అనువాద వాఙ్మయము — 12

వ్యాకరణ శాస్త్రము

# వాక్యపదీయము

ప్రథమ భాగము

[ బ్రహ్మకాండము, వాక్యకాండము ]


మూలకర్త:

భర్తృహరి

అనువాదకులు :

శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి, విద్యాప్రవీణ, పి. ఓ. ఎల్.
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, ఎం. ఏ.
డా. పుల్లెల శ్రీరామచంద్రుడు, ఎం.ఏ., పిహెచ్.డి.
శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ, ఎం. ఏ.

పరిష్కర్త :

ఆచార్య గంటి జోగిసోమయాజి, ఎం.ఏ., ఎల్.టి., విద్వాన్, పి.ఓ.ఎల్.





తెలుగు అకాడమి

హైదరాబాదు - 29

1974

vaakyapadiiyamu (VAKYAPADIYAMU) : Sanskrit Original : Bhartrihari; Telugu Translation : Sri Peri Suryanarayana Sastri, Sriman Sribhashyam Appalacharyulu, Dr. Pullela Sriramachandrudu & Sri Appalla Someswara Sarma; Scrutiniser : Prof. G. J. Somayaji. First Edition : 1974 ; pp. xxxxvi + 457 + xxii.



*First Edition, 1974*
*Copies 2,000*

Published by TELUGU AKADEMI, HYDERABAD-500029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



*Price* : Rs. 17

---

PRINTED IN INDIA
Text at Vivekananda Printers, Lakdi-ka-pul, Hyderabad-500004
Cover at Dolton Press, Hyderabad 500001,
Andhra Pradesh.

# ప్రస్తావన

తెలుగు అకాడమి ఇంతవరకు ఇంటర్మీడియట్ స్థాయిలో పాఠ్యగ్రంథాలను, డిగ్రీస్థాయిలో పఠనీయగ్రంథాలను మూడువందలకు పైగా ప్రచురించింది. శాస్త్రగ్రంథ ప్రచురణలో ఇది మొదటిదశ. రెండోదశలో కొన్ని ప్రామాణికగ్రంథాలకు అనువాదాలను, ఆయా శాస్త్రాంశాలమీద వాటివాటి ప్రాముఖ్యాన్ని పురస్కరించుకొని మోనోగ్రాఫ్‌లను ప్రచురించదలచింది. ఇందువల్ల విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ పాఠ్యగ్రంథాలే కాక ఆయా పాఠ్యాంశాలమీద విస్తృతాధ్యయనానికి సహాయపడే విషయప్రధాన రచనలుకూడా లభిస్తాయి. అంతేకాదు. ఉన్నత విద్యాబోధనభాషగా తెలుగు సుప్రతిష్ఠితమై తెలుగు అకాడమి పాత్ర మరింత సుసంపన్నం కాగలదు.

ప్రామాణికగ్రంథానువాదాలలో ఇది ఒకటి. వేదకాలంనుంచీ భారత దేశంలో వ్యాకరణశాస్త్ర సంప్రదాయ మొకటి అనూచానంగా వస్తున్నది. అందులో సిద్ధాంతవిభాగానికి చెందిన ప్రశస్తగ్రంథాలలో వాక్యపదీయము అద్వితీయమైనది. ఆ మహాగ్రంథాని కిది అనువాదము. ఆధునిక భాషాశాస్త్రసిద్ధాంతాలతో ఈ సాంప్రదాయిక సిద్ధాంతాలను పోల్చిచూడటానికి ఈ అనువాదప్రచురణ ఎంతో తోడ్పడుతుంది. వాక్యపదీయము పఠనపాఠనాదులనుంచి తొలిగిపోతున్న ఈ కాలంతో ఈ అనువాద ప్రచురణ ఎంతో ఆవశ్యకమని భావించినాము.

పై ప్రాముఖ్యాన్ని గుర్తించి అనువాదపరిష్కర్తలు ఆచార్య గంటి జోగి సోమయాజిగారు సువిస్తృతమయిన పరిచయం వ్రాసినారు. వారికీ, అనువాదకులు శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారికి, శ్రీమాన్ శ్రీ భాష్యము అప్పలాచార్యులుగారికి, డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి, శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారికి మా కృతజ్ఞతలు.

గుణగ్రహణ పారీణులయిన పాఠకులు ఈ గ్రంథాన్ని అభిమానించి ఆదరిస్తారని ఆశిస్తున్నాము. సహృదయ విమర్శకులు ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలము.

# పరిచయము

## 1. తెనుగువ్యాఖ్య

నేడు పాశ్చాత్యులు వ్రాయుచున్న భాషాశాస్త్రగ్రంథములకు భారతదేశములో మిక్కిలి ప్రచారము కల్పింపబడుచున్నది. ప్రపంచమందంతటను అన్ని రంగములలోను పాశ్చాత్యుల నాగరకత, వారి శాస్త్ర విజ్ఞానము మొదలయినవన్నియును వ్యాపించి యనుకరింపఁబడుటకు కారణము లనేకము లున్నవి. వానియందు ఘనత యుండుట యొకటి. రెండవది వానిని గూర్చిన రచనలు నేడు అనేకులయిన శ్రేష్ఠులకు పరిచితమయిన ఆంగ్ల భాషలో నుండుట. వారికి ధనము పెల్లుగా నుండుటయు, తమ యభిప్రాయములకు ప్రచారము కల్పించుటయందు నేర్పుగలుగుటయు ముఖ్యకారణములు.

పయివిషయమున ఒక భాగమగు భాషా శాస్త్రమును నేర్చుకొనుటకు ఇంగ్లాండు లోను, అమెరికాలోని సంయుక్త రాష్ట్రములలోను ప్రతివర్షము అనేకులు విద్యార్థి వేతనముల సాహాయ్యమున పర్యటించుచున్నారు. వారందరును నేటి భారతీయ విశ్వ విద్యాలయములలో ఆ సంప్రదాయములను ఇచ్చటి ఛాత్రులకు బోధించుచున్నారు.

భారతదేశమున క్రీస్తు పూర్వము సుమారు మూడువేల సంవత్సరముల నుండియు వేదాంగములుగా వ్యాకరణాదులు ప్రచారములో నుండినవి. ఇచ్చటి భాషా బాహుళ్యము, విజ్ఞానమునందలి శబ్దప్రామాణ్యము, పారమార్థికచింతయు వేదపఠనమునకు ప్రథమస్థానము నొసంగినవి. ఆ భాషను రక్షించుటకుగాను, శబ్దముయొక్క నిర్దుష్టమైన యుచ్చారణమును, స్వరూపమును, అన్వయాది లక్షణములను వేలకొలది సంవత్సరములు నిర్దుష్టముగా నిలువ బెట్టుటకు, భాషాశాస్త్రము యొక్క అనేక భాగములను మన పూర్వులు అభ్యసించి, ఇతరులకు బోధించుచు అనేక గ్రంథములు వ్రాసిరి. అట్టి వానిలో భర్తృహరిపేర వెలయుచున్న ఈ 'వాక్యపదీయము' ఒక ముఖ్య గ్రంథము; బహువిషయ సంభరితము; భారతీయులు చేసిన భాషాశాస్త్ర పరిశ్రమను బాగుగా వ్యక్తము చేయుచున్నది.

దేశ భాషలలో గ్రంథములు రచించుటకును, అందు విజ్ఞానబోధ జరుపుటకు వలయు ఇతర సదుపాయములు కూర్చుటకును ఆంధ్ర ప్రభుత్వము 'తెలుగు అకాడమి' ని స్థాపించి యున్నది. కొన్ని వందల గ్రంథములను ఈ సంస్థ ప్రచురించి యున్నది. మన భాషా శాస్త్ర సిద్ధాంతములు సంస్కృతములో నుండగా వానికి తెలుగులో పఠన పాఠనముల సదు పాయము కల్పించుటకు ఈ గ్రంథమును తెలిగింపవలసినదని అకాడమి పాలక సంఘము చేసిన నిర్ణయ ఫలితముగా ఈ గ్రంథము రచింపబడి ప్రకటింపబడినది.

## 2. భర్తృహరి రచిత గ్రంథములు

భర్తృహరి వ్రాసినవని ప్రచారములో నున్న గ్రంథములు :

1. (అష్టాధ్యాయికి) మహా భాష్యటీక.

2. వాక్యపదీయము-కాండలు I, II, III.
3. వాక్యపదీయ గ్రంథ శ్లోకములకు 1-II కాండలయందు మాత్రము వృత్తి రూపమున నున్న గ్రంథకర్తృకృత-వృత్తి-వివరణము.
4. శబ్దధాతు సమీక్ష.
5. నీతి, శృంగార, వైరాగ్య ప్రధానములయిన మూడు శతకములు.
6. భట్టి కావ్యము.

పయి వానిలో 1-4 వ్యాకరణగ్రంథములు. 5 వది కేవలము రసమయమయిన కావ్యవిశేషము. 6 వదియు పద్యకావ్యమే. కాని పాణిన్యుక్త సూత్రముల కుదాహరణము లయిన తిఙన్త రూపములకు, కారక ప్రయోగములకు లక్ష్యములను, అలంకారములకు ఉదాహరణములను చూపించు రసమయమయిన కావ్యము. పయిగ్రంథములన్నియు రచించిన వ్యక్తి ఒక్కరేయనియు, కాదు భర్తృహరి నామము కలవా రనేకు లుండిరనియు, రెండు అభిప్రాయము లున్నవి.

'మహాకవు లనేకులున్నారు, మహాపండితులు నున్నారు, కాని మహాకవి, మహావిద్వాంసుడు అయినవాడు భర్తృహరి ఒక్కడే''— కర్త తెలియని ఈ ప్రాచీన శ్లోకము[1] అభిప్రాయము వారిద్దరు నొక్కరే యని.

భర్తృహరిని గురించి యనేకములయిన కథ లున్నవి. ఒకానొక బ్రాహ్మణుడు సూర్య వర ప్రసాదమున లభించిన ఫలమును తన ప్రభువగు భర్తృహరి కొసగగా దాని నాతడు తన ప్రియభార్య కొసగెను. ఆమె దానిని తాను భుజింపక తన జారునకును, అతడు తన ప్రియురాలైన మఱియొక వనితకును ఇచ్చెను. ఆ విషయము నంతటిని గుర్తెఱింగి రాజైన భర్తృహరి రాజ్యము త్యజించి కానలకు నేగి వైరాగ్యమును బూనెను.

పయికథ ననుసరించి భర్తృహరి వ్రాసిన శృంగార వైరాగ్య శతకముల రెండిటి యందును గలిగిన రసవిశేషములను ఏకముఖమున వర్ణించుటకు కారణమయిన యనుభవ మును భర్తృహరి తన జీవితమునందు గడించెనని విమర్శకు లూహించుచున్నారు. కాని పయి కథలవంటి కథలు కల్పితములనియు, చారిత్రక ప్రమాణములు గావనియు వానిని పరిశీలింపక విశ్వసింపరాదనియు సిద్ధాంతము.

'భర్తృహరినిర్వేదము' అనుపేర నొక కావ్యము నిర్ణయసాగర ప్రెస్సువారి కావ్య మాలలో హరిహరుడను కవిచే వ్రాయబడినట్లు ప్రచురితమైనది. భర్తృహరి యొక్క భార్య మరణింపగా ఆ వియోగమును సహింపలేక శివావతారమయిన యోగి పుంగవుని (గోరక్ష నాథుని) వలన యోగజ్ఞానమును సంపాదించి యోగియయ్యెనని యిందలికథ. ఇదియు పయి కథవలె కల్పితమయినదే యని యూహ. పయిగా 'భర్తృహరి గుహ' యను పేరుతో వారణాసి దగ్గఱ చునాగడము కోటలో నొకటియు, ఉజ్జయినిలో నొకటియు నున్నవని తెలియుచున్నది. ఆ గుహలలో భర్తృహరి తపస్సుచేసెననియు నొక విశ్వాసము కొందరియందు గలదు.

భర్తృహరి శతకములకు సంస్కృత వ్యాఖ్య వ్రాసిన శ్రీరామచంద్ర పండితుడు గోదావరీ నది శాఖయగు ఆత్రేయినది యొడ్డున నుండు కంబలూరు నివాసి, తెలుగువాడు.

---

[1] మహాన్తః కవయః సంతు, మహాంతః పండితాస్తథా
మహాకవి ర్మహావిద్వాన్ ఏకో భర్తృహరి ర్మతః॥

ఈతడు 12-13 శతాబ్దముల నుండినవాడని వావిళ్ళవారి 'భర్తృహరి సుభాషిత'మునకు పీఠికా కర్త వ్రాసి, ఆయన శ్లోకము నుదాహరించి యున్నాడు. లోకములో ప్రసిద్ధముగా వినబడు చుండు పైగాథ నొకదాని నందాక దుదాహరించియున్నాడు.

"ఇత్సింగు" అను చీనాదేశస్థుడు క్రీ. శ. 691 వ సం. మున భారతదేశమున పర్యటించుచు భర్తృహరి యను ప్రసిద్ధ వైయాకరణుడు ఏడు సారులు, శృంగార వైరాగ్య ప్రధానములయిన జీవన విధానములలో, నేది యనుసరణీయమో తెలియక ఆశ్రమములు మార్చుకొనె ననియు, అతడు 40 సం. ల ముందే గతించె ననియు వ్రాసెను. దీనినిబట్టి భర్తృహరి క్రీ. శ. 651 సంవత్సరమున మరణించెనని యొక యభిప్రాయమును వెలిపుచ్చిరి.

ఇది యిట్లుండ, అభిజ్ఞాన శాకుంతల నాటకమున 5 వ అంకము 12 వ శ్లోకమగు

'భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమైః, నవాంబుభి ర్భూరవిలంబినో ఘనాః ।
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః, స్వభావ ఏవైష పరోపకారిణామ్ ॥

అనునది భర్తృహరి నీతిశతకములో పరోపకార పద్ధతియందు ప్రథమ శ్లోకముగా (సంఖ్య 61) నుండుటచేత కాళిదాసు కాలమునకు భర్తృహరి సమీపస్థుడు అనునొక యభిప్రాయము గలదు.

కాళిదాసు కాలమును గురించి అనేక భిన్నాభిప్రాయములుగలవు. 56 క్రీ. పూ. తో సమానమయిన విక్రమార్క శకారంభమునకు మూలపురుషుడయిన వానితో కాళిదాసు సమకాలికుడనియు, కావున నాతడు క్రీ. పూ. ప్రథమ శతాబ్దమువాడనియు, గుప్తవంశమునకు చెందిన సముద్రగుప్తుని యాస్థానమున నుండెననియు, కావున నతడు క్రీ. శె. మూడవ శతాబ్దమున నుండెననియు రెండు అభిప్రాయములు. ఈతడు ఆరవ శతాబ్దములో కాశ్మీర రాజయిన విక్రమాదిత్యుని కాలముననుండెనని మఱియొక యభిప్రాయము. ఇదిగాక కాళిదాసు 'అగ్నివర్ణుని' యొక్క కుమారునితో సమకాలికుడనియు, క్రీ. పూ. 8వ శతాబ్దమున నుండెననియు మఱియొక యభిప్రాయము. ముగ్గురు కాళిదాసులు వయి మూడు భిన్నకాలములలో నుండిరనియు నేటి కాళిదాస కావ్యములలో నొకొక్కరొకొక్క కావ్యము వ్రాసియున్నారనియు మఱియొక్క సిద్ధాంతయు గలదు. ఇట్లు వివాదస్థమయిన కాళిదాసు కాలమును, అభిజ్ఞాన శాకుంతలమునందలి శ్లోకమునుబట్టి మన భర్తృహరి కాలమును గూర్చి ప్రామాణికమయిన సిద్ధాంతము చేయుటకు వీలులేదు.

సుభాషితత్రిశతిని గూర్చి ఈ సందర్భమున గొంత వివరింపవలసి యున్నది. తెలుగుదేశమున 'భర్తృహరి సుభాషితము' అనుపేర వావిళ్ళవారిచేత ప్రచురింపబడిన సంపుటము మిక్కిలి ప్రచారములోనున్నది. ఉత్తర హిందూస్థానమునను, మహారాష్ట్రమునను మఱికొన్ని ముద్రణములు ప్రచారములో నున్నవి. వావిళ్ళవారి ముద్రణముయొక్క ఉపోద్ఘాతమున "దాక్షిణాత్య పాఠమని ఉదీచ్య పాఠమని రెండు తెగలు ప్రసిద్ధమైయున్నవి" అని వ్రాసియున్నారు. త్రిశతి పాఠభేదములను గుఱించి గొప్ప పరిశ్రమ చేసినవారు, కీర్తిశేషులు శ్రీ కోశాంబిగారు అప్పటి కుపలభ్యమానములయిన యనేక శ్లోకములను, భర్తృహరి కృతములనబడినవానిని పరిశీలించి యిట్లు వ్రాయుచున్నారు. 'ఆదిమమయిన శ్లోకరాశి రెండు వందలు మాత్రమే. కాని పాఠాంతరములన్నియు కలుపగా మొత్తమన్నియు చేరి 852, అన్ని పాఠములలో నమానముగా నున్నవి వయి రెండువందలు మాత్రమే వానిలో 7 ఏ రసమునకును చెందనివి, నీతికి సంబంధించినవి 69, శృంగారమునకు 71, వైరాగ్యమునకు 58.

మిగిలిన 652 శ్లోకములును వివదనీయములే. అనగా భర్తృహరి విరచితములు కాక కాల క్రమముగా నా శ్లోకములు చేర్చబడినవే. మొదటి రెండువందలు కాక మిగిలిన 100 (అనగా మూడు శతకములకు లెక్క చేయబడినవానిలోనివి) వేరువేరు ప్రతులలో నున్నవి. ఈరకమైన చేర్పు కొన్ని శతాబ్దములలో జరిగినది."

ఇట్టి సందర్భములో కాళిదాసకృత శ్లోకము నీతి శతకములో నున్నదను విషయమున తెలియదగిన సిద్ధాంత మేమియు లేదుగదా!

పయి గ్రంథములన్నియు నొక్కరిచేతనే వ్రాయబడియుండలేదనియు కావ్యములు రెండును ఒక్కనిచేతను, వ్యాకరణ గ్రంథములన్నియు నొక్కనిచేతను వ్రాయబడియుండెను అనియు నొక యూహ. కాళిదాసు లెందరో యుండినట్లు భర్తృహరు లనబడువారును భిన్న కాలములయందుండిరి. ఒకరు వాక్యపదీయాది వ్యాకరణగ్రంథములను, భట్టికావ్యమనునది మఱియొక్కరును వ్రాసియుండిరి. త్రిశతి వేరొకరిచేత వ్రాయబడినది అను కల్పన యొకటి గలదు. దృఢమైన ప్రమాణములు లేనప్పుడు ఎన్నియూహలయినను కలుగుట కవకాశ మున్నది. భట్టి కావ్య మనబడునట్టి పయి లక్షణకావ్యమునకు మరియొక పేరు 'రావణవధ.' ఈ కావ్యమునకు వ్యాఖ్యవ్రాసిన జయమంగళుడు ఈ కావ్యకర్త భట్టియనియు, స్వామియనువాని కొమారుడనియు పేర్కొనియున్నాడు. మరియొకరు "మహామహోపాధ్యాయ శ్రీ భర్తృహరి కవినా కృతం శబ్దకాండయోర్లక్షణం" అని వ్రాసిరి. ఇంకొకరు "అత్ర కవినా శ్రీధరస్వామిసూనునా భర్తృహరిణా సర్గబంధః" అనియు, "భర్తృహరిర్నామకవిః శ్రీరామకథాశ్రయం మహాకావ్యం చకార" అని యింకొకరును వ్రాసిరి.[2] భర్తృ శబ్దమునకు ప్రాకృతరూపము భట్టి యగుటచే పయిరెండు శబ్దములను ఒక్కటిగా భావించి కవులిద్దరు నభిన్నులను వాదము బయలుదేరినది. కాని వీరు వేరే యని యొకవాదము- వలభి[3] యనునది గుజరాతు సౌరాష్ట్రముయొక్క ముఖ్య పట్టణము. అందు చంద్రగుప్తుడు అను బ్రాహ్మణునకు నలుగురు భార్యలనియు, అందు బ్రాహ్మణి యందు వరరుచియు, క్షత్రియయందు విక్రమార్కుడును, వైశ్యయందు భట్టియును, నాలవదానియందు భర్తృహరియు అను కొమరులు కలిగినట్లును, భట్టి విక్రమార్కుని మంత్రి యయినట్లును నొక గాధ కలదు. ఈ కథయు పై కథలవంటిదే.[4]

పయి విచారణవలన నేమియును తేలలేదు. కాబట్టి యీ విషయమును నిర్ణయించుటకు వేరొకమార్గమును చేపట్టవలయును.

రెండవకాండ తుదిని భర్తృహరి వ్యాకరణశాస్త్ర చరిత్రలో కొన్ని విషయములను (478-484. శ్లో॥) నిరూపించెను. నష్టమయిన వ్యాకరణాగమమును పతంజలి శిష్యులు దాక్షిణాత్యులనుండి సంపాదించిరి. శ్లో. 490. దానిని చంద్రాచార్యాదులు బహువిధములుగా ప్రచారముచేసిరి. ఈ శ్లోక వ్యాఖ్యానములో "చంద్రాచార్య వసురాతగురు ప్రభృతీనాం దత్తఇతి" అని యున్నది. ఆచార్య వసురాతునినుండి భర్తృహరి పొందినట్లు దీనినుండి తేలుచున్నది.

---

2 History of Classical Sanskrit Literature-By M. Krishnamachariar-Page 140.

3 కావ్య మిదం విహితం మయా వలభ్యాం శ్రీధరసేననరేంద్రపాలితాయాం। కీర్తిరయం భవతా దతో నృపస్య క్షేమకరః క్షితిపో యతః ప్రజానామ్. Do. 141.

4 Do. Page 141.

పయివిషయము లన్నియు విమర్శించుచు 'Franwallner' పండితుడు దిఙ్నాగుని ప్రమాణ సముచ్చయము మొదలయిన గ్రంథముల ఆధారమున ఈ క్రింది కాలనిర్ణయమును చేసెను. వసురాతుడు (భర్తృహరి గురువు)-480-490 A. D. భర్తృహరి 450-510 A.D. దిఙ్నాగుడు 480-540 A. D. భర్తృహరి పతంజలికృత మహాభాష్యమును వ్యాఖ్యానించెను. ఆతనికాలము 150 క్రీ. పూ. కాశికావృత్తియందు (సుమారు 650 క్రీ. శ.) వాక్యపదీయ ప్రశంస గలదు. కాబట్టి ఈ రెండుకాలముల మధ్యను భర్తృహరి యుండియుండవచ్చును. శతపథబ్రాహ్మణమునకు వ్యాఖ్యవ్రాసిన హరిస్వామియను నాతడు భర్తృహరి శ్లోకము నుదాహరించెను. ఆతనికాలము క్రీ. శ. 588.

తక్కిన గ్రంథములమాట యెట్లుండినను వాక్యపదీయము వ్రాసిన భర్తృహరిని గూర్చియు ఆతనివని నిశ్చయింపదగిన యితర గ్రంథములనుగూర్చియు క్రింద విచారింప బడును.

1. మహాభాష్యటీక : పతంజలికృతమయిన వైయాకరణ మహాభాష్యమునకు భర్తృహరి యొకటీక వ్రాసెనని తెలియుచున్నది. ఈ విషయమును ఇత్సింగును, మఱి కొందరు ప్రాచీన వైయాకరణులును పేర్కొనిరి. పై గ్రంథములోని యొక్క చిన్నభాగము మాత్రము, వ్రాతప్రతి లభించినది. ఈ టీక యెంతటిది? మహాభాష్యమునకంతటికిని వ్రాసెనా? అయినచో అది యెంతవఱకు? ప్రథమాధ్యాయములోని మూడు పాదములకు మాత్రమేనా? అదియు సందేహమే! దీనికే దీపిక అను పేరుకూడ నుండినట్లును వ్రాయుచున్నారు—ఇది భర్తృహరి కృతమని నిశ్చయింపనగును.

2. శబ్దధాతు సమీక్ష : సోమానందుడును, ఉత్పలాచార్యులును దీనినిగూర్చి పేర్కొనిరి. కాని యిది లభింపలేదు. సోమానందుడను గ్రంథకర్త శివదృష్టియను గ్రంథము నందు తన 'సమీక్ష' యందు భర్తృహరి వ్యాకరణమును విడిచిపెట్టి విజ్ఞానాభాసము నిరూపించుటకు ప్రయత్నించెను అని వ్రాసెను. దీనికి వ్యాఖ్యాకర్తయైన ఉత్పలాచార్యుడును పయివిషయమును నిర్వచించెను.[5]

భట్టి కావ్యమునుగూర్చియు, సుభాషిత త్రిశతినిగూర్చియు ముందు ఉదాహరించితిని. ఇక మిగిలినది ఒక్క వాక్యపదీయము మాత్రమే. దీనినిగూర్చియు తత్పూర్వముండిన వ్యాకరణచరిత్రనుగూర్చియు చాల సంగ్రహముగా వివరింప బడును.

## 3. వ్యాకరణశాస్త్రముత్పత్తి వికాసములు

*సంస్కృత వ్యాకరణ చరిత్రము:* భారతదేశమునందలి వాఙ్మయ మంతటిలో వేదమే ప్రాచీనము. ఇదియే సర్వశాస్త్రములకు మూలము. ఇది యనాది. బ్రహ్మ ముఖమునుండి వెలువడినది. ఇందు లేని ధర్మము లేదు. మహర్షులు తపస్సుచే ఆధ్యాత్మిక దృష్టివలన అనేక సత్యములను ప్రత్యక్ష మొనర్చికొని వానిని వ్రాక్రుచ్చిరి. ఇది అనేక శాఖలు. బహు ఋషులచే సంరక్షింపబడుచుండినది. ఇట్టి వేదరాశిని వ్యాసుడు విభజించి, ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు భాగములుగా నొనరించెను. ఇట్టి వానిని బ్రాహ్మణులు ఇతర వృత్తుల నన్నిటిని విడిచి సంరక్షించుచు, పుత్రపౌత్రాదిక్రమమున వల్లెవేయించి

5 భర్తృహరి— K. A. S. Aiyar— పూనాడక్కన్ కాలేజీ వారి ప్రచురణము.

అర్థము తెలియకపోయినను, అట్టే వేలకొలంది సంవత్సరములు నిజధర్మముగా నెంచి మానవజాతి కొనసంగిరి. ఆ వేదమంత్రములయొక్క స్వరముగాని, వర్ణముగాని మారుపడ రాదు. అట్లు మారినచో మంత్రముయొక్క అర్థము కూడ మారిపోవును. అట్లు విపరిణత మయిన మంత్రము యజమానుని, ప్రయోక్తను సంహరించును. అది శత్రువుపైకి పోదు. ఇట్టి విశ్వాసముండుటవలన స్వరము, వర్ణము, శబ్దము, వాక్యము, అన్వయము మొదలగువానిని గుర్తెఱింగి ఆ మంత్రములను రక్షింపవలసి వచ్చినది గావున, శిక్ష, ప్రాతిశాఖ్యము అను శాస్త్ర గ్రంథములు బయలుదేరి ఆయావేద శాఖలలోని శబ్ద లక్షణాదికమును వివరించినవి. వేదార్థము తెలిసికొనుటకు వేదాంగములు బయలుదేరినవి. శిక్ష, జ్యోతిషము, కల్పము, నిరుక్తము, ఛందస్సు వ్యాకరణము అను ఆరును వేదాంగములు.

1. శిక్ష : ఈ గ్రంథములో వర్ణోచ్చారణము, ముఖయంత్రము, ఉచ్చారణాంగములు, ప్రయత్నము, స్థానకరణములు మొదలయిన నేటి ధ్వన్యుత్పాదక శాస్త్రమునకు సంబంధించిన విషయము లన్నియు నుండును. పాణినీయ శిక్ష, చారాయణీయ శిక్ష మొదలయిన వీజాతికి చెందినవి. వేదకాలములో సంస్కృతమున మాండలిక వైవిధ్యము ఏర్పడినట్లు గ్రహించి ఇంకను వైవిధ్యమున భాష మారకుండునట్లు స్థిరరూపమున నిలుపుటకు శిక్షా శాస్త్రమును కనిపెట్టి ప్రాచీనులు దానిని అభ్యాసకులకు అందరకును బోధించిరి.

2. జ్యోతిషము : ఇది ఖగోళమునందలి గ్రహసంచారములను, సంవత్సర మాసాది కాల విభాగమును, ఋతువులు, అయనములు మొదలగువానిని తెలుపును. ఏ యే యాగములు ఎప్పుడెప్పుడు చేయవలయునో నిర్ణయించుటకు, అమావాస్య, పూర్ణిమ మొదలయిన తిథుల నెఱుంగుటకు ఇది సాధనము. దీనినే వైదిక జ్యోతిషమని మనము వ్యవహరింతుము.

3. కల్పము : ఇందు ఆయా యాగముల విధానము, హోత, అధ్వర్యుడు మొదలగువారి బాధ్యతలు నిరూపింపబడును. బ్రాహ్మణములు, కల్పసూత్రములు ఈ జాతికి చెందినవి. ఆశ్వలాయన, శాంఖ్యాయనాది కృతములయిన సూత్రములు ఉదాహరణములు.

4. నిరుక్తము : ఇందు వేదములోని శబ్దములయొక్క వ్యుత్పత్తి అర్థము ననుసరించియు, ప్రయోగములను సూచించియు నిర్ణయింప బడును. ఇందు యాస్కుని గ్రంథము సుప్రసిద్ధము.

5. ఛందస్సు : ఇందు అక్షరములు, మాత్రలు, పాదభేదము, అందలి అక్షర గణనము, గాయత్రి, అనుష్టుప్ మొదలయిన ఛందో భేదములును చెప్పబడును. ఛందాగ్ంసి-ఛాదనాత్. ఛేదించుటవలన అనగా విభజించుట వలన గలుగు భాగములను బట్టి ఈ పేరు వచ్చినది. మనకు లౌకిక చ్ఛందస్సులు తెనుగున అప్పకవీయము మొదలయిన గ్రంథములలో ప్రసిద్ధములు.

6. వ్యాకరణము : వ్యాక్రియతే అనేనేతి వ్యాకరణమ్—దీనిచే శబ్దములు వ్యాకరింపబడును. ప్రకృతి, ధాతు, ప్రత్యయ విభాగము నిరూపింపబడును. శబ్దస్వరూపము స్పష్టపరుపబడును.

పయి ఆరు వేదాంగములును కాలక్రమమున వేరుపడి అభివృద్ధములై లోకములో ప్రచారము నందినవి. వానిలో మనము ఇప్పుడు తెలిసికొనవలసినది వ్యాకరణ చరిత్ర.

పయిని నిరూపింపబడినట్లు వేదాంగములకు ఆధారములు వేదములే. వ్యాకరణ శాస్త్రముయొక్క ఉత్పత్తియు మిక్కిలి ప్రాచీనకాలముననే అనగా వేదమంత్రములు ఋషులకు ప్రత్యక్షములయిన కాలముననే పద పదాంగ విభాగజ్ఞానముతోడనే ఉత్పన్నమైనట్లూహింపక తప్పదు.

వేదమునందే వ్యాకరణము నందలి పారిభాషిక పదావళికి ప్రయోగమున్నట్లు స్పష్టము. 'వ్యాకృ' ధాతువునకు విభజనార్థమున ప్రయోగములు 'నామరూపే వ్యాకరవాణి', 'దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతిః'. ఋగ్ వేదముయొక్క పద పాఠమునందు 'సమ్ఽజగ్మానః', 'ప్రఽతిరంతే' మొదలయిన విభాగములు ప్రసిద్ధమయి యున్నవి. గోపథ బ్రాహ్మణమందు 'ఓంకారం పృచ్ఛామః, కో ధాతుః,, కిం ప్రాతిపదికం, కిం నామాఖ్యాతమ్, కిం లింగమ్, కిం వచనమ్, కా విభక్తిః, కః ప్రత్యయః, కః స్వర ఉపసర్గో నిపాతః, కిం వై యాకరణం, కో వికారః, కో వికారీ, కతి మాత్రః,కతి వర్ణః, కత్యక్షరః, కతి పదః, కః సంయోగః, కిం స్థాననాదానుప్రదానానుకరణమ్,' అని చెప్పబడినది. మైత్రాయణీయ సంహితయందును, ఐతరేయ బ్రాహ్మణమునందును ఆరు విభక్తులను గుఱించియు, ఏడు విభక్తులను గుఱించియు ప్రసంగింపబడినది.

ఈ వ్యాకరణ శాస్త్రమునకు బ్రహ్మయే మొదటి కర్తయని చెప్పబడినది. ఋక్తంత్రమున- 'బ్రహ్మా బృహస్పతయే ప్రోవాచ, బృహస్పతి రింద్రాయ, ఇంద్రో భరద్వాజాయ, భరద్వాజ ఋషిభ్యః, ఋషయో బ్రాహ్మణేభ్యః' అని వ్యాకరణ ప్రచారక్రమము నిరూపింపబడినది.

ఋగ్వేదమునందలి అయిదు మంత్రములు ఉదాహరింపబడి యీ క్రింది రీతిని వ్యాఖ్యానింపబడినవి.

1. చత్వారి శృంగా, 2. చత్వారి వాక్ పరిమితా పదాని, 3. ఉతత్వఃపశ్యన్, 4. సక్తుమివ, 5. సుదేవోఽసి. ఋ. 4-58-3, ఋ. 1-164-45, ఋ. 10-71-4, ఋ. 10-71-2 ఋ. 8-69-12.

ఋక్కు. 1. చత్వారి శృంగా త్రయో అస్య పాదా
ద్వే శీర్షే సప్తహస్తాసో అస్య ।
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహో దేవో మర్త్యాన్ ఆవివేశ ॥

అర్థము : అస్య=ఈ శబ్దరూపుడయినదేవునకు, శృంగాః=కొమ్ములు, చత్వారి=నాలుగు, పాదాః=పాదములు, త్రయః=మూడు, శీర్షే = శిరస్సులు, ద్వే = రెండు, హస్తాసః = చేతులు, సప్త=ఏడు.

త్రిధా = మూడు చోటులందు, బద్ధః = ప్రతిష్ఠింపబడినట్టి, వృషభః = కోరికల నిచ్చు శబ్దదేవుడు, రోరవీతి = ధ్వని చేయుచుండును, మహః = గొప్పవాడైన, దేవః= శబ్దదేవుడు, మర్త్యాన్=మానవులను, ఆవివేశ = ఆవేశించెను.

తాత్పర్యము : మానవులందు అంతర్యామిగానున్న శబ్ద పరబ్రహ్మమొక విచిత్రమైన వృషభ స్వరూపము. ఆ వృషభమునకు నాలుగు కొమ్ములు, మూడు కాళ్ళు, రెండు

శిరస్సులు, ఏడు చేతులు నున్నవి. అయ్యది మానవుల నావేశించి మూడు చోటులనుండి యెల్లపుడును ధ్వని చేయుచుండును. అది సకల కామములను దీర్చుచుండును.

వివరణము : వాస్తవమున అగ్ని దేవతాపరమైన ఈ మంత్రము, శబ్దశాస్త్ర ప్రతిపాద్యమైన శబ్దబ్రహ్మపరముగ వైయాకరణులచే వ్యాఖ్యానింపబడినది. లాక్షణికముగ ఈ యర్థము సంభవించును.

మానవులం దంతర్యామిగ నున్న పరశబ్దము సహజ వృషభముకన్న అతివిచిత్రమని యిచట ప్రతిపాదింపబడినది.

ఇచటి శృంగములు : సుబంతము, తిఙంతము, ఉపసర్గము, నిపాతము అను నాలుగు విధములయిన పదములు.

మూడు పాదములు : భూత భవిష్య ద్వర్తమానము లను కాలములు.

రెండు శిరస్సులు : శబ్దమున కున్న రెండు రూపములు.

(నిత్యము = స్ఫోటము, అనిత్యము = వైఖరి).

ఏడు చేతులు : ఏడు విభక్తులు.

మూడు స్థానములు : వక్షః స్థలము, కంఠము, శిరస్సు (శబ్దము యొక్క అభివ్యక్తి ప్రదేశములు).

వృషభము : వర్షించునది = కోరికల నిచ్చునది (సుశబ్దప్రయోగమువలననే కోరికలు సిద్ధించునని సంప్రదాయము).

రోరవీతి = రంకెలు వేయును. (సతతము నాద రూపమున గోచరమగును).

ఇట్టి శబ్దబ్రహ్మమును దెలియు మానవుడు తత్సాయుజ్యమును బొందును. ఈ యంశమును :

"అపి ప్రయోక్తు రాత్మానం శబ్ద మంతరవస్థితమ్ ।
ప్రాహు ర్మహాంత మృషభం యేన సాయుజ్య మిష్యతే॥"

అను కారికతో భర్తృహరియు సంగ్రహించెను. (చూ : వాక్యపదీయము I. 131).

(2) చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః ।
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి ॥

అర్థము : వాక్పరిమితా = వాక్కుయొక్క భేదములగు, పదాని = పదములు (శబ్దములు), చత్వారి = నాలుగు(నామాఖ్యాతోపసర్గ నిపాతములు-లేక పరాపశ్యంతీ మధ్యమా వైఖరులు), యే = ఎవరు, బ్రాహ్మణాః మనీషిణః = వ్యాకరణజ్ఞులగు విద్వాంసులు కలరో (తే = వారు), తాని = ఆ నాలుగు భేదములను, విదుః = సంపూర్ణముగా తెలియగలరు.

మనుష్యాః = వ్యాకరణజ్ఞానములేని సామాన్యమానవులు, గుహా = గుహయందు = హృదయమందు—లేక—అజ్ఞానమందు, నిహితా = ఉంచబడిన, త్రీణి = మూడు వాగ్భేదములను, న + ఇంగయంతి = తెలియజాలరు, (తే = వారు), తురీయమ్ = నాల్గవభేదమైన, వాచమ్ = వాక్కును (వైఖరిని మాత్రము), వదంతి = పలుకుదురు.

తాత్పర్యము : వ్యాకరణ శాస్త్ర విద్వాంసులు మాత్రమే నాల్గు విధములయిన శబ్దభేదములను సంపూర్ణముగా తెలియుటకు సమర్థులగుదురు. ఇతరులకు వైఖరీ స్వరూపము మాత్రమే తెలియును. అట్టివారికి పరా పశ్యంతీ మధ్యమలను మూడు భేదములును అజ్ఞానముచే నావృతములై పోవును.

ఈ విషయమును :

"వైఖర్యా మధ్యమాయాశ్చ పశ్యంత్యా శ్చైతదద్భుతమ్।
అనేక తీర్థ భేదాయా స్త్రయ్యా వాచః పరం పదమ్॥

స్వరూప జ్యోతిరేవాంత ః పరా వా గనపాయినీ।"అను మాటలతో భర్తృహరియు సూచించెను. (వా. ప. ప్రథమ కాండము-148).

(3) ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ-
ముత త్వః శృణ్వ న్న శృణోత్యేనామ్ః
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః॥

అర్థము : త్వః = ఒకడు (వ్యాకరణము తెలియని వాడు), వాచమ్ = వాక్కును (శబ్దమును), పశ్యన్ = చూచుచున్నను, న + దదర్శ = చూడలేదు, ఉత=గదా !, త్వః = వేరొకడు, ఏనామ్ = ఈ శబ్దమును, శృణ్వన్ = వినుచున్నను, న + శృణోతి = వినలేదు, ఉత=గదా ! (ఏషా = ఈ వాక్కు), సువాసాః = శుభ్రమైన బట్టలు గలిగి, ఉశతీ = ఉరకలు వేయుకోరికలుగల, జాయా = భార్య, పత్యే + ఇవ = భర్తకువలె, త్వస్మై = మరియొకనికి (వ్యాకరణము నెఱిగిన వానికి), తన్వమ్=తన శరీరమును (స్వరూపమును), విసస్రే = ప్రకాశింపజేయును. ఉత + ఉ = ఉతో = కదా !

తాత్పర్యము : ఈ మంత్రములోని మొదటి రెండు పాదములు వ్యాకరణ జ్ఞానము లేని వానికి, తరువాతి రెండు పాదములును వ్యాకరణ జ్ఞానము గల వానికిని జెందును.

శబ్దశాస్త్రము నెఱుగనివాడు శబ్దమును చూచినను విన్నను సాఫల్యమును పొంద జాలడు. శబ్ద సంస్కారము తెలియనందున స్వరూప జ్ఞానము గాని, అర్థ జ్ఞానముగాని వానికి సంభవింపదని భావము.

ఇక వ్యాకరణజ్ఞుని విషయము వేరు. వాగ్దేవి అట్టివానికి ప్రియమైన భార్యవలె తన్నుగా నర్పించుకొనును. వైయాకరణునకు శబ్దార్థ స్వరూపము కరతలామలక మన్నమాట!

(4) సక్తుమివ తితఉనా పునంతో
యత్ర ధీరా మనసా వాచ మక్రత।
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధివాచి॥

అర్థము : యత్ర = ఏకవ్యాకరణమందు, ధీరాః = ధ్యానముగల వైయాకరణులు, తితఉనా = జల్లెడతో, సక్తుమివ = పిండినివలె, మనసా = జ్ఞానముతో, వాచమ్ = వాక్కును (శబ్దమును), పునంతః = శోధించువారై, అక్రత = ప్రయోగించిరో (తే = అట్టి వైయాకర

ఋలు), అత్ర = ఈ శబ్ద బ్రహ్మమందు, సఖాయః = సమానజ్ఞానముగల వారై, సఖ్యాని= సాయుజ్యమును, జానతే= పొందుదురు. ఏషామ్ = వీరియొక్క, వాచి = వాక్కునందు, భద్రా= మంగళాత్మిక యైన, లక్ష్మీః= శబ్దబ్రహ్మలక్ష్మి, అధి=అధికముగా, నిహితా = సిద్ధమైయున్నది.

తాత్పర్యము : జల్లెడతో పిండిని శోధించినట్లు ప్రజ్ఞానముతో వైయాకరణులు శబ్దమును పరిశోధించి, (అపశబ్దములను సుశబ్దములను వేరుచేసి చూపి) సుశబ్దములనే ప్రయోగించుచుందురు. అట్టివారికి శబ్దార్థాభేదజ్ఞానము, సర్వశబ్ద సామ్యము, శబ్ద బ్రహ్మ జ్ఞానమును క్రమముగ గలుగును. తుదకు వారికి శబ్ద బ్రహ్మ సాయుజ్యమును సంప్రాప్తించును.

వైయాకరణులకు శబ్దబ్రహ్మ సాక్షాత్కారము స్వయం సిద్ధము కాగలదని యభిసంధి.

(5) సుదేవో అసి వరుణ యస్య తే సప్తసింధవః
అనుక్షరంతి కాకుదం సూర్మ్యం సుషిరామివ.

అర్థము : వరుణ = ఓ వరుణా !, సుదేవః = సత్యదేవుడవు (సత్యేన + దీవ్యతి= సత్యముతో ప్రకాశించువాడు). అసి = అయి ఉన్నావు, యస్య = యస్మాత్=ఎందువలన, (అనగా), తే = నీయొక్క, కాకుదమ్= తాలువును, (కంఠములోపలి—కొండనాలుక అను భాగము), (ప్రాప్య = పొంది), సప్తసింధవః = సప్త సముద్ర రూపములైన సప్త విభక్తులు, సుషిరామ్= రంధ్రముగల, సూర్మిమ్= శోభనమగు ఇనుప ప్రతిమను, (ప్రాప్య= పొంది) (అగ్నిః + ఇవ= అగ్నివలె) అనుక్షరంతి = ప్రకాశించు చున్నవో (అందువలన సత్యదేవుడగుట సిద్ధించెను).

తాత్పర్యము : వరుణుడు సత్యదేవుడు. అనగా సత్యముతో ప్రకాశించువాడు. వైయాకరణులును సత్యదేవులే అగుదురు. సత్యరూపమైన శబ్ద బ్రహ్మము వారి నోళ్ళయందెల్లపుడును ప్రకాశించుచునే యుండును.

లోపల గుల్లగానుండు లోహప్రతిమలను నిప్పులో బెట్టి కాల్తురు. అగ్ని వానిలోపల ప్రవేశించి మలమునంతను దహించి వానిని శుద్ధిజేయును. అట్లే విభక్త్యంతములైన సాధు శబ్దములు వైయాకరణుల నోళ్ళను బ్రకాశింపుచు వారి పాపములను బోగొట్టుచుండును.

అనగా సాధుశబ్దమును బ్రయోగించు శాబ్దికులు విగత కల్మషులై వరుణ సదృశులై స్వర్గమును బొందుదురని సారాంశము.

[N B: కేవలము వరుణస్తుతి పరమైన ఈ ఋక్కును, వైయాకరణులు చాల శ్రమపడి తమకనుకూలముగా ఈడ్చికొని వచ్చినారు.]

పయిని నిరూపింపబడిన మంత్రములందు వ్యాకరణ ప్రచారమును, దాని స్తుతియు నుండినట్లూహింపనగును గాదాః

[వాక్యపదీయము రెండవకాండలో కొంత భాగమును తెనిగించిన శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మగారిచే పయి ఋక్కులకు ప్రతిపదార్థ తాత్పర్యములు వ్రాయబడినవి.]

ఇట్లు బయలువెడలిన వ్యాకరణశాస్త్రమునందు మిక్కిలి ప్రాచీనమయి యొక ముఖ్యఘట్టమును మనకు నిరూపించు గ్రంథము, పాణిని నిర్మితమయిన అష్టాధ్యాయి సూత్రములు. ఇవి సంస్కృతభాషకు ముఖ్యముగా లౌకిక సంస్కృతమునకు, (అనగా వైదిక మంత్రములలోని సంస్కృతముకంటె కొంత భిన్నము) ఈడులేని లక్షణము. ఈ పాణినికి ముందు విశాలమైన వైదికవాఙ్మయమేగాక లౌకిక వాఙ్మయమును, వాడుకలోనున్న అనగా నిత్యవ్యవహారములో పండితులు వాడుచుండిన భాషయు, అనేక వ్యాకర్తలును ఉండిరి. ఆ భాషనంతటిని సంస్కరించిన యీ పాణినీయ సంప్రదాయము నేటికిని ప్రమాణముగా వాడుకలో నున్నది. తక్కిన సంస్కృత గ్రంథములయొక్కయు, కవులయొక్కయు కాలమువలెనే పాణినియొక్క కాలమునుగూర్చి భిన్నాభిప్రాయము లున్నవి. **Dr. V. S. Agarwall** గారు పాణినికాలము 480-490 క్రీ. పూర్వమనిరి. శ్రీ భండార్కరుగారు 700 క్రీ. పూర్వమనిరి. **Maxmuller**850 క్రీ. పూర్వమనెను. **Keith** గారు 800 క్రీ. పూ. అనిరి. **Belwalkar** గారు 700-800 క్రీ. పూ. అనిరి.

పాణిని ముందు వ్రాయబడిన బ్రాహ్మణములయందు వ్యాకరణ ప్రశంస యుండినట్లు ముందే పేర్కొంటిని. రామాయణమునందు ఆంజనేయుని గూర్చి యీరీతిగా కిష్కింధా కాండలో చెప్పబడెను. "ఈతనిచేత వ్యాకరణ మఖిలమును బహువిధముల అభ్యసింపబడెను. ఎన్నియో మాటలు చెప్పినాడు కాని ఒక అపశబ్దముకూడ వినబడలేదు."[6] ఈ వ్యాకరణమునకు బ్రహ్మయే మొదటి కర్తయనియు,ఆతని తరువాత బృహస్పతి యనియు, అనంతరము ఇంద్రుడనియు చెప్పుటచే ఐంద్రవ్యాకరణ మను నొక సంప్రదాయ ముండినట్లును, అది పాణినికి పూర్వమనియు విమర్శకులు తలంచుచున్నారు. అరవమునకు మొదటి వ్యాకరణమును వ్రాసిన తొల్కాప్పియనారు గ్రంథమును గూర్చి, 'ఐందిరమ్ నిఱైంద తొల్కాప్పియమ్' అని ఆతని కాలము వాడయిన అదంగోట్టా సిరియర్ వ్రాసినాడు. యాస్కుడును[7] పాణినికి పూర్వుడే. ఆయన వ్రాసిన నాలుగువిధములయిన పదవిభాగమునే, తొల్కాప్పియనారు అరవమునకు సరిపెట్టెను. కాబట్టి పాణిని రచనకు ఆధారములయిన లక్ష్యలక్షణములు, సంప్రదాయములు, లాక్షణికులు, విశాలమయిన వైదిక లౌకిక వాఙ్మయములును ఉండినవి. పాణిని తన అష్టాధ్యాయికి ముందు పేర్కొన్న 'అ ఇ ఉణ్' సూత్రములు మాహేశ్వర సూత్రములని యాయనయే పేర్కొనెను. కాబట్టి మహేశ్వర సంప్రదాయ మొకటి యుండెనని కొంద రూహించుచున్నారు.

పాణినిచే ఉదాహరింపబడిన వైయాకరణులు "ఆపిశలి, కాశ్యప, గార్గ్య, గాలవ, భారద్వాజ, శాకటాయన, శాకల్య, సేనక, స్ఫోటాయనాదులు" మొదలయినవారు 32 మంది ఆయనకు ముందుగనో, సమకాలగ్రంథకారులుగనో ఉండిరి.

ఈ అష్టాధ్యాయిలో $8 \times 4 = 32$ పాదములు ఉన్నవి. మొత్తము సూత్రముల సంఖ్య 3391 . ఈ పాణినికి పాణిన, పాణిని, దాక్షీపుత్ర, శాలంకి, శాలాతురీయ, ఆహిక

---

6 నానం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్ ।
బహు వ్యాహరతానేనకించి దపభాషితమ్॥ రామాయణము (కిష్కింధాకాండము).

7 చత్వారి పదజాతాని నామాఖ్యాతే చ ఉపసర్గ నిపాతాశ్చ—యాస్కుడు.

నామములు వాడుకలో నుండినట్లు తెలియుచున్నది. ఇతని తండ్రి పణి యనియు, తల్లి దాక్షి యనియు, శాలాతూర్ ఈతని నివాస గ్రామమనియు ఊహింపబడినది. నేటికిని పరమ ప్రామాణికమయి సంస్కృత భాషాధ్యయనమునకు మిక్కిలి ఉపకారకమయిన యీ పాణిని సూత్రములకు ఆతని తరువాత అనేకులు శేష గ్రంథములను వ్రాసిరి. పయి సూత్రములందలి అతివ్యాప్తి, అవ్యాప్తి మొదలయినవి వారించుచు వివరణము సవరణము చేయునట్టివి ఈ గ్రంథములు. ఇవియును రూపమునను అర్థమునను సూత్రములేకాని వానిని వార్తికములని వ్యవహరించుట రూఢిమూలము (పాణిని కృత సూత్ర వ్యావర్తకము) [8].

> ఉక్తానుక్త దురుక్తానాం చింతా యత్ర ప్రవర్తతే ।
> తం గ్రంథం వార్తికం ప్రాహు ర్వార్తికజ్ఞా మనీషిణః ॥
> ఉక్తానుక్త దురుక్త చింతా వార్తికమ్ : కావ్య మీమాంసా.

శ్లోకవార్తికము, తంత్రవార్తికము, శ్రీశంకర భగవత్పాదకృత బృహదారణ్యక భాష్యముపయిని సురేశ్వరాచార్యుడు వ్రాసిన వార్తిక గ్రంథము మొదలయిన వాని యందు వార్తికశబ్ద ముపయుక్తము.

పతంజలికృత మహాభాష్యమును బట్టి అయిదుగురు పురుషులు అష్టాధ్యాయికి వార్తికములను రచించినట్లు తెలియవచ్చుచున్నది. 1. కాత్యుడు లేక కాత్యాయనుడు. 2. భరద్వాజుఁడు. 3. సునాగుడు 4. క్రోష్ట 5. బాడవుడు. మహాభాష్యమునకు టీకలు వ్రాసిన వారివలన మఱి యిద్దరి పేళ్ళు తెలియవచ్చుచున్నవి: 6. వ్యాఘ్రభూతి 7. వైయాఘ్రపద్యుడు.

ఇంతమంది వార్తికకారుల పేర్లు తెలియవచ్చుచున్నను, వారిలో ముఖ్యుడును, ప్రసిద్ధుడును అయినవాడు కాత్యాయనుడు. ఈయనకే వరరుచి యను నామాంతరము గలదని స్వర్గారోహణ కావ్యమునందలి క్రింది శ్లోకము దృఢపఱచుచున్నది. [9] "కాత్యాయనుని యొక్క వార్తిక పాఠము పాణినీయ వ్యాకరణము యొక్క అత్యంత మహత్త్వపూర్ణమైన అంగము". పతంజలిచే, కాత్యాయనకృత వార్తికముల ఆధారము పయినే, వ్యాకరణ మహాభాష్యము వ్రాయబడినది. కాత్యాయనుని యొక్క వార్తిక పాఠములు స్వతంత్ర రూపమున ఉపలబ్ధములు కావు. మహాభాష్యమునుండి కాత్యాయనకృత వార్తికముల నిశ్చిత సంఖ్య స్పష్టముగా తెలియబడదు. ఎందుచేతననగా అందు అనేకులయిన యితర వాక్యకారుల వచనములు కూడ సంగృహీతములయినవి. వారి నామములు భాష్యకారునిచే పేర్కొనబడలేదు.

భాషాస్వరూపము అనంతముగావున దానికంతటికి నొకరు నిర్వచనము చేసి వ్యాకరణము వ్రాయ సమర్థులు కారు. ఎవ్వరు వ్రాసినను కేవలకర్తయొక్క బుద్ధి విశేషము

---

8. ఈ వార్తిక పదమునకు లక్షణము పరాశరోపపురాణమునం దిట్లు చెప్పఁబడినది.

9. మహారాజ సముద్రగుప్తునిచేత కృష్ణ చరితమునందలి మునికవి వర్ణమునందీ శ్లోకములు వ్రాయబడినవి. యః స్వర్గారోహణం కృత్వా స్వర్గమానీతవాన్ భువి । కావ్యేన రుచిరేణైవ ఖ్యాతో వరరుచిః కవిః ॥ న కేవలం వ్యాకరణం పుపోష। దాక్షీసుతస్యేరిత వార్తికైర్యః॥ కావ్యేపి భూయోనుచకార తం వై। కాత్యాయనోఽసౌ కవికర్మదక్షః॥ (P. 295 సంస్కృత వ్యాకరణ శాస్త్రముయొక్క ఇతిహాసము) 2. సం. వ్యా. ఇ. P 291.

వలన వచ్చు గుణదోషములు మాత్రమే గాక దేశకాలముల భేదముచే వ్యవహృతము లగు చుండు మాండలిక భాషా భేదముల వలన గూడ లక్షణమందు భేదము కనుపట్టుచుండును. కావున శేషగ్రంథములు తప్పవు. తెనుగు వ్యాకరణమున ఆంధ్ర శబ్ద చింతామణికి శేష గ్రంథముగా అధర్వణ కారికలు బయలుదేరినవి. ఈ రెండిటికిని వ్యాఖ్యయగు అహోబల పండితీయమునందే ఈ కారికలు స్పష్టపడుచున్నవి. వానిని గ్రహించియే వేరుగా రూపించిరి అట్లే తెలుగున బాల వ్యాకరణమునకు సవరణ గ్రంథము ప్రౌఢ వ్యాకరణము. ఇట్టి తెలుగు రచనలును పయి సంస్కృత వ్యాకరణ సంప్రదాయము ననుసరించియే తెనుగున బయలు వెడలినవి.

పయిరీతిని వార్తికములను గూర్చి తెలిపిన తరువాత వ్యాడి[10] కృతమైన 'సంగ్రహ' మనెడి యొక గొప్ప గ్రంథమును గూర్చి తెలిసికొనవలయును. పతంజలి కృత మహా భాష్య మునందు 'సంగ్రహ' గ్రంథమును గూర్చిన ప్రశంసగలదు. 'సంగ్రహ ఏతత్ ప్రాధాన్యేన పరీక్షితమ్—సంగ్రహే తావత్ కార్యప్రతిద్వంద్విభావాన్ మన్యామహే శోభనా ఖలు దాక్షాయ ణస్య సంగ్రహస్య కృతిః' పయి వాక్యములను బట్టి సంగ్రహమునకు కర్త దాక్షాయణుడని తెలియుచున్నది. ఈతనికే వ్యాడి యని యింకొక పేరు. "పూర్వము ఈ పాణినీయ వ్యాకరణము నకు సంబంధించి వ్యాడిచే వ్రాయబడిన సంగ్రహమను గ్రంథము లక్ష శ్లోకపరిమితమయి యుండినది" అని వాక్యపదీయ టీకాకారుడయిన పుణ్యరాజు వ్రాసెను.

"'సాధారణముగా సంక్షేపరూప గ్రంథములయందే అభిరుచిగలిగి అల్పవిద్యా పరి గ్రహముచే తృప్తులైన వైయాకరణులను పొంది 'సంగ్రహము' నష్టమయినది. అనేకము లయిన విశేషములను స్వాధీనము చేసికొనిన గురురూపి పతంజలిచే బహువిధములయిన మార్గములను చూపించుచు మహాభాష్యము రచింపఁబడినది. అట్టి మహాభాష్యము అల్పబుద్ధు లకు స్వాధీనము కాకపోవుటచే మిక్కిలి విరళప్రచారమునంది నష్టతుల్యమయిపోయినది. ఇట్లు నష్టమయిన వ్యాకరణాగమము దాక్షిణాత్యులయందు మాత్రము నిలిచినది. పర్వతము నుండి దానిని తీసికొని వచ్చి చంద్రాచార్యాదులు బహుళప్రచారము నందించిరి. ఈ వ్యాకరణ శాస్త్రమార్గమును ఇతర శాస్త్రములయందు నిష్ణాతులయిన మా గురువు నిర్మించిరి.'' ఆదులనుటవలన భర్తృహరి గురువుగారయిన వసురాతుడు గూడ నందుండునట్లు నిశ్చయింప వచ్చును. పై సమాచారమంతయును వాక్యపదీయమునందలి రెండవకాండ 476-482 శ్లోక ములలో నున్నది. ఆ శ్లోకములను గ్రంథమందు పరిశీలించునది.

పయినుదాహరింపబడిన మహాభాష్యకారుడయిన పతంజలిని గూర్చి సంగ్రహముగ వ్రాయనగును. ఈ వ్యాకరణ శాస్త్రమునకు పాణిని కాత్యాయన పతంజలులు ముగ్గురుమునులు కర్తలనియు, ఆదిపురుషులనియు నేడు స్తుతింపబడుచున్నారు. 'యథోత్తరం మునిత్రయస్య ప్రామాణ్యమ్' అనుటవలన వైరుధ్యము స్ఫురించినచో మహాభాష్యము ప్రమాణమని సంప్ర దాయము. ఈ పతంజలికి గోనర్దీయుడనియు, గోణికాపుత్రుడనియు, నాగనాథ, అహిపతి, ఫణిభృత్, శేషరాజు మొదలయిన నామాంతరములు వాడుచుండిరి. పతంజలి అనేక స్థల

---

10. 'పురా పాణినీయేఽస్మిన్ వ్యాకరణే వ్యాడ్యుపరచితమ్ లక్షగ్రంథ పరి మాణం సంగ్రహాభిధానం నిబంధ మాసీత్'

ములయందు "అభిజానాసిదేవదత్తః కశ్మీరాన్ గమిష్యామః, తత్రసక్తూన్ పాస్యామః." (మహాభాష్యం 3/2/114 పాణిని సూత్రమునకు). ఇట్లాతడు కశ్మీరమును పలుమారు లుచ్చరించు చుండుటవలన అతనికి కశ్మీరదేశమందు అభిలాష మెండనియు అది జన్మభూమి యనియు భావింపబడు చున్నది. ఈతని జన్మగ్రామము గోనర్దమయి యుండవచ్చుననియు నూహ చేయబడినది. సామవేదీయ నిదానసూత్రము, యోగదర్శనము, మహాభాష్యము అను మూడును పతంజలి కృతములని ప్రతీతి. ఇక కాళిదాసులు, భర్తృహరులు మొదలయిన వారనేకు లున్నారనునట్లు పయి గ్రంథకర్త లొక్కరేనా? లేక భిన్నులా? ఎంతమంది పతంజలులు? అను ప్రశ్నలు ఉండనేయున్నవి. ఈ మహాభాష్య రచయిత ప్రాయశః పుష్యమిత్రునికి సమకాలికుడనియు 120-140 క్రీ. పూర్వమం దుండియుండెననియు నూహింపబడినది.

తక్కిన వ్యాకరణ గ్రంథములవలెగాక, మిక్కిలి సరళమయి హృదయంగమ మయిన శైలిలో వ్రాయబడిన గ్రంథము మహాభాష్యము. సంస్కృతమునందేమాత్రము పాండిత్యమున్నను మహాభాష్యశైలి అవగతము కాదగ్గదే. అందలి విషయము సర్వతోముఖము. ఆయన కాలమున విశాలమైన వ్యాకరణ వాఙ్మయ ముండినది. దాని సారము నంతను అతడందు చేరవేసి సవిమర్శముగ నిరూపించెను. కేవలము వ్యాకరణ శాస్త్రవిమర్శన మను మిషచే నాతడు ఇతర శాస్త్రసంప్రదాయములను దీనికి సంబంధించినవానిని సంగ్రహించి తన గ్రంథములో వివరించెను.

మహానంద కావ్యము, చరకసంహితా (సంస్కారము, సిద్ధాంత సారావళీ ఇది యొక వైద్యగ్రంథము) కోశము, సాంఖ్యశాస్త్రము, సాహిత్యశాస్త్రము (అనగా సాహిత్య రస విచారము), లోహశాస్త్రము మొదలయినవానికి సంబంధించిన గ్రంథములను ఈతడు రచించినట్లు కూడ ఊహించుట కాధారములున్నవి. ఇట్టి మహాభాష్యమునకు అనేకటీక లున్నవి. వ్యాఖ్యానములున్నవి. భర్తృహరి కృతమయిన మహాభాష్యటీక యున్నదని మును దుదాహరింపబడినది. ఈ టీక విశాలమై 25000 శ్లోకములలో నున్నదని యొక వదంతి. నష్టమయిన యీ గ్రంథముయొక్క, ఒకానొక చిన్నభాగము మాత్రము లిఖితప్రతి దొరకగా దానిని సంస్కరించి యున్నారు. అందు అనేకమ్, అన్యే, ఇతరే, ఏకే, అపరే అను పదములచే భిన్నమతకర్తలను నిరూపించి యున్నట్లూహింపనగును. దీనినే మహాభాష్యదీపిక యని పేర్కొనుచున్నారు. అజ్ఞాత కర్తృకమయిన మరియొకటియు నుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈ విషయము స్కందస్వామిచే సూచింపబడినది. మహాభాష్య ప్రదీపమను పేర కైయటునిచే విశాలమైన మరియొక వ్యాఖ్య వ్రాయబడినది. ఇది నేడు పఠనపాఠనముల కుపయోగించు చున్నది. దీని కాలము క్రీ. వె. 11వ శతాబ్దమని యూహింపబడినది. కాని నిశ్చితప్రమాణము లేవియును లేవు. ఈతడు కశ్మీరదేశవాసి యనుటయు కేవలము నామ సాదృశ్యమునుబట్టి యూహించినదే. ఇంకను గొన్నిటీక లున్నట్లు తెలియుచున్నది గాని కైయటము మిక్కిలి ప్రచారములో నున్నది.

## 4. భర్తృహరి మతము

భర్తృహరి బౌద్ధుడనియు ఏడు సారులు భిక్షుకుడుగా మారి, మరల నేడు సారులు ఆ మతము విడిచెనను ప్రవాదమును ఇత్ సింగ్ తెలిపినట్లు ముందు పేర్కొనబడినది.

ఈయన బౌద్ధుడగునా కాదా? అను విషయమును నిర్ణయించుటకు వాక్యపదీయముననే అనేకో దాహరణములున్నవి .వాక్యపదీయము నందెక్కడను బౌద్ధమతముయొక్క ప్రచారముగాని సిద్ధాంతములుగాని లేవు. వేద ప్రామాణ్యము, వైదిక కర్మలయిన యజ్ఞములు, అద్వైత సిద్ధాంతము, శబ్దము-బ్రహ్మము-ఈ రెంటికిని అభేదము అను విషయములున్నట్లు ఈ క్రింది శ్లోకముల వలన తెలియనగును.

1. ప్రథమ కాండములో 1, 2, 3 శ్లోకములలో బ్రహ్మ నిత్యత్వము, జగత్తునకు దాని వివర్తోపాదనత్వము, వేదప్రామాణ్యము, జ్ఞానమార్గమును నిరూపింపబడినవి.

2. 1 వ కాండ మూడవ శ్లోకమందును,
అధ్యాహితకలాం యస్య కాలశక్తి ముపాశ్రితాః
జన్మాదయో వికారాః షడ్ భావభేదస్య యోనయః ॥ 1-కాం. 3 శ్లో॥

కాలసముద్దేశము-మూడవ కాండమందును
తమస్య లోకతంత్రస్య సూత్రధారం ప్రచక్షతే
ప్రతిబంధాభ్యనుజ్ఞాభ్యాం తేన విశ్వం విభజ్యతే ॥ 3-కాం. 4 శ్లో॥

బ్రహ్మశక్తితో అభిన్నమయిన శక్తియే యిందంగీకరింపబడినది.

3. ప్రక్రియా భేదముచేత ఒక్కటియే అనేక విధములుగా విభజింపబడుచున్నది. అట్టి వ్యాకరణము నాశ్రయించి పరబ్రహ్మ పొందబడుచున్నది. 1-22

ఇట్టి వ్యాకరణ శాస్త్రాశ్రయమున ముక్తి లభించుననుట బౌద్ధుల కెట్లు సమ్మతము?

4. అన్ని స్మృతులకును వేదమే మూలమని 'స్మృతయో బహురూపాశ్చ' అని చెప్ప బడినది. ఇది బౌద్ధులకు కేవల విరుద్ధము కాక తప్పదుగదా. 1-కా. 7 శ్లో॥

5. వ్యాకరణము వేదమునకు ముఖ్యాంగము- "ఆసన్నమ్ బ్రహ్మణస్తస్య" 1-11

6. శబ్దబ్రహ్మకు ఛందోమయమయిన తనువుగలదు, "అత్రాతీత విపర్యాసః" 1-17

7. వేద శబ్దము వలననే జగత్తు యొక్క ఉత్పత్తి యేర్పడినది. "శబ్దస్య పరిణామోఽయం" 1-120

8. ప్రాణులయొక్క చేతనశక్తి గూడ శబ్దమే యని యెరుంగునది. "సైషా సంసారిణాం-" 1-126

9. అన్ని యాగములు సకర్తృకములు, వానికి వినాశనము తప్పదు. త్రయీ-మాత్రము నిత్యము "నజాత్వకర్తృకమ్." 1-133

10. ఆత్మ నిత్యమని అంగీకరించెను.

ఆత్మా వస్తు స్వభావశ్చ శరీరం తత్త్వ మిత్యపి
ద్రవ్యమిత్యస్య పర్యాయ స్తచ్చ నిత్య మితిస్మృతమ్॥ ద్రవ్య సముద్దేశము.
3-కా. 2-స. 1 శ్లో॥

భర్తృహరి యొక్క మతము బౌద్ధము కాదని చూపుటకు పయినిదర్శనములు చాలును. ఒకప్పుడు బౌద్ధ మతావలంబియైన భర్తృహరి యుండినచో నాతడు వాక్యపదీయ కర్త మాత్రము కాడు. ఆతడు మఱియొకడై యుండవచ్చును. ఆతడు సుభాషిత త్రిశతి యొక్క కర్తయయి యుండవచ్చునేమో యనిపించును. కాని అందును బౌద్ధమత విషయము లేవియును కనుపట్టవు. కాని "దిక్కాలాద్యనవచ్ఛిన్నానంతచిన్మాత్రమూర్తయే, స్వానుభూత్యేక మానాయ నమ శ్శాంతాయ తేజసే" అను శ్లోకము నీతి శతకమునకు ముందు కనుపట్టు చుండు నది భర్తృహరి శబ్దధాతుసమీక్షలోనిదని సోమానందుడు, ఉత్పలాచార్యుడును శివదృష్టి యను గ్రంథములో పేర్కొనిరి. సుభాషితత్రిశతి కర్తయు, వాక్యపదీయ కర్తయును, బ్రాహ్మణులును వేద వేదాంగ తత్త్వజ్ఞులని ఆ గ్రంథములను బట్టి నిశ్చయింపక తప్పదు.

## 5. వాక్యపదీయ టీకలు

వాక్యపదీయము మూలము, కారికలనబడెడు శ్లోకముల రూపమున మూడు కాండ ములలో నున్నది. ఈ గ్రంథము పయిని నాలుగు టీకలు లభించుచున్నవి. కాని ఏ యొక్కటి యును గ్రంథమంతటి మీదను సంపూర్ణముగా లేదు. వీనిలో ప్రాచీనమయినది 'వృత్తి' లేక 'టీక' యనబడుచున్నది. ఇది మొదటి రెండు కాండల పయినే యున్నది. ఈ వృత్తి కూడ ప్రథమ కాండము నంతటికి పూర్ణముగా నున్నను రెండవ కాండమునకు నడుమ నడుమ గ్రంథ పాతములతో కూడియున్నది. గ్రంథమునందు - వృత్తికారుడు 'హరి వృషభు'డని యున్నది. రెండవ కాండకు పయివృత్తికాక పుణ్యరాజకృతమయిన టీక కూడ నున్నది. మూడవ కాండమునకు హేలారాజు వ్రాసిన టీక యున్నది. అందు కొంత గ్రంథపాతము ఉండగా ఫుల్లరాజకృతమైన భాగముచే పూరింపబడినది. నాల్గవది వృషభదేవకృతమయిన 'పద్ధతి'యను టీక ప్రథమ కాండమునకు లభించుచున్నది.

ఇక్కడ విచారింపవలసిన విషయమొకటి. పైని పేర్కొనిన 'వృత్తి' వ్రాసిన వారెవ్వరు? ఈ విషయమును తల స్పర్శముగా విమర్శించి కారికలును వృత్తియును ఒక్కరే రచించిరని విమర్శకులు నిర్ణయించిరి. కాండాంత గద్యలలో ఒకయెడ 'శ్రీహరి వృషభ-రచితే' యనియును, 'భర్తృహరి వృషభ......రచితే' అని యింకొక యెడను వ్రాసియుండు టచే వృషభ శబ్దము శ్రేష్ఠ వాచకమనియు, భర్తృహరినే హరియని వాకొనిరనియు ఊహింప బడినది. కాని వీరిద్దరు భిన్నులను వారి వాదములోను కొన్ని బలమైన యుక్తులు గలవు. అవియు నాలోచింపవలసినవే. కాని అభిన్నులను వాదము ప్రాచీనము, అనుస్యూతము నగుట దానినే మనము ఇతర సాక్ష్యము వచ్చువరకును అంగీకరింపవచ్చును.

హేలారాజు వ్రాసిన వ్యాఖ్య మూడవకాండ సంబంధమయినదే, ప్రకాశమను పేర మనకు లభించుచున్నది. దీనియందలి వాక్యములను బట్టి ఈతడు మొదటి రెండు కాండలకు కూడ వ్యాఖ్యానములు వ్రాసినట్లును, దానిపేరు శబ్దప్రభయని వ్యవహరించెననియు తెలియు చున్నది. ఈ హేలారాజు కాశ్మీర భూపతి యయిన ముక్తాపీడుని మంత్రియగు లక్ష్మణుని వంశము వాడనియు భూతిరాజు కొమారుడనియు చెప్పుకొన్నాడు. ఈతడు పదవ శతాబ్దము నడిమిని 950 క్రీ. వె. ఉండిన ట్లూహింపబడినది. ఈతడు వ్యాకరణమున మహాపండితు డనియు మిక్కిలి ప్రతిభావంతుడనియు విమర్శనమువలన తెలియుచున్నది. పుణ్యరాజు

వ్రాసిన వ్యాఖ్యానము రెండవకాండకు లభించుచున్నది. ప్రథమ కాండమునకు ఈయనవ్రాసిన వ్యాఖ్యయున్నదని 1887 లో కాశీ విశ్వ విద్యాలయ ముద్రణమునందలి వాక్యము పొరపాటు. ఆ మొదటి కాండ వ్యాఖ్యానము హరివృషభుడు వ్రాసినట్లున్నది. ప్రథమకాండముయొక్క కారికలకును, వృత్తికిని కూడ కలిపి వ్రాసిన వ్యాఖ్యాన మొకటి వృషభదేవుడను నతడు 'పద్ధతి' యనుపేర రచియించెను. ఇది ప్రాచీన వ్యాఖ్యయే గాని కాలము స్పష్టముగా నిర్ణయింప వీలుగాదు.

## వాక్యపదీయము పేరు, అందలివిషయము

'వాక్యంచ పదంచ వాక్యపదే, తే అధికృత్య కృతో గ్రంథో వాక్యపదీయమ్ పయి విగ్రహ వాక్యమును బట్టి వాక్యపదములు రెండింటిని విచారించు గ్రంథము గావున ఇది అన్వర్థ సంజ్ఞ యని స్పష్టము. ఇందు మూడు కాండలు గలవు. మొదటి దానికి బ్రహ్మకాండ యని పేరు. రెండవదానికి వాక్యకాండ యనియు, మూడవదానికి పదకాండ యనియు పేరు. మొదటి కాండలో 156 కారికలును, రెండవదానిలో 487 కారికలును, మూడవ దానిలో నున్న 14 సముద్దేశములలోని (శ్లోకములు) కారికలు 1828. మొత్తము కారికలు 1966.

*1. బ్రహ్మకాండము* అగమ (సంగ్రహము) సముచ్చయము. ఈ కాండములో ముఖ్యముగా శబ్దబ్రహ్మముల అభేదము, వేదప్రామాణ్యము, నిశ్రేయస ప్రాప్తి ముఖ్య విషయములు. కాబట్టి ఇది బ్రహ్మకాండ మనబడినది.

*2. వాక్యకాండము* వాక్యలక్షణము, వైవిధ్యము, దాని విచారణము, ఇతర మతములు వాక్యార్థము అఖండము నిర్విభాగము, అనవయవమైన శబ్దమే వాక్యస్ఫోటము, పదవాదమునందలి దోషములు, మొదలయిన విందలి విషయములు. కాబట్టి యిది వాక్యకాండ మయినది. ఈ తెలుగు గ్రంథమున మొదటి రెండు కాండములు ప్రతిపదార్థ తాత్పర్యాదులతో ప్రచురింపబడినవి.

*3. మూడవది పదకాండము :* ప్రకీర్ణకాండము.

ఈ కాండము చాలపెద్దది. ఇందు పదునాలుగు సముద్దేశము లున్నవి. ఆయాసముద్దేశములందు ఆయావిషయముల స్వరూపము వివరింపబడినది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | జాతి సముద్దేశము | 106 | కారికలు | 8. | క్రియాసముద్దేశము | 64 | కారికలు |
| 2. | ద్రవ్య ,, | 18 | కారికలు | 9. | కాల ,, | 114 | ,, |
| 3. | సంబంధ ,, | 88 | ,, | 10. | పురుష ,, | 9 | ,, |
| 4. | భూయోద్రవ్య ,, | 8 | ,, | 11. | సంఖ్యా ,, | 32 | ,, |
| 5. | గుణ ,, | 9 | ,, | 12. | ఉపగ్రహ ,, | 27 | ,, |
| 6. | దిక్ ,, | 28 | ,, | 13. | లింగ ,, | 31 | ,, |
| 7. | సాధన ,, | 167 | ,, | 14. | వృత్తి ,, | 627 | ,, |

పయి సముద్దేశములలో ఆయా విషయములస్వభావము, వానికిగల వాచ్యవాచక సంబంధము మొదలయిన పరిపూర్ణవిచారము గలదు.

పయిరీతిని మూడు కాండముల యొక్క పేళ్ళను వానియందలి విషయ విభాగ మును మిక్కిలి సంగ్రహముగా నిరూపింపబడిన తరువాత అందలి విషయమును గూడ ఈ క్రిందను మఱికొంచెము విశదపడునట్లు సమన్వయపరచి నిరూపింతును.

1. ఈ మొదటి కాండమునకు కృత్యంతము "ఇతి శ్రీహరివృషభ మహావైయా కరణ విరచితే వాక్యపదీయే 'ఆగమసముచ్చయో' నామ 'బ్రహ్మకాండం' సమాప్తమ్" అని యుండుట వలన ఈ రెండును ఈ కాండమునకు పేళ్ళని యూహింపక తప్పదు.

ఈ గ్రంథమున 1 వ కాండలోని 24-25-26 శ్లోకములలో ఈ గ్రంథము నందంతటను వివరింపబడు విషయములు నిరూపింపబడినవి. అవి క్రమముగా 1. అపోద్ధార పదార్థములు, 2. స్థిత లక్షణములు 3. అన్వాఖ్యేయములయిన శబ్దములు 4. ప్రతిపాదకములు 5. కార్యకారణ భావమున నున్నవి. 6. యోగ్యతారూప స్థితములు. 7. ధర్మము. 8. ప్రత్య యము. (చూడు తెలుగు వ్యాఖ్యానము-24, 25, 26, శ్లో.)

ఈ ఎనిమిది విషయములకు వేరు వేరు కాండలు లేవుగదా ; ఉన్నవి మూడే. ఇక బ్రహ్మను చెప్పుకాండము బ్రహ్మ కాండమనుచో బ్రహ్మను గూర్చి యీ యెనిమిదిటిలో పరిగ ణింప వీలులేదుగదా ; అని యడుగవచ్చును . ఈ యెనిమిదియును ఏయే కాండలో వివరింప బడినవి ? అనియును ప్రశ్న కలుగుచున్నది. మొదటి కాండములో మొదటి 22 శ్లోకములలో ఫలము చెప్పబడినది. "తద్ వ్యాకరణ మాగమ్య పరం బ్రహ్మాధిగమ్యతే" అని 22 వ శ్లోకము తుదినున్నది. కాబట్టి బ్రహ్మప్రాప్తియే ఫలము. భర్తృహరి 'పయి' యెనిమిది విషయములలో 'ధర్మమును' 'ప్రత్యయమును = అర్థావగతి = బోధ అని పేర్కొనెను.' ఆ రెండే ఫలము. అందు ముఖ్యము బ్రహ్మప్రాప్తి—అదియే మోక్షము, నిశ్రేయసము మొదలగు పదములచే చెప్పబడుచున్నది, కాబట్టి అట్టి బ్రహ్మమును శబ్దాభిన్నరూపముగా మొదటి శ్లోకమునసే చెప్పి సమన్వయము చేసియున్నాడు. కావున బ్రహ్మకాండమను పేరు ఈ కాండమునకు తగి యున్నది.

ఇక రెండవపేరయిన ఆగమ సముచ్చయమును అన్వర్థమే యని చెప్పవలయును— అది నిరర్థకము అని భావి ంపమతము గూడ వినబడుచున్నది, 'ఆగమ' శబ్దమునకు సంప్ర దాయ సిద్ధమైన జ్ఞానము, వేదము, శాస్త్రములు మొదలయిన యనేకార్థములు ప్రాచీన కాలము ననే యుండినవి. ఇచ్చట ఆగమ సముచ్చయము, ఆగమ సంగ్రహము అను రెండు పదము లును ఈ ప్రథమ కాండమునకు పేళ్ళుగా వ్యవహరింపబడినవి. 'న జాత్వకర్తృకం కైశ్చిత్' అను 133 శ్లోకము నుండి చాల శ్లోకములలో ఆగమముల ప్రామాణ్యము, మానవకృతమయిన ఆగమములు, తర్కము, వేదములు మొదలగువాని స్వభావము అంతయును సంగ్రహముగ వివరింపబడినది. ఇట్లు చెప్పుటవలన ఈ కాండకు ఆగమ సముచ్చయము కూడ అన్వర్థమే యనక తప్పదు.

ఇందు చెప్పబడిన రెండు భాగములయిన ఫలమునందు ముఖ్యభాగమయిన ధర్మ రూప ఫలమునకు వేదమే మూలము. అదియే శబ్ద బ్రహ్మము. ఆ వేదమున కంగమైన వ్యాకర ణము వలన సాధుశబ్ద మేది అసాధుశబ్ద మేది యని వ్యవహర్త యెరుగగలడు. సాధుశబ్ద మును వాడుటవలననే మొదటి ఫలమయిన బ్రహ్మప్రాప్తి గలదు. అర్థావగతి మాత్రమే ఫలమను వారికి సాధ్వసాధుశబ్దములు రెండును ఉపాదేయములే. అసాధుశబ్దముల వలన

గూడ అర్థబోధ గలుగుచున్నది. లోక వ్యవహారము కుంటు వడదు.(వా.ప. I -141-42 శ్లో)
ఈ కాండములోని 44 వ శ్లో. "ద్వావుపాదాన శబ్దేషు-" మొదలయిన శ్లోకములలో స్ఫోటయే నిజమైన శబ్దమనియు, అది నాదముకంటెను, ధ్వనికంటెను భిన్నమనియు, తాల్వాద్యవయవ ముల స్పందముచేత గలుగు వైఖరీ రూపమయిన వాక్కు కేవలము క్రమరూపమయి అసత్య మగు చున్నదనియు తెలిపి స్ఫోటయొక్క రూపమును వివరించెను. 'స్ఫోటమును గురించిన విచారణ' ఆ శీర్షిక క్రింద వివరింపబడును.

ఇక రెండవ కాండ పేరు వాక్య కాండ. ఈ కాండలో వాక్యార్థమే సత్యమనియు పదములు గాని, తదర్థములు గాని కాల్పనికము లనియు తెల్పుచు అట్టి వాక్యార్థమునకు గమక మయిన వాక్యమును గూర్చిన భిన్న మతములు, తన కాలములో నున్నవాటిని ఎనిమిది విధ ములుగా విభజించి వానినన్నిటిని సమన్వయపరచి గాని నిరాకరించి గాని పిండీకృతమయిన వ్యాకరణ మతమును నిశ్చయపరచెను. వాక్యమును విభజించుటవలన గలుగు శబ్దములే అర్థవంతములని యంగీకరించుచో అట్టి పదమును విభజించుటవలన గలుగు వర్ణములు గూడ నర్థవంతములయి సత్యము కావలెను గదా? అట్లగుటలేదు. కొన్ని పదములను విభజింపనే వీలుకాదు. కొన్ని పదాంగములను మనము విభజించి యెత్తి చూపునపు డవి ఆ యర్థములకు వాచకములు గావు గాని ద్యోతకములు మాత్రమే (దీపము వస్తుజ్ఞానమునకు ఎట్లు కారణ మగుచున్నదో అట్లే అవియును ద్యోతకములగుచున్నవి యను నభిప్రాయములను మనకు తెలిపెను). ఈ కాండమునందలి విచారమంతయును వాక్యస్వరూపమును గూర్చిన భిన్న మతములను ఉపన్యసించుట, సిద్ధాంతమును నిరూపించుటతోనే ముగిసినది గావున ఇది వాక్య కాండ యనుట యుక్తమును అన్వర్థమును అనుట నిశ్చితము.

మూడవ కాండమునకు పేరు పదకాండము. ఇందు వాక్యవిభజనమువలన నేర్పడు పదములు - వానిభేదములు - వానికిని అర్థమునకును గల సంబంధములు విచారింపబడినవి. "పదములు కొందరిచేత రెండు విధములుగాను, మూడు విధములని యితరులచేతను, నాలుగని మరికొందరిచేతను, ఐదని వేరొక కొందరిచేతను విభజింపఁబడినవి" యని మూడవ కాండ యారంభింపబడినది. అందు నామాఖ్యాతములు ముఖ్యములు. వానిలో నామములయర్థమును, వాక్యమందలి ప్రయోజనము వివరించుటకు ముందు, జాతి, ద్రవ్య, సంబంధ, భూయోద్రవ్య, గుణ, దిక్ రూపములయిన ఆరు పదార్థములను నిరూపించెను. ఏడవ సముద్దేశమునందు నామములందు గలిగిన శక్తివలన క్రియోత్పాదకమైన సాధనత్వము వాని యందెట్లున్నదో నిరూ పించెను. వాక్యార్థమే సత్యముగావున, దానికి ఆధారము క్రియార్థమైన వ్యాపారముకావున నందలి సాధనములయిన కారకములనువాని నన్నిటిని ఈ ప్రకరణమున వివరించెను. తరువాత క్రియా స్వరూపము వివరింపబడినది. నామమునకు క్రియకు గల భేదము, క్రియాస్వభావము, క్రమభూతములయిన అవయవములను గురించి ద్రష్టయొక్క బుద్ధియందు గలుగు అభేద భావమే యని నిరూపించెను. ఆతరువాత కాలసముద్దేశమునందు కాలస్వరూపము నిరూపిం చెను. అందు భూత భవిష్య ద్వర్తమానముల స్వరూపమును, పదునొకండు విధములయిన అవాంతర భేదములను స్పష్టముచేసెను. తరువాతిది యగు పురుష సముద్దేశమునందు ప్రథమ మధ్యమోత్తమ పురుషములను వివరించెను. ఆ తరువాత సంఖ్యాసముద్దేశము. సంఖ్య యన నేమి? అది దేని యందున్నది? అను విచారణమును ఎట్లు భేదాభేదవిభాగము సంఖ్యా

నిబంధనమగుచున్నది? యను విషయములను తెలిపెను. 12వ దైన ఉపగ్రహ సముద్దేశము నందు ఆత్మనేపదాది విచారము చేయబడినది. తరువాతిదైన లింగ సముద్దేశమునందు లౌకిక లింగమునకు వైయాకరణాంగీకృతమగు లింగమునకు గల భేదాదికమును విమర్శించెను. 14వది వృత్తిసముద్దేశము. ఇందు 627 శ్లోకములు గలవు. అందు ధాతు, సమాసాది వృత్తులను, వాని యవాంతరభేదములను అనేక దృష్టి కోణములనుండి విభజించి వివరించెను.

## వాగ్ వ్యాపారము

"ద్వావుపాదాన శబ్దేషు" ఇత్యాది (1-44) శ్లోకమున, ఉపాదాన శబ్దములయందు రెండు విధములయిన వున్నవని భర్తృహరి చెప్పెను. ఈ రెండిటిలో ఒక్కటి ధ్వని, ఇంకొకటి స్ఫోట. వక్త పలుకు మాటలు ధ్వని. ఈ పలుకులు నిమిత్తములు. అనగా కారణములు. సత్యమై మూలమయిన స్ఫోటను (అర్థవంతమయినదానిని) ఇవి వెలుపరించుచున్నవని యభిప్రాయము. పయి శ్లోకములోను ఇతర స్థలములయం దచ్చటచ్చటను 'శబ్దము' అను పదమును అనేకార్థములలో భర్తృహరి వాడినట్లు స్పష్టముగా కనుపట్టును. 'వాక్యము, పదము, ధ్వని మాత్రము, అర్థవంతములయిన ధ్వనులు, శబ్దముయొక్క పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను భేదములు' పయి యన్నిటిని గూడ నీతడు శబ్దము అను మాటచేతనే వ్యవహరించెను. దీనివలన పాఠకులకు అర్థబోధయందు విలంబ మేర్పడును. వ్యాఖ్యాన సాహాయ్యమునగాని ప్రాకరణికార్థము తెలియ వీలుగాదు.

స్ఫోటయొక్క స్వరూపము పూర్తిగా తెలిసికొనుటకు ముందు భర్తృహరి మతము చొప్పున గాని మన యనుభవము చేతను గాని, యితర సంస్కారముచేగాని, వాగ్వ్యాపారము చేయుటయందు వక్తయొక్క ప్రయత్నములోను, శ్రోత యనుభవమునను గల యవస్థలను విభజించి మనము గుర్తించుకొనవలయును. వక్త తనచే నుద్దిష్టమయిన యర్థమునకు వాచకమయిన వాక్కును, తాలువు, జిహ్వా మొదలయిన ముఖాంగములతో నుచ్చరించును. ఆ ప్రయత్నమువలన వాక్కు బయల్వెడలి శ్రోతయొక్క శ్రవణేంద్రియముచేత గ్రహింపబడు చున్నది. వక్త తన నోటియందలి ప్రయత్నమువలన వెలువరించు వాక్కును వైఖరీ వాక్కు అని చెప్పుదురు. కొందరు వైయాకరణభిన్నులయిన శాస్త్రజ్ఞులు ఇట్లు బయలువెడలిన దానినే శబ్దమనియు, ఒక క్షణములో పుట్టి మఱియొక క్షణమున వినబడి ఉత్తర క్షణమున నశించు ననియు చెప్పుదురు.

ఇక వైయాకరణుల మతమును పరిశీలింతము. శబ్దక్రియయందు మనకు ప్రత్యక్షమగునది ముఖాంగముల చలనము, వాయువుయొక్క కదలిక మాత్రమే గాదు. అట్లైనచో ఎట్టి కదలికవలన గలిగినను, ముఖ బహిర్గతమయిన ధ్వని యంతయు వాక్కుగావలయును గదా? అర్థ స్ఫోరకము గానిది వాక్కు గాదు. ఇక, ఏదో యొక నియతమైన క్రమముతోగూడిన ముఖాంగముల కదలిక గలిగి, వక్త యుద్దేశించిన యర్థమునకు వాచకమయిన ధ్వనియేగదా శబ్దము? ఈ శబ్దము నుచ్చరించుటకే నాలుక తాలువు మొదలయిన వాని కదలిక బయలుపడకముందు వక్తయొక్క మనసున నా శబ్దముండి యుండవలెనుగదా? అది వైఖరీ రూపమునకు పూర్వరూపమయిన 'మధ్యమా' రూపమనునది. ఈ మధ్యమారూపములో శబ్దము తనకు వాచ్యమయిన యర్థము యొక్క భావనతో గూడి, స్పష్టముగానుండవలెను. బయటికి వినబడకుండ నోరు కదల్పక వక్త తనలో ననుకొను శబ్దము లనేకములు కలవని,

మనసు పరీక్షవలన తెలిసికొనగలము. పయి రీతిని మధ్యమా రూపమయిన వాక్కునకు మఱి యొక్క పూర్వ రూపము-శబ్దార్థముల వేరుపాటు లేకయుండినది ఉండక తప్పదు. దానిపేరు 'పశ్యంతీ' యనునది. ఈపేరు అన్వర్థమా, నిరర్థకమా ? 'చూచుచున్నది' యని యీపదమున కర్థము. ఈ చూచుచున్నదేది ? అది వాక్కే ; అదే కర్త్రి. మనము ఒక పదార్థమును చూచి అది యిల్లు అని గుర్తించునపుడు ఆ యింటిని గుర్తించుట వాక్కుచేతనేగదా ? అట్లు కాదను కొందము అనగా దానిపేరు మనకు తెలియదు. అప్పుడు మన జ్ఞానము, అనుభవ మాత్రము గానే యుండును గాని బహిర్భూతము చేయుటకుగాని జ్ఞాపకమేర్పడుటకు గాని పనికిరాదు. మన కాపేరు తెలిసిన వెంటనే శబ్దార్థములయొక్క సాహచర్యము, తాదాత్మ్యము నేర్పడును. అప్పటినుండియు ఆ సంజ్ఞచేతనే దానిని మన మవగాహనము చేసికొనవచ్చును. అదియే వాక్కు. అదియే 'పశ్యంతి'. ఈ పశ్యంతీ రూపమునకును వైఖరీ రూపమునకును నడిమి యవస్థయే 'మధ్యమా' రూపము. ఈ పేరును అన్వర్థమే. మధ్యమ యనగా నడిమిది. ఇక పశ్యంతీ మధ్యమా రూపములకు భేదమేమి యని యడుగవచ్చును. పూర్వావస్థ యగు పశ్యంతి యందు వాగర్థముల కైక్యము, తాదాత్మ్యము. మధ్యమయందు ఈ రెండింటియొక్క స్పష్టమయిన వేర్పాటు. ఒక ఉదాహరణమును గ్రహించునది. 'కోతి'యను శబ్దము ఆ శబ్దమునకును, దాని యర్థమునకును గూడ వాచకమే. అనగా కాగితముమీద 'కోతి' వ్రాయు మనునప్పుడు 'కోతి' యని 'లిపి'తోగాని 'కోతి' రూపమునుగాని యెదుటివాడు వ్రాయవచ్చును. ఈ రెండిటిలో నేది యుద్దిష్టమో మధ్యమా వాక్కున, వక్త యుద్దేశమున, స్పష్టముగ నుండును. పశ్యంతీ రూపమున నవి యవిభక్తముగా నుండును. కాబట్టి, యేవాక్కున కయినను పయి మూడు రూపములును అగీంకరింపక తప్పదు. భర్తృహరి యీ మూడింటినే పేర్కొనెను.[11] ఆతని మతమున ఈ మూడే వాక్కుయొక్క రూపములు అనవలెను. ఈ మూడింటికిని పూర్వ రూపమయినది యెల్లరి యంతఃకరణమున సాక్షిభూతముగా నుండునట్టిది నానాత్వము లేనిది యింకొకటి గలదనియు. దానిపేరు 'పరా' యనియు శైవమతము మఱియొకటిగలదు.

---

11 ''వైఖర్యా మధ్యమాయాశ్చ పశ్యంత్యాశ్చైత దద్భుతమ్
అనేక తీర్థభేదాయా స్త్రయ్యా వాచః పరంపదమ్'' ॥ వా. ప. — I—148.

పైన చెప్పినదిగాక, కొన్ని అధిక పాఠశ్లోకములు కూడ ఈ క్రిందివి అర్థమును స్పష్టపఱచుచున్నవి.

'అవిభాగాతు పశ్యంతీ సర్వతః సంహృతక్రమా ।
స్వరూపజ్యోతిరేవాంతః । సూక్ష్మావాగనపాయినీ ॥
కేవలం బుద్ధ్యుపాదానా క్రమరూపాతిపాతినీ ।
ప్రాణవృత్తి మతిక్రమ్య మధ్యమా వాక్ప్రవర్తతే ॥
స్థానేష్వభిహితే వాయౌకృతవర్ణ పరిగ్రహా ।
వైఖరీ వాక్ ప్రయోక్తౄణాం ప్రాణవృత్తి నిబంధనా ।
సేయమాకీర్యమాణాఽపి నిత్యమాగంతుకైర్మలైః ॥
అంత్యా కలేవసోమస్య నాత్యంత మభిభూయతే ।
'శివదృష్టి' యను గ్రంథము నందలి మధ్యమావర్ణనము.
''సంప్రాప్తా వక్త్రకుహరం । కంఠాదిస్థాన భాగశః ।
వైఖరీ కథ్యతేసైవ । బహిర్వ్యాపనయా క్రమాత్ ।
ఘటాదిరూపై ర్వ్యావృత్తా గృహ్యతే చక్షురాదినా ।

భర్తృహరి అద్వైత సిద్ధాంతమును ఆదరించువాడని ముందు స్థిరపరచితిని. ఆ పక్షమందు ఈ వాక్కు నెక్కడనో తుదిరూపమయిన బ్రహ్మముతో గలుపవలెనుగదా! ఆ పద్ధతి వాక్యపదీయ మున బ్రహ్మకాండములోని 112-115 శ్లోకములలో నాతడు చెప్పెను (చూడు వ్యాఖ్యానము-తెలుగు). "సూక్ష్మమైన వాగాత్మయందు ఉన్నవాడై, లోపలిజ్ఞాత (అనగా ఆత్మయే;జీవాత్మ యన్నచో దానికిని పరమాత్మకును అభేదమేగదా) శబ్దరూపము చేతనే వ్యక్తమగుటకు వివర్తావస్థను పొందుచున్నాడు'' అని వ్రాసెను. కాబట్టి పశ్యంతీ రూపమయిన వాక్కే బ్రహ్మతో నభిన్నమను పయిమతము భర్తృహరిది-ఈ బ్రహ్మ రూపమునకును 'పశ్యంతీ' వాక్కునకును నడుమ 'పరా' వాగవస్థ యున్నదను వారిమతమున అదియెట్టిది? ఆ పరా వాక్కునే గదా బ్రహ్మముతో కలుపుటఅని యడుగక తప్పదు - 'తెలిసిన యర్థమును చెప్పుటకు కోరికగల పురుషుని ప్రయత్నమువలన యోగమున 'మూలాధార' మందు గల వాయువుయొక్క సంస్కారము (గలుగు చున్నది). దానివలన అభివ్యక్త మయి నిశ్చలమయిన శబ్ద బ్రహ్మము తానే (అన్నిటికి ఆధారమయిన యునికిగలదగుటచేత) 'పరా' వాక్ అని చెప్పబడుచున్నది'. ఈ వాక్కు చొప్పున 'పరావాక్'[12] అనునది 'మూలాధారమను చక్రమునుండి బయలు వెడలుననియు అది బ్రహ్మముతో నభిన్నమనియు నిశ్చితమగుచున్నది. ఈ యభిప్రాయమునే నాగేశభట్టుకూడ వివరించియున్నాడు. పరావాక్ మూలాధార చక్రము నందలిది'యనియు,పశ్యంతీరూపము నాభియందలిదియనియు, మధ్యమ హృదయ గతమనియు, వైఖరీ వాక్కు కంఠదేశస్థమనియు చెప్పియున్నాడు. ఇట్లు 'పరా' అను రూపముగల వాక్కునేల పయి మతమున నంగీకరింపవలసి వచ్చినది యని ప్రశ్నింపక తప్పదు. దానికి హేతువు భర్తృహరి చెప్పిన శబ్దోత్పత్తి క్రమమునుబట్టియే యూహింపవచ్చును. భర్తృహరి I-118 వ శ్లోకమున ఈరీతిని చెప్పియున్నాడు. "ఆ బ్రహ్మ పదార్థము (వివర్త రూపమున) మనఃస్థితిని పొంది తేజస్సువలన పాకమును బడసి ప్రాణవాయువును ఆవేశించి బయటికి శబ్దముగా వచ్చుచున్నది"[13] దీనినిబట్టి వాయువు ఎచ్చట ఆవేశింపవలెను? అది అన్నిటికి ఆధారమయిన మూలాధారమున ప్రవేశించెనని చెప్పక తప్పదుగదా! ఈ మార్గమే శిక్షలలో చెప్పబడినది.[14] "ఆత్మ (తానే జీవాత్మ) బుద్ధిచే అర్థములను తెలిసికొని మాటలాడవలెనని మనస్సుతో (యోగమును పొందును) కలియును. ఆ మనస్సు, శరీరములో నున్న అగ్నిని ప్రజ్వలింపజేసి వాయువును ప్రేరించును."అట్టి మారుతమే పరమాణు రూపమయిన శబ్దముతో

---

12. జ్ఞాతమర్థం వివక్షోః పుంసః ఇచ్ఛయా జాతేన ప్రయత్నేన,
యోగే ఏవ మూలాధారస్థపవనసంస్కారః । తదభివ్యక్తం
శబ్దబ్రహ్మ స్వప్రతిష్ఠతయా పరావాగిత్యుచ్యతే ॥
పరావా మూలచక్రస్థా పశ్యంతీ నాభిసంస్థితా ।
హృదిస్థా మధ్యమా జ్ఞేయా, వైఖరీ కంఠదేశగా ॥

13. స మనోభావ మాపద్య తేజసా పాక మాగతః ।
వాయుమా విశతి ప్రాణమ్ అథాసౌ సముదీర్యతే ॥ వా. 1-118.

14. పాణినీయ శిక్ష ॥ ఆత్మా బుద్ధ్యా సమర్థ్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా,
మనః కాయాగ్ని మాహంతి స ప్రేరయతి మారుతమ్.

నభిన్నము.[15] కాబట్టి ఈ యణువులు మూలాధారమునుండియే బయల్వెడలవలెను. అంత కంటె క్రిందది లేదు. కాబట్టి మూలాధార చక్రమును గుఱించి యీ నాల్గవ భేదమగు 'పరా' వాక్కు భర్తృహరిచే గాకున్నను ఇతరులచే నంగీకరింపబడినది.[16] ఈ క్రింద నిరూపింపబడిన వృత్తియందు-భర్తృహరి చేతనే వ్రాయబడిదనబడుదానియందు, వాక్కుయొక్క నాలుగు అవస్థలును నిరూపించబడినట్లూహింపనగును. "అట్టి యీ వాక్కు (అనగా స్ఫోటము) మూడు విధములైనది. చైతన్యమనెడు ముడినుండి వివర్తరూపమున అనేక భేదములు గలుగుటచేత నిర్వచింప వీలులేనిదై వెడలినదై నాల్గవదానిచేత మనుష్యులయందు వ్యవహరింరబడుచున్నది. ఇక్కడ గూడను దీనికి కొంచెమే వ్యవహారము. మిగిలినదంతయు సామాన్య వ్యవహారము నతిక్రమించినదే. "చత్వారి వాక్ పరిమితా"యను ఋక్కును జూచునది. ఇట్లు వ్రాయబడి యుండుటవలనను పయి భర్తృహరి కృతకారికయందు త్రయీవాక్ అని చెప్పియుండగా దానికంటె అధికముగా నాలుగు విధములుగా చెప్పుటచేతను ఈవృత్తి భర్తృహరిది గాదనియు, కారికలోని విషయముకంటె అధికముగా ఋక్కు యొక్క ప్రమాణముచే నిరూపించి మఱి యొక్కరు ఈ వృత్తిని వ్రాసియుండవచ్చుననియు కొందరు విమర్శకు లభిప్రాయపడు చున్నారు. 17,18, సంఖ్య కారికలలో వాక్ శబ్దమునకు 'పరా' యని యర్థము వ్రాయుట పయి వ్యాఖ్యానానుసారము చేయబడినదని గ్రహించునది.

ఇట్లు వాగుత్పత్తివిధానమును గుర్తెఱింగి ఆ వాక్కును శ్రోత గ్రహించు విధానమును వివరింపవలెనుగదా: పయిరీతిని పుట్టిన వైఖరీవాక్కు శ్రోతయొక్క శ్రవణేంద్రియముద్వారా పరమాణు రూపమున ప్రసరించి అతనిలో నింతకుముందు సంస్కార రూపముననుండు అర్థ మునే (రూఢివలనగాని యోగమువలనగాని సంబంధించిన దానినే) బోధావస్థలోనికి దెచ్చినపుడే వక్తయొక్క వాగ్ వ్యాపారమువలని ఫలితము పూర్తియైన దనవలెను. వక్తయొక్క అంతః కరణమునందు ఈ వాగర్థము లెట్లు నిత్యరూపమున నుండినవో యట్లే శ్రోతయొక్క ప్రత్యక్షీ కరణము జరుగును, ఇది స్మరణ రూపముననో అవగతి రూపముననో సిద్ధించు చున్నది. ఇదివర కాత డెరింగిన దానికి స్మరణము, క్రొత్త భావమునకు అవగతి. వాచ్య వాచకరూప మున అతనియందు సంస్కారములుగా, ఇవి పూర్వమున ఉండియుండనిచో, స్మరణములేదు, అవగతియును గలుగదు. వక్తయందు అఖండ రూపమున నిత్యముగానున్న శబ్దార్థములను తన వైఖరీ రూపమయిన పరమాణు చలనముచేత బయల్పరచి, వానివలన శ్రోత యొక్క బుద్ధియందు ప్రతిఫలింపజేసి మరల నఖండరూపమయిన జ్ఞానముగా మార్చుటయే గదా వాగభి వ్యక్తియొక్క ఫలితము. ఈ వివరణము చొప్పున తార్కికుల వాదమగు, 'శబ్దము పుట్టు

---

15. స్వశక్త్యా వ్యజ్యమానాయాం ప్రయత్నేన సమీరితాః ।
అభ్రాణీవ ప్రచీయంతే శబ్దాఖ్యాః పరమాణవః ॥ వా. I – 111 శ్లో॥

16. భర్తృహరిచేతనే వ్రాయబడినట్లూహింపబడిన, వృత్తియందలి పంక్తి — సైషా త్రయీ వాక్ చైతన్యగ్రంథి వివర్తవ దసాఖ్యేయపరిమాణా తురీయేణ మనుష్యేషు ప్రత్యవభాసతే। తత్రాపిచాస్యాః కించిదేవ వ్యావహారికమ్, అన్యత్తు సామాన్య వ్యవహారాతీ తమ్. ఆహ ఖల్వపి "చత్వారివాక్పరిమితా, (ఋగ్వేదే) 1–164.45. దీనియర్థము ముందీయబడినది.

చున్నది. నశించుచున్నది' యనునది పరాస్తమయినది. శబ్దము పుట్టలేదు, అది నశింపను లేదు. పయిరీతిని వాగ్ వ్యాపారముయొక్క ఆరంభముననుఅంతముననుగల శబ్దమే నిత్యము. అదియే స్ఫోటము. అది కార్యముగాదు. ఈ స్ఫోటము వాక్య స్ఫోట, పదస్ఫోట, వర్ణస్ఫోట అను రీతిని ఆయా ఉపాధులగు వాక్య పద వర్ణములచేత త్రివిధముగా విభజింపనగును. 17

ఇంకొక్క విషయమిచ్చట గమనింప దగియున్నది. వక్తయొక్క మనస్సు నందున్న పశ్యంతీ వాక్కు (లబ్ధానుసంహార స్వరూపము) నిమిత్తమగుచున్నది. దీనివలన గలుగు వైఖరీ వాక్కు కార్యమగుచున్నది. కారణము పూర్వవృత్తి, కార్యము అనంతర వృత్తి- కాని శ్రోత విషయములో వైఖరీ వాక్కు నిమిత్తము, కార్యము శ్రోత యొక్క బోధ స్థమగు అవిభక్త రూపమయిన అఖండ వాక్యార్థము- ఈ రీతిని భర్తృహరి ఊహించి 'క్రమవాన్' 'అక్రమ నిమిత్తమ్' అను విశేషణములను శబ్దమును గురించి వాడియున్నాడు. వక్త విషయమున కారణము కార్యము అయినవియే శ్రోత విషయమున విపరీతములయి కార్యము కారణము అగుచున్నవి. వక్త—పశ్యంతీ—మధ్యమా—వైఖరీ—మధ్యమా—పశ్యంతీ—శ్రోత అను వరుసలో ఫలించుచున్నవి. ఒకచో వైఖరి నిమిత్తమనియు, మధ్యమ కార్య మనియు, భర్తృహరి వ్రాయుటలోని యభిప్రాయము సంబంధ విశేషమును చెప్పుటకయి అవ లంబించెను. బయటికి తెలియునది వైఖరి—దానివలన వక్తయందలి మధ్యమా వాక్కును శ్రోత యూహించుచున్నాడు-అను నభిప్రాయమునందు చెప్పియున్నాడు.

## స్ఫోట స్వరూపము

స్ఫోట యను పదార్థ మున్నదనియు నది యెల్ల శబ్దములకును మూలమనియు వైయాకరణు లెల్లరు నంగీకరించిరి. వైయాకరణులు స్ఫోటవాదులను ప్రసిద్ధిని పొందిరి, ఈ విషయమున, మీమాంసకులు, నైయాయికులు, వేదాంతులు, బౌద్ధులు, చార్వాకులు మొద లయిన వారందరును భిన్నమతముల నాశ్రయింతురు. ఈ స్ఫోట స్వరూపమును, స్వభావమును ప్రాచీనుల సమ్మతిపయి నాధారపడినదేగాని, దీనికి వివరణము, ప్రచారము, ప్రశస్తి మొట్ట మొదట భర్తృహరి వలననే కలిగినదని చెప్పవచ్చును. మీమాంసకుడయిన కుమారిలభట్టును, నైయాయికుడయిన వాచస్పతి మిశ్రుడును పయిస్ఫోటవాదమును ఖండించిరి. మండన మిశ్రుడను నాతడు 'స్ఫోటసిద్ధి' యను గ్రంథములో స్ఫోట సిద్ధాంతమును బలపరచెను.

పయిరీతిని రూఢమయిన స్ఫోట స్వభావమును తెలిసికొనుటకు శబ్దము, స్ఫోట, అను రెండు పదములను ఏయర్థములలో పతంజలి భర్తృహరులు ప్రయోగించిరో యెరుంగ

---

17. వర్ణపదవాక్య విషయాః ప్రయత్నవిశేష సాధ్యాః, ధ్వనయో వర్ణ పద వాక్యా ఖ్యాన్ స్ఫోటాన్ పునః పునః అవిర్భావయంతః బుద్ధి ప్వారోపయంతి. [వా. I-148].

ఏకో నిమిత్తం శబ్దానా మపరోఽర్థే ప్రయుజ్యతే॥ వా. ప. శ్లో. 44-దాని వృత్తి; లబ్ధానుసంహారో నిమిత్తమ్; ఉపజనితక్రమస్తు ప్రత్యాయక ఇత్యేతే;

నగును. మహాభాష్యమున శబ్దము స్వభావము ఈ రీతిగా వివరింపబడినది.[18] "ఇక శబ్దమేమి? దేనినుచ్చరించుటచేత గంగడోలు, తోక, మూపురము, డెక్కలు, కొమ్ములు గలిగిన పిండ పదార్థములు స్ఫురించునో, అది గౌః అను శబ్దము. లోకమునందు ధ్వని మాత్రము కూడ శబ్దమని వ్యవహరింపబడుచున్నది. ఎట్లనగా శబ్దము చేయుము, శబ్దము చేయకుము, ఈ పిల్ల వాడు శబ్దము చేయుచున్నాడు అనియు వ్యవహారము. కావున ధ్వని శబ్దము. అట్లే స్ఫోటము శబ్దము; ధ్వని శబ్దగుణము. ఎట్లు? భేర్యాఘాతము వలెనే; ఒకానొక డోలుదెబ్బ వలని ధ్వని, ఇరువది, ఇంకొకటి ముప్పది, మఱియొకటి నలువది అడుగులు ప్రసరించును. అట్లే ధ్వని యును గదా! కాని స్ఫోట మాత్ర మట్లే యుండును. పయిరీతిని గలిగిన వృద్ధి ధ్వని వలన గలిగినది." శబ్దము, స్ఫోట అను రెండు పదములు సమానార్థకములుగా నిర్ణయింపబడినవి. పయి మూడు పదములను ఈ రీతిని వివరింపవచ్చును. అర్థహీనమయినను సార్థకమయినను వ్యక్తిచే చేయబడు వాగ్ వ్యాపారము శబ్దము, ఎల్ల విధములయిన శబ్దములయందును ధ్వని యుండును. అట్లే అన్ని ధ్వనుల యందును స్ఫోట ముండునా? అనునది స్పష్టపడలేదు. అట్లయినచో 'శబ్దము' నకును 'స్ఫోటము' నకును సమాన వ్యాప్తి కలదా? అర్థమందు. వానికి స్వభావ భేదమే లేదా యను సందేహము తప్పదు. స్ఫోటకును ధ్వనికినిగల భేదమును సంబంధ మును మాత్రమే పతంజలి తెల్పెను. (ఇట్లు బయలుపడునట్టి సందేహములను వ్యాఖ్యాతలు తరువాత వివరింప యత్నించిరి).

ఆ తరువాత కొంతకాలము వరకు మహాభాష్య ప్రచారము ఉత్తరదేశమున నశింపగా, తనగురు పరంపరయయిన చంద్రాచార్య వసురాతులు పరిశ్రమించి తెచ్చిన వ్యాకరణ జ్ఞానమున తాను వాక్యపదీయమును వ్రాసెననియు భర్తృహరి యొక్క చరిత్రము వలన తెలియుచున్నది. అతడు వాక్యపదీయమున అనేక విషయములను వివరించుచు స్ఫోటను గూర్చి ప్రపంచించెను.అందు]కాండ44-49; 75; 77; 81; 93; 97; 102; 103; 106సంఖ్యలు గల శ్లోకములలో నా విషయము కలదు. ఈ శ్లోకముల తెలుగు వ్యాఖ్యానమును అచ్చట చూచునది. వానిలోని యభిప్రాయ మీ క్రింద సంగ్రహింపబడుచున్నది. "44-49 శ్లో- అర్థవంతములయిన శబ్దములలో రెండు విధములున్నవనియు అందొకటి స్ఫోటమనియు, అది నాదము యొక్క ప్రవర్తనము ననుసరించుట్లు కనుపట్టుననియు తెలుపబడెను.

18 యేన ఉచ్చారితేన సాస్నాలాంగూల కకుదఖుర విషాణినాంసంప్రత్యయోభవతి
సశబ్దః॥ ఏవం తర్హి స్ఫోటః శబ్దః। ధ్వనిః శబ్దగుణః॥ భేర్యాఘాతవత్।
తద్యథా॥ భేర్యాఘాతో భేరి మాహత్య కశ్చిద్వింశతి పదాని గచ్ఛతి। కశ్చిత్
త్రింశత్॥ కశ్చిచ్చత్వారింశత్॥ స్ఫోటస్తావానేవ భవతి। ధ్వనికృతా వృద్ధిః॥
లోకే ధ్వనిః శబ్ద ఇత్యుచ్యతే। తద్యథా। శబ్దం కురు। శబ్దం మాకార్షీః
శబ్దకారీ అయం మాణవకః ఇతి ధ్వనిం కుర్వ న్నేవ ముచ్యతే॥
ధ్వనిః స్ఫోటశ్చ శబ్దానాం ధ్వనిస్తుఖలు లక్ష్యతే।
అల్పో మహాంశ్చ కేషాంచి దుభయం తత్స్వభావతః॥
శ్రోత్రోపలబ్ధిః బుద్ధినిర్గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలితః ఆకాశదేశః
శబ్దః, ఏకరిచ పునరాకాశమ్॥ మ. భా.

ఉచ్చరించునపుడు ధ్వనియొక్క కాల పరిమితియు క్రమమును స్ఫోటమునం దారో పింపబడుచున్నవి. శబ్దగ్రహమునకు హేతువు స్ఫోటరూపమయిన ప్రాకృత ధ్వని. దాని తరువాతివి వైకృత ధ్వనులు.

వైకృత ధ్వనులలోనే వైవిధ్యము, అనగా వికారము కలుగును. ప్రాకృత ధ్వని అవికృతము.

స్ఫోటను గూర్చి మూడు మత భేదములు గలవు. (1) స్ఫోటము ధ్వనియు (ఏకముగానే) అభిన్నముగానే గ్రహింపబడును. (2) స్ఫోటమే గ్రహియింపబడుచున్నది. అసలు ధ్వనియే గ్రహింపబడదు. (3) ధ్వని వేరుగా గ్రహింపబడును.

వ్యక్తులయిన యనేక ధ్వనులయందు గనుపట్టు జాతిగా స్ఫోటము నెఱుంగనగును.

స్ఫోటము వ్యంగ్యము-నాదము (ధ్వని) వ్యంజకము.

స్థానకరణముల సంయోగ వియోగముల వలన గలుగు ఫలమే స్ఫోటము. అదియే శబ్దము. దానివలన గలుగునవి దానికంటె వెనుకనునయినవి ధ్వనులు. ఈ మతమున స్ఫోటము క్షణికము.

"ధ్వని దీర్ఘమయినను హ్రస్వమయినను స్ఫోటకాలము భేదింపదు. దానివలన గలుగు శబ్ద సంతానము అనగా ధ్వనుల మొత్తము మాత్రము అల్పముగాని అధికము గాని కావచ్చును."

పయని తెలుపబడిన భర్తృహరి మాటలను బట్టి ఆతని కాలముననే స్ఫోట స్వరూపమును గూర్చి వైయాకరణులయందే మత భేదము లుండెననుట స్పష్టము. అది నిత్య మనియు, అనిత్యమనియు, ధ్వనులకంటె భిన్నమనియు, అభిన్నమనియు వివదించుకొను చుండిరి. భిన్నమతములవారయిన మీమాంసకులు, నైయాయికులు స్ఫోట నాదరింపలేదు. అద్వైత సిద్ధాంతము నుండి బ్రహ్మైక్యమును గ్రహించుచు, స్ఫోటకు బ్రహ్మతుల్యత్వమును అంగీకరించి వైయాకరణులు అద్వైతము నాదరించుచున్నారని గ్రహించియు గూడ శ్రీ శంకరులు స్ఫోటను విమర్శించిరి.

పతంజలి తన భాష్యమున 'స్ఫోటః శబ్దః' అని వాని యైక్యమును జెప్పెను. అందు శబ్దమునకు లక్షణముగా మూడు ధర్మములున్నట్లు సూచించెను. అవి 1. అర్థబోధకత్వము 2. ధ్వనిత్వము 3. స్ఫోటత్వము. స్ఫోట సంగతి ప్రపంచింపలేదు. స్ఫుట ధాతువునకు 'పగిలి తటాలున బయలు పడుట', 'వికసించుట', 'బహిర్గతమగుట', అను మూడు అర్థములు గలవు. ఆ ధాతువు వలన గలిగిన కృదంతమయిన స్ఫోట శబ్దమునకు వ్యుత్పత్తి ముందు ముందు నిరూపింపబడును. ఇక వైయాకరణుల విచారణ నటుంచి మనకు తోచిన విమర్శను స్వతంత్రముగా చేసుకొనవలెను. బహిర్గతమయిన దేది? స్ఫోటయా? లేక బయల్పడుటకు కారణము స్ఫోటయా? (అర్థమని వైయాకరణుల నిరూపణము). కారణమయినను కార్యమయి నను, అది ద్రవ్యమా? గుణమా? క్రియయా? యని ప్రశ్నించుకొనవలెను. ద్రవ్యమేమయినచో క్రియాన్వయిత్వము, పరిణామ స్వభావము మొదలగు ధర్మములున్నవియా? ఎట్లు తెలిసినది? ప్రమాణమేమి? గుణమనుచో తెలుపు, నలుపువలె ఏ ద్రవ్యము నాశ్రయించి యున్నది? ఇక క్రియ యనుచో యాస్కుడంగీకరించిన క్రియా లక్షణమగు 'గ్రహీత యొక్క మానసిక మయిన ఐక్య భావముచే గుర్తింపదగిన అవస్థా భేదముల క్రమరూపము' దానియందు కలదా? అది నిత్యమా? అనిత్యమా? పై విచారణవలన నేమియు తేలదు. కాబట్టి అది యోగులయిన

సిద్ధ పురుషులకు తప్ప సామాన్యులకు గోచరము గాదు. అనిర్వచనీయతపయి నాధారపడిన బ్రహ్మమువలెనే దీనినిగూడ గ్రహింపవలెను. అందుకనియే శబ్ద బ్రహ్మము అని నిరూపించిరి. ఈ మార్గమును విడిచి ప్రత్యక్షమయిన మన వాగ్ వ్యాపారముతో దీనిని సమన్వయపరుప వలెను. శబ్దము తరంగ రూపమనుట ఎవ్వరును కాదనలేని నేటి భౌతిక శాస్త్రసిద్ధమయిన సత్యము. ఇట్టి తరంగములు ఆకాశమునంతటిని వ్యాపించి నిత్యముగా (ప్రవాహ నిత్యత్వము) నున్నవి. ఆ స్వరూపము నిత్యము ; బ్రహ్మముతో నభిన్నము. అట్టి తరంగ సృష్టిలో చలన హేతు వేదియో యొక్కటి భేర్యాఘాతమువలె నుండవలెను. అట్టి క్రియకు వాచకముగా మొదట స్ఫోటశబ్దము బయలుదేరి యుండుట యుక్తము. అట్లు బయలుదేరిన పయి శబ్దమునకు బ్రహ్మముతో నభేదమును భర్తృహరి సూచించెను. కాలక్రమమున భాష్యార్థ వివరణ కారులయిన కైయటుడు, నాగేశుడు, భట్టోటీ మొదలయినవా రంగీకరించి అనేక విధముల ప్రపంచించిరి. తరువాతి వైయాకరణులు స్ఫోట ననేకవిధములుగా విభజించిరి- వ్యక్తి స్ఫోట, జాతి స్ఫోట. అది మరియు నెనిమిది విధములు

1. వర్ణస్ఫోట 2. పదస్ఫోట 3. వాక్యస్ఫోట 4. అఖండ పదస్ఫోట 5. అఖండ వాక్య స్ఫోట 6. వర్ణజాతి స్ఫోట 7. పదజాతి స్ఫోట 8. వాక్య జాతి స్ఫోట.

పయిని చెప్పిన విషయములలో కొన్ని ముందరి విషయమున గ్రంథప్రమాణములతో తిరిగి వివరింపబడును.

## స్ఫోటనుగూర్చి శాస్త్రజ్ఞు లేమి చెప్పిరి?

సర్వదర్శనసారసంగ్రహములో సాయనాచార్యు లీరీతిని వ్రాసియున్నారు. 'జగత్తునకు ఆదికారణమైన నిత్య శబ్దమే స్ఫోటమను పేరు గలదియే బ్రహ్మ పదార్థమని' భర్తృహరిచే చెప్పబడెను.[19] ఏ ప్రకారముగా మణియందును, తళతళలాడు కత్తియందును, ఒకే రూపము ఏవిధముగా ప్రతిఫలించున్నదో అ రీతిగా ఒకే స్ఫోట, ధ్వనులయందు వేరు వేరుగా భాసించుచున్నది.[20] ఏ ప్రకారముగా చంద్రాదుల ప్రతి బింబము నీటియందు కనుపట్టి ఆ నీటియొక్క కదలికచే కదలుచున్నట్లుండునో అట్లే, స్ఫోట స్థిరమయి, హ్రస్వ దీర్ఘాది భేదము లేనిదయ్యును నాదముచేత (అనగా వైఖరీ రూపము యొక్క) ఆయా ధర్మములను పొందునట్లు కనుపట్టుచున్నది.[21] వాక్కే పశ్యంతీ రూపమయినదియే అర్థమును చూచుచున్నది.[22] ఈ స్ఫోటమునందే వాక్కుయొక్క భిన్నావస్థలు, ఇతర ప్రపంచమంతయు నిమిడి యున్నది. నెమలి గ్రుడ్డులో బీజరూపమున, పెద్దదైన నెమలియం దెన్నిరంగు లుండునో అన్ని

---

19 జగన్నిదానం స్ఫోటాఖ్యః నిరవయవః నిత్యః శబ్దః బ్రహ్మైవేతి హరిణా భాణి బ్రహ్మకాండే I. 1-2 శ్లో "అనాది నిధనమ్...తదక్షరమ్...2...వివర్తతే జగతోయతః॥

20 యథామణి కృపాణాదౌ రూపమేక మనేకథా ।
తథైవ ధ్వనిషు స్ఫోట ఏక ఏవ విభిద్యతే.

21 ప్రతిబింబం యథాన్యత్ర స్థితం తోయక్రియావశాత్ ।
తత్ప్రవృత్తి మివాన్వేతి స ధర్మః స్ఫోటనాదయోః॥

22 వాగేవార్థం పశ్యతి.

యును ఇమిడియున్న విగదా ! అని యభిప్రాయము.[23] ఈ శ్లోకము యొక్క ప్రతిపదార్థ వ్యాఖ్యానములు ఆ స్థలమునఁజూచునది. ఇందలి 'క్రతు' శబ్దము యొక్క యర్థమును భిన్న విధముల వివరించిరి. క్రతు వనగా 'జ్ఞానము' అని సూర్యనారాయణ శుక్ల గారును, Energy అని శ్రీ సుబ్రహ్మణ్య అయ్యరుగారును,'క్రతుః ఇతిశాస్త్రాంతరే బుద్ధి రుక్తా'యని వృషభదేవకృత 'పద్ధతి' యందు బుద్ధియనియు వ్రాసియున్నారు. శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు 'క్రతు శబ్ద ముపనిషత్తులలో నిశ్చయార్థకముగా నున్నది. నిశ్చయార్థమును బట్టి ఇది బుద్ధివాచకము" అని తెల్పిరి. క్రతు శబ్దమునకు **A sacrifice, intelligence, power, ability, desire, will, purpose, inspiration, enlightenment** మొదలయిన యనే కార్థములు వ్రాయబడినవి. పై యర్థములలో నేయొక్క దానినైనను ఉపయోగించి భావమును వివరింపవచ్చును. క్రతువనునది 'కృ' ధాతువు వయిని 'కతు' అను ఔణాదిక ప్రత్యయమును విధించి వ్యుత్పత్తి చెప్పుటవలన 'పని' యని భావము. దానివలననే క్రతువు నకు ప్రసిద్ధార్థము యజ్ఞ నిశేషమయిన కర్మ. శ్లోకము నందు 'శబ్ద సంజ్ఞకః క్రతుః' అని చెప్పబడినది. 'తస్యక్రతోః వృత్తిః క్రియాభూతా భాగశః క్రమం లభతే' యని యన్వయము చెప్పి క్రతుత్వమును శబ్దముపై నారోపించవచ్చును. బుద్ధిస్థమయిన యాగము క్రియా రూపమమై భాగానుసారము క్రమ నిష్పాద్యత్వమును పొందుచున్నదని యర్థము. మానసిక మయిన శబ్దము వైఖరీరూపమున వెలువడుట, బుద్ధిస్థమయి సంకల్పరూపమున నుండిన క్రతువు కార్యరూపమయి క్రమనిష్పన్నమగుట, ఈ రెండిటికిని ఔపమ్యము. దానివలన ఆరోపము సిద్ధించుచున్నది. 'అండభావమి వాపన్నః' అనుచోట నెమిలియొక్క గ్రుడ్డునందు సూక్ష్మరూపముగానున్న భిన్నములయిన రంగులే పెద్దదయిన నెమిలి శరీరమునందును పింఛముననను విశదములగుట యను ధర్మము చెప్పబడినది. ఈ ధర్మమే సూక్ష్మ రూపమున నవిభక్తముగా నున్న 'పశ్యంతీ' రూపమున నుండి 'వాక్యపద' వివర్త ధర్మమున వైఖరీ రూపమున వెలువడుచున్నది యని భర్తృహరి కృతమనబడిన వృత్తిలో నున్నది. 'అండభావాపత్తి' యను స్వభావమే 'శబ్దము'నకును 'క్రతువు'నకును సమాన ధర్మము. క్రతు శబ్దము నుపయోగించుటవలన అట్టిక్రతువును ఆచరించునపుడు నియతముగా పరిదృశ్యమానమయిన స్రుక్కు స్రువము మొదలయిన వానితో గూడి హోమములలో వెలయుచున్న క్రియారూపము, వైదికుల కెల్లరకును నిత్య నైమిత్తిక కర్మలయందు ప్రచుర మయి యున్నది గదా. ఇచట శబ్దము ప్రకృతము. యజ్ఞకర్మ అప్రకృతము తెలిసికొన వలసిన శబ్ద స్వరూపమును బోధపఱచుకొనుటకు పరిచితమయిన 'క్రతు విభాగము' పోలికగా చెప్పుట యుక్తముగాని 'జ్ఞానము, బుద్ధి' యని యర్థముచెప్పి కేవలము అనుమితి వలన నెఱుంగదగిన భావరూపమును పోలికగా చెప్పుట సుబోధకము గాదుగదా !

ఇక భర్తృహరి తన గ్రంథములో స్ఫోటను గూర్చి చెప్పిన యభిప్రాయములను విమర్శించుచు **S. D. JOSHI** అను వారు కౌండభట్ట కృతమయిన స్ఫోటనిర్ణయమను గ్రంథ

---

23 అండభావమివాపన్నః యః క్రతుః శబ్దసంజ్ఞకః ।
వృత్తిస్తస్య క్రియాభూతా భాగశో లభతే క్రమమ్॥ వా. I–51.

మును ఆంగ్లానువాదముతో గలిపి పూనాలో ప్రచురించిరి.[24] అందు వారు వ్రాక్రుచ్చిన యభి ప్రాయములు :

1. "స్ఫోటయనునది, ధ్వనులకంటె పూర్వమనియు, అది అఖండమనియు స్వగత భేదము లేనిదనియు అర్థ స్ఫోరకమయినదనియు భర్తృహరి ఎచ్చటను చెప్పలేదు."

2. "శబ్దోచ్చారకాంగములయిన స్థాన కరణముల వలన నది వ్యక్తమగుచున్నదని మాత్రమే చెప్పెను.

3. "పతంజలిచే నిర్వచింపబడిన శబ్దముయొక్క భావముతో స్ఫోట పదముయొక్క అర్థము అభిన్నమని భావించుటచే ఈ చిక్కు ఏర్పడినది."

4. "అర్థవంతమయిన వాక్కు అను నర్థమున స్ఫోటను భర్తృహరి యెచ్చటను వాడలేదు."

5. "ధ్వని యనునది వినబడునది యనియు అది కేవలము అస్థిరమయిన శారీరక ముతో సంబంధించినదనియు, స్ఫోట పయిని నిరూపించిన శారీరకమయిన యుత్పత్తిగల ధ్వనులనుండి ఆహరించిన జాతివాచకమనియు, భర్తృహరియొక్క యభిప్రాయముగా తెలియ నగు"నని జోషిగారు వ్రాసిరి.

ఇట్లు వారు భర్తృహరి చెప్పలేదన్న పయి యభిప్రాయముల కాధారములు మిక్కిలి సూక్ష్మముగా భర్తృహరి యుద్దేశములో నుండినట్లు అక్కడక్కడ స్పష్టపడుచున్నది[25] పయిని జోషిగారు వ్రాసిన వ్రాతలవలన నెరుంగదగిన దేమనగా పతంజలినాటి స్ఫోటయొక్క స్వరూపము క్రమక్రమమున ప్రస్తరింపబడి భర్తృహరి, కైయటుడు, మొదయిలన వారిచేత అంతకంతకు వివరింపబడి స్పష్టపరుపబడినదని యూహింపనగును.

'స్ఫుట' ధాతువుకంటె కరణార్థమున ఘఞ్ ప్రత్యయము చేసికొనగా 'స్ఫోట' యను శబ్దము పుట్టుచున్నది. 'వెలిపుచ్చునది', 'బయటికి దెచ్చునది' అని దీని యర్థము. 'స్ఫుట త్యర్థః అస్మాత్'-దీనివలన అర్థము. వెలిపుచ్చబడును అనియు వ్యుత్పత్తి. ఈ స్ఫోటరూప మయిన భావము వ్యంగ్యము. దీనికి వ్యంజకమయిన శబ్దమునకు ధ్వని యని వైయాకరణుల వ్యవహారము అని కావ్య ప్రకాశికాకారుడు చెప్పియున్నాడు.[26]

పయిని చెప్పిన ప్రమాణములను బట్టి స్ఫోట రూపము క్రింద క్రోడీకరింప బడు చున్నది.

---

24 S. D. JOSHI – స్ఫోట నిర్ణయము. కౌండభట్ట విరచితము. పుట 27, 35,39,40. K. A Subrahmanya Iyer - Bhartrhari పుట 157.

25 ద్వౌ శబ్దాత్మానౌ. నిత్యః కార్యశ్చేతి। కైశ్చి న్నిత్యమితి దృష్టః కైశ్చిదనిత్య ఇతి। అథవా జాతిర్వ్యక్తిశ్చేతి। అథవాస్ఫోటోధ్వనిశ్చ. మహాభాష్య దీపికా. పుట 18.

వర్ణ పద వాక్య విషయాః ప్రయత్నవిశేష సాధ్యాః ధ్వనయః వర్ణపదవాక్యాఖ్యాన్ స్ఫోటాన్ పునః పునరావిర్భావయంతః బుద్ధిష్వారోపయంతి. (యథానువాదః శ్లోకోవా ఇత్యాది. వా. ప. శ్లో. 82 క్రింది వృత్తిలోని పంక్తి).

26. బుధై ర్వైయాకరణైః ప్రధానభూత స్ఫోటరూప వ్యంగ్యవ్యంజకస్య శబ్దస్య ధ్వని రితివ్యవహారః కృతః II కావ్యప్రకాశిక – I

అద్వైత సిద్ధాంతము ప్రకారము బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య, జీవుడే బ్రహ్మ, ఇతరముగాదు. సత్, చిత్, ఆనందము అనునవియే బ్రహ్మ పదార్థమును లక్షింపజేయుచున్నవి. ఇట్టి బ్రహ్మ పదార్థముననే సర్వచరాచరమైన విశ్వము, భావరూపమయినను వస్తురూపమయినను బహిర్భూతమై అందే లీనమగుచున్నది. కావున శబ్దము గూడ అందే గలుగవలెనుగదా! అట్లు తోచుటకు ముందు శబ్దమునకును, బ్రహ్మమునకును అభేదముగదా! ఆ యభిప్రాయమును గూర్చియే 'అనాది నిధనంబ్రహ్మ' యను మొదటి శ్లోకమున శబ్దతత్వమును (స్ఫోటగా) చెప్పి యున్నారు. దీనియందే అనగా స్ఫోటయందే పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యను నాలుగు అవస్థలు గలిగి బయలు దేరి శ్రోతయందలి చైతన్యములో లీనమగుచున్నది. వాక్కే అర్థమును చూచుచున్నది. వాక్కే పలుకును. వాక్కే నిక్షిప్తమయిన యర్థమును వ్యాపింప జేయుచున్నది. వాక్కునందే విశ్వమంతయు నున్నది.[27]

ధ్వనియొక్క స్వరూపమును నేటి భౌతిక శాస్త్రజ్ఞులు అనేకవిధముల ప్రత్యక్ష ప్రమాణమున నిరూపించియున్నారు. ఈ ధ్వని నీటిమీద సమతలమందు ప్రసరించు తరంగములవలె గాని, ఒక కేంద్రమునుండి యన్నిదిక్కులకును గోళాకారమున ప్రసరించు తరంగములవలె గాని, దూరప్రదేశములకు సాగిపోవుచున్నది. ఇట్టి తరంగములు రెండురకములు. 1. వాయువునందలి యణువుల కదలికవలన గలుగునవి. ఇక్కడ మాధ్యమము ద్రవ్య రూపము. 2. వాయువిహీనమైన ఆకాశమునందు వేలకొలది మైళ్లు ప్రసరించునట్టి రేడియో తరంగములు. ఈ రెండువిధములయిన తరంగములను పాశ్చాత్యులు కొలదికాలము క్రిందటనే గుర్తెఱింగిరి[28]. ఈ రెండింటియొక్క స్వరూపమును భర్తృహరి కాలమునకే మనవారికి తెలిసినట్లు వారి వ్రాతలవలన స్పష్టపడుచున్నది. ద్రవ్యమునందు వాయువునందు కరణము యొక్క అభిఘాతముచే కంపము అనగా కదలిక పుట్టుచున్నది[29]. అట్టి కరణము నందు కంపము ఆగిపోయినను దీపమునుండి దీపము గలుగుచున్నట్లు ధ్వనులు వాయువునందుగాని ఆకాశము[30] నందుగాని అభిఘాతానంతరముకూడ కలుగుచునే యుండును. గాలిగాని, అణు

---

27. వాగేవార్థం పశ్యతి, వాగ్బ్రవీతి వాగేవార్థం నిహితం సంతనోతి, వాచ్యేవ విశ్వం బహురూపం నిబద్ధం తదేతదేకం ప్రవిభజ్యోపభుంక్తే॥ వా. ప. I—110.

28. 'వీచీ తరంగన్యాయేన కదంబ ముకుళేనవా' పైనిచెప్పిన రేడియో తరంగములను HERTZ క్రీ. శె. (1857—1894) అను జెర్మను భౌతిక శాస్త్రవేత్త 1888 సంవత్సరంలో గుర్తించెను. Robert Boyle అను శాస్త్రజ్ఞుడును తరువాత HAWKSBEE యను క్రీ. శె. 1705వ సంవత్సరములో ధ్వని తరంగములను వాయుప్రసారితములుగా తొలుత నిరూపించిరి.

29. ద్రవ్యాభిఘాతాత్ ప్రచితా—వాక్యపదీ I, 105.

30. అనవస్థితకంపేఽపి—వా. ప. I. 106. వా. ప.I. 107, 108, 109, 110. శబ్దగుణకమాకాశమ్, శ్రుతివిషయగుణా యాస్థితా వ్యాప్య విశ్వమ్, శా. శాకు. ఇట్లనుట వలన వాయుశూన్యమయిన యాకాశమునగూడ శబ్దము ప్రవర్తించు చుండినట్లు ప్రాచీనుల కవగతమయిన విషయము స్పష్టము గదా!

వులుగాని, జ్ఞానముగాని శబ్దముగా పరిణమించుననని కొందఱి మతము. ఇవి యన్నియును స్ఫోటవలననే అందే కలుగుచున్నవి. లయమందుచున్నవి. మాటలాడువాని ప్రయత్నము వలన అతని యిచ్ఛప్రకారము నోటియందలి వివిధస్థానములయందు వాయువు అభిహతమై శబ్దరూపమును పొందుచున్నది[31]. ఈ శబ్దము అజస్రవృత్తి - అనగా శాశ్వతమయినది ఎల్లప్పుడు నుండునది. సూక్ష్మమగుటచే తెలియబడదు[32]. అంతరాళమునందు ఇట్లు శాశ్వతముగా నున్న శబ్దమును లేదని తలంచుట గ్రహీతయొక్క అశక్తిచేతనేగాని వేరుగాదు[33]. ఆ శబ్దము గ్రహణోపాయము మూలముననే తెలియనగును. మనము మాటలాడునపుడు దోషరహితమయిన శ్రవణేంద్రియమువలన నివి గోచరించును. వీణాతంత్రులను మీటునప్పుడు బయలుదేరు ధ్వని తరంగములు మనకు స్పష్టముగా తంత్రులయందు గనుపట్టును. వాని యొక్క కంపనమునందలి శీఘ్రమందగతిభేదమువలన భిన్నస్వరములు మనకు శ్రూయమాణము లగుచున్నవి. వీనివలన గలుగు షడ్జాదిభేదములు, 'షడ్జాదిభేదఃశబ్దేన' మొదలయిన శ్లోకమువలన (వాక్యపదీయము I-111) మన పూర్వులకు మిక్కిలి ప్రాచీనకాలముననే తెలియ బడినట్లు స్పష్టము. క్రింద నుదాహరింపబడిన శ్లోకముల యర్థములు పైని సూచింపబడిన మార్గముకంటె భిన్నముగా ప్రాచీన వ్యాఖ్యలలో వివరింపబడినవి. ఇందలి వివరణ నేటి భౌతిక శాస్త్రసిద్ధాంతములతో సరిపడునట్లు సమన్వితము.

అసతశ్చాంతరాళే యాన్ శబ్దా నస్తీతి మన్యతే ।

ప్రతిపత్తు రశక్తి స్సా గ్రహణోపాయ ఏవ సః ॥

ఈ శ్లోకమునకు వ్యాఖ్యానాంతరము గ్రంథమునఁజూచునది. 'శబ్దానస్తీతి' అనుచోట, 'న్నాస్తీతి' 'శబ్దోనాస్తీతి' యను పాఠాంతరములు గలవు. ఇదిభిన్నవిధముల వ్యాఖ్యానింపబడినది. ఇది ప్రకృత గ్రంథమున నీయబడిన పాఠము. ఇందలి తెలుగు వ్యాఖ్యానమునందును ప్రాచీన సంస్కృత వ్యాఖ్యానములయిన వృత్తి, పద్ధతియనువానియందును, నవ్య వ్యాఖ్యాతలందరిచేతను ఏకరూపముగానే వాక్యమునందు పదములు సత్యములుకావు, ఉన్నవని గ్రహించుటకు గ్రాహకుని యొక్క అసమర్థతయే కారణము. ఇక పద రూప విభజనము అర్థమును గ్రహింపజేయుట కుపాయమాత్రమే' అమనట్లు వ్యాఖ్యానింపబడినది. వారి మతమున ఈ శ్లోకమునకు అఖండ వాక్యార్థ సాధనమే ఫలము. ఈ మతమునే 'అసతః' అనునది 'లేని వానిని' అను ద్వితీయా బహువచనాంతత్వమును శబ్దాన్ అనుదానికి విశేషణత్వము అంగీకృతము-కాని అర్థములు బహువచనము కర్త. అస్తి అను ఏకవచనము క్రియ పయిక ర్తతో కుదురదు అను ఆక్షేపణ తప్పలేదు. అట్టి శబ్దముల మొత్తమును ఏకముగా భావించి ఏకవచ

---

31. లబ్ధక్రియః ప్రయత్నేన వక్తురిచ్ఛానువర్తినా । స్థానేష్వభిహతో వాయుః శబ్దత్వం ప్రతిపద్యతే వా. ప 1-107. (అధికపాఠము).

32. అజస్రవృత్తి ర్యశ్శబ్దః సూక్ష్మత్వాన్నోపలభ్యతే। వ్యజనాద్వాయురివస స్వనిమిత్తాత్ ప్రచీయతే॥ వా. ప 108 శ్లో.

33. అసతశ్చాంతరాళేయః శబ్దో నాస్తీతి మన్యతే। ప్రతిపత్తు రశక్తిః సా గ్రహణోపాయ ఏవసః॥ వా. ప. 1-85 శ్లోకమునకు పాఠాంతరము

నము సరిపెట్టు కొందును అనిచెప్పి అందలి ఒక్కొక్క శబ్దమునకును "అస్తీత్యేకవచన శ్రుతేః ప్రత్యేకమితి గమ్యతే" అనియువ్యాఖ్యాత సమన్వయించెను. అస్తి అవ్యయమనియు సమన్వితము.

ఇక పై శ్లోకమునకు పాఠాంతరము మండన మిశ్రుని స్ఫోట సిద్ధియందు పేర్కొనబడినది. ఈ పాఠమున 'శబ్దః' కర్త అస్తిక్రియతో సమన్వయించును. అసతః అనునది ద్వితీయా బహువచనము కాక, పంచమీ ఏకవచనముగా భావించిన స్ఫోట సిద్ధాంత ప్రకరణముగ సమన్వయింపవచ్చును. ఆపక్షమున అసతః=లేనిదాని (భ్రాంతాభిప్రాయము) వలన, అంతరాళే=భూనభోంతరాళమున (నేలనింగి అనువానినడుమను) (రెండవపాఠమున వాక్యము యొక్క ఆద్యంతములనడుమను అని దీని యర్థము), యః=ఎవడు, శబ్దః=శబ్దము, నాస్తి=లేదు, ఇతి=అని, మన్యతే=ఆలోచించునో, (తస్య) ప్రతి పత్తుః=అట్లు గ్రహించు వానికి, సా=అది, అశక్తిః=అసమర్థతయే. (హేతువు), సః=ఆశబ్దము, గ్రహణోపాయః ఏవ=శ్రవణముచే గ్రహించుటయే మార్గముగా గలది. అనగా శబ్దము వినబడుటచేతనే గదా గ్రహించుట, ఉప+ఈ=ఉపే=అనుదాతువుపయి ఘఞ్ ప్రత్యయము చేయగా కలిగిన ఉపాయ శబ్దమునకు సమీపించుట, మార్గము, పొందుట మొదలయిన యర్థములు కలవుగదా: "శబ్దము అనిత్యము అను భ్రాంతివలన ఎవ్వడు అంతరాళమున అనగా ఆకాశమున శబ్దము లేదు అని భావించునో అది వాని అసమర్థత వలన గలుగుచున్నది. ఆశబ్దము గ్రహించుట కనువయిన ఉపాయమువలనగదా తెలియగలదు" అని తాత్పర్యము. ఈ విధమయిన వ్యాఖ్యానమున స్ఫోట రూపమయిన శబ్దము ఆకాశమునునిండి యున్నదియని చెప్పుట ఫలము. ఆకాశస్థితమయిన "అజస్రశబ్దవృత్తి"కి నిరూపకము. ఇప్పటి మన యనుభవము వలన ఆకాశమున కోట్ల కొలది శబ్దము లున్నవి. వానిని ఉపాయముచే (రేడియో గ్రాహకములచే) గ్రహింపవచ్చును అనుటకుగూడ సరిపోవుచున్నది. ఇక అఖండవాక్యార్థ స్థాపనకు ఎన్నియో శ్లోకములు ఇతరత్ర భర్తృహరిచే వ్రాయబడినవి. "భర్తృహరి చెప్పిన శబ్ద నిత్యత్వమునకు 'అజస్రవృత్తి' ఇత్యాది శ్లోకార్థములకును ఈ పాఠము సరిపోవునని తోచుచున్నది గాన నిట్లూహింపబడినది".

ఈ సందర్భమున అధిక పాఠముగా నున్న ఈ క్రింది శ్లోకముల యర్థమును గూడ పరిశీలింపవలెను.

> "స్థానేష్వభిహతే వాయౌ కృతవర్ణ పరిగ్రహా ।
> వైఖరీ వాక్ ప్రయోక్తౄణాం ప్రాణవృత్తి నిబంధనా ।
> సేయ మాకీర్యమాణాఽపి, నిత్యమాగంతు కైర్మలైః ।
> అంత్యా కలేవ సోమస్య, నాత్యంత మభిభూయతే" ॥

ముఖమునందలి తాల్వాది స్థానములయందు (వాయువు) తాడితమయి వర్ణరూపమును పొంది, ప్రయోక్తలయొక్క ప్రాణవాయువు వలన వైఖరీ వాక్కు కలుగుచున్నది. ఎల్లవేళలయందును (అంతరాళస్థమయిన) వాయువువలన గలుగు ఆగంతుక (మలముల వలన) దోషములచే ఈ వాక్కు వివిధముగా అన్ని ప్రక్కలను చల్లబడియును (ఆకీర్యమాణమయ్యును) చంద్రునియొక్క (తుది) పదునారవకళ వలెనే పూర్ణముగా నశింపదు.

ఈ వాక్యమును బట్టి శబ్దము క్షీణించుచున్నట్లు తోచినను చంద్రకళవలెనే నిశ్శేషముగా నశింప దని భావము. కాబట్టి శబ్దము నిత్యమనియు గ్రహణ సామర్థ్యమును బట్టియే తెలియదగిన దనియు నిశ్చితాభిప్రాయము. ఇదియు 'అసతశ్చ' అను శ్లోకాభిప్రాయమును పయిరీతిని వివరింపబడినదానిని బలపరచుచున్నదిగదా!

నేటి పాశ్చాత్య భౌతిక శాస్త్రము ననుసరించియు, ఏకశబ్ద జాతములయిన తరంగ ములు, మాధ్యమము (mediuim) నందు గలిగిన, తత్సంబద్ధాన్య తరంగములచే కలుషితము లగుచున్నవను నభిప్రాయమును పయి 'ఆగంతుకైర్మలైః' అను పదము వివరించుచున్నది గదా! ఈ పయి వివరణములు, కొన్ని యెడల ప్రాచీన వ్యాఖ్యాతల వివరణములతో సరిపడకపోవచ్చును. గాని నేటి భౌతిక శాస్త్రముతో సరిపోవుచున్నవి.

ఈ సందర్భమున స్పష్టత కొఱకు శబ్దస్వభావమును గూర్చి తార్కికుల మతము సంగ్రహముగా 'భాషా పరిచ్ఛేదముననుసరించి వివరింపబడుచున్నది. "ధ్వని, వర్ణము," అని శబ్దము రెండు విధములు. మద్దెల మొదలగువానివలన గలుగునది ధ్వని. కంఠముయొక్క సాహాయ్యమున కలిగిన 'క', 'గ' మొదలయినవి వర్ణములు. అన్ని శబ్దములును ఆకాశమున వర్తిల్లుచున్నవి. ఉత్పన్నమయిన శబ్దము శ్రోత్రముచే గ్రహింపబడుచున్నది. వీచీతరంగ న్యాయమున ఆశబ్దోత్పత్తి జరుగుచున్నది. అనగా నీటిపైనుండు అలలు ఎట్లు ～～～～ ఈ గీతరూపమున నుండునో అట్లే ప్రసరించుచున్నదని భావము. కదంబముకుళము అనగా కడిమిచెట్టు మొగ్గ ఏ యాకారమున నుండునో ఆ యాకారమున బయల్వెడలునని కొందరి మతము. (అనగా ఉమ్మెత్తకాయకు ముళ్లు ఎట్లు అన్ని ప్రక్కలను బయలుదేరునో అట్లే దిశ దిక్కులకు శబ్దము బయలుదేరి వ్యాపించునని భావము). కకారము పుట్టినది, నశించినది అను అనుభవము మనకు గలుగుచుండును గావున ఆ 'క' కారము అనగా శబ్దము అనిత్యము ఒకచోట వ్రాసినట్టిదిగాని వినినట్టిదిగాని యయిన 'క' కారము ఇయ్యదియే అని చెప్పు వాక్య మునకు అభిప్రాయము ఆ కకారమువంటిదే యనిగాని దానితో అభిన్నము అని కాదు. ఆ మొదటి 'క' కారము నశించిపోయినది. నీవు త్రాగిన మందేయిది అని యొకనితో మఱియొకడు తాను త్రాగుచున్న మందునుగూర్చి చెప్పునపుడు, ఆ మందువంటిదే యని యభిప్రాయము గాని, అతడు త్రాగివేసినమందు మఱి లేదుగదా! అనగా సాజాత్యము ఇక్కడ ఉద్దేశింప బడినది. (భర్తృహరి ఖండించిన తార్కికుల మతము. శబ్దవిషయమున పయిరీతిని స్పష్టత కొఱకు చూపబడినది). దీనికి ఆధారములయిన మూలశ్లోకములు ఈ క్రింద నీయబడినవి.

శ్లో॥ శబ్దో ధ్వనిశ్చ వర్ణశ్చ, మృదంగాదిభవో ధ్వనిః।
కంఠసంయోగాదిజన్యా వర్ణాస్తేకాదయో మతాః॥
సర్వ శ్శబ్దో నభోవృత్తిః శ్రోత్రోత్పన్నస్తు గృహ్యతే।
వీచీతరంగ న్యాయేన తదుత్పత్తిస్తుకీర్తితా॥
కదమ్బకోరక న్యాయాదుత్పత్తిః కస్యచిన్మతే।
ఉత్పన్నః కో వినష్టః క ఇతి బుద్ధే రనిత్యతా॥
సోఽయం క ఇతి బుద్ధిస్తు సాజాత్యమవలమ్బతే।
తదే వౌషధ మిత్యాదౌ సజాతీయేఽపి దర్శనాత్॥
తస్మా దనిత్యా ఏవేతి వర్ణా స్సర్వే మతం హి నః।
ఇతి శ్రీ విశ్వనాథ భట్టాచార్య విరచితాః భాషా పరిచ్ఛేదాంత్య శ్లోకాః॥

## ప్రాకృత ధ్వనులు-వైకృత ధ్వనులు

వైయాకరణుల సిద్ధాంతములకు సంబంధించిన విచారణలో, శబ్దము, స్ఫోట, నాదము, ధ్వని (వైకృత ధ్వని, ప్రాకృత ధ్వని), పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ, యను పదములు వాడబడినవి. అద్వైత సిద్ధాంతము నంగీకరించినవారికి లోకమునందలి కోట్లకొలది భిన్నవస్తువులు, అనంత భావములు అన్నియు ఒక్కటియే అనగా "ఇంగర్ సాల్," అను నాయన చెప్పినట్లు షేక్స్పియర్ వ్రాసిన శబ్దరూపమయిన హేమ్లెట్ అను నాటకమును, ఆయన తినియుండిన రొట్టెయును అభిన్నములు. ఆ రొట్టెవలని శక్తియే గదా ఆ వాక్కుగా మారినది. కాబట్టి రొట్టెకును హేమ్లెట్ నాటకమునకును అభేదము" అని ఆయన వచించెను. అద్వైత వాదమునందును బంగారము ముద్దగానున్నను, మెరుగుపెట్టకున్నను, నగము రూపములోనున్న అభరణముగా నున్నను, మెరుగు పెట్టిన గొలుసుగా నున్నను అది యొక్కటే బంగారమనవచ్చును. కాని రూప భేదముతో కూడిన ఆ పదార్థమును పేర్కొనుటకు వేరువేరు నామములును, రూప భేదమును హేతువులగుచున్నవిగదా! అట్లే వ్యక్తిపరంపరలి స్ఫోట రూపమయిన శబ్దమే మొదట చెప్పిన పయిరూపాంతరములు పొందుచున్నది. కావున అన్నిటిని స్ఫోటముగా గాని శబ్దముగా గాని వ్యవహరింపవచ్చును. అట్లే భర్తృహరియు వ్యవహరించెను. ముందు ఒకచోట అట్టి వ్యవహారమువలన అర్థబోధకు విలంబమును, సందిగ్ధతయు నేర్పడు ప్రకరణాదులచే తెలియనగు నని వివరించితిని.

ఇక గ్రహింపవలసిన దేమనగా ధ్వనికిని శబ్దమునకు భేదమున్నదనవలెను-ఆ భేదమేమి? వ్యక్తిగతమై యర్థవంతమైన అభిప్రాయ మాత్ర రూపమును చెప్పుటకు వ్యక్తి తన తాల్వాద్యవయవ ప్రయత్న రూపమున గలిగించునట్టిది ధ్వని. ఈ ధ్వని నిమిత్తమయి తనకు ముందుండిన అభిప్రాయమునకు వ్యంజకమగుచున్నది.

ఇందు ఒక సందేహము గలుగుచున్నది. స్ఫోట నిత్యము, అఖండము. అందు హ్రస్వ దీర్ఘాది భేదములు లేవుగదా, మరి, అ, ఆ, ఆ3 అనునట్లు ఉచ్చారణ కాలభేదములు ఉదాత్తాది స్వర భేదమును స్ఫోటయం దెట్లు కలుగుచున్నవి? అను ప్రశ్న లేవదీయబడినది. దానికి సమాధానము. పై ధ్వనియందు ప్రయత్నముచే వచ్చిన భేదము మూలమగుచున స్ఫోట యందు ఆరోపించబడుచున్నది. నిర్మలమైన నీటియందు చంద్రుని ప్రతిబింబము కనబడు చున్నది. ఆ నీటి యుపరి భాగమున కలుగు కదలికవలన ప్రతిబింబమున గూడ కదలిక యేర్పడుచున్నదిగదా? అట్లే శబ్దోచ్చారణమున వినబడు, జీర, బొంగు, గట్టితనము, మెల్ల దనము మొదలయినవి యేర్పడుచున్నవి అను సమాధానమును స్ఫోటస్వభావమును చెప్పునపుడు వివరించితిని. అట్లు మొట్టమొదట స్ఫోటమునకు అవ్యవహితమైన అనంతరవృత్తిగా బయలుదేరునది ప్రాకృత ధ్వని, దాని తరువాతివి వైకృతధ్వనులు. ఈ ప్రాకృత ధ్వనులలోని విశేషములే స్ఫోటమున నున్నట్లు వ్యక్తమగుచున్నది.

ఇట్లు చెప్పిన 'ప్రాకృత ధ్వనులేవి? వైకృత ధ్వనులేవి? ఈ రెండిటిని ఎందు కంగీకరింపవలె' అను ప్రశ్న బయలుదేరుచున్నది. ఈ సందర్భమున వాక్యపదీయమునను, ఇతర స్థలములను చెప్పబడిన వాక్యములను ప్రక్కపుటలో క్రింద సూచించితిని.[34] ఈ ప్రశ్నకు సమాధానము నూహించుకొనుటకు ముందు ధ్వనియనగా మనకు సాధారణముగా తోచునర్థమును

వివరింతును. నాకు ధ్వని వినబడుచున్నది అని యొకడనునప్పుడు, ఆ శ్రోతచే ననుభవింప బడినదానినే అనగా తన చెవినిబడుదానినే ధ్వనియని గాని శబ్దమని గాని చప్పుడు అని గాని పలుకును. ఈ రీతిని చూచినచో ఈ ధ్వని యనుదానికి అనంతరమున నేమి కలుగగలదో యూహింపలేడు. తాను 'క' అను వర్ణమును గాని 'కాకి' యను పదమును గాని 'అన్నమును తినుచున్నాడు' అను వాక్యమును గాని వినును. ఈ మూడింటికిని వరుసగా వర్ణస్ఫోట, పద స్ఫోట, వాక్యస్ఫోట యని వ్యవహరింపబడునట్టి జాతిరూపమయిన శబ్దమే గదా మూలము ? అది నాచే వినబడినది. ఇక తరువాత పుట్టిన ధ్వనులేవియును లేవే యను సందేహము పుట్టక తప్పదు. అట్టి సందేహము నివారించుట యెట్లు ?

ఈ సందేహమును నివారించుకొనుటకు ధ్వని యుత్పత్తినిగూర్చి వక్తనుండి క్రమము నూహించుకొనవలెను. వక్తయొక్క నోటిలోని స్థానకరణముల వలన ధ్వని పుట్టు చున్నది అని గదా యంటిమి. ఈ ధ్వనియను శబ్దముచేతనే వక్తనుండి శ్రోతవఱకు గలుగు అవస్థలనన్నిటిని శాస్త్రకర్త పేర్కొనుచున్నాడు. స్థానకరణముల సంయోగము వలన ధ్వని పుట్టలేదు. వాయువునందు కంపము మాత్రము గలిగినది. ఆ కంపమువలన తరంగరూపమయిన చలనము వాయువులోని అణువులయందు గలిగినది. ఇట్టి తరంగము మొదట కలుగును, దానివలన రెండవ తరంగమును, ఆ తరువాత మఱియొకటియు అట్లనంతముగా అన్నిదిక్కుల వైపునను ప్రసరించి వాయు వంతయు గాని, ఆకాశమంతయు గాని తరంగమయ మయి పోవును. ఈతరంగములు వాయువునందు ప్రసరించి దూరమున నున్న శ్రోత చెవియందు పడుచున్నవి. అవి చప్పుడుగా (ధ్వనిగా) శ్రోత తెలిసికొనుచున్నాడు. అప్పుడే అది అర్థ హీనమయిన ధ్వని యనిగాని అర్థవంతమయిన ధ్వని యని గాని వినినందువలన కలిగెడి యనుభవము. ఇట్లు బయలుదేరిన తరంగముల యొక్క వరుసలో ఒకదానికంటె నింకొకటి క్షీణబలముగలదిగా, నడుమను గలుగు వాయుకణములవలనిసంగముచే మార్పును పొంద వచ్చును.[35] ఆకారణము వలననే వక్తయొక్క కేక కొంత దూరమువఱకే విననగును. ఆ తరువాత నది వినబడదు.

ఇక ప్రాకృత ధ్వని యనునది స్థానకరణముల సంయోగమున అచటనే పుట్టును. దాని ప్రక్కనే నియతముగా నున్న వాయువున రెండవ తరంగము అనురణన రూపముగా

---

34. ఇహ ద్వివిధో ధ్వనిః ప్రాకృతో వైకృతశ్చ-తత్ర ప్రాకృతో నామ యేన వినా స్ఫోటరూపమ్ అనభివ్యక్తం న పరిచ్ఛిద్యతే ॥ వైకృతస్తు యేనాభివ్యక్తః పునఃపునః అవిచ్ఛేదేన ప్రచితతరకాల ముపలభ్యతే ॥ ధ్వనినాతు సంస్పృష్టం స్ఫోటస్య రూప ముపలభ్యతే యస్మాత్ ధ్వనేః స్థితికాలః స్ఫోటోపలబ్ధిరూపః పరివర్తతే॥ శబ్దస్యోర్ధ్వమభివ్యక్తేః వృత్తిభేదేతు వైకృతాః ధ్వనయఃసముపోహన్తే స్ఫోటాత్మా తైర్నభిద్యతే ॥ తస్య నిత్యస్యయేఽభివ్యంజకా స్తేచ కేచిత్ ప్రాకృతాః కచిద్వైకృతాః యః కరణసన్నిపాతా దుత్పద్యతే యశ్చ తస్మాత్ తా ప్రాకృతా॥ తాభ్యామ్ విశేషోపలబ్ధేః ॥ యస్తుధ్వనిః ధ్వనేరుత్పద్యతే సవైకృతః తతో విశేషా భావాత్॥ స్ఫోటస్య వర్ణస్య గ్రహణే హేతుః ప్రాకృతోధ్వని రిష్యతే । స్థితిభేదే నిమిత్తత్వం వైకృతః ప్రతిపద్యతే ॥

35. నేయ మాక్షిర్యమాణాపి నిత్య మాగంతుకైర్మలైః । అంత్యాకలేవ సోమస్య నాత్యంత మభిభూయతే ॥

కలుగును-ఈ రెండిటినే ప్రాకృత ధ్వనులనియు ఆ తరవాత గలిగిన తరంగములన్నియును వైకృత ధ్వనులనియు అయ్యవి శ్రోతనుజేరి యర్థమును భాసింపజేయుననియు నుద్దేశింప బడినట్లు స్పష్టము-"శబ్ద స్యోర్ధ్వ మభివ్యక్తేః" అనియు 'అనురణనరూపా యే పశ్చాత్కాల భావినః' అనియు, ప్రాకృత వైకృత ధ్వనులను హేలారాజకృత వ్యాఖ్యానమున స్పష్టపరిచి యున్నాడు.

పైని నిరూపించిన క్రమ మంతయును నేటి పాశ్చాత్య శాస్త్రమయిన (Physics లోని Propagation of sound) అను విషయమునకు సరిపడియున్నది. దీనివలన మన మెఱుంగదగినది యేమనగా క్రీ. వె నాలుగవ శతాబ్దమునాటికే యీ ధ్వని శాస్త్రమును మన వారు పూర్తిగా గోచరము చేసికొనిరనుటయే.

పైని చెప్పిన వైయాకరణ మార్గమును గూర్చియు ప్రాచీన తార్కికుల శబ్ద ప్రసారమును గూర్చిన వివరణమును, అద్వైత వేదాంతులు విమర్శించి ఖండించినమార్గమును, పరిశీలించినచో పయి పద్ధతి యొక్క బహుళ ప్రచారము మునకు స్పష్టపడుచున్నది. "అద్వైత పరిభాష" యను గ్రంథమున ధర్మరాజాధ్వరి యను గ్రంథకర్త ఈ క్రింది విషయమును వ్రాసియున్నాడు. "శబ్దము, వీచితరంగ న్యాయమునగాని కదంబ ముకుళ న్యాయమునగాని బయలుదేరి వక్తనుండి శ్రోత వఱకు పోవుచున్నది అనునది తార్కికులు అంగీకరించిరి". ఈ కల్పన దుష్టమని యాతడు త్రోసిపుచ్చెను. ఒకటి గౌరవ దోషము. రెండు ప్రత్యక్ష విరోధము. భేరి నుండి బయలుదేరిన శబ్దమును అనగా ధ్వనిని శ్రోత విను చున్నాడు. అతని యనుభూతి 'భేరీ శబ్దో మయా శ్రుతః' (భేరి శబ్దమును నేను వింటిని) అని గదా: భేరి నుండి శబ్దము పుట్టి దాని వెనుక నింకొకటిగా అనంత శబ్దకల్పన చేయుట గౌరవ దోషముతో కూడినది 'అనంతశబ్దకల్పనాయాః గౌరవత్వాత్' అని వ్రాసెను. అనగా ఒక్క భేరీ శబ్దమును అంగీకరించి చేయు కల్పన లాఘవముతో గూడినది". రెండవది "భేరీ శబ్దోమయాశ్రుతః ఇతి ప్రత్యక్షస్య విరోధాచ్చ" అనగా శ్రోత యనుభవము, "నేను భేరీ శబ్ద మును వింటిని అని గాని, భేరీ శబ్దము వలన పుట్టిన శబ్దము నుండి పుట్టిన అనేకాంతరిత శబ్దము వింటినని గాదుగదా" ఇది ప్రత్యక్ష ప్రమాణ విరోధము.

పయివాదమునందాతడును వాయుగతములయి కంపన జన్యములయిన (శబ్ద) తరంగములను అన్నిటిని శబ్దమనియే వ్యవహరించి యున్నాడు. కావున పయి క్రమము నంతటిని స్పష్టపరచుటకు ఇందు చెప్పిన క్రమికావస్థలకు భిన్న భిన్నములయిన సాంకేతిక పదములను నిర్ణయించి ఆ పదములనే ఆ యర్థములయందు వాడుచుండినచో అర్థబోధకుపకా రకము, సందేహ నివారకము. పయి కల్పనలన్నియు అంతటి ప్రాచీన కాలముననే మనవారికి తెలిసియును, మన శాస్త్రములు పెరగకుండుటకును పాశ్చాత్యభౌతిక శాస్త్రము పెరుగుచుండుట కును హేతువు ముఖ్యమైనదొక్కటి - ఇందు experimental method అనగా ప్రయోగ మూలకమయిన పరామర్శ నవ్య మార్గమున ముఖ్యము. ఇంకొకటి యేమనగా పాశ్చాత్య పద్ధ తిని ఒక శాస్త్రమున చేసిన సిద్ధాంతమునకు విరుద్ధమయిన సిద్ధాంతము మరియొకచోట నెదు రయినపుడు రెండిటిని విమర్శించి, సంపన్నమయిన సాక్ష్యమునంతటిని సమన్వయపఱచి జ్ఞాన స్వరూపమును యథార్థముగా నిర్ణయించుకొందురు. దానికి బాధ వచ్చినప్పుడు కల్పనాంతరము

వలన క్రొత్తసాక్ష్యమును సమర్థించి ప్రాతకల్పనను విడుతురు. మన శాస్త్రములలో, ఏ శాస్త్రము వారి కల్పన ఆ శాస్త్రము వారిదే. అన్నియు ప్రచారములోనే యుండును. ఎవ్వరిది వారికే ప్రమాణము. ఇట్టివి కేవల భావ మాత్ర గోచరములయిన మానసిక విషయములలో తప్పనివేమోగాని, వెలుగు, ధ్వని, దర్శనము, శరీరాంగములు, లోహములు, మొదలయిన భౌతిక వికృతులలో ప్రత్యక్షీకరింప వీలగును గావున, వేరు వేరు ప్రతిపాదనలు చెల్లవు.

అయినను ఇంతటి ప్రాచీనకాలమున బయలుదేరిన వీరి కల్పనలు, వివరణములు నేటి భౌతిక శాస్త్రములోని ముఖ్య విషయములతో సరిపోవుటకు ప్రాచీనుల తపఃఫలమే హేతువు.

## వాక్యపదీయమునకు తరువాతివారు కల్పించిన ప్రచారము

మహా భాష్యములోని యర్థములనూహించి పయిరీతిని వ్రాయబడిన కారికలను తరువాతివారనేకు లుదాహరించి యనుసరించిరి, కొందరు వివరించిరి, మరికొందరు తమ తమ మతములననుసరించి వివరించిరి. పయిరీతిని ఇతరులు ఉదాహరించిన సందర్భములను ఎత్తి పూనా విశ్వవిద్యాలయము వారు ప్రచురించిన వాక్యపదీయమునకు మూడవ అనుబంధమున విపులముగా వ్రాసిరి. దాని సంగ్రహరూప మీ క్రింద నీయబడుచున్నది.

క్షీరస్వామి యను నాతడు శతపథబ్రాహ్మణ వ్యాఖ్యాత (638 A. D.) కారికల నుదాహరించియున్నాడు, అట్లే జయంత భట్టు తన న్యాయమంజరిలో (830 A. D.), రామ కంఠుడు (950 A. D.) స్కందకారిక పయిని తాను వ్రాసిన వివృత్తియందును, సర్వ దర్శన సారసంగ్రహమునందు (1350 A. D) మాధవాచార్యులును, శాంతరక్షితుడు (720 A. D.) తత్త్వ సంగ్రహమునందును, దానికి వ్యాఖ్యాత కమలశీలుడు తన వ్యాఖ్యాన మునను, కుమారి లభట్టు (650-700 A. D.) తన తంత్రవార్తికమునను, అభినవగుప్తుడు (970-1020 A. D ) తన అభినవ భారతియందును, వాచస్పతి మిశ్రుడు(820-900 A. D.) తన తత్త్వబిందువునను, భవ్యుడను నాతడు (600 A. D.) ప్రజ్ఞాప్రదీపవృత్తియందును, గోకులనాథుడు పదవాక్యరత్నాకరమందును, శివసూత్రవృత్తి యను వ్యాఖ్యయందును, భోజరాజు తన శృంగారప్రకాశికయందును ఉదాహరించిరి. ఇంక ననేకులచేత ననేకస్థలముల యందును వాక్యపదీయ కారికలు ఉదాహరింపబడినవి. శ్రీ శంకరాచార్యులు గూడ తన బ్రహ్మసూత్ర భాష్యమున వాక్యపదీయము నభిప్రాయములు ఆధారముగా విషయమును ప్రపంచించినట్లు స్పష్టము. (వా-ప-1-84) వీరిలో చాలమంది వైయాకరణ దర్శనమునకు దూరమైన వారు.ఇక వ్యాకరణ విచారణ గ్రంథములను వ్రాసిన కైయటుడు, భట్టోజీ దీక్షితుడు, కౌండభట్టు, నాగేశభట్టు మొదలయినవారు వాక్యపదీయ కారికలను పరమ ప్రమాణముగా తమ రచనలయందు వాడుకొనిరి.

ఇన్ని విధముల ఇందరిచేత నీగ్రంథ మేల వాడబడినది యను ప్రశ్న తోపక తప్పదు.వ్యాకరణ విషయమున రెండు విధములయిన విచారణ కలదు. ఒకటి పాణిని సూత్ర ముల ననుసరించిన ప్రక్రియా భాగము, అనగా రూప నిష్పాదన విధానము. రెండు ఆర్థిక విచారము, అనగా వ్యాకరణ దార్శనికుల యొక్క శబ్దార్థ స్వరూపములలోని విచారణ. ఈ రెండును కలిసియే మహాభాష్య రచనము సాగినది. అందలి ఆర్థిక విచారమును ముఖ్యముగా

విడదీసి, వివరించి, యందలి సిద్ధాంతములను ప్రపంచించి, అన్ని విషయములను సమన్వయ పరచిన గ్రంథము వాక్యపదీయమగుట, అది యెల్లరకును ఉపాదేయమయినది. విశేషించి, ఆగమ ప్రామాణ్యము, మోక్షవిచారము, జ్ఞాన స్వరూపము (శబ్దార్థ విచార విషయమున) అద్వైత సిద్ధాంతము, ఇందు వివరింపబడుటచేత, తార్కికులకు, మీమాంసకులకు, బౌద్ధులకు ఇతర మతస్థులకు ఇది అనివార్యముగా ఉపయోగించవలసి వచ్చినది.

ఈ గ్రంథము ప్రాచీన కాలమునను, మధ్యకాలమున అనగా 19 వ శతాబ్దమునకు పూర్వమునను మిక్కిలి ప్రచారము నుండినది. అయినను 18-20 శతాబ్దములలో ఎల్లరును ప్రక్రియా గ్రంథములను, ప్రకరణ గ్రంథములను మాత్రమే చదువుచు పరీక్షా ప్రయోజనమును వెళ్ళబుచ్చుకొను చుండుటవలన దీనికి ప్రచారము తగ్గినది. కాని ఇటీవల పూనా విశ్వవిద్యాలయము వారు, పూనా దక్కను కాలేజీవారును భర్తృహరి గురించి చాల విమర్శ చేసి యనేక గ్రంథములను ప్రచురించి యున్నారు. అయినను కొన్ని యెడల అర్థసందిగ్ధత, పాఠభేదములు, సమన్వయమున మతబేదములు తప్పలేదు.

## వ్యాకరణ శాస్త్రమున భర్తృహరి నిరూపించిన విశేషములు

సర్వ శాస్త్రముల నెఱింగిన పతంజలి మహర్షి అగాథమయిన వ్యాకరణ శాస్త్రము లందలి యనేకామూల్యరత్నములను సంపాదించి తన మహాభాష్యమున విక్షేపించెను. మందబుద్ధులు వాని నుత్తర దేశమున సంరక్షింపలేక పోగా దక్షిణదేశమున నెక్కడనో ఒక్క మూలను మాత్రము ఉండిన వానిని చంద్రాచార్యాదులు పఠించి తమ శిష్య వర్గములోని వాడయిన వసురాతునకు బోధింపగా భర్తృహరి యాశాస్త్రము నాతని కృపచే పొందెను. ఆ భాష్యములో పతజంజలి చూపిన మార్గములను అనుసరించి తన గ్రంథములను భర్తృహరి రచించెను

1, పాతంజల మహాభాష్యమున బీజరూపముగానున్న స్ఫోటసిద్ధాంతమును వివరించి యనేక మార్గములలో దానిని వ్యాఖ్యానించి నిరూపించెను. ఆ తరువాత కైయటాదులు మఱి కొంత వివరించిరి.

2. తన కాలమున ప్రసిద్ధములయిన వేదాంతాది దర్శనములు, నిఃశ్రేయసప్రాప్తికి మార్గములను, విశ్వముయొక్క సృష్టిలయాదుల స్వరూపమును చెప్పుచుండగా, కేవలము శబ్దరూపసాధన మాత్రమే ప్రయోజనముగా గల వ్యాకరణ శాస్త్రము అట్టి ప్రయోజనమును సాధింపజాలదు అను ప్రవాదమును పోగొట్టి దానికి మోక్ష సాధకతను నిరూపించెను. "ఇయం సా మోక్షమాణానామ్ అజిహ్మా రాజపద్ధతిః" అని చెప్పెను.

'మహతా దేవేన నః సామ్యం యథా స్యా దిత్యధ్యేయం వ్యాకరణమ్' అను మహాభాష్యవచనమునందలి 'సామ్యమ్' అను పదమునకు సాయుజ్యమను మోక్షఫల మర్థముగా నిరూపించెను. 'అపి ప్రయోక్తు రాత్మానం శబ్దమంతరవస్థితమ్। ప్రాహుర్మహాంత మృషభం యేన సాయుజ్య మిష్యతే'' ॥ వాక్య 1-122 (180).

అనగా వ్యాకరణమునకు గూడ ఇతర దర్శన సమానమైన ఫలమును చెప్పుట వలననే శివదృష్టియను గ్రంథమునందు, "భర్తృహరి తన వైయాకరణత్వమును విడిచి దర్శన మార్గమునందు నడిచి రెంటికిని భ్రష్టుడయ్యెను" అను నింద కనుపట్టుచున్నది.

8. బ్రహ్మకును శబ్దమునకును అభేదమును జెప్పి విశ్వ మంతయును శబ్దబ్రహ్మ యందిమిడియున్నదని నిరూపించెను.36

4. సాధు శబ్దములను ప్రయోగించుటవలన వేద స్వరూపము నెరింగి ధర్మ సాధనకు మార్గమును అద్వైత అధిగమించుననను పాతంజలమతమును విపులీకరించి తెల్పెను. "శాస్త్ర పూర్వకే వా ప్రయోగే ధర్మాభివ్యక్తౌ అభ్యుత్వం ప్రతిపద్యతే" అని నిరూపించెను. ఇట్లు ధర్మాద్యర్థ నిరూపణము చేయుట విజ్ఞానాభాస (న) మని సోమానందుడు నిందించెను.

5. సృష్టిలో మొదట ఓంకారము జనించెనను ఉపనిషన్మతము నాధారముగా గాని వాక్కు అనాది యనియు సృష్టికి మూలమనియు స్పష్టపఱచెను.

6. తన కాలమున పరిచితములయిన అన్యమత సిద్ధాంతములను సంగ్రహించి తన మతమునకు పూర్వపక్షములుగా నిరూపించి సమన్వయపరచెను.

7, శబ్ద స్వభావమును గురించియు వాక్యార్థమును గుఱించియు తార్కిక మీ మాంసకాదుల సిద్ధాంతములమ దెలిపి, అఖండ వ్యాక్యార్థమే సత్యమని నిరూపించి వై యాకరణ మతమును స్థాపించెను,.

8. అద్వైతసిద్ధాంతమును, వేద ప్రామాణికత్వమును గూడ తన శాస్త్రముతో సమన్వయించెను. మీ మాంసకులకు అపూర్వమును, నైయాయికులకు ఈశ్వరుడును, కాణాదులకు పీలువులును, బౌద్ధులకు శూన్యమును, వేదాంతులకు బ్రహ్మమును ఉన్నట్లు, వై యాకరణులకు భావగమ్యమయిన మూలపదార్థమగు స్ఫోటమును స్థాపించెను.

సర్వవిద్యావిశారదుడయిన ఇట్టి భర్తృహరి గ్రంథ మెల్లరకు నుపాదేయమేకదా ?

---

36. తస్మాద్యః శబ్దసంస్కారః సా సిద్ధిః పరమాత్మనః ।
తస్యప్రవృత్తి తత్త్వజ్ఞః తద్బ్రహ్మామృత మశ్నుతే ॥ వాక్య. I. 201.
యదేకం ప్రక్రియాభేదైః బహుధా ప్రవిభజ్యతే ।
తద్వ్యాకరణ మాగమ్య పరం బ్రహ్మాధి గమ్యతే ॥ వాక్య. P. 51.

## ఉపయుక్త గ్రంథములు

వాక్యపదీయము - భర్తృహరి - వివిధముద్రణలు :

I, II కాండలు కాశీ విద్యాపీఠ ప్రచురణము - అంబాకర్త్రీ వ్యాఖ్యానముతో

I, II, III కాండలు అభయంకర్, లిమయేగారలు సంపాదించినది.
పూనా విశ్వవిద్యాలయ ముద్రణము.

I కాండ - కె. ఎస్. అయ్యరుగారు సంపాదించినది.

II కాండ ,, ,, ఆంగ్లపరివర్తనము
పూనా దక్కన్‌కాలేజి ప్రచురణము.

I, II కాండలు కే. రాఘవన్ పిళ్లై కృత - ఆంగ్లపరివర్తనసహితము.
మోతీలాల్ బనారస్‌దాస్ ప్రచురణము-బంగ్లారోడ్ ఢిల్లీ - 7

భర్తృహరి - కే. ఎ. ఎస్. అయ్యరుగారు వ్రాసినది (ఆంగ్లము)
సర్వంకష విమర్శగ్రంథము. పూనా దక్కన్ కాలేజి ప్రచురణము.

కౌండభట్టు - స్ఫోటనిర్ణయము - ఎస్. డి. జోషిగారి ఆంగ్లానువాద
వివరణముతో కూడినది. పూనా విశ్వవిద్యాలయ ముద్రణము.

పాతంజల మహాభాష్యము - ప్రదీపాదివ్యాఖ్యాసహితము.
సంస్కృతవ్యాకరణశాస్త్ర కా ఇతిహాస్ - (హిందీ) - యుధిష్ఠిర్ మీమాంసక్
భారతీయ ప్రాచ్యవిద్యా ప్రతిష్ఠాన్, 24/312 రామ్‌గంజ్, అజ్‌మేర్.

# విషయసూచిక

# వాక్యపదీయము

## బ్రహ్మకాండము

ఏ గ్రంథమును రచింపదలచినను ముందుగా అనుబంధ చతుష్టయమును జూపవలెను. 1. విషయము, 2. ప్రయోజనము, 3. సంబంధము, 4. అధికారి—ఈ నాలుగింటిని అనుబంధ చతుష్టయ మందురు. అనుబంధచతుష్టయమును చూపినచో చదువరులు ఉత్సాహము కలవారై అందలి ప్రయోజనమును పొందదలచి ఆ గ్రంథమును చదువుటకు ప్రయత్నింతురు. అట్లు గాకున్న విషయ ప్రయోజనములు తెలియనందున వారు ఆ గ్రంథమును చదువుట సంభవింపదు. కనుక నియతముగా ముందుగా ఆ చతుష్టయమును జూపి గ్రంథారంభము చేయవలెనని పెద్దలు నిర్ణయించిరి.

భర్తృహరియు పాణినీయవ్యాకరణ మహాభాష్యమునకు వ్యాఖ్యానముగ "వాక్యపదీయ" మను ప్రకరణ గ్రంథమును వ్రాయదలచి పై నిర్ణయము ననుసరించి ముందుగా 43 శ్లోకములతో అనుబంధచతుష్టయమును జూపెను. 44వ శ్లోకముతో గ్రంథమునారంభించెను. 24, 25, 26(మూడు)శ్లోకములలో వ్యాకరణ శాస్త్రమునకు విషయముగా [1]ఎనిమిది పదార్థములను జూపెను. వానిలోనే ప్రయోజనముగూడ ఇమిడి యున్నది— 1. అర్థజ్ఞానము, 2. ధర్మము. ఈ రెంటిలో ధర్మము ముఖ్యప్రయోజనము. అది అంతతః (చివరకు) మోక్షరూపమే కాగా వ్యాకరణాధ్యయనమునకు మోక్షము ముఖ్య ప్రయోజనమని తేలినది. బ్రహ్మప్రాప్తియే మోక్షము కనుక ప్రాప్యమగు బ్రహ్మపదార్థము నిరూపింపవలసియున్నదని

---

| | |
|---|---|
| 1 శబ్దము 2 విధములు : | 1. ప్రకృతి ప్రత్యయములు |
| | 2. పదవాక్యములు, |
| అర్థము 2 విధములు : | 1. ప్రకృతి ప్రత్యయార్థములు |
| | 2. పదవాక్యార్థములు |
| శబ్దార్థములకు కల సంబంధము 2 విధములు : | 1. కార్యకారణభావము |
| | 2. యోగ్యత |
| ప్రయోజనము 2 విధములు : | 1. అర్థజ్ఞానము |
| | 2. ధర్మము |
| పదార్థములు | 8 |

తలంచి భర్తృహరి నిర్గుణాద్వయబ్రహ్మస్వరూపమును ముందుగా చూపుచున్నాడు. ఈరీతిగా విషయప్రయోజనములు నిరూపింపగా వానిని పేక్షించువాడు అధికారియని, విషయ ప్రయోజనములతో గ్రంథమునకు ప్రతిపాద్య ప్రతిపాదక భావము సంబంధమనియు చెప్ప నక్కరలేకయే తెలియనగును.

> అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరమ్
> వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతో యతః. 1

అనాదినిధనమ్ = ఉత్పత్తి వినాశనములులేనట్టియు; నాశములేని, అక్షరమ్ = పరమార్థ నిత్యమగునట్టియు, శబ్దతత్త్వమ్ = శబ్దస్వరూపమగు, యత్ = ఏ, బ్రహ్మ = బ్రహ్మము, అర్థభావేన = ఘటము, పటము మున్నగు అర్థములరూపమున, వి + వర్తతే = వివర్తమగు చున్నదో-అనగా తనస్వరూపమును విడనాడకుండ రూపాంతరమును భాసింపచున్నదో, జగతః = జగముయొక్క, ప్రక్రియా = సృష్టిప్రక్రియ, యతః = దేనిచే జరుగు చున్నదో, అనగా ఏబ్రహ్మము లోకసృష్టికి కర్త యగుచున్నదో, తస్య = ఆ బ్రహ్మము యొక్క ప్రాప్త్యుపాయః = పొందుటకు ఉపాయము, వేదః = వేదము. ఈ శ్లోకార్థముతో రెండు, మూడు, నాలుగు శ్లోకముల అర్థములను జరిప శ్లోకార్థముతో సంబంధము చూపనగును.

తా. వృక్షము మున్నగువానికి ఉత్పత్తివినాశములు మనకు ప్రత్యక్షముగనే యున్నవి. ఆకాశము మున్నగునవి యుగప్రారంభమున పుట్టి ప్రళయమువరకు ఉండి నశించు చున్నవి. బ్రహ్మము అట్టిదికాదు. దానికి ఉత్పత్తివినాశములు లేవు, కావున అది పరమార్థ నిత్యము. ఆ బ్రహ్మము జగద్రూపమున వివర్తమగుచున్నది. ఉదా॥ రజ్జుసర్పము. త్రాడు తనస్వరూపమును విడనాడకయే సర్పరూపమున భాసించుచున్నది. సర్పరూపము భ్రమ విషయమే. రజ్జుజ్ఞానము కలుగగా సర్పజ్ఞానము నశించును. లోకసృష్టికి బ్రహ్మము కర్త యగుచున్నది. బ్రహ్మమే వివర్తమునను-లోకసృష్టికి మూలము. అనగా జగమునకు ఉపాదానకారణము బ్రహ్మము, సృష్టికి నిమిత్తకారణముకూడ బ్రహ్మమే అని తాత్పర్యము.

వి. ఈ శ్లోకమునందు 'యతః' అనునది పంచమ్యర్థమున [illegible] సార్వవిభక్తికము కావలెను. యతః = యేన. ఆద్యాది గణపాఠమువలన తృతీయాంతమునుండి తసి ప్రత్య యము ప్రవర్తించుటచే తైయర్థము లభించును.

అక్షరమనగా నశించనిది యని యర్థము. న + క్షరము అక్షరము. ఈ పద మునకు మరియొక అర్థముకూడ చెప్పనగును. అశ్నుతే (వ్యాప్నోతి) ఇతి అక్షరమ్. సందర్భమునుబట్టి అర్థమును వ్యాపించునది 'అక్షరమ్' అని గ్రహించునది. అర్థమును వ్యాపించునది పదము లేదా వాక్యము. ఈరీతిని పదవాక్యములు అక్షరశబ్దముచే బోధింప బడుచున్నవి. పదవాక్యములు ఈ గ్రంథమునకు విషయములని అక్షర పద ప్రయోగ ముచే ధ్వనితమగుచున్నది. పదవాక్యములలో వాక్యము ముఖ్యము కనుక దానికి పూర్వ నిపాతముచేయగా వాక్యపదములకు సంబంధించిన గ్రంథము వాక్యపదీయము అని గ్రంథ నామము కూడ ఈ పదముచే సూచితమగుచున్నది.

పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనురీతిని వాక్కు నాలుగు విధములుగా నున్నది. వానిలో పరావాక్కు అద్వైతశాస్త్రసమ్మత మగు చేతననిర్గుణాద్వయబ్రహ్మరూపమే. దాని వివర్తములే పశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కులు. కాగా, పరావాగ్రూపమగు స్ఫోటశబ్దము

---

తా. = తాత్పర్యము. వి. = విశేషములు.

బ్రహ్మరూపమే అను వైయాకరణసిద్ధాంతము "శబ్దతత్త్వమ్" అను పదముచే భర్తృహరి వ్యక్తపరచుచున్నాడు.

శబ్దస్వరూప మగు బ్రహ్మమునందు ఏవిధ మగు భేదము లేదనియు, అవస్థము విచిత్రశక్తియోగమున విచిత్రరూపమున వివర్తమగుచున్న దనియు చెప్పుచున్నాడు.

ఏకమేవ యదామ్నాతం భిన్నం శక్తివ్యపాశ్రయాత్
అపృథక్త్వేఽపి శక్తిభ్యః పృథక్త్వేనేవ వర్తతే.　　　　2

ఏకమ్ + ఏవ= ఒక్కటియేయనియు, అనగా నిజరూపమున భేదరహితమనియు శక్తివ్యపాశ్రయాత్=భిన్నములగు శక్తుల కాశ్రయమగుటవలన, భిన్నమ్=భిన్నముగా నున్నదనియు, అనగా భేదసహితమనియు, అమ్నాతమ్=ఉపనిషత్తులలో ననేకపర్యాయములు చెప్పబడినట్టి, యత్=ఏ శబ్దరూపమగు బ్రహ్మము, శక్తిభ్యః=తనయందున్న శక్తులకంటె, అపృథక్త్వే + అపి =అభిన్నముగా నున్నను, పృథక్త్వేన + ఇవ=భిన్నముగా నున్నటుల, వర్తతే=ఉన్నదో, అనగా వివర్తమగుచున్నదో, (తస్య, ప్రాప్త్యుపాయః, వేదః= దానిని పొందుట కుపాయము వేదము.)

తా. ఆ బ్రహ్మము నిజరూపమున ఒక్కటియే. దానియందు సజాతీయ విజాతీయ స్వగత భేదములు మూడును లేవు. ఈయర్థమును పరమప్రమాణములగు ఉపనిషత్తులు అనేక ప్రసంగములలో చూపియున్నవి. అట్టి బ్రహ్మమును సత్త్వరజస్తమోగుణాత్మకమగు అవిద్య అను నామాంతరము కల మాయ అను పదార్థము అనాదినుండి ఆశ్రయించి యున్నది. దానికి విలక్షణములగు శక్తులున్నవి. వానినిబట్టి అద్వితీయ మగు బ్రహ్మమునందు నానాత్వము కాన్పించును. ఈ యర్థమునుగూడ ఉపనిషత్తులు వ్యక్తపరచియున్నవి. బ్రహ్మము శక్తులకంటె భిన్నము కాకపోయినను శక్తులు పరస్పరభిన్నములగుటచే వానివలన భిన్నముగా నున్నట్లు గోచరించును.

వి. మాయాశక్తిసహితమగు బ్రహ్మమే జగముల సృష్టి స్థితి సంహారములకు కారణము. అదియే సగుణము. నిర్గుణబ్రహ్మము కారణము కానేరదు. నిర్గుణబ్రహ్మభావము మోక్షము.

బ్రహ్మముయొక్క కాలశక్తినిబట్టియు భేదము గోచరించు నని చెప్పుచున్నాడు.

అధ్యాహితకలాం యస్య కాలశక్తి ముపాశ్రితాః
జన్మాదయో వికారాః షడ్ భావభేదస్య యోనయః.　　　　3

యస్య=ఏశబ్దబ్రహ్మముయొక్క, అధ్యాహితకలామ్=ఆరోపింపబడిన భేదము కలిగినట్టి కాలశక్తిమ్=కాలమనెడి శక్తిని, ఉపాశ్రితాః=ఆశ్రయించినట్టి, జన్మాదయః= జన్మము మున్నగు, షట్=ఆరు, వికారాః=వివర్తములు, భావభేదస్య=బ్రహ్మముయొక్క నానాత్వమునకు, యోనయః=కారణములో, (తస్య, ప్రాప్త్యుపాయః, వేదః=అట్టి బ్రహ్మమును బొందుట కుపాయము వేదము.)

తా. బ్రహ్మమునందు కాలమనెడి శక్తియున్నది. దాని నిజరూపము క్షణము. అట్టి క్షణములను లెక్కించుటచే లవము, పలము, ముహూర్తము, గడియ, పగలు, రాత్రి దినము, వారము, మాసము, ఋతువు, అయనము మున్నగు కాలభేదములు కలుగుచున్నవి. ఈ కాలశక్తి పరమాత్మయం దారోపితమగుటచే ఆత్మ పుట్టుట, ఉండుట, పరిణమించుట, వర్ధిల్లుట క్షీణించుట, నశించుట అనురీతిని ఆరువిధములుగా వివర్తమగుచున్నది. క్రమరహిత మగు

బ్రహ్మవివర్తమునకు కాలశక్తినిబట్టియే పై క్రమము ఏర్పడుచున్నది. కనుకనే ప్రపంచక మునకు పుట్టుక మున్నగు వికారములు క్రమముగానే కలుగుచున్నవి. కాలము మాయయొక్క పరిణామము.

వి. ఇచట భావశబ్దము సత్తారూపపరబ్రహ్మవాచకము, వికారశబ్దము వివర్త పరము. ఈయభిప్రాయమును తృతీయకాండము జాతిసముద్దేశమున తెలిపు శ్లోకముచే భర్తృహరి స్పష్టపరచియున్నాడు.

బ్రహ్మము అవిద్యావశమున నానారూపముగ వివర్తమగునని, ఆ వివర్తము జన్మాది షట్కరూపమనియు చూపబడినది. ఇపుడు జీవుడు, భోక్త, భోగ్యము, అనుభవము అనెడి సుప్రసిద్ధమగు లోకవ్యవహారము కూడ బ్రహ్మముయొక్క వివర్తమే యని చెప్పుచున్నాడు.

ఏకస్య సర్వబీజస్య యస్య చేయ మనేకధా
భోక్తృభోక్తవ్యరూపేణ భోగరూపేణ చ స్థితిః. 4

ఏకస్య + చ = అద్వితీయమైనను, సర్వబీజస్య = సర్వప్రపంచకమునకును కారణమగునట్టి, యస్య = ఏ బ్రహ్మముయొక్క, భోక్తృభోక్తవ్యరూపేణ = జీవరూపమున, అనుభవింపబడేవిషయము రూపమునను, భోగరూపేణ + చ = సుఖదుఃఖానుభవరూపమునను, అనేకధా = పై ప్రకారముగా అనేకవిధములుగా, ఇయమ్ = ప్రత్యక్షముగా కానవచ్చుచున్న, స్థితిః = ఉనికి, అనగా వివర్తరూపమగు ఉనికి కలదో, (తస్య, ప్రాప్త్యుపాయః, వేదః = అట్టి బ్రహ్మము యొక్క ప్రాప్తికి ఉపాయము వేదము.)

తా. అవిద్యయందు కలిగెడి బ్రహ్మముయొక్క ప్రతిబింబము జీవుడు. అతడు చేతనుడు కనుక భోక్తయగుచున్నాడు బ్రహ్మవివర్తమగు విషయజాతము జడము కనుక భోగ్యమగుచున్నది. సుఖదుఃఖములుకూడ జడములే, కాని చిత్తునందలి ప్రతిబింబవశమున నవి అనుభవములుగా వ్యవహరించబడుచున్నవి. అట్టి సుఖదుఃఖానుభవము భోగము అనబడును. కాగా అవిద్యావశమున బ్రహ్మము జీవరూపమునను విషయరూపమునను అనుభవరూపమునను కాన్పించుచున్నది. ఈ స్థితియంతయు బ్రహ్మవివర్తమే.

వి. లోకమున ప్రతిపదార్థమునకును ఏదో ఒక నియత మగు కారణముండును. ఉదా. ఘటమునకు మట్టి, వస్త్రమునకు దారములు, సువర్ణకంకణమునకు బంగారము కారణమగుచున్నది. మట్టివలన వస్త్రాదికార్యములు కలుగనేరవు. బ్రహ్మము ఎల్లవస్తువులకు కారణము కాగలదు. జగత్తు బ్రహ్మముకంటె వేరుగ లేదు. కారణముకంటె కార్యము వేరుగా ఉండనేరదు. కనుక 'సర్వబీజస్య' అనుట సమంజసమే.

ఈరీతిగా నాల్గు శ్లోకములచే ప్రాప్యమగు బ్రహ్మముయొక్క స్వరూపమును జూపి దానిని పొందుట కుపాయమును జూపుచున్నాడు.

ప్రాప్త్యుపాయోఽనుకారశ్చ తస్య వేదో మహర్షిభిః
ఏకోఽప్యనేకవర్త్మేవ సమామ్నాతః పృథక్పృథక్. 5

తస్య = దానియొక్క — అనగా పై నాల్గు శ్లోకములచే చెప్పబడిన శబ్దబ్రహ్మము యొక్క, ప్రాప్త్యుపాయః = పొందుటకుపాయము, వేదః = వేదము, అనుకారః + చ = ఆ బ్రహ్మము యొక్క ప్రతిబింబముకూడ వేదము.

ఏకః=అట్టివేదము ఒక్కటియే ఐనను, మహర్షిభిః=మహర్షులచే, అనేకవర్త్మ+ఇవ=అనేకములగు మార్గములు కలదివలె, పృథక్పృథక్=వేరువేరుగ, సమామ్నాతః=అభ్యసింపబడుచున్నది.

తా. వ్యాకరణాధ్యయనమునకు పరమప్రయోజనము మోక్షము. మోక్ష మనగా బ్రహ్మప్రాప్తియే. ప్రాప్యమగు బ్రహ్మమును పై నాల్గు శ్లోకములచే చూపియున్నాడు. అట్టి బ్రహ్మమును పొందుటకు ఉపాయము వేదము, మరియొక ఉపాయము లేదు. బ్రహ్మప్రాప్తి యనగా బ్రహ్మభావము, అదియే మోక్షము. ఆవేదము బ్రహ్మముయొక్క ప్రతిబింబమువంటిది

వేదము ఒక్కటియే, కాని దాని నభ్యసించెడి మనుష్యులకు కలియుగమున ఆయుష్యము, శక్తియు తగ్గియుండుటచే వారు వేదమును సంపూర్ణముగా చదువుట కవకాశము చాలకున్నదని భావించి మహర్షులు దానిని సులభముగా నభ్యసింపజేయుటకై ఋక్, సామ, యజుస్, అథర్వ అనురీతిని, సంహిత, పదము, క్రమము, శిఖ, మాల, జట, ఘన అను రీతిని అనేకమార్గములను వేరువేరుగా జూపియున్నారు.

వి. కార్యమును సాధించుటకై గ్రహింపబడి, అది సిద్ధించిన తరువాత విడువ తగినది ఉపాయ మనబడును. 'ఉపాదాయ హేయః=ఉపాయః' అనురీతిని ఉపాయశబ్దము నకు వ్యుత్పత్తి* చెప్పనగును. 'ఉపాదాయహేయః' అనుచోట 'దాయహే' అను భాగమునకు పృషోదరాదిగణపాతముచే లోపము కలుగగా పైరూపము ఏర్పడును.

బ్రహ్మము సర్వజ్ఞము, వేదముకూడ అట్టిదే. అందుచే నది బ్రహ్మముయొక్క ప్రతి బింబము కానగును. అనుకార మనగా అనుకృతి, అనుకరణము. కాగా ప్రతిబింబ మని యాశయము.

బ్రహ్మప్రాప్తికి వేద ముపాయమని ఐదవశ్లోకమున జూపియున్నాడు. అట్టి వేదము యొక్క స్వరూపమును దాని మాహాత్మ్యమును వ్యక్తపరచుచున్నాడు.

> భేదానాం బహుమార్గత్వం కర్మణ్యేకత్ర చాఙ్గతా
> శబ్దానాం యతశక్తిత్వం తస్య శాఖాసు దృశ్యతే. 6

తస్య=ఆ వేదముయొక్క, భేదానామ్=భేదములకు అనగా ఋక్ సామ యజుస్ అథర్వ అను నాలుగు భేదములకు, బహుమార్గత్వమ్=ఒక్కొక్కవేదభేదమునకు శాఖా బాహుల్యముచే బహుమార్గములు కలిగియుండుట, ఏకత్ర=ఒకే, కర్మణి=యాగాదికర్మము నందు, అఙ్గత్వమ్=అంగత్వము- అవయవముగా నుండుట- అప్రధానముగా నుండుట అని భావము, శాఖాసు=వేదశాఖలయందున్నట్టి, శబ్దానామ్=శబ్దములకు, యతశక్తిత్వం+చ=(నియతమగు కార్యమును కలిగించుటచే) నిశ్చితమగు శక్తి కలిగియుండుటయు, దృశ్యతే=చూడబడుచున్నది.

---

* "ఉపాదాయాపి యే హేయాస్తానుపాయాన్ ప్రచక్షతే" (2 కాండ. 38) అని భర్తృహరి వివరించియున్నాడు. "తవ్యత్తవ్యానీయరః" 3-1-96 అను పాణినిసూత్ర మున నాగేశపండితుడు "ఉపాదాయాపి యే హేయా ఇతి ఉపాయశబ్దవ్యుత్పత్తిః; "పృషోదరాదిత్వా త్సాధుః" అని (భాష్యప్రదీపోద్ద్యోతమున) వ్రాసియున్నాడు. "పృషోదరా దీని యథోపదిష్టమ్" (6. 3. 109)

**తా.** ఒకే వేదమును నాలుగు భాగములుగా విభజించిరి. వానిలో ఋగ్వేదము నకు 21, యజుర్వేదమునకు 101, సామవేదమునకు 1000, అథర్వవేదమునకు 9 శాఖలు కలవు. ఇదియే శాఖలకు బహుమార్గత్వము.

ఒకే యాగము అనేకశాఖలలో చెప్పబడియుండవచ్చును. అంతమాత్రమున ఆ యాగము భిన్నభిన్నయాగములుగా పరిగణింపబడదు. ఒకే యాగముగా గుర్తింపబడును. దేవత నుద్దేశించి మంత్రములను చదువుచు నెయ్యి మున్నగువస్తువులను అగ్నిలో హోమము చేయుట యాగము. ఇందు హోమముచేయుట ప్రధానము. దానికి మంత్రములు, దేవతలు, వస్తువులుకూడ అంగములుగా నుండును. యాగక్రియకు మంత్రము మున్నగునవి ఉపకార కములని భావము. వేరువేరుశాఖలలో నున్న మంత్రములు ఒకేయాగమునకు ఉపకారము చేయుట ఇచట "అఙ్గత్వమ్" అను పదముచే వివక్షితమగుచున్నది.

ఇట్లే ఒకేశబ్దము భిన్నభిన్నశాఖలలో నుండవచ్చును. కాని శాఖాభేదముచే స్వర దీర్ఘాదులు భిన్నములు కావచ్చును. అట్టితరి ఆ శబ్దము ఏస్వరములో ఏశాఖలోనున్నదో, ఆ స్వరముకలిగినశబ్దమే ఆశాఖలోనే యాగాదిక్రియలకు ఉపయోగించును. దానినిబట్టి శబ్దము ఫలజనక మగును.

స్మృతులు వేదమూలకములు. ఈ కారణముచేగూడ వేదము బహుమార్గత్వము నుస్పష్టమగుచున్నదని బోధించుచున్నాడు.

స్మృతయో బహురూపాశ్చ దృష్టాదృష్టప్రయోజనాః
తమే వాశ్రిత్య లిఙ్గేభ్యో వేదవిద్భిః ప్రకల్పితాః. 7

వేదవిద్భిః=వేదవేత్తలచే అనగా అతీంద్రియదృష్టిచే వేదార్థమును గుర్తించిన మహర్షు లచే, బహురూపాః=పలువిధములగునట్టియు, దృష్టాదృష్టప్రయోజనాః = ప్రత్యక్షముగా కాన్పించెడి ఫలము, పరోక్షముగా కాన్పించని ఫలము, ఉభయవిధములగు ఫలములు కలిగినట్టియు, స్మృతయః + చ = స్మృతులుకూడ, తమ్ + ఏవ = ఆ వేదమునే, ఆశ్రిత్య = ఆశ్రయించి, లిఙ్గేభ్యః = ఆయా అర్థములను బోధించెడి మంత్రములవలన, ప్రకల్పితాః = రచింపబడినవి.

**తా.** మహర్షులు అతీంద్రియదృష్టిచే వేదార్థమును సాక్షాత్కరించుకొని ప్రజాక్షేమమును కోరి వేదార్థప్రకాశకములగు స్మృతులను రచించిరి. కాన వానికి వేదార్థ మునుబట్టియే ప్రామాణ్యము లభించును. ఈ యంశమును 138 వ శ్లోకము మొదలు 10 శ్లోకము లచే భర్తృహరి వివరింపనున్నాడు.

ఆ స్మృతులు పలువిధములుగా నున్నవి. కొన్నిటికి ప్రత్యక్షశ్రుతి మూలముగా కానవచ్చును. కొన్నిటికి శిష్టాచారము మూలముగా నున్నవి.

స్మృతులు మనకు ప్రత్యక్షముగా కానవచ్చు ప్రయోజనములను, ప్రత్యక్షముగా కానరాక కాలాంతరమున-అనగా జన్మాంతరమున, లోకాంతరమున కలిగెడి ప్రయోజనములను- ఉభయవిధములగు ప్రయోజనములను బోధించుచున్నవి.

దర్శనభేదములుకూడ వేదమువలననే కలుగుచున్నవని చెప్పుచున్నాడు.

తస్యార్థవాదరూపాణి నిశ్రితాః స్వవికల్పజాః
ఏకత్వినాం ద్వైతినాం చ ప్రవాదా బహుధా మతాః. 8

తస్య = ఆ వేదముయొక్క, అర్థవాదరూపాణి = అర్థవాదరూపమగు వాక్యములను-వానితో సమానములగు వాక్యములను, నిశ్రితాః = అత్యంతము ఆశ్రయించినట్టియు, స్వవికల్పజాః = వారివారి బుద్ధిభేదముచే కలిగెడి, ఏకత్వినామ్ = అద్వైతవాదులయొక్క, ద్వైతినాం + చ = భేదవాదులయొక్కయు, ప్రవాదాః = ప్రభిన్నములగు వాదములు, బహుధా = బహుప్రకారములుగా, మతాః = అభిమతములగుచున్నవి. భిన్నములగు దర్శనములుకూడ వేదమువలననే కలుగుచున్నవని భావము.

తా. చార్వాకము, బౌద్ధము, జైనము, ఆర్హతము, దిగంబరము, వైశేషికము, న్యాయము, సాంఖ్యము, యోగము, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస మున్నగు దర్శనములు వేదమును మూలముగా గైకొనియే నిర్మితము లగుచున్నవి.

ఈ దర్శనములు వేదమునందున్న అర్థవాదవాక్యములను తత్సజాతీయవాక్యములను మూలముగా జేసుకొని నిర్మింపబడినవి. చార్వాకాదులుకూడ తమమతముల వేదవాక్యముల నుదాహరింతురు.

దర్శనకర్తలు వారికి తట్టినభావముల కనుగుణముగా ఏదో ఒక వేదైకదేశవాక్యమును జూపి నిజమున ఆ వాక్యమునకు ఆ యర్థము లేకున్నను వారనుకొన్న అర్థమును జూపుదురు. కనుకనే భిన్నాభిప్రాయములతో ఇట్టి యనేకశాస్త్రములు వ్రాయుట కవకాశము కలిగినది .

వి. యుక్తాయుక్తవిచార మెట్లున్నను ఎవరికి వారే తాము చూపిన భావమే సత్యమనియు ఇతరులభావము లసత్యమనియు పట్టుదలతో దర్శనములను వ్యక్తపరచియున్నారు.

ఇచట నిశ్చిత్య, నిశ్చితాః, నిశ్రితాః అనురీతిని పాఠత్రయము కానవచ్చుచున్నది. కాని 'నిశ్రితాః' అనునదియే ప్రామాణికము. ఈ యభిప్రాయమును రఘునాథశర్మ తన *అంబాకర్త్రి అను వ్యాఖ్యయందు స్పష్టపరచియున్నాడు. కాబట్టి పాఠకమహాశయులు 'నిశ్రితాః' అను పాఠమును గ్రహింతురుగాక.

పయిచూపబడిన దర్శనభేదములు పట్టుదలతో మనుష్యులు వ్రాసియుండుటచేతను, అవి పరస్పరవిరుద్ధములగుటచేతను, వారు చూపెడి శ్రుతుల కర్థాంతరము చెప్పుట కవకాశ ముండుటచేతను అసత్యములే కావలెను. అట్టితరి సత్యమగు పదార్థ మెద్ది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

సత్యా విశుద్ధి స్తత్రోక్తా విద్యైవైకపదాగమా
యుక్తా ప్రణవరూపేణ సర్వవాదావిరోధినీ. 9

తత్ర = ఆ వేదమునందు, విశుద్ధిః = విశిష్టమైన పరిశుభ్రతకలిగినట్టియు, సత్యా = పరమార్థసత్యమగునట్టియు, ఏకపదాగమా = ఒకేవిషయమున సమన్వయము కలిగినట్టియు, సర్వవాదావిరోధినీ = అన్నివాదములతోను విరోధము లేనట్టియు, ప్రణవరూపేణ = ఓంకారముతో, యుక్తా = కూడుకొన్నట్టి, విద్యా + ఏవ = జ్ఞానరూపమగు బ్రహ్మమే, ఉక్తా = చెప్పబడినది. కనుక అదియే సత్యపదార్థమని భావము.

---

*"అత్ర నిశ్చితాః, నిశ్చిత్య, నిశ్రితాః ఇతి పాఠత్రయం వర్తతే.తత్రేద మవధేయమ్- నిశ్చిత్య ఇతిపాఠో నిశ్చితా ఇత్యస్య స్థానే కేనచి త్కల్పిత ఇత్యప్రామాణికః. నిశ్చితా ఇతి పాఠ స్తు అనన్వితార్థకత్వే నాప్రామాణిక ఇతి నిశ్రితా ఇతి పాఠ ఏవ యుక్తః."

తా. వేదార్థము పలువురు పలువిధములుగా జూపిరి. వారు ప్రవర్తించిన భావములు వేదతాత్పర్యవిషయములుకావు, అనగా అవి వేదమునకు నిజమగు అర్థములు కానేరవు. వేదవాక్యము లన్నిటికి సాక్షాత్తుగాగాని పరంపరగాగాని జ్ఞానస్వరూపమగు నిర్గుణా ద్వయబ్రహ్మమునందే ముఖ్యతాత్పర్యము. అట్టిబ్రహ్మమే పరమార్థ సత్యము.

వి. అద్వైతవేదాంతము అట్టిబ్రహ్మమును బోధించుచున్నది. అది ఎల్లదర్శ నములందలి సిద్ధాంతములను సోపానక్రమమున తనకనుగుణములనియే భావించినది. ఇతరదర్శనము లట్లు చేయలేవు. అవి ఇతరమతములయందు ద్వేషమును, తమ మతము నందు అభినివేశమును చూపి వ్రాయబడినవి. అద్వైతదర్శన మట్టిది కాదు. అది నాస్తికదర్శ నములనుగూడ శ్లాఘించును.

దర్శనప్రవాదములేకాక శిక్షాదివడంగములు, పురాణము మున్నగు ఉపాంగ ములుగూడ వేదార్థపరిజ్ఞానార్థమై వేదవేత్తలచే నిర్మింప డినవి అని చెప్పుచున్నాడు.

విధాతు స్తస్య లోకానా మఙ్గోపాఙ్గనిబన్ధనాః
విద్యాభేదాః ప్రతాయన్తే జ్ఞానసంస్కారహేతవః. 10

లోకానామ్ = లోకములయొక్క, విధాతుః = సృష్టికర్త యగు, తస్య = ఆవేదము నకు సంబంధించినట్టియు, అఙ్గోపాఙ్గ నిబన్ధనాః = అంగరూపములుగాను ఉపాంగరూపములు గాను ఉన్నట్టియు, జ్ఞానసంస్కారహేతవః = ఆత్మతత్త్వజ్ఞానమునకు పుణ్యసంస్కార మునకును కారణములైనట్టి, విద్యాభేదాః = శిక్ష, వ్యాకరణము మున్నగు విద్యాభేదములు, ప్రతాయన్తే = విస్తరింపబడుచున్నవి.

తా. చతుర్ముఖుడు వేదమును ఆధారముగా జేసుకొని లోకముల నెల్ల సృష్టించెను, కనుక లోకసృష్టికి వేదము మూలము. అట్టి వేదముయొక్క అర్థమును పూర్తిగా నిర్ణయించుటకై శిక్ష మున్నగు అంగవిద్యలు, పురాణము మున్నగు ఉపాంగవిద్యలు ఏర్పడినవి. వానిని ఋషులు విస్తరింపజేసిరి.

వి. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, [illegible] ఆరును వేదమునకు అంగములు. ఇవి షడంగము లనబడును. పు[illegible], మీమాంస, ధర్మశాస్త్రము అనునవి ఉపాంగము లనబడుచున్నవి. ఇవి [illegible] 'విద్యా భేదాః' అను పదముచే గ్రహింపబడుచున్నవి.

మరియు వేదాంగములనుండి శకునజ్ఞానము మున్నగునవియు, ఉపాంగములనుండి స్వప్నవిపాకాది జ్ఞానము మున్నగునవియు వెలువడుచున్నవి. ఏ స్వప్నము మంచిదో, ఏది చెడ్డదో చెప్పు శాస్త్రమును స్వప్నవిపాక మని వ్యవహరింతురు. ఇట్లే కర్మవిపాకాదులు కూడ కలుగుచున్నవి.

మీమాంస మున్నగునవి ఆత్మతత్త్వజ్ఞానమునకు, ధర్మశాస్త్రము పుణ్యమనే సంస్కారమునకును ఉపయోగపడును.

'భేదానాం బహుమార్గత్వమ్' అను శ్లోకముమొదలుకొని 'విధాతు స్తస్య లోకానామ్' అను శ్లోకమువరకు ఐదు శ్లోకములచే బ్రహ్మమును పొందుట కుపాయమగు వేదమును ప్రశంసించి, అట్టి వేదమునకు ప్రధానాంగమగు వ్యాకరణమును, చదువుకొనువారికి ప్రోత్సాహము కలిగించుటకై, మూడు శ్లోకములచే ప్రశంసించుచున్నాడు.

ఆసన్నం బ్రహ్మణ స్తస్య తపసా ముత్తమం తపః
ప్రథమం ఛన్దసా మఙ్గం ప్రాహు ర్వ్యాకరణం బుధాః. 11

బుధాః = జ్ఞానులగు మహర్షులు, వ్యాకరణమ్ = వ్యాకరణమును, బ్రహ్మణః = బ్రహ్మరూపము, బ్రహ్మను పొందుటకు కారణముకూడ అగునట్టి, తస్య = ఆవేదమునకు, ఆసన్నమ్ = సమీపముగానున్నదనియు, తపసామ్ = తపస్సులలో, ఉత్తమమ్ = శ్రేష్ఠమగు, తపః = తపమనియు, ఛన్దసామ్ = వేదములకు, ప్రథమమ్ = మొదటిదియగు, అఙ్గమ్ = అంగమనియు, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా. మహాభాష్యకారుడు వ్యాకరణాధ్యయనమునకు 1. వేదములను రక్షించుట, 2. ఊహ అనగా వేదములో అవసరమగునపుడు ఒక పదమును తీసివేసి దానికి బదులుగా మరియొకపదము నుపయోగించుట, 3. ఆగమము, 4. లాఘవము, 5. అసందేహము అనురీతిని ఐదు ప్రయోజనములను జూపెను. వానిలో వేదరక్షణము, ఊహ, ఆగమము అను మూడు ప్రయోజనములను భర్తృహరి ఈశ్లోకముచే వివరించుచున్నాడు. ఆ మూడింటిలోను 1–2 ప్రయోజనములనియు మూడవది వ్యాకరణము చదువవలె ననుటలో ప్రమాణముగా నున్నదనియు గుర్తించవలెను.

వి. ఈశ్లోకమున 'ఆసన్నంబ్రహ్మణః' అనుభాగము వేదరక్షణ, ఊహ అను 2 ప్రయోజనములను, 'తపసా ముత్తమం తపః' అనుభాగము ఆగమరూప ప్రమాణమును జూపుచున్నవి.

వ్యాకరణము వేదమునకు చాల సన్నిహితముగా నున్నది. వేదమునందు శబ్దములు లోకమునందున్న శబ్దములవలెను, వానికంటె విలక్షములుగాను కాన్పించుచున్నవి. లౌకిక వాఙ్మయమునందు కానవచ్చుచున్న శబ్దములకంటె భిన్నరూపమున కొన్ని కానవచ్చు చున్నవి. ఆ రూపభేదము వ్యాకరణమువలననే తెలియబడును. అట్లు కాకున్న ఆ శబ్దమునకు అర్థము తెలియరాదు.

| లౌ.కపదము | అర్థము | వైదికపదము |
|---|---|---|
| గృహ్ణామి | గ్రహించుచున్నాను | గృభ్ణామి |
| సంజహార | సంహరించెను<br>ఉపసంహరించెను | సంజభార |
| దధార | ధరించెను | దాధార |
| హన్తి | చంపుచున్నాడు | హనతి |
| దుగ్ధే | పితుకుచున్నాడు | దుహ్రే |
| కర్ణైః | చెవులచే | కర్ణేభిః |

ఇట్టి రూపపరిణామములు వ్యాకరణముచేతనే తెలియబడును. ఈరీతిగా వ్యాకరణము రక్షణముచేయుటచే వేదమునకు అతిసన్నిహిత మగుచున్నది.

ప్రాతఃకాలమున హోమముచేయుట సూర్యదేవత నుద్దేశించి జరుగును. ఆ మంత్రమున "సూర్యాయ" అని యున్నది. సాయంకాలమున ఆహోమము అగ్నిదేవత నుద్దేశించి చేయవలెను, కాని మంత్రమున 'అగ్నయే' అని లేదు. 'సూర్యాయ' అను పదమునకు బదులుగా అగ్నయే' అను పదమును మంత్రమున చేర్చి సాయంకాలమున హోమము చేయవలెను. పద

మును మార్చవలెనన్న వ్యాకరణముచే నా పదము తెలియనగును. వ్యాకరణము లేనిచో పద స్వరూపము నిశ్చితము కానేరదు. ఈ రీతిగా వ్యాకరణము వేదమునకు సన్నిహితమగు చున్నది.

బ్రహ్మచర్యము, అధశ్శయ్య మున్నగు తపస్సులు చాల కలవు. వానికి ప్రత్యక్ష ప్రయోజనము లేదు. జన్మాంతరమున, లోకాంతరమున వానికి ప్రయోజనము కలుగును. వానిని అదృష్టఫల మందురు. అట్టి తపములకంటె వ్యాకరణము శ్రేష్ఠమగు తపము. దీనికి శబ్ద సాధుత్వము, అర్థజ్ఞానము అనెడి దృష్టప్రయోజనములు, ధర్మమనే అదృష్టప్రయోజనముకూడ ఉన్నవి. వ్యాకరణము తప్పక చదువవలెనని వేదము[1] చెప్పుచున్నది. ప్రయోజనము నపేక్షింపక షడంగసహితమగు వేదాధ్యయనమును వేదము విధించుచున్నది. షడంగములలో వ్యాకరణము [2] ప్రధానమైనది. ఈ యభిప్రాయమును 'తపసా ముత్తమం తపః' 'ప్రథమం ఛన్దసా మఙ్గమ్' అను కారికాభాగము చూపుచున్నది.

**మహాభాష్యకారుడు చూపిన [3]లాఘవ మనెడి నాల్గవ ప్రయోజనమును చూపు చున్నాడు.**

ప్రాప్తరూపవిభాగాయా యో వాచః పరమో రసః
యత్తత్పుణ్యతమం జ్యోతి స్తస్య మార్గోఽయ మాఞ్జసః. 12

యః = ఏ సాధుశబ్దసముదాయము, ప్రాప్తరూపవిభాగాయాః = పొందబడిన రూపభేదము కల — అనగా వర్ణపదవాక్యరూపమున విభక్తమైన, వాచః = వాక్కునకు, పరమః = ఉత్కృష్టమగు, రసః = సారమో,

మరియు, తత్ = ప్రసిద్ధమగు, యత్ = ఏ సాధుశబ్ద సముదాయము, పుణ్యతమమ్ = మిక్కిలి పుణ్యమగు, జ్యోతిః = తేజమో,

తస్య = అట్టి సాధుశబ్ద సముదాయమునకు అనగా — దానిని తెలిసికొనుటకు, అయమ్ = ఈ వ్యాకరణము, ఆఞ్జసః = సరళము, లఘురూపము అగు, మార్గః = మార్గము — అనగా ఉపాయము.

తా. సాధుశబ్దములు అసాధుశబ్దములుకూడ లోకమున వాడుకలో నున్నవి. వానిలో సాధుశబ్దసముదాయము పవిత్రమగు వాక్కుయొక్క సారము. అసాధుశబ్ద సముదాయము తంకిపంటిది.

సాధుశబ్దసముదాయమును సులభముగా తెలిసికొనుటకు వ్యాకరణము సరళము, లఘువుకూడ అగు మార్గము. అదితప్ప అట్టిది మరియొక మార్గము లేదు.

---

1. "నిష్కారణో ధర్మః షడఙ్గో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ" అను వేదము మహాభాష్య కారుడు చూపెను.

2. "ప్రధానంచ షడఙ్గేషు వ్యాకరణమ్, ప్రధానే చ కృతో యత్నః ఫలవాన్ భవతి" అని భాష్యకారుడు పలికెను.

3. "లఘ్వర్థంచ అధ్యేయం వ్యాకరణమ్. న చాన్తరేణ వ్యాకరణం లఘునోపాయేన శబ్దాః శక్యా విజ్ఞాతుమ్."

—పస్పశాహ్నికము, మహాభాష్యము.

మహాభాష్యకారుడు చూపిన, అసందేహము[1] అనగా సందేహములేకుండ నిశ్చితార్థబోధ కలుగుట అను ఐదవ వ్యాకరణ ప్రయోజనమును జూపుచున్నాడు.

అర్థప్రవృత్తితత్త్వానాం శబ్దా ఏవ నిబన్ధనమ్
తత్త్వావబోధః శబ్దానాం నాస్తి వ్యాకరణాదృతే. 13

అర్థప్రవృత్తితత్త్వానామ్ = అర్థముయొక్క వ్యవహారమునకు కారణములగు వస్తువులకు-అనగా ఘటము, పటము, స్వర్గము, నరకము మున్నగుపదార్థములకు సంబంధించిన వక్తయొక్క సంకల్పమూలమున కలిగెడి వస్తువులకు, శబ్దాః + ఏవ = శబ్దములే, నిబన్ధనమ్ = కారణము.

శబ్దానామ్ = శబ్దములయొక్క, తత్త్వావబోధః = స్వరూపజ్ఞానము, వ్యాకరణాత్ + ఋతే = వ్యాకరణము వినాగా, నాస్తి = కలుగదు.

తా. పదార్థములు రెండురూపములు కలిగియున్నవి. 1. బాహ్యప్రపంచమున దృశ్యముగా నున్నది యొకటి. 2. వక్తయొక్క సంకల్పములో నున్నది రెండవది. స్వర్గము నరకము, మోక్షము మున్నగునవి మనకు ప్రత్యక్షము కాకపోయినను వానికి సంబధించిన వ్యవహారము మనము చేయుచునేయున్నాము. అవి వక్తయొక్క బుద్ధిలో భాసించునవే. అట్టి పదార్థములను బోధించుటకు శబ్దములు కారణములగుచున్నవి.

నిజరూపము, దానికి కావలసిన పుష్టియు ప్రతిపదార్థమునకు ఆవశ్యకము. అందు ఏదేని లేకుండుట వైకల్యము. శబ్దమునకు వైకల్యము లేకుండ అర్థమును బోధించెడి రూపము, పుష్టియు వ్యాకరణమువలన కలుగుచున్నది. వ్యాకరణమే లేనిచో శబ్దముల తత్త్వము జ్ఞాతము కానేరదు. అట్టితరి అసందిగ్ధమగు అర్థమును గుర్తించలేము.

మహాభాష్యకారుడు చూపిన మోక్ష[2] మనెడి వ్యాకరణ ప్రయోజనమును వివరించుచున్నాడు.

తద్ ద్వార మపవర్గస్య వాఙ్మలానాం చికిత్సితమ్
పవిత్రం సర్వవిద్యానా మధివిద్యం ప్రకాశతే. 14

తద్ = ఆ వ్యాకరణము, అపవర్గస్య = మోక్షమునకు, ద్వారమ్ = ద్వారము-అనగా ఉపాయము, మరియు, వాఙ్మలానామ్ = వాక్కులయొక్క మాలిన్యములకు, చికిత్సితమ్ = చికిత్సాహేతువు-అనగా ఆదోషములను తొలగొట్టునది. మరియు, సర్వవిద్యానామ్ = ఎల్లవిద్యలకు, పవిత్రమ్ = పవిత్రతను కలిగించునది, మరియు, అధివిద్యమ్ = ఎల్లవిద్యల యందు, ప్రకాశతే = ప్రకాశించునది.

తా. మనుష్యుడు వ్యాకరణసహాయమున సాధుశబ్దములలోనున్న ప్రకృతి ప్రత్యయములను, వానికి కలిగెడి కార్యవిశేషములను వర్ణముల స్థానప్రయత్నములను గుర్తించి యట్టి

1. 'అసందేహార్థం చ అధ్యేయం వ్యాకరణమ్' మహాభాష్యము—పస్పశాహ్నికము.

2. 'ఏకః శబ్దః సమ్యగ్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్ భవతి' అను శ్రుతి నుదాహరించి, 'ఏకః పూర్వపరయోః' 6—1—84 అను సూత్రమున వ్యాఖ్యానించెను—పస్పశాహ్నికమున 'మహతా దేవేన నః సామ్యం యథా స్యాత్' అనియు పలికెను. ఈ యాశయమును ప్రథమకాండముననే 131 వ శ్లోకముచే భర్తృహరి వివరించియున్నాడు.

సాధుశబ్దములను యథాశాస్త్రముగ ప్రయోగించిన ధర్మవిశేషము అలనికి కలిగి దానివలన పాపములు క్షీణించగా చిత్తశుద్ధి కలుగును. దానిమూలమున మోక్షమాతనికి లభించును.

ఆయుర్వేదము శరీరమునందున్న మాలిన్యములను, యోగశాస్త్రము మానసిక మాలిన్యములను బోగొట్టును. అట్లే వ్యాకరణశాస్త్రము వాక్కులలో నున్న అపశబ్దము అనెడి మాలిన్యములను బోగొట్టును. వ్యాకరణజ్ఞుడు ప్రత్యవాయమునకు కారణమగు అపశబ్దములను ప్రయోగించడు.

వి. సాధుత్వము వ్యాకరణాధీనము, సర్వవిద్యలయొక్క అర్థము సాధుశబ్దాధీనము, కనుక వ్యాకరణము బహుపవిత్రమైనది.

ప్రతిశాస్త్రమున వ్యాకరణ మాదరింపబడుచున్నది. కానిచో శాస్త్రములందు నపశబ్దమును ప్రయోగించిన, దానివలన (అపశబ్దప్రయోగమువలన) గ్రంథకర్త లజ్జితుడు కావలెను.

**వ్యాకరణాధ్యయనమునకు లౌకిక శబ్దముల సాధుత్వజ్ఞానము కూడ ప్రయోజనము. దానిమూలమున మోక్షముకూడ లభించునని చెప్పుచున్నాడు.**

> యథార్థజాతయ స్సర్వాః శబ్దాకృతినిబన్ధనాః
> తథైవ లోకే విద్యానా మేషా విద్యా పరాయణమ్. 15

యథా = ఏరీతిగా, సర్వాః = ఎల్ల, అర్థజాతయః = అర్థములయందున్న జాతులు, శబ్దాకృతినిబన్ధనాః = శబ్దములయందున్న జాతులు కారణములుగా గలవో, తథా ఏవ = ఆరీతిగానే, లోకే = లోకమున, ఏషా = ఈ, విద్యా = వ్యాకరణ విద్య, విద్యానామ్ = ఎల్లవిద్యలకు, పరాయణమ్ = ఉత్కృష్టమైన స్థానము-అన్ని విద్యలకు ప్రధానమైనదని భావము.

తా. ఘటః, పటః మొదలగు శబ్దములు కడవ, వంచె మొదలగు అర్థములను బోధించుచున్నవి. అందుచే ఆశబ్దములు ఆయర్థములకు కారణము లగుచున్నవి. ఆయర్థముల యందు ఘటత్వము పటత్వము మొదలగు జాతులు కలవు. వానికి ఆశబ్దములయందున్న ఘటశబ్దత్వము పటశబ్దత్వము మొదలగు శబ్దగతజాతులు కారణము లగుచున్నవి. కాగా అర్థగత జాతులకు శబ్దగతజాతులు కారణములని తెలియును. అట్లే లోకములో నున్న ఎల్లవిద్యలకు వ్యాకరణవిద్య కారణమగుచున్నది.

వి. విద్యలన్నియు శబ్దరూపమున నున్నవి. వానికి వ్యాకరణమువలన సంస్కారము కలుగుచున్నది. కాగా లౌకికశబ్దము లన్నియు వ్యాకరణము నపేక్షించును. లోకములో నున్న శబ్దములే వేదమునగూడ కాన్పించుచున్నవి. వేదములో కొన్నిశబ్దములలో కొన్ని పరిణామములు కానవచ్చినను వానినికూడ వ్యాకరణము చూచి సరిచేయుచునేయున్నది. అనగా ఆ పరిణామములను ప్రత్యేకముగా గుర్తించియేయున్నది. కనుక వైదికశబ్దములు కూడ వ్యాకరణము నపేక్షించుచున్నవి.

**వ్యాకరణము వేదములందున్న పదములకు శక్తిజ్ఞానము కలిగించుటచేతనే మోక్షసాధనమని చెప్పనక్కరలేదు. సాక్షాత్తుగా శబ్దబ్రహ్మసాక్షాత్కారమునకు సాధనమగుట చేతనుగూడ మోక్షమునకు ద్వారము కాగలదని చెప్పుచున్నాడు.**

ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణామ్
ఇయం సా మోక్షమాణానా మజిహ్మా రాజపద్ధతిః. 16

ఇదమ్ = ఈవ్యాకరణము, సిద్ధిసోపానపర్వణామ్ = మోక్షమునకు మధ్యయందున్న అవస్థలనెడి మెట్లయొక్క విభాగములలో, ఆద్యమ్ = మొదటిదియగు, పదస్థానమ్ = పాదమును వేయుట కుపకరించెడి మెట్టు.

మోక్షమాణానామ్ = మోక్షముకోరువారికి, సా + ఇయమ్ = ఆ ఈ వ్యాకరణ విద్య, అజిహ్మా = వక్రముకాని, రాజపద్ధతిః = రాచబాట.

తా. మేడఎక్కుటకు మెట్లుగదాముఖ్యమార్గము; మొదటిమెట్టుమీద పాదమువేసికదా మీదికి వెళ్ళవలెను; అట్లే మోక్షమనే మేడకు శాస్త్రములలో అంతరాళావస్థలు మెట్లుగా నున్నవి. వీనిలో వ్యాకరణము మొదటిమెట్టు. మోక్షముకోరువారికి శాస్త్రములలో కొన్ని మార్గములు చూపబడి యున్నవి. వానిలో వ్యాకరణము రాచబాట వంటిది.

ఉపనిషత్తులలో శ్రవణ మనన నిధిధ్యాసములవలన కలిగెడి ఆత్మసాక్షాత్కారము మోక్షమని చెప్పబడినది. కాగా ఆత్మసాక్షాత్కారముచే అవిద్య నశించుటవలన అది సాధనమగును. ఇట్టితరి శబ్దసాక్షాత్కారము మోక్షసాధనమనుట యెట్లుపొసగును? అను ప్రశ్నకు ఆయాత్మ శబ్దరూపమే కనుక దోషములేదని సమాధానము చెప్పుచున్నాడు.

అత్రాతీతవిపర్యాసః కేవలా మను పశ్యతి
ఛన్దస్య శ్ఛన్దసాం యోని మాత్మా ఛన్దోమయీం తనూమ్. 17

అత్ర = ఈవ్యాకరణమునందు, అతీతవిపర్యాసః = పోయినభ్రమ కలిగినట్టియు, ఛన్దస్యః = వేదమునకు హితుడగు-వేదమును కాపాడువాడని భావము, ఆత్మా = పురుషుడు, ఛన్దసామ్ = వేదములకు, యోనిమ్ = కారణమగు సాధుశబ్దరూపమగు వాక్కును, అను = చూచినతరువాత, ఛన్దోమయీమ్ = ఛందోరూపమగునట్టియు, కేవలామ్ = ప్రకృతి ప్రత్యయ సంబంధములేని, తనూమ్ = పరావాగ్రూపమగు ఆత్మస్వరూపమును, పశ్యతి = సాక్షాత్కరించుకొనుచున్నాడు.

తా. వ్యాకరణమువలన శబ్దము నిజరూపమును తెలుసుకొనినవాడు వేదార్థమును చక్కగ తెలుసుకొనగలడు. అట్లుకానిచో హ్రస్వదీర్ఘాదులవలనను ఉదాత్తాది స్వరములవలనను శబ్దము భిన్నార్థకము కాగలదు. అట్టితరి నిశ్చితార్థము తెలియబడదు. కనుక వ్యాకరణమున భ్రమప్రమాదములు లేనివాడు వాక్కుయొక్క పరమార్థరూపమును చూచి దానిమూలమున వేదములను పరమార్థరూపమగు పరావాక్కును సాక్షాత్కరించుకొనగలడు. పరావాక్కు ఆత్మరూపమే.

18, 19, 20, 21, 22 ఈ అయిదు శ్లోకములచే వ్యాకరణశాస్త్రమును స్తుతించుచున్నాడు.

ప్రత్యస్తమితభేదాయా య ద్వాచో రూప ముత్తమమ్
య దస్మిన్నేవ తమసి జ్యోతిః శుద్ధం వివర్తతే. 18

యత్ = ఏవ్యాకరణము, ప్రత్యస్తమితభేదాయాః = నశించిన భేదముకల, వాచః = వాక్కునకు-అనగా పరావాక్కునకు, ఉత్తమమ్ = శ్రేష్ఠమగు, రూపమ్ = రూపమో;

మరియు, శుద్ధమ్ = పరిశుద్ధమగునట్టియు, జ్యోతిః = స్వ-పర ప్రకాశకమగు నట్టియు వెలుగయిన, యత్ = ఏవ్యాకరణము, అస్మిన్ = ఈ, తమసి + ఏవ = వైఖరీ వాగ్రూపమగు చీకటియందే, వివర్తతే = ఆచ్ఛాదితమైయున్నదో,

(తత్ = అట్టి, వ్యాకరణమ్ = వ్యాకరణమును, ఆగమ్య = పొందినపిమ్మట, పరమ్ + బ్రహ్మ = పరబ్రహ్మము, అధిగమ్యతే = పొందబడుచున్నది.)

తా. ఈ శ్లోకముయొక్క అర్థమునకు రాబోవు మూడుశ్లోకముల అర్థములను 22వ శ్లోకార్థముతో నన్వయము చూపవలెను.

వ్యంజకములగు ధ్వనులవలన కలిగెడి వర్ణభేదములు వైఖరీవాక్కునందు లేనివి లగును. అట్టివాక్కునకు వ్యాకరణమనునది ఉత్కృష్టమగు రూపము. వ్యాకరణమువలననే గదా ఆ వాక్కు జ్ఞాతముకాసగును।

మరియు వ్యాకరణము దీపమువలె స్వప్రకాశకము పరప్రకాశకముగూడ కాగలదు. అట్టి వ్యాకరణము వైఖరీవాక్కునందు లీనమైయున్నది. దీని స్వరూపము ఆవాక్కునందు వ్యక్తముకానందున దానిని చీకటిగా భావింతురు. వ్యాకరణశాస్త్రము నెరుగనివారు వైఖరీశబ్దము నందు ప్రవర్తింపరు. ఆవాక్కు అర్థబోధకమనియైన నెరుగరు. కనుక అది చీకటివంటిదే. అట్టి వైఖరీశబ్దము వ్యాకరణమునకు సంబంధించిన మధ్యమావాక్కునకు వ్యంజకము కనుక దానిలో వ్యాకరణము లీనమైయున్నదని వైయాకరణులు భావింతురు.

వైకృతం సమతిక్రాన్తా మూర్తివ్యాపారదర్శనమ్
వ్యతీత్యాలోకతమసీ ప్రకాశం య ముపాసతే. 19

వైకృతమ్ = వైకృతధ్వనిసంబంధించునట్టి, మూర్తివ్యాపారదర్శనమ్ = దేశ కాలములవలన కలిగెడిభేదమును, సమతిక్రాన్తాః = అతిక్రమించినవారై అనగా-స్ఫోటశబ్దము నందు ఆరోపించనట్టి వైయాకరణులు, ఆలోకతమసీ = వెలుగును చీకటిని-అనగా అటువంటి ప్రాకృతధ్వనిని వైకృతధ్వనినికూడ, వ్యతీత్య = అతిక్రమించి, (స్థితాః) = ఉన్నవారై, యమ్ = ఏస్ఫోటశబ్దమును, ఉపాసతే = ఉపాసించుచున్నారో; అది ఉపలబ్ధస్థితియు.

(తత్ = అట్టిస్ఫోటశబ్దమును ప్రతిపాదించెడి, వ్యాకరణమును పొందినపిమ్మట పర బ్రహ్మము పొందబడుచున్నది.)

తా. వైయాకరణులు స్ఫోటశబ్దము నంగీకరింతురు. ఆ శబ్దము ప్రాకృతధ్వనిని వైకృతధ్వనినికూడ అతిక్రమించియున్నది. అనగా వానికంటె భిన్నముగా నున్నది. స్ఫోట శబ్ద మభివ్యక్తమైనతరువాత కలిగెడివి వైకృతధ్వనులు. అవి దేశముచేతను, కాలముచేతను భిన్నములగుచున్నవి. అట్టిభేదమును వైయాకరణులు స్ఫోటశబ్దమునందారోపించరు. స్ఫోట శబ్దాభివ్యక్తికి ముందుగానున్నవి ప్రాకృతధ్వనులు. వానిని మాత్రము స్ఫోటశబ్దమునందారో పించినట్లు కానవచ్చును. నిజరూపమున స్ఫోటశబ్దము రెండువిధములగు ధ్వనులను అతిక్ర మించియే యున్నది. ఈ యర్థము ఈకాండములోనే 77వ శ్లోకమున స్పష్టమగును.

యత్ర వాచోనిమిత్తాని చిహ్నానీ వాక్షరస్మృతేః
శబ్దపూర్వేణ యోగేన భాసన్తే ప్రతిబిమ్బవత్. 20

యత్ర = ఏస్ఫోటమునందు, అక్షరస్మృతేః = కకారము, గకారము మున్నగు అక్షరముల స్మరణమునకు, చిహ్నాని + ఇవ = గుర్తుగానున్న లిపులవలె, వాచః = శబ్దాభి

వ్యంజకమగు ప్రాకృతధ్వనికి, నిమిత్తాని = నిమిత్తములగు ధ్వనులయందు కాన్పించుచున్న కత్వగత్వాదికములు, శబ్దపూర్వేణ = శబ్దము పూర్వముగాగల, యోగేన = సంబంధముచే అనగా శబ్దాభివ్యక్తికి ముందుగానున్న ధ్వనితో సబంధించుటచే దానితో భేదము గృహీతము కానందున, ప్రతిబిమ్బవత్ = ప్రతిబింబమునందువలె, భాసన్తే = భాసించుచున్నవో,

(తత్ + వ్యాకరణమ్ = అట్టి స్ఫోటశబ్దమును ప్రతిపాదించెడి వ్యాకరణమును పొందినపిమ్మట పరబ్రహ్మము పొందబడును.)

తా. కకారాదివర్ణములు జ్ఞప్తికివచ్చుటకై కొన్ని సంకేతములుకలవు. వానినే 'లిపి' యందురు. అట్లే స్ఫోటశబ్దము జ్ఞానవిషయ మగుటకు కొన్ని సంకేతము లున్నవి. అవియే కత్వగత్వాదులు. అవి నిజముగ స్ఫోటశబ్దమునందు లేవు. కాని స్ఫోటశబ్దాభివ్యంజకమగు ప్రాకృతధ్వనియం దున్నవి. అయినను స్ఫోట శబ్దము వేరు, ప్రాకృతధ్వని వేరు అనే భేదము జ్ఞాతముకానందున ఆ ధర్మములు స్ఫోటశబ్దమునందు భాసించుచున్నవి. ఉదా. తెల్లని గాజుగ్లాసువద్దర ఎర్రని వస్తు వున్నచో దాని ఎరుపు ఆ గ్లాసునందు కాన్పించును. అనగా ఇతరధర్మము భాసించును.

అథర్వణా మఙ్గిరసాం సామ్నా మృగ్యజుషస్య చ
యస్మి న్నుచ్చావచా వర్ణాః పృథక్ స్థితిపరిగ్రహాః. 21

అఙ్గిరసామ్ = అంగిరోగణముచే గుర్తింపబడిన, అథర్వణామ్ = అథర్వమంత్రములయొక్క, సామ్నామ్ = సామవేదీయ మంత్రములయొక్క, ఋగ్యజుషస్య + చ = ఋగ్వేదీయ యజుర్వేదీయ మంత్రములయొక్కయు, ఉచ్చావచాః = విజాతీయములగు, వర్ణాః = ఉదాత్తత్వానుదాత్తత్వాది వర్ణధర్మములు, పృథక్స్థితిపరిగ్రహాః = వేరుగానున్న దానియందలి స్థితియొక్క స్వీకారము కలవై, అనగా స్ఫోటశబ్దమునందలె భిన్నమగు ధ్వనియందున్న స్థితిని స్వీకరించినవై, యస్మిన్ = ఏస్ఫోటశబ్దమునందు, (భాసన్తే = ప్రకాశించుచున్నవో),

(తత్ = అట్టి స్ఫోటశబ్దమును ప్రతిపాదించెడి వ్యాకరణమును పొందిన పిమ్మట పరబ్రహ్మము పొందబడుచున్నది.)

తా. నాలుగువేదములలోను వర్ణములు భిన్నములగు స్వరములు కలవై యున్నవి. అవి నిజమునను స్ఫోటశబ్దమునందు లేవు. స్ఫోటాభివ్యంజకములగు ధ్వనులయం దున్నవి. కాని యవియు స్ఫోటశబ్దమునం దారోపిత మగుచున్నవి. స్ఫోటశబ్దము నిజరూపమున ఏకము, నిర్గుణము, జ్ఞానరూపము. పరికించిన వైఖరీధ్వనులవలెనె ఉదాత్తత్వాది ధర్మములుకూడ స్ఫోట శబ్దమునకు సంబంధించినవి కావు.

యదేకం ప్రక్రియాభేదై ర్బహుధా ప్రవిభజ్యతే
తద్ వ్యాకరణ మాగమ్య పరంబ్రహ్మాధిగమ్యతే. 22

యత్ = ఏస్ఫోటశబ్దము, ఏకమ్ = నిజరూపమున ఒక్కటియే యైనను, ప్రక్రియాభేదైః = భిన్నములగు ప్రక్రియలచే, బహుధా = అనేకరూపముగ, ప్రవిభజ్యతే = విభజింప బడుచున్నదో.

తత్ = అట్టిస్ఫోటశబ్దమును నిరూపించుచున్న, వ్యాకరణమ్ = వ్యాకరణమును, ఆగమ్య = పొందినతరువాత, పరమ్ = ఉత్కృష్టమగు-అనగా జ్ఞానరూపమగు, బ్రహ్మ = శబ్దబ్రహ్మము, అధిగమ్యతే = తెలియబడుచున్నది.

తా. శబ్దము నిజరూపమున ఒక్కటియే. అది పశ్యంతి, మధ్యమ, వైఖరి అనురీతిని నానాత్వమును పొందుచున్నది. మరల వర్ణ పద వాక్య వ్యక్తి జాతి సఖండాఖండ రూపముగా మార్పుచెందుచున్నది. అందును ఒకేపదము వేరువేరు వ్యాఖ్యాతలచే వేరువేరు ప్రక్రియల ననుసరించి చూపబడుచున్నది. శాకల్య శాకటాయన భారద్వాజ గార్గ్య పాణిన్యాదులు ప్రక్రియా భేదమున చాల వ్యాకరణములను రచించిరి. ఉదా. రామః అను పదమును వ్యాకరించుటలో పాణిని రామ + స్ అనియు, శాకటాయనుడు రామ + రు అనియు, శాకల్యుడు రామ + రి అనియు, భవతి అనుపదమునకు భూ + అ + తి అనియు, భూ + అతి అనియు, భవ + తి అనియు విభిన్నమగు మార్గములను జూపియున్నారు. ఇట్లున్నను రామః, భవతి అనెడి సిద్ధ పదములు ఏకరూపముగలవే. చివరకు పరిశీలించిన పదపదవాక్యము లన్నియు కల్పితములే. కనుక వ్యాకర్త లందరికి ఒక్క స్ఫోటశబ్దమునందే ముఖ్యతాత్పర్యమని తేలుచున్నది. అట్టి శబ్దము నిర్గుణబ్రహ్మరూపము.

ఈ రీతిగ వ్యాకరణశాస్త్రాధ్యయనమునకు ప్రయోజనములు చూపియున్నాడు. ఇక శాస్త్రీయప్రక్రియానిర్వహణకు నియతమగు వ్యవస్థ కలుగునట్లు చూపదలచి తాను వ్రాయ దలచిన వాక్యపదీయ మను ప్రకరణగ్రంథమునకు వ్యాకరణశాస్త్రములోగల సంబంధ మును జూపుటకై ఉపోద్ఘాతమును రచియించుచున్నాడు.

> నిత్యాః శబ్దార్థసంబన్ధా స్తత్రామ్నాతా మహర్షిభిః
> సూత్రాణా మనుతన్త్రాణాం భాష్యాణాం చ ప్రణేతృభిః. 23

సూత్రాణామ్ = సూత్రములకు, అనుతన్త్రాణామ్ = వార్తికములకు, భాష్యాణామ్ + చ = భాష్యములకును, ప్రణేతృభిః = రచయితలగు, మహర్షిభిః = మహర్షులచే - అనగా పాణినికాత్యాయన పతంజలులచే, తత్ర = ఆ వ్యాకరణమునందు, శబ్దార్థసంబన్ధాః = శబ్దములు, వానిచే బోధింపబడు అర్థములు, ఆ శబ్దార్థములకు గల సంబంధములు—ఈ మూడును, నిత్యాః = నిత్యములై, ఆమ్నాతాః = అనేకస్థలములలో చక్కగా చెప్పబడినవి.

తా. శబ్దార్థసంబంధములు నిత్యములేకాని. కల్పితములు కావని తలచియే పాణిని సూత్రములను, వానికి కాత్యాయనుడు వార్తికములను, ఆసూత్రవార్తికములకు పతంజలి భాష్య మును రచియించిరి. శబ్దార్థసంబంధములు నిత్యములే కానిచో మనుష్యులు స్వతంత్రించి శబ్దార్థ సంబంధములను మార్పుచేసెదరు. క్రొత్తశబ్దములను సృష్టించగలరు. ఈనాడు సాధువులుగా నున్న శబ్దములు కాలాంతరమున అసాధువులు కాగలవు. అట్టితరి వానికి నియతమగురూపము లభించనందున తన్మూలకమగు వ్యాకరణముకూడ నియతము కాకపోయెడిని. కాగా సాధుత్వ బోధకమగు వ్యాకరణము వ్యవస్థాపకము కాకపోవుటచే నిరర్థకమే యగును. శబ్దార్థసంబంధములు నిత్యములగుచో నవి ఎల్లకాలములందు ఏకరూపముగా నుండుటచే వానికి సంబంధించిన శాస్త్రము కూడ ఏకరూపముగానుండి సాధుత్వసంపాదనమును, దానివలన ధర్మమును కలుగజేయ నుపయోగపడును; నిరర్థకముకాదు.

మనము వారియభిప్రాయమును పైరీతిని ఊహించుటయేకాదు, వారే అనేక స్థల ములలో శబ్దార్థసంబంధములకు నిత్యత్వమును స్పష్టముగా చెప్పియున్నారు.

శబ్దార్థసంబంధములు నిత్యములు కనుక వ్యాకరణమవ్యాఖ్యాపకము కాగలదని చూపి, ఆ వ్యాకరణము ప్రకృతి ప్రత్యయ కల్పనచే సాధుశబ్దములను చూపుచున్నది. అట్లు చేసిన తద్భిన్నము లసాధువులని తెలియగలదు. అట్లుగాక రెంటిని చూపిన క్లేశ మున్నది. లఘుమార్గమున శాస్త్రనిర్మాణము జరుగదని నిరూపించుచు అష్టపదార్థరూపమగు వ్యాకరణ శాస్త్రశరీరమును అనగా వ్యాకరణశాస్త్రమున చూపబడిన ఎనిమిది పదార్థములను 24,25, 26 మూడు శ్లోకములచే ప్రదర్శించుచున్నారు.

అపోద్ధారపదార్థా యే యే చార్థాః స్థితలక్షణాః
అన్వాఖ్యేయాశ్చ యే శబ్దా యే చాపి ప్రతిపాదకాః . 24
కార్యకారణభావేన యోగ్యభావేన చ స్థితాః
ధర్మే చ ప్రత్యయే చాఙ్గం సంబన్ధాః సాధ్వసాధుషు . 25
తే లిఙ్గైశ్చ స్వశబ్దైశ్చ శాస్త్రేఽస్మి న్నుపవర్ణితాః
స్మృత్యర్థ మనుగమ్యన్తే కేచిదేవ యథాగమమ్ . 26

అస్మిన్ = ఈ, శాస్త్రే = పాణినీయ వ్యాకరణశాస్త్రమునందు, సాధ్వసాధుషు = సాధుశబ్దముల అసాధుశబ్దముల మధ్యలో, 1. యే = ఏ, అపోద్ధారపదార్థాః = వేరు చేయ బడిన పదార్థములు-అనగా ప్రకృత్యర్థములు ప్రత్యయార్థములు, 2. యే + చ = ఏ, స్థిత లక్షణాః = స్థిరమగు రూపముగల, అర్థాః = అర్థములు-అనగా పదార్థములు వాక్యార్థములు, 3. యేచ = ఏ, అన్వాఖ్యేయాః = అవయవ విభాగముచే సాధుత్వబోధనమునకు అర్హమలగు, శబ్దాః = శబ్దములు-అనగా పదములు వాక్యములు, 4. యే + చ + అపి = ఇంకను ఏ, ప్రతిపాదకాః = పదవాక్యరూపములగు శబ్దముల నిష్పత్తికి ఉపయోగించెడి, శబ్దాః = శబ్ద ములు-అనగా ప్రకృతిప్రత్యయరూపములగు శబ్దములు, 5. కార్యకారణభావేన = కార్య కారణభావరూపమున, 6. యోగ్యభావేన + చ = యోగ్యతారూపమునను, స్థితాః = ఉన్నటు వంటి, యే = ఏ, సంబన్ధాః + చ = సంబంధములున్ను, 7. ధర్మే = ధర్మమునందు, 8. ప్రత్యయే + చ = అర్థజ్ఞానమునందును, అఙ్గమ్ = సాధనమో, తే = అవి, లిఙ్గైః + చ = చిహ్నములచేతను, స్వశబ్దైః + చ = స్వరూపమును బోధించెడి శబ్దములచేతను, ఉప వర్ణితాః = వర్ణింపబడినవి. సాధుశబ్దములలోను అసాధుశబ్దములలోను సాధుశబ్దములే పైరీతిని వర్ణింపబడినవి. అసాధుశబ్దములు చూపబడలేదని భావము.

స్మృత్యర్థమ్ = లఘురూపమున వ్యాకరణస్మృతిని రచియించుటకై, కేచిత్ + ఏవ = కొన్ని శబ్దములే అనగా సాధుశబ్దములే, యథాగమమ్ = శాస్త్రము నతిక్రమించక, అనుగమ్యన్తే = అనుగమింపబడుచున్నవి.

తా. వాక్యమువలననే లోకులకు అర్థబోధ కలుగుచున్నది. కనుక వాక్యమే సత్యమైనది యని వైయాకరణులు విశ్వసింతురు. శబ్దమునకు సాధుత్వము జూపునది వ్యాకరణము. వాక్యము లనంతములు కనుక వానికి సాధుత్వప్రదర్శనము శక్యము కాదని భావించి వానిలోనుండి పదములను విభజించిరి. అవియు అనంతములైనందున వానికిగూడ సాధుత్వము చూపుట శక్యము గాదని తలంచి వానిలోనుంచి ప్రకృతి ప్రత్యయములను వేరుచేసి యుంచినారు. కాగా ప్రకృతి ప్రత్యయములు, వానియర్థములు కల్పితములే. కాని

మూలమున పదములు, తద్ద్వారా వాక్యములు వ్యాకరణముచే సంపూరింపబడగలవు. ఇది మునులుచేసిన పని. సత్యమైనది వాక్యమే. ప్రకృతి ప్రత్యయములు కల్పితములే. పదము మధ్యతరగతికి చెందినది.

శబ్దమునుండి విభజింపబడిన ప్రకృతిప్రత్యయముల అర్థములు అపోద్ధారపదార్థములని భర్తృహరి యాశయము.

సాధుశబ్దమువలనను, అసాధుశబ్దమువలనను అర్థబోధ కలుగును. కాని సాధు శబ్దములే ధర్మజనకములు కనుక వానికే వ్యాకరణము సాధుత్వమును జూపుటకై రచియింపబడినది. వ్యాకరణమున జూపబడినవి సాధువులని, వానికంటె ఇతరమైనవి యసాధువులని మనము తెలుసుకొనగలము. అసాధువులనే చూపిన ఇతరములు సాధువులని తెలుసుకోవచ్చును. కాని అసాధువులు అనంతములు కనుక వానిని జూపుటలో లాఘవ ముండదు. కనుక లాఘవమును అపేక్షించి సాధుశబ్దములనే వ్యాకరణము చూపుచున్నది.

వి. ఈ మూడు శ్లోకములు వ్యాకరణశాస్త్రమున విచారింపబడిన ఎనిమిది పదార్థములను జూపుచున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| శబ్దము | 2 | విధములు | 1 | ప్రకృతి ప్రత్యయములు |
| | | | 2 | పద వాక్యములు |
| అర్థము | 2 | విధములు | 1 | ప్రకృతి ప్రత్యయార్థములు |
| | | | 2 | పద వాక్యార్థములు |
| శబ్దములకు, అర్థములకు కల సంబంధము | 2 | విధములు | 1 | కార్యకారణభావము |
| | | | 2 | యోగ్యత |
| ప్రయోజనము | 2 | విధములు | 1 | అర్థజ్ఞానము |
| | | | 2 | ధర్మము |
| | 8 | | 8 | |

కాగా రెండేసి విధములగు శబ్దములు, అర్థములు, సంబంధములు, ప్రయోజనములు కలసి ఎనిమిది యగును. వీనినే వ్యాకరణశాస్త్రము విచారించియున్నది. ఈ యష్టపదార్థీరూపమే వ్యాకరణశాస్త్రశరీరము.

వాక్యపదీయము పాణినీయవ్యాకరణ మహాభాష్యమునకు వ్యాఖ్యానగ్రంథము. కనుక ఇదియు ఆ ఎనిమిది పదార్థములను విచారించుచున్నది. కనుకనే "పదార్థాష్టక విచార పరత్వాత్ వాక్య పదీయస్య" అని మూడవకాండ ప్రారంభమున హేలారాజు పలికెను. వాక్యపదీయము ఎనిమిది పదార్థములను విచారించునది యని దాని భావము.

పాణిని రెండువిధములగు ప్రకృతులను, ఎనిమిది విధములగు ప్రత్యయములను, వాని సంయోగవశమున కార్యవిశేషములను కల్పించి వానిద్వారా పదములకు, తద్ద్వారా వాక్యములకు సాధుత్వమును జూపెను.

1. ధాతువు 2. ప్రాతిపదికము, ఇవి ప్రకృతులు. సు, ఔ, జస్ మున్నగు సుప్పులు 21; టాప్ మున్నగు స్త్రీ ప్రత్యయములు 8; సుమారు 200 లకు పైగా తద్ధితములు; 12 సనాది ప్రత్యయములు; 22 వికరణ ప్రత్యయములు; 10 లకారములు; 18 తిఙ్ ప్రత్యయములు; సుమారు 110 పైగా కృత్ ప్రత్యయములు ఇవి 8 విధములగు ప్రత్యయములు.

పై ప్రకృతులకు, ప్రత్యయములకుగూడ అర్థములను పాణిని కల్పించెను.

కాగా ప్రకృతిప్రత్యయములు, వానియర్థములు కల్పితములే. సత్యములు కావు.

వాక్యము సత్యము. అదియే అర్థబోధకము. దానిని తెలుసుకొనుటకు ఉపాయములుగా ప్రకృతి ప్రత్యయములు కల్పింపబడినవి.

ప్రకృతి ప్రత్యయములకంటె పదము సత్యముగాను, వాక్యముకంటె అసత్యముగాను శాస్త్రమున చూపబడుచున్నది. అందుచే పదము మధ్యతరగతికి చెందియున్నది. వాక్యమునుండి పదములు, వానినుండి ప్రకృతి ప్రత్యయములు కల్పితములనియే మహాభాష్యకారులు నిర్ణయించిరి. ఇట్టి కల్పనకు అపోద్ధారమని భర్తృహరి వ్యవహారము. అఖండమగు వాక్యమునుంచి అవయవకల్పన అపోద్ధారము.

అపోద్ధారపద్ధతిలో ప్రకృతి ప్రత్యయ రూపమగు శబ్దములు, వాని యర్థములు స్వీకరింపబడుచున్నవి. వానిచే సత్యములగు వాక్యములు, వాని యర్థములు తెలియబడుచున్నవి.

కాగా 24వ శ్లోకమున 'అపోద్ధార పదార్థాః' అను పదము ప్రకృతి ప్రత్యయముల అర్థములను, 'స్థితలక్షణాః' అను పదము పద-వాక్యముల అర్థములను, 'అన్వాఖ్యేయాః' అను పదము పద-వాక్యములను, 'ప్రతిపాదకాః' అను పదము ప్రకృతి ప్రత్యయములను బోధించుచున్నవి. పై నాల్గు పదార్థములను ఈ శ్లోకము చూపుచున్నది.

శబ్దములకు అర్థములకు రెండు విధములగు సంబంధములను మహాభాష్యకారులు చూపిరి: 1. కార్యకారణభావము, 2. యోగ్యత. వక్తయొక్క బుద్ధిలో అర్థము ముందుగా భాసించును. దానిని ఇతరులకు చెప్పదలచినచో దాని కనుగుణమగు శబ్దము భాసించును. కాగా అర్థము కారణము, శబ్దము కార్యము అని స్పష్టమగుటచే వానికి ఆ సంబంధము తెల్లము. పక్త శబ్దము ప్రయోగించగా దానివలన శ్రోతకు బోధ కలుగుచున్నది. కాగా ఇపుడు శబ్దము కారణమని, అర్థము కార్యమని తేలుచున్నది. ఇట్లు పరస్పరము శబ్దార్థములకు కార్యకారణభావసంబంధము కలుగుచున్నది. ఇంద్రియములకు విషయములను గ్రహించుటలో స్వాభావికమగు యోగ్యత గలదు. అట్లే శబ్దములకు అర్థములను బోధించుటలో స్వాభావికమగు యోగ్యత కలదు. శబ్దార్థములకు తాదాత్మ్యము యోగ్యత. అదియే వానికి సంబంధము. ఈ రెండు సంబంధములు శబ్దార్థములకు అనాదిసిద్ధములు, కల్పితములు కావు.

వ్యాకరణశాస్త్రమునకు ప్రయోజనములు రెండు చూపబడినవి - అర్థజ్ఞానము, ధర్మము. ప్రవృత్తిరూపమగు ధర్మమువలన ఇహలోక పరలోక సుఖములు, నివృత్తిరూపమగు ధర్మమువలన మోక్షము లభించును.

రెండు సంబంధములు, రెండు ప్రయోజనములు కలసి నాల్గు పదార్థములను 25 వ శ్లోకము చూపుచున్నది.

పయిరీతిని సిద్ధించిన ఎనిమిది పదార్థములను వ్యాకరణశాస్త్రము ప్రతిపాదించి యున్నది. ఆ పదార్థములనే ఈ గ్రంథము కూడ నిరూపించుచున్నది. — ప్రథమ కాండము రెండు ప్రయోజనములను, ద్వితీయ కాండము వాక్య వాక్యార్థములను, తృతీయ కాండము ప్రకృతి ప్రత్యయరూపమగు శబ్దము, తదర్థములు, కార్యకారణభావము, యోగ్యత అను నాలుగు పదార్థములను విచారించుచున్నది.

ప్రథమ కాండమున 44 వ శ్లోకమున "అపరోఽర్థే ప్రయుజ్యతే" అని యుపక్ర మించి శబ్దమునకు అర్థబోధకత్వము విపులముగా జూపబడినది. అట్లే 93 వ శ్లోకముచే శబ్దగతమగు జాతి వాచక మని చూపబడినది. 27 వ శ్లోకమున "సాధవో ధర్మసాధనమ్" అని ధర్మము ఫలమని నిరూపితమాయెను. 140 వ శ్లోకమున అభ్యుదయరూప ధర్మఫలము చెప్పబడినది. 14, 16, 22, 132 వ శ్లోకములతో నివృత్తిధర్మము అనగా మోక్షము ఫలముగా చూపబడినది.

వ్యాకరణమున తవ్య, అనీయ, తి మున్నగు రీతిని ప్రత్యయములు, భూ, ఏధ్, కన్యా, జానపద మున్నగు రీతిని ప్రకృతులు చూపబడినవి. కొన్నిచోట్ల త్వా, మా, వామ్, నౌ, వః, నః, తే, మే అనురీతిని పదములు, ఐకాగారికః (ఒకే ఇల్లు-అనగా అసహాయము గానున్న యిల్లు — ప్రయోజనముగా గల చోరుడు) శ్రోత్రియః (వేదమును చదివిన వాడు) హరేఽవ (ఓ విష్ణువా ! రక్షించుము) మున్నగురీతినివాక్యములు నిర్దేశింప బడినవి.

ప్రకృతి ప్రత్యయములను చిహ్నములుగా - అనగా గుర్తులుగా జూపి వానిద్వారా పదములు, వాక్యములు లోకమున కందజేయబడుచున్నవి.

పై యర్థము "తే లిఙ్గైశ్చ స్వశబ్దైశ్చ" అను కారికాభాగముచే వ్యక్తమగుచున్నది.

ఈ ఎనిమిది పదార్థములలో అర్థావబోధ, ధర్మము అనునవి ప్రయోజనములు గాను, వానికి మిగతా ఆరు పదార్థములు సాధనములుగాను చూపబడుచున్నవి.

ఈ మూడు శ్లోకములు (24, 25, 26) శాస్త్ర ప్రారంభమున కాత్యాయన పతంజ లులచే స్పష్టముగా బోధింపబడిన యర్థమునే క్రోడీకరించుచున్నవి.

పాణిని కాత్యాయన పతంజలులచే నిర్మింపబడిన వ్యాకరణ శాస్త్రముతో ఈ వాక్యపదీయమునకు గల సంబంధమును "నిత్యాః శబ్దార్థసంబన్ధాః" అను 23 వ శ్లోక ముచే భర్తృహరి చూపియున్నాడు.

సాధుశబ్దములు, అసాధుశబ్దములు అను రెంటిలోను సాధుశబ్దములకే వ్యాకరణ మన్వాఖ్యాపక మని 26 వ శ్లోకమున చెప్పబడినది. కాని ఇవి సాధువులు, ఇవి అసాధు వులు అని మనము ఎట్లు గుర్తించనగును? మరియు ప్రకృతి ప్రత్యయాదులు జ్ఞానజనకములు కాగలవు. అంతియేకాని ధర్మజనకములు కానేరవుగదా అను ప్రశ్నలకు సమాధానము చెప్పు చున్నాడు.

శిష్టేభ్య ఆగమాత్ సిద్ధాః సాధవో ధర్మసాధనమ్
అర్థప్రత్యాయనాభేదే విపరీతాస్త్వసాధవః. 27

అర్థప్రత్యాయనాభేదే = అర్థమును బోధించుటలో భేదము లేకున్నను, శిష్టేభ్యః = శిష్టులవలన లభించిన, ఆగమాత్ = శాస్త్రమువలన, సిద్ధాః = నిష్పన్నములగు శబ్ద

ములు, సాధవః = సాదువు లగుచున్నవి, ధర్మసాధనమ్ = అట్టి శబ్దములే ధర్మమునకు సాధనము కాగలవు.

విపరీతాః + తు = విపరీతములగు శబ్దములుమాత్రము—అనగా అట్టి శాస్త్రము వలన నిష్పన్నము కానివి, అసాధవః = అసాధువు లగును, కనుక అవి ధర్మసాధనము కానేరవని భావము.

తా. శబ్దములన్నియు అర్థమును బోధించుచున్నందున వానిలో కొన్ని శబ్దములు సాధువులు, కొన్ని యసాధువులని ఎట్లు మనము గుర్తించగలము? అని సందేహము కలుగవచ్చును. కాని పెద్దలు వ్యవస్థ చేసియున్నారు. అతీంద్రియశక్తిచే శబ్దతత్త్వమును గుర్తించినవారు శిష్టులు. వారు శాస్త్రములను నిర్మించిరి. ఆ శాస్త్రీయప్రక్రియచే నిష్పన్నములగు శబ్దములు సాధువు లనియు, ఆ ప్రక్రియకు దూరమగు శబ్దములు అసాధువు లనియు తేలినది. సాధుశబ్దములు ధర్మమును కలిగించును. అసాధువులు ధర్మజనకములు కావు. పైపెచ్చు అధర్మజనకము లగును.

శబ్దములు నిత్యము లనియు అనిత్యము లనియు శాస్త్రజ్ఞులలో రెండు వాదములున్నవి. శబ్దములు పుట్టునవి కావు. పరమాణువులవలె అవి నిత్యములు. కాని కంఠతాల్వాద్యభిఘాతములచే నవి వ్యక్తీకరింపబడుచున్నవి అని మొదటివారి యాశయము. కంఠతాల్వాద్యభిఘాతములచే శబ్దములు పుట్టుచున్నవి. అవి నిత్యములు కానేరవు. భేరిదండ సంయోగమున పుట్టిన శబ్దము నిత్యముకాదుగదా! అని రెండవవారి యభిప్రాయము. శబ్దము నిత్యమనెడివారి మతముచొప్పున శబ్దములు స్థిరములు కనుక అవి ఏకరూపముగా నుండును. అట్టివానికి ఇవి సాధువులు, ఇవి అసాధువులు అనే వ్యవస్థ చేయవచ్చును. కాని శబ్దములు జన్యములు అనెడివారి మతము చొప్పున పయి వ్యవస్థ ఎట్లు సాధ్యమగును? ఏలయన, క్రొత్త క్రొత్త శబ్దములను పుట్టించి వానికి అనుగుణముగ వ్యాకరణము వ్రాసి వారి సంఘము చొప్పున అవి అన్నియు సాధువులని చెప్పవచ్చును. కనుక సాధుత్వ వ్యవస్థ ఎట్లు చూపవగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

> నిత్యత్వే కృతకత్వే వా తేషా మాది ర్న విద్యతే
> ప్రాణినా మివ సా చైషా వ్యవస్థా నిత్యతోచ్యతే.　　　28

తేషామ్ = ఆ శబ్దములకు, ప్రాణినామ్ + ఇవ = జీవులకువలె, నిత్యత్వే = నిత్యత్వమున్నను, కృతకత్వే + వా = అనిత్యత్వమున్నను, అదిః = ఆదికాలము అనగా ఇంతకుముందు లేకుండగా ఈ నాడు శబ్దము పుట్టినది యనుట, న + విద్యతే = లేదు. అనాది సిద్ధముగా శబ్ద మున్నదే యని భావము.

సా = ఆ, ఏషా + చ = కూటస్థ నిత్యత్వముకంటె భిన్నమగు ఈ నిత్యత, వ్యవస్థానిత్యతా = వ్యవస్థచే అనగా వ్యవహారమున విశేషముగా నున్న స్థితిచే కలిగిన నిత్యత, ఉచ్యతే = శాస్త్రజ్ఞులచే చెప్పబడుచున్నది. ప్రవాహనిత్యత యని శాస్త్రవేత్తల నిర్ణయము.

తా. జీవులవలె శబ్దములు నిత్యములే. అవి ఎన్నడును నశించునవి కావు అని వైయాకరణులు విశ్వసింతురు. ఈ పక్షమున వ్యాకరణశాస్త్ర నిర్మాణము సంగతమగును. నిరర్థకము కాదు. ఈ సంగతి 23 వ శ్లోకమున నిర్ణీతమాయెను.

కాని దేహములవలె శబ్దములు పుట్టుచు నశించునని కొన్ని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆ పక్షమున శబ్దములు వ్యవస్థితములు కానందున వ్యాకరణము నిరర్థకమే

యగును. కాని ఆ పక్షమున గూడ శబ్దములు నిత్యములే. ఎట్లనగా—శబ్దములు పుట్టుచు నశించవచ్చును. అవి అవిచ్ఛిన్నముగా నున్నవి. వానికి ప్రాథమికకాలము, ఈ నాటితో సరి యని చివరికాలము లేదు. ప్రవాహరూపమున కాన్పించుచునేయున్నది. అట్టి వస్తువులు కూడ నిత్యములు కాగలవు. ఈ రీతిగ శబ్దములకు నిత్యత సంభవించును. దీనిని ప్రవాహనిత్యత, వ్యవహారనిత్యత యందురు.

వి. వైయాకరణులు శబ్దములు కూటస్థనిత్యము లందురు. ఎల్లపుడు పుట్టుక, నాశము లేక ఏకరూపముగా నుండునవి యని భావము. ఇతర శాస్త్రముల చొప్పున శబ్దములు అట్టివి కాకున్నను ప్రవాహనిత్యములు కాగలవు. కనుక వానిపక్షమునగూడ వ్యాకరణము నిరర్థకము కాదు.

సాధుత్వ మనునది అనాదిసిద్ధమగు శిష్టపరంపరచే గ్రహింపబడినచో వ్యాకరణ శాస్త్రము రచియించ నక్కరలేదు. దీనివలన గలిగెడి శబ్దసాధుత్వజ్ఞానము ప్రకారాంత రముచే సిద్ధించుచున్నది కదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

> నాఽఽనర్థికా మిమాం కశ్చి ద్వ్యవస్థాం కర్తు మర్హతి
> తస్మా న్నిబధ్యతే శిష్టైః సాధుత్వవిషయా స్మృతిః ॥ 29

కశ్చిత్ = ఎవడైన, అనర్థికామ్ = తెలుసుకొనుటకు చదువుటకు శక్యముకానట్టి, ఇమామ్ = మనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్న, వ్యవస్థామ్ = ఉదాత్తాదిస్వరవ్యవస్థను— లౌకిక వైదిక శబ్దములను తెలుసుకొనుట అనే వ్యవస్థను, కర్తుమ్ = చేసేకొరకు అనగా ఇత రులకు తెలిపేకొరకు, న + అర్హతి = ఈ వ్యాకరణము లేనిది సమర్థుడు కానేరడు.

తస్మాత్ = అందువలన, సాధుత్వవిషయా = శబ్దసాధుత్వము విషయముగా గల, స్మృతిః = వ్యాకరణస్మృతి, శిష్టైః = శిష్టులచే, నిబధ్యతే = అనేక ప్రకారములుగా గ్రంథ రూపమున చూపబడు చున్నది.

తా. శిష్టుల పరంపరచే సాధుశబ్దములు తెలియబడగలవు. కనుక వ్యాకరణము నిరర్థకమేగదా! యని ప్రశ్నింపవచ్చును. కాని ఉదాత్తాది స్వరములు ఎట్లు ఉచ్చరించవలెనో, లౌకిక వైదిక పదములలో స్వరనియమము, హ్రస్వదీర్ఘాదినియమము ఎట్లుండునో అను నంశములు వ్యాకరణాధీనములు. ఎంత పట్టుదల వహించినను, పై అంశములను ఎవడుకూడ వ్యాకరణము లేనిది ఇతరులకు చెప్పలేడు. ఈదృష్టితో శిష్టులు వ్యాకరణశాస్త్రమును రచించిరి.

సాధుశబ్దముల ప్రయోగముచే ధర్మము కలుగును. కాని అట్టి సాధు శబ్దముల వ్యవస్థకై వ్యాకరణము అక్కరలేదు. తర్కము వలన కూడ అట్టి వ్యవస్థ సంభవించగలదు— అయం 'గౌః' శబ్దః సాధుః శిష్టప్రయుక్తత్వాత్. (ఈ గో శబ్దము సాధువు. ఏలయన, శిష్టులచే ప్రయోగింపబడుటవలన.) కాగా వ్యాకరణమునకు అవశ్యకతయే లేదు అను ప్రశ్నకు 30, 31, 32, 33, 34 శ్లోకములచే సమాధానము చెప్పుచున్నాడు.

> నచాఽఽగమాదృతే ధర్మ స్తర్కేణ వ్యవతిష్ఠతే
> ఋషీణామపి యజ్జ్ఞానం తదప్యాగమపూర్వకమ్ ॥ 30

ధర్మః = ధర్మము, ఆగమాత్ + ఋతే = వేదము, తన్మూలకమగు స్మృతులు వినాగా, తర్కేణ = కేవలతర్కముచే, న + చ + అవతిష్ఠతే = నిశ్చితము కానేరదు.

ఋషీణామ్ + అపి = ఋషులయొక్కయు, జ్ఞానమ్ = జ్ఞానము, యత్ = ఏదో, తత్ + అపి = అదియు, ఆగమపూర్వకమ్ = వేదము పూర్వముగా గలదియే. అనగా వేదము ఆధారముగా గలదియే.

తా. ఇంద్రియ సాపేక్షమగు ప్రత్యక్షమును బురస్కరించుకొని హేతువాదము నిర్ణాయకమగును. ధర్మాధర్మము లతీంద్రియములు కనుకనే వానికి అదృష్టమని శాస్త్రజ్ఞుల వ్యవహారము. అట్టి వానిని హేతువాదము నిర్ణయింపజాలదు సాధుశబ్దప్రయోగమువలన ధర్మము కలుగవలెనన్నచో అట్టి సాధుత్వము వ్యాకరణస్మృత్యధీనమేకాని హేతువాదమువలన లభించునది కాదు. కాగా "పర్వతో వహ్నిమాన్, ధూమాత్, మహానసవత్" అనునట్లు "అయం శబ్దః సాధుః, శిష్టప్రయుక్తత్వాత్, గోశబ్దవత్" అనెడి అనుమానముచేతనే శబ్ద సాధుత్వము తెలియుటచే వేరుగ వ్యాకరణశాస్త్రము వ్యర్థమే యని యాక్షేపింపరాదు.

ఋషులు వేదముల నభ్యసించి యథాశాస్త్రముగ తద్విహితములగు సత్కర్మలను బ్రహ్మచర్యము మున్నగు తపములను ఆచరించిరి. దానివలన వారికి అతీంద్రియార్థములను గ్రహించెడి జ్ఞానము కలిగినది. ఈ రీతిగా వారిజ్ఞానము వేదమూలకమే. ఆ జ్ఞానమునుబట్టి వ్యాకరణాది స్మృతులను నిర్మించిరి. ఇంతియేకాని వారు వానిని సొంతముగాగాని, అనుమాన ప్రమాణము నుపయోగించిగాని నిర్మించలేదు.

వి. కనుక కేవల హేతువాదము ధర్మనిర్ణాయకము కానోపదు.

ధర్మము ఆగమమూలక మనుట యుక్తము కాదు. ప్రజలను మోసగించెడి వామాచారమును బోధించే ఆగమములు కలవు. వానిలో, "న కాఞ్చన పరిహరేత్" (కోరి వచ్చిన ఏ స్త్రీని కూడ విడువరాదు) అని కలదు. ఇట్లే సురాపానము మున్నగునవి వామాచారపద్ధతిలో కాన్పించుచున్నవి. ఇట్టి స్థితిలో ఆగమము మనకు ధర్మవ్యవస్థాపక మెట్లు కాగలదు?

మఱియు సంభవించినంతమట్టుకు తర్కము సహాయము కాగలదు. "నరకపాలం శుచి, ప్రాణ్యఙ్గత్వాత్" (మనుష్యుని కపాలము పవిత్రమైనది. ప్రాణికి అవయవము కనుక) ఇటువంటి తర్కము వలన కూడ ధర్మవ్యవస్థ కానగును. ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పుచున్నాడు.

ధర్మస్య చావ్యవచ్ఛిన్నాః పన్థానో యే వ్యవస్థితాః
న తాన్ లోకప్రసిద్ధత్వాత్ కశ్చి త్తర్కేణ బాధతే. 31

యే = ఏవి, ధర్మస్య = ధర్మముయొక్క, పన్థాసః = పొందెడి ఉపాయములు, వ్యవస్థితాః = లోకప్రసిద్ధములై యున్నవో, అవ్యవచ్ఛిన్నాః + చ = శిష్టు లాచరించుటవలన నశించక యున్నవో, తాన్ = అట్టి, ఆగమాన్ = ఆగమములను, లోకప్రసిద్ధత్వాత్ = లోకమున ప్రసిద్ధి చెందియుండుటవలన, కశ్చిత్ = ఎవ్వడును, తర్కేణ = హేతువాదముచే, న + బాధతే = బాధింపజాలడు.

తా. లోకమున విభిన్నములగు ఆగమము లుండవచ్చును. కాని ఏ ఆగమములు లోకుల శ్రేయమును కోరునో, వేటిని శిష్టులందరు ఆదరింతురో, దేనియందు అందరికి విరుద్ధ భావ ముండదో అట్టి ఆగమములను శుష్కహేతువాదమును జూపి బాధింపరాదు. వామాచారమును బోధించు స్మృతులు కలవు. అవి శిష్ట సమ్మతములు కావు. అవి ధర్మవ్యవస్థాపకములు కానేరవు. వాటి సామ్యమును తీసికొని స్మృతు లన్నిటికి అవ్యవస్థితి నాపాదించరాదు.

లౌకికములగు పదార్థములందున్న శక్తులను పురస్కరించుకొని వాని సాహచర్యమును బట్టి హేతువాదము ప్రవర్తించును. ఆ పదార్థములలోనే శక్తులు భిన్నభిన్నములుగా నున్నవి. ఏకరూపములుగా నుండనేరవు. కనుక లౌకిక వస్తువులయందే తర్కము సమర్థము కానపుడు అలౌకికమగు ధర్మము విషయమై తర్కము నిర్ణాయకము ఎట్లు కాగలదు? అను అంశమును నిరూపించుచున్నాడు.

అవస్థాదేశకాలానాం భేదా ద్భిన్నాసు శక్తిషు
భావానా మనుమానేన ప్రసిద్ధి రతిదుర్లభా. 32

భావానామ్ = పదార్థములయొక్క, శక్తిషు = శక్తులు, అవస్థాదేశకాలానామ్ = అవస్థలయొక్క అనగా బాల్యము, యౌవనము మున్నగువానియొక్క, దేశములయొక్క, కాలములయొక్కయు, భేదాత్ = మార్పువలన, భిన్నాసు (సతీషు) = మార్పుచెందుచుండగా అనుమానేన = అనుమానప్రమాణముచే, ప్రసిద్ధిః = వస్తువుల శక్తినిర్ణయము, అతిదుర్లభా = మిక్కిలి దుర్లభమైనది.

తా. లౌకికములగు పదార్థములందున్న శక్తులనుగుర్తించి వాని సాహచర్యమును బట్టి హేతువాదము ప్రవర్తించుచున్నది. ఒకేవస్తువునందు ఆ శక్తులు భిన్నభిన్నములుగా నున్నవి. ఏకరూపములుగా నుండనేరవు. లౌకికవస్తువులందే తర్కము నిర్ణాయకము కాకున్నది. ఇట్టి స్థితిలో అలౌకికమగు ధర్మమువిషయమై తర్కము నిర్ణాయక మెట్లు కాగలదు?

వి. మనుష్యుడు బాల్యమున బలవంతుడు కానేరడు. యౌవనమున ఆతడే బలవంతుడు కాగలడు. పచ్చిపిప్పలి కఫమును కలిగించును. అదియే ఎండినచో కఫ వాత పిత్తములను నశింపచేయును. నీరు హిమవత్ప్రదేశమున చల్లగా, అగ్నిప్రదేశమున వేడిగా నుండును. నూతిలో నీరు, మర్రిచెట్టునీడ, యౌవనముకల ఆడది, ఇటికలతో కట్టిన ఇల్లు శీతకాలమున వేడిగాను, వేసవికాలమున చల్లగాను ఉండును. కనుక అతీంద్రియమగు ధర్మము విషయమై తర్కము సాహాయ్యము చేయనేరదు. అందు ఆగమమే నిర్ణాయకమగును.

ద్రవ్యము యొక్క శక్తులు అవస్థాదేశకాలములచే మార్పు చెందునని 32 వ శ్లోకముచే చెప్పబడినది. ఇపుడు ఇతరద్రవ్యసంబంధమువలన కూడ శక్తులు మార్పు చెందునని చెప్పుచున్నాడు.

నిర్జ్ఞాతశక్తే ర్ద్రవ్యస్య తాం తా మర్థక్రియాం ప్రతి
విశిష్టద్రవ్యసంబన్ధే సా శక్తిః ప్రతిబధ్యతే. 33

తాం + తామ్ = ఆయా, అర్థక్రియాం ప్రతి = కార్యమును కలిగించుటనుగురించి, నిర్జ్ఞాతశక్తేః = స్పష్టముగా తెలియబడిన శక్తిగలిగిన, ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క, సా = ఆ, శక్తిః = శక్తి, విశిష్టద్రవ్యసంబన్ధే = విశిష్టమగు ద్రవ్యముయొక్క సంబంధమున, ప్రతిబధ్యతే = ప్రతిబంధింపబడుచున్నది.

తా. ప్రతి వస్తువునకు విలక్షణములగు కార్యములు జరిపే శక్తు లున్నట్లు అందరికి తెల్లము. ఉదా :- అగ్నికి దహనశక్తి కలదు. కాని విజాతీయమగు చంద్రకాంతశిలతో సంబంధము కలుగగా అగ్నికి ఆశక్తి కానరాకున్నది. అందుచే ద్రవ్యమును చూచినంతమాత్రాన

దీనిశక్తి ఇది యని నిర్ణయించి దానిమూలముగ తర్కమును ప్రవేశపెట్టరాదు. కనుక అతీంద్రియములగు ధర్మాధర్మములలో నాగమమే ప్రమాణము కానగును.

మహామేధావి చూపిన తర్కము నిర్దుష్టమగును. దానిచే ధర్మాధర్మవ్యవస నిర్ణీతము కానగును. అట్టితరి ధర్మాధర్మవ్యవస్థకు ఆగమప్రమాణముయొక్క ఆవశ్యకత లేదు. అను ఆక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాడు.

యత్నే నానుమితోఽప్యర్థః కుశలై రనుమాతృభిః
అభియుక్తతరై రన్యై రన్యథై వోపపాద్యతే. 34

కుశలైః = నేర్పరులగు—అనగా ఊహానైపుణ్యముకల, అనుమాతృభిః = అనుమానము చూపువారిచే, యత్నేన = ప్రయత్నముచే, అనుమితః + అపి = ఊహింపబడినదైనను, అర్థః = అర్థము, అభియుక్తతరైః = వారికంటెను అధికమగు అభినివేశముకల-అనగా పట్టుదల కలిగిన, అన్యైః = ఇతరులగు అనుమాతలచే, అన్యథా + ఏవ = మరియొక విధముగనే ఉపపాద్యతే = యుక్తియుక్తముగా చూపబడగలదు.

తా. మహామేధాసంపన్నుడు చూపిన తర్కము నియతముగా నుండవచ్చును దానినిబట్టి ధర్మవ్యవస్థ సంభవించును. కనుక ఆగమప్రమాణ మనావశ్యకమే యని శంకింపవచ్చును. కాని యాతర్కము ఆగమమునుబట్టి కాక తన బుద్ధిబలముచేతనే ఊహారూపమున కలిగినప్పుడు అతనికంటెకూడ బుద్ధిమంతుడు ఆ తర్కమునకు అన్యథాత్వము చూపగలడు, బుద్ధిబలమునకు అంతులేదుకదా ః కనుక అవ్యవస్థితమగు తర్కము ధర్మాధర్మములను నిర్ణయింప జాలదు.

అభ్యాసము అనే మరియొక ప్రమాణమును గూడ స్వీకరించవలెనని చూపుచున్నాడు.

పరేషా మసమాఖ్యేయ మభ్యాసాదేవ జాయతే
మణిరూప్యాదివిజ్ఞానం తద్విదాం నానుమానికమ్. 35

పరేషామ్ = ఇతరులకు, అసమాఖ్యేయమ్ = స్పష్టపరచి చెప్పుటకు శక్యముకాని, మణిరూప్యాదివిజ్ఞానమ్ = మణులయొక్క, వెండిబంగారములయొక్క, షడ్జము మున్నగు స్వరములయొక్క విశేషజ్ఞానము, తద్విదాం = మణి మున్నగువాని స్వరూపమును బాగుగ తెలుసుకొన్నవారికి, అభ్యాసాత్ + ఏవ = అభ్యాసమువలననే, జాయతే = కలుగుచున్నది. ఆ జ్ఞానము, అనుమానికమ్ = అనుమానప్రమాణముచే కలిగినది, న = కాదు.

తా. రత్నములు, మణులు, కెంపులు, వెండి, బంగారము మున్నగు వస్తువులను వర్తకులు అనేక పర్యాయములు పరీక్షించి వాని గుణదోషములను గుర్తింతురు. ఇట్లే షడ్జము గాంధారము మున్నగు స్వరవిశేషములను గుర్తించువారు కలరు. వారు గ్రహించిన మంచి చెడ్డలను ఒక లక్షణరూపమున కాని ఇతరులకు చెప్పజాలరు. వారలకు ఆజ్ఞానము ప్రత్యక్ష ప్రమాణమువలన, అనుమాన ప్రమాణమువలన, శబ్దప్రమాణమువలనను కలిగినదికాదు. అభ్యాసమువలననే కలిగినది. కనుక అభ్యాసమునే ప్రమాణాంతరముగా అంగీకరించవలెను.

వి. మనకు ధర్మము ప్రత్యక్షము కాకపోవచ్చును. అది ఆర్షజ్ఞానవిషయమగును. అదియు మణిరత్నాదుల విజ్ఞానమువంటిది కానగును.

వయి చూపబడిన 6 ప్రమాణములు కాక అదృష్ట మను మరియొక ప్రమాణమును గూడ అంగీకరింపవలయు నని చెప్పుచున్నాడు.

ప్రత్యక్ష మనుమానం చ వ్యతిక్రమ్య వ్యవస్థితాః
పితృరక్షఃపిశాచానాం కర్మజా ఏవ సిద్ధయః . 36

ప్రత్యక్షమ్ = ప్రత్యక్షప్రమాణమును, అనుమానమ్ = అనుమానప్రమాణమును, చ = మరియు-అనగా శబ్దాఖ్యాన ప్రమాణములను, వ్యతిక్రమ్య = విశేషముగా నతిక్రమించి- అనగా ఆ నాల్గు ప్రమాణములకు సాధ్యముకాక, వ్యవస్థితాః = లోకప్రసిద్ధములై ఉన్నటు వంటి, పితృరక్షఃపిశాచానామ్ = పితృదేవతలయొక్క, రాక్షసులయొక్క, పిశాచాదుల యొక్కయు, సిద్ధయః = సిద్ధులు అనగా దేశకాలములచే దూరముగానున్నను, గోడ మున్నగు వానిచే వ్యవహితములుగా నున్నను వస్తువులను చూచుట మున్నగు సిద్ధులు, కర్మజాః + ఏవ = కర్మవలననే కలుగుచున్నవి.

తా. మనకు దేశకాలములచే దూరములగు పదార్థములు కానరావు. గోడ మున్నగు వస్తువులు అడ్డుగానున్నను కానరావు. పితృదేవతలకు, రాక్షసులకు, దయ్యములకు పదార్థములు ఎక్కడున్నను కానవచ్చును. అందుకు కారణము అవి చేసిన కర్మయే. వానికి ప్రత్యక్షాదిప్రమాణములతో నిమిత్తములేదు. అవి చేసిన కర్మయొక్క బలముచే అన్ని పదార్థములను చూచెడి శక్తి వానికి కలుగును. ఆ కర్మయే అదృష్ట మందురు. కాగా అదృష్ట మనే ప్రమాణాంతరము నంగీకరించవలెను.

వి. ఋషులకు కూడ తపముచే కలిగిన యదృష్టవిశేషము చేతనే ధర్మాదులను గుర్తించెడి జ్ఞానము కలిగినది. అది ప్రత్యక్షాదిజన్యము కాదు.

అదృష్టమనెడి వేరు ప్రమాణము కలదని రుజువు చేయుచున్నాడు.

ఆవిర్భూతప్రకాశానా మనుపప్లుతచేతసామ్
అతీతానాగతజ్ఞానం ప్రత్యక్షా న్న విశిష్యతే. 37

అనుపప్లుతచేతసామ్ = రజస్తమోగుణములచే ఆక్రమింపబడని మనస్సు కలిగి నట్టియు, కనుకనే, ఆవిర్భూతప్రకాశానామ్ = ఆవిర్భవించిన ప్రకాశముకల యోగులయొక్క, అతీతానాగత జ్ఞానమ్ = గతించిన వస్తువులకు రాబోవు వస్తువులకు సంబంధించిన జ్ఞానము, ప్రత్యక్షాత్ = అస్మదాదులకు కలిగెడి ప్రత్యక్షముకంటె, న + విశిష్యతే = భిన్నమైనది కాదు.

తా. యోగులకు తపోబలముచే రజస్తమోగుణములు నశలి సత్త్వగుణము వృద్ధిచెందును. దానివలన వారికి అతీంద్రియపదార్థములను గుర్తించెడి జ్ఞానము కలుగును. దానిచే వారు అతీతానాగతవస్తువులను చూచెదరు. వారిజ్ఞానము మనకు కలిగిన ప్రత్యక్షము వంటిదే. మనకు విషయేంద్రియ సంయోగమున ప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నది. మనకు అచట ఎట్టి సంకోచము లేక నిశ్చితజ్ఞానము లభించుచున్నది. వారికి కలిగిన జ్ఞానముకూడ నిశ్చితమే, సందేహవిషయము కాదు. మనము అద్దములో ముఖమును చూచునట్లు వారు తమ బుద్ధిలో ప్రపంచక మంతను జూతురు. అదియే అదృష్టవిశేషము.

ఋషులకు కలిగెడి ప్రత్యక్షము ఇంద్రియ సంబద్ధము కానందున మిథ్య అని ఏల అనరాదు ? ఇంద్రియసంబద్ధము కాక కలిగెడి ప్రత్యక్షము అసత్యమేకదా! శుక్తిరజత

జ్ఞానము, రజ్జుసర్పజ్ఞానము కూడ ఇట్టివే కదా ? వాని దృష్టాంతముచే ఆర్షజ్ఞానము మిథ్య అనవచ్చును. అనుమానమునకు విరుద్ధముగా నున్నదికదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అతీన్ద్రియా నసంవేద్యాన్ పశ్య న్త్యార్షేణ చక్షుషా
యే భావాన్, వచనం తేషాం నానుమానేన బాధ్యతే. ৪৪

యే = ఎవరు, అతీన్ద్రియాన్ = ఇంద్రియశక్తుల నతిక్రమించినట్టియు — అనగా కన్ను, చెవి మున్నగు ఇంద్రియములచే గ్రహింపబడనట్టియు, కనుకనే, అసంవేద్యాన్ = అనుమాన ప్రమాణముచే గూడ గ్రహింపశక్యముకాని, భావాన్ = పదార్థములను, ఆర్షేణ = వ్యావహారిక దృష్టికంటె భిన్నమగు అనగా అలౌకికమగు—సమాధి తపస్సులచే లభించిన, చక్షుషా = నేత్రముతో సమానమగు యోగమువలన కలిగిన ధర్మముచే, పశ్యన్తి = సంశయము లేకుండ చూచుచున్నారో, తేషాం = అట్టివారియొక్క, వచనమ్ = వచనము, అనుమానేన = దుర్బలమగు అనుమానప్రమాణముచే, న + బాధ్యతే = బాధింపబడనేరదు.

తా. సామాన్యదృష్టుల కందరాని పదార్థములను యోగీశ్వరులు చూచుచున్నారు. వారు సర్వశక్తి సమన్వితమగు అంతర్యామిగా నున్న పరమాత్మను, సమస్త లోకములకు మూలములగు పరమాణువులను, వానియందు ప్రాథమికమగు క్రియను, దేవతలను, జీవుడు స్థూలదేహమును విడనాడి మరియొక దేహమును ధరియించే మధ్యకాలమున నాతనికి కలిగెడి ఆతివాహికశరీరమును, కాలాంతరమున ఫలము నిచ్చెడి కర్మలయొక్క సంస్కారమును చూడగలరు. అవి రూపాదులవలె ఇంద్రియగ్రాహ్యములు కావు. సుఖదుఃఖాదులవలె మనోగ్రాహ్యములు కావు. ఏదో ఒక దుర్బలమగు హేతువాదమును తీసుకొని వారికి కలిగిన ప్రత్యక్షము శుక్తిరజతజ్ఞానము వంటిదని ఎట్లు చెప్పనగును? దుర్బలమగు అనుమానమే బాధింపబడును.

ఋషుల జ్ఞానము అనుమానముచే బాధింపబడక పోవచ్చును. కాని వారి వచనమును అనుసరించి ప్రవర్తించెడివారికి అంత ఆర్షజ్ఞానము లేనందున వారలను అనుమానము ఏల బంధించదు? కాగా అనుమాన ప్రమాణముచే సంశయము కలుగగా ధర్మాధర్మములందు ప్రవృత్తి కలుగనేరదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

యో యస్య స్వమివ జ్ఞానం దర్శనం నాఽతిశఙ్కతే
స్థితం ప్రత్యక్షపక్షే తం కథ మన్యో నివర్తయేత్? ৪৭

యః = ఎవడు-అనగా మునులవచనమును అనుసరించి ప్రవర్తించువాడు, యస్య = ఏయోగియొక్క, దర్శనమ్ = ఉపదేశరూపమగు జ్ఞానమును, స్వమ్ = తన సంబంధమైన,జ్ఞానమ్ + ఇవ = జ్ఞానమును వలె,న + అతిశఙ్కతే = సందేహింపడో, ప్రత్యక్షపక్షే = శిష్టుల ప్రత్యక్ష సమయమున, స్థితమ్ = ఉన్న తనప్రత్యక్షము - అనగా దానితో సమానమగునది అనిభావించు, తమ్ = వానిని, అన్యః = ఇతరుడు-అనగా తర్కమే ప్రమాణముగా గలవాడు, కథమ్ = ఎట్లుగా, నివర్తయేత్ = మరల్చగలడు ?

తా. ఋషుల జ్ఞానమును అనుమానము బాధించకపోవచ్చును. వారి వచనమునను సరించి ప్రవర్తించెడివానిని తర్కము బాధింపగలదు. వానికి మునుల కున్నంత జ్ఞాన ముండదు గదా? అని శంకింపరాదు. శిష్టులు చెప్పినది శాస్త్రము. వారు అశాస్త్రీయమగు నర్థమును చెప్పరు.

కనుక వారి మాట ప్రమాణమే యని నమ్మిక కలవానిని తర్కము నివారించలేదు. అతడు శిష్టవచనమును నమ్మి సత్కర్మల నాచరించుచునే యుండును.

మనుష్యుడు తనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్న అర్థమునందు సంశయింపడు. శిష్టుల వచనమునుగూడ సంశయింపడు. వారి వచనమును తన ప్రత్యక్షముతో తుల్యమైన దనియే భావించును. 'నీటిలో రాళ్లు తేలును' అని వారుచెప్పినను సంశయము లేకుండ దానిని నమ్మును. వారి మాటయందు అంతటి విశ్వాస మాతనికి కలుగును. అట్టివానిని తర్కము నాధారముగా స్వీకరించువాడు ధర్మాచరణమునుండి మరల్పలేడు.

వేదములు, స్మృతులు అనే ఆగమములకంటె కూడ ఆప్తోపదేశము అధికమగు ప్రమాణము. శ్రుతి స్మృతులు లేకపోయినను ఆప్తుడు చెప్పగా లోకము దాని ప్రకారము సంచరించుచున్నదని చెప్పుచున్నాడు.

ఇదం పుణ్య మిదం పాప మిత్యేతస్మిన్ పదద్వయే
ఆచణ్డాలం మనుష్యాణా మల్పం శాస్త్రప్రయోజనమ్. 40

ఆచణ్డాలమ్ = చండాల పర్యంతము, మనుష్యాణాం = మనుష్యులకు, ఇదం + పాపమ్ = ఇది పాపము, ఇదం + పుణ్యమ్ = ఇది పుణ్యము, ఇతి = అనెడి, ఏతస్మిన్ = ఈ, పదద్వయే = రెండు పదముల విషయమై, శాస్త్రమ్ = శాస్త్రము, అల్పప్రయోజనమ్ = మందమగు ప్రయోజనము కలది.

తా. పుణ్యపాపములు నిజముగ వేదైకగమ్యములు. వానిని వేదము చదువనివారు కూడ తెలిసికొనుచున్నారు. అందులకు పెద్దల వచనములే కారణము. శుభకర్మచేసిన పుణ్యము. అశుభకర్మచేసిన పాపము కలుగునని యందరికి తెలియును. దానికై శాస్త్ర మక్కరలేదు. ఆప్తులగువారు పరంపరగా అనుకొనుచున్న ధర్మాధర్మములను వినువారు అందరికి చెప్పగా నదియే ఇంత విశ్వాసమును కలిగించుచున్నది.

కనుక వేదములు, స్మృతులు అనెడి ఆగమములకంటెగూడ ఆప్తోపదేశము పరమ ప్రమాణము. శ్రుతిస్మృతులు లేకపోయినను ఆప్తుడు చెప్పగా లోకము దానిప్రకారము సంచరించుచున్నది. ఇట్టితరి శాస్త్రము ప్రమాణమా? అప్రమాణమా? అను సంశయమునకు కూడ తావు లేదు.

ఈ రీతిగా ఆగమమునకు ప్రామాణ్యముచూపి ఏ ఆగమమును ఆశ్రయించి వ్యాకరణశాస్త్రము ప్రవర్తించినదో ఆ ఆగమమును చూపుచున్నాడు.

చైతన్య మివ యశ్చాయ మవిచ్ఛేదేన వర్తతే
ఆగమ స్త ముపాసీనో హేతువాదై ర్న బాధ్యతే. 41

అవిచ్ఛేదేన = స్వప్రకాశమగుటచే నవిచ్ఛిన్నముగా, చైతన్యమ్ + ఇవ = చైతన్యమువలె, యః + చ + అయమ్ = ఏ యీ, ఆగమః = శ్రుతిస్మృతిరూపమగు ఆగమము అనగా శబ్దము, వర్తతే = ఉన్నదో, తమ్ = అట్టి ఆగమమును, ఉపాసీనః = సేవించువాడు, హేతువాదైః = హేతువాదములచే, న + బాధ్యతే = బాధింపబడడు.

తా. ఆగమ మనగా శబ్దము. అది అనుమానముకంటె ప్రబలమగు ప్రమాణము. అట్టి యాగమమును నమ్మినవాడు శుష్కహేతువాదములకు లొంగడు. శబ్దము చైతన్యము వలె అవిచ్ఛిన్నముగ అంతట వ్యాపించియున్నది.

వి. శబ్దములు, వానిచే బోధింపబడే అర్థములు, ఆశబ్దార్థములకు గల సంబంధములు నిత్యములనియు, అవి వ్యాకరణాధ్యయనము వలన లభించుననియు శాస్త్రజ్ఞులు చెప్పిరి. కాని వానికొరకింత పరిశ్రమ మనవసరము. లోకమువలననే యవి తెలియబడగలవని ఎవరైనా శుష్కతర్కమునుబట్టి ఎదుర్కొనగలరు. కాని ఆ వాదమునకు బలము చాలదు. శబ్దార్థ సంబంధములు శాస్త్రైకగమ్యములని శబ్దము చెప్పుచున్నది. హేతువాదము కొంతపరిధిని బట్టియే ప్రవర్తించును. సార్వత్రికము కాదు. శబ్ద మట్టిది కాదు. అది జీవచైతన్యమువలె సర్వత్ర వ్యాపించియున్నది. ఆగమమును శిష్టులాదరించిరి. బౌద్ధాదులుకూడ శబ్దమునుబట్టి సత్యమును అహింసను అగీకరించిరి. గ్రీక్ దేశస్థులుకూడ భక్ష్యాభక్ష్యనియమము నాదరించిరి. శ్రుతి స్మృతి ప్రామాణ్యము నంగీకరించనివారుకూడ శబ్దమునుబట్టి వ్యవహరించుచునే యున్నారు.

పయి రీతిని తర్కముకంటె ఆగమము అన్ని విధముల బలవత్తరమని నిరూపించి, ఆగమమును విడనాడి కేవల తర్కమునే ఊతచేసుకొని ధర్మాధర్మాది విషయమున ప్రవర్తించిన వానికి ప్రమాదము వాటిల్లునని చెప్పుచున్నాడు.

> హస్తస్పర్శాది వాన్ధేన విషమే పథి ధావతా
> అనుమానప్రధానేన వినిపాతో న దుర్లభః. 42

విషమే = ఎత్తుపల్లములు కల-అనగా నేత్రము లున్నవాడుకూడ వెళ్ళుటకు సాధ్యము కాని, పథి = మార్గమున-అనగా పర్వతమార్గమున, హస్తస్పర్శాత్ = చేతులతో నేలను స్పృశించుటవలన, ధావతా = పరుగెత్తుచున్న, అన్ధేన + ఇవ = గ్రుడ్డివానిచేతను వలె, అనుమాన ప్రధానేన = కేవల తర్కమునే ఆశ్రయించినవానిచే, వినిపాతః = విశేషమగుపతనము, దుర్లభః = లభింపరానిది, న = కాదు. అతనికి అధోగతి తప్పక కలుగునని భావము.

తా. తార్కికుడు ఇంద్రియముచే నొకవస్తువును గ్రహించి దానికి సంబంధించిన మరియొక వస్తువును ఇంద్రియమునకు గోచరించకపోయినను ఉన్నదనియే భావించును. అందు కొక దృష్టాంతమును చూపును. అది సరిగానున్నచో దానినిబట్టి మరియొక అర్థమును గూడ సత్యమనియే తలంచును.

కాని ఒక దృష్టాంతమునుబట్టి అంతట అట్లే ఉన్నదనుట సరికాదు. అంతమాత్రాన పదార్థము నిశ్చితము కానేరదు. గ్రుడ్డివాడు సమప్రదేశమునగూడ ఇతరుని సాహాయ్యము లేనిది నడవలేడు. అట్టి తరి ఎత్తుపల్లములు కల కొండపై ఎట్లు నడవగలడు? కాని అతడు తనచేతితో నేలస్పృశించి అది సమముగా నున్నదని భావించి అడుగుపెట్టి దాని సామ్యముచే మార్గమంతయు సమముగానే యున్నదని తలంచి పరుగెత్తినచో నాతనికి ప్రమాదము వాటిల్లును. నేత్రములు కలవాని సాహాయ్యమున్నచో నట్టి ప్రమాదము కలుగదు. అట్లే వేదశాస్త్రములను నాతగైకొనక కేవలతర్కమునే ధర్మాధర్మ నిర్ణయమునకు గ్రహించువాడు అధోగతిపాలు కాగలడు.

కనుక వేదశాస్త్రములను ప్రమాణముగా గైకొని వానికి అవిరుద్ధమగు తర్కమును ప్రవేశపెట్టినచో నిజమగు ధర్మాధర్మము లాతనికి జ్ఞాతములు కాగలవు.

"న చాగమాదృతే" అను (30 వ) శ్లోకము మొదలు ఇంతవరకున్న గ్రంథముచే ధర్మాధర్మములు తర్కగమ్యములు కావనియు, అర్థజ్ఞానము ఆగమమూలకమనియు నిరూపించి ధర్మాధర్మములు ఆగమైక మూలములని ఉపసంహరించుచున్నాడు.

తస్మా దకృతకం శాస్త్రం స్మృతిం చ సనిబన్ధనామ్
ఆశ్రిత్యాఽఽరభ్యతే శిష్టైః శబ్దానా మనుశాసనమ్. 43

తస్మాత్ = అందువలన-అనగా దుర్బలమగు తర్కము ధర్మాధర్మముల విషయమున నసమర్థమగుటవలన, అకృతకమ్ = అపౌరుషేయమగు, శాస్త్రమ్ = వేదమును, సనిబన్ధనామ్ = శిష్టపరంపరాగతమగు, స్మృతిం + చ = స్మృతిని, ఆశ్రిత్య = ఆశ్రయించి, శిష్టైః = శిష్టులగు పాణిన్యాదులచే, శబ్దానామ్ = శబ్దములయొక్క, అనుశాసనమ్ = అనుశాసనము-అనగా అసాధుశబ్దములనుండి సాధుశబ్దములను వేరుచేయుట, ఆరభ్యతే = ఉపదేశింపబడుచున్నది.

తా. సాధుశబ్దజ్ఞానము తర్కసాధ్యము కానేరదు. ధర్మమునకు కారణమగు శబ్దసాధుత్వము వ్యాకరణైకసాధ్యము. అట్టి వ్యాకరణము అపౌరుషేయమగు వేదమును, శిష్ట పరంపరాగతమగు స్మృతులను గ్రహించి పాణిన్యాదులు లోకుల క్షేమమును గోరి రచించిరి.

వి. "అఇఉణ్" మున్నగు పదునాల్గు సూత్రములు వేదరూపమైనవి వానిలో నుంచి "అచ్, ఇక్, యణ్" మున్నగు సంజ్ఞలను స్వీకరించి వాని నూతనగా చేసికొని ఈ పాణినీయము నిర్మింపబడినది. అథర్వవేదమున "కో ధాతుః? కిం ప్రాతిపదికమ్? కః ప్రత్యయః?" అని విచారింపబడినది. దానిమూలమున ధాతు ప్రాతిపదిక ప్రత్యయాది సంజ్ఞలను చూపి పాణిని ఈ శాస్త్రమును లోకుల కందజేసెను.

ఆపిశలి, శాకటాయన, శాకల్య, భారద్వాజ, గార్గ్య, సేనక, గాలవ ప్రభృతులగు మహర్షులు వారివారి కాలమున వ్యాకరణములను నిర్మించిరి. ఆ వ్యాకరణముల నన్నిటిని పరిశీలించి పాణిని ఈ వ్యాకరణమును బోధించెను.

పై రీతిని 43 శ్లోకములచే విషయ ప్రయోజన సంబంధాధికారిరూపమగు అనుబంధ చతుష్టయమును జూపి ఈ 44 వ శ్లోకముతో శాస్త్రము నారంభించుచున్నాడు.

ద్వా వుపాదానశబ్దేషు శబ్దౌ శబ్దవిదో విదుః
ఏకో నిమిత్తం శబ్దానా మపరోఽర్థే ప్రయుజ్యతే. 44

శబ్దవిదః = శబ్దముల తత్త్వము నెరింగిన పాణిన్యాది మహర్షులు, ఉపాదానశబ్దేషు = వాచకములగు శబ్దములవిషయమై-అనగా వానిని అర్థబోధ కలిగించుట కుచ్చరించునపుడు, ద్వౌ = రెండు విధములగు, శబ్దౌ = శబ్దములను, విదుః = గుర్తించుచున్నారు.

ఆ రెంటిలో, ఏకః = ఒకవిధమగు శబ్దము, శబ్దానామ్ = రెండవ విధమగు శబ్దములకు, నిమిత్తమ్ = ప్రకాశకము, అపరః = ఆ రెండవశబ్దము, అర్థే = అర్థమునందు అనగా అర్థమును బోధించుటకై, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది-అనగా ఉపయోగపడుచున్నది.

తా. రాముడు, కృష్ణుడు, మున్నగు వాచకశబ్దములలో రెండు విధములగు శబ్దము లున్నవి. 1. వైఖరి, 2. మధ్యమ. నోటిలోనున్న నాలుక, దంతములు, పెదవులు మొదలగు వాని కదలికచే పుట్టుచున్నశబ్దము వైఖరి. ఇది ఇతరులకుగూడ వినబడును. ఇది యనిత్యమే. బుద్ధిలో నున్నది మధ్యమ. ఇది పుట్టునదికాదు కనుకనే నిత్యము. దీనినే స్ఫోటశబ్ద మందురు.

ఇది ఇతరులకు వినబడునది కాదు. పై రెండువిధములగు శబ్దములు వ్యాకరణశాస్త్రమునకు విషయములగునని మహర్షులు పేర్కొనియున్నారు.

వి. చీకటిలోనున్న పదార్థములకు దీపము ప్రకాశక మగును. అట్లే బుద్ధిలో నున్న మధ్యమాశబ్దమునకు వైఖరి ప్రకాశకమగును. అట్లు ప్రకాశితమగు మధ్యమా వాగ్రూపమగు స్ఫోటశబ్దము అర్థమును బోధించును. వైఖరి ప్రకాశకమేగాని యర్థబోధకము కానేరదు. కాగా వైఖరి ప్రకాశకము, మధ్యమ ప్రకాశ్యము కాగలవు. అవి వ్యంజకము, వ్యంగ్యము అనియు వ్యవహరింపబడుచున్నవి. వ్యక్తపరచునది వైఖరి, వ్యక్తముచేయబడునది మధ్యమ.

నదులు వడిగ పారునపుడు, వీణామృదంగాదులు మ్రోయించునపుడు, పశు,పక్ష్యాదు లరచునపుడు విలక్షణములగు శబ్దములు పుట్టుచున్నవి. అవి ధ్వన్యాత్మకములు. వర్ణాత్మకములు గావు. అట్టివి వ్యాకరణమునకు విషయములు కావు. అవి వాచకశబ్దములు కావు గదా: ఈ యాశయముతోడనే "ఉపాదాన శబ్దేషు" అను పదము ప్రయుక్తమాయెను. ఉపాదానము లనగా ముఖ్యకారణములు. వినువారికి అర్థమును తెలుపుటకు వ్యవహరింపబడు శబ్దములని భావము. ఉపాదానములగు శబ్దములవిషయమై యని యర్థము.

వ్యంజకమగు వైఖరీవాక్కునకు వ్యంగ్యమగు మధ్యమావాక్కునకును శాస్త్రజ్ఞులు భేదాఽభేదముల నంగీకరించి యున్నారని చెప్పుచున్నాడు.

> ఆత్మభేద స్తయోః కేచి దస్తీ త్యాహుః పురాణగాః
> బుద్ధిభేదా దభిన్నస్య భేద మేకే ప్రచక్షతే. 45

కేచిత్ = కొందరు, పురాణగాః = ప్రాచీనమతము స్వీకరించువారు, తయోః = ఆ రెండుశబ్దములకు, ఆత్మభేదః = స్వరూపభేదము, అస్తి = కలదు, ఇతి = అని, ఆహుః = చెప్పుచున్నారు. వ్యంజకముగా నున్న వైఖరీశబ్దమునకు వ్యంగ్యముగా నున్న మధ్యమాశబ్దమునకును భేదము స్వాభావికమని తలంతురని భావము.

ఏకే = మరికొందరు, అభిన్నస్య = స్వరూపమున నేకరూపమగు శబ్దమునకు, బుద్ధిభేదాత్ = బుద్ధులయొక్క భేదమువలన, అనగా వక్తయొక్క, శ్రోతయొక్క బుద్ధులు భిన్నములు కనుక వానియందున్న భేదమువలన, భేదమ్ = భేదమును, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

తా. వైఖరీ శబ్దము వ్యంజకమగుటచే కారణముగను, మధ్యమాశబ్దము వ్యంగ్యమగుటచే కార్యముగను నున్నవి. కార్యకారణములకు భేదము స్వాభావికమే కనుక పై రెండువిధములగు శబ్దములకు నానాత్వము నిజముగనే యున్నదని కొందరు తలంచుచున్నారు కార్యము కారణముకంటె వేరుగా లేదని కొందరు విశ్వసింతురు. వారి మతము చొప్పున కార్యకారణములకు భేదములేనందున పై శబ్దముల కభేదమే సిద్ధించును. కాని పై శబ్దములు భిన్నములగు బుద్ధులలో విషయములగుటచే ఆ బుద్ధి భేదముచే శబ్దమునకు నానాత్వము కాన్పించుచున్నది. కాక వైఖరీశబ్దము చెవికి, మధ్యమ మనస్సునకు విషయమగుటచే వాని యందున్న భేదమునుబట్టి వానికి భేదము లభించును. వైఖరీశబ్దము వక్తయొక్కయు మధ్యమా శబ్దము శ్రోతయొక్కయు బుద్ధిలో విషయ మగును. కాగా శబ్దములకు భేదము కాల్పనికమే. వాస్తవముగాదు.

మొదటి మతమున నా రెండుశబ్దములకు భేదము స్వాభావికమనియు, రెండవ మతమున నది కాల్పనికమనియు తేలినది.

44 వ శ్లోకముచే మధ్యమాశబ్దము వైఖరీశబ్దమునకు నిమిత్తమను నభిప్రాయముగూడ లభించుచున్నది. అది ఎట్లు? వైఖరీశబ్దమే ముందుగా జనియించుచున్నదికదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అరణిస్థం యథా జ్యోతిః ప్రకాశాన్తరకారణమ్
తద్వచ్ఛబ్దోఽపి బుద్ధిస్థః శ్రుతీనాం కారణం పృథక్. 46

యథా = ఏ ప్రకారముగా, అరణిస్థమ్ = అరణియందు అస్పష్టముగానున్న, జ్యోతిః = తేజస్సు, ప్రకాశాన్తరకారణమ్ = తరవాత స్పష్టమగు తేజస్సునకు కారణమో, తద్వత్ = అట్లే, బుద్ధిస్థః = బుద్ధియందున్న అనగా మధ్యమావాగ్రూపమగు, శబ్దః + అపి = శబ్దముకూడ, పృథక్ = భిన్నములగు, శ్రుతీనామ్ = చెవికి వినబడు అకారము ఇకారము మున్నగు వైఖరీశబ్దములకు, కారణమ్ = కారణమగుచున్నది.

తా. ఎండిన జమ్మికర్రపై రావికర్రను నిలిపి దానికి త్రాడుచుట్టి ఇటు అటు మనుష్యులు లాగుదురు. రావికర్రను నిలుపుటకు జమ్మికర్రకు ఒకరంధ్రముకూడ నిర్మింతురు. అట్లు లాగినచో ఆ కర్రల రాపిడి అధికముకాగా నిప్పు పుట్టును. అట్టి నిప్పు బహుపవిత్రమని భావించి దానితో యజ్ఞాది వైదికకర్మ లాచరింతురు. అట్టి కర్రను అరణియందురు.

అరణిలో నిప్పు సూక్ష్మరూపమున నున్నది. దాని ప్రకాశవాహకత్వాది గుణములు మనకు ప్రత్యక్షముకావు. ఆ యగ్ని అరణిమథనమున బహిర్గతమయి ప్రకాశాది గుణములు కలిగి మనకు ప్రత్యక్షమగుచున్నది. కాగా అరణిలో సూక్ష్మరూపమున ఉన్న అగ్ని ప్రకాశకమనియు దానివలన నభివ్యక్తమగు స్థూలరూపమయిన అగ్ని ప్రకాశ్యమనియు లోకులు గ్రహించుచున్నారు.

అట్లే బుద్ధియందు మధ్యమా వాగ్రూపమున స్ఫోటశబ్దము సూక్ష్మరూపమున నున్నది. ఆ శబ్దమే వక్తయొక్క అభిప్రాయ విశేషమునుబట్టియు, కంఠము, తాలువు మున్నగు స్థానములయొక్క ఆభ్యంతరప్రయత్నముయొక్క సాహాయ్యముచేతను నభివ్యక్తమయి వైఖరీశబ్దమును ప్రకాశింపజేయుచున్నది. కనుకనే వైఖరీవాక్కు చెప్పదలచిన అర్థమున కనుగుణముగానే ఉచ్చరింపబడుచున్నది. అనగా ఘటరూపార్థమును బోధింపదలచినచో దానిని బోధించెడి ఘకార అకార టకార అకారవర్ణములనే ఉచ్చరించుట జరుగుచున్నది. అవి లోపల సూక్ష్మముగానున్న స్ఫోటశబ్దము ననుసరించియే కలుగుటచే నారూపముననున్నవి. అట్లుకానున్న ఆ వైఖరీధ్వనులు ఆ రూపముననే ఉండుట కవకాశము చాలదు. కాబట్టి బుద్ధిస్థమగు శబ్దము ననుసరించియే వైఖరీశబ్దము కలుగుటచే నారెంటికి ప్రకాశ్యప్రకాశకభావరూపమగు కార్య-కారణ భావము కలదని నిశ్చయింపవచ్చును.

మధ్యమా వాగ్రూపమగు స్ఫోటశబ్దము బుద్ధియందు సూక్ష్మరూపమున నున్నది. దానికి స్థూలమగు వైఖరీశబ్దము వ్యంజకమగునని 46 వ శ్లోకమున చెప్పబడిన అర్థమునకు ఉపపత్తి చూపుచు. స్ఫోటశబ్దము ఒక్కటియే కనుక ఘటః అను శబ్దమున కానవచ్చుచున్న వైఖరీ ధ్వనులచే నభివ్యక్తమగు ఆ శబ్దమువలన ఘటరూపార్థబోధ ఏల కలుగదు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

వితర్కితః పురా బుద్ధ్యా క్వచి దర్థే నివేశితః
కరణేభ్యో వివృత్తేన ధ్వనినా సోఽనుగృహ్యతే. 47

పురా = ఉచ్చరించుటకు పూర్వము, బుద్ధ్యా = బుద్ధిచే, వితర్కితః = విశిష్టమగు రూపముచే అనగా ఇతర శబ్దములనుండి వ్యావృత్తి చేయబడిన రూపముచే నిరూపింపబడి నట్టియు, క్వచిత్ = ఒక, అర్థే=అర్థమునందు-అనగా ఏ యర్థమునందు వైఖరిచే నభివ్యక్త మగు స్ఫోటశబ్దమునకు తాదాత్మ్యము గ్రహింపబడినదో అట్టి యర్థమునందు, నివేశితః= ఉంచబడిన-అనగా బుద్ధితో తాదాత్మ్యము పొందిన, సః=ఆశబ్దము, కరణేభ్యః=స్థాన ప్రయత్నములవలన, వివృత్తేన=పుట్టిన, ధ్వనినా=వైఖరీధ్వనిచే, అనుగృహ్యతే=అనుస రించి గ్రహించబడుచున్నది-అనగా తద్రూప సంవలితమై అభివ్యంజితమగుచున్నది.

తా. ఉచ్చారణకు పూర్వము శబ్దము ఎచట ఉన్నది? ఎట్లున్నది? అను ప్రశ్న కలుగుచున్నది. వాచకమగు మధ్యమావాగ్రూపమగు స్ఫోటశబ్దము హృదయసంవలితమగు బుద్ధిలో నున్నది. ఆ శబ్దముతో అర్థము తాదాత్మ్యమును పొందియుండును. శబ్దార్థములు రెండు బుద్ధిరూపమగు ఒకేస్థలమున నుండుటచే వానికి పరస్పరము అధ్యాసము సంభవించ గలదు. అనగా నర్థమునకు శబ్దమునందు, శబ్దమునకు అర్థమునందును ఆరోపము సంభ వించును. శబ్దమునకు ఏ యర్థముతో తాదాత్మ్యము కలుగునో, ఆ యర్థమును బోధించెడి శబ్దమును ఆ బుద్ధి ఇతరశబ్దములకంటె వేరుచేయును. తరువాత ఆ బుద్ధి ఆ శబ్దమును వివక్షిత ప్రకృతార్థమునందు ప్రవేశింపచేయును. ఇది ఉచ్చారణకు పూర్వము శబ్దార్థములకు బుద్ధివలన కలిగిన ప్రక్రియ. ఇది యంతయు శబ్దోచ్చారణకు ముందు జరిగెడి కథాభాగము.

తరువాత పక్త స్థానప్రయత్నములచే వైఖరీశబ్దమును జనియింపచేయును. ఆ ధ్వనుల ననుసరించియే ఆవాచకశబ్ద మభివ్యక్తమగును. కనుక "ఘట" ధ్వనులచే నభివ్యక్త మగు శబ్దము తనతో తాదాత్మ్యమును బొందిన ఘటరూపార్థమునే బోధించును. పటరూపార్థ మును బోధింపనేరదు. పటరూపార్థముతో స్ఫోటశబ్దమునకు తాదాత్మ్యము లేదుకదా! అట్లు కాకున్న స్ఫోటశబ్ద మొక్కటియే కనుక "ఘటః" అను వైఖరీశబ్దముచే నభివ్యక్తమగు స్ఫోటశబ్దమువలన పటరూపార్థబోధ కలిగెడిని.

కాబట్టి వ్యంజకములగు వైఖరీధ్వనుల ననుసరించియే అభివ్యక్తమగు స్ఫోటశబ్ద ముండును.

బుద్ధిస్థమగు స్ఫోటశబ్దము వ్యంజకధ్వనిదూషితమై భాసించిన ఆ శబ్దమునకు నానాత్వమే లభించును. అట్లైనచో శబ్దము నిత్యము, ఏకము అను సిద్ధాన్తము పొసగనేరదు. మరియు క్రమరహితమగు స్ఫోటశబ్దమునందు ధ్వనిధర్మములగు క్రమాదులు నియతముగా భాసించుట యెట్లు? అను సంశయము కలుగగా దానికి సమాధానము చెప్పుచున్నాడు.

నాదస్య క్రమజన్మత్వా న్న పూర్వో నాఽపరశ్చ సః
అక్రమః క్రమరూపేణ భేదవా నివ జాయతే. 48

సః=వైఖరీధ్వనిచే నభివ్యక్తమగు స్ఫోటశబ్దము, పూర్వః=పూర్వత్వముకలది, న+చ=కాదు, అపరః=పరత్వముకలది, న+చ=కాదు, అక్రమః=క్రమములేనిది అనగా పౌర్వాపర్యమనే క్రమములేనిది. అట్లైనను,నాదస్య=వైఖరీధ్వని, క్రమజన్మత్వాత్= క్రమముగా జన్మకలదియగుటవలన, క్రమరూపేణ=నాదగతక్రమరూపమున, భేదవాన్+ ఇవ=భేదముకలదివలె, జాయతే=అగుచున్నది. నిజరూపమున క్రమరహితమైనను

అన్యగతక్రమమును దానియందు ఆరోపించుటచే క్రమముకలదివలె స్ఫోటశబ్దము భాసించు చున్నదని భావము.

తా. బుద్ధిగతమగు స్ఫోటశబ్దము నిజరూపమున నొక్కటియే. దానికి పౌర్వాపర్యము లేదు. పూర్వాపరావయవములు గల వస్తువునకు పౌర్వాపర్యముండును. స్ఫోటశబ్దము నిరవయవము. కాని స్ఫోటశబ్దమును ప్రకాశింపచేయునట్టి వైఖరీశబ్దము తాలువు, పెదవులు మున్నగు అవయవముల కదలికచే పుట్టుట కలదియే. కనుక దానియందు క్రమమున్నందున దానికి కలిగిన క్రమమును స్ఫోటశబ్దమునందు ఆరోపించవచ్చును. కనుక అదియు క్రమముకలదివలె భాసించవచ్చును. వ్యంజకమగు వైఖరీశబ్దమునందు అనుభవసిద్ధమగు క్రమమును వ్యంగ్యమగు స్ఫోటశబ్దమునందు ఆరోపించుటచే స్ఫోటశబ్దము క్రమవంతమువలె కాన్పించును.

కాబట్టి స్ఫోటశబ్దమునకు నిజరూపమునుబట్టి ఏకత్వనిత్యత్వములు, వ్యంజకధ్వనిగతక్రమమును ఆరోపించుటచే క్రమనియమముగూడ యుక్తమగును.

స్ఫోటశబ్దము ధ్వనిధర్మమగు క్రమమును గ్రహించుచున్నదనుటలో దృష్టాన్తమును చూపుచున్నాడు.

ప్రతిబిమ్బం యథాఽన్యత్ర స్థితం తోయక్రియావశాత్
తత్ప్రవృత్తిమివాఽన్వేతి స ధర్మః స్ఫోటనాదయోః. 49

అన్యత్ర = మరియొకస్థలమున అనగా నీరు మున్నగుచోటులందు, స్థితమ్ = ఉన్నటువంటి, ప్రతిబిమ్బమ్ = చంద్రాది ప్రతిబింబము, తోయక్రియావశాత్ = ఉదకముయొక్క చలనక్రియవలన, తత్ప్రవృత్తిమ్ = ఆ ఉదకముయొక్క ప్రవృత్తిని, యథా = ఏరీతిగా, అన్వేతి + ఇవ = అనుసరించి వెడలుచున్నట్లున్నదో, సః + ధర్మః = ఆ సాదృశ్యము అనగా ఉపాధిధర్మము ననుసరించుట, స్ఫోటనాదయోః = స్ఫోటశబ్దమునకు నాదమునకును, అస్తి = కలదు.

తా. ధ్వనులకు హ్రస్వత్వ దీర్ఘత్వాది ధర్మములు, ఇది ముందు, ఇది వెనుక అను క్రమరూపమగు ధర్మములు కూడ కలవు. అట్టి ధ్వనులచే స్ఫోటశబ్ద మభివ్యక్తమగును. వ్యంజకమగు ధ్వనియొక్క పైధర్మములు వ్యంగ్యమగు స్ఫోటశబ్దమునందు కాన్పించుచున్నవి. అన్యధర్మము అన్యత్ర భాసించును. ఇందుకు ప్రతిబింబము దృష్టాన్తముగా చూపబడినది. చంద్రబింబము నీటిలో ప్రతిఫలించును. ఆ ప్రతిబింబమునకు స్వతః చలనము మున్నగు వికారములు లేవు. కాని నీటినిబట్టి దానికి వికారములు కలుగుచున్నవి. నీరు కదలిన ప్రతిబింబముకూడ అట్లే కాన్పించును.

శబ్దము ఎట్లు అర్థప్రకాశకమగునో ఆ సంగతిని సదృష్టాన్తముగా చూపుచున్నాడు.

ఆత్మరూపం యథా జ్ఞానే జ్ఞేయరూపం చ దృశ్యతే
అర్థరూపం తథా శబ్దే స్వరూపం చ ప్రకాశతే. 50

యథా = ఎట్లు, జ్ఞానే = జ్ఞానమునందు, జ్ఞేయరూపమ్ = జ్ఞేయములగు ఘట పటాదుల స్వరూపము, ఆత్మరూపం + చ = తనయొక్క అనగా జ్ఞానముయొక్క స్వరూపమున్ను,

దృశ్యతే=ప్రత్యక్షముగా చూడబడుచున్నదో, జ్ఞానము కలుగగా అందు ఘటము, పటము మున్నగు అర్థము, జ్ఞానముకూడ భాసించునని భావము.

తథా=అట్లు, శబ్దే=శబ్దమునందు, అర్థరూపమ్=ఘటము, పటము మున్నగు వస్తువుల స్వరూపము, స్వరూపం+చ=శబ్దముయొక్క స్వరూపమున్ను, ప్రకాశతే= ప్రకాశించుచున్నవి.

తా. 'ఘట మానయ' అని యొకడు పలుకగా ఆ వాక్యము వినువానికి 'కడవను తెమ్ము 'అను జ్ఞానము కలుగుచున్నది. జ్ఞాన మనగా తెలివి. అది ఘటము, పటము మున్నగు వస్తువులను ఊతగా గైకొనియే యుండును. వస్తువులను స్పృశింపక కేవలజ్ఞాన ముండనేరదు. విశేష మేమనగా జ్ఞానము వస్తువులను భాసింపచేయును. అజ్ఞానమున అదియుగూడ భాసించును. దీపముకూడ ఇట్టిదే. అది వస్తువులను మన కంటికి గోచరమగునట్లు చేయును. తాను కూడ మన కంటికి గోచరించును. అట్లే శబ్దముకూడ విషయమును జ్ఞానవిషయమైనదానినిగా జేయును. అందు ఆ జ్ఞానముకూడ విషయమగును. ఘటః అను శబ్దమువలన 'కడవ' అను జ్ఞానము కలుగుచున్నది. ఆ జ్ఞానములో 'కడవ' అను వస్తువు, ఘకార అకార టకార అకార విసర్గరూపమగు శబ్దము ఈ రెండు కలసియే యుండును. శబ్దముకూడ భాసించనియెడల 'కడవ' అనియే జ్ఞానముయొక్క స్వరూపము లభించును. శబ్దముకూడ భాసించినచో 'ఘట శబ్దముచే బోధింపబడిన కడవ' అని జ్ఞానముయొక్క ఆకారము చూపవలెను.

వి. ఘటాదిశబ్దములకు అర్థము నందు వలె శబ్దస్వరూపమున గూడ శక్తిని స్వీకరించవలెను. అర్థము విశేష్యముగను, అంతు శబ్దము విశేషణముగను ఉండును. వ్యాకరణ సూత్రాలలో కన్యా, అగ్ని మున్నగు శబ్దము లున్నవి. అచట మాత్రము శబ్దమే విశేష్యమగును. అందు అర్థము విశేషణముగ నుండును.

వైఖరీవాక్కు మధ్యమావాక్కునకు నిమిత్తము. ఇది శ్రోతకు సంబంధించినది. వక్తకు మాత్రము మధ్యమావాక్కు వైఖరీ వాక్కునకు నిమిత్తమని 44వ శ్లోకమున చెప్పబడినది. ఆ యభిప్రాయమునే దృష్టాన్తముతో స్పష్టపరచుచున్నాడు.

అణ్ణభావమి వాఽఽఽపన్నో యః క్రతుః శబ్దసంజ్ఞకః
వృత్తి స్తస్య క్రియారూపా భాగశో భజతే క్రమమ్. 51

శబ్దసంజ్ఞకః=శబ్దమనే పేరుకలిగిన, యః=ఏ, క్రతుః=బుద్ధి, అణ్ణభావమ్=రసభావమును, ఆపన్నః+ఇవ=పొందినదివలె నున్నదో, తస్య=ఆ బుద్ధియొక్క, క్రియారూపా=ఆవిర్భావ తిరోభావరూపమగు, వృత్తిః=వ్యాపారము, భాగశః=ప్రత్యవయవము నందు, క్రమమ్=వరుసను, భజతే=పొందుచున్నది.

తా. వైఖరీవాక్కు మధ్యమావాక్కునకు నిమిత్తమగును. ఇట్లు చెప్పుట శ్రోత నుద్దేశించి యున్నది. వక్తకు మాత్రము మధ్యమాశబ్దమే వైఖరీవాక్కునకు నిమిత్తమగును. క్రమముకలిగిన వైఖరీశబ్దము శ్రోతయొక్క బుద్ధిలో ప్రవేశించుసరికి క్రమమును విడనాడి ఏకరూపముగా నుండును. ఆ శబ్దమే మరల ఇతరులతో మాట్లాడునపుడు క్రమవంతమై భాసించును. కాగా మనము మాట్లాడునపుడు వైఖరీ శబ్దము సక్రమము. అదియే శ్రోత యొక్క బుద్ధిలో ప్రవేశించి క్రమరహితమై యున్నది. అదియే ఇతరులతో మాట్లాడుసరికి

వైఖరీరూపమునుదాల్చి క్రమవంతమగును. ఈ రీతిగా శబ్దము పర్యావర్తమగుచున్నది. శబ్దమిన్ని విధములుగా కాన్పించుటలో నొకదృష్టాంతము చూపబడినది. నెమలి మున్నగు పక్షులు అవయవ విభాగముకలవై చక్కని రూపముతో కాన్పించుచున్నవి. ఇది పక్షియొక్క విభక్తమగు అవస్థ. ఆడనెమిలి, మగనెమిలి జంటగా కలియగా వాని యవయవములనుండి రసము జారి ఆడదాని కడుపులో గ్రుడ్డురూపముగా మారుచున్నది. దానిలో మరల నెమిలిగా పరిణమించే శక్తికలిగిన రసమున్నది. ఇది పక్షియొక్క అవిభక్తమగు అవస్థ. గ్రుడ్డును పొదగగా ఆ రసమే నెమిలియొక్క రూపమున కానవచ్చుచున్నది. ఇది పక్షియొక్క మరల విభక్తమగు అవస్థ. నెమిలి మున్నగువానికి పయి ప్రకారము కలిగే అవస్థాత్రయము శబ్దమునకు గూడ పయి రీతిని కానవచ్చుచున్నది.

వి. క్రతుశబ్దము ఉపనిషత్తులలో నిశ్చయార్థకముగా నున్నది. నిశ్చయార్థమును బట్టి ఇచట క్రతుశబ్దము బుద్ధివాచకము. అండమనగా గ్రుడ్డు. దానియందున్నది – ఆండము = రసము. భాగశబ్దమున కవయవ మర్థము. దానికంటె వీప్సార్థమున 'శస్' తద్ధిత ప్రత్యయము. వీప్స అనగా వ్యాప్తి.

మనుష్యుడు మాట్లాడునపుడు శబ్దమునకు క్రమము కానవచ్చును. శ్రోతకు మాత్రము బుద్ధిలో ఆక్రమము కానరాక ఏకాకారముగానే శబ్దము భాసించును అని చెప్పబడిన పై యర్థమున మరియొక దృష్టాంతమును జూపుచున్నాడు.

యథైకబుద్ధివిషయా మూర్తి రాక్రియతే పటే
మూర్త్యన్తరస్య త్రితయ మేవం శబ్దేఽపి దృశ్యతే. 52

యథా = ఎట్లు, మూర్త్యన్తరస్య = చిత్రములోని మూర్తికి సంబంధించినట్టియు, ఏక బుద్ధి విషయా = ఒకేబుద్ధికి విషయమగునట్టియు – మనుష్యుని [illegible] ముందుగ ప్రత్యేకముగ గ్రహింపబడి తరువాత చిత్రకారునికి ఒకే బుద్ధి [illegible] సామాన్యాకారమున గోచరించునని భావము. మూర్తిః = బుద్ధిలోనున్న స్వరూపము, పటే = వస్త్రమునందు, ఆక్రియతే = ఆకారవంతముగా చేయబడుచున్నదో.

ఏవమ్ = అట్లే, శబ్దే + అపి = శబ్దమునందుగూడ, త్రితయమ్ = ఈ రూప త్రయము, దృశ్యతే = ప్రత్యక్షముగా చూడబడుచున్నది.

తా. ఒక మనుష్యుని చిత్రమును వ్రాయదలచిన చిత్రకారుడు ముందుగా ఆ మనుష్యుని ప్రత్యవయవమును గుర్తించును. ఇది విభక్తమగు ప్రాథమికావస్థ. తరువాత అవయవ విభాగము లేకుండ మనుష్యుని రూపమును తన బుద్ధిలో సామాన్యాకారమున నుంచుకొనును. ఇది యవిభక్తమగు రెండవ యవస్థ. మరల ఆతడు ఆ మనుష్యుని చిత్రమును వస్త్రమునందో కాక కాగితమునందో తాను ముందు గుర్తించినరీతిని అవయవ విభాగముతో లిఖించును. ఇది విభక్తమగు మూడవ యవస్థ. కాగా బాహ్యమూర్తి, చిత్రకారుని బుద్ధిలో నున్నమూర్తి, చిత్రరూపమున నున్న మూర్తి అని ఒకేరూపమునకు అవస్థాత్రయము కలుగుచున్నది. ఈ యవస్థాత్రయము శబ్దమునకుగూడ కలుగుచున్నది.

వి. 'ఏకబుద్ధిః విషయః యస్యాః సా' అను రీతిని బహువ్రీహి సమాసమును స్వీకరించగా, మూర్తిః అను విశేష్యమును బట్టి స్త్రీలింగ మువపన్న మగుచున్నది.

శబ్దము తన రూపమును గూడ గ్రహించునని మరల నిరూపించుచున్నాడు.

యథా ప్రయోక్తుః ప్రాగ్ బుద్ధిః శబ్దేష్వేవ ప్రవర్తతే
వ్యవసాయో గ్రహీతౄణా మేవం తేష్వేవ జాయతే . 53

యథా=ఏరీతిగా, ప్రయోక్తుః=శబ్దమును ప్రయోగించువానియొక్క, బుద్ధిః= బుద్ధి, ప్రాక్=ముందుగా అనగా అర్థమును బోధించుటకు పూర్వము, శబ్దేషు+ఏవ= శబ్దములందే, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నదో.

ఏవమ్=ఈ రీతిగా, గ్రహీతౄణామ్=అర్థమును గ్రహించెడి శ్రోతలయొక్క, వ్యవసాయః=బుద్ధి, తేషు+ఏవ=శబ్దములందే, జాయతే=కలుగుచున్నది— ప్రవర్తించు చున్నది.

తా. వక్త తన యభిప్రాయమును ఇతరులకు బోధించు సమయమున ముందుగా తన బుద్ధిని శబ్దములందే ప్రవర్తింపచేయును. వానిద్వారా తన భావమును వ్యక్తపరచును.

శబ్దములను విని అర్థముచేసుకొనేవాడు శ్రోత. అతడు తనబుద్ధిని ముందుగా శబ్దములందే ప్రవర్తింపచేయును. వానిద్వారా అర్థమును గ్రహించును. ముందుగ శబ్దముల స్వరూపమును గ్రహింపనిదే అర్థమును గ్రహింపలేడు గదా!

కాబట్టి శబ్దము అర్థమును తన రూపమునుగూడ జ్ఞానమున విషయమగునట్లు చేయునని తెలుచున్నది. 51వ శ్లోకముచే బోధింపబడిన యర్థమును ఈ కారికా గ్రంథము వివరించు చున్నది.

వి. ప్రయోక్తకు బుద్ధిలో ముందుగా అర్థమే భాసించును. దానిని అనుసరించియే వానికి శబ్దములు గోచరించును. ఈ స్థితిలో నర్థము ముందు, తరువాత శబ్దము. ఈ క్రమము ననుసరించి, "యథా ప్రయోక్తుః" అను కారికాభాగము వ్రాయబడలేదు. మరి యేమన, ఇతరులకు తన భావమును వ్యక్తపరచునపుడు జరిగెడిక్రమము ననుసరించి వ్రాయబడినది. ఈ స్థితిలో అర్థముకంటె ముందుగా శబ్దములే వక్తయొక్క బుద్ధిలో భాసించుచున్నవి.

శబ్దము అర్థబోధకమగుటలో ఒక విశేషము: ఘటః అను శబ్దము అర్థవిషయిక మగు జ్ఞానమును కలిగించును. అంతటితో సరిపడక ఘకార అకార టకార అకార రూప మగు తన రూపమునుగూడ జ్ఞానమున విషయమగునట్లుచేయునని చెప్పబడినది. ఒక సంశయము—లోకులు 'ఘట మానయ' (కుండను తీసుకొనిరమ్ము) అని ప్రయోగించగా కుండను తీసుకొనివచ్చుచున్నారు. "అన్నము తినుము" అని ప్రయోగించగా అన్నము తినుచున్నారు. అచట ఘటశబ్దార్థము, అన్నశబ్దార్థము ఆనయనము భోజనము అను క్రియలతో సంబంధించు చున్నవి. అట్లే ఆ క్రియలతో 'ఘట' 'అన్న' అను శబ్దములు గూడ ఏల సంబంధించవు? అవియును భాసించుచునే యున్నవికదా! అనగా శబ్దము అర్థమును తన రూపమును గూడ ప్రకాశింపజేసినపుడు అర్థము క్రియలతో సంబంధించినట్లు శబ్దముకూడ సంబంధించవలెనుగదా! పయి సంశయమును పోగొట్టుచున్నాడు.

అర్థోపసర్జనీభూతా నభిధేయేషు కేషుచిత్
చరితార్థాన్ పరార్థత్వా న్న లోకః ప్రతిపద్యతే . 54

లోకః=జనము, కేషుచిత్=కొన్ని, అభిధేయేషు=అర్థములయందు, అనగా శబ్దముచే బోధింపబడిన శబ్దరూపములగు అర్థములయందు, చరితార్థాన్=సఫలమగునట్టి,

అర్థోపసర్జనీభూతాన్ = ఘటము మున్నగు అర్థములయందు అప్రధానములగు శబ్దములను, పరార్థత్వాత్ = అర్థబోధ కుపయుక్తములగుటచే, పరాధీనములగుటవలన, న + ప్రతిపద్యతే = గ్రహించుటలేదు. ఆనయనము మున్నగు క్రియలతో శబ్దములను సంబంధింప చేయలేదని భావము.

తా. లోకులు తమ మనస్సులోనున్న అభిప్రాయమును ఇతరులకు బోధింప దలచినపుడు దానికి సాధనముగా శబ్దముల నుపయోగింతురు. అచట అర్థబోధనము ప్రధానము. దానికి సాధనముగా నుపయోగపడుచున్నందున శబ్ద మప్రధానము. భోజనము చేయువాడు దానికి సాధనముగా పళ్లెము, విస్తరంట మున్నగువానిని ఉపయోగించును. ఆ వస్తువులవంటివి శబ్దములు. కనుక అప్రధానములైనందున లోకము శబ్దములను ఆనయనాది క్రియలతో సంబంధింపచేయుటలేదు.

వి. అట్లు అప్రధానము కాకున్న శబ్దములకు క్రియలతో సంబంధమును చూపుచునే యున్నారు. వ్యాకరణమున కన్యా, అగ్ని మున్నగు శబ్దముల నుచ్చరించి కొన్ని కార్యములు చెప్పబడినవి. ఆ శబ్దములు కార్యములతో సంబంధించుచునే యున్నవి.

శబ్దము అర్థమును ప్రకాశింపచేయును. తనరూపమును గూడ ప్రకాశింపజేసుకొనును అని 50 వ శ్లోకమున (ఆత్మరూపమ్) చెప్పబడినది. శబ్దము ప్రకాశకము ప్రకాశ్యముకూడ అగును అని దాని భావము తేలుచున్నది. ప్రకాశకత్వ ప్రకాశ్యత్వములు రెండు విరుద్ధ ధర్మములు ఒక శబ్దము నందు ఉండగలవా? అను సంశయమును తొలగించుచున్నాడు.

> గ్రాహ్యత్వం గ్రాహకత్వం చ ద్వే శక్తీ తేజసో యథా
> తథైవ సర్వశబ్దానా మేతే పృథగివ స్థితే. 55

యథా = ఏరీతిగా, తేజసః = దీపము మున్నగు తేజమునకు, గ్రాహ్యత్వమ్ = గ్రహింపబడుటయు, గ్రాహకత్వం + చ = గ్రహింపజేయుటయు అనెడి, ద్వే = రెండు, శక్తీ = శక్తులు, స్థితే = ఉన్నవో, తథా + ఏవ = అట్లే, సర్వశబ్దానామ్ = అన్నిశబ్దములకు, ఏతే = గ్రాహ్యత్వము, గ్రాహకత్వము అను విలక్షణములగు ఈ రెండు శక్తులు, పృథక్ + ఇవ = వేరుగా నున్నట్లు కాన్పించుచున్నవై, స్థితే = ఉన్నవి.

తా. ఉచ్చరింపబడిన శబ్దమర్థబోధను కలిగించుచున్నది. అందుచే నది గ్రాహక మనబడుచున్నది. కాబట్టి దానియందు గ్రాహకత్వమను శక్తి యున్నట్లు తెల్లము. అర్థబోధ కలుగునపుడు అర్థముతోపాటు శబ్దముకూడ జ్ఞానమున విషయ మగుచున్నది. అందుచే శబ్దమునందు గ్రాహ్యత్వమనెడి శక్తియు ఉన్నట్లు తెల్లము.

ఇందు తేజము దృష్టాన్తము. ఈ యర్థమును 50 వ శ్లోకమున వివరించి యుంటిని. ఆ శ్లోకమున ఈ యర్థమునకు జ్ఞానము దృష్టాన్తముగా జూపబడినది. కాగా జ్ఞానము, తేజము, శబ్దము ఈ మూడు ఒకే శ్రేణికి చెందియున్నవి. ఇవి ఇతరవస్తు ప్రకాశకములు, స్వప్రకాశకములుగూడ నగుచున్నవి. కాగా గ్రాహ్యత్వ గ్రాహకత్వములు, ప్రకాశ్యత్వ ప్రకాశకత్వములు ఈ మూడింటియందు కానవచ్చు చున్నవి.

వి. ఘటము మున్నగు వస్తువులు గ్రాహ్యములే; గ్రాహకములు కానేరవు. కన్ను, చెవి మున్నగు ఇంద్రియములు గ్రాహకములే; గ్రాహ్యములు కానోపవు. ఈ రీతిగా జూచిన నా రెండు ధర్మములు ఏకత్ర ఉండునవి కావు. కాని తేజమునందును, జ్ఞానమునందును ఈ

రెండు ధర్మములు కానవచ్చుచున్నందున శబ్దమునందుగూడ అవి యుండుటలో విరోధము లేదు.

ఈ రెండు శక్తులు శబ్దమున కవిభక్తములగు రూపములే. ఐనను రెండువిధములగు కార్యములనుబట్టి వేరుగానున్నట్లు భాసించుచున్నవి. ఈ యభిప్రాయమును 'ఇవ' శబ్దము స్పష్టపరచుచున్నది.

శబ్దమునందు గ్రాహ్యత్వము గ్రాహకత్వము అనెడి శక్తులు స్వీకరించుటవలన కలిగెడి ప్రయోజనమును జూపుచున్నాడు.

విషయత్వ మనాపన్నైః శబ్దై ర్నార్థః ప్రకాశ్యతే
న సత్తయైవ తేఽర్థానా మగృహీతాః ప్రకాశకాః. 56

విషయత్వమ్ = జ్ఞానములో విషయ భావమును, అనాపన్నైః = పొందనటువంటి- అనగా ఇది ఘటపదము, ఇది పటపదము అని ప్రత్యేకముగా గుర్తింపబడని, శబ్దైః = శబ్దములచే, అర్థః = అర్థము, న + ప్రకాశ్యతే = ప్రకాశింపబడనేరదు. జ్ఞాతమగు శబ్దమే అర్థబోధక మగును. జ్ఞాతము కాకున్న బోధకము కానేరదు.

తే = ఆ శబ్దములు, అగృహీతాః = అజ్ఞాతములై, అనగా తెలియబడనివై, సత్తయా + ఏవ = ఉనికిమాత్రముచేతనే, అర్థానామ్ = అర్థములకు, ప్రకాశకాః = ప్రకాశకములు, న = కానేరవు.

తా. కొన్ని పదార్థములు జ్ఞాతములు కాకపోయినను కార్యజనకము లగుచున్నవి. ఇది 'పంచదార' అని తెలిసినను తెలియకున్నను నాలుకపై ఉంచగా దానిరుచి తెలియును. 'ఇది నిప్పు' అని తెలిసినను తెలియకున్నను తాకినంతమాత్రాన చురుకుమనును. ఇట్లే కన్ను, చెవి మున్నగు ఇంద్రియములుకూడ జ్ఞానజనకములగుచున్నవి. ఇవి సత్తామాత్రముననే కార్యమును కలిగించుచున్నవి.

శబ్దము అట్టిదికాదు. 'ఇది ఘటశబ్దము' అని విశేషరూపమున జ్ఞానవిషయమైనపుడే అర్థబోధ కలుగుచున్నది. అది ఉనికి మాత్రాన బోధకము కాదు.

శ్రోత్రేంద్రియము వర్ణములనే గ్రహించును. అవి యర్థబోధకములు కావు. వానిచే నభివ్యక్తమగు శబ్ద మర్థబోధక మగును. జ్ఞానమున శబ్దముకూడ విషయమగుటచే నది వాచకమగుచున్నది. శబ్దమునందు రెండు శక్తు లంగీకరించుటవలన నిది లభించుచున్నది.

'ఇది ఘటశబ్దము' అని విశేషాకారమున శబ్దము గృహీతమగునపుడే అర్థబోధ కలుగును అనుటలో మరియొక కారణమును జూపుచున్నాడు.

అతోఽనిర్జ్ఞాతరూపత్వాత్ కిమాహే త్యభిధీయతే
నేన్ద్రియాణాం ప్రకాశ్యేఽర్థే స్వరూపం గృహ్యతే తథా. 57

అతః = ఈ కారణమువలన, అనగా జ్ఞాతమగుశబ్దమే అర్థబోధకమని యంగీకరించుటవలన, అనిర్జ్ఞాతరూపత్వాత్ = విశేషరూపమున శబ్దరూపము తెలియబడనందున (నిర్జ్ఞాతముకాని రూపము కలవాడగుటవలన అని వాచ్యార్థము) కిమ్ + అహ = ఏమిటియంటివి?

అని, అభిధీయతే=చెప్పబడుచున్నాడు - అడుగబడుచున్నాడు. వినేవాడు కర్త, ముందు పలికినవాడు కర్మ, ఇది కర్మార్థక ప్రయోగము.

ఇన్ద్రియాణామ్=కన్ను, చెవి మున్నగు ఇంద్రియములకు, ప్రకాశ్యే=ప్రకాశింప జేయదగిన, అర్థే=ఘటము, పటము మున్నగు అర్థము విషయమై, స్వరూపమ్=ఇంద్రియ ముల స్వరూపము, తథా=అట్లు, అనగా అర్థబోధనమున శబ్దమువలె, న+గృహ్యతే= గ్రహింపబడదు.

తా. శబ్దము నుచ్చరించగా నర్థబోధ కలుగుచున్నది. ఆలోచించినచో నంత మాత్రాన బోధ కలుగనేరదు. శబ్దము గృహీతము కావలెను. ఈ యంశమును నచ్చజెప్పవలె నన్నచో దాని లేమినిబట్టి తేలును. మాట్లాడగా ఆ శబ్దము గృహీతమగుటచే బోధకలుగు చున్నది. ఒకడు 'కడవను తెమ్ము' అని పలుకగా ఇతరులకు ఆ శబ్దము వినబడకపోతే కడవను తీసుకురాలేడు. అపుడు వినువాడు "నీవు ఏమిటి యంటివి?" అని ప్రశ్నించును అట్లుకాక శబ్దము గృహీతము కాకపోయినా బోధకమగుచో పై ప్రశ్నకు తావులేదుకదా! మొదటివాడు మరల గట్టిగా స్పష్టముగా జెప్పగా ఆ శబ్దము గృహీతమైనందున అతనికి జ్ఞానము కలుగుచున్నది

వి. కన్ను, చెవి మున్నగు ఇంద్రియములు ఇట్టివి కావు. దీని భావమును 56వ శ్లోకమున వివరించితిని.

56వ శ్లోకమున శబ్దమునకు గ్రాహ్యత్వ గ్రాహకత్వము లండు రెండు శక్తు లున్నవని చెప్పబడినది దానికి వ్యాకరణశాస్త్రమున గల విశేష ప్రయోజనమును జూపు చున్నాడు.

భేదేనాఽవగృహీతౌ ద్వౌ శబ్దధర్మా వపోద్ధృతౌ
భేదకార్యేషు హేతుత్వ మవిరోధేన గచ్ఛతః. 58

ద్వౌ=రెండు, శబ్దధర్మౌ=శబ్దమునందున్న ధర్మములు-అనగా 56వ శ్లోకమున చూపిన గ్రాహ్యత్వ గ్రాహకత్వములనెడి శక్తిరూపములగు ధర్మములు, అపోద్ధృతౌ=వేరు చేయబడుచున్నవై - అనగా ఒకే శబ్దమునందు మిళితములుగా నున్న ధర్మములు బుద్ధిచే వేరుగా విభజింపబడినవై, భేదకార్యేషు=భేదము నిమిత్తముగాగల కార్యములయందు-అనగా రెండు పదార్థములు వేరుగా నున్నపుడు కలిగెడి సంజ్ఞాసంజ్ఞి సంబంధములందు, అవిరోధేన=విరోధము లేకపోవుటచే - విరోధమును విడిచి యని భావము, హేతుత్వమ్=కారణత్వమును, గచ్ఛతః=పొందుచున్నవి.

తా. భేద మనగా నానాత్వము దానిని బట్టియే పదార్థములకు సంబంధ మేర్పడు చున్నది. వ్యాకరణమున కొన్నిస్థలములలో ఒకే శబ్దవ్యక్తికి సంజ్ఞాసంజ్ఞిభావము చూపబడినది దానిని కుదురుపాటు చేయుటకై శబ్దమునందు ఏకరూపముగా నున్న శక్తికి నానాత్వమును జూపుచున్నారు. శక్తిభేదముచే శబ్దమునకు నానాత్వము లభించును. అట్టి శబ్దములకు సంజ్ఞా సంజ్ఞి భావము సిద్ధించుచున్నది. అట్లు కాకున్న ఒకే శబ్దమునకు పయి సంబంధము కలుగ నేరదు. ఒకవ్యక్తిని ప్రత్యేకముగా గుర్తించుట కుపయోగించే సాధనము సంజ్ఞ. అట్టిసంజ్ఞచే గుర్తింపబడేది సంజ్ఞి. ఉదా: రాముడు, భీముడు, నలుడు మున్నగునవి సంజ్ఞలు. ఇవి శబ్ద రూపములు. ఆ సంజ్ఞాపదములచే గ్రహింపబడు రామ, భీమ, నల వ్యక్తులు సంజ్ఞులు. అవి

మనుష్యరూపములు. ఇచట సంజ్ఞకు సంజ్ఞికి భేదము స్పష్టముగా నుండుటచే వానికి సంజ్ఞా సంజ్ఞి భావ ముపపన్నమగుచున్నది.

వ్యాకరణ సూత్రములలో ఒకేశబ్దమునకు సంజ్ఞాసంజ్ఞిభావ మున్నది. అచట ఒకేశబ్దము రెండుశక్తుల కాశ్రయమగుటచే భిన్నమయినది. అట్టి రెండుశబ్దములకు పై సంబంధము లభించినది. గ్రాహకత్వధర్మముగల శబ్దము సంజ్ఞగాను, గ్రాహ్యత్వధర్మముకల శబ్దము సంజ్ఞిగాను జూడబడుచున్నవి. పయిరీతిని నాశ్రయించనిచో ఒకేస్థలమున విరుద్ధ ధర్మము లుండనేరవు. పయిపద్ధతిని నాశ్రయించిన, నట్టి విరోధము తొలగి భేదమూలకమగు పై సంబంధము సిద్ధించును.

ఈ శ్లోకార్థమునకు లక్ష్యము 60 వ శ్లోకము వివరించనున్నది.

58 వ శ్లోకమున చెప్పబడిన అర్థమునకు 60 వ శ్లోకముచే లక్ష్యమును జూపదలచి దానికి ముందుగా వ్యాకరణ సమ్మతమగు వృద్ధి, గుణ, సవర్ణ – మున్నగు అర్థమును దృష్టాన్తముగా జూపుచున్నాడు.

వృద్ధ్యాదయో యథా శబ్దాః స్వరూపోపనిబన్ధనాః
ఆదైచ్ప్రత్యాయితైః శబ్దైః సంబన్ధం యాన్తి సంజ్ఞిభిః . 59

వృద్ధ్యాదయః = వృద్ధి మున్నగు, శబ్దాః = శబ్దములు-అనగా వ్యాకరణశాస్త్రమున సూత్రములలో నుపయోగింపబడిన సంజ్ఞాశబ్దములు, స్వరూపోపనిబన్ధనాః = శబ్దస్వరూపమే ప్రవృత్తినిమిత్తముగా గలవై, ఆదైచ్ప్రత్యాయితైః = ఆదైచ్ అను శబ్దముచే బోధింపబడు నట్టియు, సంజ్ఞిభిః = సంజ్ఞిగా నున్నట్టియు, శబ్దైః = ఆ ఐ ఔ అనెడి శబ్దములతో, సంబన్ధమ్ = సంజ్ఞాసంజ్ఞి రూపమగు సంబంధమును, యథా = ఏరీతిగా, యాన్తి = పొందుచున్నవో; ఈ శ్లోకార్థము 60 వ శ్లోకార్థముతో నన్వయించును.

తా. "వృద్ధి రాదైచ్" 1-1-1 అను పాణిని సూత్రము అకార ఐకార ఔకారములకు 'వృద్ధి' సంజ్ఞను విధించుచున్నది. వృద్ధిశబ్దము సంజ్ఞ. ఆదైచ్ అను పదముచే బోధింపబడినవి సంజ్ఞులు. ఇచట సంజ్ఞ, సంజ్ఞియు స్వతః వేరుగా నున్నవి. కాబట్టి వానికి సంజ్ఞా సంజ్ఞి సంబంధము సరసముగా కుదురుచున్నది.

ఒకే శబ్దమునకు సంజ్ఞా సంజ్ఞి సంబంధము చూపవలెను. అచట రెండు శబ్దములు యథార్థముగాలేవు. అందుచే నచట ధర్మభేదముచే శబ్దభేదము కల్పితమగుచున్నది.

కాగా రెండు పదార్థములు స్వతః వేరుగా నున్నచోట సంజ్ఞా సంజ్ఞి భావమును జూపునట్లు కల్పనావశమున శబ్దభేదమున్నచోటున గూడ ఆ సంబంధము చూపనగును. ఈ యభిప్రాయముతో భర్తృహరి ఈ దృష్టాన్త వాక్యార్థమును జూపెను. శబ్దములు స్వతః భిన్నములుగా నుండి సంజ్ఞా సంజ్ఞి భావమును బొందిన స్థలములు వ్యాకరణమున చాల కలవు. విశేషమేమన- సంజ్ఞాపదము పదమునే బోధించును. ఆదైచ్చులు వృద్ధిసంజ్ఞకములు అని సామాన్యముగా నర్థము కలదు. ఆదైచః వృద్ధిపదాభిన్నాః అనునది వాచ్యార్థము. ఈ యంశమును 60 వ శ్లోకము వివరించును.

వి. ఈ శ్లోకమున 2 శబ్ద శబ్దములున్నవి. 1. శబ్దాః-ఇది సంజ్ఞాశబ్ద బోధకము. 2. శబ్దైః = ఇది సంజ్ఞిశబ్దబోధకము.

దృష్టాన్తమును జూపి దానికి ప్రకృతమున సమన్వయము జూపుచున్నాడు.

అగ్నిశబ్ద స్తథైవాఽయ మగ్నిశబ్దనిబన్ధనః
అగ్నిశ్రుతై ర్యైతి సంబన్ధ మగ్నిశబ్దాభిధేయయా . 60

తథా + ఏవ = అట్లే-అనగా వృద్ధ్యాదిశబ్దములవలె, అగ్నిశబ్ద నిబన్ధనః = అగ్ని శబ్దమే ప్రవృత్తినిమిత్తముగాకల, అగ్నిశబ్దః = అగ్నిశబ్దము — అనగా "అగ్నే ర్ఢక్" (4-2-33) మున్నగు సూత్రములందున్న అగ్నిశబ్దము, అగ్నిశబ్దాభిధేయయా = సూత్ర మునందున్న అగ్నిశబ్దముచే బోధింపబడిన, అగ్నిశ్రుత్యా = లక్ష్యములో నున్న అగ్ని శబ్దముతో, సంబన్ధమ్ = సంజ్ఞా సంజ్ఞి భావరూపమగు సంబంధమును, ఏతి = పొందుచున్నది.

తా. అగ్నిః దేవతా అస్య (అగ్ని ఈ హవిర్భాగమునకు దేవత) అను నర్థమున అగ్నిశబ్దముకంటె "అగ్నే ర్ఢక్" (4-2-33) అను సూత్రముచే "ఢక్" తద్ధిత ప్రత్యయము ప్రవర్తించును. ఆయా ప్రక్రియావశమున "ఆగ్నేయమ్" అను రూప మేర్పడును. సూత్రమునందున్న అగ్నిశబ్దముచే లక్ష్యమునందున్న అగ్నిశబ్దము బోధింపబడి దానికంటె ప్రత్యయము ప్రవర్తించును. కాగా సూత్రస్థమగు అగ్నిశబ్దము సంజ్ఞగను, లక్ష్యమగు అగ్నిశబ్దము సంజ్ఞిగను కాన్పించి రెండును సంజ్ఞా సంజ్ఞిభావమును పొందుచున్నవి. ఇచట ఒకే శబ్దమునకు పయి సంబంధము కలుగుచున్నది. ఈ శబ్దమునందు గ్రాహ్యత్వ గ్రాహ కత్వ శక్తిద్వయయోగమున భేదము కల్పితమగుటచే పయి వ్యవహారము నిరాఘాటముగా సుస్థిరమగుచున్నది.

వి. ఇట్టి శబ్దములకు సంజ్ఞా సంజ్ఞిభావమును "స్వంరూపం శబ్దస్య" (1-1-68) అను సూత్రముచే పాణిని బోధించి యున్నాడు. శబ్దమునకు తనరూపమే సంజ్ఞియగునని సూత్రార్థము. శబ్దమునందు గ్రాహ్యత్వ మున్నది కనుక అది సంజ్ఞియు, దానియందు గ్రాహ కత్వమున్నది కనుక అది సంజ్ఞయు రెండు నగుచున్నది. వ్యాకరణమున సూత్రములలో ఆయా శబ్దముల నుచ్చరించి కార్యములను విధించునపుడు అంతట ఇదియే ప్రణాళిక. "కన్యాయాః కనీన చ" (4-1-116) కన్యాయా అపత్యమ్ కానీనః. వివాహము లేని స్త్రీకి కలిగిన సంతతి. అట్టివారు వ్యాస కర్ణులు. ఇట్టిసూత్రాలు పెక్కులున్నవి.

ఈ పద్ధతి సంస్కృతముననే గాదు. వ్యాకరణమాత్రాన కలదు. "జగదింద్ర జిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు," (80 సూ. తత్సమ. బాలవ్యాకరణము) అను సూత్రముచే జగత్, ఇంద్రజిత్ అను శబ్దముల చివరనున్న తకారమునకు లోపము వికల్ప ముగా కలుగును. ఉదా: జగము, జగత్తు; ఇంద్రజి, ఇంద్రజిత్తు; ఇంద్రజిత్ శబ్దమునకు ఋత్విగాది పాఠమువలన ఇంద్రజితుండు అనియు రూప ముండును. ఇచటను పై ప్రణా ళిక నాశ్రయించవలెను.

ఈ శ్లోకమున 4 అగ్నిశబ్దములున్నవి. 1. సూత్రమునందలి శబ్దము. 2. అది శబ్దప్రవృత్తినిమిత్తకమని చెప్పునది. 3. లక్ష్యమునందలి అగ్నిశబ్దమును బోధించును. 4. అది సూత్రమందున్న అగ్నిశబ్దముచే బోధింపబడునని చెప్పును.

ఈ శ్లోకము 58 వ శ్లోకార్థమునకు లక్ష్యమును, 59వ శ్లోక దృష్టాన్తమునకు దార్ష్టాన్తికమును చూపుచున్నది.

సూత్రవిహితములగు కార్యములు అర్థములకంటె ప్రవర్తింపవు. కాని ఆ కార్యములు సూత్రములలో నుచ్చరింపబడిన శబ్దములకంటె ఏల ప్రవర్తించవు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

యో య ఉచ్చార్యతే శబ్దో నియతం న స కార్యభాక్
అన్యప్రత్యాయనే శక్తి ర్న తస్య ప్రతిబధ్యతే. 61

యః+యః=ఏఏ, శబ్దః=శబ్దము, ఉచ్చార్యతే=సూత్రమున నుచ్చరింపబడుచున్నదో, సః=ఆ శబ్దము, నియతమ్=నియతముగా- అనగా తప్పక, కార్యభాక్=కార్యమును బొందునది, న=కానేరదు. సూత్రమున నుచ్చరింపబడిన శబ్దముకంటె ఆ సూత్రముచే విధింపబడు కార్యము ప్రవర్తించదని భావము.

తస్య=ఆ సూత్రమున నుచ్చరింపబడిన శబ్దమునకు, అన్యప్రత్యాయనే=ఇతరమగు - అనగా లక్ష్యమునందున్న శబ్దమును బోధించుటయందు, శక్తిః=సామర్థ్యము, న ప్రతిబధ్యతే=నిరోధింపబడదు.

తా. అగ్నే ర్ఢక్ 4-2-33 మున్నగు సూత్రములలో నుచ్చరింపబడిన అగ్ని శబ్దము లక్ష్యములోనున్న అగ్నిశబ్దమును మనకు జ్ఞానవిషయముగాజేసి దానికంటె ప్రత్యయమును ప్రవర్తింపజేయుటకై ఉపయోగపడుచున్నది. ఈ ప్రయోజనమును అపేక్షించియే సూత్రమున ఆ శబ్దము ఉచ్చరింపబడినది. కాగా ఆ శబ్దము ప్రయోజనాంతరమును అపేక్షించి ఉచ్చరింపబడుటచే అప్రధానమగుచున్నందున తత్సూత్రవిహితకార్యములు ఆ శబ్దమునకు కలుగవు. లక్ష్యమునందున్న శబ్దము కంటెనే ప్రవర్తించును.

సూత్రోచ్చారితమగు శబ్దము తత్సూత్ర విహితమగు ప్రత్యయమును పొందకపోవచ్చును. అది లక్ష్యమునందున్న శబ్దమును బోధించుటలో మరేమియు ప్రతిబంధకము లేనందున దానిని తప్పక బోధించును.

వి. సంజ్ఞాశబ్దము లన్నిటికి ఇదియే ప్రయోజనము. సజ్ఞిని తెలిపి అవి తటస్థములయి యుండును. సంజ్ఞి ప్రధానము కనుక దానికి కార్యాలు ప్రవర్తించును. సంజ్ఞ అప్రధానము కాబట్టి దానికి ఆ కార్యాలు ప్రవర్తించవు.

సూత్రమున ఉచ్చరింపబడిన శబ్దములకు ఆ కార్యము ప్రవర్తించదు అనుటలో హేతువును జూపుచున్నాడు

ఉచ్చరన్ పరతన్త్రత్వా ద్గుణః కార్యై ర్న యుజ్యతే
తస్మా త్తదర్థైః కార్యాణాం సంబన్ధః పరికల్ప్యతే. 62

ఉచ్చరన్=సూత్రమున నుచ్చరింపబడిన శబ్దము, పరతన్త్రత్వాత్=పరాధీనమగుటవలన - అనగా లక్ష్యమునందున్న శబ్దమును బోధించుటకై ఉపయోగింపబడుటవలన, గుణః=అప్రధానమగుచున్నదై, కార్యైః=సూత్రవిహితములగు కార్యములతో, న+యుజ్యతే=సంబంధముకలది కానేరదు.

తస్మాత్=అందువలన అనగా సూత్రమునందుచ్చరింపబడిన శబ్దము కార్యమును బొందనందున, తదర్థైః= సూత్రోచ్చారిత శబ్దముల కర్థములగు లక్ష్యస్థశబ్దములతో, కార్యా

ణామ్ = సూత్రవిహిత కార్యములకు, సంబన్ధః = సంబంధము, పరికల్ప్యతే = కల్పింపబడు చున్నది.

తా. పరాధీనమగుటచే సూత్రోచ్చారితము అప్రధానము. కనుక దానికి కార్య సంబంధ ముండదు. లక్ష్యస్థశబ్దములు ప్రధానములు కనుక వానికి ఆ కార్యములు ప్రవర్తించును.

వి. ఈ శ్లోకమున "ఉచ్చరన్" అను శబ్దము ఉచ్చార్యమాణః అను అర్థమును బోధించును. ఈ శబ్దము ప్రేరణార్థమును జెప్పును. కాబట్టి వైయర్థము లభించును.

గుణ శబ్దము అప్రధానార్థకము.

సూత్రమునందుచ్చరింపబడిన శబ్దము లక్ష్యములో నున్న శబ్దమును బోధించుటకై ఉపయుక్తమైనందున అప్రధానమగుచున్నది. కనుక సూత్రమున నుచ్చరింపబడిన శబ్దము కంటె తత్సూత్ర విహితకార్యము ప్రవర్తించదు. అని 62 వ శ్లోకమున చెప్పబడినది. ఇట్టితరి లక్ష్యస్థమగు శబ్దము కూడ మనుష్యులకు అర్థబోధనకై ఉచ్చరింపబడుటచే నప్రధానమే కనుక దానికంటెగూడ ఆ కార్యము ప్రవర్తింపకున్నది అను ప్రశ్నకు 66 చే సమాధానము చెప్పుటకై ముందుగ ఒక దృష్టాంతమును జూపుచున్నాడు.

సామాన్య మాశ్రితం యద్యదుపమానోపమేయయోః
తస్యత స్యోపమానేషు ధర్మోఽన్యో వ్యతిరిచ్యతే. 63

ఉపమానోపమేయయోః = ఉపమానోపమేయములకు, యత్ + యత్ = ఏ ఏ, సామాన్యమ్ = సాధారణ ధర్మము, ఆశ్రితమ్ = ఆశ్రయింపబడుచున్నదో, తస్య + తస్య = ఆయా సాధారణధర్మమునకుగూడ, ఉపమానేషు = ఉపమితులు చెప్పవలసినప్పుడు- అనగా దానికిగూడ ఉపమానోపమేయభావము చూపవలసివచ్చిన, అన్యః = మరియొక, ధర్మః = సాధారణ ధర్మము, వ్యతిరిచ్యతే = భిన్నమగుచున్నది.

తా. మోము చందమామవలె సుందరముగ నున్నదని లోకులు వ్యవహరింతురు. ముఖ చంద్రులకు ఉపమానోపమేయభావము భాసించుచున్నది. అందు పదార్థభేదము కారణము. సౌందర్యము సాధారణధర్మము. అది ఉభయసాధారణము, ఏకరూపమే.

ముఖచంద్రులు స్వతః భిన్నపదార్థములు కనుక వానియందున్న సౌందర్యము గూడ భిన్నమే యగును. అది వేరు కాగా ముఖ చంద్రులవలెనే ఆ సౌందర్యములకు గూడ ఉపమానోపమేయభావము కల్పింపవలసి యున్నది. అపుడు ఆ రెంటికి సాధారణమైన మున్నగు సాధారణధర్మము కల్పితము కాగలదు. ఆశ్రయభేదమునుబట్టి దానినిగూడ భిన్నముగా వివక్షించిన, వానికి సామ్యము చెప్పవలసి వచ్చినపుడు మరియొక సాధారణ ధర్మమును కల్పించవలసి యున్నది. ఇట్లు అనంత పరంపరగా సాధారణధర్మము కల్పితము కాగలదు. ఇది యంతయు వివక్షను బట్టి జరుగుచున్నది.

వి. ఇట్లే, "బ్రాహ్మణుని వలె క్షత్రియుడు చదువుచున్నాడు" అను ప్రయోగమున బ్రాహ్మణుడుపమానము, క్షత్రియుడుపమేయము కాగలరు. వారిరువురకు అధ్యయనము సాధారణధర్మము. అది ఒక్కటియే కాని బ్రాహ్మణ, క్షత్రియులు భిన్నులు. కాగా వారి యందున్న అధ్యయనముగూడ భిన్నమే యగును. అట్టితరి యధ్యయనములకు సామ్యమును జూపిన, వానికి సాధారణధర్మము సౌష్ఠవము కాగలదు. ఆ సౌష్ఠవముగూడ భిన్నముగా వివ

క్షితమగుచో, నచట మరియొక సాధారణధర్మము, దానికి మరియొక సాధారణధర్మము కల్పితము కాగలదు. ఇట్లు అనంతపరంపర సంభవించును.

ఈ శ్లోకమున ఇట్లు సాధారణ ధర్మపరంపరా కల్పనకు ౬౫ వ శ్లోకమున ప్రయోజనము చూపబడును.

మరియొక దృష్టాంతమును జూపుచున్నాడు.

గుణః ప్రకర్షహేతు ర్యః స్వాతన్త్ర్యే ణోపదిశ్యతే
తస్యాఽఽశ్రితా ద్గుణాదేవ ప్రకృష్టత్వం ప్రతీయతే.　　　౬౪

ప్రకర్షహేతుః = ద్రవ్యముయొక్క ప్రకర్షకు హేతువగు, యః = ఏ, గుణః = గుణము, స్వాతన్త్ర్యేణ = స్వాతంత్ర్యమున, ఉపదిశ్యతే = చెప్పబడుచున్నదో, అనగా వివక్షితమగుచున్నదో, తస్య = ఆ గుణమునకు, ఆశ్రితాత్ = ఆశ్రయింపబడిన-అనగా తనకు ఆశ్రయమగు వస్తువును వేరుచేయుటకై వివక్షింపబడిన, గుణాత్ + ఏవ = గుణమువలననే, ప్రకృష్టత్వమ్ = ప్రకర్ష, ప్రతీయతే = తెలియబడుచున్నది.

తా. రెండు మూడు వస్తువులకు తారతమ్యము జూపునపుడు తర, తమప్రత్యయము లుపయుక్తము లగుచున్నవి. ఉదా: 'శుక్లతరః పటః, శుక్లతమః పటః'. ఈ వస్త్రము మిక్కిలి తెల్లనిది యని యభిప్రాయము. ద్రవ్యమునకు స్వతః ఉత్కర్షాపకర్షములు లేవు. ఆ ద్రవ్యమునందున్న గుణముయొక్క ప్రకర్షాపకర్షలను పురస్కరించుకొని ద్రవ్యప్రకర్షము ఉపపన్నమగుచున్నది. ప్రధానమగునది ద్రవ్యమనియు, అప్రధానమైనది గుణమనియు గుణ ప్రధానభావము వివక్షామూలకమనియు వైయాకరణులు విశ్వసింతురు. వస్త్రము ప్రధానముగా వివక్షితమగుటచే దానికి అప్రధానమగు శుక్లరూపమును బట్టి ఉత్కర్షాపకర్షములు కలుగుచున్నవి.

ఒకవేళ శుక్లరూపమునే ప్రధానముగా వివక్షించిన నదియు ద్రవ్యమే కనుక దానికి స్వతః ఉత్కర్షాపకర్షములుండవు. అపుడు శుక్లరూపమునందున్న శుక్లత్వమనే ధర్మమును తీసికొని దానియందున్న ఉత్కర్షాపకర్షములను బట్టి తర తమ ప్రత్యయములు ప్రవర్తించును.

కాగా శుక్లతరః పటః అనుచోట శుక్లరూపమునందున్న ప్రకర్షమును బట్టియు పటస్య రూపం శుక్లతరమ్ అనుచోట శుక్లత్వమునందున్న ప్రకర్షమునుబట్టియు తర ప్రత్యయము ప్రవర్తించును.

ఒకవేళ శుక్లత్వమునకు గూడ ప్రాధాన్యమును వివక్షించిన నదియు ద్రవ్యమే కనుక శుక్లత్వమునందున్న మరియొక ధర్మమునుజూపిన తర ప్రత్యయము ప్రవర్తించును.

పై పద్ధతిని అనంత పరంపరా రూపమున గుణకల్పన చేయవచ్చు. ఇది యంతయు వక్తయొక్క ఇచ్ఛపై ఆధారపడి యున్నది.

ఇట్టి యర్థమును స్వీకరించుటకు గూడ ౬౫ వ శ్లోకమున ప్రయోజనము చూపబడును.

౬౩, ౬౪ శ్లోకములచే రెండు దృష్టాంతములు చూపబడినవి. వాని ఉపయోగము జూపుచు ప్రకృతమున సమన్వయము చేయుచున్నాడు.

తస్యాభిధేయభావేన యః శబ్దః సమవస్థితః
తస్యా ప్యుచ్చారణే రూప మన్య త్తస్మా ద్వివిచ్యతే.　　　౬౫

తస్య = ఆ సూత్రమున నుచ్చరింపబడిన శబ్దమునకు, అభిధేయభావేన = అర్థ రూపమున, యః = ఏ, శబ్దః = శబ్దము, సమవస్థితః = ఉన్నదో, అనగా లక్ష్యములలో కాన్పించుచున్నదో, తస్య + అపి = ఆ శబ్దముయొక్కయు, ఉచ్చారణే = ఉచ్చారణము కలుగగా- అనగా ఉచ్చరితత్వము కలుగగా, తస్మాత్ = ఆ శబ్దముకంటె, అన్యత్ = ఇతర మగు, రూపమ్ = రూపము, వివిచ్యతే = వేరుగా గ్రహింపబడుచున్నది. ఉచ్చారణ క్రియచే రెంటికి భేదముకలుగునని భావము.

తా. లక్ష్యములోనుండు శబ్దమును బోధించుటకై సూత్రమునందు శబ్దముచ్చరింప బడినది. కనుక అది అప్రధానమగుచున్నది. లక్ష్యస్థ శబ్దము ప్రధానము కనుక దానికంటె సూత్రవిహిత ప్రత్యయము ప్రవర్తించును. అప్రధానమగుటచే సూత్రమునందలి శబ్దముకంటె ప్రత్యయము ప్రవర్తించదు. ఇచట ఉచ్చరితత్వమే కారణము. ఈయభిప్రాయమును 62 వ శ్లోకము స్పష్టపరచి యున్నది.

63 వ శ్లోకముయొక్క అవతారికలో చూపబడిన సంశయమునకు సమా ధానము- శబ్దములు రెండు విభిన్నములు. కనుక ఒక దానికి కార్యము ప్రవర్తించుట, మరి యొకదానికి ప్రవర్తింపక పోవుట యుక్తమే. రెంటికి ఉచ్చరితత్వమనే ధర్మము సమానము. కనుక పై కార్యవ్యవస్థ ఎట్లు? నిజమే, కాని వానికి ఉచ్చారణక్రియనుబట్టి భేదము సిద్ధించును. సూత్రమున అగ్ని శబ్దోచ్చారణముకంటె లక్ష్యములో అగ్నిశబ్దోచ్చారణము భిన్నమే. క్రియా భేదముచే కార్యభేదము లభించును. కాగా ఏ కార్యమును బోధించుటకై ఏ శబ్దమును ఉచ్చ రించెదమో, ఆ కార్యము ఆ శబ్దమునకు కలుగదు. కార్యాంతరము కలుగవచ్చును. లక్ష్య ములోనున్న అగ్ని శబ్దముకంటె "ఢక్" ప్రత్యయసిద్ధికై సూత్రమున అగ్నిశబ్దోచ్చారణము. కనుక ఆ ప్రత్యయము సూత్రమునందున్న అగ్ని శబ్దమునకు కలుగదు. ఆ శబ్దముమాత్రము లక్ష్యములోనున్న అగ్ని శబ్దమును బోధించగలదు. అగ్నిదేవతకు హవిస్సంబంధమును బోధించుటకై లక్ష్యములో అగ్నిశబ్దముచ్చరింపబడినది. కనుక ఈ పరిస్థితిలో అగ్ని శబ్ద మునకు హవిస్సంబంధము కలుగదు. ఆ శబ్దము 'ఢక్' ప్రత్యయము పొందజాలదు.

వి. పైరీతిని శబ్దమునకు భేదము కల్పించవచ్చునా అను సందేహము కలుగు చుండగా దానికి ముందుగనే 62, 64 శ్లోకములచే ౨ దృష్టాంతములు చూపబడినవి. "మోము చంద్రునివలె సుందరము" అను ఉపమా స్థలమునవలెను, శుక్లతరః పటః అను తర ప్రత్యయ స్థలమునవలెను భేదము కల్పించి సమన్వయము చేయవలెను. ఇది యంతయు వక్తయొక్క వివక్షనుబట్టి కలుగును.

"భేదకార్యేషు" అని 65వ శ్లోకముచే జూపబడిన అర్థమును వివరించుచున్నాడు.

ప్రాక్ సంజ్ఞినాభిసంబన్ధాత్సంజ్ఞా రూపపదార్థికా
షష్ఠ్యాశ్చ ప్రథమాయాశ్చ నిమిత్తత్వాయ కల్పతే . 66

సంజ్ఞా = సంజ్ఞావాచకము, సంజ్ఞినా = సంజ్ఞితో, అభిసంబన్ధాత్ = సంబంధించుట కంటె, ప్రాక్ = పూర్వము, రూప పదార్థికా = శబ్దస్వరూపమే అర్థముగాగలదై, షష్ఠ్యాః + చ = షష్ఠీ విభక్తికి, ప్రథమాయాః + చ = ప్రథమకు, నిమిత్తత్వాయ = నిమిత్తత్వముకొరకు, కల్పతే = సమర్థమగుచున్నది.

తా. వ్యాకరణ శాస్త్రమున వృద్ధిపదముచే అదైచ్చులు గ్రహింపబడుచున్నవి. అందు "వృద్ధి రాదైచ్" 1-1-1 అను సూత్రముచే వానికి వృద్ధిసంజ్ఞావిధానము కారణము. ఆ సంజ్ఞాసూత్రమున కర్థము తెలిసినపిమ్మట పై వ్యవహారము కలుగును. కాగా ఆ సంజ్ఞా సూత్రమున కర్థజ్ఞానము కలుగుసమయమున వృద్ధిపదము అదైచ్చులను బోధింపజాలదు. ఆ కాలమున వృద్ధిపదమునకు ఆ శబ్దస్వరూపమే వాచ్యార్థము. లోకప్రసిద్ధమగు అభివృద్ధి కానేరదు. అది ప్రకృతమున అన్వితము కాదు. కాబట్టి ఘటపదమునకు కడవ అర్థమగునటుల ఇచట వృద్ధిశబ్దమునకు వకార, ఋకార, దకార, ధకార, ఇకార వర్ణసముదాయాత్మకమగు శబ్దస్వ రూపమే వాచ్యార్థమగును.

వి. వ్యాకరణమున సంజ్ఞాసూత్రములు రెండువిధములుగా నున్నవి. 1. సంజ్ఞావాచకము, సంజ్ఞిబోధకము రెండుకూడ ప్రథమాన్తములుగా నుండుట. ఉదా: "వృద్ధిరాదైచ్" 1-1-1 వృద్ధిశబ్దము సంజ్ఞ, అదైచ్చులు సంజ్ఞులు. రెండు ప్రథమాన్తములే. 2. సంజ్ఞావాచకము ప్రథమాన్తముగను, సంజ్ఞి షష్ఠ్యంతముగాను ఉండుట. ఉదా: ఊఞః 1-1-17అను సూత్రముచే ఉఞ్ అను నిపాతమునకు ఇతి శబ్దము పరమగునపుడు ప్రగృహ్యసంజ్ఞ కలుగుచున్నది. ఇచట సంజ్ఞి ఊఞః అనునది షష్ఠ్యంతము. సంజ్ఞ ప్రథమాన్తము. కాగా సంజ్ఞికి ప్రథమ, షష్ఠియు ప్రవర్తించును.

ఈ శ్లోకమున పదార్థశబ్దము వాచ్యార్థపర్యాయము. పదార్థః = వాచ్యార్థము. రూపశబ్దమునకు స్వరూప మర్థము. రూపం పదార్థః యస్యాః సా అని బహువ్రీహి.

ప్రథమా విభక్తి, షష్ఠీవిభక్తియు ఎట్లు ప్రవర్తించునో ఆ మార్గమును జూపుచున్నాడు.

> తత్రార్థవత్త్వాత్ప్రథమా సంజ్ఞాశబ్దా ద్విధీయతే
> అస్యేతి వ్యతిరేకశ్చ తదర్థా దేవ జాయతే. 67

తత్ర = ఆ షష్ఠీ ప్రథమావిభక్తులలో, సంజ్ఞాశబ్దాత్ = సంజ్ఞిని బోధించెడు శబ్దము కంటె, అర్థవత్త్వాత్ = శబ్దస్వరూపమునుబట్టి అర్థవంతమగుటవలన, ప్రథమా = ప్రథమా విభక్తి, విధీయతే = విధింపబడుచున్నది.

అస్య + ఇతి = దీనికి అనెడి, వ్యతిరేకః + చ = భేదముకూడ, తదర్థాదేవ = సంజ్ఞా శబ్దముయొక్క అదైచ్ రూపమగు అర్థమువలననే, జాయతే = కలుగుచున్నది.

తా. సంజ్ఞాశబ్దము సూత్రము సంజ్ఞితో కలియనపుడు తన స్వరూపమునే బోధించును. అందుచే ఆ శబ్దము అర్థవంతమై ప్రాతిపదికసంజ్ఞ కలది యగును. దానికంటె ప్రథమావిభక్తి ప్రవర్తించును.

వి. సంజ్ఞకు, సంజ్ఞికి అభేదమును వివక్షించిన రెండును ప్రథమాంతములే యగును. ఉదా: "వృద్ధి రాదైచ్" 1-1-1 "భూవాదయో ధాతవః" 1-3-11. వానికి భేదమును వివక్షించిన సంజ్ఞికంటె షష్ఠీవిభక్తి సాధువగును. 'అదైచాం వృద్ధిః' అని యుండును.

"ఊఞః" 1-1-18 సూత్రమును షష్ఠికి ఉదాహరణగా జూపవచ్చును.

పై రీతిని శబ్దమునందు గ్రాహకత్వ గ్రాహ్యత్వములనెడి రెండు శక్తులను ఆశ్ర యించి "స్వం రూపం శబ్దస్యాఽశబ్దసంజ్ఞా" 1–1–68 అను సూత్రార్థము విచారింపబడినది. ఇపుడు జాతి వ్యక్తి పక్షముల నాశ్రయించి జాతి వ్యక్తి భేదముచే సంజ్ఞా సంజ్ఞి భావము కుదురుచున్నదని యట్టి యభిప్రాయముతో పయి సూత్రమునకు సమన్వయము జూపు చున్నాడు.

స్వం రూపమితి కైశ్చిత్తు వ్యక్తిః సంజ్ఞోపదిశ్యతే
వ్యక్తేః కార్యాణి సంసృష్టా జాతిస్తు ప్రతిపద్యతే . 68

కైశ్చిత్ + తు = కొందరిచేతను అయితే, స్వంరూపమ్ + ఇతి = "స్వంరూపం" అను పాణిని సూత్రమున, వ్యక్తిః = శబ్దవ్యక్తి, సంజ్ఞా = సంజ్ఞాపరముగా, ఉపదిశ్యతే = చూపబడుచున్నది. వ్యక్తేః = వ్యక్తికి సంబంధించియున్న, కార్యాణి = ప్రత్యయము పరముగా వచ్చుట మున్నగు కార్యములను, సంసృష్టా = వ్యక్తితో నిత్యసంబద్ధమగు, జాతిః + తు = జాతియు, ప్రతిపద్యతే = పొందుచున్నది.

తా. 56 వ శ్లోకమునుంచి ఇంతవరకు శబ్దమునందు గ్రాహ్యత్వము, గ్రాహ కత్వము అనే రెండుశక్తుల నాశ్రయించి "స్వంరూపం శబ్దస్య" అను పాణిని సూత్రము విచారితమాయెను. శక్తిభేదముచే శబ్దమునకు నానాత్వము నంగీకరించి సంజ్ఞాసంజ్ఞిభావ ముపపాదింపవలెనని దాని యాశయము.

అట్లుగాక జాతి వ్యక్తి పక్షముల నాశ్రయించి వాని భేదముచే సంజ్ఞా సంజ్ఞి భావ మును చూపుటకు 68, 69, 70 శ్లోకములు చూపబడుచున్నవి.

అగ్ని, కన్య మున్నగు శబ్దములు సూత్రములలోను, లక్ష్యములలోను కానవచ్చు చున్నవి ఘటాది పదార్థములందు ఘటత్వాది జాతులున్నట్లు పై శబ్దములందు అగ్ని శబ్దత్వము కన్యాశబ్దత్వము మున్నగు జాతులున్నవి. కాగా అకార గకార నకార ఇకార రూప వర్ణసమునాయాత్మకమగు శబ్దము వ్యక్తియనియు, దానియందున్న అగ్నిశబ్దత్వము జాతియనియు స్వీకరింపబడుచున్నది.

ఈ పక్షమున వ్యాకరణసూత్రములలో నున్న శబ్దవ్యక్తి సంజ్ఞిగాను, లక్ష్యములలో నున్న శబ్దములందలి శబ్దత్వజాతి సంజ్ఞిగాను చూపబడుచున్నది.

అగ్ని శబ్దత్వజాతి సంజ్ఞియగుచో దానికంటె ప్రత్యయము పరముగా ప్రవర్తించుట మున్నగు కార్యాలు స్వతః సంభవించవు. కాని వ్యక్తితో నిత్యసంబద్ధము జాతి యగుచున్నది. వ్యక్తికి ఆకార్యములు సంభవించును. కాగా వ్యక్తిద్వారా జాతి ఆకార్యములను పొందగలదు.

68 వ శ్లోకమున వ్యక్తి సంజ్ఞ అని, జాతి సంజ్ఞి యని సమన్వయము చేయబడినది. ప్రస్తుతము వ్యక్తి సంజ్ఞి యనియు, జాతి సంజ్ఞ అనియు సమన్వయము జూపుచున్నాడు.

సంజ్ఞినీం వ్యక్తి మిచ్ఛన్తి సూత్రగ్రాహ్యా మథాఽపరే
జాతిప్రత్యాయితా వ్యక్తిః ప్రదేశే షూపతిష్ఠతే . 69

అథ = అట్లుగాక, అపరే = కొందరు, సూత్రగ్రాహ్యామ్ = సూత్రముచే గ్రహింప బడే అనగా "స్వంరూపం శబ్దస్య" అను సూత్రమున స్వం రూపం అను పదములచే బోధింప బడిన జాతిచే గ్రహింపబడెడి, వ్యక్తిమ్ = అగ్ని, కన్యా మున్నగు శబ్దరూపమగు వ్యక్తిని, సంజ్ఞినీం = సంజ్ఞినిగా, ఇచ్ఛన్తి = కోరుచున్నారు.

జాతిప్రత్యాయితా = జాతిచే నాక్షేపింపబడిన, వ్యక్తిః = వ్యక్తి, ప్రదేశేషు = ప్రదేశములయందు అనగా సూత్రములయందు, ఉపతిష్ఠతే = సన్నిహితమగుచున్నది, అనగా అగ్నేర్ఢక్ అను సూత్రమున సంబంధించును.

తా. వ్యక్తియే సంజ్ఞి కావలెను. లేక జాతియే సంజ్ఞి కావలెను అని చెప్పుటలో నియామకము లేనందున 68, 69 శ్లోకములలో రెండు పక్షములు చూపబడినవి. ఏ పక్షము నాశ్రయించినను కార్యము కలుగుటలో భేదము లేదు. ఐనను జాతివ్యక్తులకు ప్రధానాప్రధాన భావమును పురస్కరించుకొని బుద్ధివైశద్యమును కలిగించుటకు భర్తృహరి పక్షభేదమును జూపెను.

68 వ శ్లోకమున వ్యక్తి సంజ్ఞి అని చెప్పుటకు, 69 వ శ్లోకమున జాతి సంజ్ఞి అని చెప్పుటకును - అనగా జాతి వ్యక్తులను నిమిత్తముగా జేసుకొని సంజ్ఞా సంజ్ఞి భావము కుదురును అని చెప్పుటకు ఉపపత్తి చూపుచున్నాడు.

కార్యత్వే నిత్యతాయాం వా కేచి దేకత్వవాదినః
కార్యత్వే నిత్యతాయాం వా కేచి న్నానాత్వవాదినః . 70

(అ) కార్యత్వే = శబ్దమునకు అనిత్యత్వమును స్వీకరించినను, నిత్యతాయాం వా = నిత్యత్వమును స్వీకరించినను, కేచిత్ = కొంతమంది శాస్త్రజ్ఞులు, ఏకత్వవాదినః = ఏకత్వము నంగీకరించు స్వభావము కలవారు.

తా. ఒకే శబ్దము నానార్థకమగుచో అర్థములు నానా అయినను శబ్దముమాత్రము ఒక్కటియే, దానికి నానాత్వము సంభవింపదు. శబ్దముల నిత్యత్వానిత్యత్వములతో మాకు ప్రసక్తిలేదు. ఏ పక్షముననైన శబ్దమున కేకత్వమే లభించును. ఇది కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయము. వీరిమతము చొప్పున శబ్దము లనేకములు కావు. కనుక అచట జాతి కల్పితము కానేరదు. వ్యక్తులకు నానాత్వమున్నప్పుడే జాతి సిద్ధించును.

కాగా వీరిమతము ప్రకారము జాతి వ్యక్తులను పురస్కరించుకొని "స్వంరూప" సూత్రమున కర్థవర్ణనము చేయరాదు.

(ఆ) కార్యత్వే + నిత్యతాయాం + వా = శబ్దములకు అనిత్యత్వమున్నను, నిత్యత్వమున్నను, కేచిత్ = కొందరు శాస్త్రజ్ఞులు, నానాత్వవాదినః = నానాత్వము నంగీకరించు స్వభావము కలవారు.

తా. శబ్దముల నిత్యత్వానిత్యత్వములతో పనిలేక అర్థము భిన్నమగుచో శబ్దము భిన్నమే యగును. అనగా హరిశబ్దమునకు విష్ణువు, ఇంద్రుడు, వానరము, కప్ప మున్నగు వాచ్యార్థములు చాల ఉన్నవి. వీని నన్నిటిని బోధించేది హరిశబ్ద మొక్కటియే కాదు. అర్థములు ఎన్నియో, బోధకములుకూడ అన్నియే యగును. ఇది కొందరు శాస్త్రజ్ఞుల మతము.

కాగా వీరిమతమున శబ్దములు అనేకములు కనుక అచట జాతి కల్పితమగుటచే, జాతివ్యక్తులను పురస్కరించుకొని "స్వంరూప" సూత్రార్థము చెప్పనగును.

శబ్దనిత్యత్వ ప్రసంగమున శబ్దనిత్యత్వవాది మీమాంసకమతము ననుసరించి వర్ణపద వాక్యములను 71, 72 శ్లోకములచే చూపుచున్నాడు.

పదభేదేఽపి వర్ణానా మేకత్వం న నివర్తతే
వాక్యేషు పద మేకం చ భిన్నేష్వ ప్యుపలభ్యతే . 71

(అ) పదభేదే అపి = పదములకు భేదమున్నను, అనగా పదములు వేరైనను, వర్ణానామ్ = వర్ణములకు, ఏకత్వమ్ = ఏకత్వము అనగా ఒక్కటియేయనుట, న నివర్తతే = నివర్తించునది - అనగా మరలునది కాదు.

తా. అర్కః = (సూర్యుడు), అశ్వః = (గుర్రము) మున్నగు పదములు భిన్నములుగా నున్నవి. వీనిలో 4 అకారములున్నవి. అవిమాత్రము వేరుకావు. స్థలము మారినను, వర్ణము మారునది కాదు. అవి యన్నియు ఒకే అకారముగానే గుర్తింపబడును. అర్క, మర్కట, కర్కట మున్నగు పదములు భిన్నములైనను, వానిలో రేఫములు ఏకమే యనియు, టకారములు ఏకమే యనియు తెలియనగును. వాఙ్మయమున గల అకారము లన్నియు ఒక్కటే, ఇకారము లన్నియు ఒక్కటే, రేఫము లన్నియు ఒక్కటే. అకారములు ఇకారములు మాత్రము భిన్నములే. వర్ణములు జన్యములుకావు నిత్యములు.

(ఆ) చ = మరియు, వాక్యేషు = వాక్యములు, భిన్నేషు + అపి = భిన్నములైనను పదమ్ = పదము, ఏకమ్ = ఒక్కటిగానే, ఉపలభ్యతే = తెలియబడుచున్నది.

తా. వాక్యములు భిన్నములుగా కాన్పించినను, వానిలో నున్న సరూపపదములు ఏకత్వమును విడనాడవు. అవి ఒక్కటి యనియే గ్రహించవలెను. "కడవను తెమ్ము", "పటమును చూడుము", "అశ్వమును తెమ్ము", "గోవును చూడుము" మున్నగు వాక్యములు భిన్నములు. ఐనను వానిలో తెమ్ము, చూడుము అను పదము లభిన్నములే.

వి. కనుక పదములకంటె వేరుగా వాక్యము లేదు. వర్ణములకంటె వేరుగా పదము లేదు. వర్ణములే పదములు. అవియే వాక్యములు. "గౌః" ఇచట ఏది శబ్దము? అని ప్రశ్నించిన గకార ఔకార విసర్గములు అనియే సమాధానము చెప్పవలెను. వర్ణములే సత్యములు. పదవాక్యములు కల్పితములు, మిథ్య.

ఈ యభిప్రాయమునే వ్యక్తపరచుచున్నాడు.

న వర్ణవ్యతిరేకేణ పద మన్యచ్చ విద్యతే
వాక్యం వర్ణపదాభ్యాం చ వ్యతిరిక్తం న కిఞ్చన . 72

వర్ణవ్యతిరేకేణ = వర్ణములు వినాగా- అనగా వర్ణములకంటె- వర్ణములను విడచి, అన్యత్ = వేరుగా- అనగా విలక్షణమగు, పదమ్ = పదము, న + విద్యతే + చ = లేనేలేదు.

చ = అట్లే, వర్ణపదాభ్యామ్ = వర్ణములకంటె, పదములకంటెను, వ్యతిరిక్తమ్ = వేరుగానున్న, వాక్యమ్ = వాక్యము, కిఞ్చన = ఏమియు, న + విద్యతే = లేదు.

తా. వర్ణసముదాయము పదము. పదసముదాయము వాక్యము అని తార్కికులు తలంతురు. కాని ఆ యాశయమునకు బలముచాలదు. కనుక వర్ణములే సత్యములు. పదవాక్యములు భ్రమమాత్మకములే.

శబ్ద నిత్యత్వ ప్రసంగమున మీమాంసక మతమును జూపి దానిని నిరాకరించుచు వైయాకరణసిద్ధాంతమును స్పష్టపరచుచున్నాడు.

పదే న వర్ణా విద్యన్తే వర్ణే ష్వవయవా న చ
వాక్యాత్పదానా మత్యన్తం ప్రవివేకో న కశ్చన . 73

చ = కాని, వర్ణేషు = వర్ణములందు, అవయవాః + న = అవయవములు వలె, పదే = పదమునందు, వర్ణాః = వర్ణములు, న + విద్యన్తే = ఉండనేరవు. వాక్యాత్ =

వాక్యముకంటె, పదానామ్ = పదములకు, కశ్చన = ఏమియు, ప్రవివేకః = భేదము, అత్యన్తమ్ = మిక్కిలి, న = లేదు.

తా. వాక్యమే అర్థబోధకము. అదియే సత్యము. దానినుండి పదములు వర్ణములు విభజింపబడినవి. కాగా అవి మిథ్య అని వైయాకరణులు విశ్వసింతురు. ఈ యభిప్రాయమును 24 వ శ్లోకమున వ్యక్తపరచియున్నారు.

'ఋ' వర్ణమున రెండు రేఫములున్నట్లు భాసించును. కాని నిజముగా నచట అవి లేవు. అశ్లే పదమునందు ఘకారాది వర్ణములు భాసించుచున్నవి. అవియులేవు. అవి కల్పనా మూలమున కాన్పించుచున్నవి. పదము నిరవయవమే.

బాగుగా పర్యాలోచనచేసిన వాక్యమే సత్యము. దానియందు పదములు అవయవముల వలె కాన్పించును. అది కల్పనా మూలకము. పదములు లేనే లేవు. వాక్యము నిరవయవమే. అదియే అఖండార్థబోధకము.

వి. కాగా వర్ణములే సత్యములనెడి మీమాంసకమతము, పదమే సత్యమనెడి తార్కిక మతముకూడ నమ్మతగినవి కావు. వైయాకరణులు ప్రక్రియానిర్వాహార్థమై చేసిన కల్పనా మార్గాన దర్శనాంతరీయుల సిద్ధాంతములు లగ్నములైయున్నవి.

ఈ శ్లోకమున "న" శబ్దము ఇవార్థకము, నిషేధార్థకము కాదు. కొన్ని పుస్తకాలలో 'నచ' పదములకు 'ఇవ' అను పాఠాంతరము కలదు.

పయి చూపబడిన రెండుపక్షములు గూడ వ్యవహారమున కానవచ్చుచున్న వని చెప్పుచున్నాడు.

> భిన్నం దర్శన మాశ్రిత్య వ్యవహారోఽనుగమ్యతే
> తత్ర య న్ముఖ్య మేకేషాం తత్రాన్యేషాం విపర్యయః . 74

(అ) భిన్నమ్ = పరస్పరము భిన్నమగు, దర్శనమ్ = సిద్ధాంతమును - అనగా 1. వర్ణములే సత్యము, పదవాక్యములు మిథ్య 2. వాక్యమే సత్యము, వర్ణపదములు మిథ్య అనెడి భిన్నసిద్ధాంతములను, ఆశ్రిత్య = ఆశ్రయించి, వ్యవహారః = శాస్త్రీయ వ్యవహారము, అనుగమ్యతే = అనుగమింపబడుచున్నది. అనగా నిర్ణయింపబడుచున్నది.

వి. వాక్యమే సత్యమను నమ్మకముగల శాబ్దికులు వర్ణములను పదములను చూపియే వ్యాకరణశాస్త్ర ప్రక్రియను నిర్వహించుచున్నారు. వర్ణ పదములే లేకున్న వారి ప్రక్రియ ఎట్లు కుదురును? వర్ణములే సత్యములని విశ్వసించిన జైమినీయులు పదవాక్యముల అర్థములను గ్రహించి వేదార్థమును చూపుచునే యున్నారు.

పయి సమస్య ఎట్లు తీర్మానింపబడును ? అను ప్రశ్నకు సమాధానముగా నుత్తరార్ధము చెప్పబడినది.

(అ) తత్ర = ఆ రెండు సిద్ధాంతములలో, ఏకేషామ్ = ఒక పక్షము వారికి, యత్ = ఏది, ముఖ్యమ్ = ముఖ్యదర్శనమో, తత్ర = దానియందు-అనగా ఆ దర్శనమునందు, అన్యేషామ్ = రెండవ పక్షమువారికి, విపర్యయః = విపరీతమగు భావము, అనగా ముఖ్యము కాదని భావము కలదు.

అందరు అన్నిపక్షములను నాశ్రయింతురు. అట్లుకాకున్న శాస్త్రముల ప్రవృత్తి కుదురుట ఎట్లు ? కాని కొందరు ఒక పక్షమును ముఖ్యముగను, రెండవ పక్షమును గౌణము

(అ) పదభేదే అపి = పదములకు భేదమున్నను, అనగా పదములు వేరైనను, వర్ణానామ్ = వర్ణములకు, ఏకత్వమ్ = ఏకత్వము అనగా ఒక్కటియేయనుట, న నివర్తతే = నివర్తించునది - అనగా మరలునది కాదు.

తా. అర్కః = (సూర్యుడు), అశ్వః = (గుఱ్ఱము) మున్నగు పదములు భిన్నములుగా నున్నవి. వీనిలో 4 అకారములున్నవి. అవిమాత్రము వేరుకావు. స్థలము మారినను, వర్ణము మారునది కాదు. అవి యన్నియు ఒకే అకారముగానే గుర్తింపబడును. అర్క, మర్కట, కర్కట మున్నగు పదములు భిన్నములైనను, వానిలో రేఫములు ఏకమే యనియు, టకారములు ఏకమే యనియు తెలియనగును. వాఙ్మయమున గల అకారము లన్నియు ఒక్కటే, ఇకారము లన్నియు ఒక్కటే, రేఫము లన్నియు ఒక్కటే. అకారములు ఇకారములు మాత్రము భిన్నములే. వర్ణములు జన్యములుకావు నిత్యములు.

(ఆ) చ = మరియు, వాక్యేషు = వాక్యములు, భిన్నేషు + అపి = భిన్నములైనను పదమ్ = పదము, ఏకమ్ = ఒక్కటిగానే, ఉపలభ్యతే = తెలియబడుచున్నది.

తా. వాక్యములు భిన్నములుగా కాన్పించినను, వానిలో నున్న సరూపపదములు ఏకత్వమును విడనాడవు. అవి ఒక్కటి యనియే గ్రహించవలెను. "కడవను తెమ్ము", "పటమును చూడుము", "అశ్వమును తెమ్ము", "గోవును చూడుము" మున్నగు వాక్యములు భిన్నములు. ఐనను వానిలో తెమ్ము, చూడుము అను పదము లభిన్నములే.

వి. కనుక పదములకంటె వేరుగా వాక్యము లేదు. వర్ణములకంటె వేరుగా పదము లేదు. వర్ణములే పదములు. అవియే వాక్యములు. "గౌః" ఇచట ఏది శబ్దము? అని ప్రశ్నించిన గకార ఔకార విసర్గములు అనియే సమాధానము చెప్పవలెను. వర్ణములే సత్యములు. పదవాక్యములు కల్పితములు, మిథ్య.

ఈ యభిప్రాయమునే వ్యక్తపరచుచున్నాడు.

న వర్ణవ్యతిరేకేణ పద మన్యచ్చ విద్యతే
వాక్యం వర్ణపదాభ్యాం చ వ్యతిరిక్తం న కిఞ్చన . 72

వర్ణవ్యతిరేకేణ = వర్ణములు వినాగా- అనగా వర్ణములకంటె- వర్ణములను విడచి, అన్యత్ = వేరుగా- అనగా విలక్షణమగు, పదమ్ = పదము, న + విద్యతే + చ = లేనేలేదు.

చ = అట్లే, వర్ణపదాభ్యామ్ = వర్ణములకంటె, పదములకంటెను, వ్యతిరిక్తమ్ = వేరుగానున్న, వాక్యమ్ = వాక్యము, కిఞ్చన = ఏమియు, న + విద్యతే = లేదు.

తా. వర్ణసముదాయము పదము. పదసముదాయము వాక్యము అని తార్కికులు తలంతురు. కాని ఆ యాశమునకు బలముచాలదు. కనుక వర్ణములే సత్యములు. పదవాక్యములు భ్రమాత్మకములే.

శబ్ద నిత్యత్వ ప్రసంగమున మీమాంసక మతమును జూపి దానిని నిరాకరించుచు వైయాకరణసిద్ధాంతమును స్పష్టపరచుచున్నాడు.

పదే న వర్ణా విద్యన్తే వర్ణే ష్వవయవా న చ
వాక్యా త్పదానా మత్యన్తం ప్రవివేకో న కశ్చన . 73

చ = కాని, వర్ణేషు = వర్ణములందు, అవయవాః + న = అవయవములు వలె, పదే = పదమునందు, వర్ణాః = వర్ణములు, న + విద్యన్తే = ఉండనేరవు. వాక్యాత్ =

స్వభావభేదాత్ = స్వరూపవిశేషమువలన, ప్రాకృతధ్వనియే స్ఫోటశబ్దముయొక్క స్వరూపమనెడి అభిమానమువలన, ప్రాకృతస్య = ప్రాకృతమగు, ధ్వనేః = ధ్వనికి సంబంధించినదై, హ్రస్వదీర్ఘప్లుతాదిషు = ఉచ్చరింపబడెడి హ్రస్వాదులందున్న, కాలః = ఏకమాత్రాది కాలము, నిత్యత్వే = స్ఫోటశబ్దమునకు నిత్యత్వమున్నను, శబ్దస్య + ఇతి = స్ఫోటశబ్దమునకు సంబంధించినది యని, ఉపచర్యతే = ఆరోపింపబడుచున్నది.

తా. ప్రకృతి యనగా మూలము. దానినుండి కలిగిన ధ్వని ప్రాకృతధ్వని. ఇది జన్యము కనుక కాలము దీనిని పరిణమింపచేయగలదు. అందుచే ఏకమాత్రా ద్విమాత్రాది కాలభేదము ప్రాకృతధ్వనికి కలుగును. ఇదియే స్ఫోటశబ్దము బయటికి అభివ్యక్తమగుటలో కారణము. ఆధ్వని, స్ఫోటశబ్దము రెండును పాలునీరువలె మిశ్రితములైయున్నవి. ఆరెంటిని వేరుచేయుట సాధ్యముకాదు. రెండును అవిభక్తములుగా నుండుటచే ఆ ధ్వని ధర్మములు స్ఫోటశబ్దమునందు భాసించును. స్ఫోటశబ్దము ఈధ్వనిచేతనే అకార కకార గకారాది రూపముగా కాన్పించుచున్నది.

వి. ప్రాకృతధ్వనియొక్క రూపమే స్ఫోటశబ్దముయొక్క రూపమువలె కాన్పించును. అందుచే స్ఫోటశబ్దమునందు ఏకమాత్రా ద్విమాత్రా త్రిమాత్రా కాలభేదము ఆరోపమూలమున కాన్పించును. అందుచే ఆశబ్దమునకు భేదము కలుగుచున్నది. హ్రస్వాకారము, దీర్ఘాకారము, ప్లుతాకారము పరస్పరము భిన్నములే యగును. కనుకనే హ్రస్వాకారమునకు తకారము చేర్చగా 'అత్' అనురీతిని ఉండి దీర్ఘాకారాదులను గ్రహించకయున్నది. దీనినే 'తపరకరణ' మందురు. తపర స్తత్కాలస్య 1-1-70 అని పాణిని సూత్రము.

ఈ రీతిగా ప్రాకృతధ్వని ధర్మములు స్ఫోటశబ్దమునందు ఆరోపితములగుచున్నవి. నిజరూపమున స్ఫోటశబ్దమునందు ఈభేదములు లేవు. కనుక అది నిత్యమే యగును.

స్ఫోటశబ్దమునందు హ్రస్వాకారాది భేదము కాన్పించు నట్లు ద్రుతాది వృత్తి భేదము కూడ భాసింపవలెను. ఉభయత్ర కాలభేదమేకదా కారణమగుచున్నది! అను ఆక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాడు.

> శబ్ద స్యోర్ధ్వ మభివ్యక్తే ర్వృత్తిభేదే తు వైకృతాః
> ధ్వనయః సముపోహన్తే స్ఫోటాత్మా తై ర్న భిద్యతే. 77

శబ్దస్య = స్ఫోటశబ్దముయొక్క, అభివ్యక్తేః = అభివ్యక్తికంటె, ఊర్ధ్వమ్ = తరువాత, (జాయమానాః = పుట్టుచున్న), వైకృతాః = వైకృతములగు, ధ్వనయః + తు = ధ్వనులు మాత్రము, వృత్తిభేదే = ద్రుత మధ్యమ విలంబిత వృత్తుల భేదమునందు - అనగా అభివ్యక్తమగు స్ఫోటశబ్దమును అంతకాలమున ఉంచుటయందు, సముపోహన్తే = కారణములగుచున్నవి, తైః = ఆ వైకృత ధ్వనులచే, స్ఫోటాత్మా = స్ఫోటస్వరూపము, న + భిద్యతే = భేదింపబడదు. ఆ ధ్వనుల భేదముచే స్ఫోటశబ్దము నానారూపములుగా మార్పుచెందదని భావము.

తా. వికృతి యనగా బాహ్యము. దానివలన కలిగెడి ధ్వనులు వైకృతధ్వనులు. ప్రాకృతధ్వనులచే వ్యక్తీకరింపబడిన స్ఫోటశబ్దము స్మృతముకాగా దానిని కొంతకాలమువరకు మన చెవికి వినపడునట్లు వైకృతధ్వనులు చేయును. దానిమూలమున ద్రుతాది వృత్తులు

కలుగుచున్నవి. చదివినదానిని వల్లెవేయునపుడు ద్రుతవృత్తిని, ఇతరులతో మాట్లాడునపుడు మధ్యమను, పాఠము చెప్పునపుడు విలంబితమును వాడవలెను.

కాగా వైకృతధ్వనులు అభివ్యక్తమగు స్ఫోటశబ్దమునకు కొంతసేపుండుటకు సహకరించునవే. కనుక వానివలన స్ఫోటము భిన్నము కానేరదు.

కనుక ఒకే అకారము ద్రుతాదివృత్తిభేదమున భిన్నము కానందున మూడు వృత్తులలోను ఏకముగానే ఉండును. అట్లు కాకున్న పాణిని సూత్రములలో ఏదో ఒక వృత్తిలో అకార ముచ్చరించిన ఇతరవృత్తులలో ఆ సూత్రము ప్రవర్తించక పోయెడిది.

వి. ధ్వనులు ప్రాకృతములని, వైకృతములనియు రెండు విధములుగా నున్నవి. శబ్దాభివ్యక్తికి ముందుగా మూలముగా నున్నవి ప్రాకృతములు. వానివలన స్ఫోట శబ్దము నానాత్వమును పొంది మాత్రాకాలాది భేదమును చూపును. శబ్దాభివ్యక్తి తరువాత కలిగెడివి వైకృతములు. అవి ఆ శబ్దమును కొంతసేపు ఉండునట్లు చేయును. ఇవియే ద్రుతాది వృత్తులు. వీనివలన స్ఫోటశబ్దము నానాత్వమును పొందదు.

ధ్వనులు శబ్దముల వ్యక్తపరచును. వానిచే నభివ్యక్తమగు స్ఫోటశబ్దము వాచ్య మగునని ముందు చూ బడినది. ధ్వనులు శబ్దమును ఎట్లు వ్యక్తపరచును ? అభివ్యక్తి అనగా ఏమి ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

> ఇన్ద్రియస్యైవ సంస్కారః శబ్దస్యైవోభయస్య వా
> క్రియతే ధ్వనిభి ర్వాదా స్త్రయోఽభివ్యక్తివాదినామ్ . 78

ధ్వనిభిః = ధ్వనులచే, 1. ఇన్ద్రియస్య + ఏవ = ఇంద్రియమునకే, సంస్కారః = సంస్కారము, క్రియతే = చేయబడుచున్నది, 2. శబ్దస్య + ఏవ = శబ్దమునకే సంస్కారము చేయబడును. 3. వా = కాక, ఉభయస్య = రెంటికి-అనగా ఇంద్రియమునకు, శబ్దమునకుగూడ సంస్కారము చేయబడును అనురీతిని, అభివ్యక్తివాదినామ్ = అభివ్యక్తిని స్వీకరించు స్వభావము కలవారిలో, త్రయః = మూడు, వాదాః = వాదములు, (సన్తి = కలుగుచున్నవి,) - అభిప్రాయ భేదము లున్నవి.

తా. ధ్వనులవలన కలిగెడి విశేషమునుగూర్చి మూడు అభిప్రాయములు గలవు. 1. ధ్వనులు చెవికి సంస్కారమును కలిగించును. అట్టి చెవి శబ్దమును గ్రహించును. 2. అవి శబ్దమునకే సంస్కారమును కలిగించును. అట్టి శబ్దము చెవిచే గ్రహింపబడును. 3. అవి రెంటికి సంస్కారమును కలిగించును. అట్టి శబ్దమును అట్టిచెవి గ్రహించును.

వి. చెవి శబ్దమును గ్రహించును. అట్టి గ్రహణశక్తిలేని చెవికి ధ్వనులు శక్తి విశేషమును కలిగించును. గ్రహణశక్తి చెవికి ఉన్న దానిని స్పష్టపరచును. ఇదియే ఇచట సంస్కారము. అపుడు శ్రోత్రము శబ్దగ్రాహకము కాగలదు.

ఈ వాదములు ప్రాకృతధ్వనులకు సంబంధించును. అవియే కదా స్ఫోటశబ్దాభివ్యంజకములు.

ధ్వనులు ఇంద్రియమునకే సంస్కారమును కలిగించునది ప్రథమ పక్షమును పూర్వార్ధముచేతను, విషయమునకే సంస్కారము కలిగించునది రెండవ పక్షమును ఉత్తరార్ధముచేతను చూపుచున్నాడు.

> ఇన్ద్రియస్యైవ సంస్కారః సమాధానాఞ్జనాదిభిః
> విషయస్య తు సంస్కార స్తద్గన్ధప్రతిపత్తయే . 79

(అ) సమాధానాఞ్జనాదిభిః=(మనస్సునకు) ఏకాగ్రత, కాటుక మున్నగువానిచే, ఇన్ద్రియస్య+ఏవ=ఇంద్రియమునకే, సంస్కారః=సంస్కారము, (క్రియతే=చేయ బడుచున్నది) విషయమునకు కాదు.

తా. ధ్వనులు ఇంద్రియమునకే సంస్కారమును కలిగించును. యోగీశ్వరుడు దూరముగానున్న వస్తువును చూడగోరినపుడు మనస్సునకు ఏకాగ్రతను సంపాదించును. దానిచే కంటికి శక్తి కలుగును. అట్టి కంటికి దూరమున నున్న వస్తువు కానవచ్చును. కొందరు కంటికి విలక్షణమగు కాటుకను పెట్టుకొని దూరమందున్న వస్తువులను జూతురు. అస్మదాదులము వయస్సు మరలగా కంటికి కండ్లజోడు పెట్టుకొని చూచుచున్నాము. ఈదృష్టాన్తములు చూడగా ఇంద్రియమునకే సంస్కారము కలుగునని తెలుచున్నది.

అట్లే ప్రాకృతధ్వనులు కూడ చెవికి శబ్దమును గ్రహించుటకు యోగ్యమగు శక్తిని కలిగించును. అపుడు ఆచెవి శబ్దమును గ్రహించును. ధ్వని పైరీతిని శ్రోత్రముచే గ్రహింప బడు శబ్దమునకు వ్యంజకమగుచున్నది.

ఇచట 'ఆది' పదముచే కండ్లజోడు మున్నగునవి గ్రహింపబడును. గ్రాహ్యమగు శబ్దమునకు సంస్కార మక్కర లేదని దీని యాశయము.

(ఆ) విషయస్య+తు = విషయమునకే, సంస్కారః = సంస్కారము, తద్గన్ధ ప్రతిపత్తయే = విషయమునందున్న గంధముయొక్క జ్ఞానముకొరకు (క్రియతే = చేయ బడుచున్నది.)

అధికముగా ఎండిన భూమియొక్క గంధము నీరుపోసిన, నూనెయొక్క గంధము ఎండలో పెట్టిన తెలియును. అనగా ఉదకసంస్కారమువలన నేలయొక్క వాసన, ఆతప సంస్కారమువలన నూనెయొక్క వాసన తెలియును. గంధమనగా మన అలవాటులోనున్న వాసన. సుగంధము, దుర్గంధము. దానిని గ్రహించునది ఘ్రాణేంద్రియము- అనగా ముక్కు. ఇచట ఘ్రాణేంద్రియమునకు సంస్కారము చేయబడలేదు. గ్రాహ్యమగు గంధమునకు ఆధారమగు వస్తువుకే చేయబడుచున్నది.

అట్లే ధ్వని సంసర్గమున శబ్దమే సంస్కరింపబడి చెవికి విషయమగుచున్నది. లోపల ఉన్న శబ్దము బయటికి వినబడెడి రూపమును ధ్వనిసంబంధమువలన ధరియించును.

ఉభయమునకు సంస్కార మను మూడవపక్షమును జూపుచున్నాడు.

చక్షుషః ప్రాప్యకారిత్వే తేజసా తు ద్వయో రపి
విషయేన్ద్రియయో రిష్టః సంస్కారః, స క్రమో ధ్వనేః. 80

చక్షుషః = నేత్రమునకు, ప్రాప్యకారిత్వే = ప్రాప్యకారిత్వ పక్షమున అనగా నేత్రేంద్రియము వస్తువువద్దకుపోయి దానితోకలసి దానిని గ్రహించు నను పక్షమున, తేజసా +తు = వెలుతురు చేతను అయితే, విషయేన్ద్రియయోః = విషయము ఇంద్రియము అనెడి, ద్వయోః = రెంటికి, సంస్కారః = సంస్కారము, ఇష్టః = సమ్మతమగుచున్నది, ధ్వనేః = ధ్వనికికూడ, సః+క్రమః = ఆ క్రమము, ఇష్టః = సమ్మతమగును, ధ్వనులవలన శ్రోత్రేంద్రియమునకు శబ్దమునకు గూడ సంస్కారము కలుగునని భావము.

చీకటిలో ఘటము పటము మున్నగువస్తువులను వెలుతురు సాహాయ్యమున మనము కండ్లతో చూచుచున్నాము. వెలుతురు వస్తువులకు సంస్కారకమనుటలో విప్రతిపత్తి లేదు.

కాని ఇంద్రియము తన గోళమునందే యుండి వస్తుగ్రాహకమగునను సిద్ధాన్తమున ఒకవస్తువునకే సంస్కారము కలుగును. అట్లుకాక నేత్రేంద్రియము కిరణరూపము. అది అంతట ప్రసరించును. కనుక అది వస్తువువద్దకు పోయి దానితోకలసి దానిని గ్రహించుననెడి సిద్ధాంతమున ఆలోకము ఇంద్రియమునకుగూడ సంస్కారకము కాగలదు. మొదటి సిద్ధాంతము బౌద్ధులది. రెండవది నైయాయికులది. నైయాయిక మతమును దృష్టాంతముగాజూపి "ప్రాకృతధ్వనులు చెవికి శబ్దమునకు గూడ సంస్కారమును కలిగించును" అను మూడవపక్షము ఈ శ్లోకముచే చూపబడినది. స్ఫోటశబ్దము నంగీకరింపకున్నను శబ్దమునకు నిత్యత్వము నంగీకరించెడి మీమాంసకులు కూడ ఈ మూడుపక్షములను జూపియేయున్నారు.

స్ఫోటశబ్దమును ప్రకాశింపజేయు ధ్వనుల విషయమున గూడ మూడు విధములగు అభిప్రాయములను జూపుచున్నారు.

స్ఫోటరూపావిభాగేన ధ్వనే ర్గ్రహణ మిష్యతే
కైశ్చిద్ ధ్వని రసంవేద్యః స్వతన్త్రోఽన్యైః ప్రకల్పితః. 81

అభివ్యక్తివాదుల మతము నాశ్రయించి 78, 79, 80శ్లోకములచే స్ఫోటశబ్దాభివ్యక్తి విషయమున 3 పక్షములు చూపబడినవి. వారి మతముననే స్ఫోటశబ్దమును ప్రకాశింపచేయు ధ్వనులను గ్రహించుటలో గూడ ఈ శ్లోకముచే 3 పక్షములను జూపుచున్నారు.

(అ) కైశ్చిత్ = కొందరిచే, స్ఫోటరూపావిభాగేన = స్ఫోటశబ్దముతో స్వరూప విభాగము లేకుండునట్లుగా, ధ్వనేః = ధ్వనియొక్క, గ్రహణమ్ = జ్ఞానము, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

ఉ. సూర్యునివలన కలిగిన వెలుతురు స్తంభము మున్నగువస్తువులను ప్రకాశింపజేయును. ఆ వస్తువులతో అవిభక్తముగనే వెలుతురు గ్రహింపబడును. "ఇది స్తంభము". "ఇదివెలుతురు" అను భేదజ్ఞాన ముండదు.

అట్లే నాలుక, పెదవులు మున్నగుస్థానముల చలనముచే జనియించిన ధ్వనులు స్ఫోటశబ్దమును ప్రకాశింపచేయును. ఆ శబ్దముకంటె వేరుగా ధ్వనులు గ్రహింపబడవు, దానితో అవిభక్తములైయే ధ్వనులు గ్రహింపబడును.

(ఆ) కైశ్చిత్ = మరికొందరిచే, ధ్వనిః = ప్రాకృతధ్వని, అసంవేద్యః = తెలియబడనిదై అనగా ధ్వని స్వరూప మిది అని గుర్తింపబడనిదై, ఇష్యతే = శబ్దగ్రహణమున నిమిత్తముగా స్వీకరింపబడుచున్నది.

ఉ. కన్ను మున్నగు ఇంద్రియములు వానిరూపము మనకు తెలియకయే వస్తుగ్రాహకములగుచున్నవి. అదే విధమున ధ్వనులుగూడ ప్రత్యేకము మనకు తెలియకయే శబ్దమును ప్రకాశింపజేయుచున్నవి.

(ఇ) అన్యైః = మరికొందరిచే, ధ్వనిః = ధ్వని, స్వతన్త్రః = స్వతంత్రమైనదై అనగా స్ఫోటశబ్దముతో గలిసియున్నను స్వతంత్రమైనదై, ప్రకల్పితః = స్వీకరింపబడుచున్నది.

ఉ. దంతములుపోగా మనము స్పష్టముగా మాట్లాడుచున్నను అచట ధ్వనియే గృహీత మగును. దంతము లున్నను పదిమంది కలసి మాట్లాడినపుడు ఇతరులకు ధ్వనియే

వినబడును. శబ్దముతో కలసియున్నను పై విధముగా ధ్వనియే జ్ఞాతమగుచున్నది. పశు, పక్ష్యాదులు అరచునపుడు వర్ణములులేక ధ్వనులే వినబడును.

'ఘటః' అను పదమున 4 ధ్వనులు కలవు. అవి యన్నియు ఒకేసారి శబ్దమును ప్రకాశింపజేయనేరవు. ఒకేధ్వని దానిని ప్రకాశింప చేయలేదు. అట్టితరి ధ్వనులు శబ్దమును ఎట్లు ప్రకాశింపజేయగలవు? అను ప్రశ్నకు 88వ శ్లోకముచే సమాధానము చెప్పదలచి దానికి ముందుగా ఈ శ్లోకముచే నొక దృష్టాంతమును జూపుచున్నాడు.

యథాఽనువాకః శ్లోకో వా సోఢత్వ ముపగచ్ఛతి
ఆవృత్త్యా, న తు స గ్రన్థః ప్రత్యావృత్తి నిరూప్యతే. 82

యథా = ఏరీతిగా, అనువాకః = మంత్రసముదాయము, శ్లోకః + వా = శ్లోకము గాని, ఆవృత్త్యా = ఆవృత్తిచే - అనగా 10 పర్యాయములు వల్లెవేయుటచే, సోఢత్వమ్ = సహింటకు యోగ్యతను-అనగా గురువు చెప్పనక్కరలేకుండగా తనకు స్వాధీనమగుటను, ఉపగచ్ఛతి = పొందుచున్నదో, సః + గ్రన్థః = ఆ గ్రంథము, ప్రత్యావృత్తి + తు = ఆవృత్తి చేయునపుడెల్లను-అనగా చివరివల్లెకు ముందుగానున్న అన్నిఆవృత్తులలోను, న + నిరూప్యతే = బుద్ధివిషయము కానేరదో,

ఈ శ్లోకార్థమునకు 88 వ శ్లోకార్థముతో నన్వయము కలుగును.

తా. ఒకవ్యక్తి గురువువద్ద వేదములో ననువాకమును సంత చెప్పుకొనును. లేక ఒక శ్లోకమును చెప్పుకొనును. 10 పర్యాయములు వల్లెవేయగా అది వానికి కంఠస్థ మగును. 10 వ సారి చదువు సరికి గాని అతనికి అది స్వాధీనము కాలేదు; చివరి ఆవృత్తిచే అది స్వాధీనమైనది. అపుడు 9 పర్యాయములు చదువుట వ్యర్థము అను ప్రశ్న కలుగును. కాని అన్నిసార్లు చదువుటచేతనే వాని బలమువలన 10 వ సారికి స్వాధీనమైనది. అంతకు ముందు వల్లెవేయునపుడెల్ల అంతయు చదివినను అది స్వాధీనము కానందున వ్యర్థము కావలెను అని చెప్పరాదు కదా! అనగా ఒక్కొక్కసారి వల్లెవేయుటచే రానందున, అట్లుచేయుట నిరుపయోగ మనరాదు. చివరి సమయమున అది స్వాధీనమగుటలో సాహాయ్యము చేయుట సంభవించినది.

పై దృష్టాంతమును ప్రకృతమున సమన్వయపరచుచున్నాడు.

ప్రత్యయై రనుపాఖ్యేయై ర్గ్రహణానుగుణై స్తథా
ధ్వనిప్రకాశితే శబ్దే స్వరూప మవధార్యతే. 88

తథా = ఆరీతిగా, అనుపాఖ్యేయైః = ప్రత్యేకము చెప్పుటకు శక్యము కానట్టియు, అయినను, గ్రహణానుగుణైః = స్ఫోటశబ్దమును గ్రహించుటకు ఉపాయములగునట్టియు, ప్రత్యయైః = బుద్ధులచే, ధ్వని ప్రకాశితే = ధ్వనులచే ప్రకాశింపజేయబడిన, శబ్దే = శబ్దము నందు, స్వరూపమ్ = అక్రమ స్ఫోటశబ్దముయొక్క స్వరూపము, అవధార్యతే = స్పష్టముగ నిశ్చయింపబడుచున్నది.

తా. ధ్వనులు స్ఫోటప్రకాశకము లగును. 'ఘట మానయ' (కడవనుతెమ్ము) ఇచట 10 ధ్వనులున్నవి. ఒక ధ్వనిచేగూడ స్ఫోటము వ్యక్తమగును. ఇది అనువాకమును మొదటితడవ వల్లెవేయుట వంటిది. అంతమాత్రాన ఆ శబ్దము స్పష్టముకానేరదు. ఘకార అకార అనురీతిని 9 ధ్వనులచే నభివ్యక్తమైన తరువాత చివరి 'అ' ధ్వనివలన ఆ స్ఫోట

శబ్దము స్పష్టమగును. అలాగుననే ముందుగా నున్న 9 ధ్వనులు వ్యర్థములు కావు. ఈ తొమ్మిది ధ్వనులచే సహకృతమగు చివరిధ్వని స్ఫోటవ్యంజకము కాగలదు.

కాగా పది పర్యాయములు వల్లెవేయగా అనువాకమో, శ్లోకమో స్వాధీనమగునట్లు పై వాక్యమున 10 ధ్వనులచే నభివ్యక్తమగు స్ఫోటశబ్దము వాచక మగును.

ఒక్కొక్క పర్యాయము చదువునప్పుడు ఒక్కొక్క ధ్వనిచే శబ్దము వ్యక్తము కాగలదు. అంతమాత్రాన చారితార్థ్యము లభించదు.

కాబట్టి పూర్వ పూర్వ వర్ణానుభవ సహకృతమగు అంత్యవర్ణవిషయకమగు బుద్ధిచే నాశబ్దము గృహీతమగును.

88 వ శ్లోకములో నున్న అర్థమునే ప్రకాశింపజేయుచున్నారు.

> నాదై రాహితబీజాయా మన్త్యేన ధ్వనినా సహ
> అవృత్తపరిపాకాయాం బుద్ధౌ శబ్దోఽవధార్యతే. 84

నాదైః = పూర్వపూర్వధ్వనులచే, ఆహితబీజాయామ్ = సమర్పింపబడిన బీజము అనగా భావన కలిగినట్టియు, ఆవృత్తపరిపాకాయామ్ = అభ్యసింపబడిన పరిపాకము కలిగిన బుద్ధౌ = బుద్ధియందు, అన్త్యేన = చివరిదియగు, ధ్వనినా + సహ = ధ్వనితోగూడ - అనగా చివరి ధ్వని అవగతమగుకాలముననే, శబ్దః = స్ఫోటశబ్దము, అవధార్యతే = నిశ్చితమగుచున్నది.

88 వ శ్లోకార్థమునే ఈశ్లోకము వివరించుచున్నది. ఇచట బీజమనగా సంస్కారము. ప్రకృత కార్యమును కలిగించెడి శక్తి విశేషము పరిపాక మనబడును.

పూర్వపూర్వధ్వనులచే బుద్ధిలో వాని సంస్కారమేర్పడును: స్ఫోటశబ్దమును వ్యక్తపరచెడి శక్తి విశేషము దానియందు కలుగును. చివరిధ్వనితోపాటు స్ఫోటశబ్ద మభివ్యక్తమగును. చివరిధ్వనిచే నభివ్యక్తి కలుగునపుడు పూర్వపూర్వధ్వనులు సంస్కారరూపమున నుండి సహకరించును.

ధ్వనులు ప్రత్యేకముగా స్ఫోటశబ్దమును వ్యక్తపరచినచో వర్ణమున అవయవములు, పదమున వర్ణములు వాక్యమున పదములు లేవనియే సిద్ధాన్తము తేలుచున్నది. వానికి ప్రత్యేకముగ వ్యంజకములు లేవు కదా! కాని వర్ణము మున్నగునవి భాసించుచునేయున్నవి. అవి యెట్లు సంగతము లగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

> అసత శ్చాన్తరాలే యాన్ శబ్దా నస్తీతి * మన్యతే
> ప్రతిపత్తు రశక్తిః సా గ్రహణోపాయ ఏవ సః. 85

(అ) అన్తరాలే = మధ్యకాలమున-అనగా ధ్వనులుపుట్టుట, స్ఫోటశబ్ద మభివ్యక్తమగుట ఈ రెంటికి మధ్యకాలమున, అసతః + చ = లేనట్టి, యాన్ = యే, శబ్దాన్ = శబ్దములను, అస్తి + ఇతి = ఉన్నట్లు, మన్యతే = తలంచుచున్నాడో, సా = వానినిసట్లు భావించుట, ప్రతిపత్తుః = శబ్దమును గ్రహించువానియొక్క, అశక్తిః = అసామర్థ్యము.

---

* ఈ కారికలో "అస్తి" అనునది తిఙంతముకాదు, తిఙంత ప్రతిరూపకమగు అవ్యయము. 'మన్యతే' అను క్రియనుబట్టి 'శబ్దాన్' అనునది కర్మ, ద్వితీయాంతము.

(అ) సః = మధ్యకాలమున శబ్దము లున్నవని భావించుట, గ్రహణోపాయః + ఏవ = స్ఫోటశబ్దమును గ్రహించుటలో నుపాయమే, (భవతి = అగుచున్నది).

తా. ధ్వనివలన వర్ణరూపమున గాని, పదరూపమున గాని స్ఫోటశబ్ద మభివ్యక్త మగును. ఆ శబ్దము మాత్రము నిరవయవము. వర్ణమున వర్ణావయవములుగాని, పదమున వర్ణములు గాని, వాక్యమున పదములు గాని లేనేలేవు. అవి యున్నవని భావించుట భ్రమయే. ధ్వనులచే శబ్దమును గ్రహించు శక్తికలవానికి అవి భాసించవు. పైరీతిని లేని శబ్దము లున్నవని కొందదు భావింతురు. వారు అసలుశబ్దమును గ్రహించే శక్తిలేనివారు. అట్టివారే అట్లు భావింతురు.

కాని అట్టి శక్తికలవారు క్రమముగా స్ఫోటశబ్దమును గ్రహించుటలో భ్రమరూపముగా నున్న మధ్యకాలమునందలి శబ్దములు సాహాయ్య మాచరింపగలవు.

సిద్ధాంతమున శబ్దము అఖండమే.

నిజరూపమున క్రమము లేనిదే స్ఫోటశబ్దము. దానిని వ్యక్తపరచెడి ధ్వనులయందు క్రమ మున్నది. ఆ క్రమము స్ఫోటశబ్దమునందు ఆరోపింపబడుచున్నది. అట్టిశబ్దమే మనకు అర్థబోధకమగుచున్నది. అట్లుకానిచో నది మనకు గ్రాహ్యము కాదు. అర్థబోధకము కూడ కాదు అని దృష్టాంతము చూపుచు బోధించుచున్నాడు.

భేదానుకారో జ్ఞానస్య వాచ శ్చోపప్లవో ధ్రువః
క్రమోపసృష్టరూపా వాగ్ జ్ఞానం జ్ఞేయవ్యపాశ్రయమ్. 86

(అ) జ్ఞానస్య = ఘటము అనెడి ఆకారముకల జ్ఞానమునకు, భేదానుకారః = భేదముయొక్క ఆరోపణము అనగా ఏకరూపమగు జ్ఞానమునందు వస్తుభేదము వలన కలిగెడి బేదమును ఆరోపించుట, వాచః = శబ్దమునకు, ఉపప్లవః + చ = భేదమును ఆరోపించుటయు-అనగా స్ఫోటశబ్దమునందు వ్యంజకధ్వనుల యందున్న భేదమును ఆరోపించుటయు, ధ్రువః = నిశ్చితమే.

తా. స్ఫోటశబ్దము నిజరూపమున నిరవయవము, క్రమరహితము. దానికి వ్యంజకములగు ధ్వనులు జన్యములు కనుక సావయవములు, క్రమసహితములు. వానియందున్న ధర్మములు స్ఫోటశబ్దమునందు ఆరోపితములు కాగలవు. ఇందుకు జ్ఞానము దృష్టాంతముగా జూపబడినది. జ్ఞానము నిజమున ఏకరూపమే. దానియందు భేదము లేదు. కాని తెలియబడే వస్తువులు భిన్నములగుటచే వానియందున్న బేదమును జ్ఞానమునందు ఆరోపించుచున్నారు.

(అ) జ్ఞానమ్ = జ్ఞానము, జ్ఞేయవ్యపాశ్రయమ్ = జ్ఞేయములగు వస్తువులు ఆశ్రయముగా గలది, వాక్ = శబ్దము, క్రమోపసృష్టరూపా = వ్యంజకధ్వని గతమగు క్రమముతో మిశ్రితమగు రూపమే గలది.

తా. ధ్వనిగతక్రమము స్ఫోటశబ్దమునందు ఆరోపితమగును. అట్టిశబ్దమే మనకర్థబోధక మగుచున్నది. అట్లుకాకున్న అది అస్మదాదులకు గ్రాహ్యము కానేరదు. అర్థబోధకము కూడ కానేరదు. ఇందు జ్ఞానము దృష్టాంతముగా జూపబడినది. జ్ఞేయములగు ఘటపటాది వస్తువులతో సంవలితమగు జ్ఞానమే వ్యవహారయోగ్యమగును. అట్లు కాకున్న నిరాశ్రయమగు జ్ఞానము వ్యవహారక్షమము కానేరదు.

వి. ఈ శ్లోకమున పూర్వోత్తరభాగములలో జ్ఞానము దృష్టాంతముగా జూపబడినది. ఇవ, యథా మున్నగుపదములు లేవు. అయినను అప్రకృతమగు జ్ఞానమును చెప్పుట దృష్టాంతార్థమే యగును.

86 వ కారికలో "గ్రహణోపాయ ఏవ సః" అని చెప్పబడినది. అవయవ రహితమగు స్ఫోటశబ్దమునకు పదములు వర్ణములు వాని అవయవములు అవయవములుగా కల్పింపబడినవి అవి విలక్షణములే, అయినను అవి శబ్దగ్రహణమునకు ఉపాయములని దాని భావము. ఇచట ఒక సంశయము—వస్త్రమునకు తంతువులకు యథార్థము అగు అవయవావయవి భావ మున్నది. రెంటికి గుణసామ్యము కూడ కలదు. అచట అవయవములు అవయవిని తెలుసుకొనుటకు ఉపాయములు కాగలవు. వర్ణపదములు వాక్యమునకు ముఖ్యము లగు అవయవములు కావు. పరస్పరము అవి సంబద్ధములు కానేరవు. సదృశమగు వస్తువు సదృశవస్తుజ్ఞానమునకు ఉపకరించును. కాగా విసదృశములగు వర్ణపదములు స్ఫోటశబ్ద జ్ఞానమునకు ఎట్లు ఉపాయము లగును ?— ఈ సంశయమును పోగొట్టుచున్నాడు.

యథాఽఽద్యసంఖ్యాగ్రహణ ముపాయః ప్రతిపత్తయే
సంఖ్యాన్తరాణాం భేదేఽపి తథా శబ్దాన్తరశ్రుతిః . 87

యథా = ఏరీతిగా, ఆద్యసంఖ్యాగ్రహణమ్ = మొదటిది యగు సంఖ్యయొక్క- అనగా ఏకత్వసంఖ్య యొక్క జ్ఞానము, భేదే + అపి = భేదమున్నను, సంఖ్యాన్తరాణామ్ = దశత్వము మున్నగు ఇతరసంఖ్యల యొక్క, ప్రతిపత్తయే = తెలుసుకొనుటకొరకు, ఉపాయః = ఉపాయమో, తథా = ఆరీతిగా, శబ్దాన్తరశ్రుతిః = పదము మున్నగు శబ్దముల శ్రవణము అఖండవాక్య స్ఫోటమును తెలుసుకొనుట కుపాయము కాగలదు.

తా. వర్ణావయవములు పదావయవములు కూడ మిథ్యాభూతములు. మిక్కిలి భిన్నములు. అయినను అవి ఆశబ్దమును వ్యక్తపరచగలవు. ఇచట సంఖ్య దృష్టాంతముగా జూపబడినది ఏకత్వము మొదటిసంఖ్య. దీనివలననే ఇతరసంఖ్యలు కలుగుచున్నవి. ఇది ఒకటి, ఇది ఒకటి అని లెక్కించిన ద్విత్వసంఖ్య పుట్టుచున్నది. ఇట్లే 10 వ్యవహారముల వలన దశత్వసంఖ్య పుట్టును. ఏకత్వముకంటె ఇతరసంఖ్యలు విజాతీయములే. అయినను వానికి ఏకత్వసంఖ్య కారణము కాగలదు. చివరి ఏకత్వముచే దశత్వము పుట్టుచున్నది. అట్లే ప్రకృతమున గూడ కాగలదు.

ధ్వనులు శబ్దజ్ఞానమున కారణములు కావచ్చును. కాని ఆ ధ్వనులు విలక్షణము లగుటచే తమరూపమును శబ్దమున ఎట్లు చూపగలవు? ధూమము అగ్నిని జ్ఞాపన చేయుచు ధూమరూపమున చూపి జ్ఞాపన చేయలేదు కదా! అను సంశయమును పోగొట్టుచున్నాడు.

ప్రత్యేకం వ్యఞ్జకా భిన్నా వర్ణవాక్యపదేషు యే
తేషా మత్యన్తభేదేఽపి సంకీర్ణా ఇవ శక్తయః . 88

వర్ణవాక్యపదేషు = వర్ణములు, వాక్యములు, పదములు, (ప్రకాశనీయేషు = ప్రకాశింప జేయవలసి వచ్చినపుడు), ప్రత్యేకమ్ = ప్రత్యేకముగా, యే = ఏవి, భిన్నాః = భిన్నము లగు, వ్యఞ్జకాః = ప్రకాశములగు ధ్వనులో, తేషామ్ = వానికి, అత్యన్త భేదే + అపి = మిక్కిలి భేదమున్నను, శక్తయః = శక్తులు, అనగా వర్ణపదాదులను ప్రకాశింపజేయు శక్తులు, సంకీర్ణాః + ఇవ = సంకీర్ణమైనవివలె కాన్పించుచున్నవి.

తా. వాక్యమును ప్రకాశింపజేయు ధ్వనులు పదాభివ్యంజక ధ్వనులు, వర్ణాభివ్యంజక ధ్వనులు ఏకరూపములు కావు. అవి పరస్పరము భిన్నములే. అవి వేరువేరుగా ప్రకాశకములగును. కాని వాక్యమున పదావయవములు. వానిలో వర్ణావయవములు. వానిలో కొన్ని అవయవములు ఉన్నట్లు కాన్పించును. ఉదా: 'గా మానయ' (ఆవును తెమ్ము) ఇది ఒక వాక్యము. స్వతంత్రముగా ప్రయోగింపబడు గామ్, ఆనయ అను పదముల సారూప్యము దీనియందు కానవచ్చుచున్నది. వాక్య పద ధ్వనులు విభిన్నములైనను పై సామ్యమును బట్టి సంకీర్ణములై కన్పించుచున్నవి. కాబట్టి వాక్యము నిరవయవమైనను దానిలో పదములు, వానిలో వర్ణములు కనిపించుచున్న వనుట సరియగుచున్నది.

కత్వ గత్వాదికము క్రమము అనునవి ధ్వనిధర్మములు. స్ఫోట శబ్దమున అట్టి ధర్మములు లేవు. కాగా అట్టి వైలక్షణ్య ముండుటచే అట్టి ధర్మములు శబ్దమునందు ఎట్లు భాసించును? అను ప్రశ్నకు సమాధానముచెప్పుటకై ముందు ఈ శ్లోకముచే దృష్టాంతము చెప్పుచున్నాడు.

> యథైవ దర్శనైః పూర్వై ర్దూరా త్సంతమసేఽపి వా
> అన్యథాకృత్య విషయ మన్యథై వాధ్యవస్యతి . 89

యథా = ఏరీతిగా, పూర్వైః = ముందుగానున్న, దర్శనైః = చూపులచే, దూరాత్ = వెలుతురులోనే దూరముగానున్నను, సంతమసే + అపి + వా = దగ్గరగా కను చీకటిలో నున్నను, విషయమ్ = చెట్టు, త్రాడు మున్నగువస్తువులను, అన్యథాకృత్య + ఏవ = రూపాంతరముచే అనగా ఏనుగుగాను, పాముగాను గుర్తించి, (పరైః) = తరువాతి చూపులచే, అన్యథా + ఏవ = ముందు గుర్తించిన రూపముకంటె భిన్నమగు చెట్టు, త్రాడు అను నిజ రూపముతోనే, అధ్యవస్యతి = నిశ్చయించుచున్నదో. (ఇచట లోకము కర్త. ఈ శ్లోకార్థమునకు 90 వ శ్లోకార్థముతో సన్వయము కలుగును.)

తా. పూర్వపూర్వ ధ్వనులు ప్రకాశకములగునపుడు అఖండవాక్య స్ఫోట శబ్దము స్పష్టముకాక వర్ణపదములే భాసించుచున్నవి. ఆ స్ఫోటశబ్దమే నిజరూపమునగాక అసత్యములగు వర్ణ పద రూపములుగా కానవచ్చుచున్నది. చివరిధ్వనిచే నభివ్యక్తి కలుగు సమయమున వర్ణపదరూపములు పోయి సత్య వాక్యస్ఫోటశబ్దము స్పష్టమగును. ఇందుకు రెండు దృష్టాంతములు చూపబడినవి. చక్కనివెలుతు రున్నను మనుజుడు దూరమున ఒక చెట్టునుచూచి 'ఏనుగు' అని భావించును. దగ్గరగా నున్నను చీకటిలో వంకరగానున్న త్రాడును చూచి 'పాము' అని భావించును. ఆ వ్యక్తి ముందుచూచుటలో కలిగిన పరిస్థితి యిది. ఆయన అచటనే యుండి జాగ్రత్తగా పరికించిన చెట్టు, త్రాడు అను రూపాంతరముల భావించును. దోషవశమున అసలు వస్తువును ముందుగా రూపాంతరముగా చూచి ఆ దోషము నివర్తించగా ఆ వస్తువునే రూపాంతరమును-అనగా భ్రమరూపమును, విడనాడి నిజరూపమున గుర్తించును. ప్రకృతమునగూడ అట్లే.

వర్ణ పదములు కల్పితములు. అవి నిజముగ లేవు వాక్యము సత్యము. అదియే స్ఫోటశబ్ద మని వైయాకరణులు విశ్వసింతురు.

పయిరీతిని దృష్టాంతము జూపి ప్రకృతార్థమున సమన్వయము చేయుచున్నాడు.

వ్యజ్యమానే తథా వాక్యే వాక్యాభివ్యక్తిహేతుభిః
భాగావగ్రహరూపేణ పూర్వం బుద్ధిః ప్రవర్తతే . 90

తథా = ఆరీతిగా, వాక్యే = నిరవయవమగు వాక్యశబ్దము, వ్యజ్యమానే = వ్యక్తీకరింపవలసియుండగా, వాక్యాభివ్యక్తిహేతుభిః = వాక్యముయొక్క అభివ్యక్తికి కారణములగు ధ్వనులచే, పూర్వమ్ = ముందుగా, భాగావగ్రహరూపేణ = వర్ణములు పదములు అనే భాగముల యొక్క స్వీకారరూపమున, బుద్ధిః = బుద్ధి, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

తా. వాక్యాభివ్యంజక ధ్వనులతో 88 వ శ్లోకమున చెప్పినప్రకారము పద ధ్వనులు సారూప్యమును బట్టి సంకీర్ణములగుటచే ముందుగా వర్ణ పద ధ్వని రూపమున బుద్ధి ప్రవర్తించును. చివరి ధ్వనివలన అట్టి పదవిషయక భ్రమ నివర్తించి నిజమగు వాక్యరూపమున నిలుచును.

'ఘట మానయ' ఈవాక్యము వ్యక్తము కావలెనన్నచో ముందుగా ఘకారాది వర్ణములు, 2 పదములు భాసించును. చివరి ధ్వనివలన ఈ రెండురూపములు మారి వాక్యరూపమున భాసించును. ముందుగా కలిగినది భ్రమ, తరువాతిది సత్యము. దీని భావము 89 వ శ్లోకమున గూడ వ్యక్తము.

వాక్యము అఖండము. దానికి అవయవములు లేవు. అచట పదరూపావయవములు, వర్ణరూపావయవములు కల్పితములే అని అంగీకరించినచో కల్పన అనియతముగా కాన్పించుచున్నందున వాక్యము విషయమున ముందుగ వర్ణరూపము. తరువాత పదరూపము అను క్రమముకూడ అనియతముగానే ఉండవలెను. చెట్టును చూచి భ్రమపడుటలో వొకనికి చిన్నఏనుగుగను, మరియొకనికి పర్వతముగను కాన్పించుచున్నదిగదా ! కాని వాక్యము విషయమున నియతమగు క్రమము కాన్పించుచున్నది. అది ఎట్లు పొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

యథాऽనుపూర్వీనియమో వికారే క్షీరబీజయోః
తథైవ ప్రతిపత్తౄణాం నియతో బుద్ధిషు క్రమః . 91

యథా = ఏరీతిగా, క్షీరబీజయోః = పాలయొక్క, విత్తుయొక్కయు, వికారే = వికారము విషయమై, అనుపూర్వీనియమః = అనుపూర్వియొక్క నియమము అనగా నియతమగు క్రమము (అస్తి = కలదో) తథా + ఏవ = ఆరీతిగనే, ప్రతిపత్తౄణామ్ = గ్రహించువారికి - అనగా వాక్యమును తెలుసుకొనువారికి, బుద్ధిషు = వర్ణపదములకు సంబంధించిన బుద్ధుల విషయమై, క్రమః = క్రమము - అనగా ముందుగా వర్ణములు, తరువాత పదములు అను క్రమము, నియతః = నియతమైనదై, (అస్తి) = కలదు.

తా. నిరవయవమగు వాక్య స్ఫోటశబ్దమే సత్యము. దానియందు పదములు, వర్ణములు లేనేలేవు. కాని ముఖ్యశబ్ద మభివ్యక్తము కావలెనన్నచో నియతమగు క్రమము కలదు. ముందుగా వర్ణములు, తరువాత పదము భాసించును. తరువాత వాక్యము వ్యక్తమగును. అంతియేగాని పదము ముందు, వర్ణములు తరువాత అని మాత్ర ముండదు. వర్ణ పదములు కల్పితములు కావచ్చును. వానికి క్రమముమాత్రము పైరీతిని నియతముగా

నుండును. ఇందుకు రెండు దృష్టాంతములు చూపబడినవి. పాలు పెరుగుగా మారును. పాలు ముందుగా కొంచెము గట్టిపడును. తరువాత మరికొంచెము గట్టిపడును. విత్తు వేయగా మొలక, రెండు ఆకులు, చిగురు, రెమ్మ, కొమ్మ అను క్రమముననే చెట్టు అగుచున్నది. ప్రథమావస్థను రెండవ యవస్థగాను, రెండవయవస్థను ప్రథమావస్థగాను మార్చుట బ్రహ్మకుగూడ సాధ్యము గాదు. ప్రకృతమునగూడ అదియే రీతి.

పూర్వమీమాంసకులు వర్ణములకు నిత్యత్వ మంగీకరింతురు. మరియు వర్ణముల కలయికయే పదము, అదియే వాక్యము. వర్ణములకంటె వేరుగా పదముగాని వాక్యముగాని ఉండనేరదు అని వారు తలంచుచున్నారు. వారిమతమునగూడ ఘట పటాది శబ్దములకు భేదము అభివ్యంజకములగు ధ్వనుల క్రమమును పురస్కరించుకొనియే కలుగునని అంగీకరించవలె నని చెప్పుచున్నాడు.

భాగవత్స్వపి తేష్వేవ రూపభేదో ధ్వనేః క్రమాత్
నిర్భాగే ష్వభ్యుపాయో వా భాగభేదప్రకల్పనమ్ . 92

(అ) భాగవత్సు + అపి = అవయవములు కలవియైనను, తేషు = ఆ పద వాక్యములయందు, రూపభేదః = రూపభేదము, ధ్వనేః = వ్యంజకమగు ధ్వనియొక్క, క్రమాత్ + ఏవ = క్రమమువలననే (జాయతే = కలుగుచున్నది).

తా. మీమాంసకమతమున ఘటః పటః అను పదస్వరూపము వ్యంజకములగు ధ్వనులందున్న క్రమమును బట్టియే చెప్పవలెను. అట్లు కాకున్న ఒక్కొక్క ధ్వనిచే నభివ్యక్తి కలిగిన పదము నిర్ధారితము కాకపోయెడిని. వర్ణములకు స్వతః క్రమములేదు. అన్ని ధ్వనులు ఒకేసారి వ్యంజకములగుచో 'నదీ' 'దీన' ఈ రెండు పదములలో గూడ ఒకేవిధములగు వర్ణము లున్నందున పదభేదము చూప సాధ్యము కాదు. ఇట్లే 'కపి'-'పిక' 'రాజ'-'జరా' 'యమ'-'మయ' మున్నగునవి కలవు. వ్యంజకములు ధ్వనులు. అవి జన్యములు. వానికి క్రమము కలదు. ఆ క్రమమును వ్యంగ్యమగు వర్ణమునందు ఆరోపించగా పదభేదము సిద్ధించును.

పూర్వార్ధముచే మీమాంసకమతమును జూపి వైయాకరణమతమును ఉత్తరార్ధముచే జూపుచున్నాడు.

(అ) వా = అట్లుగాక, నిర్భాగేషు = నిరవయవములగు వాక్యములందు, భాగభేదప్రకల్పనమ్ = వర్ణములు పదములు అనెడి భాగముల భేదముయొక్క కల్పనము - అనగా ధ్వనుల క్రమముచే కలిగిన వర్ణము, పదము అనే అవయవముల కల్పనము, అభ్యుపాయః = అఖండ స్ఫోటశబ్దమును తెలుసుకొనుటకు ఉపాయము కాగలదు.

తా. వాక్యమే సత్యము వర్ణ పదములు కల్పితములని శాబ్దికులు విశ్వసింతురు. వీరికిగూడ ధ్వనులక్రమముచే వర్ణ పద భేదము, దానివలన సత్య వాక్య స్ఫోటశబ్దజ్ఞానము కలుగును.

కాగా ధ్వనులకు స్వాభావికమగు క్రమమును ముఖ్యశబ్దమునందు ఆరోపణము మీమాంసకులకు, వైయాకరణులకు సమానమే.

విశేషమేమనగా మీమాంసక మతమున వాయుసంయోగములు, వైయాకరణ మతమున కకార గకారాది వర్ణములు ధ్వనులుగా గ్రహింపబడుచున్నవి.

శబ్దగత జాతియే వాచకమనెడి జాతిస్ఫోటవాదియొక్క మతమును జూపుచున్నాడు.

అనేకవ్యక్త్యభివ్యఙ్గ్యా జాతిః స్ఫోట ఇతి స్మృతా
కైశ్చి ద్వ్యక్తయ ఏవాస్యా ధ్వనిత్వేన ప్రకల్పితాః . 93

కైశ్చిత్ = కొందరిచే, అనగా శబ్దమునందున్న జాతి వాచకమను పక్షము నాశ్రయించిన వారిచే, అనేకవ్యక్త్యభివ్యఙ్గ్యా = అనేకములగు వర్ణవ్యక్తులచే వ్యంగ్యమగు, జాతిః = శబ్దత్వరూపమగు జాతి, స్ఫోటః + ఇతి = వాచకమని, స్మృతా = స్మరింపబడుచున్నది అనగా నిశ్చయింపబడుచున్నది.

అస్యాః = వాచకమగు ఈ జాతికి, వ్యక్తయః + ఏవ = వర్ణవ్యక్తులే, ధ్వనిత్వేన = వ్యంజకరూపమున, ప్రకల్పితాః = స్వీకరింపబడినవి.

తా. మహాభాష్యకారులు జాతి వ్యక్తి భేదమున స్ఫోటశబ్దమును రెండు రకములుగా నిరూపించి యున్నారు. ఇంతవరకు వ్యక్తి స్ఫోటపక్షమును చూపి ఈ శ్లోకముచే జాతి స్ఫోటపక్షమును నిరూపించుచున్నాడు.

స్ఫుటతి అస్మాదర్థః (దీనివలన అర్థము స్ఫుటమగును) అను వ్యుత్పత్తిని బట్టి స్ఫోటశబ్దము వాచకపర్యాయము. వ్యక్తిస్ఫోట అనగా వ్యక్తి వాచకమనియు, జాతి స్ఫోట అనగా జాతివాచకమనియు అర్థము చెప్పవలెను.

ఘటః పటః మున్నగు ధ్వనులచే నభివ్యక్తమగు స్ఫోటశబ్దము వాచకమని వ్యక్తి స్ఫోటవాది యాశయము.

పై శబ్దములు ఘటము మున్నగు వ్యక్తులందున్న ఘటత్వ పటత్వ జాతులను బోధించును. అట్లు చెప్పుటలో లాఘవ మున్నదని చాలమంది శాస్త్రజ్ఞులు సిద్ధాంతపరచి యున్నారు. అట్టితరి ఘటశబ్దము వాచకముకాక దానియందున్న ఘటశబ్దత్వ జాతి వాచకమగునని జాతి స్ఫోటవాది యాశయము. అట్టి జాతికి వర్ణరూపములగు ధ్వనులు వ్యంజకములు కాగలవు.

వి. ఇచట జాతి అనగా తార్కికులు చూపుచున్న జాతి కాదు. మతియేమన అద్వైత వేదాంతులు చూపిన బ్రహ్మరూపము. ఈ యంశమును భర్తృహరియే మూడవ కాండమున స్పష్టపరచనున్నాడు.

శబ్దవ్యక్తియే వాచకమనెడి వ్యక్తిస్ఫోటవాది మతమును చూపుచున్నాడు.

అవికారస్య శబ్దస్య నిమిత్తై ర్వికృతో ధ్వనిః
ఉపలబ్ధౌ నిమిత్తత్వ ముపయాతి ప్రకాశవత్ . 94

నిమిత్తైః = నోటిలోనున్న తాలువు, దంతములు, పెదవులు మున్నగు స్థానముల చలనముచే, వికృతః = వికారమునుపొందిన-అనగా పుట్టిన, ధ్వనిః = ధ్వని, ప్రకాశవత్ = దీపము మున్నగువాని వెలుతురువలె, అవికారస్య = వికారములేని, శబ్దస్య = అఖండవ్యక్తి స్ఫోటరూపమగు శబ్దముయొక్క, ఉపలబ్ధౌ = పొందుటయందు, నిమిత్తత్వమ్ = కారణత్వమును, ఉపయాతి = పొందుచున్నది - అనగా కారణమగుచున్నది.

తా. ఘటమునందు ఘటత్వజాతి యున్నది. దానికి ఆశ్రయము ఆ ఘటము. అనగా వ్యక్తి. ఇది శాస్త్రజ్ఞుల వ్యవహారమున నున్న ప్రక్రియ.

స్ఫోటశబ్దము అట్టిదికాదు. శబ్దవ్యక్తి నిత్యము. ఆకాశము నంతట వ్యాపించి యున్నది ఒక్కటియే. దానియందు జాతి లేనేలేదు. స్థానముల చలనము నోటిలో నున్న ధ్వనికే భేదమును కలిగించును. స్ఫోటశబ్దమునకు భేదకము కాదు.- ధ్వనివలన స్ఫోటవ్యక్తి పుట్టినది కాదు. ఐనను దానికి ధ్వని వ్యంజకము కాగలదు. ఇందుకు ప్రకాశము దృష్టాంతముగా జూపబడినది. దీపముయొక్క వెలుతురు ఘటము మున్నగు వస్తువులను పుట్టించునది కాదు. దానిపై అవి ఆధారపడినవి కావు. ఐనను వానిని ప్రకాశింపజేయుచున్నది. ప్రకృతమునగూడ అట్లే.

బ్రహ్మజ్ఞానము కలుగగా జాతియు నశించును. కనుక జాతి సిద్ధాంతమున నిలుచునది కాదు. కనుక వ్యక్తి స్ఫోటపక్షము యుక్తము.

నిత్యమగు శబ్దమునకు ధ్వనులు వ్యంజకము లనుట పొసగదు. ఏలయన అనిత్యము లగు ఘటపటాదులకే దీపాదులచే నభివ్యక్తి కలుగును. నిత్యమగుదానికి అభివ్యక్తి ఎట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

న చానిత్యే ష్వభివ్యక్తి ర్నియమేన వ్యవస్థితా
ఆశ్రయైరపి నిత్యానాం జాతీనాం వ్యక్తి రిష్యతే.  95

అభివ్యక్తిః=వ్యంజకములచే ప్రకాశించుట, అనిత్యేషు + చ = అనిత్యములగు వ్యక్తులందే, నియమేన=నియతముగా, న+వ్యవస్థితా=నిశ్చయింపబడునది కాదు.

కారణమేమనగా, నిత్యానామ్+అపి=నిత్యములైనను, జాతీనామ్=ఘటత్వము మున్నగు జాతులకు, ఆశ్రయైః=ఆధారములగు ఘటము మున్నగువ్యక్తులచే, వ్యక్తిః=అభివ్యక్తి, ఇష్యతే=అంగీకరింపబడుచున్నది.

దీపముయొక్క ప్రకాశము ఘటము మున్నగువస్తువులను ప్రకాశింపజేయుచున్నది. ప్రకాశింపజేయబడెడి ఘటాదు లనిత్యములే. కాబట్టి ప్రకాశింపజేయబడే పదార్థము అనిత్యమే యగును అను నియమము లభించుచున్నది. ఇట్టితరి ధ్వనులచే స్ఫోటశబ్ద మభివ్యక్త మగునని తలంచిన ఆ శబ్ద మనిత్యమే కావలెను. అట్లంగీకరించుట వ్యాకరణసిద్ధాంత విరుద్ధము అను సంశయము కలుగుచున్నది. దానికి ఈ శ్లోకము సమాధానము చూపుచున్నది.

తా. అభివ్యక్తి అనిత్య వస్తువులకే అను నియమము లేదు. ఘటము పటము గోవు మున్నగువ్యక్తులందు ఘటత్వము పటత్వము గోత్వము మున్నగు జాతు లున్నవి. అవి నిత్యములనియే శాస్త్రములు చెప్పుచున్నవి. ఘటము మున్నగు వ్యక్తులు ఆ జాతులను ప్రకాశింపజేయుననియు శాస్త్రములే చెప్పుచున్నవి. కనుకనే ఘటాదులకు వ్యక్తులను వ్యవహారము కలిగినది వ్యక్తపరచునది వ్యక్తి. ఇట్టి ఆకారము కలవి యన్నియు ఘటములు అనియు, వాని యన్నిటియందు ఘటత్వమను జాతి యున్నదనియు లోకులు తలంచుచునే యున్నారు.

కాగా నిత్యములైనను జాతులు స్వాశ్రయ వ్యక్తులచే నభివ్యంజితములగు చున్నందున నిత్యమగు స్ఫోటశబ్దముకూడ ధ్వనులచే నభివ్యంజితమగుటలో విప్రతిపత్తి లేదు. అనిత్యవస్తువులే అభివ్యక్తము లగునను నియమము లేదు.

ఒకే దేశమునందున్న దీపమునకు, ఘటాదికమునకు వ్యంగ్యవ్యంజక భావము కాన్పించుచున్నది. బజారులోనున్న దీపము ఎచ్చటనో ఉన్న ఘటాదికమును ప్రకాశింప జేయనేరదు కదా! ప్రకృతమున తాల్వాదులచే నభివ్యక్తమగు ధ్వని నోటిలోనున్నది శబ్దము మాత్రము బుద్ధియందున్నది. కాగా భిన్నదేశములయందున్న ధ్వని శబ్దములకు వ్యంగ్య వ్యంజకభావము ఎట్లు కుదురును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

దేశాదిభిశ్చ సంబన్ధో దృష్టః కాయవతా మిహ
దేశభేదవికల్పేఽపి న భేదో ధ్వనిశబ్దయోః. 96

(అ) ఇహ=ఈ జగమున, కాయవతామ్ + చ=శరీరము కలవానికే, దేశాదిభిః= దేశము మున్నగువానితో, సంబన్ధః=సంబధము-అనగా ఈ గోవు ఈ ప్రదేశమున నున్నది. ఈ కడవ ఈ దేశమున ఉన్నది. ఇది ఈ కాలమున ఉన్నది. అనే దేశకాలసంబన్ధము, దృష్టః=చూపబడుచున్నది. మూర్తిమత్తులకే దేశకాల సంబంధము కలుగును. పరిమితమగు పరిమాణము కలవి మూర్తిమత్తు లనబడును. అమూర్తములకు దేశకాల సంబంధ ముండదని భావము.

తా. మూర్తములగు పదార్థములకే దేశసంబంధము కలుగును. ఘటము గోవు మున్నగునవి మూర్తములు కనుక వానికి దేశసంబంధము, కాలసంబంధము కలుగును. శబ్దము అట్టిదికాదు. అది వ్యాపకము. అంతట వ్యాపించియున్నది. కనుక పరిమిత పరిమాణ ములకు కలిగెడి దేశసంబంధము వ్యాపకమగు శబ్దమునకు పర్తించునది కాదు.

(ఆ) ధ్వనిశబ్దయోః=ధ్వనికి శబ్దమునకును, దేశభేద వికల్పే + అపి =దేశభేద మును కల్పించినను, భేదః=యథార్థమగు భేదము, న=లేదు.

తా. 'ఇంటిలో మాట్లాడుచున్నాడు', 'బజారులో మాట్లాడుచున్నాడు' మున్నగు లోకుల వ్యవహారము చూడగా శబ్దమునకుగూడ దేశభేదమున్నటుల కాన్పించును; కాని ఆ భేదము కల్పితమే. యథార్థము కానేరదు. అమూర్తమగు శబ్దమునకు దేశసంబంధము కలుగ నేరదు కదా!

వి. ఈ కారికా పూర్వభాగమున 'చ' శబ్దము, 'ఏవ' శబ్దార్థకము. 'కాయవతా మపి' అని పాఠాంతరము.

ప్రకాశింపజేయబడు వస్తువునకు ప్రకాశకములు నానావిధము లుండగలవు. ఘట మును దీపము సూర్యరశ్మి మణికాంతి మున్నగునవి అన్నియు ప్రకాశింపజేయుచున్నవి. ప్రకాశక నియమము లేదు. ఇది వ్యంగ్యవ్యంజకములకు గల పద్ధతి. ప్రకృతమున శబ్దము ప్రకాశింపజేయబడేది. దానిక ప్రకాశకములు "ధ్వనులు". మరియొకదాని వలన అది ప్రకాశింపజేయబడనేరదు. అందుచే ధ్వనులకు, శబ్దమునకు జన్యజనకభావము చెప్పవలెను, వ్యంగ్య వ్యంజకభావము కుదరదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

గ్రహణ గ్రాహ్యయోః సిద్ధా నియతా యోగ్యతా యథా
వ్యఙ్గ్యవ్యఞ్జకభావేన తథైవ స్ఫోటనాదయోః. 97

యథా = ఏరీతిగా, గ్రహణగ్రాహ్యయోః = గ్రహణసాధనమునకు, గ్రహింపబడు దానికిని, వ్యఙ్గ్యవ్యఞ్జక భావేన = వ్యంగ్యవ్యంజక భావరూపమున, నియతా = నియతమగు, యోగ్యతా=అర్హత, సిద్ధా=ప్రసిద్ధమైయున్నదో, తథా + ఏవ = అట్లే, స్ఫోటనాదయోః= స్ఫోటశబ్దమునకు, ధ్వనికిని, వ్యంగ్యవ్యంజక భావమున నియతమగు యోగ్యత కలదు.

తా. నేత్రేంద్రియమునందున్న రూపము బాహ్యఘటాదుల రూపమును ఘటమును వ్యక్తపరచును. నేత్రమునందున్న మరియొక గుణముగాని, మరియొక ఇంద్రియముగాని దాని రూపముగాని ఘటరూపమును ఘటమును వ్యక్తపరచలేవు. కనుక నేత్రేంద్రియరూపమే వ్యంజకమగును. వానికి సంబంధము నియతమే. ఇదియే యోగ్యత. కాని పై రెంటికి జన్య జనక భావములేదు. నేత్రరూపమువలన ఘటరూపము, ఘటము పుట్టుటలేదు. అట్లే ధ్వనులు నియతమగు శబ్దమునే వ్యక్తపరచగలవు. వానికి ఆ శక్తి నియమితము. అదియే యోగ్యత.

97 వ శ్లోకమున అవతారికలో చూపబడిన సంశయమునకు సమాధానము చూపి, ఆ సంశయమునకే మరియొకరీతిగా సమాధానము చూపుచున్నాడు.

సదృశగ్రహణానాం చ గన్ధాదీనాం ప్రకాశకమ్
నిమిత్తం నియతం లోకే ప్రతిద్రవ్య మవస్థితమ్ . 98

సదృశగ్రహణానామ్=సమానములగు గ్రహణములు కల-అనగా సమానములగు గంధాదులచే గ్రహింపబడునట్టి, గన్ధాదీనామ్+చ=గంధము రూపము మున్నగువానికి అయితే, ప్రకాశకమ్ = ప్రకాశింపచేయునట్టి, నిమిత్తమ్=నిమిత్తము, లోకే=లోకమున, ప్రతిద్రవ్యమ్ = ప్రతిద్రవ్యమునందు, నియతమ్ = నియతమైనదై, అవస్థితమ్ = ఉన్నది.

తా. గ్రాహ్యగ్రాహకములకు వైజాత్యమున్నపుడే వ్యంజక మనియతమగును. వ్యంగ్యమగు ఘటమునందు ద్రవ్యత్వము, గ్రాహకమగు నేత్రేంద్రియ రూపమున గుణత్వము ఉన్నవి. అవి విజాతీయములు కనుక అచట వ్యంజక మనియతము కావచ్చును. వానికి సారూప్యమున్నచో వ్యంజకము నియమితముగానే యుండును. ఘటముయొక్క రూపము వ్యక్తము కావలయునన్నచో నేత్రేంద్రియము యొక్క రూపమే వ్యంజకమగును. మరియొకటి ఉపయోగించదు. ప్రకృతమున వ్యంజకములగు ధ్వనులకు వ్యంగ్యమగు స్ఫోటశబ్దమునకు సారూప్యముండుటచే నిచటవ్యంజకము అనియతముగా నుండవలయునను నియమములేదు. వ్యంజకము నియతముగానే యుండును. ఇట్లే భూమియొక్క గంధము గ్రాహ్యము కావలె నన్నచో ఘ్రాణేంద్రియముయొక్క గంధమే వ్యంజకమగును. అదియు సజాతీయము కనుక వ్యంజకము నియతమే.

ప్రాకృతధ్వని స్ఫోటశబ్దమును ప్రకాశింపజేయును. స్ఫోట శబ్దము నిత్యమే. దానికి పరిణామము లేదు. కాగా స్ఫోటశబ్దము వ్యంగ్యమగునని వైయాకరణుల సిద్ధాంతము. కాని అట్లు చెప్పుట లోకానుభవమునకు విరుద్ధముగా కానవచ్చుచున్నది. చీకటిలో ఘటాదులు మనకు కానరావు. వానిని చూడవలెనన్నచో దీపమును ఉపయోగించుచున్నాము. ఆ దీపముచే చీకటి తొలగి ఘటాదులు మనకు కానవచ్చుచున్నవి. ఇచట దీపము ప్రకాశకము. ఘటాదులు ప్రకాశ్యములని అందరికి తెలిసినదే. ప్రకాశకమగు దీపము యొక్క అల్పత్వ మహత్త్వములచే ప్రకాశ్యమగు ఘటమునకు అల్పత్వాదులు కలుగవు. అనగా దీపము చిన్నదైనచో ఆ ఘటము చిన్నదిగా ఉండుటగాని, దీపము పెద్దది యగుచో ఘటము పెద్దది యగుటగాని జరుగదు. అట్లే పది దీపములు ప్రకాశకములైతే ప్రకాశ్యమగు ఘటముకూడ పది ఘటములుగా మార్పుచెందదు. ఇది ప్రకాశ్య ప్రకాశకములకు కల స్థితి. అనగా ప్రకాశమునుబట్టి ప్రకాశ్యము భిన్నరూపమును దాల్చదు. అది నిజరూపముతోనే యుండును. ప్రకృతమున అట్లు కానరాదు. వ్యంజకధ్వనులనుబట్టి స్ఫోటశబ్దమునకు పెరుగుట, తరుగుట కానవచ్చుచున్నది. అట్లే వ్యంజకధ్వనులు పలువిధములగుచో వ్యంగ్యమగు స్ఫోటమును

ఘటః పటః మున్నగు నానా పదములుగా కానవచ్చుచున్నది. కాగా స్ఫోటశబ్దమునందు వ్యంజక ధ్వని ధర్మములు కాన్పించుచున్నవి. లోకమున అట్లు కానరాలేదు. కనుక స్ఫోట శబ్దము జనియించుచున్నదనుటయే యుక్తము. అయినచో శబ్దమునకు నిత్యత్వమెట్లు సిద్ధించును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

ప్రకాశకానాం భేదాంశ్చ ప్రకాశ్యోఽర్థోఽనువర్తతే
తైలోదకాది భేదే తత్ప్రత్యక్షం ప్రతిబిమ్బకే. 99

ప్రకాశ్యః=ప్రకాశింపజేయబడెడి, అర్థః=పదార్థము, ప్రకాశకానామ్=ప్రకాశింప జేయు పదార్థములయొక్క, భేదాన్=భేదములను, అనువర్తతే=అనువర్తించుటయు కలదు. తత్=అట్లు అనువర్తించుట, తైలోదకాదిభేదే=తైలము ఉదకము మున్నగు వస్తువులచే భేదముకల - అనగా వానిచే భిన్నమగు, ప్రతిబిమ్బకే=ప్రతిబింబమున, ప్రత్యక్షమ్=ప్రత్యక్షమగుచున్నది. అనగా చూడబడుచున్నది.

తా. ప్రకాశకముయొక్క ధర్మములను ప్రకాశ్యము అనువర్తించుచున్నది కలదు. ముఖము నూనెలో ప్రతిఫలించిన నల్లగాను, అద్దమునందు ప్రతిఫలించిన స్వచ్ఛముగాను, ఘృతయద్దమున పెద్దదిగాను, వికారముగానున్న యద్దమున వికారముగాను, కత్తియందు కోలగాను కనుపించుచున్నది.

వి. ఒకే సూర్యబింబము ఉదకములు నానాస్థలములందు నున్నచో వానియందు బహుసంఖ్యాకముగా కనిపించును. ఒకే చైతన్యము అంతఃకరణ భేదమున నానాత్వమును బొందుచున్నది. పెద్ద ఏనుగు చిన్నఅద్దమున చిన్నరూపముతో కనిపించును. పెద్ద మేఘ మాలయు చిన్నదిగా కానవచ్చును. కాన ప్రకాశకధర్మము ప్రకాశ్యమున కానరాదు అను నియమములేదు.

కాబట్టి ఒకే స్ఫోటశబ్దము వ్యంజకధ్వని-ననుసరించి నానారూపములను వ్యక్తము కావచ్చును. స్ఫోటశబ్దము జన్యము కాదు.

తైలము, వజ్రము, అద్దము మున్నగువానిలో ముఖప్రతిబింబము నూతనమైనదే పుట్టుచున్నది. అంతియేకాని వానియందు ముఖము [illegible] ప్రతిఫలించుట [illegible] కనుక ప్రకాశక ధర్మములు ప్రకాశ్యమునందు కలుగుట [illegible] దృష్టాంతము [illegible] అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

విరుద్ధపరిమాణేషు వజ్రాదర్శతలాదిషు
పర్వతాదిసరూపాణాం భావానాం నాస్తి సమ్భవః. 100

విరుద్ధపరిమాణేషు=విరుద్ధమగు పరిమాణము కల, వజ్రాదర్శతలాదిషు= వజ్రము, అద్దము మున్నగు వస్తువులయందు, పర్వతాది సరూపాణామ్=పర్వతము మున్నగు వానితో సమానమగు స్వరూపము కల, భావానామ్=పదార్థములకు, సమ్భవః=పుట్టుక, నాస్తి=లేదు, కలుగదు; సంభవించదు.

తా. వజ్రము, అద్దము మున్నగువానిలో కొండ ఏనుగు మున్నగునవి ప్రతి ఫలించును. అంతియేగాని నూతనముగ అచట వస్తువు పుట్టదు. అది అసంభవము. పర్వతా దుల శరీరము పెద్దది. అట్టి ప్రతిబింబము - అనగా అంత ఆకారముకల ప్రతిబింబములు స్వల్పమగు వజ్రము అద్దము మున్నగు వానియందు నూతనముగా ఎట్లు పుట్టగలవు?

కాబట్టి 99 వ శ్లోకమున చూపిన దృష్టాంతము యుక్తమే.

స్ఫోటశబ్దమునందు వ్యంజకధ్వనులవలన భేదము కలుగుచున్నదని 49 వ శ్లోకము దగ్గరనుండి ప్రతిపాదింపబడిన అర్థమును ఉపసంహరించుచున్నాడు.

తస్మా దభిన్నకాలేషు వర్ణవాక్యపదాదిషు
వృత్తికాలః స్వకాలశ్చ నాదభేదా ద్విభావ్యతే. 101

తస్మాత్=ఆకారణము వలన - అనగా వ్యంజకధ్వనుల భేదముచే వ్యంగ్యమగు స్ఫోట శబ్దమునందు భిన్నధర్మములు కాన్పించుట వలన, అభిన్నకాలేషు=అభిన్నమగు కాలము కల-అనగా స్వతః కాలభేదములేని, వర్ణవాక్యపదాదిషు=వర్ణ వాక్య పదరూపమగు స్ఫోటశబ్దములయందు, నాద భేదాత్=ప్రాకృత వైకృత ధ్వనుల భేదమువలన, వృత్తికాలః =ద్రుత మధ్య విలంబిత వృత్తుల కాలము, స్వకాలః+చ=తనయొక్క స్ఫోటాభివ్యంజక మగు ప్రాకృత ధ్వనియొక్క ఏకమాత్రాది కాలమున్ను, విభావ్యతే=తెలియబడుచున్నది.

తా. స్ఫోట శబ్దము నిత్యము, కనుక దానిని కాల ధర్మము లనువర్తించవు. దానిని ధ్వనులు వ్యక్తపరచును. వ్యంజక ధర్మములు శబ్దమునందు కాన్పించును. ప్రాకృత ధ్వనులు స్ఫోటాభివ్యంజకములు. వానితో కలిసియే యున్నందున ఆశబ్దము ఏక మాత్రాది కాల భేదమును పొందగలదు. వైకృత ధ్వనులు బహిరంగములగుటచే వాని ధర్మములు స్ఫోట శబ్దమునందు సంక్రమించవు. కాని యవి ఆ శబ్దమునకు కొంతకాలము ఉనికిని కలిగించగలవు.

పై రీతిని ప్రాకృతధ్వనులవలన స్ఫోటశబ్దమునందు ఏకమాత్రాది కాలభేదము, వైకృత ధ్వనులవలన ద్రుతాది కాలవ్యవహారము లభించును.

వైయాకరణులు శబ్దము నిత్యమనియు, అనిత్యమనియు రెండు పక్షములను స్వీకరించిరి. మొదటి పక్షము ముఖ్యసిద్ధాంతమని వారు తలంతురు. ఆ పక్షము నాశ్రయించి స్ఫోటశబ్దస్వరూపము, దానికి వ్యంజకములగు ధ్వనుల స్వరూపము, వ్యంగ్య వ్యంజక భావము మున్నగు అంశములను 44వ శ్లోకమున నుపక్రమించి యింతవరకు నిరూపించెను. ఈ పక్షము ఉత్తమాధికారులకు సంబంధించినది.

మధ్యమాధికారులకు గూడ శాస్త్ర మందుబాటులో నుండవలె నను తలంపుతో వైయాకరణులు శబ్ద మనిత్య మను రెండవ పక్షమును గూడ ఆశ్రయించిరి. ఈ పక్షమును వారు "కార్యశబ్దవాద" మను పేరుతో వ్యవహరించిరి. శబ్దము ఘటపటాదికము వలె పుట్టుక కలదియే యని దీని భావము. ఆ పక్షమును నాశ్రయించి స్ఫోట శబ్దస్వరూపమును ధ్వని స్వరూపమును 102 నుంచి 118 వ శ్లోకము వరకు 16 శ్లోకములలో వివరించుచున్నాడు.

య స్సంయోగవిభాగాభ్యాం కరణై రుపజన్యతే
స స్ఫోటః శబ్దజాః శబ్దా ధ్వనయోఽన్యై రుదాహృతాః. 102

కరణైః=స్థానప్రయత్నములచే, సంయోగ విభాగాభ్యామ్=వాయువుల సంయోగముచేతను, విభాగముచేతను, యః=ఏ శబ్దము, ఉపజన్యతే=ముందుగా పుట్టుచున్నదో, సః=ముందుగా పుట్టిన ఆశబ్దము, స్ఫోటః=వాచకశబ్దముగాను, శబ్దజాః=అట్టి శబ్దముచే

పుట్టిన, శబ్దాః=ఇతర శబ్దములు, ధ్వనయః=ధ్వనులుగా, అన్యైః=ఇతరులచే అనగా శబ్దమునకు అనిత్యత్వము నంగీకరించెడి ఆచార్యులచే, ఉదాహృతాః=చెప్పబడుచున్నవి.

తా. కంఠము, తాలువు, మూర్ధము, పెదవులు మున్నగు స్థానములందు లోపల నుండి పయనముచేయు వాయువు ప్రసరించును. వానియందు ఆ వాయువుల సంయోగ విభాగములచే, అ, ఇ, ఉ, క మున్నగు శబ్దములు పుట్టుచున్నవి. అవియే వాచకములు. అవియే స్ఫోట శబ్దరూపములు. ఇవియే ముందుగా పుట్టినవి.

ఇట్టి స్ఫోటశబ్దమువలన మరికొన్ని శబ్దములు పుట్టును. అవియే ధ్వనులు. నిత్య శబ్దవాదమున స్ఫోటశబ్దమునకు వ్యంజకములుగా నున్న ప్రాకృత ధ్వనులు ఈ కార్యశబ్ద వాదమున స్ఫోటశబ్దముగాను, వైకృతధ్వనులు ధ్వనులుగాను స్వీకరింపబడును. స్థానము లందు ముందుగా స్ఫోట శబ్దము పుట్టును. ఆశబ్దమువలన మరికొన్ని శబ్దములు పుట్టును. అవి ధ్వనులుగా నున్నవి.

ముందుగా కంఠతాల్వాదులయందు వాచక శబ్దము జనియించును. దానినే స్ఫోట శబ్దమందురు. తరువాత ఆ శబ్దమువలన మరికొన్ని శబ్దములు పుట్టుచున్నవని 102 వ శ్లోకములో చూపబడినది. ఆ మతమున కలిగెడి ప్రక్రియను అనగా వివరములను జెప్పు చున్నాడు.

అల్పే మహతి వా శబ్దే స్ఫోటకాలో న భిద్యతే
పరస్తు శబ్దసన్తానః ప్రచయాపచయాత్మకః . 103

అల్పే=తక్కువదియైనను, మహతి+వా=పెద్దది అయినను, శబ్దే=వైకృత శబ్దము, (జాతే=కలుగగా), స్ఫోటకాలః=స్ఫోట శబ్దముయొక్క కాలము-అనగా హ్రస్వా కారాది కాలము, న+భిద్యతే= భేదింపబడదు-అనగా భిన్నము కాదు.

పరః=రెండవదియగు - అనగా ముందుగా పుట్టిన స్ఫోటశబ్దమువలన పుట్టిన, శబ్దసన్తానః+తు=శబ్దసముదాయము మాత్రము, ప్రచయాపచయాత్మకః=వృద్ధిచెందునది, అల్పత్వము చెందునదియు - అనగా అధిక దేశమును వ్యాపించునదియు, అల్ప దేశమును వ్యాపించునదియు, (భవతి=అగుచున్నది).

తా. శబ్దము అమూర్తము కనుక దానియందు అల్పత్వ మహత్త్వరూప పరిమా ణము సంభవింపదు. దాని పరిమాణ మిది యని చెప్ప సాధ్యము కాదు.

కాని ఆ స్ఫోట శబ్దమువలన కలిగిన శబ్ద సముదాయమునకు అట్టి పరిమాణము లభించును. దానిని బట్టి స్ఫోట శబ్దమునకు గూడ ఆ వ్యవహారము కలుగును. కాగా ముఖ్య మగు అల్పత్వముకల సూది అల్పదేశమును, అట్టి మహత్త్వముకల పర్వతము అధికదేశమును వ్యాపించునట్లు ఆరోపితమగు అల్పత్వ మహత్త్వములు కల శబ్దముకూడ అల్పమగు దేశమును, అధిక మగు దేశమును వ్యాపించును.

102 వ శ్లోకమున ముందుగా స్ఫోటశబ్దము పుట్టును. దానివలన ధ్వనులు కలు గునని చూపబడినది. ఈ శ్లోకమున స్ఫోటశబ్దము ధ్వనులతో పాటు పుట్టు ననెడి మరియొక మతమును జెప్పుచున్నాడు.

దూరాత్ ప్రభేవ దీపస్య ధ్వనిమాత్రం తు లక్ష్యతే
ఘణ్టాదీనాం చ శబ్దేషు వ్యక్తో భేదః స దృశ్యతే . 104

దీపస్య=దీపముయొక్క, ప్రభా+ఇవ=వెలుతురు వలె, ధ్వనిమాత్రం+తు =ధ్వని మాత్రమే, దూరాత్=దూరమునుండి, లక్ష్యతే=గుర్తింపబడుచున్నది. శబ్దము మాత్రము దూరమున వినబడదు.

చ = మరియు, ఘణ్టాదీనామ్=గంట మున్నగువానియొక్క, (అభిఘాతేన జాయమానేషు = కొట్టుటచే కలిగినటువంటి,) శబ్దేషు=శబ్దములయందు, సః = ఆ, భేదః=భేదము-అనగా స్ఫోటనాదములకు గల భేదము, వ్యక్తః = స్పష్టమైనదై, దృశ్యతే = తెలియబడుచున్నది.

**తా.** దీపము ప్రభతోపాటు పుట్టును. అట్లే స్ఫోట శబ్దముకూడ ధ్వనులతో పాటు పుట్టును - అనగా రెండు ఒకేసారి పుట్టును. దీపము ఆ స్థలమునందే ఉండును. కాంతి మాత్రము దూరము వ్యాపించును. అట్లే శబ్దము అచటనే ఉండును. ధ్వని మాత్రము దూరము వ్యాపించును - అనగా దూరమున నున్నను ధ్వని వినబడును. శబ్దము వినబడదు. పదిమంది కలసి మాట్లాడునపుడు మాట వినబడదు. ధ్వని మాత్రము వినబడును.

మరియు గంట మ్రోయించగా ధ్వని కలుగును. అది స్ఫోటశబ్దము. దాని వలన మరికొన్ని శబ్దములు వరుసగా కలుగును. అవి ధ్వనులు. ఇచట స్ఫోటనాదములకు భేదము స్పష్టముగా నున్నది.

**వి.** ఈ శ్లోకమున రెండు భాగములలోను రెండుదృష్టాంతములు కలవు. స్ఫోట శబ్దముకంటె వేరుగా ధ్వని అనుభూతము కానందున లేదు అను శంకకు సమాధానముగా ఘంటానాద దృష్టాంత ముపయుక్తమగు చున్నది. రెండు ఒకేసారి పుట్టుటచే వేరుగా తెలియక పోయినా జనసమూహము మాట్లాడునపుడు ధ్వని వేరుగా కాన్పించుచున్నది. స్ఫోట శబ్దము వలన జనియించిన ధ్వని దూరదేశమును వ్యాపించుననుటకు దీపప్రభాదృష్టాంత ముపయుక్త మగును. 102, 104, శ్లోకములచే చూపబడిన రెండు మతములు శబ్దమున కనిత్యత్వము నంగీకరించెడివారిలో నభిప్రాయభేదములే.

శబ్దములు కార్యములను పక్షమున హ్రస్వ దీర్ఘాదులకు, ద్రుతాది వృత్తులకు ఉపపత్తిని జూపుచున్నాడు.

> ద్రవ్యాభిఘాతా త్ప్రచితౌ భిన్నౌ దీర్ఘప్లుతావపి
> కమ్పే తూపరతే జాతా నాదా వృత్తే ర్విశేషకాః . 105

ద్రవ్యాభిఘాతాత్ =కంఠము మున్నగు స్థానములయందు నాలుకయొక్క తాకుట వలన, ప్రచితౌ = వృద్ధిపొందిన, దీర్ఘప్లుతౌ + అపి = దీర్ఘప్లుతములుకూడ, భిన్నౌ= భిన్నములే.

కమ్పే=కంపము, ఉపరతే+తు=విరమించగానే, జాతాః=పుట్టిన, నాదాః= వైకృతధ్వనులు, వృత్తేః=ద్రుతాది వృత్తికి, విశేషకాః = భేదకము లగుచున్నవి.

**తా.** లోపలనున్న వాయువు కంఠమువరకు వచ్చి స్థానములయందు జిహ్వాగ్రమును పడునట్లు చేయును. దానియందు విలక్షణమగు శక్తియున్నది. దానివలన కంపము కలుగును. అది ఆ వర్ణమును అనువర్తించును. అందుచే దీర్ఘప్లుతములు కూడ భిన్నములే యగును. "స్విచ్చి" వేయగా "ఫాన్" తిరుగును. అది కొంతసేపు తిరగగా "స్విచ్చి" ఆపి వేసినను "ఫాన్" వేగమున్నంత వరకు తిరుగుచుండును. ఈ కంపము కూడ అట్టిదే.

ఆ కంపము తగ్గిన తరువాత వైకృతధ్వనులు జనియించును. అవి ద్రుతమధ్యమ విలంబిత వృత్తులకు కారణమగుచున్నవి.

స్థానములందు వాయుప్రసారము కలిగి దానివలన శబ్దము పుట్టును. దానియందు స్వతః నానాత్వము లేకపోయినా కంపమును బట్టి భిన్నధర్మములు కలుగును. దీర్ఘప్లుతములు పైరీతిని భిన్నములగును.

కంపము నశించిన తరువాత వైకృత ధ్వనులు కలుగును. అవి స్ఫోట శబ్దమందు వైజాత్యమును కలిగించనేరవు. వానివలన ద్రుతాది వృత్తిభేదము సిద్ధించును.

వి. కాగా ద్రుతాది వృత్తులతో దీర్ఘము పరిణమించదు. స్ఫోటశబ్దము నిత్యమని స్వీకరించినను ఈ శ్లోకము దానికి అనుగుణమే యగును.

కమ్పము నివర్తించిన పిమ్మట వైకృతధ్వనులు కలుగునని 105 వ శ్లోకమున చెప్పబడినది. అట్లుగాక కంపముండగనే ఆ ధ్వనులు స్ఫోట శబ్దమునుండియే పుట్టుచున్నవని మతాంతరమును పలుకుచున్నాడు.

అనవస్థితకమ్పేఽపి కరణే ధ్వనయోఽపరే
స్ఫోటాదేవోపజాయన్తే జ్వాలా జ్వాలాన్తరాదివ . 106

కరణే = వాయువు ముఖ్యగుణము, అనవస్థితకమ్పే + అపి = అనవస్థితకంపము కలదైనను, అపరే = మరికొన్ని, ధ్వనయః = [illegible] ధ్వనులు, స్ఫోటాత్ + ఏవ = స్ఫోట శబ్దమునుండియే, జ్వాలాన్తరాత్ = మరియొక [illegible], జ్వాలాః + ఇవ = జ్వాలలు వలె, ఉపజాయన్తే = పుట్టుచున్నవి.

తా. కర్రలను అగ్ని సంపర్కము కలుగగా [illegible] కర్రలను ఆశ్రయించియున్న జ్వాలలనుండియే మరికొన్ని కర్రలు [illegible] కలుగు చున్నవి. అట్లే వాయువుయొక్క [illegible] కంపము [illegible] కంపముండగనే ఆ స్ఫోట శబ్దమునుండియే వైకృత ధ్వనులు [illegible].

కార్య శబ్దవాదమున — [illegible] ములు నిత్యములు కావు. [illegible] మతమున శబ్దమునకు ఉపాదానకారణమును (ముఖ్యకారణమును) [illegible] 107 వ శ్లోకము మొదలు 119 వరకు 11 శ్లోకములచే చూపుచున్నాడు.

వాయోరణూనాం జ్ఞానస్య శబ్దత్వాపత్తిరిష్యతే
కైశ్చిద్దర్శనభేదో హి ప్రవాదేష్వనవస్థితః . 107

(అ) కైశ్చిత్ = కొందరిచే, వాయోః = వాయువునకు, [illegible], అణూనామ్ = పరమాణువులకు, మరికొందరిచే, జ్ఞానస్య = జ్ఞానమునకు, శబ్దత్వాపత్తిః = శబ్దాకారముగ పరిణామము, ఇష్యతే = ఇష్టమగుచున్నది, అనగా వారిచే సమ్మతింపబడుచున్నది.

తా. శబ్దమునకు వాయువు కారణమని శిక్షాశాస్త్రజ్ఞులు, పరమాణువులు కారణమని జైనులు, జ్ఞానము కారణమని మహాభాష్యకారుడు తలంచుచున్నారు.

(అ) ప్రవాదేషు = ప్రకృష్టములగు వాదములయందు-అనగా సిద్ధాన్తములయందు, దర్శన భేదః = దృష్టిభేదము, అనవస్థితః + హి = వ్యవస్థితముకాదు-అనగా నిశ్చితము కాదు గదా : శబ్దమునకు ఇదియే ముఖ్యకారణమని నిర్ధారణచేసి చెప్పుట శక్యము కాదని భావము.

1. శబ్దమునకు వాయువు ముఖ్యకారణమను శిక్షాశాస్త్రకారుని మతమును 108, 109 రెండు శ్లోకములలో జెప్పుచున్నారు.

లబ్ధక్రియః ప్రయత్నేన వక్తురిచ్ఛానువర్తినా
స్థానే ష్వభిహతో వాయుః శబ్దత్వం ప్రతిపద్యతే. 108

వక్తుః=వక్తయొక్క-అనగా శబ్దము నుపయోగించెడి వానియొక్క, ఇచ్ఛానువర్తినా=శబ్దప్రయోగేచ్ఛచే కలిగినట్టి, ప్రయత్నేన=ప్రయత్నముచే, లబ్ధక్రియః=పొందబడిన వ్యాపారము—అనగా చలనము కల, వాయుః=ప్రాణవాయువు, స్థానేషు=కంఠము, తాలువు మున్నగు ఎనిమిది స్థానములందు, అభిహతః=కొట్టబడినదై - అనగా శబ్దమును కలిగించెడి సంయోగమున కాశ్రయమైనదై, శబ్దత్వమ్=శబ్దభావమును, ప్రతిపద్యతే=పొందుచున్నది. అట్టి ప్రాణవాయువు శబ్దముగా పరిణమించుచున్నదని భావము.

తా. మనుష్యుడు తన యభిప్రాయమును ఇతరునకు చెప్పదలచినపుడు ఒక ప్రక్రియ కలదు. ముందుగా ఆ భావము తన బుద్ధిలో స్ఫురించును. తరువాత దానిని వ్యక్తపరచవలెననెడి ఇచ్ఛ కలుగును. తరువాత దానికి అనుగుణమగు ప్రయత్నము చేయును. కంఠముదగ్గర ఉన్న నాడులను బిగబెట్టుట, మూసుకొనియున్న పెదవులను విప్పుట, దవడలను కొంచెము విశాలముచేయుట, గుటక వేయుట మున్నగునవి ఇచట ప్రయత్నమన బడును. ఆ ప్రయత్నముచే నాభి ప్రదేశమందున్న వాయువు కదలి ఆ భావమును తనయందారోపించుకొని హృదయముద్వారా కంఠము వరకు పయనముచేసి అచట నున్న స్థానములయందు ప్రసరించి అ, ఇ, ఉ మున్నగు శబ్దరూపమును ధరించుచున్నది.

ఘనీభూతమగు ఒకే వాయువునకు నానా విధములగు శబ్దములుగా పరిణామము ఎట్లు కలుగును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

తస్య కారణసామర్థ్యా ద్వేగప్రచయధర్మణః
సన్నిపాతా ద్విభజ్యన్తే సారవత్యోఽపి మూర్తయః. 109

కారణసామర్థ్యాత్ = వాయుచలనమునకు కారణమగు ప్రయత్న విశేషముయొక్క సామర్థ్యము వలన, వేగ ప్రచయ ధర్మణః = వేగమను సంస్కారమును, ఘనీభావము అను ధర్మమును కల, తస్య=ఆ వాయువునకు, సన్ని పాతాత్ = కంఠాది స్థానములందు లెస్సగా పడుటవలన, సారవత్యః + అపి = ఘనీ భూతములుగా నున్నట్టివి-అనగా కఠినములైనను, మూర్తయః=మూర్తులు, విభజ్యన్తే = విభజింపబడుచున్నవి.

'తస్య' అనుదానికి "సారవత్యోఽపి మూర్తయః' అను దానితో సంబంధము చూపవలెను.

తా. వాయువునకు వేగము, ఘనీభావము అను రెండు ధర్మములు కలవు. మనుష్యుని ప్రయత్నవిశేషమువలన వాయువునకు వేగము వ్యక్తమై భాసించును. దానివలన వాయువు చలించును. ఆ వేగముచేతనే ఆయా స్థానములందు పడుటచే వాయువుయొక్క ఘనీభావము-అనగా కఠినభావము శిథిలమై నానారూపములను ధరించును. కఠినముగానున్న మట్టిగడ్డ రాతిమీద పడగా శిథిలమై విశీర్ణమగుచున్నది. అట్లే ఘనీభూతమగు ఒకే వాయువు ఆయా స్థానములందు పడుటచే శిథిలమై నానావిధములగు శబ్దములుగ పరిణమించుచున్నది.

2. అణువులు శబ్దములకు కారణమనెడి జైనుల పక్షమును 110, 111 రెండు శ్లోకములలో చూపుచున్నాడు.

అణవః సర్వశక్తిత్వాద్ భేదసంసర్గవృత్తయః
ఛాయాతపతమశ్శబ్దభావేన పరిణామినః . 110

సర్వశక్తిత్వాత్ = సమస్తమగు శక్తులు కలుగుటవలన, భేదసంసర్గ వృత్తయః = విభాగము, కలియుట అను వ్యాపారములు కల, అణవః = పరమాణువులు-అనగా తన్మాత్రలు ఛాయాతపతమశ్శబ్దభావేన = నీడగాను, ఎండగాను చీకటిగాను, శబ్దముగాను, పరిణామినః = పరిణామము కలవి (భవన్తి = అగుచున్నవి).

తా. ఈశ్లోకమున అణవః అను పదము కపిల సాంఖ్యమున నంగీకరింపబడిన తన్మాత్రలను బోధించును. మహాభూతములకు మూలముగానున్న సూక్ష్మపదార్థములు "తన్మాత్ర" లనబడును. వానియందు భూతత్వము లేనందున 'తన్మాత్ర' లందురు. తర్కశాస్త్ర ప్రసిద్ధము లగు పరమాణువు లిచట గ్రాహ్యములు కావు. తన్మాత్రలయందు విలక్షణములగు శక్తులు కలవు. వాని వలన నవి విభక్తము లగుటయు, సంయుక్తములగుటయు గాగలవు. వానిలో నీలాణువులు నీడగాను, చీకటిగాను, శుక్లాణువులు ఎండగాను, శబ్దాణువులు స్థూలశబ్దముగాను పరిణమించును. విభాగసంయోగములను కలిగించెడి శక్తులుగూడ వానియందున్నవి.

శబ్దతన్మాత్ర రూపములగు పరమాణువులు నిత్యములు కనుక అవి ఎల్లప్పుడును స్థూలశబ్ద రూపమున ఏల పరిణమింపవు ? మనకు అట్లు అనుభవము లేదు కదా ! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

స్వశక్తౌ వ్యజ్యమానాయాం ప్రయత్నేన సమీరితాః
అభ్రాణీవ ప్రచీయన్తే శబ్దాఖ్యాః పరమాణవః . 111

ప్రయత్నేన = ప్రయత్నముచే, సమీరితాః = ప్రేరేపించబడిన, శబ్దాఖ్యాః = శబ్దమనే పేరుగల, పరమాణవః = పరమాణువులు-అనగా శబ్దతన్మాత్రలు, స్వశక్తౌ = తమ శక్తి, వ్యజ్యమానాయామ్ = వ్యక్తీకరింపబడగా, అభ్రాణి + ఇవ = మేఘపరమాణువుల వలె, ప్రచీయన్తే = స్థూల శబ్దరూపమున ప్రోగుచేయబడుచున్నవి.

తా. ఇచట ప్రయత్నమనగా అదృష్టవిశేషమున కలిగిన చలనము. అట్టి చలనము కలవానిని ప్రాణవాయువు ప్రోగుగా చేయును. వర్షాకాలమున మేఘములు పురోవాతముచే ప్రేరేపింపబడినవై ఉదకరూపముగా పరిణమించును. అట్లుగాకున్న అవి అట్లుపరిణమించ లేవు.

అట్లే శబ్దతన్మాత్రలు అంతటవ్యాపించి యున్నను అదృష్టవిశేషకృతమగు చలనము కలుగగా ప్రాణవాయువుచే ప్రోగుగా చేయబడినవై స్థూలశబ్దరూపమున కాన్పించుచున్నవి. అట్టి ప్రయత్నములేకున్న అవి స్థూలశబ్దముగా మార్పుచెందలేవు.

3. జ్ఞానము శబ్దమునకు కారణమను [1] మహాభాష్యకారుని మతమును 112, 113, 114, 115 నాల్గు శ్లోకములచే జూపుచున్నాడు.

అథాయ మాన్తరో జ్ఞాతా సూక్ష్మవాగాత్మనా స్థితః
వ్యక్తయే స్వస్య రూపస్య శబ్దత్వేన వివర్తతే . 112

1 "ఆఖ్యాతోపయోగే" 1-4-29 అను పాణిని సూత్రమును వ్యాఖ్యానించు సందర్భమున మహాభాష్యకారుడు ఈ పక్షమును నిరూపించియున్నాడు. 107 వ శ్లోకము నుండి 115 వ శ్లోకమువరకు గల వాక్యపదీయమును కైయటనాగేశులు అచట చూపి వ్యాఖ్యానించి యున్నారు.

సూక్ష్మవాగాత్మనా = సూక్ష్మమగు వాగ్రూపమున, స్థితః = ఉన్నట్టియు, అన్తరః = లోపలఉన్న, జ్ఞాతా = మనస్సు-కాక జీవుడు, స్వస్య = తన సంబంధమైన, రూపస్య = రూపముయొక్క, వ్యక్తయే = అభివ్యక్తి-అనగా బయటకు ఆవిర్భవింపచేయుకొరకు, శబ్దత్వేన = స్థూలశబ్దరూపమున, అథ = తరువాత-అనగా వివక్షచే కలిగెడి ప్రయత్నముచే ప్రేరేపింపబడిన ప్రాణవాయువుయొక్క చలనముచే ఆ యాస్థానములందు అభిఘాతము కలిగిన తరువాత, వివర్తతే = వివర్తమగుచున్నది.

తా. శబ్దస్వరూపమే ముందుగా ఉండెడిది. అదియే వాగ్రూపముగాను, మనస్సుగాను విభక్తమగుచున్నది. ఆ మనస్సు వృత్తిరూపమున పరిణమించును. ఆ పరిణామమే జ్ఞానము. వృత్తిరూపమగు జ్ఞానమున కాశ్రయమగుటంజేసి మనస్సు "జ్ఞాతా" అను పదముచే గ్రహింపబడుచున్నది. అట్లే జ్ఞాతయగు జీవునియందు వాగ్రూపత్వము అనుషక్తము కాగలదు. ప్రాథమికావస్థ బహుసూక్ష్మమైనది. కత్వ గత్వాది విశేషరూపము లేనిది.

అట్టి మనస్సు ఇతరునికి తనయందున్న భావమును వ్యక్తపరచవలసినపుడు తన సూక్ష్మరూపమును స్థూలశబ్దరూపముగా వివర్తింపచేయుచున్నది. అట్లు జరుగుటకు శరీరము నందున్న వేడియే సాధనము.

వి. అంతఃకరణము వృత్తిద్వారా శబ్దభావమును బొందుటయే జ్ఞానము శబ్దరూపమున భాసించునట్లుగా గ్రహింపబడుచున్నది. శబ్దమును ప్రయోగించువాని జ్ఞానము శబ్దము చేతనే ఇతరులకు చూపవలసి వచ్చియున్నందున జ్ఞానమే శబ్దముగా మార్పుచెందునని తలచబడు చున్నది. శబ్దము చేతనమని శాబ్దికులు విశ్వసింతురు.

జ్ఞానము స్థూల శబ్దరూపమును ఎట్లు పొందుచున్నదో ఆ క్రమమును జూపుచున్నాడు.

స మనోభావ మాపద్య తేజసా పాక మాగతః
వాయు మావిశతి ప్రాణ మథాసౌ సముదీర్యతే. 118

సః = 112 వ శ్లోకమున నిర్దిష్టమగు జ్ఞాత, మనోభావమ్ = మనస్సుయొక్క రూపమును, ఆపద్య = పొంది, తేజసా = తేజముచే, పాకమ్ = పాకమును, ఆగతః = పొందినదై, ప్రాణం + వాయుమ్ = ప్రాణవాయువును, ఆవిశతి = ప్రవేశించుచున్నది. అథ = తరువాత, అసౌ = ఈ ప్రాణవాయువు, సముదీర్యతే = లెస్సగా పైకి ప్రేరేపింపబడుచున్నది.

తా. జఠరాగ్ని, నాడులందున్నవేడి ఇచట 'తేజసా' అను పదముచే గ్రహింపబడును. ఈ రెండును మనోవృత్తిరూపమగు జ్ఞానమునకు పాకమును కలిగించును. మనోభావమును బొందిన అంతఃకరణ వృత్తికి విషయగ్రహణ సామర్థ్యమును కలిగించుట ఇచట పాకశబ్దార్థము.

ఇట్టి పాకముననే అంతఃకరణము తన రూపమును ప్రాణవాయువునందు నిలుపును. అట్టివాయువు కంఠపర్యంతము మీదుగా జీవశక్తిచే ప్రేరేపింపబడును. పయనము ప్రాణ వాయు స్వభావము. ప్రేరణ జీవశక్తిది.

వి. బాహ్యప్రపంచముననున్న వాయువునకు అట్టి ప్రక్రియ లేనందున ఆ వాయువు దంత తాల్వాదులయందు ప్రవేశించినను శబ్దభావమును బొందనేరదు.

తరువాత ఏమిజరుగునో చెప్పుచున్నాడు.

అ న్తఃకరణత త్త్వస్య వాయు రాశ్రయతాం గతః
తద్ధర్మేణ సమావిష్ట స్తేజసైవ వివ ర్తతే . 114

అ న్తఃకరణ త త్త్వస్య = మనస్సునకు, ఆశ్రయతామ్ = ఆశ్రయత్వమును, గతః = పొందిన, వాయుః = ప్రాణవాయువు, తద్ధర్మేణ = మనస్సుయొక్క ధర్మముతో, సమావిష్టః = కూడినదై, తేజసా + ఏవ = జఠరాగ్నియొక్క సహకారముచేతనే, వివ ర్తతే = వివ ర్తమగుచున్నది.

తా. మనస్సునకు ఆధారము ప్రాణవాయువు. ఆ వాయువులేనిచో మనస్సు ఉండేదికాదు. కాగా ప్రాణవాయువును ఆశ్రయించిన మనస్సు వాయువుతో కలసి జఠరాగ్ని సహకారమున బయటికి మరల మనస్సుయొక్క రూపముతోనే వివ ర్తమగును. ఇందుకు ఒక దృష్టాంతము- పాకము తయారుకావలెనన్నచో అగ్ని అపేక్షితమగును. అగ్ని కర్రను ఆశ్రయించును. తరువాత కర్రను విడనాడి తేజోరూపమును పొందును.

వి. ప్రాథమికస్థితి శబ్దరూపమే, అదియే మనస్సుగా మారినది. అది వాయువు నాశ్రయించి తేజస్సహకారమున బయటికి వచ్చుటలో శబ్దరూపమగు మనస్సు వ్యక్తమగును.

తరువాత మనస్సుతో తాదాత్మ్యమును పొందిన ప్రాణవాయువు వర్ణరూపమును పొందెడి ప్రక్రియ చూపుచున్నాడు.

విభజన్ స్వాత్మనో గ్రన్థీన్ శ్రుతిరూపైః పృథగ్విధైః
ప్రాణో వర్ణా నభివ్యజ్య వర్ణే ష్వే వోపలీయతే . 115

ప్రాణః = ప్రాణవాయువు, పృథగ్విధైః = భిన్నవిధములగు, శ్రుతిరూపైః = వర్ణములచే, గ్రన్థీన్ = గ్రంథులతో సమానములగు, స్వాత్మనః = తన అవయవములను, విభజన్ = ఆయా వర్ణవిభాగములచే చూపుచున్నదై, వర్ణాన్ = అ, క మొదలగు వర్ణములను, అభివ్యజ్య = వ్య క్తపరచి, తేషు + ఏవ = ఆవర్ణములందే, ఉపలీయతే = లయమును పొందు చున్నది. వర్ణరూపమును పొంది నిజరూపమును వదలుచున్నది.

తా. ప్రాణవాయువు వర్ణాభివ్య క్తికి ప్రయత్నవిశేషములను గ్రంథులవలెనున్న తన అవయవ ములను లోపలనుండి వచ్చుచున్న వర్ణములచే ఆయా వర్ణరూపము కలవానిగా చూపి బయటికి వర్ణములను వ్య క్తపరచును. తరువాత ఆ వాయువు వర్ణరూపముగానే మిగులును. వాయు రూపము కానరాదు.

వి. వాయువు బయటకి వచ్చునపుడు కంఠాది స్థానములందు, తనుననుసరించి అభి ఘాతమును కలిగించును. దానివలన వర్ణాభివ్య క్తి కలుగును.

గ్రంథియనగా 'ముడి' అందురు. త్రాటియందు ముడియున్నట్లు వాయువునందు గూడ ప్రసారమును నిరోధించే భాగములు కలవు. గ్రంథులు హృదయమునందుగూడ కలవు. అవియే ఆత్మ త త్త్వజ్ఞానమునకు ప్రతిబంధకములు.

107 నుంచి శబ్దము జనియించు ప్రకారము మూడు మతములలోను చూప బడినది. అన్నిటిలోను వాయువునకు ప్రాధాన్యము కలదు. ప్రాణవాయువు ముఖ్యము. ఇతర సహకారమును పురస్కరించుకొని మతభేదము సిద్ధించుచున్నది.

శబ్దము ఆకాశమునందే గాక అంతట నిండి, నిబిడముగా నున్నదని కొందరు శిక్షాశాస్త్రజ్ఞులు తలంచిరి. వారి మతమును జూపుచున్నాడు.

అజస్రవృత్తి ర్యః శబ్దః సూక్ష్మత్వా న్నోపలభ్యతే
వ్యజనా ద్వాయు రివ స స్వనిమిత్తా త్ప్రతీయతే. 116

అజస్రవృత్తిః=ఎల్లప్పుడు ఉన్నటువంటి, యః=ఏ, శబ్దః=శబ్దము, సూక్ష్మత్వాత్=సూక్ష్మమగుటవలన, న+ఉపలభ్యతే=చెవిచే గ్రహింపబడకున్నదో, సః=ఆ శబ్దము, స్వనిమిత్తాత్=తనకు నిమిత్తమగు తాల్వాది స్థానాభిఘాతమువలన, వ్యజనాత్=విసనకర్రవలన, వాయుః+ఇవ=వాయువువలె, ప్రతీయతే=తెలియబడుచున్నది-అనగా ఇంద్రియగ్రాహ్య మగుచున్నది.

తా. శబ్దము వ్యాపకము. అచేతనములగు ఘటాదులయందు ధ్వనిరూపమున, చేతనములలో గూడ, పశుపక్ష్యాదులందు ధ్వనిరూపమున, మనుష్యులయందు ధ్వని వర్ణోభయ రూపమున కాన్పించును. కాని శబ్దమునకు వ్యక్తి కలిగించెడి నిమిత్తమున్నప్పుడే అది గ్రాహ్యమగును. మనుష్యులచెవికి శబ్దము వినబడవలెనన్నచో తాల్వాది స్థానాభిఘాతము కావలెను. అపుడు వర్ణరూపమున శ్రుతమగును. భేరీ దండసంయోగమున ధ్వనిరూపముగా శ్రుతమగును. నిమిత్తములేనిది భాసించునదికాదు. అందు కారణము శబ్దముయొక్క సూక్ష్మత్వమే. ఇందుకు వాయువు దృష్టాంతముగా జూపబడినది. వాయువు సర్వవ్యాపి, అయినను మనకు ఒక సమయమున చర్మముచే గ్రహింపబడుట, లేకుండుటగూడ కలదు. చర్మముచే గ్రహింపబడకున్నను అచట వాయువు సూక్ష్మరూపమున ఉన్నది. అదియే విసనకర్ర మున్నగు సాధనములచే వ్యక్తమయి మన ఇంద్రియముచే గ్రహింపబడుచున్నది.

కాగా సూక్ష్మరూపమున నంతట వ్యాపించియున్న శబ్దము కారణవశమున స్థూలరూపమున గృహీతమగుచున్నది.

శబ్దము విషయమై మతాంతరమును జూపుచున్నాడు.

తస్య ప్రాణే చ యా శక్తి ర్యా చ బుద్ధౌ వ్యవస్థితా
వివర్తమానా స్థానేషు సైషా భేదం ప్రపద్యతే. 117

తస్య=శబ్దముయొక్క, యా=ఏ, శక్తిః=శక్తి-అనగా సూక్ష్మరూపము, బుద్ధౌ+చ=బుద్ధియందే, వ్యవస్థితా=ముందుగానున్నదో, యా=ఏశక్తి, ప్రాణే+చ=ప్రాణవాయువునందుగూడ, వ్యవస్థితా=బుద్ధిప్రేరణచే తరువాత ఉన్నదో, సా+ఏషా=ఆ ఈ రెండువిధములగు శక్తి, స్థానేషు=తాల్వాదిస్థానములందు, వివర్తమానా=వెలువడుచున్నదై, భేదమ్=వర్ణభేదమును, ప్రపద్యతే=పొందుచున్నది.

తా. శబ్దము బుద్ధిలో సూక్ష్మరూపమున నున్నది. సూక్ష్మరూపమే ఇచట 'శక్తి' శబ్దముచే గ్రహింపబడును. బుద్ధి తనలోనున్న సూక్ష్మశబ్దమును ప్రాణవాయువునందు కలిగించును. ఈ రెండువిధములగు శక్తులు తాల్వాది స్థానములందు జనియించి అ, ఇ, క మున్నగు విజాతీయ వర్ణములను చూపుచున్నవి.

ఆ శబ్దము బుద్ధిలోనే ముందుగా నున్నది. బుద్ధిబలముచే ప్రాణమునకు బలము కలుగును. ఉభయము కలసి స్థూలశబ్దమునకు కారణమగును.

వి. బుద్ధిసంబంధమున్నందుననే ప్రాణవాయువు వివక్షితమగు అర్థమును అనుసరించియే వర్ణవిశేషములను కలిగించెడి స్థానవిశేషములందే ప్రసరించుచున్నది. అట్లుగాకున్న ఏవో వర్ణములే జనియించును.

ప్రాణవాయు సంబంధములేనిచో బుద్ధికి శబ్దరూపముగా పరిణామము సంభవించదు.

కనుక బుద్ధిలో ముందుగా సూక్ష్మశబ్దముండును. దాని ప్రేరణచే ప్రాణవాయువునందు ఆ సూక్ష్మశబ్దము కలుగును. ఉభయమును కలసి స్థానములందు ప్రసరించి వర్ణవిశేషములను పుట్టించును.

ఇంతవరకు శబ్దస్వరూపమును నానాదృక్పథముల జూపి లోకమున కలిగిన వ్యవహారమునకు శబ్దమే మూలమని చెప్పుచు ఈ శ్లోకమునుండి 15 శ్లోకములచే శబ్దమాహాత్మ్యమును నిరూపించుచున్నాడు.

శబ్దేష్వేవాఽఽశ్రితా శక్తి ర్విశ్వస్యాఽస్య నిబన్ధనీ
యన్నేత్రః ప్రతిభాత్మాఽయం భేదరూపః ప్రతీయతే. 118

(అ) అస్య = ఈ-అనగా మనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్న, విశ్వస్య = ప్రపంచకమునకు, నిబన్ధనీ = కారణమగు, శక్తిః = సామర్థ్యము, శబ్దేషు + ఏవ = శబ్దములందే, ఆశ్రితా = ఆశ్రయించియున్నది.

తా. ప్రపంచమున కలిగెడి వ్యవహారమునకు శబ్దమే కారణము. ప్రపంచకము శబ్దార్థోభయ రూపము; శబ్దముకంటె, దానిచే చెప్పబడే అర్థమునంటెను వేరుగాలేదు. ఈ రెంటిలోను శబ్దము వాచకము. అర్థము వాచ్యము అగుచున్నది. కాగా ఈ రెంటికి వాచ్యవాచకభావ సంబంధమే శక్తియని వైయాకరణులు విశ్వసింతురు. ఈ సంబంధమును పురస్కరించుకొనియే లోకవ్యవహారమంతయు నడచుచున్నది. ఆ వ్యవహారము శబ్దమునందాధారపడియున్నది.

(ఆ) యన్నేత్రః = ఏ శబ్దము నేత్రముగా అనగా జ్ఞాపకముగా కలిగినట్టియు, ప్రతిభాత్మా = ప్రతిభారూపమగు, భేదరూపః = భిన్నమగు రూపముకల, అయమ్ = ఈ లోకి వ్యవహారము, ప్రతీయతే = మనచే తెలియబడుచున్నదో, ప్రతిపురుషునకు భిన్న భిన్న రూపముగా లోకవ్యవహారము కానవచ్చుచున్నదని భావము.

వి. ప్రతిభ బుద్ధిలో నొక విశేషము. తద్రూపమే వాక్యార్థము, లోకవ్యవహారము బుద్ధిరూపముగనే ఉన్నది. అది బాహ్యప్రపంచము నపేక్షించునది కాదు. బాహ్యరూపమున ఒకే వస్తు వున్నను దానిని లోకులు భిన్నరూపిగా గుర్తింతురు. ఒకే పడతిని కాముకుడు భోగ్యవస్తువని, పులి మున్నగునవి భక్ష్యమనియు, తలిదండ్రులు కూతురనియు, ఆమెకు కలిగిన పిల్లలు తల్లి అనియు, వీతరాగులు శవమనియు తలంతురు. వారివారి బుద్ధిలో నున్న సంస్కారమే అందుకు కారణము. ఇంతకు శబ్దమే కారణ మగుచున్నది.

మరియు లోకములో బాహ్యరూపముగా లేని వస్తువులుకూడ వ్యవహారమున కలవు. వానిని శబ్దము బోధించును.

కాగా లోకమున రూపవంతములు కాని పదార్థములు శబ్దముచేతనే బోధింపబడుచున్నవి. ప్రత్యక్షముగా కానవచ్చుచున్న ఘటపటాదుల భేదముకూడా శబ్దమూలకమే.

కాబట్టి జగమంతయు ప్రతిభావిషయమే. బాహ్యార్థము లేకున్నను శబ్దము కలుగును. శబ్దమే జగద్రూపమున వివర్తమగును. ఈ భావము 1 కాండలో 18 వ శ్లోకమున చూపబడి యున్నది.

118 వ శ్లోకార్థమునే వ్యక్తపరచుచున్నాడు.

షడ్జాదిభేదః శబ్దేన వ్యాఖ్యాతో రూప్యతే యతః
తస్మా దర్థవిధాః సర్వాః శబ్దమాత్రాసు నిశ్రితాః . 119

యతః = ఏకారణమువలన, షడ్జాది భేదః = షడ్జము, నిషాదము మున్నగు స్వరముల భేదము, శబ్దేన = శబ్దముచే, వ్యాఖ్యాతః = స్పష్టపరుపబడినదై, రూప్యతే = వేరుచేయబడి నియమింపబడుచున్నదో, తస్మాత్ = ఆకారణము వలన, శబ్ద మాత్రాసు = శబ్ద శక్తుల యందు, సర్వాః = సమస్తములగు, అర్థవిధాః = అర్థముయొక్క శక్తులు, నిశ్రితాః = మిక్కిలి ఆశ్రయించి యున్నవి. మనము గుర్తించుటకు శక్యముగాని పదార్థములకుగల పరస్పర భేదమును గుర్తించుటకు శబ్దమే కారణమని భావము.

తా. షడ్జము, నిషాదము మున్నగురీతిని 7 విధములగు ధ్వనులు జగత్ప్రసిద్ధములు. వీనికి గాంధర్వ శాస్త్రమున లక్షణములు చెప్పబడినవి. ఆ లక్షణములు శబ్దరూపముననున్నవి. అట్టి శబ్దమే లేనిచో వానికి గల పరస్పర భేదము గుర్తింప నలవికాదు.

ఘటము, పటము మున్నగునవి మనకు స్పష్టముగా భాసించును. కాని వానికి పరస్పర భేదము శబ్దమూలకమే.

వి. మరియు పశువులను మేపువారు వానికి ఏవో సంకేతములను ఏర్పరచి వ్యవహరింతురు. ఒక్కొక్క విలక్షణమగు సంకేతముచే ఒక్కొక్క జాతికి చెందిన పశువులు పిలువబడి పనిచేయుట జరుగుచున్నది. కాబట్టి లోకవ్యవహారమున కంతకు శబ్దము మూలము.

ఇంతియేకాక లోకసృష్టియు శబ్దమువలననే కలుగుచున్నదని బోధించుచున్నాడు.

శబ్దస్య పరిణామోఽయ మిత్యామ్నాయవిదో విదుః
ఛన్దోభ్య ఏవ ప్రథమ మేత ద్విశ్వం వ్యవర్తత . 120

అయమ్ = ఈ ప్రపంచకము, శబ్దస్య = శబ్దముయొక్క, పరిణామః = పరిణామము, ఇతి = అని, ఆమ్నాయవిదః = వేదవేత్తలు, విదుః = తెలియుచున్నారు. ఏతత్ = ఈ, విశ్వమ్ = ప్రపంచకము, ప్రథమమ్ = ముందుగా, ఛన్దోభ్యః + ఏవ = వేదముల వలననే, వ్యవర్తత = వివర్తమైనది.

తా. ఈ ప్రపంచకము శబ్దముయొక్క వివర్తమే యని వేదముల ముఖ్యతాత్పర్యమును గుర్తించినవారు నుడివిరి. వేదములలోను, వానిని ప్రమాణముగా జేసుకొని నిర్మింపబడిన స్మృతులలోను, పురాణములలోను గూడ వేదముల వలననే దృశ్యమగు ఈ ప్రపంచకము వివర్తమగుచున్నదని స్పష్టముగా చెప్పబడియున్నది.

వి. వైయాకరణులు నిర్గుణాద్వయ బ్రహ్మభావము మోక్షమనెడి ఔపనిషద సిద్ధాన్తమును విశ్వసింతురు. కనుక వారు వివర్తవాదము నాశ్రయించువారే. కాబట్టి ఈ శ్లోకమున పరిణామ పదము వివర్తపరము.

ఘటాది ప్రపంచము శబ్దముయొక్క పరిణామమని చెప్పబడినది. అట్టితరి మృద్వి కారమగు ఘటాదికమున మృద్రూపము కానవచ్చునట్లు శబ్దరూపము కూడ ఏల కానరాదు ? అను ప్రశ్నకు, అది మాకు సమ్మతమే. అది సిద్ధాన్తమే. అట్లే కానవచ్చుచున్నదని చెప్పు చున్నాడు.

ఇతికర్తవ్యతా లోకే సర్వా శబ్దవ్యపాశ్రయా
యాం పూర్వాహితసంస్కారో బాలోఽపి ప్రతిపద్యతే . 121

లోకే = లోకమున, సర్వా = సమస్తమగు, ఇతికర్తవ్యతా = ఈపని ఇట్లు చేయ వలెను అని భావించుట, శబ్దవ్యపాశ్రయా = శబ్దమే కారణముగా గలది.

యామ్ = ఏ "ఇతికర్తవ్యత"ను, బాలః + అపి = చంటి పిల్లడు గూడ, పూర్వా హిత సంస్కారః = పూర్వజన్మమునందు కలిగిన భావనాసంస్కారము గలవాడై, ప్రతి పద్యతే = పొందుచున్నాడో.

తా. కర్తవ్య మనగా చేయవలసిన పని. ఈపని ఈ రీతిగా చేయవలెననే భావన ఇతికర్తవ్యత. అట్టి భావన అంతయు శబ్దరూపమే. కనుక ప్రతి పదార్థము నందును ఇతి కర్తవ్యత సంబంధించియే యుండును. అట్లు ఆలోచించనిదే ఎవరును ఏ పనియు చేయలేరు. అట్టి భావన మానసికక్రియ. అది ఇతరులకు విసపడక పోవచ్చును. కాని ఆలోచించువాని మనస్సున నది శబ్దరూపమున భాసించుచునే యున్నది. ఘటాదికములందు మన్ను అనుగత ముగా నున్నట్లు పైరీతిని శబ్దము గూడ అనుగతముగానే యున్నది.

చంటిపిల్లడు పుట్టగానే శబ్దజ్ఞానము కలవాడే. వాని పాలు త్రాగుట పూర్వ జన్మమునందున్న సంస్కారవశమున చిన్నిపెదవులను గూడ కదలించి చేయుగలడు.

వి. శరీరము మారినను, జీవశక్తి అవిచ్ఛిన్నముగాను అవ్యక్తముగాను అను వర్తించును. పూర్వజన్మమున చేసిన పుణ్యపాప కర్మఫలముల ననుభవించుటకే మరియొక జన్మ లభించును. దీని సంపూర్ణభావమును 123 వ శ్లోకము వివరించుచున్నది.

చంటిపిల్లవానికి ఇతికర్తవ్యత ఉన్నదని ఎట్లు చెప్పగలము ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

ఆద్యః కరణవిన్యాసః ప్రాణస్యోర్ధ్వం సమీరణమ్
స్థానానా మభిఘాతశ్చ న వినా శబ్దభావనామ్ . 122

బాలునకు, ఆద్యః = ప్రాథమికమగు, కరణ విన్యాసః = శబ్దముల నుచ్చరించుటకై ప్రయత్నములయొక్క వినియోగము, ప్రాణస్య = ప్రాణవాయువుయొక్క, ఊర్ధ్వమ్ = మీదుగా, సమీరణమ్ = ప్రేరణము, స్థానానామ్ = కంఠము, తాలువు మున్నగు స్థానముల యొక్క, అభిఘాతః + చ = కొట్టుటయును, శబ్దభావనాం + వినా = లోపల శబ్దములను భావించుట లేనిది, న (భవతి) = కలుగనేరదు.

వి. శబ్దముల నిట్లుచ్చరించవలెను. ఇవి శబ్దములు అను విషయము చంటి వాడు శబ్దముల నుచ్చరించుటకై తన అవయవములను వినియోగించుచున్నాడు - అనగా ప్రాణవాయువును నిరోధించుట, కంఠమునందున్న నాడులను స్పందింపచేయుట, నోటిలో నున్న నీటిని లోపలకు గుటకవేయుట, దవడలనుచాచుట మున్నగు పనులను చేయుచున్నాడు. ఇవి లేనిది శబ్దోచ్చారణము జరుగదు.

మరియు వాయువునకు తిర్యగ్గమనము అనగా అడ్డముగా సంచరించుట స్వభావము. అట్లయినను బాలుడు ప్రాణవాయువును ఊర్ధ్వముగా ప్రసరింప చేయుచున్నాడు. మరియు కంఠము మున్నగు స్థానములందు ప్రాణవాయువును ప్రతిహతము చేయుచున్నాడు.

పై పనులు బాలుడు చేయుటవలన లోపల శబ్దములను భావించుచున్నాడనియే నిశ్చయింపవచ్చును. కాని ఈ జన్మమున అతనికి శిక్షణలేనందున పై కారణసామాగ్రిచే జన్మాంతరీయ సంస్కారమునే కారణముగా జూపక తప్పదు. కాబట్టి సర్వసాధారణముగ శబ్దము ఇతి కర్తవ్యతకు మూలమని నిశ్చయింపదగును.

శబ్దము వలన కలిగెడి జ్ఞానమునందే కాక జ్ఞానసామాన్యమున శబ్దము భాసించు నను సిద్ధాన్తమును జూపుచున్నాడు.

న సోఽస్తి ప్రత్యయో లోకే యశ్శబ్దానుగమాదృతే
అనువిద్ధ మివ జ్ఞానం సర్వం శబ్దేన భాసతే. 123

యః=ఏ జ్ఞానము, శబ్దానుగమాత్+ఋతే=శబ్ద సంబంధ శూన్యమైనదో - అనగా శబ్ద సంబంధము లేనిదో, సః=అట్టి, ప్రత్యయః=జ్ఞానము, న+అస్తి=లేదు.

సర్వమ్=సమస్తమగు-అనగా వక్తకు కలిగినదిగాని, శ్రోతకు కలిగినదిగాని, ప్రత్యక్షానుమిత్యుపమితిశాబ్దరూపముగాని, స్మృతిరూపముగాని, భ్రమరూపముగాని, జ్ఞానమ్=జ్ఞానము, శబ్దేన=శబ్దముతో, అనువిద్ధమ్+ఇవ=కలిసిపోయినది వలె, భాసతే=భాసించుచున్నది.

తా. ఏ జ్ఞానము కలిగినను శబ్దముతో కలిసియే కలుగును. శబ్దసంబంధము లేనిది జ్ఞానముండదు. వక్త ముందుగా నర్థమును బుద్ధిలో చూచును. దానికి అనుగుణమగు శబ్దమును చూచును. తనకు కలిగిన భావనకు అనుగుణముగా కల్పితమగు శబ్దార్థసంబంధమును చూచును. ఇది యంతయు శబ్దమూలకము. ఇట్టి తన భావమును ఇతరునకు బోధింపదలచి నపుడు శబ్దమునే ద్వారముగా జేసుకొనును. శ్రోతయు శబ్దమువలననే అర్థమును గ్రహించును. ఈ భావము ఈ కాండలో 53 వ శ్లోకమున స్పష్టముగా జూపబడియున్నది.

కనుకనే ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్దము, స్మృతి, భ్రమ మున్నగు జ్ఞానము లన్నియు శబ్దముతో మిశ్రితములైనవే భాసించుచున్నవి. శబ్ద సంబంధము లేక శుద్ధ జ్ఞానము వ్యవహారదశలో నుండనేరదు. ప్రత్యయశబ్ద మిచట జ్ఞానపరము.

జ్ఞానమున శబ్దము యొక్క ఆకారము అనుగతముగా నుండు నను అర్థమును దృఢ పరచుచున్నాడు.

వాగ్రూపతా చే న్నిష్క్రామే దవబోధస్య శాశ్వతీ
న ప్రకాశః ప్రకాశేత సా హి ప్రత్యవమర్శినీ. 124

(అ) అవబోధస్య=జ్ఞానమునకు, శాశ్వతీ=సహజమగు, వాగ్రూపతా=వాగ్రూపపత్వము-అనగా సూక్ష్మమగు శబ్దముయొక్క సంబంధము, నిష్క్రామేత్+చేత్=తప్పుకొన్నచో, ప్రకాశః=జ్ఞానము, న+ప్రకాశేత=ప్రకాశించక పోయెడిని.

తా. తనలోపల నున్న జ్ఞానము పరునకు తెలియబడదు. దానిని శబ్దముచేతనే పరునకు స్పష్టపరచవలెను. శబ్దము లేనిచో ప్రకాశము లేనందున పరునకు తనకున్న జ్ఞానము

కలుగకపోయెడిని. లేక తనకు కలిగిన జ్ఞానముకూడ ప్రకాశింపక పోయెడిని అని చెప్ప వచ్చును. తనకు జ్ఞానము కలిగినచో దానిని శబ్దముచేతనే కదా భావన చేయవలెను :

(అ) హి = ఏలయన, సా = వాగ్రూపత, ప్రత్యవమర్శినీ = ప్రకాశమునకు గూడ ప్రకాశకము.

తా. తనకు జ్ఞానము కలుగగా నాకు ఇట్టి జ్ఞానము కలిగినది అను భావన లోక మున కలుగును. దానినే అనువ్యవసాయ మందురు. కంటికి ఘటము కనబడగా ఘటజ్ఞానము ఆ వ్యక్తికి కలుగును. "ఘట మహం జానామి" (నేను ఘటమును తెలుసుకొనుచున్నాను) అను రూపమున ఉన్న జ్ఞానము అనువ్యవసాయము. సూక్ష్మరూపము గూడ అట్టిదే.

కాగా కలిగిన జ్ఞానమును మరల ఒకసారి అనువదించుట ప్రత్యవమర్శ. అది శబ్ద రూపము.

సర్వము వాగ్రూపమే యని చెప్పుచున్నాడు.

సా సర్వవిద్యాశిల్పానాం కలానాం చోపబద్ధనీ
తద్వశా దభినిష్పన్నం సర్వం వస్తు విభజ్యతే. 125

సా = ఆ వాక్కు, సర్వవిద్యాశిల్పానామ్ = ఎల్ల విద్యలను, ఎల్ల శిల్పములను, కలానాం + చ = ఎల్ల కళలకును, ఉపబద్ధనీ = కారణము.

తద్వశాత్ = ఆ వాక్కు యొక్క మహిమవలన, సర్వమ్ = సమస్తమగు, వస్తు = వస్తువు, అభినిష్పన్నమ్ = పుట్టుచున్నదై, విభజ్యతే = వేరుచేయబడుచున్నది.

తా. మనుష్యులు లౌకిక వ్యాపారములందు యాగాది వైదిక కర్మలయందు అను కూల్యమున్ననాడు ప్రవర్తించుచున్నారు. ప్రాతికూల్యమున్నచో నివర్తించుచున్నారు. ఆ ప్రవృత్తి నివృత్తులు విద్యలను, శిల్పములను, కళలను ఆధారముగా చేసుకొనియే జరుగు చున్నవి. పశు పక్ష్యాది తిర్యగ్జంతువులు ఘట పటాదికమగు అచేతన పదార్థములుగూడ మనుష్యునికి అధీనములై యున్నవి. అట్లుండుటకు మనుష్యునికి గల విద్యాశిల్పకళలే కారణములు.

విద్యాశిల్పకళ లుపదేశించువాని బుద్ధిలో సూక్ష్మరూపమున నున్నవి. అవి చదువు కొను వాని బుద్ధిలో సంక్రమించవలెనన్నచో శబ్దము ముఖ్యకారణ మగుచున్నది. ఆ శబ్దము జ్ఞానరూపము. అట్లుగాకున్న శబ్దమును నుచ్చరించిన మాత్రమున శిష్యునకు జ్ఞానము కలుగ నేరదు. కాబట్టి శబ్దము, జ్ఞానము ఏకరూపములే. శబ్దము అర్థము ఏకరూపమే కనుక ఉపా ధ్యాయుడు శబ్దము నుచ్చరించగా శిష్యునకు అర్థజ్ఞానము కలుగుచున్నది.

వి. మరియు మనుష్యుని బుద్ధిలో సూక్ష్మ శబ్దరూపమున సమస్తపదార్థము ఆవి ర్భవించి బాహ్యప్రపంచమున ఆ పదార్థమే స్థూలరూపమున కాన్పించుచున్నది. కనుకనే ఘటము పటము పర్వతము మున్నగు శబ్దములచేతనే పదార్థ విభాగజ్ఞానము కలుగుచున్నది.

మరియు ఒకేవ్యక్తి భిన్న భిన్న రూపముగా పలువురచే గ్రహింపబడుచున్నది. ఈ యాశయము 118 వ శ్లోకమున చూపబడినది.

కాగా విద్యాశిల్పకళలు, లోకమున సమస్తవస్తువిభాగము శబ్దరూపమును ఆధార ముగా జేసికొని యున్నవి.

శబ్దము, విద్యాశిల్పకళలకు మూలమే కాదు. మరి యేమనగా సర్వప్రాణులకు లోపల ఏ చైతన్యము కలదో, అదియు శబ్దరూపమే యని చెప్పుచున్నాడు.

సైషా సంసారిణాం సంజ్ఞా బహిరన్తశ్చ వర్తతే
తన్మాత్రా మనతిక్రాన్తం చైతన్యం సర్వజన్తుషు .　　　126

సా+ఏషా=ఆ ఈవాక్కు-అనగా విద్యాశిల్పకళలకు కారణమగు శబ్దము, సంసారిణామ్ = ప్రాణులకు, సంజ్ఞా = చైతన్యమై, బహిః = వెలుపల, అన్తః+చ = లోపల గూడ, వర్తతే = ప్రవర్తించుచున్నది. శబ్దము ప్రాణుల బాహ్యవ్యవహారమునకు అంతరంగిక సుఖ దుఃఖాది జ్ఞానమునకు కారణమని భావము

ఏలయన, సర్వజన్తుషు = సమస్త జంతువులం దున్న, చైతన్యమ్ = చైతన్యము, తన్మాత్రమ్ = శబ్దముయొక్క స్వరూపమును, అనతిక్రాన్తమ్ = అతిక్రమించునది కాదు. అది శబ్దరూపమే యని భావము.

తా. సర్వప్రాణులు నేను సుఖముగానున్నాను. నేను దుఃఖము కలిగియున్నాను. నేను పని చేయుచున్నాను అని భావింతురు. అట్లు భావించుటకు చైతన్యము కారణము. ఒకరితో నొకరు మాట్లాడుదురు. పరస్పరము పనులు చేసుకొందురు. అచటను చైతన్యమే కారణము. ఆ చైతన్యము శబ్దరూపము. శబ్దముచేతనే గదా లోకులు సర్వవ్యవహారములు నడుపుచున్నారు

వి. ఘటము, పటము మున్నగు వ్యక్తులందు ఘటత్వము పటత్వము మున్నగు జాతులు కలవు. అవి యన్నియు శబ్దరూపము ననుసరించియే యున్నవి. శబ్దము లేనిది ఏ జాతియు చెప్పబడలేదు.

వృక్షాదులకు గూడ సుఖ దుఃఖములు కలవు. అవి తమ సుఖదుఃఖాదులనే తెలుసుకొనగలవు. పరవృత్తాంతమును చెప్పజాలవు. వానికికూడ ప్రాణమున్నది కనుకనే అవి విరిగి పోయినా మరల పుట్టుచున్నవి.

సంసారులకు వాక్కు సంజ్ఞ-అనగా చైతన్యము అని చెప్పినాడు. దానినే బలపరచు చున్నాడు.

అర్థక్రియాసు వాక్ సర్వాన్ సమీహాయతి దేహినః
తదుత్క్రాన్తౌ విసంజ్ఞోఽయం దృశ్యతే కాష్ఠకుడ్యవత్ .　　　127

వాక్ = చైతన్యరూపమగు శబ్దము, సర్వాన్ = సమస్తములగు, దేహినః = దేహధారులను, అర్థక్రియాసు = ప్రయోజన వంతమగు పనులయందు, సమీహాయతి = ప్రేరేపించు చున్నది.

తదుత్క్రాన్తౌ = ఆ చైతన్యమునకు ఉత్క్రాన్తి కలుగగా-అనగా–దేహమునుండి చైతన్యము తప్పుకొనగ, అయమ్ = అంతకుముందు చలించుచున్న దేహి, కాష్ఠకుడ్యవత్ = ఎండిన కఱ్ఱవలె, గోడవలెను, విసంజ్ఞః = పోయిన సంజ్ఞకలదై-అనగా తెలివితప్పినదై, చలనము లేనిదై, దృశ్యతే = ప్రాణవంతులచే చూడబడుచున్నది

తా. సమస్తమగు దేహధారులను తన కవసరమగు పనులయందు శబ్దము ప్రేరేపించుచున్నది. ముందుగా తెలుసుకొని దానిని కావలెనని కోరి, యత్నించి, గమనా

గమనములు దేహధారి చేయును. ఈ క్రమమునే "జానాతి, ఇచ్ఛతి, యతతే, చేష్టతే" అను రీతిని ప్రవృత్తిలో ప్రజలు అనుసరింతురు. వీనిలో జానాతి (తెలుసుకొనుచున్నాడు)ముందుగా నున్నది. అది శబ్దమే. అదియే చైతన్యము. అట్టి శబ్దసంబంధములేని చెట్టు, లత మున్నగునవి పై రీతిని కదలలేకున్నవి.

ఆ దేహమునుండి ఆ శబ్దము తప్పుకొన్ననాడు దేహాలు కర్ర, రాయి, బెడ్డ, గోడ మున్నగు జడపదార్థముల వలె తెలివితప్పి కదలక యుండును. అట్టి స్థితి సుషుప్తి, మూర్ఛ, మరణము మున్నగు అవస్థలలో కానవచ్చుచున్నది.

జాగ్రదవస్థలో వాక్కు సర్వవ్యవహార కారణమని చూపి ఇపుడు స్వప్నావస్థయందు గూడ అదియే కారణమని చూపుచున్నాడు.

ప్రవిభాగే యథా కర్తా తయా కార్యే ప్రవర్తతే
అవిభాగే తథా సైవ కార్యత్వే నాఽవతిష్ఠతే. 128

కర్తా = పనిచేయువాడు, ప్రవిభాగే = జాగ్రదవస్థయందు, తయా = ఆవాక్కుచే, కార్యే = చేయదగిన పనియందు, యథా = ఏరీతిగ, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నాడో, తథా = ఆ రీతిగా, అవిభాగే = స్వప్నావస్థయందు, సా + ఏవ = ఆవాక్కే, కార్యత్వేన(అపి) = కార్యరూపమునగూడ, అవతిష్ఠతే = ఉంటున్నది.

తా. ప్రాణులకు జాగ్రదవస్థలో సర్వవ్యవహార కారణము శబ్దము, అదియే చైతన్యము. వాగ్రూపమగు చైతన్యముతో ననువిద్ధమగు శబ్దమును పురస్కరించుకొనియే లోకులు వ్యవహరింతురు. ఈ భావము 127 వ శ్లోకమున స్పష్టముగా నున్నది.

అట్లే కర్త, కర్మ, కరణము అను విభాగములేని స్వప్నావస్థయందు గూడ శబ్దము ఉపయోగపడుచున్నది. విశేషమేమనగా — స్వప్నావస్థలో వాగ్రూపమున చైతన్యమే పని చేయు కర్తగాను, చేయబడే కర్మగాను, పనిచేయుట కుపయోగించెడి సాధనముగాను గూడ మార్పుచెందుచున్నది. ఆ యవస్థలో పదార్థములు వాసనారూపములే, జాగ్రదవస్థయందు వలె స్థూల పదార్థములు కావు. కనుక వాటిని ప్రాతిభాసికము లందురు. మిథ్యాభూతములని భావము. రథ మెక్కి ప్రయాణము చేసినట్టు కల వచ్చును. నిజముగ అచట రథము, గుర్రములు, పయనము లేవు. కాని అది యంతయు శబ్దము వలననే జరుగును. జాగ్రదవస్థలో శబ్దము సాధన మేయగును. స్వప్నావస్థలో సాధనము గాను, కార్యరూపముగాను భాసించును.

స్వప్నావస్థలో చైతన్యమే ఇంద్రియములు చేసే పనిని చేయును. శబ్దమే చైతన్యమని 125 వ శ్లోకమున స్పష్టముగా జూపబడినది.

సమస్తమగు వికారము శబ్దమునకు సంబంధించినదే అని చూపుచున్నాడు.

స్వమాత్రా పరమాత్రా వా శ్రుత్యా ప్రక్రమ్యతే యథా
తథైవ రూఢతా మేతి తయా హ్యర్థో విధీయతే. 129

స్వమాత్రా = తన స్వరూపము, పరమాత్రా + వా = ఇతర వస్తువుయొక్క స్వరూపముగాని, శ్రుత్యా = శబ్దముచే, యథా = ఏరీతిగా, ప్రక్రమ్యతే = జ్ఞానవిషయముగా

చేయబడుచున్నదో-అనగా అభిన్నముగా నున్న పదార్థమును రెండు రూపములతో నున్నట్టు, భిన్నముగా నున్న పదార్థములను ఏకరూపముగా నున్నట్టు శబ్దము ఎట్లు చూపుచున్నదో తథా + ఏవ = ఆరీతిగానే భేదరూపమునగాని, అభేదరూపమునగాని, అర్థః = ఆ యర్థము, రూఢతామ్ = రూఢిని, ఏతి = పొందుచున్నది. ఇది నిజరూపమా, కాక కల్పితమా అని సంశయమే లేక అయర్థము రూఢమనియే లోకము భావించునని భావము.

హి = ఏలయన, తయా = ఆశబ్దముచేత, అర్థః = అర్థము, విధీయతే = బుద్ధి యందు ఆరోపింపజేయ బడుచున్నది. అట్టి యర్థమును బుద్ధికి శబ్దము అందజేయుచున్నది. లేని యర్థమును గూడ ప్రకాశింపజేయుట శబ్దముయొక్క మహిమచే కలుగుచున్నది.

తా. "రాహోః శిరః" (రాహువుయొక్క శిరము) అను వాక్యము కలదు. ఒక వ్యక్తి మొండెముగాను, కేవల శిరస్సుగాను ఛేదింపబడగా మొండెమునకు కేతువని శిరోమాత్ర మునకు రాహువనియు లోకప్రసిద్ధి కలదు. రాహువే శిరము, శిరస్సుకంటె వేరుగా అవయవ ములు లేవు. కాని రాహువుయొక్క శిరస్సు అను వాడుక మాత్రము కలిగినది. ఒకే శిరము నకు రెండు భాగములున్నట్లు శబ్దము బోధించుచున్నది. ఇది శబ్దముయొక్క మహిమ.

ఇట్లే వ్యాకరణమున స్థాన్యాదేశవ్యవహారము కలదు. అచట స్థాని వేరు. ఆదే శము వేరు. కాని ఆదేశము స్థానివంటిది యగునని శాస్త్రముచెప్పుచున్నది. అచట భిన్నము లగు రెంటికి అభేదము శబ్దముచే లభించును.

బాహ్య ప్రపంచమున పదార్థములతో సంబంధములేకయే శబ్దము భిన్న భిన్నము లగు రూపములతో నర్థమును బుద్ధి విషయమగునట్లు చేయుచున్నది.

పయి అంశమునే స్పష్టపరచుచున్నాడు.

అత్యన్త మతథాభూతే నిమిత్తే శ్రుత్యుపాశ్రయాత్
దృశ్యతేఽలాతచక్రాదౌ వస్త్వాకారనిరూపణా. 180

నిమిత్తే = బాహ్య ప్రపంచమున నిమిత్తముగానున్న, అలాతచక్రాదౌ = కొర కంచును తిప్పుటవలన గన్పట్టు చక్రము మొదలయినవానియందు, అత్యన్తమ్ = మిక్కిలి, అతథాభూతే = అట్లు కాకపోయినా - అనగా సత్యము కాకపోయినా, శ్రుత్యుపాశ్రయాత్ = శబ్దముయొక్క బలమువలన, వస్త్వాకార నిరూపణా = వస్తువుయొక్క ఆకారమునకు సంబం ధించిన శబ్దప్రయోగము, దృశ్యతే = చూడబడుచున్నది. ఇచట లోకము కర్త.

తా. శబ్దము చెవిచే గ్రహింపబడినదై తనయందున్న అర్థమును బుద్ధికి విషయ మగునట్లు చేయును. చెవిని ద్వారముగా జేసుకొని శబ్దము బుద్ధికి విషయమగునపుడు తన యందున్న అర్థమునుగూడ బుద్ధికి విషయమగునట్లు చేయుటలో నాశ్చర్యమేమి యున్నది? శబ్దము ప్రత్యాయకము, దానియందు ప్రత్యాయ్యరూపమున అర్థమున్నది. శబ్దమర్థమును బోధించుటలో ఆ యర్థము బాహ్య ప్రపంచకమున ఉన్నదా? లేదా? అను విచారము లేకయే ఉపయోగపడును. అచట వక్తయొక్క ఇచ్ఛయే మూలము.

ఇందు మనకు చాలా వ్యవహారములు కన్పించుచున్నవి. రథచక్రము కంటికి కన బడును. దానిని తాకిన దానిస్పర్శయు ప్రత్యక్షము అగును. అది నాలుగుప్రక్కల ఒకేసారి స్పర్శకు యోగ్యమగును. అలాతచక్ర మట్టిది కాదు. అలాత మనగా కొరకంచు. దానికి తగు

మాత్రము నిప్పు ఉండును. దానిని చేతితో త్రిప్పినచో చక్రమువలె కాన్పించును. అది కంటికి కనబడునేగాని నాలుగు ప్రక్కల ఒకేసారి అంతట స్పర్శలేకపోవుటచే అదిలేదనియే నిశ్చిత మగును. రథచక్రము స్పర్శకర్హమగుటచే నది సత్పదార్థమనియు, అలాతచక్ర మసత్పదార్థ మనియు తెలియబడుచున్నది. 'అలాతచక్రము' అనుశబ్దము మాత్రము దానిని బోధించుచునే యున్నది.

వి. ఇట్లే వంధ్యాపుత్రుడు, చెవులపిల్లి కొమ్ము, గగనకుసుమము మున్నగు పద ములు కూడ అర్థవంతములే, కాని వాని యర్థము లోకమున ప్రత్యక్షముగా కానరాదు.

జగత్తునకు పరమాత్మ కారణమని వేదము బోధించుచున్నది. జగత్తునకు శబ్దము కారణమన్నచో పయుక్తులు విరోధించుచున్నవి అను సంశయము కలుగగా ఆ శబ్దము పరమాత్మస్వరూపమే అని సమాధానము చెప్పుచున్నాడు.

అపి ప్రయోక్తు రాత్మానం శబ్ద మన్తరవస్థితమ్
ప్రాహు ర్మహా న్తం వృషభం యేన సాయుజ్య మిష్యతే. 181

(మన్త్రాః = మంత్రములు), ప్రయోక్తుః = శబ్ద ముచ్చరించువాని-అనగా జీవుని యొక్క, ఆత్మానమ్ + అపి = నిజస్వరూపమునుగూడ-అనగా నిర్గుణపరమాత్మ స్వరూప మును గూడ, అన్తః = లోపల, అవస్థితమ్ = ఉన్నట్టియు, మహాన్తమ్ = వ్యాపకమగు, వృష భమ్ = వృషభరూపముగా కల్పింపబడిన, శబ్దమ్ = శబ్దమునుగానే, ప్రాహుః = చెప్పుచున్నవి. జీవభావము కల్పితము. దానిపారమార్థికరూపము నిర్గుణబ్రహ్మమే. ఆబ్రహ్మము శబ్దరూపమే యని వేదమంత్రములు చెప్పుచున్నవని భావము.

యేన = ఏశబ్దరూపమగు పరబ్రహ్మముతో, సాయుజ్యమ్ = ఐక్యము (ముముక్షుభిః = మోక్షము కోరువారిచే), ఇష్యతే = కోరబడుచున్నదో.

తా. శబ్దమును వృషభముగా మంత్రములు రూపకల్పనచేసి దాని మహిమను పొగడుచున్నవి. అది సమస్తమగు కోరికలను ఇచ్చును. సర్వశక్తి సమన్వితము, పరమాత్మ రూపము. మనుష్యులను అట్టి శబ్దము ఆవేశించియున్నది. దానిని సేవించిన ముముక్షువులు దానితో నైక్యమును బొందుదురు. దాని స్వరూపము వ్యాకరణాధ్యయనము వలన తెలియ నగును. వ్యాకరణమును అభ్యసించిన పాపములు తొలగి ధర్మము వలన చిత్తశుద్ధి కలిగి సాధ కుడు నిర్గుణాద్వయబ్రహ్మభావమును పొందును.

శబ్దబ్రహ్మతో నైక్యమును పొందుటకు అవసరమగు ఉపాయమును చూపు చున్నాడు.

తస్మా ద్యః శబ్దసంస్కారః సా సిద్ధిః పరమాత్మనః
తస్య ప్రవృత్తితత్త్వజ్ఞ స్తద్బ్రహ్మాఽమృత మశ్నుతే. 182

తస్మాత్ = అందువలన-అనగా శబ్దమునందు మాహాత్మ్యముండుటవలన, యః = ఏది, శబ్దసంస్కారః = శబ్దముయొక్క సంస్కారమో - అనగా అసాధు శబ్దములనుండి సాధు శబ్దములను వేరుగా చూపుటయో, సా = అది, పరమాత్మనః = పరమాత్మయొక్క, సిద్ధిః = పొందుట కుపాయము.

తస్య = ఆ శబ్దబ్రహ్మము యొక్క, ప్రవృత్తి తత్త్వజ్ఞః = ప్రవృత్తులయొక్క తత్వము గుర్తించినవాడు, అమృతమ్ = అవినాశియగు, తత్ = ఉపనిషత్ప్రతిపాద్యమగు, బ్రహ్మ = పరబ్రహ్మమును, అశ్నుతే = వ్యాపించుచున్నాడు-అనగా పొందుచున్నాడు.

తా. అసాధు శబ్దసంపర్కము వలన సాధుశబ్దముల శక్తి తగ్గియుండును. అందుచే నవి ధర్మజనకములు కానేరవు. కనుక ముందుగా అసాధుశబ్దముల నుండి సాధు శబ్దములను వేరుగా తెలుసుకొనవలెను. ఇదియే శబ్ద సంస్కారము. దాని వలన పాపములు నశించి ధర్మము వృద్ధిచెంది చిత్తము శుద్ధమగును. అపుడు ఉపనిషత్ప్రతిపాద్యమగు నిర్గుణ బ్రహ్మభావరూపమగు మోక్షము లభించును.

వి. శబ్దబ్రహ్మము 'జాయతే' (పుట్టుక) మున్నగు ఆరు విధములుగా వివర్త మగును. అవియే ప్రవృత్తులు అనబడును. వాని తత్త్వము అవికారి బ్రహ్మమే.

సాధుశబ్దము కూడ వికృతమే. దానిని సేవించిన ప్రతిభ కలుగును. అదియే సృష్టి స్థితిలయములకు కారణము. అట్టి సాధుశబ్ద జ్ఞానము వ్యాకరణాధీనము. అది లేనిది శబ్దస్వ రూపము జ్ఞాతము కానేరదు. ఈ యర్థము 132 వ శ్లోకమున కలదు. 118 వ శ్లోకమునుండి ఇంతవరకు 15 శ్లోకములచే శబ్దముయొక్క మాహాత్మ్యము నిరూపింపబడినది.

సాధుశబ్ద ప్రయోగమువలన ధర్మము, దానివలన చిత్తశుద్ధి, మోక్షము కలుగును. అని చెప్పబడినది. కాని వ్యాకరణస్మృతికి ప్రామాణ్య మెట్లు? అది పౌరుషేయము కనుక అప్రమాణమగును అనిశంక కలుగగా వేదమూలకమగుటచే వ్యాకరణస్మృతి ప్రమాణమే అను సమాధానము చెప్పదలచి ఒక్క వ్యాకరణమే వేదమూలకమగుటచే ప్రమాణముకాదు. స్మృతులన్నియు ఇట్టివే అని చెప్పుచున్నాడు.

న జాత్వకర్తృకం కశ్చి దాగమం ప్రతిపద్యతే
బీజం సర్వాగమాపాయే త్రయ్యే వాఽతో వ్యవస్థితా. 133

(అ) కశ్చిత్ = ఒకడుకూడ, జాతు = ఎప్పుడైనను, అగమమ్ = స్మృతిశాస్త్ర మును, అకర్తృకమ్ = కర్తలేనిదానినిగా-అనగా అపౌరుషేయమునుగా, న+ప్రతిపద్యతే = గుర్తించడు.

తా. ప్రతి మనుష్యుడు స్మృతులు వేదమువలె అపౌరుషేయములని భావించడు. అవి మనుష్యులచే నిర్మింపబడినవి యనియే తలంచును. అవి యనిత్యములగుటచే తప్పక నశించు నని భావము.

(ఆ) అతః = ఈ కారణమువలన - అనగా స్మృతులు పురుషులచే నిర్మింపబడి యుండుటవలన, సర్వాగమాపాయే = ప్రళయమున సమస్తమగు స్మృతిశాస్త్రములు నశించగా, వ్యవస్థితా = నిత్యమగునట్టి, త్రయీ + ఏవ = ఋగ్యజుస్సామరూపమగు వేదత్రయమే, బీజమ్ = మూలము. స్మృతు లన్నిటికి వేదమే మూలమని భావము.

వి. సాధుశబ్దప్రయోగము వలన పాపముపోయి ధర్మము. చిత్తశుద్ధి, మోక్షము కలుగును. సాధుశబ్దజ్ఞానము వ్యాకరణమూలకమని చెప్పుట ఎట్లు పొసగును? వ్యాకరణము పురుష నిర్మితము కాబట్టి యప్రమాణమే యగును. కాగా వ్యాకరణమునుబట్టి పైయర్థమును ఎట్లు విశ్వసింతుము? అను సంశయము కలుగగా వ్యాకరణము వేదమూలకము కనుక

ప్రమాణమే యగును అను నర్థమును చెప్పుచు స్మృతులన్నిటికి వేదప్రామాణ్యమును బట్టియే ప్రామాణ్యము లభించునని 133 నుండి 143 వరకు 10 శ్లోకములచే నిరూపించుచున్నాడు.

తా. ఈ కాలమున కనిపించుస్మృతులు వేదార్థమును ప్రమాణముగా తీసుకొని మునులచే రచింపబడినవి. అంతియేకాని వేదార్థముతో సంబంధములేక కేవలము వ్యక్తి బుద్ధిబలమునే ఉపయోగించి వ్రాయబడినవి కావు. వేదము స్వతః పరమప్రమాణమని భారతీయులు విశ్వసింతురు.

స్మృతులు పురుషనిర్మితములనియే అందరు నమ్ముదురు. అవి అపౌరుషేయము లని ఎవ్వరు నమ్మరు. కాగా అవి సకర్తృకములగుటచే అనిత్యములని వేరుగ చెప్పనక్కర లేదు. అనిత్యములగుటచే ప్రళయమున నవి నశించును.

ప్రళయము తరువాత యుగప్రారంభమున కపిల ప్రభృతులు వేదమును మూలముగా గైకొని స్మృతులను నిర్మింతురు. ఆ సమయమున వేదమొక్కటియే మిగిలియుండును. అది నిత్యము. ప్రళయమున గూడ వేదము నశించదు. అట్లే ప్రతి యుగమున జరుగుచుండును.

అట్టి స్మృతులలో వ్యాకరణము గూడ చేరియున్నందున ప్రమాణమే. కనుక పై యర్థము విశ్వసింప దగినదే.

పౌరుషేయములగు ధర్మశాస్త్రగ్రంథములు నశించునపుడు స్మృతులకు మూలము లగు వేదములు మనకు తెలియబడనందున ఆ సమయమున ధర్మాచరణము విచ్ఛిన్నమే కావలెనను సంశయమును పోగొట్టుచున్నాడు.

అస్తంయాతేషు వాదేషు కర్తృష్వన్యేష్వసత్స్వపి
శ్రుతిస్మృత్యుదితం ధర్మం న లోకో వ్యతివర్తతే. 184

వాదేషు = ధర్మశాస్త్రగ్రంథములు, అస్తమ్ = నాశమును, యాతేషు = పొందగా- అనగా అవి నశించగా, అన్యేషు = ఇతరులను, కర్తృషు = ధర్మశాస్త్ర గ్రంథరచయితలు, అసత్సు + అపి = లేకున్నను, లోకః = శిష్టలోకము, శ్రుతిస్మృత్యుదితమ్ = వేదములోను, తన్మూలకమగు స్మృతులలోను చెప్పబడిన, ధర్మమ్ = ధర్మమును, న + వ్యతివర్తతే = అతిక్రమించి ప్రవర్తించదు. దానిని విడచి యుండదు

తా. ప్రళయమున ధర్మశాస్త్రగ్రంథములు, వానిని రచించినవారు నశింతురు. యుగప్రారంభమున రచయితలు లేరు. ఈ మధ్యకాలమున ధర్మాచరణమున కవ కాశము లేనందున ధర్మాచరణము విచ్ఛిన్నమే యగునని సంశయింపనచ్చును. కాని నిత్యమగు వేదమునే యాధారముగా జేసుకొని ఆనాటి శిష్టులు ధర్మమును ఆచరించుచునే యుందురు. కాబట్టి ధర్మాచరణ మెన్నడు విచ్ఛిన్నము కానేరదు.

కపిలాది స్మృతి ప్రణేతలకు ధర్మాధర్మజ్ఞానము స్వభావసిద్ధమే. అందు ఇతర శాస్త్రములు కాని వేదముకాని కారణముకాదు. కనుక స్మృతులు వేదమూలకములని ఎట్లు చెప్ప నగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

జ్ఞానే స్వాభావికే నార్థః శాస్త్రైః కశ్చన విద్యతే
ధర్మో జ్ఞానస్య హేతుశ్చేత్తస్యాఽఽమ్నాయో నిబన్ధనమ్. 185

(అ) జ్ఞానే = ధర్మాధర్మ విషయకమగు జ్ఞానము. స్వాభావికే = స్వభావసిద్ధమే యగుచో, శాస్త్రైః = స్మృతిశాస్త్రములచే, కశ్చన = ఏమియు, అర్థః = ప్రయోజనము, న + విద్యతే = కలుగ నేరదు.

తా. వేదమక్కరలేకుండ కపిలాదులకు వలె ఇతరులకు గూడ ధర్మాధర్మ జ్ఞానము స్వభావముగానే కలుగవచ్చును. కనుక కపిలాదులు ఇతరుల నుద్దేశించి చేసిన శాస్త్ర నిర్మాణము నిరుపయోగమే యగును; కనుక కపిలాదులకుగూడ వేదమూలముననే జ్ఞానము కలిగినదని చెప్పవలెను. కాబట్టి స్మృతులు వేదమూలములే కాగలవు. కపిలాదులకు జ్ఞానము స్వాభావికము కాదు.

(అ) జ్ఞానస్య = కపిలాదులకు కలిగెడి జ్ఞానమునకు, ధర్మః = ధర్మము, హేతుః + చేత్ = కారణమన్నచో, తస్య = ఆధర్మమునకు, ఆమ్నాయః = వేదము, నిబన్ధనమ్ = మూలము. వేదములేనిది వారలకు కూడ ధర్మము కలుగనేర దని భావము.

తా. స్మృతిశాస్త్రములను నిర్మించెడి కపిలాదులకే ధర్మ మనుగ్రహమును జూపును, ఇతరుల ననుగ్రహించదనుట విశ్వసనీయము కాదు.

కనుక కపిలాదులు వేదార్థపరిశీలనము, తద్విహిత సత్కర్మాచరణము చేసి దాని మూలముననే జ్ఞానాతిశయమును బొందిరి. ఇతరులకు, అంతశక్తి లేనందున వారియందు అనుగ్రహబుద్ధితో కపిలాదులు తాము గుర్తించిన పరమార్థసత్యమును గ్రంథరూపమున వారి కంద జేసిరి. అట్లు కాకున్న, సామాన్యులు వేదార్థమును గ్రహించలేక పోవుటచే జ్ఞానవంతులు కాకపోయెడివారే.

స్మృతులన్నియు వేదమును ఊతచేసుకొని రచియింపబడినందున ప్రమాణములని నిరూపింపబడినది. అట్టితరి ఆ వేదమువలననే మనకు అర్థజ్ఞానము కలుగుచుండగా మరల వేరుగా పూర్వోత్తర మీమాంసాశాస్త్రనిర్మాణము వ్యర్థమే కావలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

వేదశాస్త్రావిరోధీ చ తర్క శ్చక్షు రపశ్యతామ్
రూపమాత్రాద్ధి వాక్యార్థః కేవలా న్నావతిష్ఠతే.　　　136

వేదశాస్త్రావిరోధీ = వేదమనే శాస్త్రమున కవిరుద్ధమగు, తర్కః + చ = తర్కమే, అపశ్యతామ్ = చూచుటకు శక్తిలేని వారికి-అనగా సందేహములేకుండ వేదార్థమును స్వయముగా గ్రహించుటకు సామర్థ్యము లేనివారికి, చక్షుః = నేత్రమువంటిది.

హి = ఏలయన, కేవలాత్ = తర్కసహకారములేని, రూపమాత్రాత్ = వేద శబ్దముయొక్క స్వరూపమాత్రమువలన, వాక్యార్థః = వేదవాక్యమునకు తాత్పర్యవిషయమగు అర్థము, న + అవతిష్ఠతే = సామాన్యులకు నిశ్చితము కానేరదు.

తా. శాస్త్రముల నిర్మాణమువలన కలిగెడి ప్రయోజనమును ఈ శ్లోకము వివరించుచున్నది. ఇచట తర్కశబ్దముచే జైమిని రచియించిన పూర్వమీమాంసాశాస్త్రము, వ్యాసమహర్షి నిర్మించిన ఉత్తరమీమాంసాశాస్త్రము గ్రహింపబడును.

వేదవాక్యములో కొన్ని పదములకు అర్థము పరస్పర విరుద్ధముగాను, సందిగ్ధముగాను, అనేకవిధములుగా కాన్పించును. అస్మదాదులు వానిని సమన్వయపరచి నిశ్చితార్థమును

గ్రహింపజాలము. పూర్వోత్తర మీమాంసా శాస్త్రములు అట్టి వేదవాక్యములను జూచి సాధక బాధక పర్యాలోచనచేసి ఒక నిశ్చితార్థమును చూపుచున్నవి. వేదవాక్యముననే ఆ నిశ్చితార్థ బోధకత యున్నది. దానిని శాస్త్రము స్పష్టపరచినది. శాస్త్రము లేనిది దానిని మనము తెలుసుకొనలేము.

పదార్థములను చూచుటకు నేత్రము సహకరించునట్లు వేదార్థమును చూచుటకు శాస్త్రము సహకరించును. ఆ శాస్త్రము వేదార్థమునకు విరుద్ధముగా నుండరాదు. విరుద్ధమగు తర్కము నిర్ణాయకము కానేరదు.

కాబట్టి వేదతాత్పర్య నిర్ణయము తర్కాధీనమే.

**వేదతాత్పర్య విషయమగు అర్థమును నిర్ణయించుట తర్కాధీనమను అర్థమును ఉదాహరణతో చూపుచున్నాడు.**

> సతోఽవివక్షా పారార్థ్యం వ్యక్తి రర్థస్య లైఙ్గికీ
> ఇతి న్యాయో బహువిధ స్తర్కేణ ప్రవిభజ్యతే . 187

సతః = ఉన్నదానికి-అనగా శబ్దమువలన లభించిన అర్థమునకు, అవివక్షా = వివక్ష చేయకుండుట-ఆ యర్థమును విడనాడుట యని భావము, పారార్థ్యమ్ = పరాధీనత్వము-అనగా ఒక పదార్థము మరియొకపదార్థమునకు ఉపకరించుట, అర్థస్య = శబ్దముచే లభించిన అర్థమునకు, లైఙ్గికీ = లింగబలముచే లభించిన, వ్యక్తిః = అభివ్యక్తి - అనగా శబ్దముచే సామాన్యాకారముగా బోధింపబడిన అర్థమును వాక్యాంతర బలముచే విశేషాకారముగా చూపుట, ఇతి = ఇట్టి, బహువిధః = పలువిధమగు, న్యాయః = సిద్ధాంతము, తర్కేణ = తర్కముచే ప్రవిభజ్యతే = స్పష్టముగా విభజింపబడి చూపబడుచున్నది. అట్టి నిర్ణయము తర్కాధీనమే యని భావము.

తా. శబ్దముచే అర్థము స్పష్టముగా లభించుచున్నను దానిని విడిచియే కొన్ని చోటులందు సమన్వయము చేయవలయును. కొన్ని చోటులందు విడువకుండగనే సమన్వయము చూపవలయును. ఎచట విడువవలెనో, ఎచట విడువరాదో ఆ పరిస్థితిని మనము గుర్తించలేము. తర్కము ఆ పని చేయును.

వి. ఉదాహరణమునకు-"తస్యాఽపత్యమ్"- 4-1-92 అని పాణిని సూత్రము. షష్ఠ్యంతముకంటె అపత్యార్థమున తద్ధితము ప్రవర్తించునని యర్థము. సూత్రమున "తస్య" అని యున్నందున పుల్లింగమగు ఏకవచనాంతముకంటె ప్రత్యయము ప్రవర్తించునని లభించుచున్నది. కాగా 'దశరథస్య అపత్యమ్ = దాశరథిః' మున్నగు రూపములే లభించును. స్త్రీ లింగముకంటెను, ద్వివచన బహువచనాంతములకంటెను ప్రత్యయము ప్రవర్తించనేరదు. 'సుమిత్రాయాః అపత్యమ్ = సౌమిత్రిః, స్వస్రోః అపత్యే-స్వాస్రీయౌ, (చెల్లెండ్ర కుమారులు)' ఇత్యాదిరూపములు సిద్ధించకపోయెడివి. ఇట్లే ఆ సూత్రమున 'అపత్యమ్' అని ఏకవచనాంతముగా నున్నందున రెండు మూడు సంతానములు అర్థమగునపుడు ప్రత్యయము ప్రవర్తించక పోయెడిది. కాబట్టి పై సూత్రమున లింగవచనములు వివక్షితములు కావని చెప్పవలెను. ఇట్టివి ఉదాహరణములు చాల కలవు.

"కాకేభ్యో దధిరక్ష్యతామ్" (కాకములనుండి పెరుగు రక్షింపబడవలెను) అను వాక్యము పెరుగు రక్షింపదగినదనెడి తాత్పర్యముతో ప్రయోగింపబడినది. దానికి గుర్తుగా

"కాకేభ్యః" అను పదమున్నది. పిల్లి, కుక్క మున్నగు ఏ వ్యక్తియు పెరుగు పాడుచేయ కుండ జాగ్రత్తగా కాపాడవలెనని ముఖ్యాశయము. అంతియేకాని "కాకేభ్యః" అని యన్నందున కాకములనుండి రక్షించి పైవానినుండి రక్షించవద్దని భావము కాదు. కాగా పై వాక్యమునందలి కాకపదము కాకమునేగాక పెరుగును పాడుచేయు వ్యక్తు లన్నిటిని బోధిం చును. ఈ యర్థమునే "దధ్యుపఘాతుకే కాకపదం లాక్షణికమ్" అని పెద్దలు నుడివిరి. దీనినే ఉపలక్షణమని యందురు.

"అభిరూపాయ కన్యా దేయా"- (యోగ్యమగువానికి కన్యక ఈయతగినది) అను వాక్యము సామాన్యార్థమును బోధించును. మరికొన్ని వాక్యములు చూచినతరువాత విద్య, ధనము, రూపము, కులము మున్నగునవి కలవానికి ఈయవలెనని విశేషరూపమున అర్థము నిర్ణీతముకాగా పై వాక్యమున కదియే యర్థమని చివరికి తేలుచున్నది.

ఈ రీతిగా ఎన్నియో సిద్ధాంతములను తర్కము స్పష్టపరచుచున్నది.

పురుషులచే జూపబడెడి తర్కమునకు శబ్దశక్తియే మూలము. అట్లుకాక పురుషులచే స్వతంత్రముగా జూపబడెడి తర్కము శుష్కతర్క మనబడును. అట్టి తర్కము వేదతాత్పర్య విషయమగు అర్థమును నిర్ణయింపజాలదు అని చూపుచున్నాడు.

శబ్దానా మేవ సా శక్తి స్తర్కో యః పురుషాశ్రయః
శబ్దావనుగతో న్యాయోఽనాగమే ష్వనిబన్ధనః . 188

పురుషాశ్రయః = పురుషుల నాశ్రయించియున్న-అనగా పురుషులు చూపెడి, యః = ఏ, తర్కః = తర్కమో, సా = ఆ, శక్తిః = సామర్థ్యము, శబ్దానామ్ + ఏవ = శబ్దములకు సంబంధించినదే, శబ్దముల కంత సామర్థ్యమున్నది, దానిని పురుషులు వ్యక్తపరచు చున్నారని భావము.

అనాగమేషు = శబ్దశక్తిని అనుసరించని పురుషుల యందున్నట్టియు, శబ్దానను గతః = శబ్దశక్తిని అనుసరించనట్టియు, న్యాయః = తర్కము, అనిబన్ధనః = అర్థనిర్ణాయకము కానేరదు.

తా. "తస్యాఽపత్యమ్", "కాకేభ్యో దధి రక్ష్యతామ్", "అభిరూపాయ కన్యా దేయా" మున్నగు శబ్దములకు 187 వ శ్లోకమున వివరింపబడిన యర్థమంతయు కలదు. మనుష్యులు వానికి లేని యర్థమును చెప్పుట కాదు. నిగూఢముగా నున్న అర్థమును స్పష్టపడు నట్లు మనుష్యులు హేతువాదమును జూపుచున్నారు.

అట్లుకాక శబ్దశక్తిని దూరముచేసి మనుష్యుడు తనకు తట్టిన యభిప్రాయము ననుసరించియే శబ్దమున కర్థముచెప్పినచో దానిని ప్రామాణికులు పరిగ్రహించరు. శుష్క తర్కమని హేలన చేయుదురు.

సాధుశబ్దములకు ధర్మమును కలిగించుటయందు సామర్థ్యము కలదని 140 వ శ్లోక ముచే చెప్పదలచి, దానికి రెండు దృష్టాంతములను ఈ శ్లోకముచే చూపుచున్నాడు.

రూపాదయో యథా దృష్టాః ప్రత్యర్థం యతశక్తయః
శబ్దా స్తథైవ దృశ్యన్తే విషాపహారణాదిషు . 1?9

యథా = ఏరీతిగా, రూపాదయః = రూపము మున్నగునది – అనగా రూపరస గంధస్పర్శలు, ప్రత్యర్థమ్ = ప్రతిప్రయోజనమున - అనగా విలక్షణమగు కార్యమునుబట్టి,

యతశక్తయః = నియతమగుశక్తులు కలవై, దృశ్యన్తే = ప్రత్యక్షముగా చూడబడుచున్నవో, తథా + ఏవ = మరియు అట్లే, శబ్దాః = శబ్దములు-అనగా అథర్వవేదమున నున్న శబ్దములు, విషాపహరణాదిషు = విషమును పోగొట్టుట మున్నగు కార్యములందు, నియతమగు శక్తులు కలవై చూడబడుచున్నవి. ఈ శ్లోకార్థమునకు 140వ శ్లోకార్థముతో నన్వయము కలుగును, ఇది దృష్టాంత వాక్యము.

తా. కంటితో రూపముచూతుము. అది నీల హరితరూపములు చూచుటకు ఉపక రించును. వానిని మనము చూడగలము. కాని భాస్వర శుక్లరూపము కంటికి నాశనము కలి గించును. వానిని కంటితో చూడలేము. రూపములకు రూపత్వము సామాన్యమైనను పయి రీతిని కార్యభేదము కానవచ్చుచున్నది.

మధురరసము కఫమును, కటురసము పైత్యమును కలిగించును. విషపు ఓషధుల గంధము మూర్ఛను, మాలతీగంధము అధికమైతస్యమును కలిగించును.

బాలికను [1] స్పృశించిన ఆయుష్యాభివృద్ధి, పడతిని స్పృశించిన యథాస్థితమగు ఆయుష్యము, ప్రౌఢను స్పృశించిన వృద్ధత్వము, వృద్ధురాలిని స్పృశించిన మరణము పురుషు నకు కలుగును.

ఇట్లే అథర్వవేదమున కొన్ని మంత్రములు తేలు, పాము మున్నగువాని విషమును పోగొట్టును. కొన్ని శత్రునాశనమును జేయును. ఋగ్వేదమున నున్న శ్రీసూక్తము, పురుష సూక్తము మున్నగునవి దేవతానుగ్రహమును కలిగించును.

దృష్టాంతమును జూపి ఈ యర్థమును ప్రకృతమున జూపుచున్నాడు.

యథైషాం తత్ర సామర్థ్యం ధర్మేఽప్యేవం ప్రతీయతామ్
సాధూనాం సాధుభి స్తస్మా ద్వాచ్య మభ్యుదయార్థిభిః . 140

యథా = ఏరీతిగా, ఏషామ్ = వీనికి-అనగా 139 వ శ్లోకమున చూపబడిన రూప రస గంధాదులకును, అథర్వణ శబ్దములకును, తత్ర = విశేషకార్యమును కలిగించుటయందు, సామర్థ్యమ్ = సామర్థ్యము, ప్రతీయతే = తెలియబడుచున్నదో, ఏవమ్ = ఈరీతిగా, సాధూ నామ్ = సాధుశబ్దములకు, ధర్మేఽపి = ధర్మమునందు గూడ, సామర్థ్యమ్ = శక్తి, ప్రతీయ తామ్ = తెలియబడుగాక - అనగా లోకులచే గుర్తింపబడు గాక.

తస్మాత్ = అందువలన-అనగా సాధుశబ్దములు ధర్మమునకు కారణమగుటవలన, అభ్యుదయార్థిభిః = ఇహలోక పరలోక ఫలములను కోరువారిచే, సాధుభిః = సాధు శబ్దముల చేతనే, వాచ్యమ్ = మాట్లాడుట యుక్తము.

వి. 138 వ శ్లోకమునుంచి స్మృతులకు వేదార్థమూలకములగుట వలన ప్రామా ణ్యమునుజూపి, వానిలో నంతర్గతమగుటచే వ్యాకరణమునకుగూడ ప్రామాణ్యము లభించునని

[1] ఆయుర్వేదమున నిట్లున్నది.

"బాలా ప్రాణప్రదా ప్రోక్తా, యువతీ ప్రాణధారిణీ
ప్రౌఢా కరోతి వృద్ధత్వం, వృద్ధా మరణ మాదిశేత్."

స్పష్టపరచెను. దానివలన వ్యాకరణాధ్యయనము వలన సాధుశబ్దజ్ఞానము, తద్ద్వారా ధర్మము కలుగవచ్చునని స్పష్టమగుచున్నది.

కాని అర్థబోధనకై ఉపయోగించెడి శబ్దములకు ధర్మమును కలిగించెడి సామర్థ్య మున్నదా ? అను ప్రశ్నకు ఈ శ్లోకముచే సమాధానము చెప్పబడినది. అందుకు ముందుగా 139 వ శ్లోకమున రెండు దృష్టాంతములను జూపియున్నాడు. వానిలో రెండవది ఆశ్లోకము యొక్క పూర్వార్థమునకు దార్ష్టాంతికము, ఈ శ్లోకార్థమునకు దృష్టాంతముకూడ కాగలదు.

తా. రూపరసగంధ స్పర్శలు ఆథర్వణములలో మంత్రములు ఎట్లు విలక్షణము లగు కార్యములను కలిగించుచున్నవో, అట్లే సాధుశబ్దములు ధర్మమును కలిగించగలవు. వానికి అర్థబోధకత ప్రయోజనము కావచ్చును. అది దృష్టఫల మగును. అవి పైరీతిని ధర్మరూప మగు అదృష్టఫలమును గూడ కలిగించగలవు.

కనుక ధర్మము నపేక్షించువాడు సాధుశబ్దములనే సామాన్యవ్యవహారమున గూడ ప్రయోగించవలెను.

కొన్ని శబ్దములకు విపాపహారణము కలదు. అది ప్రత్యక్షసిద్ధము. అట్లు సాధు శబ్దములు ధర్మజనకము అనుట ప్రత్యక్షసిద్ధము కాదు. అట్టితరి పయి సిద్ధాంతము ఎట్లు సమ్మతమగును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

సర్వోఽదృష్టఫలా నర్థా నాగమా త్ప్రతిపద్యతే
విపరీతం చ సర్వత్ర శక్యతే వక్తు మాగమే . 141

(అ) సర్వః = ప్రతిమనుష్యుడు, అదృష్టఫలాన్ = అదృష్టఫలకములగు-అనగా ప్రత్యక్షముగా కనిపించని ఫలములు కల, అర్థాన్ = అర్థములను, ఆగమాత్ = వేదమువలన, తన్మూలకమగు స్మృతుల వలన, ప్రతిపద్యతే = పొందుచున్నాడు (తెలుసుకొనుచున్నాడు).

తా. లోకులు ఇంద్రియములచే లభ్యములగు అర్థములను ఇంద్రియములచేతనే తెలుసుకొనుచున్నారు. అతీంద్రియములగు స్వర్గాదిఫలములను కలిగించెడి యాగాదులను వేదమువలననే తెలుసుకొనుచున్నారు. యాగముచేసిన స్వర్గముకలుగునని వేదము చెప్పు చున్నది. "స్వర్గకామో యజేత" అది వేదము వలననే తెలియనగును. మరియొక సాధనముచే తెలియబడునది కాదు.

అయితే సాధుశబ్దములు అధర్మమునకు కారణము లేల కాకూడదు ? అధర్మము కూడ అదృష్టరూపమే కదా ! వానివలన ధర్మమే కలుగునని యెట్లు నిశ్చయింప నగును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

(అ) విపరీతం + చ = విపరీతార్థమైతే, సర్వత్ర = ఎల్లవిధములగు, ఆగమే = ఆగమ విషయమై, వక్తుమ్ = చెప్పేకొరకు, శక్యతే = శక్యమగుచున్నది.

తా. దానముచేసిన పుణ్యము, చౌర్యముచేసిన పాపము కలుగునని వేదము చెప్పుచున్నది. ఆయా పనులవలన భిన్నఫలము లేల కలుగరాదు ? అని వేద విహిత కర్మలన్నిటిని ఎదుర్కొని మాట్లాడవచ్చును. అట్లైన ఏదియు విశ్వసనీయము కాక పోయెడిది. కనుక అట్టి హేతువాదము చూపరాదు. పుణ్యపాపముల విషయమున వేదార్థముపై నమ్మక మున్ననాడే లోకులు నిత్యయాత్రను సక్రమముగా నడుపుకోగలరు.

వ్యాకరణ శాస్త్రము స్మృతిరూపము, అదియే సాధు శబ్దస్వరూపమును జూపగలదు. అది శిష్టపరంపరగా నిబద్ధమగుచున్నది. కనుక సాధుశబ్దములను ప్రయోగించిన ధర్మము కలుగుననుటలో ఇది ప్రమాణము కాగలదని చెప్పుచున్నాడు.

సాధుత్వజ్ఞానవిషయా సైషా వ్యాకరణస్మృతిః
అవిచ్ఛేదేన శిష్టానా మిదం స్మృతినిబన్ధనమ్ . 142

సా=అ- అనగా శబ్దసాధుత్వమును తెలుసుకొనుటకు అన్వేషింపబడుచున్న స్మృతి, ఏషా=ఈ,-అనగా మనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్న, వ్యాకరణ స్మృతిః=పాణినీయ స్మృతి, సాధుత్వజ్ఞాన విషయా=శబ్దముల సాధుత్వమును తెలుపుటయే విషయముగా గలదై, (వర్తతే=ఉన్నది).

ఇదమ్=ఈ పాణిని వ్యాకరణము, శిష్టానామ్=సాధుశబ్దములయొక్క, అవిచ్ఛేదేన=అవిచ్ఛిన్నముగా-అనగా మధ్యే మధ్యే నాశములేకుండ, స్మృతినిబన్ధనమ్=స్మరణమే మూలముగా గలది, (భవతి=అగుచున్నది).

తా. పెద్దలు సాధుశబ్దములను అవిచ్ఛిన్నముగా స్మరించుచునేయున్నారు. ఒకరి నుండి మరియొకరికి, వారినుండి మరియొకరికి ఈ రీతిగా ఆ శబ్దములు లోకమున నిలిచి యున్నవి. దానిని ఆధారముగా గైకొనియే ఈ వ్యాకరణము ప్రవర్తించుచున్నది. నూతనమైనది కాదని భావము.

ఏ శబ్దము సాధువో, ఏది యసాధువో అనునది శబ్దతత్త్వజ్ఞులు నిర్ణయించి యున్నారు. ఆ నిర్ణయము ననుసరించియే పాణిని కాత్యాయన పతంజలులు ఈ వ్యాకరణమును లోకమున కందజేసిరి. ఇదియే శబ్ద సాధుత్వమును నిర్ణయించును. కనుక మనము శబ్ద సాధుత్వము విషయమై వేరుగ అన్వేషణ చేయనక్కర లేదు.

వి. ఈ వ్యాకరణము శిష్టపరంపరాగతములగు శబ్దములను అనేకములగు మార్గముల ద్వారా బోధించుచున్నది. కనుకనే కొన్ని శబ్దములు వ్యాకరణ సూత్రము ప్రకారము సాధువులువలె కాన్పించినను అట్టివానిని వేరుచేసి మునులు వానిని ప్రయోగించరాదని నిషేధింతురు. "నహి పచి రన్తి పరః ప్రయుజ్యతే" అని మహాభాష్యకారుడు బిగ్గరగా పలికెను. 'అన్తి' ప్రత్యయమునుజేర్చి పచధాతువును ప్రయోగించరాదని యర్థము. ఇట్టివి చాల కలవు.

పయి రీతిగా వ్యాకరణ స్మృతికి ప్రామాణ్యము జూపి దానికి విషయమగు శబ్ద స్వరూపమును అనగా ఏ శబ్దమును విషయముగా జేసికొని ఈ స్మృతి ప్రవర్తింపజేయబడినదో ఆ యంశమును జూపుచున్నాడు.

వైఖర్యా మధ్యమాయాశ్చ పశ్యన్త్యా శ్చైత దద్భుతమ్
అనేకతీర్థభేదాయా స్త్రయ్యా వాచః పరంపదమ్ . 143

అనేక తీర్థ భేదాయాః=అనేకములగు స్థానములచే భేదము కలిగినట్టియు, త్రయ్యాః=మూడు విధములగునట్టియు, వైఖర్యాః=వైఖరీరూపముగా నున్నట్టియు, మధ్యమాయాః+చ=మధ్యమా రూపముగా నున్నట్టియు, పశ్యన్త్యాః+చ=పశ్యన్తీరూపముగా నున్నట్టియు, వాచః=వాక్కునకు, ఏతత్=ఈ వ్యాకరణము, అద్భుతమ్=విలక్షణమగునట్టియు, పరమ్=ఉత్తమమగు, పదమ్=స్థానము-అనగా పొందుటకు సాధనము.

తా. శబ్దము కంఠము, ప్రాణము, బుద్ధి యనెడి మూడు స్థానములందున్నది. దానికి వైఖరీ, మధ్యమా, పశ్యన్తీ అను మూడు అవయవములు కలవు. ఇన్నివిధములగు శబ్దములను తెలుసుకొనుటకు వ్యాకరణము సాధనము.

వి. "ద్వావుపాదానశబ్దేషు" అను 44 వ శ్లోకమున వైఖరీ, మధ్యమా అను రెండు విధములగు శబ్దములు వ్యాకరణమునకు విషయమగునని చెప్పెను. అది అస్మదాదుల నుద్దేశించి చెప్పబడినది. మనకు ఆ రెండు విధములే విషయమగును. పశ్యంతిని మనము గుర్తించలేము. అది యోగులకే విషయమగును. యోగులనుకూడ ఉద్దేశించి ఇచట త్రయ్యాః అని చెప్పెను. పరావాక్కు యోగులకుకూడ విషయము కాదు. అది సర్వ వ్యవహారాతీతము, నిర్గుణ బ్రహ్మరూపము. కనుక దానిని ఇచట విడిచి త్రయ్యాః అని పలికెను. వాక్కు మూడు విధములే అనరాదు. పరను కలిపి వాక్కు 4 విధములని ఋగ్వేద భాష్యములోను, మహాభారతములోను, ఇతరములగు ప్రామాణికగ్రంథములలోను కూడగలదు. పశ్యన్తీవాక్కునందు గూడ ప్రకృతి ప్రత్యయ విభాగము కలదు. అది యోగికి అందుబాటులో ఉన్నది.

కంఠము, ప్రాణము, పెదవులు మున్నగు అవయవముల చలనముచే కలిగెడిది వైఖరి. ఇది ఇతరుల చెవికికూడ వినపడును. బుద్ధిలోనున్నది మధ్యమ. ఇది నిత్యము, వైఖరి జన్యము. వైఖరి మధ్యమా వాక్కును వ్యక్తపరచును. మధ్యమాశబ్దము వ్యాకరణ కార్యములు ప్రవర్తించుటకు యోగ్యమైనది. అదియు, పశ్యన్తియు సాక్షాత్ వ్యాకరణవిషయములు. మధ్యమా వాక్కునకు వ్యంజకమగుటచే వైఖరియు వ్యాకరణ విషయమగుచున్నది.

పయిరీతిని వ్యాకరణము అన్నివిధములగు సాధుశబ్దములు తెలుసుకొనుటకు ఉపాయమని సామాన్యముగా చెప్పబడినది. ఆ అభిప్రాయమునే విశేషరూపమున చూపుచున్నాడు.

> తద్విభాగావిభాగాభ్యాం క్రియమాణ మవస్థితమ్
> స్వభావజ్ఞై శ్చ భావానాం దృశ్యన్తే శబ్దశక్తయః . 144

చ = ఎందువలన, భావానామ్ = పదార్థములయొక్క, స్వభావజ్ఞైః = స్వభావమును గురైరింగినవారిచే—అనగా అతీంద్రియ పదార్థములను గుర్తించెడి ఆర్షదృష్టికలవారిచే, శబ్దశక్తయః = శబ్దములయొక్క సామర్థ్యములు, అనగా పుణ్యపాపములను కలిగించెడి శక్తులు, అర్థమును బోధించెడి శక్తులు, దృశ్యన్తే = ప్రత్యక్షముగా జూడబడుచున్నవో;

(అతః = ఈ కారణమువలన), తద్ = ఆ వ్యాకరణము, విభాగావిభాగాభ్యామ్ = విభాగముచేతను, అవిభాగముచేతను-అనగా కొన్ని శబ్దములకు ప్రకృతి ప్రత్యయములను వేరుగా చూపుటచేతను, కొన్ని శబ్దములను అట్లుకాక సూత్రములలో స్పష్టముగా ఉచ్చరించుటచేతను, క్రియమాణమ్ = రచింపబడినదై, అవస్థితమ్ = సాధ్వసాధుశబ్దముల స్వరూపమును తెలుసుకొనుటకు ఉపయోగించుచున్నది.

తా. అతీంద్రియ ద్రష్టలగు మహానుభావులు శబ్దములందు అర్థబోధకతను, ధర్మజనకత్వమును ప్రత్యక్షముగా జూచి వ్యాకరణమూలమున అశబ్దములను లోకుల కంద చేసిరి. వ్యాకరణాధ్యయనము వలన శబ్దములు తెలియబడగలవు. అవి అర్థబోధకము లగును. ధర్మజనకములు కూడ అగును.

వి. వ్యాకరణ నిర్మాణము రెండువిధములుగా నున్నది. 1. వ్యాకర్త ఏ శబ్ద మునకు సాధుత్వము చూపదలచెనో, ఆ శబ్దము నుచ్చరించక ఆ శబ్దమునకు, తత్సజాతీయ ములకు ఎన్నియో మరికొన్ని శబ్దములకు సరిపడునట్లు సామాన్యాకారముగా సూత్రములను నిర్మించును. ఆ సూత్రార్థమునకు లక్ష్యములుగా నున్న శబ్దములన్నియు దాని మూలమున సాధువులగును. అవ్యాప్తి, అతివ్యాప్తి మున్నగు దోషములు లేకుండ ఆ సూత్రము నిర్మింప బడును. ఉదా: ఇకోయణచి 6-1-77 అచ్చు పరమగుచో ఇక్కునకు యణ్ ఆదేశముగా అగు నని సూత్రార్థము. సుధీ+ఉపాస్యః=సుధ్యుపాస్యః. ఇట్లే "ఉత్తునకు అచ్చుపరంబగు నపుడు సంధియగు" అను సూత్రము బాలవ్యాకరణమున కలదు. (సంధి 1) రాముడు + అతడు=రాముడతడు. పై సూత్రములచే లెక్కించుటకు అలవికాని లక్ష్యములు సిద్ధింపగలవు. అదియొక పద్ధతి.

2. సూత్రము లట్లు వ్రాయక ఆ శబ్దములను ఆ సూత్రములలో స్పష్టముగా నుచ్చ రించుట రెండవ పద్ధతి.

"కస్కాదిషుచ" - 8-3-48. కొన్నిచోట్ల సకారము, కొన్నిచోట్ల షకారము ప్రవర్తించును. కస్కః, సర్పిష్కుణ్డికా, ధనుష్కపాలమ్, ఇట్లే "వేషపురోధ పురోధసుడు" (తత్సమ 82) అను బాలవ్యాకరణ సూత్రము. వేషశబ్దమునకు నిత్యముగా పురోధశ్శబ్ద మునకు వైకల్పికముగా సకారలోప త్రిపద్యాపములు ఈ సూత్రముచే నిపతింపబడినవి.

పయిరీతిని వ్యాకరణము స్మృతి యనుటవలన ప్రమాణమని నిరూపించి శ్రుతి స్మృతు లకుగల భేదమును జూపుచున్నాడు.

> అనాది మవ్యవచ్ఛిన్నాం శ్రుతి మాహు రకర్తృకామ్
> శిష్టై ర్నిబధ్యమానా తు న వ్యవచ్ఛిద్యతే స్మృతిః . 145

శ్రుతిమ్=వేదమును, అకర్తృకామ్=కర్త లేనిదానినిగాను - అనగా ఎవరిచేతను నిర్మింపబడనిదనియు, అనాదిమ్=ఆది రహితమునుగాను-అనగా పుట్టుకలేనిదనియు, అవ్యవచ్ఛి న్నామ్=విచ్ఛేదము లేనిదానినిగాను, ఆహుః=చెప్పుచున్నారు. వేదము అపౌరుషేయమనియు, ఉత్పత్తివినాశములు దానికి లేవనియు పూర్వమీమాంసకులు చెప్పుచున్నారని భావము.

స్మృతిః+తు=స్మృతి మాత్రము, శిష్టైః=శిష్టులచే, నిబధ్యమానా=ప్రతికాల మున నిర్మింపబడినదైనను, న+వ్యవచ్ఛిద్యతే=విచ్ఛిన్నమగునట్లు చేయబడినదికాదు.

తా. వేదములు బ్రహ్మయొక్క ముఖములనుండి అప్రయత్నముగా వెలువడినవి. వానికి ఎన్నడు నాశనములేదు. ఉత్పత్తియు లేదు. ప్రళయము, యుగప్రారంభము అను నవి లేనేలేవు. వేదములో వర్ణములు, పదములు, స్వరములు ఎన్నడును మారునవి కావు.

స్మృతు లట్టివి కావు. అవి మునులచే రచింపబడినవే. అవి అవిచ్ఛిన్నముగా ప్రవాహరూపమున నుండుటచే నిత్యములనియే పరిగణింపబడుచున్నవి.

ప్రళయము లేదని తలంచెడి పూర్వమీమాంసకమత మనుసరించి 145 వ శ్లోకమున శ్రుతి స్మృతులకు కల భేదమును చూపి 146 వ కారికచే ప్రలయమును అంగీకరించెడి వారి మతమును అనుసరించి వానికి కల భేదమును చూపుచున్నాడు.

> అవిభాగా ద్వివృత్తానా మభిఖ్యా స్వప్నవ చ్ఛ్రుతౌ
> భావత త్త్వం తు విజ్ఞాయ విశ్లేషేభ్యో విహితా స్మృతిః . 146

అవిభాగాత్ = విభాగములేని శబ్ద బ్రహ్మమునుండి, వివృత్తానామ్ = వివర్తమగు చున్న ఋషులకు, శ్రుతౌ = వేదవిషయికమగు, అభిఖ్యా = జ్ఞానము, స్వప్నవత్ = స్వప్నముతో సమానమైనదై యున్నది. స్వప్నమున ఇంద్రియముల అపేక్ష లేకుండగనే జ్ఞానము కలుగునట్లు, బ్రహ్మకు ప్రతినిధులగు ఋషీశ్వరులకు స్వతః వేదము భాసించును. వారల కుపదేశాపేక్ష లేదని భావము.

స్మృతిః + తు = స్మృతి అయితే, భావతత్త్వమ్ = వేదార్థముయొక్క సామర్థ్యమును, విజ్ఞాయ = ఆర్షదృష్టిచే తెలిసికొని, లిఙ్గేభ్యః = వైదికశబ్దములనుండియే, విహితా = రచియింపబడినది.

తా. విభాగములేకుండ ఏకరూపముగా శబ్దమే ముందుగా ఉండెడిది. ప్రలయము తరువాత ఆ శబ్దమునుండి ఋషులు ప్రాదుర్భవింతురు. మనుష్యులకు స్వప్నమున చూచుటకు కన్ను, వినుటకు చెవి లేకున్నను ఇంద్రియముల నపేక్షించకయే మానసికజ్ఞానము కలుగుచున్నది. అట్లే ఋషులకుగూడ ఇతరుల ఉపదేశ మక్కరలేకుండగనే వేదములు మానస జ్ఞానవిషయము లగుచున్నవి.

యుగప్రారంభమున పరమేశ్వరుని నిశ్వాసరూపమున వేదము లావిర్భవించును. ప్రళయమున నవి నశించును. ప్రళయము శాస్త్రసమ్మతము.

స్మృతులు శ్రుతుల అర్థము ననుసరించి ఋషులచే నిర్మింపబడినవి.

వి. సృష్టిప్రలయముల నంగీకరించెడి ఉత్తరమీమాంసక మతముల ననుసరించి వేదప్రామాణ్యమును ఈ శ్లోకము చూపుచున్నది.

పయిరీతిని శ్రుతి—స్మృతుల స్వరూపమును ప్రామాణ్యమును జూపి ఇతర స్మృతులతో వ్యాకరణ స్మృతికి సామ్యమును చూపుచున్నాడు.

> కాయవాగ్బుద్ధివిషయా యే మలాః సమవస్థితాః
> చికిత్సాలక్షణాధ్యాత్మశాస్త్రై స్తేషాం విశుద్ధయః . 147

కాయ వాగ్ బుద్ధి విషయాః = శరీరమునకు, వాక్కునకు, మనస్సునకును విషయములగు- అనగా వానియందు, యే = ఏ, మలాః = మలములు, సమవస్థితాః = ఉన్నవో, తేషామ్ = వానికి, చికిత్సాలక్షణాధ్యాత్మశాస్త్రైః = వైద్యకశాస్త్రముచేతను, వ్యాకరణశాస్త్రము చేతను, యోగశాస్త్రముచేతను, విశుద్ధయః = విశిష్టములగు పారిశుద్ధ్యములు, (భవన్తి = కలుగుచున్నవి).

తా. భుజించిన పదార్థముల పరిణామమువలన, దేశకాల పరిస్థితులవలనను శరీరమునకు రోగములు కలుగును. సౌఖ్యము నపేక్షించి యపశబ్దములను ప్రయోగించగా వానిదోషములు వాక్కునకు సంక్రమించును. మనస్సునకు భ్రమ, వంచన, ప్రమాదము, రాగము, ద్వేషము, లోభము మున్నగు దోషములు కలుగును. వానినే మలము లందురు. అవి యున్నచో బుద్ధి కలుషితమై వస్తువుయొక్క నిజరూపమును గ్రహింపనేరదు.

చరక సుశ్రుతాది వైద్యకగ్రంథముల అర్థమును పరిశీలించి, వానిలో చెప్పిన ప్రకారము ఆచరించిన శరీరమునకు సంబంధించిన రోగములు నశించును. అట్టి కార్యజ్ఞానము ఆ శాస్త్రమువలన కలుగుచున్నది.

యోగశాస్త్రముయొక్క అర్థపరిశీలనచేసి దానిప్రకారము నడచిన మనస్సునకు కలిగిన దోషములు పోవుచున్నవి. ఆ శాస్త్రమువలన ఆ లాభము కలుగుచున్నది.

పయిరీతిని వైద్యశ యోగ శాస్త్రము లెట్లు శరీరముయొక్కయు మనస్సుయొక్కయు దోషములను పోగొట్టుచున్నవో అట్లే వ్యాకరణశాస్త్రముకూడ వాక్కులయొక్క మాలిన్యమును పోగొట్టుచున్నది. అపశబ్దములే వాక్కుల మాలిన్యములు.

ఇతరస్మృతుల వలె వ్యాకరణస్మృతియు కార్యకారి యగుటచే తత్సామ్యమును పొందుచున్నది.

ధర్మమునకు సాధువులగు శబ్దములు కారణమని ఇంతవరకు నిరూపించి, ఆ ప్రసంగమున ప్రయోగింపరాని అసాధుశబ్దములను 9 శ్లోకములచే చూపుచున్నాడు.

> శబ్దః సంస్కారహీనో యో గౌరితి ప్రయుయుక్షితే
> త మపభ్రంశ మిచ్ఛన్తి విశిష్టార్థనివేశినమ్. 148

గౌః + ఇతి = గౌః అనురీతిని, ప్రయుయుక్షితే = ప్రయోగింపవలచియుండగా, అట్లుకాక, యః = ఏ, శబ్దః = శబ్దము (గోవి వంటిది), సంస్కారహీనః = వ్యాకరణసంస్కారముచే శూన్యమైనది యగునో, విశిష్టార్థ నివేశినమ్ = అర్థవిశేషమున ప్రయోగింపబడిన, తమ్ = అట్టిదానిని, అపభ్రంశమ్ = అపభ్రంశ శబ్దముగా, ఇచ్ఛన్తి = శిష్టులంగీకరించుచున్నారు. అట్టిది అసాధుశబ్ద మని భావము.

తా. వ్యాకరణమున ఏ కార్యములు శబ్దములకు చూపబడినవో వానిని విడనాడియున్న శబ్దము అసాధువగును. ఉదా: గౌః అను పదము వ్యాకరణప్రక్రియానుసారముగా నిబద్ధమైయున్నది. ఇది సాధువు. ఈ ప్రక్రియకు వ్యతిరేకముగా ఆ శబ్దమును ప్రయోగించిన అసాధువే. గావీ, గోణీ, గోతా మున్నగునవి ఇట్టివి. ఈ శబ్దములు గోవు అను నర్థమున అసాధువులు. వానిలో గోణీ, గోతా శబ్దములు అర్థాంతరమును బోధించునపుడు ఆ ఆనుపూర్వీ సహితములే సాధువులు కానగును. ఈ యంశము 119 వ శ్లోకమున స్పష్టము కాగలదు.

148 వ శ్లోకమున "విశిష్టార్థనివేశినమ్" = అర్థవిశేషమున ప్రయోగింపబడినది అపభ్రంశము అని చెప్పబడినది. దానిని బట్టి చూచిన ఒకే శబ్దము ఒక అర్థమున అపభ్రంశమనియు, మరియొక అర్థమున సాధువు అనియు లభించుచున్నది. ఈ యభిప్రాయమునే ఉదాహరణము చూపుచు స్పష్టపరచుచున్నాడు.

> అస్వగోణ్యాదయః శబ్దాః సాధవో విషయాన్తరే
> నిమిత్తభేదా త్సర్వత్ర సాధుత్వం చ వ్యవస్థితమ్. 149

అస్వగోణ్యాదయః = అస్వ, గోణీ మున్నగు, శబ్దాః = శబ్దములు, విషయాన్తరే = అర్థాంతరమున, సాధవః = సాధువులగును. నిమిత్తభేదాత్ = శబ్దముల ప్రవృత్తి నిమిత్తముయొక్క భేదమువలన, సర్వత్ర = అంతట అనగా లోకవ్యాకరణవాదులకు సమ్మతమగు శబ్దమునందు, సాధుత్వం + చ = సాధుత్వముకూడ, వ్యవస్థితమ్ = నియతమై యున్నది.

తా. గుర్రము అను నర్థమున 'అశ్వ' పదము అశ్వత్వ జాతినిబట్టి ప్రవృత్తమై సాధువగును. ఆ యర్థమున 'అస్వ' పదము సాధువు కాదు. ఆ పదము ధనములేనివాడు అను నర్థమున సాధువు కాగలదు. న విద్యతే, స్వం = ధనం యస్య-సః = అస్వః. ఇచట ధనాభావమును బట్టి అస్వశబ్దము ప్రవర్తించినది. అస్వశబ్దము సర్వాత్మనా అసాధువని చెప్పరాదు.

గోపదము గోత్వజాతిని బట్టి గోవును కిరణమును బోధించును. ఆ యర్థమున గోణీ శబ్దము అసాధువు. ధాన్యము, బియ్యము మున్నగు వస్తువులను భద్రపరచే నిమిత్తము వాడబడుచున్న గోనె అను నర్థమున సాధువే యగును.

గోశబ్దమునకు పర్యాయ పదముగా గోతాశబ్దము అసాధువు. 'గోః భావః' అను నర్థమున అది సాధువే యగును.

పై పదములు ఒక యర్థమున నసాధువులైనను అర్థాంతరమున సాధువులగుచున్నవి. ఈ యర్థమునే "విశిష్టార్థనివేశినమ్" అను పదముచే 148 వ శ్లోకమున భర్తృహరి స్పష్టపరచెను.

వి. సంస్కృతమున మిత్ర శబ్దము పుంలింగమున, నపుంసకలింగమున గూడ ఉన్నది. మిత్రః, మిత్రమ్. పులింగశబ్దము సూర్యుని, నపుంసక శబ్దము స్నేహితుని బోధించునపుడే సాధువగును. ఇట్టి శబ్దములు చాల కలవు.

వ్యాకరణ సంస్కారమునకు దూరమగు శబ్దములు ఏ యర్థమును బోధించినను అసాధువులే యగును. ఉదా: శర్వర్యాం భవం = శార్వరికమ్, రాత్రియందుండునది యని యర్థము. శార్వరమ్ అను పదము సాధువు కానేరదు.

147 నుంచి 8 శ్లోకములచే అపభ్రంశములు కూడ అర్థబోధకములే, కాని అవి సాధువులు కానేరవు అని ప్రతిపాదింపబడినది. ఆ ప్రసంగమున 150 వ శ్లోకమునుండి 5 శ్లోకములచే తార్కికుల మతమును జూపుచున్నాడు.

తే సాధు ష్వనుమానేన ప్రత్యయోత్పత్తిహేతవః
తాదాత్మ్య ముపగమ్యేవ శబ్దార్థస్య ప్రకాశకాః . 150

తే = ఆ యపభ్రంశ శబ్దములు, సాధుషు = సాధుశబ్దముల విషయమై- అనగా ఆ శబ్దములకు బదులుగా ప్రయోగింపబడినవై, అనుమానేన = సాధుశబ్దస్మరణముచే, ప్రత్యయోత్పత్తిహేతవః = జ్ఞానోత్పత్తికి కారణములగుచున్నవి.

(తే = ఆయసాధుశబ్దములు), తాదాత్మ్యమ్ = సాధు శబ్దములతో నైక్యమును, ఉపగమ్య + ఇవ = పొందినట్టు ఉండి, శబ్దార్థస్య = శబ్దమువలన కలిగెడి యర్థమునకు, ప్రకాశకాః = ప్రకాశమును కలిగించుచున్నవి.

తా. సాధుశబ్దములనుండి అపభ్రంశ శబ్దములు జనియించుచున్నవి. అసాధు శబ్దము లర్థబోధకములు కానేరవు. వానియందు శక్తి లేదు. సాధుశబ్దములే శక్తములు. శక్తపదమే సాధువు కానగును. అసాధుశబ్ద ముచ్చరించగా దానికి ప్రకృతియగు సాధు శబ్దము స్మరింపబడును. ఆ సాధుశబ్దమే అర్థబోధకమగును. అసాధుశబ్దము సాధుశబ్దముతో సమానరూపముతో నున్నందున తాదాత్మ్యమును పొందియున్నట్లు కాన్పించును. ఇది తార్కికుల యాశయము.

వి. ఇచట అనుమానశబ్దము స్మరణార్థకము. అనుమానప్రమాణపరము కాదు. రెండు శబ్దములకు వస్తుతః ఐక్యము లేనందున 'ఇవ' శబ్దము ప్రయుక్తమాయెను.

148, 149 రెండు శ్లోకములచే వ్యాకరణమతము ననుసరించి యసాధు శబ్దములు విచారింపబడినవి. అపభ్రంశములే సాక్షాత్ అర్థమును బోధించును. వానియందు

గూడ శక్తియున్నది. కాని యవి సాధువులు కావు. సాధుత్వమనునది వ్యాకరణైకగమ్య మగు జాతివిశేష మని వైయాకరణులు విశ్వసింతురు.

150 నుండి 5 శ్లోకములలో తార్కికుల మతము ననుసరించి వానిని విచారించు చున్నాడు.

తార్కికుల మతమున విశేషమును జూపుచున్నాడు.

న శిష్టై రనుగమ్యన్తే పర్యాయా ఇవ సాధవః

తే యతః స్మృతిశాస్త్రేణ తస్మా త్సాక్షా దవాచకాః . 151

సాధవః = సాధువులగు, పర్యాయాః + ఇవ = పర్యాయశబ్దములవలె, తే = ఆ యసాధుశబ్దములు, యతః = ఏకారణమువలన, శిష్టైః = శిష్టులగువారిచే, న + అను గమ్యన్తే = అనుసరింపబడుట లేదో, మరియు స్మృతిశాస్త్రేణ = వ్యాకరణ శాస్త్రముచే, (న + అనుగమ్యన్తే = అనుసరింపబడలేదో), తస్మాత్ = ఆ కారణమువలన, సాక్షాత్ = సాక్షాత్తుగా, అవాచకాః = అర్థబోధకములు కావు.

తా. సాధువులగు పర్యాయశబ్దములతో పాటు అపభ్రంశములు గూడ పర్యాయ పదములుగా ఏల గ్రహింపబడవు? అట్లైతేరి అవియు వాచకములే యగునుగదా! అను సంశయమును ఈ శ్లోకార్థము తీర్చుచున్నది. అపభ్రంశములను శిష్టులు సాధుశబ్దములతో పాటు ఉపయోగించి యుండలేదు. వానిని వ్యాకరణశాస్త్రము కూడ వ్యాఖ్యానించలేదు. అట్లుకాక అపభ్రంశములుకూడ వాచకములగుచో వానిని శిష్టులు పర్యాయపదములతో పాటు ఉపయోగించియుండెడివారు. వ్యాకరణము కూడ వానికి ప్రకృతి ప్రత్యయ విభాగము చూపి వ్యాఖ్యానించి యుండెడిది. అట్లు జరగకుండుటచే అవి వాచకములు కావనియే తేలుచున్నది.

వి. కాబట్టి యవి సాక్షాత్తుగా అర్థబోధకములు కావు. సాధుశబ్దమును స్మరి యింపజేసి వానిద్వారా అర్థబోధకములగు ననుటయే సమంజసము.

150 వ శ్లోకమున అసాధువుచే సాధుశబ్దస్మృతి కలుగును. - దానిచే అర్థబోధ కలుగును అని చెప్పబడినది. అందుకు దృష్టాంతమును చూపుచున్నాడు.

అమ్బామ్బేతి యథా బాలః శిక్ష్యమాణః ప్రభాషతే

అవ్యక్తం తద్విదాం తేన వ్యక్తే భవతి నిర్ణయః . 152

అమ్బా + అమ్బా + ఇతి = అంబ, అంబ అని, శిక్ష్యమాణః = తల్లి మొదలగు వారిచే సభ్యాసము చేయించబడుచున్న, బాలః = చంటివాడు, అవ్యక్తమ్ = అస్పష్టముగా, ప్రభాషతే = పలువిధములుగా మాట్లాడును. తద్విదామ్ = ఆ చంటివాని యస్పష్టములగు వాక్కుల పరిచయము కలవారికి, తేన = ఆ చంటివాడుచ్చరించిన యస్పష్టమగు మాటచే, వ్యక్తే = స్పష్టమగు శబ్దము జ్ఞాపకము రాగా, యథా = ఏరీతిగా, నిర్ణయః = ప్రకృత నిశ్చి తార్థము, (భవతి = కలుగుచున్నదో), (ఈ శ్లోకమునకు 153వ శ్లోకార్థముతో సమన్వయము చూపవలెను).

తా. 1, 2 సంవత్సరముల ప్రాయముకల చంటివానికి మాటలు చెప్పుదురు. వానిని విని చంటివాడు అవయవ బలము చాలక అస్పష్టముగా మాట్లాడును. తల్లిదండ్రులు

మున్నగు వారు ఆ పిల్లవాని మాటలు విని వానివలన తమకు భాసించిన స్పష్టశబ్దముల వలన ప్రకృతార్థమును నిర్ణయింతురు. అంతియేకాని చంటివాని మాటలవలననే వారికి జ్ఞానము కలుగనేరదు.

పై దృష్టాంతమునకు దార్ష్టాంతికమును చూపుచున్నాడు.

ఏవం సాధౌ ప్రయోక్తవ్యే యోఽపభ్రంశః ప్రయుజ్యతే
తేన సాధువ్యవహితః కశ్చిదర్థోఽభిధీయతే. 153

ఏవం = ఈ ప్రకారముగానే, సాధౌ = సాధుశబ్దము, ప్రయోక్తవ్యే = ప్రయోగింపవలసి యుండగా, దానికి బదులుగా, యః = ఏ, అపభ్రంశః = అసాధుశబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నదో, తేన = ఆ అసాధుశబ్దముచే, సాధువ్యవహితః = సాధు శబ్దముతో వ్యవధానము కల, కశ్చిత్ = ఒక - అనగా ప్రకృతమగు, అర్థః = అర్థము, అభిధీయతే = చెప్పబడుచున్నది.

**తా.** సాధు శబ్దమే అర్థబోధకము. అది ప్రయుక్తము కాక దానియర్థమున నసాధు శబ్దమును ప్రయోగించిన నా శబ్దము అర్థవాచకము కాదు. దానిచే సాధుశబ్దము స్మరణకు వచ్చి దాని ద్వారా అర్థజ్ఞానము కలుగును. ఈ యర్థమునకు 152 వ శ్లోకమున చంటివాని మాటలు దృష్టాంతముగా చూపబడినవి.

**వి.** కాగా 150 వ శ్లోకార్థమే దృష్టాంతముతో 152, 153-రెండు శ్లోకములచే స్పష్టపరుపబడినది.

అసాధు శబ్దమును ఉచ్చరించగా దానిచే సాధుశబ్దము స్మరింపబడి అర్థబోధను కలిగించుననుట సార్వత్రికము కానేరదు. ఏలయన సాధుశబ్దములను ఎరుగనివారు కొందరు పరస్పరము మాట్లాడుట లోకమున కలదు. వారికి పరస్పరము భావములు అవగతములు అగుచునే యున్నవి. వారికి సాధుశబ్దము తెలియనే తెలియదు. అను సంశయమునకు సమాధానముగా "తాదాత్మ్యము పగమ్యైవ శబ్దార్థస్య ప్రకాశకాః" అను 150 వ కారికా భాగము కక్క అభిప్రాయమును వ్యక్తపరచుచున్నాడు.

పారమ్పర్యా దపభ్రంశా విగుణే ష్వభిధాతృషు
ప్రసిద్ధి మాగతా యేషు తేషాం సాధు రవాచకః. 154

విగుణేషు = విగుణులగు - అనగా శబ్దములను స్పష్టముగా నుచ్చరించుటకు యోగ్యములగు దంతాదిస్థానబలములేనట్టి, అభిధాతృషు = శబ్దముసుచ్చరించునట్టి, యేషు = ఏమనుష్యులందు, పారమ్పర్యాత్ = పరంపరగా, అపభ్రంశాః = అసాధు శబ్దములు, ప్రసిద్ధిమ్ = ప్రసిద్ధిని, ఆగతాః = పొందినవో, తేషామ్ = వారలకు, సాధుః = సాధుశబ్దము, అవాచకః = వాచకము కాదు. అట్టివారికి అసాధుశబ్దమే సాక్షాత్తు అర్థబోధక మగును దాని వలన సాధుశబ్దము స్మరింపబడి, దాని వలన నర్థబోధ కలుగదని భావము.

**తా.** దంతములు మున్నగునవి శిథిలము కాగా మనుష్యుల ఉచ్చారణము స్పష్టముగా నుండదు. ఒక వర్ణమునకు బదులుగా మరియొక వర్ణము పలుకుటయు, కొన్ని వర్ణములు వినబడక యుండుటయు మున్నగు ఎన్నియో దోషములు కలుగును. వాని మూలమున అసలు శబ్దస్వరూపము మారిపోవును. అట్టివారు మాట్లాడగా ఇతరులు వానిని విని

అవియే యథార్థములగు శబ్దములని భావింతురు. అట్టివానిని పరంపరగా అందరు వ్యవహరింతురు. అట్టి స్థితిలో అసాధుశబ్దమే సాక్షాత్తు అర్థబోధకము కాగలదు. సాధుశబ్దస్మరణ అక్కరలేదు.

మరియు చాలమంది సాధుశబ్దములు తెలియకయే అసాధు శబ్దములతోనే మాట్లాడుదురు. అచట కూడ సాధుశబ్ద స్మరణ లేకుండగనే బోధ కలుగును.

150 నుంచి ఇంతవరకు అపభ్రంశములవలన బోధ కలుగుట గురించి తార్కికుల యభిప్రాయమును వ్యక్తపరచి ఇపుడు వైయాకరణ మతము ప్రకారము సాధు శబ్దముల యొక్కయు, అసాధుశబ్దముల యొక్కయు విభాగమును జూపుచున్నాడు.

దైవీ వాగ్ వ్యవకీర్ణేయ మశక్తై రభిధాతృభిః

అనిత్యదర్శినాం త్వస్మిన్ వాదే బుద్ధి విపర్యయః . 155

దైవీ = దేవతలకు సంబంధించియున్న, ఇయమ్ = వ్యాకరణ బద్ధమగు, వాక్ = శబ్దము, అశక్తైః = ఉచ్చరించుటకు ఇంద్రియసామర్థ్యము లేని, అభిధాతృభిః = ఉచ్చరించెడి వారిచే, వ్యవకీర్ణా = మిక్కిలి సంకీర్ణమైనదిగా, (కృతా = చేయబడినది).

తా. పూర్వము అసత్యము, అశక్తత మున్నగు దోషములు లేకుండ మనుష్యులందరు పరిశుద్ధముగా నుండెడివారు. రాను రాను వారు అసత్యాది దోషములకు లోబడినారు. వారి భాషయు అపశబ్దసంకీర్ణ మాయెను. కాగా శుద్ధమగు భాష అపభ్రంశములతో సంకీర్ణమాయెను.

అనిత్యదర్శినామ్ + తు = శబ్ద మనిత్యమనెడి వారికి - అనగా తార్కికులకు, అస్మిన్ = ఈ, వాదే = పై చూపబడిన అర్థము విషయమున, బుద్ధి విపర్యయః = బుద్ధికి వైపరీత్యము - అనగా వారికి అభిప్రాయము భిన్నముగా నున్నది.

తా. శబ్దము నిత్యము కానేరదు. సాధు శబ్దములు ధర్మజనకములు కావు. అవి కేవలము అర్థబోధకనే ఉపయోగపడును. అసాధువులే ముందుగా నుండెను. వానిని సంస్కరించగా సాధు శబ్దములు లభించినవి. కనుక అసాధువుల నుచ్చరించగా సాధుస్మరణముచే బోధ కలుగునని తార్కికుల యాశయము.

"బుద్ధి విపర్యయః" అనుటచే వారి యాశయము గ్రాహ్యము కాదను భావము లభించుచున్నది.

సాధుశబ్దాపశబ్దములు రెండును స్వతంత్రములే. వానికి పరస్పరము ప్రకృతి వికృతి భావము లేదు. మరియు రెండు కూడ పరంపరగా వచ్చుచున్నవను తన యాశయమును స్పష్టపరచుచున్నాడు.

ఉభయేషా మవిచ్ఛేదా దన్యశబ్ద వివక్షయా

యోఽన్యః ప్రయుజ్యతే శబ్దో న సోఽర్థ స్యాభిధాయకః . 156

ఇతి వాక్యపదీయే బ్రహ్మకాణ్డం సమాప్తమ్.

ఉభయేషామ్ = రెండు - అనగా సాధుశబ్దములు అసాధుశబ్దములు కూడ, అవిచ్ఛేదాత్ = పరంపరగా అవిచ్ఛిన్నముగా నుండుటవలన, అన్యశబ్ద వివక్షయా = ఒక శబ్దమును ప్రయోగించ నిచ్ఛచే, యః = ఏ, అన్యః = మరియొక, శబ్దః = శబ్దము, ప్రయుజ్యతే =

ప్రయోగింపబడుచున్నదో, సః = ఆ శబ్దము అర్థస్య = ప్రయోగింప దలచిన శబ్దము యొక్క అర్థమునకు, అభిధాయకః = బోధించునది, న = కానేరదు.

తా. అపశబ్దము నుచ్చరించగా నా శబ్దముచే సాధుశబ్దము స్మరింపబడి యర్థ బోధకమగు ననెడి తార్కికుల మత మయుక్తమే యని భావము.

## ఇంతటితో బ్రహ్మకాండ మనబడు ప్రథమకాండము ముగిసినది.

1—43 శ్లోకములలో వ్యాకరణ శాస్త్రారంభమును సమర్థించుటకై విషయ ప్రయోజన సంబంధాధికారి రూపమగు అనుబంధ చతుష్టయము చూపబడినది. ప్రధాన ప్రయోజనమగు మోక్షమును బొందుటకై నిర్గుణ బ్రహ్మస్వరూప నిర్ణయముతో గ్రంథ మారంభింపబడినది. కనుకనే ఈ కాండమునకు బ్రహ్మకాండము అను ప్రసిద్ధవ్యవహారము కలిగినది. కాగా ఈ భాగము ఉపోద్ఘాతముగా నున్నది. 44 నుండి శాస్త్రమారంభింపబడినది.

44—101 శ్లోకములలో నిత్యశబ్దవాదము ననుసరించి వాదక స్ఫోట శబ్దము, ధ్వనులు — రెంటికి గల వ్యంగ్య వ్యంజక భావము, అభివ్యక్తి ధ్వనుల స్వరూపము, ప్రాకృత వైకృత ధ్వనుల వలన స్ఫోటశబ్దమునకు కలిగెడి విశేషములు, జాతి—వ్యక్తి స్ఫోటపక్షములు నిరూపింపబడినవి.

102-117 శ్లోకములలో కార్యశబ్దవాదము నాశ్రయించి స్ఫోట శబ్దము, ధ్వనులు, శబ్దోత్పత్తికి కారణములు చూపబడినవి.

118—132 శ్లోకములలో శబ్దముయొక్క మాహాత్మ్యము, మోక్షము చూపబడినవి. 129 వ శ్లోకమునుండి 14 శ్లోకములలో శబ్దమునకు అవశ్యకత ప్రాబల్యము కూడ నిర్ణీత మాయెను. కనుకనే ఈ కాండమునకు "ఆగమ కాండము" అను వ్యవహారము కూడ కలిగినది.

133—147 శ్లోకములలో వేదార్థమూలకము లగుటచే స్మృతులు ప్రమాణములు. వానిలో నొకటి యగుటచే వ్యాకరణము ప్రమాణమని చూపబడినది.

148—156 శ్లోకములలో అసాధు శబ్దములు విచారింపబడినవి.

ఈ రీతిగా ఈ కాండముయొక్క విషయములు సూక్ష్మరూపమున తెలియనగును.

# వాక్యపదీయము

## వాక్య కాండము

"ఆగమ సముచ్చయ" మను బ్రహ్మకాండమందు శబ్దస్వరూపము—దాని జ్ఞానము వలన, ప్రయోగమువలన కలుగుఫలము—శబ్ద నిత్యత్వము—అనిత్యత్వము, సఖండత్వము అఖండత్వము నిరూపింపబడినవి. పదవాక్య సాధారణముగ శబ్దము వాచక మని అందు స్థాపింపబడినది. కాని కొందర మతమున పదము వాచకము (అర్థబోధకము). కొందర మతమున వాక్యము వాచకము. కాని సిద్ధాంతమున వాచకము వాక్యమే. అందుచే వాక్య స్వరూపమును విస్తరించి ప్రతిపాదించుటకు ద్వితీయ కాండము ఆరంభింపబడినది.

వాక్యస్వరూపము ఆయా ఆచార్యుల మతములలో ఎనిమిది విధములుగ నిరూపింప బడినది—అని నిర్దేశించుచున్నాడు.

ఆఖ్యాతశబ్దః సంఘాతో జాతిః సంఘాతవర్తినీ
ఏకోఽనవయవః శబ్దః క్రమో బుద్ధ్యనుసంహృతిః . 1

పద మాద్యం పృథ క్సర్వం పదం సాకాంక్ష మిత్యపి
వాక్యం ప్రతి మతి ర్భిన్నా బహుధా న్యాయవాదినామ్ . 2

ఆఖ్యాతశబ్దః = క్రియావాచకశబ్దము, (వాక్యము). సంఘాతః = పద సముదాయము, సంఘాతవర్తినీ జాతిః = సముదాయమునందుండు జాతి, ఏకః అనవయవః శబ్దః = ఏకము అఖండము అగు శబ్దము, క్రమః = పదముల పౌర్వాపర్యము, బుద్ధ్యను సంహృతిః = బుద్ధిలో కల్పింపబడిన పదముల కూడిక, ఆద్యం పదమ్ = మొదటపదము, పృథక్ సర్వం పదం సాకాంక్షమ్ = వేరుగా అన్నిపదములు ఆకాంక్షగలవి, వాక్యమ్ = వాక్యము, ఇత్యపి = అనియు, వాక్యం ప్రతి = వాక్యమునుగూర్చి, న్యాయవాదినామ్ = వాక్య విషయ చర్చాశీలురగు విద్వాంసులయొక్క, మతిః = మతము, బహుధా = అనేకవిధము లుగా, భిన్నా = భిన్నమై యున్నది.

తా. ఆయా యాచార్యుల మతభేదము ననుసరించి వాక్యము ఎనిమిది విధము లుగ ఇందు నిర్దేశింపబడుచున్నది. వాక్యవిషయమున చర్చించిన ఆచార్యుల అభిప్రాయ ములు ఎనిమిది విధములుగ ఉన్నవి.

1. క్రియావాచకశబ్దము — వాక్యము
2. పదసముదాయము — ,,
3. సముదాయమునందుండు జాతి
4. పూర్ణము-అఖండము (స్ఫోటరూపము) అగు శబ్దము — ,,
5. పౌర్వాపర్యముతో నున్న పదములు — ,,

6. బుద్ధిలో కల్పింపబడిన పదముల సక్రమమగు కూడిక  వాక్యము
7. (వాక్యములో) మొదటిపదము  ,,
8. (వాక్యములోని) ప్రతిపదము పరస్పరాకాంక్ష గలిగియుండునది  ,,

వి. వాక్యము (1) అఖండము-అనగా పదవర్ణరూప విభాగములేనిది-స్ఫోటము, (2) సఖండము అనగా పదవర్ణరూప విభాగము కలది, అని రెండు పక్షములు కలవు.

పై ఎనిమిది వాక్యలక్షణము-లలో, 3. సముదాయవర్తిజాతి వాక్యము. 4. ఏకము-అఖండమునగు శబ్దము వాక్యము, 6. బుద్ధియందు ఏర్పడిన పదసముదాయము వాక్యము. అను మూడును అఖండపక్షమునకు చెందినవి. మిగిలిన 1, 2, 5, 7, 8 మతములు సఖండ పక్షమునకు చెందినవి. ఈ అయిదింటిలో 2. పదసముదాయము, 5. పౌర్వాపర్యముతో నున్న పదములు అను రెండుమతములు "అభిహితాన్వయవాదము"నకు చెందినవి. మిగిలిన మూడును "అన్వితాభిధాన వాదము"నకు చెందినవి.

"వాక్యములోని క్రియావాచకశబ్దమే వాక్యము". అను వారిమతమున కేవల క్రియాపదమే వాక్యమని తాత్పర్యము గాదు.కొన్నిచోట్ల కేవలక్రియాపదముకూడ వాక్యముగా నుండనగునని వారి యభిప్రాయము.

ఉదా॥ "మూయుము" అను క్రియను వాడినపుడు దానితో అన్వయించు కారకము నియతముగ భాసించుటచే కేవలక్రియాపదమును వాడినను సంపూర్ణముగ అర్థబోధ కలుగు చుండుటచే అదికూడ వాక్యమే.

"సుబంత తిఙంత పదసముదాయము వాక్యము" అనునది అందరకు అంగీకారనమే అయినను ఆ యా వ్యక్తుల ఉచ్చారణమున భిన్నమై, కాలముచే భిన్నమై ఒకే వాక్యము ప్రయోగింపబడునపుడు ఆ వాక్యములన్నియు ఏకరూపముగా ఉండుటచే ప్రత్యేకవాక్యములకు అర్థబోధకత్వము నంగీకరించుటకంటె అట్టి వాక్యములందుగల జాతి అర్థబోధకము-అని కొందరు చెప్పుటచే పదసముదాయము వాక్యము, సముదాయవర్తిజాతి వాక్యము అని రెండు పక్షము లేర్పడినవి.

వైయాకరణుల సిద్ధాంతమున అఖండమగు స్ఫోట మనబడు శబ్దమే వాక్యము.

మన ముచ్చరించునపుడు ఏనాదము వచ్చునో ఆ నాదముచే అభివ్యక్తమై అర్థమును ఇతరులకు భాసింపజేయు బుద్ధిమాత్ర గోచరమగు ఒకానొక శబ్దమే స్ఫోటము. దానిని అభివ్యక్తము చేయునది ధ్వని. ఈ స్ఫోటము రెండువిధములు. 1. బాహ్యము 2. ఆంతరము. బాహ్యము ఇతరుల శ్రవణేంద్రియముచే గ్రహింపబడును. ఆంతరము మనసుచే మాత్రమే గ్రహింపబడును. బాహ్యమగు స్ఫోటము 1. వ్యక్తి, 2. జాతిఅను భేదముచే ద్వివిధము. వ్యక్తి స్ఫోటము-ఏకః అనవయవః శబ్దః. ఇది పూర్ణము, అద్వితీయము, అఖండజ్ఞానస్వరూపము. కేవలవాక్యమే తప్ప పదపదార్థములు కల్పితములు అని వీరి సిద్ధాంతము. అట్లుకాక, ఆ స్ఫోటము పదరూపము అని కొంద రంగీకరించిరి. ఆ స్ఫోటరూపములగు పదవాక్యసముదాయ ములలోనున్న వర్తిజాతి అర్థబోధకముగా ఉండును. దీనినే జాతిస్ఫోటము అందురు. ఆంతరమగు స్ఫోటరూపమగు శబ్దము అర్థబోధకము అను పక్షమున బుద్ధిచే పరికల్పితములైన పదములకూడిక అర్థబోధకము. అదియే వాక్యము అను పక్షము వచ్చినది. ఇట్లు స్ఫోట వాదుల మతమున వాక్యస్వరూపము మూడువిధములుగా కన్పట్టుచున్నది.

ఇక సఖండపక్షమున రెండుమతములు కలవు, 1. అభిహితాన్వయవాదము, 2. అన్వితాభిధానవాదము.

1. "పదమే సంకేతముచే - లేదా శక్తిచే అర్థమును బోధించును. అట్లు పదముచే బోధింపబడిన పదార్థములకు అన్వయమును వాక్యము ప్రతిపాదించును" అనునది అభిహితాన్వయవాదము. మీమాంసకులలో భాట్టులు, నైయాయికులు అభిహితాన్వయ వాదమునే అంగీకరించిరి.

ఈ మతమున (1) పదసముదాయము వాక్యము (2) పూర్వాపర క్రమమున ఏర్పడిన పదములే వాక్యము అను రెండు పక్షములు ఆవిర్భవించినవి

2. అన్వితాభిధానవాదము—ప్రవృత్తి లేదా నివృత్తి అనునవియే వాక్యప్రయోజనములు. దానినే కార్యము అందురు. ఆ కార్యమునందు అన్వయించియే సర్వపదములు వాక్యమున ప్రయోగింపబడును. అందుచే "కార్యముతో అన్వయించిన - లేదా కార్యముతో అన్వయించిన వేరొక పదార్థముతో అన్వయించిన అర్థమునే పదము బోధించును" అనునది అన్వితాభిధానవాదము. ఈ మతము ననుసరించి ఆఖ్యాతశబ్దము వాక్యము, మొదటిపదము వాక్యము, సాకాంక్షమగు ప్రతిపదము వాక్యము అను మూడు పక్షములు ఆవిర్భవించినవి. ఈ మతమును మీమాంసకులలో ప్రాభాకరులు ఆదరించిరి.

అభిహితాన్వయ వాదమున పదము కేవలము అర్థమును బోధించును. వాక్యము ఆ పదార్థములకు గల సంసర్గమును అనగా అన్వయమును బోధించును. అన్వితాభిధానవాదమున వేరొకదానితో అన్వయించిన అర్థమునే పదము బోధించును. వాక్యము అన్వయమును బోధింపదు. విశేషసంబంధములను మాత్రము బోధించును.

పైరీతిగా స్ఫోటవాదమున మూడు వాక్యలక్షణములును, అభిహితాన్వయవాదమున రెండు వాక్యలక్షణములును, అన్వితాభిధానవాదమున మూడు వాక్యలక్షణములును మొత్తము ఎనిమిది వాక్యలక్షణములు నిర్దేశింపబడినవి. ఇవి ప్రక్కపుటలోని పట్టికలో చూపబడినవి.

పై వాక్య లక్షణములను ముందు విపులముగా వివరింప బోవుచున్నారు. సంగ్రహముగా వాని స్వరూపము వివరింపబడుచున్నది.

*1. ఆఖ్యాత శబ్దము వాక్యము.*

క్రియావాచక పదము కారకములతో అన్వయించి ప్రవృత్తి నివృత్తిరూపమగు వాక్యార్థమును ప్రతిపాదించును. మిగిలిన పదములు ఆ అర్థమును ఇతరవాక్యార్థములకంటె విలక్షణమని తెలియజేయగల సంస్కారమును గలిగించును.

*2. పదసంఘాతము వాక్యము.*

పదముల పరస్పరాన్వయము వాక్యముచే బోధింపబడును. అట్లు బోధించు పదసముదాయమే వాచకము.

*3. పదసంఘాతవర్తి జాతి వాక్యము.*

''దేవదత్తః కఱ్ఱతో గోవును తోలి తెమ్ము'' అను వాక్యమును ఉచ్చరించునపుడు ధ్వని విశేషములగు వర్ణములు అనిత్యములు, క్రమికములు నగుటచే ఏకకాలమున ఉండవు. అందుచే, ఆ ధ్వనులచే దేవదత్తాది పదములకంటె భిన్నమగు నిత్యము-అనవయవము అగు శబ్దము అభివ్యక్తమగును. అదియే వాచకము. అది జాతిరూపమగు స్ఫోటము.


వాక్యము
సఖండము
అఖండము (స్ఫోటము)
(వైయాకరణులు)
అభిహితాన్వయము
(నైయాయికులు, భాట్టమీమాంసకులు)
అన్వితాభిధానము
(ప్రాభాకర మీమాంసకులు)
బాహ్యము
ఆంతరము
బుద్ధ్యనుసంహృతిః
వ్యక్తి
ఏకః అనవయవః శబ్దః
జాతి
సంఘాతవర్తినీ జాతిః
సంఘాతః
క్రమః
ఆద్యం
పదమ్
పృథక్ సర్వం
పదం సాకాంక్షమ్
ఆఖ్యాతశబ్దః

*4. ఏకము, అనవయవమునగు శబ్దము వాక్యము.*

వర్ణములు - పదములు అసత్యములు. ఆ ధ్వనులచే అభివ్యక్తమగు నిత్యము, విభాగరహితము, ఏకమునగు స్ఫోటరూపమగు శబ్దమే వాచకము.

*5. పదక్రమము వాక్యము.*

వీరి మతమున వర్ణముల క్రమము పదము. పదములక్రమము వాక్యము. అదియే వాచకము.

*6. బుద్ధియొక్క అనుసంహారము వాక్యము.*

వ్యక్తముగా ఉచ్చరించినపుడు ఉండు క్రమము స్థిరమైనది కాదు; కనుక, అంతరాత్మ - అంతర్యామి అయి ప్రతిప్రాణియందును ఉండు ఒకానొక శబ్దతత్త్వము అక్షర చిహ్నములు లేకయే ఉన్నట్లుగను, పదవిభాగము లేకయే ఉన్నట్లుగను బుద్ధిలో ఏర్పడును. ఆ బుద్ధులచే ఏర్పడిన సంస్కారములచే కలిగిన స్మరణమే, నిత్యము - అనవయవము అగు వాక్యముగ ఉండి అర్థమునకు వాచకమగును. అదియే వాక్యము.

*7. ఆద్యపదము వాక్యము.*

ఏ పదము మొదట ప్రయోగింపబడునో అదియే వాక్యార్థమునకు వాచకము. దానిచేతనే మిగిలిన అర్థమంతయు సూచింపబడును. ఆ మొదట ప్రయోగింపబడిన పదము క్రియావాచకమైనను సరే; నామవాచకమైనను సరే. క్రియాకారకములు అవినాభావము కలవి కనుక వానిలో ఏ ఒకటి ప్రయోగింపబడినను దానికి సంబంధించిన అర్థాంతరమును గూడ తానే తెలియజేయును. మిగిలిన పదములు ఆ వాక్యార్థమునకు ఇతర వాక్యార్థములకంటె గల భేదమును స్పష్టముచేయుటకొరకు సాయపడును.

*8. ప్రత్యేకము సాకాంక్షమగు ప్రతిపదము వాక్యము.*

అన్యోన్యము అన్వయాపేక్షగల సర్వపదములు ప్రత్యేకము వాచకములే.

పై వాక్యలక్షణములే గాక వ్యాకరణశాస్త్రమున ఉపయోగపడునవి వార్త్తికకారుడు చెప్పిన రెండు వాక్యలక్షణములును, లౌకికముగ ఉపయోగపడు మీమాంసకులు చెప్పిన ఒక వాక్యలక్షణమును గలవు.

1. అవ్యయములు, కారకములు, విశేషణములతో కూడిన క్రియావాచక శబ్దము వాక్యము.

2. ఒక తిఙంతము (క్రియావాచక శబ్దము) కలది వాక్యము అను రెండు లక్షణములను వార్త్తికకారుడు వ్యాకరణమున అనుదాత్తాదిస్వర కార్యముల సాధనకు ఉపయోగపడునట్లు నిర్వచించెను.

3. ఒకే అర్థము కలిగియున్నది (క్రియలు ఒకటికంటె ఎక్కువగానున్నను) ఒక వాక్యము. వాక్యమునందు గల పదములు పరస్పరాన్వితములై ఏకార్థ ప్రతిపాదకము

1. ఆఖ్యాతం సావ్యయ కారక విశేషణం వాక్యమ్.
2. ఏకతిఙ్ వాక్యమ్.
3. అర్థైకత్వా దేకం వాక్యం సాకాంక్షం చేద్ విభాగే స్యాత్.

లగును. అందులో ఒకపదమును వేరుచేసినచో మిగిలిన పద సముదాయము ఆ పదముయొక్క అర్థమున ఆకాంక్షకలదియై యుండును.

ఈ లక్షణములన్నియు పదసముదాయము వాక్యము అను వాక్యలక్షణమున అంతర్భూతములగు నని గ్రహింపవలయును.

వాక్యలక్షణములను ప్రస్తావించు సందర్భమున ఆయా మతములలో వాక్యార్థము ఏది ? సంబంధ మేది ? అనికూడ తెలిసికొనవలెను. పైని పేర్కొనబడిన ఎనిమిది మతము లలో అఖండపక్షమునకు చెందిన మూడు లక్షణములలో వాక్యార్థము ప్రతిభ.

వాక్యము అఖండము. దానియందు పదముల విభాగము బుద్ధిచే కల్పితము. ఆ పదముల యర్థమును గ్రహించు సమయముననే దానికంటె భిన్నమగు అఖండమగు వాక్యార్థ ప్రతీతి ఈ అసత్యములగు పదార్థములచే అభివ్యక్తమగును. అట్లు భాసించు అఖండార్థ స్ఫురణమే ప్రతిభ.

మిగిలిన అయిదు లక్షణములలో ఆఖ్యాతశబ్దము వాక్యము అను మతమున వాక్యా ర్థము క్రియ. క్రియావాచక పదమును విన్నంతమాత్రముననే ఆ క్రియకు ఆశ్రయము, ఆక్రియకు సాధనము అగు పదార్థములతో అన్వయించిన ఇతరక్రియలకంటె భిన్నమయిన క్రియ వినువానికి స్ఫురించును. ఆ వాక్యమున ఉపయోగింపబడిన నామవాచక పదములు దానినే స్పష్టపరచుటకు సాయపడునవై యుండును.

ఇక పదసంఘాతము - లేదా పదముల క్రమము వాక్యము అను లక్షణములలో పదములే అర్థములకు వాచకములు. వానిచే బోధింపబడిన అర్థముల సంసర్గము-అనగా పరస్పరాన్వయము వాక్యార్థము.

అన్వితాభిధానవాదుల మతమున ఆద్యపదము, ప్రత్యేకము సాకాంక్షమగు ప్రతి పదము వాక్యము అను రెండు పక్షములలో ఇతర పదములయొక్క అర్థములతో అన్వ యించిన స్వార్థమునే పదము బోధించును. అందుచే ప్రతిపదము వాక్యమంతటి యొక్క అర్థమును తెలియజేయుచుండును. ఇట్లు ఒక పదముచేతనే వాక్యార్థము తెలియజేయబడు చున్నను ఇతర పదముల ఉచ్చారణ అస్ఫుటముగా ఉన్న ఆ అన్వయమును స్పష్టముగా వ్యక్తముచేయును. అందుచే వీరిమతమున పదార్థమే వాక్యార్థము. కొందరు ప్రయోజనము వాక్యార్థము అని అందురు. ఈ విధముగ ప్రతిభ, సంసర్గము, సంసర్గవశమువలన నిరా కాంక్షమైన సంపూర్ణమగు పదార్థము, పరస్పరాన్వితమగు పదార్థము, క్రియ, ప్రయోజనము అను ఆరును వాక్యార్థములుగా భావింపబడినవి.

ఇవికాక, విధి వాక్యార్థమని, నియోగము వాక్యార్థమని, భావన వాక్యార్థమని కొన్ని మతములు కలవు. కాని, ఇవి క్రియారూపములే కనుక వేరుగ పేర్కొనబడలేదు. ఆ క్రియ ప్రకృత్యర్థము అని వైయాకరణులు భావించగా ప్రత్యయార్థమని మీమాంసకులు భావించిరి. వైయాకరణుల మతమున క్రియ ధాత్వర్థము. మీమాంసకమతమున భావన ఆఖ్యాతార్థము. విధి, నియోగము అనునవి లిఙ్, లోట్, తవ్య ప్రత్యయములతో కూడిన వాక్యములందే కానవచ్చును గాన సామాన్య వాక్యలక్షణములందు వానిని పేర్కొన అవసరము లేదు.

ఇక బౌద్ధులు విజ్ఞానవాదులు. వీరికి వాక్యము వాక్యార్థము కూడ విజ్ఞానము యొక్క ఆకారవిశేషము. అనాదిగ వాక్యము విషయమున, వాక్యార్థవిషయమున గలిగిన భేదవాసనచే విజ్ఞానమునకు విభాగరహిత మైనదానికి విభాగమున్నట్లును రూపములేనిదానికి రూపమున్నట్లును భాసించును. ఆ విధముగ ఆరోపితమైన రూపముగల పదార్థములచే పదార్థ సముదాయ రూపమగు వాక్యార్థము భాసించును. ఇది నిర్విభాగమే అయ్యు విభాగము కలది వలె భాసించును. ఈ శాక్యసిద్ధాంతము నందలి వాక్యార్థము వైయాకరణ మతమునందలి ప్రతిభతో సమానమైనదే. అందుచే వేరుగా పేర్కొనబడ లేదు-ఇక వారిసిద్ధాంతమున వాక్యము వైయాకరణ మతమునందలి "ఆంతర స్ఫోటరూపమగు బుద్ధ్యనుసంహారము వాక్యము" అను లక్షణముతో తుల్యము. అందుచే ఆ లక్షణములు గూడ ఇందు అంతర్భూతములే;

నైయాయికుల మతమున పదములో ముందు ముందు వర్ణములు ఉచ్చరింపగనే నశించిపోయినను వానిస్మృతి చివరి వర్ణముయొక్క అనుభవముతో కలిసి జ్ఞానమున గోచరమగును. అదియే పదము. అట్లే వాక్యములో పూర్వపూర్వపదముల స్మృతితో కూడిన చివరి పదముయొక్క అనుభవములో గోచరమగు రూపమే వాక్యము. అట్లే వాక్యార్థములో పూర్వపూర్వ పదముల అర్థముల స్మృతితో చివరిపదముచే కలిగిన అర్థజ్ఞానమే వాక్యార్థము. ఈ పక్షము సంసర్గము వాక్యార్థము అను పక్షమున అంతర్భూతమగును. ఈ విధముగా వాక్యార్థములను తెలిసికొనిన తరువాత వాక్య వాక్యార్థములకు గల సంబంధమును పరిశీలింతము.

అనవయవము ఏకము స్ఫోటరూపము అను వాక్యము ప్రతిభారూపమగు వాక్యార్థమును ప్రతిపాదించుటలో అధ్యాసము సంబంధము-అనగా వాక్య వాక్యార్థములకు తాదాత్మ్యము సంబంధము. మిగిలిన పక్షములలో వాచకము వాక్యము, వాచ్యము వాక్యార్థము; కావున వాచ్యవాచకభావము-అనగా యోగ్యత సంబంధము.

ఇక బౌద్ధమతానుసారముగ విజ్ఞానవాదమున వాక్యార్థము విజ్ఞానరూపమే. వాక్యము విజ్ఞానరూపమే. ఆ వాక్యము వాక్యార్థమునకు కారణము. అందుచే వానికి గల సంబంధము కార్యకారణ సంబంధము.

సంసర్గము వాక్యార్థము అనువారిమతమున సంకేతము వాక్య వాక్యార్థములకు గల సంబంధము. కావున అధ్యాసము, వాచ్య వాచకభావము, కార్యకారణ భావము, సంకేతము అనునవి సంబంధములు.

వీనిలో వైయాకరణుల మతమున అఖండము, ఏకము, అనవయవము నగు స్ఫోట రూపమగు శబ్దమే వాక్యము. ప్రతిభయే వాక్యార్థము. అధ్యాసమే సంబంధము. వీనినే ఈ కాండమున ప్రతిపాదింతురు.

వార్తికకారుడు చెప్పిన లక్షణములకు మీమాంసకులు చెప్పిన వాక్యలక్షణమునకు సమన్వయము కుదురునా? అను విషయమున చర్చచేయబడుచున్నది.

నిఘాతాదివ్యవస్థార్థం శాస్త్రే యత్పరిభాషితమ్
సాకాంక్షావయవం తేన న సర్వం తుల్యలక్షణమ్. 8

సాకాంక్షావయవమ్ = ఆకాంక్షగల పదములతో కూడినదై, విభాగము లేనప్పుడు ఆకాంక్షారహితముగా నుండు ఏకార్థ ప్రతిపాదకమగు పద సముదాయము వాక్యము అని

మీమాంసకులు చెప్పిన లక్షణము, నిఘాతాదివ్యవస్థార్థమ్=నిఘాతము (అను దాత్త స్వరము), యుష్మదస్మదాదేశములు మొదలగునవి వచ్చుటలో వ్యవస్థను కల్పించుటకొరకు, శాస్త్రే= వ్యాకరణ శాస్త్రమందు, యత్ = ఏ వాక్యలక్షణములు రెండును, పరిభాషితమ్=నిర్వచింప బడెనో, తేన=ఆ వాక్యలక్షణ ద్వయముతో, సర్వం, తుల్య లక్షణమ్ = పూర్తిగ సమాన లక్షణము కలది, న=కాదు.

తా. వ్యాకరణ శాస్త్రములో సమానవాక్యమునందే నిఘాతము, యుష్మదస్మచ్ఛబ్ద ములకు వచ్చు ఆదేశములు రాదగును అను నియమము కలదు. దానికై శాస్త్రీయముగ వార్తిక కారుడు వాక్యలక్షణమును నిర్వచించెను. ఆ లక్షణములు రెండు. ఒకటి : అవ్యయకారక విశేషణసహితమగు క్రియాపదము వాక్యము. రెండు : ఒకే క్రియాపదము గలది వాక్యము.

మీమాంసకులు అర్థైక్యమున్నచో ఒకే వాక్యమని నిర్ణయించిరి. "అయం దండః హర అనేన" "ఇది కఱ్ఱ, తెమ్ము దీనితో" "ఓదనం పచ, తవ భవిష్యతి" "అన్నమును వండుము, నీకు అగును" అను వాక్యములలో "అయం దండో హ రానేన" అనునది మీమాంసక మతము ననుసరించి ఏకార్థ ప్రతిపాదకమగుటచే ఏకవాక్యమే ; అట్లే "ఓదనం పచ తవ భవిష్యతి" అనునది కూడ ఏకవాక్యమే ; కాని, వైయాకరణ మతమున "అయం దండః-హర అనేన" అనునవి రెండు వాక్యములు. అవి రెండు వాక్యములగుటచే ఒకే వాక్యమునందు రావలసిన నిఘాతస్వరము 'దండః' అనుదానిలోని చివరి అకారమునకు 'హర' అను క్రియాపదము పరముగా ఉన్నను రాదు. తిఙంతము పరముగా ఉన్నప్పుడు అతిఙంతమునకు నిఘాతము ఏకవాక్యమున వచ్చును. ఇది ఏకవాక్యము కాదు గనుక తిఙంతము పరముగా ఉన్నను స్వరము రాదు. అట్లే "ఓదనం పచ, తవ భవిష్యతి" అనునవి వైయాకరణ మతమున రెండు వాక్యములు. ఏకవాక్యమైనప్పుడే తవ అనుదానికి 'తే' అను ఆదేశము వచ్చును. పైవాక్యములలో ఏవాక్యమునకు ఆ వాక్యమునందే తిఙంతము లుండుటచే అవి ప్రత్యేకవాక్యములు కనుక నిఘాతముకాని, 'తే' అను ఆదేశము కాని రావు. మీమాంసకుల మతము ననుసరించి పైవాక్యములలో సామర్థ్యము అనగా ఏకార్థసంబంధము ఉండుటచే ఏక వాక్యత ఉండును. కాని, ఏకవాక్యత ఉన్నచో శాస్త్రీయముగ పై స్వరము, ఆదేశములు రావలసివచ్చునని వైయాకరణ మతమున వానిని ఒక వాక్యముగ అంగీకరింపరు. అందుచే పై వాక్యలక్షణములు ఈ లక్ష్యములందు సమావేశపడవు.

ఇక, "నద్యాః స్తిష్ఠతి కూలే" (నదియొక్క-ఉన్నది-ఒడ్డున),"శాలీనాం తే ఓదనం దాస్యామి" (శాలిధాన్యముల యొక్క - నీకు-అన్నమును - ఇచ్చెదను) అను వాక్యములలో వైయాకరణ మతము ననుసరించియు, మీమాంసకమతము ననుసరించియు గూడ ఏక వాక్యత ఉన్నది. వైయాకరణ సిద్ధాంతమున నిఘాతము - తే-మే ఆదేశములు, వచ్చుటకు ఏకార్థసంబంధము ఆవశ్యకముగాదు. ఏకవాక్యత ఆవశ్యకము. "నద్యాః" అను పదము యొక్క అర్థమునకు 'తిష్ఠతి' అనుపదము యొక్క అర్థముతో సామర్థ్యము లేదు. లేక పోయినను ఏకవాక్యము గనుక- ఒకే తిఙంతముకలది గనుక అచట నిఘాతము వచ్చును. అట్లే 'శాలీనాం-తే' అనువాని యర్థములకు కూడ సామర్థ్యములేదు. కాని ఏకతిఙంత ఘటిత మగుటచే ఏకవాక్యము గనుక 'తవ' - అనుదానికి 'తే' అను ఆదేశము వచ్చును. ఇట్లు

మీమాంసక సిద్ధాంతమున వాక్యలక్షణము అన్వయించినచోట శాస్త్రీయమగు వార్తికకార వాక్య లక్షణము కూడ కొన్నిచోట్ల సరిపడవచ్చును. కాని, వెనుక చూపిన ఉదాహరణములలో రెండు మతములవారి వాక్యలక్షణములు సరిపడవు. అందుచేత వార్తికకార మీమాంసక మతములందలి వాక్యలక్షణములు సర్వత్రతుల్యముగ సమావేశపడవు అని యెఱుంగనగును.

ప్రసంగవశమున మీమాంసకులు చెప్పిన వాక్యలక్షణమును చెప్పుచున్నాడు.

> సాకాంక్షావయవం భేదే పరానాకాంక్షశబ్దకమ్
> కర్మప్రధానం గుణవ దేకార్థం వాక్యమిష్యతే. 4

ఈ కారికకు మూలమగు మీమాంసకుల వాక్యలక్షణమును ప్రతిపాదించి తరువాత కారికార్థమును ప్రతిపాదింతును.

"అర్థైకత్వా దేకం వాక్యం సాకాంక్షం చే ద్విభాగే స్యాత్" విభాగే=వాక్యములోని పదములను వాక్యమునుండి తీసివేసినచో, సాకాంక్షం-స్యాత్-చేత్=ఆ వాక్యము ఆ పదముల అన్వయమును అపేక్షించునదిగా ఉన్నదైనచో, అర్థైకత్వాత్ = ప్రయోజన మొకటిగా ఉండుటవలన, ఏకం-వాక్యం=ఆపదసముదాయము ఒకే వాక్యమగును.

"రాముడు అన్నమును వండుచున్నాడు" -అను వాక్యములో కర్తృపదమునుగాని, కర్మపదమునుగాని, క్రియాపదమునుగాని తొలగించినచో మిగిలిన పదములు ఆకాంక్షకలవిగా ఉండును. అవియన్నియు కలిసి ఒకే అర్థమును బోధించును. కావున అది ఒక వాక్యము. అట్టివాక్యములలో క్రియలు రెండున్నను ప్రతిపాదింపబడు అర్థము ఒకటే అయినచో ఏక వాక్యమగును. "చూడుము, గుఱ్ఱము పరుగెత్తుచున్నది" ఇది మీమాంసక సిద్ధాంతమున ఒక వాక్యమే.

ఇక, కారికకు ప్రతిపదార్థము చెప్పబడుచున్నది.

భేదే = ఒకపదమును వాక్యమునుండి వేరుచేసినచో, సాకాంక్షావయవమ్= సాకాంక్షములగు ఇతరపదములు కలదియు, పరానాకాంక్షశబ్దకమ్=అట్లు వేరుచేయనినాడు వాక్యములోని పదములకంటె ఇతరములగు పదముల ఆకాంక్షలేనిదియు, కర్మప్రధానమ్= క్రియాప్రధానమై యుండునదియు, గుణవత్ = విశేషణములతో కూడినదియు, ఏకార్థమ్= ప్రయోజనైక్యము కలదియు నగు పదసముదాయము, వాక్యమ్ = వాక్యముగ, ఇష్యతే= చెప్పబడుచున్నది.

తా. వాక్యములో నుండు పదములలో ఏపదమును తీసినను మిగిలినపదముల అన్వయము పూర్తికాకుండ ఉండునదియు, అన్నిపదములు కలిసియున్నచో వేరొకపదము యొక్క అపేక్షలేకయే సంపూర్ణముగ అర్థబోధ కలిగించునదియు, క్రియ ప్రధానముగా కల దియు, ఇతరపదముల అర్థమంతయు దానికి విశేషణముగనే అన్వయించునదియు, ఏక ప్రయోజన సంబద్ధమగునదియు నగు పదసముదాయము వాక్యము.

వార్తిక కారుడు చెప్పిన అవ్యయ కారక విశేషణ సహితమగు క్రియాపదము వాక్యము-అను లక్షణము అవ్యాప్తి దోషము కలిగియున్నదని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

సంబోధనపదం యచ్చ తత్క్రియాయా విశేషకమ్
వ్రజాని దేవదత్తేతి నిఘాతో౽త్ర తథా సతి. 6

యచ్చ, సంబోధనపదమ్=“వ్రజాని దేవదత్తః” అను వాక్యములో “దేవదత్తః” అనెడి ఏ సంబోధనపదము కలదో, తత్=అది, క్రియాయాః=“వ్రజాని” అనెడి క్రియ యొక్క, విశేషకమ్=మిగిలిన క్రియలకంటె విశేషమును (భేదమును) బోధించునది. తథా, సతి=అట్లు ‘దేవదత్త’ అనునది కూడ విశేషణమగుటచే, అత్ర=ఈ “వ్రజాని దేవదత్త” అనుచోట, నిఘాతః=అనుదాత్తము సిద్ధించుచున్నది.

శా. వార్తికకారుడు చెప్పిన వాక్యలక్షణము ననుసరించి “వ్రజాని దేవదత్తః” అను వాక్యములో దేవదత్తః అనునది అవ్యయముగాని, కారకముగాని, విశేషణముగాని కాక పోవుటచే, వాక్యత్వము లేకపోవలసివచ్చును- అని శంకించి ఈ కారిక సమాధానము చెప్పుచున్నది.

విశేషణమనగా ఇతరమగు వానికంటె విశేష్యమునకుగల విశేషమును బోధించునది. “వెళ్ళుదును దేవదత్తః” అనునపుడు ‘దేవదత్తః’ అను సంబోధనపదము ఇతరులను సంబోధించి తాను వెళ్ళుటకంటె దేవదత్తు నుద్దేశించి చెప్పి వెళ్ళుటలో గల విశేషమును బోధించుచున్నది. “యజ్ఞదత్తః వెళ్ళుదును” అనునప్పుడు జరుగు గమనక్రియకంటె “దేవదత్తః వెళ్ళుదును” అనునప్పుడు జరుగు గమనక్రియ వేరైనదని ‘దేవదత్తః’ అను పదము తెలుపుచుండుటచే అది క్రియకు విశేషమును నిరూపించుచున్నది కావున విశేషణమే. ఆ విధముగ ‘వ్రజాని దేవదత్తః’ అనుచోట వాక్యత్వమునకు భంగములేదు. అందుచే ‘దేవదత్త’ అనువానికి అనుదాత్తస్వరము వచ్చుటకు అభ్యంతరములేదు.

వి. ‘వ్రజాని దేవదత్తః’ అనుచోట ‘దేవదత్త’ అనునది క్రియావిశేషణమని నిరూపింపబడినది గదా: క్రియావిశేషణము నపుంసకలింగములో ఉండవలెను, కర్మగా ఉండవలెను. ఇది అట్లులేదు. అది విరుద్ధముకదా అని సందేహము కలుగవచ్చును.

క్రియావిశేషణములు రెండురకములు. సమానాధికరణములు- వ్యధికరణములు. అందు సమానాధికరణము అగు క్రియావిశేషణము “శోభనముగ జరుగుచున్నది” అనుచోటి “శోభనముగ” అనునది. ఇది క్రియకే విశేషణమై అన్వయించుటచే క్రియ ద్రవ్యవాచకము కాదు కనుక ఆ క్రియతో అన్వయించు శోభనశబ్దము నపుంసకలింగమును పొందినది. “దేవదత్తః వెళ్ళుదును” అనుచోట “దేవదత్తః” అనునది వ్యధికరణము. దేవదత్తునకు క్రియతో అన్వయములేదు. దేవదత్తునిచేత క్రియ సాధింపబడుటలేదు. వేరొకడు వెళ్ళుచు దేవదత్తుని సంబోధించి చెప్పి వెళ్ళుచున్నాడు. అందుచే దీనిని వ్యధికరణక్రియావిశేషణ మందురు. ‘శోభనముగ’ అనుదానిని సమానాధికరణ క్రియావిశేషణ మందురు. సమానాధికరణ క్రియావిశేషణమే నపుంసకలింగమున ఉండును. వ్యధికరణము ఉండదు. కాని “దేవదత్తః వెళ్ళుదును”అనుచోటిక్రియ“యజ్ఞదత్తః వెళ్ళుదును” “దేవదత్తః వచ్చెదను”అనుక్రియలకంటె విశిష్టమైనదని దేవదత్తశబ్దము తెలియజేచున్నది. కావున అదియు క్రియావిశేషణమే. ‘దేవదత్తః వ్రజాని’ ‘వ్రజాని దేవదత్తః’ అను వాక్యములకు అర్థము సమానమే అయినను ‘వ్రజాని దేవధత్త’ అను వాక్యమునే ఇచట గ్రహింపవలెను. ‘దేవదత్త’ అనుదానికి అనుదాత్తస్వరము ‘వ్రజాని దేవదత్తః’ అనునపుడే వచ్చునుగాని ‘దేవదత్తః వ్రజాని’ అనునప్పుడు

రాదు. ఆ స్వరము ఏకవాక్యమైనప్పుడుగాని రాదు కనుక 'వ్రజాని 'దేవదత్త' అనునది ఏక వాక్యమనియు, స్వరము రావచ్చుననియు, వార్తికకారుడు చెప్పిన లక్షణమునకు అవ్యాప్తి లేదనియు ఎఱుంగనగును.

వార్తికకారుడు చెప్పిన లక్షణములో ఒకే క్రియాపదము కలది వాక్యము అన్నట్లు స్ఫురించు చుండుటచే "పూర్వం స్నాతి—పచతి తతో వ్రజతితతః" అనువాక్యము ఏకవాక్యము కాకపోవలసివచ్చును. అట్లు ఏకవాక్యతలేనిచో 'తతః' అనుదాని తర్వాతనున్న 'వ్రజతి' అనుదానికి నిఘాతము అనగా అనుదాత్తస్వరము రాకపోవును అని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

యథానేకమపి క్త్వాన్తం తిఙన్తస్య విశేషకమ్
తథా తిఙన్తం తత్రాహుః తిఙన్తస్య విశేషకమ్. 6

యథా=ఏవిధముగ, అనేకమపి క్త్వాన్తమ్=అనేకములను క్త్వాప్రత్యయాంతము లను ప్రయోగించినను, 'స్నానముచేసి-వండికొని-భోజనముచేసి వెళ్ళుచున్నాడు'. అనుచోట నున్న క్త్వాన్తములన్నియు, తిఙన్తస్య=ప్రధానమగు "వెళ్ళుచున్నాడు" అను క్రియకు, విశేష కమ్=విశేషమును తెలియజేయుటచే విశేషణములగుచున్నవో, తథా=అట్లే, తత్ర= 'ముందుగా స్నానముచేయుచున్నాడు, వండుచున్నాడు తర్వాత-వెళ్ళుచున్నాడు తర్వాత' (పూర్వం స్నాతి, పచతి తతః ప్రజతి తతః) అను వాక్యములో, తిఙన్తమ్=క్రియాపదము లన్నియు, తిఙన్తస్య=ప్రధాన క్రియాపదమగు వెళ్ళుచున్నాడు అనుదానికి, విశేషకమ్= విశేషణములు అగుచున్నవి.

తా. "పూర్వం స్నాతి పచతి తతః వ్రజతి తతః" అనుచోట అతిఙన్తముకంటె పరమైన తిఙన్తమునకు నిఘాతము వచ్చుననెడు నియమము ననుసరించి 'తతః' అనుదాని తరువాత నున్న 'వ్రజతి' అను క్రియాపదమునకు నిఘాతము రావలెను. కాని స్వరము ఏకవాక్యమునందే వచ్చును గనుక సాపేక్ష కారక విశేషణములు ఆఖ్యాతము వాక్యము అను వార్తిక కారుని లక్షణము ననుసరించి ఒకే క్రియాపదముగల పదసముదాయమే వాక్యమగును గాని అనేక క్రియాపదములుగల పదసముదాయము భిన్నవాక్యములే యగును. అట్లు భిన్న వాక్యములే యైనచో పైవాక్యమున 'వ్రజతి' అనుదానికి నిఘాతమురాదని శంకించి ఇది ఏకవాక్యమే యని సమర్థించుచున్నాడు.

అనేక క్రియాపదములున్నను ఆ క్రియాపదములన్నియు ప్రధానములు గాక ఒకే క్రియాపదము ప్రధానమై ఇతరములు దానికి విశేషణములే అయినప్పుడు అది ఏకవాక్యమే యగును. 'స్నాత్వా, భుక్త్వా, పీత్వా వ్రజతి' అన్నప్పుడు-స్నాన, భోజన, పానములు క్త్వాన్తములగు పదములచే తెలియజేయబడి ప్రధానమగు 'వ్రజతి' అనుదానిచే తెలుపబడు వ్యాపారమునే ఎట్లు విశేషించి చూపుచున్నవో అట్లే 'పూర్వం స్నాతి పచతి తతః వ్రజతి తతః' అనునపుడు కూడ క్త్వాన్తములుగాక తిఙన్తములే ప్రయోగింపబడినను 'వ్రజతి' అనునది ఒక్కటే ప్రధానక్రియ. మిగిలిన 'స్నాతి-పచతి' అను తిఙన్తములచే తెలుపబడు క్రియలు దానికే విశేషణములు. అందుచే ఏకవాక్యతకు భంగములేదు. వాక్యమున ఒకే తిఙన్త ముండ వలెను అనుదానికి అర్థము ఒకే ప్రధానమగు తిఙన్తముండవలెను అని గ్రహింపవలెను. ఇదియే వార్తికకారుని లక్షణమునకు అర్థమని చెప్పనిచో సూత్రకారుని అభిప్రాయమునకు

విరుద్ధము గావున 'ఏకతిఙన్తముకలది వాక్యము' అనునపుడు ప్రధానమగు ఒక తిఙన్తము కలది వాక్యము అని అర్థమును గ్రహింపవలెను.

వి. సమగ్రార్థబోధకమగు వాక్యములో అప్రధానములగు తిఙన్తము లెన్ని యున్నను అవి దాని ఏకవాక్యతకు భంజకములు కావు. అందుచే మీమాంసకులు చెప్పిన అర్థైకత్వమే వీరికిని అభిమతమని గ్రహింపవలెను. కాని వైయాకరణుల యభిప్రాయమున నిర్విభాగము శబ్దార్థమయము బోధరూపము నగు స్ఫోటము అనబడు శబ్దమే బాహ్యముగాని ఆంతరముగాని వాక్యము అని గ్రహింపవలెను.

వైయాకరణమతమున అంగీకరించిన స్ఫోటరూపమగు శబ్దము పదవర్ణ రూప విభాగము లేని అఖండమగు శబ్దమని నిరూపింపబోవుచు దానికి దృష్టాంతముగ చిత్రజ్ఞానమును చిత్రరూపమును ప్రదర్శించుచున్నాడు. అందు ముందు చిత్రజ్ఞానమును దృష్టాంతముగా చూపుచున్నాడు.

యథైక ఏవ సర్వార్థప్రత్యయః ప్రవిభజ్యతే
దృశ్యభేదానుకారేణ వాక్యార్థానుగమ స్తథా.　　　　7

యథా = ఏవిధముగ, ఏకఏవ = ఒకేప్రకాశము (జ్ఞానము), సర్వార్థప్రత్యయః = సకలవస్తువిషయకమైనది, దృశ్యభేదానుకారేణ = చూడబడు వస్తువులయొక్క భేదమునుబట్టి వాస్తవముగ భేదము లేకున్నను, ప్రవిభజ్యతే = విభజించి వ్యవహరింపబడుచున్నదో, తథా = అవిధముగ, వాక్యార్థానుగమః = వాక్యవాక్యార్థములయందు పదపదార్థభేదము కల్పింపబడుచున్నది.

తా. నీలపీతాది అనేకాకారములుగల ఒక ద్రవ్యమును చూచినపుడు వాని అన్నిటి సామూహికమైన జ్ఞానము మనలో కలుగును. అట్లే ఘట పట కుడ్యాది వస్తుసమూహ మును ఒక్కసారి చూచినపుడు ఆ సమూహమును గూర్చిన ఒక జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము ఏకాకారమే కాని భిన్నము కాదు. మనకు అందు కన్పట్టు వేర్వేరు రంగులను బట్టి, వేర్వేరు వస్తువులనుబట్టి జ్ఞానములోకూడ భేదమున్న దన్నట్లు కన్పించును. వాస్తవమునకు ఈ చిత్రజ్ఞానమున ఆకారభేదము లేదు. అట్లే వాక్యమునందు పదములుగాని, వాక్యార్థము నందు పదార్థములుగాని వాస్తవములు కావు. కల్పితములై, ఉన్నట్లు భాసించును.

వి. పంచదార, మిరియము, సుగంధద్రవ్యములు, జలము మున్నగువాని సమ్మిశ్రణమున ఏర్పడిన పానకమున అనుభవింపబడు రుచి ఏకాకారమే కాని భిన్నముకాదు. ఇట్లే నెమలి గ్రుడ్డులోని రసములో భిన్నభిన్నములగు వర్ణములు కన్పట్టును. అవి భిన్నవర్ణముల యొక్క సమ్మేళనము కాదు. అది అఖండమే. ఇట్లే నరసింహరూపమున భాసించు నరసింహత్వజాతి నరత్వ-సింహత్వములు కలిసినదికాదు. అఖండమే. ఈ విధముగ చిత్రరూపమున నీలపీతాది అనేక వర్ణభానము ఉన్నను ఆ జ్ఞానము ఏకమే. వేరొకచోట నీలరూపమును పీత వర్ణమును చూచినపుడు కల్గిన జ్ఞానముతో సదృశమగు జ్ఞాన మిందులో ఉండుటచే దీనిలోకూడ భేదమున్నదన్నట్లు తోచును. అట్లే వాక్యము. ఆ వాక్యమును వినగానే కల్గిన అర్థజ్ఞానము అఖండమే దానిలో పదములు పదార్థములు ఉన్నట్లు భాసించుట కాల్పనికము

ఇట్లు చిత్రజ్ఞానమును దృష్టాంతముగా చూపి బాహ్యమగు చిత్రరూపమును దృష్టాంతముగ ఒసంగుచున్నాడు.

చిత్ర స్యైకస్వరూపస్య యథా భేదనిదర్శనైః
నీలాదిభి స్సమాఖ్యానం క్రియతే భిన్నలక్షణైః. 8

ఏకస్వరూపస్య=ఏకాకారముగా ఉన్న, చిత్రస్య=భిన్నభిన్నవర్ణముగల వస్తువునకు, భిన్నలక్షణైః=భిన్న ఆకారములగు నీలపీతాది స్వరూపములుగల, భేదనిదర్శనైః=ప్రత్యేకవ్యవహారముగల, నీలాదిభిః=నలుపు, ఎరుపు మున్నగు రూపములతో, యథా=ఎట్లు, సమాఖ్యానమ్=వ్యవహారము, క్రియతే=చేయబడుచున్నదో.

తథైవైకస్య వాక్యస్య నిరాకాంక్షస్య సర్వతః
శబ్దాంతరై స్సమాఖ్యానం సాకాంక్షై రనుగమ్యతే. 9

తథైవ=ఆవిధముగనే, ఏకస్య-వాక్యస్య=అఖండమగు వాక్యమునకు, సర్వతః నిరాకాంక్షస్య=అన్నివిధముల ఆకాంక్షారహితమై ఉన్నదానికి, సాకాంక్షైః=ఈ వాక్యమునందు అంతర్గతములుకాక, దీనియందలి పదములతో సదృశములై పరస్పరము వేరుపదములతో అన్వయింప యోగ్యతకల, శబ్దాంతరైః=వేరుశబ్దములతో, సమాఖ్యానమ్=అఖండ వాక్యమున కాల్పనికముగ పదవ్యవహారము, అనుగమ్యతే=చేయబడుచున్నది.

తా. 'దేవదత్తః గామానయ దండేన' అను వాక్యము ప్రయోగించునపుడు, అది సంపూర్ణమగు వాక్యార్థమునకు వాచకమై యుండును. దీనిలోని పదములు మరియొకపదముతో అన్వయింప యోగ్యతకలవి కావు. ఈ వాక్యమువలన కలిగిన జ్ఞానము విభాగరహితముగ ఉండును. కాని వేరొకచోట వినబడిన అదేవిధమగు పదములను అర్థములను భావించి అట్టిదియే ఇది యని, ఈ వాక్యములో నాల్గుపదము లున్నవి అని కాల్పనికముగ వ్యవహరించుచుందురు. వాస్తవమునకు ఈ పదములు ఆ పదములు వేరు. అందు పదవిభాగము లేదు. నీలపీతాది వర్ణములతో చిత్రింపబడిన ఒక చిత్రమును చూచునపుడు ఆ చిత్రమునందు ఏకాకారతయే గాని భిన్నరూపత కనబడదు. కాని వేరొకచోట చూచిన నీలపీతాది వర్ణములను భావించి ఆ లక్షణములు గలవి ఇందును గలవని కల్పితముగ వ్యవహరింతురు. కాని వాస్తవమునకు ఈ రూపము, ఆ రూపమును చూచినపుడు కల్గిన జ్ఞానము కూడ విభాగరహితమై ఉండునదియే. ఇట్టే వాక్యవాక్యార్థ విషయమున గూడ మనము భావించు పదపదార్థస్వరూపము కల్పితమే యని యెరుంగవలెను.

ఈ సిద్ధాంతమున పదము అఖండము. అందలి ప్రకృతి, ప్రత్యయము అను భేదము అజ్ఞులకు వ్యుత్పత్తి కలుగజేయుటకు కల్పింపబడినది. అట్లే వాక్యమునందును పండితులుకాని వారికొరకు అసత్యభూతములయిన పదములను విభజించి కల్పించిరని చెప్పుచున్నాడు.

యథా పదే విభజ్యన్తే ప్రకృతిప్రత్యయాదయః
అపోద్ధార స్తథా వాక్యే పదానా ముపవర్ణ్యతే. 10

యథా=ఏవిధముగ, పదే=అఖండమగు పదమునందు, ప్రకృతి ప్రత్యయాదయః=బాలవ్యుత్పాదనమునకై ప్రకృతి, ప్రత్యయములు మున్నగునవి, విభజ్యన్తే=

కల్పించి విభజింపబడినవో, తథా = ఆవిధముగనే, వాక్యే = అఖండమగు వాక్యమునందు, పదానామ్ = కల్పితములగు పదములయొక్క, అపోద్ధారః = విభాగము, ఉపవర్ణ్యతే = వర్ణింపబడు చున్నది.

తా. బాలవ్యుత్పాదనమునకై పదమునందు ప్రకృతి, ప్రత్యయము అను విభాగము యథార్థముగ లేనిదాని నెట్లు కల్పించిరో అట్లే వాక్యమునందును సులభముగ వాక్యార్థ ప్రతిపత్తి కల్గుటకు అసత్యమగు పదవిభాగము కల్పింపబడినది.

వర్ణాంతరసరూపం చ వర్ణభాగేషు దృశ్యతే
పదాంతరసరూపాశ్చ పదభాగా అవస్థితాః. 11

యథా = ఏవిధముగా, వర్ణభాగేషు = ఏకవర్ణములగు ఐ,ఔ మొదలగు వర్ణముల అవయవములలో, వర్ణాంతర సరూపమ్ = స్వతంత్రవర్ణములగు అ, ఇ - అ, ఉ అను వర్ణముల సారూప్యము, దృశ్యతే = కన్పట్టుచున్నదో, తథా = అవిధముగనే, పదాంతర సరూపాః = వాక్యావయవములగు పదములలో ప్రత్యేక పదములపోలికగల భాగములును, పదభాగాః చ = అఖండమగు పదమునందు ప్రకృతి ప్రత్యయ రూప భాగములును, అవస్థితాః = ఏర్పడినవి.

తా. "ఐ, ఔ" అనునవి స్వంతంత్ర వర్ణములు. కాని వానిలో 'అ-ఇ; అ-ఉ' అను అక్షరముల పోలికలు కన్పట్టుటచే అవి సంధ్యక్షరములనియు, రెండక్షరముల కూడికచే ఏర్పడిన వనియు, ఎట్లు తోచుచున్నదో అట్లే వాక్యమునందు వాస్తవముగ పదములు, పదము నందు ప్రకృతి ప్రత్యయ రూపావయవములు లేవు. కాని ప్రత్యేకముగా కన్పట్టు పదములవంటి భాగములు ఆ వాక్యములలో కన్పడినపుడు వానిని పదములని విభజించి ఏర్పరచుట జరిగినది. అట్లే పదముకూడ నిరంశమే, ప్రకృతి ప్రత్యయ విభాగము అసత్యమే అని యెరుంగవలెను.

భాగై రనర్థకై ర్యుక్తా వృషభోదకయావకాః
అన్వయవ్యతిరేకౌ తు వ్యవహారనిబంధనమ్. 12

వృషభోదక యావకాః = 'వృషభ, ఉదక, యావక' అనుశబ్దములు, అనర్థకైః = అర్థములేని, "ఋషభ, ఉద, యావ" అను, భాగైః = అవయవములతో, యథా = ఎట్లు, యుక్తాః = కూడియున్నవో - అట్లే (పచతి-పాచకః మున్నగుపదములలో ప్రకృతి ప్రత్యయ రూపములగు భాగములు వాస్తవమున అనర్థకములే. కాని, శాస్త్రములు 'పచతి' అనుచోట 'పచ్' అనునది ప్రకృతి, 'తి' అనునది ప్రత్యయము, వానికర్థము క్రియ-కర్త అనికల్పించిరి.) అన్వయవ్యతిరేకౌ = ఈ ప్రత్యయముతో కూడిన ధాతువు ఈయర్థము నిచ్చును. ఈ ప్రత్య యము లేనిచో ఈ యర్థమునీయదు అని ఆ భాగములకు ఆ అర్థాదులందు కల్పింపబడిన అన్వయ వ్యతిరేకములు, వ్యవహారనిబంధనమ్ = ఆ కల్పితమైన అర్థముతో ఆ పదమును అజ్ఞులు వ్యవహరించుటకు కారణము.

తా. లోకములో 'ఋషభ-ఉద-యావ' అను ప్రత్యేకపదములు ప్రత్యేకార్థముల యందు వ్యవహరింపబడుచున్నవి. వానికి అర్థము కలదు. కాని 'వృషభ' అనునది విను నపుడు దానిలోని 'ఋషభ' అనునది ప్రత్యేకముగా అర్థము కలిగియుండదు. మొత్తము 'వృషభ' శబ్దమే అర్థబోధకము. అట్లేయున్నను ఇందలి 'ఋషభ' అనుభాగము 'ఋషభ' అను ప్రత్యేకపదము వలె అర్థబోధకము కాక 'వృషభ' అను అఖండపదమే అర్థబోధకము

అగును. అట్లే, పచతి అనుచోట 'చ్ + తి' అని విభజించి 'పచ్' అనుదానికి 'వండు' అని యర్థము. 'తి' అనుదానికి "ఆపనిని చేయువాడు" అని అర్థము. 'తి' అను ప్రత్యయమును చేర్చినపుడు "వండుచున్నాడు" అను అర్థమువచ్చును అని శాస్త్రజ్ఞులు బాలుర వ్యుత్పత్తి కొరకు ఆ ప్రకృతి ప్రత్యయముల కాయా యర్థములందు అన్వయ వ్యతిరేకములను—అనగా అవిభాజ్యమగు సంబంధమును కల్పించిరి. కాని వాస్తవమునకు 'పచతి' అను అఖండపదము "వండుచున్నాడు" అను అర్థమును బోధించును గాని ప్రత్యేకార్థములు గల భాగములు అందు లేవు. అట్లే వాక్యముకూడ నిరంశమై అర్థబోధక మగును. పదవిభాగము వ్యవహారమునకై కల్పింపబడినది.

వాక్యమువలె వాక్యార్థముకూడ నిర్విభాగమే అని ప్రతిపాదించుచున్నాడు.

శబ్దస్య న విభాగోఽస్తి కుతోఽర్థస్య భవిష్యతి?
విభాగైః ప్రక్రియాభేద మవిద్వాన్ప్రతిపద్యతే. 18

శబ్దస్య = అఖండ వాక్యస్ఫోటరూపమగు శబ్దమునకు, విభాగః = పదరూపమగు విభాగము, నాస్తి = లేదు, (అట్టిచో) అర్థస్య = ఆ వాక్యముచే బోధింపబడు అఖండమగు ప్రతిభారూపమగు అర్థమునకు, విభాగః = విభాగము, కుతః భవిష్యతి = ఎట్లుండగలదు; అవిద్వాన్ = యథార్థ జ్ఞానములేని బాలుడు. విభాగైః = అసత్యములగు శాస్త్రములచే కల్పింపబడిన పద, ప్రకృతి, ప్రత్యయాది రూపవిభాగములచే, ప్రక్రియాభేదమ్ = పదముయొక్క ప్రక్రియలో ప్రకృతి ప్రత్యయాది భేదమును, వానియర్థములోని భేదమును (లేనివానిని గూడ), ప్రతిపద్యతే = (ఉన్నట్లు) తెలిసికొనుచున్నాడు.

తా. సిద్ధాంతమున వాక్య మఖండమైనపుడు దానిచే బోధింపబడు అర్థముకూడ అఖండమే. కాని వాక్యమునందు పదములను, పదములందు ప్రకృతి ప్రత్యయాది భేదమును శాస్త్రజ్ఞులు కల్పించుట ఆ అఖండమగు అర్థమును, శబ్దమును తెలిసికొనుటకు సాధనము. విభాగముతో పదనిర్మాణమును సులభముగా తెలియగలుగును. తద్ద్వారా వాక్యార్థము నెఱుంగుట సులభమగును. వానిని అఖండముగ నెఱుంగుట కష్టము.

వి. ప్రతి పదము, ప్రతి వాక్యము పఠించి శబ్దజాలము నంతను ఎఱుంగుట ఇంద్రునివంటివానికే సాధ్యముకాలేదని మహాభాష్యకారుడు చెప్పియున్నాడు. ఈవిధముగా సామాన్య విశేషభావముచే ఏకరూపముగ ఉన్న పదములన్నిటిని విభజించి ఒకదానిని తెలిసికొనుటచే సర్వపదముల స్వరూపము తెలియునట్లు ప్రక్రియను ఏర్పరచిరి. అందులో విశిష్టములగు పదములకు ఈ సామాన్యప్రక్రియ సరిపడకపోయినచో విశేషప్రక్రియను నిర్దేశించిరి. 'ఇంద్రాణీ, వరుణానీ' మొదలగు కొన్నిరూపములలో ఇంద్ర-ఆన్-ఈ కన్పించుచుండుటచే ఇంద్ర మొదలగు శబ్దములకు 'ఆనుక్' ఆగమము ఙీష్ ప్రత్యయము వచ్చి ఆ రూపము లేర్పడినవని సామాన్యప్రక్రియ నిర్దేశించిరి. కాని 'పూతక్రతాయీ' అనుచోట 'పూతక్రతు - అయ్ - ఈ' అని వినిపించుటచే వెనుకటి ప్రక్రియ పనికిరాక పూతక్రతు శబ్దమునకు మాత్రము 'ఐ' అను ఆదేశము, ఙీష్ అను ప్రత్యయము వచ్చునని విశేషప్రక్రియను నిర్దేశించిరి. ఈ విధముగ పదభేదమును బట్టి ప్రక్రియాభేద మేర్పడినది. ఈ సామాన్య విశేషరూపమగు ప్రక్రియా రచనచే అవిద్వాంసులు సులభముగ వాక్యార్థము నెఱుంగుట సాధ్యపడును. అందుకై అసత్యమగు ఈభేదము కల్పింపబడినది.

వాక్యములో దేవదత్తాది పదములు అర్థమున్నట్లు కన్పడుచు వినబడుచుండగా అనర్థకములని చెప్పుట యెట్లు ? అను సంశయమును నివారించుచున్నాడు.

బ్రాహ్మణార్థో యథా నాస్తి కశ్చి ద్బ్రాహ్మణకంబలే
దేవదత్తాదయో వాక్యే తథైవ స్యు రనర్థకాః . 14

బ్రాహ్మణకంబలే = బ్రాహ్మణ కంబలమను శబ్దమునందు, బ్రాహ్మణార్థః కశ్చిత్ = బ్రాహ్మణశబ్దమునకు ఏ అర్థముకూడ, యథానాస్తి = ఏవిధముగ లేదో, తథైవ = ఆ విధముగనే, వాక్యే = వాక్యమునందు, దేవదత్తాదయః = దేవదత్త మొదలగు పదములు, అనర్థకాః = అర్థములేనివి, స్యుః = అగుచున్నవి.

తా. బ్రాహ్మణ కంబలము అనుదానితో బ్రాహ్మణ శబ్దము విడదీసి ఉచ్చరించినపుడు అది బ్రాహ్మణ శబ్దమువలె విన్పడినను దానికి ప్రత్యేకముగా అర్థమేమియును లేదు. అట్లే "దేవదత్తః గామ్ ఆనయ దండేన" అను వాక్యము నుచ్చరించినపుడు వాక్యార్థ మఖండముగా భాసించును గాని దేవదత్త మున్నగుపదములు వేరువేరుగా ఉచ్చరించినపుడు వానికి ప్రత్యేకార్థవత్త్వము లేదు.

మీమాంసకులు పదములకు సామాన్యరూపమగు స్వార్థమును బోధించు శక్తి ఉండుననియు, వాక్యము ఆ పదార్థముల అన్వయ విశేషమును బోధించుననియు, ఆకాంక్షాదుల వలన పరస్పరము అన్వయించిన పదసముదాయము వాక్యమనియు చెప్పుదురు. దానిని ఖండించుచున్నాడు.

సామాన్యార్థ స్తిరోభూతో న విశేషేఽవతిష్ఠతి
ఉపాత్తస్య కుత స్త్యాగః నివృత్తః క్వావతిష్ఠతామ్ ? 15

సామాన్యార్థః = ('దేవదత్తః గామ్ ఆనయ దండేన' అనునప్పుడు దేవదత్త పదము సకలపదార్థములతో అన్వయించుటకు తగిన దేవదత్తః అను) సామాన్యార్థము కలది, తిరోభూతః = (పదాంతర సన్నిధానము లేక మునుపే పదాంతరములో అన్వయము కలదియై యుండియు వేరొక పదార్థముతో అన్వయింపని సామాన్యార్థము కలదియై ఆ) యన్వయము మరుగుపడినదియై, విశేషే = వేరొక పదార్థముతో అన్వయించిన స్వార్థము అను విశేషమునందు, న–అవతిష్ఠతే = ఉండదు, ఉపాత్తస్య = సామాన్యార్థ బోధనమునకై స్వీకరించిన వాచ్యవాచకభావరూప సంబంధమునకు, త్యాగః = త్యాగము, కుతః = ఎట్లు, నివృత్తః = సామాన్యార్థ బోధనమునుండి విరమించిన యాపదము, క్వ = ఎచట (ఏ అర్థమునందు) అవతిష్ఠతామ్ = ఉండును.

తా. 'దేవదత్తః గామ్ ఆనయ దండేన' అను వాక్యములో దేవదత్తాది పదములే వాక్యము. దేవదత్త పదము ముందు సామాన్యముగ వేరొకపదముతో అన్వయింపదగిన స్వార్థమును బోధించును. కాని పదాంతరములతో కలిపి పలికినపుడు ఆ పదములతో అన్వయించుటకు వీలుగా, సామాన్యార్థమును బోధించు శక్తిని మరుగుపరచి యుంచును. పదాంతర సన్నిధానముచే ఆ అర్థముతో అన్వయించిన విశిష్టార్థమును బోధించు శక్తి కలిగియుండును–అని మీమాంసకులు చెప్పుదురు. కాని ఇది పొసగదు. సకల పదార్థములతో అన్వయింపదగిన సామాన్యార్థమును బోధించు శక్తిగల పదమునకు ఆ యర్థముతోగల వాచ్య వాచక భావసంబంధము నిత్యము. అందుచే సామాన్యార్థము వాచ్యమైననాడు దానిని పదాంతర సన్ని

ధానమున విడచుట కుదురదు. అట్లు విడచునన్నచో శబ్దార్థసంబంధము అనిత్యము అనవలసి వచ్చును. అందుచే విశేషార్థమున ఆ పదమునకు శక్తియుండదు. విశేషార్థమున వాచ్యవాచక రూపసంబంధము లేకపోయినను సామాన్యార్థముగల ఆ పదమే స్మరింపబడి విశేషార్థముతో అన్వయించును అనినప్పుడు సామాన్యార్థమును బోధించు శక్తిగల పదమును స్మరించి విశేషార్థసంబంధమును బోధించు శక్తి దానికి కల్పించునపుడు ఆ మొదటి సామాన్యార్థ సంబంధమును విడచుట ఎట్లు పొసగును? ఒకవేళ విడచినను విశేషార్థబోధకత్వరూపమగు సంబంధము లేనిదే దాని నెట్లు బోధించును? అందుచే పదము ముందు సామాన్యముగ అర్థమునుబోధించి తరువాత విశేషముగ అర్థమును బోధించు నను సిద్ధాంతము నిలువదు.

మీమాంసకులలో అన్వితాభిధాన వాదమున పదాంతరముతో అన్వయించిన స్వార్థమునందే పదమునకు శక్తి అను సిద్ధాంతము ఉండుటచే సామాన్యార్థముతో అన్వయించిన స్వార్థబోధకత్వము పదమునకే అంగీకరించి అట్టి పద సంఘాతమే వాక్యమని చెప్పిరి. కాని అది సంగతము కాదని వెనుక నిరూపింపబడినది. ఇపుడు రెండవ పక్షమగు అభిహితాన్వయవాదమును నిరూపించి ఖండించుచున్నాడు.

అశబ్దో యది వాక్యార్థః పదార్థోఽపి తథా భవేత్
ఏవం చ సతి సంబంధః శబ్దస్యార్థేన హీయతే. 16

వాక్యార్థః = వాక్యముయొక్క అర్థము, అశబ్దః-యది = వాచకశబ్దము లేకయే వచ్చినట్లంగీకరించినచో, పదార్థోఽపి = పదార్థముకూడ, తథాభవేత్ = ఆవిధముగనే-వాచక శబ్ద మక్కరలేకయే రాగలదు, ఏవం చ సతి = ఈవిధముగ అంగీకరించినచో, శబ్దస్య = శబ్దమునకు, అర్థేన = అర్థముతో, సంబంధః = వాచ్యవాచకభావరూప సంబంధము, హీయతే = తొలగిపోవును.

తా. అభిహితాన్వయ వాదమున పదములు పరస్పరసంబంధము లేని పదార్థములను మాత్రము బోధించును. ఆ పదముల యొక్క సమూహరూపమగు వాక్యములో ఆ పదార్థములకు పరస్పరసంబంధము ఆకాంక్షచే మన బుద్ధిలో భాసించును. ఈ సిద్ధాంతము నంగీకరించినచో వాక్యార్థమునకు వాచకము పదములు కావు, వాక్యమునుగావు. ఆకాంక్షచే బుద్ధిలో భాసించును. అందుచే శబ్దార్థములకు గల వాచ్యవాచక భావరూపసంబంధము పరిత్యక్తమగును. వాక్యార్థము ఎట్లు ఆకాంక్షచే భాసించినదో పదార్థముకూడ ఉచ్చరించగనే నశించు వర్ణములు ఏకకాలికములుగ ఉండవు గనుక, ఆ పదముచే గాక వేరొకదానిచే మన బుద్ధిలో భాసించునని చెప్పవచ్చును. ఇట్లు శబ్దార్థములకు గల వాచ్యవాచకభావరూపసంబంధము పదమునకు గాని వాక్యమునకు గాని లేదని అపసిద్ధాంతమేర్పడును.

పై కారికచే అభిహితాన్వయవాదుల వాక్యలక్షణము నిరసింపబడినది. ఇక అన్వితాభిధాన పక్షమున ఆద్యపదము వాక్యము, పరస్పరాన్వితమగు ప్రతిపదము ప్రత్యేకముగ వాక్యము అను రెండు వాక్యలక్షణములను విమర్శించుచున్నాడు.

విశేషశబ్దాః కేషాంచి త్సామాన్యప్రతిరూపకాః
శబ్దాంతరాభి సంబంధాత్ వ్యజ్యన్తే ప్రతిపత్తృషు. 17

విశేషశబ్దాః = ('దేవదత్త గామ్ ఆనయ దండేన' మున్నగు వాక్యములలో దేవదత్త శబ్దము మిగిలిన పదముల అర్థముతో అన్వయించినది గనే ప్రయోగింపబడును) అట్టి

విశిష్టార్థ ప్రతిపాదకములగు శబ్దములు, సామాన్యప్రతిరూపకాః = సామాన్యార్థ ప్రతిపాదకములగు దేవదత్తాది సాధారణ శబ్దములుగ, కేషాంచిత్ = కొందరకు (భాసించును), శబ్దాంతరాభిసంబంధాత్ = ఆ వాక్యములో దానితర్వాత ఉచ్చరింపబడిన గవాది పదములతో గల సంబంధము వలన, ప్రతిపత్తృషు = తెలిసికొనువారియందు, వ్యజ్యన్తే = (దేవదత్తాది పదముల విశిష్టార్థము) అభివ్యక్తమగును.

తా. ఆద్యపదము వాక్యము అనుపక్షమున సకల విశేషణములతో కూడి ఇతర పదార్థములతో అన్వయించిన అర్థమే వాచ్యమైయుండును గాన వాక్యారంభమున ఉపయోగింపబడిన పదము ఆ వాక్యములోని ఇతర పదములతో అన్వయించిన స్వార్థమును దెల్పును. అందుచే ఆద్యపదము వాక్యార్థమునంతను ప్రతిపాదించును. మిగిలిన పదములు కొందరకు ఆ పదము సామాన్యరూపమున ఉండుటచే సామాన్యార్థకమను భ్రమచే సంపూర్ణవాక్యార్థమును భాసింపజేయనపుడు విశిష్టార్థమును అభివ్యక్తముచేయుటకు సాయపడును.

ఈ తీరుననే ఒక్క మొదటిపదముమాత్రమేకాక ఏపదమైనను వాక్యముయొక్క మొత్తముఅర్థమును ప్రతిపాదింపగలది అగునని కొందరు, పరస్పరాన్వితమగు ప్రతి పదమును వాక్యమున ప్రత్యేకముగ వాక్యార్థ ప్రతిపాదకమగునని చెప్పిరి.

ఈ పక్షములందు గల దూషణమును, దానికి వారు చెప్పు సమాధానమును ప్రదర్శించు చున్నాడు.

తేషాం తు కృత్స్నో వాక్యార్థః ప్రతిభేదం సమాప్యతే
వ్యక్తోపవ్యంజనా సిద్ధిః అర్థస్య ప్రతిపత్తృషు . 18

తేషాంతు = ఒకే శబ్దముచే వాక్యార్థమంతయు అఖండముగ ప్రతిపాదింపబడునని చెప్పువారి మతమున, కృత్స్నః = సంపూర్ణ వాక్యార్థము, ప్రతిభేదమ్ = ప్రతి పదమున, సమాప్యతే = మాప్తమైయుండును, ప్రతిపత్తృషు = బోద్ధలయందు, అర్థస్య = వాక్యార్థముయొక్క, సిద్ధిః = జ్ఞానము, వ్యక్తోపవ్యంజనా = మొదటి పదముయొక్క అర్థముతెలియుట చేతనే తెలిసిన వాక్యార్థము, మిగిలిన పదముల ఉచ్చారణముచే స్ఫుటముగా అభివ్యక్తము కాగలదు.

తా. వాక్యమున మొదటిపదము లేదా ప్రతిపదము వాక్యార్థమునంతను సమగ్రముగ బోధించుచో ఇతర పదప్రయోగము వ్యర్థము గదా అను శంకను ఈ కారికచే నిరసించు చున్నారు. ఒక పదముచేతనే సకలవిశేషణ విశిష్టమగు వాక్యార్థము బోధింపబడినను మిగిలిన పదములు దాని స్పష్టప్రతిపత్తికి సాయపడునని గ్రహింపవలెను. ఈ విధముగ అన్వితాభిధాన వాదమునందలి రెండు వాక్యలక్షణములను నిరూపించిరి.

పై విధముగ వాక్య వాక్యార్థములు సఖండములు అను మతములను నిరూపించి వానికి తిరస్కరించుటకు ముందుగ ప్రతిభా రూపమగు వాక్యార్థమే ప్రధానముగా గ్రహింప దగినదని వాక్య మఖండము అను పక్షమును నిరూపించుచున్నాడు.

అవ్యక్తః క్రమవాన్ శబ్దః ఉపాంశ్వాయ మధీయతే
అక్రమస్తు వితత్యేవ బుద్ధి ర్యత్రావతిష్ఠతే . 19

అవ్యక్తః = బాహ్యముగా గాని అంతరముగాగాని స్ఫోటరూపముగా ప్రతీయమాన మగుచున్నను అంతకుముందు అవ్యక్తమైయుండు, శబ్దః = శబ్దము, ఉపాంశు = ఇతరులకు తెలియక తనకుమాత్రమే తెలియునట్లు, అధీయతే = ఉచ్చరింపబడుచున్నది, అయమ్ = ఇది, అక్రమస్తు = క్రమములేనిదయ్యు, క్రమవాన్ = అభివ్యంజకములగు ధ్వనులనెడి ఉపాధుల వలన క్రమముకలదియై యుండును, యత్ర = ఏక్రమభానమందు, బుద్ధిః = కల్పింపబడిన క్రమముతోకూడిన ఆ శబ్దబుద్ధి, వితత్య ఇవ = విస్తరించి యున్నట్లుగ, అవతిష్ఠతే = ఉన్నదై క్రమమును గ్రహించునో.

తా. శబ్దము వాస్తవమునకు జ్ఞానరూపము. దానిని అభివ్యక్తముచేయు ధ్వనుల వలన అది బాహ్యరూపమున ప్రతీయమాన మగుచుండును. దానిలో అంశములులేవు. అందుచే మెల్లగా ఉచ్చరించుట, గట్టిగా ఉచ్చరించుట, ఉపాంశువుగ ఉచ్చరించుట, ద్రుతముగ ఉచ్చరించుట, మున్నగునవి అన్నియు మనకు భాసించుచున్నవేగాని, శబ్దమునం దుండవు. అభివ్యంజకధ్వనుల ఉచ్చారణభేదమునుబట్టి శబ్దములం దాభేదము లున్నట్లు కన్పించును. శబ్దమును ప్రయోగించువారు, వారి బుద్ధియందు ఒక క్రమరూపము ఉన్నట్లు అనుభవింతురు గాని వాస్తవమునకు శబ్దమున క్రమములేదు. అందుచే వ్యావహారికముగ వాక్యమనబడు దాని యందుకూడ పదభేదము ఆది, అంతము, మధ్యము అను భేదము లేదని యెరుంగవలెను. నిర్విభాగమగు ఆకాశమున ప్రయాణము చేయువాడు తాను పొందిన దేశములనుబట్టి ఆకాశమును ఎట్లు పరిచ్ఛిన్నముగ చేయునో అట్లే ఈ వాక్యరూపమగు శబ్దమునందుకూడ ఆయా ప్రాణ కరణాదులయందు చేయు ప్రయత్నభేదమువలన ప్రయోగించువాని బుద్ధియందు ఒక క్రమ మున్నట్లు భాసించుటచే అదియే అఖండమగు శబ్దమని ఆరోపింపబడును.

ఈ స్ఫోటరూపమగు శబ్దము వ్యక్తిరూపము, ఏకము, నిరవయవము అని ఒక సిద్ధాంతము. ఆ వ్యక్తులెన్నియైనను ఆ వ్యక్తులయందు గల వాక్యజాతి స్ఫోటరూపమగు శబ్దము అని వేరొక సిద్ధాంతము. ఈ రెండు సిద్ధాంతములందును వాక్యరూపమగు శబ్దము నిరవయవము-ఏకము. అట్లయినచో కాలభేదముచేత, భిన్నపురుషులచేత ఉచ్చరింపబడు వాక్యములం దీ భేదము, సాదృశ్యము ఎట్లు కుదురును ? మనకు లోకములో కొన్ని వాక్యము లలో భేదము, కొన్ని వాక్యములలో సాదృశ్యము కన్పడుచున్నవి. వస్తువు ఒకటియే యైన పుడు తనలో తనకు భేదము సాదృశ్యము ఉండవుగదా ! అని శంకించి సమాధానము చెప్పు చున్నాడు.

యథా క్షేపవిశేషేఽపి కర్మభేదో న గృహ్యతే
అవృత్తౌ వ్యజ్యతే జాతిః కర్మభిః భ్రమణాదిభిః . 20

వర్ణవాక్యపదే ష్వేవం తుల్యోపవ్యంజనా శ్రుతిః
అత్యంతభేదే తత్త్వస్య సరూపేవ ప్రతీయతే . 21

యథా = ఏవిధముగ, క్షేపవిశేషేఽపి = త్రిప్పుట, ఎత్తుట, కదల్చుట మున్నగు కర్మలలో మూలభూతమగు ప్రయత్నము ప్రత్యేకము నిరవయవమై పరస్పరభేదము కల దైనను, కర్మభేదః = ఆ వ్యాపారములలో భేదము, న గృహ్యతే = ఇతరులచే గ్రహింపబడదో, అవృత్తౌ = ఆ కర్మ మరల చేయబడినపుడు, భ్రమణాదిభిః కర్మభిః = ప్రయత్నవిశేషముచే

గుండ్రముగా తిరుగుట, ఊర్ధ్వదేశమునకు పోవుట మున్నగు కర్మలచే, జాతిః = వాస్తవముగ మూలభూతమగు వ్యాపారములందు లేనిజాతి, వ్యజ్యతే = ఉన్నట్లు కన్పట్టునో, ఏవం = ఇట్లే, తుల్యోపవ్యంజనాశ్రుతిః = సమానములగు శ్రుతులు (వినపడుటలు) గల వ్యంజక ధ్వనులు గల శబ్దము, వర్ణవాక్యపదేషు = వర్ణములందు, వాక్యమునందు, పదములందు, తత్త్వస్య = అఖండమగు వాక్యమునకు, సరూపేవ = సాదృశ్యముకలదివలెను, అత్యంత భేదే = వ్యంజకధ్వనులలో భేదమున్నచో ఆ వర్ణపదములచే భేదము కలదివలెను, ప్రతీయతే = భాసించును.

తా. వాక్యవ్యక్తి, స్ఫోటరూపమగునది శబ్దమనునపుడు వ్యక్తి ఒకటి కనుక భేదము, సాదృశ్యము (ఈ వాక్యము ఈ వాక్యముతో పోలియున్నది, ఈ వాక్యముకంటె భిన్నముగానున్నది అనుట) కుదురదు. వాస్తవమునకు శబ్దము ఒకటియేగాన భేదసాదృశ్యములు లేవు. లేనిదానియందు వేరొకచోట ఉండు భేదసాదృశ్యములు ఆరోపింపబడుచున్నవి. లోకములో ఎత్తుటకు, కదల్చుటకు, త్రిప్పుటకు చేయు ప్రయత్నములు ప్రత్యేకములు క్షణికములు. ఆ ప్రయత్నమున కాప్రయత్నమే కాని ఒక ప్రయత్నము వేరొకప్రయత్నమువంటిది ఉండదు. ఆ ప్రయత్నముచే కదల్పబడు వస్తువు ఒకప్పుడు ఊర్ధ్వదేశమును తాకును. ఒకపుడు గుండ్ర ముగా సర్వదేశములను తాకును. అపుడు ఈ భ్రమణము, ఉత్క్షేపణము మొదలగు కర్మలు ఆ యా దేశసంయోగభేదముచే భిన్నములై మూలప్రయత్నమునందు లేని భేదసాదృశ్యము లను ఉన్నట్లు కన్పింపచేయుచున్నవి. అట్లే వాస్తవముగ స్ఫోటరూపమగు శబ్దములో లేని భేదసాదృశ్యములు బయటికి వినపడు ధ్వనులచే ఉన్నట్లు భాసింపచేయబడుచున్నవి. సమాన ముగా వినబడు ధ్వనులుగల వర్ణపదములున్నపుడు ఆ ధ్వనులయందు గల సాదృశ్యముచే ఆ వాక్యములందు సాదృశ్యము, ఆధ్వనుల భేదముచే ఆ వాక్యములందు భేదము ఆరోపితమై భాసించుచున్నది.

వాక్యము ఏకము అనునప్పుడు అఖండము ఏకమునగు నిత్యశబ్దమున పూర్వము, పరము అని పౌర్వాపర్యము నిరూపించుట ఎట్లు సంభవించునని శంకించి సమాధానము నిచ్చుచున్నాడు.

> నిత్యేషు తు కుతః పూర్వం పరం వా పరమార్థతః
> ఏకస్యైవ తు సా శక్తిః యదేవ మవభాసతే. 22

నిత్యేషు = నిరవయవములగు వాక్యములందు, పరమార్థతః = వాస్తవముగ, పూర్వం పరం వా = ఈ పదము ముందు, ఈ పదము తరువాత అని చెప్పెడి పౌర్వాపర్యము, కుతః = ఎట్లు సంభవించును?, ఏకస్యైవ = నిరవయవము క్రమరహితమునగు అఖండవాక్య మునకే, సా శక్తిః = ఆ శక్తి కలదు, యత్ ఏవం అవభాసతే = దేనివలన క్రమరహితమగు వాక్యముకూడ క్రమముకలదివలె భాసించుచున్నదో.

తా. "ఈ వాక్యము పూర్వము పాటలిపుత్రమున పలుకబడినది. ఈ వాక్యము తరువాత పలుకబడినది" అని వాక్యములలో ముందువెనుకలు కాలమునుబట్టిగదా ఏర్పడ వలెను. కాలము అనిత్యపదార్థములకు పౌర్వాపర్యమును కల్పింపగలదు. కాని నిత్యపదార్థము లలో ఎట్లు కల్పింపగలదు? ఎప్పుడూ ఉన్నదానికి ముందువెనుక లెట్లు? అని శంక కలుగ వచ్చును. వేదాంతమతమున విశ్వరూపముగ కన్పట్టు విశ్వాత్మకమగు బ్రహ్మము ఏకము

నిత్యము అయినను దానియందు స్ఫురించబడు వస్తువులను క్రమముగ భాసింపచేయు శక్తి కలదియై యుండును. అట్లే నిత్యము నిరవయవమునగు వాక్యమునకుగూడ వర్ణములలోను పదములలోను వాస్తవముగ లేని క్రమమును భాసింపచేయు శక్తి కలదు. ఆ శక్తిచే వాక్యమున వాస్తవముగ లేని క్రమము భాసించినను వాక్యముయొక్క ఏకత్వ నిత్యత్వములకు విరుద్ధము కాదు.

పదము నుచ్చరించుటకంటె వాక్యము నుచ్చరించుటలో ఎక్కువకాలము పట్టును అని మనకు తెలియును. ఒక మాత్రకాలములో ఉచ్చరించిన హ్రస్వము అనియు రెండు మాత్రల కాలము దీర్ఘము, మూడు మాత్రల కాలము ప్లుతమనియు చెప్పుచున్నాము. కాని శబ్దము నిత్యము నిరవయవము కావున దానికి కాలకృతమగు "వేగము, ఆలస్యము" "హ్రస్వము, దీర్ఘము, ప్లుతము" అను భేదమెట్లు కలుగును ? అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

చిరం క్షిప్ర మితి జ్ఞానే కాలభేదా దృతే యథా
భిన్నకాలే ప్రకాశేతే స ధర్మో హ్రస్వదీర్ఘయోః. 23

జ్ఞానే=బహు వస్తువిషయకమగు జ్ఞానము, ఏకవస్తు విషయకమగు జ్ఞానము కలిగినపుడు ఆ జ్ఞానములందు, చిరమితి=బహు వస్తువిషయక జ్ఞానమంతయు చాలకాలమున కల్గినది అనియు, క్షిప్రమితి=వేగముగ కల్గినది అనియు, కాలభేదా దృతే=ఆ జ్ఞానములలో కాలభేదము లేకపోయినను, యథా=ఎట్లు భేదము ఏర్పడుచున్నదో అట్లే, స ధర్మః=ఆ స్వభావము, హ్రస్వ దీర్ఘయోః=హ్రస్వము, దీర్ఘము అను వానికి గూడ కలదు. ఆ స్వభావము చేతనే, భిన్నకాలే=భిన్నకాలికత్వములు, ప్రకాశేతే=ప్రకాశించుచున్నవి.

తా. చాలా వస్తువులనుగూర్చి జ్ఞానము కలిగినపుడు ఆలస్యముగ కలిగినట్లును, ఒక వస్తువునుగూర్చి జ్ఞానము కలిగినపుడు వేగముగ కలిగినట్లును మనము తలతుము. వాస్తవమునకు బహువస్తువిషయక జ్ఞానమునకు, ఏకవస్తు విషయకజ్ఞానమునకు కాలములో భేదము లేదు. కాని తెలిసికొనబడిన వస్తువులందు గల కాలభేదమును జ్ఞానమునం దారోపించి ఎట్లు "చిరకాలము, శీఘ్రము" అని వ్యవహరించుచున్నామో ఆ స్వభావము ననుసరించియే స్ఫోటరూపముగ వర్ణము, పదము నిత్యమేయయినను అభివ్యంజకములగు ధ్వనులందు గల కాలభేదమును ఆ నిత్యస్ఫోటరూపశబ్దమున నారోపించుటచే, "చిరము, క్షిప్రము, హ్రస్వము, దీర్ఘము" మున్నగు కాలభేద వ్యవహారము సంభవించుచున్నది.

వాక్యము లేదా పదము అభివ్యంజక ధ్వనిభేదముచే భిన్నమని చెప్పుట యుక్తము కాదు. నిత్యము నిరవయవము అగు వాక్యమునకు—లేదా పదమునకు ఉపాధివశమున భేదము కలుగునని చెప్పినచో స్వభావభేద మంగీకరించినట్లే యగును. అంతేకాక వాక్యము, పదము, హ్రస్వ దీర్ఘాది వర్ణములు కూడ నిత్యములే యగుటచే కాలభేదము కలదని చెప్పుటకు వీలు లేదు. వానియందు కాలకృతమగు పరిమాణ భేదమును చూపుట విరుద్ధము. కాలమునందే భేదము చెప్పుట సంభవించదు. ఇక హ్రస్వదీర్ఘములం దాభేదము ఎట్లు సంక్రమించునని శంకించుచున్నాడు.

న నిత్యః పరమాత్రాభిః కాలో భేద మిహార్హతి
వ్యావర్తినీనాం మాత్రాణా మభావే కీదృశః క్రమః ? 24

ఇహ = ఈ శాస్త్రమునందు, నిత్యః = నిత్యముగా వ్యవహరింపబడుచున్న, కాలః = కాలము, పరమాత్రాభిః = తనకంటె భిన్నమగు క్రియయొక్క లేదా ఆ క్రియచే జనించిన పదార్థము యొక్క అవయవములచే, భేదమ్ = భేదమును, నార్హతి = పొందుటకు తగదు, వ్యావర్తినీనామ్ = పరస్పరము భిన్నములగు, మాత్రాణామ్ = క్రియావయవములు, లేదా దానిచే జనించు పదార్థావయవములు, అభావే = ఒకసారిగా ఉండనప్పుడు, క్రమః = పౌర్వాపర్యము, కీదృశః = ఎట్టిది ?-అనగా క్రమము లేదని యర్థము.

తా. కాలము నిత్యము, వ్యాపకము అని వైయాకరణ సిద్ధాంతము. ఆ పక్షము నంగీకరించినపుడు గాని-లేదా క్రియ, క్రియచే జనించు పదార్థావయవములే పౌర్వాపర్యముతో కూడి కాలమని వ్యవహరింపబడును అను పక్షము నంగీకరించినపుడు గాని, కాలమునందు క్రమము నిరూపించుట శక్యము కాదు. అట్టి కాలభేదమే లేనప్పుడు ఆ కాలభేదమును బట్టి ఔపాధికముగ హ్రస్వ దీర్ఘ భేదము సంభవించు ననుట కుదురదు గదా !

వి. కాలము నిత్యము, నిరవయవము అన్నప్పుడు ఆకాలములో జరుగు క్రియ యొక్క అవయవములచే లేదా ఆక్రియచే జనించు పదార్థముల యొక్క అవయవములచే ఔపాధికముగ క్షణము, లవము, ఎక్కువ, తక్కువ అను భేదము కాలమునందు కల్గుచున్న దని చెప్పుట కుదురదు. ఇతర పదార్థావయవములచే కాలమునకు ఉత్కర్షాపకర్షలు సంభవించు ననుట అసంగతము.

కాల మనిత్య మనునపుడు కాలమనునది ఇతర పదార్థముల పరిమాణ రూపము. అనగా "పాలుపిండు చుండగా అతడు వెళ్లెను" అనునప్పుడు గోదోహనము అను క్రియ ఉపాధిగా కల కాలము గమనమను క్రియకు పరిమాణ మగుచున్నది. ఒకదానికి పరిమాణమగు కాలమునకు మరల వేరొకదానిచే పరిమాణ మేర్పడుట సంభవింపదు. ఇక సర్వజగత్తు నిత్య మనునపుడు పదార్థములు నిత్యమే, కాలము నిత్యమే, అయినప్పుడు నిత్యముచే నిత్యమునకు పరిచ్ఛేదము కుదురదు. సర్వము అనిత్యము అనునపుడు ఒకపదార్థములోని ముందు భాగము తరువాతి భాగము ఒకసారి ఉండుట ఎన్నడును కుదురదు కనుక క్రమము కుదురదు. ఈ విధముగ పదార్థావయవములు నిత్యము లనుకొన్నను, అనిత్యము లనుకొన్నను వాని వలన కాలమునందు భేదము కలుగునని చెప్పుట కుదురదు. ఇట్లు కాలమునందే భేదము సంభవింపనపుడు దానిభేదముచే హ్రస్వ దీర్ఘాది భేదము కల్గుననుట సర్వథా అనుపపన్నము.

క్రమముతోకూడిన పదార్థముల అవయవములచే మనబుద్ధిలో కల్గు పరిమాణ భేదముచే కాలభేదము కల్పితమగుచున్నది—అనుట కూడ యుక్తము కాదని నిరూపించుచున్నాడు.

తాభ్యో యా జాయతే బుద్ధి రేకా సా భాగవర్జితా
సా హి స్వశక్త్యా భిన్నేవ క్రమప్రత్యవమర్శినీ. 25

తాభ్యః = బుద్ధిగోచరములగు పదార్థావయవములవలన, యా బుద్ధిః = ఏ బుద్ధి జాయతే = కల్గుచున్నదో, సా = ఆ బుద్ధికూడ, ఏకా = ఒకటియై, భాగవర్జితా = విభాగములు లేనిది అగుటచే బుద్ధికూడ కాలమునందు భేదమును కల్పింపలేదు అని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

హి = ఎందువలన, సా = ఆబుద్ధి, భేదరహితమైనను, భిన్నేవ = భేదముకలది వలె ఉండి, స్వశక్త్యా = తన స్వభావముచే, క్రమప్రత్యవమర్శినీ = తనకు గోచరమగు పదార్థావయవములలో క్రమమును స్ఫురింపచేయును.

తా. ప్రకాశమాత్రస్వరూపముకల దగుటవలన బుద్ధి ఏతిముగా నుండును కాని అవయవ విభాగముకలదిగా ఉండదు. ఆ బుద్ధిలో భాసించు పదార్థముయొక్క అవయవములు భిన్నములైనవియు, జడరూపములైనవియు అయినను, బుద్ధికిని దానిలో గోచరము అగు విషయమునకును తాదాత్మ్యము ఆరోపించుటచే విషయముయొక్క అవయవములు కూడ ప్రకాశరూపములే యగును. కాని ఆ పదార్థావయవముల స్వరూపము ప్రకాశమునకు విరుద్ధమైనను స్వస్వరూప పరిత్యాగము లేరయే బుద్ధి తాదాత్మ్యమునందుటచే బుద్ధియందు సహజముగ లేనిదైనను క్రమము ఉన్నట్లు గోచరించును.

వి. ఈరీతిగ చూచినచో బుద్ధియందు గూడ క్రమము లేదని తెలియుచున్నది. బుద్ధి తనకు లేని క్రమమును నిత్యము నిరవయవమునగు శాలమున కెట్లు కల్గించును? కాలమునకు భేదము, క్రమము లేనపుడు హ్రస్వ దీర్ఘాది భేదము కాని క్రమము కాని ఎట్లు సంభవించును?

పదార్థావయవములు క్రమముగలవి. కాని క్రమము వానిని గోచరింపజేయుటకాను బుద్ధియందు ఉన్నట్లు ప్రత్యక్షముగ గోచరించుచున్నది. ఆ బుద్ధిచేతనే సంస్కారమేర్పడును. ఆ సంస్కారములో కూడ పదర్థముల క్రమము భాసించును. బుద్ధి సంస్కారము లెప్పుడును ఏకరూపముగనే ఉండును. సంస్కారముచే అనుభవము, అనుభవముచే సంస్కారము ఏర్పడుచు అనాదిగ సాగుచున్నది. ఆ సంస్కారమునందలి క్రమము బుద్ధియందుకూడ భాసించుటచే ఆక్రమమే దీర్ఘప్లుతాదిభేదమును వర్ణవాక్యాదుల యందలి క్రమమును కల్గింపజేయునని చెప్పవీలున్నది—అనువాదమును ఖండించుచున్నాడు.

క్రమోల్లేఖానుషంగేణ తస్యాం యద్బీజమాహితమ్
తత్త్వనానాత్వయో స్తస్య నిరుక్తి ర్నావతిష్ఠతే. 26

తస్యామ్ = బుద్ధియందు, క్రమోల్లేఖానుషంగేణ = క్రమమును గోచరింపజేయగల సంబంధముచేత, యత్ బీజమ్ = క్రమమును గోచరింపజేయగల సంస్కార రూపమగు ఏ బీజము, ఆహితమ్ = పూర్వానుభవముచే నిరూపింపబడినదో, తస్య = ఆ సంస్కార రూపమగు బీజమునకు, తత్త్వనానాత్వయోః = బుద్ధితోటి అభేదము-లేదా భేదముయొక్క, నిరుక్తిః = నిర్వచనము, నావతిష్ఠతే = నిలువదు.

తా. పదార్థముయొక్క అవయవములలో గల క్రమము బుద్ధిలో భాసించుటకు ఆ బుద్ధిని కల్గించిన సంస్కారముయొక్క స్వభావము కారణము-అని అనుకొనుట కుదరదు. ఆ సంస్కార స్వభావము బుద్ధియందు నిక్షేపింప బడినప్పుడు ఆ స్వభావము బుద్ధికంటె వ్యతిరిక్తమా లేక అవ్యతిరిక్తమా అని పరిశీలింపవలెను. వ్యతిరిక్తమన్నచో ఆ స్వభావము బుద్ధిని మార్పు నొందింపలేదు. అవ్యతిరిక్తమన్నచో ఆ స్వభావము బుద్ధికంటె వేరుకాదు కనుక బుద్ధి నిర్విభాగమే యగును. కావున పదార్థావయవములు ఎట్లు బుద్ధిలో క్రమమును కల్పింపనేరవో అట్లే సంస్కార స్వభావముకూడ బుద్ధియందు క్రమమును ఏర్పరుపలేదు. అందుచే వర్ణపదాదులయందు కాలభేదము క్రమము కల్పించుట కుదురదు.

కాలమునకు గాని బుద్ధికి గాని సహజముగ క్రమము లేకుండుటచే అఖండమగు పదమునకు గాని వాక్యమునకు గాని పౌర్వాపర్యము కల్గింపలేదు. వాక్యస్ఫోటము లేదా పదస్ఫోటము చాతకాండరపమువలె విభాగ మున్నట్లు కన్పించుచున్నను అవిభక్తమే యని నిరూపించుచున్నాడు.

భావనాసమయే త్వేతత్ క్రమసామర్థ్య మక్రమమ్
వ్యావృత్తభేదో యేనార్థో భేదవా నుపలభ్యతే . 27

ఏతత్ = ఈ వాక్యము, అక్రమం = స్ఫోటస్వభావము కలదగుటచే విభాగరహిత ముగనే వాచకము, భావనాసమయేతు = వాక్యార్థము పదార్థఘటితముగ భావనచేయు నవసర మున, క్రమసామర్థ్యం = కల్పితములగు పదములనెడి ఉపాధివలన క్రమమును తెలిపెడి సామర్థ్యముకలదియై యుండును. యేన = ఏ సామర్థ్యముచే, అర్థః = వాక్యార్థము, వ్యావృత్త భేదః = అవయవభేదములేక అఖండమయ్యు, భేదవాన్ = పదార్థరూపమగు భేదము కలదివలె, ఉపలభ్యతే = తోచుచున్నదో.

తా. వర్ణపదభేదశూన్యమగు వాక్యము అఖండము. కాని లోకవ్యవహారమున వాక్యమున పదభేదమున్నట్లు భావింపబడుటచే అఖండమగు వాక్యమున పదభేద మారోపింప బడుచున్నది ఇట్లు మిథ్యారోపిత పదభేదముతో గూడినదిగా వాక్యమును అనాదిగ వ్యవహ రించు పురుషులబుద్ధిలో వాస్తవముగ లేని పౌర్వాపర్యరూపమగు క్రమము పదార్థావయవముల యందున్నట్లు కల్పింపబడును. అందుచే వాస్తవముగ అవయవభేదములేని వాక్యము ఏకము, అనవయవము అయ్యు తనకు విరుద్ధమగు పౌర్వాపర్యరూపమగు అర్థమును తనకు లేనిదానిని ఉన్నట్లు భావనాసమయమున గ్రహించుటచే భేదముకలదిగా కన్పట్టును. లోకములో వాస్తవముగ భేదము లేకున్నను ఆరోపితభేదముచే భేదమున్నట్లు భాసించుట ప్రసిద్ధమేకదా!

వి. దిక్కు అనవయవము అయినను ఆ యా అవధినిబట్టి పైన, క్రింద, ప్రక్క మొదలగు వ్యవహారము భావనచే ఆరోపింపబడి వ్యవహరింపబడుచున్నది. ఆత్మ పుట్టుచున్నది, చనిపోవుచున్నది మొదలగు వ్యవహారము నిత్యమగు ఆత్మయందు భావనచే ఉత్పత్త్యాది ధర్మములను ఆరోపించుటచేతనే కల్గుచున్నది. అట్లే వాక్యమున వాస్తవముగలేని పదవిభాగము భావనచేయు నవసరమున వ్యావహారికముగ భాసించును.

వాక్యముకంటె వేరుగ కన్పట్టు పదములే కలిసి వాక్యమనబడుచున్నవి కాని వాస్తవముగ సత్యములు పదములే. వానికంటె వ్యతిరిక్తమగు అఖండమగు వాక్యమనునది ప్రత్యేకము లేదని వాదించు పద సముదాయము వాక్యము అను మతమును దూషించు చున్నాడు.

పదాని వాక్యే తాన్యేవ వర్ణా స్తేచ పదే యది
వర్ణేషు వర్ణభాగానాం భేదః స్యాత్ పరమాణువత్ . 28

భాగానా మనుపశ్లేషా న్న వర్ణో న పదం భవేత్
తేషా మవ్యపదేశ్యత్వాత్ కి మన్య దపదిశ్యతామ్ ? 29

పదాని = వాక్యమున కాకుండా వేరుగా స్వతంత్రముగ నుండు పదములే కలిసి, వాక్యే యది = వాక్యమున నున్నవి అనినచో,అట్లే, వర్ణాః = పదమునందు కాక వేరుగా స్వతం

క్రమముగ నుండు వర్ణములు, తేచ = అవియే, పదే యది = పదమున నున్నవి యన్నచో, పరమాణువత్ = పరమాణువులవలె, వర్ణేషు = వర్ణములయందుకూడ, వర్ణభాగానాం = వర్ణావయవములయొక్క, భేదః = విభాగము, స్యాత్ = కల్పింపబడవచ్చును. (అట్లు సఖండముగ నుండునని అంగీకరించినచో).

భాగానాం = వాక్యమునందు పదరూపములగు భాగములు, పదములందు వర్ణరూపములగు భాగములయొక్క, అనుపశ్లేషాత్ = (ఒకకాలమందుండకపోవుటచే) కలయిక లేకపోవుటచే, వర్ణః = వర్ణరూపమగు అవయవి, న = ఉండదు, పదం = పదరూపమగు అవయవికూడ, న భవేత్ = ఉండదు. (వర్ణపదరూపములగు అవయవములకంటె వేరుగ పదము, వాక్యము అనునవి ఉండునని యంగీకరించక పోవుటచే), తేషాం = ఆ వర్ణరూపములలో లేదా పదరూపములగు భావములకు, అవ్యపదేశ్యత్వాత్ = పదము లేదా వాక్యము అని వ్యవహారము లేకపోవుటవలన (వాచకము పదము—లేదా వాక్యము అనుటకు వీలుకాదు. కానినాడు) అన్యత్ = ఆ పదవాక్యములకంటె ఇతరమైనది, కిం = ఏది, అపదిశ్యతామ్ = వాచకముగా వ్యవహరింపబడును?

తా. స్వతంత్రముగ పదములుగ వ్యవహరింపబడునవి కలిసి వాక్యము, అట్టి వర్ణములు కలిసి పదము అగుచున్నవి అనినచో ఘటమును విభాగముచేసి పరమాణువుల వరకు ఎట్లు విభజించిరో అట్లే వర్ణములయందు కూడ వర్ణభాగములను కల్పింపవచ్చును. ఇట్లు కల్పించుకొనుచు పోయినచో దానికి అంతము ఉండదు. అంతేకాక అనిత్యములగు వర్ణములు ఉత్పత్తివినాశములు కలవియగుటచే ఏకకాలమున ఉండవు. కావున కలియుట సంభవింపదు. వర్ణములకంటె వేరుగ పదమునుకాని పదములకంటె వేరుగ వాక్యమును కాని అంగీకరించనపుడు వాక్యార్థమునకు వాచకము ఏది?

వి. వాక్యార్థము ప్రతీతమగుచున్నదికదా? దానికి వాచకమును కల్పించవలెను కనుక నిత్యము అఖండమునగు పదము-లేదా వాక్యము స్ఫోటరూపమును శబ్దము కలదనియు అదియే వాచకమనియు అంగీకరింపవలెను.

స్ఫోటరూపమగు శబ్దము ద్వివిధము. అంతరము—బాహ్యము అని. ఆయాస్థానకరణములందు వాయ్వభిఘాతముచే పుట్టిన నాదములచే ప్రకాశింపచేయబడి శ్రవణగోచరమగునది బాహ్యము. ఇది అభివ్యంజకము; వ్యక్తిరూపము—జాతిరూపము అని ద్వివిధము. ఇదియు అఖండము నిత్యము. దీనిని వినుటచే బుద్ధిలో భాసించు శబ్దము అంతరము. ఇది అంతర స్ఫోటరూపము; పదరూపము, లేదా వాక్యరూపమై యుండును. అదియే వాస్తవముగ వాచకమని అంతరమగు బుద్ధ్యనుసంహారము వాక్యమని వాక్యలక్షణములలో నిర్దేశించిన భేదమును వివరించుచున్నారు.

యదంతః శబ్దతత్త్వం తు నాదైరేకం ప్రకాశితమ్
తదాహు రపరే శబ్దం తస్య వాక్యే తథైకతామ్. 30

[ఇంతవరకు బహిరూపమగు వ్యక్తిస్ఫోట జాతి స్ఫోట రూపముగల శబ్దము వాచకము అని ప్రతిపాదింపబడినది] తు = కాని, యత్ = ఏ, అంతః = హృదయమునందుండు, శబ్దతత్త్వం = జ్ఞానరూపమగు శబ్దతత్త్వము, ఏకం = విభాగరహితమయ్యును, నాదైః =

క్రమముకలిగిన ధ్వనిరూపములగు భాగములచే, ప్రకాశితం = ప్రకాశింపచేయబడునో, తత్ = ఆ, శబ్దం = పదరూపమగు శబ్దము వాచకముగ, అపరే = కొందరు, ఆహుః = చెప్పుదురు, తస్య = ఆ పదమునకు, ఏకతాం = సజాతీయభేదము, స్వగతభేదము, లేకుండుటను, ఆహుః = చెప్పుదురు, తథా = అట్లే, వాక్యే = వాక్యమునందుకూడ, ఏకతాం = ఏకత్వమును (సజాతీయ స్వగత భేద రాహిత్యమును), ఆహుః = చెప్పుదురు.

తా. శబ్దములకు అక్షరచిహ్నరూపమగు లిపి కల్పితమగుటచే ఎట్లు అవాస్తవమో అట్లే శ్రవణగోచరమగు శబ్దము వ్యక్తిరూపమేయైనను, జాతిరూపమేయైనను నశించునదే కావున వాస్తవముగ వాచకము కాదు. దానిచే బుద్ధియందు ప్రకాశింపచేయబడి బుద్ధియందు అనుసంధానము చేయబడిన పదము లేదా వాక్యమే వాచకము. ఆ బౌద్ధమగు వాక్యమున పద వర్ణరూపాది విభాగము వాస్తవముగ లేకున్నను ఏ ధ్వనులచే ఇది ప్రకాశితమగునో ఆ ధ్వనులయందుగల క్రమముచే, క్రమము కలదివలె భాసించును. ఈ బుద్ధ్యనుసంహార రూపమగు శబ్దమే వాచకము.

కేవలము వాక్యమే అఖండమును వర్ణపదరూపవిభాగరహితమును కాదు. వాక్యార్థమగు ప్రతిభకూడ పదార్థరూపవిభాగరహితమే. కల్పితములగు పదార్థరూపములగు భాగములచే విభాగము కలది వలె భాసించునని చెప్పుచున్నారు.

అర్థభాగై స్తథా తేషా మాంతరోఽర్థః ప్రకాశ్యతే
ఏకస్యై వాత్మనో భేదౌ శబ్దార్థా వపృథక్స్థితౌ. 81

తేషామ్ = ఆంతర జ్ఞానరూపమగు అఖండ వాక్యమే వాచకము, అది వాసనారూపమున శబ్దార్థోభయాత్మకమై యుండును అని చెప్పువారి మతమున, తథా = వాక్యము వలె, అర్థః = ప్రతిభాత్మకమగు వాక్యార్థము కూడ, ఆంతరః = జ్ఞానరూపమై, అర్థభాగైః = పరికల్పితములగు పదార్థరూపములగు భాగములచే, ప్రకాశ్యతే = అభివ్యక్తము చేయబడును, శబ్దార్థౌ = ఆ శబ్దార్థములు (వాక్య వాక్యార్థములు), ఏకస్య ఆత్మనః ఏవ = ఒక శబ్ద తత్వము యొక్కయే, అపృథక్స్థితౌ = ఒకదానిని విడిచి వేరొకటియుండని, భేదౌ = విశేషములు.

తా వాచకమగు శబ్దము బౌద్ధము (బుద్ధి సంబంధమైనది) అయినట్లే వాచ్యమగు అర్థము కూడ బౌద్ధమే. ఆ యర్థము బాహ్యమగు అర్థముచే ప్రకాశింపచేయబడును. ఉపాధి వశమున నీ బాహ్యార్థమున కల్పింపబడిన పదార్థ విభాగము ఆంతరమగు బౌద్ధ వాక్యార్థమున నారోపింపబడును. అది వాసనారూపమున బుద్ధియందు నిలిచి వ్యవహారహేతు వగును. కాని వాస్తవమున జ్ఞానమే శబ్దరూపము, అర్థరూపమునై యుండును. అదియు అఖండమేయై యుండును. వాసనారూపమున శబ్దార్థోభయాత్మకత్వము, విభాగము దానియందుండును. అందుచే శబ్దము, అర్థము అనునవి అవిభాజ్యమగు అఖండజ్ఞానముయొక్క ఆరోపింపబడిన వాసనారూపమున నుండు విశేషములని ఎరుంగవలెను.

శబ్దార్థములు వాచ్యవాచకములని ప్రసిద్ధమే కదా ? వాచకము శబ్దము, వాచ్యము అర్థము-ప్రకాశకమగుటచేతనే శబ్దము వాచకమగుచున్నది. అర్థప్రకాశమున శబ్దము కారణము కావున శబ్దార్థములు కార్యకారణములుగా కూడ వ్యవహరింపబడుచున్నవి. శబ్దార్థములు ఏకత్వమే యైనచో ప్రకాశ్య ప్రకాశక భావము, కార్యకారణభావము

కుదురదు. ఒకేవస్తువు కార్యము కారణము, ప్రకాశ్యము ప్రకాశకము కూడ కాదు కదా! ఏకతత్త్వ మనుట ఎట్లు ? అని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

ప్రకాశకప్రకాశ్యత్వం కార్యకారణరూపతా
అంతర్మాత్రాత్మన స్తస్య శబ్దతత్త్వస్య సర్వదా . 32

అంతర్మాత్రాత్మనః = (బుద్ధిలో విషయముగా శబ్దము భాసించునపుడు) విషయాత్మకమగు, తస్యశబ్దతత్త్వస్య = ఆ శబ్దతత్త్వమునకు (శక్తిద్వయ సంబంధ ముండుటవలన) సర్వదా = ఎల్లపుడు, ప్రకాశకప్రకాశ్యత్వం = ప్రకాశకప్రకాశ్యభావము, కార్యకారణరూపతా = కార్యకారణభావము ఉండును.

తా. బాహ్యముగ శ్రవణగోచరమగుచున్న శబ్దము కూడ కేవలము బాహ్యము కాదు. అది బుద్ధియందు గోచరమగు జ్యోతీరూపమగు శబ్దతత్త్వమే. దానికి రెండు శక్తులు కలవు. అందొకటి ఎల్లపుడు శబ్దమును విడువకయుండు ప్రకాశకశక్తి. వేరొకటి కాదాచిత్కముగ నుండు ప్రకాశ్యత్వశక్తి. శబ్దతత్త్వమున ఈ రెండు శక్తులు కూడియే యుండును. అందుచే శక్తిద్వయ యుక్తమగు శబ్దము ఒకటియే అయియున్నను బయటికి విభాగమున్నట్లు భాసించును. బుద్ధిరూపమగు ఉపాధి సంబంధముచే ఈ శబ్దతత్త్వమే విభువు, నిత్యము, నిరవయవము అగు ఆత్మస్వరూపమయ్యు అంతర్మాత్ర (బుద్ధి గోచరమగు శబ్దతత్త్వము) అని వ్యవహరింపబడును. ఇది జీవాత్మవంటిది. దీనికి సూక్ష్మమగు రూపము స్థూలమగు రూపము కూడ కలవు. సూక్ష్మమగు రూపము అంతరముగ పరా పశ్యంతీ మధ్యమా రూపములతో ఉండును. స్థూలరూపము, స్వరవర్ణరూపమై వైఖరీరూపమున భాసించును. ఇది శబ్దార్థమయ మగుటచే ప్రకాశ్య ప్రకాశకత్వము విరుద్ధము కాదు. శబ్దతత్త్వమున కాలకృత పరిచ్ఛేదము లేకపోయినను ప్రకాశకత్వ శక్తితో ఎల్లప్పుడు కూడియున్నట్లును వ్యామోహము అవిద్యచే కల్గుచుండును.

శబ్దార్థోభయాత్మకమును జ్ఞాన స్వరూపమును అగు శబ్దతత్త్వమునకు నిత్యములగు భావాభావములు ఉండును. అవి ఏకరూపములు. క్రమరహితములు. ఐనను శక్తిభేదము వలన క్రమము కలవిగను, ఒకప్పుడుండి ఒకప్పుడు లెనివిగను భాసించును.

తస్యైవా స్తిత్వనా స్తిత్వసామర్థ్యే సమవస్థితే
అక్రమే క్రమనిర్భాసే వ్యవహారనిబంధనే . 33

తస్యైవ = ఏకము, ఆత్మస్వరూపము, శబ్దార్థోభయాత్మకము నగు ఆ శబ్దతత్త్వమునకే, అస్తిత్వ నాస్తిత్వ సామర్థ్యే = భావము, అభావము (ఉండుట, లేకపోవుట) అను సామర్థ్యములు, సమవస్థితే = స్వరూపములై ఉండును, అక్రమే = క్రమరహితములయ్యు, క్రమనిర్భాసే = ఆ భావాభావముల క్రమము ప్రతీతమగునట్లు చేయునవియై, వ్యవహార నిబంధనే = లోకములోని శబ్దము వాచకము, అర్థము వాచ్యము అను వ్యవహారమును కల్గించుటకు కారణములగుచున్నవి.

తా. జ్ఞానరూపమై, ఏకమై ఉండు వాక్యస్ఫోటమున శబ్దార్థోభయాత్మకత నిత్యముగా ఉండును. దానికి భావము, అభావము అను రెండు సామర్థ్యములు నిత్యముగ కలవు. అవి దాని స్వరూపముకంటె వేరు కావు. ఆ సామర్థ్యముచే ఈశబ్దార్థములు లోకమున ఒకప్పు

దున్నట్లు, ఒకప్పుడు లేనట్లు భాసించుటచే ఒకటి ముందు, ఒకటి తరువాత అను క్రమము, ఒకటి ప్రకాశకము, ఒకటి ప్రకాశ్యము అను భేదము వ్యవహరింపబడుచున్నవి.

పదము పారమార్థికమను పదస్ఫోటవాదమును దూషించుచున్నారు.

సంప్రత్యయప్రమాణత్వాత్ పదార్థాస్తిత్వకల్పనే
పదార్థాభ్యుచ్చయే త్యాగా దానర్థక్యం ప్రసజ్యతే. 34

సంప్రత్యయప్రమాణత్వాత్=వాక్యమున పదములు, పదార్థములు ప్రతీయమానములగుచుండుట వలన, పదార్థాస్తిత్వకల్పనే=పదములు, పదార్థములు వాస్తవముగా నున్నవని కల్పించినచో, పదార్థాభ్యుచ్చయే = పూర్వపూర్వపదముల యర్థములతో కూడిన స్వార్థమునే తరువాతి పదములు బోధించు నను పదార్థ సముచ్చయముగ, త్యాగాత్= కేవల స్వార్థమును విడనాడుటచే, ఆనర్థక్యం=పూర్వపూర్వపదముల ఉచ్చారణమునకు వైయర్థ్యము, ప్రసజ్యతే =ప్రాప్తించును.

తా. వాక్యమున పదములు, పదార్థములు భాసించుచుండుటచే పదములు, పదార్థములు పారమార్థికములని యంగీకరించినచో ఆ పదార్థములన్నియు కలిసి వాక్యార్థముగా నుండును. కావున పూర్వపూర్వపదార్థములతో గూడిన స్వార్థమే ఉత్తరపదమున కర్థమని చెప్పవలెను. అట్లు చెప్పినచో ముందరిపదముల యర్థము తరువాతిపదములచే చెప్పబడుటచే పూర్వపదోచ్చారణము వ్యర్థమగును. అంతేకాక కేవలపదార్థమును పదము బోధింపదు కావున పదార్థము ప్రతీతమగుచుండుటచే అది పరమార్థమనుట కూడ కుదురదు.

పదము (పరమార్థముగ) వాస్తవముగ నుండునది యనినచో అది అంతటను ఏక రూపమై యుండవలెను. అట్లు కనప్పట్టుట లేదు కావున పద మసత్యము అని నిరూపించుచున్నాడు.

రాజశబ్దేన రాజార్థో భిన్నరూపేణ గమ్యతే.

భిన్నరూపేణ=రాజా, రాజానం, రాజ్ఞా, రాజ్ఞే, రాజ్ఞి అని భిన్నములగు రూపములు గల, రాజశబ్దేన=రాజపదముచేత, రాజార్థః=రాజు అను అర్థము, గమ్యతే=తెలియజేయబడుచున్నది.

తా. పదము సత్యము అన్నచో అది అంతట ఏకరూపముగ ఉండియుండును. రాజరూపార్థమును తెలియజేయుపదములు ఆయా వాక్యములలో భిన్నరూపములతో కన్పట్టుచున్నవి. సత్యమే యన్నచో పదము సర్వత్ర ఏకరూపముగ కన్పట్టును. అట్లు కన్పడుట లేదు కావున పదములు మిథ్యాభూతములు.

పదము సత్యము కాదనుటకు వేరొక హేతువును చూపుచున్నాడు.

వృత్తా వాఖ్యాతసదృశం పద మన్య త్ప్రసజ్యతే. 35

(వాక్యములో పదము సత్యమేయయినచో) వృత్తౌ='రాజపురుష' మొదలగు సమస్తపదమున, ఆఖ్యాత సదృశం='రాజ' అను క్రియావాచకముతో తుల్యమగు, అన్యత్ పదమ్=వేరొకపదము, ప్రసజ్యతే=భాసింపవలసివచ్చును.

తా. పదములే సత్యమనినచో 'రాజపురుషః' అను సంబోధనాంతమగు సమస్త పదమును ప్రయోగించినపుడు రాజపురుషుడా! అనునర్థమును మాత్రమేకాక, "పురుష=

ఓ పురుషుడా, రాజ=ప్రకాశించుము" అను నర్థము వచ్చునట్లు 'రాజ' అని రాజధాతువు లోట్ మధ్యమైక వచనాంతము అగు పదముకూడ ప్రతీతి విషయము కావలెను. వాని అట్టి అనుభవము లేదు. కావున వాక్యార్థగ్రహణమునకు కల్పింపబడినవే పదపదార్థములు కాని వాస్తవములు కావు.

రాజా, రాజానాం, రాజ్ఞా మొ॥ స్థలములందు రాజశబ్దము నియతరూపముగ లేదు. రాజపురుషః ఇత్యాదులలో నియతరూపమున్నను నియతముగ విశిష్టార్థమునే బోధించును కాని రాజపదము భిన్నార్థమును బోధింపదు కావున పదములు కాని పదార్థములు కాని పారమార్థికములు కావు అని నిరూపించుచు "రాజపురుష" అనునపుడు కూడ "రాజ" అనునది ప్రత్యేకార్థము కలది కాదని నిరూపించుచున్నాడు.

యథాశ్వకర్ణ ఇత్యుక్తే వినైవాశ్వేన గమ్యతే
కశ్చిదేవ విశిష్టోఽర్థః సర్వేషు ప్రత్యయ స్తథా . 86

యథా=ఏవిధముగ, అశ్వకర్ణః ఇత్యుక్తే=అశ్వకర్ణశబ్దము నుచ్చరించునపుడు, అశ్వేన వినైవ = సమాసములోనున్న అశ్వపదముయొక్క అర్థములేకయే, కశ్చిదేవ విశిష్టోఽర్థః=వృక్షవిశేషరూపమగు ఒకానొక విశిష్టార్థమే, గమ్యతే=భాసించునో, తథా= ఆవిధముగనే, సర్వేషు=సమాసము లన్నింటియందుకూడ, ప్రత్యయః=అవయవార్థము లేకుండ విశిష్టార్థమే (భాసించును).

తా. అశ్వకర్ణః మొదలగు పదములు వృక్షవిశేషవాచకములు. అవి బహువ్రీహి సమాసమున అశ్వ, కర్ణ అనుశబ్దముల కలయికచే ఏర్పడినట్లు కల్పింపబడినవి. కాని వాస్తవముగ అశ్వశబ్దార్థము ఆ సమాసముచే స్ఫురింపదు. కేవలము వ్యుత్పత్తికై పదవిభాగము కల్పింపబడినది.

అట్లే రాజపురుషః మున్నగు సమాసములలో విశిష్టార్థబోధకత్వమే కాని పదార్థప్రతీతి యుండదు. అందలి పదములు సత్యములు కావు. కాల్పనికము లని ఎరుంగ నగును.

ఇట్లు 'రాజపురుషః' మున్నగు సమస్త పదములలోగూడ అశ్వకర్ణాది సమస్త పదము లందువలె పూర్వపదార్థోత్తరపదార్థములకు అన్వయము లేదన్నచో అశ్వకర్ణాది శబ్దములు రూఢి శబ్దములు, రాజపురుషాది శబ్దము లవయవార్థస్ఫురణముండుటచే యౌగికములు అని రూఢి యోగ విభాగమెట్లు సంభవించును ? అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

వాక్యే త్వర్థాంతరగతేః సాదృశ్యం పరికల్ప్యతే
కేషాంచిద్ రూఢిశబ్దత్వం శాస్త్ర ఏవానుగమ్యతే . 87

వాక్యేతు=లౌకికవిగ్రహ వాక్యమునందు, వృత్తికంటె, అర్థాంతరగతేః=రాజ పురుషః, అక్షికః మున్నగుచోట వేరొకయర్థము భాసించుచుండుటచే, సాదృశ్యం=పరస్పరము వృత్తిచే బోధింపబడు నర్థమునకును, విగ్రహవాక్యముయొక్క అర్థమునకును సాదృశ్యము, పరికల్ప్యతే=కల్పింపబడును. (అట్టి వృత్తి-వాక్యముల యర్థములకు సాదృశ్యమును కల్పించినవానిని యౌగికములందురు). కేషాంచిత్=అశ్వకర్ణః మొదలగు కొన్ని శబ్దములకు (వృత్తి-విగ్రహవాక్యముల యర్థములందు పూర్తిగ భేదమే కల శబ్దములకు)రూఢి

శబ్దత్వం = రూఢిశబ్దములు అని వ్యవహారము, శాస్త్రే ఏవ = శాస్త్రమునందే, అనుగమ్యతే = అనుసరింపబడుచున్నది.

తా. రాజపురుషః, ఆక్షికః మున్నగునవి యౌగికశబ్దములు. అశ్వకర్ణః, తైలపాయికా మున్నగునవి రూఢిశబ్దములు. ఈ రెండువిధములగు శబ్దములలో గూడ, సమస్త పదమునకు విశిష్టార్థబోధకత్వమే కాని పదపదార్థవిభాగము కాల్పనికము. పదవిభాగము, పదార్థవిభాగము లేనపుడు యౌగికము, రూఢము అను భేదము ఎట్లువచ్చినదో చెప్పుచున్నాడు. "రాజ్ఞః పురుషః = రాజపురుషః" అనుచోట వృత్తికి, విగ్రహవాక్యమునకు అర్థము ఒకేవిధముగ నున్నట్లు కన్పించును. కాని శాస్త్రప్రకారము చూచినచో సమాసములో రాజపదార్థము పురుషపదార్థమునకు ఉపసర్జనముగనే భాసించును. "రాజ్ఞః పురుషః" అన్న వాక్యములో "రాజ్ఞః" అను పదార్థము ముందు భాసించి తరువాత పురుషపదార్థములో విశేషణముగ భాసించును. ఈ భేదమున్నను ఈ రెండర్థములు సదృశములని, వానిని యౌగిక శబ్దములందురు.

అశ్వకర్ణః అనుచోట ఒకానొకచెట్టు అని సమస్తపదమునకు అర్థము. అశ్వముయొక్క కర్ణముల వంటి ఆకులు కలది అని విగ్రహవాక్యమున కర్థము. ఈ రెండర్థములకు భేదమే కాని సాదృశ్యము లేదు. కనుక ఇది రూఢశబ్దము. ఇట్టివే సంజ్ఞావాచకములు. ఆయా వ్యాకరణ కార్యములకై శాస్త్రమునందు ఈ రూఢశబ్దములను నిరూపించిరి. అంతియే కాని వాస్తవమునకు సమస్తపదములలో విశిష్టార్థమేకాని అవయవార్థము లేదు.

సమస్తపదములం దాయాపదములయొక్క విభాగము, వాక్యములందు పదవిభాగము, పదములందు ప్రకృతి ప్రత్యయ విభాగము ఉన్నట్లు శాస్త్రము చెప్పుచున్నది. ఆ విభాగమును పరిత్యజించుటచే శాస్త్ర ప్రామాణ్యము చెడిపోవునుకదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

> ఉపాదాయాపి యే హేయా స్తా నుపాయన్ ప్రచక్షతే
> ఉపాయానాం చ నియమో నావశ్య మవతిష్ఠతే . 38

యే = ఏవి (పదసిద్ధికి ప్రకృతిప్రత్యయాదులు, వృత్తిసిద్ధికి పదములు మున్నగునవి), ఉపాదాయాపి = స్వీకరించియును, హేయాః = ప్రయోజనసిద్ధి అయిన తరువాత విడువదగినవో, తాన్ = వానిని, ఉపాయాన్ = ఉపాయములనుగా, ప్రచక్షతే = చెప్పుదురు, ఉపాయానాం = ఉపాయములయొక్క (పదసిద్ధికై ఆశ్రయించు ప్రకృతి ప్రత్యయాది కల్పన, వృత్తిసిద్ధికై కల్పించు విగ్రహవాక్యములు), నియమః = ఈరీతిగనే యుండవలెనను నియతి, అవశ్యం = తప్పక, నావతిష్ఠతే = ఉండదు.

తా. శబ్ద పరిజ్ఞానమునకు శాస్త్రము ఉపాయము. వైయాకరణులు పదజ్ఞానమునకు సాధనముగా ప్రకృతి ప్రత్యయములను, వృత్తి పరిజ్ఞానమునకు విగ్రహవాక్యముగ కొన్ని పదములను ఆశ్రయింతురు. అవి ఆయా శాస్త్రకారుల యభిప్రాయముచే భిన్న భిన్నముగా కల్పింపబడును. పదస్వరూప జ్ఞానము కలిగిన తరువాత ఆ ఉపాయముల ఆవశ్యకత లేదు. కనుక అవి పరిత్యజింపబడును. అవి శాస్త్రకారులచే కల్పితములే కాని వాస్తవికములు కావు. కనుకనే ఒక్కొక్క వైయాకరణుడు ఒక్కొక్క విధముగ ఆ ప్రకృతి ప్రత్యయ విభాగమును కల్పించును. కావున వానిని పరిత్యజించుట దోషము కాదు.

వి. ఈ ఉపాయముల చేతనే కాక వేరొకవిధముగ ఆ జ్ఞానమును సంపాదించి నను సంపాదించవచ్చును. ఇట్లే వాక్యార్థజ్ఞానమునకు సాధనములుగ పదములు, పదార్థములు కల్పింపబడును; కాని నియమతలు కావు.

ఒకరు పాణినిరచించిన వ్యాకరణము ననుసరించి శబ్దముల నెరుంగవచ్చును. వేరొకరు మరొక వ్యాకరణశాస్త్రము ననుసరించి ఎరుంగవచ్చును. కాని సమాసరూపమున సంసృష్టమైన అర్థమైనను, విభక్తమై విగ్రహ వాక్యరూపమున నుండు అర్థమైనను వాక్యార్థముచేతనే ఎరుంగనగును కాని ప్రత్యేకమెరుంగుటకు వీలుకాదు అని నిరూపించుచున్నాడు.

అర్థం కథంచిత్ పురుషః కశ్చిత్సంప్రతిపద్యతే
సంసృష్టా వా విభక్తా వా భేదా వాక్యనిబంధనాః. ౮౭

కశ్చిత్ పురుషః = ఒకానొక పురుషుడు, అర్థం = వాక్యార్థమును, కథంచిత్ = పద పదార్థములను కల్పించుకొని ఎట్లో, సంప్రతిపద్యతే = ఎరుంగుచున్నాడు, భేదాః = పద పదార్థరూపములగు భేదములు, సంసృష్టాః వా = రాజపురుషః మున్నగువానివలె కలిసియున్నవి యైనను, విభక్తాః వా = 'రాజ్ఞః పురుషః' మున్నగువానివలె వేరుగా నున్నను, వాక్యనిబంధనాః = వాక్య వాక్యార్థజ్ఞానమును కల్గించుట కేర్పడినవే.

తా. పదస్వరూప నిర్వచనము వాక్యస్వరూపము నెరుంగుటకే. ఆ పదలక్షణములు భిన్న భిన్నములుగా నుండును. శ్రోత్రియ శబ్దమునకు "ఛందః అధీతే ఇతి శ్రోత్రియః", ఛందస్సును అధ్యయనము చేయువాడు అను వ్యుత్పత్తి నాశ్రయించి, ఛందస్ శబ్దమునకు శ్రోత్రాదేశమును, అధ్యయనము చేయుచున్నాడను నర్థమున "ఘన్" ప్రత్యయమును వచ్చి, ఆ ప్రత్యయమునకు ఇయాదేశమువచ్చుటచే, 'శ్రోత్రియ' రూపము నిష్పన్నమైనదని పాణిని చెప్పెను. ప్రాచీన వైయాకరణులు శ్రోత్రశబ్దమునకు, ఘన్ ప్రత్యయము చేరగా శ్రోత్రియ శబ్దము నిష్పన్నమైనదని కల్పించిరి. ఇట్లే ఆఖనిక శబ్దము 'ఆఖని' అను ప్రకృతికి ఇక ప్రత్యయము చేరుటచే ఏర్పడినదని కొందరు చెప్పగా, ఆ, ఖని, క అని మూడు భాగములుగ కల్పించి అ = అతిశయితా ఖనిః యస్య సః = అఖనికః అని కొందరు చెప్పిరి. ఈ విధముగా ఏదో ఒక విధముగ పదపదార్థజ్ఞానము కల్గించుటకు లాక్షణికులు లక్షణముల నేర్పరతురు. కాని అవి యేకరూపమున నున్నను విభక్తములై ప్రత్యేక పదములుగ నున్నను వాక్యమున ప్రయోగింపబడినవే అర్థబోధకములగును. రాజపురుషః అన్నను రాజ్ఞః పురుషః అన్నను, అది వాక్యములో ప్రయోగింపబడినపుడు 'రాజపురుషః పశ్యతి' 'రాజ్ఞః పురుషః పశ్యతి' అనుతీరున వాక్యరూపమున నుండియే అర్థవంతము లగును. ఆ వాక్యార్థమును ఎరుంగజేయుటకే ఈ కల్పితమగు పద పదార్థ విభాగము. అంతేకాని వానికి ప్రత్యేకార్థవత్త్వము, స్వరూపము లేదు.

వి. "ఆఖనిక, శ్రోత్రియ" మొదలగు శబ్దములు ఆయా లాక్షణిక నిర్వచనముల ననుసరించి భిన్నములయినట్లు కన్పించినను, అవి అఖండములై ఉండును. ఇంతే కాక "దేవదత్త గామ్ ఆనయ" అని కొన్ని పదములతో గూడిన వాక్యమయినను, 'విధేహి' (మూయుము) మున్నగు వ్యస్తపద రూపముగ నున్న వాక్యముమైనను, వాక్యరూపమున నున్నప్పుడే, ఆ పదములచే అర్థబోధ కలుగును. కాని ప్రత్యేకముగ పదములు అర్థబోధక

ములు కావు. పదములను విడి విడిగ చూపుట కేవలము నేర్చుకొనువారికి వాక్యార్థజ్ఞానమును కల్గించు ఉపాయమే.

వాక్యార్థము నిరవయవము, పదార్థ విభాగము వాక్యార్థ జ్ఞానమునకై కల్పితము. వాక్యము నకు వాక్యార్థమునకు తాదాత్మ్య సంబంధమును ఆరోపించుటచే, వాక్యము వినగనే వాక్యార్థము ప్రతీయమాన మగుచున్నది. వాక్యమునందు పదములు వర్ణములు అను విభాగము లేదు వాక్యార్థముతో సంబంధము సంకేతితముగ ఒక వర్ణమునకు కల్పించినను 'భా, భీ' మొదలగు వర్ణ మాత్రమున గూడ వాక్యార్థము భాసించును అని వివరించుచున్నారు.

సోఽయమి త్యభిసంబంధో బుద్ధ్యా ప్రక్రమ్యతే యదా
వాక్యార్థస్య తదైకోఽపి వర్ణః ప్రత్యాయకః క్వచిత్ . 41

యదా = ఎప్పుడు, సోఽయ మిత్యభిసంబంధః = వాక్యార్థమునకు వాక్యముతో అదే ఇది అను తాదాత్మ్య సంబంధము, బుద్ధ్యా = బుద్ధిచే, ప్రక్రమ్యతే = శాబ్దబోధకు ముందుగా తెలిసికొనబడునో, తదా = అప్పుడు, ఏకోఽపివర్ణః = వాక్యార్థమునందు సంకేతిత మగు ఒక్క వర్ణమైనను (వాక్యము వలెనే), వాక్యార్థస్య = వాక్యార్థమునకు, క్వచిత్ = ఒక్కొక్కచోట, ప్రత్యాయకః = వాచకము - అగును.

భా. పరస్పరము భిన్నములయిన అనేకపదములతో కూడిన 'గామ్ ఆనయ శుక్లామ్ దండేన' మున్నగు వాక్యరూపమున శబ్దము ఆవరుసలో నున్న తన పద ముల చేతనే వాక్యార్థమును స్ఫురింపజేయును అని నియమము లేదు. ఆ వాక్యమునందు ఒక వర్ణము సంకేతితమైయున్నచో దానివలన గూడ ఆ వాక్యార్థము స్ఫురింపగలదు. కావున పద పదార్థములకు ప్రాధాన్యము లేదు. పదమున ప్రకృతి ప్రత్యయ విభాగమునకును ప్రాధాన్యము లేదు. లోకవ్యవహారమున వాక్యార్థ జ్ఞానముకల్గినను శాస్త్రజమగు పద నిర్మాణ జ్ఞానముచే వాక్యార్థ జ్ఞానము కల్గినను సమానమే:

వి. ప్రతి వాక్యమును వ్యవహారముచే తెలిసికొనుట శ్రమసాధ్యమని శాస్త్రముచే ప్రకృతి ప్రత్యయ విభాగము, పద పదార్థవిభాగము కల్పింపబడినది. కాని, వాక్యార్థము క్రమరహితము. అది క్రమరహితమగు వాక్యమువలననే జనించును. శాస్త్రవాసన కలవారికి మాత్రము పదార్థజ్ఞాన పూర్వకముగ వాక్యార్థజ్ఞానము కలిగినట్లు భాసించుట మిథ్యా పరికల్పితమగు ప్రకృతి ప్రత్యయాది విభాగ జ్ఞాన ముండుటచేతనే అని ఎరుంగవలెను. అందుచేతనే పదమున ప్రకృతి ప్రత్యయ విభాగము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగ కల్పించుకొనిరి. "పచతి" అనుచోట పచ్-ధాతువు, అ, తి, అనునవి రెండు ప్రత్యయములు- అని కొందరు విభజింపగా, పచ్-ధాతువు, అతి-ప్రత్యయమును అని కొందరు విభజించిరి. అందుచే విభాగము నియతము కాదు. అది వాక్యార్థజ్ఞానము కల్గించుటకు సాధనముమాత్రమే అని ఎరుంగవలెను.

అభిహితాన్వయవాదమున పదసంఘాతము వాక్యము అను వాక్యలక్షణమును ఉపపాదించుచున్నాడు.

కేవలేన పదే నార్థో యావానే వాభిధీయతే
వాక్యస్థం తావతోఽర్థస్య తదాహు రభిధాయకమ్ . 41

కేవలేన = అన్వయయోగ్యమగు పదాంతరముతో సంబంధములేని, పదేన = పదముచేత, యావాన్ = ఎంత, అర్థః = అర్థము, అభిధీయతే = తెలియచేయబడునో, వాక్యస్థం = వాక్యముననుండు, తత్ = ఆ పదము, తావతఏవ అర్థస్య = అంతమాత్రపు అర్థమునకే, అభిధాయకమ్ = వాచకము అగును అని, ఆహుః = చెప్పుదురు.

తా. ఇతరపదార్థములతో అన్వయము లేక కేవలము ఏయర్థమును మాత్రము పదము బోధించునో వాక్యములో ఇతరపదములతో కలిపి ప్రయోగింపబడినపుడు కూడ ఆ పదము ఆ యర్థమునే బోధించును. పరస్పర మాపదముల యర్థముల అన్వయము (సంసర్గము) ఆ కాంక్షచే తెలుపబడును. లేదా వాక్యమున లక్షణావృత్తిచే బోధింపబడును.

సంబంధే సతి యత్త్వన్య దాధిక్య ముపజాయతే
వాక్యార్థమేవ తం ప్రాహు రనేకపదసంశ్రయమ్ . 42

సంబంధే సతి = కేవలపదములచే తెలియచేయబడు అర్థములకు సంబంధము కలుగగా, అన్యత్ = ఆ పదార్థములకంటె వేరుగ, యత్ ఆధిక్యం = పరస్పర సంబంధరూపమగు ఏయధికార్థము, ఉపజాయతే = భాసించునో, తం = ఆ యర్థమును, అనేకపదసంశ్రయమ్ = అనేకపదముల నాశ్రయించియున్న, వాక్యార్థమేవ = వాక్యార్థముగనే, ప్రాహుః = చెప్పుదురు.

తా. పదములు పరస్పరము కలిసి వాక్యముగా నున్నపుడు కేవల పదార్థములు కాక వానికిగల సంబంధము అధికముగ భాసించును. ఆ యధికముగ భాసించు పదార్థముల పరస్పరాన్వయరూపమగు నర్థము అనేక పదసమాశ్రయమగు వాక్యార్థముగ నెరుంగవలెను.

వి. "వీరః పురుషః" అన్నపుడు, ఆ రెండుపదములు విడివిడిగా ప్రయోగించినపుడు భాసించని విశేష్యవిశేషణభావము, లేదా ఒకే వ్యక్తియందు వీరత్వమను గుణము, పురుషత్వము అను జాతియు చేరియున్నవను సామానాధికరణ్యము భాసించుచున్నది. అది పదములు ప్రత్యేకముగ ప్రయోగించినపుడు భాసింపక కలిపి ప్రయోగించినపుడు భాసించుటచే నీ సంసర్గము వాక్యార్థమని ఎరుంగవలెను. పదాంతరముతో సంబంధము వాక్యార్థము అనినచో రాజ్ఞః (రాజుయొక్క) అనుచోట సంబంధము వేరొకపదముతో సంబంధమున్నపుడే భాసించును కనుక అది పదార్థ మెట్లగును ? ఘటం (కుండను) అనుచోట కర్మత్వము క్రియావాచక పదసంబంధములేనిదే భాసింపదుకదా? అది పదార్థమెట్లగును అని శంకకలుగవచ్చును. రాజ్ఞః, ఘటం (రాజుయొక్క కుండను) అనుచోట పదాంతర సాపేక్షమైయున్నను అది వాక్యార్థముకాదు. పదార్థమేయని శాస్త్రనిర్ణయము. పదసంస్కారమునకు ఏ యర్థజ్ఞానము నిమిత్తమగునో ఆ యర్థము పదార్థము. రాజ్ఞః రాజుయొక్క అనుచోట షష్ఠీవిభక్తి రాజన్‌శబ్దమునకు సంబంధార్థమున చేరిననాడే రాజ్ఞః అనుపదము సాధువగును. అందుచే ఇచట భాసించు స్వస్వామిభావరూపసంబంధ జ్ఞానము పదముచే కల్గునదేయని తెలియవలెను. వీరః పురుషః అనునపుడు విశేష్య విశేషణ భావరూప సంబంధము వీరః అను పదముయొక్క సంస్కారమునకు కాని, పురుషః అను పదముయొక్క సంస్కారమునకు కాని అవశ్యకము కాదు. కాన నది వాక్యార్థము. కాబట్టి సంసర్గము (సంబంధము) వాక్యార్థము అనునపుడు ఆసంసర్గము యొక్క స్వభావమును బట్టి దాని పదార్థత్వము, లేదా, వాక్యార్థత్వమును ఎరుంగనగును.

సంసర్గము వాక్యార్థము, అది అనేకపదసంశ్రయము అనునపుడు అనేక పదసంశ్రయమున గల రెండు మతములను వివరించుచున్నాడు.

స త్వనేకపదస్థోఽపి ప్రతిభేదం సమాప్యతే
జాతివత్ సముదాయేఽపి సంఖ్యావ త్కల్ప్యతే పరైః. 43

సః తు = ఆ వాక్యార్థమయితే, అనేకపదస్థోఽపి = వాక్యమునందలి పదముల నన్నింటిని ఆశ్రయించి యుండునదే యయినను, జాతివత్ = జాతివలె, ప్రతిభేదం = ప్రతిపదమున, సమాప్యతే = వ్యాపించి సమాప్తమగును, పరైః = మరికొందరిచే, సంఖ్యావత్ = ద్విత్వ బహుత్వాది సంఖ్యవలె, సముదాయేఽపి = సముదాయమునందుకూడ, కల్ప్యతే = కల్పింపబడుచున్నది.

తా. జాతి భిన్నవ్యక్తులయందుండుటచే, అనేకవ్యక్తులయందున్నను ప్రతివ్యక్తియందునుగూడ న్యూనత ఏమాత్రము లేక పరిపూర్ణముగ ఎట్లుండునో, అట్లే వాక్యార్థము అనేకపదనిష్ఠ మయ్యును ఆవాక్యమునం దుండు అర్థముకంటె ఏమాత్రము కొరవడకుండ ప్రతిపదమునందును ఉండును అని ఒక మతము. ఇరువది అనుసంఖ్య సముదాయమునే ఆశ్రయించునదైనను ప్రత్యేక మాయా ఇరువది వస్తువులందుకూడ ఇరువది అను సంఖ్యచే తెలియజేయబడుటకై ఎట్లు ఉండునో అట్లే వాక్యార్థము పదసముదాయమునందే యున్నను ప్రత్యేకపదములయందుకూడ ఉండును అని యొక మతము.

పదసంఘాతము వాక్యము అను పక్షమున అభిహితాన్వయవాదమును వివరించి అన్వితాభిధానవాదమును వివరించుచు పదార్థమే వాక్యార్థమని నిరూపించుచున్నాడు.

సర్వభేదానుగుణ్యం తు సామాన్య మపరే విదుః
త దర్థాంతరసంసర్గాత్ భజతే భేదరూపతామ్. 44

భేదా నాకాంక్షత స్తస్య యా పరిప్లవమానతా
అవచ్ఛినత్తి సంబంధ స్తాం విశేషే నివేశయన్. 45

అపరేతు = ఇతరులయితే, సర్వభేదానుగుణ్యమ్ = ఇతరపదార్థరూపములగు విశేషణము లన్నియు ఏదో ఒకసంబంధముతో అన్వయించుటకు తగిన, సామాన్యమ్ = సంబంధసామాన్యరూపమును, విదుః = పదార్థమునుగా చెప్పుదురు, తత్ = ఆ సంసర్గ సామాన్యమే, అర్థాంతర సంసర్గాత్ = వేరొకపదార్థము అన్వయించుటకు తగినది సన్నిధానమున ఉండుట వలన, భేరూపతామ్ = సంసర్గ విశేషరూపమును, భజతే = పొందును.

భేదాన్ = తనతో అన్వయించుటకు యోగ్యములగు పదార్థవిశేషములను, ఆకాంక్షతః = ఆకాంక్షించుచున్న, తస్య = ఆ సంబంధసామాన్యమునకు (పదార్థముగా ఉన్నదానికి), యా పరిప్లవమానతా = తనతో సంబంధించు పదార్థవిశేషనిశ్చయము లేకపోవుటచే గల్గిన ఏ అస్ఫుటత్వమున్నదో, తామ్ = ఆ సంబంధసామాన్యమును, సంబంధః = పదార్థాంతర సాన్నిధ్యము, విశేషే = అన్వయవిశేషమందు, నివేశయన్ = నిలుపుచు, అవచ్ఛినత్తి = తొలగించును.

తా. పదసంఘాతము వాక్యము, వాక్యఘటకములగు పదములకు కేవలముగా ఉన్నప్పు డే యర్థమో ఆ యర్థమే వాక్యమునందును ఉండును. పదార్థాన్వయ రూపమగు

సంసర్గము వాక్యశక్తిచే అభిహితమగును. అదియే వాక్యార్థమని అభిహితాన్వయవాదుల మతము. పదార్థాంతరముతో అన్వయింపతగిన స్వార్థమునే పదము బోధించును. ఆ అన్వయింపదగిన పదార్థము ఇది అని నిశ్చయముగా లేకపోవుటచే సామాన్యరూపముగ పదమే సంసర్గమునుకూడ తెలియజేయును. తనతో అన్వయింపదగిన పదార్థాంతరమును గూర్చి ఆకాంక్షించు సంసర్గసామాన్యము అర్థముగాగల పదమునకు పదార్థాంతర సాన్నిధ్యము ప్రత్యేకార్థమున అన్వయమును నిశ్చయించును. అనగా పదము మొదట సంసర్గ సామాన్యమును బోధించుననియు పదాంతర సంబంధము ఆ సామాన్యమైన సంబంధము ఏ పదార్థముతోనో నిర్ణయించు ననియు తెలియనగును. ఇట్లు చెప్పుటచే సంసర్గముకూడ పదార్థమే యనియు అదియే వాక్యార్థమనియు ప్రత్యేకము సంసర్గము వాక్యార్థము కాదనియు అన్వితాభిధానవాదమున సిద్ధాంతము.

పదార్థములకు పరస్పరము గల సంసర్గము వాక్యశక్తిచే తెలియబడునది గాదు. పదము మొట్టమొదట సంసర్గ సామాన్యమునే బోధించును. పదాంతర సన్నిధానమువలన ఆ పదార్థము ఏ పదార్థముతో అన్వయించునో ఆ సంసర్గ విశేషమున పర్యవసించును. ఈ సంసర్గ విశేషము పదార్థమే. కాని మొట్టమొదట తెలియజేయబడకపోవుటచే పదమునకు వాచ్యార్థముగ మొత్తమువాక్యమునకర్థము తెలియకమునుపు భాసింపదు. వాక్యమునకంతకు అర్థజ్ఞానము కల్గినపిమ్మట ఈ సంబంధ విశేషము కూడ పదముయొక్క అర్థమే అని అనుమానింపబడును— అని నిరూపించుచున్నాడు.

> కార్యానుమేయ స్సంబంధః రూపం తస్య న దృశ్యతే
> అసత్త్వభూత మత్యన్త మత స్తం ప్రతిజానతే. 46

సంబంధః = పదార్థములకుగల సంసర్గవిశేషము, కార్యానుమేయః = ఏ పదము యొక్క అర్థముతోనైనను అన్వయయోగ్యత సామాన్యముగ కలిగిన పదార్థము ఒక పదము యొక్క అర్థముతో నన్వయించుట అనెడి కార్యముచే అనుమానింపదగినది, తస్య = ఆ పదార్థ విశేషసంబంధముయొక్క, రూపం = స్వరూపము, న దృశ్యతే = వాక్యమున కంతకు అర్థజ్ఞానము కలుగకమునుపు తెలియబడదు. అతః = అందుచే, తం = ఆ సంసర్గవిశేషమును, అత్యంతం = పూర్తిగ, అసత్త్వభూతం = పదార్థములకంటె భిన్నముగ నుండనిదానినిగ, ప్రతిజానతే = చెప్పుచున్నారు.

తా. వాక్యమున కంతకు అర్థము తెలియకముందు అన్వయించుటకు తగిన ఏదో ఒక అర్థముతో అన్వయింపదగిన అర్థమును మాత్రము పదము తెలియజేయును. తరువాత ఇతర పదార్థములతో చేరినపుడు వానితో నన్వయించిన స్వార్థమును తెలియజేయును. అందుచే పదము ముందు సంసర్గసామాన్యమును తెలుపును. తరువాత వాక్యములో ఏ పదార్థముతో అన్వయించునో మనకు తెలియును. ఇదియే సంసర్గవిశేషము. ఈ సంసర్గవిశేషము ఇతర పదార్థముతో నన్వయించిన తరువాత పదమునకే అర్థముగా మనకు గోచరించును. కాని వాక్యమునకు అంతకు అర్థము తెలియకమునుపు పదముయొక్క అర్థముగా భాసింపదు. అందుచే సంసర్గవిశేషము వాక్యమున కంతకు అర్థము తెలియకముందు లేనట్టుండి వాక్యమున నితర పదార్థములతో అన్వయించినతరువాత పదముయొక్క అర్థముగనే ఊహింప వీలగును అని సంసర్గము (సామాన్యము, విశేషము కూడ) పదార్థమే అనువారు చెప్పుదురు.

ఇట్లు అన్వితాభిధానవాదమున పదార్థముకంటె వ్యతిరిక్తమగు వాక్యార్థము లేదను భావమునే వివరించుచున్నాడు.

నియతం సాధనే సాధ్యం క్రియా నియతసాధనా
స సన్నిధానమాత్రేణ నియమః సన్ ప్రకాశతే. 47

సాధనే = క్రియకు సాధనవిశేషమగు కారకమందు, సాధ్యం = క్రియావిశేషము, నియతమ్ = అవశ్యముగ ఉండును, క్రియాపి = క్రియావిశేషముకూడ, నియతసాధనా = నియతముగ సాధనము కలదియైయుండును, సః నియమః=సాధ్యసాధనములు వ్యాప్యవ్యాపకములగుటచే నేర్పడిన ఉపకార్యోపకారకభావనియతి, సన్ = పదాంతర సన్నిధానమునకు ముందు ఉన్నదియే, సన్నిధానమాత్రేణ = పదాంతర సన్నిధానమాత్రముచే, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తా. వాక్యములో క్రియావాచక తత్సాధన వాచక పదములు రెండును నియతముగ ఒకదానినొకటి ఆక్షేపించుకొనుచునే యుండును. అవి విడిగా నున్నపుడు వానికి వ్యాప్యవ్యాపకభావరూప నియతసంబంధము అజ్ఞాతమైయుండును. అందుచే క్రియ కారకముతోను, కారకముక్రియతోను కలిగియున్న నియతసంబంధము నిర్ధరింప వీలుకానిదై లేనట్లు కన్పించును. దానితో అన్వయింపదగిన అర్థముగల పదము సన్నిహితము కాగానే వాని నియతసంబంధము ప్రకాశించును. పదార్థమే తనతో నన్వయింపదగిన పదార్థముతో నన్వయించిన నది వాక్యార్థము. అట్టిపదాంతరములతో కూడిన పదమే వాక్యము. కావున పద పదార్థములకంటె భిన్నము కాని పదసంఘాతము వాక్యము, పదార్థసంఘాతము వాక్యార్థము అని తెలియవలెను.

క్రియాపదము కారకపదము వాక్యములో పరస్పరాపేక్షకలవై యుండునపుడు క్రియాపదము ప్రధానము, కారకము అప్రధానము అని గుణప్రధానభావము కల్పించుట ఎట్లు సరిపడు నను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

గుణభావేన సాకాంక్షం తత్ర నామ ప్రవర్తతే
సాధ్యత్వేన నిమిత్తాని క్రియాపద మపేక్షతే. 48

తత్ర = ఆక్రియ విషయమున, సాకాంక్షం = నియతముగ ఆకాంక్ష కలదియగు నామ = కారకపదము, గుణభావేన = క్రియను సాధించుటలో ఉపకారకమగుటచే అప్రధానభావముతో, ప్రవర్తతే=తనయర్థమును బోధింపసాగును. క్రియాపదమ్=క్రియావాచకపదము, సాధ్యత్వేన = సాధింపబడునది యగుటచే, నిమిత్తాని = ఆ క్రియాసాధనమున నిమిత్తములుగ కారకపదములను, అపేక్షతే = అపేక్షించును.

తా. వాక్యమున క్రియ విధేయమగుటచే ముఖ్యము. ముఖ్యము కనుక మిగిలిన పదార్థములు దానికి సాధకములుగ అవశ్యాపేక్షితములు. కారకపదములు సిద్ధములగుటచే ఒకదానిని సాధించుట కుపకరించునవి. కావున సాధ్యము నాకాంక్షించుచు క్రియకు అంగములుగ స్వార్థములను బోధించును. క్రియ ప్రధానభావముతో కారకపదముల నపేక్షించును. ఈ విధముగ వీనికి గుణ ప్రధాన భావ మేర్పడునని ఎరుంగునది.

క్రమము వాక్యము అనుపక్షమును ఉపపాదించుచున్నాడు.

సంత ఏవ విశేషా యే పదార్థేషు వ్యవస్థితాః
తే క్రమా దనుగమ్యన్తే న వాక్య మభిధాయకమ్ . 49

పదార్థేషు = దేవదత్తుడు మొదలగు పదముల యర్థములందు, యే విశేషాః = కర్తృత్వము, కర్మత్వము మున్నగు ఏ విశేషములు, వ్యవస్థితాః = ప్రసిద్ధిచే నియతములై, సంత ఏవ = పదార్థములు వాక్యార్థముగా ఏర్పడుటకు ముందు అనభివ్యక్తములై యుండునో అనియే అగు, తే = ఆ కర్తృత్వాది విశేషములు, క్రమాత్ = యోగ్యపదములయొక్క పౌర్వాపర్య రూపమగు క్రమమువలన, అనుగమ్యంతే = బుద్ధిగోచరములగుచున్నవి, వాక్యం = క్రమముకంటె విలక్షణమగు వాక్య మనునది, అభిధాయకం = వాచకము, న = కాదు.

తా. క్రమము-అనగా పౌర్వాపర్యము. ఇది కాలవ్యాపారము. అది శబ్దములయం దారోపింపబడుటచే నిత్యములగు శబ్దములలో పౌర్వాపర్యము కనబ్బట్టును. "దేవదత్తుడు గోవును తీసుకొని వచ్చుచున్నాడు" అను వాక్యమున వాక్యార్థము ఏర్పడకముందు కూడ దేవదత్తుడు అను దానియందు కర్తృత్వము, గోవును అను పదమునందు కర్మత్వము ప్రసిద్ధములుగా నుండనే యున్నవి. అవి యోగ్యపదముయొక్క సంబంధమున అభివ్యక్తమగును. ఆ పదము లొక క్రమములో కలిసినపుడు ఆ యర్థము లభివ్యక్తములై వాక్యార్థమును భాసింపచేయును కావున క్రమమే వాక్యార్థమునకు వాచకము కాని వేరొకటి వాక్యము కాదు.

దీనినే వివరించుచున్నాడు.

శబ్దానాం క్రమమాత్రే చ నాన్యః శబ్దోఽస్తి వాచకః
క్రమో హి ధర్మః కాలస్య తేన వాక్యం న విద్యతే . 50

శబ్దానాం = శబ్దములయొక్క, కమమాత్రే = పౌర్వాపర్య రూపమగు క్రమము మాత్రము వాచకము అని నిశ్చితమైనది కావున, అన్యః = క్రమముకంటె ఇతరమగు, శబ్దః = వాక్యస్ఫోటరూపమగు శబ్దము, వాచకః = వాచకము, నాస్తి = కాదు, క్రమః = క్రమము. కాలస్య = కాలముయొక్క, ధర్మః = ధర్మము, తేన = అందుచేత, వాక్యం = క్రమముకంటె ఇతరమగు వాక్యము, న విద్యతే = లేదు.

తా. కాలముయొక్క శక్తియే క్రమము. ఆ క్రమమే పదములయందు ఆరోపింపబడును . పదములయొక్క, పదార్థములయొక్క క్రమము మాత్రముననే వాక్యార్థము అవగతమగు చుండగా, వాక్యార్థమునకు వాచకముగ వేరొక శబ్దము నంగీకరించుట యుక్తము కాదు.

కాలముయొక్క శక్తియగు క్రమము కలిగియుండుటచే పదములు వాచకము లనుట కంటె వర్ణక్రమమే వాచకమని యంగీకరింపరాదా యను శంకకుసమాధానము చెప్పుచున్నాడు.

యే చ సంభవినో భేదాః పదార్థే ష్వవిభావితాః
తే సన్నిధానే వ్యజ్యన్తే న తు వర్ణే ష్వయం క్రమః . 51

పదార్థేషు = పదములయొక్క అర్థములందు, యే సంభవినః భేదాః = కర్తృత్వము, కర్మత్వము మున్నగు ఉండగిన ఏ విశేషములు కలవో, తే = అవి, అవిభావితాః = పదార్థాం

తరసన్నిధానము లేనపుడు అజ్ఞాతములై యున్నవి, సన్నిధానే=పదార్థాంతర సన్నిధాన మున, వ్యజ్యంతే = అభివ్యక్తము లగుచున్నవి, వర్ణేషు = వర్ణములయందు, అయం క్రమః = ఈక్రమము, న=కర్తృత్వాది ధర్మముల నభివ్యక్తముచేయ సమర్థము కాదు.

తా. పదములయొక్క అర్థములందు సహజముగ కర్తృత్వము కర్మత్వము మున్నగు భేదము లుండును. కాని యోగ్యమగు పదార్థాంతరము ప్రక్కన ఉన్నపుడు అవి అభివ్యక్త మగును. అందుచే పదములయొక్క క్రమమే వాక్యార్థమును తెలియచేయును. వర్ణములయొక్క క్రమము పదార్థములం దుండు కర్తృత్వాదుల నభివ్యక్తము చేయజాలదు. కావున వర్ణక్రమము వాచకము కాదు, పదక్రమమే వాచకమని యంగీకరింపదగును.

పదక్రమమే వాక్యము అను పక్షమును ముగించుచున్నాడు.

వర్ణానాం చ పదానాం చ క్రమమాత్రనివేశినీ
పదాఖ్యా వాక్యసంజ్ఞా చ శబ్దత్వం నేష్యతే తయోః. 52

పదాఖ్యా=పదమనుసంజ్ఞ, వాక్య సంజ్ఞాచ = వాక్యమను సంజ్ఞయును, వర్ణా నాంచ = వర్ణములయొక్కయు, పదానాంచ = పదములయొక్క యు, క్రమమాత్రనివే శినీ=క్రమమునందు మాత్రమే ఉండునవి, తయోః=ఆ వర్ణములకు పదములకు, శబ్ద త్వమ్=అర్థబోధకత్వము, న ఇష్యతే = అంగీకరింపబడదు.

తా. వర్ణములు, పదములు శ్రోత్రేంద్రియ గ్రాహ్యము లగుచున్నను వాచకత్వ రూపమగు శబ్దము అను వ్యవహారమును కల్గియుండవు. వర్ణములయొక్క క్రమమునకే పదమని సంజ్ఞ. పదములయొక్క క్రమమునకే వాక్యమని సంజ్ఞ. అవియే వాచకములు.

పదక్రమము శబ్దము కాని పదము శబ్దముకాదు—అనగా వాచకత్వములేదు. కాని వాక్యార్థములోని భాగములను తెల్పునది యగుటచే వర్ణక్రమమునకు కూడ వాచకత్వము కల్పించినట్లే వర్ణములకు కూడ వాచకత్వము ఏల కల్పింపరాదు ? అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

సమానేఽపి తు శబ్దత్వే దృష్టస్సంప్రత్యయః పదాత్
ప్రతివర్ణం త్వసౌ నాస్తి పదస్యార్థ మతో విదుః. 53

శబ్దత్వే సమానేఽపి = వర్ణములు, పదములు అనునవి రెండును శ్రోత్రేంద్రియ గ్రాహ్యములగుట అను శబ్దత్వమును కల్గియుండుటలో సమానములే అయినను, పదాత్ తు= వర్ణక్రమరూపమగు పదమువలన అయినచో, సంప్రత్యయః=వాక్యార్థములోని భాగమగు పదార్థముయొక్క ప్రతీతి, దృష్టః=కన్పట్టుచున్నది, ప్రతివర్ణంతు = వర్ణములయందు ప్రత్యేకముగ, అసౌ = పదార్థమును భాసింపచేయుశక్తి, నాస్తి=లేదు, అతః=అందువలన, పదస్య=వర్ణక్రమరూపమగుపదమునకు, అర్థమ్=వాక్యార్థములో భాగమును అర్థమునుగ, విదుః=చెప్పుచున్నారు.

తా. పదములయొక్క క్రమమే వాచకముగాని పదములు వాచకములు కావు. కాని వాక్యార్థములోని భాగములు ఆ పదములు వినునపుడు ప్రతీతము లగుచుండుటచే ఆ పదములకు అవి అర్థములని కల్పించిరి. పదములకు యథార్థముగ వాచకత్వము లేనట్లే వర్ణ ములకు కూడ వాచకత్వము లేదు. ఆ పదములయందు గల శ్రోత్రేంద్రియ గ్రాహ్యత్వము

వర్ణములయందును గలదు. అందుచే వర్ణములకు కూడ పదములకు వలెనే అర్థవత్త్వము ఏలకల్పింపరాదు అని శంకింపబనిలేదు. పదమువలన వాక్యార్థభాగము స్ఫురించునట్లు వర్ణమువలన ఏ అర్థము స్ఫురించుటలేదు. కావున పదము లర్థవంతములు— వర్ణములు అనర్థకములు. వాస్తవమునకు పదక్రమమే వాక్యము, సంసర్గమే వాక్యార్థము అని ఎఱుంగ వలెను.

ఇంతవరకు 1. "పద సముదాయము" 2. "క్రమము" 3. "అనవయవము, ఏకము అగుశబ్దము" వాక్యము అనుపక్షములు మూడును వివరింపబడినవి. ఆమూడు వాక్యలక్షణము లను మూడు శ్లోకములతో ఉపసంహరించుచున్నాడు. పద సముదాయము వాక్యము అనుపక్ష మును మొదట ఉపసంహరించుచున్నాడు.

యథా స్యావయవా వర్ణా వినా వాచ్యేన కేనచిత్
అర్థవంత స్సముదితా వాక్యమ ప్యేవ మిష్యతే. 54

యథా=ఎట్లు, అస్య=వర్ణసముదాయరూపమగు పదముయొక్క, అవయవాః= అవయవములగు, వర్ణాః = వర్ణములు, కేనచిత్ వాచ్యేన వినా=వాచ్యమగు నర్థము ఏదియు లేక యుండునో, సముదితాః=పరస్పరము కలిసి ఆవర్ణములే,అర్థవంతః = అర్థముకలవియగునో, తథా = అట్లు, వాక్యమపి = వాక్యముకూడ, ఏవం = పదములు ప్రత్యేకము వాక్యార్థమును బోధింపనివియై కలిసి వాక్యార్థమగు సంసర్గమును బోధించునదిగా, ఇష్యతే = భావింపబడు చున్నది.

తా. పదముయొక్క అవయవములగు వర్ణములకు అర్థములేదు. ఆ వర్ణముల యొక్క సముదాయరూపమగు పదమే అర్థబోధకము. అట్లే పదములకు ప్రత్యేకము వాక్యార్థ మును బోధించు శక్తి లేదు. పద సముదాయరూపమగు వాక్యము పదార్థ సంసర్గరూపమగు వాక్యార్థమును బోధించును. కావున పదసముదాయమే వాక్యమని ఎరుంగవలెను.

క్రమము వాక్య మను పక్షము నుపసంహరించుచున్నాడు.

అనర్థకా న్యుపాయత్వాత్ పదార్థే నార్థవంతి వా
క్రమే ణోచ్చరితా న్యాహుః వాక్యార్థం భిన్నలక్షణమ్. 55

ఉపాయత్వాత్ = వాక్యార్థజ్ఞానము కల్గించుటకు ఉపాయము లగుటవలన (కేవల పదములు), అనర్థకాని = అర్థరహితములు; లేదా, పదార్థేన = పదములయొక్క అర్థముచేత, అర్థవంతి = అర్థముకలవి- కాని వాక్యార్థము బోధించు సామర్థ్యము లేనివి, క్రమేణ ఉచ్చరి తాని = క్రమముతో ఉచ్చరింపబడిన పదములే వాక్యార్థబోధకములు, భిన్నలక్షణం = పద ములయొక్క అర్థముకంటె భిన్నమగునది (సంసర్గము లేదా సంసర్గవిశేషముగల పదార్థము), వాక్యార్థం = వాక్యార్థము అని, ఆహుః = చెప్పుచున్నారు.

తా. క్రమము వాక్యము అను మతమున రెండు పక్షములు కలవు. అందు మొదటిపక్షమున పదములు స్వార్థమును బోధించును. వానిక్రమము వాక్యార్థమగు సంసర్గ మును బోధించును. అందుచే వాక్యార్థమును బోధించుట కుపాయము లగుటవలన వీనికి వాక్యార్థమును తెలియజేయు శక్తి లేకపోవుటచే పదము లర్థరహితములు. వాక్యార్థము పదార్థములకంటె భిన్నమగు ఆ పదార్థముల పరస్పర సంసర్గము.

రెండవపక్షమున పదములు సామాన్యముగ ఇతరపదార్థముతో నన్వయించు స్వార్థమును బోధించును. ఆ పదముల క్రమము విశేషముగ ఒక ప్రత్యేకపదార్థముతో అన్వయించిన పదార్థరూపమగు వాక్యార్థమును మనకు భాసింపచేయును. మొదటి పదముచే బోధింపబడు అర్థము సంసర్గసామాన్య విశిష్టము. ఏ పదముయొక్క అర్థముతోనైన అన్వయించురీతి నుండునది. తరువాత క్రమముచే ఆ పదముయొక్క అర్థము ఆ వాక్యములోని ఏదో ఒక పదార్థముతో అన్వయించుటచే పదార్థవిశేషసంసర్గవిశిష్టము. ఈ పదార్థమే వాక్యార్థము.

ఈ రెండువిధములగు వాక్యార్థములకు బోధకము క్రమమే యని ఎరుంగవలెను.

అనవయవము, ఏకమునగు శబ్దము వాక్యము అనెడి స్ఫోటపక్షము నుపసంహారించుచున్నాడు.

> నిత్యత్వే సముదాయానాం జాతే ర్వా పరికల్పనే
> ఏకస్యై వార్థతా మాహుః వాక్య స్యావ్యభిచారిణీమ్ . 56

సముదాయానాం = పదసముదాయములుగ భావింపబడు వాక్యస్ఫోటములకు, నిత్యత్వే = నిత్యత్వమును స్వీకరించినపుడు, లేదా, సముదాయానాం = వక్తృభేదముచేతను, కాలభేదముచేతను భిన్నములగు పదసముదాయములయొక్క, జాతేః వా = జాతిరూపమగు వాక్యస్ఫోటముయొక్క, పరికల్పనే = కల్పనమునగాని, ఏకస్య వాక్యస్య ఏవ = వాక్యవ్యక్తి రూపమగు స్ఫోటమునకే, లేదా, వాక్యజాతి రూపమగు స్ఫోటమునకే, అవ్యభిచారిణీం = ఆ స్ఫోటరూపమగు వాక్యమును నియతముగ విడచియుండని, వాక్యార్థతాం = ప్రతిభారూపమగు వాక్యార్థము సంబంధించియుండునని, ఆహుః = చెప్పుదురు.

తా. "దేవదత్తః గామ్ ఆనయ" (దేవదత్తః గోవునుతెమ్ము) అను వాక్యమును ఒకేవ్యక్తి పలుసార్లు ఉచ్చరింపవచ్చును. లేదా వేరువేరు వ్యక్తులు భిన్నకాలములలో ఉచ్చరింపవచ్చును. కాని ఆ వాక్యములన్నింటిని విన్నపుడును ఆ వాక్యమే యిది అని గుర్తింపబడుచుండుటచే ఆ వాక్యములచే అభివ్యక్తమగు ఒకేవాక్యము వ్యక్తిస్ఫోటము, నిత్యము, అర్థబోధకము. ఆ వాక్యమే ప్రతిభ యనెడి అఖండవాక్యార్థమును బోధించును. ఇది వ్యక్తిస్ఫోట పక్షము.

వేరువేరు వ్యక్తులు వేర్వేరుకాలములలో లేదా ఒకేవ్యక్తి భిన్నకాలములలో నుచ్చరించిన వాక్యములు అనిత్యములు. ఆ అనిత్యములగు వాక్యములచే నిత్యమగు జాతిరూపమగు వాక్యము స్ఫోటరూపము అభివ్యక్తమగును. అదియే అర్థబోధకము. ఇది జాతిస్ఫోటము. ఆ వాక్యమే నిత్యము, అఖండమునగు వాక్యార్థమునకు వాచకము.

ఈ విధముగ సంఘాతము, క్రమము, స్ఫోటము అను మూడు పక్షములలోని వాక్యస్వరూపము వివరింపబడినది. ఇకముందు ఆఖ్యాతము వాక్యము అను మతమును వ్యాఖ్యానింపబోవుచు వాక్యము, వాక్యార్థముకూడా అఖండములే యని వివరించుచున్నారు. అఖండపక్షము సూత్రకారుడగు పాణినికి భాష్యకారుడగు పతంజలికి గూడ సమ్మతము. పాణిని "తిఙ్ అతిఙః" అను సూత్రమున అతిఙః అను పదముచే అఖండమగు వాక్యార్థమును బోధించునదే అఖండమగు వాక్యము అని సూచించెను. తిఙన్తముకాని పదముకంటె పరమగు తిఙన్త

మునకు నిఘాతము వచ్చునని పాణిని సూత్రించెను. ఒకే తిఙన్తపదము ఒకవాక్యములోనుండు నని నియమము నంగీకరించినచో ఒకవాక్యములో తిఙన్తపదముకంటె పరమైన తిఙన్తపదము ఉండనే యుండదు కనుక "అతిఙః" అనుట వ్యర్థము. అందుచే పాణిని ఉద్దేశమున పదము లనుబట్టి వాక్య లక్షణము చెప్పుట సరికాదనియు అఖండమగు అర్థమును బోధించునది వాక్య మనియు, అందు ఒక క్రియావాచకపద మున్నను అనేకము లున్నను నుండవచ్చుననియు తెలియుచున్నది. అందుచే పదవిభాగము కాల్పనికము వాక్య మఖండమని సూత్రకారాభి మతము, ఇక పతంజలి మహాభాష్యమున "నలక్షణేన పదకారా అనువర్త్యాః, పదకారై ర్నామ లక్షణ మనువర్త్యమ్" 'లక్షణము పదకారుల ననుసరింపతగదు. పదకారులు లక్షణము నను సరింపతగును' అని చెప్పెను. పదములే సత్యమని పతంజలి యభిమతమైనచో పదకారు లనుట అసంగతముకదా! పదమును నిర్మించువారలు పదకారులు, పదములు సత్యములే యయినచో వానిని నిర్మించుటఎట్లు? పదకారులు లక్షణము ననుసరించి నిర్మింపవలెననుట మాత్రము పదములు సత్యములే యైనపుడు అంతకుముందే యున్నవి గనుక ఎట్లు సంగతమగును? కావున భాష్యకారుల మతమున అఖండమగు వాక్యమే సత్యము. పదములు లాక్షణికులచే అబుధ బోధమునకు కల్పితములు. కావున అఖండవాక్యసిద్ధాంతమే ఆదరణీయము. దానినే నిరూ పించుచున్నాడు.

> అభేదపూర్వకా భేదాః కల్పితా వాక్యవాదిభిః
> భేదపూర్వా నభేదాంస్తు మన్యంతే పదదర్శినః . 57

వాక్యవాదిభిః=పదవిభాగ రహితమగు వాక్యస్ఫోటము గలదను వాదులచే, అభేద పూర్వకాః = వాక్యము సత్యము ఏకము అని ముందు అంగీకరించి, భేదాః = దానినెరుంగు టకు పద విభాగములు, కల్పితాః = కల్పింపబడినవి, పదదర్శినః = వాక్యము సఖండము అని యంగీకరించువారు, భేదపూర్వాన్=వాస్తవముగ పద విభాగము కలదని ముందు అంగీకరించి, అభేదాన్=ఆ పదములు అవిభక్తమగు వాక్యములుగా నుండుటను, కల్పి తాన్=కల్పింపబడినవానినిగా, మన్యంతే = తలంతురు.

తా. సుగమము.

పదములు సత్యములు కానినాడు "పదప్రకృతిః సంహితా" 'పదమూలకము సంహిత' యను ప్రాతిశాఖ్య ఎట్లు సమన్వయించును? పదములు అసత్యము లైనపుడు వానివలన ఏర్పడు సంహితకూడ అసత్యమే అగునుకదా? అని వాక్యము అఖండము అను పక్షమున పదప్రకృతిః సంహితా అను వాక్య మసంగతమగు నని శంకించి సమాధానముచెప్పుచున్నాడు.

> పదప్రకృతిభావశ్చ వృత్తిభేదేన వర్ణ్యతే
> పదానాం సంహితా యోనిః సంహితా వా పదాశ్రయా . 58

పదప్రకృతిభావశ్చ = సంహితకు పదప్రకృతిత్వము, వృత్తిభేదేన = బహువ్రీహి, షష్ఠీతత్పురుష సమాభేదముచే, వర్ణ్యతే=నిరూపింప వీలగుచున్నది, పదానాం=పదములకు, యోనిః= మూలము, సంహితా = వాక్యధర్మమగు సంహిత అని షష్ఠీతత్పురుషముకాని, సంహితా=సంహిత, పదాశ్రయా=పదములు మూలముగా కలిగియుండునది అని బహువ్రీహి సమాసముకాని చెప్పవచ్చును.

తా. పదములయొక్క సన్నిధానము సంహిత. ప్రాతిశాఖ్యమున సంహిత పదప్రకృతి అని చెప్పిరి. పదములు కాల్పనికములు, వాక్యమఖండము అన్నపుడు పై

లక్షణమెట్లు కుదురునని సందేహింప నక్కరలేదు. పదసత్యత్వవాదులు సఖండము వాక్య మని పదములు ప్రకృతిగా కలది అని బహువ్రీహి సమాసము నాశ్రయించి సంహిత పద మూలకమని చెప్పుదురు. కాని వాక్యము అఖండము, సత్యము; పదములు కల్పితములను నపుడు పదములకు ప్రకృతి సంహిత యని షష్ఠీతత్పురుషము నాశ్రయించి సంహితనే విభ జించి పద విభాగము కల్పించబడినది. కావున సంహిత పదములకు మూలమని ఎరుంగ వలెను. పై విధమున షష్ఠీతత్పురుషము నాశ్రయించుటచే పదప్రకృతి సంహిత యగుటలో విరోధము లేదు.

వాక్యము అఖండము, అదియే సత్యము, అపౌరుషేయము; పదములు కల్పితములు అని భావించువారు అఖండవాదులు. పదములే సత్యములు, అపౌరుషేయములు; వాని సంసర్గ రూపమే వాక్యము, అది కల్పితము అనువారు సఖండవాదులు. నిత్యము ఏకము నగు శబ్ద మునకు రెండు శక్తులు కలవు: విభాగశక్తి, అవిభాగశక్తి! అవిభాగశక్తి వాక్యరూపము, అవిభాగశక్తి పదరూపము అని సఖండాఖండవాదుల మతము. వెనుక భాష్యకారుడు "న లక్షణేన పదకారా అనువర్త్యాః" అని చెప్పుటచే పదము అసత్యములు, వాక్య మఖండ మని చెప్పినాడు. పదము సత్యము అను వాదమున పై భాష్యకారుల వాక్య మెట్లు సమర్థింప బడును ? అని శంకించి సమాధానమును చెప్పుచున్నాడు.

పదామ్నాయశ్చ యద్యన్యః సంహితాయా నిదర్శకః
నిత్య స్తత్ర కథం కార్యం పదం లక్షణదర్శనాత్ .  59

సంహితాయాః=పద సన్నిధి రూపమగు వాక్యరూప సంహితకు, నిదర్శకః = ప్రతిపాదకమగు, పదామ్నాయశ్చ=పదరూపమగు శబ్దము కూడ, అన్యః=వాక్యముకంటె భిన్నమగునది, యది నిత్యః=నిత్యము అయినచో, తత్ర=ఆ మతమున, లక్షణదర్శనాత్= సూత్రప్రవృత్తివలన, పదం=పదము, కార్యం=నిర్మింపబడవలెను అని భాష్యకారులు చెప్పి నది, కథం=ఎట్లు కుదురును?

తా. పదమే నిత్యము, సత్యమునగు శబ్దము. అట్టిపదములే సంహితారూపమున నుండు వాక్యమన్నచో పదకారులు లక్షణము ననుసరింపవలెనని పదములను కార్యములనుగా చెప్పుట సంగతము కాదు కనుక వాక్యము అఖండమే యని అంగీకరింపవలెను. అని అఖండ వాక్యపక్షమున ఈ కారికయొక్క భావము. సఖండవాక్య పక్షమున ఈ కారికకు అర్థము మరియొక విధముగ భావింపవలెను. పదకారులు అను శబ్దమునకు పదస్రష్టలు అనియర్థము కాదు. పదప్రయోక్తలని యర్థము. వాక్యముకంటె భిన్నమగు పదము నిత్యము అని యంగీకరించునపుడు ఆ పదములను ప్రయోగించువారు నిత్యమగు పదార్థసంబంధమును అవిద్యచే ఎరుంగజాలరు కనుక సమ్యగ్జ్ఞానము కల ఋషులు చెప్పిన లక్షణము ననువర్తించి ప్రయోగింపనగును. లక్ష్యము సిద్ధము కనుక దానిని శాస్త్ర మనుసరించవలెను కాని నిత్య మగు లక్ష్యము శాస్త్రము ననుసరింపదు అని భాష్యకారుల యభిప్రాయముగా ఎరుంగనగును.

శబ్దము విభాగావిభాగరూప శక్తిద్వయ సహిత మనువారి మతము ఒకశబ్దమున రెండు విధములగు విభాగము లేర్పడు శక్తి యున్నపుడు ఒకేవిధమగు విభాగము గుర్తింప బడవలెనని, ఏవిధమగు శక్తి తొలగింపబడునో దానిని లక్షణముచే నెరుంగవలెను అని పద కారులు లక్షణము ననుసరింపవలెననుదాని యర్థము. "వక్షస్సురుక్మ" అను శబ్దము వక్షః,

సురుక్మ అనియు, వక్షస్సు, రుక్మ అనియు గూడ విభజింపబడు శక్తియుండ వక్షస్సు, రుక్మ అను విభాగమేకాని వక్షస్, సురుక్మ అను విభాగశక్తి భాసింపకుండుటకు లక్ష ణము ననుసరింపవలెను. ఇట్లు భాష్యకారుని వాక్యమును మూడు విధముల నన్వయింప వచ్చును. కాని అఖండపక్షమే భాష్యకారాభిమత మని గ్రహింపవలెను.

పదసత్యత్వ వాదమున వొక ఆక్షేపమును చేయుచున్నాడు,

ప్రతివర్ణ మసంవేద్యః పదార్థప్రత్యయో యథా
పదేష్వేవ మసంవేద్యం వాక్యార్థస్య నిరూపణమ్ . 60

యథా=ఎట్లు, పదార్థ ప్రత్యయః=పదముయొక్క అర్థజ్ఞానము, ప్రతివర్ణం=ఆ పదమునందలి ప్రతి వర్ణము నందును, అసంవేద్యః=భాసింపదో, ఏవం=ఈవిధముగనే, వాక్యార్థస్య=వాక్యార్థముయొక్క, నిరూపణం=ప్రతీతి, పదేషు=పదములయందు- ప్రతి పదమునందు, అసంవేద్యం=భాసింపదు.

తా. దేవదత్త అను పదములోని దే, వ, మొదలగు వర్ణములచే పదార్థము భాసింపదు. దేవదత్త అను పదముచే అఖండముగనే భాసించును. కావున వర్ణములు అనర్థ కములు. అట్లే 'దేవదత్త గా మానయ' అను వాక్యముయొక్క అర్థము ప్రత్యేక పదములచే ప్రతీతి గోచరముకాక వాక్యముచేతనే అఖండముగ బోధింపబడును. అందుచే పదములో వర్ణములవలె వాక్యములో పదములు కూడ అర్థరహితములే. అర్థము కలదగుటచే వాక్యమే సత్యము. పదములు అనర్థకములు కనుక అసత్యములే యని భావము.

పదసత్యత్వవాది మతములో పదములకు వాక్యార్థభాగము అర్థముగా భాసించు చుండుటచే అర్థమున్నది అని అంగీకరించినపుడు పదము నొుక్క అర్థముచేత వర్ణములు ప్రత్యేక ముగ అర్థవంతములే యగును అను ఆక్షేపణకు పదసత్యత్వవాది సమాధానము చెప్పుచున్నాడు.

వాక్యార్థః సన్నివిశతే పదేషు సహవృత్తిషు
యథా తథైవ వర్ణేషు పదార్థః సహవృత్తిషు . 61

సహవృత్తిషు=ఇతర పదములతో కలిసియున్న, పదేషు=పదములయందు, వాక్యార్థః=వాక్యములయొక్క అర్థము, యథా=ఎట్లు, సన్నివిశతే=పదాంతర సన్నిధానము వలన ప్రతీయమాన మగునో, తథైవ=అట్లే, సహవృత్తిషు = వర్ణాంతరములతో కలిసి యున్న, వర్ణేషు=వర్ణములయందు కూడ, పదార్థః=పదముయొక్క అర్థము, సన్నివిశతే= వర్ణాంతర సన్నిధానమువలన ప్రతీయమానమగును.

తా. పదములు ఒకదానితో ఒకటి కలిసి యున్నప్పుడు వాక్యార్థమును స్ఫురింపజేయుచుండుటచే ఎట్లు అర్థవంతము లగుచున్నవో అట్లే వర్ణములు కూడ ఇతర వర్ణములతో కలిసి పదార్థమును స్ఫురింపజేయుటచే అర్థవంతములేయని ఎఱుంగవలెను.

వి. కేవల పదములు ఎట్లు వాక్యార్థమును ఎరింగింపజాలవో అట్లే కేవల వర్ణములు పదార్థమును ఎరింగింపజాలవు. అంతమాత్రముచే అవి అనర్థకములు అనరాదు. ఒక పదమునం దర్థము లేకపోయినచో ఇతర పదములతో కలిసినపుడు కూడ దానికి అర్థవత్త్వము కలుగదు. ఒక యిసుకరేణువునందు నూనె లేకపోయినచో ఎన్ని రేణువులు

కలిసినను నూనె ఉండదు గదా ! కావున వర్ణములు, పదములు అర్థవంతములే. అవి పరస్పర సంసృష్టములై అర్థబోధకము లగును.

వర్ణములు కూడ అర్థవంతములే అయినచో పదము వినగనే పదార్థము ప్రతీత మయినట్లు వర్ణము వినగనే అర్థము స్ఫురించుట లేదేమి ? అను ప్రశ్నకు సమాధానము నిచ్చుచున్నాడు.

సూక్ష్మం గ్రాహ్యం యథాఽన్యేన సంసృష్టం సహ గృహ్యతే
వర్ణోఽప్యన్యేన వర్ణేన సంబద్ధో వాచక స్తథా .		62

సూక్ష్మమ్=సూక్ష్మమైనదైనను, గ్రాహ్యమ్=గ్రహింపదగిన వస్తువు (విడిగా గ్రహింపబడకున్నను), అన్యేన సంసృష్టమేవ=వేరొక వస్తువుతో కలసినదై, యథా=ఎట్లు, గృహ్యతే=గ్రహింపబడుచున్నదో. తథా=అట్లే, వర్ణః అపి=వర్ణముకూడ, అన్యేన వర్ణేన=వేరొక వర్ణముతో, సంబద్ధః=కూడినదై, వాచకః=అర్థబోధక మగును.

తా. సూక్ష్మములైన కేశ మక్షికాది వస్తువులుగాని, పరాగ రేణువులుగాని విడిగా ఉన్నప్పుడు గ్రహింపదగినవైనను గ్రహించుటకు వీలుకానివైనను ఇతర వస్తువులతో కలిసి యున్నప్పుడు గ్రహింపబడుట లోకములో గోచరించుచున్నది గదా ? అట్లే వర్ణములు విడిగా నుచ్చరించునపుడు అర్థముకలవే అయినను మనమా అర్థమును గ్రహింపలేము. అవి కలసినపుడు మనకు అర్థప్రత్యాయకము లగుచున్నవి.

వర్ణములు అర్థరహితములు కనుక పదము అనర్థకము అనుట యుక్తముగాదు. వర్ణముల కానర్థక్యము నంగీకరించుట ప్రత్యక్ష విరుద్ధము అని చెప్పుచున్నాడు.

పద స్యోచ్చారణా దర్థో యథా కశ్చి న్నిరూప్యతే
వర్ణానా మపి సాన్నిధ్యాత్ తథా సోఽర్థః ప్రతీయతే .		63

యథా = ఎట్లు, పదస్య = కేవలము ఒక పదముయొక్క, ఉచ్చారణాత్ = ఉచ్చారణమువలన, కశ్చిత్ అర్థః = పదార్థమని వ్యవహరింపబడు ఒకానొక అర్థము, నిరూప్యతే = గ్రహింపబడుచున్నదో, తథా = అట్లు, వర్ణానామ్ = వర్ణములయొక్క, సాన్నిధ్యాత్ అపి = సన్నిధానమువలనకూడ, సః అర్థః = ఆ యర్థమే, ప్రతీయతే = తెలియజేయబడుచున్నది.

తా. ఒకపదము ఉచ్చరించగనే ఏ అర్థము స్ఫురించుచున్నదో ఆ యర్థము ఆ పదము వలననే కలిగినదని ఎట్లు అనుకొనుచున్నామో అట్లే ఆ పదములోని వర్ణములు కలిపి పలుకగానే ఆ యర్థము స్ఫురించిన దనుకొనినచో ఆ వర్ణముల సముదాయమే ఆ యర్థమును బోధించినదని అనుకొనవచ్చును. అందుచే వర్ణముయొక్క సముదాయముకంటె విలక్షణమగు పదముగాని పదముయొక్క సముదాయముకంటె విలక్షణమగు వాక్యముగాని లేదు. పరస్పరము కలిసిన వర్ణములే పదార్థమునకు వాచకములు. పరస్పరము కలిసిన పదములే వాక్యార్థమునకు వాచకములు.

పదములచే వాక్యములు, పదార్థములచే వాక్యార్థములు భాసించునని యంగీకరించినచో పదార్థములు యథార్థముగ లేవు కనుక (1)'కుశ'లు లేనిచో ప్రతినిధిగ 'శర'ములు=రెల్లు కల్పింపవలెననుట ఎట్లు సంభవించును? (2)ఈ వాక్యములో 'పిక' పదమున కర్థము ఏమి?

అని ఒక పదమునకు మాత్రము అర్థముతెలియక ప్రశ్నించుట ఎట్లు ? (3) శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యలు అను ఆరు ప్రమాణములలో వాక్య ప్రమాణముకంటె పదశ్రుతి రూప ప్రమాణము బలవత్తరము అనుట ఎట్లు ? (4) ఒక మహావాక్యములో అవాంతర వాక్యములకు అర్థవత్త్వము ఎట్లు ? అని శంకలు కలుగుచున్నవి. అందు మొదటిది పదార్థ ప్రతినిధికల్పన మఖండవాక్యార్థ పక్షమున కుదరదని శంకించుచు పదార్థమునకు ప్రతినిధిగ వేరొక పదార్థమును విధించుటను గూర్చి చర్చించుచున్నాడు.

ప్రాప్తస్య యస్య సామర్థ్యా న్నియమార్థా యతః శ్రుతిః
తే నాత్యంతం విశేషేణ సామాన్యం యది బాధ్యతే. 64

సామర్థ్యాత్ = 'యజేత' అనుచోట యజతిక్రియయొక్క సామర్థ్యమువలన, ప్రాప్తస్య = లభించిన, యస్య = ఏ వ్రీహిత్వరూపజాతియొక్క, శ్రుతిః = వ్రీహిభిః అను పదముచే నిర్దేశింపబడుట, యతః = ఎందుచే, నియమార్థా = వ్రీహులచేతనే యాగముచేయ వలెనను నియమమును బోధించునో, తేన = అందుచే, విశేషేణ = వ్రీహియనబడు ద్రవ్య విశేషముచే, సామాన్యం = ద్రవ్యసామాన్యము, అత్యంతం = పూర్తిగ, బాధ్యతే యది = బాధింపబడును అనినచో.

యజేతేతి యదా ద్రవ్యం ప్రాప్తం సామర్థ్యలక్షణమ్
వ్రీహిశ్రుత్యా నివర్తేత న స్యా త్ప్రతినిధి స్తదా. 65

యజేతేతి = యజేత అనుచోట యజతి క్రియచే యాగైకదేశముగ, ప్రాప్తం = ద్రవ్య సామాన్యమున విశేషముగ అన్వయించు వ్రీహిత్వమువలె ప్రాప్తమగు, ద్రవ్యం = యవత్వ రూపమగు ద్రవ్యము, సామర్థ్యలక్షణం = యజతి క్రియాసామర్థ్యముచే లభించునది, యదా = ఎపుడు, వ్రీహిశ్రుత్యా = వ్రీహిపదశ్రవణముచే, నివర్తేత = నివర్తించునో, తదా = అపుడు, ప్రతినిధిః = వ్రీహులకు యవలు ప్రతినిధి, న స్యాత్ = కాకపోవును.

తా. (64, 65) 'యజేత' అనుచోట 'యజ్' అనుధాతువు ద్రవ్యదేవతా రూపమగు యాగస్వరూపమును తెలుపును. ద్రవ్యత్వరూపమున ఏ ద్రవ్యమైనను ఇందు సాధనముగ ఉండవచ్చును. ద్రవ్యత్వములో వ్రీహిత్వము, యవత్వము అను విశేషజాతుల రూపముననైనను ఉండవచ్చును. యాగైకదేశముగ యజతిక్రియచే తెలుపబడు ద్రవ్యము ద్రవ్యత్వరూపమునకాక వ్రీహిత్వ యవత్వాది రూపమున నుండునను మతమున వ్రీహులకు, యవలకు కూడ యాగములో సాధనములుగా నుండుటకు అర్హత యుండగ "వ్రీహిభి ర్యజేత" అనుచోట వ్రీహిభిః అను పదము వ్రీహులతోనే యాగముచేయవలెను అను నియమమును చేయుటచే "యవ" లకు యాగసాధనత్వము లేదని ఈ "వ్రీహిభి ర్యజేత" అను వాక్యము నియమించినపుడు వ్రీహులులేనపుడు వ్రీహులకు బదులుగ యవలు ఉపయోగింపవలెను అను ప్రతినిధి కల్పనము కుదురదు.

ఇచట రెండు పక్షములు కలవు. 'వ్రీహిభి ర్యజేత' అనుచోట 'వ్రీహిభిః' అను శ్రుతి విధ్యర్థము అని కొందరు, నియమార్థము అని కొందరు. ఇతర విధమున ప్రాప్తించిన దానిని శ్రుతిచెప్పినచో దానిని విధి యందురు. వేరొకదానిచే అదియు మరొకటియు కూడ ప్రాప్తించు

నపుడు శ్రుతి ఒకదానిని పేర్కొనినచో అదియే స్వీకరింపదగినది రెండవది కాదు అని నియమము అగును. 'వ్రీహిభిః యజేత' (వ్రీహులతో యాగముచేయవలెను) అనుచోట 'యజేత' అనుచోట యజ్ అను క్రియ ద్రవ్యదేవతలను సామాన్యముగ తెలుపును. ఆ ద్రవ్య మేదియో వ్రీహిభిః అను పదము తెలుపును. ఇది విధియా లేక నియమమా అని ముందు ఎరుంగవలెను. యజతి క్రియచే తెల్పబడు ద్రవ్యము ద్రవ్యత్వ సామాన్యరూపమున నుండునని కొందరందురు. అనగా వ్రీహిత్వ యవత్వాది విశేషజాతులు గల ద్రవ్యము లన్నియు ద్రవ్యత్వము కలవే కావున ఏ ద్రవ్యముచే యాగముచేయవలెనో దీనిచే నిర్ధరింపబడదు. అపుడు 'వ్రీహిభిః' అను పదము వ్రీహులచేత అని విధించును. ఇట్లు విధి యయినపుడు అవి లేనపుడు ప్రతినిధిగా క్రియాలోపము లేకుండుటకు యవలనుపయోగింపవచ్చును. కాని యజతి క్రియచే ద్రవ్యత్వము కాక యవత్వ వ్రీహిత్వాది రూపమున నుండు ద్రవ్య విశేషముల జాతి చెప్పబడునన్నపుడు యాగసాధనము వ్రీహులు కావచ్చును, యవలు కావచ్చును. ఇట్లు అన్నింటికి యాగసాధనత్వము వచ్చునపుడు వ్రీహిభిః అను పదము వ్రీహులచేతనే చేయవలెను కాని వేరొకదానిచే కాదని నియమించును. ఇట్లు నియమార్థము అని నపుడు వ్రీహులస్థానమున యవలను ప్రతినిధులుగా ఉపయోగించుట కుదురదు. నిషేధింపబడినవానికి యాగసాధనత్వము కూడదు. విధింపబడకుండ నిషేధింపబడకుండ ఉన్నచో విధింపబడినది లేనపుడు నిషేధింపబడనిదానిని ప్రతినిధిగ కల్పించవచ్చును. కావున నియమార్థమైనపుడు ప్రతినిధి కల్పన ఎట్లు పొసగును ? అని శంక రాగా ఆ రెండు మతములకంటె భిన్నమగు మరొక మతము నాశ్రయించి ప్రతినిధికల్పనమును సమర్థించుచున్నాడు.

తస్మాద్ వ్రీహిత్వ మధికం వ్రీహిశబ్దః ప్రకల్పయన్
ద్రవ్యత్వ మవిరుద్ధత్వాత్ ప్రాప్త్యర్థః స న్నబాధతే. 66

తస్మాత్ = అందువలన (యజేత అనుచోట యజనక్రియచే యాగాంగముగా ద్రవ్యత్వ మాక్షిప్తమైనను వ్రీహిత్వమున కంగత్వము బోధింపబడనందున), వ్రీహిశబ్దః = 'వ్రీహిభి ర్యజేత' అనుచోట వ్రీహిశబ్దము, అధికం = ద్రవ్యత్వముకంటె అధికముగ, వ్రీహిత్వం = వ్రీహిత్వమును అంగముగ, ప్రకల్పయన్ = కల్పించుచు, ప్రాప్త్యర్థః సన్ = అప్రాప్తమగు వ్రీహిత్వమునకు యాగాంగత్వమును కల్గించుచున్నదై, అవిరుద్ధత్వాత్ = సామాన్యమునకు విశేషమునకు సామానాధికరణ్యమున విరోధము లేకపోవుటవలన, ద్రవ్యత్వం = ద్రవ్యత్వమును, న బాధతే = బాధింపదు.

తా. యజేత అనుదానివలన యాగాంగముగ ఒక ద్రవ్య ముండవలెనని సామాన్యముగ తెలియును. వ్రీహిభిః అను పదము యాగమున ద్రవ్యముగా నుండవలసినది వ్రీహియని వ్రీహిత్వమునకు యాగాంగత్వ ప్రాప్తిని కల్గించును. కావున వ్రీహి యున్నపుడు యవలకు ప్రాప్తి యుండదు. అది లేనపుడు ప్రతినిధిగా ఉండుట కభ్యంతరము లేదు. వ్రీహిత్వము, ద్రవ్యత్వము విశేష సామాన్య ధర్మములు కనుక బాధ్యబాధకభావ ముండదు. ముందు సామాన్యముగ ద్రవ్యత్వమునకు యాగాంగత్వము బోధింపబడి తరువాత వ్రీహులకు యాగాంగత్వము బోధింపబడినపుడు ద్రవ్యత్వము వ్రీహిత్వముకూడ వ్రీహులయందుండ వచ్చును కనుక వ్రీహిత్వము ద్రవ్యత్వమును బాధింపదు. యవలకు ప్రతినిధికల్పనము కూడ సంభవించును.

వ్రీహులు లేనపుడు యవలతో చేయుట ప్రతినిధి కల్పనము. వ్రీహులతో గాని యవలతో గాని చేయవచ్చు ననుట వికల్పము. వ్రీహిత్వమునకు బాధకము కాదని చెప్పినారు కనుక ద్రవ్యత్వముగల వ్రీహులతో గాని యవలతో గాని చేయవచ్చునని వికల్పము వచ్చునా ? యని శంకించి ఇచట వికల్పము రాదని చెప్పుచున్నాడు.

తేన చాపి వ్యవచ్ఛిన్నే ద్రవ్యత్వే సహచారిణి
అసంభవాద్ విశేషాణాం తత్రాన్యేషా మదర్శనమ్ . 67

తేన చ = విధ్యర్థకమగు వ్రీహిశబ్దముచే, సహచారిణి = యజతిక్రియచే ఆక్షిప్తమై యవత్వాదులతోకూడ కలిసియుండు, ద్రవ్యత్వే = ద్రవ్యత్వము, వ్యవచ్ఛిన్నే = యవత్వాదులతో నన్వయించుటనుండి వారింపబడగా, తత్ర = ఆ యాగమునందు, అన్యేషాం విశేషాణాం = వ్రీహికంటె భిన్నములగు యవలు మొదలగు విశేషములకు, అసంభవాత్ = వికల్పము సంభవింపకపోవుటవలన, అదర్శనమ్ = యాగాంగముగ నన్వయించుట కన్పట్టదు.

తా. యజేత అనునపుడు (యజ్ )యాగము ద్రవ్య దేవతాస్వరూపమగుటచే ద్రవ్యత్వము సామాన్యముగ దానికర్థముగ భాసించును. ఆ ద్రవ్యత్వము వ్రీహిత్వము, యవత్వము మున్నగు విశేషములతో సహచరితమై యుండును. కాని వ్రీహిభిః అను పదము ఆ ద్రవ్యత్వజాతి వ్రీహిత్వరూప విశేషజాతి కలదే కాని యవత్వాది విశేషము కలద కాదు అని యవత్వాదులతో సంబంధమును ద్రవ్యత్వమునకు వారించును. అందుచే యవలు యాగాంగములు కావు. కావున ఇచట వికల్పము సంభవింపదు.

వి. "వ్రీహిభిః యజేత" "యవైః యజేత" అను రెండు ద్రవ్యములు కూడ శబ్దతః ఉపాత్తములైనపుడే వికల్పము సంభవించును.

'యజేత' అనుచోట యజతిక్రియ ద్రవ్యత్వ సామాన్యమును చెప్పుటచే విశేషము లన్నియు గ్రహింపబడవచ్చునుగదా ? అట్లు వ్రీహియవాదులన్నియు గ్రహింపబడినపుడు వికల్పమని చెప్పుట కభ్యంతరములేదుకదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

న చ సామాన్యవ త్సర్వే క్రియాశబ్దేన లక్షితాః
విశేషా న హి సర్వేషాం సతాం శబ్దోఽభిధాయకః . 68

సర్వే విశేషాః = యవత్వము మొదలగు విశేషము లన్నియు, సామాన్యవత్ = ద్రవ్యత్వమువలె, క్రియాశబ్దేన = యాగక్రియను బోధించు 'యజేత' అను శబ్దముచే, న చ లక్షితాః = బోధింపబడవు, హి = ఎందుచేతననగా, శబ్దః = ఏ శబ్దముకూడ, సతాం = తనచే బోధింపబడదగిన, సర్వేషాం = అర్థములకన్నిటికి, అభిధాయకః = బోధకము కాదు(బోధింపగల వానిలో సంకేతితమైన దానినే బోధించును).

తా. 'యజేత' అను శబ్దము ద్రవ్యదేవతలను తెలియజేయును. ద్రవ్యము సామాన్యము కావచ్చును. వ్రీహియవాది రూపమున విశేషము కావచ్చును. కాని ఇచటి క్రియాశబ్దము ద్రవ్యత్వరూపమున సామాన్యమునే బోధించును కాని విశేషమును బోధింపదు. దానిచే ఆ యర్థములు బోధింపదగినవే యైనను ఏయర్థమున సంకేతముండునో ఆ యర్థమునే శబ్దము బోధించును. కాబట్టి యజేత అను క్రియాశబ్దము విశేషములందు సంకేతము లేకపోవుటచే విశేషములను బోధింపదు. కావున వికల్పము సంభవింపదు.

శబ్దమున కా యర్థ మున్నను వివక్ష చేతనే అర్థబోధకత్వము కల్గును. వివక్ష లేనపుడు శబ్దమున కర్థమున్నను అది అర్థము కానట్లే యుండును. వివక్షచేతనే శబ్దము అర్థమును బోధించు ననుటలో దృష్టాంతమును చూపుచున్నాడు.

శుక్లాదయో గుణాః సంతో యథా తత్రావివక్షితాః
తథాఽవివక్షా భేదానాం ద్రవ్యత్వసహచారిణామ్ . 69

యథా = ఏ విధముగ, తత్ర = వ్రీహిభిః అనుచోట, సంతః = వ్రీహిత్వముతో విరోధము లేకుండ వ్రీహులలో నున్న, శుక్లాదయః = శుక్లకృష్ణాది గుణములు, అవివక్షితాః = వివక్షితములు కావో(అందుచే వ్రీహిశబ్దముచే బోధింబడవో), తథా = ఆవిధముగ, ద్రవ్యత్వ సహచారిణాం = ద్రవ్యత్వముతో కలిసియుండదగిన, భేదానాం = వ్రీహిత్వయవత్వాది విశేషములకు, అవివక్షా = వివక్ష లేదు(అందుచే ద్రవ్యత్వసామాన్యబోధక మగు యజిక్రియ తద్విశేషములను బోధింపదు).

తా. యజేత అనునపుడు యాగక్రియచే తెలుపబడిన ద్రవ్యత్వములో నన్వయించు వ్రీహులు ఎరుపు, నలుపు మొదలగు రంగులు కలిగి ఆ రంగులు కలవియే యాగాంగము లగుచున్నవి. కావున వ్రీహిపదము తెల్లని, లేదా, నల్లని వ్రీహులు అని బోధింపదు. అవి నియతముగ వ్రీహులయందున్నను, ద్రవ్యత్వములో నన్వయించుటలో విరుద్ధములు కాక పోయినను, ఈ రంగు గల వ్రీహు లని బోధించు తలంపు(వివక్ష)తో వ్రీహిభిః అనుపదము ప్రయుక్తము కాలేదు కనుక వ్రీహిశబ్దము శుక్లకృష్ణాది వర్ణముల నెట్లు బోధింపదో అట్లే యాగక్రియాబోధకమగు 'యజ్' అను ధాతువు ద్రవ్యత్వసామాన్యమునే బోధించుట వివక్షితము కావున వ్రీహిత్వయవత్వాదులను బోధింపదు. వ్రీహిత్వయవత్వములు ఇచట వివక్షితములు కావు కనుక యజేత అను శబ్దముచే బోధింపబడవు. అందుచే వ్రీహిత్వమునకు యాగాంగత్వప్రాప్తికై నిర్దేశించిన వ్రీహిభిః అను పదముచే వ్రీహులకు యాగాంగత్వము సిద్ధించును. వ్రీహిరూపమగు ముఖ్యద్రవ్యము లేనపుడు క్రియకు ప్రతినిధిగ వేరొకక్రియ చేయరాదు కనుక ద్రవ్యప్రతినిధిగ యవలను ఉపయోగింప వీలగును.

శాస్త్రముచే ప్రతిషిద్ధముకాని ద్రవ్యమును ముఖ్య ద్రవ్యము లభింపనపుడు ప్రతినిధిగా కల్పించుటకు ప్రయోజనమును తెల్పుచున్నాడు.

అసన్నిధౌ ప్రతినిధి ర్మాభూ న్నిత్యస్య కర్మణః
కామ్యస్య వా ప్రవృత్తస్య లోప ఇత్యుపదిశ్యతే . 70

అసన్నిధౌ = ముఖ్యద్రవ్యము లేనపుడు, నిత్యస్య కర్మణః = నిత్యకర్మకు గాని, కామ్యస్య వా = కామ్య కర్మకు గాని, ప్రవృత్తస్య = ప్రారంభింపబడిన దానికి, లోపః = లోపము, మాభూత్ ఇతి = కాకుండుగాక యని, ప్రతినిధిః = ప్రతినిధి, ఉపదిశ్యతే = ఉపదేశింపబడుచున్నది.

తా. సంధ్యావందనము, అగ్నిహోత్రము మున్నగు నిత్యకర్మలు చేయక పోయినచో ప్రత్యవాయము కలుగును. అందుచే ఆ నిత్యకర్మల కంగములుగా చెప్పిన ద్రవ్యములు లేనపుడు ప్రతినిధులతోనైనను ఆచరించవలెను. అట్లే కామ్యకర్మ లారంభించిన తరువాత మధ్యలో ముఖ్యమగు ద్రవ్యమేదైన లేకపోవుట తటస్థించిన కర్మకు విచ్ఛేదము

కలుగకుండుటకై శాస్త్రము నిషేధించని ద్రవ్యమును ప్రతినిధిగా ఉపయోగింపవలెనని శాస్త్రము చెప్పుచున్నది.

పై విధమున 'వ్రీహిభిః' అను పదము వ్రీహులకు యాగాంగత్వ ప్రాప్తికై చెప్ప బడినది. యవాదులను నిషేధింపదు అని చెప్పి ప్రతినిధిత్వమును తత్ప్రయోజనమును సమర్థించి, ఇట్లు ద్రవ్యమునకు బదులుగా ద్రవ్యము నుపయోగించుట పదపదార్థముల నంగీకరించినపుడే తప్ప అఖండవాక్యార్థ పక్షమున కుదురదని ఆక్షేపించుచున్నాడు.

విశిష్టైవ క్రియా యేన వాక్యార్థః పరికల్ప్యతే

ద్రవ్యాభావే ప్రతినిధౌ తస్య తత్స్యా త్క్రియా_న్తరమ్. 71

యేన=వాక్య వాక్యార్థము లఖండములని యంగీకరించుఎవనిచేత, ద్రవ్యాభావే= ముఖ్యద్రవ్యము లేనపుడు ప్రతినిధౌ =ప్రతినిధిని పెట్టినపుడు, విశిష్టైవక్రియా =ప్రతి నిధి ద్రవ్యసాధ్యమగు యాగక్రియయే, వాక్యార్థః =వాక్యార్థముగ, పరికల్ప్యతే =కల్పింప బడునో, తస్య=ఆ యఖండ వాక్యార్థవాదికి, తత్=ప్రతినిధిద్రవ్యవిశిష్ట యాగక్రియ, క్రియాం తరం =ముఖ్యద్రవ్య విశిష్టయాగక్రియలకంటె భిన్నమగునది, స్యాత్=అగును.

**తా.** అఖండ వాక్యార్థవాదమున "వ్రీహిభిః యజేత" అనుచోట వ్రీహులు సాధనముగా గల యాగక్రియ చేయవలెను అని విశిష్టముగ వాక్యార్థబోధ కలుగును. పదార్థభానము ప్రత్యేకముగ నుండదు. అట్టిచో వ్రీహులు లేనపుడు యవలను ప్రతినిధిగ ఉపయోగించునపుడు అదేక్రియలో వ్రీహిరూప పదార్థమునకు బదులు యవద్రవ్యము నుపయోగించి రనుట కుదురదు. వారికి ప్రత్యేక పదార్థము లేదు. కనుక మొదటి వాక్యార్థ మునకు బదులు 'యవకరణకము' అగు యాగక్రియ అను వాక్యార్థమే క్రొత్తది వచ్చును. అట్లు చెప్పినచో 'వ్రీహిభి ర్యజేత'అనునది 'యవై ర్యజేత' అనుదానికంటె భిన్నక్రియ లగుటచే క్రియకు క్రియ ప్రతినిధి అయినది కాని ద్రవ్యమునకు ద్రవ్యము ప్రతినిధి యయినది అనుట కుదురదు. అట్లు క్రియకు ప్రతినిధిగా క్రియను చేయుట కూడదు. ద్రవ్యమునకు ప్రతినిధిగా ద్రవ్యమును కల్పించవచ్చును కాని క్రియకు ప్రతినిధిగ క్రియను కల్పించుట శాస్త్రనిషిద్ధము. అందుచే అఖండవాక్యార్థపక్షమునంగీకరించినచో ప్రతినిధిద్రవ్యకల్పనము లోపపోవలసివచ్చును.

వాక్యార్థాఖండవాదమున వేరొకదోషమును చూపుచున్నాడు.

విజ్ఞాతార్థం పదం యచ్చ తదర్థే ప్రతిపాదితే

పికాది య దవిజ్ఞాతం త త్కిమి త్యనుయుజ్యతే. 72

యత్ =ఏది, విజ్ఞాతార్థం =తెలిసిన అర్థముగల, పదం =పదము కలదో, తదర్థే =దానియర్థము, ప్రతిపాదితే =ప్రతిపాదింపబడగా, యత్=ఏ, 'అవిజ్ఞాతం=అర్థము' తెలియని పదము కలదో, తత్=అది, కిమ్ ఇతి=ఏమి అర్థమును బోధించును అని, అను యుజ్యతే చ=ప్రశ్నింపబడుచున్నది.

**తా.** "వనాత్ పికః ఆనీయతామ్"(వనమునుండి పికమును తెమ్ము)అను వాక్యమును వినిన నాగరికుడు తనకు "వనాత్, ఆనీయతామ్," అను పదములకు అర్థముతెలిసి పికః అను పదమునకు అర్థముతెలియక పికః అనగా నేమి ? అని ప్రశ్నించుచున్నాడు. వాక్యము పద

విభాగము లేనిదై అఖండమునై అర్థమునకు వాచకమగునని యంగీకరించినపుడు వాక్యము వలన వాక్యార్థము అఖండముగనే తెలియును కనుక ఒక పదమున కర్థము తెలియక ప్రశ్నించుట కుదురదు. వాక్యార్థము అఖండముగనే తెలియుటయో తెలియకపోవుటయో జరుగును. కాని కొన్ని పదముల కర్థము తెలిసి కొన్నిపదములకు తెలియకుండుట సంభవింపదు. కాని అట్టు సంశయము కల్గుచున్నది. కావున పదములు ప్రత్యేకార్థవంతములై యుండును అని అంగీక రించవలెను.

అఖండ వాక్య వాక్యార్థ పక్షమున శ్రుతివాక్యములకు విరోధము కల్గినపుడుగాని, శ్రుతి లింగములకు విరోధము కల్గినపుడుగాని శ్రుతి ప్రబలమని చెప్పుట కుదురదు అని దోష మును చూపుచున్నాడు.

సామర్థ్యప్రాపితం యచ్చ వ్యక్త్యర్థ మనుషజ్యతే
శ్రుతిరే వానుషంగే సా బాధికా లింగవాక్యయోః. 78

సామర్థ్యప్రాపితం="వాయవ్యం శ్వేతం ఛాగ మాలభేత" అను వాక్యమున ఆలం భన (పశువిశసనము) రూపక్రియా కర్మభూతమగు ద్రవ్యము (పశువు) నిర్గుణముగా నుండదు కనుక ఆ శబ్ద సామర్థ్యముచేతనే లభించిన, యత్=ఏ తెల్లదనము మొదలగు ధర్మము, వ్యక్త్యర్థం=స్ఫుటీకరణమునకై, అనుషజ్యతే=ఆలభేత అనుక్రియతో సంబంధింప చేయబడుచున్నదో, (ద్రవ్యగుణము కూడ క్రియతో), అనుషంగే=సంబంధము కలిగి యున్నప్పుడు, సా శ్రుతి రేవ=ఆ సంబంధము దెలుపు శ్రుతియే, లింగవాక్యయోః=లింగము చేతను, వాక్యముచేతను ప్రాప్తమగు సంబంధమునకు, బాధికా=బాధకమగును.

తా. వాక్యముయొక్క అర్థము సందిగ్ధముగా నున్నపుడు నిర్ణయించుటకు శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యలు అను ఆరు ప్రమాణములుగా స్వీకరింపబడును. వానిలో పూర్వ పూర్వము ఉత్తరోత్తరముకంటె బలవత్తరము. శ్రుతి : స్వార్థబోధనమున వేరొకదాని యపేక్షలేని శబ్దము. లింగము : శబ్దసామర్థ్యము. వాక్యము : రెండు లేక అంతకంటె ఎక్కువ పదముల చేరిక. ప్రకరణము : రెండు అర్థములకు పరస్పరము ఆ కాంక్షయుండుట. స్థానము : సాన్నిధ్యము. సమాఖ్య : యౌగిక శబ్దము. "వాయవ్యం శ్వేతం ఛాగ మాలభేత భూతికామః" ఐశ్వర్యమును కోరువాడు వాయుదేవతాకమగు శ్వేతమగు ఛాగమును (మేకను) విశసనము చేయవలెను అని విధి. ఆలభేత=ఆలంభనము చేయవలెను అను క్రియకు కర్మగా ఛాగము, దానితో ద్వితీయా విభక్తి చేరియుండి శ్రుతి గోచరమగుటచే సంబంధించుచున్నది. ఛాగమునకు కర్మత్వ రూపసంబంధమున సందేహము కలుగకుండ చేసినది ద్వితీయావిభక్తి శ్రవణము (శ్రుతి). కావున శ్రుతిప్రమాణముచే ఛాగమునకు కర్మ త్వము సిద్ధించినది. అట్లే శ్వేతం అను శబ్దమునందలి ద్వితీయా విభక్తి శ్రవణము శ్వేత గుణమునకు కర్మరూపమున క్రియాసంబంధమును తెలుపుచున్నది. ద్రవ్యము గుణములేనిదే యుండదు. గుణము ద్రవ్యములేనిదే యుండలేదు. కనుక గుణద్రవ్యముల సంబంధము "శ్వేతం ఛాగం" అను పదద్వయ సమభివ్యాహారరూపమగు వాక్యమువలన తెలియుచున్నది. గుణము (తెల్లదనము) ద్రవ్యము (ఛాగము) అనునవి రెండును ఆలంభనక్రియతో శ్రుతి ప్రమాణముచే సంబంధించుచున్నవి. కనుక అవి రెండును ఒకదానినొకటి బాధించుకొనవు. శ్రుతికి శ్రుతి బాధకము కాదు కావున వికల్పము ఏర్పడును. శ్వేతగుణము గల ఛాగము

లభించనపుడు 'శ్వేతం' అనుదానికి ప్రతినిధిగ ఏదో ఒక గుణముగల ఛాగమును విశసనము చేయవలెను. ఛాగము లభింపనపుడు శ్వేతగుణముకల మేషమును విశసనము చేయవలెను. "శ్వేతం ఛాగం" అను రెండిటికి గల సంబంధము(విశేష్య విశేషణభావ రూప సంబంధము) వాక్యప్రమాణముచే నేర్పడినది కనుక 'తెల్లని ఛాగమును' అనుదానిని శ్రుతి ప్రమాణము బాధించి శ్వేతగుణము కలదానినైనను, ఛాగమునైనను విశసనము చేయవలెను అని బోధించును.

శ్రుతిసిద్ధమగు సంబంధమునకు, వాక్యసిద్ధమగు సంబంధమునకు భేదమును చూపుచున్నాడు.

అప్రాప్తో యస్తు శుక్లాదిః సన్నిధానేన గమ్యతే
న యత్నప్రాపితో వాక్యే శ్రుతిధర్మవిలక్షణః. 74

యస్తు శుక్లాదిః=వ్రీహిత్వముతో కలిసియుండు ఏ శుక్లాది గుణము, అప్రాప్తః= శ్రుతిచే అప్రాప్తమై, సన్నిధానేన=వ్రీహిరూప ద్రవ్యమందుండుటచే, గమ్యతే=తెలియబడుచున్నదో, సః=ఆ శుక్లాదిగుణము, వాక్యే="వ్రీహిభిర్యజేత" అను వాక్యములో (నిర్గుణమగు ద్రవ్యముండదు కనుక ద్రవ్యము నాశ్రయించియున్న గుణమునకుకూడ క్రియాసంబంధము), యత్నప్రాపితః=లింగరూప ప్రమాణముచే కాని, అర్థాపత్తిరూపప్రమాణముచే కాని క్రియా సంబంధము కల్గింపబడిన దైనది, అది, శ్రుతిధర్మ విలక్షణః=శ్రుతిచే సిద్ధమైన వ్రీహ్యాది ద్రవ్యమువంటిది కాదు కనుక విధిలో అన్వయ ముండదు.

తా. "వ్రీహిభి ర్యజేత" అనుచోట వ్రీహిరూపద్రవ్యము శ్రుతిసిద్ధము కనుక దానికి సాక్షాత్ క్రియా సంబంధముండును. దానియందుండుటచే ద్రవ్యద్వారా ప్రమాణాంతర బలముచే శుక్లాదిగుణము క్రియాసంబంధము కలది యగుచున్నది. కావున అది విధ్యర్థముతో నన్వయింపదు.

వి. "శ్వేతం ఛాగ మాలభేత" అనుచోట అట్లుకాక ద్రవ్యము, గుణముకూడ శ్రుతి సిద్ధములే యగుటచే రెండింటికి సాక్షాత్తు క్రియాసంబంధముండును కనుక రెండింటికిని విధ్యన్వయ ముండును.

ఇట్లు శ్రుతి వాక్యప్రమాణములకు విరోధము కల్గినపుడు శ్రుతి బలవత్తర మనుట అఖండవాక్యార్థ పక్షమున కుదురదని దూషించుచున్నాడు.

అభిన్నమేవ వాక్యం తు య ద్యభిన్నార్థ మిష్యతే
త త్సర్వం శ్రుతిభూతత్వా న్న శ్రుత్యైవ విరోత్స్యతే. 75

వాక్యం=వాక్యము, అభిన్నమేవ=పదవిభాగశూన్యమే యయి, అభిన్నార్థం= అఖండమగు వాక్యార్థమును బోధించునదిగానే, యది ఇష్యతే=అంగీకరించినచో, తత్సర్వం= వాక్యము, దానియందు కల్పితమగు పదము కూడ. శ్రుతిభూతత్వాత్ = ఇతరానపేక్షముగ అర్థబోధకమగు శ్రుతిరూపమగుటవలన, శ్రుత్యైవ=వాక్యముకూడ శ్రుతియే యగుటచే శ్రుతితోనే, న విరోత్స్యతే=విరోధము కల్గియుండదు.

తా. వాక్యము అఖండము. పదవిభాగశూన్యమై అఖండవాక్యార్థమునే బోధించును. పదములు, వాని యర్థములు కూడ కల్పితములు అనునపుడు వాక్యము పదమువలె నిరపేక్ష

ముగ అర్థబోధకము అగును-దానికి పదసాపేక్షత్వము లేదు. 'శ్వేతం ఛాగ మాలభేత' అన్నప్పుడు శ్వేతత్వగుణవిశిష్ట ఛాగకర్మక అలంభనక్రియ వాక్యార్థము. శ్వేతత్వగుణము, ఛాగము శ్రౌతము, వాని సంబంధము వాక్యజన్యము అని వేరుచేయుటకు పదపదార్థోపస్థితి వలెనే వాక్య వాక్యార్థోపస్థితి నిరపేక్షముగ కల్గుచుండుటచే వీలు కాదు.

వి. అందుచే 'శ్వేతం ఛాగ మాలభేత, యనునపుడు గుణద్రవ్యసంబంధము వాక్యజన్యము కావున పదశ్రుతి జన్యమగు క్రియాకారక సంబధము దానిని బాధించును కావున శ్వేత గుణము లేకపోయినను, ఛాగము లేకపోయినను వాని ప్రతినిధులను కల్పించి వికల్పముగా విధిని అనుష్ఠించుట కుదురదు. క్రియాకారక సంబంధము, గుణద్రవ్య సంబంధము కూడ శ్రుతిప్రమాణసిద్ధమే కావున ఒకదాని నొకటి బాధింపవు కనుక శ్వేతచ్ఛాగము లభించనపుడు విధ్యనుష్ఠానము లేకపోవలసివచ్చును.

వాక్య వాక్యార్థములకు అఖండత్వ మంగీకరించినచో అవాంతర వాక్యముల యర్థ నిరూపణము కుదురదని ఆక్షేపించుచున్నాడు.

> వాక్యానాం సముదాయశ్చ య ఏకార్థప్రసిద్ధయే
> సాకాంక్షావయవ స్తత్ర వాక్యార్థోఽపి న విద్యతే. 76

ఏకార్థప్రసిద్ధయే=ముఖ్యమగు నొక యర్థము సిద్ధించుటకొరకు, యః=ఏ, వాక్యానాం=అవాంతరవాక్యములయొక్క, సాకాంక్షావయవః=పరస్పరాకాంక్ష గల అవాంతర వాక్యార్థములుగల, సముదాయః=సమూహము (ప్రయుజ్యతే=ప్రయోగింపబడుచున్నదో), తత్ర=అట్టి మహావాక్యములో, వాక్యార్థోఽపి=అవాంతర వాక్యార్థము లేదు కనుక మహా వాక్యార్థము కూడ, న విద్యతే=ఉండదు.

తా. "పాలు పిండుము, పాలతో భోజనముచేసి ఉపాధ్యాయుడు నాకు చదువు చెప్పను." అను మహా వాక్యములో "పాలు పిండుము" అనునది అవాంతర వాక్యము. దీని యర్థముతో ఆకాంక్ష కలిగియున్నది తరువాతి వాక్యము. తరువాతి వాక్యములోని యర్థముతో దీని కాకాంక్షయున్నది. మహావాక్యమునకు నిర్విభాగమగు మహావాక్యార్థమే తప్ప అవాంతరవాక్యార్థమే లేదన్నచో ఒక్కసారి అంతవాక్యము గ్రహించుట సాధ్య పడదు కనుక మహావాక్యార్థమే ఏర్పడదు. అవాంతరవాక్యార్థము ఉండదన్నచో శాస్త్రములు మహావాక్యావాంతరవాక్యరూపములై యుండును కావున అవాంతరవాక్యార్థ జ్ఞానపూర్వకముగ కాని మహావాక్యార్థజ్ఞానము ఏర్పడుట సంభవింపకపోవుటచే శాస్త్రగ్రహణ ప్రవచనమే లేకపోవలసివచ్చును. సర్వవ్యవహారము సాగకపోవలసివచ్చును.

[వాక్యార్థ నిర్ణయమున మీమాంసకులచే ఆరు, లేక పన్నెండు లేక ఇరువది నాలుగు న్యాయము లంగీకరింపబడినవి. వానినే పన్నెండు అధ్యాయములలో పూర్వమీమాంసాశాస్త్రమున నిరూపించినారు. వాక్యవాక్యార్థముల నిర్ణయమున ఈ న్యాయములు లోకమున, వేదమున గూడ ఉపయోగించును. ఈ న్యాయములు పదపదార్థాంగీకారములేని అఖండ వాక్య వాక్యార్థ పక్షమున సంభవింపవు అని నిరూపించుచు ప్రసంగవశమున ఆ న్యాయములకు ఉదాహరణములను ఏడు శ్లోకములలో నిరూపించుచున్నాడు.

పూర్వ మీమాంసా శాస్త్రమున పన్నెండు అధ్యాయములయందు పన్నెండు లక్షణ ములు (న్యాయములు) ప్రతిపాదింపబడుటచే దీనికి "ద్వాదశలక్షణి" అని వ్యవహారము.

మొదటి ఆరధ్యాయములలో విధి, భేదము, శేష శేషిభావము, ప్రయోజకత్వము, క్రమము, అధికారి అను ఆరు విషయములు నిరూపింపబడినవి. ఇవి ప్రకృతి యాగములకు సంబంధించిన వగుటచే వీనికి ప్రకృతిషట్కము, లేదా ఉపదేశషట్కము అని పేరు. తరువాతి ఆరు అధ్యాయములలో సామాన్యాతిదేశము, విశేషాతిదేశము, ఊహ, బాధ, తంత్రము, ప్రసంగము అను ఆరు విషయములు నిరూపింపబడినవి. మొత్తము పన్నెండు లక్షణములచే లౌకిక, వైదిక వాక్యార్థ నిర్ణయముచేయ వీలగును. ఈ పన్నెండు లక్షణములకు ప్రతిపక్షములు (వ్యతిరేక రూపములు) పన్నెండు కూడ ఆయా యధ్యాయములలో నిరూపింపబడినవి. అందుచే ఇరువదినాలుగు లక్షణములు (న్యాయములు) ప్రతిపాదింపబడినవి. [లక్ష్యతే=నిశ్చ యతే అనేన) దీనిచే నిశ్చయింపబడును కావున దీనికి లక్షణమని పేరు].

'అథాతో ధర్మజిజ్ఞాసా' అని ఆరంభించి ధర్మమన నేమి, దాని లక్షణ మేమి అని ప్రశ్నించుకొని చోదన (చేయవలెనని శ్రుతిచే ప్రతిపాదింపబడుట) లక్షణముగా గలది ధర్మము, చోదనయే ప్రమాణము, చోదనకే విధి, నియోగము అని మతభేదమున సంజ్ఞాభేదము, చోదన రూపమగు ప్రమాణమును నిరూపించుటచే మొదటి అధ్యాయము ప్రమాణ నిరూపణము.

ప్రమాణము అనగా చోదనశబ్ద, ప్రవృత్తి, సంఖ్యా భేదములచే భిన్నమయి యుండును. ఆ భేదములను రెండవ అధ్యాయము ప్రతిపాదించును. యజతి, దదాతి, జుహోతి అను శబ్దములు భిన్నములగుటచే చోదన భిన్నమగును. సంఖ్యయొక్క భేదముచే చోదన భిన్న మగును. ఒకే మంత్రముతో మూడుసార్లు మూడు ఆహుతులను హోమముచేయవలెను అని ''త్రిస ఆహుతీ ర్జుహోతి''అని చోదన భిన్నభిన్నముగా ఉండును కాన కర్మకూడ భిన్నమగును.

మూడవ అధ్యాయములో—ప్రతిపాదింపబడిన కర్మలలో ప్రధాన మేది? అంగ మేది? అని తెలిసి వినియోగముచేయవలెనని శేష శేషిభావము ప్రతిపాదింపబడినది. వినియోగింప బడిన కర్మలలో ఏది ప్రయోజకము, ఏది అప్రయోజకము అని తెలుపునది నాల్గవ అధ్యా యము. అంగములను క్రమముగ వినియోగించుటలో శ్రుతిక్రమము పాఠక్రమము ననుసరించ వలెనని క్రమమును అయిదవ అధ్యాయము నిరూపించును.

సాంగమైన కర్మ నాచరించుటకు సమర్థుడు అర్థిత్వముకలవాడు,శాస్త్రముచే నిషేధింప బడనివాడు, యోగ్యతకలవాడని అధికారి నిరూపణము ఆరవయధ్యాయమున నిరూపింప బడినది.

యాగమునకు అంగజాతము నిపద్ధ చెప్పనపుడు అది వికృతి యాగమైనచో దానిని ప్రకృతి యాగమువలెనే చేయవలెను అను సామాన్యాతిదేశముచే ప్రకృతియాగము యొక్క అంగజాతమునే ఆచరించవలెనని తెల్పునది సామాన్యాతిదేశము ఏడవ అధ్యాయమున ప్రతిపా దింపబడెను.

కొన్ని కర్మలలో అతిదేశమువలన ఇతర కర్మలలోని విశేషములగు మంత్రము బ మున్నగునవే గ్రహింపవలెను కాని సామాన్యములు కావని విశేషాతిదేశము ఎనిమిదవ యధ్యాయమున ప్రతిపాదింపబడెను.

అతిదేశముచే ప్రకృతియాగములోని మంత్రమును వికృతి యాగములో ఉపయో గించునపుడు దేవత మొదలగువానిని మార్చుట చేయవలెనని తెల్పు ఊహ తొమ్మిదవ యధ్యాయమున ప్రతిపాదింపబడెను.

సామాన్యశాస్త్రమును నిరవకాశమైన విశేషశాస్త్రము తదితర విషయములందు ప్రవర్తించునట్లు చేయు బాధ పదవయధ్యాయమున నిరూపింపబడెను.

ఒకసారి ఒకకర్మ ఆచరించుటవలన, రెండుసార్లు చేసినందువలన వచ్చుఫలము సిద్ధించునట్లు చేయుటయనెడి తంత్రము పదునొకండవ అధ్యాయమున నిరూపింపబడెను.

ఒకదానికొరకు ఆరంభింపబడినదానిచే ఒకే ప్రయత్నమున వేరొకటిగూడ సంభవించుటచే ప్రయత్నలాఘవము కల్గుట ప్రసంగము పన్నెండవయధ్యాయమున నిరూపింపబడెను. వీని ప్రతిపక్షములు కూడ ఆయా యధ్యాయములందు ప్రతిపాదించుటచే ఇరువదినాల్గు లక్షణములు].

ప్రసంగ, తంత్ర, అవృత్తి, భేద, సముచ్చయములను నిర్దేశించుచున్నారు.

ప్రాసంగిక మిదం కార్య్య మిదం తంత్రేణ లభ్యతే
ఇద మావృత్తిభేదాఖ్యా మత్ర బాధ స ముచ్చయౌ. 77

ఇదం కార్యం = ఈకార్యము, ప్రాసంగికం = ఒకఫలమునకై చేసిన ప్రయత్నముచే వేరొకటికూడ సిద్ధించినది. ఇదం = ఇది, తంత్రేణ = ఒకే ప్రయత్నముచే రెండును సిద్ధించునట్లు చేయుటచే, లభ్యతే = లభించుచున్నది. ఇదం = ఇది, అవృత్తిభేదాఖ్యాం = ప్రసంగమునకు తంత్రమునకు ప్రతిపక్షములు అగు ఆవృత్తిభేదములచేతను సిద్ధించును. అత్ర = ఈ విషయమున, బాధసముచ్చయౌ = బాధసముచ్చయములు- విశేషశాస్త్రముచే సామాన్యశాస్త్రమునకు బాధ, అవిరుద్ధములై తుల్యబలములగు వానికి సముచ్చయమును సిద్ధించును.

తా. పై విధముగ ప్రసంగ, తంత్రములును వాని ప్రతిపక్షములగు ఆ వృత్తి భేదములును, బాధయు దాని ప్రతిపక్షమగు సముచ్చయమును నిరూపింపబడినవి.

ఊహ, సామాన్యాతిదేశ విశేషాతిదేశములను నిర్దేశించుచున్నారు.

ఊహో౽స్మిన్ విషయే న్యాయ్యః సంబంధో౽స్య న బాధ్యతే
సామాన్య స్యాతిదేశో౽యం విశేషో౽త్రాతిదిశ్యతే. 78

అస్మిన్ విషయే = ఈ పదవిషయమునగాని విభక్తివచనములవిషయమునగాని, న్యాయ్యః = చేయదగిన మార్పు, ఊహః = ఊహయనబడును, అస్య = ప్రకృతి యాగము నుండి వచ్చినవాక్యములో('అగ్నయే త్వా జుష్టం నిర్వపామి' అనుదానిని సూర్యాయ అని మార్చి ఊహచేసినపుడు), మిగిలిన వాక్యముయొక్క, సంబంధః = సంబంధము, న బాధ్యతే = బాధింపబడదు, అనగా "త్వా జుష్టం నిర్వపామి" అని మారకుండగనే సంబంధించును.

అయం = ఇది, సామాన్యస్యాతిదేశః = సామాన్యాతిదేశము, అనగా ప్రకృతివలె వికృతిని చేయవలెనని చెప్పుట సామాన్యాతిదేశము, విశేషః = విశేషము, అత్ర = ఈ కర్మలందు, అతిదిశ్యతే = అతిదేశింపబడును, ఇది విశేషాతిదేశము.

తా. ఈ శ్లోకమున సామాన్యాతిదేశము, విశేషాతిదేశము, ఊహ, అపవాదము అనునవి నిరూపింపబడినవి.

అధికార తదపవాదములు నిరూపింపబడినవి.

అర్థిత్వ మత్ర సామర్థ్య మస్మి న్నర్థో న ఛిద్యతే
శాస్త్రా త్ప్రాప్తాధికారో౽యం వ్యుదాసో౽స్య క్రియాంతరే. 79

అత్ర = ఈ ఫలమునందు, అర్థిత్వం = కోరికయు, అస్మిన్ = ఈ కర్మయందు, సామర్థ్యం = శక్తియును, ఉండవలెను. అర్థః = ఫలము, న భిద్యతే = భేదింపదు, అయం = ఈ అధికారి, శాస్త్రాత్ = శాస్త్రమువలన, ప్రాప్తాధికారః = ఒక కర్మయందు యోగ్యత కలవాడు అగును, అస్య = వీనికి, క్రియాంతరే = వేరొకకర్మయందు, వ్యుదాసః = నిషేధము సిద్ధించును.

తా. అర్థిత్వము, సామర్థ్యము, శాస్త్రముచే నిషేధింపబడకుండుట అనునవియే కర్మయందు ఒకనికిగల యోగ్యతకు నిర్ణాయకములు. అదియే అధికారము.

క్రమము యొక్క స్వరూపమును నిరూపించుచున్నాడు.

ఇయం క్రుత్యా క్రమప్రాప్తి రియ ముచ్చారణాదిభిః
క్రమోఽయ మత్ర బలవా నస్మింస్తు న వివక్షితః . 80

ఇయం క్రమ ప్రాప్తిః = ఈ అంగముల క్రమసిద్ధి, శ్రుత్యా = శ్రుతిచేత ("చేయవలెను" అని చెప్పు శబ్దశ్రవణముచేత), ఇయం = ఈ క్రమసిద్ధి, ఉచ్చారణాదిభిః = పాఠము అర్థము మొ. వానిచే, అయం క్రమః = ఈ క్రమము, అత్ర = ఈ అంగానుష్ఠానమున, బలవాన్ = బలమైనది, అస్మింస్తు = ఈ అంగాచరణమున, క్రమః = క్రమము, న వివక్షితః = వివక్షచేయబడదు.

తా. అంగాచరణమున శ్రుతి, పాఠము, అర్థము మొదలగువానిచే క్రమము సిద్ధించును. కొన్నిచోట్ల క్రమము వివక్షింపబడదు.

వి. క్రమావివక్ష క్రమమునకు ప్రతిపక్షము.

ప్రయోజకత్వ మనెడి ప్రయుక్తిని నిరూపించుచున్నాడు.

ఇదం పరాంగైః సంబద్ధ మంగానా మప్రయోజకమ్
ప్రయోజక మిదం తేషా మత్రేదం నాంతరీయకమ్ . 81

ఇదం = ఇది, పరాంగైః = ఇతరములగు కర్మాంగములతో, సంబద్ధం = సంబంధించినది, అంగానాం = ఈ కర్మాంగములకు, అప్రయోజకం = నిమిత్తముకాదు, ఇదం = ఈ వస్తువే, తేషాం = ఆ ఫలభేదముకల కర్మాంగములకు, ప్రయోజకం = నిమిత్తమగును, అత్ర = ఇక్కడ, ఇదం = ఇది, నాంతరీయకం = ఉండకతప్పనిది కనుక అప్రయోజకము.

తా. వేరొకఫలమునకై యొక వస్తువుండి మరియొక కర్మాంగముతో సంబంధించి యుండి దాని ఫలమును తనకు కూడ ఫలముగా పొందుచున్నను అది దానికి అప్రయోజకము. దేనియొక్క సాన్నిధ్యములేనిదే ఏ అంగముయొక్క ఫలము సిద్ధింపదో దానికే అది ప్రయోజకము.

వి. ఛత్రచ్ఛాయ క్రిందనున్న రాజు ఏనుగుపై నుండుటచే రాజునకువలెనే ఏనుగునకు కూడ ఛత్రఛాయతో సంబంధమున్నను ఛత్రఛాయకు రాజు ప్రయోజకము, ఏనుగు అప్రయోజకము అని ఎరుంగునది.

శేష శేషిభావమును వివరించుచున్నాడు.

ఇదం ప్రధానం శేషోఽయం వినియోగక్రమ స్త్వయమ్
సాక్షా దస్యోపకారీద మిద మారాద్విశేషకమ్ . 82

ఇదం=ఈ కర్మ, ప్రధానం=ప్రధానము, అయం=ఇది, శేషః=అంగము (అప్రధానము), అయం=ఈ ప్రధానాంగ భావరూపమగు శేషశేషిభావమే, వినియోగక్రమః= ఆ కర్మలకుగల పరస్పర సంబంధముయొక్క క్రమమును తెలుపును. ఈ శేష శేషిభావము ద్వివిధము, ఇదం=ఇది, అస్య=ఈ కర్మకు, సాక్షాదుపకారి=ప్రత్యక్షముగ ఉపకారకము, ఇదం=ఇది, ఆరాత్=పరంపరగా, విశేషకం=ఉపకారకము.

తా. ప్రధానము, అంగము అను కర్మలకుగల సంబంధమే శేష శేషిభావము. ఇదియే వాని వినియోగక్రమము. ఈ అంగములు కొన్ని ప్రధానకర్మకు సాక్షాత్తుగను, కొన్ని మరియొకదాని ద్వారాను ఉపకారకములు అగును కనుక సాక్షాదుపకారకము, ఆరాదుపకారకము అని రెండువిధములగును.

వి. ఈ శేషశేషిభావమును వివక్షింపకుండుటయే దీని ప్రతిపక్షము.

శక్తివ్యాపారభేదేఽస్మిన్ ఫల మత్ర తు భిద్యతే
సంబంధా జ్జాతభేదోఽయం భేద స్తత్రావివక్షితః . 83

అస్మిన్=యాగ, దాన, హోమరూపములగు మూడు కర్మలయందు, శక్తివ్యాపారభేదే=యజతి, జుహోతి, దదాతి అను శబ్దములయొక్క శక్తిరూపవ్యాపారముల యొక్క ఏ భేదముకలదో ఆభేదముచేతనే భేదమేర్పడును. అందు, అత్ర = కర్మలయందు ఫలం=ఫలము, భిద్యతే=భేదించుచుండును, సంబంధాత్=కర్మసంబంధమువలన, అయం= ఈ ఆచమనాదికమగు అంగకర్మ, జాతభేదః= భేదముకలదగును, తత్ర=ఆ కర్మలలో, భేదః=శబ్దాదులచే భేదము, అవివక్షితః=వివక్షింపబడనిది. అభేదము అనే భేదప్రతిపక్షము.

తా. యజతి, జుహోతి, దదాతి మున్నగు శబ్దభేదములచే ఆ క్రియల శక్తి భేదముచే కర్మలలో కల్గుభేదమును భేదము అందురు. భిన్నశబ్దవ్యవహారములు కాకపోయినను కర్మలు ఫలభేదముచే భేదము కలిగియుండును. కౌండపాయుల మాసాగ్నిహోత్రమునకును "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః"అని విధించిన అగ్నిహోత్ర కర్మకును ఫలభేదముచే భేదము. కర్మాంగమగు ఆచమనకర్మ స్వతంత్రమగు ఆచమనకర్మకంటె భేదము కలిగియుండును. ఇట్టిభేదము వివక్షింపబడనపుడు దానిని అభేద మందురు.

ఈ ఇరువదినాల్గు విధములగు న్యాయములు పదపదార్థాశ్రయములై లోక వేద శాస్త్రములయందు వాక్యార్థ నిర్ణయమున నెట్లుపకరించునో తెలియచేయుటకు వాని స్వరూపోదాహరణములను శ్రీ భర్తృహరియు తదనుసారముగ పుణ్యరాజును వివరించిరి. వాని నిట కొద్దిగ తెలిసికొందము.

ప్రసంగము : ఇద్దరు అర్థులైయుండి ఇద్దరకు సామర్థ్యమున్నను ఒకరిని గూర్చి చేసిన పనితోనే రెండవవాడుకూడ కృతార్థుడై యుండునపుడు చేసిన పని వాని నుద్దేశించినది కాకయే ఫలము సిద్ధించుట ప్రసంగము. అట్టి ప్రసంగము కారణముగా సంభవించిన కార్యము ప్రాసంగికము.

లోకమున : ఒకనికి పాఠము చెప్పుచుండగా దానిని తానుకూడ ఎరుంగవలె నని వేరొకడు కూడ సమర్థుడైనవాడు అచటనున్నచో వేరుగా అధ్యాపన మక్కరలేకయే ఒకనికి చెప్పిన దానివల్లనే రెండవవానికి అధ్యాపన ఫలము సిద్ధించినది. కావున ఇది ప్రాసంగికము.

వేదమున : "అగ్నీ షోమీయం పశు మాలభతే, తస్య వపయా ప్రచర్యాగ్నీషోమీయ మేకాదశకపాలం పురోడాశం నిర్వపతి" అగ్నీషోమీయ పశువిశసనము చేసి అగ్నీషోమీయమగు ఏకాదశకపాలపురోడాశమును యాగమున నుపయోగించవలెను. ఇచట అగ్నీషోమీయ పశువునకై చేయు ప్రయాజానుయాజరూపాంగానుష్ఠానము ఆ పశుపురోడాశమునకు కూడ చేసినట్లే యగును. ఇది ప్రాసంగికము.

వ్యాకరణశాస్త్రమున : 'సర్వాదీని సర్వనామాని' అను సూత్రముచే సర్వనామ సంజ్ఞ విధింపబడుచున్నది. సర్వనామ అను పదమున నకారమునకు ణత్వము రావలెను. సర్వణామ అనియుండవలెను. కాని సంజ్ఞను విధించుచు పాణిన్యాచార్యులు సర్వనామ అని నిర్దేశించుటచేతనే ణత్వమురాక పోవుటను కూడ సాధించెను. దానికి వేరేప్రయత్నము చేయ లేదు. కావున ఇది ప్రాసంగికము. దానికొరకు ఉద్దేశింపబడకపోయినను వేరొకదానికై ఉద్దేశించినదానిచేతనే కార్యము సిద్ధించుట ప్రసంగము. "ఆమ్రాశ్చ సిక్తాః పితరశ్చ తృప్తాః" అను లోకన్యాయము దీనికి ఉదాహరణము.

తంత్రము : ఒక వస్తువుచే అనేకులకు కార్యము కావలసివచ్చినపుడు ఆవృత్తిచేసి వారి వారి నుద్దేశించి చేయనవసరము లేకయే ఒకేప్రయత్నముతో ఆ యందరి కార్యములు నెరవేర్చుట తంత్రము. ఒకేదానిచే భిన్నఫలములు సిద్ధించుట.

లోకమున : ఒక దీపముతో పదిమంది చదువుకొనుట. వేరు వేరు దీపములు వేరుగ అవసరములేక అందరకు ఒకే దీపము ఫలమును నెరవేర్చుచున్నది కావున ఇది తంత్రము.

వేదమున : ఆగ్నేయాదులగు దర్శపూర్ణమాస యాగము లారింటికి ముందుగాని వెనుకగాని ప్రయాజానుయాజలు ఆచరించినచో అవి ఆరింటికి వేరు వేరుగా చేయనక్కర లేకయే ఆరింటికి చెందును.

వ్యాకరణ శాస్త్రమున : 'తపర స్తత్కాలస్య' అనుసూత్రమున తపరః అను పదము బహువ్రీహిసమాసము, తత్పురుష సమాసము కూడ చెప్పుటకు వీలుగా నుచ్చరింపబడుట. "తాత్పరః" (తకారముకంటె పరమైనది), "తః పరః యస్మాత్ సః" (తకారము దేనికంటె పరముగానుండునో అది) అని రెండు విధములుగ అర్థము వచ్చునట్లు తపరః అని ఒకేపదమును నిర్దేశించుట తంత్రము.

పై తంత్రప్రసంగములకు ప్రతిపక్షములు ఆవృత్తిభేదములు.

ఆవృత్తి : లోకమున యుద్ధభూమిలోగాని, రంగస్థలమున గాని ఒకేవస్త్రము, ఆభరణము, ఆయుధము వేర్వేరు వ్యక్తులచే ఉపయోగింపబడుచున్నది. దానిని వారు వేరు వేరు సమయములలో మార్చుకొని ధరింతురు.

*వేదములో* : సామిధేనీమంత్రములు 17 అని చెప్పబడుచున్నవి. ఇవి అగ్నిని ప్రజ్వలింపచేయు ఋక్కులు. ఇవి 13 మాత్రమే. కాని మొదట ఋక్కును మూడుసార్లు, చివరి ఋక్కును మూడుసార్లు ఉచ్చరించిన అవి 17 అగును. ఉచ్చారణయొక్క ఆ వృత్తిచే మంత్రభేదము వచ్చినది.

*వ్యాకరణ శాస్త్రమున* : "ఇగ్యణః సంప్రసారణమ్" ('యవరల') యణ్ యొక్క స్థానమున (ఇఉఋౡ) ఇక్కు వచ్చును, అది సంప్రసారణము, అని సంప్రసారణ సంజ్ఞవిధింపబడినది. వర్ణములకు సంప్రసారణసంజ్ఞ యనియు, వాక్యమునకు సంప్రసారణ సంజ్ఞ అనియు రెండు పక్షములు కలవు. ఆయాసూత్రములలో సంప్రసారణ పదము వచ్చినపుడు 'యణ్ స్థానికములను ఇక్కులు' అనిగాని 'యణ్ స్థానమునందు ఇక్ వచ్చును' అనువాక్యము కాని ఉపస్థితము కావలెను. విధిస్థలములలో వాక్యము, అనువాదస్థలములలో వర్ణములు ఉప స్థితములు కావలెను. అందుచే అనువాదస్థలములో వాక్యము, వర్ణములు రెండు నుపస్థితమగు టకు ఆవృత్తిచేయుదురు. అట్లు చేసినచో అన్వయము కుదురును.

**భేదము** : తంత్రమునకు ప్రతిపక్షము. లోకమున ఒకే కంచము వేర్వేరు సమయములలో భుజించునపుడు చాలమందికి ఉపయోగించినను ఒకేసారి భోజనముచేయు నపుడు వేర్వేరు భోజనపాత్ర లుండుట భేదము.

*వేదమున* : గ్రహము అని యాగములో నుపయోగించు పాత్రలను శోధించు నపుడు "గ్రహం సమ్మార్ష్టి" అని ఏకవచనముతో నున్నను భిన్న భిన్నముగనే సమ్మార్జనము చేయవలెను.

*వ్యాకరణ శాస్త్రమున* : 'నవేతి విభాషా' అనుసూత్రమును భాష్యకారులు ప్రత్యాఖ్యానము చేసి ఉభయత్ర విభాషాస్థలములలో కొన్ని ఉదాహరణములలో విధిరూపమున ప్రవర్తించుననియు, కొన్ని ఉదాహరణములలో నిషేధరూపమున ప్రవర్తించుననియు భేదమును అంగీకరించిరి. "హృక్రో రన్యతరస్యామ్" అనుసూత్రమున ప్రవృత్తిభేదము నంగీకరించి "కారయతి కటం చైత్రం చైత్రేణ" అనుచోట వేరొకదానిచే ప్రాప్తింపకపోవుటచే కర్మత్వమును విధించును. "వికారయతి సైంధవాన్, సైంధవైః" అనుచోట అకర్మకమగుటచే వేరొక సూత్ర ముచే ప్రాప్తించుటచే నిషేధము ప్రవర్తించును. ఇట్లు ప్రవృత్తిభేద మంగీకరింపబడినది. ప్రసంగమునకుగూడ ఆవృత్తిభేదములు ప్రతిపక్షములే.

**ప్రసంగవిరోధియగు భేదము** : లోకములో ఒక ఊరికి వెళ్లి తిరిగివచ్చుచు త్రోవలో మేయుచున్న ఆవును తోలి తెచ్చుట ప్రసంగము. అట్లు మరచిపోయి ఇంటికి వచ్చి మళ్ళీ వెళ్ళి ఆవును తోలి తెచ్చుట క్రియాభేదము.

*వ్యాకరణమున* : 'పూర్వత్రాసిద్ధమ్' అను సూత్రముచే పూర్వశాస్త్రముల దృష్ట్యా పరశాస్త్రమునకు అసిద్ధత్వమును విధించి దాని తరువాతి సూత్రముచే "నలోపః సుప్స్వరసంజ్ఞాతుగ్విధిషు కృతి" నలోపము సుప్స్వరాది విధుల దృష్ట్యా అసిద్ధమగును కాని ఇతర శాస్త్రముల దృష్ట్యా అసిద్ధము కాదని చెప్పెను. ఇచట "పూర్వత్రాసిద్ధమ్" అను సూత్ర ములోనే "సుప్స్వరాది శేషే" అని సుప్స్వరాదిశేషత్వమును విధించినచో వేరే సూత్రమక్కర లేకయే ప్రసంగముచే రెండు సూత్రముల ప్రయోజనము సిద్ధించును. కాని పాణిని సూత్ర ద్వయము చేయుట క్రియాభేదము.

**ప్రసంగ విరోధియగు ఆవృత్తి :** లోకమున వసిష్ఠునికి పాద్యాదులతో పూజించి భోజనముపెట్టుము అనినపుడు ప్రధానక్రియ భోజనము; దానితో కలిసి పాద్యాది పూజనము ఒక్కని విషయమున ఒకే ప్రయత్నమున జరుగును. కావున క్రియాభేదము లేదు. అది ప్రసంగము. "బ్రాహ్మణులకు పూజలొనర్చుము-భుజింపచేయుము" అనునపుడు ప్రతి బ్రాహ్మణునికి పూజన భోజనము లావృత్తిచే చేయబడును.

*వ్యాకరణమున :* సంజ్ఞా సూత్రములను ఆ సంజ్ఞల నుపయోగించిన సూత్రము లన్నింటిలోనూ ఆవృత్తిచే ఏకవాక్యతలో సంబంధింపచేయుట ఆవృత్తి.

**బాధ :** సామాన్యోపదేశమువలన గాని, కావలెననిపించుటచే గాని ఒక కార్యము నకు ప్రాప్తి సంభవించుచుండగా దృష్టప్రయోజనముచే గాని, అదృష్టప్రయోజనముచే గాని ప్రాప్తి లేదని చెప్పుట బాధ.

*వైదికము అనగా స్మృతిసిద్ధమగు దృష్టాంతము :* ఆకలితీరుటకు దేనినైనను తిని ఆకలి తీర్చుకొనుట ప్రాప్తమగుచుండగా "అభక్ష్యో గ్రామ్యకుక్కుటః" అని గ్రామ్యకుక్కుట భక్షణము బాధింపబడుచున్నది.

*లోకమున :* "బ్రాహ్మణులకు పెరుగు పోయుము కౌండిన్యునకు మజ్జిగ పోయుము" అనునపుడు బ్రాహ్మణుడుగా కౌండిన్యునకు సామాన్యముగ రావలసిన పెరుగును "మజ్జిగ పోయుము" అనునది బాధించును.

*వ్యాకరణమున :* 'కర్మణ్యణ్' అను సూత్రముచే సామాన్యముగ కర్మ ఉప పదముగా నున్నపుడు వచ్చు అణ్ ప్రత్యయమును ఉపసర్గముందుండని ఆకారాంత ధాతు వులకు కప్రత్యయము వచ్చును అని "ఆతోఽనుపసర్గే కః" అనుసూత్రముచే విధించు "క" ప్రత్యయము బాధించును.

**సముచ్చయము :** పరస్పర విరోధము లేనివానికి ఒకచోట ప్రాప్తికల్గినపుడు తుల్యబలములైనచో సముచ్చయము (రెండును ప్రాప్తించుట) సంభవించును.

*లోకమున :* దేవదత్తునకు నెయ్యి, ఉప్పు, కూర, పఢ్డెంపుము అనునపుడు పరస్పర విరోధము లేదు కనుక, మూడింటికి ప్రాప్తి సమానము కనుక మూడు పదార్థములను వడ్డింపవచ్చును.

*వైదిక కర్మమున :* "బ్రాహ్మణులకు పాద్యమును, ఆచమనీయమును ఒసంగుము" అనునపుడు పాద్యాచమనీయములకు పరస్పరవిరోధము లేదు కనుకను, తుల్యముగనే ప్రాప్తించుచున్నవి కనుకను సముచ్చయము.

*వ్యాకరణశాస్త్రమున :* ఒకేప్రత్యయమునకు, ఫలభేదముండుటవలనను విరోధము లేకపోవుటవలనను ప్రత్యయసంజ్ఞ, కృత్ సంజ్ఞ, కృత్యసంజ్ఞ కూడ వచ్చును. ఇది సముచ్చయము.

**వికల్పము :** ఇది సముచ్చయమునకును, బాధకును ప్రతిపక్షము, అనగా విరోధి. తుల్యప్రమాణసిద్ధములగు వానిలో విరోధమున్నపుడు రెండును (ఏకకాలికముగ) సముచ్చయముగ రావీలులేదుకనుకను ఒకదాని నొకటి బాధింపవీలులేదుకనుకను ఏదో ఒకటియే రావీలగును. కావున దీనిని వికల్పమందురు.

*వేదమున :* "వ్రీహిభిర్వా యవైర్వా యజేత" అనునపుడు యాగమున వ్రీహి యవలకు అంగత్వము తుల్య ప్రమాణసిద్ధ మగునపుడు రెంటిని కలిపి ఉపయోగింప వీలుపడదు కనుక ఏదో ఒకదానినే వినియోగించుట వికల్పము.

*లోకమున :* కౌండిన్యునకు పెరుగు గాని మజ్జిగ గాని పోయుము అనునపుడు ఏదో ఒకదానిచే అన్నము తడియుట అను ఫలము సిద్ధించును కనుక పెరుగు కాని మజ్జిగ కాని పోయబడుట వికల్పము.

*శాస్త్రమున :* ణ్వుల్ తృచ్ ప్రత్యయములు సమానార్థకములు, తుల్యప్రమాణ సిద్ధములు అగునవి సముచ్చయముగా రావీలుపడదు కనుక వికల్పము. విధి ప్రతిషేధ శాస్త్రములు రెండును తుల్యబలములైనపుడు వానికి కూడ వికల్పమే సంభవించును.

*వేదమున :* "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి, న గృహ్ణాతి" అను విధినిషేధ ములు రెండును తుల్యప్రమాణ సిద్ధములే కనుక షోడశి గ్రహణాగ్రహణములకు వికల్పము.

*లోకములో కూడ :* "వీనికి కొంచెమిమ్ము, వద్దు" అని చెప్పినపుడు రెండును సమానబలములే కనుక విధి నిషేధములకు వికల్పము. ఇస్తే ఇవ్వవచ్చు-మానిన మానవచ్చు.

*శాస్త్రమున :* భాష్యకారుడు "వా" గ్రహణము చేయనవసరము లేదు. విధి నిషేధ శాస్త్రబలముచేతనే రెండును సిద్ధించును అని విధినిషేధములకు వికల్పమును చెప్పెను.

**ఊహ :** ప్రకృతియాగమున వినియోగించు మంత్రములను వికృతియాగమున నుపయోగించునపుడు దేవతాభేదముండుటచే ఆ మంత్రములు యాథాతథముగా ఉపయో గింపవు. కావున ప్రకృతిని, లింగమును, వచనమును వికృతియాగదేవతానుగుణముగ మార్చుకొనుట ఊహ. ప్రకృత్యూహ, లింగోహ, వచనోహ అని ఇది మూడు విధములు. ప్రకృత్యూహ: ప్రకృతియాగమున "అగ్నయే త్వా జుష్టం నిర్వపామి" అను మంత్రమున వికృతియాగమున "సూర్యాయ" అని సూర్యదేవతా వాచకమగు ప్రకృతిని మార్చుట. ఇట్లే మిగిలినవి కూడ.

*లోకమున :* "ఈ దేవదత్తునకు ఎత్తైన మేడలు కలవు. ధనవంతుడు ఈ వెధవ" అన్నపుడు దేవదత్తునకు అను షష్ఠీవిభక్త్యంతమును రెండవ వాక్యములో ధనవం తుడు అను ప్రథమాంతముతో అన్వయించునట్లు దేవదత్తుడు అని మార్చుకొనుట ఊహ.

*వ్యాకరణమున:* ఒకసూత్రములోనున్న పదము వేరొక సూత్రములో సంబంధించు నపుడు విభక్తి పరిణామము తరచు చేయవలసియుండును. "ఉపదేశేఽజనునాసిక ఇత్" (ఉపదేశమున అనునాసికమగు అచ్చు ఇత్ అను సంజ్ఞ కలదగును) అని చెప్పి "తస్య లోపః" (ఆ ఇత్సంజ్ఞక వర్ణమునకు లోపము వచ్చును) అని చెప్పెను. "తస్య" అను షష్ఠ్యంతముతో సంబంధించుటకు పూర్వసూత్రములోని 'ఇత్' అను ప్రథమాంత పదమును షష్ఠ్యంతముగా మార్చవలెను.

**సంబంధాబాధనము :** ఇది ఊహకు ప్రతిపక్షము. "దేవదత్తునకు ఎత్తైన మేడలు కలవు. అవి ధనవంతునకు తగినవే" అనునపుడు దేవదత్తునకు అను షష్ఠ్యంతము

రెండవ వాక్యములోని ధనవంతునకు అను పదముతో సంబంధించుటలో విభక్తి పరిణామ మక్కరలేదు. కనుక ఆది సంబంధాబాధనము.

*వేదమున :* "యజమానం దండేన ద్దీక్షయతి-అద్భి ర్దీక్షయతి-మేఖలయా దీక్షయతి" అను వాక్యములలో ''యజమానం" అను పదము విభక్తి పరిణామ మక్కర లేకుండగనే మిగిలిన వాక్యములతో సంబంధించును.

*వ్యాకరణమున :* "బహుగణవతుడతి సంఖ్యా" అను సూత్రమునందలి "సంఖ్యా" శబ్దము "ష్ణాంతా షట్'' (ష్ణాంతా సంఖ్యా) అను సూత్రమున ష్ణాంతా అనుదానితో విభక్తి పరిణామ మక్కరలేకయే సంబంధము కలిగియుండును.

**అతిదేశము :** ఒకదానియందుండు ధర్మమును వేరొకదానికి సంబంధింప చేయుట అతిదేశము. సామాన్యాతిదేశము-విశేషాతిదేశము అని అది రెండువిధములు.

**సామాన్యాతిదేశము :** వేరొకచోట ప్రసిద్ధముగ సంబంధముకలపని నిశ్చిత ములైన సాధారణ ధర్మములు దానికంటె భిన్నమగుస్థలమున నున్నట్లు ప్రసిద్ధముగ తోచు టచే ఒకదాని సాధారణ ధర్మమును వేరొకదానికి సంబంధింపచేయుట సామాన్యాతిదేశము.

క్షత్రియుని బ్రాహ్మణునివలె చూడవలెను. బ్రాహ్మణునియందు ప్రసిద్ధసంబం ధముకల త్రిషవణస్నాన శౌచ జపాది ధర్మములు క్షత్రియునియం దుండుటచే బ్రాహ్మణ సాధారణముగ చేయు అగ్రాసనదాన, అనుగమనాది ధర్మములను క్షత్రియునందుగూడ సంబంధింపచేయుట సామాన్యాతిదేశము.

*వేదమున :* ప్రకృతి యాగమువలె వికృతియాగము నాచరింపవలెను అనునది సామాన్యాతిదేశము.

*వ్యాకరణశాస్త్రమున :* ఆదేశము స్థానివలె ఉండును అనునది సామాన్యాతి దేశము.

**విశేషాతిదేశము :** ఈ బ్రాహ్మణుని బ్రాహ్మణునివలె ఆదరించవలెను.

బ్రాహ్మణ సామాన్యముగాచేయు అగ్రాసనదాన, అనుగమనాదులు చేయవలెనని ఎరింగినవానికి బ్రాహ్మణునివలె ఈ బ్రాహ్మణుని ఆదరించవలె నని బ్రాహ్మణాతిదేశముచే ప్రయోజనములేదు కనుక అతిదేశసామర్థ్యముచే విశిష్టబ్రాహ్మణునికి చేయు అర్ఘ్యోపనయనాది విశేషములు ఈ బ్రాహ్మణునికి చేయవలె నని అతిదేశము చేయబడును.

*వేదమున :* ప్రకృతియాగమువలె వికృతియాగము చేయవలె నను సామాన్యాతి దేశ మున్నను "ఆగ్నేయవత్ సౌర్యమ్" అని వికృతియాగమగు సౌర్యయాగము ఏకదేవతాక మగుటచే, ఏకదేవతాకమగు ఆగ్నేయయాగమువలెనే అంగజాత మాచరింపవలె నని విశేషాతి దేశము చేయబడును.

*వ్యాకరణశాస్త్రమున :* రూపాతిదేశ, నిమిత్తాతిదేశ, తాదాత్మ్యాతిదేశ,శాస్త్రాతి దేశ, కార్యాతిదేశ, వ్యపదేశాతిదేశ భేదములచే విశేషాతిదేశ మారు విధములుగ నుండును.

**ఉదాహరణమునకు** *నిమిత్తాతిదేశము:* ధాతువునకు సన్ ప్రత్యయమును చేర్చు నపుడు, సన్ ప్రత్యయప్రకృతియగు ధాతువు ఏనిమిత్తము నాశ్రయించి ఆత్మనేపదము నందునో ఆ నిమిత్తము సన్నంతమునకుగూడ ఆత్మనేపదమునకు నిమిత్తమగునని సూచిం చుచు "పూర్వవ త్సనః" అని సన్నంతమున నిమిత్తాతిదేశము చేయబడెను. ఏధ ధాతువు ఆత్మనేపదమగుటచే "ఏదిధిషతే" అని సన్నంతముకూడ ఆత్మనే పదమే యగును.

**అధికారము :** అధికారము అనగా యోగ్యత. అర్థిత్వము, సామర్థ్యము, శాస్త్రముచే నిషేధింపబడకుండుట అను మూడు లక్షణములుకల వ్యక్తి అధికారి. పురుషార్థము నపేక్షింపనివానికి ఆ కర్మయందు ప్రవృత్తికలుగదు కనుక మొదట కోరిక యుండవలెను. అది యున్నను ఆ కర్మచేయు సామర్థ్యము లేనివాడు కర్మయందు ప్రవృత్తుడు కాలేడు. నాటకము చూడవలెనని కోరిక యున్నను కన్నులేనివాడు చూడలేడు. సామర్థ్యము, కోరిక, యున్నను శాస్త్రవిహితములైన కర్మలయందు శాస్త్రముచే నిషేధింపబడిన వానికి అధికారము లేదు. అలౌకికమగు పురుషార్థము నుద్దేశించి ప్రవర్తించుటలో శాస్త్ర మెవనికి ప్రవృత్తిని విధించునో వానికే అధికారము. అదియే ప్రధానము. లోకమున రాజు ఒకనిని "నీవీనాటి నుండి ఈ గ్రామమునకు లేదా నగరమునకు అధికారివి" అని నియోగించినచో వాని కధి కారము సిద్ధించును.

*వేదమున:* "'అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామో బ్రాహ్మణః" అని బ్రాహ్మ ణునకు స్వర్గమందు కోరికగలవానికి అగ్నిహోత్రము నాచరించుటలో అధికారము.

*వ్యాకరణశాస్త్రము:* సాధుశబ్దమును, దానియర్థమును, దానిని ప్రయోగించుటచే పురుషునకు గలుగు ధర్మములను, ఫలమును ప్రతిపాదించుటలో అధికారము గలిగియుండును,

**శబ్దము:** ఆరు విధములు – మొదట సాధుశబ్దము, అసాధుశబ్దము అని రెండు విధములు. సాధుశబ్దము శాస్త్రీయము, ప్రాయోగికము అని ద్వివిధము. శాస్త్రీయము ప్రతిపాద్యము, ప్రతిపాదకము, ఉభయరూపము అని త్రివిధము.

ప్రతిపాద్యశబ్దము "దాధర్తి" మున్నగురూపమున శాస్త్రముచే సాధువుగ నిపతింప బడిన శబ్దము.

ప్రతిపాదకశబ్దము : ప్రకృతిప్రత్యయరూపము.

**ఉభయరూపము :** "భవితవ్య" శబ్దము. తవ్య శబ్దముచే ప్రతిపాదింపబడుటచే ప్రతిపాద్యశబ్దము; భవితవ్యం మొదలగుచోట ఇతవ్య శబ్దము ప్రతిపాదకశబ్దము. ఈ విధముగ ఉభయరూపము. ప్రాయోగికము లౌకికము, వైదికము అని ద్వివిధము. అసాధు శబ్దముతో కలిపి ఆరు విధములు.

**అర్థము:** ఇది 18 విధములు. అర్థము వస్తుమాత్రము, అభిధేయము అని ద్వి విధము.

1. వస్తుమాత్రము : లోకమున వస్తురూపమున నుండునది.
2. అభిధేయము : ఇతరుల కర్థమగునట్లు చెప్పబడి బుద్ధిలో శబ్దముచే భాసించునది. ఇది శాస్త్రీయము, లౌకికము అని రెండు విధములు.
3. శాస్త్రీయము : ప్రకృత్యర్థము, ప్రత్యయార్థము అని శాస్త్రముచే కల్పింపబడినది.
4. లౌకికము : ప్రకృతి ప్రత్యయ విభాగరహితముగ, అఖండముగ భాసించునది.
5. విశిష్టావగ్రహసంప్రత్యయహేతువు : శాస్త్రములో "కంసవధమును చెప్పుచున్నాడు" అను నర్థమున "కంసం ఘాతయతి" అని విశిష్టముగ వ్యవహరింపబడును. లోకమున కథకుడు లేదా నటుడు చెప్పుచున్నను, అభినయించుచున్నను కంసుని చంపు

చున్నాడు. చంపును, చంపినాడు అని వ్యవహరింతురు. ఇచట లోకవ్యవహార విలక్షణ మగు జ్ఞానమున గోచరమగు అర్థము విశిష్టావగ్రహసంప్రత్యయ హేతువు.

6. తద్విపరీతము : లోకములో ఎట్లు జ్ఞానవిషయమగుచున్నదో అట్లే శబ్దముచే కూడ చెప్పబడునది "ఈ ఆవు తెల్లనిది".
7. ముఖ్యము : "గంగడోలు మున్నగునవి కలది ఆవు" అని.
8. పరికల్పితరూప విపర్యాసము : సాదృశ్యాది నిమిత్తవశమున ఆరోపితరూపముకలది. "గౌ ర్వాహీకః" "వాహీకుడు పశువు" అనినపుడు గోరూపము కల్పితము.
9. వ్యపదేశ్యము : జాతి, ద్రవ్యము మొ॥ నవి.
10. అవ్యపదేశ్యము : జాతిద్రవ్యాది విభాగరహితమగు అఖండవాక్యార్థము.
11. సత్త్వభావము నందినది : లింగసంఖ్యాద్యన్వయయోగ్యమగు ద్రవ్యరూపము సందినది.
12. అసత్త్వభూతము : వాక్యార్థరూపమున నుండునది.
13. స్థిరలక్షణము : 'రాజపురుషుడు' అను సమస్తపదమున పురుషునకు రాజసంబంధి త్వము స్థిరలక్షణము.
14. వివక్షాప్రాపిత సన్నిధానము : "రాజ్ఞః పురుషస్య" (రాజుయొక్క - పురుషుని యొక్క") ఇచట విశేష్య మొకపుడు రాజు కావచ్చును. లేదా పురుషుడు కావచ్చును. ఇట్లు వివక్షనుబట్టి విశేష్య విశేషణ భావము మారవచ్చును.
15. అభిధీయమానము : 'రాజసఖః' అను సమాసమున టచ్ ప్రత్యయము సమాసాంత ముగ షష్ఠీతత్పురుషసమాసముననే వచ్చును కనుక "రాజుయొక్క సఖుడు" అను నర్థము అభిధీయమానము.
16. ప్రతిపాద్యమానము : రాజు స్నేహితుడుగా కలవాడు అను సర్థము.
17. అభిసంహితము : గోశబ్దమునకు గోత్వరూపజాతికాని, గోరూపవ్యక్తికాని, ఉభయము కాని-శబ్దశక్తిచే ప్రతిపాదింప నభిప్రేతమైనది.
18. నాంతరీయకము : గోవునందుండు రంగు, ఆకారము మున్నగునవి వ్యక్తిని వదలి యుండునవి కాకపోవుటచే,వ్యక్తిని శక్తిచే ప్రతిపాదించుచున్నను దానిని వదలియుండక పోవుటచే వచ్చు అర్థము.

**క్రమము** : శ్రుతిక్రమము, అర్థక్రమము, పాఠక్రమము, కాండక్రమము, ప్రవృత్తిక్రమము, ప్రతిపత్తిక్రమము, ప్రయోగక్రమము, బుద్ధిక్రమము అను భేదములు కలిగి యుండును.

*శ్రుతిక్రమము లోకమున* : స్నాత్వా "వ్రజతి" స్నానముచేసి వెళ్ళుచున్నాడు అనుచోట క్త్వాప్రత్యయము శ్రుతిగోచరమగుటచే రెండు క్రియల పౌర్వాపర్యము తెలియుచున్నది.

*వేదమున* : "హృదయస్యాగ్రే అవద్య త్యథ జిహ్వాయాః" "పశువుయొక్క హృదయమును ముందుగా విశసనము చేయవలెను తరువాత జిహ్వను" అని చెప్పుటలో అగ్రే=ముందు–అథ = తరవాత అను పదశ్రుతి క్రమమును నిరూపించుచున్నది.

*శాస్త్రమున* : "పరస్మైపదానాం ణలతుసుస్థలథుసణల్వమాః" అని పరస్మైపద ప్రత్యయములు తొమ్మిదింటికి ణల్ మొదలగు తొమ్మిది ఆదేశములు వచ్చును అనుచోట

స్థానాన్యాదేశములు సమసంఖ్యలో నున్నపుడు "యథాసంఖ్య మనుదేశః సమానామ్" అని యథాసంఖ్యముగ వచ్చునని శాస్త్రము చెప్పుటచే ఇది శ్రుతిక్రమము.

*అర్థక్రమము* : అర్థము అనగా సామర్థ్యము. దానిచే పౌర్వాపర్యము నిశ్చయింపబడుట. *లోకమున* "భుక్త్వా స్నాత్వా వ్రజతి" (భోజనముచేసి స్నానముచేసి వెళ్ళుచున్నాడు) అనునపుడు స్నానము తరువాత భోజనము జరుగుట సహజమగుటచే వేరొక విధముగ పలుకబడినను అర్థపర్యాలోచనచే "స్నానము, భోజనము" తరువాత "వెళ్ళుట" అని తెలియును కావున ఇది అర్థక్రమము.

*వేదమున* : "అగ్నిహోత్రం జుహోతి, యవాగూం శ్రపయతి" అగ్నిహోత్రమును హోమము చేయుచున్నాడు, యవాగువును (గంజి) కాచుచున్నాడు" అనునపుడు యవాగువు హోమద్రవ్యముగా ఉపయోగపడునది కనుక దానిని ముందు కాచి తరువాత హోమము చేయవలెనను క్రమము వాని స్వరూప పర్యాలోచనముచే నిర్ణయింపబడును. శ్రుతినిబట్టి ముందు అగ్నిహోత్రహోమమున్నను తరువాతియవాగూ పాకము దృష్టప్రయోజనము లేనిదగును కావున, ముందు యవాగూపాకమైనచో హోమార్థ ముపయోగింపబడును కావున అర్థమునుబట్టి యవాగూ పాకము ముందు హోమము తరువాత చేయవలెననునది అర్థక్రమము. శాస్త్రమున *గూడ* ప్రధానాప్రధానకర్మలు *గల* ఉభయకర్మక క్రియలలో ప్రధానకర్మకంటె ముందుగ అప్రధానకర్మకే క్రియతో సంబంధముండును కావున దాని ననుసరించి లకారాదులు ప్రవర్తించుచుండును. "గాం దోగ్ధి పయః" (ఆవును పాలను పిండుచున్నాడు) అనునపుడు 'గాం' అనునది అప్రధాన కర్మ-'పయః' అనునది ప్రధానకర్మ. కాని ఆవు లేనిదే పాలను పిండలేడు కావున క్రియతో ముందు గోశబ్దమునకు, తరువాత పయశ్శబ్దమునకు సంబంధము. ఇది అర్థ సామర్థ్యముచే ఏర్పడిన క్రమము కావున అర్థక్రమము.

*పాఠక్రమము* : ఉచ్చారణము ఏ క్రమములో నుండునో ఆక్రమమే పాఠక్రమము. ఆమె వక్త్ర, కాంతి, ఈక్షణ, గతి, స్వర, కేశములచే ఇందు, స్వర్ణ, ఏణ, మాతంగ, పుంస్కోకిల, మయూరములను జయించినది. ఇచట ఉచ్చరించిన క్రమములో ఉపమేయోపమానములకు సంబంధము పాఠక్రమము.

*వేదమున* : ప్రయాజలు అనెడి యాగాంగ హోమములను "సమిధో యజతి, తనూనపాతం యజతి, ఇడో యజతి, బర్హి ర్యజతి" అని ఏ వరుసలో పఠించినారో ఆ వరుసలోనే చేయవలెను. ఇది పాఠక్రమము.

*శాస్త్రమున* : "విప్రతిషేధే పరం కార్యమ్" అని సూత్రపాఠక్రమము ననుసరించి పూర్వ పరశాస్త్రములకు ఏకత్ర ప్రాప్తి కలుగునపుడు పాఠక్రమము ననుసరించి పరశాస్త్రము ప్రవర్తించును.

*కాండక్రమము* : స్మృతులలోను పురాణములలోను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రుల ధర్మములు ఏ క్రమములో ముందు ఉద్దేశింపబడునో ఆ క్రమముననే కాండములలో ధర్మములు ప్రతిపాదింపబడును. వేదమున యాజ్యానువాక్య లనెడి ఋక్కులు ఏ క్రమములో నున్నవో ఆ క్రమములోనే ఆగ్నేయాదులకు సంబంధము. వ్యాకరణ శాస్త్రములో ఆరవ యధ్యాయమున ముందు ద్విర్వచన కాండము. తరువాత సంప్రసారణకాండము పఠింప

బడినవి. అందుచే ద్విర్వచన కాండముకంటె సంప్రసారణకాండము పరమగుటచే ముందుగా ప్రవర్తించును.

*ప్రవృత్తిక్రమము :* బ్రాహ్మణులు ఏ వరుసలో యజ్ఞశాలలో ప్రవేశింతురో ఆ వరుసలోనే వారిని ఆచార్యుడు ఆయా కార్యములలో నియమించును.

*వేదమున:*''సప్తదశ ప్రాజాపత్యాన్ పశూ నాలభతే'' అని పదునేడు ప్రాజాపత్య పశువులను ప్రోక్షణ విశసన పర్యగ్నికరణము లను సంస్కారములచే సంస్కరించవలెను. అపుడు ఏ పశువునకు ముందు ప్రోక్షణ మారంభించునో ఆ ప్రోక్షణ మన్నింటికి చేసి ఆక్రమ ములోనే మిగిలిన విశసన పర్యగ్నికరణములను చేయవలెను. యజ్ఞమాచరించువాని ఇచ్ఛ ననుసరించి ప్రోక్షణ మారంభించవచ్చును. కాని మిగిలిన సంస్కారములు ఆ ప్రవృత్తి ననుసరించి సాగును. కావున ఇది ప్రవృత్తిక్రమము

*వ్యాకరణశాస్త్రమున :* ఏ క్రమమున అర్థప్రాదుర్భావము జరుగునో ఆ క్రమముననే శబ్ద ప్రాదుర్భావము జరుగును. పట్వ్యౌ, మృద్వ్యౌ అనుచోట్ల 'పటు' అను ప్రాతిపదికకు లింగసంబంధమువలన ముందు స్త్రీ ప్రత్యయము వచ్చును, తరువాత కర్మ, సంఖ్యాది సంబంధముచే ఏకవచనము వచ్చును. ఆ క్రమముననే పటు + ఈ + ఆ అనుచోట యణా దేశాది కార్యములు వచ్చును.

*ప్రతిపత్తిక్రమము :* లోకమున "పురుషః రాజ్ఞః" అని పురుష శబ్దము ముందు చ్చరింపబడినను ''రాజుగారి యొక్క పురుషుడు" అని రాజశబ్దార్థ ప్రతిపత్తి పూర్వకముగనే పురుష శబ్దార్థ ప్రతిపత్తి కలుగును.

*వేదమున :* ప్రధాన యాగమును గూర్చి ముందు తెలిపి అవాంతర యాగ ములను గూర్చి తరువాత చెప్పినను అంగ నిర్వర్తనానంతరమే ప్రధాన యాగనిర్వర్తనము కనుక అట్లే గ్రహింపబడును.

*శాస్త్రమున :* "లుఙ్ లఙ్ ల్ఱఙ్ క్ష్వడుదాత్తః" లుఙ్, లఙ్, ల్ఱఙ్‌లలో ధాతువునకు పూర్వము అడాగమము వచ్చునని విధించెను. అభవత్, అభూత్, అభవిష్యత్ మొ. స్థలము లందు అడాగమము ముందు ఉచ్చరింపబడుచున్నను లఙ్, లుఙ్ మొదలగు లకారములేనిదే అడాగమము రాదు కనుక పాఠక్రమముకంటె ప్రతిపత్తిక్రమముచే లకారములు వచ్చిన తరువాతనే అడాగమము వచ్చును.

*ప్రయోగక్రమము :* శాస్త్రములో "డుకృఞ్" అను ధాతువునందు ఏ క్రమము మున ఇత్సంజ్ఞక వర్ణములు ప్రయోగింపబడినవో ఆక్రమము ననుసరించియే వానికి ఇత్సంజ్ఞ లభించును.

*వేదమున :* "దర్శపూర్ణమాసాభ్యా మిష్ట్వా అన్యేన యజేత" దర్శపూర్ణమాస యాగముల నాచరించియే ఇతరయాగము ననుష్ఠింపవలెను అని ప్రయోగమున క్రమమును పాటింపవలెను.

*బుద్ధిక్రమము :* వర్ణములు ఉచ్చరించగానే నశించునవి కనుక "ఇక్కులకు అచ్చు పరముగా నున్నపుడు యణ్ ఆదేశముగా వచ్చును'' అను సూత్రముచే సంహితలో ఇక్కుకు అచ్చుపరముగా నుండుట కుదురదని భాష్యకారుడు ఆశంకించి బుద్ధిమంతుడైన వక్త వర్ణ పద వాక్య మహావాక్య రూపముగ శబ్దముచే అర్థములను బుద్ధిలో గోచరింపచేసికొని

పౌర్వాపర్యమును కల్పించుకొనవలెను అని వర్ణములకు, పదములకు, వాక్యములకు, వాని అర్థములకు పౌర్వాపర్యము బుద్ధిక్రమమని సమాధానము చెప్పెను. ఇది శాస్త్రమునందలి బుద్ధిక్రమము.

**లోకములో:** మెరుపును చూచి ఒకటే యనుకొనుటతో క్రమముగా ప్రవర్తించు చున్న విద్యుత్తులను బుద్ధిలో సంకలనముచేయుట గోచరించును. ఇది బుద్ధిక్రమము.

**వేదములో :** అనుష్ఠానానంతరమే నశించు ప్రయాజాదులకు క్రమము బుద్ధి పరికల్పితమే కావున ఇది క్రమము.

**అవివక్ష :** క్రమమునకు విరోధి. క్రమమును వివక్ష చేయనిచో నిమిత్త వశమున అక్రమముగ ప్రవర్తించును. యాగాంగముల నాచరించునపుడు "తుమ్మువచ్చినచో ఆచమనము చేయవలెను. దురదవేసినచో దుప్పికొమ్ముతో గోకుకొనవలెను". అనియున్నది. ఇది ఒక వరుసలో చేయవలసినది కాదు. ఎవరికి ఆ నిమిత్తము సంభవించునో వారు ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**లోకములో :** వాక్యమును ప్రయోగించుటలో క్రమమునకు అవివక్ష. అందుచే కొందరు "గాం ఆనయ శుక్లాం దండేన" అందురు. మరికొందరు. "శుక్లాం గాం ఆనయ దండేన" అందురు. క్రమమక్కరలేదు. శాస్త్రములో క్త్తుజిత్తు రూపమగు నిమిత్తము నాశ్రయముగా చేసికొని వచ్చు గుణవృద్ధులు రావు. అనునపుడు యథాసంఖ్యముగా క్త్తు గుణమునకు, జిత్తు వృద్ధికి సంబంధించునని వివక్షచేయబడలేదు కనుక క్రమము అశ్రయింపబడదు.

**ప్రయోజకము :** ప్రయోజకమనగా హేతుభూతమైనది. ఏనుగుమీదనెక్కిన రాజుగారిపైనుండు ఛత్రచ్ఛాయతో ఏనుగు సంబంధించియున్నను రాజు ఛత్రచ్ఛాయకు ప్రయోజకుడు. ఏనుగు అప్రయోజకము.

**శేషశేషిభావము :** ప్రధానము శేషి-దానికుపయోగించునది శేషము. వేదమున "వ్రీహీన్ అవహన్తి" ధాన్యమును దంపవలెను. ధాన్యము శేషి– దంపుట శేషము. ఈ శేషశేషి భావసంబంధము అంగములుగా నుండునవి ఆరాదుపకారకములు, సాక్షాదుపకారకములు అని రెండువిధములు. వేదమున అవఘాతము (దంపుట) దర్శపూర్ణమాసములకు సాక్షాదుపకారకము. ప్రయాజాదులు ఆరాదుపకారకములు.

**భేదము :** ఒకే పదార్థమునందు శక్తిభేదము, శక్తివ్యాపారభేదము ఉండును. మేఘమునుండి మెరయుచున్నది; మేఘమునందు మెరయుచున్నది; మేఘము మెరయు చున్నది అని మేఘమునందు అపాదాన, అధికరణ, కర్తృ శక్తిభేదముచేతనే వ్యాపారభేదము కూడ కన్పట్టును.

"ధనుస్సుచే కొట్టుచున్నాడు" (ధనుషా విధ్యతి) యనునపుడు ధనుస్సునందు అపాదానశక్తిగర్భమగు కరణశక్తి యుండును.

ఒకే కర్మకు ఫలభేదము కూడ ఉండును. ఒకే విధమగు దానకర్మకు ఆయుస్సు ఆరోగ్యము, ఐశ్వర్యము అను ఫలభేదము ఉండును. సంబంధభేదముచే కూడా భేదము కలుగును.

ధాత్వర్థమగు క్రియయొక్క కర్తలలో భేదముండుటచే క్రియాభేదమేర్పడును. ఇద్దరు వండుచున్నారు, పలువురు వండుచున్నారు. కర్తలు ఇద్దరు, పలువురు అయినపుడు వారిసంబంధముచే క్రియాభేద మేర్పడును.

**అభేదము:** భేదమునకు ప్రతిపక్షము భేదమును వివక్షింపకుండుట. "అన్నమును వండి తినుచున్నాడు" ఒకే కర్తయొక్క రెండు వ్యాపారములలో పూర్వవ్యాపారమును తెలుపు క్రియకు క్త్వాప్రత్యయము వచ్చును. ఇక్కడ క్రియాభేదముచే కర్తృకర్మశక్తులు భిన్నములని వివక్ష చేయకపోవుటచే ఏకకర్తృకత్వముచే క్త్వాప్రత్యయము వచ్చెను. ఈభేదము, అభేదము కూడ బహువిధముల నుండును.

ఈవిధముగ మీమాంసాశాస్త్రమునందలి ఆరు, లేదా పదిరెండు, లేదా ఇరువది నాల్గు న్యాయములు వివరింపబడినవి. ఇవి అఖండవాక్యార్థ పక్షమున పద పదార్థములు లేవు కనుక ప్రతిపాదింప వీలుపడదు.

వెనుక ప్రతిపాదించిన ఇరువదినాల్గు విధములగు న్యాయములకంటె భిన్నములగు మరికొన్ని న్యాయములు కూడ పదార్థ నిర్ణయమునకు ఉపయోగించునవి కలవని ప్రతిపాదించుచున్నాడు.

> ప్రసజ్యప్రతిషేధోఽయం పర్యుదాసోఽయ మత్ర తు
> ఇదం గౌణ మిదం ముఖ్యం వ్యాపీదం గురు లఘ్విదమ్. 84
>
> భేదో నాంగాంగిభావోఽస్య బహుధేదం వికల్ప్యతే
> ఇదం నియమ్యతేఽస్యాత్ర యోగ్యత్వ ముపజాయతే. 85
>
> అస్య వాక్యాంతరే దృష్టా ల్లింగా ద్భేదోఽనుమీయతే
> అయం శబ్దా దపోద్ధృత్య పదార్థః ప్రవిభజ్యతే. 86
>
> ఇతి వాక్యేషు యే ధర్మాః పదార్థోపనిబంధనాః
> సర్వే తే న ప్రకల్పేరన్ పదం చేత్స్యా దవాచకమ్. 87

అయం = ఇది, ప్రసజ్యప్రతిషేధః = ప్రసజ్య ప్రతిషేధము, అత్రతు = ఇచటనైతే, అయం = ఇది, పర్యుదాసః = పర్యుదాసము, ఇదం = ఇది, గౌణం = గౌణము, ఇదం = ఇది, ముఖ్యం = ముఖ్యము, ఇదం = ఇది, వ్యాపి = వ్యాపకము, ఇదం = ఇది, గురు = గురువు, ఇదం = ఇది, లఘు = లఘువు, భేదః = భేదము, న = లేదు, అంగాంగిభావః = అంగాంగిభావము, ఇదం = ఇది, అస్య = దీనికి, బహుధా = అనేకవిధముల, వికల్ప్యతే = వికల్పించబడును, ఇదం = ఇది, నియమ్యతే = నియమింపబడును, అస్య = దీనికి, అత్ర = ఈక్రియయందు, యోగ్యత్వం = యోగ్యత, ఉపజాయతే = కలుగును, అస్య = దీనికి, వాక్యాంతరే = ఇతరవాక్యమున, దృష్టాత్ = చూడబడిన, లింగాత్ = హేతువువలన, భేదః = భేదము, అనుమీయతే = అనుమానింపబడును, అయం పదార్థః = ఈ పదార్థము, శబ్దాత్ = శబ్దమునుండి, అపోద్ధృత్య = పృథక్కరించి, ప్రవిభజ్యతే = విభాగముచేయబడుచున్నది, ఇతి = ఈ విధముగ, వాక్యేషు = వాక్యములయందు, పదార్థోపనిబంధనాః = పదార్థముల నాశ్రయించి ప్రవర్తించునట్టి, యేధర్మాః = ఏ న్యాయములు కలవో, తే = అవి, సర్వే = అన్నియు, పదం = పదము, అవాచకం స్యాత్ చేత్ = అర్థబోధకము కాదన్నచో, న ప్రకల్పేరన్ = సంభవింపవు.

తా. వెనుక చెప్పిన ఇరువది నాల్గు విధములగు వాక్యలక్షణములు కాక మరి కొన్నిటి నిట ప్రదర్శించుచున్నాడు. పద, పదార్థముల నంగీకరించనిచో ఈ న్యాయములచే వాక్యార్థనిర్ణయము చేయుట సంభవింపదు. వాని నిట వరుసగా తెలిసికొందము.

**ప్రసజ్య ప్రతిషేధము :** 'నఞ్' కు క్రియాపదముతో సంబంధము ఉండి వాక్యభేద మున్నచో అది ప్రసజ్య ప్రతిషేధము. ఉదా : శాస్త్రములో "అకర్తరిచ కారకే సంజ్ఞాయామ్" సంజ్ఞయందు కారకమున ఘఞ్ ప్రత్యయము వచ్చును. కర్తృకారకమున రాదు. ఇచట "అకర్తరి" అను సమాసములో నుండు 'నఞ్' క్రియతో నన్వయించి కర్తృకారకమున రాదు అను నర్థము నిచ్చును. అది భిన్న వాక్యము కావున ప్రసజ్యప్రతిషేధము. వేదమున "బ్రాహ్మణో న హంతవ్యః, నానృతం వదేత్" మొ॥నవి. *లోకమున :* "అసూర్యం పశ్యా రాజదారాః" (రాజభార్యలు సూర్యుని చూడరు) అని క్రియతో నఞ్ అన్వయించును.

**పర్యుదాసము :** నఞ్ క్రియతో నన్వయింపక ఉత్తరపదముతో అన్వయించును. భిన్నవాక్యముగా కాక ఏకవాక్యమై యుండును.

*శాస్త్రమున:* "ఆతో కనుపసర్గేఽ కః" ఉపసర్గభిన్న మగునది ఉపపదముగా నున్నపుడు ఆకారాంతధాతువునకు కప్రత్యమువచ్చును. ఇచట నఞ్ ఉపసర్గముతో సంబంధించినది కాని క్రియతో కాదు. భిన్న వాక్యముగా కాక ఏకవాక్యముగా నున్నది. కావున పర్యుదాసము.

*వేదమున:* "అబ్రాహ్మణః సోమవిక్రయీ" (బ్రాహ్మణత్వ వ్యతిరిక్త జాతికలవాడు సోమవిక్రయి) అని నఞ్ ఉత్తరపదమగు బ్రాహ్మణ శబ్దముతో సంబంధించినది; నఞ్ సాదృశ్యముకూడ అర్థముగా కలిగియుండుటచే బ్రాహ్మణభిన్నుడు – బ్రాహ్మణ సదృశుడు సోమవిక్రయి అని తెలియచేయబడును.

*లోకమున:* "అబ్రాహ్మణ మానయ" అబ్రాహ్మణుని తీసికొని రమ్ము అనునపుడు బ్రాహ్మణత్వ వ్యతిరిక్తజాతి కలవాడు తత్సదృశుడు నగువానిని తీసికొనిరమ్ము అనియర్థము. ఇచట నఞ్ ఉత్తరపదమగు బ్రాహ్మణ శబ్దముతో అన్వయించును. కావున ఇది పర్యుదాసము.

**గౌణము :** "తత్పురుషః సమానాధికరణః కర్మధారయః" (సమానాధికరణ ము॥ప తత్పురుషము కర్మధారయము.) ఇచట తత్పురుష సమాసావయవములగు పూర్వోత్తర పదములు సమానాధికరణములు కాని అసామానాధికరణ్యము తత్పురుషమందు లక్షణా వృత్తిచే ఆరోపింపబడెను. కావున ఇది గౌణము.

*వేదమున:* "ఆదిత్యో యూపః" చక చకమని మెరయుట యను గుణసంబంధముచే యూపమును ఆదిత్యుడుగా వ్యవహరించుట గౌణము.

*లోకమున:* "సింహో మాణవకః" ఆ మాణవకుడు సింహము అని సింహము యొక్క శౌర్యాదిగుణయోగముచే మాణవకుని సింహముగా వ్యవహరించుట గౌణము

**ముఖ్యము :** శాస్త్రమున 'ధాతోః ప్రాతిపదికాత్' అనువాని యర్థము ముఖ్యము. 'హన్' అను దానియందు ముఖ్యధాతుత్వము, రామ యను దాని యందు ముఖ్య ప్రాతిపదికత్వము. అహన్ అను పరినిష్ఠితరూపమున ధాతుత్వము అతిదిష్టము కావున గౌణము. 'రామే' అను సుబంతమున ప్రాతిపదికత్వము అతిదిష్టము కావున గౌణము.

*వేదమున* : "యజమానోఽధ్వర్యు మన్వారభతే" (యజమానుడు అధ్వర్యువును అన్వారంభము చేయును) అనుచోట యజమాన, అధ్వర్యువు అను శబ్దముల యర్థములు ముఖ్యములు.

*లోకమున* : "శూరో మాణవకః" ఈ మాణవకుడు శూరుడు అనుట ముఖ్యము.

**వ్యాప్తి** : "ఏకశ్రుతి దూరాత్సంబుద్ధౌ" (దూరమునుండి సంబోధనము చేయునపుడు ఆ పదము) ఏకశ్రుతి కలదగును. అనుచోట సంబుద్ధిపదమునకు లోకప్రసిద్ధమైన అభిముఖీకరణము అను నర్థము వ్యాపి (వ్యాపకము). శాస్త్రసిద్ధమగు ఏకవచనమున సంబుద్ధి సంజ్ఞను గ్రహించినచో మిగిలినస్థలములలో సంబోధనమును గ్రహింపదు. వ్యాపకమగు లోకప్రసిద్ధమగు నర్థమును గ్రహించినచో శాస్త్రీయమగునదికూడ దానిలో నంతర్భూతమగును.

*వేదమున* : ప్రధానయాగసంబంధియగు ఫలమును విధించునవి ఫలవిధానము లేని అన్నియాగములకు సంబంధించునట్లు వ్యాపకముగా నుండును. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని విధించినపుడు జ్యోతిష్టోమ శబ్దము ఫలవిధానములేని ప్రధాన యాగమును లక్షణచే తెలుపును. కావున ఫలవిధానములేని విశ్వజిదాది యాగములందు స్వర్గమే ఫలముగా నుండును. కావున ఈ విధి వ్యాపకము.

*లోకమున* : 'సన్నిహతి' యను నొకతీర్థమున సర్వతీర్థములు సన్నిహితములై యుండునని భారతమున చెప్పబడెను. దానిలో గ్రహణ సమయమున స్నానముచేయుట సర్వతీర్థస్నానఫలదము అనుట వ్యాపకము.

**గురువు-లఘువు** : పృషోదరాది శబ్దములు శిష్టవ్యవహారమున ప్రసిద్ధములగుటచే వానిని 'పృషోదరాదీని యథోపదిష్టమ్' యథోపదిష్టములగు వానికి సాధుత్వమును విధించుట లఘువైన ఉపాయము. వానినే ప్రత్యేకముగ సాధించిన గురువగును.

*లోకమున* : 'లోహితశాలిమాన్ అయం గ్రామః' (ఎఱ్ఱధాన్యము కలది ఈగ్రామము) అనుచోట లోహితశాలిశబ్దములకు కర్మధారయమును చేసి దానిపై మతుప్ప్రత్యయమును చేర్చుట గురువు. బహువ్రీహి సమాసమును చేయుట లఘూపాయము. వేదమున వెనుక ప్రతిపాదించిన తంత్రప్రసంగములు లఘూపాయములు. ఆవృత్తి గురూపాయము.

**అంగాంగిభావము** : సామాన్యవిధులు విశేషవిధులతో కలిసి ఏకవాక్యతతో నన్వయించును కాని భేదముండదు. "తస్యాపత్యమ్" అను సామాన్యసూత్రము అపత్యార్థమున ప్రత్యయములను విధించు విశేషసూత్రములతో అంగాగిభావముతో అన్వయించును.

*వేదమున* : ఒక వాక్యమున అవయవముగా సంబంధించు భాగము వాక్యాంతరములకు కూడ అవయవముగా అన్వయించును. 'చిత్పతి స్త్వా పునాతు, వాక్పతి స్త్వా పునాతు, దేవ స్త్వా సవితా పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ' ఇచట 'అచ్ఛిద్రేణ పవిత్రేణ' అను వాక్యావయవము ముందు వాక్యములకుకూడ సంబంధించును. అంగాగిభావము వెనుక ఇరువది నాల్గు న్యాయములలో చెప్పబడినది. అయితే అచట ఒక అంగికి ఒక అంగము చూపబడినది. కాని ఇచట ఒక అంగము అనేకాంగులకు సంబంధించుట ప్రతిపాదింపబడెను.

*లోకమున* : "మణిః శాణోల్లీఢః శరది సరిదాశ్యాన పులినా" మున్నగు దీపకాలంకారోదాహరణములలో ఒకే క్రియ అనేక వాక్యములతో సంబంధించును.

**బహుధావికల్పము: వ్యాకరణశాస్త్రమున :** కొన్నిచోట్ల నిత్యముగా ప్రాప్తించుచుండగా వికల్పము, కొన్నిచోట్ల ప్రాప్తిలేకున్నను వికల్పము, కొన్నిచోట్ల ఉభయ వికల్పము. వేదమున దీక్షణీయేష్టియందు ఉపాంశు స్వరము ప్రాప్తమగుచుండగా యథేష్టముగ ఉచ్చైస్స్వరవిధానము వికల్పముగ విధింపబడెను.

*లోకమున :* ఒకే ఉపమేయ వస్తువును వివిధముగ ఉత్ప్రేక్షారూపమున వికల్పించుట ఉత్ప్రేక్షాలంకారమున కన్పట్టును.

**నియమము : శాస్త్రమున :** "తే ప్రాగ్ధాతోః" ఉపసర్గలు ధాతువునకు ముందే ప్రయోగింపబడవలెను అనునది నియమము.

*వేదమున :* 'నక్షత్రం దృష్ట్వా వాచం విసృజేత్' నక్షత్ర దర్శనముచేసి మాట లాడవలెను అనిచెప్పుటచే నక్షత్రదర్శనము అయ్యేకాలమందే మాటలాడవలెను. అంతకు ముందు మౌనము పాటింపవలెను అని నియమము వచ్చుచున్నది. 'నక్షత్రములను చూచి' అనుటచే నక్షత్రదర్శన యోగ్యమగు కాలమని యర్థము వచ్చును. అందుచే పగలు ఏదైన కారణముచే నక్షత్రములు కన్పడినను వాగ్విసర్గము చేయరాదు. అట్లే రాత్రి మబ్బులు కమ్ముటచే నక్షత్రములు కానరాకున్నను మాటలాడవచ్చును అని గ్రహింపవలెను.

*లోకమున :* పార్థుడే ధనుర్ధరుడు అనునపుడు ధానుష్కత్వము పార్థుని యందు నియమింపబడుచున్నది. విశేష్యముతో నన్వయించు ఏవకారము అన్యయోగ వ్యవచ్ఛేదమును చేయును. విశేషణముతో సంబంధించు ఏవకారము అయోగవ్యవచ్ఛేదము చేయునని ఎరుంగునది.

**యోగ్యత: శాస్త్రమున :** ఋకారముయొక్క స్థానమున రాబోవుచున్న అణ్‌నకే రపరముగా నుండు యోగ్యత కలదని "ఉరణ్ రపరః" (అ, ఇ. ఉలకే) అను సూత్రము చెప్పెను.

*వేదమున :* జ్యోతిష్టోమ యాగానుష్ఠానమున త్రైవర్ణికులకే యోగ్యతను ప్రతిపాదించును.

*లోకమున :* "ధురి ధుర్యో నియుజ్యతే" కాడి మోయగల ఎద్దునే కాడికి కట్టుదురు అని యోగ్యత తెలుపబడును.

**భేదము :** వాక్యాంతరమున గన్పట్టు లింగము వలన భేదము గోచరించు చుండును. శాస్త్రమున "ఓః పుయణ్‌జ్యపరే" అను సూత్రముచే అభ్యాసమునందలి ఉకారమునకు ఇకారమును విధించుట అను లింగము (నిమిత్తము)చే ణిచ్ పరమగునపుడు వచ్చిన ఆదేశము స్థానివంటిదగునను విశేషము తెలియును. "ద్విర్వచనేఽచి" అను సూత్రముచే స్థాని వద్భావనిషేధము 'ణిచ్' పరమగునపుడు ప్రవర్తింపదు.

*వేదమున :* 'అక్తాః శర్కరా ఉపదధాతి' పూయబడిన గులకరాళ్ళు ఉపధానము చేయవలెను. అనినపుడు 'దేనిచే పూయబడినవి' అని శంక కలుగగా 'తేజో వై ఘృతమ్' అను వాక్యాంతరమున కన్పట్టు ఘృతస్తుతిరూపలింగముచే ఘృతముచే పూయబడినవి అని తెలియుచున్నది.

లోకమున : "రామోఽసౌ భువనేషు విక్రమగుణైః ప్రాప్తః ప్రసిద్ధిం పరామ్" విక్రమముచే ప్రసిద్ధిచెందినవాడు ఈ రాముడు అనినపుడు దశరథ రాముడా ? పరశు రాముడా ? అను సందేహము రాగా ఆశ్లోకముయొక్క ఉత్తరార్ధములో ఒకే బాణముతో ఏడు చెట్లకు రంధ్రమేర్పరచిన వాడను లింగముచే దశరథరాముడే అని తెలియుచున్నది.

పదార్థవిభాగము : శబ్దమును పృథక్కరించి ప్రకృతి ప్రత్యయములుగా విభాగముచేయుట. శాస్త్రమున : "ధృషిశసీ వైయాత్యే" అను సూత్రమున వైయాత్యశబ్ద మును వియాత + ష్యఞ్ అని విభజించి వియాతునియొక్క భావము వైయాత్యము అని అర్థము కల్పించుటలో గోచరించును.

వేదమున : "వాయవ్యం శ్వేత మాలభేత" అను వాక్యార్థమునందలి వాయవ్య పదార్థమునుండి వాయుపదార్థమును పృథక్కరించి 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' అని వాయు దేవత అర్థవాదమున స్తోత్రము చేయబడినది. లోకమున 'రాజపురుషః' అనునపుడు అందులో రాజపదార్థమును పృథక్కరించి 'కస్య రాజ్ఞః' (ఏ రాజుయొక్క) అని ప్రశ్నించుటచే విభాగము కల్పించబడుచున్నది.

పైవిధమగు న్యాయములు పదసముదాయ రూపములగు వాక్యములందు పదార్థ ముల నాధారముగ చేసికొని వాక్యార్థమును నిర్ణయించుట కేర్పడినవి. పదపదార్థ విభాగ రహితమగు వాక్య వాక్యార్థము నంగీకరించినచో ఈ న్యాయముల కవకాశముండదు కదా ! కావున అఖండ వాక్యపక్షము అంగీకరించుట తగదని పదసత్యత్వవాది ఆక్షేపములను తెలిపెను.

అఖండవాక్యార్థవాదమున చూపిన దోషములను పరిహరించుచున్నాడు.

అవిభక్తేఽపి వాక్యార్థే శక్తిభేదా దపోద్ధృతే
వాక్యాంతర విభాగేన యథోక్తం న విరుధ్యతే . 88

అవిభక్తే ఽపి = అవాంతరవాక్యార్థ, పదార్థరూప విభాగము వాస్తవముగ లేని దైనను, వాక్యార్థే = వాక్యార్థము, శక్తిభేదాత్ = పదార్థప్రతీతిని, అవాంతర వాక్యార్థ ప్రతీ తిని కల్గించు మహావాక్యగత శక్తిభేదమువలన, వాక్యాంతర విభాగేన = అవాంతర వాక్య, పదరూప విభాగముచే, అపోద్ధృతే = బుద్ధిచే పృథక్కరింపబడగా, యథోక్తం = పదార్థ నిశ్చయమునకై ఏర్పడిన న్యాయములు మొదలగునవంతయు, న విరుధ్యతే = విరుద్ధముకాదు.

తా. మహావాక్యమువలన అఖండ వాక్యార్థజ్ఞానమే కల్గుచుండుటచే అదియే సత్యమైనను, అవాంతరవాక్య, వాక్యార్థ, పద, పదార్థ ప్రతీతికూడ లోకమున కల్గుచుండుటచే తదనుగుణముగ మహావాక్యమున భిన్నశక్తులుండు ననియు ఆ శక్తులచే అవాంతరవాక్య, పద విభాగమును కల్పించినచో అవాంతర వాక్యార్థ పదార్థజ్ఞానము వానిచే కల్గునని యంగీకరింప వలెను. అట్లంగీకరించిన వాక్యార్థనిర్ణయమున నుపయోగించు పదసంబంధులు మీమాంసా న్యాయములన్నియు ప్రవర్తించుటలో విరోధము లేదు.

అభిన్నమగు పుష్పచందనాది వాసనలయందు భేదమెట్లు కల్పితముగ వ్యవహరింప బడునో అట్లే అఖండవాక్యార్థమున కల్పితభేదము వ్యవహరింపబడునని దృష్టాంతమును ప్రదర్శించుచున్నాడు.

యథైవైకస్య గంధస్య భేదేన పరికల్పనా
పుష్పాదిషు తథా వాక్యే ష్వర్థభేదో విధీయతే . 89

పుష్పాదిషు = పూవులు, చందనము మున్నగువానియందు, యథైవ = ఏవిధముగా, ఏకస్య గంధస్య = అభిన్నమగు లేదా ఏకజాతీయమగు పరిమళమునకు, భేదేన = భిన్న జాతీయముగ, పరికల్పనా = కల్పించుట జరుగుచున్నదో, తథా = ఆ విధముగనే, వాక్యేఽపి = అఖండ వాక్యార్థమునందుకూడ, అర్థభేదః = పదార్థభేదము, విధీయతే = కల్పింపబడును.

తా. పూవులయందు, చందనమందు ఉండు పరిమళము ఒకేవిధమైనది, లేదా ఒకటేయయినను ఇది చందనపరిమళము, పూవులపరిమళము అని ఎట్లు భేదమును కల్పించి వ్యవహరించుచున్నారో అట్లే వాక్యముచే బోధింపబడు అఖండవాక్యార్థమున ఇది దేవదత్త శబ్దార్థము, ఇది గోశబ్దార్థము అని భేదము కల్పింపబడుచున్నది.

వేరొక దృష్టాంతమును చూపుచున్నాడు.

గవయే నరసింహే వా ప్యేక జ్ఞానావృతే యథా
భాగం జాత్యంతరస్యైవ సదృశం ప్రతిపద్యతే . 90

యథా = ఏవిధముగ, గవయే = గవయమృగమునందును, నరసింహే వా = నరసింహునియందును, ఏకజ్ఞానావృతే = ఒకటిగానే గ్రహింపబడుచున్నవానియందు, జాత్యంతరస్యైవ = గవయత్వరూపమున, నరసింహత్వరూపమున ప్రత్యేకజాతియై యుండు దానికే, భాగం = గోత్వము, అశ్వత్వము అను విభాగమును, నరత్వము, సింహత్వము అను విభాగమును, సదృశం = గోవునందు, అశ్వమునందు ఉండు గోత్వాశ్వత్వములకు సదృశమగు దానిని, నరునియందు, సింహమునందు ఉండు నరత్వసింహత్వములకు సదృశమగుదానిని, ప్రతిపద్యతే = లోకము గుర్తించుచున్నదో (అట్లే వాక్యార్థమునగూడ విభాగమును గ్రహించు చున్నది).

తా. గవయమృగము గోవు అశ్వము కలిసినరూపముతో నుండును. నరసింహ మూర్తి నరుడు సింహము కలిసినట్లు ఉండును. కాని వాస్తవమునకు గవయమున గోరూప అశ్వరూపముల సమావేశములేదు. నరసింహునియందు నర-సింహరూపముల సమావేశము లేదు. గవయత్వము వేరేజాతి. నరసింహత్వము వేరేజాతి. ప్రసిద్ధమగు గోవునందుండు గోత్వమువంటి భాగము, అశ్వత్వమువంటి భాగము అందున్నట్లు కన్పించుటచే గోత్వ-అశ్వత్వము లను భాగములు గవయమునందున్నట్లును, నరత్వసింహత్వరూపజాతులు నర సింహము నందున్నట్లును లోకము బుద్ధిచే పరికల్పితమగు విభాగము నెట్లు గుర్తించునో, అట్లే వాక్యార్థమును పదార్థరూప విభాగరహితమైనను కల్పితమైన భాగములచే పదపదార్థవిభాగము కలదానివలె గ్రహించును.

ఇట్లు కల్పితమగు పృథక్కరణముచే ఏర్పడిన పదవిభాగము నాశ్రయించి "పిక" పదార్థ సందేహము ఉపపన్నమగునని సమాధానించుచున్నాడు.

అప్రసిద్ధం తు యం భాగ మదృష్ట మనుపశ్యతి
తావ త్యేవంవిధం మూఢః సర్వత్ర ప్రతిపద్యతే . 91

యం=ఏ, అప్రసిద్ధం = అంతకుముందు ప్రసిద్ధముకాని, భాగం=గవయము యొక్క అశ్వసదృశమగు భాగమును, అదృష్టం=ఇంతకుముందు అశ్వసదృశముగనున్నను అశ్వసదృశముగ చూడని దానినిగ, అనుపశ్యతి=భావించునో, సః = వాడు, సర్వత్ర = సంపూర్ణమగు గవయరూపమున, మూఢః=జ్ఞానములేనివాడయ్యె, తావతి=అశ్వభాగ సదృశమగు గవయభాగముననే, అసంవిదం=అజ్ఞానమును, ప్రతిపద్యతే=కల్గియుండును.

తా. గవయమున గోసదృశమగు భాగము అశ్వసదృశమగు భాగము ఉండు నపుడు అందులో గోసదృశభాగము నెరింగి అశ్వసదృశమగు భాగమును ఎరుంగనివాడు గవయమును పూర్ణముగ నెరుంగనివాడే యగును. కాని దానియందు వాస్తవముగ లేని గోస దృశ, అశ్వసదృశ భాగములను కల్పించుకొనుటచే సగము తెలిసినట్లును సగము తెలియ నట్లును వానికి తోచును.

అట్లే ప్రకృతమున పికపదముయొక్క అర్థము తెలియనట్లుండునని సమన్వయించు చున్నాడు.

తథా పికాదియోగేన వాక్యేఽత్యంతవిలక్షణే
సదృశస్యేవ సంజ్ఞాన మసతోఽర్థస్య మన్యతే. 92

తథా=అట్లే, పికాదియోగేన='పిక' మొదలగు పదముల చేరికచే, అత్యంత విలక్షణే=వనాత్ ఋక్ష ఆనీయతామ్, (వనమునుండి ఎలుగుబంటి తేబడుగాక) అను వాక్యముకంటె పూర్తిగ విలక్షణమైన, వాక్యే=వనాత్ పిక ఆనీయతామ్ వనమునుండి కోకిల తేబడుగాక) అను వాక్యమున, అసతః అర్థస్య=వాస్తవముగలేని ''వనము, ఆనయనము (తెచ్చుట)''అను నర్థమునకు, సదృశస్యఇవ= మొదటివాక్యములోనివానివలె, సంజ్ఞానం = ప్రత్యభిజ్ఞ (గుర్తించుట), మన్యతే = భావింపబడును.

తా. "వనాత్ పిక ఆనీయతామ్" అనువాక్యము "వనాత్ ఋక్ష ఆనీయతామ్" అను వాక్యముకంటె పూర్తిగ భిన్నమైనదే. మొదటి వాక్యములోలేని పికపద ము ఉండుటచే భిన్నమే. వనాత్ ఆనీయతామ్ అను పదములు, వాని యర్థములను పోలినయర్థములుగల పదము లిందుండుటచే-సదృశము లనిపించుటచే ఆ రెండు శబ్దములు తెలిసినట్లును పికపదము తెలియ నట్లును భావించును. కాని వాస్తవమునకు పదములు వాక్యమురంటె ప్రత్యేకముగ లేవు. ఒక పదముయొక్క అర్థము తెలియనినాడు వాక్యమంతయు తెలియనట్లే.

వేరొకదృష్టాంతమును చూపుచున్నాడు.

ఏకస్య భాగే సాదృశ్యం భాగే భేదశ్చ లక్ష్యతే
నిర్భాగస్య ప్రకాశస్య నిర్భాగేనైవ చేతసా. 93

ఏకస్య = ఏకాకారమైన, నిర్భాగస్య = భాగములులేని, ప్రకాశస్య=ప్రకాశ రూపమగు జ్ఞానమునకు, భాగే = (జ్ఞాన) భాగమున, సాదృశ్యం=ఇతరజ్ఞానములతో పోలికయున్నను, భాగే=(విషయ) భాగమున, భేదశ్చ=భేదమున్నను, నిర్భాగేనైవ= భాగరహితమగు, చేతసా = జ్ఞానసాధనమగు మనస్సుచేతనే, లక్ష్యతే = గుర్తింపబడును.

తా. ఎరుపు నలుపు మొదలగు రంగులయొక్క సమూహజ్ఞానము కలిగినపుడు ఆ జ్ఞానము ప్రకాశరూపము, విభాగరహితము, ఏకమునై యుండును. కాని ప్రత్యేకముగా

ఎరుపునే చూచినపుడు కలిగిన జ్ఞానమునకును దీనిలో ఎరుపుయొక్క జ్ఞానమునకును పోలిక యున్నట్లును నలుపుయొక్క జ్ఞానము మాత్రము ఇచట భిన్నముగా నున్నట్లును కన్పడును. కాని వాస్తవమునకు నిర్భాగమైన మనస్సు కాల్పనికముగ అట్లు గ్రహించున ట్లుండును. కాని ఆ జ్ఞానము వేరు, ఈ జ్ఞానము వేరు. అంతేకాదు. విషయము వేరు కాని జ్ఞానము సమానమను కొనుటకు వీలుకాదు. విషయము జ్ఞానము విడదీసి చూప వీలుగా నుండవు. అదంతయును ఒకటే కావున భేదసాదృశ్యములు కల్పితములే, ఉన్నట్లు తోచును.

పై దృష్టాంతమును పదవాక్యవిషయమున నన్వయించుచున్నాడు.

తథైవ భాగే సాదృశ్యం భాగే భేదోఽవసీయతే
భాగాభావేఽపి వాక్యానా మత్యంతం భిన్నధర్మణామ్ .	94

తథైవ=అట్లే, అత్యంతం=పూర్తిగా, భిన్నధర్మణామ్=భిన్న స్వభావముకల, వాక్యానాం=వాక్యములలో, భాగాభావేఽపి = భాగములు లేకపోయినను, భాగే=ఒక భాగమునందు, సాదృశ్యం=పోలికయున్ను, భాగే=భాగమునందు, భేదః=భేదమున్ను, అవసీయతే = నిశ్చయింపబడును.

తా. పైని చూపిన రక్తనీలాది జ్ఞానమువలెనే "వనాత్ ఋషః ఆనీయతామ్" "వనాత్ పిక ఆనీయతామ్" అను వాక్యములు రెండును అత్యంతభిన్నములే. కాని కాల్పనిక పదవిభాగముచే వాస్తవముగ భాగములు లేకపోయినను "వనాత్, ఆనీయతామ్" అను భాగమున రెండు వాక్యములలో సాదృశ్య మున్నట్లును "ఋషః, పికః" అను భాగమున భేదమున్నట్లును గోచరించును. కాని వాస్తవమునకు రెండును ప్రత్యేకము అఖండములై అఖండ వాక్యార్థమును బోధించునవే.

అఖండవాక్యార్థవాది పదవాదమున దోషములను చూపుచున్నాడు.

రూపనాశే పదానాం స్యాత్ కథం చావధికల్పనా ?
అగృహీతావధౌ శబ్దే కథం చార్థో వివిచ్యతే ?	95

పదానాం=పదములయొక్క, రూపనాశే=స్వరూపము సంహితలో (సంధిలో) మార్పుచెందునపుడు, అవధికల్పనా = ఈ యర్థమును బోధించు వర్ణానుపూర్విగల పద మిది యని కల్పించుట, కథంచ = ఎట్లుగా, స్యాత్ = అగును, శబ్దే = పదము, అగృహీతావధౌ = ఈ వర్ణానుపూర్విగల ఈ పదము ఈ అర్థముయొక్క వాచకత్వము కలది యని గ్రహింప బడనిచో, కథం చ=ఎట్లు, అర్థః=అర్థము, వివిచ్యతే=గ్రహింపబడును.

తా. సంహితలో సంధి జరిగినపుడు 'దధ్యానయ' 'దధీహ' మున్నగు వాక్యములలో దధిశబ్దమునకు ఏకరూపత లేకపోవుటచేతను దధ్నా దధ్నే మొదలగు విభక్త్యంతములలో ఏకరూపత లేకపోవుటచేతను, దధిరూపార్థబోధకము ఈ పదము అని నియతముగ నెట్లు నిశ్చయింప వీలగును ? అర్థబోధక పదస్వరూప నిశ్చయము లేనిచో అర్థజ్ఞాన మెట్లు కలుగును? అని పదవాది ఇది పదమని నిరూపింప వీలుపడదని దోషమును చూపుచున్నారు.

'శ్వేతో ధావతి' అను వాక్యము రెండు ప్రశ్నలకు సమాధానముగా వ్యవహరింప బడుచున్నది. అచట "శ్వా+ఇతః, శ్వేతః" అనురెండు విధములుగ పదప్రతీతి అఖండ వాక్య వాక్యార్థపక్షమున కుదురదు. కనుక "శ్వేతః ధావతి" (తెల్లని గుర్రము పరుగెత్తుచున్నది)

అను నర్థమే కాని "కుక్క ఇటువైపు పరుగెత్తుచున్నది' అను నర్థము అంఖండవాక్యపక్షమున కావీలుపడదని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

సంసర్గ ఇవ రూపాణాం శబ్దేఽన్యత్ర వ్యవస్థితః
నానారూపేషు తద్రూపం తంత్రేణాపర మిష్యతే. 96

అన్యత్ర = వాక్య వాక్యార్థము లఖండములను పక్షమున, శబ్దే = శ్వేతః అను శబ్దమున, రూపాణాం = శ్వా + ఇతః — శ్వేతః, శ్వేతః అనునట్టి శబ్దస్వరూపముల యొక్క, సంసర్గ ఇవ = సంసర్గము (కలిపి యుచ్చరించుట) వలె, వ్యవస్థితః = ఏర్పడి యున్నది; తంత్రేణ = ఏక ప్రయత్నముచేతనే రెండు శబ్దములను కలిపి యుచ్చరించుటచే (దానితోనే చేరియున్న), అపరం తద్రూపం = అఖండమగు ఆ శ్వేతో ధావతి యను వాక్య స్వరూపమే, నానారూపేషు = శ్వాఇతః-శ్వేతః అను భిన్న స్వరూపముల ప్రతీతిని కల్గించు నదిగా, ఇష్యతే = అంగీకరింపబడును.

తా. కుక్క ఇటు పోవుచున్నదా? అని ఒకరు ప్రశ్నించగా, వేరొకరు తెల్లని గుఱ్ఱము ఇటు పోవుచున్నదా? అని ప్రశ్నింపగా ఆ రెండు ప్రశ్నములకుకూడ ఒకేవాక్యముతో "శ్వేతోధావతి" అని సమాధానము చెప్పినపుడు ఒక అర్థమున శ్వా = కుక్క, ఇతః = ఇటువైపు, ధావతి = పరుగెత్తుచున్నది : వేరొక యర్థమున శ్వేతః = తెల్లనిది (గుఱ్ఱము), ధావతి = పరుగెత్తుచున్నది అని రెండర్థములు అఖండవాక్యపక్షమున ఎట్లు వచ్చును? ఇచట 'శ్వా' అన్న రూపమే లేదుగదా ; ఒక్క యర్థమేగదా వాక్యము వలన వచ్చును అని శంకించు కొని సమాధానమును చెప్పుచున్నారు.

శ్వేతః అనుదానిలో శ్వా + ఇతః, శ్వేతః అనునవి తంత్రముచే కలిపి యుచ్చ రింపబడినట్లుండును. వాస్తవమునకు అఖండమే కాని శ్వేతో ధావతి అను వాక్యముచే శ్వా ఇతో ధావతి, శ్వేతో ధావతి అను రెండు వాక్యస్వరూపములు ప్రతీయమానము లగును. అట్లు ప్రతీతములగు రెండు వాక్యములచే రెండు విధములగు అర్థములు వచ్చును.

దినే ప్రకారాంతమున వివరించుచున్నాడు.

తస్మి న్నభేదే భేదానాం సంసర్గ ఇవ వర్తతే
రూపం రూపాంతరా త్తస్మా దనన్యత్ ప్రవిభజ్యతే. 97

తస్మిన్ = ఆ శ్వేతః అనునట్టి, అభేదే = అఖండమగు ఒకే వాక్యమున, భేదా నాం = శ్వా ఇతః, శ్వేతః అనునట్టి భిన్న వాక్యములయొక్క, సంసర్గ ఇవ = కలయిక వలె, వర్తతే = ఉండును, తస్మాత్ = అందువలన, రూపం = శ్వేతః అనెడి అఖండరూపము, రూపాంతరాత్ = శ్వా ఇతః, శ్వేతః అనెడి రూపద్వయము కంటె, అనన్యత్ = వేరు కానిదే యయ్యు, ప్రవిభజ్యతే = ఆవృత్తిచే రెండు అర్థముల నిచ్చునట్లు విభజింపబడును.

తా. ఇచటగూడ "శ్వేతో ధావతి" అను వాక్యముచే రెండర్థములు వచ్చుటనే వివరించుచున్నారు. "శ్వా ఇతో ధావతి, శ్వేతో ధావతి" అనెడి రెండు వాక్యములను కలిపి తంత్రముగ (ఒకేసారి) ఉచ్చరించునట్లు కన్పట్టు "శ్వేతో ధావతి" అను వాక్యము అఖండమే. ఈ అఖండ వాక్యములో ఆ రెండు వాక్యములు కలిసియే యుండును. ఈ అఖండవాక్యమే, ఉచ్చరించువా డొక్కసారియే ఉచ్చరించినను అర్థమును గ్రహించువానిచే రెండుసార్లు భావింప బడి కల్పిత విభాగముచే రెండర్థము లిచ్చును.

వి. వెనుకటి శ్లోకమునకు ఈ శ్లోకమునకు కొంచెము భేదమున్నది. ప్రత్యాయకము=ప్రతీతిని (జ్ఞానమును) కల్గించునది, ప్రత్యాయ్యము = ప్రతీయమానమైనది అనెడి రెండింటికి భేదము, అభేదము అనెడి రెండుపక్షము లిందు ప్రతిపాదింపబడినవి. 'శ్వేతో ధావతి' అనెడి వాక్యముచే 'శ్వా ఇతో ధావతి' 'శ్వేతో ధావతి' అను రెండు వాక్యములు ప్రతీయమానము లగుననియు, ఆ ప్రతీయమానములగు రెండు వాక్యములచే రెండర్థములు ప్రతిపాదింపబడు నను నదియు మొదటిమతము. శ్వేతో ధావతి అని రెండర్థములతో కలిసియున్న వాక్యము ప్రత్యాయకము. దానిచే ప్రత్యేకార్థబోధకములుగా ప్రతీయమానములగు రెండు వాక్యములు ప్రత్యాయ్యములు. వీటికి భేదము అంగీకరించి మొదటి శ్లోకమున సమాధానము నిచ్చిరి.

రెండవ శ్లోకమున "శ్వేతో ధావతి" అనెడి అఖండవాక్యముకంటె ప్రత్యేకార్థబోధకములగు వాక్యములు వేరుగా నుండవనియు అవి దానితో అభిన్నములుగనే యుండుననియు ఆ ప్రత్యాయక వాక్యముచేతనే ఆవృత్తిచే రెండర్థములు ప్రతిపాదింపబడుననియు వివరించెను. ఇందు ప్రత్యాయక ప్రత్యాయ్యములకు అభేదము నంగీకరించెను.

ప్రత్యాయక ప్రత్యాయ్యములకు భేదము, అభేదము అనునవి విషయభేదముచే శాస్త్రమున నంగీకరింపబడినవి అని ప్రసంగవశమున నిరూపించుచున్నాడు.

శాస్త్రే ప్రత్యాయకస్యాపి క్వచి దేకత్వ మాశ్రితమ్
ప్రత్యాయ్యేన క్వచి ద్భేదః గ్రహణ గ్రాహ్యయోః స్థితః. ౯౪

శాస్త్రే=శాస్త్రమునందు, క్వచిత్=కొన్నిచోట్ల, ప్రత్యాయక స్యాపి = ప్రత్యాయకమునకు గూడ, ప్రత్యాయ్యేన = ప్రత్యాయ్యముతో, ఏకత్వం=అభేదము, ఆశ్రితం=స్వీకరింపబడినది, క్వచిత్=కొన్నిచోట్ల, గ్రహణ గ్రాహ్యయోః = ప్రత్యాయక ప్రత్యాయ్యములకు, భేదః = భేదము, స్థితః = ఉండును.

ప్రత్యాయక ప్రత్యాయ్యములకు భేదమునకు ఉదాహరణము నిచ్చుచున్నాడు.

ఊఃఇత్యభేద మాశ్రిత్య యథాసంఖ్యం ప్రకల్పితమ్

ఊః ఇతి="ఊకాలోఽజ్ఘ్రస్వదీర్ఘప్లుతః" (1.2.27) అను సూత్రములో ఊః అను చోట, అభేదం=ప్రత్యాయక ప్రత్యాయ్యములకుఅభేదమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, యథాసంఖ్యం = యథాసంఖ్యత, ప్రకల్పితం=కల్పింపబడెను.

తా. "ఊకాలోఽచ్ హ్రస్వ దీర్ఘప్లుతః" అను సూత్రములో ఉ, ఊ, ఊః అను మూడు వర్ణములను 'ఊః' అని నిర్దేశించి వానియొక్క కాలముతో సమానమైన కాలము గల అచ్చు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అను సంజ్ఞలు కలది యగునని విధించెను. 'ఊః' అను నది ఉ, ఊ, ఊః అను మూడు వర్ణముల ప్రతీతిని మనకు కల్గించును కనుక అది ప్రత్యాయకము. 'ఉ, ఊ, ఊః' అను వర్ణములు ప్రత్యాయ్యములు. ఇచట యథాసంఖ్య నియమముచే 'ఉ' కాలముతో సమానమైన కాలముగల అచ్చు హ్రస్వము, ఊకాలసదృశకాలముగల అచ్చు దీర్ఘము, ఊః కాలసదృశకాలముగల అచ్చు ప్లుతము అని అర్థము చెప్పవలెను. ఉద్దేశ్యము ఊః అనునది ఒకటి. విధేయములు హ్రస్వ దీర్ఘ ప్లుతములు మూడు. వీనికి సంఖ్యలో సామ్యములేదు కనుక 'యథా సంఖ్య మనుదేశః సమానామ్' అను సూత్రముచే సమసంఖ్య కలవానికే యథాసంఖ్యముగ సంబంధము కనుక ఇచట యథాసంఖ్యముగ సంబంధమెట్లు?

అని శంకించి భాష్యకారులు ప్రత్యాయక ప్రత్యాయ్యముల కభేదము నాశ్రయించి ఊః అను దానిలో సంధిచే కలిసి 'ఉ, ఊ, ఊః' అను మూడును కలవు కనుక యథాసంఖ్య సంబంధము కుదురును అని వివరించెను. అందుచే 'ఊః' అను ప్రత్యాయకమునకు 'ఉ ఊ ఊః' అను ప్రత్యాయ్యములకును అభేద మంగీకరింపబడెను.

ప్రత్యాయక ప్రత్యాయ్యములకు భేదమునకు ఉదాహరణము నిచ్చుచున్నాడు.

లృఙ్ లృటోర్గ్రహణే భేదో గ్రాహ్యాభ్యాం సహ కల్పితః . 99

లృఙ్ లృటోః గ్రహణే = 'స్యతాసీల్ృలుటోః' (3.1.33)అను సూత్రమున లృ అనుటచే లృఙ్ లృట్ లకు ప్రతీతి కల్గుచున్నను, గ్రాహ్యాభ్యాం సహ = ప్రత్యాయ్యములతో, భేదః=భేదము, కల్పితః = కల్పింపబడినది.

తా. 'స్యతాసీ ల్ృలుటోః' అను సూత్రముచే 'ల్ృలుటోః' పరముగానున్నపుడు స్య తాస్ అనునవి వచ్చును అని విధించుచున్నారు. ఇచట లృ అనుదానిచే లృఙ్ లృట్ గ్రహింపబడును. కాగా నిమిత్తములు లృఙ్ లృట్ లుట్ అనునవి మూడు. అవి నిమిత్తములుగా నుండగా వచ్చు నాగమములు స్య, తాస్ అనునవి రెండు. ఇచట ప్రత్యాయకము లృ లుటోః అనునది. ప్రత్యాయ్యములు లృఙ్ లృట్ లుట్ లు. వీనికి అభేదము నంగీకరించినచో లృఙ్ లృట్ లుట్ అను నిమిత్తములు మూడు, ఆగమములు స్య, తాస్ లు రెండు కనుక యథాసంఖ్య సంబంధము కుదురదు. అందుచే ఇచట భేద మంగీకరించిరి. భేదమంగీకరించినచో ప్రత్యాయకమగు లృ, లుట్ లు రెండే కనుక అవి నిమిత్తములుగా స్యతాస్లు వచ్చునని యథాసంఖ్య సంబంధము చెప్పవచ్చును. అపుడు లృఙ్ లోను, లృట్ లోను స్య వచ్చును, లుట్‌లో తాస్ వచ్చును. ఇట్లు ఇచట ప్రత్యాయక ప్రత్యాయ్యములకు భేదము నంగీకరించి యథాసంఖ్య సంబంధము నిరూపింపబడినది.

ప్రత్యాయక ప్రత్యాయ్యముల కభేదమునకు వేరొక ఉదాహరణ మిచ్చుచున్నాడు.

యస్యేత్యేత దణో రూపం సంజ్ఞినా మభిధాయకమ్
నహి ప్రతీయమానేన గ్రహణ స్యాస్తి సంభవః . 100

అణోః = ఇకార అకారములయొక్క, రూపం = రూపము అగు, యస్య ఇత్యేతత్ = "యస్యేతిచ" (6.4.148) అను సూత్రములోని యస్య అనునది, సజ్ఞినాం = అకారసంజ్ఞులగు పదునెనిమిది అకారములకును, ఇకారసంజ్ఞులగు పదునెనిమిది ఇకారములకును, అభిధాయకమ్ = (గ్రాహకము) వాచకము, అట్లుకానిచో ప్రతీయమానేన = ప్రతీయమానమగు ఇకార అకారములచే, గ్రహణస్య = స్వసవర్ణములగు పదునెనిమిది విధములగు ఇకారాకారములను గ్రహించుటకు, సంభవః = అవకాశము, నాస్తి హి = లేదుగదా !

తా. "ఇశ్చ అశ్చ యం, తస్య యస్య" అను విగ్రహముచే ఇకార అకారములకు సమాసముచేయగా ఇ + అ అనునవి సంధిచే కలిసి య అగును. ఆ ఇకార అకారములకు ఈకారముగాని తద్ధిత ప్రత్యయముగాని పరముగా నున్నపుడు లోపము వచ్చును. అని 'యస్యేతిచ' అను సూత్రము విధించుచున్నది. యస్య అనుచోట ఇ + అ సంధితో కలిసి య అయినది. ఇది ప్రత్యాయకము, ఇకార అకారములు అను ప్రతీతిని కల్గించునది. ఇకారాకారములు ప్రత్యాయ్యములు. ఈ రెండును భిన్నములు కావు. సంధిచేకలిసిన

ఇకారాకారములే య గా నున్నది. అందుచే ఇకారముచే దాని 18 భేదములు, అకారముచే దాని 18 భేదములుకూడ ఇచట గ్రహింపబడును. ఇట్లు గ్రహింపబడనిచో ఇకారమునకే తప్ప ఈకారమునకు లోపమురాదు. అకారమునకే తప్ప ఆకారమునకు లోపమురాదు. అట్లు రానిచో సౌపర్ణేయః వైనతేయః-అను రూపములు సిద్ధింపవు. అందుచే య అను దానికి ఇ, అ అనువానికి అభేదముగ నిర్దేశ మిందు కలదని యంగీకరించవలెను. అంగీకరించినచో ఇ, అ అనునవి స్వసవర్ణములను గ్రహించును కనుక 18 విధములగు ఇకారాకారములకు లోపము రావచ్చును. అట్లు అభేదముగ నిర్దేశము నంగీకరింపక య అను ప్రత్యాయకము "ఇ అ" అను ప్రత్యాయ్యములు భిన్నములన్నచో, ఉచ్చరింపబడినదే స్వసవర్ణములను గ్రహించును కాని ప్రతీయమానము గ్రహింపదు కనుక ప్రతీయమానములగు ఇకార అకారములు ఉచ్చరింపబడిన య కంటె భిన్నములు కనుక ఉచ్చరింపబడక పోవుటచే స్వసవర్ణములను గ్రహింపవు. అందుచే ఇచట ప్రత్యాయక ప్రత్యాయ్యముల కభేదము అంగీకరింపబడినది.

వి. ఇట్లే 'శ్వేతో ధావతి' అనునపుడుకూడ 'శ్వా + ఇతః, శ్వేతః' అనునని రెండును కలిపి అభిన్నముగ 'శ్వేతో ధావతి' అను వాక్యమున నుండుటచే రెండర్థములను ఆ వాక్యమే యొసంగును.

భిన్నవాక్యములు ఏకవాక్యముగ గాని, భిన్నపదములు ఏకపదముగా గాని తోచునపుడు ఒక వాక్యములో ఒక వాక్యము మునిగి కన్పడకయుండును. అర్థబోధనమయమున ఆ రెండర్థములును ఏ:నివలననే వచ్చును అని చెప్పుచున్నాడు.

ఊః ఇత్యేత దభిన్నం చ భిన్నవాక్యనిబంధనమ్
భేదేన గ్రహణం చాస్య పరరూప మివ ద్వయోః . 101

ఊః ఇత్యేతత్ = ఊకాలః అనుచోట ఊః అనునది, అభిన్నం = అఖండమైనదే, భిన్నవాక్య నిబంధనం = "ఉకాలః అచ్, ఊకాలః అచ్, ఊఃకాలః అచ్" అను భిన్న వాక్యములకు జ్ఞాపకము, ద్వయోః = రెండు అచ్చులయొక్క, పరరూపం ఇవ = పరరూప సంధిచే ఏర్పడిన రూపము అఖండముగా నుండియు తన స్థానులనెట్లు జ్ఞాపకముచేయునో అట్లే, అస్య = అఖండమగు 'ఊః' అనుదానికే, భేదేన = ఉఊఊః అను మూడింటిని విడిగా, గ్రహణం = గ్రహించుట జరుగును.

తా. "ఊకాలః" అనుచోట 'ఊః' అనునది ఉత్వజాతి సామాన్యముచే మూడు విధములగు ఉకారములకు సామాన్యనిర్దేశమే. అందుచే ఆ ఒక్క ఉకారమే మూండిటిని మనకు భాసింపచేయును. అదే మూడు వాక్యముల యర్థమును ఇచ్చును.

వి. పరరూపముచే రెండు అచ్చులు ఏకరూపమున నున్నను రెండుస్థానులు కూడ ఎట్లు దానిచే స్ఫురించుచుండునో అట్లే ఒకే వాక్యముచే ఆ వాక్యములోనే అణగియున్న మిగిలిన వాక్యములును వాని యర్థమును ప్రకాశింపచేయబడును. వెనుక తంత్రముచే రెండు వాక్యము లేకముగా నుచ్చరింపబడిన వనియు, ఇచట వాక్యము వాక్యములో లీనమై యున్నదను వాక్యోపప్లవముచే రెండువాక్యములు స్ఫురించుచున్న వనియు చెప్పిరి.

"ఊకాలః" అని సూత్రకారుడు నిర్దేశించుటచే వాక్యము అభిన్నమేయని నిరూపించి, యీ అభేదపక్షము వార్తికకారుడు అంగీకరించలేదని వివరించుచున్నారు.

ప్లుత స్యాంగవివృద్ధిం చ సమాహార మచో స్తథా
వ్యుదస్యతా పువ ర్భేదః శబ్దే ష్వత్యంత మాశ్రితః. 102

ప్లుతస్య = ఐకారమునకు, ఔకారమునకు ప్లుతము రాగా ఆ ప్లుతముయొక్క, అంగవివృద్ధిం = ఆ ఐకారౌకారముల యంగములగు ఇకార ఉకారములకు చతుర్మాత్రములుగా నగు వృద్ధిని, వ్యుదస్యతా = నిషేధించుచున్నట్టియు, తథా = అట్లే, అచోః = పూర్వ పరాచ్చుల యొక్క, సమాహారం = సంహితలో కలిసియుండుటను, వ్యుదస్యతా = నిషేధించుచున్న వార్తికకారునిచే, శబ్దేషు = శబ్దములయందు, అత్యంతం = పూర్తిగా, భేదః = భేదము, ఆశ్రితః = ఆశ్రయింపబడెను.

తా. వార్తికకారుడు ఐకారమునకు, ఔకారమునకు ప్లుతమువచ్చి నాలుగు మాత్రలగునపుడు సమూహమునకే వృద్ధివచ్చును కాని అంగములగు ఇకార ఉకారములకు వృద్ధి రాదని చెప్పెను. అందుచే ఇకార, ఉకారములకంటె ఐకార ఔకారములు భిన్నములే కాని అభిన్నములు కావని తెలియుచున్నది. అట్లే సంహితలో పూర్వ పరాచ్చులకు ఏకాదేశము వచ్చిన రూపములలో ఆ అచ్చు రెండు అచ్చుల సమాహారము కాదనియు నది భిన్నమే యనియు వార్తికకారుడు చెప్పెను. అందుచే ప్రత్యాయక ప్రత్యాయ్యములకు భేదపక్షమును వార్తిక కారుడు అంగీకరించెను.

వార్తికకారునకు భేదపక్షము ఇష్టమైనను "ఊకాలః" అని నిర్దేశించిన సూత్రకారునకు అభేదపక్షమే ఇష్టము కనుక దానినే ఆశ్రయించి "శ్వేతోధావతి" మొదలగు వాక్యములలో తంత్రముచేతనే అర్థభేదము వచ్చునని సిద్ధాంతము చేయుచున్నాడు.

అర్ధర్చాదిషు శబ్దేషు రూపభేదః క్రమా ద్యథా
తంత్రా త్తథైకశబ్దత్వే భిన్నానాం శ్రుతి రన్యథా. 108

యథా = ఏవిధముగా, అర్ధర్చాదిషు శబ్దేషు = అర్ధర్చ మున్నగు అఖండశబ్దములలో, రూపభేదః = 'ఋచః అర్ధం—అర్ధర్చం' అని విగ్రహవాక్యముగను, సమాసముగను భిన్నరూపములు ఎట్లు వ్యవహరింపబడునో, తథా = ఆవిధముగనే, ఏకశబ్దత్వే = ప్రత్యాయ్య ప్రత్యాయకములు ఏకశబ్దమే యను మతమున భిన్నానాం = భిన్నములగు "శ్వా ఇతః" "శ్వేతః" అను శబ్దములయొక్క, అన్యథాశ్రుతిః = ఏకరూపమున 'శ్వేతః' అని వినబడుట, తంత్రాత్ = తంత్రమువలన అని యెరుంగనగును.

తా. ఋక్కులో సగము అను నర్థము గల 'అర్ధర్చం' అను శబ్దము అభిన్న రూపమే. కాని 'ఋచః అర్ధం అర్ధర్చం' అని విగ్రహమున ఒక తీరుగను సమాసమున ఒక తీరుగను ఉండును. విగ్రహమున ఋక్ శబ్దము ముందుగను అర్ధశబ్దము తరువాతను ఉండగా సమాసమున అర్ధశబ్దము ముందును ఋక్ శబ్దము తరువాతను ఉండును. ఈ భిన్న క్రమముతో భిన్నరూపములు ఉండగా 'అర్ధర్చం' అను అభిన్నశ్రుతి ఎట్లు వినబడుచున్నదో అట్లే ప్రత్యాయ్య ప్రత్యాయకము లభిన్నములయ్యు "శ్వేతో ధావతి" మున్నగుచోట్ల రెండర్థములు కనబట్టును.

శబ్దైకత్వమే వివరింపబడుచున్నది.

సంహితావిషయే వర్ణాః స్వరూపే ణావికారిణః
శబ్దాంతరత్వం యాంతీవ శక్త్యాన్తర పరిగ్రహాత్ .　　　　104

సంహితావిషయే—'శ్వా + ఇతః—శ్వేతః' అను సంహితయందు, వర్ణాః—అకార ఇకార రూపములగు వర్ణములు, స్వరూపేణ అవికారిణః—స్వరూపతః మార్పులేనివైనను, శక్త్యన్తర పరిగ్రహాత్—రెండర్థముల ప్రతీతిని కల్గించుటవలన—వేరొక శక్తిని స్వీకరించుట వలన, శబ్దాంతరత్వం—శ్వా ఇతః అనునది సంహితచే శ్వేతః అను వేరొకశబ్దముగా నుండుటను, యాంతీవ = పొందినట్లు ఉండును.

తా. శ్వేతః అనునది రెండర్థముల నిచ్చుచుండుటచే, అకార ఇకారములు అసంహితలో అనేక వర్ణములు కలదే సంహితలో ఏకవర్ణమై ఏకపదముగా నున్నట్లు తోచును. కాని వాస్తవమునకు అచట ఏకాక్షరమే కాని భిన్నాక్షరములు లేవు. కాని శ్వేతః అనుదానిచే రెండర్థములు ప్రతీయమానము లగుచుండుటచే వేరొకయర్థమును ప్రతిపాదించు శక్తి ఆ శబ్దమున కంగీకరింపవలెను. కావున సహజముగ వికారములేనివైనను అకార ఇకారములు కలిసి ఏకాక్షరమైనట్లును ఆశబ్దము భిన్నశబ్దమైనట్లును తలంపబడునే కాని వాస్తవమునకు రెండువర్ణము లేకమై ఒక వర్ణమగుటకాని, శ్వా ఇతః, శ్వేతః అను రెండు శబ్దము లుండుట కాని లేదు. అది కల్పితమే యని ఎరుంగవలెను.

శాస్త్రపరికల్పితమైన సంహిత యనెడి నిమిత్తముచే శ్వేతః అనుచోట రెండవ రూపము గ్రహింపబడినను శబ్దస్వరూపము ఏకమే కాని భిన్నముకాదని దృష్టాంతపూర్వకముగ వివరించుచున్నాడు.

ఇంద్రియాదివికారేణ దృష్టం గ్రాహ్యేషు వస్తుషు
ఆత్మత్యాగా దృతే భిన్నం గ్రహణం స క్రమః శ్రుతౌ .　　　105

ఇంద్రియాది వికారేణ—కన్ను మొదలగు ఇంద్రియములకు కల్గిన కామెర మొదలగు దోషములచే, గ్రాహ్యేషు—ఆ కంటిచే గ్రహింపబడు, వస్తుషు = వస్తువులయందు, ఆత్మత్యాగాత్ ఋతే—స్వరూపములో భేదము లేకుండగనే (ఎట్లు), భిన్నంగ్రహణం—ఒకే త్రాడు భిన్నరూపములతో పాముగా, పూలదండగా, భూమిపై పగులుగా గ్రహింపబడుట సంభవించుచున్నదో, అట్లే శ్రుతౌ = శ్వేతః అను శబ్దమును వినునపుడు, సఃక్రమః—ఆ తీరే సంభవించును, అనగా - ఆ శబ్దము ఒకటే యయి దానిలో మార్పులేకుండగనే సంహిత అను దోషముచే ఆ శబ్దము రెండు రూపములుగా భాసించును. దీనిచే స్వరూపములో భేదము కలుగదు.

తా. ఒక త్రాటిని చూచినపుడు చీకటిచేగాని, కంటి దోషముచేగాని పాముగా, పూలదండగా, భూమిపై ఏర్పడిన బీటగా అది తోచును. ఇచట రజ్జుస్వరూపమున భేదములేకుండగనే ఎట్లు భేదము కంటిచే దోషవశమున గ్రహింపబడునో అట్లే శ్వేతః అను ఒకేశబ్దము స్వరూపమున భేదములేకయే సంహిత యను దోషముచే 'శ్వా ఇతః' అను రూపమున గూడ చెవిచే గ్రహింపబడి భిన్నార్థము నిచ్చును.

పై విషయమునే ఉపసంహరించుచున్నాడు.

అభిధానక్రియాయోగా చ్ఛబ్దే ష్వవికృతే ష్వపి
రూప మత్యంతభేదేవ తదే వైకం ప్రకాశతే. 106

అవికృతేష్వపి=భిన్నరూపములు కలిగియున్నట్లు భాసించుచున్నను వాస్తవము నకు భేదము లేనివేయైన, శబ్దేషు=శ్వేతః మొదలగు శబ్దములయందు, తదేవ ఏకం రూపం =ఆశ్వేతః అను శబ్దముయొక్కటియే, అభిధానక్రియాయోగాత్=సంహితతో కలిపి యుచ్చ రించుట యనెడి దోషసంబంధమువలన, అత్యంతభేదేన=శ్వా ఇతః అను భిన్నరూపముతో, ప్రకాశతే=ప్రకాశించును.

తా. 'శ్వేతః' అను రూపము మార్పుచెందునది కాకపోయినను వ్యాకరణ శాస్త్ర కల్పనానుసారముగ శ్వా ఇతః అనునవి సంహితలో 'శ్వేతః' అను రూపము నందుట యను సంబంధముచే శ్వేతః అనునది 'శ్వా ఇతః' అను నాకారముతో గూడ భాసించును.

శబ్దము ఏకమే యయ్యు భిన్నరూపమున వ్యవహరింపఁబడుట వేదమున కూడ గలదని చూపుచున్నాడు.

ఋచో వా గీతిమాత్రం వా సామ ద్రవ్యాంతరం న తు
గీతిభేదా ద్విగృహ్యంతే తా ఏవ వికృతా ఋచః. 107

ఋచః=ఋక్కుయొక్క, గీతిమాత్రంవా=గానము మాత్రముకాని, ఋచః వా =ఋక్కు లేకాని, సామ=సామ యనబడును, కాని, ద్రవ్యాంతరంతు=ప్రత్యేకవస్తువు, న=కాదు, తా ఏవ ఋచః=ఆ ఋక్కులే, వికృతాః=గానముచే మార్పునొందింపబడినవై, గీతిభేదాత్=వస్తువొకటేయయ్యు గీతిభేదము వలన, విగృహ్యంతే=భిన్నముగా గ్రహింప బడుచున్నవి.

తా. ఋక్కులే గీతిభేదముచే సామము అను పేరున వ్యవహరింపబడుచున్నవి. గానపూర్వకోచ్చారణక్రియామాత్ర సంబంధముచే ఋక్కునకు, సామమునకు వాస్తవమున భేదము లేకపోయినను భేదమున్నట్లు ఎట్లు గోచరించుచున్నదో, అట్లే శ్వా ఇతః అను శబ్ద ములకు సంహితారూప సంబంధముచే ఏర్పడిన శ్వేతః అను శబ్దముకంటె భిన్నముగ వేరొక శ్వేతః (శ్వా ఇతః) ఉన్నట్లు గోచరించును. కాని వాస్తముసకు శ్వేతశబ్దము అచట ఒక్కటే కాని రెండు కావు.

భిన్నములగు అర్థముల నిచ్చు రెండు శబ్దములను సమానవర్ణానుపూర్వి కలవానిని తంత్రముచే ఒకే యుచ్చారణమున నుచ్చరించుటయే శాస్త్రసమ్మతమని వివరించుచున్నాడు.

ఉపాయా చ్ఛ్రుతిసంహారో భిన్నానా మేకశేషిణామ్
తంత్రేణోచ్చారణే తేషాం శాస్త్రే సాధుత్వ మిష్యతే. 108

"శ్వేతో ధావతి" మొదలగువాక్యములలో, భిన్నానాం=శ్వేతః, శ్వా ఇతః అను రూపమున భిన్నములగు పదములకు, ఏకశేషిణాం=సమాన వర్ణానుపూర్వికల వగుటచే ఒకటిగనే పలుకబడినవానికి, ఉపాయాత్=తంత్రమనెడి ఉపాయమువలన అనగా - ఒకే ఉచ్చారణముచే రెంటిని కలిపి ఉచ్చరించుటవలన, శ్రుతిసంహారః=శ్వేతో ధావతి అను ఒకే అఖండవాక్య శ్రవణమున రెండు వాక్యములు ఇమిడియుండును, తంత్రేణ ఉచ్చారణే=

తంత్రముతో నుచ్చరించునపుడు, తేషాం=ఆ భిన్నములగు శబ్దములకు, శాస్త్రే = శాస్త్రము నందు, సాధుత్వం = సాధుత్వము, ఇష్యతే = ప్రతిపాదింపబడుచున్నది.

తా. 'శ్వేతో ధావతి' అను వాక్యమున శ్వేతః అనునది రెండు పదములయొక్క స్వరూపములను కలిపి ఒకే ఉచ్చారణమున రెండును స్ఫురించునట్లు ఉచ్చరింపబడును. శ్వా ఇతః అనునపుడు 'ఆ ద్గుణః (6.1.87) అను సూత్రముచే సంధివచ్చి సాధుత్వము కల్గును. శ్వేతః శ్వేతః అనెడి-ఆ రెంటిలో ఒకటి మిగిలినను రెంటి అర్థములను గోచరింపచేయును.

'శ్వేతో ధావతి' మున్నగుచోట్ల రెండర్థములు గలవన్న శబ్దములను వర్ణానుపూర్విచే సమానములైన వానిని తంత్రముచే ఉచ్చరించి అర్థద్వయబోధనమునకు ప్రయోగించుట ఆవశ్యకమని నిరూపించుచున్నాడు.

పరిగృహ్యా శ్రుతిం చైకాం రూపభేదవతా మపి
తంత్రే ణోచ్చారణం కార్య మన్యథా తే న సాధవః . 109

రూపభేదవతామ్ అపి = వర్ణవాచకమగు అఖండమగు శ్వేత శబ్దమునకు, శ్వా ఇతః అను రెండు పదార్థములను ప్రతిపాదించు సఖండ శ్వేతశబ్దమునకును రూపములో భేదము ఉన్నను, ఏకామ్ = సమానవర్ణానుపూర్విగల, శ్రుతిమ్ = శబ్దమును, పరిగృహ్య = రెండు శబ్దములను కలిపియుంచు నాధారముగా స్వీకరించి, తంత్రేణ = రెండు అర్థములను ప్రతిపాదించునట్లు ఒకేసారి, ఉచ్చారణం = ఉచ్చారణము, కార్యమ్ = చేయవలెను, అన్యథా = అట్లు తంత్రముచే రెండు శబ్దములను కలిపి యుచ్చరించనిచో, తే = ఆ శబ్దములు, సాధవః = రెండర్థములను ప్రతిపాదించు సమర్థత యనెడి సాధుత్వముకలవి, న = కావు.

తా. "శ్వేతః"అనునది రెండర్థములను ప్రతిపాదించు రెండు శబ్దముల కలయిక. ఒక శబ్దము 'తెల్లనిది' అను నర్థమును, వేరొకటి 'కుక్క ఇటువైపు' అను నర్థమును రెండు పదార్థములను బోధించును. ఆ రెంటిలో ఒకటి అఖండము, ఒకటి సఖండము. అట్లు భేదము గల ఆ రెండు శబ్దములకు 'శ్వేతః' అను వర్ణానుపూర్విసమానమే. కావున శ్వేతః అను చోట రెండుశబ్దములను తంత్రముచే ఉచ్చరింపవలెను. ఉచ్చరించినచో ఆవృత్తిచే రెండర్థములు వచ్చును, ఆ తంత్రము నాశ్రయించనిచో ఒకసారి యుచ్చరించిన శబ్దము ఒక యర్థమును ప్రతిపాదించి విరమించును. కావున రెండవయర్థమును ప్రతిపాదింపదు. రావలసిన యర్థమును బోధించుటయే శబ్దమునకు సాధుత్వము కావున ఆ సాధుత్వము లేకపోవలసివచ్చును. కావున సాధుత్వమునకై తంత్రముతో నుచ్చరించుట అవశ్యకర్తవ్యము.

సరూపములగు పదములకు ఏకశేషమును వ్యాకరణ శాస్త్రము ప్రతిపాదించును. అందుచే సమాన స్వరూపములగు పదములను తంత్రముతో నుచ్చరించుట శాస్త్ర విహితమే. కాని వాక్యములను తంత్రముతో నుచ్చరించుట శాస్త్రమున విధింపబడలేదు. పద తంత్రము ననుసరించి వాక్యతంత్రముకూడ శాస్త్రసమ్మతమే యని యంగీకరింపవలెను. అట్టి ప్రయోగములు కన్పట్టుచున్నవని వివరించుచున్నాడు.

సరూపాణాం చ వాక్యానాం శాస్త్రేణ ప్రతిపాదితమ్
తంత్రే ణోచ్చారణా దేకం రూపం సాధూపలభ్యతే . 110

సరూపాణాం = సమానములగు రూపముగల, వాక్యానాంచ = వాక్యములకు కూడ, తంత్రేణ = ఒకేప్రయత్నముతో రెండు వాక్యములను కలిపి ఉచ్చరించు తంత్రముచే, ఉచ్చా

రణాత్ = ఉచ్చరించుటవలన, ఏకంరూపం = ఒకరూపముండుట, శాస్త్రేణ = పదములకు ఏక శేషమును విధించు శాస్త్రముచేతనే, ప్రతిపాదితమ్ = ప్రతిపాదింపబడినట్లే, సాధు = ప్రయోగ ములలో రెండు వాక్యముల నేకరూపమున ప్రయోగించుట బాగుగా, ఉపలక్ష్యతే = కన్పట్టు చున్నది.

తా. శాస్త్రము పదములకు ఏకశేషముచే తంత్రమును ప్రతిపాదించినను వాక్య ములకుకూడ తంత్రము నంగీకరించినట్లే గ్రహింపవలెను. అట్టి వాక్యైకశేషములు ప్రయోగ ములలో మనకు గోచరించుచున్నవి.

పై విషయమునే దృష్టాంతపూర్వకముగ వివరించుచున్నాడు.

ఏక స్యానేకరూపత్వం నాలికాది పరిగ్రహాత్
యథా తథైవ తంత్రాత్ స్యాత్ బహూనా మేకరూపతా. 111

యథా = ఏవిధముగా, నాలికాదిపరిగ్రహాత్ = రంధ్రములనెడి ఉపాధిభేద స్వీకారమువలన, ఏకస్య = ఒకేధ్వనికి, అనేక రూపత్వం = భిన్నరూపములై యుండుటయో, తథైవ = అట్లే, తంత్రాత్ = తంత్రమువలన, బహూనాం = భిన్నములగు (శ్వేతః, శ్వా + ఇతః) శబ్దములకు, ఏకరూపతా = ఒకేరూపము కలవై యుండుట, స్యాత్ = అగును.

తా. వేణువునందుగల రంధ్రములనుండి ధ్వని ప్రసరించునపుడు ఒకేధ్వని షడ్జాది భేదములచే భిన్నరూపత నెట్లుపొందునో అట్లే శ్వేతః అనుశబ్దము, శ్వా ఇతః — శ్వేతః అను శబ్దము కలిసి తంత్రముగా ఉచ్చరించుటచే భిన్నశబ్దములు ఏకరూపత నందును.

అవాంతరవాక్యములు ప్రత్యేకముగా లేవు కనుక అఖండవాక్యపక్షమున అవాంతర వాక్యమున కర్థము లేకపోవలసివచ్చు నను ఆక్షేపమునకు సమాధానము నొసంగుచున్నాడు.

యథా పదసరూపాణాం వాక్యానాం సంభవః పృథక్
తథా వాక్యాంతరాభావే స్యా దేషాం పృథగర్థతా. 112

యథా = ఏవిధముగా, పదసరూపాణాం = వాక్యములో లేనిపదములు పృథక్కర ణముచే ఏర్పడినపుడు ఉన్నట్లుగా తోచుపదములతో సమానధర్మముగల, వాక్యానాం = అవాంతర వాక్యములకు, పృథక్ సంభవః = మహావాక్యముకంటె ప్రత్యేకముగ ఉండుట ఎట్లు సంభవమో, తథా = అట్లే, వాక్యాంతరాభావే = అవాంతరవాక్యములు లేకపోయినను, ఏషాం = ఈ వాక్యములకు, పృథగర్థతా = ప్రత్యేకార్థవత్త్వము, స్యాత్ = సంభవించును.

తా. వాక్యము అఖండము పదవిభాగరహితము. అయినను ఆ వాక్యమును పృథక్కరించుటచే అందులో లేనిపదము లెట్లు ఉన్నట్లు తోచుచున్నవో అట్లే మహావాక్యములో అవాంతరవాక్యములు లేకపోయినను మహావాక్యమును పృథక్కరించుటచే అవాంతరవాక్య ములను, ఆ యవాంతర వాక్యములకు ప్రత్యేకార్థవత్త్వమును కల్పితమైయుండుటకు ఆటంకములేదు.

వాక్యముయొక్క అర్థము ప్రయోజనము అను మతమును నిరసించుచున్నాడు.

అభిధేయః పదస్యార్థో వాక్యస్యార్థః ప్రయోజనమ్
యస్య తస్య న సంబంధో వాక్యానా ముపపద్యతే. 113

పదస్య=పదముయొక్క, అర్థః=అర్థము, అభిధేయః=శబ్దశక్తి ప్రతిపాద్యమై వాచ్యమగును, వాక్యస్య=వాక్యముయొక్క, అర్థః=కార్యము, ప్రయోజనం=ఆ పదార్థముల యొక్క సంసర్గమును బోధించుట, అని, యస్య=ఎవనియొక్క మతమో, తస్య=వాని మత మున, వాక్యముల కర్థములేదు కనుక, వాక్యానాం=వాక్యములకు, సంబంధః=సంబంధము, న ఉపద్యతే=కుదురదు.

తా. పదములకే యర్థమును ప్రతిపాదించు శక్తి యుండును. అట్టిపదముల చేరికయే వాక్యము. ఆవాక్యమున కర్థము లేదు. ఆ పదముల యర్థములకు గల పరస్పరసంబధమును బోధించుటయే దాని ప్రయోజనము. వాక్యముల కర్థము లేనపుడు అర్థముద్వారా పరస్పర సంబంధము కలిగియుండ వలసిన వాక్యములకు సంబంధము ఉండదు. ఏ వాక్యమున కావా క్యమే కాని పరస్పర సంబంధము కుదురదు.

అన్వితాభిధానవాదము నాశ్రయించి వెనుక చూపిన దోషములను పరిహరించు చున్నాడు.

తత్ర క్రియాపదాన్యేవ వ్యపేక్షన్తే పరస్పరమ్
క్రియాపదానుషక్తస్తు సంబంధోఽతః ప్రతీయతే. 114

తత్ర=ఆ అన్వితాభిధాన పక్షమున, క్రియాపదమేవాక్యమను పక్షమున, క్రియా పదాన్యేవ=క్రియాపదములే, పరస్పరం=అన్యోన్యము, వ్యపేక్షన్తే=కారక పదములను తమతో అన్వయింపదగిన వానిని ఆక్షేపించును, అతః=అందువలన, క్రియాపదానుషక్తః= క్రియాపదమే వాక్యమనునపుడు ఆ క్రియాపదమునకు వాచ్యమై సంబంధించిన, సంబంధః= సాధ్యసాధనములయొక్క సంబంధము, ప్రతీయతే = వాక్యార్థముగ గోచరించును.

తా. అన్వితాభిధాన పక్షమున క్రియాపదమే వాక్యము అని యంగీకరించినపుడు క్రియాపదములే సర్వసాధనములతో నన్వయించిన స్వార్థమును బోధించును. 'మూయుము' అనగానే 'తలుపు మూయుము' అను వాక్యార్థము క్రియాపదముచే ప్రతిపాదింపబడును. 'తలుపును' అను కర్మవాచక పదమును ఆ క్రియాపదమే ఆక్షేపించును. క్రియాపదములోనే ఈ సాధ్యసాధనములకు గల పరస్పరాన్వయ రూపమగు సంబంధమును ప్రతిపాదించుశక్తి కలదు కనుక అదియే వాక్యార్థము. అందుచే వాక్యార్థము ప్రయోజనమను మతమున వాక్య ములకు పరస్పరాన్వయము సంభవించును. క్రియాపదమే వాక్యము. కావున దానిచే ఆక్షిప్త ములగు కారకపదములతో అన్వయించిన స్వార్థమే క్రియారూప వాక్యార్థము కావున ఆ వాక్యార్థములు వాక్యాంతరార్థములతో అన్వయించుటలో క్లేశము లేదు.

అన్వితాభిధానవాదమే సంగతముకాదు, మొట్టమొదట క్రియాపదమును వినగనే సకలకారకములతో అన్వయించిన వాక్యార్థము అవగతమగుచో తరువాత కారకపదములను ప్రయోగించుట ఎందుకు? అర్థము వేరొకవిధముగా అవగతమైన పిమ్మట ఆ యర్థమును ప్రతిపాదించు శబ్దమును ప్రయోగించుట వ్యర్థము కదా! యను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

అవృత్తి రనువాదో వా పదార్థవ్యక్తికల్పనే
ప్రత్యేకం తు సమాప్తోఽర్థః సహభూతేషు వర్తతే. 115

అవృత్తిః = అన్వితాభిధానవాదమున ఒకే పదముచే మిగిలిన పదముల యర్థము తెలియచేయబడినను ఆ పదమును మరల నుచ్చరించుట వేరొకపదము అన్వయించక ఈ పదమే యన్వయించు నను నియమముకొరకు, వా = లేక, పదార్థ వ్యక్తికల్పనే = ఇతర కారక పదార్థములు కాక ఈ పదార్థమే అన్వయించునని స్పష్టముగా తెలియజేయుటకై, అనువాదః = ఇదిపరకే ప్రతీతమైన యర్థముగల పదమును అనువదించుట జరుగును. సహభూతేషు = బుద్ధిలో కలిసియేయున్న క్రియాకారక వాచకపదములలోనే, ప్రత్యేకం = ప్రత్యేకము ఒక్కొక్క పదముననే, సమాప్తః అర్థః = ఆకాంక్షారహితముగ పూర్తియగు అర్థము, వర్తతే = ఉండును.

తా. అన్వితాభిధానవాదమున క్రియాపదమే దానితో అన్వయింపదగు కారక పదార్థములతో అన్వయించిన స్వార్థమునే బోధించినపుడు, క్రియాపదమే సంపూర్ణవాక్యార్థమును బోధించుటచే, ఇతర కారకపదప్రయోగము ఆ కారకపదములే తప్ప ఇతరపదములా క్రియతో అచట అన్వయింపవు అను నియమమును సూచించుటకని ఎరుంగవలెను. లేదా ఆ క్రియలో అన్వయించు కారకపదార్థములు ఇవి యని స్పష్టముగా తెలియుట కా పదములు పేర్కొనబడెనని ఎరుంగవలెను. కారకపదములు, క్రియాపదము కలిసిన వాక్యము, ఒక్కసారియే బుద్ధియందు సన్నిహితమైయుండును. కావున ఒక్కొక్కపదమే పూర్తియర్థమును బోధింపజాలినదై యుండునని ఎరుంగవలెను.

"సంఘాతము వాక్యము" మొదలగు వాక్యలక్షణములను ముందు పేర్కొనిరి. అచటనే సంసర్గము, పరస్పరాన్వితపదార్థము, నిరాకాంక్షపదార్థము, ప్రయోజనము వాక్యార్థములని నిరూపించిరి. ప్రతిభ, క్రియకూడ వాక్యార్థము అని ఇక ముందు గ్రంథముక నిరూపింపబోవుచున్నారు. వాక్యార్థము అఖండము, (అభిన్నము) ఏకమును అయినచో ఇన్ని పక్షము లెట్లు వచ్చినవి అని సందేహము కలుగవచ్చునని దానిని నివారించుచున్నాడు.

అవికల్పేఽపి వాక్యార్థే వికల్పా భావనాశ్రయాః
అత్రాధికరణే వాదాః పూర్వేషాం బహుధాగతాః . 116

వాక్యార్థే = వాక్యముయొక్క అర్థము, అవికల్పేఽపి = భేదము లేక అఖండమే యగుచుసను, వికల్పాః = సంసర్గము మొదలగు వాక్యార్థభేదములు, భావనాశ్రయాః = ఆయా శాస్త్రవాసన కలవారి భావనచే వచ్చినవి, అత్ర అధికరణే = ఈ వాక్యార్థ విచారప్రకరణమున, పూర్వేషాం = ప్రాచీనులయొక్క, వాదాః = వాదములు, బహుధా = అనేకవిధములుగ, గతాః = సాగినవి.

తా. వాక్యార్థము ఏకరూపమును అఖండమును అయియుండును. ఆయా శాస్త్రముల నధికరించినవారు ఆ శాస్త్రవాసనచే వాక్యార్థమును తమ సంస్కారముతో భావించి భిన్న భిన్నముగా ప్రతిపాదించుటచే ఈ భేదము లేర్పడినవి. అందుచే ఈ వాక్యార్థ విచారణ ప్రకరణమున ప్రాచీనశాస్త్రముల ననుసరించి మతభేదములు ప్రతిపాదింపబడినవి.

వాస్తవమునకు వాక్యార్థము ప్రతిభారూపమున ఏకవిధమే. వాక్యమును వినగనే తరువాత చేయవలసినకార్యము మనస్సున భాసింపచేయుటయే వాక్యార్థము. అందుచేతనే మీమాంసకులు కార్యమే వాక్యార్థమని నిరూపించిరి. అందుచే శబ్దము ప్రతిభను కలిగించుటకు కారణమని ఎరుంగవలెనని ప్రతిభారూప వాక్యార్థమును వివరించుచున్నాడు.

అభ్యాసా త్ప్రతిభా హేతుః శబ్దః సర్వోఽపరైః స్మృతః
బాలానాం చ తిరశ్చాం చ యథార్థప్రతిపాదనే. 117

అపరైః = ఆచార్యులచే, సర్వః శబ్దః = ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము నగు శబ్దము-పదవాక్యరూపము అగు శబ్దముకూడ, అభ్యాసాత్ = పునఃపునరావృత్తి వలన, ప్రతిభా హేతుః = నియతార్థబోధ హేతువై కార్యప్రవృత్తికి కారణమగును, బాలానాంచ = బాలురకు-అనగా శబ్దార్థసంకేత మెరుంగని వారికిని, తిరశ్చాంచ = పశు పక్ష్యాదులకును, యథార్థప్రతిపాదనే = ఉన్న యర్థమును ప్రతిపాదించుటలో శబ్దము అభ్యాసము వలన సమర్థమగును.

తా. పదవాక్య రూపమగు శబ్దము, కరతాళధ్వన్యాదులు, వర్ణాత్మకమగు శబ్దములు కూడ అభ్యాసమువలన కార్యప్రవృత్తి హేతువగును. అట్టి అభ్యాసమువలన సంకేతము నెరుంగని బాలురకు, పశు పక్ష్యాదులకు కూడ అర్థము తెలియుచున్నది.

అభ్యాసమువలన కార్యప్రవృత్తిని కలిగించు అర్థబోధరూపకమగు ప్రతిభ జనించును అని చెప్పిరి. ఆ యభ్యాసము ఈ జన్మమందలిదా? జన్మాంతరమందలిదా? ఆ ప్రతిభ ఎట్లుండునని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

అనాగమశ్చ సోఽభ్యాసః సమయః కైశ్చి దిష్యతే
అనంతర మిదం కార్య మస్మాది త్యుపదర్శనమ్. 118

సః అభ్యాసః = ఆయభ్యాసము, అనాగమః = ఈ జన్మలో శాస్త్రాభ్యాసాదులచే వచ్చునదికాదు, జన్మాంతరమునుండి లభించినది, సః = ఆ అభ్యాసమే, కైశ్చిత్ = కొందరిచే, సమయః = సంకేతము అని, ఇష్యతే = చెప్పబడుచున్నది, అస్మాత్ అనంతరం = దీని తరువాత, ఇదం కార్యం = ఇది చేయదగినది, ఇతి = అని, ఉపదర్శనం = బోధ కల్గుట యనెడి ప్రతిభను కల్గించుటకు కారణమే అభ్యాసము.

తా. శబ్దమును వినగనే ప్రవృత్తి కలుగుటకు కారణము అభ్యాసము. ఆ అభ్యాసము ఈ జన్మలో నేర్చుకొనినది కాదు. జన్మాంతరమునుండి వచ్చినదే. దానినే కొందరు సంకేతమని యందురు. శబ్దమును వినగనే ఈ పని చేయవలెనని తోచుటయే ప్రతిభ. ఆ ప్రతిభను కల్గించి ప్రవర్తింపచేయునది అభ్యాసము.

వి. అంకుశపు పోటుచేత ఏనుగు నడచుట, కొరడాతో కొట్టగనే గుఱ్ఱము పరుగెత్తుట ఈ అభ్యాసము వలననే. ఇట్లే ప్రాణులన్నియు అనాది వాసనచే ఈ శబ్దమును వినగనే ఈ ప్రవృత్తి చేయవలెనను బోధకలవారగుదురు. దానిచేతనే లోకయాత్రసాగును. అందుచే వాక్యము, వాక్యార్థము కూడ అఖండమే. ప్రతిభయే వాక్యార్థము. పదములు, పదార్థములు కాల్పనిక విభాగముచే పరికల్పితములు. వాని నాశ్రయించియే ప్రతినిధి కల్పనము, ప్రసంగాది మీమాంసాన్యాయములను ప్రవర్తించేయుట సంభవమగుచున్నవి.

అఖండ వాక్యార్థములనుండి పద పదార్థములు పృథక్కరణముచే ఏర్పడునని చెప్పుటచే పదముయొక్క అర్థమునుగూర్చి విచారణ చేయుచున్నాడు.

అస్త్యర్థః సర్వశబ్దానా మితి ప్రత్యాయ్యలక్షణమ్
అపూర్వదేవతాస్వర్గైః సమ మాహు ర్గవాదిషు. 119

సర్వశబ్దానాం=శబ్దముల కన్నింటికి, అర్థః=విశేషాకార పరామర్శలేక సామాన్యమగు అర్థము, అస్తి=ఉండును, ఇతి=అనునదియే, ప్రత్యాయ్యలక్షణం=శబ్దముచే వాచ్యమగు నర్థమాయొక్క స్వరూపము, గవాదిషు=గోవు మొదలగు శబ్దములచే తెలియచేయబడు నర్థము, అపూర్వ దేవతా స్వర్గైః=అపూర్వము, దేవత, స్వర్గము మొ. లగు పదములచే ఆకారవిశేషప్రతీతి లేకయే ప్రతీయమానమగు సామాన్యార్థముతో, సమం=సమానమైనదని, ఆహుః=చెప్పుదురు.

తా. పదముయొక్క అర్థమునుగూర్చి మతభేదములను ప్రతిపాదించుచున్నాడు. సర్వపదములు ఆకార విశేషప్రతీతి లేకయే సామాన్యమగు అర్థమును కల్గియుండును, అపూర్వము యాగముచే జనించు ఒక అదృష్ట విశేషము; ఆ యపూర్వము అను పదమును వినునపుడు ఏదో అర్థము ఆ శబ్దముచే మనకు తెలియచేయబడును. కాని దాని ఆకారము బుద్ధిలో గోచరింపదు. అట్లే దేవత, స్వర్గము అను పదములు వినునపుడుకూడ సామాన్యముగ విశేషాకారప్రతీతి లేని అర్థమే గోచరించును. గోవు అను శబ్దమునకు కూడ పై అపూర్వ స్వర్గదేవతా శబ్దములవలెనే విశేషముగ కొమ్ములు, తోక మొ. లగు లక్షణములతో కూడిన ఆకార విశేషములేని సామాన్యమగు అర్థమే వాచ్యముగా నుండును. ఆ శబ్దమును చాలా సార్లు ఆ యాకారముగల వస్తువును చూసి పెద్దలు ప్రయోగించుటచే ఆ స్మరణ కలిగి ఆకారవిశేషము గోచరించును. విశేషము లేనిదే సామాన్య ముండదు. కనుక విశేషాకారము బుద్ధిలో తరువాత గోచరించును కాని, శబ్దమునకు వాచ్యమగు నర్థము సామాన్యభూతమే యని ఎరుంగవలెను.

'గోవు' మొదలగు శబ్దముల వలన ఆకారముతోకూడిన గో వ్యక్తియే గోచరించుచున్నదే—అది వాచ్యమగు అర్థము కాదనుట ఎట్లు? అను ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు.

ప్రయోగదర్శనాభ్యాసా దాకారావగ్రహస్తు యః
న స శబ్దస్య విషయః స హి యత్నాంతరాశ్రయః. 120

ప్రయోగదర్శనాభ్యాసాత్=తోక, కొమ్ములు మొదలగునవి కల ఆకార విశేషము కలిగిన వస్తువునందే గోవు మొ. శబ్దమును ప్రయోగించుట మరల మరల చూచుచుండుట వలన, యః=ఏ, ఆకారావగ్రహః=ఆకారజ్ఞానము కల్గుచున్నదో, సః=అది, శబ్దస్య=గోవు మొ. శబ్దమునకు, విషయః=వాచ్యమగు నర్థము, న=కాదు, హి=ఏలనన, సః=ఆకారజ్ఞానము, యత్నాంతరాశ్రయః=మరల మరల ప్రయోగించుట చూచుట యనెడి యత్నాంతరము నాశ్రయించి కలుగుచున్నది.

తా. గోవు అను శబ్దము నుచ్చరింపగనే ఆకార విశేషముతో కూడిన వస్తువు మనకు బుద్ధిలో గోచరించినట్లుండును. కాని శబ్దము ఆకార విశేషములేని సామాన్యమునే బోధించును. ఆ శబ్దమునే గంగడోలు, కొమ్ములు మొ. నవి కలిగిన గోవ్యక్తియందు పదే పదే ప్రయోగించుట చూచుచుండుటచే ఆ వ్యక్తి ఆ శబ్దమును వినగనే గోచరించును కావున ఆకార విశేషప్రతీతి ప్రయత్నాంతరముచే కల్గినది కాని శబ్దముచే కల్గినదికాదు.

జాతియే శబ్దవాచ్యమని చెప్పుదురుకాని కొందరు ఆ జాతితోపాటు దానివెంటనే వ్యక్తికూడ గోచరించును కావున వ్యక్తికూడ శబ్దవాచ్యమందురు అని నిరూపించుచున్నాడు.

కేచిద్ భేదాః ప్రకాశ్యంతే శబ్దై స్తదభిధాయిభిః
అనునిష్పాదినః కాంశ్చి చ్ఛబ్దార్థ ఇతి మన్వతే. 121

కేచిత్ భేదాః = గోత్వము మొదలగు కొన్ని సామాన్యభేదములు, తదభిధాయిభిః శబ్దైః=వానిని ప్రతిపాదించు గోవు మొ. లగు శబ్దములచే, ప్రకాశ్యంతే=బుద్ధిగోచరమగునట్లు చేయబడును, అనునిష్పాదినః = ఆ జాతి భాసించినవెంటనే దానితోపాటు గోచరించు, కాంశ్చిత్ = వ్యక్తులను కూడ, శబ్దార్థ ఇతి=శబ్దముచే వాచ్యముగానుండు అర్థమునుగానే, మన్వతే = తలంతురు.

తా. వేర్వేరు వ్యక్తులలో సామాన్యముగా నుండు జాతినే శబ్దము ప్రతిపాదించు నని కొందరు పేర్కొందురు. ఆ జాతితోపాటు శబ్దమును వినగానే తప్పక వ్యక్తికూడ గోచరించుచుండుటచే వ్యక్తులుకూడ శబ్దమునకు వాచ్యార్థములే యని కొందరందురు.

పై పక్షమును ఖండించుచున్నాడు.

జాతేః ప్రత్యాయకే శబ్దే యా వ్యక్తి రనుషంగిణీ
న త ద్వ్యక్తిగతాన్ భేదాన్ జాతిశబ్దోఽవలంబతే. 122

జాతేః = వ్యక్తులన్నింటి యందుండు సామాన్యరూపమగు జాతియొక్క, ప్రత్యాయకే = ప్రతీతిని కల్గించు, శబ్దే = గోవు మొదలగు శబ్దమున, అనుషంగిణీ=అనుగత సంబంధముకల్గి జాతిని వదలకయుండు, యావ్యక్తిః=ఏ వ్యక్తి భాసించుచున్నదో, తద్వ్యక్తి గతాన్ = ఆ వ్యక్తులందు ఉండెడి, భేదాన్=ఆకారవిశేషములను, జాతిశబ్దః = అట్టి జాతి వాచక శబ్దము, నావలంబతే=వాచ్యముగ ప్రతిపాదింపదు.

తా. 'గోవు' మొదలగు శబ్దము గోవ్యక్తులయందు సామాన్యభూతమగు జాతిని ప్రతిపాదించును. వ్యక్తి జాతిలేకుండ ఉండునదికాదు. జాతితో కలిసియే యుండును. కావున వ్యక్తికూడ గోచరించును. కాని ఆవ్యక్తుల ఆకారవిశేషము శబ్దమునకు వాచ్యార్థము మాత్రము కాదు. జాతియే వాచ్యమని ఎరుంగనగును.

పైవిషయమునే దృష్టాంతముతో వివరించుచున్నాడు.

ఘటాదీనాం న చాకారాన్ ప్రత్యాయయతి వాచకః
వస్తుమాత్రనివేశిత్వాత్ తద్గతి ర్నాంతరీయకీ. 123

ఘటాదీనాం = ఘటము మొదలగు వానియొక్క, ఆకారాన్ = ఆకార విశేషములను, వాచకః = శబ్దము, వస్తుమాత్ర నివేశిత్వాత్=ఆ యాకారముగల వస్తువును మాత్రమే ప్రతి పాదించున దగుటవలన, న ప్రత్యాయయతి = ప్రతీతిగోచరము చేయదు, తద్గతిః = ఆ ఆకార విశేషము బుద్ధిలో గోచరించుట, నాంతరీయకీ = సామాన్యభూతమగు నాయర్థమును ఆకారమువదలి యుండనిదగుటచేతనే - అని ఎరుంగవలెను.

తా. ఘటము అను శబ్దము ప్రత్యేకమగు నొక యాకారముతో కూడిన వస్తు సామాన్యమునే బోధించును కాని వేరుగా ఒక ఘటమునందుండు ఆకారమును గోచరింప

జేయదు. కాని ఆ సామాన్యభూతమగు అర్థము శబ్దముచే తెలియజేయబడగనే దానిని వదలక అంటియుండు ఆకారము కూడ దానితోపాటు జ్ఞానగోచరమగును.

జాతివ్యక్తులకు గల అవినాభావసంబంధమును ప్రదర్శించుచున్నారు.

క్రియా వినా ప్రయోగేణ న దృష్టా శబ్దచోదితా
ప్రయోగ స్త్వనునిష్పాదీ శబ్దార్థ ఇతి గమ్యతే. 124

శబ్దచోదితా='యజేత' అను శబ్దముచే విహితమైన, క్రియా=యాగక్రియ, ప్రయోగేణ వినా=కర్తృ కర్మాది కారక సంబంధము లేనిదే, న దృష్టా=జ్ఞానగోచరము కాదు అందుచే, ప్రయోగస్తు=కర్తృ కర్మాది కారకసంబంధ ప్రతీతి లేనిదే క్రియా ప్రతీతి పూర్తిగా జ్ఞానవిషయము కాకపోవుటచే కారక సంబంధము, అనునిష్పాదీ=క్రియాప్రతీతి కలుగగనే కలుగునది. కావున అట్లే ఘటసామాన్య ప్రతీతి కలుగగనే ఆకార విశేషప్రతీతి కలుగును కావున అదికూడ, శబ్దార్థః ఇతి=శబ్దముయొక్క అర్థముగా, గమ్యతే= గోచరించును.

తా. 'యజేత' యాగము చేయవలెను అను శబ్దముచే యాగక్రియ విధింప బడును. కాని క్రియ సామాన్యముగా తెలిసినను కర్తృ కర్మ కరణాది కారకాన్వయము లేని క్రియ యుండదు కనుక కారకసంబంధము కూడ క్రియాప్రతీతి కలిగిన వెంటనే కలుగును. కావున అది కూడ శబ్దార్థముగనే తోచును.

సామాన్యవిశేషరూపములగు అర్థములు రెండును పదమునకు వాచ్యార్థములే. అందు విశేషార్థము ప్రధానముగను సామాన్యార్థము విశేషణముగను ఉండును. అట్లే సాధ్యమగు క్రియ సాధనములగు కారకములు కూడ శబ్దార్థమే. అందు క్రియ ప్రధానముగను కారకములు దాని విశేషణములుగను ఉండునను పక్షమును వివరించుచున్నాడు.

నియతాస్తు ప్రయోగా యే నియతం యచ్చ సాధనమ్
తేషాం శబ్దాభిధేయత్వ మపరై రనుగమ్యతే. 125

యేతు=ఏవైతే (యజేత మున్నగునవి), నియతాః=తప్పనిసరిగా కారక వాచక శబ్దప్రయోగమున్నను లేక పోయినను నియతమైన, ప్రయోగాః=క్రియావాచక శబ్ద ప్రయోగములు కలవో, యచ్చసాధనం=ఏ కారక వాచక శబ్దప్రయోగము, నియతం=క్రియా వాచక శబ్దప్రయోగమున్నను లేకపోయినను నియతమో, తేషాం=ఆ సాధ్య సాధనముల రెండింటియొక్క, శబ్దాభిధేయత్వం=శబ్దముయొక్క వాచ్యార్థమే యగుట, అపరైః=మరి కొందరిచే, అనుగమ్యతే=అంగీకరింపబడుచున్నది.

తా. "యజేత" యాగము చేయవలెను అనుక్రియను ప్రయోగించినపుడు 'సోమేన' సోమముతో అను సాధనము చెప్పినను చెప్పకపోయినను నియతముగ భాసించును. అట్లే "ద్వారం" 'ద్వారమును' అను కారక వాచకపదమును ప్రయోగించగానే 'పిధేహి' 'మూయుము' అనుక్రియావాచక పదము నియతముగ భాసించును. కావున క్రియా కారకములు రెండును విశేష్య విశేషణభావముతో అన్వయము కలిగినవై శబ్దమునకు వాచ్యార్థమే యగును. అందు ఒకటి వాచ్యార్థము, వేరొకటి దానిని వదలక యుండునదగుటచే ప్రతీయమానము అనుట సరికాదు. సామాన్య విశేషములు, సాధ్య సాధనములు కూడ పరస్పరము

విశేష్య విశేషణభావముతో, ప్రధానాప్రధానభావముతో సంబంధించి వాచ్యార్థమే యని కొందరు చెప్పుదురు.

సాధ్యసాధనములు, సామాన్యవిశేషములు గుణప్రధానభావముతో వాచ్యమగుట కాక సమూహరూపమున పదముచే వాచ్యములుగ ప్రతిపాదింపబడుననియు, వానియొక్క విశేష్యవిశేషణభావము తరువాత శాబ్దబోధలో భాసించుననియు కొందరందురు. వీరిమతమున సముదాయమే పదార్థము. సామాన్యము, విశేషము, అనగా జాతి, వ్యక్తి అనువానిలో విశేష్య విశేషణభావము గోచరింపక రెండును సమప్రధానముగనే యుండును అనెడి వాద్గిపక్షము ను పదార్థప్రతిపాదనమున నిరూపించుచున్నాడు.

సముదాయోఽభిధేయో వా ప్యవికల్పసముచ్చయః

అవికల్పసముచ్చయః అపి=సామాన్య విశేషార్థములకు వికల్పముకాని సముచ్చయము కాని లేనిదైన, సముదాయః=సామాన్య విశేషముల సముదాయము, సమప్రధానముగ, అభిధేయః = పదమునకు వాచ్యార్థమైయుండును.

తా. జాతి వ్యక్తులు, క్రియా కారకములు ప్రధానాప్రధానభావము లేక సమప్రధానముగ సముదాయరూపమున పదమునకు వాచ్యమగునని కొందరి యభిప్రాయము. రెండును సమప్రధానము లైనచో అర్థములు రెండు కలిసి వాచ్యార్థమైనచో 'ఘటము' అనునపుడు ద్వివచనము రావలెను. అట్లు రెండర్థములు సముచ్చయము కాక వికల్పము అనగా అదికాని, ఇదికాని అర్థమన్నచో "వా" అని యర్థములో కల్పింపవలెను. అందుచే పదముచే రెండర్థములు ప్రతిపాదింపబడినను ఆ రెండర్థములు సముచ్చయ వికల్పములు లేని సముదాయమే యైయుండునని వీరి అభిప్రాయము.

వ్యక్తియందు జాతి గుణ క్రియలయొక్క సంసర్గము వాస్తవముగ వస్తువుకంటె వేరుగ నిరూపింప వీలుకానిదైనను ఆ సంసర్గము పదముయొక్క వాచ్యార్థమను పక్షమును ప్రతిపాదించుచున్నాడు.

అసత్యో వాపి సంసర్గః శబ్దార్థః కైశ్చి దిష్యతే. 126

వా = అట్లుగాక, సంసర్గః = ఘటము మున్నగువస్తువులకు ఘటత్వము మున్నగు జాత్యాదులతోడి సంబంధము, అసత్యః = వాస్తవముగ వస్తువుకంటె వేరుగా గోచరింపక పోవుటచే అసత్యమయినది, శబ్దార్థః = శబ్దమునకు అర్థమని, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

తా. ఘటమునందుండు ఘటత్వజాతి సంబంధమే ఘటశబ్దార్థమని కొందరందురు. వ్యక్తికంటె వేరుగా జాతియొక్క సంసర్గము అనుభూయమాన మగుటలేదు. అందుచే ఇది అసత్యము. జాతి యనునది కల్పనయే కాని వేరేలేదని బౌద్ధుల యభిప్రాయము. జాతిని అద్వైతు లంగీకరింప లేదు.

అసత్యములగు జాతి, గుణము మున్నగు ఉపాధుల యొక్క సంబంధముచే భిన్నభిన్నముగా భాసించు వ్యక్తియే శబ్దమునకు అర్థము అను పక్షమును ప్రతిపాదించుచున్నాడు.

అసత్యోపాధి యత్సత్యం తద్వా శబ్ద నిబంధనమ్.

వా = లేక, యత్ సత్యం = సత్యమగు ఏ వ్యక్తికలదో, అసత్యోపాధి = అసత్యములగు జాతి మున్నగు ఉపాధులతోకూడిన, తత్ = ఆ వ్యక్తియే, శబ్దనిబంధనం = ఆశబ్దము ప్రయోగించుటకు కారణము, అనగా వాచ్యమగు అర్థము అని ఎరుంగవలెను.

తా. అసత్యములగు జాతి మొదలగు ఉపాధులతోకూడిన సత్యమగు ద్రవ్యమే-అనగా వ్యక్తియే శబ్దముయొక్క వాచ్యమగు అర్థమని భావము.

శబ్దో వాప్యభిజల్పత్వ మాగతో యాతి వాచ్యతామ్. 127

వా = లేక, అభిజల్పత్వం = శబ్దముతో అర్థమునకు, అర్థముతో శబ్దమునకు గల్గు అభేదారోపరూపమగు అభిజల్పమును, ఆగతః = పొందిన, శబ్దః = శబ్దమే, వాచ్యతాం = అర్థముగా నుండుటను; యాతి = పొందుచున్నది.

తా. శబ్దమునకు అర్థమునకు గల్గు అన్యోన్యాధ్యాసము అభిజల్పము. ఆ అభిజల్పముచే అనగా అధ్యాసరూపమగు అభేదారోపముచే శబ్దమే అర్థముగా నుండును.

అభిజల్పమును వివరించుచున్నాడు.

సోఽయ మి త్యభిసంబంధాద్ రూప మేకీకృతం యదా
శబ్ద స్యార్థేన తం శబ్ద మభిజల్పం ప్రచక్షతే. 288

శబ్దస్య = శబ్దమునకు, అర్థేన = అర్థముతో, సోఽయమితి = అదే ఇది యను, అభిసంబంధాత్ = శబ్దార్థములకు తాదాత్మ్యము వలన, రూపం = శబ్దముయొక్క స్వరూపము, యదా = ఎప్పుడు, ఏకీకృతం = అర్థముతో తాదాత్మ్యముచే అభిన్నముగా భావింపబడునో, తం శబ్దం = ఆ శబ్దమును, అభిజల్పం = అభిజల్పము అని, ప్రచక్షతే = చెప్పుదురు.

తా. 'అదే ఇది' అను తాదాత్మ్య సంబంధము శబ్దార్థములకు కల్పింపబడును. ఆ సంబంధమునకే అధ్యాసమని పేరు. అదే అభిజల్పము. ఆ సంబంధముచే పదార్థము శబ్దముచే ఆచ్ఛాదింపబడి అర్థమే శబ్దస్వరూపమున భాసించును. అపుడు పదార్థమే శబ్దముగా వ్యవహరింపబడును. శబ్దమే అర్థముగా భాసించును. కావున శబ్దమే అర్థమని కొందరు చెప్పుదురు. ఈ అధ్యాసముచే శబ్దార్థములు ఏకరూపములే యయినను అర్థము ఉపయోగమున నావశ్యకము కనుక అది ప్రధానముగా భావింపబడును.

శబ్దార్థములకు అభేదమే యయినను లోకమున అర్థమునకును, శాస్త్రమున శబ్దమునకును ప్రాధాన్యము కవ్పట్టుచుండునని వివరించుచున్నాడు.

తయో రపృథగర్థత్వే రూఢే రవ్యభిచారిణి
కించిదేవ క్వచిద్రూపం ప్రాధాన్యే నావతిష్ఠతే. 129

తయోః = ఆ శబ్దార్థములకు, రూఢేః = అధ్యాసముచే కల్గిన ప్రసిద్ధివలన, అవ్యభిచారిణి = నియతమగు, అపృథగర్థత్వే = ఏకరూపతయే యున్నను, క్వచిత్ = ఒక్కొక్కచోట, కించిదేవ = ఒక్కొక్కటియే, ప్రాధాన్యేన = ప్రధానముగ, అవతిష్ఠతే = ఉండును.

తా. శబ్దార్థములకు తాదాత్మ్యము నంగీకరించుటచే శబ్దార్థములు రెండును సమ ప్రధానములుగనే యుండును. కాని లోకమున పదార్థము ప్రధానముగను, శాస్త్రమున శబ్దము ప్రధానముగను గోచరించుచుండును.

లోకమున అర్థమునకే ప్రాధాన్య మని వివరించుచున్నాడు.

లోకేఽర్థరూపతాం శబ్దః ప్రతిపన్నః ప్రవర్తతే.

లోకే=లోకమున (వ్యవహారములో), శబ్దః=శబ్దము, అర్థరూపతాం ప్రతిపన్నః =తాదాత్మ్యాధ్యాసము వలన అర్థముతో ఏకరూపత నందినదై, ప్రవర్తతే = వ్యవహారమున ప్రతీయమాన మగుచున్నది.

తా. లోకములో వ్యవహరించునపుడు పదార్థమే ప్రధానము కనుక ఆ యర్థముతో తాదాత్మ్యము నందియున్న శబ్దముకూడ అర్థరూపముననే భాసించును.

శాస్త్రములో మాత్రము శబ్దార్థములు రెండును ఆయా స్థలముల వివక్షనుబట్టి భాసించునని చూపుచున్నాడు.

శాస్త్రే తూభయరూపత్వం ప్రవిభక్తం వివక్షయా. 180

శాస్త్రేతు=శాస్త్రమునందు అయితే, వివక్షయా=ఆ సందర్భమున యోగ్యత ననుసరించి, ఉభయరూపత్వం=కొన్నిచోట్ల శబ్దస్వరూపము ప్రధానముగను, కొన్నిచోట్ల అర్థస్వరూపము ప్రధానముగను, ప్రవిభక్తం=భిన్నముగ నుండును.

తా. వ్యాకరణశాస్త్రమున శబ్దము కొన్నిచోట్ల కేవల శబ్దస్వరూపమును ప్రతిపాదించును. కొన్నిచోట్ల అర్థమునుకూడ ప్రతిపాదించును. "అగ్నేర్ఢక్" (4.2.33) అనుచోట 'అగ్ని' అను శబ్దమునకు ఢక్ వచ్చును అని శబ్దస్వరూపమును ప్రతిపాదించును. "తస్యాపత్యం" (4.1.92) అనునపుడు అపత్యశబ్దము సంతాన రూపార్థమును బోధించును.

అర్థములు అశక్తివిశిష్టములుగానే యుండును. వానిని ప్రతిపాదించుటకు తగిన శక్తి శబ్దమున కధీనమై యుండును. జాతి, గుణ, క్రియాది భిన్నశక్తియుతమగు అర్థములను ప్రతిపాదించుటలో నియతముగ కొన్ని శబ్దములు జాతి, గుణ, క్రియాదులనే గాని, కొన్ని శబ్దములు సిద్ధవస్తువును గాని ప్రతిపాదించుట శబ్దాధీనమని వివరించుచున్నాడు.

అశక్తేః సర్వశక్తేర్వా శబ్దైరేవ ప్రకల్పితా

ఏకస్యార్థస్య నియతా క్రియాదిపరికల్పనా. 181

అశక్తేః = జాతి, గుణము, క్రియ మొ. వానిని కలిగియుండు శక్తిలేని, లేదా, సర్వశక్తేః=జాతి, గుణము,క్రియ మొదలగువాని నన్నింటిని కలిగియుండుటలో శక్తిగల, ఏకస్య = ఒక, అర్థస్య=పదార్థమునకు, నియతా=నియతముగ, క్రియాది పరికల్పనా = క్రియతోకూడినట్లు, గుణముతో కూడినట్లు కన్పించుట, శబ్దైరేవ = శబ్దములచేతనే, ప్రకల్పితా = కల్పింపబడినది.

తా. ఘటము, కలసము మున్నగు శబ్దములచే ఒకే పదార్థమును గూర్చిన జ్ఞానము కలుగుచున్నది. కాని ఘటము అను శబ్దముచే ఘటనచేయబడిన వస్తువుగా గాని, లేదా ఘటత్వరూపజాతి కలదిగా గాని గోచరించును. కలస శబ్దముచే 'క' అనగా నీటిచే 'లస' ప్రకాశించునదిగా గోచరించును. జాతి, గుణ, క్రియలు మూడును పదార్థమునందే యున్నను ఆ శబ్దములు భిన్న భిన్న శక్తియుతముగ ప్రకాశింపచేయును. నియతార్థ ప్రతిపాదనము శబ్దాధీనము. అర్థము మాత్రము సర్వశక్తి విశిష్టమే యని ఎరుంగవలెను.

శబ్దముయొక్క అర్థము బుద్ధినిష్ఠమేకాని బాహ్యవస్తునిబంధనము అని నిరూపించు చున్నాడు.

యో వార్థో బుద్ధివిషయో బాహ్యవస్తునిబంధనః
స బాహ్యావస్త్వితి జ్ఞాతః శబ్దార్థః కైశ్చి దిష్యతే. 182

వా = అట్లుకాక, యః అర్థః = శబ్దముచే బోధింపబడు ఏ యర్థముకలదో, అది, బుద్ధివిషయః = బుద్ధిగోచరమగునదే యయినను, బాహ్యవస్తునిబంధనః = జ్ఞానాకారముగ వస్తువు కన్పడుటలో బాహ్యవస్తువే కారణముగా కలది యగును. సః = ఆ బాహ్యవస్తువు, జ్ఞాతః = జ్ఞానగోచరమగు అర్థముతో (అధ్యాసము) తాదాత్మ్యము నందినదై, శబ్దార్థః ఇతి = శబ్దముయొక్క అర్థమని, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = అంగీకరించబడినది.

తా. శబ్దము బుద్ధిగోచరమగునదే వాచకము కనుక అర్థముకూడా బుద్ధిగోచరమై జ్ఞానాకారము నందినదే వాచ్యమగును. అట్లు అర్థము జ్ఞానాకారము నందుటకు కారణము బాహ్యవస్తువే. అందుచే జ్ఞానాకారము నందిన యర్థమునకును, బాహ్యముగనుండు వస్తువున కును తాదాత్మ్యముచే బాహ్యవస్తువుకూడ శబ్దార్థమని కొందరందురు. కాని బుద్ధ్యుపారూఢ మగు అర్థమే శబ్దార్థమని ఎరుంగవలెను.

కొన్ని శబ్దములు అనగా ఘటము మున్నగునవి ఆకారవిశేషముతో కూడిన అర్థమును కల్గియుండును. కొన్ని శబ్దములు అనగా అపూర్వము మొదలగు శబ్దములు ఆకార విశేషము లేని జ్ఞానమాత్రమున నుండు అర్థము కల్గియుండును అను పక్షమును వివరించుచున్నాడు.

ఆకారవంత స్సంవేద్యా వ్యక్తస్మృతినిబంధనాః
యే తే ప్రత్యవభాసంతే సంవిన్మాత్రం త్వతోఽన్యథా. 183

యే సంవేద్యాః = ఏ అర్థములు, వ్యక్తస్మృతి నిబంధనాః = ఆకారముకల్గిన వస్తువును చూచి, ఆ చూచిన వస్తువుయొక్క స్మృతిచే కల్గినవో, తే = ఆ యర్థములు, ఆకార వంతః = ఆకారము కలవియై, ప్రత్యవభాసంతే = బుద్ధిగోచరములగును; యేతు = ఏ యర్థము లైతే, అతః అన్యథా = ఆకారములేని వస్తువులగుటచే ఆకారస్మృతి యుండకయే కల్గినవో, తే = ఆ యర్థములు, సంవిన్మాత్రం = జ్ఞానమాత్రముగనే, ప్రత్యవభాసంతే = బుద్ధిగోచరము లగును.

తా. బాహ్యమున ఆకారముగల వస్తువును చూచుటచేగాని వినుటచేగాని ఏ యాకారము మనకు గోచరమగునో ఆ యాకారము ఆ వస్తువునకు సంకేతమగు శబ్దమును వినగానే స్మృతికి వచ్చును. అట్లు స్మృతిలో వచ్చిన రూపము ఆ శబ్దముచే భాసించు జ్ఞాన రూపమగు నర్థమునగూడ భాసించును. అందుచే అట్టి యర్థములు సాకారములై యుండును. ఏ పదార్థములకు బాహ్యమున ఆకారము ఉండదో ఆ శబ్దములను విననపుడు ఆకార స్మృతి యుండదు. కనుక అట్టి యర్థములు నిరాకారములై జ్ఞానమాత్రములుగ భాసించునని ఎరుంగవలెను.

ఒక వస్తువును చూచినపుడు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా తోచును. ఘట మును చూడగనే కొందరికి కంబుగ్రీవాదిమత్తుగను, కొందరికి పెద్ద కడుపు కలదిగను, కొందరికి ఘటత్వ జాతి కలదిగను తోచును. ఆ విధముగనే వారి వాసనలు ఏర్పడును. ఎవరి

వాసన ననుసరించి వారికా శబ్దమువలన అర్థజ్ఞానము కలుగును. కావున శబ్దముయొక్క అర్థము అందరికి ఏకరూపముగ నుండదు అని శబ్దార్థము అనియతమను పక్షమును వివరించుచున్నాడు.

యథేంద్రియం సన్నిపత ద్వైచిత్ర్యే ణోపదర్శకమ్
తథైవ శబ్దా దర్థస్య ప్రతిపత్తి రనేకధా.　　　184

యథా=ఏ విధముగ, ఇంద్రియం=ఇంద్రియము, సన్నిపతత్=విషయముతో సంబంధించుచు, వైచిత్ర్యేణ=విశిధాకారము కలదానినిగ, ఉపదర్శకం=విషయమును కన్పింపచేయునది యగునో, తథైవ=అట్లే, శబ్దాత్=వారివారి వాసనలతో కూడిన శబ్దము వలన, అర్థస్య=అర్థముయొక్క, ప్రతిపత్తిః=జ్ఞానము, అనేకధా=భిన్నభిన్నముగ, కల్గును.

తా. ఉపనిషత్తులలో 'ద, ద, ద' అను వర్ణము వినబడినపుడు వారివారి వాసనల ననుసరించి దేవతలకు దమమని, అసురులకు దయ యని, మానవులకు దానమని యర్థము ఎట్లు స్ఫురించెనో, ఒకత్రాడును చూచినపుడు ఒకరికి సర్పమనియు, వేరొకరికి భూమిబీట యనియు, వేరొకరికి నీటిధారయనియు వారివారి వాసనల ననుసరించి దోషవశమున ఎట్లు భిన్నముగ జ్ఞానము కలుగుచున్నదో, అట్లే శబ్దమునకు నియతమగు అర్థము లేదు. వారివారి వాసనల ననుసరించి శబ్దముయొక్క అర్థము భిన్న భిన్నముగా నుండును.

పై విషయమునే వివరించుచున్నాడు.

వక్త్రాఽన్యథైవ ప్రక్రాంతః భిన్నేషు ప్రతిపత్తృషు
స్వప్రత్యయానుకారేణ శబ్దార్థః ప్రవిభజ్యతే.　　　185

వక్త్రా=వక్తచేత, అన్యథైవ=ఒక వస్తువును వేరొకవిధముగ ప్రతిపాదింపవలెనని, ప్రక్రాంతః=ప్రారంభింపబడినదై, భిన్నేషు=వేర్వేరు, ప్రతిపత్తృషు=శబ్దము నర్థము చేసికొనువారిలో, స్వప్రత్యయానుసారేణ=తమతమ జ్ఞానమునుబట్టి, శబ్దార్థః=శబ్దముయొక్క అర్థము, ప్రవిభజ్యతే=భిన్నభిన్నమగుచున్నది.

తా. వైశేషికుని మతముననుసరించి 'ఘటము' అను ఒక అవయవిని బోధింపవలెనని ఘటశబ్దము ప్రయోగింపబడగా సాంఖ్యుడు సత్త్వరజస్తమోగుణసమాహారము ఘటమనియు, జైనబౌద్ధులు పరమాణు సముదాయరూపము ఘటమనియు అర్థముచేసికొందురు. కావున శబ్దమున కర్థము వారివారి వాసనల ననుసరించి భిన్నముగా కల్గును. కాని నియతము కాదు.

వెనుక చెప్పిన విషయమునే వ్యక్తీకరించుచున్నాడు.

ఏకస్మిన్నపి దృశ్యేఽర్థే దర్శనం భిద్యతే పృథక్
కాలాంతరేణ చైకోఽపి తం పశ్య త్యన్యథా పునః.　　　186

ఏకస్మిన్ అపి = వాస్తవమునకు ఏకరూపమేయైనను, దృశ్యే అర్థే = దృశ్యమగు అర్థము, వారివారి వాసనల ననుసరించి, దర్శనం = జ్ఞానము, పృథక్ = ప్రత్యేకముగ, భిద్యతే = భేదించును, ఏకోఽపి = ఒక్కడేయైనను, తం = ఆవెనుక చూచిన వస్తువును, కాలాంతరేణ = కాలాంతరమున, పునః = మరల, అన్యథా = వేరొకవిధముగ, పశ్యతి = చూచును.

**తా.** వాస్తవమున ఏకరూపమే యైనను దృశ్యమగు వస్తువునుగూర్చిన జ్ఞానము వారివారి వాసనల ననుసరించి భిన్నభిన్నముగా నుండును. ఒకే పురుషుడు ఒకే వస్తువును బౌద్ధ జైన సంప్రదాయ వాసనతో చూచినపు డొకవిధముగా తోచును. వైశేషిక దర్శనాను సారి జ్ఞానముకలవాడై దానిని చూచినపుడు వేరొకవిధముగ తోచును.

పై విధమున అర్థ మనియతమగుటచే అర్థజ్ఞానము అనేక విధములుగ కల్గుచుండు నని ప్రతిపాదించుచున్నాడు.

ఏకస్యాపి చ శబ్దస్య నిమిత్తై రవ్యవస్థితైః

ఏకేన బహుభి శ్చార్థో బహుధా పరికల్ప్యతే . 187

ఏకస్య శబ్దస్య అపి = ఒకేశబ్దమునకుకూడ, అవ్యవస్థితైః = నియతముగానుండని నిమిత్తైః = శాస్త్రసంస్కారరూపమగు హేతువులచే, ఏకేన = ఒకపురుషునిచేతను, బహుభిశ్చ = అనేకులచేతను, అర్థః = అర్థము, బహుధా = అనేకవిధములుగ, పరికల్ప్యతే = కల్పింపబడును.

**తా.** శబ్దము ఒకటియేయైనను దానియర్థము నెరుంగు పురుషుల సంస్కారములు భిన్నభిన్నములుగా నుండుటచే, ఒకే పురుషునికి భిన్నభిన్నములగు అర్థములు భాసించును. అట్లే వేర్వేరు పురుషులకు వేర్వేరు రూపములుగ అర్థములు భాసించును. దీనికి కారణములు వారివారి సంస్కారమే యని ఎరుంగనగును.

వెనుకచెప్పినదాని ఫలితమును చెప్పుచున్నాడు.

తస్మా దదృష్టతత్త్వానాం సాపరాధం బహుచ్ఛలమ్

దర్శనం వచనం చాపి నిత్యమే వానవస్థితమ్ . 188

తస్మాత్=అందువలన, అదృష్టతత్త్వానాం=తత్త్వము నెరుంగనివారియొక్క దర్శనం=దర్శనము, వచనంచాపి=అ యర్థముల వ్యవహారముకూడ, నిత్యమేవ=ఎల్లప్పుడు, అనవస్థితమ్=నిలుకడగా నుండదు, సాపరాధం=అసత్యవస్తువిషయ మగును, బహుచ్ఛలం=అనేకవిధములగు బాధకములు కల్గియుండును.

**తా.** పై విధముగ పదార్థములు అనియతములుగ నుండుటకు తత్త్వము నెరుంగక పోవుటయే కారణము. తత్త్వము నెరుంగకపోవుటచే వారి దర్శనము అవ్యవస్థితమై యుండును. అసత్య వస్తువిషయమై యుండును. బాధకములు అధికముగా నుండును. దర్శనము వలె వ్యవహారము కూడ అవ్యవస్థితముగానే యుండును.

పరమార్థ దర్శనము కలిగిన మునులు తత్త్వదర్శనము చేయగలవారే యైనను వారి దర్శనము ననుసరించి అర్థ వ్యవస్థాపనము చేయుట వీలుపడదని నిరూపించుచున్నాడు.

ఋషీణాం దర్శనం యచ్చ తత్త్వే కించి దవస్థితమ్

న తేన వ్యవహారోఽస్తి న త చ్ఛబ్దనిబంధనమ్ . 189

ఋషీణాం=పరావరతత్త్వ దర్శనము కలిగిన ఋషులయొక్క, యచ్చ దర్శనం= ఏదర్శనముకలదో, తత్త్వే = పరమార్థమునందు, కించిదవస్థితం=కొంచెము నిలచియుండు

నది యగునో, తేన=ఆ తత్త్వజ్ఞానముచే, వ్యవహారః=లోకమున వ్యవహారము, నాస్తి = లేదు, తత్ = ఆ తత్త్వజ్ఞానము, శబ్దనిబంధనం=శబ్దప్రయోగమునకు నిమిత్తము, న=కాదు.

తా. పరమార్థజ్ఞానము గల ఋషులు యథార్థ దర్శనముకలవారు కనుక వారి దర్శనము ననుసరించి వాస్తవముగ అర్థ మేదో నిశ్చయింప వీలగును. కావున అర్థము అవ్యవస్థితము అనుట ఎట్లు అని సందేహము కలుగవచ్చును. ఋషులు ఎపుడో ఒకప్పుడు యథార్థ వస్తుదర్శనము చేసినను అది వ్యవహారమున నుపయోగింపదు. వ్యవహారదశలో వారుకూడ తత్త్వదర్శనము లేనివారితో సమానులే కావున వారిజ్ఞానము అర్థవ్యవస్థ కల్పించుటకు సమర్థము కాదు. పరమార్థజ్ఞానము శబ్దప్రయోగమునకు నిమిత్తము కాదు. అధ్యస్తమైన వస్తువే వ్యవహరింపబడును, కాని పరమార్థ వస్తువు వ్యవహారోపయోగి కాదు.

తర్కముచేతను, ఆయా శాస్త్ర సంస్కారములచేతను పురుష బుద్ధులు భిన్నభిన్నములుగా నుండుటచే అర్థము అనియతమని వెనుక నిశ్చయింపబడినది. కాని శాస్త్ర జన్యబుద్ధి నాశ్రయింపక కేవల ప్రత్యక్షముచేతనే అర్థ నిర్ణయము చేయవచ్చునుగదా? ప్రత్యక్షముచే మనము ఏ యర్థమునెట్లు తెలిసికొందుమో అదే శబ్దమున కర్థము అని చెప్పవచ్చునుగదా యని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

తలవద్ దృశ్యతే వ్యోమ ఖద్యోతో హవ్యవా డివ
నైవ చా స్తి తలం వ్యోమ్ని న ఖద్యోతో హుతాశనః . 140

వ్యోమ = ఆకాశము, తలవత్ = ఇంద్రనీలమణి నిర్మిత కటాహసదృశ భాగము కలదిగ, దృశ్యతే=చూడబడును. ఖద్యోతః = మిణుగురు పురుగు, హవ్యవాడివ=అగ్నివలె, దృశ్యతే = చూడబడును. వ్యోమ్ని=ఆకాశమున, తలం = భాగము, న చాస్తి=లేదు. ఖద్యోతః = మిణుగురు పురుగు, హుతాశనః=అగ్ని, న = కాదు.

తా. ఆకాశము ఇంద్రనీలమణి కటాహమువలె నిర్మలము అని మనము చూచు చుందుము. అట్లే మిణుగురుపురుగును చీకటిలో చూచినపుడు నిప్పుగా చూచుచుందుము. ప్రత్యక్షము ఈ విధముగా నున్నను ఆ యర్థము నట్లు వ్యవహరించుటకు ఆకాశమున తలము అను భాగములేదు. దానికి మాలిన్యము ఉండుట, లేకపోవుట యనునవి లేవు. కాని నిర్మలముగా ఉన్నదని మనకు ప్రత్యక్ష వ్యవహారము. అట్లే మిణుగురు పురుగులో నిప్పు లేదు. కాని నిప్పున్నట్లు ప్రత్యక్షమగుచుండును. కావున ఇంద్రియ జన్యమగు జ్ఞానము అనగా ప్రత్యక్షము కూడ అవ్యవస్థితముగనే యుండును. కావున ప్రత్యక్షము కూడ అర్థవ్యవస్థను కల్గింపలేదు.

ఇందుచేత ఎవరికి ఎట్లు భాసించునో యుక్తిచే నిశ్చయించి. దానినే శబ్దమున కర్థమని గ్రహింతురు కాని వ్యవస్థ లేదని చెప్పుచున్నాడు.

తస్మాత్ ప్రత్యక్ష మప్యర్థం విద్వా నీక్షేత యుక్తితః
న దర్శనస్య ప్రామాణ్యాత్ దృశ్య మర్థం ప్రకల్పయేత్ . 141

తస్మాత్ = అందువలన, విద్వాన్=విద్వాంసుడు, ప్రత్యక్ష మప్యర్థం = ఇంద్రియ గోచరమగు నర్థమును గూడ, యుక్తితః=ప్రత్యక్షము భ్రమరూపముగ కూడ ఉండునుకావున యుక్తిచే, ఈక్షేత = పరీక్షింపవలెను, దర్శనస్య = ప్రత్యక్షముయొక్క, ప్రామాణ్యాత్=

ప్రామాణ్యమువలన, ఉపపత్తి లేకపోయినను ప్రమాణమే యని తలంచి, దృశ్యమర్థం = చూచినదానిని చూచినట్లే పదార్థముగ, న ప్రకల్పయేత్ = భావింపరాదు.

తా. అయథార్థ విషయకముగ కూడ ప్రత్యక్షము కలుగుచుండుట సహజము కావున ప్రత్యక్షమునే ఆశ్రయించి ఉపపత్తిచే నిర్ణయము చేయనిదే పదార్థమును నిశ్చయింప రాదు. అందుచే పదార్థము వారి వారి సంస్కారభేదముచే భిన్నముగా నుండును.

ప్రత్యక్షముగ ఎట్లు కన్పట్టునో చూచి, దానిని యుక్తిచే నిశ్చయించి, వ్యవహార మున లోకములో ఎట్లు ఆ పదార్థమును గ్రహింపదగునో అట్లు కల్పింపవలెనే కాని తమ పరమార్థ జ్ఞానము ననుసరించి కల్పింపరాదని చెప్పుచున్నాడు.

అసమాఖ్యేయ తత్త్వానాం అర్థానాం లౌకికై ర్యథా
వ్యవహారే సమాఖ్యానం తత్ప్రాజ్ఞో న వికల్పయేత్ . 142

అసమాఖ్యేయ తత్త్వానాం = ఇట్టున్నదని నిర్వచించుటకు వీలుకాని స్వభావము కలిగిన, అర్థానాం = అర్థములయొక్క, వ్యవహారే = లోకవ్యవహారమున, సమాఖ్యానం = చెప్పుట, లౌకికైః = లోకములోనివారిచే, యథా = ఏ విధముగ చేయబడుచున్నదో, తత్ = ఆ లోక ప్రసిద్ధ వ్యవహారమును, ప్రాజ్ఞః = విద్వాంసుడు, న వికల్పయేత్ = భిన్నము చేయరాదు.

తా. లోకములోని పదార్థము లన్నియు అనిర్వచనీయస్వరూపములే యయినను లోకులచే ప్రసిద్ధముగ ఏ రూపముతో వ్యవహరింపబడుచున్నవో ఆ రూపము కలవిగనే శాస్త్ర జ్ఞులు కూడ వ్యవహరింపవలెను. కాని భిన్న భిన్న రూపములుగ కల్పింపరాదు. లోకముతో ఏ శబ్దమున కేది యర్థమని వ్యవహారమున ప్రసిద్ధమైయుండునో దానినే స్వీకరింపవలెను. కాని దానిని యుక్తులచే నిరసింపరాదు.

ఈ విధముగ పన్నెండు విధములుగ పదార్థము న్యాయామతభేదమున నిరూపించెను. కాని వైయాకరణ మతమున వాక్యార్థ మఖండము, పదార్థ మసత్యము. వాక్య వాక్యార్థ ములకు అధ్యాసమే సంబంధము. ప్రతిభయే వాక్యార్థము కావున ప్రతిభా స్వరూపమే వివరింపబడుచున్నది.

విచ్ఛేదగ్రహణేఽర్థానాం ప్రతిభాన్యైవ జాయతే
వాక్యార్థ ఇతి తా మాహుః పదార్థై రుపపాదితామ్ . 143

అర్థానాం = 'దేవదత్త గామ్ ఆనయ' అను వాక్యములో కల్పితములైన పదములచే భాసించిన అర్థములను, విచ్ఛేదగ్రహణే = విడి విడిగా గ్రహించునపుడు, అన్యైవ = ఆ పదార్థ ములకంటె వ్యతిరిక్తమగు, ప్రతిభా = ప్రతిభయనుపేరుగల బుద్ధి, జాయతే = కల్గును, పదార్థైః ఉపపాదితాం = అసత్యములగు దేవదత్తాది పదార్థములచే అభివ్యక్తమైన ఆ బుద్ధినే, వాక్యార్థ ఇతి = వాక్యార్థమని, ఆహుః = చెప్పుదురు.

తా. 'దేవదత్త గామ్ ఆనయ' అను వాక్యము అఖండమైనను దానియందు లేని పదములు కల్పితములై ఉన్నట్లు భాసించును. ఆ పదముల యర్థములు విడివిడిగా భాసించు నపుడు ఆ యర్థము లన్నియు సామూహికముగ వేరొక యర్థమును, ప్రతిభ యను దానిని, అభివ్యక్తము చేయును. ఆ ప్రతిభయే వాక్యార్థము.

ఆ ప్రతిభ ఎట్టిదియో వివరించుచున్నాడు.

ఇదం తదితి సాన్యేషా మనాఖ్యేయా కథంచన
ప్రత్యాత్మవృత్తిసిద్ధా సా కర్త్రాఽపి న నిరూప్యతే . 144

సా = ఆ ప్రతిభ, ఇదం తత్ ఇతి = పదార్థములచే అభివ్యక్తమగు ఈ ప్రతిభ యను వాక్యార్థము ఆ పదార్థ సముదాయమేనని, కథంచన = ఏవిధముగను, అన్యేషాం = ఇతరులకు, అనాఖ్యేయా = నిరూపించుటకు శక్యముకాదు. సా = ఆ ప్రతిభ, ప్రత్యాత్మ వృత్తి సిద్ధా = ఎవరికి వారి అనుభవమున గోచరించునదే, కాని, కర్త్రాఽపి = ఆ వాక్యార్థ జ్ఞానము కలవానిచేత గూడ, న నిరూప్యతే = నిరూపింప వీలుపడదు.

తా. ప్రతిభ యని భాసించు ఈ వాక్యార్థము పదార్థముల సముదాయరూపమే యని ఇతరులకు నిరూపించుటకు వీలుకాదు. పానక రసమువలె పదార్థ సమ్మేళనముచే విడదీసి చూపరాని దగుటచే ఇది ఈ పదము యొక్క అర్థమని ఇతరులకు గాని తనకుగాని తెలిసికొన వీలుకాదు. కాని ఎవరి అనుభవమున వారికి గోచరించుచుండును.

ప్రతిభయొక్క స్వభావమును వివరించుచున్నాడు.

ఉపశ్లేషమి వార్థానాం సా కరో త్యవిచారితా
సార్వరూప్యమి వాపన్నా విషయత్వేన వర్తతే . 145

సా = ఆ ప్రతిభ, అవిచారితా = ఇది ఆ పదముయొక్క అర్థము అని వివేచించి చూప వీలుకానిదైనను, అర్థానాం = పదార్థముల యొక్క, ఉపశ్లేషం = సంసర్గమును (పరస్పరమేళనమును), కరోతి ఇవ = చేయునట్లు ఉండును. సార్వరూప్యం = వాక్యము యొక్క సంపూర్ణమగు అర్థస్వరూపమును, ఆపన్నా = పొందినదై, విషయత్వేన = పదార్థ ములచే అభివ్యక్తి చేయబడునదై, వర్తతే ఇవ = ఉన్నట్లుండును.

తా. ప్రతిభ వాక్యార్థము. ఆ వాక్యార్థము అనిర్వచనీయము. అనగా ఈ పదము యొక్క అర్థ మిదియని వాక్యార్థములో నిశ్చయించి చూప వీలుపడదు. కాని పదార్థములయొక్క పరస్పర సంబంధమును కల్పించునట్లును, పదార్థములచేతనే ఈ వాక్యార్థము అభివ్యక్తమైనట్లును గోచరించుచుండును.

ఏ ప్రాణియు లోకవ్యవహారమున ప్రతిభ నతిక్రమించి యుండలేదు. ప్రతిభయే మనుష్యులకు, తిర్యగ్జంతువులకు, బాలురకు కూడ వ్యవహార హేతువు అని నిరూపించు చున్నాడు.

సాక్షాచ్ఛబ్దేన జనితాం భావనానుగమేన వా
ఇతికర్తవ్యతాయాం తాం న కశ్చి దతివర్తతే . 146

సాక్షాత్ = ప్రత్యక్షముగ ఈ జన్మమున, శబ్దేన = వృద్ధ వ్యవహారమున ప్రయో గింపబడిన శబ్దముచేతగాని, భావనానుగమేన వా = పూర్వజన్మయందలి భావనచే గాని, జనితాం = కలిగిన, తాం = ఆ ప్రతిభను, ఇతికర్తవ్యతాయాం = వ్యవహారమున, కశ్చిత్ = ఏ ఒక్క ప్రాణియు, న అతివర్తతే = మీరి వ్యవహరింపజాలదు.

తా. లోకమున మనుష్యులలో పెద్దలు చేయు వ్యవహార నిర్వహణమునగాని, పిల్లలుచేయు కార్యములలోగాని, తిర్యగ్జంతువులు తమతమ పనులు చేయుటలోగాని ప్రతి

భయే కారణము. మనుష్యులలో పెద్దవారు ఈ జన్మలోనే శబ్దముయొక్క సంకేతము నెరుంగుటచే వ్యవహారము సాగింతురు. బాలురు తమ తోడివారితో పూర్వజన్మయందలి భావన యనుసరించివచ్చుటచే వారికి తెలియకయే లోపల నావిర్భవించిన ప్రతిభచే వ్యవహారము సాగింతురు. తిర్యగ్జంతువులు కూడ అంతే. అందుచేత లోకమున ఏ ప్రాణియు ప్రతిభనతిక్రమించి ప్రవర్తింపజాలదు.

దీనినే విశదము చేయుచున్నాడు.

ప్రమాణత్వేన తాం లోకః సర్వః సమనుపశ్యతి
సమారంభాః ప్రతాయంతే తిరశ్చామపి తద్వశాత్ . 147

సర్వః లోకః = సమస్త లోకము, తాం = ఆ ప్రతిభను, ప్రమాణత్వేన = తాను చేయుపనికి ప్రమాణముగ, సమనుపశ్యతి = భావించును. తిరశ్చామపి = తిర్యగ్జంతువులయొక్క కూడ, సమారంభాః = వ్యాపారములు, తద్వశాత్ = ఆ ప్రతిభవలననే, ప్రతాయంతే = విస్తృతముగ సాగుచున్నవి.

తా. ప్రతివ్యక్తియు తనకు మనస్సులో తోచినదానిని బట్టియే ప్రవర్తించుచు దానినే ప్రమాణముగ భావించును. శాకుంతలమున దుష్యంతుడు "సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అని అంతఃకరణ వ్యాపారము ప్రమాణమని నిశ్చయించినాడుకదా ! పుట్టగనే పశువులు తమ వ్యవహారమును సాగించుట ఈ ప్రతిభచేతనే. కావున సర్వ వ్యాపారములు ప్రతిభ నాశ్రయించియే సాగును.

అందరిలోను ఈ ప్రతిభ సహజముగ నుండునని ప్రతిపాదించుచున్నాడు.

యథా ద్రవ్యవిశేషాణాం పరిపాకై రయత్నజాః
మదాదిశక్తయో దృష్టాః ప్రతిభా స్తద్వతాం తథా . 148

ద్రవ్యవిశేషాణాం = ఇప్పపువ్వు, బెల్లము, బియ్యము, మొదలగు ద్రవ్యములయొక్క, పరిపాకైః = పాకవిశేషములచే, అయత్నజాః = ప్రయత్నము వేరుగ అవసరము లేకయే జనించు, మదాదయః = మత్తుకల్గించు శక్తులు, యథా = ఎట్లు, దృష్టాః = చూడబడునో, తథా = అట్లు, తద్వతాం = ప్రతిప్రాణికిని, ప్రతిభాః = ప్రతిభలు, దృష్టాః = అయత్నజన్యముగ చూడబడుచున్నవి.

తా. ఇప్పపువ్వు బెల్లము మొ॥నవి కలిపి నానబెట్టినచో వానిలో పరిపాకముచే వేరొక ప్రయత్న మేమియు అక్కరలేకయే మత్తుకల్గించుశక్తి ఆవిర్భవించును. అట్లే ప్రతిప్రాణియందును సహజముగనుండు శక్తియే ప్రతిభ. కాని ఇది క్రొత్తగా సృజింపబడునది కాదు.

ఈ ప్రతిభ జన్మాంతరాభ్యాసముచే జనించునది అని నిరూపించుచున్నాడు.

స్వరవృత్తిం వికురుతే మధౌ పుంస్కోకిలస్య కః ?
జంత్వాదయః కులాయాదికరణే కేన శిక్షితాః ? 149

మధౌ = వసంతర్తువునందు, పుంస్కోకిలస్య = గండుగోయిలకు, స్వరవృత్తిం = తన పూర్వస్వరము పంచమస్వరముగా నగు మార్పును, కః = ఎవడు, వికురుతే =

కల్గించుచున్నాడు. జంత్వాదయః = సాలెపురుగు మున్నగునవి, కులాయాదికరణే = గూడు నిర్మించుటలో, కేన = ఎవనిచేత, శిక్షితాః = శిక్షింపబడినవి.

తా. వసంతర్తువులో కోకిలకు పూర్వపుకంఠస్వరము మారి పంచమస్వరము కల్గుట అయత్నసిద్ధమే కాని ఎవరిచేతను సృజింపబడినది కాదు. సాలెపురుగు గూడు కట్టుకొనుట ఎవరివద్దను నేర్చుకొనలేదు. అదియే ప్రతిభ. ఆ ప్రతిభచేతనే సర్వవ్యాపారములు సాగును.

దానినే స్పష్టముచేయుచున్నాడు.

ఆహారప్రీత్యపద్వేషప్లవనాదిక్రియాసు కః
జాత్యన్వయప్రసిద్ధాసు ప్రయోక్తా మృగపక్షిణామ్ ? 150

జాత్యన్వయ ప్రసిద్ధాసు = జాతినిబట్టి, కులమునుబట్టి సిద్ధములై యుండు, ఆహార ప్రీత్యపద్వేషప్లవనాదిక్రియాసు = ఆహారము, ప్రీతి, పగ, ఈదుట మొ॥గు వ్యాపారములలో, మృగ పక్షిణామ్ః = మృగములకు, పక్షులకు, ప్రయోక్తా = ప్రవర్తింపచేయువాడు, కః = ఎవడు ?

తా. పిల్లికి ఎలుక ఆహారమగుట, కుక్కకు తనను పెంచిన వానిమీద ప్రేమ, గోవ్యాఘ్రములకు, ముంగిసకు, పాముకు పరస్పరద్వేషము, ఎనుబోతులు మొ॥నవి నీటిలో ఈదుట మొ॥నవి అయా మృగములలో పక్షులలో జాతి సహజములుగ మనకు కన్పట్టుచున్నవి. వానిని ఆ విధముగ ఆహార, ప్రేమ, ద్వేష, ప్లవనాదులు చేయవలెనని ఎవ్వరును ప్రేరణ చేయలేదు. అది సహజమేయని ఎరుంగనగును. అది అనాదియగు ప్రతిభవలననే అని స్పష్టమగుచున్నదికదా ?

ప్రతిభకు శబ్దమే మూలమని చెప్పుచున్నాడు.

భావనానుగతా దేత దాగమా దేవ జాయతే
ఆసత్తివిప్రకర్షాభ్యా మాగమస్తు విశిష్యతే. 151

భావనానుగతాత్ = ప్రతిభకు కారణముగా కన్పట్టు భావనతో కలిసియుండు, ఆగమాదేవ = శబ్దమువలననే, ఏతత్ = ఈ ప్రతిభారూపమగు జ్ఞానము, జాయతే = కల్గును. తు = కాని, ఆగమః = శబ్దము, ఆసత్తి విప్రకర్షాభ్యాం = (ఈ జన్మమున) దగ్గరగానుండుట, (పూర్వజన్మముల)దూరముగా నుండుట అను భేదములచే, విశిష్యతే = విశేషము కలదగును.

తా. భావనా సహకారముతో ప్రతిభకు కారణ భూతమైనది శబ్దమే. ఆ శబ్దము ఈ జన్మమునందలిది కావచ్చును; పూర్వజన్మమందలిది కావచ్చును. అందుచే ప్రతిభా హేతు భూతమగు శబ్దము ఆసన్నము, విప్రకృష్టము అని ద్వివిధముగ నుండును.

నిమిత్తభేదముచే ప్రతిభ ఆరు విధములుగ నుండునని వివరించుచున్నాడు.

స్వభావచరణాభ్యాసయోగాదృష్టోపపాదితాం
విశిష్టోపహితాం చేతి ప్రతిభాం షడ్విధాం విదుః. 152

స్వభావ, చరణ, అభ్యాస, యోగ, అదృష్ట—ఉపపాదితాం = స్వభావముచేతను, సదాచారముచేతను, నిత్యాభ్యాసముచేతను, యోగబలముచేతను. అదృష్టముచేతను

అభివ్యక్తమగునదియు, విశిష్టోపహితాంచ=సిద్ధినందిన మహాపురుషులచే సంక్రమింపచేయ బడినదియు, ఇతి=అని, ప్రతిభాం=ప్రతిభను,షడ్విధాం=ఆరువిధములుగ, విదుః=ఉదా హరింతురు.

తా. ప్రతిభ నిమిత్త భేదముచే ఆరువిధములుగ నుండునని కొందరు చెప్పుదురు.

1. స్వభావ సిద్ధముగ నావిర్భవించు ప్రతిభ: ఉ॥ ప్రకృతి మహత్తత్త్వముగ పరిణామము నందుట సహజమే. సుషుప్త్యవస్థలో నున్న వానికి మేల్కొనుటకు తగిన స్థితి కల్గుట
2. సదాచారము నిమిత్తముగ నావిర్భవించు ప్రతిభ: శాస్త్ర విహితమగు తపస్స్వాధ్యాయాదులచే వసిష్ఠాదులకు కల్గిన త్రైకాలికవిషయప్రకాశము
3. అభ్యాసము నిమిత్తముగ నావిర్భవించు ప్రతిభ: నూతులు చెరువులు త్రవ్వు వారికి ఎక్కడ నీరుపడునో తెలియుట అభ్యాస సిద్ధ ప్రతిభచేతనే.
4. యోగనిమిత్తముగ నావిర్భవించు ప్రతిభః యోగాభ్యాసముచే నావిర్భవించు ప్రతిభ. యోగాభ్యాసముచేతనే ఇతరుల అభిప్రాయముల నెరుంగు శక్తి.
5. అదృష్టముచే నావిర్భవించు ప్రతిభ: రక్షఃపిశాచాదులు ఇతురులపై ఆవేశించుట, అంతర్ధానమగుట మున్నగునవి ఈ శక్తిచేతనే.
6. తపోయోగాది సిద్ధిసంపన్నులగు విశిష్టవ్యక్తులచే సంక్రమింపచేయబడిన ప్రతిభ: సంజయునకు భారత యుద్ధమున దూరముగా జరిగిన యుద్ధ వృత్తాంతములను చూడ గల్గిన శక్తి. ఇది కృష్ణద్వైపాయనునిచే సంక్రమింపచేయబడినది.

పై ఆరు విధములగు ప్రతిభకూడ ఆగమసిద్ధవాక్యములచే అభివ్యక్తము చేయ బడునదే యని ఎరుంగవలెను.

వాక్యము అఖండమని యంగీకరించినను పద పదార్థవిభాగములేనిదే వ్యవహారము సిద్ధించదు కావున పదార్థ స్వరూపమును వెనుక వివరించిరి. ఆ పదార్థము ముఖ్యము, సాంత రీయకము అనుభేదముచే ద్వివిధముగా నుండునని వివరించుచున్నాడు.

> యథా సంయోగిభి ర్ద్రవ్యై ర్లక్షితేఽర్థే ప్రయుజ్యతే
> గోశబ్దో న త్వసౌ తేషాం విశేషాణాం ప్రకాశకః. 153

> ఆకారవర్ణావయవైః సంసృష్టేషు గవాదిషు
> శబ్దః ప్రవర్తమానోఽపి న తా నంగీకరో త్యసౌ. 154

గోశబ్దః='గోవు' అనుశబ్దము, సంయోగిభిః=గోశబ్దముయొక్క అర్థము అగు వ్యక్తితో తాత్కాలికముగ సంబంధించియుండు, ద్రవ్యైః=ఘంటలు, మణులు మొదలగు వస్తువులచే, లక్షితే=ఉపలక్షితమగు, అర్థే=గోవునందు, యథా ప్రయుజ్యతే=ఏవిధముగ ప్రయోగింపబడునో, మనమెరుంగుదుము. తు=కాని, అసౌ=ఈ గోశబ్దము, తేషాం విశేషాణాం=ఆ ఘంటలు, మణులు మొదలగు విశేషములకు, న ప్రకాశకః=వాచకము కాదు. ఆకారవర్ణావయవైః= ఆకారము, రంగు, కొమ్ములు, తోక మొదలగు అవయములతో, సంసృష్టేషు=కూడిన, గవాదిషు=గోవు మొదలగు అర్థములందు, శబ్దః=గోశబ్దము, ప్రవర్తమానోఽపి=వ్యవహరింపబడుచున్నను, అసౌ=ఈ గోశబ్దము, తాన్=ఆకారము, రంగు మొదలగు వానిని, న అంగీకరోతి=వాచ్యముగా స్వీకరింపదు.

తా. గోవు అను శబ్దముచే గోత్వమను జాతి కాని గోవ్యక్తి కాని చెప్పబడును. ఆ గోవుకు అలంకారములుగా మెడలో కట్టిన మువ్వలు, గంటలు కూడ ఆ గోవుతో పాటే జ్ఞాన గోచరమగును; కాని ఇవి ఒకపుడు లేకపోవచ్చును. ఉపలక్షకములుగా గోవుతో సంబంధించి యుండును. అవి బహిరంగములగు విశేషములు, అట్లే గోవునం దుండు ఆకారము, రంగు, కొమ్ములు, తోక మొదలగు అవయవములు కూడ శబ్దముచే జ్ఞానగోచరములగును. ఇవి అంతరంగ విశేషములు. ఈ రెండు విధములగు విశేషములు గోవుతో తాత్కాలికముగనో, నిత్యముగనో కూడి యుండునవే యయినను గోత్వమను జాతి గోవుతో కూడి యుండునట్లు అవ్యభిచరితముగ సర్వదా గోచరింపవు. కనుక అవి గోశబ్దమునకు ముఖ్యార్థములు కావు. గోశబ్దమునుచ్చరించగనే తప్పక గోచరించు వ్యక్తి లేదా జాతియే ముఖ్యమగు వాచ్యార్థము. ఆ మువ్వల ఆవు, కుంచెడు పాలిచ్చే ఆవు, రాజుగారి ఆవు మొదలగు ఇతర గోవులకంటె భేదమును తెలియచేయు బహిరంగ విశేషములు ఆ గోశబ్దమును వినగనే మనసున గోచరించినను అవి వాచ్యములు కావు. అట్లే ఆ గోవుయొక్క ఆకారము, రంగు, అవయవములు కూడ గోశబ్దముచే మనసున గోచరించుచున్నను ఆ అంతరంగవిశేషములు కూడ వాచ్యములు కావు.

శబ్దముచే ఆకారము, వర్ణము మొ॥నవి తెలియచేయబడవు అనినచో స్థూలము, హ్రస్వము, చిత్రము మున్నగు శబ్దములు ఆకారము, లేదా వర్ణముతో కూడిన వస్తువు నుద్దేశించి ప్రయోగింపబడును కావున అచట ఆకారవర్ణములు శబ్దవాచ్యములగునా కాదా యను సందేహమును నివారించుచున్నాడు.

సంస్థానవర్ణావయవై ర్విశిష్టే యః ప్రయుజ్యతే
శబ్దో న తస్యావయవే ప్రవృత్తి రుపలభ్యతే . 155

సంస్థానవర్ణావయవైః = ఆకారము, రంగు, అవయవములతో, విశిష్టే = కూడిన వస్తువునందు, యః శబ్దః = ఏ శబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడునో, తస్య = ఆ శబ్దమునకు, అవయవే = అవాంతర భాగమునందు, ప్రవృత్తిః = వాచకత్వము, న ఉపలభ్యతే = ఉండదు.

తా. 'గోవు' అను శబ్దము గోత్వజాతిని లేదా వ్యక్తిని ముఖ్యముగా తెలియచేయును. కాని దాని ఆకారమును రంగును తెలియచేయదు. కాని స్థూలము, కృశము, చిత్రము మున్నగు శబ్దము ఆకారముతో గూడిన వస్తువును, వర్ణముతో కూడిన వస్తువును తెలుపవలెనను నుద్దేశముతో ప్రయోగింపబడినవి కనుక ఆ శబ్దములు ఆకారమునకు, వర్ణమునకు వాచకములే యగును. కాని వానిలో అవాంతరభాగములను అనగా చిత్రము అనునది చిత్రవర్ణమునే కాని దానిలో అవయవములైన శ్వేతపీతాది వర్ణములను వాచ్యముగా ఎరిగింపదు. ఆ చిత్రవర్ణములో తప్పనిసరిగా అవి యుండును కనుక గోచరించునే కాని అవి వాచ్యార్థము మాత్రము కావు.

ఆకారపరిమాణసంఖ్యానిరపేక్షముగ సామాన్యమాత్రమునే శబ్దము తెలియచేయుటలో దృష్టాంతమును చూపుచున్నాడు.

సంఖ్యా ప్రమాణ సంస్థాన నిరపేక్షః ప్రవర్తతే
బిందౌ చ సముదాయే చ వాచకః సలిలాదిషు . 156

సలిలాదిషు='నీరు తెల్లనిది' మొదలగు వానియందు, వాచకః='జలము, శుక్లము, శ్వేతము మున్నగు శబ్దము, సంఖ్యా ప్రమాణ సంస్థాన నిరపేక్షః=ఏకత్వాది సంఖ్యనుగాని, 'చిన్నది, పెద్దది, తక్కువ, ఎక్కువ' అను ప్రమాణమునుగాని, ఆకారమును గాని అపేక్షింపకయే, బిందౌ = బిందువునందు, సముదాయేచ = సముదాయమునందు కూడ, ప్రవర్తతే = ప్రవర్తించును.

తా. జలము అను శబ్దము జలబిందువును, సముద్రమునందలి జలరాశినికూడ తెలియజేయును. ''ఒక శిల తెల్లగానున్నది'' 'హిమవత్పర్వతము తెల్లగానున్నది' అని శిల యందు పర్వతమునందు కూడ ''తెల్లగా నున్నది'' అనునది సమానముగనే వర్ణవాచకమగును. ఇచట సంఖ్యగాని, ఆకారముగాని, పరిమాణము కాని వివక్షితములు కావు. ఇచట జల, శుక్ల, నీలాది శబ్దముల ప్రవృత్తికి నిమిత్తము జలత్వ, శుక్లత్వ మాత్రములే కాని ఆశ్రయ ద్రవ్యముయొక్క ప్రమాణ—సంఖ్యా—ఆకారాదులు కావని ఎరుంగునది.

విశేషపరామర్శ లేక వస్తుమాత్రమునే శబ్దము బోధించును అని చెప్పినచో ''సముదాయ వాచకశబ్దములు అవయవములనుకూడ బోధించును'' అని భాష్యకారులు చెప్పి ''తైలము శుక్తము, ఘృతము శుక్తము'' అని ఉదాహరణము నిచ్చి నిరూపించుట ఎట్లు కుదురును? సముదాయవాచకము, తద్విశేషమగు అవయవమును కూడ బోధించు చున్నదిగదా! అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

సంస్కారాదిపరిచ్ఛిన్నే తైలాదౌ యో వ్యవస్థితః
ఆహైకదేశం తత్త్వేన తస్యావయవ వర్తితా. 157

సంస్కారాదిపరిచ్ఛిన్నే = సంస్కారము లేదా ఉపఘాతము (దూషితముగ చేయుట)చే పరిమితమైయున్న, తైలాదౌ=తైలము, ఘృతము మున్నగువానియందు, యః= ఏ తైలశబ్దము లేదా ఘృతశబ్దము, వ్యవస్థితః=ప్రయోగింపబడినదో, సః = ఆ శబ్దము, తత్త్వేన=ఆ సముదాయారోపముచే సముదాయ సదృశముగ, ఏకదేశం=అవయవమును, ఆహ=బోధించును. అందుచే—తస్య=ఆ పరిమిత సముదాయ వాచక శబ్దమునకు, అవయవ వర్తితా=అవయవ వాచకత్వము కూడ ఉండును అని భాష్యకారుడు చెప్పెను.

తా. కాకి ముట్టుకొనుటచే దూషితమైన నేయి కాని లేదా రోగికొరకు శుద్ధిచేయబడిన నేయి కాని కొంత యున్నపుడు అందులో ఏకదేశము నొకడు తినగా ఆ భాగము కూడ సముదాయమువలెనే దూషితమో సంస్కృతమో యగుటచే తత్సాదృశ్యముచే ఆ మొత్తమునకు వాచకమగు పదము లక్షణచే ఏకదేశమునకు కూడ వాచక మగునని భాష్యకారుడు చెప్పెను కాని సముదాయబోధనమున శక్తి కలిగిన శబ్దమే అవయవమును బోధించు శక్తికూడ కలిగి యుండునని దాని యర్థము కాదని ఎరుంగనగును.

గోత్వ, ఘటము మొదలగు శబ్దములకు జాతి (సామాన్యము) అర్థము, తైలము మొ॥గు శబ్దములకు సామాన్యము, విశేషము కూడ అర్థము; ముష్టి మొ॥గు శబ్దములకు విశేషమే అర్థము అగునపుడు శబ్దార్థము ఇట్టిదని నిశ్చయముగ చెప్పవీలుపడదని పరమార్థ ముగ నిశ్చయముగ చెప్పుచున్నాడు.

యేనార్థే నాభిసంబద్ధ మభిధానం ప్రయుజ్యతే
తదర్థాపగమే తస్య ప్రయోగో వినివర్తతే. 158

యేన అర్థేన=ప్రయోజనముచే అనగా జాత్యాదిరూపమగు నిమిత్తముచే ఏ యర్థముతో-అభిసంబద్ధం=(దానితో అనగా ఆ జాత్యాది రూపార్థముతో) తాదాత్మ్య సంబంధము కలదై, అభిధానం = ఆ యర్థమును ప్రతిపాదింపగల-అభిధావృత్తిగల శబ్దము, ప్రయుజ్యతే= ప్రయోగింపబడునో, ఆ శబ్దము, తదర్థాపగమే = ఆ యర్థము బోధింపబడనపుడు, తస్య= ఆ శబ్దముయొక్క, ప్రయోగః=ప్రయోగించుట, వినివర్తతే = ఆగిపోవును.

తా. జాతి, లేదా, విశేషము అనువానిలో ఏది ఏశబ్దమును ప్రయోగించుటలో నిమిత్తముగా నుండునో ఆ యర్థముతో తాదాత్మ్యము నందుటచే శబ్దము ఆ యర్థమును బోధించుటలో అభిధయను శక్తి కలదైయుండును. కావున ఆ యర్థమునే ఆ శబ్దము బోధించును. ఆ యర్థము శబ్దప్రవృత్తి లో నిమిత్తము కానపుడు ఆ శబ్దము ప్రయోగింపబడదు.

గోశబ్దమును ప్రయోగించునపుడు రోమములు, గిట్టలు మొదలగు అవయవములతో కూడిన గోశబ్దార్థమగు గోత్వమునే నియతముగ బోధించును. కాని రోమశృంగాది విశేషములను నియతముగ బోధింపదు అని వివరించుచున్నాడు.

యాంస్తు సంభవినో ధర్మా నంతర్నీయ ప్రయుజ్యతే
శబ్ద స్తేషాం న సాన్నిధ్యం నియమేన వ్యపేక్షతే. 159

యాంస్తు సంభవినః ధర్మాన్=గోశబ్దముయొక్క అర్థమగు గోత్వజాతితో సమానాధికరణములగు రోమ, శఫాదులగు ఏ ధర్మములను, అంతర్నీయ = గోత్వజాతి యందు అంతర్భావింపచేసి, శబ్దః=గోశబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడునో, తేషాం = ఆధర్మముల యొక్క, సాన్నిధ్యం = సన్నిధానమును ఆ శబ్దము, నియమేన=నియతముగ, న వ్యపేక్షతే=అపేక్షింపదు.

తా. గోశబ్దమునుచ్చరింపగనే గోత్వజాతియే నియతముగ గోచరించును కనుక అదియే గోశబ్దార్థము. ఆ గోవునందుండు రోమ శఫాదులు కూడ ఆ గోశబ్దముచే గోచరింపవలెనని తలంచి ఒకప్పుడు గోశబ్దమును ప్రయోగించినను అవి నియతములు కాకపోవుటచే గోశబ్దార్థము కానేరవు. గోత్వజాతి లేనిచో గోశబ్దము ప్రయోగింపబడదు. రోమశఫాదులు లేకున్నను గోత్వజాతి యున్నచో గోశబ్దము ప్రయోగింపబడును.

యథా రోమశఫాదీనాం వ్యభిచారేఽపి దృశ్యతే
గోశబ్దో న తథా జాతే ర్విప్రయోగే ప్రవర్తతే. 160

రోమశఫాదీనాం=రోమములు, గిట్టలు మొ॥ వాని యొక్క, వ్యభిచారేఽపి = నియతముగ సాన్నిధ్యము లేకపోయినను, గోశబ్దః = గోశబ్దము, యథా = ఎట్లు, దృశ్యతే= కన్పట్టుచున్నదో, తథా=ఆ విధముగ, జాతేః=గోత్వజాతియొక్క, విప్రయోగే = సాన్నిధ్యము లేనపుడు, న ప్రవర్తతే=గోశబ్దము ప్రయోగింపబడదు.

తా. గోత్వజాతితో సమానాధికరణములగు రోమశఫాదులు లేనపుడు కూడ గోశబ్దము ప్రయోగింపబడును. కాని గోత్వజాతి లేనిచో గోశబ్దము ప్రయోగింపబడదు.

శృంగ రోమ శఫాది విశిష్టమగు వస్తువు ప్రత్యక్షగోచరము కానేరదు. గోత్వజాతి మాత్రమునే గోశబ్దము సాక్షాత్కరింపచేయును. అందుచే గోత్వమే గోశబ్దార్థమని నిరూపించుచున్నాడు.

దుర్లభం కస్యచి ల్లోకే సర్వావయవదర్శనమ్
కైశ్చి త్త్వవయవై ర్దృష్టై రర్థః కృత్స్నోఽనుమీయతే. 161

కస్యచిత్ = ఏ పదార్థము యొక్క అయినను, సర్వావయవదర్శనం = సర్వావయవవిశిష్ట పదార్థ సాక్షాత్కారము, లోకే = లోకమునందు, దుర్లభం = దుర్లభము; కైశ్చిత్ = కొన్ని, దృష్టైః = చూడబడిన, అవయవైః = అవయవములచే, కృత్స్నః అర్థః = సర్వాంగ విశిష్టమగు సమగ్ర పదార్థము, అనుమీయతే = అనుమానముచే గోచరించును.

తా. ఏ పదార్థమైనను ఎవనిచేతనైనను సర్వాంగవిశిష్టముగ సాక్షాత్కారము చేసికొన సాధ్యపడదు. కొన్ని అవయవములు ప్రత్యక్ష గోచరములు కాగా సర్వాంగ విశిష్టమగు పదార్థము అనుమానముచేతనే జ్ఞాన విషయమగును కాని ప్రత్యక్షముచే గోచరము కాదు.

ఈవిధముగ కొన్ని అవయవములను చూచుటచే గలిగిన సకల పదార్థ జ్ఞానము ఆనుమానికమే యైనట్లు 'జాతిగంధః' 'ఉత్పలగంధః' ఇత్యాది పదములచే జాతిపుష్పగంధ—ఉత్పలగంధముల జ్ఞానముతో పాటు కలుగుచున్న ఆ పుష్పముల రూపస్పర్శాది జ్ఞానము అనుమానికమే కాని ప్రత్యక్షము కాదని చెప్పుచున్నాడు.

తథా జాత్యుత్పలాదీనాం గన్ధేన సహచారిణామ్
నిత్యసమ్బన్ధినాం దృష్టం గుణానా మవధారణమ్. 162

తథా = కొన్ని అవయవములను ప్రత్యక్షముగ చూచినపిమ్మట అనుమానముచే సకలపదార్థజ్ఞానము కలిగినట్లు, జాత్యుత్పలాదీనాం = మాలతీపుష్పము, కలువ మొదలగు వాటియొక్క, గన్ధేన = ప్రత్యక్షమగు గంధముతో, సహచారిణాం = కూడా ఉండునవియు, నిత్యసమ్బన్ధినామ్ = దానితో నిత్యసంబంధము కలవియు అగు, గుణానాం = రూపస్పర్శాది గుణములయొక్క, అవధారణమ్ = అనుమానము, దృష్టమ్ = చూడబడినది.

తా. అట్లే జాత్యుత్పలాది గంధ ప్రత్యక్షముచే తత్సహచారులును, దానితో నిత్యసంబద్ధములును అగు రూపస్పర్శాదుల అనుమానము కలుగుచున్నది.

వి. గాలి వీచుచున్నపుడు ఒక గంధవిశేషమును వాసనచూడగా ఇది మాలతీ కుసుమ గంధము, ఇది ఉత్పలగంధము అనెడు జ్ఞానము కలుగును. ఆ జ్ఞానముచే గంధ విశేషమున్నది గాన ఇది మాలతీపుష్పము, ఇది ఉత్పలము అని జాత్యుత్పలాద్యనుమానము కలుగుచున్నది. ఈ విధముగ అనుమితములగు జాత్యుత్పలాదుల విషయమున ప్రయుక్తములగు 'జాతి' 'ఉత్పల' మొదలగు శబ్దములు జాత్యుత్పల సామాన్యములను బోధించుచు, ప్రత్యక్షగంధ జ్ఞానసాహాయ్యముచే, ఆ గంధముతో పాటు కలిసియుండెడు రూపస్పర్శాది గుణముల జ్ఞానమును అనుమానముచే కలిగించుచున్నవి. అంతియేకాని గంధజ్ఞానము ప్రత్యక్షముగ నున్నట్లు రూపస్పర్శాది జ్ఞానము ప్రత్యక్షము కాదు. కావున 'జాతిగంధః' 'ఉత్పలగంధః' ఇత్యాది శబ్దములవలన కలిగిన జాత్యుత్పలస్పర్శాది రూపార్థము అనుమానజన్యమే కాని శబ్దార్థము కాజాలదు.

ప్రకృత విషయమును ఉపసంహరించుచున్నాడు.

తస్మా త్సమ్భవినోఽర్థస్య శబ్దాత్ సంప్రత్యయే సతి
అదృష్టవిప్రయోగోఽర్థః సమ్బన్ధిత్వేన గమ్యతే. 163

తస్మాత్ = సామాన్యముతో కలిసియున్న గుణాదుల విషయమున వ్యభిచారము కనబడుటచే, శబ్దాత్ = శబ్దమువలన, సంభవినః = సంభావ్యమగు, అర్థస్య = గుణాద్యర్థము యొక్క, సంప్రత్యయే సతి = ప్రతీతి కలుగుచున్నను, అదృష్ట విప్రయోగః = వ్యభిచరితముకాని, అర్థః = సామాన్యరూపమగు అర్థము, సమ్బన్ధిత్వేన = వాచ్యముగ, గమ్యతే = బోధింపబడుచున్నది.

తా. కావున శబ్దముచే గుణాదుల జ్ఞానము కలుగుచున్నను (ఆ గుణాదులు వ్యభిచరించును గాన) వ్యభిచరితము కాని సామాన్యమే శబ్దార్థమని చెప్పవలెను.

వి. అనగా శబ్దముచే ప్రతీయమానమైనంత మాత్రముచే సంభావ్యములగు అర్థములన్నియు శబ్దార్థములే యని చెప్పుటకు వీలులేదు. ఏలయన కొన్నియెడల వాటికి వ్యభిచారము కనబడుచున్నది. అందుచే 'గౌ' మొదలగు శబ్దములు అవ్యభిచరితమై నిత్య సంబద్ధమగు గోత్వాదిరూప సామాన్యమునే బోధించును. కావున ఆ సామాన్యమే శబ్దార్థము. వ్యక్త్యాదులు కావు.

ఇంతవరకును భర్తృహరి నామపదార్థవిచారణము చేసి ఇపుడు నామపదాంశము లగు ప్రకృతి ప్రత్యయముల అర్థమును విచారించుటకు ఉపక్రమించుచున్నాడు. మొదట 'వాచికా' ఇత్యాది శ్లోకద్వయమునందు ప్రత్యయభాగార్థమును గూర్చి విచారించుచున్నాడు.

> వాచికా ద్యోతికా వా స్యు ర్ద్విత్వాదీనాం విభక్తయః
> స్యాద్వా సంఖ్యావతోఽర్థస్య సముదాయోఽభిధాయకః.　　164

విభక్తయః = సు, ఔ, జస్, తిప్, తస్, ఝి మొదలగు విభక్తిప్రత్యయములు, ద్విత్వాదీనామ్ = ద్విత్వము, కర్మత్వము మొదలగు వాటికి, వాచికాః = వాచకములు, వా = లేక, ద్యోతికాః = సూచకములు, స్యుః = అగును, వా = లేక, సముదాయః = ప్రకృతిప్రత్యయసముదాయము, సంఖ్యావతః = సంఖ్యాది విశిష్టమగు, అర్థస్య = అర్థమునకు, అభిధాయకః = వాచకము, స్యాత్ = కావచ్చును.

తా. విభక్తి ప్రత్యయములు ద్విత్వాదులను బోధింపవచ్చును లేదా సూచింపవచ్చును. లేదా ప్రకృతిప్రత్యయ సముదాయము సంఖ్యాది విశిష్టమగు అర్థమును బోధింపవచ్చును.

లేదా ప్రకృతి ప్రత్యయసముదాయము సంఖ్యా కర్మత్వాద్యుపలక్షితమగు అర్థమును బోధించును—అను పక్షాంతరమును రెండవ శ్లోకమున చెప్పుచున్నాడు.

> వినా సంఖ్యాభిధానాద్వా సంఖ్యాభేదసమన్వితాన్
> అర్థాన్ స్వరూపభేదేన కాంశ్చి దాహు ర్గవాదయః.　　165

వా = లేక, గవాదయః = విభక్తి ప్రత్యయాంతములగు గోశబ్దాదులు, సంఖ్యాభిధానాద్వినా = సంఖ్యాదులను బోధించకుండగనే, స్వరూపభేదేన = ద్విత్వాది సంఖ్యల స్వరూపభేదముచేత, సంఖ్యాభేదసమన్వితాన్ = సంఖ్యావిశేషముతో ఉపలక్షితములగు, కాంశ్చిత్ = కొన్ని, అర్థాన్ = అర్థములను, ఆహుః = బోధించుచున్నవి.

తా. గోశబ్దాదులు సంఖ్యను బోధించకుండగనే ద్విత్వాది సంఖ్యాస్వరూపముచేత సంఖ్యావిశేషముతో ఉపలక్షితములగు కొన్ని అర్థములను బోధించును.

వి. ఈ శ్లోకద్వయమునందు నాలుగు పక్షములు ప్రతిపాదితము లైనవి. స్వాది తిఙాది విభక్తులు ద్విత్వకర్మత్వాదులను బోధించును అనునది మొదటిపక్షము. సంఖ్యాదులు కూడ ప్రకృతికే చెందినవి అనెడు పక్షమున విభక్తులు కేవలము ద్విత్వాదులను ద్యోతింప చేయును అని రెండవపక్షము. ప్రకృతిప్రత్యయములకు వేరువేరు అర్థములు లేవు. ప్రకృతి ప్రత్యయ సముదాయము సంఖ్యాది విశిష్టార్థమును బోధించును అని మూడవపక్షము. ప్రకృతి ప్రత్యయ సముదాయము సంఖ్యాద్యుపలక్షితమగు అర్థమును బోధించును అని నాల్గవపక్షము.

వాక్యమునుండి పదపదార్థములను విడదీసి వ్యవహరించునట్లే పదమునుగూడ ప్రకృతి ప్రత్యయరూపమున విడదీసి చూపించుట శాస్త్రములలో కానవచ్చుచున్నది. ఈ విధముగ పదములను విభజించగా నేర్పడిన ప్రకృతిప్రత్యయముల అర్థము విషయమున పండితులలో అభిప్రాయభేదము కనబడుచున్నది. దీనికి ఇది అర్థము అని అన్వయ వ్యతిరేక ముల సహాయముచే నిర్ణయింతుము. ఈ అన్వయ వ్యతిరేకముల సహాయముతో పరిశీలింపగా పదమునందు ప్రకృత్యర్థము ప్రత్యయార్థము అనునవి రెండుమాత్రమే ఉన్నవి కాని అంతకు మించిన ప్రకృతిప్రత్యయ సముదాయరూపపదార్థ మనునది లేదు. ఒక వాక్యమునందు అనేకపదము లుండును. ఒక్కొక్కపదము ఒక్కొక్క అర్థమును బోధించును. అంతియే కాని ఆ పదములు తమ పరస్పర సంబంధమును బోధింపజాలవు. కాని ఆకాంక్షావశముచే- అనగా పరస్పరసంబంధము లేకున్నచో ఆ పదముల ప్రయోగము వ్యర్థమగునను కారణముచే- వాటి పరస్పరసంబంధరూపమగు వాక్యార్థము బోధితమగును. పదమునందుగూడ ఆ విధము గానే ఆకాంక్షావశముచే ప్రకృతి ప్రత్యయార్థములు పరస్పర సంబద్ధమగుటతో ప్రకృతి ప్రత్యయ సముదాయ రూపపదార్థ మవగతమగును అని కొందరి అభిప్రాయము.

ఒక పదమునందు ఈ భాగము ప్రకృతి, ఈ భాగము ప్రత్యయము అని పాణి న్యాది వైయాకరణులు కేవలము స్వబుద్ధిచే కల్పించి శాస్త్రవ్యవహారమును నిర్వహించి యున్నారు. కావున ఇది దీని అర్థము, ఇది దీని అర్థము కాదు, అని అన్వయవ్యతిరేకములచే నిరూపించుటకై ప్రయత్నించుటగూడ కేవలము శాస్త్రీయమే. లోకమున, ఈ పదములో ఇంతవరకును ప్రకృత్యర్థము, ఇది ప్రత్యయార్థము అనెడు భేదజ్ఞానము లౌకికులకు లేదుకదా. కావుననే శాస్త్రకారులలోగూడ కొందరు ప్రాతిపదికమే స్వార్థద్రవ్యలింగసంఖ్యాకర్మాదులను బోధించును, విభక్తులు కేవలము సంఖ్యాకర్మత్వాది సూచకములే అనియు, మరికొందరు-ప్రాతి పదికము స్వార్థద్రవ్యలింగములను మాత్రమే బోధించును అనియు చెప్పుచున్నారు. దీనినిబట్టి ఈ ప్రకృతిప్రత్యయ విభాగము, అన్వయవ్యతిరేకములచే ప్రకృతి ప్రత్యయములకు విభిన్నార్థ కల్పనము, ఇది యంతయు శాస్త్రప్రక్రియకై కల్పితమైనదని కొందరి అభిప్రాయము. ఈ విధముగ ప్రకృతిప్రత్యయ విభాగము కేవలశాస్త్రకల్పిత మగుటచే ప్రకృతిప్రత్యయసము దాయమే సంఖ్యాదివిశిష్టార్థమును లేదా సంఖ్యాద్యుపలక్షితమగు అర్థమును బోధించును అను తృతీయ చతుర్థపక్షములు బయల్వెడలినవి.

ఈ రెండు శ్లోకముల సంపిండితార్థ మేమనగా- 'రామమ్' 'ఫలమ్' 'రాముని' 'ఫలమును' మొదలగు పదములలో 'రామ' 'ఫల' మొదలగు ప్రకృతిభాగములును, 'అమ్' 'ని' 'ను' మొదలగు ప్రత్యయభాగములును ఉన్నవి. ఈ ప్రత్యయభాగములు ఏకత్వాది సంఖ్యను, కర్మత్వ కరణత్వాదికమును బోధించుచున్నవి. కాని ఈ ప్రత్యయములు ప్రకృతి

యందు అంతకుపూర్వము లేని సంఖ్యాకర్మత్వాదులను బోధించుచున్నవా లేక ప్రకృత్యర్థ ములేర్పైన సంఖ్యాదులను బోధించుచున్నవా అనునది ప్రశ్న. ఈ రెండు పక్షములును ఉన్నవి. మొదటి పక్షమున ప్రకృతి బోధింపని సంఖ్యాదుల జ్ఞానము ప్రత్యయములచే కలుగుచున్నది గాన ప్రత్యయములు సంఖ్యాదిబోధకములు (వాచకములు) - అనగా అవి క్రొత్తగ సంఖ్యాదులను బోధించుచున్న వని చెప్పవలెను. ఇది వాచకత్వపక్షము. ప్రకృతి యందే సంఖ్యాదులు కూడ ఉన్నవి; వాటిని ప్రత్యయములు, చీకటిలో ఉన్న వస్తువులను దీపము స్పష్టీకరించినట్లు, స్పష్టీకరించుచున్నవి అనునది రెండవ పక్షము - ద్యోతకత్వ పక్షము. ప్రకృతి ప్రత్యయ విభాగము కేవల శాస్త్రకల్పితము గాన సముదాయమే (ప్రకృతి ప్రత్యయ సంఘాతమే) సంఖ్యాది విశిష్టము లేక సంఖ్యాద్యుపలక్షితము నగు అర్థమును బోధించును అని తృతీయ చతుర్థపక్షముల అభిప్రాయము.

విశిష్టత్వము, ఉపలక్షితత్వము :- కలిసి ఉన్న అన్ని వస్తువులకును తుల్యముగ క్రియాన్వయ మున్నచో అది విశిష్టత్వము. ఉదా: "లక్ష్మణునితోగూడిన రాముడు భుజించు చున్నాడు" అనునపుడు భోజనము చేయుట అనుక్రియతో రామ లక్ష్మణు లిరువురకును తుల్యముగ సంబంధమున్నది. కావున "లక్ష్మణునితో కూడిన రాముడు" అనగా "లక్ష్మణ విశిష్టుడగు రాముడు" అని యర్థము. ప్రకృతమున "సంఖ్యాది విశిష్టార్థము" అనగా "సంఖ్యాదులతో నిత్యసంబద్ధమగు అర్థము" అని ఫలితార్థము. "పీతవస్త్రముతో గూడిన రాముడు భుజించుచున్నాడు" అని చెప్పునపుడు పీతవస్త్రమునకు భోజనక్రియతో అన్వయము లేదు. కావున "పీతవస్త్రముతో గూడిన రాముడు" అనగా "పీతవస్త్రోపలక్షితుడగు రాముడు" అని యర్థము. ప్రకృతమున సంఖ్యాద్యుపలక్షితార్థ బోధన మనగా సంఖ్యాదులతో కాకగుణకంబలము వలె, అనిత్య సంబద్ధమగు అర్థమును బోధించుట యని యర్థము. విశిష్టత్వపక్షమున ప్రకృత్యర్థములకును సంఖ్యాదులకును ప్రాధాన్యము తుల్యము. ఉపలక్షి తత్వ పక్షమున సంఖ్యాదులకు అప్రాధాన్యము. కాకి కంఠమున గుర్తుకై కట్టిన రంగు గుడ్డ వంటివి ఈ సంఖ్యాదులు. గుడ్డ మారవచ్చును. గుడ్డ రంగు మారవచ్చును, కాకిమాత్రము అట్లే ఉండును. అట్లే సంఖ్యాదులు మారుచుండవచ్చును. ప్రాతిపదికార్థము మాత్రము అట్లే ఉండును. ఇదియే విశిష్టత్వోపలక్షితత్వ పక్షములలోని భేదము.

ఇది ప్రకృత్యర్థము, ఇది ప్రత్యయార్థము అని నిర్ణయించుట ఎట్లు ? అని ఆశంకించు కొని సమాధానము చెప్పుచున్నాడు.

> యే శబ్దా నిత్యసమ్బన్ధా వివేకే జ్ఞాతశక్తయః
> అన్వయవ్యతిరేకాభ్యాం తేషా మర్థో విభజ్యతే . 166

యే = ఏ, నిత్యసంబన్ధాః=స్వార్థముతో నిత్యసంబంధము గల, శబ్దాః=విభక్త్యన్త పదములు (వృక్షమ్ మొదలగునవి), వివేకే=ప్రకృతిప్రత్యయ విభాగము, ప్రకృత్యర్థ-ప్రత్యయార్థ విభాగము చేసినపుడు మాత్రమే, జ్ఞాతశక్తయః=స్వార్థమున జ్ఞాతమగు శక్తి కలవో, తేషాం=అట్టి శబ్దముల, అర్థః = అర్థము, అన్వయ వ్యతిరేకాభ్యాం=అన్వయ వ్యతిరేకములచే, విభజ్యతే=స్థాపింపబడుచున్నది.

తా. స్వార్థముతో నిత్యసంబంధముగల శబ్దముల శక్తి ప్రకృతి ప్రత్యయాది విభాగము చేసినపుడు మాత్రమే తెలియును. వాటి అర్థము అన్వయ వ్యతిరేకములచే విభజింపబడును.

వి. 'వృక్ష' అను ప్రాతిపదికమును మాత్రము ప్రయోగించగా ఏకత్వాదులు లేని కేవల వృక్షత్వరూపార్థము అవగతమగు చున్నది. 'అమ్' అను ప్రత్యయమును చేర్చి 'వృక్షమ్' అని ప్రయోగింపగా ఏకత్వకర్మత్వవిశిష్టవృక్షబోధ కలుగుచున్నది. ఈ విధముగ ఏది లేనపుడు ఏది బోధింపబడుటలేదో, ఏది యున్నపుడు ఏది బోధింపబడు చున్నదో అది దాని యర్థమని నిర్ణయించుటకు వీలగుచున్నది. ప్రకృతమున వృక్షత్వము 'వృక్ష' రూప ప్రకృత్యర్థ మనియు, సంఖ్యాకర్మత్వాదికము 'అమ్' రూప ప్రత్యయార్థ మనియు తెలిసికొనుటకు వీలగుచున్నది. ఈవిభాగము కాల్పనికమే కావచ్చును. బుద్ధికల్పితమగు వస్తుశూన్య వికల్పజ్ఞానమే కావచ్చును. ఐనను అర్థవిభాగమునకు ఇది సహాయకారిగనే కనబడుచున్నది.

'అది ఉన్నచో ఇదికూడ ఉండును' - "యత్సత్త్వే యత్సత్త్వమ్" - అని చెప్పినచో అన్వయము. "అది లేనిచో ఇదియు ఉండదు" - "యదభావే యదభావః" అని చెప్పినచో వ్యతిరేకము. "ధూమ మున్నచో అగ్ని ఉండి తీరును" అనునది అన్వయమునకుదాహరణము. "అగ్ని లేనిచో ధూమము ఉండఁజాలదు" అనునది వ్యతిరేకమునకు ఉదాహరణము. ఈ అన్వయవ్యతిరేకముల సహాయముచే దీని కిది కారణము అని నిర్ణయించుటకు వీలగును.

ప్రకృతి ప్రత్యయ సముదాయరూపమగు పదము వాస్తవమున అఖండమే యైనను, అన్వయవ్యతిరేకములచే ప్రకృతి ప్రత్యయార్థములు వేరువేరుగ వ్యవస్థాపితములగుచున్నవి అని వెనుక ప్రతిపాదించబడినది. కాని ఈ అన్వయవ్యతిరేకములు గూడ వ్యభిచారము లేనపుడు మాత్రమే ప్రకృతి ప్రత్యయార్థ విభాగమును కల్పింప సమర్థమగునని చెప్పుచున్నాడు.

యత్ర చావ్యభిచారేణ తయోః శక్యం ప్రకల్పనమ్
నియమ స్తత్ర న త్వేవం నియమో నుట్శబాదిషు . 167

యత్ర = ఎచట, అవ్యభిచారేణ = వ్యభిచారము లేకుండగా, తయోః = ఆ అన్వయ వ్యతిరేకముల, ప్రకల్పనమ్ = కల్పనము, శక్యం = శక్యమైనదో, తత్ర = అట్టి స్థలములయందు మాత్రమే, నియమః = ప్రకృతి ప్రత్యయార్థముల నియమము, తు = కాని నుట్శబాదిషు = నుడాగమము, శప్ మొదలగువాటి విషయమున, ఏవం = ఈ విధముగ, నియమః = నియమము, న = లేదు.

తా. వ్యభిచారము లేకుండగ ఎచట అన్వయవ్యతిరేకములను కల్పింపవీలగునో అచటనే నియమముగాని, 'నుట్' 'శప్' మొదలగువాటి విషయమున నియమము లేదు.

వి. ఈ అన్వయ వ్యతిరేకములు వ్యభిచారదోషము లేకుండ ఎచట ప్రవర్తించునో అట్టి స్థలములందు మాత్రము 'ఈ పదమునందలి ఈ భాగము ఈ అర్థమును బోధించును' అని నియమము ఏర్పరచుటకు వీలగును. ఉదాహరణమునకు : 'రామాణామ్' (రాములయొక్క) 'మరుతామ్' (దేవతలయొక్క) మొదలగు పదములలో 'ఆమ్' అను

భాగము సంఖ్యాసంబంధాదులను బోధించుచున్నది. అదిలేనిచో వాటి బోధ కలుగుటలేదు. కావున 'ఆమ్' సంఖ్యాసంబంధాది వాచకమని చెప్పవచ్చును. అట్లే 'అత్తి' (తినుచున్నాడు), 'పచతి' (వండుచున్నాడు) ఇత్యాద్యుదాహరణములందలి 'తి' అనునది కర్తృత్వైకత్వాదులను బోధించుచున్నదని అన్వయవ్యతిరేకముల సహాయముచే నిర్ణీత మగుచున్నది. కాని 'రామాణామ్' అను పదమున 'ఆమ్' కు 'నుట్' అను ఆగమము వచ్చినది. ("రామ+ఆమ్" అని యుండగా నుడాగమము- ఆకారము వెనుక నకారమువచ్చి, అది ణకారముగా మారి 'రామాణామ్' అను రూపము సిద్ధించినది). 'మరుతామ్' అనునపుడు నుడాగమము రాలేదు. ఆ నుడాగమము వచ్చిన 'రామాణామ్' అనునపుడు అర్థవిశేషమేదియో యుండి 'మరుతామ్' అనునపుడా యర్థవిశేషము లేకపోవుట యనునది లేదు. దీనిని బట్టి నుట్టుకు ప్రత్యేకముగ అర్థమేదియు లేదని స్పష్టమగుచున్నది. 'పచతి' అనునపుడు 'శప్' (అ) ప్రత్యయమున్నది, ('పచ్+తి' అని యుండగా 'శప్' వచ్చి 'పచ్+అ+తి' = 'పచతి' అను రూపము సిద్ధించినది), కాని 'అత్తి' అనునపుడు 'శప్' లేదు. కావున పైవలెనే శప్ కు అర్థమేదియు లేదని తేలినది. ఈ 'నుట్' 'శప్' లు కేవలము అర్థబోధనమున సహాయకారులుగ మాత్రమున్నవి. 'నుట్' తో గూడిన 'ఆమ్' సంఖ్యాసంబంధాదులను బోధించుననియు, 'శప్' తో గూడిన 'తి' కర్తృత్వాదిబోధక మనియు చెప్పినచో ఈ నియమమునకు 'మరుతామ్' 'అత్తి' ఇత్యాద్యుదాహరణములందు వ్యభిచారము గాన అట్లు చెప్పుటకు వీలులేదు. ఈ యుదాహరణములలో 'నుట్' 'శప్' లు లేని 'ఆమ్' 'తి' లు గూడ తత్తదర్థములను బోధించుచున్నవి కదా? కావున ఇట్టి వ్యభిచారదోషము లేనిపక్షముననే ఈ యన్వయ వ్యతిరేకములద్వారా ప్రకృతి ప్రత్యయార్థకల్పనము చేయవలెను.

'వ్యభిచారము' అనునది న్యాయశాస్త్రమునం దుపయోగించెడు ఒక పారిభాషిక పదము. "ఎక్కడెక్కడ ధూమముండునో అక్కడక్కడ అగ్ని ఉండును" అని చెప్పినచో దీనికి వ్యాప్తి యని పేరు. ఇది అన్వయవ్యాప్తి. "ఎక్కడ అగ్ని ఉండదో అక్కడధూమము కూడ ఉండదు" అనునది కూడ వ్యాప్తియే. ఇది వ్యతిరేకవ్యాప్తి, మొదటి అన్వయవ్యాప్తిని తారుమారుచేసి "ఎక్కడెక్కడ అగ్ని ఉండునో అక్కడ ధూమముండును" అని చెప్పినచో అది నిర్దుష్టమైన వ్యాప్తి కాజాలదు. ఎఱ్ఱగా కాల్చిన అయోగోళముపై అగ్నిఉన్నను ధూమము లేదుకదా? ఈ విధముగా వ్యాప్తికాని, లేదా ఒక నియమముకాని ప్రవర్తింపకూడని, అనగా సాధ్యములేని కొన్ని లక్ష్యములలో ప్రవర్తించుటకు వ్యభిచారమని పేరు. ఇట్టి వ్యభిచారదోషము పట్టిన వ్యాప్తి వాస్తవమున వ్యాప్తి కాజాలదు. అట్లే "ఎక్కడ ధూమముండదో అక్కడ అగ్ని ఉండదు"అని చెప్పినచో ఈ వ్యతిరేకవ్యాప్తికి గూడ తప్తాయోగోళముననందే వ్యభిచారము. కావున ఈ వ్యతిరేకవ్యాప్తిగూడ దుష్టమైనది. ఈ విధముగనే, 'ఈ పదభాగమున కిది యర్థము' అని నిర్ణయించుటకు ఉపయోగించు అన్వయ వ్యతిరేకములు వ్యభిచారదోషదుష్టములు కారాదని ఈ కారిక తాత్పర్యము.

కొన్ని స్థలములలో ప్రకృతి ప్రత్యయములు వేరువేరు అర్థములను బోధించునట్లు స్పష్టముగ గోచరించును. అట్టి స్థలములలో ప్రకృతి ప్రత్యయములు ఆయాయర్థములను బోధించును అని అంగీకరింపవలెను. అంతియే కాని వాటిలో ఒకటి వాచకమనియు, రెండవది ఉపలక్షకమనియు చెప్పరాదు అని చెప్పుచున్నాడు.

సమ్భవే వాఖిధానస్య లక్షణం తు న కల్ప్యతే
ఆపేక్షికో హి సంసర్గే నియతాః శబ్దశక్తయః . 168

వా = కాని, అభిధానస్య = (ప్రకృతి ప్రత్యయములు రెండును) భిన్నార్థములను బోధించుటకు, సంభవే = వీలు ఉన్నపుడు, లక్షణంతు = ఉపలక్షకత్వము (ద్యోతకత్వము), న కల్ప్యతే = కల్పింపబడదు.

తా. ప్రకృతి ప్రత్యయములు రెండును భిన్నార్థములను బోధించుటకు అవకాశ మున్నపుడు అవి ద్యోతకములని కల్పించుట యుక్తముకాదు అని పూర్వార్ధతాత్పర్యము.

వి. 'కిమ్' శబ్దమును నపుంసకలింగ ప్రథమైక వచనమున 'కిమ్' అని ప్రత్యయరహితముగ ప్రయోగించుచున్నాము. అట్లే 'ఇదమ్' శబ్దమునకు 'వతుప్' ప్రత్యయము చేర్చగా ప్రకృతిభాగమంతయు లోపించి 'ఇయాన్' 'ఇయతీ' 'ఇయత్' ఇత్యాది విధముల ప్రత్యయము మాత్రమే ప్రయోగమునకు మిగిలినది. ఇట్టి స్థలములలో ప్రకృతి ప్రత్యయములే తత్తదర్థవాచకము లని అంగీకరింపవలెను. పదము ప్రకృత్యర్థమును మాత్రమే బోధించి ప్రత్యయార్థమును ఉపలక్షించుచున్నదని గాని, తద్విపరీతముగ గాని చెప్పరాదు.

కిమ్‌శబ్ది నపుంసక ప్రథమైకవచనమున 'కిమ్ + సు' అని యుండగా 'స్వమోర్నపుంసకాత్' (7-1-23) అను సూత్రముచే విభక్తిప్రత్యయము పూర్తిగ లోపించి 'కిమ్' అను ప్రకృతి మాత్రమే శేషించినది. 'ఇదమ్' శబ్దమునకు పరముగ "కిమిదంభ్యాం వో ఘః" (5-2-50) అను సూత్రముచే 'వతుప్' ప్రత్యయము, దాని వకారమునకు ఘకారమును వచ్చును. ఘకారమునకు 'ఆయనేయీ' (7-1-2) ఇత్యాదిసూత్రముచే 'ఇయ్' ఆదేశము. 'ఇదమ్ + ఇయత్' అని యుండగా "ఇదమ్ కిమో రీశ్కీ" (6-3-90) అను సూత్రముచే 'ఇదమ్'కు 'ఈ' ఆదేశము. 'ఈ + ఇయత్' అని యుండగా 'యస్యేతిచ' (6-4-148) అను సూత్రముచే 'ఈ' లోపించినది. ఈ విధముగ ప్రకృతిభాగమంతయు లోపించి, ప్రత్యయ భాగమైన 'ఇయత్' మాత్రము శేషింప లింగత్రయమున 'ఇయాన్' 'ఇయతీ' 'ఇయత్' ఇత్యాదిరూపములు సిద్ధించును. ఈ విధముగ ప్రకృతియంతయు లోపించి ప్రత్యయము మాత్రము మిగిలిన 'ఇయత్' ఇత్యాద్యుదాహరణములను, అద్వైత జ్ఞానమును దృష్టిలో నుంచుకొని రచించిన శ్లోకమొకటి పండితలోకప్రసిద్ధము.

"ఉదితవతి పరస్మిన్ ప్రత్యయే శాస్త్రయోనౌ
గతవతి విలయం చ ప్రాకృతేఽపి ప్రపఞ్చే
సపది పరముదీతం కేవలః ప్రత్యయో యత్
తదిదమితి మిమీతే కోఽధునా పండితోఽపి?"

శబ్దశాస్త్రవిహితమగు (వతుప్)ప్రత్యయము పరముగ ఆవిర్భవించిన దగుచుండగా, ప్రకృతి సంబంధమగు ప్రపంచము కూడ విలయమును పొందినదగుచుండగా, అపుడు కేవల ప్రత్యయరూపమగు ఏ పదము ఆవిర్భవించినదో దానిని ఇది అని (ఇయత్ అని) పండితుడైనను ఇపుడు ఎవడు ఊహింపగలడు ? ఇది వ్యాకరణశాస్త్రమునకు సంబంధించిన అర్థము. ఈ శ్లోకమున ఆ శబ్దమిది యనెడు ప్రశ్నయు, అది 'ఇయత్'అను పదము అనెడు ప్రత్యుత్తరముకూడ ఉన్నది. 'అధునా' అనునదికూడ ప్రత్యుత్తరము. 'ఇదమ్' శబ్దమునకు 'అధునా' (5-3-17)

అను సూత్రముచే 'అధునా' ప్రత్యయము. 'ఇదమ్+అధునా' అని యుండగా 'ఇదమ ఇశ్' (5.3.3) అను సూత్రముచే 'ఇదమ్'కు 'ఇశ్' అను నాదేశము. దానికి 'యస్యేతిచ' (6.4.148) అను సూత్రముచే లోపము. ఇక 'అధునా' అను ప్రత్యయభాగము మాత్రము మిగిలినది. ఈ విధముగ 'ఇయత్' 'అధునా' అనునవి ప్రత్యుత్తరము.

*అద్వైతజ్ఞానపరమగు అర్థము*: ఉపనిషజ్జన్య మగు అత్యుత్తమమైన అద్వైతజ్ఞానము జనించిన పిమ్మట ప్రకృతి విలాసరూపమగు ఈ జగము లీనము కాగా, కేవలము జ్ఞానరూపమగు - చిద్రూపమగు - ఏస్థితి లభించినదో దానిని ఈవిధముగ నుండునని ఎంతటి పండితుడైనను ఎవడు నిర్ణయింపగలడు?

ఈ విధముగ పూర్వార్ధమున ప్రకృతి ప్రత్యయములు రెండును వేరు వేరు అర్థములను బోధించునపుడు అట్టి స్థలములలో అవిధముగనే అంగీకరింపవలెనని చెప్పియున్నాడు. ప్రకృతి ప్రత్యయము ఎట్లు స్వతంత్రార్థబోధన సమర్థములైన పక్షమున ఆ రెండును స్వస్వార్థములను బోధించు సందర్భములలో పరస్పరాపేక్షములుగ నుండుటకు కారణమేమి? పరస్పరాపేక్ష లేకుండ ఘటపటాది శబ్దములవలె అర్థబోధ చేయవచ్చును గదా యని యాశంకించుకొని 'ఆపేక్షికోహి' ఇత్యాద్యుత్తరార్ధమున సమాధానము చెప్పుచున్నాడు.

హి = ఎందుచేతననగా, శబ్దశక్తయః = ప్రకృతి ప్రత్యయరూపములగు శబ్దముల శక్తులు, సంసర్గే = ప్రకృత్యర్థ ప్రత్యయార్థముల కలయికచే కలిగిన బోధయందు, ఆపేక్షిక్యః = పరస్పరాపేక్ష కలవైనను, నియతాః = తాము బోధించవలసిన (అన్వయ వ్యతిరేకములచే నిర్ణీతము లగు) అర్థముల విషయమునందు నియతముగనే యుండును.

తా. శబ్దశక్తులు సంసర్గజన్య బోధవిషయమున పరస్పరాపేక్ష కలవే యైనను తమ తమ అర్థములను మాత్రము నియతముగనే బోధించును.

వి. వెనుక చూపిన విధముగ ప్రకృతిప్రత్యయములు వేరు వేరు అర్థములను బోధించుచుండగా వానిలో ఒకటి వాచకమనియు, రెండవది ద్యోతకమనియు చెప్పుట తగదు. ఇది వాచకము, ఇది ద్యోతకము అని చెప్పుటకు వినిగమనము (నిర్ణాయక ప్రమాణము) ఏదియు లేదు కదా? ద్యోతకత్వమును అంగీకరించు పక్షమున ప్రతి ఒక్కటియు ప్రతి యొక్క అర్థమునకును ద్యోతకమని చెప్పవచ్చును గదా? అందుచే - ఏశబ్దమును ప్రయోగింపగా ఏ యర్థము బోధ కలుగుచున్నదో అది దాని కర్థమని నిర్ణయించుట యుక్తము. సాధారణముగ ప్రకృతి లేని ప్రత్యయమును గాని, ప్రత్యయము లేని ప్రకృతినిగాని ప్రయోగించుట కానరాకపోవచ్చును. తావన్మాత్రముచే ప్రకృతి ప్రత్యయములకు అవినాభావ సంబంధ మని మాత్రమే చెప్పగలము గాని, అన్వయవ్యతిరేకముల సహాయముచే వాటికి నిర్ణీతమైన స్వస్వార్థాభిధాన శక్తి లేదని కూడ చెప్పజాలము.

కొన్ని చోట్ల అన్వయ వ్యతిరేకములు చూపినను వాటికి వ్యభిచార ముండవచ్చును, అట్టి స్థలములలో పదముల అవయవములను విభజించి వాటికి వేరు వేరు అర్థములను నిర్ణయించుటకు ప్రయత్నింపరాదు. ఉదాహరణమునకు—'కూప' 'యూప' 'సూప' అను పదముల లోని 'ఊప' అనుదానిని విడదీసి దానికి ప్రత్యేకముగ ఒక అర్థమును, కకారాదులకు ఒక అర్థమును నిర్ణయించుటకు వలనుపడదు. ఇచట నున్న కకారాదుల కేదైన ఒక అర్థమున్నదని

నిర్ణయించినచో, అది 'కలశ' మొదలగు పదములలోని కకారమున గోచరించకపోవుటచే వ్యభిచారదోషము పట్టినది. కావున 'కూప' 'యూప' మొదలగు సముదాయములే అర్థవిశేష మును బోధించుననని చెప్పవలెను గాని వాటిని విభజింపరాదని చెప్పుచున్నాడు.

న కూప సూప యూపానా మన్వయోఽర్థస్య దృశ్యతే
అతోఽర్థాన్తరవాచిత్వం సఙ్ఘాతస్యైవ కల్ప్యతే . 169

కూప సూప యూపానాం='కూప' 'సూప' 'యూప' శబ్దముల, అర్థస్య=అర్థము యొక్క, అన్వయః = సంబంధము, న దృశ్యతే = కకారాది వర్ణములయందు కనబడుట లేదు. (కలశాది పదములలోని కకారాదులందు వ్యభిచారము కదా ?) అతః=అట్టి అన్వయ వ్యభి చారము వలన, సంఘాతస్యైవ='కూప' 'సూప' మొదలగు సంఘాతమునకే, అర్థాన్తర వాచిత్వం=మరియొక అర్థమును బోధించు శక్తి (కూప శబ్దమునకు సూపశబ్దార్థముకంటె భిన్నమగు అర్థమును బోధించు శక్తి, సూపశబ్దమునకు కూపాది శబ్దార్థములకంటె భిన్న మగు అర్థమును బోధించు శక్తి), గమ్యతే=ఊహింపబడుచున్నది.

తా. కూప-సూప-యూప శబ్దముల అర్థముయొక్క సంబంధము కకారాదు లలో కనబడుట లేదు. అందుచే మొత్తము పదమే అర్థవిశేషమును బోధించు నని అంగీక రింపవలెను.

వి. కూపశబ్దమునుండి కకారమును తొలగింపగా మిగిలిన 'ఊప' శబ్దము ఏ యర్థమును బోధించుట లేదు. అట్లే 'ఊప' శబ్దమును తీసివేయగా కకారము ఏయర్థమును బోధించుట లేదు. కావున వాటిని ఇట్లు విభజింపరాదు. 'కూప' అను సముదాయమే 'నుయ్యి' అను నర్థమును బోధించునని అంగీకరింపవలెను. సూపాదిశబ్దముల విషయమునగూడ నిట్లే.

పదమునందలి భాగములను విభజించి, అన్వయ వ్యతిరేకముల సహాయముచే వాటి యర్థమును నిర్ణయించునపుడు ఈ ప్రకృతి ప్రత్యయాన్వాఖ్యానమునకు తగు నిమిత్తమేదియో ఒకటి ఉండవలెనని చెప్పుచున్నాడు.

అన్వాఖ్యానాని భిద్యన్తే శబ్దవ్యుత్పత్తికర్మసు
బహూనాం సమ్భవేఽర్థానాం నిమిత్తం కిఞ్చి దిష్యతే . 170

శబ్దవ్యుత్పత్తికర్మసు=శబ్దములకు వ్యుత్పత్తిని తెలుపునపుడు, అన్వాఖ్యానాని = ప్రకృతి ప్రత్యయ విభాగమును, వాటి యర్థభేదములను కల్పించెడు అనుశాసనములు, భిద్యన్తే=(ఆయా వ్యాకరణ రచయితల బుద్ధిభేదము ననుసరించి) వేరువేరుగ ఉన్నవి. బహూనాం = అనేకములగు, అర్థానాం=అర్థములకు, సమ్భవే=అవకాశమున్నపుడు, కించిత్ =ఏదియో ఒక, నిమిత్తమ్ = నిమిత్తము, ఇష్యతే=అంగీకరింపబడును.

తా. శబ్దముల వ్యుత్పత్తిని చూపు విషయమున శబ్దానుశాసనములు వేరువేరుగ నున్నవి. అనేక అర్థములకు అవకాశ మున్నపుడు (నిర్వచనమునకై) ఏదియో యొకదానిని నిమిత్తముగ అంగీకరింతురు.

వి. వైయాకరణులు తమతమ బుద్ధిభేదము ననుసరించి ఒక పదమునకు వేరు వేరు వ్యుత్పత్తులు చెప్పుచుందురు. ఆ పదమునకు వారు చెప్పిన వ్యుత్పత్తులే కాక మరికొన్ని వ్యుత్పత్తులు కూడ చెప్పుటకు అవకాశ ముండవచ్చును. ఉదాహరణమునకు 'తణ్డుల' శబ్ద

వ్యుత్పత్తి చెప్పుచు "వృఞ్-లుతి-తని-తాడిభ్య ఉలచ్ తణ్డశ్చ" అను ఉణాదిసూత్రము 'వృఞ్ వరణే' 'లుత విలోడనే' 'తనువిస్తారే' 'తడ ఆఘాతే' అను ధాతువులకంటె 'ఉలచ్' ప్రత్యయమును, ధాతువునకు 'తణ్డ్' అను ఆదేశమును విధించినది. దీనిసిపట్టి "'వ్రియన్తే' 'లుత్య న్తే' 'తన్య న్తే' 'తాడ్య న్తే' ఇతివా తణ్డులాః" అనగా ఎల్లరిచేతను కోరబడునవి, లేదా అవలోడనము చేయబడునవి, లేదా విస్తరింపచేయబడునవి, లేదా దంచబడునవి కావున తండులములు అని వ్యుత్పత్తి చెప్పినట్లైనది. ఈ విధముగ ఒకధాతువు స్థానమున తణ్డ్ ఆదేశము విధించు పక్షమున, మూలధాతువు పూర్తిగ లోపించి 'తండ్' అనునది మాత్రమే మిగులును గాన 'వృఞ్' మొదలగు నాలుగు ధాతువులనే కాక మరియే 'ఖుజ్' ధాతువునో గూడ మూలధాతువుగ గ్రహింపవచ్చును. కావున ఇట్టి వ్యుత్పత్తులన్నియు పురుషబుద్ధిభేద కృతములు గాన వ్యవస్థితములు కావు. 'బియ్యము' అను నర్థముమాత్రము నియతము. ఈ విధముగ అనేకములగు అర్థములు సంభావ్యములగునపుడు శాస్త్రకారులు ఏవియో ఒకటిరెండు నిమిత్తములను పురస్కరించుకొని వ్యుత్పత్తి చెప్పుచుందురు. ఇట్లు వ్యుత్పత్తి చెప్పుటకు నియతమైనను అనియతమైనను ఏదియో యొక నిమిత్తము మాత్రము ఉండితీరును.

శబ్దముల సాధుత్వాన్వాఖ్యానమునకు నిమిత్తమేదియేని ఉన్న చాలును, అది నియతముగ నుండవలసిన పనిలేదు—అను విషయమునే వివరించి చెప్పుచున్నాడు.

> వైర వాసిష్ఠ గిరిశా స్తథైకాగారికాదయః
> కైశ్చిత్ కథఞ్చి దాఖ్యాతా నిమిత్తావధిసఙ్కరైః . 171

వైరవాసిష్ఠగిరిశాః = వైర, వాసిష్ఠ, గిరిశ శబ్దములు, తథా = మరియు, ఐకాగారికాదయః = ఐకాగారిక మొదలగు శబ్దములును, కైశ్చిత్ = కొందరు శాస్త్రకారులచేత, నిమిత్తావధిసఙ్కరైః = నిమిత్తములగు అర్థములయొక్కయు, అన్వాఖ్యానమునకు అవధి భూతములగు ప్రకృతిప్రత్యయముల యొక్కయు, సంకరములచేత (భిన్నమైనవి ఏకస్థానమున సమావేశమగుట సంకరము), కథఞ్చిత్ = ఎటులనో, ఆఖ్యాతాః = సాధువులుగ ప్రతిపాదింపబడినవి.

తా. 'వైర' 'వాసిష్ఠ' 'గిరిశ' శబ్దములను, 'ఐకాగారిక' మొదలగు శబ్దములను కొందరు, అర్థములయొక్కయు ప్రకృతి ప్రత్యయములయొక్కయు సంకరములచే, ఏదియో విధముగ సాధువులనుగ ప్రతిపాదించినారు.

వి. 'వైర' 'వాసిష్ఠ' మొదలగు పదములకు వైయాకరణులు వేరు వేరు వ్యుత్పత్తులను చూపియున్నారు. 'వైరం' అనుదానికి వీరునికర్మ (వీరస్యకర్మ) అనిగాని, వీరునకు లేక వీరవనితకు సంబంధించినది (వీరస్య వీరాయా వా ఇదమ్) అనిగాని, వీరులలో ఉన్నది (వీరేషు భవమ్) అనిగాని అర్థము చెప్పవచ్చును. అట్లే వాసిష్ఠశబ్దమునకు 'వసిష్ఠునిచే చూడబడినది' లేక 'వసిష్ఠునిచే చెప్పబడినది', లేదా 'వసిష్ఠ శబ్దముకలది' అని అర్థమును చెప్పవచ్చును(వసిష్ఠేన దృష్టం వా, ప్రోక్తం వా, వసిష్ఠశబ్దోఽస్మిన్ వర్తతే ఇతి వా వాసిష్ఠమ్). 'గిరిశః' అనుదానికి 'గిరియందు శయనించువాడు' (గిరౌ శేతే) అనిగాని, గిరిని ఖండించువాడు (గిరిం శ్యతి) అనిగాని, 'గిరియందు శిరస్సుకలవాడు' (గిరౌ శిరః యస్య సః) అనిగాని చెప్పవచ్చును. 'ఐకాగారికః' అను దానికి ఒక గృహమును మాత్రము సహించువాడు (ఏకా

గారం సోధా) అనిగాని, విడిగా ఒక్కటిగా ఉన్న ఇంటివలన లాభము పొందు చోరుడు (ఏకం అసహాయం అగారం ప్రయోజనం యస్య) అనిగాని చెప్పవచ్చును. ఈ విధముగ పై ఉదాహరణములలో అర్థమునకు అనియమము గోచరించుచున్నది.

'తప్పర్వమరుద్భ్యామ్' అను వార్తికముచే 'పర్వ' 'మరుత్' శబ్దములకంటె 'తప్' ప్రత్యయమును విధించుటచే 'పర్వతః' 'మరుత్తః' అనురూపములు సిద్ధించినవి. కాని మరుత్ శబ్దమునకు "మరుచ్ఛబ్దస్యోపసంఖ్యానమ్" అను వార్తికముచే ఉపసర్గసంజ్ఞ నంగీకరించి, "మరుతా దత్తః" అను నర్థమున "మరుత్ + దా + త" (క్త ప్రత్యయము) అని యుండగా ఈ దాధాతువు ఆకారమునకు "అచ ఉపసర్గాత్తః" అను సూత్రముచే తకారమును చేసి "మరుత్తః" అను రూపమును సాధించవచ్చునని "దదాతివృత్తంవా" ఇత్యాది భాష్యవార్తికములు ప్రతిపాదించుచున్నవి. ఈ విధముగ "మరుత్తః" అను పదమున 'తప్పర్వమరుద్భ్యామ్' అను వార్తికము ననుసరించి "త" అనునది ప్రత్యయమనియు, "మరుత్" అనునది ప్రకృతి యనియు, పైనచూపిన విధమున తత్వము నంగీకరించిన పక్షమున ఈ తకారము "దా" ధాతు "క్త" ప్రత్యయములకు చెందినదనియు రెండు విధముల చెప్ప వీలగుచున్నది. ఇట్లు నిమిత్తభూతము లగుచుండుటచే నియతములగు నిమిత్తములేవియు లేకుండ వైయాకరణులు అన్వాఖ్యానములు చెప్పచుందురని యభిప్రాయము.

వ్యుత్పత్తి చెప్పునపుడు ఏదైన నియతమగు నిమిత్తమునే ఏల గ్రహింపరాదు అని శంకించుకొని, ప్రకృతి ప్రత్యయాపోద్ధారరూపములగు నిమిత్తములు అనియతములు గాన వ్యుత్పత్తి నిమిత్తములుగూడ అనియతములుగనే ఉండునని చెప్పుచున్నాడు.

యథా పథః సమాఖ్యానం వృక్షవల్మీకపర్వతైః
అవిరుద్ధం గవాదీనాం భిన్నైశ్చ సహచారిభిః . 172

వృక్షవల్మీకపర్వతైః = వృక్షములచేతను, వల్మీకములచేతను, పర్వతములచేతను, పథః = మార్గముయొక్క, అన్వాఖ్యానం = బోధనము, యథా = ఎట్లో, (తథా = అట్లే), భిన్నైః = వేరువేరైన, సహకారిభిః స్వార్థసంబద్ధములగు గుణక్రియాకారాదులచే, గవాదీనాం = "గో" మొదలైనవాటి యొక్క (నిర్వచనము), అవిరుద్ధమ్ = విరుద్ధము కాదు.

తా. చెట్లులు, పుట్టలు, గుట్టలు మొదలగువాటి గుర్తుచే దారి చూపించునట్లు, వేరు వేరు గుణక్రియాదుల సహాయముచే గోశబ్దాదుల వ్యుత్పత్తిని చూపుట అవిరుద్ధము.

వి. ఎవరికైన ఏదైన మార్గమును తెలుపవలసి వచ్చినపుడు ఆ మార్గమునకు దగ్గరనున్న చెట్టును గాని, పుట్టను గాని, గుట్టనుకాని గుర్తుగా చూపవచ్చును. అవియన్నియు ఆ మార్గమునకు సంబంధించినవే కావున వీటిలో దేనిని చెప్పినను తప్పులేదు. మార్గమును తెలియజెప్పుట ప్రధానము గాని వృక్షాదిచిహ్నములు ప్రధానములు కావు. అట్లే 'గో' మొదలగు శబ్దముల వ్యుత్పత్తిని చెప్పవలసి వచ్చినపుడు గోశబ్దార్థమగు ఆవుకు సంబంధించిన జాతి క్రియా గుణ అవయవాది నిరూపణమును ఇచ్ఛానుసారముగ చేయవచ్చును.

ఒక అర్థమునకు వివిధములగు అవస్థాభేదము లుండవచ్చును. వ్యుత్పత్తి చెప్పువాడు తన దృష్టికి గోచరించిన అవస్థాభేదము ననుసరించి వ్యుత్పత్తి చెప్పుచుండునని వివరించుచున్నాడు.

అన్యథా చ సమాఖ్యాన మవస్థాభేదదర్శిభిః
క్రియతే కింశుకాదీనా మేకదేశావధారణాత్ . 173

అవస్థాభేదదర్శిభిః = ఒక పదార్థమునకు గల వేరు వేరు అవస్థలను పరికించిన వ్యుత్పత్తికారులచేత, అనగా - తాము చూచిన అవస్థాభేదము ననుసరించి వేరు వేరుగా, సమాఖ్యానం = పదసాధుత్వ నిర్వచనము, క్రియతే = చేయబడుచున్నది, ఏకదేశావధారణాత్ = వాక్యములోని ఒక భాగమును విడదీసి, కింశుకాదీనాం = 'కింశుక' మొదలగు శబ్దముల (నిర్వచనము చూపబడుచున్నది).

తా. పదార్థముల వేరు వేరు అవస్థలను చూచినవారు వేరు వేరు నిర్వచనములు చేయుచుందురు. వాక్యమునందలి ఒక విభాగమును విడదీసి కింశుకాది శబ్దముల వ్యుత్పత్తిని చూపించుచున్నారు.

వి. అన్వాఖ్యానము చేయువారు ఒకపదార్థమునందలి, తమదృష్టికి గోచరించిన ఒక అవస్థాభేదమును పురస్కరించుకొని పదనిర్వచనము చేయుచుందురు. ఉదాహరణముకు : కింశుక శబ్దమునకు 'మోదుగ చెట్టు' అని యర్థము. దానికా యర్థమువచ్చుటకు కారణ మేమనగా- ఫలములు లేని మోదుగచెట్టుపై చిలుకలు వాలకుండుటచూచి "కింశుకేన ఫలాశే" (పలాశవృక్షముపై శుకమెందులకుండును?) అని గాని 'కింశుకో న పలాశే?' (పలాశముపై శుక మేల లేదు?)అని గాని ఒకడు ప్రశ్నింపగా, ఆతడు ప్రయోగించిన పై వాక్యములోని కింశుక పదమును వేరుగ దీసి దీనినే పలాశరూపార్థ ప్రయోగకారణమగు వ్యుత్పత్తినిగా ఒకరు చూపవచ్చును. ఈ విధముగ ఒక వస్తువునకు ఎన్నియో అవస్థాభేదములుండ తమ దృష్టికి గోచరించిన విశేషమును బట్టి వైయాకరణులు వ్యుత్పత్తి చెప్పుచుందురు. కొంతకాలమునకు ఈ వ్యుత్పత్తి కేవలము ఉపలక్షణము మాత్రమై నిలుచును. కావుననే "కింశుకే శుకః శేతే" (కింశుక వృక్షముపై శుకము నిద్రించుచున్నది) అను వాక్యమున కింశుక పదవ్యుత్పత్తి మరుగుపడి ఆ పదము పలాశత్వమాత్రవాచక మగుచున్నది.

ఈ విషయమునే ఇంకను స్పష్టీకరించుచున్నాడు.

కైశ్చి న్నిర్వచనం భిన్నం గిరతే ర్గర్జతే ర్గమేః
గవతే ర్గదతే ర్వాపి గౌరిత్యత్రానుదర్శితమ్ . 174

కైశ్చిత్=కొందరు వైయాకరణులచేత, గౌరిత్యత్ర='గౌః' అను శబ్దమున, గిరతేః = 'గౄ' నిగిరణే (మ్రింగుట) అను ధాతువునుండి, గర్జతేః = 'గర్జ శబ్దే' (గర్జించుట) అను ధాతువునుండి, గమేః=' గమ్లృగతౌ'(నడచుట) అను ధాతువునుండి, గవతేః = 'గుఙ్ అవ్యక్తే శబ్దే' (అస్పష్టధ్వని చేయుట) అను ధాతువునుండి, వాపి=లేక, గదతేః = 'గద వ్యక్తాయాం వాచి' (స్పష్టముగ పలుకుట) అను ధాతువునుండి, భిన్నం=వేరైన, నిర్వచనమ్ = నిర్వచనము, అనుదర్శితమ్ = చూపబడినది.

తా. కొందరు, 'గో' శబ్దము గౄధాతువునుండి గాని, గర్జధాతువునుండి గాని, గమ్లృధాతువునుండి గాని, గుఙ్ధాతువునుండి గాని, గద ధాతువునుండి గాని నిష్పన్నమైనదని చూపియున్నారు.

వి. గోరూపార్థమునకు వివిధములగు అవస్థలుండుటచే వాటిలో ఒకదాని ననుస రించి, ధాతువులోనున్న వర్ణములతో సామ్యమునుకూడ పురస్కరించుకొని, గో మొదలగు శబ్దములకు అనేకులు అనేకవిధములగు వ్యుత్పత్తులు చెప్పుచున్నారని యభిప్రాయము.

ఇంతవరకును, ఏదైన ఒక పదమునకు నిర్వచనము చెప్పునపుడు దాని ప్రకృతిః వాచ్యమగు అర్థమునే నిమిత్తముగ తీసికొనవలెను అని ప్రతిపాదించి, ఇందులకుదాహరణముగ 'గో' శబ్దమును చూపి, దాని వివిధ ప్రకృత్యర్థములు ఏవిధముగ వివిధ వ్యుత్పత్తులకు దారి తీసినవో చూపియున్నాడు. ఇపుడు, శబ్దముల స్వరూపమే వాటి ప్రవృత్తి నిమిత్తమనియు (అవి ఏదైన అర్థమును బోధించుటకు నిమిత్తమనియు), అదియే వ్యుత్పత్తి ప్రదర్శనమునకై (అన్వాఖ్యానమునకై) గ్రహింపబడువనియు చెప్పుచున్నాడు.

గౌరిత్యేవ స్వరూపా ద్వా గోశబ్దో గోషు వర్తతే
వ్యుత్పాద్యతే నవా సర్వం కైశ్చిచ్చో భయ థేష్యతే . 175

గోశబ్దః = గోశబ్దము, గౌరిత్యేవ = అది గో శబ్దము అనెడు కారణముచేత మాత్రమే (అనగా గో శబ్దస్వరూపమును మాత్రమే ప్రవృత్తి నిమిత్తముగ తీసికొని), గోషు = గోవులు అను అర్థమునందు, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది, (గోరూపార్థమును బోధించు చున్నది. కావున) సర్వమ్ = ఏ ఒక్క పదముకూడ, న వ్యుత్పాద్యతే = వ్యుత్పత్తికలదిగా చూపబడదు, కైశ్చిత్ = కొందరు వైయాకరణుల చేత, ఉభయథా = రెండు విధములుగా కూడ ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

తా. గోశబ్దము గోశబ్దము కావున గోవు అను అర్థమును బోధించుచున్నది. కావున ఏ పదమునకునుగూడ వ్యుత్పత్తి చూపవలసిన పని లేదు. కొందరు రెండు విధములుగ కూడ అంగీకరింతురు.

వి. ఔక్థిక్యుడు మొదలగు కొందరు ప్రాచీనాచార్యులు గోశబ్దము గోవు అను నర్థమును ఎట్లు బోధించుచున్నది అని ఆశంకించుకొని అది గోశబ్దము గాన గోవు అను నర్థ మునను బోధించుచున్నది అని సమాధానము చెప్పియున్నారు. అనగా గోశబ్దము సహజముగ గోరూపార్థమును బోధించును. దీనికి నిమిత్తాంతర విచారము అనావశ్యకము. ఇది గోశబ్ద మగుటయే (గోశబ్ద స్వరూపమే) అందులకు నిమిత్తము అని వారి అభిప్రాయము. ఈ విధ ముగ ఏ పదమైనను ఒక యర్థమును బోధించుచున్నదనిన అందులకా పదస్వరూపమే నిమిత్తము. ఈ పదము ఈ విధముగ నిష్పన్నమైనది గాన ఈ యర్థమును బోధించు చున్నది అని వ్యుత్పత్తి చెప్పుటకై ప్రయత్నించుట అనావశ్యకము. దీనిని అవ్యుత్పత్తి పక్ష మందురు. మరికొందరు - ఒక పదము ఒక అర్థమును బోధించుచున్నదనగా అందులకు ఆ శబ్దస్వరూపము, దాని వాచ్యము, రెండును నిమిత్తములే. కావున శబ్దమునకు వ్యుత్పత్తి చూపుటకై ప్రయత్నించుటలో తప్పులేదు అని చెప్పుదురు. ఈ విధముగ పక్షద్వయము నందును గూడ అన్వాఖ్యానమునకు నిమిత్తమున్నది. మొదటి (అవ్యుత్పత్తి) పక్షమున శబ్ద స్వరూపమే నిమిత్తము; రెండవ పక్షమున శబ్దస్వరూపము, వాచ్యము అను రెండును నిమిత్తములు.

ఇపుడొక క్రొత్త విషయమును విచారించుచున్నాడు. ఒకే పదమును అనేక పర్యాయము లుచ్చరించినపుడు అది ప్రతి పర్యాయమునందును వేరు వేరు శబ్దమా లేక ఆ శబ్దము లన్నియు ఒక్కటియేనా? అవి యన్నియు వేరువేరు శబ్దము లన్నచో 'గరలం' 'గమనం' 'గజః' ఇత్యాదిస్థలములందలి గకారములన్నియు భిన్నవర్ణములైనట్లు ప్రతిఒక్క ఉచ్చారణము నందును 'గో' శబ్దముకూడ భిన్న మగుటచేతను, అట్టి గో శబ్దములు అనంత సంఖ్యాకములగుట చేతను వాటి అన్నిటికిని అన్వాఖ్యానము అశక్యముకదా అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

సామాన్యే నోపదేశశ్చ శాస్త్రే లఘ్వర్థ మాశ్రితః
జాత్యన్తరవదస్యాపి విశేషాః ప్రతిపాదకాః. 176

శాస్త్రేచ = శాస్త్రమునందైతే, లఘ్వర్థమ్ = ఒక్కొక్క ఉచ్చారణమునందు వేరువేరుగా కనబడుచున్న అనంతశబ్దములకు లఘువుగా అన్వాఖ్యానము చెప్పుటకొరకు, సామాన్యేన = అగ్నిశబ్దాదులలోనున్న అగ్నిశబ్దత్వాది సామాన్యమును (జాతిని) పురస్కరించుకొని, ఉపదేశః = అగ్న్యాది శబ్దోపదేశము, ఆశ్రితః = ఆశ్రయింపబడినది, విశేషాః = అగ్నిశబ్దము మొదలగు వ్యక్తివిశేషములు, జాత్యన్తరవత్ = ఘటత్వాదీతర జాతులకువలె, అస్యాపి = అగ్నిశబ్దత్వాది జాతికికూడ, ప్రతిపాదకాః = బోధకములు.

తా. శాస్త్రములందు లాఘవార్థమై జాతిని పురస్కరించుకొని ఉపదేశము చేయుచుందురు. అగ్నిశబ్దము మొదలగు విశేషములు ఇతరజాతులనువలె అగ్నిశబ్దత్వాది జాతులనుగూడ బోధించును.

వి. "అశ్వః శీఘ్రగామీ" ఇత్యాది వాక్యములందలి 'అశ్వః' శబ్దము ఏదియో ఒక్క అశ్వమును మాత్రమునే కాక అశ్వత్వజాతిని చెప్పును, కాని అశ్వత్వజాతికి శీఘ్రగామిత్వము కుదరదుగాన చివరకు "అశ్వత్వజాతి విశిష్టము శీఘ్రముగ నడచును" అనునర్థము పర్యవసన్న మగును. ఇట్లు చెప్పుటచే శీఘ్రగామిత్వ మనునది ఏదియో ఒక అశ్వముతోడనే కాక అశ్వత్వజాతిగల అన్ని అశ్వములతోడను సంబంధించును. అట్లే 'అగ్నే ర్ఢక్'(4-2-33)ఇత్యాది సూత్రములచే అగ్నిశబ్దముకంటె 'ఢక్' ప్రత్యయము విధింపబడినది. ఇచట 'అగ్ని' శబ్దము ఒక పర్యాయ ముచ్చరించిన ఏదేనొక అగ్నిశబ్దమును మాత్రమేకాక అగ్నిశబ్దత్వజాతి విశిష్టములగు అగ్నిశబ్దము లన్నింటిని బోధించును. ఈ విధముగ శాస్త్రకారులు ప్రత్యుచ్చారణము భిన్నములగు శబ్దములన్నింటిని చెప్పశక్యముకాదు గాన లాఘవార్థమై సామాన్యము (జాతి) ద్వారా శబ్దోపదేశము చేయుచుందురు. ఈ విధముగ ఒక అశ్వవ్యక్తి అశ్వత్వజాతికి సూచకమైన విధమున అగ్ని శబ్దము మొదలగు విశేషములు అనగా వ్యక్తివిశేషములు, అగ్ని శబ్దత్వాది జాతులను సూచించును.

ఇట్లే 'గో' శబ్దమునకు 'గచ్ఛతి ఇతి గౌః' అను నొక వ్యుత్పత్తి చెప్పుదురు. ఇచట 'గచ్ఛతి' అనునది ఏదియేనొక గమనవిశేషమును కాక గతిసామాన్యమునే బోధించుచున్నది. ఈ గతిసామాన్యము మహిష్యాదులలో కూడ ఉన్నదికదా యని శంకింపరాదు. ఇచట గతి సామాన్యమునే అంగీకరించినను, ఒకవిధమగు వైశిష్ట్యముతోగూడిన గమనమునే గ్రహింప వలెను. ఉదాహరణమునకు 'స్యన్దతే' 'స్రవతి' 'ప్లవతే' ఇత్యాదులలో గతిసామాన్యమున్నను

ఒక విశేషముగూడ నిగూఢముగ లేకపోలేదు. అందుచేతనే 'స్రవతి' 'స్యన్దతే' ఇత్యాదులు జలాది గమనార్థమునందే ప్రయుక్తము లగుచున్నవి. అట్లే గోవునకు సంబంధించిన గమన సామాన్యమునందు గూడ ఒక వైశిష్ట్యమును అంగీకరింప వచ్చును. కావున ప్రత్యుచ్చారణము పదములు భిన్నములైనను అభిన్నములైనను గూడ అన్వాఖ్యానమునకు విఘాత మేదియు ఉండదని కారిక పరమతాత్పర్యము.

వాస్తవమున 'అర్థభేదమును బట్టి శబ్దముకూడ భేదించును' అనున్యాయము ననుసరించి గతివిశేషరూపమగు అర్థాంతరమున ప్రయుక్తమగు గోశబ్దమునందలి 'గమ్' ధాతువు గమన సామాన్యమున ప్రయుక్తములగు 'గచ్ఛతి' ఇత్యాదులలోని 'గమ్' ధాతువుకంటె భిన్నమైనది. ఉదాహరణమునకు—కర్తరిప్రయోగమున 'తణ్డులం పచతి' (తండులమును వండుచున్నాడు) అని ప్రయోగింపగా కర్మకర్తరిప్రయోగమున 'పచ్యతే తండులేన' (బియ్యము ఉడుకుచున్నవి) అని ప్రయోగింపఁడుచున్నది. ఇచట రెండు వాక్యములందును ఉన్నది పచ్ ధాతువేయైనను అర్థభేదముచే ఆ రెండును వేరు వేరని చెప్పుచున్నారు కదా ? పై ఉదాహరణములలోని 'గమ్'ధాతువు విషయమునందును అట్లే అని చెప్పుచున్నాడు.

అర్థాన్తరే చ యద్వృత్తం తత్ప్రకృత్యన్తరం విదుః
తుల్యరూపం న తద్ రూఢౌ యదన్యస్మిన్ననుషజ్యతే . 177

యత్=ఏది, అర్థాన్తరే=అర్థవిశేషమునందు, వృత్తం=వృత్తిగలదో, తత్=దానిని, ప్రకృత్యన్తరం=మరియొక ప్రకృతినిగా, విదుః=తెలియుచున్నారు. (యత్=ఏ 'గమ్' ధాత్వాదిరూపము) అన్యస్మిన్=గచ్ఛతీత్యాదులందు, అనుషజ్యతే=సంబంధించి యున్నదో, తత్=అది, రూఢౌ=రూఢార్థమగు గవాదిశబ్దమునందు, న=లేదు, తత్=అది, తుల్యరూపమ్=సమానమైన రూపము గలదిమాత్రమే.

తా. అర్థభేదమును బోధించునది భిన్నమగు ప్రకృతియే యని చెప్పుదురు. మరియొక పదమునందున్న ప్రకృతి రూఢపదమున లేదు. అది కేవలము సమానరూపము గలది.

వి. గవాదిశబ్దములలో నున్న రూఢి విషయములగు (అనగా 'గోవు' మొదలగు రూఢార్థములను బోధించు) గమ్యాదులకును, 'గచ్ఛతి' ఇత్యాదులలోనున్న రూఢివిషయములు కాని గమ్యాదులకును కొంచెము రూపసామ్యమున్నను అర్థభేద మధికముగ నుండుటచే ఆ రెండును వేరువేరని చెప్పుదురు.

ఈవిధముగ వేరువేరు అర్థములను బోధించునవి వేరువేరు ప్రకృతులని యంగీకరింపవలెనని చెప్పి కొన్ని యెడల అర్థభేదము లేకున్నను (అర్థైకత్వమున్నను), విభిన్న ప్రకృతులే యని అంగీకరింపవలెనని చెప్పుచున్నాడు.

భిన్నావిణియణౌ ధాతూ నియతౌ విషయాన్తరే
కైశ్చిత్ కథంచిదుద్దిష్టౌ చిత్రం హి ప్రతిపాదనమ్ . 178

విషయాన్తరే=భిన్నవిషయమునందు (కిత్ ప్రత్యయము పరమగునపుడు 'ఇణ్' అనియు, తదితరస్థలములందు 'యణ్' అనియు), నియతౌ=నియతము లైనవియు, (అందుచే) భిన్నౌ=పరస్పర భిన్నములగు, ఇణియణౌ ధాతూ='ఇణ్' 'యణ్' ధాతువులు, కైశ్చిత్=కొందరు లాక్షణికులచే, కథంచిత్=వేరువేరు విధములుగ, ఉద్దిష్టౌ=ప్రతిపా

దింప బడినవి, ప్రతిపాదనం = ప్రతిపాదనముచేసెడు విధానము, చిత్రం హి = విచిత్ర మైనదికదా ?

తా. విషయాంతరములందు భిన్నములగు ఇఙ్, యఙ్ ధాతువులను కొందరు మరి యొక విధముగ ప్రతిపాదించి యున్నారు. ప్రతిపాదనము విచిత్రముగ నుండునుకదా ?

వి. 'ఇఙ్' 'యఙ్' ధాతువులు సమానార్థకము లైనను అత్యంతభిన్నము లైనవి. ఏలనన 'ఇఙ్' ధాతువు కిత్తులగు ప్రత్యయములు పరమగునపుడు మాత్రమే ప్రయుక్త మగును. 'యఙ్' ధాతువు తద్భిన్న స్థలములందు ప్రయోగింపబడును. ఐనను కొందరు వైయాకరణులు వీటికి పరస్పరభేదము నాశ్రయించియు, మరికొందరు అభేదము నాశ్ర యించియు—అనగా రెండును వేరువేరు ధాతువులనియు ఈ రెండును ఒకేధాతువనియు, ప్రతిపా దించి యున్నారు. ఉదాహరణమునకు పాణిని 'యఙ్' ధాతువును అంగీకరించి "వచి స్వపి యజాదీనాం కితి" (6-1-15) అను సూత్రముచే 'కిత్' ప్రత్యయములు పరమగునపుడు యకారమునకు సంప్రసారణము (ఇకారము) వచ్చి 'ఇఙ్' అగునని చెప్పియున్నాడు. కొందరు 'ఇఙ్' ను మూలధాతువుగా స్వీకరించి దానికి అకిత్ ప్రత్యయములు పరమగునపుడు యకారాదేశము వచ్చి 'యఙ్' అగునని చెప్పియున్నారు. లక్ష్యప్రధానులగు ఈ వైయాకర ణుల లక్షణవిధానము విచిత్రముగా నుండునుగదా ?

శబ్దస్వరూప సామ్యమున్నను, రూఢములగు గవాదిశబ్దములందలి 'గమ్' ధాతువు, 'గచ్ఛతి' 'గన్తా' ఇత్యాది పదములలోని 'గమ్' ధాతువును పరస్పర భిన్నము లని వెనుక ప్రతిపాదింపబడి యున్నది, అట్లే 'ఇఙ్' 'యఙ్' మొదలగువాటికి అర్థసామ్యమున్నను, శాస్త్రకారులు గూడ ఆ విధముగనే అంగీకరించి యున్నను, ఈ రెండును పరస్పర భిన్నములే యని ఈ కారిక చెప్పుచున్నది.

'స్తః' 'సన్తి' ఇత్యాదులలో 'స' అనునదిమాత్రమే ధాతువు. ఇది 'అస్తి' ఇత్యాదులలోని 'అస్' ధాతువుకంటె భిన్నమైనదే గాని 'అస్' అనునది 'స' గా మారుట, అనునది వాస్తవము కాదు. ఒక పదమునందు ఈ భాగము ధాతువు, ఈ భాగము ప్రత్య యము అనెడు కల్పనము వ్యావహారికమే గాని పారమార్థికము కాదు. వాస్తవమున ప్రతి యొక్క పదమును అఖండమే, ధాతు వనునది కేవలము శాస్త్రకల్పితమే కాని వాస్తవము కాదు. కావుననే 'అస్' ధాతువని పాణిన్యాదు లంగీకరించినది వాస్తవమున 'స్' ధాతువే యనియు, దానికి విషయవిశేషమునందు (పిత్ ప్రత్యయములు పరమగునపుడు) అకారా గమము వచ్చుననియు కొందరు చెప్పిరి. నిరుక్తకారుడు "నిగచ్ఛన్తి" అనుచోట "నిగమ్" అను స్వతంత్రధాతువు నొకదాని నంగీకరించినాడు. "బ్రూఞ్" ధాతువునకు లట్టులోని మొదటి ఐదు రూపములందును ఆహాదేశము వచ్చునని ("బ్రువః పంచానామాదిత ఆహో బ్రువః" 3-4-84) పాణిని అంగీకరింప, మరికొందరు "ఆహ" అను స్వతంత్రధాతు వొకటి ఉన్నదనియు, దానికి లట్టులో ఐదు రూపములుమాత్రమే ఉండుననియు అంగీకరించినారు.

లాక్షణికులు ఒకవస్తువునకు గల అవస్థాభేదము నాధారముగ గొని కూడ తద్వాచక శబ్ద ప్రతిపాదనము (వ్యుత్పాదనము) చేయుదురని చెప్పుచున్నాడు.

ఏవం చ వాలవాయాది జిత్వరీవ దుపాచరేత్
భేదాభేదాభ్యుపగమే న విరోధోఽస్తి కశ్చన . 179

ఏవం చ = అర్థైక్యమున్నను, భిన్నప్రకృతిత్వ మంగీకరించిన పక్షమున, వాలవాయాది="వాలవాయ" "విశ్రవణ" "రవణ" మొదలగు పదములను, జిత్వరీవత్ = "జిత్వరీ" పదమునువలె, ఉపాచరేత్ = వ్యవహరించవలెను. భేదాభేదాభ్యుపగమే = భేదము నంగీకరించినను అభేదము నంగీకరించినను, విరోధః = విరోధము, కశ్చన = ఏదియు, నాస్తి = లేదు.

తా. ఈ విధముగ "వాలవాయ" మొదలగు శబ్దములను 'జిత్వరీ' శబ్దమును వలె వ్యవహరించవలెను. భేదాభేదపక్షములలో దేని నంగీకరించినను విరోధ మేదియును లేదు.

వి. ఒక రత్నవిశేషము విదూరమునుండి పుట్టుచున్నది. ఈ అవస్థా భేదమునాధారముగ తీసికొని పాణిని "విదూరా ఞ్ఞ్యః" (4-3-84) అను సూత్రముచే 'విదూరాత్ ప్రభవతి' అను నర్థమున విదూరశబ్దముకంటె 'ఞ్య' ప్రత్యయమును విధించి 'వైదూర్యః' అను రూపమును సాధించినాడు. కాని విదూర మనునది ఒక నగరము. అచట వైదూర్యములు పుట్టుట లేదు. వాలవాయ మనెడు పర్వతమున పుట్టిన వాటిని విదూరనగరమున సానబట్టుచుండెడివారు. కావున 'ఞ్య' ప్రత్యయము వచ్చు సందర్భమున "వాలవాయ" శబ్దమునకు 'విదూర' అను నాదేశము వచ్చునని గాని, లేదా వారణాసికి కేవలము వర్తకులకు మాత్రమే తెలిసిన 'జిత్వరీ' అను నామాంతరమున్నట్లు, వాలవాయమునకు ఇతరజనాప్రసిద్ధమగు 'విదూర' అను నామాంతర మున్నదని గాని అంగీకరించవలెను. ఈ విధముగ "విదూర" అనునది "వాలవాయ" శబ్దమునకు ఆదేశముగ వచ్చినదని[1] అంగీకరించి అభేదపక్షమును (వాలవాయ

[1] ఒక శబ్దము స్థానమున దానితో ఏ మాత్రమును సంబంధములేని కొన్ని యాదేశములను చెప్పు పాణిన్యాదుల పద్ధతి భాషావికాసరీతికి విరుద్ధముగ మున్నదని కొందరి ఆక్షేపణకు ఇచట కొంతవరకును సమాధానము లభించుచున్నది. పాణిన్యాదులు బహుళప్రచారములో లేని కొన్ని స్వతంత్రపదములను ఆదేశముగ చూపుచున్నారు. ఉదాహరణమునకు—'జాయాచ పతిశ్చ' అనునపుడు 'జాయా' శబ్దమునకు వికల్పముగ 'దమ్' ఆదేశము వచ్చునని వైయాకరణులు చెప్పుదురు. కాని అచట 'దమ్' అనునది దానితో సామ్యముగల 'దమ్యా'వంటి పదముక్కు ('దమ్య' శబ్దము ఇంటిలో నుండునది అను నర్థమున ఋగ్వేదములో నున్నది.) అవశేషము కావచ్చును. ఆ పదమిపుడు భార్యార్థమున ప్రయుక్తము కాక కేవలము 'దంపతీ' ఇత్యాది రూపములలో శేషించి యుండునని ఊహించవచ్చును. అనగా అత్యంత భిన్నములుగ కనపడు ఆదేశములన్నియు పూర్వమొకప్పుడు స్వతంత్రపదములుగ ఆ యా యర్థములందు ప్రయుక్తములయ్యెడివనియు, కాలాంతరమున వాటి ప్రయోగము కొన్ని స్థలములందే సీమితమైనదనియు చెప్పవలెను. ఇట్లు కొన్ని అంశములలో ప్రయోగములందు లేక కొన్ని యంశములందు మాత్రము ప్రయోగములలో మున్న పదములెన్నియో మనకిపుడు గోచరించును, 'గచ్ఛతి' అనునర్థమున 'శవతి' అని ఇపుడెవ్వరును ప్రయోగింపరు—కాని గమనార్థకశవధాతువునుండి నిష్పన్నమగు 'శవ' శబ్దము మాత్రము బహుళ ప్రయోగములో నున్నది. కాలాంతరమున 'శవ'ధాతువొకటి యున్నదని పూర్తిగ మరచినపుడు ఎవరైనను కొన్ని పరిస్థితులలో 'గమ్' ధాతువునకు 'శవ్' ఆదేశము వచ్చును అని చెప్పవచ్చును. ఇట్టి నియమము 'శవ' అను స్వతంత్రశబ్దమొకటి ఉండెడిదని మనము గ్రహించుటకు సహాయపడును. విదూర శబ్దాదుల విషయమున భిన్నశబ్దత్వాభిన్నశబ్దత్వరూపమగు మతభేదమును ప్రతిపాదించు పై కారిక ఈ విషయమును స్పష్టముగ సూచించుచున్నది.

విదూర శబ్దములకు) ఆశ్రయించినను, విదూర అనునది ప్రకృత్యంతర మని గ్రహించి భేద పక్షము నాశ్రయించినను దోషమేమియు లేదు. ఇట్లే "రావణ" "వైశ్రవణ" శబ్దములు 'విశ్రవసః అపత్యం పుమాన్' అను నర్థమున విశ్రవస్ శబ్దమునకు రవణ, విశ్రవణ ఆదేశములు వచ్చుటచే నిష్పన్నమైనవని కొందరును రవణ, విశ్రవణ అను స్వతంత్ర శబ్దముల నుండియే నిష్పన్నమైనవని ('శివాదిభ్యోఽణ్' 4—1—112 అను సూత్రముచే అణ్ చేయగా) కొందరును చెప్పుచున్నారు. ఈ భేదాభేద పక్షములు రెండును యుక్తములే.

ఈవిధముగ అర్థభేదాదులను బట్టి శబ్దభేదము నంగీకరింపవలెనని తేలినది. కావున 'గమ్' ధాతువు వేరు 'ఆగమ్' ధాతువు వేరు, ఆ రెండును వేరువేరు అర్థములను బోధించు చున్నవిగదా ? ఐనను అడాగమ—ఆడాగమ—ద్విర్వచనాదుల వ్యవస్థకొరకై కొన్ని శబ్ద భాగములు ఉపసర్గములనియు, మిగిలినవి ధాతువులనియు చెప్పుచుందురు. వాస్తవమున ఉపసర్గ ముతో కూడిన దానికే ధాతుసంజ్ఞ యని చెప్పుచున్నాడు.

అడాదీనాం వ్యవస్థార్థం పృథక్త్వేన ప్రకల్పనమ్
ధాతూపసర్గయోః శాస్త్రే ధాతు రేవ తు తాదృశః.　　　　180

తథాహి సంగ్రామయతేః సోపసర్గా ద్విధిః స్మృతః
క్రియావిశేషాః సంఘాతైః ప్రక్రమ్యన్తే తథావిధాః.　　　　181

శాస్త్రే = శాస్త్రమునందు, ధాతూపసర్గయోః = ధాతువులకును, 'ప్ర' 'పరా' మొదలగు ఉపసర్గములకును, పృథక్త్వేన = వేరుగా, ప్రకల్పనం = కల్పనము, అడాదీనాం = అడాగమ - ఆడాగమ-ద్విత్వాదుల, వ్యవస్థార్థమ్ = వ్యవస్థకొరకే, తు = కాని, తాదృశ ఏవ = ఆ ఉపసర్గముతో కూడిన మొత్తము సముదాయమే, ధాతుః = ధాతువు.

తథాహి = అది యుక్తమేకదా, సోపసర్గాత్ = 'సమ్' అను ఉపసర్గముతోగూడిన, సంగ్రామయతేః = సంగ్రామ ధాతువుకంటె, విధిః = అడాగమాడాగమాదివిధి, స్మృతః = చెప్పబడినది, తథావిధాః = అట్టి, క్రియావిశేషాః = యుద్ధాది క్రియావిశేషములు, సంఘాతైః = ధాతూపసర్గ సంఘాతములచేత, ప్రక్రమ్యన్తే = ఆ క్రమములో నున్నయెడలనే బోధింపబడుచున్నవి.

తా. అడాగమాదుల వ్యవస్థకొరకై శాస్త్రమునందు ధాతూపసర్గలను వేరువేరుగ చెప్పుచుందురు. కాని ఉపసర్గతో కూడినదే ధాతువు.

కావుననే సోపసర్గమగు 'సంగ్రామ' ధాతువుకంటె అడాగమాదులు విధింపబడినవి. సంఘాతములు ఆక్రమములో నున్నయెడలనే, అట్టి క్రియావిశేషమును బోధించును.

వి. 'భూ' అనుదాని అర్థము వేరు 'అనుభూ' అనుదాని అర్థము వేరు. కావున రెండును భిన్నధాతువులు. అయినను కొన్ని ప్రయోజనముల నుద్దేశించి వైయాకరణులు 'అను' మొదలగునవి ఉపసర్గము లనియు, 'భూ' అనునది ధాతు వనియు చెప్పియున్నారు.

లఙ్-లుఙ్-లృఙ్లలో హలాది ధాతువునకు 'అ' (ట్) అను ఆగమము, అజాది ధాతువునకు 'ఆ' (ట్) అను ఆగమము విధింపబడినవి. 'భూ' అనునది ధాతువు అని అంగీకరించుటచే దానికి అడాగమము వచ్చి అను + అభవత్ = అన్వభవత్ అను రూపము సిద్ధించినది. ఉపసర్గసహితమగు 'అనుభూ' అనునదియే ధాతువని చెప్పినచో దానికి ప్రారంభ

మున అడాగమము వచ్చి "అ+అనుభవత్ = అనుభవత్" అను అనిష్టరూపము సిద్ధించెడిది. ఇట్లే యఙంతాదులలో భూధాతువునకే ద్విత్వమువచ్చి అనుబోభూయతే మొదలగు ఇష్టరూపములు సిద్ధించును. 'అనుభూ' అనునదియే ధాతువగుచో 'భూ' అనుదానికి ద్విర్వచనము రాక అనిష్టరూప మేదియో సిద్ధించి యుండెడిది. ఈ విధముగ ప్రక్రియా సౌలభ్యము కొరకై శాస్త్రకారులు ఉపసర్గ ధాతువిభాగమును చేసిరి. కాని వాస్తవమున సోపసర్గ నిరుపసర్గములు భిన్న భిన్నధాతువులే. కావుననే అడాగమద్విర్వచనాదులు సోపసర్గమునకే వచ్చుట ఇష్టమైన స్థలములలో సోపసర్గమునే ధాతువుగ అంగీకరించి యున్నారు. ఉదాహరణమునకు 'సంగ్రామ' అనుదానిలోని సమ్ అనునది ఉపసర్గము. ఐనను సమ్ కు పూర్వము అడాగమము వచ్చుటయు, 'సమ్' కు ద్విర్వచనాదులు వచ్చుటయు ఇష్ట మగుటచే సోపసర్గమగు 'సంగ్రామ' అనుదానినే ధాతువుగ అంగీకరించినారు. దానికి లఙాదులందు అడాగమము వచ్చి 'అసంగ్రామయత' ఇత్యాదిరూపములును, సన్నంతాది రూపములలో 'సిసంగ్రామయిషతే' ఇత్యాది రూపములును సిద్ధించినవి. 'సమ్' ఉపసర్గము అన్నచో 'సమగ్రామయత' ఇత్యాద్యనిష్టరూపములు సిద్ధించెడివి. ఈ విధముగ ప్రక్రియాసౌకర్యమునకై కొన్ని విషయముల నంగీకరించినను అర్థభేదాదులను బట్టి శబ్దభేదము నంగీకరింపవలె ననునది పరమార్థము.

ధాతూపసర్గ సంఘాతమే విశిష్టార్థబోధకమని యంగీకరించుటకు ప్రయోజనాంతరమును చెప్పుచున్నాడు.

> కార్యాణా మన్తరఙ్గత్వ మేవం ధాతూపసర్గయోః
> సాధనై ర్యాతి సమ్బన్ధం తథాభూతైవ సా క్రియా . 182

ఏవం=ఈవిధముగ ధాతూపసర్గముల సంఘాతము విశిష్ట క్రియాబోధకము గాన ధాతూపసర్గయోః = ధాతూపసర్గలకు సంబంధించిన, కార్యాణామ్ = కార్యములకు, అన్తరఙ్గత్వం=అంతరంగత్వము (అంగీకరింపబడినది), తథాభూతైవ=ధాతూపసర్గ సముదాయ వాచ్య మగుచునే, సా క్రియా=ఆ విశిష్టక్రియ, సాధనైః = కర్మకరణాది కారకములతో, సమ్బన్ధం = సంబంధమును, యాతి=పొందును.

తా. కావుననే ధాతూపసర్గములకు సంబంధించిన కార్యము అంతరంగము అట్టి క్రియయే సాధనములతో సంబంధించుచున్నది.

వి. ధాతూపసర్గములు రెండును కలిసి ఒక సంఘాతముగ ఏర్పడి ఒక విశిష్టార్థమును బోధించుచున్నవి గావుననే వాటి నడుమ రావలసిన సంధ్యాదికార్యము అంతరంగము. కావున ఇతరకార్యములకంటె ముందుగ ఆకార్యమే వచ్చును. అనగా ధాతూపసర్గములు పూర్తిగ ఒకదానితో నొకటి కలసి, ఒక్క సంఘాతముగ నేర్పడిన పిదప విశిష్టార్థమును బోధించును. ఉపసర్గముకంటె భిన్నమగు ధాతువునకు ప్రత్యేకార్థబోధకత్వశక్తి ఏదియు ఉండదు. కావుననే 'అనుభూయతే' (అనుభవింపబడుచున్నది) అనునపుడు కర్మణి లకారము వచ్చుటకు వీలయినది. 'అను' పూర్వకమగు భూధాతువు ('అనుభూ' అనునది) సకర్మకము గాని 'భూ' అనునది అకర్మకమే కదా? ఈ విధముగ ఉపసర్గసంబంధమును బట్టి క్రియా విశేషబోధకము లగు 'అనుభూ' మొదలగు ధాతువులు పిమ్మట 'సుఖం' 'దుఃఖం' ఇత్యాది కారకములతోడను, కర్మవాచక లకారాదులతోడను సంబంధించును. 'గౌర' శబ్ద

'ఖర' శబ్దములు భిన్న భిన్నార్థములైనను 'గౌరఖర' శబ్దము "అడవి గాడిద" అనెడు విశిష్టార్థమును బోధించును. అట్టి విశిష్టార్థమునకే కర్మకారకత్వాదికము లభించును. అట్లే 'అనుభూ' ఇత్యాదుల విషయమున గూడ తెలియవలెను.

వ్యాకరణకార్యములలో కొన్ని అంతరంగము లనియు, కొన్ని బహిరంగము లనియు చెప్పుదురు. అంతర్నిమిత్తమును బట్టి వచ్చు కార్యము అంతరంగము, బాహ్యనిమిత్తమును బట్టి వచ్చు కార్యము బహిరంగము. ఉదాహరణమునకు – 'ఇఙ్' ధాతువు తప్పక 'అధి' పూర్వకముగ నుండును. దీనికి 'క్త్వా' ప్రత్యయము చేర్చినపుడు "అధి + ఇ + త్వా" అని యుండగా 'త్వా' కు 'ల్యప్' చేయగా "అధి + ఇ + య" అని యున్నది. ఇపుడు 'అధి' లోని ఇకారమునకు పరమగు ఇకారముతో ముందుగ సవర్ణదీర్ఘము చేయవలయునా, లేక 'ఇ' ధాతువునకు చెందిన ఇకారమునకు 'హ్రస్వస్య పితికృతి తుక్' (6-1-71) అను సూత్రముచే తుక్ ('త్') ఆగమము చేయవలయునా అని సంశయము. ఉపసర్గధాతువులు రెండును కలిసి ఒక ధాతువుగ నేర్పడి విశిష్టార్థమును బోధింపనున్నవి గాన వాటి సంబంధము పైన చూపిన విధముగ చాల ప్రధానము. అందుచే వాటి కార్యము అంతరంగము. కావున 'అధి + ఇ' అనువాటికి సవర్ణదీర్ఘముచేసి 'అధీ' అని ముందుగ రూపము సిద్ధింపచేయవలెను. ఇపుడు అధీ + య అని యుండగా ఈకారము హ్రస్వముకాదు గాన పైన చూపిన సూత్రముచే తుగాగమమురాదు. తుగాగమము వచ్చినగాని 'అధీత్య' అను అభీష్టరూపము సిద్ధించదు. కావున సూత్రకారుడు 'షత్వతుకోరసిద్ధః' (6-1-86)అని ప్రత్యేకముగ ఒక సూత్రము రచించి తుగాగమము చేయవలసియున్నపుడు సవర్ణదీర్ఘరూపమగు ఏకాదేశము అసిద్ధమని చెప్పినాడు. అనగా దీర్ఘము వచ్చినను రానట్లే భావించి (హ్రస్వ మున్నదని భావించి) తుగాగమము చేయవనెనని యర్థము. ఇపుడు 'అధీత్య' అనురూపము సిద్ధించును. ధాతూపసర్గల కార్యము అంతరంగము కావుననే ఈ విధముగ ఈసూత్రము చెప్పవలసి వచ్చినది. కాకున్నచో అధి + ఇ + య అని యుండగా ముందుగా తుగాగమముచేసి, పిమ్మట అధి + ఇ అనుదానికి దీర్ఘము చేసిన పక్షమున ఈ సూత్రము ఆవశ్యకమై యుండెడిది కాదు. ఈ సూత్రనిర్మాణమును బట్టి కూడ ధాతూపసర్గముల కార్యము అంతరంగ మనియు, అందుకు కారణము ఆ రెండును కలిపి ఒక సంఘాతముగ నేర్పడి విశిష్టార్థమును చెప్పుటయే యనియు తేలినది.

కారకముతో సంబంధించుటకు పూర్వమే ధాతువు ఉపసర్గముతో సంబంధించును అను పక్షమును వెనుకటి కారికలో ప్రతిపాదించి, ఇపుడు ధాతువు మొదట కారకములతో సంబంధించి అటుపిమ్మటనే ఉపసర్గముతో సంబంధించునను పక్షాంతరమును చెప్పుచున్నాడు.

ప్రయోగార్హేషు సిద్ధః సన్ భేత్తవ్యోఽర్థో విశిష్యతే
ప్రాక్ చ సాధనసమ్బన్ధాత్ క్రియా నైవోపజాయతే. 188

ప్రయోగార్హేషు = ధాతువులు కారకసంబధమును పొంది ప్రయోగార్హతను పొంది యుండగా, సిద్ధః సన్ = సిద్ధరూపమై, భేత్తవ్యః = ఇతర వ్యావర్త్యమైన, అర్థః = అర్థము, విశిష్యతే = ఉపసర్గలచే విశేషింపబడుచున్నది. సాధనసమ్బన్ధాత్ ప్రాక్ = కారకాన్వయము కంటె పూర్వము, క్రియా = క్రియ, నైవోపజాయతే = పుట్టనే పుట్టదు కదా?

తా. ధాతువులు ప్రయోగార్హములై యుండగా, సిద్ధరూపమై ఇతరవ్యావర్త్యమైన అర్థమును (ఉపసర్గములు) విశేషించును. కారకసంబంధము కంటె పూర్వము క్రియ పుట్టనే పుట్టదు గదా॥

వి. 'ఛిద్' మొదలగు ధాతువులు ఛేదించుట మొదలగు క్రియలను బోధించును. కాని 'అసినా' (కత్తితో) 'వృక్షః' మొదలగు కరణకర్మాది కారకములతో, కర్తృకర్మాద్యర్థక తిఙాదులద్వారా సంబంధ మేర్పడిన గాని ఛిద్ ధాతువాచ్యక్రియ నిష్పన్నము కాదు. కావున క్రియ పూర్తిగ నిష్పన్నము కావలెనన్నచో ముందుగ కారక (సాధన) సంబంధము ఏర్పడ వలెను. ఈ విధముగ క్రియ నిష్పన్నమైన తరువాత ఆ క్రియ యందలి విశేషమును బోధించు ఇతర క్రియలనుండి దానిని వ్యావర్తింపచేయుటకు విశేషణ సంబంధ మేర్పడును. అట్టి విశేష ణము ఉపసర్గము; క్రియ విశేష్యము కావున కారకములతో మొదట సంబంధించి నిష్పన్నమగు క్రియను బోధించు శక్తి లభించిన పిమ్మటనే ధాతువు విశేషణమగు ఉపసర్గములతో సంబంధించును. విశేష్యమే సిద్ధము కాని యెడల దానికి విశేషణ సంబంధ మెట్లు లభించును? ఇది "పూర్వం ధాతు రుపసర్గేణ యుజ్యతే, పశ్చా త్సాధనేన" అను పూర్వకారికోక్త పక్షము నకు విరుద్ధమగు "పూర్వం ధాతుః సాధనేన (కారకేణ) యుజ్యతే, పశ్చా దుపసర్గేణ" అను పక్షాంతరము.

ఇప్పుడు "పూర్వం ధాతు రుపసర్గేణ యుజ్యతే" ఇత్యాది పక్షమును సమర్థించు చున్నాడు.

> ధాతోః సాధనయోగస్య భావినః ప్రక్రమా ద్యథా
> ధాతుత్వం కర్మభావశ్చ తథాన్యదపి దృశ్యతామ్ . 184

భావినః = రాబోవు, సాధనయోగస్య=కారక సంబంధము యొక్క, ప్రక్రమాత్ = ఉపక్రమమునందే అనుసంధానము వలన, ధాతోః = ధాతువునకు, యథా = ఏ విధముగ, ధాతుత్వం= ధాతుసంజ్ఞయు, కర్మభావశ్చ = కర్మత్వమును అంగీకరింపబడుచున్నవో, తథా = అట్లు, అన్యదపి= సాధన సంబంధమునకు పూర్వము ఉపసర్గసంబంధవశముచేత విశిష్టక్రియావాచిత్వము కూడ, దృశ్యతామ్ = చూడబడుగాక.

తా. రాబోవు సాధన సంబంధమును ప్రారంభముననే అనుసంధించుటచే ధాతు వునకు ధాతుత్వ కర్మత్వములను అంగీకరించినట్లు ఇతరమైనది గూడ అంగీకరింపబడుగాక.

వి. భాష్యకారులు "క్రియను బోధించునది ధాతువు" (క్రియావచనో ధాతుః) అని ధాతువును నిర్వచించియున్నారు. సాధనసంబంధము కలుగక పూర్వము క్రియ నిష్ప న్నము కాదు. కాన 'భూ' 'అద్' మొదలగునవి (ఆ అవస్థలో) క్రియా వచనములు కాకున్నను రాబోవు కారకసంబంధమును ముందుగనే బుద్ధియందు అనుసంధానము చేసికొని వాటికి ధాతుసంజ్ఞను అంగీకరించియున్నారు. "పఠితుం ఇచ్ఛతి పిపఠిషతి" ఇత్యాదులందు "ధాతోః కర్మణః సమానకర్తృకా దిచ్ఛాయాం వా"(3.1.7)అను సూత్రముచే 'పఠ్' మొదలగు ధాతువులు ఇచ్ఛాకర్మకము లగునపుడు (పఠనమును ఇచ్ఛించుచున్నాడు గాన) 'సన్' ప్రత్యయము విధింపబడినది. ఇచట ధాతువునకు ఇచ్ఛాకర్మత్వము మొదట లేకున్నను భావియందు సంభవింపనున్నది గాన, దానిని అట్టి ఉపక్రమమునందే ఉన్నట్లుగ భావింప

బడినది. అట్లే భావిసాధన సంబంధమును మనస్సులో నుంచుకొని మొదటనే ధాతువునకు ఉపసర్గసంబంధమును చేయుటచే అది విశిష్టక్రియావాచి యగునని అంగీకరింపవచ్చును. కావున "పూర్వం ధాతు రుపసర్గేణ యుజ్యతే" అను పక్షము నిర్దుష్టమని యభిప్రాయము.

సాధన సంబంధ మేర్పడుటకు పూర్వమే ధాతూపసర్గములకు సంబంధమేర్పడి ఒక విశిష్టక్రియ అవ్యక్తరూపమున ప్రతీయమానమగును. సాధన సంబంధమేర్పడిన పిదప ఆ విశిష్ట క్రియకుస్ఫుటప్రతీతి లభించును అను విషయమును దృష్టాంతపూర్వకముగనిరూపించుచున్నాడు.

బీజకాలేషు సమ్బద్ధా యథా లాక్షారసాదయః
వర్ణాదిపరిణామేన ఫలానా ముపకుర్వతే. 185

బుద్ధిస్థా దభిసమ్బన్ధా త్తథా ధాతూపసర్గయోః
అభ్యన్తరీకృతో భేదః పదకాలే ప్రకాశతే. 186

బీజకాలేషు = బీజవాపకాలమునందు, సమ్బద్ధాః = బీజములతో కలిసిన, లాక్షా రసాదయః = లాక్షారసము మొదలగునవి, వర్ణాదిపరిణామేన = తమ వర్ణాదులతో సమానము లగు వర్ణాదుల పరిణామము ద్వారా, యథా = ఏ విధముగా, ఫలానాం = ఫలములకు, ఉప కుర్వతే = ఉపకరించునో, తథా = అట్లు, బుద్ధిస్థాత్ = బుద్ధియందున్న, ధాతూపసర్గయోః = ధాతూపసర్గముల యొక్క, అభిసమ్బన్ధాత్ = సంబంధము వలన, అభ్యన్తరీకృతః = అంతర్లీన మగుటచే అస్పష్టముగ ప్రతీయమానమగు, భేదః = క్రియావిశేషము, పదకాలే = ధాతువునకు సాధనసంబంధము కలిగిన పిమ్మట పదనిష్పత్తి కాలమునందు, ప్రకాశతే = స్పష్టముగ తెలియును.

తా. విత్తులు నాటిన కాలమున వాటిపై పూసిన లాక్షారసాదులు స్వగతవర్ణాది పరిణామముచే ఫలాదులకు ఉపకరించునట్లు బుద్ధిస్థమగు ధాతూపసర్గముల సంబంధముచే అంతర్లీనమై యున్న క్రియావిశేషము పదనిష్పత్తికాలమున స్పష్టముగ తెలియును.

వి. కొన్ని వృక్షముల విత్తనములను మొలవేయునపుడు, మున్ముందు ఆ విత్తములనుండి రాబోవు ఫలముల వర్ణరసాదికము బాగుండుటకై లాక్షారసాదులను పూసి విత్తనములకు సంస్కారము చేయుదురు. ఈ విధముగ బీజములకు కలిగిన లాక్షారసాది సంబంధముచే భావికాలమున వృక్షము ఫలింపబోవు ఫలములకు మంచి రంగు, రుచి మొద లగునవి కలుగుటద్వారా ఉపకారము కలుగుచున్నది. అట్లే బుద్ధికృతమగు సంబంధముచే కలిసిన ధాతూపసర్గములు, మొదట అంతర్లీనమై అనుద్బుద్ధముగ నున్న క్రియావిశేషమును (ధాతువునకు) సాధనసంబంధము (కర్త్రాకర్మాద్యర్థక తిబాది సంబంధము) కలిగి పదత్వము నిష్పన్న మైన పిమ్మట, స్పష్టముగ ప్రకాశింపచేయును.

వాస్తవమున ధాతూపసర్గసముదాయమే ధాతువగుటచే ధాతూపసర్గముల సంబంధము ఆడాది కార్యార్థమై బుద్ధికల్పితము గాన "బుద్ధిస్థా దభిసమ్బన్ధాత్" అని చెప్పియున్నాడు. లాక్షారసాది సంబంధమును పొందిన బీజములలో అనుద్బుద్ధముగ నున్న విశిష్ట వర్ణ రసా దులను కాలాంతర సంబంధము ఆవిష్కరించినట్లు, ధాతూపసర్గ సముదాయమునందు సహజ ముగ నున్న అనుద్బుద్ధమగు క్రియావిశేషబోధకత్వశక్తిని సాధనసంబంధము అభివ్యక్తీక రించుచున్నది. దానియందా శక్తి సహజముగ లేకున్నచో ఎన్ని సాధనములతో సంబంధ

మేర్పడినను క్రొత్తగ ఆవిర్భవింపదు కదా ! కావున "పూర్వం ధాతు రుపసర్గేణ యుజ్యతే" అనునదియే సిద్ధాంతమని తాత్పర్యము.

"నామాఖ్యాతోపసర్గనిపాతాశ్చేతి చత్వారి పదజాతాని" (నామములు, ఆఖ్యాతములు, ఉపసర్గములు, నిపాతములు అని పదములు నాలుగువిధములు) అని నిరుక్తకారుడు చెప్పియున్నాడు. ఇంతవరకును నామాఖ్యాతముల స్వరూపము నిరూపింపబడినది. ఇపుడు ఉపసర్గల స్వరూపమును నిరూపించుచున్నాడు.

క్వచి త్సమ్భవినో భేదాః కేవలై రనిదర్శితాః
ఉపసర్గేణ సమ్బన్ధే వ్యజ్యన్తే ప్రపరాదినా. 187

క్వచిత్=(పచ్ధాతువు మొదలగు) కొన్నిటియందు, కేవలైః=ఉపసర్గ రహితములైన వాటిచే, అనిదర్శితాః=స్పష్టముగ బోధింపబడని, సంభవినః=సంభావ్యములగు (బోధింప వీలయిన), భేదాః=ప్రకృష్టపాకము మొదలగు విశిష్టార్థములు, ప్రపరాదినా= 'ప్ర' 'పరా' మొదలగు, ఉపసర్గేణ=ఉపసర్గముతో, సమ్బన్ధే=సంబంధ మేర్పడగా, వ్యజ్యన్తే=అభివ్యక్త మగుచున్నవి.

తా. కొన్ని యెడల కేవల ధాతువులచే చూపబడనివియు, సంభావ్యములును అగు భేదములు 'ప్ర' 'పరా' మొదలగు ఉపసర్గములతో సంబంధము కలుగగనే వ్యంజితమగుచున్నవి.

వి. 'పచతి' అనుదానికి 'ప్రకృష్టమగు పాకము చేయుచున్నాడు' అను నర్థము కూడ చెప్పవచ్చును. ఐనను 'ప్ర' అను ఉపసర్గమును చేర్చినగాని ఆ యర్థము స్పష్టముగ గోచరించుట లేదు. 'ప్ర' 'పరా' మొదలగు ఉపసర్గములతో సంబంధమేర్పడుటచే 'ప్రపచతి' ఇత్యాదులలో ఆ అర్థవిశేషము స్పష్టముగ స్ఫురించుచున్నది. కావున ఉపసర్గములు ధాతువులలో నున్న అర్థవిశేషమునే స్పష్టీకరించుచున్నవి గాని క్రొత్తఅర్థమును బోధింపకుండుటచే ఇవి అర్థవిశేషద్యోతకములే కాని అర్థవిశేషవాచకములు కావు.

పై కారికనుబట్టి ఉపసర్గములకు కేవలము ద్యోతకత్వమే యున్నదా లేక వాచకత్వాదులు కూడ అంగీకార్యములా యని ఆశంకించుకొని పక్షాంతరములను చెప్పుచున్నాడు.

స వాచకో విశేషాణాం సంభవా ద్ద్యోతకోఽపి వా
శక్త్యాధానాయ ధాతో ర్వా సహకారీ ప్రయుజ్యతే. 188

సః=ఆ ఉపసర్గము, విశేషాణామ్=క్రియలోనున్న విశేషములకు, వాచకః= వాచకము (కావచ్చును), వా=లేక, సమ్భవాత్=ధాతువునకే విశిష్టక్రియా బోధకత్వశక్తి సంభావ్యము గాన, ద్యోతకః=సూచకము కావచ్చును, వా=లేక, ధాతోః=ధాతువునకు, శక్త్యాధానాయ=విశిష్టక్రియా బోధకత్వ శక్తిని కలిగించుటకు, సహకారీ=సహకారిగా (సహాయ పడునదిగా), ప్రయుజ్యతే=ప్రయోగింప బడుచున్నది.

తా. ఆ ఉపసర్గమే ధాతుగత విశేష వాచకము కావచ్చును. లేదా, ధాతువునకే (వాచకత్వము) సంభావ్యము గాన ద్యోతకము కావచ్చును. లేదా, ధాతువునకు శక్తిని కల్పించుటకై అది సహకారిగ ప్రయోగింపబడవచ్చును.

వి. 'స్థా' ధాతువునకు గతినివృత్తి (నిలబడుట) అని యర్థము. కాని దానికి 'ప్ర' అను ఉపసర్గమును చేర్చుటచే అది ప్రయాణముచేయుట (గమనము) అను నర్థమును బోధించు చున్నది. కావున ఇచట 'ప్ర' అనునది ధాత్వర్థమగు స్థితికి విరుద్ధమగు గమనరూపార్థమును బోధించుచున్నది గాన ఉపసర్గములు వాచకము లని కూడ అంగీకరింపవలెను. ఉపసర్గములు ద్యోతకములను విషయము పూర్వకారికయందు స్పష్టీకరింపబడినది. ఇట్లు వాచకత్వ ద్యోతకత్వ పక్షములు కాక మూడవ పక్షము సహకారిత్వపక్షము. ఉపసర్గము విశిష్టక్రియను బోధింపదు. ద్యోతింపచేయదు. ఇక నేమనగా - ధాతువు ప్రక్కన చేరి దానికి విశిష్టార్థబోధకత్వశక్తిని కూర్చుచుండును. ఈ విధముగ ఉపసర్గములు వాచకములు, ద్యోతకములు, సహకారులు అను మూడు పక్షములను చెప్పినట్లైనది.

'ప్రతిష్ఠతే' ఇత్యాదులలో 'ప్ర' అను ఉపసర్గము కేవల ధాత్వర్థరూపమగు గతినివృత్తి రూపార్థమును బాధించి గమనరూపార్థమును బోధించుచున్నది అని వెనుక చెప్పబడినది. వాస్తవమున అనుమాన సహాయముచే గమనాద్యర్థ వాచకత్వము కూడ స్థా ధాతువునకే ఉన్నది. ఉపసర్గము ద్యోతకము మాత్రమే యని చెప్పుచున్నాడు.

స్థాదిభిః కేవలై ర్యచ్చ గమనాది తు గమ్యతే
తత్రానుమానా ద్ద్వివిధా త్తద్ధర్మా ప్రాది రుచ్యతే. 189

ద్వివిధాత్ = రెండు విధములగు, అనుమానాత్ = అనుమానమువలన, కేవలైః = ఉపసర్గరహితములగు, స్థాదిభిః = 'స్థా' మొదలగు ధాతువులచే, యత్ = ఏ, గమనాది = గమనాదికము, గమ్యతే = బోధింపబడుచున్నదో, తత్ర = ఆ గత్యాద్యర్థము విషయమున, ప్రాదిః = ప్ర మొదలగునది, తద్ధర్మా = ద్యోతకత్వధర్మము కలదిగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా. కేవలము లగు 'స్థా' మొదలగు ధాతువులు బోధించు గమనాద్యర్థ విషయమున ప్రాదులు ద్యోతకత్వధర్మము కలవి అని ద్వివిధానుమానముచే చెప్పబడుచున్నది.

వి. 'స్థా' ధాతువును ఉపసర్గరహితముగ ప్రయోగించునపుడు అది గతినివృత్తి రూపార్థమునే బోధించును. కావుననే 'ష్ఠా గతినివృత్తౌ' అని అభియుక్తులు పఠించియున్నారు. 'ప్రతిష్ఠతే' అనునపుడు ఆ 'స్థా' ధాతువే గమనమును బోధించుచున్నది కావున అనుమాన సహాయముచే స్థా ధాతువునకు గమనార్థ వాచకత్వశక్తి గూడ యున్నదనియు, 'ప్ర' అను ఉపసర్గము ఆ శక్తిని కేవలము ద్యోతింప చేయుచున్నదనియు గ్రహింపవలెను. ఒక్క అర్థమును మాత్రము జూపు 'ష్ఠా గతి నివృత్తౌ' ఇత్యాది పాఠము లోక ప్రసిద్ధ్యనుసారము చేయబడినది.

అనుమాన మనగా అనుమితి జ్ఞానమును కలిగించు సాధనము. పర్వతముపై ధూమమును చూడగనే 'పర్వతో ధూమవాన్' (పర్వతముపై ధూమ మున్నది) అను జ్ఞానము కలుగును. దీనికి పక్షధర్మతాజ్ఞాన మని పేరు. పిమ్మట 'యత్ర యత్ర ధూమ స్తత్ర తత్ర వహ్నిః' (ఎక్కడెక్కడ ధూమముండునో అక్కడక్కడ వహ్ని యుండును) అను వ్యాప్తి జ్ఞానము స్మరణకు వచ్చును. పిమ్మట 'వహ్నివ్యాప్యధూమవాన్ పర్వతః' (వహ్నివ్యాప్యమగు ధూమము పర్వతముపై నున్నది) అను జ్ఞానము కలుగును. దీనికి పరామర్శ మని

పేరు. పిమ్మట 'పర్వతో వహ్నిమాన్' (పర్వతముపై అగ్ని ఉన్నది) అను జ్ఞానము కలుగును. దీనికి అనుమితి యనిపేరు. ఈ యనుమితికి కరణము (సాధనము) గాన 'యత్ర ధూమస్తత్రాగ్నిః' అను జ్ఞానమునకు అనుమాన మని పేరు.

అనుమానము అవీతము, వీతము అని రెండు విధములు. అవీతమునకే కేవల వ్యతిరేకి యని కూడ పేరు. అన్వయవ్యాప్తి లేక కేవలము వ్యతిరేకవ్యాప్తియే ఉన్నచో అది కేవల వ్యతిరేకి. 'పర్వతో వహ్నిమాన్, ధూమాత్' అను అనుమితియందు పర్వతము పక్షము, వహ్ని సాధ్యము, ధూమము సాధనము లేక హేతువు. ఎక్కడెక్కడ సాధనము (హేతువు) ఉండునో అక్కడక్కడ సాధ్యముండును అని దృష్టాంత పూర్వకముగ చెప్పుటకు వీలు ఉన్నచో అది అన్వయవ్యాప్తి. ఉదాహరణమునకు – ఎక్కడెక్కడ ధూమముండునో అక్కడక్కడ అగ్ని యుండును, వంటయింటిలో వలె; అని చెప్పుటకు వీలున్నది గాన ఇది అన్వయ వ్యాప్తి. ఎక్కడ సాధ్యము ఉండదో అక్కడ హేతువు గూడ ఉండదు. అని దృష్టాంత పూర్వకముగ చెప్పుటకు వీలున్న అది వ్యతిరేకవ్యాప్తి. ఉదాహరణమునకు — ఎక్కడ అగ్ని ఉండదో అక్కడ ధూమము కూడ ఉండదు, చెరువునందువలె అని చెప్పుటకు వీలగు చున్నది గాన ఇది వ్యతిరేకవ్యాప్తి. కొన్ని స్థలములలో ఈ అన్వయ వ్యతిరేక వ్యాప్తులు రెండును ఉండును. కొన్ని స్థలములలో అన్వయవ్యాప్తి ఒక్కటియే యుండును. కొన్నిట వ్యతిరేకవ్యాప్తి మాత్రమే ఉండును. అట్టి దానికి కేవలవ్యతిరేకి లేక అవీతము అని పేరు. ఉదాహరణమునకు 'పృథివి జలాదులకంటె భిన్నమైనది, గంధ మున్నది గాన' (పృథివీ ఇతరరేభ్యః భిద్యతే, గన్ధవత్త్వాత్) అను అనుమితి యందలి 'గంధమున్నది గాన' (గంధవత్త్వాత్) అను హేతువు కేవలవ్యతిరేకి. ఇచట "ఏది సగంధమో అది జలాదులకంటె భిన్న మైనది" అను అన్వయవ్యాప్తి చెప్పుటకు వీలులేదు. దీనికి దృష్టాంతముగ గంధముగల ఏవస్తువును చూపినను అది పృథివిలో చేరినదే గాన (పక్షమే గాన) దీనికి ఉదాహరణము చూపుటకు అవకాశము లేదు. దేనియందు సాధ్యమును సాధింతుమో దానినే దృష్టాంతముగ చూపుటకు వీలులేదుకదా? పర్వతమునందు అగ్ని ఉన్నది, ధూమమున్నది కనుక; "మహానసమునందు వలె" అని పర్వత(పక్ష)భిన్నమగు మహానసమును దృష్టాంతముగ చూపుదుము గాని పర్వతమునే చూపము గదా? కావున దానికి "యదితరేభ్యో న భిద్యతే న తద్ గంధవత్, యథా జలమ్" (ఏది జలాదులకంటె భిన్నము కాదో దానికి గంధముండదు; జలమునందు వలె) అని వ్యతిరేకవ్యాప్తి మాత్రమే యున్నది గాన ఇది కేవలవ్యతిరేకి.

వీతము 'పూర్వవత్' అనియు, 'సామాన్యతోదృష్టమ్' అనియు రెండు విధములు. 'పూర్వవత్' అనుదానికి 'విశేషతోదృష్టమ్' అని నామాన్తరము. మహానసమున ధూమ మున్నపుడు అగ్ని యుండుట చూచి పర్వతమునందుగూడ ధూమ మున్నదిగాన అగ్ని యుండవలె నని యూహించుచున్నాడు. కాని ఆనాడు మహానసమునందు చూచిన ధూమము వేరు, ఈ నాడు పర్వతముపై చూచుచున్న ధూమము వేరు. మహానసమునందు ఆనాడు చూచిన అగ్ని వేరు, ఈనాడు పర్వతముపై ఊహించుచున్న అగ్ని వేరు. అనగా పూర్వము మహానసమునందు చూచిన ధూమవిశేష–అగ్నివిశేషముల సంబంధమును పురస్కరించుకొని ఇపుడు మరియొక ధూమవిశేషము సహాయముచే మరియొక అగ్నివిశేషమును ఊహించుచున్నాడు. కాని ఆనాడు చూచిన ధూమాగ్నులయందు ధూమత్వాగ్నిత్వజాతు లున్నవి.

పర్వతీయ ధూమాగ్నులయందు గూడ ధూమత్వాగ్నిత్వజాతు లున్నవి.పర్వతీయాగ్నిని ఇపుడు ఊహించుటకు పూర్వము అగ్నిత్వజాతి గల అగ్నివిశేషము మహానసమునందు చూడబడెను గాన దానికి 'పూర్వవత్' అనియు, 'విశేషతో దృష్టమ్' అనియు పేర్లు వచ్చినవి. ఈ విధముగ విశేషమును పూర్వ మెన్నడును చూచుటకు అవకాశము లేనిచో అట్టి దానికి (అనుమానమునకు) 'సామాన్యతో దృష్టమ్' అని పేరు. చక్షురాదీంద్రియములు ప్రత్యక్షములు కావు; కేవలము అనుమాన గమ్యములు. "రూపాదిజ్ఞానాని కరణవన్తి, క్రియాత్వాత్, ఛిదిక్రియావత్" (రూపాది జ్ఞానములకు కరణములు (సాధనములు) ఏవైన ఉండియుండవలెను. క్రియలు కావున, ఛేదనక్రియకు వలె) అనునది ఇంద్రియ సాధకానుమానము. ఛేదన క్రియవలెనే రూపాదిజ్ఞానము కూడ క్రియ గాన ఛేదనక్రియకు కుఠారాదికము కరణముగ నుండునట్లు ఈ జ్ఞాన రూపక్రియకు గూడ ఏదైన కరణము (సాధనము) ఉండవలెను. ఆ సాధనము ఇంద్రియము అని అనుమానము వలన సిద్ధించును. ఇచట సాధ్యము ఇంద్రియరూప కరణము. పర్వతముపై వహ్నిని ఊహించుటకు పూర్వము తద్వహ్ని గత వహ్నిత్వజాతి విశిష్టమగు వహ్నివిశేషమును మహానసము నందు చూచియున్నట్లు ఇచట సాధ్యమగు ఇంద్రియత్వ సామాన్యమునకు విశేషమగు ఇంద్రియమును పూర్వమెన్నడును అనుమాత చూచియుండలేదు. కరణత్వ సామాన్యమునకు విశేషమగు కుఠారాదుల స్వరూపమును మాత్రము ఛేదనాది క్రియలయందు చూచి యుండవచ్చును. ఈ అనుమానముచే అనుమాత కరణత్వ సామాన్య రూపముననే ఇంద్రియానుమితిని పొందుచున్నాడు. కావున ఇది సామాన్యతోదృష్టము.

ప్రకృతమున— విశేషతోదృష్ట సామాన్యతోదృష్టానుమానముల సహాయముచే ధాతువులకు భిన్నవిశిష్టక్రియా వాచకత్వమును, ఉపసర్గములకు విశిష్టక్రియాద్యోతకత్వమును సాధింపవచ్చును. "స్థాధాతుః అనేకార్థః, ధాతుత్వాత్; ఉభయవాది సమ్మతానేకార్థక యజత్యాదివత్" (స్థా ధాతువు, ధాతువు గాన, అనేకార్థములని అందరును అంగీకరించిన యజ్ మొదలగు ధాతువుల వలె, అనేకార్థము) అను సామాన్యతోదృష్టానుమానముచే స్థా ధాతువు అనేకార్థమని నిశ్చయించ వచ్చును ఈ సామాన్యతోదృష్టానుమానమును ఆధారముగ గొనిన 'అన్యేఽపి ధాతవః అనేకార్థాః, ధాతుత్వాత్, స్థా ధాతువత్' అను మరియొక సామాన్యానుమానముచే అన్ని ధాతువులును అనేకార్థము లని తెలియవచ్చును. 'స్థా' ధాతువునకు పూర్వమున నున్న 'ప్ర' అను ఉపసర్గమునకు – 'ప్ర' శబ్దః గతిరూప క్రియాద్యోతకః, ప్రశబ్దత్వాత్, పచ్యాది పూర్వదృష్ట ప్రశబ్దవత్' (పచ్ మొదలగు ధాతువుల మొదటనున్న 'ప్ర' వలె 'స్థా' కు పూర్వమున నున్న 'ప్ర' కూడ విశిష్టక్రియాద్యోతకము) అను విశేషతోదృష్టానుమాన సహాయముచే 'ప్ర' కు విశిష్టార్థబోధకత్వమును సాధింపవలెను. పిమ్మట ఏ తదనుమాన మూలకముగ – 'పరాదయః ఉపసర్గాః ద్యోతకాః, ఉపసర్గత్వాత్, ప్రతిష్ఠతే ఇత్యత్ర ప్రోపసర్గవత్' (పరా మొదలగునవి ద్యోతకములు, ఉపసర్గములు కావున; 'ప్రతిష్ఠతే' లోని 'ప్ర' అను ఉపసర్గమువలె) అనెడు సామాన్యతోదృష్టానుమానముచే ఉపసర్గము లన్నిటికిని తద్ధర్మత్వము అనగా ద్యోతకత్వరూప సాధ్యవత్త్వము – సిద్ధించును. కావున ధాతువు వాచకము, ఉపసర్గము ద్యోతకము అని కారిక అభిప్రాయము.

ఈ విధముగ ధాతువు విశిష్టక్రియాభిధాయక మనియు, ఉపసర్గము తద్ద్యోతక మనియు ప్రతిపాదించి ఇపుడు (కొన్ని యెడల) ధాతూపసర్గములు రెండును కలిసియే విశిష్టా

ర్థమును బోధించును. కేవలధాతువు గాని కేవలోపసర్గము గాని నిరర్థకము అని తెలుపు చున్నాడు.

అప్రయోగేఽధిపర్యోశ్చ యావద్దృష్టం క్రియాన్తరమ్
తస్యాభిధాయకో ధాతుః సహ తాభ్యా మనర్థకః. 190

అధిపర్యోః='అధి' 'పరి' అను ఉపసర్గముల, అప్రయోగే = ప్రయోగములేనప్పుడు, యావత్=ఏ, క్రియాన్తరమ్ = క్రియావిశేషము, దృష్టమ్ = చూడబడినదో, తస్య = దానికి, ధాతుః = ధాతువు, అభిధాయకః = వాచకము, తాభ్యాం సహ = వాటితో కూడ (వాటిని ప్రయోగించునపుడు), అనర్థకః = అర్థములేనిది.

తా. 'అధి' 'పరి' అనువాటిని ప్రయోగింపనపుడు ఏ క్రియా విశేషము కాన వచ్చుచున్నదో దానికి ధాతువు వాచకము. వాటితోకూడ ప్రయోగించినపుడు అది అర్థము లేనిది.

వి. 'అధ్యాగచ్ఛతి' (మీదుగా వచ్చుచున్నది) 'పర్యాగచ్ఛతి' (నలువైపుల నుండి వచ్చుచున్నది) ఇత్యాదులలోని 'అధి' 'పరి' అను ఉపసర్గములు అనర్థకములు వాటిని ప్రయోగింపకున్నను ప్రకరణాది సహకృతమగు ధాతువే ఉపరివిశిష్టాగమనమును సర్వతోభావ విశిష్టాగమనమును బోధించును గాన 'అధి' 'పరి' అను ఉపసర్గముల ప్రయోగము కేవలము స్పష్టార్థము. ఆ రెండింటిని ప్రయోగించునపుడు కేవల ధాతువు నిరర్థకము. అనగా ఉపసర్గసహితమగు ధాతువు విశిష్టార్థబోధకము గాన కేవల ధాతువు గాని కేవలోప సర్గము గాని నిరర్థకమని యభిప్రాయము.

ధాతువుతో కలిసి యుండెడి ఉపసర్గములకు అర్థముండునా ఉండదా అను విచారణము చేయు ప్రసంగమున నామసమభివ్యాహృతము అగు కొన్ని స్వార్థిక ప్రత్యయముల స్వరూపమును నిర్ణయించుట కుపక్రమించుచున్నాడు.

తథైవ స్వార్థికాః కేచిత్ సఙ్ఘాతాన్తరవృత్తయః
అనర్థకేన సంసృష్టాః ప్రకృత్యర్థానువాదినః. 191

తథైవ = ధాతు సమభివ్యాహృతము లగు 'అధి' 'పరి' మొదలగు ఉపసర్గములవలెనే కేచిత్ = కొన్ని, స్వార్థికాః = "యావాదిభ్యః కన్' (5.4.29) ఇత్యాది సూత్రములచే 'యావ' మొదలగు శబ్దములకంటె పరములుగ విహితములగు 'కన్' మొదలగు స్వార్థికప్రత్యయములు, అనర్థకేన = అర్థరహితములగు యావాది శబ్దములతో, సంసృష్టాః = కలిసినవై, సంఘాతాన్తర వృత్తయః = 'యావ' శబ్దముకంటె భిన్నమగు 'యావక' శబ్దరూప సంఘాతము నందు ఉన్నవై, ప్రకృత్యర్థానువాదినః = ప్రకృతిభూతములగు యావాదుల అర్థమును అనువదించునవిగ (ఉన్నవి).

తా. అట్లే కొన్ని స్వార్థిక ప్రత్యయములు అనర్థకములగు శబ్దములతో కలిసి మరియొక సంఘాతమునం దున్నవై ప్రకృత్యర్థమును అనువదించును.

వి. 'యావాదిభ్యః కన్' (5.4.29)అను సూత్రముచే 'యావ' మొదలగు శబ్దముల కంటె 'కన్' ప్రత్యయము స్వార్థమున విధింపబడుచున్నది. ఇచట 'యావ' శబ్ద 'క' ప్రత్యయ ములు భిన్నార్థబోధకములా లేక రెండును కలిసియే అర్థమును బోధించుచున్నవా యనునది

ప్రశ్న. 'యావ' శబ్దమును వేరుగా ప్రయోగించినపుడు దానికి అర్థమున్నది గాని 'యావక' లోని 'యావ' శబ్దము నిరర్థకము. 'యావ' శబ్దము వేరు. 'యావక' లోని 'యావ' వేరు. అనర్థక మగు నీ యావశబ్దముతో కలిపిన కప్రత్యయము 'యావ' శబ్దమును స్వతంత్రముగ ప్రయోగించినచో ఏ యర్థముండునో ఆ యర్థమును ('యావక'లోని 'యావ' నిరర్థకమైనను) అనువదించును. అనగా 'యావ' మొదలగు ప్రకృతులును, కప్రత్యయమును కలిసియే అర్థ మును బోధించును గాని వాటికి స్వతంత్రముగ అర్థమేమియు లేదని తాత్పర్యము.

నిపాతముల స్వరూపమును గూర్చి గూడ విభిన్నమతము లుండుటచే ఇప్పుడు వాటిని గూర్చి చెప్పుచున్నాడు.

నిపాతాః ద్యోతకాః కేచిత్ పృథగర్థాభిధాయినః
ఆగమా ఇవ కేఽపి స్యుః సంభూయార్థస్య వాచకాః . 192

కేచిత్ = కొన్ని, నిపాతాః = నిపాతములు, ద్యోతకాః = తత్తదర్థద్యోతకములు, (కేచిత్ = కొన్ని నిపాతములు), పృథగర్థాభిధాయినః = వేరువేరు అర్థములను బోధించును, కేఽపి = మరికొన్ని నిపాతములు, ఆగమా ఇవ = ఆగమములువలె, సంభూయ = ఇతర పదములతో కలిసి, అర్థస్య = అర్థమునకు, వాచకాః = వాచకములు, స్యుః = అగును.

తా. కొన్ని నిపాతములు ఆ యా యర్థములకు ద్యోతకములు. కొన్ని నిపాత ములు విభిన్నార్థబోధకములు. మరికొన్ని నిపాతములు ఆగమములవలె ఇతరపదములతో కలిసి అర్థవాచకములు.

వి. 'వటశ్చ ప్లక్షశ్చ' అను దానికి "వటముతో సముచ్చితమగు (కూడిన) ప్లక్షము, ప్లక్షముతో సముచ్చితమగు వటము" అని యర్థము. ఇచట 'వట' 'ప్లక్ష' శబ్దములు స్వేతరపదార్థ సముచ్చితములగు స్వార్థములనే శక్తి చేతగాని లక్షణచేతగాని బోధించునని కొందరి యభిప్రాయము. ఈ మతము ప్రకారము ఇచటనున్న 'చ' అను నిపాతములకు స్వతంత్రార్థ మేదియును లేదు. ఇవి కేవలము వటాదిపదములకున్న సముచ్చితత్వార్థమును ద్యోతింపచేయుచున్నవి. మరికొందరి మతము ననుసరించి ఇచటనున్న 'చ' అను నిపాత ములు స్వతంత్రముగ సముచ్చయ రూపార్థమును బోధించును. ఇది రెండవ మతము. 'సంస్కృత్య' ఇత్యాదులలోని తుగాగమాదులును ప్రకృతియును కలిసి ఏవిధముగ అర్థమును బోధించుచున్నవో ఆ విధముగనే నిపాతములుగూడ ఇతరపదములతో కలిసి అర్థబోధకము లగునని మూడవమతము. ఈ మతము ప్రకారము నిపాతములకు అర్థమేదియు లేదు.

ఈ కారిక పూర్వార్ధమునకు మరియొక విధముగగూడ అర్థము చెప్పవచ్చును. 'చ' 'తు' మొదలగు కొన్ని నిపాతములు తత్తదర్థద్యోతకములు (వాచకములు) కావు. 'యుగ పత్' (ఒక్కమారుగా) 'శశ్వత్' (ఎల్లప్పుడును) మొదలగు మరికొన్ని నిపాతములు తత్తదర్థవాచకములు. 'చ' మొదలగునవి స్వతంత్ర ప్రయోగానర్హములు గాన అవి ద్యోతక ములు మాత్రమే. స్వతంత్ర ప్రయోగార్హములగు 'యుగపత్' మొదలగునవి వాచకములు అని భావము.

ద్యోతకము లగు 'చ' మొదలగు నిపాతములను లౌకిక వాక్యములందు, ద్యోత్యా ర్థాభిధాయి పదమునకు ముందు గాని వెనుక గాని ఇచ్ఛానుసారముగ ప్రయోగింపవచ్చునని చెప్పుచున్నాడు.

ఉపరిష్టా త్పురస్తా ద్వా ద్యోతకత్వం న భిద్యతే
తేషు ప్రయుజ్యమానేషు భిన్నార్థేష్వపి సర్వథా. 193

భిన్నార్థేషు = తమతో కలిసిన పదముల అర్థముకంటె భిన్నమైన అర్థములు కల, తేషు = వికల్ప సముచ్చయాద్యర్థద్యోతకములగు 'చ' 'వా' మొదలగునవి, ఉపరిష్టాత్ = ద్యోత్యార్థపదములకు తరువాతగాని, పురస్తాద్వా = వెనుకగాని, ప్రయుజ్యమానేష్వపి = ప్రయోగింపబడుచున్నను, సర్వథా = సర్వవిధములచేతను, ద్యోతకత్వమ్ = ద్యోతకత్వము, న భిద్యతే = మార్పుచెందదు.

తా. భిన్నార్థకములగు ఆ నిపాతములను ముందు ప్రయోగించినను, వెనుక ప్రయోగించినను వాటి ద్యోతకత్వమునందు మార్పు ఏదియును లేదు.

వి. 'చ' 'వా' మొదలగు సముచ్చయ వికల్పాదిద్యోతక నిపాతములను లౌకిక వాక్యమున, ద్యోత్యార్థవాచక పదములకు ముందుగాని వెనుకగాని ప్రయోగింపవచ్చును. ఎట్లు ప్రయోగించినను వాటి ద్యోతకత్వమున భేదమురాదు, ఉదాహరణమునకు 'ధవం ఖదిరం చ ఛిన్ధి' అనిగాని, 'ధవం చ ఖదిరం' అని గాని, 'ధవంచ ఖదిరంచ' అని గాని, 'ధవం వా ఖదిరం' అనిగాని, 'ధవం ఖదిరంవా' అనిగాని ప్రయోగింపవచ్చును.

కొన్ని నిపాతములు ద్యోతకము లనియు, కొన్ని వాచకము లనియు ఏలచెప్పవలెను? అన్నియు వాచకములే యని ఏల చెప్పరాదు? అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

చాదయో న ప్రయుజ్యన్తే పదత్వే సతి కేవలాః
ప్రత్యయో వాచకత్వేఽపి కేవలో న ప్రయుజ్యతే. 194

పదత్వే సతి = పదములేయైనను, చాదయః = 'చ' మొదలగునవి, కేవలాః = ఇతరపదాసహకృతములుగ (స్వతంత్రముగ), న ప్రయుజ్యన్తే = ప్రయోగింపబడుటలేదు. ప్రత్యయః = ప్రత్యయము, వాచకత్వేఽపి = వాచకమేయైనను, కేవలః = కేవలముగ, న ప్రయుజ్యతే = ప్రయోగింపబడదు.

తా. చాదులు పదములేయైనను వాటిని ఇతరపదాసహకృతములుగ ప్రయోగింపరు. ప్రత్యయము అర్థవాచకమే యైనను దానిని స్వతంత్రముగ ప్రయోగింపరు.

వి. చాదులు పదములేయైనను వాటిని స్వతంత్రముగ (ద్యోత్యార్థవాచక పదములతో సంబంధము లేకుండగ) ప్రయోగించుటలేదు. కావున అవి ద్యోతకములే కాని వాచకములు కావు. వాచకము లైనచో 'గో' శబ్దాదులవలె స్వతంత్ర ప్రయోగార్హములై యుండెడివి. "ప్రత్యయములు వాచకములేయైనను వాటిని స్వతంత్రముగ ప్రయోగించుట లేదు గదా? అందుచే స్వతంత్రప్రయోగార్హత లేనంతమాత్రమున చాదులు వాచకములని ఏల చెప్పుదురు?" అని ఆశంకింపరాదు. ప్రత్యయములకు స్వతంత్రప్రయోగము లేకుండుటకు కారణము అవి పదములు కాకుండుట. 'అపదం న ప్రయుఞ్జీత' అని పదము కాని దానిని ప్రయోగింపరాదని నిషేధ మున్నదికదా? చాదులన్ననో పదములే. అయినను వాటిని కేవలము ప్రయోగింపరు. కావున అవి ద్యోతకములే కాని వాచకములు కావని చెప్పవచ్చును.

ఇపుడు, శంకా తన్నిరాకరణపూర్వకముగ. చాదులు సముచ్చయాద్యర్థవాచకము లని (శారికాద్వయమున) నిరూపించుచున్నాడు. (శంక) — శబ్ద శక్తి స్వభావమును ననుసరించి చాదులుగూడ ద్రవ్యభిన్నములగు వేరువేరు సముచ్చయాద్యర్థములను బోధించును అని చెప్పుట యుక్తము కాదు. శక్తి ననుసరించి చాదులు సముచ్చయాద్యర్థములను బోధించు నని అంగీకరించు పక్షమున ఆ యర్థములనే బోధించు 'సముచ్చయ' మొదలగు పదములను ప్రయోగించునపుడు ఏవిధముగ సంబంధవాచకమగు షష్ఠి వచ్చి 'వటస్య సముచ్చయః, ప్లక్షస్య సముచ్చయః' ఇత్యాది ప్రయోగములుండునో చాదిప్రయోగమునందు గూడ 'వటస్య చ ప్లక్షస్య చ' అని షష్ఠి రావలసియుండును. (సమాధానము) — చాదులు సము చ్చయవాచకములైనచో పై దోషము వచ్చియుండెడిది; కాని అవి సముచ్చయవాచక ములు కావు. సముచ్చితములను (సముచ్చయము కలవాటిని) బోధించును. ఇపుడు వటా దులకును చాదిబోధితము లగు సముచ్చితములకును అభేదము గాన షష్ఠి వచ్చెడు ప్రసంగము లేదని చెప్పుచున్నాడు.

సముచ్చితాభిధానేఽపి వ్యతిరేకో న విద్యతే
అసత్త్వభూతో భావశ్చ క్రియాన్త్యే నాభిధీయతే . 195

సముచ్చితార్థాభిధానేఽపి = (చాదులు)సముచ్చితము అను నర్థమును బోధించినను, వ్యతిరేకః = భేదము, నవిద్యతే = లేదు.

తా. సముచ్చితము అను నర్థమును బోధించినను భేదము లేదు. అనగా చాదులు ద్యోతకములు అను పక్షమున ప్లక్షాదిపదములే సముచ్చిత ప్లక్షాద్యర్థములను బోధించును. చాదులు కేవలము ప్లక్షాదులలో నున్న అట్టి అర్థమును ద్యోతింపచేయును అని చెప్పునపుడు భేదము లేకపోవుటచే ప్లక్షాదిపదములకంటె షష్ఠి రాదు కదా; అట్లే చాదులు సముచ్చితా ద్యర్థమును బోధించునను పక్షమునందు గూడ భేదము లేకుండుటచే భిన్నవస్తువుల సంబంధ మును బోధించు షష్ఠి ప్లక్షాది శబ్దములకంటె రాదు అని పూర్వార్ధాశయము.

*శంక* — చాదులు సముచ్చితార్థములని యంగీకరించినచో అవి సత్త్వ (ద్రవ్య) వాచకము లగును. అట్లైనచో 'చాదయోఽసత్త్వే' (1-4-57)అను సూత్రమున ద్రవ్యవాచక ములు కాని చాదులకుమాత్రమే నిపాతసంజ్ఞ విధింపబడినది గాన సత్త్వవాచకము లగు ఈ చాదులకు నిపాతసంజ్ఞ లేకపోవును. నిపాతసంజ్ఞ లేకున్నచో తత్ప్రయుక్తమగు 'స్వరాదినిపాత మవ్యయమ్' (1-1-37) అను సూత్రవిహితమైన అవ్యయసంజ్ఞ లభింపదు. అవ్యయసంజ్ఞ లేనిచో ఈ చాదులకంటె పరముగ వచ్చిన విభక్తి ప్రత్యయములకు 'అవ్యయాదాప్సుపః' (2.4.82) అను సూత్రముచే విహితమగు 'లుక్'(లోపము) రాదు గాన చాదులకంటె విభక్తి ప్రత్యయములు కనబడవలసియుండును అని ఆశంకించుకొని – ఆఖ్యాతము అసత్త్వమగు క్రియనుబోధించునట్లు చాదులు కూడ అసత్త్వమగు సముచ్చితాద్యర్థమునే బోధించును అని ఉత్తరార్థమున సమాధానము చెప్పుచున్నాడు.

అసత్త్వభూతః = పదార్థము కాని, భావః = సముచ్చితాద్యర్థము, నిపాతలచే బోధింపబడును. (యథా = ఏవిధముగా,) అన్యేన = సత్త్వమగు క్రియను బోధించు 'పాకః' ఇత్యాది పదములకంటె భిన్నమగు 'పచతి' మొదలగు ఆఖ్యాతముచే, క్రియాసత్త్వము కాని క్రియ, అభిధీయతే = చెప్పబడుచున్నదో.

తా. 'పచతి' మొదలగు ఇతరపదములచే క్రియ బోధింపబడినట్లు చాదులచే అసత్త్వభూతమగు సముచ్చయాద్యర్థముబోధింపబడును.

వి. 'పాకః' అను నామపదము, 'పచతి' అను అఖ్యాతపదము, ఈ రెండును పాకక్రియనే బోధించును. కాని శబ్దశక్తిస్వభావము ననుసరించి 'పచతి' అనునపుడు అఖ్యాతము సత్త్వము కానిదియు, సాధ్యమును (అసంపూర్ణమును) అగు పాకక్రియను బోధించు చున్నది. 'పాకః' అను నామపదము పరినిష్ఠితస్వభావమగు, సత్త్వమైన పాకక్రియను బోధించుచున్నది. (క్రియ సంపూర్ణమైననే గాని పదార్థము కాజాలదు) అట్లే శబ్దశక్తి స్వభావమును అనుసరించి చాదులు సత్త్వము కాని సముచ్చితాద్యర్థమునే బోధించును. ఈ విధముగ చాద్యర్థము సత్త్వము కాదు. కాన లింగసంఖ్యాన్వయయోగ్యము కాదు. అందుచే చాదులకంటె విభక్తియే ఉత్పన్నము కాదు.

చాదులు సముచ్చితాద్యర్థబోధకము లను పక్షమున దోషాంతరము నాశంకించి పరిహరించుచున్నాడు. చాదులు సముచ్చితాద్యర్థ బోధకము లని యంగీకరించినచో ఆ యర్థమునే బోధించు 'సముచ్చితః' ఇత్యాదిపదములకు విశేషణములను చేర్చుటకు అవకాశమున్నట్లు 'చ' మొదలగు వాటికి గూడ విశేషణములను చేర్చుటకు అవకాశముండవలెను. విశేషణముల లింగవచనములు విశేష్యముల లింగవచనములపై ఆధారపడి యుండును. కాని చాదులు అసత్త్వ వాచకములగుటచే వాటికి లింగవచనాదులు లేవు గాన వాటికి విశేషణములుగ ప్రయోగించు పదములకు 'సామాన్యే నపుంసకమ్' (వా.) అను శాస్త్రముచే నపుంసకలింగము వచ్చి 'హరితం శోభనం చ వృక్షః' ఇత్యాదివాక్యమును ప్రయోగింపవలసి యుండును, కావున చాదులకు సముచ్చితాద్యర్థవాచకత్వమును అంగీకరింపరాదు అని ఆశంకించుకొని సమాధానమును చెప్పుచున్నాడు.

సముచ్చితాభిధానేఽపి విశిష్టార్థాభిధాయినామ్
గుణైః పదానాం సమ్బన్ధః పరతన్త్రాస్తు చాదయః . 196

విశిష్టార్థాభిధాయినామ్=స్వార్థమును బోధించుటకు తప్పక పదాంతరముతో సంబంధముండవలెను అనెడు పారతంత్ర్యము లేకుండ స్వతంత్రముగ జాత్యాదివిశిష్టార్థమును బోధించు, పదానాం=పదములకు, గుణైః=విశేషణములతో, సంబంధః = సంబంధము (ఉండును). చాదయస్తు = చాదులైతే, సముచ్చితార్థాభిధానేఽపి = సముచ్చితార్థమును బోధించినను, పరతంత్రాః = పరాధీనములు.

తా. (స్వతంత్రముగ) విశిష్టార్థమును బోధించు పదములకు విశేషణములతో సంబంధము ఉండవచ్చును; కాని చాదులు సముచ్చితార్థ బోధకములైనను పరతంత్రములు.

వి. స్వతంత్రముగ జాత్యాది విశిష్టార్థబోధకము లగు పదములకు విశేషణములను చేర్చవచ్చును. చాదినిపాతములు శబ్దశక్తి స్వభావముచే అసత్త్వభూతార్థవాచకములని అంగీకరించినను, శబ్దశక్తిస్వభావముచేతనే, తప్పక ఇతరపదములతో కలిసియుండవలెననెడు పారతంత్ర్యము కూడ వీటికుండుటచే, విశేషణములను చేర్చెడు అవకాశము ఉండదు గాన పూర్వోక్తదోషము లేదు. ఈ విధముగ చాదినిపాతములు శబ్దశక్తిస్వభావమును బట్టి అసత్త్వభూతసముచ్చితాద్యర్థములను బోధించును. కాని వీటికి స్వతంత్ర ప్రయోగము గాని, విశేషణయోగము గాని లేదు అని ఈ రెండు కారికల సారాంశము.

ఇంతవరకు నామ—ఆఖ్యాత—ఉపసర్గ-నిపాతము లనెడు చతుర్విధ పదస్వరూపమును నిరూపించి ఇపుడు కర్మ ప్రవచనీయ మనెడు పంచమవిధ పదమును గూర్చి కూడ విచారించు చున్నాడు.

జనయిత్వా క్రియా కాచిత్ సమ్బన్ధం వినివర్తతే
శ్రూయమాణే క్రియాశబ్దే సమ్బన్ధో జాయతే క్వచిత్ . 197

క్వచిత్ = కొన్ని స్థలములందు, కాచిత్ = ఒకానొక, క్రియా = క్రియ, సమ్బన్ధం= సంబంధమును, జనయిత్వా= పుట్టించి, వినివర్తతే = తొలగిపోవును (వినబడకుండును). క్వచిత్ = కొన్ని స్థలములందు, క్రియాశబ్దే = క్రియావాచక మగు శబ్దము, శ్రూయమాణే= వినబడుచుండగా, సమ్బన్ధః = సంబంధము, జాయతే = ఏర్పడును.

తా. కొన్ని స్థలములందు ఒక్కొక్క క్రియ సంబంధమును ఏర్పరచి తాను వినబడకుండ పోవును. మరికొన్ని యెడల క్రియావాచకము వినబడుచు ఉండగనే సంబంధము ఏర్పడును.

వి. 'లక్షణేత్థంభూతాఖ్యానభాగవీప్సాసు ప్రతిపర్యనవః '(1-4-90) ఇత్యాదిసూత్రములచే లక్షణాద్యర్థములు విషయ మగునపుడు 'ప్రతి' మొదలగు వాటికి కర్మప్రవచనీయసంజ్ఞ విహితమైనది. 'వృక్షం ప్రతి విద్యోతతే విద్యుత్' ఇత్యాదికము ఉదాహరణము : 'కర్మ ప్రోక్తవన్తః కర్మప్రవచనీయాః' అను వ్యుత్పత్తిచే కర్మప్రవచనీయ శబ్దమునకు పూర్వ మొకప్పుడు (ఉదాహరణాంతరముల యందు) క్రియను బోధించునవి, కాని ఇపుడు మాత్రము క్రియావాచకములు కాక క్రియాజన్య మగు సంబంధ విశేషమును బోధించునవి అని యర్థము. 'వృక్షంప్రతి విద్యోతతే విద్యుత్' అను వాక్యమునకు 'వృక్షముచే గుర్తింపబడు మెరుపు మెరయుచున్నది' అని యర్థము. మెరుపు మెరిసిన మరుక్షణమునందే అదృశ్యమగును. వృక్షప్రకాశము గూడ మెరుపుతోపాటు పుట్టి నశించుచున్నది. ప్రకాశితమగు వృక్షముచే విద్యుత్తును ఊహించుచున్నాము గాన వృక్షము విద్యుత్తునకు లక్షణము. విద్యుత్తు లక్ష్యము. ఈ లక్ష్యలక్షణ రూపసంబంధమును 'ప్రతి' అనునది సూచించుచున్నది. కావున ఇది కర్మ ప్రవచనీయము. ఈ కర్మప్రవచనీయముతో సంబంధించిన 'వృక్ష' శబ్దమునకు 'కర్మప్రవచనీయ యుక్తే ద్వితీయా' (2-3-8) అను సూత్రముచే ద్వితీయ వచ్చినది. ఈ విధముగ కర్మప్రవచనీయములు సంబంధవిశేషావచ్ఛేదకము లని తేలినది.

సంబంధము లన్నియు క్రియాకారకపూర్వకములై యుండును అనగా ఒక క్రియ యందు కారకములుగా నున్న రెండింటికి ఆ క్రియద్వారా సంబంధ మేర్పడును. ఉదాహరణమునకు - 'రాజు ఈ పురుషుని పోషించుచున్నాడు' అనునపుడు పోషణ క్రియయందు కర్తయగు రాజునకును, కర్మయగు పురుషునకును ఈ పోషణ రూపక్రియ ద్వారా స్వస్వామి భావసంబంధము (భృత్యుడు, అధిపతి అనెడు సంబంధము) ఏర్పడినది. కొన్ని స్థలములలో క్రియ రెండు కారకములకు సంబంధమేర్పరచి తాను నివర్తించును - అనగా ఆ క్రియ వినబడదు. ఉదాహరణమునకు - 'రాజ్ఞః పురుషః' అనునపుడు 'రాజుకు సంబంధించిన పురుషుడు' అని స్వస్వామిభావసంబంధము గోచరించుచున్నది. ఈ పురుషుని రాజు పోషించు చున్నాడు గాన వారిరువురకును స్వస్వామిభావసంబంధము, ఈ పోషణక్రియ స్వస్వామి భావసంబంధమును ఏర్పరచి 'రాజ్ఞః పురుషః' అనుచోట వినబడకుండ తొలగిపోయినది.

ఇచట ఆ క్రియ శ్రూయమాణము కాకున్నను స్వస్వామిభావసంబంధము అవగతమగు చున్నది. కొన్ని స్థలములలో క్రియాపదము శ్రూయమాణముగ నున్నపుడు మాత్రమే స్వవాచ్యక్రియకు కారకముతో సంబంధమును బోధింప గల్గును. ఆ క్రియాపదము శ్రూయ మాణము కాకున్నచో సంబంధము కూడ అవగతము కాదు. ఉదాహరణమునకు – 'మాతుః స్మరతి' అనుదానికి తల్లిని స్మరించుచున్నాడు అని యర్థము. ఇచట తల్లికిని స్మరణము నకును జన్యజనకభావసంబంధము లేక నిమిత్త నిమిత్తి భావసంబంధము. తల్లి స్మరణము నకు నిమిత్తము, స్మరణము నిమిత్తి. ఇచట 'స్మరతి' అనెడు క్రియ తొలగిపోయి శ్రూయ మాణము కాకున్నచో మాతృస్మరణములకు గల సంబంధము గూడ తొలగిపోవును గాన ఇట్టి స్థలములలో క్రియాపదమున్నపుడు మాత్రమే సంబంధ మవగతమగును.

దీనినిబట్టి ఒక క్రియద్వారా రెండు కారకములకు ఏర్పడిన సంబంధము ఆ క్రియాపదము వినబడకున్నను గమ్యమగును; కాని కారకమునకును క్రియాపద వాచ్యక్రియ కును నడుమ నేర్పడిన సంబంధము క్రియాపదము శ్రూయమాణము కాకున్నచో తొలగిపోవు నని తేలినది.

'షష్ఠీ శేషే' (2.3.50) అనుసూత్రముచే సంబంధసామాన్యమున షష్ఠీ విహితమై యుండగా కర్మత్వాది విశేషసంబంధమును పురస్కరించుకొని 'అధిగర్థదయేశాం కర్మణి' (2.3.52) ఇత్యాది సూత్రములచే మరల ప్రతిపదషష్ఠి (పదవిశేషమును నిమిత్తముగ గొని వచ్చెడు షష్ఠి) ఏల విధింపబడినది? అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు. (ఈ విచారము ప్రాసంగికము).

తత్ర షష్ఠీ ప్రతిపదం సమాసస్య నివృత్తయే
విహితా, దర్శనార్థంతు కారకం ప్రత్యుదాహృతమ్. 198

తత్ర = 'మాతుః స్మరణమ్' ఇత్యాదులందు, సమాసస్య = సమాసముయొక్క, నివృత్తయే = నివృత్తికొరకు (సమాసము రాకుండుటకొరకు), ప్రతిపదం షష్ఠీ = పద నిర్దేశ పూర్వకమగు షష్ఠి, విహితా = విధింపబడినది, తు = కాని, దర్శనార్థంతు = గుణములు కరణ మని చూపుట నిమిత్తము, కారకమ్ = కరణ కారకమైన 'గుణైః' అనునది, ప్రత్యుదా హృతమ్ = ప్రత్యుదాహరణముగా చూపబడినది.

తా. అచట సమాసము రాకుండుటకై ప్రతిపదషష్ఠి విహితమైనది. కరణత్వ మును చూపుటకై కారకము ప్రత్యుదాహరణముగా చూపబడినది.

వి. రెండు పదముల నడుమ ఏదైన ఒక సంబంధమును చెప్పుటకు వీలున్నపుడు (సంబంధ సామాన్యార్థమున) 'షష్ఠీ శేషే' (2.3.50) అను సూత్రముచే షష్ఠి విధింపబడినది. దీనిని బట్టి 'రాజ్ఞః పురుషః' 'రామస్య పుత్రః' 'రామస్య భార్యా' ఇత్యాది స్థలములందు స్వస్వామి భావ–జన్యజనకభావ–దాంపత్యాది సంబంధములను పురస్కరించుకొని రాజాది శబ్దములకు షష్ఠి వచ్చినది. కర్మ–కరణ సంప్రదానాదులకు ద్వితీయా–తృతీయా–చతుర్థ్యాదులను విధిం చినను ఆ కర్మాదులను సంబధసామాన్యముగ పరిగణించినచో షష్ఠి రావచ్చును. 'మాతరం స్మరతి' (తల్లిని స్మరించుచున్నాడు) అనునపుడు స్మరణక్రియలో తల్లి కర్మ గాన మాతృ శబ్దము ద్వితీయలో నున్నది. కాని ఆ కర్మను సంబంధ సామాన్యముగ వివక్షించినచో [చెప్పదలచినచో] అపుడు ద్వితీయ రాక 'షష్ఠీ శేషే' అను సూత్రముచే షష్ఠి వచ్చి 'మాతుః స్మరతి' యగును. 'మాతుః స్మరణమ్' అనునపుడు గూడ ఈ విధముగనే షష్ఠి

రావచ్చును. అనగా పై ఉదాహరణమున షష్ఠి వచ్చుటకు ప్రత్యేకముగ సూత్ర మేదియు అవశ్యకము కాకుండగనే సంబధ సామాన్య వివక్షచే (శేషత్వ వివక్షచే) షష్ఠి రావచ్చునని తెలినది. కాని పాణిని పై యుదాహరణమున షష్ఠి వచ్చుటకై 'అధీగర్థదయేశాం కర్మణి' (2.3.52) అను సూత్రమును పఠించెను. 'స్మృత్యర్థక ధాతువులు, దయధాతువు, ఈశ్ధాతువు వీటి కర్మ శేషముగ (సంబంధ సామాన్యరూపమున) వివక్షిత మగునపుడు (ఆ కర్మకు) షష్ఠి వచ్చును' అని దాని యర్థము. కొన్ని పదములను నిమిత్తముగ చూపి విహితమగు షష్ఠిగాన దీనికి 'ప్రతిపదవిధానషష్ఠి' యని పేరు. పైన చూపిన విధముగ శేషత్వ వివక్షయందు 'షష్ఠీ శేషే' (2.3.50) అను సూత్రముచేతనే షష్ఠి వచ్చుచుండగా ఇక ప్రతిపదవిధాన మెందులకు అని ఆశంక. దీనికి సమాధానము 'సిద్ధే సత్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి' అను వైయాకరణ సంప్రదాయము ననుసరించి ఒక కార్యము ఒక శాస్త్రముచే సిద్ధించుచుండగా మరల ఆ కార్యమే శాస్త్రాంతరముచే ఒక నియమము నుద్దేశించి విధింపబడును. ఇచట 'మాతుః స్మరణమ్' ఇత్యాదులలో శేషషష్ఠి వచ్చుటకు అవకాశమున్నను మరల ప్రతిపదవిధానషష్ఠీ విధానమునకు – 'ఇట్టి షష్ఠ్యంతము సమసింపదు' అను నియమ కల్పనము ప్రయోజనము. ఈవిషయమునే వార్త్తికకారుడు 'ప్రతిపదవిధానా షష్ఠీ న సమస్యత ఇతి వాచ్యమ్' అని స్పష్టీకరించి యున్నాడు. కావున ఈ నియమముచే 'మాతుః స్మరణమ్' అనునపుడు సమాసము చేసి 'మాతృ స్మరణమ్' అని ప్రయోగింపరాదు. ఈ విధముగ 'ప్రతిపదషష్ఠి' సమాసము రాకుండుటకై విధింబడినది.

ఇది ఇట్లుండగా మరియొక ఆశంకగూడ కలుగుచున్నది–అధీగర్థేత్యాది సూత్రమునందు 'కర్మణి' అని చెప్పనేల అని ప్రశ్నించి 'మాతుః గుణైః స్మరణమ్' అను ప్రత్యుదాహరణము చూపబడినది[1]. ఈ సూత్రమున 'కర్మణి' అను పదము లేకున్నచో స్మరణార్థాది ధాతువుల అన్ని కారకములకును శేషత్వవివక్షయందు షష్ఠి వచ్చునని అర్థము వచ్చును. అట్లైనచో 'మాతుః గుణైః స్మరణమ్' అనుచో 'గుణైః' అను కరణకారకమునకు గూడ షష్ఠి వచ్చియుండెడిది అని ప్రత్యుదాహరణము నిచ్చుటలోని యభిప్రాయము. ఇచట గుణశబ్దముకంటె షష్ఠి ఈ సూత్రముచే రాకున్నను, శేషత్వవివక్షలో షష్ఠీ శేషే అను సూత్రముచే రావచ్చును కదా? అపుడు 'మాతుః గుణానాం స్మరణమ్' అని యుండవచ్చును కదా? అని ఆశంక. దీనికి హరి 'దర్శనార్థం తు కారకం ప్రత్యుదాహృతమ్' అని సమాధానము చెప్పుచున్నాడు. అనగా గుణశబ్దముకంటె శేషషష్ఠి రావచ్చును. కావున 'మాతుః గుణానాం స్మరణమ్' అని గూడ ప్రత్యుదాహరణ మీయవచ్చును. కాని ఈ 'గుణానామ్' అనునది కర్మవాచకమా లేక కరణాదివాచకమా యని సంశయము వచ్చును. ఈసంశయము రాకుండుటకై 'గుణైః' అని కరణతృతీయాంతము ప్రయోగింపబడినది. ఈ కరణవాచకమగు గుణశబ్దమునకు శేషషష్ఠి రావచ్చును. సమాసము రాదను నియమము దానికి వర్తింపదు గాన గుణస్మరణమ్ అని సమాసము కూడ రావచ్చునని యభిప్రాయము.

[1] ఈ ప్రత్యుదాహరణము భాష్యములో లేదు. కాశికలో మున్నది. కాని భర్తృహరి కాశికకంటెను ప్రాచీనమగు వ్యాఖ్యానమును దేనినో దృష్టిలోనుంచుకొని ఈ కారికను వ్రాసి యుండును.

ప్రాసంగిక విచారము ముగిసినది. శ్రూయమాణము కాని అశ్రూయమాణము కాని యగు క్రియ సంబంధము నేర్పరచును అని వెనుక నిర్ణయింపబడినది. దీనికి ప్రకృతముతో సమన్వయమును చూపుచున్నాడు.

స చోపజాతః సమ్బన్ధో వినివృత్తే క్రియాపదే
కర్మప్రవచనీయేన తత్ర తత్ర నియమ్యతే. 199

క్రియాపదే = క్రియాపదము, వినివృత్తే = సంబంధమును కల్పించిన పిమ్మట నివర్తించిన దగుచుండగా, సః = ఆ, ఉపజాతః = పుట్టిన, సమ్బన్ధః = సంబంధము, కర్మప్రవచనీయేన = కర్మప్రవచనీయముచే, తత్ర తత్ర = ఆయా క్రియయందు, నియమ్యతే = నియమించబడుచున్నది.

తా. క్రియాపదము సంబంధమును కల్పించి నివర్తించినపిమ్మట, కర్మప్రవచనీయము, జనించిన ఆ సంబంధమును ఆ యా క్రియయందు నియమించును.

వి. సంబంధమును కల్పించినపిమ్మట క్రియాపదము నివృత్తముకాగా పిమ్మట, ఈ సంబంధము ఏక్రియద్వారా ఏర్పడినది అను సందేహము కలుగును. అపుడు కర్మప్రవచనీయము ఈ సంబంధము ఈ క్రియనుబట్టి ఏర్పడినది అని నియమించును. "కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా" (2.38) అను సూత్రముచే కర్మప్రవచనీయయోగముగల శబ్దమునకు ద్వితీయా విభక్తి వచ్చునుగాన ఆ ద్వితీయయే యీ సంబంధమును బోధించును. కావున కర్మప్రవచనీయము ఈ సంబంధవిశేషము ఈ క్రియద్వారా కలిగినది అని ద్యోతనము మాత్రము చేయును.

వెనుకచూపిన 'వృక్షం ప్రతి విద్యోతతే విద్యుత్' అను ఉదాహరణమునకు 'వృక్షమ్ అభిలక్ష్య విద్యుత్ విద్యోతతే' (వృక్షమును గుర్తుగా చేసికొని విద్యుత్తు మెరయుచున్నది) అని యర్థము. ఇచట వృక్షమునకును మెరపునకును లక్ష్యలక్షణభావ సంబంధము. వృక్షము లక్షణము (గుర్తు), విద్యుత్తు లక్ష్యము (గుర్తింపదగినది). ఈ సంబంధమును బోధించు 'అభిలక్ష్య' అను క్రియ నివర్తించినది. ఇచట కర్మప్రవచనీయమగు ప్రతి అనునదిగూడ లేకున్నచో ఆ సంబంధము ఎట్టి సంబంధము? ఏ క్రియద్వారా ఏర్పడినది? అను విషయములు తెలియవు. ప్రతి అనునది ఉన్నచో అది ముందుగా లక్షణక్రియను చెప్పి, ఆ క్రియద్వారా కలిగిన, ద్వితీయా బోధ్యమగు లక్ష్యలక్షణభావరూపసంబంధమును ద్యోతింపచేయును. కావుననే దీనికి కర్మప్రవచనీయమని పేరు. అనగా ముందుగ క్రియను బోధించి తరువాత సంబంధమును సూచించునది యని యర్థము[1].

అశ్రూయమాణమగు క్రియను కర్మప్రవచనీయము ఆక్షేపించును అని ఏల చెప్పరాదు—అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

[1] 'కర్మప్రవచనీయ' శబ్దమునకు వెనుక చెప్పిన వ్యుత్పత్తిని ఈ వ్యుత్పత్తిని గూడ వ్యాఖ్యానకారులు అంగీకరించియున్నారు. కర్మ ప్రవచనీయము లోని కర్మ శబ్దమునకు క్రియ యని యర్థము, యాస్కాదులు కర్మ శబ్దమును క్రియా పర్యాయముగ ప్రయోగించి యున్నారు.

యేన క్రియాపదాక్షేపః స కారకవిభక్తిభిః
యుజ్యతే వి ర్యథా తస్య లిఖావనుపసర్గతా. 200

యేన=ఏ శబ్దముచేత, క్రియాపదాక్షేపః=ఆ క్రియాపదముయొక్క ఆక్షేపము చేయబడునో, సః=అది, కారకవిభక్తిభిః=కారకవిభక్తులతో, విః యథా='వి' అను ఉపసర్గమువలె, యుజ్యతే=సంబంధించుచున్నది, తస్య=ఆ 'వి' కి, లిఖౌ='లిఖ' ధాతువునందు, అనుపసర్గతా=ఉపసర్గత్వము లేదు.

తా. ఏది క్రియాపదమును ఆక్షేపించునో అది 'వి' అను ఉపసర్గమువలె, కారకవిభక్తులతో సంబంధించుచున్నది. ఆ 'వి', 'లిఖ్'ధాతువు విషయమున ఉపసర్గముకాదు.

వి. క్రియాపదమును ఆక్షేపించు పదము క్రియాబోధకముగాన క్రియాపదము వలె ఆ పదము కారకవిభక్తులతో సంబంధించును. ఆక్షేపమనగా ఒక పద మొకచోట ప్రయోగింపబడకున్నను అది అక్కడ నున్నట్లుగా భావించి అర్థము చెప్పుటకు వీలు కలిగించుట. 'ప్రాదేశం విలిఖతి' అనుదానికి జేనెడు చొప్పున కొలిచి గీయుచున్నాడు అని యర్థము-అనగా ఇచట 'వి' అను పదము (ఉపసర్గము) 'విమాయ' (కొలిచి) అను క్రియను ఆక్షేపించినది కావుననే ఇది విమానక్రియను బోధించుచు ప్రాదేశమ్ అను కర్మకారకముతో సంబంధించుచున్నది. ఈ విలిఖతి లోని 'వి' అనుదానికి క్రియాయోగమున్నది గాన 'ఉపసర్గాః క్రియాయోగే' (1.4.59) 'గతిశ్చ' (1.4.60) (ప్రాదులు క్రియలతో సంబంధించినపుడు ఉపసర్గ సంజ్ఞములు, గతిసంజ్ఞములు గూడ అగును) అను సూత్రములచే ఉపసర్గ సంజ్ఞా గతి సంజ్ఞలు లభించినవి. కాని ఈ ఉపసర్గసంజ్ఞ లిఖతి అను క్రియతోడ సంబంధమును బట్టి వచ్చినది కాదు. ఆక్షిప్తమగు మానక్రియనుబట్టి వచ్చినది. కావున లిఖ ధాతువునుగూర్చి 'వి' ఉపసర్గముగాని, గతిగాని కాదు.

ప్రకృతమున కర్మప్రవచనీయములుగూడ 'విలిఖతి' లోని 'వి' వలె క్రియా పదాక్షేపకము లని అంగీకరించినచో అపుడు అట్టి కర్మప్రవచనీయములతో యోగమున్నపుడు కర్మత్వాది ప్రయుక్త ద్వితీయావిభక్తియే వచ్చును గాన" కర్మ ప్రవచనీయయుక్తే ద్వితీయా" అని మరల ద్వితీయను విధింపవలసిన పనిలేదు. 'ప్రాదేశం విలిఖతి' అనునపుడు 'వి' చేత ఆక్షిప్తమగు మా ధాతువునుబట్టి దానియందు కర్మయగు ప్రాదేశమునకు ద్వితీయ వచ్చినది కదా? అటులనే ఇక్కడను ద్వితీయ వచ్చుటకు అవకాశముండగా మరల సూత్ర మెందులకు? ఈ సూత్రమును చెప్పుటనుబట్టి కర్మప్రవచనీయము క్రియను ఆక్షేపించుట లేదని తెలియుచున్నది. క్రియాపదమును ఆక్షేపించుటలేదు గాన వృక్ష, విద్యుత్ పదములకు సంబంధసామాన్యముచే షష్ఠి వచ్చుటకు అవకాశమున్నది. దానిని బాధించుటకై ద్వితీయా విధాయకసూత్రము చెప్పబడినది.

ఉపసర్గము క్రియాపదాక్షేపక మనుటకు ఉదాహరణాంతరము గూడ చూపుచున్నాడు.

తిష్ఠతే రుపయోగశ్చ దృష్టోఽప్రత్యయన్నితి
సున్వతీ త్యాభిముఖ్యేఽభిః కేవలోఽపి ప్రయుజ్యతే. 201

(అ) అప్రత్యజయన్నితి = 'దేవాః అసురాన్ అప్రత్యజయన్' అను స్థలమున (దీనికి - 'దేవాః = దేవతలు, అప్రతి = ప్రతిష్ఠితులు కాని, అసురాన్ = అసురులను, అజయన్ = జయించిరి' అని యర్థము) తిష్ఠతేః = స్థా ధాతువునకు, ఉపయోగశ్చ = 'ప్రతి' అను ఉపసర్గముచే ఆక్షేపము గూడ, దృష్టః = చూడబడినది.

తా. 'అప్రత్యజయన్' అనునపుడు స్థా ధాతువునకు ఆక్షేపము చూడబడినది గూడ.

వి. కావున 'ప్రాదేశం విపరిలిఖతి' అను వాక్యమునందలి 'వి' శబ్దము లిఖ ధాతువును బట్టి ఉపసర్గము కాని విధమున ఇచటగూడ 'ప్రతి' శబ్దము 'జి' ధాతువును బట్టి ఉపసర్గము కాదు.

కొన్ని స్థలములలో ఉపసర్గము స్వార్థమును స్వతంత్రముగ బోధించుచు తద్ద్వారా, (క్రియాపదాక్షేపకమగు ఉపసర్గమువలె కాక) ప్రక్కనున్న ధాతువుతో, సంబంధించును, అనగా ఈ ఉపసర్గము ప్రక్కనున్న ధాతువుతో, తద్ధాత్వర్థ ద్యోతకము కాక, స్వతంత్రముగ తన యర్థమును బోధించుచు సంబంధించును అను విషయమును ప్రసంగవశమున ఉత్తరార్ధమున చెప్పుచున్నాడు.

(ఆ) సున్వన్తీతి = అభిషుణ్వన్తి అనుచోట, కేవలోఽపి = కేవలముగనే, అభిః = అభి అను ఉపసర్గము, ఆభిముఖ్యే = ఆభిముఖ్యార్థమునందు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును.

తా. 'అభిషుణ్వన్తి' అనునపుడు 'అభి' అను ఉపసర్గము ఆభిముఖ్యార్థమున స్వతంత్రముగ ప్రయోగింపబడును.

వి. 'అభిషుణ్వన్తి' అనునపుడు 'అభి' అను ఉపసర్గమే 'అభిముఖముగ నుండుట' (ఆభిముఖ్యము) అను నర్థమును బోధించుచున్నది. కాని ధాతువే ఆభిముఖ్యవిశిష్ట సవనమును బోధించును. 'అభి' అనునది దానిని ద్యోతింపచేయును అని చెప్పుటకు వీలులేదు. 'ఆభిముఖ్యము' అను నర్థము లింగసంఖ్యాన్వయయోగ్యము కాన అది సత్త్వము (పదార్థము). ధాతువు సత్త్వమును బోధింపదు. 'అసత్త్వభూతో భావశ్చ తిఙ్ పదై రభిధీయతే' (తిఙన్తములు సత్త్వము కాని భావమును బోధించును) అని నియమము. 'అభి' పదబోధ్యమగు ఈ ఆభిముఖ్యము సవనమునందు క్రియావిశేషణముగ భేదమున అన్వయించును. 'అభి అనునది స్వార్థము ద్వారా ధాత్వర్థమగు సవనమునందు అన్వయించును.

ఈ విధముగ సార్థకమగు 'కర్మప్రవచనీయము' అను నామధేయమును బట్టియే కర్మప్రవచనీయములు, సంబంధమును ఏర్పరచి నివృత్తమైన క్రియను బట్టి వచ్చిన సంబంధ విశేషమును ద్యోతింపచేయుచు, సంబంధనియామకము లగునని నిర్ణీతమైనది.

సంబంధము నేర్పరచి ధాతువు నివృత్తము కాగా సంబంధ విశేషద్యోతనము చేయునవి కర్మప్రవచనీయములు అని చెప్పినచో, క్రియలతో సంబంధించి యుండియే క్రియావిశేషమును బోధించు 'సు, అతి' మొదలగు వాటికి కర్మప్రవచనీయత్వము నెట్లు చెప్ప వీలగును అని శంకించుకొని చెప్పుచున్నాడు

కర్మప్రవచనీయత్వం క్రియాయోగే విధీయతే
షత్వాదివినివృత్త్యర్థం స్వత్యాదీనాం విధర్మణామ్ . 202

విధర్మణామ్ = విరుద్ధ ధర్మములు కలిగిన, అనగా సంబంధ విశేషమును ద్యోతింపచేయుటకంటె విరుద్ధమయిన క్రియావిశేషమును ద్యోతింపచేయుట యనునది కలిగిన, స్వత్యాదీనామ్ = 'సు' 'అతి' మొదలగు వాటికి, షత్వాదినివృత్త్యర్థమ్ = 'సుసిక్తమ్' ఇత్యాదులందు షత్వాదులు రాకుండుటకై, క్రియాయోగే = క్రియావిశేషద్యోతకత్వమున్నపుడు (సంబంధవిశేషద్యోతకత్వము లేకున్నను), కర్మప్రవచనీయత్వమ్ = కర్మప్రవచనీయ సంజ్ఞ. విధీయతే = విధింపబడుచున్నది.

తా. విరుద్ధ ధర్మములగు 'సు' 'అతి' మొదలైనవాటికి, క్రియావిశేషద్యోతకత్వమున్నపుడు, షత్వాదులు రాకుండుటకై, కర్మప్రవచనీయ సంజ్ఞ విధింపబడుచున్నది.

వి. 'సుః పూజాయామ్' (1.4.94) 'అతి రతిక్రమణేచ' (1.4.95) అను సూత్రములచే 'సు' 'అతి'అను పదములకు కర్మప్రవచనీయ సంజ్ఞ విధింపబడినది. 'సుసిక్తమ్' 'అతిసిక్తమ్' ఇత్యాదులు ఉదాహరణములు. ఇచట కర్మప్రవచనీయములగు 'సు' 'అతి' అనునవి 'వృక్షం ప్రతి విద్యోతతే విద్యుత్' ఇత్యాదిస్థలమునందలి 'ప్రతి' మొదలగువానివలె (సంబంధమును జనింపచేసి క్రియాపదము నివర్తించినపిమ్మట) సూచించుట లేదు. అట్లయినను వీటికి కర్మప్రవచనీయసంజ్ఞ విధించుటలో ప్రయోజనమేమనగా - 'సుసిక్తం' ఇత్యాదులలో గత్యుపసర్గలను బాధించి కర్మప్రవచనీయ సంజ్ఞమాత్రమే 'సు' 'అతి' అనువాటికి ఉండును కావున 'ఉపసర్గాత్ సునోతి' ఇత్యాది (8.3.65) సూత్రముచే విహితమగు షత్వము ('సిక్తం' లోని సకారమునకు)రాదు. ఇట్లు షత్వాదులు రాకుండుటయే ఈ కర్మప్రవచనీయసంజ్ఞకు ప్రయోజనము.[1]

సంబంధ విశేషద్యోతకములగు కర్మ ప్రవచనీయములకు వెనుక చెప్పినట్లు శేష షష్ఠిని ఒక్కదానిని బాధించుటయే ప్రయోజనము కాదు. కొన్ని స్థలములలో హేతు తృతీయను బాధించుట గూడ ప్రయోజనమని ప్రసంగవశమున చెప్పుచున్నాడు.

హేతు హేతుమతో ర్యోగపరిచ్ఛేదేఽనునా కృతే
ఆరమ్భా ద్బాధ్యతే ప్రాప్తా తృతీయా హేతులక్షణా. 208

హేతుహేతుమతోః = హేతువుయొక్కయు హేతుమత్తుయొక్కయు, యోగపరిచ్ఛేదే = హేతుహేతుమద్భావసంబంధముయొక్క నిర్ధారణము, అనునా = 'అను' అనెడు ఉపసర్గముచే, కృతే = చేయబడినదగుచుండగా, ప్రాప్తా = ద్వితీయను బాధించి ప్రాప్తమైన, హేతులక్షణా = హేతుత్వప్రయుక్తమగు, తృతీయా = తృతీయావిభక్తి, ఆరమ్భాత్ = శాస్త్రారంభసామర్థ్యము వలన, బాధ్యతే = బాధింపబడుచున్నది.

తా. హేతు హేతుమత్తుల సంబంధ నిర్ధారణము 'అను' చేత చేయబడినదగుచుండగా, ద్వితీయను బాధించి ప్రాప్తించుచున్న హేతులక్షణ తృతీయ శాస్త్రారంభ సామర్థ్యముచే బాధింపబడుచున్నది.

[1] కాని 'అతిరతిక్రమణేచ' (1-4-95) అను సూత్రముచే అతికి కర్మ ప్రవచనీయ సంజ్ఞ విధింపబడినది గాన 'అతిదేవాన్ కృష్ణః,' ఇత్యాదులలో దేవాదిశబ్దములకు ద్వితీయ వచ్చినది, ఇది కర్మ ప్రవచనీయములగు ప్రత్యాదులవలె సంబంధ బోధకముగా నున్నది. కావున ఈ కారికలో 'అతి' ని అతిసిక్తమ్ ఇత్యాద్యుదాహరణములను మాత్రమే దృష్టిలోనుంచుకొని చేర్చినట్లు కనబడుచున్నది.

వి. 'అనుర్లక్షణే' (1.4.84)అను సూత్రము లక్ష్యలక్షణ భావరూప సంబంధము ద్యోత్య మగునపుడు 'అను' అను ఉపసర్గమునకు కర్మప్రవచనీయసంజ్ఞను విధించుచున్నది. దానికి ఉదాహరణము 'శాకల్యస్య సంహితా మను ప్రావర్షత్' అనునది, 'శాకల్యుడు సంహితను పఠించినపుడు వర్షము కురిసినది' అని యర్థము. ఇచట వర్షమెపుడు కురిసినదో చెప్పుటకు శాకల్యుడు సంహితను పఠించుట అనునది లక్షణము (గుర్తు), వర్షము కురియుట అనునది లక్ష్యము. వర్షము కురియుటకు సంహితాపఠనము హేతువు. అనగా సంహితాపఠనజన్యా పూర్వము వర్షము కురియుటకు నిమిత్తము. ఈ లక్ష్య లక్షణ భావరూప సంబంధమును బోధించుచున్నదిగాన 'అను'కు కర్మప్రవచనీయ సంజ్ఞ లభించినది, 'సంహితా' శబ్దమునకు ద్వితీయ వచ్చినది.

ఇచట విచారణీయాంశ మిది. కారకమనియు జ్ఞాపకమనియు హేతువు రెండు విధములు. ఘటాదులకు దండాదులు కారకహేతువులు, అనగా అవి ఘటాదుల నిర్మాణమునకు సహకరించుచున్నవి. 'వృక్షమను విద్యోతతే విద్యుత్'అనునపుడు విద్యుత్తు ఎక్కడ మెరిసినదో గుర్తుగానున్నదిగాన వృక్షము జ్ఞాపకహేతువు. దీనినిబట్టి లక్ష్య లక్షణభావసంబంధము గూడ హేతుహేతుమద్భావరూపమైనదే అని తేలినది. కావున 'లక్షణేత్థంభూతాఖ్యాన–' ఇత్యాది సూత్రముచేతనే (1.4.90) 'సంహితామను' ఇత్యాద్యుదాహరణమునందు కూడ కర్మ ప్రవచ నీయత్వము లభించుచుండగా మరల 'అను ర్లక్షణే' (1.4.84)అను సూత్రముచే కర్మ ప్రవచ నీయ సంజ్ఞావిధాన మెందులకు అనునది ప్రశ్న. దీనికి సమాధానమేమనగా–'సంహితా మను' ఇత్యాద్యుదాహరణమున 'లక్షణేత్థం–' ఇత్యాది (1.4.90) సూత్రముచే కర్మ ప్రవచనీయ త్వము, తత్ప్రయుక్తమగు ద్వితీయయు రావచ్చును; కాని సంహితాపఠనము వర్షాగమనమునకు హేతువుగాన పూర్వమగు కర్మ ప్రవచనీయ సంజ్ఞా విధాయక శాస్త్రమును బాధించి, పరమగు 'హేతౌ' అనుసూత్రముచే (2.3.23) తృతీయ వచ్చును గాన అది రాకుండుటకై 'అను ర్లక్షణే' అనుసూత్రము చెప్పబడినది. 'హేతౌ' అనుసూత్రము (2.3.23) 'అనుర్లక్షణే' అను (1.4.84) సూత్రముకంటె గూడ పరమే యైనను దానిని బాధింపదు. దానిని గూడ బాధించి తృతీయయే వచ్చినచో 'అను ర్లక్షణే' అను సూత్రమును చెప్పుట వ్యర్థమగును. పృథక్సూత్ర నిర్మాణసామర్థ్యముచే పరమైనను హేతుతృతీయా విధాయక సూత్రమును పూర్వమగు ఈసూత్రమే బాధించును.

ఈ విధముగ కర్మ ప్రవచనీయసంజ్ఞ కొన్ని ఉదాహరణములలో శేష షష్ఠిని కొన్ని ఉదాహరణములలో హేతు తృతీయను బాధించి ద్వితీయ వచ్చుట కుపయుక్తమగు చున్నదని తాత్పర్యము.

కర్మప్రవచనీయములకు సంబంధించిన ప్రాసంగిక విచారమును పూర్తిచేసి ఇపుడు కర్మ ప్రవచనీయమునకు ద్యోతకత్వమే కాని వాచకత్వాదికము లేదని చెప్పుచున్నాడు.

క్రియాయా ద్యోతకో నాయం సమ్బన్ధస్య న వాచకః
నాపి క్రియాపదాక్షేపీ సమ్బన్ధస్య తు భేదకః . 204

అయం = కర్మప్రవచనీయము, క్రియాయాః = లక్షణాది క్రియకు, ద్యోతకః = ద్యోతకము, న = కాదు. సమ్బన్ధస్య = సంబంధమునకు, వాచకః = వాచకము, న = కాదు,

క్రియాపదాక్షేప్యపి = క్రియాపదము నాక్షేపించునది గూడ, న = కాదు. తు = కాని, సమ్బన్ధస్య = సంబంధమునకు, భేదకః = విశేషకము (సంబంధమునందలి విశేషమును సూచించును).

తా. ఇది క్రియను ద్యోతింపచేయదు; సంబంధవాచకము కాదు; క్రియాపదాక్షేపమును కూడ చేయదు. సంబంధమునందలి విశేషమును మాత్రము బోధించును.

వి. కర్మప్రవచనీయ ప్రయోగస్థలమున లక్షణాదిక్రియల ప్రతీతి కలుగుట లేదు; కాన అది క్రియాద్యోతకము కాదు. షష్ఠిని బాధించి వచ్చిన ద్వితీయయే సంబంధమును బోధించుచున్నది గాన అది సంబంధవాచకము కూడ కాదు. 'ప్రాదేశం విలిఖతి' ఇత్యాదులలో 'వి' శబ్దము విమానమను క్రియను (విశేషమయిన మానము, అనగా కొలత అని అర్థము) ఆక్షేపించినట్లు ఇది లక్షణక్రియను ఆక్షేపించుటలేదు. ఇంక నేమనగా లక్షణాది క్రియాజనితమగు సంబంధమునందలి విశేషమును మాత్రము బోధించును.

వాక్య వాక్యార్థములు అఖండములని యంగీకరించు సిద్ధాంతి తన వాదమున పద పదార్థ విభాగము అనుపపన్నమైనను కాల్పనికమగు అట్టి విభాగమును అంగీకరించి, నిరుక్తకారానుసారముగ నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము అని నాల్గు విధములగు పదములను గూర్చి వివరించెను. కర్మప్రవచనీయము ఐదవ విధమగు పదము అను మతము ననుసరించి దాని స్వరూపమును గూడ స్పష్టీకరించెను. ఇట్లు శాస్త్రీయవ్యవహారార్థమై సఖండత్వ పక్షము నంగీకరించినను అఖండత్వ పక్షమే పారమార్థికమని సమర్థింపబోవుచు భాష్య వార్తిక విరోధము నాశంకించి చెప్పుచున్నాడు.

> అనర్థకానాం సఙ్ఘాతః సార్థకోఽనర్థకస్తథా
> వర్ణానాం పద మర్థేన యుక్తం నావయవాః పదే. 205

అనర్థకానామ్ = అర్థరహితములగు, వర్ణానామ్ = వర్ణములయొక్క, సఙ్ఘాతః = సమూహము, సార్థకః = ('ఘటః' ఇత్యాదులలో) సార్థకము, తథా = మరియు, అనర్థకః = ('కర్పటః' ఇత్యాదులలో) నిరర్థకము, పదమ్ = పదమే, అర్థేన = అర్థముతో, యుక్తమ్ = కూడినది (వర్ణములు కావు; కావున), పదే = పదమునందు, అవయవాః = అవయవములు, న = లేవు

తా. అర్థరహితములగు కొన్ని వర్ణముల సంఘాతము సార్థకముగను, కొన్ని వర్ణముల సంఘాతము నిరర్థకముగను ఉండును. అర్థముతో కూడినది పదమే. పదమునందు అవయవములు లేవు,

వి. 'సఙ్ఘాతార్థవత్త్వాత్' అని యొక వార్తికము గలదు. పదముల సముదాయము వాక్యము. ఆ వాక్యము అర్థవంతము. వాక్యమువలె వాక్యఘటితములగు పదములుగూడ అర్థవంతములు. అట్లే వర్ణముల సంఘాతము పదము. ఈపదము అర్థవంతముగాన తద్ఘటితములగు వర్ణములును అర్థవంతములై యుండవలెను అని దాని యభిప్రాయము. దీనినిబట్టి వాక్యఘటితములగు పదములకు వలె పదఘటితములగు వర్ణములకు గూడ అర్థముండవలెనని వార్తికకారుని యభిప్రాయము గాన అఖండత్వపక్షమున ఏతద్వార్తికవిరోధము నాశంకించి ఈ కారిక చెప్పబడుచున్నది.

వర్ణములకు అర్థములేదు. ఇట్టి వర్ణములు సంఘాతముగ నేర్పడినపుడు కొన్ని, 'ఘటః' ఇత్యాదిసంఘాతములకు అర్థవిశేషముండును; 'కర్పట' ఇత్యాదిసంఘాతములకు

ఉండదు. ఇట్లు వర్ణసంఘాతమే అర్థబోధకమగును గాని వర్ణములు అర్థబోధకములు కావు. పదార్థములు వాక్యార్థమునందు ఉపకరించునట్లు వర్ణార్థములు పదార్థమునందుపకరించుటలేదు. కావున పదములకు అవయవములుగ వర్ణములనునవి ఉన్నటులగూడ అంగీకరింపబనిలేదని యభిప్రాయము.

నిరర్థకములగు వర్ణముల సంఘాతము కొన్ని యెడల సార్థకము, కొన్ని యెడల నిరర్థకము అయినట్లు అర్థయుక్తములగు పదముల సముదాయము గూడ పరస్పర సంబంధ ముండుట లేకపోవుట అను భేదమును బట్టి సార్థకముగను నిరర్థకముగను ఉండును అని చెప్పుచున్నాడు.

పదానా మర్థయుక్తానాం సఙ్ఘాతో భిద్యతే పునః
అర్థాన్తరాపరోధేన సమ్బన్ధవిగమేన చ . 206

పునః = మరియు, అర్థయుక్తానాం = అర్థముగల, పదానామ్ = పదములయొక్క, సఙ్ఘాతః = సంఘాతము, అర్థాన్తరాపరోధేన = పదార్థముకంటె భిన్నమగు సంసర్గరూపమైన అర్థమును స్వీకరించుటచేతను, సమ్బన్ధ విగమేన చ = అట్టి సంసర్గము లేకపోవుటచేతను, భిద్యతే = భేదించుచున్నది (రెండువిధములుగ నున్నది).

తా. అర్థయుక్తములగు పదముల సంఘాతము అర్థాంతరమును స్వీకరించుట చేతను, స్వీకరింపకుండుటచేతను భిన్నముగ నున్నది.

వి. భిన్నార్థబోధకములగు పదములు ఒక సంఘాతముగ నేర్పడినపుడు ఆ పదములలో ఒకదానితో మరియొకదానికి సంబంధము (సంసర్గము) ఉన్నయెడల అపుడా సంఘాతము అర్థబోధకమగును, ఈ సంసర్గ మనునది పదవాచ్యము కాదు. రెండు పదము లొకచోట చేరగనే సహజముగ భాసించుచున్నది. ఉదాహరణమునకు – "దేవదత్త ! గామ భ్యాజ శుక్లాం దణ్డేన" (ఓ దేవదత్తా! తెల్లని ఆవును దండముతో తోలుకొనిరమ్ము) ఇత్యాది పదసంఘాతములలోని పదములు ప్రత్యేకముగ స్వస్వార్థములను బోధించుటయే కాక ఒకదానితో నొకటి సంబంధించునవిగ కూడ ఉన్నవి. కావున ఈ పదసంఘాతము అర్థవంతము. కాని 'దశదాడిమాని, షడపూపాః' ఇత్యాది పదసంఘాతములలోని పదములకు స్వస్వార్థ బోధకత్వమున్నను, వాటికి పరస్పర సంబంధమేదియు కానవచ్చుటలేదు. కావున నీ పద సంఘాతము నిరర్థకము.

కొన్ని స్థలములలో వర్ణసముదాయముల పరస్పర సంబంధ తదభావములను గూర్చిన మతభేదమును చెప్పుచున్నాడు.

సార్థకానర్థకౌ భేదే సమ్బన్ధం నాధిగచ్ఛతః
అధిగచ్ఛత ఇత్యేకే కుటీరాదినిదర్శనాత్ . 207

భేదే = ప్రకృతి ప్రత్యయవిభాగము చేసినపుడు, సార్థకానర్థకౌ = ఒకటి సార్థకమై రెండవది నిరర్థకమై యుండు వర్ణసముదాయములు, సమ్బన్ధం = పరస్పరసంబంధమును, నాధిగచ్ఛతః = పొందవు (అని కొందరు అందురు). కుటీరాదినిదర్శనాత్ = 'కుటీర' మొదలగు వర్ణసంఘాత ద్వయఘటితపదముల నిదర్శనమును పురస్కరించుకొని, ఏకే = కొందరు, అధిగచ్ఛతః = పొందును, ఇతి = అని (చెప్పుచున్నారు).

తా. విడదీసినపుడు సార్థకముగను నిరర్థకముగను ఉండునవి పరస్పరసంబంధమును పొందవని కొందరును, కుటీరాది దృష్టాంతముచే పొందునని కొందరును చెప్పుచున్నారు.

వి. 'కుటీర' మొదలగు శబ్దముల ప్రకృతిప్రత్యయ విభాగముచేయగా 'కుటీ' అను ఒక వర్ణసముదాయము, 'ర' అను మరియొక వర్ణసముదాయమును విడివడును. ఇందు కుటీ అను వర్ణసంఘాతము సార్థకము (పర్ణశాల యని యర్థము), 'ర' అను సంఘాతము నిరర్థకము. ఆ రెండును పరస్పరసంబంధమును పొందవని కొందరును, అల్పత్వరూపార్థద్యోతకమగుటచే 'ర' ప్రత్యయము గూడ సార్థకమే గాన ఇవి పరస్పర సంబంధమును పొందునని మరికొందరును చెప్పుచున్నారు.

సంఘాతము అర్థవంతముగాన అవయవములు గూడ అర్థవంతములే యని చెప్పుచున్నాడు.

> అర్థవద్భ్యో విశిష్టార్థః సంఘాత ఉపజాయతే
> నోపజాయత ఇత్యేకే సమాసస్వార్థికాదిషు . 208

అర్థవద్భ్యః = అర్థవంతములగు వర్ణపదాదులనుండి, విశిష్టార్థః = ఆ వర్ణములకంటెను పదములకంటెను విలక్షణమగు అర్థముగల, సంఘాతః = సంఘాతము, ఉపజాయతే = కలుగుచున్నది (అని కొందరు). నోపజాయతే = కలుగదు, ఇతి = అని, ఏకే = మరికొందరు అనుచున్నారు. సమాసస్వార్థికాదిషు = సమాసములు స్వార్థిక ప్రత్యయములు మొదలగువాటిలో ('తథా దర్శనాత్' అని అధ్యాహారము - అట్లు కనబడుటవలన).

తా. సమాసస్వార్థికాదులను బట్టి అర్థవంతములగు వాటినుండి విశిష్టార్థ మగు సంఘాతమేర్పడునని కొందరును, కలుగదని మరికొందరును చెప్పుచున్నారు.

వి. 'చిత్రగుః' ఇత్యాది సమాసములయందు అర్థవంతములగు పదముల కలయికవలన విశిష్టార్థమగు సమాసరూపసంఘాతము జనించుచున్నది గాన, దాని నుదాహరణముగ గొని కొందరు అర్థవంతములగు వర్ణపదాదులవలన విశిష్టార్థమగు సంఘాతమేర్పడునని యంగీకరించుచున్నారు. 'బాలకః' ఇత్యాదులలో స్వార్థమున విహితములగు 'క' ప్రత్యయాదులు చేర్చినను సంఘాతము విశిష్టార్థమును దేనినీ బోధించుటలేదు గాన, ('బాలః' అన్న ఏ యర్థమో 'బాలకః' అన్ననూ అదియే యర్థము) అట్టి స్వార్థికాది ప్రత్యయాంత సంఘాతములయందు అర్థవంతములగు అవయవముల వలన విశిష్టార్థ సంఘాతము జనించుట అనునది లేదని మరికొందరనుచున్నారు.

సంఘాతములు పైనచూపిన ప్రకారము రెండువిధములుగ (కొన్ని విభక్తావయవార్థములుగను మరికొన్ని విభక్తావయవార్థ రహితములుగను) ఉన్నవని చెప్పుచున్నాడు.

> కేచిత్తు యుతసిద్ధార్థాః భేదే నిర్జ్ఞాతశక్తయః
> అన్వయవ్యతిరేకాభ్యాం కేచిత్ కల్పితశక్తయః . 209

యుతసిద్ధార్థాః = విభక్తమై తెలియబడు అర్థముగల, కేచిత్తు = కొన్ని సంఘాతములైతే, భేదే = విభాగము చేయబడినవగుచుండగా, నిర్జ్ఞాతశక్తయః = వేరువేరుగా గుర్తింప

పీలగు శక్తికలవి, కేచిత్ = కొన్ని సంఘాతములు, అన్వయ వ్యతిరేకాభ్యామ్ = అన్వయవ్యతిరేకములచేత, కల్పితశక్తయః = కల్పింపబడిన శక్తికలవి.

తా. వేరుగతెలియు అర్థములు గల కొన్ని సంఘాతములు విభాగము చేసినపుడు వేరువేరుగ తెలియబడు శక్తి కలవిగనుండును. కొన్ని అన్వయవ్యతిరేకములచే కల్పితమగు శక్తి కలవిగనుండును.

వి. 'శమీవృక్షః', 'దాడిమీ వృక్షః', ఇత్యాది పదసంఘాతములలోని 'శమీ' 'వృక్ష' మొదలగు అవయవముల స్వరూపమున మార్పు ఏదియునులేదు గాన, అట్టి సంఘాతములను విడదీసినను వాటి అవయవముల అర్థము స్పష్టముగ తెలియుచున్నది. 'ప్రగతే జానునీ యస్య సః' 'సంహతే జానునీ యస్య సః' అను నర్థమున జానుశబ్దమునకు 'జ్ఞు' అను నాదేశమురాగా సిద్ధించిన 'ప్రజ్ఞుః' (ఎడముగానున్న మోకాళ్ళుకలవాడు) 'సంజ్ఞుః' (కలిసిన మోకాళ్ళుకలవాడు) ఇత్యాది సమాసముల అవయవార్థము, తద్ఘటితమగు జానుశబ్దము పూర్తిగ అదృశ్యమైనది గాన, 'ప్రసంభ్యాం జానునోర్జ్ఞుః' (౫-4-129) ఇత్యాది లక్షణము ననుసరించి అన్వయ వ్యతిరేకములసహాయముచేతనే అవగతమగుచున్నది. కావున "సంఘాతార్థవత్త్వాత్" అను వార్తికము అనైకాన్తికము, భాగాసిద్ధము కూడనని యర్థము.

అనైకాన్తికత్వము, భాగాసిద్ధత్వము అనునవి హేతుదోషములు. ఇట్టి దోషములు పట్టిన హేతువునకు 'హేత్వాభాస' మనిపేరు. ఒకసాధ్యమును సాధించుటకై చెప్పినహేతువు ఆసాధ్యము ఉండుటకు అవకాశములేని స్థలమునందుగూడ ఉన్నచో అట్టి హేతువు అనైకాంతికము. "పర్వతో వహ్నిమాన్, ప్రమేయత్వాత్" (పర్వతము ప్రమేయముగాన—జ్ఞేయముగాన—దానిపై వహ్ని యుండవలెను.) అను ప్రయోగమున 'ప్రమేయత్వాత్' అను హేతువు పక్షమైన పర్వతమునందును, వహ్నిలేని విపక్షమగు హ్రదమునందును గూడ ఉన్నది గాన ఇది అనైకాంతికము. అట్టి దుష్టహేతువు సాధ్యమును సాధింపజాలదు. (ప్రమేయత్వ మనగా, తెలిసికొనుటకు శక్యమగుట. ప్రపంచమునందలి పదార్థములన్నియు ప్రమేయములే). వార్తికకారుడు 'సంఘాతార్థవత్త్వాత్' అని చెప్పుటలో "పదాద్యవయవాః అర్థవన్తః, అర్థవత్సంఘాతావయవత్వాత్" అను అనుమానమును అంగీకరించినట్లయినది. "పదములు మొదలగు అవయవములకు గూడ అర్థమున్నది. అవి అర్థవంతమగు సంఘాతమునకు అవయవములగుటవలన" అని అనుమానప్రయోగమున కర్థము. కాని, ఈ (20౬ వ) కారికలోచెప్పినవిధముగ 'సంజ్ఞుః' ఇత్యాది పదావయవములగు 'జ్ఞు' ఇత్యాదులకు అర్థము లేదు గాన "అర్థవత్సంఘాతావయవత్వాత్ అను హేతువు వ్యభిచారదోషదుష్టమైనది. (అనైకాన్తికత్వమునకు వ్యభిచారమనికూడ పేరు.)

అసిద్ధత్వదోషము- ఆశ్రయాసిద్ధము, స్వరూపాసిద్ధము, వ్యాప్యత్వాసిద్ధము అని మూడు విధములు. 'గగనారవిందం సురభి; అరవిందత్వాత్; సరోజారవిందవత్' అను అనుమానమున గగనారవిందమనునదే లేదు గాన, 'అరవిందత్వాత్' అను హేతువుకు ఆశ్రయము లేదు. కావున ఇది ఆశ్రయాసిద్ధము. పై వార్తికము ననుసరించి 'వర్ణాః అర్థవన్తః, అర్థవత్సంఘాతావయవత్వాత్' అని ప్రయోగము చేసినచో 20౬ వ కారికలో చెప్పినవిధముగ ('నావయవాః పదే') వర్ణములనునవే అంగీకార్యములు కావు గాన, ఈ హేతువు ఆశ్రయాసిద్ధత్వదోష దుష్టము.

"ఏకవర్ణ రూపములగు ధాతు, ప్రాతిపదిక, ప్రత్యయ, నిపాతములు అర్థవంత ములుగ కానవచ్చుచున్నవి. కావున వర్ణములు గూడ నర్థవంతములు" (అర్థవన్తోవర్ణాః; ధాతు ప్రాతిపదిక ప్రత్యయ నిపాతానా మేక వర్ణానామర్థ దర్శనాత్)" అనగా — 'ఇ'అను ఏకవర్ణ రూపమగు ధాతువునకు గమన మర్థము; 'అ' మొదలగు ప్రాతిపదికములు విష్ణ్వాద్యర్థ కములు; 'కారుః' (శిల్పి) ఇత్యాదులలోని 'ఉ' కారాది ప్రత్యయములు కర్త్రాద్యర్థకములు. 'అఅపేహి' ఇత్యాదులలో 'అ' కారాది నిపాతములు సంబోధనాద్యర్థకములు. ఈ విధముగ ఏకవర్ణరూప ధాత్వాదులు సార్థకములు గాన వర్ణము లన్నియు సార్థకములే యని వార్తిక కారుని ఆశయము). దీనిని నిరాకరించుచున్నాడు.

> శాస్త్రార్థ ఏవ వర్ణానా మర్థవత్త్వే ప్రదర్శితః
> ధాత్వాదీనాం విశుద్ధానాం లౌకికోఽర్థో న విద్యతే . 210

వర్ణానామ్ = వర్ణములకు, అర్థవత్త్వే = అర్థవత్త్వమును సాధించువిషయమున (ప్రమాణముగ), శాస్త్రార్థఏవ = ప్రక్రియకొరకై శాస్త్రముచే అంగీకరింపబడిన అర్థమే, ప్రదర్శితః = (వార్తికకారునిచే) చూపబడినది, విశుద్ధానామ్ = కేవలములైన, ధాత్వాదీనామ్ = ధాతు ప్రాతిపదికాదులకు, లౌకికః = లౌకికమైన, అర్థః = అర్థము, న విద్యతే = లేదు.

తా. వర్ణములు అర్థవంతములు అని సాధించుటకు శాస్త్రమాత్రాంగీకృతమగు అర్థమే ప్రమాణముగ చూపబడినది. విశుద్ధములగు ధాత్వాదులకు లౌకికార్థము లేదు.

వి. వార్తికకారుడు వర్ణములు సార్థకములని నిరూపించు నుద్దేశముతో ఏకవర్ణ రూపధాత్వాదుల సార్థకత్వమును ఉదాహరణముగ చూపియున్నాడు. అది యుక్తము కాదు. ధాత్వాదుల కర్థము శాస్త్రపరికల్పితమేకాని, లోకమున వాటికి స్వతంత్రప్రయోగము గాని, అర్థవిశేష బోధకత్వముగాని లేదుకదా.

కేవలములగు కృత్ప్రత్యయ తద్ధిత ప్రత్యయాదులకు గూడ స్వతంత్రముగ అర్థబోధ కత్వము లేదని చెప్పుచున్నాడు.

> కృత్తద్ధితానా మర్థశ్చ కేవలానా మలౌకికః
> ప్రాగ్విభక్తే స్తదన్తస్య తథైవార్థో న విద్యతే . 211

కేవలానామ్ = కేవలములైన, కృత్తద్ధితానామ్ = కృత్తద్ధిత ప్రత్యయముల, అర్థశ్చ = అర్థముకూడ, అలౌకికః = శాస్త్రీయము మాత్రమేగాని, లోకప్రసిద్ధముకాదు, తథైవ = అట్లే, విభక్తేః ప్రాక్ = విభక్తిప్రత్యయములు చేర్చుటకు పూర్వము, తదన్తస్య = కృతద్ధిత ప్రత్యయాంతమునకు, అర్థః = అర్థము, న విద్యతే = లేదు.

తా కేవల కృత్తద్ధితముల అర్థముకూడ శాస్త్రమాత్రప్రసిద్ధము, విభక్తిప్రత్యయ ములను చేర్చుటకుపూర్వము తదంతములకు కూడ అర్థములేదు.

వి. కేవల కృత్ప్రత్యయ, తద్ధితప్రత్యయములకును, విభక్తి ప్రత్యయరహితము లగు కృత్ప్రత్యయాంత తద్ధితప్రత్యయాంతములకును లౌకికార్థముగాని, స్వతంత్ర ప్రయో గార్హతగాని లేదు.

కృత్తద్ధితాంతములకు గూడ అర్థము లేకున్నచో సూత్రకారుడు మొదట — 'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్' (1.2.45) (ధాతువు, ప్రత్యయము, ప్రత్యయాంతము

కాని, అర్థవంతమగు శబ్దస్వరూపము (ప్రాతిపదిక సంజ్ఞ మగును) అను సూత్రముచే, ప్రాతిపదిక సంజ్ఞను విధించి, మరల 'కృత్తద్ధిత సమాసాశ్చ' (1.2.46) అను సూత్రమున, వెనుకటి సూత్రము నుండి 'అర్థవత్' అను పదమును అనువర్తింప చేసికొని 'అర్థవంతములగు కృత్తద్ధితాంతములకు ప్రాతిపదిక సంజ్ఞను ఎట్లు విధించినాడు? దానినిబట్టి కేవల కృత్తద్ధితాంతములకు కూడ అర్థమున్నట్లు సూచిత మగుచున్నది కదా? యని ఆశంకించుకొని, కృత్తద్ధితాంతములకు ఈ సూత్రములో చెప్పిన అర్థవత్త్వము శాస్త్రీయార్థవత్త్వమే గాని లౌకికార్థవత్త్వము కాదని పరిహరించుచున్నాడు.

అభివ్యక్తతరో యోఽర్థః ప్రత్యయాన్తేషు లక్ష్యతే
అర్థవత్ప్రకరణా దాశ్రితః స తథావిధః. 212

ప్రత్యయాన్తేషు = కృత్తద్ధిత ప్రత్యయాంతములయందు, యః = ఏ, అర్థః = శాస్త్రీయార్థము, అభివ్యక్తతరః = ప్రకృత్యర్థముకంటె ఎక్కువ వ్యక్తముగ, లక్ష్యతే = అపోద్ధార కల్పనచేత ఏర్పడిన అన్వయవ్యతిరేకముల సహాయముచే గోచరించుచున్నదో, తథావిధః = ఆ విధముగ శాస్త్రీయమైన, సః = ఆ అర్థము, అర్థవత్ప్రకరణాత్ = కృత్తద్ధితేత్యాది సూత్రములోనికి 'అర్థవత్' అను పదమును అనువర్తింప చేసికొనుటచే, ఆశ్రితః = సూత్రకారునిచే ఆశ్రయింపబడినది.

తా. ప్రత్యయాంతములయందు ఏ అర్థము ఎక్కువగ అభివ్యక్తముగ నున్నదో అట్టి శాస్త్రీయార్థమే 'అర్థవత్' అను పదమును, అనువర్తింపచేసికొనుటచే ఆశ్రయింపబడినది.

వి. అనగా, ఇచట కృత్తద్ధితాంతములు విభక్త్యుత్పత్తికి పూర్వము బోధించు అర్థము శాస్త్రీయమేగాని లౌకికము కాదు కావున, కృత్తద్ధితాంతములు విభక్తిప్రత్యయోత్పత్తికి పూర్వము నిరర్థకములు అని చెప్పుట యుక్తమే అని భావము.

పదములును, వాక్యములును అర్థమును బోధించును అని లోకమున ప్రసిద్ధి యున్నది. వర్ణములు అర్థవంతములని అంగీకరించినచో ఈ లోక ప్రసిద్ధికి భంగము వాటిల్లును అని చెప్పుచున్నాడు.

ఆత్మభేదో న చేత్ కశ్చి ద్వర్ణేభ్యః పదవాక్యయోః
అన్యోన్యాపేక్షయా శక్త్యా వర్ణః స్యా దభిధాయకః. 213

పదవాక్యయోః = పదవాక్యములకు, వర్ణేభ్యః = వర్ణములకంటె, ఆత్మభేదః = స్వరూపభేదము, కశ్చిత్ = ఏదియు, న చేత్ = లేకున్నచో, అన్యోన్యాపేక్షయా = పరస్పరాపేక్షగల, శక్త్యా = శక్తిచేత, వర్ణః = వర్ణమే, అభిధాయకః = వాచకము, స్యాత్ = అగును.

తా. పదవాక్యములకు వర్ణములకంటె స్వరూపభేద మేదియును లేకున్నచో, పరస్పరాపేక్షగల శక్తిచేత వర్ణమే వాచకము కావలసి యుండును.

వి. వర్ణములు అర్థవంతములు అని అంగీకరించినచో పదవాక్యములుగూడ అర్థవద్వర్ణసముదాయములేగాన, వర్ణములే పరస్పరాపేక్షగల శక్తిచే అర్థబోధకములు అని చెప్పవలసి యుండును. వర్ణముకంటె అతిరిక్తమగు పదముగాని, వాక్యముగాని, లేకపోవుటచే అవి వాచకములు కావు అని అంగీకరింపవలసి యుండును. వర్ణములకు అర్థములేదని అంగీక

రించినచో అర్థవంతములగు పదవాక్యములకు ఒక విశిష్టస్వరూపమున్నదనియు, అవియే అర్థబోధకము లనియు చెప్పుటకు వీలగును. ఇది లోకప్రసిద్ధికి అనుగుణముగ నుండును.

'నిష్కర్తారమ్' (చేయువానిని) అను పదములో 'న' కారమును లోపింపచేసి, 'ఇష్కర్తారమ్' అని ప్రయోగించినను అర్థబోధము కలుగుచున్నది. కాన అవయవములు కూడ వాచకములే యని యాశంకించి, ఆ విధముగ ఒక వర్ణమును తొలగింపగా, ఏర్పడిన 'ఇష్కర్తారమ్' ఇత్యాది శబ్దము 'నిష్కర్తారమ్' కంటె భిన్నమగు శబ్దమని గాని, అదే శబ్దమనిగాని రెండు పక్షములు చెప్పవచ్చును. రెండు పక్షములందును గూడ అవయవములు అనర్థకములే యని చెప్పుచున్నాడు.

వర్ణేన కేనచి న్న్యూనః సఙ్ఘాతో యోఽభిధాయకః
నచే చ్ఛబ్దాన్తర మసౌ వన్న్యూన స్తేన గమ్యతే. 214

కేనచిత్ = ఒకానొక, వర్ణేన = నకారాదివర్ణముతో, న్యూనః = న్యూనమైన, యః = ఏ, సఙ్ఘాతః = 'ఇష్కర్తారమ్' అను సంఘాతము, అభిధాయకః = అర్థబోధకముగ నున్నదో, అసౌ = ఈ సంఘాతము, శబ్దాన్తరం = 'నిష్కర్తారమ్' అనుదానికంటె భిన్నమగు శబ్దము, నచేత్ = కానిచో, తేన = ఆ న్యూన వర్ణపదముచే, అన్యూనః = పరిపూర్ణమగు 'నిష్కర్తారమ్' అను పదము, గమ్యతే = గమ్యమగుచున్నది.

తా. ఒకవర్ణము తొలగించినను అర్థబోధకముగ నున్న వర్ణసంఘాతము శబ్దాంతరము కాకున్నచో, దానిచే పరిపూర్ణశబ్దము గమ్యమగుచున్నది.

వి. న్యూనవర్ణమగు 'ఇష్కర్తారమ్' అనునది 'నిష్కర్తారమ్' అనుదానికంటె భిన్నమని అంగీకరించు పక్షమున అవయవముకూడ వాచకమని చెప్పుటకు అవకాశమేలేదు. అట్లుకాక ఆ రెండును ఏకశబ్దమేయన్నచో 'ఇష్కర్తారమ్' అను న్యూనవర్ణశబ్దముద్వారా 'నిష్కర్తారమ్' అను పూర్ణశబ్దము గమ్యమానమై దానిచే అర్థబోధ కలుగుచున్నదని చెప్పవలెను. ఈ ద్వితీయపక్షమునందుగూడ అవయవమునకు వాచకత్వము లేదని తేలినది.

ఎవ్వడైన వక్త 'ఇష్కర్తారమ్' అని ప్రయోగించినచో శ్రోత – ఈతడు 'నిష్కర్తారమ్' అని ఉచ్చరించుటకు బదులు ఉచ్చారణ దోషముచే 'ఇష్కర్తారమ్' అని పలుకుచున్నాడనియు, వాస్తవమున ఆ పదము 'నిష్కర్తారమ్' అనునదియే యనియు తెలిసికొని అర్థజ్ఞానమును బొందుచున్నాడు. కావున 'నిష్కర్తారమ్' అను పూర్ణపదమే వాచకము గాని తదవయవమగు 'ఇష్కర్తారమ్' అనునది కాదు అని పూర్వకారికోక్త విషయమునే వివరించుచున్నాడు.

స తస్మిన్ వాచకే శబ్దే నిమిత్తాత్ స్మృతి మాదధత్
సాక్షా దివ వ్యవహితం శబ్దే నార్థ ముపోహతే. 215

సః = అన్యూనవర్ణసముదాయము, నిమిత్తాత్ = వ్యాకరణశాస్త్రాభ్యాసరూపనిమిత్తమువలన, తస్మిన్ = ఆ పూర్ణవర్ణమగు, వాచకే = వాచకమగు, శబ్దే = శబ్దమునందు, స్మృతిమ్ = స్మృతిని, ఆదధత్ = కలిగించుచున్నదై, వ్యవహితమ్ = పూర్ణవర్ణశబ్దస్మృతిచే వ్యవహితమగు, అర్థమ్ = అర్థమును, సాక్షాదివ = ప్రత్యక్షముగ వలె, శబ్దేన = పూర్ణవర్ణశబ్దముద్వారా, ఉపోహతే = సమర్పించుచున్నది (బోధించుచున్నది).

తా. అది శాస్త్రాభ్యాసాది నిమిత్తవశమున వాచక శబ్దస్మృతిని కలిగించి వ్యవహితమగు అర్థమును పూర్ణశబ్దముద్వారా ప్రత్యక్షముగ బోధించుచున్నట్లు బోధించుచున్నది.

వి. న్యూనవర్ణ సముదాయమును వినగనే వినువానికి వ్యాకరణశాస్త్రాభ్యాస సంస్కారవశముచేత పూర్ణవర్ణమగు పదము స్మృతికి వచ్చును. అపుడు అర్థబోధ కలుగును. ఈ విధముగ న్యూనవర్ణపదము సాక్షాత్తుగాకాక, పూర్ణవర్ణపదస్మృతిద్వారా అర్థబోధను కలిగించుచున్నను సాక్షాత్తుగా కలిగించుచున్నట్లే తోచును. కావున అవయవమునకు బోధకత్వము పక్షద్వయమందును లేదు.

**అవయవములకు అర్థప్రతిపాదకత్వము లేదనెడు విషయమునే మరల శ్లోకద్వయముచే ప్రతిపాదించుచున్నాడు.**

పదవాచ్యో యథా నార్థః కశ్చిత్ గౌరఖరాదిషు
సత్యపి ప్రత్యయేఽత్యన్తం సముదాయేన గమ్యతే . 216

సమన్విత ఇవార్థాత్మా పదార్థైర్యః ప్రతీయతే
పదార్థదర్శనం తత్ర తథైవానుపకారకమ్ . 217

గౌరఖరాదిషు = 'గౌరఖరః' 'కృష్ణసర్పః' మొదలగుపదములయందు, పదవాచ్యః = 'గౌర', 'ఖర' 'కృష్ణ', 'సర్ప', మొదలగు విభక్తపదములచే వాచ్యమగు, అర్థః = అర్థము, కశ్చిత్ = ఏదియు, ప్రత్యయే = దాని జ్ఞానము, సత్యపి = శ్రవణసమయమున నున్నను, సముదాయే = సముదాయమునందు, యథా = ఏవిధముగా, అత్యన్తమ్ = అత్యంతము. న గమ్యతే = గమ్యముకాదో, తథైవ = ఆ విధముగనే ("దేవదత్త గా మభ్యాజ కృష్ణాం దణ్డేన" ఇత్యాదివాక్యములయందుగూడ) పదార్థైః = పదార్థములతో, సమన్విత ఇవ = సమన్వితము కాకున్నను సమన్వితమైనదివలె, యః = ఏ, అర్థాత్మా = ప్రతిభాలక్షణమగు వాక్యార్థము, ప్రతీయతే = బుద్ధి గోచరమగుచున్నదో, తత్ర = ఆ వాక్యార్థమునందు, పదార్థదర్శనమ్ = పదార్థజ్ఞానము, అనుపకారకమ్ = ఉపకారకము కాదు.

తా. గౌర-ఖరాదిశబ్దములయందు ప్రతీతియున్నను పదవాచ్యమగు అర్థము సముదాయమునందు ఏవిధముగ ఏమాత్రమును గమ్యముగాకుండునో, ఆ విధముగనే పదార్థములతో సమన్వితమైనది వలె, ప్రతీయమానమగు వాక్యార్థమునందు పదార్థజ్ఞానము ఉపకారకము కాదు.

వి. 'గౌరఖరః' అను పదమునకు అడవిగాడిద యని యర్థము. 'కృష్ణసర్పః' అను పదమునకు 'త్రాచుపాము' అని యర్థము. ఈ విధముగ ఈ పదసముదాయములే ఆయా యర్థములను బోధించుచున్నవి. వాటిలో నున్న 'గౌర', 'ఖర', 'కృష్ణ', 'సర్ప', మొదలగు పదములకు వ్యస్తరూపమున అర్థ మేదియు లేదు. పదోచ్చారణసమయమున గౌరాది పదములయర్థము బుద్ధిగోచరమగుచున్నను, సముదాయార్థమునందు ఆ యర్థములకు అన్వయము లేదు. అట్లే 'దేవదత్త గా మభ్యాజ' ఇత్యాది వాక్యములే అఖండమగు ప్రతిభాలక్షణమైన అర్థమును బోధించుచున్నవి. ఏ తద్వాక్యాంతర్గత గవాదిశబ్దార్థములు వాక్యార్థమునకేమియు ఉపకారమును చేయజాలవు. ద్రాక్షారసము, పంచదార, పాలు, మొదలగు మధుర

ద్రవ్యములను, లవంగాది సుగంధద్రవ్యములను, కలిపి తయారుచేసిన పానకమునందు, ఒక విలక్షణమగు రసముండును గాని, ఆ ద్రాక్షాది రసముల జ్ఞానము ఆ రుచియందు వేరువేరుగ గోచరింపదు. అట్లే అఖండమగు వాక్యార్థమున పదార్థములు సమన్వితములైనట్లు కనబడునే గాని, వాటి కొక స్వతంత్ర ప్రతీతి లేదు.

సముదాయములును, అవయవములును, వేరు అర్థములను బోధించునని అంగీకరించినచో వృత్తియందు ఒకే సమయమున విరుద్ధ ధర్మముల ప్రతీతి కలుగవలసి యుండును అని చెప్పుచున్నాడు.

> సముదాయావయవయో ర్భిన్నార్థత్వే చ వృత్తిషు
> యుగపద్భేదసంసర్గౌ విరుద్ధా వానుషంగికౌ. 218

వృత్తిషు = 'గౌర ఖరః' 'కృష్ణ సర్పః' మొదలగు సమాసాది వృత్తులయందు, సముదాయావయవయోః = సముదాయము, అవయవము, భిన్నార్థత్వే = వేరువేరు అర్థములు కలవైనచో, విరుద్ధౌ = పరస్పరవిరుద్ధములగు, భేదసంసర్గౌ = భేదసంసర్గములు, యుగపత్ = ఒక్కమాటుగా, అనుషంగికౌ = ప్రాప్తించును.

తా. వృత్తులయందు సముదాయావయవములు, భిన్నార్థములన్నచో, పరస్పర విరుద్ధములగుభేద-, సంసర్గములు ఒక్కమారుగ ప్రాప్తించును.

వి. మట్టి, నీరు విడదీయరాకుండునట్లు కలసిపోయి బురద యను విజాతీయ వస్తు వుత్పన్నమైనట్లు గౌరఖరాది సమాసవృత్తి గౌతఖరత్వాదిజాతిగల పదార్థాంతరమును బోధించుచుండగా, అదేసమయమున తత్సముదాయమున నవయవములగు 'గౌర', 'ఖర' మొదలగు శబ్దములుసూడ సముదాయార్థ విరుద్ధములగు అర్థములను బోధించునని చెప్పవలసి యుండును. అది అనుభవవిరుద్ధము. కావున సముదాయమునకే గాని, అవయవములకు అర్థము లేదు.

వృత్తియందును, వాక్యార్థముల యందును పద పదార్థములు కల్పితములని అంగీకరింపనిచో 'అధిభువి రామః' ఇత్యాది వాక్యముల యందు 'అధి' మొదలగునవి అధికరణాద్యర్థములను బోధించునని చెప్పవలసి యుండును. అట్లైనచో వాటిని స్వతంత్రరూపమున ప్రయోగించుటకు వీలుండ వలెను. అట్లు లేదుకదా! కావున పద పదార్థములు అసత్యములని చెప్పుచున్నాడు.

> కశ్చ సాధనమాత్రార్థా నధ్యాదీన్ పరికల్పయేత్ ?
> అప్రయుక్తపద శ్చార్థో బహువ్రీహౌ కథం భవేత్ ? 219

కశ్చ = ఎవడు, అధ్యాదీన్ = 'అధి' మొదలగునాటిని, సాధనమాత్రార్థాన్ = అధికరణాది కారకార్థములు కలవాటినిగా, పరికల్పయేత్ = కల్పింపగలడు, బహువ్రీహౌ = బహువ్రీహిసమాసమునందు, అప్రయుక్తపదః = ప్రయోగింపబడని పదముగల, అర్థః = అర్థము, కథమ్ = ఎట్లు, భవేత్ = అగును (బోధింపబడును).

తా. 'అధి' మొదలగునవి సాధన మాత్రార్థములేయని ఎవడు కల్పించును? బహువ్రీహియందు అప్రయుక్తపదమగు అర్థము ఎట్లు భాసించును?

వి. 'అధిహరి' (హరియందు) ఇత్యాది సముదాయమున కే అధికరణార్థ వృత్తిత్వముగాని, 'అధి' అనుదానికి అధికరణార్థ బోధకత్వములేదు. అట్లైనచో దానిని స్వతంత్రముగ ప్రయోగించుటకు వీలుండవలెను. 'చిత్రగుః' (చిత్రమైన గోవులు కలవాడు) ఇత్యాది బహువ్రీహిసమాసములయందు చిత్రమైన గోవులుకల దేవదత్తాదులను బోధించు పద మేదియును లేదు. అయినను దేవదత్తాద్యర్థ ప్రతీతి కలుగుచునే యున్నది. దానినిబట్టి గూడ సముదాయమే విశిష్టార్థబోధకమనియు, అవయవములకు అర్థములేదనియు స్పష్టమగుచున్నది.

అవయవములు కూడ సార్థకములైనచో 'ప్రజ్ఞః', 'సంజ్ఞః' ఇత్యాదులలోని 'జ్ఞః' అనునది భిన్నార్థమును బోధింపవలసి యుండును. అట్లు లేదు. కావున, అవయవములు నిరర్థకములని చెప్పుచున్నాడు.

ప్రజ్ఞసంజ్ఞాద్యవయవై ర్న చాస్త్యర్థావధారణమ్
తస్మాత్సంఘాత ఏవైకో విశిష్టార్థ నిబన్ధనమ్. 220

ప్రజ్ఞసంజ్ఞాద్యవయవైః = 'ప్రజ్ఞః', 'సంజ్ఞః' మొదలగు పదముల అవయవములైన 'జ్ఞ' అను పదములచే, అర్థావధారణమ్ = అర్థనిర్ణయము, నచాస్తి = లేదు, 'జ్ఞ' అనునది స్వతంత్రముగ అర్థబోధకము కాదు. తస్మాత్ = ఆ కారణమువలన, ఏకః = ఒక్క (అఖండమైన), సంఘాతఏవ = స్ఫోటరూపమగు సంఘాతమే, విశిష్టార్థ నిబన్ధనమ్ = ప్రతిభాత్మకమగు విశిష్టార్థబోధకు హేతువు.

తా. 'ప్రజ్ఞ', 'సంజ్ఞ' మొదలగు పదముల అవయవములచే అర్థనిర్ణయము లేదు. కావున సంఘాత మొక్కటియే విశిష్టార్థబోధకారణము.

వి. సమాసములలో ఒక్క సమయముననే భేదము, సంసర్గము, అనెడు విరుద్ధార్థములు ఉపస్థితములు కావలసి యుండుటచేతను, స్వతంత్రముగ 'అధి' మొదలగునవి అధికరణాద్యర్థ బోధకములుగ కానరాకుండుటచేతను, బహువ్రీహియందు ప్రయుక్త పదార్థభిన్నమగు అన్యపదార్థము ప్రతీయమానమగుటచేతను, 'సంజ్ఞః' ఇత్యాదులలోని 'జ్ఞః' మొదలగునవి స్వతంత్రముగ అర్థబోధకములు కాకుండుటచేతను (ఈ నాలుగు హేతువులచే) అఖండమును స్ఫోటాత్మకమును అగు పదసంఘాతమే ప్రతిభాత్మకమగు అఖండ వాక్యార్థమును బోధించుచున్నదని అంగీకరింపవలెను.

ఇపుడు అఖండ వాక్యార్థవాదియగు సిద్ధాంతి తన సిద్ధాంతమున ఇతరులు చూపు దోష సప్తకమును అనువదించి పరిహరించుచున్నాడు. పదార్థము అసత్యమైనచో 'దేవదత్త యజ్ఞదత్త విష్ణుమిత్రాః భోజ్యన్తామ్' అను వాక్యమున ద్వంద్వము అఖండ సముదాయ రూప వాక్యార్థమును విధించుచున్నది. కాన, పదార్థభేదము లేకుండుటచే ఏకవచనమే ఉండవలెను గాని, బహువచన మెట్లు వచ్చినది ? అను ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు.

గర్గా ఇత్యేక ఏవాయం బహుష్వర్థేషు వర్తతే
ద్వంద్వ సంజ్ఞోఽపి సంఘాతో బహూనా మభిధాయకః. 221

యథా = ఏవిధముగా, గర్గా ఇతి = గర్గాః అని, ఏక ఏవ అయం = ఈ ఒక్క పదమే, బహుషు = బహుత్వ విశిష్టమైన, అర్థేషు = అర్థములయందు, వర్తతే = ప్రవర్తించు

చున్నదో, (తథా = అవిధముగా), ద్వంద్వసంజ్ఞః = ద్వంద్వమను పేరుగల, సంఘాతః అపి = సముదాయముకూడా, బహూనాం = అనేకవస్తువులకు, అభిధాయకః = వాచకము.

తా. 'గర్గాః' అనెడు ఒక్కపదమే బహుత్వవిశిష్టార్థములను బోధించునట్లు ద్వంద్వమను పేరుగల సంఘాతముకూడ అనేక వస్తువులను బోధించును.

వి. గర్గశబ్దముకంటె, 'గర్గాదిభ్యో యఞ్' అను సూత్రముచే, 'గర్గస్య గోత్రాపత్యమ్' అను నర్థమున 'యఞ్' ప్రత్యయము వచ్చి 'గార్గ్యః' అను రూపము సిద్ధించును. గర్గుని గోత్రమునందు పుట్టినవాడు అని యర్థము. గర్గగోత్రమునందు పుట్టిన అనేకులు అనునర్థము చెప్పవలసి వచ్చినపుడు, ఎంతమందిని చెప్పవలెనో అన్నిసారులు గార్గ్యశబ్దమును ఆవృత్తి చేయవలయును. గాన, గార్గ్యశ్చ, గార్గ్యశ్చ, గార్గ్యశ్చ అని ఆవృత్తిచేసిన పిమ్మట, 'సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ' (1-2-64) అను సూత్రముచే ఒక్క గార్గ్యశబ్దము మాత్రమే శేషించును. బహుత్వమును బోధింపవలసి యున్నదిగాన, 'యఞఞోశ్చ' (2-4-64) అను సూత్రముచే 'యఞ్' లోపింపతన్నిమిత్తకమగు ఆదివృద్ధికూడ పోయి 'గర్గ' శబ్దము మిగులును. ఇపుడు ఈ 'గర్గ' శబ్దము అవయవ విభాగ మేమియు లేకున్నను బహుత్వమును బోధించుచున్నది గాన, బహువచన ప్రత్యయమగు 'జస్' వచ్చి 'గర్గాః' అను రూపము సిద్ధించును. (ఈ శబ్దము - గార్గ్యః, గార్గ్యౌ, గర్గాః; గార్గ్యమ్, గార్గ్యౌ, గర్గాన్ ఇత్యాది విధమున ఉండును). ఈ విధముగ నిరస్తావయవభేదమగు గర్గశబ్దము బహ్వర్థ వృత్తియగుటచే ఎట్లు బహువచనాంతమైనదో, అట్లే ద్వంద్వ సంజ్ఞమగు సంఘాతముగూడ అవయవ భేదరహితమైనను శబ్దశక్తి మాహాత్మ్యముచే బహుత్వమును బోధించును గాన బహువచనము వచ్చినది. తావన్మాత్రముచే వాక్యార్థ వ్యతిరిక్తమగు పదార్థ మున్నదని చెప్పుటకు అవకాశము లేదు.

వృత్తి అఖండార్థము అను పక్షమున 'ధవఖదిరపలాశాః సిచ్యన్తామ్' ఇత్యాదులందు వృత్త్యర్థవ్యతిరిక్తమగు పదార్థము లేకుండుటచే, 'ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః' అనునది కుదురదు కాన—అనగా 'ధవః సిచ్యతామ్ ఖదిరః సిచ్యతామ్, పలాశః సిచ్యతామ్' ఇత్యాదివిధమున ధవాది వృక్షములతో క్రియకు విడివిడిగ అన్వయము చెప్పుటకు వీలులేదు గాన—సముదాయమునకే ఒక్కమారుగ సేచనక్రియాకర్మత్వము చెప్పవలెను. కాని మూడుచెట్ల సముదాయమును ఒకే మయమున తడుపుట శక్యముకాదు. కావున వాక్యార్థబోధము అనుపపన్నము అను రెండవచోద్యమునకు సమాధానము చెప్పుచున్నాడు.

యథైకదేశే భుజ్యాదిః ప్రత్యేక మవతిష్ఠతే
క్రియైవం ద్వంద్వవాచ్యేఽర్థే ప్రత్యేకం ప్రవిభజ్యతే . 222

యథా = ఏవిధముగా, భుజ్యాదిః = భుజ్ మొదలగు, క్రియా = క్రియ, ఏకదేశే = సముదాయముయొక్క ఏకదేశమునందు, ప్రత్యేకం = వేరువేరుగా, అవతిష్ఠతే = ఉండునో, ఏవం = ఈ విధముగా, ద్వంద్వవాచ్యే = ద్వంద్వముచే బోధింపతగిన, అర్థే = సముదాయరూపార్థమునందు, ప్రత్యేకమ్ = ఒక్కొక్కదానియందు, ప్రవిభజ్యతే = విభక్తమగుచున్నది.

తా. భుజ్యాదిక్రియ సముదాయైకదేశమునందు ప్రత్యేకముగ నున్నట్లు ద్వంద్వవాచ్యమగు అర్థమునందుగూడ ఒక్కొక్కదానియందు విభక్తమగుచున్నది.

వి. "అతిథయః భోజ్యన్తామ్" (అతిథులకు భోజనము పెట్టుడు) అనునపుడు 'అతిథయః' అను ఏకశేషమునందు వృత్త్యర్థమగు సముదాయముకంటె భిన్నమగు పదార్థము లేకపోయినను భోజనక్రియ సముదాయములో ఏకదేశము (అవయవము) లగు బుద్ధి పరికల్పిత వ్యక్తులతో వేరువేరుగా అన్వయించును. అట్లే ద్వంద్వవాచ్యమగు సముదాయమునందలి అవయవములను బుద్ధిచే విభజించుకొని వాటితో సేచనాదిక్రియలను అన్వయించుకొన వచ్చును గాన అఖండత్వ పక్షమునందు దోష మేమియు లేదు.

'జనపద తదవధ్యోశ్చ' (4.2.124) అను సూత్రము జనపదవాచకము కంటెను తదవధివాచకము కంటెను (అనగా వెనుక జనపదము చెప్పబడినది గాన ఈ తచ్ఛబ్దము జనపదమును పరామర్శించును. కావున తదవధివాచకమనగా జనపదముయొక్క అవధిని చెప్పునది అని అర్థము) 'వుఞ్' ప్రత్యయము వచ్చునని చెప్పుచున్నది. 'జనపద తదవధ్యోః' అనునది ద్వంద్వము. అఖండవాదపక్షమున ఈ ద్వంద్వ ఘటకములగు పదములకు అర్థము లేదు గాన జనపదశబ్దము నిరర్థకము. అట్టి జనపదశబ్దమును తచ్ఛబ్దముచే పరామర్శించుట కూడ కుదరదు. ఇచటనున్న తచ్ఛబ్దము కూడ నిరర్థకమేకదా ? కావున వృత్త్యఖండార్థత్వపక్షమున ఈ సూత్రమునకు అర్థముచెప్పుట కుదరదు అను మూడవచోద్యమునకు (అనుపపత్త్యాశంకకు) సమాధానము చెప్పుచున్నాడు.

యచ్చ ద్వన్ద్వపదార్థస్య తచ్ఛబ్దేనవ్యపేక్షణా
సాపి వ్యావృత్తరూపేఽర్థే సర్వనామసరూపతా. 228

ద్వన్ద్వపదార్థస్య='జనపద తదవధ్యోః' అను ద్వంద్వమున ఘటితమగు 'జనపద' పదార్థమునకు, తచ్ఛబ్దేన=తచ్ఛబ్దముచేత, వ్యపేక్షణా=పరామర్శ మనునది, యచ్చ= ఏదికలదో, సాపి = ఆ పరామర్శకూడ, వ్యావృత్తరూపే=విశేషణ విశేష్యోభయ రూపము కంటె వ్యావృత్తమై (భిన్నమై) అఖండమగు, అర్థే = ప్రతిభామాత్రవృత్త్యర్థమునందు, బుద్ధికల్పితమైన అపోద్ధారముచే పదార్థాన్వయము నాశ్రయించిన, సర్వనామ సరూపతా = సర్వనామ సారూప్యము మాత్రమే.

తా. ద్వంద్వావయవమగు పదముయొక్క అర్థమును తచ్ఛబ్దముచే పరామర్శించుట యనునదిగూడ కాల్పనిక భేదముగల అర్థముతో సంబంధించినట్లు కనబడు సర్వనామ సారూప్య మాత్రముచే ఏర్పడినదియే.

వి. 'జనపద తదవధ్యోః' అను పైన చూపిన ద్వంద్వమునందు వాస్తవమున సర్వనామశబ్ద మేదియును లేదు. కావున, ఆ శబ్దము పూర్వపదమగు జనపదశబ్దమును పరామర్శించుట అనునదియు లేదు. ఇది సర్వనామమువలె భాసించుచున్నది గాని, వాస్తవమున సర్వనామము కాదు. కావున అఖండార్థమే ఇచట బోధింపబడుచున్నది, అని తాత్పర్యము.

'ధవఖదిరపలాశాః ఛిద్యన్తామ్' అను వాక్యమునందలి 'ధవఖదిరపలాశాః' అను ద్వంద్వమునందలి పదములు నిరర్థకములు. ఈ ద్వంద్వము అఖండమగు అర్థమునే బోధించుచున్నది అని అంగీకరించినచో ఛేదనక్రియలో ధవఖదిరపలాశము లన్నియు ఒక్కమారుగ అన్వయించును కాని అన్నింటిని ఒక్కమారుగ ఛేదించుట అశక్యముకదా ? కావున పదములకు

కూడ సార్థకత్వము నంగీకరించి ఈ వృక్షములను క్రమముగ ఛేదింపవలెను అను అర్థము చెప్పిన యుక్తముగనుండును అనెడు వాల్గవచోద్యమును పరిహరించుచున్నాడు.

యథా చ ఖదిరచ్ఛేదే భాగేషు క్రమవాం శ్ఛిదిః
తథా ద్వన్ద్వపదార్థస్య భాగేషు క్రమదర్శనమ్. 224

ఖదిరచ్ఛేదే='ఖదిరః ఛిద్యతామ్' అనునపుడు నిరవయవమగు ఖదిరమును, అఖండ మగు ఛేదనమును ఉపస్థితములగుటచే ఈ వాక్యముచే క్రమరహితమగు ఖదిరచ్ఛేదనము చోద్య మగునపుడు, ఛిదిః=ఛేదనక్రియ, యథా=ఏవిధముగా, భాగేషు=ఖదిరముయొక్క త్వగాది భాగములయందు, క్రమవాన్=క్రమము కలదిగా భాసించుచున్నదో, తథా=అట్లే, ద్వంద్వ పదార్థస్య=అఖండమగు ద్వంద్వపదార్థముయొక్క, భాగేషు= (అక్రమము, అఖండము నగు ద్వంద్వపదార్థము ఛేదనక్రియాకర్మ కాజాలదు గాన బుద్ధిపరికల్పితములైన) అవయవ ములయందు, క్రమదర్శనమ్= ఛేదనక్రియానుష్ఠాన క్రమదర్శనము (లోకములోనున్నది).

తా. 'ఖదిరః ఛిద్యతామ్' అనునపుడు ఛేదనక్రియ ఏవిధముగ దాని భాగముల యందు, క్రమము కలదిగ నుండునో అట్లే ద్వంద్వపదార్థ భాగములయందు క్రమదర్శన మున్నది.

వి. పదార్థ వాక్యార్థములకు భేదము నంగీకరించువారి మతమునందుగూడ "ఖదిరః ఛిద్యతామ్" ఇత్యాదులలో ఖదిరము సావయవమైనను శబ్దశక్తిచే అఖండముగనే భాసించుచున్నది. అట్లే ఛేదనక్రియగూడ సావయవమైనను అఖండముగనే ప్రతిభాసించు చున్నది. ఖదిరము సావయవమని సర్వవిదితమేకదా! క్రియకూడ క్రమవిశిష్టములగు అనేకావయవముల సమూహము. ఉదాహరణమునకు పాకక్రియయనగా, బియ్యమును కడు గుట, గిన్నెలో పోయుట, దానిని పొయ్యిపై నుంచుట, మంటపెట్టుట మొదలగు ఎన్నియో క్రమవంతములగు అవయవములతో గూడినది. ఐనను వాటినన్నింటిని బుద్ధిచే ఒకదానిగా భావించి ఒక క్రియ యందురు. ప్రకృతమున 'ఖదిరమును ఛేదింపుము' అనునపుడు శబ్దముచే అఖండము, అక్రమము అగు ఛేదనక్రియ భాసించుచున్నను ఒక్కమారుగ చేయుట అశక్యము గాన, అవయవములయందే పర్యవసన్న మగుచున్నది. అనగా, ఈ ఛేదనము మొదట చెట్టుపై నున్న బెరడుమీదను, పిమ్మట కఠినపదార్థమునందును పిమ్మట సారభూతమైన అంతర్గత పదార్థమందును ప్రవర్తించుచున్నది. అట్లే 'ధవఖదిరపలాశా శ్ఛిద్యన్తామ్' అను నపుడు ద్వంద్వమున వృత్త్యర్థము అఖండమేయైనను అపోద్ధారబుద్ధిచే పరికల్పితములగు, పదార్థముల క్రమము ననుసరించి ఛిదిక్రియకు లోకమున అన్వయము చూడబడుచున్నది.

వనపాలకుడొకడు 'మమపురుషైః అస్మిన్ పర్వతే ధవఖదిరపలాశాః ఛిద్యన్తామ్' (నా పురుషులు ఈ పర్వతమునందలి ధవఖదిరపలాశములను ఛేదింపవలెను.) అని చెప్పి నపుడు ఆ పర్వతముపైనున్న కొన్ని ధవములను, కొన్ని ఖదిరములను, కొన్ని పలాశములను మాత్రమే ఛేదించి ఆ పురుషులు వనపాలకుని ఆజ్ఞ నిర్వహింపబడినదని చెప్పుచున్నారు. కాని వృత్త్యర్థము అఖండమని యంగీకరించినచో ఆ పర్వతముపైనున్న ధవాది వృక్షముల నన్నిటిని ఛేదించిన గాని, వనపాలుని ఆజ్ఞను నిర్వహించినట్లు కాకూడదు అను ఐదవ చోద్యమును పరిహరించుచున్నాడు.

సఙ్ఘైకదేశే ప్రక్రాన్తాన్ యథా సఙ్ఘానుపాతినః
క్రియావిశేషాన్ మన్యన్తే స ద్వన్ద్వావయవే క్రమః. 225

సఙ్ఘానుపాతినః = బ్రాహ్మణాః భోజ్యన్తామ్ ఇత్యాదిస్థలములలో 'బ్రాహ్మణాః' అను ఏకశేషవృత్తికి అర్థమగు బ్రాహ్మణసంఘమునకు సంబంధించిన, ప్రక్రాన్తాన్ = ఉపక్రమమున ప్రతీతములగు, క్రియావిశేషాన్ = క్రియావిశేషములను, సంఘైకదేశే = సంఘము యొక్క ఒకభాగమునందు, యథా = ఏవిధముగా, మన్యన్తే = అంగీకరించుచున్నారో, ద్వన్ద్వావయవే = ద్వన్ద్వవాచ్యసముదాయాన్తర్గతములగు అవయవములందుగూడ, సః = అదియే, క్రమః = క్రమము.

తా. సంఘమునకు సంబంధించిన ఉపక్రమ ప్రతీతములగు క్రియావిశేషములను సంఘైకదేశమునం దెట్లు అంగీకరింతురో ద్వన్ద్వావయవమునందును ఆ విధముగనే క్రమము అంగీకరింప దగినది.

వి. 'బ్రాహ్మణాః భోజ్యన్తామ్' ఇత్యాదిస్థలములలో భోజనక్రియ ప్రారంభమున ఏకశేషవృత్తియగు 'బ్రాహ్మణాః' అనుపదముచే బోధింపబడిన బ్రాహ్మణసంఘాతముతో నన్వయించునట్లు భాసించుచున్నది. కాని, తత్సంఘాతావయవమగు కొందరు బ్రాహ్మణులు మాత్రమే భోజనము చేసినను 'బ్రాహ్మణాః భుక్తాః' అని చెప్పుదురు. అట్లే ధవఖదిర పలాశ సంఘాతమంతయు ఛేదించక కొన్ని ధవాదులను మాత్రమే ఛేదించినను 'ధవఖదిరపలాశాః ఛిన్నాః' అని చెప్పుటకు వీలగుచున్నది. ఈ విధముగ వృత్త్యఖండార్థత్వమును అంగీకరించినను ద్వంద్వవాచ్య సముదాయాతంతర్గతావయవములతో క్రియ అన్వయించుట కవకాశ మున్నది.

వృత్తియు వృత్త్యర్థమును అఖండములు, పద పదార్థములు అసత్యములు అని, అంగీకరించినచో, అవ్యయీభావము పూర్వపదార్థ ప్రధానము, తత్పురుషము ఉత్తర పదార్థ ప్రధానము, ఇత్యాది విధమున సమాసములందు తత్తత్పదార్థ ప్రాధాన్య వర్ణనము అసంగతమగును అనెడు అరవ చోద్యమును పరిహరించుచున్నాడు.

ప్రతిపాదయతా వృత్తి మబుధాన్ వాక్యపూర్వికామ్
వృత్తౌ పదార్థభేదేన ప్రాధాన్య ముపదర్శితమ్. 226

అబుధాన్ = అపండితులనుగూర్చి, వాక్యపూర్వికామ్ = వాక్యపూర్వకమగు, వృత్తిం = వృత్తిని, ప్రతిపాదయతా = ప్రతిపాదించుచున్న ఆచార్యునిచేత, పదార్థభేదేన = అలౌకిక వాక్యమునందలి పదార్థభేదమునుబట్టి వృత్తియందుకూడ నేర్పడిన పదార్థభేదముచే, వృత్తౌ = సమాసమునందు, ప్రాధాన్యమ్ = తత్తత్పదార్థ ప్రాధాన్యము, ఉపదర్శితమ్ = చూపబడినది.

తా. అబుధులకు వాక్యపూర్వకమగు వృత్తిని బోధించుచు ఆచార్యుడు పదార్థ భేదమును పురస్కరించుకొని వృత్తియందు తత్తత్పదార్థప్రాధాన్యమును చూపియున్నాడు.

వి. ఆచార్యుడు అజ్ఞులకు సులభముగ అర్థమును బోధించు నిమిత్తమై సమాస వృత్తియందు, అపోద్ధారకల్పనచే 'రాజపురుషః' ఇత్యాదివృత్తుల సిద్ధికొరకు 'రాజన్ +

జస్ + పురుష + సు' ఇత్యాద్యలౌకిక విగ్రహవాక్యమును కల్పించినాడు. ఈ విధముగ అలౌకిక విగ్రహవాక్యకల్పనా పూర్వకముగ, సమాసరూపవృత్తిని ప్రతిపాదించు ఆచార్యుడు అలౌకిక వాక్యమునందలి పదార్థభేదమునుబట్టి, సమాసమునందు ఆయా పదముల అర్థములు ప్రధానమని ప్రతిపాదించినాడు. వాస్తవమున వృత్తియందు పదపదార్థ విభాగము లేదు.

'అబ్రాహ్మణః' ఇత్యాది 'నఞ్' సమాసములందలి పదార్థ ప్రాధాన్యమును భాష్యకారులు అనేకవిధముల చూపియున్నారు. అదికూడ శిష్యశిక్షార్థమై చేసిన కల్పనయే కాని వాస్తవము కాదని చెప్పుచున్నాడు.

అభేదా దభిధేయస్య నఞ్సమాసే వికల్పితమ్
ప్రాధాన్యం బహుధా భాష్యే దోషాస్తు ప్రక్రియాగతాః . 227

అభిధేయస్య=అర్థముయొక్క, అభేదాత్=ఏకత్వమువలన (వృత్త్యర్థము అఖండమగుటచే దానియందు పూర్వపదార్థోత్తరపదార్థాది ప్రాధాన్యవిచారము అసంగతమైనను), నఞ్ సమాసే=నఞ్ సమాస విషయమున, ప్రాధాన్యమ్=పూర్వోత్తరాది పదార్థ ప్రాధాన్యము, భాష్యే=భాష్యమునందు, బహుధా=అనేకవిధములుగా,(యత్), వికల్పితమ్=వికల్పింపబడెను అనువిషయ మేది కలదో అదియు, తత్ప్రయుక్తాః = తాదృశప్రాధాన్యవికల్పకృతములగు దోషాస్తు=పూర్వపదార్థప్రాధాన్యము చెప్పినచో ఈ దోషమనియు, ఉత్తరపదార్థ ప్రాధాన్యమంగీకరించిన ఈ దోషమనియు, ఈ విధముగ భాష్యమునందు చెప్పబడిన దోషములు, ప్రక్రియాగతాః=కల్పితమగు లౌకిక విగ్రహవాక్యాది ప్రక్రియకు సంబంధించినవి.

తా. అర్థము అఖండముగాన, భాష్యమునందు 'నఞ్' సమాసవిషయమున బహువిధముల చూపబడిన ప్రాధాన్యవికల్పమును, అభ్యూహితములగు ఆయా దోషములును కాల్పనిక ప్రక్రియకు సంబంధించినవి.

వి. భాష్యకారుడు నఞ్ సమాసమునందు అర్థభేదమునుబట్టి కొన్ని యెడల పూర్వపదార్థప్రాధాన్యమును, కొన్ని యెడల అన్యపదార్థప్రాధాన్యమును, మరికొన్ని యెడల ఉత్తరపదార్థ ప్రాధాన్యమును ప్రతిపాదించెను. వృత్త్యర్థము అఖండమేయైనను భాష్యకారుడు ఈ విధముగ త్రివిధ వికల్పములను చూపుట, పూర్వపదార్థాది ప్రాధాన్యము నంగీకరించు పక్షమున నాయాదోషములు వచ్చునని చెప్పి ఉత్తరపదార్థాది ప్రాధాన్య స్థాపనము చేయుట, ఇదియంతయు, కాల్పనికమగు విగ్రహ వాక్యాదులకు సంబంధించినదేగాని, అఖండ సమాస వృత్తికి సంబంధించినదికాదు.

వృత్తియందు పద పదార్థములు లేవన్నచో జహత్స్వార్థయనియు, అజహత్స్వార్థా వృత్తియనియు భేదము ఉండుటకు అవకాశము ఉండదు. ఏ వృత్తియందలి పదము తన అర్థమును పరిత్యజించునో అది జహత్స్వార్థయనియు, ఏవృత్తియందలి పదము పరిత్యజింపకుండునో అది అజహత్స్వార్థ యనియు అనబడును. వృత్తి యఖండమై పదపదార్థములే లేవన్నచో ఈ విభాగ మెట్లు కుదురును ? అను చోద్యమును పరిహరించుచున్నాడు.

జహత్స్వార్థ వికల్పేచ సర్వార్థత్యాగ మిచ్ఛతా
బహువ్రీహిపదార్థస్య త్యాగః సర్వస్య దర్శితః . 228

సర్వార్థ త్యాగం = వృత్తియందు సర్వ పదార్థ త్యాగమును, ఇచ్ఛతా = కోరుచు, 'అనేక మన్యపదార్థే' (2.2.24) (అన్యపదార్థమును బోధించు అనేక పదములు సమసించును) అని సూత్రించిన ఆచార్యునిచేత, సర్వస్య = సమస్తమైన, బహువ్రీహి పదార్థస్య = బహువ్రీహి పదార్థముయొక్క, త్యాగః = త్యాగము, జహత్స్వార్థవికల్పే = జహత్స్వార్థ వృత్తియగు వికల్పమునందు, దర్శితః = ప్రమాణముగ చూపబడినది.

తా. సర్వార్థ త్యాగమును అంగీకరించెడు పాణిన్యాచార్యుడు సకల బహువ్రీహి పదార్థ త్యాగమును జహత్స్వార్థ వికల్పమునకు ప్రమాణముగ చూపియున్నాడు.

వి. పాణిన్యాచార్యుడు "అనేక మన్యపదార్థే" యను బహువ్రీహి సమాస విధాయక సూత్రమున సమస్యమానములగు పదముల అర్థములకంటె భిన్నమగు అర్థమును బోధించుటకై ప్రథమాంత పదములు సమసించును అని చెప్పెను. వృత్తియందు పదార్థము ఉండదు అను సిద్ధాంతము నంగీకరించువాడు కావుననే ఈయన ఈ విధముగ బహువ్రీహి యందు సర్వపదార్థ త్యాగమును బోధించి వృత్తి జహత్స్వార్థయా, అజహత్స్వార్థయా అను వికల్పమున జహత్స్వార్థ పక్షమే తన కభీష్ట మనియు అందుచే అఖండత్వ వాదమేయథార్థ మనియు సూచించియున్నాడు.

వృత్తులు జహత్స్వార్థ యనియు, అజహత్స్వార్థ యనియు రెండువిధములు. అవయవార్థమును అపేక్షింపకయే సముదాయార్థమును బోధించు వృత్తి జహత్స్వార్థా వృత్తి. ఈ వృత్తియందు ఘటకములగు అవయవములు తమతమ యర్థములను విడచినవిగాన, (జహతి స్వార్థం పదాని యస్యాం సా) దీనికాపేరు వచ్చినది. 'రథన్తరమ్' (ఒకానొకసామము), కృష్ణ సర్పః (త్రాచుపాము) గౌరఖరః (అడవిగాడిద) శుశ్రూషా (సేవ-ఇది సన్నంతధాతువృత్తి. శ్రోతుం ఇచ్ఛా శుశ్రూషా అను అవయవార్థమును బోధింపదు) ఇత్యాదివృత్తులు అవయవార్థ నిరపేక్షముగనే సముదాయార్థమును బోధించుచున్నవి గాన, ఇవి జహత్స్వార్థములు. 'రాజపురుషః' ఇత్యాదివృత్తులు అవయవార్థముతో మిశ్రితమగు సముదాయార్థమును బోధించుచున్నవి గాన, (ఈ వృత్తులు తమయందలి పదముల స్వార్థములను విడచుట లేదుగాన) ఇవి అజహత్స్వార్థములు.

కాల్పనికమగు అపోద్ధారముచే ఈ అజహత్స్వార్థత్వము కల్పితమనియు, వాస్తవమున వృత్తులన్నియు జహత్స్వార్థములే యనియు, ఇదియే పాణిన్యాచార్యునకు గూడ అంగీకార్యమనియు, ఈ కారికకు తాత్పర్యము. కావున వృత్తి అఖండార్థబోధకమను సిద్ధాంతము సుస్థము.

వృత్తియందును వాక్యమునందునుగూడ పద పదార్థవ్యవహారము శాస్త్రప్రక్రియ కొరకు కల్పితమే కాని వాస్తవముకాదని చెప్పుచున్నాడు.

శాస్త్రే క్వచి త్ప్రకృత్యర్థః ప్రత్యయే నాభిధీయతే
ప్రకృతౌ వినివృత్తాయాం ప్రత్యయార్థశ్చ ధాతుభిః . 229

శాస్త్రే = శాస్త్రమునందు, క్వచిత్ = కొన్ని స్థలములందు, ప్రకృతౌ = ప్రకృతి, వినివృత్తాయాం = లోపించినదగుచుండగా, ప్రకృత్యర్థః = ప్రకృతియొక్క అర్థము, ప్రత్యయేన = ప్రతయముచేత, అభిధీయతే = చెప్పబడుచున్నది, ధాతుభిః = ధాతువులచేత, ప్రత్యయార్థశ్చ = ప్రత్యయార్థము కూడ (ప్రత్యయము లోపించినపుడు) చెప్పబడుచున్నది.

తా. శాస్త్రమునందు కొన్నియెడల, ప్రకృతి లోపింప దాని యర్థమును ప్రత్యయమే బోధించును. ధాతువులే ప్రత్యయార్థమును గూడ బోధించుచుండును.

వి. 'ఇయాన్' ఇత్యాదిపదములలో ప్రకృతి పూర్తిగ లోపించినపుడు ఆ లోపించిన ప్రకృతిభాగమునకు సంబంధించిన అర్థమును ప్రత్యయభాగమే బోధించుచున్నది. ఇట్లే, 'అహన్', 'దధి' ఇత్యాదులలో ప్రత్యయము పూర్తిగ లోపింప ప్రకృతిభాగమే ప్రత్యయభాగార్థమును గూడ చెప్పుచున్నది. ఈ విధమగు ప్రక్రియ యంతయు శాస్త్రమునందేగాని, లోకమునకు సంబంధించినంతవరకు 'ఇయాన్', 'దధి' ఇత్యాదులలో ప్రకృతిగాని, ప్రత్యయమనునదిగాని లేవు. నిరవయవమగు పదము నిర్విభాగమగు అర్థమును బోధించుచున్నది.

ప్రకృతి ప్రత్యయ విభాగము కాల్పనికమని చెప్పుటకు యుక్త్యంతరమును చెప్పుచున్నాడు.

యమర్థ మాహాతు ర్భిన్నౌ ప్రత్యయౌ వేక ఏవ తమ్
క్వచి దాహ పచ న్తీతి ధాతు స్తాభ్యాం వినా క్వచిత్ .　　280

పచన్తీతి = 'పచన్తి' అనుచోట, భిన్నౌ = వేరువేరైన, ప్రత్యయౌ = ప్రత్యయములు, యం=ఏ, అర్థమ్=కర్తృరూపమగు అర్థమును, ఆహతుః=చెప్పుచున్నవో, క్వచిత్=కొన్నిస్థలములయందు, తమ్=ఆ అర్థమును, ఏకఏవ = ఒక్క ప్రత్యయమే, ఆహ=చెప్పుచున్నది, క్వచిత్ = కొన్నిస్థలములయందు, తాభ్యాంవినా = ఆ రెండు ప్రత్యయములును లేకుండగ, ధాతుః = ధాతువు, ఆ అర్థమును బోధించుచున్నది.

తా. 'పచన్తి' ఇత్యాదులలో రెండు భిన్నప్రత్యయములు ఏ యర్థమును బోధించుచున్నవో, ఆ అర్థమును కొన్నియెడల ఒక్క ప్రత్యయమే బోధించును. కొన్నియెడల ఆ రెండును లేకుండగ ధాతువే ఆ యర్థమును బోధించును.

వి. 'పచన్తి' అనునపుడు 'పచ్' ధాతువు 'శప్' (అ) 'అన్తి' అనునవి ఉన్నవి. వాటిలో 'అ', 'అన్తి' అను రెండు ప్రత్యయములును కర్తృరూపార్థమును బోధించుచున్నవి. 'అత్తి' 'జుహోతి' ఇత్యాదులలో, 'శప్' (అ) లేకపోయినను ఒక్క 'తి' యను ప్రత్యయమే ఆ కర్తృరూపార్థమును బోధించుచున్నది. 'అహన్' ఇత్యాదులందు 'శప్' గాని, 'తిబ్' ప్రత్యయముగాని, లేకపోయినను ధాతువే వాటిచే బోధ్యమగు కర్తృత్వార్థమును బోధించుచున్నది. దీనినిబట్టి ప్రకృతి ప్రత్యయములకు అర్థబోధన విషయమున ఒక వ్యవస్థ యనునది లేదుగాన, ప్రకృతిప్రత్యయములు గాని, ప్రకృత్యర్థప్రత్యయార్థములుగాని, సత్యములు కావు. అట్లే వృత్తియందును వాక్యమునందును పదములును, పదార్థములును అసత్యములు.

'అహన్' అనునది 'హన' ధాతు లజ్ ప్రథమపురుషైకవచనము. లజ్ పరమగునపుడు హనధాతువునకు 'అట్' (అ) ఆగమము, 'అహన్లజ్' అని యుండగా, లజ్‌కు 'తి' ఆదేశము. ఇకారమునకు 'ఇతశ్చ' (3-4-100) అను సూత్రముచే లోపము. మిగిలిన తకారమునకు 'సంయోగాన్తస్య లోపః' (8-2-23) అను సూత్రముచే లోపము. ఈ ప్రత్యయమంతయు లోపింప 'అహన్' అను ధాతుభాగము మాత్రము మిగిలినది.

ప్రకృతి ప్రత్యయములు, వాటి యర్థములును మాత్రమే కాదు; శాస్త్రప్రక్రియ అన్నియును గూడ అవాస్తవములేయని చెప్పుచున్నాడు.

అన్వాఖ్యానస్మృతౌ యేచ ప్రకృత్యర్థా నిబన్ధనమ్
నిర్దిష్టార్థ (ష్టాస్తే) ప్రకృత్యర్థాః స్మృత్యన్తర ఉదాహృతాః. 281

అన్వాఖ్యానస్మృతౌ = ఒక శబ్దానుశాసనస్మృతియందు (ఒక వ్యాకరణము నందు), యే=ఏ, ప్రత్యయార్థాః = ప్రత్యయముల యొక్క అర్థములు, నిబన్ధనమ్ = ప్రత్యయములను విధించుటకు హేతువులుగ, నిర్దిష్టాః = చెప్పబడినవో, తే = ఆప్రత్యయార్థములే, స్మృత్యన్తరే = మరి యొక వ్యాకరణమునందు, ప్రకృత్యర్థాః = ప్రకృతి యొక్క అర్థములుగా, ఉదాహృతాః = చెప్పబడినవి.

తా. ఒక వ్యాకరణమున, ఆయాప్రత్యయములు వచ్చుటకు కారణముగ చెప్పిన ప్రత్యయార్థములు వ్యాకరణాంతరమున ప్రకృత్యర్థములుగ చెప్పబడినవి.

వి. కొన్ని వ్యాకరణములలో ఈ ప్రత్యయములకు, ఈ యర్థములని నిర్ణయించి, తత్తదర్థ బోధకములు కావుననే ఆప్రత్యయములు ప్రకృతికి చేర్చబడుచున్నవి అని ప్రతిపాదింపబడినది. మరికొన్ని వ్యాకరణములు ప్రకృతి యే ఆయా యర్థములను బోధించుననియు, ప్రకృతియందలి అర్థ భేదము ననుసరించి వేరువేరు ప్రత్యయములను చేర్చవలెననియు ప్రతిపాదించినవి. ఉదాహరణమునకు లింగ సంఖ్యాకారకాదులు ప్రకృత్యర్థము లని కొన్ని వ్యాకరణము లంగీకరింప, అవి ప్రత్యయార్థము లని కొన్ని వ్యాకరణము లంగీకరించినవి. కావుననే భాష్యకారులు, —"ఏకం ద్వికం త్రికం చాథ చతుష్కం పంచకం తథా। నామార్థ ఇతి సర్వేఽమీ పక్షాః శాస్త్రే నిరూపితాః॥" అను శ్లోకమున స్వార్థ ద్రవ్య లింగ సంఖ్యా కారకములు అను ఐదిటిలో, స్వార్థ మొక్కటియే ప్రకృత్యర్థమనియు, (ఇతరములు ప్రత్యయార్థములనియు) స్వార్థద్రవ్యములు రెండును ప్రకృత్యర్థములనియు, మూడును ప్రకృత్యర్థములనియు, నాల్గును ప్రకృత్యర్థములనియు, ఐదును ప్రకృత్యర్థములనియు, మత భేదములు శాస్త్రములలో నున్నవి" అని చెప్పియున్నారు.

ఈ విధముగ శాస్త్రప్రక్రియలు ఒక నియత రూపమున లేవుగాన, ఈ ప్రకృతి ప్రత్యయ విభాగము, తత్తదర్థ విభాగము గూడ అసత్యమైనవని తేలినది.

ఈ కారికలోని తృతీయపాదమున "నిర్దిష్టాస్తే ప్రకృత్యర్థాః" అనునది సాధు పాఠ మని వ్యాఖ్యాతలు పరిగ్రహించినారు.

శాస్త్రవ్యాసముచే అధివాసితమగు చిత్తము గలవారు శాస్త్ర ప్రక్రియయందు, 'ఉద్వమతి', 'లిమ్పతి', 'కరోతి' ఇత్యాది తిఙంత పదములను విభజించి, 'ఉద్వమి', 'లిమ్పి', 'కరి' ఇత్యాది విధమున ప్రయోగించుచున్నారు. అట్టి ప్రయోగములు శాస్త్ర ప్రక్రియ యందు మాత్రమే సాధువులు గాని, లౌకిక ప్రయోగమున సాధువులు కావు అని చెప్పుచున్నాడు.

ప్రసిద్ధే రుద్వమికరీత్యేవ శాస్త్రేఽభిధీయతే
వ్యవహారాయ మన్యన్తే శాస్త్రార్థప్రక్రియా యతః. 282

ప్రసిద్ధేః = శాస్త్రప్రసిద్ధివలన, ఉద్వమికరీతి='ఉద్వమి', 'కరి' ఇత్యాది విధముగ, శాస్త్ర ఏవ = శాస్త్రమునందు మాత్రమే, అభిధీయతే=చెప్పబడుచున్నది. యతః=

ఏకారణమువలన, శాస్త్రార్థప్రక్రియాః=శాస్త్రసంబంధమైన అర్థములు పదసాధుత్వ ప్రక్రియలు గూడ, వ్యవహారాయ=అబుధులకు వ్యుత్పత్తిని కల్గించుటకొరకు మాత్రమే, మన్యన్తే= అంగీకరింపబడుచున్నవో.

తా. ప్రసిద్ధి ననుసరించి 'ఉద్వమి', 'కరి' మొదలగునవి శాస్త్రమునందు మాత్రమే చెప్పబడుచున్నవి. శాస్త్రీయములగు అర్థప్రక్రియలు కేవల శాస్త్ర వ్యవహారమునకు మాత్రమే ఉపయోగించును.

వి. లాఘవముకొరకై 'ఉద్వమతి' అనుపదమును విభజించి "ఉద్వమి" అనియు, "కరోతి, కరోషి, కరోమి" ఇత్యాదులను విభజించి (ప్రత్యాహారమువలె "కర్"కు, "తి"లోని "ఇ" కారమును కలిపి) "కరి" అనియు, శాస్త్రమునందు మాత్రమే ప్రయోగింతురు. కావుననే "స్తంబం కరోతి ఇతి స్తంబకరిః" అనియున్నది కాదాఅని "శర్మకరిః" "యాగకరిః" ఇత్యాది ప్రయోగములను లోకమున చేయరాదు. "స్తంబకరిః" అనుదానిలోని "కరిః" అనుదానిని మాత్రమే శాస్త్రము అంగీకరించెనుగాని ఇతరోదాహరణములయందు అంగీకరింపదు. ఈవిధముగ, శాస్త్రమునందు తిఙంతములను విభజించి "ఉద్వమిః" ఇత్యాది ప్రయోగములు చేసియున్నను అట్టి విభాగము అసత్యమే కాని, సత్యముకాదు. శాస్త్రప్రక్రియ యంతయు, అపండితులకు బోధచేయుటకొరకు మాత్రమే ఉద్దిష్టమైనది.

శాస్త్ర ప్రక్రియ యంతయు కాల్పనికమే గాన మిథ్యాభూతమని చెప్పుచున్నాడు.

శాస్త్రేషు ప్రక్రియాభేదై రవిద్యైవోపవర్ణ్యతే
అనాగమవికల్పాతు స్వయం విద్యోపవర్తతే. 233

శాస్త్రేషు = శాస్త్రములయందు, ప్రక్రియాభేదైః=ప్రక్రియా భేదములచేత, అవిద్యైవ=అవిద్యయే, ఉపవర్ణ్యతే=వర్ణింపబడుచున్నది. అనాగమవికల్పా = శాస్త్రకల్పితమగు ప్రకృతి ప్రత్యయాది వికల్పములులేని, విద్యా=పదాది విషయజ్ఞానము, స్వయం= స్వయముగ, ఉపవర్తతే = అవిద్యను ఉపమర్దించి ప్రాప్తించును.

తా. శాస్త్రములు ప్రక్రియాభేదము ననుసరించి అవిద్యను మాత్రమే వర్ణించుచున్నవి. ఆగమ వికల్ప రహితమగు పదాదిజ్ఞానము స్వయముగనే భాసించును.

వి. ఒకే పదముయొక్క ప్రక్రియను బోధించునపుడు ఒక వ్యాకరణము, ఈ పదభాగము స్థాని, దానిస్థానమున ఈ ఆదేశము వచ్చినది అని ప్రతిపాదింప—మరియొక వ్యాకరణము, మరియొక పదభాగము స్థాని యనియు, దాని స్థానమున ఆదేశము వచ్చినదనియు ప్రతిపాదించుచున్నది. ఈవిధముగ స్థాన్యాదేశాదుల విషయమునను ప్రకృతి ప్రత్యయ విభాగ విషయమునను, ప్రకృత్యర్థ, ప్రత్యయార్థముల విషయమునను, ఆగమముల విషయమునను, తత్కృతవికారవిషయమునను, భిన్న భిన్నవ్యాకరణములయందు తత్తత్పురుషబుద్ధి పరికల్పితములగు ఎన్నియో కల్పనాభేదములు కానవచ్చుచున్నవి.

వ్యాకరణమునందే కాదు, వేదాంతాదులయందునను జగత్స్రష్ట్యాది విషయమున, ప్రక్రియాభేదములు చెప్పబడినవి. కొన్నిచోట్ల జగత్సృష్టికి క్రమమే చెప్పలేదు. మరికొన్ని చోట్ల క్రమము చెప్పబడినది. ఆ క్రమములో గూడ కొన్నిచోట్ల, ఆకాశాదికమగు సృష్టియు, మరికొన్నిచోట్ల తేజస్సు అదిగాగలసృష్టియు చెప్పబడినది. ఈవిధములుగ, శాస్త్రములలో విద్యా

ప్రాప్తిసాధనములుగ ప్రక్రియాభేదము నెన్ని చెప్పినను అవియన్నియు, ఉపాయమాత్రములే గాని, యథార్థములుగావు అవిద్యకములగు ఈ ప్రక్రియలను బాగుగా తెలిసికొనిన పిమ్మట విద్య స్వయముగ ప్రతిభాసించును. అపుడు ఈ ప్రక్రియాదుల ఆవశ్యకత యుండదు.

విద్యావిలక్షణమును అసత్యమును అగు అవిద్య సత్యమగు విద్యకు ఉపాయ మెట్లగును అని ఆశంకించుకొని, చెప్పుచున్నాడు.

అనిబద్ధం నిమిత్తేషు నిరుపాఖ్యం ఫలం యథా
తథా విద్యా ప్యనాఖ్యేయా శాస్త్రోపాయేవ లక్ష్యతే. 284

యథా=ఏ విధముగా, నిమిత్తేషు=కారణములయందు, అనిబద్ధమ్=(ఉత్పత్తికి పూర్వము) సంబంధములేనిదియు, (కావుననే) నిరుపాఖ్యమ్=వ్యపదేశము (ఇది ఇట్టు అని చెప్పుట వ్యపదేశము) లేనిదియు అగు, ఫలమ్=ఫలము, (కార్యము) ["అద్భుతేన రూపేణ జాయతే" యని అధ్యాహారము=అద్భుతరూపముతో జనించుచున్నదో], తథా=ఆవిధముగా, అనాఖ్యేయా=అనిర్వాచ్యమగు స్వప్రకాశ రూపముగల, విద్యాపి=విద్యకూడ, శాస్త్రోపాయేవ=శాస్త్రము ఉపాయముగాకలదివలె, లక్ష్యతే=చెప్పబడుచున్నది.

తా. కారణముతో సంబద్ధము కానిదియు, వ్యపదేశ్యము కానిదియు, అగు కార్యము ఏవిధముగ అద్భుతరూపమున జనించుచున్నదో, ఆవిధముగనే అనిర్వాచ్య స్వరూపముగల విద్యకూడ, శాస్త్రమే ఉపాయముగా గలదివలె చెప్పబడుచున్నది.

వి. ఉత్పత్తికి పూర్వము కార్యము కారణముతో ఎట్లు సంబంధించియున్నదో చెప్పుటకు శక్యముకాదు. కావున ఆ కార్యము ఈవిధముగనున్నది అని చెప్పుటకు వీలుకాదు. ఐనను ఆ కార్యము అద్భుతమగు రూపమున జనించుచున్నది. అట్లే పదాదివిషయిక విద్య కూడ శాస్త్రమువలన జనించుచున్నది.

వాస్తవమున విద్య జనించుట యనునది గూడ యథార్థముగాదు. అంతఃకరణ వృత్తి రూపమగు విద్యచే అజ్ఞానావరణము భగ్నముకాగా వెంటనే స్వయంప్రకాశమగు బ్రహ్మవిద్య ప్రకాశించుచున్నది. కాని ఇది ఉపనిషత్ప్రక్రియాజన్య మనియు చెప్పజాలము, మరి, యేమన అంతఃకరణవృత్తియే ఆవిధముగ స్వప్రకాశమగును. ఉపనిషత్ప్రక్రియవలన జనించిన దెల్ల అజ్ఞానావరణ భంగము మాత్రమే.

ఇట్లే శాస్త్రప్రక్రియా రూపమగు అవిద్యగూడ అంతఃకరణవృత్తిరూపమగు పదాది విద్యయందు ఉపాయము మాత్రమే యని భావము. వాస్తవమున విద్య అవిద్యాజన్యము కాజాలదు గాన, శాస్త్రము విద్యకు ఉపాయము కాకున్నను ఉపాయమువలె తోచుచున్నది.

'శాస్త్రములు ప్రక్రియాభేదముచే అవిద్యనే వర్ణించుచున్నవి' అని వెనుక చెప్పియున్నాడు. కాని అఖండ పదాది తత్త్వ సాక్షాత్కారము కలుగునంతవరకును ఈ శాస్త్రీయ ప్రక్రియ యంతయు అవిద్యాకార్యమను విషయము గూడ తెలియకుండుటచే వాక్కువలన లోకులకు శాస్త్రాభ్యాసానుసారముగ నీ శబ్దార్థ ప్రతిపత్తి కలుగుచున్నదని చెప్పుచున్నాడు.

యథాభ్యాసం హి వాగర్థే ప్రతిపత్తిం సమీహతే
స్వభావ ఏవ చానాది ర్మిథ్యాభ్యాసో వ్యవస్థితః. 285

వాక్=వాక్కు, యథాభ్యాసం=శాస్త్రాభ్యాసానుసారముగనే, అర్థే=అర్థమునందు, ప్రతిపత్తిం=జ్ఞానమును, సమీహతేహి=కలిగించుటకు సమర్థమగుచున్నదికదా. అనాదిః= ఆదిలేని,మిథ్యాభ్యాసః=మిథ్యాభూతమగు శాస్త్రాభ్యాసము, స్వభావ ఇవ=స్వాభావికమువలె, వ్యవస్థితః=ఉన్నది.

తా. వాక్కు శాస్త్రాభ్యాసానుసారముగనే అర్థజ్ఞానమును కలిగింప సమర్థమగును. అనాదిగనున్న ఈ మిథ్యాభ్యాసము స్వాభావికమువలె అయిపోయినది.

వి. వాక్కు శాస్త్రాభ్యాసము ననుసరించి, ప్రకృతి, ప్రత్యయ, తదర్థ జ్ఞాన పూర్వకముగ అర్థ జ్ఞానమును కలిగించుచున్నది. కాన, ఈ శాస్త్రీయ ప్రక్రియా భేదము అవిద్యా విషయికమైనను శబ్దార్థ జ్ఞాన హేతుక మగుటచే ఉపాదేయమేకాని హేయముకాదు. పద పదార్థ తత్త్వము నెరింగిన ఆర్ష దృష్టిమంతులకు మాత్రము ఇది అనావశ్యకము. అనాది గురుశిష్య పరంపరా ప్రాప్తమైన ఈ శాస్త్రాభ్యాసము మిథ్యాభూత ప్రక్రియా భేదములను బోధించుటచే మిథ్యయేయైనను, దేహాత్మైకత్వాధ్యాసాభ్యాసమువలె స్వాభావిక మైనట్లు కనబడుచున్నది.

పురుషమతి వికల్పములవలన పుట్టిన కల్పనలన్నియు, శాస్త్రీయములైనను, లౌకికములైనను మిథ్యాభూతములే, కాని శాస్త్రీయకల్పనలు తత్త్వజ్ఞానమునకు ఉపయుక్తము లగును. అశాస్త్రీయము లట్లుకాదు అను విషయమును ప్రతిపాదించుటకై చెప్పుచున్నాడు.

ఉత్ప్రేక్షతే సావయవం పరమాణు మపణ్డితః
తథావయవినం యుక్త మన్యై రవయవైః పునః . 286

అపణ్డితః = అపండితుడు, పరమాణుమ్ = పరమాణువును, సావయవమ్ = అవయవములతో కూడుకున్న దానినిగా, ఉత్ప్రేక్షతే = ఊహించుచున్నాడు. తథా= మరియు, అవయవినం=అవయవములు కలదానిని, పునః= మరల, అన్యైః=ఇతరమైన, అవయవైః=అవయవములతో, యుక్తం కూడినదానినిగా, (ఊహించును).

తా. పరమాణువునకు గూడ అవయవము లున్నవనియు, అవయవికి ఇంకను ఏవిమో అవయవము లున్నవనియు అపండితుడు ఊహించుచుండును.

వి. పరమాణువు అన్నిటికన్న చిన్న ప్రమాణము కలదనియు, దానిని రెండుగ భేదింపుట అశక్యమనియు పండితులు నిర్ణయించి యుండగా, అపండితుడు పరమాణువునకు గూడ అవయవము లుండునని యూహించుచుండును. అట్లే, ఒక అవయవికి అవయవము లున్నట్లే, దాని అవయవములకు అవయవము లున్నవనియు, మరల దానికి గూడ నున్నవనియు, ఈ విధముగ అవిచ్ఛిన్నమగు అవయవ ధారను ఊహించును. ఇట్లు పురుష బుద్ధి కృతములగు కల్పనలకు అంతమనునది యుండదనియు, అవియన్నియు వాస్తవము కాజాలవనియు అభిప్రాయము.

కొందరు పరిచ్ఛిన్న ప్రమాణమగు ఘటమును జూచి, ఘటమువలె ప్రపంచము గూడ (వాస్తవమున నది పరిచ్ఛిన్నము కాకున్నను) పరిచ్ఛిన్నమని భావింతురు. అట్లే భావ పదార్థములన్నియు ఆది కలవి కావున బ్రహ్మకూడ భావ పదార్థమగుటచే (అది వాస్తవమున శాశ్వతమైనను) సాదియనియు, కార్యమనియు, ఊహింతురు అని చెప్పుచున్నాడు.

ఘటాదిదర్శనా ల్లోకః పరిచ్ఛిన్నోఽవసీయతే
సమారమ్భాచ్చ భావానా మాదిమద్ బ్రహ్మ శాశ్వతమ్. 287

ఘటాది దర్శనాత్ = ఘటము మొదలగు వాటిని చూచుటవలన, లోకః = దృశ్యమగు ఈ ప్రపంచము గూడ, పరిచ్ఛిన్నః = పరిమితమైనదిగా, అవసీయతే = (కొందరిచే) నిశ్చయింపబడుచున్నది, భావానామ్ = భావ పదార్థములకు, సమారమ్భాత్ = అరంభము (ఉత్పత్తి) ఉండుట వలన, శాశ్వతం = శాశ్వతమైనను, బ్రహ్మ = బ్రహ్మ, ఆదిమత్ = ఆదికలదిగా నిశ్చయించబడుచున్నది.

తా. ఘటాదులను జూచి ప్రపంచము గూడ పరిచ్ఛిన్నమనియు, భావముల న్నియు జన్మకలవిగాన, శాశ్వతమగు బ్రహ్మకు గూడ ఆది ఉన్నదనియు నిర్ణయించు చుందురు.

శాస్త్రీయ ప్రక్రియ కాల్పనికమే కాని, వాస్తవము కాదని చెప్పుచున్నాడు.

ఉపాయాః శిక్షమాణానాం బాలానా మపలాలనాః
అసత్యే వర్త్మని స్థిత్వా తతః సత్యం సమీహతే. 288

ఉపాయాః = శాస్త్రములు, శిక్షమాణానాం = అభ్యసించుచున్న, బాలానామ్= అపండితులకు, అపలాలనాః = వంచనములే, అసత్యే = అసత్యమైన శాస్త్ర ప్రక్రియా రూపమగు, వర్త్మని = మార్గమునందు, స్థిత్వా = నిలచి, తతః = అటు పిమ్మట, సత్యం సత్యమును, సమీహతే = పొందును.

తా. పూర్వోక్త కారణములచే శాస్త్రములు జిజ్ఞాసువులగు అపండితులను మోస గించునవే కాని, వాటి ప్రక్రియలో సత్యము లేదు. కాని జిజ్ఞాసువు కొంత కాలము అసత్య ప్రక్రియా మార్గమునందు నిలచి, అటు పిమ్మట అవిద్యను పదలి సత్యమును పొందును.

ఇపుడు మరల వాక్య వాక్యార్థములు అఖండములని స్థాపించుటకై పదపదార్థములను నిరాకరించుచున్నాడు.

అన్యథా ప్రతిపద్యార్థం పదగ్రహణపూర్వకమ్
పునర్వాక్యే తమేవార్థ మన్యథా ప్రతిపద్యతే. 289

పదగ్రహణ పూర్వకం = వేరు వేరుగా పదములజ్ఞానముద్వారా, అర్థం = అర్థమును, అన్యథా = ఒక విధముగా, ప్రతిపద్య = శక్తిచే గ్రహించి, పునః = తిరిగి, వాక్యే = వాక్యమునందు, తం=ఆ, అర్థమేవ = అర్థమునే, అన్యథా = మరియొక విధముగా, ప్రతిపద్యతే = తెలిసికొను చున్నాడు.

తా. పదములను గ్రహించునపుడు ఒక విధమగు అర్థమును గ్రహించి మరల ఆ అర్థమునే వాక్యమున మరియొకవిధముగ గ్రహించుచున్నాడు.

వి. ఒక వాక్యమునందు మొదట పదగ్రహణ పూర్వకముగ, శక్తిచే, ఒక అర్థమును గ్రహించి అంతమునందు అదేవాక్యమున లక్షణచేతగాని, వ్యంజనచేతగాని, మరి యొక అర్థమును గ్రహించుచున్నాడు.

ఉదాహరణమునకు అపకారము చేసినవానిని గూర్చి "ఓ మిత్రమా ! నీవు నాకు చాల ఉపకారము చేసినావు" అని పలికినపుడు మొదట పదపదార్థముల గ్రహణముచే ఉపకారము చేసితివి అని విధేయముఖమున అర్థము గ్రహించినను తుదకు లక్షణచే "నీవు నాకు గొప్ప అపకారము చేసితివి" అను నర్థమును గ్రహించును.

ఈ విధముగ కొన్నిస్థలములలో నిషేధ్యముగ ప్రథమమున అవగతమగు వాక్యార్థము చివరకు లక్షణావ్యంజనాదులచే విధేయముగ తెలియబడుచున్నది. వాక్యవాక్యార్థముల లోని పదపదార్థములు సత్యములైనచో అపుడు పదార్థజ్ఞానసమయమున పరస్పరాన్విత పదార్థములను ఒకవిధముగ గ్రహించి, వాక్యార్థబోధానవసరమున వెనుకటి యర్థమును త్యజించి మరియొక అర్థమును గ్రహించుట యనునది అసమపన్నముకదా ! కావున చివరకు గ్రాహ్యమగు వాక్యార్థమే సత్య మనియు తత్పూర్వజన్య పదపదార్థజ్ఞాన మసత్య మనియు చెప్పవలెను.

మొదట 'నఞ్' పద ప్రయోగము లేక, వాక్యాంతమున దానిని ప్రయోగించిన, 'ధవ ఖదిర పలాశాః ఛేదనీయాః న' ఇత్యాది స్థలములలో పదగ్రహణ పూర్వకముగ మొదట గ్రహించిన పదార్థమును, తత్సమన్వయముచే లభించిన వాక్యార్థమును విడిచి, (అనగా, విధేయవాక్యార్థమును విడిచి) మరియొక నిషేధ రూపమగు వాక్యార్థము గ్రహింప బడుచున్నదని చెప్పుచున్నాడు.

ఉపాత్తా బహవోఽప్యర్థా యేష్వన్తే ప్రతిషేధనమ్
క్రియతే తే నివర్తన్తే తస్మాత్తాం స్తత్ర నాశ్రయేత్ . 240

(యే = ఏ) బహవోఽపి = అనేకమైన, అర్థాః = అర్థములు, ఉపాత్తాః = నఞ్ ప్రయోగముకంటె ముందు ప్రయోగింపబడిన అనేకపదములచే బోధింపబడినవో (పదముల ద్వారా గ్రహింపబడినవో), యేషు = వేటియందు, అంతే = అంతమునందు ప్రయుక్తమగు నఞ్ చేత, ప్రతిషేధనమ్ = నిషేధము, క్రియతే = చేయబడుచున్నదో, తే = ఆ పదార్థము లన్నియు, నివర్తన్తే = నఞర్థఘటితమగు వాక్యార్థము యొక్క జ్ఞానము కలుగునపుడు నివర్తించుచున్నవి. తస్మాత్ = అ కారణమువలన, తాన్ = అవిధముగ నివర్తింపనున్న పదార్థములను, తత్ర = నఞ్ రహితవాక్యమునందుకూడా, నాశ్రయేత్ = ఆశ్రయింపరాదు.

తా. వేటియందు అంతమున నిషేధము చేయబడునో అట్టి అనేకములగు అర్థములు ప్రారంభమున గ్రహింపబడినను, వాటిని అచట ఆశ్రయింపరాదు.

వి. "ధవ ఖదిర పలాశాః ఛేదనీయాః న" అనునపుడు మొదట 'ధవఖదిర పలాశాః ఛేదనీయాః' అనునంతవరకు వినగనే వాటిని ఛేదింపవలెను అను అర్థము వచ్చుచున్నది. కాని, అంతమునందు ప్రయుక్తము అగు 'నఞ్' చే తన్నిషేధము బోధింపబడుచున్నది. కాని ఈ విధముగ ఒకమారు గృహీతమగు అర్థమును పరిత్యజించినచో శబ్దార్థసంబంధము అనిత్యము కావలసి వచ్చును. కావున ధవఖదిర పలాశచ్ఛేదన రూపార్థమును గ్రహింపకుండుటయే యుక్తము.

పైనచెప్పిన విధముగ నఞ్ సమభివ్యాహారమున్నపుడు అఖండ వాక్య వాక్యార్థములనే సత్యములని అంగీకరించుట యుక్తము. దీని దృష్టాంతముచే నఞ్ సమభివ్యాహారము

లేనపుడు గూడ వాక్య వాక్యార్థముల అఖండత్వము నంగీకరించుటయే యుక్తమని చెప్పు చున్నాడు.

వృక్షో నాస్తీతి వాక్యం చ విశిష్టాభావలక్షణమ్
నార్థేన బుద్ధౌ సమ్బన్ధో నివృత్తే రవతిష్ఠతే. 241

'వృక్షః నాస్తి' ఇతి వాక్యం = 'వృక్షఃనాస్తి' అనెడు వాక్యము, విశిష్టాభావ లక్షణమ్=విలక్షణమగు అఖండమైన అభావమును జ్ఞాపింపచేయునది. (ఎందుచేతననగా) నివృత్తేః = నిషేధమునకు, అర్థేన='సత్' ఐనను, 'అసత్' ఐనను, నిషేధ్యమగు పదార్థముతో గూడ, సమ్బన్ధః = సంబంధము, బుద్ధౌ = బుద్ధియందు, నావతిష్ఠతే=నిలవదు.

తా. 'వృక్షః నాస్తి' అనెడు వాక్యము విలక్షణమగు అభావమును బోధించును; ఏలనన అర్థముతోగూడ నిషేధమునకు సంబంధము బుద్ధియందు నిలవదు.

వి. 'వృక్షః నాస్తి' అను అఖండవాక్యమే అఖండమగు వృక్షాభావ జ్ఞానరూపమగు అర్థమునకు జ్ఞాపకము. ఇచట ఆయా పదార్థములతో ఘటితమగు సఖండవాక్యార్థము నంగీకరించినచో స్వీకారణ బలముచే స్థితిని సంపాదించుకొనిన (అనగా, ఉన్నట్లుగా తెలియబడిన) వృక్షపదార్థముతో నఞర్థమగు నిషేధమునకు సంబంధము కుదరదు. జనితమై యున్న సత్పదార్థమును లేదనుట ఎట్లు? వృక్షరూపార్థము బుద్ధియందున్నను, బాహ్యస్థలమున లేదుగాన, దానికి నఞర్థముతో సంబంధ ముండవచ్చును అనుటకూడ యుక్తము కాదు. స్వతః, 'అసత్' అగు (లేని) పదార్థమును నిషేధించుట అనావశ్యకముకదా? కావున, 'వృక్షో నాస్తి' ఇత్యాది నఞ్ఘటితవాక్యములలో విలక్షణాభావావగతిరూపమగు అఖండ వాక్యార్థమునే అంగీకరింపవలెను. నఞ్ఘటిత వాక్య సామ్యముచే తదఘటితములగు 'వృక్షఃఅస్తి' ఇత్యాది వాక్యములందుగూడ అఖండార్థత్వమునే అంగీకరించుట యుక్తము.

'నఞ్' నిషేధబుద్ధిని కలిగించుటకు పూర్వమే 'వృక్షః నాస్తి' అనువాక్యమున పద పదార్థములను విభజించుటచే ముందుగ వృక్ష పదార్థ విషయకమగు అస్తిత్వబుద్ధి (వృక్షము ఉన్నది అనుబుద్ధి) కలుగును. నఞ్ ప్రయోగించగనే తత్సంబంధముచే ఆ బుద్ధి నివర్తింపచేయబడును. అంతియేకాని, వృక్షాస్తిత్వమును నిషేధించుట అనునది లేదు అని ఆశంకించి వృక్షాస్తిత్వము శబ్ద బోధితముగాని వృక్షాస్తిత్వబుద్ధి శబ్దబోధితముకాదు కావున శబ్దబోధితము కాని వృక్షాస్తిత్వ బుద్ధితో నఞ్ శబ్దార్థమగు నిషేధమునకు అన్వయము కుదురదు. శబ్దార్థము శబ్దార్థముతోడనే అన్వయించును గాని, శబ్దార్థ భిన్నముతో అన్వయింపదు కదా, యని చెప్పుచున్నాడు.

విచ్ఛేదప్రతిపత్తౌ చ యద్యస్తీత్యవధార్యతే
అశబ్దవాచ్యా సా బుద్ధి ర్నివర్తేత స్థితా కథమ్? 242

విచ్ఛేద ప్రతిపత్తౌ=పదపదార్థముల విభక్త జ్ఞానము కలుగగా, అస్తీతి = ఉన్నది అని, అవధార్యతే యది=వృక్షాస్తిత్వము నిర్ణయింపబడినట్లైతే, అశబ్దవాచ్యా = శబ్దవాచ్యము కానిదియు, స్థితా=ఉన్నదియు అగు, సా=ఆ అస్తిత్వబుద్ధి, కథమ్=ఎట్లు, నివర్తేత = నివర్తించును.

తా. విభక్తమగు జ్ఞానము కలిగినపుడు, ఉన్నది అని నిర్ధారణము చేయబడినచో, శబ్దవాచ్యము కానిదియు, ఉన్నదియును అగు ఆ అస్తిత్వబుద్ధి ఎట్లు నివర్తించును?

వి. నఞ్ శబ్దవాచ్యమగు అర్థమునుమాత్రమే నిషేధించును. శబ్దము బాహ్యమగు ఆర్థమును బోధించును. వృక్షాస్తిత్వము శబ్ద బోధ్యముకావచ్చును గాని, వృక్షాస్తిత్వబుద్ధి శబ్దవాచ్యముకాదు. కావున అది నఞ్‌తో సంబంధింపజాలదు. 'కావున, వృక్షః నాస్తి' అను వాక్యమునందలి 'వృక్షఃఅస్తి' అనుదానికి వృక్షాస్తిత్వబుద్ధియను నర్థమును చెప్పి దానిని నిషేధించుట కుదురదు గాన, "వృక్షో నాస్తి" అనుదానిని అఖండవాక్యముగ అంగీకరించి తద్బోధ్యమగు వృక్షాభావరూపార్థము కూడ అఖండమని చెప్పవలెనని యర్థము.

పైనచూపినట్లు, నఞ్ వృక్షాస్తిత్వబుద్ధిని నివర్తింపచేయకున్నను ఆ బుద్ధి మిథ్యాభూతమని తెలుపుచున్నది అని ఆశంకించి నిరాకరించుచున్నాడు.

> అథ యద్ జ్ఞాన ముత్పన్నం త న్మిథ్యేతి నఞా కృతమ్
> నఞో వ్యాపారభేదేఽస్మి న్నభావావగతిః కథమ్ . 248

అథ = అట్లుగాక, యద్ = ఏ, జ్ఞానమ్ = వృక్షాస్తిత్వజ్ఞానము, ఉత్పన్నమ్ = పుట్టినదో, తత్ = అది, మిథ్యేతి = అసత్యమైనది అను జ్ఞానము, నఞా = నఞ్ చేత, కృతమ్ = ఏర్పరుపబడినట్లైతే, (అట్లైనను) నఞః = నఞ్‌కు, అస్మిన్ = ఈ, వ్యాపారభేదే = పూర్వజ్ఞానము అసత్యము అని బోధించుట యను వ్యాపార విశేషమును అంగీకరించినచో, అభావావగతిః = అభావజ్ఞానము, కథమ్ = ఎట్లు కలుగును?

తా. అట్లుకాక, నఞా ఉత్పన్నమగు జ్ఞానము అసత్యమని బోధించును అని చెప్పినచో ఈ విధముగా నఞ్కు వ్యాపారభేదము నంగీకరించిన పక్షమున అభావావగతి ఎట్లు కలుగును?

వి. వృక్షాస్తిత్వబుద్ధి శబ్దార్థముకాదుగాన, నఞర్థమునకు దానితో సంబంధము లేకపోవచ్చును. కాని ఇచట నఞ్ "వృక్షాస్తిత్వజ్ఞానము మిథ్య" అని బోధించును. ఇట్లు చెప్పినచో పూర్వోక్తపగు అనుపపత్తి యుండదు—అనికూడ చెప్పుట యుక్తముకాదు. ఇచట నఞ్ వృక్షాభావబోధనమునకై ఉద్దిష్టమైనది. ఇపుడు దానికి పూర్వజ్ఞానము అసత్యము అని బోధించుట యను అర్థమును కల్పించినచో అభావరూపార్థమును బోధించుట ఎట్లు? అనగా నఞ్‌కు పర్యుదాసార్థమును చెప్పినచో "ఇది వృక్షముకాదు, వృక్షసదృశము; కావున వృక్షజ్ఞానము మిథ్య" యని చెప్పుటకు వీలగును కాని, నఞ్ ప్రసజ్య ప్రతిషేధార్థకమైనచో ఇట్లు చెప్పుట కుదురదు. ప్రసజ్యప్రతిషేధమును అంగీకరించినగాని, వాక్యార్థమగు వృక్షాభావము బోధింపబడదు అని యభిప్రాయము.

పర్యుదాసమనియు, ప్రసజ్యప్రతిషేధమనియు నఞర్థములు రెండు. నఞ్ ఉత్తర పదముతో అన్వయించినచో అది పర్యుదాసము. 'అబ్రాహ్మణః', 'అనశ్వః', ఇత్యాదులలో 'నఞ్' బ్రాహ్మణ, అశ్వ, ఇత్యాది పదములతో అన్వయించి, 'బ్రాహ్మణుడు కానివాడు' 'అశ్వముకానిది' అను అర్థములను బోధించుచున్నది. ఇచట నఞ్ తద్భిన్నత్వమునేగాక, తత్సదృశత్వమునుగూడ తెలుపును. "న ఞివయుక్త మన్యసదృశే తథాహ్యర్థగతిః" ('నఞ్' తోడను, 'ఇవ' తోడను కూడినపదము తద్భిన్నము, తత్సదృశము అను అర్థమును బోధించును, ఈ విధముగనే లోకములో అర్థబోధ కలుగుచున్నదికదా)అని అభియుక్తోక్తి; కావుననే, ఒక చెట్టునుగాని, ఒక పుట్టనుగాని చూపి, 'అబ్రాహ్మణః' 'అనశ్వః' అని అనరాదు. అవి

బ్రాహ్మణాశ్వ భిన్నములే యైనను, బ్రాహ్మణాశ్వ సదృశములు కావు. కావున, బ్రాహ్మణ భిన్నులును, బ్రాహ్మణ సదృశులును, అగు క్షత్రియాదులను అబ్రాహ్మణులని యనవచ్చును. అశ్వభిన్నములును అశ్వసదృశములు నగు వృషభాదులను మాత్రమే అనశ్వము లనవచ్చును. నఞ్ క్రియతో అన్వయించినచో అది ప్రసజ్యప్రతిషేధము, "బ్రాహ్మణః నాగచ్ఛతి" "అశ్వః నాగచ్ఛతి" ఇత్యాదులందు నఞ్ ఆగమనక్రియతో అన్వయించి, 'వచ్చుటలేదు' అను నర్థమును (గమనాభావమును) బోధించుచున్నది. కావున ఇది ప్రసజ్యప్రతిషేధము "పర్యుదాసః సవిజ్ఞేయః యత్రోత్తరపదేన నఞ్, ప్రసజ్యప్రతిషేధోఽయం క్రియయా సహ యత్ర నఞ్" అని అభియుక్తవచనము.

నఞ్ నివర్తింపమన్న వృక్షమునే బోధించును. నివర్తింపనున్న ఈ వృక్షాది బౌద్ధ పదార్థము (బుద్ధిస్థ వృక్షాది పదార్థము) సత్తు అని గాని, అసత్తు అని గాని, వికల్పించుట కుదురదు గాన, ఉభయ విలక్షణమని చెప్పవచ్చును అని ఆశంకించుకొని అట్లు అంగీకరించినచో ఆధారమగు వృక్షపదము నపేక్షింపకయే నఞ్ ప్రవర్తించునని చెప్పవలసియుండును. అపుడు ప్రతియోగి వాచకమగు వృక్షాదిపదముకంటె పూర్వమే నఞ్‌ను ప్రయోగించవలసియుండును; పరముగ కాదు. కాని, 'వృక్షః న' ఇత్యాదివిధమున ప్రతియోగివాచకమునకు తరువాతనే నఞ్ పదమును ప్రయోగించుట స్వారసికముగ కన్పట్టుచున్నది. అట్లంగీకరించుటలో మరియొక దోషమేమనగా—నఞ్ అనునదియే నిషేధ్యమగు వృక్షాదికమును బోధించును గాన, దేనినైన నిషేధించవలసియున్నప్పుడు ప్రతియోగి పదమును ప్రయోగింపకుండగనే కేవలము 'న' అని యందురు. ప్రతియోగి వాచక పదప్రయోగము ప్రతియోగి నియమము కొఱకై చేయబడు చున్నది.—అనగా, ఇది ఘట నిషేధముగాని, పటనిషేధముకాని కాదు, వృక్షనిషేధము, అను నియమమును సూచించుటకై, 'న వృక్షః', ఇత్యాదులలో ప్రతియోగి ప్రయోగము చేయబడుచున్నది అన్నచో—ప్రతియోగి వాచకపదము స్వార్థమును విడచి లక్షణచే స్వేతరార్థ నిషేధమును బోధించుట యనునది అనుచితముకాదా! ఈ విషయము లన్నిటిని మనస్సులో నుంచుకొని చెప్పుచున్నాడు.

నిరాధారప్రవృత్తౌ చ ప్రాక్ ప్రవృత్తి ర్నఞో భవేత్
అథాధారః స ఏవాస్య నియమార్థా శ్రుతి ర్భవేత్ . 244

నిరాధారప్రవృత్తౌ = ఆధారములగు వృక్షాదిశబ్దముల అపేక్షలేని ప్రవృత్తిని నఞ్‌కు అంగీకరించినచో, నఞః = నఞ్‌కు, ప్రాక్ = ఆధారమగు ప్రతియోగికంటె పూర్వము, ప్రవృత్తిః = ప్రయోగము, భవేత్ = కావలసివచ్చును. అథ = అట్లుకాక, స ఏవ = ఆ వృక్షాదికమే, అస్య = ఈ నఞ్‌కు, ఆధారః = ఆధారము, (ఘటపటాదికము కాదు) అని చెప్పినచో, (అప్పుడు) శ్రుతిః = వృక్షాదిపదశ్రవణము, నియమార్థా = నియమ రూపమగు అర్థము కలదిగా, భవేత్ = కావలసివచ్చును.

తా. ఆధారాపేక్షలేని ప్రవృత్తిని అంగీకరించినచో నఞ్‌ను పూర్వమందే ప్రయోగించవలసి యుండును. అట్లుకాక, అదియే దీనికి ఆధారమన్నచో వృక్షాది పదశ్రుతి నియమార్థము కావలెను. (ఈ విధముగ స్వార్థమును విడచి లాక్షణికార్థమును స్వీకరించుట యుక్తము కాదని అభిప్రాయము).

వి. ఏదిలేదని చెప్పుదుమో - అనగా దేనియొక్క అభావమును చెప్పుదుమో దానికి ప్రతియోగియని పేరు. 'ఘటము లేదు' అనునపుడు లేనిది ఘటముగాన, ఘటమునకు ప్రతియోగియని పేరు. "యస్యాభావ స్తత్ ప్రతియోగి".

పక్షాంతరములను శంకించి పరిహరించుచున్నాడు.

నియమద్యోతనార్థా వా అనువాదోఽథవా భవేత్
కశ్చిదే వార్థవాం స్తత్ర శబ్దః శేషా స్త్వనర్థకాః . 245

పూర్వకారికనుండి 'శ్రుతిః' అనుపదము అనువర్తించును. అచట 'శ్రుతిః' అను దానికి ప్రతియోగి వాచకపదశ్రుతియనియు, ఇచట 'నఞ్ శ్రుతి' యనియు అర్థము.

వా = లేక (నఞ్ శ్రుతి), నియమద్యోతనార్థావా = నియమమును ద్యోతింపచేయుట కొరకైనదిగాని, అథవా అనువాదః = అనువాదముగాని, భవేత్ = అగును, ఏ పక్షము నంగీకరించినను, తత్ర = 'వృక్షో నాస్తి' ఇత్యాదులలో, కశ్చిత్ = ఏదియో యొక, శబ్దఏవ = శబ్దముమాత్రమే, అర్థవాన్ = అర్థముకలది, శేషాస్తు = ఇతరపదములైతే, అనర్థకాః = అర్థరహితములు.

వి. 'నిపాతా ద్యోతకాః కేచిత్' అను మతము ప్రకారము 'వృక్షో న' ఇత్యాదులలో ప్రతియోగి వాచకమగు వృక్షాది పదమే నివర్త్యమాన ప్రతియోగివాచకము (లేదని చెప్పబడుచున్న వృక్షమును - అనగా వృక్షాభావమును) బోధించును. నఞ్ రూపమగు నిపాతము కేవలము తదర్థ ద్యోతకము అని చెప్పవచ్చును. కాని, శబ్దార్థ నియామకములగు సంయోగాదులలో ఏదో ఒకదాని సహాయముచేతనే ప్రతియోగివాచకపదము నివర్త్యమాన ప్రతియోగివాచకమని చెప్పుటకు అవకాశముండును గాన, నఞ్ వ్యర్థమే యనవలసి వచ్చును. కావున ఈ నఞ్ ప్రతియోగిత్వమును మాత్రమేకాక, ప్రతియోగి నియమమును కూడ సూచించునని చెప్పవలయును. కాని, నియమము అనుచితమను విషయము పూర్వకారికయందే స్పష్టీకరింపబడినది. అట్లుకాక, ప్రతియోగిపదముగాని, నఞ్ గాని, నివర్త్యమాన ప్రతియోగిని బోధింప, రెండవది ఆ యర్థమునే అనువదించుచు, స్పష్టీకరించుచున్నదని చెప్పవచ్చును. కాని, అట్లు చెప్పినచో పునరుక్తిదోషము వచ్చును. ఈ విధముగ, ప్రతియోగిబోధక పదశ్రుతి నియమార్థ మన్నను, నఞ్ ప్రయోగము నియమ ద్యోతనార్థ మన్నను, లేదా, వీటిలో ఒకటి అనువాదార్థమన్నను, 'వృక్షః న' ఇత్యాదులలోని ఒక పదము మాత్రమే సార్థకము, ఇతరపదములు నిరర్థకములు అని తేలినది. ఇట్లు ఒక వాక్యము నందలి ఒకభాగమునకు సార్థకత్వమును, మరియొకభాగమునకు నిరర్థకత్వమును, చెప్పుట అయుక్తము. కావున 'వృక్షో నాస్తి' ఇత్యాద్యఖండవాక్యములు విశిష్టాభావరూపమగు అఖండ వాక్యార్థమును బోధించుచున్నవని యంగీకరించుట యుక్తము.

'అన్యథా ప్రతిపద్యార్థమ్' ఇత్యాది పూర్వకారికను (239) సింహావలోకనముచే వ్యాఖ్యానించుచున్నాడు.

విరుద్ధం చాభిసమ్బద్ధ ముదహార్యాదిభిః కృతమ్
వాక్యే సమాప్తే వాక్యార్థ మన్యథా ప్రతిపద్యతే . 246

(వాక్యసమాప్తికి పూర్వము పదార్థము, ప్రతిభాసించునపుడు) ఉదహార్యాదిభిః = 'ఉదహారి' మొదలగు పదములచే, కృతమ్ = చేయబడిన, విరుద్ధమ్ = విరుద్ధమగు, అభిసమ్బన్ధమ్ = పదార్థసంబంధమును, (అవగచ్ఛతి = తెలిసికొనును). వాక్యే = వాక్యము, సమాప్తే = సమాప్తమైనదగుచుండగా, వాక్యార్థమ్ = వాక్యార్థమును, అన్యథా = మరియొక విధముగా, ప్రతిపద్యతే = గ్రహించును.

తా. 'ఉదహారి' మొదలగు పదములచే కలిగిన విరుద్ధపదార్థసంబంధమును గ్రహించుచున్నాడు. వాక్యము పూర్తియైన పిమ్మట, వాక్యార్థమును మరియొకవిధముగ గ్రహించును.

వి. "ఉదహారి, భగిని యా త్వం శిరసానడ్వాహం వహసి సా త్వం ప్రాచీనం కుమ్భ మభిధావన్త మద్రాక్షీః" ఇత్యాదివాక్యములలో పదప్రయోగము అస్తవ్యస్తముగ నుండుటచే వాక్యము పూర్తిగానిసమయమున శ్రోత, "ఓ ఉదహారీ! ఎద్దును మోయుచున్నావు" ఇత్యాది విరుద్ధములగు పదార్థముల జ్ఞానమును పొందును. కాని వాక్యము పూర్తియైనపిమ్మట యోగ్యతా వశముచేత పదములను— 'ఉదవాహిని, భగిని, యా త్వం ప్రాచీనం కుమ్భం శిరసా వహసి, సా త్వం అభిధావన్త మనడ్వాహ మద్రాక్షీః' (నీరును మోసికొని పోయే ఓ సోదరీ! ఏ నీవు శిరస్సుపై పాతకుండను ధరించుచున్నావో ఆ నీవు పరుగిడిపోవుచున్న ఎద్దును చూచితివా?) ఇత్యాదివిధమున తగుక్రమమున నేర్పరచుకొని, మొదట గ్రహించిన, పదార్థములకంటె భిన్నమగు వాక్యార్థమును గ్రహించును. కావున వాక్యార్థమునందు పదార్థ మనునది వాస్తవము కాదు.

ఈ విషయమునే మరియొక విధముగకూడ మరల ప్రతిపాదించుచున్నాడు.

> స్తుతినిందాప్రధానేషు వాక్యే ష్వర్థో న తాదృశః
> పదానాం ప్రవిభాగేన యాదృశః పరికల్ప్యతే . 247

స్తుతి నిందా ప్రధానేషు = స్తుతి ప్రధానములును నిందా ప్రధానములును అగు, వాక్యేషు = వాక్యములయందు, పదానాం = పదములయొక్క, ప్రవిభాగేన = విభాగముచేత, యాదృశః = ఎట్టి, అర్థః = అర్థము, పరికల్ప్యతే = వాచ్యమగుచున్నదో, తాదృశః = అట్టి అర్థము, న = వాచ్యమగుటలేదు.

తా. స్తుతి నిందా ప్రధానములగు వాక్యములలో పదములను విభజించుటచే వాచ్యమగు అర్థము వాక్యార్థముగా కానరాదు.

వి. కొన్ని వాక్యములలో స్తుతి వాక్యార్థముగ నుండును. కాని పదార్థ జ్ఞాన సమయమున నిందారూపార్థము అవగతమగును.

ఉదా॥ "కః స్వర్ధుని వివేక స్తే పాపినో నయసే దివమ్"

'ఓ గంగా! పాపాత్ములను స్వర్గమునకు కొనిపోవుచున్నావు. ఇదియేనా నీ వివేకము?' ఇచట పదార్థజ్ఞానసమయమున 'నీకు వివేకజ్ఞానములేదు' అని నింద గమ్యమగుచున్నను, 'పాపాత్ములను గూడ స్వర్గమును చేర్చగల పవిత్రురాలవు నీవు' అను స్తుతియే వాక్యార్థము.

ఇట్లే కొన్నియెడల పదార్థబోధావసరమున స్తుతి బోధ్యమాన మగుచున్నను, నిందయే ప్రధానవాక్యార్థముగ నుండును.

ఉదా॥ "సాధు దూతి! పునః సాధు కర్తవ్యం కిమతఃపరమ్ ।
యన్మదర్థే విలూనాసి దన్తైరపి నఖై రపి॥"

'బాగు దూతీ బాగు: ఇంతకంటె ఏమిచేయుదువు: నాకొరకై దంతములచేతను, నఖములచేతను విలూనవైతివి' తన ప్రియుని తీసుకొనివచ్చెదనని తెల్పి ఆతనికడకు పోయి, ఆతనితో ఆనంద మనుభవించి వచ్చిన దూతిక శరీరముపై దంతక్షతాది సంభోగచిహ్నములను జూచి నాయిక అను మాట లివి. ఇచట పదార్థజ్ఞానసమయమున స్తుతి గమ్యమగుచున్నను, నిందయే ప్రధాన వాక్యార్థము.

పద పదార్థములుకూడ, సత్యమైనచో ఈ వాక్యము విరుద్ధార్థబోధక మనవలసి వచ్చును. గాన, వాక్యార్థమున పదపదార్థములు లేవని అంగీకరింపవలెను.

ఇపుడు పదవాది ఆశంకించుచున్నాడు.

అథాసంసృష్ట ఏవార్థః పదేషు సమవస్థితః
వాక్యార్థ స్యాభ్యుపాయోఽసా వేకస్య ప్రతిపాదనే. 248

పదేషు = పదములయందు, అసంసృష్ట ఏవ = ఇతరార్థములతో సంసృష్టముకాక వేరువేరుగ నుండు, అర్థః = అర్థము, సమవస్థితః = వాచ్యముగానున్నది; అసౌ = ఈ పదార్థము, ఏకస్య = ఒక్క, వాక్యార్థస్య = వాక్యార్థముయొక్క, ప్రతిపాదనే = ప్రతిపాదనమునందు, అభ్యుపాయః = ఉపాయము.

తా. పదములలో అసంసృష్టముగనే ఉన్న పదార్థము ఒక్క వాక్యార్థమును బోధించుటకు ఉపాయము.

వి. అర్థాంతరముతో సంసృష్టముకానిది పదార్థము; తత్సంసృష్టము వాక్యార్థము. వాక్యార్థమనునది ఒక్కటి మాత్రమే. కాని వాక్యార్థమునందు అనేకములగు పదార్థములు భాసించుచున్నవి. మొదట పదార్థజ్ఞానము కలుగుచున్నది. పిమ్మట వాక్యార్థజ్ఞానము కలుగుచున్నది. కావున పదార్థము వాక్యార్థజ్ఞాన హేతువు అని అంగీకరింపవలెను. అంచుచే పదార్థము కూడ సత్యమే యని పూర్వపక్షి యభిప్రాయము.

దీనిని నిరాకరించుచున్నాడు.

పూర్వం పదే ష్వసంసృష్టో యః క్రమా దుపచీయతే
భిన్నగ్రథితకల్పత్వా త్తం విశిష్టతరం విదుః. 249

పూర్వం = ఆదియందు, యః = ఏ అర్థము, అసంసృష్టః = అర్థాంతరములతో అన్వితము కాకుండగనే, క్రమాత్ = క్రమముగ, అర్థాంతరములతో అన్వయించి, ఉపచీయతే = వృద్ధిపొందునో (వికసించునో), తం = వాక్యార్థమనెడు ఈ అర్థమును, భిన్నగ్రథితకల్పత్వాత్ = భేదించి అతికిన ఘటాదులతో సమానమగుటవలన, విశిష్టతరం = పదముల యర్థము మాత్రముకంటె అత్యంత విలక్షణమైనదానినిగా, విదుః = చెప్పుదురు.

తా, ఏ అర్థము అదియందు అసంస్పృష్టముగనుండి పిదప క్రమముగ వికసిత మగునో అది భేదించి, అతుకబడినదివలె నుండుటచే విశిష్టతరము అని చెప్పుదురు.

వి. రెండు చిప్పలను (కపాలములను) అతికి కుండగ తయారుచేయుదురు. కావున, కుంభకారుడు మొదట కపాలాంతరముతో సంయుక్తముకాని కపాలమును, కపాలాంత రముతో కలిపి, తయారుచేయగా, ఏర్పడిన ఘటము, కపాలములకంటె అత్యంతభిన్నమగు పదార్థాంతరమని నైయాయికుల సిద్ధాంతము. అంతియేకాని, శాఖలకు వృక్షమునకు నడుమ భేదాభేదము నంగీకరించినట్లు, (కొమ్మలను విడివిడిగా కొమ్మలుగా తీసుకొన్నచో వాటికిని వృక్షమునకును భేదము. సమూహ రూపమున తీసికొన్నచో అభేదము) ఇచట అంగీకరింపరు. అట్లే మొదట పదార్థాంతర సంసర్గములేక పిమ్మట క్రమముగ వాక్యార్థరూపమున ఉపచిత మగు అర్థము పదార్థముకంటె అత్యంత విలక్షణమైనది.

ఈ విధముగ అనేక యుక్తుల సహాయముచే వాక్యార్థము అఖండమనియు, అదియే సత్యమనియు, అపోద్ధారకల్పితములగు పదపదార్థములు అసత్యములనియు ప్రతిపాదింపబడినది. ఈ అఖండవాక్య, వాక్యార్థవాదులు పదపదార్థములను సత్యములని అంగీకరింపకున్నను, పదపదార్థాపోద్ధారమును స్వీకరించి పదపదార్థములను, వ్యవహారార్థమై అంగీకరించి యున్నారు. కావున, ఇపుడు ప్రసంగవశముచే ముఖ్య గౌణ విభాగమును చేయబోవుచు, మొదట అర్థభేదము ననుసరించి, శబ్ద భేదమున్నదా లేదా యని విచారించుచున్నాడు.

ఏక మాహు రనేకార్థం శబ్ద మన్యే పరీక్షకాః
నిమిత్తభేదా దేకస్య సార్వార్థ్యం తస్య భిద్యతే. 250

అన్యే = కొందరు, పరీక్షకాః = శాస్త్రజ్ఞులు, ఏకమ్ = ఒక, శబ్దమ్ = శబ్దమును, అనేకార్థమ్ = అనేకములైన అర్థములు కలదానినిగా, ఆహుః = చెప్పుచున్నారు. ఏకస్య = ఒకటేయైనను, తస్య = ఆ శబ్దమునకు, నిమిత్త భేదాత్ = అర్థప్రకరణాది రూపములగు నిమిత్తముల భేదము వలన, సార్వార్థ్యం = అనేక అర్థములు కలిగియుండుట, భిద్యతే = (అభిన్నమే ఐనను) భిన్నముగ కనబడుచున్నది.

తా. కొందరు శాస్త్రకారులు ఒకే శబ్దము అనేకార్థమని చెప్పుచున్నారు. ఒక్కటే యైనను, ఆ శబ్దముయొక్క సర్వార్థకత్వము నిమిత్త భేదముచే భిన్నముగ నుండును.

వి. వ్యాకరణశాస్త్రమున ఏకశబ్దదర్శనము అనేకశబ్దదర్శనము అను రెండు పక్షములున్నవి. అర్థభేదముచే శబ్దభేదము— అనగా ధేనువు అను అర్థముగల గోశబ్దము వేరు, భూమ్యర్థకమగు గోశబ్దము వేరు—అని అంగీకరించు పక్షము అనేకశబ్దదర్శనము. ఆవు, భూమి, కిరణములు, మొదలగు వేరువేరు అర్థములను చెప్పుచున్నను, గోశబ్ద మొక్కటియే యని చెప్పునది ఏకశబ్ద దర్శనము. పదరూపమగు నిమిత్తము, ఒక్కటియే యైనను, అర్థము, ప్రకరణము, మొదలగు నిమిత్తాంతరములు భిన్నములగుటచే ఒకే గో శబ్దము అనేకార్థవాచకముగ నుండును అని ఏకార్థ దర్శనమును అంగీకరించువారి అభిప్రాయము

ఒకే శబ్దము నిమిత్త భేదముచే శక్తి భేదమును పొంది అనేకార్థవాచకమని, యంగీక రించుటచే ప్రకృతమున నేమి యని ఆశంకించుకొని, సమాధానము చెప్పుచున్నాడు.

యౌగపద్య మతిక్రమ్య పర్యాయే వ్యవతిష్ఠతే
అర్థ ప్రకరణాభ్యాం వా యోగా చ్ఛబ్దాన్తరేణ వా . 251

(గవాది శబ్దము నానార్థమైనను), యౌగపద్యమ్ = ఒక్కమారుగ సర్వార్థబోధ కత్వమును, అతిక్రమ్య = విడిచి, అర్థప్రకరణాభ్యాం = ప్రయోజనముచేత గాని, ప్రకరణముచేతగాని, శబ్దాన్తరేణ = ఇతర శబ్దముతో, యోగాద్వా = సంబంధమువలన గాని, పర్యాయే = పర్యాయముచే ఆయాయర్థములను బోధించుటయందు, వ్యవతిష్ఠతే = నియతమగును.

తా. అనేకార్థశబ్దము ఒక్కమారుగ, సర్వార్థబోధకత్వమును విడిచి, అర్థప్రకరణములచేతగాని, శబ్దాంతర సంబంధమువలనగాని, పర్యాయమున ఆయా యర్థములను బోధించుచుండును.

వి. గవాదిశబ్దములకు అనేకార్థములున్నను, ఆ అర్థము లన్నింటిని ఆ శబ్దము ఒకే సమయమున బోధింపదు. ప్రయోజనమునుబట్టి గాని, ప్రకరణ సహాయముచే గాని, శబ్దాంతర సన్నిధిచేగాని, ఒకమారు ఒక అర్థమునే బోధించును. "గౌః పాలయితవ్యా దుగ్ధాయ" అనునప్పుడు 'పాలకొరకు గోవును పోషింపవలెను' అని యున్నదిగాన, ఇచట పాలు అను ప్రయోజనమును బట్టి గోశబ్దము ధేనురూప ముఖ్యార్థ వాచకము. "గౌర్భర్తవ్యో గృహకర్మసిద్ధయే'' (గృహ కర్మలుచేయుటకై గోవును పోషించవలెను) అనునపుడు గృహకర్మసిద్ధియను ప్రయోజనమునుబట్టి గోశబ్దము వాహీకుడు (ఎద్దువలె మొరటగానుండెడు వాహీకదేశీయుడగు వ్యక్తి) అను గౌణార్థమును బోధించును. 'గౌ స్తిష్ఠతి', ' గౌ ర్గచ్ఛతి ' ఇత్యాదులలో ప్రకరణాది భేదము ననుసరించి గో వాహీకాద్యర్థములను బోధించును. ' గౌ ర్దుహ్యతే ' (గోవు పిదుకబడుచున్నది) ' గాం పాఠయ ' (గోవుకు చదువు చెప్పుము) ఇత్యాదులయందు ' దుహ్యతే ', 'పాఠయ' ఇత్యాది పద సాన్నిధ్యముచే క్రమముగ ధేను, వాహీకార్థములు బోధింపబడుచున్నవి.

'యౌగపద్య మతిక్రమ్య పర్యాయే వ్యవతిష్ఠతే' అను దానికి ఉదాహరణము చెప్పుచున్నాడు.

యథా సాస్నాదిమాన్ పిణ్డో గోశబ్దే నాభిధీయతే
తథా స ఏవ గోశబ్దో వాహీకేఽపి వ్యవస్థితః . 252

గోశబ్దేన = గోశబ్దముచేత, యథా=ఏ విధముగా, సాస్నాదిమాన్ =గంగడోలు మొదలగుదానితోకూడిన, పిణ్డః = పదార్థము, అభిధీయతే=అభిధచే బోధించబడుచున్నదో, తథా = అట్లు, సః = అ, గోశబ్ద ఏవ = గోశబ్దమే, వాహీకేఽపి = వాహీకుడను అర్థమునందు కూడ, వ్యవస్థితః = నియతమైయున్నది.

తా. గోశబ్దము అభిధచే ఏ విధముగా సాస్నాదులతో గూడిన ఒక పదార్థమును బోధించునో, అట్లే, వాహీకుడు అనునర్థమునందు కూడ నియతమై యుండును.

వి. గోశబ్దము అభిధావృత్తిచే గోత్వజాతి బోధనపురస్సరముగ గంగడోలు మొదలగు అవయవవిశేషములు గల ఒక వ్యక్తిని ఏవిధముగ బోధించుచున్నదో ఆ విధముగ, అదే గోశబ్దము, అభిధావృత్తిచేతనే, వాహీకాద్యర్థమును గూడ బోధించుచున్నది. అనగా శక్తిస్వరూపమునందు భేదమున్నను, అభిధయనునది ఒక్కటియే. శుద్ధలక్షణ,

గౌణలక్షణ యను మరియొక్క వృత్తి యేదియును లేదు. అభిధయే ప్రసిద్ధమైనచో ముఖ్యమనియు, అప్రసిద్ధమైనచో గౌణమనియు శబ్దోపచారముచే—అనగా శబ్దమునందు ముఖ్యత్వ, గౌణత్వారోపణముచే చెప్పబడుచున్నది అని సూచింపబడినది.

ఈ విషయమునే స్పష్టీకరించుచున్నాడు.

సర్వశక్తేస్తు తస్యైవ శబ్ద స్యానేకధర్మణః
ప్రసిద్ధిభేదాద్ గౌణత్వం ముఖ్యత్వం చోపవర్ణ్యతే. 253

అనేక ధర్మణః = అర్థభేదముచే వేరు వేరు శక్తికల, సర్వశక్తేః = కావుననే సర్వార్థ విషయకభిన్నశక్తులు గల, తస్య = ఆ ఒక్క, శబ్దస్యైవ = గవాదిశబ్దమునకే, ప్రసిద్ధి భేదాత్ = అధిక ప్రసిద్ధి-అల్పప్రసిద్ధి భేదముచే, ముఖ్యత్వం = ముఖ్యత్వము, గౌణత్వంచ = గౌణత్వమును, ఉపవర్ణ్యతే = చెప్పబడుచున్నది.

తా. అనేక ధర్మమును సర్వశక్తియు నగు ఆ శబ్దమే ప్రసిద్ధిభేదము ననుసరించి, గౌణమనియు ముఖ్యమనియు చెప్పబడుచున్నది.

వి. ఒక్క గోశబ్దమునకే అనేకములగు అర్థములను బోధించు శక్తులుండుటచే, అది సర్వశక్తిమంతము. కాని, గోశబ్దము గోత్వాదివిశిష్ట పిండరూపమగు అర్థమును బోధించునని ఎక్కువ ప్రసిద్ధి కలదు. కావున ఆ యర్థమున గోశబ్దము ముఖ్యము. వాహీకాద్యర్థ ప్రతిపాదనమున ప్రసిద్ధి అల్పము. అందుచే ఆ యర్థములందు గోశబ్దము గౌణము. ఈ విధముగ వేరు వేరు అర్థములను బోధించినను శబ్దమొక్కటియే. ఆ శబ్దము అభిధా శక్తిచేతనే ముఖ్య గౌణార్థములను రెండింటిని బోధించును.

శబ్దైక్యదర్శనమున గౌణ ముఖ్య విభాగమును చూపి, ఇపుడు ఆదర్శనమునందే, ఆయా యర్థముల భేదముచే భిన్నములగు మంత్రముల వినియోగ ప్రకార భేదమును గూర్చి చెప్పుచున్నాడు.

ఏకో మన్త్ర స్తథాధ్యాత్మ మధి దైవ మధిక్రతు
అనక్కరేణ సర్వార్థో భిన్నశక్తి ర్వ్యవస్థితః. 254

తథా = ఆ విధముగా, ఏకః = ఒక్క, మన్త్రః = మంత్రము, అధ్యాత్మం = ఆత్మయందును, అధిదైవమ్ = దేవతలయందును, అధిక్రతు = యజ్ఞములందును, భిన్న శక్తిః = భిన్నమైనశక్తులు కలదై, సర్వార్థః = భిన్నార్థములు కలదై, వ్యవస్థితః = నియమితమైయున్నది.

తా. అ విధముగ ఒకే మంత్రము, అధ్యాత్మ-అధిదైవ -అధియజ్ఞార్థముల యందు విభిన్నశక్తి కలదై, భిన్నార్థములు కలదై, నియమితమై యున్నది.

వి. ఏకశబ్ద దర్శనమునందు ఒకేశబ్దము ఆయా యర్థములయందు వేరు వేరు శక్తులు కలదగుటచే వేరువేరు అర్థములను బోధించుచున్నది. అట్లే ఒకే మంత్రము, ఆత్మ విచారసమయమునందు ఆత్మార్థమునందును, జపసమయమునందు దేవతారూపార్థమునందును, యజనసమయమునందు క్రత్వర్థమునందును వినియుక్తమగుచున్నది. ఉదాహరణమునకు— గాయత్రీ మంత్రము ధ్యానసమయమునందు ప్రత్యగాత్మ ధ్యానపరముగాను, జపసమయమున సూర్యదేవతాధ్యానపరముగాను, కర్మానుష్ఠాన సమయమున సూర్యమండల పరముగాను

వినియోగింపబడుచున్నది. ఈ విధముగ ఒకే మంత్రము వేరువేరు శక్తులను పురస్కరించు కొని, వేరువేరు అర్థములను బోధించుటయందు వినియుక్త మగుచున్నది.

ముఖ్యత్వ గౌణత్వ రూప శబ్దోపచారము ప్రసిద్ధ్యప్రసిద్ధి నిమిత్తమని చెప్పబడినది. ఈ శబ్దోపచార పక్షమున ఒక శబ్దము ఒక అర్థమును బోధించు సమయమున ఆ యర్థముతో దానికి సంబంధ ముండును. బోధింపనపుడు సంబంధముండదు గావ, శబ్దార్థ సంబంధము అనిత్యమని చెప్పవలసి యుండును. కావున అర్థోపచారపక్షము నవలంబించి చెప్పుచున్నాడు.

గోత్వానుషఙ్గో వాహీకే నిమిత్తాత్ కైశ్చి దిష్యతే
అర్థమాత్రం విపర్యస్తం శబ్దః స్వార్థే వ్యవస్థితః .	255

కైశ్చిత్ = కొందరు శాస్త్రజ్ఞులచేత, నిమిత్తాత్ = జడత్వము మొదలగు కొన్ని సాధారణ ధర్మములను నిమిత్తముగ గొని, వాహీకే = వాహీకునియందు, గోత్వానుషఙ్గః = ఆరోపమూలకమగు గోత్వసంబంధము, ఇష్యతే = అంగీకరించబడుచున్నది, అర్థమాత్రం = పదజన్య ప్రతీతియందు విశేష్యమగు అర్థము మాత్రమే, విపర్యస్తమ్ = మార్పుచెందినది. శబ్దః = గోశబ్దము, స్వార్థే = గోత్వరూప స్వార్థమునందు, వ్యవస్థితః = నియతమైనది.

తా. నిమిత్తవశముచే వాహీకునియందు గోత్వసంబంధ మేర్పడుచున్నది అని కొందరు అంగీకరింతురు. అర్థము మాత్రమే మార్పు చెందినది గాని, శబ్దము స్వార్థమునందే నియతమైనది.

వి. శబ్దముయొక్క అర్థము స్వరూపము, బాహ్యము అని రెండు విధములు. 'గో' శబ్దమునకు 'గో' అను అర్థము స్వరూపము. గోశబ్దము ఎల్లపుడును గోత్వము అను అర్థమునే బోధించును. ఈ గోత్వ రూపార్థము గోశబ్ద స్వరూపముకంటె బాహ్యము గాన, ఇది బాహ్యార్థము. బాహ్యమగు ఈ గోత్వము, గోవునందు భాసించుచున్నది, వాహీకాదులందు ఆరోపింపబడుచున్నది. అనగా, గోశబ్దము సహజముగ గోత్వరూపమగు అర్థమునే బోధించినను, గోవునకు (ఎద్దుకు) ఉన్న జడబుద్ధిత్వము మొదలగు ధర్మములు వాహీకుని యందు కానవచ్చుటచే, ఈ వాహీకుని గూడ బోధించుటకు ప్రయుక్తమగుచున్నది. వాహీకాద్యర్థమును చెప్పినపుడు గూడ విశేష్యమగు వాహీక రూపపదార్థము మారినది గాని, గోత్వము మాత్రము, అపుడు గూడ (వాహీక రూపార్థ బోధనసమయమునందు గూడ) భాసించుచునే యున్నది. ఈ విధముగ రెండు స్థలములయందునను,— గోరూప వాహీక రూపార్థములను బోధించునపుడు— గోత్వరూప బాహ్యార్థోపచారమున్నది. కాని విశేష మేమనగా— 'గౌః' అని స్వతంత్రముగ ప్రయోగించినపుడు అభిహితమగు గోత్వము ముఖ్యము. 'గౌ ర్వాహీకః' ఇత్యాది స్థలములలో వాహీకాది పదాంతర సంబంధమున్నప్పుడు అభిహితమగు గోత్వము గౌణము. ఈ విధముగ అర్థోపచార పక్షమున గోశబ్దము ఏ యర్థము నందుపయుక్తమైనను, గోత్వమనుదానితో సంబంధించియే యున్నది గాన, శబ్దార్థసంబంధము నిత్యమనుటకు విఘాత ముండదు.

బాహ్యార్థోపచారమును నిరూపించి ఇపుడు స్వరూపోపచారమును తెలుపుచున్నాడు.

తథా స్వరూపం శబ్దానాం సర్వార్థే ష్వనుషజ్యతే
అర్థమాత్రం విపర్యస్తం స్వరూపే తు స్థితిః స్థిరా .	256

తథా = గోత్వరూపమగు అర్థము సహజ రీతిచే గోరూప ముఖ్యార్థముతో గాని, జాడ్యాది నిమిత్తకృతమగు ఆరోపముచే వాహీకాది గౌణార్థములతోగాని. ఏ విధముగా సంబంధించుచున్నదో, ఆ విధముగనే (శబ్దస్వరూపమే ప్రవృత్తి నిమిత్తము — అర్థము అను పక్షమున), శబ్దానామ్ = గవాది శబ్దముల, స్వరూపం = స్వరూపము, సర్వార్థేషు = ముఖ్యార్థములయందును, గౌణార్థములయందును గూడ, అనుషజ్యతే = సంబంధించుచున్నది. అర్థమాత్రం = గవాది శబ్దములవలన కలిగిన జ్ఞానమునందు విశేష్యమగు అర్థము మాత్రమే, విపర్యస్తమ్ = ముఖ్యార్థము కంటె భిన్నమైనది. స్వరూపే తు = శబ్ద స్వరూపమునందైతే, స్థితిః = గవాది శబ్దముల స్థితి, స్థిరా = స్థిరమైనది.

తా. అట్లే శబ్దముల స్వరూపము, సర్వార్థములతోడను అనుషక్తమగును. అర్థము మాత్రము విపర్యస్తమైనను, స్వరూపమునందు గవాదిశబ్దముల స్థితి స్థిరమైనది.

వి. గోశబ్దమునకు 'గో' శబ్దస్వరూపమే అర్థమని మరియొక మతము. ఈ మతము ప్రకారము కూడ శబ్దస్వరూపము 'గోవు' అను ముఖ్యార్థముతో సహజసంబంధముచేతను, వాహీకుడు మొదలగు గౌణార్థములతో జాడ్యాది గుణనిమిత్తము చేతను సంబంధించును. గోశబ్దస్వరూపము విశేషణము; 'గోవు,' 'వాహీకుడు' మొదలగు అర్థము విశేష్యము. ఈ విధముగ విశేష్యమగు వాహీకాద్యర్థము, గోరూప ముఖ్యార్థముకంటె భిన్నమైనను విశేషణమగు గోశబ్దము గౌణముఖ్యార్థములు రెండింటియందును స్థిరముగ నున్నదిగాన, శబ్దార్థసంబంధముల నిత్యత్వమునకు హానిలేదు.

ఏకశబ్ద దర్శనానుసారముగ, శబ్దోపచార-అర్థోపచారములను నిరూపించి, ఇపుడు అనేక శబ్దార్థ దర్శనానుసారముగ శబ్దోపచార అర్థోపచారములను విశదీకరించుచున్నాడు.

ఏకత్వం తు సరూపత్వా చ్ఛబ్దయో ర్గౌణముఖ్యయోః
ప్రాహు రత్యన్తభేదేఽపి భేదమార్గానుదర్శినః . 257

భేదమార్గానుదర్శినః = శబ్దభేదవాదులు, గౌణముఖ్యయోః = గౌణార్థములును, ముఖ్యార్థములును అగు, శబ్దయోః = శబ్దములకు, అత్యన్తభేదేఽపి = అర్థభేదము ననుసరించి మిక్కిలి భేదమున్నను, సరూపత్వాత్ = సమానరూపములు కలిగియుండుటచే, ఏకత్వమ్ = ఏకత్వమును, ప్రాహుః = చెప్పుచున్నారు.

తా. గౌణార్థక, ముఖ్యార్థకశబ్దములు భిన్నములే యైనను, అవి రూపసామ్యమును బట్టి అభిన్నములుగ నున్న వని భేదమార్గాంగీకర్తలు చెప్పుదురు.

వి. భేదమార్గము ననుసరించు వైయాకరణులు, గౌణముఖ్యార్థములను బోధించుశబ్దములు పరస్పరము భిన్నములే యని అంగీకరించుచున్నారు. వాహీకరూపార్థమును బోధించు గోశబ్దము, గోరూపార్థమును బోధించు శబ్దముకంటె అత్యంత భిన్నమనియే వీరి అభిప్రాయము. ఏలయనగా—శబ్దార్థములు భిన్నాకారముకలవి; వేరువేరు ఇంద్రియములచే గ్రహింపదగినవి; వేరువేరు స్థానములం దున్నవి. వీటికి వాస్తవమున తాదాత్మ్యముగాని మరియొక సంబంధముగాని సంభావ్యముగాదు. కాని వీటికి ఏదియో సంబంధ మున్నట్లు తెలియుచున్నది. ఈ సంబంధము కేవలము కాల్పనికమగు తాదాత్మ్యసంబంధము. ఈ విధముగ గోశబ్దమునకు వాహీకాద్యర్థముతో కాల్పనికమైనను ఒక తాదాత్మ్యసంబంధమేర్పడిన తరువాత మరల ఇంకొక అర్థముతో సంబంధ మెట్లు ఏర్పడును; కాన, గౌణార్థబోధక

గోశబ్దము వేరు, ముఖ్యార్థబోధక గోశబ్దము వేరు. కాని, ఆనుపూర్వీసామ్యమును బట్టి ఈ రెండును అభిన్నములని అభిప్రాయము కలుగుచున్నది.

ఏకశబ్దదర్శనమును ప్రతిపాదించునపుడు 'ఏకమాహు రనేకార్థమ్' అని 'ఆహుః' అను పదమునుమాత్రము ప్రయోగించి, ఇచట అనేకశబ్దదర్శన ప్రదర్శన సమయమున 'ప్రాహుః 'అని ప్రశస్తార్థమగు 'ప్ర' అను నుపసర్గను గూడ ప్రయోగించుటచే, భర్తృహరికి అనేక శబ్దదర్శనమే అంగీకార్యమని సూచితమగుచున్న దని వ్యాఖ్యాతల అభిప్రాయము.

ఈ శబ్ద భేద దర్శనము వైదిక శబ్దముల విషయమున గూడ ప్రవర్తించునని చెప్పుచున్నాడు.

సామిధేన్యన్తరం చైవ మావృత్తా వనుషజ్యతే
మన్త్రాశ్చ వినియోగేన లభన్తే భేద మూహవత్ . 259

ఏవం = వెనుక చూపినవిధముగ శబ్దభేదదర్శనము నంగీకరించినచో, ఆవృత్తౌ = ఆవృత్తిచేసినపుడు, సామిధేన్యన్తరం = భిన్నమైన సామిధేనీ మంత్రము, అనుషజ్యతే = పూర్వమున నున్న సామిధేనీమంత్రములతో సంబంధించును. మన్త్రాశ్చ = మంత్రములు కూడ, ఊహవత్ = ఊహమునందువలె, వినియోగేన = వినియోగభేదముచే, భేదమ్ = భేదమును, లభన్తే = పొందుచున్నవి.

తా. ఈ విధముగ ఆవృత్తిచేసినపుడు భిన్నమైన సామిధేని, పూర్వమున నున్న సామిధేనితో సంబంధించును. మంత్రములుగూడ ఊహమునందువలె వినియోగభేదముచే భేదమును పొందుచున్నవి.

వి. అగ్నిని ప్రజ్వలింపచేయుటకై వినియుక్తములగు పదకొండు లేక పదమూడు ఋక్కులు కలవు. వాటికి సామిధేనీ ఋక్కు లని పేరు. వాటిలో మొదటిఋక్కును, చివరిఋక్కును, మూడేసిసార్లు పఠించవలెను అనెడి నియమము కలదు. కావున వాటిని రెండేసిసార్లు ఎక్కువ పఠించుటచే, ప్రత్యుచ్చారణము శబ్దభేదముగాన, నాలుగు ఋక్కులు అధికముగ వచ్చును. వీటితో మొత్తము ఋక్కులసంఖ్య పదిహేనుకుగాని, పదిహేడుకు గాని పెరుగును.

ఈ విధముగ సంఖ్య పెరుగుట అనునది, మూడు పర్యాయము లుచ్చరించిన మంత్రము మూడు భిన్నమంత్రము లని యంగీకరించిననే సాధ్యమగును, కావున మొదట చదివిన మంత్రము వేరు, రెండవసారి చదివినది వేరు, మూడవసారి చదివినది వేరు అని శబ్ద భేదవాదుల అభిప్రాయము.

ఈ విధముగ ఒకేమంత్రమును, రెండు మూడు కర్మలలో వినియోగింతురు. (మంత్రమునకు వినియోగ మనగా-ఒక కర్మ నాచరించునపుడు ఆ మంత్రమును పఠించుట). ఈ వినియోగభేదమునుబట్టి మంత్రములుకూడ సమానానుపూర్వీకములైనను, ఊహమునందు కొంచెము మార్పుచెందిన ఆనుపూర్విగల మంత్రములవలె భిన్నములే యని యంగీకరింపవలెను.

ఊహ మనగా ఒక కర్మయందు వినియోగించిన మంత్రమును మఱియొక కర్మయందు వినియోగించునపుడు అచట దేవతా లింగ సంఖ్యాదులను బట్టి ఈ మంత్రమునందలి

కొన్నిపదములలో దేవతా లింగ సంఖ్యాది కృతములగు మార్పులను చేయుట. ఉదాహరణమునకు ప్రకృతి యాగమున వినియుక్తమగు 'అగ్నయే త్వా జుష్టం నిర్వపామి' అను మంత్రమునే వికృతి యాగమగు సౌర్యయాగమునందు వినియోగించునపుడు 'సూర్యాయ త్వా జుష్టం నిర్వపామి' అను పదవ్యత్యాసము చేయుదురు. కావున ఈ రెండుమంత్రములును భిన్నములు. అట్లే గాయత్రీ మంత్రమునకు ఆచార్యుడు బ్రహ్మచారికి ఉపదేశించుట, వివాహ ప్రకరణమున దంపతులు హుతశేష ప్రాశనము చేయుట, స్నానము చేయించుట మొదలగు అనేక కర్మలలో వినియోగము గలదు. కావున ఒక్కొక్క వినియోగము చేసినపుడెల్ల ఈ మంత్రముగూడ, ఊహచేసిన మంత్రమువలె, వేరువేరని అంగీకరింపవలె నని భావము.

సమగ్రముగ అంగము లన్నింటిని చెప్పినయాగము ప్రకృతియాగము. కొన్ని యంగములనే చెప్పుటచే ప్రకృతియాగమునుండి మరికొన్ని యంగములను గ్రహింపవలసి యున్న యాగము వికృతియాగము. దర్శపూర్ణమాసాదికము ప్రకృతి, సౌర్యయాగాదికము వికృతియని మీమాంసక సంప్రదాయము.

**ఊహ వినియోగాదులచే భిన్నములని యంగీకృతములగు ఆ మంత్రములకు వేదత్వ మున్నదా—లేదా ? యని ఆశంకించి ఉన్నదని చెప్పుచున్నాడు.**

తా న్యామ్నాయాంతరా ణ్యేవ పఠ్యతే కశ్చిదేవ తు
అనర్థకానాం పాఠో వా శేష స్త్వన్యః ప్రతీయతే. 259

తాని = ఊహ వినియోగాది పఠితములగు మంత్రములుగూడ, ఆమ్నాయాన్తరాణ్యేవ = వేదాంతరములే, తు = కాని, కశ్చిదేవ = ఒకవేదము మాత్రమే, పఠ్యతే = పఠింపబడుచున్నది.

తా. అవికూడ వేదాంతరములే; కాని, ఒక్కటిమాత్రమే పఠింపబడుచున్నది.

వి. ఊహ వినియోగాదిపఠితములగు మంత్రము లన్నియును ఆనుపూర్వీసామ్యము కలవగుటచే వేదములే. కాని అన్నింటిని వేరువేరుగ పఠించిన గ్రంథవిస్తరమగు నను భయముచే ఋషులు ఒక వేదమును మాత్రమే పఠించియున్నారని పూర్వార్ధభావము.

**ఇపుడు మతాంతరమును చెప్పుచున్నాడు.**

వా = లేక, అనర్థకానామ్ = అర్థరహితములగు వాటియొక్క, పాఠః = పాఠము (వేదమునందు చేయబడినది). అన్యస్తు = పఠితమైనదానికంటె భిన్నమును, లక్షణచే తద్బోధ్యమైనదియు నగునది, శేషః = కర్మాంగముగ, ప్రతీయతే = తోచుచున్నది (లేదా, 'అన్యః = పఠితముకంటె భిన్నమైన, శేషః = కర్మాంగమైన వేదమైతే, ప్రతీయతే = పఠితమగు వేదముద్వారా ఉపలక్షణరీతిచే ప్రతీయమానమగుచున్నది' అని అర్థము).

తా. లేదా అనర్థకములగు మంత్రముల పాఠమే చేయబడుచున్నది. తద్భిన్నమగు కర్మాంగమంత్రము ప్రతీయమానమగుచున్నది.

వి. వేదమునందు పఠితములగు మంత్రములకు కర్మనిష్పాదన సామర్థ్యము లేకుండుటచే అవి వేదము కావు. ఆ మంత్రములు లక్షణచే తమతో సమానమగు ఆనుపూర్విగల మంత్రములకు ఉపలక్షణభూతములగుచున్నవి. కావున వినియోగాది సమయము

లందు మూలపఠితమంత్రములద్వారా ప్రతీయమానములగు కర్మవినియుజ్యమాన మంత్ర ములే వేదనామయోగ్యములు.

అర్థభేదమున్నచో శబ్దములు కూడ భిన్నములే కాన, మంత్రములు కూడ భిన్నములే. వేద పఠితములగు మంత్రము లన్నిటికి వాస్తవమున వేదత్వము లేదు. వినియోగోపాదుల కుపయుక్తములగు మంత్రములను ఉపలక్షణచే బోధించుటయే వాటి ప్రయోజనము అని వెనుక ప్రతిపాదింపబడియున్నది. కొందరి యభిప్రాయము ప్రకారము సకల వైదిక మంత్ర పాఠము స్వరూపార్థకమే గాని, వాటికి అర్థవిశేషము లేదు అని చెప్పుచున్నాడు.

> శబ్దస్వరూప మర్థస్తు పాఠేఽన్యై రుపవర్ణ్యతే
> అత్యన్త భేదః సర్వేషాం తత్సమ్బన్ధాత్తు తద్వతామ్ .   260

అన్యైస్తు = ఇతరులచేతనైతే, పాఠే = వేదమంత్రముల పాఠమునందు, శబ్ద స్వరూపం = శబ్దస్వరూపమే, అర్థః = అర్థముగా, ఉపవర్ణ్యతే = వర్ణింపబడుచున్నది. తత్సమ్బన్ధాత్తు = ప్రవృత్తి నిమిత్తమగు స్వరూపము యొక్క సంబంధమువలన, తద్వ తామ్ = స్వరూపముగల, సర్వేషామ్ = అన్ని మంత్రములకును, అత్యన్తభేదః = మిక్కిలి భేదము.

తా. వేదమంత్రపాఠమున శబ్దస్వరూపమే అర్థమని కొందరు చెప్పుదురు. దాని సంబంధమువలన ఆ స్వరూపము గల అన్ని మంత్రములకును అత్యంతభేదము.

వి. వ్యాకరణమునందు 'అగ్నేర్ఢక్' ఇత్యాది సూత్రములలోని అగ్న్యాది పదములకు 'అగ్ని' శబ్దమే అర్థము కాని తద్భిన్నమగు అర్థము లేదు. అనగా ఈ అగ్న్యాది శబ్దములకు 'అగ్ని' శబ్దస్వరూపమాత్రబోధనమే ప్రయోజనము కాని ఇతర కార్యకారిత్వ మేదియును లేదు. అట్లే వేదపఠితములగు మంత్రములకు శబ్దస్వరూపమే అర్థము. కావున శక్తిచేతనే శబ్దము మంత్రస్వరూపమును బోధించుచున్నది. కాన లక్షణ అనావశ్యకమని యభిప్రాయము. కావున పఠితమంత్రములకును, అపఠితమంత్రములకును స్వరూపభేద ముండుటచే అత్యంతభేదమే కాని అభేదము లేదు. వేదపఠితములైనవాటికి స్వరూపము మాత్రమే అర్థమైనను ఇతర మంత్రములకు యాగాదివినియోగముకూడ ఉన్నది గాన అవి కేవలస్వరూపవంతములు కావుకదా యని యాశంకింపరాదు. అచట కూడ ప్రవృత్తినిమిత్త భూతమగు స్వరూపమున్నది గాన ఆ స్వరూపము కలవాటి కన్నిటికిని పరస్పరము అత్యంతాభేదమే అంగీకార్యము.

ఈవిధముగ పఠితాపఠిత మంత్రములకు భేదమునే అంగీకరింపవలెనని చెప్పుచున్నాడు.

> అన్యా సంస్కారసావిత్రీ కర్మణ్యన్యా ప్రయుజ్యతే
> అన్యా జపప్రబన్ధేషు సా త్వేకైవ ప్రతీయతే .   261

సంస్కారసావిత్రీ = ఉపనయనాది సంస్కారములయందు వినియుక్తమగు గాయత్రి, అన్యా = భిన్నమైనది. కర్మణి = యాగాదికర్మయందు, అన్యా = మరియొక గాయత్రి, వినియుజ్యతే = వినియోగింపబడుచున్నది. జపప్రబన్ధేషు = చతుర్వింశతి లక్ష జపాదులందు, అన్యా = మరియొక గాయత్రి వినియోగింపబడుచున్నది. తు = కాని. సా = ఆ గాయత్రి, ఏకైవ = ఒక్కటిగానే, ప్రతీయతే = తోచుచున్నది.

తా. సంస్కారమునందు వినియుక్తమగు గాయత్రి వేరు. కర్మవినియుక్త గాయత్రి వేరు. జపవినియుక్త గాయత్రి వేరు. ఐనను ఆ గాయత్రి ఒక్కటిగనే తోచు చున్నది.

వి. ఈ విధముగ అర్థభేదముచే శబ్దభేదము నంగీకరించు అనేక భేదధర్మము సందు గౌణార్థము వేరు, ముఖ్యార్థము వేరు. గౌణార్థబోధక శబ్దము వేరు, ముఖ్యార్థబోధక శబ్దము వేరు. అయినను ఆనుపూర్వీ సామ్యముచే ఆ రెండు శబ్దములకును ఏకత్వము నారోపించి (ఇదియే శబ్దోపచారము) ప్రసిద్ధమగు అర్థమును బోధించునపుడు ముఖ్యార్థమును బోధించుచున్నదనియు, అప్రసిద్ధార్థమును బోధించునపుడు గౌణార్థమును బోధించుచున్న దనియు వ్యవహారము. ఇట్లు శబ్దోపచారము నంగీకరించక (శబ్దైకత్వ దర్శనము నవలం బించి)అర్థోపచారమును స్వీకరించి, వాహీకుని యందు జాడ్యాదిగుణములను నిమిత్తముగ గొని గోత్వరూపార్థము ఆరోపించబడుచున్న దన్నచో శబ్దార్థసంబంధము అనిత్యమని అంగీ కరింపవలసి యుండును. కావున భేదపక్షము నవలంబించి శబ్దోపచారము నంగీకరించుటయే యుక్తము.

ఇపుడు శబ్దములన్నింటికిని స్వరూపమే ప్రవృత్తి నిమిత్తమని చెప్పుచున్నాడు.

అర్థస్వరూపే శబ్దానాం స్వరూపా ద్వృత్తి రిష్యతే
వాక్యరూపస్య వాక్యార్థే వృత్తి రన్యానపేక్షయా . 262

శబ్దానామ్ = శబ్దములకు, అర్థస్వరూపే = అర్థమనెడు వస్తువునందు, స్వరూ పాత్ = స్వరూపమువలననే, వృత్తిః = ప్రవృత్తి (బోధకత్వము), ఇష్యతే = అంగీకరింప బడుచున్నది. వాక్యరూపస్య = వాక్యస్వరూపమునకు, వాక్యార్థే = వాక్యమనెడు అర్థమునందు, అన్యానపేక్షయా = ఇతరాపేక్ష లేకుండగానే, వృత్తిః = ప్రవృత్తి.

తా. శబ్దము స్వరూపముచేతనే అర్థరూపవస్తువునందు ప్రవర్తించును. వాక్య స్వరూపముకూడ ఇతరానపేక్షమై వాక్యార్థమున ప్రవర్తించును.

వి. 'తత్సమ్బన్ధాత్తు తద్వతామ్' అని పూర్వముచెప్పిన ప్రవృత్తి నిమిత్తమగు స్వరూపముతో సంబంధము వేదమంత్రముల విషయముననే కాదు; ఇతరశబ్దములు, వాక్య ములు కూడ స్వరూపసంబంధమునే పురస్కరించుకొని స్వస్వార్థములను బోధించును.

గౌణ ముఖ్య విభాగము ఏకశబ్దదర్శనమునందే గాని అనేకశబ్ద దర్శనమునందు లేదని చెప్పుచున్నాడు.

అనేకార్థత్వ మేకస్య యైః శబ్ద స్యానుగమ్యతే
సిద్ధ్యసిద్ధికృతా తేషాం గౌణముఖ్యప్రకల్పనా . 263

యైః = ఎవరిచేత, ఏకస్య = ఒక, శబ్దస్య = శబ్దమునకే, అనేకార్థత్వమ్ = గౌణ ముఖ్యార్థభేదముచే నానార్థకత్వము, అనుగమ్యతే = అంగీకరింపబడుచున్నదో, తేషామ్ = వారిమతమునందు, గౌణముఖ్యప్రకల్పనా = గౌణముఖ్యవిభాగకల్పనము, సిద్ధ్యసిద్ధికృతా = అర్థముయొక్క ప్రసిద్ధ్యప్రసిద్ధులచే చేయబడినది.

తా. ఒకశబ్దము అనేకార్థము అని అంగీకరించు వారిమతమున గౌణముఖ్య విభాగము ప్రసిద్ధ్యప్రసిద్ధిమూలకము.

వి. ఒకే శబ్దము అనేకములగు (గౌణముఖ్యాది) అర్థములను బోధించును అని అంగీకరించు ఏకశబ్దదర్శనమునందే ఇది గౌణార్థము, ఇది ముఖ్యార్థము అనెడు విభాగము గాని అనేకశబ్దదర్శనమున అట్టి విభాగములేదు. ఈ దర్శనమున అన్నిశబ్దములును తమ తమ యర్థములను బోధించును గాన అన్నియు ముఖ్యార్థములే. అనేకశబ్దదర్శనమునందు, ఒక అర్థము ప్రసిద్ధమగుటచే అది ముఖ్యార్థమనియు, మరియొకటి అప్రసిద్ధమగుటచే గౌణార్థమనియు చెప్పుదురుగాని, ముఖ్యార్థమును శక్తి (అభిధ) బోధించుననియు, గౌణార్థమును లక్షణ బోధించుననియు అంగీకరింపవలసిన పనిలేదు. గౌణార్థమైనను, ముఖ్యార్థమైనను, రెండర్థములను గూడ శక్తియే బోధించును. స్వతంత్రమగు లక్షణావృత్తిని కల్పింప పనిలేదు. అప్రసిద్ధార్థమును బోధించు శక్తియే లక్షణ, శబ్దాభేద దర్శనమునందుగూడ వాస్తవమున ఆయా 'గో' శబ్దములు బోధించు ఆయా వాహీకగవాద్యర్థము లన్నియు ముఖ్యార్థములేయైనను లోకప్రసిద్ధిచే వాహీకాద్యర్థబోధక గోశబ్దము గౌణమనియు, గోరూపార్థబోధక 'గో' శబ్దము ముఖ్యమనియు లోకవ్యవహారము.

ఇపుడు రెండు దర్శనములందును గౌణముఖ్య విభాగమునకు నిమిత్తాంతరమును చూపుచున్నాడు.

అర్థప్రకరణాపేక్షో యో వా శబ్దాన్తరైః సహ
యుక్తః ప్రత్యాయయ త్యర్థం తం గౌణ మపరే విదుః. 264

యః=ఏ శబ్దము, అర్థప్రకరణాపేక్షః=అర్థమును (ప్రయోజనమును), ప్రకరణమును అపేక్షించునదై గాని, వా=లేక, శబ్దాన్తరైః=ఇతరశబ్దములతో, యుక్తం=కూడినదై గాని, అర్థం=అర్థమును, ప్రత్యాయయతి=బోధించునో, తం=దానిని, గౌణమ్=గౌణశబ్దమునుగా, అపరే=ఇతరులు, విదుః=గ్రహించుచున్నారు.

తా. అర్థప్రకరణాపేక్షమై గాని, శబ్దాంతరసహచరితమై గాని అర్థమును బోధించు శబ్దము గౌణశబ్దమని కొందరు చెప్పుదురు.

వి. అర్థమును గాని, ప్రకరణమును గాని అపేక్షించి, లేదా శబ్దాంతరముతో సన్నిహితమై యుండి అర్థమును బోధించు పదము గౌణమని కొందరి అభిప్రాయము. ఇది భేద పక్షమునందును అభేదపక్షమునందును గూడ సమానము. 'గాం పాతయ' అనునపుడు పాతనరూపప్రయోజనమును పురస్కరించుకొని గోశబ్దము వాహీకుని బోధించును. వాహీకుని గూర్చి మాటలాడుప్రసంగమున 'గౌర్గచ్ఛతి' అని ప్రయోగించినపుడు గూడ గోశబ్దమునకు 'వాహీకుడు' అని యర్థము. ఇట్లే 'గౌ ర్వాహీకః' ఇత్యాదులలో వాహీకపదసంబంధముచే 'గో' శబ్దము గౌణార్థకము.

పై విషయమునే సంగ్రహకారుని శ్లోకమునుగూడ ప్రమాణముగ చూపుచు విశదీకరించుచున్నాడు.

శుద్ధ స్యోచ్చారణే స్వార్థః ప్రసిద్ధో యస్య గమ్యతే
స ముఖ్య ఇతి విజ్ఞేయో రూపమాత్రనిబన్ధనః. 265

శుద్ధస్య=అర్థప్రకరణాదిరహితమగు, యస్య=ఏ శబ్దముయొక్క, ఉచ్చారణే=ఉచ్చారణముచేయగనే, ప్రసిద్ధః=ప్రసిద్ధమగు, స్వార్థః=స్వార్థము, గమ్యతే=తెలియ

బడునో, రూపమాత్రనిబన్ధనః = శబ్దస్వరూపముమాత్రమే నిమిత్తముగా గల, సః = ఆ శబ్దము, ముఖ్యః ఇతి = ముఖ్యమని, విజ్ఞేయః = తెలియదగినది.

తా. ఒకశబ్దము నుచ్చరించగనే, అర్థప్రకరణాది సహాయము నపేక్షింపక, స్వస్వరూపమును మాత్రమే నిమిత్తముగా గొని (అది 'గో' శబ్దము గావున) ప్రసిద్ధమగు అర్థమును బోధించినచో ఆ శబ్దము ముఖ్యమని గ్రహింపవలెను. ఇది ముఖ్యశబ్దలక్షణము.

ఇపుడు గౌణశబ్దస్వరూపమును చెప్పుచున్నాడు.

యస్త్వన్యస్య ప్రయోగేణ యత్నాదివ నియుజ్యతే
తమప్రసిద్ధం మన్యన్తే గౌణార్థాభినివేశినమ్. 266

యస్తు = ఏ శబ్దమైతే, అన్యస్య = మరియొక శబ్దము యొక్క, ప్రయోగేణ = ప్రయోగముచేత. యత్నాదివ = ప్రయత్నపూర్వకముగ చేసినట్లు (అర్థప్రకరణాన్యపద సాహచర్యాదులచే), నియుజ్యతే = అప్రసిద్ధమగు అర్థాంతరమునందు నియమితమగుచున్నదో, తం = ఆ, అప్రసిద్ధం = అప్రసిద్ధార్థముగల పదమును, గౌణార్థాభినివేశినమ్ = గౌణార్థబోధకమునుగా (గౌణమునుగా), మన్యన్తే = తలతురు.

తా. అర్థము, ప్రకరణము, ఇతరశబ్దసంసర్గము మొదలగు కారణాంతరములచే అప్రసిద్ధార్థమును బోధించు శబ్దము గౌణము; ఆ శబ్దము బోధించు అర్థము గౌణార్థము.

ఇపుడు శబ్దైక్యదర్శనమున ప్రకారాంతరముచే గౌణముఖ్యవిభాగమును చేయుచున్నాడు.

స్వార్థే ప్రవర్తమానస్య యస్యార్థం యోఽవలమ్బతే
నిమిత్తం తత్ర ముఖ్యం స్యాన్నిమిత్తీ గౌణ ఇష్యతే. 267

స్వార్థే = గంగడోలు మొదలగు అవయవములుగల వ్యక్తియందు, ప్రవర్తమానస్య = బహులముగా ప్రయోగింపబడుచున్న, యస్య = ఏ గోశబ్దముయొక్క, అర్థం = అర్థమును (ప్రవృత్తినిమిత్తమగు గోత్వమును), యః = వాహీకుని విషయమున ప్రయుక్తమగు ఏ గోశబ్దము, అవలమ్బతే = అవలంబించుచున్నదో, తత్ర = ఆవిధముగ అవలంబించుటయందు, ముఖ్యం = ముఖ్యార్థము, నిమిత్తమ్ = నిమిత్తముగా, స్యాత్ = అగును, గౌణః = గౌణశబ్దము, నిమిత్తీ = నిమిత్తిగా, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

తా. గోశబ్దము ప్రయోగబాహుళ్యముచే సాస్న (గంగడోలు) మొదలగు అవయవవిశేషముగల వ్యక్తిని బోధించును. అది దాని ముఖ్యార్థము. వాహీకుని విషయమున ప్రయుక్తమగు గోశబ్దము కూడ జాడ్యాది మూలకమగు ఆరోపముచే గోశబ్దముఖ్యార్థమగు గోత్వమునే ప్రవృత్తి నిమిత్తముగ ఆశ్రయించుచున్నది. కావున ముఖ్యార్థము నిమిత్తము, గౌణార్థము నిమిత్తి.

అర్థద్వయమునకున్న ఈనిమిత్త నిమిత్తి భావముతో సహితమగు అర్థప్రకరణాదికమే గౌణముఖ్య విభాగమునకు హేతువు కాని కేవలార్థ ప్రకరణాదికము కాదని చెప్పుచున్నాడు.

పురారాదితి భిన్నేఽర్థే యా వర్తేతే విరోధిని
అర్థప్రకరణాపేతం తయోరవ్యవధారణమ్. 268

పురా ఆరాత్ ఇతి = 'పురా' 'ఆరాత్' అని, యౌ = ఏశబ్దములు, భిన్నే = పరస్పరభిన్నమును, విరోధిని = విరుద్ధమును అగు, అర్థే = అర్థమునందు, వర్తేతే = ఉంటున్నవో, తయోరపి = వాటియందు కూడా, అవధారణమ్ = అర్థనిర్ణయము, అర్థప్రకరణాపేక్షమ్ = అర్థప్రకరణములపై ఆధారపడియున్నది.

తా. పరస్పరభిన్నములును, విరుద్ధములును అగు రెండేసి అర్థములను బోధించు 'పురా' 'ఆరాత్' అను శబ్దముల అర్థనిర్ణయము కూడ అర్థప్రకరణాపేక్షమై యున్నది.

వి. 'పురా' అనునది భూతార్థమును భావ్యర్థమును కూడ బోధించును. 'పురా భుఙ్క్తే' అనగా 'భుజింప గలడు' అని యర్థము. ఇచట 'పురా' భవిష్యదర్థకము. 'యజతిస్మ పురా యుధిష్ఠిరః' 'యుధిష్ఠిరుడు పూర్వము యాగముచేసెను' అనునపుడు భూతార్థకము. ఇట్లే 'ఆరాత్' అను అవ్యయమునకు 'దూరమున' 'సమీపమున' అని రెండర్థములు. 'ఆరాద్దూరసమీపయోః' అని అమరుడు. ఈ విధముగ పరస్పరభిన్నములగు రెండు అర్థములను బోధించు ఈ అవ్యయముల అర్థమును నిర్ణయింపవలెనన్న అర్థప్రకరణాది సహాయము కావలెను. తావన్మాత్రముచే ఒక యర్థము ముఖ్యమనియు, రెండవది గౌణమనియు చెప్పుటకు వీలులేదు. రెండును ముఖ్యార్థములే. కావున అర్థప్రకరణాదికముతో పాటు నిమిత్తనిమిత్తి భావమున్ననే అవి గౌణముఖ్యత్వ నిర్ణయమునకు ఉపయుక్తములగును.

ఏకశబ్దదర్శనమునందు గాని, అనేకదర్శనమునందు గాని, పదపదార్థములకు సత్యత్వము నంగీకరించుటచే, గౌణముఖ్యవిభాగము, దాని నిమిత్తములును ప్రతిపాదింపబడినవి. కాని వాస్తవమున పదార్థములు అసత్యములనియు, అఖండవాక్యమే అఖండవాక్యార్థమును బోధించుననియు సిద్ధాంతము గాన, అట్టి వాక్యమునందు పదపదార్థములు లేకున్నచో గౌణముఖ్య విభాగ మెట్లు కుదురును ? అనగా 'గౌర్వాహీకః' ఇత్యాద్యుదాహరణములయందు పదపదార్థములు సత్యములు అని అంగీకరించు పక్షమున విరుద్ధార్థకములగు రెండు పదములకు సామానాధికరణ్యము (ఏకవిశేష్యబోధకత్వము) అనుపపన్నముగాన గోపదము ఆరోపితార్థకమగుటచే గౌణమనియు,'గౌఃచరతి' ఇత్యాదులలో అనారోపితార్థకమగుటచే ఇది ముఖ్యమనియు చెప్పుటకు వీలగును, కాని 'గౌర్వాహీకః' అనెడు అఖండవాక్యము, తత్తత్పదార్థానుసంధానమేదియు లేకుండగనే 'జాడ్యాదిధర్మావచ్ఛిన్నుడగు వాహీకుడు' అనెడు అఖండ వాక్యార్థమును బోధించునపుడు గౌణముఖ్యవిభాగమనునది అసంభావ్యముకదా యని ఆశంకించుకొని వాక్య వాక్యార్థము లఖండములు అనెడు పక్షమునందుగూడ గౌణముఖ్యభావమును సమర్థించుచున్నాడు.

వాక్యస్యార్థాత్ పదార్థానా మపోద్ధారే ప్రకల్పితే
శబ్దాన్తరేణ సమ్బన్ధః తస్యైకస్యోపపద్యతే .　　　269

వాక్యస్య = వాక్యముయొక్క, అర్థాత్ = అర్థమునుండి, పదార్థానామ్ = పదపదార్థములయొక్క, అపోద్ధారే = అపోద్ధారము, ప్రకల్పితే = కల్పింపబడిన దగుచుండగా, తస్యఏకస్య = ఆ విధముగ అపోద్ధృతమగు ఆ ఒక్క పదమునకు, శబ్దాన్తరేణ = మరియొక శబ్దముతో, సమ్బన్ధః = సంబంధము, ఉపపద్యతే = ఉపపన్నమగును.

తా. వాక్యార్థమునుండి పదార్థముల విభాగమును బుద్ధిచే కల్పింపగా దానికే శబ్దాంతరముతో సంబంధము ఉపపన్న మగును.

వి. అఖండములగు వాక్యవాక్యార్థములనుండి బుద్ధి పరికల్పితమగు అపోద్ధారముచే పదపదార్థములను విడదీసి, ప్రసిద్ధ్యప్రసిద్ధిమూలకమగు గౌణముఖ్య విభాగము నంగీకరించవచ్చును.

'అయం కః'అను ప్రశ్నకు ప్రత్యుత్తరముగా 'గౌః'అను ఒక్క పదమే ప్రయోగింపబడుచున్నది. అట్టి స్థలములలో వాస్తవమగు పదపదార్థ విభాగమున్నది గాన గౌణముఖ్య విభాగము గూడ వాస్తవమే యని యాశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

యచ్చాప్యేకం పదం దృష్టం చరితాస్తిక్రియం క్వచిత్
తద్వాక్యాన్తరమేవాహు ర్నతదన్యేన యుజ్యతే . 270

క్వచిత్ = కొన్ని స్థలములయందు, యత్ = ఏ, ఏకమ్ = ఒక, పదం = 'గో' ఇత్యాదిపదము, దృష్టం = చూడబడినదో, చరితాస్తిక్రియం = కబలీకృతమగు 'అస్తి' అనెడు క్రియగల, తత్ = దానిని, వాక్యాన్తరమేవ = మరియొక స్వతంత్ర వాక్యమేయని, ఆహుః = చెప్పుదురు. తత్ = అది, అన్యేన = మరియొక పదముతో, న యుజ్యతే = సంబంధించదు.

తా. నిగీర్ణమగు 'అస్తి' క్రియగల ఏ ఒక పదము గలదో అది భిన్నవాక్యమే కాని మరి దేనితోడను సంబంబంధింపదు అని చెప్పుచున్నారు.

వి. ప్రత్యుత్తరరూపమున ప్రయుక్తమగు 'గౌః' ఇత్యాదిశబ్దము ఒకపదమువలె కనబడుచున్నను, 'అస్తి' అను క్రియ గూడ అందు నిగూఢమైయున్నది. కావున ఇది 'గౌః అస్తి' అను అఖండవాక్యమే కావున అది పదాంతరముతో సంబంధించుట అనునది లేదు.

ఈ విషయమునే స్పష్టీకరించుచున్నాడు.

యచ్చ కోఽయ మితి ప్రశ్నే గౌ రశ్వ ఇతి చోచ్యతే
ప్రశ్న ఏవ క్రియా తత్ర ప్రక్రాన్తా దర్శనాదికా . 271

అయం = ఇది, కః = ఏమిటి, ఇతి = అను, ప్రశ్నే = ప్రశ్నయందు, గౌః = ఎద్దు అనియు, అశ్వ ఇతిచ = అశ్వమనియు, యచ్చ ఉచ్యతే = చెప్పుట ఏది కలదో, తత్ర = ఆ స్థలమునందు, ప్రశ్నేఏవ = ప్రశ్నమునందే, దర్శనాదికా = దర్శనము మొదలగు, క్రియా = క్రియ, ప్రక్రాన్తా = ఉపక్రమింపబడినది.

తా. 'ఇది ఏమి?' అని ప్రశ్నించినపుడు 'గోవు' 'అశ్వము' అని సమాధానము చెప్పబడుచున్నది. అచట ప్రశ్నమునందే దర్శనాదిక్రియ ఉపక్రాంతమై యున్నది.

వి. 'కోఽయమ్' అని ప్రశ్నించినపుడు 'గౌః' అని గాని, 'అశ్వః' అని గాని ప్రత్యుత్తరము చెప్పబడుచున్నది. ఇచట ప్రశ్నమునందే 'దృశ్యతే' 'భవతి' ఇత్యాదిక్రియ ('కోఽయం దృశ్యతే' లేక 'భవతి' ఇత్యాది విధమున) ప్రారంభముననే అంతర్గర్భితమై యున్నది. ఆ క్రియయే 'గౌః' 'అశ్వః' అను ప్రత్యుత్తరమునందు గూడ నిగూఢమైయున్నది గాన ఇది నిగూఢక్రియమగు వాక్యమని భావము.

ధర్మముల న్యూనాధికభావమే గౌణముఖ్య విభాగమునకు కారణమని కొందరి యభిప్రాయము. ఉదాహరణమునకు—అధికమగు జాడ్యము కలది ముఖ్యమగు గోపదార్థము. తద్వాచకమగు గోశబ్దము ముఖ్యము. వాహీకాదులలో జాడ్యము అల్పముగనుండును. అట్టి యర్థము గౌణార్థము. ఆ యర్థమును బోధించు గోశబ్దము గౌణము. ఈ మతమును నిరాకరించుచున్నాడు.

నై వాధికత్వం ధర్మాణాం న్యూనతా వా ప్రయోజికా
అధిక్యమపి మన్యన్తే ప్రసిద్ధే ర్న్యూనతాం క్వచిత్ .  272

ధర్మాణాం=ధర్మములయొక్క, అధికత్వమ్ = ఆధిక్యముగాని, న్యూనతావా = న్యూనత్వముగాని, ప్రయోజికా = గౌణముఖ్యత్వనిమిత్తము, నైవ = కాజాలదు. క్వచిత్ = కొన్నియెడల, ప్రసిద్ధేః = లోకప్రసిద్ధివశమున, ఆధిక్యమపి = ఆధిక్యమునుగూడ, న్యూనతామ్ = న్యూనత్వమునుగా, మన్యన్తే = తలచుచున్నారు.

తా. ధర్మముల న్యూనత్వాధికత్వములు ప్రయోజకములు కావు, లోకప్రసిద్ధి వశమున కొన్ని యెడల ఆధిక్యము గూడ న్యూనత్వమే యని చెప్పుదురు.

వి. అధికత్వము, న్యూనత్వము అనువని ఆపేక్షికములుగాన వాటిని బట్టి గౌణత్వ ముఖ్యత్వముల నిర్ణయము పొసగదు. కొన్ని స్థలములలో వాహీకాదులగు గౌణార్థములలో అత్యధికముగ జాడ్యాదికమున్నను, లోకప్రసిద్ధి ననుసరించి, అల్పమని చెప్పుట గూడ సంభావ్యము కావున గౌణార్థమున ధర్మములు న్యూనముగా నుండు ననియు, ముఖ్యార్థమున అధికముగనుండు ననియు చెప్పుట యుక్తిసహము కాదు.

ఇపుడు మతాంతరము ననుసరించి, గౌణముఖ్య వ్యవహారమునకు సాదృశ్యము నిమిత్తమని చెప్పుచున్నాడు.

జాతిశబ్దోఽన్తరేణాపి జాతిం యత్ర ప్రయుజ్యతే
సమ్బన్ధిసదృశా ద్ధర్మాత్ తం గౌణ మపరే విదుః .  273

జాతిశబ్దః = గోత్వాదిజాతి ప్రవృత్తినిమిత్తముగా గల గవాది శబ్దము, జాతిమ్ అన్తరేణాపి = గోత్వాది జాతి లేకపోయినను, యత్ర = ఏ వాహీకాద్యర్థమునందు, సమ్బన్ధిసదృశాత్=గోత్వాదిజాతికి సంబంధించిన గవాది వ్యక్తియొక్క ధర్మమగు జాడ్యాదిక్యముతో సమానమగు వాహీకాదిగత జాడ్యాదికమువలన, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నదో, తం = దానిని, గౌణమ్ = గౌణమునుగా, అపరే = ఇతరులు, విదుః = తెలిసికొనుచున్నారు. (చెప్పుచున్నారు).

తా. జాతిశబ్దము జాతి లేకపోయినను తత్సంబంధిధర్మసదృశమగు ధర్మము వలన ఎచట ప్రయోగింపబడునో దానిని గౌణమని కొందరు చెప్పుదురు,

వి. వాహీకునియందు గోత్వము లేదు. అయినను 'గో' శబ్దము ఆతని విషయమున ప్రయోగింపబడుచున్నది. గోత్వజాతికి ఆశ్రయభూతమగు గోవునం దున్న జాడ్యాదులతో సమానమగు జాడ్యాదులు వాహీకునియందుండుటయే ఇందులకు కారణము. ఈవిధముగ సాదృశ్యమే గౌణముఖ్యవ్యవహారమునకు నిమిత్తమని కొందరు చెప్పుచున్నారు.

విపర్యాసము—అనగా అది కాని దానిని అదియని భావించుట అనెడు అధ్యారోపము గౌణత్వ వ్యవహారమునందు హేతువని చెప్పుచున్నాడు.

విపర్యాసాది వార్థస్య య త్రార్థాన్తరతా మివ
మన్యన్తే స గవాదిస్తు గౌణ ఇత్యుచ్యతే క్వచిత్ .  274

అర్థస్య = వాహీకాద్యర్థమునకు, అర్థాన్తరతామివ = ముఖ్యార్థగవాది రూపత్వమును వలె (గవాదిరూపత్వము యథార్థముకాదు గాన 'ఇవ' శబ్దప్రయోగము), విపర్యాసాదివ =

విపర్యాసమువలనవలె, యత్ర = ఎచ్చట, మన్యన్తే = తలతురో, సః = అం గవాదిస్తు = 'గో' మొదలగు శబ్దము, క్వచిత్ = కొందరిమతమున, గౌణ ఇతి = గౌణమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా. ఒక అర్థము మరియొక అర్థమువలె ఉన్నట్లు, విపర్యాసమువలన వలె, ఎచట తలతురో, అది కొందరి మతమున గౌణమని చెప్పబడుచున్నది.

వి. విపర్యాసమనగా ఒక యర్థమును (వాహీకాద్యర్థమును) బోధింపని పదమును ఆ అర్థమనకు (వాహీకాద్యర్థమునకు) వాచకముగా ప్రయోగించుట. ఇది అధ్యవసాయము—అనగా అభేదగ్రహణరూపమగు మిథ్యాజ్ఞానము, అధ్యారోపము అను రెండు నిమిత్తములచే కలుగవచ్చును. శుక్తికనుచూచి ఇది రజతము అనునపుడు ఇచట భేదగ్రహణము లేదు గాన ఇది మిథ్యాజ్ఞానరూపమగు విపర్యాసము. దానికి నిమిత్తము అధ్యవసాయము. 'గౌర్వాహీకః' అనునపుడు గోవాహీకులకుగల భేదము గ్రహింపబడుచున్నను వాహీకుని యందు గోగత జాడ్యాది గుణసదృశములగు గుణములను చూచి అతనియందు గోత్వమును ఆరోపించుచున్నాడు. ఇదియు విపర్యాసమే. ఇందు భేదగ్రహణపూర్వకాధ్యారోపము మూలము. ఈ విధముగ నిచట అధ్యవసాయరూపవిపర్యాసము (మిథ్యాజ్ఞానము) లేదు. అధ్యారోపరూప విపర్యాసమే ఉన్నది. కావుననే కారికలో 'విపర్యాసాదివ' (అనగా అధ్యవసాయరూప విపర్యాసమువలన వలె) అని 'ఇవ' శబ్దము ప్రయోగింపబడినది. ముఖమునందు చంద్రత్వమును ఆరోపించి 'ముఖమే చంద్రుడు' అనునట్లు వాహీకునియందు గోత్వము లేకున్నను దానిని ఆరోపించి 'గౌర్వాహీకః' ఇత్యాది గౌణప్రయోగములు చేయుచున్నారు అని కొందరి యభిప్రాయము.

గౌణముఖ్య వ్యవహారమునకు రూపమును, శక్తియు నిమిత్తమని కొందరి యభిప్రాయము. ఉదాహరణమునకు—గంగడోలు మొదలగు అవయవములు గల రూపముతో గూడిన వ్యక్తి విషయమున ప్రయుక్తమగు గోశబ్దము ముఖ్యము. ఇతర స్థలమునందు గౌణము. దోహన—వాహనాదులకు సాధనమగుట యను శక్తిగల వ్యక్తి విషయమున ప్రయుక్తమగు గోశబ్దము ముఖ్యము; అట్టి శక్తి లేని వ్యక్తి విషయమున ప్రయుక్తమగు గోశబ్దము గౌణము. ఈ మతమును దృష్టాంత ప్రదర్శన పూర్వకముగ ప్రతిపాదించుచున్నాడు.

నియతాః సాధనత్వేన రూపశక్తి సమన్వితాః
యథా కర్మసు గమ్యన్తే సీరాసిముసలాదయః . 275

క్రియాన్తరేణ చైతేషాం భవన్తి నహి శక్తయః
రూపాదేవ తు తాదర్థ్యం నియమేన ప్రతీయతే . 276

తథైవ రూపశక్తిభ్యా ముత్ప్రేక్ష్యా సమవస్థితః
శబ్దో నియతతాదర్థ్యః శక్త్యాన్యత్ర ప్రయుజ్యతే . 277

యథా = ఏ విధముగా, రూపశక్తి సమన్వితాః = తమతమ ఆకారములతోడను, ఆయాక్రియలను చేయుటకు అనుకూలమగు శక్తులతోడను కూడిన, సీరాసిముసలాదయః = నాగలి, కత్తి, రోకలి మొదలగునవి, కర్మసు = దున్నుట, ఖండించుట, దంచుట మొదలగు

ఆయా కర్మలయందు, సాధనత్వేన=సాధనములుగా, నియతాః=నియతములై, గమ్యన్తే= తెలియబడునో,

ఏతేషాం = ఈ సీరాసిముసలాదులకు, క్రియాన్తరేణ చ = లతాచ్ఛేదాకమగు ఇతరక్రియతో సంబంధించిన, శక్తయః =శక్తులు, నహి =ఉండవుకదా (అందుచే), రూపాదేవ = వాటి రూపమువలననే, నియమేన=నియమముచేత, తాదర్థ్యం = ఆయా కర్మలను చేయుటకై ఉద్దిష్టమగుట, ప్రతీయతే=తోచుచున్నది.

తథైవ = అట్లే (సీరాసిముసలాదులవలెనే), ఉత్పత్త్యా = స్వభావముచేతనే, రూపశక్తిభ్యామ్ = రూపశక్తులతో, సమవస్థితః = కూడియున్నదియు, నియతతాదర్థ్యః= సాస్నాదిమత్పిండమును నియతముగబోధించు, శబ్దః =గవాది శబ్దము, శక్త్యా=కేవల శక్తి చేత, అన్యత్ర = బాహీకాద్యర్థమునందు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును.

తా. ఆయా రూపశక్త్యాదులతో కూడిన హలముసలఖడ్గాదులు ఆయా కర్మల యందు నియత సాధనములుగ తెలియబడుచున్నవి. వాటి శక్తులు మరియొక క్రియతో సంబంధించి యుండవు. రూపమును బట్టియే ఇవి ఆయాకర్మల కొరకై ఉద్దిష్టములైనవని తెలియుచుండును. ఈ విధముగనే స్వభావము చేతనే రూపశక్తులతో కూడియున్నదియు, నియతార్థబోధకమును అగు శబ్దము శక్తిచేతనే వాహీకార్యర్థమున ప్రయోగింపబడును.

వి. నాగలి, కత్తి, రోకలి మొదలగువాటికి వేరువేరు ఆకారములును, ఆయా పనులను చేయు శక్తులును ఉన్నవి. కావున కర్షణచ్ఛేదనాది కర్మలనుచేయుటకు ఇవి సాధనములని తప్పక తెలియును. ఈ నాగలి మొదలగువాటికి లతలను ఛేదించుట మొదలగు కర్మలు చేయు శక్తి లేదు. వాటి రూపములను చూడగనే ఇవి ఈ పనిచేయుశక్తిగల సాధనములు అని తప్పక తెలియును. ఈ విధముగనే రూపశక్తులతో స్వభావసిద్ధముగనే కూడియున్న (గవాది) శబ్దము నియతముగ (సాస్నాది మత్పిండరూపమగు) ఒక అర్థమునే బోధించును. కేవలశక్తిని పురస్కరించుకొని గోభిన్నార్థవిషయమున గూడ ప్రయోగింపబడును.

నాగలికి ఒక ఆకారము (రూపము), ఒక పనిని చేయు శక్తియు కలవు. కావున ఆ రూపశక్తులను రెండింటిని పురస్కరించుకొని 'సీర' శబ్దమును ప్రయోగించినపుడు ఆ శబ్దము నాగలి అను నర్థమునే బోధించును. అదియే దాని ముఖ్యార్థము. నాగలి దున్నుట అను క్రియావిశేషమునుమాత్రమే చేయకలుగును అనునది దాని రూపమునుబట్టి మాత్రమే తెలియును. ఈ అసాధారణరూపమునకు ప్రాధాన్య మీయక కేవలక్రియాశక్తిని మాత్రమే పురస్కరించుకొని ప్రయోగించినపుడు 'సీర' శబ్దము నాగలికంటె భిన్నమగు (నాగలి భూమిని చీల్చినట్లు శత్రుసేనలను చీల్చిన యోధుడు మొదలగు) అర్థమును చెప్పవచ్చును. అది గౌణార్థము. ఇట్లే సాస్నాదిమద్రూపమును భారవహనాదిశక్తిని ఈ రెండింటిని పుర పురస్కరించుకొని ప్రయుక్తమగునపుడు గోశబ్దము గోరూపమగు ముఖ్యార్థమును బోధించును. గోవునకు కేవలము కర్షణశక్తియే కాక తద్భిన్నములగు భారవహనాదిశక్తులుకూడ ఎన్నియో ఉండవచ్చును. వాటిలో నేదైన ఒకదానిని పురస్కరించుకొని గోశబ్దమును ఇతరార్థములయందు ప్రయోగింపవచ్చును. ఆ విధముగ కేవల భారవహనాదిక్రియానుకూలశక్తిని పురస్కరించుకొని ప్రయుక్తమగునపుడు వాహీకాది గౌణార్థమును బోధించును. ఇట్లు రూపము,

శక్తి అనెడు నిమిత్తద్వయమును బట్టి ఒకపదమును ప్రయోగించునపుడు అది బోధించు అర్థము ముఖ్యార్థము. కేవలశక్తిరూపనిమిత్తమును బట్టి ప్రయోగించునపుడు అది బోధించు అర్థము గౌణార్థము.

గోశబ్దమునకు అనేకశక్తులుండవచ్చును గాన వాహీకార్థమునందు గూడ దానిని ప్రయోగించవచ్చునని అన్నచో గోశబ్దమున గౌణముఖ్య విభాగమెట్లు అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

> శ్రుతిమాత్రేణ యత్రాస్య యాదర్థ్య మవసీయతే
> ముఖ్యం తమర్థం మన్యన్తే గౌణం యత్రోపపాదితమ్ . 278

యత్ర = ఎచట, అస్య = ఈ శబ్దముయొక్క, శ్రుతిమాత్రేణ = శ్రవణమాత్రముచేతనే, యాదర్థ్యమ్ = ఏ అర్థమును బోధించుసామర్థ్యము, అవసీయతే = నిశ్చయింపబడుచున్నదో, తమ్=ఆ, అర్థమ్ = అర్థమును, ముఖ్యమ్ = ముఖ్యార్థమునుగాను, యత్ర = ఎచట, ఉపపాదితమ్ = అర్థప్రకరణాదులచే అర్థమును బోధించుశక్తి సమర్థింపబడినదో దానిని, గౌణమ్ = గౌణమునుగాను, మన్యన్తే = తలచుచున్నారు.

తా. పదమును వినినంతనే ఇది ఈ యర్థమున ప్రయుక్తమైనది అని ఏది నిశ్చయింపబడునో అది ముఖ్యార్థమనియు, ఏ యర్థమును ప్రకరణాదులచే సమర్థింపవలసి యుండునో అది గౌణమనియు చెప్పుదురు.

ఈవిధముగ అధ్యారోపరూపమగు శబ్దోపచారము గాని అర్థోపచారముగాని ఎచట నుండునో అది గౌణమనియు, అది లేనిచో ముఖ్యమనియు ప్రతిపాదించి కొన్ని లక్ష్యములలో దీనిని సమన్వయించుటకై చెప్పుచున్నాడు.

> గోయుష్మన్మహతాం చ్వ్యర్థే స్వార్థా దర్థాన్తరే స్థితౌ
> అర్థాన్తరస్య తద్భావ స్తత్ర ముఖ్యోఽపి దృశ్యతే . 279

గో-యుష్మ-న్మహతామ్=చ్విప్రత్యయాంతములగు గో-యుష్మద్-మహచ్ఛబ్దములకు, చ్వ్యర్థే=అభూతతద్భావరూపచ్విప్రత్యయార్థమున, స్వార్థాత్ = స్వార్థముకంటె, అర్థాన్తరే = మరియొకఅర్థమగు వాహీకాదియందు, స్థితౌ సత్యామ్ = ప్రవృత్తియుండగా, తత్ర= అచట, అర్థాంతరస్య=అర్థాంతరమునకు (వాహీకాదికమునకు), తద్భావః = గవాదిరూపతాప్రాప్తి, ముఖ్యోఽపి = ముఖ్యమైనదిగా కూడ, దృశ్యతే=కనబడుచున్నది.

తా. గోయుష్మన్మహచ్ఛబ్దములకు, చ్విప్రత్యయార్థమున, స్వార్థముకంటె భిన్నమగు మరియొకఅర్థమున ప్రవృత్తి కలిగినపుడు, అర్థాంతరము గవాదిరూపమును పొందుట ముఖ్యమైనదిగా కూడ కానవచ్చుచున్నది.

'ఆ విధముగ లేనిది ఆ విధముగ అగుట' అనునర్థమునందు 'కృ' 'భూ' 'అస్' ధాతువులతో సంబంధమున్నపుడు— 'కృభ్వస్తియోగే సమ్పద్యకర్తరి చ్విః' (5-4-50) 'అభూత తద్భావ ఇతి వక్తవ్యమ్' అను సూత్రవార్తికములచే చ్విప్రత్యయము వచ్చును. 'అకృష్ణం కృష్ణం సమ్పద్యమానం కరోతి'— (కృష్ణుడు కానివానిని వేషాదులచే కృష్ణునిగా తయారుచేయుచున్నాడు) అను నర్థమున చ్విప్రత్యయము వచ్చి ఏర్పడిన 'కృష్ణీకరోతి' ఇత్యాదులుదాహరణము. ఈ విధముగా చ్విప్రత్యయము చేర్చగా సిద్ధించిన— 'అగౌః

గౌః సమపద్యత ఇతి 'గో ఽభవత్' (గోవుకానివాడు గోవుగా అయినాడు), 'అత్వం త్వం సమ్పద్యతే త్వద్భవతి' (నీవు కానివాడు నీవుగా అయినాడు) ఇత్యాదులందు వాహీకుని వాహీకత్వము పూర్వావస్థలో నున్నట్లును గోరూపత్వము ఉత్తరావస్థలో వచ్చినట్లును, అట్లే 'నీవు' కానివానియందు నీవు కానివాడుగా నుండుట పూర్వావస్థలో నున్నట్లును, ఉత్తరావస్థ యందు నీవగుట వచ్చినట్లును చెప్పబడుచున్నది. ఇట్లు ఉత్తరావస్థయందు గోరూపత్వము, యుష్మద్రూపత్వము, (లేనివి) ఆరోపించబడుచున్నవిగాన ఇచట గౌణార్థత్వము. 'అమహాన్ మహాన్ భూతః మహద్భూతః పూర్ణిమాయాం చంద్రః' 'అశుక్లః శుక్లః సంపద్యతే శుక్లీభవతి పటః' ఇత్యాదులలో పూర్వము పెద్దగా లేని చంద్రుడు ఇపుడు పెద్దగానగుట, పూర్వము తెల్లగాలేని వస్త్రము తెల్లబడుట అనునవి ఆరోపితములు కాక యథార్థములే గాన ఇచట మహచ్ఛుక్ల శబ్దముల యర్థము ముఖ్యమేకాని గౌణముకాదు. ఈ విధముగ చ్విప్రత్యయము చేర్చినపుడు కొన్ని యెడల గౌణార్థత్వము, కొన్ని యెడల ముఖ్యార్థత్వము కానవచ్చు చున్నదని యభిప్రాయము, 'గో ఽ భవత్' 'త్వద్భవతి' అను ఉదాహరణములలో గోశబ్ద (త్వమ్) యుష్మచ్ఛబ్దములు గౌణములుగాన "గౌణముఖ్యయో ర్ముఖ్యే కార్యసంప్రత్యయః" (గౌణపదము, ముఖ్యపదము రెండును ఉన్నపుడు కార్యము ముఖ్యపదము విషయముననే ప్రవర్తించును) అను భాష్యకారోక్త నియమము ననుసరించి 'గో ఽ భవత్' లోని 'గో' అనునది ఓకారాంతనిపాతమే యైనను 'ఓత్' అను సూత్రముచే ప్రగృహ్యసంజ్ఞయు, తత్ప్రయుక్త ప్రకృతిభావమును (సంధి లేకపోవుట) రాలేదు. 'త్వద్భవతి' అనునపుడు యుష్మచ్ఛబ్దమున్నను భూధాతువునకు మధ్యమ పురుషమురాలేదు. ('త్వద్భవసి' కాలేదు).

పైనచూపిన విధముగ 'గో ఽభవత్' 'త్వద్భవతి' అనునపుడు గౌణార్థత్వమున్నది గాన ఇష్టరూపములు సిద్ధించినవి. కాని 'మహద్భూతశ్చన్ద్రమాః' అనునపుడు చంద్రుడు పూర్ణిమనాడు యథార్థముగనే పెద్దగా అయినాడు గాన గౌణత్వము లేదు, మహచ్ఛబ్దము ముఖ్యమే. అందుచే నిచట గౌణముఖ్యన్యాయము ప్రవర్తించదుగాన 'ఆన్మహతః సమానాధికరణ జాతీయయోః' అను సూత్రముచే మహచ్ఛబ్దమునకు ఆత్వము రావలయును కదా యని ఆశంకించుకొని ఇచటగూడ గౌణార్థత్వమున్నదని నిరూపించుచున్నాడు.

> మహత్త్వం శుక్లభావంచ ప్రకృతిః ప్రతిపద్యతే
> భేదేనాపేక్షితా సాతు గౌణత్వస్య ప్రయోజికా. 280

ప్రకృతిః = ప్రకృతి, మహత్త్వమ్ = మహత్త్వమును, శుక్లభావంచ = శుక్లత్వ మును, ప్రతిపద్యతే = పొందుచున్నది, భేదేన = భేదముచేత, అపేక్షితా = అపేక్షింపబడిన, సా = ఆప్రకృతి, గౌణత్వస్య = గౌణత్వమునకు, ప్రయోజికా = కారణభూతమైనది.

**తా.** ప్రకృతి మహత్త్వమును శుక్లత్వమును పొందుచున్నది. భేదముచే అపే క్షింపబడిన ఆ ప్రకృతి గౌణత్వమునకు కారణభూతమైనది.

**వి.** చ్విప్రత్యయస్థలమునందు ఒక వస్తువు మరియొక వస్తువుగా మారుచున్నది గాన దాని పూర్వావస్థ ప్రకృతి, ఉత్తరావస్థ వికృతి లేక వికారము. 'కృష్ణీభవతి' అను నుదాహరణమున కృష్ణుడు కాని నటుని స్వరూపము ప్రకృతి; కృష్ణత్వము వికృతి. 'మహద్భవతి చన్ద్రమాః' 'శుక్లీభవతి పటః' ఇత్యాదులలో మహద్రూపము వికృతి, అమహ ద్రూపము ప్రకృతి; శుక్లత్వము వికృతి, అశుక్లత్వము ప్రకృతి; వాస్తవమున అమహద్రూపా

శుక్లరూపములలో నున్న ప్రకృతులకును, మహద్రూప శుక్లరూప వికృతులకును భేదము లేదు. ఆ చంద్రుడు, ఈ చంద్రుడును, ఆ వస్త్రమును, ఈ వస్త్రమును ఒక్కటియే కదా ? ఐనను అవి వివక్షా వశముచే భేదమును అపేక్షించుటచే విశేష్యమగు పూర్వరూపావస్థకు ప్రాధాన్యమును, విశేషణమగు (ఆ పూర్వావస్థగల దానికి వచ్చిన) ఉత్తరావస్థకు అప్రాధాన్య మును కల్పించి, పూర్వావస్థయందు మహత్త్వ శుక్లత్వాదుల నారోపించుటచే మహత్త్వము గౌణమైనది. కావున 'గౌణముఖ్య' న్యాయము ననుసరించి అత్వము రాలేదు.

'అగ్ని' 'సోమ' మొదలగు శబ్దములు (1) దేవతావాచకములు, (2) తేజస్విత్వా హ్లాదకత్వాది గౌణసాదృశ్యము నాధారముగ గొని శబ్దస్వరూపము నారోపించుటచే మాణ వకుల విషయమున ప్రయోగింపబడునవి, (3) పిత్రాదులు సంకేతముచేసి శబ్దస్వరూపము నారోపించుటచే బాలాదులకు సంజ్ఞగా ప్రయుక్తమగునవి అని మూడు విధములుగ నుండ వచ్చును. ఇందు సాదృశ్యనిమిత్తకములు గౌణములు. కాని మిగిలిన రెండు విధములకును చెందినవి ముఖ్యములు. కావున 'అగ్నిసోమౌ మాణవకౌ' (అగ్నిసోముడు అను బాలురు) అనుచోట సంజ్ఞావాచకములగు ఈ 'అగ్నిసోమ' శబ్దములు ముఖ్యములే గాన 'అగ్నేఃస్తుత్ స్తోమసోమాః' అను సూత్రముచే షత్వము రావలెనుకదా యని ఆశంకించుకొని చెప్పు చున్నాడు.

అగ్నిసోమాదయః శబ్దా యే స్వరూపనిబన్ధనాః
సంజ్ఞిభిః సంప్రయుజ్యన్తేఽప్రసిద్ధే స్తేషు గౌణతా. 281

స్వరూపనిబన్ధనాః=పిత్రాది సంకేతముచే ఆరోపితమగు శబ్దస్వరూపమే ప్రవృత్తి నిమిత్తముగా గల (అనగా అగ్ని శబ్దమును మాణవక రూపార్థమున ప్రయోగించుటకు అది 'అగ్ని' శబ్దమగుట ఒక్కటియే కారణము కాని కారణాంతరము లేదని యర్థము), అగ్ని సోమాదయః='అగ్ని' 'సోమ' మొదలగు, యే = ఏ, శబ్దాః = సంజ్ఞాశబ్దములు, సంజ్ఞిభిః= సంజ్ఞులగు మాణవకాదులతో, సంప్రయుజ్యన్తే = సంబంధించుచున్నవో, తేషు = ఆ శబ్దముల యందు, అప్రసిద్ధేః = ప్రసిద్ధి లేకపోవుటవలన, గౌణతా = గౌణత్వము.

తా. స్వరూపమే ప్రవృత్తి నిమిత్తముగా గల ఏ అగ్ని సోమాది శబ్దములు సంజ్ఞులతో సంబంధించుచున్ననో వాటియందు ప్రసిద్ధి లేకుండటచే గౌణత్వమే.

వి. అగ్నిసోమాది శబ్దములు పిత్రాది సంకేతముచే మాణవకాదుల సంజ్ఞగా నుపయుక్తములైనను, ఇవి దేవతారూపార్థమున ప్రసిద్ధములైనట్లు మాణవకాద్యర్థమున కావు. కావున సాదృశ్యమూలకశబ్దములవలె అప్రసిద్ధార్థకములు గూడ గౌణములుగ పరిగణింప బడుటచే గౌణముఖ్యన్యాయానుసారముగా షత్వము రాదు. అనగా గౌణముఖ్యన్యాయమునందలి గౌణత్వము అప్రసిద్ధి మూలకము కావచ్చును లేదా సాదృశ్యమూలకము కావచ్చునని యభిప్రాయము.

'అగ్ని' 'సోమాది' శబ్దములను ఆరోపాది నిమిత్తముచే మాణవకాదివిషయమున ప్రయోగించునపుడు అవి గౌణార్థములను విషయము స్పష్టమే యని చెప్పుచున్నాడు.

అగ్నిదత్తస్తు యోఽగ్నిః స్యాత్ తత్ర స్వార్థోపసర్జనః
శబ్దో దత్తార్థవృత్తిత్వాత్ గౌణత్వం ప్రతిపద్యతే. 282

తు = కాని, అగ్నిదత్తః = అగ్నిదత్తరూపమగు, యః = ఏ అర్థము, అగ్నిః = అగ్నిపదవాచ్యమై, స్యాత్ = అగునో, తత్ర = అచట, స్వార్థోపసర్జనః = దేవతారూపమగు స్వార్థము అప్రధానముగా (విశేషణముగా) గల, శబ్దః=అగ్ని శబ్దము, దత్తార్థవృత్తిత్వాత్= అగ్నిదత్తుడు అనునర్థము బోధించుట వలన, గౌణత్వం=గౌణత్వమును, ప్రతిపద్యతే= పొందును.

తా. 'అగ్నిదత్త' రూపమగు అర్థము అగ్ని శబ్ద వాచ్యమగునపుడు, అచట స్వార్థోపసర్జనమగు 'అగ్ని' శబ్దము దత్తార్థబోధకమగుటచే గౌణత్వమును పొందును.

వి. అగ్ని ప్రసాదలబ్ధుడగు బాలునియందు అగ్నిత్వమునారోపించి వానిని అగ్ని యని పిలచునపుడు అగ్నిశబ్దము, స్వముఖ్యార్థమగు దేవత అప్రధానము కాగా, ఇచట 'అగ్నిదత్తుడు' అనునర్థమును బోధించుచున్నది గాన ఇది గౌణమని భావము.

'హారిశ్చన్ద్రః మాణవకః' అనునపుడు సుడాగమమును సమర్థించుటకై ప్రస్తావించు చున్నాడు.

నిమిత్తభేదాత్ ప్రక్రాన్తే శబ్దవ్యుత్పత్తికర్మణి
హారిశ్చన్ద్రాదిషు సుటో భావాభావౌ వ్యవస్థితౌ . 283

ప్రకాన్తే = పాణినిచే ఉపక్రమింపబడిన, శబ్దవ్యుత్పత్తికర్మణి = శబ్దముల వ్యుత్పత్తి నిరూపణమునందు, హారిశ్చన్ద్రాదిషు = హారిశ్చంద్రాది పదములయందు, నిమిత్తభేదాత్ = నిమిత్తభేదమువలన, సుటః = సుట్టుయొక్క, భావాభావౌ = భావాభావములు, వ్యవస్థితౌ = నియతముగనున్నవి.

తా. పాణిన్యుపక్రాంతమగు శబ్దవ్యుత్పత్తి నిరూపణమునందు, హారిశ్చంద్రాది పదములందు, నిమిత్తభేదమువలన సుట్టుయొక్క భావాభావములు వ్యవస్థితములైనవి.

వి. పాణిని తన వ్యాకరణమున 'ప్రస్కణ్వ హారిశ్చన్ద్రా వృషీ' (6-1-153) అను సూత్రముచే ఋషివాచకమగునపుడు 'హారిశ్చన్ద్ర' శబ్దమునకు సుడాగమము వచ్చునని ('హారిచన్ద్ర' శబ్దమునకు సుడాగమము వచ్చి 'హారిశ్చన్ద్ర' అని యగునని) చెప్పియున్నాడు. ఈ విధముగ సుడాగమము వచ్చుట రాకపోవుట అనునవి 'హారిశ్చన్ద్ర' శబ్దము ఋషివాచకమగుట కాకపోవుట అను నిమిత్తభేదముపై ఆధారపడి యున్నవి - అనగా ఋషివాచకమగు నపుడు సుడాగమము వచ్చి 'హారిశ్చన్ద్రః' అను రూపమును, ఋషివాచకము కాక 'హరిద్వర్ణమగు చంద్రుడు కలది' ఇత్యాద్యర్థములయందు 'హారిచన్ద్రః' అను రూపము అగునని భావము.

ఇట్లుండగా—ఒక పిల్లవానియందు ఋషియగు హారిశ్చంద్రుని యందలి గుణము లుండుటచే వానిని చూచి 'సాక్షాత్ హారిశ్చన్ద్రోఽయం మాణవకః' అని పలుకుట కలదు. కాని ఇచట 'హారిశ్చన్ద్ర' శబ్దము గౌణమగుటచే దీనికి సుడాగమము రావచ్చునా రాకూడదా అను సంశయమున రావచ్చునమటకు ఉపపత్తి చెప్పుచున్నాడు.

ఋష్యాదౌ ప్రాప్తసంస్కారో యః శబ్దోఽన్యేన యుజ్యతే
తత్రాన్తరఙ్గః సంస్కారో బాహ్యేఽర్థే న నివర్తతే . 284

ఋష్యాదౌ = ఋష్యాద్యర్థమునందు, ప్రాప్తసంస్కారః = పొందబడిన సుడాదేశాది సంస్కారముగల, యః = ఏ, శబ్దః = శబ్దము, అన్యేన = మరియొక మాణవకాద్యర్థ

ముతో, యుజ్యతే = సంబంధించుచున్నదో, తత్ర=ఆ శబ్దమునందు, అన్తరఙ్గః = పదాన్తరని రపేక్షమగుటచే అంతరంగమగు, సంస్కారః=సుడాదిరూపవ్యాకరణ కార్యము, బాహ్యే= బాహ్యమగు, అర్థే = మాణవకరూపమగు అర్థము బోధ్యమగునపుడు, న నివర్తతే = నివర్తించదు.

తా. ఋష్యాద్యర్థమున సుడాగమరూప సంస్కారమును పొందిన ఏ శబ్దము మరియొక మాణవకాద్యర్థముతో సంబంధించుచున్నదో, ఆ శబ్దమునందు, అంతరంగమగు సంస్కారము బాహ్యమగు అర్థము బోధ్యమగునపుడు నివర్తించదు.

వి. వ్యాకరణశాస్త్రానుసారముగా 'హరిశ్చంద్ర' శబ్దమునకు ఋషియను అర్థమునందు మాత్రమే సుడాగమమువచ్చినది. ఈ విధముగ వ్యాకరణసంస్కృతమగు 'హరిశ్చన్ద్ర' శబ్దమును సాదృశ్యమూలారోపముచే మాణవకుని విషయమున ప్రయోగించి వాక్యార్థబోధసమయమున దాని యర్థమునకు అర్థాంతరముతో సంబంధము కల్పించినపుడు, అంతకుపూర్వము ప్రవర్తించిన, బాహ్యపదానపేక్షమగుటచే అంతరంగమగు, సుడ్రూప కార్యము నివర్తించదని యభిప్రాయము. ఒకమారు వచ్చిన వ్యాకరణకార్యము ఎప్పుడును నివర్తించదని వైయాకరణసిద్ధాంతము.

ఏశబ్దమును వినినంతనే ఏ యర్థము బుద్ధిగోచరమగునో ఆ యర్థము ఆ శబ్దమునకు ముఖ్యార్థమే కాన శబ్దములలో గౌణముఖ్య విభాగమనునది లేదని ఆశంకించుచున్నాడు.

అత్యన్తవిపరీతోఽపి యదా యోఽర్థోఽవధార్యతే
యథాసప్రత్యయం శబ్ద స్తత్ర ముఖ్యః ప్రవర్తతే. 285

యదా = ఎప్పుడు, అత్యన్తవిపరీతోఽపి = ముఖ్యార్థమని ప్రసిద్ధమగు అర్థము కంటె మిక్కిలి విపరీతమైనను, యః = ఏ, అర్థః = అర్థము, అవధార్యతే = ఏ శబ్దమును వినినంతనే బుద్ధిగోచర మగుచున్నదో, తత్ర = ఆ అర్థము విషయమున, శబ్దః = శబ్దము యథాసంప్రత్యయం = అర్థజ్ఞానానుసారముగ, ముఖ్యః = ముఖ్యముగనే, ప్రవర్తతే= ప్రవర్తించును.

తా. అత్యంతవిపరీతమైనను ఏ యర్థము బుద్ధిగోచరమగుచున్నదో ఆ యర్థము విషయమున, ఆ శబ్దము అర్థజ్ఞానానుసారముగ ముఖ్యముగనే ప్రవర్తించును.

వి. శబ్దమును వినగనే బుద్ధిగోచరమగు అర్థమంతయు ముఖ్యార్థమే. ముఖ్యార్థ మని ప్రసిద్ధమగు అర్థముకంటె అది విపరీతముగ నున్నను శబ్దశ్రవణముచే బుద్ధిగోచరమగు చున్నదిగాన దానినికూడ ముఖ్యార్థముగనే పరిగణింపవలెను. ఈ విధముగ ఒక శబ్దము ఏ యే అర్థములను బోధించునో ఆయా అర్థము లన్నియు దాని ముఖ్యార్థములే గాన గౌణ ముఖ్యవిభాగము లేదు అని భావము.

బుద్ధిగోచరమైన దంతయు శబ్దార్థమే అను నీమతమునందు గూడ గౌణముఖ్య విభాగము సంభావ్యమే యని ప్రతిపాదించుటకై ముందుగ సత్యాసత్యవిభాగమును చేయు చున్నాడు.

యద్యపి ప్రత్యయాధీన మర్థతత్త్వావధారణమ్
న సర్వః ప్రత్యయ స్తస్మి న్నసిద్ధ ఇవ జాయతే. 286

అర్థతత్త్వావధారణమ్ = ఒకపదార్థము సత్యమని ఊహించుట (నిర్ణయించుట), ప్రత్యయాధీనం యద్యపి = ప్రత్యయ (జ్ఞాన) రూప లింగముపై ఆధారపడినదే యైనను, సర్వః = సమస్తమైన, ప్రత్యయః = జ్ఞానము (యథార్థమైనను, అయథార్థమైనను), అసిద్ధే ఇవ = అసిద్ధమైన (లేని), తస్మిన్ = సత్యమైనను అసత్యమైనను ఆ పదార్థము విషయమున, న జాయతే = పుట్టదు.

తా. అర్థతత్త్వనిర్ణయము జ్ఞానాధీనమే యైనను, అసిద్ధమగు ఆ పదార్థము విషయమున ఏ జ్ఞానమును పుట్టదు.

వి. ఒకపదార్థము సత్యమని ఊహించుటకు జ్ఞాన మనెడు లింగము ఆవశ్యకము. అనగా ఇచటనున్న పదార్థము ఘటమే యని నిర్ణయించుటకు ఘటజ్ఞాన ముండవలెను. ఘటజ్ఞానము లేకున్నచో నిఇచట నున్న ఘటము సత్యమని చెప్పజాలము. అయినను పదార్థమున్నపుడే సత్యజ్ఞానము కలుగు ననియు (అనగా సత్యజ్ఞానోత్పత్తినిపట్టి ఆ పదార్థము సత్యముగ నచటనున్నదని చెప్పవచ్చుననియు) పదార్థము లేనపుడు అసత్యజ్ఞానము పుట్టుననియు (అనగా అసత్యజ్ఞానోత్పత్తిని బట్టి ఆ పదార్థమచటలేదని చెప్పవచ్చుననియు) అంగీకరించుటకు వీలులేదు. జలము యథార్థముగనున్నను లేకున్నను జలప్రత్యయము కలుగుచునే యున్నది. కావున కేవలము జ్ఞానమునుబట్టి పదార్థముల సత్యత్వాసత్యత్వములను నిర్ణయింపజాలమని యర్థము.

సత్యమగు జలమును చూచినపుడును, ఎండమావులను చూచినపుడును గూడ జలప్రత్యయము కలుగుచున్నది. అయినను మృగతృష్ణిక జలము కాదు. అందుచే జ్ఞానమును బట్టి అర్థతత్త్వమును నిర్ణయింపజాలము గాన ప్రత్యయరూపహేతువు (జలజ్ఞానము కలిగినది గాన జలము సత్యము అను అనుమానమానములోని జ్ఞానరూపహేతువు) మృగతృష్ణాజన్య జలజ్ఞానమున వ్యభిచరితమని చెప్పుచున్నాడు.

దర్శనం సలిలే తుల్యం మృగతృష్ణాది దర్శనైః
తుల్యత్వే దర్శనాదీనాం న జలం మృగతృష్ణికా. 287

సలిలే = యథార్థమైన జలము విషయమున, దర్శనమ్ = జలజ్ఞానము, మృగతృష్ణాది దర్శనైః = మృగతృష్ణాదులవలన కలిగిన జలజ్ఞానములతో, తుల్యమ్ = తుల్యమైనదే. దర్శనాదీనామ్ = మృగతృష్ణికాది దర్శనములు, తుల్యత్వేఽపి = తుల్యములే యైనను, మృగతృష్ణికా = ఎండమావులు, జలం న = నీరు కాజాలదు.

తా. యథార్థజలజ్ఞానము మృగతృష్ణాజలజ్ఞానముతో తుల్యమైనదే. దర్శనాదులు తుల్యములే యైనను మృగతృష్ణ జలము కాజాలదు.

వి. కావున జ్ఞానమును పట్టి వస్తువు సత్యమని కాని, అసత్యమని కాని నిర్ణయింపజాలమని భావము.

ఆయా వస్తువులచే సాధ్యములగు అసాధారణ కార్యముల జ్ఞానముచే వస్తువుయొక్క సత్యత్వాసత్యత్వములను నిర్ణయింపవచ్చునని చెప్పుచున్నాడు.

య దసాధారణం కార్యం ప్రసిద్ధం రజ్జుసర్పయోః
తేన భేదః పరిచ్ఛేద్య స్తయో స్తుల్యేఽపి దర్శనే. 288

రజ్జుసర్పయోః = రజ్జుసర్పములయొక్క, ప్రసిద్ధమ్ = ప్రసిద్ధమైన, యత్ = ఏ, అసాధారణమ్ = అసాధారణమైన, కార్యమ్ = కార్యముగలదో, తేన = ఆ కార్యముచేత, దర్శనే = జ్ఞానము, తుల్యేఽపి = సమానమేయైనను, తయోః = ఆ రజ్జుసర్పములయొక్క భేదః = భేదము, పరిచ్ఛేద్యః = నిర్ణయింపదగినది.

తా. జ్ఞానము తుల్యమేయైనను, రజ్జుసర్పములకు గల అసాధారణకార్యములను బట్టి వాటి భేదమును నిర్ణయింపవలెను.

వి. రజ్జువును చూచినపుడు సర్పమనుజ్ఞానము కలుగుచున్నది. సర్పమును చూచినపుడు సర్పమనుజ్ఞానము కలుగుచున్నది. వీటిలో మొదటిది భ్రాంతి; రెండవది యథార్థజ్ఞానము, జ్ఞానమాత్రమును బట్టి ఇది భ్రమయా, ప్రమయా యను విషయమును తెలిసికొనజాలము. రజ్జుసర్పములు చేయగల్గు అసాధారణకార్యములు కొన్నిగలవు. రజ్జువు బంధనరూపకార్యము చేయును. సర్పము దశనరూపకార్యము చేయును, కావున ఈ అసాధారణకార్యజ్ఞానము కలిగినచో దానిని బట్టి సర్పము సత్యమా మిథ్యయా యని నిర్ణయింపవచ్చును. కావున స్వరూపప్రత్యయము వ్యభిచరితమైనను అసాధారణకార్య ప్రత్యయము వస్తుసత్యత్వాసత్యత్వనిర్ణయమున వ్యభిచరితము కాదని యభిప్రాయము.

అసాధారణ కార్యజ్ఞానము లేనిచో విషయము అసత్యమనియు, దీనినిబట్టి ఆ విషయ జ్ఞానము అసత్యమనియు, ప్రతిపాదించి, ఇపుడు ఇంద్రియవిషయములలో దేనియందైన దోష మున్నచో తజ్జన్యజ్ఞానము గూడ అసత్యమని చెప్పుచున్నాడు.

ప్రసిద్ధార్థవిపర్యాసనిమిత్తం యచ్చ దృశ్యతే
యస్తస్మా ల్లక్ష్యతే భేద స్తదసత్యం ప్రచక్షతే. 289

యచ్చ = ఏ, ప్రసిద్ధార్థవిపర్యాసనిమిత్తమ్ = ప్రసిద్ధమైన సత్యమగు అర్థము యొక్క వైపరీత్యమునకు (మిథ్యాజ్ఞానమునకు) కారణమైన ఇంద్రియాదిదోషము, దృశ్యతే = కనబడుచున్నదో, తస్మాత్ = ఆదోషమువలన, యః = ఏ, భేదః = ద్విచంద్రాదివిశేషము, లక్ష్యతే = కనబడుచున్నదో, తత్ = ఆ విపర్యాసదర్శనమునకు విషయమైన వస్తువును, అసత్యం = అసత్యమైనదానినిగా, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

తా. సత్యమగు అర్థము విపరీతముగ కనబడుటకు నిమిత్తములగు విషయేంద్రియాదిదోషములచే కనబడు ద్విచంద్రాదికము అసత్యమని చెప్పుచున్నారు.

వి. తెల్లగానున్నట్లు ప్రసిద్ధమగు శంఖాదికము నేత్రములయందలి కాచకామలాది దోషముచే పచ్చగా కనబడును. ముత్యపుచిప్ప చాకచక్యరూపమగు దోషముచేత వెండి వలె కనబడుచున్నది. ఈ విధముగ ప్రసిద్ధములగు వస్తువులు విపర్యస్తరూపమున కనబడుటకు కారణభూతమగు ఇంద్రియవిషయగతదోషములచే కలుగు జ్ఞానమున విషయమగునదియు, ఆ జ్ఞానమునుకూడ అసత్యములని చెప్పుదురు.

జ్ఞానవిషయము తన అసాధారణ కార్యమును చేయగలిగినచో ఆ జ్ఞానము సత్యమనియు, లేనిచో అసత్యమనియు మొదట చెప్పబడినది. పిమ్మట—జ్ఞానవిషయము సత్యమైనచో ఆ జ్ఞానము కూడ సత్యమనియు, కానిచో కాదనియు ప్రతిపాదింపబడినది. ఇపుడు—జ్ఞాన విషయమగు వస్తువునకు సంబంధించిన అసాధారణ ధర్మములను చూచినను, తత్ప్రియుక్తము

లగు కార్యములను గూడ చూచినచో ఆ జ్ఞానము సత్యమనియు, ఆ కార్యములను చూడకున్నచో అసత్యజ్ఞానమనియు చెప్పుచున్నాడు.

యచ్చ నిమ్నోన్నతం చిత్రే సరూపం పర్వతాదిభిః
న తత్ర ప్రతిఘాతాదికార్యం తద్వత్ ప్రవర్తతే.　　　　290

చిత్రే=చిత్తరువునందు, పర్వతాదిభిః=పర్వతాదులతో, సరూపమ్ = సమానమైన, యచ్చ=ఏ, నిమ్నోన్నతం=ఎత్తుపల్లములు (చూడబడుచున్నవో), తత్ర = ఆ చిత్తరువునందలి నిమ్నోన్నతమునందు, తద్వత్ = యథార్థ పర్వతమునందలి నిమ్నోన్నతములందువలె, ప్రతిఘాతాది = దెబ్బతగులుట మొదలగు, కార్యమ్=కార్యము, న ప్రవర్తతే= ప్రవర్తించుటలేదు

తా. చిత్తరువునందు పర్వతాదులతో సమానరూపముగల నిమ్నోన్నతము కనబడుచున్నది. కాని అచట ప్రతిఘాతాదికార్యము దానియందు వలె కనబడుట లేదు.

వి. యథార్థములగు పర్వతాదుల అసాధారణ ధర్మములగు నిమ్నోన్నతములతో సమానములగు నిమ్నోన్నతములు చిత్తరువులోని పర్వతములందు కూడ కనబడుచున్నవి. కాని పర్వతాసాధారణ ధర్మములగు నిమ్నోన్నతముల కార్యమగు (వాటివలన కలుగు) దెబ్బతగులుట మొదలగునది చిత్తరువునందలి నిమ్నోన్నతములలో లేదు. కావున చిత్రమునందలి నిమ్నోన్నతములును, వాటి జ్ఞానమును గూడ అయథార్థములు. ప్రతిఘాతాది కార్యముండుటచే యథార్థ పర్వతములయందలి నిమ్నోన్నతములును, వాటి జ్ఞానమును సత్యములు.

ఈ విషయమునే మరికొన్ని దృష్టాంతములతో విశదీకరించుచున్నాడు.

స్పర్శప్రబన్ధో హస్తేన యథా చక్రస్య సన్తతః
న తథాలాతచక్రస్య విచ్ఛిన్నం స్పృశ్యతే హి తత్.　　　　291

వప్ర ప్రాకారతల్పైశ్చ స్పర్శనావరణే యథా
నగరేషు న తే తద్వ ద్గన్ధర్వనగరే ష్వపి.　　　　292

చక్రస్య = యథార్థమైన రథాది చక్రముయొక్క, స్పర్శప్రబన్ధః = స్పర్శప్రబంధము, హస్తేన = హస్తముతో, యథా=ఎట్లు, సన్తతః = అవిచ్ఛిన్నముగా నుండునో, అలాతచక్రస్య = అలాతచక్రముయొక్క స్పర్శము, తథా = ఆ విధముగా, న = ఉండదు. తత్ = అలాతచక్రము, విచ్ఛిన్నం = ఆగి ఆగి, స్పృశ్యతే హి=స్పృశింపబడునుగదా ?

తా. సత్యమగు చక్రమునకు హస్తముతో స్పర్శము ఎట్లు అవిచ్ఛిన్నముగ నుండునో అట్లు అలాతచక్రమునకు ఉండదు. అది ఆగి ఆగి స్పృశింపబడును గదా ?

వి. అలాతమనగా కొరవి. కొరవిని పైకెత్తి వేగముగా త్రిప్పినచో అది చక్రమువలె కన్పడును. అది చక్రమువలె కన్పడినను రథచక్రమును అవిచ్ఛిన్నముగ దాని చుట్టును స్పృశింప గలిగినట్లు ఈ అలాతచక్రమును హస్తముతో స్పృశింపజాలము. అది తిరుగుచున్నపుడు ఏ ప్రక్కకు వచ్చునో ఆ ప్రక్క హస్తమును పెట్టినపుడు మాత్రమే అది స్పృశింపబడును. కావున అసాధారణమగు చక్రత్వము కనబడుచున్నను, తత్కార్యమగు అవిచ్ఛిన్నస్పర్శ లేదు గాన అలాతచక్ర, తద్జ్ఞానములు అసత్యములు.

నగరేషు = యథార్థనగరములయందు, వప్రప్రాకారతల్పైః = వప్రములచేతను, ప్రాకారములచేతను, తల్పములచేతను, స్పర్శనావరణే = స్పర్శనావరణములు, యథా = ఏ విధముగా చేయబడుచున్నవో, తద్వత్ = ఆ విధముగా, గన్ధర్వనగరేష్వపి = గంధర్వ నగరములయందు కూడ, తే = స్పర్శనావరణములు, న = లేవు.

తా. యథార్థనగరములందు వప్రప్రాకారతల్పములచే స్పర్శనావరణములు కలుగునట్లు గంధర్వనగరములందు కలుగవు.

వి. వప్రమనగా నగరమునకు వెలుపలనున్న రాళ్ళు రప్పలు మొదలగు వాటితోకూడిన ఉన్నతభూప్రదేశము. ఇది కృత్రిమము కావచ్చును, సహజముకావచ్చును. దానివెనుక నిర్మితమగు ఎత్తైన గోడ ప్రాకారము. తల్పమనగా నగరప్రాకారమునకు దగ్గ రగ కట్టెడు రక్షక భటాద్యావాసమగు గృహవిశేషము. పూర్వము మొదట కృత్రిమము గాని సహజముగాని యగు ఒక వృక్షలతాగుల్మాది సంకులమగు ఎత్తైన ప్రదేశము, దాని వెనుక ఎత్తైన ప్రాకారము, దానివెనుక చుట్టును అట్టములను పేరుగల సైన్యావాసస్థానము లగు గృహవిశేషములు, వాటి వెనుక నగరము ఈ విధముగ నగరనిర్మాణ ముండెడిదని సూచితమగుచున్నది. గారడీవాడు మాయచే ఆకాశమున సృష్టించిన నగరమునకు గంధర్వ నగరమని పేరు. ఈ గంధర్వనగరమునందు గూడ సత్యనగరమందువలె వప్రప్రాకారాట్టము లున్నను, అవి స్పృశించుటకుగాని, దాగికొనుటకుగాని ఉపయోగింపవు. ఇట్లు నగరాసాధారణ ధర్మములగు వప్రాదులు కనబడుచున్నను వాటి కార్యములు కానవచ్చుటలేదు గాన ఆ నగరము, నగరజ్ఞానముగూడ మిథ్యాభూతములు.

ఇంతవరకును చేసిన సత్యాసత్యజ్ఞాననిర్ణయముచే, సత్యాసత్యవిభాగమునే గౌణ ముఖ్యవిభాగముగ భావింపరాదని తెలినది. భేదగ్రహణము లేని అనాహార్యారోపమునకు విషయమైనది సత్యము. భేదగ్రహణపూర్వకమగు ఆహార్యారోపమునకు విషయమగునది గౌణము. బుద్ధివిషయమైనదంతయు శబ్దార్థమే అను మతమునందు గూడ (కా.286) ఈ గౌణముఖ్యవిభాగమును అంగీకరింపవలసియుండును. జ్ఞానవిషయమైనవాని నెల్ల సత్య మని చెప్పుటకు ఎట్లు శక్యము కాదో అట్లే శబ్దప్రతిపాద్యమైన అన్ని అర్థములును ముఖ్యము లని చెప్పుటకు వీలులేదు కదా? కావున ప్రసిద్ధ్యప్రసిద్ధ్యాది నిమిత్తములను బట్టి గౌణముఖ్య విభాగమును అంగీకరింపవలసియే యుండును. ఈ విషయమును సూచించుటకే ఈ సత్యా సత్యవిభాగ మిచట చూపబడినది.

ఆహార్యమనగా బుద్ధిపూర్వకముగా తెచ్చిపెట్టుకొనినది. అనాహార్యమనగా బుద్ధి పూర్వకముగ కాక కారణాంతరములచే వచ్చినది. రజ్జువును చూచి సర్పమనుకొనునపుడు రజ్జువుపై సర్పత్వా రోపమున్నది. ఆరోపించుసమయమున ఇది వాస్తవమున రజ్జు వనియు, తాను సర్పత్వము నారోపించుచున్నాడనియు ఆ భ్రాంతునకు తెలియదు. ఈ యారోపము నకు అస్పష్టప్రకాశకించిచ్చలనాదులు కారణము. దీనికి అనాహార్యారోపమని పేరు. భ్రాంతికి ఇది కారణము. మాణవకునిజూచి 'అగ్నిరయం మాణవకః' అనునపుడు అగ్నిమాణవకులు వేరువేరని తెలిసినను కావలెనని మాణవకునియందు అగ్నిత్వము ఆరోపించబడుచున్నది. ఇది ఆహార్యారోపము. ఇది గౌణప్రయోగములకు మూలము.

'ఇవే ప్రతికృతౌ' (5.3.96) అను సూత్రముచే గౌణార్థ విశేషమున 'కన్' ప్రత్యయము విధింపబడినది. అట్టి 'కన్' ప్రత్యయము చేర్చుట కుపయుక్తమగు గౌణముఖ్య విభాగమును చెప్పుచున్నాడు.

మృగపశ్వాదిభిర్యావాన్ ముఖ్యై రర్థః ప్రసాధ్యతే
తావాన్న మృన్మయేఽప్యస్తి తస్మాత్తే విషయః కనః. 293

ముఖ్యైః = ముఖ్యములైన, మృగపశ్వాదిభిః = మృగములు, పశువులు మొదలగు వాటిచే, యావాన్ = ఎంతటి, అర్థః = ప్రయోజనము, ప్రసాధ్యతే = సాధింపబడునో, మృన్మయే = మట్టితోనిర్మించిన మృగపశ్వాదికమునందు, తావాన్ = అంతప్రయోజనము, నాస్తి = లేదు, తస్మాత్ = ఆ కారణమువలన, తే = ఆ మృన్మయ మృగాదివాచకశబ్దములు, కనః = కన్ ప్రత్యయమునకు, విషయః = విషయము.

తా. ముఖ్యములగు మృగపశ్వాదులచే ఎట్టి ప్రయోజనము సాధింపబడునో అట్టిది మృన్మయమైనదానియందు లేదు. కావున అవి కన్ ప్రత్యయమునకు విషయము.

వి. సత్యమైన మృగాదులు చేయగలిగిన కార్యములను వాటి మట్టి బొమ్మలు చేయజాలవు. కావున బహుప్రయోజన సాధకములగు మృగములు ముఖ్యములు అల్ప ప్రయోజనసాధకములు గౌణములు. ఈ గౌణముఖ్యవిభాగమునే మనస్సులో నుంచుకొని గౌణార్థములగు మృగశబ్దాదులకంటె 'ఇవే ప్రతికృతౌ' (5.3.96) అను సూత్రముచే (ఇవార్థము—అనగా ఉపమానత్వము—గల ప్రాతిపదికముకంటె ప్రకృతి ఉపమేయమగునపుడు) 'కన్' ప్రత్యయమును విధించెను. 'హరిణకాన్ విక్రీణీతే' 'హస్తికాన్ విక్రీణీతే' (లేడిబొమ్మలను అమ్ముచున్నాడు; ఏనుగ బొమ్మలను అమ్ముచున్నాడు) ఇత్యాదులుదాహరణము.

గౌణములగు చరపదార్థములను ఉదాహరించి. ఇపుడు అచరపదార్థములను ఉదాహరించుచున్నాడు:— లేదా గౌణముఖ్యములకు ఆకారముచే గల సాదృశ్యమును చెప్పి ఇపుడు బింబ ప్రతిబింబభావముచే సాదృశ్యమును చెప్పుచున్నాడు.

మహానాప్రియతే దేశః ప్రసిద్ధైః పర్వతాదిభిః
అల్పదేశాన్తరావస్థం ప్రతిబిమ్బంతు దృశ్యతే. 294

ప్రసిద్ధైః = ప్రసిద్ధములగు, పర్వతాదిభిః = బింబములగు పర్వతాదులచే, మహాన్ = విశాలమైన, దేశః = ప్రదేశము, ఆప్రియతే = ఆవరింపబడును, ప్రతిబిమ్బంతు = వాటి ప్రతిబింబమైతే, అల్పదేశాన్తరావస్థం = స్వల్పమైన ప్రదేశమునందున్నదిగా, దృశ్యతే = చూడబడుచున్నది.

తా. ప్రసిద్ధములగు పర్వతాదులు విశాలదేశము నాక్రమించును. కాని వాటి ప్రతిబింబము అల్పప్రదేశమునందు కానవచ్చుచున్నది.

వి. ఈ విధముగ మహాదేశావరకత్వాల్పదేశావరకత్వరూప కార్యభేదముచే ప్రసిద్ధపర్వతము ముఖ్యము, ప్రతిబింబపర్వతము గౌణము. కావున 'పర్వతకాః సురస్రోతస్వినీ జలే' (గంగాజలమునందు పర్వతప్రతిబింబములు) అని ప్రయోగము. ఇచట పర్వతక శబ్దము ప్రతిబింబవాచకము.

చరాచరవస్తువులలో కన్ ప్రత్యయమున కుపయోగించు గౌణముఖ్య విభాగమును తెలిపి ఇపుడు స్వప్నాదులయందు అట్టి విభాగమును చూపుచున్నాడు.

మరణాదినిమిత్తంచ యథా ముఖ్యా విషాదయః
న తే స్వప్నాదిషు స్వస్య తద్వ దర్థస్య సాధకాః . 295

ముఖ్యాః = ముఖ్యమైన, విషాదయః = విషము మొదలగునవి, యథా = ఏ విధముగా, మరణాదినిమిత్తం = మరణాదులకు నిమిత్తమో, తద్వత్ = ఆ విధముగా, తే = ఆ విషాదులు, స్వప్నాదిషు = స్వప్నేంద్రజాలాదులందు, స్వస్య = తమయొక్క, అర్థస్య = మరణాది ప్రయోజనమునకు, సాధకాః = సాధకములు, న = కావు.

తా. ముఖ్యమైన విషాదులు ఎట్లు మరణాదులకు నిమిత్తమో ఆ విధముగ స్వప్నగతవిషాదులు స్వస్వకార్యములను సాధింపజాలవు. కావున అట్టి విషాదులు 'కన్' ప్రత్యయమునకు విషయము లని భావము.

ప్రకృతమగు గౌణముఖ్యవిభాగమును ఉపసంహరించుచున్నాడు.

దేశకాలేన్ద్రియగతై ర్భేదై ర్యద్దృశ్యతేఽన్యథా
యథాప్రసిద్ధి ర్లోకస్య తథా తదవసీయతే . 296

యత్ = ఏ వస్తువు, దేశకాలేన్ద్రియగతైః = దేశమునందు, కాలమునందు, ఇంద్రియమునందు ఉన్న, భేదైః = దోషములచేత, అన్యథా = మరియొకవిధముగా, దృశ్యతే = కనబడుచున్నదో, తత్ = ఆ వస్తువు, లోకస్య = లోకమునకు, యథా = ఎట్లు, ప్రసిద్ధిః = ప్రసిద్ధియో, తథా = ఆ విధముగా, అవసీయతే = నిర్ణయింపబడును.

తా. దేశకాలేంద్రియాది గత దోషములచే మరియొకవిధముగ కనబడుచున్నను వస్తువు, లోకప్రసిద్ధి ననుసరించి, ఆ విధముగనే నిర్ణయింపబడును.

వి. దగ్గరగా నుండుట అనెడు దేశదోషముచేత, జపాపుష్పమునకు దగ్గరగానున్న స్ఫటికము ఎర్రగా కనబడుచున్నది. దూరముగ నుండుట అనెడు దేశదోషముచేత, ఎత్తైన పర్వతముపై నున్న వృక్షములు దూర్వాగ్రములవలె కనబడుచున్నవి. గ్రీష్మమున కాల దోషముచేత ఆవిరితో కలిసి చలించుచున్న సూర్యరశ్ములు దూరముసనున్నవారికి జలజ్ఞానమును కలిగించుచున్నవి. నేత్రదోషముచేత ఒక చంద్రుడు చంద్రద్వయముగా కనబడుచున్నాడు. ఈ విధముగ దేశకాలేంద్రియగత దోషములచే ఒక వస్తువు మరియొక విధముగా కనబడుచున్నను లోక ప్రసిద్ధివశముచేత దాని యథార్థస్వరూపము నిర్ణయింపబడుచున్నది. అనగా దోషవశముచే కల్గిన జలాది ప్రత్యయమునకు బాధకమగు 'ఇది జలము కాదు' అను జ్ఞానము కలిగినను, లేదా అది జలకార్యమగు సేచనాదికమును చేయజాలకపోయినను, ఇది ఇంతే యని దృఢ ప్రత్యయము కలుగకపోయినను, ఇవి యెండమావులే యను యథార్థ స్వరూపము తెలియును.

బుద్ధిగోచరమైనదే శబ్దార్థమని గాని, బాహ్యపదార్థమే శబ్దార్థమని గాని, ఉభయమును శబ్దార్థమని గాని ఈమూడు మతములలో ఏమతము నంగీకరించినను, జ్ఞానాంతరముచే బాధితము కానిదియు, సకలవ్యవహార నిర్వహణ దక్షమును అగు జ్ఞానమునకు విషయమగునదియే సత్యమని గ్రహించవలెను, ఇతరము కాదు అని చెప్పుచున్నాడు.

యచ్చోపఘాతజం జ్ఞానం యచ్చ జ్ఞానమలౌకికమ్
న తాభ్యాం వ్యవహారోఽ_స్తి శబ్దాలోకనిబన్ధనాః . 297

యచ్చ = ఏ జ్ఞానము, ఉపఘాతజమ్ = ఇంద్రియదోషాదులవలన కలిగినదో, యచ్చ = ఏ, అలౌకికమ్ = అలౌకికమైన, జ్ఞానమ్ = ఆర్షజ్ఞానము కలదో, తాభ్యామ్ = ఆ జ్ఞానములచే, వ్యవహారః = లోకవ్యవహారము, నాస్తి=లేదు. శబ్దాః = శబ్దములు, లోక నిబన్ధనాః=లోక వ్యవహారకారణములు.

తా. దోషజన్యజ్ఞానము గాని, అలౌకికమగు యోగిజ్ఞానముగాని లోక వ్యవహార మునకు ఉపయోగించవు. శబ్దములు లోక వ్యవహారముపై ఆధారపడియుండును.

వి. ఇంద్రియ దోషాదులవలన కలిగిన భ్రాంతిజ్ఞానముచే గాని, తపఃసిద్ధులగు మహర్షుల లోకాతీతమగు జ్ఞానముచే గాని లౌకిక కార్య నిర్వాహము చేయ శక్యము కాదు. లోకములో శబ్దములను అర్థబోధకై ప్రయోగింతురు. కావున ఇవి లోకవ్యవహారమున కుప యుక్తములై యుండవలెను. ఇవి భ్రాంతిరూపజ్ఞానమును గాని, అలౌకికమగు (దృశ్యలోక విరుద్ధమగు) జ్ఞానమును గాని కల్పించినచో అట్టి శబ్దములతో లౌకిక వ్యవహారము కుదరదు. ఈ విధముగ లోకవ్యవహారమాత్రప్రయోజనములగు శబ్దములు బాధజ్ఞానము లేకుండుట చేతను, ప్రసిద్ధివశముననుు ముఖ్యార్థమును బోధించుటలో ఏ మాత్రము అడ్డులేక (అస్ఖలద్గతిక ములై) ప్రవర్తించును. గౌణార్థమును బోధింపవలసివచ్చునపుడు అప్రసిద్ధి బాధాదులచే మందముగ (స్ఖలద్గతికములై) ప్రవర్తించును. శబ్దార్థము బౌద్ధము (బుద్ధి గోచరమైన దెల్ల శబ్దార్థమే) అని అంగీకరించు మార్గమునందు గూడ ఈ గౌణముఖ్య విభాగము అంగీకార్యమే యని భావము.

ఇంతవరకును గౌణముఖ్యన్యాయమునకు ఉపయుక్తమగు గౌణముఖ్య విభాగము, తత్ప్రసంగముచే సత్యాసత్య విభాగాదులును ప్రతిపాదింపబడినవి. ఇపుడు అర్థములలో ముఖ్యము—ద్యోత్యము, వివక్షితము—అవివక్షితము, గుణము—ప్రధానము, మొదలగు విభాగములను, పదార్థమునందలి ఒక భాగమునకే వివక్ష, సకల పదార్థమునకు వివక్ష, అన్యార్థోపలక్షణము మొదలగు విషయములను తెలుపుటకై ముందుగ శబ్దముల ముఖ్యార్థ నాన్తరీయకార్థ విచార మును దృష్టాంత నిరూపణ పూర్వకముగ చేయుచున్నాడు. జ్ఞాపకము, కారకము అను రెండు విధములగు దృష్టాంతములలో మొదట జ్ఞాపకదృష్టాంతమును చూపుచున్నాడు.

ఘటాదిషు యథా దీపో యేనార్థేన ప్రయుజ్యతే
తతోఽన్యదపి సాచివ్యాత్ స కరోతి ప్రకాశనమ్ . 298

దీపః = దీపము, ఘటాదిషు = ఘటము మొదలగు జ్ఞేయపదార్థములవిషయమున యేన = ఏ, అర్థేన = ప్రయోజనముచే, ప్రయుజ్యతే = ఉపయోగింపబడునో, తతః = ఆ ప్రయోజనముకంటె, అన్యత్ = భిన్నమైన, ప్రకాశనమపి = ప్రకాశనమునుకూడా, సాచి వ్యాత్ = నాన్తరీయకత్వమువలన, యథా = ఏవిధముగా, కరోతి = చేయునో—

తా. ఘటాదివిషయమున ఉపయుక్తమగు దీపము ఉద్దిష్టమగు ప్రయోజనము కంటె భిన్నమగు ప్రకాశమును గూడ, నాన్తరీయకత్వముచే, ఎట్లు చేయునో—1

వి. ఘటప్రత్యక్షజ్ఞానము కలుగుటకై దీపము సహాయముగ తీసికొనబడును. ఆ దీపము ఘటప్రత్యక్షమును కలిగించుటయే కాక, ఆ ప్రత్యక్షమునకు నాంతరీయకముగ, ఘటమునందు ప్రకాశమును కూడ కలుగచేయును.

'యేన వినా యదనుపపన్నం తత్తస్య నాన్తరీయకమ్' అని నాన్తరీయకత్వలక్షణము. ఒకపని జరుగవలెనన్న మరియొకపనికూడ జరిగితీరవలెను. అపుడు రెండవపని మొదటిదానికి నాన్తరీయకము; ఫలమును భక్షింపవలెనన్నచో దానిని ఛేదించుట తప్పక జరుగవలెను. ఛేదించకుండగా ఫలభక్షణము అసంభావ్యము గాన ఫలభక్షణమునకు ఫలచ్ఛేదనము నాంతరీయకము, అట్లే దీపసహాయముచే ఘట ప్రత్యక్షము కావలెనన్నచో ఆ దీపపు వెలుతురు ఘటముపై ప్రసరించుట (ఘటప్రకాశనము) నాంతరీయకము.

దృష్టాంతసిద్ధమగు అర్థమును దార్ష్టాంతికమునందు కూడ సమన్వయించుచున్నాడు.

సంసర్గిషు తథార్థేషు శబ్దో యేన ప్రయుజ్యతే
తస్మాత్ప్రయోజకా దన్యా నపి ప్రత్యాయయ త్యసౌ. 299

తథా = అవిధముగనే, శబ్దః = 'భావః' 'పాకః' 'లవః' ఇత్యాదిశబ్దము, సంసర్గిషు = తనతోసంబంధించిన సిద్ధత్వము, లింగము, సంఖ్య మొదలగు, అర్థేషు = అనేకార్థములలో, యేన = ఏ అర్థముచే (ఏ అర్థమును బోధించుటకై) ప్రయుజ్యతే = ప్రయోగింపబడునో, తస్మాత్ = ఆ, ప్రయోజకాత్ = ప్రయోగనిమిత్తమగు అర్థముకంటె, అన్యానపి = ఇతరములైన అర్థములనుకూడ, అసౌ = ఈ పదము, ప్రత్యాయయతి = బోధించుచున్నది.

తా. ఆ విధముగనే తనకుసంబంధించిన అర్థములలో ఏ అర్థమును బోధించుటకై ఒకశబ్దము ప్రయోగింపబడునో దానికంటె భిన్నములగు అర్థములనుగూడ బోధించును.

వి. 'భావః' 'లవః' 'పాకః' ఇత్యాది శబ్దములకు సిద్ధత్వము, సంఖ్య, లింగము, మొదలగు ఎన్నియో అర్థములతో సంబంధమున్నది. ఈ యర్థములలో ఏదే నొకదానిని బోధించుటకై ప్రయుక్తమైనను ఆ శబ్దము, ఘటజ్ఞానముకొరకు ఉద్దిష్టమగు దీపము ఘట ప్రకాశమునుకూడ కలిగించునట్లు, ఇతరార్థములనుగూడ (సిద్ధత్వముతో సంబంధించని లింగ సంఖ్యాదులు కాని, లింగసంఖ్యాదులతో సంబంధించని సిద్ధత్వము గాని లేకపోవుటచే) బోధించుచుండును కావున ఆ యర్థములు నాంతరీయకములు.

[1] ఇచట 'తతోఽన్యదపి' అను పాఠమునకు బదులు 'తతోఽన్యస్యాపి' అను పాఠమును గ్రహించి 'ఘటమును ప్రకాశింపచేయుటకు వెలిగించిన దీపము దాని ప్రక్కనే యున్న పటమును కూడ ఎట్లు ప్రకాశింపచేయునో అవిధముగా' అని ఒక వ్యాఖ్యాత వ్యాఖ్యానించి యున్నారు. ఈ కారికకపై పుణ్యరాజ వ్యాఖ్యానము ననుసరించి మొదట చూపిన యర్థము యుక్తమైనను, 302 వ కారికకు పుణ్యరాజు వ్రాసిన అవతారికను బట్టి రెండవ వ్యాఖ్యానము కూడ యుక్తమే యని తోచుచున్నది. కాని నాంతరీయకత్వమనునది ప్రథమ వ్యాఖ్యానమునందే సంగతముగనుండును.

జ్ఞాపక హేతువు, కారక హేతువు అని హేతువు రెండు విధములు, దీపము ఘట మున్నట్లు జ్ఞానము కలిగించును గాన అది జ్ఞాపక హేతువు. అగ్నివలన ధూమము పుట్టునుగాన అగ్ని ధూమమునకు కారక హేతువు. పూర్వము జ్ఞాపక హేతువును దృష్టాంతముగ జూపి ఇపుడు కారక హేతువును దృష్టాంతముగ చూపుచున్నాడు.

నిర్మన్థనం యథారణ్యో రగ్న్యర్థ ముపపాదితమ్
ధూమమ ప్యనభి ప్రేతం జనయ త్యేకసాధనమ్ . 300

యథా = ఏ విధముగా, అగ్న్యర్థం = అగ్నికొరకై, ఉపపాదితమ్ = చేయబడిన, అరణ్యోః = అరణులయొక్క, నిర్మన్థనమ్ = మథనము, అనభిప్రేతమ్ = ఉద్దేశింపబడనిదియు, ఏకసాధనమ్ = అగ్నికి ఏ అరణులు సాధనమో అవియే సాధనములుగా గల, ధూమం = ధూమమును, జనయతి = పుట్టించునో—

తా. అగ్నిని పుట్టించుటకై అరణులను మథించునపుడు అగ్నిని పుట్టించుటకు ఏ అరణులు సాధనమో ఆ అరణులే ధూమమునకు కూడ సాధనము గాన, కావలెనని కోరక పోయినను, ధూమముకూడ ఏ విధముగ ఉత్పన్న మగునో—

వి. యాగాదులకై అగ్నిని సంపాదింపవలసి వచ్చినపుడు జమ్మికఱ్ఱతో చేసిన ఒక దిమ్మను నేలపై ఉంచి, దానికి రంధ్రములుచేసి, ఒక రంధ్రములో మరియొక కఱ్ఱ యొక్క అగ్రమును చేర్చి, ఒకరు నిలబడి పైనుండి అదిమిపట్టుకొనియుండగా మరియొకరు త్రాళ్ళతో కవ్వము త్రిప్పినట్లు త్రిప్పుదురు. ఈ రెండు కఱ్ఱలకును అరణులని పేరు.

దీనిని దార్ష్టాంతికమునందు సమన్వయించుచున్నాడు.

తథా శబ్దోఽపి కస్మింశ్చిత్ ప్రత్యాయ్యార్థే వివక్షితే
అవివక్షితమ ప్యర్థం ప్రకాశయతి సన్నిధేః . 301

తథా = ఆ విధముగ, శబ్దోఽపి = పాకాదిశబ్దము కూడా, కస్మింశ్చిత్ = ఒకా నొక, ప్రత్యాయ్యార్థే = బోధింపవలసిన సిద్ధత్వాద్యర్థము, వివక్షితే = వివక్షితమైనదగు చుండగా, సన్నిధేః = సన్నిధానమువలన, అవివక్షితమ్ = వివక్షితము కాని, అర్థమ్ = లింగసంఖ్యాద్యర్థమును కూడా, ప్రకాశయతి = బోధించుచున్నది.

తా. అట్లే శబ్దము కూడ, ఒక అర్థము వివక్షితమై యుండగా, సన్నిధివశమున అవివక్షితార్థమును గూడ బోధించును.

వి. అగ్నికొరకై మథింపబడిన అరణులు ధూమమును కూడ పుట్టించునట్లు సిద్ధత్వార్థమును బోధించుటకు ప్రయుక్తమగు 'పాక' శబ్దము, అవినాభావ సంబంధముచే సిద్ధత్వరూపార్థముతో కలిసియున్న పుంలింగ-ఏకత్వ సంఖ్యాదులను కూడ బోధించును.

కావున ఒక శబ్దము ఏ అర్థమును బోధింపవలెనని ప్రయోగింతుమో ఆ యర్థము ముఖ్యార్థము. తత్సన్నిధానముచే బోధ్యమగునది నాన్తరీయకము అని భావము.

ఒక క్రియకు అనేకములగు అంగములు ఉండును. ఉదా. పచనక్రియకు నిప్పు రగుల్చుట, బియ్యము కడుగుట, గిన్నె పొయ్యిపై కెక్కించుట మొదలగు ఎన్నియో అంగము లుండును. "పచతి" మొదలగు తిఙంతములు క్రియజరుగుచున్నట్లు బోధించును.

కావున తదొప్రధ్యమగు క్రియ సాధ్యము. ఘఞాద్యంతములగు 'పాకః' ఇత్యాది పదములు క్రియపూర్తియై పోయినట్లు బోధించును. కావున ఏతదొప్రధ్యమగు క్రియ సిద్ధము.

దీపము, ఘటముతో పాటు దానిదగ్గర నున్న పటాదికమును గూడ ప్రకాశింప చేసిన చేయవచ్చును. శబ్దము కూడ అవిధముగనే వివక్షితార్థమునే కాక తత్సమానాధికరణ మగు అర్థాంతరమును గూడ బోధింపవలెనని నియమ మేమి యున్నది అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

యథై వాత్యన్తసంసృష్ట స్త్యక్తు మర్థో న శక్యతే
తథా శబ్దోఽపి సమ్బన్ధీ ప్రవివేక్తుం న శక్యతే. 302

అత్యన్తసంసృష్టః = ఎక్కువగా కలిసిపోయి ఉన్న, అర్థః = వస్తువు, యథా= ఏ విధముగా, త్యక్తుం=విడచుటకు, న శక్యతే=శక్యముకాదో, తథా=ఆ విధముగా, సమ్బన్ధీ= ఆయా అర్థములతో సంబంధించిన, శబ్దోఽపి = శబ్దముకూడ, ప్రవివేక్తుమ్ = ఆ యర్థముల నుండి విడదీయుటకు, న శక్యతే=శక్యము కాదు.

తా. ఎక్కువగా కలిసిపోయిన పదార్థమును విడచుట ఎట్లు శక్యము కాదో, ఆ విధముగనే ఆయా యర్థములతో కలిసిన శబ్దమునుగూడ ఆయా అర్థములనుండి విడ దీయుట శక్యము కాదు.

వి. మత్స్యాదిమాంసమును కోరువాడు ఆ మాంసముతో కలిసిపోయిన చర్మము, ముళ్ళు మొదలగు వాటిని ఏ విధముగ పూర్తిగ విడువజాలడో ఆ విధముగనే ముఖ్యార్థమును బోధింపవలెననెడు నభిప్రాయములతో ఒక శబ్దమును ప్రయోగించువాడు ఆ శబ్ద ముతో ఘనిష్ఠ సంబంధము గల లింగ సంఖ్యాది రూపములగు నాంతరీయ కార్థములను దానినుండి విడదీయజాలడు. కావున ముఖ్యార్థముతోపాటు నాన్తరీయ కార్థము కూడ బుద్ధిగోచర మగుచుండును. ఆ శబ్దమును లింగసంఖ్యాదులనుండియే కాదు, లింగసంఖ్యావాచకములు కాని, ద్యోతకములు కాని అగు ప్రత్యయములనుండి గూడ విడదీ యుట శక్యము కాదు—కావుననే— "న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః' (కేవల ప్రకృతిని గాని, కేవల ప్రత్యయమును గాని ప్రయోగింపరాదు) అని నియమము.

అనేకములగు అర్థములు సన్నిహితములైనచో శబ్దము ఏ అర్థమును బోధించును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

వ్యర్థానాం సన్నిధానేఽపి సతి చైషాం ప్రకాశనే
ప్రయోజకోఽర్థః శబ్దస్య రూపాభేదేఽపి శస్యతే. 303

వ్యర్థానామ్ = అనుపయుక్తములగు నాంతరీయకార్థముల యొక్క, సన్నిధానేఽపి= ముఖ్యార్థమునకువలె, ఒక శబ్దమున సన్నిధానమున్నను, ఏషాం = ఈ నాంతరీయకార్థ ములయొక్క, ప్రకాశనే=బోధనము, సత్యపి=ఉన్నను, శబ్దస్య=శబ్దమునకు, రూపాభేదేఽ పి= ముఖ్యార్థమునందు వలె నాంతరీయకార్థ విషయమునందుగూడ స్వరూపభేదము లేకున్నను, ప్రయోజకః = ప్రయోజకమగు (ఏ అర్థము నుద్దేశించి ఆ శబ్దము ప్రయోగింప బడినదో అట్టి), అర్థః=అర్థము, శస్యతే= ప్రశంసింపబడును.

తా. అనుపయుక్తములగు అర్థములు సన్నిహితములైనను, అవి ప్రకాశితములైనను, రూపభేదము లేకున్నను, ప్రయోజకమగు అర్థమే ప్రశంసింపబడును.

వి. ఒక శబ్దముతో ముఖ్యార్థమెట్లు సంబంధించియున్నదో నాంతరీయకార్థములు గూడ ఆ విధముగనే సన్నిహితములై యున్నవి. ముఖ్యార్థములను, నాంతరీయకార్థములను కూడ, తన స్వరూపమునందు ఎట్టి మార్పును లేకుండగనే శబ్దము బోధించుచున్నది. అయినను ఏ అర్థమును బోధింపవలెనను నుద్దేశముతో శబ్దము ప్రయోగింపబడినదో అట్టి ప్రయోజకమగు అర్థమే ప్రశస్యము— అనగా ముఖ్యము. ఇతరార్థములు నాన్తరీయకములు మాత్రమే.

ఈ విషయమునే, ప్రకారభేదములను గూడ చూపుచు విస్తారముగ ప్రతిపాదించుచున్నాడు.

క్వచి ద్గుణప్రధానత్వ మర్థానా మవివక్షితమ్
క్వచి త్సాన్నిధ్య మప్యేషాం ప్రతిపత్తా వకారణమ్ . 304

క్వచిత్=కొన్ని స్థలములయందు,అర్థానామ్=అర్థములయొక్క,గుణప్రధానత్వమ్=గుణప్రధాన భావము, అవివక్షితమ్=వివక్షితము కాదు. అనగా గుణప్రధానభావమునందు విపర్యయము కనబడుచున్నది.క్వచిత్=కొన్ని స్థలములయందు, ఏషామ్=ఈనాంతరీయకార్థముల యొక్క, సాన్నిధ్యమపి=సాన్నిధ్యముకూడ, ప్రతిపత్తౌ = జ్ఞానమునందు, (జ్ఞానము ద్వారా నాంతరీయకార్థ సంబద్ధ వ్యవహారమునందు), అకారణమ్=కారణము కాదు.

తా. కొన్నిటి అర్థముల గుణప్రధానభావము అవివక్షితము. కొన్నియెడల ఈ నాంతరీయకార్థముల సాన్నిధ్యము జ్ఞానమునందు అకారణము. అనగా పదార్థైకదేశము (పదార్థములోని ఒక భాగము) వివక్షితము కాదు - అని యర్థము.

యచ్చానుపాత్తం శబ్దేన తత్కస్మింశ్చిత్ ప్రతీయతే
క్వచి త్ప్రధాన మేవార్థో భవ త్యన్యస్య లక్షణమ్ . 305

కస్మింశ్చిత్ = ఒకానొకస్థలమునందు, యచ్చ=ఏది, శబ్దేన=శబ్దముచేత, అనుపాత్తమ్=వాచ్యార్థరూపమున బోధింపబడలేదో, తత్=అ యర్థమే, (నాన్తరీయకమైనను), ప్రతీయతే = గ్రహింపబడును. అనగా వాచ్యార్థమునకు వివక్ష ఉండదని భావము. క్వచిత్=కొన్నిస్థలములయందు, ప్రధానమ్=ప్రధానమైన, అర్థఏవ = అర్థమే, అన్యస్య = మరియొక అర్థమునకు, లక్షణమ్ = ఉపలక్షణము, భవతి=అగును.

తా. కొన్ని స్థలములందు శబ్దవాచ్యముకాని అర్థము గ్రహింపబడును. కొన్నియెడల ప్రధానమైన అర్థమే మరియొక అర్థమునకు ఉపలక్షకముగ నుండును.

పై రెండు కారికలలో (1) గుణప్రధాన భావ విపర్యయము (2) పదార్థైకదేశావివక్ష, (3) సకల పదార్థావివక్ష (4) ఉపాత్త పదార్థమును విడువకుండగనే అర్థాంతరమును ఉపలక్షించుట అను ప్రకారచతుష్టయము చెప్పబడినది. వీటిలో మొదటిదానిని ఉదాహరణపూర్వకముగ వివరించుచున్నాడు.

అఖ్యాతం తద్ధితార్థస్య యత్కించి దుపదర్శకమ్
గుణప్రధానభావస్య తత్ర దృష్టో విపర్యయః . 306

అఖ్యాతమ్ = 'తేనదీవ్యతి -' (4.4.2) ఇత్యాదిసూత్రమునందలి అఖ్యాతము, తద్ధితార్థస్య=తద్ధితార్థముయొక్క, యత్కిఞ్చిదుపదర్శకమ్=క్రియారూపము, కారకరూపము అగు ఏదియో అంశమునకు ప్రదర్శకము, తత్ర = ఆ అఖ్యాతమునందు, గుణప్రధాన భావస్య=గుణప్రధాన భావమునకు, విపర్యయః=వైపరీత్యము, దృష్టః=చూడబడినది.

తా. అఖ్యాతము తద్ధితముయొక్క ఏదియో ఒక అంశమును ప్రదర్శించును. ఆ అఖ్యాతమునందు గుణప్రధానభావమునకు విపర్యయము కానవచ్చుచున్నది.

వి. 'అక్ష' శబ్దమునకు 'అక్షముతో ఆడువాడు' అను నర్థమున 'తేన దీవ్యతి ఖనతి జయతి జితమ్' (4.4.2) అను సూత్రముచే 'ఠక్' ప్రత్యయము, దానికి ఇకాదేశము వచ్చి 'ఆక్షికః' అను రూపము సిద్ధించినది. 'పాచికలతో ఆడెడువాడు' అని యర్థము. 'తేన దీవ్యతి—' ఇత్యాదిసూత్రమున 'దీవ్యతి' అను అఖ్యాతము ప్రయుక్తమైనది. 'క్రియాప్రధాన మాఖ్యాతమ్' (అఖ్యాతము ప్రధానముగ క్రియను బోధించును) అను నియమము ననుసరించి 'తత్కరణకదేవనక్రియ' అను నర్థమున ఠక్ ప్రత్యయము వచ్చునని సూత్రమున కర్థము వచ్చును. కావున ఈ లక్షణము (శాస్త్రము) ననుసరించి నిష్పన్నమగు 'ఆక్షికః' అను లక్ష్యమునకు 'అక్షకరణక (దేవదత్త కర్తృక) దేవనక్రియ' అను నర్థము చెప్పవలసియున్నది. కాని తద్ధితాంతమూ స్వభావముచే సాధనప్రధానమగు అర్థమును బోధించునుగాన 'అక్షకరణక దేవనక్రియ చేయువాడు' (అక్షకరణకదేవనక్రియా కర్త్రభిన్నః దేవదత్తః) అను ప్రథమాంత ప్రధానమగు బోధమునే చెప్పవలెను. ఈ విధముగ లక్షణోక్త గుణప్రధానభావమునకును (అచట కర్త అప్రధానము, క్రియప్రధానము), లక్ష్యబోధ్యగుణప్రధానభావమునకును (ఇచట కర్త ప్రధానము, క్రియ తద్విశేషణ మగుటచే అప్రధానము) విపర్యాసమువచ్చినది గాన ఇది గుణప్రధాన విపర్యాసమున కుదాహరణము. ఇట్టి పరిస్థితులలో 'తేన దీవ్యతి' ఇత్యాదులందు అఖ్యాతము తద్ధితాంతమునకు సంబంధించిన క్రియాకర్తృరూపమగు కొంత అర్థమును బోధించుచున్నదేగాని ఇందు గుణప్రధానభావము వివక్షితము కాదు. అక్షకరణక దేవనక్రియాకర్తృరూపమగు అర్థముమాత్రమే ప్రయోజకము గాన అదియే ముఖ్యార్థమని భావము.

'క్వచి త్సాన్నిధ్యమ ప్యేషాం ప్రతిపత్తా వకారణమ్' అను ద్వితీయ ప్రకారమును (పదార్థైకదేశావివక్షను). 'యచ్చానుపాత్తం శబ్దేన తత్ కస్మింశ్చిత్ ప్రతీయతే' అను తృతీయ ప్రకారమును (సకల పదార్థావివక్షను) విశదీకరించుచున్నాడు.

నిర్దేశే లిఙ్గ సంఖ్యానాం సన్నిధాన మకారణమ్
ప్రమాణ మేవ హ్రస్వాదా వనుపాత్తం ప్రతీయతే . 307

నిర్దేశే='భావే' (3.3.18) ఇత్యాది సౌత్రనిర్దేశమునందు, లిఙ్గసంఖ్యానామ్ = లింగసంఖ్యలయొక్క, సన్నిధానం = సన్నిధి, అకారణమ్ = స్వవిషయక వ్యవహారమునకు కారణము కాదు.

తా. సౌత్రనిర్దేశమున లింగ సంఖ్యా సన్నిధి స్వవ్యవహారకారణము కాదు.

వి. 'పచ్' మొదలగు ధాతువులకు 'భావే' (3.3.18) అను సూత్రముచే భావార్థమున 'ఘఞ్' (అ) ప్రత్యయము విధింపబడినది. సిద్ధావస్థనుపొందిన ధాత్వర్థమునకు

భావమని పేరు. 'పాకః' ఇత్యాదిరూపములు సిద్ధించినవి. ఇచట 'భావే' అనునపుడు పుంలింగైకత్వములుకూడ భావపదార్థముతో సంసృష్టములై యున్నవి గాన నాంతరీయకము లగు ఆ అర్థములను గూడ స్వీకరించినచో 'భావార్థమున, పుంలింగమున, ఏకత్వసంఖ్యా వాచ్యమగునపుడు ఘఞ్ వచ్చును' అను నర్థము చెప్పవలసియుండును. అట్లు చెప్పినచో 'పాకః' ఇత్యాది పుంలింగైకవచనరూపములు మాత్రమే యుండునుగాని 'పాకౌ' 'పాకాః' ఇత్యాదిరూపము లుండరాదు. అట్లే భావార్థమున 'క్తి' (తి) ప్రత్యయము వచ్చి, గతిః, 'గతీ' ఇత్యాదిస్త్రీలింగరూపములుండుటకు గూడ అవకాశముండదు. కావున నాన్తరీయకము లగు సంఖ్యాలింగరూపార్థముల జ్ఞాన మిచట కలిగినను అవి వ్యవహారయోగ్యములు కావు. ఇది పదార్థైకదేశావివక్షకు ఉదాహరణము.

ఉత్తరార్థము సకల పదార్థావివక్షను వివరించుచున్నది.

హ్రస్వాదౌ = 'తస్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్' (1.2.32) ఇత్యాదిసూత్రము లందలి హ్రస్వాదిపదములందు, అనుపాత్తం = గ్రహింపబడని (చెప్పబడని), ప్రమాణ మేవ = అర్థమాత్రప్రమాణమే, ప్రతీయతే = రూఢిచే తెలియబడుచున్నది.

తా. హ్రస్వాదిపదములందు చెప్పబడని ప్రమాణరూపార్థము గ్రహింపబడు చున్నది.

వి. పాణిని—'ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘ ప్లుతః' (1.2.27) అను సూత్రముచే అచ్చు లన్నియు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని మూడేసి విధములుగ నుండుననిచెప్పి, మరల హ్రస్వదీర్ఘప్లుతములు ఉదాత్తానుదాత్తస్వరితభేదములచే మూడేసి విధములగునని ప్రతిపా దించి, 'ఉచ్చై రుదాత్తః' (1.2.29) నీచై రనుదాత్తః' (1.2.30) అను సూత్రములచే ఉదాత్త మన నేమియో, అనుదాత్తమన నేమియో చెప్పి, పిదప 'సమాహారః స్వరితః' (1.2.31)అను సూత్రమున ఉదాత్తానుదాత్తముల సమాహారము (కలయిక) స్వరితమని ప్రతిపాదించినాడు. ఈ విధముగ అచ్చులన్నియు (ఏజాదులుతప్ప) హ్రస్వోదాత్త—హ్రస్వానుదాత్త—హ్రస్వ స్వరితములనియు, దీర్ఘోదాత్త—దీర్ఘానుదాత్త- దీర్ఘ స్వరితములనియు, ప్లుతోదాత్త—ప్లుతాను దాత్త—ప్లుతస్వరితము లనియు తొమ్మిదేసివిధము లుండును. స్వరితములగు హ్రస్వదీర్ఘప్లుత ములు క్రమముగ ఏకమాత్ర-ద్విమాత్ర-త్రిమాత్రములై యుండును. కావునహ్రస్వస్వరితాదు లలోఉదాత్తానుదాత్తములు రెండునుకలిసియున్నవి గాన, ఎంతభాగముఉదాత్తము, ఎంతభాగము అనుదాత్తము, అందును మొదటిభాగముదాత్తమా, మధ్యభాగమా లేక చివరిభాగమా అను శంకకు సమాధానముగా 'తస్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్' (1.2.32) అని చెప్పబడినది. దానికి—'ఆ స్వరితముయొక్క మొదటి సగమైన హ్రస్వము ఉదాత్తము' అని అర్థము చెప్పవలసియున్నది. కాని ఇట్లు అర్థము చెప్పినచో హ్రస్వస్వరితమువిషయమున వెనుకటి శంక తొలగినను దీర్ఘస్వరిత ప్లుతస్వరితములవిషయమున వాటిలో ఎంతభాగము, ఏభాగము ఉదాత్తమో సమాధానముచెప్పినట్లుకాదు. కావున ఈ సూత్రమునందలి 'హ్రస్వ' శబ్దము నిరర్థకము 'అర్ధహ్రస్వమ్' అనుదానికి అర్ధమాత్ర యనియే అర్థము. అట్లు చెప్పినచో దీర్ఘప్లుత స్వరితములలోగూడ మొదటి అర్ధమాత్రయే ఉదాత్తమని చెప్పినట్లగును. ఈ విధముగ నిచట హ్రస్వపదార్థమును పూర్తిగ విడిచి నిరూఢలక్షణచే 'అర్ధహ్రస్వమ్' అను

దానికి 'ర్ధఅమాత్ర' యని మరియొకయర్థము చెప్పబడినది. కాన ఇది సకలపదార్థా వివక్షకు ఉదాహరణము.

వర్ణములను ఉచ్చరించుటకు పట్టు కాలమునకు మాత్ర యని పేరు. హ్రస్వమునకు ఒక మాత్ర, దీర్ఘమునకు రెండు మాత్రలు, ప్లుతమునకు మూడు మాత్రలు, వ్యంజనమునకు అర్ధమాత్ర.

'ఏకమాత్రో భవే ద్ధ్రస్వో ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః వ్యఞ్జనం త్వర్ధమాత్రకమ్'.

పూర్వకారికో క్తవిషయమునే స్పష్టీకరించుచున్నాడు.

హ్రస్వస్యార్ధం చ యద్దృష్టం తత్ర స్యాసన్నిధా వపి
హ్రస్వస్య లక్షణార్థత్వాత్ తద్వదే వాభిధీయతే . 308

హ్రస్వస్య = హ్రస్వముయొక్క, యత్ = ఏ, అర్ధమ్ = అర్ధమాత్రాప్రమాణమగు అర్ధభాగము, దృష్టమ్ = చూడబడినదో, తత్ = ఆ అర్ధమాత్రాప్రమాణము, తస్య = ఆ హ్రస్వముయొక్క, అసన్నిధావపి = దీర్ఘ స్వరితాదులయందు సన్నిధి లేకపోయినను, హ్రస్వస్య = హ్రస్వశబ్దము, లక్షణార్థత్వాత్ = మాత్రయను నర్థమున లాక్షణిక మగుట వలన, తద్వదేవ = ఆ హ్రస్వముయొక్క అర్ధమాత్రవలె (దీర్ఘప్లుతముల విషయమునందు కూడ) అభిధీయతే = చెప్పబడుచున్నది.

తా. హ్రస్వస్వరితమునందు, అర్ధహ్రస్వ మనగా హ్రస్వముయొక్క సగ భాగము అని అర్థము చెప్పుటకు అవకాశమున్నను దీర్ఘప్లుతములలో హ్రస్వము లేదు గాన 'హ్రస్వ' శబ్దమునకు 'మాత్ర' యనియే అర్థము లక్షణచే చెప్పవలెను. ఆ యర్థము దీర్ఘ ప్లుతముల విషయమునగూడ సంగత మగును.

వి. "క్వ వోఽశ్వాః" ఇత్యాదులలో 'క్వ' లోని హ్రస్వ అకారము స్వరితము. పైన చూపిన సూత్రమునుబట్టి ఈ హ్రస్వస్వరితమునందలి మొదటి సగము హ్రస్వము—

అనగా హ్రస్వమునకు ఒకమాత్రగాన సగముమాత్ర—ఉదాత్తము. కాని "రథానాం నయేరాః" అనునపుడు "యే" యందలి దీర్ఘస్వరిత ఏ కారమున హ్రస్వము లేకున్నను, సూత్రము నందలి 'హ్రస్వ' శబ్దమునకు మాత్ర యను లాక్షణికార్థముచెప్పి 'అర్ధహ్రస్వమ్' అను దానికి 'అర్ధమాత్ర' యను నర్థము చెప్పుటచే హ్రస్వస్వరితవిషయమునం దెట్లో ఆ విధముగనే దీర్ఘ స్వరిత ప్లుతస్వరితముల విషయమున గూడ 'మొదటి అర్ధమాత్ర' అను నర్థము చెప్పబడు చున్నది.

లేదా, ఇచట మూడు ప్రకారములను చెప్పవచ్చును అను నభిప్రాయముతో చెప్పు చున్నాడు.

దీర్ఘప్లుతాభ్యాం తస్య స్యా న్మాత్రయా వా విశేషణమ్
జాతే ర్వా లక్షణా యస్మాత్ సర్వథా స ప్తవర్ణవత్ . 309

తస్య = ఆ అర్ధశబ్దమునకు, దీర్ఘప్లుతాభ్యాం = దీర్ఘప్లుతములచేగూడ, విశేషణమ్ = అవచ్ఛేదనము, స్యాత్ = అగును.

తా. 'అర్ధ' శబ్దము 'దీర్ఘ' 'ప్లుత' ములచే అవచ్ఛేద్యము కావచ్చును.

వి. "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" (1.2.27) అను సూత్రమున హ్రస్వదీర్ఘ ములు కూడ నిర్దిష్టములై యున్నవిగాన ఛత్రి న్యాయముచే దీర్ఘప్లుతములు కూడ ఉపలక్షితము లగును. (ఒకరిద్దరు గొడుగులు చేతబట్టుకొనియు, ఇతరులు గొడుగులు లేకుండగను, పది మంది కలిసిపోవునపుడు వారందరిని కలిపి "ఛత్రిణో గచ్ఛన్తి"-గొడుగులవారు వెళ్ళు చున్నారు - అనిఅందుము. దీనికి ఛత్రిన్యాయమని పేరు). ఇట్లు దీర్ఘప్లుతములు గూడ అర్ధశబ్దముతో విశేషణముగ అన్వయించుటచే హ్రస్వముయొక్క అర్ధము, దీర్ఘముయొక్క అర్ధము, ప్లుతముయొక్క అర్ధము అను నర్థములు వచ్చును. 'హ్రస్వ' శబ్దముతో సంబం ధించిన 'అర్ధ' శబ్దమునకు సగభాగమని యర్థము. 'దీర్ఘ' 'ప్లుత' శబ్దములతో సంబంధించి నపుడు ఒక అంశము అని యర్థము. అర్ధశబ్దమునకు సమమైన భాగమనియే కాక విషమ మైన భాగమనికూడ అర్థమున్నది. ఈ విధముగ హ్రస్వ-దీర్ఘ-ప్లుత స్వరితముల మొదటి అర్ధమాత్ర ఉదాత్తమని యర్థము సిద్ధించును. ఇది మొదటి ప్రకారము

విశేషణమనగా ఇతరవస్తువులలో లేనిదియు, ఒకవస్తువునం దుండునదియు అగు విశేషమును తెలిపి తద్ద్వారా ఈ వస్తువు ఇతరవస్తువులకంటె భిన్నమైనది అను విషయమును (ఇతరవ్యావృత్తత్వమును లేదా అవచ్ఛిన్నత్వమును) సూచించునది. అందుచే 'నీలోత్పలమ్' ఇత్యాదులలో 'నీల' శబ్దము 'ఉత్పల' శబ్దమునకు విశేషణమై, ఏ విధముగ—'ఈ ఉత్ప లము శ్వేతోత్పలాదులకంటె భిన్నమైనది' అని బోధించుచున్నదో అట్లే 'రాజపురుషః' అను నపుడు 'రాజ' శబ్దము కూడ—'ఇతడు మరియొక పురుషుడుకాడు, రాజుయొక్క పురు షుడు' అను నర్థమును తెలుపుచు ఇతరవ్యావృత్తిని బోధించుచున్నది. కావున 'రాజన్' శబ్దము 'పురుష' శబ్దమునకు విశేషణమని చెప్పుట శాస్త్రపద్ధతి. ఈ పద్ధతి ననుసరించి 'అర్ధ హ్రస్వమ్' 'అర్ధదీర్ఘమ్' ఇత్యాదులలోని హ్రస్వాదిశబ్దములు 'అర్ధ' శబ్దమున విశేషణములైన వని చెప్పబడినది.

వా = లేక, మాత్రయా = మాత్రాశబ్దముచే, తస్య = ఆ 'హ్రస్వ' శబ్దమునకు, విశేషణమ్ = అవచ్ఛేదము (చేయబడును).

తా. లేదా 'మాత్రా' శబ్దము 'హ్రస్వ' శబ్దావచ్ఛేకముగ నుండునని చెప్ప వచ్చును.

వి. 'హ్రస్వ' పదమునకు లక్షణచే 'మాత్ర' యని యర్థము. ఈ మాత్రరూ పార్థము అర్ధశబ్దముతో విశేషణముగ అన్వయించుటచే 'మాత్రయొక్క అర్ధము' (అర్ధమాత్ర) అను నర్థము సిద్ధించును. ఈ విధముగ 'హ్రస్వ దీర్ఘ ప్లుత స్వరితముల మొదటి అర్ధమాత్ర' అను నర్థము సిద్ధించును. ఇది ద్వితీయప్రకారము.

వా = లేక, (అఖండమగు అర్ధహ్రస్వపదముచే), సప్తపర్ణవత్ = సప్తపర్ణశబ్దము చేతవలె, సర్వథా = సర్వవిధములచే, అనగా అవయవవిభాగము ఏదియులేకుండ, యస్మాత్ = ఏ కారణమువలన, జాతేః = అర్ధమాత్రాత్వరూపమగు జాతియొక్క, లక్షణా = సూచనము (ఉపలక్షణము) అంగీకరింపబడునో ఆ కారణమువలన దీర్ఘప్లుతాదులందు గూడ మొదటి అర్ధముమాత్రమే ఉదాత్తమగునని యర్థము.

తా. సప్తపర్ణశబ్దమువలె, అవయవవిభాగము లేక అర్ధమాత్రాత్వరూప జాత్యుప లక్షణము అంగీకరింపవచ్చును.

వి. అవయవవిభాగము లేని అఖండమగు 'అర్ధహ్రస్వ' శబ్దమే, సప్తపర్ణాదిశబ్ద ములు సప్తపర్ణవృక్షత్వమునకు ఉపలక్షకములైనట్లు, అర్ధమాత్రాత్వజాతికి ఉపలక్షకమని భావము. ఇది తృతీయప్రకారము.

ఇపుడు 'క్వచి త్ప్రధాన మే వార్థో భవ త్యన్యస్య లక్షణమ్' అని చెప్పిన 'ఉపాత్త పదార్థమును త్యజించకుండగనే అన్యార్థమును ఉపలక్షించుట అను చతుర్థ ప్రకారమును విచా రించుచున్నాడు.

గన్తవ్యం దృశ్యతాం సూర్య ఇతి కాలస్య లక్షణే
జ్ఞాయతాం కాల ఇత్యేత త్సోపాయ మభిధీయతే. 310

గన్తవ్యమ్ = ఇంకను చాలదూరము వెళ్ళవలసియున్నది, సూర్యః = సూర్యుడు, దృశ్యతామ్ = చూడబడుగాక, ఇతి = ఈ విధముగా (సూర్యదర్శనము ప్రధానార్థముగా గల 'సూర్యః దృశ్యతామ్' అను వాక్యముచేత) కాలస్య = కాలవిశేషముయొక్క, లక్షణే = లక్ష ణచే బోధించుటలో, కాలః = కాలము, జ్ఞాయతామ్ = తెలిసికొనబడుగాక, ఇత్యేతత్ = అనువిషయము, సోపాయమ్ = సూర్యదర్శన రూపకాల జ్ఞానోపాయ సహితముగా, అభిధీ యతే = చెప్పబడుచున్నది.

తా. 'ఇంకను వెళ్ళవలెను, సూర్యుని చూడుము' అని కాలమును లక్షణచే బోధించునపుడు—'కాలమును తెలుసుకొనుము' అనెడు విషయము ఉపాయముతో చెప్పబడు చున్నది.

వి. పథికులు ఒకరితోనొకరు—'ఇంకను చాలదూరము వెళ్ళవలసియున్నది; సూర్యునివైపు చూడుడు' అని చెప్పుకొనునపుడు—'కొంచెము పగటికాలమే మిగిలియున్నది- అను విషయమును తెలిసికొనండి' అను లాక్షణికార్థము సూర్యదర్శన రూప ముఖ్యార్థబోధ నమును ఉపాయముగ గొని తెలుపబడుచున్నది. ఈ విధముగ నిచట ముఖ్యార్థమును వీడ కుండగనే మరియొకయర్థము లక్షణచే బోధింపబడుచున్నది గాన ఇది—'ఉపాత్తపదార్థాపరి త్యాగేనైవాన్యార్థోపలక్షణమ్' అనుదానికి ఉదాహరణము.

'ప్రధానమగు అర్థమే అన్యార్థోపలక్షక మగును'అను విషయమునే శాస్త్రీయలౌకికో దాహరణములతో రెండు శ్లోకములలో వివరించుచున్నాడు.

విధ్యత్యధను షేత్యత్ర విశేషేణ నిదర్శ్యతే
సామాన్య మాశ్రయః శక్తే ర్యః కశ్చిత్ప్రతిపాదకః. 311

విధ్యత్యధనుషా + ఇత్యత్ర = 'విధ్యత్యధనుషా' అను సూత్రమున, విశేషేణ = కరణవిశేషవాచకమగు ధనుస్సుచేత, శక్తేః = కరణశక్తికి, సామాన్యమ్ ఆశ్రయః = ఆశ్రయ సామాన్యమైన, యః = ఏ, కశ్చిత్ = ఒకానొకపదార్థము కలదో, ప్రతిపాదకః = దానిని బోధించుశబ్దము, నిర్దిశ్యతే = నిర్దేశింపబడుచున్నది.

తా. 'విధ్యత్యధనుషా' అను సూత్రమున విశేషముచే కరణశక్తికి ఆశ్రయ సామాన్యమగు ఒకానొక పదార్థమును బోధించుశబ్దము నిర్దేశింపబడుచున్నది.

వి. 'విధ్యత్యధనుషా' (4.4.83) అను సూత్రము 'విధ్యతి' (కొట్టుచున్నాడు) అను నర్థమున, ఆ కొట్టుటయందు కరణము (సాధనము) ధనుస్సు కానిచో, ద్వితీయాంతము కంటె 'యత్' ప్రత్యయమును విధించుచున్నది. 'పాదౌ విధ్యన్తి పద్యాః శర్కరాః' (పాదములను వేధించు గులకరాళ్ళు) అనునది ఉదాహరణము. ఇచట 'అధనుషా' అని చెప్పుటచే ఒక్కధనుస్సునుమాత్రమే గ్రహించినచో 'చోరం విధ్యతి ఖడ్గేన' అనునపుడు కరణ వాచకము ధనుస్సు కాదు కావున ఇచట 'చోర' శబ్దముకంటె 'యత్' ప్రత్యయము వచ్చుటకు అవకాశమున్నది. అది అనిష్టము. ఇచట ధనుఃశబ్దము లక్షణచే కరణసామాన్యవాచకము. ఇపుడు కరణవాచక మేదియు ప్రయుక్తము కానపుడుమాత్రమే 'యత్' ప్రత్యయము వచ్చునని అర్థమగుటచే పై ఉదాహరణమున చోరశబ్దముకంటె 'యత్' ప్రత్యయము రాదు. ఇచట ధనుఃశబ్దముచే లక్షితమగు కరణసామాన్యమునందు ధనుస్సుకూడ అంతర్గతమే కాన (ధనుస్సును మరి యే ఇతర కరణములను చెప్పరాదు అని అర్థమగుటచే) ప్రధానార్థమును పూర్తిగ పరిత్యజించక అన్యార్థము ఉపలక్షితమైనది. కావున ఇది అజహల్లక్షణకు శాస్త్రీయోదాహరణము.

సామాన్యమును గ్రహించుటకై విశేషమును చెప్పుట యనుదానికి (అజహల్లక్షణకు) లౌకికోదాహరణమును చూపుచున్నాడు.

> కాకేభ్యో రక్ష్యతాం సర్పి రితి బాలోఽపి చోదితః
> ఉపఘాతపరే వాక్యే న శ్వాదిభ్యో న రక్షతి. 312

కాకేభ్యః = కాకులనుండి, సర్పిః = నెయ్యి, రక్ష్యతామ్ = రక్షింపబడుగాక, ఇతి = అను, ఉపఘాతపరే = సర్పిరుపఘాతపరమగు, వాక్యే = వాక్యము ప్రయుక్తమైనదగుచుండగా, చోదితః = ఈ వాక్యముచే సర్పిరక్షణమునకై ప్రేరితుడగు, బాలోఽపి = బాలుడైనను, శ్వాదిభ్యః = కుక్కలు మొదలగువాటినుండి, న రక్షతీతి న = రక్షింపడను మాట లేదు.

తా. 'కాకులనుండి నెయ్యిని రక్షింపుము' అని సర్పిరుపఘాతపరమగు వాక్యము ప్రయుక్తమగు నపుడు, ఆదిష్టుడగువాడు బాలుడైనను శునకాదులనుండి దానిని రక్షింపకుండడు.

వి. ఇచట 'కాకులనుండి రక్షింపుము' అని సర్పిరుపఘాతక విశేషములగు కాకములనుమాత్రమే చెప్పినను సర్పిరుపఘాతకములగు అన్నింటినుండియు రక్షింపుమని తాత్పర్యముగాన కాకశబ్దము లక్షణచే సర్పిరుపఘాతక సామాన్యమును తెలుపును. కావున విశేషాభిధాయకమగు ఈ వాక్యమును ప్రయోగించుటకు సామాన్యమే నిమిత్తమని భావము. ఇది అజహల్లక్షణకు లౌకికోదాహరణము.

'యచ్చానుపాత్తం శబ్దేన తత్ కస్మింశ్చిత్ ప్రతీయతే' (కా. 20౮) అని చెప్పిన విధమున కొన్నిచోట్ల ఉక్తమగు ముఖ్యార్థమునకు నాంతరీయకమగుటచే అనుక్తమగు మరియొక వాక్యార్థము కూడ ప్రతీతమగునని చెప్పుచున్నాడు.

ప్రక్షాళనం శరావాణాం స్థాలీనాం మార్జనం తథా
అనుక్తమపి రూపేణ భుజ్యఙ్గత్వాత్ ప్రతీయతే . 313

రూపేణ = స్వరూపముచేత, అనుక్తమపి = ఈ అతిథులకుభోజనము పెట్టుడు అను వాక్యముచే బోధింపబడకున్నను, శరావాణాం = భోజనపాత్రములయొక్క, ప్రక్షాలనమ్= జలప్రక్షాళనము, తథా = మరియు, స్థాలీనామ్ = వంటపాత్రలయొక్క, మార్జనమ్=మృత్తికాదులచే తోముటయు, భుజ్యఙ్గత్వాత్ = భోజనాంగమగుటవలన, ప్రతీయతే = తెలియబడుచున్నది.

తా. ప్రత్యక్షముగ చెప్పకున్నను, శరావప్రక్షాళనము, స్థాలీమార్జనము మొదలగునది భోజనాంగము గాన ప్రతీతమగును.

వి. 'అతిథులకు భోజనము పెట్టవలెను' అని చెప్పినపుడు భోజనపాత్రలను, పాకపాత్రలను కడిగిననే కాని అన్నము వండి భోజనముపెట్టుట కుదరదు. కనుక 'ఆ పాత్రలను కడుగవలెను' అను అర్థముకూడ పై వాక్యముచే అప్రత్యక్షరూపమున బోధింపబడుచున్నది. కావున—కొన్ని యెడల ముఖ్యార్థము సాక్షాదనుక్తమగు అర్థాంతరమును గూడ బోధించును—అనుదానికి ఇది ఉదాహరణము.

శబ్దార్థములలో, 'ఇది ముఖ్యము, ఇది గౌణము (అప్రధానము)' మొదలగు నిర్ణయమును చేయుటకుపయోగించు కొన్ని ఉపాయములను చూపుచున్నాడు.

వాక్యాత్ప్రకరణా దర్థా దౌచిత్యా ద్దేశకాలతః
శబ్దార్థాః ప్రవిభజ్యంతే న రూపాదేవ కేవలాత్ . 314

వాక్యాత్ = వాక్యముయొక్క సమన్వయమువలన, (వాక్యము మొత్తముపై వచ్చు భావము వలన) ప్రకరణాత్=సందర్భమువలన, అర్థాత్=చెప్పదలచిన ప్రయోజనమువలన, ఔచిత్యాత్ = ఔచిత్యము (తగి ఉండుట) వలన, దేశకాలతః = ప్రదేశమువలన, సమయమువలనను, శబ్దార్థాః=శబ్దముల అర్థములు, ప్రవిభజ్యంతే=నిశ్చయింపబడును, కేవలాత్ = కేవలము (ఎట్టి సహాయము లేకుండ), రూపాత్ + ఏవ=శబ్దముయొక్క ఆకారమునుబట్టియే, న = కాదు (నిశ్చయింపబడవు).

తా. "శబ్దమునకు ఇది అర్థమా ? అది అర్థమా ?" అని సంశయము కలుగునపుడు సంశయమును పోగొట్టి, అర్థమును నిర్ణయించుటకు కొన్ని ఉపాయములు కలవు. అవియే వాక్యము, ప్రకరణము, అర్థము, ఔచిత్యము మొదలగునవి. వీని సాయముతో అర్థమును నిశ్చయించుకొన వీలు కలుగును. కేవలము శబ్దము యొక్క స్వరూపము మాత్రమే, అన్నిచోట్లను అభిమతమైన అర్థమును స్పష్టపరుపజాలదు.

వి. ఇంతకు ముందున్న కారికలలో శబ్దముల విషయమునను అర్థముల విషయమునను గౌణముఖ్యాది విభాగము (ఏది ప్రధానము ? ఏది అప్రధానము ? మొదలగు చర్చ) చర్చింపబడినది. ఆ ప్రసంగమును బట్టి శబ్దము యొక్క అర్థమును గురించి కలుగు సందేహమును పోగొట్టు ఉపాయములు ఇచట చూపబడినవి. అనేకార్థత్వము (ఒకే శబ్దము రెండు మూడర్థములను బోధించుట), సారూప్యము (వేరు వేరు అర్థములను బోధించినను శబ్దరూపమొకే విధముగ ఉండుట) మొదలగు హేతువులవలన, కొన్నిచోట్ల "ఈ శబ్దము

నకు ప్రకృతము ఏది అర్థము" అనుసంశయమునకు అవకాశము ఉండును. అట్టితరి అర్థ నిర్ణయమునకు ఈ వాక్యాది సాధనములు మిక్కిలి ఉపకరించును. వీనిలో ఏదో ఒక ఉపాయము మూలమున "ఈ శబ్దమునకు ఇచట ఇదియే అర్థము" అని నిశ్చయించుకొన వచ్చును.

కొన్ని ఉదాహరణములతో పై అంశములను విశదీకరింపనగును.

*1.* వాక్యమువలన అర్థనిర్ణయము : 'కటం కరోతి భీష్మ ముదారం దర్శ నీయమ్' అనునది వాక్యము. (భీష్మమ్=దృఢమైన, ఉదారమ్ = విశాలమైన, దర్శనీయమ్= అందమైన, కటమ్=చాపను, కరోతి=చేయుచున్నాడు—అల్లుచున్నాడు) ఇచట 'కట' శబ్దము 'చాప' అను ద్రవ్యమును బోధించుటచే అది విశేష్యముగాన దానికి 'కరోతి' అను క్రియతో ముందుగా సంబంధము తప్పదని తెలియును. పిదప ద్రవ్యగుణములు (ఒకవస్తువు- దానికి సంబంధించిన గుణములును) పరస్పరాపేక్ష కలవగుటచే (ఒకదానిని విడిచి మరొకటి ఉండుట కుదురదు. నలుపు, తెలుపు మొదలగు గుణములు ఎల్లప్పుడును ఒక ద్రవ్యము నాశ్రయించుకొనియే ఉండును) విశేషణ విశేష్యభావము, శబ్దములను వాడినతీరు, వానికుండు పరస్పర సంబంధము, అన్వయ సారస్యమును వెంటనే స్ఫురించి, "భీష్మ" శబ్దమునకు ఈ వాక్యమున 'దృఢమైన' అనియే అర్థముగాని భారత కథయందలి 'భీష్ముడని' అర్థము కాదని స్పష్టమగును. అనగా వాక్యమందలి పదముల విన్యాసరీతి, పరస్పర సంబంధము ముందుకు వచ్చి, వాక్యముయొక్క మొత్తము భావమును సూచించి ఏ ఒక శబ్దముయొక్క అర్థమునైనను నిస్సంశయముగ బోధింపజాలునని అభిసంధి.

*2.* ప్రకరణమువలన : ప్రకరణ మనగా సందర్భము. దీనినే ప్రసంగము, ప్రస్తావము అనియు అందురు. "సైంధవ మానయ" అను వచనము. (సైంధవమును తెమ్ము). ఇచట సైంధవ శబ్దమునకు అశ్వము, ఉప్పు అను రెండర్థములున్నవి. (సింధౌభవమ్= సింధుదేశమున పుట్టునది—లేక—సముద్రమున పుట్టునది) కాన సంశయమునకు అవకాశ మున్నది. అయినను ఈ వచనమును ప్రయాణము సందర్భములో వాడినచో సైంధవశబ్ద మునకు గుర్రమనియు, భోజన ప్రసంగములో వాడినచో ఉప్పు అనియు అర్థనిర్ణయము కలు గును. అది సహజము, సముచితమును.

*3.* అర్థము వలన : అర్థమనగా ప్రయోజనము. ఇదియు అర్థమును నిర్ణ యించును. 'స్థాణుం భజ భవచ్ఛిదే' (భవచ్ఛిదే=సంసారము నశించుటకు, స్థాణుమ్= స్థాణువును, భజ = సేవింపుము) అన్న వాక్యములో స్థాణుశబ్దమునకు పరమశివుడనియే అర్థ మును చెప్పవలెను. అతడే సంసారమును నశింపజేసి, మోక్షమును ఈయగలవాడు. అంతే గాని స్థాణు వనగా 'కర్రమొద్దు'అని అర్థము కానేరదు. నిఘంటువులో మాత్రము స్థాణుశబ్దము నకు రెండర్థములును కనిపించును. కాగా ప్రకృతప్రయోజనమును బట్టి శబ్దార్థమును నిర్ణ యించుకొనవలెను.

*4.* ఔచిత్యమువలన : 'ఉచితస్యభావః = ఔచిత్యమ్ =తగిఉండుట లేక పొసగుట. 'పాతు వో దయితాముఖమ్' (దయితాముఖమ్ = ప్రియురాలి అభిముఖ్యము, వః = మిమ్ము, పాతు=రక్షించుగాక!) ఇచట ముఖశబ్దమునకు కేవలము 'మోము' అని

అర్థము కాదు. 'ప్రియురాలి ఆభిముఖ్యము లేక అనుకూల్యము' అని అర్థము. 'కాముకులను రక్షింపగలది ప్రియురాలి అనుకూల్యమే' అను ఔచిత్యము ననుసరించి ఈ నిర్ణయము పర్యవసించును.

*5.* దేశమువలన : 'వైకుంఠే హరిః వసతి' (వైకుంఠే=వైకుంఠమందు, హరిః = హరి, వసతి = నివసించును) హరిశబ్దమునకు విష్ణువు, ఇంద్రుడు, గుర్రము, కప్ప, మొదలగు ఎన్నో అర్థములను కోశములు చూపును. అయినను ఈ వాక్యమున వైకుంఠ మను పురాణప్రసిద్ధమైన ప్రదేశము హరిశబ్దమునకు విష్ణువని అర్థమును చెప్పుటలో ఉపకరించును.

*6.* కాలమువలన : 'దివా చిత్రభానుః విభాతి' (దివా = పగటియందు, చిత్రభానుః=సూర్యుడు, విభాతి = ప్రకాశించును) ఈ వచనమున 'దివా' అని సమయమును చెప్పుట, చిత్రభానుశబ్దమునకు 'సూర్యు' డను అర్థమును నిర్ణయించుటలో సాయపడును. ఈ వాక్యమునే 'రాత్రౌ' అను పదముతో విన్యసించినచో, చిత్రభాను శబ్దమునకు 'అగ్ని' అని అర్థమును చెప్పవలెను. (చిత్రాః భానవః యస్యసః=చిత్రమైనకాంతులుకలవాడు—లేక—కిరణములు గలవాడు) ఈ శబ్దమునకు సూర్యుడు, అగ్ని అను రెండర్థములును ఉన్నవి.

ఇట్లు సౌకర్యముకొరకై లోకవ్యవహారమందలి ఉదాహరణములు మాత్రమే చూపబడినవి. వ్యాకరణము, తర్కము, మీమాంస, మొదలగు శాస్త్రములతో గూడ వీనికుదాహరణములను చూపవచ్చును. కాని అవి మిక్కిలి గహనములుగా (సులభముగా తెలియశక్యము కానివిగా) ఉండును. అందుచే వానిని విడచుట జరిగినది.

'అట్టి శబ్దార్థ నిర్ణయోపాయములను కొందరు పండితులు ఇదివరకే చెప్పియున్నారు' అను అంశమును విశదీకరించుచున్నాడు.

> సంసర్గో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
> అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాఽన్యస్య సన్నిధిః . 315
>
> సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
> శబ్దార్థ స్యానవచ్ఛేదే విశేషస్మృతి హేతవః . 316

సంసర్గః=కలయిక, కూడిక, లేక-ఏదో ఒక సంబంధము, విప్రయోగః = విడివడుట, వేరుగా ఉండుట, సాహచర్యమ్=ప్రసిద్ధమైన మైత్రి, విరోధితా=ప్రసిద్ధమయిన శత్రుత్వము, అర్థః=ప్రయోజనము (అనుకొన్న ఫలము), ప్రకరణమ్ = సందర్భము, లింగమ్ = చిహ్నము (ఒక వస్తువునకుండు ప్రత్యేకమైన ధర్మము—లేక—ముఖ్యమైన గుణము), అన్యస్య=మరియొక, శబ్దస్య = శబ్దముయొక్క (పదము యొక్క), సన్నిధిః = సామీప్యము (దగ్గరగా ఉండుట)—

సామర్థ్యమ్ = శక్తి, అనుకొన్న అర్థమును ఈయగల శక్తి (సమర్థస్యభావః = సామర్థ్యమ్ = తగినబలము), ఔచితీ = తగిఉండుట (ఔచిత్యము), దేశః=ప్రదేశము (చోటు), కాలః = సమయము, వ్యక్తిః = స్త్రీ లింగము, పుంలింగము, నపుంసకము అను లింగము, స్వరాదయః = ఉదాత్తము మొదలగు స్వరము (లేక-ప్రశ్నను, వెక్కిరింతను,

హాస్యము మొదలగు భావములను స్ఫురింపజేయుచు, శబ్దమును పలుకుటలో వినబడు "కాకువు" మొదలగు స్వరము)—ఈ మొదలగునవి, శబ్దార్థస్య = శబ్దమునకు సంబంధించిన అర్థము యొక్క, అనవచ్ఛేదే = సంశయమందు (అవచ్ఛేదః = నిశ్చయము, న + అవచ్ఛేదః = సంశయము), విశేషస్మృతిహేతవః = నిశ్చితమైన అర్థమును తెలియజేయుటలో కారణములు (అగును).

తా. లోకవ్యవహారమందు, పురాణాదులందును మిక్కిలి ప్రసిద్ధములైన సంబంధము, మైత్రి, విరోధము, మొదలగు అంశముల సాయముతో గూడ శబ్దము యొక్క అర్థమును నిశ్చయించుటకు వీలగును. కొండొకచో ప్రక్కనుండు శబ్దము, శబ్దముయొక్క శక్తి, శబ్దము యొక్క లింగము మొదలయినవి కూడ అర్థనిర్ణయమున ఉపకరించును.

వి. ఉదాహరణముల మూలముగా సంయోగాదులను సుఖముగ తెలిసికొనవచ్చును.

*1. సంయోగము :* "సశంఖచక్రో హరిః" (శంఖచక్రములుగల హరి)హరి శబ్దమునకు ఇంద్రుడు, కోతి, గుర్రము, మొదలగు చాలా అర్థములున్నవి. అయినను శంఖ చక్రములతో సంబంధముగల వ్యక్తి విష్ణువొక్కడే. కాన ఆసంబంధమువలన (సంయోగమను సంబంధము) ఇచట హరిశబ్దమునకు విష్ణువనియే అర్థము ఫలించును. (మిగిలిన అర్థములు పొసగవు).

*2. విప్రయోగము :* "సః రాజా అశంఖచక్రో హరిః" (ఆరాజు శంఖచక్రములు లేని హరి) అనుచుటచే శంఖచక్రముల వియోగము కూడ హరి శబ్దమునకు "విష్ణువు" అను అర్థమును నిశ్చయించును. శంఖచక్రములతో కలిసి ఉండుటగాని, వానిని విడిచి ఉండుటగాని విష్ణువునకే చెల్లుననుట పురాణములలో ప్రసిద్ధమైన విషయము.

*3. సాహచర్యము :* "తౌ రామలక్ష్మణౌ ఇవ దృశ్యేతే"(వారిరువురు రామ లక్ష్మణులవలె అగపడుచున్నారు) రామ శబ్దమునకు శ్రీరాముడు, బలరాముడు, పరశురాముడు అను అర్థములు ప్రసిద్ధములు. అయినను లక్ష్మణునితో సాహచర్యము (కలసి మెలసి ఉండుట) శ్రీరామునకే మిక్కిలి రూఢమై ఉన్నది. అందువలన ఇచట రామశబ్దమునకు శ్రీరామః దనియే అర్థము.

*4. విరోధిత :* "రామార్జునగతిః తయోః"(వారిద్దరి నడవడి రామార్జునులను పోలిఉన్నది) ఇచట రామశబ్దమునకు పరశురాముడనియు, అర్జున శబ్దమునకు కార్తవీర్యార్జును డనియు అర్థములు. వారికుండు ప్రసిద్ధ వైరమునుబట్టి ఈ నిర్ణయము సిద్ధించును.

*5. అర్థము, 6. ప్రకరణము :* ఈ రెండింటి స్వరూప స్వభావములును మీది కారికలో (814) వివరింపబడినవి.

*7. లింగము :* ఒక వ్యక్తికి గాని, ఒక వస్తువునకు గాని ఉండు ప్రత్యేకమైన ధర్మమును లేక గుణమును లింగమందురు. అనగా శబ్దముయొక్క నానార్థములలో ఏదో ఒక అర్థమందే కుదురునట్టి విశేషధర్మము. ఇది ఇతరములగు అర్థములకు పొసగకుండ ఉండవలెను. ఇదియు అర్థమును నిర్ణయించును. "కుపితః మకరధ్వజః" (మన్మథుడు కోపగించెను) ఇచట "కోపము" అను ధర్మము మన్మథునికే కుదురును కాన 'మకరధ్వజ' శబ్ద

మునకు మన్మథుడని అర్థమును నిర్ణయింపవలెను. ఆ శబ్దమునకు "సముద్రము" అను వేరొక అర్థమున్నది. అయినను 'కోపము' అను లక్షణము సముద్రునకు సంభవింపదు.

*8. శబ్దాంతర సాన్నిధ్యము :* 'కరేణ రాజతే నాగః' (ఏనుగుతొండముచే భాసిల్లుచున్నది) ఇచట కర శబ్దము నానార్థకము. (కరః=చేయి, తొండము, పన్ను అని అర్థములు) నాగశబ్దము కూడ అట్టిదే. (నాగః=ఏనుగు, పాము, నాగజాతికిచెందిన వ్యక్తి, అని అర్థములు) అయినను ఈ శబ్దములు ఒకదానిప్రక్కను వేరొకటిగ ప్రయోగింపబడి నందున, కరశబ్దమునుబట్టి నాగశబ్దముయొక్క అర్థము 'ఏనుగు' అని,నాగశబ్దము ననుసరించి కరశబ్దముయొక్క అర్థము 'తొండము' అనియు ఫలించును. అనగా పదముల సామీప్యమే ఇట్టి చోట్ల అర్థమును నిర్ణయించునని భావము.

*9. సామర్థ్యము :* అనుకొన్న అర్థమును చెప్పగలుగు శక్తిని సామర్థ్య మందురు. 'మధునా మత్తః కోకిలః' (మధుమాసముచే కోకిల కైపెక్కినది) ఇచట మధు శబ్దమునకు చైత్రమాసము తేనె, మద్యము, అను అర్థము లున్నవి. అయినను కోకిలకు సహజముగ కైపెక్కించగలది చైత్రమాసమొక్కటే కాన మధుశబ్దమునకు చైత్రమాస మనియే అర్థమును చెప్పవలెను. (మిగిలిన అర్థములకు అట్టి శక్తి లేదు).

*10. ఔచిత్యము, 11. దేశము, 12. కాలము :* వీని లక్షణములు, ఉదాహరణములును మీదికారికలో ఉన్నవి.

*13. వ్యక్తి :* శబ్దముయొక్క లింగమే (స్త్రీ లింగము, పుంలింగము, నపుం సక లింగము) వ్యక్తి అనబడును. 'మిత్రం భాతి' (స్నేహితుడు ప్రకాశించుచున్నాడు) ఇచట మిత్రశబ్దమునకు 'స్నేహితుడు' అని అర్థము. సూర్యుడని కాదు. 'మిత్రః భాతి' (సూర్యుడు ప్రకాశించుచున్నాడు) ఇచట మిత్రశబ్దము సూర్యునిమాత్రమే బోధించును. మిత్రశబ్దము యొక్క లింగము నపుంసకమైనచో 'స్నేహితుడు' అనియు, పుంలింగమైనచో 'సూర్యుడు' అనియు అర్థములను నిర్ణయింపవచ్చును. ఇట్లే 'నభస్' అను సకారాంతశబ్దము నపుంసక మైనచో 'ఆకాశము' అని అర్థము. పుంలింగమైనచో 'శ్రావణమాసము' అని అర్థము.

*14. స్వరము :* ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అను స్వరములతో అర్థనిర్ణయమును వేదమందు చేయుదురు. 'ఇంద్రశత్రుః వర్ధస్వ'—ఇచట 'ఇంద్రశత్రుః' అను సమాసములో చివరను ఉదాత్తస్వరమును పలికినచో 'ఇంద్రుని చంపునది' (షష్ఠీతత్పు రుష సమాసము) అను అర్థమువచ్చును. అట్లుకాక మొదటివర్ణమును ఉదాత్తముగ పలికినచో 'ఇంద్రుడే (తనను) చంపునట్టి' '(బహువ్రీహిసమాసము-ఇంద్రః, శత్రుః = శాతయితా యస్యసః = ఇంద్రశత్రుః—ఇంద్రునిచే చంపబడువాడు)' అను అర్థమువచ్చును. ఇచట శత్రు శబ్దము, 'ద్వేషి' అను సామాన్యార్థమునుగాక, 'చంపువాడు' అను విశేషార్థమును బోధించు నదిగ ప్రయోగింపబడినది. ('శత్' అను ధాతువునకు 'చంపుట' అనునది సహజమైనఅర్థము). పై వాక్యమును వృత్రాసురుడు , ఒక అస్త్రమును ఇంద్రునిపై విడుచుచు పలికెననియు, అది ఎదురుతిరిగి తననాశమునకే దారితీసెననియును గాథ కలదు.

వివిధములగు స్వరములతో (నొక్కిపలుకుట, తేల్చిపలుకుట, సాగదీసి పలుకుట, ప్రశ్నార్థకముగా కాని, అపహాసార్థకముగా కాని పలుకుట మొదలగు ధ్వనిభేదములు) శబ్ద

ముల అర్థములు మారుచుండుట అనుభవసిద్ధమే. ప్రశ్నార్థకమైన స్వరమును సంస్కృతమున సామాన్యముగా 'కాకుస్వరము' అందురు. 'ఆగచ్ఛతి' అనుపదమును ఏ స్వరములేకుండ పలికినచో 'వచ్చుచున్నాడు' అని అర్థము. కాకుస్వరముతో పలికినచో 'వచ్చుచున్నాడా?' అను అర్థమువచ్చును.

*15. స్వరాదయః :* అనుచోట 'ఆది' (మొదలగునవి) అను పదమువలన అభినయము, చేష్ట, మొదలగు ఇతరసాధనములను గ్రహింపవలెను. అవియు కొన్నిచోట్ల శబ్దార్థమును నిర్ణయించును.

శబ్దముయొక్క అర్థమును నిర్ణయించుటకు చాలా ఉపాయములున్నవని చెప్పుటలో పూర్వుల సమ్మతికూడ ఉన్నదని విశదీకరించుటకై ఈ రెండు కారికలును బయలు దేరినవి. కొన్నిచోట్ల ఈ పరికరములలో ఒకదానినిగాని, రెండుమూడింటిని గాని సహాయముగా తీసుకొని అర్థమును నిశ్చయించుకొనవచ్చును. ఆవశ్యకతనుబట్టి ఆయా సందర్భములలో ఆయా ఉపాయములను అవలంబించవలెను.

శబ్దముయొక్క ముఖ్యమగు అర్థమును ("అభిధ" అను వ్యాపారమువలన సాంకేతికముగా వచ్చునది) నిర్ణయించుటకే పై ఉపాయములు తోడ్పడును. లక్ష్యార్థము ("లక్షణ" అను వ్యాపారమువలన సిద్ధించు అర్థము), వ్యంగ్యార్థము (వ్యంజన అను వ్యాపారమువలన లభించునది) అను వానివిషయములో వీని ఉపయోగము లేదు.

అర్థము, లింగము, సామర్థ్యము, అను వానివిషయములో వేరొకవిధమైన వ్యాఖ్యానము కూడ ఉన్నది. సందర్భమున నుసరించి దానిని స్వీకరింపవచ్చును.

*1. అర్థము :* అనగా ఒక శబ్దముయొక్క నిశ్చితమైన అర్థము. దానిని బట్టి దానితో అన్వయముగల మరియొక శబ్దముయొక్క అర్థమును నిశ్చయించుట కూడ ఒక పద్ధతియే. ఉదా :- "అంజలినా జుహోతి"- ఇచట "జుహోతి" అను పదమునకు "హోమము చేయవలెను'' అని అర్థము. దీనినిబట్టి "అంజలినా" అనుపదమునకు "దోసిలితో" అను అర్థమును నిశ్చయింతురు. 'అంజలినా సూర్య ముపతిష్ఠతే' అను వాక్యములో 'ఉపతిష్ఠతే' అను శబ్దమునకు 'ప్రార్థింపవలెను' అని అర్థము. దీనిని అనుసరించి 'అంజలినా' అను పదమునకు "నమస్కారముతో=రెండుచేతులను జోడించుటతో'' అను అర్థమును నిశ్చయింపవలెను.

*2. లింగము :* ఒక వాక్యములోని పదముయొక్క అర్థమును నిర్ణయించుటకు, వేరొకవాక్యములోని ఒక పదము (దాని అర్థము) సూచకముగ ఉపయోగించుట లింగమగును. ఉదా :- 'పశు మాలభేత' (యాగములో పశువును చంపవలెను) ఇది శ్రౌతకర్మకు సంబంధించిన వచనము. ఇచట 'పశు' శబ్దమువలన 'ప్రాణి ఏదయినాసరే' అను సామాన్యార్థము స్ఫురించును. కాని అది సరికాదు. 'ఛాగస్య హవిషః వపాయాః మేదసః' అను వేరొక వాక్యములోని 'ఛాగస్య' అను పదము సూచకముగ ఉపయోగించి, పశువనగా 'ఛాగమే' (మేక) అని నిశ్చయింపనగును. 'మేకయొక్క వపను (గుండెలోని సన్నని చర్మపు పొరను) హవిస్సుగా చేయవలెను' అని పైవాక్యముయొక్క భావము. సూచకము జ్ఞాపకము, లింగము, అను పదములు సమానార్థకములు.

౬. సామర్థ్యము : 'ఒక శబ్దమునకు ఒక విధమైన అర్థమును చెప్పక తప్పదు' అను స్థితి ఏర్పడుటయే సామర్థ్యము. ఉదా :- 'అనుదరా కన్యా' (నాస్తి-ఉదరం-యస్యాః-సా = అనుదరా) ఇచట 'అనుదరా' అనుపదమునకు 'సన్నని నడుముగలది' అను అర్థమును చెప్పక తప్పదు. 'నడుములేనిది' అనుట బొత్తిగా కుదరదు గదా !

మీదచూపిన ఉపాయములలో 'లింగము' 'సామర్థ్యము' అను రెండే ముఖ్యములని, మిగిలినవన్నియు వానిలో అంతర్భూతములగుననియు కొందరందురు. 'సామర్థ్యము ఒక్కటే చాలును-మిగిలినవి దాని వివరణములు మాత్రమే' అని మరికొందరు. ఈ వాదోపవాదములను ఉద్గ్రంథములలో చూడనగును.

'అనేకార్థస్థలములలో—అర్థభేదమునుబట్టి శబ్ద భేదమును అంగీకరింపవలెను'— అను భేదపక్షమందు కూడ, మీద చూపిన ప్రకరణాద్యుపాయములు ఆవశ్యకములే అని చెప్పుచున్నాడు.

భేదపక్షేఽపి సారూప్యా ద్భిన్నార్థాః ప్రతిపత్తిషు
నియతా యాంత్యభివ్యక్తిం శబ్దాః ప్రకరణాదిభిః . 317

భేదపక్షే + అపి = నానార్థక శబ్దములు పరస్పరము భిన్నములను మతమందు కూడ, సారూప్యాత్ = ఆకారము సమానముగా ఉండుటవలన, (శబ్దముల ఆకారము ఒకటే అగుటవలన 'వేరువేరు శబ్దములు కావు' అను భావన కలుగునుగాన) ప్రతిపత్తిషు=అర్థమును గ్రహించునపుడు, భిన్నార్థాః = వేరువేరు అర్థములను కలిగిన, శబ్దాః = శబ్దములు, ప్రకరణాదిభిః = ప్రకరణ, దేశ, కాలాదులచే, నియతాః = నియమింపబడినవై, అభివ్యక్తిమ్=అర్థ నిర్ణయమును, యాంతి = పొందును.

తా. అనేకార్థక శబ్దములు పరస్పరము భిన్నములను పక్షమందుకూడ, అర్థమును నిశ్చయించుటకు ప్రకరణాదుల సాయము తప్పనిసరి అగును. ఏలయనగా- 'వేరువేరు' అని చెప్పినను శబ్దముల స్వరూపము ఒకటే అయినందున భ్రాంతికలిగి అర్థవిషయమున సందేహమేర్పడుచుండును. దానినివారించుటకు ప్రకరణాదులే శరణ్యములు.

వి. అనేకార్థక శబ్దముల విషయములో సంప్రదాయసిద్ధముగా రెండు మతములున్నవి. "అర్థము వేరయినపుడు దానిని బోధించు శబ్దముకూడ వేరే'' అనునది మొదటి మతము. "ఎన్ని అర్థములున్నను శబ్దరూపమొకటి'' అనునది రెండవమతము. మొదటి మతమును 'భేదపక్షము' అనియు, రెండవదానిని 'అభేదపక్షము' అనియు చెప్పుదురు. ఈ రెండిటిలో అభేదపక్షమందే అర్థ సంశయమునకు అవకాశము ఉండునని భావించి (శబ్దస్వరూపము ఒకటే కావున) 'ప్రకరణాదుల ఆవశ్యకత అచటనే' అని కొందరన వచ్చును. అది సరికాదు. భేదపక్షమున కూడ శబ్దముల ఆకారము (ఆనుపూర్వి = వర్ణక్రమము) ఒకటే అయినందున, అభేదభావన కలిగి తన్మూలముగా అర్థసంశయము కలుగక తప్పదు. దానిని పోగొట్టుటకు ప్రకరణాదులను ఆశ్రయింపక తీరదు.

'హరి' అను శబ్దమునకు మొత్తము పదిహేను అర్థములు నిఘంటువులో ఉన్నవని అనుకొందము. అపుడు భేదపక్షమున పదిహేను హరిశబ్దములున్నవని చెప్పవలెను; అభేద పక్షమున హరిశబ్దమొక్కటే అని, దాని అర్థములుమాత్రమే వేర్వేరుగ పదిహేను అనియు చెప్పవలెను. కాగా పదిహేను శబ్దములును విడివిడిగా ఉన్నందున భేదపక్షములో అర్థసంశ

యము కలుగదని, అభేదపక్షములోనే అట్టి సంశయము కలుగుననియు కొందరు భావింప వచ్చును. వారికిది సమాధానము: భేదపక్షములోగూడ 'హరి' శబ్దముయొక్క రూపమొక్క రీతిలోనే ఉండుటచే (పలుకుట, వినుట, వ్రాయుటయు ఒకే తీరులో జరుగును) 'శబ్దమొకటే' అను భ్రాంతి కలుగవచ్చును. దానివలన అర్థసంశయము ఏర్పడవచ్చును. తన్నివృత్తికై ప్రకరణాదులనే ఉపయోగింపవలెను. 'భేదాభేద పక్షములు రెండింటియందును అర్థమును నిర్ణయించు సాధనములు ప్రకరణాదులే' అని సారాంశము.

పై అభిప్రాయము సమంజసమని సహేతుకముగ నిరూపించుచున్నాడు.

నామాఖ్యాతసరూపా యే కార్యాంతరనిబంధనాః
శబ్దా వాచ్యాశ్చ తేష్వర్థో న రూపా దధిగమ్యతే . 318

కార్యాంతర నిబంధనాః=వేరువేరు ప్రత్యయములతో వేరువేరు పద్ధతులలో ఏర్పడిన, నామాఖ్యాతసరూపాః=సుబంతములను పోలిన తిఙంతములు, తిఙంతములను పోలిన సుబంతములును అయిన, యే=ఏ, శబ్దాః=శబ్దములు, వాచ్యాః+చ=వాని అర్థములును కలవో, తేషు=అట్టి శబ్దముల విషయమున, రూపాత్=కేవలము శబ్దస్వరూపమును బట్టి, అర్థః=అభిమతమైన అర్థము, న+అధిగమ్యతే=పొందబడదు.

తా. సంస్కృతభాషయందు కడు విచిత్రములైన శబ్దములు కొన్ని ఉన్నవి: అశ్వః, తేన, తస్య మొదలగునవి. ఇవి సుబంతములుగను (నామవాచకములు), తిఙంతములుగను కూడ (క్రియాపదములు) సాధుశబ్దములే. (అవి సిద్ధించిన తీరుమాత్రము వేరు) వానిని ప్రయోగించునపుడు 'అర్థమేదిః' అను సందేహము కలిగితీరును. అది పోవుటకు ప్రకరణాదులసాయమును తీసుకొనక తప్పదు.

వి. అశ్వః=ఇది 'శ్వి' అను ధాతువుయొక్క (శ్వి=గతిసమృద్ధ్యోః-భ్వాది గణము - పరస్మైపది) భూతకాలమునకు సంబంధించిన (లుఙ్ అను లకారము) మధ్యమ పురుషైకవచనరూపము. 'వెళ్ళితివి' అని అర్థము, 'అశ్వ' శబ్దముయొక్క ప్రథమావిభక్తితో ఏకవచనరూపము కూడ ఇట్లే ఉండును. 'అశ్వః=ఒక గుర్రము' అని అర్థము. తేన=ఇది 'తను' ధాతువుయొక్క (తను=విస్తారే, తనాదిగణము - పరస్మైపది) లిట్టుకు సంబంధించిన (భూతకాలము) మధ్యపురుష బహువచనరూపము. 'మీరు వ్యాపించిరి' అని అర్థము. 'తద్' అను సర్వనామముయొక్క (పుంనపుంసకములు) తృతీయైకవచనముకూడ 'తేన' అనియే అగును. దీనికి 'వానిచే' - 'దానిచే' అని అర్థము. ఇట్లే 'తస్య' అనునది 'తసు' ధాతువుయొక్క (తసు=యత్నే, దివాదిగణము—పరస్మైపది) లోట్టుకు చెందిన (విధ్యర్థకము) మధ్యమ పురుషైకవచనము. 'తస్య=ప్రయత్నింపుము' అని అర్థము. 'తద్' అను సర్వనామముయొక్క (పుంనపుంసకములు) షష్ఠ్యేకవచనము కూడ 'తస్య' అనియే అగును. 'తస్య=వానియొక్క—దానియొక్క' అనియర్థము. ఇవి నానార్థకశబ్దములు కావు. వేరువేరుఅర్థములు కలిగిన సరూపములగు శబ్దములుమాత్రమే. కాగా 'త్వమ్ అశ్వః' (నీవు గుర్రము—లేక—నీవు వెళ్ళితివి) 'యూయం తేన' (మీరువ్యాపించిరి—లేక - మీరు వానితో) 'త్వం తస్య' (నీవు ప్రయత్నింపుము - లేక - నీవు వానియొక్క) మొదలగు ప్రయోగములలో అర్థసంశయ మందరకును కలుగును. అపుడు అర్థమును నిశ్చయించుటకు

ప్రకరణాదులే గతిఅగును. కావున అన్నిపక్షములందును ప్రకరణాదులను అంగీకరించుట యుక్తము.

ఒకటినిమించి రెండుగాని మూడుగాని అర్థములను బోధించుశబ్దములు సామాన్యముగ ప్రతిభాషలోను కనబడును. ఇట్టిచోట్ల శబ్దవ్యుత్పత్తిమాత్రము (శబ్దము ఏర్పడినతీరు) ఒకటేఅయిఉండును. వీని విషయములోనే 'భేదపక్షము, అభేదపక్షము' అను వాదములు కుదురును. అట్లుగాక వేర్వేరు అర్థములను బోధించుచు, ఒకే ఆకారములో ఉండు శబ్దములు కూడ భాషలలో ఉండుట సహజమే. ఇట్టిచోట్ల శబ్దము సిద్ధించినతీరు వేరుగాఉండును (ఒకటి సుబంతము, వేరొకటి క్రియాపదము మొదలగుతీరు). ఇవి సమానమైన ఆకారముగలవి మాత్రమే. వీని విషయములో భేదాభేదవాదములు కుదరవు. ఇట్టిశబ్దములవిషయములో అర్థనిర్ణయమునకు ప్రకరణాదు లావశ్యకము కాక తప్పవు. కాగా అన్నిపక్షము లందును సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న ప్రకరణాది సామగ్రిని స్వీకరించుటయే సముచితము.

ప్రసంగవశమున ప్రారంభమైన ప్రకరణాదుల చర్చ ఈ కారికతో ముగిసినది.

శబ్దార్థములను నిర్ణయించు సందర్భమును పురస్కరించుకొని, "వాస్తవమున పద పదార్థములు సత్యములు కావనియు, అఖండవాక్య వాక్యార్థములే సత్యము లనియును అంగీకరింపక తప్ప"దని వివరించు ప్రఘట్టకమును ప్రారంభించుచున్నాడు.

యా ప్రవృత్తినివృత్త్యర్థా స్తుతినిందాప్రకల్పనా
కుశలః ప్రతిపత్తా తా మయథార్థాం ప్రతీయతే. 319

ప్రవృత్తినివృత్త్యర్థా=ప్రవృత్తినివృత్తులే ప్రయోజనముగాగల, స్తుతి నిందా ప్రకల్పనా = స్తోత్రమును నిందను చేయు వాక్యముల కల్పనము, యా = ఏదిగలదో, తామ్= దానిని, కుశలః=నేర్పరియగు, ప్రతిపత్తా = జ్ఞాత-లేక - తెలిసికొనువ్యక్తి, అయథార్థామ్ = అసత్యముగ, ప్రతీయతే=గ్రహించును.

తా. ఏదైన ఒకపనిని చేపట్టుటను ('ఈపని చేయుము' అనుట) ప్రోత్సహించుటకై ఆ పనిని వివిధ వచనములతో పొగడుట, వేరొకపనినుండి మరల్చుటకు ('ఈపని చేయవద్దు' అనుట) ఆపనిని మరొకరీతిలో దూషించుటయు జరుగును. ఇట్టిరీతి శాస్త్రములందును, లోకవ్యవహారములందును అనూచానముగ(సంప్రదాయసిద్ధముగా) కనబడుచున్నది. అయినను తెలివిగలవా డాయంశమును గ్రహించి, అట్టి స్థలములలో ప్రవృత్తి నివృత్తులే ముఖ్యముగ ఉద్దేశింపబడినవని, స్తుతి నిందలు వాస్తవములు కావనియు సమన్వయించుకొనును.

వి. ప్రవృత్తి=ఒక పనిని చేయ తలపెట్టుట. నివృత్తి=ఒకపనిని మానదలచుట. స్తుతి=పొగడ్త (పొగడు వాక్యము). నింద = తెగడుట (తెగడు వాక్యము). ఒక పనిచేయుట యందు ఉత్సాహమును కలిగించుటకై ఆ పనిని విశేషవచనములతో పొగడుదురు. అట్లే ఒక చెడ్డ పనినుండి మరల్చుటకు ఆ పనిని పెక్కు మాటలతో దూషింతురు. ఈతీరు సహజము. అందు 'చేయుట' లేక 'మానుట' అను అంశములే ముఖ్యములనియు, భూషణ దూషణములు ముఖ్యము కావనియు పరిశీలకులు శీఘ్రముగ తెలిసికొందురు.

ప్రశంసకు ఉదాహరణము: 'గంగలో స్నానముచేసినచో సకలపాపములు నశించును. మోక్షము కలుగును.' ఇచట 'గంగలో స్నానముచేయుము' అను ఆశయమే ఉద్దిష్టముగాని మోక్షాది ప్రత్యేకసిద్ధి కాదు.

నిందకు ఉదాహరణము : 'సూర్యోదయమైన తరువాత మేల్కొన్నవానికి ఆయుర్దాయము క్షీణించును. నరకము వచ్చును.' ఇచట 'సూర్యోదయము అయిన పిదప నిద్రించుట కూడదు' అని చెప్పుటయే ఉద్దేశ్యము.

ఇట్లు ఒక వాక్యమువలనగాని, వాక్యసముదాయమువలనగాని తెలియు ప్రధానమైన భావమునే 'వాక్యార్థము' లేక 'తాత్పర్యార్థము' అని అందురు. అన్ని ప్రయోగములలోను ఇదియే వాస్తవమని ఎరుగవలయును.

ఇంతవరకు పదపదార్థములను నిర్ణయించు తీరులు వివరింపబడినవి. ఈ సందర్భములో 'అఖండమగు వాక్యము దాని అర్థము మాత్రమే సత్య' మని (వర్ణములు, పదములు మొదలగు ఎట్టి విభాగములు లేని వాక్యము) 'పదములయొక్కయు, పదార్థములయొక్కయు విభాగము సత్యమును తెలియుటకు ఉపయోగించు కల్పన మాత్రమే' అనియు ప్రసిద్ధమై ఉన్న వైయాకరణుల తత్త్వమును మరొకసారి నొక్కి చెప్పుటకు ఈ ప్రకరణ మారంభమైనది. స్తుతినిందా వాక్యములలో ప్రవృత్తినివృత్తులే సత్యమైనట్లు అఖండవాక్యమే సత్యమని చెప్పుట ఈ కారికయొక్క సారాంశము. రాబోవు కారికల మూలమున ఈ యంశ మింకను విశదము కాగలదు.

పై కారికయొక్క విషయమునే వివరించుచున్నారు.

విధీయమానం యత్కర్మ దృష్టాదృష్ట ప్రయోజనమ్
స్తూయతే సా స్తుతి స్తస్య కర్తు రేవ ప్రయోజికా . 320

దృష్టాదృష్టప్రయోజనమ్ = కనబడునట్టియు కనబడనట్టియు ఫలముగలిగి, విధీయమానమ్ = విధింపబడుచున్న, యత్ = ఏ, కర్మ = పని, స్తూయతే = పొగడబడునో, సా = అ, తస్య = ఆకర్మయొక్క, స్తుతిః = పొగడ్త, కర్తుః + ఏవ = చేయువానికే, ప్రయోజికా = ప్రోత్సాహమును కలిగించునది (అగును).

తా. లోకములోని పనులకు ఫలము కనబడును. వేదము విధించిన కర్మల యొక్క ఫలితము కన్నులకు గోచరము కాదు. 'ఈపని చేసినచో ఈ లాభము కలుగును' అని ప్రయోజనము నుద్దేశించి ప్రశంసను చేయుట అలవాటు అయినను అచట ఆ ప్రశంస ప్రధానము కాదు. కర్త ఆపనియందు సంతోషముతో చొరబడుటకే అది ఉపయోగించును.

వి. 'యో రాజానం భజతే స సారం భుంక్తే' (రాజును సేవించినవాడు ఐశ్వర్యమును పొందును) ఇది లౌకికమైన ప్రశంసావాక్యము. ఇచట 'రాజును సేవింపవలెను' అని సూటిగా చెప్పక, 'రాజసేవ సంపద నిచ్చును' అని రాజసేవను పొగడుట జరిగినది. రాజసేవవలన కలుగుఫలము కనబడునుగాన అది దృష్టప్రయోజనమైన కర్మ. 'యః అగ్నిష్టోమేన యజతే సః స్వర్గం గచ్ఛతి' (అగ్నిష్టోమమను యాగమునుచేయువాడు స్వర్గమును పొందును) ఇది వైదికవాక్యము. ఇచటకూడ 'అగ్నిష్టోమయాగమును చేయవలెను' అని చెప్పక, దాని ఫలమును చెప్పి ఆ యాగమును ప్రశంసించుట జరిగినది. స్వర్గమన్న ఫలము కనశక్యముకానిది. అందుచే అగ్నిష్టోమమను కర్మ అదృష్టప్రయోజనము. ఈ రెండుస్థలములందును ప్రశంసకు వేరుగా ప్రయోజన మేదియు లేదు. ఆయా కర్మలను చేయుటకు తగిన ప్రబలమైన కోరికను కర్తలో రేకెత్తించుటయే అద్దాని ముఖ్యోద్దేశము.

ప్రశంసావాక్యము అసత్యము. దానివలన పర్యవసించుప్రవృత్తివాక్యమే సత్యము. అట్లే నిందాస్థలములలో నిందావచనము వాస్తవముకాదు. తుదకు ఫలించు నివృత్తివచనమే వాస్తవము. ఆయా వాక్యమువలన 'ఈ పనిచేయవలెను' లేక 'ఈ పని మానవలెను' అను రీతిలో ఏ విభాగము లేని ఒకవాక్యార్థము అవగతమగును (అవిభక్తమైన మొత్తము సారాంశము స్ఫురించును). అట్లే వ్యాకరణశాస్త్రము చూపు వర్ణములు, పదములు మొదలగు విభాగము లన్నియు కృతకములు, అఖండవాక్యమే యథార్థమైనది.

అట్టిచోటులందు, ''స్పష్టముగ ప్రవృత్తి నివృత్తులనే విధించుట మానివేసి, ప్రయోజనరహితములగు స్తుతినిందాదులను ప్రదర్శించుట ఎందులకు ?'' అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

వ్యాఘ్రాదివ్యపదేశేన యథా బాలో నివర్త్యతే
అసత్యోఽపి తథా కశ్చిత్ ప్రత్యవాయో విధీయతే . 821

వ్యాఘ్రాదివ్యపదేశేన = పెద్దపులి మొదలగు జంతువులపేర్లను చెప్పటచే, బాలః = బాలుడు, యథా = ఏవిధముగా, నివర్త్యతే = మరలింపబడునో, తథా = ఆ విధముగనే, అసత్యః + అపి = వాస్తవముకానిదైనను ('అపి,' అనుటవలన కొన్నిచోట్ల సత్యమైనదైనను) కశ్చిత్ = ఒకానొక, ప్రత్యవాయః = అనిష్టము (దుఃఖము), విధీయతే = విధింపబడును.

తా. ఏడ్చుచున్నబాలుని భయపెట్టి ఏడుపును మానిపించుటకు, 'నీవు ఏడ్చినచో పులి వచ్చి నిన్ను తినివేయును' అని బెదరించుట లోకములో కానవచ్చును. ఆ సమయమున అచటికి పులివచ్చుట, తినుటయు అసత్యమే. కేవలము 'ఏడువవద్దు' అని చెప్పుటయే సత్యము (అభిమతము). అట్లే వేదములందు, ధర్మశాస్త్రములందును కొన్ని పనులను చేసినచో పాపమని, నరకము కలుగుననియు భయపెట్టుట జరుగును. కాని అచటకూడ 'ఆ పనులను చేయవద్దు' అని నిషేధించుటయే ముఖ్యతాత్పర్యమని తెలియవలెను.

వి. 'విధిని (చేయుమనుట), నిషేధమును (చేయవద్దనుట) సూటిగా చెప్పక స్తుతినిందలను కల్పించి ఆ భావమును వంకరగా ఎందుకు చెప్పవలసివచ్చును?' అను ప్రశ్న పుట్టునని ఊహించి దానికి సమాధానముగా ఈ శ్లోకము బయలుదేరినది 'లోకవ్యవహారమువలె వేదవ్యవహారమందున్ను ఒక పనియందు ప్రవర్తింపచేయుటనుగాని నివర్తింపచేయుటనుగాని చక్కగా నిర్వహించుటకు స్తుతినిందలను కల్పించుట అలవాటయిన ఒకతీరు. అట్టిచోట్ల వాస్తవమైన అంశమునే నేర్పుతో గ్రహింపవలెను. (అట్లే పదములయొక్క, పదార్థముల యొక్కయు కల్పనము, అఖండవాక్యము - అఖండవాక్యార్థము అను సత్యమును గ్రహించుటకే ఉపయోగపడును)' అని సారము.

ప్రత్యవాయః = అనర్థము—దుఃఖము. వేదమునందు, ధర్మశాస్త్రములందును చేయకూడని పనులను చేసినచో 'రౌరవం నరకం వ్రజేత్' (రౌరవమను నరకము పొందును) 'సాన్వయో వినశ్యతి' (వంశముతోకూడి నశించును) మొదలగు వచనములతో వివిధములైన ప్రత్యవాయములు చూపబడును.

ప్రత్యేకించి నిషేధముయొక్క సంగతినే ఈ కారిక వివరించినది. విధినిగురించి కూడ ఇట్లే ఊహించుకొనవలయును (స్తుతి వాక్యము సత్యముకాదు - విధియే సత్యము-అని).

శాస్త్రము చూపిన ప్రత్యవాయమునకు ఏదో విధముగ ప్రతిక్రియ నాచరించి, కేవలము అహంకారముతో శ్రేయస్కాముడు నిషిద్ధమైన కర్మలను చేయరాదని నిరూపించుచున్నాడు.

న సంవిధానం కృత్వాఽపి ప్రత్యవాయే తథావిధే
శాస్త్రేణ ప్రతిషిద్ధేఽర్థే విద్వాన్ కశ్చిత్ ప్రవర్తతే. ౩౨౨

తథావిధే=ఆ తీరుగ చూపబడిన, ప్రత్యవాయే=అనర్థము (పాపము) విషయమున, సంవిధానమ్=ప్రతిక్రియను (విరుగుడు), కృత్వా+అపి=చేసినను, శాస్త్రేణ=శాస్త్రముచే (వేదము - ధర్మశాస్త్రము మొదలగునవి) ప్రతిషిద్ధే=నిషేధింపబడిన, అర్థే=పనియందు, విద్వాన్=పండితుడైనవాడు, కశ్చిత్=ఎవడైనను, న+ప్రవర్తతే=ప్రవర్తింపడు.

తా. ప్రత్యవాయము స్పష్టముగచెప్పబడినను, 'ఆః దానికేమిః ఏదో ప్రతిక్రియనుచేసి ఆ నష్టము పోగొట్టుకొనవచ్చును లెమ్ము' అని అహంకారముతో నిషేధింపబడిన పనిని చేయుట విజ్ఞుల లక్షణము కాదు. వద్దన్న పనినిచేయుట, అందువలన కలుగు నష్టమునకు విరుగుడును ఆలోచించుటయు మంచినడవడి కానేరదు.

వి. సత్యాంశమును గ్రహించుటకు ప్రత్యవాయము కల్పింపబడునని మీదికారిక సూచించినది. 'ప్రత్యవాయము సత్యము కానిండు - లేక - అసత్యము కానిండు. అంతమాత్రమున దానిని పూర్తిగా తిరస్కరించుటగాని, ప్రతిక్రియపై దృష్టిపెట్టి నిషిద్ధమైన కర్మను మొండిగా ఆచరించుటగాని పండితునకు సముచితముకాదు' అని ఈ శ్లోకము వివరించినది.

కేవలము దృష్టాంతమును చూపుటకుమాత్రమే 'ప్రత్యవాయము కల్పితము' అని చెప్పబడినది. దీనినే ప్రమాణముగా తీసుకొని అహంకారముతోను, పట్టుదలతోను ఇష్టము వచ్చిన తీరులో శాస్త్రములను వ్యాఖ్యానింపకూడదు. స్తుతినిందల మూలముగా శాస్త్రమందలి సత్యమును గుర్తించి, తదనుసారము విహితకర్మను ఆచరించుట, నిషిద్ధకర్మను మానుటయు పండితుల ముఖ్యకర్తవ్యము. ఇదియే సంప్రదాయ రహస్యము.

మీది కారిక యొక్క భావమునే ఉదాహరణ పూర్వకముగ విశదీకరించుచున్నాడు.

సర్పేషు సంవిధాయాఽపి సిద్ధైర్మంత్రౌషధాదిభిః
నాఽన్యథా ప్రతిపత్తవ్యం "న దతో గమయేదితి". ౩౨౩

సిద్ధైః = ప్రసిద్ధములైన (స్వాధీనములోఉన్న), మంత్రౌషధాదిభిః = మంత్రములు, ఔషధములు మొదలగువానితో, సర్పేషు = పాముల విషయమున, సంవిధాయ+అపి = ప్రతిక్రియనుచేసినను, 'న - దతః - గమయేత్' ఇతి = 'న దతో గమయేత్' యద్దతో గమయేత్ సర్పాః ఏనం ఘాతుకాః భవంతి' (పురోడాశమును దంతములతో నమలకూడదు. అట్లు నమలినచో అతడు పాముకాటుకు గురి అగును - అనిభావము) అను శాస్త్రమునకు, అన్యథా=విపరీతముగ (చెప్పినదానికి భిన్నముగ), న+ప్రతిపత్తవ్యమ్= (వ్యాఖ్యానము చేయకూడదు) ఆచరింపకూడదు.

తా. యజ్ఞములో దేవతలకై తయారుచేయు వరిపిండి ముద్దను పురోడాశమందురు. దానిని దేవతలకు నివేదించి యజమానుడు, ఋత్విజులును తిందురు. ఆ తిను

టనుగురించి ఒకనియమమును శాస్త్ర మీవిధముగా చెప్పినది :—'పురోడాశమును దంతములతో నమలకూడదు. నమిలినచో—నమిలినవానిని పాములు కరచును.' – అని ఇట్లు ప్రత్యవాయము స్పష్టముగ ఉన్నను – దానిని తిరస్కరించి, మంత్రములతోను, ఔషధములతోను పాములను దరిజేరకుండ చేసుకొని, పురోడాశమును దంతములతోనే నమలుట సముచితమైన పని కాదు.

వి. శాస్త్రమునకు ఈయదగిన గౌరవమును ఎల్లప్పుడును ఈయక తప్పదు. విధినిషేధములను శాస్త్రోక్తముగా అచరింపవలసినదే. వ్యక్తియొక్క స్వేచ్ఛకు, స్వాతంత్ర్యమునకును అచట చోటు లేదు. అట్లుకాకున్న శాస్త్రము నిరుపయోగమై విశృంఖలత్వమునకు రాజమార్గములు ఏర్పడును.

పురః = ముందుగా, దాశ్యతే = ఈయబడును (దేవతలకు) = పురోడాశః అని వ్యుత్పత్తి. ప్రత్యవాయము కల్పితమనుటవలన తుదకు శాస్త్రాతిక్రమణమే సంభవించునేమో అని సంభావించి, అది సరికాదని, శాస్త్రమును ఉల్లంఘింపకూడదనియు స్పష్టముగాచెప్పుటకై మీదికారిక, ఈ కారికయు వినియోగపడినవి. 'సత్యమును (తత్త్వమును) గ్రహించినవారు కూడ లోకసంగ్రహార్థము (సామాన్యజనులకు మార్గమును చూపుటకై) శాస్త్రమును అనుసరించుచునే ఉండవలయును' అన్నది ఇచట ముఖ్యాంశము.

"స్తుతినిందలే వాస్తవముగ కనబడు స్థలములందు కూడ, తుదకు ప్రవృత్తినివృత్తులే తాత్పర్య విషయములని ఫలించును" అని సమర్థించుచున్నాడు.

క్వచిత్తత్త్వసమాఖ్యానం క్రియతే స్తుతినిందయోః
తత్రాఽపిచ ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చోపదిశ్యతే. 324

స్తుతినిందయోః = ప్రశంసయొక్క, దూషణముయొక్కయు, తత్త్వసమాఖ్యానమ్ = సత్యత్వమునుచెప్పుట (అవియే సత్యములనుట), క్వచిత్ = కొన్నిచోట్ల, క్రియతే = చేయబడును. తత్ర + అపి + చ = అచటకూడ, ప్రవృత్తిః + చ = ప్రవర్తించుటయు, నివృత్తిః + చ = నివర్తించుటయు, ఉపదిశ్యతే = చెప్పబడును

తా. కొన్నిచోట్ల విధినిగాని, నిషేధమునుగాని, కొంచెమైనను సూచింపక, ఒక విషయమును పొగడుటయో తెగడుటయో కనిపించును. అట్టి స్థలములలో స్తుతినిందలే ప్రముఖములని, సత్యములనియు తోపవచ్చును. కాని అచటకూడ పర్యవసానమున (చివరను) విధియో నిషేధమో ఏదో ఒకటి గమ్యముకాక తప్పదు. ఆ అంశమునే సత్యముగా గ్రహింపవలెను. విధినిషేధములను సూచింపకున్నట్టి స్తుతినిందలు నిష్ప్రయోజనములగునుగాదా!

వి. పురాణాదులందు భగవంతుని స్తోత్రములు కొల్లలుగా ఉండును. దురాచారులను దూషించుటయు అధికముగనే అగపడును. అట్టిచోట్ల స్తుతియు, నిందయు మాత్రమే ప్రధానములని, వానివలన తెలియదగు విధినిషేధములు లేవనియు పై పైని అనిపించును. (స్తుతి స్తుతికొరకే, నింద నిందకొరకే అనుకొనుట) కాని సూక్ష్మముగ పరిశీలించినచో 'దేవుని సేవింపవలెను' 'చెడ్డపనులను చేయరాదు' అనురీతిని విధినిషేధములే అచటకూడ ఫలించును. ఏలయనగా విధిని చెప్పనిస్తుతియు, నిషేధమును బోధింపని నిందయు వ్యర్థప్రసంగములగును.

లోకములోగాని శాస్త్రములోగాని స్తుతినిందావాక్యములు అప్రధానములు. వానివలన తెలియు విధినిషేధవాక్యములే ప్రధానములు. అట్లే వ్యాకరణమున వివరింపబడు పద

ములయొక్కయు, పదార్థములయొక్కయు ఉనికి అసత్యము-కాల్పనికము. అఖండవాక్యము, అఖండవాక్యార్థము మాత్రమే యథార్థములు. ఈ అంశములను గట్టిగాచెప్పటకే 'యా ప్రవృత్తినివృత్త్యర్థా స్తుతినిందాప్రకల్పనా' (319) అను కారిక మొదలుకొని ఈకారికవరకును చర్చసాగినది. 'అఖండవాక్యమే సత్య' మను వైయాకరణతత్త్వమును సమయమువచ్చినపు డెల్ల, గ్రంథకర్త తరచుగా ఏదోఒక పద్ధతిలో నిరూపించుచునే ఉండును. సందర్భాను సారముగా సిద్ధాంతమును నొక్కిచెప్పటలో పునరుక్తిదోషము సంభవింపదు.

ఇట్లు పదపదార్థములు అసత్యములనియు, అఖండవాక్య వాక్యార్థములే సత్యముల నియు నిశ్చయించి, పదార్థముల ఉనికికి వాక్యార్థమే మూలమని ప్రతిపాదించుచున్నాడు.

రూపం సర్వపదార్థానాం వాక్యార్థోపనిబంధనమ్
సాపేక్షా యే తు వాక్యార్థాః పదార్థై రేవ తే సమాః. 325

సర్వపదార్థానామ్ = అన్నివిధములయిన పదములయొక్కయు వాని అర్థముల యొక్కయు, రూపమ్ = స్వరూపము - లేక - ఉనికి, వాక్యార్థోపనిబంధనమ్ = క్రియప్రధా నముగాగల వాక్యార్థమే నిమిత్తముగాగలది (వాక్యార్థమున అన్వయముగలవై దానియొక్క అంతర్భాగములు అనిపించుకొనునుగాని వేరుగ వానికి ఉనికి ఉండదు) (భవతి = అగును.) సాపేక్షాః = ఒకదానినొకటి కోరుకొను, (పరస్పరము సంబంధముగల), యే = ఏ, వాక్యార్థాః + తు = చిన్నచిన్న వాక్యముల అర్థములుగలవో, తే = అవి, పదార్థైః + ఏవ = పదార్థములతోనే, సమాః = సమానములయినవి, (భవంతి = అగును).

తా. సంపూర్ణమైన ఒకవిషయమును వాక్యార్థముమాత్రమే అందజేయును. పర స్పరము అన్వయముకలిగి, విశేషణ విశేష్యభావమును పొంది, ప్రధానమైన క్రియతో అన్వ యించునట్టి అఖండసముదాయరూపమైన భావార్థమును వాక్యార్థమందురు. (దానిని బోధించు నది అఖండవాక్యము) వాక్యార్థముతో అన్వయము కలిగిఉండునవి పదార్థములు. (పదార్థమును అందించునది పదము) వాక్యార్థమును బట్టియే పదార్థముల ఉనికి సిద్ధించును. అదిలేకుండా స్వతంత్రముగ పదార్థములు ఉండజాలవు. రాముడు, గుర్రము, తినెను, మొదలగు విడివిడి పదార్థములవలన ఎట్టి జ్ఞానమును కలుగదుగదా! ఒకవాక్యార్థమున అన్వయము కలిగినపుడు అవి సార్థకములగును. లేకున్న వ్యర్థములగును. కాగా వాక్యార్థము లేకున్నచో, పదార్థము లేనేలేదు. (సౌకర్యముకొరకు పదార్థములను కల్పించుట జరుగును). అట్లే చిన్నచిన్న వాక్య ముల అర్థములుకూడ పదార్థములవంటివే. అనగా చిన్నచిన్న అవాంతరవాక్యములు ఒక దానితో వేరొకటి సంబంధము కలిగి, పెద్దవాక్యముగాఏర్పడిన స్థలములలోకూడ - ఆ పెద్ద వాక్యముయొక్క అఖండార్థమునుబట్టియే అవాంతరవాక్యార్థముల ఉనికి సిద్ధించును. మహా వాక్యార్థములోని అవాంతర వాక్యార్థములు, వాక్యార్థములోని పదార్థములును సమానప్రతిపత్తి కలవే అగును.

వి. "రామః సీతాం పర్యణయత్" (రాముడు సీతను పెండ్లియాడెను) ఇదొక చిన్నవాక్యము. ఇందలి పదములకు పరస్పరము సంబంధము లేకున్నచో భావార్థము తెలి యదు. అట్టి సంబంధమునే ఆకాంక్ష లేక అపేక్ష అందురు. ఆసంబంధమువలన 'వివాహము చేసికొనుట క్రియ, అందులో రాముడు కర్త, సీత కర్మ' అని తెలిసి తాత్పర్యార్థము బోధ

పడును. అట్టి అర్థమే వాక్యార్థము. అది అఖండము. (అవయవముల విభాగము తెలియని ఏకాకారజ్ఞానము). అది పానకమువంటిది. (నీరు, చక్కెర, సుగంధ ద్రవ్యములును కలిసిన పానకములో పదార్థములకు విడివిడిగా ఉనికి ఉండదు.) ఆ వాక్యార్థమును ఆధారముగా పెట్టుకొనియే పదార్థములను ఊహించుటకు అవకాశము కలుగుచున్నది. ఇట్లే 'రామః విశ్వామిత్రేణ సహ వనం జగామ. సః తత్ర తాటకాం జఘాన. క్రమేణ మిథిలాం గత్వా తత్ర సీతాం పర్యణయత్' (విశ్వామిత్రునివెంట రాముడు అడవికి వెళ్లెను. అతడచట తాటకను చంపెను. క్రమముగా మిథిలానగరమునకు చేరి అచట సీతను పరిణయమాడెను)మొదలగు కథా సంవిధానమును వర్ణించు చిన్న చిన్న వాక్యములు వాని అర్థములును పరస్పరము సంబంధమును (అన్వయము) పొంది మహావాక్యముగా (మహావాక్యార్థముగా) ఏర్పడును. అచటకూడ మహావాక్యార్థములో అన్వయించు అవాంతర వాక్యార్థములు, చిన్న వాక్యార్థములోని పదార్థములవంటివే. వానికి స్వాతంత్ర్యము కుదరదు. మహావాక్యార్థమే వానికి ఉనికిని ప్రసాదించును. ఇదే తీరులో ఒక పెద్ద గ్రంథమునుగురించియు చెప్పవచ్చును. గ్రంథము మొత్తముపై ఏర్పడు తాత్పర్యము మహావాక్యార్థము. గ్రంథములోని ఇతర వాక్యముల అర్థములన్నియు పదార్థములే అగును.

భాషలో వాక్యమే సహజము. అదియే సమగ్రమైన భావమును అందించును. సౌకర్యముకొరకై పదములను కల్పింతుము. ఒక వాక్యములోని పదములు,వాని అర్థములును పరస్పరము సంబంధము గలవై, తుదకు ప్రధానమైన క్రియతో అన్వయించును. అట్టి వాక్యము వలన కలుగు బోధ (జ్ఞానము) లో క్రియయే ముఖ్యమైనది. మిగిలిన పదార్థములన్నియు ఆ క్రియకు విశేషణములుగా అన్వయించును. 'రామః సీతాం పర్యణయత్' అను వాక్యమువలన, 'రాముడు కర్తగను సీత కర్మగను ఉన్న జరిగిపోయిన పెండ్లి అను వ్యాపారము' అను సంపిండితార్థము లభించును. ఏ వాక్యమునైనను గ్రంథమునైనను ఈవిధముగనే విశ్లేషించుకొనవలెను. ఈ పద్ధతిచే 'శాబ్దబోధ' (శబ్దమువలన కలుగు సామూహికమైన అర్థమును తెలిసికొనుట) అందురు. క్రియయే విశేష్యముగా ఉండు శాబ్దబోధ వైయాకరణులకు అభిమతము. అవాంతరవాక్యార్థములు కూడ మహా వాక్యార్థమునకు సంబంధించిన పదార్థములే. కాగా 'వాక్యార్థమందు పదార్థములు, మహావాక్యార్థమందు అవాంతర వాక్యార్థములును స్వతంత్రములు కావు. అఖండవాక్యము, అఖండవాక్యార్థము మాత్రమే పరమార్థమున సత్యములు' అని సారాంశము.

పరిపూర్ణార్థమును సమర్పించు ఒకే ఒక పదమైనను కొండొకచో వాక్యము కావచ్చునని స్పష్టపరచుచున్నాడు.

వాక్యం తదపి మన్యంతే యత్పదం చరితక్రియమ్
ఆఖ్యాతశబ్దే నియతం సాధనం యత్ర గమ్యతే
తదప్యేకం సమాసా(ప్తా)ర్థం వాక్యమిత్యభిధీయతే. 326

చరితక్రియమ్=ఇమిడియున్న క్రియాపదముగల. యత్ = ఏ, పదమ్ = పదము గలదో, తత్ + అపి = ఆ పదమునుగూడ, వాక్యమ్ = వాక్యమని, మన్యంతే = తలచుదురు. యత్ర=ఏ, ఆఖ్యాతశబ్దే = క్రియా పదము విషయములో, సాధనమ్ =

కారకముగా అన్వయించు పదము, నియతమ్ = నిశ్చయముగా, గమ్యతే = తెలియబడునో, తత్ + అపి = ఆక్రియాపదము కూడ, సమాసార్థమ్ = సంగ్రహింపబడిన అర్థముగల (సమాప్తార్థమ్ = సంపూర్ణమైన అర్థముగల), ఏకమ్ = ఒక, వాక్యమ్ + ఇతి = వాక్యమని, అభిధీయతే = చెప్పబడును.

తా. మిక్కిలి ప్రసిద్ధమైన వాడుకనుబట్టి కొన్నిసంధర్భములలో ఒక్క నామవాచకమువలననే సంపూర్ణమగు అర్థముతెలియుచుండును. అట్లే కొన్నిచోట్ల ఒకే క్రియాపదమువలననే సంపూర్ణవాక్యార్థము అవగతమగును. అట్టి స్థలములలో ఆ ఒక్కపదమే ఇతర పదములను అపేక్షింపకుండ సంపూర్ణవాక్యార్థమును ఇచ్చుటచే, ఆ పదమే వాక్యమని చెప్పవలయును. ఆ పదము, దాని అర్థమును అచట వాస్తవములే. ఎందుచేతననగా - ఎట్టి ఆకాంక్షయులేకుండ (కర్త, కర్మ, క్రియ మొదలగువానియొక్క అపేక్షలేకుండ) ఒక సంపూర్ణమగు అర్థమును బోధించుటయే వాక్యముయొక్క ముఖ్యలక్షణము. ఇది అట్టి స్థలములలో ఒకే పదమునకు అన్వయించును. ఆ పదము నామవాచకమైనచో క్రియయు, క్రియాపదమైనచో ఆవశ్యకమైన కారకమున్ను వెంటనే స్ఫురించును.

వి. 'ఖడ్గేన' (కత్తితో) అనుపదము 'ఛినత్తి' (నరకుచున్నాడు) అను క్రియాపదమును పలుకనక్కరలేకుండగనే, ప్రసిద్ధినిబట్టి ఆక్రియను బోధించును. (ఖడ్గేన అను పదమే క్రియనుకూడ చెప్పగలుగును). అట్లే 'వర్షతి' (వర్షించును) అను క్రియాపదమే 'దేవః' (దేవుడు) 'జలమ్' (నీటిని) అనుకారకములను తప్పక బోధించును. ప్రకరణాదుల సాయముతో అవశ్యకమైన ఆయా పదార్థములు నియతముగా తెలిసిపోవును. కాన అవన్నియు ఉచ్చరించిన ఒక పదమువలననే (నామముకాని, ఆఖ్యాతముకాని) లభించునట్లు అనుభవము కలుగును. ఆ విధముగా పదమే వాక్యమగుచున్నది. కాన అదియు దాని అర్థమును సత్యములే అగును.

'పదములు, పదార్థములును అసత్యములు అన్నారుగదా! అయినపుడు సంపూర్ణవాక్యార్థమును అందించు, మీదచూపిన 'ఖడ్గేన' 'వర్షతి' మొదలగుపదముల గతిఏమి?' అను శంకకు, ఈ కారిక సమాధానముచూపినది. 'అవి వాక్యమందలి అవయవములైన పదములు కావు. సంపూర్ణమైనవాక్యములే. ఆవశ్యకమైన పదపదార్థములన్నియు అచట ఒకపదములోనే ఇమిడిఉన్నవి' అని తీర్మానము.

చరితక్రియమ్ = చరితా, క్రియా, యేన తత్ = తనలో ఇముడ్చుకున్న క్రియగలది. ఆఖ్యాతశబ్దము = తిఙంతము—క్రియాపదము. సాధనమ్ = కర్త, కర్మ, మొదలగు కారకము.

ఈ సందర్భమున మీమాంసకుల ఆశయమును చూపుచున్నాడు.

శబ్దవ్యవహితా బుద్ధి రప్రయుక్తపదాశ్రయా
అనుమానా త్తదర్థస్య ప్రత్యయే హేతు రుచ్యతే.                327

(ప్రయుక్తేన = ఉచ్చరింపబడిన, పదేన = పదముచే) అప్రయుక్తపదాశ్రయా = ఉచ్చరింపబడని పదమునకు సంబంధించిన, బుద్ధిః = బుద్ధి (ఊహ), శబ్దవ్యవహితా = ఆవశ్యకమైన

శబ్దముతో వ్యవధానముగలదై, అనుమానాత్ = అనుమానమువలన (ఊహవలన), తదర్థస్య= ఉచ్చరించబడని శబ్దమునకు సంబంధించిన అర్థముయొక్క, ప్రత్యయే = జ్ఞానమందు, హేతుః = కారణముగా, ఉచ్యతే = చెప్పబడును.

తా. ఒకే సుబంతముగాని ఒకే తిజంతముగాని తనంతటతానుగా సంపూర్ణ వాక్యార్థమును చెప్పజాలదు. అట్టిచోటులందు సంపూర్ణార్థము ఈ విధముగా లభించుచుండును. పొగనుచూచి నిప్పును అనుమానించునట్లు, ప్రయోగించిన పదమువలననే, దాని అర్థముతో సంబంధముగల పదముల నన్నింటిని అనుమానించుదురు, అట్లు లభించిన అన్నిపదములను కూర్చుకొనియే పూర్తిఅర్థములను తెలిసికొందురు. (అర్థములను అనుమానించి, పిదప వానిని చెప్పుపదములను ఊహించుట ఒకపద్ధతి. మొదట పదములనే ఊహించి, తరువాత వాని అర్థములను చెప్పుకొనుట రెండవ పద్ధతి. ఏదయినను అనుమానప్రమాణముతోనే కావలసిన శబ్దార్థములు వచ్చును) ఈ రీతినే 'ఆక్షేపము' (కావలసినదానిని లాగికొనివచ్చుట) అనియు అందురు. కావున 'ఒకేపదము వాక్యము' అనుట యుక్తముకాదు. (అక్కడ అన్నిపదము లును ఉన్నట్లే లెక్క)

ఇది మీమాంసకుల వాదము. దీనిసారమిట్లుండును. ఒకదానినివిడిచి వేరొకటి ఉండుటకు వీలుకుదరని శబ్దములుకాని, అర్థములుకాని ఉన్నపుడు, వానిలో ఏ ఒకదానిని ప్రయోగించినను, అది రెండవదానిని తప్పక లాగుకొని వచ్చును. 'రెండవదాని ప్రయోగము స్పష్టముగఉండితీరవలెను' అను నిర్బంధము లేదు. దీనిని ఆక్షేప మందురు. 'యేన వినా యదనుపపన్నం తత్తేనాఽఽక్షిప్యతే' అని ఆక్షేపన్యాయము. (యేన వినా=ఏదిలేకుండ. యత్ + అనుపపన్నమ్=ఏది కుదరదో, తత్ = అది, తేన=ఆ కుదరనిదానిచే, ఆక్షిప్యతే=తీసు కొని రాబడును) 'పీనో దేవదత్తః దివా న భుంక్తే' (దేవదత్తుడు బలిసిఉన్నాడు-కాని పగలు భోజనముచేయడు) అనునది శాస్త్రప్రసిద్ధమైన ఉదాహరణము. ఇచట, 'దేవదత్తుడు రాత్రి భోజనముచేయును' అను అర్థము ఆక్షేపమువలన లభించును. రాత్రికూడ భోజనము చేయ కున్నచో బలిసిఉండుట కుదురదుగదా! ఈ పద్ధతినే "శ్రుతార్థాపత్తి - లేక - అర్థాపత్తి" అను పదములతో సాంకేతికముగ వ్యవహరింతురు. (కావలసిన అర్థమును ఆక్షేపించి - పిదప దానిని చెప్పు శబ్దమును తీసుకొనివచ్చినను, తొలుతశబ్దమునే ఆక్షేపించి, తరువాత దాని అర్థ మును చెప్పుకొన్నను ఇబ్బందిలేదు.) ప్రకృతము ఈ మార్గమును అవలంబించి, ఒకే పదముగల ప్రయోగములలో, అవశ్యకమైన క్రియాపదమునో కారకపదమునో ఆక్షేపించు కొని పూర్తి అర్థమును పొందుదురని చెప్పుటయే సమంజసము. ("ఖడ్గేన"అనగానే "ఛినత్తి" అనుక్రియాపదము, "వర్షతి" అనగానే "దేవః, జలమ్" అనుకారక పదములును ఆక్షేపించ బడును). అన్ని పదములను యథావిధిగ ఉచ్చరింపనక్కరలేదు. ఉచ్చరింపబడినపదమే మిగిలిన అన్ని పదములను తీసుకొని వచ్చును. కాగా "వాక్యైకదేశములు (వాక్యముయొక్క ఖండములు) సమగ్ర వాక్యములే" అనుట పొసగదు.

శాస్త్రీయములగు చర్చలలో పలుతావులందు వైయాకరణులకు, మీమాంసకుల కును పూర్తిగా వేర్వేరు అభిప్రాయములు, సిద్ధాంతములును ఉన్నవి. అట్లే తార్కికులకు వైయాకరణులకును అన్ని విషయములందును అభిప్రాయభేదములు ఉన్నవి. సమయము సందర్భమును బట్టి పై వారి వాదములను గ్రంథకర్త ఉట్టంకించుచుఖండించుచుండును. అయితే

ప్రవాహరూపమున నడచు మూలకారికలలో, "ఏది పూర్వపక్షము ? ఏది సిద్ధాంతము ?" అని తెలిసికొనుట మిక్కిలి శ్రమసాధ్యము. వ్యాఖ్యానములమూలమున అట్టి సంశయములు తీరు చుండును. ఈ కారిక మీమాంసకుల పూర్వపక్షమును ప్రతిపాదించినది.

(1) అర్థాపత్తిః = అర్థస్య + ఆపత్తిః = కావలసిన విషయమును బలవంతముగా లాగికొని వచ్చుట. మీమాంసకులు దీనిని వేరే ప్రమాణముగా (జ్ఞానమును కలిగించు ఉపాయము) అంగీకరించినారు.

(2) అనుమానమ్ = పరస్పరము నియతమైన సంబంధముగల రెండింటిలో ఒకదానిని బట్టి రెండవదానిని ఊహించుట. కార్యమును బట్టి కారణమును, కారణమును బట్టి కార్యమును నిశ్చయముగా తెలిసికొనుట అని భావము. (పొగనుచూచి నిప్పును ఊహించుట మొదలగునవి). తార్కికులకు ఇది ప్రబలమైన ప్రమాణము. ప్రకృతమైన కారికలో అనుమానమనగా—"శబ్దమువలన తత్సంబంధియగు శబ్దమునుగాని, అర్థమునుబట్టి తత్సంబంధియగు అర్థమునుగాని తెలిసికొనుట" అగును. అర్థమును అనుమానించినపుడు దానిని చెప్పు శబ్దము కూడ అనుమానమువలననే లభించునని అనుకొనవలయును. తార్కికులు "అర్థాపత్తి" అను ప్రమాణమును ఒప్పుకొనరు. కాన వారి మార్గమననుసరించి యిచట అనుమాన పదము ఉపయోగింపబడినది. మీమాంసకుల దృష్టిలో ఇచటి అనుమాన పదమునకు "అర్థాపత్తి" అనియే తాత్పర్యము.

"ఒకే పదము వాక్యము కానేరదు. అట్టిచోటులందుకూడ ఆవశ్యకమైన ఇతర పదములను తీసికొని రాక తప్పదు" అను మీమాంసకుల మతమును ఖండించుచున్నాడు.

యస్మిం స్తూచ్చరితే శబ్దే యదా యోఽర్థః ప్రతీయతే
తమాహు రర్థం తస్యైవ నాన్య దర్థస్య లక్షణమ్ . 328

యదా=ఎప్పుడు, యస్మిన్ = ఏ, శబ్దే=శబ్దము, ఉచ్చరితే + తు=ఉచ్చరింపబడగా, యః = ఏ, అర్థః = అర్థము, ప్రతీయతే = తెలియబడునో, తమ్ = ఆ, అర్థమ్ = అర్థమును, తస్య + ఏవ = ఆ శబ్దమునకు సంబంధించినదిగానే, ఆహుః = చెప్పుదురు, అర్థస్య = అర్థముయొక్క, లక్షణమ్ = లక్షణము, అన్యత్ = వేరుగా ఏదియు, న=లేదు.

తా. శబ్దమును ప్రయోగించినపుడు, దానివలన సూటిగా బోధపడు అర్థమంతయు ఆ శబ్దమునకు సంబంధించినదే అని చెప్పవలెను. (ఒక శబ్దమువలన కలుగు భావార్థమంతయు ఆ శబ్దముయొక్క శక్తిని బట్టియే వచ్చును) శబ్దముయొక్క శక్తినిబట్టి సూటిగా తెలియుదానినే అర్థమందురు.

వి. ఈ శ్లోకము మీమాంసకుల వాదమును త్రోసిపుచ్చును:- ఏకపద వాక్యములలో (ఖడ్గేన, వర్షతి మొదలగునవి) ఆవశ్యకమైన పదములను ఆక్షేపించ నక్కరలేదు. ప్రయోగించిన పదమొక్కటే తన అర్థముతోపాటు, సంబంధించినట్టి, (ప్రయోగింపబడని) శబ్దముల అర్థమునంతను బోధించును. అది వ్యవహారస్వభావము (లోకులు భాష నుపయోగించు సహజమైన తీరు). కాగా కొన్నిచోట్ల ఒక్కపదమే సంపూర్ణవాక్యమగుననుటలో బాధకము లేదు.

మీది కారిక చెప్పిన తీరును అవలంబించినపుడు, ''క్రియార్థోపపదస్య కర్మణి స్థానినః'' అను సూత్రము విధించు చతుర్థీవిభక్తి వ్యర్థమే అని చెప్పుచున్నాడు.

క్రియార్థోపపదే ష్వేవం స్థానినాం గమ్యతే క్రియా
వృత్తౌ నిరాదిభి శ్చైవ క్రాంతాద్యర్థోఽవగమ్యతే. 329

ఏవమ్=ఈ విధముగనే (ఒకేపదమువలన కావలసిన అర్థమంతయు లభించు తీరుకో), క్రియార్థోపపదేషు=ఒక క్రియకు ప్రయోజనమైన వేరొకక్రియను బోధించు, స్థానినామ్=ఉచ్చరింపబడని ధాతువులయొక్క, క్రియా=వ్యాపారము, గమ్యతే=తెలియబడును, వృత్తౌ=సమాసము మొదలగు వృత్తియందు, నిరాదిభిః+చ+ఏవ=నిర్ మొదంగు ఉపసర్గలచేతనే, క్రాంతాద్యర్థః = "అతిక్రమించినాడు" మొదలగు అర్థము, అవగమ్యతే = బోధింపబడును.

తా. ఒకపనిని సాధించుటకు వేరొకపనిని ప్రారంభింతుము. దానిని క్రియార్థమైన క్రియ అందురు. ఇట్టిచోట్ల ప్రయోజనముగా ఉండు క్రియను ఉచ్చరింపక పోయినను ఇబ్బంది లేదు. సాధింపదలచిన క్రియ తప్పక అవగతమగుచుండును. అట్లే సమాసము, (తద్ధితము, కృత్తు), మొదలగు వృత్తులలో 'నిర్' మొదలగు ఉపసర్గలు, 'క్రాంతః' మొదలగు పదములను వాడకపోయినను, ఆ పదముల అర్థమును స్పష్టముగా తెలియజేయును.

వి. 'సః ఫలేభ్యో యాతి' (అతడు పండ్లకై వెళ్ళుచున్నాడు) అనునది ఒక వాక్యము. ఇచట వ్యాకరణశాస్త్రమనుసరించి, వివరణ మిట్లుండును :- "పండ్లకై వెళ్ళుచున్నాడు" అనగా 'పండ్లను తెచ్చుటకు వెళ్ళుచున్నాడు' అని అర్థము. 'వెళ్ళుట' ఒక పని. 'తీసుకొనివచ్చుట' వేరొకపని. వెళ్ళుటకు ప్రయోజనము, తీసుకొనివచ్చుట. ఇటువంటి క్రియనే క్రియార్థమైన క్రియ అందురు. ప్రయోజనముగా ఉండు క్రియను, 'ఆహర్తుమ్, సంపాదయితుమ్, ద్రష్టుమ్' మొదలగు పదములతో (ఈ పదములు ఆయా ధాతువులకు 'తుమున్'=తుమ్-అను ప్రత్యయమును చేర్చగా ఏర్పడు అవ్యయములు) సంస్కృతభాషలో బోధింతురు. ప్రయోజనముగా ఉండు క్రియను బోధించు తుమున్ ప్రత్యయాంతపదమును ఉచ్చరింపని సందర్భములలో, ఆ ప్రయోజనక్రియలో కర్మగా అన్వయించు శబ్దమునకు, చతుర్థీవిభక్తి అగునని, 'క్రియార్థోపపదస్యచ కర్మణిస్థానినః' (2-3-14) అను పాణినీయ సూత్రము చెప్పినది. 'ఫలాని ఆహర్తుం యాతి', 'ధనం సంపాదయితుం గచ్ఛతి', మొదలగు వాక్యములలో, కర్మవాచకములగు 'ఫలాని', 'ధనమ్' మొదలగు శబ్దములకు చతుర్థివచ్చి, 'ఫలేభ్యః యాతి', 'ధనాయ గచ్ఛతి' మొదలగు ప్రయోగములు సిద్ధించును. 'ఆహర్తుమ్' 'సంపాదయితుమ్' మొదలగు తుమున్నంతముల వలన లభించు అర్థము చతుర్థీ విభక్తిచేతనే సూచింపబడునుగాన, మరల ఆ పదములను వాడకూడదు. వాడినపుడు ఈ సూత్రము ప్రవర్తింపదు. కర్మవాచకమునకు సహజమైన ద్వితీయా విభక్తియే వచ్చును.

కాగా ప్రకృతము ''ఫలేభ్యః'' అను దానివలననే ''పండ్లను తెచ్చుటకు'' అని, 'ధనాయ' అనుదానివల్లనే "ధనమును సంపాదించుటకు' అనియు పూర్తి అర్థమును చెప్పవచ్చును. 'ఒక పదమువలన బోధింపబడు అర్థమంతయు ఆపదమునకు సంబంధించినదే' అని అంగీకరించినపుడు, 'క్రియార్థోపపదస్యచ కర్మణి స్థానినః' అను సూత్రము వ్యర్థమేఅగును. 'ఫలేభ్యః' 'ధనాయ' మొదలగు ప్రయోగములలో, 'తాదర్థ్యే చతుర్థీ వాచ్యా' (పరిక్రయణే

సంప్రదాన మన్యతరస్యామ్-1-4-44 అను సూత్రమున-వార్తికము) అనువార్తికముచే చతుర్థీ విభక్తిని సాధించుకొనవచ్చును.' ఒక క్రియయొక్క ప్రయోజనమును చెప్పు శబ్దమునకు ('ఈ ఫలమునకై ఈ పని' అను భావమును చెప్పదలచుకొన్నప్పుడు) చతుర్థి వచ్చునని' 'తాదర్థ్యే చతుర్థీ వాచ్యా' అనువచనము యొక్క తాత్పర్యము. 'ముక్తయే హరింభజతి' (ముక్తికై హరిని సేవించుచున్నాడు) అని దీని ఉదాహరణము. 'హరిసేవ' అనుక్రియకు ముక్తి ప్రయోజనము. కాన ముక్తి శబ్దమునకు చతుర్థివచ్చినది. ఇదే విధముగ'ఫల, ధన', మొదలగు శబ్దములకు ఈ వార్తికముచేతనే చతుర్థిని సాధించి, అభిమతార్థమును పొంద వచ్చునుగాన, అందుకై వేరే సూత్రము ఆవశ్యకము కానేకాదు.

ఇట్లే 'నిరాదయః క్రాంతాద్యర్థే పంచమ్యా' (కుగతిప్రాదయః-2-2-18 అను సూత్రమున వార్తికము) అనిసమాసప్రకరణములో ఒక వచనము కలదు. 'నిర్' మొదలగు ఉపసర్గలు 'క్రాంతః' (దాటినవాడు) మొదలగు అర్థములలో పంచమ్యంతశబ్దముతో సమసించును అని దీని అర్థము. 'క్రాంతః కౌశాంబ్యాః' అను విగ్రహవాక్యము, 'నిర్' అను ఉపసర్గతో కలిసి, 'నిష్కౌశాంబిః' అను సమాసముగ సిద్ధించును. ఇటువంటి సమాస ములు ఈ వచనమునకు ఉదాహరణములు. ఇట్టి స్థలములలో కూడ ఉపసర్గయే అభిమతమైన అర్థమునంతను బోధించునుగాన. 'క్రాంతః' మొదలగు పదములను వేరుగా పలుకనక్కర లేదు.

క్రియార్థోపపదస్యచ కర్మణి స్థానినః (2-3-1) ఈ సూత్రము సిద్ధాంతకౌ ముదిలో కారకప్రకరణమందున్నది. 'క్రియార్థాక్రియా ఉపదం యస్య తస్య స్థానినః అప్రయు జ్యమానస్య తుమునః కర్మణి చతుర్థీ స్యాత్' అని దీని వృత్తి. ఉదా: ఫలేభ్యో యాతి. ఉపపదమనగా సమీపమందుచ్చరింపబడు పదము. ప్రకృతమున క్రియార్థమైన క్రియను చెప్పు 'యాతి' మొదలగు క్రియావాచకమే ఉపపదమగును. స్థానినః = ఉచ్చరింప బడనిది, 'తుమునః' అనుపదము అధ్యాహారము, ఇదియే విశేష్యము, 'క్రియార్థోపపదస్య స్థానినః' అనునవి రెండును విశేషణములు. ఇట్లు అభిమతార్థము సిద్ధించును. క్రియార్థమైన క్రియను సమీపమందు ప్రయోగించునపుడు ధాతువునకు 'తుమన్' (తుమ్) ప్రత్యయము వచ్చును (కర్తుంయాతి, ద్రష్టుం గచ్ఛతి, మొదలగునవి). అట్టి తుమున్ ప్రత్యయాంత శబ్దములకు సంభవము ఉండి, వానిని ప్రయోగింపని వాక్యములలోనే ఈ సూత్రము సహజ ముగ ప్రవర్తించును.

'తాదర్థ్యే చతుర్థీ వాచ్యా' - తదర్థస్య భావః = తాదర్థ్యమ్ = 'అందుకొరకు' అనుట- అనగా అనుకొన్న ప్రయోజనము.

'కుగతిప్రాదయః '(2-2-18) కు అనునది. గతిసంజ్ఞగలది, ప్ర, పరా, మొదలగునవియు సమర్థమైన శబ్దముతో సమసించును.' అని దీని అర్థము. కుకవిః, తిరస్కృత్య, ప్రాచార్యః, మొదలగునవి ఉదాహరణములు. ఈ సూత్రమును వివరించు సందర్భములో 'నిరాదయః క్రాంతాద్యర్థే పంచమ్యా' అను వార్తికము బయలుదేరినది.

1. ఉపసర్గః = క్రియతో అన్వయించు ప్ర, పరా, అను, మొదలగునది. ఉదా:- ప్రభవతి, పరాజయతే, అనుకరోతి మొదలగునవి.

2. స్థానీ = ఉచ్చరింపబడనిది. "స్థానమ్ అస్య అస్తి = స్థానీ = స్థానముగలది. స్థానమనగా ప్రసంగము." అది అచట ఉండదగినది–కాని ప్రకృతము ఉండదు" అని అర్థము. దీనివలన "లేనిది–ఉచ్చరింపబడనిది" అను భావము ఫలించును.

౩. కర్మ = కర్తయైన వ్యక్తి తన పనిచే పొందుటకుద్దేశింపబడిన విషయము.

4 వృత్తిః = విగ్రహవాక్యములలో కనబడు విడివిడి పదముల అర్థమును విడిచి, సమూహమువలన ఒకానొక ప్రత్యేకార్థమును బోధించు వ్యాకరణ ప్రక్రియ ఉదా :- రాజ్ఞః పురుషః. ఇది విగ్రహము. "రాజపురుషః" ఇది సమాసము. దీనివలన 'రాజసేవకుడు' అను విశేషణ విశేష్యభావముకల ఒకా నొక ప్రత్యేకార్థము వచ్చునని వైయాకరణులందురు. సమాసము, కృత్తు, తద్ధితము, ఏకశేషము, నామధాతువు, అని వృత్తులు అయిదు విధములు.

**అట్లయినపుడు కేవలము సుబంతమునో తిఙంతమునో వాక్యముగ వాడుకొని, ఆవశ్యకములగు పదాంతరములను విడువవచ్చునా ? అను శంకకు ఉత్తరమును చూపుచున్నాడు.**

**తాని శబ్దాంతరాణ్యేవ పర్యాయా ఇవ లౌకికాః**
**అర్థప్రకరణాభ్యాం తు తేషాం స్వార్థో నియమ్యతే. ౩౩౦**

తాని=వాక్యముయొక్క అర్థమును పూర్తిగా బోధించు ఒక్కొక్కపదములు, లౌకికాః=లోకములో ప్రసిద్ధములగు, పర్యాయాః + ఇవ = పర్యాయపదములవలె, శబ్దాంతరాణి + ఏవ=వేరువేరు శబ్దములే. తేషామ్=ఆ పదములయొక్క, స్వార్థః=పూర్తిఅర్థము, అర్థప్రకరణాభ్యామ్ + తు = ప్రయోజనమును బట్టి, సందర్భమునుబట్టియు, నియమ్యతే = 'ఇది' అని స్పష్టము చేయబడును.

తా. 'ఖడ్గేన' 'వర్షతి' మొదలగు ఒక్కొక్క పదమువలననే వాక్యార్థము పూర్తిగా వచ్చునపుడు అవియే వాక్యములగును. అట్లని 'ఖడ్గేన ఛినత్తి' 'దేవః జలం వర్షతి' అను సమగ్రవాక్యములు వ్యర్థములని ఎంచరాదు. అవియు వేర్వేరుగ వాక్యములై ప్రయోగార్హములే అగును. ఈ రెండువిధములయిన వాక్యములును పర్యాయపదములవంటివని భావింపవలెను. చెట్టును బోధించుటకు 'వృక్షః' 'తరుః', 'ద్రుమః', మొదలగు అనేక పదములున్నవి. అవన్నియు పర్యాయపదములు. అందు ఒకదానినే స్వీకరించి తక్కినవానిని వ్యర్థము లనలేముగదా: అట్లే పై రెండువిధములైన వాక్యములును ప్రయోగింపబడుచుండును. అయితే సుబంతమునే వాక్యముగా ఉచ్చరించునపుడు ఆవశ్యకమైన తిఙంతార్థము, తిఙంతమునే వాడినపుడు ఆవశ్యకమైన సుబంతార్థమును వెనుక చెప్పబడిన అర్థప్రకరణాదుల సాయముతో లభించును.

వి. ఒకపదమే వాక్యముకాగలిగినపుడు దానినే వాడుచు, సమగ్రవాక్యములను (ఆవశ్యకమైన పదములన్నియు గల వాక్యములు) విడిచిపెట్టవచ్చునాః అను శంకకు ఇది సమాధానము. అట్లు విడువనక్కరలేదని, రెండురకములైన వాక్యములను ప్రయోగించుకొనవచ్చునని, పదమే వాక్యమగు స్థలములలో అర్థప్రకరణాదులు సాయముచేసి సమగ్రార్థమును బోధించుననియు సారాంశము.

ఒకే అర్థమును బోధించుచు వేర్వేరు ఆకారములు గల శబ్దములను పర్యాయము లందురు.

ఉదా : ఇంద్రః, హరిః, పాకశాసనః మొదలగునవి. పర్యాయపదముల విషయములో లాఘవ గౌరవచర్చను ('ఈ పదము చిన్నది- దీనినే వాడవలెను' 'ఆ పదము పెద్దది- దానిని వాడకూడదు' అను విచారణము) అంగీకరించనక్కరలేదు. అట్లయిన పెద్దపదము లన్నియు నిష్ఫలములగును. ఆ విధముగనే వాక్యములుకూడ పర్యాయవాక్యములు కావచ్చును. లాఘవగౌరవవిచారణము అక్కడకూడ చేయకూడదు. ఇష్టానుసారము చిన్నవాక్యమునో (ఏకపదవాక్యము), పెద్దవాక్యమునో (అన్నిపదములునుగల వాక్యము) ప్రయోగింపవచ్చును. వాక్యార్థమును ప్రకరణాదులే నిర్ణయించును.

అఖండవాక్యము, అఖండవాక్యార్థముమాత్రమే సత్యమని, కొన్నిచోట్ల ఒకేపదము అఖండవాక్యమగుటలో ప్రతిబంధకములేదని, పదపదార్థములు అసత్యములనియు ఇంతవరకు దృఢపరచడమైనది.

"అఖండ వాక్య వాక్యార్థములే సత్యమయినపుడు, పదపదార్థాది విభాగము కల్పింపనేల ?" అనుశంకకు సమాధానమును చూపుచున్నాడు.

ప్రతిబోధాభ్యుపాయాస్తు యే తం తం పురుషం ప్రతి
నాఽవశ్యం తేఽభిసంబద్ధాః శబ్దా జ్ఞేయేన వస్తునా. 881

తమ్ + తమ్ = ఆయా, పురుషమ్ = వ్యక్తిని, ప్రతి = గురించి, యే = ఏ, ప్రతిబోధాభ్యుపాయాః = అర్థమును తెలియజేయుటకుపయోగించు, పదములు, (పదభాగములు) మొదలయినఉపాయములు గలవో, తే = ఆ, శబ్దాః = శబ్దములు, జ్ఞేయేన = తెలియదగు, వస్తునా = విషయముతో, అవశ్యమ్ = తప్పక, అభిసంబద్ధాః = సంబంధము కలవి, న = కావు.

భా. వాక్యములో పదములు, సమాసాదివృత్తులలో పదైకదేశములు, (పదములలో వర్ణములు) మొదలగునవి అఖండవాక్యార్థమును తెలియుటలో సాధనములు మాత్రమే. ఆ అర్థమునకు, ఉపాయములైన అట్టి విభాగములకును సంబంధమేదియు లేదు.

వి. ఒక పరిపూర్ణమైన అర్థమును తెలియజేయుటకై వాక్యమును ఉపయోగించుదురు. అది ఏకపదరూపముగనో, పదసముదాయరూపముగనో కనిపించవచ్చును. కాని అది అఖండము. (ఎట్టిభాగములును లేనిది). దానివలన తెలియు అర్థముకూడ అఖండమే. అయినను సామాన్యులకు స్పష్టత కలుగవలయునని. పదములను పదభాగములను కల్పించి చూపుదురు. సత్యమును తెలిసికొన్నవారికి ఆ విభాగముతో పనిలేదు.

"అఖండవాక్యము - అఖండార్థము మాత్రమే సత్యమైనపుడు పదములు - వాని అవయవములు (ప్రకృతి, ప్రత్యయము మొదలగునవి) మొదలగు కల్పనలన్నియు ఎందుకు ?" అను శంక కిది సమాధానము. మందమధ్యమాధికారులకు (తెలివితక్కువ వారు మందులు, సామాన్యమైన తెలివిగలవారు మధ్యములు) సత్యమును బోధించుటకై అసత్యాంశముల కల్పన అవశ్యకమగుచుండునని సారము. ఇటువంటి భావములను గ్రంథకర్త తరచుగ ప్రకటించుచునే ఉండును.

"యస్మింస్తూచ్చరితే శబ్దే" (828 శ్లోకము) అన్న రీతిలో శబ్దార్థమును పరిష్కరించినచో, ఉచ్చరించిన శబ్దమును సమముగా వినలేపోవుట, భ్రమపడుట మొదలగు కారణముల

వలన కొన్నిచోట్ల సరియైన అర్థము తెలియక పోవచ్చును. అట్లయిన శబ్దార్థముల సంబంధము అనిత్యము కావలసివచ్చును. అది సముచితముకాదు'' అని శ్రుతార్థాపత్తి గినంకరించు మీమాంసకుడు మరల తన ఆశయమును ప్రతిపాదించుచున్నాడు.

అసత్యాం ప్రతిపత్తౌ చ మిథ్యా వా ప్రతిపాదనే
స్వైరర్థైః నిత్యసంబద్ధా స్తే తే శబ్దా వ్యవస్థితాః. 332

ప్రతిపత్తౌ = అర్థజ్ఞానము, అసత్యామ్ = కలుగనపుడు, (లేనపుడు) వా = లేక మిథ్యా = అసత్యముగ (వేరొకరీతిని), ప్రతిపాదనే + చ = కలిగినపుడు కూడ, తే + తే = ఆయా, శబ్దాః = శబ్దములు, స్వైః = తమతమ, అర్థైః = ముఖ్యమైన అర్థములతో, నిత్య సంబద్ధాః = ఎల్లపుడునుఎడతెగని సంబంధము కలవిగా, వ్యవస్థితాః = నిశ్చయింపబడి ఉన్నవి.

తా. "ఈ శబ్దమునకు ఇది అర్థము'' అని శబ్దార్థసంకేతము తెలియకపోవచ్చును; పరాకుగా ఉండి సమముగ వినకపోవుటవలన, లేక—భ్రాంతివలనను ఒక శబ్దమునకు 'వేరొక అర్థము' అని అనిపించవచ్చును; అయినను శబ్దమునకు. అర్థమునకును ఉండు సంబంధము నిత్యముగాన, (తనకు సంబంధించిన ముఖ్యార్థమునే శబ్దము ఎల్లపుడును తెలియ జేయును) ఉచ్చరింపబడిన శబ్దము తన అర్థమును మాత్రమే చెప్పును. మిగిలిన అర్థములను చెప్పజాలదు. అట్లు కాకున్న 'శబ్దార్థ సంబంధము నిత్యము' అను సంప్రదాయము పాడగును.

వి. ఇది మొదలు వరుసగా నాలుగు కారికలు మీమాంసకుల పూర్వపక్షమును ఉపపత్తులతోను, ఉదాహరణములతోను వివరించును.—'శబ్దార్థయోః నిత్యః అభిసంబంధః' (శబ్దమునకు దాని అర్థమునకు ఉండు సంబంధము నిత్యము) అని వారి మతము. తదను సారము ఒక్కొక అర్థమునకు ఒక్కొక శబ్దము నియతముగా ఉండును. ఈ భావమునే 'ప్రత్యర్థం శబ్ద నివేశః' (ప్రతియొక అర్థమును గురించియు వేరువేరుగ ఒక్కొక్క శబ్దమును ఉచ్చరింప వలయును) అను వచనముతో ప్రకటించుదురు. 'ఈ శబ్దమునకు ఇది అర్థము లేక—ఈ అర్థమును బోధించు శబ్దము ఇది' అని గ్రహించుట శబ్దార్థ సంకేతమనబడును. దీనినిబట్టియే శబ్దార్థముల వ్యవహారము జరుగును. ఒకప్పుడు ఇట్టి సంకేతము తెలియక పోవచ్చును. పరాకుగా శబ్దమును వినవచ్చును. లేక భ్రాంతికలుగవచ్చును. అట్లయినను శబ్దమునకుండు నియతమైన అర్థము మారినదని కాని, లేదని కాని' అనకూడదు తెలిసినను, తెలియకపోయినను శబ్దమునకుండునది తన ముఖ్యార్థమే. వాని సంబంధము శాశ్వతము.

కాగా—'యస్మింస్తూచ్చరితే శబ్దే యదా యోఽర్థః ప్రతీయతే'(328)అను కారిక చెప్పినట్లు, వైయాకరణుల మతము ప్రకారము ఒకే పదము వాక్యమగుట కుదురదు. ఆ ఒక్కపదము తనయొక్క అర్థమును మాత్రమే చెప్పి ఊరకుండును. మిగిలిన అర్థములను చెప్పజాలదు. అందుకొరకై ఆయాశబ్దములను వాడక తప్పదు. అట్లుకాకున్నచో (ఒకే పదమువలన అన్ని అర్థములను లభించినచో) 'శబ్దార్థ సంబంధము నిత్య' మను శాస్త్రము భగ్నమగును. అందుచే ఏక పదవాక్యములలో, అర్థాపత్తి నాశ్రయించి ఆవశ్యకమైన పదముల నన్నింటిని కూర్చుకొన్న తరవాతనే సంపూర్ణవాక్యమగునని చెప్పక తీరదు.

'ఖడ్గేన' అను సుబంతము 'కత్తితో' అను అర్థము నొకదానినే చెప్పును. అట్లే 'వర్షతి' అనునది 'వర్షించుచున్నాడు' అను అర్థమునే చెప్పును. మిగిలిన అరములు కావలసి నచో వానిని బోధించు శబ్దములను వాడవలెను. శబ్దమును వాడకుండ నర్థమువచ్చునని

చెప్పినను, అర్థము లేకుండ శబ్దమును వాడినను 'శబ్దార్థ సంబంధము నిత్యము' అనుట ఎట్లు పొసగును? ఇది శంకయొక్క సారాంశము.

"ద్వారమ్" మొదలగు ఏకపదస్థలములలో, "పిధేహి" మొదలగు ఆవశ్యకమైన పదములను తీసికొనివచ్చియే అర్థమును బోధింపవలయును. లేకున్న మీద చూపిన రీతిని శబ్దార్థముల సంబంధమునకు హాని కలిగెడిని" అని బోదాహరణముగ నిరూపించుచున్నాడు.

యథాప్రకరణం ద్వార మిత్యస్యాం కర్మణః శ్రుతౌ
బధాన దేహీ వేత్యేత దుపాయా దధిగమ్యతే. ౩౩౩

ద్వారమ్ + ఇతి = 'ద్వారమ్' అను (ద్వారమును), కర్మణః = కర్మవాచకమగు పదము యొక్క, అస్యామ్ = ఈ, శ్రుతౌ = వినుటలో, బధాన + ఇతి = "బధాన" అను అర్థముగాని (మూసివేయుము), దేహి + ఇతి + వా = "దేహి" అను అర్థముగాని (ఇమ్ము, తెరువుము), యథాప్రకరణమ్ = సందర్భమును బట్టి, ఉపాయాత్ = "ఆయాశబ్దములను పలుకుట" అనే ఉపాయమువలన, అధిగమ్యతే = తెలియబడును.

తా. 'ద్వార' అను శబ్దమునకు 'తలుపు', 'దారి' అనునవి అర్థములు. 'ద్వారమ్' (ద్వారమును) అను ద్వితీయాంతమును (కర్మకారకమును) ఉచ్చరించినవెంటనే సందర్భమునుబట్టిగాని, సన్నివేశమునుబట్టిగాని, ఆవశ్యకమైన 'బధాన' (మూయుము) అను పదమో, లేక 'దేహి' (ఇమ్ము)అను పదమో అచటకు వచ్చును. దానిమూలముగానే అర్థబోధ కలుగును.

వి. కర్త, కర్మ, మొదలగుకారకములను ఉచ్చరించినపుడు, ఆవశ్యకమైన క్రియాపదమును, క్రియాపదమునుమాత్రమే వాడినపుడు యోగ్యమైన కారకపదమును, అర్థాపత్తి వలన తప్పకవచ్చును. తరువాతనే పూర్తి అర్థజ్ఞానము సంభవించును. ఇట్లు చెప్పకున్నచో 'శబ్దార్థముల సంబంధము నిత్యము' అను సిద్ధాంతమునకు భంగము వాటిల్లును.

ఇట్లు 'యస్మి న్నుచ్చరితే శబ్దే' (౩౨౯వ శ్లోకము) ఇత్యాదికారిక చూపిన శబ్దార్థ లక్షణము నంగీకరించినయెడల, శబ్దార్థముల సంబంధము అనిత్యము కావలసివచ్చునని ప్రతిపాదించి, ఈ సందర్భముననే వేరొకదోషమునుకూడ చూపుచున్నాడు.

యత్ర సాధనవృత్తి ర్యః శబ్దః సత్త్వనిబంధనః
న స ప్రధానభూతస్య సాధ్య స్యార్థస్య వాచకః. ౩౩౪

యత్ర = ఏస్థలమందు, సాధనవృత్తిః = కారకమును ప్రతిపాదించుచు, సత్త్వనిబంధనః = ద్రవ్యమును బోధించుటకు ఉద్దేశింపబడిన, శబ్దః = శబ్దము, యః = ఏది కలదో, సః = ఆ శబ్దము, ప్రధానభూతస్య = ముఖ్యమైన, సాధ్యస్య = క్రియారూపమగు, అర్థస్య = అర్థమును, వాచకః = బోధించునది, న = కాదు.

వి. 'సాధనము' అనగా క్రియను పుట్టించునది. (సాధ్యతే—అనేన = దీని మూలముగా క్రియపుట్టును) కర్త, కర్మ, కరణము, మొదలగుకారకములు సాధనము లనబడును. సత్త్వమనగా ద్రవ్యము. స్త్రీలింగము, పుంలింగము మొదలగులింగము, ఒకటి, రెండు మొదలగుసంఖ్యయు కలది ద్రవ్యమగును. సాధ్యమనగా క్రియ—లేక - వ్యాపారము. ఏ వాక్యములోఅయినను, కారకము అప్రధానముగాను, క్రియ ప్రధానముగాను ఉండును. అందుచేత శబ్దమును ప్రయోగించకుండ, సాధనముమాత్రమే సాధ్యమునుకూడ బోధించ

ననుట సమంజసముకానేరదు. 'ఒకేపదము (కారకము) సాధనము, సాధ్యము అను పర స్పరవిరుద్ధములగు అర్థములను ఏకకాలములో ఎట్లు బోధింపగలుగును?' (కాగా 'ద్వారమ్' అనుపదమే 'పిధేహి' అను క్రియాపదముయొక్క అర్థమునుకూడ బోధించుట కుదరదు) అని భావము.

"కాగా ఏకపదస్థలములలో అవశ్యకమైన శబ్దమును కలుపుకొనియే వాక్యార్థమును సంపాదింపవలయును" అని మీమాంసకుడు తన మతమును పూర్తి చేయుచున్నాడు.

స్వార్థమాత్రం ప్రకాశ్యాసౌ సాకాంక్షో వినివర్తతే
అర్థస్తు తస్య సంబంధీ ప్రకాశయతి సన్నిధిమ్ . ౩౩౫

అసౌ = ఈ శబ్దము (కేవలము నామవాచకము కాని, కేవలము క్రియాపదము కాని), స్వార్థమాత్రమ్ = తన అర్థమునే, ప్రకాశ్య = బోధించి, సాకాంక్షః = తనతో అన్వయించుటకు తగినఅర్థమును అపేక్షింపుచు, వినివర్తతే = వెడలిపోవును (వేరొకఅర్థమును బోధింపక ఊరకుండును). తస్య = ఆ శబ్దమునకు, సంబంధీ = సంబంధించిన, అర్థః + తు = అర్థమైతే, సన్నిధిమ్ = అన్వయమునకు తగిన, ఆవశ్యకమైన, అర్థముయొక్క చేరికను, ప్రకాశయతి = స్పష్టపరచును. (యోగ్యమైన శబ్దముమూలముగనే తెలియజేయును).

భా. నామవాచకమునైనా, క్రియావాచకమునైనా, ఒక్కదానినే వాడినపుడు, అది తన అర్థమునుమాత్రమే బోధించి ఊరకుండును. మిగిలిపోయిన ఆవశ్యకార్థములన్నియు, ప్రకరణాదుల సాయముతో తమతమ శబ్దములను తీసికొనివచ్చి, వానిమూలముననే అన్వయించును.

వి. కాగా 'ఒక్కపదమే వాక్యముకావచ్చును' అనుట కుదురదు. 'శ్రుతార్థాపత్తి' అను ప్రమాణము మూలముగా ఆవశ్యకమైన శబ్దములను తీసికొనిరాక తప్పదు.

ఈ కారికతో మీమాంసకుల పూర్వపక్షము ముగిసినది. దీని సారాంశమిది :

1. "శబ్దార్థసంబంధము నిత్యము" అను శాస్త్రము విరోధించును.
2. సాధనము, సాధ్యముకూడ ఒకే పదమువలన బోధింపబడుట మంచిదికాదు (కుదరదు).
3. ఒక శబ్దము తన అర్థమునే బోధించునుగాని, అన్వయమునకు ఆవశ్యకమైన అర్థములను అన్నింటిని బోధింపదు.
4. "శ్రుతార్థాపత్తి"ని (ఆవశ్యకమైన శబ్దములను ఆక్షేపించి వాని అర్థములను కలుపుకొనుట) ఆశ్రయించుట తప్పనిసరి.

శ్రుతార్థాపత్తి నంగీకరించు మీమాంసకుని అఖండవాది తిరస్కరించుచున్నాడు.

పారార్థ్యస్యావిశిష్టత్వాన్న శబ్దాచ్ఛబ్దసన్నిధిః
నాఽర్థాచ్ఛబ్దస్య సాన్నిధ్యం న శబ్దాదర్థసన్నిధిః . ౩౩౬

పారార్థ్యస్య=వేరొక ప్రయోజనము ఉండుట (ఉద్దేశించిన ఫలము ప్రత్యేకముగా ఉండుట అనగా శబ్దము తన అర్థమును చెప్పుట, ఆవశ్యకమైన మరియొక్క శబ్దమును ఆక్షేపించుట అను అంశములు), అవిశిష్టత్వాత్=సమానమైనందున (అన్నిశబ్దములకు సమానమేగాన), శబ్దాత్=ఒక శబ్దమువలన, శబ్దసన్నిధిః = మరొక శబ్దము యొక్కరాక,

(ఆక్షేపము) న=కలుగదు, అర్థాత్=అర్థమువలన, శబ్దస్య=శబ్దముయొక్క, సాన్నిధ్యమ్=లాభము (ఆక్షేపము), న = కలుగదు, శబ్దాత్ = శబ్దమువలన, అర్థసన్నిధిః = అర్థము యొక్క లాభము, న = సంభవింపదు.

తా. "ద్వారమ్" అను పదమువలన "పిధేహి" అనుపదము (ఆపదము లేనిదే అర్థము పూర్తి కాదు కాన ఆపదము ఆక్షేపించబడును) తప్పని సరిగా అర్థాపత్తిచే ఆక్షేపించ బడునన్న మీమాంసకుల వాదము నిలువదు. అది యుక్తియుక్తము కాదు. ప్రతి యొక శబ్దమునకును తన అర్థమును బోధించుట, అవశ్యకమైన మరియొక శబ్దమును (దాని అర్థమును) అపేక్షించుట అను అంశములు సమానముగనే ఉండును. అయినను అట్టిస్థలములలో ("ద్వారమ్" మొదలగు ఏకపదవాక్యములలో) "శబ్దమును ఆక్షేపించునని" గాని, "అర్థము శబ్దమును ఆక్షేపించును" అనిగాని "శబ్దము అర్థమును ఆక్షేపించును" అనిగాని చెప్పుట కుదరదు. "ప్రత్యర్థం శబ్దనివేశః" (ప్రతి యొక అర్థమునకు ఒక శబ్దము ఉండక తప్పదు) అను మీమాంసకుల న్యాయము వారికే ఎదురు తిరుగును. ఎందువల్లననగా—శబ్దమునకు తనముఖ్యార్థమును చెప్పుటయే ప్రధాన ప్రయోజనము. అంతతో దానిపని నెరవేరును. ఇంకొక శబ్దమునుగాని, అర్థమును గాని అది ఆక్షేపించుటకు సమర్థముకాదు. ఇట్లే అర్థము కూడ తనను చెప్పు శబ్దమును తీసికొనినచ్చి, బలహీనమైపోవును. కాగా శబ్దార్థముల సహజ ధర్మము లంతటను ఒకే విధముగా ఉండునుగాన అవి తమకు దూరముగా ఉండు (పూర్తిగా వేరైన) శబ్దార్థములను ఆక్షేపించ జాలవు.

వి. ఖండవాక్యమును, ఖండవాక్యార్థమును అంగీకరించి మీమాంసకుల మీదివాదమునకు ఇది ఖండనము : 'ద్వారమ్' మొదలగు ఏకపదప్రయోగములలో అర్థాపత్తివలన, 'పిధేహి' మొదలగుపదములకు ఆక్షేపముకలిగి, సంపూర్ణవాక్యములగునని వారందురు. కాని వారు చూపు ఆక్షేపమను రీతి కుదరనే కుదరదు. చూడుడు :

1. శబ్దమే వేరొకశబ్దమును ఆక్షేపించుట సంభవింపదు. ఉచ్చరించిన పదము తన అర్థమును చెప్పుటతో దానిపని నెరవేరును.

2. అట్లే ప్రకృతమైన అర్థము తనను బోధించు శబ్దమునుమాత్రమే ఆక్షేపించ గలదుగాని, సంకేతసిద్ధముకాని వేరొకశబ్దమును ఆక్షేపించజాలదు. కాన అర్థము శబ్దమును ఆక్షేపించు ననుట ఆసంభవము.

3. అట్లే శబ్దము తన అర్థమునే చెప్పి ఊరకుండును గాన, దానివలన వేరొక అర్థము ఆక్షేపించబడు ననుటయు అసంగతము.

అందువలన 'శ్రుతార్థాపత్తి' అని మీమాంసకులు ప్రతిపాదించుస్థలములలో శబ్దము శబ్దమునుగాని, అర్థము శబ్దమునుగాని, శబ్దము అర్థమునుగాని ఆక్షేపించుట పొసగదు.

కాగా "అఖండవాక్యము, అఖండవాక్యార్థము అనునవే సత్యములు. ద్వారమ్, మొదలగు ఏకపదప్రయోగములు వాక్యఖండములని అనకూడదు. అవియు అఖండవాక్యములే. అట్టిచోటులందు ఉచ్చరించిన ఒక్కపదమే సంపూర్ణార్థమును బోధించును. (అభిమతమైన 'పిధేహి' మొదలగు శబ్దముల అర్థములను ఒక్కపదమే సూటిగా తెలియజేయును) ప్రకరణాదులసాయముతో సంపూర్ణార్థమును చెప్పు శక్తి ఆ ఒక్కపదమునకే ఉండుననవలయును" అని అభిసంధి.

మీమాంసకుల అర్థాపత్తిని దూషించుటకై మూడు రకములను (అభిప్రాయములను) ఊహించి—వాని నన్నింటిని ఈ కారిక తిరస్కరించినది.

1. శబ్దమువలన శబ్దమునకు ఆక్షేపము,
2. అర్థమువలన శబ్దమునకు ఆక్షేపము,
3. శబ్దమువలన అర్థమునకు ఆక్షేపము,

అనునవి మూడు వికల్పములు. శబ్దార్థములకు ఉండు వాచ్యవాచకభావ మను సంబంధము (వాచకము = శబ్దము, వాచ్యము = అర్థము), దానిస్వభావమును బట్టి, శబ్దము గాని అర్థము గాని తనకు సంబంధించని వేరొకదానిని ఆక్షేపించుట అసంగతమని ప్రకృతఖండనము యొక్క సారము.

ఇక 'అర్థము అర్థమును ఆక్షేపించును' (పిదప ఆ అర్థములను భావించుకొన వచ్చును)అనురీతిని నాలుగవ వికల్పమును కూడ చూపవచ్చును కాని అది ఈ సందర్భములో బొత్తిగా అతకదు. అతీరు నైయాయికుల అనుమాన ప్రమాణమే అయిపోవును. వాచ్య వాచక భావముగల శబ్దార్థముల విషయములో ఆవిధమైన అనుమానము నప్పదు. ('ఒకే పదము-సమగ్రార్థమును బోధించును' అను ప్రకృతసిద్ధాంతములో శబ్దమొకటి తప్పక ఉచ్చరింప బడవలెను గదా!)

మరల మీమాంసకుడు ఆక్షేపించుచున్నాడు.

> నష్టరూపమి వాఖ్యాత మాక్షిప్తం కర్మవాదినా
> యది ప్రాప్తం ప్రధానత్వం యుగపద్భావసత్త్వయోః. 387

ఆఖ్యాతమ్ = క్రియాపదము (తిఙంతము), నష్టరూపమ్ + ఇవ = స్వరూపము పోయినదా-అన్నట్లు (వాడనక్కరలేకుండానే), కర్మవాదినా = కర్మను చెప్పు పదముచేతనే, ఆక్షిప్తమ్ = కల్పించబడినది (తెలియబడునది), యది = అయినచో, భావసత్త్వయోః = క్రియకు, ద్రవ్యమునకును, ప్రధానత్వమ్ = ప్రాముఖ్యము, యుగపత్ = ఒక్కసారిగా, ప్రాప్తమ్ = ప్రాప్తించును.

తా. 'ద్వారమ్' మొదలగు కర్మపదమును మాత్రమే ఉచ్చరించిన స్థలములలో 'పిధేహి' మొదలగు క్రియాపదమును తెచ్చుకొనక్కర లేకుండగనే సంపూర్ణమగు వాక్యార్థము లభించునని చెప్పినయెడల, సుబంతమే తిఙంతముయొక్క అర్థమును కూడ చెప్పినట్లు అగును గాన, ద్రవ్యమునకు క్రియకును భేదమే లేకుండపోయెడిని.

వి. ఈ కారిక మరల మీమాంసకుల ఆక్షేపమును చూపును.

లింగము, సంఖ్యయు గలది ద్రవ్యమని, వ్యాపారము క్రియ అనియు నిర్వచింతురు. ద్రవ్యమునకు సత్త్వమని, క్రియకు భావమనియు నామాంతరములు. వాక్యమందు క్రియయే ప్రధానమని, ద్రవ్యము అప్రధానమనియు వైయాకరణుల సిద్ధాంతము. అయినపుడు క్రియాపదమును వాడకుండగనే, వాక్యము సంపూర్ణమగునని అంగీకరించినచో, ఉచ్చరించిన ద్రవ్యవాచక పదమే క్రియను కూడ బోధించునని పర్యవసించును. కాగా ఆ రెండింటి యొక్క ప్రత్యేకతయు నశింపవలసివచ్చును. (రెండును ఒకటే అనవలసివచ్చును:)

'క్రియాప్రధాన మాఖ్యాతమ్' (ఆఖ్యాతమ్ = తిఙంతము, క్రియాప్రధానమ్ = వ్యాపారమునే ముఖ్యముగా బోధించును), 'సత్త్వప్రధానాని నామాని' (నామాని = సుబంతములు, సత్త్వ ప్రధానాని = ద్రవ్యమునే ముఖ్యముగా చెప్పును), 'ప్రధానం వ్యాపారః' (వాక్యములో క్రియయే ముఖ్యము) అను వచనములు వైయాకరణుల మతమును ప్రతిపాదించును. అట్లే ద్రవ్యమును 'సిద్ధము' (సిద్ధముగా ఉండునది) అని, క్రియను 'సాధ్యము' (చేయదలచిన పని) అనియు వైయాకరణులు వ్యవహరింతురు.

కాగా 'విధేహి' అను క్రియాపదముయొక్క అర్థమును కూడ "ద్వారమ్" అను సుబంతము (కలుపుకొని) చెప్పునన్నచో, సుబంతములకు, తిఙంతములకును భేదమే లేదని తేలునుగాన, వాని వాడుక 'కలగూరగంప'గా తయారగును. వైయాకరణుల సిద్ధాంతములు, ప్రత్యేకలక్షణములు, నియమములు అన్నియు పాడైపోవునుగదా ! 'యత్ర సాధనవృత్తి ర్యః' (334) మొదలగు శ్లోకముయొక్క భావమునే మరొకరీతిలో ఈ శ్లోకము ప్రతిపాదించినది.

అఖండవాది సమాధానమును ఈ కారిక చూపుచున్నది.

తైస్తు నామసరూపత్వ మాఖ్యాత స్యోపవర్ణ్యతే
అన్వయవ్యతిరేకాభ్యాం వ్యవహారో విభజ్యతే. 333

ఆఖ్యాతస్య = తిఙంతమునకు (క్రియాపదమునకు), నామసరూపత్వమ్ = సుబంతముతో సాదృశ్యము (నామవాచకముయొక్క ఆకారమును కలిగియుండుట), తైః + తు = వారిచే (వైయాకరణులచే), ఉపవర్ణ్యతే = చెప్పబడును. అన్వయవ్యతిరేకాభ్యామ్ = అన్వయ వ్యతిరేకమువలన, (ఉండుట—లేకపోవుట అను వివేచనమునుబట్టి)—అనగా సుబంతముల యొక్క, తిఙంతములయొక్కయు ప్రసిద్ధమైన ప్రయోగరీతిననుసరించి, వ్యవహారః = ఆయా పదములవాడుక, విభజ్యతే = వేరుచేయబడును. (విడివిడిగా నిశ్చయింపబడును).

తా. 'ద్వారమ్' అను కర్మపదమునుమాత్రమే వాడిన వాక్యములో— ఆ పదమే 'విధేహి' (మూయుము) అను క్రియాపదమని అనుకొనవలెను. వాక్యములో క్రియయే ముఖ్యము కాన, 'ద్వారమ్' అను పదమే 'విధేహి' అను పదముయొక్క అర్థమును బోధించుటకై వాడబడినదని భావనచేసికొనవలెను. (క్రియాపదమునకు బదులుగా నామవాచకమును వాడి, దానివలన క్రియారూపమగు అర్థమునుపొందుట. తిఙంతమునకు నామవాచక సాదృశ్యమనగా ఇదియే). కాగా 'ద్వారమ్' అనగా 'విధేహి' అనియే అర్థము. ఇట్లు నామవాచకమును క్రియావాచకముగా మార్చుకొనవలెను. (పిదప 'ద్వారమ్' అనుదానిని మరొకసారి భావనచేసికొన్నచో, అదియే కర్మనుకూడ చెప్పగలుగును. అట్లు వాక్యార్థము పూర్తిఅగును). అట్లయినచో నామపదములకు, క్రియాపదములకును సాంకర్యమేర్పడి, వ్యామోహము కలుగునేమో—అని శంకింపనక్కరలేదు. 'త్వం ద్వారం విధేహి' మొదలగు పూర్తివాక్యముల అనుభవమునుబట్టి, 'ఇది నామవాచకము ఇది క్రియాపదము'—అను విభాగము, నిశ్చయమును కలుగుచునే ఉండును.

వి. మీమాంసకుల పైఆక్షేపమునకు వైయాకరణు లిచ్చు సమాధాన మిది : "నామాఖ్యాతసరూపా యే కార్యాంతరనిబంధనాః" (316)అనుకారికలో వివరించినరీతి ననుసరించి, (అశ్వః అను పదమును సుబంతముగను, తిఙంతముగనుకూడ వాడునట్లు—అశ్వః = గుర్రము, అశ్వః = నీవు వెళ్ళితివి) 'ద్వారమ్' అను ఒకపదమునే రెండువిధములుగను

వాడుకొనవచ్చును. అందుకుగాను మీమాంసకుల 'శ్రుతార్థాపత్తి' అను మార్గమును అవలంబింప నక్కరలేదు. సుబంతతిఙంతముల వివేచనమును అన్వయవ్యతిరేకముల మూలముగా, సులభముగానే పొందవచ్చును.

అన్వయః = ఉండుట—అనగా ఒకటి ఉన్నపుడు దానికి సంబంధించిన వేరొకటి తప్పనిసరిగా ఉండుట, వ్యతిరేకః = లేకుండుట = ఒకటిలేనపుడు దానికిసంబంధించిన వేరొకటి తప్పక లేకుండుట. అన్వయమును సూటిగాచెప్పి, వ్యతిరేకమును త్రిప్పి చెప్పుదురు. ఉదాహరణము: 'పొగఉన్నచోట నిప్పు తప్పక ఉండును' - అది అన్వయము. 'నిప్పులేని చోట పొగ ఎప్పుడును ఉండదు' - ఇది వ్యతిరేకము. ఈ తీరు నుపయోగించుకొని, వాక్యములలోని సుబంతతిఙంతములను విశకలితముగా తెలిసికొనవచ్చును.

కాగా—ప్రకృతమున 'ద్వారమ్' అనుపదము ప్రక్కను 'పిధేహి' అను పదమున్నచో, ద్వారశబ్దమునకు ద్వారమను ద్రవ్యార్థమును, 'పిధేహి' అను పదములేనపుడు, 'మూయుము' అను క్రియార్థమును చెప్పుకొనవచ్చును. అట్టే ప్రకృతి ప్రత్యయవిభాగమును కూడ పొందవచ్చును. కావుననే 'సిద్ధము—సాధ్యము ఒకటైపోవును' 'సుబంతము తిఙంతమెట్లగును' మొదలగు శంకలకు అవకాశములేదు.

'పిధేహి' అను ఒకక్రియాపదమును మాత్రమే వాడినపుడుకూడ ఇట్టి పద్ధతిని ఊహించుకొని అన్వయించుకొనవలెను. 'త్వం ద్వారం పిధేహి' అను సమగ్రవాక్యము వలెనే 'ద్వారమ్', 'పిధేహి' అను విడివిడిపదములు కూడ సమగ్రవాక్యములే అగును.

"ద్వారమ్" మొదలగు చోట్ల సంశయము కలిగినను, ప్రకరణాదులవలన అర్థమును నిశ్చయింప వీలగునని అనుచున్నాడు.

నచాఽపి రూపాత్సందేహే వాచకత్వం నివర్తతే
అర్ధం పశోరివ యథా సామర్థ్యాత్తద్వికల్ప్యతే. ౩౩౭

రూపాత్ = శబ్దముయొక్క ఆకారమునుబట్టి, సందేహే + అపి = అర్థమువిషయమున సంశయము కలిగినను, వాచకత్వమ్ = అర్థమును సూటిగాబోధించుట, న + చ + నివర్తతే = పోదుకాదు. 'అర్ధమ్-పశోః-ఇవ' యథా = 'అర్ధంపశోరివ' (అర్ధమ్ = సగము, పశోః = పశువుయొక్క, ఇవ = వలె) అను వాక్యమందువలె, సామర్థ్యాత్ = సామర్థ్యము వలన (కావలసినఅర్థమును బోధించుశక్తి, ప్రకరణము మొదలగు ఉపాయమువలన), తత్ = ఆ వాచకత్వము, వికల్ప్యతే = నిశ్చయింపబడును.

తా. "మీదికారికలో చెప్పినట్లు 'ద్వారమ్' అను పదము కొన్నిచోట్ల (ఆ ఒక్క పదమునే వాడిన వాక్యములో) క్రియాపదముయొక్క అర్థమును చెప్పును" అని ఒప్పుకొన్నచో, ఆ పదముయొక్క నిశ్చితార్థమునుగురించి సంశయముకలుగవచ్చును. (మరి కొన్నిచోట్ల 'ద్వారమ్' అనునది ద్వితీయైకవచనముగా వాడబడునుగదా!) కాని సామర్థ్యము, ప్రకరణము, మొదలగు పూర్వముచెప్పిన ఉపాయములతో ప్రకృతార్థమును నిశ్చయించుకొనవచ్చును కాన, అట్టి సంశయము తీరిపోవును.

"దేవదత్తస్య అర్ధం పశోః ఇవ" అను వాక్యమందు కలుగుసంశయమును (దేవదత్తునియొక్క సంగోరుభాగమా? లేక పశువుయొక్క సంగోరుభాగమా? అని సందేహము)

సామర్థ్యాదుల సాయముతోనే తీర్చుకొందురు (ప్రకరణాదులవలన, దేవదత్తునియొక్క సంగోరుభాగము పశువువలె ఉన్నదని కాని, పశువుయొక్క సగముభాగము దేవదత్తునివలె ఉన్నదని కాని నిశ్చయించుకొందురు).

వి. "శబ్దముయొక్క ఆకారము (వర్ణక్రమము) ఒకేవిధముగా ఉన్నచో, అర్థమునుగురించి సంశయము ఏర్పడి, తుదకు ఎట్టి యర్థమును చెప్పలేక, ఆ శబ్దము 'అవాచకము' కావలసివచ్చును" అని మీమాంసకు లందురు. వారి కిది సమాధానము : రూపసాదృశ్యమునుబట్టి అర్థమువిషయమున సంశయము కలిగినంతమాత్రముచేత ఒకశబ్దముకాని, ఒక వాక్యముకాని, అవాచకము (ఏ అర్థమును చెప్పనిది) కానక్కరలేదు. ప్రకరణాదుల సాయముతో అట్టిచోట్ల అర్థమును నిశ్చయించుకొని, వాచకత్వమును నిలబెట్టుదురు (ప్రకరణాదులు అర్థమును నిర్ణయించునని 314, 315,316, కారికలు వివరించినవి). ప్రకరణాదులసాయము ఇంచుమించు అన్నిస్థలములందును ఆవశ్యకమే అగుచుండును. అది లేనిచో ప్రతియొక ప్రయోగములోను, పదమువిషయమునగాని వాక్యమువిషయమునగాని ఏదో యొకసంశయము కలుగుచునేఉండును గాన, అవన్నియు అవాచకములు కావలసివచ్చును. ఇట్టి సందర్భమునకు ఉదాహరణముగా "అర్ధంపశోరివ" అను వచనము చూపబడినది. ఇందు "దేవదత్తస్య" అను షష్ఠ్యంతమును కలుపుకొనవలెను. (లేక ఏదో ఒక వృత్తిని చెప్పు షష్ఠ్యంతము చేర్చవలెను. అపుడే సంశయమునకు అవకాశము).

ప్రకృతమున "ద్వారమ్" అను ఒక పదమునే వాడినచోట, "పిధేహి"(మూయుము) అనునది అర్థమని, "త్వం ద్వారం పిధేహి" అనుస్థలములో "ద్వారమును" అని అర్థమనిన్ని సామర్థ్యమునుబట్టి నిశ్చయించుకొనవలయును.

శ్రుతార్థాపత్తిని అంగీకరించు మీమాంసకుడు మరల ఆక్షేపించుచున్నాడు.

సర్వం సత్త్వపదం శుద్ధం యది భావనిబంధనమ్
సంసర్గే చ విభక్తోఽస్య తస్యాఽర్థో న పృథగ్యది. 340

క్రియాప్రధాన మాఖ్యాతం నామ్నాం సత్త్వప్రధానతా
చత్వారి పదజాతాని సర్వ మేత ద్విరుధ్యతే. 341

శుద్ధమ్ = కేవలమైన, (ఆఖ్యాతపదముతో విరహితమైన) సర్వమ్ = ప్రతియొక, సత్త్వపదమ్ = ద్రవ్యవాచకపదము ("ద్వారమ్" మొదలగునది), భావనిబంధనమ్ = క్రియాపరమైనది (క్రియనుచెప్పునది), యది=అయినచో, సంసర్గే + చ=క్రియాపదముతో సంబంధమున్నపుడు, అస్య = ఈ నామవాచకమునకు, తస్య = ఆ క్రియావాచకమునకు, విభక్తః= వేరుచేయబడిన, అర్థః=అర్థము, పృథక్ = వేరుగా, న + యది = లేకపోయినచో,

ఆఖ్యాతమ్ = తిఙంతము (క్రియాపదము), క్రియాప్రధానమ్ = క్రియను ముఖ్యముగా బోధించునది అను అంశము, నామ్నామ్ = సుబంతములకు, సత్త్వప్రధానతా = ద్రవ్యము ముఖ్యముగా ఉండుట అను అంశము, పదజాతాని=పదసమూహములు, చత్వారి= నాలుగువిధములు అను అంశమున్ను (నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము అని నాలుగువిధములు), ఏతత్ = ఈ, సర్వమ్ = అంతయు, విరుధ్యతే= విరోధించును (ఎదురు తిరుగును).

తా. మీమాంసకులు మరల ఇట్లు ఆక్షేపించుచున్నారు.

ఇంతవరకు జరిగిన చర్చవల్ల కేవలము సుబంతమైనను (ద్వారమ్), కేవలము తిజంతమైనను (వర్షతి) వాక్యము కావచ్చునని, శేషించినపదముల అర్థమును, ఉచ్చరించిన పదమొక్కటే చెప్పగలుగుననియు వైయాకరణులమతమని తెలినది. అట్లయినపుడు ఒకచో సుబంతము తిజంతముగను, వేరొకచో తిజంతము సుబంతముగను పనిచేయును. సుబంతములకు, తిజంతములకును వేరువేరు అర్థ మనుభావము పొడయి - ప్రత్యేకత నశించి సాంకర్య మేర్పడును. "క్రియాప్రధాన మాఖ్యాతమ్" "సత్త్వప్రధానాని నామాని" "చత్వారి పదజాతాని—నామాఖ్యాతే చ—ఉపసర్గనిపాతా శ్చ" అను చిరప్రసిద్ధములైన వైయాకరణ సంప్రదాయములకే భంగము వాటిల్లును.

వి. క్రియాపదము చెప్పవలసిన అర్థమును నామపదము, నామవాచకము చెప్పదగిన అర్థమును క్రియాపదమున్ను చెప్పుట ప్రారంభించినచో వానికి వేరువేరుగా లక్షణములను చూపించుట, వాని ప్రయోగవిషయములో ఒకవిధమైన వ్యవస్థను ఆదరించుటయు వ్యర్థముకావలసివచ్చును. ముఖ్యముగా—నామము, ఆఖ్యాతముకూడ ఒకతీరుగనే పనిచేసినపుడు, "పదములు నాలుగువిధములు" అనులెక్క ఎట్లుకుదురును?—అని సారము.

"క్రియాప్రధాన మాఖ్యాతమ్" మొదలగులక్షణవాక్యములు యాస్కాచార్యుని 'నిరుక్త'మను గ్రంథములో ఉన్నవి. (చూడు: నిరుక్తము - 1, వ అధ్యాయము).

1. క్రియాప్రధాన మాఖ్యాతమ్ : ఆఖ్యాతమ్ = తిజంతము, క్రియాప్రధానమ్ = వ్యాపారమును ముఖ్యముగా చెప్పును.

2. సత్త్వప్రధానాని నామాని : నామాని = నామవాచకములు, (సుబంతములు) సత్త్వప్రధానాని = ద్రవ్యమును ముఖ్యముగా చెప్పును.

3. చత్వారి పదజాతాని - నామాఖ్యాతేచ ఉపసర్గ నిపాతాశ్చ : పదజాతాని = భాషయందలి పదములన్నియు, చత్వారి = నాలుగువిధములు. నామాఖ్యాతేచ-ఉపసర్గ నిపాతాశ్చ : నామవాచకము, క్రియాపదము, ఉపసర్గము, నిపాతము—అని.

ఉపసర్గము = క్రియాపదముతో సంబంధమునుకలిగి, ఒకానొక విశేషార్థమును సూచించునది. ప్ర, పరా, అను - మొదలగునది. ఉదా: ప్రభవతి, పరాజయతే, అనుకరోతి, మొదలగునవి.

నిపాతము : సముచ్చయము (కూడిక), నిర్ధారణము (నిశ్చయము), వికల్పము (సంశయము), మొదలగు అర్థములనుచెప్పు, చ - ఏవ - వా - మొదలగునవి. ఉదా : రామశ్చ లక్ష్మణశ్చ, సః ఏవ, శివో వా హరిర్వా మొదలగునవి.

పై ఆక్షేపణమును తిరస్కరించుచున్నాడు.

వాక్యస్య బుద్ధౌ నిత్యత్వ మర్థయోగం చ లౌకికమ్
దృష్ట్వా చతుష్ట్వం నాస్తీతి వార్తాక్షౌడుంబరాయణౌ. 342

బుద్ధౌ = బుద్ధియందు, వాక్యస్య = ఎట్టి అవయవములును లేని అఖండవాక్యము, నిత్యత్వమ్ = నిత్యమగుటను, దృష్ట్వా, = పరిశీలించి, లౌకికమ్ = లోకసిద్ధమైన (అనిత్యమైన) అర్థయోగమ్ = అఖండార్థముతోడి సంబంధమును, దృష్ట్వా + చ = పరిశీలించియు, చతు

ష్ట్వమ్ = నాలుగగుట (పదములు నాలుగువిధములను విభాగము) న + అస్తి + ఇతి = లేదు అని, వార్తాక్షౌదుంబరాయణౌ = వార్తాక్షుడు, ఔదుంబరాయణుడు అను ఇద్దరు ఆచార్యులు (చెప్పియున్నారు).

తా. ఏ విధమైనభాగములున్ను (సుబంతము, తిఙంతము, ఉపసర్గము, మొదలగు అవయవములు) లేని అఖండవాక్యము నిత్యము. అది బోధించు అర్థముకూడ అఖండమే. (సిద్ధాంతములో మట్టుకు అర్థము అసత్యమే; శబ్దమే అర్థముగా భాసించును) కావున పదములయు, పదార్థములయు ఉనికి కేవలము కల్పితము. కాగా 'పదములు నాల్గు విధములు' మొదలగు నియమములున్ను కల్పితములే.అవి వాస్తవములు కానందున ప్రతిబంధకములు కావు—ఈవిధముగా వార్తాక్షుడు, ఔదుంబరాయణుడు అను ప్రాచీనవైయాకరణులు తత్త్వమును బోధించి ఉన్నారు. అదియే మాకుకూడ (గ్రంథకర్తకు) సమ్మతము.

వి. మీమాంసకులకు ఇది సమాధానము: వర్ణము, ప్రకృతి, ప్రత్యయము, మొదలగు విభాగములన్నియు కృతకములు. అఖండమైనట్టి, వాక్యరూపముగా ఉండునట్టియు స్ఫోటశబ్దము మాత్రమే నిత్యము. దీనిని గుర్తించుటకే కల్పితమైన విభాగములన్నియు ఉపయోగించును. అట్లే అఖండవాక్యముయొక్క అర్థము కూడ, వ్యక్తియొక్క (చెప్పేవాడు—వినువాడును) బుద్ధియందు అఖండముగనే ప్రకాశించును. ఈ ప్రకాశమును 'ప్రతిభ' అని అందురు. ఇదియు ఒకవిధముగా అసత్యవస్తువే. (శబ్దమే అర్థముగా భాసించును గాన వేరుగా అర్థమనునది ఉండదు-చూడు : ద్వితీయకాండము—145 వ శ్లోకము) ఇది వైయాకరణుల సిద్ధాంతసారము. ఇదంతయు మొదటి కాండమందు, రెండవ కాండమందును ఆయా సందర్భములలో వివరింపబడినది. తదనుసారము పదముల విభాగములు, లక్షణములు మొదలగునవి అన్నియు వైయాకరణులకు లేనట్టివే, లేనివానితో—వారికి పని ఏమి?

"పదము" మొదలగు విభాగములు అన్నియు సత్యములని మీమాంసకు లందురు. వారి సిద్ధాంతములు వేరు. వానినిబట్టి వైయాకరణులను ఆక్షేపించుట అసంగతము.

'ఇట్లయిన శాస్త్ర మెందుకు ?' అనుశంకకు సమాధాన మిచ్చుచున్నాడు.

వ్యాప్తిమాంశ్చ లఘుశ్చైవ వ్యవహారః పదాశ్రయః
లోకే శాస్త్రే చ కార్యార్థం విభాగేనైవ కల్పితః . 848

వ్యాప్తిమాన్ + చ = అన్నిచోటులందును ప్రసరించునట్టియు, లఘుః + చ + ఏవ = సులభమైనట్టియు, పదాశ్రయః = పదములనుబట్టి జరుగు, (పదములను విభజించి చూపునట్టి), వ్యవహారః = వాక్యములయొక్క వాడుక, లోకే = లోకమందు (భాషయందు), శాస్త్రే + చ = వ్యాకరణశాస్త్రమందును, కార్యార్థమ్ = ప్రయోజనమును ఉద్దేశించి (సాధుశబ్దములను తెలిసికొనుట మొదలగు ప్రయోజనము), విభాగేన + ఏవ = ప్రకృతి, ప్రత్యయము, వాని అర్థము మొదలగు విభాగములతో, కల్పితః = కల్పింపబడినది.

తా. విభాగములన్నియు అసత్యమైనపుడు—వాక్యమును పదముగాను, పదమును ప్రకృతి + ప్రత్యయము అనురీతిని విభజించుటయు, వాక్యార్థ మిది, ఇది పదార్థము, ప్రకృతియొక్క అర్థమిది, ఇది ప్రత్యయముయొక్క అర్థము—అని విభజించి చూపుటయు

వైయాకరణులు ఎందుకు చేయుచున్నారు? అందుకై బయలుదేరిన వ్యాకరణశాస్త్ర మెందుకు? అను శంకలు పుట్టవచ్చును. వాని కిది సమాధానము: సాధుశబ్దములను, వాని అర్థములను సర్వతోముఖముగ, సులభముగ, అనాయాసముగను తెలిసికొనుటకు, ఆ ఉపాయములద్వార మున తుదకు సత్యమైన అఖండవాక్యమును తెలిసికొనుటకును — లోకమందుకాని, వ్యాకరణ శాస్త్రమందుకాని ఆయా విభాగములు ఉపయోగపడును. అంతమాత్రమున శాస్త్రము వ్యర్థమై పోదు. అది సత్యాన్వేషణకొరకు బయలుదేరిన ఒక సాధనము. అట్లే విభాగములు యథార్థ ములును కానేరవు. అవి అసత్యములే.

వి. వ్యాప్తిః అస్య అస్తి = వ్యాప్తిమాన్ = అన్నిచోటులందు ప్రసరింప గలది. వ్యాకరణశాస్త్రములోని ప్రక్రియ అంతయు వ్యాప్తిగలదియే. అనగా ఒక లక్షణము వలన లక్ష్యము లన్నియు తెలియును. ఉదా॥ ఒకసంధిలక్షణమువలన దానికిచెందిన లక్ష్యము లన్నియు తెలిసిపోవును. ఒకపదముయొక్క వ్యుత్పత్తి తెలిసినచో సజాతీయములగు పదము లన్నింటియొక్క వ్యుత్పత్తియు తెలిసిపోవును.

'పదపదార్థముల మూలముగనే జనులకు ప్రవృత్తినివృత్తులు కలుగుచుండునుగదా! కాగా పదపదార్థములు అసత్యము లనుట సమంజసమా?' అను శంకను తొలగించుచున్నాడు.

న లోకే ప్రతిపత్తౄణా మర్థయోగాత్ ప్రసిద్ధయః
తస్మాద లౌకికో వాక్యా దన్యః కశ్చి న్న విద్యతే. 844

లోకే = లోకమందు (భాషయొక్కవాడుకలో), అర్థయోగాత్ = సత్యమైన అర్థ ముతో సంబంధము ఉన్నందువలననే, ప్రతిపత్తౄణామ్ = తెలిసికొనువారియొక్క, ప్రసి ద్ధయః = ఆయా ప్రవృత్తులు (ఒకపనిచేయుట, మానుటయు), న = జరుగలేదు. (లేకపోయి నను జరుగుచున్నవి.) తస్మాత్ = అందువలన, వాక్యాత్ = సత్యమైన అఖండవాక్యము కన్న, అన్యః = వేరైన, అలౌకికః = సత్యమైనది, కశ్చిత్ = ఏదియు, న + విద్యతే = లేదు.

తా. "పదములు, వాని అర్థములును అన్నివిధముల అసత్యమైనపుడు, లోక మందలి వ్యవహారములలో వానిని పూర్తిగా విడిచిపెట్టుట జరుగదేమి? పదపదార్థమూలముననే అభిమతభావమును పొందుచున్నట్లు ఎందుకు అనిపించును?" అను శంకకు సమాధానము చూపుటకై ఈ కారిక బయలుదేరినది.

అసత్యమైన ఉపాయముతో కూడ, సత్యమైన విషయమును తెలిసికొనుట లోక ములో కనిపించును. ఉదా: పెద్దపులియొక్క బొమ్మను వేసి 'ఇది పులి' అందుము. బొమ్మ అను అసత్యమైన సాధనముతో సత్యమైన పులియొక్క జ్ఞానము కలుగును. వీలు కుదిరినపుడు వాస్తవమైనపులిని చూచినందువలననే "ఇది పులి" అను జ్ఞానము కలుగవచ్చును. కాని సత్యము సిద్ధించుటకు ఎల్లపుడును సత్యమైనసాధనమే ఉండవలయునను నియమము మాత్ర మక్కరలేదు. అందుచే అఖండవాక్యమే సత్యమైనది. దానిని తెలుపుటకు, పద పదార్థములు పరికరములుగా ఉపయోగించును. అవి సత్యములు కావు.

వి. వైయాకరణుల మతమున, సత్యమైన శబ్దబ్రహ్మమును తెలియుటకై ఉప యోగించు వర్ణ, పదాదిరూపములైన ఉపాయము లన్నియు అసత్యములే. కనుకనే 'ఉపేయ ప్రతిపత్త్యర్థాః ఉపాయా అవ్యవస్థితాః' (లక్ష్యమును పొందుటకుపయోగించు సాధనములు అని

యతములు) మొదలగు వచనములతో గ్రంథకర్త ఈ అభిప్రాయమును తరచు సూచింపు చుండును.

ఒకానొక జ్ఞాపకమువలన తెలియదగు అర్థముకూడ, వాక్యమువలననే పొందబడునని సూచించుచున్నాడు.

అన్యత్ర శ్రూయమాణైశ్చ లింగైర్వాక్యేషు సూచితాః
స్వార్థా ఏవ ప్రతీయంతే రూపాభేదా దలక్షితాః . 345

రూపాభేదాత్ = స్వరూపము ఒకటే అయినందువలన, అలక్షితాః = స్పష్టముగ తెలియబడని, స్వార్థాః + ఏవ = ప్రస్తుతమైన వాక్యముయొక్క పూర్తిఅర్థములే, అన్యత్ర = వేరొక, వాక్యేషు = వాక్యములలో (విశేషార్థమును సూచించు పదములచే), సూచితాః = సూచింపబడినవై, ప్రతీయంతే = తెలియబడును.

తా. కొన్నివాక్యములలో వాక్యార్థము పూర్తిగా తెలియుటకు, వేరొకవాక్యము లోని పదము (దానిఅర్థము) సూచకముగ ఉపయోగపడును. దానివలన సూచింపబడిన అర్థమునుకూడ కలుపుకొనిన తరువాతనే పూర్తిఅర్థము తెలియుచుండును. అయినను అట్టి చోట్లకూడ, ఉచ్చరించిన వాక్యముచేతనే సంపూర్ణార్థము లభించునని, సూచకమైన పదము, కేవలము అర్థమును నిర్ణయించుటకై అవలంబించు ప్రకరణాదులవంటి పరికరము మాత్రమే అనియు గ్రహింపవలెను.

వి. "వేరొక వాక్యమందలి సూచకమైన (జ్ఞాపకమైన) పదమును ఆపేక్షించు వాక్యములుకూడ సంపూర్ణవాక్యములే" అని విశదీకరించుట ఈ కారికయొక్క పని. యాగము నకు సంబంధించిన ఒకవాక్యమును ఉదాహరణముగా తీసుకొనవచ్చును. 'అక్తాః శర్కరాః ఉపదధాతి' (అక్తాః = జిడ్డుచేయబడిన, శర్కరాః = పటికబెల్లపుముక్కలను, ఉపదధాతి = ఉంచుకొనవలెను) ఇచట 'అక్తాః' అనగా 'జిడ్డుచేయబడినవి' అని అర్థము. జిడ్డుచేయుట 'నూనెతోనా? లేక నెయ్యితోనా?' అని సంశయము కలుగును. అది తీరుటకు 'తేజో వై ఘృతమ్' (ఘృతమ్=నేయి, తేజః + వై = కాంతియేగదా!) అను వేరొకవాక్యములోని 'ఘృతమ్' అను పదము సూచకముగ (లింగముగ) ఉపయోగించును. నేతిని పొగడుటచే 'నేతితో జిడ్డు చేయబడిన' అను అర్థము అభిమతమని స్ఫురించి, మొత్తము వాక్యార్థము నిస్సంశయముగ పూర్తిఅగును. ఇటువంటిసందర్భములలో కూడ, 'అక్తాః శర్కరా ఉపదధాతి' అనువాక్యమే 'ఘృతేన అక్తాః శర్కరా ఉపదధాతి' అను సమగ్రమైన అర్థమును బోధించునని, వాక్యాంత రమున ఉండు 'ఘృతమ్' అను పదము సూచకముమాత్రమే అనియు అనవలెను. 'అక్తాః' అను శబ్దరూపమునుబట్టి (ఘృతేన-అక్తాః, తైలేన-అక్తాః—అను రెండు ప్రయోగములలోను 'అక్తాః' అను పదమొకటే గాన) విశేషార్థము తెలియుట కష్టము కావున, అట్టి విశేషార్థము కొరకై సూచకమును స్వీకరించుట ఒక ఉపాయము.

లింగ్యతే = సూచ్యతే అనేన = లింగమ్. ఒక విశేషార్థమును సూచించు పదము. సూచకము, జ్ఞాపకము, గమకము, లింగము—అనునవి పర్యాయపదములు.

సామాన్యముగా వాడుకొను లౌకిక వాక్యముల విషయములో కూడ "అల్లక్కడ అపదమున్నది కనుక దానిని బట్టి, ఇక్కడ ఈ వాక్యమునకు ఈయర్థమునే చెప్పవలెను" అని సమన్వయింతుము. అర్థమును జ్ఞాపనము చేయురీతి అనగా ఇదియే.

వ్యాకరణసూత్రములలో జ్ఞాపకపదములుగలవి అధికముగనే ఉన్నవి. అయినను శాస్త్రీయ సంకేతము క్లేశకరమని, ఈ విషయమున సూత్రముల ఉదాహరణములను చూప లేదు. (ఆయాస్థలములందు శాస్త్రీయోదాహరణములను విడిచిపెట్టుట పాఠకులకు క్లేశమును పరిహరించుటకే).

కాగా—విశేషార్థమును సూచించుపదము ఆవశ్యకమైన వాక్యములు కూడ సంపూర్ణ వాక్యములే అని, వాక్యైకదేశములు (వాక్యఖండములు) కావనియు సారము.

శాస్త్రీయములగు వాక్యములలో బాధ్యబాధక భావముయొక్క తీరును నిరూపించు చున్నాడు.

ఉత్సర్గ వాక్యే య త్త్యక్త మశబ్దమివ శబ్దవత్
తద్బాధకేషు వాక్యేషు శ్రుత మన్యత్ర గమ్యతే. 846

ఉత్సర్గవాక్యే = సామాన్యవాక్యమందు, అశబ్దమ్ + ఇవ = బోధించుశబ్దములు లేవా—అన్నట్లుగను, శబ్దవత్ = బోధించుశబ్దములతో చెప్పినట్లుగను, యత్ = ఏ విషయము, త్యక్తమ్ = విడువబడునో, తత్ = ఆ విషయము, బాధకేషు = బాధించునట్టి, వాక్యేషు = విశేషవాక్యములందు, శ్రుతమ్ = వినబడినదై, అన్యత్ర = వేరొకచోట (సామాన్య వాక్య మందే), గమ్యతే = తెలియబడును.

తా. చెప్పదలచుకొన్న విషయము అన్నింటికిని వర్తించునట్లు ప్రతిపాదించు వాక్యము సామాన్యవాక్యము. ఉదా:- "అవులను పొలమునుండి యింటికి తీసుకొని రమ్ము." ఇచట "తీసికొని వచ్చుట" అవులన్నింటికిని ఉద్దేశింపబడినది. ఒక ప్రత్యేక విషయమును వెంటనే చెప్పి, ముందు చెప్పిన సామాన్య వాక్యమును అడ్డు పెట్టునట్టి వాక్యము బాధక వాక్యము లేక విశేషవాక్యము. ఉదా - "తెల్ల అవులను రెండింటిని పొలములోనే కట్టి వేయుము" ఇచట తెల్ల ఆవులను ఇంటికి తెచ్చుట, వారింపబడినందున మీది వాక్యమునకు ఇది బాధకమైనది. ఇట్టి రీతిని కూర్పబడిన వాక్యములను, సామాన్య విశేషవాక్యములు, బాధ్యబాధకవాక్యములు, ఉత్సర్గాపవాదవాక్యములు అను పేర్లతో వ్యవహరింతురు. లోకము లోపలనే ప్రతి యొక శాస్త్రమందును, ఏదో ఒక సందర్భమున సామాన్యవిశేషవాక్యములు ఉండకతప్పవు. అట్టి వాక్యములవలన కలుగు అర్థప్రతిపత్తిని ఈ కారిక విశదీకరించును.

విశేషవాక్యము యొక్క అర్థము కూడ, సామాన్య వాక్యము వలననే తొలుత పూర్తిగా అవగతమైపోవును. తరువాత విశేషవాక్యము వలన అది స్పష్టపడును. అనగా విశేష మెప్పుడును సామాన్యములోని భాగముగనే ఉండును. విశేషవిషయమును మొదట స్పష్టముగ చెప్పకపోయినను, తాత్పర్యమునుబట్టి చెప్పినట్లే అనిపించి, "విశేషము ఉండును" అని సామాన్య వాక్యమును విను వ్యక్తికి (ఉచ్చరించు వ్యక్తికిని) బోధపడును. ఉత్తర క్షణ ములో విశేషముచ్చరింపబడును. దాని భావము అపుడు విస్పష్టమగును. అయినను ఆ విశే షార్థము కూడ సామాన్య వాక్యము నుచ్చరించు క్షణములోనే సూచింపబడి, సంపూర్ణ వాక్యా ర్థము (సామాన్య విశేష వాక్యముల యొక్క మొత్తము భావము) తెలిసిపోవును. ఇందులో తాత్పర్యము (వాక్యమును ప్రయోగించువాని యొక్క మనసులోని ముఖ్యమైన భావము) మిక్కిలి సాయము చేయును.

"ద్వారమ్", "వర్షతి" మొదలగు వాక్యభాగములవంటివి అఖండవాక్యములు అగునట్లుగానే, సామాన్య విశేషవాక్యములు రెండును కలిపి, ఒకటే అఖండ వాక్యమని, అవి విడివిడి వాక్యములు కావని, వానివలన లభించునది అఖండవాక్యార్థమే అనియు సారాంశము.

వి. వ్యాకరణమునకు మూలమనదగిన అష్టాధ్యాయిని, ప్రధానముగ సామాన్య విశేషభావముగల సూత్రములతోనే పాణిని రచించెను. వానికి సంబంధించిన అర్థసమన్వయమును దృష్టిలో ఉంచుకొనియే భర్తృహరి ఈ కారికను దీనికి అనుబంధములుగా కొన్ని దిగువ కారికలను కూర్చినాడు. ఈ విషయమున అతి ప్రసిద్ధమైన సూత్రముల ఉదాహరణమును చూడుడు:—'ఆద్గుణః' (6-1-87) అను సూత్రము. 'అవర్ణా దచి పరే పూర్వపరయోః గుణః ఏకాదేశః స్యాత్' (దీక్షితుని వృత్తి) (అ, ఆ, అనువానికి అచ్చుపరమైనచో, పూర్వపర వర్ణములకు గుణము ఏకాదేశమగును. ఓ, ఏ, అ, అనునవి గుణసంజ్ఞకములు. సావర్ణ్యమునుబట్టి ఆదేశమువచ్చును. రమా + ఈశః = రమేశః, ఉప + ఇంద్రః = ఉపేంద్రః, మొదలగునవి ఉదాహరణములు). ఇది సామాన్యవాక్యము. 'వృద్ధిరేచి' (6-1-86) అను సూత్రము. 'ఆ దేచి పరే వృద్ధి రేకాదేశః స్యాత్, గుణాపవాదః' (వృత్తి) అ, ఆ, లకు ఏ, ఓ, ఔ, లలో ఏదోయొకటి పరమైనపుడు వృద్ధి ఏకాదేశమగును. ఆ, ఐ, ఔ, అనునవి వృద్ధి సంజ్ఞకములు. వర్ణసామ్యమునుబట్టి ఆదేశమువచ్చును. కృష్ణ + ఐశ్వర్యమ్ = కృష్ణైశ్వర్యమ్ మొదలగునవి లక్ష్యములు) ఇది విశేషవాక్యము. (ఇటువంటి సామాన్యవిశేషభావము గల సూత్రములు కొల్లలుగా ఉన్నవి). ఇట్టి స్థలములలోగూడ, సామాన్యవాక్యముయొక్క అర్థమువలననే, విశేషవాక్యార్థము అవగతమగును. "వృద్ధికి అవకాశమును విడిచిపెట్టి— మిగిలినస్థలములందే గుణమువచ్చును" అని ముందుగనే తెలియును, పిదప వెంటనే 'వృద్ధిరేచి' అనుసూత్రము వినబడి, ఆ విశేషము సుస్పష్టమగును.

ఉచ్చరించుటలో — సామాన్యవాక్యము ముందుగను, విశేషవాక్యము వెనుకగను ఉండుట సహజము. అట్లే విశేషార్థమును కూడగట్టుకొనియే (విశేషము తప్పక ఉండును. దానికి చోటును వేరుగాఉంచి, ఈ సామాన్యము ప్రవర్తించును — అని ఊహించి) సామాన్యార్థము తెలియుట, వెనువెంటనే విశేషార్థము స్పష్టమగుటయు సహజమే. ఈ భావమునే 'ప్రకల్ప్య చ అపవాదవిషయం తత ఉత్సర్గః ప్రవర్తతే' (విశేషముయొక్క చోటును విడిచిపెట్టి మిగిలినచోటులందే సామాన్యము ప్రవర్తించును) అను న్యాయముతో వైయాకరణులు వివరించుదురు.

బాధ్యబాధకభావమునే లోకదృష్టాంతముతో వివరించుచున్నాడు.

బ్రాహ్మణానాం శ్రుతి ర్దధ్ని ప్రక్రాంతా మాఠరం వినా
మాఠర స్తక్రసంబంధా త్తత్రాఽచష్టే యథార్థతామ్. 347

మాఠరమ్ = మాఠరుడను పేరుగల బ్రాహ్మణుని, వినా = విడిచి (తప్పించి,) దధ్ని = పెరుగువిషయమున, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులకు సంబంధించిన, శ్రుతిః = వచనము, ప్రక్రాంతా = ఆరంభింపబడినది, తక్రసంబంధాత్ = మజ్జిగతో సంబంధమునుబట్టి, మాఠరః = మాఠరశబ్దము, తత్ర = ఆ వాక్యమందలి, యథార్థతామ్ = వాస్తవమును, ఆచష్టే = చెప్పును.

తా. సామాన్యవిశేషవాక్యముల విషయములో, లోకసిద్ధమగు ఒక ఉదాహరణము ఇచట చూపబడినది:—'బ్రాహ్మణేభ్యో దధి దీయతామ్' (బ్రాహ్మణులందరకు పెరుగు వేయండి) ఇది సామాన్యవాక్యము. 'తక్రం మాఠరాయ' (మాఠరుడనే బ్రాహ్మణునికి మజ్జిగ వేయండి). ఇది విశేషవాక్యము. ఇచట మాఠరుని విడిచిపెట్టి, మిగిలినబ్రాహ్మణులందరకును పెరుగున్ను, మాఠరునికి మజ్జిగయు లభించును. సామాన్యవాక్యమును వినగానే ఏదో ఒక మినహాయింపు (విశేషము) ఉండునని ఊహించుట, వెంటనే విశేషవాక్యము చెవిని బడి, మినహాయింపు స్పష్టమై మొత్తము వాక్యార్థము అఖండముగ తెలియుటయు జరుగును.

వి. మొదట విశేషముచెప్పినట్లు భాసించినను, వెంటనే చెప్పుటచే సామాన్య విశేషవాక్యములు రెండును కలిపి, ఒకటే వాక్యమనీ విశేషవాక్యము సామాన్యవాక్యమునకు లింగమువలె (వాక్యార్థమును పూర్తిచేయుటలో సూచకము) ఉపయోగించును గాన, అది వేరే వాక్యము కాదనియు పర్యవసానము. అట్టే సామాన్యము విశేషము జోలికి పోకుండుటయే, 'బాధ' అనిపించుకొనును. వాస్తవముగా విశేషవాక్యమువలన కలుగు బాధ ఏదియు లేదు. (ఉత్సర్గము = సామాన్యము, అపవాదము = విశేషము, బాధ్యము = సామాన్యము, బాధకము = విశేషము—ఈ ప్రయోగములను సందర్భమునుబట్టి వివరించుకొనవలెను.)

సామాన్య వాక్యమునకు, విశేషవాక్యమునకును ఏకవాక్యతను ఆశ్రయించియే, బాధ్యబాధకభావమును నిర్ణయించవలయునని చెప్పుచున్నాడు.

అనేకాఖ్యాతయోగేఽపి వాక్యం న్యాయ్యాపవాదయోః
ఏకమేవేష్యతే కైశ్చి ద్భిన్నరూపమివ స్థితమ్. 848

న్యాయ్యాపవాదయోః = ఉత్సర్గాపవాదములకు చెందిన (వానిని బోధించు), వాక్యమ్ = వాక్యము, అనేకాఖ్యాతయోగే + అపి = ఒకటికిమించిన తిఙంతములతో సంబంధమున్నను, భిన్నరూపమ్ + ఇవ = వేరువేరు స్వరూపముకలిగినట్లుగా, స్థితమ్ = ఉన్న, ఏకమ్ + ఏవ = ఒకే వాక్యముగా, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = ఒప్పుకోబడుచున్నది (చెప్పబడుచున్నది).

తా. 'బ్రాహ్మణేభ్యో దధి దీయతామ్ తక్రం మాఠరాయ దీయతామ్' మొదలగు సామాన్యవిశేషవాక్యములలో క్రియాపదములను వేరువేరుగా వాడినను, అవి విడివిడి వాక్యములు కానేరవు;అవి రెండును కలిసి ఒకటే వాక్యమగును. ఎందుచేతననగా సామాన్య విశేషములు పరస్పరసాపేక్షములు (ఒకదానినొకటి కోరుకొనునవి). కాన ఆకాంక్ష, యోగ్యత, (తగిఉండుట) మొదలగు సాధనములనుబట్టి ఆ రెండింటిని ఒక వాక్యముగానే సిద్ధము చేసికొనవలయును. 'మాఠరునికి మజ్జిగను మిగిలినవారికి పెరుగును వేయుము' అన్న తీరులో ఒక క్రియాపదమునే వాడి, సమన్వయము చేసి ఏకవాక్యతను సంపాదించుటయే సమంజసము.

వి. ఇది కొందరిమతము. మీది రెండుకారికలున్ను 'సామాన్యవాక్యము ఒకటే అఖండము. విశేషవాక్యము సామాన్యమును పూర్తిచేయు లింగముమాత్రమే (జ్ఞాపకము వంటిది)' అను భావమును తెలిపినవి. 'సామాన్యవిశేష వాక్యములను వేరువేరుగా అంగీకరించినను, అవయవాఽవయవిభావముతో ఆ రెండును ఒకే వాక్యముగా మారును' అని ఈ కారిక వివరించినది.

వి. "ఎవరు ఎట్లు సమన్వయము చేసినను 'అఖండవాక్యము, అఖండవాక్యార్థము' అను సత్యమునకు రాక తప్పదు" అను భావము విశదమైనది.

'కాగా విధి నిషేధాదివాక్యములతో గూడ ఈ రీతినే అవలంబింపవలెను' అని ప్రతిపాదించుచున్నాడు.

నియమః ప్రతిషేధశ్చ విధిశేష స్తథా సతి
ద్వితీయే యో లుగాఖ్యాత స్తచ్ఛేష మలుకం విదుః . 349

తథా = ఆ విధముగా, సతి = అయినపుడు (ఉత్సర్గవాక్యమునకు, అపవాద వాక్యమునకును అంగాంగిభావమును అంగీకరించి, ఏకవాక్యతను చూపిన తీరులోనే), నియమః = నియమము, ప్రతిషేధః + చ = నిషేధముకూడ, విధిశేషః = విధివాక్యమునకు అవయవము, (అగును). ద్వితీయే = రెండవ అధ్యాయములో (పాణిని అష్టాధ్యాయిలో రెండవది), యః = ఏ, లుక్ = లోపము, ఆఖ్యాతః = విధింపబడినదో, తచ్ఛేషమ్ = దానికి అవయవమైనదానినిగా, అలుకమ్ = అలుక్కును ('కొన్నిచోట్ల లోపము ప్రవర్తింపదు' అను వచనమును), విదుః = తెలిసికొందురు.

తా. మీదికారిక వివరించిన విధములో సామాన్యవిశేషవాక్యములకు అవయవావయవిభావమును, ఏకవాక్యతను అంగీకరించినపుడు,—అదేతీరులో విధి నియమవాక్యములకు, విధినిషేధవాక్యములకును, అంగాంగిభావమును, ఏకవాక్యతను చెప్పుట సమంజసమగును.

'దీనిని చేయవలెను', 'ఇది ఇట్లు జరుగవలెను' అని ఒక అంశమును క్రొత్తగా చెప్పుట 'విధి' అనబడును. సహజముగ సిద్ధించు ఒక విషయమును కొంతవరకే పరిమితముచేయుట 'నియమము' అగును. 'దీనిని చేయకూడదు' అని ఒక విషయమును అడ్డుపెట్టుట 'నిషేధము' అనిపించుకొనును. లౌకికములగు కొన్ని ఉదాహరణములు వీనిని విశదీకరించును. 'దేవ మభిషించేత్' (దేవుని స్నానము చేయింపవలెను) ఇది విధివాక్యము. 'దేవం పర్వణి పయసా అభిషించేత్' (పర్వదినములలో దేవునికి పాలతోనే స్నానము చేయింపవలెను) ఇది నియమవాక్యము. 'కదాఽపి దేవం తైలేన నాఽభిషించేత్' (దేవునికి ఎప్పుడును నూనెతో అభిషేకము చేయరాదు) ఇది నిషేధవాక్యము. ఇటువంటి వాక్యములలో కూడ, విధివాక్యము ప్రధానమని (అవయవి), నియమవాక్యముకాని, నిషేధవాక్యముగాని దానికి అనుబంధములు (అవయవములు) అగుననియు తెలియవలెను. ఈ తీరునే 'శేషశేషిభావము' అనియు అందురు. (శేషము = అవయవము, శేషి = అవయవి) అనగా నియమవాక్యమున్నపుడు దానితోను, నిషేధవచనమున్నపుడు దానితోను, విధివాక్యమునకు ఏకవాక్యతను సంపాదింపవలెను.

అందుచే అష్టాధ్యాయిలోని రెండవ అధ్యాయములో ఉన్న "సుప్ ప్రత్యయము లోపము" ను విధించు సూత్రమునకు, ఆరవ అధ్యాయములో ఉన్న నిషేధ సూత్రము అవయవమై ఏకవాక్యతను బోధించును.

వి. విధినిషేధముల విషయములో కర్మకాండకు సంబంధించిన ఒక ఉదాహరణము : "పశు మాలభేత" (యాగమందు పశువును చంపవలెను) ఇది విధివాక్యము. "మా హింస్యాత్ సర్వాణి భూతాని" (జీవులను హింసింపకూడదు) ఇది నిషేధవాక్యము. ఈ రెండును వేదచోదితములే. కావున ఈ రెండిటిని ఒకే వాక్యముగ చేసి, "యాగమందు తప్ప, మరెప్పుడును జీవహింసచేయరాదు" అను అర్థమును చెప్పవలెను. లేకున్న విధి

నిషేధములకు సంబంధము కుదరక, రెండును వ్యర్థములై పోవును. నియమవిషయములో కూడ, ఇట్లే ఏక వాక్యతను ఊహించునది. విధి వాక్యమునకు అవయవమగుటనే "విధిశేష భావ" మనియు వ్యవహరింతురు. కాగా నియమము, నిషేధమున్ను విధిశేషములు.

అష్టాధ్యాయిలో రెండవ అధ్యాయమున "సుపో ధాతు ప్రాదిపదికయోః"(2-4-71)-(ఏతయో రవయవస్య సుపో లుక్ స్యాత్=ధాతువునకు, ప్రాతిపదికమునకును, అవయవముగా ఉన్న సుప్ ప్రత్యయము లోపించును) అనునది లోపమును విధించు సూత్రము. దీనికి "అలు గుత్తరపదే" (6-3-1) (ఉత్తరపదము పరమైనపుడు సుప్పునకు లుక్కు రాదు) అను నిషేధసూత్రమును శేషముగా చెప్పవలెను.

వి. విధి నియమములకు, విధినిషేధములకును ఇట్టి ఏకవాక్యతను స్వీకరించని యెడల, విధివాక్యము తన స్వభావము ననుసరించి తొలుత తనకు వీలున్న అన్ని చోటులందును ప్రవర్తించునుగాన, తరువాత బయలుదేరిన నియమముగాని, నిషేధముగాని ప్రయోజనము లేనిదగును. భోజనము ముగించినవానితో "భుజింపకుము" అనినచో లాభము లేదుగదా? (యో హి భుక్తవంతం ప్రతి బ్రూయాత్, "మా భుంక్థాః" ఇతి కిం తేన కృతం స్యాత్?" అనునది లోకన్యాయము = పూర్తిగా తినినవాని నుద్దేశించి "తినవద్దు" అన్నచో ఏమి ప్రయోజనము?)

నియమవిషయమును, నిషేధవిషయమును విడిచి, (వాని స్థలములను పరిహరించి) విధివాక్యము ప్రవర్తించుటయే ఏకవాక్యతవలన కలుగు ప్రయోజనము.

పదైకవాక్యత (పదములు పరస్పరము కలిసి ఒకే వాక్యమగుట), వాక్యైకవాక్యత (రెండు వాక్యములును తమ ప్రత్యేకతను చూపుచు ఒక వాక్యముగా ఏర్పడుట), అని ఏక వాక్యత విషయములో రెండు పక్షములున్నవి. వాని స్వరూప స్వభావములు గ్రంథ విస్తర భీతిచే విడువబడినవి. అట్లే పాణినీయ సూత్రములను ఉదాహరణములుగా తీసికొని, సమన్వయించుటయు విడువబడినది. (అవన్నియు పెద్ద వ్యాఖ్యానముల వలన తెలియదగినవి).

ఈ సందర్భమున వాక్యభేదము నంగీకరించు వ్యక్తి ఇట్లనుచున్నాడు.

నిరాకాంక్షాణి నిర్వృత్తౌ ప్రధానాని పరస్పరమ్
తేషా మనుపకారిత్వాత్ కథం స్యా దేకవాక్యతా ? 850

( విధినిషేధవాక్యములు - లేక - విధినియమవాక్యములు ) నిర్వృత్తౌ = తమ తమ అర్థమును పూర్తిగా చెప్పుటలో, పరస్పరమ్ = అన్యోన్యము, నిరాకాంక్షాణి=అపేక్ష లేనివి, (ఒకదానినొకటి ఆశించనవి) (కావున), ప్రధానాని=ముఖ్యములు (అగును). అనుపకారిత్వాత్ = ఒకదానిసాయ మింకొకదానికి ఆవశ్యకము కానందువలన, తేషామ్ = ఆవాక్యములకు, ఏకవాక్యతా = ఒకే వాక్యమగుట, కథమ్=ఎట్లు, స్యాత్ = అగును?

తా. ఈ కారికపూర్వపక్షమును చూపును. విధినిషేధ వాక్యములలో-లేక-విధినియమవాక్యములలో, ఒకదాని అపేక్ష వేరొకదానికి లేదు. అవి దేనికది స్వతంత్రముగనే అర్థమును బోధించును. కావున వానికి అవయవావయవిభావము కుదరదు. అయినపుడు ఆ రెండు వాక్యములకు ఏకవాక్యత ఎట్లు సిద్ధించును? (అవి విడివిడిగా రెండు వాక్యములని ఎందు కనగూడదు?)

వి. ఒక వాక్యమందలి పదములకు, ఆకాంక్ష (ఒకదానిని వేరొకటి ఆశించుట), యోగ్యత (తగియుండుట), సన్నిధి (సామీప్యము) మొదలగు ధర్మములు పనిచేసి, పరస్పర సమన్వయము సంభవించును. కాన అచట పదములకు, వాక్యమునకును అవయవావయవిభావ మును చెప్పుట సముచితమే. అట్లే ఏదో విధముగ ఉపకార్యోపకారక భావము ఉన్న వాక్య ములలో కూడ శేషశేషిభావమును అంగీకరింపవచ్చును. కాని విధి నియమ వాక్యముల విషయ మున, విధి నిషేధ వాక్యముల విషయమునను అన్యోన్యము అట్టి పరస్పరాపేక్ష ఉన్నట్లు కనపడదు. కావున అవి స్వతంత్రములగు వాక్యములే అనుట మంచిది.

ఏకవాక్యతను అంగీకరించు సిద్ధాంతి యొక్క ప్రతివచన మిది.

విశేషవిధినా ర్థిత్వా ద్వాక్యశేషోఽనుమీయతే
విశేషవ న్నివ ర్త్యేఽర్థే తస్మా త్తుల్యం వ్యపేక్షణమ్ . 851

అర్థిత్వాత్ = ఆకాంక్ష ఉన్నందువలన (వేరొక అంశమును కోరుచున్నందువలన) విశేషవిధినా=ఒక ప్రత్యేక విషయమును చెప్పు వాక్యముచే, వాక్యశేషః=వాక్యముయొక్క భాగమని ("ఈ విశేష వాక్యము సామాన్య వాక్యముయొక్క భాగము" అని) అనుమీయతే= ఊహింపబడును, తస్మాత్=అందువలన, విశేషవత్=ఒక ప్రత్యేకాంశమందువలె, నివర్త్యే= నిషేధింపదగు, అర్థే=విషయమున కూడ, వ్యపేక్షణమ్=ఆకాంక్ష (ఆశించుట), తుల్యమ్= సమానము.

తా. మీది పూర్వపక్షమునకు ఇది సమాధానము. సామాన్యము, విశేషమును ఎల్లప్పుడును పరస్పరాపేక్షములే (అవి ఒక దాని నొకటి తప్పక ఆశించుచుండును). సామాన్యముతో విశేషమును, విశేషముతో సామాన్యమును అనుమానించుట (ఊహించుట) సహజము. ఉదా: "పువ్వులను తెమ్ము" అను సామాన్యవాక్యము గులాబీలు, లేక సంపంగులు మొదలగు-ఉద్దేశింపబడిన పూవులను బోధించు వాక్యమును అపేక్షించును. "గులాబీ పువ్వులను తెమ్ము" అను విశేష వాక్యము, "మిగిలిన అన్ని రకముల పూవులను విడువుము" అను సామాన్య వాక్యమును ఊహించును.

ఈ తీరునుబట్టి విధినియమములు, విధి నిషేధములును సామాన్య విశేషముల వంటివే అగును. విడిచిపెట్టవలసిన అంశము స్పష్టముగ తెలియుటకై నియమముగాని, నిషేధముగాని విధివాక్యముతో కలియుటయే సముచితము (వాని వాని పరిధులు నిర్దిష్టముగ తెలియుటకై, వానికిని పరస్పరాకాంక్ష ఉండును). కావున అట్టి వాక్యములు అన్యోన్యము కలిసి ఒకే వాక్యముగ ఏర్పడునని చెప్పవచ్చును.

వి. ఉత్సర్గ వాక్యమునకు అపవాద వాక్యము శేషమగునట్లుగా, విధివాక్యమునకు నియమవాక్యము, నిషేధ వాక్యమును శేషములగును. పరస్పరాకాంక్ష ఉండుటయే అందుకు ముఖ్యమైన కారణము.

"వాక్యభాగములుగా (వాక్యైక దేశములు-లేక-వాక్యఖండములు) కనిపించునవి సంపూర్ణ వాక్యములే" అను విషయమును గురించిన చర్చ ఈ కారికతో ముగిసినది. అట్టి వాక్యములు నాలుగు విధములుగా ఉండవచ్చునని సారాంశము సిద్ధించినది.

1. కేవలము నామవాచకము : "వృక్షః" (తిష్ఠతి) అర్థప్రకరణాదులసాయ ముతో సిద్ధించునది.

2. కేవలము ఆఖ్యాతము : "వర్షతి'' (జలమ్) ప్రసిద్ధిని బట్టి ఏర్పడునది.

3. జ్ఞాపకమును అపేక్షించునది : '' అక్తాః శర్కరా ఉపదధాతి'' (ఘృతేన-అనునది లింగము)

4. సామాన్యవిశేషభావము గలది : '' బ్రాహ్మణేభ్యో దధి దీయతామ్ '' "మాఠరాయ తక్రమ్''(బాధకవచనము, నియమవచనము, నిషేధవచనము మొదలగువానితో సంబంధము గలది).

'అపోద్ధారము' (సమగ్రవాక్యమునుండి వేరుచేసిచూపుట) అను పద్ధతిలో మీద చూపినవన్నియు వాక్యములే అని, అవి అఖండములనియు తత్త్వము.

అపోద్ధారమును ఆశ్రయించినపుడు వాక్యములందు వాక్యైకదేశముల వలె, పదములందును పదైకదేశములు సంభవించునని వివరింప ప్రారంభించుచున్నాడు.

సంజ్ఞాశబ్దైకదేశో య స్తస్య లోపో న విద్యతే
విశిష్టరూపా సా సంజ్ఞా కృతా చ న నివర్తతే . 352

సంజ్ఞా శబ్దైకదేశః = పేరులోని ఒకభాగము, యః = ఏది కలదో, తస్య = దానికి, లోపః = లోపము (కనబడకపోవుట), న + విద్యతే = లేదు. సా = ఆ, సంజ్ఞా = పేరు, విశిష్టరూపా = పూర్తియగు ప్రత్యేకస్వరూపముగలదై, కృతా + అపి = చేయబడినందున, న + నివర్తతే = తొలగిపోదు.

తా. 'దేవదత్తః' 'సత్యభామా' మొదలగు శబ్దములున్నవి. అవి ఆయా వ్యక్తులకు పేర్లు(సంజ్ఞలు).ఇటువంటి శబ్దములను సంజ్ఞాశబ్దములందురు. వీనిలో ఒకభాగమునే ఉచ్చరించి, (దేవః—లేక—దత్తః) సంజ్ఞనంతను బోధించుట వాడుకలో ఉన్నది. అదెట్లు కుదురును ? అట్టిప్రయోగములలో, విడువబడిన భాగము లోపించినదని చెప్పుట శాస్త్రీయము కాదు. (వ్యాకరణము దానికి లోపమును చెప్పలేదు). వాస్తవముగ—సంజ్ఞా శబ్దములకు ఒక నిర్దిష్టమైన స్వరూపము (వర్ణక్రమము) ఉండును గాన, వానిలో ఏ భాగము లోపించినను సంజ్ఞ పూర్తికాదు కావునను, లోపమనుటకు కూడ వీలులేదు.

వి. 'అపోద్ధారము' (వేరుచేయుట—లేక—విడగొట్టుట) అను కాల్పనికమైన పద్ధతిలో వాక్యములందు వాక్యైకదేశము లుండవచ్చునని ఇంతవరకు చర్చ కొనసాగినది. ఈ సందర్భములో—అదే మార్గమును ఆశ్రయించినచో, కొన్ని పదములలోకూడ, పదైకదేశములు (పదఖండములు) ఉండవచ్చునను చర్చను, ఈ కారిక ప్రారంభించినది. ఇది శంకారూపమైన కారిక.

'ఈ వర్ణక్రమముగలది ఈ సంజ్ఞ' (దీనిరూపమిది) అని అన్నపుడు, ఆ శబ్దమును పూర్తిగా ఉచ్చరించినందువలననే అర్థము బోధపడును గాని, అందులోని ఒక భాగమును మాత్రమే ఉచ్చరించినందువలన బోధపడదు. అందుచే ఒక భాగమును వాడి, మిగిలిన భాగమునకు లోపమనుట కుదరదు.

వి. 'వృక్షః ప్రచలన్ సహ అవయవైః ప్రచలతి' (చెట్టు కదిలినపుడు దాని అవయవములును కదలును) అను న్యాయము ననుసరించి, సంజ్ఞా శబ్దమును పూర్తిగా పలికినపుడే, అవయవములైన వర్ణములకును సార్థక్యము ఏర్పడును. లేనపుడు కేవలము అవయవములకు అర్థము ఉండదు.

"దేవదత్త" మొదలగు సంజ్ఞాశబ్దములలో ఏకదేశమువలన (దేవ – లేక – దత్త) సంపూర్ణమగు అర్థమెట్లు తెలియనగునని ఆక్షేపించుచున్నాడు.

సంజ్ఞాంతరాచ్చ దత్తాదేః నాన్యా సంజ్ఞా ప్రతీయతే
సంజ్ఞినం దేవదత్తాఖ్యం దత్తశబ్దః కథం వదేత్ ?  353

దత్తాదేః = దత్తః మొదలగు, సంజ్ఞాంతరాత్ + చ = వేరొక సంజ్ఞా శబ్దము వలన, అన్యా = మరియొక, సంజ్ఞా = పేరు, న + ప్రతీయతే = తెలియబడదు. దేవదత్తాఖ్యమ్ = దేవదత్తః అను పూర్తిపేరుగల, సంజ్ఞినమ్ = ఒక వ్యక్తిని (ఆ పేరుతో తెలియదగిన వ్యక్తిని), దత్తశబ్దః = 'దత్తః' అను శబ్దము, కథమ్ = ఎట్లు, వదేత్ = చెప్పును ?

తా. 'దేవః' 'దత్తః' అనునవి తమంతట తాము వేరువేరు సంజ్ఞలు కూడ కావచ్చును. కాన వానిలో ఏ ఒకటియు 'దేవదత్తః' అను పూర్తిసంజ్ఞను తెలియజేయజాలదు. అట్లే పూర్తిసంజ్ఞయే తనకు అర్థముగా నిర్ణయింపబడిన వ్యక్తిని ('ఈ పేరుతో తెలియదగిన వ్యక్తి ఇది'—అను సంకేతముగల వ్యక్తిని) బోధించును గాని, అందులోని భాగము బోధింపదు (వర్ణక్రమము తగ్గిపోవుటచే అనుకున్న అర్థము తెలియదు).

వి. సంజ్ఞ = పేరుగా ఉచ్చరింపబడు శబ్దస్వరూపము. సంజ్ఞి = ఆ పేరుతో పిలువబడువ్యక్తి (సంజ్ఞా శబ్దముయొక్క వాచ్యార్థము) "సంజ్ఞా శబ్దమందలి ఒక భాగముతో ఆ సంజ్ఞను అంతనుగాని, దాని అర్థమునుగాని చెప్పుటకు వీలులేదు. సంజ్ఞాస్వరూపమును—దేనినైనను—పూర్తిగానే ఉచ్చరింపవలయును." అని సారము.

మీది కారికకు, ఈ కారిక అనుబంధము. ఇదియు శంకారూపమే.

ఈ సందర్భమున వేరొక మతమును చూపుచున్నాడు.

సర్వైరవయవై స్తుల్యం సంబంధం సముదాయవత్
కేచి చ్ఛబ్దస్వరూపాణాం మన్యంతే సర్వసంజ్ఞిభిః .  354

శబ్దస్వరూపాణామ్ = సంజ్ఞాశబ్దములలో, సముదాయవత్ = మొత్తమునకువలెనే, (శబ్దముయొక్క పూర్తిరూపము), సర్వైః = అన్ని, అవయవైః = అవయవములకు (భాగములకు), సర్వసంజ్ఞిభిః = అన్ని అర్థములతోను (తెలియదగిన వ్యక్తులు), తుల్యమ్ = సమానమైన (ఏకకాలమందే), సంబంధమ్ = సంబంధమును, కేచిత్ = కొందరు, మన్యంతే = భావించుదురు.

తా. మీదిశంకకు సమాధానమును కొంద రిట్లు చెప్పుదురు. సంజ్ఞాశబ్దముల విషయములో, ఒకే సమయమున సముదాయమునకు, అవయవములకు కూడ అర్థముతో కల సంబంధము గ్రహింపబడును. కావున సముదాయమువలన అర్థము తెలియునట్లు, అవయవములవలనను పూర్తి అర్థము తెలియును.

వి. శబ్దమునకు అర్థమునకును ఉండు ముఖ్యమైన సంబంధము వాచ్య వాచక భావము గదా: సముదాయమందువలెనే అవయవములందు కూడ శబ్దమును పలుకు సమయమందే ఈ సంబంధమును అంగీకరించినచో, అవయములును పూర్తి అర్థమును బోధింపగలవని ఈ వాదముయొక్కసారము.

ఈ సందర్భముననే రెండు దోషములను చూపుచున్నాడు.

వర్ణానా మర్థవత్త్వం తు సంజ్ఞానాం సంజ్ఞిభి ర్భవేత్
సంబద్ధోఽవయవః సంజ్ఞాప్రవివేకే న కల్ప్యతే . ౩౫౫

సంజ్ఞానామ్ = సంజ్ఞా శబ్దములయొక్క, వర్ణానామ్ = అక్షరములకు, సంజ్ఞిభిః = ఆయా అర్థములతో, అర్థవత్త్వమ్ + తు = అర్థము కలిగియుండుట, భవేత్ = సంభవించెడిని.

సంజ్ఞా ప్రవివేకే = మొత్తము సంజ్ఞా పదమునుండి విడదీసినపుడు, సంబద్ధః = సంబంధించిన (పూర్తి అర్థమును చెప్పు సముదాయమునకు చెందిన) అవయవః = ఒక భాగము, న + కల్ప్యతే = పూర్తి అర్థమును చెప్పజాలదు.

తా. సంజ్ఞా శబ్దములలో సముదాయమునకు అవయవములకును, ఏకకాలమందే అర్థబోధకత్వమును ఒప్పుకొన్నచో, ఒక్కొక్క వర్ణముకూడ అర్థబోధకము కావలసివచ్చును వర్ణములును అవయవములేగదా! అదియుగాక సముదాయమునకే అర్థమును బోధించుశక్తి ఉండునుగాని, విడదీయబడిన భాగమునకు అట్టి శక్తి ఉండదు.

వి. పై కారిక చూపిన మతములో రెండు రకములైన దోషములు ఉన్నవని ఈ శ్లోకము విశదీకరించినది.

మీది కారిక చెప్పిన భావమునే ఈ కారిక విశదీకరించుచున్నది.

సర్వస్వరూపై ర్యుగప త్సంబంధే సతి సంజ్ఞినః
నైకదేశసరూపేభ్య స్తత్ప్రత్యాయన సంభవః. ౩౫౬

సర్వస్వరూపైః = సంజ్ఞాశబ్దముయొక్క అన్ని అవయవములతో, సంజ్ఞినః = ఆ సంజ్ఞయొక్క అర్థమునకు, యుగపత్ = ఒకేసారి, సంబంధే = సంబంధము, సతి = ఉన్నపుడు, ఏకదేశస్వరూపేభ్యః = అవయవములతో సమానముగ కనిపించు శబ్దరూపములతో, తత్ప్రత్యాయనసంభవః = ఆ సంజ్ఞయొక్క అర్థమును బోధింపగలుగుట, న = లేదు (కుదురదు).

తా. అవయవములన్నియు కలిసి, సముదాయముగా ఏర్పడిన సంజ్ఞాశబ్దముల వల్లనే వానియర్థములు తెలియును. (సముదాయమునకు మాత్రమే అర్థమును బోధించుశక్తి ఉండును). 'దత్తః' మొదలగు ప్రత్యేక సంజ్ఞాపదములతో సమానముగ కనిపించునట్టి—'దేవదత్తః' మొదలగు సముదాయములలో భాగములుగా ఉండునట్టియు 'దత్తః' మొదలగు శబ్దములు 'దేవదత్తుడు' మొదలగు పూర్తిఅర్థములను చెప్పలేవు.

వి. పై కారికయొక్క భావమే ఇచట వేరొకతీరులో ప్రతిపాదింపబడినది. కాగా సంజ్ఞాపదములలోని భాగములు, ఆయా సంజ్ఞల పూర్తిఅర్థమును చెప్పజాలవని తేలినది.

వేరొక మతమును చూపుచున్నాడు.

ఏకదేశాత్తు సంఘాతే కేషాంచి జ్జాయతే స్మృతిః
స్మృతేస్తు విషయా చ్ఛబ్దాత్ సంఘాతార్థః ప్రతీయతే . ౩౫7

ఏకదేశాత్ + తు = ఒకభాగమువలననే, సంఘాతే = సముదాయమును గురించిన, స్మృతిః = స్మరణము, కేషాంచిత్ = కొందరకు, జాయతే = కలుగును. స్మృతేః = స్మర

ణమునకు, విషయాత్ = లోనైన, శబ్దాత్ + తు = శబ్దమువలన, సంఘాతార్థః = సముదాయముయొక్క అర్థము, ప్రతీయతే = తెలియబడును.

తా. ఈ సందర్భములో మరికొందరు ఇట్లందురు — సంజ్ఞాశబ్దములలో, ఒక భాగమును ఉచ్చరించుటతోడనే పూర్తియైన శబ్దరూపము గుర్తునకు వచ్చును. అట్లు జ్ఞాపకమునకు వచ్చిన సముదాయమే అర్థమును బోధించును.

వి. 'దేవదత్తః' అనునది సముదాయము. 'దేవ, దత్త' అనునవి దాని భాగములు. వీనిలో ఏ ఒకదానిని పలికినను, 'దేవదత్తః' అను పూర్తిరూపము స్మృతికి వచ్చును. అందువల్ల అర్థము తెలియును. భాగమునుమాత్రమే ఉచ్చరించిన ప్రతియొకచోటను ఈ తీరును ఉపయోగించుకొనవచ్చును.

పై మతమును నిరాకరించుచున్నాడు.

ఏకదేశాత్ స్మృతి ర్భిన్నే సంఘాతే జాయతే కథమ్
కథం ప్రతీయమానః స్యా చ్ఛబ్దోఽర్థ స్యాభిధాయకః ?　　358

భిన్నే = వేరైన, సంఘాతే = సముదాయము విషయములో, ఏకదేశాత్ = ఒక భాగమువలన, స్మృతిః = స్మరణము, కథమ్ = ఎట్లు, జాయతే = కలుగును ? ప్రతీయమానః = స్మరింపబడు, శబ్దః = శబ్దము, అర్థస్య = అర్థమును, అభిధాయకః = చెప్పునది, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును ?

తా. ఒకదాని నొకటి పోలిన రెండు వస్తువులు అనుభవములో ఉన్నపుడు, వానిలో ఒకదానివలన, రెండవది గుర్తువచ్చుట లోకములో ప్రసిద్ధము. ప్రకృతము సంజ్ఞాశబ్దములలో సముదాయరూపము వేరుగను; అవయవములరూపము వేరుగను ఉండును. (రెండింటికిని పోలిక లేదు). కాన అవయవరూపముతో సముదాయము స్మృతికి వచ్చుననుట పొసగదు. మరియు — అట్లంగీకరించినను, ప్రయోజనము సిద్ధించదు. స్పష్టముగ ఉచ్చరింపబడిన శబ్దమే తన అర్థమునకు వాచకమగును గాని, స్మృతికివచ్చి, ఉచ్చరింపబడని శబ్దము అర్థమును చెప్పజాలదు. (ఉచ్చరించిన ఒకభాగమువలన సముదాయముయొక్క అర్థము లభింపదు).

వి. మీది శ్లోకము చూపిన స్మృతిపక్షమును ఈ శ్లోకము ఖండించినది. 'ఉచ్చారిత ఏవ హి శబ్దః ప్రత్యాయకః నానుచ్చారితః (ఉచ్చరింపబడిన శబ్దమే అర్థమును బోధించును. మరొకవిధముగ ఉన్న శబ్దము బోధింప సమర్థముకాదు) అన్నది వైయాకరణుల సిద్ధాంతము.

సముచితమైన సిద్ధాంతమును చూపుచున్నాడు.

ఏకదేశసరూపాస్తు తైస్తై ర్లింగైః సమన్వితాః
అనునిష్పాదినః శబ్దాః సంజ్ఞాసు సమవస్థితాః .　　359

ఏకదేశసరూపాః + తు = అవయవములగు శబ్దముల రూపములతో సమానమైనటువంటి స్వరూపముగలవై, తైః + తైః = ఆయా, లింగైః = లింగములతో, (పుంలింగము మొదలగు శబ్దలింగములు) సమన్వితాః = కూడినవై, అను నిష్పాదినః = తరువాత పుట్టునటు

వంటి, శబ్దాః = వేరువేరుశబ్దములు, సంజ్ఞాసు = సంజ్ఞావాచక శబ్దములలో, సమవస్థితాః = స్పష్టముగా ఉన్నవి.

తా. 'దేవదత్తః' అనునది సంజ్ఞాపదము. ఇది సముదాయరూపము. 'దేవ దత్తుడు' అనువ్యక్తి సంజ్ఞి —లేక—ఆ సముదాయమువల్ల లభించు అర్థము. ఇటువంటి స్థలము లలో, సముదాయమును ఉచ్చరించిన వెనువెంటనే, దానిలో సుస్పష్టముగ వినబడు 'దేవ', 'దత్త' మొదలగు అవయవములనుపోలిన వేరే శబ్దములు (దేవ, దత్త మొదలగునవి)పుట్టును. (అనగా ఉచ్చరింపబడును). వానిని 'అనునిష్పాదులు' (సముదాయమును పలికినతరువాత పుట్టునవి) అందురు. ఇవి సంపూర్ణమైన అర్థమును బోధించును. అట్టిశక్తిని వానికి అంగీక రింపవలెను. అనగా 'దేవః' మొదలగునవి వేరేశబ్దములే. అవి సముదాయముయొక్క అవ యవములుమాత్రము కావు. సముదాయమునకువలెనే వీనికిని సమగ్రార్థమును బోధింపగల సామర్థ్య ముండును. అయితే—ఆవశ్యకతనుబట్టి వీని లింగమును మార్చుకొనుచుండవలెను (పుంలింగమైతే —దేవః, దత్తః అని, స్త్రీలింగమైతే సత్యా, భామా అనియు). అవయవసదృ శములైన శబ్దములు సంజ్ఞిని బోధించు స్థలములన్నింటియందును ఈ తీరును అవలంబింప వలెను.

వి. ఇదే వైయాకరణుల సిద్ధాంతము.–'సంజ్ఞా వాచకములలో ఏకదేశములు అర్థ మును బోధింపగలవా?' అను చర్చను ఆరంభించి, ఇతరుల మతములను అందలి దోషము లను చూపి, తుదకు గ్రంథకర్త తన అభిమతమును స్పష్టముచేసినాడు.

"దేవదత్తః" అను సముదాయమును పలికిన సమయములోనే, "దేవ, దత్త"అను విడివిడిశబ్దములను కూడ పలికి, (అట్లు భావించుకొని), వానికి ఆవశ్యకములైన లింగములను చేర్చుకొని, ఆయా సంజ్ఞలుగా వాడుకొనవచ్చును. "సముదాయములు వేరు. అనునిష్పాదులైన ఇట్టి శబ్దములు వేరు. రెండింటికిని అర్థబోధకత్వము సమానమే" అనునది ఈ వాదముయొక్క సారము.

అను=(పశ్చాత్) = తరువాత, నిష్పాదినః = పుట్టునవి—అనునిష్పాదినః.

వాక్యమువలెనే పదముకూడ అఖండమని, నిత్యమనియు వైయాకరణులందురు (పరమసిద్ధాంతములో పదము లేనేలేదు. అది వేరువిషయము). అయినపుడు వాక్యములో వాక్యైకదేశములు లేనట్లుగానే, పదములోకూడ పదైకదేశములు లేవని చెప్పకతప్పదు. అట్లే వాక్యైకదేశములుగా కనబడువానిని, వేరే స్వతంత్రవాక్యములని సమర్థించిన రీతిలో, పదైక దేశములుగా కనబడువానిని, వేరే స్వతంత్రపదములని సమర్థింపవలసి వచ్చినది. ఇట్టి పద ముల ఉచ్చారణమును హేతుబద్ధము చేయుటకై "అనునిష్పత్తివాదము"ను చేపట్టవలసి వచ్చినది.

సంజ్ఞాశబ్దములలోని భాగములు (దేవ — దత్త మొదలగునవి) నియమితముగ సంజ్ఞిని (ఆ సంజ్ఞచే తెలియదగిన వ్యక్తిని) ఎట్లు బోధించునో నిరూపించుచున్నాడు.

సాధారణత్వాత్సందిగ్ధాః సామర్థ్యాన్నియతాశ్రయాః
తేషాం యే సాధవ స్తేషు శాస్త్రే లోపాది శిష్యతే. ౩60

సాధారణత్వాత్=శబ్దరూపము సమానముగా ఉన్నందువలన, సందిగ్ధాః = అర్థము విషయములో సంశయమును కలిగించు శబ్దములు, సామర్థ్యాత్=వానికుండు శక్తిని

ఇట్టి, నియతాశ్రయాః = నిర్ణయింపబడిన అర్థములుగలవి (అగును). తేషామ్ = అట్టి శబ్దములలో, యే = ఏవి, సాధవః = శిష్టవ్యవహారమున ప్రసిద్ధములై ఉండునో, తేషు = వాని విషయమున, శాస్త్రే = వ్యాకరణశాస్త్రములో, లోపాది = లోపము మొదలగు కార్యము, శిష్యతే = విధింపబడును.

తా. అర్థము వేరుగాఉండి, శబ్దరూపము ఒకేవిధముగా ఉండు స్థలములలో, అర్థమును గురించి సంశయము కలుగుట సహజము. అయినను, ఆయా శబ్దములకుండు శక్తిని ఇట్టి, (ప్రకరణాదుల సాయముతో) వాని అర్థములు నిశ్చయింపబడును. "అనునిష్పాదులు" అగు శబ్దములలో (దేవ, దత్త, మొదలగునవి) అర్థమును ఇట్లే నిశ్చయించుకొనవలెను. అవి స్వతంత్రశబ్దములై, పూర్తిఅర్థమును బోధించుచుండును. లోకములోని పెద్దల వాడుకను అనుసరించి "అవి సాధువులు" (ప్రయోగార్హములు) అని తెలియును. వాని సాధుత్వమును స్పష్టపరచుటకు మాత్రమే ఆ యా స్థలములలో పూర్వపదము లోపించునని, (దత్తః, అన్నచో, దేవ అను ముందుపదము జారిపోయినదని) ఉత్తరపదము లోపించుననియు, దేవః, అనినచో, దత్త అను చివరిపదము జారిపోయినదని) వ్యాకరణశాస్త్రము చెప్పుచుండును. వాస్తవముగ లోప మచట లేకపోయినను, సామాన్యులకు అదొక ఉపాయమని గ్రహింపవలెను.

వి. "దేవదత్తః" మొదలగు సంజ్ఞాపదములలో దేవ, దత్త మొదలగు విడివిడి శబ్దములను "అనునిష్పాదిశబ్దము" లనుగా ఒప్పుకొని, వానివలనకూడ పూర్తి అర్థము తెలియునని చెప్పవలెనని మీదిశ్లోకము వివరించినది.

ఈ సందర్భములో కలుగు ఒకటి రెండు సందేహములను పోగొట్టుట ఈ శ్లోకము యొక్క ప్రయోజనము.

మొదటి సంశయము : సంజ్ఞావాచకములలోని భాగములవంటి శబ్దములను వేరుగా ఒప్పుకొన్నచో, దేవ శబ్దము రెండు విధములగును. దేవుని బోధించునది ఒకటి. (దేవః = దేవుడు). దేవదత్తుడు, అనువ్యక్తిని చెప్పునది రెండవది. (దేవః = దేవదత్తుడు = దేవదత్త శబ్దములోని పూర్వభాగమువంటి శబ్దము). అట్లే దత్త శబ్దముకూడ రెండు విధములగును. "ఈయబడినది'' అను అర్థమును తెలుపునది ఒకటి. (దా = ఇచ్చుట అనుధాతువునకు భూతకాలికమైన కృదంతరూపము). దేవదత్తుని బోధించునది రెండవది. (దేవదత్త శబ్దములోని రెండవభాగమువంటిది) ఆ శబ్దముల ఆకారములు సమానములు అయినపుడు వాడుకలో "దేని కేది అర్థము?'' అను సందేహము కలిగితీరును అని.

దీని కిది సమాధానము : అర్థము విషయమున సంశయము కలిగినంత మాత్రముచే శబ్దము వాచకము కాకపోదు. సామర్థ్యము, ప్రకరణము మొదలగు ఉపాయముల నాశ్రయించి, ఆయా శబ్దముల అర్థములను నిశ్చయించుకొనగలము. (ఈ యంశమును పలుమారులు గ్రంథకర్త చెప్పుచునే యున్నాడు). పెద్దల వాడుకనుబట్టి శబ్దార్థముల సంబంధము సాధుత్వమును అవగతమగుచుండును. కాగా సంజ్ఞావాచకములలోని భాగములవంటి "దేవ'' మొదలగు శబ్దములును సాధువులై, స్వతంత్రముగ ఆయా సంజ్ఞికలవ్యక్తిని తెలుపును. వానివలె ఉండు ప్రత్యేకశబ్దములుకూడ వాని ప్రత్యేకార్థములను తెలుపుచుండును. ఇటువంటి ఏర్పాటుకు బాధక మేదియు లేదు.

రెండవసంశయము: అట్లంగీకరించినయెడల, "వినాఽపి ప్రత్యయం పూర్వోత్తర పదయోః వా లోపో వాచ్యః" (5-3-83 సూత్రములోని వార్తికము) (ప్రత్యయమేదియు పరముగ లేకున్నను సంజ్ఞాశబ్దములలో ముందుపదమునకుగాని, చివరిపదమునకుగాని లోపము వికల్పముగ అగును) అను వచనముచే లోపవిధాన మెందుకుః అని.

దీని కిది సమాధానము: భాష లోకసిద్ధము, సహజము. శాస్త్రము కల్పితము, అవాస్తవము. లోకసిద్ధములగు శబ్దార్థముల ప్రయోగరీతులను శాస్త్రము ధ్రువపరచి ప్రామాణ్యమును, సంప్రదాయమును సంపాదించును. సామాన్యులకు అదొక సాధనము. శబ్దతత్త్వము నెరిగిన వారికి వ్యాకరణశాస్త్రముతో పనిలేదు. కాగా ప్రకృతము పూర్వోత్తర పదములకు లోపము జరుగుట కేవలము కల్పన. (పదములు నిత్యములుగాన - లోపాదులు కుదరవు) ప్రయోగసిద్ధములైన దేవ మొదలగు శబ్దములను సంజ్ఞావాచకములుగ సాధువులనుటయే తాత్పర్యము.

మీది అంశమును విశదీకరించి, విశేషమును చూపుచున్నాడు.

తుల్యాయా మనునిష్పత్తౌ జ్యే-ద్రా-ఘా-ఇత్యసాధవః
న హ్యన్వాఖ్యాయకే శాస్త్రే తేషు దత్తాదివత్ స్మృతిః. 361

అనునిష్పత్తౌ = తరువాతపుట్టుట, తుల్యాయామ్ = సమానమైనను, జ్యే-ద్రా-ఘా ఇతి = జ్యే - ద్రా - ఘా - మొదలగు వేరువేరు వర్ణములు, అసాధవః = సాధువులుకావు (ప్రయోగించుటకు తగినవి కావు). తేషు = అట్టి వర్ణముల విషయములో, అన్వాఖ్యాయకే = సాధుత్వమును చెప్పు, శాస్త్రే = వ్యాకరణ శాస్త్రమున, దత్తాదివత్ = దత్త, మొదలగు శబ్దముల విషయములో వలె, స్మృతిః = సాధుత్వమును చెప్పు వచనము, న+హి = లేదుగదా।

తా. సంజ్ఞావాచకములగు శబ్దములలో విడివిడి భాగములకువలె, విడివిడి వర్ణములకు కూడ అనునిష్పత్తిని (సముదాయమును పలికిన క్షణములోనే, విడిగాకూడ పలికినందువలన వేరుగ వినిపించుట) చెప్పవచ్చును. కాని అట్టి వర్ణములకు ప్రయోగార్హతలేదు. అందుచే జ్యేష్ఠ, ద్రాఘిష్ఠ, శ్లాఘా, మొదలగు పదములలోని జ్యే, ద్రా, ఘా మొదలగు ప్రత్యేక వర్ణములను ఆయా పదముల అర్థమును చెప్పువానినిగా వాడకూడదు. శిష్టులు అట్టి వర్ణములకు సాధుత్వమును అంగీకరింపలేదు. అందుచేతనే వ్యాకరణశాస్త్రముకూడ అట్టి స్థలములలో ప్రత్యేకవర్ణములకు సాధుత్వమును చెప్పలేదు.

వి. "దేవదత్తః" మొదలగు సముదాయశబ్దములను, దేవః, దత్తః, మొదలగు భాగములను మాత్రమే, ఆయా సంజ్ఞలుగ వాడుట ప్రసిద్ధముగా ఉన్నదిగాని, దే-వ-త్త- మొదలగు విడివిడి అక్షరములను ఆ విధముగా వాడుట లోకమందు లేదని, కావుననే శాస్త్రము కూడ వానిని ఒప్పుకొనదనియు సారాంశము.

"కొన్ని స్థలములలో (ముఖ్యముగా సంజ్ఞావాచకములు) సముదాయములు, వాని అవయవములును కూడ ప్రయోగార్హములగును"—అను చర్చ ఈ కారికతో ముగిసినది.

ఇచట వర్ణములనగా, సంయుక్తవర్ణములు-లేక-అచ్చులతోకూడిన హల్లులు లేక-కేవలము అచ్చులు, హల్లులును అని తెలియదగును. "రాః" (ఐశ్వర్యము) "గ్లౌః" (చంద్రుడు) "నౌః" (ఓడ) మొదలగునవి, ప్రత్యేకపదములేగాని వర్ణమాత్రములు కావు.

"పదములందు పదైకదేశములందు" నను ఈ ప్రసంగమున, సంజ్ఞాశబ్దముల విషయములో గూడ శబ్దార్థ సంబంధముల నిత్యత్వమును సమర్థించుచున్నాడు.

కృతణత్వాశ్చ యే శబ్దా నిత్యం ఖరణసాదయః
ఏకద్రవ్యోపదేశిత్వా త్తాన్ సాధూన్ సంప్రచక్షతే. 362

నిత్యమ్=ఎల్లప్పుడును, కృతణత్వాః=ణత్వముచేయబడిన, ఖరణసాదయః="ఖరణసః" మొదలగు, యే+చ=ఏ, శబ్దాః=శబ్దములు గలవో, తాన్=వానిని, ఏకద్రవ్యోపదేశిత్వాత్=ఒకేవ్యక్తిని బోధపరచుటవలన, సాధూన్=ప్రయోగమునకు తగినవని, సంప్రచక్షతే=చెప్పుదురు.

తా. సంజ్ఞాశబ్దములలో శబ్దవ్యుత్పత్తిని చూపుట, దాని అర్థమును వివరించుటయు చేయనక్కరలేదు. ఆ శబ్దములను "ఉన్నవానిని ఉన్నట్టుగనే" ఉచ్చరింపవలెను. ప్రతియొక సంజ్ఞావాచకముకూడ, ఆ సంజ్ఞికల వ్యక్తిని ఎల్లపుడును సూటిగా బోధించును. ఇతరశబ్దముల విషయములోవలెనే, సంజ్ఞాశబ్దమునకు, దానివలన తెలియు అర్థమునకు గల సంబంధము నిత్యము. కాగా సంజ్ఞాశబ్దములును నిత్యములే. ణత్వము (ఖరణస అనుచోట నకారము ణకారమగుట), దీర్ఘము (విశ్వామిత్ర అనుచోట తొలిపదము చివరనున్న అకారము ఆకారముగ మారుట) మొదలగు సంజ్ఞావాచకములకు సంబంధించిన శాస్త్రీయ కార్యములన్నియు సాధుత్వమును స్పష్టపరచుటకు ఉద్దేశింపబడినవే. అవి వాస్తవములు కావు.

వి. శబ్దము (స్ఫోటశబ్దము), అర్థము (బుద్ధియందు భాసించుఅర్థము), శబ్దార్థముల సంబంధమును నిత్యములని భర్తృహరి సిద్ధాంతముగదా: ప్రకృతము సంజ్ఞావాచకముల ప్రసంగమును పురస్కరించుకొని – ఆ సిద్ధాంతమును మరొకసారి విశదీకరించుటకై ఈ ఘట్టము ప్రారంభమైనది.

"ఖరణసః"అనునది ఒక వ్యక్తిపేరు. ఇచట "ఖరస్యేవ నాసికా యస్య" (గాడిద ముక్కువంటి ముక్కు కలవాడు) అను విగ్రహమును చూపుట, నాసికాశబ్దమును "నస"అను శబ్దముగా మార్చి, నకారమునకు ణత్వము చేయుటయు వ్యాకరణము చూపు ప్రక్రియ. అట్లే "విశ్వామిత్రః" అనునది ఒక మునిపేరు. ఇచటకూడ "విశ్వస్యమిత్రమ్" (ప్రపంచమునకు మిత్రుడు) అను విగ్రహమును, తొలిపదముచివర దీర్ఘమును వ్యాకరణము చూపును. అయినను ఇట్టిస్థలములలో శాస్త్రప్రక్రియకు ముందు ఒక రూపమనియు, (ఖరనస, విశ్వమిత్ర) ప్రక్రియ చేసినతరువాత వేరొకరూపమనియు భావింపరాదు. అట్లయిన శబ్దములు మారినట్లగును గాన నిత్యములు కాకపోవును. (మార్పుచెందని పదార్థమే నిత్యము). కాగా ఆ శబ్దములు "ఉన్నవి ఉన్నట్లే" సాధువులు. అవి ఎల్లప్పుడును ఒకే అర్థమును బోధించును. అదియు నిత్యమే. (అర్థమునకు మార్పులేదు). సంజ్ఞకు సంజ్ఞికి ఉండు సంబంధము (వాచ్యవాచకభావము) కూడ నిత్యమే. శాస్త్రముచూపు ప్రక్రియ, కేవలము సాధుత్వమును ధ్రువపరచు ముద్రవంటిది. సంజ్ఞాపదము లన్నింటియందును ఈ తీరునే గమనింపవలెను.

"ఖరణసః" అనుచోట ఈ రెండు సూత్రములు ప్రవర్తించును.

1. "అఞ్ నాసికాయాః సంజ్ఞాయాం నసంచాऽస్థూలాత్"(5-4-118) నాసికాంతాత్ బహువ్రీహే రచ్ స్యాత్ నాసికాశబ్దశ్చ నసం ప్రాప్నోతి నతు స్థూలపూర్వాత్ (వృత్తి). దీనిభావ మిది : సముదాయము సంజ్ఞ అయినపుడు, చివరను నాసికాశబ్దముగల బహువ్రీహి

సమాసమునకు అచ్ (అ) అను ప్రత్యయమును, నాసికాశబ్దమునకు 'నస్' అను ఆదేశమున్ను అగును. తొలిపదము స్థూలశబ్దమైనచో ఈ కార్యము రాదు.

2. "పూర్వపదా త్సంజ్ఞాయామగః" (8-4-3) పూర్వపదస్థాన్నిమిత్తా త్పరస్య నస్య ణః స్యాత్ నతు గకార వ్యవధానే (వృత్తి). దీనిభావ మిది : తొలిపదమందున్న నిమిత్తమునకు (రేఫగాని, షకారముగాని) పరమగు నకారము ణకారముగ మారును. సముదాయము సంజ్ఞకావలయును. గకారముతో వ్యవధానమున్నపుడు మాత్రము ఈ కార్యము జరుగదు. ఉదా : ఖరణసః.

"విశ్వామిత్రః" అనుచోట ఈ సూత్రము ప్రవర్తించును :- "మిత్రేచర్షౌ" (6-3-130). దీనిభావ మిది : మిత్రశబ్దము పరమైనపుడు తొలిపదము చివరి అచ్చునకు దీర్ఘమగును. సముదాయమొక మునికి పేరు కావలెను.

ఇట్టి స్థలములలో, సముదాయరూపములే సహజములనియు, వైశద్యముకొరకు, ఆయా కార్యములు జరుగునట్లు శాస్త్రము చూపుననియు అనుకొనవలెను. లేకున్న ఆ కార్యములు ప్రవర్తింపనిస్థితిలో అవిసంజ్ఞలే కానందున, "కార్యము లెట్లు ప్రవర్తించును?" అని శంక కలుగును. కార్యములు ప్రవర్తించిన తరువాతనే సంజ్ఞలగునన్నచో, "ముందొక రూపము, వెనుక వేరొకరూపము" అగునుగాన, శబ్దనిత్యత్వమునకు భంగమేర్పడును.

పై శ్లోకము యొక్క భావమునే స్పష్టపరచుచున్నాడు.

గోత్రాణ్యేవ తు తా న్యాహుః సంజ్ఞాశక్తి సమన్వయాత్
నిమిత్తాపేక్షణం తేషు స్వార్థే నావశ్య మిష్యతే. 368

సంజ్ఞాశక్తి సమన్వయాత్ = ఆయా అర్థములను (సంజ్ఞలవలన తెలియువ్యక్తులు) బోధించు సామర్థ్యమును కలిగిఉన్నందువలన, తాని + తు = ఆయా సంజ్ఞాపదములను (ఖరణసః, మొదలగునవి), గోత్రాణి + ఏవ = ప్రత్యేకమైన శబ్దకులముగా (ఒకవిధమైన శబ్ద విభాగము), ఆహుః = చెప్పుదురు, తేషు = ఆ శబ్దముల విషయములో, నిమిత్తాపేక్షణమ్ = తన స్వరూపముకంటె వేరైన వ్యుత్పత్త్యర్థము, అవశ్యమ్ = తప్పనిసరిగా, న + ఇష్యతే = కోరబడదు.

తా ఖరణసః మొదలగు సంజ్ఞలు, వాచ్యవాచక భావసంబంధముచే తమ తమ అర్థములను సూటిగా బోధించును. అవి నిత్యమైన ఒక ప్రత్యేక శబ్దరాశికి చెందును. వాని విషయములో ప్రవృత్తి నిమిత్తము (శబ్దము అర్థమును బోధించుటకు హేతువైన ఒక ధర్మము) వాని స్వరూపమే (అనుపూర్వి = వర్ణక్రమము). వేరే ప్రవృత్తి నిమిత్తము ఉండవలెనను నిర్బంధము లేదు. (కొన్నిచోట్ల అట్టి నిమిత్తము కుదిరినను బాధలేదు).

వి. ఇతరశబ్దముల వలెనే సంజ్ఞాశబ్దములును అనాదిగా లోకమందు సిద్ధములై ఉన్నవి. వానికి ఆయా అర్థములను బోధించుశక్తియు నిత్యముగానే ఉన్నది. అయినపుడు "ఆ శబ్దము లా అర్థమును బోధించుటలో హేతువేమి?" అని పరిశీలింప నక్కరలేదు. ఒకానొకచో వేరే ప్రవృత్తినిమిత్తము (శబ్దవ్యుత్పత్తినిబట్టి తెలియు అర్థము) కుదిరినయెడల, దానిని స్వీకరింపవచ్చును. లేనియెడల ఆ సంజ్ఞయొక్క స్వరూపమునే ప్రవృత్తినిమిత్తముగా అంగీకరింపవలెను.

అనగా 'ఖరణసః' అను సంజ్ఞను వాడినపుడు, దాని అర్థముగా తెలియబడువ్యక్తి, "గాడిదముక్కు కలవాడై తప్పక ఉండవలయు" నను నిర్బంధము లేదు. అట్టు లేనివాని కైనను ఆ పేరును పెట్టుకోవచ్చును. ఆ విధముగా పెట్టినపుడు, "ఈ వర్ణక్రమముతోకూడిన ఈ శబ్దమునకు ఈ వ్యక్తి అర్థము" అని సమన్వయము చేసికొనవలెను.

ప్రవృత్తి నిమిత్తమునుబట్టి, భాషయందలి శబ్దములను ముఖ్యముగా మూడు విధములుగా విభజింతురు.

1. జాతివాచకములు : గౌః, అశ్వః, మానవః మొదలగునవి. (ఈ శబ్దములు ఆయా జాతిని ఆధారముగా చేసికొని వాడబడును).

2. గుణవాచకములు : శుక్లః, నీలః, రక్తః, మొదలగునవి. (ఇచట ఆయా గుణములు ప్రవృత్తి నిమిత్తములు).

3. క్రియావాచకములు : పాచకః, గాయకః, లేఖకః మొదలగునవి. (ఇచట ఆయా క్రియ ప్రవృత్తినిమిత్తము).

ప్రకృతము సంజ్ఞాశబ్దములను వేరే ఒక విభాగముగాచూపి, "సంజ్ఞాప్రవృత్తినిమిత్తములు" అని నాలుగవ శబ్దరాశిని అంగీకరించుట మంచిదనియు, అచట వేరుగా వ్యుత్పత్త్యర్థమును చూపినను చూపకపోయినను బాధలేదనియును ఈ కారికయొక్క సారాంశము.

ప్రవృత్తేః=శబ్దప్రవృత్తేః, నిమిత్తమ్ = హేతుః- అని విగ్రహము. ఒక శబ్దము తన అర్థమును బోధించుటలో కారణమైన అంశమును ప్రవృత్తి నిమిత్తమందురు. అది జాతి, గుణము, క్రియ అను మూడు విధములని సంప్రదాయము. సంజ్ఞాపదములలో ఇవి కుదరవు గాన, అచట శబ్దస్వరూపమే ప్రవృత్తి నిమిత్తమగునని వైయాకరణు లందురు. ఈ ప్రవృత్తి నిమిత్తమును గురించిన విశాలమైన చర్చలను మహాభాష్యము మొదలగు ఉద్గ్రంథములలో చూడనగును.

"సంజ్ఞా శబ్దములన్నియు కృతకములు–అనగా–కేవలము కల్పితములు" అన్న పక్షమందును, వాని విషయములో శబ్దార్థ సంబంధము నిత్యమే అని సమర్థించుచున్నాడు.

వ్యవహారాయ నియమః సంజ్ఞాయాః సంజ్ఞిని క్వచిత్
నిత్య ఏవ తు సంబంధో డిత్థాదిషు గవాదివత్ . 364

క్వచిత్ = ఒకానొక, సంజ్ఞిని = సంజ్ఞగల వ్యక్తి విషయములో (సంజ్ఞచే తెలియదగు అర్థము విషయములో), వ్యవహారాయ = లోకములోని వాడుక సిద్ధించుట కొరకు, సంజ్ఞాయాః = సంజ్ఞావాచకమునకు సంబంధించిన, నియమః= వ్యవస్థ ("ఈ సంజ్ఞతో తెలియవలసిన వ్యక్తి ఇదే"—అను కట్టుబాటు), (క్రియతే=చేయబడును). గవాదివత్ = "గౌః" మొదలగు శబ్దములలో వలె, డిత్థాదిషు= "డిత్థ" మొదలగు శబ్దములలో కూడ, సంబంధః= అర్థముతోగల సంబంధము, నిత్యః + ఏవ + తు = నిత్యమైనదే (కల్పితము కాదు).

తా. "డిత్థః" "డపిత్థః" మొదలగు సంజ్ఞాపదములుకూడ, భాషలోని ఇతర శబ్దములవలె అనాదులును, నిత్యములును అని తెలియవలెను. ఆయా వ్యక్తులను బోధించు శక్తి, ఆయా అర్థములతో వానికుండు సంబంధమును నిత్యమే. అయితే లోకులు మాత్రము ఆయా సమయములలో, ఆయా సంజ్ఞా శబ్దములను కొందరు వ్యక్తులకు వాడుచుందురు. అది

సౌకర్యము కొరకు చేసికొన్న ఏర్పాటు. దానివలన, 'ఈ సంజ్ఞ ప్రస్తుతమీ అర్థమును తెలుపును' అను స్పష్టత సిద్ధించును.

గో, అశ్వ, మొదలగు భాషలోని శబ్దము లన్నింటికి, వాని వాని అర్థములకును ఉండు సంబంధము (వాచ్య వాచకభావము) అనాది అనియు, నిత్యమనియు అందురు. ఆ సంబంధమును "యోగ్యత" (తగియుండుట) అని కూడ అందురు. ఇటువంటి తీరును సంజ్ఞా శబ్దముల విషయములో కూడ అంగీకరింపవలెను. కాగా సంజ్ఞా శబ్దములు కేవలము "ఆధునికులు కల్పించుకొన్న శబ్దములు" అనకూడదు.

వి. "సంజ్ఞా శబ్దములు మనము కల్పించుకొన్నవి. అవి నిత్యము లెట్లు కాగలవు ?" అను శంకకు ఈ శ్లోకము సమాధానము. "అన్ని రకముల శబ్దములును ప్రవాహరూపమున నిత్యములే. వానికి అర్థములతోడి సంబంధమును నిత్యమే. అది "అనాది యోగ్యత" అని వ్యవహరింపబడును ("ఈ అర్థము ఈ శబ్దమువలన తెలియదగినది అనుభావము). సంజ్ఞా శబ్దముల విషయములో మాత్రము ఒక విధమైన నియమమును ("ఏ అర్థమును బోధించు ఉద్దేశముతో ఆ సంజ్ఞనువాడుదుమో అప్పటికదియే దాని అర్థము' అనుకొనుట) అవలంబింపక తప్పదు" అన్నది సారాంశము.

శబ్దార్థ సంబంధము నిత్యమైనపుడు, ఆ సంబంధము కల శబ్దార్థములు కూడ నిత్యములే యని ఫలించును. (సంబంధులు లేని సంబంధము ఉండదు గదా !) ఈ యంశమును ముందు ముందు గ్రంథకర్త బహురీతులతో విశదీకరించును.

శాస్త్రీయములగు "వృద్ధి" మొదలగు సంజ్ఞలలోగూడ, ఇట్టి వ్యవహార నియమమును అవలంబింపవలెనని అనుచున్నాడు.

> వృద్ధ్యాదీనాం చ శాస్త్రేఽస్మిన్ శక్త్యవచ్ఛేదలక్షణః
> అకృత్రిమోఽభిసంబంధో విశేషణవిశేష్యవత్ . 365

అస్మిన్ = ఈ, శాస్త్రే = వ్యాకరణ శాస్త్రమందు, వృద్ధ్యాదీనామ్ + చ = వృద్ధి, గుణము, మొదలగు సంజ్ఞలకు కూడ, శక్త్యవచ్ఛేద లక్షణః = శక్తి నియమ రూపమైన, ("ఇచట ఈ శబ్దమునకు ఇదే అర్థము" అని ప్రత్యేకించుట), అకృత్రిమః = సహజసిద్ధమైన అభిసంబంధః = అర్థముతోడి సంబంధము, విశేషణ విశేష్యవత్ = విశేషణ విశేష్యముల యొక్క సంబంధమువలెనే, (అస్తి = ఉన్నది).

తా. వ్యాకరణ శాస్త్రములో వృద్ధి, గుణము మొదలగు సంజ్ఞలు కొల్లలుగా ఉన్నవి. అవి వాని సంకేతితార్థములను బోధించుచుండును. అవియు "డిత్థ" "డవిత్థ" మొదలగు లౌకిక సంజ్ఞల వంటివే. కృతకములు కావు. అచటను శబ్దార్థ సంబంధములు నిత్యములే అయినను, శాస్త్రీయ వ్యవహారము కొరకై, "ఈ సంజ్ఞ వలన ఈ యర్థము తెలియదగినది" అను చిన్న నియమమును చేసికొందుము.

విశేషణ విశేష్యములకుండు సహజమైన ఒకానొక సంబంధమువలెనే, సంజ్ఞా సంజ్ఞులకుండు సంబంధమున్ను అనాదియు స్వతస్సిద్ధమునై ఉండును.

వి. శబ్దము, అర్థము వాని సంబంధము,—అన్నియు నిత్యములను సిద్ధాంతము యొక్క శిఖరముపై, "సర్వే సర్వార్థ వాచకాః" (అన్ని శబ్దములును అన్ని అర్థములను

కూడ చెప్పగలుగును) అనువచనము ఉన్నది. అయినపుడు శబ్దార్థముల విషయములో ఏ విధమైన నియమమును చేయనక్కరలేదు. నిత్యములైన వానికి నియమము ఎందుకు ?

కాని "సర్వే సర్వార్థ వాచకాః" అను అనుభవము శబ్ద బ్రహ్మవేత్తలగు యోగీశ్వరులకే చెల్లును. సామాన్యులకు అన్ని విధములైన ఏర్పాటులును ఆవశ్యకములే. అట్టి ఏర్పాటులలో ముఖ్యమైనది శబ్ద శక్తిని నియమించుట. లౌకిక సంజ్ఞలకువలెనే, శాస్త్రీయ సంజ్ఞలకును శక్తిని నియమింతురు. (ఈ శాస్త్రమున, ఈ సంజ్ఞకు ఇది అర్థము అని చెప్పుదురు). ఉన్న విషయమును ప్రత్యేకించుట తప్ప, క్రొత్త కల్పన ఏదియు ఈ సందర్భములో ఉండదు.

వాక్యములోని విశేషణ విశేష్యములకు ఉండు సంబంధము కూడ (అభేద సంబంధము మొదలయినది) అనాది సిద్ధమైనదే, ఏ ఒక వ్యక్తియు అట్టి సంబంధమును సృష్టింపలేదు. స్వతస్సిద్ధమైన విషయమును, కొన్ని ఉపాయముల మూలముగా సామాన్యులు గుర్తించుట జరుగుచుండును. అట్టి ఉపాయములనే శాస్త్రము అందురు.

కాగా వ్యాకరణ శాస్త్రములోని సంజ్ఞ లన్నియు నియమరూపములే.

ఉ. "వృద్ధి రాదైచ్" (1-1-1) ఆదైచ్చ వృద్ధి సంజ్ఞః స్యాత్. (వృత్తి) "ఆ, ఐ, ఔ అనునవి 'వృద్ధి' అనబడును" అని అర్థము. ఇదొక నియమము. "అదేఙ్ గుణః" (1-1-2) అదేఙ్చ గుణసంజ్ఞః స్యాత్. (వృత్తి)" "అ, ఏ, ఓ అనునవి 'గుణము' అనబడును" అని భావము. ఇది వేరొక నియమము. ఇట్లే ఇతర సంజ్ఞల విషయమును ఊహించునది.

"సంజ్ఞాశబ్దములన్నియు శబ్దాంతరములవలె అనాదులే. వ్యవహారము కొరకు మాత్రమే నియమము చూపబడును" అనునది ముఖ్యతత్త్వము.

సంజ్ఞాశబ్దముల ప్రవృత్తి నిమిత్తమును నిరూపించుటకు ఉపక్రమించుచున్నాడు.

> సంజ్ఞాస్వరూప మాశ్రిత్య నిమిత్తే సతి లౌకికీ
> కాచిత్ ప్రవర్తతే కాచి న్నిమిత్తాసన్నిధా వపి . 366

కాచిత్ = ఒకానొక, లౌకికీ = లోకమందు ప్రసిద్ధమైన, సంజ్ఞా = సంజ్ఞా శబ్దము, (శత్రుఘ్న-మొదలగునది), నిమిత్తే = ప్రవృత్తి నిమిత్తము (వ్యుత్పత్తి ననుసరించి లభించు అర్థము), సతి = ఉన్నయెడల, స్వరూపమ్ = శబ్దస్వరూపమును (వేరుగా ఉన్న వ్యుత్పత్త్యర్థమును కూడ), ఆశ్రిత్య = ఆశ్రయించి (నిమిత్తముగా ఉంచుకొని), ప్రవర్తతే = ప్రవర్తించును (అర్థమును బోధించును), కాచిత్ + సంజ్ఞా = వేరొక సంజ్ఞాశబ్దము, నిమిత్తాసన్నిధౌ + అపి = వ్యుత్పత్తిసిద్ధమైన అర్థము వేరుగా లేకున్నను (స్వరూపమ్ = కేవలము శబ్దరూపమును, ఆశ్రిత్య = ఆశ్రయించి), ప్రవర్తతే = ప్రవర్తించును.

తా. లోకములో వాడబడు సంజ్ఞలు రూఢములు, యౌగికములు అని రెండు విధములు. ఎట్టి వ్యుత్పత్తియు లేనివి రూఢములు. ఉదా : డిత్థః, డవిత్థః మొదలగునవి. వ్యుత్పత్త్యర్థముకలవి యౌగికములు. ఉదా : శత్రుఘ్నః మొదలగునవి (శత్రూన్-హంతి= శత్రువులను చంపువాడు). ఈ రెండు విధములైన సంజ్ఞలకును శబ్దస్వరూపమే ప్రవృత్తి నిమిత్తము. దానినే ఆధారముగ చేసుకొని, శబ్దము ఆయా సంజ్ఞిని బోధించును. వ్యుత్పత్త్యర్థ

ర్థము కుదిరినచోట్ల దానినికూడ ప్రవృత్తి నిమిత్తముగా కలుపుకొనవచ్చును. లేనిచోట్ల శబ్ద స్వరూపమే ప్రవృత్తి నిమిత్తముగా మిగులును.

వి. సంజ్ఞాశబ్దముల ప్రవృత్తినిమిత్తమును పరిశీలించుటకు ఈ ప్రసంగ మారంభ మైనది. శ్లోకములోని "లౌకికీ" అను పదమును సూచనగా తీసుకొని, "శాస్త్రీయ సంజ్ఞలకు కూడ ఈ తీరునే అవలంబింపవలయును" అని తెలియవలెను.

వ్యాకరణశాస్త్రమునకూడ రెండు విధములైన సంజ్ఞలును ఉన్నవి. టి, ఘు, భ మొదలయినవి రూఢములు. 'సర్వనామ' 'సమాస' మొదలగునవి యౌగికములు. రెండింటి విషయమునను శబ్దస్వరూపమునే ముఖ్యమైన ప్రవృత్తి నిమిత్తముగా గ్రహింపవలెను (వ్యుత్పత్త్యర్థమున్నచో కలుపుకొందుము. లేనిచో ఇబ్బంది లేదు).

వి. జాతి, గుణము, క్రియ-వీనితోపాటు శబ్దస్వరూపమునుకూడ, ప్రవృత్తి నిమిత్తముగా వైయాకరణు లంగీకరించినారు. ఇది సంజ్ఞాశబ్దములకే చెందును.

సర్వేషామ్ = అన్నింటికిని, నామ = పేరు — సర్వనామ. (తద్, యద్, మొదలగు శబ్దములు ఉద్దేశించిన ప్రతియొక వస్తువును బోధింపగలవి.) సమాసః = సంగ్రహః = రెండు మూడు పదముల అర్థము ఇచట కుదింపబడును. ఇట్టిచోట్ల యౌగికార్థముకూడ ప్రవృత్తి నిమిత్తముగా కుదురును. వీనిని సార్థకసంజ్ఞలు-లేక-అన్వర్థసంజ్ఞలు అని అందురు.

ఏకాక్షర సంజ్ఞల విషయమునవే గాక-మహా సంజ్ఞల విషయములో కూడ శబ్ద స్వరూపమే ప్రవృత్తి నిమిత్తమని తెలియవలెనని ప్రకటించుచున్నాడు.

> శాస్త్రే తు మహతీ సంజ్ఞా స్వరూపోపనిబంధనా
> అనుమానం నిమిత్తస్య సన్నిధానే ప్రతీయతే. 367

శాస్త్రే + తు = వ్యాకరణశాస్త్రమందైతే, మహతీ = పెద్దదైన, సంజ్ఞా = సంజ్ఞా శబ్దము, స్వరూపోపనిబంధనా = తన అనుపూర్వియే ప్రవృత్తినిమిత్తముగా గలది (అగును). నిమిత్తస్య = వేరుగా కనబడు అవయవార్థమనెడి ప్రవృత్తి నిమిత్తముయొక్క, సన్నిధానే = ఉనికియందు (అవయవార్థముకూడ ఉన్నపుడు), అనుమానమ్ = ఊహవలన లభించు ఆ అవయవార్థముకూడ, ప్రతీయతే = తెలియబడుచుండును.

తా. "సర్వనామ" మొదలగు మహాసంజ్ఞలకున్ను (టి-ఘు-భ-మొదలగువాని సంగతి వేరుగా చెప్పనక్కరయే లేదు) తమతమ అనుపూర్వియే ప్రవృత్తి నిమిత్తము. అయితే అట్టిచోట్ల అవయవార్థముకూడ ఉండును కావున అదియు ప్రవృత్తి నిమిత్తమే అని ఊహింపవచ్చును.

అనగా శబ్ద స్వరూపమే ముఖ్య ప్రవృత్తి నిమిత్తము. పిదప, అనుమాన ప్రమాణమును బట్టి (ఊహించి) అవయవార్థమును కూడ ప్రవృత్తి నిమిత్తముగా గ్రహించుట జరుగును.

వి. మీది శ్లోకమునకు ఇది విపులీకరణము. అనుమానమనెడు ఒక క్రొత్తతీరు ఇచట సూచింపబడినది.

పై కారికయందలి అనుమాన ప్రకారమును వివరిస్తున్నాడు.

అవృత్తే రనుమానం వా సారూప్యా త్తత్ర గమ్యతే
శబ్దభేదానుమానం వా శక్తిభేదస్య వా గతిః. 368

తత్ర=ఆ మహాసంజ్ఞ విషయములో, సారూప్యాత్ = శబ్ద రూపము సమాన మైనందువలన, అవృత్తేః = శబ్దమును ఆవృత్తి చేయుటయొక్క (రెండవసారి పలుకుట) అనుమానమ్=అనుమానము (ప్రామాణికమైన ఊహ) గమ్యతే = తెలియబడును. వా = లేక, సారూప్యాత్ = సాదృశ్యమువలన, శబ్దభేదానుమానమ్=వేరే శబ్దమను అను మానము, గమ్యతే=తెలియబడును, వా=లేక, సారూప్యాత్=సాదృశ్యమువలన, శక్తి భేదస్య = రెండు శక్తులయొక్క, గతిః = అనుమానము, (భవతి = అగును).

తా. "సర్వనామ" మొదలగు మహాసంజ్ఞల విషయములో శబ్దస్వరూపమే (వర్ణక్రమము) మొదటి ప్రవృత్తి నిమిత్తము. అవయవార్థము కూడ (సర్వేషామ్-నామ = అన్నింటిని చెప్పునది) రెండవ ప్రవృత్తి నిమిత్తమగును. అయితే అవయవార్థమును పురస్క రించుకొని వేరొక శబ్దమును పలుకుటను (సర్వనామ-అను దానిని) అనుమానింపవలెను. లేక– ఒక శబ్దము వలననే ఒకసారి "స్వరూప" మని, రెండవసారి "అవయవార్థ" మని, అర్థము లభించునని ఊహింపవలెను. లేదా - ఒక శబ్దమునకే రెండు శక్తులను (రెండు విధములయిన అర్థములను చెప్పగల వేరుగా ఉండు రెండు శబ్దశక్తులు) అనుమానింపవలెను. ఎట్లు అనుమానించినను-ఆ అనుమానమునకు హేతువు శబ్ద సాదృశ్యమే అని తెలియవలెను.

వి. మహాసంజ్ఞల విషయములో, అనుమాన ప్రమాణమును స్వీకరించినట్లయితే, అవయవార్థము కూడ రెండవ ప్రవృత్తి నిమిత్తము కావచ్చునని మీది కారిక సూచించినది. అనుమానించుపద్ధతిని ఈ కారిక వివరించినది. సర్వనామ సంజ్ఞను ఉదాహరణముగా తీసుకొని ఈ అంశమును స్పష్టపరచుకొనవచ్చు.

1. సర్వనామ: ఈ శబ్దముయొక్క ఆనుపూర్వియే (వరుసగా ఉన్న వర్ణములు) మొదటి అర్థము. అదే ప్రవృత్తి నిమిత్తము.

2. సర్వనామ: "సర్వేషామ్-నామ"- ఇది అవయవార్థము. రెండవ ప్రవృత్తి నిమిత్తము. "ఇదెట్లు లభించు"నని ప్రకృతశంక. ఈ శంకను పోగొట్టుటకు మూడు మార్గ ములను గ్రంథకర్త చూపినాడు:— 1. అవృత్తి :— "సర్వనామ"- అనుపదమును రెండుసార్లు ఉచ్చరించి కావలసిన రెండర్థములను సంపాదించుట 2. శబ్దభేదము:—శబ్దమును ఒక మారేపల్కి, రెండర్థములును ఆ శబ్దమునకే అతికినట్లున్నవని చెప్పుట. దీనినే సాంకేతిక ముగా "తంత్రము" అని అందురు. (ఇచట శబ్దశక్తి ఒకటే). 3. శక్తిభేదము :- శబ్దము నకు రెండు శక్తులు (అర్థమును బోధించు శక్తి) విడివిడిగా ఉన్నవని, అవి రెండు అర్థముల నున్ను బోధించుననియు చెప్పుట. దీనిని "శక్తిభేదము" అందురు. ఇచట కూడ శబ్దమును పలుకుట ఒక్కసారియే.

పై మూడింటిలో ఒక దానినైనను అనుమానమువలన సాధించుకొనవచ్చును. అన్నింటి విషయములోను "శబ్దసారూప్యమే" హేతువు. (శబ్దరూప మొక విధముగానే ఉన్నందువలన రెండవ అర్థము కూడ ఉన్నందువలనను అవృత్తి మొదలగు వానిని ఊహింపవచ్చునని భావము).

కాగా మహా సంజ్ఞలన్నింటికిని, "ఆనుపూర్వి", "అవయవార్థము" అను రెండు ప్రవృత్తి నిమిత్తములుండునని ఫలించినది.

సంజ్ఞా శబ్దములు నాలుగు విధములని ప్రతిపాదించుచున్నాడు.

క్వచి ద్విషయభేదేన కృత్రిమా వ్యవతిష్ఠతే
సంఖ్యాయా మేకవిషయం వ్యవస్థానం ద్వయో రపి . 369

కృత్రిమా = శాస్త్రమందు చేయబడిన సంజ్ఞ, క్వచిత్ = ఒక చోట, విషయ భేదేన = విషయము వేరగుటను బట్టి, వ్యవతిష్ఠతే = ప్రత్యేకముగా సమన్వయించును. సంఖ్యాయామ్ = సంఖ్యాసంజ్ఞ విషయములో, ఏక విషయమ్ = ఒక కార్యమును గురించిన, వ్యవస్థానమ్ = నియమము (సమన్వయ నియమము), ద్వయోః + అపి = కృత్రిమమము, అకృత్రిమము అగు రెండు రకముల సంజ్ఞలకును, (భవతి = అగును).

తా. సంజ్ఞలు ముఖ్యముగా రెండు విధములు: కృత్రిమములు, అకృత్రిమములు అని. ఒక ప్రయోజనమును ఉద్దేశించి ప్రత్యేకముగా శాస్త్రమందు చేయబడినవి కృత్రిమములు. లోకవ్యవహారములో సహజముగా వాడబడునవి అకృత్రిమములు. ఈ సంజ్ఞల అర్థమును ఆయా విషయమును బట్టి నిశ్చయించుకొనవలెను. ఒక చోట కృత్రిమమైన అర్థమును వేరొకచోట అకృత్రిమమైన అర్థమును, మరొకచోట రెండు విధములైన అర్థములను ఆయా సందర్భమును బట్టి స్వీకరింపవలెను. అన్నిచోటులందును ఒకే విధమున సమన్వయించుట కుదురదు.

వి. వ్యాకరణ శాస్త్రమందలి కొన్ని ఉదాహరణముల మూలముగా ప్రకృతాంశము విశదమగును:— 1. కరణమ్:- ఇదొక కృత్రిమ సంజ్ఞ "ఒకక్రియ సిద్ధించుటలో మిక్కిలి ఉపయోగపడు పనిముట్టు" అని అర్థము. "కర్తృకరణయో స్తృతీయా" (2-3-18) అను సూత్రము కర్తృవాచకమునకు, కరణవాచకమునకును తృతీయా విభక్తిని విధించినది. కావున ఇచట "కరణం" మనగా సాధనమను కృత్రిమార్థమునే చెప్పవలెను.

2. "చేయుట" అను లోకసిద్ధమైన సామాన్యార్థమును చెప్పినచో, "కరణ" సంజ్ఞ అకృత్రిమము కూడ అగును. "శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే" (3-1-17) అను సూత్రమున కరణ శబ్దమునకు అకృత్రిమార్థమునే చెప్పవలెను. ("చేయుట" అను అర్థములో శబ్ద, వైర, మొదలగు శబ్దములకు పరముగ, క్యఙ్ అను ప్రత్యయమును ఈ సూత్రము విధించును).

3. సంఖ్యా: బహు, గణ, అనుశబ్దములును, వతుప్రత్యయాంత శబ్దములును. (యావత్, తావత్, మొదలగునవి) కతి అనుశబ్దమును (డతిప్రత్యయాంతము) "సంఖ్య" అనిపించుకొనును. (బహుగణవతుడతి సంఖ్యా-1-1-23 అని సూత్రము) ఇది ఈ శబ్దమునకు కృత్రిమమైన అర్థము. "ఏక, ద్వి, త్రి, మొదలగు సంఖ్యావాచకములు" అను అర్థమును చెప్పినచో అకృత్రిమమగును. "సంఖ్యాయా అతిశదంతాయాః కన్" (5-1-22) అను కన్ ప్రత్యయమును విధించు సూత్రములో, సంఖ్యాసంజ్ఞకు ఈ రెండు విధములైన అర్థములను కూడ స్వీకరింపవలెను.

కర్మ, కరణమ్, సంఖ్యా, మొదలగు సంజ్ఞలు వ్యాకరణ శాస్త్రమందు ప్రత్యేక సంకేతములుగా ఉన్నవి. లోకవ్యవహారములో అవే శబ్దములకు ప్రసిద్ధములైన వేర్వేరు అర్థములున్నవి. శాస్త్రమందు ఆయా శబ్దములకు, కొన్నిచోట్ల సంకేతసిద్ధమైన అర్థమును, మరికొన్నిచోట్ల లోకప్రసిద్ధమైన అర్థమును, ఇంకను కొన్నిచోట్ల రెండువిధములైన అర్థములనుకూడ చెప్పుచుండవలెను. ప్రకరణము, ఔచిత్యము, లక్ష్యసిద్ధి మొదలగువాని ననుసరించి ఆయా అర్థమును నిశ్చయించుకొనవలెను. ఈ విషయములను బోధించుటయే ఈ శ్లోకము యొక్క ముఖ్యప్రయోజనము.

1. కర్తృకరణయోస్తృతీయా (2-3-18) "అనభిహితే కర్తరి కరణేచ తృతీయా స్యాత్" (వృత్తి)- "కర్తయు కరణమును వేరొకరీతిని చెప్పబడని సందర్భములో, తద్వాచక శబ్దమునకు తృతీయావిభక్తి అగును"—అని అర్థము. ఉదా: రామేణ బాణేన హతః వాలీ. (బాణము కరణము) కరణమును చెప్పు శబ్దమునకు తృతీయ వచ్చునుగాన, ఇచట కరణశబ్దము శాస్త్రీయమైన కృత్రిమార్థమునే బోధించును. ("చేయుట" అను అకృత్రిమార్థము పొసగదు).

2. శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే (3-1-17) ఏభ్యః కర్మభ్యః కరోత్యర్థే క్యఙ్‌స్యాత్ (వృత్తి). "శబ్ద, వైర, కలహ, అభ్ర, కణ్వ, మేఘ- అను శబ్దములకు పరముగ—"దానిని చేయువాడు"—అను అర్థములో "క్యఙ్" (య) అను ప్రత్యయము వచ్చును"—అని అర్థము. ఉదా: "శబ్దం కరోతి = శబ్దాయతే, వైరం కరోతి = వైరాయతే," మొదలగునవి. ఈ సూత్రమున కరణశబ్దము "చేయుట" అను అకృత్రిమార్థమును మాత్రమే బోధించును. 'ఈ అర్థమందు ఈ ప్రత్యయమగును' అను సందర్భముగాన, ఇచట కృత్రిమమైన అర్థము నప్పదు.

(సాధకతమం కరణమ్—1-4-42 క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణసంజ్ఞం స్యాత్ (వృత్తి). వ్యాపారము సిద్ధించుటలో ప్రముఖమైన సాధనము కరణమనబడును. — ఇది కరణశబ్దమునకు కృత్రిమమైన అర్థము).

3. 'సంఖ్యాయా అతిశదంతాయాః కన్' (5-1-22) సంఖ్యాయాః కన్ స్యాత్ ఆర్హీయేఽర్థే నతు త్యంతశదంతాయాః(వృత్తి). "దానిచే కొనబడినది" మొదలగు అర్థములలో సంఖ్యావాచకమునకు కన్ ప్రత్యయ మగును, తి-శత్ అనునవి చివరనుగల సంఖ్యకు మాత్రము (వింశతి, త్రింశత్ మొదలగునవి) ఈ ప్రత్యయము రాదు. ఉదా: పంచభిః క్రీతః=పంచకః మొదలగునవి. ఈ సూత్రమున సంఖ్యాశబ్దము కృత్రిమార్థమును (బహు, గణ, మొదలగునవి) అకృత్రిమార్థమునుకూడ (ఏక, ద్వి, మొదలగునవి) బోధించును. 'అతిశదంతాయాః' అను నిషేధమువలన 'అకృత్రిమార్థమునుకూడ గ్రహింపవలెను' అను విషయము సూచితమైనది. కేవలము కృత్రిమమునే గ్రహించినయెడల ఆ నిషేధము వ్యర్థమగును గదా! (వింశతి, త్రింశత్, మొదలగునవి కృత్రిమసంఖ్యలు కానే కావు కాన నిషేధ మక్కరలేదు).

సారాంశము: 1. వ్యాకరణశాస్త్రములోని సంజ్ఞలకు కొన్నిచోట్ల కృత్రిమార్థమునే చెప్పవలెను.
2. కొన్నిచోట్ల అకృత్రిమార్థమునే చెప్పవలెను.
3. మరికొన్నిచోట్ల రెండు విధములైన అర్థములను ఒకేసారి చెప్పవలెను.

కొన్నిచోట్ల అకృత్రిమమగు సంజ్ఞాశబ్దము కృత్రిమసంజ్ఞను గూడ బోధించునని చెప్పుచున్నాడు.

విషయం కృత్రిమస్యాఽపి లౌకికః క్వచి దుచ్చరన్
వ్యాప్నోతి దూరాత్సంబుద్ధౌ తథా హి గ్రహణం తయోః . 370

దూరాత్, సంబుద్ధౌ = 'ఏకశ్రుతి దూరాత్ సంబుద్ధౌ' (1-2-33) మొదలగు, క్వచిత్ = కొన్నిచోట్ల, లౌకికః = లోకప్రసిద్ధమైన సంజ్ఞ, ఉచ్చరన్ = పలుకబడుచు, కృత్రిమస్య = శాస్త్రీయమైన సంజ్ఞయొక్క, విషయమ్ + అపి = విషయమునుకూడ, వ్యాప్నోతి = వ్యాపించును. హి = ఎందువల్లననగా, తయోః = ఆ రెండు విధములైన అర్థములకును, తథా = అవిధముగ (వ్యాప్యవ్యాపక భావముచే), గ్రహణమ్ = స్వీకారము, (భవతి = అగును).

భా. 'సంబుద్ధి' అనునది ఒక సంజ్ఞ. 'పిలుచుట లేక హెచ్చరించుట' అని దీని యొక్క లౌకికార్థము (అకృత్రిమము). 'సంబోధన ప్రథమయొక్క ఏకవచన ప్రత్యయము' (సు) అనునది శాస్త్రీయార్థము (కృత్రిమము). 'ఏకశ్రుతి దూరాత్ సంబుద్ధౌ' అను సూత్రములో సంబుద్ధిపదమునకు తొలుత అకృత్రిమమైన అర్థమునే చెప్పవచ్చును. అయినను ఆ అర్థములోనే ఇమిడియున్నందున, కృత్రిమార్థమునుకూడ గ్రహింప వీలుకలుగును.

వి. 'సంబోధనం సంబుద్ధిః' ('ఒకవ్యక్తిని తనవైపు త్రిప్పుకొనుటకు చేయు పిలుపు') ఇది లౌకికార్థము. 'ఏకవచనం సంబుద్ధిః' (2-3-49) సంబోధనే ప్రథమాయా ఏకవచనం సంబుద్ధిసంజ్ఞంస్యాత్ (వృత్తి). సంబోధనమందు ప్రథమావిభక్తియొక్క ఏకవచన ప్రత్యయమునకు (సు) సంబుద్ధి యని పేరు. ఇది శాస్త్రీయార్థము. లౌకికార్థము వ్యాపకము. (దాని విషయము విశాలమైనది). శాస్త్రీయార్థము వ్యాప్యము. (దాని విషయము పరిమితమైనది). వ్యాపకమందు వ్యాప్యము అంతర్భూతమగును.

'ఏకశ్రుతి దూరాత్ సంబుద్ధౌ' (1-2-33) దూరాత్ సంబోధనే వాక్య మేకశ్రుతి స్యాత్. (వృత్తి) 'సంబోధనమందు ప్రయోగించు వాక్యమునకు "ఏకశ్రుతి" అగును' అని అర్థము. అనగా ఉదాత్తాది స్వరవిశేషములు లేకుండ, ఆ వాక్యము ఒకే సామాన్యధ్వనితో ఉచ్చరింపబడునని భావము. ఉదా: 'ఆగచ్ఛ భో మాణవక!' ఈ సూత్రమున సంబుద్ధిపదమునకు లౌకికార్థమునే చెప్పినను, దానితోపాటు శాస్త్రీయార్థముకూడ స్ఫురించి, అంగీకరింపబడును. కావున దాని విషయములోకూడ ఏకశ్రుతి సిద్ధించును.

సంబోధన ప్రథమావిభక్తి అంతయు సంబుద్ధి అయినపుడు (లౌకికముగా) దాని ఏకవచనాంతము సంబుద్ధి అని వేరుగా చెప్పనక్కరలేదుగదా! అని సారాంశము. సంజ్ఞాశబ్దముల చర్చ ఇంతతో ముగిసినది.

వాక్యవిచారణ ప్రసంగమున, కొన్నిచోట్ల ప్రత్యేకవాక్యసమాప్తి అని, మరికొన్ని చోట్ల సముదాయ వాక్య సమాప్తి అనియు సూచించుచున్నాడు.

సంభేదైక శేషద్వంద్వేషు కేచి త్సామర్థ్యలక్షణమ్
ప్రత్యాశ్రయ మవస్థానం క్రియాణాం ప్రతిజానతే . 371

సంఖ్యైకశేషద్వంద్వేషు = సముదాయమును బోధించుపదము, ఏకశేషము, ద్వంద్వ సమాసమును, (నిర్దిష్టేషు = ప్రయోగింపబడినపుడు), క్రియాణామ్ = భోజనము మొదలగు కొన్ని వ్యాపారములకు, సామర్థ్యలక్షణమ్ = శబ్దస్వభావము నిమిత్తముగాగల, అవస్థానమ్ = సమాప్తిని, ప్రత్యాశ్రయమ్ = ప్రతియొక కర్తకును చెందునట్లుగా, కేచిత్ = కొందరు, ప్రతి జానతే = చెప్పుదురు.

తా. 'బ్రాహ్మణః భునక్తు' (బ్రాహ్మణుడు భుజించుగాక) 'బ్రాహ్మణాః భుంజంతు' (బ్రాహ్మణులు భోజనముచేయుదురుగాక). 'రామ, కృష్ణ, గోపాలాః భుంజంతు' (రామ-కృష్ణ-గోపాలురు భుజించుదురుగాక). వీనిలో మొదటివాక్యములోని 'బ్రాహ్మణః' అనునది బ్రాహ్మణసముదాయమును చెప్పు పదము. రెండవ వాక్యములోని 'బ్రాహ్మణాః' అనునది ఏకశేషము. మూడవవాక్యమందలి 'రామకృష్ణగోపాలాః' అనునది ద్వంద్వసమాసము. 'భుజించుట' అను క్రియ అన్నింటను సమానమే.

'ఇటువంటి వాక్యములలో, శబ్దసామర్థ్యము ననుసరించి భోజనమను వ్యాపారము, ఎందరు కర్త లుందురో అందరకును ప్రత్యేకముగా చెందును. అపుడే వాక్యార్థము సఫలమగును'. అని కొందరందురు. అనగా అందరును ఎవరికి వారు తిన్నపుడే ప్రతియొకరికిని తృప్తి కలుగునుగాని, ఎవరో ఒక రిద్దరు తిన్నందువలన మిగిలిన అందరకును తృప్తి కలుగదని భావము.

వి. వాక్యవిచారణమును, వాక్యార్థవిచారణమును ప్రకృతములు. తదనుసారము వాక్యవాక్యార్థ సమాప్తి, 'సముదాయమందాః లేక ప్రత్యేకమందాః' అను పరిశీలనకొరకు ఇటు పై ఘట్టమంతయు ఉపయోగించును. ఆ ఘట్టమును ఈ కారిక ప్రారంభించినది. వాక్యమందలి క్రియ కర్తృసముదాయమందు విశ్రమించినచో (అన్వయించి ఆగినచో), 'సముదాయ వాక్య పరిసమాప్తి' అనియు, ప్రతియొక కర్తకును విడివిడిగా సంబంధించినచో, 'ప్రత్యేక వాక్యసమాప్తి' అనియు సాంకేతికముగా చెప్పుదురు.

'బ్రాహ్మణః' అను ఏకవచనాంతముతో బ్రాహ్మణసముదాయమునంతను బోధింపవచ్చును. దీనిని జాత్యేకవచన మందురు. 'బ్రాహ్మణాః' అను బహువచనాంతముకూడ బ్రాహ్మణుల నందరిని చెప్పును. దీనిని ఏకశేషవృత్తి అందురు. సరూపమైన శబ్దములలో ఒకటే మిగిలి, అన్నింటి అర్థమును చెప్పగలుగుట (బ్రాహ్మణశ్చ, బ్రాహ్మణశ్చ, బ్రాహ్మణశ్చ = బ్రాహ్మణాః). ఇతరేతరయోగమును (ఒకరినొకరు కలియుట) సూచింపుచు విడివిడి శబ్దములను సమాసముగా కూర్చుట ద్వంద్వమగును. ఈ మూడువిధములైన వాక్యప్రయోగము లందును క్రియకు ప్రత్యేక సమాప్తియే అని కొందరి మతము.

సంఖ్యైకశేష ద్వంద్వసమాసములుగల వాక్యములలో, క్రియాపదమునకు ప్రతియొక పదముతోను సంబంధము కొన్నిచోటులందు (భోజనము, పానము, మొదలగు క్రియలను చెప్పు తిఙంతమును ప్రయోగించిన స్థలములలో) సహజము. కొన్నిచోటులందు ('చూచుట' మొదలగు వ్యాపారములను చెప్పు తిఙంతమును వాడినచోట్ల) సముదాయమును బోధించు పదముతో మాత్రమే సంబంధము సహజము. అట్లే వాక్యార్థవిషయమునకూడ, కొన్నిచోటులందు సముదాయ సమాప్తియు శబ్దార్థస్వభావమునుబట్టి సహజము, సముచితమును అగును.

'భుజించుట' 'త్రాగుట' 'నడచుట' మొదలగు క్రియలకు ప్రత్యేక పరిసమాప్తి (ప్రతియొక కర్తతోను సంబంధము) తప్పదు. 'చూచుట' మొదలగు వ్యాపారములకు సముదాయపరిసమాప్తియే (కర్మసముదాయముతో సంబంధము) సమంజసము. (ఎందుచేత ననగా భోజనాదులను ఎవరికివారే చేయవలెను. లేకున్న ప్రతియొకరికిని తృప్తికలుగదు. కాని వస్తుసముదాయము నంతను ఒకేసారి చూడగలుగుదుము. విడివిడిగా ఒక్కొక్క వస్తువును చూడనక్కరలేదు). ఆయా వ్యాపారముల స్వభావమే ఇట్టి వ్యవస్థకు నిదానము.

'భాష వాక్యరూపము. వాక్యమందు క్రియ ప్రధానము, మిగిలినవన్నియు (కారకములు) క్రియకు విశేషణములు. ఆ క్రియ తన సంబంధమునకు తగిన వస్తువుల సముదాయమునకు అన్వయించినచో సముదాయ పరిసమాప్తి అగును. విడివిడిగా ప్రతియొక వస్తువునకు అన్వయించినచో ప్రత్యేక పరిసమాప్తి అగును' అని సారాంశము.

ఈ కారిక ప్రత్యేక సమాప్తి పక్షమును చూపును.

నాట్యక్రియవలె భోజన క్రియకు కారక సముదాయసమాప్తి కుదురదని చెప్పుచున్నాడు.

భోజనం ఫలరూపాఖ్యా మేకైకస్మిన్ సమాప్యతే
అన్యథా హి వ్యవస్థానే న తదర్థః ప్రకల్పతే. 372

ఫలరూపాఖ్యామ్ = 'తృప్తి' (కడుపునిండుట)అను ఫలముతోను, 'అన్నముతినుట' అను స్వరూపముతోను, భోజనమ్ = భోజనము, ఏకైకస్మిన్ = ప్రతియొక కర్తయందును, సమాప్యతే = పూర్తిఅగును (సంబంధించును). అన్యథా = మరియొకవిధముగా (సముదాయ సమాప్తి అని) వ్యవస్థానే = భుజించుటను నియమించినచో, తదర్థః = భోజనముయొక్క ప్రయోజనము, న + ప్రకల్పతే + హి = సిద్ధింపదుగదా।

తా. 'భుజించుట' అను క్రియకు ముఖ్యమైన స్వరూపము అన్నమును తినుట, ఫలము తృప్తి. ఈ రెండును ప్రతియొక కర్తకును చెందునపుడే భోజనము జరిగినట్లు లెక్క వచ్చును. ఒకడుభుజించగానే మిగిలిన అందరకును తృప్తి కలుగదుగదా। కావున భోజన క్రియకు ప్రత్యేకసమాప్తి అని చెప్పక తప్పదు.

వి. కొన్నిరకములైన క్రియలకు సముదాయ పరిసమాప్తి సహజముగా కుదురును. ఉదా: అభినయక్రియ (నాట్యక్రియ). ఒక నాటకమందలి నాట్యమును పెక్కుమంది కలిసి అభినయింతురు. నటులలో ఎవరి అభినయము వారికి వేరువేరుగా ఉన్నను, మొత్తముపై నటసముదాయమునకే ఆ అభినయము చెందును. 'నటాః శాకుంతలం అభినయంతి' మొదలగు వాక్యములలో, నాట్యక్రియ సముదాయమునకే సంబంధించును. అట్లే 'చూచుట' అనుక్రియ. 'సః వృక్షాన్ పశ్యతి' అను వాక్యములో, 'చూచుట' అనునది వృక్షసముదాయమునకే చెందును (అన్నింటిని ఒక్కసారిగనే చూడగలుగును. విడివిడిగా ఒక్కొక్కచెట్టును చూడనక్కరలేదు). ఇటువంటి వ్యాపారములలో ప్రత్యేకసమాప్తి ఆవశ్యకము కాదు. కాని భుజిక్రియ ఇటువంటిది కాదు. దాని విషయములో ప్రత్యేకసమాప్తియే ఫలప్రదము.

నాట్యక్రియ, దృశిక్రియ మొదలగువానివలె, భుజిక్రియకును సముదాయపరిసమాప్తిని ఎందుకు చెప్పకూడదు?- అను శంకకు ఈ శ్లోకము ఉత్తరమిచ్చినది.

సూక్ష్మముగా పరిశీలించినచో ప్రతిఒక క్రియకును, అవయవములైన కొన్ని క్రియలు కొద్దిగనో గొప్పగనో ఉండకతప్పదు. ఇందుకు 'పచిక్రియ' (వండుట) ప్రసిద్ధమైన ఉదాహరణము. బియ్యమును కడుగుట మొదలుకొని, పొయ్యిమీదనుండి గిన్నెను దింపుపరకును మధ్యను ఎన్నో చిన్నచిన్న వ్యాపారములుండును. అవన్నియు 'వండుట' అను క్రియకు అవయవములే. కాగా పచిక్రియ క్రియాసముదాయ రూపమైనదని తెలియును. విమర్శించి చూచినచో ప్రతిఒక క్రియయు క్రియాసముదాయ రూపమే అగును. అయినను ప్రతి ఒక క్రియకును ఒక ముఖ్యమైన రూపము, ఫలమును ఉండును. పచిక్రియకు 'బియ్యము ఉడుకుట' రూపమని, 'తినుటకుపయోగించుట' ఫలమనియు అనవచ్చును. ఇట్టి రూపమును ఫలమును బట్టియే ప్రత్యేక సమాప్తినిగాని, సముదాయ సమాప్తినిగాని నిర్ణయింపవలెను. అన్ని క్రియలకును ఒకేపద్ధతి పనికిరాదు. ఈ రీతినే సామర్థ్యము లేక వస్తుస్వభావము అని వ్యవహరింతురు. ఈ సామర్థ్యము ముందు వివరింపబడును.

ప్రకృతము – భుజిక్రియకూడ క్రియాసముదాయ రూపమే. (కాళ్ళు కడుగుకొనుట, పీటపై కూర్చుండుట, అన్నము వడ్డించుట, మొదలగునవి అవయవక్రియలు) అయినను దీని రూపఫలములు మాత్రము (తినుట, తృప్తి) వేరుగా ఉన్నవి. వాని ననుసరించి భుజిక్రియకు ప్రత్యేకసమాప్తినే చెప్పవలయునన్నది సారాంశము.

పై కారిక యొక్క విషయమునే స్పష్టపరచుచున్నాడు.

అన్నాదానాదిరూపాం చ సర్వే తృప్తిఫలాం భుజిమ్
ప్రత్యేకం ప్రతిపద్యంతే న తు నాట్యక్రియా మివ . 373

అన్నాదానాదిరూపామ్ = అన్నమును తీసికొనుట మొదలగు స్వరూపము కలిగినట్టియు, తృప్తిఫలామ్ + చ = తృప్తి అను ఫలము కలిగినట్టియు, భుజిమ్ = భోజనమను క్రియను, సర్వే = అందరును, ప్రత్యేకమ్ = ఒక్కొక్కరుగా, ప్రతిపద్యంతే = పొందుదురు, నాట్యక్రియామ్ + ఇవ = అభినయక్రియనువలె, న + తు = కాదు (సముదాయముగా పొందరు).

తా. ఒక్కొక్కక్రియకు ఒక్కొకరీతిని సంబంధము సహజము. భోజనమునకు ప్రత్యేకకారక సమాప్తియు, నాట్యమునకు కారక సముదాయ సమాప్తియు స్వభావసిద్ధములు.

వి. మీదికారిక చెప్పిన అంశమునే ఇది స్పష్టపరచినది. క్రియను 'సాధ్యము' (చేయదగుపని) అని అందురు. ఈ ధర్మము అన్ని క్రియలకును సమానమే. అయినను కారకములతో కలుగు సంబంధము మాత్రము ఆయా క్రియలకు నియతముగా ఉండును. అది వ్యవహారస్వభావము. శబ్దార్థసంబంధములవలెనే క్రియాకారకముల నియతసంబంధము కూడ అనాదిసిద్ధము. అందుచే భోజనము మొదలగు కొన్ని క్రియలు ప్రత్యేకముగా ఒక్కొక్క కారకమునకు సాధ్యములని, నాట్యము మొదలగు మరికొన్నిక్రియలు కారక సముదాయమునకు సాధ్యములనియు గ్రహింపవలెను.

పై భావమునే వేరొక దృష్టాంతముతో సమర్థించుచున్నాడు.

పాద్యవత్ సా విభాగేన సామర్థ్యా దవతిష్ఠతే
భుజిః కరోతి భుజ్యర్థం న తంత్రేణ ప్రదీపవత్ . 374

సా = ఆభోజనక్రియ, పాద్యవత్ = పాదోదకమువలె, సామర్థ్యాత్ = వస్తు స్వభావమువలన, విభాగేన = ప్రత్యేకముగా, అవతిష్ఠతే = సంబంధించి ఉండును, భుజిః = భోజనక్రియ, భుజ్యర్థమ్ = తృప్తిరూపమైన భోజనఫలమును, ప్రదీపవత్ = దీపమువలె, తంత్రేణ = సమానముగా (అన్నివస్తువులకు ఒకేసారి చెందునట్లుగా) న + కరోతి = చేయదు (సంపాదింపజాలదు).

తా. అతిథులకు పాదోదకమును ఇచ్చుట ఆచారము. ఆ ఉదకమును విడివిడిగా ప్రతియొక అతిథికిని ఇచ్చినపుడే సాఫల్యము. (ఒకరి కిచ్చినందువలన అందరకును పాద్య మిచ్చినట్లు కాదుగదా!) అట్లే భోజనక్రియకూడ ప్రత్యేకముగనే సంబంధించును. అది ఆ క్రియయొక్క స్వభావము.

దీపము ఒకచోటనే ఉండి, అన్నివస్తువులను ఒకేసారి ప్రకాశింపచేయగలదు. కాని భోజనక్రియ అట్లు చేయజాలదు (ఒకరు తిన్నందున అందరకును తృప్తి కలుగదు).

వి. మీది భావమే, వ్యతిరేకదృష్టాంతము మూలముగా విశదీకరింపబడినది. దీపప్రకాశముచేయు విధముగా భోజనక్రియ చేయలేదనుటయే దృష్టాంత తత్త్వము.

"చూచుట" మొదలగు క్రియలవిషయములో సముదాయపరిసమాప్తియే అని నిరూపించుచున్నాడు.

దృశ్యాదిస్తు క్రియైకాఽపి తథాభూతేషు కర్మసు
అవృత్తి మంతరేణాఽపి సముదాయాశ్రయా భవేత్ . 375

దృశ్యాదిః = 'చూచుట' మొదలగు, క్రియా + తు = వ్యాపారమైతే, ఏకా + అపి = ఒక్కటే, తథా భూతేషు = ఆయాయోగ్యములైన, కర్మసు = కర్మలు ఉన్నపుడు, ఆవృత్తిమ్ = ఆవృత్తి (మరల మరల చూచుట), అంతరేణ + అపి = లేకపోయినను, సముదాయాశ్రయా = సముదాయమందు సమాప్తికలదై, భవేత్ = అగును.

తా. 'చూచుట' (పశ్యతి, పశ్య, పశ్యేత్ మొదలగు ప్రయోగములు. —'దృశ్' ధాతువు) మొదలగు క్రియ, ఆవృత్తి అక్కరలేకుండగనే, యోగ్యమైన కర్మ సముదాయ మందు పరిసమాప్తమగును. ఉదా: 'త్వం వృక్షాన్ పశ్య'—ఇచట చెట్లు కర్మలు. వాని నన్నింటిని ఒక్కసారిగనే చూడవచ్చును. చూపును ఆవృత్తి చేసి, ప్రతియొక చెట్టును వేర్వేరుగా చూడనక్కరలేదు.

వి. ద్వంద్వము (రామ, కృష్ణ, గోపాలాః భుంజంతు), ఏకశేషము (బ్రాహ్మణాః భుంజంతు), ఉన్నపుడు, ఆవృత్తి అనెడి మరొకక్రియను (తినుట అనునది మరల మరల జరుగుట) ఆశ్రయించి భోజనవ్యాపారము ప్రత్యేకముగ సంబంధించుననియు, భోజన సామాన్యరూపమున అదియే సముదాయమునకు కూడ సంబంధించు ననియు శాస్త్రీయముగ చెప్పుదురు. (సముదాయాన్వయమును చెప్పకున్న ద్వంద్వైకశేషములు శాస్త్రప్రకారము కుదురవు).

దృశిక్రియకు అట్టి ఆవృత్తి కూడ అక్కరలేకుండగనే సముదాయసమాప్తి కుదురును. ఈ అంశమును చెప్పుటకే ఈ శ్లోకము బయలుదేరినది.

'వండుట' మొదలగు కొన్ని క్రియల విషయములో గూడ, సముదాయ సమాప్తియే సముచితమని భావించుచున్నాడు.

భిన్నవ్యాపారరూపాణాం వ్యవహారాదిదర్శనే
కర్తృణాం దర్శనం భిన్నం సంభూ యార్థస్య సాధకమ్ . 376

భిన్నవ్యాపార రూపాణామ్ = వేరువేరు వ్యాపారముల స్వరూపములుగల, కర్తృణామ్=కర్త, కర్మ, కరణము మొదలగు కారకములయొక్క, దర్శనమ్ = కనబడుట (తెలియుట), భిన్నమ్ = వేరుగా ఉన్నదై, వ్యవహారాది దర్శనే=అయా అర్థములలో అయా ధాతువు యొక్క ప్రయోగము కనిపించునపుడు, సంభూయ = కలిసి, (మొత్తముపై) అర్థస్య = ఆయా కారక సముదాయమునకు సంబంధించిన అర్థమును, సాధకమ్ = సాధించునది, (భవతి = అగును).

తా. ఒకక్రియలో అవయవములుగా పెక్కుక్రియలు ఉండునని, వెనుక చూపబడినది. క్రియను పుట్టించునది కారకమగును. (కరోతి = క్రియాం జనయతి=కారకమ్), కాగా ఒక ప్రధానక్రియను తీసికొన్నపుడు, దానికి చెందిన కారకమును, అవయవక్రియలకు చెందిన కారకములును విడివిడిగా అనుభూతము లగుచుండును. అయినను ప్రయోగములలో, 'ప్రధానమగు క్రియ కారక సముదాయమునకే సంబంధిచును' అనియే తెలియుచుండును.

వి. ఈ కారికయొక్క భావమును, ప్రసిద్ధమైన ఒక ఉదాహరణము మూలముగా తెలియనగును. "పచ్" (పాకే) అను ధాతువునకు "వండుట" అని అర్థము. "దేవదత్తః కాష్ఠైః స్థాల్యాం తండులం పచతి" (దేవదత్తుడు కర్రలతో గిన్నెయందు బియ్యమును వండుచున్నాడు) అని ప్రయోగము. ఇచట 'వండుట' ముఖ్యవ్యాపారము. బియ్యమును కడుగుట, గిన్నెలో పోయుట, పొయ్యిమీద పెట్టుట మొదలగు అవయవ వ్యాపారము లెన్నో ఉండును. అట్లే దేవదత్తుడు కర్తయు, కాష్ఠములు కరణములును, స్థాలి (గిన్నె) అధికరణమును, తండులములు కర్మయును అయి ఉన్నవి. ఈ కారకములకు కూడ వాని వాని వ్యాపారములు ఉండును. ఇట్టి సన్నివేశములో 'వంట' అను క్రియ వేరువేరుగా ఒక్కొక్క కారణమునకు సంబంధించినదని చెప్పుటకు వీలులేదు (ఏ ఒకదాని వలనను వంట పూర్తిఅయినట్లు లెక్కరాదు). కావున ఆ క్రియ కారకసముదాయమునకే చెందుననియు, అది కారక సమూహసాధ్యమనియును చెప్పవలెను. ఇదియు వాక్యస్వభావమే.

పచ్యాదిక్రియలు కొన్ని, తమ తమ స్వభావము ననుసరించి, కారక సముదాయ పరిసమాప్తములగు చుండును. వానివిషయములో ప్రత్యేక కారకసమాప్తి పొసగదు.

మీది ఉదాహరణవాక్యములో, దేవదత్తుని వ్యాపారము, మొత్తముగా వంటను చేయుటయు, కర్రలపని మంటను కలిగించుటయు, గిన్నెపని బియ్యమును భరించి పొయ్యిమీద ఉండుటయు, బియ్యము వ్యాపారము మెత్తబడుటయు నని విశ్లేషించుకొనవలెను. 'పచతి' అనగా ఈ పనులన్నియు కలిసి, ఒక ముద్దగా తయారైన పని జరుగుచున్నదని తెలియును. కారకసముదాయ సమాప్తి అనగా ఇదియే. 'పచ్' ధాతువువంటి ఇతర ధాతువుల విషయములో కూడ ఈ తీరును ఊహించుకొనవలెను.

కారికయందలి దర్శనశబ్దమునకు 'జ్ఞానము' అని అర్థమును చెప్పవలెను. 'కన బడుట' అన్నది ఫలితార్థము.

శాస్త్రీయవాక్యములో ప్రత్యేక సమాప్తిని చూపుచున్నాడు.

లక్ష్యస్య లోకసిద్ధత్వా చ్ఛాస్త్రే లింగస్య దర్శనాత్
అర్థిత్వా దైచు భేదేన వృద్ధిసంజ్ఞా సమాప్యతే. 377

లక్ష్యస్య=ప్రయోగములు, లోకసిద్ధత్వాత్=భాషలో సహజముగా ఉన్నందు వలనను, శాస్త్రే=వ్యాకరణశాస్త్రమున, లింగస్య=జ్ఞాపకము, దర్శనాత్=కనబడుట వలనను, అర్థిత్వాత్=అపేక్ష ఉన్నందువలనను, ఐచు=ఆ, ఐ, ఔ, (దీర్ఘములు) అను వర్ణములందు, భేదేన=వేర్వేరుగా, వృద్ధిసంజ్ఞా='వృద్ధి' అను శాస్త్రీయసంజ్ఞ, సమాప్యతే= సంబంధించును.

తా. 'వృద్ధిరాదైచ్' (1-1-1) అను సూత్రము, ఆ, ఐ, ఔ, (దీర్ఘములు) అను వర్ణములకు వృద్ధిసంజ్ఞను చెప్పినది. ఈ సంజ్ఞ మూడు వర్ణములకును ప్రత్యేకముగా చెందును. (సముదాయమునకు చెందదు). భాషలోని ప్రయోగములు, వ్యాకరణమందలి జ్ఞాపకము, ఆ వర్ణముల అపేక్ష అను మూడున్ను ఇందుకు హేతువులు.

వి. శాస్త్రమందు కొన్నిచోట్ల ప్రత్యేక వాక్యపరిసమాప్తి ఆవశ్యకమని చెప్పుటకు, వృద్ధిసంజ్ఞ ఉదాహరణముగా తీసికొనబడినది. ఇచట ప్రత్యేకసమాప్తిని సమర్థించుటకై మూడు కారణములు చూపబడినవి: 1. లోకసిద్ధమైన లక్ష్యము: 'అసురస్య ఇదమ్=ఆసు రమ్' (అసురసంబంధి), 'ఇంద్రః దేవతా అస్య=ఐంద్రమ్' (ఇంద్రుడు దేవతగాగలది), 'ఉపగోః అపత్యం పుమాన్=ఔపగవః' (ఉపగుని పురుషసంతతి) ఈ మూడు స్థలముల లోను మొదటి అచ్చునకు వృద్ధివచ్చినది. అది ఒక్కొక్కచోట ఒక్కొక్క వర్ణముగనే (సదృశ మైన వర్ణము) ప్రవర్తించినదిగాని, సముదాయరూపముగా ప్రవర్తింపలేదు. ఇట్టి ప్రయోగములు అనాదిసిద్ధములు.

2. శాస్త్రమందలి జ్ఞాపకము:'వృద్ధిర్య స్యాచా మాది స్తద్వృద్ధమ్' (1-1-73) అను సూత్రము 'వృద్ధ' అను సంజ్ఞను చెప్పినది. 'యస్య సముదాయస్య అచాంమధ్యే ఆది ర్వృద్ధిః తద్వృద్ధసంజ్ఞం స్యాత్'— అని ఈ సూత్రముయొక్క వృత్తి. 'ఒక శబ్దమందలి అచ్చులలో మొదటి అచ్చు వృద్ధిసంజ్ఞ గలదైనచో (ఆ, ఐ, ఔ, అనువానిలో ఒకటి), ఆ శబ్దము 'వృద్ధము' అనిపించుకొనును అని దీని అర్థము. ఉదా: మాలా, ఐశ్వర్య, ఔపగవ అనునవి వరుసగ వృద్ధములగును. (వృద్ధసంజ్ఞకములకు ప్రవర్తించు తద్ధిత కార్యములు పెక్కులున్నవి). వృద్ధిసంజ్ఞ ప్రత్యేకముగ పరిసమాప్తమైనపుడే, ఈ సూత్రము సార్థక మగును. (సముదాయ సమాప్తి అన్నయెడల, ఆ, ఐ, ఔ ల సముదాయము ఏశబ్దమందును మొదట సంభవింపదుగాన వృద్ధసంజ్ఞాసూత్రము వ్యర్థమగును గాదా!) కాగా ఈ సూత్రము ప్రత్యేకసమాప్తికి జ్ఞాపకము.

3. అర్థిత్వము—లేక—అపేక్ష—ఆ, ఐ, ఔ, అనునవి విడివిడిగానే వృద్ధిసంజ్ఞను కోరుకొనును. లేకున్న (సముదాయమే వృద్ధి సంజ్ఞక మైనచో) ప్రయోగములలో ఎక్క డను ఈ సంజ్ఞకు ఉపయోగము ఉండదు.

పై మూడు హేతువుల వలనను, వృద్ధిసంజ్ఞ వేరుగా ఒక్కొక్క వర్ణమునకే చెందు నని ఫలించును.

కొన్నిచోట్ల సముదాయవాక్య సమాప్తి సమంజసమనుచున్నాడు.

శతాదానే ప్రధానత్వా ద్దండనే శతకర్మకే
అర్థినాం గుణభేదేఽపి సంఖ్యేయోఽర్థో న భిద్యతే. 878

శత కర్మకే = నూరు రూపాయిలు కర్మగా గల, దండనే = 'జరిమానా' యందు (శిక్షకు పరిహారముగా చెల్లించవలసిన ధనము), అర్థినామ్ = కోరే వారికి (ఆ సొమ్మును కోరు రాజులకు - లేక—అధికారులకు), శతాదానే = నూరు రూపాయలను తీసికొనుటయే, ప్రధానత్వాత్ = ముఖ్యమగుటవలన, గుణభేదే + అపి = అప్రధానులైన—ఇచ్చేవారియొక్క భేదమున్నను (ఇచ్చేవారు ఎందరున్నను), సంఖ్యేయః = లెక్కింపదగిన, అర్థః = అర్థము (సొమ్ము), న + భిద్యతే = మారదు.

తా. 'గర్గాః శతం దండ్యంతామ్'— 'అర్థినశ్చ రాజానో హిరణ్యేన భవంతి' అని ప్రయోగము. "గర్గులనువారినుండి నూరు రూపాయలను జరిమానాగా వసూలు చేయవలెను. - రాజులకు కావలసినది ఆ సొమ్ముమాత్రమే" అని దీని భావము. ఇచట నూరు రూపాయిలే ముఖ్యము. గర్గుల సంఖ్య ముఖ్యము కాదు. కనుక గర్గులు ఎందరున్నను అందరి మొత్తముపై నూరు రూపాయిలను వసూలు చేయుదురు. (ఒక్కొక్క గర్గుని నుండి నూటిని వసూలు చేయరు). అనగా ఈ వాక్యమునకు గర్గసముదాయమందే పరిసమాప్తి అని తెలును.

వి. 'లౌకిక వాక్యములందు కూడ కొన్నిచోట్ల సముదాయసమాప్తియే' అని ఉదాహరణపూర్వకముగా ఈ శ్లోకము చూపినది. 'వాక్యసామర్థ్యము, అన్వయ స్వారస్యము, యోగ్యత మొదలగు హేతువులనుబట్టి ఆయా వాక్యములలో ప్రత్యేక పరిసమాప్తి అనిగాని, సముదాయ పరిసమాప్తి అనిగాని నిశ్చయించుకొనవలెననియు, ఈ విషయమున ప్రత్యేక నియమము లేవియు లేవనియు, సహజసిద్ధమైన వాక్యార్థస్వభావమును విశదీకరించి చూపుటయే పండితుల పని అనియును' దీనివలన ఫలించును.

మీదచూపిన వాక్యమున 'శతము' ప్రధానకర్మ అనియు, 'గర్గులు' అప్రధాన కర్మ అనియు శాస్త్రీయముగా చెప్పుదురు. కాన ప్రధానమైన శతమే తాత్పర్యవిషయమగుటయు, గర్గులసంఖ్య అట్లు కాకపోవుటయును సిద్ధించును. గర్గు లెందరున్నను అందరి మొత్తమునుండి నూరు రూపాయిలను తప్పక తీసుకొనవలెనని పర్యవసించును.

శాస్త్రీయ వాక్యములలో సముదాయ సమాప్తిని చూపుచున్నాడు.

సంఘస్యైవ విధేయత్వాత్ కార్యవత్ప్రతిపాదనే
తత్ర తంత్రేణ సంబంధః సమాసాఖ్యాస్తసంజ్ఞయోః. 879

కార్యవత్ప్రతిపాదనే = శబ్దార్థసంబంధములు అనిత్యములను వ్యాఖ్యానమందు, సంఘస్య + ఏవ = సముదాయమునకే, విధేయత్వాత్ = విధింపబడుటవలన, సమాసాఖ్యాస్త

సంజ్ఞయోః = సమాసము, అభ్యస్తము అను సంజ్ఞలకు, తయోః = ఆ సముదాయములందే, తంత్రేణ = ఒక్కసారిగ, సంబంధః = సంబంధము (సమాప్తి), (భవతి = అగును).

తా. సమాసము (రాజపురుష మొదలగునవి), అభ్యస్తము (దదత్ మొదలగునవి), అను సంజ్ఞలు వ్యాకరణశాస్త్రమందున్నవి. ఇవి సముదాయములకే విధింపబడినవి. కాన ఈ సంజ్ఞలకు ఆయా సముదాయములతోనే సంబంధమును చెప్పవలెను. (ప్రత్యేక పరిసమాప్తి వీని విషయములో కుదురదు).

'సహసుపా' (2—1—4) అని సూత్రము. 'సుప్ సుపా సహ సమస్యతే — సః సమాసః' అని వృత్తి. 'సుబంతము సమర్థమైన వేరొక సుబంతముతో కలిసి సమాసమని పించుకొనును' అని భావము. పూర్వోత్తరపదముల సముదాయమునకే సమాససంజ్ఞను ఈ సూత్రము విధించుచున్నది. కాన ప్రత్యేకపదములకు సమాససంజ్ఞ వర్తించదు. అట్లే 'ఉభే అభ్యస్తమ్' (6—1—5) అని సూత్రము. 'షాష్ఠద్విత్వప్రకరణే యే ద్వే విహితే తే ఉభే సముదితే అభ్యస్త సంజ్ఞే స్తః'—అని వృత్తి. "ఆరవ అధ్యాయములోని సూత్రములచే ద్విత్వమును పొందినపుడు, ఆ రెండు భాగములును కలిసి మొత్తముగా 'అభ్యస్తము' అన బడును" అని భావము. ద్విత్వమును పొందిన (రెండు) భాగముల సముదాయమునకే ఈ సూత్రము అభ్యస్త సంజ్ఞను విధించినది. కాన ప్రత్యేకభాగమునకు అభ్యస్త సంజ్ఞ ఉండదు.

వి. వ్యాకరణ శాస్త్రములో సముదాయ పరిసమాప్తిని చూపుటకై ఈ కారిక బయలుదేరినది. "రాజపురుషః" మొదలగు సమాసములలో, సముదాయమునకే సమాస సంజ్ఞ. అట్లే దదత్, బిభ్యత్, మొదలగు ద్విరుక్తరూపములలో కూడ, సముదాయమునకే అభ్యస్తసంజ్ఞ. శాస్త్ర మావిధముగ చెప్పుటయే అందుకు హేతువు.

'దా' (దానే) ధాతువునకు 'శతృ' (అత్) ప్రత్యయమును చేర్చినపుడు, ద్విరుక్తి కలిగి 'దదత్' అను రూపమగును. (దా + దా + అత్ = దదత్ = ఇచ్చువాడు). ఇట్లే 'భీ' (భయే) ధాతువునకు 'బిభ్యత్' (భీ + భీ + అత్ = బిభ్యత్ = భయపడువాడు) అను రూపమగును.

"'శబ్దము నిత్యము' అన్నపక్షములో సమాసాదులు కూడ నిత్యములే కాన, వాని విషయములో శాస్త్రవిధాన మెట్లు కుదురును?" అను శంక రాకుండుటకై, 'కార్యవత్ప్రతిపాదనే' అనునది కారికలో పొందుపరచబడినది. 'శబ్దము అనిత్య' మను కొందరి మతము నాశ్రయించి యిట్లనవచ్చు నని భావము.

తంత్రేణ = ఒక్కసారిగా, తంత్రశబ్దమునకు ఇచట ఈ లాక్షణికార్థమును చెప్పవలెను.

కొన్ని వాక్యములలో ప్రత్యేక సమాప్తియు సముదాయ సమాప్తియును, సంభవించునని ప్రతిపాదించుచున్నాడు.

> లక్షణార్థా శ్రుతి ర్యేషాం కాంచిదేవ క్రియాం ప్రతి
> తై ర్వ్యస్తై శ్చ సమస్తై శ్చ స ధర్మ ఉపలక్ష్యతే. 380

కాంచిత్ + ఏవ = ఒకానొక, క్రియామ్ + ప్రతి = వ్యాపారమును గురించి, యేషామ్ = ఎవరికి సంబంధించిన, లక్షణార్థా = ఉపలక్షణము కొరకైన, శ్రుతిః = పదము

గాని, వాక్యముగాని (వినబడువచనము), (స్యాత్ = ఉండునో), వ్యస్తైః + చ = విడిగా ఉన్నను, సమస్తైః + చ = సముదాయముగా ఉన్నను, తైః = వారిచే, సః = ఆ, ధర్మః = ధర్మము, ఉపలక్ష్యతే = సూచింపబడును.

తా. ప్రత్యేకమగు ఒక ధర్మముగల వ్యక్తులను ఉద్దేశించి, ఒక పనిని బోధించు వాక్యమును ప్రయోగించినపుడు, విడిగా ఉన్నను, కలిసిఉన్నను ఆ ధర్మముగలవారికి ఆ పని సంబంధించును. నిర్దేశింపబడిన ధర్మ మచట ఉపలక్షణముగా ఉపయోగించును.

వి. కొన్ని వాక్యములలో స్వభావమునుబట్టి, ప్రత్యేకసమాప్తియు సముదాయ సమాప్తియుకూడ సమంజసమగునని చెప్పుట ఈ కారికయొక్క ఉద్దేశము. ఉదాహరణమును దిగువకారిక స్పష్టపరచును.

ఉపలక్షణమనగా 'సూచనము' అని సామాన్యార్థము. 'తన అర్థముతోపాటు మరియొక అర్థమునుకూడ సూచించు పదమును ఉపలక్షకమనియు, ఉపలక్షణమనియు సాంకేతికముగా చెప్పుదురు, ఉదా: "కాకేభ్యః దధి రక్ష్యతామ్" (కాకులనుండి పెరుగును కాపాడవలెను) ఇచట కాకశబ్దము ఉపలక్షణమై, పెరుగును తిను అన్ని పక్షులను, జంతువులను కూడ సూచించును. అంతేగాని, కాకులను మాత్రమే పారద్రోలి, ఇతర జంతువులు పెరుగును తినుచున్నను ఊరకుండుమని తాత్పర్యముకాదు. చెప్పేవాని భావమునుబట్టి ఉపలక్షణాంశము తెలియుచుండును.

జాతిరూపమైన ధర్మమునుకూడ ఉపలక్షణమని వ్యవహరించుదురు. ప్రకృత శ్లోకమున ఇట్టి ధర్మమునే ఉపలక్షణముగా గ్రహింపవలెను. దిగువ శ్లోకమందలి ఉదాహరణము ఈ అంశమును విశదీకరించును.

మీది కారికకు ఉదాహరణమును ఇచ్చుచున్నాడు.

> వృషలైర్న ప్రవేష్టవ్య మిత్యేతస్మిన్ గృహే యథా
> ప్రత్యేకం సంహతానాంచ ప్రవేశః ప్రతిషిధ్యతే. 381

యథా = ఎట్లనగా, ఏతస్మిన్ = ఈ, గృహే = ఇంటియందు, వృషలైః = శూద్రులు, న + ప్రవేష్టవ్యమ్ = ప్రవేశింపగూడదు, ఇతి = అనగానే, ప్రత్యేకమ్ = విడిగా ఒక్కొక్కనికిని, సంహతానామ్ + చ = సమూహముగా ఉన్నవారికినికూడ, ప్రవేశః = ప్రవేశము, ప్రతిషిధ్యతే = నిషేధింపబడును.

తా. "ఈ యింటిలో శూద్రులు ప్రవేశింపరాదు." ఈ వాక్యమున క్రియకు ప్రత్యేకసమాప్తియు, సముదాయ సమాప్తియును కూడ ఉన్నది. 'ఒక్కడైనాసరే మరెందరైనా సరే శూద్రజాతి వ్యక్తికి ఈ యింట ప్రవేశము నిషిద్ధ' మను భావము ఈ వాక్యమువలన ఫలించును.

వి. పై కారికకు ఈ కారిక పూర్తిగా ఉదాహరణరూపము. ప్రత్యేక సముదాయ పరిసమాప్తులు రెండును ఒకేవాక్యములో ఉండవచ్చుననుటకు, "ఏతస్మిన్ గృహే వృషలైః న ప్రవేష్టవ్యమ్" మొదలగు వాక్యములు ఉదాహరణములగును. ఇచట ప్రవేశ నిషేధము వ్యాపారము. వృషలత్వమను జాతి ఉపలక్షణము. ఆధర్మముగల వ్యక్తికిగాని, వ్యక్తి సము

దాయమునకు గాని గృహమందు ప్రవేశించుట నిషిద్ధము. ఈ విధముగ రెండు కారికలను కలిపి సమన్వయము చేసికొనవలెను.

మీది భావమునే వేరొక తీరులో చూపుచున్నాడు.

సంభూయ త్వర్థలిప్సాదిప్రతిషేధోపపాదనే
పృథగప్రతిషిద్ధత్వాత్ ప్రవృత్తి ర్న విరుధ్యతే. 382

సంభూయ + తు = సముదాయము మొత్తముపైననే, అర్థలిప్సాది ప్రతిషేధోపపాదనే = ధనమందు కోరిక, రాగము, ద్వేషము మొదలగువానిని నిషేధించునపుడు, పృథక్ = ప్రత్యేకముగా, అప్రతిషిద్ధత్వాత్ = నిషేధింపబడక పోయినను, ప్రవృత్తిః = వేరు వేరుగా నిషేధము ప్రవర్తించుట, న + విరుధ్యతే = విరోధించదు.

తా. ఒక వాక్యములో ఒక విషయమును, సముదాయమునకే చెందునట్లు నిషేధింపవచ్చును. ప్రత్యేకముగా ఒక్కొకవ్యక్తికి నిషేధము సంబంధించు సూచన అందేమియు ఉండదు. అయినను ఆ నిషేధము సముదాయమునకు వలె, ప్రత్యేకవ్యక్తులకును సంబంధించును. అది వాక్యస్వభావము.

వి. సముదాయమునకే ఉద్దేశింపబడినట్లు కనబడు కొన్ని వాక్యములకు కూడ ప్రత్యేకసమాప్తి ఉండుననియు, ఉభయసమాప్తియే (సముదాయ + ప్రత్యేకసమాప్తులు) అట్టిచోట్ల అభిమతమనియు, అది వ్యవహారస్వభావమనియును, ఈ కారిక ప్రతిపాదించును. ఉదా : "భవద్భిః ఇతఃపరం రాజసేవా న కార్యా, సముద్గమనం న విధేయం, కృషికర్మ నానుష్ఠేయం, ధనలిప్సా న కార్యా, యోషా న స్ప్రష్టవ్యా". (ఇటుపైని మీరందరును రాజును సేవింప కూడదు, ఎవరికిని నమస్కరించకూడదు, వ్యవసాయమును చేయకూడదు, ధనమందు కోరిక నుంచుకొనరాదు, స్త్రీని ముట్టుకొన కూడదు). సంన్యాసదీక్షను పుచ్చుకొన్నవారిని ఉద్దేశించి, గురువుగారు చెప్పు వాక్యమిది. ఇచటి నిషేధము సామూహికమైనను, ప్రత్యేకముగా కూడ సంబంధించును. (ఆ యా పనులను సముదాయము మాత్రమే చేయకూడదనియు, వేరుగా వ్యక్తులు చేయవచ్చుననియును వాక్యతాత్పర్యము కాదుగదా !) ఇట్టి వాక్యములను "ఉభయ సమాప్తిగల వాక్యములు" అందురు.

శాస్త్రీయమగు వాక్యమందు ఉభయవిధవాక్యసమాప్తికి ఉదాహరణమును ఇచ్చుచున్నాడు.

వ్యవాయలక్షణార్థత్వా దట్కుప్వాఙాదిభి స్తథా
ప్రత్యేకం వా సమస్తై ర్వా ణత్వం న ప్రతిషిధ్యతే. 383

తథా = ఆ విధముగానే. వ్యవాయలక్షణార్థత్వాత్ = వ్యవధానము (అడ్డు) ఉపలక్షణమగుటవలన, ప్రత్యేకమ్ + వా = విడివిడిగా ఉన్నను, సమస్తైః + వా = కలిసిఉన్నను, అట్కుప్వాఙాదిభిః = అట్, కు, పు, ఆఙ్ మొదలగువానిచే, ణత్వమ్ = ణత్వమను కార్యము, న + ప్రతిషిధ్యతే = నిషేధింపబడదు.

తా. "అట్కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి" (8–4–2) అను సూత్రము, 'అట్, కు, పు- మొదలగు వానితో వ్యవధానమున్నను, నకారమునకు ణత్వమగును"

అని చెప్పుచున్నది. ఇచట వ్యవధానమన్నది ఉపలక్షణము, కాన, ఒక్కొకదానితో వ్యవధాన మున్నను, సముదాయముతో వ్యవధానమున్నను, ణత్వము ప్రవర్తించును. అనగా ణత్వమును విధించు ఈ వాక్యమునకు ఉభయ సమాప్తి ఉన్నదని అభిప్రాయము.

వి. వ్యాకరణ శాస్త్రములో ఉభయసమాప్తికి ఒక ఉదాహరణమును ఈ శ్లోకము చూపినది. ''అట్కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి'' '8-4-2) అని సూత్రము. ''అట్, కవర్గ, పవర్గ, ఆఙ్, నుమ్— ఏతైః వ్యస్తైః యథాసంభవం మిలితైశ్చ వ్యవధానేఽపి, రషాభ్యాం పరస్య నస్య ణః స్యాత్ సమానపదే'' అని వృత్తి. ''ఏకపదమందు రేఫకుగాని, షకారమునకు గాని పరముగా ఉన్న నకారమునకు ణత్వముగును. రేఫషకారములకును, నకారమునకును మధ్యను— అడాదులతో— విడివిడిగా కాని, పీలున్న సముదాయముగా గాని వ్యవధాన మున్నను, ణత్వము ప్రవర్తించును'' అని భావము. ఉదా :— రామేణ (రామే + న = రామేణ ఇచట రేఫకును నకారమునకు మధ్యను అ-మ్-ఏ-అనునవి అడ్డుగా ఉన్నను, ణత్వము వచ్చినది).

విశేష్యమందు తప్పక ఉండునట్టియు, తాను తప్ప మిగిలిన వానిని త్రోసి వేయునట్టియు ధర్మమును విశేషణమందురు. ఉదా: "కపిలా గౌః" (పచ్చని ఆవు). ఇచట కపిలత్వము విశేషణము. విశేష్యమందుండు ధర్మముతో పాటు ఇతర ధర్మమును కూడ సూచించి కూడగట్టుకొనునది ఉపలక్షణము. ఉదా: ''ఇదం సస్యం గోభ్యః రక్షేత్'' (ఈ సస్యమును ఆవులు తినకుండ కాపాడవలెను). ఇచట గోశబ్దము ఉపలక్షణమై, ఆవులనే కాక, సస్యమును తిను ప్రతియొక జంతువును కూడ బోధించును.

ప్రకృతమున వ్యవధానమన్నది ఉపలక్షణము కావుననే ''విడిగా కాని, సమూహ ముగా కాని వ్యవధానము'' అను అర్థము సిద్ధించినది. విశేషణమన్నచో, "సముదాయము తోనే వ్యవధానము ఉండవలెను'' అను అర్థము వచ్చెడిని.

అట్ = అట్ ప్రత్యాహారములోని వర్ణము. కు = కవర్గ వర్ణములు. పు = పవర్గా క్షరములు. ఆఙ్ = ఆ-అనునిపాతము. నుమ్ = న్- అను ఆగమము.

భోజన క్రియా విషయమున ఏకత్వానేకత్వములను పరిశీలించుచున్నాడు.

(ఇది మొదలు మూడు శ్లోకములతో)

> అనుగ్రహార్థం భోక్తౄణాం భుజి రారభ్యతే యదా
> దేశకాలాద్యభేదేన నాఽనుగృహ్ణాతి తా నసౌ . 384

భోక్తౄణామ్ = భుజించు వారియొక్క, అనుగ్రహార్థమ్ = అనుగ్రహముకొరకు (వారి ఆశీస్సుల ఫలమును పొందుట—లేక— వారు భుజించినందువలన కలుగు పుణ్యమును పొందుట), దేశకాలాద్యభేదేన = దేశ కాలాదిభేదము లేకుండ, భుజిః = భుజిక్రియ, యదా = ఎప్పుడు, ఆరభ్యతే = ప్రారంభింపబడునో, (తదా = అప్పుడు) అసౌ = ఈ భుజిక్రియ, తాన్ = ఆ భోక్తలను, న + అనుగృహ్ణాతి = అనుగ్రహించదు. (అనుగ్రహము వారికి చెందదు, భోజనము పెట్టినవారికే చెందును).

తా. భోక్తల అనుగ్రహముకొరకు భోజనమును పెట్టినపుడు, భోక్తల అనుగ్రహము అన్నదాతకు చెందునుగాని భోక్తలకు చెందదు. అన్నదానమునకు దేశకాలాది భేదములు లేవు. ఏ దేశమందు పెట్టినను, ఏ కాలమందు పెట్టినను, ఎవరికి పెట్టినను-అన్నమును పెట్టినందువలన, భోక్తల అనుగ్రహము తప్పక కలుగును. దేశకాలభేదము న్నను (ఒక్కొకచోట, ఒక్కొకసమయమున, ఒక్కొకవ్యక్తికి అన్నదానము చేసినను వారి అనుగ్రహము కలుగును).

వి. "ఒక విధముగా చెప్పినచో, భుజిక్రియ (భుజించుట) ఒకటే అగును. అవుడు దానికి "సముదాయ సమాప్తి" అన్నను బాధ ఉండదు. "మరొక విధముగా చెప్పినచో అక్రియ అనేకమగును. అపుడు దానికి ప్రత్యేక సమాప్తి తప్పదు" అను అంశమును సూచించుటకై ఇది మొదలు వరుసగా మూడు శ్లోకములు ప్రయత్నించును. "దేశ కాలాది భేదమున్నను లేకున్నను, భోక్తల అనుగ్రహము సమానముగనే లభించును" అను సామాన్యాంశమును ఈ కారిక చెప్పినది.

భోజనమును పెట్టుట రెండు విధములు. భోక్తల అనుగ్రహమును కోరునది ఒకవిధము. శ్రాద్ధాదులందు నిమంత్రించిన భోక్తల విషయములో ఇది సరిపోవును. భోక్తల అనుగ్రహమును కోరనిది రెండవ విధము. ఒకరు తమంత తాము కోరగా పెట్టు భోజనము విషయములో ఇది సరిపోవును.

అనుగ్రహార్థమైన భోజన మిచట గ్రహింపబడినది(రెండవదానిని కూడ ఊహించు కోవచ్చును. అచట కూడ ఏదోఒక రూపమున భోక్తల అనుగ్రహము ఉండును).

"దేశకాలాద్యభేదేన" అన్నందువలన, 'ఒకప్రదేశమందే, ఒకసమయమందే, కొందరు వ్యక్తులకే భోజవము పెట్టినపుడు' అను అర్థము వచ్చును, కాని అట్టి నిర్బంధ మక్కరలేదు. ఈ పదము "దేశకాలాదిభేదము ఉన్నను" అను అంశమును కూడ సూచించును.

భోజనము విషయములో దేశకాలపాత్రలను గురించిన నియమములు, ధర్మశాస్త్ర ములందు పెక్కులున్నవి. వానిని ఇచట భావించుకొనవలెను.

పాత్రాదిభేదా న్నానాత్వం యస్యైక స్యోపదిశ్యతే
విపర్యయే వా భిన్నస్య తస్యైకత్వం ప్రకల్ప్యతే. ౪౩౯

యస్య = ఎవని మతమున, ఏకస్య = ఒకటియైన భుజిక్రియా స్వరూపమునకు, పాత్రాదిభేదాత్ = దేశ, కాల, పాత్రల భేదమువలన, నానాత్వమ్ = భేదము, ఉపదిశ్యతే = చెప్పబడునో, తస్య = వాని మతమున, ఏకత్వమ్ = ఐక్యము (భుజిక్రియకు), ప్రకల్ప్యతే= స్పష్టముగ చెప్పబడును. విపర్యయే వా = విపరీతముగా చెప్పినచో, (భుజక్రియ భిన్నము అన్నపుడు), భిన్నస్య = భిన్నమైన భుజిక్రియకు, (పాత్రాద్యభేదాత్ = దేశకాల పాత్రలభేద మును భావింపనందువలన), ఏకత్వమ్ = ఐక్యము, ప్రకల్ప్యతే = చెప్పబడును.

తా. భుజిక్రియకు తృప్తి అన్నది ఫలము. అది భోక్తలందరకును సమా నమే కావున, ఆ సామాన్యధర్మము ననుసరించి, భోక్తలు వేరువేరుగా ఉన్నను, 'భుజిక్రియ

ఒకటే' అని కొందరందురు. ఈ పక్షమున దేశ, కాల, పాత్రల భేదమును పురస్కరించు కొని, 'భుజిక్రియ భిన్నము కావచ్చుననియు, స్వయముగ అది ఒకటే' అనియును సమర్థించుకొనవచ్చును.

"భోక్తలు వేరువేరుగా ఉన్నందున భుజిక్రియయు వేరువేరు" అని భుజిక్రియకు భేదమును మరికొందరు చెప్పుదురు. ఈ పక్షమున దేశ, కాల, పాత్రములయొక్క అభేదమును భావించుకొని, "స్వయముగ భిన్నమైనను, భుజిక్రియ ఒకటే" అని వ్యాఖ్యానింపవచ్చును.

వి. 'భుజిక్రియ సహజముగ ఒకటే' అన్నది ఒకమతము .ఇందు భేదము కల్పితమగును. 'భుజిక్రియ సహజముగ భిన్నము' అన్నది మరొకమతము. ఇందు అభేదము కల్పితమగును. కల్పితమైనదానిని 'ఔపాధికము' అని సాంకేతికముగా అందురు. అనగా 'ఆయా ధర్మములను భావించి, పరిగణించుట' అని భావము.

కాగా భుజిక్రియ ఏకమన్నచో సముదాయ పరిసమాప్తి అనియు, భిన్నమన్నచో ప్రత్యేక పరిసమాప్తి అనియును చెప్పవచ్చునని సారాంశము. ఈ విషయము దిగువకారికలో విశదమగును.

సంహత్యాఽపి చ కుర్వాణా భేదేన ప్రతిపాదితాః
స్వం స్వం భోజ్యం విభాగేన ప్రాప్తం సంభూయ భుంజతే. ౪౬౬

భేదేన=భేదముతో(విడివిడిగా), ప్రతిపాదితాః=చూపబడిన భోక్తలు, సంహత్య=కలిపి (ఒక్కుమ్మడిగా), కుర్వాణాః+అపి+చ=భుజించువారైనను, విభాగేన =విడివిడిగా వడ్డనచే, ప్రాప్తమ్=లభించిన, స్వమ్ స్వమ్=తమతమ, భోజ్యమ్=తినదగు పదార్థమును, సంభూయ=కలిసి, భుంజతే=తిందురు.

తా. పదిమంది కలిసి భుజించుటను గమనింపుడు. అచట అందరును ఒకే సమయములో ఒకేపనిని చేయుదురు. (పదార్థములను తీసుకొనుట, కలుపుకొనుట, నమలుట మొదలగు క్రియాకలాపరూపమైనది భోజనము). చివరకు అందరకును తృప్తి కలుగును. ఈ తీరును "మొత్తముపై ఒకటే" అని భావించినచో "దశబ్రాహ్మణాః భుంజతే" అను వాక్యములో వాక్యార్థవిశ్రాంతి సముదాయమునకే అనవచ్చును.

అట్లుకాక "వడ్డన ప్రతి ఒకరికి విడిగా జరుగుచున్నది. ఎవరికివారు విడిగా తినుచున్నారు. ఎవరితృప్తి వారిది" అని భేదభావన చేసినయెడల, పై వాక్యమున "ప్రత్యేక సమాప్తియే" అనక తప్పదు.

వి. భుజిక్రియకు ప్రత్యేకసమాప్తియే అని వెనుక ప్రతిపాదింప బడినది. ఒక విధమైన భావన మూలకముగా ఆ క్రియకు సముదాయ సమాప్తికూడ కుదురునని ఇచట చూపబడినది.

కల్పనానుసారము భుజ్యాదిక్రియలకు ఐక్యమును భేదమును కూడ అంగీకరింతురన్నది ఇచట క్రొత్తవిషయము. "సమూహభావన ఉన్నపుడు భుజిక్రియ ఒకటే, వ్యక్తిభావన కలిగినపుడు మాత్రము అది భిన్నము" అన్నది సంపిండితార్థము.

"శతాదానే ప్రధానత్వాత్" (378 వ శ్లోకము) ఇత్యాదికారిక చెప్పిన అంశ మునకు ఉపపత్తిని చూపుచున్నాడు.

వీప్సాయా విషయాభావాత్ విరోధా దన్యసంఖ్యయా
ద్విధా సమాప్త్యయోగాచ్చ శతం సంఘేఽవతిష్ఠతే. 387

వీప్సాయాః = వీప్సకు సంబంధించిన (ప్రతియొక గర్గుని ఉద్దేశించుటకు), విషయాభావాత్ = ఆవృత్తి లేనందువలనను, అన్యసంఖ్యయా = శతమును మించిన సంఖ్యతో, విరోధాత్ = విరోధము కలుగును కావునను, ద్విధా = రెండువిధములుగా (ప్రత్యేకముగను, సముదాయమందును), సమాప్త్యయోగాత్ + చ = సమాప్తి సముచితము కానందువలనను, శతమ్ = నూరు (రూపాయిలు), సంఘే = సముదాయమందే, అవతిష్ఠతే = సమాప్తిని పొందును.

తా. (వెనుకటి సందర్భములో (378వ శ్లోకము) ఈ విషయము చర్చింప బడి నది. దానినే భంగ్యంతరముగ ధ్రువపరచుటకు మరల ఈ కారిక బయలుదేరినది).

"గర్గాః శతం దండ్యంతామ్" అను వాక్యములో సముదాయ సమాప్తియే కాని ప్రత్యేక సమాప్తి కుదురదు. అందుకు మూడు హేతువులు కలవు: (1) వీప్సాభావము : ఈ వాక్యములో వీప్సలేదు. "చేయుపని ప్రతియొక వస్తువునకు చెందవలెను" అని సూచించు టకై, శబ్దమును ఆవృత్తి చేయుట వీప్స అగును. ఉదా: "వృక్షం వృక్షం పశ్య" (ప్రతియొక చెట్టును చూడుము). ప్రకృతము. "గర్గః గర్గః శతం దండ్యతామ్" అను వాక్యవిన్యాసము లేదు. అనగా వక్తకు, "ప్రతియొక గర్గుని నుండి నూరు చొప్పున వసూలు చేయవలెను" అను కోరిక లేదనుట స్పష్టము.

(2) సంఖ్యావిరోధము : ప్రతియొక గర్గుని నుండియు నూరు రూపాయలను తీసు కొన్నచో, "శతమ్" అను సంఖ్యను నొక్కి పలుకుట పొసగదు. అట్లయిన కొన్నివందలో, వేలో (గర్గుల సంఖ్యను బట్టి) కావలసి వచ్చును.

(3) అసంభవము : ఈ వాక్యమును ప్రయోగించిన తీరు, వాక్యసామర్థ్యము, వక్తృతాత్పర్యము, వ్యవహార స్వభావము, ఔచిత్యము మొదలగు పరికరమువలన, ఇచట సముదాయ సమాప్తియే కుదురును గాని ప్రత్యేక సమాప్తి గాని, ఉభయసమాప్తి గాని కుదురదు.

వి. (1) వీప్స = వ్యాప్తుమ్ + ఇచ్ఛా = అనుకొన్నది ప్రతియొక వ్యక్తికిని చెందవలెనను కోరిక. ఇది ఉన్నపుడు ఆయా వ్యక్తిని గాని, వస్తువును గాని చెప్పు శబ్దమును ఆవృత్తి చేయుదురు. ప్రకృతవాక్యమున "గర్గాః" అను ఏకశేషము (గర్గశ్చ, గర్గశ్చ, గర్గశ్చ = గర్గాః) ఉపయోగింపబడినది. ఏకశేషమెల్లపుడును సముదాయమునే బోధించును.

(2) "శతమ్" అనునది ముఖ్యముగా నొక్కి చెప్పిన సంఖ్య. ప్రత్యేక సమాప్తి అన్నచో శతసంఖ్యకు ప్రాధాన్యము లేకపోయెడిని (అనుకొన్న సొమ్ముకన్న అధికమైపోవును).

(3) తంత్రము, ఆవృత్తి మొదలగు కొన్ని పద్ధతుల నాశ్రయించి, "ఇచట ఉభయసమాప్తి" అనుట తాత్పర్య విరుద్ధమును, ఔచిత్యభంజకమును, వితండప్రాయమును అగును.

భోజనక్రియ విషయములో కూడా, కొన్ని సందర్భములందు ఉభయవిధవాక్య సమాప్తి పొసగునని ప్రదర్శించుచున్నాడు.

భుజి ర్ద్వంద్వైకశేషాభ్యాం యత్రాఽన్యైః సహ శిష్యతే
తత్రాపి లక్షణార్థత్వాత్ ద్విధా వాక్యం సమాప్యతే.      ३३८

ద్వంద్వైకశేషాభ్యామ్ = ద్వంద్వసమాసము, ఏకశేషము – ఈ రెండింటితోను, అన్యైః = ఇతరులతో, సహ = కలిసి, భుజిః = 'భుజ్' ధాతువు, యత్ర = ఏ వాక్యమున, శిష్యతే = చెప్పబడునో, తత్ర + అపి = అచటకూడ, లక్షణార్థత్వాత్ = భుజ్ ధాతువు భోజన సామాన్యమును బోధించుటవలన, వాక్యమ్ = వాక్యము, ద్విధా = రెండువిధములుగా (ప్రత్యేకముగను, సముదాయమందును), సమాప్యతే = సమాప్తిని పొందును. (క్రియ సంబంధించును).

తా. 'త్వయా రామ, గోపాల, కృష్ణైః సహ భోక్తవ్యమ్' (నీవు రామ గోపాల కృష్ణులతో కలిసి భుజింపుము) ఇది ద్వంద్వమున్న వాక్యము. 'త్వయా బ్రాహ్మణైః సహ భోక్తవ్యమ్' (నీవు బ్రాహ్మణులతో కలిసి భుజింపుము) ఇది ఏకశేషము కల వాక్యము. 'కలిసి చేయవలెను' అన్న అర్థమును ఇట్టి వాక్యములతో బోధింతురు. ఇటువంటి స్థలము లలో క్రియ ప్రత్యేకమునకును, సముదాయమునకును కూడ సంబంధించును. 'ఎవరికి వారు ఆ పని చేయుటయు, అందరును కలిసి ఒక్కుమ్మడిగనే ఆ పని చేయుటయు' వాక్యతాత్పర్య మగుట ఇందు నిదానము.

వి. కొన్ని సందర్భములలో భుజిక్రియకు కూడ ఉభయసమాప్తి సంభవించు నని చెప్పుట ఈ కారికయొక్క ప్రయోజనము.

మీది ఉదాహరణ వాక్యములలో 'భోక్తవ్యమ్' అను క్రియాపదమును ఆవృత్తి చేసి, తొలిసారి 'నీవు భుజింపవలెను' 'వారును ప్రత్యేకముగా భుజింపవలెను' అని అర్థమును చెప్పవలయును. అపుడు ప్రత్యేకసమాప్తి అగును. రెండవసారి 'మీరందరును కలిసి, ఒక సమయముననే భుజింపవలెను' అను అర్థమును చెప్పవలెను. ఇపుడు సముదాయసమాప్తి అగును. అనగా భుజ్ ధాతువునకు భోజన సామాన్యార్థమును స్వీకరించి, దానికి కర్తృ సముదాయముతో సంబంధమును చెప్పవలయునని సారము.

'లక్షణార్థత్వాత్, అనగా, భుజిక్రియ లక్షణావ్యాపారముచే భోజనసామాన్యమును బోధించుటవలన' అని భావము.

వాక్యార్థమునుబట్టి (వాక్యార్థముయొక్క సామర్థ్యము, తాత్పర్యము, యోగ్యత మొదలగు ధర్మములను అనుసరించి) ప్రత్యేకసమాప్తియు, సముదాయసమాప్తియు, ఉభయ సమాప్తియు జరుగు విధానము ఇంతవరకు వివరింపబడినది.

ఇట్లు వాక్యార్థమును బట్టి ప్రత్యేకసమాప్తిని సముదాయసమాప్తిని పరిశీలించి, ప్రకృతము వాక్యస్వరూపమును బట్టి ఆ యంశమునే ప్రతిపాదించుచున్నాడు.

వాక్యాంతరాణాం ప్రత్యేకం సమాప్తిః కైశ్చి దిష్యతే
రూపాంతరేణ యుక్తానాం వాక్యానాం తేన సంగ్రహః.      ३३९

వాక్యాంతరాణామ్ = మహావాక్యములకు, ప్రత్యేకమ్ = (అవాంతరవాక్యములతో) వేరువేరుగా, సమాప్తిః = సంబంధము (విశ్రాంతి=పూర్తి), కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే= కోరబడుచున్నది, రూపాంతరేణ = వేరేరూపముతో, యుక్తానామ్ = కూడిన, వాక్యానామ్= అవాంతర వాక్యములకు, తేన = ఆ మహావాక్యముచే, సంగ్రహః = స్వీకారము, (భవతి = అగును).

తా. ఒక తత్త్వమును లేక ఒక ముఖ్యాంశమును ప్రతిపాదించు వాక్యము మహావాక్యము (గౌరవమునుబట్టియే దాని మహత్త్వము, రూపమునుబట్టి కాదు) ఉదా: 'తత్ త్వమ్ అసి' (ఆ బ్రహ్మమే నీవు) ఇది వేదాంత మహావాక్యము. ఈ తత్త్వమును సూచించు మిగిలిన ఉపనిషద్వాక్యములన్నియు అవాంతరవాక్యములు. 'శ్రీరామవత్ వర్తితవ్యం నతు రావణవత్' (మానవుడు రామునివలె నడచుకొనవలయును, రావణునివలె నడచుకొనరాదు). ఇది రామాయణ మహావాక్యము. రామాయణమందలి ఇతరవాక్యములన్నియు అవాంతర వాక్యములు. అట్లే లోకవ్యవహారమున కూడ ప్రధానమైన దానిని మహావాక్యమనియు, దానికి బలము చేకూర్చు వాక్యములను అవాంతర వాక్యములనియును చెప్పవచ్చును.

ఇట్టి సందర్భములలో మహావాక్యమునకు ప్రతియొక అవాంతరవాక్యముతోను సంబంధము ఉండునని కొందరందురు. అనగా అంగాంగి భావముతో (మహావాక్యము అంగి, అవాంతరవాక్యములు అంగములు) అవి ప్రకాశించునని వారి ఆశయము. 'కైశ్చిత్' అనుట వలన, సముదాయసమాప్తియు (అవాంతరవాక్యముల సముదాయముతోకూడ సంబంధము) మరికొందరికి అభీష్టమని సూచితమైనది.

మహావాక్యముచేతనే అవాంతరవాక్యములన్నియు సంగ్రహింపబడును.

వి. "వాక్యార్థమునుబట్టి సముదాయసమాప్తి—లేక-ప్రత్యేకసమాప్తి" అను విషయము ఇంతవరకు కొనసాగినది. వాక్యస్వరూపము నాశ్రయించి, "మహావాక్యములకు" అవాంతరవాక్యములకును ఉండు సమన్వయము" ఇటుపైని విపులముగా చూపబడును.

ఒక పద్యమును ఉదాహరణముగా తీసుకొని ప్రకృతాంశమును తెలియనగును:

అభ్యుద్ధృతా వసుమతీ దలితం రిపూరః
ప్రత్యాహృతా బలవతా బలిరాజలక్ష్మీః ।
ఏకత్ర జన్మని కృతం తదనేన యూనా
జన్మత్రయే యదకరోత్ పురుషః పురాణః ॥

అర్థము: వసుమతీ = భూమి, అభ్యుద్ధృతా = ఉద్ధరింపబడెను. రిపూరః = శత్రువుయొక్క వక్షఃస్థలము, దలితమ్ = బద్దలు చేయబడినది. బలవతా = బలముగల ఇతనిచే, బలిరాజలక్ష్మీః = బలవంతులైన రాజుల రాజ్యము (బలిచక్రవర్తియొక్క రాజ్యము) ప్రత్యాహృతా = మరల తీసుకొనబడెను.

పురాణః + పురుషః = శ్రీకృష్ణుడు, జన్మత్రయే = మూడు జన్మలందు (వరాహ, నరసింహ వామన జన్మలు) యత్ = దేనిని, అకరోత్ = చేసెనో, తత్ = ఆపని, అనేన + యూనా = ఈ యువకుడైన రాజుచే, ఏకత్ర + జన్మని = ఒక జన్మయందే, కృతమ్ + చేయబడినది.

ఒక రాజుయొక్క వర్ణనమిది. "శ్రీకృష్ణుడు మూడుజన్మలలో చేసినపనిని ఇత డొక జన్మలోనే చేయగలిగెను" అన్నది చమత్కారము.

ఇందు పూర్వార్ధములో మూడు వాక్యములున్నవి. అవి దేనికది సంపూర్ణమే(ప్రత్యేక సమాప్తము). అయినను ఆ మూడున్ను, ఉత్తరార్ధమందలి "యత్ పురాణః పురుషః అకరోత్ .........తత్ అనేన కృతమ్" అను మహా వాక్యమునకు అవయవము లగును. లేకున్న, వానికి "స్వతంత్రమైన ఉనికి" కుదరదు. కాగా మహావాక్యము అవయవియు, అవాంతర వాక్యములు అవయవములును అయి పరస్పర సంబంధమును పొందును.

"ఆకాంక్ష, యోగ్యత మొదలగు హేతువులవలన, అంగవాక్యములతో అంగి వాక్యమునకును, అంగివాక్యముతో అంగవాక్యములకును పొత్తు ఏర్పడును. అయినను అంగి వాక్యము ముఖ్యము గాన, దానివలన అంగవాక్యములు గతార్థములైనట్లే. సంగ్రహము అనగా ఇదియే" అన్నది తత్త్వము.

మహా వాక్యమునకు అవాంతరవాక్యములతో విడివిడిగా సంబంధమన్నను, సము దాయముతో సంబంధమన్నను ఫలిత మొకటే. ఆ యంశమును ఈ కారిక సూచించినది.

మహావాక్యమొకటే అవయవ వాక్యముల భావమును వ్యక్తపరచగలుగును గాన, "మహావాక్యము అవాంతరవాక్యములను సంగ్రహించును--అనగా వాని భావమును చెప్పును." అవి అందురు. ఉదా: "నీవు ఊరికి వెళ్ళి సొమ్ము పట్టుకు రమ్ము." ఇది ముఖ్యవాక్యము. "బస్సులో జాగ్రత్తగా ఉండుము. ఆకలయితే ఫలహారము చేయుము. అవశ్యకమైతే ఒక రోజు ఆ ఊరిలో ఉండుము." మొదలగు అవయవవాక్యముల అర్థమంతయు ఈ ముఖ్య వాక్యమువలన అవగతమైపోవును. అందుచేతనే "మహావాక్యము వాచకమనియు, అవాంతర వాక్యములు వాచ్యములనియును" సాంకేతికముగా అందురు.

ఈ తీరునుబట్టి మహావాక్యము, అవాంతరవాక్యములను అన్నింటిని ఒక్కమారు గనే సంగ్రహించునన్నచో, "సముదాయసమాప్తి" అనియు, విడివిడిగా వానితో సంబం ధించు నన్నచో "ప్రత్యేకసమాప్తి" అనియును వ్యాఖ్యానించుకొనవలయును.

మహావాక్యము అవాంతర వాక్యములకు వాచకము కాదని నిరూపించుచున్నాడు:

న వాక్యస్యాభిధేయాని భేదవాక్యాని కానిచిత్
తస్మిం స్తూచ్చరితే భేదాం స్తథాన్యాన్ ప్రతిపద్యతే. 390

భేదవాక్యాని = అంగవాక్యములు, కానిచిత్ = ఏవయినను, వాక్యస్య = మహా వాక్యమునకు, అభిధేయాని = వాచ్యములు, న = కావు. తస్మిన్ = ఆ మహావాక్యము, ఉచ్చ రితే + తు = ఉచ్చరింపబడగానే, తథా = ఆవిధముగా, అన్యాన్ = ఇతరములైన, భేదాన్ = అవయవవాక్యములను, ప్రతిపద్యతే = సూచించును.

తా. మహావాక్యము, అవయవవాక్యములకు వాచకము మాత్రము కాజాలదు. కాని దానిని పలుకగానే అవయవవాక్యముల అర్థము స్ఫురించుచుండును (యోగ్యత, ఆకాంక్ష మొదలగు హేతువులవలన).

వి. మహావాక్యమునకు అవాంతర వాక్యములకును సాక్షాత్తుగా వాచ్యవాచక సంబంధము లేదు. అయినను మహావాక్యార్థము తెలియగానే, అవాంతరవాక్యముల అర్థము

కూడ అవగతమైనందున దానిని బోధించు వాక్యములును ఉచ్చరితములే అనిపించును. "మహావాక్యము అవాంతరవాక్యములకు ఉపలక్షణము" అని సారము.

అఖండ వాక్యవాది పదవాదియొక్క మతమును ఖండించుచున్నాడు.

యేషాం సమస్తో వాక్యార్థః ప్రతిభేదం సమాప్యతే
తేషాం తదానీం భిన్నస్య కిం పదార్థస్య సత్తయా ? 391

సమస్తః = అఖండమైన, వాక్యార్థః = వాక్యార్థము, ప్రతిభేదమ్ = ప్రత్యేకముగా, యేషామ్ = ఎవరిమతమందు, సమాప్యతే = సంబంధించునో, తేషామ్ = వారిమతమున, తదానీమ్ = అట్లయినపుడు, భిన్నస్య = వేరయిన, పదార్థస్య = పదార్థముయొక్క, సత్తయా = ఉనికిచే, కిమ్ = ఏమిప్రయోజనము ?

తా. అఖండవాక్యమును, అఖండవాక్యార్థమును అంగీకరించిన వారి మతమున, పదపదార్థములను వేరుగా చూపుట వ్యర్థము. వాని ఉనికి శూన్యప్రాయమే గదా !

వి. అఖండవాక్యవాదియొక్క మతమిది. "పదపదార్థముల ఉనికి కాల్పనికమును, ఉపాయభూతమును" అని అతని సిద్ధాంతము గదా !

పదవాదమును నిరాకరించుటకై, వాక్యవాది రెండు పక్షములను ప్రతిపాదించుచున్నాడు.

అథ తైరేవ జనితః సోఽర్థో భిన్నేషు వర్తతే
పూర్వస్యార్థస్య తేన స్యాత్ విరోధః సహ వా స్థితిః. 392

తైః + ఏవ = (పరస్పరము కలసిన) పదార్థములచేతనే, జనితః = కలిగింపబడిన, సః + అర్థః = ఆ వాక్యార్థము, భిన్నేషు = వేరుగా ఉన్న పదములందు వేరువేరుగా, వర్తతే = ఉన్నది, అథ = అయినచో, పూర్వస్య = ముందున్న, అర్థస్య = వాక్యార్థమును పుట్టించు పదార్థమునకు, తేన = ఆ వాక్యార్థముతో, విరోధః = విరోధము కాని, (కలిసి ఉండుట కుదరకపోవుట), వా = లేక, సహస్థితిః = కలిసి ఉండుట కాని, స్యాత్ = అగును (అని చెప్పవలసి యుండును).

తా. మహావాక్యములోని అవాంతరవాక్యములు, వాక్యములోని పదములవంటివే కాన, ప్రత్యేక సమాప్తి, సముదాయ సమాప్తి- అను వానిని రెండు విషయములందును యథాసంభవముగ ఊహించుకొనవలెను.

ప్రత్యేక సమాప్తి అన్న పక్షమునకు సంబంధించినది ప్రకృత పరిశీలనము : "పరస్పరము కలిసిన పదార్థములే వాక్యార్థము. అందుచే పదార్థములు వాక్యార్థజనకములు. ఆ విధముగ పుట్టిన వాక్యార్థము విడివిడిగా ప్రతియొక పదమందును ఉండును" అని పదవాదులు అనుట కవకాశమున్నది.

అయినను ఇట్లు చెప్పినచో రెండు చిక్కులున్నవి : పదార్థముయొక్క రూపము వేరు (ఇతర సంబంధము లేనిది). వాక్యార్థము యొక్క స్వరూపము వేరు (పరస్పర సంబంధము కలది). ఇవి విరుద్ధములు కాన ఒక చోట ఉండుట కుదురదు. ఇదొక చిక్కు. "విరోధమున్నను, రెండును ఒక చోట ఉండును" అన్నది మొండివాద మగును. ఇది రెండవ చిక్కు.

వి. పదవాదమును ఖండించుటకై, అందు సంభవించు రెండు విధములైన బాధలను ఈ కారిక చూపినది. పదార్థ వాక్యార్థముల స్వరూపములు భిన్నములు కాన, పరస్పరము పొత్తు కుదురదు (ఒకే పదమందు రెండును ఉండుట అసంభవము).

మీది రెండు పక్షములందును దోషము కలదని వ్యాఖ్యానించుచున్నాడు.

సహాస్థితౌ విరోధిత్వం స్యా ద్విశిష్టావిశిష్టయోః
వ్యభిచారీ తు సంబంధ స్త్యాగేఽర్థస్య ప్రసజ్యతే. 393

సహాస్థితౌ = పదార్థము, వాక్యార్థమున్ను కలిసి ఉన్నయెడల, విశిష్టావిశిష్టయోః ఎట్టి సంబంధము కలిగియుండని పదార్థమునకును, విశేషణ విశేష్యభావముతో మొత్తముగా ఏర్పడిన వాక్యార్థమునకును, విరోధిత్వమ్=విరోధము, స్యాత్=కలిగెడిని. అర్థస్య=పదార్థము యొక్క, త్యాగే + తు = త్యాగమందైతే (విడుచుట = ఉపేక్షించుట), సంబంధః = శబ్దార్థ ముల సంబంధము, వ్యభిచారీ = అనిత్యము, ప్రసజ్యతే = కావలసివచ్చును.

తా. దేనికది విడిగా భాసించునది పదార్థము; అన్ని పదార్థములను కలుపుకొని, విశేషణ విశేష్యభావముతో ఏకాకారముగ భాసించునది వాక్యార్థము. ఇట్లు పరస్పర విరుద్ధము లగు ఈ రెండింటికిని సహాస్థితి (ఒక పదార్థమందే కలసి ఉండుట) అనుచితము (విరోధము లేని వానికే సహావస్థానము సముచితము).

అట్లుకాక, పదార్థము తొలుత వాక్యార్థమును కలిగించి, పిదప తన ఉనికిని కోల్పోయి, తనయందు వాక్యార్థమునకు స్థానమిచ్చునని చెప్పినయెడల, శబ్దార్థము నశించి నట్లగును గాన, "శబ్దార్థ సంబంధము నిత్యము" అను సిద్ధాంతము పాడగును.

కావున "ప్రత్యేక సమాప్తి అన్న పక్షములో పరమార్థమున పదపదార్థములు ఉండవు" అని సారాంశము.

వి. విశిష్టము = సంబంధము కలది = వాక్యార్థము. అవిశిష్టము = సంబంధము కలిగి ఉండనిది = పదార్థము. "విశిష్టావిశిష్టయోః" అను ద్వంద్వములో, లాఘవమునుబట్టి, విశిష్టశబ్దము ముందుకు వచ్చినది. అట్లే జన్య మనగా వాక్యార్థమును, జనక మనగా పదార్థ మును అని తెలియునది. -

వ్యభిచారి = చంచలము = నిత్యముకానిది. పదార్థవాక్యార్థములకు విరోధమును పూర్వకారిక వివరించినది. అందువలననే వానికి సహాస్థితియు కుదరదని ఈ కారిక చెప్పినది.

"సముదాయ వాక్యపరిసమాప్తి" అను పక్షమున అర్థవత్త్వము సముదాయ మునకా? లేక—అవయవములకా? (వాక్యమే అర్థము కలదై పదములు అర్థశూన్యములగునా?) అను అంశమును పరిశీలించుచున్నాడు.

ఏకః సాధారణో వాచ్యః ప్రతిశబ్ద మవస్థితః
సంఘే సంఘిషు చార్థాత్మా సంనిధాననిదర్శకః. 394

అర్థాత్మా = వాక్యార్థము, వాచ్యః = అన్నిపదములచేతను చెప్పబడినదై (సత్య మైనదై), ఏకః = అఖండమైనదై, సంనిధాన నిదర్శకః = ఇతర శబ్దములయొక్క ఉనికివలన ప్రతిపాదింపబడినదై, సంఘే = సముదాయరూపమగు వాక్యమందును, సంఘిషు + చ =

సముదాయమునకు అవయవములుగా ఉన్న పదములందును, సాధారణః = సమానమైనదై, ప్రతిశబ్దమ్ = ప్రతియొక పదమందును, అవస్థితః = ఉండునదియే.

తా. వాక్యమందలి పదములన్నియు వాక్యార్థమును పుట్టించును. అది అఖండము, నిత్యము. అయినను ఏ ఒక్క పదమువలనను సంపూర్ణ వాక్యార్థము కలుగుదు. ఆవశ్యకమైన పదములన్నియు ఉన్నపుడే అది జనించును. అందుచే పదసముదాయమునకును, ప్రత్యేక పదములకును కూడ సంబంధించియే వాక్యార్థము ఉండునని చెప్పవలెను.

వి. "సముదాయమందు వాక్యపరిసమాప్తి" అని అంగీకరించినను, ప్రత్యేక పదములకును, పదసముదాయరూపమైన వాక్యమునకును కూడ, వాక్యార్థము వాచ్యమగుననియు, పదపదార్థములు పూర్తిగా వ్యర్థములు కావనియును ఈ శ్లోకము విశదపరచినది. (117 వ శ్లోకముచే ఇదివరకే ఈ భావము ప్రకటితము— "ప్రత్యేకంతు సమాప్తోఽర్థః సహభూతేషు వర్తతే" అని వచనము).

పదసముదాయముచే వాక్యార్థము బోధపడును. అవయవములగు పదములు కూడ ప్రత్యేకముగా వాక్యార్థమునకు సహకారులగును. ఏ ఒక పదము లేకున్నను అది సమగ్రము కాదు గదా! ఈ విధముగా వాక్యార్థము సముదాయావయవసాధారణ మగును.

పై కారికయొక్క భావమునకు ఒక దృష్టాంతమును చూపుచున్నాడు.

యథా సాధారణే స్వత్వం త్యాగస్య చ ఫలం ధనే
ప్రీతి శ్చావికలా తద్వ త్సంబంధోఽర్థేన తద్వతామ్. ౩౯౫

స్వత్వమ్=తమకు సంబంధించుటయు (హక్కు), త్యాగస్య = దానముయొక్క, ఫలమ్ + చ = పుణ్యము మొదలగు ఫలమును, అవికలా = సంపూర్ణమైన, ప్రీతిః + చ = సంతృప్తియును, సాధారణే = ఉమ్మడిగాఉన్న, ధనే = ధనమందు, యథా = ఎట్లు తెలియబడునో, తద్వత్ = ఆ విధముగనే, తద్వతామ్ = వాక్యార్థముగల వాక్యమునకు, తదవయవములైన పదములకును, అర్థేన = వాక్యార్థముతో, సంబంధః = వాచ్యవాచక భావసంబంధము, (సాధారణః = సామాన్యముగా = ఉమ్మడిగా, భవతి = అగును-తెలియబడును).

తా. కొందరు వ్యక్తులకు ఉమ్మడిగా కొంతధనము ఉన్నదనుకొనుడు. ఆ ధనమందు హక్కును, దానిని దానము చేసినందువలన లభించు ఐహికాముష్మిక ఫలములును, దానివలన కలుగు తృప్తియును విడివిడిగాను, సామూహికముగాను కూడ ఆ వ్యక్తులకు సమానముగా ఉండునన్నది లోకములోని అనుభవము. అట్లే వాక్యమందును, తదవయవములైన పదములందును వాక్యార్థము వాచ్యవాచక భావసంబంధముతో ఉండును.

వి. పై కారిక చూపిన విషయము ఒక ఉదాహరణముతో ఇచట సమర్థించబడినది.

కాగా "పదములును, తత్సముదాయరూపమైన వాక్యమునుకూడ వాచకములు. వాక్యార్థము వాచ్యము. అది పదార్థసముదాయరూపము" అని ఫలించును.

ఈ ప్రసంగమున "వర్ణ సముదాయరూపమగు ప్రాతిపదికమునకే సుప్ ప్రత్యయమగును, అవయవములగు వర్ణములకు అది సంభవింపదు" అను పతంజలి వచనమును వ్యాఖ్యానించుచున్నాడు.

వర్ణానా మర్థవత్తాయాం తేనై వార్థేన తద్వతి
సముదాయేన చైకత్వం భేదే న వ్యవతిష్ఠతే. 396

వర్ణానామ్ = వర్ణములకు, అర్థవత్తాయామ్ = అర్థమున్నపుడు, తేన = ఆ, అర్థేన + ఏవ = అర్థముతోనే, తద్వతి = అర్థముగల ప్రాతిపదికము విషయములో, సముదాయేన + చ = వర్ణసముదాయ రూపమైన ఆ ప్రాతిపదికము చేతనే, ఏకత్వమ్ = ఏకత్వ సంఖ్య = ఏకవచనము, (బోధ్యతే=బోధింపబడును). భేదే=విడిగా వర్ణమందు, ఏకత్వమ్= ఏకత్వసంఖ్య, న + వ్యవతిష్ఠతే = ఉండదు.

తా. ధన వన మొదలగునవి ప్రాతిపదికములు. వీనిలో ప్రత్యేకవర్ణములును, సముదాయమును కూడ అర్థము కలవియే- అని ఒక మతమున్నది. తదనుసారము ప్రత్యేక వర్ణముల కేది అర్థమో సముదాయమైన ప్రాతిపదికమునకును అదియే అర్థమగును. అందుచే ప్రాతిపదికమునకే సుప్ ప్రత్యయములు చేరును. ఆ విధముగ సుబర్థము (సంఖ్య, మొదలగునది) అవగతమగును గాన, ప్రత్యేకవర్ణములకు వేరుగా సుప్రత్యయములు చేరవు.

వి. ఈ విషయము ప్రాసంగికము. 'సంఘాతస్యైకార్థ్యాత్ సుబభావో వర్ణాత్' (మహాభాష్యము- రెండవ ఆహ్నికము - హయవరట్-అను సూత్రములోని వచనము) అని ఒక వచనమున్నది. 'సంఘాతస్య = సముదాయము, ఐకార్థ్యాత్ = ఒక అర్థము గలదగుట వలన, వర్ణాత్ = వర్ణమునకు పరముగ, సుబభావః = సుప్ ప్రత్యయము రాదు' అని అర్థము. ఒక ప్రాతిపదికములోని వర్ణములకును సముదాయమునకును అర్థవత్త్వము సాధారణము. అందువలన సముదాయమునకు ప్రత్యయము వచ్చి, ఆవశ్యకమైన అర్థమును బోధించును. విడివిడి వర్ణములకు ప్రత్యయము వ్యర్థమగును. సముదాయమునకు ప్రత్యయము చేరుటయందు లాఘవమున్నది గదా!

పై భావమునే దృష్టాంతపూర్వకముగ చూపుచున్నాడు.

ఏకేనైవ ప్రదీపేన సర్వే సాధారణం ధనమ్
పశ్యంతి తద్వ దేకేన సుపా సంఖ్యాభిధీయతే. 397

ఏకేన = ఒక, ప్రదీపేన + ఏవ = దీపముతోనే, సర్వే = అందరును, సాధారణమ్ = సామాన్యమైన (అందరకును చెందిన), ధనమ్ = ధనమును, పశ్యంతి = చూడ గలుగుదురు. తద్వత్ = అట్లే, ఏకేన = ఒక, సుపా = సుప్రత్యయముచే, సంఖ్యా = ఆవశ్యకమైన సంఖ్య, అభిధీయతే = చెప్పబడును.

తా. ఉమ్మడిగా ఒకచోట దాచుకొన్న ధనమును ఒక దీపముతోనే రాత్రిపూట అందరును చూడవచ్చును. ఆ విధముగానే ఒకే సుప్ ప్రత్యయము సముదాయముయొక్కయు అవయవములయొక్కయు సంఖ్యను తెలియజేయ గలుగును.

వి. పైది శ్లోకము చెప్పిన అంశమును ఉదాహరణపూర్వకముగా ఈ శ్లోకము సమర్థించినది. "వర్ణసముదాయ రూపమగు ప్రాతిపదికమునకే సుప్రత్యయమగునుగాని, ప్రత్యేకవర్ణములకు కాదు" అని ఫలితము.

"వర్ణ పద వాక్యములకు అర్థవత్త్వము సాధారణము" అనుట ఎట్లు పొసగును? అను శంకకు ఉత్తరము నిచ్చుచున్నాడు.

నార్థవత్తా పదే వర్ణే వాక్యే చైవం విశిష్యతే
అభ్యాసాత్ప్రక్రమోఽన్యస్తు విరుద్ధ ఇవ దృశ్యతే. 398

ఏవమ్ = ఈ విధముగా, వర్ణే = వర్ణమందును, పదే = పదమందును, వాక్యే + చ = వాక్యమందును కూడ, అర్థవత్తా = అర్థముండుట, న + విశిష్యతే = మార్పుచెందదు (సమానమే). అన్యః = ఇతరమైన, ప్రక్రమః + తు = ఆయా శాస్త్రముల రీతి, అభ్యాసాత్ = అభ్యాసమువలన, విరుద్ధః + ఇవ = పరస్పరము పొసగనిదివలె, దృశ్యతే = కనబడును.

తా. "వర్ణములును, పదములును, వాక్యమును కూడ అర్థము గలవియే" అనునది వాస్తవము కాదు. ఇతరశాస్త్రముల ననుసరించియే ఈ మాట తరచుగ వినబడుచుండును. "అఖండవాక్యము, అఖండవాక్యార్థము మాత్రమే పరమార్థ సత్యము" అని వైయాకరణుల సిద్ధాంతము.

వి. "అఖండవాక్య వాక్యార్థములే సత్యములని పెక్కురీతులతో ఇదివరకు నిర్ణయింపబడినది. వర్ణ, పద, వాక్యములును, వాని అర్థములును కూడ సత్యము లన్నట్లుగా ప్రకృతము వివరింపబడినది. కాగా పరస్పర విరుద్ధవచనములతో గ్రంథమంతయు నిండి యున్నట్లు తోచును" అను శంకకు ఈ కారిక సమాధానము.

"ప్రాచీన వ్యాకరణములు కొన్ని ఉన్నవి. న్యాయము, పూర్వమీమాంస, మొదలగు శాస్త్రాంతరములును పెక్కు లున్నవి. అవి వర్ణములకును, పదములకును కూడ అర్థవత్త్వమును ప్రతిపాదించును. తదనుసారము ఆయా మతములను చూపుటకు గాని, అనువదించుటకుగాని, ఏదో ఒకరీతిని సమర్థించుటకు గాని, అనేకవిధములయిన వచనములు ఈ గ్రంథమున కనబడవచ్చును. అంతమాత్రమున పరస్పర విరోధమని భావింపరాదు. సందర్భానుసారము సమన్వయము చేసుకొనుచుండవలెను. పాణినీయ తత్త్వమున మాత్రము అఖండవాక్య వాక్యార్థములే పరమసత్యములు" అన్నది సమాధానము యొక్క సారము. ప్రత్యేకసమాప్తి, సముదాయసమాప్తి అను చర్చ ఇంతతో ముగిసినది.

అర్థమును బోధించుటలో గల శబ్దముయొక్క వ్యాపారమును ఇపుడు పరిశీలించుచున్నాడు.

వినియోగాదృతే శబ్దో న స్వార్థస్య ప్రకాశకః
అర్థాభిధాన సంబంధ ముక్తిద్వారం ప్రచక్షతే. 399

వినియోగాత్ = ప్రయోగము (ఉచ్చారణము), ఋతే = లేకుండ, శబ్దః = శబ్దము, స్వార్థస్య = తన అర్థమును, ప్రకాశకః = బోధించునది, న = కాదు. అర్థాఽభిధానసంబంధమ్ = అర్థమునకు, శబ్దమునకును ఉండు సంబంధమును, ఉక్తిద్వారమ్ = ప్రయోగము ద్వారముగా గలదని, ప్రచక్షతే = చెప్పుదురు.

తా. ప్రయోగములేకుండ శబ్దము తన అర్థమును చెప్పజాలదు. శబ్దార్థముల సంబంధము ప్రయోగమూలకము.

వి. 'ఈ శబ్దము ఈ అర్థమును బోధింపవలయును' అను తాత్పర్యముతో, వక్త ఒక శబ్దమును స్పష్టముగ పలికినపుడే ఆయా శబ్దమువలన ఆయా అర్థము తెలియుట జరుగుచున్నది. అట్లు కానపుడు అర్థబోధ కలుగదు. కావున శబ్దమునకు నియతమైన అర్థమున్నను, ప్రయోగములేనిదే అది తెలియదని స్పష్టమగును. కావుననే శబ్దార్థసంబంధము విశదమగుటకు ప్రయోగమును సాధనముగా స్వీకరింపక తప్పదు.

శబ్దము తన అర్థమును బోధించి తీరునని ఈ కారిక వివరించును. ఒక శబ్దము నియతమైన ఒక అర్థమును బోధించును. అనేకార్థక శబ్దమైనను ప్రకరణాదులచే నియతార్థమునే చెప్పును. శ్లేషాదిస్థలములలో కూడ ఆవశ్యకమైన అర్థములే బోధింపబడును. శబ్దార్థములకు యోగ్యతారూపమైన ఇట్టి సంబంధము అనాదిసిద్ధము. దీనినే అభిధా వ్యాపారమని అందురు. అభిధా వ్యాపారమును 'ప్రతిభ' అనియు సామాన్యముగా వైయాకరణులు వ్యవహరింతురు.

ప్రతిభకు మూడు స్వరూపములున్నవి: 1. ఉక్తి - లేక - వినియోగము = ఉచ్చారణము. ఇది వాగ్రూపము. 2. అనుసంధానము - లేక - అభిసంధానము = ఎడతెగని భావన. ఇది మనోరూపము. 3. ప్రణిధానము = శ్రద్ధతో చూచుట. ఇది నేత్రరూపము. ఈ మూడును కలిసియే ప్రతిభ అగును.

అభిధయు ప్రతిభయు ఒకటే అన్న పక్షములో ఇబ్బందిలేదు. 'శబ్దము తన అర్థమును అభిధావ్యాపారముచే తెలియజేయును' అని చెప్పవచ్చును. 'ఆ రెండును వేరే' అన్న పక్షములో మాత్రము అభిధకు ప్రతిభ—లేక—వినియోగము-సాధనముగా పనిచేయు నని వ్యాఖ్యానించుకొనవలెను. 'ప్రతిభాసహితమైన అభిధయే అర్థప్రకాశకమగును' అని సారాంశము.

కారికలోని 'వినియోగ' పదము ప్రతిభకు సూచకము.

శబ్దమునకు అర్థమునకును గల సంబంధము సహజము, నిత్యమునని ప్రతిపాదించుచున్నాడు.

> యథా ప్రణిహితం చక్షు ర్దర్శనా యోపకల్పతే
> తథాభిసంహితః శబ్దో భవ త్యర్థస్య వాచకః .　　　　400

ప్రణిహితమ్=సావధానమైన, (ఏకాగ్రమైన=గురియందు లగ్నమైన), చక్షుః= నేత్రము, దర్శనాయ=చూచుటకు, యథా=ఏవిధముగ, ఉపకల్పతే=సమర్థమగునో, తథా = ఆవిధముగనే, అభిసంహితః = సావధానమైన, (అనుసంధింపబడిన=ఈ శబ్దమీఅర్థమును చెప్పవలెనని భావింపబడిన), శబ్దః = శబ్దము, అర్థస్య=అర్థమును, వాచకః=చెప్పునది, భవతి = అగును.

తా. కన్ను లక్ష్యమందు లగ్నమైనపుడే దానిని చూడగలుగును. అట్లే అర్థమందు లగ్నమైనపుడే శబ్దమా అర్థమును చెప్పగలుగును. ఈ తీరును ప్రణిధానమనియు, అభిసంధానము - లేక - అనుసంధానమనియు అందురు.

వి. వస్తువును చూచుట కంటి యొక్క సహజధర్మము (కంటికి రూపమగపడుట సృష్టిసిద్ధము). అయినను అచట ప్రణిధాన మను ఒక వ్యాపారముకూడ ఉండ

వలెను. అనగా కంటిని మనసుతో జోడించి చూడగోరిన వస్తువునందు నిలుపవలెను. లేకున్న—ఎదురుగా ఉన్న వస్తువులు కూడ కనబడవు.

అట్లే అర్థమును చెప్పుట శబ్దముయొక్క స్వభావము. అయినను ఇచట కూడ అభిసంధానమను వ్యాపారము ఉండితీరవలెను. లేకున్న శబ్ద మెట్టి అర్థమును చెప్పజాలదు. అనగా సహజమైన వానిని గ్రహించుటకు కూడ ఒక వ్యాపారము - లేక - ప్రక్రియ ఆవశ్యక మగును. 'ఈ శబ్దము ఈ అర్థమును బోధించుగాక' అను కోరికయే శబ్దమునకు సంబంధించిన వ్యాపారము. దీనిని 'అభిసంధానము' (మనసును ఏకాగ్రముచేయుట=నిలుపుట) అని అందురు.

'శబ్దమునకు అర్థముతోడి సంబంధము సహజము - నిత్యము. అట్లు కాక కల్పిత మన్నచో, శబ్దార్థసంబంధములు నిత్య ములన్న వైయాకరణ సిద్ధాంతము పాడగును.' ఈ యంశమును సమర్థించుటకు ఈ ప్రసంగ మారంభమైనది.

ఆయా ఇంద్రియము మనస్సుతో కలిసినపుడే, ఆయా యోగ్యమైన తన విషయ మును గ్రహించుచున్నదనుట అనుభవసిద్ధమైన అంశము. దీనిని 'ఇంద్రియ మనస్సం యోగము' అని నైయాయికు లందరు. దీనినే 'ప్రణిధానము' - లేక - 'ప్రచారము' అని వైయాకరణు లందురు. ఇది ఇంద్రియములకును వాని విషయములైన రూపాదులకును వర్తించు ప్రక్రియ.

ఇదేతీరులో శబ్దమునకును, అర్థమునకును వర్తించు ప్రక్రియను 'అభిసంధానము' అని వైయాకరణులు వ్యవహరించుదురు. వక్త తనమనస్సును శబ్దార్థములందు లగ్నము చేయుటయే అభిసంధాన మగును. ఇది లేనపుడు శబ్ద మర్థమును బోధింపజాలదు. అనగా 'ఈ శబ్దమువలన ఈ అర్థము తెలియదగును' అను ఏకాగ్రభావనతో వక్త ఉచ్చరించినపుడే, ఏ శబ్దమైనను తన అర్థమును చెప్పగలుగునని భావము. అనుసంధానము, వినియోగము, ఉక్తి, అనునవి అభిసంధానమునకు మారు పేరులు.

ఇట్టి అభిసంధిద్వారమున శబ్దము అభిధావ్యాపారముతో తన అర్థమును బోధించును. కాగా మీదికారికలో సూచించిన ప్రతిభయు ఈ అభిసంధియు ఒకటే అని పర్యవసించును.

అభిసంధియు అభిధావ్యాపారమును వేరన్న పక్షములో అభిసంధి అభిధావ్యాపారమునకు సహాయమగును.

ఆ రెండున్ను ఒకటే అన్న పక్షముకూడ ఉన్నది. ఈ పక్షములో అభిధ, ప్రతిభ, అభిసంధానము అన్న పదములు సమానార్థకములే అగును. అపుడు శబ్దమువలన అర్థము బోధపడి తీరును. ఇట్లు వివరించుకొనవలెను- "ఈ శబ్దము ఈ అర్థమును బోధింపవలెను" అను కోరిక వక్తయొక్క మనస్సులో పుట్టును. అభిధ అన్నను, ప్రతిభ అన్నను ఇదియే. ఇది సూక్ష్మమైన శబ్దమయమైన స్థితి. తరువాత ఆ యా స్థానములందు వాయుప్రసారముచే వైఖరీరూపమున (స్పష్టధ్వని) ఇదే అభివ్యక్తమగును. (పరమసిద్ధాంతములో అర్థమనునది వేరుగా లేనేలేదు. శబ్దమే అర్థముగా భాసించును).

'వక్తయొక్క తాత్పర్యము ననుసరించి, శబ్దము, తన అర్థమును సమర్పించుటయే అభిధావ్యాపారము. దీనినే అనేక నామములతో వ్యవహరించి, అనేక రీతులలో వివరించు

చుందురు. ఇట్టి శబ్దార్థసంబంధము సహజమైనను, 'అభిసంధానము నిమిత్తమాత్రముగా-వ్యావహారికస్థితిలో ఉండకతప్పదు' అన్నది సారసంగ్రహము.

వినియోగము, ఉక్తి, అభిసంధానము అనునవి అభిధావ్యాపారముయొక్క మారు పేర్లు అని నిరూపించుచున్నాడు.

క్రియావ్యవేతః సంబంధో దృష్టః కరణకర్మణోః
అభిధానియమ స్తస్మా దభిధానాభిధేయయోః . 401

కరణకర్మణోః = కరణకారకమునకును, కర్మకారకమునకును, క్రియావ్యవేతః = క్రియాద్వారకమైన (వ్యాపారము మూలముగాగల), సంబంధః = సంబంధము, (యతః = ఏకారణమువలన), దృష్టః = కనబడునో, తస్మాత్ = ఆ కారణము వలననే, అభిధానాభిధేయయోః = శబ్దమునకును అర్థమునకును, అభిధా = అభిధఅనెడు వ్యాపారము, నియమః = నియామకమై (నియమించునది), (భవతి = అగును).

భా. కరణము (క్రియను కలిగించుటలో ప్రముఖసాధనము), కర్మ (కర్త తన వ్యాపారముతో పొందగోరు విషయము) అను కారకములు దేనికది స్వతంత్రము. (ఒక దానితో వేరొకదానికి సంబంధము వాస్తవముగ ఉండదు). అయినను ఒకానొక క్రియనుబట్టి ఆ రెండింటికిని సంబంధము ఏర్పడుచుండును. ఉదా : 'రామః బాణేన రాక్షసం జఘాన' (రాముడు బాణముతో రాక్షసుని చంపెను). ఇచట బాణము కరణము. రాక్షసుడు కర్మ. ఈ రెండును 'చంపుట' అను వ్యాపారముతో ముడివడి ఉన్నవి (సంబంధమును కలిగి ఉన్నవి). అనగా క్రియ ఒక్కటే; దానితో బాణము సాధనముగను, రాక్షసుడు కర్మగను కూడగట్టబడుట జరిగినది.

అట్లే శబ్దము సాధనమును, అర్థము కర్మయును అగును (ఉదా : శబ్దేన అర్థం బోధయతి = శబ్దముతో అర్థమును బోధించును) అభిధ అను వ్యాపారము ఈ రెండింటిని నియమించును.

వి. అభిధానమనగా శబ్దము. అభిధేయమనగా అర్థము ఆ రెండును అభిధ అను వ్యాపారముతో కట్టబడి ఉండును. అనగా శబ్దము అర్థమును బోధించుట అభిధావ్యాపారము మూలముగా జరుగును.

కాగా 'శబ్దము వాచకము. అర్థము వాచ్యము. వాచ్యవాచకభావము శబ్దార్థముల సంబంధము. అది అభిధావ్యాపారముచే నియమింపబడును' అని ఫలించును.

శబ్దార్థములకుండు వాచ్యవాచక భావసంబంధమును, దానిని నియమించు అభిధావ్యాపారమును స్వతస్సిద్ధములు. అవి కల్పితములుకావు. కేవలము తెలియువారి సౌకర్యముకొరకు అనేకరీతులలో వానిని వివరించుచుందురు. అందుచే వినియోగము, అభిసంధానము, ఉక్తి అనునవి అభిధకు మారుపేరులేగాని, వేరువేరు శబ్దములు కావు. వానికి వేర్వేరు అర్థములును లేవు.

'సిద్ధే శబ్దార్థసంబంధే' (భాష్యము మొదటి ఆహ్నికము మొదటివార్త్తికము).— (శబ్దము, అర్థము, వాని సంబంధము ఈ మూడును నిత్యములు) అను వార్త్తికమును, దానికి సంబంధించిన భాష్యమును పై అంశములను దృఢపరచును.

మీది విషయమునే స్పష్టపరుచుచున్నాడు.

బహు ష్వేకాభిధానేషు సర్వే ష్వేకార్థకారిషు
యత్ ప్రయోక్తాభిసంధత్తే శబ్ద స్తత్రావతిష్ఠతే ॥ 402

బహుషు = పెక్కు అర్థములు, ఏకాభిధానేషు = ఒకేశబ్దముచే బోధింపబడినపుడు, సర్వేషు = అన్ని అర్థములును, ఏకార్థకారిషు = ఒక క్రియలో అన్వయించుటకు వీలుకలుగు నపుడు, ప్రయోక్తా = శబ్దమును ఉచ్చరించు వ్యక్తి, యత్ = ఏ అర్థస్వరూపమును, అభిసంధత్తే = నిశ్చయించునో (సంకల్పించునో), తత్ర = ఆ అర్థమందు, శబ్దః = శబ్దము, అవతిష్ఠతే = నిలబడును.

తా. ఒక శబ్దమునకు పెక్కు అర్థములు ఉండవచ్చును. అవన్నియు ప్రకృతమైన క్రియతో అన్వయించుటకు వీలుకూడ కనబడవచ్చును. అయినను అట్టిచోట్ల కూడ ప్రయోక్త ఉద్దేశించిన అర్థమునే అతడు ఉచ్చరించిన శబ్దము చెప్పును. అన్ని అర్థములను చెప్పదు. అది అభిధయొక్క - లేక - అభిసంధానముయొక్క ప్రభావము.

వి. మీదికారికయొక్క భావమును ఈ కారిక విశదీకరించును, గో శబ్దమునకు గోవు, భూమి, కిరణము మొదలగు అనేకార్థములున్నవి. 'గావః దృశ్యంతామ్' (గోవులు చూడబడుగాక) మొదలగు ప్రయోగములలో, 'చూచుట' మొదలగు క్రియలతో ఆ అర్థము లన్నియు అన్వయింపగలవు. ('గామ్ ఆనయ' మొదలగుచోట్ల అట్లు కుదురదు- అది వేరువిషయము) అయినను ఉచ్చరించినపుడు వక్త ఏ అర్థమును మనసునందు అనుసంధానముచేయునో, ఆ అర్థమునే గో శబ్దము చెప్పును. ఇది లోకానుభవము. ఆ అనుసంధానమే అభిధావ్యాపారము.

పై విషయమునే వేరొకరీతిలో విశదీకరించుచున్నాడు.

ఆమ్నాయశబ్దా నభ్యాసే కేచి దాహు రనర్థకాన్
స్వరూపమాత్రవృత్తీంశ్చ పరేషాం ప్రతిపాదనే. 403

అభిధానక్రియాభేదా దర్థస్య ప్రతిపాదకాన్
నియోగభేదా న్మన్యంతే తానే వైకత్వదర్శినః ॥ 404

అభ్యాసే = తరచుగా వల్లె వేయుటయందును, పరేషామ్ = ఇతరులకు (శిష్యులకు), ప్రతిపాదనే + చ = ఉపదేశించుటయందును, ఆమ్నాయశబ్దాన్ = వేదమందలి శబ్దములు, అనర్థకాన్ = అర్థము లేనివనియు, స్వరూపమాత్రవృత్తీన్ + చ = తమరూపమును మాత్రమే తెలియజేయునవి అనియును, ఏకత్వదర్శినః = శబ్దమొకటే అని భావించువారు, కేచిత్ = కొందరు, ఆహుః = చెప్పుదురు.

(అట్లే)-అభిధానక్రియాభేదాత్ = అనుసంధానభేదమువలనను (అభిధాభేదమువలన), నియోగభేదాత్ = వినియోగభేదమువలనను, తాన్ + ఏవ = ఆ శబ్దములనే, అర్థస్య = ఆయా అర్థమును, ప్రతిపాదకాన్ = బోధించువానినిగా, ఏకత్వదర్శినః = శబ్దైకత్వవాదులు, మన్యంతే = తలచుదురు.

తా. 'ఎన్నిమారులు పలికినను, ఎన్నిఅర్థములను బోధించినను శబ్దమొకటే' అనువారు శబ్దైకత్వవాదులు. వీరు ఇట్లందురు: వల్లెవేసినసమయములోను, శిష్యులకు చెప్పు సమయములోను వేదశబ్దములకు అర్థము లేదు. వాని స్వరూపమును బోధించుటయు, తెలిసి కొనుటయు మాత్రమే అచట ముఖ్యప్రయోజనము. అయినను యజ్ఞయాగాదికర్మలందును, తత్త్వప్రతిపాదనమందును ఆవేదశబ్దములే, ఆయా అర్థములను బోధించుచుండును. అను సంధానభేదమువలన సిద్ధించు అభిధావ్యాపారభేదమువలననే వేర్వేరు అర్థములను శబ్దములు బోధించుచుండును.

వి. అభిధావ్యాపారమును దృఢపరచుటకై వేరొకరీతిని ఈ కారిక ప్రతిపాదించు చున్నది. లౌకిక శబ్దములవలెనే, వైదికశబ్దములు కూడ, యజ్ఞయాగాది కర్మలలో తమ తమ అర్థములను బోధించును. అట్లు బోధించుట అభిధావ్యాపారమువలననే జరుగును. అర్థము మారినపుడు అభిధయు మారినది అని అనుకొనవలెను. అభిధ మారుటకు అను సంధానము మారుట కారణమగును. (వేదశబ్దముల ప్రయోక్త వేదపురుషుడే అని ఆర్ష సంప్రదాయము).

కాగా శబ్దమును, అర్థమును కూడగట్టు అభిధ అను ఒక వ్యాపార మున్నదని స్పష్టపడును.

శబ్దమును అర్థమును కాక, ఆ రెడింటిని ముడివేయు, అభిధ అను ఒకప్రక్రియ వేరుగా ఉన్నదని చెప్పుటయే ఈ ప్రసంగముయొక్క అభిసంధి.

"అర్థభేదమున్నను (చాలా అర్థములున్నను) శబ్దమొక్కటే" అన్నది ఏకత్వ వాదుల ఆశయము. ఈ మతములో అభిధాభేదమువలన (ఒక్కొక అర్థమునకు ఒక్కొక అభిధ) ఆయా నియతమైన అర్థము తెలియబడును. అట్టి యర్థమును స్మరించుటకు మాత్రమే ప్రకరణాదు లుపయోగించును. కావుననే వానిని"విశేషస్మృతి హేతువులు" అని పేర్కొనుట జరిగినది (316 శ్లోకము).

"అర్థభేదమున్నను శబ్దమొకటే" అను పక్షమున అభిధావ్యాపారమే అర్థమును నియమించునని మీది కారికలో సూచించి, ప్రకృతము "అర్థభేదముచే శబ్దభేదము" అను పక్షమున ప్రకరణాదులు అర్థమును నియమించునని వివరించుచున్నాడు.

> తేషా మత్యంతనానాత్వం నానాత్వవ్యవహారిణః
> అక్షాదీనా మివ ప్రాహు రేకజాతిసమన్వయాత్ . 405

అక్షాదీనామ్ + ఇవ = "అక్ష" మొదలగు శబ్దములకువలె, ఏకజాతి సమన్వ యాత్ = ఒకే అనుపూర్వి (వర్ణక్రమము) అను ధర్మమున్నందువలన, తేషామ్ = అనానార్థక శబ్దములకు, అత్యంతనానాత్వమ్ = పూర్తిగా భేదమును, నానాత్వవ్యవహారిణః = భేదమును చెప్పువారు, ప్రాహుః = చెప్పుదురు.

తా. నానార్థకములైన శబ్దముల విషయములో, అర్థభేదమును బట్టి శబ్దభేదమును అంగీకరింపవలెను. అనగా ఎన్ని అర్థములుండునో అన్ని శబ్దములను ఒప్పుకొనవలెను. అయితే-ఆ శబ్దముల స్వరూపమొకటే కావున సాదృశ్యమును బట్టి "ఒకే శబ్దము" అనిపించు చుండును. కాని అది వాస్తవము కాదు. ఉదా: అక్షః. ఈ శబ్దమునకు, పాచిక, ఇరుసు,

పాము, బండి అను నాలుగర్థములున్నవని చెప్పినపుడు, నాలుగు అక్ష శబ్దములును విడిగా ఉన్నవనియే అనవలెను. వీని రూప మొకటైనంత మాత్రమున శబ్ద మొకటే అనకూడదు.— ఇది శబ్ద భేదవాదుల మతము.

వి. అర్థభేదమును బట్టి శబ్దభేదమును స్వీకరించు భేదవాదములో, ప్రకరణాదుల వలననే అర్థ నిర్ణయమగునని విశదీకరించుటకు, ముందుగా ఈ శ్లోకము బయలుదేరినది.

కాగా ఫలించిన అంశమును విశదీకరించు చున్నాడు.

ప్రయోగా దభిసంధానం తత్ప్రదేషు న విద్యతే
విషయే యతశక్తిత్వాత్ స తు తత్ర వ్యవస్థితః . 406

ప్రయోగాత్ = ఉచ్చారణము కన్న వేరైన, అభిసంధానమ్=అభిధ, తత్ప్రదేషు = ఆ నానార్థకశబ్దములందు, న+విద్యతే=లేదు. సః+తు = ఆ నానార్థకశబ్దమైతే, విషయే= ఆయా అర్థమందు, యతశక్తిత్వాత్ = నియతమైన వేర్వేరు శక్తులు ఉన్నందువలన, తత్ర= ఆ నియతమైన ఒక అర్థమందు, వ్యవస్థితః = తప్పక ఉండునదియై, (భవతి=అగును).

తా. నానార్థకస్థలములలో అర్థభేదమును బట్టి శబ్దభేదము తప్పదన్న యెడల, ఆ శబ్దములకు ఉచ్చారణమే తప్ప, వేరుగా అనుసంధానరూపమైన అభిధ ఉండుట కష్టము. అయినను వెనుక చూపిన (314-316 శ్లోకములు) ప్రకరణాదులవలన శబ్దశక్తి నియతమై, కావలసిన అర్థమునే ఇచ్చుచుండును.

వి. శబ్దభేదవాదములో ప్రకరణాదులే ఆవశ్యకార్థమును సమర్పించునని తత్త్వము. కాగా "ఏకత్వవాదమందు అభిధా వ్యాపార భేదమువలన, నియతార్థ ప్రతీతియనియు, భేదవాద మందు ప్రకరణాదులవలన నియతార్థ ప్రతీతియనియును" ఫలించును.

ఏకత్వవాదములో శబ్దము ఒకటే. అర్థములు పెక్కులు కావున అనుసంధాన నిమిత్తకమగు అభిధ మారుచు, అర్థమును మార్చుచుండును. భేదవాదమున ఎన్ని అర్థము లున్నవో, అన్ని శబ్దములను ఉచ్చరింపవలసి వచ్చును. అప్పుడు అనుసంధానమునకు అవకాశము ఉండదు. ప్రకరణాదులు వచ్చి శబ్ద శక్తిని నియమింపక తప్పదు.

అనుపూర్వి సమానముగ ఉన్నను, శబ్దములు భిన్నములే. ప్రకరణాదులు అర్థమును నిశ్చయించుటయే అందు గమకము" అని చూపుచున్నాడు.

నానాత్వస్యైవ సంజ్ఞాన మర్థప్రకరణాదిభిః
న జాత్వర్థాంతరే వృత్తి రన్యార్థానాం కథం చ న . 407

అర్థప్రకరణాదిభిః = అర్థము, ప్రకరణము మొదలగు వానిచే, నానాత్వస్య+ శబ్దభేదము యొక్క, సంజ్ఞానమ్+ఏవ = బాగుగా తెలియుటయే, (భవతి = అగును). అన్యార్థానామ్= ఒక నియతమైన అర్థమును బోధించు శబ్దములకు, అర్థాంతరే = వేరొక అర్థ మందు, జాతు= ఎప్పుడైనను, కథంచన= ఎట్టయినను, వృత్తిః = ప్రవృత్తి, న= కాదు.

తా. అర్థప్రకరణాదులు నానార్థకశబ్దముల శక్తిని నియమించును. అట్లు నియత మైన శక్తివలన, ఎల్లప్పుడును ఏదో ఒక అర్థమే తెలియబడుచుండునుగాని, అన్ని అర్థములును ఏకకాలమున తెలియబడవు. కావున అర్థభేదమునుబట్టి శబ్దభేదమును అంగీకరించుటయే న్యాయ్యము.

వి. శబ్దము నానార్థకమైనను, ప్రకరణాదికమువలన ఎప్పుడును ఒకే అర్థము వచ్చుచుండునుగాన, వేరొకఅర్థము కావలసినపుడు వేరొకశబ్దమునే ఆశ్రయించవలసివచ్చును. అందుచే నానార్థకస్థలములలో, అర్థభేదము ననుసరించి, శబ్దభేదమును ఒప్పుకొనుటయే సమంజసమగునను భావము సూచితమైనది. 'అర్థము వేరైనపుడు శబ్దముకూడ వేరుకాక తప్పదు' అనునది ఇచట ముఖ్యమైన యుక్తి. (ధర్మభేదమువలన ధర్మిభేదము సిద్ధించును). అభిధావ్యాపారచర్చ యింతతో ముగిసినది.

ప్రసంగవశమున మరల వాక్య వాక్యార్థ నిర్ణయమును సంగ్రహముగ ప్రదర్శించు చున్నాడు.

పదరూపం తు యద్వాక్య మస్తీత్యేవనిబంధనమ్
కామం విమర్శ స్తత్రాయం న వాక్యావయవే పదే. 408

అస్తీత్యేవనిబంధనమ్ = 'అస్తి' (ఉన్నది) అనుక్రియను బట్టి వాచకముగా సిద్ధించు, పదరూపమ్ = ఒకేపదముగా ఉండు, యత్ = ఏ, వాక్యమ్ = వాక్యముగలదో, తత్ర = ఆ వాక్యము విషయములోనే, అయమ్ = ఈ, విమర్శః = పరిశీలనము, కామమ్ = పూర్తిగా సరిపడును, వాక్యావయవే = అఖండవాక్యముయొక్క అవయవమైన, పదే + తు = పదమందు అయితే, న = సరిపడదు.

తా. 'అర్థభేదమును బట్టి శబ్దభేదమును అంగీకరింపవలయునా? - లేక అక్కర లేదా?' అను మీది విమర్శ అంతయు, గౌః, హరిః, మొదలగు ఏకవాక్యములకే సరిపోవును. 'అస్తి' అనియో, 'నివర్తతే' (పోవుచున్నది) అనియో, ఒకక్రియను చేర్చినందువలన, అవి అఖండవాక్యములు కాగలుగుటయే అందుకు కారణము. సహజమైన అఖండవాక్యముల యొక్క పదములకు మాత్రము, ఈ విమర్శ సంబంధింపదు. అచట వాస్తవముగ పదములు ఉండవు. అపోద్ధారముచే (వేరుచేసి చూపుట) వానిని కల్పింతుము.

వి. క్రియ లేకుండ వాక్యము ఏర్పడదు. స్పష్టముగ క్రియను ఉచ్చరింపక పోయినను అది ఉచ్చరింపబడినట్లే భావింపబడును. ఈ యంశము వెనుక (323వ శ్లోకము) వివరింపబడినది. విశేషక్రియ ఏదియు లేక పోయినను, 'అస్తి' అను సామాన్యక్రియ ఉండు నని వైయాకరణుల సంప్రదాయము. కాగా 'గౌః' అని అనగానే 'అస్తి' అను క్రియ సంబంధించును. దీనినిబట్టి అది అఖండవాక్యమగును. గోశబ్దము నానార్థకము కాన, మీద చూపిన విమర్శమును ఇచట సమన్వయింపవచ్చును. హరిః, ఘటః, వృక్షః, మొదలగు ఇట్టి ప్రయోగములను ఏకపదివాక్యము లందురు.

కర్తృ కర్మ క్రియాదుల నన్నింటిని కలిపి ప్రయోగించిన వాక్యము సహజమైన అఖండవాక్యము. అందు పదములన్నవి కేవలము కల్పితములు కాన, వాని విషయముతో పై విమర్శకు సంబంధ మక్కరలేదు.

'అస్తి' అనునది ఉపలక్షణము (సూచకము), కాన 'నివర్తతే' (మరలును, పోవును) అను క్రియనుకూడ స్వీకరింపవచ్చును. కాగా 'ఘటః' అనగానే, 'అస్తి' అనికాని, 'నివర్తతే' అనికాని ఒక సామాన్యక్రియను భావింపక తప్పదు. ఈ క్రియనుబట్టియే ఘటాది

పదములు అర్థమును బోధించుట సిద్ధించును. ఈ యంశము మున్ముందు (428 శ్లోకము) వివరింపబడును.

'అర్థభేదమునుబట్టి శబ్దభేదము అనగానే, పదములను వేరుగా ఒప్పుకొన్నట్లగును. అట్లయిన అఖండ వాక్యవాదము దెబ్బతినదా?' అను శంకకు ఈ కారిక సమాధానము. 'అఖండ వాక్యవాదమే సిద్ధాంతము. ఏకపదరూపమున కనబడు అఖండ వాక్యములకు మాత్రమే, ప్రకృతచర్చ సంబంధించును' అని సమాధానసారము.

స్ఫోటరూపమైన అఖండవాక్యమే అర్థమును బోధించునని, దృష్టాంతముతో నిరూపించుచున్నాడు.

యథైవా ఽనర్థకై ర్వర్ణై ర్విశిష్టార్థో ఽభిధీయతే
పదై రనర్థకై రేవం విశిష్టార్థో ఽభిధీయతే . 409

అనర్థకైః=అర్థములేని, వర్ణైః=వర్ణములచే, విశిష్టార్థః=అ వ్యక్తమైన అర్థము యొక్క మొత్తము, యథా=ఎట్లు, అభిధీయతే + ఏవ=చెప్పబడునో, ఏవమ్=ఈ విధముగానే, అనర్థకైః=అర్థములేని, పదైః=పదములచే, విశిష్టార్థః=ఆవశ్యకమైన అఖండమైన వాక్యార్థము, అభిధీయతే=చెప్పబడును.

తా. పదములోని వర్ణములకు విడిగా అర్థములేదు. అయినను అవి గుంపుగా ఏర్పడి ఒక ప్రత్యేకమైన అర్థమును ఇచ్చును. అనగా విడివిడి వర్ణములకు ఎట్టి అర్థమును లేకున్నను, క్రమబద్ధములైన వర్ణములే పదముగా సిద్ధించి, ఒక విశేషార్థమును తెలియజేయును. వర్ణముల వలన అభివ్యక్తమైన మొత్తము అర్థమునకు సముదాయము వాచకమగును. ఈ సముదాయమునే "పదస్ఫోట" అందురు.

ఇట్లే వాక్యమందలి పదములకు విడిగా అర్థములేదు. అవి కలియగా ఏర్పడిన (పదములచే అభివ్యక్తమైన) మొత్తము అర్థమునే వాక్యము తెలియజేయును. కావున అఖండార్థమును చెప్పు అఖండ వాక్యమే వాస్తవమగును. దీనినే "అఖండ వాక్యస్ఫోట" అందురు.

వి. "పదస్ఫోటమును అంగీకరించిన మతములో వర్ణములు లేనట్లే, వాక్యస్ఫోటమును తత్త్వముగా స్వీకరించినపుడు, పదములును లేవు." అని దృష్టాంతపూర్వకముగా, అఖండ వాక్యస్ఫోటము సమర్థింపబడినది.

స్ఫోటమనగా నిత్యశబ్దము. 1. వర్ణస్ఫోట. 2. పదస్ఫోట, 3. వాక్యస్ఫోట, 4. వర్ణజాతిస్ఫోట, 5. పదజాతిస్ఫోట, 6. వాక్యజాతిస్ఫోట. 7. అఖండపదస్ఫోట. 8. అఖండ వాక్యస్ఫోట- అని స్ఫోట ఎనిమిది విధములు. వీనిలో అఖండ వాక్యస్ఫోటయే వైయాకరణుల పరమ సిద్ధాంతము. మిగిలినవానిని కూడ ఉపాయభూతములుగాను, ప్రాసంగికముగాను వివరించుచుందురు. స్ఫోటకు సంబధించిన ముఖ్య చర్చ అంతయు మొదటి కాండములో ఉన్నది.

అనర్థకములయినను పదముల ఉనికి వాక్యమందు ఎట్లు సంభవించునని వివరించుచున్నాడు.

య దంతరాలే జ్ఞానం తు పదార్థే షూపజాయతే
ప్రతిపత్తే రుపాయో ఽసౌ ప్రక్రమానవధారణాత్ . 410

అంతరాలే=వాక్యజ్ఞానము యొక్కయు, వాక్యార్థజ్ఞానము యొక్కయు మధ్యను, పదార్థేషు=పదముల విషయమందు, పదార్థముల విషయమందును, యత్=ఏ, జ్ఞానమ్=జ్ఞానము (ఉన్నట్లు అనిపించుట - లేక - తెలిసికొనుట), ఉపజాయతే=కలుగుచున్నదో, అసౌ+తు=ఈ జ్ఞానమైతే, ప్రక్రమానవధారణాత్=తొలుతనే అఖండ వాక్యవాక్యార్థముల స్వరూపము నిశ్చయించుట వీలుకాకపోవుట వలన, ప్రతిపత్తేః=అఖండ జ్ఞానమునకు, ఉపాయః=ఉపాయము, (భవతి=అగును).

తా. "పదార్థములు తెలిసినపుడే వాక్యార్థము తెలియును" అని అందరును అందురు. అనుభవము కూడ అట్లే కనబడుచున్నది. అయినను పదమును, పదార్థమును ఉపాయములే కాని వాస్తవములు కావు. "అఖండ వాక్యార్థము" అను తత్త్వమును ప్రారంభములోనే గ్రహించి మనసుకు పట్టించుకొనుట, ఎవరికైనను కష్టమే అగును. అందువలన ఆగమ్యమును చేరుటకు పెక్కు ఉపాయములను చూపుచుందురు. పదపదార్థములన్నవి అట్టి ఉపాయములలో ప్రముఖములు. అంత మాత్రమున అవి సత్యములు కానేరవు.

వి. "వాక్యార్థజ్ఞానం పదార్థ జ్ఞానాధీనమ్" (వాక్యార్థమును తెలియుట పదార్థములను తెలియుటపై అధారపడి ఉండును) అని సామాన్యముగా కొందరు శాస్త్రవేత్త లందురు. వైయాకరణుల మతమున ఈ వచనము కాల్పనికమును, మార్గదర్శకమును అగును.

వాచ్యమగు అర్థమును ఒట్టియు అఖండత్వమును సాధించుటకు ప్రయత్నించుచున్నాడు.

> పూర్వై ర్ర్థై రనుగతో యథార్థాత్మా పరః పరః
>
> సంసర్గ ఏవ ప్రక్రాంత స్తథాఽన్యే ష్వర్థవస్తుషు .　　　　411

పూర్వైః=ముందున్న, అర్థైః = పదముల అర్థములతో, అనుగతః = సంబంధించిన, పరః+పరః=వెనుకను ఉండు పదార్థము, యథా=ఏ విధముగా, అర్థాత్మా=వాక్యార్థము, (స్యాత్=అగునో), తథా=ఆ విధముగనే, అన్యేషు=వెనుకను ఉన్న, అర్థవస్తుషు=పదార్థములు, (ప్రతీతేషు=తెలియబడగా), ప్రక్రాంతః=మొదటనే ఉండునట్టి, సంసర్గః+ఏవ=సంబంధమే, అర్థాత్మా=వాక్యార్థముగా, (స్యాత్ = అగును).

తా. 'ఒక వాక్యమున ఉండు పదముల అర్థములు, ఎట్టి సంబంధమును లేకుండ, విడివిడిగా ముందు తెలియబడును. పిదప ఆ పదార్థములు, ఒకదానితో వేరొకటి యోగ్యతానుసారముగా కలిసి, వాక్యార్థముగా మారును. కాగా ముందుపదార్థమును, వెనుక వాక్యార్థమును లభించును' అని కొందరందురు.

ఆ విధముగనే "అన్యోన్యము కలిసిపోయిన పదార్థముల రూపముగా భావింపబడు వాక్యార్థమే ముందు లభించును. వెనుక ఆ వాక్యార్థమందే పదార్థములు భాసించుచుండును." అని వైయాకరణులందురు.

వి. "ముందు పదార్థములు, పిదప వాక్యార్థము" అని మీరుచెప్పిన విధముగానే, "ముందు వాక్యార్థము, పిదప పదార్థములు" అని మేము చెప్పుదుము—అను సమన్వయ మిచట అభిమతము. కావున "ముందుగా వాక్యార్థము లభించును" అనునదియే వైయాకరణుల సిద్ధాంతమగును.

వాచకముఖమున (శబ్దమునుబట్టి), అఖండవాక్యార్థములు మూడు విధములుగా ఉండవచ్చునని ఇంతవరకు ప్రపాదింపబడినది.

1. అస్తిక్రియనుబట్టి సిద్ధించు ఏకపదవాక్యము (406 శ్లోకము).

2. అఖండస్ఫోటరూపమైన వాక్యము (409 శ్లోకము).

3. పదములు ఉపాయములుగా ఉండు వాక్యము (410 శ్లోకము).

ఆ విధముగనే వాచ్యముఖమునకూడ (అర్థమునుబట్టి) అఖండవాక్య వాక్యార్థములు మూడు విధములుగా సిద్ధించునని విశదీకరించుటకు, ఈ శ్లోకము బయలుదేరినది.

1. వాక్యార్థమే ముందు చెప్పబడును, (పిదప పదార్థములు కల్పితములగును).

2. క్రియయే వాక్యార్థము.

3. ఎట్టి విభాగములును లేని అఖండార్థరూపమైన ప్రతిభయే వాక్యార్థము.

ఈ మూడువిధములును ఇటుపైని వివరింపబడును: అందు మొదటి విధమును ఈ కారిక ప్రారంభించినది.

"ముందు పదార్థములు, పిదప వాక్యార్థము" అను మతమును "అభిహితాన్వయ వాదము" అని అందురు. దీనిని నైయాయికు లంగీకరించిరి. దీని సార మిది: "అభిహితా నామ్ = చెప్పబడిన పదార్థములకు, అన్వయః = పరస్పరసంబంధము — అభిహితాన్వయః. ఒక వాక్యమున పదములు తమ విడివిడి అర్థములనే ముందుగా చెప్పును. పిదప ఆ కాంక్ష, యోగ్యత మొదలగు పరికరముతో వానికి పరస్పరసంబంధము ఏర్పడును. (కర్త, కర్మ, క్రియ - ఇది ప్రధానము - ఇది అప్రధానము -, ఇది విశేషణము-ఇది విశేష్యము-, మొద లగు సంపూర్ణసంబంధము) ఇట్టి సంబంధమైన అర్థమునే వాక్యార్థమందుము. ఉదా : "కులాలః ఘటం కరోతి". ఈ వాక్యమువలన,"కుండను తయారుచేయుటకు అనుకూలమైన వ్యాపారము గలవాడు కుమ్మరి'' అను బోధ కలుగును. ఇదియే వాక్యార్థము. ఏ ఒక పదమువలనను ఈ యర్థము లభింపదు.''—అని.

పదార్థమును ఒప్పుకొనని వైయాకరణులకు ఈ మతము అభిమతము కాదు. కాన వారు ''అన్వితాభిధానము" అను మతమును స్వీకరించుదురు. ఈ మతమున ''అఖండమగు వాక్యార్థమే" వాక్యమువలన ముందుగా బోధింపబడును. పిదప సౌకర్యమునకై పదార్థము లను విడదీయుట జరుగును.

దీనిసారమిది: ''అన్వితానామ్ = పరస్పరముసంబంధముగల పదార్థసముదాయము లకే (సమగ్రవాక్యార్థములకే), అభిధానమ్ = చెప్పుట — అన్వితాభిధానమ్" భాష వాక్య రూపము. వ్యవహారమువలన అది వాక్యరూపముగనే సంక్రమించుచుండును. కాన వాక్య మును వినగానే తాత్పర్యవశమున, వాక్యార్థమే ముందుగా తెలియును. తరువాత సౌకర్యము కొరకు, పదార్థములను విడదీసి తెలిసికొందురు. ఉదా: ''రామః గ్రామం గచ్ఛతి'' - ''రాముడు కర్తగను, గ్రామము కర్మగను ఉన్న గమనరూపమైన వ్యాపారము'' అని వాక్యార్థము — అని.

కాగా అన్వితాభిధానమును ఆశ్రయించినందువలన ''అఖండవాక్యార్థమే" సిద్ధించు నని పర్యవసించును.

అంగీకృతే తు కేషాంచిత్ సాధ్యే నార్థేన సాధనే
ఆధారనియమార్థైవ సాధనానాం పునః శ్రుతిః. 412

కేషాంచిత్ = కొందరి మతమున, సాధ్యేన = సాధింపదగు, అర్థేన = క్రియతోడి సంబంధముచే, సాధనే = క్రియకు ఉపకారకమైన కారకము, అంగీకృతే + తు = సామాన్యరూపమున తప్పకఉండునని అంగీకరింపబడినపుడు, పునః = మరల, సాధనానామ్ = కారకముల యొక్క, శ్రుతిః = వినబడుట, ఆధారనియమార్థా + ఏవ = కారకశక్తుల ఆధారమును నియమించుటకే, (భవతి = అగును).

**తా.** అన్వితాభిధానవాదులు కొందరు ఇట్లందురు: "వాక్యమునందలి మొదటి పదము వలననే, క్రియతో సంబంధించిన పరస్పర సంబద్ధమైన వాక్యార్థమంతయు బోధింపబడును" అని. అట్లు మొదటి పదమువలననే కారకాన్వితమైన క్రియ పూర్తిగా చెప్పబడినచో, వేరుగా కారకములను వాక్యమందుచ్చరించుట వ్యర్థమే అగును. అయినను ఆయా కారకములను వేరుగా చూపుట, వానివాని శక్తుల ఆశ్రయములను నియమించుటకు ఉపయోగించును.

**వి.** అన్వితాభిధానవాదములోకూడ ఒకవిధమైన రీతిని కొందరు చెప్పినారు. తదనుసారము వాక్యమందలి తొలిపదమే వాక్యార్థమంతను చెప్పును. వాక్యార్థమున క్రియయే ప్రధానము. కారకము లన్నియు పరస్పరసంబద్ధములై క్రియతో అన్వయించును. అట్లు సమన్వితమైవ క్రియ పూర్తిగా, తొలిపదమువలననే తెలిసినపుడు, "వేరుగా కారకపదముల నన్నింటిని చూపుట ఎందుకు?" అను శంక కలుగుట సహజము. ఆ శంకను ఇట్లు పరిహరించుకొనవలెను: క్రియ ఉన్నపుడు కారకము తప్పక ఉండును. కాని ఆ కారకమేదియో తెలియదుగదా: కారకమును స్పష్టపరచుటకే - వేరుగా కారకము ఉచ్చరింపబడును. అనగా సామాన్యరూపముగా అవగతమైపోయిన కారకమును, విశేషరూపముగా ఆయా పదములతో నొక్కిచెప్పుట జరుగును. కాన వానికి వైయర్థ్యము లేదు.

సాధ్యము = సాధింపదగినది—లేక—సాధింపదలచినది. ఇది ఎల్లప్పుడును క్రియయే అగును. సాధనము = సాధించునది = కలిగించునది. అనగా కారకము—క్రియను పుట్టించునది కారకము. ఈ "పుట్టించుట" అన్నది ఒక విధమైన "శక్తి" అని వైయాకరణులందురు. అట్టి శక్తి కలది కారకమగుచుండును. కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము, అని కారకము ఆరు విధములు. (కర్తృత్వము, కర్మత్వము మున్నగునవి శక్తులు). తృతీయాది విభక్తులు ఈ కారకములను బోధించును. కారకములేని క్రియ ఉండదు.

సామాన్య వివక్షయందు శక్తి ఒకటే. విశేష వివక్షయందు దాని వైవిధ్యము స్ఫుటమగుచుండును.

ప్రకృత మొక ఉదాహరణము: "రామః దండేన గామ్ ఆనయతి" (రామ కర్తృకమును, దండ కరణకమును, గో కర్మకమును వర్తమానమును అగు ఆనయన రూపమైన క్రియ). ఇచట రామపదమువలననే, వాక్యార్థమంతయు వచ్చుననుట ఒక పద్ధతి. అయినను, కరణ శక్తికి ఆధారము కర్ర, కర్మ శక్తికి ఆధారము గోవు, అని నియమించుటకై కారకములు ఉచ్చరింపబడుచుండు నన్నది తత్త్వము.

ఆధారవిశేష రహితమైన సాధనమును క్రియ ఆక్షేపించదని చెప్పుచున్నాడు.

ఆధారనియమా భావాత్ తదాక్షేపో న విద్యతే
సామర్థ్యాత్సంభవ స్తస్య శ్రుతి స్త్వన్యనివృత్తయే. 413

అధార నియమా భావాత్ = ఆధారవిశేషములయొక్క నియమము కుదరనందు వలన, తదాక్షేపః = ఆధార విశేషములను ఆక్షేపించుట, న + విద్యతే = లేదు (జరుగదు). తస్య = ఆ ఆధారవిశేషమునకు, సామర్థ్యాత్ = సామర్థ్యమువలన, సంభవః = ఉండుట, (భవేత్ = కావచ్చును). శ్రుతిః + తు = మరల కారకములు వినబడుట, అన్యనివృత్తయే = ఇతర కారకములను అడ్డుటకు, (ఉపయుజ్యతే = ఉపయోగించును).

తా. సాధనములులేని క్రియ (సాధ్యము) ఉండదు. కావున క్రియ సాధనమును ఆక్షేపించును (లాగుకొనివచ్చును). అయినను సాధన సామాన్యమునే ('ఏదో ఒకసాధనము' అను భావమును) క్రియ ఆక్షేపించును. విశేషము లేని సామాన్యము కూడ ఉండదు గాన, సాధన విశేషము కూడ ఆక్షిప్తము కావచ్చును. అట్టి విశేషమును విశదీకరించి, విశేషాంతర ములను నివర్తింప చేయుటకొరకే కారక పదములను ఉచ్చరింపవలెను.

వి. కారకశక్తికిని కారకమునకును ఆధారాధేయభావమును చెప్పుదురు. (కారక శక్తి అధేయము. కారకము ఆధారము. ఉదా: "దండేన'' అనుచోట కరణత్వ మనునది శక్తి. ఇది ఆధేయము. దండమం దా శక్తి ఉన్నది కాన దండము ఆధారము. ఇట్లే ఇతర కారకముల విషయమును కూడ ఊహించునది). క్రియ కారకమును ఆక్షేపించునపుడు సామాన్యాకారముగ (కారకసామాన్యము) ఆక్షేపించును. సామాన్యములో విశేషము ఇమిడి యుండును గాన సామాన్యము విశేషమును కూడ తీసికొనిరాగలుగును. అయినను ఆ విశేషమును స్పష్టపరచుటకై కారకములను చూపక తప్పదు.

మీది కారికకు ఇది అనుబంధము.

''క్రియచేతనే కారక సామాన్యమును, కారక విశేషమును కూడ ఆక్షేపించుటకు వీలున్నది కాన, వాక్యములో కారకములను ఉచ్చరించుట ఎందుకు?'' అను శంకకు ఈ శ్లోకము సమాధానము. "కారకాంతరములను నివర్తింపజేయుటయే ప్రయోజనము'' అన్నది సమాధాన స్వరూపము.

"నిర్విశేషం న సామాన్యమ్'' అని శాస్త్రీయమగు సంప్రదాయము. "విశేషమును ఇముడ్చుకొనని సామాన్యము ఉండదు'' అని దీని అర్థము. ఉదా: గోత్వము (నిఖిల గోవులందును ఉండు ధర్మము) సామాన్యము. కృష్ణ గోత్వము (నల్ల ఆవులందుండు ధర్మము), ధవళ గోత్వము మొదలగునవి విశేషములు. ఇవన్నియు గోత్వమందు అంత ర్భూతములే కదా! ఈవిధముగ సామాన్యధర్మము విశేషధర్మమును కూడ ఆక్షేపించును. కాని దాని ప్రత్యేకతను చెప్పుటకు ఆవశ్యకమైన పదములను తప్పక ఉచ్చరింపవలెను. ఉదా:- "కృష్ణా గౌః, ధవళా గౌః" మొదలగునవి.

అట్లే ''ఈ కారకములే ఈ వాక్యమున ఉండదగినవి. మిగిలినవి ఉండకూడదు'' అనుటకై కారకములను పలుకవలెను.

అన్వితాభిధాన మతము ననుసరించి, అఖండ వాక్యార్థమే మొదట సిద్ధించు నను రీతి ఇంతతో ముగిసినది.

క్రియయే వాక్యార్థ మను భావము నాశ్రయించి మాటాడుచున్నాడు.

క్రియా క్రియాంతరా ద్భిన్నా నియతాధారసాధనా
ప్రక్రాంతా ప్రతిపత్తౄణాం భేదాః సంబోధహేతవః . 414

నియతాధార సాధనా = నియమింపబడిన కర్తృకర్మాది కారకములు గలిసట్టియు, క్రియాంతరాత్ = వేరొక క్రియనుండి, భిన్నా = వేరైనటువంటిన్ని, క్రియా = ఒకానొక నిర్దేశింపబడిన క్రియయే, ప్రక్రాంతా = మొదట బోధపడును. భేదాః = వాక్యమందలి విశేష ములన్నియు, ప్రతిపత్తౄణామ్ = తెలియువారియొక్క, సంబోధ హేతవః = జ్ఞానమునకు ఉపయోగించునవి.

తా. ఏ వాక్యమందైనను క్రియయే వాక్యార్థము. వాక్యమున ఏ క్రియను చూపుదుమో ఆ క్రియ, ఆవశ్యకములైన కారకములను కలుపుకొని, ప్రధానముగా బుద్ధి గోచరమగును. ఇతరవిశేషములన్నియు కేవలము సుఖబోధ కొరకే ఉపయోగించును.

"రామః, దండేన, గామ్, ఆనయతి". ఇచట ఆనయన క్రియయే వాక్యార్థము. కారకములన్నియు అందులో ఇమిడిపోవును.

ప్రతియొక వాక్యమందును ఒక క్రియ నిర్దేశింపబడును గాన, అది ఇతరక్రియలను నివర్తింపజేయును. అవాంతరక్రియలు ఏవయిన ఉన్నను అవి ప్రధానక్రియయందే లీన మగును.

క్రియ అనునది వ్యాపారరూపము, ఫలరూపమునుకూడ కావచ్చును.
"క్రియయే అఖండవాక్యార్థము" అను రీతిని ఈ కారిక చూపినది.

స్వమతమును అవలంబించి వాక్యార్థమును చూపుచున్నాడు.

అవిభాగం తు శబ్దేభ్యః క్రమవద్భ్యోఽపదక్రమమ్
ప్రకాశతే తదన్యేషాం వాక్యం వాక్యార్థ ఏవ చ . 415

తదన్యేషామ్ = మీది రెండు మతములను అంగీకరింపనివారికి, క్రమవద్భ్యః = క్రమముగల, శబ్దేభ్యః = వర్ణస్వరూపములనుండియు, పదస్వరూపములనుండియు, అపద క్రమమ్ = వర్ణములయు పదములయు వరుసలేనటువంటిన్ని, అవిభాగమ్ + తు = ఎట్టిభాగ ములును లేనటువంటి (అఖండమైన), వాక్యమ్ = వాక్యమున్ను, వాక్యార్థః + ఏవ + చ = వాక్యార్థమున్ను మాత్రమే, ప్రకాశతే = ప్రకాశించును.

తా. వర్ణములకును, పదములకును ఒక వరుసఉన్నట్లు కనబడినను, మొత్తము పై ఎట్టివరుసయు, అవయవములును భాసింపనట్టి అఖండవాక్యమును, అది బోధించు అఖండ వాక్యార్థమును మాత్రమే ఎల్లపుడును గ్రహింపబడుచుండును. ఇది వైయాకరణులమతము.

వి. 1. అన్వితాభిధాన వాదముచే తొలుత లభించునది వాక్యార్థము, 2. క్రియయే వాక్యార్థము, అను ఈ రెండు మతములను వైయాకరణు లంగీకరింపరు. ఈ కారిక వైయా కరణమతమును ప్రతిపాదించినది. దీని సార మిది: "లోకములో మధురపానీయములు ఎన్నో ఉన్నవి. విడివిడి వస్తువుల రసములను ఎన్నింటినో కలిపి ఒక పానీయమును తయారు చేయుదురు. అయినను త్రాగునపుడు ఆ విభాగమేదియు తెలియదు. అఖండరసమే అనుభూత మగును. దీనిని పానకరసన్యాయ మందురు."

అట్లే వాక్యములో వర్ణములును, పదములును, వాని వరుసయు ఉన్నట్లు కనబడినను, అఖండాకారమైనదే వాక్యమగును. అది బోధించు అఖండార్థమే వాక్యార్థము—అని.

అర్థమునుబట్టి కూడ అఖండవాక్యార్థము సిద్ధించునను చర్చ ఇంతతో ముగిసినది.

అసత్యమైన పదార్థమువలన, సత్యమైన వాక్యార్థము గ్రహింపబడునని పరామర్శించుచున్నాడు.

స్వరూపం విద్యతే యస్య తస్యాత్మా న నిరూప్యతే
నాస్తి యస్య స్వరూపం తు తస్యైవాత్మా నిరూప్యతే. 416

యస్య = దేనికి, స్వరూపమ్ = రూపము, విద్యతే = ఉండునో, తస్య = దాని యొక్క, ఆత్మా = స్వరూపము (సత్యత్వము), న + నిరూప్యతే = బోధింపబడదు. యస్య + తు = దేనికైతే, స్వరూపమ్ = రూపము, న + అస్తి = ఉండదో, తస్య = దానియొక్క, ఆత్మా + ఏవ = స్వరూపమే, నిరూప్యతే = బోధింపబడును.

తా. పదార్థమునకు స్వరూపముండును. అనగా విడివిడి పదముల అర్థములు లోకములో ప్రత్యక్షమగుచుండును (ఉదా: రామః, గౌః, దండః మొదలగువాని అర్థములు). వాక్యార్థమునకు స్వరూపము ఉండదు. అనగా పరస్పర సంబద్ధమైన (ఒక సంబంధముతో ముడివడిన) పదార్థసముదాయ రూపమైన వాక్యార్థము అంతకుముందు (శాబ్దబోధకు ముందు) లేనిదే అగును. కావున వాక్యముచే వాక్యార్థమే బోధింపబడును గాని పదార్థము బోధింపబడదు.

వి. క్రియతో సంబంధించని పదార్థము వ్యవహారయోగ్యము కాదు (ఉదా: రామః అను ఒకే పదమువలన ఏదియు బోధపడదు). క్రియా కారకభావసంబంధము వాక్యము. ఇదియే వ్యవహారయోగ్యము. ఇది వాక్యావస్థకు ముందు ఉండదు. అయినను వాక్యముచే ఇదియే బోధింపబడును.

"పదార్థము అసత్యము, వాక్యార్థము సత్యము. సత్యమైన వాక్యార్థము తెలియుటకు, అసత్యమైన పదార్థమును ఉపాయముగా మాత్రమే వాడుకొందుము" అను తమ సిద్ధాంతమును అనేకరీతులతో గ్రంథకర్త ఇటుపైని వివరించును. ఆ సందర్భమునకు ఇది ప్రారంభము.

గోవుయొక్క బొమ్మను వ్రాసి, దాని మూలమున వాస్తవమైన గోవుయొక్క జ్ఞానమును కలిగింతురు. ఈ రీతిని "రేఖాగవయన్యాయము" అని అందురు. ఈ తీరుననే అసత్యమైన పదార్థమును సాధనముగా పెట్టుకొని, సత్యమైన వాక్యార్థమును బోధింతుము.

స్వరూపముకలది అనగా క్రియాసంబంధములేని కేవలపదార్థము. దీనిని వాక్యము బోధింపదు. స్వరూపము లేనిది అనగా క్రియాసంబంధము కలిగిన వాక్యార్థము (సంబంధమన్నది వాక్యముగా ఏర్పడుటకు ముందు ఉండదు). దీనినే వాక్యము బోధించును.

కేవలపదార్థముల కన్న వాక్యార్థము క్రొత్తదే అగును. అది పదార్థముల సంబంధమును నూతనముగా తీసుకొనివచ్చును. (ఇది కర్త, ఇది కర్మ, ఇది విశేషణము, ఇది అవయవము మొదలగు సంబంధములు). అట్టి సంబంధమే ప్రధానము. అందుకొరకే వాక్యము వినియోగింపబడును.

పదార్థములు వేరుగా ఉన్నట్లు భావించి, అవి అసత్యములని ఈ శ్లోకము సూచించినది.

ఉన్నట్లుగా భాసించు పదార్థముల యొక్క సంసర్గమే వాక్యార్థమని ప్రతిపాదించు చున్నాడు.

> అశబ్ద మపరేఽర్థస్య రూపనిర్ధారణం విదుః
> అర్థావభాసరూపా హి శబ్దేభ్యో జాయతే స్మృతిః . 417

అర్థస్య = సంసర్గరూపమైన వాక్యార్థముయొక్క, రూపనిర్ధారణమ్ = స్వరూప నిశ్చయము, అశబ్దమ్ = శబ్దమువలన లభింపనిదే - అని, అపరే = మరికొందరు, విదుః = తెలిసికొందురు (చెప్పుదురు). అర్థావభాసరూపా = వాస్తవమైన అర్థముయొక్క అనుభవ ముతో సమానమైన, స్మృతిః = అర్థముయొక్క స్మరణము, శబ్దేభ్యః = శబ్దముల వలన, జాయతే + హి = కలుగునుగదా!

తా. సంబంధరూపమగు అఖండవాక్యార్థము శబ్దములవలన కలుగనే కలుగ దనియు, అది మనస్సుచేతనే తెలియబడుననియు కొందరు తాత్త్వికు లందురు.

మరియు, ఆకాశగుణముగా ఉండు శబ్దములు ఆకాశమందుగాని, ఆకాశ ప్రతీక మైన చెవియందుగాని ఉండును. అర్థములన్నవి ఆయా చోటులం దుండును. ఈ విధముగా శబ్దములకును అర్థములకును మధ్యను కడుదూర మున్నది. కావున శబ్దము అర్థముయొక్క అసలు అనుభవమును కలుగజేయజాలదు. కేవలము అర్థముయొక్క స్మృతిని కలిగించి ఒక విధమైన అర్థముద్రను మనస్సులో వేయుటకుమాత్రమే శబ్దము ఉపయోగించును.

వి. వాక్యార్థమనునది, అఖండమైన స్ఫోటరూపవాక్యముచే సిద్ధించు మానస ప్రత్యక్షమే. పదములయొక్కయు, పదార్థములయొక్కయు ఆవశ్యకత అట్టి మానసిక జ్ఞానమునకు ఉండనేఉండదు.

శబ్దములు అర్థస్మృతికి మాత్రమే ఉపయోగించు సాధనములు.

వాక్యమును వినగనే, మనస్సును ఏకాగ్రము చేసి (లగ్నముచేసి) దాని అర్థమును అఖండ రూపమున గ్రహింతుము. ఈ తీరును "మానసిక నిర్వికల్ప ప్రత్యక్ష జ్ఞానము" (మనసున భావించు విభాగరహితమైన సంసర్గరూప వాక్యార్థము) అని అందురు. ఈ అనుభవ మును బట్టి పద పదార్థములు కల్పితములే అనక తప్పదు.

మరొక చిత్రము :- శబ్దము ఉండుచోటు వేరు (ఆకాశము-లేక-చెవి). అర్థము ఉండుచోటు వేరు (ఆయా ప్రదేశము). ఇట్లు శబ్దార్థములకు సామీప్యమే లేదు. కాన శబ్దము అసలు అర్థమును సమర్పింపజాలదు. అర్థాభాసను మాత్రము స్మృతిమూలముగా కలిగించును.

అనగా :- "గౌః" అను శబ్దము చెవిని పడును. అసలు ఆవు ఎక్కడో ఒక ప్రదేశములో ఉండును. గోశబ్దమువలన ఆ ఆవు దగ్గరకు వచ్చి కనబడదు. సంకేతాదుల వలన వెనుక కలిగిన అనుభవమును బట్టి, స్మరణము కలిగి, ఆవుయొక్క చిత్రముమాత్రము మనసులో పడును. ఇది మానస ప్రత్యక్షము. ఇట్టి ప్రక్రియకే శబ్దములు సాయము చేయును. లౌకికముగ జరుగు శబ్దార్థ వ్యవహారమంతయు వాస్తవమున మనోవ్యాపారమే. అట్టి ఆంతర మగు జగత్తుకు సంబంధించినది నిత్య శబ్దము. అదియే అర్థముగ భాసించుచుండును.

వైయాకరణుల శబ్దతత్త్వమును ఈ కారిక మరొకసారి పరామర్శించినది.

అన్యథైవాగ్నిసంబంధాద్దాహం దగ్ధోఽభిమన్యతే
అన్యథా దాహశబ్దేన దాహాద్యర్థః ప్రతీయతే. 418

అగ్నిసంబంధాత్=నిప్పుయొక్క సంబంధమువలన, దాహమ్=కాలుటను, దగ్ధః=కాలినవాడు, అన్యథా=వేరొకవిధముగా, అభిమన్యతే=అనుభవించును. దాహశబ్దేన='దాహ' అను శబ్దముచే (కాలుట, చురుకుట, మొదలగు శబ్దములు), దాహాద్యర్థః=కాలుట మొదలగు అర్థము, అన్యథా+ఏవ=వేరొకవిధముగానే, ప్రతీయతే=తెలియబడును..

తా. నిప్పును సాక్షాత్తుగ ముట్టుకొన్నచో చేయి కాలును. ఆ అనుభవము వేరు. "దాహ" అను శబ్దమువలన "కాలుట" అను చిత్రము మాత్రము మనసులో పడును. కాని సాక్షాత్తుగ కాలుట ఉండదు, ఈ అనుభవము వేరు. కావున శబ్దార్థములకు వాస్తవమైన సంబంధము లేదు.

వి. బాహ్య జగత్తులోని వస్తురూపమైన అర్థము వేరు. శబ్దమువలన బోధపడు అర్థము వేరు. రెండును ఒకటి కాదు. అట్లయినచో "అగ్ని" అనగానే నాలుక కాలవలసి వచ్చును. అందుచే శబ్దమువలన లభించు అర్థమంతయు బుద్ధి పరికల్పితమే. దానికి వాస్తవమైన ఉనికి లేదు. అట్టి బౌద్ధార్థమునకు, శబ్దమునకును సంబంధము కల్పితమే. కాగా శబ్దార్థముల సంబంధము అసత్యము.

అర్థము బుద్ధి పరికల్పితమన్నపుడు, దానిని బోధించు వైఖరీ రూపమైన శబ్దము గూడ (ధ్వనిరూపము) బుద్ధి పరికల్పితమే అగును. కావుననే ఒక్కొక అర్థమునకు, పెక్కు వైఖరీ శబ్దము లాయా భాషలలో వినబడుచుండును. అందువలన స్ఫోట శబ్దము ఒక్కటే సత్యము. (బాహ్య శబ్దము అసత్యము).

పదార్థాలింగిత మైన వాక్యార్థమే సత్యమని సమర్థించుచున్నాడు.

పృథఙ్నివిష్టతత్త్వానాం పృథగర్థానుపాతినామ్
ఇంద్రియాణాం యథాకార్య మృతే దేహాన్న కల్ప్యతే. 419

పృథక్=వేరువేరుగా, నివిష్టతత్త్వానామ్=ఉన్నటువంటి స్వరూపములు గలిగినటువంటివిన్ని, పృథక్=వేరువేరుగా, అర్థానుపాతినామ్ = విషయములను గ్రహించునటువంటివిన్ని, ఇంద్రియాణామ్=నేత్రము మొదలగు ఇంద్రియములకు, దేహాత్+ఋతే=శరీరము లేకుండా, కార్యమ్=ప్రయోజనము, (తమ తమ విషయములను గ్రహించుట), యథా=ఏవిధముగా, న+కల్ప్యతే=సిద్ధింపదో.

తా. నేత్రము మొదలగు ఇంద్రియముల స్వరూపము వేరు వేరుగా ఉండును. అవి గ్రహించు రూపాది విషయములును వేరు వేరుగానే ఉన్నవి. అయినను శరీరమను ఒక ఆధారమున్నపుడే ఆయా ఇంద్రియములు తమ తమ విషయములను గ్రహించుటకు సమర్థములగును. శరీరము లేనియెడల ఇంద్రియములు నిష్ప్రయోజనములు.

వి. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనునవి జ్ఞానేంద్రియములు. వీని స్థానములును, స్వరూపములును భిన్నభిన్నములు. రూపము, వాసన, శబ్దము, రుచి, స్పర్శ అనునవి వరుసగా ఆయాఇంద్రియములు గ్రహించు విషయములు. శరీరమను అధిష్ఠానము ఉన్నపుడే ఇంద్రియములు తమ పనిని చేయగలుగును.

ఈ కారికను దిగువ కారికతో కలిపి సమన్వయము చేయవలెను.

కంటి యొక్క రూపము తైజసము (తేజోవికారము); స్థానము కనుపాప. ముక్కు రూపము పార్థివము (భూమికి చెందినది); స్థానము ముక్కుకొన. చెవి రూపము ఆకాశము; స్థానము చెవిలోని పొర. నాలుక రూపము నీటికి చెందినది; స్థానము నాలుక చివర. చర్మము రూపము వాయువునకు చెందినది; స్థానము శరీరమంతయు.

తథా పదానాం సర్వేషాం పృథగర్థనివేశినామ్
వాక్యేభ్యః ప్రవిభక్తానా మర్థవత్తా న విద్యతే. 420

తథా = ఆ విధముగానే, పృథక్=వేరువేరుగా, అర్థనివేశినామ్ = అర్థమును బోధించునవి అయినను, వాక్యేభ్యః = వాక్యములనుండి, ప్రవిభక్తానామ్=వేరుచేయబడిన, సర్వేషామ్ = అన్ని రకములైన, పదానామ్ = పదములకును, అర్థవత్తా = అర్థము కలిగి ఉండుట, న + విద్యతే = ఉండదు.

తా. ఇంద్రియములకు శరీరమువలెనే, పదములకు వాక్యము అధిష్ఠానము. శరీరము లేనపుడు ఇంద్రియములు పనిచేయనట్లుగానే, వాక్యములేనపుడు పదములును పనిచేయవు. వాక్యమువలననే పదములు అర్థవంతములగును. విడగొట్టినచో పదముల కర్థములు ఉండవు.

వి. వాక్యమందలి పదములను వేరుచేయుటయు, వానికి వేర్వేరు అర్థములను చూపుటయు ఉపాయభూతమైన కల్పన మాత్రమే.

మీది సందర్భము సమర్పించిన సారమిది :— "పదపదార్థము లన్నవి భ్రమరూపములు. వాక్యవాక్యార్థములనే, పదపదార్థములన్నట్లు గ్రహించి, భ్రాంతి పడుచుందురు. దీనిని 'అన్యథాఖ్యాతి' అందురు. ఒక వస్తువును చూచి వేరొక వస్తు వనుకొనుట అన్యథాఖ్యాతి అగును. ఉదా:— త్రాటిని చూచి పాము అనుకొనుట. కాగా పదార్థము లున్నట్లు భ్రాంతిని కలిగించుచు, వాక్యార్థమే సత్యమైనదిగా ఉండును."— అని.

వాక్యార్థ స్వరూపమును ప్రతిపాదించుచున్నాడు.

సంసర్గరూపం సంసృష్టే ష్వర్థవస్తుషు గృహ్యతే
నాఽత్రోపాఖ్యాయతే తత్త్వ మపదార్థస్య దర్శనాత్. 421

అర్థవస్తుషు = పదార్థములు, సంసృష్టేషు = పరస్పరము కలిసిపోయినపుడే, సంసర్గరూపమ్ = సంబంధముయొక్క స్వరూపము, గృహ్యతే = తెలియబడును, అత్ర = ఇచట = పదార్థములు వేర్వేరుగా భాసించు సమయములో. అపదార్థస్య = పదార్థములకన్న వేరైన వాక్యార్థముయొక్క, దర్శనాత్ = అనుభవమువలన, తత్త్వమ్ = వాక్యార్థముయొక్క స్వరూపము, న + ఉపాఖ్యాయతే = చెప్పబడదు.

తా. చక్కెర, నీరు, మొదలగు విడివిడి వస్తువులవంటివి పదార్థములు. పానకమువంటిది వాక్యార్థము. అది, పదార్థములు తమ రూపమును పోగొట్టుకొని, ఏకరూపముగా సిద్ధించిన సంబంధరూపము. అది పదార్థములకన్న విలక్షణమైనది. కావున, పదార్థములను భావించు సమయములో, వాక్యార్థమును వివరించుట కుదురదు. అనుభవములో వాక్యార్థమే ఉన్నందున దానిని లేదనుటయు పొసగదు.

వి. "లేనిపదార్థములను ఉన్నట్లు భావించి ఊతగా తీసుకొని వర్ణింపబడునదియు, సంబంధరూపమైనదియు వాక్యార్థము. అనుభవములో ఎల్లప్పుడును అదియే ఉండును. సాతా

త్తుగ మొదటనే వాక్యార్థమును నిరూపించుట శక్యముకాదు గాన, దాని స్వరూపమును వివరించుటకై పదార్థమను భావనను సాయముగా తీసుకొందుము'' అను వైయాకరణుల మతము ఇచట సంగ్రహింపబడినది.

''వాక్యార్థమనగా ఏమి?'' అను శంకకు, ''పదార్థసంబంధమే వాక్యార్థము'' అనియే సమాధానముకాని, వేరొక సమాధానము కుదరదు. ఆ విధముగా పదార్థభావన అవశ్యకమగును. అంతమాత్రమున అది సత్యమని అనుకొనకూడదు.

''అసత్యమైన పదార్థము మూలమున సత్యమైన వాక్యార్థమెట్లు సాధింపబడును?'' అనుశంకకు, సయుక్తికముగ సమాధానమిచ్చుచున్నాడు.

> దర్శనస్యాఽపి యత్సత్యం న తథా దర్శనం స్థితమ్
> వస్తుసంసర్గరూపేణ తదరూపం నిరూప్యతే. 422

దర్శనస్య + అపి = జ్ఞానముయొక్కయు, సత్యమ్ = సత్యమైన = స్వచ్ఛమైన (పదార్థముల సంపర్కములేని), యత్ = ఏరూపముగలదో, తథా = ఆరూపముగా, దర్శనమ్ = జ్ఞానము, న + స్థితమ్ = లేదు (ఉండదు). అరూపమ్ = రూపములేని, తత్ = ఆ జ్ఞానము, వస్తుసంసర్గరూపేణ = ''వస్తువులసంబంధము'' అను స్వరూపముతో, నిరూప్యతే = వర్ణింపబడును.

తా. ''జ్ఞానము'' అను ఒక పరతత్త్వమున్నది. ఎరుక, తెలివి, అను మాటలతో దానిని చెప్పుదురు. జ్ఞానమునకు వాస్తవమైనరూపము లేదు. సంభవింపదు కూడ. అది రూపరహితము. అయినను వస్తువులను జ్ఞానమునకు విషయముగాచేసి, జ్ఞానస్వరూపమును తెలియజేయుదురు. అనగా, ''గోవిషయక జ్ఞానము'' ''అశ్వవిషయక జ్ఞానము'' అని చెప్పి, గోవు, అశ్వము మొదలగువాని సంబంధమును కలిగించి, ''జ్ఞానమనగా ఏదియో'' తెలియ ప్రయత్నములను చేయుదురు. వాస్తవమున వస్తువులు అసత్యములు, జ్ఞానమేసత్యము. అట్లే రూపములేని కార్యమును నిరూపించుటకు, పదార్థముల సంపర్కమును స్వీకరించుట జరుగును.

వి. పరతత్త్వమునకు సంబంధించిన దృష్టాంతముతో ''వాక్యార్థము సత్యమని'' నిరూపించుట ఈ కారిక యొక్క ప్రయోజనము.

రూపములేని జ్ఞానమునకు లక్షణము చెప్పవలసివచ్చినపుడు, వస్తువును విషయముగా తీసికొనక తప్పదు. అనగా ''వస్తువులు దేనికి గోచరమగునో అది జ్ఞానము''అనవలెను. పరమార్థమున వస్తువులు అసత్యములు, జ్ఞానమే సత్యము.

అట్లే వాక్యార్థమునకు స్వతంత్రమైన రూపములేదు. దానిని నిరూపించుటకై పదార్థములను కల్పించుకొనవలెను. ''పదార్థసంబంధమే వాక్యార్థము'' అని చెప్పవలెను. వాక్యార్థమే నిత్య సత్యమగును.

శబ్దతత్త్వవిదులగు వైయాకరణులకును, అద్వైత వేదాంతులకును, తత్త్వవిచారణ విషయములో పెక్కు పోలికలు ఉన్నవి. మొదటి కాండమున అవన్నియు విశదీకరింపబడినవి. ప్రకృతము, అద్వైత దృష్టాంతముతో శబ్దతత్త్వము మరొకసారి సంగ్రహింపబడినది.

''ఉన్నపదార్థముల లేవనుటయు, వాని సముదాయము తప్ప, వేరుగా ఉండని వాక్యార్థమును ఉన్నది—అదియే సత్యము అనుటయు'' ఎట్లు సమంజసము? ఈ విధానము,

"కుందేటి కొమ్ము అను ప్రయోగమున, ఉన్న కుందేలును లేనిదనియు, లేని కొమ్మును ఉన్న దనియు ప్రతిపాదించినట్లున్నది"—అను శంకకు ఈ కారిక సమాధానము.

దీనిసారమిది: "తత్త్వమును సామాన్యులు తెలియుటకు ఈ మార్గము తప్పదు. వేదాంతవిషయమును చూడుడు: పరబ్రహ్మముతప్ప వేరొక పదార్థము లేదు. ఆ బ్రహ్మము జ్ఞానము. దీనికి సాక్షాత్తుగ "ఇది—ఇట్టిది" అను లక్షణమును ఎవరును చెప్పలేరు. అయినను భ్రాంతిమూలకమైన లౌకికవస్తువులను ఆశ్రయించి. "ఇటువంటిది జ్ఞానము" అని బోధపర తురు. చివరకు మనస్సు ద్వారముననే జ్ఞానము ప్రకాశించి, మనస్సుకూడ లయమైపోవును. జ్ఞానమే మిగులును. భ్రాంతి ఉన్నంతవరకును ఇట్టి నిరూపణములును, ప్రతిపాదనములును అవశ్యకములగుచుండును. సత్యవేత్తలకు ఇవి వ్యర్థములే. ఈ యంశము లన్నియు ఉపని షత్తులలో బహుముఖముగా వర్ణింపబడినవి.

శబ్దతత్త్వము కూడ ఇట్టిదే. అఖండవాక్యము సత్యము. అది అఖండవాక్యార్థముగ భాసించును. దీనికిని రూపము లేదు. కావున పదార్థములను కల్పించుకొని, "పదార్థసంబంధము వాక్యార్థము" అని చెప్పవలసి వచ్చును. తత్త్వము తెలియగానే ఇట్టి ప్రతిపాదన లన్నియు నిష్ప్రయోజనము లగును.

తత్త్వము సూటిగా తెలియ శక్యము కానపుడు, కొన్ని ఉపాయములను ఆశ్ర యింపక తప్పదు గదా!

మరియు జ్ఞానమే లేకున్నచో విషయములైన వస్తువు లసలే ఉండవు. (వానిని నిరూపించుట కుదరదు). అట్లే వాక్యార్థమే లేనప్పుడు పదార్థము ఉనికియే కుదరదు. కాగా "వాక్యార్థము సత్యము గాన, దానినిబట్టియే, పదార్థముల భావన యైనను కుదురును"అని.

వాక్య వాక్యార్థములే వ్యవహార యోగ్యములు అని స్పష్టపరచుచున్నాడు.

> అస్తిత్వేనానుషక్తో వా నివృత్త్యాత్మని వా స్థితః
> అర్థోఽభిధీయతే యస్మా దతో వాక్యం ప్రయుజ్యతే. ౪౨౮

అస్తిత్వేన = "అస్తి" అను క్రియతో, అనుషక్తః + వా=కూడినదైగాని, వా=లేక, నివృత్త్యాత్మని= "నాఽస్తి" అను క్రియయందు, స్థితః = అన్వయించినదై కాని, అర్థః = అర్థము, యస్మాత్=ఎందువలన, అభిధీయతే=చెప్పబడునో, అతః = అందువలన, వాక్యమ్=వాక్యమే, ప్రయుజ్యతే=ప్రయోగింపబడును.

తా. కేవలము పదము కాని పదార్థముగాని ప్రయోగార్హముకాదు. అట్టిచోట్ల కూడ "అస్తి" అను క్రియతో గాని, "నాఽస్తి" అను క్రియతో గాని సంబంధము తప్పదు. అయినపుడు అది వాక్యమే అగును.

వి. "వృక్షః" "అశ్వః" మొదలగు ఏకపదమును వాడినచోట్ల కూడ చివరకు "అస్తి" అనియో "నాస్తి" అనియో క్రియను చేర్చనిదే సమగ్రార్థము లభింపదు. ఇట్టిస్థలము లందు పదముల కధ్యాహారమన్నను, అర్థములకు అధ్యాహారమన్నను అధ్యాహారము మాత్రము తప్పదు. ఆ విధముగ అవి వాక్యములే అగుగు.

"అస్తి" "నాఽస్తి" అనుక్రియలు ఉపలక్షణములు. "ఏదో ఒక క్రియ" అను భావమును అవి సూచించును. క్రియ లేనపుడు వాక్యము సంపూర్ణము కాదు గదా!

క్రియానుషంగేణ వినా న పదార్థః ప్రతీయతే
సత్యో వా విపరీతో వా వ్యవహారే న సోఽస్త్యతః. 424

వ్యవహారే = లోకములోని వాడుకలో, సత్యమైనదికాని, విపరీతః + వా = అసత్యమైనది కాని, పదార్థః = కేవలము పదార్థము. క్రియానుషంగేణ + వినా = క్రియతోడి సంబంధము లేకుండ, న + ప్రతీయతే = తెలియబడదు, అతః = అందువలన, సః = అట్టి పదార్థము, న + అస్తి = లేదు.

తా. సత్యము కానిందు-లేక-అసత్యము కానిందు; క్రియాసంబంధములేని పదార్థమన్నది లేదు. క్రియతో సంబంధముగల అర్థమే లోకములో అనుభవసిద్ధముగా ఉన్నది. అది వాక్యార్థమే కావున పదార్థమన్నది లేదు.

వి. పై కారికయు, ఈ కారికయు ఒకే భావమును విశదీకరించును.

లోక వ్యవహారములో వాక్య వాక్యార్థములవలననే ప్రవృత్తి నివృత్తులు బోధపడుచున్నవి. కాన అవియే సత్యములు, పదపదార్థములు కల్పితములు.

పెద్దలనుండి పిన్నలకు భాష సంక్రమించురీతిని లోకవ్యవహార మందురు. అట్లే ఒకరితోనొకరు మాటాడుకొను రీతికూడ వ్యవహారమే అగును. అందు వాక్యవాక్యార్థములకు మాత్రమే, యోగ్యత ఉండునది అనుభవసిద్ధమైన విషయము.

ఒకే పద మెపుడును అర్థవంతము కానేరదని చెప్పుచున్నాడు.

సదిత్యేవ తు య ద్వాక్యం త దభూ దస్తి నేతి వా
క్రియాభిధాన సంబంధ మంతరేణ న మన్యతే. 425

సత్ + ఇతి + ఏవ = "సత్" అను కేవలపదరూపముగానే, యత్ = ఏ, వాక్యమ్ + తు = వాక్యమైతే కలదో, తత్ = దానినికూడ, అభూత్ + అస్తి + ఇతి = "అభూత్" (ఉండెను) "అస్తి" (ఉన్నది) అని కాని, వా = లేక, న—ఇతి = న + అభూత్, న + అస్తి" అని కాని, క్రియాభిధానసంబంధమ్ = క్రియావాచకసంబంధము, అంతరేణ = లేకుండ, న + మన్యతే = తెలియజాలదు ("తెలియువాడు" అనునది అధ్యాహారము).

తా. "సత్" (ఉన్నది) అను ఏక పదవాక్యమున్నది. బ్రహ్మమును, సత్యవస్తువును చెప్పుటకు దీనిని వాడుదురు. ఇచట క్రియయొక్క ఆవశ్యకతలేదని సామాన్యముగా అనిపించును. ఈ పదము కేవలము సత్తును (ఉనికిని) బోధించుటయే అందుకు కారణము. అయినను "సత్" అనగానే "అభూత్"—"అస్తి" "నాభూత్ — "నాస్తి" అని ఏదో ఒక క్రియాపదసంబంధము ఉండక తప్పదు. లేకున్న సంపూర్ణభావము తెలియదు.

వి. కేవలము సత్తను బోధించు "సత్" మొదలగు ప్రయోగములలో కూడ, క్రియా సంబంధము లేనిదే అర్థము పూర్తికాదు. కావుననే 'సదేవ — ఆసీత్' 'సదజాయత' (సత్తు ఉండెను—సత్తు పుట్టెను) మొదలగు ఉపనిషత్ప్రయోగములలో క్రియాపదము తప్పక ఉపయోగించబడినది. అందుచే కేవలము పదమునకు (పదార్థమునకు) ప్రయోగార్హత లేదు.

క్రియ ఎల్లపుడును కారకమును ఆక్షేపించుచుండునని చూపుచున్నాడు.

ఆఖ్యాతపదవాచ్యేఽర్థే సాధనోపనిబంధనే
వినా సత్త్వాభిధానేన నాఽకాంక్షా వినివర్తతే. 426

సాధనోపనిబంధనే = సాధనము (కారకము) నిమిత్తముగా గల, ఆఖ్యాత పద వాచ్యే = క్రియాపదముచే చెప్పబడు, అర్థే = అర్థము ప్రతిపాదింపబడినపుడు, సత్త్వాభిధానేన = సాధనమైన ద్రవ్యమును చెప్పుట, వినా = లేకుండ, ఆకాంక్షా = అపేక్ష, న + వినివర్తతే = నివర్తింపదు (శాంతింపదు).

తా. క్రియ సాధ్యము. ద్రవ్యము సాధనము (కారకము). సాధ్యము సాధనమును, సాధనము సాధ్యమును తప్పక అపేక్షించును. ఆ రెండును అవినాభూతములు అనగా ఒకదానిని విడిచి, వేరొకటి ఉండజాలదు. కావున క్రియను చెప్పినపుడు కారకమును చూపవలెను. కారకమును చూపినపుడు క్రియను చూపవలెను. ప్రతియొక వాక్యమందును ఈ విధముగ నియతముగ క్రియాకారకములు ఉండును. లేకున్న ఆకాంక్ష శాంతింపదు (వాక్యార్థము పూర్తికాదు).

వి. క్రియాపదమున్నపుడు కారకపదము ఉండక తప్పదని ఈ కారిక చెప్పినది. దీనినిబట్టి 'కారక పదమున్నపుడు క్రియాపదము ఉండక తప్పదు' అను అంశమును కూడ ఊహించుకొనవలెను. కాగా ఏదయినను, ఒకేపదము వాక్యము కానేరదని సారాంశము. ఈ యంశములు వెనుక చర్చింపబడినవే (326 శ్లోకము). ప్రసంగవశమున మరల ఇచట విశదీకరించబడినవి.

సాధనము అప్రధానము, క్రియయే ప్రధానము అనుటలో ఉపపత్తిని చూపుచున్నాడు.

ప్రాధాన్యాత్తు క్రియా పూర్వ మర్థస్య ప్రవిభజ్యతే
సాధ్య ప్రయుక్తా న్యంగాని ఫలం తస్యాః ప్రయోజకమ్. 427

క్రియా + తు = క్రియయే, ప్రాధాన్యాత్ = ముఖ్యము అగుటవలన, అర్థస్య = వాక్యార్థమునుండి, పూర్వమ్ = ముందుగా, ప్రవిభజ్యతే = వేరుచేయబడును. అంగాని = అప్రధానములైన (అవయవములైన) కారకములు, సాధ్యప్రయుక్తాని = క్రియ సిద్ధించుటకు ఉపయోగించునవి. తస్యాః = ఆ క్రియకు, ఫలమ్ = ఫలము (ప్రయోజనము), ప్రయోజకం = ప్రేరేపించునది (ముఖ్యమైనది), (భవతి = అగును).

తా. వాక్యార్థములో వ్యాపారమే ముఖ్యమైనది; కావుననే దానిని ముందుగా వేరు చేసి చూపుదురు. వ్యాపారము సిద్ధించుటకు అనేకరీతులలో సాయముచేయునవి కారకములు. అవి అప్రధానములు. అన్నిటికన్నను ముఖ్యమైనది ఫలము. అది వ్యాపారమువలన సిద్ధించును.

వి. "దేవదత్తః కాష్ఠైః స్థాల్యాం తండులాన్ పచతి" అను వాక్యము. "దేవదత్తుడు కర్తగాను, కర్రలు సాధనముగాను, గిన్నె ఆధారముగాను, బియ్యము కర్మగాను, ఉన్న జరుగుచున్న వంట అను పని" అని వైయాకరణులమతములో (మీమాంసకమతము కూడ ఇదియే) శాబ్దబోధము కలుగును. దీనిని క్రియావిశేష్యకమైన శాబ్దబోధ అందురు. ఇందు విశేష్యము కాన, క్రియ ప్రధానమగును. కారకములన్నియు క్రియాసిద్ధికై పాటుపడు

నవే గాన విశేషణములై అప్రధానములగును. (క్రియాకారకములకు అవయవావయవిభావ సంబంధమని తాత్పర్యము. క్రియ—అవయవి. కారకములు—అవయవములు). వ్యాపారమునకు కూడ, ఉద్దేశించినఫలమే ప్రయోజకమగును. ఎట్టి ఫలమునులేని వ్యాపారము వ్యర్థమగును గదా! మీదివాక్యములో పాకమే (బియ్యము ఉడుకుట) ఫలము. ఇట్లే ప్రతియొక క్రియకును ఒక ఫల ముండును. అదియే వ్యాపారమునకు లక్ష్యము కాన, అన్నింటికన్నను ముఖ్యమగును.

"సాధ్యసాధనములకు పరస్పరాపేక్ష సమానమే గాన, వానిలో ఒకటి ముఖ్యమనియు వేరొకటి అముఖ్యమనియు ఎట్లు చెప్పగలుగుదుము?" అను శంకకు ఈ శ్లోకము సమాధానము.

"గమ్" (వెళ్ళుట) "పచ్" (వండుట) మొదలగు ధాతువులన్నియు వ్యాపారమును బోధించును, దానివలన సిద్ధించుఫలముకూడ, ఆ వ్యాపారమందే ఇమిడియుండును. అందుచేతనే "ఫలవ్యాపారయోః ధాతుః" (ధాతుః = ధాతువు, ఫలవ్యాపారయోః = ఫలమును వ్యాపారమును కూడ బోధించును) అని ధాతులక్షణమును చూపుదురు. కాగా ఫలము పరమ ముఖ్యమని తెలియును. (లోకములోని వ్యాపారము లన్నియు, ఏదో ఒక ఫలమును ఆశించియే జరుగుచుండును).

సాధ్య సాధన వ్యవహారము కూడ కల్పితమే అనుచు, మరల "పదార్థము అసత్యమే" అని స్థాపించుచున్నాడు.

ప్రయోక్త్రైవాఽభిసంధత్తే సాధ్యసాధనరూపతామ్
అర్థస్య వాఽభిసంబంధకల్పనాం ప్రసమీహతే. 428

సాధ్యసాధన రూపతామ్ = సాధ్యముయొక్కయు, సాధనము యొక్కయు స్వరూపమును, ప్రయోక్త్రా + ఏవ = వాక్యమును ప్రయోగించు వ్యక్తియే, అభిసంధత్తే = కల్పించును, అర్థస్య = సాధ్యమును, సాధనమును అయిన పదార్థము యొక్క, అభిసంబంధకల్పనామ్ + వా = సంబంధకల్పనమును కూడ, ప్రసమీహతే = కోరుకొనును.

తా. వాక్యమున "ఇది సాధ్యము, ఇది సాధనము" అను విభాగము కూడ కల్పనయే. వాస్తవము కాదు. వాక్యమును ఉచ్చరించు వ్యక్తి అట్టి కల్పనను మనసునందు చేసికొనియే, వాక్యమును ఉచ్చరించును. అట్లే పదార్థముల సంబంధమును కూడ అతడే కల్పించును. వాక్యమును వినువ్యక్తియు—విన్నతరవాత, ఆయా పదార్థములను, వాని సంబంధమును కల్పించుకొనియే, వాక్యార్థమును గ్రహించును.

వి. "ఇది సాధ్యము, ఇది సాధనము, ఇది ఈ రెండింటికిని ఉండు సంబంధము" మొదలగు వివేచన అంతయు, వక్తయు బోద్ధయు కల్పించుకొను అసత్యములు. అఖండ వాక్యార్థమే సత్యము. పదపదార్థము లన్నవి అనిర్వచనీయములు).

విశేష విషయములు : ఉన్నదని కాని లేదని కాని, నొక్కి చెప్పుటకు వీలులేని ఒక వస్తువును అనిర్వచనీయమని వేదాంతులు చెప్పుదురు. (అనిర్వచనీయము = వర్ణింప శక్యము కానిది). ఉదా : త్రాటిని చూచి 'పాము' అనుకొన్న సమయములో పాము అనిర్వచనీయము.

'పదపదార్థములు ఇట్టివే' అని శాబ్దికుల ఆశయము.

సాధ్యము, సాధనము, వాని సంబంధమును నియతములు కావని ప్రతిపాదించుచు న్నాడు.

పచిక్రియా కరోమీతి కర్మత్వే నాఽభిధీయతే
పక్తేః కరణరూపం తు సాధ్యత్వేన ప్రతీయతే. 429

కరోమి + ఇతి = 'అహం పాకం కరోమి' అను ప్రయోగములో, పచిక్రియా = వంట, కర్మత్వేన = కర్మగా, అభిధీయతే = చెప్పబడుచున్నది. సాధ్యత్వేన = సాధింపదగినది అగుటచే, పక్తేః = పచి క్రియకు, కరణరూపమ్ + తు=సాధనస్వరూపముకూడ, ప్రతీయతే= తెలియబడుచున్నది.

తా. "అహంపాకం కరోమి" (నేను వంటను చేయుచున్నాను) అనుప్రయోగ ములో "వంట" అను క్రియ "చేయుట" అను క్రియకు కర్మగా ఉన్నది. అనగా ఒకప్పుడు ("పచామి" అను ప్రయోగమున) ప్రధానముగా ఉండునది, ప్రకృతము అప్రధానముగా మారినది. అట్లే "ఓదనం పచతి" (అన్నమును వండుచున్నాడు) అను ప్రయోగములో, "బియ్యము ఉడికి అన్నముగా సిద్ధమగుట" ఫలము. దీనికి పాక క్రియ ఒక విధముగా "కరణము" (సాధనము) కూడ అగుచున్నది. ఇట్లు ఒకే పచిక్రియ ఒకప్పుడు, ముఖ్యము గాను, వేరొకప్పుడు కర్మగాను, ఇంకొకప్పుడు సాధనముగాను మారుచున్నది. కావున సాధ్యసాధనాది వ్యవహారము కూడ అనియతము.

వి. ఒకే వస్తువు, ఆయా సందర్భమునుబట్టి అనేకకారకములుగా (సాధనముగా) మారుచుండును. ఉదా: "పుష్పం విద్యతే" ఇచట పుష్పము కర్త, "పుష్పం పశ్యతి"ఇచట పుష్పము కర్మ. 'పుష్పేణ పూజ్యతే' ఇచట అది కరణము. "పుష్పే మకరందః అస్తి" ఇచట అది అధికరణము. కావున "ఇది ఈ సాధనము" అని సృష్టిలో ఏ వస్తువును నియత ముగా లేదు.

అట్లే "ఇది వ్యాపారము, ఇదే ప్రధానము" అను నియమముకూడ, ఏ వ్యాపారము విషయముననను నిర్దిష్టముగా సంభవింపదు. ప్రసిద్ధమైన పచిక్రియ ఒకచోట కర్మగాను, మరొక చోట కరణముగాను తెలియబడుచుండును గదా!

అట్లే సాధ్యసాధనముల సంబంధము కూడ అనియతమే. ఉదా: "రామేణ బాణేన హతః వాలీ" (రాముని బాణముచే వాలి చంపబడెను). ఇచట కర్తయగు రామునకును, హనన క్రియకును ఉండు సంబంధము వేరు. (బాణమును విడుచుట రాముని పని). కరణమగు బాణ మునకును, హననక్రియకును ఉండు సంబంధము వేరు. (చచ్చుట అను ఫలమును బాణము సాధించును). అనగా కర్తకు వ్యాపారముతోను, కరణమునకు ఫలముతోను సంబంధమని తాత్పర్యము.

కాగా, సాధనము, సాధ్యము, సంబంధము అనునవి నియతముగా ఉండునవి కావు. కావుననే అవి కల్పితములును, అసత్యములును అగుచున్నవి.

మీది కారిక సూచించిన అంశమును, ఈ కారిక పూర్తిగా వివరించినది.

సాధనత్వాదికము వివక్షాధీనమని వివరించుచున్నాడు.

యోఽసౌ యేనోపకారేణ ప్రయోక్తృణాం వివక్షితః
అర్థస్య సర్వశక్తిత్వాత్ స తథైవ వ్యవస్థితః 480

యః+అసౌ (అర్థః)=ఏ అర్థము (వస్తువు), యేన=ఏవిధమైన, ఉపకారేణ=సాయముతో, ప్రయోక్తృణామ్=ప్రయోగించువారిచే, వివక్షితః=బోధించుటకు సంకల్పింపబడినదో, సః=ఆ అర్థము, అర్థస్య=అర్థమునకు, సర్వశక్తిత్వాత్=అన్నివిధములైన శక్తులును ఉండుటవలన, తథా+ఏవ = అవిధముగనే (వివక్షించినరీతిగనే), వ్యవస్థితః=నియతమై, (స్యాత్=ఉండును).

తా. కర్తృత్వము, కర్మత్వము, కరణత్వము మొదలగునవి శక్తులనబడును. ప్రతియొక వస్తువునకును ఈ శక్తులన్నియు ఉండవచ్చును, అయినను ప్రయోగించు వ్యక్తి, ఏ శక్తిని బోధింపవలయునని సంకల్పించునో, ఆ శక్తియే అప్పటికి నియతమగును. అనగా ఉద్దేశించిన వ్యాపారములో, ఏది-ఎట్లు-సాయపడునో అను అంశము, ప్రయోక్తచే సంకల్పించబడునుగాన, అది—ఆకారకముగ—అచట నియతరూపమున తెలిసికొనబడును.

వి. మీది కారిక చెప్పిన విషయమునే, మరొక రీతిలో ఈకారిక చెప్పుచున్నది.

"అర్థము" అనగా వస్తువు, విషయము-లేక-అంశము. ఒక వ్యాపారమును, అందు ఒక్కొక్క అర్థము చేయు సాయమును, సంకల్పించియే, వక్త వాక్యమును ప్రయోగించును. దానిని బట్టి ఆ వాక్యములో "ఏది ఏ కారకము" అన్న విషయము నిశ్చయముగా తెలియుచుండును. ప్రతియొక అర్థమును సర్వశక్తిసంపన్నమే అయినను, ఆయా ప్రయోగములలో వక్తృవివక్షను బట్టి ఒక విధమైన వ్యవస్థ కుదురుచుండును. అయినను, "ఈ వస్తువు ఎల్లప్పుడును ఈ కారకమే" అను స్వరూపనియమము లేనందున కారకములు అవ్యవస్థితములే అగును. "కారకములు వివక్షాధీనములే కాని, నియతములు కావు" అని సారాంశము. ఇట్లే సాధ్యరూపమైన అర్థము కూడ వివక్షాధీనమని అభిసంధి.

వస్తువులు సర్వశక్తి సంపన్నములు కావున, వివక్షావశమున వివిధ సంబంధములను సహించుచుండునని నిరూపించుచున్నాడు.

ఆరాద్వృత్తిషు సంబంధః కదాచి దభిధీయతే
ఆశ్లిష్టో యోఽనుపశ్లిష్టః స కదాచిత్ ప్రతీయతే. 481

ఆరాత్=దూరముగా, వృత్తిషు=ఉన్నట్టి వస్తువుల విషయములో కూడ, సంబంధః= పరస్పరసంబంధము, కదాచిత్=ఒకప్పుడు, అభిధీయతే = చెప్పబడును, ఆశ్లిష్టః=సంబంధముకలదైనను, అనుపశ్లిష్టః=సంబంధము లేనట్టిదిగా, యః=ఏ పదార్థము ఉండునో, సః=ఆ పదార్థము, కదాచిత్=ఒకప్పుడు, ప్రతీయతే=తెలియబడును.

తా. పదార్థముల సంబంధము కూడ అతి విచిత్రమైనది. దూరదూరముగా ఉండి ఎట్టి సంబంబంధమును లేని వస్తువులు, వివక్షావశమున ఒకప్పుడు పరస్పరసంబంధమును పొందును. ఉదా:- "అయోధ్యోజ్జయినీవారాణస్యః భారతదేశే ద్రష్టవ్యాః" (అయోధ్య ఉజ్జయిని, వారాణసి అనునగరములు భారతదేశమున చూడదగినవి) అను ప్రయోగము.

ఇచట వాస్తవమున ఆయా నగరములు ఒకదానికొకటి సుదూరముగా ఉన్నవి అయినను అవి వక్తయొక్క ఇచ్ఛానుసారము, పరస్పర సంబంధమును పొంది ద్వంద్వరూపమున ఒకచోట కూడినవి. అట్లే ఎల్లపుడును కలిసియుండు వస్తువులు, సంబంధము లేనట్లుగా ఒకప్పుడు చెప్పబడుచుండును. ఉదా: "తోయమత్స్యయోః నైకత్వమ్-కింతు మహదంతరమ్" (నీరును చేప ఒకటి కాదు. చాలా భేదమున్నది.) ఇచట నీటిని ఎల్లపుడును ఆశ్రయించి ఉండు చేపకు నీటితో సంబంధము లేనట్లు చూపబడినది. "అస్య రూప మన్యత్, అస్య పాండిత్య మన్యత్" (ఇతని రూపమువేరు. ఇతని పాండిత్యము వేరు) మొదలగు ప్రయోగములలో కూడ ఇట్లే ఊహించునది (వేరు కాకున్నను వేరని వర్ణించుట).

వి. "వస్తువులు సర్వశక్తిసంపన్నములే కాక, సర్వసంబంధశోభితములుకూడ" అని ఈ కారిక చెప్పినది. అనగా లేని సంబంధము ఉన్నట్లుగను, ఉన్న సంబంధము లేనట్లుగను, వివక్షావశమున పదార్థములకు కల్పింపబడుచుండును. ఆలంకారిక ప్రయోగములలో ఇట్టి కల్పనము తరచుగా అనుభూతమగుచుండును. కాగా పదార్థముల సంబంధములును అవ్యవస్థితములే.

సంసృష్టానాం వివేకిత్వం సంసర్గశ్చ వివేకినామ్
నానాత్మకానా మేకత్వం నానాత్వం చ విపర్యయే. 482

సంసృష్టానామ్=కలిసిఉండు పదార్థములకు, వివేకిత్వమ్=భేదమును (విడివడుట), వివేకినామ్ = విడిగాఉన్నవానికి, సంసర్గః + చ = సంబంధమును, నానాత్మకానామ్ = వేరు వేరు స్వరూపముకలవానికి, ఏకత్వమ్=ఐక్యమున్ను, విపర్యయే=అట్లు కానపుడు, (ఒకటిగా ఉన్నపుడు), నానాత్వమ్ + చ = వేర్వేరురూపమున్ను, (పరికల్ప్యతే = కల్పింపబడును).

తా. పదార్థముల విషయములో మరొక చిత్రమైన తీరుకూడ ఉన్నది.

*1. కలిసిఉన్నవానిని విడదీయుట:* ఉదా: "మాథురాః పాటలిపుత్రకేభ్యః ఆఢ్యతరాః" (మథురానగరపు జనులు, పాటలిపుత్రనగరపు జనులకన్న ధనవంతులు) ఇచట జనులందరిని మొదట మనసులో కూడగట్టుకొని భావించి, పిదప విడదీయుట జరుగును.

*2. విడిగాఉన్నవానికి సంబంధమును కూర్చుట:* ఉదా: "దేవదత్తః కాష్ఠైః పచతి" ఇచట విడిగాఉండు దేవదత్తునికిని, కర్రలకును వంట అను ఒక వ్యాపారముతో సంబంధమును కూర్చుట జరుగును.

*3. వేరువేరు స్వరూపములు కలవానికి ఐక్యమును సంపాదించుట:* ఉదా: "వనమ్". (అడవి). ఇచట మర్రి, రావి, జువ్వి, మొదలగు ఎన్నోరకములచెట్లకు ఒకేపదము ఐక్యమును కలుగజేయును.

*4. ఒకే రూపము గలదానికి వేరువేరు రూపములను వర్ణించుట:* ఉదా: "రాహోః శిరః" (రాహువుయొక్క శిరస్సు). ఇచట పురాణసంప్రదాయము ననుసరించి రాహువును, శిరస్సును ఒకటే. అయినను భేదము చూపబడినది.

ఇట్టి తీరులన్నియు కేవలము బుద్ధియొక్క కల్పనలు. కాగా పదార్థము లన్నవి కల్పనావిలాసములు (వానిని బోధించుపదములును అట్టివే).

మీద చూపిన తీరు ఎట్లు సంభవమగునో విశదీకరించుచున్నాడు.

సర్వాత్మకత్వా దర్థస్య నైరాత్మ్యా ద్వా వ్యవస్థితమ్
అత్యంతయతశక్తిత్వా చ్ఛబ్ద ఏవ నిబంధనమ్. 433

అర్థస్య = పదార్థము, సర్వాత్మకత్వాత్ = అన్నిశక్తులును, అన్నిరూపములుకలది అగుటవలన గాని, వా = లేక, నైరాత్మ్యాత్ = రూపములేనిదియు, అసత్యమైనదియు అగుటవలనగాని, వ్యవస్థితమ్ = ఆయా విధమున తెలియబడునదిగా ఉండును. అత్యంతయతశక్తిత్వాత్ = నియతమైనశక్తి మిక్కుటముగా గలదగుటవలన, శబ్దః + ఏవ = శబ్దమే, నిబంధనమ్ = ఆయా విధమున అర్థముతెలియుటలో నిమిత్తము, (భవతి = అగును).

తా. వివక్షావశమున ఆయా తీరులో తెలియబడుచు, పదార్థములు అవ్యవస్థితములుగా ఉండుటకు రెండు హేతువులను చెప్పవచ్చును. అవి సర్వశక్తి సంపన్నములగుట మొదటి హేతువు. అవి సర్వథా అసత్యములగుట రెండవ హేతువు.

ఏది ఎట్లయినను, పదార్థముల కట్టి స్థితికలుగుటలో ముఖ్యమైన నిమిత్తము శబ్దమే అనగా వక్తయొక్క ఇచ్ఛానుసారము (ఆయా అర్థములను తెలియుటకు) ప్రయోగించు శబ్దములు మాత్రమే, తమ వ్యాపారముచేతను, ప్రకరణాది పరికరముచేతను, కావలసిన తీరులో అర్థప్రతీతిని కలుగజేయును. కావున వ్యవహారమునకు శబ్దమే ముఖ్య నిమిత్తము.

వి. "పదార్థములున్నవి – అవి సర్వశక్తులును గలవి" అని అన్నను, "పదార్థములు లేవు – అవి కాల్పనికములు" అని అన్నను వాని ప్రతీతి శబ్దమువలన మాత్రమే సాధింపబడును—అని సారాంశము.

"శబ్దార్థములకు సత్యమైన సాక్షాత్సంబంధము లేదు. అర్థమునకు శబ్దము ఉపలక్షణము మాత్రమే" అని చెప్పుచున్నాడు.

వస్తూపలక్షణం శబ్దో నోపకారస్య వాచకః
న స్వశక్తిః పదార్థానాం సంస్ప్రష్టుం తేన శక్యతే. 434

శబ్దః = శబ్దము, వస్తూపలక్షణమ్=అర్థమునకు ఉపలక్షణముమాత్రమే (సూచించునది). ఉపకారస్య=అసలువస్తువు చేయుపనికి, వాచకః=చెప్పునది, న=కాదు. పదార్థానామ్= పదార్థములయొక్క, స్వశక్తిః = తమతమ ఉపయోగరూపమైన శక్తి, తేన = ఆ శబ్దముచే, సంస్ప్రష్టుమ్ = స్పృశింపబడుటకు (సంబంధమును కలిగియుండుటకు), న + శక్యతే = వీలుకాదు.

తా. శబ్దము అర్థమును కేవలము సూచించి ఊరకుండును. అట్టి అర్థముగా ఉండు వస్తువు చేయగలిగినపనిని శబ్దము చేయజాలదు. శబ్దమును ఉచ్చరింపగానే అర్థము తెలియుటయు, ఆ అర్థముయొక్క ఉపయోగము తెలియుటయుకూడ అనుమాన ప్రమాణము (ప్రామాణికమైన ఊహ) వలననే సిద్ధించును. కావున శబ్దమునకు అర్థముతోగల సంబంధము కూడ వాస్తవము కాదు.

వి. "శబ్దార్థముల సంబంధముకూడ వాస్తవము కాదు" అని నిరూపించుటకు ఈ సందర్భము బయలుదేరినది. ఒక ఉదాహరణముతో ప్రకృతాంశమును వివరించుకొనవచ్చును. "ఘటః" (కుండ) అనునది శబ్దము. ఘటమను వస్తువు అర్థము. రెండును ఒకచోట

ఉండవు. (శబ్దము వాగ్రూపమున ప్రయోక్తయం దుండును. వస్తువు దూరముగా ఒకచోట ఉండును). అనగా వస్తువును అంటిపెట్టుకొని శబ్దమెప్పుడును ఉండదు. కావున ఆ రెండింటికిని ఎట్టి సంబంధమును లేదు. అయినను ఒక సంకేతరూపమున శబ్దము అర్థమును సూచించును ("కాకేభ్యః దధి రక్ష్యతామ్" అనుచోట కాకశబ్దము పెరుగును తిను జంతువు లన్నింటిని సూచించునట్లుగా). ఈ తీరునే ఉపలక్షణమందురు.

అట్లే ఘటము నీటిని తెచ్చుటకు ఉపయోగించును. "ఘట" అను శబ్దమట్లు ఎన్నడును ఉపయోగింపదు. అనగా అసలు పదార్థము ఏదో ఒక పనిని సాధించును. ఆ అర్థమును చెప్పు శబ్దము మాత్రము అట్టి పనిని చేయజాలదు.

కాగా శబ్దమునకు, అసలు అర్థముతో గాని, అది సాధించుపనితో గాని ఏ విధమైన సంబంధమును కుదరదు. అందుచే శబ్దార్థ సంబంధము వాస్తవము కాదు.

అయితే ఒక వస్తువుయొక్క ఉపయోగమును, అనుమానరూపమైన ఊహచే ఎట్లు తెలిసికొందుమో, అట్లే కల్పితమైన సంకేతమను సూచనను అనుసరించి శబ్దముయొక్క అర్థమును తెలిసికొందుము.

శబ్దార్థముల సంబంధము కల్పితము కావుననే, వైశేషికులు శబ్దమును వేరే ప్రమాణముగా ఒప్పుకొనలేదు. అది అనుమాన ప్రమాణముతో గతార్థమగునని వ్యాఖ్యానించిరి. అనగా "ఈ శబ్దము ఈ అర్థమును బోధించును" అను అంశమును, పొగనుబట్టి నిప్పును ఊహించునట్లుగా, ఊహింపవచ్చునని వారి ఆశయము.

శబ్దార్థములకు వాచ్య వాచకభావము కూడ కుదురదని చెప్పుచున్నాడు.

> సంబంధిధర్మా సంయోగః స్వశబ్దే నాభిధీయతే
> సంబంధః సమవాయశ్చ సంబంధిత్వేన గమ్యతే. 485

సంయోగః=సంయోగసంబంధము, సంబంధిధర్మా=సంబంధముకల వస్తువుల యొక్క స్వభావము గలదై, స్వశబ్దేన=తన శబ్దముచే, ("సంయోగ" అను శబ్దముచే) అభిధీయతే=చెప్పబడును. సమవాయః=సమవాయమనెడు, సంబంధః+చ=సంబంధము కూడ, సంబంధిత్వేన=సంబంధముగల వస్తువుల స్వభావముచేతనే, గమ్యతే=తెలియ బడును.

తా. సంయోగము, సమవాయము అను రెండు సంబంధములకును, ప్రత్యేకమైన స్వరూప మేదియు లేదు. ఆ సంబంధము గల వస్తువుల స్వరూపమే ఆ సంబంధము యొక్క స్వరూపమనియు, అంతకు మించిన రూపము సంభవింపదనియును శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

ప్రకృతము, శబ్దమునకును అది బోధించు అర్థమునకును "వాచ్యవాచకభావసంబంధము" ఉన్నదని సామాన్యముగా చెప్పుదుము. కాని అట్టి సంబంధము కూడ శాస్త్రీయముగ కుదురదు.

ఎందుచేతననగా, వాచ్యవాచకభావసంబంధముకూడ సంయోగ సమవాయముల వంటిదే. కాన దానికిని వేరుగా స్వరూపముఉండదు. ఆ సంబంధముగల శబ్దార్థములే దాని స్వరూపమని చెప్పవలసిఉండును. అట్టయిన శబ్దమును, దాని అర్థమును (అర్థమైనవస్తువు)

ఒకేసారి కలిసి కనబడవలెను. అట్లు కనబడుట అనుభవవిరుద్ధము. (శబ్దమును అర్థరూపమును ఒకచోట కలిసిఉండును), ఈ రీతిగా వాచ్యవాచక భావమనునది సంభవింపదు.

వి. "శబ్దార్థములకు వాచ్యవాచకభావసంబంధము కలదు" అని సామాన్యముగా చెప్పు అంశము కూడ సూక్ష్మపరిశీలనకు నిలబడజాలదనియు, అట్టి సంబంధము శబ్దార్థములకు కుదరదనియు—కాన అదియు కల్పనయే అనియును ప్రతిపాదించుటకు ఈ కారిక రచింపబడినది.

ఇచటి తత్త్వ మిది : సంబంధమన్నది రెండు వస్తువులకు చెందిన విషయము. సంయోగము, సమవాయము అని ప్రసిద్ధమైన సంబంధములు రెండున్నవి. విడదీయుటకు వీలైనది సంయోగము. ఉదా:"చేతిలోని పుస్తకము". చేతికిని పుస్తకమునకును ఉన్న సంబంధము సంయోగము (చేతినుండి పుస్తకమును విడదీయగలము). విడదీసి చూపుటకు శక్యముకానిది సమవాయము. ఉదా : 'శరీరముయొక్క చేయి.' (శరీరమునుండి విడదీసి చేతిని చూపలేము. అవయవములకును, అవయవికిని ఉండు సంబంధము సమవాయము). ఈ రెండుస్థలములందును సంబంధమునకు ప్రత్యేకమైనస్వరూపము ఉండదు. సంబంధముగలవానియొక్క రూపమే, సంబంధముయొక్కయు రూపమగునని నిర్వచింతురు. అనగా సంయోగముగల వస్తువుల రూపమే సంయోగస్వరూపము. (చేయి + పుస్తకము=ఇదియే సంయోగరూపము) సమవాయ రూపముకూడ ఇట్టిదే. ఈ అంశమునే "సంబంధము సంబంధిస్వరూపమే" అని శాస్త్రీయముగ చెప్పుదురు. కావున సంబంధమనగానే-ఆ సంబంధముగల రెండువస్తువులును స్పష్టముగా ఒకచోట ఉండక తప్పదు. లేనపుడు సంబంధము లేనట్లే అగును.

ప్రకృతము—శబ్దార్థములకు వాచ్యవాచక భావమను ఒకసంబంధము ఉన్నదని చెప్పినచో, పై విధానమునసుసరించి దాని స్వరూపము శబ్దరూపమును, అర్థస్వరూపమును అని చెప్పవలెను గదా ! కాని అది సంభవింపదు. "ఘట" అనునది శబ్దరూపము. "మట్టి కుండ" అనునది అసలు అర్థస్వరూపము. ఈ రెండును ఒకచోట కలిసిఉండవు. సంబంధము వాస్తవముగ ఉన్నచో, ఘటశబ్దమును, దాని అర్థమగు కుండయు ఒకే సమయములో కలిసి ఉండవలెను. అనగా శబ్దమును పలికినవెంటనే దాని అర్థమగు వస్తురూపము కూడ, ప్రక్కనే ఉండును. ఇట్టి తీరు శబ్దార్థముల విషయములో సంభవింపదు అందుచే వానికి వాచ్యవాచక భావము కుదురదు. కాగా అట్టి సంబంధము కూడ కల్పితమే.

"హస్తే పుస్తకమ్" మొదలగు ప్రయోగములలో, "హస్తము. ఆధారముగను, పుస్తకము ఆధేయముగను ఉన్న సంయోగము" అను ప్రతీతి కలుగునుగాన, సంయోగము సంబంధరూపమను జ్ఞానముకూడ కలుగును. "హస్తపుస్తకయోః సంయోగః" మొదలగు ప్రయోగములలో సంయోగము సంబంధిరూపమే అగును. సమవాయవిషయమున కూడ ఇట్లే ఊహించునది.

పదార్థములకు సహజసిద్ధమైన స్వరూపము లేదు. వివక్షను బట్టి ఆయారూపము గోచరమగుచుండునని వ్యాఖ్యానించుచున్నాడు.

లక్షణా ద్వ్యవతిష్ఠంతే పదార్థా న తు వస్తుతః ।
ఉపకారాత్ స యీవార్థః కథంచి దనుగమ్యతే. 486

పదార్థాః=శబ్దముయొక్క అర్థములు, లక్షణాత్ = ఒకానొక ధర్మమువలన, వ్యవతిష్ఠంతే=ఆయా రూపముతో నియతములగును. వస్తుతః + తు = సహజరూపమువలన, న=కాదు (న + వ్యవతిష్ఠంతే = నియతములు కావు). ఉపకారాత్ = ఆయా పనికి ఉపయోగించుటవలన, సః=ఆ, అర్థః + ఏవ = నియతమైన అర్థమే, కథంచిత్ = ఎట్లో, అనుగమ్యతే = తెలియబడును.

తా. పదార్థములకు వాస్తవమైన స్వరూపము లేనేలేదు. ఒకానొక విశేషధర్మమును సంకల్పించి—ఒక్కొక్క వ్యుత్పత్తిని చూపుచు, వివిధములైన శబ్దములను ఒకే వస్తువును బోధించుటకు వాడుచుందురు. కావున వివక్షించిన ధర్మమునుబట్టియే పదార్థముయొక్క స్వరూపము భావింపబడుచుండును. అట్లు వివక్షాధీనమైన స్వరూపమే, శక్తిసంపన్నమైనట్లు భావించుకొని, ఆయా కారకముగ స్వీకరింపబడుచుండును.

వి. "పదార్థములకు సహజసిద్ధమైన రూపము లేదు. మనము ఇచ్ఛానుసారము కల్పించినరూపమే ఆయా పదార్థముగ భాసించుచుండును" అని విశదీకరించుటకు ఈ కారిక బయలుదేరినది.

దీని సార మిది: పదార్థమునకు నియతమైన రూపమున్నయెడల, దానిని పురస్కరించుకొని, ఆ రూపమును సూచించుచు, నియతమైన ఒకే శబ్దము ప్రయోగింపబడవలెను. కాని వ్యవహార మట్లు లేదు. ఇష్టమువచ్చిన రూపమును కల్పించుకొని, దానికి తగిన వ్యుత్పత్తిని చూపించి, వివిధశబ్దములను ఒకే వస్తువును బోధించుటకై వాడుచుందురు. అనగా కల్పనానుసారముగ ఒకే వస్తువునకు ఎన్నో రూపములను చూపుచుందురు. పర్యాయశబ్దములను తీసికొని ఈ అంశమును విశ్లేషించుకొనవచ్చును: "ఇంద్రః"=ఇంద్రుడు (ఇందం-రాతి=ఐశ్వర్యమును ఇచ్చువాడు). ఐశ్వర్యము నిచ్చుట ఇచటిరూపము. వజ్రీ (వజ్రమ్, అస్య, అస్తి = వజ్రాయుధము గలవాడు) వజ్రాయుధమును ధరించుట రూపము. గోత్రభిత్ (గోత్రాణి, భినత్తి = పర్వతములను భేదించువాడు) పర్వతములను భేదించుట రూపము. శచీపతిః (శచ్యాః పతిః=శచీదేవి భర్త) శచియొక్క భర్త అగుట రూపము. ఇట్లు ఎన్నో రూపములను కల్పించి, వ్యుత్పత్తులనుచూపి – ఒక అర్థమునుగురించియే వివిధశబ్దములను ఉపయోగించుచుందురు. పదార్థమునకు శాశ్వతమైన రూపమున్నచో, ఇట్టి విధానము కుదరదు.

అట్లే ఏ రూపమును వివక్షించుదురో ఆ రూపమునకే కారకశక్తులను అంటగట్టి ఆయా ఉపయోగములను చూపుదురు. ఉదా: ఇంద్రమ్, ఇంద్రేణ, ఇంద్రాయ, మొదలగునవి. (వజ్రిణమ్, వజ్రిణా, వజ్రిణే మొ॥).

అందుచే పదార్థముల రూపములును, వానిశక్తులును సంకల్పాధీనములు. నియతములు కావు. నియతములు కానందువలననే అవి సత్యములును కానేరవు. (సత్యమైనది ఎప్పుడును మారదు.)

"బహుముఖములైన యుక్తుల మూలమున పదార్థములు అసత్యములు" అను ప్రతిపాదనము ఈ కారికతో ముగిసినది. ఇటుపైని వాక్యార్థవిచారణము చూపబడును.

వాక్యార్థమే సత్యమని నొక్కి చెప్పుచున్నాడు.

> వాక్యార్థే యోఽభిసంబంధో న తస్యాత్మా క్వచిత్ స్థితః
> వ్యవహారే పదార్థానాం త మాత్మానం ప్రచక్షతే. 487

వాక్యార్థే = వాక్యార్థమందు, యః = ఏ, అభిసంబంధః = పరస్పరసంబంధము గలదో, తస్య = దానియొక్క, ఆత్మా = స్వరూపము, క్వచిత్ = ఎక్కడను, న + స్థితః = లేదు. తమ్ = ఆ వాక్యార్థమును, పదార్థానామ్ = పదార్థములయొక్క, ఆత్మానమ్ = ఆత్మనుగా; వ్యవహారే = సామాన్యవ్యవహారమున, ప్రచక్షతే = చెప్పుదురు.

తా. సంబంధరూపమని భావింపబడు వాక్యార్థముయొక్క స్వరూపస్వభావములను "ఇది" అని మాటలతో నొక్కి చెప్పలేము. "పదార్థములయొక్క ఆత్మ వాక్యార్థము" అని మాత్రము మామూలుమాటలతో సూచింపగలము.

వి. వాక్యార్థమే సత్యమని ఈ కారిక చెప్పుచున్నది. అఖండమును, నిత్యమును, సత్యమును అయిన వాక్యార్థమును "ఇది ఇట్లు" అని ఎవరును చెప్పలేరు. "సంబంధరూపమనియు, పానకరసమువంటిదనియును" ఏవో ఏవో మాటలతో దానిని సూచించుటయే జరుగును.

అయినను పదపదార్థమూలముగా, వాక్య వాక్యార్థజ్ఞానమును, దానిని బట్టియే ప్రవృత్తినివృత్తులును జరుగుచున్నట్లు లోకములో అనుభవమున్నది గాన, తదనుసారము "పదార్థముల ఆత్మయే వాక్యార్థము" అని ఒక నిర్వచనమును చెప్పవచ్చును. ఇది వేదాంతుల ఆత్మ నిర్వచనమును పోలి ఉండును.

లౌకికమగు సామాన్యవ్యవహారమున, ప్రతి శరీరమందును ఆత్మ ఉన్నదనియు, అది ఇంద్రియాదులతో కూడినదనియు, ఒక శరీరమునుండి వేరొక శరీరమునకు పోవుచుండుననియును— మొదలగు లక్షణములను చెప్పుచుందురు. వానివలన ఒక విధమైన అనుభూతి కలుగుచుండును. కాని అద్వైతవేదాంతము ననుసరించి ఆ లక్షణములన్నియు వ్యావహారిక సత్యములు, పరమార్థసత్యము ఆత్మ ఒక్కటే. దానికి సూటిగా లక్షణములేదు. మనస్సును వాక్కును అచట పనిచేయవు. అది అనుభవైకవేద్యము. "ఇది కాదు. ఇది కాదు" అనుకొనుచు, "అన్నిటికంటెను వేరైనది" అను రీతిలోనే ఆత్మను అనుభవింపవలెను. అనగా "ఏదియు కానిదియు సత్యమైనదియును ఆత్మ" అని ఫలించును. ఉపనిషత్తులన్నియు ఈ విషయములను పెక్కు రీతులలో వివరించినవి.

ఈ అద్వైత వేదాంతుల మార్గమునే వైయాకరణులు ఆశ్రయించినారు. పదపదార్థములు వ్యవహారసత్యములు. వానివలననే లోకవ్యవహారము సిద్ధించుచుండును. వీనిని మాటలతో వర్ణింపవచ్చును. అఖండ వాక్యవాక్యార్థములు పరమార్థ సత్యములు. వానిని మాటలు చెప్పజాలవు. అవి అనుభవైకవేద్యములు. ఏదో ఒక విధమున (జ్ఞానము కలుగుటకు) స్వరూపము చెప్పక తప్పదుగాన, "పదార్థ సంబంధరూపమైనదియు, పదార్థములకు ఆత్మవంటిదియును వాక్యార్థము (దానిని చెప్పునది అఖండ వాక్యము)" అని చెప్పుదురు.

కాగా, లౌకికజ్ఞానము కొరకు, "పదపదార్థములు, వాని సంబంధము, అది వాక్యార్థము" మొదలగు ఎన్ని ఉపాయములను చూపినను, అవన్నియును అసత్యములనియు,

బ్రహ్మపదార్థమువంటి అఖండవాక్యార్థమే (అఖండ వాక్యబోధితము) పరమసత్యమనియు, దానికి లక్షణము మాత్రము లేదనియును శబ్దతత్త్వవిదులు భావింపవలెను.

కల్పితములయిన పదార్థములను బట్టి, వాక్యార్థము సఖండమువలె అగపడుచుండునని చూపుచున్నాడు.

పదార్థే సముదాయే వా సమాప్తో నైవ వా క్వచిత్
పదార్థరూపభేదేన తస్యాత్మా ప్రవిభజ్యతే . 488

పదార్థే = ఒక పదార్థమందుగాని, వా = లేక, సముదాయే = పదార్థ సముదాయ మందుగాని, వా = లేక, క్వచిత్ = మరెక్కడైన గాని, సమాప్తః = సమాప్తిని పొందినదై (విశ్రమించినదై), న + ఏవ = ఉండనే ఉండదు. పదార్థ రూపభేదేన = పదార్థములయొక్క స్వరూప భేదముచే, తస్య = ఆ వాక్యార్థముయొక్క, ఆత్మా = స్వరూపము, ప్రవిభజ్యతే = విడగొట్టబడును.

తా. సత్యమైన వాక్యార్థము అసత్యమైన పదార్థమందుగాని, పదార్థ సముదాయ మందుగాని విశ్రమింపదు. కేవలము కల్పితమైన పదార్థములనుబట్టి, వాక్యార్థము (అఖండ మైనను) విడగొట్టబడినట్లు భావింపబడును.

వి. వాక్యములోని ఒక పదార్థమందు వాక్యార్థము సమాప్తమగునని ఒక పక్షము. పదార్థ సముదాయమందు అది విశ్రమించునని వేరొక పక్షము. ఈ రెండు పక్షములు కూడ కల్పనలే అనియు, వాక్యార్థము స్వయంపూర్ణమనియు, ఎట్టి భేదభావన అయినను కల్పనా మూలకమే అనియును పరమతత్త్వమును ఈ కారిక వ్యాఖ్యానించినది.

"వాక్యార్థము సమాప్తమగుట" అనగా వాక్యార్థము సంపూర్ణముగా తెలియుట అని భావము. వాక్యమందలి తొలిపదమువలననే, అట్లు జరుగునని కొందరును, పదార్థ సము దాయమువలననే అట్లు జరుగునని మరికొందరును అందురు. ఈ ప్రక్రియ కూడ సౌకర్యము కొరకే ఏర్పడినది. వాస్తవము కాదు.

ఎందుచేతననగా : వాక్యార్థమనునది సిద్ధాంతములో సర్వోపాధిరహితము (ఎట్టి విశేషములును లేనిది). అది సత్యము 'ఇది—అది' అని చెప్ప శక్యముకానిది. పదార్థమనునది విశేషధర్మము. అసత్యము కల్పనచే 'ఇది ఇట్టిది' అని చెప్పశక్యమైనది. కావున సత్యాసత్య ములకు ఎట్టి సంబంధమును సంభవింపదు. (వేరుగా ఉండు వానికే సంబంధము కుదురును).

అయినను వాక్యార్థముయొక్క అనుభవము కలుగుటకు, 'పదార్థసంబంధరూపము వాక్యార్థము' అను కల్పనను మాత్రము చేయకతప్పదు. ఈ కల్పనవలననే అఖండమైనను, సఖండమువలె (భాగములున్నట్లు) వాక్యార్థము భాసించుచుండును.

పై కారిక యొక్క భావమునే స్పష్టపరచుచున్నాడు.

అన్వాఖ్యానాయ యో భేదః ప్రతిపత్తినిబంధనమ్
సాకాంక్షావయవం భేదే తేనాన్య దుపవర్ణ్యతే . 489

యః = ఏ, భేదః = భేదముగలదో (పదార్థముల భేదము), సః = అది, అన్వాఖ్యానాయ = వాక్యార్థమును చెప్పుటకొరకును, ప్రతిపత్తినిబంధనమ్ = వాక్యార్థము తెలియుటకు నిమిత్తముగను, (భవతి = అగును), తేన = ఆ కల్పితమైన భేదముచే, భేదే =

భేదము కలుగగా, సాకాంక్షావయవమ్=పరస్పరము ఆకాంక్షతో కూడిన పదార్థములు అవయవములుగాగల, అన్యత్=వేరైన వాక్యార్థము, ఉపవర్ణ్యతే=చెప్పబడును.

తా. పదార్థములను విడదీసిచూపుట కల్పనామాత్రము. అది వాని పరస్పర సంబంధమును తెలియజేయుటకును, తన్మూలమున చివరకు అఖండవాక్యార్థమును తెలియ జేయుటకును ఉపయోగించును.

వి. మీది కారికయొక్క భావమును ఈ కారిక మరింత స్పష్టపరచినది.

'అన్యత్' అనగా, కల్పితమైన పదార్థముల మూలముగానే తెలియదగినదియు, పదార్థములకంటె పూర్తిగా వేరైనదియును అని భావము.

సత్యము, అఖండమునగు వాక్యార్థము కల్పిత పదార్థముల మూలమున భిన్న భిన్న ముగ తోచుచుండునని నిరూపించుచున్నాడు.

అనేకశక్తే రేకస్య ప్రవిభాగోఽనుగమ్యతే
ఏకార్థత్వం హి వాక్యస్య మాత్రయాఽపి ప్రతీయతే . 440

ఏకస్య = ఒకటే అయినటువంటిన్ని, అనేకశక్తేః = అనేకార్థములను చెప్పగల శక్తి కలిగినటువంటి, వాక్యస్య = వాక్యమునకు, ప్రవిభాగం = విభాగము, (భేదము) అనుగమ్యతే=కల్పనచే తెలియబడుచున్నది, వాక్యస్య = అఖండమైన వాక్యముయొక్క, ఏకార్థత్వమ్=అఖండార్థమును కలిగియుండుట, మాత్రయా + అపి=ఒక లేశముతో అయినను (చిన్న పదముతో అయినను), ప్రతీయతే + హి = తెలియబడునుగదా!

తా. అఖండవాక్యమే వాచకము. అది స్ఫోటరూపమైన నిర్విభాగమైన నిత్య శబ్దము. దానికి అనేకశక్తు లుండును. అందుచేతనే అట్టి అఖండవాక్యమువలన వివర్తరూపము లైన (సత్యవస్తువు, భ్రాంతిమూలముగా వివిధరూపములతో కనబడుట) అఖండవాక్యార్థ ములు తోచుచుండును. (ప్రకరణాదులనుబట్టి ఏదోఒక అర్థము స్వీకరింపబడుచుండును.) ఇదంతయు కల్పితమైన పదార్థములవలన ఏర్పడు విభాగము.

'వాక్యము అఖండార్థమును బోధించును' అన్న విషయము కొన్నిచోట్ల ఒక పదమువల్లనే తెలియుచుండును.

వి. "వాచకమగు వాక్యమును, వాచ్యమగు అర్థమును అఖండములే. శబ్ద భేదమును, అర్థభేదమును కల్పనామూలకములు" అను అంశమునే మరొక రీతిలో ఈ కారిక వివరించినది. అక్కడక్కడ లౌకికములైన వాక్యములవలన, అనేకార్థములు భాసించుటయు పదార్థ భేదమువలననే (కృతకమైన భేదము) జరుగుచుండుననియు, ప్రకరణాదులమూలముగా తుదకు ఒక అర్థమే నిలబడుననియును సూచింపబడినది. "అనేకార్థములు తోచుటకు మూల కారణము, వాక్యము సర్వశక్తి సంపన్నమగుటయే" అని తెలియవలెను. వ్యవహారములోని అనేకార్థక వాక్యములను, శ్లేషతో కూడిన వాక్యములను కూడ ఈ సందర్భములో ఉదాహరణ ముగా తీసుకొనవచ్చును.

అట్టే వాక్యము ఏకార్థమను అంశమును కొన్నిచోట్ల ఒక పదమే సూచించును.

మీది అంశములకు ఉదాహరణములు :

(1) అనేకార్థకవాక్యము: "సైంధవ మానయ" (భోజన ప్రకరణమైతే "ఉప్పును తెమ్ము" అని అర్థము, ప్రయాణసమయమైతే "గుర్రమును తెమ్ము" అని అర్థము).

(2) శ్లేషవాక్యము : "అజరామరతా అయోధ్యేవ సర్వస్య ప్రియా" (అజ+రామ+రతా = అజ మహారాజునందు శ్రీరామునందును అసక్తమైన, అయోధ్యా+ఇవ = అయోధ్యవలె, అజర + అమరతా = జరామరణములు లేకుండుట, సర్వస్య=ప్రతియొకనికిని ప్రియా = ఇష్టమైనది).

(2) ఒక పదము అఖండార్థమును బోధించుట : "సంప్రసారణమ్" అను ఒకే పదము, "య్, వ్, ర్, ల్, అను వర్ణముల స్థానములో వచ్చు ఇ, ఉ, ఋ, ఌ, అను వర్ణములు" అను ఏకార్థమును (వ్యాకరణములో) బోధించును.

"ఇగ్యణః సంప్రసారణమ్" (1-1-45) "యణః స్థానే ప్రయుజ్యమానో యః ఇక్ స సంప్రసారణ సంజ్ఞః స్యాత్" అని వృత్తి. "యణ్ణుల ప్రసంగములో ప్రయోగింపబడు ఇక్కులు సంప్రసారణ మనబడును" అని అర్థము. ఇచట "ఇక్", "యణః" అను రెండు పదములు బోధించు అర్థమును, "సంప్రసారణమ్" అను ఒకే పదము బోధించుచున్నది: అనగా పదభేదము లేకున్నను, ఏకార్థమును తెలియజేయుచున్నదని భావము.

సత్యమైన వాక్యార్థము బౌద్ధమని ప్రతిపాదించుచున్నాడు.

> సంప్రత్యయార్థా ద్బాహ్యోఽర్థః సన్నసన్వా విభజ్యతే
> బాహ్యీకృత్య విభాగస్తు శక్త్యపోద్ధారలక్షణః . 441

సంప్రత్యయార్థాత్ = బౌద్ధమగు వాక్యమువలన, బాహ్యః = బయటనున్న (లోకములో ఉన్న), అర్థః = పదార్థము, సన్ = ఉన్నదైనను, అసన్+వా = లేనిదైనను, విభజ్యతే = వేరుగా చేయబడును. బాహ్యీకృత్య = వెలుపల ఉన్నదానినిగా చేసి, విభాగః + తు = వేరుచేయుట అనగా, శక్త్యపోద్ధారలక్షణః = పదార్థముయొక్క శక్తిని, వేరుచేయుటయే (అనిగ్రహింపవలెను).

తా. వాక్యార్థమంతయు బౌద్ధమే, అనగా బుద్ధియొక్క అకారమే (బుద్ధిలో ఏర్పడు ఒకవిధమైన ముద్ర) బాహ్యమైన వాక్యార్థమునుండియే వేరుచేసి చూపబడును. అట్లు వేరుచేయుట బాహ్యమైన ఆయా పదార్థములయొక్క శక్తినిబట్టియే (ఉపయోగించు సామర్థ్యము = పనికివచ్చుట) జరుగును.

వి. అఖండవాక్యార్థ మన్నది బుద్ధి రూపమే అనగా, ఏ వాక్యమును విన్నను-దాని వలన ఏకాకారమగు జ్ఞానము కలుగును, ఆ జ్ఞానమే వాక్యార్థము. ఉదా : "దేవదత్తః దండేన గామ్ ఆనయతి". ఈ వాక్యమువలన "దేవదత్తుడు కర్తగాను, దండము కరణము గాను, గోవు కర్మగాను ఉన్న ఆనయనమను వ్యాపారము జరుగుచున్నది అను బుద్ధిఏర్పడును. అనగా బుద్ధి అట్టి చిత్రముగా (సంస్కారముగా = ముద్రగా) మారును. అచట బాహ్య పదార్థముల సంపర్కము (అసలు వస్తువుల ఉనికి) సంభవింపదు. అట్టి బుద్ధిరూపమైన వాక్యార్థము నుండి, బాహ్య పదార్థములు వేరుచేయబడును. అనగా బౌద్ధ పదార్థమున్ను, బాహ్య పదార్థమున్ను ఒకటే అని భావించి విడదీయబడును. ఉదా: 'దండః, గౌః' = కర్ర, ఆవు,

అనువాని ముద్రలు బుద్ధియందుండును. ఇవి బౌద్ధములు. వాక్యార్థమందిమిడియున్న వీనికి భేదభావన ఉండదు. కఱ్ఱ, ఆవు అను భౌతిక వస్తువులు బాహ్యములు. ఈ రెండును ఒకటే అను భావన కలుగును. ఇట్లు విడదీయుటకు ముఖ్య కారణము శక్తిభేదము అనగా ఆయా బాహ్యవస్తువులకుండు, క్రియాజనకమైన శక్తి వేర్వేరుగా ఉండుట. ఉదా : దేవదత్తుడను శరీరధారియే పనిచేయగలడు. భౌతికమైన కఱ్ఱయే తోలుటకు పనికివచ్చును. బౌద్ధ పదార్థములకు ఇట్టి శక్తు లుండవు. (అయినను రెండును ఒకటే అనుకొని, వీనికిని శక్తులను అంట గట్టుదురు).

కాగా లౌకికములైన పదార్థములయొక్క శక్తి భేదమును అనుసరించియే, బౌద్ధమైన పదార్థములకును భేదమును కల్పించుదురు. అంతియే కాని బౌద్ధముల కట్టి భేదములేదు' అని సారాంశము.

సన్=ఉండునది. నైయాయికుల మతములో ద్రవ్య, గుణాది పదార్థములకు 'ఉనికి' ఉన్నది. అసన్=లేనిది. విజ్ఞానవాదులగు బౌద్ధులయొక్కయు, అద్వైతవేదాంతులయొక్కయు మతములో పదార్థములకు పరమార్థమున 'ఉనికి' లేదు. వైయాకరణులు వీరికి చుట్టములే.

సంప్రత్యయము, బుద్ధి, విజ్ఞానము—ఇవన్నియు సమానార్థకములే.

ఇచటి తత్త్వ మిది : స్ఫోటరూపశబ్దబ్రహ్మమొక్కటే సత్యము. అదియే వాక్యార్థముగ బుద్ధికి గోచరించును. అందు పదార్థములు లేవు. అయినను, లోకవ్యవహారము సిద్ధించుటకై బాహ్య పదార్థములను విడదీసినట్లు వీనినిగూడ విడదీయుదుము. ఇదంతయు అజ్ఞానమూలకమే. శబ్దబ్రహ్మానుభవము కలుగగానే, అజ్ఞాన విలసితములైన విషయము లన్నియు నశించిపోవును.

వాక్య విచారణ ప్రసంగమున, పరస్పరము సాకాంక్షములైన వాక్యములకు ఏక వాక్యత గాని, అనేక వాక్యతగాని సంభవింపనగునని మతభేదములను చూపుచు, మొదట సూత్రకారుని ఆశయమును ఉగ్గడించుచున్నాడు.

> బహుష్వపి తిఙంతేషు సాకాంక్షే ష్వేకవాక్యతా
> తిఙంతేభ్యో నిఘాతస్య పర్యుదాస స్తథార్థవాన్ . 442

తిఙంతేషు = తిఙ్ ప్రత్యయాంతములగు పదములు, బహుషు + అపి = చాలా ఉన్నను, సాకాంక్షేషు = పరస్పరము ఆకాంక్షగలవి అయిన యెడల, ఏకవాక్యతా = ఒకే వాక్యమగుట, (ఇష్టా=అభిమతమైనది), తిఙంతేభ్యః = తిఙంతములకు పరమైన, తిఙంతస్య= తిఙంతమునకు సంబంధించిన, నిఘాతస్య=అనుదాత్త స్వరముయొక్క, పర్యుదాసః = నిషేధము, తథా = ఆవిధముగానే, అర్థవాన్=అర్థముగలది, (భవతి = అగును).

తా. తిఙంతములనగా క్రియాపదములు (తిప్, తస్ మొదలగు ప్రత్యయములు కలిసిన ధాతురూపములు). ఒక తిఙంతముతో ఒక వాక్యము సామాన్యముగా ఏర్పడును. కొన్నిచోట్ల ఒక వాక్యములోనే, ఒకటిని మించిన క్రియాపదములుండవచ్చును. అంత మాత్రమున ఎన్ని క్రియాపదములున్న- అన్ని వాక్యములని అనుకొననక్కరలేదు. ఉన్న క్రియాపదములకు పరస్పరాకాంక్ష ఉండి, మొత్తమువాక్యము ఒక క్రియతో సంపూర్ణమైనపుడు, అదంతయు ఒకేవాక్యమని భావింపవలెను. ఉదా : 1. 'గృహే పచతి భవతి' (ఇంటియందు

వంట జరుగుచున్నది). ఇచట 'పచతి' అను క్రియాపదమునకు 'వంట' అనియే అర్థము. 'భవతి' అను ముఖ్యక్రియతో అది సంబంధించునుగాన, ఈ వాక్యము ఏకవాక్యమే. 2. 'మృగో ధావతి-పశ్య' (లేడి పరుగెత్తుచున్నది-చూడుము) అనగా 'పరుగెత్తుచున్న లేడిని చూడుము' అని భావము. ఇచటకూడ 'చూచుట' అను ముఖ్యక్రియతో వాక్యము సమాప్తమగును గాన, ఇదియు ఏకవాక్యమే. ఇట్టి భాషీయ ప్రయోగములు సంస్కృతములో అక్కడక్కడ కనబడును. కాగా తిఙంతములు అనేకము లున్నను, అవి సాకాంక్షములైనచో ఏక వాక్యతయే సిద్ధించును.

ఈ విషయమును సూత్రకారుడైన పాణిని సూచించెను. 'తిఙ్ఙతిఙః' (8-1-28) అని సూత్రము. 'అతిఙంతా త్పదా త్పరం తిఙంతం నిహన్యతే' అని వృత్తి. 'వాక్యములో, తిఙంతముకాని పదమునకు ప్రక్కనున్న తిఙంతమునకు, అనుదాత్తస్వరమగును'. అని అర్థము. ఉదా : 'అగ్నిమీళే' (అగ్నిమ్ + ఈళే = అగ్నిని స్తోత్రము చేయుదును) ఇచట 'ఈళే' అను తిఙంతము అనుదాత్తమగును. 'ముందు తిఙంతమున్నపుడు, దాని ప్రక్కనున్న తిఙంతమునకు, అనుదాత్తము రాకుండుటకై 'అతిఙః' అను నిషేధము చెప్పబడినది ('పచతి భవతి' మొదలగుచోట్ల నిషేధము అనభిమతము). ఒక వాక్యమందు రెండవ తిఙంతమునకు ఎన్నడును ప్రయోగమే లేనిచో, ఈ నిషేధము నిష్ప్రయోజనమగును. కావున దీనినిబట్టి, ఒక వాక్యమందు అనేక తిఙంతముల ప్రయోగమునకు అవకాశమున్నదని జ్ఞాపనము చేయబడినది.

అట్లు అనేక తిఙంతములున్నను, ఒక క్రియయే ముఖ్యముగా ఉన్నపుడు, ఏక వాక్యమే అగుననియు, ఒకేతిఙంతమున్నపుడు చిక్కే లేదనియును పాణినియొక్క భావము. కాగా 'కారకములుగాని, తిఙంతములుగాని విశేషణములై, ఒకేక్రియ విశేష్యముగా ఉండు వాక్యము' ఏకవాక్యమే అని సారము.

వి. తిఙంతములను బట్టి వాక్యములకు నానాత్వమా (భేదము)? - లేక - ఏకత్వమా? అను పరిశీలనకై ఈ సందర్భము బయలుదేరినది. పాణిని మతమును ఈ కారిక ప్రతిపాదించినది.

పర్యుదాసము = నిషేధమని భావము. 'తద్భిన్నత్వం తత్సాదృశ్యంచ పర్యుదాసః' అని వచనము. 'అదికానిది-దానితో సమానమైనది' అను అర్థమును పర్యుదాసశబ్దము తెలియజేయును. ప్రకృతసూత్రమున 'అతిఙ్' అనగా, 'తిఙంతము కానిదియు, దానితో సమానమైనదియును అయిన పదము' సుబంతమగును. ఇట్లు తిఙంతము నివారింపబడును.

ఈ సందర్భమున వార్తికకారుని మతమును ఉటంకించుచున్నాడు.

ఏకతిఙ్ యస్య వాక్యం తు శాస్త్రే నియతలక్షణమ్
తస్యాతిఙ్గ్రహణే నార్థో వాక్యభేదా న్న విద్యతే .          448

యస్య + తు = ఎవనిమతములో, శాస్త్రే = వ్యాకరణ శాస్త్రమందు, నియత లక్షణమ్ = నియతమగు స్వరూపముగలదై, ఏకతిఙ్ = ఒకే తిఙంతముగలదై, వాక్యమ్ = వాక్యముండునో, తస్య = అతనికి (అతని మతములో), వాక్యభేదాత్ = అనేక తిఙంతము లున్నపుడు వాక్యభేదమే సిద్ధించునుగాన, అతిఙ్గ్రహణేన = 'అతిఙః' అను పదముతో, అర్థః = ప్రయోజనము, న + విద్యతే = ఉండదు.

తా. 'ఏకతిఙ్ వాక్యమ్' (ఒకే ఒక తిఙంతముగలది వాక్యము) అను వాక్య లక్షణమును దృఢముగా అంగీకరించిన వార్తికకారుని మతములో, ఒకటినిమించిన తిఙంత ములు గలవి వేరు వేరు వాక్యములే అగునుగాన, 'తిఙ్ఙతిఙః' అను మీదికారికలో చూపిన సూత్రమందు 'అతిఙః' అను పదము అనావశ్యకమే అగును. ప్రతియొక వాక్యమందును ఒక తిఙంతమే ఉండునుగాన, 'తిఙః' అనియే సూత్రమున్నను బాధలేదు.

వి. ఈకారిక వార్తికకారుని మతమును చెప్పును. 'ఏకతిఙ్ వాక్యమ్' అనియు, 'ఆఖ్యాతం సావ్యయకారకవిశేషణం వాక్యమ్' అనియు, రెండు వాక్యలక్షణములను కాత్యాయనుడు చూపెను, (సమర్థః పదవిధిః 2-1-1 సూత్రములోని వార్తికములు). వీనిలో మొదటి వచనముయొక్క అర్థమును పరిశీలించితిమి. రెండవ వచనముయొక్క అర్థమిది : 'యథావకాశముగ, అవ్యయములును, కారకములును, విశేషణములును గల, (వాని అన్వయ ముగల) ఒకతిఙంతము వాక్యమగును' అని. కాగా ఇది మొదటి లక్షణముయొక్క వివరణమే అగును. వాక్యమందు కారకము తప్పక ఉండవలెను. (క్రియ ఉన్నపుడు కారకము ఉండక తీరదు). అవ్యయమును, విశేషణములును, ఆవశ్యకతను బట్టి ఉండవచ్చును. 'దేవదత్తః ఓదనం పచతి' 'దేవదత్తః మృదు ఓదనం పచతి' 'సః మృదు మధురం ఓదనం పచతి మొదలగునవి ఉదాహరణములు.

ఈ పక్షమందు ఒక వాక్యములో రెండు తిఙంతములు ఉండనే ఉండవుగాన 'అతిఙః' అను పదము వ్యర్థమే (తిఙంతమునకు పరమైన తిఙంతము సంభవింపదు గాన అనుదాత్తస్వరమునకు అతిప్రసక్తి కలుగదు).

కాగా, "మృగోధావతి—పశ్య" మొదలగు చోట్ల, ఏకవాక్యతయే అనునది పాణిని మతమనియు, "మృగః ధావతి"—"త్వం తం పశ్య" అనురీతిలో అవి రెండు వాక్యములనునది కాత్యాయనుని మతమనియును ఫలించును.

కాత్యాయనుడు చూపిన రెండవ వాక్యలక్షణమందు 'ఆఖ్యాతమ్' (క్రియాపదము) అనుచోట ఏకవచనము వివక్షితము కాదనియు ('ఒకటి' అను సంఖ్యను పట్టించుకొననక్కర లేదు), అది సూచనామాత్రమనియును కొందరు వ్యాఖ్యానింతురు. అట్లయినపుడు, అనేక తిఙంతములున్నను ఒక వాక్యమే అగును గాన, పాణిని కాత్యాయనులకు మతభేదము ఏర్పడదు. పతంజలి మాత్రము పాణిని మతమునే సమర్థించెను. (సమర్థః పదవిధిః 2-1-1 సూత్రముయొక్క భాష్యము).

కొందరిమతమున అనేక తిఙంతములుగల వాక్యములలో భేదాభేదములు రెండును కుదురునని సమర్థించుచున్నాడు.

తిఙంతాంతరయుక్తేషు యుక్తయుక్తేషు వా పునః
మృగః పశ్యత యాతీతి భేదాభేదౌన తిష్ఠతః . 444

'మృగః పశ్యత, యాతి + ఇతి = 'మృగః, యాతి, పశ్యత, (లేడి వెళ్ళుచున్నది- చూడుడు) మొదలగు, తిఙంతాంతరయుక్తేషు = ముఖ్యమగు క్రియాపదముతో సంబంధించు మరొక క్రియాపదము గల స్థలములలో, (భేదః + ఇతి = వాక్యభేదమని, కేచిత్ = కొందరు, ఆహుః = చెప్పుదురు).

వా=లేక, యుక్తయుక్తేషు = ఒకతిఙంతముతో సంబంధించు మరొకతిఙంతము గల స్థలములలో, (మృగః, యాతి, పశ్యత, మొదలగునవియే) పునః=కూడ, (అభేదః + ఇతి = భేదములేదని=ఏకవాక్యతయే అని, కేచిత్=కొందరు, ఆహుః=చెప్పుదురు)

భేదాభేదౌ=భేదాభేదములు, న + తిష్ఠతః=వాస్తవముగలేవు. (సూత్రవార్తికకారుల మతములో అట్టిచోట్ల అభేదమే కాని భేదములేదు).

తా. 'మృగః యాతి పశ్యత' మొదలగు ప్రయోగములలో వాక్యభేదమని కొందరి మతము. 'అయం మృగః యాతి' అను మొదటి వాక్యమును, 'యూయం తం పశ్యత' అను రెండవ వాక్యమును అచట ఏర్పడునని వారి ఆశయము. అట్టి ప్రయోగములలో పరస్పరాకాంక్ష ఉన్నందువలన, ఏకవాక్యతే అని మరికొందరి మతము. అనగా 'మృగః యాతి' అనునది, 'పశ్యత' అను క్రియకు కర్మగా మారి, 'యూయం యాంతం మృగం పశ్యత' (మీరు వెళ్లుచున్న లేడిని చూడుడు) అన్నట్లు వాక్యార్థము సంభవించి, అది ఒక వాక్యమే అగునని వీరి అభిప్రాయము.

అయినను పాణిని కాత్యాయనుల మతములో ఇట్టిచోట్ల ఏకవాక్యతయే అని గ్రహింపవలెను.

వి. 'అనేకతిఙంతములు గలవాక్యములలో, పాణిని కాత్యాయనులు ఇరువురికిని, ఏకవాక్యతయే అభిమతము' అను విషయమును సూచించుట ఈ కారికయొక్క ముఖ్య ప్రయోజనము. తదనుసారము కొన్ని పదములను అధ్యాహారము చేసి దీనిని వ్యాఖ్యానించుట జరిగినది.

'తిఙంతాంతర యుక్తేషు' 'యుక్తయుక్తేషు' అను రెండు పదములకును భావమొకటే. ("మృగః," అనుదానితో యుక్తమైనది "యాతి" అనునది. "మృగః యాతి" అనుదానితో యుక్తమైనది "పశ్యత" అనునది).

కాత్యాయనుని రెండవ వాక్యలక్షణమునకు, ఏకవాక్యతయందే తాత్పర్యమని మీది కారికలోనే సూచితమైనది. "ఏకతిఙ్ వాక్యమ్" అను మొదటిలక్షణమునకు కూడ, అట్టి తాత్పర్యమును సాధింపవచ్చును. "ఏకం తిఙ్—తిఙంతం=ప్రధాన తిఙంతం, యస్య—తత్=ఏక తిఙ్=ముఖ్యమైన ఒక తిఙంతముగలది వాక్యము" అని అర్థమును చెప్పినచో, అప్రధానమైన మరొక తిఙంతమున్నను, అది ఏకవాక్యమే అగునని పర్యవసించును. ఇట్లు కాత్యాయనుని ఆశయమును, పాణిని ఆశయమును ఒక్కటే అగును. (వాక్యభేదమును చెప్పువారు వైయాకరణులు కాక, వేరొకరు అగుదురు).

కష్టపడి అయినను, వ్యాకరణ ప్రవర్తకులగు ఆచార్యులకు, ఐకమత్యమును చూపుట శాస్త్రమర్యాద అని తెలియునది.

"వాక్యములకు భేదమా? అభేదమా? అను విర్శ ఇంతతో ముగిసినది.

ఏకవాక్యతగాని, అనేకవాక్యతగాని, వాక్యపరిసమాప్తి జ్ఞానమువలన సంభవించును. అట్టి వాక్యసమాప్తియు శబ్దస్వరూపమువలననే తెలియదగినదని విశదీకరించుచున్నాడు.

ఇతికర్తవ్యతార్థస్య సామర్థ్యాద్ యస్య కాంక్ష్యతే
అశబ్దలక్షణాకాంక్షం సమాప్తార్థం తదుచ్యతే. 445

యస్య = ఏ వాక్యముయొక్క, అర్థస్య = అర్థముయొక్క, సామర్థ్యాత్ = అర్థ స్వభావమువలన, ఇతికర్తవ్యతా = 'ఇది ఇట్లు చేయవలెను' అను పద్ధతి, కాంక్ష్యతే = కోర బడు చుండునో, అశబ్దలక్షణాకాంక్షమ్ = శబ్దముల అపేక్షలేని, తత్ = ఆ వాక్యము, సమాప్తార్థమ్ = సంపూర్ణమైన అర్థముగలదని, ఉచ్యతే = చెప్పబడును.

తా. అవశ్యకములైన శబ్దములన్నియు ఉండి, (ఉచ్చరింపబడినవి-లేక-అధ్యా హృతములైనవి) నిరాకాంక్షమైన అర్థమును బోధించునది వాక్యము. దానివలన తెలియు అర్థమును, 'ఎట్లు చేయవలెను ?'- లేక 'ఎట్లు సమకూర్చవలెను?' అను రీతియు, అందు కొరకు కావలసిన సామగ్రియు చెప్పనక్కర లేకుండగనే తెలిసిపోవుచుండును. అట్లు అవ గతమగుట వాక్యార్థముయొక్క స్వభావము. ఉదా : 'త్వం విపణిం గత్వా తండులాన్ ఆనయ' (నీవు అంగడికిపోయి బియ్యమును తీసుకొనిరమ్ము) ఇది నిరాకాంక్షమైన వాక్యము. దీనివలన సమగ్రార్థము తెలియును. ఇచట బస్సు ఎక్కుటయు, బజారులో దిగుటయు, బియ్యమును గోనెలో వేయుటయు, మొదలగు పనులెన్నో ఉండును. అయినను అవన్నియు చెప్పనక్కర లేకుండగనే ఈ వాక్యార్థమువలన తెలిసిపోవును. ఇది స్వభావము. కావున ఇట్టి ఆకాంక్షలు ఉన్నను సాకాంక్షమును స్పష్టముగా చెప్పినందువలన, ఇది వాక్యమే అగును.

వి. 'శబ్దమునుబట్టియే వాక్యసమాప్తి అగును. అర్థమునుబట్టి కాదు. అందుచే శబ్దాకాంక్ష లేనపుడు- అది సమగ్రవాక్యమే అగును. అర్థమునకు సంబంధించిన విశేషాంశ ములు ఎన్ని ఉన్నను ఇబ్బందిలేదు. అవి అవగతమగుచునే ఉండును. అనగా ఉద్దేశించిన ముఖ్యమగు అర్థమును, నిస్సంశయముగా బోధించు శబ్దములు (కారకము, క్రియాపదము మొదలగునవి) ఉండుటయే వాక్యమునకు ముఖ్యలక్షణము. ఆ అర్థమునకు చెందిన వివరము లన్నియును శబ్దముల సాయమక్కర లేకుండగనే స్ఫురించును' అనునది సారము.

ఇతికర్తవ్యతా = 'ఇది ఇట్లు చేయవలెను' అను ప్రక్రియ.

వాక్యప్రసంగవశమున, వాక్యపరిసమాప్తిని, మరల మరొకతీరులో ఈ కారిక పదామర్శించినది. 'వాక్యసమాప్తి అన్నది శబ్దాశ్రితమేకాని, అర్థాశ్రితము కాదు'. అన్నది ఇచట తత్త్వము. ప్రతియొక వాక్యమునకును ఈ తీరు వర్తించును. అన్నిచోటులందును అర్థమునకు సంబంధించిన వివరములను అన్నింటిని శబ్దములతో చెప్పుటయు, సంశయనివృత్తి కలుగుటయు శబ్దార్థస్వభావములకును, అనుభవమునకును విరుద్ధములుగదా!

పై విషయమునే స్పష్టపరచుచున్నాడు.

> తత్త్వాన్వాఖ్యానమాత్రే తు యావానర్థోఽనుషజ్యతే
> వినాపి తత్ప్రయోగేణ శ్రుతే ర్వాక్యం సమాప్యతే. 446

తత్త్వాన్వాఖ్యానమాత్రే + తు = సారభూతమైన అర్థమును చెప్పగానే, యావాన్ = ఎంత (ఎన్ని రకములైన), అర్థః = అర్థము, అనుషజ్యతే = అనుబంధముగా స్ఫురించునో, తత్ప్రయోగేణ = ఆ అర్థమును బోధించు శబ్దములయొక్క ఉచ్చారణము, వినా + అపి = లేకున్నను, శ్రుతేః = శబ్ద వ్యాపారముయొక్క సామర్థ్యము వలన, వాక్యమ్ = వాక్యము, సమాప్యతే = పూర్తి అగును.

తా. వాక్యముయొక్క సారాంశము తెలియగానే అర్థమునకు సంబంధించిన వివరములన్నియు తెలిసిపోవును. వానికొరకు వేరుగా శబ్దములను వాడనక్కరలేదు. అట్లు తెలియుట వాక్యముయొక్క సామర్థ్యమువలన (అభిధా వ్యాపారమువలన) జరుగును. ఉదా: 'వ్రీహయః అవహన్యంతామ్' (ధాన్యమును దంచవలయును). ఇచట ధాన్యమును దంచుట' సారాంశము. రోలు తెచ్చుట, రోకళ్ళు తెచ్చుట, రోటిలో ధాన్యమును పోయుట, రోకళ్ళను ఆడించుట మొదలగునవన్నియు విశేషాంశములు. ఇవన్నియు ఈవాక్యమువలననే తెలిసి పోవును. కావున వాక్య సమాప్తి శబ్దాశ్రితమే అగును.

వి. మీదికారిక చెప్పిన విషయమును ఇది స్పష్టపరచినది.

శబ్దస్వభావమును బట్టి అర్థమువిషయమున గుణప్రధానభావము ఏర్పడునని తెలుపుచు, శబ్దస్వభావమును ప్రతిపాదించుచున్నాడు.

చంక్రమ్యమాణోఽధీ ష్వాత్ర జపం శ్చంక్రమణం కురు
తాదర్థ్య స్యాఽవిశేషేఽపి శబ్దా ద్భేదః ప్రతీయతే. 447

'చంక్రమ్యమాణః=పచారుచేయుచు, అధీష్వ = జపము చేయుము', 'జపన్ = జపముచేయుచు, చంక్రమణమ్ = పచారుచేయుటను, కురు = చేయుము'— అత్ర = ఈ రెండు వాక్యములందును, తాదర్థ్యస్య = ఒకే అర్థమును బోధించుట, అవిశేషే + అపి = సమానమైనను, శబ్దాత్ = శబ్ద స్వభావమును బట్టి, భేదః = ఒకటి ముఖ్యము, ఒకటి అముఖ్యము అను భేదము, ప్రతీయతే = తెలియబడును.

తా. అర్థము ఒకటే అయినను శబ్ద స్వభావమును బట్టి (శబ్దములను ప్రయోగించు తీరునుబట్టి), అర్థమునకు సంబంధించిన గుణ ప్రధాన భావము (అముఖ్యము-ముఖ్యము అను విషయము) విశదమగుచుండును. ఉదా: (1) "పచారు చేయుచు, జపింపుము" (2) 'జపించుచు, పచారుచేయుము' ఈ రెండు వాక్యములయొక్కయు సారార్థమొకటే (పచారు, జపము అను రెండు పనులను చేయుట) అయినను మొదటి వాక్యములో 'పచారు చేయుట అముఖ్యము, జపించుట ముఖ్యము అనియు, రెండవ వాక్యములో 'జపించుట అముఖ్యము, పచారుచేయుట ముఖ్యము' అనియు బోధపడును. ఇట్టి వైచిత్ర్యము శబ్ద స్వభావమును బట్టియే సిద్ధించుచుండును.

వి. కల్పితములైన పదార్థములను బోధించు శబ్దములయొక్క, అర్థబోధనా వైచిత్రిని చూపుటకు ఈ కారిక బయలుదేరినది.

'అర్థమొకటే అయినను, అందలి గుణప్రధాన భావమును శబ్దవిన్యాసము (శబ్ద వ్యాపారము) స్పష్టపరచును' అని ఫలించినది.

కొన్నిచోటులందు శబ్దభేదమున్నను సామర్థ్యమువలన అర్థప్రతిపాదనము విచిత్రముగ నుండునని చెప్పుచున్నాడు.

ఫలవంతః క్రియాభేదాః క్రియాంతరనిబంధనాః
అసంఖ్యాతాః క్రమోద్దేశై రేకాఖ్యాతనిదర్శనాః. 448

ఏకాఖ్యాత నిదర్శనాః = ఒకే క్రియాపదమువలన బోధింపబడునటువంటివిన్ని, క్రమోద్దేశైః = అనుసరింపదగినరీతుల చేతను, పొందగోరు ఫలములచేతను, అసంఖ్యాతాః =

లెక్కించుటకు శక్యము కానటువంటివిన్ని, ఫలవంతః = ఫలభేదమును పురస్కరించుకొన్న, క్రియాంతర నిబంధనాః = ఉపకారకములగు చిన్న చిన్న అవాంతర క్రియలు కలిగినటు వంటివిన్ని, క్రియాభేదాః = వ్యాపారభేదములు, (ప్రతీయంతే = తెలియబడుచుండును).

తా. కొన్ని వాక్యములందు క్రియాపదము ఒక్కటే ఉన్నను, దానివలన తెలియు అర్థముయొక్క సామర్థ్యమును బట్టియు, స్వభావమును బట్టియు, అవాంతర క్రియ లును, వానియొక్క ప్రయోజనములును లెక్కలేనన్ని స్ఫురించి అవగతములగుచుండును. ఒకే క్రియను బోధించు వేర్వేరు ధాతువులను ప్రయోగించినను ఇట్టి తీరు సంభవించును.

వి. శబ్దముయొక్క సామర్థ్యమువలన (శబ్దవ్యాపారమువలన) కలుగు అర్థవైచి త్రిని మీదికారిక చూపినది. శబ్దభేదమున్నను, లేకున్నను దాని అర్థముయొక్క స్వభావము వలన, లెక్కకుమించిన మరికొన్ని అర్థములు శబ్దములను వాడనక్కర లేకుండగనే తెలియు చుండునని ఈ కారిక చెప్పుచున్నది. వాక్యమందలి క్రియాపదమును ఆధారముగా తీసుకొని ప్రకృతాంశము విశదీకరింపబడినది. ఉదా: 'సోమేన యజతే' (సోమయాగమును చేయు చున్నాడు) 'చిత్రయా యజతే' (చిత్రయాగమును చేయుచున్నాడు) 'దర్శపూర్ణమాసాభ్యాం యజతే' (దర్శము, పూర్ణమాసము, అను కర్మలను అచరించుచున్నాడు) ఇవి కర్మకాండకు సంబంధించిన వాక్యములు. వీనిలో 'యజతే, యజతి' అను క్రియాపదములు సమానార్థక ములు. 'యాగం కరోతి' అని మరొకరీతిలో చెప్పినను అర్థమొకటే. అయినను ప్రతియొక కర్మ విషయములోను, చేయురీతులు, వానిని సూచించువ్యాపారములు, అవాంతరఫలములు, ప్రధానఫలము మొదలగునవి ఎన్నో ఉండుట సహజము. అవన్నియు 'యజతే' అను ఒక క్రియాపదముయొక్క అర్థమువలననే తెలిసిపోవును. అది అర్థస్వభావము.

లౌకికోదాహరణమును చూడుడు. 'ఉపాధ్యాయుడు ధనమును సంపాదించు చున్నాడు'. 'వైద్యుడు ధనమును సంపాదించుచున్నాడు'. 'వర్తకుడు ధనమును సంపాదించు చున్నాడు.' ఈ వాక్యములందు "ధనసంపాదనము" ఒక్కటే వ్యాపారము. అయినను ఆ యా వ్యక్తులు అనుసరించు మార్గములును వారు అనుకొన్న ప్రయోజనములును ఎన్నో ఉండును. అవన్నియు 'సంపాదించుచున్నాడు' అను క్రియవలననే అవగతమగును. వాని కొరకు వేరుగా శబ్దములను వాడనక్కరలేదు.

'శబ్దము యొక్కయు, అర్థముయొక్కయు స్వభావము అతివిచిత్రమైన' దని సారాంశము.

పై అంశమునే విశదీకరించుచున్నాడు.

నివృత్తభేదా సర్వైవ క్రియాఖ్యాతేఽభిధీయతే
శ్రుతే రశక్యా భేదానాం ప్రవిభాగప్రకల్పనా . 449

సర్వా = ప్రతియొక, క్రియా = వ్యాపారము, నివృత్త భేదా + ఏవ = భేదములు లేనిది అగుచునే, ఆఖ్యాతే = క్రియాపదముచే, అభిధీయతే = చెప్పబడును. భేదానామ్ = భేదములయొక్క, ప్రవిభాగప్రకల్పనా = విభాగమును చూపుట, శ్రుతేః = క్రియాపదమును విన్నంత మాత్రమువలన, అశక్యా = శక్యము కానిది (అలవి కాని పని).

తా. ఒక వ్యాపారములో అవాంతర వ్యాపారములు ఎన్నో ఇమిడియుండును. వానినన్నింటిని క్రియ ముక్తకంఠముగా చెప్పదు. క్రియాపద మేది అయినను వ్యాపార సామాన్యమునే చెప్పును. దానివలన విశేషాంశము లన్నియు పూర్తిగా తెలియుచుండును. అది అర్థ స్వభావము. ఉదా: 'పచతి'. ఇచట బియ్యమును బాగుచేసి గిన్నెలోపోయుట మొదలు కొని, పొయ్యినుండి గిన్నెను దింపువరకును, మధ్యను ఎన్నో వ్యాపారము లుండును. అవి అన్నియు 'వంట' అను వ్యాపారమువలననే తెలిసిపోవును.

వి. పైకారికను ఈ కారిక స్పష్టపరచినది.

మీది భావమును ఉదాహరణపూర్వకముగ సమర్థించుచున్నాడు.

అశ్వమేధేన యక్ష్యంతే రాజానః సత్ర మాసతే
బ్రాహ్మణా ఇతి నాఖ్యాతరూపా ద్భేదః ప్రతీయతే . 450

'రాజానః = రాజులు, అశ్వమేధేన=అశ్వమేధమును, యక్ష్యంతే = చేయు చున్నారు'—' బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, సత్రమ్ = సత్రయాగమును, ఆసతే = చేయుచున్నారు.' — ఇతి = ఈచోటులందు, ఆఖ్యాత రూపాత్ = క్రియాపదముయొక్క స్వరూపమువలన, భేదః=అవాంతరక్రియా భేదము, న + ప్రతీయతే = తెలియబడదు.

తా. అర్థము ఒకటే అయినపుడు, క్రియాపద రూపములో భేదమున్నను, అవాంతరక్రియాభేదములు తెలియవు. అవి అర్థసామర్థ్యమును బట్టియే తెలియుచుండును. ఉదా: 'రాజానః అశ్వమేధేన యక్ష్యంతే' 'బ్రాహ్మణాః సత్రమాసతే'. ఈ వాక్యములలో 'యక్ష్యంతే' 'సత్రమాసతే' అని క్రియాస్వరూపము వేరుగానే ఉన్నది. అయినను అర్థము ఒకటే. అదియే ఇతికర్తవ్యతాభేదములను, (చేయు తీరులు) ఫలభేదములను తెలియజేయును. అనగా అర్థము తెలియగానే అవన్నియు స్ఫురించును. శబ్దము ముఖ్యార్థమును చెప్పుటయేకాని, దాని భేదముల జోలికి పోలేదు.

వి. మీది రెండు కారికల విషయమునకును, ఉదాహరణమును ఈ కారిక చూపినది.

"శబ్దభేదమున్నను అర్థమువలననే భేదములు తెలియునపుడు, శబ్దభేదము లేన పుడు అట్లు జరుగునని వేరుగ చెప్పనక్కరలేదు" అని సారము.

'కొన్నిచోట్ల శబ్దసామర్థ్యము వలనను, మరికొన్నిచోట్ల అర్థసామర్థ్యమువలనను, అర్థమునకు సంబంధించిన సొగసులు తెలియుచుండును. ఈ విషయములో ప్రత్యేకమైన కొలత బద్దలు ఏవియు ఉండవు. అవి వాని వాని స్వభావము. యథాసంభవముగ, ఆయా వాక్యములలో ఇట్టి విచిత్రములను అనుభవింపనగును.'—అన్నది ప్రకృత సందర్భము యొక్క తత్త్వము.

పై విషయమునకే వైదికోదాహరణమును చూపుచున్నాడు.

సకృచ్ఛ్రుతా సప్తదశ స్వనావృత్తాఽపి యా క్రియా
ప్రాజాపత్యేషు సామర్థ్యాత్ సా భేదం ప్రతిపద్యతే . 451

సప్తదశసు= పదియేడు అయిన, ప్రాజాపత్యేషు=ప్రజాపతి దేవతగాగల మేకల విషయములో, యా = ఏ, క్రియా = ఆలంభనమను వ్యాపారము(చంపుట), సకృత్= ఒక్క-

సారియే, శ్రుతా = వినబడునో, సా = ఆ వ్యాపారము, అనావృత్తా + అపి = ఆవృత్తి లేనిదైనను (మరలమరల చెప్పబడకపోయినను), సామార్థ్యాత్ = అర్థముయొక్క స్వభావము వలన, భేదమ్ = భేదమును, ప్రతిపద్యతే = పొందును.

తా. "శబ్దభేదము లేకున్నను, అర్థసామర్థ్యమునుబట్టి క్రియయొక్క భేదము తెలియుచుండును" అను అంశమునకు, వైదిక కర్మకాండలోని ఒక ఉదాహరణమును ఈ కారిక చూపినది: "సప్తదశ ప్రాజాపత్యాన్ ఏకవర్ణాన్ అజాన్ ఆలభేత" అనునది ఒక. యాగప్రక్రియకుచెందిన వాక్యము. "ప్రజాపతి దేవతగాగలిగినటువంటివిన్ని, ఒకే రంగు గలిగినట్టివిన్ని, పదిహేడు మేకలను ఈ యాగములో చంపవలెను" అని అర్థము. ఇచట "ఆలభేత" అను క్రియాపదము ఒక్కసారే వాడబడినది. అయినను దానివలనతెలియు ఆలంభనమను వ్యాపారము, మేకల విషయములో వేరువేరుగా (ప్రత్యేకముగా) సంబంధించుననీ తెలియును. అది అర్థస్వభావము.

ధాతువు భేదరహితమైన క్రియను ప్రతిపాదించును. కావుననే భుజిక్రియ దేవదత్తాదుల విషయమున ప్రత్యేకముగ అన్వయించునని చెప్పుచున్నాడు.

దేవదత్తాదిషు భుజిః ప్రత్యేక మవతిష్ఠతే
ప్రతిస్వతంత్రం వాక్యం వా భేదో న ప్రవిభజ్యతే. 452

దేవదత్తాదిషు = దేవదత్తుడు మొదలగువారి విషయములో, భుజిః = భోజనమను వ్యాపారము, ప్రత్యేకమ్ = ప్రతియొక వ్యక్తికిని, అవతిష్ఠతే = సంబంధించియుండును. వా = లేక, ప్రతిస్వతంత్రమ్ = ప్రతియొకకర్తకును సంబంధించిన, వాక్యమ్ = వాక్యమైనను, అవతిష్ఠతే = ఏర్పడును. భేదః = క్రియాభేదము, న + ప్రతీయతే = తెలియబడదు.

తా. "నివృత్తభేదా సర్వైవ" (449 శ్లోకము) మొదలగుశ్లోకము, "క్రియాపదము (అందలిధాతువు) అవాంతరభేదములేని వ్యాపారసామాన్యమును తెలియజేయు"నని చెప్పినది. ఈ అంశము భుజిక్రియలో స్పష్టముగ కనబడును. భోజనమను వ్యాపారములో కూడ, అవాంతరవ్యాపారములు (కాళ్ళు కడుగుకొనుట, అన్నము కలుపుకొనుట, నమలుట మొదలగునవి) పెక్కులుండును. అయినను "భుజ్" అను ధాతువు, "భుజించుట" అను వ్యాపారసామాన్యమునే తెలుపును గాని, దాని భేదములను తెలుపదు.

అందువలన "దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రాః భుంజంతి" మొదలగు వాక్యములలో వాక్యార్థము ప్రతియొకవ్యక్తికిని సంబంధించును. (అనగా ప్రతియొకడును భోజనము చేయుచున్నాడని చెప్పినందువలననే వాక్యార్థము పూర్తిఅగును కాని, ఒక్కొక్కరికి ఒక్కొక్క అవాంతరవ్యాపారమును అంటగట్టినందువలన వాక్యార్థము పూర్తి కానేరదు). ఇది వాక్యార్థ సమాప్తి పక్షము (అర్థముయొక్క సంబంధమును చూపుట).

వాక్యసమాప్తిపక్షమును (శబ్దరూపమైన సంబంధమును చూపుట) ఆశ్రయించినచో ఇట్టి స్థలములందు, "దేవదత్తః భునక్తి, యజ్ఞదత్తః భునక్తి, విష్ణుమిత్రః భునక్తి" అనురీతిని వేరువేరు వాక్యము లేర్పడును.

ఏ పక్షమందైనను, ఇట్టిచోట్ల ధాతువు క్రియాసామాన్యమునే చెప్పును గాని, దాని భేదములను చెప్పదు.

వి. వాక్యసమాప్తిని పరిశీలించు సందర్భములో ఈ విషయములు, లోగడ (371–380) విపులముగా చర్చింపబడినవి ప్రసంగవశమున మరల ఇచట చూపబడినవి.

''దేవదత్త యజ్ఞదత్త విష్ణుమిత్రాః భుంజంతు'' మొదలగు వాక్యములలో ప్రత్యేక సమాప్తి సిద్ధించు రీతిని చూపుచున్నాడు.

ఉచ్చారణే తు వాక్యానా మన్య ద్రూపం నిగృహ్యతే
ప్రతిపత్తౌ తు భిన్నానా మన్య ద్రూపం ప్రతీయతే. 453

ఉచ్చారణే + తు = ఉచ్చరించు సమయమున, వాక్యానామ్ = వాక్యమందలి క్రియా పదములకు, అన్యత్=వేరొక, రూపమ్=స్వరూపము (భేదములేని రూపము), నిగృహ్యతే= స్వీకరింపబడును. ప్రతిపత్తౌ + తు = అర్థమును గ్రహించు సమయమున, భిన్నానామ్ = వేరైనక్రియా పదములయొక్క, అన్యత్ = వేరొక, రూపమ్ = స్వరూపము, ప్రతీయతే= తెలియబడును.

తా. 'దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రాః భుంజంతి' మొదలగు వాక్యములను ఉచ్చరించునపుడు, క్రియాపదము ఒకసారే వినిపించినను, అర్థమును గ్రహించు సమయములో, అది ప్రతియొక కర్తకును సంబంధించునని (విడివిడిగా చేరుట)తెలియుచుండును. వాక్యార్థమును సమగ్రముగ భావించుటవలన అట్లు జరుగును, కావున 'ఒకసారిమాత్రమే ఉచ్చరింపబడిన క్రియాపదము,రెండు మూడు కర్తృపదములతో విడివిడిగా ఎట్లు సంబంధించు' నని సంశయింప నక్కరలేదు.

వి. వాక్యముయొక్క రచనాపద్ధతియు, వాక్యార్థముయొక్క ఔచిత్య పరిశీలనయు, వాక్య వాక్యార్థముల సమాప్తిని నిర్ణయించుటలో ముఖ్య హేతువులగుచుండును. దీనిని బట్టియే కొన్నిచోట్ల క్రియాపదమునకు ఆవృత్తిచేయవలయుననియు, కొన్నిచోట్ల చేయనక్కర లేదనియు వ్యాఖ్యానించుచుందురు.

శాస్త్రీయ వాక్యములలో గూడ ప్రత్యేకసమాప్తిని ప్రదర్శించుచున్నాడు.

ఏకం గ్రహణకం వాక్యం సామాన్యేనాభిధీయతే
కర్తరీతి యథా తచ్చ పశ్వాదిషు విభజ్యతే. 454

గ్రహణకమ్=విశేషములను అన్నింటిని గ్రహించునట్టి, వాక్యమ్ = వాక్యము, ఏకమ్ = ఒక్కటే, సామాన్యేన=సామాన్యరూపముతో, కర్తరి + ఇతి + యథా= ''కర్తరి కృత్'' అన్నరీతిని, అభిధీయతే = చెప్పబడును. తత్ + చ = ఆ వాక్యమైతే, పశ్వాదిషు = "పశౌ" మొదలగు విశేషస్థలములలో, విభజ్యతే = వేరుచేయబడుచుండును.

తా. విశేషవాక్యములన్నింటిలోను,విడివిడిగా సంబంధించునట్లుగా, ఒకే సామాన్య వాక్యమును ముందుగా ఉచ్చరింతురు. అది ప్రతియొక విశేషముతోను, వేరువేరుగానే కలియుచుండును. దీనికి వ్యాకరణములో ఒక ఉదాహరణము: 'కర్తరి కృత్' (3-4-67) ఇది సామాన్యసూత్రము. ఇది 'హరతే ర్దృతినాథయోః పశౌ' (3-2-25) మొదలగు, కృత్ప్రకరణమందలి ప్రతియొక విశేషసూత్రముతోను సంబంధించుచుండును.

వి. ''కర్తరి కృత్'' అనుదానికి, ''ప్రతియొక కృత్ప్రత్యయమును కర్తను బోధించును'' అని అర్థము. (ఉదా: కృ + అకః = కారకః = చేయువాడు, కృ +

తృ=కర్తృ=చేయునది మొదలగునవి). కృత్ ప్రత్యయములను విధించు ప్రతియొక విశేష సూత్రముతోను "కర్తరి" అను పదము సంబంధించును. ఉదా: "హరతేః దృతినాథయోః పశౌ" అను సూత్రము. ఇచట "కర్తరి" అనుపదము సంబంధింపగా, "దృతి నాథ," అను శబ్దములు ముందున్నప్పుడు హృ అను ధాతువునకు 'ఇ' అను ప్రత్యయమువచ్చును. ఇది పశువు కర్తగా అయినపుడే ప్రవర్తించును. "పశౌ కర్తరి" అను అర్థము ఫలించును. "దృతి హరిః (దృతిమ్+హరతి)-దృతిని హరించు పశువు. నాథహరిః (నాథమ్+హరతి) ముక్కు త్రాటిని హరించు పశువు" అనునవి ప్రకృతసూత్రమునకు ఉదాహరణము లగును. ఇట్లే కృత్ప్రకరణములోని విశేషములతో, "కర్తరి కృత్" అను సామాన్యసూత్రమునకు సంబంధము నూహించునది.

"శాస్త్రమందుకూడ కొన్నిచోట్ల ప్రత్యేక వాక్యసమాప్తియే" అని చూపుట ఈ కారికయొక్క ఆశయము. ప్రత్యేకసమాప్తి అనగా, విశేషవచనములతో సామాన్యవచనము విడివిడిగా సంబంధించుటయే.

మీది కారిక చెప్పినతీరును స్వీకరించకపోయినచో, అభిమతము సిద్ధింపదని వివరించు చున్నాడు.

> యద్యాకాంక్షా నివర్తేత తద్భూతస్య సకృచ్ఛ్రుతౌ
> నైవాన్యేనాభిసంబంధం తదుపేయాత్ కథంచన. 455

తద్భూతస్య = సామాన్యవాక్యమును, సకృత్ = ఒకసారి, శ్రుతౌ = వినుట జరుగ గానే, ఆకాంక్షా = ఆకాంక్ష (మరియొకదానితో సంబంధము), నివర్తేత + యది = పోయినట్లయితే, తత్ = ఆ సామాన్యవాక్యము, అన్యేన = వేరొకవిశేషవాక్యముతో, అభిసంబంధమ్ = సంబంధమును, కథంచన = ఏవిధముగా అయినను, న + ఏవ + ఉపేయాత్ = పొందలేక పోయెడిని.

తా. మీది కారికలో చూపిన సామాన్య వాక్యమునకు, 'కేవలము సామాన్యార్థమును బోధించుటయందే తాత్పర్య' మని చెప్పినచో, దానికి విశేషవాక్యములతో ఏవిధము గాను సంబంధము కుదరదు కావున, అభిమతములగు లక్ష్యములు సిద్ధింపక పోయెడివి.

వి. 'కర్తరి కృత్' అను వాక్యము, 'కృత్ప్రత్యయము కర్తను బోధించును' అను అర్థమును మాత్రమే చెప్పి ఊరకుండును' అన్నయెడల, విశేషస్థలములలో 'పశౌకర్తరి' (పశుపు కర్త కావలెను) మొదలగు సమన్వయములు సిద్ధింపవు. కాగా పశువు కర్త కాకుండ, వేరొకటి కర్త అయినపుడు కూడ దృతిహరిః, నాథహరిః మొదలగు ప్రయోగములు సాధువులు కావలసివచ్చును. అది అభిమతము కాదు.

"పశౌ కర్తరి" అని అన్వయము చేసినపుడే, "పశువే కర్త కావలెను" అను నియమము లభించును.

కాగా ఏకరూపమైన వాక్యమే అవాంతర వాక్యములకు మూలకారణ మగుచుండు నని ఉపపాదించుచున్నాడు.

> ఏకరూప మనేకార్థం తస్మా దుపనిబంధనమ్
> యోని ర్విభాగవాక్యానాం తేభ్యోఽనవ్యదివ స్థితమ్. 456

తస్మాత్ = అందువలన, అనేకార్థమ్ = వేర్వేరు అర్థములతో సంబంధముగల, ఏకరూపమ్ = ఒకేస్వరూపముగల సామాన్యవాక్యము, ఉపనిబంధనమ్ = ముఖ్యమైన స్థానమై, విభాగవాక్యానామ్=విశేషములగు అవాంతరవాక్యములకు, యోనిః=మూలకారణమై, తేభ్యః= ఆ విశేషవాక్యముల కన్న, అనన్యత్ + ఇవ = భేదములేనిదివలె, స్థితమ్ = ఉండును.

తా. "కర్తరి కృత్" అనునది, స్వతంత్రమైన విధివాక్యము కాని, ఏదో ఒక విశేష వాక్యముతోమాత్రమే సంబంధించి ఊరకొనునది కాని కాదు. కృత్ప్రత్యయమును విధించు ప్రతియొక విశేషవాక్యముతోను, ప్రత్యేకముగ సంబంధించు సామాన్యవాక్యమది. కాగా ఆయా సూత్రములలో నిర్దేశింపబడిన "పశౌ" మొదలగు విశేషార్థములన్నియు, "కర్తరి" అను సామాన్యార్థముయొక్క భిన్నభిన్న రూపములే. అగును (ఏది కర్తకావలెనో స్పష్టముగ చెప్పును). అందువలన మన్ను వివిధములైన పాత్రలకు మూలకారణమైనట్లు, ఈ సామాన్యవాక్యము వివిధములైన విశేషవాక్యములకు నిదాన మనియు, అది ఒకేరూపముతో వేరుగా ఒకచోట ఉండు ననియు చెప్పవచ్చును.

వి. 'ఏకం గ్రహణకం వాక్యమ్' మొదలగు కారికకు, మీది కారికయు ఈ కారికయు సయుక్తికమైన వ్యాఖ్యానములు. వీనివలన, శాస్త్రమందు కూడ ప్రత్యేకసమాప్తి అవశ్యకమగునని సమర్థింపబడినది. సామాన్యవాక్యము వేరుగా ఉండి, విశేషములతో విడి విడిగా సంబంధించినను, ఒకేవాక్యములో సామాన్యవిశేషభావమును కల్పించుకొని, విడివిడిగా సంబంధమును చూపినను—అది ప్రత్యేకసమాప్తియే అని గ్రహింపవలెను. ఔచిత్యమునుబట్టి ఆయా వాక్యములలో, ఆయా తీరును ఉపయోగించుకొనవలెను.

క్రియా విషయమున "జాతి — వ్యక్తి" వ్యవహారము సంభవించు రీతిని వివరించు చున్నాడు.

> క్వచిత్ క్రియావ్యక్తిభాగై రుపకారే ప్రవర్తతే
> సామాన్యభాగ ఏవాఽస్యాః క్వచి దర్థస్య సాధకః . 457

క్రియా = క్రియ (వ్యాపారము), క్వచిత్ = కొన్నిచోట్ల, వ్యక్తిభాగైః = ఒక్కొక్కటిగా చూపబడిన భాగములచే, ఉపకారే = అభీష్టమైన అర్థమునుసాధించుటయందు, ప్రవర్తతే = ప్రవర్తించును, క్వచిత్ = కొన్నిచోట్ల, అస్యాః = ఈ క్రియయొక్క, సామాన్యభాగః + ఏవ = సామాన్యరూపమే, అర్థస్య = వాక్యార్థమునకు, సాధకః = సాధించునది, భవతి = అగును.

తా. వేరువేరుగా ఒక్కొక్కటిగా కనుపించునవి వ్యక్తులు. వ్యక్తులన్నిటి యందును సమానముగాను, ఏకాకారముగాను, ఒక్కటిగాను ఉన్నట్లు భావింపబడు ధర్మము సామాన్యము—లేక—జాతి. ఉదా: మానవులు విడివిడిగా వ్యక్తులగుదురు. "మానవత్వము" అను ధర్మము జాతి అగును. లోకవ్యవహారములోని క్రియావిషయమున కూడ, ఇట్లే కొన్ని చోట్ల వ్యక్తి విభాగమునుబట్టియు, మరి కొన్నిచోట్ల జాతినిబట్టియును అభీష్టార్థము సిద్ధించు చుండును. ఉదా: "అయం తత్ర ఇదానీం స్తోక మోదనం పచతి" (వీడు అక్కడ ఇప్పుడు కొంచెము అన్నమును వండుచున్నాడు). "సః అత్ర మధురం శాకం పచతి" (వాడు ఇక్కడ తియ్యని కూరను వండుచున్నాడు). ఇట్టి ప్రయోగములలో ప్రదేశము, కాలము, ద్రవ్యము,

క్రియావిశేషణము, మొదలగువానిని స్పష్టముగా చెప్పుదురుగాన, "ఆ క్రియ వేరు" "ఈ క్రియ వేరు" అన్నట్లుగా క్రియకు విభాగమును కల్పించుకొని, సమన్వయమును పొందుదురు. అట్లు కాక, ఎట్టి విశేషములను చెప్పకుండ, "పచతి" "యజతి" మొదలగు ప్రయోగములను చేసినపుడు, ఆయా క్రియయొక్క జాతిని భావించుకొని సమన్వయమును పొందుదురు.

వి. వ్యక్తి, జాతి, అను విభాగము క్రియావిషయమునకూడ సంభవించునని, ఈ కారిక చెప్పుచున్నది.

క్రియకు సామాన్యలక్షణ మిది: లింగముతోకాని (స్త్రీ, పుమాన్. నపుంసకమ్), సంఖ్యతోకాని (ఒకటి, రెండు మొ॥) దానికి అన్వయము ఉండదు. ఆరంభించిన క్షణము మొదలుకొని, పూర్తియగు క్షణమువరకును మధ్యను అవాంతరక్రియలు-(చిన్నవి-పెద్దవియు) ఎన్నో అందు ఉండును. పూర్తి అగువరకును జరుగుచుండుటయు, క్షణక్షణము పెరిగి పూర్తి అగుటయు దానియొక్క అవస్థలు.

ఇట్టి క్రియకు దేశకాలాదివిశేషములు చూపినపుడు, వ్యక్తి భావనయే ఉపయోగించును. 1. 'న పచ' (వండకుము)అను నిషేధమందును, 2. "పచ వా గచ్ఛవా" (వండు-లేక-వెళ్ళు) అను వికల్పమందును, 3. 'పచతి స్తౌతి చ' (వండుచున్నాడు మరియు స్తుతించుచున్నాడు) అను సముచ్చయమందును, క్రియను వ్యక్తిగా భావించుటయే సమంజసమగును (దేనికది వేరే క్రియాస్వరూపమనుకొనుట). ఈ నిషేధవికల్పాదులు వ్యక్తుల విషయములోనే సంభవించును.

ఎట్టి విశేషమును లేనిచో క్రియను జాతిగా స్వీకరింపవచ్చును. జాతి నిత్యమును ఏకమును అగుటవలన, దానివిషయములో నిషేధవికల్పాదులను అన్వయించుట కుదురదు. కాగా ప్రయోగమునుబట్టియు, చెప్పదలచుకొన్న అర్థమును బట్టియు, క్రియలలో జాతి వ్యక్తి విభాగము ఏర్పడుచుండునని సారాంశము.

ఆఖ్యాత శబ్దములు క్రియాగతమైన జాతి భాగమునే సామాన్యముగ బోధించుచుండునని చెప్పుచున్నాడు.

> కాలభిన్నాశ్చ భేదా యే యే చాప్యుష్ట్రాసికాదిషు
> ప్రక్రమే జాతిభాగస్య శబ్దాత్మా తై ర్న భిద్యతే. 458

యే = ఏ, కాలభిన్నాః = కాలముచే వేరుచేయబడిన, భేదాః + చ = క్రియయొక్క భేదములుగలవో, యే = ఏ, ఉష్ట్రాసికాదిషు= "ఉష్ట్రాసికాః ఆస్యంతే" మొదలగుశబ్దములను ప్రయోగించినపుడు, (సాధనభిన్నాః = కారకములచే వేరుచేయబడిన), భేదాః + చ = క్రియయొక్క భేదములు గలవో, తైః=ఆ భేదములచే, జాతిభాగస్య= "క్రియయొక్క జాతి" అను అంశము, ప్రక్రమే = ప్రారంభమున తెలియగా, శబ్దాత్మా = క్రియాపదముయొక్క స్వరూపము, న + భిద్యతే = వేరుచేయబడదు (మారదు).

తా. "పచతి" (వండుచున్నాడు-వర్తమానకాలము), "అపాక్షీత్" (వండెను-భూతకాలము), "పక్ష్యతి" (వండగలడు-భవిష్యత్కాలము) ఇట్టి ప్రయోగములలో కాల భేదము ఉండును. అయినను "వంట" అను సామాన్యాంశమునే గ్రహించుటవలన, "పాక జాతి" అను సామాన్యమే ప్రారంభమున అవగతమగుచుండును. 'ఆ వంటవేరు' 'ఈ వంట

వేరు' అన్నట్లుగా, వ్యక్తి భావన కలుగదు (దేశకాలాది విశేషములను భావించిన క్షణములో వ్యక్తిభావన కలిగిన కలుగుగాక, అది వేరు విషయము).

అట్లే 'ఉష్ట్రాసికాః ఆస్యంతే' (ఒంటెలు కూర్చున్నట్లు కూర్చుండుట) 'హతశాయికాః శయ్యంతే' (చచ్చినవారివలె నిద్రించుట) మొదలగు వాక్యములలో కూడ, కర్తృభేద మున్నను 'ఆసనము' 'శయనము' మొదలగు క్రియాసామాన్యమే మొదట తెలియబడు చుండును.

అనగా దేశకాలాదిభేదమును, కారకభేదమును (ముఖ్యముగా కర్తృభేదము) విడదీసి చెప్పనంతవరకు, ఏ క్రియ అయినను మొదట జాతినే సూచించునని సారము.

వి. 'నడచుట, వ్రాయుట, తినుట' మొదలగు అన్ని విషయములలోను, సామాన్య రూపమైన జాతియే మొదట తెలియును. పిదప దేశకాలాది భేదమును, కర్తృభేదమును స్ఫురించి, ఆవశ్యకమైనచోట, 'ఆ క్రియ వేరు' 'ఈ క్రియ వేరు' అని వ్యక్తి విభాగము జరుగు చుండును.

'ఉష్ట్రాసికాః ఆస్యంతే' మొదలగునవి భావ ప్రయోగములు. క్రియ మాత్రమే వీనివలన బోధపడును. ఈ ప్రయోగములలో కర్తృపదము తృతీయాంతముగ ఉండును. 'దేవదత్తాదిభిః ఉష్ట్రాసికాః అస్యంతే' అనునది పూర్తి ప్రయోగము. 'దేవదత్తుడు మొదలగు వారు ఒంటెలవలె (వికృతముగా) కూర్చుండుట' అని మాత్రమే వాక్యార్థము. ఇట్టిచోట్ల కూడ కూర్చుండు వ్యక్తులు (కర్తలు) వేరువేరుగా ఉన్నను, 'ఆసన'మను జాతిభాగమే, మొదట వాక్యార్థముతో సంబంధించును.

మీది కారికయు, ఈ కారికయు క్రియలలోని జాతి వ్యక్తి వివేచనమును జరిపినవి.

**సాధనములు ఒకే శబ్దముచేతను, క్రియ విభిన్నములగు శబ్దములచేతను ప్రతిపాదింప బడిన వాక్యములలో క్రియాసాధనముల సంబంధమును నిర్దేశించుచున్నాడు.**

> ఏకసంఖ్యేషు భేదేషు భిన్నా జాత్యాదిభిః క్రియాః
> భేదేన వినియుజ్యంతే తచ్ఛబ్దస్య సకృచ్ఛ్రుతౌ. 459

ఏకసంఖ్యేషు = ఒకేసంఖ్యగల (వేరువేరుగా బహుత్వసంఖ్యను కలిగి ఉన్న), భేదేషు = ఒకేశబ్దముతో చెప్పబడిన సాధనభేదములందు, జాత్యాదిభిః = జాతి, దేశ, కాలాదులచే, భిన్నాః = వేరైనటువంటివిన్ని, వేర్వేరు శబ్దములతో బోధింపబడునటువంటి, క్రియాః = వ్యాపారములు, తచ్ఛబ్దస్య = సాధనవిశేషములను చెప్పు ఆ శబ్దమును, సకృత్ = ఒకసారి, శ్రుతౌ = వినగానే, భేదేన = భేదముతోనే (వేర్వేరుగానే), వినియుజ్యంతే = ఆయా సాధనములతో సంబంధమును పొందును.

తా. ఈ దిగువ ఉదాహరణమును తీసుకొని, ఈ కారికయొక్క ఆశయమును విశదీకరించుకొనవలెను: "అక్షాః భజ్యంతామ్, భుజ్యంతామ్, దీవ్యంతామ్" ఇచట అక్ష శబ్దమునకు మూడు అర్థములు ఉన్నవి. 1. బండి ఇరుసు. 2. ఒక పండు (విభీతకఫలము తానికాయ) 3. పాచిక, వీనిలో ఏ ఒక అర్థమును తీసికొన్నను, క్రియాపదమందలి బహువచనమును అనుసరించి అక్షశబ్దమును బహువచనాంతముగానే అంగీకరింపవలెను. పిదప ప్రకృతక్రియను, దాని వరుసను బట్టి, 1. "అక్షాః భజ్యంతామ్" (ఇరుసులు విరుగగొట్టబడు

గాక) 2. "అక్షాః భుజ్యంతామ్" (అక్షఫలములు తినబడుగాక) 3. "అక్షాః దీవ్యంతామ్" (పాచికలు ఆడబడుగాక) అను మూడు వాక్యములు వరసగా ఏర్పడి, వినువానికి అర్థబోధ కలుగును.

అయినను తంత్రమును (శబ్దమును ఒకసారే పలికి, దానివలన చాలా అర్థములను బోధించురీతి) ఆశ్రయించి, వక్త అక్ష శబ్దమును ఒక్కసారే పలుకును. ఇట్టి ప్రయోగములలో క్రియలు, దేశకాలాదులవలన భిన్నభిన్నములే అగును (వాని జాతియు, వ్యక్తులును, వానిని ఆచరించు సమయమును, తీరులును వేర్వేరు). కావుననే క్రియాభేదమును, క్రియాశబ్దమును, వినువానికి కలుగు జ్ఞానభేదమును పురస్కరించుకొని, 'అక్షాః' మొదలగు శబ్దములవలన, సాధన భేదముకూడ (కారక భేదము) సిద్ధించును. ఒక్కొక్క సాధనముతో దానికి తగిన క్రియ వేరువేరుగానే సంబంధించును. సాధన శబ్దమును పలుమారులు పలుకనక్కరలేకుండగనే అభీష్టార్థము తెలియుచుండును.

వి. "దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రాః భోజ్యంతామ్" మొదలగు ప్రయోగములలో, క్రియ ఒక్కసారే ఉచ్చరింపబడి, సాధనములతో వేర్వేరుగా సంబంధించుచుండును. ఈ అంశమును (ప్రత్యేక సమాప్తి) అనేక యుక్తులతో శాఖా చంక్రమణము చేసి గ్రంథకర్త ఇంత వరకు వ్యాఖ్యానించెను.

ఆవిధముగానే వేర్వేరు క్రియలను వేర్వేరు శబ్దములతో చెప్పి, కారకములను మాత్రము ఒకే శబ్దముతో ఒకేసారి బోధించు ప్రయోగములలో (అక్షాః భజ్యంతామ్, భుజ్యంతామ్, దీవ్యంతామ్ మొదలగునవి) కూడ, క్రియకు ప్రత్యేకసంబంధమే సంభవించునని విశదీకరించుటకు, ఈ కారిక రచింపబడినది. ఇట్టి ప్రయోగములలో 'వక్త తంత్రముతో పలుకుననియు, బోద్ధ ఆవృత్తి చేసికొని అర్థమును తెలిసికొనుననియు' సారము. ఈ విషయము దిగువ కారికలవలన స్పష్టపడును.

మీది కారికకు ఒక ఉదాహరణము నిచ్చుచున్నాడు.

> అక్షాదిషు యథా భిన్నా భంజి భక్షి దివి క్రియాః
> ప్రయోగకాలాభేదేఽపి ప్రతిభేదం పృథక్ స్థితాః . 460

యథా=ఎట్లనగా, అక్షాదిషు='అక్షాః' మొదలగు సాధనములు ఒకే శబ్దముతో చెప్పబడినపుడు (అక్షాః భజ్యంతామ్, భుజ్యంతామ్, దీవ్యంతామ్ మొదలగు ప్రయోగములలో) భిన్నాః = వేరైనటువంటివిన్ని, వేర్వేరు శబ్దములతో చెప్పబడినటువంటి, భంజి భక్షి దివి క్రియాః=భంజనము, భక్షణము, దేవనము అనువ్యాపారములు, ప్రయోగకాలాభేదే + అపి=ఉచ్చరించుటలో గాని, ఉచ్చరించు సమయములో గాని భేదము లేకున్నను, ప్రతిభేదమ్= ప్రతియొక సాధనముతోను, పృథక్ = వేరువేరుగా, స్థితాః=సంబంధించి ఉండును.

తా. పై శ్లోకమునకు ఉదాహరణమును ఈ శ్లోకముచూపినది. "అక్షాః భజ్యంతామ్" మొదలగు ప్రయోగములలో, సాధనములను ఒక శబ్దముతోనే చెప్పినను, అర్థబోధ సమయమున వేర్వేరు క్రియలు వేర్వేరుగా తమతమ యోగ్యమైన సాధనములతో సంబంధించును. కాగా ఇట్టిచోట్ల కూడ వాక్యమునకు ప్రత్యేకసమాప్తియే అని ఫలించును.

మీద చూపినట్టి వాక్యముల విషయమున తంత్రన్యాయమును ఆశ్రయింపవలయు నని చూపుచున్నాడు.

అక్షాణాం తంత్రిణాం తంత్ర ముపాయ స్తుల్యరూపతా
ఏషాం క్రమో విభక్తానాం తంత్రిబద్ధా సకృచ్ఛ్రుతిః. 461

తంత్రిణామ్ = తంత్రమునకు విషయములైన (తంత్రముగల), అక్షాణామ్ = అక్షములకు (రథముయొక్క అక్షము, విభీతకాక్షము, ఆడుకొనే అక్షము-మూడుచోట్లకూడ, శబ్దము "అక్ష" అనునదియే), తుల్యరూపతా="స్వరూపము సమానముగా ఉండుట" అను, తంత్రమ్ = తంత్రము (ఒకే ఉచ్చారణముమాత్రము), ఉపాయః = ఉపాయము (మూడు అర్థములను ఒకేమారు బోధపరచుటలో సాధనము), (భవతి=అగును). విభక్తానామ్=అక్షాః భజ్యంతామ్, అక్షాః భుజ్యంతామ్, అక్షాః దీవ్యంతామ్ అని వేరుచేయబడిన, ఏషామ్ = ఈ అక్షములకు, క్రమః = వేర్వేరుగా తెలియజేయుటకు అవలంబింపబడిన అక్షశబ్దములయొక్క ఉచ్చారణక్రమము, ఉపాయః=వేర్వేరుగా తెలియుటకు సాధనము, (భవతి=అగును). సకృత్ = ఒకసారే, శ్రుతిః = అక్షశబ్దము వినబడుట, తంత్రిబద్ధా = తంత్రవిషయములైన అక్షములకు సంబంధించినది (భవతి=అగును).

తా. వక్త ఇచ్ఛానుసారము ప్రయోగములు జరుగుచుండును. "అక్షాః భజ్యంతామ్, అక్షాః భుజ్యంతామ్, అక్షాః దీవ్యంతామ్" అని విడివిడిగా కూడ ప్రయోగింపవచ్చును. ఇట్లు ప్రయోగించునపుడు, అక్షశబ్దముయొక్క ఉచ్చారణక్రమము, అర్థభేదమందలి క్రమమును (వరుసను) స్పష్టపరచును. (క్రియాభేదమువలన అర్థభేదము తప్పనిసరి అగుటయు— ఆ భేదమును, వరుసయు స్పష్టమగుటయు మొదట సిద్ధించి, పిదప క్రియలకు వేరువేరుగా, తమతమ కారకములతో సంబంధము ఏర్పడును).

మరియు, "అక్షాః భజ్యంతామ్, భుజ్యంతామ్, దీవ్యంతామ్" అని కూడ ప్రయోగింపవచ్చును. ఇపుడు కావలసిన అర్థమంతయు (పైనిచూపిన తీరు) "తంత్రము" వలన (శబ్దమును ఒకమారే పలికి, చాలా అర్థములను బోధించుట) సిద్ధించును. అయితే ఒకవిశేషము. ఇట్టి స్థలములలో, తంత్రవిషయమైన శబ్దమును బోద్ధ (తెలియువాడు) ఆ వృత్తి చేసికొని అర్థభేదమును గ్రహించును.

వి. "క్రమమనగా—వరుస—లేక-విభాగము. అభిమతార్థములు తెలియుటకై నానార్థక శబ్దములను ఒకవరుసలో విడివిడిగా ఉచ్చరించుట" అని భావము. దీనికి పూర్తిగా విరుద్ధమైనది తంత్రము. దీనినే 'యౌగపద్యము' అని అందురు. "నానార్థములను బోధించుటకు శబ్దమును ఒక్కమారే పలుకుట" అని భావము. శబ్దరూపము సమానముగా ఉండుటయే, తంత్రమునకు ముఖ్యకారణ మగును.

కాగా నానార్థక శబ్దములను క్రమముతోగాని, యౌగపద్యముతోగాని, వాక్యములలో వాడవచ్చును. క్రియలుమాత్రము వానిలోని కారకములతో విడివిడిగానే సంబంధించును.

క్రమయౌగపద్యముల స్వరూపమును ఉద్దేశించుచున్నాడు.

ద్వా వభ్యుపాయౌ శబ్దానాం ప్రయోగే సమవస్థితౌ
క్రమో వా యౌగపద్యం వా యౌ లోకో నాతివర్తతే. 462

క్రమే విభిద్యతే రూపం యౌగపద్యే న భిద్యతే
క్రియా తు యౌగపద్యేఽపి క్రమరూపానుపాతినీ . 463

శబ్దానామ్ = శబ్దములయొక్క (తెలిసికొను సమయమున వేర్వేరు అర్థములుగల సరూపశబ్దములయొక్క) ప్రయోగే=ఉచ్చరించుట విషయములో, క్రమః + వా=విభాగము గాని (విడివిడిగా పలుకుట), యౌగపద్యమ్ + వా = ఒక్కసారే ఉచ్చరించుటగాని, ద్వౌ= రెండు, అభ్యుపాయౌ=ఉపాయములు, సమవస్థితౌ = స్పష్టముగా ఉన్నవి. యౌ=ఏ రెండు ఉపాయములను, లోకః=జనము (ప్రయోగించువారు), న + అతివర్తతే=విడనాడజాలదో (తౌ=అవి, స్తః=ఉన్నవి).

క్రమే=శబ్దములను వేరుగా పలికినపుడు, రూపమ్ = ఆ శబ్దముల స్వరూపము, విభిద్యతే = వేరుగా ఉండును (వేరని భావింపబడును). యౌగపద్యే=ఒక్కసారే పలికినపుడు, రూపమ్=శబ్దస్వరూపము, న + భిద్యతే = వేరుకాదు. (వేరుకాదని భావింపబడును) యౌగపద్యే + అపి=ఒక్కసారే పలికినపుడు కూడ, క్రియా=వ్యాపారము (క్రియాపదము), క్రమరూపానుపాతినీ = క్రమములో ఉండు శబ్దరూపమును అనుసరించునది (క్రమమునను సరించి ప్రత్యేకాన్వయము కలది), భవతి=అగును.

తా. క్రమము, యౌగపద్యము అనువాని స్వరూపస్వభావములను వివరించుటకు ఈ ప్రసంగము ప్రారంభింపబడినది.

అనేకార్థకములగు శబ్దములను వాక్యములలో ప్రయోగించుటకు రెండు మార్గము లున్నవి. మొదటిది క్రమము—ఎన్ని అర్థములను చెప్పదలచుకొన్న అన్ని శబ్దములను విడిగా పలుకుట. ఈ మార్గమున శబ్దస్వరూపము వాస్తవముగ ఒకటే అయినను, 'వేర్వేరు' అన్నట్లు ఊహించుకొనవలసి ఉండును (కావుననే శబ్దములను మరల మరల పలికినట్లు భావన). రెండవది యౌగపద్యము—శబ్దమును ఒక్కసారే పలుకుట. ఇందు శబ్దరూపమొకటే అని భావింపవలయును. ఈ రెండుపద్ధతులను మించిన వేరొక పద్ధతిలేదు.

యౌగపద్యముతో ప్రయోగించినపుడు కూడ, విడివిడిగా ఉండు క్రియలు తమతమ కారకములతో ప్రత్యేకముగనే సంబంధించును. అట్లు అన్వయించుట క్రియయొక్క స్వభావము. మీదికారికలలో చూపిన 'అక్షాః భజ్యంతామ్' ఇత్యాది వాక్యమే ఇందుకు ఉదాహరణము. భంజనమను క్రియ రథాక్షమునకే (ఇరుసు) చెందుననియు, భుజిక్రియ విభీతకాక్షమునకే (పండు) చెందుననియు, దేవనక్రియ (ఆట) దేవనాక్షమునకే (పాచిక) చెందుననియును ఇచట బోధకలుగును.

క్రమ యౌగపద్యము లనునవి వాస్తవమున శబ్దముయొక్క శక్తులే అని చెప్పు చున్నాడు.

భేదసంసర్గశక్తీ ద్వే శబ్దాద్భిన్నే ఇవ స్థితే
యౌగపద్యేఽప్యనేకేన ప్రయోగే భిద్యతే క్రియా . 464

ద్వే=రెండైన, భేదసంసర్గశక్తీ=భేదము, సంసర్గము అనుశక్తులు, శబ్దాత్= శబ్దముకన్న, భిన్నే + ఇవ=వేరయినవి అన్నట్లు, స్థితే=ఉన్నవి. యౌగపద్యే + ప్రయోగే + అపి=ఒక్కసారే శబ్దమును ప్రయోగించినను, అనేకేన=అనేకసాధనములతో క్రియకు

సంబంధము కలుగుచున్నందుచే, శ్రుతిః=సాధనముయొక్క వినబడుట, భిద్యతే=వేరగును (సాధనశబ్దములు విడివిడిగా స్ఫురించును).

"అక్ష" మొదలగు నానార్థక శబ్దములలో వాస్తవముగ శబ్దమునకే భేదము, సంసర్గము, అను రెండు శక్తులున్న వని చెప్పవలయును. "ఎన్నిఅర్థములు ఉంటే, అన్ని శబ్దములును ఉండుట" భేదమనబడును. "శబ్దములన్నియు కలిసి, అంటుకున్నట్లు ఒకశబ్దముగనే భాసించుట" సంసర్గమనబడును. భేదమునకే "క్రమ" మనియు, సంసర్గమునకే "యౌగపద్య"మ నియును మారుపేర్లు. శక్తికిని, శక్తిమత్తునకును (శక్తికలది) అభేదము సహజము. కావున శబ్దమునకును, దానిశక్తులగు భేదసంసర్గములకును అభేదమే (రెండును ఒకటే) అనక తప్పదు. అయినను ఆ రెండుశక్తులను శబ్దముకన్న వేరయినవన్నట్లుగా ఊహింపబడుచుండును. మరొకవిషయము : శబ్దమును ("అక్షాః" మొదలగుదానిని) యౌగపద్యముతో ప్రయోగించినను, దానిని ఆ వృత్తి చేసికొనియే, విభిన్నములగు క్రియలతో (భజ్యంతామ్, భుజ్యంతామ్, మొదలగునవి) సంబంధమును చూపవలయును. అనగా "అక్ష" మొదలగు సాధనశబ్దమును విడివిడిగా ప్రయోగించునపుడు, శబ్దభేదము ఉండునుగాన, విభిన్న క్రియలతో సంబంధము స్పష్టముగ కుదిరినట్లే, ఒక్కసారి ప్రయోగించినను శబ్దావృత్తిని చేయుదుము. గాన విభిన్నక్రియలతోడి సంబంధము సంభవించును. ఒక్కసారే పలికినంతమాత్రమున, "శబ్దముకూడ ఒక్కటే అని అనుకొనకూడదు" అని సారాంశము.

వి. అర్థముయొక్క క్రమము (భేదము) గాని, యౌగపద్యముగాని శబ్దమును బట్టియే తెలియుచుండును గాన భేదసంసర్గశక్తులు రెండును శబ్దశక్తులే అగును గాని అర్థశక్తులు కానేరవు.

"అక్షాః" ఇత్యాది వాక్యములలో తంత్రమును ఆశ్రయింపక పోయినను ప్రత్యేక పరిసమాప్తి సంభవించు రీతిని ప్రతిపాదించుచున్నాడు.

అభిన్నో భేదరూపేణ య ఏకోఽర్థో వివక్షితః
తత్రాఽవయవధర్మేణ సముదాయోఽనుగృహ్యతే. 465

అభిన్నః=స్వయముగా భేదమును కలిగిఉండనటువంటిన్ని, ఏకః=ఒక సముదాయరూపమైన, యః=ఏ, అర్థః=అర్థము, భేదరూపేణ=భిన్నభిన్నముగా, వివక్షితః=చెప్పదలపబడినదో, తత్ర=అచ్చట (ఆ అర్థము విషయములో), అవయవధర్మేణ=అవయవముల భేదముచే, సముదాయః=సముదాయము, అనుగృహ్యతే=అనుగ్రహింపబడును (భేదముగలదిగా చేయబడును).

తా. కొన్నివస్తువుల ప్రోగు సముదాయమును, సముదాయమందలి విడివిడి వస్తువులు ఆ సముదాయమునకు అవయవములును అగును. సముదాయ మొక్కటియే. అందు విభాగము ఉండదు. అవయవములందు విభాగము ఉండును. ఈ అవయవభేదమును, సముదాయమును చెప్పు శబ్దముతోనే కొన్నిచోట్లబోధింతురు. అనగా సముదాయవాచకశబ్దమును ఒక్కసారే పలికి, అవయవములను విడివిడిగా బోధింపప్రయత్నింతురు. ఇందుకు లోకమందలి ఉదాహరణము : "సభకు జనము గొప్పగావచ్చినది (వచ్చినారు)". ఇచట "జనము" అను పదమునకు "జనులు" (విడివిడిగా) అను అర్థము. ఇట్టి తీరును "ఉద్భూతావయవభేదము" (సముదాయ

మందు అవయవములభేదమును ఆరోపించుట) అందురు. దీనిని స్వీకరించినచో, మీదచూపిన "అక్షాః" మొదలగు స్థలములలో, ఆ ఒక్క శబ్దమువలననే అవయవభేదము స్ఫురించి, (అక్షాః, అక్షాః, అక్షాః అని) క్రియలు ప్రత్యేకముగ సంబంధించును. ఈ పక్షమందు," వక్త తంత్రముతో పలుకు ననియు, బోద్ధ అవృత్తితో అర్థమును తెలిసికొను ననియును" వేరుగా ఉపపాదింప నక్కరలేదు.

శబ్దతంత్రమును అవలంబించినను, అట్టి వాక్యములలో పరిసమాప్తిని సాధించుకొన వచ్చునని నిరూపించుచున్నాడు.

భేదనిర్వచనే త్వస్య ప్రత్యేకం వా సమాప్యతే
శ్రుతి ర్వచనభిన్నా వా వాక్యభేదేఽవతిష్ఠతే . 466

వా=లేక, అస్య = ఈ "అక్షాః" అను బహువచనాంతముచే బోధింపబడు సముదాయమునకు, భేదనిర్వచనే+తు = అవయవభేదమునను సరించి భేదమును చెప్పినపుడు, ప్రత్యేకమ్=విడివిడిగా, సమాప్యతే = వాక్యార్థము సమాప్తిని పొందును (కియలు విడివిడిగా సాధనములతో సంబంధించి, వాక్యములు పూర్తి అగును).

వా=లేక, శ్రుతిః = "అక్షాః" అను బహువచనాంతము, వచనభిన్నా = వచనముతో వేరైనదై = ఏకవచనాంతముగ మారినదై, వాక్యభేదే = వేరువేరు వాక్యములుగ, అవతిష్ఠతే= పర్యవసించును.

తా. "అక్షాః" అను శబ్దముబోధించు సముదాయమునకు, ఉద్భూతావయవ భేదమును అంగీకరించినపుడు, విజాతీయములగు క్రియాపదములకు విడిగా కారకములతో సంబంధమేర్పడి, "అక్షాః భజ్యంతామ్, అక్షాః భుజ్యంతామ్, అక్షాః దీవ్యంతామ్," అను సంపూర్ణ వాక్యములు సిద్ధించును.

లేక—"అక్షాః" అను పదమును విడివిడిగా ఏకవచనాంతముగ మార్చుకొని, తదనుగుణముగ క్రియాపదములనుకూడ ఏకవచనాంతములుగా మార్చి, "అక్షః భజ్యతామ్, అక్షః భుజ్యతామ్, అక్షః దీవ్యతామ్", అని మూడు ప్రత్యేకవాక్యములనైనను సంపాదించి అర్థమును తెలియనగును.

వి. "అక్ష" మొదలగు నానార్థక శబ్దములలో, శబ్దము ఒకటే అయి, అర్థములు పరస్పరము దానిని అంటిపెట్టుకొని ఉండునని చెప్పినచో, "అర్థతంత్రము" అని అందురు. శబ్దములే (సమానరూపముగలవి—అవశ్యకమైన అర్థములను చెప్పునవి) అతుకుకొని, ఒక శబ్దముగా కనుపించునన్నచో "శబ్దతంత్రము" అని అందురు. ఈ రెండు పక్షములనుకూడ, వాక్యపరిసమాప్తి పరిశీలనములో చూపుచుందురు.

ప్రకృతము "అక్షాః" అను బహువచనమును ఏకవచనముగా మార్చుట అను అంశము శబ్దతంత్రపక్షమునకు చెందును.

శబ్దపరిసమాప్తి యొక్క ఒకానొక రీతిని చూపుచున్నాడు.

తత్రైకవచనాంతో వా సోఽక్షశబ్దః ప్రయుజ్యతే
ప్రత్యేకం వా బహుత్వేన ప్రవిభాగో యథాశ్రుతి . 467

తత్ర = "అక్షాః భజ్యంతామ్, భుజ్యంతామ్, దీవ్యంతామ్" అను వాక్యములో, సః = అ, అక్షశబ్దః = అక్షశబ్దము, ఏకవచనాంతః + వా = ఏకవచనాంతముగా అయినను, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును. వా = లేక, యథాశ్రుతి = వాక్యము వినిపించినట్లుగానే, బహుత్వేన = బహువచనాంతముగానే, ప్రత్యేకమ్ = విడివిడిగా, ప్రవిభాగః = విభాగము, (క్రియతే = చేయబడును).

తా. "అక్షాః భజ్యంతామ్" ఇత్యాదివాక్యములలో, శబ్దములను బట్టి ప్రత్యేక వాక్యసమాప్తిని చెప్పదలచుకొన్నపుడు, అక్షశబ్దమును, క్రియలను కూడ ఏకవచనాంతముగా మార్చుకొని, వాక్యసమాప్తిని చెప్పవచ్చును. లేక — ఉన్నదున్నట్లుగా బహువచనాంతములుగానే, క్రియలకును, సాధనములకును (అక్షాః అనుదానిని ఆవృత్తిచేసి) సంబంధమును చూపి, ప్రత్యేకసమాప్తిని పొందవచ్చును.

వి. "అర్థమునుబట్టి వాక్యసమాప్తి" అన్నపక్షములో ఆవృత్తిమొదలగు ప్రక్రియ అంతయు అర్థమునకే ముఖ్యముగా సంబంధించును. "శబ్దమునుబట్టి వాక్యసమాప్తి" అనుపక్షమందు ఎట్టి కల్పనముచేసినను, అది ముఖ్యముగా శబ్దమునకే సంబంధించును. ఈ రెండు పక్షములనుకూడ శాస్త్రకారులు ఎడనెడ చూపుచుందురు. వీనిని యథాసంభవముగ ఆయా వాక్యములలో సమన్వయించుకొనవలెను.

ఈ కారిక, మీది కారికకు అనుబంధమే.

"అర్థభేదమున్నను శబ్దభేదము లేదు" అను మతమున, అనేకార్థక వాక్యములలో శక్తిభేదముచే అర్థవిభాగము సిద్ధించునని ప్రతిపాదించుచున్నాడు.

ద్విష్ఠాని యాని వాక్యాని తేష్వప్యేకత్వదర్శినామ్
అనేకశక్తే రేకస్య స్వశక్తిః ప్రవిభజ్యతే . 468

యాని = ఏ, వాక్యాని = వాక్యములు, ద్విష్ఠాని = రెండు అర్థములుగలవై ఉండునో, తేషు + అపి = వానియందుకూడ, ఏకత్వదర్శినామ్ = "శబ్దము ఒకటే" అనువారి మతములో, అనేకశక్తేః = ఒకటికి మించిన అర్థములను బోధించుశక్తులుగల, ఏకస్య = ఆ ఒకవాక్యము యొక్క, స్వశక్తిః = తనయొక్క శక్తి, ప్రవిభజ్యతే = వేరువేరుగా తెలియబడును.

తా. రెండువిధములైన అర్థములను సమర్పించువాక్యములను "ద్విష్ఠములు" అని అందురు. ఇటువంటివి శాస్త్రములోను, లోకములోను కూడ కొన్ని ఉండును. "రెండు విధములైన అర్థములను ఇచ్చుశక్తులు, వేరువేరుగా ఈ వాక్యములకు ఉండుననియు, శబ్దము ఒకటే అనియును" ఈ వాక్యముల విషయములో అభేదవాదు లందురు.

వి. "అనేకార్థక స్థలములలో, ఎన్ని అర్థములుంటే, అన్నిశబ్దములు వేర్వేరుగా ఉండునని" కొందరందురు. వీరు శబ్ద భేదవాదులు. "శబ్దమొకటే అనియు, ఆ శబ్దమునకే వేర్వేరుఅర్థములనుచెప్పు శక్తులు వేర్వేరుగా ఉండుననియును" మరికొందరందురు. వీరు శబ్దాభేదవాదులు. భేదవాదులమతములో "శబ్దతంత్రము" వలన అర్థభేదము సిద్ధించును. "స్వరూపము సమానముగా ఉండి, వేర్వేరు అర్థములుగల శబ్దములు ఒకశబ్దముగా అతుకుకొనుట (వర్ణక్రమము ఒకటే కావున) "శబ్దతంత్రము" అగును. ఈ పక్షములో వక్త శబ్దమును ఒకసారే పలుకుటయు, బోద్ధ శబ్దమును ఆవృత్తిచేసికొని, (విడదీసికొని) అర్థమును తెలియు

టయు జరుగును. అభేదవాదులమతములో శబ్దముఒకటే కావున, శబ్దతంత్రము సంభవింపదు. అందుచే వీరు "శక్తితంత్రము" ను ఆశ్రయింతురు. "ఒకశబ్దమునకే అనేకార్థములనుచెప్పు శక్తులు భిన్నభిన్నములుగా ఉండుట శక్తితంత్రము" అనివించుకొనును. దీనివలన, శబ్దమును ఒకేసారిపలికినను, దానికుండు వేర్వేరుశక్తులు వేర్వేరుఅర్థములను తెలియజేయుచుండును. ఇచట అర్థములను మార్చుకొనుటయే అవశ్యకమగును కాని, శబ్దావృత్తి అవశ్యకముకాదు. ఈ తీరును "అర్థతంత్రము" అని కూడ చెప్పవచ్చును.

ఈ విషయములు 317 వ కారికలో కొంతవరకు సూచింపబడినవి. ప్రసంగము వచ్చినపుడెల్ల గ్రంథకర్త వీనిని ఎడనెడ స్పృశించుచునే ఉండును. భేదపక్షమును, అభేద పక్షమును కూడ, వైయాకరణులకు అభిమతమే. కావుననే తదనుసారముగను, యథా సంభవ ముగను రెండిటికిని సంబంధించు యుక్తులను, వాని వివరణములును సంకీర్ణముగ ఇందు కనిపించుచుండును. (కేవలము పదములకును [అనేకార్థములు] పదార్థములకును సంబంధించిన చర్చ ఇంతవరకు సాగినది.)

ప్రకృతము ఈ కారిక రెండర్థములుగల వాక్యములకు సంబంధించిన చర్చను ప్రారంభించినది. ఇది 475 వ కారికతో (అనగా – ఈ కాండము చివరకు) పూర్తిఅగును. భేదాభేదపక్షములను రెండిటిని చూపుచు చర్చ కొనసాగును.

శాస్త్రమందలి ద్విష్ఠవాక్యమున కొక ఉదాహరణము : 'ఇగ్యణః సంప్రసారణమ్' (1-1-45) అను సూత్రము. ఇది సంప్రసారణమను సంజ్ఞను బోధించును. ఇచట 'యణః ఇక్' (యణ్ణుల ప్రసంగములో ప్రయోగింపబడు ఇక్కులు) అనువాక్యమునకు 'సంప్రసారణ సంజ్ఞ' అని ఒక అర్థము. య్, వ్, ర్, ల్, అనువాని స్థానమున వరుసగ ప్రయోగింపబడు ఇ, ఉ, ఋ, ఌ అను వర్ణములకు విడివిడిగానే సంప్రసారణ సంజ్ఞ' అని రెండవ అర్థము.

లోకమందలి ద్విష్ఠ వాక్యమున కొక ఉదాహరణము : 'శ్వేతోధావతి'. 'తెల్లని వాడు పరుగెత్తుచున్నాడు' (శ్వేతః + ధావతి) అని ఒక అర్థము. "కుక్క ఇటునుండి పరుగెత్తు చున్నది" (శ్వా + ఇతః + ధావతి) అని రెండవ అర్థము.

ఇటువంటి ద్వ్యర్థక వాక్యములలో, వాక్యమునకు ఉండు రెండు శక్తులను వేరు చేసికొని, తన్మూలమున వేర్వేరు అర్థములను గ్రహింపవలెనని అభేదవాదులందురు. శాస్త్రీయ ములును, లౌకికములును అగు ద్వ్యర్థవాక్యము లన్నింటియందును ఈ మార్గమునే వారు అవలంబింతురు. 'ద్విష్ఠ' అను పదము ఒక్కద్వ్యర్థకములనే కాక బహ్వర్థకములను కూడ గ్రహించును.

"ప్రత్యర్థం శబ్దనివేశః" అనునది వైయాకరణుల సిద్ధాంతము. ఈ వచనము 'సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ' (1-2-64) అను సూత్రముయొక్క భాష్యములో ఉన్నది. ఇచట 'అర్థమర్థం ప్రతి = ప్రత్యర్థమ్' అను విగ్రహమును చెప్పినచో, 'ఒక్కొక అర్థము చెప్పుటకు, ఒక్కొక శబ్దమును వేరుగా వాడవలెను' అను భావము వచ్చును. ఇదియే శబ్దభేద వాదము. 'అర్థౌ అర్థౌ ప్రతి' 'అర్థాన్ అర్థాన్ ప్రతి = 'ప్రత్యర్థమ్' అని ద్వివచన బహు వచనాంతములతో కూడ విగ్రహమును చూపినచో, 'రెండు కాని అంతకు మించి కాని అర్థము లను చెప్పుటకు కూడ, ఒక శబ్దమునే వాడవచ్చును.' అనుభావము ఫలించును. ఇదియే శబ్దా భేదవాదము.

'ప్రత్యర్థమ్' అనుచోట మూడువిధములైన విగ్రహములను కూడ, భాష్యకారుడు అంగీకరించెను. కావున భేదాభేదవాదములు రెండిటికిని ఈ వచన మొక్కటియే మూలమై కూర్చున్నది. కావుననే రెండు మతములును వైయాకరణులకు స్వీకార్యములైనవి.

కాగా—"ఎన్ని యుక్తులను ఎన్ని విధముల చూపినను, అనేకార్థక స్థలములలో భేదవాదులకు శబ్దతంత్రము అనియు, అభేదవాదులకు శక్తితంత్రము — లేక - అర్థతంత్రము అనియు, ఎవరి కిష్టమైన మార్గమును వారు అనుసరింపవచ్చు ననియును" ఇచటి తత్త్వము. దీనినే ఈ దిగువ శ్లోకములు వివరించును.

శబ్దభేదమును అంగీకరించువారి మతమున శబ్దతంత్రముచే ఆభీష్టము సిద్ధించునని వాఖ్యానించుచున్నాడు.

> అత్యంతభిన్నయో ర్వా స్యాత్ ప్రయోగ స్తంత్రలక్షణః
> ఉపాయ స్తత్ర సంసర్గః ప్రతిపత్తృషు భిద్యతే . 469

వా = లేక, అత్యంత భిన్నయోః = పూర్తిగా వేరయిన శబ్దములకు, తంత్రలక్షణః=శబ్దతంత్రరూపమైన, ప్రయోగః = వక్తయొక్క ఉచ్చారణము, స్యాత్ = అగును. తత్ర = ఆ స్థలములో, ప్రతిపత్తృషు = తెలిసికొనువారి విషయములో, సంసర్గః = సంబంధము (వాక్యసంబంధము, లేక-పదార్థ సంబంధము), ఉపాయః=ఉపాయమై, భిద్యతే= వేరగును.

తా. 'అక్షాః' మొదలగు శబ్దములను కావలసిన అర్థముల ననుసరించి వేర్వేరుగానే వక్త ప్రయోగించును. అతడు శబ్దతంత్రమును ఆశ్రయించునుగాన, శబ్దములన్నియు అతుకుకొనినట్లు అయి ఒక శబ్దముగానే వినిపించును. ఆ శబ్దమును అవృత్తి చేసికొని, కావలసిన అర్థములను బోద్ధ తెలిసికొనును. కాగా వక్తకు శబ్దతంత్రమున్ను, బోద్ధకు శబ్దావృత్తియును ఉపాయములగును'— అని శబ్దభేదవాదులందురు.

వి. 'ఒక్కొక్క అర్థమునకు, ఒక్కొక్క శబ్దము ఉండవలయు' నని శబ్దభేద వాదులందురు. వారి మతమున, 'అక్షాః' మొదలగు అనేకార్థక శబ్దముల విషయములోను, 'ఇగ్యణః సంప్రసారణమ్' 'శ్వేతోధావతి' మొదలగు ద్వ్యర్థవాక్యముల విషయములోనుకూడ, 'అభిమతములగు అర్థములు తెలియుగాక' అను భావముతో వక్త ఒకసారే శబ్దమును ఉచ్చరించును. (శబ్దములు సరూపములగుటచే, అన్నింటిని కుదించి వానికి ఒకరూపమునే ఇచ్చును). అయినను ఆ శబ్దమును విడదీసికొని బోద్ధ అర్థములను తెలిసికొనును. అనగా ఏదో ఒక అర్థము కావలసినను, లేక-అన్ని అర్థములును కావలసినను, వానిని గ్రహించుటకు వీలుగా లాఘవమును బట్టి, ఆయా సందర్భములలో వక్తయగు వ్యక్తి శబ్దమును ఒక్కసారే పలికినను, బోద్ధ అగు వ్యక్తి తనకు కావలసిన తీరులో శబ్దమును విడదీసికొని అర్థమును తెలిసికొనుచుండును. ఇట్లు విభిన్నార్థములు కలిసి ఉండుటయే సంసర్గ మనిపించుకొనును.

> భేదేనావగతౌ పూర్వం శబ్దౌ తుల్యశ్రుతీ పునః
> తంత్రేణ ప్రతిపత్తారః ప్రయోక్త్రా ప్రతిపాదితాః . 470

పూర్వమ్= ప్రయోగించుటకు ముందు, భేదేన = వేర్వేరుగా, అవగతౌ = తెలియబడిన, శబ్దౌ = శబ్దములు, పునః = మరల (ప్రయోగించు సమయమున), తుల్యశ్రుతీ =

సమానమైన వర్ణక్రమముగలవై, తంత్రేణ = తంత్రముతో, ప్రయోక్త్రా = వక్తచే, ప్రతిప్రత్తారః = బోద్ధలనుగురించి, ప్రతిపాదితాః = ప్రతిపాదింపబడును (వినిపింపబడును).

తా. మీది కారికకు ఇది వివరణము. ప్రయోగించుటకు ముందు 'శబ్దములు వేరు' అని తెలిసినను, వాని వర్ణక్రమము సమానమగుటచే, వక్త అగువాడు లాఘవమును అపేక్షించి ఒక్కసారే శబ్దమును ప్రయోగించును. అయినను బోద్ధ ఆవృత్తిని ఆశ్రయింపక తీరదు. దానివలననే అతనికి విభిన్నార్థములు తెలియును.

వి. 'అక్షాః (ఇరుసులు) అక్షాః (విభీతక ఫలములు), అక్షాః (పాచికలు)'. శబ్దభేదవాదములో ఈ మూడును వేర్వేరు శబ్దములు అయినను వీని స్వరూపమొకటే. అట్లే, 'శ్వా + ఇతః = శ్వేతః (కుక్క, ఇక్కడనుండి) 'శ్వేతః' (తెల్లనివాడు), అనుచోట కూడ శబ్దములు వేరు, రూపమొక్కటే. ఈ రూపసామ్యమును బట్టి సౌకర్యము కొరకై, వక్త ఒక్కసారే శబ్దమును ప్రయోగించును. అర్థములను తెలియునపుడు మాత్రము శబ్దములను వేరుచేసియే తెలియవలయును. శబ్దభేదవాదములో ఇంతకు మించిన ఉపాయము లేదు.

శబ్దభేదమతముననే వేరొకరితిని తంత్రమును నిరూపించుచున్నాడు.

ఏకస్యాపి వివక్షాయాం మనునిష్పద్యతే పరః
వినాభిసంధినా శబ్దః శక్తిరూపః ప్రకాశతే. 471

ఏకస్య = ఒక అర్థమునే బోధించు శబ్దముయొక్క, వివక్షాయామ్ + అపి = వివక్షయందు కూడ, పరః = రెండవ అర్థమును చెప్పు వేరొక శబ్దము, అనునిష్పద్యతే = తరువాత పుట్టును.

అభిసంధినా + వినా = వక్తయొక్క తాత్పర్యము లేకపోయినను, శబ్దః = అనేకార్థక శబ్దము, శక్తిరూపః = అనేకార్థములను ఇచ్చు అనేక శక్తులు కలదిగ, ప్రకాశతే = ప్రకాశించును (తెలియబడును).

తా. అనేకార్థకశబ్దమును వాడినపుడు, వక్తకు ఏదో ఒక అర్థమందే దృష్టి ఉండవచ్చును. వేరొక అర్థమందు దృష్టి లేకపోవచ్చును. అయినను శబ్ద స్వరూపము ఒకటే అయినందున, ఉచ్చరింపబడిన శబ్దమునకు వెనువెంటనే, అట్టి శబ్దమే వేరొకటికూడ స్ఫురించి, రెండవ అర్థము బోద్ధకు తెలియుచుండును. ఇట్లే ఎన్ని అర్థములను బోద్ధ అపేక్షించునో, అన్ని శబ్దములును, ఒక దాని వెనుక మరొకటి అతనికి వినిపించుచుండును. శబ్దభేదవాదుల యొక్క శబ్దతంత్రమును ఈ విధముగా కూడ వ్యాఖ్యానించుకొనవచ్చును.

అట్లే—"వక్తకు అనేకార్థములందు ఇచ్ఛ లేకున్నను, అతడు ప్రయోగించిన శబ్దమునకు అనేక శక్తులు ఉండుటవలన, వాని మూలముగా బోద్ధకు అనేకార్థములు తెలియుచుండునని" కూడ సమన్వయింపవచ్చును. ఇట్టి సమన్వయము శబ్దాభేదవాదులయొక్క శక్తితంత్రము-లేక- అర్థతంత్ర మగును (ఏదయినను ఫలితమొకటే).

వి. ఈ కారికయందలి మొదటి సగము, శబ్దభేదవాదుల శబ్ద తంత్రమునకు సంబంధించిన ప్రకారాంతరమును (వేరొకరీతి) చెప్పినది. రెండవ సగము, శబ్దాభేదవాదుల శక్తి తంత్రముయొక్క ప్రకారాంతరమును చూపినది. ఒక ధ్వనికి అనుబంధముగా పుట్టు ధ్వనిని అనురణన మందురు. అట్లే ఒక శబ్దమును పలుకగానే, అట్టివే మరికొన్ని శబ్దములు

పుట్టుటను అనునిష్పాదన మందురు. ఈ రీతిని స్వీకరించినపుడు శబ్దావృత్తి అక్కరలేదు. (ఎట్టియుక్తిని చూపినను, "ఒక శబ్దమువలన అనేకార్థములను సాధించుటయే" పరమార్థము).

ఈ సందర్భముననే శక్తితంత్రమును చూపుచున్నాడు.

అనేకశక్తి రేకస్య యుగప చ్ఛ్రియతే క్వచిత్
అగ్నిః ప్రకాశదాహాభ్యా మేకత్రాపి నియుజ్యతే. 472

ఏకస్య = ఒకే శబ్దముయొక్క, అనేకశక్తిః = వేరుగా అర్థములను బోధించు శక్తులు, క్వచిత్ = కొన్నిచోట్ల, యుగపత్ = ఒక్కసారిగా (కలిసికట్టుగా), శ్రీయతే = ఆశ్రయింపబడును.

ప్రకాశదాహాభ్యామ్ = వెలుగుట, కాల్చుట అను రెండు శక్తులతోను, అగ్నిః = అగ్ని, ఏకత్ర + అపి = ఒకేచోటకూడ, నియుజ్యతే = వినియోగింపబడును.

తా. శబ్దాభేదవాదుల శక్తితంత్రములోని వేరొకరీతిని, ఈ కారిక వివరించినది. శక్తి తంత్రమున ఒకే శబ్దమునకు, వేర్వేరు అర్థములను బోధించు వేర్వేరు శక్తులు ఉండును. కొన్నిచోట్ల ఆ శక్తులన్నియును ఒకేసారి పనిచేయును. కాన, కావలసిన అర్థము లన్నియును ఒకేసారి తెలియును.

ఇందుకు లౌకికమైన ఒక దృష్టాంతము: అగ్నికి వెలుగు నిచ్చుట, కాల్చుట అను రెండు శక్తులున్నవి. వానిని ఆవశ్యకతనుబట్టి ఆయా సమయములలో, ఆయా స్థలము లలో, ప్రత్యేకముగ కాని, కలిసికట్టుగా ఒకేసారి గాని వాడుకొనవచ్చును (కొన్నిచోట్ల వెలుగుమాత్రమే. కొన్నిచోట్ల దాహము మాత్రమే. మరికొన్నిచోట్ల రెండున్ను కలిసి). శబ్ద శక్తుల విషయమును కూడ ఇట్లే ఊహించునది.

వి. వక్త యేదో ఒక అర్థమునే చెప్పదలచినపుడు, వేరొక అర్థము వచ్చు రీతి మీది కారికలో వివరింపబడినది. 'అన్ని అర్థములను వివక్షించినను అవన్నియు, ఒకేసారి రావచ్చు' నను పద్ధతిని ఈ కారిక చెప్పినది. అనగా వక్తయొక్క ఇచ్ఛానుసారము శబ్దశక్తులు పనిచేసి, ముందువెనుకలుగా కాని, ఒకేసారి కాని అర్థము లన్నియును వచ్చుచుండు నని సారాం శము. 'అక్ష' మొదలగు శబ్దములును, "శ్వేతో ధావతి" మొదలగు వాక్యములును ఉదాహర ణములను విషయమును మరువకూడదు.

నానార్థక స్థలములలో—ఒకే ఆకారముగల శబ్దములు వేరువేరుగా ఉండి, వేర్వేరు అర్థములను చెప్పుట ఒక పద్ధతి. ఒకే శబ్దము ఉండి, వేర్వేరు అర్థములను చెప్పుట రెండవ పద్ధతి. ఇది సూత్రప్రాయము. ఇది మనస్సుకు గట్టిగా పట్టుటకై, గ్రంథకర్త అనేకరీతులలో చర్విత చర్వణముగా (చెప్పినదానినే చెప్పుట) చర్చలను కొనసాగించెను. 'ద్విర్బద్ధం సుబద్ధం భవతి' (రెండుకట్లు కట్టినచో బాగుగా బిగియును) అను న్యాయముతో వీనిని సమర్థించు కొనవలెను.

శాస్త్రీయ వాక్యములో శక్తితంత్రమును సమన్వయించుచున్నాడు.

అవృత్తిశక్తిభిన్నార్థే వాక్యే సకృదపి శ్రుతే
లింగా ద్వా తంత్రధర్మా ద్వా విభాగేనావతిష్ఠతే. 478

అవృత్తి శక్తి భిన్నార్థే=శబ్దముయొక్క అవృత్తివలనగాని, శబ్దశక్తుల భేదము వలనగాని వేర్వేరు అర్థములను బోధించు, వాక్యే = వాక్యము, ("ఇగ్యణః సంప్రసారణమ్" మొదలగు శాస్త్రీయమైన వాక్యము), సకృత్=ఒకసారి, శ్రుతే + అపి=వినబడినను, (తత్ = ఆ వాక్యము) లింగాత్ + వా = జ్ఞాపకమువలన గాని (విశేషార్థమును సూచించునది), తంత్ర ధర్మాత్ + వా = శక్తితంత్రమువలన గాని, విభాగేన = వేరుగా (వేర్వేరు అర్థములను బోధించునదిగా), అవతిష్ఠతే = ఉండును.

తా. 'ఇగ్యణః సంప్రసారణమ్' (1-1-45) మొదలగు శాస్త్రీయ వాక్యములలో కూడ, రెండర్థములు వచ్చుచుండు'నని ఇదివరకు సూచింపబడినది (468 వ శ్లోకకము). ఆ యంశమునే మరల ఈ కారిక వివరించుచున్నది. "ఇక్, యణః" (యణ్ణుల స్థానమందలి ఇక్కులకు) అను వాక్యమునకు సంప్రసారణ సంజ్ఞ అనునది ఇచటి మొదటి అర్థము. "య్, వ్, ర్, ల్ అను వర్ణముల స్థానములో వరుసగా ప్రయోగింపబడు ఇ, ఉ, ఋ, ఌ, అను వర్ణములకు ప్రత్యేకముగా సంప్రసారణ మని పేరు" అనునది రెండవ అర్థము. ఈ రెండర్థములను శబ్దభేదవాదుల మతములో 'శబ్దావృత్తి' వలన సిద్ధించును. శబ్దాభేదవాదుల మతములో 'శక్తితంత్రము' (రెండర్థములను చెప్పు రెండు శక్తులుండుట) వలన లభించును.

శబ్దభేదవాదులకు ఇతర సూత్రములలో కనబడు జ్ఞాపకములు కూడ సాయము చేయును. ఎట్లన : 'సంప్రసారణాచ్చ' (6-1-10०) మొదలగు సూత్రములు 'వర్ణములకే సంప్రసారణ సంజ్ఞ' అని జ్ఞాపనము చేయును. 'వసోః సంప్రసారణమ్' (6-4-131) మొదలగు సూత్రములు 'వాక్యమునకు సంప్రసారణ సంజ్ఞ' అని సూచించును.

శబ్దాభేదవాదులు, "రెండర్థములనిచ్చు రెండు విధములైన శక్తులును వాక్యమునకే ఉండును' అని అందురుగాన, వారికి జ్ఞాపకములతో పనిలేదు.

వి. 'శ్వేతోధావతి' మొదలగు లౌకిక వాక్యములకువలెనే, 'ఇగ్యణః సంప్రసారణమ్' మొదలగు పాణిని వాక్యములకు కూడ రెండర్థములు సంభవించుననియు, మతభేదము ననుసరించి అవృత్తివలననో. లేక అర్థతంత్రమువలననో ఆ అర్థములను సాధించుకొన వలయు ననియును ఈ కారికయొక్క తత్త్వము.

"సంప్రసారణాచ్చ"(6-1-108) అని సూత్రము 'సంప్రసారణా దచి పరే పూర్వ రూప మేకాదేశః స్యాత్' అని వృత్తి, 'సంప్రసారణమను సంజ్ఞ గల వర్ణమునకు అచ్చు పరమగునపుడు పూర్వరూప మేకాదేశమగును' అని అర్థము. ఇచట విధింపబడు 'పూర్వరూప' మను కార్యము వర్ణమునకు మాత్రమే సంభవించును గాన ఈ సూత్రము 'వర్ణములకు సంజ్ఞ అను అర్థమును తెలియజేయును.

'వసోః సంప్రసారణమ్' (6-4-131) అని సూత్రము. 'వస్వంతస్య భస్య సంప్రసారణం స్యాత్' అని వృత్తి. "భసంజ్ఞ కలిగిన వస్వంతమునకు (విద్వస్, మొదలగు శబ్దములు) సంప్రసారణమగును" అని అర్థము. ఇచట సంప్రసారణ శబ్దమువలన "యణ్ణుల స్థానమందలి ఇక్కులకు మొత్తముపై సంప్రసారణమని పేరు గదా: అది ఇచట ప్రవర్తించును'' అన్నట్లుగా, సామాన్యార్థము మొదట స్ఫురించునుగాన ఈ సూత్రము 'వాక్యమునకు సంప్రసారణ సంజ్ఞ' అను అర్థమును తెలియజేయును. ప్రకృతకారికయందలి 'లింగము' అనగా ఇట్టి సూచనయే.

సంప్రసారణ సంజ్ఞాయాం లింగాఖ్యాం వర్ణవాక్యయోః
ప్రవిభాగ స్తత్ర సూత్రే ఏకస్మిన్నేవ కల్ప్యతే . 474

సంప్రసారణ సంజ్ఞాయామ్=సంప్రసారణమను సంజ్ఞా శబ్ద విషయములో, వర్ణ వాక్యయోః=ప్రత్యేక వర్ణములకును, వాక్యమునకును చెందిన, లింగాఖ్యామ్=జ్ఞాపకములవలన, తత్ర=ఆ, ఏకస్మిన్=ఒక, సూత్రే+ఏవ=సూత్రమందే, ప్రవిభాగః=వర్ణములకును సంజ్ఞ, వాక్యమునకును సంజ్ఞ అను విభాగము, కల్ప్యతే=లభించును.

తా. 'ఇగ్యణః సంప్రసారణమ్' అనునది సంజ్ఞా సూత్రము. "సంప్రసారణాచ్చ" "వసోఃసంప్రసారణమ్" మొదలగునవి విధి సూత్రములు. వీనియందలి సూచనలను బట్టి, 'వర్ణములకును, వాక్యమునకును కూడ సంప్రసారణమను సంజ్ఞ ఉండవచ్చును' అను అర్థము తెలియుచుండును.

వి. మీది కారిక చెప్పిన విషయమునకు వ్యాకరణ శాస్త్రమందలి ఒక ఉదాహరణమును ఈ కారిక చూపినది. ఆ యా విధి సూత్రములలో వినబడు 'సంప్రసారణస్య' 'సంప్రసారణాత్' మొదలగు ఇతర విభక్తులు వర్ణ సంజ్ఞా పక్షమును, 'సంప్రసారణమ్' అను ప్రథమా విభక్తి, వాక్యసంజ్ఞా పక్షమును సూచించునని సారాంశము.

శక్తితంత్రమనెడు అర్థతంత్రము పతంజలికిని అభిమతమే అని సమర్థించుచున్నాడు.

తథా ద్విర్వచనేఽచీతి తంత్రోపాయాదిలక్షణః
ఏకశేషేణ నిర్దేశో భాష్య ఏవోపవర్ణితః . 475

తథా=ఆవిధముగా, ద్విర్వచనేఽచి+ఇతి="ద్విర్వచనేఽచి" అను సూత్రము యొక్క, భాష్యే+ఏవ=మహాభాష్యమందే, తంత్రోపాయాదిలక్షణః=శక్తితంత్రము, లేక-శబ్దావృత్తి అను ఉపాయములను సూచించు, ఏకశేషేణ=ఏకశేషముతో, నిర్దేశః=ప్రయోగము (ఉచ్చారణము), ఉపవర్ణితః=చెప్పబడినది.

తా. ఒక శబ్దమువలన అనేకార్థములను సాధించుటకు, శక్తితంత్రమునుగాని, శబ్దావృత్తిని గాని ఉపాయముగా తీసికొనవచ్చునను అంశమును, 'ద్విర్వచనేఽచి' (1-1-59) అను సూత్రముయొక్క వ్యాఖ్యానమున మహాభాష్యకారుడే స్వయముగ సూచించెను.

వి. "తంత్రము" లేక "ఆవృత్తి" అను ఉపాయముల మూలముగా, అనేకార్థములను పొందవచ్చునని ఇంతవరకును గ్రంథకర్త 'పదే పదే' విశదీకరించెను. అట్టి ఆశయము తన కల్పన కాదనియు, మహా ప్రామాణికుడగు పతంజలియొక్క సిద్ధాంతమే అనియును సమర్థించుటకై ఈ కారికను రచించెను.

"ద్విర్వచనేఽచి' (1-1-59) అని సూత్రము. 'ద్విత్వనిమిత్తే అచి పరే, అచః ఆదేశో న స్యాత్, ద్విత్వే కర్తవ్యే' ద్విత్వము చేయతలపెట్టినపుడు, ద్విత్వమునకు నిమిత్తమైన అచ్చు పరమందుండగా, ముందున్న అచ్చునకు ఎట్టి ఆదేశమును ప్రవర్తింపదు' అని అర్థము.

ఇచట మనకు కావలసిన ముఖ్యాంశ మిది : సూత్రమందు 'ద్విర్వచనే' అను పద మొకసారే ఉచ్చరింపబడినది. కాని దానివలన, 'ద్విత్వనిమిత్తము' 'ద్విత్వము' అను రెండర్థములను గ్రహింపవలసి ఉన్నది. "ఒక శబ్దమువలన రెండర్థములు ఎట్లు వచ్చును ?" అని

శంక కలిగినది. దానికి సమాధానముగా 'ద్విర్వచనే' అనునది, 'ఏకశేష'మని పతంజలి చెప్పెను. అది వాస్తవముగ ఏకశేషమైనచో, "ద్విర్వచనయోః" అని ప్రయోగము ఉండక తీరదు (రామయోః—అన్నట్లు సప్తమీ ద్వివచనాంతము). కాని అట్లు ప్రయోగము లేదు. అందువలన ఏక శేషపదముతో, 'శక్తితంత్రమును-లేక-శబ్దావృత్తిని' పతంజలి సూచించెనని అనక తప్పదు. ఈ విధముగ 'తంత్రావృత్తులు' పతంజలికి అభిమతములే అని ఫలించును.

'యత్ పునః ద్వితీయం ద్విర్వచన గ్రహణం కర్తవ్యమ్ః న కర్తవ్య మిత్యాహ-ఏకశేష నిర్దేశాత్ సిద్ధమ్' (సూత్రములో రెండవసారి 'ద్విర్వచనే' అని పలుకవలయునా ః—అక్కరలేదు-ఏకశేషమనుటవలన అభీష్టార్థము సిద్ధించును) అనునవి ఈ సందర్భములోని పతంజలి వచనములు. కాగా "తంత్రము, ఆవృత్తి" అని స్పష్టముగ చెప్పకపోయినను, ఏక శేష శబ్దముతో ఆ రెండింటిని సూచించినట్లు అనుకొనక తీరదు. అట్లు కాకున్న 'ద్విర్వచనయోః' అని ప్రయోగమును చేయవలసి ఉండును. ఉన్నదున్నట్లు సమర్థించుటయే గాని, ప్రయోగమును మార్చుట పతంజలికి ఎంత మాత్రమును ఇష్టము కాదు.

ఈ కారికతో రెండవకాండము యొక్క విషయమంతయు పూర్తి అయినది. ఇటుపైని పది శ్లోకములతో భర్తృహరి, 'తన గ్రంథము సంప్రదాయబద్ధమనియు, ప్రామాణికమనియును' ప్రతిపాదించును. ఆ సందర్భముననే, మహాభాష్యము యొక్క మహత్త్వమును, గురుపరంపరను, తన పరిశ్రమను కూడ చరిత్రరూపమున విశదీకరించును.

మహాభాష్యముయొక్క అవతారమును—తన గ్రంథముయొక్క గురుసంప్రదాయమును వర్ణించుచున్నాడు.

ప్రాయేణ సంక్షేపరుచీ వల్పవిద్యాపరిగ్రహాన్
సంప్రాప్య వైయాకరణాన్ సంగ్రహేఽస్త ముపాగతే. 476

సంక్షేపరుచీన్ = లాఘవమందును, సౌకర్యమందును ఆసక్తి గలిగినట్టియు, అల్ప విద్యా పరిగ్రహాన్ = విద్యలను తక్కువగా అభ్యసించినట్టి, వైయాకరణాన్ = వైయాకరణులను, ప్రాయేణ = అధికముగా, సంప్రాప్య = పొంది, సంగ్రహే = 'సంగ్రహము' అను గ్రంథము, అస్తమ్ = కనబడకపోవుటను, ఉపాగతే = పొందగా (దిగువ శ్లోకముతో అన్వయించుకొనవలెను).

తా. కేవలము సుఖాపేక్షచే పెద్ద గ్రంథములను చదవలేక, చిన్నచిన్న గ్రంథములందే ఆసక్తిని చూపునట్టియు, విద్యలందు తక్కువ పరిశ్రమను చేసినట్టియు వైయాకరణులు చాలామంది 'సంగ్రహము' అను మహాగ్రంథమును ఆదరింపకపోవుటవలన, ఆ గ్రంథము కాలగర్భములో కరగిపోయినది. అప్పుడు—

వి. ఈ శ్లోకము మొదలు వరుసగా పది శ్లోకములు మహాభాష్యము యొక్క ఆవిర్భావమును, గౌరవమును, వాక్యపదీయము భాష్యసారమగుటను, కథారూపమున వివరించి చూపును.

పాణినీయ వ్యాకరణమునకు మూలము, పాణిని రచించిన సూత్ర రూపమైన ఎనిమిది అధ్యాయముల గ్రంథము. దీనినే 'అష్టాధ్యాయి' అని అందురు. పిదప 'వ్యాడి' అను ఆచార్యుడు అష్టాధ్యాయిపై "సంగ్రహము" అనుపేరుతో, ఒక గొప్ప గ్రంథమును రచించెను.

అది లక్ష అనుష్టుప్ శ్లోకములు కలిగియుండె నందురు. అది అలసులును, మందబుద్ధులు నగు వ్యక్తుల చేతులలో పడి, కాలక్రమమున నశించిపోయెను. (భాష్యకారుడగు పతంజలి 'సంగ్రహము'ను పెక్కుసారులు పేర్కొనెను. అతనిసమయములో ఆ గ్రంథము ఉండి ఉండవచ్చును.)

పతంజలి మహాభాష్యమును రచించెనని, అది మహావైభవ సంపన్నమనియు వివరిం చుచున్నాడు.

> కృతేఽథ పతంజలినా గురుణా తీర్థదర్శినా
> సర్వేషాం న్యాయబీజానాం మహాభాష్యే నిబంధనే. 477
>
> అలబ్ధగాధే గాంభీర్యా దుత్తాన ఇవ సౌష్ఠవాత్
> తస్మి న్నకృతబుద్ధీనాం నైవావాస్థిత నిశ్చయః. 478

అథ = తరువాత, గురుణా = పూజ్యుడైనటువంటిన్ని, తీర్థదర్శినా = పెక్కు శాస్త్రముల రహస్యములను తెలిసినటువంటిన్ని, పతంజలినా = పతంజలి అను మహాను భావునిచే, గాంభీర్యాత్ = గాంభీర్యమువలన (విషయ గౌరవము), అలబ్ధగాధే = లోతు తెలియనటువంటిన్ని (అంతు చిక్కనటువంటిది), సౌష్ఠవాత్ = సరళముగా ఉండుటవలన, ఉత్తానే + ఇవ = లోతులేనట్లు కనబడునటువంటిన్ని (విశదముగా ఉండునటువంటిది), సర్వేషామ్ = సకలమైన, న్యాయబీజానామ్ = లౌకికములును, శాస్త్రీయములునగు న్యాయము లకును పరిభాషలకును, నిబంధనే = మూలకారణమైన, మహాభాష్యే = మహాభాష్యమను వ్యాఖ్యానము, కృతే = రచింపబడగా, అకృతబుద్ధీనామ్ = బుద్ధివైభవము లేనివారలకు తస్మిన్ = ఆభాష్యమందు, నిశ్చయః=నిర్ణయము (తత్త్వజ్ఞానము), న + ఏవ + అవాస్థిత=, కలుగనేలేదు.

తా. వ్యాడివిరచితమైన సంగ్రహమను గ్రంథము నశించిన పిదప, భగవత్ప తంజలి పాణినీయ వ్యాకరణమునకు 'మహాభాష్య' మహావ్యాఖ్యను సంతరించెను అది సకల న్యాయములకును పుట్టినిల్లు. అతిగంభీరము అయినను మృదుమధురమైన శైలితో ప్రకా శించునుగాన, పైపైని తేలికగా తోచును. అందువలననే సామాన్యమానవులు ఆ గ్రంథము యొక్క తత్త్వమును గ్రహింపజాలరు.

వి. పాణినీయాష్టాధ్యాయిపై విమర్శరూపమైన వార్తికములను వరరుచి అనబడు కాత్యాయనుడు రచించెను. వార్తికములు చాలవరకు పాణిని సూత్రములను అధిక్షేపించు చుండును. సూత్రములను వార్తికములను కూడ కలిసికట్టుగా తీసికొని, సర్వతోముఖమైన విమర్శమును చేయుచు, తుదకు కాత్యాయనుని ఖండించి పాణినినే పతంజలి సమర్థించును. అతడు సాక్షాత్తుగ ఆదిశేషుని అవతారమందురు (అనగా సాటిలేని మహామేధావి అని భావము). వేరొక వ్యక్తి ఎంతటి పండితుడైనను అంతటి మహావ్యాఖ్యను రచింపజాలడు.

మహాభాష్యము సరళము, గంభీరమును అగు సంస్కృతములో, సంభాషణ రూపమున సాగినది. పైపైని చదువువారలకు అది తేలికగానే తోచును. కాని అందలి ఉక్తి ప్రత్యుక్తుల తాత్పర్యమును, వాదధోరణిని, న్యాయపరిశీలనమును సమన్వయించుకొని విషయ

నిర్ణయమును పొందగలుగుట సామాన్యబుద్ధులకు సాధ్యము కాని పని. కావుననే మహాభాష్య మును మహాసాగరముతో పోల్చుచుందురు.

కాలక్రమమున మహాభాష్యము నష్టప్రాయమయ్యెనని చెప్పుచున్నాడు.

బైజి సౌభవ హార్యక్షైః శుష్కతర్కానుసారిభిః
ఆర్షే విప్లావితే గ్రంథే సంగ్రహప్రతికంచుకే . 479

శుష్కతర్కానుసారిభిః = కేవలము తర్కమును మాత్రమే అనుసరించు, బైజి సౌభవ హార్యక్షైః = బైజి–సౌభవుడు–హార్యక్షుడు అనువారలచే, ఆర్షే = పతంజలి మహర్షిచే రచింపబడినటువంటిన్ని, సంగ్రహప్రతికంచుకే = సంగ్రహమునకు సంరక్షకమైనటువంటిన్నీ, గ్రంథే = మహాభాష్యగ్రంథము, విప్లావితే = పాడుచేయబడగా (నశింపచేయబడగా) – (తరువాత శ్లోకముతో అన్వయింపవలెను).

తా. బైజి, సౌభవుడు, హార్యక్షుడు అనువారలు ఆనాటి తార్కికులు. వారు తమ తర్కమును మాత్రమే అవలంబించి మాహాభాష్యముయొక్క తత్త్వమును తెలియజాలక క్రమముగ దాని వినాశమునకు కారకులైరి.

వి. మానవుని బుద్ధిబలమువలన సిద్ధించు ఊహారూపమైనది తర్కము. దానిని మాత్రమే ప్రమాణముగ తీసుకొనువారు శుష్కతార్కికులు. వారికి ఇతర శాస్త్రములందు ప్రవేశముగాని అభిరుచిగాని ఉండదు. తత్త్వ విషయములు తర్కమునకు లొంగవు. అవి అతీంద్రియములు. ద్రష్టలగు ఋషులకే అవి 'తమకు తాముగా' సమర్పించుకొనును. పతంజలిముని ద్రష్టలలో అగ్రేసరుడు. శబ్దతత్త్వముతో పాటు ఎన్నింటినో అతీంద్రియ తత్త్వములను, తనభాష్యమున అతడు పొందుపరచెను. శుష్క తార్కికులు వానిని గ్రహింప జాలక, తిరస్కరించుటవలన క్రమముగ మహా భాష్యము ప్రచారమునుండి తొలగిపోయెను.

కొందరు దాక్షిణాత్యులయొద్ద మాత్రము భాష్యగ్రంథము మిగిలెనని సూచించు చున్నాడు.

యః పతంజలిశిష్యేభ్యో భ్రష్టో వ్యాకరణాగమః
కాలే స దాక్షిణాత్యేషు గ్రంథమాత్రే వ్యవస్థితః . 480

కాలే = ఒకానొక సమయమున, పతంజలి శిష్యేభ్యః = మందబుద్ధులగు పతంజలి యొక్క శిష్యులనుపొంది, భ్రష్టః = జారిపోయినటువంటి (పఠనపాఠనాదులనుండి దూర మైపోయిన), యః = ఏ, వ్యాకరణాగమః = వ్యాకరణ సంప్రదాయముగలదో, సః = అది, దాక్షిణాత్యేషు = దక్షిణదేశమం దుండు పండితులలో, గ్రంథమాత్రే = కేవలము గ్రంథరూప మున, వ్యవస్థితః = నిలిచిపోయినది.

తా. ఆ విధముగ శుష్క తార్కికుల చేతిలోను, బుద్ధివైభవములేని శిష్యుల చేతిలోను పడి–'కోతి చేతిలోని మహారత్నము' వలె నిరర్థకమై, పఠనపాఠనాది సంప్రదాయ రహితమై వ్యాకరణశాస్త్రము (మహాభాష్యము) కొంతకాలమునకు లుప్తప్రాయమయ్యెను. ఎక్కడో దాక్షిణాత్యుల ఇండ్లలో మాత్రము, అది గ్రంథరూపమున మూలబడి మూల్గు చుండెను.

వి. "వ్యాకరణాగమము" అనగా - వ్యాకరణ సంప్రదాయము = మునిత్రయో పజ్ఞమైన వ్యాకరణశాస్త్రమును, దాని అధ్యయనాధ్యాపనములును అగును.

గురుసంప్రదాయమును చూపి దానివలన తనకు వ్యాకరణాగమము సంక్రమించెనని స్పష్టపరచుచున్నాడు.

పర్వతా దాగమం లబ్ధ్వా భాష్యబీజానుసారిభిః
స నీతో బహుశాఖత్వం చంద్రాచార్యాదిభిః పునః . 481

భాష్యబీజానుసారిభిః = భాష్యమందలి న్యాయములను, రీతులను అనుసరించు, చంద్రాచార్యాదిభిః = చంద్రుడు, వసురాతుడు మొదలగు ఆచార్యులచే, పర్వతాత్ = ఒక కొండనుండి, ఆగమమ్ = వ్యాకరణ సంప్రదాయమును, లబ్ధ్వా = పొంది, సః = ఆ వ్యాకరణ శాస్త్ర సంప్రదాయము, పునః = మరల, బహుశాఖత్వమ్ = శాఖోపశాఖలగుటను, నీతః = పొందింపబడెను.

తా. నష్టప్రాయమైన ఆ వ్యాకరణ సంప్రదాయమును, చంద్రుడు, వసురాతుడు మొదలగు మహా విద్వాంసులు కొందరు, భాష్యన్యాయానుసారముగనే వ్యాఖ్యానించి బహువిధములుగ లోకమున వ్యాప్తిగావించిరి. ఒకానొక కొండయొక్క రాతిపలకలపై వారికి వ్యాకరణాగమము లభించెను.

వి. "లంకలోని ఒకకొండయొక్క పలకలపై రావణుడు వ్యాకరణాగమమును వ్రాయించెననియు, దానిని ఒక బ్రహ్మరాక్షసుడు సంగ్రహించి కాలక్రమమున చంద్రాచార్యుల కిచ్చెననియును" ఒక గాథ కలదు. ఇటువంటి కథలకు చారిత్రకాధారములు లభింపవు. "పోయినదనుకొన్న వ్యాకరణసంప్రదాయము ఏదోవిధమున మరల కొందరు మేధావులకు దొరికెననియు, వారు దానిని విస్తరింపజేసిరనియు, అదియే మహాభాష్యమునకును, తద్వ్యాఖ్యలకును పునరుజ్జీవనమయ్యెననియును" భావించుకొనవలెను.

న్యాయప్రస్థానమార్గాం స్తా నభ్యస్య స్వం చ దర్శనమ్
ప్రణీతో గురుణాఽస్మాక మయ మాగమసంగ్రహః . 482

తాన్ = ఆయా, న్యాయప్రస్థానమార్గాన్ = భాష్యన్యాయములయొక్క రాజ మార్గములను, స్వమ్ = తనసంబంధమైన, దర్శనమ్ + చ = వ్యాకరణ సిద్ధాంతములను, అభ్యస్య = బాగుగా పరిశీలించి, గురుణా = గురువైన వసురాతునిచే, అయమ్ = ఈ వాక్య పదీయరూపమైన, ఆగమసంగ్రహః = వ్యాకరణ సంప్రదాయసారము, అస్మాకమ్ = మాకు, ప్రణీతః = ఈయబడినది.

తా. వసురాతుడు మాకు (భర్తృహరికిని-అతని సహాధ్యాయులకును) గురువు. అతడు మహావైయాకరణుడు. వ్యాకరణముయొక్క మూలసిద్ధాంతములును, మహాభాష్యము యొక్క న్యాయములను అతనికి కరతలామలకములు. అతడే మమ్మనుగ్రహించి, ఈ వాక్య పదీయమును మాకిచ్చెను.

వి. భర్తృహరియొక్క గురువుపేరు వసురాతుడని వైయాకరణులు అందురు. "అతడే వాక్యపదీయము యొక్క ప్రణాళికను, సిద్ధాంతములను ఉపదేశించెననియు,

అవన్నియు మహాభాష్యమును అనుసరించినవే అనియు, స్వకపోలకల్పనలు ఇందు లేవనియు, గురూపదేశములకు గ్రంథరూపము నిచ్చుటయే తానుచేసిన పని అనియును' గ్రంథకారుని తాత్పర్యము. దీనివలన గ్రంథముయొక్క గౌరవమును, గ్రంథకర్తకు గురువులయెడ ఉన్న గౌరవమును వెల్లడియగును. 'వాక్యపదీయము సర్వథా భాష్యసిద్ధాంత సర్వస్వము' అనునది ఈ ఘట్టమందలి సారాంశము.

మూడవకాండమున వ్యాకరణాగమవిషయములు సమగ్రముగ చర్చింపబడినవని చెప్పుచున్నాడు.

వర్త్మనా మత్ర కేషాంచిత్ వస్తుమాత్ర ముదాహృతమ్
కాండే తృతీయే న్యక్షేణ భవిష్యతి విచారణా . 483

కేషాంచిత్ = కొన్ని, వర్త్మనామ్ = భాష్య సిద్ధాంత మార్గములయొక్క, వస్తుమాత్రమ్ = మూలస్వరూపము మాత్రమే, అత్ర = ఈ రెండు కాండములందును, ఉదాహృతమ్ = చెప్పబడినది; తృతీయే = మూడవ, కాండే = కాండమందు, న్యక్షేణ = ఆదరముతో (పూర్తిగా), విచారణా = పరిశీలనము, భవిష్యతి = జరుగగలదు.

తా. ఈ గ్రంథమున మొదటి కాండము బ్రహ్మకాండము. రెండవది వాక్యకాండము. ఈ రెండు కాండములందును, భాష్య సిద్ధాంతముల మూలరూపము ప్రదర్శింపబడినది. మూడవ కాండము పదకాండము. అందు సకల విషయములును సాదరముగ చర్చింపబడును.

వేర్వేరు శాస్త్రములనుగూడ క్షుణ్ణముగ అభ్యసించినందువలననే విద్యాసిద్ధి సంభవించునని నిరూపించుచున్నాడు.

ప్రజ్ఞా వివేకం లభతే భిన్నై రాగమదర్శనైః
కియద్వా శక్య మున్నేతుం స్వతర్క మనుధావతా . 484

భిన్నైః = అనేకవిధములైన, ఆగమదర్శనైః = శాస్త్రములయొక్క సిద్ధాంతములచే, ప్రజ్ఞా = నిశితమైనబుద్ధి, వివేకమ్ = వైశాల్యమును—వైశద్యమును, లభతే = పొందును. స్వతర్కమ్ = తనయొక్క ఊహనుమాత్రమే, అనుధావతా = అనుసరించువానిచే, కియత్ + వా = ఏపాటిజ్ఞానము, ఉన్నేతుమ్ = సంపాదించుటకు, శక్యమ్ = వీలుకలిగెడిని ?

తా. వివిధములైన శాస్త్రములను బాగుగా అభ్యసించుటవలననే, బుద్ధిపాటవము పెరుగును. కేవలము తన బుద్ధినిమాత్రమే అవలంబించి, విషయములను ఊహించు వ్యక్తి, పరిపూర్ణజ్ఞానమును ఎన్నటికిని సంపాదింపజాలడు.

వి. ఆయా శాస్త్రవిషయములను అన్నింటిని కూలంకషముగ దివ్యశక్తితో పరికించి, ప్రవర్తింపజేయగల మహానుభావులు కొందరే ఉందురు. వారు ఋషులును, ద్రష్టలును అగుదురు. వారివిషయము వేరు. సామాన్యమానవుడుమాత్రము, సిద్ధముగఉన్న అనేకశాస్త్రములను అభ్యసించియే చక్కని పండితుడు కాగలుగును. అపుడే తన సిద్ధాంతమును సమర్థించుటకుగాని, ఇతరుల ఆశయమును ఖండించుటకుగాని అతనికి అడ్డులేని నేర్పు అలవడును. శాస్త్రసంస్కారములేని బుద్ధి ఎంతటి నిశితమైనదైనను, ఎందుకును కొరగాదు.

"ఏదోఒక శాస్త్రమునుమాత్రమే అభ్యసించి తృప్తి పడకూడదు. వీలయినంత వరకును ఇతరశాస్త్రములనుకూడ పరిశీలింపవలెను. అపుడే సమగ్రమైన జ్ఞానమున్ను, పరిశీలనాశక్తియు సమకూరును" అని సారము.

తత్తదుత్ప్రేక్షమాణానాం పురాణై రాగమై ర్వినా
అనుపాసితవృద్ధానాం విద్యా నాతిప్రసీదతి . 485

ఇతి వాక్యపదీయే వాక్యకాణ్డం సమాప్తమ్.

పురాణైః=ప్రాచీనములగు, ఆగమైః=శాస్త్రములను, వినా=విడిచిపెట్టి, తత్ + తత్ = ఆయా విషయమును, ఉత్ప్రేక్షమాణానామ్=ఊహించువారియొక్కయు, అనుపాసిత వృద్ధానామ్=పెద్దలగు గురువులను సేవింపనివారియొక్కయు, విద్యా=విద్య (ప్రజ్ఞ, ప్రతిభ), అతి = ఎక్కువగా, న + ప్రసీదతి = అనుగ్రహింపదు (ప్రకాశింపదు).

తా. గురువులను సేవింపకయు. శాస్త్రములను చదువకయు, కేవలము తనబుద్ధి బలముతో "అది అట్లు, ఇది ఇట్లు" అని ప్రతియొకవిషయమును నిశ్చయింప సమకట్టిన వ్యక్తియొక్క విజ్ఞానము రాణింపదు. గురు శుశ్రూషయు, శాస్త్రాభ్యాసమును మాత్రమే ప్రజ్ఞాప్రాభవమును సంపాదించిపెట్టును. ప్రతిభాప్రకాశమునకు ఇంతకుమించిన రాజమార్గము లేదు.

వి. మీదికారికచెప్పిన అంశమునే ఈ కారిక వివరించినది. భారతీయుల భారతీ సంప్రదాయమును, భర్తృహరియొక్క సంప్రదాయప్రవణతను ఈ రెండుకారికలును చక్కగా చిత్రించినవి.

వాక్యపదీయమున వాక్యకాండము
సమాప్తము.

# పారిభాషికపదకోశము

**అకృత్రిమము** II. 866.

స్వభావసిద్ధమైనది. ప్రయత్నముచే నిర్మితమైనది కానిది. ఉదా: ద్రవ్యగుణములలో గుణము ఎల్లప్పుడును విశేషణముగనే ఉండును. ద్రవ్యము విశేష్యముగనే ఉండును. వీటి విశేషణత్వ విశేష్యత్వములు సహజములే కాని ఇపుడు క్రొత్తగ కల్పించినవి కావు.

**అఙ్గిరస్** I. 21.

అథర్వవేదద్రష్టలగు ఋషుల వంశమునకు పేరు. ఇచట అథర్వవేదము అనునర్థమున ప్రయోగింపబడినది.

**అతిదేశము** II. 78.

ఒక దాని ధర్మములు మరియొకదానితో గూడ సంబంధించు వని చెప్పుట.

'గురు పుత్రుని గురువునువలె చూడవలెను' అనగా గురు ధర్మములు, వచనానుసరణ నమస్కారాదులు, గురు పుత్రుని యందు అతిదేశింపబడుచున్నవి. "స్థానివదాదేశోఽనల్విధౌ" అను సూత్రము స్థానికి గల ధర్మములను ఆదేశమునందు గూడ అతిదేశించు చున్నది. సామాన్యాతిదేశము, విశేషాతిదేశము అని అతిదేశము రెండు విధములు. "బ్రాహ్మణవత్ క్షత్రియేఽస్మిన్ వర్తితవ్యమ్" అనుచోట సామాన్యాతిదేశము. "బ్రాహ్మణవదస్మిన్ బ్రాహ్మణే వర్తితవ్యమ్" అనుచోట విశేషాతిదేశము.

**అథర్వన్** I. 21.

అథర్వవేదద్రష్టలగు ఋషుల వంశమునకు పేరు. ఇచట ఈ పదము అథర్వవేదమను నర్థమున ప్రయుక్తమైనది.

**అధికరణము** II. 116.

చర్చనీయాంశము. విచారస్థానము.

**అధికారము** II. 79.

శాస్త్రము మొదలగునవి ప్రవర్తించుటకు అనువగు స్థానము. ఉదా. "ప్రతిపాద్యేషు శబ్దేషు వ్యాకరణశాస్త్రస్యాధికారః" "వ్యాకరణ శాస్త్రమునకు ప్రతిపాద్యములగు శబ్దముల విషయమున అధికారమున్నది" మొ.

**అధిక్రతు** II. 254

యజ్ఞమునందు; యజ్ఞము చేయు సందర్భమున ఈ యర్థమున 'అధియజ్ఞ' శబ్దము ప్రసిద్ధతరముగా వాడబడుచున్నది. అధ్యాత్మ అధిదైవ శబ్దములు రెండును పయి శబ్దము వంటివే.

**అధ్యాహిత** I. 8 ('అవ్యాహత' తో సమానార్థకము)

ఆరోపితమగు. లేకున్నను ఉన్నట్లుగా భావింపబడిన.

**అనవస్థిత** I. 106.

ఆగకుండగా పునఃపునరావృత్తమగు.

**అనాగమ** II. 182.

మన బుద్ధికి గోచరించునట్టి కారణము లేనిది.

**అనిబంధన** I. 188.

ఆధారము లేనిది; శుష్కతర్కము; నిర్విషయము.

**అనుకార** (1) I. 5

ప్రతిబింబము ప్రతికృతి.

(2) II. 68. అనుకరించుట. అసత్యమగు ఆకారచేష్టాదులనుగ్రహించుట.

అనుతంత్ర I. 28.

ఒక శాస్త్రగ్రంథమును అనుసరించి బయలువెడలిన మరియొక శాస్త్రగ్రంథము. ఉదా: పాణిని కృతమగు అష్టాధ్యాయికి వార్తికము అనుతంత్రము.

అనునిష్పత్తి II. 362.

ఒకటి నిష్పన్నమైన పిమ్మట నిష్పన్నమగుట. 'యజ్ఞదత్తుడు' అను సముదాయము ఒకనికి నామధేయముగ నిష్పన్నమైన పిమ్మట దాని అవయవమగు 'య' అను దానికి గూడ తన్నామధేయత్వము అను నిష్పన్నము.

అనునిష్పాదిన్ II. 121; 124; 352

1. కాలాంతరమున ప్రయోగములోనికి వచ్చినది. ఉదా: 'దేవదత్త' 'సత్యభామా' శబ్దములకు బదులుగ అదేయర్థమున 'దత్త' 'భామా' శబ్దములు ప్రయుక్తములగుచున్నవి గాన అవి అనునిష్పాది శబ్దములు.

2. మూలమగు శబ్దము ననుసరించి పుట్టు శబ్దములు. (దేవదత్తాది సంజ్ఞా శబ్దముల ననుసరించి వెనువెంటనే జనించు 'దేవ'–'దత్త' మొదలగు స్వతంత్ర శబ్దములు.)

అనుమానమ్ II. 367.

1) అనుమీయతే–ఇదమ్ = ఊహింపబడునది. (సర్వనామ మొదలగు మహాసంజ్ఞలకు సంబంధించిన అవయవార్థము 'సర్వేషాం నామ' మొదలగునది)

II 368.

2) కార్యమునుబట్టి కారణమునుగాని కారణమునుబట్టి కార్యమునుగాని ఊహించుట (జ్ఞానమునకు ఇదొక ప్రబల సాధనము)

అనువాద II. 115.

స్పష్టీకరణమునకై గాని, నియమార్థము కాని చెప్పిన విషయమును మరల చెప్పుట.

అనుషంగిణీ II. 122.

తప్పక సంబంధించునది.

అనుసంస్మృతి II. 1.

బుద్ధియందు అకళించుకొనుట.

అన్వయ II. 388.

ఎల్లపుడును కలిసియుండు రెండింటిలోను ఒకటి ఉన్నపుడు రెండవది కూడ తప్పక ఉండుట.

అన్వాఖ్యాన II. 170; 281; 439; 443.

ఉన్నదానిని మరలచెప్పుట. తెలిసినదానిని స్పష్టీకరించుట. వాడుకలోనున్న పదములకు ప్రకృతి ప్రత్యయాది విభాగము చేసి వ్యుత్పత్తి చూపుట.

అన్వాఖ్యానస్మృతి II. 281.

శబ్దవ్యుత్పత్తిని చూపెడు గ్రంథము. శబ్దానుశాసనము. పాణినీయాది వ్యాకరణ గ్రంథములను గూడ స్మృతులని యనుట సంప్రదాయసిద్ధము.

అన్వాఖ్యేయ I. 24.

ప్రకృతి ప్రత్యయాది విభాగముచే వ్యుత్పత్తి చూపుటకు తగినశబ్దము. 'అన్వాఖ్యేయః శబ్దః' ఇత్యాదులలో 'అన్వాఖ్యేయః' అనుదానికి ప్రయోగార్హమై సాధువైనది అని యర్థము.

అన్వితాభిధాన పక్ష II. 17.

ఒక వాక్యమునందలి పదములు పరస్పర సంబద్ధములగు అర్థములను బోధించును అను పక్షము. ఇది ప్రాభాకర మీమాంసకుల మతము. ఒక వాక్యమునందలి పదములు వాటి వాటి అర్థములను బోధించిన పిమ్మట ఆ అర్థములు పరస్పరము సంబంధించును అనునది అభిహితాన్వయ పక్షము. ఇది భాట్టమీమాంసకుల మతము.

అపభ్రంశ I. 148, 153, 154.

ఒక సాధుశబ్దము వ్యాకరణ విరుద్ధమగు మార్పుచెందుటచే నేర్పడిన శబ్దము. అది వ్యాకరణ విరుద్ధమే యైనను దానిని విను నపుడు దాని ప్రకృతియగు సాధుశబ్దము స్మృతి పథమున గోచరించుటచే అర్థబోధ కలుగుచుండును.

**అపవర్గ** I. 14.
మోక్షము, బంధవిముక్తి.

**అపవాద** II 343.
ఒక స్థలమున సామాన్యశాస్త్రము—దీనికే 'న్యాయము' 'ప్రాప్యము' అనికూడ పేరు— ప్రవర్తింపవలసి యుండ అది యట్లు ప్రవర్తింపకుండ చేయునది అపవాద శాస్త్రము. ఈ సామాన్యాపవాద శాస్త్రములకు ఏక వాక్యత్వమును సంపాదించి, అపవాదశాస్త్ర స్థానభిన్నములగు స్థానములందు సామాన్య శాస్త్రము ప్రవర్తించును అని అర్థము చెప్పుకొనవలెను. 'అద్గుణః' అను సామాన్య శాస్త్రమునకు 'వృద్ధి రేచి' ఇత్యాదులు అపవాదములు. కావున 'వృద్ధి రేచి' ఇత్యాదులకు ప్రవృత్తిలేని స్థలములందు మాత్రమే 'అద్గుణః' ప్రవర్తించును.

**అపోద్ధార** I. 24, II 10, 269, 441.
వేరుచేయుట. విడదీయుట. ఈ పదమును—'ప్రకృతినుండి ప్రత్యయమును విడదీయుట' అను నర్థమున ప్రయోగింతురు. ప్రకృతినుండి వేరుచేసిన ప్రత్యయము లేక ప్రత్యయమునుంచి వేరుచేసిన ప్రకృతి అను నర్థమున గూడ ఈ పదమును ప్రయోగింతురు. అప + ఉద్ + ధార = విభాగము చేయుట.

**అపోద్ధృత** II. 83, III 14, 170
సముదాయమునుండి వేరుచేసిన అవయవము, సముదాయార్థము నుండి విడదీసిన అవయవార్థము.

**అభిఖ్యా** I 146.
జ్ఞానము.

**అభిఘాత** (ద్రవ్యాభిఘాత) I 105.
'దెబ్బ'యని అక్షరార్థము. వర్ణోచ్చారణ స్థానములగు తాల్వాదులందు ఉచ్చారణ సాధనములగు జిహ్వాదుల చేతను, వాయువు చేతను కలిగిన ఒత్తిడి.

**అభిజల్ప** II 128.
తాను బోధించు అర్థముతో తాదాత్మ్య[illegible]మును పొందిన శబ్దము.

**అభిధా** II 401
శబ్దము అర్థమును బోధించును ఈ అర్థబోధన వ్యాపారమునకు అభిధ యని పేరు. శబ్దమునకును తద్వాచ్యమగు అర్థమునకును గల సంబంధము.

**అభిధాన** II. 160, 165, 168, 401, 402, 404, మొ.
శబ్దము అర్థమును బోధించుట. ఈ అభిధానము శబ్దమునకు స్వాభావికము. 'అభిధానం పునః స్వాభావికమ్' మ. భా.

**అభిధానక్రియా** II. 106.
పరస్పర సంబద్ధములగు పదములను ప్రయోగించి సాధించిన అర్థబోధ చేయుట అనెడు వ్యాపారము. 'అభిధాన క్రియా సంహిత యోచ్చారణ మేవ'. (పుణ్యరాజ)

**అభిధేయ** II. 118, 401.
శబ్దము బోధించు అర్థము.

**అభిసంధాన** II. 400.
ఏకాగ్ర చిత్తత్వము. మానస వ్యాపారము.

**అభిసంహిత** II. 400
వివక్షితమగు అర్థమును బోధించుటకై బాగుగ పర్యాలోచించి ప్రయోగించిన శబ్దము.

**అభిహితాన్వయపక్ష** [II. 1, 41, 42]
స్వతంత్రముగ తమతమ అర్థములను బోధించు పదములు ఒక వాక్యమున పరస్పరము అన్వయించి, స్వస్వార్థ భిన్నమగు తాత్పర్యార్థమును బోధించును అని అంగీకరించు భాట్ట మీమాంసకుల పక్షము. ఇది ప్రాభాకర మీమాంసకుల అన్వితాభిధాన పక్షమునకు విరుద్ధము.

**అభ్యాస** II. 117, 235.
(1) అభ్యసించుట. (2) పదమును గాని, తత్ప్రకృతిని గాని ఆవృత్తి చేయుట. ఉదా: లిట్టులో 'పత్' అనుదానిని రెండు పర్యాయములు ఆవృత్తి చేయుటచే 'పపాత' ఇత్యాది రూపములు సిద్ధించును.

అవివక్షా I. 137.

ఈ విషయమును తప్పక చెప్పవలెను అనెడు ఇచ్ఛ లేకుండుట. ఔదాసీన్యము.

అశ్వకర్ణ II. 36.

ఒక లతకు పేరు. దాని యాకులు గుర్రము చెవులను పోలియుండును.

అసంవిద్ II. 61.

అవిద్య. భ్రాంతి.

అసంసృష్ట II. 248; 249.

సంసృష్టము కానిది. కలియనిది. ఉదాహరణమునకు—పదవాద పక్షమున ఒక పదము బోధించు అర్థము మరియొక పదము బోధించుఅర్థముతో కలియదు అని చెప్పుదురు.

అసిద్ధి II. 268.

పూర్వమే తెలిసినది కాకుండుట. అప్రసిద్ధత్వము.

ఆఖ్యాత II. 1, 57, 306, 338, 341, 342 మొ॥

క్రియ. క్రియారూపము. ఇదియే వాక్యమని కొందరి యభిప్రాయము.

ఆఖ్యాతశబ్ద I. 1.

క్రియాశబ్దము.

ఆగమ (1) I. 27, 30, 133.

అవిచ్ఛిన్న మగు సంప్రదాయము.

(2) I. 41.

అవిచ్ఛిన్న సంప్రదాయ సిద్ధమగు ఆచారము.

(3) అవిచ్ఛిన్న సంప్రదాయ ప్రవర్తకమగు శాస్త్ర గ్రంథము.

ఆంజస I. 12.

సులభముగ గ్రహింప శక్యమైనది. ఋజుమార్గోపదిష్టము.

ఆండభావ I. 51.

అండ మధ్యగత రసమువలె ప్రధానరూపమున నుండుట.

ఆత్మన్ I. 17.

ఆత్మ. అతిసూక్ష్మమగు తత్త్వము.

ఆద్యపద II. 2.

వాక్యములోని మొదటి పదము. ఇదియే (ఇతర సంసృష్టమై)వాక్యమగునని కొందరు చెప్పుదురు.

ఆధారనియమ II. 468.

కారకముల వ్యాపారము కొన్ని వస్తువులకు మాత్రమే నియమితమై యుండుట. ఉదా. కరణ శక్తికి ఇంధనము ఆధారము, అధికరణ శక్తికి స్థాలి ఆధారము.

ఆపేక్షికీ II. 168.

మరియొకదానిపై ఆధారపడి యున్నది.

ఆమ్నాత I. 2.

శాస్త్రములలో ప్రమాణ రూపమున చెప్పబడినది.

ఆమ్నాయ II. 259.

వేదము.

ఆవాపోద్ధారిక II. 79.

పదముల విభిన్నావయవములలో అర్థమును చేర్చుచుండుట తీసివేయుచుండుట అను దానిపై ఆధారపడినది.

ఆవృత్తి II. 115.

నియమము కొరకుగాని, స్పష్టీకరణార్థము గాని ఒక యర్థమును రెండు పర్యాయములు చెప్పుట.

ఆసన్న I. 11.

చాల సమీపమున నున్నది.

ఇతికర్తవ్యతా I. 122.

లౌకిక వ్యవహారము. ఈ విధముగ చేయవలెను అనెడు బుద్ధి.

ఉత్సర్గవాక్య II. 347.

సామాన్య వాక్యము. ఉదా. "మా హింస్యాత్సర్వాణి భూతాని" 'ఏ భూతము

లను హింసింపరాదు' అనునది ఉత్సర్గ వాక్యము. "అగ్నిషోమీయం పశు మాల భేత" 'అగ్నిషోమయాగ పశువును ఆలంభింప వలెను' అనునది విశేషవాక్యము, లేదా అప వాదవాక్యము.

**ఉదహారి** II 246.

నీళ్లు మోయుట జీవికగా గల స్త్రీ.

**ఉపఘాత** II. 312.

పాడు చేయుట.

**ఉపఘాతజ** II. 297

దోషమువలన కలిగినది. ఇంద్రియ దోష జన్యము.

**ఉపవ్యంజన** II. 13.

ఏదైన గుర్తు మొదలగు దానిచే ఒక వస్తువును సూచించుట. అట్లు సూచించు గుర్తు మొదలగునది.

**ఉపాదానశబ్ద** I. 44. II. 4.

ప్రత్యక్షముగ అర్థమును బోధించు శబ్దము.

ఉపాదాన మనగా మూలకారణము. అర్థములను తన యందు ఆరోపించుకొని యున్నందున, ఇచట శబ్దపద సాహాయ్య్రమున వాచక పర్యాయము ఉపాదాన శబ్దము, వాచకములగు శబ్దముల విషయమున అని వాచ్యార్థము.

**ఉపాయ** II. 38, 108, 287.

ఏదైన ఒక లక్ష్యమును సాధించుటకై గ్రహింపబడి ఆ లక్ష్యమును సాధించిన వెంటనే విడువబడెడు సాధనము.

ఉపాదాయ హేయః—ఉపాయః. ఉపాదాయహేయః ఇందు 'దాయహే' అను భాగము పృషోదరాదిగణపాఠముచే లోపింపగా ఉపాయ శబ్దము నిష్పన్నమగును.

**ఊహ** II. 78, 258.

అవశ్యకతానుసారముగ లింగవచన ప్రకృత్యాదులను మార్చుట. ఉదా. "వికృతి యాగమును ప్రకృతియాగమువలె చేయ వలెను" అను నియమ మున్నది. ప్రకృతి యాగమున 'అగ్నయే త్వా జుష్టం నిర్వ పామి' అని యున్నది. కాని వికృతి యాగ మున 'అగ్నయే" అనుదానికి బదులుగా 'సూర్యాయ' అని మార్చి "సూర్యాయ త్వాజుష్టం నిర్వపామి" అని చెప్పవలెను. "తతః ప్రవిశతి దశరథః రామలక్ష్మణౌచ" ఇత్యాదులలో 'ప్రవిశతి' అనుదానిని 'రామ లక్ష్మణౌ' అనుదానితో అన్వయించునపుడు 'ప్రవిశతః' అని మార్చవలెను. ఇది ఊహము.

**ఏకశ్రుతి** (వ్యా).

ఒకే స్వరముతో ఉచ్చరించుట. ప్రాచీన వైయాకరణులు 'లింగ సర్వనామ' శబ్ద సాదృశ్యముచే, ఏక శ్రుతి అనునర్థమున 'స్వరసర్వనామ' శబ్దమును ప్రయోగించి యున్నారు. 'లింగసర్వనామ' మనగా నపుంసకలింగము.

**ఔచిత్య** II. 314; 316.

ఉచితముగా నుండుట. అనేకార్థ శబ్ద ములను ప్రయోగితచునపుడు ఆశబ్దమునకు ఒక అర్థమును నిర్ణయించుటలో ఇది యొక నిమిత్తము.

'నాగలి', 'కత్తి', 'రోకలి' మొదలగు పదములతో క్రియాపదమును ప్రయోగింప కున్నను ఔచిత్యమును బట్టి దున్ను, యుద్ధ ముచేయు, దంచు మొదలగు క్రియాపద ములను ఆక్షేపించుటచే శబ్దార్థ నిర్ణయము జరుగును అని పుణ్యరాజాదులు ఉదాహ రించిరి. ఆలంకారికులు 'పాతు వో దయితా ముఖమ్', ఇత్యాదులందు ఔచిత్యమును బట్టి 'పాతు' అనగా "అభిముఖముగా నుండు గాక" యని యర్థమని ఉదాహరించిరి.

**ఔత్పత్తిక** [I. 23. స్వోపజ్ఞవృత్తి].

జన్మసిద్ధము. సహజము. అనగా క్రొత్తగా కల్పితము కానిది.

**ఔదుంబరాయణ** II. 348.

శబ్దనిత్యత్వవాదియగు ఒక ప్రాచీన వైయాకరణుడు. ఇతనిని యాస్కుడు పేర్కొనెను.

కంప I. 107.

వర్ణములను ఉచ్చరించు సమయమున పవనాభిఘాతముచే కలిగిన కంఠతాళ చలనము.

కరణ II. 430.

ఒక పని చేయు సాధనము. ఒక వస్తువు ఒక క్రియయందు సాధనముగ నుండుటచే ఆవస్తువునకు అక్రియతో గల సంబంధము.

కరణవిన్యాస I. 123.

ఉచ్చారణ సాధనములను శబ్దోచ్చారణ మున నియోగించుట.

కర్మ II. 430.

కర్త క్రియద్వారా దేనిని పొందగోరునో అది.

కర్మప్రవచనీయ II. 199, 201, 202, 204.

ఒకానొకప్పుడు క్రియా వాచకములై యుండి, ఇపుడు మాత్రము అట్లుకాక క్రియోపజనిత సంబంధవిశేష ద్యోతకము లగు ఉపసర్గాదులు.

కృత్రిమ (సంజ్ఞాశబ్దము) II. 371.

కల్పితమును సహజార్థరహితమును అగు 'టి' 'ఘు' ఇత్యాది సంజ్ఞాశబ్దము.

క్రతు I. 51.

చేయునది యని అక్షరార్థము. బుద్ధి శబ్దాభివ్యక్తి కారణభూతమగు అంతరశక్తి.

క్రమ II. 1, 49-52.

(1) ఒక వాక్యములో నున్న అనేక పదముల అర్థము తెలియుటకు సహకరించునదియగు పదముల క్రమము. ఈ పదక్రమమే వాక్య మని కొందరి యభిప్రాయము. "క్రమేణ పదార్థగత కర్తృ కర్మవిశేషాః ప్రతిపాద్యన్తే అతః క్రమ ఏవ వాక్యమ్" (2) ముక్రమమే కాలమని చెప్పుదురు. "క్రమాఖ్యాహి కాలశక్తి ర్వృత్తిహ్నాణః జన్మవత్సు పదార్థేషు జన్మాదిక్రియా ద్వారకమేవ పౌర్వాపర్యేణా వభాసోపయోగ విధాయినీ; నాపరో ద్రవ్యభూతః కాలః" (పుణ్యరాజ).

క్రియానుషఙ్గ II. 425.

ధాతు ప్రతిపాద్య వ్యాపారముతో కారక మునకు గల సంబంధము. ఇది లేనిచో వాక్యము పరిపూర్ణము కాజాలదు.

క్రియాపద I. 114.

ధాతువునుండి నిష్పన్నమై ప్రయోగార్హ మగు 'భవతి' ఇత్యాది క్రియా వాచకపదము. ధాతువు వేరు క్రియాపదము వేరు. ధాతువు నుండి క్రియాపదము నిష్పన్నమగును. ధాతు వును స్వతంత్రముగ ప్రయోగించుటకు వీలు లేదు.

క్రియాప్రధాన II. 442.

వ్యాపారము ప్రధాన వాచ్యముగ గలది క్రియాపదము. 'క్రియాప్రధానము' అను నది అఖ్యాతమునకు లక్షణము. అఖ్యాత శబ్ద మును 'ధాతువు' 'క్రియా పదము' అనునర్థ మున ప్రయోగింతురు.

ఖరణస II. 368.

గాడిద ముక్కు. ఇచట 'నస' లోని నకారము ణకారమైనది.

గీతి II. 107.

గానము. సంగీత యుక్తముగ ఉచ్చరిం చుట. సంగీతయుక్తముగ నుచ్చరించినచో ఋఙ్మంత్రము సామ మగును. 'గీతిషు సామాఖ్యా' (పుణ్యరాజ).

గుణ I. 62, 64.

అప్రధానముగా వివక్షితమగు అర్థము గుణము. తర్కశాస్త్రమున రూప రస గంధాదులు 24 పారిభాషిక గుణ ములుగా జెప్పబడినవి. అవి మాత్రము ఇచట గ్రాహ్యములు గావు.

గురువు II. 34.

సుదీర్ఘమగు ప్రతిపాదనము. దానికి వ్యతిరేక పదము లఘువు.

“శాస్త్రీయథా- ‘పృషోదరాదీని యథోపదిష్టమ్’ ఇతి శిష్టప్రసిద్ధసాధుశబ్దౌఘ ప్రతిపాదనే లఘు రుపాయః, సపవతు ప్రాతిపదికాదనభిహితకర్త్రాదిగతైకత్వాదౌ స్వాదయ ఇత్యాదినా గురు రుపాయః.”

గౌః II. 174.

ఆవు లేక ఎద్దు. ఈ శబ్దము గ్మా, గర్జ, గమ్, గు, గద్ ధాతువుల నుండి నిష్పన్నమైనదని చెప్పుదురు.

గౌణ II. 34, 273, 274.

అప్రధానము. వాక్య నిర్మాణమున ప్రధాన స్థానములో లేనిది. అర్థమునకు సంబంధించినంతవరకు మరియొక దానికి లొంగియుండునది. “గుణాదాగతం గౌణమ్” అని దీని వ్యుత్పత్తి. ‘సింహో మాణవకః’ ఇత్యాద్యుదాహరణములందు సింహ శబ్దము, సింహసదృశ శౌర్యాదులుండుటచే, మాణవకుని విషయమున ప్రయోగింపబడుచున్నది. ఇది గౌణ ప్రయోగము.

గౌరఖర II. 216.

అడవిగాడిద. ‘కృష్ణసర్ప’ ‘లోహితశాలి’ మొదలగు శబ్దములవలె ఈ శబ్దము అవయవార్థ విహీనమై ఒక జాతిని బోధించుచున్నది.

గ్రహణక II. 456.

సర్వసామాన్యార్థము. వ్యాకరణమున ఏదియో ఒక విషయమును పేర్కొనుచు సూత్రము రచింపబడును. ఆ సూత్రము సామాన్య రూపమున ఇతర స్థలములందు గూడ ప్రవర్తించును. ఈ విధముగ ఇతరోదాహరణము చేయునది గాన అది గ్రహణకము. ఉదా. ‘కర్తరి కృత్’ అను సూత్రము ‘కర్త్రర్థమున కృత్ ప్రత్యయము వచ్చును’ అని బోధించుచున్నది. ఇది కర్త్రర్థమున వచ్చు ప్రతి ఒక్క ప్రత్యయము తోడను వేరువేరుగా సమన్వయించును. ఈ విధముగ ఈ సూత్రము పరోదాహరణ సంబద్ధముగాన గ్రహణకము.

‘అణ్’ మొదలగునవి స్వసజాతీయములను గూడ గ్రహించును అని ప్రతిపాదించు ‘అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః’ ఇత్యాది సూత్రములను గ్రహణక శాస్త్రములని, శాఖాంతరమున కాశికాకారాదులు చెప్పియున్నారు.

గ్రాహ్య I. 65, II. 99.

శబ్దము నుచ్చరించినంతనే బుద్ధిచే గ్రహింపదగినది. బుద్ధిచే గ్రహింపదగిన ఒక వస్తువును గూర్చి శబ్దమును ప్రయోగింతురు. ఆ వస్తువు గ్రాహ్యము, గ్రహణ సాధన మగు బుద్ధ్యాదికము గ్రాహకము.

ఘా II. 362.

జ్యోతిష గ్రంథములలో ‘మఘా’ అను పదమునకు సంక్షిప్త రూపముగ ‘ఘా’ అని యుపయోగింతురు. వైయాకరణులు ఇట్టి ప్రయోగము సాధువని అంగీకరింపరు.

చతుష్ట్వ II. 343.

నాలుగుగా ఉండుట, నాల్గింటి సముదాయము. ప్రాచీన వైయాకరణులు చెప్పిన నామ–ఆఖ్యాత–ఉపసర్గ–నిపాతములనెడు నాల్గు శబ్ద విభాగములు.

చంద్రాచార్య II. 453.

ఆచార్య చంద్రగోమి. ఈతడు మహా వైయాకరణుడు. పాణినీయ పాతంజలములపై ఇతర వైయాకరణుల ఆక్షేపములను ఖండించి వీటి పఠన పాఠన సంప్రదాయమును పునరుద్ధరించినవాడు. ఈతడు రచించిన చాంద్రవ్యాకరణము పాణినీయానుసారియైనది కాని ఇందు వైదిక ప్రక్రియ లేదు. పారిభాషిక పదములను ఉపయోగింపకుండుట ఈ వ్యాకరణమునందలి విశేషము. ఈతడు క్రీ. శ. 5వ శతాబ్దమునకు చెందిన వాడు.

చరితము II. 270. 326.

నమిలివేయబడినది లేదా మ్రింగివేయబడినది అని దీని అక్షరార్థము. దీనిని భర్తృహరి "అంతర్గతము చేయబడినది" అను నర్థమున ప్రయోగించి యున్నాడు.

ఛందస్య I. 17.

వేద మంత్రముల సముదాయమని అక్షరార్థము. వేదమంత్ర సముదాయ ప్రతిపాద్యమగు ఆత్మ గూడ ఛందస్యము.

జహత్స్వార్థా వికల్ప II. 223.

జహత్స్వార్థ వృత్తియనెడు వికల్పము. జహత్స్వార్థ యనియు అజహత్స్వార్థ యనియు వృత్తులు రెండు విధములు. అవయవార్థమును అపేక్షింపకయే సముదాయార్థమును బోధించువృత్తి జహత్స్వార్థా వృత్తి. ఈ వృత్తియందు ఘటకములగు అవయవములు తమ తమ అర్థములను విడచినవిగాన దీని కాపేరు. 'రథన్తరమ్' (ఒక సామము) కృష్ణ సర్పః (త్రాచు పాము), శుశ్రూషా (సేవ) మొదలగునవి ఉదాహరణములు.

'గంగాయాం ఘోషః' 'పీతాంబరః' ఇత్యాదులలో 'గంగాగాయాం' 'పీతాంబరః' మొదలగునవి స్వవాచ్యార్థ భిన్నములగు 'గంగాతీరమునందు' 'పీతాంబరమును ధరించినవాడు' అను నర్థముల బోధించుచున్నవి గాన ఇవి కూడ జహత్స్వార్థకు ఉదాహరణములు.

జాతిశబ్దము II. 122.

ముఖ్యముగ జాతిని, లక్షణచే వ్యక్తిని బోధించు శబ్దము. అనేక వ్యక్తులకు సంబంధించిన ఒకానొక విలక్షణ ధర్మమునకు జాతి యని పేరు. ఉదా. గోత్వము అనేక గో వ్యక్తులతో సంబంధించి యున్నది గాన అది జాతి.

జిత్వరీ II. 179.

పతంజలి కాలమున వారాణసిని వర్తకులు 'జిత్వరి' అను పేరుతో వ్యవహరించుచుండెడి వారు.

జ్ఞాన I. 86.

తెలివి. ఎఱుక.

జ్యే II. 362.

'జ్యేష్ఠా' నక్షత్రమునకు సంక్షిప్త రూపము.

తంత్ర II.77, 96, 108, 108, 109. 470.

ఒక ప్రయత్నముచే రెండు లేక అంతకంటె అధికమగు విషయములను సాధించుట (శబ్దమును ఒకసారే పలికి అనేకార్థములను బోధించు తీరు).

తర్క I. 30, 48, 136, 138.

అనుమానోపమానాదుల సహాయముచే ఒక విషయమును నిర్ణయించుట. ఈ నిర్ణయము శాస్త్ర ప్రత్యక్షాది విరుద్ధముగ నుండరాదు.

నైయాయికుల పరిభాష ననుసరించి 'వ్యాప్యారోపముచే వ్యాపకారోపము తర్కము' ఉదాహరణమునకు— 'వహ్ని లేకున్నచో ధూమము కూడ లేకుండెడిది' అని వ్యాప్యమగు వహ్ని యొక్క ఆరోపముచే (వహ్ని విషయక భ్రమముచే) వ్యాపకమగు ధూమము యొక్క ఆరోపము (ధూమ విషయక భ్రమము) తర్కము.

త్రయీ I. 138.

ఋగ్యజుస్సామ వేదముల త్రయము. ఇవి అపౌరుషేయములు లేదా ఈశ్వరజన్యములని ఆస్తికుల విశ్వాసము. స్మృత్యాగమాదులు కూడ ప్రవాహానాదిత్వముచే నిత్యములు. ఎప్పుడైన వీటి సంప్రదాయము విచ్ఛిన్నమైనను ఇవి నిత్యములగు బీజముల సహాయముచే పునరుద్ధరింపబడుచుండును.

దేశ II. 314, 316.

ఒకానొక ప్రదేశము. రెండు లేదా అంతకంటె అధికమగు అర్థములు గల శబ్దమును

ప్రయోగించినపుడు దాని యర్థనిర్ణయమునకు ఈ దేశము ఉపకరించును. 'మథురకు ఉత్తరముగ నున్న నగరమునుండి వచ్చుచున్నాను' అని చెప్పినపుడు 'పాటలిపుత్రము నుండి వచ్చుచున్నాను' అని చెప్పినట్లు అర్థమగును.

ద్యోతక II. 192, 193.

తన సమీపముననున్న పదము యొక్క శక్తిని వ్యంజింప చేయునది.

ద్రా I. 362.

'ఆర్ద్రా' నక్షత్రము యొక్క సంక్షిప్త రూపము. ఉనిని ఆర్ద్రా నక్షత్రము అను నర్థమున జ్యోతిష గ్రంథములలో కొందరు ప్రయోగించినను, దీనిని విననంతనే 'ఆర్ద్రా' స్ఫూర్తి కలుగదు గాన అట్లు ప్రయోగించుట యుక్తము కాదని వైయాకరణు లందురు.

ద్వంద్వ పదార్థ II. 223.

ద్వంద్వ సమాసావయవమగు ఒక పదము యొక్క అర్థము.

ధర్మ I. 31, 140.

(1) శాస్త్ర విహితమగు ధర్మము. పవిత్ర కర్తవ్యము. (2) ఒక పదార్థము నందలి ధర్మము.

నఞ్ II. 243, 244.

ఇది ఒక అవ్యయము. 'న' మాత్రము మిగులును. సమాసమునందు ఇది 'అ' గాను 'అన్' గాను మార్పు చెందును.

నాద I. 102.

ధ్వని. దీని మార్పుచే ఒచ్చులలో దీర్ఘత్వ హ్రస్వత్వములును, ఉచ్చారణమున తారత్వ మందత్వములును కలుగుచుండును.

నాన్తరీయక II. 81.

ఒక వస్తువుతో తప్పక కలిసియుండునది. 'అంతర' శబ్దమునకు లేకుండ గాఅనియర్థము. 'అంతరేభవం అంతరీయమ్' ఒక దానితో కలిసి కాక వేరుగా ఉండునది. 'న అంతరీయం నాన్తరీయం' అట్లు విడిగా ఉండనిది.

నామాఖ్యాతసరూప II. 318.

క్రియా పదముగను నామవాచకముగను కూడ నుండు పదములు. ఉదా. 'అశ్వః' 'అజాపయః', 'తేన', 'యస్య' 'అస్య' మొ. 'అశ్వః' అనునది 'టుఓశ్వి గతి వృద్ధ్యోః' అను ధాతువు లుఙ్ మధ్యమపురుషైక వచన రూపము. గుఱ్ఱము అను నర్థమున నామవాచకము, ఇట్లే 'అజాపయః' ఇత్యాది శబ్దములు కూడ క్రియాపదములుగను, నామవాచకములుగను ఉన్నవి.

నాలికా II.113.

ఊదుటచే వివిధములగు శబ్దములు పుట్టు వెదురుగొట్టము మొదలగునది.

నిఘాత II. 8.

అనుదాత్తము.

నిపాత II. 192.

వైయాకరణులు పదములను–నామములు ఆఖ్యాతములు, ఉపసర్గములు, నిపాతములు అని నాలుగు విధములుగ విభజించి యున్నారు. 'చ' 'వా' మొదలగునవి నిపాతములు. వివిధార్థములను బోధించుటకై వచ్చుచుండును గాన ఇవి నిపాతములు. 'ఉచ్చావచేష్వర్థేషు నిపతన్తీతి నిపాతాః' (నిరుక్తము) నిపాతములకు లింగ, విభక్తి, వచనాదులు ఉండవు.

నిబంధన I. 13, II. 127, 132, 297, 434

'మూలకారణము,' 'ఆధారము' అను నర్థమున 'నిబంధనమ్' 'నిబంధనా' అను పదములనుభర్తృహరి అత్యధికముగ ప్రయోగించి యున్నాడు.

నియమ II. 85, 350

ఏదైన ఒక సూత్రముచే విహితమగు కార్యము ప్రవర్తించు స్థానములను సంకు

చితముచేయునది నియమము. విధి సూత్రమునకు ఈ నియమ సూత్రమును చేర్చి అర్థము చెప్పవలసి యుండును.ఉదా. 'సార్వధాతుకార్ధధాతుకయోః' అను సూత్రము 'సార్వధాతు కార్ధధాతుకములు పరమగు నపుడు పూర్వవర్ణమునకు గుణము వచ్చును' అని చెప్పుచున్నది. ఆగుణము 'ఇక్' కు మాత్రమే వచ్చునని 'ఇకో గుణవృద్ధీ' అను సూత్రము చెప్పుచున్నది. కావున ఈ సూత్రము నియమ సూత్రము.

నిర్వచన II. 174.

ఒక పదము ఏధాతువునుండి జనించినదో కనుగొని అర్థము చెప్పుట.

న్యాయము II. 348, 479, 482.

సామాన్య రూపమున చెప్పిన ఒక వాక్యము. సామాన్య శాస్త్రము. సామాన్య నియమము. ఈ పదమును 'ప్రాప్యము' అను నర్థమున 'న్యాయ్యము' అని గూడ వ్రాయుట కలదు.

న్యాయవాదిన్ II. 2.

ఒక శాస్త్రీయ సిద్ధాంతమును ప్రతిపాదించిన వాడు.

న్యాయ్య II 348.

న్యాయము. సామాన్య శాస్త్రము.

పతంజలి II. 479, 482.

వ్యాకరణ మహాభాష్య రచయితయగు మహావైయాకరణుడు. ఈయన క్రీ. పూ. రెండవ శతాబ్దికి చెందినవాడు. మహాభాష్యము వ్యాకరణమున అత్యుత్తమ ప్రమాణమని వైయాకరణు లెల్లరును అంగీకరించిన గ్రంథము.

పద I. 71, 72, 73.

ఒక వాక్యమునకు అవయవముగ నున్న సుబంతము లేక తిఙంతము. అక్షరసముదాయము.

పదదర్శినః II. 57.

వైదిక సంహితలకు పదపాఠము నేర్పరచిన శాకల్యుడు, ఆత్రేయుడు, శాకాయనుడు మొదలగువారు. సంహితా పాఠమే సత్యమని అంగీకరించెడు వైయాకరణుల మతమునకు విరుద్ధముగ వీరు పదపాఠమే సత్య మనియు వాక్యపాఠము కాల్పనిక మనియు చెప్పుదురు.

పదస్థాన I. 16.

అడుగు.

పదామ్నాయ II. 59.

సంప్రదాయసిద్ధమగు వైదికపదపాఠము.

పదార్థ II. 61.

(1) ఒక పదము బోధించెడు అర్థము.

(2) పదముచే చూపబడిన ఒక వస్తువు. బుద్ధియందు ఒక క్రమమున భాసించు అక్షరముల అర్థము.

పరమాత్రా I. 126.

మరి యొక రూపముతో భాసించుట.

పరిప్లవమానతా II. 45.

అస్పష్టత్వము. అస్ఫుటత్వము.

పర్యాయ II. 251.

వంతు. క్రమము. అవిచ్ఛిన్నమగు క్రమము.

పర్యుదాస II. 84, 442.

క్రియతో కాక నామముతో సంబంధించిన నఞ్. ఉదా. అబ్రాహ్మణః. అనశ్వః మొ.

"ప్రసజ్య ప్రతిషేధః సః క్రియయా సహ యత్ర నఞ్। పర్యుదాసః స విజ్ఞేయః యత్రోత్తరపదేన నఞ్॥"

పశ్యన్తీ I. 143.

వాక్కునకు గల నాల్గు భేదములలో నొకటి. ఇది ఒకానొక విధమగు బౌద్ధిక

పదార్థావకలనము. ఇచ్ఛానుసారముగ ఇది వాగ్రూపమున అభివ్యక్తమగును.

పారార్థ్య I. 137.

మరియొకదాని నిమిత్తమై ఉద్దిష్టమై యుండుట.

పురాణగాః I. 45.

పురాణవ్యాఖ్యాతలు. రామాయణ మహాభారతాది గ్రంథములందు ప్రతిపాదితము లగు శాస్త్రీయ సిద్ధాంతములను పాటించు వారు.

పృథక్సర్వపద II. 2.

పరస్పర సంబంధముతో వాక్యార్థమును బోధించునవియు స్వతంత్రములును అగు పదముల సముదాయము. ఇదియే వాక్య మని కొందరి యభిప్రాయము.

ప్రకరణ I. 314, 315, 317, 330.

ఏదైన ఒక విషయమును ప్రతిపాదించు సందర్భము. ఒక పదము యొక్క అర్థమును నిర్ణయించుటలో ఇది ఉపకరించును.

ప్రకర్ష I. 64.

గుణముల అతిశయము. ఇది 'తరప్' 'తమప్' ప్రత్యయములను చేర్చుటయందు ఉపకరించును.

ప్రకృత్యర్థ II. 229.

ప్రకృతి పూర్తిగ లోపించి ప్రత్యయము మాత్రము మిగిలిన 'ఇయాన్' ఇత్యాది స్థలములలో ప్రత్యయము చేతనే బోధింపబడిన ప్రకృత్యర్థము.

ప్రక్రమ II. 399.

మౌలికములగు సిద్ధాంతములను బోధించు విధానము.

ప్రక్రియా I. 1

(1) 1. ఏర్పడుట,స్వరూప నిర్మాణము. (2) స్వరూప నిరూపణము.

ప్రణవ I. 9.

ఓంకారము. ఇది సకల వేదసారము.

ప్రతినిధి II. 65, 70, 71.

ఒక వస్తువు లభ్యము కానప్పుడు దాని స్థానమున ఉపయుక్తమగు, దానితో సమాన మగు మరి యొక వస్తువు.

ప్రతిపత్తి I. 79.

జ్ఞానము.

ప్రతిపాదక I. 24.

విభక్తి ప్రత్యయాదులు చేర్చని, అర్థ బోధకమగు ధాతువు, ప్రాతిపదికము మొద లగు శబ్దము.

ప్రతిబింబ II. 294.

ప్రతికృతి. ఒక మార్గము, దేశము, ప్రాంతము, ఏనుగు, సింహము మొదలగు వాటి స్వరూపమును చూపుటకై గీసిన చిన్న పటము.

ప్రతిభా II. 117, 148, 152.

(1) సర్వప్రాణి సంవేద్యమును, సర్వవ్యవహారమూలభూతమును అగు బుద్ధిస్ఫురణము. ఇది స్వభావము, అభ్యాసము, శిక్ష, సంబంధము, అదృష్టము, ప్రత్యేక పరిస్థితులు అనెడు ఆరు కారణములచే వెంటనే స్వయముగ ఆవిర్భవించును.

(2) II. 148

వాక్యము వినినంతనే బుద్ధి యందు గోచరమగు అర్థము. ఇదియే వాక్యార్థ మని కొందరు పండితుల అభిప్రాయము.

ప్రతిషేధ II 319.

జరుగనున్న పనిని నిషేధించుట. ఏదైన ఒక విషయమును నిషేధించు వాక్యము. ఈ ప్రతిషేధ వాక్యమును విధి వాక్యముతో సమన్వయించి దీనికి అర్థము చెప్పవలెను.

ప్రత్యయ II. 135, 236.

(1) జ్ఞానము

(2) II. 229.

ఒక పదము మొదలగు దానికి చేర్చు ప్రత్యయము.

ప్రత్యవాయ II. 321.
నిషేధము అనిష్టము.

ప్రత్యాయ్య II. 119.
ఒక పదముచే బోధింపబడునది.

ప్రమాణ [II. 77].
(1) యథార్థ జ్ఞానము కలుగుటకు సాధనము.
(2) II. 307
కొలత.

ప్రయోగ II. 124, 125
ఒక వాక్యమున కారకములను ప్రయోగించుట.

ప్రయోజక II. 293, 303, 428.
వాక్యప్రయోగమునకు కారణభూతమగు అర్థము.

ప్రయోజన II. 118.
ఒక వాక్యము యొక్క ప్రయోజనము. ఇదియే వాక్యమునకు లక్షణమని కొందరు పండితుల అభిప్రాయము.

ప్రవిభాగ I. 128.
శబ్దబ్రహ్మము ప్రపంచమునందలి విభిన్న పదార్థాకారమున ఆవిర్భవించుట. ఇదియే శబ్ద బ్రహ్మముయొక్క జాగ్రదవస్థ యని చెప్పుదురు.

ప్రసజ్య ప్రతిషేధ II. 84.
నఞ్ క్రియాపదముతో సంబంధించి తదోష్ఠ్య క్రియను నిషేధించుట. ఉదా. 'నేక్షేతోద్యన్త మాదిత్యమ్.'

ప్రాజాపత్య II. 453.
ప్రజాపతికై ఉద్దిష్టమగు పశువు లేక సోమపాత్ర మొదలగునది.

ప్రాప్యకారిన్ I. 80
ఒక వస్తువును చేరిన పిమ్మట పని చేయునది. ఉదా. నేత్రము విషయమును చేరిన పిమ్మట జ్ఞానమును కలిగించునుగాన ఇది ప్రాప్యకారి.

ప్రాసంగిక II. 77.
ప్రధానమగు ఒక విషయమును గూర్చి చెప్పెడు సందర్భమున ప్రతిపాదితమగు అప్రధాన విషయము.

ఫల II. 228.
ఒక వ్యాపారమువలన కలుగు ఫలము. ఇది కారణములకంటె భిన్నమైనది. వ్యాపారము, ఫలము కూడ ధాత్వర్థములని నవీన వైయాకరణుల యభిప్రాయము. ప్రాచీన వైయాకరణుల యభిప్రాయము ప్రకారము వ్యాపారము మాత్రమే ధాత్వర్థము.

బాధకవాక్య II. 347.
మొదట చెప్పిన సామాన్య శాస్త్రమును బాధించు విశేష శాస్త్రము.

బాధా II. 77.
ఏదైన ఒక విషయమును నిరాకరించు వాక్యము. ప్రమాణాదులచే ప్రాప్తించు దానిని నిషేధించుట.

బీజ I 84.
నిగూఢ మగు శక్తి. విత్తనము.

బుద్ధి I 84.
విషయములను గ్రహించెడు శక్తి. ప్రపంచమునందలి వివిధ పదార్థములను వేరువేరుగ గ్రహించెడు శక్తి.

బుద్ధి విషయ II. 132.
బుద్ధికి గోచరమైనది.

బుద్ధ్యనుసంహృతి II. 1.
పరస్పర సంబద్ధములగు అనేక పదములు బోధించిన విభిన్నార్థములను ఒక సంఘాతముగ బుద్ధియందు గ్రహించుట. ఈ విధముగ విభిన్న పదములను ఏకసంఘాత రూపమున గ్రహించుటయే అంతరస్ఫోటమనియు ఇదియే వాక్యలక్షణమనియు కొందరు వైయాకరణుల అభిప్రాయము.

బైజి II. 481.
ఒక ప్రాచీన వైయాకరణుని పేరు. మహాభాష్యమునందు పతంజలియు, సంగ్ర

హామున వ్యాడియు ప్రతిపాదించిన సంప్రదాయ సిద్ధములగు వ్యాకరణ సిద్ధాంతములను ఈతడు తర్కాభాసములచే నిరాకరింప ప్రయత్నించెనట.

బ్రహ్మన్ I. 11, 22, II 287.

వేద ప్రతిపాదిత మగు అత్యుత్తమ తత్త్వము. ఇదియే వేదసారమగు శబ్ద బ్రహ్మము.

బ్రాహ్మణ కంబల II. 14.

'బ్రాహ్మణుని కంబళి' అనునపుడు కంబళి ఒక్కటియే ప్రధానముగ కానవచ్చుచున్నది గాని, ఇచట 'బ్రాహ్మణ' పదము ప్రయుక్తమైనను బ్రాహ్మణ లక్షణ మొక్కటియైనను కానవచ్చుట లేదు. కావున ఒక పదము ఉన్నను లేకున్నట్లే అను విషయమును బోధించుటకు ఈ బ్రాహ్మణ కంబల న్యాయము నుపయోగింతురు.

భావనా II. 116.

ఆయా శాస్త్రముల నభ్యసించిన పిదప వాటి యర్థమును మానసమున మననము చేసికొనుట. ఒక సిద్ధాంతము.

భాష్య II. 477.

పాతంజల మహాభాష్యము.

భేత్తవ్య II. 188.

విశేషణము దేనియందలి వైశిష్ట్యమును బోధించునో అట్టి విశేష్యము.

భేద II. 77, 85, 440.

భేదము, భేదమునకు నిమిత్తము. భేద కారణ భూతమగు వైశిష్ట్యము. ఒక వ్యక్తిని ఇతర వ్యక్తులనుండి వేరుగ చూపగలిగిన ఒక విశిష్టలక్షణము.

భేదశక్తి II. 466.

ఒక క్రమమునకు కారణభూతమగు పదమునందలి ఒకానొక శక్తి.

భేదానుకార I. 86.

తెలియబడిన విషయములందలి పరస్పర భేదమును గుర్తించుటచే వాటి జ్ఞానమునందు గూడ ఏర్పడినట్లు భావింపబడిన భేదము.

మధ్యమా I. 148.

'మధ్యమా' వాక్కు. ఇది మనోవృత్తి స్వరూపమైనది. ఇందు దీనినావిష్కరింప సమర్థములగు పదము లేవియు ఉండవు.

మంత్ర II 258.

వైదిక మంత్రము.

మహతీ సంజ్ఞా II. 368.

దీర్ఘమగు పారిభాషిక పదము. ఇది సార్థకముగ నుండును. ఉదా. 'సర్వనామము' (అన్నిటికిని బోధకముగ ప్రయోగింప దగినది). 'అవ్యయము' (మార్పుచెందనిది) మొ.

మహాభాష్య II. 479.

పతంజలి విరచితమును అష్టాధ్యాయీ వ్యాఖ్యాన రూపమును అగు ఉద్గ్రంథము.

మాఠర II. 348.

ఒక బ్రాహ్మణుని పేరు.

'బ్రాహ్మణా భోజ్యన్తామ్; మాఠర కౌండిన్యౌ పరివేవిష్టామితి, నేదానీం తౌ భుంజాతే" మ. భా.

మాత్రా II. 24.

(1) స్థితి. అవస్థ.

(2) II 309. అచ్చులు హల్లులు మొదలగు వాటిని ఉచ్చరించుటకు అవసర మగు కాలము.

మిథ్యాభ్యాస II. 285.

దోషభూయిష్ఠములగు పద్ధతుల ద్వారా శాస్త్రములను అభ్యసించుట.

ముఖ్య II. 84.

ప్రధానము. గౌణము కానిది.

మూర్తి వ్యాపారదర్శన I. 19.

జగమునందలి దృశ్యపదార్థముల వ్యాపారమును చూచుచుండుట.

యథా సంఖ్య II. 99

క్రమమును అనుసరించి. ఉదా. మొదట నాలుగు విషయములను చెప్పి మరల మరి నాలుగు విషయములను చెప్పునపుడు మొదటిది మొదటి దానితోడను, రెండవది రెండవ దానితోడను ఈ క్రమమున సంఖ్యానుసారముగ సంబంధించును. ఇది యథాసంఖ్యము.

యౌగపద్యమ్ = 462.

ఒక్క మారుగానే జరుగుట

(ఒక్క మారుగానే ఉచ్చరించుట)

రూఢి II 771.

స్థిరీభూతమగు అలవాటు లేక ఆచారము.

లక్షణ II. 168.

గౌణార్థము. సూచితమగు అర్థము. లాక్షణికార్థము.

'లక్షణ మునలక్ష్యసూచార్థః' (పుణ్య.)

లఘు II 84, 176.

సంక్షిప్తము. గురువు కానిది. తేలికగా నుండునది.

లిఙ్గ II. 73, 315

గుర్తు. సాకూత మగు వచనము. సమీపమున నున్న పదము యొక్క అర్థము తెలియటకు ఉపకరించు విశిష్టార్థబోధక శబ్దము.

లైఙ్గికీ I. 137.

భావగర్భిత మగు మాటవలన తెలియునది. ఏదైన ఒక వస్తువునందలి విశిష్ట లక్షణమును తెలిసికొనగా, తద్ద్వారా కల్గిన మరియొక జ్ఞానము.

వర్ణసఙ్ఘాత II 342.

అర్థవంతమగు వర్ణ సముదాయము. దీనికే పదమని పేరు.

వాక్య II. 1, 2, 326-327.

వాక్యము. పదసముదాయము. ఒక భావమును ఆవిష్కరించుటకు ప్రయుక్తమై, విడదీయరాని పదసముదాయము.

(2) II 314.

పదార్థనిర్ణయమునకై ఉపయుక్తము అగు హేతువులలో నొకటి.

వాక్యవాదినః II. 57.

అఖండార్థ బోధకమగు వాక్యము అఖండ మనియు, పదాది విభాగము కాల్పనిక మనియు అంగీకరించువారు.

వాచ్ I. 124, 127.

శ్రవణ గోచరమగు వాక్కు (మాట). శ్రవణగోచరమును వైఖరీనామధేయమును అగు వాక్కునకే కాక తత్పూర్వస్థితరూపము అగు 'మధ్యమా' 'పశ్యన్తీ' లకు గూడ 'వాచ్' అని పేరు. కొందరు పండితులు 'పరా' అనుదానిని కూడ వీటి అన్నింటి యొక్క పూర్వస్థితి రూపమగు వాక్కుగా అంగీకరించినారు.

వాచక II. 192, 194.

ఒక అర్థమును ప్రత్యక్షముగ బోధించునది.

వార్తాక్ష II. 343.

ఒక ప్రాచీన వైయాకరణుడు. వాక్యార్థమే వాస్తవమైనదనియు, కావున వాక్యము అఖండమైనదనియు ఇతని యభిప్రాయము. వాక్యమును పదములుగ విభజించి ఆపదములు నాలుగు విధములని యంగీకరించుట కాల్పనికము. ఇట్టిసిద్ధాంతమునుచెప్పినవాడు ఔదుంబరాయణుడనీ నిరుక్తకారుడు చెప్పియున్నాడు. భర్తృహరి అతనితోపాటు వార్తాక్షుని గూడ ఏతత్సిద్ధాంతాంగీకర్తముగా చెప్పినాడు.

వాలవాయ II. 179.

వైదూర్య మణులు జనించు ఒక పర్వతమునకు పేరు.

వాహీక II. 252, 255.

వాహీకదేశవాసి. ఈ దేశము నేటి పంజాబు కాశ్మీర రాష్ట్రములతో సంబంధించి యున్నది. వాహీక శబ్దము మొద్దువాడు అను నర్థమున ప్రయోగింపబడినది.

వికల్ప II. 116.

విభాగము.

వికల్పన II. 180

ఇదికాని, అది కాని అని చెప్పుట.

వికార I. 3. II. 50,

ఆకారము. పరిణామము. మార్పుచెందుట.

విచ్ఛిన్న II. 291,

తెగిపోయిన. వేరుగా చేయబడిన. ఆగిపోయిన.

విచ్ఛేద II. 242.

పదావయవములను విడదీసి చూపుట.

విద్యా I. 10, 15, II. 283, 288

శాస్త్ర ప్రక్రియ.

విధాతా I. 10

సృష్టికర్త. వ్యవస్థాపకుడు.

విధిశేష II. 349.

విధాయక శాస్త్రమునకు అంగభూతము. ఉదా. 'ఇకోగుణవృద్ధీ' అను సూత్రము గుణ విధాయకములగు 'సార్వధాతుకార్ధధాతుకయోః' ఇత్యాదులకు అంగము.

వినియోగ II. 32.

ఉపయోగించుట.

విప్రయోగ II. 315.

విడిపడుట. ఒక పదమునకు ఏ అర్థము చెప్పవలెను అనుసందేహము కలిగినపుడు తదర్థ నిర్ణయ హేతువులలో విప్రయోగము ఒకటి. 'అశంఖచక్రో హరిః' ఇత్యాదు లుదాహరణము.

విరహిత II. 328,

వ్యవహితము. ఒక అసదృశ వస్తువు మధ్య ప్రవేశించుటచే ఏర్పడిన వ్యవధానము కలది.

విరోధితా II 315.

విరుద్ధ స్వభావము. శత్రుత్వము. ఇది అర్థ నిర్ణయహేతువులలో నొకటిగ అంగీకరింపబడినది. 'రామార్జునగతిస్తయోః' ఇత్యాదులు ఉదాహరణము.

వివిక్తత్వ (వివేకత్వ) II 433.

భేదము, నానాత్వము.

వివేక II. 116.

విభాగము.

విశేషాతిదేశ [II. 77].

ఒక వస్తువునందు సదృశమగు వస్త్వంతరము యొక్క ధర్మములను ఆరోపించుట.

వృత్తి I. 51, 75, II. 35, 218, 226.

(1) కొన్ని ధర్మములు ఆవిర్భూతములై మరికొన్ని ధర్మములు తిరోభూతములగుచుండెడు పరిస్థితి.

(2) II. 35.

ఒక పదము మరియొక అర్థమును గూడ బోధించెడు స్థితి. 'కృత్తద్ధిత సమాసైక శేష సనాద్యన్త ధాతురూపాః పఞ్చవృత్తయః. పదార్థాభిధానం వృత్తిః' (సి. కౌ.).

(3) II. 246.

పదముల ప్రయోగము లేక ప్రవృత్తి. 'కా పునర్వృత్తిః? శాస్త్ర ప్రవృత్తిః' (మ. భా)

(4) II. 75. 101, 105

వృత్తిఅనగా ప్రవృత్తి. ఇచట వైకృత ధ్వనులవలనకలిగెడు ద్రుత, మధ్యమ, విలంబిత అను మూడు విధములగు ధ్వని ధర్మములు గ్రాహ్యములగును. గ్రంథమును వల్లెవేయునపుడు ద్రుతవృత్తి. ఇతరులతో ప్రసంగించునపుడు మధ్యమవృత్తి. పాఠము

చెప్పునపుడు విలంబితవృత్తి ఉపయోగపడును. వీనివలన స్ఫోటశబ్దము భిన్నము కాదు. తొందరగా, సామాన్యముగా, మందముగా ప్రజలు చదువునపుడు పై వృత్తులు స్పష్ట మగును.

వృద్ధి I. 59.
వ్యాకరణ శాస్త్రమున 'ఆ' 'ఐ' 'ఔ' లకు వృద్ధి యని పేరు.

వేద I. 5
వేదము. ఇది శబ్ద బ్రహ్మస్వరూపము.

వైకృత I. 19, 77.
వికారము చెందినదానితో సంబంధిం చినది.

దుతాది వృత్తి భేదము వైకృత ధ్వను లచే కలుగును. స్ఫోటశబ్దమభివ్యక్తమైన తరు వాత ఆశబ్దమును కొంతకాలము నిలచునట్లు చేయునవి వైకృతధ్వనులు. అవి మాత్రము స్ఫోట శబ్దమునకు నానాత్వమును జూపునవి కావు.

వైఖరీ I 143.
శ్రోత్రగ్రాహ్య మగు శబ్దము. ఇది చతుర్విధ వాక్కులలో నొకటి.

వ్యక్తి I. 68. 69.
ఒక పదార్థము. ఒక వ్యక్తి.

వ్యఞ్జన I. 116.
వ్యక్తము చేయుట, అభివ్యక్తి. వింజామర గాలి ఉనికిని సూచించినట్లు ఒక వస్తువు అవిర్భవించుటకు కారణమగుట.

వ్యతిరేక I. 388
ఎల్లపుడు కలిసియుండు రెండింటిలో ఒకటి లేనపుడు రెండవది కూడ ఉండదనుట.

వ్యపేక్షణా II. 228.
పేర్కొనుట, పరామర్శించుట.

వ్యర్థ II. 303.
విభిన్నార్థము.

వ్యవచ్ఛిన్న II. 6.
ఇది ఇట్లని చెప్పబడినది, నిశ్చిత రూప మున ప్రతిపాదింప బడినది,

వ్యవహార II. 343
వాక్యములను ప్రయోగించుట.

వవ్యస్థానిత్యతా I. 28.
బాహ్యాకృతియందు మార్పులు కల్గ బడుచున్నను అంతరతత్త్వము స్థిరముగ నుండుట,

వ్యవహిత II. 323.
అనదృశవస్తువుచే వ్యవధానముకలదిగ చేయబడినది. చూ. విరహిత.

వ్యవాయ II. 364.
వ్యవధానము.

వ్యాకరణ I, 11, 18, 22, 142.
శబ్దసాధుత్వాసాధుత్వాది నిర్ణాయక శాస్త్రము.

వ్యాపిన్ II. 84.
ఇతర వస్తువులను తనలో సంగ్రహిం చునది,

వ్యుదాస II. 79.
దూరముచేయుట, ఒక నియమము పట్ట కుండ వేరు చేయుట.

వ్రీహిశ్రుతి II. 65.
వ్రీహులతో యాగముచేయ వలెను అని బోధించెడు వేదవాక్యము.

శబ్ద I. 1, 107, 108, 111, 1112
II. 80 మొ.

ధ్వనియని అక్షరార్థము, ఉచ్చారణ సమయ మున ధ్వనికి సంబంధించిన అన్ని దశలకును శబ్దమను పేరు ప్రయుక్త మగుచున్నది స్పష్టము కాని ధ్వని, స్పష్టమగు ధ్వని, అర్థబోధకమగు స్పష్టధ్వని (పదము), శ్రవణ గోచరము కాని ధ్వని, ధ్వని కారణ భూత మగు మానసిక శక్తి, సర్వవ్యాపారకారణ

భూత మగుచిచ్ఛక్తి- ఇవియన్నియు శబ్దావస్థా భేదములే.

శబ్దతత్త్వ I. 1, II. 30, 32.

శబ్ద తత్వము అత్యుత్తమమగు శబ్ద శక్తి. దీనికే శబ్దబ్రహ్మ మనియు, నాద బహ్మమనియు, స్ఫోటయనియు నామాంతరములు.

దీనికి 'శబ్దస్య తత్త్వమ్' అనియు 'శబ్దః తత్వం అస్య' అనియు విగ్రహములు చెప్పుదురు.

శబ్దధర్మ I. 58.

అర్థమును గ్రహించుట, అర్థమును బోధించుట అనెడు రెండు శబ్ద ధర్మములు.

శబ్దశక్తి II. 168.

అర్థమును బోధించు విషయమున శబ్దమునకు గల శక్తి.

శబ్దార్థసంబంధ I. 23.

శబ్దమునకు అర్థముతో సంబంధము. ఈ సంబంధము నిత్యమని వైయాకరణుల మతము.

శాస్త్రార్థము. II. 210.

ఒక పదమునకు గాని ఒక వర్ణమునకు గాని వ్యాకరణశాస్త్ర కారులు తను గ్రంథము లోచూపిన యర్థము. ఈయర్థము లౌకిక భాషతో కాన రాదు.

శిష్ట I. 27, 29.

మంచి సంస్కృతిగల పండితులు. వ్యాకరణాది శాస్త్రములను బాగుగ అభ్యసించి ప్రమాణ సంమతముగ వాటి విషయములను విశదీకరింప కలిగినవారు.

'శిష్టా వైయాకరణాః. శాస్త్ర పూర్వికా హి శిష్టిః. వైయాకరణాశ్చ శాస్త్రజ్ఞాః' (మ. భా. VI. 3, 109)

శేష II. 32.

మరియొకదానికి అంగమైనది. శేషించినది.

శేషలక్షణా (షష్ఠీ)

సంబంధ సామాన్యార్థమున 'షష్ఠీ శేషే' అను సూత్రముచే విహితమగు షష్ఠి.

శ్రుతి II. 73, 75. మొ.

ప్రత్యక్షముగ బోధించు వాక్యము, అనుమానముద్వారా బోధించు లింగమువలె కాక ఇది ఒక విషయమును ప్రత్యక్షముగ బోధించును.

సంగ్రహ II. 478, 481.

(1) అతి విస్తృతమగు ఒక వ్యాకరణగ్రంథము. అది ఇపుడు లభ్యముకాదు. దీనిని ఎందరో ప్రాచీన వైయాకరణులును అర్వాచీనులును ప్రమాణముగ చూపియున్నారు. దీనిని వ్యాడియను ఒక వేదవేత్త రచించెను. ఈతని నామధేయమును వార్తికకారుడును, ఋక్ప్రాతిశాఖ్యకారుడును పేర్కొనియున్నారు. పాతంజల భాష్యమునకు ఈ సంగ్రహము ఆధారమని చెప్పుదురు.

(2) కూర్పు

సంఘాత II. 169, 205, 208. మొ.

(1) సహోచ్చరితములై అర్థబోధకములగు వర్ణముల సముదాయము.

(2) II. 1. పరస్పర సంబంద్ధములగు పదముల సముదాయము. ఇదియే వాక్యమని అభిహితాన్వయవాదులు చెప్పుదురు.

సంజ్ఞా I, 59, 66; II. 353, 360. మొ.

పేరు. పారిభాషికమగు పదము. ఇది కాల్పనికమై కొన్నిటికి నామధేయముగ ప్రయుక్తమగును. సమ్యగ్ జానన్తి అనయా (దీనిచే లెస్సగా తెలుసుకొందురు). అనువ్యుత్పత్తిచే తెలుసుకొనుటకు సాధనము సంజ్ఞ అనబడును. ఇది లోకశాస్త్రసాధారణము. 126 శ్లోకమున మాత్రము సజ్ఞా శబ్దము ప్రాణము లోపలనున్న చైతన్యమును బోధించును

సంజ్ఞిన్ I. 59, 66, II. 100, 353, 365.

పారిభాషికమగు ఒక సంజ్ఞాశబ్దముచే బోధింపబడు వస్తువు.

సంనిపాత I. 109.

వ్యాపార విశేషము.

సంవిత్ II. 133.

జ్ఞానము

సంవిధానమ్ II. 322.

ప్రతిక్రియ. ఒకపనికి విరుగుడుగా చేయు వేరొకపని (ప్రాయశ్చిత్తము మొ॥)

సంసర్గ II. 96, 97, 126 మొ.

(1) క్రియా కారకముల పరస్పర సంబంధము

(2) II. 44.

క్రియా సాధనములకు క్రియతో ఘనిష్ఠమగు సంబంధము. ఈ క్రియయే అనగా వ్యాపారమే వాక్యార్థమని కొందరి అభిప్రాయము.

(3) II. 315.

ఇతర వస్తువులతో సంబంధము. సంశయము. కలిగినపుడు అర్థ నిర్ణాయక హేతువులలో నిది యొకటి.

సంస్కార I. 79.

(1) ఎక్కువ అర్హత. కార్య కరణ సమర్థముగ చేయుట.

(2) II. 284.

వ్యాకరణ నియమ ప్రవృత్తి.

సంస్థాన II. 155.

అవయవసంనివేశము. ఆకృతి.

సంహితా II. 58, 104.

పదములు పరస్పరము కలిసియుండుట. పదవిభాగరహితమగు వేదపాఠము.

సత్య II. 127.

వాస్తవమైనది. పదము యొక్క లేదా వాక్యము యొక్క వాస్తవమగు అర్థము.

సప్తపర్ణ II. 309.

కణుపుకు ఏడు ఆకులుచొప్పున బయల్వెడలు ఒక వృక్ష విశేషము.

'సప్తపర్ణ' అనుదానికి 'ఏడాకులు' అని మాత్రమే' అర్థమైనను ఇది లక్షణచే వృక్షమును బోధించుచున్నది గాన ఈ పదమును లక్షణకు ఉదాహరణముగ చూపుదురు

సమయ II. 118.

(1) ఒక కట్టుబాటు. అలవాటుగా వచ్చుచుండెడు ఒక నియమము.

(2) సహజమగు ఒకానొక విధమైన జ్ఞానము.

సమవాయ II. 436.

విడదీయరాని సంబంధము.

సమాఖ్యాన II. 9, 173.

చెప్పుట. ప్రతిపాదనము.

సమామ్నాత I. 5.

ప్రామాణికముగ చెప్పబడినది.

సముచ్చయ II. 77.

ద్వంద్వాది సమాసములలో చెప్పిన విధముగ రెండు లేక అంతకంటె అధికమగు వస్తువులను కలిపి చెప్పుట.

సముచ్చితాభిధాన II. 195, 196.

దగ్గరగా చేర్చబడిన వస్తువులను చెప్పుట.

సముదాయ II. 126.

ఏకపిండీకృతమగు అర్థము. ఏకవచన ప్రయోగాదులచే అనేక విషయములను ఒక సమాహారముగ నేర్పరచుటచే వచ్చిన సముదాయము.

సాధన II. 413, 426 మొ.

ఒక [illegible] సాధించుటకు ఉపయుక్తమగు సాధనము.

సామిధేనీ II. 258.

అగ్నియందు సమిధలను ఉంచునపుడు పఠించు ఋక్కు.

సాయుజ్య I. 181.

కలయిక.

సార్వార్థ్య II. 250.

వివిధార్థముల నన్నింటిని బోధించుట

సాహచర్య II. 815.

కలిసి ఉండుట.

సిద్ధి I. 86.

(1) ఈప్సితార్థము నెరవేరుట.

(2) II. 263

తెలియబడి యుండుట.

సోఢత్వ I. 82.

బుద్ధిస్థము చేయబడుట. పునఃపఠనముచే బుద్ధిస్థము చేయబడుట.

సౌభవ II. 181.

ఒక ప్రాచీన వైయాకరణుడు. ఈతడు తర్కాభాసములచే భాష్యకారుని సిద్ధాంతములను ఖండింప ప్రయత్నించెను.

స్ఫోట I. 49, 75, 77, 81, 93, 102, 108, 106

విషయమును స్ఫుటము చేయునది. నిత్యమగు శబ్దము.

"స్ఫుటతి అస్మాత్ అర్థః ఇతి స్ఫోటః." దీనివలన అర్థము స్ఫుటమగును, ఈవ్యుత్పత్తిచే అర్థబోధకమగు శబ్దము. మధ్యమావాగ్రూపము స్ఫోట అనిశాబ్దికులు విశ్వసింతురు.

స్మృతి I. 7, 145

సంప్రదాయ సిద్ధముగ స్మరింపబడుచుండెడు ప్రామాణికమగు వాక్యము.

స్వమాత్ర I. 129

ఆత్మ స్థితి. ఆత్మ స్వరూపము.

స్వర II. 816.

స్వరము. ఇది అర్థ నిర్ణయ హేతువులలో నొకటి.

స్వార్థిక II, 191.

తనయొక్క అర్థము మాత్రమే కలది. ఒక పదమునకు చేర్చిన ప్రత్యయమునకు ఆ పదమున కేది యర్థమో యదియే కాని మరియొక అర్థము లేకున్నచో అది స్వార్థికము.

హర్యక్ష II. 481.

ఒక ప్రాచీన వైయాకరణుడు. ఈతడు తర్కాభాసములచే భాష్యకార ప్రతిపాదితములగు సిద్ధాంతములను ఖండింప ప్రయత్నించెను.

హేతువాద I. 41.

హేతు ప్రదర్శన పూర్వకమగు వాదము.

vaakyapadiiyamu–II (Vakyapadiyamu–II) : SANSKRIT ORIGINAL : BHARTRIHARI ; TELUGU TRANSLATION : SRI PERI SURYANARAYANA SASTRI, SRIMAN SRIBHASHYAM APPALACHARYULU, DR. PULLELA SRIRAMACHANDRUDU & SRI APPALLA SOMESWARA SARMA ; SCRUTINISER : PROF. G. J. SOMAYAJI. FIRST EDITION : 1980 ; pp. viii+1072,







FIRST EDITION, 1980

*Copies:* 1000

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme for Production of Books and Literature in Regional Languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



PRICE Rs. 34-75

అనగా ఆజాతి, కార్యమును కలిగించెడి శక్తియు ఒకే ద్రవ్యము నందుండును; ఆసాహచర్యముచే, శక్త్యుపలక్షణమ్ = శక్తికి ఉపలక్షణమగును. ఉపలక్షణమనగా ఉపాయము. శబ్దములచే బోధింపబడినది జాతియే అయినను అది ప్రధానముకాదు. అది ద్రవ్యగతమగు శక్తిని గ్రహించుటలో ఉపాయముకాగలదని భావము.

ఖదిరాదిషు = చంద్రకఱ్ఱ మున్నగునవి, అశక్తేషు = సమర్థములుకాకయుండగా, శక్తః = కార్యమును కలిగించుటకు సమర్థమగునది, ప్రతినిధీయతే = ప్రతినిధిగా స్వీకరింపబడుచున్నది.

ఖాదిరేబధ్నాతి (చంద్రకఱ్ఱచే నిర్మింపబడిన యూపస్తంభమున పశువును కట్టవలెను) అని వేదము చెప్పుచున్నది. పశువు పారిపోకుండునట్లుచేయుటకై దానిని యూపస్తంభమున బంధింతురు. ఆస్తంభము చంద్రకఱ్ఱతో చేయవలెను. అచట ఖదిరత్వము ప్రధానము కాదు. అట్లుకాకున్న సన్నని చంద్ర గాని, దానిలేత చిగురుగాని స్తంభముగా జేసిన, నది పశువుచేలాగివేయబడును. పశుబంధనము నెరవేరదు. అందుచే ఖదిరత్వజాతి అప్రధానమే. శబ్దముచే బోధింపబడిన జాతి శక్తికి గుర్తుగా ఉపయోగపడును. కాగా బంధనమునకు సమర్థమగు కఱ్ఱతో స్తంభము చేయవలెనని భావముతేలుచున్నది. అట్టి సామర్థ్యమే ప్రధానము కనుక, అటువంటిది చంద్రకఱ్ఱ లభించిన దానినే యుపయోగింతురు. అట్టి చంద్రకఱ్ఱ లభింపనిచో ఆసామర్థ్యముకల మరియొక కఱ్ఱ ఖదిరము మున్నగునది గ్రహింపబడును.

కాబట్టి, జాతి శక్తివాదమునగూడ జాతియనునది శక్తికి ఉపలక్షణము కనుక ప్రతినిధి యుపపన్నము కాగలదు. ఈపక్షమున జాతి అప్రధానమే, ఉపలక్షితమగు శక్తియేప్రధానము. ॥3॥

*అవతారిక*—ఎల్లశబ్దములు జాతినే బోధించును. అచట జాతి శక్తికి ఉపలక్షణము అనగా ఉపాయము అను వారిమతమున పై రీతిని ప్రతినిధి ఉపపన్నము కాగలదు.

కాని ఆజాతియే ప్రధానము. శక్తికి ఉపలక్షణము కాదని కొందరు జాతిశక్తివాదులభిప్రాయమును వ్యక్త పరుచుచున్నారు. వారి మతమున యథావిధిగా వాక్యార్థము లభించుచున్నందున ప్రతినిధి యెట్లు ఉపపన్నమగును? అను ప్రశ్నకు వారిమతమునగూడ ప్రతినిధికి భంగములేదని సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అస్వాతన్త్ర్యఫలో బన్ధః ప్రమాణాదివశిష్యతే।**
**అతోజాత్యభిధానేపి శక్తిహీనం నగృహ్యతే॥** 4

అస్వాతన్త్ర్యఫలః = స్వాతంత్ర్యము లేకపోవుటయే ప్రయోజనముగాగల, బన్ధః = బంధనము అనగా పశువును స్తంభమున బంధించుట, ప్రమాణాది + ఇవ = పశువునుచంపుట అవయవములను గ్రహించుట మున్నగునది వలె, శిష్యతే = వేదముచే విధింపబడుచున్నది.

రచ్చుట చక్కగ నున్నను మొదట చూచిన వెంటనే పూర్వ వాసన ఉద్బుద్ధమై వాడే పీడని యనుకొందుము. కనుక భేదము వాస్తవికమయినను, బుద్ధి గోచరము కానంతవరకు నది అకించిత్కరము గవయము పోలిక దొరకనంతవఱకు ఎదుటి దానిని గోవనియే భావింతుము గదా. ॥571॥

అవతారిక— అత్యంతము వ్యావృత్తమయిన పదార్థమయినను బుద్ధిలో భేదమును గ్రహింపనపు డభేద ప్రత్యయమే కలుగును.

**శ్లో॥ అత్యంతం విషయే భిన్నే యావత్ ప్రఖ్యా న భిద్యతే।**
**న తావత్ ప్రత్యభిజ్ఞానం కస్యచిద్వినివర్తతే॥** 572

అత్యంతం = సంపూర్ణముగ, భిన్నే విషయే = వేరయిన విషయమునందును, ప్రఖ్యా = అభేద నిశ్చయము, యావత్ న భిద్యతే = మారనంతవరకు = ఎంతవరకు మారదో, తావత్ అంతవరకు, ప్రత్యభిజ్ఞానం = 'అదియే యిది', అను జ్ఞానము, కస్యచిత్ = ఎవ్వనికిని, న వినివర్తతే = తొలగిపోదు.

తాత్పర్య వివరణములు— వ్యక్తులు సర్వాత్మనా భిన్న భిన్నములయినను, అవి అట్లు భిన్నములు అను జ్ఞానము మనకు కలుగనిచో, రెండు వ్యక్తులయందును అన్వయము గల రూపము అనగా ధర్మము వ్యాపించియుండుట చేత అభేద నిశ్చయమే కలుగును. భేద జ్ఞానము కలుగనంతవరకు, ప్రత్యభిజ్ఞానమును (అదియే యిది యనుట) అనువర్తించునని భావము. ॥572॥

అవతారిక— కనుక ఉపపాదించిన రీతిగ, పదార్థముల భేదాభేద వ్యవహారము నకు వానికి బాహ్యరూపము కలదా? లేదా? అను విచారముతో బనిలేదు. బుద్ధియందు ప్రతిభాసించు భేదాకారమును బుచ్చుకొని యొకే పదార్థమున కుపమానోపమేయ భావము సంభవము. "రాజవదస్య వృత్తమ్" "ఈతని వృత్తము రాజును బోలినది." – ఇత్యాది ప్రయోగములందు పూర్వ సూత్రము చేతనే వతి ప్రత్యయము సిద్ధింపవచ్చును గాన, 'తద ర్హమ్'' అను సూత్రము, అపండితులకు తెలియపరచుట కగును. కాన తదారంభము సమర్థ నీయ మనుచున్నారు.

**శ్లో॥ అయమేవతు సూత్రేణ భేదోభేదేన దర్శితః।**
**ప్రసిద్ధమపిదుర్ జ్ఞానమబుధః ప్రతిపద్యతే॥** 573

అయమేవ = ఈ బుద్ధ్యవస్థను బట్టిన, భేదః తు = భేదమే, సూత్రేణ = సూత్రముచేత, భేదేన = వాస్తవ భేదముకంటె వేరయిన భేద మిదియని, 'దర్శితః' = చూపింపబడినది, ప్రసిద్ధమపి = ప్రసిద్ధమైనదియే అయినను, దుర్ జ్ఞానం = దుర్బోధమగు దానిని, అబుధః = మందబుద్ధియగు వాడు, ప్రతిపద్యతే = తెలిసికొనును.

శ్లో॥ తన్నాస్తి, విద్యతేతచ్చ, తదేకం తత్పృథక్పృథక్ ।
సంసృష్టంచ విభక్తంచ వికృతం తత్తదన్యథా ॥ 13

నిజరూపమున పరతత్త్వము వ్యవహారగోచరముకాదు. అనాదియగు మాయయొక్క సంబంధ మున విచిత్రరూపములతో గానవచ్చుచున్నది.

తత్ = అపరతత్త్వమే, న + అస్తి = లేదనియు, తత్ + చ = అదియే, విద్యతే = ఉన్నదనియు వ్యవహరింపబడుచున్నది.

ఉనికికి లేమికి గూడ ఆ పరతత్త్వమే మూలమగుచున్నది. విరుద్ధములగు సత్త్వా సత్త్వములనెడి ఉపాధులను అదియే సహించుచున్నది.

వ్యవహారదశయందే, తత్ = ఆ తత్త్వము, ఏకమ్ = ఒక్కటి యనియు, తత్ = అదియే, పృథక్ + పృథక్ = నానారూపమనియు వ్యవహరింపబడుచున్నది, ఏకత్వ నానా త్వములు పారమార్థికరూపమునలేవు, అవిద్యా దశయందు ఆతత్త్వమునందు భాసించుచున్నవి. అదియే జాతిరూపమున వ్యక్తిరూపమున కాన్పించుచున్నది.

తత్ = ఆతత్త్వము, సంసృష్టం + చ = ఇతర వస్తువులతోసంబంధముకలదియు, విభక్తం + చ = విభాగము కలదియు అగుచున్నది.

సంయోగ విభాగములనెడి ఉపాధులు అవిద్యాదశయందు తత్త్వమునందు గోచ రించుచున్నవి.

తత్ = ఆ తత్త్వము, వికృతమ్ = వికారములు కలదిగాను, తత్ = అదియే, అన్యథా = వికారములు లేనిదిగాను అగుచున్నది.

ఎల్ల వికారములతో పుట్టుచున్నట్లు కాన్పించును. అదియే ఆకాశరూపమున కూటస్థ ముగా ఎట్టి వికారము లేక భాసించును.

పరతత్త్వము యొక్క పారమార్థికరూపము 12 వ శ్లోకమున, అవిద్యాదశయందు గోచరించెడి వ్యావహారిక రూపము 13 వ శ్లోకమునను నిరూపింపబడినవి. ॥13॥

అవతారిక — ఎల్ల ప్రపంచకము బ్రహ్మమయమే కనుక విరుద్ధములగు వ్యవహా రములన్నియు ఆ పరబ్రహ్మమునందే లయమును బొందును. అవియన్నియు అవిద్యామూల మున పరబ్రహ్మమునంపు భాసించుచున్నవని చెప్పుచున్నాడు.

శ్లో॥ తస్యశబ్దార్థ సంబన్ధ రూపమేకస్య దృశ్యతే ।
తద్ దృశ్యం దర్శనం ద్రష్టా దర్శనే చ ప్రయోజనమ్ ॥ 14

ఏకస్య = అద్వితీయమగు, తస్య = ఆ బ్రహ్మ రూపమగు ద్రవ్యమునకు, శబ్దార్థ సంబన్ధ రూపమ్ = శబ్ద స్వరూపము, అర్థస్వరూపము, వానికి గల సంబంధ స్వరూపము, దృశ్యతే = చూడబడుచున్నవి.

తాత్పర్య వివరణములు— 'ఇట్టివాడు' దేవదత్తుడు అనగా, భుజకీర్తులు, కుండలములు గలవాడు' - అని ముందు బుద్ధిలో సారూప్యము నేర్పరచుకొని యుందుము.

ఇత్థం భావప్రతీతియందు గూడ, బాహ్య వస్తువుయొక్క ఉపరాగము వలన స్వల్ప భేదము భాసించినను యథార్థముగ భేదము లేదు. బాహ్యమగు వస్తువు, బౌద్ధమగు పదార్థము యొక్క అనుకారమే కావున నది దానికి ప్రకారము. కనుక సాదృశ్యము ప్రకారము గావచ్చును.

ఈ విధముగనే ''పంచధా భుంక్తే'' ''త్రేధా అధీతే'' మున్నగు ప్రయోగములందు 'పంచధా' 'త్రేధా' అనుచో ధాప్రత్యయార్థమగు ప్రకారమును సాదృశ్యమే. బుద్ధిలో పరికల్పితమయిన భేదముతో సదృశమగు క్రియా విశేషమే అచట నిర్వర్తింపబడునది గదా. సంఖ్యావచనము కంటె బరముగా విధార్థమున ధాప్రత్యయము విహితము. విధార్థమనగా ప్రకారము = పృథగ్భావము = భేదమని పర్యవసానము. ॥623॥

అవతారిక— ఉపపాదితార్థము శాస్త్ర ప్రమాణోపబృంహితమైన యెడ శోభావహమగునను నాశయముతో చిరోపాసిత సద్వృద్ధుడును, ప్రమాణ పరతంత్రుడు నగు భర్తృహరి, సాదృశ్యమే సర్వత్ర ప్రకార శబ్దార్థమను నంశమున భాష్యకార మతమును సంవాదకమునుగా నిందు ప్రతిపాదించి ముగించుచున్నాడు.

శ్లో॥ గౌర్వాహీక ఇతి ద్విత్వే సాదృశ్య ప్రత్యుదాహృతమ్ ।
శుక్లాదౌ సతి నిష్పన్నే వాహీకో న ద్విరుచ్యతే ॥ 624

ద్విత్వే = ద్విర్వచన విధాయక సూత్రమున, గుణవచన పదమునకు, గౌర్వాహీకః ఇతి = 'గోవు వాహీకుడు' అని, సాదృశ్యం = సాదృశ్యమే, అనగా సాదృశ్య ప్రతీతి గలదియే, ప్రత్యుదాహృతమ్ = ప్రత్యుదాహరణముగా నీయబడినది, నిష్పన్నే = ప్రసిద్ధ గుణవాచకమగు, శుక్లాదౌ సతి = శుక్ల, కృష్ణ, మున్నగు గుణవచన మున్నపుడు, వాహీకః = వాహీకుని బోధించు గోశబ్దము, ద్విః న ఉచ్యతే = రెండు పర్యాయము లుచ్చరింపబడదు, ద్విత్వమును బొందదనుట.

తాత్పర్య వివరణములు— ''ప్రకారే గుణవచనస్య'' (8-1-12) అని అష్టమాధ్యాయమున పదద్విత్వ విధాయక సూత్రము. 'ప్రకారము' ద్యోతమయినపుడు గుణవాచక శబ్దమునకు ద్విర్వచనము వచ్చును అని యర్థము. 'శుక్ల శుక్లం రూపమ్' 'శుక్ల శుక్లః పటః'- ఉదాహరణములు. అట, మహాభాష్యమున, ''గుణవచనస్యేతి కిమర్థమ్ ? అగ్నిర్మాణవకః । గౌర్వాహీకః'' అని గుణవచన పదకృత్యము విచారింపబడి యున్నది. ప్రకార బోధకము లన్నియు గుణవచనములే యగును. కావున 'అగ్నిః మాణవకః' 'గౌః వాహీకః' - అను స్థలములందు అగ్నిశబ్దమునకును గోశబ్దమునకును గూడ ద్విర్వచనము రావలసి యుండునని యర్థము. గోవు యొక్క సాదృశ్యముండుట వలన వాహీకుని 'గోవు' అందురు. అగ్ని

*అవతారిక*— మహాభాష్యమున నీ సూత్రారంభము సమర్థింపబడి యున్నది గాని ప్రత్యాఖ్యానము చేయబడలేదే? 'ఈ సూత్రము, భత్రాద్యర్థ మావశ్యకమయిన యెడల ప్రత్యాఖ్యానము సంభవింపక పోయెడిదని'యే ప్రమాణమునుబట్టి చెప్పుదురు? అనిన -

**శ్లో॥ తదర్హ మితి నారబ్ధం సూత్రం వ్యాకరణాంతరే।**
**సంభవత్యుపమాత్రాపి భేదస్య పరికల్పనాత్॥** 561

''తదర్హమ్'' ఇతి సూత్రం = తదర్హమను నీ సూత్రము, వ్యాకరణాంతరే = పాణినీయేతర వ్యాకరణములందు, న ఆరబ్ధమ్ = ఆరంభింపబడి యుండలేదు, భేదస్య = భేదమును, పరికల్పనాత్ = కల్పించుట వలన, అత్రాపి = వస్తు భేదములేని విషయమునను, ఉపమా సంభవతి = ఉపమానోపమేయ భావము సంభవించును.

**తాత్పర్య వివరణములు**— ఆపిశల వ్యాకరణమునందును, కాశకృత్స్న వ్యాకరణము నందును నీ సూత్రము పఠింపబడలేదు. దానివలన నీ సూత్రము ప్రత్యాఖ్యాతమని గ్రహింపబడుచున్నది. భాష్యకారుడు శాస్త్రాంతరముల వలన సిద్ధాంతిత మయిన విషయమును తన వచనముగా నాదేశించుచుండును. వారి మతము నాతడు ప్రతిషేధింపలేదు. దానివలన ''అప్రతిషిద్ధమనుమతం భవతి'' = 'వాచా నిషేధింపబడనిది అంగీకరింపబడినట్లే అగును'– అను న్యాయముచే నాతనికి ప్రత్యాఖ్యానము సమ్మతమేయని గ్రహింపదగును. ఈ సూత్రమును బఠింపని వైయాకరణాంతరుల యాశయమేమయి యుండునని పరిశీలింప, రెండు పదార్థములకు స్వతః భేదము లేకున్నను, దానిని గల్పించి వాని కుపమానోపమేయ భావము నుపపాదింపదగునని తెలుచున్నది. కాగా నీ సూత్రోదాహరణములను, పూర్వ సూత్రముచేతనే వతి ప్రత్యయమును జేసి సాధింపవచ్చునని భావము. ॥561॥

*అవతారిక*— భేద పరికల్పనము నెట్లు చేయవలెననిన–

**శ్లో॥ ఏకస్యకార్య నిర్జ్ఞానాత్ సిద్ధస్య విషయాంతరే।**
**తద్ధర్మత్వ వివక్షాయాం బుద్ధ్యాభేదః ప్రకల్ప్యతే॥** 562

ఏకస్య = ఒకే పదార్థమునకు, విషయాంతరే = వేరొక విషయమున, కార్యనిర్జ్ఞానాత్ = పనిచేయుట తెలియుటవలన, సిద్ధస్య = (సమర్థముగ) ప్రసిద్ధమునకు, తద్ధర్మత్వ వివక్షాయామ్ = ఆ కార్యమును నిర్వర్తించుట వివక్షితమయినపుడు, బుద్ధ్యా = బుద్ధి పరికల్పనచే, భేదః = అనేకత్వము, ప్రకల్ప్యతే = భావింపబడుచుండును.

**తాత్పర్య వివరణములు**— ''చిచ్ఛేద కృతహస్తవత్'' = 'నీవు కృతహస్తునివలె రణమునందు శత్రువుల శిరస్సులను ఛేదించితివి; అని యర్థము.

కృతహస్తుడనగా అభ్యాస పాటవము కలవాడని భావము. అర్జునుడే కృతహస్తుడు. అతని కుపమానమయిన వేరొక కృతహస్తుడు లేడు. కావున నిట, 'కృతహస్తునకు తగునట్లు'

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 52 | ఉభయార్థతా | XIV - 359 | ఒక శబ్దముచేతనే జాతిని వ్యక్తిని కూడ బోధించు తీరు. |

ఊ

| | | | |
|---|---|---|---|
| 53. | ఊహ్య(ము) | XIV - 80 | సముదాయమునుండి వేరుచేయదగినది. |

ఏ

| | | | |
|---|---|---|---|
| 54. | ఏకవద్భావ(ము) | XIV - 108 | పెక్కులు ఒకటిగా అగుట. (బహువచన ముండవలసిన చోట, ఏకవచనముండుట ఉదా :- ప్రభువనమ్॥ మొ॥). |
| 55. | ఏకార్థీభావ(ము) | XIV - 44 | విడిగా ఉండుఅర్థములు ఒకటిగా పెనవేసి కొనుట. (శబ్దములకుండు సామర్థ్యము.) ఇది సమాసాది వృత్తులందుండును. |

ఔ

| | | | |
|---|---|---|---|
| 56. | ఔపయిక(ము) | XIV - 580 | ఉపాయముగా ఉండుట (సాధనమగుట.) |

క

| | | | |
|---|---|---|---|
| 57. | కరణకారక(ము) | VII - 90,100 | క్రియసిద్ధించుటలో మిక్కిలి ప్రధానమైన సాధనము. (తృతీయ విభక్తితో దీనిని బోధింతురు). |
| 58. | కర్తృతా<br>కర్తృత్వ(ము) | VII - 19, 28 | ఒక క్రియకు కర్తయగుట. |
| 59. | కర్తృస్థభావక(ము) | XIV - 168 | కర్తయందే జరుగు (చూడదగు). వ్యాపారమును చెప్పు ధాతువు. ఉదా :- శీ = నిద్రించు, స్మృ = స్మరించు, మొదలగునవి. |
| 60. | కర్త్రధికార(ము) | VII - 101, 128 | కర్తనుగురించి చర్చించు భాగము. (ఒక శాస్త్రమున). |

అను నర్థమున తదర్హ్మమను సూత్రముచే వతి ప్రత్యయము విహితము. ఉపమానోపమేయ భావము వివక్షితము గాదు - అని "కృతహస్తవదిత్యేతత్" - అను కారికలో నుపపాదింప బడినది.

ఇందు కృతహస్తుడగు వీరు డొక్కడే అయినను, ఆతని పనులు, విషయాంతరమునను, కాలాంతరముననుు ప్రసిద్ధములగుట వలన ఆతని శక్తిని ప్రకృత విషయమున నుగ్గడించుటకై వానికి భేదమును గల్పించి ఉపమానోపమేయ భావము నుపపాదింపవచ్చును. తదర్హ్మమను సూత్రముతో బనిలేదు' అని ప్రతిపాదింపబడుచున్నది.

"నీవు, వెనుకటి యుద్ధములలో, హస్తలాఘవముచే శత్రువులను ద్రుంచినట్లు ఈ రణమునందును, ఛేదించితివి" - అని తాత్పర్యము.

ఆ విధముగనే "రాజవత్ పాండోః ప్రేతకార్యాణి కారయ" అను స్థలమునను, పాండురాజుకు దగునట్లని యర్థము వివక్షితము గాదు. "ప్రాచీనులగు రాజులకు ప్రేతకార్యములను జరిపినట్లు పాండురాజునకును నిర్వర్తింపుమని యర్థము. కావున 'తేనతుల్యా'మను సూత్రముచేతనే వతి ప్రత్యయము సిద్ధింపవచ్చునని భావము. ॥562॥

*అవతారిక*— ఈ విధముగ భేదపరికల్పన మావశ్యకము. లేనిచో సూత్రారంభము వలన వతి ప్రత్యయము సిద్ధించినను, ఇవ శబ్ద ప్రయోగము లభింపదు. "రాజేవాయం రాజా యుధ్యతే" "వైయాకరణ ఇవాయం వైయాకరణో బ్రూతే" - మున్నగు ఇవ ఘటిత ప్రయోగములును ననేకములు గలవు - అని చెప్పుచున్నారు.

**శ్లో॥ సూత్రారంభాన్న చైతస్మాదివ శబ్దస్య విద్యతే ।
ప్రయోగః సోఽపిచైతస్య విషయే విద్యతే వతేః ॥ 563**

ఏతస్మాత్ సూత్రారంభాత్ = (తదర్హామ్) అను ఈ సూత్రమును రచించుటవలన, వతేః ప్రయోగః విద్యతే = వతి ప్రత్యయమునకు ప్రయోగము లభించును, ఇవ శబ్దస్య తు న = ఇవ శబ్దమునకు ప్రయోగము ఘటింపదు, ఏతస్య విషయే = ఈ విషయమునందు, సోఽపి చ విద్యతే = ఇవ శబ్ద ప్రయోగమును లోకమున గలదు

**తాత్పర్య వివరణములు**— కాబట్టి భేదపరికల్పన మవర్జనీయమని తాత్పర్యము. ॥563॥

*అవతారిక*— ఇట్లు భేదపరికల్పనముచే ఇవ శబ్దము ప్రయుక్తమయిన వైదిక మంత్రములును గలవని చెప్పుచున్నారు.

**శ్లో॥ దస్యుహేన్ద్ర ఇవేత్యేతదైన్ద్రే మన్త్రే ప్రయుజ్యతే ।
అన్యత్ర దృష్టకర్మేన్ద్రో యథేత్యస్మిన్ వివక్షితే ॥ 564**

"దస్మహా ఇంద్ర ఇవ" = "ఇంద్రునివలె దొంగలను జంపువాడవు", ఇతి, ఏతదైంద్రే మంత్రే = అను, ఈ, ఇంద్రుడు దేవతగాగల మంత్రమున, అన్యత్ర = వేరొక స్థలమునందు

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 69. | కాలసముద్దేశ(ము) | IX - 1, 114 | అన్ని వస్తువుల అభివ్యక్తికిని కారణమైన కాలశక్తిని నిరూపించు ఒకభాగము. ఈ కాండమున తొమ్మిదవది). |
| 70. | కుత్సా | I - 41 | నింద. తక్కువగా భావించుట. శబ్దమునకు "కన్" (క) అను ప్రత్యయమును చేర్చి ఈ యర్థమును సూచింతురు. ఆ ప్రత్యయము స్వార్థికము. అనగా శబ్దమునకు గల కుత్సార్థమునే అది స్పష్టము చేయును. |
| 71. | కుత్సితశ్రుతి | XJV - 2 | "కుత్సితే" అను సూత్రము. (పా. 5.3.74) ఇది" "నింద" అను అర్థమున "కన్" ప్రత్యయమును విధించును. |
| 72. | కృత్ | XIV - 329 | ధాతువునకు చేరు తృచ్, ణ్వుల్, మొదలగు ప్రత్యయము. దీనివలన కర్తా, కారకము మొదలగు శబ్దములు సిద్ధించును. (కృదతిజ్. పా. 3. 1. 93) |
| 73, | కృతహస్త(స్తుడు) | XIV - 560 | సిద్ధహస్తుడు (చేయితిరిగినవాడు) ప్రవీణుడు "అర్జునుడు" అనునర్థమున ఈ శబ్దమును తరుచు వాడుదురు. |
| 74. | క్రియా | VII - 1,4, 10,15,18, 21,24 IX - 2 | వ్యాపారము, పని, (చిన్న చిన్న అవాంతర వ్యాపారముల సముదాయము.) కలుగు ఫలితముచే ఊహింపదగిన చేత. |
| 75. | క్రియాశ్రుతి | I - 85 XIV - 499, 50,5514,521 | ఒక పని చేయుటలో వేదముయొక్క సమ్మతి. వేదము విధించుట). |
| 76. | క్రియాసముద్దేశ | VIII - 1-64 | క్రియను విశదీకరించు భాగము. (ఈ కాండమున ఎనిమిదవది). |

దృష్టకర్మా = చూడబడిన దస్యుహనన వ్యాపారముగల, ఇంద్రః యథా = ఇంద్రుడువలె, ఇతి అస్మిన్ = అను నీ యర్థము, వివక్షితే సతి = వివక్షింపబడినపుడు, ప్రయుజ్యతే = ఇవ శబ్దము ప్రయోగింపబడియున్నది.

**తాత్పర్య వివరణములు**— "ఇంద్ర ఇవ హి ఉపస్తూయసే । ఇంద్ర ఇవ దస్యుహా భవ । క్షేత్రాణి సృజ" - అని యొక మంత్రము కలదు. అది ఇంద్రదేవతాకము. అనగా నందు స్తోత్రము చేయబడు దేవత ఇంద్రుడు. "ఇంద్రునివలె స్తుతింపబడుచున్నావు । ఇంద్రునివలె నీవు దొంగలను జంపువాడవగుము. సస్య క్షేత్రములను సృష్టింపుము" అని అర్థము. ఇందు సంబోధింపబడిన వ్యక్తి ఇంద్రుడే. వేరొక వ్యక్తి గాదు. ఇంద్రుడే ఇంద్రునితో బోల్పబడినాడు. నానాత్వము నారోపించి, ఒక ఇంద్రునకే భేద కల్పనచే ఉపమానోపమేయ భావమును నిర్వహింపవలెను. స్థలాంతరమున, నింద్రుడవయిన నీవు తస్కరహనన వ్యాపారము గలవాడయినట్లు ఇచ్చట గూడ నగుమని, విషయాంతరమున దృష్టనుయిన కార్యమును బట్టి భేదము పరికల్పించి చెప్పబడినది. ॥564॥

*అవతారిక*— ఈ విషయమున లౌకికోదాహరణమును గూడ జూపుచున్నారు.

**శ్లో॥ పూర్వామవస్థా మాశ్రిత్య యావస్థా వ్యపదిశ్యతే ।**
**సదృశస్త్వం తవైవేతి తత్రైవమభిధీయతే ॥** 565

పూర్వాం అవస్థాం ఆశ్రిత్య = వెనుకటి అవస్థనుబట్టి, యా అవస్థా వ్యపదిశ్యతే = ఏ అవస్థ పోల్పబడునో, తత్ర = అచ్చట, త్వం, తవైవ సదృశః = నీవు నీకే సాటి, ఇతి, ఏవం, అభిధీయతే = అని, ఇట్లు చెప్పబడుచుండును.

**తాత్పర్య వివరణములు**— అవస్థల భేదమునుబట్టి, పదార్థములకు భేదమును గల్పించి పోలికను చెప్పుటను జూతము. ఒక వ్యక్తి తన యౌవనావస్థలో చక్కని ఆకర్షకత గలవాడై యుండెనను కొందము. కాని వార్ధకావస్థలో గూడ ఆ వ్యక్తి అట్టి యాకర్షణ గలవాడైన నీకు నీవే సాటి అయ్యా అందుము. అచట వ్యక్తి ఒక్కడే. అవస్థలు వేరు వేరు. ఆ అవస్థల భేదమును బురస్కరించుకొని వ్యక్తికి భేదము నాశ్రయించి 'నీతో తుల్యుడవు నీవు'- అని ఒకే వ్యక్తి ఉపమింపబడుచున్నాడు గదా. ॥565॥

*అవతారిక*— కాబట్టి సంక్షిప్తాంశ మేమనిన—

**శ్లో॥ ప్రసిద్ధభేదం యత్రాన్య దుపమానం న విద్యతే ।**
**ఉపమేయస్య తత్రాత్మా స్వబుద్ధ్యా ప్రతిభజ్యతే ॥** 566

యత్ర = ఎచ్చట, ప్రసిద్ధభేదం = సుప్రసిద్ధమయిన భేదము గల, అన్యత్ ఉపమానం = వేరొక ఉపమానము, న విద్యతే = ఉండదో, తత్ర = అచ్చట, ఉపమేయస్య ఆత్మా = ఉపమేయము యొక్క స్వరూపము, స్వబుద్ధ్యా, ప్రవిభజ్యతే = మన బుద్ధిచే విభజింపబడుచుండును.

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 86. | ఛాగ(ము) | I - 78, 80 | మేక. (సోమయాగములో వధింపబడునది). |
| | | జ | |
| 87. | జన్మన్ | I - 89, VIII - 29 | పుట్టుక, ఉనికి స్పష్టపడుట. |
| 88. | జరా | IX - 24 | ముసలితనము. క్షీణించుట (కాలశక్తి వలన వస్తువులందు కలుగు శిథిలావస్థ) |
| 89. | జాతి | I - 2, 8, 6, 8 | (1) సకల వ్యక్తులందును ఒకే విధముగ కనపడు ఒకానొక ధర్మము. ఉదా :- గోత్వము (గంగడోలు, మూపురము, తోక. మొదలగు వానిని కలిగియుండుట). భావనా గమ్యమగు ఆకార సామ్యము. (2) I. 2. ఒక వాక్యమున గల పదముల సముదాయము అందించు సామాన్యార్థము. (జాతిస్ఫోట). (8) XIII. 4. లింగము. (ప్రాణులను వేరు చేయు చిహ్నము = స్త్రీ, పుమాన్ నపుంసకమ్.) |
| 90. | జాతిపదార్థతా | XIV - 356 | ''జాతియే శబ్దముల అర్థము'' అనువాదము (''వాజప్యాయనుడు'' అను ప్రాచీనవైయాకరణుడు తొలుత ఈ వాదమును లేవదీసెను). |
| 91. | జాతిసముద్దేశ(ము) | I - 1. 106 | జాతిని విశదీకరించు భాగము. (ఈ కాండమున మొదటి విభాగము). |
| | | త | |
| 92. | తద్ధిత | XIV - 86, 89, 329 | అపత్యము, హితము, భావము, మొదలగు అర్థములలో సుబంతమునకు (శబ్దమునకు) చేరు ప్రత్యయము. ఉదా :- ''దశరథస్య |

తాత్పర్య వివరణములు— 'రామరావణుల యుద్ధమునకు అదియే సాటి' అనునట్లు, అనన్వయాలంకార ప్రక్రియలో నొకే పదార్థమున కుపమానోపమేయ భావము ప్రతీతము ఆ విధముగనే వాస్తవముగ భేదము లేకున్నను, నీ కింకొకడు సమానుడుండుట అసంభవము. కనుక నీవు నీకే సదృశుడవు, అని యిట్లొక వ్యక్తినే స్తుతించుట కలదు. అచట భేదము బుద్ధి పరికల్పితమే కావలెను. కనుక కాల్పనిక భేదము. ఇవ శబ్ద ప్రయోగమువలన, ''రాజేవత్వం రాజా'' = 'రాజువలె నీవు రాజువు' - అను స్థలమున అవధారితమగుట నిశ్చితము కాగా పూర్వ సూత్రముచే వతి ప్రత్యయ సిద్ధివలన నీ సూత్రము ప్రత్యాఖ్యాతము. ॥566॥

అవతారిక— ఒక ప్రశ్న కలుగవచ్చును. బుద్ధి పరికల్పితమయిన భేదమును బురస్కరించుకొని ఉపమానోపమేయ భావోపపాదనము గౌణము గదా. శాస్త్రీయ కార్యములు ముఖ్యార్థముననే ప్రవర్తించును గాని గౌణార్థమున ప్రవర్తింపవు. అట్టి యెడ నిట వతి ప్రత్యయ మెట్లు? అని-

**శ్లో॥ యోఽపిస్వాభావికో భేదః సోఽపి బుద్ధి నిబంధనః।**
**తేనాస్మిన్ విషయే భిన్న మభిన్నం వా నవిద్యతే ॥ 567**

స్వాభావికః = స్వభావ సిద్ధమయిన = వాస్తవిక మయిన, యః భేదః = ఏ భేదము పదార్థములకు గలదో, సః అపి = అదియును, బుద్ధి నిబన్ధనః = బుద్ధి వృత్తమయినదే, తేన = అందుచేత, అస్మిన్ విషయే = ఈ శబ్ద వ్యవహార విషయమున, భిన్నం అభిన్నం వా = భిన్నమనునది గాని, ఏకమే యనునది గాని, న విద్యతే = వస్తు గతిచే లేనేలేదు.

తాత్పర్య వివరణము— భేదము వాస్తవికమయినను, అది మనకు బుద్ధ్యపారూఢమయిననే 'ఇవి భిన్నములు' అను వ్యవహారమును కలుగజేయును. కాగా భేదాభేద వ్యవహారములకు బుద్ధియే నిదానము. ఏకమయినను భిన్నముగ భావింపబడవచ్చును. భిన్నమయినను నది యేకముగనే తలంపబడును. 'మధురలోని ఆ వరి ధాన్యమునే ఇపుడు తినుచున్నాము' అనుట కలదు గదా. ఉపమానోపమేయ భావ విషయమునను బుద్ధి పరికల్పిత భేదా భేదములే కారణమని యింతకు బూర్వము నిరూపితము. ॥567॥

అవతారిక — ఈ విషయమున భాష్యకారుని సంవాదమును జూపుచున్నారు.

**శ్లో॥ అంగదీ కుండలీచేతి దర్శయన్ భేదహేతుభిః।**
**చైత్రమీదృశమిత్యాహ బుద్ధ్యవస్థా పరిగ్రహాత్ ॥ 568**

అంగదీ = బాహుపురులు కలవాడు, కుండలీ చ = కుండలములు గలవాడును, ఇతి = అని, భేద హేతుభిః = భేద కారణములచేత, దర్శయన్ = కనబరచుచు, బుద్ధ్యవస్థా పరిగ్రహాత్ బుద్ధియందు స్ఫురించు అవస్థను గ్రహించుటవలన, చైత్రమ్ = చైత్రుని, ఈదృశమ్ = ఇటువంటి వానిని, ఇతి ఆహ = అని చెప్పెను.

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 122. | పరికల్ప(ము) | III – 65 | ఊహ, వికల్పము, ఊహాగమ్యమైన రూపము. |
| 123. | పశుశ్రుతి | I – 83 | "యాగమందు జంతువును వధింపవలెనను వేదము చెప్పిన విధి. ఉదా :– "పశునా యజేత" మొదలగునది. |
| 124. | పుంవద్భావ(ము) | VI – 10 XIV – 419, 420, 422 | స్త్రీలింగశబ్దము పుంలింగశబ్దముగా మారుట. సమాసము మొదలగు వృత్తులలో కొన్నిచోట్ల ఇట్లు జరుగును. |
| 125. | పురుష(ము) | X – 2,3,70 | వాక్యమందలి క్రియా పదమునగల తిఙ్ ప్రత్యయముచే బోధింపబడు వ్యక్తి, (1. ప్రథమపురుషము = వాడు, అతడు, అది. 2. మధ్యమపురుషము = నీవు. 3. ఉత్తమ పురుషము = నేను). |
| 126. | పురుషసముద్దేశ(ము) | X – 1,9 | పురుషమును చర్చించు భాగము. ఈ కాండ మున పదవ విభాగము). |
| 127. | ప్రఖ్యా | XIV – 28, 405, 575 | జ్ఞానము. భావన |
| 128. | ప్రతికృతి | XIV – 595, 607 | బొమ్మ, ప్రతిమ, విగ్రహము. |
| 129. | ప్రతిజ్ఞా | III – 27 | కర్తవ్యమును నిర్దేశించు వాక్యము. ప్రతి పాదనము. |
| 130. | ప్రతిపదమ్(షష్ఠీ) | VII – 159 | ఆయా సందర్భములలో ప్రత్యేకముగ విధింప బడిన షష్ఠి. (పా. సూ :– "అధీగర్థదయేశాం కర్మణి." మొదలగునది), |
| 131. | ప్రతిబంధ(ము) | IX – 11 | ఫలితము సిద్ధించుటలో ఏర్పడు అడ్డు. కాల శక్తివలన ఏర్పడు అడ్డంకి). |
| 132. | ప్రతిసంహార(ము) | XIV – 90 | విశేషమును బోధించిన వెంటనే, ఆవిశేష మును తెలుపు ప్రత్యయమునుతీసి వేయుట. |

తాత్పర్య వివరణములు— ''ఉపదేశేజనునాసిక ఇత్'' (1-3-2) అను సూత్రమునందు ఉపదేశమునకును, ఉద్దేశమునకును లక్షణమును చెప్పుచు, ''గుణైః ప్రాపణ ముద్దేశః'' అని భాష్యకారుడు చెప్పి, ఉదాహరణముగా, ''అంగదీ, కుండలీ, వ్యూఢోరస్కః, తామ్రాయతాక్షః, వృత్తబాహుః, ఈదృశో దేవదత్తః'' అని నిర్దేశించెను. ఉపదేశమనగా ప్రత్యక్షాఖ్యానము. ఉద్దేశమనగా గుణములచే గుణాశ్రయమును బోధించుట. దేవదత్తుని ఉద్దేశించుటకు, అంగదములు, కుండలములును గలవాడు. విశాలమయిన వక్షః స్థలను గలవాడు. ఎఱ్ఱని విశాలములయిన కన్నులు గలవాడు. వర్తులములయిన బాహువులు గలవాడు'– 'ఇటువంటి వాడు దేవదత్తుడు' అని యర్థము. అంగదిత్వము మున్నగునవి గుణములు. దేవదత్తున కవచ్ఛేదకములు. దేవదత్తుని అంగదవత్త్వాది గుణావచ్ఛిన్నునిగ బోధించుచు, 'ఈదృశుడు'= వీనితో తుల్యుడు, అని యనెను. అట నితరునితో దేవదత్తునకు తౌల్యము విపక్షితము గాదు ఆ ధర్మములతో నపుడు మన బుద్ధిలో పరిస్ఫురించు వానితో సదృశుడనియే భావము. అనగా బుద్ధి యందలి ప్రతిబింబముతో బాహ్య పదార్థమునకు సారూప్యము కలదనుట. కాగా ఉపమానోపమేయ భావము బుద్ధియందు భేదారోపముచే ఉపపన్నమగునని నిరూపితమగుచున్నది. ॥568॥

అవతారిక— దీనికి ఫలమేమన–

శ్లో॥ ఏతైః శబ్దైః యథాభూతః ప్రత్యయాత్మోపజాయతే ।
తత్ప్రత్యయానుకారేణ విషయోప్యుపపద్యతే ॥ 569

యథాభూతః = ఎటువంటి పదార్థముగ భాసించు, ప్రత్యయాత్మా = జ్ఞాన విశేషము, ఏతైః శబ్దైః = ఈ శబ్దములచేత, ఉపజాయతే = ఉద్భవించునో, తత్ప్రత్యయానుకారేణ = ఆ జ్ఞానాకార సాదృశ్యము చేత, విషయః అపి ఉపపద్యతే = బాహ్యమగు విషయము గూడ అవబుద్ధమగును.

తాత్పర్య వివరణములు— బాహ్య పదార్థము జ్ఞానాకారమేయని వ్యవహర్తల అధ్యవసాయము. అంగదిత్వము, కుండలవత్త్వము మున్నగు ధర్మములచే ఆచ్ఛురితమైన యొక ఆకారము బుద్ధియందు భాసించును. నీవు ఏ బాహ్య వస్తువును జూచినపుడా యాకృతి నీ బుద్ధియందు పడునో ఆ పదార్థమే దేవదత్తుడని వ్యవహరింపబడువాడు. దృశ్యమునకును బుద్ధి పరికల్పితము (వికల్పము) నకు అభేదాధ్యవసాయముచే సకల వ్యవహార సిద్ధియని భావము. ॥569॥

అవతారిక— కాబట్టి కల్పితమగు భేదమే ఎల్లయెడల నుపయోగించునది.

శ్లో॥ బుద్ధ్యవస్థా విభాగేన భేదకార్యం ప్రతీయతే ।
జన్యన్త ఇవశబ్దానామర్థా స్సర్వే వివక్షయా ॥ 570

భేద ప్రయుక్త కార్యం = భేద నిబంధనమగు శాస్త్రీయ కార్యము, బుద్ధ్యవస్థా విభాగేన =

అవతారిక— కాలము ఒక్కటేయైనను ఉపాధి భేదముచే భిన్నముగ తోచుచున్న దని చెప్పుచున్నాడు.

శ్లో॥ తస్యాత్మా బహుధా భిన్నో భేదైర్ధర్మాన్తరాశ్రయైః ।
న హి భిన్నమభిన్నం వా వస్తు కించ న విద్యతే ॥ 6

ధర్మాన్తరాశ్రయైః = ఇతర ధర్మములకు (క్రియలకు) సంబంధించిన, భేదైః = భేదములచే, తస్య = ఆ కాలముయొక్క, ఆత్మా = స్వరూపము, బహుధా = అనేక విధములుగా, భిన్నః = భిన్నమైనది, భిన్నం = భేదముగల, వా = లేక, అభిన్నం = భేదములేని, వస్తు = వస్తువు కించన = ఏదియు, న విద్యతే హి = లేదుకదా.

తాత్పర్యము— కాల మొక్కటియే యైనను ఆ యా క్రియలకు సంబంధించిన భేదములచే భిన్నమువలె కనబడుచున్నది. (కాలమే కాదు), ఏ వస్తువైనను భేదము కలదని కాని, లేనిదని కాని చెప్పుటకు వీలులేదు.

విశేషము— సర్వవ్యాప్త మగు ఆకాశము ఒక్కటే యైనను కుండలో నున్న ఆకాశమును ఘటాకాశమనియు, చెంబులో నున్న ఆకాశమును కరకాశమనియు, ఇంటిలో నున్న ఆకాశమును గృహాకాశమనియు ఘటాద్యుపాధి భేదమును బట్టి వేరువేరుగ వ్యవహరించు చుందుము. అట్లే కాలమనునది ఒక్కటే యైనను సూర్యాద్యుదయాస్తమయాది క్రియా భేద మును బట్టి దినయామిన్యాది భేదముతో భిన్నరూపముల వ్యవహరించుచుందుము. కాలమునందే కాదు, ప్రపంచమునందలి ఏ విషయమునందును గూడ పూర్తిగ భేదమున్నదని గాని, భేద మసలే లేదని గాని చెప్పజాలము. దేవదత్తుడను వాడొకడు. వానిలో భేదమున్నదా లేదా యని విచారింపగా భేదము లేదని చెప్పుటకు వీలులేదు. నిన్నటి దేవదత్తుడు పూర్వకాలముతో సంబంధించినవాడు, ఇప్పటి దేవదత్తుడు ఈ కాలముతో సంబంధించినవాడు. ఈ కాలభేద మును బట్టి నిన్నటి దేవదత్తుడు వేరు నేటి దేవదత్తుడు వేరు అని చెప్పవలెను. అట్లని భేదమే గాని అభేదము లేదనుటకు గూడ వీలులేదు. ఈతడు నిన్న చూచిన దేవదత్తుడే అని ప్రత్యభి జ్ఞానము కలుగుచున్నది కదా ? కావున ఏ పదార్థమైనను భేదాభేదములచే అనిర్వచనీయమే యని అభిప్రాయము అట్లే కాలము కూడ. ॥6॥

అవతారిక— 'నహిభిన్న మభిన్నం వా' అను విషయమునే ఉదాహరణముతో విశదీకరించుచున్నాడు.

శ్లో॥ నైకోఽస్తి నాప్యనేకోఽస్తి న శుక్లో నాపిచాసితః ।
ద్రవ్యాత్మా సతు సంసర్గాదేవం రూపః ప్రకాశతే ॥ 7

ఏకః = ఒక ద్రవ్యము, నాస్తి = లేదు, అనేకః అపి = అనేకము కూడ ; నాస్తి = లేదు, శుక్లః = తెల్లనిది, నాస్తి = లేదు, అసితః అపిచ = నల్లనిది కూడా, న = లేదు, తు = కాని,

బుద్ధియొక్క అవస్థల భేదమును బట్టి, ప్రతీయతే = గోచరమగుచుండును, శబ్దానాం = శబ్దముల యొక్క, సర్వే అర్థాః = అర్థము లన్నియు, వివక్షయా = శబ్ద ప్రయోక్తల ఇచ్ఛచేత, జన్యన్తే ఇవ = పుట్టింపబడుచున్నవా యనునట్లు తోచును.

*తాత్పర్య వివరణములు*— "వివక్షాతః కారకాణి భవన్తి" = కర్తృ కర్మాది కారకములు నియతములు కావు. అవి వివక్షాదీనములై వర్తించును. శాస్త్రమునందు వ్యపదేశివద్భావమను నతిదేశ మొకటి కలదు. ఏకాచ్చునకు ద్విత్వము చెప్పబడినది. ఏకాచ్చనగా నొక యచ్చు గలది, పచ్, యజ్, మున్నగునది. 'ఇ' అను ధాతువు అజ్మాత్రమే కాని ఏకాచ్కము గాదు. అటద్విత్వ మెట్లు రావలెను? అనిన, అజ్మాత్రమునే తద్విశిష్టముగ భావింపవలెననిరి. అదియే వ్యపదేశివద్భావము. అది వివక్షా నిబంధనమనుట తెల్లము గదా. పదార్థములకు బాహ్య సత్తా అసత్తలను జూడకయే, ఇచ్ఛచే వానిని భావించి శబ్ద సంస్కారము చేయబడును. కంసవధ వృత్తాంతమును జెప్పువానిని 'కంసంఘాతయతి' అందురు. కంసుని జంపించుచున్నాడని యర్థము శబ్దమువలన ప్రతీతము. ఈ విధముగనే బలిబంధ వృత్తాంతమును జెప్పువానిని 'బలిం బంధయతి' అందురు. బలిని బంధింపజేయు చున్నాడని శబ్దార్థము. కంసుడు, బలిచక్రవర్తియు చిరాతీతులు గదా. వారిపుడు లేకున్నను, మన బుద్ధిలో వారిని సన్నిధాపితులను జేసికొని, 'చంపువాడు చంపించువాడు' అను ప్రయోజ్య ప్రయోజక వ్యవస్థ నేర్పరచుకొని, అట్టి ప్రయోగములను జేయుచున్నాము. ॥570॥

*అవతారిక*— అందువలన శబ్ద ప్రతిపాద్యమగు నర్థము వస్త్వర్థము కానక్కరలేదు.

శ్లో॥ తథా విధేఽపి బాహ్యార్థే భిద్యన్తే యత్ర బుద్ధయః ।
న తత్ర కశ్చిత్ సాదృశ్యం సదపి ప్రతిపద్యతే ॥ 571

తథావిధే = అటువంటి అనగా వ్యక్త్యంతర భిన్నమయిన, బాహ్యే అర్థే అపి = బాహ్య పదార్థము నందు గూడ, యత్ర బుద్ధయః = ఎచట బుద్ధులు, భిద్యన్తే = భేదించునో, తత్ర = అచట, సత్ అపి సాదృశ్యం = విద్యమానమయిన సాదృశ్యమును గూడ, కశ్చిత్ న ప్రతిపద్యతే = ఎవడును గ్రహింపడు.

*తాత్పర్య వివరణములు*— ఉపమానమును ఉపమేయమును బుద్ధియందే గాక బయట గూడ (పృథక్సత్త గలవయినను), వేరయిన వయినను ఆ భేదము ప్రయోక్త మనస్సులో పడనంతవరకు వానికి సాదృశ్య మున్నప్పటికి దానిని నెవడును గమనింపడు. 'అదియే యిది' అను నేకాకార పరామర్శయే యట నుండును.

ఒక వ్యక్తిని దూరమున జూతుమనుకొనుడు. లేదా ఆ ప్రదేశమున వెలుతురు తక్కువగ నుండుననుడు. అపుడు విశేష నిశ్చయములేక వెనుక మనము చూచిన ఆ వ్యక్తి ఆకారమును అనుసంధించి 'వాడే వీడు' అనుకొందుము. సమీపముననే యున్నను, వెలుతు

2. తద్ధితవృత్తి:— దాశరథిః. (దశరథస్య - అపత్యమ్ - పుమాన్ = దశరథుని పురుష సంతానము. ''అతఇఞ్'' - పా. సూ. (4-1-95). అకారాంతమైన షష్ఠ్యంతమునకు అపత్యార్థమున ఇఞ్ ప్రత్యయమగును). ఇచట సుబంతములకు తద్ధితములను పేరుగల వివిధములయిన ప్రత్యయములు చేరుచుండును.

3. సమాసవృత్తి:— నీలోత్పలమ్ = నల్ల కలువ. (నీలమ్ - చ + తత్ - ఉత్పలమ్ + చ - ''విశేషణం విశేష్యేణ బహులమ్'' - పా. సూ. (2-1-57). విశేషణమైన సుబంతము విశేష్యమగు సుబంతముతో సమసించును). ఇచట పదములు ఒకదానితో వేరొకటి కలియుచుండును.

4. ఏకశేషవృత్తి:— పితరౌ = తలిదండ్రులు. (మాతాచ - పితాచ - ''పితా మాత్రా'' పా. సూ. (1-2-70). మాతృపితృ శబ్దములను రెండింటిని కలుపదలచినపుడు. పితృశబ్దమే మిగిలి రెండిటి యర్థమును తెలుపగలుగును) ఇచట ఒకే శబ్దము మిగిలి లోపించిన శబ్దముల అర్థమును కూడ చెప్పుచుండును.

5. సనాద్యంత ధాతువృత్తి:— పుత్రీయతి = పుత్రుని కోరుచున్నాడు. (పుత్రమ్- ఆత్మనః - ఇచ్ఛతి - ''సుప ఆత్మనః క్యచ్'' పా. సూ. (7-4-33) తాను కోరుచున్న వస్తువును చెప్పు సుబంతమునకు క్యచ్ ప్రత్యయము వచ్చును). ఇచట సుబంతమునకు క్యచ్, క్యఙ్, మొదలగు ప్రత్యయములు చేరును. పిదప అట్టి ప్రత్యయాంతము ధాతువై తిఙ్ ప్రక్రియకు అనుకూలమగును.

పై స్థలము లన్నింటియందును ఆయా పాణినీయ సూత్రములచే పెక్కు కార్యములు ప్రవర్తించి పరిపూర్ణ రూపములు ఏర్పడుచుండును. కావున ప్రక్రియ సమగ్రముగ తెలియవలయునన్నచో పాణినీయ సూత్రముల పరిజ్ఞానముండక తప్పదు.

ఈ వృత్తు లన్నిటికిని సాధారణముగా అన్వయించు ముఖ్య లక్షణములు కొన్ని గలవు. అవి యిట్లుండును—

1. ఇవన్నియు పదవిధులు (పదములకు విధింపబడు కార్యములు).

2. సమర్థములగు పదముల విషయముననే యివి ప్రవర్తించును.

3. వీనియందుండు సామర్థ్యము ఏకార్థీ భావము. అంతకుముందు ఏకార్థములు కాని శబ్దములు ప్రకృతము ఏకార్థకములగును. అనగా వృత్తికి అవయవములుగా ఏర్పడు పదములు తమ తమ వేర్వేరు అర్థములను విడిచి, ఒకే పదముగ తయారై మిశ్రమలోహము వలె స్వరూపమును ధరించి మొత్తముపై విశేషణ విశేష్యభావము గల ఒక అఖండమగు అర్థమును బోధించుచుండునని తాత్పర్యము. ఉదా: రాజపురుషః (రాజ్ఞః పురుషః) ఇది సమాసవృత్తి. ఇచట రాజశబ్దమునకు గాని పురుషశబ్దమునకు గాని ప్రత్యేకార్థము లేదు. ''రాజసంబంధము గల వ్యక్తి'' అని మొత్తముపై ఒకే యర్థము సంభవించును. వృత్తిని

"వీరః పురుషః", "నీలమ్ ఉత్పలమ్" మొదలగు ప్రయోగములలో రెండు పదార్థములను ముఖ్యములనుట నిష్ఫలముగాన, ఒకటి ముఖ్యమనియు వేరొకటి అముఖ్యమనియును చెప్పక తప్పదు. ద్రవ్యము ప్రధానమును దానియందలి గుణము అప్రధానమును సామాన్యముగా అగుచుండును. అట్లు కుదరనిచోట్ల గుణప్రధాన భావమును (ముఖ్యాఽముఖ్య భావమును) కల్పించుకొనవచ్చును.

కాగా సమానాధికరణ సమాసములలో విశేషణ విశేష్యభావము వేరుగ ప్రకాశింపు చుండును.

॥6॥

*అవతారిక*— సమానాధికరణములగు స్థలములలో, "ఒకటి గుణము (అప్రధానము) వేరొకటి ప్రధానము" అను విషయము ఎట్లు తెలియనగునో వివరించుచున్నాడు.

**శ్లో॥ విశేష్యం స్యాదనిర్జ్ఞాతం నిర్జ్ఞాతార్థో విశేషణమ్ ।**

**పరార్థత్వేన శేషత్వం సర్వేషాముపకారిణామ్ ॥ 7**

అనిర్జ్ఞాతమ్ = స్పష్టముగా తెలియబడనిది, విశేష్యమ్ = విశేష్యము, స్యాత్ = అగును, నిర్జ్ఞాతార్థః = స్పష్టముగా తెలిసిన అర్థముగలది, విశేషణమ్ = విశేషణము, స్యాత్ = అగును' ఉపకారిణామ్ = ఉపకారముచేయు, సర్వేషామ్ = అన్నిటికి, పరార్థత్వేన = ఇతరముల కుపయోగించుటచే, శేషత్వమ్ = అప్రధానమగుట, (భవతి = అగును).

*తాత్పర్యము*— ఎట్టి విశేషమును తెలియక సామాన్యముగ పేర్కొనబడు వస్తువు విశేష్యము. దానియందలి ఒకానొక విశేషమును చెప్పునది విశేషణము. విశేషణములన్నియు వస్తువునకు చెందును. కావున అవి అప్రధానములగును. విశేష్యమెప్పుడును ప్రధానముగ నుండును.

వివరణము— వేరు చేయునది విశేషణము. ఉదా : "నీలమ్ + ఉత్పలమ్" (నల్ల కలువ). ఇచట నీల శబ్దము, మిగిలిన కలువలనుండి ప్రస్తుతమైన కలువను వేరు చేయును. భేదకము(విడదీయునది), అవచ్ఛేదకము(కేటాయించునది), ఉపకారకము (సాయము చేయునది), శేషము (వేరుగా మిగులునది) మొదలగునవి విశేషణమునకు నామాంతరములు. వేరు చేయబడునది విశేష్యము. అనగా ఎట్టి విశేషమును తెలియకుండ చూపబడిన వస్తువు. ఉదా : "ఉత్పలమ్" ఈ పదము ఏ కలువనైనను తెలియజేయును. భేద్యము, అవచ్ఛేద్యము, ఉపకార్యము, శేషి మొదలగునవి విశేష్యమునకు మారు పేర్లు. విశేష్యము సూటిగా క్రియతో అన్వయించును. విశేషణములన్నియు విశేష్యమునకు సంబంధించిన వివరణములను విశదీకరించుచు విశేష్యముతోనే అన్వయించును. కాన అవి ఉపకారకములు. వానికి సూటిగా క్రియాన్వయము కుదురదు. అందుచే విశేష్యము ప్రధానము. విశేషణము అప్రధానము.

విశేష విషయములు— విశేషణములన్నియు సామాన్యముగా గుణములను తెలుపును. గుణము లెప్పుడును ఒక ద్రవ్యమును ఆశ్రయించి ఉండును. (విడిగా నుండవు).

తాత్పర్య వివరణములు— బుద్ధియందుండు భేద వ్యవహారమే సూత్రముచే, వ్యుత్పాదింపబడినది. వాస్తవ భేదముకంటె ఈ భేదము వేరయినది. కనుక నిది సూత్రమున రచించుటచే వేరయినదని సూచింపబడినది. అందరును నిట్టి వివేక జ్ఞానము కలవారుండరు. శాస్త్రము సూక్ష్మ బుద్ధులకును మంద బుద్ధులకును గూడ ఉపయోగపడవలెను పూర్వ సూత్రముచే సిద్ధింపదీవిషయమున వతి ప్రత్యయము' అనుకొను మందమతుల కొరకు 'రాజాన మర్హతి' అని విగ్రహాంతరము ప్రదర్శింపబడినది. ॥573॥

అవతారిక— ఒకే వ్యక్తి ఉపమానుపమేయము నగుట సంభవములేని విషయము కావున దుర్జ్ఞానము. కనుక బుధులు కానివారికొర కీ 'తదర్హ'మను సూత్ర మారంభణీయము అని పై కారికలో చెప్పబడినది. కాని అది సంభవమే. సూత్ర మావశ్యకము కాదని చెప్పు చున్నారు.

శ్లో॥ వైయాకరణ వద్బ్రూతే న వైయాకరణః సదా ।
వైయాకరణవత్ బ్రూహ్యేత్యతః సోఽప్యభిధీయతే ॥ 574

వైయాకరణః = వ్యాకరణ శాస్త్రాధ్యయనము చేసినవాడయినను, సదా=ఎల్లపుడును, వైయా కరణవత్ = వైయాకరణునివలె, న బ్రూతే = ప్రసంగము చేయడు, అతః = అందువలన, సః అపి = ఆతడు కూడ, వైయాకరణవత్ బ్రూహ్య = ''వ్యాకరణము చదువుకొనినవాని వలె మాట్లాడుము'', ఇతి అభిధీయతే = అని యుద్బోధింపబడుచుండును.

తాత్పర్య వివరణములు— ఒక వ్యక్తి బాగుగ వ్యాకరణమును జదివిన వాడే. కాని సంస్కార విహీనుని వలె గ్రామ్యములగు సంభాషణములను చేయుచుండును అట్టి వానిని ఉద్దేశించి, సాధు శబ్ద ప్రయోగ కుశలులు అయిన వైయాకరణుల వలె ప్రసంగింపుమయ్యా ' అపశబ్ద భాషణమును చేయబోకుము'' అని వైయాకరణుని వైయాకరణునితో నుపమించుట లోకమున ప్రసిద్ధము. ॥574॥

అవతారిక— మరియు నట్లే–

శ్లో॥ కేచిత్పుమాంసో భాషన్తే స్త్రీ వత్పుంవచ్చయోషితః ।
వ్యభిచారే స్వధర్మోఽపి పునస్తే నోపదిశ్యతే ॥ 575

కేచిత్ పుమాంసః = కొందరు పురుషులును, స్త్రీవత్ భాషన్తే = స్త్రీలవలె ప్రసంగింతురు, యోషితః చ పుంవత్ = స్త్రీలును పురుషులవలె మాట్లాడుదురు, తేన = ఇట్లుండుటచేత, వ్యభి చారే సతి = స్వధర్మమున కతిక్రమము గలిగినపుడు, స్వధర్మః అపి = ఆ, తన కర్తవ్యము గూడ, పునః = మరల, ఉపదిశ్యతే = ఉపదేశింపబడు చుండును.

తాత్పర్య వివరణములు— స్త్రీ పురుషులు తమ తమ ధర్మముల నతిక్రమించి, విరుద్ధముగ ప్రసంగించుటయు లోకమున గలదు. అపుడు స్వధర్మము నెరింగి యితరులు

పురుషః''. ఇట్టివి సమానాధికరణము లగును. (ఒకే విభక్తి కలిగి చివరకు గుణప్రధాన భావమును పొందుట). ఇట్టిచోట్ల రెండిటిని ముఖ్యముగ అన్వయించుట సహజము కాదుగాన, స్ఫుటముగ లేకున్నను ప్రయోగ సామర్థ్యమునుబట్టి గుణప్రధాన భావమును తుదకు అంగీకరింపక తప్పదు. అనగా వానికి విశేషణ విశేష్య సంబంధము ఏర్పడును. (''వీరుడైన పురుషుడు మొదలగు అర్థము వచ్చును). సమానాధికరణములగు పదములను గూడ విడివిడిగా వాడవచ్చును. లేక– సమాసమును చేసియైనను ప్రయోగింపవచ్చును (వీరపురుషః. మొదలగు రీతిని), అట్టి సమాసమే కర్మధాయమనబడును. ॥8॥

అవతారిక— రెండు పదములుకూడ ముఖ్యముగా ద్రవ్యమునే బోధించు సమానాధికరణ స్థలములలో, విశేషణ విశేష్యభావము సిద్ధించురీతిని మూడు కారికలతో విశదము చేయుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యేఽనిర్జ్ఞాత జాతీయే కృష్ణశబ్దః ప్రయుజ్యతే ।
అనిర్జ్ఞాతగుణేచైవ తిలశబ్దః ప్రవర్తతే ॥ 9

అనిర్జ్ఞాత జాతీయే = స్పష్టముగ తెలియని జాతిగల, ద్రవ్యే = ఒక పదార్థమందు, కృష్ణశబ్దః = కృష్ణ, అను శబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును, అనిర్జ్ఞాతగుణే = స్పష్టముగ తెలియని గుణముగల, ద్రవ్యే + చ + ఏవ = పదార్థమందే, తిలశబ్దః = తిల, అను శబ్దము, ప్రవర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— ''కృష్ణాః తిలాః'' (నల్ల నువ్వులు - ఇచటనే సమాసమైనచో ''కృష్ణతిలాః'' అని యగును) అను ప్రయోగమును తీసికొని సమన్వయము చూపబడుచున్నది. ఇచట కృష్ణ శబ్దము స్వతంత్రముగ ఒక ద్రవ్యమును చెప్పవచ్చును. (ద్రవ్యమునకును గుణమునకును అభేదమును కల్పించి ''నల్లకాకులు'' ''నల్లకోయిలలు'' మొదలగు ఏదో ఒక వస్తువును బోధించుననుటకు అవకాశముండును). అయినను ''ఆ వస్తువు ఏది ? ఏ జాతికి చెందినది ?'' (కాకియా - కోకిలయా మొదలగు) అను సంశయము తప్పదు. అట్లే తిలశబ్దము ద్రవ్యమును సామాన్యముగ బోధింపవచ్చును. కాని గుణమును (నలుపు, తెలుపు, మొదలగునవి) చెప్పజాలదు. ఇచట కూడ గుణమును గురించి సంశయము తప్పదు. కాగా కృష్ణశబ్దము జాతిని తిలశబ్దము గుణమును అపేక్షించుమగాన రెండిటికిని విశేషాపేక్ష సమానమే యగును. (అందువలన రెండును ఒకదానితో వేరొకటి కలిసి సంశయములేని యర్థమును బోధింప సమకట్టును). అదియే విశేషణ విశేష్యభావము. అదే సముచితము.

శ్లో॥ సామాన్యానామ సంబంధాత్తౌ విశేషే వ్యవస్థితౌ ।
రూపాఽభేదాద్విశేషం తమభివ్యంక్తుం న శక్నుతః ॥ 10

సామాన్యానామ్ = కేవలము ద్రవ్య సామాన్యములకు, అసంబంధాత్ = సంబంధము లేనందున

వారి నుద్బోధించుటయు ప్రసిద్ధము. స్త్రీలవలె పేలవముగ భాషించు పురుషులను జూచి మీ రిట్లు అప్రగల్భముగ సదస్సులలో ప్రసంగించిన, మిమ్ములను స్త్రీలనుగా భావించి పరిహసింతురు. కావున పురుషులకు దగునట్లు భాషింపుడు' అని వారి నుద్బోధింతురు.

స్త్రీ యొకతె, అతిప్రగల్భముగ, పురుషోచిత రీతిని మాట్లాడిన నామె నుద్దేశించి, స్వధర్మము నెరింగిన స్త్రీ మరియొకామె, ''ఆడుదానివలె మాట్లాడుము. సిగ్గు స్త్రీధర్మము. లజ్జావతులగు స్త్రీలను బోలిన ప్రసంగమును జేయుము. స్త్రీల హద్దును మీరుట యుక్తము గాదు', అని యెరింగించుటయు గలదు.

ఒక వీరుడు, యుద్ధరంగమున పిరికిపందగ వర్తించినపుడు, 'పురుషోచితముగ యుద్ధము చేయుము' అందురు. ఇట్లు తమ తమ కృత్యములను మరచి, విపరీతముగ వర్తించు వారికి, తమ యాచారమును ఔపమ్యముచే నుద్బోధించుచుందురు. కాబట్టి ఒకే వ్యక్తికి ఉపమానోపమేయ భావము దుర్బోధము గాదు. ॥575॥

*అవతారిక*— ''తవైవ సదృశస్త్వమ్'' = నీకు నీవే తుల్యుడవు - అనియొక వ్యక్తిని పూర్వావస్థను బట్టి అవస్థాంతరములో బోల్చుట గలదని వచింపబడినది. దాని తాత్పర్య మేమనగా—

**శ్లో॥ సదృశస్త్వం తవైవేతి లోకే యదభిధీయతే।**
**ఉపమానాంతరం తత్ర ప్రసక్తం వినివర్తతే॥** 576

''తవ ఏవ త్వం సదృశః'' = ''నీకే నీవు సమానుడవు'', ఇతి, లోకే = అని, లోకమున, యత్ = ఏ మాట, అభిధీయతే = చెప్పబడుచున్నదో, తత్ర = అచ్చట = ఆ వ్యవహారమున ప్రసక్తం = (అట్లు చెప్పనిచో) ప్రసక్తమగు, ఉపమానాంతరం = వేరొక యుపమానము, వినివర్తతే = తొలగుననుట.

*తాత్పర్య వివరణములు*— పై వ్యవహారము స్తుతిపరము. అనన్వయాలంకారచ్ఛాయలో నున్నది. నీవు సర్వోపమాన ధర్మములను నతిక్రమించిన వాడవు. నీకు వేరొకటి యుపమానము గాదు' అని చెప్పుటయే తాత్పర్య విషయమని వ్యాఖ్యానింపబడినది. కాబట్టి మన బుద్ధియందు భేదమును గల్పించి ఉపమానోపమేయ భావమును నిర్వహింప వచ్చును గాన నీ సూత్రము నారంభింప బనిలేదు. కనుకనే ఆపిశలులుగాని కాశకృత్స్నులు గాని తమ తమ వ్యాకరణములలో నిట్టి సూత్రమును రచింపలేదు. ఈ వ్యాకరణమునను ఈ సూత్రోదాహరణములను, ఉపమానోపమేయ భావమును వివక్షించి నిర్వహింపవచ్చును గాన నీ సూత్ర మక్కరలేదు. ॥576॥

*అవతారిక*— ఉపమానోపమేయ భావమును చెప్పదలంచుకొనక అర్థతను ప్రతిపాదింప దలంచిన నీ సూత్ర మావశ్యకమగునను చున్నారు.

ఇట్టి తీరునే విశేషణ విశేష్యభావమందురు. ఆ పదములకు గల సంబంధమదియే యని సారాంశము.

''వీరః పురుషః'' మొదలగు చోట్ల రెండును ద్రవ్యవాచకములే అగును. అయినను అచట గూడ విశేషణ విశేష్యభావమును సందర్భానుసారము కల్పింపక తప్పదు. సమానాధికరణ సమాసము లన్నిటియందును ఈ తీరునే ఊహించునది. ॥11॥

అవతారిక— ''వీరపురుషః'', ''కృష్ణతిలాః'' మొదలగు చోట్ల పదార్థములకు ఏర్పడు విశేషణ విశేష్యభావము సామానాధికరణ్య రూపము. సామానాధికరణ్యమనగా ఎట్టిది? ''సమానమ్ + అధికరణమ్ + యస్య సః = సమానాధికరణః - సమానాధికరణస్య భావః = సామానాధికరణ్యమ్'' అని వ్యుత్పత్తి. అధికరణమనగా ఆశ్రయము —లేక— ఆధారము. కావున ''అనేకములు ఒక స్థలమందుండుట'' అని సామాన్యమగు అర్థము. ప్రకృతమున ఈ యర్థ మెట్లు సరిపోవును? ''వేర్వేరు ప్రవృత్తి నిమిత్తములు గల (జాతి, గుణము మొదలగునవి) రెండు శబ్దములు ఒకే యర్థమును బోధించుట''యా? లేక— ''రెండు శబ్దములకును అర్థ మొకటియే'' అనియా? —లేక— ''రెండర్థములకును ఆధార మొకటియే'' అనియా?— మొదలగు శంకలు కలుగును. వానిని తొలగించుటకు సామానాధికరణ్యమనగా ఎట్టిదియో విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యాత్మా గుణసంసర్గభేదా దాశ్రీయతే పృథక్ ।
జాతిసంబంధ భేదాచ్చ ద్వితీయ ఇవ గృహ్యతే ॥ 12

గుణ సంసర్గభేదాత్ = గుణముతోడి సంబంధమువలన ఏర్పడు భేదమువలన, ద్రవ్యాత్మా = ద్రవ్యమనెడి ఆత్మ (పదార్థము), పృథక్ = వేరుగా, ఆశ్రీయతే = స్వీకరింపబడును, జాతి సంబంధ భేదాత్ + చ = జాతియొక్క సంబంధముచే ఏర్పడు భేదమువలన, ద్వితీయః + ఇవ = రెండవదివలె, గృహ్యతే = గ్రహింపబడును.

తాత్పర్యము— ఎట్టి విశేషములును లేని చైతన్యరూపమైన ఆత్మయే ద్రవ్యము. అది ఒక్కటే అయినను గుణముతోడి సంబంధమువలన వేరుగను జాతితోడి సంబంధము వలన వేరొకటిగను కనిపించుచుండును.

వివరణము— ''కృష్ణాః - తిలాః'' మొదలగుచోట్ల రెండు శబ్దములును ఒకే వస్తువును బోధించును. ఆ వస్తువు వాస్తవముగ ఆత్మచైతన్యమే. (అదే ప్రపంచమంతకును ఆధారము) అదొకటియే అయినను గుణసంబంధముచేతను (నలుపు, తెలుపు మొదలగునది), జాతి సంబంధముచేతను (తిలత్వము, ఉత్పలత్వము మొదలగునది) రెండుగ భాసించుచుండును. ఇట్టి భేదము కేవలము జాతిగుణాదుల కల్పననుబట్టి ఏర్పడును. కాగా కృతకమైన భేదముచే కృష్ణ శబ్దము ''కృష్ణగుణముగల తిలలు'' అను ఒక ద్రవ్యమును, తిలశబ్దము ''తిలత్వమును జాతిగల వేరొక ద్రవ్యమును'' బోధించుననియు ఇట్లు రెండు ద్రవ్యములున్నట్లు అనుకొనవలయుననియును పర్యవసించును. ॥12॥

శ్లో॥ యుక్తమౌపయికం రాజ్ఞ ఇత్యర్థస్య నిదర్శనే ।
ఉపమానా వివక్షాయాం తదర్హామితి పఠ్యతే ॥ 577

రాజ్ఞః యుక్తం ఔపయికం చ = రాజు కిది తగినది రాజ్యపాలనమున కుపాయమైనదియు, ఇతి అర్థస్య నిదర్శనే = అను నర్థమును జూపదలంచినపుడు, ఉపమానా వివక్షాయామ్ = ఉపమానోపమేయ భావము వివక్షితము కానపుడు, తదర్హామితి పఠ్యతే = 'తదర్హా'మను నీ సూత్రము పఠింపబడినది.

తాత్పర్య వివరణములు— 'ఈ వృత్త మీతనికే యర్హము. ఇతరులకు దగినది గాదు' - అని నిశ్చిత పూర్వమగు విషయమునే దృఢపరచుటకు కోరి, వచించినపుడు, ''రాజాన మర్హతి' అనియే విగ్రహ వాక్యము. అపు డుపమానోపమేయ భావము వివక్షితము గాదు. కనుక 'రాజ్ఞా తుల్యం' = రాజవత్ - అని విగ్రహము కాదు. అందువలన ''తేనతుల్య''మను సూత్రముచే సిద్ధింపదు. పృథక్సూత్ర మావశ్యకమే. ఉపమానోపమేయ భావ వివక్షచే, గతార్థమగునని, పూర్వ వైయాకరణుల యాశయము. పరమతము మనకు విరుద్ధము గానపుడు దానిని ప్రతిషేధింప నక్కరలేదు.

కాని అర్హతను తెలియజేయదలంచిన, ఆవశ్యకమే. ఇతర వ్యాకరణములందు ఈ సూత్రమును రచింపకుండుట దోషమే. అయ్యది అవ్యాప్తియే.

అందువలననే భాష్యకారుడు, ప్రయోజనములను స్థిరపఱచి ముగించెనే గాని సూత్రమును ప్రత్యాఖ్యానము చేయలేదు. కనుక ''వైయాకరణ వద్బ్రూహి'' అనునపుడును యోగ్యతను ప్రతిపాదింప దలంచిన ఈ సూత్రము చేతనే వతి ప్రత్యయము. ॥577॥

*అవతారిక*— తుల్యార్థక వతి ప్రత్యయము. ఇవార్థ వతి ప్రత్యయము. అర్హార్థ వతి ప్రత్యయము - అని మూడర్థములందు వతి ప్రత్యయము, ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' (5-1-115), ''తత్ర తస్యేవ'' (5-1-116), ''తదర్హమ్'' (5-1-117) అను మూడు సూత్రములచే విధింపబడినది. తరువాతి సూత్రము, ''ఉపసర్గాచ్ఛందసి ధాత్వర్థే'' (5-1-118) అనునది. అదియు వతి విధాయకమే. ఆ వతి ప్రత్యయాంత రూపములు వేదమునందే కాన వచ్చు చున్నవి. ఆ వతి ప్రత్యయము. స్వార్థవతి (ఉపమానార్థము కానిది) ప్రత్యయము. క్రమ ప్రాప్తమగు తద్విచారము చేయబడును.

శ్లో॥ ప్రసక్తానుప్రసక్తస్తు వతిశేషోఽభిధీయతే ।
ఉపమానాభిసంబంధా దస్మిన్ వతిరుదాహృతః ॥ 578

అస్మిన్ = ఈ వృత్తి పద విచారమునందు, వతిః = వతి ప్రత్యయము, ఉపమానాభిసంబంధాత్ = ఉపమాన సమాస ప్రసంగమున ఆ సంబంధము వలన, ఉదాహృతః = ఉదాహరింప బడినది, వతి శేషస్తు = దానికి శేషమయి ఉపమానార్థక వతిప్రత్యయము, ప్రసక్తానుప్రసక్తః

అంతర్భూతవిభక్త్యర్థే = విభక్త్యర్థము (సంబంధము) లోపల ఇమిడియున్నపుడు, షష్ఠీ = షష్ఠీవిభక్తి, యథా = ఎట్లు, న + శ్రూయతే = వినబడదో, తథా = అట్లు, లింగసంఖ్యాభిధాయినామ్ = లింగమును సంఖ్యను చెప్పు ప్రత్యయములయొక్క, అశ్రుతిః = వినబడకపోవుట, ప్రసజ్యేత = సంభవించెడిని.

తాత్పర్యము— అర్థగ్రహణము యొక్క సామర్థ్యము ననుసరించి బహువ్రీహి యందు సంపూర్ణమైన (లింగవచనములు గల) ద్రవ్యమే ముఖ్యముగా తెలియుచున్నచో, షష్ఠి యొక్క అర్థమైన సంబంధము అప్రధానమై ప్రాతిపదికార్థముగనే మారునుగాన షష్ఠీ విభక్తి రాదు. అది యుక్తమే. కాని ఆ విధముగనే టాప్ మొదలగు స్త్రీ ప్రత్యయములును, సు, ఔ. జస్, మొదలగు సుప్ ప్రత్యయములును రాకపోయెడిని.

*వివరణము*— చిత్రగు, అను సమాసము లింగసంఖ్యలుగల "చిత్రగోవుల స్వామి" (చైత్రుడు మొదలగువాడు) అను పదార్థమును ప్రధానముగ చెప్పినపుడు షష్ఠ్యర్థమైన సంబంధము (స్వస్వామి భావము) సమాసముననే ఇమిడిపోయి అప్రధానమగును. కాన షష్ఠి రాదు. ప్రథమయే వచ్చును. అట్లే లింగవచనములు కూడ సమాసముననే అంతర్భవించినపుడు వానిని చెప్పు ప్రత్యయములును సమాసమునకు రాకపోవును.

విశేష విషయములు— (1) సంబంధమును చెప్పు విభక్తి షష్ఠి ఆ సంబంధము వేరొక విధమున తెలిసినపుడు షష్ఠి రాకుండ ప్రథమయే వచ్చును. ప్రకృతము సమాసము వలననే సంబంధము తెలిసిపోవును.

(2) లింగమును, సంఖ్యయు కూడ సమాసమువలననే తెలిసినచో వానిని చెప్పు ప్రత్యయము లక్కరలేక పోయెడిని. "ఉక్తార్థానామప్రయోగః" (చెప్పబడిన అర్థమునే చెప్పుటకై వేరుగా శబ్దములను వాడకూడదు) అని సంప్రదాయము గదా!

(3) బహువ్రీహి సంపూర్ణమైన అన్యపదార్థమును చెప్పునన్న పక్షమున, లింగవచనములు కూడ సమాసముననే అంతర్భవించునను భావముతో ఈ శంక బయలుదేరినది.

అవతారిక— కాగా బహువ్రీహి అవ్యయముతో సమానము కావలసివచ్చునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ సాధర్మ్యమవ్యయేన స్యాద్బహువ్రీహే స్తథా సతి ।**
**లింగసంఖ్యానిమిత్తస్య సంస్కారస్యాపవర్తనాత్ ॥ 228**

తథా + సతి = అట్లయినచో, లింగసంఖ్యానిమిత్తస్య = లింగమును సంఖ్యను సూచించు, సంస్కారస్య = వ్యాకరణ సంస్కారముయొక్క, అపవర్తనాత్ = పోవుటవలన, బహువ్రీహేః = బహువ్రీహికి, అవ్యయేన = అవ్యయముతో, సాధర్మ్యమ్ = సాదృశ్యము, స్యాత్ = కలిగెడిని.

బ్రహ్మమునందు ఎవ్విధమగు భేదమును లేదు. కాని దానియందు శబ్దశక్తి అర్థ శక్తియు సంసృష్టములై యున్నవై, అవియే శబ్దము అర్థము అను రెండు శాఖలుగా చీలికలై లోకమున వ్యవహారదశలో భిన్నరూపమున నలరారుచున్నవి. వానికి గల సంబంధము కూడ నట్టిదే.

మరియు, తత్ = ఆబ్రహ్మమే, దృశ్యమ్ = కంటికి కనబడెడి జడప్రపంచకము, అదియే ద్రష్టా = చూచెడి చేతనుడగుజీవుడు, అదియే, దర్శనమ్ = చూచుట యనెడిక్రియ, దర్శనే = క్రియావిషయకమగు, ప్రయోజనం + చ = ప్రయోజనము కూడ నగుచున్నది.

జీవుడు చేతనుడు, అనగా జ్ఞానరూపుడు, అతడే భోక్త, కర్త. అట్టిజీవుడు పర బ్రహ్మముయొక్క వివర్తమే జీవునకు జడప్రపంచక మంతయు భోగ్యము. అదియు పరబ్రహ్మము యొక్క వివర్తమే. చూచుటమున్నగు క్రియలు, వానిని ఆచరించుటవలన కలిగెడి ప్రయోజనములు బ్రహ్మము యొక్క వివర్తమే.

భోగ్యము, భోక్త, క్రియ, ఫలము ఇవియన్నియు పరస్పర విరుద్ధములైయున్నవి. ఇవి అవిద్యావశమున పరబ్రహ్మము యొక్క వివర్తములే కనుక, తత్త్వజ్ఞానము కలుగుటచే అవిద్యనివర్తింపగా అవియన్నియు పరతత్త్వమునందే లయమును బొందును. ॥14॥

*అవతారిక*— ఆకారము లసత్యములు. పరబ్రహ్మ మొక్కటియే సత్యము అను అర్థము సిద్ధించుటకై వస్తువుల మూలకారణ మన్వేషింపగా చివరకు ఏది మిగిలియుండునో అదియే సత్యము. అది పరబ్రహ్మమే అని 11 వ శ్లోకమున చెప్పబడినది. కాని అది యుక్తముకాదు. ఏలయన-ప్రతివస్తువునకు కారణమన్వేషింపగా చివరకు ఏమియు మిగులదు. శూన్యమునుండియే ప్రపంచకమావిర్భవించును, అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వికారాపగమే సత్యం సువర్ణం కుణ్డలే యథా ।**
**వికారాపగమే సత్యాం తథాహుః ప్రకృతిం పరామ్ ॥ 15**

కుణ్డలే = కుండలము విషయమై, వికారాపగమే = వికారరూపము పోగా, యథా = ఏరీతిగా, సువర్ణమ్ = బంగారము, సత్యమ్ = నిజమైనదో, తథా = ఆ రీతిగా, వికారాపగమే = జీవుడు జడము మున్నగు వికారములు నశింపగా, పరామ్ = సర్వోత్తమమగు, ప్రకృతిమ్ = మూల పదార్థమును, సత్యామ్ = సత్యమైనదానిగా, ఆహుః = చెప్పుచున్నారు.

బంగారముచే కడియము, కుండలము మున్నగువస్తువులను నిర్మించు చున్నారు. అవియన్నియు బంగారముయొక్క వికారములే. ఆ వికారములు నశింపగా చివరకు బంగారము ఒక్కటియే మిగిలియుండును. ఆ వికారములు పోగా అచట ఏదో ఒక వస్తువుకానవచ్చు చున్నది. అదిశూన్యము కాదు. అదియెల్లరుకు తెలిసినదే. అదే విధముగా జీవుడు మున్నగు వికారములు పోగా చివరకు శూన్యము కానేరదు. చివరకు సద్రూపమగు బ్రహ్మము మిగిలి యుండును. అదియే పరాప్రకృతి, అదియే నిర్గుణబ్రహ్మము. ॥15॥

వివరణము— చిత్రగుః = రంగు రంగుల గోవుల ప్రభువు. ఇచట చిత్రగో, అనునవి వర్తి పదములు చైత్ర, మొదలగునది అన్యపదము (వీని యర్థమును భావింతుము). వర్తి పదార్థములకును, అన్యపదార్థమునకును గల సంబంధము స్వస్వామిభావము. కాగా సంబంధము కలిగినవి వర్తి పదార్థములు కూడ అగును. ''అట్టి సంబంధముగల చిత్రగోవుల సంబంధము'' బహువ్రీహికి నిమిత్తమని చెప్పవచ్చును. ఇది విభక్త్యర్థాభిధానమగును. లేక— ''చిత్రగోవుల సంబంధము గలిగిన ప్రభువు'' అని సంబంధియే నిమిత్తమనియును చెప్ప వచ్చును. ఇది పదార్థాభిధానమగును.

విశేష విషయములు— విడి విడిగా తీసికొన్నపుడు బహువ్రీహులు అనంతములు గాన, కారికలో బహువచనములు ప్రయోగింపబడినవి. ॥232॥

అవతారిక— మీది కారిక చెప్పిన విషయమునే మత్వర్థ ప్రత్యయాంతముల దృష్టాంతముతో వివరించుచున్నాడు.

శ్లో॥ కేచిత్ సంయోగినో దండాత్ విషాణాత్సమవాయినః ।
తద్వతి ప్రత్యయానాహుర్బహువ్రీహిం తథైవ చ ॥ 233

సంయోగినః = సంయోగముగల, దండాత్ = దండమునకు, (దండ శబ్దము), సమవాయినః = సమవాయముగల, విషాణాత్ = విషాణమునకు (విషాణ శబ్దమునకు), తద్వతి = అదిగల వస్తువను అర్థమున, ప్రత్యయాన్ = మతుప్ మొదలగు ప్రత్యయములను, కేచిత్ = కొందరు ఆహుః = చెప్పుదురు, తథా + ఏవ = అట్లే, బహువ్రీహిమ్ + చ = బహువ్రీహిని కూడ, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— దండవాన్, దండీ (దండః అస్య అస్తి = దండముగల వ్యక్తి), విషాణీ (విషాణే అస్యసః = కొమ్ములుగల జంతువు) - అనునవి మతుప్ ప్రత్యయము కాని, ఆ అర్థమును చెప్పు వేరొక ప్రత్యయముకాని (ఇన్ మొ॥) చేరిన పదములు. ఇట్టిచోట్ల సంయోగముకాని, సమవాయముకాని సంబంధమై యుండును. ఆ సంబంధముగల దండము మొదలగునవి ప్రవృత్తి నిమిత్తములగును. అట్టి శబ్దములకు మత్వర్థ ప్రత్యయము చేరును. కాగా దండీ, మొదలగు శబ్దములవలన ''సంయోగ సంబంధముతో కూడిన దండముయొక్క సంబంధము గలవాడు'' మొదలగు రీతిని భావ మేర్పడుచుండును. ఈ విధముగనే బహువ్రీహి యందును సంబంధముగల వర్తి పదార్థము ప్రవృత్తి నిమిత్తమగును. సమాసమువలన అన్య పదార్థము తెలియును అని కొందరు వివరింతురు.

వివరణము— (1) విడదీయుటకు సహజముగ వీలుగల సంబంధము సంయోగము. ఇది ఏవైన రెండు వస్తువులకు ఏర్పడును. విడదీయ వీలులేని సంబంధము సమవాయము. ఇది అవయవమునకును అవయవికిని గల సంబంధము.

(2) దండీ = దండమునకును వ్యక్తికిని సంయోగము. విషాణీ = కొమ్మునకును

= ఉపమానార్థక వతి ననుసరించి క్రమ ప్రాప్తమయి, అభిధీయతే = విధింపబడి విచారింప బడుచున్నది.

తాత్పర్య వివరణములు— వృత్తి సముద్దేశమునందు వృత్త పదముల విచారము ప్రధాన ప్రస్తావ విషయము. అందుపమాన సమాసమును విచారించి ఉపమానోపమేయ భావ సంబంధమున విధింపబడిన వతిప్రత్యయ ముపన్యసింపబడినది. అయ్యది అనుషంగమువలన ప్రసక్తము. ఆ విచారమునకు దరువాత క్రమప్రాప్తమయినది ఉపమానార్థకము. కాని వతి ప్రత్యయము యొక్క విచారము. ఇది పై దాని వలన ప్రసక్తము. వతి శేషమనగా శేషించిన వతి ప్రత్యయము. అయ్యది "ఉపసర్గాచ్ఛందసి ధాత్వర్థే" (5-1-118) అను సూత్రముచే విధింపబడినది.

వేదమునందు ఉపసర్గ కంటె బరముగా ధాత్వర్థ విశిష్ట సాధనము నా యుప సర్గము బోధించినపుడు స్వార్థమున వతి ప్రత్యయమగునని యర్థము. "యదుద్వతః నివతః" అను మంత్ర భాగమున "ఉద్వతః" 'నివతః' - అనునవి యుదాహరణములు. ఉద్వత్ నివత్ శబ్దముల ద్వితీయా బహువచనాంతములు. మెట్ట ప్రదేశములను, పల్లపు దేశములను' అని యర్థము. ఆ సూత్రమున భాష్య గ్రంథము, రాబోవు కారికలో విచారింపబడును. ॥578॥

అవతారిక— అట, "అర్థ గ్రహణం కిమర్థమ్ । న । 'ఉపసర్గాచ్ఛన్దసి ధాతౌ' ఇత్యేవోచ్యేత" - అని అర్థ పద ప్రయోజనము ప్రశ్నింపబడినది. 'ధాత్వర్థే' అనుచో అర్థ పద మెందులకు ? అక్కరలేదు. 'ఉపసర్గాచ్ఛందసి ధాతౌ' అనిన జాలును అని యర్థము. ఆ ప్రశ్నాభిప్రాయ మీ కారికలో వ్యాఖ్యానించుచున్నారు.

**శ్లో॥ ప్రధాన కల్పనాభావే గుణశబ్దస్య దర్శనాత్ ।**
**ఉపసర్గాద్వతౌ సిద్ధా ధాతౌ ధాత్వర్థ కల్పనా ॥** 579

ప్రధాన కల్పనా భావే = శబ్దముల ముఖ్యార్థములకు గ్రహణము సంభవింపనపుడు, గుణ శబ్దస్య దర్శనాత్ = ఆ శబ్దమును గుణశబ్దమునుగా కల్పించుట అగపడుటవలన, ఉపసర్గా ద్వతౌ = ఉపసర్గ కంటె వతి ప్రత్యయమును విధించిన సూత్రమున, ధాతౌ = ధాతు పదము నందు, ధాత్వర్థ కల్పనా = 'ధాత్వర్థము నందు' అని గౌణార్థమును కల్పించుట, సిద్ధా భవతి = సిద్ధించును.

తాత్పర్య వివరణములు— ధాతువనగా, భూ, వా, మున్నగునది. అది ఆ శబ్దము నకు ముఖ్యార్థము. 'ధాతౌ' అనిన, ధాతువునందు వతి ప్రత్యయము వచ్చునని యర్థమగును. ధాతువనగా శబ్ద రూపము. అది ప్రత్యయార్థము కానేరదు. అందువలన, సూత్రమునం దర్థ పదము లేకున్నను, సామర్థ్యము వలన ధాతు పదము లక్షణావృత్తిచే ధాత్వర్థ పరమగును. అర్థము శబ్దమునకు సహచారి గదా. కనుక అర్థ గ్రహణము ప్రయోజన రహితమని భావము. కనుకనే, ఆ భావమునే వివరించు భాష్యము "శబ్దే కార్యస్యా సంభవాదర్థే కార్యం విజ్ఞాస్యతే" అని యచట గలదు. ॥579॥

నున్న పదార్థమును ''న'' అనునది పోగొట్టజాలదు. అనగా ''న'' అనగానే ఉన్నవస్తువు పోదు. అందువలన ఆ వస్తువును చెప్పు శబ్దము దానియొక్క ఉనికిని (భావము) లేకుండుటను గూడ (అభావము) సామాన్యముగ బోధించునని కల్పించుకొని, అందు అభావమును మాత్రమే నఞ్ సూచించునని యనుకొనవలెను. ఇట్లు బ్రాహ్మణ మొదలగు పదమువలననే తెలియు అభావమును వాక్యమందలి 'న' అనునది వెల్లడి చేయునుగాన ద్యోతకమగునుగాని వాచకము కానేరదు.

విశేష విషయములు— ''వృక్షః'' అను శబ్దము కేవలము చెట్టుయొక్క ఉనికిని మాత్రమే చెప్పునని అనలేము. లేకపోవుటను చెప్పుటకు కూడ ఆ శబ్దమునే వాడవలయును. అందుచే భావాభావములకు రెండింటికిని అన్వయించు అనిర్వచనీయమైన సత్తను (ఉనికి) శబ్దములు బోధించునవలెను. (సత్త లేకున్నను ఉన్నట్లు భావించుట - దీనిని ఔపచారిక సత్త అందురు.) కాగా అభావమును కూడ శబ్దమే చెప్పును. దానినే నఞ్ వెల్లడి చేయును. 'న' అని వాడినపుడే అభావము ద్యోత్యమగునుగాన దాని ప్రయోగమావశ్యకము. ॥250॥

అవతారిక— 'న' అను దానికి స్వతంత్రమైన అర్థమే లేనిచో అది ప్రధాన మెట్లగును? లేక అభావరూపమైన నఞర్థముతో కలిసిన ఉత్తరపదార్థము కూడ అభావమే యగును గాన దానికి ప్రాధాన్యమెట్లు కుదురును? ఇట్లు సమాసమందలి రెండు పదార్థముల కును సంబంధము చిక్కులలో పడినపుడు అన్యపదార్థము మాత్ర మెట్లు సిద్ధించును? కాగా మూడు పక్షములు అను ప్రతిపాదనమే సంభవింపదు.

అట్లుకాక ఉత్తరపదార్థముతో అన్వయించు క్రియను నఞ్ నిషేధించునన్నచో అపుడు సమాసమే రాదు - అను భావమును విశదము చేయుచున్నాడు.

శ్లో॥ బ్రాహ్మణాదిస్థయా వాక్యేష్వాఖ్యాత పదవాచ్యయా ।
క్రియయా యస్య సంబంధో వృత్తిస్తస్య న విద్యతే ॥ 251

వాక్యేషు = వాక్యములందు, బ్రాహ్మణాదిస్థయా = బ్రాహ్మణుడు మొదలగు వానియందుండు నట్టియు, ఆఖ్యాతపదవాచ్యయా = తిఙంతమైన పదమునకు వాచ్యమైన, క్రియయా = క్రియతో, సంబంధః = సంబంధము, యస్య = ఏ నఞునకు గలదో, తస్య = దానికి, వృత్తిః = సమాసము మొదలైన వృత్తి, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— ''న బ్రాహ్మణమ్ ఆనయ'' (బ్రాహ్మణుని తీసికొని రాకుము). ఇట్టి వాక్యములలో స్వభావమునుబట్టి 'న' అను దానికి, 'ఆనయ' మొదలగు క్రియతోనే సంబంధము కలుగును. కాన నఞునకు బ్రాహ్మణాది శబ్దములతో వృత్తి కాదు.

వివరణము— నఞునకు క్రియాపదముతో సంబంధమున్నపుడు, ఉత్తరపదమైన బ్రాహ్మణాది శబ్దముతో సామర్థ్యముండదుగాన వృత్తి ప్రవర్తింపదు. అందుచే వృత్తిలో ''దీని యర్థము ముఖ్యమా? దాని యర్థము ముఖ్యమా?'' అను విచారణకు ఈ పక్షమున అవ కాశమే లేదు.

అవతారిక— అర్థపదము సూత్రమునందు లేకున్నను, శబ్ద సహచరితమగుననుట వలన అర్థము ప్రతిపన్నమగునని గదా ఫలితము ? ధాతువునకు సంబంధించిన శబ్ద ధర్మములును తత్సహచరితములు ఇతరములు సంభవించును గదా. అట్టి యెడ అర్థమే గ్రహింపబడుట యెట్లు ? అని ప్రశ్న కలుగ వచ్చును. దానికి సమాధాన మీ కారిక—

**శ్లో॥ స్వం రూపమితి చైతస్మిన్నర్థస్యాపి పరిగ్రహః ।**
**రూపవత్ జ్ఞాపిత స్తస్మాత్ ఆసన్నార్థో గ్రహీష్యతే ॥ 580**

స్వం రూపమితి చైతస్మిన్ = ''స్వం రూపం శబ్దస్యా శబ్ద సంజ్ఞా'' అను సూత్రమున, రూపవత్ అర్థస్యాపి = రూపమునకువలె అర్థమునకు గూడ, పరిగ్రహః = గ్రహణము, జ్ఞాపితః = జ్ఞాపన చేయబడినది, తస్మాత్ = అందువలన, ఆసన్నః అర్థః = రూపమువంటి ప్రత్యాసన్నతరమగు అర్థము, గ్రహీష్యతే = గ్రహింపబడును.

తాత్పర్య వివరణములు— స్వం రూప సూత్రమున, 'స్వం శబ్దస్య' అని మాత్రమే చెప్పినను శబ్దమునకు స్వీయము రూపమేయగును గాన, మరల రూపపద మనావశ్యకమయి, రూపమువలెనే అర్థము గూడ బోధ్యమగునని జ్ఞాపన చేయునని చెప్పబడినది. అందువల్ల శబ్దమునకు సంబంధించిన ఇతరములకంటె దాని వాచ్యార్థమే సన్నిహిత తరము గాన నదియే గ్రహింపబడును' అని తాత్పర్యము. ॥580॥

అవతారిక— పయి ప్రశ్నకు సమాధాన భాష్యము— ''ఇదం తర్హి ప్రయోజనమ్ । ఉత్తర పదలోపో యథా విజ్ఞాయేత । ధాతుకృతోఽర్థో ధాత్వర్థః । కః పునర్ధాతు కృతోర్థః । సాధన మితి'' = 'అర్థ పదము ఉత్తర పదలోప సమాససిద్ధి కొరకు, ఎట్లు ? ధాతుకృతమగు నర్థము ధాత్వర్థము. ఏయది ధాతువుచే కలుగచేయబడిన యర్థము ? సాధనము, అనగా కారకము. ఇది సమాధానము. ఆ గ్రంథ మీ కారికలో వ్యాఖ్యానింపబడుచున్నది.

**శ్లో॥ ధాత్వర్థేనోప జనితం సాధనత్వేన సాధనమ్ ।**
**ధాతునా కృతమిత్యేవమస్మిన్ సూత్రే ప్రతీయతే ॥ 581**

అస్మిన్ సూత్రే = ఈ ఉపసర్గాత్ ఛందసి ధాత్వర్థే అను సూత్రమునందు, సాధనత్వేన = క్రియా సాధనముగా, ధాత్వర్థేన = క్రియచేత, ఉపజనితం = కలిగింపబడిన, సాధనం = కారకము, ధాతునా కృతమ్ = 'ధాతువుచేత నిది చేయబడినది' అని, ఇత్యేవం = అని యిట్లు, ప్రతీయతే = భావింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ధాతు శబ్దమున కిచ్చట లక్షణచే ధాత్వర్థమని యర్థము కాగా ధాతు కృతమనగా, ధాత్వర్థమగు క్రియచేత చేయబడినది = ప్రాదుర్భావిత మయినది యని యర్థము. అదియే సాధనము = కారకము. ఇట నొక శంక కలుగును. కారకము సిద్ధ రూపము గదా సాధ్య స్వరూపమగు క్రియచే నది యెట్లు కల్పితమగును ? అని. కాని క్రియ కారక స్వరూపమును నిష్పాదింపదు. కర్మ కరణాది సాధనముల సాధనత్వము క్రియాపేక్షము

ఋడు) అని విశేషణమును కలుపుటలో దోషము లేదు. కాగా ''అబ్రాహ్మణః'' మొదలగు చోట్ల నఞ్ఞనకును ఉత్తరపదమునకును విశేషణ విశేష్యభావము కుదురును.

వివరణము— ''వస్తువు ఉన్నదని'' చెప్పుటకు దానిని నిర్దేశించుట తప్పనిసరి అయినట్లే, ''వస్తువు లేదని'' చెప్పుటకు కూడ దానిని స్పష్టముగ చెప్పక తప్పదు. ఉదా: ''వృక్షః'', ''అస్తి'', అనుటకును, ''నాఽస్తి'' అనుటకును గూడ ఈ పదమును వాడక తీరదు. విషయమే లేనపుడు నిషేధము కుదురదుగదా! కావున ఏ పదార్థమునయినను భావాభావసాధారణముగా తొలుత వాడుదురు. పిదప సందర్భమునుబట్టి భావరూపమైన విశేషమునుగాని, అభావరూపమైన విశేషమునుగాని చూపుదురు. ఇట్లు సామాన్యమైన పదార్థము యొక్క సత్తను ''ఉపచారసత్త'' అని యందురు. (ఈ యంశము 250 వ కారికలో వివరింపబడినది) నఞ్ సమాసమున ఉత్తరపదము ఇట్టి సత్తనే బోధించును. దీని ననుసరించి నఞ్ సమాసములో పూర్వపదము విశేషణమనియు, ఉత్తరపదము విశేష్యమనియును కల్పించుకొనవలెను.

విశేష విషయములు— శబ్దమువలన కలుగు అర్థప్రతీతి అంతయు బౌద్ధమే (బుద్ధియందు జరుగు వ్యాపారము). మనస్సు అందించిన భావమునే ఏదో విధముగ శబ్దము బయలుపరచును. మనస్సు అతివిచిత్రములైన కల్పనలను చేయును. వానికి శబ్దము లౌకిక ఆకారము నిచ్చును విశేషణ విశేష్యభావమంతయు అట్టి కల్పనమే. ఉదా: ''నీలోత్పలమ్'' (నల్ల కలువ). ఇచట వస్తువు ఒకటియే. (నలుపు వేరుగను, కలువ వేరుగను సృష్టిలో ఉండదు). అయినను మనస్సులో భేదమును కల్పించి ''నీల శబ్దము విశేషణమనియు, ఉత్పల శబ్దము విశేష్యమనియును'' చెప్పుదురు. ఈ విధముగనే ''అబ్రాహ్మణః'' మొదలగుచోట్ల బౌద్ధమైన విశేషణ విశేష్యభావమును శబ్దము బహిరంగము చేయునని భావింపక తప్పదు.

అవతారిక— మరియు ''అబ్రాహ్మణః'' మొదలగుచోట్ల ఉత్తరపదము ''తత్సదృశుడు'' (బ్రాహ్మణ సదృశుడు = బ్రాహ్మణుడుకాడు = క్షత్రియాదివ్యక్తి) అను నర్థమును అందించునని చెప్పుటకు ఉపక్రమించుచున్నాడు.

శ్లో॥ క్షత్రియాదౌ పదం కృత్వా బుద్ధిః సత్తాంతరాశ్రయా ।
జాత్యా భిన్నాం తతః సత్తాం ప్రసక్తామపకర్షతి ॥ 262

సత్తాంతరాశ్రయా = వేరొక సత్తను అవలంబించిన. బుద్ధిః = బుద్ధి, క్షత్రియాదౌ = క్షత్రియుడు మొదలగు వానియందు, పదమ్ = అడుగును, కృత్వా = చేసి (పెట్టి), తతః = పిదప, జాత్యా = జాతిచే, భిన్నామ్ = వేరయిన, ప్రసక్తామ్ = ఉండుటకు సిద్ధమైన, సత్తామ్ = సత్తను, అపకర్షతి = లాగివేయును.

తాత్పర్యము— బ్రాహ్మణుడు కాని వ్యక్తియందు, భ్రాంతివలన బ్రాహ్మణ శబ్దమును ప్రయోగించు సందర్భములో, ''న'' అనునది చేరి, ''అతడు బ్రాహ్మణుడు కాని

క్రియయే గదా సాధనములను బ్రవర్తింప జేయునది. కాగా క్రియచే సాధనము, స్వరూపతః గాక కారకముగా నిష్పాదింపబడుచున్నది గాన నది ధాత్వర్థ కృతమగు నర్థము కానోపును. ఈ విషయము సాధన సముద్దేశమునందు "ప్రవృత్తి రేవ ప్రథమం" అను కారికచే నిర్ణీత పూర్వము. ॥581॥

*అవతారిక*— సమాధాన భాష్యమున, "ఉత్తర పదలోపో యథా విజ్ఞాయేత" అని చెప్పబడినది గదా! ఆ ఉత్తర పదలోప మన నేమి? ఉత్తర పదలోపమును సూత్ర కారుడు చెప్పియుండలేదే యనిన—

**శ్లో॥ యశ్శబ్దశ్చరితార్థత్వా దత్యంతం న ప్రయుజ్యతే।**
**విషయేఽదర్శనాత్తత్ర లోపస్తస్యాభిధీయతే॥** 582

యః శబ్దః = ఏ శబ్దము, చరితార్థత్వాత్ = కృతకృత్యమగుట వలన, అత్యంతంన ప్రయుజ్యతే = ప్రయోగింపనే పడదో, తస్య = ఆ శబ్దమునకు, విషయే అదర్శనాత్ = ప్రసంగ విషయమున నగపడక పోవుటవలన, లోపః అభిధీయతే = లోపము కలిగినదని చెప్పబడును

తాత్పర్య వివరణములు— శబ్దములు అర్థబోధనమునకై ప్రయోగింపబడును. కావున అర్థమున్నపుడు ఎన్ని సూత్రకార వార్తికకార వచనము లున్నను వానిచేత శబ్దముల ప్రయోగము వారింపబడదు. కాని ఇంకొక దానివలన నా యర్థము తెలియబడుటచే దాని అదర్శనము లోపమని వ్యవహరింపబడును. లోపసంజ్ఞా శాస్త్రమునకును నదియే యర్థము. కాబట్టి ధాత్వర్థః అనుచోట ధాతు కృతః అర్థః = ధాత్వర్థః అని విగ్రహమును, కృత శబ్దమునకు లోపమును నని తాత్పర్యము గాదు. 'ధాతుశ్చాసౌ అర్థశ్చ' అనియే విగ్రహవాక్యము. ధాతు శబ్దమునకు క్రియ అర్థము. తత్కృతమయిన యర్థము ఉపచారమువలన నదియే యగును. మయూర వ్యంసకాది సూత్రముచే సమానాధికరణ సమాసమే, ధాతు కృతమయిన యర్థమని పర్యవసి తార్థము. లేదా ధాతుః అర్థః యస్య తత్ అని బహువ్రీహి వివక్షితమన వచ్చును. ధాత్వర్థమగు క్రియ ప్రయోజనముగా గలదియని యర్థమగును. క్రియ సాధ్యము గాన సాధనకు గల కారకమునకు ప్రయోజనమగును. అట్టి సాధనమునందు వర్తమానమగు నుపసర్గ కంటె బరముగా వతి ప్రత్యయము వచ్చునని సూత్రార్థము నిష్పన్నమగును. అది స్వార్థమున బ్రవర్తించును. ॥582॥

*అవతారిక*— ఈ విధముగ అర్థపద సామర్థ్యము వలన సాధనమునందును నర్థము లభించుటవలన, సాధన బోధకమగు వతి ప్రత్యయాంతము లింగ సంఖ్యలు కలది యగును. "సాధనేయం భవన్ లింగసంఖ్యాభ్యాం యోక్ష్యతే" – అని అర్థపద ప్రయోజనము వర్ణితము. 'అది శక్తిరూపము గదా, కారక శక్తియు, క్రియవలె అసత్త్వభూతమే అయె. సాధనమునకు లింగ సంఖ్యా సంబంధ మెట్లు? అను శంకకు సమాధానమును చెప్పుచున్నారు.

అవతారిక— కొన్ని నఞ్ సమాసములలో సాదృశ్యమంతర్భవించుట అనుభూత మగునని విశదము చేయుచున్నాడు.

శ్లో॥ అవృష్టయో యథా వర్షా నీహారాభ్రసమావృతాః ।
తద్రూపత్వాత్ స హేమంత ఇత్యభిన్నః ప్రతీయతే ॥ 301

నీహారాభ్ర సమావృతాః = మంచువంటి మేఘములతో కప్పబడిన, అవృష్టయః = వర్షములు లేని, వర్షాః = వర్షర్తువు, యథా = ఎట్లుండునో (తథా = అట్లు), తద్రూపత్వాత్ = అట్టి స్వరూపము కలిగియున్నందువలన, సః = అది, హేమంతః + ఇతి = హేమంత ఋతువని, అభిన్నః = భేదము లేనిదై, ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్యము— ''అవర్షాః హేమంతః'' అని ప్రయోగము. ''హేమంత ఋతువు వర్షఋతువుతో సమానమని'' దీని యర్థము. ఇచట ''అవర్షాః'' అన్నది నఞ్ సమాసము (న + వర్షాః = అవర్షాః). ఇందలి నఞు సాదృశ్యమును బోధించును. కావున ''హేమంతము వర్షా సమానము'', అను భావము కలుగును. మంచుతో కప్పబడిన ఆకసముగల హేమంతము వర్షములు లేకుండ మేఘములతో కప్పబడిన ఆకాశముగల వర్షఋతువుతో సమానముగనున్న దని తెలుపుటకై ఇట్టి నఞ్ తత్పురుషమును వాడుట ప్రసిద్ధము.

వివరణము— ఋతువును తెలుపు వర్షా శబ్దము స్త్రీలింగము. నిత్య బహువచ నాంతము.

ఇచట, ''న + వర్షాః + యస్మిన్ - సః'' అను విగ్రహమును చూపి, బహు వ్రీహిని చేసినచో వర్షా శబ్దమునకు శాస్త్రీయముగ హ్రస్వము వచ్చి, ''అవర్షః'' అను రూపము కావలసి వచ్చును. అది యభిమతము కాదు. ''అవర్షాః'' అనునదియే పెద్దల ప్రయోగము. అయినపుడది నఞ్ తత్పురుషమే అయి, సాదృశ్యమును- ఇమిడ్చికొని అన్య పదార్థమైన హేమంతమును బోధించునని వ్యాఖ్యానింపక తీరదు.

ఈ తీరున నఞ్ సమాసములు సాదృశ్యమును ఇమిడ్చికొని అన్యపదార్థ ప్రధానము లగుచుండునని కొందరందురు. ॥301॥

అవతారిక— ఈ సందర్భముననే మరికొందరిట్లందురని చెప్పుచున్నాడు.

శ్లో॥ అపరే బ్రాహ్మణాదీనాం సర్వేషాం జాతివాచినామ్ ।
ద్రవ్యస్యాన్యపదార్థత్వే నఞా యోగం ప్రచక్షతే ॥ 302

జాతివాచినామ్ = జాతిని బోధించు, బ్రాహ్మణాదీనామ్ = ''బ్రాహ్మణ'' మొదలగు, సర్వేషామ్ = ఎల్ల శబ్దములకును, ద్రవ్యస్య = వ్యక్తి, అన్యపదార్థత్వే = అన్యపదార్థమైనపుడు, నఞా = నఞుతో, యోగమ్ = కలయికను, అపరే = మరికొందరు, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్యము— ''బ్రాహ్మణ'' మొదలగు జాతివాచకములకే తొలుత నఞ్

శ్లో॥ క్రియాయాం సాధనే ద్రవ్యే ప్రాదయో యే వ్యవస్థితాః ।
తేభ్యః సత్త్వాభిధాయిభ్యః వతిః స్వార్థే విధీయతే ॥ 583

క్రియాయాం = క్రియలో, సాధనే, ద్రవ్యే = సాధనమయిన, ద్రవ్యమునందు, యే ప్రాదయః = ఏ. ప్ర, పరా, - మున్నగు నుపసర్గలు, వ్యవస్థితాః = వాచకములుగా ప్రవృత్తములయి యున్నవో, సత్త్వాభిధాయిభ్యః = ద్రవ్యమును జెప్పు, తేభ్యః = ఆ, ప్ర పరా - మున్నగువాని కంటె బరముగ, స్వార్థే = స్వార్థమునందు, వతిః విధీయతే = వతి ప్రత్యయము విధింపబడు చున్నది.

తాత్పర్య వివరణములు— సాధన మనగా నిచట సాధన శక్తికి ఆశ్రయమగు ద్రవ్యము అని భావము. కారక శక్తికిని తదాశ్రయమగు ద్రవ్యమునకును అభేదము భావింప బడును. ప్రాది ఉపసర్గలు క్రియాసాధనములచే ఆకర్షింపబడిన ద్రవ్యములకు వాచకములు. వానికంటె బరముగ స్వార్థమున నీ వతిప్రత్యయము వచ్చును. కాగా నిపుడిది సత్త్వరూపమగు ద్రవ్యమును బోధించును. అందువలన లింగ సంఖ్యల సంబంధ మువపన్నమగునని తాత్ప ర్యము. ॥౫౮౩॥

*అవతారిక*— ప్రాదులు క్రియా విశేషములను ద్యోతనచేయును అనియే నిశ్చితమై యున్నది గాని, వానికి ద్రవ్యమును బోధించు సామర్థ్యమున్నట్లు లేదే? అని ఆశంకించి చెప్పుచున్నారు.

శ్లో॥ ప్రత్యయేన వినా ప్రాదిస్తత్రార్థే న ప్రయుజ్యతే ।
భేదేన తు సమాఖ్యానే విభాగః పరికల్పితః ॥ 584

ప్రత్యయేన వినా = ప్రత్యయము లేకుండగ, ప్రాదిః = ఉద్, ని, మున్నగు ప్రాది, తత్ర అర్థే = ఉద్గతములు, నిగతములు - అను నా యర్థమునందు, న, ప్రయుజ్యతే = ప్రయోగింప బడదు, భేదేన, సమాఖ్యానే తు = ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి అన్వాఖ్యానమునందు, విభాగః పరికల్పితః = విభాగము కల్పింపబడినదే గాని అది అఖండమే.

తాత్పర్య వివరణములు— 'విగ్రహ వాక్యమునందు నియతములగు ధర్మములు కొన్ని వృత్తిపదమునందు భాసించునవి గొన్ని, వృత్తి వాక్యములు రెండింటను భాసించునవి మరికొన్ని - అని యిట్లు శబ్ద శక్తిని గూర్చిన నియమము గలదు. "—వాక్యేఽపినియతా ధర్మాః కేచి ద్వృత్తౌ ద్వయో స్తథా" - అని ఈ సముద్దేశమున ౩౬వ కారికలో ఆ విషయ మువపాదితము. కావున, విగ్రహ వాక్యమునందు ప్రయుక్తములయిన ప్రాదులకు ద్రవ్యమును బోధించు శక్తి లేదు. కాని ఏకార్థీభావ సామర్థ్యమునందు వృత్తి విషయమున ఆ శక్తి వానికి కలుగును. ఉద్వతః నివతః అనునవి అఖండ శబ్దములు.

ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి అన్వాఖ్యానము చేసినపుడు, అందు ప్రకృతి భాగమునకు క్రియా సాధన ముపసర్జనముగా గల ద్రవ్య మర్థమనియు, అదియే ప్రత్యయ భాగమునకును నర్థము, వేరర్థము లేదనియు దెలియును.

మున్నగు ధర్మములను బుచ్చుకొని సాదృశ్యముండునుగాన ఔపమ్యము సంభవింపవచ్చును గదా యనవచ్చును. కాని ఆ ధర్మములు సర్వార్థ సాధారణములు. కావున నవి యుపమా నిమిత్తములు కాజాలవు. సత్త్వమనగా వస్తుత్వము. జ్ఞేయత్వమనగా జ్ఞానములో విషయమగుట సకల వస్తువులందును నా ధర్మము లుండును. అవి సాదృశ్యమును వచించుటకు ప్రయోజక ములు కావు" - అని పూర్వపక్ష భాష్య తాత్పర్యము. ॥442॥

*అవతారిక*— 'శయితవ్యమ్' మున్నగు పదములందలి సజాతీయ క్రియలకు ఎట్లో భేదమును గల్పించి ఉపమానోపమేయభావము నుపపాదించుటయు గలదు. ఎట్లన-

**శ్లో॥ ఆధారభేదాద్భిన్నానా ముపమానస్య సంభవః ।**
**అధ్యేతవ్యేన విప్రాణాం తుల్య మధ్యయనం విశామ్ ॥** 443

ఆధారభేదాత్ = ఆశ్రయమగు ద్రవ్యముయొక్క భేదమువలన. భిన్నాయాం = భేదముగలది యగు సజాతీయ క్రియ విషయమున, ఉపమానస్య = ఉపమానోపమేయ భావమునకు, సంభవః భవతి = సంభవము కలుగును - (ఎట్లనగా), విప్రాణామ్ = బ్రాహ్మణుల, అధ్యే తవ్యేన = అధ్యయనముతో, విశామ్ = వైశ్యుల, అధ్యయనం = అధ్యయనము, తుల్యమ్ = సమానము (అని చెప్పవచ్చును).

*తాత్పర్య వివరణములు*— క్రియలు సమాన జాతీయములయినను, వాని కాశ్రయ ములు వేరు వేరయినపుడు వానినిబట్టి భేదమును, జాతి అనుగతమై యుండుటచే సామ్యమును నుండును. కావున భేదాభేదములున్నప్పుడు సంభవించు ఉపమానోపమేయభావ ముపపాద్యము ఎట్లనగా - "బ్రాహ్మణానామధ్యేతవ్యేన సదృశమిదం క్షత్రియాదీనా మధ్యయనమ్" = 'బ్రాహ్మణుల యధ్యయనముతో నీ క్షత్రియాదుల యధ్యయనము తుల్యము' 'రాజ్ఞః శయిత వ్యేన తుల్యం దేవదత్తస్య శయితవ్యమ్' 'రాజుగారి శయనముతో దేవదత్తుని శయన క్రియ సమానము' - ఇత్యాది ప్రయోగములు దృష్టములు. అధ్యయన శయన క్రియలకు, బ్రాహ్మ ణులు, క్షత్రియులు అను నాశ్రయములవలనను, రాజు, దేవదత్తుడును అను ఆశ్రయముల భేదమువలన భేద ముపపాదితము. కావున నుపమానోపమేయభావము సంగతము. ॥443॥

*అవతారిక*— ఓయీ ! భేద ప్రతిపత్తికొరకు, క్రియావాచక శబ్దము, ఆశ్రయము నపేక్షించుచున్నదని తెలినదిగదా ! అపుడది సాపేక్షమగుటచే అసమర్థమగును. అసమర్థమైన తద్ధితవృత్తి ప్రాప్తింపదేయనిన-

**శ్లో॥ అర్థాత్ ప్రకరణాద్వాపి యత్రాపేక్ష్యం ప్రతీయతే ।**
**సామర్థ్యాదనపేక్షస్య తస్య వృత్తిః ప్రసజ్యతే ॥** 444

యత్ర = ఏ విషయమునందు, అర్థాత్ = సామర్థ్యమువలన గాని, ప్రకరణాద్వా అపి = ప్రకరణమువలన నయినగాని, అపేక్ష్యమ్ = అపేక్షింపవలసినది, ప్రతీయతే = ప్రతీతి

శబ్దముల యన్వాఖ్యానము లోకసిద్ధమగు నర్థమును బట్టియే గదా. ఉపసర్గలకు వృత్తి విషయమున నిది స్వభావమని, సూత్రమునందలి యర్థపదము బోధించును. అది లేనిచో, శబ్దమునందు కార్యము సంభవింపదు గాన క్రియ ప్రతీతమయినను, అది, సాధన శక్తిని, తనతో అవినాభూతమై యుండుటవలన బోధించినను, దానితో అభిన్నమయిన ద్రవ్యమును బోధింపదు. అర్థపదమువలన ద్రవ్యము యొక్క ప్రతీతి సంభవించును. అదియే తత్ఫలము. ॥584॥

*అవతారిక* — సాధన శబ్దమునకు కారక శక్తి మాత్రమే అర్థమయిన, అపుడు—

**శ్లో॥ అనంగీకృత సత్త్వం తు యదిగృహ్యేత సాధనమ్ ।**
**విభక్తిభిర్నయోగః స్యాత్ యథైవ తసిలాదిషు ॥ 585**

అనంగీకృత సత్త్వం=ఆశ్రయమయిన ద్రవ్యము గ్రహింపబడనిదై, సాధనం యది గృహ్యేత =సాధన శక్తి మాత్రమే గ్రహింపబడినచో, తసిలాదిషు యథైవ=తసిల్ ప్రత్యయాంత త్రల్ ప్రత్యయాంతముల వలె, విభక్తిభిః=సకల విభక్తులతోడను, యోగః నస్యాత్ = సంబంధము లేకపోయెడిది.

తాత్పర్య వివరణములు— 'తతః' అనునది తసిలంతము. 'తత్ర' అనునది త్రలంతము. ఇవి పంచమీ సప్తమీ విభక్త్యర్థ ప్రధానములయిన అవ్యయములు. అసర్వ విభక్తి తద్ధితాంతములు. సకల విభక్తి సంబంధము వానికి ఉండదు. ఏకవచన మొక్కటియే యుండును. 'ఉద్వత్' 'నివత్' - అను నీ వత్యంతములు గూడ ద్రవ్య ప్రధానములు కానిచో లింగ సంఖ్యలు లేకపోవును. బహువచనాంత ప్రయోగిమ నుపపన్నమగును.

సూత్రమునందలి అర్థగ్రహణ బలమున, సాధన మప్రధానమయి ద్రవ్యము ప్రధాన ముగ వాచ్యమగును. సత్త్వవచనత లభించును. కర్మకరణాది సంబంధమున సర్వవిభక్తి యోగము కలుగును. బహువచన ముపపన్నమగును. అర్థ మొక్కటియే అయినను, తద్వాచక శబ్దములు భిన్న భిన్నములయినపుడు లింగ భేదము విరుద్ధము గాదు—ఏకార్థే శబ్దాన్యత్వాత్ దృష్టం లింగాన్యత్వమ్. ॥585॥

*అవతారిక* — అయినను, స్వరాది గణమునందు వతిప్రత్యయము పఠింపబడుట వలన అవ్యయత్వము ప్రాప్తించుచున్నదే యనిన చెప్పుచున్నారు.

**శ్లో॥ పాఠాద్యైరవిభక్తిత్వం వత్యన్తేష్వనుగమ్యతే ।**
**తేషా ముద్వత ఇత్యత్ర వక్తవ్యా స విభక్తితా ॥ 586**

యైః = ఎవరిచేత, వత్యంతేషు=వతి ప్రత్యయాంతములందు, పాఠాత్ =స్వరాది పాఠము వలన, అవిభక్తిత్వం=విభక్తి రాహిత్యము, అనుగమ్యతే = అంగీకరింప బడునో, తేషాం =వారికి=వారి మతమున, ఉద్వతః ఇత్యత్ర = 'ఉద్వతః' - అనుచోట, సవిభక్తితా = విభక్తి యోగము, వక్తవ్యా = అపూర్వముగ చెప్పవలసినదగును.

ముగ వచింపబడిన నంతతో దాని కయ్యది పరిపూర్ణము గాదు. ఉపమానోపమేయము లందుభయత్ర అన్వయించు ధర్మము గూడ నుండవలెను. ॥448॥

అవతారిక— కానిండు. అయిననేమి? అన్వయిధర్మ మపేక్షితమయిన మాత్ర మున నుపమానముయొక్క స్వభావము పోవునా? అనిన—

శ్లో॥ తృతీయోప్యాశ్రితో భేదో ధర్మః సాధారణో ద్వయోః ।
వ్యాపారవాన్ న కృత్స్నస్య సామ్యం కృత్స్నేన విద్యతే ॥ 449

తృతీయః అపి = మూడవ దొకటి కూడ, ఆశ్రితః = ఉపమానోపమేయములచే నపేక్షింప బడిన, భేదః = విశేష రూపమయిన, ద్వయోః = ఆ రెండింటికిని, సాధారణః = సమానమగు ధర్మః = ధర్మము, వ్యాపారవాన్ = పనిచేయునది (అపేక్షితము), కృత్స్నస్య = సకలమున కును, కృత్స్నేన = సకలముతో, సామ్యం = సామ్యము, న విద్యతే = ఉండదు.

తాత్పర్య వివరణములు— ఉపమానోపమేయములకు, పరస్పర వ్యావృత్తమయిన సాధారణ ధర్మ మొకటి. అవి ఉపమానోపమేయములని తెలియచేయునది, ఉదాసీనమయినది గాక సవ్యాపారమయినది, కావలసియున్నది. అది క్రియ ఉపమానమయినపుడు, దాని సాధ్య స్వభావమును బోగొట్టును. ఉపమానముపమేయమునకు పరిచ్ఛేదకము. అది ద్రవ్యమయిన తద్గత ధర్మమువలన, నుపమేయమును పరిచ్ఛేదించుటకు సిద్ధత గలిగి యుండును. క్రియ, స్వస్వభావమగు సాధ్యతారూపముననున్న, ఉపమేయ పరిచ్ఛేదకము గాజాలదు. తాను నిష్పన్నము గానపుడు ఇతరమున కుపకారమెట్లగును? తైల పాకము మున్నగునది ద్రవ్య మగును. 'ఇదమ్', తత్ = ఇది, అది - అని సర్వనామ శబ్దములచే బరామర్శింపబడునది ద్రవ్యము గదా. హోతవ్యాది క్రియోపమానములు గూడ 'సౌష్ఠవము' అను సమాన ధర్మము గలవియయినను, ద్రవ్యములే. కావున తృతీయాంతములయినను క్రియావాచులు గావు ఏ పదార్థమయినను నది ద్రవ్యమా? గుణమా? క్రియయా? అని నిర్ణయించుటకు, ప్రకృత శబ్దము దాని నెట్లుగా జెప్పుచున్నది? అని చూడవలెను. 'ధ్వని' అను పదార్థము, 'ధ్వనతి ఘంటా' = ఘంట మ్రోగుచున్నది - అని చెప్పినపుడు, తిఙన్త శబ్దవాచ్యమగుటచే సాధ్య స్వభావమగు క్రియ. ఆ ధ్వని ఘంటయొక్క ధ్వని. దానికి వేరొకటి కారణము గాదు అని తెలియజేయుటకు "ఘంటాయాః ధ్వనిః" అని వచించిన నది యపుడు నిష్పన్నరూపమగు గుణము అదియే 'ధ్వనిత్వమ్' - అని భావప్రత్యయాంత వాచ్యమయినపుడు ద్రవ్యభావము నొందిన ప్రాతికార్థము. ఆ విధముగనే "ధ్వనతి శబ్దః" = శబ్దము ధ్వనించుచున్నది - అని యనిన నపుడు ధ్వనియే కర్త. అది వ్యక్తవర్ణ మగునది. సిద్ధరూపము. 'ధ్వనతి' - అను శబ్దమునకు అవ్యక్తమగు సాధ్యావస్థ శబ్ద మర్థము.

అందువలన క్రియాపదములయినను హోతవ్యాదులు అయిన వానివలన సాధ్యస్వ భావమగు క్రియ ప్రతీయమానముగాదు. అది ద్రవ్యమేగాన సుబంతము క్రియావాచి యుండదు. ఆఖ్యాతములే అట్టివి. నామములు ఆఖ్యాతములు అను భేదమునకు మూలము సిద్ధసాధ్యార్థ భేదమే గదా!

తాత్పర్య వివరణములు— లోకమునందు ప్రయోగములలో విభక్తి విరహితము లుగ నగపడు వానికి అవ్యయ సంజ్ఞ చెప్పబడుచున్నవి. స్వరాదులందు వతి ప్రత్యయమును బఠించుటవలన అవ్యయ సంజ్ఞ కలిగిన, తదంతములు విభక్తి రహితములు కావలెను. ''అవ్యయాదాప్ సుపః'' (2-4-82) అను సూత్రముచే విభక్తి ప్రత్యయమునకు లుక్కు రావలెను. అందుకని సవిభక్తికతను ప్రతిపాదింపవలసి యుండును. ''ఉపసర్గాచ్ఛందసి ధాత్వర్థే'' అను ప్రకృత సూత్రమునందలి అర్థపదము వలన అవ్యయత్వము ప్రాప్తింపదు. ఇట వతి ప్రత్యయముచే ద్రవ్యము బోధింపబడుచున్నది గాన నిది సత్వవచనము. కావున నవ్యయ సంజ్ఞ ప్రవర్తింపదు. స్వరాది గణపాఠము వలన నవ్యయ సంజ్ఞ 'తేనతుల్యమి'త్యాది సూత్ర విహిత వతి ప్రత్యయాంతములకే యని భావము. ॥586॥

*అవతారిక*— ఇంతవరకును వతి ప్రత్యయ పరీక్ష చేయబడినది. ఆ ప్రసంగమున, విషయాంతరమును మహాభాష్యమున విచారింపబడిన దాని నుపపాదించుచున్నారు. వార్తిక కారుడు, ''స్త్రీ పుంసాభ్యాం వత్యుప సంఖ్యానం'' అని యొక వార్తికమును బఠించెను. 'స్త్రీ, పుం శబ్దములకంటె బరముగా, వతి ప్రత్యయనమునకు, తుల్యార్థమున, ఉపసంఖ్యానము కర్తవ్యము' - అని యా వార్తికమున కర్థము. 'తేనతుల్య మిత్యాది సూత్రములచే నేల సిద్ధింపదు ? అనగా, ''స్త్రీ పుంసాభ్యాం నఞ్ స్నఞౌ భవనాత్'' (4-1-87) అను సూత్రముచే, భవనమను నర్థమునకు బూర్వము ఆ యా సూత్రములందు నిర్దేశింపబడిన అర్థములందు, స్త్రీ శబ్దమునకు 'నఞ్' అను ప్రత్యయమును, పుమ్ శబ్దమునకు స్నఞ్ అను ప్రత్యయమును విధింపబడినవి. అపత్యాద్యర్థములందు సామాన్యవిహితములగు నుత్సర్గ ప్రత్యయములను బాధించి ఆ శబ్దముల కా ప్రత్యయములు వచ్చునట్లు, వత్యర్థమునందును, వతి ప్రత్యయమును బాధించి నఞ్ స్నఞ్ ప్రత్యయములు రావలసియున్నవి. అపుడు స్త్రీవత్, పుంవత్ అను రూపములు సిద్ధింపక పోవును. అందువలన నా శబ్దములకంటె బరముగ వతి ప్రత్యయ ముపసంఖ్యేయ మగును. 'వత్యుప సంఖ్యానమ్' అను వార్తికాంశమున, 'వతి' అను పదమునకు 'వతి ప్రత్యయార్థమున' అని యర్థము. ఉపసంఖ్యానం అనగా, నఞ్ స్నఞ్ ప్రత్యయములకు వచనముచే విధానము అని యర్థము. 'కర్తవ్యమ్' అయధ్యాహారము. లేదా 'వతి' = వతి ప్రత్యయము విధీయమానమయినపుడు, స్త్రీ పుం శబ్దములకు గూడ నది విధేయము అని యర్థము. అపుడు 'వతి' అనునది సతిసప్తమి యనుట.

ఈ వార్తికము మహాభాష్యమున ప్రత్యాఖ్యానము చేయబడినది. ''ఆచార్య ప్రవృత్తిః జ్ఞాపయతి, న వత్యర్థే నఞ్ స్నఞౌ భవతః । యదయం స్త్రియాః పుం వదితి నిర్దేశం కరోతి । ఏవ మపి స్త్రీవదితి న సిధ్యతి. యోగాపేక్షం జ్ఞాపకమ్'' - అని అచట భాష్య గ్రంథము.— 'ఉపసంఖ్యాన మక్కర లేదు. ''స్త్రియాః పుంవత్'' అను సూత్రమున 'పాణిని పుంవత్' అని వతి ప్రత్యయమును చేసియే, 'పుంసా తుల్యమ్' అను నర్థమును తెలియజేసెను. ఆ నిర్దేశము వలన, వతి ప్రత్యయార్థమున నఞ్ స్నఞ్ ప్రత్యయములు ప్రవర్తింపవు అని

నారోపించుటచే ప్రవృత్తము. భుక్త శబ్దము క్రియా శబ్దమయినను జాతి శబ్దములవలెనును, గుణ శబ్దములవలెనును పరిమితమగు భుజి క్రియను బోధించు అక్త పరిమాణ శబ్దము కానోపును.

ఔషధ సంస్కృతమయిన తైలము భుక్తమా కాదా యను సంశయము గలిగినపుడు, భుక్తమేయని తెలియజేయుటకు 'తైలము భుక్తము' అనినపుడు సముదాయమునకును అవయవమునకును భేదము వివక్షితము గాదు గాన, సముదాయ శబ్దమగు భుక్త శబ్ద మవయవమును బోధించుట యుక్తమే.

ఏతావతా పర్యవసితమయిన పరమార్థము ఇది - పటము ప్రధానముగా భావింపబడిన, శుక్ల శబ్ద మవయవబోధకము. శుక్లావయవము ప్రధానముగా దలంపబడిన, పట శబ్దమపు డవయవ బోధకము. 'ఇది పంచాలమే దేశాంతరము గాదు' అని బోధింపదలంచి, 'పూర్వ పంచాలము' - అనిన నపుడు పంచాల శబ్దము ముఖ్యవృత్తి చేతనే అవయవమును జెప్పును. అర్ధ పిప్పలీ అనుచోట పిప్పలీ శబ్దమును, తైలం భుక్తమనుచోట తైల శబ్దమును, అన్య నిషేధముకొరకు ప్రయుక్తములుగాన, ఏకదేశమును గూడ ముఖ్యవృత్తి చేతనే బోధించును. ఘృత శబ్దమును నీ విధముగనే అన్యవ్యావృత్తిపరమై ప్రయుక్తమయినపుడు, అవయవమును గూడ ముఖ్యవృత్తి చేతనే బోధించును. ॥487॥

*అవతారిక*— కాగా నీ విషయము నిట్లు ముగింపవచ్చును.

శ్లో॥ నివృత్త్యర్థా శ్రుతిర్యేషాం భేద స్తేష్వనపేక్షితః ।
ప్రదేశే సముదాయే వా గుణోఽన్యేషాం నివర్తకః ॥ 488

యేషాం శ్రుతిః = ఏ శబ్దముల ప్రయోగము, నివృత్త్యర్థా = ఇతరములను నివర్తించుటకు దలంపబడునో, తేషు = ఆ శబ్దములందు, భేదః = అవయవమా అవయవియా యను భేదము, అనపేక్షితః = గమనింప నక్కరలేనిది, ప్రదేశే = అవయవమునందు = ఏకదేశమునగాని, సముదాయేవా = మొత్తమునందుగాని, వర్తమానః గుణః = బోధకముగా నుండు గుణవాచక శబ్దము, అన్యేషాం = ఇతరములకు, నివర్తకః భవతి = తొలగించునది కాగలదు.

తాత్పర్య వివరణములు— అవయవ మాత్రబోధకము కానిందు, సముదాయ వాచకము గానిందు, అన్యనివృత్తికొరకు ప్రయోగింపబడిన గుణ శబ్దము, 'కృష్ణ' 'శుక్ల' - మున్నగునది, ఆభేదమును బాటింపకయే అన్యవ్యవచ్ఛేదమును జేయును. అట శబ్ద ప్రవృత్తి ముఖ్యమేయని తాత్పర్యము. ॥488॥

*అవతారిక*— "ఏవమయం సముదాయే బ్రాహ్మణశబ్దః ప్రవృత్తోఽవయవేఽపి వర్తతే" - అని దార్ష్టాంతిక భాష్యము. ఇది దృష్టాంతోపపాదనమునకు తరువాతి గ్రంథము. దానిని వ్యాఖ్యానించుచున్నారు.

పాణిని జ్ఞాపన చేసెనని భావము. అందువలన 'స్త్రీవత్' అను రూపమును సిద్ధించును - ఆ విషయ మెల్ల ఈ క్రింది మూడు కారికలందు వ్యాఖ్యానింపబడినది.

శ్లో॥ వత్యర్థం నావగాహేతే పుంవదిత్యస్య దర్శనాత్ ।
నఞ్ స్నఞా వపవాదస్య బాధకం తన్నిపాతనమ్ ॥ 587

శ్లో॥ ఏతముత్క్రామతో నూనం వత్యర్థం నఞ్ స్నఞా వితి ।
తయోః ప్రవృత్తా వుత్సర్గో బాధనాన్నోపపద్యతే ॥ 588

శ్లో॥ నఞ్ స్నఞా విహితౌ యేన స యోగో నావగాహతే ।
వతి ప్రకరణం తద్ధి లింగమేవం సమర్థ్యతే ॥ 589

'పుంవత్' ఇత్యస్య = "పుంవత్" అను సూత్ర నిర్దేశము, దర్శనాత్ = కనబడుట వలన, నఞ్ స్నఞౌ = నఞ్, స్నఞ్ - అను ప్రత్యయములు, వత్యర్థం = వతి ప్రత్యయార్థమగు తుల్యార్థమును, న అవగాహేతే = ప్రవేశింపవు = తమకు విషయమును జేసికొనవు, తత్ నిపాతనమ్ = ఆ 'పుంవత్' అను నిపాతము, అపవాదస్య బాధకమ్ = అపవాదయగు 'స్నఞ్' విధాయకమునకు బాధకమగును.

నూనం = నిశ్చితముగ, నఞ్ స్నఞౌ = నఞ్ స్నఞ్ ప్రత్యయములు, ఏతం వత్యర్థం = ఈ వతి ప్రత్యయార్థమును, ఉత్క్రామతః ఇతి = దాటి, వదిలిపెట్టి పోవును అది నిశ్చితమనుట, తయోః ప్రవృత్తౌ = అట్లుగాక అవియే ప్రవర్తించిన బాధనాత్ = అవి వతి ప్రత్యయమును బాధించును గాన, ఉత్సర్గః = బాధ్య శాస్త్రమునకు ప్రవృత్తి, న, ఉపపద్యతే = ఉపపన్నము కాదు.

యేన = ఏ సూత్రము చేత, నఞ్ స్నఞౌ = నఞ్, స్నఞ్ - అను ప్రత్యయములు, విహితౌ = విధింపబడినవో, సః యోగః = ఆ సూత్రము, వతి ప్రకరణం = వతి ప్రత్యయ ప్రకరణమును, న అవగాహతే = స్పృశింపదు, ఏవం హి = అని యీ విధముగ, తత్ లింగం = ఆ 'పుంవత్' అను జ్ఞాపకము, సమర్థ్యతే = సమర్థింపబడును.

తాత్పర్య వివరణములు— "—స్త్రియాః పుంవత్ భాషిత పుంస్కాత్ అనూఙ్ సమానాధికరణే - స్త్రియామపూరణీ ప్రియాదిషు" - (6-3-34) అని సూత్రము. అందు, 'పుంవత్' అని నిర్దేశింపబడినది. నిర్దేశమనగా ఉచ్చారణము. ఆ నిర్దేశము వలన, వత్యర్థ విషయము నుండి నఞ్ స్నఞ్ ప్రత్యయములు తప్పింపబడినవని తెలియుచున్నది. వత్యర్థము నందు గూడ నివి ప్రవర్తించిన, వతి ప్రత్యయమున కపవాదములగును గాన నిక వతి ప్రత్యయము వినబడకయే పోవును. కాని, ఆ సూత్ర నిర్దేశమున వతి ప్రత్యయము వినబడుట వలన, ఆ ప్రత్యయముల కిది విషయము కాదని జ్ఞాపితము.

యింపబడుచున్నదో, సః భేదః = అచ్చట ఆ, క్రియ అను విశేషము, అధ్యవసీయతే = శబ్దవాచ్యముగా నిశ్చయింపబడును, అప్రయోగే = (ఎందువలనన) శబ్దాంతరము ప్రయోగింపబడనపుడు, తథా = ఆ విధముగ, సః = ఆ నియతమగు ప్రకారము, అన్యథా = వేరొకటిగ గాని, సర్వథా చ ఇతి = సర్వముగ గాని, న విద్యతే = సంభవింపదు.

తాత్పర్య వివరణములు— ఉపమించుటయను క్రియలో, అధ్యయనాది క్రియ సాధారణ ధర్మముగ నపేక్షింపబడినపుడు, సముదాయ వృత్తమగు బ్రాహ్మణ శబ్దమునకు, ఆ క్రియయే వాచ్యముగా నిశ్చయింపబడును. "బ్రాహ్మణవదధీతే క్షత్రియః" అను వాక్యము నందు అధ్యయనము సాధారణ ధర్మముగ నాశ్రయింపబడినది. కావున బ్రాహ్మణ పదమునకు 'అధీతే' - అను పదముయొక్క సన్నిధానమువలన. బ్రాహ్మణాధ్యయన క్రియ యర్థము. శబ్దాంతరము ప్రయోగింపబడనిచో, నది వేరొకటి గాని, సర్వధర్మములు గాని సామాన్య ధర్మములగుట సంభవింపదు. అపుడు శబ్దాంతరము ప్రయుక్తమా కాదా యని యాలోచింపకయే, ప్రసిద్ధ స్వార్థమగు, గుణ సముదాయమును ఆ శబ్దము బోధించును. కావున సముదాయ శబ్దమున కవయవబోధకత్వ ముపమావిషయమున, యత్నసాధ్యము. ॥501॥

అవతారిక— ఆ యత్నమునే చెప్పుచున్నారు—

శ్లో॥ ఉపమానే క్రియావృత్తిముపమేయే క్రియా శ్రుతిః ।
ప్రత్యాయయన్తీ భేదస్యకరోతీవ పదార్థతామ్ ॥ 502

ఉపమేయే క్రియాశ్రుతిః = క్షత్రియపదము దగ్గర, అధీతే అను పదము నుచ్చరించుట, ఉపమానే క్రియావృత్తిం = బ్రాహ్మణ పదమునందు క్రియావాచకత్వమును, ప్రత్యాయయన్తీ = తెలియచేయుచున్నదై, భేదస్య = అవయవమునకు = క్రియ కనుట, పదార్థతాం = ఉపమాన పదమున కర్థమగుటను, కరోతీవ = కల్పించునదివలె నుండును.

తాత్పర్య వివరణములు— బ్రాహ్మణశబ్ద ముపవాచకము. క్షత్రియశబ్ద ముపమేయ బోధకము. 'అధీతే' అను క్రియాపదము, ఉపమేయ సమీపమున వినబడుచున్నది. దానివలన ఉపమానము గూడ క్రియాబోధకమని సూచించుచున్నది. ఉపమానోపమేయ భావము సాధారణ ధర్మప్రయుక్తముగాన, నుభయత్ర క్రియయే సాధారణము గావలెను. కావున బ్రాహ్మణ శబ్దము తదేకదేశమగు తత్క్రియను బోధించునని నిశ్చితమగుచున్నది. ఉపమేయగతమగు క్రియాపద ముపమానగత క్రియను జెప్పదు. కాని దానివలన నుపమాన పదమును క్రియావాచకమని నిశ్చయింపవలసి యుండునుగాన, 'కరోతీవ' - అని ఇవ శబ్దము ప్రయోగింపబడినది. ॥502॥

అవతారిక— క్రియల కుపమానోపమేయభావము తలంపబడినపుడును, శుద్ధ క్రియ కది సంభవింపదు గాన వ్యాపార విశిష్ట ద్రవ్యావాచకమగు తృతీయా సమర్థముకంటె పరముగనే 'వతి' ప్రత్యయమగునను చున్నారు.

పోనిండు. నిర్దేశమువలన వతి ప్రత్యయమును, యథాప్రాప్తములగు నా ప్రత్యయములను గూడ రావచ్చు ననరాదా యనిన, ఆ నిపాతనము వానికి **బాధకమే** యగునని, చెప్పబడినది. "**బాధకం తన్నిపాతనమ్**'. ॥587॥

నిపాతలును అపవాదల వంటివే. కనుక వతి ప్రత్యయమే వాని కపవాదమగును. అవియే అపవాదములయిన, ప్రబల శత్రువు లున్నపుడు, దుర్బలమగు **ఈ ఉత్సర్గ** మెట్లు నిలువగలదు? నిలిచినదనిన, నవి దీని **జోలికి,** రావను నిశ్చయము కలదనుట. అపవాద **శాస్త్రము,** తాను ప్రవర్తించుచు, స్వవిషయమున సామాన్య శాస్త్రము ప్రాప్తింపదని సూచించి నట్లే. నిపాతనము గూడ యథా ప్రాప్తములగు ప్రత్యయము**లను** ఇట బాధించును. సర్వాధి **సూత్ర** భాష్యమునందు "నిపాతన మప్యేవం జాతీయక మేవ. బాధకాన్యేవ నిపాతనాని" అని వ్యవస్థాపితను. కావున వత్యర్థమున = **పురుషునివలె** యను నర్థమందు 'పౌంస్నమ్' అను రూపము సాధువు కాదు. ॥588॥

ఈ 'పుంవత్' అను నిర్దేశమను లింగము = ఆనగా అనుమానము = అనగా జ్ఞాపకము, "**స్త్రీ పుంసాభ్యాం** నఞ్ స్నఞౌ - భవనాత్" (4-1-87) అను సూత్రము, వతి ప్రత్యయార్థ విషయము నాక్రమింపదు అని జ్ఞాపనము చేయును. అందు కారికలో వతి ప్రకరణము నని చెప్పియున్నది. అనగా "తేనతుల్యం క్రియాచేద్వతిః" (5-1-115), "తత్ర **తస్యేవ**" (5-1-116), "తదర్హమ్" (5-1-117) అను మూడు సూత్రముల విషయమును ఆక్రమింపదని భావము.

కనుక యోగాపేక్షం జ్ఞాపకమ్" అను **భాష్యకారుని** వచనమునకు, 'యోగా న పేక్షత ఇతి = యోగాపేక్షమ్' = మూడు సూత్రములకును సంబంధించునది యనియు నర్థముగా నోపును.

ప్రదీప గ్రంథమునందు, '**స్త్రీ పుంసాఖ్యాం**' - అను యోగము వత్యర్థమునందు ప్రవర్తింపదను నర్థమునకు, '**పుంవత్**' అనునది జ్ఞాపకము. కావున **స్త్రీ** శబ్ద విషయమున, నఞ్ ప్రత్యయమును గూడ నిది బాధించును. కాగా స్త్రీవలె నను నర్థమున, '**స్త్రీవత్**' అను రూపమే సాధువుగాని 'స్త్రైణమ్' అను ప్రయోగము సాధువు గాదు. '**పుంవత్**' అని సూత్రమున నుచ్చరింపబడుట వలన నది 'స్నఞ్' ప్రత్యయ విషయము మాత్రమే యనుకొనరాదు. అని వ్యాఖ్యానింపబడినది. ॥589॥

**అవతారిక**— **ఉపమాన** సమాస విచారము ప్రధాన ప్రస్తుతము. ఆ ప్రసంగమున ప్రాప్తమయినది వతి ప్రత్యయ విచారము. ఈ **ఉపమాన** విచార సందర్భములో పరీక్షింప వలసిన విషయాంతరమును గలదు. అది యేదియన— అనేకములగు నుపమేయములకుపకారకముగ నొకే యొక **ఉపమానముపాత్తమయిన** వాక్యమునందు, **ఉపమేయము** లనేకము లగుటచే, **ఉపమానములను** గూడ నన్నింటిని గల్పింప వలయునా? లేక, ఒకే యుపమాన ముపకరించునా? అని సంశయము కలుగును. ఆ విషయము **పరీక్షింపబడును.**

తాత్పర్య వివరణములు— ఇవార్థ విషయమున సప్తమికి సంభవము లేదు. అయినను, 'తత్ర' అని సూత్రమున సప్తమి నిర్దేశింపబడినది. కావున నా నిర్దేశము. ఇవార్థ విషయమున తన యునికి నిత్యమని జ్ఞాపన చేయును. కాగా నిక షష్ఠి లేకనే పోవును. అందువలన నదియు నుండునని తెలియచేయుటకు 'తస్య' అని షష్ఠీ విభక్త్యంతమును గ్రహింపబడినది.

ఇచట నొక శంక— షష్ఠ్యంతమగు 'తస్య' అను పదమును సూత్రమున గ్రహింపక, 'తత్ర' అను పదమును మాత్రమే నిర్దేశింపబడిన ఆ సప్తమి బాహ్యమగు ఆధేయ సంబంధ నిమిత్తకమగు అధికరణ సప్తమియే యగును. అధికరణ విహిత సప్తమ్యంతమున కంటె వతి విధానమునకు సప్రయోజనమయినపుడు విశేషవిషయ జ్ఞాపనార్థ మెట్లగును? 'తస్య' అను షష్ఠ్యంతము సూత్రమున నుచ్చరింపబడిన నది శేషార్థకమగుటచే దాని సాహచర్యమువలన 'తత్ర' అనునది గూడ, శేషవిషయక సప్తమియని తెలియును. కాగా షష్ఠీ నిర్దేశమే లేనియెడల సప్తమికి జ్ఞాపకత్వమెట్లు? అది షష్ఠిని బాధించుటయు నెట్లు?

పై శంక కిది సమాధానము— సత్యమే యనుకొనుడు. కాని, షష్ఠీ, సప్తములలో నేదియో యొకటి మాత్రము నిర్దిష్టమయినను, నయ్యది రెండవదాని యర్థము నంతర్భవింప జేసికొనునుగాన నుభయోపాదానము వ్యర్థమయి జ్ఞాపనార్థమగును. అందు సప్తమి విషయములో షష్ఠి భాష్యకారునకు సమ్మతము కాదు. కావున సప్తమియే జ్ఞాపకార్థమని భాష్యమున చెప్పబడినది. ఇక వతి ప్రత్యయము షష్ఠ్యంత ప్రకృతికి గూడ వచ్చుట ఇష్టము కాబట్టి, స్వవిషయమున షష్ఠిని వర్తింపదు. ఈ అనివృత్తియే అబాధ - అనగా దానికి బాధ లేకుండ యనబడును.

వేరొక శంక— ప్రకృత జ్ఞాపకమువలననే, ఈ సప్తమి శేషవిషయమనిన, ''మథురాయామివ పాటలిపుత్రే ప్రాకారాః'' = 'మథురలోవలె పాటలిపుత్రమునందు ప్రాకారములు' - అనుచో, అధికరణ సప్తమ్యంతమును కంటె బరముగా వతి ప్రత్యయము సిద్ధింపదు. ఇది ఇవార్థమున శేషసప్తమిగాన అనుప్రయోగమునందు, 'పాటలిపుత్రే' అని సప్తమి, ఆధారాధేయ భావము వివక్షింపబడినపుడు తప్ప సిద్ధింపకపోవును. ఇవ శబ్ద మున్నపుడుగదా శేష విషయ సప్తమి జ్ఞాపితము. అనుప్రయోగమగు పాటలిపుత్ర శబ్దమువద్ద ఇవ అను శబ్దము లేదుగదా.

అందువలన ''మథురాయామివ పాటలిపుత్రస్య ప్రాకారాః'' అని పాటలిపుత్ర శబ్దమునకు షష్ఠియే రావలసియున్నది.

ఈ శంకకు సమానాధానము = ''ఆక్షేపము సమంజసమే. అందుకొరకు 'తత్ర' అను సూత్రమున కావృత్తిచేయబడును. లేదా అది తంత్ర నిర్దేశమని యయినను జెప్పవచ్చును సకృదుచ్చరితమయినను ననేకార్థ బోధకమగుట తంత్రమనబడదు. అందొక దానిచే అధికరణ సప్తమ్యంతమునకు వతి ప్రత్యయమును విధించి, రెండవదానిచే శేషవిషయమున సప్తమి జ్ఞాపితమగునని భాష్యకారుని యాశయమును'' కైయటోపాధ్యాయులు వివరించిరి.

శ్లో॥ అభేదే నోపమానస్య భిన్నార్థోపనిపాతితా ।
ఊహ స్తదోపమానానా మంగవన్నోపలభ్యతే ॥ 590

ఉపమానస్య = ఉపమానమునకు, భిన్నార్థోప నిపాతితా = వేరు వేరు ఉపమేయముల కుపక రించుట యనునది, అభేదే న భవతి = అభేదము చేతనే = తన కనేకత్వము లేకుండగనే, సంభవించును, తథా = ఆ విధముగనే, అంగవత్ = శరీరావయవములకు వలె, ఉపమానానాం = ఉపమానములకు గూడ, ఊహః = ఊహ = అనగా వచన భేదకల్పన, న ఉపలభ్యతే = అగపడ లేదు.

తాత్పర్య వివరణములు— ప్రధానములును, (గుణములును = అనగా) అప్రధాన ములును నని రెండు విధములుగ పదార్థము లుండును. అందు గుణములు ప్రధానమున కుపక రించుటకై ప్రయోగింపబడును. ఆ ఉపకారమున కనుగుణముగ గుణములు తమ్ము సవరించు కొనును. అది న్యాయము. ఉపమాన మొక్కటియే నిర్దేశింపబడినను నది యనేకోపమేయముల కుపకరించుటకు సమర్థమయినచో నది మారనక్కర లేదు. అనగా తాను ననేకోపమానము లుగా కాబనిలేదు.

యాగములు ప్రకృతి యాగములు, వికృతి యాగములు నని రెండు విధములు. సకలాంగోపదేశములు కలవి ప్రకృతి యాగములు. వికృతి యాగమున 'ఊహ'చే గొన్ని యంగములు ప్రకృతి యాగముల నుండి సంపాదనీయము లగును. శబ్దముల లింగవచన భేదము గూడ వికృతులలో కల్పింపబడవలసి యుండును. కాని ఉపమాన పదము లుపమేయ ములను బట్టి వచన భేదమును గల్పించుకొనుట సమ్మతము గాదు. శరీరావయవ వాచకముల కును జాతివాచకముల పేళ్ళకును, ఉపమాన శబ్దములకును, ఇంద్రియ వాచకములకును 'ఊహ' యుండదని ఊహ సంప్రదాయజ్ఞుల ఆమ్నాయము, ''అంగాని, జాతినామాని, ఉపమా ఇంద్రియాణి చ, ఏతాని నోహం గచ్ఛన్తి'' అని చెప్పుచున్నది.

అంగములకు 'ఊహ' లేదనుటకు వైదికోదాహరణము—

''యత్పశుర్మాయుమకృతో రోవాపద్భి -
రాహతాగ్నిర్మా తస్మాదే న సః ప్రమోచయతు''

అని మంత్రము - ఇదియే—

''యత్పశుర్మాయుమకృతో రోవాపద్భి రాహతే ।
అగ్నిర్వాతస్మా దేనసో విశ్వాన్ ముంచత్వం హసః ॥''

అని ముద్రితమయిన తైత్తిరీయ సంహితా గ్రంథమున నగపడుచున్నది.

ప్రకృతి యాగమున నొక్క పశువునకే ఉపాలంభము. కనుక అది ఏకపశుకము. వికృతి యాగములు ద్విబహుపశుకములు.

రెండు పశువులు గల వికృతియాగమున, పశు శబ్దము 'పశూ' అని ద్వివచనాంతముగ నూహింపబడినదే గాని 'ఉరః' అను అంగవాచకము 'ఉరసీ' అని మార్పబడలేదు. అంగి భేదమువలననే అంగముల సంఖ్యాభేదము సిద్ధించునని తాత్పర్యము. బహుపశుకమగు వికృతి యాగమునందును, 'పశవః' అని మారినను, 'ఉరాంసి' అని అంగవాచకమునకు మార్పు లేదు—

ఇది అంగ నామముల కూహ లేదనుట కుదాహరణము. ఇట్లే ఉపమానవాచకములకును నది లేదు. చూడుడు—

మం॥ "కశ్యపేవాంసా అచ్ఛిద్రే శ్రోణీ కవషోరూ స్రేకవర్ణే"

అని మంత్రము ఇందు, కశ్యప, కవష, స్రేక అను నివి మూడును ఉపమాన వాచకములు. కశ్యపమనగా కచ్ఛపము = తాబేలు కవష మనగా నొక జాతి చేప. స్రేక మనగా కరవీరము = గన్నేరు. అట ఉపమేయముల లింగ సంఖ్యలను బట్టి ఉపమానములకు మార్పు లేదు. ॥590॥

*అవతారిక*— ఉపమానముల కుపమేయములను బట్టి లింగవచన భేదము ఉండబోదను విషయమున నింకొక వైదిక సంవాదమును జూడుడు.

**శ్లో॥ గవేధుకే చరౌ దృష్టా గోవికర్తాక్షవాపయోః ।**
**పశూరుద్ర ఇవహ్యేతా విత్యేకవచన శ్రుతిః ॥** 591

గవేధుకే = తృణములలో నొక జాతిచే సంస్కరింపబడిన, చరౌ = చరుయాగమునందు, గోవికర్తాక్షవాపయోః = గోవికర్తుడు, అక్షవాపుడు అను వారికి, "పశూరుద్ర ఇవహ్యేతా" = అను నీ మంత్రభాగమునందు, రుద్ర ఇతి ఏకవచన శ్రుతిః దృష్టా = 'రుద్రః' అని ఏకవచనాంతమె ఉపమానముగ నగపడుచున్నది.

తాత్పర్య వివరణములు— మం॥ "రుద్ర ఇవైతౌ గోవికర్తాక్షవాపౌ పశూ అభిమన్యేతే" అను మంత్రము వేదమున గలదు. గవేధుక మనగా నొక జాతి గడ్డి. దానితో సంస్కరింపబడిన హవిస్సు గల యొక చరుద్రవ్యక యాగము. అందు, గోవికర్తుడు, అక్షవాపుడు అని ఇద్దరు, యజ్ఞ పశుచ్ఛేదకులు. గోవును ఛేదించువాడు గాన, గోవికర్తుడు, అక్షము లనగా తాండ్రచెట్టు గింజలు. వానిని భూమిలో చల్లువాడు అక్షవాపుడు. వారికి రుద్రుడుపమానముగా చెప్పబడినాడు. కాబట్టి మంత్ర దృష్టమయిన యీ ఏకవచనాంతోపమాన శబ్దము వలన, ఉపమానము, ఏకవచనాంతముగనే అనేకోపమేయముల కుపస్కారకమగునని తెలియుచున్నది. ॥591॥

*అవతారిక*— ఉపమేయము లనేకములయినపు డుపమానములును ననేకములయిన—

అవతారిక — ఉపనిషదములలో ఆత్మశబ్దముచే చెప్పబడెడి పరబ్రహ్మమే ఇచట ద్రవ్యశబ్దార్థము. అదియే ఎల్ల శబ్దములకు వాచ్యము కాగలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ **వాచ్యా సా సర్వశబ్దానాం, శబ్దాశ్చ న పృథక్తతః ।**
**అపృథక్త్వేచ సంబన్ధస్తయో ర్నానాత్మనోరివ ॥** 16

సా = ఆ పరాప్రకృతియే, సర్వశబ్దానామ్ = ఎల్ల శబ్దములకు, వాచ్యా = వాచ్యమగుచున్నది. శబ్దములు అట్టి ద్రవ్యమునే బోధించుచున్నవని భావము.

శబ్దాః + చ = శబ్దములు కూడ, తతః = ఆ బ్రహ్మ రూపమగు ద్రవ్యము కంటె, పృథక్ = వేరుగా, న = లేవు. ఈ యభిప్రాయమును "శబ్ద తత్త్వం యదక్షరమ్" అని గ్రంథ ప్రారంభముననే భర్తృహరి వ్యక్తపరచెను

తయోః = ఆ రెంటికి అనగా శబ్దమునకు ద్రవ్యమునకు, సంబన్ధః = సంబంధము అనగా వాచ్యవాచక భావమనెడి సంబంధము, నానాత్మనోః + ఇవ = వేరువేరుగా నుండెడి పదార్థములకు వలె, (ఘటతే) = కుదురును.

అవిద్యావశమున ఆయా ఉపాధులచే కల్పింపబడిన భేదమును అనుభవించి వ్యవహారము జరుగు చున్నది. కాగా ఉపాధినిబట్టి బ్రహ్మమే నానా రూపమున కాన్పించుచున్నది. కాబట్టి ఎల్లశబ్దములకు బ్రహ్మమే విషయమగును. ఉపాధులను విడనాడిన ఆ తత్త్వము శబ్దమునకు విషయము కాదు. ఆత్మ, బ్రహ్మ, తత్త్వము, మున్నగు శబ్దములు పరబ్రహ్మమునకు సన్నిహితములు, ఘటాది శబ్దములట్టివికావు.

ఘటము, పటము పరస్పరము భిన్నములు. కనుక వానికి సంయోగ సంబంధము కలుగును. అట్లే శబ్దము, ద్రవ్యము ఈ రెండు ఏకరూపములైనను వానికి సంబంధము ఘటిల్లును. ॥16॥

అవతారిక — ఇదియంతయు ఇంద్రజాలమువలె కాన్పించుచున్నది! ఘటపటాదులకు భేదము కంటికి ప్రత్యక్షముగా కాన్పించుచున్నది, అయినను వానికి భేదములేదనుట యెట్లు? అవి అసత్యములెట్లగును? బ్రహ్మముకంటికి కానరాదు. చెవికి వినబడదు. అట్టి బ్రహ్మమున్నట్లు ఎట్లు విశ్వసింతము? అను ప్రశ్నకు స్వప్న దృష్టాంతముతో సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ **ఆత్మా పరః ప్రియో ద్వేష్యో వక్తా వాచ్యం ప్రయోజనమ్ ।**
**విరుద్ధాని యథైకస్య స్వప్నే రూపాణి చేతసః ॥** 17

**అజన్మని తథా నిత్యే పౌర్వాపర్యవివర్జితే ।**
**తత్త్వే జన్మాదిరూపత్వం విరుద్ధముపలభ్యతే ॥** 18

శ్లో॥ ఉపమానస్య భేదాచ్చ బహుషు స్యాదణో విధిః ।
కాశ్యపా ఇతి లోపస్స్యాత్తథా ప్రతికృతిష్వపి ॥ 592

ఉపమానస్య = ఉపమానమునకు, భేదాత్ = అనేకత్వమువలన, బహుషు = బహ్వర్థమునందు, అణః విధిశ్చస్యాత్ = 'అణ్' అను ప్రత్యయ విధానమయ్యెడిది, తథా = ఆ విధముగా, ప్రతి కృతిష్వపి = ప్రతికృతులు ఒక వ్యక్తికి బొమ్మలు, ఫోటోలు, విగ్రహములు అర్థమయి నపుడును, కాశ్యపాః ఇతి = 'కాశ్యపాః' అను రూపమునందు, లోపః స్యాత్ = అణ్ ప్రత్యయమునకు లోపము వచ్చెడిది.

తాత్పర్య వివరణములు— "యఞఞోశ్చ" (2-4-64) అని యొక సూత్రము. 'గర్గ' మున్నగు ప్రాతిపదికములకు, 'గర్గుని సంతానము' అను నర్థమున 'యఞ్' అను ప్రత్యయము విహితము. అట్లే, 'బిద' - మున్నగువానికి 'అఞ్' ప్రత్యయము విధింపబడినది. 'గార్గ్య' బైద మొదలగునవి తదంతములు. ప్రవరాధ్యాయమున ప్రసిద్ధములయిన గోత్రములను బోధించు పదములు. గార్ధ్య గోత్రమువారు బైద గోత్రమువాదు అందరు గదా. ఆగర్గబిదాపత్యము లనేకములను జెప్పదలంచినపుడు 'గార్గ్యుడు' - అనునట్లు. గార్గ్యులు అనరు. గర్గులు అందురు. అట్లే బిదులందురు. అనగా బహుత్వమున, ఆ ప్రత్యయములు రెండును లోపించునని ఈ సూత్రము తెలియజేయును.

'యఞఞోశ్చ' అను సూత్రములోనికి పూర్వ సూత్రము నుండి 'బహుషు' అను పద మనువర్తించును. ఆ ప్రత్యయములు బహుత్వమును తెలియచేసినపుడు వానికి లుక్కగు నని యర్థమా? లేక తదంతముల బహుత్వముననా? అని ప్రశ్నించి, మొదటి పక్షమున, ఒక గార్గ్యుని అపత్యములు, అని వివక్షించినపుడును, ఇద్దరు గార్గ్యుల సంతానములను చెప్ప దలంచినవుడును లుక్కు రాకపోవును. ఎందువలననగా నచట గార్గ్యస్య, అపత్యాని, గార్గ్యయోః అపత్యాని' అనుచున్నారు గదా. యఞ్ప్రత్యయ మచట ఏకవచనాంత ద్వివచనాంతముల కంటె బరముగ నుత్పన్నము గదా' అని యాక్షేపించిరి. తదుపరి - 'పోనిండు. యఞంతముల బహత్వమున లుక్కు వచ్చునందము' - అని సవరించి బదులు చెప్పబడినది. దాని పైనను మరల నాక్షేపము గలదు.

'అట్లనుటకు వీలు లేదు. అపుడు 'కాశ్యపాః' అనుచోట అణ్ ప్రత్యయమునకు లుక్కు రావలసి వచ్చును. అది వచ్చినచో 'కశ్యపాః' అనియే యగును. 'కాశ్యపాః' అనుటయే సమ్మతము - అని ప్రత్యాక్షేపము చేయబడినది.

'కాశ్యపాః' అన నేమి యర్థమో చూతము. కశ్యప మహర్షి అపత్య మొకడు కాశ్యపు డనబడును. అకాశ్యప శబ్దము, అణ్ ప్రత్యయాంతము. "కాశ్యపునివంటి ప్రతికృతులు" - అను నర్థమున 'కాశ్యపాః' (కాశ్యపులు) అని యగును. పతికృతు లనగా బొమ్మలను కొందము. అపుడు, "ఇవే ప్రతికృతౌ" (5-3-96) అను సూత్రముచేత 'కన్' అను ప్రత్యయము ప్రతికృతి బోధకము వచ్చి, "జీవికార్థే చాపణ్యే" (5-3-99) అను

సూత్రముచే, లుప్త మగును. కాగా కాశ్యపుని ప్రతికృతులు (బొమ్మలో, ఫోటోలో) అను నర్థమున 'కాశ్యపాః' అని యేర్పడినది.

ఇచట మొదట అఞంతమగు 'కాశ్యపః' అనునది ఒక అపత్యమునే తెలియజేయునది. కన్ప్రత్యయమునకు 'లుప్పు' వచ్చి లోపించిన తరువాత, అఞంతము బహు ప్రతికృతులను చెప్పుచున్నది. కనుక రెండవ పక్షమున అఞ్ ప్రత్యయమునకు 'లుక్కు' రావలసియుండును. ''కశ్యపాః'' అనవలసి యుండును. 'కాశ్యపాః' అను రూపమే సమ్మతము, అని ''తద్రాజస్య బహుషు తేనైవాస్త్రియామ్'' (2-4-62) అను సూత్రములో మహాభాష్యమున విమర్శింపబడినది.

ప్రకృతమునకు వర్తము– ''అఞ్యః బహుషు తస్య లుక్'' – 'బహ్వర్థ బోధకము అఞ్ ప్రత్యయమయినపుడు దానికి లుక్కగును' – అని యొక వ్యాఖ్యానము. ''అఞన్తం యద్బహుషు, తదవయవస్య అఞః లుక్'' అని మరియొక వ్యాఖ్యానము. ఇట మహాభాష్యమున మొదటి పక్షమే స్థాపితము. ఉపమేయముల భేదమువలన ఉపమానములు గూడ భేదించుననిన, ఉపమేయములగు ప్రతికృతులు, అనేకములు గాన, ఉపమానమయిన కాశ్యపులును ననేకులయిన, అఞ్ ప్రత్యయ మచట బహ్వర్థ బోధకమగును. అపుడు మొదటి వ్యాఖ్యానమనను, లుక్కు రావలసియుండును. అది భాష్య విరుద్ధము. ప్రతికృతు లర్థమయినపుడు 'కశ్యపాః' అని అనిష్టరూపము ప్రసక్తమగును. అందువలన ఉపమేయములకు భేదమున్నను ఉపమానములు భేధింపవని సిద్ధాంతము. ॥592॥

*అవతారిక*— 'కాశ్యపః ఇవ ప్రతికృతయః' = కశ్యపుని అపత్యమువంటివి ప్రతికృతులు - అను స్థలమున 'కన్' ప్రత్యయమునకు 'లుప్పు' వచ్చిన తరువాత, లుబంతమునకు లింగవచనములు కన్ప్రత్యయ ప్రకృతికివలెనె ఉండునని చెప్పబడుటచే, 'కాశ్యపః' అని ఏకవచనాంతమే ప్రయోగార్హము గదా ? 'కాశ్యపాః' అని యెట్లగును ?– అను ప్రశ్నయును, దానికి సమాధానమును ఈ కారిక పూర్వోత్తరార్థములచే ప్రతిపాదింపబడినవి. చూడుడు—

**శ్లో॥ ఏవం తు యుక్తవద్భావా దత్రైకవచనం భవేత్ ।**

ఏవం తు = ఉపమేయములు భిన్నములైనను నుపమాన మేకవచనాంతమే అయిన, యుక్తవద్భావాత్ = యుక్తవద్భావము వలన, అత్ర = 'కాశ్యపాః' (కాశ్యపుని ప్రతికృతులు) అను చోట, ఏకవచనం భవేత్ = 'కాశ్యపః' అని ఏకవచనము ప్రాప్తించుచున్నది.

తాత్పర్య వివరణములు— ''లుపియుక్త వద్వ్యక్తి వచనే'' (1-2-51) అని అతిదేశ సూత్రము. లుప్పు వచ్చినపుడా లుబంతమునకు లింగవచనములు ప్రత్యయార్థ యుక్తమగు ప్రకృత్యర్థమును బట్టి ప్రవర్తించునని యర్థము.

'కాశ్యపుని వంటి ప్రతికృతులు' అను నర్థమున, ప్రతికృతులు అనేకములయినను, ఈ అతిదేశ సూత్రముచే ఏకవచనమే రావలసియున్నదని యాక్షేపము.

అవతారిక — ఈ యాక్షేపమునకు పరిహార మిట్లు ప్రేక్షితము—

**శ్లో॥ లుమ్మనుష్యే తథోక్తం స్యాల్లింగస్యైకస్యసిద్ధయే ॥** 593

లుమ్మనుష్యే = 'లింగసిద్ధ్యర్థం లుమ్మనుష్యే" అను వార్తికమునందు, లింగస్య ఏకస్య = ఒక్క లింగము మాత్రమునకే, సిద్ధయే = సిద్ధికై, తథా = 'లింగవచన సిద్ధ్యర్థమనక, లింగ సిద్ధ్యర్థం' అని, ఉక్తం = చెప్పబడినదయి, స్యాత్ = ఉండును.

తాత్పర్య వివరణములు— లుపి యుక్తవత్ అను నతిదేశ సూత్రముచేత ప్రకృతి లింగాతిదేశమే అపేక్షితము. వచనము అభిధేయముల వచనమే ప్రవర్తించును. 'చంచవంటి మనుష్యుడు' = చంచా ఇవ మనుష్యః, = చంచా అని యగును. చంచా శబ్దము స్త్రీ లింగము. గడ్డిబొమ్మ అని యర్థము. ప్రత్యయార్థము మనుష్యుడు. వచనము ప్రత్యయార్థానురోధి, లింగము మాత్రము ప్రకృతి లింగము—

'చంచామనుష్యాః' చంచే మనుష్యా. చంచాః మనుష్యాః - అని ఇట్లు మనుష్య సంఖ్యను బట్టియే వచనములు. లింగము మాత్రము స్త్రీ లింగమే। ఆ విధముగనే 'కాశ్యపాః' (కాశ్యప ఇవ ప్రతికృతయః) అను స్థలమునను, అతిదేశము వలన పుంలింగము మాత్రమే. వచనము ప్రతికృతుల బహువచనమే సాధువగునని భావము. ॥593॥

అవతారిక— కాశ్యపుని ప్రతికృతులు, అను నర్థమున యుక్తవద్భావము వలన 'కాశ్యపః' - అని ఏకవచన మెందులకు రాదు? లింగ సిద్ధ్యర్థమను వార్తికమున కేవల లింగ గ్రహణమున్నను, సూత్రమున వ్యక్తి వచనములు రెండును నతిదేశింపబడినవి గదా. 'మనుష్య లుపి ప్రతిషేధః' - అను వార్తిక ప్రామాణ్యము వలన, లుబంతము అమనుష్య వాచకమయి నపుడు అతిదేశ ప్రాప్తమగు ఏకవచనము తప్పదు గదా' అని ఆశంకించి వేరొక పరిహార మును జెప్పుచున్నారు.

**శ్లో॥ ఉపమేయేషు భిన్నేషు కించిదేకం ప్రవర్తతే।**
**ప్రత్యయస్య విధౌ తత్ర నిత్యం యుక్తవదిష్యతే ॥** 594

భిన్నేషు ఉపమేయేషు = ఉపమేయము లనేకములయినపుడు, కించిత్ ఏకం = ఏదియో యొక ప్రత్యయస్య నిమిత్తం = కన్ప్రత్యయ నిమిత్తము = అనగా ఉపమానమే, ప్రవర్తతే = పరి చ్ఛేదకముగా వర్తించును, తత్ర నిత్యం = అట్టియెడ నియతముగ, యుక్తవత్ ఇష్యతే = యుక్తవద్భావము సమ్మతము.

తాత్పర్య వివరణములు— ప్రతికృతులు, నానా వాని నుపమించు = పరిచ్ఛేదించు ఉపమాన మొక్కటియే. ఇట్టి స్థితి యున్నపుడు, అనగా ఉపమించుట అను వ్యాపారమున నొక యుపమానము అనేకోపమేయములందు నడిపించిన, 'లుపి యుక్తవత్' అను అతిదేశము నియతముగ ప్రవర్తించి, ఏకవచనమే ప్రాప్తించును. అది యిష్టమే అగుటచే, అనిష్టాపత్తి యేదియు లేదు. ॥594॥

అవతారిక— ఇక నుపమాన ముపమేయముల ననేకములను సంస్కరించుటకు దానును భిన్న భిన్నమై వ్యాపరించినపుడు 'కాశ్యపాః' అను బహువచనాంత రూపము సిద్ధమే—

శ్లో॥ యదా ప్రత్యుపమేయం తు తదేకైకమవస్థితమ్ ।
తదా బాహ్యార్థ భేదేన తద్ధితాంతం ప్రచీయతే ॥ 595

యదా తు = ఎపుడైతే, ప్రత్యుపమేయం = ఒక్కొక ఉపమేయముగా, తత్ ఏకైకం = ఆ ఉపమాన మొక్కొకటి, అవస్థితమ్ భవతి = వ్యాపారముగలిగి యుండునో, తదా = అపుడు, బాహ్యార్థ భేదేస = బయట అర్థముల భేదముచే, తద్ధితాంతం = కన్ లుబంతము, ప్రచీయతే = ప్రచయమును = అనేకత్వమును బొందును.

తాత్పర్య వివరణములు— కాశ్యపునివంటి ప్రతికృతి యొకటి అయినచో దానిని, 'కాశ్యపః' అందుము. రెండవదియు నంతియే, మూడవదియు నంతియే. అనేక ప్రతికృతులను అనేకోపమానములు పరిచ్ఛేదించిన వనుట. అచట ప్రతికృతిబోధకమగు కన్ ప్రత్యయము లోపించిన శబ్దరూపము లనేకములకు "కాశ్యపశ్చ, కాశ్యపశ్చ, కాశ్యపశ్చ = కాశ్యపాః', అని సరూపైక శేషము. ఈ ఏకశేష వృత్తియగు 'కాశ్యపాః' అను శబ్దమునందు "లుపి యుక్తవత్ వ్యక్తివచనే" (1-2-51) అను లింగవచనాతిదేశము ప్రవర్తింపదు. మొదటనే అది ప్రవర్తించి యున్నది గదా.

"కాశ్యపః ఇవ అయం ప్రతికృతి సమూహః" అని వివక్షించి మొదటనే 'కన్' ప్రత్యయమును ప్రవర్తింపచేసిన యెడల నపుడు యుక్తవదతిదేశమునకు వ్యాపారముండును. అపుడు ప్రకృత్యర్థమునకు సంఖ్యా భేదముండును. అది యుక్తవదతిదేశమునకు గారణ మగును. ఇపుడు ప్రతికృతుల కనేకత్వము. అది బాహ్యపదార్థముల భేదమువలన గలిగినది. అది అతిదేశముచే దొలగునది కాదని భావము. కాగా ఉపమేయ సంఖ్య ననుసరించి ఉపమాన ములు భిన్నములయినపుడు 'కాశ్యపాః' అను తద్ధితాంతమునకు ప్రచయము సమ్మతమే.॥595॥

అవతారిక— ఏమండీ! ఏకశేష శబ్దము గూడ లుబద్ధకమే గదా. అదియే ప్రచీయమాన మాయె. యుక్తవద్భావ మేల రాదు? అని యాశంకించి నిదర్శనమును జూపు చున్నారు.

శ్లో॥ యథా సమూహ ప్రచయే ద్విగూనాం భిన్న సంఖ్యతా ।
పంచపూల్యాదిషు, తథా లుబంత ప్రచయే భవేత్ ॥ 596

పంచపూలీ ఆదిషు = 'పంచపూలీ' మున్నగు వానిలో, సమూహప్రచయే, సతి = కాని సమూహమునకు అనేకత్వమున్నపుడు, యథా ద్విగూనాం = ఏ ప్రకారముగా, ద్విగుసమానము లగు, భిన్న సంఖ్యతా, భవతి = బహుత్వ సంఖ్య, కలుగునో, తథా లుబన్త ప్రచయే భవేత్ = ఆ విధముగనే లుబన్తముల కనేకత్వమునందు భిన్న సంఖ్య కలుగును.

తాత్పర్య వివరణములు— నిదర్శనము ద్విగుసమాసము. పంచానాం పూలానాం సమాహారః = పంచపూలీ. లేదా పంచపూలాః సమాహృతా పంచపూలీ. 'అయిదు గడ్డికట్టల మొత్తము' అని యర్థము. ''ద్విగురేక వచనమ్'' (2-4-1) అను సూత్రము, ద్విగువు, అర్థ మనేక మయినను, అది ఏకము వంటిదిగనే వ్యవహరింపబడునని, ఏకవద్భావమును విధించు చున్నది. కనుక గడ్డికట్ట లయిదయినను, 'పంచపూలీ' అని ద్విగుసమాసము, తద్బోధక మేకవచనాంతమే లోకమున ప్రయోగింపబడుచున్నది.

'అటువంటి అయిదేసి కట్టలు మూడు' అని చెప్పదలంచినపుడు, 'పంచపూల్యః' అని చెప్పవలెను. అది ఏకశేష వృత్తి. పంచపూలీ చ పంచపూలీ చ, పంచపూలీ చ = పంచపూల్యః అని విగ్రహ వాక్యము.

ఈ ఏకశేష పదమునం దేకవద్భావ మేల మరల రాదు ? అని మహాభాష్యమున, నాశంకించి, ''ఏకశేష ప్రతిషేధాచ్చ'' అని వాక్యకారుడు వార్తికమును రచించెను. ఏకశేష విషయమున నేకవద్భావమునకు ప్రతిషేధము చెప్పవలెనని యర్థము. దీనికి సమాధాన వార్తి కము - ''నవాన్యస్యానేకత్వాత్'' అనునది. ''ప్రతిషేధము చెప్పనక్కర లేదు. ఏకవద్భావ విధాయక సూత్రము, మొదటి ద్విగుసమాసార్థమునకు ఏకవద్భావమును విధించినది. తరువాత ఏకశేషానంతరము, ద్విగ్వర్థముల సముదాయము ద్విగ్వర్థము కాదు. దానికే గదా ఏకవద్భా వము ! ఒకపుడదియు ద్విగ్వర్థమయినను, బహిరంగము. ప్రాథమ కల్పిత ద్విగ్వర్థము అంత రంగము. అంతరంగమయిన ద్విగ్వర్థమున నేకవద్భావము చరితార్థముగాన నిట ప్రవర్తిం పదు - అని సమాధాన తాత్పర్యము.

ఆ విధముగనే లుబంతము మాత్రము వలన ప్రతీయమానమే లుబర్థము. ఏకశేషా నంతర మది శబ్దాంతరమగును. కావున యుక్తవద్భావ మిచట ప్రవర్తింపదు. మరియు ప్రాథమ కల్పిక లుబర్థ మంతరంగము ఏకశేషానంతర లుబర్థము బహిరంగమును గదా ! అని భావము. ॥596॥

అవతారిక— ''దృష్టాంతమునకును దార్ష్టాంతికమునకును వైషమ్యము కలదు. ద్విగుదృష్టాంతము లుబంతమునకు నప్పదు'' అని యీ కారికయందు ప్రతిపాదించుచున్నారు.

శ్లో॥ ప్రచయే భిద్యమానే తు సంఖ్యాపూలేషు భిద్యతే ।
అర్థభేదో లుబంతేషు నైవం కశ్చన దృశ్యతే ॥ 597

ప్రచయే భిద్యమానే తు = ప్రచయము = బహుత్వము, భేదించినపుడు, పూలేషు సంఖ్యా భిద్యతే = గడ్డి కట్టలయందు, సంఖ్య భేదించును, ఏవం లుబంతేషు = కాని ఆ విధముగ, లుబంతములందు, కశ్చన అర్థభేదః = అర్థభేద మేదియు, న దృశ్యతే = అగపడుట లేదు.

తాత్పర్య వివరణములు— పంచపూలీ = అయిదు గడ్డి కట్టలు. పంచపూల్యః = పదునైదు గడ్డి కట్టలు. పంచపూల్యౌ = పది గడ్డి కట్టలు. ఈ విధముగ, ద్విగుసమాసమున

కును, ఏకశేషకును అర్థమున నెంతయో భేదము గలదు. ఒకచో పంచసంఖ్య, అనగా ద్విగువు నందు అవచ్ఛేదకము. ఏకశేష పదములందు, దశ సంఖ్యా పంచ సంఖ్యలు వేరు వేరుగా అవచ్ఛేదకములు. అందువలన, ద్విత్వ, బహుత్వములకు ప్రచయము భేదించినపుడు, ద్విగ్వర్థ మగు సంఖ్యకంటె వేరుసంఖ్య అగపడుచున్నది. కావున నది ద్విగువు నర్థము కాదు కాబట్టి మహాభాష్యమున, "నవాన్యస్యానేకత్వాత్" అని చెప్పబడిన పరిహారము యుక్తమే. కాని, లుబంతమున నా విధమగు నర్థభేద మేమియు నగపడదు. ఉపమానములకు ప్రత్యేకముగ నా యా బహూపమేయములతో సంబంధము గలిగి, తరువాత ప్రచయమును వివక్షించినపుడు ఏకశేష రాగా, ఏ యర్థము బోధ్యమగుచున్నదో, అదియే యర్థము, ఒకే ఉపమానమునకు, అనేకోపమేయముల సంబంధము కలిగినపుడు, మొదటనే బహువచనము ప్రవర్తించినపుడును ప్రతీతమగుచున్నది. అందువలన అర్థములో భేదము లేనందున ప్రకృతమున ప్రచయార్థ మును లుబర్థమే కాబట్టి వచనాతిదేశము కలుగవలసినదే.

ఒక ప్రశ్న— అర్థభేదము లేదందువేమి ? స్పష్టముగ నున్నదే ? ఎట్లనగా— ప్రతి కృతులకు ప్రత్యేకముగ నుపమానముతో సంబంధమును గల్పించినపుడు, ఏకశేష ప్రవర్తించి బహువచనాంతముగ 'కాశ్యపాః' అని ప్రయోగించిన, నొక్కొక ప్రతికృతికిని కాశ్యపుడు ఉపమానమని తెలియవచ్చుచున్నది. అట్లుగాక ఒకే ఉపమానమునకు బహూపమేయములతో సంబంధమునందు ప్రతికృతుల సమూహమునకు ఒకే కాశ్యపుడు ఉపమానమని యర్థమగును. ప్రతికృతుల పరిచ్ఛేదము సమానమే అయినను, భేద మిట్లు స్పష్టము గదా !

అనిన, సత్యమే. ఈ ప్రశ్న లేకపోలేదు. ఈ భేదము లేదనుట కవకాశము లేదను కొనుడు. కాని, ప్రచయమునందును, అనగా ఏకశేష యందును, లుబంతము యొక్క అర్థము లేకపోదు.

లుబంతమున కర్థము ప్రతికృతి. అదియే ప్రచయమునందు బహుత్వమును బొందు నది. అది వేరుగాదు మరియు, ప్రచయమును వివక్షించినపుడే యుక్తవద్భావమునకు కృత్య ముండును. 'కాశ్యపునివంటి వాడు కాశ్యపుడు' అందుమనుకొనుడు. అచ్చట యుక్తవద్భావ మున కేమి పని గలదు ? అచట ప్రకృత్యర్థమును కశ్యపాపత్యమే. కన్నృత్యయార్థమును కశ్యపుని అపత్యమే.

అదియును గాక, కాశ్యప ఇవ ప్రతికృతయః = 'కాశ్యపుని వంటివి బొమ్మలు', అందుమనుకొనుడు. అచట 'ప్రతికృతయః' అనునది ఏకశేష యగుటవలన, వానికి బహుత్వ నిశ్చయము కలుగును.

కావున బహిరంగిమగు నర్థము సంభవించినపుడే అతిదేశము ప్రవర్తింపవలసి యుండును. కాగా 'కాశ్యపాః' అను బహువచనాంత రూపమునకు సిద్ధిని మరియొక ప్రకార ముగా జెప్పవలసి యుండును. ఏకశేష చేతనైనను నది సిద్ధించుననుట కుదురదు. ॥597॥

అవతారిక— ఆ ప్రకారమే యీ కారికలో జెప్పబడుచున్నది.

**శ్లో॥ యేషూపమేయవచనః శబ్దోన్యో న ప్రయుజ్యతే ।**
**ఉపమానస్య తత్రాన్యైః సంఖ్యాయా భేద ఇష్యతే ।** 598

యేషు = ఏ లుబంత శబ్దములందు, ఉపమేయ వచనః = ఉపమేయ వాచకమగు, అన్యః శబ్దః = వేరొక శబ్దము, న ప్రయుజ్యతే = ప్రయోగింపబడదో, తత్ర ఉపమానస్య = అచ్చట ఉపమానము యొక్క, సంఖ్యాయాః = సంఖ్యకు, భేదః = భేదము, అన్యైః ఇష్యతే = ఇతరులచే అంగీకరింపబడు చున్నది.

తాత్పర్య వివరణములు— కొన్ని 'కన్' లుబంత శబ్ద ప్రయోగములలో, పరిచ్ఛేద్యము లయిన ప్రతికృతులను జెప్పు వేరొక శబ్ద ముండదు. కన్ లుబంతము మాత్రమే యుండును. అట్టి స్థలములందు ఉపమాన వాచకమునకు సంఖ్యాభేద మిష్టమే. ఉపమేయ వాచకము వాక్యమునందు ప్రయుక్తమయిన దానివలననే బహుత్వ సంఖ్య తెలియును. ఏకోపమానమే ఉపమేయము లనేకముల కుపకారకమగును. ఎట్లన— చూడుడు.

''కాశ్యప ఇవ దేవదత్త యజ్ఞదత్త విష్ణు మిత్రా ఇమాః ప్రతికృతయః'' = దేవదత్తుడు, యజ్ఞదత్తుడు, విష్ణు మిత్రుడు - అను నీ ప్రతిమలు, కశ్యపుని అపత్యము వంటి వారు అను నీ ప్రయోగమున నుపమానము కాశ్యపు డొకడే ;

ఉపమేయ వాచకమును ప్రయోగింపక 'కాశ్యపః' అనిన, నట ఈ కాశ్యపు డొక ప్రతికృతికే ఉపమానమా ? లేక అనేక ప్రతికృతులకా ? అను సందేహము కలుగును. అనేకోపమేయములకు కాశ్యపు డుపమానమైనను యుక్తవద్భావము వలన కాశ్యప శబ్దము ఏకవచనాంతము గావచ్చును.

అను నీ ప్రతిమలు (అనగా దేవదత్త యజ్ఞదత్త విష్ణు మిత్రులు అను పేర్లు గల వారివి) కాశ్యప ఇవ, కాశ్యపుడు వంటివే అనగా కాశ్యపుని ప్రతిమ వంటివే. ఇచ్చట ఉపమానోపమేయ భావము ప్రతిమలకే గాని పురుషులకు గాదు. (సంస్కృతము వాడుకకు తెనుగు వాడుకకు ఒక భేదము కలదు. ప్రతిమకును, దానికి మూలమయిన పురుషునకును గూడ వాచకమయి కాశ్యపః అనియే యుండును. ప్రతిమయైనప్పుడు కాశ్యప (ము) అనియు (అమహత్తు గావున) పురుషుడయినచో కాశ్యపుడు అనియు వ్రాయక తప్పదు. ఇచ్చట కాశ్యప శబ్దము కశ్యపుని అపత్యము అను యౌగికార్థమును సూచించుచున్నది. కశ్యపుని పుత్రులు అనేకు లుండవచ్చును. వానిలోనే యొక్కరి ప్రతిమ యయినను అను అర్థము చెప్పినచో కుదురదు. ఎవడో ఒక్కడే కాశ్యపుడు అను వానియొక్క ప్రతిమయని యర్థము చెప్పవలెను

అందువలన, అనేకోపమేయములన నీ యుపమానము పరిచ్ఛేదించుటకు, ఉపక్రమమునందే ఉపమానమయిన కాశ్యపునకు ఆత్మభేద కల్పన మావశ్యకము. కాగా 'కాశ్యపాః ప్రతికృతయః' అనునది సిద్ధించును. ''ఇతరులచే సంఖ్యకు భేదమంగీకరింపబడు చున్నది'' అని కారికయందు చెప్పుటచే మతాంతరమును గలదని వ్యక్తము. ॥598॥

*అవతారిక*— ఈ విషయమున నిదర్శనము జూపబడుచున్నది.

**శ్లో॥ యథా గుడతిలాదీనాం ప్రయోగా దేకసంఖ్యతా ।
పాకాదేర ప్రయోగే తు భిన్నసంఖ్యాభిధీయతే ॥ 599**

యథా, పాకాదేః = ఏ ప్రకారముగా, గుడతిలాదీనాం ప్రయోగే = గుడ, తిల, మున్నగు శబ్దముల ప్రయోగమునందు, ఏకసంఖ్యతా భవతి = ఏకవచనము కలుగుచున్నదో, అప్రయోగే తు = అవి ప్రయోగింపబడ నపుడు, భిన్న సంఖ్యా = వేరు సంఖ్య, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ''గుడ తిలతండులానాం పాకః'' - ''తామ్రః పలాశేషు బభూవ రాగః'' అని రెండు ప్రయోగములు. ''బెల్లము, నువ్వులు, బియ్యము - వీని వంట''. ''మోదుగు పూవునందు, రాగిరంగు ఏర్పడినది'' అని పై వాక్యముల కర్థమట.

అందు, 'పాకః' 'రాగః' అని ఏకవచనాంత శబ్దమే యున్నది. వస్తుతః వాని వాని పాకములు వేరు వేరు. పాక్య వస్తువులు అనగా వండవలసిన బెల్లము, నువ్వులు, బియ్యమును అనేకములగుట వలన, వాని వంటయొక్క నానాత్వ మవగతమగుచుండుటచే, ఏకవచనమున కుపపత్తి. అట్లుగాక, 'పాకః' 'రాగః' అని మాత్రమే ప్రయోగించిన, పాక్య వస్తువుల భేదమును దెలుపు పదమును, రాగాశ్రయ వస్తువుల భేదమును దెలుపు పదమును ప్రయోగింపకుండిన, ఈ పాకము ఒక పాక్య ద్రవ్యమునకు సంబంధించినదా ? లేక అనేక గతమా ? ఈ రాగమున కాధారము ఏకమా ? అనేకమా ? అని సందేహము కలుగును. అట్టియెడ నిశ్చయ ప్రతిపత్తి కొరకు 'పాకౌ' అనియు, పాకాః అనియు, అట్లే రాగౌ అనియు, రాగాః అనియు అనేక సంఖ్యా ప్రయోగ మగపడుచున్నది. ॥599॥

*అవతారిక*— ఆ దృష్టాంత మీ కారికలో దార్ష్టాంతికమునందు సమన్వయ పరుపబడుచున్నది.

**శ్లో॥ యః సంబంధిగతో భేదః స ప్రయోగే ప్రతీయతే ।
సంబంధినామతో భేద ఉపమేయేన గమ్యతే ॥ 600**

యః భేదః = ఏ భేదము, సంబంధిగతః = సంబంధి నాశ్రయించినదై యుండునో, సః = అది, ప్రయోగే = ఆ సంబంధివాచక శబ్ద ముపయుక్తమయినపుడు, ప్రతీయతే = అవగతమగును, అతః = అందువలన, సంబంధినాం భేదః = సంబంధుల భేదము, ఉపమేయేన గమ్యతే = ఉపమేయముచే తెలియబడును.

తాత్పర్య వివరణములు— పాకమను పదార్థము స్వతః భేదములేనిది. కాని సంబంధిని బట్టి భేదించును. అనగా గుడాలను బట్టి వేరగును. సంబంధివాచక ప్రయోగము లేనపుడు పాకగత విశేషము తెలియరానట్లే ప్రతికృతి వాచక ప్రయోగము లేనపుడు భేదము

జ్ఞాతము కానేరదు. ఉపమాన భేదమపుడు తప్పదు. కాగా ప్రత్యేకోపమానమే ఉపమేయ భేదమును దెలియచేయవలసి యుండును. ॥600॥

అవతారిక— ఈ విషయ మీ కారికయందిట్లు నిగమనము చేయబడినది.

**శ్లో॥ తస్మాత్, సామాన్య శబ్దత్వ ప్రసంగ వినివృత్తయే ।**
**ఉపమేయగతో భేద ఉపమానేషు దృశ్యతే ॥ 601**

తస్మాత్ = అందువలన, సామాన్య శబ్దత్వ ప్రసంగ వినివృత్తయే = ఉపమానశబ్దము సామాన్య శబ్దము కొరకుండుటకు, ఉపమేయగతః భేదః = ఉపమేయముల యందలి భేదము, ఉపమానేషు దృశ్యతే = ఉపమానములందు అగపడును.

తాత్పర్య వివరణములు— 'కాశ్యపః' - అని ఉపమానమును మాత్రము ప్రయోగించిన, కశ్యపుని గోత్రాపత్యము = (గోత్రమనగా మనుమలు) అని యర్థమగును. 'కశ్యపాపత్యము వంటి ప్రతికృతి' - అను నర్థము నియతముగ ప్రతీతము గాదు. ఉపమాన సంబంధము = ఉపమానోపమేయ భావము స్ఫురించినను, ఈ ఉపమాన మనేకోపమేయములకా ఏకోపమేయమున కేనా ? అను సందేహమువలన నిది సామాన్య శబ్దమని యనవలసి యుండును. అది సమ్మతము గాదు. అందువలన ఉపమేయముల బహుత్వము తెలియవచ్చుటకు, ఉపమానమును భిన్న భిన్నమగు చుండును. ఉపమేయము ప్రధానము. ఉపమానము గుణము. ప్రధానమునుబట్టి, అప్రధానములావృత్తములగుటయే శాస్త్ర సమ్మతము. ॥601॥

అవతారిక— ''యేషూపమేయవచనః'' = అను 598 వ కారికలో ఉపమాన సంఖ్యాభేదము ఇతరులకు సమ్మతమని చెప్పబడియున్నది. అచట ఇతరుల కనుటచేత మతాంతరమును గలదని సూచితము. అయ్యదిందు వివరింపబడుచున్నది.

**శ్లో॥ ఉపమానం సమస్తానామభిన్నం శ్రూయతే క్వచిత్ ।**
**భిన్నానాముపమేయానా మేకైకం వోపమీయతే ॥ 602**

సమస్తానాం = ఉపమేయముల కన్నిటికి, అభిన్నం = ఒక్కటియే, ఉపమానం = ఉపమానము క్వచిత్ శ్రూయతే = కొన్ని చోట్ల వినబడును, అథవా = లేదా, భిన్నానాం = వేరువేరయిన. ఉపమేయానాం = ఉపమేయములలో, ఏకైకం = ఒక్కటొక్కటియు, ఉపమీయతే = ఉపమింపబడును.

తాత్పర్య వివరణములు— అనేకములగు ననేకోపమేయముల మొత్తమునకు ఒక ఉపమానమును ప్రయోగించుటయు గలదు. వేరొకపుడు నానోపమానములకు ప్రత్యేకముగ నుపమితి క్రియయు నగపడుచున్నది. అనగా ననేకోపమాన పదముల ప్రయోగమును గలదు. ఇది మత భేదము. ॥602॥

అవతారిక— అందు సమస్తోపమేయముల మొత్తమున కాకచే ఉపమానము ప్రయోగింపబడిన నిదర్శన మిందు జూపబడినది.

**శ్లో॥ యథా గరుడ ఇత్యేతత్ వ్యూహాపేక్షం ప్రయుజ్యతే।**
**ఏకేన యత్ర సాదృశ్యం వైనతేయేన హస్తినామ్॥ 603**

ఏకేన వైనతేయేన = ఒక గురుడినితో, హస్తినాం = అనేకములగు నేనుగులకు, యత్ర సాదృశ్యం = ఎచ్చట, సామ్యముండునో, తత్ర యథా = అచ్చట, ఏ విధముగా, గరుడః ఇత్యేతత్ = 'గరుడః' అను పదము, వ్యూహ పేక్షం = వ్యూహ పేక్షముగా = వాని రచనా విశేషమును బట్టి, ప్రయుజ్యతే = ప్రయోగింపబడు చున్నదో,

తాత్పర్య వివరణములు— కొన్ని ఏనుగులను ఒక వ్యూహముగ నిలిపినపుడు, అది గరుడ పక్షిని బోలి యుండుటచే, "గరుడ ఇవ ఇమే హస్తినః" = ఈ ఏనుగులు (గుంపు) గరుడినివలె నున్నవి - అని యందురు. వ్యూహమనగా రచనా విశేషము. ఆ విధ ముగ, అశ్వ రచనను, మొసలితో నుపమించినపుడు, 'మకర ఇవేమే వాజినః' అనుటయు గలదు. యజ్ఞవేది ఇటుకలు డేగవలె పేర్చబడినపుడు, "శ్యేన ఇవ ఇమాః ఇష్టకాః" అని ప్రయోగము. వాని వాని వ్యూహములే గరుడ, మకర శ్యేనములతో బోల్పబడునవి. కనుక, 'గరుడః ఇవ, మకరః ఇవ, శ్యేనః ఇవ' అని ఏకవచనాంతములే ప్రయోగింపబడుచున్నవి. మకరాదుల పోలిక వ్యూహములకుగాని, గజ, వాజి ఇష్టకలకు గాదు.

కావున సంబంధుల భేదమును బుచ్చుకొని యుపమానములకు భేదము ప్రసక్తము కాదు. "గరుడాః ఇవ హస్తినః, మకరా ఇవ వాజినః", అని యీ తీరుగ బహువచనము ప్రయుక్తమయిన, అపుడు ప్రత్యేకముగ హస్తులకును అశ్వములకును ఉపమేయత్వము గమ్య మగును. శీఘ్ర జవత్వము సమాన ధర్మమపుడగును. వ్యూహ ముపమేయము గాదు. ॥603॥

అవతారిక— ఆ విధముగనే యచట—

**శ్లో॥ ఏకస్యాఽపి ప్రతీయేత భిన్నా ప్రతికృతిః సహ।**
**కాశ్యపస్యేతి తేనాయం ప్రత్యేకమవతిష్ఠతే॥ 604**

ఏకస్య అపి = ఒకడే అయినను, కాశ్యపస్య = కశ్యపుని అపత్యమయిన యొకానొక వ్యక్తికి సహ = తుల్యమయిన, భిన్నా ప్రతికృతిః = వేరు వేరు ప్రతికృతి, ప్రతీయేత ఇతి = గమ్య మానము కావలసి వచ్చును గాన, తేన, అయం = ఆ హేతువు వలన ఈ ఉపమేయము, ప్రత్యేకం అవతిష్ఠతే = భిన్న భిన్నముగ నుండును.

తాత్పర్య వివరణములు— కాశ్యపః ఇవ ఇమాః ప్రతికృతయః = కాశ్యపః = ఈ బొమ్మలు కాశ్యపుని బోలినవిగాన కాశ్యపుడు అనబడును - అను ఈ వాక్యమునందు ఉపమానవాచకము, ఏకవచనాంతముగా ప్రయోగింపబడి యున్నది. అనేకములగు ప్రతి

యథా = ఏరీతిగా, స్వప్నే = స్వప్నమునందు, ఏకస్య + ఏవ = ఒక్కటియేయగు, చేతసః = మనస్సునకు, (1) ఆత్మా = తన వాడు, పరః = ఇతరుడు, (2) ప్రియః = ఇష్టుడు, ద్వేష్యః = శత్రువు, (3) వక్తా = మాటలాడువాడు, వాచ్యమ్ = చెప్పబడునది, (4) ప్రయోజనమ్ = ప్రయోజనము (ఇతి) = ఇటువంటి, విరుద్ధాని = పరస్పరము విరుద్ధములగు, రూపాణి = రూపములు, (ఉపలభ్యన్తే) = తెలియబడుచున్నవో ;

తథా = అట్లే, అజన్మని = పుట్టుకలేనట్టియు, కనుకనే, నిత్యే = పరమార్థనిత్యమగునట్టియు, కనుకనే, పౌర్వాపర్యవివర్జితే=పూర్వాపరభావములేనట్టి, తత్త్వే = పరబ్రహ్మమునందు, విరుద్ధమ్ = పరస్పరము విరుద్ధమగు, జన్మాది రూపత్వమ్ = పుట్టుక మున్నగు అనేక రూపములు కలిగియుండుట, ఉపలభ్యతే = చూపబడుచున్నది.

మేల్కొనియున్న యవస్థలో నేత్రము మున్నగు ఇంద్రియములు పనిచేసి విశ్రాంతిని అపేక్షించును. అవి మనస్సులోలయమును బొందును. దానినే నిద్రయందురు. అపుడు ఒక మనస్సే పని చేయును. అదియే పలురూపములను దాల్చి సంచరించును. తనలో సూక్ష్మరూపముగా ఉన్నపదార్థములను జీవునకు జూపును. అదియే స్వప్నము. ఆస్థితిలో ఒకడు తనతో సఖ్యము చేసినట్లు, మరియొకడు ద్వేషించినట్లు, జీవుడు చూచును. ఇట్టి ఎన్నియో విరుద్ధములగు రూపములు జీవునకు కాన్పించును. మనస్సు ఒక్కటియే జీవునకు విభిన్నరూపములతో గోచరించును. అట్టి స్వాప్నిక పదార్థములు మేల్కొనగా కానరావు.

అట్లే పరబ్రహ్మమునందు జీవుడు భోక్తగాను, ప్రపంచకము భోగ్యముగాను భాసించును. అవియన్నియు మాయావశమున భాసించుచున్నవి. అవియన్నియు బ్రహ్మసాక్షాత్కారము కలుగగా కానరావు. అవిద్య ఉన్నంతవరకు పుట్టుక మున్నగు విరుద్ధ భావములు కాన్పించును. బ్రహ్మమునందు అనాది యగు మాయ బహు విచిత్రములగు రూపములను భాసింపజేసి జగన్నాటకమును జూపుచున్నది. స్వప్నము కూడ మాయామాత్రమనియే అద్వైత వాదుల విశ్వాసము.

కాబట్టి వ్యవహారదశలో విరుద్ధములగు పదార్థములు వానిభేదము మనకు గోచరింపవచ్చును. పరమార్థదశలో అవిఏమియు కానరావు. బ్రహ్మ యొక్కటియే మిగులును. అది సత్యము. ॥17, 18॥

ద్రవ్య సముద్దేశము ముగిసినది

కృతులు, కాశ్యపునకు, సంనివేశాదియగు ఏదియో ఒక ధర్మమును బట్టి తుల్యములని దీని వలన దెలియబడును. గరుడునకు, ఏనుగులు, వ్యూహరూపముచే దుల్యములగుట యట్లేగదా ! అంతియగాని ఉపమానము ప్రత్యేకముగ నుపమేయములను పరిచ్ఛేదించుట గమ్యము గాదు.

కారికయందలి 'సహ' అనునది తుల్యార్థకము. తద్యోగమున ('తుల్యార్థై' రతు లోపమాభ్యాం (2-3-72) అను సూత్రముచే కాశ్యపస్య అనుచోట షష్ఠియని గ్రహింప వలెను.

అందువలన ప్రత్యేకముగ నుపమేయములగు ప్రతికృతుల కుపమాన సంబంధము వ్యక్తమగుటకై కాశ్యప శబ్దము ప్రత్యేకముగ నుపమేయములతో సంబంధించును.

పై రెండు మతములకును గల భేదము నిట్లు గ్రహింపనగును. వెనుకటి మతమున ఉపమేయ శబ్దము ప్రయోగింపబడనపుడు, ఆ ఉపమేయముల యనేకత్వము తెలియుటకు, ఉపమానము, తాను భిన్న భిన్నమగును. అది ఉపమేయార్థమగుటచే పరార్థము గదా !

ఇక నీ మతమున - ఉపమేయవాచక శబ్దమునకు వాక్యమునందు ప్రయోగమున్న పుడు, ఉపమానము వేరు వేరుగా నా యుపమేయములను సంస్కరించుట దృష్టముగాన, నొక యుపమేయమున కొక్కొక యుపమాన ముండవలెనని తెలియజేయుటకు, ఉపక్రమమున నందే, ఉపమానము అనేకత్వమును పరిగ్రహించునని తాత్పర్యము. ॥604॥

అవతారిక— ఇక నొక యుపమానము సముదితములయిన అనేకోపమేయముల మపమించుటకు, ప్రసిద్ధతరమగు వేరొక నిదర్శనమును నిందు జూపుచున్నారు.

**శ్లో॥ మేఘా శైల ఇవేత్యుక్తే సమస్తానాం ప్రతీయతే।**
**సాదృశ్యం గిరిణైకేన ప్రత్యేకం తేన భిద్యతే ॥ 605**

మేఘాః శైలః ఇవ = 'శైలమువలె మేఘములన్నవి' ఇతి ఉక్తే సతి = అని చెప్పబడినపుడు, ఏకేన, గిరిణా = ఒక శైలముతో, సమస్తానాం = అన్ని మేఘముల మొత్తమునకును, సాదృశ్యం ప్రతీయతే = సామ్యము తెలియనగుచున్నది, తేన = అందుచేత, ప్రత్యేకం భిద్యతే = వేరు వేరుగ నుపమానపదము మారును.

తాత్పర్య వివరణములు— "శైలః ఇవ అమీ వలాహకాః మహా పరిమాణాః నానావిధ రాగవిచ్ఛురితానేక సంస్థాన శిఖరత్వాత్" అని యొక వాక్యము. "కొండవలె ఈ మేఘములు పెద్ద పరిమాణము గలవి. ఏలయన, వేరు వేరు రంగులచే రంజితములైన శిఖర ములు గలవిగ నున్నవి కాబట్టి" - అని యర్థము

ఇట నొక కొండతో మేఘములకు పోలిక చెప్పదలంపబడినది. అందువలన మేఘ ముల మొత్తమునకే పర్వత తౌల్యము. వేరు వేరు మేఘములకు గాదు. ఒక్కొక మేఘమును పర్వతమువంటిది కాదు గదా. అనేక వర్ణములు గల అనేక సన్నివేశముల శిఖరము లుండుట

యను పర్వత సాధారణ ధర్మము, మేఘముల మొత్తమునకే గాని, ఒక్కొక్క మేఘమునకు సంభవించునది గాదు. కాగా, ఏకవచనాంతమగు ఉపమానము అనేకోపమేయ సముదాయమునకు సంభవము గాని, ప్రత్యేకముగ గాదు గాన, ఉపమేయవాచక శబ్దమునకు ప్రయోగమున్నపుడు, ఉపమాన ప్రతి సంబంధియగు నుపమేయము సముదితము ఒక్కటి యుండదు గాబట్టి, సంబంధి భేదము నిశ్చితము గాదు. 'గుడతిలతండులానాం పాకః' అను స్థలమునందు వలె ఉపమాన నిశ్చయమును గలుగదు. కావున ప్రతికృతు లొక్కొక్క దానికి ఉపమాన సంబంధము తెలియ పరచుటకు, కశ్యపాపత్యమను నుపమానమును ముందే వేరు వేరగును కాగా వివక్షితమయిన అర్థము లభించుటకు 'కాశ్యపాః' అను బహువచనాంత ప్రయోగ మీ విధముగ వ్యవస్థాపితము.

ఏమందీ? ఉపక్రమముననే, భేదము అంగీకరింపబడి నందున బిదాది పాఠము వలన వచ్చు అఞ్ ప్రత్యయము అనేకాపత్యములను నర్థమున నుత్పన్నము కావలెను. అపుడు "యఞఞోశ్చ" (2-4-64) అను సూత్రముచే బహుత్వమున రాదగిన లుక్కు ఇచ్చట గూడ ప్రాప్తించును గదా? అనిన, అట్లు కాదు. అఞ్ ప్రత్యయము ఏకత్వరూపార్థమునందే ప్రవర్తించును గదా. దానివలన యుక్తవదతి దేశముచే ఏకవచనము రావలసి యుండునని, ఏక శేషచే బహువచనము సమర్థింపబడినది. అనగా, యుక్తవద్భావ ప్రాప్తమయిన వచనము, వివక్షితార్థ లాభమునకై బాధింపబడునని భావము.

"హరీతక్యాదిషు వ్యక్తిః" - అని యొక వార్తికము కలదు. హరీతక్యాః ఫలాని= హరీతక్యః = కరకచెట్టు కాయలు. లుప్పు వచ్చినపుడు యుక్తవద్భావముచేత లింగవచనములు రెండును ప్రకృతి సంబంధులు ప్రాప్తించుచుండ లింగము మాత్రమే ప్రవర్తించును. వచనము అభిధేయ వచనమే వచ్చునను నియమము నా వార్తికము బోధించుచున్నది. పైన నుపపాదించిన న్యాయమే అందును గర్భీకృతము.

అఞ్ ప్రత్యయము బహ్వర్థబోధక మయినపుడు లుక్కగు ననియు, అఞంతము బహ్వర్థమును బోధించినపుడు లుక్కగుననియు రెండర్థములు భాష్యమున నుపపాదింపబడినవి. అందు రెండవ పక్షము నందును నిచట లుక్ప్రసంగము లేదని ప్రతిపాదితము. ఏలయన- "యఞఞోశ్చ' (2-4-64) అను నీ సూత్రములోనికి "యస్కాదిభ్యోగోత్రే" (2-4-63) అను సూత్రములో నుండి 'గోత్రే' అను పద మనువర్తించును. గోత్రమనగా అపత్యము. ప్రవరాధ్యాయోక్తమగు గోత్రము కాదు. 'అఞన్తం యత్ బహుషు గోత్రం' = అఞంతము బహ్వపత్య బోధకమైనపుడు లుక్కు అగునని యర్థము. ప్రతికృతుల బహుత్వ మిచట ఆ గోత్ర బహుత్వము గాదు కావున నిట లుక్ప్రసంగము లేదు.

"బైదస్య అపత్యాని = బిదాః । బైదయోరపత్యానిబిదాః" అను స్థలములందును, అఞంతము గోత్ర బహుత్వమును బోధించును. అందువలన నీ సూత్రముచేతనే లుక్కు సిద్ధించును. "ఏకవచన ద్వివచనాంతస్య ప్రవృత్తౌ బహుషు లోపో యూని" అను వార్తిక మక్కర

లేదు అని భాష్యమున సిద్ధాంతము చేయబడి యున్నది. గోత్రమనగా అపత్యము గనుక యువా పత్యమును గోత్రమే యగును అని భావము. ॥605॥

ప్రకరణసంగతి— ఉపమానసమాసప్రసంగము ముగిసిన తరువాత, ప్రసంగ సంగతిని బట్టి తుల్యార్థాది వతి ప్రత్యయము విచారింపబడినది. ఉపమాన విచార సందర్భ మున విచారణీయమయిన, బహూపమేయములకు ఏకోపమానము చేయు ఉపకార ప్రకారము, 590 కారిక నుండి 605 వ కారిక వరకును గల 16 కారికలచే విచారింపబడినది.

ఇక నా ఉపమాన ప్రసంగ ప్రసంజితమగు ఛ ప్రత్యయ విధి విచారము ఈ 606 వ కారిక నుండి చేయబడును.

*అవతారిక*— ''సమాసాచ్చ తద్విషయాత్'' (5-3-106) అను యొక సూత్రము ఇది ఛ ప్రత్యయ విధాయకము. ప్రకృతి, సమాసము. 'కాకతాలీయమ్', 'అజాకృపాణీయమ్' మున్నగునవి యుదాహరణములు. ప్రకృత సూత్ర మహాభాష్యమున, నీ సూత్రార్థ పరిశీలన మీ క్రింది విధముగ నడచినది.

'తదిత్యనేన కిం ప్రతినిర్దిశ్యతే ?' అని మొదటి ప్రశ్న. 'తద్విషయాత్ సమాసాదపి ఛ ప్రత్యయో భవతి' అని గదా సూత్రార్థము. 'తద్విషయాత్' అనుచోట సర్వనామమగు తత్పదము దేనిని పరామర్శించును ? ఇవార్థమునా ? లేక ఛ ప్రత్యయమునా ? సర్వనామ ములు ప్రధానమయిన దానిని పరామర్శించుట న్యాయప్రాప్తము. సమాసము ప్రత్యయమునకు పకృతి గాన, అప్రధానము. ఇవార్థమును ఛ ప్రత్యయ విధిలో గుణ భూతము. వేరొకటి పరామర్శనీయ మగపడదు. కాగా నది దేనిని పరామర్శింపవలెను ? అని ప్రశ్నాశయము.

ఛ ప్రత్యయము విధేయము గాన ప్రధానము. అందువలన దానిని పరామర్శించుట యుక్తము అను నాశయముతో ''ఛః ప్రతినిర్దిశ్యతే'' అని సమాధానము.

కావచ్చును. కాని అర్థము పొసగదు. ఛ ప్రత్యయము విషయముగా గల సమా సము కంటె యని యర్థము గదా ? శబ్దము శబ్దమునకు విషయ మెట్లగును ? శబ్దమున కర్థము విషయమగును. అది అనుకరణమయినచో, శబ్దమునకు శబ్దము విషయమగునను కొనుడు. కాని సమాసము 'ఛః' అను దానికి అనుకరణము గాదు గదా.

ఇక విషయ శబ్దమున కర్థము, అనన్య భావము. అనగా ఛ విషయమనగా, ఛ ప్రత్యయ విషయము గానిచోట నుండనిదని యర్థము. కావున, సమాసము ఛ విషయము కావచ్చునందురా ? అది అయుక్తము - అనుచున్నారు.

**శ్లో॥ ఛాపేక్ష తద్విషయతా విధేయత్వాన్న గమ్యతే ।**
**కాకతాలీయ మిత్యత్ర ప్రసిద్ధం హ్యుపలక్షణమ్ ॥ 606**

ఛాపేక్షా = ఛ ప్రత్యయముపై నాధారపడిన, తద్విషయతా = సమాసమునకు ఛ ప్రత్యయ

విషయత్వము, విధేయత్వాత్ = ఆ ఛ ప్రత్యయ మిచటనే విధింపబడుట వలన, న గమ్యతే= గ్రహింపబడదు, కాకతాలీయమ్ ఇతి అత్ర='కాకతాలీయమ్' అను స్థలమునందు, ఉపలక్షణం = ఈ సూత్రముచేతనే సమాస విధానము, ప్రసిద్ధం హి = ప్రసిద్ధము గదా.

తాత్పర్య వివరణములు— ఛ' ప్రత్యయము వచ్చినపుడు తప్ప వేరొకచోట నుండని సమాసము కంటె బరముగా ఛ ప్రత్యయము ప్రవర్తించును, అను నీ రీతిగ, ఛ ప్రత్యయాపేక్షమయిన ఛ విషయత్వము, కాకతాలీయం అను పదవ్యుత్పాదనము నందు కుదురుపడదు. ఎందువలన ననగా - ఒక దానివలన తెలియబడినది తా నింకొక దానికి జ్ఞాపక మగును. ఛ ప్రత్యయము, ఇదం ప్రథమముగ నీ సూత్రముచేతనే విధింపబడుచున్నదాయె. అంతకు మునుపు తెలియని విశేషణము ఛ ప్రత్యయమునకు ప్రకృతిగా సమాసమును విశే షించును ? ఆ ప్రత్యయము వేరొక సూత్రముచే నిధింపబడి యుండినదై సిద్ధముగానున్నచో నపుడు, సమాసమునకు ఛ ప్రత్యయ నైయత్యమును నిర్ణయించి తద్విధానమునకు, ఛ ప్రత్యయ విషయతను నిమిత్తముగా జెప్పట యుక్తమయ్యేడిది. సూత్రాంతర మేదియు దానిని విధించి యుండలేదు. ఈ సూత్రమే దానికి ఉత్పత్తి వాక్యమాయె. అనువాద మనునది సిద్ధ పూర్వమునకు గదా.

ఛ విషయమనగా, భావికాలమున ఛ ప్రత్యయమునకు విషయమయిన సమాసము కంటె బరముగా ఛ ప్రత్యయము వచ్చునని బోధించుటయే మాకు వివక్షితమనిన, ఆ మాట కర్థము లేదు. అపుడిట్లర్థము కావలెను. "ఏ సమాసముకంటె ఛ ప్రత్యయము భావిలో విధింప బడునో, ఆ సమాసము ఛ విషయమయిన, దానికి బరముగ ఛ ప్రత్యయమగును" అని. అపుడీ విశేషణము వలన ప్రకృతి అయిన సమాసమునకు గలిగిన విశేషమేమి ? దానికి ఛ విషయత్వము లేకుండ నుండదు. ఇక నా విశేషణము దేనిని వ్యావర్తించును ? కావున నది యర్థములేని విశేషణమగును - అని తాత్పర్యము. ॥606॥

*అవతారిక*— ఓయీ ! భావి అవస్థనుబట్టి, విశేషణమునకు ప్రయోజన ముండును. ఎట్లనగా— 'సమాసము ఛ విషయమైనపుడు' అని విశేషించుట వలన, ఛ ప్రత్యయము వచ్చి నపుడే గాని అది లేనపుడు ఈ సమాసమునకు ప్రయోగ ముండదని చెప్పినట్లగును గదా. అన్యత్ర అభావము గదా విషయ శబ్దమున కర్థము ! అని శంకింపగా జెప్పుచున్నారు.

**శ్లో॥ రాజాశ్వాదిశ్చ విషయః స్యాదన్యో వేత్య నిశ్చితమ్ ।**
**తేన ఛస్య విధానాత్ ప్రాక్ వ్యపదేశో న విద్యతే ॥** 607

రాజాశ్వాదిః చ='రాజాశ్వ' మున్నగు సమాసమును, విషయః స్యాత్ =ఛ విషయమగునా ?, అన్యోవా ఇతి = లేక వేరొక సమాసము ఛ విషయమగునా ? అనిశ్చితమ్ = అని నిశ్చ యింపబడ లేదు, తేన = అందువలన, ఛస్య విధానాత్ ప్రాక్ = ఛ ప్రత్యయ విధానమునకు ముందు, వ్యపదేశః = ఛ ప్రత్యయ విషయమను వ్యవహారము, న విద్యతే = ఉండదు.

తాత్పర్య వివరణములు— ''సమాసాచ్చ తద్విషయాత్'' (5-3-106) అను సూత్రమునందు, తద్విషయాత్ అనుటవలన ఛ ప్రత్యయము రాదగునే సమాసమయినను, ఛ ప్రత్యయమునకు ప్రకృతి యగునని సూత్రకారునకు వివక్షితమా ? లేక, ఛ విషయమయిన సమాసము ప్రకరణ విశేషమునందలిదే గ్రాహ్యమా ? అను విషయము నిశ్చితము కాలేదు. ఆ విషయము నిశ్చితమయి యుండిన, ఆ సమాసమునకు సాధుత్వము, ఛ విషయముగా జ్ఞాపితమయ్యెడిది. ఆ సమాసము ఛ ప్రత్యయమునకు ప్రకృతి గనుకనే ఛ విషయము. మరి యొక రీతిగా గాదు. అట్టియెడ నన్ని సమాసములును ప్రకృతులు గావచ్చును. అపుడు ఆ సమాసము లన్నియు, ఛ ప్రత్యయ విషయములు కానపుడు అసాధువులని తేలును. అది సమ్మతము గాదు గదా. శాస్త్ర రచనము అనిష్టము నాపాదించుటకు గాదు గదా !

అట్లయిన, తత్ అను పదము దేనిని పరామర్శించునందురు ? అనిన, ఛ ప్రత్యయ విధానమునకు బూర్వము నియతమగు సమాస మేదియు సిద్ధమయి ఛ ప్రత్యయమునకు విషయమయినది లేదు గాన 'ఛ విషయాత్' అను విశేషణము వ్యర్థము. అయుక్తమును. ప్రత్యయము పూర్వసిద్ధమయిన, కార్యాంతర విషయమున, అనగా ఛ ప్రత్యయ విధానము గాక మరియొక కార్యమున, ఆ విశేషణము ప్రకృతిరూపమును విశేషించుట యుచితమగును. ''షష్ఠ్యతసర్థ ప్రత్యయేన'' (2-3-30) అను సూత్రమును జూడుడు. 'అతసుచ్' అను ప్రత్యయము యొక్క అర్థమున విహితములయిన ప్రత్యయములతో యోగమున, షష్ఠీ విభక్తి ప్రత్యయ మగునని యర్థము. అతసర్థ ప్రత్యయములు సూత్రాంతరములచే విహితములు, పూర్వసిద్ధములు. ప్రకృతమున నట్లు కాదు గదా.

కాగా 'తద్విషయాత్' అనుచో తత్పదము ప్రధానమగు ఛ ప్రత్యయమును బరామర్శించుట సంభవింపదు. ఇక ఛ ప్రత్యయ విధానములో నిమిత్తమయిన ఇవార్థమును, అప్రధానమయినను, పరామర్శించును. ఇవార్థమును, ప్రస్తుతమయి సన్నిహితమే గదా.

''కథం పునః సమాసోనామ ఛ విషయః స్యాత్'' - అని శంకించి.

''ఏవం తర్హి ఇవార్థః'' అని సమాధానము. మహాభాష్యమున గలదు.

తదుపరి, ''యది తర్హి సమాసోఽపీవార్థే, ప్రత్యయోఽపి, సమాసేనోక్తత్వాత్ ప్రత్యయో న ప్రాప్నోతి'' - అని యాక్షేపము. సమాసమును, ఇవార్థకమే అయి, ప్రత్యయమును, నదియే యగుచో, సమాసమా ఇవార్థ సాదృశ్యమును చెప్పినది గాన నిక ప్రత్యయము ప్రాప్తింపదే ? ''ఉక్తార్థానామప్రయోగః'' అని గదా యభియుక్త వచనము. ఏ శబ్దముల యర్థము శబ్దాంతరములచే జెప్పబడునో ఆ శబ్దములకు ప్రయోగము కలుగదు గదా ! అని యాక్షేప తాత్పర్యము.

వచన సామర్థ్యమువలన, అనగా ఛ ప్రత్యయ విధానము వ్యర్థము కాకుండుటకు, వచ్చుననిన, 'శస్త్రీవ శ్యామా = శస్త్రీ శ్యామా' మున్నగు ఇవార్థ సమాసముల కంటె బరముగ గూడ ఛ ప్రత్యయాపత్తి.

అందువలన, "ఏవం తర్హి ద్వావివార్థౌ । కథమ్ ? కాకాగమనమివ తాలపతన మివ కాకతాలమ్ । కాకతాల మివ కాకతాలీయమ్ ॥ అట్లయిన నపుడు ఇవార్థములు రెండగును. అనగా నది రెండు విధములుగ వ్యాపరించును. అందొక వ్యాపారముచే సమాసమును, నింకొకర్థ వ్యాపారముచే ప్రత్యయార్థమును సంస్కరించును. ఇవార్థ విషయమగు సమాసమునకు ఇవాక మున, ఛ ప్రత్యయమగునని యర్థము. 'కాకతాలమ్' అనగా 'కాకి రాక తాటిపండుపడుట వంటిది' అని యొక ఉపమార్థము. 'కాకతాల మివ = కాకతాలీయమ్' = కాకి వచ్చుట తాటి పండు పడుట వంటిది, దేవదత్తుని రాకయు, దొంగవానిని జంపుటయును అని రెండవ ఉప మార్థము. ఈ ఇవార్థ భేదమునకు మూలము సర్వనామము. దానిని పరామర్శించుటయే యని భావము. ॥607॥

*అవతారిక*— ఆ ఇవార్థములు రెండును నీ కారికలో వివరింపబడుచున్నవి.

**శ్లో॥ ద్వయోరివార్థయోరర్థ నిమిత్తత్వం ప్రతీయతే ।**
**ఏకేనావయవో యుక్తః ప్రత్యయోన్యేన యుజ్యతే ॥** 608

ద్వయోః ఇవార్థయోః = రెండు ఇవ శబ్దార్థములకు, అర్థ నిమిత్తత్వం = సమాస, ప్రత్యయ ముల అర్థమునకు కారణత్వము, ప్రతీయతే = గమ్యమగుచున్నది, ఏకేన = ఒక ఇవార్థము చేత, అవయవః = సమాసైక దేశమగు పదము, యుక్తః = సంబద్ధము, అన్యేన = ఇంకొక దానిచే, ప్రత్యయః = ఛ ప్రత్యయము, యుజ్యతే = సంబంధింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— కాకతాలీయమ్, అజాకృపాణీయమ్ మున్నగునవి ప్రకృత సూత్రోదాహరణములు. కాకి తాటిచెట్టు క్రిందకు వచ్చుట, వెంటనే ఆ సమయము ననే త్రాటిపండు పడి ఆ కాకి చనిపోవుటవలె దేవదత్తుడు బయటకు వచ్చుట, వెనువెంటనే చోరుడు పట్టుకొని వానిని జంపుట వంటిది యీ సంఘటనము. అనగా ననుకొనకుండగ దటస్థించినది అని 'కాకతాలీయ మిదమ్' అను వాక్యమున కర్థము.

మేక ఆ చోటకు వచ్చుట, పైనుండి ఆ సమయముననే కత్తిమీద పడుట, దాని వలన నా మేక చనిపోవుట వంటిది దేవదత్తుడు చోరునిచే చంపబడుట. దానివంటి దీ సంఘ టన మని, అజాకృపాణీయమను, ఛ ప్రత్యయాంతమున కర్థము.

రెండుపమానములలో నొకటి సమాసావయవము లయిన పూర్వోత్తర పదములకు సంబంధించినది. దానిని దెలియజేయునది సమాసము. కనుక నది ఇవార్థ విషయము. లేదా అవయవమనిన సమాసమే యనవచ్చును. అది తద్ధితాంతమునందు ప్రకృతి గావున నవయ వము. అది అవయవ ద్వారముగా నివార్థముతో సంబంధించును. సాక్షాత్తుగా గాదు. రెండవ ఇవార్థ సంబంధము ఛ ప్రత్యయమునకు.

'శస్త్రీ శ్యామా' అను నుపమాన మిటువంటిది గాదు. అచట కత్తికి శ్యామ గుణము పూర్వ సిద్ధము. శ్యామ గుణ విశిష్ట శస్త్రితో దేవదత్త యను స్త్రీ ఉపమింపబడుచున్నది.

అచట దేవదత్త యను నుపమేయముతో నింకొకటి ఉపమింపబడుట లేదు గాన నివార్థ మొక్కటియే. ॥608॥

అవతారిక— అందు సమాస వాచ్యమగు నివార్థ మీ కారికలో చెప్పబడుచున్నది

శ్లో॥ చైత్రస్య తత్రాగమనం కాకస్యాగమనం యథా।
దస్యోరభినిపాతస్తు తాలస్యపతనం యథా ॥ 609

తత్ర, చైత్రస్య ఆగమనం = అచటికి చైత్రుని రాక, కాకస్య ఆగమనం యథా = కాకి రాక వంటిది, దస్యోః అభినిపాతం తు = దొంగయొక్క చైత్రుని పైని బడుట, తాలస్య పతనం యథా = తాటిపండు కాకిమీద పడుట వంటిది.

తాత్పర్య వివరణములు— కాకతాలీయమను స్థలమున, కాకి రాక ఉపమానమును, చైత్రుని రాక ఉపమేయమును తాలపతన ముపమానమును, దస్యు = చోరసమాగమ ముపమేయమును నగుచున్నవి. రెండు పనులయందును. అతర్కితోపనతత్వము = అనుకొనకుండ దటస్థపడుట, సమానధర్మము. ఇది సమాసవాచ్యమగు నివార్థము. ॥609॥

అవతారిక— ఇక ప్రత్యయవాచ్యమగు నివార్థ మీ కారికలో నభిహితము.

శ్లో॥ సంనిపాతే తయోర్యాన్యా క్రియా తత్రోపజాయతే।
వధాదిరుపమేయే ఽర్థే తయా ఛవిధి రిష్యతే ॥ 610

తత్ర = అచట, తయోః సంనిపాతే = కాకము యొక్కయు, తాటిపండు యొక్కయు కలయికలో, యా, అన్యా, వధాదిః క్రియా = ఏ, ఇంకొక, వధ, మున్నగు, క్రియ, ఉపజాయతే = కలుగుచున్నదో, తయా, ఉపమేయే అర్థే = ఆ క్రియచే, పోల్పదగిన, అర్థమునందు, ఛవిధిః ఇష్యతే = ఛ ప్రత్యయ విధానము సమ్మతమగుచున్నది.

తాత్పర్య వివరణములు— కాకి రాక, తాటిపండు పడుట, అను చర్యలు కలసినపుడు, ఆ కలయిక వలన, కాకి చనిపోవుటయో, అవయవములు విరుగుటయో, తలకాయ పగులుటయో, ఏదియో క్రియ పుట్టును. దానితో బోల్పదగినది, చైత్రుని, వధాంగభంగాదిక ముపమేయము. వాని ఉపమానోపమేయ భావ సంబంధమే రెండవ ఇవార్థము. దానిని బోధించుచు, ఛ ప్రత్యయమును సూత్రము విధించుచున్నదని భావము. ॥610॥

అవతారిక— మరియు, కాకి రాక, చైత్రుని రాక కుపమానము. కాగా కాకాగమన మప్రధానము. తాలఫల పతనము, ధస్యుని రాక కుపమానము గాన నదియు నప్రధానము. ప్రధానా ప్రధానములగు కాకతాల శబ్దార్థములకు పరస్పర సంబంధము లేదు. కాగా నవి అసమర్థములు. అసమర్థములయిన సమాన మెట్లు? ఇక, 'ఈ ఛ ప్రత్యయ విధియే సమాసమునకును జ్ఞాపకమగును' అనిన నపుడును 'సుప్సుపా' అను సూత్రముచేతనే సమాసమని భాష్య

మున సూచింపబడి యున్నది. కావున అసమర్థములకు సమాసము దుర్లభమే। సమాస మెట్లో సిద్ధించినను, పూర్వోత్తర పదార్థములు పరస్పర సమన్వయము లేనపుడు, సముదాయార్థమును బోధింప జాలవు. అపుడు, ప్రకృత్యర్థ మేయది ప్రత్యయార్థమునకు విశేషకము కావలెను? అని యాశంకించి, సమాధాన మిందు చెప్పబడినది.

శ్లో॥ క్రియాయాం సమవేతాయాం ద్రవ్యశబ్దోఽవతిష్ఠతే।
పాతాగమనయోః కాకతాలశబ్దౌ తథా స్థితౌ॥ 611

ద్రవ్యశబ్దః = ద్రవ్యమును బోధించు శబ్దము సమవేతాయాం = ఆ ద్రవ్యమును, సమవాయ సంబంధముచే నాశ్రయించిన, క్రియాయాం = క్రియయందు, అవతిష్ఠతే = ఉండును = బోధించుచుండు ననుట, తథా = ఆ ప్రకారముగా, కాకతాల శబ్దౌ = కాక శబ్దమును, తాల శబ్దమును, పాతాగమనయోః = వచ్చుట, పడుట, అను క్రియలందు యథాక్రమముగా, స్థితౌ = ఉన్నవి.

తాత్పర్య వివరణములు— ద్రవ్యములు సిద్ధములు. క్రియలు సాధ్యములు. 'దధ్యోదనః', గుడధానాః మున్నగు సమాసములలో, పూర్వోత్తర పదార్థములు రెండును ద్రవ్యములే. వానికి పరస్పర సంబంధము సంభవింపదు. కాని అసమర్థములకు సమాసము రాదు గదా. కావున సమాసోపపత్తికై ద్రవ్యగతములయిన, ఉపసేకము, మిశ్రణము అను క్రియలను దధి గుడ శబ్దములు బోధించును దధిచేత నుపసిక్తమగు నోదనము, గుడ మిశ్రితము లగు పేలాలు అని యర్థమని చెప్పుదురు.

ఆ ప్రకారముగనే కాక శబ్దము స్వగత వ్యాపారమును, తాల శబ్దము, స్వసమవేత క్రియను బోధించును. కాకాగమన తాలపతన క్రియలకు పరస్పరాభి సంబంధము. ద్రవ్య వాచక శబ్దములు వృత్తి విషయమున, క్రియాబోధకములుగా నుండు, ''బ్రాహ్మణవదధీతే'' ఇత్యాదులలో నగపడుచున్నది. అచట బ్రాహ్మణ శబ్దమునకు, బ్రాహ్మణాధ్యయన క్రియ గదా అర్థము. కాకాగమన, తాలఫల పతనము లొకదానికొకటి యుపమానములు. కాకి రాక, అనుకొనకుండ జరిగినట్లు, తాటిపండు పడుటయు ననుకొనకుండ ప్రాప్తించినది. తాల పతన మతర్కితోపనతము (= ఊహింపబడకయే ప్రాప్తించినది) అయినట్లు. కాకాగమన మును జరిగినది. ఈ విధముగ పరస్పరోపమానోపమేయ భావముచే పూర్వోత్తర పదార్థములు సమన్వితము లగును. కాగా వానికి ప్రత్యయార్థ విశేషణత్వ ముపపన్నమే. కాకాగమనము, తాలఫల పతనము. దీనికి సమన్వయము కుదిరినది గాన, వానితో, దేవదత్తుని, లేదా చైత్రుని రాకకును, దొంగవచ్చి పైబడుటకును పోలిక సిద్ధించినది. ఆ యర్థమును బోధించునది సమాసము. కాకవధతో ఉపమేయమయినది దేవదత్త వధ. దానిని బోధించునది 'ఛ' ప్రత్యయము. ॥611॥

అవతారిక— ఆర్యా! ప్రారంభముననే, అతర్కితోపనతమయిన తాలకృత కాక వధతో, చోరకృతమయిన దేవదత్త వధ నుపమింపవచ్చును గదా! కాకాగమన తాలపతనము

లకు పరస్పరోపమానముతో బనియేమి ? కాక పదమునకు గౌణవృత్తి నాశ్రయించి, కాకా గమన పరత్వమును, తాలశబ్దమునకు తత్పతన పరత్వమును జెప్పుట కుపయోగమేమి ? అని శంకించి చెప్పుచున్నారు.

**శ్లో॥ యదన్వాఖ్యాయకం వాక్యం తదేవం పరికల్ప్యతే ।**
**ప్రయోగవాక్యం యల్లోకే తదేవం న ప్రయుజ్యతే ॥ 612**

అన్వాఖ్యాయకం = వృత్తియొక్క అర్థమును దెలియచేయు, యత్ వాక్యం = ఏ వాక్య ముండునో, తత్ ఏవం పరికల్ప్యతే = అది ఇట్లు కల్పింపబడును, లోకే ప్రయోగవాక్యం = లౌకిక ప్రయోగమున వాక్యము, యత్, తత్ = ఏది గలదో అది, ఏవం న ప్రయుజ్యతే = ఈ విధముగ ప్రయోగింపబడదు.

తాత్పర్య వివరణములు— 'కాకతాలీయమ్' 'అజాకృపాణీయమ్'-అని లోకమున వ్యవహరింపబడు పదములు గలవు. ఆ పదముల నన్వాఖ్యానము చేయుట శాస్త్రకారుని కృత్యము. శబ్దముల అన్వాఖ్యానము = ప్రకృతి ప్రత్యయ విభాగమును బురస్కరించుకొని అర్థమును చేయుట. ప్రక్రియా వాక్యమునందలి పదములకు అర్థ సమన్వయము అన్వాఖ్యాన మార్గమున సిద్ధించును. ప్రక్రియా వాక్యము = లౌకిక విగ్రహ వాక్యము. ఆ అన్వాఖ్యానమున కుపాయముగా కల్పింపబడుచుండును.

కాకాగమన మివ తాలపతనమ్. తాలపతన మివ కాకాగమనం = కాకి రాక వంటిది తాటిపండు పడుట. తాటిపండు పడుటవంటిది కాకి రాక - అని యిట్లు ఆ రెండు క్రియలను నొకదానితో నింకొకదానిని బోల్చి ప్రక్రియలో అన్వాఖ్యానమున కుపాయ భూతమగు నీ వాక్యము కల్పన మాత్రమే. దీనికి లోకమున ప్రయోగముండదు.

ప్రక్రియావాక్యము నిట్లు కల్పింపకుండిన, తాల కర్తృకమగు వధతోడనే కాకికి సంబంధము గృహీతమయ్యేదిది, తాలకాకములకు సంబంధమే గ్రహింపబడదు. 'కాకతాలమ్' అని ప్రయోగమునం దుండబోదు. దానికి ఛ ప్రత్యయమునకు ప్రకృతిగా మాత్రమే ప్రయోగము. సమన్వయానుసారముగ వాక్య పరికల్పనము కర్తవ్యముగదా యని తాత్పర్యము.॥612

అవతారిక— ఏతావతా ఫలిత మేమనగా—

**శ్లో॥ యయోరతర్కితా ప్రాప్తిర్దృశ్యతే కాకతాలవత్ ।**
**తయోః సమాసప్రకృతే ర్వృత్తిరభ్యుపగమ్యతే ॥ 613**

కాకతాలవత్ = కాకికిని తాటిపండునకును వలె నున్న, యయోః = ఏ దేవదత్తునకును, దొంగకును వలెను, అతర్కితా = ముందుగ నూహింపబడని, ప్రాప్తిః దృశ్యతే = సమాగమము = కలయిక, కనబడుచున్నదో, తయోః = ఆ రెండింటి సమాగమము ఇవార్థమయి నపుడు, సమాస ప్రకృతేః = సమాసమనెడు ఛ ప్రత్యయ ప్రకృతివలన, వృత్తిః = ఛ ప్రత్యయోత్పత్తి యను, వృత్తి, అభ్యుపగమ్యతే = గ్రహింపబడుచున్నది.

**తాత్పర్య వివరణములు**— అతర్కితములయిన ఉపస్థితములు కాకతాలములు. వానికి కాకవధ నిమిత్తముగా సంబంధము. దస్యు దేవదత్తుల ఉపస్థితియు దస్యువుచే (చోరునిచే) దేవదత్తుని వధయు నంతియే. ఆ విధముగ సంబంధము గల యా రెండింటి సమాగమమును ఇవ శబ్దమున కర్థమయినపుడు సమాసమను ప్రకృతి యేర్పడుచున్నది. దానినుండి ఛ ప్రత్యయమునకు ప్రవృత్తి యని చెప్పబడినది.

కనుక నీ విధముగ కాకతాలముల సంబంధ విశిష్ట ముపమానము. ఉపమేయము వధాదికము. ఛ ప్రత్యయ ముపమేయమును బోధించును. కాకతాల అను ప్రకృతి, నియతముగ ఛ ప్రత్యయ విషయమే. ఛ ప్రత్యయము లేనపుడు దాని ప్రయోగము సాధువు కాదు. ఈ విషయము భాష్యమున విస్తరముగ ప్రదర్శింపబడినది. ॥613॥

**అవతారిక**— ''వృత్తిరభ్యుప గమ్యతే'' = ఛ ప్రత్యయ ప్రవృత్తి స్వీకరింపబడుచున్నది అని వెనుకటి కారికలో చెప్పబడినది. ఏ యర్థమున ? అనగా—

**శ్లో॥ కాకస్యతాలేన యథావధోయస్య తు దస్యునా ।**
**తత్ర చిత్రీకృతేఽన్యస్మి న్నుపమేయే ఛ ఇష్యతే ॥** 614

కాకస్య తాలేన = కాకికి తాటిపండు చేతను, యస్యతు, దస్యునా = ఏ దేవదత్తునకో దొంగ చేత నున్ను, యథా వధః = ఏ ప్రకారముగ, వధ జరిగినదో, తథా త త్రచిత్రీకృతే = ఆ ప్రకారముగా, ఆశ్చర్య భూతముగా జరిగిన, అన్యస్మిన్నుపమేయే = వేరొక చర్యయందు, ఛః ఇష్యతే = ఛ ప్రత్యయము సమ్మతమగుచున్నది.

**తాత్పర్య వివరణములు**— సమాసార్థమగు ఉపమ, కాకతాల సమాగమ తుల్యమగు దస్యు దేవదత్తుల సమాగమము. అది ఒక ఇవార్థము. ప్రత్యయార్థోపమ, ''అన్యస్మిన్ ఉపమేయే'' అని చెప్పబడినది. తాటిపండు పడుట దానంతట నది జరిగినది. దేవదత్తుని రాకయు నంతియ. కాకి యదృచ్ఛగా నచ్చటికి వచ్చి, పైనబడిన ఆ పండుచే చనిపోయినది, అట్లే దొంగచే దేవదత్తుడు హతుడు. ఇది ఆశ్చర్యజనకమైన విషయము. ఇట్లే అద్భుతరూపమయిన ఉపమేయమునందు ఛ ప్రత్యయము వచ్చును. కాకతాలముల సమాగమము మూలముగ కలిగిన క్రియతో పోల్పబడిన క్రియాంతరమునందు ఛ ప్రత్యయమని ఫలితము. అట్లాశ్చర్య భూతమయిన చర్య కాకతాలీయ మనబడును అని తాత్పర్య పర్యవసానము.॥614॥

**అవతారిక**— ఉపమాన ప్రసంగవశమున, ఇవార్థక ఛ ప్రత్యయ విధి విచారము చేయబడినది. దాని వంటిదే అగు, కన్ప్రత్యయ విధి ఇక విచారింపబడు చున్నది.

**శ్లో॥ చంచత్ప్రకారశ్చంచత్కో బృహత్క ఇతిచాపరే ।**
**మణిమండూక ఖద్యోతాన్ సాదృశ్యేన ప్రచక్షతే ॥** 615

మణి, మండూక, ఖద్యోతాన్ = మణిని, కప్పను, మిణుగురు పురుగును, చంచత్ప్రకారః =

# సంబంధ సముద్దేశము-3

అవతారిక — మొదటి సముద్దేశమున వాజప్యాయనముని యొక్క మతము నాశ్రయించి ఎల్ల శబ్దములకు జాతియే వాచ్యమనియు, రెండవ సముద్దేశమున వ్యాడిమహర్షి యొక్క మతము నాశ్రయించి ఎల్ల శబ్దములకు ద్రవ్యమే వాచ్యమనియు, అపోద్ధారమునకు ఉపయోగించెడి అర్థములు నిరూపింపబడినవి.

ఈ సముద్దేశమున శబ్దార్థములకు గల 1. యోగ్యత, 2. కార్యకారణ భావము అను రెండు సంబంధములు నిరూపింపబడుచున్నవి. శబ్దముచే నర్థము బోధింపబడుటలో సంబంధము హేతువు. అట్లు కాకున్న ఎల్ల శబ్దములు ఎల్ల యర్థములను బోధింపవలెను. అట్లు అనుభవము లేదు. కాబట్టి ముందుగా శబ్దార్థములకు సంబంధమున్నదనియు, అదియు స్వాభావికమే, కల్పితము కాదనియు చెప్పుచున్నాడు.

శ్లో॥ జ్ఞానం ప్రయోక్తుర్బాహ్యోఽర్థః స్వరూపం చ ప్రతీయతే ।
శబ్దైరుచ్చరితైస్తేషాం సంబన్ధోఽస్తీతి గమ్యతే ॥ 1

ఉచ్చరితైః = ఉచ్చరింపబడిన, శబ్దైః = శబ్దములచే, ప్రయోక్తుః = శబ్దమును ప్రయోగించిన వానియొక్క, జ్ఞానమ్ = జ్ఞానము అనగా అభిప్రాయము, బాహ్యః = బాహ్య ప్రపంచకమున గల, అర్థః = ఘటము, పటము మున్నగు అర్థము, స్వరూపం + చ = శబ్ద స్వరూపము, ఈ త్రయము, ప్రతీయతే = తెలియబడుచున్నది, అనగా శబ్దము నుచ్చరింపగా ప్రయోక్త యొక్క భావము, బాహ్యపదార్థము, ఆ శబ్దము ఈ మూడు కూడ భాసించునని భావము.

(అతః) = ఈ కారణమువలన, తేషామ్ = వానికి అనగా వక్తయొక్క జ్ఞానము నకు బాహ్యార్థమునకు శబ్ద స్వరూపమునకును, సంబన్ధః = సంబంధము, అస్తి = కలదు, ఇతి = అని, గమ్యతే = అనుమాన ప్రమాణముచే తెలియబడుచున్నది.

శబ్దముల నుచ్చరింపగా ఈ మూడు తెలియబడుచున్నవి. సంబంధమే లేనిచో అవి ఎట్లు తెలియబడగలవు. అవి తెలియబడుటవలన వానికి సంబంధము ఉన్నట్లు ఊహింప వచ్చును.

అందును శబ్దమునకు, అర్థమునకు యోగ్యత సంబంధము. ఈ అంశము 29 వ శ్లోకమున వివరింపబడుచున్నది. వక్తయొక్క జ్ఞానమునకు, శబ్దమునకు కార్యకారణ భావము సంబంధము. ఈ యంశము 32 వ శ్లోకమున స్పష్టము కాగలదు. ॥1॥

అవతారిక —శబ్దముచే అర్థము బోధింపబడును. ఈ రెంటికి సంబంధము నిత్యము. బాహ్యార్థము అనగా లోకమున కంటికి కానవచ్చెడి అర్థముకాక, బుద్ధిచే కల్పింపబడిన అర్థము

చంచత్కః ఇతి = చలించుచున్న దానివలె నున్నదిగాన చంచత్కమనియు, బృహత్ప్రకారః బృహత్కః ఇతి చ = పెద్దదివలె నున్నదిగాన బృహత్కమనియు, సాదృశ్యేన = సాదృశ్యము చేత, అపరే ప్రచక్షతే = కొందరు చెప్పుదురు.

తాత్పర్య వివరణములు— "స్థూలాదిభ్యః ప్రకారవచనేకన్" (5-4-3) అని యొక సూత్రము. స్థూల మున్నగు శబ్దములకు బరముగ సాదృశ్యమునకు ద్యోతకమగు 'కన్' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. సూత్రమున ప్రకార శబ్దమునకు సాదృశ్యము అర్థమయినను సాదృశ్య విశిష్టము నది బోధించును. జాతీయర్ ప్రత్యయమున కపవాదము గదా. అచట మహాభాష్యమున నొక వార్త్తికము పఠింపబడియున్నది. "చంచద్బృహతో రుప సంఖ్యానమ్" అని యా వార్త్తికము. 'చంచత్' 'బృహత్' - అను శబ్దములకు గూడ స్థూలాది గణమున పాఠమును చేయవలెనని భావము. చంచత్సదృశః = చంచత్కః ॥ బృహత్సదృశః బృహత్కః ॥ ఈ పేరు దేనికి ? అనిన, మణి, మండూక ఖద్యోతములకు, అని పూర్వాచార్యుల తలంపు. ॥615॥

అవతారిక— మణ్యాదుల సాదృశ్య మెట్టిది ? అనిన, చెప్పుచున్నారు.

శ్లో॥ తత్రోన్మేష నిమేషాభ్యాం ఖద్యోత ఉపమీయతే ।
శ్వాసప్రబంధై ర్మండూకః స్యందమాన ప్రభోమణిః॥ 616

తత్ర = అందు, ఉన్మేషనిమేషాభ్యాం = తన కాంతి, మెరయుట, ఆరిపోవుటలచేత, ఖద్యోతః ఉపమీయతే = మిణుగురు పురుగు చలించుచున్న వస్తువుతో పోల్పబడుచున్నది, శ్వాస ప్రబంధైః = ఉచ్ఛ్వాస నిశ్వాసలచే, కదలుచున్న దానితో, మండూకః ఉపమీయతే = కప్ప పోల్పబడుచున్నది, స్పందమాన ప్రభః = తన ప్రభ కదలునదయి = కదలుచున్న ప్రభ గలదై, మణిః ఉపమీయతే = మణి, కదలుచున్న మణితో బోల్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— మిణుగురు పురుగు కదలకుండగనే యొకచోట నుండి మెరయుచుండును. ఆ ప్రభావ్యాప్తిని బట్టి దానిని కదలుచున్న పదార్థముగా మనము భావించి చంచన్నివ = చంచత్కః = కదలుచున్న దానివలె నున్నదిగాన చంచత్కము అనుచున్నాము

కప్ప, అవిచ్ఛిన్నముగ నెగపీల్పులు పీల్చుచుండును. దానిచేత తన శరీరముబ్బును కాని తాను చరింపలేదు. ఆశ్వాసల అను వృత్తిచేత మనము దానిని కదలుచున్న పదార్థముతో బోల్చి ఇది 'చంచత్కము' అందుము.

మణి, యొక్క ప్రభలు దేదీప్యమానములయి రశ్మి చక్రవాల మేర్పడును. దానిని జూచి, ఆ మణి కదలకయున్నను, చలించుచున్నట్లు తలంచి, చలించు వస్తువుతో పోల్తుము. చంచత్కోయం మణిః అని యందుము. ॥616॥

అవతారిక— 'బృహత్కః' అను స్థలమున, కన్ప్రత్యయార్థమయిన ప్రకారమేమిః అన—

**శ్లో॥ ప్రవికాసి ప్రభోల్పోపి మహాన్ య ఉపలభ్యతే ।**
**బృహత్క ఇతి తత్రైషమణౌ శబ్దః ప్రయుజ్యతే ॥** 617

యః = ఏ మణి, ప్రవికాసి ప్రభః = అంతటను వ్యాపించిన ప్రభాజాలము గలది, అల్పోపి= తాను చిన్నదయినను, మహాన్ ఉపలభ్యతే = పెద్దదిగా నగపడునో, తత్ర మణౌ = ఆ మణి యందు, 'బృహత్కః' ఇతి, ఏషః శబ్దః = 'బృహత్కమిది' అను శబ్దము, ప్రయుజ్యతే = ఉపయోగింపబడుచున్నది.

**తాత్పర్య వివరణములు**— మణి చిన్నదే. దాని ప్రభా సందోహము సర్వతోవ్యాపి. కనుక పెద్దదిగా గనబడుచున్నది. అపుడు, 'ఈ మణిబృహత్కము' అని కన్ప్రత్యయాంత శబ్దముచే వ్యవహరింతురు. బృహద్వస్తు సదృశము గాన బృహత్కము. ॥617॥

అవతారిక— ఇక ప్రసంగ సంగతిచే, మత భేదము ననుసరించి ప్రకారమన నేమియో విచారింపబడును.

**శ్లో॥ సాదృశ్యమేవ సర్వత్ర ప్రకారః కైశ్చి దిష్యతే ।**
**భేదేఽపి తు ప్రకారాఖ్యా కైశ్చిదభ్యుగమ్యతే ॥** 618

సర్వత్ర = శబ్ద శాస్త్రమునందెల్ల, సాదృశ్యం ఏవ = 'సాదృశ్యము' అను నర్థమునందే, ప్రకారః = ప్రకార శబ్దము (వర్తించునదిగా), కైశ్చిత్ ఇష్యతే = కొందరిచే నంగీకరింపబడు చున్నది, భేదే అపి = 'భేదము' అను నర్థమునందును, ప్రకారాఖ్యా = 'ప్రకారము' అను శబ్దము (వర్తించుట), కైశ్చిత్, అభ్యుపగమ్యతే = కొందరిచే స్వీకరింపబడుచున్నది.

**తాత్పర్య వివరణములు**— "ప్రకారవచనే థాల్" (5-3-23), 'ప్రకారేగుణ వచనస్య" (8-1-12).

"స్థూలాదిభ్యః ప్రకారవచనే కన్" (5-4-3), ఈ మొదలగు పాణిని సూత్రము లందెల్ల సాదృశ్యమే ప్రకారశబ్దమున కర్థము.

"యథా తథా" = 'యేన ప్రకారేణ', 'తేన ప్రకారేణ' అని విగ్రహములు. 'యత్తుల్యం తత్తుల్యమ్' అని తుల్యత్వమే అచట ద్యోతము.

"ప్రకారే గుణవచనస్య" (8-1-12) అను సూత్రమున కుదాహరణము, 'పటు పటుః' అనునది. అది ద్విర్వచన విధాయకము. పటు సదృశుడు సమర్థునకు గొలదిగా తరిగిన వాడు = ఇంచుమించు గట్టివాడు అని యర్థము. అచట సాదృశ్యము, తద్విశిష్టునికి విశేషణ ముగా ద్యోతన చేయబడుచున్నది. స్థూలకః = అనగా స్థూల సదృశుడు అని యర్థముగాన నచటను సాదృశ్య విశిష్ట దర్థము. పటుజాతీయః అను స్థలమున నదియే యర్థము.

ఈ సూత్రములందెల్ల ప్రకారశబ్దమునకు భేద మర్థమని కొందరి మతము. 'యథా' 'తథా' అను చోటను భేదమే వాచ్యము. భేదము గలవాడే సమానుడు. భేదమే సాదృశ్య హేతువు గదా. పటు పటుః = ద్విత్వమున కుదాహరణము. స్థూలకః = కనంతము. అచటను భేదమే వాచ్యము. అనగా భేదమును, సాదృశ్యమును గూడ అంతటను ప్రతీతము లగును. అందొకటి వాచ్యమగును. రెండవది సామర్థ్యము వలన గమ్యము. 'పటు ప్రకారః దేవదత్తః'- అనిన, సాదృశ్యమే ప్రకారము. "పటుర్దేవదత్తః" అని అభేదముగ వచించినపుడును సాదృశ్యమే గమ్యము. ఇచట భేదము గమ్యము గాదు. "బ్రాహ్మణ ప్రకారాః మాఠరాదయః" అను ప్రయోగమున, మాఠరుడు మున్నగువారు బ్రాహ్మణులలో భేదమేయని యర్థమగుచున్నది గాన సాదృశ్యమున కచట సంభవము లేదు. ॥618॥

అవతారిక— ఇట విమర్శింపదగిన విషయములు రెండు గలవు. ప్రకారమనగా సాదృశ్యము కానిండు, లేదాభేదము కానిండు, లేదా ఉభయమునయిన నగు గాక. 'ప్రకార వచనే జాతీయర్' (5-3-69) అని యొక సూత్రము. "ప్రకారవచనే థాల్" (5-3-23), అని మరియొక సూత్రము. జాతీయర్ ప్రత్యయము సకల ప్రాతిపదికములకును బరముగా వచ్చును. ఇక థాల్ ప్రత్యయము, కిమ్, సర్వనామ, బహు శబ్దములకు బరముగ మాత్రమే విహితము. కనుక నిది జాతీయర్ ప్రత్యయమునకు బాధకము కావలెను. అపుడు "కింజాతీయః" అను ప్రయోగ మెట్లు సిద్ధించును? అనునది యొక ప్రశ్న. ఆ విధముగనే "తథా జాతీయః" అను ప్రయోగమున కేమి యుపపత్తి గలదు? అచట థాల్ ప్రత్యయమే ప్రకారమును బోధించుచున్నది గదా, మరల జాతీయర్ ప్రత్యయమునకు బ్రసంగమేమి? అని రెండవ విమర్శ విషయము. దీనికి సమాధాన మీ కారిక—

శ్లో॥ ప్రకారవచనః కశ్చిత్ ప్రకారవతి సంస్థితః ।
ప్రకారమాత్రే వర్తిత్వా కశ్చిత్ తద్ వ్యతివర్తతే ॥ 619

కశ్చిత్ ప్రకారవచనః = ఒకానొక ప్రకార వాచకము, ప్రకారవతి, సంస్థితః = ప్రకార విశిష్టమునందుండును, కశ్చిత్ = ఒకానొకటి, ప్రకారమాత్రే, వర్తిత్వా = ప్రకారమునందే యుండి తత్, వ్యతివర్తతే = దాని నతిక్రమించి తద్విశిష్టమును బోధించును.

**తాత్పర్య వివరణములు**— ఒకానొక ప్రకార వచనమనగా, 'జాతీయర్' ప్రత్యయమును, కన్ ప్రత్యయమును, ద్విర్వచనమును నగును. వీనికి అప్రధానమగు ప్రకారమును బోధించుట స్వభావము. ప్రకారవత్తే ప్రధానముగ జెప్పబడునది. థాల్ ప్రత్యయము అట్టిది గాదు. అది ప్రకారమునే బోధించును. ప్రకార విశిష్ట బోధకము గాదు. కాని యొక విశేషమున్నది. అది యేమనిన, ముందు, ప్రకారమును బోధించి, తరువాత ప్రకార విశిష్టమును, జాతీయర్ ప్రత్యయ సహితమై బోధించును. థాల్ప్రత్యయాంతమునకు, శుక్లాది శబ్దములవలె విశిష్ట బోధకత్వము లేదు. కాబట్టి విషయిభేదముండుటవలన, థాల్, జాతీయర్ ప్రత్యయములకు బాధ్య బాధక భావ ముండబోదు.

'తథా జాతీయః' అను ప్రయోగమును నుపపన్నమే యగును. 'యథా దేవదత్త స్తథా యజ్ఞదత్తః' అను ప్రయోగమున దేవదత్తు డే ప్రకారము కలవాడో యజ్ఞదత్తు డన నా ప్రకారము కలవాడే అని యర్థమగుటచే థాల్ప్రత్యయము ప్రకార విశిష్టమును బోధించుచున్న దని తలంచుట కవకాశమున్నది గాని థాలంతము ప్రకార విశిష్టబోధకము గాదు. ఆ వాక్యము క్రియతో పరిసమాప్తి నొందవలెను గదా. కనుక, 'వర్తతే' అనియో, 'దృశ్యతే' – అనియో అధ్యాహారము కర్తవ్యము. ఆవర్తన క్రియలోగాని దర్శన క్రియలోగాని, ఈ ప్రకారము కరణముగా నన్వయించును. ఏ ప్రకారము సాధనముగా దేవదత్తు డుండెనో, లేదా కనబడు చుండెనో, ఆ ప్రకారముచేతనే యజ్ఞదత్తుని దర్శనమని యర్థము, లేదా యాతని వర్తన మట్టి దని భావము.

అందువలననే, క్రియతో సంబంధించిన ప్రకారమను కరణము ప్రకారవత్తును బోధింపదు. అట్లు బోధించిన, దేవదత్తస్య అని షష్ఠి ప్రాప్తమగును. దేవదత్తుని ప్రకారముతో గూడినవాడు యజ్ఞదత్తుడని యర్థము. ॥619॥

అవతారిక— తదుపరి వేరొక ప్రశ్న ఉదయించుచున్నది. థాల్ప్రత్యయార్థమగు ప్రకారము సాదృశ్యమే అయిన యెడల, పాణిని, "అవ్యయం విభక్తి" – ఇత్యాది సూత్రముచే యథార్థమునందును, సాదృశ్యార్థమునందును వర్తమానమయిన అవ్యయము సుబంతముతో సమసించునని చెప్పబడినదే. యథా శబ్దార్థములు నాలుగింటిలో సాదృశ్యమున్నది గదా. మరల 'సాదృశ్య సంపత్తి' అని చివర సాదృశ్య పదమును నుచ్చరించి, సాదృశ్యమున వర్తమానమయిన అవ్యయమును సమసించునని ఎందుకు చెప్పవలసి వచ్చినది? అను నీ ప్రశ్నకు సమాధాన మీ క్రింది రెండు కారికలును.

శ్లో॥ సాదృశ్య గ్రహణం సూత్రే సదృశస్యోప లక్షణమ్ ।
తుల్యయోరవ్యయీభావే సహశబ్దోఽభిధాయకః ॥ 620

శ్లో॥ వీప్సా సాదృశ్య యోర్వృత్తిర్యా యథార్థాభిధాయినః ।
సచాయమవ్యయీభావే భేదోఽభేదేన దర్శితః ॥ 621

సూత్రే = అవ్యయం విభక్తి సమీప సమృద్ధి వ్యృద్ధ్యర్థాభావాత్యయాసమ్ప్రతి శబ్ద ప్రాదు ర్భావ పశ్చాద్యథాను పూర్వ్య యౌగపద్య సాదృశ్య సంపత్తిసాకల్యాంత వచనేషు (2-1-6) సూత్రమునందు, సాదృశ్య గ్రహణమ్ = సాదృశ్య పదమును గ్రహించుట, సదృశస్య ఉపలక్షణమ్ = సాదృశ్యము గల ధర్మికి లక్షణచే బోధకము, తుల్యయోః = సదృశ పదార్థములు రెండింటికి, అవ్యయీభావే = అవ్యయీభావమునందు, సహశబ్దః అభిదాయకః = 'సహ' అను శబ్దము, వాచకము, యథార్థాభిధాయినః = 'యథార్థ' పదార్థములలోని యర్థమును జెప్పు అవ్యయమునకు, యా = ఏ వృత్తి గలదో అది, వీప్సా సాదృశ్యయోః వృత్తిః = వీప్సయందును, సాదృశ్యమునందును వృత్తి, సచ అయంభేదః = ఆ ఈ భేదము గూడ, అవ్యయీభావే = అవ్యయీభావ విధాయకమునందు, భేదేన దర్శితః = వేరుగ జూపబడినది.

తాత్పర్య వివరణములు— అవ్యయ మిత్యాది సూత్రము (2-1-6) యధార్థము నందు వర్తమానమయిన అవ్యయమునకును, సాదృశ్యమునందు వర్తమానమయిన అవ్యయ మునకును, సుబంతముతో సమాసమును విధించుచున్నది. అందు సాదృశ్యమున వర్తమాన మనగా లక్షణచే సదృశమగు ధర్మిని బోధించునట్టి అని యర్థము. ధర్మము స్వాశ్రయమగు ధర్మి నుపలక్షింపగలదు.

ఉదాహరణము— ససఖి = సదృశః సఖ్యా, అని విగ్రహము. ఇద్దరుమిత్రులు సాదృశులు, తద్వాచకము 'సహ' అను శబ్దము దానికి సమాసమున 'స' అను నాదేశము. ప్రాచీనులయిన వృత్తికారు లిచ్చిన యుదాహరణ మిది సదృశార్థాభిదాయి అవ్యయమునకే సూత్రమునందలి సాదృశః పదముచే గ్రహణము. "అవ్యయీభావశ్చ" (1-1-41) సూత్ర ముచే సత్యభూతమగు నర్థము నా పదము బోధించినను అవ్యయసంజ్ఞ.

ఇక, 'యథా' అను, సూత్రస్థ పదార్థమగు సాదృశ్యము ధర్మమేగాని ధర్మిగాదు. 'సహరి' అనునది దాని కుదాహరణము. హరి యొక్క సాదృశ్యము అని యర్థము. ఆ యథా శబ్దమునకు యోగ్యతయు, వీప్సయు గూడ నర్థము. కావున తద్వాచకములును సమసించును. 'అనురూపం' 'ప్రత్యర్థ' అని యుదాహరణములు. అర్థ సామాన్యము అనగా సకలార్థము లును క్రియచే వ్యాపింపబడుట అచట 'ప్రతి' అను దానిచే ప్రకాశింపజేయబడును. ప్రకార మనగా సామాన్యమునకు భేదకమగు విశేషమని చెప్పబడినది. సకల పదార్థములకును క్రియతో సంబంధమను వీప్సా సామాన్యమునకు భేదకమగు విశేషము యథార్థము. ఇక ప్రకృతము - యథా శబ్దార్థమగు నది ధర్మమాత్రము. సాదృశ్య శబ్దార్థము తుల్యమైనది యను నర్థము గల ధర్మి. పృథక్ గ్రహణమువలన భేద మభిమతమని తెలియుచున్నది.
॥620, 621॥

అవతారిక— వెనుకటి కారికలలో అవ్యయ మిత్యాది సూత్రమునందలి సాదృశ్య పదము ధర్మి పదమనియు, యథా శబ్దార్థములలోని సాదృశ్య శబ్దము ధర్మపరమనియు నుప పాదింపబడినది. రెండు స్థలములందును ధర్మపరమేయనియు గుణగవ సాదృశ్యబోధకము యథార్థ సాదృశ్యమును ద్రవ్యగత ధర్మవాచకము సూత్రస్థ సాదృశ్యపదమును నని యీ కారికలో ప్రకారాంతరమును జెప్పుచున్నారు.

**శ్లో॥ సాదృశ్యం యోగ్యతా కైశ్చిదనావభ్యుపగమ్యతే ।**
**యత్తు మూర్తిగతం సామ్యం తత్ సహేనాభిధీయతే ॥ 622**

అనౌ = 'అను' - అను శబ్దము విషయమున, యోగ్యతా, సాదృశ్యం = దానిచే ద్యోతమగు యోగ్యత యను సాదృశ్యము, కైశ్చిత్, అభ్యుపగమ్యతే = యథార్థములలోనిదిగా కొందరిచే నంగీకరింపబడుచున్నది, యత్, తు = ఏ యది కలదో, మూర్తిగతం, సామ్యం = ద్రవ్య గతమయున సాదృశ్యము, తత్, సహేన, అభిధీయతే = అది, 'సహ' అను నవ్యయముచే చెప్పబడును.

తాత్పర్య వివరణములు— ''అనురూపం సురూపో వహతి'' అని యొక ప్రయోగము. (తన) రూపముతో తుల్యముగ, శోభాతిశయమునకు హేతువయిన హార కటకాద్యాభరణము నొక సురూపుడు ధరించియున్నాడు'' అని యర్థము. ఇట నాతని గుణమగు రూపము యొక్క సాదృశ్యము యథార్థమగు యోగ్యత. రూపమునకు యోగ్యముగ = అనుగుణముగా తత్సదృశమగు హారాదికమును ధరించుచున్నవాడు. ఇక 'ససఖి' అనుచోట, వస్తు నిష్ఠమయిన అవయవ సంనివేశాదుల వలన గలిగిన సామ్యము. సహశబ్దముచే జెప్పబడును. కాబట్టి 'ససఖి' అను నవ్యయీభావమునకు 'సాదృశ్యం సఖ్యాః' అని విగ్రహము. సదృశః సఖ్యాః (సఖుని పోలినవాడు) అని కాదు. సూత్రస్థ సాదృశ్య శబ్దముచే ద్రవ్యగత సాదృశ్యమును, యథా శబ్దముచే, యోగ్యతయను గుణగత సాదృశ్యమును గ్రహింపబడును. కనుక నా రెండు సమాసములును భిన్న విషయములు. ఇదియే ప్రకారాంతరము.

ఇక యోగ్యత వేరు, సాదృశ్యము వేరు, వీప్స వేరు, ఆ మూడును 'యథా' యొక్క అర్థములు, అనిన నపుడు, 'అనురూపమ్' అను స్థలమున రూపమునకు శోభ నిచ్చునది యేది యోగ్యమో అది అనురూపమని యర్థము. అపుడు వెనుక చెప్పిన ధర్మధర్మి భేదమే, పృథక్ సాదృశ్య గ్రహణమునకు హేతువగును. ॥622॥

అవతారిక— ప్రకారపదము గల సూత్రము లన్నింటిలో ప్రకారమనగా సాదృశ్యమే అని చెప్పబడినది. కాని అది అవ్యాపకము. ఎందువలన ననగా, 'కమండలునా ఛాత్రమజానాత్' = కమండలువుచే శిష్యుడని తెలిసికొనెను - అనుచోట కమండలు శబ్దమునకు బరమైన తృతీయ, ''ఇత్థం భూతలక్షణే'' (2-3-21) అను సూత్రముచే విధింపబడినది. ఇత్థం భూతుడన నొక ప్రకారమును బొంది యున్నవాడు. లక్షణమనగా లక్షకము = జ్ఞాపకము. ఛాత్రత్వమను ప్రకారము గల వానికి జ్ఞాపకము కమండలువు. 'ఇత్థమ్' అను పదమున, 'థము' అని తద్ధిత ప్రత్యయము. తద్విధాయకము 'ఇదమస్థముః' (5-3-24) అనునది. ''ప్రకారవచనే థాల్'' (5-3-23) అను పూర్వ సూత్రమునుండి 'ప్రకారవచనే' అను పదమిం దనువర్తించును. ఇత్థం భూతః = ఇమం ప్రకారం ప్రాప్తః, కథం భూతః = కం ప్రకారం ప్రాప్తః - అని యర్థము. ప్రకృతమేమన— ఇచ్చట ప్రకారము సాదృశ్యము గాదే. అంతటను ప్రకారమనగా సాదృశ్యమే యనుట యెట్లు ? అనగా—

శ్లో॥ ఇత్థంభావేఽపి సాదృశ్యం బుద్ధ్యవస్థానిబన్ధనమ్ ।
గ్రహణే భేదమాత్రస్య తత్రాన్యైవాభిధీయతే ॥ 623

బుద్ధ్యవస్థానిబన్ధనమ్ = బుద్ధియొక్క అవస్థ నిమిత్తముగా గల, సాదృశ్యం = సారూప్యము, ఇత్థంభావే, గ్రహణే అపి = ఇత్థం భావమను ప్రత్యయమునందును, భేదమాత్రస్య, అస్తి = భేదలేశమునకు, ఉండును, తత్ర అన్యా ఏవ = అచ్చట, భేదమాత్రమే, వేరొకటియే, అభిధీయతే = చెప్పబడుచున్నది.

(ఈ కారిక తృప్తికరముగ సమన్వితము కాలేదు.)

సాదృశ్యము వలన మాణవు డగ్ని. కనుక ప్రకారమనగా సాదృశ్యమే. ప్రకారమున అగ్ని శబ్దము వర్తమానము గాన గుణవచన పదము లేవిచో ద్విత్వము రావలసి వచ్చును. కాగా 'గుణ వచనస్య' అను దానికి ప్రత్యుదాహరణము.

ప్రకారమనగా, సామాన్యమునకు భేదకమగు విశేషమయిన, గోత్వము, అగ్నిత్వ ములకు భేదకమయిన విశేషమున నీ శబ్దములు వర్తమానములు కావు గదా. అపుడు గుణ వచన పదమున కివి ప్రత్యుదాహరణము కాజాలవు. కావున నెచ్చటనైన ప్రకారమనగా సాదృశ్యమే అని సూచితము.

శుక్ల మున్నగునవియే గుణవచనములు. అవి గుణమునందును, గుణ విశిష్టము నందును వర్తించును. గుణముక్తవాన్ = గుణవచనః = గుణమును చెప్పియున్న శబ్దమనుట. గోశబ్దము వాహీకునే బోధించునది. అది గుణమును బోధించియున్న శబ్దము కాదు. పూర్వ మది జాతి బోధకము గదా.

"ప్రకృత్యర్థ విశేషణత్వాత్ సిద్ధమ్" - అని వార్తికము, ప్రకృతి యనగా ద్విత్వ మునకు కారణమయినది. స్థాని యనుట. దాని యర్థమును 'గుణవచనస్య' - అనునది విశేషించును. ప్రకారార్థమును గాదు విశేషించునది. అట్లయిన ప్రకారమునందు వర్తమానము లన్నియు గుణవచనములే యగును. గోశబ్దము ద్రవ్యమును చెప్పునదయినను, సాదృశ్యమును బట్టి ప్రవర్తించుచున్నది గాన వాహీకుని బోధించినను గుణవచనమే యగును. కావున ఆ విశేషణ మునకు వ్యావర్త్య ముండదు.

అందువలన గుణమును బోధించినదిగా నంతకు మునుపు బాగుగ దెలియబడిన శబ్దమునకు సాదృశ్యము ద్యోతనీయమయినపుడు, ద్విత్వము వచ్చునని యర్థము. కావున నతి ప్రసంగము ప్రాప్తింపదు.

'శుక్ల శుక్లః పటః' - అను నుదాహరణమున, శుక్ల శబ్దము, శుక్ల గుణము అప్ర ధానము. తద్విశిష్టము ప్రధానము అయిన దానిని చెప్పునది. 'గుణోపసర్జన ద్రవ్యవాచి' అనుట. 'శుక్ల శుక్లం రూపమ్' - అనుచోట, శుక్ల గుణమాత్రవాచి. 'పటు పటుః' అనునది గుణవిశిష్టవాచికి ఉదాహరణము.

పదార్థ సంసర్గము వాక్యార్థము. వాక్యార్థమునుండి పదార్థమును వేరుపరచి, పద విభాగ పూర్వకముగ నది సమీక్షింపబడినది గాన అర్థంద్వారా పదవిచారము సమగ్రముగ నీ గ్రంథమునందీ సముద్దేశమున జేయబడి పరిసమాప్తమయినది. శుభం భూయాత్. ॥624॥

గౌర్వాహీక ఇత్యాది చివరి కారిక, 'నద్విరుచ్యతే ఇతి' అని ముగింపబడినది. ఇతి అను శబ్దము సమాప్తి సూచకము.

ఇక వ్యాఖ్యాన గ్రంథము 'ఇతి శుభమ్' - అని ముగింపబడినది. ప్రకీర్ణక ప్రకాశ మని వ్యాఖ్య పేరు. హేలా రాజుచే రచింపబడినది. ఆతని తండ్రి భూతిరాజు. ఆ వ్యాఖ్యాన

మున పదునాలుగవ సముద్దేశము, వృత్తి సముద్దేశమనబడునది ముగిసినది. మూడవకాండ మయిన పదకాండమును సమాప్తము.

## వ్యాఖ్యాకర్త అగు హేలారాజు స్వయముగా చేసికొనిన, స్వపరిచయ రూప శ్లోకముల భావము

1. కాశ్మీర దేశమున, ముక్తాపీడుడు అను నొక ప్రసిద్ధుడగు మహారాజుండెను. ఆతని మంత్రి లక్షణుడు అను నాతడు. ఉదార చరితుడయిన ఆ మంత్రి వంశమునందు 'భూతిరాజు' అను నాయన కుమారుడు హేలారాజు ఈ 'ప్రకాశము' అను వ్యాఖ్యను ప్రకాశింప జేసెను.

2. సూర్య చంద్రాదులు లోకమున చీకటిని తొలగింతురు. కాని, కొన్నిచోట్ల ఆ పని చేయుటకు దీపము కూడ అవసరము కాకుండ పోదు. బుద్ధిశాలులగు వారి భావములు నవనవోన్మేష రుచిరములగునవి కప్పిపుచ్చి యుంచబడవు.

3. మూడవ వాగవస్థ = అనగా స్ఫోటాత్మక శబ్దము స్వప్రకాశమగు స్వరూపముతో విశ్వజనులకును హితకరమై ఒప్పుచున్నది. అది ఈ గ్రంథమువలన సుప్రతిష్ఠితమగు గాక.

4. శ్రీకాంతుడగు హరి మూడు లోకములను మూడడుగులతో నాక్రమించినట్లు ఈ సమస్త విద్యా శ్రీకాంతుడగు హరి త్రైలోక్యము నాక్రమించుటకు మూడు కాండములను మూడడుగులుగా రచించెను.

5. జగదాచార్యుడగు ఈ హరి యొక్క సూక్తి లక్ష్ములు మహాభాష్యమను నబ్ధియందుద్భవించిన అమృత ఛటలచేత (అమృతము యొక్క పిండములచేతను కాంతులచేతను) ఆచ్ఛురితములయిన విగ్రహములతో సర్వోత్కర్షతో వర్తించుచున్నవి.

శ్రీ

# పదముల పట్టిక

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | **అ** | |
| 1. | అకథిత(ము) | VII - 70, 71 | చెప్పబడనిది. = అపాదానము, సంప్రదానము మొదలగు విశేషములను చెప్పదలపక, సామాన్యముగ చూపబడు కర్మ. దీనినే "అప్రధానకర్మ" యని అందురు. ఉదా :- "గాందోగ్ధిపయః" ఇచట "గామ్" అనునది "అకథితకర్మ" (వాస్తవముగ అది అపాదానము కావలెను.) |
| 2. | అకర్మకైర్యోగే కర్మ | VII - 67 | అకర్మకములగు క్రియలను వాడినపుడు, కాలము, దేశము, మొదలగునవి కర్మలగునని సంప్రదాయము. ఉదా :- "మాసమ్ ఆస్తే" (ఇచ్చట "వ్యాప్య" అనునది అధ్యాహారము. అది అంతర్భూతమైన క్రియను తెలుపును. దానినిబట్టి మాసము కర్మయగునని భావము). |
| 3. | అకర్మికా క్రియా | VII - 88 | ప్రసిద్ధిని బట్టి కర్మతెలియు చోటకర్మ పదమును వాడక, చూపబడు క్రియ ఉదా:- "మేఘః వర్షతి" (జలమ్.) |
| 4. | అతీతాఖ్యా శక్తిః | IX - 51 | "వర్తమానము" అను భావమును అడ్డగించు (కాలగతమైన) ఒక శక్తి. దానిని "భూతము" అందురు. |
| 5. | అతుల్యవిభక్తి | XIV - 478 | వేర్వేరు విభక్తులు గల పదముల కగు సమాసము. ఉదా :- "పూర్వః కాయస్య" |
| 6. | అధ్యారోప(ము) | XI - 10 | ఒక దాని ధర్మమును వేరొక దానియందు |

శబ్దవాచ్యము. అనగా జ్ఞానరూపముగా ఉన్న అర్థమే శబ్దవాచ్యము. ఇట్టి యర్థము ఉపచార సత్తతో గూడిన యర్థమని యందురు. ఈ యంశము ఈ ప్రకరణముననే 39 వ శ్లోకము నుండి 50 వ శ్లోకము వరకు నిరూపింపబడుచున్నది. ఘటాది శబ్దములచే బోధింపబడునవి కడవ మున్నగు వ్యక్తులే కావు. ఆ శబ్దముగూడ అనగా ఘకార, అకార, టకార, అకారములు అను ఆనుపూర్విత్రో కూడిన శబ్దము కూడ బోధింపబడును. ఆ యర్థము మాత్రము ఔపచారికము గాదు. అది ముఖ్యమే. వ్యక్తిరూపమగు అర్థము అనిత్యము కనుక దానితో శబ్దమునకు సంబంధము నిత్యము కానేరదు. కనుక ఉపచారసత్తను అచట గ్రహింపవచ్చును. అట్లు కానిచో శబ్దము నియతముగా బోధింపజాలదు. శబ్ద వాచ్యమగు శబ్దము నియతమేకాన అచట సంబంధము నిత్యము కాగలదు. కనుక అచట సంబంధము ముఖ్యమే కాగలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రతిపత్తిర్భ వత్యర్థే జ్ఞానేవాసంశయః క్వచిత్ ।
స్వరూపేషూప లబ్ధేషు వ్యభిచారో నవిద్యతే ॥ 2

అర్థే = అర్థమునందు, జ్ఞానే + వా = జ్ఞానమునందును, క్వచిత్ = ఏదో ఒక స్థలమున, సంశయః = సంశయ రూపమగు, ప్రతిపత్తిః = జ్ఞానము, భవేత్ = కలుగవచ్చును.

ఘటః అను శబ్దమువలన కడవ అను అర్థము తెలియబడుచున్నది. తద్విషయకమగు జ్ఞానము కలుగుచున్నది. అచట శక్తిజ్ఞానము లేనిచో అర్థము సంశయ విషయమగును. శక్తిజ్ఞాన మున్నను హరి మున్నగు నానార్థక శబ్దములలో అర్థము సంశయితమగును.

అట్టి అర్థము ననుసరించెడి జ్ఞానముకూడ సంశయరూపము కాగలదు.

క్వచిత్ = కొన్ని స్థలములలో అనగా శక్తిజ్ఞానము లేనిచోట, శక్తిజ్ఞాన మున్నను నానార్థక స్థలముునను సంశయము కలుగునని భావము.

హరి శబ్దమునకు = విష్ణువు, కప్ప, కోతి, పాము ఇవి యన్నియు వాచ్యార్థములే.

ఉపలబ్ధేషు = తెలియబడుచున్న, స్వరూపేషు = శబ్దస్వరూపముల విషయమై, వ్యభిచారః = వ్యభిచారము అనగా ఒకదానిని విడిచియుండుట, న + విద్యతే = లేదు.

శబ్దము తన రూపమునుకూడ బోధ విషయముగా చేయును. జ్ఞానమున ఆ శబ్దము కూడ భాసించును ఆ రీతిగా భాసించిన శబ్దమునకు, వాచకముగా ఉన్న శబ్దమునకు సంబంధము నిత్యము. అర్థము విషయమున, జ్ఞానము విషయమున సంశయము కలుగునట్లు ఇచట సంశయము కలుగదు. సంశయమునకు అవకాశము లేదు.

కాగా వ్యక్తిరూపమగు అర్థము నియతము కానందున అచట ఔపచారికమగు, అనగా బుద్ధికల్పితమగు, అర్థము శబ్దవాచ్యమని చెప్పపలెను. శబ్దము స్వరూపమును గూడ బోధించుటలో అనియమము లేక నియతమగు రూపమునే బోధించును. కనుక అచట ఉపచార సత్త అక్కరలేదు. ముఖ్యమగు శబ్దమే విషయమగును.

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | ఆరోపించుట = అర్థధర్మమందు శబ్దధర్మ మును కల్పించి, రెండును ఒకటేయని భావించుట. (శబ్దము-అది బోధించు అర్థమును ఒకటేయను భావన) |
| 7. | అనవస్థా | XIV - 220 | అంతము లేకపోవుట. (ముగింపులేని ఆవృత్తి) ఇదొక దోషము. |
| 8. | అనుప్రయోగ(ము) | XIV - 233 | ఒక శబ్దము వెంట వేరొకదానిని పలుకుట. ఉదా:- ఏధాంచక్రే. ఏధాంబభూవ, ఏధా మాస, మొదలగునవి కొన్ని ధాతువుల లిట్టు రూపములలో ఇది కనబడును. |
| 9. | అనుప్రవృత్తి | I - 14 | ఒక ధర్మము అన్ని వ్యక్తులందును సమాన ముగ అన్వయించుట. ఉదా :- గోత్వము అన్ని గోవులందును (పూర్తిగ) అన్వ యించును. |
| 10. | అంతకరణ తత్త్వ(ము) | VII - 41 | మనోధర్మము. = భావన, ఆలోచించుట. ఉదా :- (మనసులోని రూపమే బయట ఉన్నట్లు తోచునను తత్త్వము). |
| 11. | అన్వాఖ్యే యత్వ(ము) | XIV - 277 | వ్యాకరణసంస్కారము |
| 12. | అపాదాన(ము) | VII - 186 | విడదీయుట, లేక వేరుచేయుటలో ''స్థిరముగ ఉండునది'' అని భావింపబడు వస్తువు ఇదొ కారకము. పంచమిని వాడి దీనిని బోధింతురు. |
| 13. | అపాయ(ము) | VII - 4 | విడదీయుట, వేరుచేయుట, |
| 14. | అపోహ | I - 98 | తొలగించుట. ఉదా :- ''భేదాపోహ'' = భేదమును తొలగించుట |
| 15. | అభివ్యక్తి | I - 26 | స్పష్టపడుట, స్వరూపము తెలియుట |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 16. | అభ్యుచ్చయ(ము) | XIV - 90, 96, 98 | పెరుగుట, అధికమగుట, (శబ్దములు చేరుట వలన కలుగు అర్థముల ఆధిక్యము) |
| 17. | అర్థక్రియా | XI - 14 | సృష్టియందలి ప్రతియొక వస్తువునకును గల ఉపయోగము (ప్రయోజనము). |
| 17. | అర్థజాతి | I - 6, 8, 11 | విడి విడి వస్తువులందు గల సమానధర్మము. (ఆవస్తువులను బోధించు శబ్దముల జాతి, దీనియందారోపితమగును.) ఉదా :- గోత్వము, మొ॥. |
| 19. | అవచ్ఛేద(ము) | XIV - 11, 297 | ప్రత్యేకించుట, నొక్కిచెప్పుట, నిశ్చితమైన జ్ఞానము. (విశేషణము). |
| 20. | అవయవస్వర(ము) | XIV - 57, 61 | ఒక సమాసమునకు అవయవమైన పదమునకు గాని, సమాసమునకు గాని ప్రవర్తించు ఉదాత్తాది స్వరము. |
| 21. | అవ్యపవర్గ(ము) | III - 8 | వేర్పాటు లేకుండ పూర్తిగా కలసిపోవుట. |
| 22. | అవ్యయ(ము) | XIV - 105 | మార్పులేని శబ్దము. (లింగము, విభక్తి, వచనమును లేనిది. ఉదా :- చ, వ, హ, మొదలగునది). |
| 23. | అవ్యయీభావ(ము) | VII - 165 | అవ్యయముతో జరుగు సమాసము |

ఆ

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 24. | ఆకృతి | I - 19 | ఒక జాతికి చెందిన అన్ని వ్యక్తులందును ఒకేవిధముగ కనబడు ఆకారము (అవయవముల అమరిక లేక పొందిక) సామాన్యము, జాతి. అను భావనలకిది ఉపయోగించును. |
| 25. | ఆఖ్యాతపద(ము) | IX - 99 | క్రియాపదము (తిజంతమగుశబ్దము) |
| 26. | ఆత్మతత్త్వ(ము) | I - 21, IX - 89 | సారభూతమైనది. (అంతకును మూలము). నిత్యమైన తత్త్వము. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 27. | ఆధారశక్తి | VII - 151 | వస్తువులకు అధారముగా నుండు సామర్థ్యము ఉధా :- ఆకాశము. దీనికి అన్ని వస్తువులకును ఆధారముకాగల శక్తి ఉన్నది. |
| 28. | ఆరాచ్ఛబ్ద | XIV - 276 | ''ఆరాత్'' అను శబ్దము. (''దూరము'' ''దగ్గర'') అను రెండర్థములను కూడ. ఇది బోధించును. |
| 29. | ఆలంభన(ము) | I - 84 | యజ్ఞమందు పశువును వధించుట. |
| 30. | ఆవిర్భావ(ము) | VIII - 26, XIII - 17, XIV - 323 | అభివ్యక్తి, కనపడుట, స్పష్టమగుట. |
| 31. | ఆవిష్టలింగతా | XIV - 319, 330 | ఏదో ఒక లింగమును (పుమ్, స్త్రీ, నపుంసక) నియతముగ స్వీకరించుట = నియత లింగత్వము. |
| 32. | ఆవిష్టసంఖ్య | XIV - 288 | ఒకేసంఖ్యను నియతముగ చెప్పునది. ఉదా :- ఏక, ద్వి, త్రి, మొదలగునది. |
| 33. | ఆశంసా | IX - 105 | శోభనమైన కోరిక. |
| | **ఇ** | | |
| 34. | ఇంద్రశత్రు(వు) | X - 5 | ''ఇంద్రుని చంపునది'' - లేక - ''ఇంద్రునిచే చంపబడునది''. స్వరము యొక్క మార్పును బట్టి రెండర్థములు వచ్చును. |
| | **ఉ** | | |
| 35. | ఉత్తమ | X - 1 | { మిప్, వస్, మస్, / ఇట్, వహి, మహి, } ఉత్తమ పురుషము; దీనివిభక్తులు |
| 36. | ఉద్వత్(త్తు) | XIV - 589 | ఎత్తైనది. ఎత్తైన మార్గము. |
| 37. | ఉన్మీలన(ము) | IX - 56 | ఒక వస్తువు అగుపడుట, ఆవిర్భవించుట. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 38. | ఉపకార(ము) | VII - 13<br>XIV - 149 | ఒక శబ్దముయొక్క అర్థము, తనతో కలిసిన వేరొక శబ్దముయొక్క అర్థమునకు చేయు సాయము. |
| 39 | ఉపగ్రహ(ము) | XII - 1, 4 | ఆత్మనేపదము, పరస్మై పదము, అను వాని వలన తెలియదగు అర్థముయొక్క భేదము (క్రియకు చెందు విశేషము). |
| 40. | ఉపగ్రాహి(న్) | XIV - 114 | అంగీకరించుటకు హేతువు. |
| 41. | ఉపచార(ము) | VIII - 18 | ఒక పదమును గౌణార్థమున వాడుట. |
| 42. | ఉపచారసత్(తు) | XIV - 278 | గౌణమైన అర్థము. (లాక్షణికమైనది) |
| 43. | ఉపప్లవ(ము) | (1) III 57<br>(2) XIV 417 | భ్రాంతి, అసత్యమైన జ్ఞానము<br>చంద్రగ్రహణము |
| 44. | ఉపమాన(ము) | XIV - 362, 363,365,375 | పోలికను చెప్పుటలో అధికగుణములు గల వస్తువు (చంద్రుడు, మొ॥). |
| 45. | ఉపమేయ(ము) | XIV - 604, 605 | పోలికను చెప్పుటలో అల్పగుణములు గల వస్తువు. (ముఖము, మొ॥). |
| 46. | ఉపలక్షణ(ము) | XIV - 184, 425, 609 | సూచకము, జ్ఞాపకము, చిహ్నము,(ఒక నిర్దిష్టమైన అర్థమును సూచించుట కుపయోగించు పదము). |
| 47. | ఉపవ్యంజన | XIV - 85 | ఒక యంశమును సూచించు చిహ్నము. |
| 48. | ఉపశ్లేష(ము) | VII - 149 | ఆధారమునకు ఆధేయముతోగల సంబంధము. (సంయోగము). |
| 49. | ఉపసర్జన(ము) | XIV - 97, 415 | విశేషణమై అప్రధానముగనుండు పదము-లేక - అర్థము. |
| 50. | ఉపాదాన(ము) | XIII - 3 | ప్రత్యేకమైన శక్తులను బట్టి, ఒక శబ్దముయొక్క అర్థమును నిశ్చయించుట. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 61, | కర్త్రభిప్రాయతా | XII - 9 | కర్తకు చెందునట్లగుట. |
| 62. | కర్మస్థభావక(ము) | VII - 65 | కర్మయందు గమనింపదగిన (జరుగు) వ్యాపారమును చెప్పు ధాతువు. ఉదా :- ''బాలమాసయతి (బాలుని కూర్చుండ బెట్టు చున్నాడు). |
| 63. | కర్మోపదిష్ట(ము) | XIV - 169 | కర్మతోసమానమైన. (కర్మకుచెందు, కర్మకు ఆవశ్యకమైన). |
| 64. | కలా | IX - 57, 68 | అంశము, భాగము, (కాలముయొక్క ఒక భాగము. కాలశక్తి యొక్క అంశమైనశక్తి). |
| 65. | కాకతాలీయ(ము) | XIV - 609 | ''కాకి వ్రాలుట పండు పడుట''వలె అనుకొన కుండ, ఆకస్మికముగ జరిగిన ఒక సంఘటన. |
| 66. | కారక(ము) | VII - 18 | క్రియను పుట్టించునది. - లేక - క్రియతో అన్వయించునది. కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అని ఆరు విధములు. |
| 67. | కారకసప్తక(ము) | VII - 44 | ''శేషము'' (సంబంధము) అనుదానితో కలిసిన కర్త, కర్మ, మొదలగు ఆరుకారకములును ''కారక సప్తకము'' అనబడును. |
| 68. | కాల(ము) | IX - 1, 2, 3, 8, 9 | (1) ''కాలశక్తి'' అనెడి ఒక మహాశక్తి. సృష్టి కారణములలో ప్రముఖమైనది. శబ్దబ్రహ్మమునకు తరువాతిది. (2) II. 814, 316. సమయము. (సామాన్యముగకాలము) శబ్దముయొక్క అర్థమును నిశ్చయించుటకుపయోగించునది. ''ద్వారమ్'' అనగానే శీతకాలములో ''పిధేహి'' (మూయుము) అని తాత్పర్యము. వేసవిలో ''ఉద్ఘాటయ'' తెరువుము అని తాత్పర్యము. అట్లు కాలము సంశయమును పోగొట్టుటకుపకరించును. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | ఖ | |
| 77. | ఖదిర(ము) | I - 3<br>XIV - 301 | చంద్రచెట్టు. దీని కర్రతో యాగము లందు యూపస్తంభమును తయారు చేయుదురు. |
| 78. | ఖర్జూర(ము) | XIV - 301 | ఖర్జూరపు చెట్టు ఖర్పుర, ఖర్జుర, అనునవి మారు రూపములు. |
| | | గ | |
| 79. | గుణసముద్దేశ | V - 1, 9 | ద్రవ్యమందలి గుణములను చర్చించు భాగము (ఈ కాండమున అయిదవది). |
| 80. | గుణాశ్రయా(శక్తి): | VII - 81 | అప్రదానమైన శబ్దమునకు గల సామర్థ్యము. |
| 81. | గ్రహ(ము) | I - 58,61,70, 85 | యజ్ఞమందు సోమరసమును త్రాగుటకై ఉపయోగించు పాత్ర. (యాగ ప్రక్రియలో ఈ పదమును వాడుచుందురు). |
| | | చ | |
| 82. | చార్థ | XIV - 196, 197 | "చ" అను అవ్యయముయొక్క అర్థము. (సముచ్చయము, ఇతరేతరయోగము మొదలగునవి). |
| 83. | చితి | XIV - 325 326 | జ్ఞానము. |
| 84. | చైతన్య | X - 2,3<br>XIV - 327 | జ్ఞానము. తెలిసికొనుట). |
| | | ఛ | |
| 85. | ఛత్రిన్ | XII - 22 | గొడుగుగలవాడు, పెక్కుమంది గొడుగులు విప్పుకొని నడచుచున్నపుడు, వారిలో ఒకరిద్దరికి గొడుగులు లేకున్నను "ఛత్రిణో యాంతి" అని వ్యవహరింతురు. దీనినే "ఛత్రిన్యాయము" అని అందురు. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | అపత్యమ్ = దాశరథిః (ఇచట "ఇ" అనునది తద్ధితము). |
| 93. | తిరోభావ(ము) | VIII - 26<br>IX - 11<br>XIII - 17<br>XIV - 323 | గుణములు (ధర్మములు) కనపడకుండ అణగియుండుట "ఆవిర్భావను" నకు వ్యతిరేకమైన స్థితి. |
| 94. | త్రిపక్షీ | XIV - 254 | నఞ్ సమాసమందు (నఞును గురించి) ఏర్పడిన మూడు పక్షములు. 1. పూర్వపదార్థము ముఖ్యము, 2. ఉత్తరపదార్థము ముఖ్యము, 3. అన్యపదార్థము ముఖ్యము.అనునవి. |
| 95. | త్ర్యక్ష | XIV - 214 | శివునికి పేరు, (ముక్కంటి). |
| | | ద | |
| 96. | దండిన్ | I - 93 | కర్రను. చేపట్టువాడు. "సంన్యాసి" అనునర్థమున వాడుదురు. |
| 97. | దిక్ | VI - 3 | తూర్పు. పడమర, మొదలగు వ్యవహారమునకు కారణముగా భావింపబడు ఒక శక్తి దీని వలననే ఆయా ప్రదేశములను గుర్తించుట జరుగును. |
| 98. | దిక్సముద్దేశ(ము) | VI - 1, 23 | దిక్కును గురించి చర్చించు భాగము (ఈ కాండమున ఆరవ విభాగము) |
| 99. | ద్రవ్య(ము) | II - 1 | (1) సృష్టియందలి ప్రతియొక వస్తువునందును సారరూపముగా ఉండు తత్త్వము. (ఉదా :- బంగారు వస్తువులందు బంగారము). పరమార్థమున మాత్రము ఆత్మ ఒక్కటే ద్రవ్యము. దానినే వేర్వేరు పదములతో బోధింతురు.<br>(2) IV. 3. విడిగానుండు వస్తువు. (వ్యక్తి) దీనియందు గుణములగపడును. ఇదమ్, |

ఇచట "స్వరూపేషు" అని బహువచనమున్నది. వాచక శబ్దముచే బోధింపబడునది ఒకటియే, కనుక బహువచన మెట్లు ? అని ప్రశ్న కలదు.

సమాధానము— అర్థమును చెప్పుటకు నిమిత్తముగా ఉన్నది ఒకటి, ఆ శబ్దముచే బోధింపబడిన శబ్దము రెండవది. శబ్దార్థములకు సంబంధజ్ఞానము కలిగెడి అవస్థలో ప్రవృత్తి నిమిత్తముగా ఉన్నది మూడవది. ఈ యభిప్రాయముతో 'స్వరూపేషు' అని బహువచనము ప్రయుక్తమాయెను. ॥2॥

అవతారిక— శబ్దార్థములకు సంబంధము సహజమే అది కల్పితము కాదు, అని చెప్పబడినది. వానికి సంబంధమున్నట్లు ప్రమాణ మెద్ది ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అస్యాయం వాచకోవాచ్య ఇతి షష్ఠ్యా ప్రతీయతే ।**
**యోగః శబ్దార్థ యో స్తత్త్వమప్యతో వ్యపదిశ్యతే ॥ 3**

అస్య = దీనికి అనగా ఈ యర్థమునకు, అయమ్ = ఇది అనగా ఈ శబ్దము, వాచకః = బోధకము. అట్లే, అస్య = ఈ శబ్దమునకు, అయమ్ = ఈ అర్థము, వాచ్యః = బోధ్యము. ఇతి = ఇట్టి అనగా 'అస్య అయం వాచకః', 'అస్య అయం వాచ్యః' అనెడి ప్రామాణికుల వ్యవహారమున కాన్పించెడి, షష్ఠ్యా = షష్ఠీ విభక్తిచే, శబ్దార్థయోః = శబ్దమునకును, అర్థమునకును, యోగః = సంబంధము, ప్రతీయతే = తెలియబడుచున్నది.

షష్ఠీ విభక్తికి సంబంధము అర్థము. రాజ్ఞః పురుషః (రాజునకు సంబంధించిన నౌకరు) మున్నగు తావులందు ఆ యర్థము స్పష్టము. అట్లే అస్య అయం వాచకః, అస్య అయం వాచ్యః మున్నగు ప్రాజ్ఞుల వ్యవహారమున (స్య) షష్ఠీ విభక్తి కాన్పించుచున్నది. దానికి సంబంధము అర్థము. (1) అర్థము, (2) శబ్దము, ఈ రెంటికి సంబంధమున్నట్లు షష్ఠిచే తెలియబడుచున్నది. వానికి సంబంధమే లేనిచో షష్ఠీ విభక్తి ప్రయోగింపబడదు. పరస్పరము సంబంధము కలవానిని తెలుపునపుడే గదా షష్ఠీ ప్రత్యయము నుపయోగింతురు. ఉదా॥ 'దశరథస్య రామః'. సంబంధములేని ఘట, పటములను తెలుపునపుడు షష్ఠిని ప్రయోగింపరు. కాబట్టి పై రీతిని షష్ఠీ విభక్తిచే శబ్దార్థములకు సంబంధమున్నదని మనము ఊహింపవలసి యున్నది. ఆ సంబంధము స్వాభావికమే.

అతః = ఈ కారణమువలన అనగా శబ్దార్థములకు స్వాభావికమగు సంబంధమున్నట్లు తెలియబడుచున్నందున, తత్త్వమ్ అపి = తాదాత్మ్యము కూడ అనగా శబ్దార్థములకు, తాదాత్మ్యము = అభేదము కూడ, వ్యపదిశ్యతే = వ్యవహరింపబడుచున్నది.

గౌః, అనునది శబ్దము. దానిచే బోధింపబడునది అర్థము. అది మనకు కంటికి కానవచ్చుచునే యున్నది. శబ్దము వేరు, అర్థము వేరు అని అస్మదాదులకు ప్రత్యక్షముగా తెలియుచున్నది. కాని ఆ అర్థమును చూపవలసి వచ్చినప్పుడు, గౌరయమర్థః = (ఈ అర్థము

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | తత్, మొదలగు సర్వనామ శబ్దములను ద్రవ్యమును నిర్దేశించుటకై వాడుదురు. |
| 100. | ద్రవ్యపక్ష(ము) | XIV - 333 | శబ్దము బోధించు అర్థము ''వ్యక్తి''యే గాని ''జాతి'' కాదు - అనుపక్షము దీనిని తొలుత ''వ్యాడి'' అను ప్రాచీనవైయాకరణుడు స్థాపించెను. |
| 101. | ద్రవ్యపదార్థతా | XIV - 357 358 | ''వ్యక్తి'' యే శబ్దముయొక్క అర్థమను పక్షము. (ద్రవ్య పక్షము). |
| 102. | ద్రవ్యసముద్దేశ(ము) | II - 1, 18 | ద్రవ్యమును గురించి చర్చించు భాగము ఈ కాండమున రెండవ విభాగము. ఇందు ద్రవ్యము యొక్క పరమ తత్త్వము నిరూపింపబడినది. (ద్రవ్యమందలి నిత్యమగు అంశము). ''భూయో ద్రవ్యసముద్దేశము'' అను నాలుగవ భాగములో ద్రవ్యము యొక్క వ్యావహారిక తత్త్వము నిరూపింపబడినది (ద్రవ్యమందలి అనిత్యమగు అంశము). |
| 103. | ద్రవ్యాభిధానపక్ష | XIV - 110 | శబ్దము యొక్క అర్థము ''ద్రవ్యమే'' అను పక్షము. (ద్రవ్య పక్షము). |

## ధ

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 104. | ధ్రౌవ్య(ము) | VII - 138, 139 | ''నిశ్చలము'' అనుభావము. (కదలకుండు''). అను భావన కదలుచున్నను, కదలకపోయి నను, ఒక వస్తువును నిశ్చలముగా భావించి ''అవధి'' అనవచ్చును. అందువలన అది అపాదానము అగును. |
| 105. | ధ్వని | VIII - 2 | గంట మొదలగు వాని చప్పుడు. (పౌర్వాపర్య మును వివక్షింపని చప్పుడు). |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | న | |
| 106. | నఞ్ సమాస(ము) | XIV - 250 254 | నఞ్ను పూర్వపదముగా గల సమాసము. |
| 107. | నపుంసకలింగ(ము) | XIII - 1 హేలారాజు | సంస్త్యానము, తిరోభావము, అనునవి స్త్రీ లింగమునకు పర్యాయములు. ప్రసవము ఆవిర్భావము, అనునవి పుంలింగమునకు పర్యాయములు. రెండు లింగముల యొక్కయు లక్షణములు గలది నపుంసకము. దీనిని "లింగ సర్వనామము" అనియు వైయాకరణులు వ్యవహరింతురు. (సత్త్వ. రజస్తమోగుణములను బట్టి శాస్త్రమున లింగ వ్యవస్థ ఏర్పడినది). |
| 108. | నాడికా | II - 5 | లోపల గుల్లగానుండు ఒక గొట్టము. దీనితో చూచినపుడు వస్తువు మిక్కిలి స్ఫుటముగా కనిపించును. (దృష్టియొక్క పరిధి నిమితమగును గాన). |
| 109. | నాలికా | IX - 70 | ఒక గొట్టముతో (కుండలోగాని) నీరు-(లేక-ఇసుకను) నింపి, అడుగున చిన్న రంధ్రము చేసి, దానిద్వారా ఆపదార్థము చుక్కచుక్కగా పూర్తిగా క్రిందపడుటకు పట్టు కాలము. (కాలము కొలుచుట కొకసాధనము.) |
| 110. | నాస్తితా | I - 38 | మూలకారణములో లీనమగుట. మూలకారణమగు శక్తిలో అణగియున్నపుడు, వస్తువులు లేనట్లు తోచును. దానినే "వినాశ" మని అనుచుందురు. (వాస్తవముగా వినాశమనునది లేదు.) |
| 111. | నిపాతన(ము) | XIV - 590 | వ్యాకరణ సంస్కారమును చూపక, ఉన్న దున్నట్లుగనే ఒక శబ్దము సాధువని చెప్పుట. ఉదా :- పృషోదరః సింహః, మొదలగునివి. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 112. | నిమిత్తానువిధాన(ము) | XIV - 310, 311 | నిమిత్తము ననుసరించి లింగసంఖ్యలను చెప్పుట. (విశేష్యము ననుసరించి విశేషణము నకు లింగ సంఖ్యలనుచెప్పుట). |
| 113. | నిమీలన(ము) | IX - 56 | మూసికొని పోవుట, కనపడకపోవుట. (ఉన్మీలనమునకు వ్యతిరేకము). |
| 114. | నిరుపాఖ్యా | XIV - 268 | సత్త (ఉనికి) ఎట్టి విశేషములును లేనిస్థితి. |
| 115. | నిర్ధారణ | XIV - 41 VII - 147 | మొత్తము వస్తువులనుండి ఒకదానిని గాని, కొన్నిటినిగాని వేరు చేసి ఎంచుట. (చూపుట) (ఉదా :- గవాం కృష్ణా బహు క్షీరా). |
| 116. | నిర్వర్త్య కర్మ | 1-27 VII-45 47,49,54,79 | ఒక ఆకృతిగలదిగ (పుట్టుక, రూపము) చేయబడు కర్మ. (క్రియకుఫలము). ఉదా :- కుంభకారః. ఇచట కుంభ నిర్వర్త్య కర్మ అగును. |
| 117. | న్యగ్భావ(ము) | VII - 95,123 | కనబడకపోవుట, ఒక దానియందాధారపడి యుండుట. |
| 118. | న్యగ్భావనా | VII - 59 | అర్థమును పూర్వస్థితికి ఉపకరించుట. |
| 119. | న్యాయ(ము) | I - 66 XIV - 457 | ఉదాహరణము. లక్ష్యము. దృష్టాంతము. ప్రసిద్ధమైన లోకోక్తి. |

## ప

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 120. | పరవల్లింగ(ము) | XIV - 306 | ద్వంద్వము, తత్పురుషము, అను సమాసము లలో చివరి పదము ననుసరించి సమాసము లకు లింగమేర్పడుట. |
| 121. | పరస్మైపద(ము) | XII – 20 | వేరొకని కొరకైన (తనకుకాదు) స్థానము. తిప్, తస్, ఝి. మొదలగు మొదటి తొమ్మిది తిఙ్ ప్రత్యయములకును ''పరస్మైపదము'' అని వ్యాకరణ శాస్త్రమున సంకేతము. ఈ ప్రత్యయములు ''క్రియాఫలము కర్తకు కాక వేరొకనికి చెందును'' అని సూచించును. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
| --- | --- | --- | --- |
| | | | ఉదా :- శుక్ల = తెలుపుగలది. ఇచ్చట "మతుప్" అను ప్రత్యయము, "కలది" అను విశేషమును బోధించి తప్పుకొన్నది. (కేవలము "తెలుపు" అను అర్థము కూడ శుక్ల శబ్దమునకు గలదు). |
| 133. | ప్రత్యక్తా | X – 1 | శరీరమునందుగల ఆత్మ. "నేను" భావనకు మూలము. దీనినే ఉత్తమ పురుషము బోధించును. (అహం కరోమి). |
| 134. | ప్రథమపురుష(ము) | XIV – 600 | తిప్, తస్, ఝి, త, ఆతామ్, ఝ, అను తిఙ్ ప్రత్యయములు. (వాడు, అది, అను కర్తను బోధించును). |
| 135. | ప్రదేశ(ము) | I – 18<br>XIV – 218 | భాగము, విభాగము. |
| 136. | ప్రధానవిషయా | VII - 82 | ముఖ్యక్రియను ఆశ్రయించునది. |
| 137. | ప్రమాణ(ము) | I - 4 | గాయపరచుట, చంపుట. |
| 138. | ప్రయోగవాక్య(ము) | XIV - 615 | వ్యవహారమున వాడుటకు తగిన వాక్యము (వ్యాకరణ సంస్కారమునకై చూపు ప్రక్రియా వాక్యము ప్రయోగ యోగ్యము కాదు). |
| 139. | ప్రవృత్తి | XIV - 324 | ద్రవ్యమందలి గుణముల మార్పు, లేక కదలిక (ఆవిర్భావము, తిరోభావము, స్థితి - అని మూడు విధములు). |
| 140. | ప్రష్ఠ | XIV - 85, 152 | నాయకుడు. నాయకత్వము సామాన్యముగా పురుషులకే చెల్లును. కాగా ఈ శబ్దమును పుంలింగముగనే వాడుదురు. అయినను "ప్రష్ఠుని భార్య" అను అర్థమున మాత్రము "ప్రష్ఠీ" అని స్త్రీలింగముగ వాడవచ్చును. |
| 141. | ప్రసక్తాదర్శన(ము) | XIV - 132 | ఉండవలసినది కనపడకుండుట. దీనినే శాస్త్రమున "లోపము" అందురు). |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 142. | ప్రసవ(ము) | VI - 10, XIII - 27 | పుట్టించు శక్తి. పుంస్త్వము). |
| 143. | ప్రహాణ(ము) | IX - 11 | నశించుటకు యోగ్యమగుట. |
| 144. | ప్రాతిపదికార్థ(ము) | I - 34 | శబ్దముయొక్క అర్థము = జాతి, జాతినే "సత్త" అనియు అందురు. అన్ని శబ్దము లకును సత్తయే తొలి అర్థమనియు, ధాతువు లకు కూడ క్రియా సామాన్య రూపమైన సత్తయే ప్రాథమికమైన అర్థమనియును వై యాకరణుల తాత్పర్యము. |
| 145. | ప్రాధాన్య(ము) | I - 69 | ఇతరముల కన్న ముఖ్యమగుట. |
| 146. | ప్రాప్య(కర్మ) | VII - 51 | క్రియ వలన ఎట్టి మార్పును కనబడని కర్మ. ఉదా :- ఆదిత్యం పశ్యతి. |
| | | **బ** | |
| 147. | బహిరంగ(ము) | XIV - 141 | బయటనుండు అవయవములు (నిమిత్తములు) బయటనుండునది, దూరముగా నుండునది, విలంబముగా అగునది. |
| 148. | బాహులేయ | III - 75 XIV - 149 | (1) గోవుయొక్క సంతతి. ("బహులాయాః అపత్యమ్"). "శాబలేయ" అను పదమువలె ఈ పదము కూడ సాధువే. ఇదున్నదని ఆ పదమును, అదున్నదని ఈ పదమును విడువనక్కర లేదు, [(2). శాబలేయ, బాహు లేయ, అను వ్యక్తులు ఇద్దరుందురు. వారిలో ఒకరి ఉనికి కాని అభావము కాని, మరొకరి భావమునకుగాని అభావమునకుగాని నిమిత్తము కానేరదు]. |
| 149. | బుద్ధ్యనుసంహార | IX - 57 | మానసికమైన స్వరూపము సంకల్పము, మనస్సు కలుగజేయు వాస్తవముకాని వ్యవస్థ. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశసంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 150. | బుద్ధ్యవస్థా | XIV - 571, 578 | మనస్సు యొక్క స్థితి. భావనము. |
| 151. | బృహత్క | XIV - 618 620 | చిన్నదైనను తన కాంతివలన పెద్దదిగ అగపడు ఒక వజ్రము. |
| 152. | బ్రాహ్మణశ్రుతి | XIV - 492, 493,494,542 | "బ్రాహ్మణునితో సమానమైన క్రియ - లేక - ఒక వస్తువు" అను నర్థమున బోధించు వాక్యము. "(బ్రాహ్మణవత్ అధీతే" మొదలగునది). |
| | **భ** | | |
| 153. | భావ(ము) | VIII-12,17, 24,26,59,60, 66 | వ్యాపారము, క్రియ, ఒకపని, (కారకముల తోడి సంబంధమును చూపకుండ, కేవలము ధాతువును వాడి నిరూపించు క్రియ). క్రియ, భావము, అను పదములను పర్యాయములుగ వాడుదురు. అయినను చిన్న భేదమున్నది. పూర్తి అయిన క్రియను భావమనియు, జరుగుచుండు పనిని క్రియ యనియును భావించుట సంప్రదాయము. |
| 154. | భాషితపుస్క(ము) | VI - 10 | పుంస్త్వమును చెప్పునది. వేరొకలింగమును కూడ గట్టుకొని పుంలింగమగు శబ్దము. (ఒకే లింగము గలది కాదు). |
| 155. | భూత(ము) | IX - 38,79, 85,91,101 | జరిగిపోయినది. (కాలమునుబట్టి ఏర్పడు వ్యవహారము). |
| 156. | భూయోద్రవ్య సముద్దేశ(ము) | IV - 1, 3 | ద్రవ్యమును గురించి చర్చించు ఇంకొక భాగము, ఈకాండమందలి నాల్గవ విభాగము.) |
| | **మ** | | |
| 157. | మధురాశ్రుతి | XIV - 542 | మధురాపట్టణమును గురించి ప్రయోగించిన ఒక వాక్యము. (ఉదా :- మధురాయామివ పాటలిపుత్రే జనాః). |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 158. | మధ్యమ | X - 1,4 | మధ్యమపురుషము. (సిప్, థస్,థ,- థాస్, ఆథామ్, ధ్వమ్, అను ప్రత్యయములు). |
| 159. | మాన(ము) | XIV - 390 | కొలుచుటకు సాధనము, కొలత. |

## య

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 160. | యుక్తవద్భావ(ము) | XIV - 112, 113, 320 | లుప్, అను పదమును వాడి తద్ధితప్రత్యయమునకు లోపము చెప్పినపుడు, ప్రకృతి యొక్క లింగవనములే అనువర్తించుట (ప్రకృతికి యొక్క లింగిము, వచనమును మారకుండ అనుసరించును. ఉదా :- అంగానాం నివాసః జనపదః = అంగాః, కురూణామ్ = కురవః, వంగానామ్ = వంగాః, మొ॥ "లుపి యుక్తవద్వ్యక్తివచనే" పా. సూ. 1-2-51.) ఇచట "కురు" శబ్దము పుంలింగము బహువచనము ఆ శబ్దమునకు వచ్చిన తద్ధితప్రత్యయమునకు లోపము వచ్చినను ఆ పుంలింగమును, బహువచనమును నిలిచినవి |
| 161. | యుగపద్వాచితా | XIV - 34 | ద్వంద్వ సమాస మందలి పదముల అర్థము లచు - ఉన్నవానిలో ఏదో ఒక పదమే చెప్పుట. ఉదా :- రామలక్ష్మణౌ. ఇచ్చట రామ శబ్దము గాని, లక్ష్మణ శబ్దము గాని "రామ లక్ష్మణులు" అనునర్థమును తెలుపగలుగుట. |
| 161. | (A) యోగ(ము) | II - 3 | శబ్దమునకును అర్థమునకును ఉండు సహజమైన సంబంధము. (అభేదము, తత్త్వము. తద్భావము, అను పదములతో దీనిని బోధింతురు. |

## ర

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 162. | రూఢయోగ | XIV - 442 | ప్రసిద్ధిని బట్టి ప్రత్యయముగ చెప్పనక్కర |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | లేకుండగనే తెలిసిపోవు గుణము. క్రియ, మొదలగునవి. ఉదా :- ''చంద్రవత్ ముఖమ్'' అనగానే కాంతినిగలిగి యుండుట, ఆహ్లాదమును కలిగించుట, మొదలగు గుణములు తెలిసి పోవును. |
| | | ల | |
| 163. | లక్షణా | I - 50 | ఒక అర్థమును సూచించు శక్తి. (శబ్దమునకు గల శక్తి). |
| 164. | లింగ(ము) | XIII - 2, 3 | చిహ్నము, (పుమ్, స్త్రీ, నపుంసక, అని మూడు విధములు. ఇవి శబ్దములకు చెందునవి). |
| 165. | లింగసముద్దేశ(ము) | XIII - 1, 31 | లింగమును చర్చించు భాగము. ఈ కాండమందలి పదమూడవ విభాగము). |
| 166. | లుప్తోపమ | XIV - 382 | సాదృశ్యమును చెప్పు ''ఇవ'' మొదలగు శబ్దములను వాడకుండగనే, సాదృశ్యమును బోధించు ప్రయోగములు. ఉదా : ''సింహః మాణవకః,'' ''గౌః వాహీకః'' మొదలగునవి. |
| 167. | లోప(ము) | XIV - 585 | కనబడ కుండట, విడుచుట, వినబడకుండుట, పలుకకుండుట, లేకపోవుట. |
| | | వ | |
| 168. | వజ్రపాణి | XIV - 214 | ఇంద్రుడు ప్రసిద్ధిని బట్టి ఈ యర్థము తెలిసి పోవును. ''వజ్రము చేతి యందు గలవాడు'' అను యౌగికార్థము ఆవశ్యకముకాదని భావము |
| 169. | వర్తమాన(ము) | IX - 38,50, 55,90,101, 103 | ప్రస్తుతమైన కాలము.''క్రియ జరుగుచున్నది'' అను అంశమును తెలుపుట లట్, అను లకారము దీనిని సూచించును). |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 170. | వాక్య(ము) | III - 1:76 | సంశయము కలుగునపుడు శబ్దము యొక్క అర్థమును నిర్ణయించుటకై ప్రమాణముగ తీసి కొనబడు ఒక వాక్యము. మీమాంసకుల సం ప్రదాయమున, ఇది శ్రుతి, లింగము, అను ప్రమాణములకన్న, దుర్బలమైనది. |
| 171. | వాక్యశేష(ము) | XIV - 525 | వాక్యము యొక్క అర్థము సంపూర్ణమగుటకై సాయము చేయు ఒక పదము - లేక వాక్యము. (దీనిని అధ్యాహారము చేయుదురు). |
| 172. | వికార్య(కర్మ) | VII - 48,49 79 | జరుగు పని వలన ఒకానొక వికారమును (మార్పు) పొందు కర్మ. ఉదా :- తండులాని పచతి" ఇందు తండులములు అనగా బియ్యము మార్పును పొందును, |
| 173. | విభక్తి | XI - 27,29, 31 | వేరు చేయుట, విభజించుట, విభజించునది, సుప్ ప్రత్యయములకును తిఙ్ ప్రత్యయ ములకును విభక్తి అని సంజ్ఞ. |
| 174. | విభక్తిపరిణామ(ము) | XIV - 468. | సముచితమైన అర్థమును పొందుటకై ఉన్న విభక్తిని వేరొకవిభక్తిగా మార్చుకొనుట. |
| 175. | విభక్తిభేద(ము) | XIV - 8 | విభక్తి ప్రత్యయముల భేదము (వేర్వేరు విభక్తులుండుట). |
| 176. | విభక్త్యర్థ(ము) | VII- 164, 165 XIV - 219, 221,222,227 283 | విభక్తియొక్క అర్థము ఒక పదము యొక్క అర్థమునకు వేరొక పదము యొక్క అర్థము తోగల సంబంధవిశేషమును విభక్తి ప్రత్యయమే బోధించును. |
| 177. | వివిభక్తి | XIV - 460 | వేరు విభక్తిగలది. |
| 178. | విశేషణ(ము) | XIV - 7 | ఒక వస్తువునందు గల ధర్మమును వేరు చేసి బోధించుపదము. (వస్తువుయొక్క ఒకానొక ధర్మము). భేదకము, అవచ్ఛేదకము, అను నని దీని పర్యాయములు, |

గోవు = గోశబ్దము) అను రీతిని శబ్దార్థములకు అభేదమును సూచించెడి వాడుక కలదు. కాబట్టి వానికి తత్త్వమును అనగా తాదాత్మ్యమును, అభేదమును స్వీకరింపవలెను. ॥3॥

అవతారిక— "అస్య అయం వాచకః" మున్నగు వాక్యములలో సంబంధార్థక షష్ఠీ విభక్తి కానవచ్చుచున్నందున దానికి మరియొక విధముగ ఉపపత్తి చూపుటకు సాధ్య పడనందున, దాని బలమువలన శబ్దార్థములకు సంబంధమున్నదని అనుమాన ప్రమాణముచే ఊహింపవలెనని 3 వ శ్లోకమున చెప్పబడినది. అట్లు ఏల చెప్పవలెను? గంధము కలిగి యున్నది భూమి, అను రీతిని సంబంధమునకు అసాధారణమగు లక్షణ మేల చెప్పరాదు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నాఽభిధానం స్వధర్మేణ సంబన్ధస్యాస్తివాచకమ్ ।
అత్యన్త పరతన్త్రత్వాత్ రూపం నాస్యాపదిశ్యతే ॥ 4

A. స్వధర్మేణ = తనయొక్క అనగా సంబంధముయొక్క అసాధారణమగు ధర్మముచే, సంబన్ధస్య = సంబన్ధమునకు, వాచకమ్ = బోధకమగు అనగా సంబంధమును బోధించెడి, అభిధానమ్ = శబ్దము, న + అస్తి = లేదు. అనగా షష్ఠీ విభక్తి తప్ప మరియొక శబ్దము లేదు. భూమికి అసాధారణ ధర్మము గంధము. నీటికి చల్లదనము, తేజమునకు ఉష్ణత ఉన్నందున ఆ ధర్మములనుబట్టి ''గంధవతీ పృథివీ" మున్నగురీతిని వానికి లక్షణములు చెప్ప వచ్చును. అచట అసాధారణ ధర్మ సహితములగు పృథివ్యాదులను బోధించెడి శబ్దములున్నవి. కాబట్టి అచట అట్లు చెప్పుటకు వీలున్నది. ఈ సంబంధమును దానియొక్క అసాధారణ గుణ ములతో కూడియున్నట్లు చెప్పెడి శబ్దము లేనందున దానికి విశిష్ట లక్షణము చెప్పజాలము.

B. సంబంధమునకు ఏదో రూపమును కల్పించి దానికి అనుగుణముగా లక్షణము చెప్ప రాదా! కేవలము అనుమానముపై ఆధారపడుట ఏల? అను ప్రశ్నకు సమాధానము చెప్పు చున్నాడు.

అత్యన్త పరతన్త్రత్వాత్ = మిక్కిలి పరాధీనమగుట వలన, అస్య = ఈ సంబం ధము యొక్క, రూపమ్ = రూపము, న + అపదిశ్యతే = చెప్పబడ నేరదు.

రెండు సంబంధులను బట్టియే సంబంధముండును. అందుచే సంబంధము పరా పేక్షమే. స్వతంత్రమగు పదార్థము కాదు. కనుక దానికి ఎట్టి రూపము కల్పించుట శక్యము కాదు.

రూపరసాదిగుణములు పరతంత్రములే. అవి ద్రవ్యమునందు ఆధారపడియున్నవి. ఐనను వానిని ద్రవ్యముతో వేరుచేసి శుక్లమ్, నీలమ్ (తెలుపు, నలుపు) అనురీతిని స్వతంత్ర పదార్థముగా జూపుటకు అవకాశమున్నది. కనుకనే వానిని బోధించెడి శబ్దములు కానవచ్చు చున్నవి. వానికి ప్రత్యేకము లక్షణములు చెప్పబడుచున్నవి. సంబంధము రూపాది గుణముల వంటిది కూడకాదు. ఇది ఎల్లప్పుడు నిత్యపరతంత్రమే ఈ యభిప్రాయమునే కారికలోనున్న "అత్యన్త" పదము వ్యక్తపరచుచున్నది.

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 179. | విశేష్య(ము) | XIV - 7 | ముఖ్యమైన వస్తువును, చెప్పు పదము. (ధర్మముగల వస్తువు) ఛేద్యము, అవచ్ఛేద్యము. అనునవి దీని పర్యాయపదములు. |
| 180. | వృత్తిసముద్దేశ(ము) | XIV 1,627 | సమాసము మొదలగు వృత్తులను చర్చించు భాగము. (ఈ కాండమందలి పదునాలుగవ విభాగము). |
| 181. | వ్యపేక్షా | XIV - 41,45 47 | వాక్యమందలి పదములకుండు సామర్థ్యము. (పదముల అర్థములు సముచితముగ కలియు తీరు). |
| 182. | వ్యవస్థితవిభాషా | XIV - 45 | వికల్పమైన కార్యమును నియమించుట. (వికల్పమైనను ఒకానొకచో నిత్యముగనే ప్రవర్తించునని నిశ్చయించుట). |
| 183. | వ్యాపార(ము) | IX - 10 | పని, క్రియ, (ధాతువు చెప్పు అర్థము). |
| 184. | వ్యావృత్తి | I - 19 | ఒక విషయమును పేర్కొనుట వలన. తక్కిన వానినన్నింటిని తొలగించుట. ఉదా :- గౌః, అనగానే ఆ పదమువలన, గో భిన్నమైన వన్నియు తొలగిపోవును). |

శ

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 185. | శక్తి | VII - 2 | (1) ప్రపంచమందలి వివిధమైన వస్తువులకుండు సామర్థ్యము. దానివలన అవి ఆయా ప్రయోజనములను సాధింపుచు, తమ తమ ఉనికిని సార్థకము చేసికొనును. ఉదా: కుండ. ఇది నీటిని తీసికొనివచ్చును. అట్టిశక్తి దానికి కలదు. (తుదకు ఆ శక్తియే కుండయని భావించుట తత్త్వము). |
| | | VII - 28,31, 34,35 | (2) క్రియను కలిగించు శక్తి. దీనినే ''కారక శక్తి'' అని యందురు. ఇది కర్త, కర్మ, మొదలగు రీతిని ఆరు విధములు. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 186. | శబ్దసంస్కార(ము) | XIV - 139 | సాధుత్వమును సంపాదించుటకై శబ్దమునకు జరుగు వ్యాకరణ సంస్కారము. |

ష

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 187. | షడవస్థా | I - 36 | సత్త (ఉనికి) అసునది ప్రపంచమందలి ప్రధానమైన వ్యాపారము. దానియొక్క భాగములుగా భావింపబడు వ్యాపారములు ఆరుగా చూపబడును. (పుట్టుట, పెరుగుట, మారుట, మొదలగునవి). వీనిని "షడవస్థ" అందురు. ఇది సృష్టి అంతకును సామాన్యము. |

స

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 188. | సంఖ్యా | XI - 1,2,3 XIV - 100, 101, 102 | అన్ని వస్తువులందును ఉండు ఒక గుణము. సుప్ ప్రత్యయములును, తిఙ్ ప్రత్యయములును, దీనిని బోధించును. |
| 189. | సంఖ్యాన (శబ్ద,) | XI - 19 | వస్తువుల సమూహమును మొత్తముగా బోధించు సంఖ్యావాచకము. ఉదా :- వింశతి, త్రింశత్, మొదలగునవి. |
| 190. | సంఖ్యాసముద్దేశ(ము) | XI - 1,32 | సంఖ్యను చర్చించు భాగము. (ఈ కాండ మందలి పదకొండవ విభాగము). |
| 191. | సంఖ్యేయ(ము) | XI - 19, 22, 23, 24 | లెక్కింపబడు వస్తువు. |
| 192. | సంపద్యమాన(ము) | VII - 115 | ఏర్పడునది, మార్పుచెంది పుట్టునది, (మారునది, సిద్ధించునది). |
| 193. | సంప్రదాన(ము) | VII - 129,130 | (దానమును స్వీకరించువాడు. ఒక క్రియచే ఉద్దేశింపబడు వ్యక్తి. |
| 194. | సంబంధ(ము) | III-11,17,18 VII - 156 | పదములకు గాని, అర్థములకు గాని ఉండు సహజమైన సంబంధము, "సామాన్యసంబంధ |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | మనియు క్రియాకారక సంబంధమనియు. దీనిని రెండు విధములుగా చూపుదురు. |
| 195. | సంబంధసముద్దేశ(ము) | III - 1, 88 | సంబంధమును చర్చించు భాగము. ఈ కాండమందలి మూడవ విభాగము. |
| 196. | సంబోధన(ము) | VII - 163, XIV - 99 X - 4, 5 | పిలుపు, హెచ్చరిక, (ఒక పనిలో ఉపయోగించుకొనుటకు, ఒక వ్యక్తిని తనవైపు త్రిప్పుకొనుట). |
| 197. | సంమార్గ(ము) | I - 59,70 | కడుగుట, శుద్ధిచేయుట. యజ్ఞమందలి పాత్రలను శుద్ధిచేయుట). |
| 198. | సంమూర్ఛిత(ము) | VII - 118 | లోపల నుండునది, అణగియుండి తనఉనికిని హేతువుగా కొనసాగించునది). |
| 199. | సంవిధాన(ము) | XII - 8 | వ్యాపారమునకు (క్రియకు) ఆవశ్యకమైన అన్ని హంగులను సిద్ధము చేయుట. |
| 200. | సంస్త్యాన(ము) | XIII - 27 XIV - 171, 172 | గుణములు లేక- భాగములు శిథిలమగుట, అసమర్థములగుట, కప్పబడుట, పని చేయక పోవుట. ("స్త్రీత్వము" అనునర్థములో దీనిని వాడుదురు). |
| 201. | సకర్మక(ము) | III - 47 | కర్మ సంభవించు (కలుగునట్టి) ధాతువు. |
| 202. | సతిశిష్టబలీయస్త్వ(ము) | VI - 413 XIV - 62 | ఒక పదమందలి స్వరములలో చివర వచ్చిన స్వరము ప్రబలమగుట. ఈ పదమును వైయాకరణులు తరచుగ వాడుదురు). |
| 203. | సత్తా | III-46,48,51 VIII - 28 IX - 112 | పరమ సత్యము. విశ్వమంతకును మూలమగు తత్త్వము. |
| 204. | సత్త్వ(ము) | I - 85 | వస్తువుయొక్క సహజస్థితి. (మార్పు లేని అవస్థ) ద్రవ్యము యొక్క సహజమగు స్వభావము. (ఒక విధముగ ఇది సత్తయే. |

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| | | | ధీనినసుసరించియే ద్రవ్యమును "సత్త్వ" మందురు. |
| 205. | సమాఖ్యా | VI - 7 | పేరు, పేర్కొనుట. (వస్తువుయొక్క స్వభావముతో ఎట్టి సంబంధమును లేకుండ పెట్టిన నామధేయము). |
| 206. | సమూహప్రచయ (ము) | XIV - 599 | వస్తువుల సముదాయమును అంతను ''ఒకటిగా'' భావించుట. |
| 207. | సర్వనామ(ము) | XIII - 18 | అన్నింటికిని అన్వయించు శబ్దము. తద్, ఏతద్, ఇదమ్, మొదలగు సర్వనామములు). |
| 208. | సాదృశ్య(ము) | XIV - 402, 428 | సమానమైన ధర్మములను బట్టి రెండువస్తువులకు గల సామ్యము, (పోలిక). |
| 209. | సాధనసముద్దేశ (ము) | VII - 1,167 | కారకములను చర్చించు భాగము. (ఈ కాండమున ఏడవ విభాగము). |
| 210. | సామానాధికరణ్య (ము) | XIV - 8,21, 175,183, | ఒకే చోటనుండుట. (విశేషణ విశేష్యములు రెండును కలిసి, ఒకే యర్థమునుచెప్పుట). |
| 211. | సామాన్యవచన(ము) | XIV - 387, 427 | సామాన్యముగా చెప్పుట. అట్లుచెప్పు శబ్దము). |
| 212. | సోపస్కార(ము) | XIV - 465 | ప్రయోజనము కలిగియుండునది. ఉపయోగించునది). |
| 213. | స్థితి | VIII - 27, XIII - 18, 27 XIV - 332 | (1) కదలకుండుట, ఉనికి. (2) సత్త్వరజస్తమో గుణములు సమముగానుండుట (నపుంసకము). |
| 214. | స్ఫటిక(ము) | III - 40 | స్ఫటికము. (సచ్ఛమైన ఒక మణి). |

హ

| వరుస సంఖ్య | పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|---|
| 215. | హాయన(ము) | IX - 29 | సంవత్సరము. |

| పదము | సముద్దేశ సంఖ్య కారిక సంఖ్య | అర్థము |
|---|---|---|
| హేతు(వు) | VII - 24,25, 26 | (1) క్రియను ప్రేరించునది. (ప్రోత్సహించునది). |
| | VII - 27 | (2) క్రియ యొక్క ప్రయోజనము. |

కనుక సంబంధులకంటె వేరు చేసి సంబంధమును చూపుటసాధ్యముకాదు. ఇట్టిది ఏ శబ్దము చేతను చెప్పనలవికాదు. కేవలము కార్యముచేతనే సంబంధమున్నదని యూహింప వలసి యున్నది. ॥4॥

అవతారిక— సంబంధమును చెప్పెడి శబ్దములేదు. కాబట్టి కార్యమును బట్టి సంబంధమున్నదని యూహింపవలెను. అనగా అనుమానప్రమాణముచే సంబంధము సిద్ధించు నని 4 వ శ్లోకమున చెప్పబడినది. ఆ సంబంధమునకు అనుమాపకమగు కార్యమెద్ది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపకారః సయత్రాస్తి ధర్మస్తత్రానుగమ్యతే ।
శక్తీనామప్యసౌశక్తిర్గుణానామప్యసౌగుణః ॥ 5

యత్ర = ఎచట, ఉపకారః = ఉపకారము, అస్తి = కలదో, తత్ర = అచట, సః = ఆ, ధర్మః = ధర్మము అనగా సంబంధము, అనుగమ్యతే = అనుసరింపబడుచున్నది. అనగా అనుమాన ప్రమాణముచే తెలియ బడుచున్నది.

ఉపకార్యమునకు, ఉపకర్తకు సంబంధము కలియగా ఉపకారము కలుగును. శబ్దము ఉపకరించునది. అర్థము ఉపకార్యము. వానికి బోధ ఉపకారము. అర్థబోధయనెడి ఉపకారము ఎచట కలుగు చున్నదో, అచట వానికి సంబంధమున్నదని నిశ్చయింపవచ్చును.

సంబంధమునకు ఏదో యొక సంబంధమును కల్పించి, దానిని సంబంధిగా పరిగణింపరాదు. అట్టి తరి ఆసంబంధమునకు గూడ మరియొక సంబంధము, దానికి గూడ మరి యొక సంబంధము కల్పింపవలెను. ఈ రీతిని అనవస్థాదోషము కలుగును.

కాబట్టి సంబంధము నిత్య పరతంత్రము, అది అనుమేయమే యని చెప్పవలెను.

శబ్దమునందు అర్థమును బోధించుట కనుగుణ మగు శక్తియున్నది. ఆ శక్తియే సంబంధమనరాదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అసౌ = ఈ సంబంధము, శక్తీనామ్ + అపి = కార్యమును కలిగించెడి శక్తులకు గూడ, శక్తిః = శక్తివంటిది. అనగా సహకరించునది.

శక్తియున్నంత మాత్రమున కార్యము కలుగదు. ఉదా:—దీపమునకు వస్తుప్రకాశ కత్వ శక్తియున్నది. కాని ఆదీపమునకు వస్తువుతో సంబంధమున్ననాడే ఆ వస్తువు ప్రకాశిత మగుచున్నది. ఎచటనో ఉన్నవస్తువు దేశాంతరమున నున్న దీపముచే ప్రకాశితము కాదు గదా!

ఏలయన— అసౌ = ఈ సంబంధము, గుణానామ్ + అపి = రూపరసాదిగుణము లకు కూడ, గుణః = ఉపకారకము.

రూప, రస, గంధాదికములగు గుణములు, ద్రవ్యమును ఆశ్రయించుచున్న. అవి యట్లుండుటలో సంబంధమే కారణము.

*అవతారిక*— తార్కికులు సంయోగము, సమవాయము, అనెడి రెండు సంబంధముల నంగీకరించియున్నారు. అవియే శబ్దార్థములకు గూడ సంబంధములు కాగలవు.

ఈ రీతిని సరిపడుచుండగా అట్లు స్వీకరింపక, వానికంటె వేరుగ ఏదో మరియొక సంబంధమును ఏల స్వీకరింపవలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తద్ధర్మణోస్తు తాచ్ఛబ్ద్యం సంయోగసమవాయయోః ।**
**తయోరప్యుపకారార్థా నియతాస్తదుపాధయః ॥ 6**

A. తద్ధర్మణోః = దానియొక్క ధర్మముకల, అనగా సంబంధమునకు పారతంత్ర్యమనెడి అసాధారణమగు ధర్మము కలదు. అట్టిపారతంత్ర్యమనే ధర్మముకల, సంయోగసమవాయయోః + తు = సంయోగమునకు సమవాయమునకున్న, తాచ్ఛబ్ద్యం = ఆశబ్దముచే వాడుక, అనగాసంబంధ శబ్దముచే వ్యవహరించుట, (భవతి) = అగుచున్నది.

రెండు ద్రవ్యములకు సంయోగము కలుగును. జాతి వ్యక్తులకు, గుణ, గుణవత్తులకు, క్రియా, క్రియావత్తులకు, అవయవ అవయవులకు సమవాయము సంబంధమగును. సంయోగము, సమవాయము రెండు కూడ ఇతర సాపేక్షములే. రెండు ద్రవ్యములు లేనిదే సంయోగముండనేరదు. జాతి, వ్యక్తిమున్నగునవి లేనిచో సమవాయముండనేరదు. ఈరీతిగా ఈ రెండు పరాధీనములే. సంబంధమనునదియు పరాపేక్షమే. ఈ సామ్యమును బట్టి ఈ రెంటిని సంబంధములుగా లోకులు భావించు చున్నారు.

B. నిజరూపమున సంయోగ సమవాయములు సంబంధములు కావు. వానికి కూడ కొన్ని ఉపాధులున్నవని చెప్పుచున్నాడు.

తయోః + అపి = ఆ సంయోగసమవాయములకుగూడ, ఉపకారార్థాః = ఉపకారము ప్రయోజనముగా గలిగినట్టియు, నియతాః = అసాధారణములగు, తదుపాధయః = ప్రసిద్ధములగు ఉపాధులు, (సన్తి) = కలవు.

"ఘటపటౌసంయుక్తౌ" (కడవ, వస్త్రము, సంయుక్తములైయున్నవి) అనురీతిని కలిగెడి వ్యవహారమునకు నియామకమగు ఒక సంబంధముండవలెను. ఉపాధిని నియమించుటకై సంబంధముండవలెను.

పై పరాధీనత్వమనెడి సామ్యముండుటవలన ఇవియు సంబంధములుగా పరిగణింపబడుచున్నవి. కాని అవియు కొన్నినియమములు కలిగియుండుటచే స్వతంత్ర పదార్థములే.

కాబట్టి సంయోగ సమవాయములు ముఖ్య సంబంధములుకానేరవు. గౌణ సంబంధములగును. ॥6॥

5]

అతః = ఈకారణమువలన, అనగా బంధనము వేదవిహితమగుటవలన, జాత్యభిధానే + అపి = ఖదిరాది శబ్దములచే ప్రధానముగా జాతిబోధింపబడినను, శక్తిహీనమ్ = కార్యమున కలిగించెడి సామర్థ్యము లేనిది, న + గృహ్యతే = స్వీకరింపబడదు.

ఇచట ప్రమాణశబ్దము ప్రత్యక్షాది ప్రమాణములను బోధింపదు. మీఞ్ హింసాయామ్ అను హింసార్థక ధాతువునకు ల్యుట్ ప్రత్యయము ప్రవర్తింపగా ప్ర + అను ఉపసర్గము చేరగా. హింసన ప్రారంభించుట అను అర్థము కలుగును.

పశుమాలభేత, (పశువును యజ్ఞము నిమిత్తమై చంపవలెను) హృదయేఽవద్యతి, (చంపినపశువుయొక్క హృదయమును ఖండింపవలెను) మున్నగు రీతిని హింసనము, హృదయమును ఖండించుట మున్నగునవి శాస్త్రమున విధింపబడినవి. అట్లే, ఖాదిరేబధ్నాతి, చంద్రకఱ్ఱచే చేయబడిన స్తంభమున పశువునుబంధింపవలెను అని శాస్త్రము చెప్పుచున్నది. స్తంభమున పశువును బంధించుటకు ప్రయోజనము ఏమనగా పశువునకు స్వాతంత్ర్యము లేక పోవుటయే. అనగా పశువుపారిపోకుండగానిలుచుటయే. చంద్రకఱ్ఱ కదా అని పశువును కట్టుటకు ఉపయోగపడని దానిని స్తంభముగా చేయరాదు. శాస్త్రవిహితమగు బంధనమునకు అదియే ఫలము కనుక ఆఫలమును నిర్వహించుటకు ఒకవేళ చంద్రకఱ్ఱ సమర్థము కానియెడల దానిని ఉపయోగింపక, అందుకుపయోగించెడి ఖదిరము మున్నగు మరియొకజాతికి చెందిన కఱ్ఱస్వీకరింపబడగలదు.

కాబట్టి జాతిప్రధానమైనను ఆజాతికినెందిన కఱ్ఱ అసమర్థమగునపుడు అందుకు సమర్థమగు ఇతరజాతికిచెందిన కఱ్ఱ గ్రహింపబడును. కనుక ఈ పక్షమునగూడ ప్రతినిధి ఉపపన్నముకాగలదు. ॥4॥

**అవతారిక** — ఈపక్షముననే లింగముచే అనగా హేతువాదముచేగూడ ప్రతినిధికి ఆవశ్యకత కలుగునని నిరూపించుచున్నాడు.

శ్లో॥ సంశ్లేషమాత్రం **బధ్నాతిర్యదిస్యాత్తు** వివక్షతః,
శక్త్యాశ్రయేతతో లిఙ్గం ప్రమాణాద్యనుశాసనమ్॥ 5

బధ్నాతిః = బంధనము అనగా ఖాదిరేబధ్నాతి (చంద్రకఱ్ఱచే చేయబడిన యూప స్తంభమున పశువును బంధింపవలెను) అనువచనముచే చెప్పబడినబంధనము, సంశ్లేష మాత్రమ్ = స్తంభమునసంబంధించియుండుట మాత్రమే, వివక్షితః = చెప్పదగినదిగా, స్యాత్ + తు + యది = అయినట్లైన, తతః = సంశ్లేషము తరువాత చెప్పబడిన, ప్రమాణాద్యమశాసనమ్ = చంపుట, అవయవములను గ్రహించుట మున్నగువానిని ఉపదేశించుట, శక్త్యాశ్రయే = శక్తికి ఆశ్రయమగు ఖదిర అనెడి కఱ్ఱయొక్క ఆశ్రయించుటయందు, అనగా అట్టి ఖదిరమును గ్రహించుటయందు, లిఙ్గమ్ = హేతువు (భవతి) అగుచున్నది.

*అవతారిక*— సంయోగము ముఖ్య సంబంధము కానేరదు, దానికి కూడ కొన్ని ఉపాధులున్నవని 6వ శ్లోకమున చెప్పబడిన యర్థమునే వివరించుచున్నాడు.

శ్లో॥ కాచిదేవ హి సావస్థా కార్యప్రసవసూచితా ।
కస్యచిత్కేనచిద్యస్యాం సంయోగ ఉపజాయతే ॥ 7

కస్యచిత్ = ఏదో ఒకదానికి అనగా ఒక ద్రవ్యమునకు, కేనచిత్ = ఏదో ఒకదానితో అనగా మరియొక ద్రవ్యముతో, యస్యామ్ = ఏయవస్థయందు, సంయోగః = సంయోగము, ఉపజాయతే = కలుగు చున్నదో, కార్యప్రసవసూచితా = కార్యముయొక్క ఉత్పత్తిచేసూచింపబడిన, సా = ఆ యవస్థ, కాచిత్ + ఏవ + హి = ఏదో ఒకటియే కదా!

సంయోగము స్వతః సంబంధముకానేరదు. దానికి కూడ కొన్ని యుపాధులున్నవి. ఎట్లనగా— రూపము, రసము మున్నగు *తార్కికులు చెప్పెడి 24 గుణములలో సంయోగ మొకటి. ఇది ద్రవ్యములకే సంబంధించును. వస్త్రమనెడి కార్యము జనియించుటలో దారములు సమవాయి కారణము. దారముల సంయోగము అసమవాయి కారణము. దారములున్నను వానికి సంయోగము లేనిచో వస్త్రము జనియింపనేరదు ఇట్లే ఏ ద్రవ్యము పుట్టనలెనన్నను అవయవముల సంయోగమపేక్షితమగు చున్నది. సావయవములగు ద్రవ్యములకు సంయోగము కలుగును. కాగా ద్రవ్యైక నియతత్వము అనగా ద్రవ్యములయందే నియతముగా నుండుట సంయోగమునకు ఉపాధి.

అట్లే సంయోగము గుణమగుటచే గుణత్వము కూడ ఉపాధికాగలదు. ఇట్టియుపాధులున్నందున సంయోగము ఒకస్వతంత్రమగు పదార్థమే కావలెను. అట్లయినను ద్రవ్యపరతంత్రమగుటచే ఇదియు సంబంధముగా గుర్తింపబడుచున్నది. పారతంత్ర్యము సంబంధమునకు అసాధారణమగు రూపముకదా! అంతయేకాని పారతంత్ర్యము సంబంధము ఏకరూపముగాదు. గుణకర్మ సామాన్యములు పరాధీనములైనను అవి సంబంధములు కావు కదా! మరియు సంయోగము సార్వత్రికము కాదు. సంబంధము సార్వత్రికము. అనగా ద్రవ్యము, గుణము అనునియమము లేకుండగా పదార్థమాత్రమునకు యోజన చేసెడిది సంబంధము.

*విశేషాంశము*—(1) సంయోగము సార్వత్రికము కాదనెడి భావమును నిరూపించుటకై శ్లోకమున 'కస్యచిత్', 'కేనచిత్', 'కాచిత్' అను పదములు ప్రయోగింపబడినవి. అనగా సావయవములగు ద్రవ్యములకు సంయోగము కలుగును. దానివలన విశిష్టమగు ద్రవ్యము జనియించును.

---

* రూపము, రసము, గంధము, స్పర్శ, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, గురుత్వము, ద్రవత్వము, స్నేహము, శబ్దము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సంస్కారము- ఈ రీతిగా తార్కికులు 24 గుణములను చూపియున్నారు. ఇవి గుణ సముద్దేశమున మరల చూపబడగలవు.

(2) సంయోగమును తప్పక స్వీకరింపవలెననెడి భావమును స్ఫురింపజేయుటకై కారికలో 'కార్యప్రసవసూచితా' అను పదము ప్రయోగింపబడినది. సంయోగమే లేనిచో వస్త్రము మున్నగు కార్యములు పుట్టకపోయెడివి వేరువేరుగా దారములున్ననువాని సంయోగము లేనిది వస్త్రము నిష్పన్నము కాదుకదా ! కాగా, సంయోగమనుమానప్రమాణగమ్యమగును ॥7॥

*అవతారిక* — సమవాయము సంబంధము కానేరదు. దానికి గూడ కొన్ని యుపాధులున్నవి అని 6 వ శ్లోకమున చెప్పబడినది. ఆ యంశమునే నిరూపించుటకై సమవాయస్వరూపమును జూపుచున్నాడు

శ్లో॥ నిరాత్మకానా ముత్పత్తౌ నియమః క్వచిదేవయః ।
తేనైవాఽవ్యపవర్గశ్చ ప్రాప్త్యభేదే స యత్కృతః ॥ 8

ఆత్మాన్తరస్యయే నాత్మా తదాత్మేవావధార్యతే ।
యతశ్చైకస్య నానాత్వం తత్త్వం నాధ్యవసీయతే ॥ 9

తాం శక్తిం సమవాయాఖ్యాం శక్తీనాముపకారిణీమ్ ।
భేదాభేదావతిక్రాన్తా మన్యథైవ వ్యవస్థితామ్ ॥ 10

ధర్మః సర్వపదార్థానామతీతః సర్వలక్షణః ।
అనుగృహ్ణాతి సంబన్ధ ఇతి పూర్వేభ్య ఆగమః ॥ 11

1. నిరాత్మకానామ్ = స్వరూపములేని వస్తువులకు అనగా కారణ వ్యాపారము లేని సమయమున ఆ రూపములతో లేని వస్త్రముమున్నగు వస్తువులకు, క్వచిత్, ఏవ = ఏదో ఒకచోటు నందే అనగా సర్వత్ర కాక నియమితమగు కారణమునందే, ఉత్పత్తౌ = పుట్టుక కలుగుట విషయమై, యః = ఏ, నియమః = నియమమో, దారముల వ్యాపారముచే వస్త్రము జనియించును. ఆ వ్యాపారమునకు ముందు వస్త్రము లేనేలేదు. అట్టి వస్త్రము దారముల యందే కలుగును. ఘటము కపాలములయందే కలుగును అట్టి ఏనియమమో ; మరియు, ప్రాప్త్యభేదే + అపి = 'ప్రాప్తి' అను అంశము సమానమే ఐనను, అనగా ఇంతకు మునుపు వస్తువులకు సంబంధము లేకున్నను ఇప్పుడు సంబంధము కలిగియుండుట సంయోగసమవాయములకు సమానమే ఐనను, తేన + ఏవ = ఆకారణముతోనే, అవ్యపవర్గః + చ = భేదము లేకుండుట అను ఏ నియమమో, కలయికలేని ఘటపటములకు సంయోగముకలుగును. అట్లే వస్త్రమను కార్యముతో ఇంతకుమునుపు సంబంధములేని దారములకు వస్త్రముతో సంబంధము కలుగును. ఇట్టి సామ్యము సంయోగమునకు సమవాయమునకు ఉన్నను సంయుక్తములగు ఘటపటములు వేరుకాగలవు. వస్త్రముమాత్రము తనకు కారణములగు దారముల నుండి వేరు కానేరదు, ఎల్లకాలములందు కలసియే యుండును. అనగా కారణములగు దారములను విడనాడి వస్త్రముండనేరదు. సంయోగసమవాయముల కిదియే భేదము.

సః = అట్టినియమము, యత్కృతః = దీనిచేకలుగుచున్నదో, ఇచట యచ్ఛబ్దార్థము సమవాయము. ఇంతకు ముందు లేని వస్త్రము సమవాయమును బట్టి దారములయందే పుట్టును. ఘటము కపాలముల యందే పుట్టును. ఇంతియే కాని ప్రతివస్తువు ప్రతికారణమునందు పుట్టదు. సమవాయమును బట్టియే కార్యమునకు కారణముతో అభేదము కలుగును.

పై రెండు విధములగు నియమము దేనివలన జరుగు చున్నదో, అది *సమవాయ మని భావము.

2. యేన = దేనిచే, ఆత్మా = ద్రవ్యము, ఆత్మాన్తరస్య = మరియొక ద్రవ్యమునకు, తదాత్మా + ఇవ = అదేస్వరూపము కలదివలె, అవధార్యతే = నిశ్చయింపబడుచున్నదో.

దారము లనెడి కారణద్రవ్యముచే వస్త్రమనెడి కార్యద్రవ్యము జనియించును. తరువాత ఇది కారణము, ఇది కార్యము అని వేరుగా చెప్పుటకు సాధ్యము కానందున రెండు ద్రవ్యములు ఒకే ద్రవ్యముగా నిశ్చయింపబడుచున్నవి. అట్టి నిశ్చయము సమవాయమువల ననే కలుగు చున్నది.

పైసందర్భము బట్టి చూడగా ఒకదానిని ఒకటి విడనాడి యుండని పదార్థములకు సమవాయము సంబంధమని తెలుచున్నది— అవయవము, అవయవి (దారములు అవయవ ములు, వస్త్రము అవయవి) గుణములు గుణి, (తెలుపు నలుపు మున్నగునవి గుణములు, కడవ మున్నగునది గుణి) క్రియ, ద్రవ్యము (వండు మున్నగునది క్రియ, ఆపనిచేయువాడు ద్రవ్యము)

జాతి, ద్రవ్యము (ఘటత్వము మున్నగునది జాతి, కడవ మున్నగునది ద్రవ్యము) వీనిని 'అయుత సిద్ధము' లందురు. ఎన్నడు ఒకదానిని ఒకటి విడిచి ఉండనివని భావము. కాగా సమవాయమునకు అయుతసిద్ధత్వము ఉపాధి యని వ్యక్తమగుచున్నది.

3. యతః + చ = దేనివలన, ఏకస్య = ఒకే వస్తువునకు అనగా వస్త్రము మున్నగు అవయవి ద్రవ్యమునకు, నానాత్వమ్ = భేదము అనగా కారణములగు దారములు మున్నగు అవయవములకంటె అవయవికి భేదముగాని, తత్త్వమ్ = అభేదముగాని, న + అధ్యవసీయతే = నిశ్చయింపబడదో.

అవయవావయవులు, గుణగుణులు మున్నగు వానికి సమవాయము సంబంధము. అచట కార్యకారణములకు కొందరు భేదమును, మరికొందరు అభేదమును అంగీకరింతురు.

---

* అసత్కార్యవాదము నాశ్రయించి యీ రీతిగా సమవాయము నిరూపింపబడినది. కారణ వ్యాపారముకంటె పూర్వము కార్యము (అసత్) లేదు అని ఆ వాదముయొక్క యాశ యము, దారముల వలన వస్త్రము నిష్పన్నమగును. ఇంతకుమునుపు లేని వస్త్రము దారముల నుండి పుట్టుచున్నది. ఈ యాశయముతో "నిరాత్మకానామ్" అని భర్తృహరి పలికెను. సత్కార్యవాదమున కార్యము కారణ వ్యాపారముకంటె పూర్వము కూడ (సత్తే) ఉన్నదే కనుక అచట నియతముగనే కార్యము వ్యక్తమగును. అనియమము ప్రసక్తము కాదు. కనుక ఆ వాదమున ఈ గ్రంథము సమన్వయింపబడదు.

అట్టితరిని అచట కార్యకారణములకు భేదమే అనిగాని, అభేదమే అని గాని నిశ్చయింపజాలము.

4. శక్తీనామ్ + అపి = శక్తులకు గూడ, అనగా దారములు మున్నగుకారణ ద్రవ్యముల యందున్న కార్యానుకూలములగు శక్తులకు గూడ, ఉపకారిణీమ్ = ఉపకరించునట్టియు,

వస్త్రమునిష్పన్నమగుటకు కావలసిన సామర్థ్యము దారముల యందున్నది. ఆ సామర్థ్యము కార్యరూపము ధరియింపవలెనన్నచో సమవాయముండవలెను. అది లేనిది కార్యము జనియింపనేరదు.

5. కనుకనే, శక్తిమ్ = శక్తిరూపముగా నున్నట్టియు,

విలక్షణములగు అవయవముల వలన విలక్షణమగు అవయవి జనియించుటలో శక్తిరూపమైనది సమవాయము.

6. కనుకనే, భేదా భేదౌ = భేదమును అభేదమును గూడ, అతిక్రాన్తామ్ = అతిక్రమించి యున్నట్టియు, శక్తులను వస్తువులతో వేరు చేసి భిన్నరూపమున గాని, వేరుచేయక అభిన్నరూపమున గాని చెప్పగలవి కాదు.

7. అన్యథా + ఏవ = రూపాంతరముననే, వ్యవస్థితామ్ = నిశ్చితమగునట్టి,

ఎల్లపదార్థములకంటె విలక్షణముగా సమవాయమున్నది. పదార్థములను కొన్నిటితో భిన్నరూపమున, కొన్నిటితో అభిన్నరూపమున గుర్తింపవచ్చును. సమవాయమట్టిదికాదు.

సమవాయాఖ్యామ్ = సమవాయమనే పేరుగలశక్తిని, సర్వపదార్థానామ్ = ఎల్ల పదార్థములకు, అతీతః = విలక్షణమగునట్టియు, ఏపదార్థమైనను శబ్దముచే బోధింపబడును, సంబంధము మాత్రము ఏశబ్దము చేతను బోధింపబడదని భావము.

కనుకనే, సర్వలక్షణః = ఎల్లవస్తువులచే గుర్తింపబడుచున్నట్టి

ఏవస్తువైనను కార్యమును జనియింపవలెనన్న, సంబంధమపేక్షిత మగును. అది లేనిది ఆకార్యమును కలిగింపలేదు. ఆ కార్యమును బట్టి సంబంధమున్నట్లు ఊహింపవచ్చును. కాగా అనుమాన ప్రమాణముచే సంబంధము తెలియబడుచున్నది.

సంబన్ధః = సంబంధమనెడి, ధర్మః = ధర్మము, అనుగృహ్ణాతి = అనుగ్రహించుచున్నది. అనగా అయుత సిద్ధమైనదానిగా నియమించుచున్నది. పారతంత్ర్యమనెడి సామ్యమునుబట్టి, సంబంధము అను వ్యవహారమును గూడ కలిగించుచున్నది. ఇతి = అని, పూర్వేభ్యః = ప్రాచీనుల నుండి వచ్చెడి, ఆగమః = శబ్దము, (శ్రూయతే) = వినబడుచున్నది. ఇట్టి ప్రయోజనమును కలిగించెడి సంబంధము స్వతంత్రమగుపదార్థమని పెద్దల వ్యవహారమువలన తెలియబడుచున్నదని భావము.

ఒకవేళ అవియు సంబంధములు కావలెనన్నచో, ఈ రీతిగా సమన్వయము చేయవలెనని మూడున్నర (13, 14, 15½) శ్లోకములచే చూపుచున్నాడు.

శ్లో॥ సమవాయః స్వ ఆధారః సాచజాతిః ప్రతీయతే।
ఏకార్థ సమవాయాత్తు గుణాః స్వాధార ఏవతే ॥ 13

A. స్వః = స్వీయమగు గగన, ఆకాశ, మున్నగుశబ్దములకు స్వీయమగు, ఆధారః = ఆధారము అనగా ఆధారమగు ఆకాశము, సా = తనకు సంబంధించి యున్న, అనగా శబ్దముల యందున్న, జాతిః + చ = జాతియును అనగా శబ్దత్వ జాతియును, సమవాయాత్ = సమవాయ సంబంధము వలన, ప్రతీయతే = తెలియబడుచున్నది.

కణాదతర్కము తొమ్మిది* ద్రవ్యములను జూపియున్నది. వానిలో ఆకాశమొకటి. ఆతర్కము చూపిన 24 గుణములలో శబ్దమొకటి. ద్రవ్యమునకు గుణమునకు సమవాయము సంబంధము. శబ్దము ఆకాశము యొక్క గుణము, "శబ్దగుణకమాకాశమ్" (శబ్దమనెడి గుణము కలది ఆకాశము) అనితార్కికులు చెప్పుదురు. కాగా గగన, ఆకాశ, నభః, అన్తరిక్ష మున్నగు శబ్దములు వానికి సమవాయియగు ఆకాశమును సమవాయ సంబంధమును బట్టి బోధింపగలవు.

అట్లే శబ్దమునందు, శబ్దత్వ జాతి సమవేత మగును. అందుచే శబ్దము సమవాయ సంబంధముచే ఆ జాతిని బోధింపగలదు.

B. స్వాధారే + ఏవ = తనకు అనగా శబ్దమునకు ఆధారమగు ఆకాశముననే ఉన్న, తే = ప్రసిద్ధములగు, గుణాః = గుణములు అనగా మహత్త్వము మున్నగు గుణములు, ఏకార్థసమవాయాత్ + తు = ఒకే ఆకాశమనే అర్థము నందు సమవాయ సంబంధము వలననే, ప్రతీయన్తే = తెలియబడుచున్నవి.

మహత్త్వమ్ మున్నగు శబ్దములు, మహత్త్వము మున్నగు గుణములు గూడ ఆకాశమనే ద్రవ్యమునందు సమవాయ సంబంధముచే నున్నవి. ఆ సంబంధముచే అనగా ఏకార్థ సమవాయ సంబంధముచే మహత్త్వాది శబ్దములుమహత్త్వాది గుణములను బోధింపగలవు.

ఇట్లే ఆకాశమునకు అసాధారణములగు గర్జిత, కూజిత, మణిత, హేషితములు మున్నగుశబ్దములు కూడ ఏకార్థ సమవాయ సంబంధముచే ఉరుము మున్నగు అర్థములను బోధింపగలవు. ॥13॥

*అవతారిక*— మరికొన్నిశబ్దములకు అర్థముతో సమవాయము సంబంధముగా సంభవించునని చెప్పుచున్నాడు.

---

* (1) పృథివి, (2) అప్పు (ఉదకము), (3) తేజము, (4) వాయువు, (5) ఆకాశము, (6) కాలము, (7) దిక్కు, (8) ఆత్మ, (9) మనస్సు. ఈ తొమ్మిది ద్రవ్యములు.

శ్లో॥ ద్రవ్యత్వసత్తా సంయోగాః స్వాన్యాధారోపబన్ధనాః ।
తత్రప్రదేశ విభాగాశ్చ గుణాద్విత్వాదయశ్చయే ॥ 14

స్వాన్యాధారోపబన్ధనాః = స్వీయమగు శబ్దమునకు స్వీయమగు ఆకాశమనెడి ఆధారము. దాని కంటె ఇతరమగు పృథివి మున్నగు ఆధారమును ఆశ్రయముగా గల అనగా ఆకాశముచేత పృథివ్యాదులచేతను గూడ నియమింపబడు చున్న, ద్రవ్యత్వ సత్తాసంయోగాః = ద్రవ్యత్వము, సత్త, సంయోగము అనునవి, తత్రప్రదేశ విభాగాః+చ=ఆకాశము యొక్క అవాంతర ప్రదేశములు, దాని విభాగములు, చ = మరియు ద్విత్వాదయః = ద్విత్వము మున్నగు, యే = ఏ, గుణాః = గుణములో అనగా ద్విత్వ, పరిమాణ, సంయోగ విభాగములు మున్నగు గుణములో, (తే) = అవియు, (ఏకార్థ సమవాయాత్) = ఏకార్థ సమవాయమనే సంబంధము వలన, ప్రతీయన్తే = తెలియబడు చున్నవి.

ద్రవ్యత్వమనే జాతి పృథివి మున్నగు తొమ్మిది ద్రవ్యములయందు ఉండును. సత్తాజాతి ద్రవ్య-గుణ-కర్మలయందుండును. సంయోగము ద్రవ్యములయందే ఉండును. ద్రవ్యత్వ-సత్తా, సంయోగ శబ్దములు ఆకాశమునందు సమవాయ సంబంధముచే నుండును. సత్తాజాతి, సంయోగమనే గుణము కూడ ఆకాశమునందు సమవాయ సంబంధముచే నుండును. ద్రవ్యత్వము పృథివ్యాదుల యందు గూడ ఉండును. కాగా స్వాశ్రయమునందు, ఇతరము లగు పృథివ్యాదులయందును ద్రవ్యత్వాదులుండును. అవి ఆకాశముచేత పృథివ్యాదులచేతను స్వాశ్రయముల యందు నియమింపబడియున్నవి. కాగా పైశబ్దములు ద్రవ్యత్వాదులను ఏకార్థ సమవాయమనే సంబంధముచే బోధింపగలవు.

అట్లే ఆకాశమునకు ఇతర పదార్థములతో సంబంధము కలుగగా కొన్ని ప్రదేశములు, విభాగములు కలుగును. అచటను ప్రదేశ-విభాగశబ్దములు ఆకాశమునందే ఉన్నవి. ప్రదేశాదులు అచటనే యున్నవి. కాగా పై శబ్దములు పై యర్థములను పై సంబంధముచే బోధింపగలము.

అట్లే ద్విత్వాది శబ్దములు ద్విత్వాది గుణములు ఆకాశమునందుండుటచే పై సంబంధముచే ఆశబ్దములు వానిని చెప్పగలవు. ॥14॥

*అవతారిక*— అట్లే మరికొన్నిశబ్దములు అర్థములను బోధించుటలో సమవాయ సంయోగములు సంబంధములుగా సంభవించుచున్నవని చెప్పుచున్నాడు.

శ్లో॥ కేచిత్స్వాశ్రయ సంయుక్తాః కేచిచ్చ సమవాయినః ।
సంయుక్తసమవేతేషు సమవేతా స్తథాపరే ॥ 15

1. కేచిత్ = కొన్నిశబ్దములు అనగా రథము, ఘటము మున్నగుశబ్దములు, స్వాశ్రయ సంయుక్తాః = తనకు ఆశ్రయమగు దానితో కలసియున్నవి.

రథ-ఘటాది శబ్దములు, రథము, ఘటము మున్నగు అర్థములను బోధింపవలెను. అచట స్వాశ్రయ సంయోగము సంబంధము. స్వ = రథాది శబ్దములు, వానికి ఆశ్రయము ఆకాశము, దానితో సంయోగము రథాదులకు కలదు. కాగా, స్వసమవాయి సంయోగము సంబంధము అనినను అదియే యర్థము.

2. కేచిత్ + చ = మరికొన్ని శబ్దములు అనగా ఘటరూపమ్ మున్నగు శబ్దములు, సమవాయినః = సమవాయము కలవై బోధకములగును.

ఘటరూపమ్ (కడవయొక్క తెలుపు నలుపు మున్నగురూపము) అను శబ్దమునకు ఆశ్రయము ఆకాశము. దానితో సంయుక్తము కడవ, దానియందు సమవేతము రూపము, కాగా స్వాశ్రయ సంయుక్త సమవాయము సంబంధము కాగలదు.

3. తథా = అట్లే, పరే = మరికొన్ని అనగా ఘటరూపత్వము మున్నగునవి, సంయుక్తసమవేతేషు = సంయుక్తమగు దానియందు సమవాయసంబంధమున నున్న వాని యందు, సమవేతాః = సమవాయ సంబంధముచే నున్నవై, బోధ్యములగుచున్నవి.

ఘటరూపత్వమ్ (కడవయొక్క రూపమునందున్న రూపత్వజాతి) ఇచట స్వాశ్రయ సంయుక్త సమవేత సమవాయము అను సంబంధము కలదు. స్వ = ఘటరూపత్వ శబ్దము. దానికి ఆశ్రయము ఆకాశము, దానితో సంయుక్తము కడవ, దానియందు సమవేతము రూపము దానియందు సమవాయమున నున్నది జాతి.

కాగా రథ ఘటాది శబ్దములు స్వాశ్రయ సంయోగ సంబంధమున, ఘటరూపాది శబ్దములు స్వాశ్రయ సంయుక్త సమవాయసంబంధమున, ఘటరూపత్వాది శబ్దములు స్వాశ్రయ సంయుక్త సమవేత సమవాయసంబంధమున అర్థబోధకములగుచున్నవి. ॥15॥

*అవతారిక*— మరికొన్ని శబ్దములకు అర్థములతోగల సంబంధములను జూపుచున్నాడు.

**శ్లో॥ స్వాశ్రయేణతు సంయుక్తైః సంయుక్తం విభుగమ్యతే ।
సమవాయస్య సంబన్ధోనా పరస్తత్ర విద్యతే ॥** 16

A. విభు + తు = *విభువు అగు పదార్థము మాత్రము, స్వాశ్రయేణ = తనకు ఆశ్రయమగు దానితో అనగా దిక్కాలాత్మ శబ్దములకు ఆశ్రయమగు ఆకాశముతో, సంయుక్తైః = సంయుక్తములగు వానితో, సంయుక్తమ్ = కలసి యున్నదై, గమ్యతే = తెలియబడుచున్నది.

దిక్కు, కాల, ఆత్మ అను శబ్దములకు ఆశ్రయము ఆకాశము. ఆ యాకాశముతో భూమి, నీరు, తేజము మున్నగునవి కలసియున్నవి. వానితో దిక్కాలాత్మలు కలిసియున్నవి. కాగా స్వాశ్రయ సంయుక్త సంయోగము సంబంధము కాగలదు.

---

* ఎల్లమూర్త ద్రవ్యములతో సంయోగము కలది 'విభువు' అని యనబడును. పరిచ్ఛిన్నమగు పరిమాణము కలది 'మూర్తము' అని యనబడును. కాక క్రియావత్తు మూర్త మనబడును.

B. పై రీతిని 3$\frac{1}{2}$ శ్లోకములచే శబ్దములకు అర్థములతో సంయోగ సమవాయములు సంబంధములు కాగలవని చూపబడినవి. కాని యట్లు చూపుట సరిపడదు. అట్లైన అవ్యాప్తి అనగా లక్షణము కొన్ని లక్ష్యములలో ప్రవర్తింపకుండుట అను దోషము కలుగునని చెప్పు చున్నాడు. సమవాయస్య = సమవాయమునకు, సంబన్ధః = సంబంధము, న = కుదరదు.

రథము మున్నగు శబ్దములు ద్రవ్య బోధకములు. వానికి ఆకాశము ద్వారా వాని యర్థములకు సంయోగమో, సమవాయమో రెండు కలిసియో సంబంధముగా చూపబడు చున్నది. 'సమవాయ' అను శబ్దము సమవాయమును చెప్పవలెను. అచట సంయోగము సంబంధముగా నుండనేరదు. సమవాయము ద్రవ్యము కానందున దానికి ఆకాశము ద్వారా సంయోగముండనేరదు. ద్రవ్యములకే సంయోగము కలుగును.

తత్ర = దానియందు అనగా సమవాయమునందు, అపరః = మరియొక, సమ వాయః=సమవాయము, న + విద్యతే= లేదు.

'సమవాయ' అను శబ్దమునకు దాని యర్థముతో సమవాయ సంబంధమును చూపుటకు వీలులేదు. సమవాయ మొక్కటియే (సమవాయస్తు ఏక ఏవ) అని తార్కికులు సిద్ధాంతము చేసియున్నారు. అట్టితరి మరియొక సమవాయ మెట్లుండును ?

కాబట్టి 'సమవాయ' అను శబ్దము సంయోగ సమవాయములను సంబంధములుగా గైకొని సమవాయమును బోధింపజాలదు. ॥16॥

**అవతారిక**— శబ్దార్థములకు సంయోగ సమవాయములు సంబంధములుగా నుండుట ఈ రీతిగా సంభవించునని 3$\frac{1}{2}$ శ్లోకములతో జూపి, 16 వ శ్లోకముయొక్క ఉత్త రార్ధముచే దానిని దూషించి, "తేన శబ్దార్థః ప్రవిభక్తుం నశక్యతే" (సంయోగముచేత సమ వాయము చేతను శబ్దార్థములు విభజింపబడవు) అను 12 వ శ్లోకము యొక్క అర్థమునే విశదపరచుచున్నాడు.

**శ్లో॥ సంబన్ధస్యావిశిష్టత్వాన్న చాత్రనియమో భవేత్ ।
తస్మాచ్ఛబ్దార్థయోర్నైవ సంబన్ధః పరికల్ప్యతే ॥** 17

A. సంబన్ధస్య = సంబంధము, అవిశిష్టత్వాత్ = విశిష్టరూపమున లేనందున అనగా సంబం ధము విశేషరూపముగా లేకపోవుటవలన, అత్ర = ఇందు అనగా శబ్దముచే నర్థమును బోధిం చుట యందు, నియమః = నియమము, న + భవేత్ = కలుగకిపోయెడిని.

ఈ శబ్దమునకు ఈ యర్థముతో ఇది సంబంధమని విశేషరూపముగా చెప్పలేనందున ఘట శబ్దముచే కడవయే బోధింపవలెను. పటము బోధింపబడదు అను నిశ్చయము లభింపదు. కాగా ఎల్ల శబ్దములు ఎల్ల యర్థములను బోధింపవలెను. అట్లు అనుభవము లేదు.

కాక, సంబన్ధస్య = సంబంధము, అవిశిష్టత్వాత్=సమానమగుటవలన నియమము లేకపోయెడిని,

ఆకాశ శబ్దము స్వసమవాయ సంబంధమున ఆకాశమును బోధించునని యంగీకరించిన ఘట శబ్దమునకు ఆకాశముతో పై సంబంధముండుటవలన ఘటశబ్దము కూడ ఆకాశమును బోధింపవలెను. ఇట్లే ఘటశబ్దము స్వాశ్రయ సంయోగ సంబంధమున (స్వ = ఘట శబ్దము. దానికి ఆశ్రయము ఆకాశము దాని సంయోగము ఘటమునకు కలదు) ఘటమును బోధించునని యంగీకరించిన అట్టి యాకాశము యొక్క సంయోగము పటమునకు గూడ నున్నందున ఘట శబ్దము పటమును గూడ బోధింపవలెను.

సంయోగ సమవాయములు ఎల్ల వస్తువులకు సమానములగుటంజేసి నియతమగు వాచ్యవాచక భావము ఏర్పడదు

B. తస్మాత్ = ఆ కారణమువలన, శబ్దార్థయోః = శబ్దమునకు అర్థమునకును, సంబన్ధః= సంబంధము అనగా సంయోగము సమవాయము అనే సంబంధము, న + ఏవ + కల్పతే = కుదరనేరదు.

సమవాయ శబ్దము సమవాయమును చెప్పుటకు సంబంధము లేనందున నచట అవ్యాప్తిదోషము, ఆకాశ-ఘటాది శబ్దములచే ఆకాశ-ఘటాదుల బోధింపవలసిన, నచట అతివ్యాప్తిదోషము కలుగుచున్నందున శబ్దార్థముల విషయమై పై రెండు సంబంధములు గ్రహింపరాదు. ॥17॥

*అవతారిక*— శబ్దార్థములకు సంయోగ సమవాయములు సంబంధములుగా పరిగ్రహింపబడవని నిరూపింపబడినది. కాని యందు చూపబడిన దోషము లోకవిధముగ పరిహరింపవచ్చునేమోయని పరిహారోపాయమును జూపుచున్నాడు.

**శ్లో॥ అదృష్టవృత్తి లాభేన యథాసంయోగ ఆత్మనః ।**
**క్వచిత్ స్వస్వామి భావాఖ్యోఽభేదేఽన్యత్రాపి సక్రమః ॥** 18

యథా = ఏ రీతిగా, ఆత్మనః = ఆత్మకు అనగా జీవునకు సంయోగే = సంయోగము, అభేదే = ఎల్ల ద్రవ్యములతో సమానమే ఐనను, అదృష్టవృత్తి లాభేన = అదృష్టముయొక్క అనగా ధర్మాధర్మములయొక్క ఫలమును కలిగించుటకై కలిగెడి వ్యాపారమును పొందుటచే, క్వచిత్ = ఏదో ఒకదాని యందే, స్వస్వామిభావాఖ్యః = స్వస్వామి భావమనెడి సంబంధము, (అస్తి) = కలుగునో ;

తథా = అట్లే, అభేదే = సంబంధభేదము లేకున్నను, అనగా 17వ శ్లోకమున చూపిన ప్రకారము సంబంధము అవిశిష్టమైనను, అన్యత్ర + అపి = శబ్దార్థముల విషయమున గూడ, సః + క్రమః = ఆ క్రమము అనగా నియమము, (అస్తి) = కలుగును.

జీవ పదార్థము ఎల్ల వస్తువులను వ్యాపించియుండును. అది వైశేషికతర్కము ప్రకారము ద్రవ్యము-శరీరము, గృహము, ఘటము, వృక్షము, తటస్థములగు నదీ పర్వ

ఖాదిరేబధ్నాతి అనువచనముచే బంధనమువిధింపబడినది. అచట బంధనమనగా యూపస్తంభమునకు పశువు (మేక)ను స్పృశించుటమాత్రము, అనగా స్తంభమునకు మేకను తగిలేటట్లుచేయుటకాదు. అట్లైన బంధనము తరువాత, ఆపశువును చంపుట, దాని హృదయమునుండి మాంసము గ్రహించుట, ఇవియన్నియు శ్రుతిలో చెప్పబడియున్నవి కుదరవు. ఆపశువు సంబంధించి యున్నంతమాత్రాన చంపుట మున్నగునవి జరుగవు. అట్లైన చంద్రకట్టి చిన్నకొమ్మతో సంసర్గము చాలదు. అందు బంధనానంతరము చెప్పబడిన హననాదిక్రియా కలాపము యొక్క సామర్థ్యము వలన సమర్థమగు కఱ్ఱను గ్రహింపవలెనని లభించున్నది. కాబట్టి బంధనానంతరము చెప్పబడిన హింసాకలాపమును హేతువుగా గ్రహించి హింసకు సమర్థమగు ఖదిరమును గ్రహింపవలెనని పర్యవసన్న మగుటచే ప్రతినిధి దీనివలన లభించుచున్నది.

*విశేషాంశము*—4వ శ్లోకమున జాతి అప్రధానమై శక్తికి ఉపాయమగుటచే ప్రతినిధి యుపపన్నమగునని నిరూపింపబడినది. 5వ శ్లోకమున జాతిప్రధానమే, శక్తికి ఉపలక్షణము కాదని స్వీకరించినను లింగమువలన ప్రతినిధి సమర్థింప బడినది.

కాక బంధనము ప్రతినిధిలో హేతువని 4వ శ్లోకమున, బంధనము తరువాత చెప్పబడిన హింసాదికము ప్రతినిధిలో హేతువని 5వ శ్లోకమున చెప్పబడినది, కాగా రెండు శ్లోకములు అనుమాన ప్రమాణముచే ప్రతినిధి సమర్థకములని తేలుచున్నది.

కాక పదార్థసామర్థ్యము తరువాత వాక్యార్థ సామర్థ్యమువలన ప్రతినిధి సమర్థింప బడినదని 4వ శ్లోకమున, ప్రకరణ సామర్థ్యమువలన ప్రతినిధి సమర్థింపబడినదని 5వ శ్లోకమున భావము స్పష్టమగుచున్నది. ॥5॥

*అవతారిక*—పైరీతిని జాతి శక్తివాదమున ప్రతినిధి యుపపన్నమగుచున్నదని చూపబడినది.కాని శబ్దములు అర్థమును బోధించుటలో ప్రవృత్తి నిమిత్తము అపేక్షిత మగుచున్నది.ఉదా॥ ఘటశబ్దము కడవను బోధింపవలెనన్నచో దానియందున్న ఘటత్వజాతి ప్రవృత్తినిమత్తమగుచున్నది.

ఎల్లశబ్దములకు జాతియే వాచ్యమగుచో ప్రవృత్తి నిమిత్తములేనందున శబ్దము బోధకముకానేరదు. జాతియందు మరియొకి జాతిలేదుకదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్వా జాతిః ప్రథమంశబ్దైః సర్వైరేవాభిధీయతే।**
**తతోఽర్థజాతి రూపేషు తదధ్యారోప కల్పనా॥ 6**

A. సర్వైః + శబ్దైః + ఏవ = ఎల్లశబ్దములచేతనే, ప్రథమమ్ = ముందుగా, స్వా = ఆత్మీయమగు అనగా తనకు అసాధారణమగు, జాతిః = జాతి, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాదులు వీని యన్నిటితో ఆత్మ సంయుక్తమగును. అంత మాత్రాన ఎల్ల వస్తువులు తనవే యని, వానికి తాను స్వామియని మాత్రము భావింపదు. తాను చేసికొనిన పుణ్య పాపకర్మల ఫలితములగు ధర్మాధర్మములను ఏ కాలమున ఏ దేశమున ఏ రూపమున అనుభవింపవలసి యున్నదో, దానికి అనుగుణముగ జన్మను పొంది శరీరము ఆ ప్రాంతమున తనకు సంబంధించిన గృహాదులు తనకు సొత్తు అని భావించును.

అట్లే ఘటాది శబ్దములకు స్వాశ్రయ సంయోగము సంబంధము. అది ఎల్ల వస్తువులకు సమానమైనను అదృష్టవశమున ఘటాదులనే బోధించును. పటాదులను బోధింపదు.

అదృష్టమనగా ధర్మాధర్మములు. వాని ఫలమును జీవుడు అనుభవించుటకై కలిగెడి వృత్తి వ్యాపారము. దానిని పొందుట లాభము. అది యంతఃకరణ వ్యాపారము ద్వారా కలుగును.

*విశేషాంశము*— కాని ఈ సమాధానము బాగులేదు. అదృష్టమునకు కర్మ మూలము. దానివలన పుణ్యపాపములు, వానివలన ధర్మాధర్మములు కలుగును. అవి ఆత్మకు నియతమగు ఫలము నీయగలవు. శబ్దమునకు అట్టి కర్మ లేనందున పై దృష్టాంతమిచట అన్వయింపదు. ప్రయోగానుసారము నిర్ణయించిన, దానికి ఏదో శబ్దమునకు సహజ శక్తి యుండవలెను. ఈ యభిప్రాయమును హేలారాజు వక్కాణించి యున్నాడు. ॥18॥

*అవతారిక*— సమవాయము సంబంధము కానేరదు. కనుకనే దానిని చెప్పెడి శబ్దము లేదు. 'సమవాయ' అను శబ్దము కూడ దానిని బోధింపజాలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాప్తిం తు సమవాయాఖ్యాం వాచ్యధర్మాతివర్తినీమ్ ।
ప్రయోక్తా ప్రతిపత్తా వా న శబ్దైరనుగచ్ఛతి ॥ 19

ప్రయోక్తా = శబ్దములను ప్రయోగించువాడుగాని, ప్రతిపత్తా + వా = వానిని గ్రహించువాడుగాని, వాచ్యధర్మాతివర్తినీమ్ = శబ్దములచే బోధింపబడెడి అర్థములయొక్క ధర్మమును అతిక్రమించి యున్న, సమవాయాఖ్యామ్ = సమవాయమనే పేరుకల, ప్రాప్తిం+తు = సంబంధమును, శబ్దైః = శబ్దములచే, న + అనుగచ్ఛతి = తెలిసికొనుట లేదు.

మనుష్యుడు తన బుద్ధిలో నొక యర్థమును నిరూపించి దానికి అనుగుణమగు శబ్దమును ప్రయోగించును. అట్టి శబ్దమును వినువాడు ఆ శబ్దమును దానిచే బోధింపబడెడి యర్థమును గ్రహించును. ఇరువురు కూడ సమవాయమును శబ్దవాచ్యముగా గ్రహించి యుండ లేదు. అనగా ఘటము, పటము మున్నగు అర్థములను, 'ఘట', 'పట', మున్నగు శబ్దములచే బోధింపదలచినట్లు సమవాయమును ఏ శబ్దముచేతను బోధింపజాలకున్నారు. కారణమేమనగా— ఉపాధితో గూడియున్న అర్థమే శబ్దవాచ్యమగును. ఘటమునకు జాతి, నలుపు తెలుపు మున్నగువానికి గుణము, వంటవాడు పాఠకుడు మున్నగువానికి క్రియయు, ఉపాధులు కలవు.

వానినే ఆ శబ్దములకు ప్రవృత్తి నిమిత్తములందురు. అవియే వాచ్యధర్మములుగా పరిగణింపబడు చున్నవి. అట్టి ధర్మములు లేని యర్థమును శబ్దము బోధింపజాలదు. సమవాయమునందు ఏ ధర్మములు లేవని తార్కికుల నిర్ణయము. అట్టితరి ఏ శబ్దము దానిని చెప్పగలదు ?

ఒకవేళ సమవాయము స్వతంత్ర పదార్థమేయని యంగీకరించిన, దానికి కొన్ని ధర్మము లుండవలెను. అట్టితరి నది తార్కికులు చెప్పిన సమవాయము కానేరదు.

కాబట్టి సమవాయమును బోధించెడి శబ్దము లేదు. అది అవాచ్యమే. ॥19॥

అవతారిక— 6వ శ్లోకమునుండి యింతవరకు సంయోగ సమవాయములు సంబంధములు కానేరవనియు, అందును సమవాయము శబ్దమునకు వాచ్యము కానేరదనియు నిరూపించియున్నాడు.

ఇప్పుడు *నైయాయికుడు ఛలమునుపయోగించి సమవాయము శబ్దవాచ్యము కాగలదని 20వ శ్లోకమునుండి 30వ శ్లోకమువరకు నిరూపించుచున్నాడు.

**శ్లో॥ అవాచ్యమితి యద్వాచ్యం తదవాచ్యతయా యదా ।**
**అవాచ్యమిత్యవసీయేత వాచ్యమేవ తదాభవేత్ ॥ 20**

అవాచ్యమ్ + ఇతి = 'అవాచ్య' అను శబ్దముచే, యత్ = ఏది, వాచ్యమ్ = చెప్పబడుచున్నదో, తత్ = అదే, యదా = ఎప్పుడు, అవాచ్యతయా = అవాచ్యత్వరూపమున, వాచ్యమ్ = వ్యవహరింపదగినది. ఇతి = అని, అవసీయేత = నిశ్చయింపబడినదైన యెడల, తదా = అపుడు, వాచ్యమ్ + ఏవ = వాచ్యమైనదే, అనగా శబ్దముచే బోధింపబడినదే, భవేత్ = కాగలదు.

సమవాయము అవాచ్యము అని చెప్పిన దాని యర్థమును పరిశీలింపగా అది శబ్దవాచ్యమనియే తేలుచున్నది. అవాచ్యము అను శబ్దమునకు ఏదో అర్థము చెప్పవలెను. ఘట శబ్దమునకు ఘటత్వరూపమున ఘట మర్థమగునట్లు అవాచ్య శబ్దమునకు అవాచ్యత్వ రూపమున నొక యర్థము కాగలదు. కాగా సమవాయము అవాచ్యమనగా సమవాయము అవాచ్యత్వ రూపమున అవాచ్య శబ్దమునకు అర్థమని స్పష్టము కాగలదు.

---

* గోతమమహర్షిచే నిర్మింపబడిన తర్కమునకు న్యాయశాస్త్రమని పేరు. అందు (1) ప్రమాణము, (2) ప్రమేయము, (3) సంశయము, (4) ప్రయోజనము, (5) దృష్టాంతము, (6) సిద్ధాంతము, (7) అవయవము, (8) తర్కము, (9) నిర్ణయము, (10) వాదము, (11) జల్పము, (12) వితండము, (13) హేత్వాభాసము, (14) ఛలము, (15) జాతి, (16) నిగ్రహస్థానము అను 16 పదార్థములు నిరూపింపబడినవి. వక్త యొక్క యభిప్రాయముతో పలికిన శబ్దమునకు అర్థాంతర కల్పనచేసి యాక్షేపించుట ఛలము. ఉదా. "నవకమ్బలోఽయం బ్రాహ్మణః" (ఈ బ్రాహ్మణుడు నూతనమగు కంబలము కలవాడు.) ఇచట నవ శబ్దమునకు తొమ్మిది అని యర్థముచే, ఇతనికి ఒక కంబళమున్నది. అట్టితరి 'నవకంబలః' అనుట యెట్లు? అని యాక్షేపించుట ఛలము.

కాగా సమవాయము అవాచ్యమను భావము సరియగునదే.

సమవాయము వాచ్యముకాదని సామాన్యముగా చెప్పగా, అచట ఛలమును ఉపయోగించి, సమవాయము అవాచ్యము, అను దానికి అర్థము ఇది అని ఆక్షేపించెను. అందుచే సమవాయము 'అవాచ్య' శబ్దమునకు వాచ్యము కాగలదు. ॥20॥

అవతారిక — పై రీతిని అంగీకరింపనియెడల, సమవాయము అవాచ్యము, అనెడి ప్రకృతార్థమే సిద్ధింపనేరదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అథాప్యవాచ్యమిత్యేవం న తద్వాచ్యం ప్రతీయతే ।
వివక్షితాఽస్యయాఽవస్థా నేయం నాధ్యవసీయతే ॥** 21

అథ + అపి = ఒక వేళ, అవాచ్యమ్ + ఇతి = అవాచ్యమ్ అను శబ్దముచే, ఏవమ్ = ఈ రీతిగా అనగా అవాచ్యత్వరూపముగా, తత్ = ఆ సమవాయము, వాచ్యమ్ = బోధింపబడినదై, న + ప్రతీయేత + (యది) = తెలియబడకపోయినదైన యెడల, అస్య = ఈ సమవాయమునకు, యా = ఏ, అవస్థా = అవస్థయో అనగా సమవాయమునకు శబ్దవాచ్యత్వము లేదనెడి ఏ నియమమో, సా + ఇయమ్ = ఆ యీ నియమము, న + అధ్యవసీయేత = నిశ్చితము కాకపోయెడిని.

అవాచ్యము అను శబ్దముచే అవాచ్యత్వరూపమున సమవాయము బోధింపబడని యెడల, సమవాయము శబ్దవాచ్యము కాదు అనెడి నియమము అయుక్తమే యగును. అవాచ్య శబ్దము అర్థబోధకిమే కానందున పై నియమము ఎట్లు సిద్ధించును ? అవాచ్య శబ్దము బోధకమే కానిచో సమవాయము వాచ్యమనియే లభించుచున్నది. ఆ శబ్ద మర్థబోధకమగుచో నది అవాచ్యత్వరూపమున సమవాయబోధకమని తెలిసినందున ఆ రూపమున సమవాయము శబ్దవాచ్యమే యగుచున్నది. 'అవాచ్య' అనునదియు శబ్దమేకదా ! ॥21॥

అవతారిక — సమవాయము పారతంత్ర్య రూపమున వాచ్యము కాదనియే తాత్పర్యము. అంతియేకాని ఏ రూపమున గూడ అది వాచ్యముకాదని గ్రహింపరాదు. కాబట్టి ఛలమునకు తావు లేదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అథాన్యథా సర్వథా చ యస్యావాచ్యత్వముచ్యతే ।
తథాపినైవసావస్థా తైశ్శబ్దైః ప్రతిషిధ్యతే ॥** 22

అథ = అట్లుకాక, అన్యథా = ఏదో ఒక ధర్మరూపమున, సర్వథా + చ = ఎల్ల ధర్మరూపమునగాని, యస్య = దేనికి, అనగా ధర్మికి, అవాచ్యత్వమ్ = అవాచ్యత్వము, ఉచ్యతే = చెప్పబడుచున్నదో, తత్ర + అపి = అచటకూడ, సా + అవస్థా = ధర్మరూపమగు అవస్థ అనగా విశేషరూపమగు అవస్థ, తైః = ఆ, శబ్దైః = శబ్దములచే అనగా పారతంత్ర్యము, పరాధీనత్వము మున్నగు శబ్దములచే, న + ఏవ + ప్రతిషిధ్యతే = నిషేధింపబడదు.

సమవాయము వాచ్యముకాదు అనువాని యభిప్రాయమేమనగా— అది పరాధీనము కనుక పరాధీనత అను విశేషరూపమున వాచ్యముకాదని కాని దానియందు ఎన్ని ధర్మములు అనగా ఎన్ని విశేషణములున్నవో, అన్ని రూపములతో వాచ్యముకాదని భావము. ఇదియు సరికాదు. ఏలయన, ధర్మిని నిషేధించినగాని ధర్మములు నిషేధింపబడవు. అందుచే సమవాయము, ఈ విశేషణముతో గూడినదై వాచ్యము కాదు అను రీతిని తత్తద్రూపమున వాచ్యముకాదనియే నిరూపింపవలెను. అపుడు సమవాయము వాచ్యముకాదనియే చెప్పవలెను. అట్టితరి అవాచ్య శబ్దమునకు వాచ్యము కాగలదు. కాబట్టి ఛలము నుపయోగించుటచే సమవాయము 'అవాచ్య' శబ్దమునకు వాచ్యమనుటలో దోషము లేదు. ॥22॥

*అవతారిక*— పై యర్థమునే యుక్తమగు దృష్టాంతముతో సమర్థించుచున్నాడు.

**శ్లో॥ న హి సంశయరూపేర్థే శేషత్వేన వివక్షితే ।**
**అవ్యుదాసే స్వరూపస్య సంశయోఽన్యః ప్రవర్తతే ॥** 23

సంశయరూపే = సంశయరూపమగు జ్ఞానము, అర్థే = సంశయమున విషయమగు వస్తువునందు, శేషత్వేన = విశేషణముగా, వ్యవస్థితే = నిశ్చితము కాగా, స్వరూపస్య = సంశయ జ్ఞానము యొక్క స్వరూపమునకు, అవ్యుదాసే = నాశము లేనపుడు, అనగా ఆ జ్ఞానము అట్లే యుండగా, అన్యః = మరియొక, సంశయః = సంశయము, అనగా సంశయజ్ఞానము విషయముగాగల సంశయము, న + ప్రవర్తతే = ప్రవర్తింపదుగదా !

రెండు వస్తువులకు ధర్మములు సమానముగా నుండగా విశేషధర్మములు తెలియబడనపుడు *సంశయజ్ఞానము కలుగును. కనుచీకటిలో సన్నముగా పొడవుగా ఉన్న వస్తువును జూడగా 'ఇది రాయియా ? కాక మనుష్యుడా ? అను సంశయజ్ఞానము కలుగును. అట్లే కనుచీకటిలో వంకరగానున్న వస్తువును జూడగా త్రాడా ? కాక పామా ? అను సంశయజ్ఞానము కలుగును. వస్తువును ఆధారముగా గైకొనియే జ్ఞానముండును. విషయము లేనిది జ్ఞానముండదు. కనుక జ్ఞానము పరాధీనమే ! పై సంశయ జ్ఞానముండగా మరియొక సంశయము అనగా సంశయజ్ఞానము విషయముగాగల మరియొక సంశయజ్ఞానము కలుగదు. జ్ఞానములో విషయములగు రాయి మనుష్యుడు సంశయితములగును. అంతియేకాని ఆ జ్ఞానము కూడ సంశయితము కానేరదు. ఆ జ్ఞానము తనకంటె నితరములగు వస్తువులను సంశయగ్రస్తముగా జేయును. అది మాత్రము సంశయితము కాదు.

అట్లే 'అవాచ్య' అను శబ్దము తన్ను విడిచి ఇతర శబ్దములచే సమవాయము వాచ్యము కాదనియే చెప్పును. అవాచ్య శబ్దముచే గూడ వాచ్యము కాదని చెప్పదు.

'అవాచ్య' శబ్దము సంశయజ్ఞానము వంటిది. ఆ జ్ఞానము సంశయరూపము కానట్లు

---

* నైయాయికు లంగీకరించిన 16 పదార్థములలో సంశయమొకటి, దీని వివరణము 20 శ్లోకము యొక్క 'ఫుట్ నోట్'లో కలదు.

అవాచ్యశబ్దము వాచకము కాదని చెప్పదు. ఇతరములగు విషయములు సంశయ గ్రస్తము లగుసట్లు సమవాయము ఇతర శబ్దవాచ్యము కాదు. అవాచ్య శబ్దము కూడ వాచకమే కానిచో అది శబ్దమే కాకపోయెడిని, అది వాచకము కాసందున సమవాయము వాచ్యము కాదనెడి యర్థము లభింపనందున అర్థాత్ సమవాయము వాచ్యమనియే లభించును. ॥23॥

*అవతారిక*— పై యర్థమునే మరియొక దృష్టాంతముతో సమర్థించుచున్నాడు.

**శ్లో॥ యదా చ నిర్ణయజ్ఞానే నిర్ణయత్వేన నిర్ణయః ।**
**ప్రక్రమ్యతే తదాజ్ఞానం స్వధర్మేణావ తిష్ఠతే ॥** 24

యదా + చ = ఏ సమయమున, నిర్ణయః = నిర్ణయము, నిర్ణయజ్ఞానే = నిర్ణయమును కలిగించెడి జ్ఞానమునందు, నిర్ణయత్వేన = నిర్ణయత్వ రూపమున, ప్రక్రమ్యతే = ఉపక్రమింపబడుచున్నదో, తదా = ఆ సమయముననే, జ్ఞానమ్ = జ్ఞానము అనగా నిర్ణయ జ్ఞానము, స్వధర్మేణ = జ్ఞానరూపముననే, అవతిష్ఠతే = నిలిచియుండును.

ఆత్మ నిత్యమా ? కాక అనిత్యమా అని సంశయము కలుగగా, బాధకములగు యుక్తులను పారద్రోచి, సాధకములగు యుక్తులను జూపి ఒక పక్షమును స్థిరమైనదానినిగా ఒప్పించి తత్వమును ప్రవర్శించుట, *'నిర్ణయ' మనబడును.

నిర్ణయము జ్ఞానరూపము, అందు ఆత్మయొక్క నిత్యత, అనిత్యత అనునవి విషయములు. వాని నిర్ణయము నిర్ణయత్వరూపమున నుపక్రమింపబడినపుడు ఆ నిర్ణయ జ్ఞానము నిర్ణయరూపము కానేరదు. ఆ జ్ఞానము మరియొక జ్ఞానమున విషయము కాదుకదా ! జ్ఞానను ఎల్లపుడు విషయ పరతంత్రము, కాగా నిర్ణయజ్ఞానము జ్ఞానరూపమును విడనాడక తనకంటె అతిరిక్తమగు విషయమును నిర్ణయించును.

అవాచ్యశబ్దము కూడ నిర్ణయజ్ఞానమువలె నున్నది. అదియు తన్ను విడనాడి ఇతరములగు శబ్దములచే సమవాయము బోధింపబడదనియే చెప్పును. అంతియేకాని 'అవాచ్య' శబ్దముచే గూడ సమవాయము వాచ్యముకాదని చెప్పజాలదు. 'అవాచ్య' శబ్దముచే వాచ్యము కాదని చెప్పెడి మరియొక శబ్దము లేదుకదా !

కాగా సమవాయము అవాచ్యము అని పలుకగా ఇతరములగు శబ్దములకు వాచ్యము కాదనియే లభించును. 'అవాచ్య' శబ్దమునకు మాత్రము అవాచ్యత్వ రూపమున వాచ్యమనియే సిద్ధించును. ॥24॥

*అవతారిక*— పై యర్థమునే మరియొక దృష్టాంతముచే సమర్థించుచున్నాడు.

---

* నైయాయికులు అంగీకరించిన 16 పదార్థములలో 'నిర్ణయము' ఒకటి. ఆ పదార్థములు 20 వ శ్లోకము యొక్క 'ఫుట్‌నోట్'లో చూపబడియున్నవి.

శ్లో॥ సర్వం మిథ్యా బ్రవీమీతి నైతద్వాక్యం వివక్ష్యతే ।
తస్య మిథ్యాభిధానే హి ప్రక్రాన్తోఽర్థో న గమ్యతే ॥ 25

సర్వం + మిథ్యా + బ్రవీమి = (నేను అంతయు మిథ్యయే పలుకుచున్నాను. అనగా నేను అంతయు అసత్యమే చెప్పుచున్నాను), ఇతి = అనెడి, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యము, న + వివక్ష్యతే = వివక్షింపబడదు అనగా ఈ వాక్యము కూడ మిథ్యయే యని గ్రహింపబడదు.

ఒక మనుష్యుడు 'నేను అన్నియు అసత్యములే పలుకుచున్నాను' అని ఏదో సందర్భమున పలుకును. నా మాటలను నమ్మవద్దు అని దాని భావము. సర్వం మిథ్యా బ్రవీమి, అనునదియు ఆయన వాక్యమే కనుక అదియు అసత్యమే అని మాత్రము ఎవరు భావింపరు. ఈ వాక్యము మాత్రము సత్యమునే బోధించును. ఇది తప్ప ఇతర వాక్యములు మిథ్య అని దాని భావమును లోకులు గుర్తింతురు.

అట్లుకాకున్న తస్య = అదియు అనగా 'సర్వం మిథ్యా బ్రవీమి' అనునదియు, మిథ్యాభిధానే = అసత్యమే అనిన యెడల, ప్రక్రాన్తః = ఉపక్రమింపబడిన, అర్థః = అర్థము, అనగా తాను చెప్పదలచిన అర్థమంతయు అసత్యమే అను భావము, న + గమ్యతే + హి = తెలియబడనేరదు కదా !

"నేను చెప్పిన మాటలన్నియు అసత్యములే, అవి నిశ్చితార్థమును బోధింపవు" అని ఒకడు పలుకును. ఇదియు అసత్యము అగుచో తాను ప్రతిపాదింపదలచిన అర్థము నిర్వహింపబడదు. కనుక 'సర్వం మిథ్యా బ్రవీమి' అను వాక్యము తప్ప ఇతరములగు వాక్యములు మిథ్యాబోధకములనియే లభించును. అట్లుకాకున్న ఇదియు మిథ్యయే యగుచో అసంబద్ధార్థమును బోధించును.

అట్లే 'సమవాయము అవాచ్యము' అనగా అవాచ్య శబ్దముకంటె ఇతరములగు శబ్దములకు సమవాయము వాచ్యము కాదనియే చెప్పవలెను. అవాచ్య శబ్దమునకు మాత్రము అది వాచ్యము కాగలదు. ఛలము నుపయోగించి నైయాయికుడు సమవాయము వాచ్యమే యని చూపుచున్నాడు. ॥25॥

అవతారిక— పై యర్థమున యుక్తిని జూపుచున్నాడు.

శ్లో॥ న చ వాచకరూపేణ ప్రవృత్తస్యాస్తి వాచ్యతా ।
ప్రతిపాద్యం న తత్తత్ర యేనాన్యత్ప్రతిపాద్యతే ॥ 26

చ = మరియు, వాచకరూపేణ = వాచక శబ్దరూపమున, ప్రవృత్తస్య = అర్థమును చెప్పుటకై ప్రవర్తించిన దానికి, వాచ్యతా = వాచ్యత్వము అనగా బోధింపబడుట, న + అస్తి = లేదు. యేన = దేనిచే, అన్యత్ = ఇతరమైనది, ప్రతిపాద్యతే = తెలుపబడుచున్నదో, తత్ = అదియే, తత్ర = అచట, ప్రతిపాద్యమ్ = తెలుపబడునది, న = కాదుకదా !

'అవాచ్య' అను శబ్దము వాచకముగా అనగా అర్థబోధకముగా గుర్తింపబడినది అర్థమును బోధించుటలో ఆ శబ్దము కర్తగాను, బోధింపబడునది కర్మగాను నుండవలెను. ఒకే వస్తువు ఒకే అవస్థలో కర్తగాను, కర్మగాను ఉండనేరదు. వాచకము ఎప్పుడు పరతంత్రమే. వాచ్యమగునది స్వతంత్రమే. కాగా 'అవాచ్య' అను శబ్దముచే గూడ సమవాయము వాచ్యము కాదని భావింపరాదు.

ఘటః అను శబ్దము 'కడవ' అను అర్థమును బోధించుటకై ప్రవర్తించి తననే బోధింపనేరదు. సాధనము వేరు సాధ్యము వేరు.

'అవాచ్య' అను శబ్దము సమవాయము వాచ్యముకాదని చెప్పుటకు ఉపయోగపడు చున్నది. ఆ శబ్దము సాధనమగుచున్నది. అదియే వాచ్యకోటిలో అనగా సాధ్యరూపమున గ్రహింపబడదు కదా ! ॥26॥

*అవతారిక* — వాచకమగు శబ్దము విరోధముండుటచే వాచ్యము కాకపోవవచ్చును. కాని సమవాయము శబ్దమునకు వాచ్యము కాదు అను ప్రసంగమున అవాచ్య అను శబ్దము కూడ శబ్ద సామాన్యమున చేరియున్నందున దానికి గూడ సమవాయము వాచ్యము కానేరదు అను ప్రశ్నకు చక్కని దృష్టాంతమును జూపుచు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అసాధికా ప్రతిజ్ఞేతి నేయమేవాభిధీయతే ।**
**యథా, తథాస్య ధర్మోఽపినైవకశ్చిత్ప్రతీయతే ॥ 27**

యథా = ఏ రీతిగా, *ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ అనగా ప్రతిజ్ఞా వాక్యము 'పర్వతో వహ్నిమాన్' మున్నగునది, అసాధికా = సాధ్యమును సాధించునది కాదు అనగా సాధనాంగము కానేరదు, ఇతి = అని చెప్పగా, ఇయమ్ + ఏవ = ఇదే అనగా 'ప్రతిజ్ఞా అసాధికా' అనునదియే, న + అభిధీయతే = చెప్పబడదో, తథా = ఆ రీతిగా, అస్య = దీనికి అనగా, అవాచ్య అను శబ్దమునకు, కశ్చిత్ = మరియొక, ధర్మః + అపి = ధర్మము కూడ అనగా మరియొక వ్యాపారము, న + ఏవ + ప్రతీయతే = తెలియబడుట లేదు.

---

* హేతువును జూపి దానితో సంబంధించియున్న అర్థమును గుర్తింతురు. అందు అయిదు అంశములు అపేక్షితములు. (1) ప్రతిజ్ఞ (పర్వతము వహ్నిమత్తు). (2) హేతువు (పొగ యుండుట వలన), (3) దృష్టాంతము (వంట యింటివలె), (4) ఉపనయము (అట్లే ఇచట ఉన్నది). (5) నిగమనము, (కనుక ఇది వహ్నిమత్తే) వీనినే పంచావయవము లందురు. ఈ 5 ను కలిపి న్యాయమందురు. దీనిని బోధించునది న్యాయశాస్త్రము. గౌతమ విరచితము. దానిని అవలంబించినవారు నైయాయికులు.

బౌద్ధులు 5 ను ఆశ్రయింపక 1. హేతువు, 2. దృష్టాంతము అను రెంటినే న్యాయముగా గ్రహించిరి.

పూర్వ మీమాంసకులు మొదటి మూటినిగాని, చివరి మూటినిగాని స్వీకరింపవలెనని విశ్వసింతురు.

బౌద్ధులు (1) హేతువు, (2) దృష్టాంతము అను రెండు అవయవములనే గ్రహింతురు. ప్రతిజ్ఞను వారు సాధనాంగముగా గ్రహింపరు. వారి మతమిచట దృష్టాంతముగా జూపబడుచున్నది.

'ప్రతిజ్ఞా న సాధనాఙ్గమ్' అని బౌద్ధులు చెప్పుదురు. అట్టితరి ఇదియు ప్రతిజ్ఞా వాక్యమేకాన సాధనాంగము కానందున వారు అనుకొనిన యభిప్రాయము నెరవేరదు. అందుచే 'ప్రతిజ్ఞా న సాధనాఙ్గమ్' అను దానిని విడిచి ఇతరములగు పర్వతోవహ్నిమాన్ మున్నగు ప్రతిజ్ఞలు అర్థసాధకములు కావనియు, ఇది మాత్రము సాధనాంగమే అనియు అంగీకరింప వలెను.

అవాచ్య శబ్దము ప్రతిజ్ఞా వాక్యము వంటిది. సమవాయము అవాచ్యము అని చెప్పగా ఇతర శబ్దములకు వాచ్యము కాదనియే తెలియబడును. 'అవాచ్య' అను శబ్దమునకు గూడ వాచ్యము కాదని తెలియబడదు. ఏలయన— ఆ శబ్దమునందు అభిధా వ్యాపారము ఒక్కటియే యుండును. దానిచే ఆ శబ్దము అర్థమును బోధించును. శబ్దమునందు రెండు వ్యాపారములున్నచో ఒక వ్యాపారముచే సమవాయము ఇతర శబ్దములకు వాచ్యముకాదనియు, రెండవ వ్యాపారముచే అవాచ్యమునకు గూడ వాచ్యము కాదనియు తెలియబడగలదు. కాని యట్లు రెండు వ్యాపారములు లేవు.

కాగా 'ప్రతిజ్ఞా న సాధనాఙ్గమ్' అను బౌద్ధుల పద్ధతిలో ఈ వాక్యమును విడిచి ఇతరములగు ప్రతిజ్ఞా వాక్యములు సాధనాంగములు కావు. ఇది మాత్రము సాధనాంగమే అని చెప్పినట్లు సమవాయము అవాచ్యము. అనగా 'అవాచ్య' అను శబ్దమును విడిచి ఇతర శబ్దములకు వాచ్యము కాదనియే లభించును. అవాచ్య శబ్దమునకు గూడ వాచ్యము కాదని లభింపదు. ఇచట రెండు వ్యాపారములు శబ్దమునందు లేకుండుటయే కారణము. ॥27॥

*అవతారిక*— ఆ శబ్దమునందు రెండు వ్యాపారములను ఆశ్రయించి, అవాచ్య శబ్దమునకు కూడ సమవాయము వాచ్యము కాదని చెప్పరాదా ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యాపారస్యాపరో యస్మాన్న వ్యాపారోఽస్తి కశ్చన ।**
**విరోధమనవస్థాం వా తస్మాత్సర్వత్ర నాశ్రయేత్ ॥ 28**

యస్మాత్ = ఎందువలన, వ్యాపారస్య = వ్యాపారమునకు, అపరః = మరియొక, కశ్చన= ఎట్టి విధమగు, వ్యాపారః = వ్యాపారము, న + అస్తి = లేదో, తస్మాత్ = అందువలన, సర్వత్ర = ఎల్లచోటులయందు, విరోధమ్ = విరోధమును, అనవస్థాం + వా = అనవస్థా దోషమునుగాని, న + ఆశ్రయేత్ = ఆశ్రయింపరాదు.

'అవాచ్య' శబ్దమునందు రెండు వ్యాపారముల నాశ్రయించి, ఒక వ్యాపారముచే సమవాయము ఇతర శబ్దవాచ్యము కాదనియు, రెండవ వ్యాపారముచే అది అవాచ్య శబ్ద

కన్ను, చెవి, ముక్కు మున్నగు ఇంద్రియముల వలన నలుపు, శబ్దము మున్నగు విషయములను గోచరించెడి జ్ఞానములు కలుగుచున్నవి. అందు మనుష్యుని ప్రయత్నమేమియు అపేక్షితము కాదు. అది ఇంద్రియములకు స్వభావ సిద్ధమగు శక్తియే. ఎంత ప్రయత్నము చేసినను కన్ను రుచిని, ముక్కు శబ్దమును, చెవి రుచిని గ్రహింపదుకదా!

అట్లే శబ్దముల నుచ్చరింపగా అర్థబోధ కలుగుచున్నది. అచట వేరు సంబంధము అపేక్షితము కాదు. వానికి అర్థబోధకత స్వాభావికము. ఘట శబ్దము నుచ్చరింపగా 'కడవ' అను అర్థము అవగతమగును. వస్త్రము అను అర్థము అవగతము కాదు. అందుచే ఇంద్రియములకు వలె శబ్దములకు అర్థములతో యోగ్యత అను సంబంధము స్వభావసిద్ధమై యున్నది అనియే మహాభాష్యకారుడు పస్పశాహ్నికమున నిర్ణయించెను.

విశేషమేమనగా ఇంద్రియము జ్ఞాతముకాకున్నను జ్ఞానమును కలిగించును. శబ్దము అట్టిది కాదు. అది జ్ఞాతమయియే అర్థబోధకమగును. ॥29॥

*అవతారిక*— అర్థమును తెలుపుటకై శబ్దము ప్రయోగింపబడుట వలన ఆ రెంటికి సంబంధమున్నదని నిశ్చయింపవచ్చును. అట్టితరి అపభ్రంశములవలనను అర్థబోధ కలుగుచున్నందున అచటకూడ సంబంధము కల్పితము కావలెను అను పూర్వపక్షమునకు రెండు విధములుగా సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అసాధురనుమానేన వాచకః కైశ్చిదిష్యతే ।**
**వాచకత్వా విశేషే వా నియమః పుణ్య పాపయోః ॥** 30

A. కైశ్చిత్ = కొందరిచే అనగా తార్కికులచే మీమాంసకుల చేతను; అసాధుః = అపభ్రంశమగు శబ్దము, అనుమానేన = సాధు శబ్దముయొక్క స్మరణముచే; వాచకః = అర్థబోధకమై; ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

అసాధు శబ్దమునందు శక్తి లేదు. కాని దానివలన వర్ణముల సామ్యమునుబట్టి సాధు శబ్దము స్మరణకువచ్చి దానివలన బోధ కలుగును. ఉదా: గౌః (ఆవు) అనునది సాధు శబ్దము. గావీ, గోణీ మున్నగునవి అసాధు శబ్దమునకు అపభ్రంశములు. ఒక వ్యక్తి 'గావీ' అని ప్రయోగించిన దానివలన గోశబ్దము జ్ఞాపకమునకు వచ్చి అర్థమును బోధింపగలదు అని తార్కికులు, మీమాంసకులు భావింతురు.

B. వైయాకరణుల మతము ననుసరించి సమాధానము ఉత్తరార్ధముచే చెప్పుచున్నాడు.

వా = కాక; వాచకత్వాऽవిశేషే = అర్థమును బోధించుటలో భేదము లేకున్నను అనగా సాధు శబ్దమువలన అసాధు శబ్దమువలనను అర్థబోధ కలుగుట సమానమైనను; పుణ్యాపాపయోః = పుణ్యాపాపముల విషయమై, నియమః = నియమము, (క్రియతే) = శాస్త్రముచే చేయబడుచున్నది.

శబ్దత్వమనెడిజాతి ఎల్లశబ్దములయందుకలదు. కనుక అదిసర్వశబ్దములకు సాధారణ మైనదే.అట్లుకాక ఘట,శబ్దమునందు ఘటశబ్దత్వమనెడి జాతి కలదు. అది కేవలము ఘటశబ్దము నందే యుండును. ఆజాతి ఘటశబ్దముచే బోధింపబడును. అది దానికి ఆత్మీయమగు జాతి. అది శబ్దము అర్థమునుబోధించుటలోఅవినాభావి కనుక ప్రథమమ్, అని గ్రంథకర్త పలికెను. అంతియేకాని పౌర్వాపర్యమున్నదని భావముకాదు.

*విశేషాంశము*—సర్వైః = ఎల్లశబ్దములచే, ఇచటసంజ్ఞా శబ్దములు. అవియేకాక ఘట పటాది శబ్దములుకూడా గ్రహింపబడును. అన్నిశబ్దములు తమయందున్న అసాధారణమగు ఘటశబ్దత్వము, గోశబ్దత్వము మున్నగు శబ్దగత జాతులను బోధించును.

B. తతః = తరువాత అనగా తన యందున్న శబ్దత్వజాతిని బోధించిన తరువాత, అర్థజాతి రూపేషు = ఆవు, కడవ మున్నగు అర్థములయందున్న గోత్వము ఘటత్వము మున్నగు జాతులయందు, తదధ్యారోపకల్పనా = శబ్దములయందున్న గోశబ్దత్వము ఘటశబ్దత్వము మున్నగు జాతులకు ఆరూపము కల్పితమగును.

గౌః అనునదిశబ్దము. దానిచేబోధింప బడునది ఆవు అనునది యర్థము. అ అర్థము నందు గోత్వజాతికలదు. శబ్దమునందు గోశబ్దత్వజాతి కలదు. ఆశబ్దమునందున్న గోశబ్దత్వ జాతిని అర్థగతమగు గోత్వజాతియందు ఆరోపింపగా, అదియే అనగా గోశబ్దత్వజాతియే ప్రవృత్తినిమిత్తముకాగలదు.

కాగా గోశబ్దము గోత్వజాతిని బోధించును. అచటగోశబ్దత్వము ఆరోపితమగుటచే నది ప్రవృత్తియగుచున్నది. ॥6॥

*అవతారిక*—శబ్దగతమగు గోశబ్దత్వము మున్నగు అసాధారణమైన జాతి గోవు నందున్నగోత్వజాతితో నభేదమునుపొంది అది శబ్దప్రవృత్తికి నిమిత్తము కాగలదని 6వ శ్లోకమునచూపబడినది.

కాని ఆ రెండుజాతులును ఒక స్థలమున లేవు. అర్థజాతి గోవ్యక్తియందున్నది. గోశబ్దమునందు గోశబ్దత్వజాతియున్నది. ఈ రీతిగా ఆ జాతులు వేరు వేరు చోటుల యందున్నందున ఆ రెంటికి అభేదవ్యవహారమెట్లు? అనుప్రశ్నకుచక్కని దృష్టాంతము చూపి సమాధానముచెప్పుచున్నాడు.

**శ్లో॥ యథా రక్తేగుణే తత్త్వం కషాయే వ్యపదిశ్యతే।**
**సంయోగిసంనికర్షాచ్చ వస్త్రాది ష్వపిగృహ్యతే॥ 7**
**తథాశబ్దార్థసంబన్ధాచ్ఛబ్దే జాతిరవస్థితా।**
**వ్యపదేశేఽర్థజాతీనాం జాతికార్యాయకల్పతే॥ 8**

యథా = ఏరీతిగా, రక్తే = ఎరుపు అనే, గుణే = గుణమునందున్న, తత్త్వమ్ = రక్తత్వము అనుధర్మము, కషాయే = కషాయద్రవ్యమునందు అనగా లాక్షమున్నగుద్రవ్యమునందు,

సాధు శబ్దములను ప్రయోగించుటవలన ధర్మము కలుగును. దానివలన పుణ్యము కలుగును. అసాధు శబ్దములను ప్రయోగించిన అధర్మము కలుగును. దానివలన పాపము కలుగును. కనుకనే మహాభాష్యకారుడు "సమానాయామర్థావగతౌ శబ్దైశ్చాపశబ్దైశ్చ శాస్త్రేణ ధర్మనియమః" అని పస్పశాహ్నికమున పలికెను. శబ్దములచేతను అపశబ్దములచేతను అర్థము తెలియుట సమానమే. కాని శాస్త్రము ధర్మమునుగూర్చి నియమమును జూపుచున్నదని దాని యర్థము. ఈ యంశము మొదటికాండ యొక్క చివరను నిరూపించి యుంటిమి. ॥30॥

*అవతారిక*— శబ్దమునకు అర్థముతో సమవాయము సంబంధమను మతము యుక్తము కాదు. సమవాయమున మరియొక సమవాయము లేనందున సమవాయ శబ్దము సమవాయమును బోధింపజాలదని నిరూపించి శబ్దార్థములకు యోగ్యత సంబంధమనెడి వైయాకరణ సిద్ధాన్తమున పై దోషము లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ సమ్బన్ధశబ్దే సమ్బన్ధో యోగ్యతాం ప్రతి యోగ్యతా ।
సమయాద్యోగ్యతా సం విన్మాతా పుత్రాదియోగవత్ ॥ 31

A. ఇచట ''సంబంధ శబ్దః సంబంధం యోగ్యతాం ప్రతియోగ్యతామ్'' అని కారికా పూర్వార్ధ పాఠము కానవచ్చుచున్నది. ఆ పాఠము హేలారాజ టీకకు అనుగుణముగ నున్నది. సంబంధ శబ్దః = 'సంబంధః' అనెడి శబ్దము, యోగ్యతామ్ = యోగ్యత అనెడి ; సంబంధమ్ = సంబంధమును, యోగ్యతాం + ప్రతి = యోగ్యతచేతనే (ప్రతిపాదయతి) = చెప్పుచున్నది

శబ్దార్థములకు యోగ్యత సంబంధమని ఈ ప్రకరణముననే 29 వ శ్లోకముచే చెప్పబడినది. అట్టి సంబంధమును 'సంబన్ధః' అను శబ్దము చెప్పగలదు. సంబంధము అనునది పరాధీనముగాన దానికి కొన్ని యుపాధులు కలవు. అట్లు చెప్పుటలో యోగ్యతయే కారణము.

ఇట్లే 'సమవాయ' శబ్దము గూడ యోగ్యతను బట్టియే సమవాయమును చెప్పగలదు అట్లు కాకున్న ఆ శబ్దము సమవాయమును చెప్పజాలదు.

ఇట్లే ఘటాది పదములు గూడ యోగ్యతనుబట్టియే కడవ మున్నగు అర్థములను చెప్పగలవు.

కాగా యోగ్యతయే శబ్దార్థములకు సంబంధము. అది స్వాభావికమే.

యోగ్యతాం + ప్రతి = అనుచోట లక్షణార్థమున 'ప్రతి' శబ్దమునకు కర్మప్రవచనీయ సంజ్ఞ కలుగగా దాని యోగమున యోగ్యతా శబ్దముకంటె ద్వితీయ కలిగినది. యోగ్యతాం + ప్రతి = యోగ్యతయా = యోగ్యతచేయని యర్థము లభించును.

కాక -

'సంబన్ధ శబ్దే సంబన్ధో యోగ్యతాం ప్రతి యోగ్యతా' అనియే పాఠము. 'సంబన్ధ శబ్దే' అనుచోట సంబన్ధ శబ్దము అర్శ ఆద్యజంతము. కాగా సంబన్ధ శబ్దే అను దానికి,

'యోగ్యతా రూపమగు *సంబంధము కల శబ్దమునందు'* అనగా అట్టి 'ఘటః' 'పటః' మున్నగు శబ్దమునందున్న, యోగ్యతాం + ప్రతి = యోగ్యతా నిరూపకమగు అనగా యోగ్యతను నిర్ణయించెడి, సంబన్ధః = సంబంధము, యోగ్యతా = యోగ్యతకు ద్యోతకము, (భవతి) = అగుచున్నది.

ఈ ప్రకరణ ప్రారంభమున యోగ్యత సంబంధమని చెప్పియున్నందున ఇచట యోగ్యతా శబ్దము యోగ్యతా ద్యోతకమను అర్థమున ఉపయోగింపబడినది.

'సమ్బన్ధ శబ్దే' అనుచోట సంబంధ శబ్దము అర్శ ఆద్యజంతము అని చెప్ప నక్కర లేదు. 'సమ్బన్ధి శబ్దే' అని కానవచ్చుచున్నదని కొందరి యాశయము.

కాక సంబన్ధ శబ్దే అనుచోట సప్తమికి వాచ్యవాచకభావ మర్థము. సమ్బన్ధ శబ్దే = సంబంధవాచ్యమగు అనగా సంబంధ అను శబ్దమునకు అర్థమగు సమ్బన్ధః = సంబంధము యోగ్యతాం + ప్రతి = యోగ్యతా నిరూపకమగు, యోగ్యతా = యోగ్యతా స్వరూపమే.

ధనవాన్ ఇత్యాదులయందు, మతుప్ ప్రత్యయము 'కలది' అను నర్థమున విధింపబడినది. ఆప్రత్యయము లేనిచో కలవాడు అను అర్థము లభింపదు. కొన్ని శబ్దములకు 'మతుప్' కాక, 'కల' అర్థమున 'అచ్' ప్రత్యయము విధించబడినది. దీనిని, 'అర్శ ఆదిభ్యోఽచ్' (5-2-127) అని సూత్రకర్త చూపెను.

B. అట్లైన సంకేతమునకు ఉపయోగమెద్ది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

సమయాత్ = సంకేతమువలన అనగా 'అస్మాత్ శబ్దాత్ అయమర్థో బోద్ధవ్యః' (ఈ శబ్దమువలన ఈ యర్థము తెలియదగినది) మున్నగు సంకేతమువలన, మాతాపుత్రాది యోగవత్ = తల్లికి పుత్రునకుగల సంబంధము వలెను, యోగ్యతా సంవిత్ = యోగ్యతా స్వరూపమగు శబ్దార్థములకు గల సంబంధము తెలియనగును.

శబ్దార్థములకు గల సంబంధమును సంకేతము స్పష్టపరచును. అట్లు స్పష్టపరచుటయే సంకేతముయొక్క ఆవశ్యకత. సంకేతమే సంబంధము కానేరదు.

ఉదా :- అయ మస్యాః పుత్రః (ఇతడు ఈమె కొమరుడు) అను వ్యవహారము వలన తల్లికి కొమరునకు గల జన్యజనకభావము తెలియబడుచున్నది. వ్యవహారమే సంబంధము కాదు.

కాక—

సంబన్ధ శబ్దే = సంబన్ధ శబ్ద వాచ్యము, సంబన్ధః = సంబంధము (ఇతి) = అనెడి, యోగ్యతాం + ప్రతి = యోగ్యతా శబ్దవాచ్యము, యోగ్యతా = యోగ్యత, (ఇతి) = అనెడియు, సమయాత్ = వ్యవహారమువలన, మాతాపుత్రాదియోగవత్ = తల్లి, కొమరుని సంబంధము వలె, యోగ్యతాసంవిత్ = ప్రాథమిక శక్తిజ్ఞానము కలుగును.

సంబన్ధ శబ్దమునకు సంబంధమర్థము. యోగ్యతా శబ్దమునకు యోగ్యత అర్థము అని వ్యవహారము కలుగగా దానినిబట్టి ఘట శబ్దమునకు కడవ అర్థము. పట శబ్దమునకు వస్త్ర మర్థమని విశేషణ రూపమున తెలియగలదు. ॥31॥

అవతారిక — శబ్దార్థములకు 'యోగ్యత' అను సంబంధమును జూపి ఇపుడు వానికిగల కార్యకారణ భావమనెడి సంబంధమును జూపుచున్నాడు.

శ్లో॥ శబ్దం కారణమర్థస్య సహి తేనోపజన్యతే ।
తథాచ బుద్ధి విషయా దర్థాచ్ఛబ్దః ప్రతీయతే ॥ 32

A. శబ్దః = శబ్దము, అర్థస్య = అర్థజ్ఞానమునకు, కారణమ్ = కారణమగుచున్నది, సః = ఆ యర్థము, తేన = ఆ శబ్దముచే, ఉపజన్యతే + హి = కలిగింపబడుచున్నది కదా !

మాటాడువాని పెదవులు దంతములు మున్నగు అవయవముల కదలికచే శబ్దము పుట్టును. ఆ శబ్దము వినువాని చెవిలో ప్రవేశించి వాని బుద్ధికి లగ్నమగును. చెవిలో పడునవి వర్ణములే. అవి యన్నియు కలసి బుద్ధిలో పదరూపమున వాక్యరూపమున నుండును. అట్టి శబ్దమువలన శ్రోతకు అర్థజ్ఞానము కలుగుచున్నది. అంతకుముందులేని యభిప్రాయము శ్రోతకు ఆ శబ్దమువలననే కలుగుచున్నది. కాగా శబ్దము కారణము. అర్థము కార్యమని స్పష్టమగుచున్నది.

B. తథా + చ = అట్లే, బుద్ధి విషయాత్ = బుద్ధికి విషయమగు, అర్థాత్ = అర్థమువలన, శబ్దః = శబ్దము, ప్రతీయతే = పుట్టుచున్నట్లు తెలియబడుచున్నది.

మనుష్యుడు తన బుద్ధిలోనున్న భావమును ఇతరులకు చెప్పదలచి దానికి అనుగుణమగు శబ్దములను ప్రయోగించును. వక్తయొక్క బుద్ధిలో ముందు అర్థము భాసించును. దానిని అనుసరించి శబ్దములు జనియించును. దీనినిబట్టి చూడగా మాటాడువానియందు భాసించిన అర్థము కారణము. శబ్దము కార్యమని తేలుచున్నది.

కాబట్టి మాటాడు వక్తనుబట్టి చూచిన, అర్థము కారణము. శబ్దము కార్యము అని ; శ్రోతనుబట్టి చూచిన, శబ్దము కారణము, అర్థము కార్యమనియు తెలియబడుచున్నది. పై రీతిని రెంటికి కార్య కారణ భావము సంబంధమని వైయాకరణులు తలంతురు. ॥32॥

అవతారిక — బుద్ధి పరికల్పితమగు అర్థమే శబ్దవాచ్యమగుచో 'ఓదనం భుఙ్క్తే' (అన్నము తినుచున్నాడు) అను లోకవ్యవహార మెట్లు పొసగును? బుద్ధిచే కల్పింపబడిన అర్థము శబ్దముచే చెప్పబడినను దానిని పురస్కరించుకొని లోకవ్యవహారము జరుగనేరదు కదా ! తన బుద్ధిలో 'నాకు నాలుగు లక్షల రూపాయలు కలవు' అని భావింపవచ్చును. కాని అట్టి రూపాయలు అంగడిలో వస్తువులను కొనుటకు ఉపయోగపడవు కదా ! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ భోజనాద్యభిమన్యన్తే బుద్ధ్యర్థే యదసమ్భవి ।
బుద్ధ్యర్థాదేవ బుద్ధ్యర్థే జాతే తదపి దృశ్యతే ॥ 33

బుద్ధ్యర్థే = బుద్ధిచే కల్పింపబడిన అర్థము (శబ్దార్థే) = శబ్దవాచ్యమగుచో, యత్ = ఏ, భోజనాది = భోజనము మున్నగు దానిని, అసమ్భవి = జరుగుటకు సాధ్యము కాని దానినిగా, అభిమన్యన్తే = తలంచుచున్నారో అనగా బుద్ధిచేతనే సృజియింపబడిన అర్థమే శబ్దవాచ్యమగుననెడి వాదమున, భోజనముచేయుట, గ్రామముగూర్చి వెడలుట మున్నగు లోకవ్యవహారము సంభవింపదని తలంచెదరో, తత్ + అపి = అదియు అనగా భోజనాదికము గూడ, బుద్ధ్యర్థాత్ + ఏవ = బుద్ధిచే సిద్ధించిన అర్థము వలననే, బుద్ధ్యర్థే = బుద్ధిచే లభించిన అర్థము, జాతే = నిష్పన్నము కాగా అనగా సిద్ధము కాగా, దృశ్యతే = చూడబడుచున్నది. సంభవించుచునే యున్నదని భావము. ఏ వ్యవహారము సంభవింపదని తలంచుచున్నారో అదియు సంభవించుచునే యున్నదని భావము.

ఓదనము, భోజనముచేయుట రెండు కూడ బుద్ధి కల్పితములే కనుక అన్నము తినుచున్నాడు అనుట సమంజసము. "ఓదనం భుఙ్క్తే" ఇచట ఓదనము కారకము. భోజనము క్రియ. కారకము వలన క్రియ జనియించును. జనకమగు ఓదనము బుద్ధిచే కల్పింపబడగా అట్టి కారకముచే సాధ్యమగు భుజి క్రియయు బుద్ధిచే కల్పింపబడగలదు. అట్టి ఆ రెంటికి క్రియా కారకభావము చెప్పనగును.

మరియు బుద్ధిచే కల్పింపబడిన అర్థమునకు బాహ్య ప్రపంచమునగల పదార్థములకు అభేదాధ్యవసాయముచే లోకుల వ్యవహారములన్నియు సంగతములు కాగలవు. ॥౩౩॥

అవతారిక— మరియు బుద్ధి కల్పితమగు అర్థము శబ్దవాచ్యమనుట చాల యుక్తము. ఏలయన శబ్దార్థములకు సంబంధము నిత్యమని ప్రాజ్ఞులు నుడివియున్నారు. ఆ యాశయము పై వాదముననే నిలబడును. అట్లు గాకున్న పై సిద్ధాన్తము అయుక్తమే కాగలదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అనిత్యేష్వపి నిత్యత్వమభిధేయాత్మనా స్థితమ్ ।
అనిత్యత్వం స్వశక్తిర్వా సా చ నిత్యాన్నభిద్యతే ॥ 34

A. అనిత్యేషు + అపి = అనిత్యములగు వ్యక్తులందు గూడ ; నిత్యత్వమ్ = నిత్యత్వము ; అభిధేయాత్మనా = శబ్దముచే బోధింపబడెడి అర్థరూపముచే అనగా బుద్ధి కల్పితమగు అర్థరూపమున ; స్థితమ్ = ఉన్నది.

'ఘటము' మున్నగు శబ్దములు కడవ మున్నగు అర్థములను బోధించును. శబ్దములకు అర్థములతో సంబంధము నిత్యమని భాష్యకారుడు నుడివెను కాని బాహ్య ప్రపంచకమున

కానవచ్చెడి కడవ మున్నగునవి అనిత్యములే. అట్టితరి వానికి శబ్దముతో సంబంధము నిత్యమగుట యెట్లు? కనుక బుద్ధి కల్పితమగు అర్థము నిత్యము. కాబట్టి భాష్యకారుని మాట ఉపపన్నమగుచున్నది. ఈ యంశమును ప్రథమకాండమున వివరముగ జూపి యుంటిమి.

B. కూటస్థ నిత్యతయు శబ్దార్థములకు కలుగుచున్నదని చెప్పుచున్నాడు.

అనిత్యత్వమ్=అనిత్యత్వమనునది; స్వశక్తిః+వా=సోపాధికమగు బ్రహ్మము యొక్క శక్తిరూపమే, సా+చ = ఆ శక్తియు, నిత్యాత్ = పరమార్థ నిత్యమగు బ్రహ్మము కంటె; న+భిద్యతే = వేరుకాదు.

శబ్దములు సాక్షాత్తుగా సత్యజ్ఞానానన్దరూపమగు నిర్గుణ బ్రహ్మమును బోధింపవు మాయా కల్పితములగు ఉపాధులతో గూడిన బ్రహ్మముయొక్క ఏకదేశమునో, దానిలోగూడ కొన్ని భాగములనో, బోధించును. కాగా అనిత్యములగు ఉపాధులతో గూడిన బ్రహ్మమును శబ్దములు బోధించుటచే బ్రహ్మమునందు అనిత్యత్వమనే ధర్మమున్నదని చెప్పక తీరదు. ఆ ధర్మము బ్రహ్మముయొక్క శక్తిరూపమే. ఆ శక్తి బ్రహ్మముకంటె వేరుకాదు. నిజరూపమున బ్రహ్మము నిత్యమేకాన శక్తియు నిత్యమేయగును. ఈ రీతిగ కూటస్థ నిత్యతగూడ శబ్దార్థములకు చెప్పవచ్చును. ॥34॥

*అవతారిక*— శబ్దమునకు అర్థముతో సంబంధము స్వాభావికమని అంగీకరించుటలో మతాంతరమును జూపుచున్నాడు.

**శ్లో॥ శబ్దేనార్థస్య సంస్కారో దృష్టాఽదృష్ట ప్రయోజనః ।**
**క్రియతే, సోఽభి సంబన్ధ మన్తరేణ కథంభవేత్ ॥ 35**

శబ్దేన = శబ్దముతో, అర్థస్య = అర్థమునకు, దృష్టాఽదృష్ట ప్రయోజనః = ప్రత్యక్షముగా కనబడునట్టియు, ప్రత్యక్షముగ కానరానట్టియు ప్రయోజనము కల, సంస్కారః = సంస్కారము, క్రియతే = చేయబడుచున్నది.

సః = ఆ సంస్కారము, అభిసంబన్ధమ్+అన్తరేణ = స్వాభావికమగు సంబంధము లేనిది, కథమ్ = ఎట్లు, భవేత్ = కలుగగలదు?

అధర్వవేదమున కొన్ని మంత్రములు గలవు. వానిని జపించిన తేలు, పాము మున్నగువాని విషము శాంతించును. అట్టి వానిని శాబరమంత్రము లందురు. వీనికి ప్రయోజనము మనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్నది.

అట్లే మంత్రములను జపించునపుడు 'హుం' 'ఫట్' 'హ్రాం' 'హ్రీం' అను రీతిని బీజాక్షరములను పలుకుదురు. వీనివలన ప్రత్యక్షముగా మనకు ప్రయోజనము కానరాదు. వీనికి ఏదో ఒక ప్రయోజనము కాలాంతరమున కలుగును. దీనినే అదృష్ట ప్రయోజనమందురు.

శాబరమంత్రములకు, బీజాక్షరములకు ఏమియు అర్థముండనేరదు. కాని మంత్రము లుచ్చరింపగా ప్రయోజనము కలుగుచున్నది. శబ్దమునకు అర్థముతో సంబంధమే లేనిచో ఆ సంస్కారము ఎట్లు కలుగగలదు? దానినిబట్టి శబ్దమున కర్థముతో సంబంధము స్వాభావిక మని నమ్మవచ్చును. ॥35॥

అవతారిక — 35 వ శ్లోకములో జూపబడిన అభిప్రాయము యుక్తము కాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నాఽవశ్య మభిధేయేషు సంస్కారః స తథావిధః।
దృశ్యతే న చ సంబన్ధ స్తథా భూతో వివక్షితః॥ 36

అభిధేయేషు = అర్థముల విషయమై; తథావిధః = అట్టి అనగా దృష్టాఽదృష్టరూపమగు ప్రయోజనము కల, సంస్కారః = సంస్కారము, అవశ్యమ్ = నియతముగా, న + దృశ్యతే = చూడబడుట లేదు; చ = మరియు, తథాభూతః = అట్టి అనగా పై ప్రకారము ఊహింపబడినట్టి, సంబన్ధః = శబ్దార్థ సంబంధము, న + వివక్షితః = వివక్షితము కాదు.

శాబర మంత్రములలోను, బీజాక్షరములలోను ఏవో కొన్ని శక్తులుండవచ్చును. అట్టి సంస్కారము ఎల్ల యర్థములందు మనకు కానరాదు. మరియు మరియొక గతిలేని బీజాక్షరములను దృష్టాన్తముగా గైకొని శబ్దార్థములకు సంబంధము చెప్పదలచినది కూడ కానేరదు. మంత్రములయందు కానవచ్చెడి అర్థ సంబంధము వేరే యున్నది. ఘటాది శబ్దములకు అర్థముతోగల సంబంధము వేరేయున్నది. ॥36॥

అవతారిక — శబ్దముచే అర్థమునకు సంస్కారము కలుగుననెడి యాశయము 36 వ శ్లోకముచే ఖండింపబడినది. అట్టితరి శబ్దార్థములకు సంబంధమున్నట్లు ఎట్లు తెలియ నగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సతి ప్రత్యయ హేతుత్వం సంబన్ధ ఉపపద్యతే।
శబ్దస్యార్థే యత, స్తస్మాత్సంబన్ధోఽ స్తీతి గమ్యతే॥ 37

యతః = ఏ కారణమువలన, శబ్దస్య = శబ్దమునకు, అర్థే = నియతమగు అర్థము విషయమై ప్రత్యయహేతుత్వమ్ = జ్ఞాన కారణత్వము, సంబన్ధే = సంబంధము, సతి = ఉండగా, అనగా ఉన్నప్పుడే, ఉపపద్యతే = యుక్తమగుచున్నదో, తస్మాత్ = ఆ కారణము వలన, సంబన్ధః (శబ్దార్థములకు) సంబంధము, అస్తి = కలదు, ఇతి = అని, గమ్యతే = తెలియ బడుచున్నది.

ఘటః అను శబ్దమువలన నియతముగా కడవ అను అర్థమే భాసించుచున్నది. నియమములేకుండ పటము, వృక్షము మున్నగు అర్థములు తెలియబడలేదు. ఇట్లే పటః అను శబ్ద ముచ్చరింపగా వస్త్రము అను అర్థమే నియతముగా జ్ఞాతమగుచున్నది. పై రీతిని శబ్దము

నియతార్థబోధకు కారణమని చెప్పక తప్పదు. శబ్దమునకు అర్థముతో సంబంధమే లేనిచో కారణత్వము కుదురదు. కాబట్టి దానికి ఉపపత్తి కలుగుటకై శబ్దార్థములకు సంబంధము స్వాభావికమైయున్నదని చెప్పక తీరదు.

కనుక శబ్దముచే అర్థమునకు సంస్కారము కలుగుననుట యుక్తము కాదు. శాబర మంత్రములలో ఆనుపూర్వీ విశేషమువలన కార్యము కలుగవచ్చును. ॥37॥

అవతారిక— శబ్దార్థములకు కల సంబంధము పురుష కల్పితము కానేరదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నిత్యేఽనిత్యేపి బాహ్యార్థే పురుషేణ కథఞ్చన।
సంబన్ధోఽకృత సంబన్ధైః శబ్దైః కర్తుం నశక్యతే॥ 38

నిత్యే = నిత్యమగునట్టి అనగా ఘటత్వము మున్నగు జాతిరూపమున నిత్యమగునట్టి, అనిత్యే+ అపి = అనిత్యము అగునట్టి అనగా ఘటము, పటము మున్నగు వ్యక్తిరూపమున అనిత్యమగునట్టి, బాహ్యార్థే = బాహ్య ప్రపంచమున కానవచ్చెడి అర్థమునందు, అకృతసంబన్ధైః = కృత్రిమము అగు సంబంధము కల; శబ్దైః = ఘటః పటః మున్నగు శబ్దములచే, సంబన్ధః= సంబంధము, కథఞ్చన = ఎంత ప్రయత్నించినను; కర్తుమ్ = కల్పించుటకు, న + శక్యతే = శక్యపడదు.

ఘటః మున్నగు పదములు ఘటత్వమనెడి నిత్యమగు జాతిని, దానికి ఆశ్రయమగు అనిత్యమగు వ్యక్తినిగూడ బోధింపగలవు. ఆ శబ్దమునకు జాతితోగాని, వ్యక్తితోగాని సంబంధమును అస్మదాది, మనుష్యుడు కల్పింపలేడు. కాక 'పురుష' శబ్దము పరమపురుషపరమని భావించినను ఈశ్వరుడు కూడ సంబంధమును కల్పింపలేడు.

కాక శబ్దములు నిత్యములనెడి నిత్య శబ్ద వాదమునగాని, శబ్దము లనిత్యము లనెడి అనిత్య శబ్ద వాదమున (కార్య శబ్ద వాదమున) గాని బాహ్యార్థముతో శబ్దములకు సంబంధ కల్పన శక్యము గాదు.

శబ్దమునకు అర్థముతో సంబంధము స్వాభావికమే. పురుష కల్పితము కాదు. ఘట పటాది శబ్దములు ఎప్పటినుండియో లోకమున ఉన్నవి. ఈనాటి పురుషులచే ఆ శబ్దములకు అర్థములతో సంబంధము ఎట్లు కల్పింపబడగలదు ?

మరియు అర్థములన్నియు మనకు ప్రత్యక్షము కానందున అర్థములతో సంబంధమును కల్పించుట అసాధ్యము. ఘటమునందున్న జాతినిబట్టి వ్యక్తితో సంబంధమును అనుమాన ప్రమాణముచే చూపరాదాయని ప్రశ్నింపవచ్చును. ఘటమునందు ఘటత్వజాతి ఒక్కటియే లేదు. ద్రవ్యత్వము, పదార్థత్వము వస్తుత్వము మున్నగు ఎన్నియో ధర్మములు కలవు. నియత సంబంధము లేనందున అనుమానమునకు తావులేదు. బుద్ధిచే అర్థకల్పనచేసి శబ్దముల

చేతనే అర్థ సంబంధమును చూపవలెను. ఆ శబ్దమునకు అర్థముతో సంబంధము ఎట్లు అని ప్రశ్నింపగా మరియొక శబ్దముచే చెప్పవలెను. ఈ రీతిని ఎన్నియో శబ్దములను చూపిన అనవస్థా దోషము ప్రసక్తమగును. కనుకనే పరమపురుషుడు కూడ ఈ సంబంధమును కల్పింపజాలడు. శబ్దమునకు అర్థముతో సంబంధము స్వాభావికమని అంగీకరించి అనవస్థను వారింపవలెను. అట్టితరి ప్రతి శబ్దమునకు అర్థముతో స్వాభావిక సంబంధమున్నదని తెలుచున్నది. ॥38॥

అవతారిక— పదార్థముల ఉనికి రెండు విధములుగానున్నది. బాహ్య ప్రపంచకమున అస్మదాదుల దృష్టికి గోచరించెడి రూపము ఒకటి. అదియే క్రయ విక్రయాదులకు ఉపయోగపడుచున్నది. బుద్ధితో మనుష్యుడు కల్పించుకొనినది రెండవది. ఇది క్రయ విక్రయాదులకు ఉపయోగపడదు. కాని దీని ఉనికి చెడదు. బాహ్యరూపము నశించినను రెండవరూపముండగలదు. ఈ రెండవ రూపమునకుగల ఉనికిని ఉపచార సత్తయని శాస్త్రజ్ఞులు పేర్కొనియున్నారు. బుద్ధి కల్పితమగు ఉనికి అని దాని భావము. శబ్దముచే అర్థమును బోధింపదలచినపుడు ఈ ఉపచారసత్తయే ఉపయోగపడును. బాహ్య సత్తనుబట్టి శాబ్దవ్యవహారము జరుగనేరదు ఇట్లంగీకరించుటచే గతించిన వస్తువులకు రాబోవు వస్తువులకుకూడ ఉపచారసత్త కలుగుటచేనవియు శబ్దవాచ్యములు కాగలవు. పై రీతిని సత్తకు ద్వైవిధ్య కల్పన భాష్యకారుడు జూపియున్నాడు. ''తదస్యాస్త్యస్మిన్నితిమతుప్'' (5-2-94) అని పాణిని సూత్రము. దీని యర్థము, 51 వ శ్లోకమున స్పష్టము కాగలదు. అందు అస్తి అని ప్రత్యేకించి చెప్పుటవలన బాహ్యసత్తనుబట్టియే మతుప్ ప్రత్యయము ప్రవర్తించును. ధనవాన్ = వర్తమాన కాలికమగు ధనము కలవాడు. గతించిన ధనమునుబట్టిగాని రాబోవు ధనమునుబట్టిగాని తద్ధితము ప్రవర్తింపనేరదు. ఉపచారసత్తనుబట్టి పదార్థము నిత్యము కాన ''శబ్దార్థములకు సంబంధమునిత్య''మను వైయాకరణుల సిద్ధాంతము సంగతమగుచున్నది. అట్లుకాకున్న పై సిద్ధాంతము నిలువజాలదు అని తలంచి గ్రంథకర్త ఔపచారికమగు సత్తను విపులముగా నిరూపించుచున్నాడు.

శ్లో॥ వ్యపదేశే పదార్థానా మన్యా సత్తౌపచారికీ ।
సర్వావస్థా సు సర్వేషా మాత్మరూపస్య దర్శికా ॥ 39

పదార్థానామ్ = పదార్థములయొక్క, అనగా ఘటము, పటము మున్నగు వస్తువులయొక్క, వ్యపదేశే = వ్యవహారము విషయమై, అనగా వానిని శబ్దముచే బోధించుట విషయమై, అన్యా = భిన్నమగు అనగా బాహ్యవస్తువులయొక్క ఉనికి కంటె వేరుగానున్న, ఔపచారికీ = కల్పింపబడినట్టి అనగా బుద్ధిచే నిర్మింపబడినట్టి, సత్తా = ఉనికి, సర్వేషామ్ = ఎల్లవస్తువుల యొక్క అనగా. ఘటము పటము మున్నగు భావ వస్తువులయొక్క, లేమి అనే అభావ పదార్థము యొక్కయు, ఆత్మరూపస్య = తన రూపమునకు, సర్వావస్థాసు = ఎల్లయవస్థల యందు అనగా కంటికి కానవచ్చుచున్న వర్తమానకాలమున భూతకాలమున భవిష్యత్కాలమున గూడ, దర్శికా = చూపుచున్నదై, అస్తి = కలదు.

బాహ్య ప్రపంచమున పదార్థములుండుట వాస్తవము. దానినిబట్టి బుద్ధిచే కల్పింప బడిన వస్తువుల ఉనికిగౌణము. కనుక బుద్ధి కల్పిత సత్త ఔపచారికమనబడుచున్నది. ఉపచార మనగా లక్షణ. దానిచే నిర్మింపబడినది ఔపచారికము.

పదార్థములు బాహ్య ప్రపంచమున ఉన్నను లేకున్నను వానిని ఉన్నట్లు చూపినది యీ సత్త, కనుక "సర్వావస్థాసు" అనుట సమంజసము.

ఘటము, పటము మున్నగు వస్తువులను భావ పదార్థములందురు. అతీతము, అభావము మున్నగు వానిని అభావ పదార్థములందురు. ఈ రెండు విధములగు పదార్థముల స్వరూపమును ఈ సత్త చూపగలదు.

అర్థములను శబ్దముచే బోధించుటకు ఉపచారసత్త సహకరించును. జ్ఞానరూపముగా నున్న సత్త ఔపచారికసత్త. ఈ ఉపచారసత్తయొక్క స్వరూపము, ఆవశ్యకత, అందులకు ప్రమాణము 52 వ శ్లోకమువరకు చూపబడుచున్నది. ॥39॥

అవతారిక— ఔపచారికసత్తను ఆశ్రయించుట చాల అవసరమని నిరూపించుటకు ముందుగా యుక్తమగు దృష్టాంతముతో దాని స్వరూపమును జూపుచున్నాడు.

శ్లో॥ స్ఫటికాది యథాద్రవ్యం భిన్నరూపైరుపాశ్రయైః ।
స్వశక్తి యోగాత్సంబన్ధం తాద్రూప్యేణోపగచ్ఛతి ॥ 40

తద్వచ్ఛబ్దోఽపి సత్తాయామస్యాం పూర్వం వ్యవస్థితః ।
ధర్మైరుపైతి సంబన్ధమవిరోధి విరోధిభిః ॥ 41

స్ఫటికాది = స్ఫటికము మున్నగు, ద్రవ్యమ్ = వస్తువు, అవిరోధివిరోధిభిః = అవిరుద్ధ మగునట్టియు, విరుద్ధమగునట్టియు (తెల్లని స్ఫటికమునకు మల్లెపూవు మున్నగు తెల్లని వస్తువులు విరోధులుకావు. స్ఫటికముయొక్క రూపమును మరుగుపెట్టునవి కావు. మంకెన పువ్వు మున్నగు ఎరుపు వస్తువులు విరోధులు. అవి స్ఫటికముయొక్క రూపమును మార్పు చేయగలవని భావము.) కనుకనే. భిన్నరూపైః = విలక్షణమగు రూపముకల; ఉపాశ్రయైః= దగ్గర ఉండెడి వస్తువులతో; స్వశక్తియోగాత్ = స్వ = తనయొక్క అనగా స్ఫటికము యొక్క స్వచ్ఛత అనెడి శక్తి సంబంధమువలన; తాద్రూప్యేణ = తాద్రూప్యమనెడి; సంబన్ధమ్ = సంబంధమును, యథా = ఎట్లు: ఉపగచ్ఛతి = పొందుచున్నదో;

తద్వత్ = అట్లే, శబ్దః + అపి = శబ్దముకూడ, అస్యామ్ = ఈ (అనగా బుద్ధిచే) కల్పితమగు; సత్తాయామ్ = సత్తయందు, ఔపచారికసత్తయందు, పూర్వమ్ = ముందుగా; వ్యవస్థితః = ఉన్నదై అనగా జ్ఞానరూపముగానున్న పదార్థముతో సంబంధముకలదై; అవిరోధి విరోధిభిః = అవిరుద్ధమగునట్టియు-విరుద్ధమగునట్టియు అనగా బాహ్య ప్రపంచకమున భావరూపమగునట్టియు అభావరూపముగనున్నట్టియు; ధర్మైః = ధర్మములతో, సంబంధమ్= వాచ్యవాచక భావమనెడి సంబంధమును. ఉపైతి = పొందుచున్నది.

సత్ = అనగా ఉన్నటువంటిది యని యర్థము. ఘటము, పటము మున్నగు వానిని బోధించును. సతః భావః = సత్తా, ఉనికి. బుద్ధిలో పదార్థములను భావించుట, ఉపచారసత్త. అనగా జ్ఞానరూపమున వస్తువులను గుర్తించుట.

ఇది నిర్మలమగు స్ఫటికమువంటిది. స్ఫటికములో దగ్గరనున్న వస్తువులన్నియు ప్రతిఫలించును. తెల్లని వస్తువులు స్ఫటికముతో కలిసియుండును. అనగా దానికి రూపము మారునట్లు చేయక ఐక్యమును బొందియే యుండును. ఎరుపు, నలుపు, పసుపు వస్తువులు స్ఫటికముయొక్క తెలుపుతనమును మరుగు పరచును.

అట్లే ఈ సత్తయు సత్పదార్థములగు ఘటాదులలోను, లేమితోనుగూడ కలిసి యుండును. ఎల్ల వస్తువులతోను ఈ సత్త సంబంధించుననెడి భావముతో ''అవిరోధి విరోధిభిః'' అని చెప్పబడినది.

శబ్దము ముందుగా బుద్ధి కల్పిత సత్తతోగూడిన పదార్థమునే బోధించును.

ఈ సత్త చాలా అవసరమైనది. దీనిని ఆశ్రయింపనిచో ''ఘటః'' ''అస్తి'' అను ప్రయోగము కలుగనేరదు ఘటః అనుటచేతనే సత్త భాసించుటచే మరల అస్తి అనుట పునరుక్తమగును. అట్టి ఘటమునకు అభావముతో విరోధముండుటచే ''ఘటః నాస్తి'' అని నిషేధ ప్రయోగముకూడ అసంగతమేయగును.

తాద్రూప్యేణ అనుచోట అభేదార్థమున తృతీయావిభక్తి. ॥40, 41॥

*అవతారిక*— శబ్దములవలన కలిగెడి వ్యవహారమున ఉపచారసత్త ప్రముఖ పాత్రను వహించియున్నది. అనగా ప్రధానమగుచున్నది. అట్లుకాకున్న వాడుకలో "న" (లేదు) అనుటయే పొసగదు అని చెప్పుచు దానికి విరోధి వస్తువులతో సంబంధము కలుగు ననెడి 41 వ శ్లోకము యొక్క అర్థమును వివరించుచున్నాడు.

**శ్లో॥ ఏవఞ్చ ప్రతిషేధ్యేషు ప్రతిషేధ ప్రక్లృప్తయే।**
**ఆశ్రితేషూప చారేణ ప్రతిషేధః ప్రవర్తతే ॥ 42**

ఏవం + చ = ఇట్లుండగా అనగా ఉపచారసత్తకు విరోధి వస్తువులతో గూడ సంబంధము కలుగుచుండగా, ప్రతిషేధ ప్రక్లృప్తయే = నిషేధము యొక్క ప్రసిద్ధికొరకు, ఉపచారేణ = కల్పనారూపముచే, ఆశ్రితేషు = గ్రహింపబడిన, ప్రతిషేధ్యేషు = నిషేధింపబడెడి వస్తువుల యందు, ప్రతిషేధః = 'న' అను నిషేధము, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది.

లోకులు 'ఘటోనాస్తి', (కడవ లేదు) 'అబ్రాహ్మణః' (బ్రాహ్మణుడు కానివాడు) అను రీతిని 'న' శబ్దముచే లేమిని చూపుచున్నారు. ఘటము నిజరూపమున నున్నచో సత్తకు లేమి యసంభవము కనుక 'ఘటో న' అనుట పొసగదు. కడవ లేనియెడల లేమి సిద్ధమే కనుక ప్రత్యేకించి 'న' అని ప్రయోగము సరిపడదు. లేని దానిని గురించి 'న' అని చెప్ప

వ్యపదిశ్యతే = వ్యవహరింపబడుచున్నదో, సంయోగిసంనికర్షాత్ = లాక్షాద్రవ్యముతో సంయోగము కలవస్త్రము మున్నగువాని సంనికర్షమువలన, వస్త్రాదిషు + అపి = వస్త్రము మున్నగువానియందు గూడ, గృహ్యతే + చ = గ్రహింపబడుచున్నదో,

తథా = ఆరీతిగా శబ్దే = శబ్దమునందు, అవస్థితా = ఉన్నట్టి, జాతిః = జాతి అనగా గోశబ్దత్వము మున్నగుజాతి, శబ్దార్థసంబన్ధాత్ = శబ్దమునకు అర్థమునకు గల సంబంధమువలన, అర్థజాతీనామ్ = అర్థమునందుగల జాతులయొక్క, వ్యపదేశే = వ్యవహారము నందుఅనగా ఆ రెంటికి అభేదవ్యవహారమునందు, కల్పతే = సమర్థమగుచున్నది. అంతియే కాదు. జాతికార్యాయ = జాతినిబట్టి కలిగెడి కార్యముకొరకుకూడ, కల్పతే = సమర్థమగు చున్నది.

కాక శబ్దగతమగుజాతి వ్యపదేశే = అభేదవ్యవహారముకలుగగా, జాతికార్యాయ = జాతిని బట్టికలిగెడి కార్యమునకు సమర్థమగుచున్నది.

రంగువేసిన వస్త్రమునందు ఎరుపుతనము కానవచ్చుచున్నది. అది వస్త్రమునకు స్వాభావికముకాదు. లాక్షయందుగూడ ఆ ఎరుపుతనము స్వాభావికముకాదు. ఎరుపు అనుగుణము నందు రక్తత్వము సమవాయ సంబంధమున కలదు. అట్టిరక్తత్వము గుణమునకు ఆధారమగు లాక్షయందు భాసించును. అట్టిలాక్షతో సంయుక్తమగు అనగా కలిసియున్నవస్త్రమునందు కాన్పించును. కాగా రక్తగుణమునందు సమవేతమగురక్తత్వముపరంపరగా వస్త్రము నందు కాన్పించుచున్నది.

ఆట్లే గో శబ్దమునందున్న గో శబ్దత్వ జాతి శబ్దార్థములకుగల స్వాభావికమగు యోగ్యత అనెడి సంబంధమువలన అర్థగతమగుజాతితో ఐక్యమునుబొందగలదు.

స్వతః గోవునందుగల గోత్వము నందు మరియొకజాతిలేదు. కాని ఆజాతికిగూడ శబ్దగతమగు అసాధారణమగు జాతి సాహాయ్యము చేయగలదు. అందుచే పరంపరగా రక్తత్వము వస్త్రము మున్నగు దానియందు భాసించునట్లు శబ్దగతమగు జాతి శబ్దార్థములకు గలసంబంధము వలన అర్థజాతితో నైక్యమును బొందగలదు. ॥7,8॥

అవతారిక—శబ్దమునందుగల జాతి అర్థజాతి యందు ఆరోపింపబడినదై జాతి కార్యమునుకలిగింపగలదు (జాతికార్యాయకల్పతే) అని 8వ శ్లోకమున చెప్పబడినది. దానినే వివరించున్నాడు.

శ్లో॥ జాతి శబ్దైకశేషే సాజాతీనాం జాతిరిష్యతే।
శబ్దజాతయ ఇత్యత్ర తజ్జాతిః శబ్దజాతిషు ॥ 9

1. సా = అది అనగా శబ్దమునందున్నజాతి, జాతిశబ్దైకశేషే = జాతివాచకములగు గవాది శబ్దములకు ఏకశేషము, (ప్రసక్తే) = ప్రాప్తించు చుండగా (జాతికార్యాయ) = జాతినిమిత్తకమగు కార్యముకొరకు (కల్పతే) = సమర్థమగుచున్నది.

సక్కర లేదు గదా ! ఈ పద్ధతిని చూచిన లోకమున 'స' అనుటకు అవకాశమే లేదు. కనుక బాహ్య ప్రపంచమునగల పదార్థములను మనము గుర్తించి వానిని అనుసరించి శబ్దములను ప్రయోగించుట సరికాదు.

కాబట్టి ఉపచారమునే శరణముగా జూపవలెను. అనగా ప్రపంచమున ఉనికి లేములతో నిమిత్తమక్కరలేకుండ బుద్ధిచే పదార్థమును కల్పించి వ్యవహరింపవలెను. అట్టి పదార్థములు కల్పితమైయున్నందున వానికి విరోధి పదార్థములతోను, అవిరోధి పదార్థములతోను గూడ సంబంధము లభించును. కాన అట్టి పదార్థములయొక్క లేమిని తెలుపుటకై 'న' శబ్దము ప్రయోగార్హమగుచున్నది. అట్లు కాకున్న నిషేధమున కర్హమగు పదార్థములే లేనందున 'న' శబ్దమును ప్రయోగించుటకు తావే లేకపోయెడిని. ॥42॥

అవతారిక— 42 వ శ్లోకమున విరోధి పదార్థములతో ఉపచారసత్తకు సంబంధమును జూపి దానితోనే అవిరోధి పదార్థములకు గూడ సంబంధము యుక్తమగుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆత్మలాభస్య జన్మాఖ్యా సత్తాలభ్యా చ లభ్యతే ।**
**యది సజ్జాయతే కస్మా, దథాసజ్జాయతే కథమ్ ॥** 43

ఆత్మలాభస్య = స్వరూపము యొక్క ప్రాప్తికి, జన్మాఖ్యా = జన్మా అను పేరు, స్వరూప ప్రాప్తిని జన్మ అని వ్యవహరింతురని భావము, అట్టి జన్మమునకు మూడు అర్థములు నియతములని చూపుచున్నాడు.

1. సత్తా = ఉనికి ; అనగా ఆ పని చేయువాని స్థితి. కర్తయని భావము. 2. లభ్యా = పొందబడునది. అనగా కర్మ. 3. లభ్యతే = పొందుట అనగా లాభము. 1. పొందునట్టి కర్త, 2. పొందబడు అర్థము కర్మ, 3. పొందుట అను క్రియ ఈ మూడు పుట్టుట అను కార్యము జరుగుటకు అపేక్షితమగుచున్నవని భావము. దీనినే జన్మయందురు. జన్మ అనగా వస్తుస్వరూప ప్రాప్తి.

B. పై అంగత్రయము సత్కార్యవాదమున కుదరదని చెప్పుచున్నాడు.

సత్ = వస్తువు సత్తే ; యది = అగుచో ; అనగా కారణ వ్యాపారమునకు ముందుగూడ కార్యము సద్రూపముగా ఉన్నదేయగుచో, కస్మాత్ = దేనివలన, జాయతే = పుట్టుచున్నది ? ఉన్నదానికి జన్మమనునది విరుద్ధముకదా !

అథ = అట్లుగాక, అసత్ = అసత్తేయగుచో, అనగా కారణ వ్యాపారమునకు ముందు వస్తువులేనిదే యగుచో, కథమ్ = ఎట్లు, జాయతే = పుట్టగలదు ? లేనిది పుట్ట నేరదుకదా !

సత్కార్యవాదమున ప్రత్యయార్థమగు కర్తయు, అసత్కార్యవాదమున ప్రకృత్యర్థము కుదరదని తాత్పర్యము. ॥43॥

*అవతారిక*— పై శ్లోకార్థమునే దృష్టాన్తముతో నిరూపించుచున్నాడు.

శ్లో॥ సతో హి గన్తుర్గమనం సతి గమ్యే ప్రవర్తతే।
గన్తృవచ్చేన్న జన్మార్థో న చేత్తద్వన్న జాయతే॥ 44

గన్తుః = వెళ్ళువాడు ; సతః = ఉండగా, గమ్యే = పొందబడునది ; స్థితే = ఉండగా, గమనమ్ =నడక ; ప్రవర్తతే + హి = జరుగునుకదా !

చైత్రః గ్రామం గచ్ఛతి. వెళ్ళువాడు చైత్రుడు. అట్టి కర్త సిద్ధముగానుండవలెను. వెళ్ళబడునది గ్రామము. అది కర్మ. అది సిద్ధముగా నుండవలెను. ఈ రీతిగా కర్తయు కర్మయు సిద్ధముగా నుండుటచే ఆ కారకములంపబట్టి గచ్ఛతి అను క్రియ జరుగును. దీనిని దృష్టాన్తముగా జూపియున్నాడు. దీని సామ్యము ''జాయతే'' అనుచోట లేదు. ''అఙ్కురో జాయతే'' (మొలక పుట్టుచున్నది.) ఇచట నడకవంటిది జననక్రియ. గ్రామము వంటిది స్వరూప ప్రాప్తి. నడచెడి మనుష్యునివంటివి అంకురము. చైత్రుడు సిద్ధ వస్తువు. గ్రామము సిద్ధ వస్తువు. ఈ రెండు సిద్ధముగా నున్నందున గమనక్రియ జరుగగలదు. ప్రకృతమున గన్తృవత్ = నడచెడి చైత్రునివలె, చేత్ = ఉన్నచో, అనగా అంకురము సిద్ధముగా నున్నచో, జన్మార్థః = జన్మ (పుట్టుట) అను ధాత్వర్థము ; న = లేదు. అనగా ఉపపన్నము కాదు. సిద్ధమే కాన పుట్టుట ఎట్లు ? సిద్ధమగు పదార్థమునకు పుట్టుక ఉండదు కదా !

కాక తద్వత్ = దానివలె అనగా నడచెడి వానివలె ; న + చేత్ = లేనియెడల అంకురము లేనిదే యగుచో, గన్త సిద్ధము, అట్లు అంకురము సిద్ధముకాదు. కనుక జన్మను బొందవచ్చునని భావము. న + జాయతే = పుట్టనేరదు. లేని వస్తువు ఎట్టు జనియింపగలదు ?

గన్తృ దృష్టాన్తము చొప్పున అంకురమున్నదని యంగీకరించిన సిద్ధమే కాన పుట్టుక జరుగదు. అంకురము గన్తవలె సిద్ధము కాదనిన లేనిదానికి పుట్టుక యెట్లు ? కాబట్టి బాహ్య వస్తువులను ఆధారముగా గైకొనినచో శబ్దములు వాడుకలో సరిపడవు. ॥44॥

*అవతారిక*— బాహ్య పదార్థముల నాశ్రయించిన ''అఙ్కురో జాయతే'' మున్నగు శాబ్ద వ్యవహారము సంగతము కానేరదని చూపి ఉపచారసత్తను ఆశ్రయించిన ఏ విధమగు దోషము లేకుండ సరిపడునని చూపుచున్నాడు.

శ్లో॥ ఉపచర్య తు కర్తార మభిధానప్రవృత్తయే।
పునశ్చకర్మ భావేన తాంక్రియాఞ్చ తదాశ్రయామ్॥ 45

శ్లో॥ అథోపచారసత్త్వైవం విధేయాస్తత్ర లాదయః।
జన్మనా తు విరోధిత్వాత్ ముఖ్యా సత్తా న విద్యతే॥ 46

అభిధాన ప్రవృత్తయే = శబ్దములయొక్క ప్రయోగముకొరకు, కర్తారమ్ = కర్తను ; పునః + చ = మరియు, కర్మ = కర్మను, చ = మరియు ; తదాశ్రయామ్ = కర్తృ కర్మలు

ఆశ్రయముగాకల ; తాం + క్రియామ్ = ఆ క్రియను, భావేన = బుద్ధిచే ; ఉపచర్య + తు = వివేచనము అనగా భేదము నాశ్రయించి, ఉపచారసత్తా = కల్పితమగు పదార్థముల యొక్క ఉనికి ; అథ = అంగీకరింపవలెను.

ఏవమ్ = ఇట్టైన, తత్ర = పై రీతిని కల్పింపబడిన కర్తయందు, లాదయః = లకారము మున్నగునవి, విధేయాః = శాస్త్రముచే విధింపదగినవి. అనగా ''అఙ్కురో జాయతే'' అనుచోట కర్త్రర్థమున లకారము. జాయతే అను పదప్రయోగము. జాతవాన్ = అని కర్త్రర్థమున 'క్తవతు' ప్రత్యయము. జన్మ అఙ్కురస్య = అనుచోట కర్త్రర్థమున షష్ఠీ ప్రత్యయము వచ్చును.

కాక, తత్ర = కల్పితపదార్థమున, లాదయః = లకారాదులు, విధేయాః = విధింపదగినవి. కర్త్రర్థమున ప్రత్యయము క్రియను కల్పించుటచే ప్రకృతికి ధాతు సంజ్ఞయు, కర్మను కల్పించుటచే కర్మనుగా కర్తనుగా చూపుచు ''అఙ్కురః ఆత్మానం లభతే" అను వాక్యము, అఙ్కురమ్ అనుచోట కర్మార్థమున ద్వితీయ, ఇవి యన్నియు సంపాదింపవలెను.

ముఖ్యా = ప్రధానమగు ; సత్తా + తు = సత్త ఐన అనగా ఆరోపము నపేక్షింపక బాహ్య ప్రపంచమున ఉన్న వస్తువులయొక్క ఉనికి మాత్రము, జన్మనా = జన్మతో ; విరోధిత్వాత్ = విరోధము కలది యగుటవలన అనగా విరుద్ధమగుటవలన, న + విద్యతే = ఉండనేరదు.

కనుక ఔపచారిక సత్తనే శాబ్ద వ్యవహారమునకు స్వీకరింపవలయును. ॥45,46॥

*అవతారిక* — బాహ్య సత్తనుబట్టి "అఙ్కురో జాయతే'' అను ప్రయోగము కుదరదు, ఆరోపిత సత్తనుబట్టియే కుదురునని ప్రదర్శించి, 'అఙ్కురః అస్తి' (అంకురమున్నది) అని జన్మ తరువాతను కలిగెడి అస్తిత్వము పురస్కరించుకొని యున్న ప్రయోగము కూడ బాహ్య సత్తను బట్టి కుదరదు, ఉపచారసత్తను బట్టియే కుదురునని చూపుచున్నాడు.

**శ్లో॥ ఆత్మానమాత్మనా బిభ్రదస్తీతి వ్యపదిశ్యతే ।**
**అన్తర్భావాచ్చ తేనాసౌ కర్మణా న సకర్మకః ॥ 47**

A. ఆత్మానమ్ = తన్ను, ఆత్మనా = తనచేతనే, బిభ్రత్ = ధరించుచున్న (అఙ్కురః)= అంకురము మున్నగునది, అస్తి + ఇతి = అస్తి అను పదముచే ; వ్యపదిశ్యతే = వ్యవహరింపబడుచున్నది.

లోకులు అఙ్కురః అస్తి = (మొలిక ఉన్నది.) ఘటః అస్తి = (కడవ ఉన్నది.) అను రీతిని, అస్తి పదమును ప్రయోగించుచున్నారు. 'అస్తి' అను పదమునకు తన రూపమును తానే ధరియించుచున్నది అని యర్థము. తన్ను ధరియించుటలో మరియొక కర్త లేదని చెప్పుటకు 'ఆత్మనా' అను పద ముపయుక్తమగుచున్నది.

ఇచట గూడ 1. ధరియించుట అను క్రియ, 2. ధరియించెడి కర్త, 3. ధరి యింపబడెడి కర్మ, ఈ మూడును ఉండవలెను. కాని ఈ మూడు వేరువేరుగా భాసింపనందున బాహ్య పదార్థమును బట్టి పై ప్రయోగ ముపపన్నము కానేరదు. ఉపచార సత్తను స్వీకరిం చిన పై వ్యవహారము సంగతము కాగలదు.

B. అస్తి అను దానికి తన్ను ధరియించుచున్నదని యర్థము చెప్పిన, (తన్ను) ఆత్మానమ్ అను కర్మనుబట్టి 'అస్' ధాతువు 'గ్రామం గచ్ఛతి' అనుచోట 'గమ్' ధాతువువలె సకర్మ కము కావలెను. అది స్వతః అకర్మకమే. అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అసౌ = ఈ అసధాతువు, అన్తర్భావాత్ = ధాత్వర్థమున ఇమిడియున్నందున ; తేన = ఆ, కర్మణా = ఆత్మానమ్ అను కర్మచే ; సకర్మకః + చ = సకర్మకము మాత్రము ; న = కానేరదు.

తన్ను తనచే ధరియించినవాడు అను ఎల్ల యర్థము ధాతువునకే వాచ్యమగు చున్నది. కర్మగానున్న తన్ను అనునది ధాత్వర్థముకంటె వేరుగాలేదు. కనుక ఆ కర్మనుబట్టి ధాతువునకు సకర్మకత్వము చెప్పరాదు.

ఎచట ధాత్వర్థము కంటె వేరుగా కర్మ భాసించునో, అచట ఆ కర్మనుబట్టి ధాతువు సకర్మకమగును. ఉదా :– చైత్రః గ్రామం గచ్ఛతి. ఇచ్చట గ్రామము ధాత్వర్థము కాదు.

ఈ యభిప్రాయమును భర్తృహరి సాధన సముద్దేశమున 87వ శ్లోకముచే చెప్ప బోవు చున్నాడు.

ఈ శ్లోకములో రెండవ భాగము ప్రసంగవశమున చూపబడినది. ప్రకృతార్థము గాదు. ॥47॥

అవతారిక— "అఙ్కురో జాయతే" అను ప్రయోగము బాహ్య వస్తువును స్వీక రించినచో కర్త లేనందున కుదరదని చెప్పి, ఇపుడు ధాత్వర్థము కూడ లేనందున ఆ ప్రయో గము కుదరదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాక్చ సత్తాఽభిసంబన్ధా న్ముఖ్యాసత్తాకథం భవేత్ ।
అసంశ్చనాస్తేః కర్తాస్యా, దుపచారస్తు పూర్వవత్ ॥ 48

సత్తాఽభిసంబన్ధాత్ = ఔపచారిక సత్తయొక్క సంబంధముకంటె, అనగా అట్టి సత్తతో పదార్థము సంబంధించుట కంటె, ప్రాక్ = పూర్వము, ముఖ్యా = ప్రధానమగు, సత్తా = బాహ్య పదార్థముల సత్త, కథమ్ = ఎట్లు, భవేత్ = కలుగును ?

బుద్ధి కల్పితమగు సత్తతో ముందుగ సంబంధించిన తరువాతయే పదార్థములకు బాహ్య సత్తతో సంబంధము కలుగును. అంతకుమునుపు ముఖ్యమగు సత్త ఉండనేరదు.

అస్తే అసన్ + చ = అసత్తు అగు అనగా లేని పదార్థము మాత్రము, అస్తేః = 'అస' ధాత్వర్థమునకు, కర్తా = కర్త అనగా ఆశ్రయము, న + స్యాత్ = ఉండనేరదు.

పూర్వవత్ = పూర్వము 45-46 శ్లోకములచే చెప్పినట్లు, ఉపచారః + తు = కల్పనామాత్రము (సమర్థః) = సమర్థము కాగలదు. అస్తి అను శబ్ద ప్రయోగమునకు అచట కర్త ఉపపన్నమగుటకు సరిపడి యుండును.

కాగా ఔపచారికమగు సత్తనుబట్టి అస్తి, నాస్తి, జాయతే అను ప్రయోగములు కుదురుచున్నవి. బాహ్య ప్రపంచమున గల పదార్థముల స్థితినిబట్టి ఎంత మాత్రము పై మూడు ప్రయోగములు కుదరవు. ॥48॥

*అవతారిక* — శబ్ద వ్యవహార మాత్రమున ఔపచారిక సత్తయే ఉపయోగించు చున్నదనియు, అది మహాభాష్యకార సమ్మతమనియు, నిరూపించుచు దాని స్వరూపమును వ్యక్తపరచుచున్నాడు.

శ్లో॥ తస్మాద్భిన్నేషు ధర్మేషు విరోధిష్వవిరోధినీమ్ ।
విరోధి ఖ్యాపనాయైవ శబ్దైస్తైస్తైరుపాశ్రితామ్ ॥ 49

శ్లో॥ అభిన్నకాలామర్థేషు భిన్నకాలేష్వవస్థితామ్ ।
ప్రవృత్తిహేతుం సర్వేషాం శబ్దానామౌపచారికీమ్ ॥ 50

శ్లో॥ ఏతాం సత్తాం పదార్థో హి న కశ్చిదతివర్తతే ।
సా చ సంప్రతి సత్తాయాః పృథక్‌భాష్యే నిదర్శితా ॥ 51

తస్మాత్ = అందువలన అనగా బాహ్య సత్తను బట్టి, "అస్తి, జాయతే, నాస్తి మున్నగు ప్రయోగములు నిర్వహింపబడనందున, భిన్నేషు = విజాతీయములగునట్టియు, కనుకనే, విరోధిషు = విరోధకముకల, ధర్మేషు = ధర్మములయందు అనగా అస్తిత్వము, నాస్తిత్వము మున్నగువానియందు, అవిరోధినీమ్ = విరోధి కానట్టియు, విరోధిఖ్యాపనాయ + ఏవ = విరుద్ధమగు పదార్థములను చెప్పుటకొరకే; తైః + తైః = ఆయా, శబ్దైః = శబ్దములచే, ఉపాశ్రితామ్ = ఆశ్రయింపబడినట్టియు, అనగా ముందుగా శబ్దములచే బోధింపబడినట్టియు, అభిన్నకాలామ్ = భేదములేని అనగా ఏకాకారమగు కాలము కలిగినట్టియు అనగా ఎల్లకాలములయందును ఉండునట్టియు, భిన్నకాలేషు = భిన్నమగు కాలము కల, అనగా వేరు వేరు కాలములయందుండెడి, అర్థేషు = వ్యక్తులయందు, అవస్థితామ్ = ఉన్నటువంటి ; సర్వేషామ్ = ఎల్ల ; శబ్దానామ్ = శబ్దములయొక్క, ప్రవృత్తిహేతుమ్ = ప్రవృత్తికి కారణమగునట్టి, ఏతాం = ఈ రూపముకల, ఔపచారికీం = బుద్ధిచే కల్పింపబడిన, సత్తామ్ = సత్తను (ఉనికిని) కశ్చిత్ + పదార్థః = ఏ వస్తువు, న + వ్యభిచరతి + హి = వ్యభిచరించునది కాదు. అనగా దానిని విడిచియుండునది కాదుగదా !

హారం = శబ్దములవలన కలిగెడి పరస్పరాభిప్రాయ ప్రకటన, అనువర్తతే = అనువర్తించు చున్నది. అనగా అట్టి దానిని బట్టియే శాబ్దవ్యవహారము జరుగుచున్నది.

1. "ప్రదేశస్యైకదేశంవా"

నిర్గుణబ్రహ్మమేసత్యము. దానికంటె వేరు పదార్థములేదు. ఇదియే పరమ సిద్ధాన్తము. అట్టి బ్రహ్మపదార్థమును శబ్దము చెప్పజాలదు. కాని మాయా వశమున నిర్గుణ బ్రహ్మము జగద్రూపమున వివర్తమగుచున్నది. అందుచే ఘటాదికము ఆ బ్రహ్మముయొక్క రూపాంతరమే యగుటచేనట్టి ఘటాదికము ఈ శ్లోకమున ప్రదేశశబ్దముచే బోధింపబడుచున్నది. కాబట్టి బ్రహ్మపదార్థమున ప్రదేశమగు అనగా కల్పిత భాగమగు ఘటాదికమునే ఘటశబ్దము బోధించును. మరియు ఆ ఘటమునుగూడ గుణక్రియాది సకల ధర్మ సహితముగా బోధింప జాలదు. దానిలో ఏక దేశమగుజాతిని వ్యక్తిని బోధించును. నీలాది గుణములను చెప్పజాలదు.

2. "పరతోవానిరూపణమ్"

నిర్గుణమగు బ్రహ్మమే ద్రవ్యమనబడును. అట్టి ద్రవ్యమును ఏ శబ్దము బోధింప జాలదు దానికి ఘటత్వము గోత్వము మున్నగు జాత్యాదులతో సంబంధమును కల్పించి కల్పితరూపమును బుద్ధిచే భాసింపజేసి అట్టి దానిని శబ్దము బోధించునని చెప్పవలెను. ఈ సిద్ధాన్తమునగూడ శబ్దము అర్థమును ఇతరరూపముతోనే బోధించును. దీనిని సంసర్గ దర్శన మందురు.

3. ''విపర్యయమ్''

జ్ఞానమే సత్యము. అది తప్ప పదార్థములేదు అని నాస్తికదార్శనికులలో కొందరు భావింతురు. వీరిని ''విజ్ఞానవాదు''లని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. విజ్ఞానవాది మతమున జ్ఞానముకంటె వేరుగ పదార్థము లేనందున ఘటఘటాదులు వేరుగ ఉన్నవని భావించుట భ్రమయే. ఘటాది పదార్థములు లేనివే భాసించుచున్నవని తేలినది. అట్లు భాసించుటయే విపర్యయము విపర్యయమనగా భ్రమయే. కాగా వీరి మతమున పదార్థములు భ్రమ విషయములే శబ్ద వాచ్యములని తేలినది.

4. "అభావం + వా"

నాస్తికులలో 'మాధ్యమికు'లని పేరితో కొందరున్నారు. వీరు ''సర్వం శూన్యమ్'' ఎల్లయు శూన్యమని భావింతురు. వీరి మతమున ఘటాది పదార్థములు శూన్యములే శాబ్దవ్యవహార విషయములగుచున్నవి.

కాగా ఏ మతమును జూపినను శబ్దము యథార్థమగు వస్తువును చెప్పజాలదు. విచారణచేయకుండగనే ఈ శబ్దము ఈ యర్థమును బోధించునని గ్రహింపవలసియున్నది. అట్లు భావించుట అతీత, అభావ, నాస్తి మున్నగు పదములకు సమానమే. కాబట్టి భావవస్తు బోధక ఘటగవాది శబ్దములకు అభావబోధక శబ్దములకు సంబంధము అర్థములతో ఏక రూపమే. ॥52॥

*అవతారిక* — పై యర్థమునే దృష్టాన్తముతో జూపుచున్నాడు.

**శ్లో॥ యథేన్ద్రియస్య వైగుణ్యాత్సత్త్వాధ్యారోపవానివ।**
**జాయతే ప్రత్యయోఽర్థేభ్య స్తథైవోద్దేశజా మతిః॥** 53

ఇన్ద్రియస్య = ఇంద్రియము యొక్క అనగా కన్ను చెవి మున్నగు ఇంద్రియముల యొక్క, వైగుణ్యాత్ = పోయిన గుణము కలది యగుట వలన అనగా దోషమువలన, సత్త్వాధ్యారోపవాన్ + ఇవ = ఉనికి యొక్క ఆ రూపముకలదివలెయున్న, ప్రత్యయః = జ్ఞానము, అర్థేభ్యః = విషయములవలన అనగా వస్తువులవలన, యథా = ఏ రీతిగా, జాయతే = కలుగుచున్నదో, తథా + ఏవ = అట్లే, ఉద్దేశజా = శబ్దమువలన కలిగెడి, మతిః = జ్ఞానము, జాయతే = కలుగుచున్నది. వస్తువు నిజరూపమునగాక కల్పిత రూపముతోనే శబ్దమువలన జ్ఞాతమగుచున్నదని భావము.

కన్ను వస్తువుయొక్క రూపమును గ్రహించును. ఇంద్రియమునకు ఏదైన దోషమున్న, దానివలన ద్రవ్యరూపము రూపాంతరముగా కానవచ్చును. శంఖము తెల్లనిది. పైత్యము అధికమైన 'కామిల' అను దోషము కంటికి కలిగిన శంఖముయొక్క తెలుపుతనము స్వస్వరూపమున కానరాక పచ్చగ కానవచ్చును. శంఖము పచ్చనిది అనియే జ్ఞానము కలుగును. అట్లే చెవి శబ్దమును గ్రహించును. దానికి దోషమున్నచో ఇతరునిచే నుచ్చరింపబడిన శబ్దము మరియొక శబ్దమువలె భాసించును. నాలుక దుష్టమగుచో మధుర పదార్థము చేదుగా భాసించును. అట్లే శబ్దముకూడ విగుణమగు ఇంద్రియమును బోలి అర్థమును నిజరూపమునగాక కల్పితమగు రూపాంతరముకల దానినిగా బోధించును. వస్తువునందులేని రూపము నారోపింపగా అట్టి కల్పితరూపముకల అర్థమునే శబ్దము బోధించును.

ఇంద్రియమునకు దోషములేనిచో యథాస్థితమగు రూపమునే ఇంద్రియము గ్రహియించును. అందుచే విగుణమగు ఇంద్రియము దృష్టాన్తముగా జూపబడినది. శబ్దము ఎల్లప్పుడు అర్థమును నిజరూపముతో జూపక కల్పితమగు రూపముతోగూడిన దానినే బోధించును.

'ఉద్దిశ్యతే = ప్రతిపాద్యతే యేనసః ఉద్దేశః' దేనిచే అర్థమును తెలిసికొనునో అనగా తెలిసికొనుటకు సాధనమైనది శబ్దము. ఉద్దేశాత్ = శబ్దాత్, జాతాః ఉద్దేశజా = శబ్దమువలన కలిగెడిది. ॥53॥

*అవతారిక* — ఇంద్రియముయొక్క వైగుణ్యము మనకు ప్రత్యక్షముగా కానవచ్చుచున్నది. కాని శబ్దమునకు వైగుణ్యము అనగా దోషము ఎట్టిదో మనకు తెలియదు. దానిని తెలిసికొనుట యెట్లు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అకృత్స్న విషయాభాసం శబ్దః ప్రత్యయమాశ్రితః।**
**అర్థమాహాత్మ్యరూపేణ స్వరూపేణాఽనిరూపితమ్॥** 54

శబ్దః = శబ్దము, అర్థమాహాత్మ్యరూపేణ = అర్థముయొక్క మహిమయే రూపముగాకల, స్వరూపేణ = స్వరూపముచే, అనగా నిజరూపముచే, అనిరూపితమ్ = నిరూపింపబడనట్టియు, అకృత్స్నవిషయాభాసమ్ = సంపూర్ణముకాని విషయముకల, (కనుకనే ఆరోపితమగు) ప్రత్యయమ్ = జ్ఞానమును, ఆశ్రితః = ఆశ్రయించియున్నది.

ఘటము, పటము మున్నగు వ్యక్తులను పరిశీలించిన అందుకంటికి కానవచ్చెడి ఆకారము, దానిని ఆశ్రయించియున్న ఘటత్వము పటత్వము మున్నగుజాతి, ఎరుపు తెలుపు మున్నగు రూపము, కదలిక, ఉండుట మున్నగు క్రియ, ఏకత్వము మున్నగుసంఖ్య, కర్తృత్వము మున్నగు కారకము, పుంస్త్వము మున్నగు లింగము, గంధము పరిమాణము పృథక్త్వము మున్నగు ఎన్నియో అర్థములు గోచరించును. ఇదియే ఘటంద్వర్థముననున్న మాహాత్మ్యము. ఇన్ని అంశములు కలిగినదే ఆ యర్థము. అట్టి యర్థమును "ఘటః" అను ఒక శబ్దము చెప్పజాలదు. వానిని అన్నిటిని చెప్పవలెనన్న నీలః, చలః, ఏకః, కర్తా, పుమాన్ అను రీతిని ఎన్నియో శబ్దములను నుపయోగింపవలెను. అట్లే ఏ శబ్దమును చూచినను ఆ వ్యక్తికి సంబంధించియున్న గుణము లన్నిటిని చెప్పుట సంభవింపదు. అర్థమును ముందుగ బుద్ధితో భావించి దానికి అనుగుణమగు శబ్దమునుచూచి ప్రయోగింపవలెను. బుద్ధిచే అర్థకల్పన లేని దానిని ఉన్నట్లు భావించియే జరుగును. అందుకు మూలకారణము మాయ. అందుచే విచారించిచూచిన ఎల్ల యర్థములు ఇట్టివేయని భావించియే శబ్దప్రయోగము జరుగుచున్నది. ఇదియే శబ్దముయొక్క దోషము. ఆ దోషముచే శబ్దము అర్థమును సంపూర్ణరూపముతో చూపలేదు. సంపూర్ణార్థమును బోధింపలేకపోవుటయే శబ్దవైగుణము.

కాబట్టి భావరూపములగు అర్థములను బోధించు ఘట పటాది శబ్దములకు 'అతీత', 'అభావ' మున్నగు అభావ బోధక శబ్దములకు అర్థముతో సంబంధముకలుగుట ఏకరూపమే. శాబ్దవ్యవహారమంతయు యథార్థ విషయము కాదు. ॥54॥

అవతారిక — మాయాసంబంధము విడనాడి శుద్ధమగు పరమాత్మ స్వరూపమును ఆకలించియున్న జీవన్ముక్తులకు కలిగెడి శాబ్దవ్యవహారము యథార్థవిషయకమే యగును. కాబట్టి వారల ఉపదేశమువలన మనకు కూడ కలిగెడి శాబ్దవ్యవహారము సత్యరూపమే కానోపును. అట్టితరి శబ్దము అసంపూర్ణమగు అర్థమునే బోధించును. కాన భావబోధక శబ్దములు అతీత, అభావ మున్నగు శబ్దములు అర్థసంబంధ విషయమై ఏకరూపములే అని నిర్ధారణ ఎట్లు పొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ రూపణ వ్యపదేశాభ్యాం లౌకికే వర్త్మని స్థితౌ ।
జ్ఞానం ప్రత్యభిలాపం చ సమానౌ బాలపణ్డితౌ ॥ 55

రూపణ వ్యపదేశాభ్యామ్ = బుద్ధిచే అర్థమును నిరూపించుటచే, అట్టి యర్థమును శబ్దముచే వ్యవహరించుటచేతను, లౌకికే = లోకవ్యవహారమునకు సంబంధించియున్న, వర్త్మని = మార్గమున, అనగా ఒకే మార్గాన, స్థితౌ = ఉన్నటువంటి, బాలపణ్డితౌ = ఆత్మతత్త్వము

తెలియనివాడు, ఆ తత్త్వమును తెలిసికొన్నవాడు వీరిరువురు, జ్ఞానం + ప్రతి = ఇతరుల అభిప్రాయమును గుర్తించి బుద్ధితో అర్థమును నిర్మించుట గూర్చి అభిలాపం + చ = దానిని శబ్దముచే అనువదించుట గూర్చియు, సమానౌ = సములే, వారిరువురకు లోకవ్యవహారమున తారతమ్యములేదని భావము.

ఇచట బాలశబ్దము చంటివాడు అనునర్థమును బోధింపదు. పరమాత్మతత్త్వము ఎరుగక శరీరేంద్రియాదులకు బద్ధుడైయున్న వ్యక్తిని బాలశబ్దము బోధించును. అట్లే పండిత శబ్దము గూడ తర్కవ్యాకరణాది శాస్త్రముల నభ్యసించిన వ్యక్తిని బోధింపదు. చిత్తశుద్ధి కలిగి శ్రవణమననాదులచే మాయాసంబంధమును విడనాడి నిర్గుణ పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొన్నను ప్రారబ్ధకర్మవశమున దేహమును విడనాడకయున్న జీవన్ముక్తుని బోధించును. అట్టివానిని స్థితప్రజ్ఞుడందురు.

బాలుడు పండితుడు కూడ లోకవ్యవహారము నడపుటలో సమానులే. ఇతరుల యభిప్రాయమును గుర్తించి దానికి అనుగుణమగు అర్థమును బుద్ధిచే నిరూపించుట, అనగా కల్పించుట, దానికి అనుగుణమగు శబ్దమును ప్రయోగించుట ఈ రెండుకూడ ఇరువురకు సమానమే. తత్త్వవేత్తయు ''బ్రహ్మసత్యం; జగన్మిథ్య'' అని గుర్తించినను ఆ దృష్టితో లోకమున సంచరింపడు. అస్మదాదులవలెనే మాట్లాడును. స్నానపానాదులు చేయును.

తత్త్వవేత్తయొక్క శాబ్దవ్యవహారము కూడ యథార్థవిషయకము కాదు. అదియు అస్మదాది వ్యవహారము వంటిదే. కాబట్టి శబ్దము అసంపూర్ణమగు అర్థమునే బోధించుననుట యుక్తమే. ॥55॥

*అవతారిక*— వ్యవహారదశయందు బాలుడు, పండితుడు సమానమైనవారే యని 55 వ శ్లోకమున చెప్పబడినది. కాని పండితునకు కలిగిన జ్ఞానము స్వచ్ఛమని పెద్దలు చెప్పుదురు. అతనికి గూడ ప్రతివస్తువు తెలియబడియుండనందున దానితో గూడిన జ్ఞానమే పండితునిది. అట్టితరి ఆయన జ్ఞానము స్వచ్ఛమైనది అనుట ఎట్లు పొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ సర్వార్థరూపతా శుద్ధిః జ్ఞానస్య నిరుపాశ్రయా ।**
**తతోఽప్యస్య పరాంశుద్ధి మేకే ప్రాహురరూపికామ్ ॥ 56**

A. జ్ఞానస్య = జ్ఞానమునకు, నిరుపాశ్రయా = ఆశ్రయమును అపేక్షింపని అనగా ఇంద్రియ సంబంధమును అపేక్షింపకయున్న, సర్వార్థరూపతా = ఎల్ల యర్థములరూపము కలిగియుండుట, శుద్ధిః = నైర్మల్యము, పరిశుభ్రత.

ప్రతివ్యక్తికి ఇంద్రియ సంబంధమువలన జ్ఞానము కలుగుచున్నది. అందుచే ఇంద్రియ దోషమువలన ఆ జ్ఞానముగూడ దోషసహితము కాగలదు. అస్మదాదులకు కలిగెడిది ఇట్టి జ్ఞానమే. అట్లుగాక ఇంద్రియ సంబంధమును అపేక్షింపకుండగనే పండితునకు జ్ఞానము

పదిఆవులను బోధింపదలచిన పది గోశబ్దములను ప్రయోగింపవలెను. అట్టితరి ఏకశేషముచే ఒకే గోశబ్దముశేషించి గావః అను ప్రయోగము లభించును. పైరీతిని ఏకశేషము చేయకపోయినను ఒకే శబ్దము ప్రయోగమున నిలవగలదు. అది ఒకజాతికార్యము. 'గో' అను శబ్దమునందు గోశబ్దత్వమను జాతి యున్నది. దానిని అర్థజాతులయందారోపింపగా అది వానితో నైక్యమునుబొంది దానియందున్న ఏకత్వమును బట్టిఏకగోశబ్దమును ప్రయోగించు నట్లు చేయును. కాగా ఆ జాతి యందున్న ఏకత్వమునుబట్టి ఆజాతి ఏకశబ్దప్రయోగమనెడి జాతికార్యమును సంపాదించును.

2. మరియొకజాతికార్యము.

సా = శబ్దగతమగుజాతి, జాతీనామ్ = జాతులకుగూడ, జాతిః = జాతిగా ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

ఇమాః జాతయః, (ఇవిజాతులు) గోత్వము, ఘటత్వము, పటత్వము మున్నగునవి జాతులు అనురీతిని ప్రయోగములుకలవు. ఇచట జాతయః అనుపదము అర్థబోధకము కావలెను, కాని యచట మరియొకజాతి లేనందున ప్రవృత్తి నిమిత్తము లేనందున బోధకము కానేరదు. శబ్దమునందుగల గోశబ్దత్వము అనుజాతి ఇమాజాతయః అనుచోటజాతులతో ఏకీభావముబొందగా దానిని బట్టి జాతయః అనుశబ్దము బోధకముకాగలదు.

3. మరియొక జాతికార్యము.

తజ్జాతిః = ఆజాతి అనగా శబ్దమునందుగల గో శబ్దత్వము మున్నగుజాతి, శబ్ద జాతయః + ఇతి + అత్ర = శబ్దజాతులు అనుప్రయోగమున, శబ్దజాతిషు = శబ్దజాతుల యందు జాతికార్యమునుకలిగించును. అనగా గోశబ్దత్వము, ఘటశబ్దత్వము, పటశబ్దత్వము మున్నగునవి వ్యక్తులవంటివి. వీనిని శబ్దజాతులు అని వ్యవహరింతురు. వీనియన్నిటి యందు శబ్దజాతయః, అనురీతిని ఒకేవిధమగు ప్రయోగమున్నది. అట్టి ఏకాకారప్రయోగము జాతి కార్యము. అది శబ్దజాతినిబట్టియే కలుగుచున్నది. ॥9॥

***అవతారిక***–ఎల్లశబ్దములయందు అసాధారణముగా వాచకమగు జాతియున్నది. కాని అదిశబ్దత్వమనెడిజాతులకంటె వేరుకాగలదు. అట్లే ఆజాతులకంటె వేరుగా మరియొకజాతి, మరియొకజాతియని యంగీకరించినచో అనవస్థాదోషము కలుగును అనుప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యా శబ్దజాతిశ్శబ్దేషు శబ్దేభ్యో భిన్నలక్షణా।**
**జాతిస్సా శబ్దజాతిత్వ మప్యతిక్రమ్యవర్తతే॥ 10**

శబ్దేషు = శబ్దజాతి అనుశబ్దములయందు, యా = ఏ, శబ్దజాతిః = శబ్దత్వ జాతియో, సా = ఆ, జాతిః = శబ్దేభ్యః = శబ్దజాతి అనుశబ్దములకంటె, భిన్నలక్షణా = విజాతీయమగు లక్షణముకలదై, శబ్దజాతిత్వమ్ + అపి = శబ్దజాతిత్వమును గూడ, అతిక్రమ్య = అతిక్రమించి, వర్తతే = ఉన్నది.

కలుగును. అది ఎల్లయర్థములకు సంబంధించియుండును. అదియే జ్ఞానముయొక్క పారిశుద్ధ్యము. అస్మదాదులకు పరిమితమగు వస్తువులకు సంబంధించిన జ్ఞానమే కలుగును.

B. ఏకే = కొందరు తత్త్వవేత్తలు, అస్య = ఈ జ్ఞానమునకు, తతః + అపి = దానికంటె గూడను అనగా ఇంద్రియ సంబంధము లేకుండగనే కలిగెడి జ్ఞానమునకు గల పారిశుద్ధ్యము కంటె గూడ, అరూపికామ్ = రూపసంబంధములేని అనగా విషయసంబంధము లేనందున లోకవ్యవహారమునకు సంబంధింపనట్టి, కనుకనే, పరామ్ = ఉత్తమమగు, శుద్ధిమ్ = శుద్ధిని, ప్రాహుః = చెప్పుచున్నారు.

విషయసంబంధములేని జ్ఞానము ప్రశాంతము. ఆనందరూపము. స్వపరప్రకాశము. గ్రాహ్యగ్రాహకములతో సంబంధములేనిది. అదియే పరబ్రహ్మరూపము.

పండితునకు ఇంద్రియసంబంధములేక జ్ఞానము కలుగును. బాలునకు ఇంద్రియముల సంబంధము లేనియెడల జ్ఞానము కలుగనేరదు.

మరియు విషయములతో కలసియున్న జ్ఞానమే బాలునకు కలుగును. విషయముల సంపర్కములేక కేవల జ్ఞానము పండితునకు కలుగును. ఆ జ్ఞానము బ్రహ్మరూపము.

తత్త్వవేత్త వ్యవహారదశయందు అస్మదాదులవలె వ్యవహరించినను, ఆయన ఈ ప్రపంచకముతో సంబంధములేని బ్రహ్మజ్ఞానము కలవాడే. ఆ జ్ఞానము శుద్ధము. ॥56॥

*అవతారిక* — జ్ఞానము స్వతః పవిత్రమైనది. అట్టి స్థితిలో దానికి అశుద్ధి ఎట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉపప్లవో హి జ్ఞానస్య బాహ్యాకారానుపాతితా ।**
**కాలుష్యమివ తత్రాస్య సంసర్గే వ్యతిభేదజమ్ ॥** 57

జ్ఞానస్య = జ్ఞానమునకు, బాహ్యాకారానుపాతితా = బాహ్యప్రపంచమున గల వస్తువుల ననుసరించుట ; ఉపప్లవః + హి = ఉపద్రవము కదా ! అనగా జ్ఞానముయొక్క నైర్మల్యమునకు భంగము కలిగించును కదా !

తత్ర = బాహ్యవస్తువునందు, సంసర్గే = సంబంధము కలుగగా, అస్య = ఈ జ్ఞానమునకు, వ్యతిభేదజమ్ = అభేదమువలన కిలిగెడి, కాలుష్యమ్ = కాలుష్యము, ఇవ = కలిగినట్లుండును.

స్వచ్ఛమగు జ్ఞానమునకు బాహ్యవస్తువుతో సంపర్కము కలుగగా ఆ వస్తువు జ్ఞానమునందు ప్రతిబింబించును. అందుచే ఆ రెండు ఏకరూపముగనే కాన్పించును. ఈ కారణము వలన జ్ఞానమునకు స్వచ్ఛత యుండనేరదు. విషయసంబంధము తొలగిన జ్ఞానమునందు అశుద్ధి కానరాదు

స్వతః జ్ఞానము నిర్మలమే. పరిశుద్ధమే. విషయసంబంధమున్నను మలినమైనది వలె కాన్పించును. ఈ యభిప్రాయము కారికలో 'ఇవ' శబ్దము వ్యక్తపరచుచున్నది. ॥57॥

అవతారిక — వ్యవహారదశలో జ్ఞానమునకువలె విషయమునకు గూడ అశుద్ధి కలుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథాచ జ్ఞాన మాలేఖా దశుద్ధౌ వ్యవతిష్ఠతే ।**
**తథోపాశ్రయవానర్థః స్వరూపాద్విప్రకృష్యతే ॥** 58

జ్ఞానమ్ = జ్ఞానము, యథా = ఏ రీతిగ, ఆలేఖాత్ = విషయసంపర్క వశమున, అశుద్ధౌ = అశుద్ధియందు అనగా పారిశుద్ధ్యము లేకపోవుటయందు, వ్యవతిష్ఠతే = ఉన్నదో, తథా = అట్లే, అర్థః + చ = ఘటము, పటము మున్నగు అర్థముగూడ, ఉపాశ్రయవాన్ = జాతిగుణము క్రియ మున్నగువానియొక్క సంబంధము కలదై, స్వరూపాత్ = నిజరూపమునుండి, విప్రకృష్యతే = వ్యవహితమగుచున్నది, అనగా దూరమగుచున్నది.

ఘటము మున్నగుపదార్థములు జాతి మున్నగు ఉపాధులతో కలిసియే లోక వ్యవహారమునకు శబ్దముచే బోధింపబడుటకు అర్హములగుచున్నవి. అట్లుకాకున్న అవి శబ్దవాచ్యములు కానేరవు. వ్యవహారమునకు సమర్థములుగూడ కానేరవు. జాతి, గుణము మున్నగునవి సంబంధింపకుండుటయే ఘటాదుల నిజస్వరూపము. అదియే శుద్ధరూపము. జాత్యాదులు కలియుటవలన ఘటముయొక్క రూపము కలుషితమగుచున్నది. కాగా వ్యవహారదశయంతయు పదార్థముల పారిశుద్ధ్యమును గుర్తింపకయే జరుగుచున్నదని తెలుచున్నది. ఇందు 57 వ శ్లోకముచే జూపబడిన జ్ఞానముయొక్క కాలుష్యము దృష్టాంతముగా జూపబడినది.॥58॥

అవతారిక — పై చూపబడిన అర్థమును ప్రకృతమున సమన్వయించుచున్నాడు.

**శ్లో॥ ఏవమర్థస్య శబ్దస్య జ్ఞానస్య చ విపర్యయే ।**
**భావాభావావభేదేన వ్యవహారానుపాతినౌ ॥** 59

ఏవమ్ = ఈ ప్రకారముగా అనగా 57, 58 వ శ్లోకములలో చెప్పిన ప్రకారముగా, అర్థస్య = ఘటము పటము మున్నగు అర్థమునకు, శబ్దస్య = అర్థమును బోధించెడి శబ్దమునకు, జ్ఞానస్య + చ = అవి విషయముగాకల జ్ఞానమునకును, విపర్యయే = వ్యత్యాసము అనగా నిజరూపము కలుషితమై రూపాంతరము (జాతే) = కలుగగా, కనుకనే భావాఽభావౌ = భావ పదార్థము అభావపదార్థము రెండుగూడ, అభేదేన = భేదములేకపోవుటచే అనగా సామ్యము కలవి యగుటచే వ్యవహారానుపాతినౌ = లోకవ్యవహారమును అనుసరించియే యున్నవి.

ఘటము మున్నగు వస్తువులు స్వతః శుద్ధములే. కాని జాతి మున్నగు ధర్మముల సంపర్కమున అవి కలుషితములగుచున్నవి. ఆ ధర్మములు లేనిదే వస్తువులు వ్యవహారమునకు గాని, శబ్దముచే బోధింపబడుటకు గాని యోగ్యములు కానేరవు. అట్టి ధర్మములతో

గూడిన యర్థములను బోధించెడి శబ్దములు గూడ శుద్ధములు కానేరవు. అట్లే జ్ఞానముగూడ విషయసంబంధమున శుద్ధిని విడిచియున్నది.

పై రీతిని అర్థము శబ్దము జ్ఞానము ఈ మూడును స్వతః స్వచ్ఛములైనను ఇతర సంబంధవశమున అస్వచ్ఛములగుచున్నవని తెలినది.

లోకమున ఘటము పటము మున్నగునవి భావపదార్థములనియు, అభావమనునది వానికంటె వేరు పదార్థమనియు వాడుక గలదు. తార్కికులు గూడ ద్రవ్యగుణకర్మ సామాన్య విశేష సమవాయములనెడివి ఆరు భావపదార్థములనియు, అభావమనునది మరియొక విధమగు పదార్థమనియు విభజించియున్నారు.

కాని భావపదార్థము, అభావపదార్థము రెండు ఏకరూపములే యనవచ్చును. రెంటికి ఒక విచిత్రమగు సామ్యము కలదు. శుద్ధమగు ఘటాది వస్తువు వ్యవహారమునకు గాని శబ్దముచే బోధింపబడుటకుగాని అర్హము కానేరదని పలుమారులు చెప్పబడినది. జాతి మొదలగు ఇతర ధర్మములను పురస్కరించుకొనియే వస్తువులకు వ్యవహారము, శబ్దవాచ్యత్వము కలుగును. అభావము గూడ అట్టిదే. అభావము అనినంత మాత్రమున మనకు జ్ఞానము కలుగదు. వ్యవహారము కూడ జరుగదు. అభావమునకు అనగా లేమికి ముందుగా ఘటాదులను చేర్చి 'ఘటముయొక్క అభావము', 'పటముయొక్క లేమి' అను రీతిని చెప్పిన అది తెలియబడును. అనగా ప్రతియోగియగు పదార్థములేనిదే అభావము వ్యవహారోపయోగి కానేరదు.

ఈ రీతిగా ఘటము మున్నగు భావవస్తువులు జాతి మున్నగు ఇతర ధర్మముల సాహాయ్యమును తీసికొనియే లోకవ్యవహారమునకు కారణములగుచున్నవి. అభావము కూడ ఘటము మున్నగు ఇతరవస్తువులను సాహాయ్యముగా గైకొనియే వ్యవహారవిషయమగుచున్నది. రెంటికి పరాపేక్షయున్నందున రెండు ఏకరూపములే యనవచ్చును. ఇతరాపేక్ష లేనిదే భావవస్తువుగాని అభావముగాని వ్యవహారగోచరము కానేరదుగదా. ॥59॥

*అవతారిక*— భావపదార్థముకంటె వేరుగా అభావమనెడి పదార్థమున్నదని తలంచి వ్యవహారదశలో రెండు పరాపేక్షములగుటచే నవి భిన్నములు కానేరవని ఇంతవరకు జూపియున్నాడు.

కాని భావపదార్థము ఒక్కటియే నిలిచెడిది. దానికంటె వేరుగా అభావపదార్థము సంభవింపదు. అది యుండుటకు తావులేదని ఇపుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ నాఽభావో జాయతే భావో నైతి భావోఽనుపాఖ్యతామ్ ।
ఏకస్మాదాత్మనోఽనన్యౌ భావాఽభావౌ వికల్పితౌ ॥ 60

A. అభావః = అభావము అనగా ప్రధ్వంసాభావము, భావః = భావమూలకమై అనగా భావ వస్తువు కారణముగా గలదై. న + జాయతే = జన్మింపనేరదు. ఘటము, పటము మున్నగు భావవస్తువులను ఉపమర్దనముచేయగా అనగా వానిని పగులకొట్టిన దానిని ప్రధ్వంసాభావ

మందురు. భావవస్తువుల నాశనమువలన ధ్వంస జన్మించునని తార్కికులు తలంతురు. కాగా ప్రధ్వంసాభావము భావవస్తునాశ మూలకమని భావింతురు. కాని అట్లు తలంపరాదు. భావము అభావము అనునవి పరస్పరము విరుద్ధములైనవి కదా!

అట్లే ఘటము, పటము మున్నగు భావవస్తువులు ప్రాగభావముయొక్క నాశనము వలన జన్మించునని వారు తలంతురు. అదియు పొసగదు. భావః = భావపదార్థము, అనుపాఖ్యతామ్ = అసత్ అను బుద్ధి విషయత్వమును అనగా అభావరూపమును, న + ఏతి = పొందలేదు. అనగా తనకు కారణమునుగా గైకొనజాలదు. ప్రాగభావమును దర్దించగా భావము పుట్ట నేరదని భావము. కాన భావపదార్థోపమర్దముచే ధ్వంస పుట్టును అట్లే ప్రాగభావోపమర్దనము వలన ఘటాది భావవస్తువు జన్మించును అనుట సమంజసము కాదు.

B. ఏకస్మాత్ = అద్వితీయమగు, ఆత్మనః = పరమాత్మకంటె, అనన్యౌ = విభిన్నములు కాని అనగా వేరుగాలేని, భావాఽభావౌ = భావము అభావము అను రెండు, కల్పితౌ = వికల్పితములే, అనగా కల్పనా మూలకములే.

పరబ్రహ్మము ఒక్కటియే పరమార్థ సత్యము. పరమార్థ నిత్యము. అది ఎన్నడు వ్యవహారవిషయము కానేరదు. కాని పరబ్రహ్మము నాశ్రయించియున్న అవిద్యనుబట్టి ఆ పరబ్రహ్మము వ్యవహారదశలో నానారూపములను దాల్చినట్లు అస్మదాదులకు గోచరించును. ఆ పరబ్రహ్మమే తన శక్తివిశేషము అగు కాలముయొక్క మహిమచే కాలభేదమును గూడ అనుసరించును. అస్మదాదులకు ఘటపటాదులు ప్రత్యక్షమగు అవస్థనుబట్టి ఘటపటాదులు భావరూపములనియు, అస్మదాదుల ఇంద్రియములకు గోచరించని వాని పూర్వావస్థ ప్రాగభావమనియు, అస్మదాదుల దృష్టికి గోచరించని వాని యుత్తరావస్థ ప్రధ్వంసాభావమనియు ప్రాజ్ఞులు గుర్తించుచున్నారు. ఘటపటాది వస్తుజాతమంతయు బ్రహ్మముయొక్క వివర్తమే కదా! ॥60॥

పై యర్థమునే చూపుచున్నాడు.

**యథాభావముపాశ్రిత్య తదాభావోఽనుగమ్యతే ।**
**తథాఽభావముపాశ్రిత్య తద్భావోఽప్యనుగమ్యతే ॥ 61**

యథా = ఎట్లు, భావమ్ = భావమునకు, ఉపాశ్రిత్య = ఆశ్రయించి, తదభావః = దానియొక్క అభావము, అనుగమ్యతే = అనుసరింపబడుచున్నదో, తథా = అట్లే, అభావమ్ = అభావమును ఉపాశ్రిత్య = ఆశ్రయించి, తద్భావః = దానియొక్క భావము, అపి = కూడ, అనుగమ్యతే = అనుసరింపబడును. ॥61॥

*అవతారిక*— భావపదార్థముల సంస్కారము సుతరాం నివర్తింపగా అభావమనెడి పదార్థము నిలబడియుండును. అభావమనునది ఎల్లశక్తులు లేనిది. కారణభేదముచే భావము, అభావము అనునవి రెండు పదార్థములు స్వతంత్రములై భాసించుచునే యున్నవి.

అవి సత్యములే. ఇట్లుంటగా భావపదార్థము, అభావము అనునవి రెండుకూడ కల్పితములే సత్యములు కానేరవు అనుట పొసగదు, అను పూర్వపక్షమునకు సమాధానము అనగా సత్కార్యవాదమునగాని, అసత్కార్యవాదమునగాని పదార్థములకు కార్యకారణ భావము పొసగదు కనుక ద్వైతదర్శనములు నిలుచునవి కానందున అద్వైతశాస్త్రము చొప్పున వివర్త వాదమే శరణమని సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ అభావస్యానుపాఖ్యత్వాత్కారణం న ప్రసాధకమ్ ।
సోపాఖ్యస్య తు భావస్య కారణం కిం కరిష్యతి ॥ 62

A. ముందుగ అసత్కార్యవాదమున కార్యకారణ భావము కుదురదని చెప్పుచున్నాడు.

అభావస్య = లేమి, అనుపాఖ్యత్వాత్ = సత్ (ఉన్నది) అను బుద్ధికి గోచరము కానందున, కారణమ్ = మట్టి మున్నగు కారణము, న + ప్రసాధకమ్ = కార్యజనకము కానేరదు.

ఒక వస్తువువలన మరియొక వస్తువు జనియించును. లేమినుండి ఏ వస్తువు పుట్ట నేరదు. కారణ వ్యాపారమునకు ముందు కార్యము లేదనెడివారి మతము చొప్పున ఘటము మున్నగునవి అంతకుముందు లేవని చెప్పవలెను. అట్టితరి లేమి ఒక కార్యమును కలిగింపదు. కనుక మన్ను కారణము, కడవ కార్యమని చెప్పదగదు. లేమినుండియు కార్యము పుట్టగలదని అంగీకరించిన ఆవు కొమ్ములనుండియు పాలు పుట్టవలెను. ఇసుకనుండియు నూనె ఉద్భవింప వలెను.

B. సత్కార్యవాదమున గూడ అనగా కారణ వ్యాపారమునకు ముందు కార్యము సూక్ష్మ రూపమున ఉన్నదియే అనెడివారి మతమున గూడ కార్యకారణ భావము సిద్ధింపదని చెప్పు చున్నాడు.

సోపాఖ్యస్య = సత్ (ఉన్నది) అనెడి బుద్ధికి విషయమగు, భావస్య = పదార్థము యొక్క, (స్వీకారే) తు = స్వీకారపక్షము నందైతే, అనగా సత్కార్యవాదమున అయితే, కారణమ్ = మట్టి మున్నగు కారణము, కిం కరిష్యతి = ఏమి చేయగలదు ?

కార్యముగా తలంపబడెడి ఘటాదికము సత్తేయగుచో మరల కారణము నిరుప యుక్తమే కదా ! లేని వస్తువును రూపొందించుటకు కదా కారణమపేక్షితమగుచున్నది. ఆ వస్తువు సత్తే అనగా సిద్ధమేయగుచో కారణాపేక్ష లేదు.

కనుక ఏ పక్షమునను కార్యకారణ భావము కుదరదు. కనుక అద్వైతశాస్త్రమునే సేవింపవలెను. అపుడు శబ్దము శుద్ధ బ్రహ్మపదార్థమును చెప్పజాలనందున కల్పితమగు అర్థ మునే బోధించుచున్నదని తప్పక అంగీకరింపవలయును. కాబట్టి భావబోధకములుగా భావింప బడెడి ఘటపటాదులను చెప్పెడి శబ్దములు, లేమిని బోధించెడి అతీత, అభావము అను శబ్ద ములు రెండుకూడ సమానములే. ॥62॥

అవతారిక — కనుక ప్రాగభావము, ప్రధ్వంసాభావము అనునవి వేరుగాలేవు. అవియు భావపదార్థము కూడ పరబ్రహ్మముయొక్క అవిద్యామూలకములగు అవస్థా భేదములే అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తస్మాత్సర్వమభావోవా భావోవాసర్వమిష్యతే।**
**నత్వవస్థాన్తరం కిఞ్చి దేకస్మాత్సత్యతః స్థితమ్॥ 63**

తస్మాత్ = అందువలన అనగా అభావమునుండి భావముగాని, భావమునుండి అభావముగాని పుట్టుట సంభవింపనందున, సర్వమ్ = అంతయు అనగా పరబ్రహ్మముకంటె అతిరిక్తమగు ఎల్ల ప్రపంచకము, అభావః + వా = పరమార్థము కానేరదనియే, ఇష్యతే = అంగీకరింపబడు చున్నది. సర్వమ్ = ప్రపంచకమంతయు, భావః + వా = భావరూపమనియే, (ఇష్యతే) = అంగీకరింపబడుచున్నది. పరబ్రహ్మము సద్రూపము కనుక దాని వివర్తమగు ప్రపంచకము గూడ సత్తే. అనగా బ్రహ్మసత్తను బట్టి ప్రపంచకమునందు గూడ సత్తయే భాసించును. బ్రహ్మ సత్తకంటె వేరుగ సత్త లేదు. కాన అభావమనునది మాత్రము వేరుగా లేదు.

B. ఆ యంశమునే జూపుచున్నాడు.

ఏకస్మాత్ = అద్వితీయమగు, సత్యతః = సత్యమగు పరబ్రహ్మముకంటె, స్థితమ్ = ఉన్నటువంటి, అవస్థాన్తరమ్ = మరియొక అవస్థ, న + తు + కిఞ్చిత్ = ఏమియు లేదు. ॥63॥

అవతారిక — అద్వితీయమగు పరబ్రహ్మమే పరమార్థ సత్యము. అది జ్ఞాన రూపము. దానికి అవిద్యావశమున బహుభావము ఏర్పడినది. దాని మూలమున దర్శన వికల్పములు ఏర్పడినవి. కాన వానియందు పెద్దలు అభిమానము వహించి సత్యపదార్థమును దూరము చేయరాదు. అభిమానము మాత్రము దురాగ్రహ మూలకమే అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తస్మాన్నాఽభావమిచ్ఛన్తియే లోకే భావవాదినః।**
**అభావవాదినో వాపి నభావం తత్త్వలక్షణమ్॥ 64**

A. తస్మాత్ = అందువలన అనగా పరబ్రహ్మమే సత్యము. ఇతరము కల్పితమని చెప్పుట వలన, లోకే = లోకమునందు యే = ఎవరు. భావవాదినః = పరబ్రహ్మమే సత్యమని నమ్మినవారో (తే) = అట్టి మహర్షులు, అభావమ్ = అభావమును, న + ఇచ్ఛన్తి = అంగీకరింపరు. ఘటాది పదార్థములకు ఆవిర్భావము జన్మము, తిరోభావము నాశము. అంతకు వేరుగా జన్మనాశములు లేవు. పదార్థముయొక్క పూర్వావస్థ ప్రాగభావము. దాని ఉత్తరావస్థ ధ్వంసము. ఎట్లనగా - ఘటమునకు మట్టిరూపముగా నుండుట ఘట ప్రాగభావము. ఘటమునకు కపాలావస్థ ధ్వంసము. పరమార్థ సత్యము బ్రహ్మమే అను నమ్మిక కల మహర్షులు భావపదార్థము కంటె వేరుగ అభావమును నంగీకరింపరు.

B. యే + అపి = ఎవరు, అభావవాదినః + వా = అభావవాదులే అనగా ''సర్వం శూన్యం జగత్'' ఎల్లజగము శూన్యమేయని భావింతురో వారు ''తత్త్వలక్షణమ్'' = సత్యస్వరూపమగు భావమ్ = భావశబ్ద వాచ్యమగు పరమాత్మను, న + ఇచ్ఛన్తి = అంగీకరింపరు ఎల్ల ప్రపంచము శూన్యరూపమే. దానికంటె వేరుగా భావపదార్థము లేదని చార్వాకాదులు విశ్వసింతురు.

ఇట్టి దర్శనభేదములు అవిద్యామూలకములే వ్యవహారమున మాత్రము ఎల్లరు ఎల్ల వాదముల అభిప్రాయములను గ్రహించియే యున్నారు. ॥64॥

అవతారిక— పై రీతిని అభావములేదని నిశ్చయింపబడినది. కాని అట్టి స్థితిలో ప్రపంచమున కానబడు భేదమంతటికిని కారణమేమియుండును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ అద్వయేచైవ సర్వస్మిన్ స్వభావాదేక లక్షణే ।
పరికల్పేషు మర్యాదా విచిత్రైవోపలభ్యతే ॥ 65

సర్వస్మిన్ = ఎల్ల ప్రపంచకము, స్వభావాత్ = స్వభావమువలన, ఏకలక్షణే = ఏకరూపమగునట్టి, అద్వయే + చ + ఏవ = అద్వితీయమే యగునట్టి పరబ్రహ్మమయమై యుండగా. పరికల్పేషు = వికల్పములయందు, మర్యాదా = వ్యవస్థ, విచిత్రా + ఏవ = అనేకరూపము కలదై, ఉపలభ్యతే = చూడబడుచున్నది.

పరబ్రహ్మమున స్వగతభేదముగాని, సజాతీయభేదముగాని, విజాతీయభేదముగాని లేదు. ప్రపంచకమంతయు అట్టి నిర్గుణ పరబ్రహ్మకంటె వేరుగాలేదు. అయినను అనాదియగు మాయ ఆ పరబ్రహ్మమునందుండుటచే దానివలన బహుభావమును బ్రహ్మ పొందినట్లు కాన్పించును. దానివలన ఎన్నియో విచిత్రములగు పదార్థములు విలక్షణములుగా గోచరించును. అందుచే ఘటాదికమగు భావపదార్థము అభావముగూడ అవిద్యాదశలో కానవచ్చుచున్నవి.॥65॥

అవతారిక— రూపము లేనట్టియు వ్యవహారమున కతీతమగునట్టి పరబ్రహ్మమునందు ఘటపటాది భావపదార్థము, అభావము కూడ మాయావశమున నెట్లు భావించును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ చతస్రోఽపి యథాఽవస్థా నిరుపాఖ్యే ప్రకల్పితాః ।
ఏవం ద్వైవిధ్యమప్యేతద్భావాఽభావవ్యపాశ్రయమ్ ॥ 66

నిరుపాఖ్యే = రూపరహితమగు అభావమునందు, చతస్రః = నాలుగు విధములగు, అవస్థా + అపి = అవస్థలు కూడ, అనగా ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము. అత్యంతాభావము అనెడి నాల్గు అవస్థలు. యథా = ఏ రీతిగా ప్రకల్పితాః = నైయాయికులచే కల్పింపబడినవో,

ఏవమ్ = ఈ రీతిగానే, భావాఽభావవ్యపాశ్రయమ్ = భావము అభావము, అనే అర్థములు ఆశ్రయముగాగల, ఏతద్ + ద్వయమ్ + అపి = ఈ జంటయు (కల్పితమ్) = పరబ్రహ్మమునందు కల్పింపబడినది.

అభావము నాల్గు విధములని తార్కికులు పలుకుదురు. అభావమనగా లేమి దానికి చాతుర్విధ్య మెట్లు ? అని ప్రశ్నించిన వస్తుతః ఏమియులేదు. వాని వ్యవస్థ కుదురుటకై ఈ కల్పన చేయబడినదని వారు చెప్పుదురు

అట్లే పరబ్రహ్మమునందు అనంతశక్తి సహితమగు మాయవలన ఈ భావపదార్థము, అభావపదార్థము గూడ కల్పితము కావచ్చును. సర్వశక్తి శూన్యమగు అభావమునకే నాల్గు అవస్థలను కల్పింపగా, సర్వశక్తి సమన్వితమగు పరబ్రహ్మమునందు అవస్థాభేదము కల్పించుటలో నాశ్చర్యమేమి యున్నది ?

''చతస్రోహి'' అను పాఠాంతరము కలదు. ॥66॥

*అవతారిక*— యథార్థముగ చూచిన భావము, అభావముగూడ నిజరూపమును జూపజాలవు. అనగా విచారించి చూచిన అవి నిలుచునవి కానేరవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అవిరోధీ విరోధీవా సన్నసన్వాపి తత్త్వతః ।**
**క్రమవా నక్రమోవాపి నాఽభావ ఉపపద్యతే ॥ 66**

అభావః = అభావము అనగా లేమి, అవిరోధీ = భావపదార్థముతో విరోధములేనిది అనగా ఘటము మున్నగు వస్తువునకు సహకరించునది. న + కానేరదు. భావపదార్థము పుట్టుటకుగాని ఉండుటకుగాని అభావము సహకరింపనేరదని భావము. విరోధీ + వా = విరోధించునది, న + కానేరదు. అభావము భావపదార్థమును పాడుచేయనేరదని భావము.

అట్లే, తత్త్వతః = నిజరూపమున, అభావము, సన్ = సద్రూపమైనది అనగా ఉనికి కల వస్తువు కానేరదని భావము. అసన్ + వా + అపి = అసద్రూపమైనదియు, న = కానేరదు. అభావమనునది విరుద్ధమైనందున భావరూపము కానేరదు. అభావమనునవి స్వతః లేమియేగాన దానికి వేరుగ అసత్త్వముండనేరదు.

అట్లే అభావము, క్రమవాన్ = క్రమముకలది, న = కానేరదు. భావపదార్థమునకే క్రమము సంభవించును. అక్రమో + వా = క్రమములేనిది, న = కానేరదు. అక్రమమనగా యౌగపద్యము. అది ఇతర వస్తుసాపేక్షము. అభావము వస్తురూపము కానందున అక్రమము కూడ సంభవింపదు.

కాగా పై రీతిని చూచిన అభావము న + ఉపపద్యతే = ఉపపన్నము కాదు. యుక్తికి సరిపడదు. కాగా అభావమనునది లేదని చెప్పనగును.

ఇట్లే భావపదార్థముగూడ నిర్వచనమున కర్హము కాజాలదు. భావపదార్థము ఇతర

వస్తువులతో విరోధించునదిగాని, విరోధింపనిదిగాని స్వభావముచే నుండనేరదు. అట్లే స్వరూప మును బట్టి, సత్తుగాని అసత్తుగాని కానేరదు. మధ్యమావస్థయందే అనగా వర్తమానకాలముననే వస్తువు కానవచ్చుచున్నందున దానికి క్రమముగాని అక్రమముగాని కలుగనేరదు. ॥66॥

పై యభిప్రాయమునే జూపుచున్నాడు.

**శ్లో॥ అవిరోధీ వా విరోధీ వా సన్నసన్వాపియుక్తితః ।**
**క్రమవానక్రమోవాపి నాభావ ఉపపద్యతే ।** 67

అభావః = అభావము, యుక్తితః = యుక్తివలన, అవిరోధీ = ఇతర వస్తువులతో విరోధింప నిది యనిగాని, విరోధీ + వా = విరోధించునదియనిగాని, సన్ + సద్రూపమనిగాని, అసన్ + వా + అపి = అసద్రూపమనిగాని, క్రమవాన్ = క్రమముకలది యనిగాని, అక్రమః + వా + అపి = క్రమములేనిది యనిగాని న + ఉపపద్యతే = యుక్తము కానేరదు.

అభావము ఇట్టిదియని నిర్ధారణ చేయలేమని భావము. ॥67॥

పూనా యూనివర్సిటీలో శ్రీ కె. వి. అభ్యంకర మహాశయుడు ప్రకటించిన వాక్యపదీయమున క్రింది మరియొక శ్లోకము కానవచ్చుచున్నది.

**అవిరోధీ విరోధీ వా సన్నసన్నపి తత్త్వతః ।**
**క్రమవానక్రమోవాపి తేన భావో న విద్యతే ॥** 68

కాని హేలారాజు వేరు శ్లోకమును చూపకయే 66వ శ్లోకమునకే అవతరణములోను వ్యాఖ్యా నములోను పై శ్లోకార్థమును చూపియున్నాడు. ఈ భావమును అభ్యంకర పండితుడు వ్యక్త పరచి యున్నాడు. ॥68॥

భూతభవిష్యద్వర్తమాన రూపమున కాలము భిన్నముగానున్నదై పదార్థము లన్నింటికి భేదమును కలిగించుచున్నదని చెప్పుచున్నారు. కాని అదియు పారమార్థికము కానేరదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అభావేత్రిషుకాలేషు భేదేష్వస్యాస్తి సంభవః ।**
**తస్మిన్నసతి భావేపి త్రైకాల్యం నావతిష్ఠతే ॥** 69

A. త్రిషుకాలేషు = త్రికాల నిమిత్తమగు, భేదస్య = భేదమునకు, అసతి = అసత్తు అగు, తస్మిన్ + అభావే = ఆ అభావమునందు, సంభవః = సంభవము అనగా ఒప్పుదల, న + అస్తి = కలుగనేరదు.

రూపవంతమగు ఘటము మున్నగు వస్తువులకు వర్తమానత్వవ్యవహారము కలు గును. అభావమునకు రూపము లేనందున అచట వర్తమానమనెడి కాలభేదము కలుగదు. వర్త మానత్వము కలదానికే భూతము, భవిష్యము అను వ్యవహారము కలుగును. కనుక అభావము

నకు భూతత్వము, భవిష్యత్త్వము కూడ కలుగనేరదు. కాగా అభావోఽస్తి (లేమియున్నది) అభావోఽభూత్ = (లేమి ఉండెడిది) అభావో భవిష్యతి (లేమి కలుగగలదు) అను రీతిని కాలత్రయ సంబంధము అభావమునకు కలుగనేరదు. కాబట్టి కాలభేదమును పురస్కరించు కొని అభావమునకు భేదము సిద్ధింపదు.

B. భావే + అపి = భావపదార్థమునందు గూడ, త్రైకాల్యమ్ = త్రికాలముల వలన కలిగెడి ధర్మము, న + అవతిష్ఠతే = కలుగనేరదు.

అభావమునకే గాక భావపదార్థమునకు గూడ కాలత్రయముచే కల్పితమగు భేదము చెప్పనలవి కాదు. ఘటము మున్నగు వస్తువునకు వర్తమాన దశయందే స్థితి కలుగును. దానికి పూర్వాపరభాగములు లేనందున కాలత్రయ వ్యవహారము కలుగదు. వస్తువుయొక్క పూర్వావస్థ, పరావస్థ అనునవి ఘటరూపములే. కనుక వస్తువు ఏకరూపమే యగును. అవస్థలు వేరు అగుచో వస్తువునకు నానాత్వమే లభించును. కనుక భావ వస్తువునకు గూడ కాలమువలన కలిగెడి భేదము సిద్ధింపదు. కనుక భావాభావములు చెప్పనలవి కాదు. ॥69॥

*అవతారిక* — భావః, అభావః అను పదములకు వ్యుత్పత్తిజూపిన భావాభావములు నిర్ణయించి చూపవచ్చును. భవతీతి (పుట్టునది) భావః. అట్లే ఉనికి కలది భావః (భావము) అని చెప్పవచ్చును. న + భావః = అభావః (భావము కానిది). ఉనికి లేనిది అభావము అని నిర్వచనము చెప్పవచ్చును. కాగా భావాభావములు చెప్పనలవి కావని ఎట్లు చెప్పనగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆత్మతత్త్వపరిత్యాగః పరతో నోపపద్యతే।
ఆత్మతత్త్వం తు పరతః స్వతో వా నోపకల్పతే॥ 70

ఆత్మతత్త్వ పరిత్యాగః = వస్తువుయొక్క స్వరూపమును విడచుట, పరతః = ఇతర వస్తువు వలన, న + ఉపపద్యతే = కుదురదు.

ఘటము మున్నగు వస్తువులకు కారణసామగ్రి వలన నాశము లభింపదు. ఆ వస్తువు సద్రూపము కదా! సత్తునకు నాశమెట్లు? కాబట్టి భావము కానిది అభావము అని నిర్వచనము సరిపడదు.

ఆత్మతత్త్వంతు = వస్తువుయొక్క స్వరూపమైతే, పరతః = ఇతర వస్తువువలన గాని, స్వతః = తనవలన గాని, న + ఉపకల్పతే = సిద్ధింపనేరదు.

పుట్టునది, ఉనికి కలది, భావము అని నిర్వచనము సరిపడదు. పుట్టుక అనగా లేనిది ఇపుడు కనిపించుచున్నదని యర్థము. రూపములేని దానికి కారణసామగ్రిచే ఉత్పత్తిని అంగీకరించిన నాశమునకు రూపము కల్పించినట్లు అగును. అట్టితరి అదియు లేమియేయగును. దానికి మరియొక రూపము కల్పింపవలెను. వస్తువు అభావమునుండియే జన్మింపనక్కర లేదు. స్వతః వస్తువుకదా! స్వతః వస్తువేయగుటచే దానికి ఇతర సంబంధము అనవసరమేయగును.

పలువురు, శబ్దజాతి అను శబ్దమును ఉచ్చరింపగా. అది నానాత్వమును బొందును. అట్టివానియందు మరియొకజాతియుండును. అది శబ్దజాతియందున్న ధర్మము వంటిదికాదు. మరియేమనగా, వాచకములగు గోశబ్దత్వము, ఘటశబ్దత్వము మున్నగు జాతులకు చెందినది.

కాగా గోశబ్దత్వము మున్నగు శబ్దములవలె, శబ్దజాతయః అను శబ్దము కూడ ఎల్లజాతులను బోధింపగలదు. కనుక అనవస్థాదోషము వాటిల్లదు. ॥10॥

*అవతారిక*—ఇంతవరకు వైయాకరణుల సమయమును ఆశ్రయించి శబ్దము నందుగల అసాధారణమగు గోశబ్దత్వము మున్నగు జాతిని అర్థజాతులయందు అనగా గోవు మున్నగు వాని యందున్న గోత్వాదిజాతులయందు అరోపించి ఎల్లశబ్దములు జాతివాచకములే అను సిద్ధాంతమును నిరూపించెను.

ఇపుడు ఆరూపమును స్వీకరింపకపోయినను పైసిద్ధాంతము యుక్తముకాగలదని నిరూపించుచున్నాడు.

**శ్లో॥ అర్థజాత్యభిధానేపి సర్వేజాత్యభిధాయినః।**
**వ్యాపారలక్షణా యస్మాత్పదార్థాః సమవస్థితాః॥ 11**

A. అర్థజాత్యభిధానే + అపి, ఆవు మున్నగు వ్యక్తులయందున్న శుద్ధములగుజాతులనే బోధించినను. సర్వే = ఎల్లశబ్దములు అనగా జాతి, సామాన్య మున్నగు శబ్దములు, జాత్యభిధాయినః = జాతివాచకములే యగును.

జాతి అను శబ్దము జాతిని బోధించుటలో దానియందు మరియొకజాతియుండుటయే కారణము. జాతి మున్నగుశబ్దములు జాతివాచకములనుటలో ఎవరికిని విప్రతిపత్తిలేదు.

B. నిస్సామాన్యాని సామాన్యాని (జాతులు జాతిలేనివే అనగా జాతియందు మరియొక జాతి యుండదు) అని తార్కికులు చెప్పుచుండగా జాతియందు జాతియున్నదనుట యెట్లుపొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

యస్మాత్ = ఎందువలననగా, వ్యాపారలక్షణాః = ప్రయోజనమే హేతువుగా గలవై అనగా ప్రయోజనముచేతనే గుర్తింపబడినవై, పదార్థాః = పదార్థములు, సమవస్థితాః = నియతమైన స్వరూపముకలవి, (భవన్తి) = అగుచున్నవి.

వైశేషికులు జాతియందు జాతిలేదు అని తలంతురుగాక, వైయాకరణులు మాత్రము జాతియందు జాతిని అంగీకరింతురు. అందుకు కారణము ప్రయోజనమే అనగా జాతిః,సామాన్యమ్ అను పదములు జాతిని నిమిత్తముగా గైకొనియే అర్థబోధకములగుచున్నవి.

**నియతరూప**మున గుణముకూడ ఏకాకారముగా అర్థబోధకమగుచో అదియు జాతియేకాగలదు,

కాబట్టి భావాభావముల నిర్వచనము సరిపడదు. ॥70॥

*అవతారిక* — భావాభావములు రెండు వేరు పదార్థములు కాకపోవచ్చును. రెండు కలసి ఒకే తత్త్వము కావచ్చును అను ఆక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తత్త్వే విరోధో, నానాత్వే ఉపకారో న కశ్చన ।**
**తత్త్వాన్యత్వపరిత్యాగే వ్యవహారో నివర్తతే ॥ 71**

తత్త్వే = ఒకటియే తత్త్వమను పక్షమున, విరోధః = విరోధము వాటిల్లును. భావాభావములు రెండును చీకటి వెలుతురువలె విరుద్ధములు కదా !

నానాత్వే = భావాభావములకు భేదమంగీకరించిన, కశ్చన = ఏమియు, ఉపకారః = ఉపకారము, న = జరుగదు. రెంటికి పరస్పరాపేక్ష లేనందున ఉపకార్యోపకారక భావ ముండదు.

తత్త్వాన్యత్వ పరిత్యాగే = భావాభావములకు ఏకత్వపక్షమును, నానాత్వ పక్షమును విడనాడిన, అనగా ఆ రెంటికి అభేదమునుగాని భేదమునుగాని అంగీకరింపనియెడల, వ్యవహారః = వ్యవహారము, నివర్తతే = మరలిపోయెడిని రెండు పక్షములుకాక మూడవ పక్షము లేనందున లోకుల వ్యవహారమే విరుద్ధము కావలెను.

కాబట్టి భావాభావముల నిర్వచనము సుకరము కానందున బుద్ధి కల్పితమగు పదార్థములను బట్టియే లోకవ్యవహారము కలుగుచున్నదని అంగీకరింపవలెను. ॥71॥

*అవతారిక* — ప్రపంచమంతయు ఇట్టిదేయగుచో పరమార్థ సత్యమగునది యేది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యత్ర ద్రష్టా చ దృశ్యం చ దర్శనం చ వికల్పితమ్ ।**
**తస్యైవార్థస్య సత్యత్వం శ్రితాస్త్రయ్యన్తవేదినః ॥ 72**

త్రయ్యన్తవేదినః = ఉపనిషదముల తత్త్వమును గుర్తించినవారు, యత్ర = ఏ యర్థమున, ద్రష్టా + చ = చూచువాడు అనగా జీవుడు, దృశ్యం+చ = చూడబడెడి వస్తువు, దర్శనం + చ = చూచుట, చేయుట మున్నగు క్రియలు, వానివలన కలిగెడి ప్రయోజనము, వికల్పితమ్ = ఆరోపింపబడినదో, తస్య = అట్టి అనగా ఉపనిషత్తులలో ప్రసిద్ధమగు, అర్థస్య + ఏవ = అర్థమునకే అనగా జ్ఞానరూపమగు నిర్గుణ బ్రహ్మమునకే, సత్యత్వమ్ = సత్యత్వమును, శ్రితాః = ఆశ్రయించియున్నారు.

త్రికాలములయందు ఏకరూపమగు జ్ఞానరూపము ఆనందరూపమునగు నిర్గుణ బ్రహ్మమే పరమార్థ సత్యమనియు, దానియందు మాయావశమున జీవభావము భోగ్య వస్తువులు, వ్యాపారములు, వానిఫలములు కల్పింపబడినవని అద్వైత వేదాంతులు విశ్వసింతురు.

ఋగ్, యజుస్సు, సామ అను మూడు వేదములకు 'త్రయి' అని పేరు. త్రయి యొక్క అంతము, చివరిభాగము త్రయ్యంతము. అనగా ఉపనిషత్తు. దాని తత్త్వము నెరింగిన వారు ''త్రయ్యన్తవేదినః'' కాక అంతమనగా నిశ్చయము, దానిని గుర్తించినవారు అని యర్థము. ॥72॥

*అవతారిక*— అట్టి పరబ్రహ్మమే సత్యపదార్థము. జగమంతయు మాయా కార్యము అనగా మాయావశమున బ్రహ్మమే జగత్తుగా వివర్తమగుచున్నది. కాగా అసత్య మగు పదార్థమును బట్టియే ఎల్ల శాబ్దవ్యవహారము జరుగుచున్నది. దాని మూలముననే భేదము భాసించుచున్నది అని బోధించుచున్నాడు.

శ్లో॥ సామాన్యం వా విశేషం వా యస్మాదాహుర్విశేషవత్ ।
శబ్దాస్తస్మాదసత్యేషు భేదేష్వేవ వ్యవస్థితాః ॥ 73

యస్మాత్ = ఏ కారణమువలన, శబ్దాః = శబ్దములు, సామాన్యం + వా = సామాన్యముగా కాన్పించెడి యర్థమునుగాని విశేషం + వా = విశేషముగా కాన్పించెడి యర్థమునుగాని. విశేషవత్ = విశేషమున కర్హమైన దానినిగానే, ఆహుః = చెప్పుచున్నవో, తస్మాత్ = ఆ కారణమువలన, అసత్యేషు = యథార్థముకాని, భేదేషు = భేదములయందే, వ్యవస్థితాః = చూప బడిన సంబంధము కలవిగానగుచున్నవి.

సత్ (ఉనికిగలది) జ్ఞేయమ్ (తెలుసుకొనదగినది) ప్రమేయమ్ (విషయము) మున్నగు పదములు సామాన్యముగా అనగా సర్వసాధారణముగానుండు అర్థములను బోధించు నని లోకము గుర్తించుచున్నది. కాని ఆ శబ్దములుగూడ విశేషార్థమునే బోధించుచున్నవి. 'సత్' అనునది శూన్యముకానిది యను విశేషమును, జ్ఞేయమ్ అనునది తెలియబడని దానికంటె విలక్షణమైనదని విశేషమును బోధించుచునే యున్నవి. ఘటః, పటః మున్నగు పదములు విశే షార్థ వాచకములని లోకులు గుర్తింతురు. అవి ఇంకను విశేషార్థమగు నల్లని కడవ, తెల్లని కడవ, తెల్లని పంచ అను రీతిని బోధించుచునే యున్నవి.

కాబట్టి శబ్దములు వ్యవహారదశలో అసత్యములగు భేదములనే బోధించుచున్నవి. భేదములేని సత్యమగు బ్రహ్మపదార్థమును ఎన్నడు బోధింపజాలవు. ॥73॥

*అవతారిక*— ఇంతవరకు రూపములేని అభావమునుద్దేశించి భావాఽభావములకు గల విరోధమును ప్రదర్శించి ఇపుడు వైశేషికమతము చెప్పున 'అభావ' మనెడి సప్తమ పదార్థమును గురించి ముచ్చటించుచున్నాడు.

శ్లో॥ నాఽభావస్య సద్భావే భావస్యాత్మా ప్రహీయతే ।
నవాఽభావస్య నాస్తిత్వే భావస్యాత్మా ప్రసూయతే ॥ 74

భావస్య = వస్తువుయొక్క, ఆత్మా = స్వరూపము, అభావస్య = అభావము యొక్క అనగా

ప్రధ్వంసాభావము యొక్క, సద్భావే = ఉనికి విషయమై అనగా ప్రధ్వంసాభావము సిద్ధించుటకై, న + ప్రహీయతే = నశింపదు. వస్తువు నశించుటవలననే ప్రధ్వంసాభావము కలుగుననెడి నియమము లేదు.

అట్లే, అభావస్య = అభావమునకు అనగా ప్రాగభావమునకు, నాస్తిత్వే = లేమి కలుగగా, భావస్య = వస్తువుయొక్క, ఆత్మా = స్వరూపము. న + ప్రసూయతే = పుట్టదు. ప్రాగభావము నశించిన తరువాత వస్తువు జనియించుననెడి నియమము లేదు.

వస్తునాశమువలన ప్రధ్వంసాభావము జనియించును. ప్రాగభావము నశించుట వలన వస్తువు జనియించునని చెప్పరాదు. వానికి పై రీతిని కార్యకారణ భావము లేదు. భావము కంటె అభావము అనునది వేరు పదార్థమే. కనుక 60 వ శ్లోకమున చూపబడిన వికల్పములకు తావు లేదు. ఇది కణాదముని రచియించిన వైశేషిక తర్కముయొక్క నిర్ణయము. వారు అభావమును పెద్దదిగాజేసి శాస్త్రమును పెంపొందించినారు. నవ్యతార్కికుల జీవితమంతయు అభావపదార్థముపై ఆధారపడియున్నది. ॥74॥

అవతారిక — పై యర్థముననే యుక్తమగు దృష్టాంతమును జూపుచున్నాడు.

**శ్లో॥ న శాబలేయస్యాస్తిత్వం బాహులేయస్య బాధకమ్ ।**
**న శాబలేయో నాస్తీతి బాహులేయః ప్రకల్ప్యతే ॥** 75

శాబలేయము, బాహులేయము అను రెండు గోవ్యక్తులున్నవి. అవిపరస్పరాపేక్ష లేక వేరు వేరుగా ఉత్పన్నమైనవే. ఇట్టి స్థితిలో శాబలేయస్య = శాబలేయము యొక్క, అస్తిత్వమ్ = ఉనికి, బాహులేయస్య = బాహులేయమునకు, న + బాధకమ్ = నిరోధకము కాదు. శాబలేయ ముండగనే బాహులేయము కూడ ఉండగలదు. శాబలేయము నశించుట బాహులేయస్థితికి సంబంధించునది కాదు. అట్లే ఘటవ్యక్తి యుండుట ప్రధ్వంసకు బాధకము గాదు. ఘటవ్యక్తి యుండగనే ప్రధ్వంస యుండవచ్చును. ఆ రెండు స్వతంత్రమగు పదార్థములు. వానికి పరస్పరాపేక్ష లేదు.

అట్లే, శాబలేయః = శాబలేయుడు, న + అస్తి + ఇతి = లేడు అని అనగా ఆయన యొక్క లేమివలన బాహులేయః = బాహులేయుడు, న + ప్రకల్ప్యతే = పుట్టడు. శాబలేయుడు నశించుటవలన బాహులేయుడు పుట్టవలెనని నియమము సరిపడదు. అట్లే ప్రాగభావము నశించుట వలన ఘటము మున్నగు వస్తువు పుట్టుననుట అయుక్తము. ప్రాగభావము ఘటము స్వతంత్ర పదార్థములు. ॥75॥

అవతారిక — భావపదార్థముకంటె వేరుగ అభావమనెడి పదార్థమును అంగీకరింపవలెననెడి వైశేషిక మతమును 72-73 వ శ్లోకములచే జూపి యథార్థ మాలోచించిన నట్లు స్వీకరింపరాదని దానిని దూషించుచున్నాడు.

శ్లో॥ అభావోయది వస్తుస్యాత్తత్రేయం స్యాద్విచారణా।
తతశ్చ తదభావేఽపి స్యాద్విచార్యమిదం పునః॥ 76

A. అభావః = అభావము, వస్తు = వస్తురూపమైనది, స్యాత్ + యది = అయిన ఎడల, తత్ర = అభావ విషయమున, ఇయమ్ = ఈ, విచారణా = విచారణ, స్యాత్ = కలుగును

ఆరు భావపదార్థములకంటె వేరుగా అభావమును స్వీకరింపరాదు. అభావము స్వీకరించిన కొంత ప్రశ్నింపవలసి యున్నది అభావముండగా దాని ప్రక్కన భావముండనేరదు. అభావము లేనిఎడల భావముండుననుటయు పొసగదు. అవి రెండు పరస్పరము విరుద్ధములు కదా! కాని అభావముండి అది నశింపగా భావము కలుగునని మాత్రము తార్కికులు చెప్పుదురు.

B. తతశ్చ = అభావమనునది వస్తురూపమగుచో, తదభావే + అపి = దానియొక్క అభావము నందు గూడ, పునః = మరల, ఇదమ్ = ఈ యంశము, విచార్యమ్ = విచారింపదగినది, స్యాత్ = కాగలదు.

అభావము వస్తురూపమగుచో దానియందు గూడ మరియొక అభావమును స్వీకరింపవలెను. దానికి గూడ సన్నిధానమువలన భావముండనేరదు. దానికి సాన్నిధ్యము లేనిఎడల భావమునకు ఉనికి యుండదని చెప్పవచ్చును. ఆ రెండవ యభావము గూడ వస్తువేయగుచో నచటను పై విచారణయే కలుగును. ఇట్లు ఎంత కల్పించినను అనవస్థ సంభవించును. ॥76॥

అవతారిక — భావపదార్థముల స్వరూపము చెడుటయే అభావమనెడి వారి యభిప్రాయమును దూషించుచున్నాడు.

శ్లో॥ అవస్తుత్వాదతీతం యద్వ్యవహారస్య గోచరమ్।
తత్ర వస్తుగతో భేదో న నిర్వచనమర్హతి॥ 77

అవస్తుత్వాత్ = అభావము వస్తురూపము కానందున, వ్యవహారస్య = లోకవ్యవహారమునకు, గోచరమ్ = గోచరత్వము అనగా అందుబాటును, అతీతమ్ = అతిక్రమించిన, యత్ = ఏ అభావమో, తత్ర = అట్టి వస్తువుకాని అభావమునందు, వస్తుగతః = వస్తువునకు ధర్మమగు, భేదః = భేదము అనగా నానాత్వము, నిర్వచనమ్ = నిర్వచనము గూర్చి అనగా లక్షణము దెల్పి నిర్ణయించుటను గురించి, న + అర్హతి = తగదు.

అభావము వస్తురూపము కానందున నది లోకుల వ్యవహారమునకు తగదు. అట్టి స్థితిలో దానికి భేదమును అనగా 1. ప్రాగభావము. 2. ప్రధ్వంసాభావము. 3. అన్యోన్యాభావము. 4. అత్యంతాభావము అను రీతిని అభావము నాలుగు విధములు అను భేదమును జూపి వానికి లక్షణములు నిర్వచించుట అయుక్తము. ద్రవ్యము వస్తురూపముకాన దానిని 9 విధములుగా విభజింపవచ్చును. భేదము వస్తువునకు చెందియుండును అభావము వస్తురూపము కానందున దానికి లక్షణముచెప్పుట, దానిని విభజించుట పొసగదు. ॥77॥

*అవతారిక*— ఇంతకుముందు చూపియున్న కార్యకారణ భావ ముపపన్నము కాదనెడి భావమును స్పష్టపరచుచు వైయాకరణ మతమున వివర్తవాదమును సిద్ధాన్తముగ జూపుచున్నాడు.

శ్లో॥ అపదేఽర్థే పదన్యాసః కారణస్య న విద్యతే ।
అథ చ ప్రాగసద్భావః కారణే సతి దృశ్యతే ॥ 78

A. అపదే = స్థానముకాని, అర్థే = అర్థమునందు, అనగా లేనియర్థమునందు, కారణస్య = కారణమునకు, పదన్యాసః = వ్యవహారము, న + విద్యతే = కలుగనేరదు.

కారణమువలన కార్యము కలుగునని లోకులు విశ్వసింతురు. అందు రెండు వాదములు కలవు. 1. కారణము ప్రవర్తింపకమునుపు కార్యము లేదు. కారణబలమువలన ఇంతకుముందు లేని కార్యము జనియించును. దీనిని అసత్కార్య వాదమందురు. వీరిమతమున ఉత్పత్తికి ముందు వస్తువు లేనందున నట్టిదానిని అపదమందురు. అనగా వస్తురూపమున కాక శూన్యరూపముగానున్న దానికి ఇది కారణమని చెప్పుట ఎట్లు? కనుక అసత్కార్యవాదమున కారణమునకు కార్యమునకు సంబంధము కుదురునది కాదు.

2. కారణ వ్యాపారమునకు ముందుగూడ కార్యము సూక్ష్మముగానుండును. అదియే కారణ బలమువలన జనియించినట్లగపడును. దీనిని సత్కార్యవాదమందురు. వీరి మతమున కార్యము సిద్ధమేకాన దానినిగూర్చి మరల కారణవ్యాపార మక్కరలేదు. వారి మతమునగూడ ఉత్పత్తికి పూర్వము కార్యము అపదమేయగును. లేనిదానికి కదా కారణాపేక్ష కలుగును. కనుక వీరి మతమున గూడ కార్యకారణ భావ ముపపన్నము కానేరదు.

B. అథ + చ = అట్లైనను, కారణే = ఏదో విలక్షణమగు కారణము, సతి = ఉండగా, ప్రాగసద్భావః = ఇంతకుముందు లేనియట్టి వస్తువు, దృశ్యతే = ప్రత్యక్షముగా జూడబడుచున్నది.

పై రీతిని వస్తువులకు కార్యకారణ భావము సత్కార్యవాదమున, అసత్కార్యవాదమున గూడ కుదరకున్నను ఏదో చెప్పుటకు శక్యముకాని కారణమువలన ఇంతకుమునుపు కానరాని వస్తువు కానవచ్చుచునే యున్నది. అట్లు జరుగుటనే వివర్తమందురు. బ్రహ్మపదార్థమే మాయా సహకారమున ఈ జగద్రూపమున వివర్తమగుచున్నదని అద్వైతశాస్త్రము యొక్క సిద్ధాన్త మిచట చూపబడినది. అది తప్ప మరియొకగతి లేదని భావము. ॥78॥

*అవతారిక*— మధ్యకాలమున వస్తువు కంటికి కానవచ్చుచున్నది. ఆ వస్తువునకు పూర్వావస్థ ప్రాగభావమనియు, ఉత్తరావస్థ ధ్వంసయనియు వ్యవహరింపబడుచున్నది. అంత మాత్రాన అది శూన్యరూపము కాదు. ఆ యవస్థయందున్న పదార్థమునకు మన్ను మున్నగునవి కారణము కానగును. కాగా 77 వ శ్లోకముచే కార్యకారణ భావము పొసగదనుట ఎట్లు? పొసగును అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ కాలస్య ప్రాగవస్థేతి వస్త్వాశ్రితమిదం పునః ।
ప్రాగవస్థేతి నహ్యేతద్ద్వయమప్యస్త్యవస్తుని ॥ 79

ఇదమ్ = ఇది అనగా వస్తువు జనియింపక మునుపున్న రూపము, కాలస్య = కాలమునకు సంబంధించిన, ప్రాక్ + అవస్థా = పూర్వకాలమునందున్న అవస్థ అనగా రూపాంతరము, ఇతి = అనుట, వస్త్వాశ్రితం + పునః = వస్తువు నాశ్రయించి యున్నది కదా !

1. ప్రాక్ = పూర్వకాలమున, 2. అవస్థా = రూపాంతరము, ఇతి = అనెడి, ఏతత్ = ఈ, ద్వయమ్ = రెండును, అవస్తుని = వస్తువు కానిదానియందు, న + అస్తి + హి = ఉండనేరదు కదా !

సద్రూపమగు పదార్థమునకు ప్రాగవస్థ అనగా పూర్వమునం దునికి అనుటయు, అట్లే ఉత్తరావస్థ అనగా ఉత్తరకాలమునందుండుట అనియు సంభవించును.

అభావము వస్తురూపము కాదు. కనుక దానికి ప్రాక్ అని యనుట, అవస్థ అనుటయు రెండుకూడ లభింపవు. ''కాతస్య ప్రాగవస్థా'' అని పాఠాంతరము. ॥79॥

అవతారిక — అభావమనునది అసత్తే. కనుకనే అది రూపరహితము. కనుక అది శబ్దముచే బోధింపబడునది కాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నచోర్ధ్వమస్తినాస్తీతి వచనాయాఽనిబన్ధనమ్ ।
అలం స్యాదపదస్థానమేతద్వాచః ప్రచక్షతే ॥ 80

అనిబన్ధనమ్ = ఉపలబ్ధముకాని, ఏతత్ = ఈ అభావము, ఊర్ధ్వమ్ = వస్తువు నశించినతరువాత అస్తి = కలదు, న + అస్తి = లేదు, ఇతి = అని, వచనాయ = చెప్పుటకు, న + చ = లేదు, అనగా ఉపయోగింపదు.

ఉపలబ్ధమగు అనగా రూపముకల వస్తువు ఉన్నది, లేదు అను శబ్దముచే చెప్పుటకు వీలుపడును. అభావమనునది ఉపలబ్ధము కాదు. అందుచే అట్లు చెప్పుటకు అవకాశము చాలదు.

మరియు, ఏతత్ = ఈ అభావము. వాచః = శబ్దమునకు, అలమ్ = మిక్కిలి, అపదస్థానమ్ = వ్యవహార యోగ్యము కానేరదు. అనగా శబ్దముచే వ్యవహరించుటకు శక్యము గాదు.

తస్మాత్ = అందువలన అనగా ఉపలబ్ధము కానందున, శబ్దమునకు గోచరము కానందున, ప్రచక్షతే = చెప్పుచున్నారు. అనగా అభావము అసద్రూపము = అసత్యము అనియే ప్రాజ్ఞులు నుడువుచున్నారు.

కాగా 76వ శ్లోకమున చెప్పిన ప్రకారము కారణమునకు అపదస్థితియే సంభవించి నందున కార్యకారణ భావ ముపపన్నము కానందున అద్వైతశాస్త్ర ప్రకారము వివర్తవాదము సిద్ధించును.

ఆ వాదమే వైయాకరణులు విశ్వసింతురు. కనుకనే భర్తృహరి గ్రంథమును 'వివర్తతేఽర్థభావేన' అని వివర్తవాదముతో నారంభించెను. ॥౮౦॥

*అవతారిక*— పదార్థమనునది మధ్యమావస్థయందే కేవలము కానవచ్చుచున్నది. దానికి పూర్వావస్థయు, పరావస్థయు లేనేలేదు. అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అత్యద్భుతా త్వియం వృత్తిః యదభాగం యదక్రమమ్ ।**
**భావానాం ప్రాగభూతానా మాత్మతత్త్వం ప్రకాశతే ॥ 81**

యత్ = ఏది ; అభాగమ్ = అవయవములు లేనిదై, కనుకనే యత్ = ఏది, అక్రమమ్ = క్రమము లేనిదై, ప్రాక్ + అభూతానామ్ = ఇంతకుముందు లేనట్టి, భావానామ్ = పదార్థముల యొక్క, ఆత్మతత్త్వమ్ = ఆత్మస్వరూపము, ప్రకాశతే = ప్రకాశించుచున్నదో, ఇయమ్ = (ఆ) ఈ ; వృత్తిః = పదార్థముల యొక్క ప్రవృత్తి, అత్యద్భుతా = మిక్కిలి ఆశ్చర్యమయినది.

పదార్థములకు అనగా మన్ను, కడవ మున్నగు వస్తువులకు కార్యకారణ భావము సరిపడదు. అట్లయినను ఏదో ఒక విలక్షణమగు కార్యవిశేష మహిమచే ఈ పదార్థము అంతయు ఇంతకుముందు లేనిదై అస్మదాదులకు ఈ రూపమున కానవచ్చుచున్నది. దానికి అవయవములు లేవు. కనుకనే దానికి క్రమము కూడ లేదు. కేవలము కంటికి కానవచ్చు సమయముననే అనగా వర్తమాన కాలముననే కానవచ్చుచున్నది. కాబట్టి అవయవములు లేని, క్రమములేని సత్యజ్ఞానానందరూపమగు నిర్గుణ బ్రహ్మమే మాయాశక్తి సహకారమున జగద్రూపముగ వివర్తమగుచున్నది. ఇదియే అత్యద్భుతమగు పదార్థ ప్రవృత్తి. ॥81॥

*అవతారిక*— పదార్థములకు కార్యకారణ భావము సరిపడదు. భావము, అభావము అనెడి పదార్థములు వేరుగా లేవు అని యంగీకరించినచో లౌకికవ్యవహారమెట్లు జరుగుచున్నది ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వికల్పోత్థాపితేనైవ సర్వోఽభావేన లౌకికః ।**
**ముఖ్యేనేవ పదార్థేన వ్యవహారో విధీయతే ॥ 82**

లౌకికః = లోకులచే జరుపబడుచున్న, సర్వః = సమస్తమగు అనగా విధి నిషేధరూపమగు వ్యవహారః = వ్యవహారము అనగా ప్రజల పరస్పరాభిప్రాయ ప్రకాశనము, వికల్పోత్థాపితేన + ఏవ = కల్పనచే ఉత్పాదితమే యగునట్టి అనగా కల్పింపబడినట్టి, సత్యముకాదని భావము. కనుకనే ముఖ్యేన + ఇవ = ముఖ్యమైనదివలె కాన్పించుచున్న, పదార్థేన = పదార్థముచే, విధీయతే = నిర్వహింపబడుచున్నది.

జ్ఞానరూపమగు పరబ్రహ్మమే సత్యము. జగమంతయు అవిద్యా కల్పితము. ఆ స్థితిలో పదార్థజాతమును విచారించిన దాని నిజరూపము తేలదు. పదార్థములకు కార్యకారణ భావము సరిపడదు. లేని వస్తువునే ఉన్నట్లు అవిద్యావశమున భావించి వ్యవహారము లోకులు

చేయుచున్నారు. ఆ పదార్థము ముఖ్యమైనదివలె భాసించును. కొన్ని పనులయందు ప్రవర్తించుట, ఇష్టముకాని వానినుండి మరలుట, ఒకరి యభిప్రాయమును మరియొకరు గుర్తించుట ఇదియంతయు అవిద్యాదశయందే జరుగును. ఆ యవస్థలో ఆ పదార్థములు అవిచారిత రమణీయములే. వీనినే వ్యావహారిక పదార్థములందురు. అనగా ఎండమావులువలె శూన్యములు కావు. బ్రహ్మము బోలి పరమార్థ సత్యములు కావు. ॥82॥

అవతారిక— పరమార్థము ఆలోచించిన భేదమనునది వేరుగా పదార్థము లేదు. పరబ్రహ్మమే అవిద్యా సహకారమున ఇటుల కాన్పించుచున్నది యని చెప్పుచున్నాడు.

శ్లో॥ భావశక్తిమతశ్చైనాం మన్యన్తే భావవాదినః ।
భావమేవక్రమం ప్రాహుః, న భావాదపరః క్రమః ॥ 83

అతః + చ = ఈ కారణమువలన అనగా బ్రహ్మమే సత్యము అగుటవలన, భావవాదినః = పరబ్రహ్మమే సత్యమని నమ్మినవారు, ఏనామ్ = ఈ లోకవ్యవహారమును, భావశక్తిమ్ = పరబ్రహ్మముయొక్క శక్తినిగానే, జీవగతమైనదనియే, మన్యన్తే = తలంచుచున్నారు.

పరబ్రహ్మమునందు అనాదిగా అవిద్య సంబంధించి యున్నందున, దాని ప్రభావము వలననే భేదవ్యవహారమంతయు జరుగుచున్నదని వేదాంతులు విశ్వసింతురు.

క్రమమ్ = పదార్థములకుగల క్రమమునుగూడ, భావమ్ + ఏవ = పరబ్రహ్మముయొక్క శక్తి విశేషమగు కాలముచే కలిగిన దానినిగానే, ప్రాహుః = పలుకుచున్నారు.

ఈ పదార్థముముందు, ఈ పదార్థము వెనుక అనెడి క్రమముగూడ పరబ్రహ్మముయొక్క కాలమనెడి శక్తివలననే కలుగుచున్నదనియే వారు తలంచుచున్నారు.

భావాత్ = పరబ్రహ్మముకంటె, అపరః = వేరుగానున్న, క్రమః = క్రమమనునది న = లేదు.

ఆ క్రమమునకు హేతుహేతుమద్భావము కూడ చెప్పనలవి కాదు. ॥83॥

అవతారిక— క్రమముకంటె వేరుగ అనగా క్రమమునకు ప్రతికూలముగా యౌగపద్యము (ఒకేసారి జరుగుట) ప్రత్యేకించి లేదు. అదియు అట్లు భాసించుట అవిద్యయొక్క ప్రభావమేయని చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రమాన్న యౌగపద్యస్య కశ్చిద్భేదోఽస్తి తత్త్వతః ।
యథైవ భావాన్నాఽభావః కశ్చిదన్యోఽవసీయతే ॥ 84

తత్త్వతః = యథార్థముగ, క్రమాత్ = క్రమముకంటె, యౌగపద్యస్య = యౌగపద్యమునకు అనగా ఒకేసారి జరుగుట అను దానికి, కశ్చిత్ = ఏమియు, భేదః = భేదము, న + అస్తి = లేదు.

కొన్ని పనులు క్రమముగా జరుగుచున్నపని, కొన్ని ఒకే సమయమున జరుగు చున్నవని లోకులు భావింతురు. ఆలంకారికులు సంలక్ష్యక్రమ ధ్వని, అసంలక్ష్యక్రమ ధ్వని యని రెండు రకములుగా ధ్వనిని విభజింతురు. నిజముగ జూచిన క్రమమే యౌగపద్యముగా భాసించును. లోకులు మాత్రము వేరుగానున్నట్లు క్రమమునకు అది విరుద్ధముగా నున్నట్లు భావింతురు.

ఇందు పూర్వముచూపిన యర్థమునే దృష్టాన్తముగా జూపుచున్నాడు.

యథా + ఏవ = ఎట్లు, భావాత్ = భావపదార్థముకంటె, అన్యః = భిన్నమగు, కశ్చిత్ = ఎవ్విధమగు, అభావః = అభావము, న + అవసీయతే = నిశ్చయింపబడదో.

భావపదార్థముకంటె అభావమనునది వేరుగా పదార్థము కానేరదు. ఈ యంశము ఇంతకుముందు స్పష్టపరచబడి యున్నది. ॥84॥

అవతారిక — ఈ పని క్రమముగా చేయబడినది అనియు, ఈ పని క్రమమక్కర లేకుండ ఒకేసారిగా చేయబడినది అనియు లోకుల వ్యవహారము కలదు. దానినిబట్టి క్రమము కంటె యౌగపద్యమనునది వేరుగా ఉన్నదని తెలుచున్నది అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ కాలస్యాప్యపరం కాలం నిర్దిశన్త్యేవ లౌకికాః ।
న చ నిర్దేశమాత్రేణ వ్యతిరిక్తోఽనుగమ్యతే ॥ 85

A. లౌకికాః = లోకమందలి ప్రజలు, కాలస్య + అపి = కాలమునకు గూడ, అపరమ్ = మరియొక, కాలమ్ = కాలమును, నిర్దిశన్తి + ఏవ = చూపుచునే యున్నారు.

అద్యతన కాలమని అందరు వ్యవహరింతురు. అద్య శబ్దమునకు ఈ రోజునందు అని యర్థము. 'అస్మిన్నహని' అని విగ్రహము. ఇదమ్ శబ్దముకంటె 'ద్య' తద్ధిత ప్రత్యయము. ఇదం శబ్దమునకు 'అన్' ఆదేశము ప్రవర్తింపగా 'అద్య' అను రూపమేర్పడును. అద్యభవః అను నర్థమున అద్యతనః అని శబ్దమేర్పడును. అద్య శబ్దమున కర్థమగు కాలమునకు మరియొక కాలమును జూపుచున్నారు.

B. నిర్దేశమాత్రేణ = చూపినంత మాత్రముచే, వ్యతిరేకః = భేదము, న + హి + అను గమ్యతే = నిర్ణయింపబడదు కదా ! పదార్థముల నిజరూపము తెలియనందున లౌకికులు వారి వారి వ్యవహారమున కనుగుణముగా ప్రసంగింతురు. అంతమాత్రాన పదార్థములకు లేనిభేదము సిద్ధింపదు.

కనుక క్రమముగా, అక్రమముగా అని లోకులు వ్యవహరించిన మాత్రాన క్రమము కంటె వేరుగా యౌగపద్యము సిద్ధింపనేరదు. ॥85॥

అట్లే క్రియయు ఏకాకారముగా అర్థబోధకమగుచో నదియు జాతికాగలదు. కాబట్టి ఎల్లశబ్దములు జాతివాచకములు కాగలవు. ॥11॥

*అవతారిక*—అభిధావ్యాపారముచే శబ్దము నియతముగా జాతిబోధకముకాఁగలదను చున్నాడు.

**శ్లో॥ జాతౌపదార్థేజాతిర్వావిశేషోవాపి జాతివత్,**
**శబ్దైరపేక్ష్యతేయస్మాదతస్తే జాతివాచినః॥ 12**

యస్మాత్ = ఎందువలన, జాతౌ + పదార్థే = జాతియేశబ్దార్థము అను పక్షమున, జాతిః + వా = జాతికాని. విశేషః + వా = విశేషముగాని అనగా సంజ్ఞాశబ్దములచే బోధింపబడెడి వ్యక్తివిశేషముగాని, జాతివత్ = ప్రసిద్ధమగు జాతివలె, శబ్దైః + అపి = శబ్దములచే మాత్రము, అపేక్ష్యతే = బోధింపబడునదిగా అంగీకరింపబడుచున్నదో, అతః = ఈకారణమువలన, తే = ఆఎల్లశబ్దములు, జాతివాచినః = జాతిబోధకములే.

అర్థములను శబ్దములు బోధించును. అందు అర్థములయొక్క అసాధారణమగు రూపమున అవి బోధింపవు. అట్లేజాతులకుగల పరస్పరభేదమునుగూడ శబ్దములు చెప్పవు. వ్యక్తులకు అభేదమును జూపి వానిని బోధవిషయములుగా అవి చేయును.

జాతియందు జాతియుండవచ్చును, లేకపోయిన లేకపోవచ్చును. కాని ఏకాకారమగు జ్ఞానముకలిగినచో నదియే జాతియని యంగీకరింపవలెను.

సంజ్ఞాశబ్దములచే బాల్యకౌమారాద్యవస్థలు భాసింపకపోయినను, నియతముగా ఒక వ్యక్తి విశేషము భాసించుచున్నందున సంజ్ఞాశబ్దములుకూడ జాతిశబ్దములేగాగలవు॥12॥

***అవతారిక***—జాతివాదిమతమున ఎల్లశబ్దములు జాతివాచకములే. విశేషమేమనగా కొన్నిశబ్దములు ప్రసిద్ధముగా జాతివాచకములు .కొన్నిశబ్దములు ఉపచారమువలన జాతివాచకములు. ఇట్లంగీకరించుట, నామతముననేకాదు. మరియేమనగా ఎల్లశబ్దములు ద్రవ్యావాచకములే యనియంగీకరించెడి ద్రవ్యావాదిమతమున కూడ నిట్లే. అనగా కొన్ని ప్రసిద్ధముగా ద్రవ్యబోధకములు, మరికొన్ని ఉపచారమువలన ద్రవ్యబోధకములు అను భావమును వ్యక్తపరచుచున్నాడు.

**శ్లో॥ ద్రవ్యధర్మా పదార్థేతుద్రవ్యేసర్వోఽర్థఉచ్యతే,**
**ద్రవ్యధర్మాశ్రయాద్ద్రవ్యమతః సర్వోఽర్థఇష్యతే॥ 13**

ద్రవ్యే + పదార్థే + తు = ద్రవ్యమే పదార్థము అను మతమునగూడ, ద్రవ్యధర్మాశ్రయాత్ = ద్రవ్యముయొక్క ధర్మములకు ఆశ్రయమగుటవలన. ద్రవ్యధర్మా = ద్రవ్యముయొక్కధర్మము కలదియే, సర్వః + అర్థః = ఎల్లయర్థము, ఉచ్యతే = శబ్దముచే చెప్పబడుచున్నది.

అవతారిక— వెనుకటి అర్థమునే క్రింద వివరించుచున్నాడు.

**శ్లో॥ ఆధారం కల్పయన్ బుద్ధ్యా నాఽభావే వ్యవతిష్ఠతే ।**
**అవస్తుష్వపి నోత్ప్రేక్షా కస్యచిత్ప్రతిబధ్యతే ॥ 86**

A. (మనుష్యః) = మనుష్యుడు, బుద్ధ్యా = బుద్ధిచే, అభావే = అభావమునందు అనగా లేమి యందు, ఆధారమ్ = ఆధారశక్తిని, కల్పయన్ = కల్పించిన వాడైనను, న + వ్యవతిష్ఠతే = ఉండునట్లు చేయనేరడు.

సప్తమీ విభక్తికి ఆధారమర్థము. భూతలేఘటః (నేలపై కడవ యున్నది) నేల ఆధారము. కడవ ఆధేయము. సప్తమికి ఆధారశక్తి యర్థము. ఇట్టి ఆధారాధేయములు లోకమున ఎన్నియో గలవు. ఒక వస్తువు మరియొక వస్తువు నిలిచియుండుట కుపయోగపడును. దానినే ఆధారమందురు. వస్తువు కానట్టియు, ఎట్టి శక్తియులేని అభావమును అనగా లేమిని గూడ ఆధారముగా లోకులు చూపుచున్నారు. "శత్రోరభావే సుఖమ్" (శత్రువు యొక్క లేమి యందు సుఖము)."సుహృదభావే దుఃఖమ్" (స్నేహితుని లేమియందు దుఃఖము). సుఖదుఃఖములకు అభావము ఆధారమని లోకులు తలచినట్లు కానవచ్చుచున్నది. అట్లు కాకున్న సప్తమీ విభక్తికి తావు కానరాదు. అట్లే ''రాగాది క్లేశనాశాదుత్సాహః'' (రాగము మున్నగు క్లేశముల యొక్క నాశమువలన ఉత్సాహము కలుగును). అను రీతిని అభావమునకు హేతుత్వమును గూడ లోకులు చూపుచున్నారు. ఇదియంతయు బుద్ధిచే కల్పింపబడినదియే. కడవను నేలపై ఉంచేటట్లు అభావముపై సుఖాదుల నుంచనేరరు కదా ! కాబట్టి లేని యర్థములను కల్పించియే లోకుల వ్యవహారము జరుగుచున్నదని చెప్పవలెను.

B. లేని యర్థములను మాత్రము ఎట్లుపయోగింప గలడు ? ఎట్లు ప్రసంగింపగలడు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అవస్తుషు + అపి = లేని పదార్థముల విషయమై గూడ, కస్యచిత్ = ఎవని యొక్క, ఉత్ప్రేక్షా = ఊహ అనగా కల్పించుట, న + ప్రతిబధ్యతే = నిరోధింపబడదు.

ప్రపంచకమున పదార్థములకు ఒక స్థానమునందుండుట కవకాశము లేకపోవచ్చును. ఐనను ఊహారూపమున అచట పదార్థములున్నట్లు భావింపవచ్చును. అట్టి భావనను ఎవరును నిరోధింపలేరు. అది నిరోధింపబడదు. ఉదా : "అఙ్గుల్యగ్రే కరియూథశతమాస్తే" (వ్రేలి చివర నూరు ఏనుగుల గుంపు ఉన్నది.) అది కార్యరూపమును ధరియింపవలెనన్న కుదరదు. అట్లనుకొనుటలో ప్రమాదమేమియు లేదు. ॥86॥

అవతారిక— లోకమున వస్తురూపముగా కానవచ్చెడి అర్థములను బోధించెడి శబ్దములకువలె, అభావమును బోధించెడి శబ్దములకుగూడ అర్థములతో సంబంధము యుక్తమే అనెడి ప్రకరణార్థమును ముగించుచున్నాడు.

**శ్లో॥ తస్మాచ్ఛక్తి విభాగేన నిత్యస్సదసదాత్మకః ।**
**ఏకోఽర్థః శబ్దవాచ్యత్వే బహురూపః ప్రకాశతే ॥ 87**

తస్మాత్ = ఆ కారణమువలన అనగా భావముకంటె అభావమనునది వేరుగ లేనందున, ఏకః = ఏకరూపమే యగునట్టి, కనుకనే నిత్యః = పరమార్థ నిత్యమగునట్టి, అర్థః = అర్థము అనగా బ్రహ్మము, శబ్దవాచ్యత్వే = శబ్దములచే బోధింపబడినపుడు, శక్తి విభాగేన = విభిన్నము లగు శక్తి భేదముచే, సదసదాత్మకః = భావాభావ రూపముకలదై, బహురూపః = అనేకము లగు రూపములుకలదై, అనగా క్రమము అక్రమము మున్నగు విచిత్రములగు రూపములుకలదై, ప్రకాశతే = (వ్యవహారదశయందు) భాసించుచున్నది.

నిర్గుణ బ్రహ్మము మాయా సహకారమున తత్తచ్ఛక్తి సమన్వితమై శబ్దములచే బోధింపబడుచున్నది. ఆ స్థితిలో శబ్దవిశేషముచే బోధింపబడెడి ఆ బ్రహ్మమే భావరూపమున అభావరూపమున తెలియబడుచున్నది. కాబట్టి భావపదార్థములను బోధించెడి 'ఘట', 'పట' మున్నగు శబ్దములకు అర్థములతో సంబంధమున్నట్లు, లేమిని చెప్పెడి అభావ, న, నిషేధ మున్నగు శబ్దములకు గూడ వాని యర్థములతో సంబంధము నిత్యముగా కలుగవచ్చును. ॥87॥

*అవతారిక* — కల్పనచే పదార్థములు లోకవ్యవహారమునకు ఉపయోగపడుచున్న వని చెప్పబడినది. ఆ కల్పన ఎట్లు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యవహారశ్చ లోకస్య పదార్థైః పరికల్పితైః ।**
**శాస్త్రే పదార్థః కార్యార్థం లౌకికః ప్రవిభజ్యతే ॥ 88**

కల్పితైః = కల్పింపబడిన అనగా నిజరూపమున లేకున్నను బుద్ధిచే నిరూపింపబడినట్టి, పదార్థైః = పదార్థములచే అనగా భావము, అభావము, కార్యకారణ భావము, క్రమము, అక్రమము మున్నగు వస్తువులచే లోకస్య = లోకముయొక్క, వ్యవహారః = వ్యవహారము అనగా పరస్పరాభిప్రాయమును తెలిసికొనుట, ఇష్టమైన దానియందు ప్రవర్తించుట, ఇష్టముకాని దానియందు ప్రవర్తింపకుండుట మున్నగు నిత్యయాత్ర (ప్రవర్తతే) = జరుగుచున్నది.

లౌకికః = లోకమున ప్రసిద్ధముగానున్న, పదార్థః = పదార్థము అనగా ద్రవ్యము, గుణము, దిక్, క్రియ, సాధనము, కాలము, పురుషము, సంఖ్య, ఉపగ్రహము, లింగము అనెడి పదార్థము, శాస్త్రే = వ్యాకరణశాస్త్రమున, కార్యార్థమ్ = కార్యములు ప్రవర్తించుటకై, ప్రవిభజ్యతే = విభజింపబడుచున్నది. అనగా అఖండమగు వాక్యార్థమునుండి వేరుచేసి చూప బడుచున్నది.

పాణినీయము లోకసిద్ధములగు శబ్దములకే సంబంధించును. కాన లోకసిద్ధములగు పదార్థములను గ్రహించియే వ్యాకరణ సూత్రార్థము నిర్ణయించి దాని మూలముగ కార్యములను విధించి శబ్ద సాధుత్వమును జూపవలెను.

వాక్యార్థమఖండము. అయినను దానినుండి లోకప్రతీతినిబట్టి కొన్ని పదార్థములను కల్పనా మూలమున గ్రహించి క్రియావాచకము ధాతువు, సత్త్వవాచకము నామము అను రీతిని పదార్థకల్పన చేయబడుచున్నది. ॥88॥

*సంబంధసముద్దేశము ముగిసినది*

# భూయో ద్రవ్యసముద్దేశము—4

అవతారిక—— వ్యాకరణశాస్త్రమునందలి ప్రక్రియను నిర్వహించుటకై లోకసిద్ధము లగు పదార్థములు విభజింపబడుచున్నవని సంబంధసముద్దేశమున చరమశ్లోకముచే జూప బడినది.

దానిని పురస్కరించుకొని 10 విధములగు* అపోద్ధార పదార్థములను జూపుటకై రెండు శ్లోకములచే భూమికను రచియించుచున్నాడు.

శ్లో॥ సంసర్గరూపా త్సం భూతాః సంవిద్రూపా దపోద్ధృతాః ।
శాస్త్రే విభక్తా వాక్యార్థా త్ప్రకృతి ప్రత్యయార్థవత్ । 1
నిమిత్తభూతాః సాధుత్వే శాస్త్రాదనుమితాత్మకాః ।
కేచిత్పదార్థా వక్ష్యన్తే సంక్షేపేణ యథాగమమ్ ॥ 2

సంసర్గరూపాత్ = సంసర్గమే స్వరూపముగా కలిగినట్టియు, సంసర్గమనగా సంబంధము, సంవిద్రూపాత్ = అపోద్ధారబుద్ధియే స్వరూపముగాగల, వాక్యార్థాత్ = వాక్యార్థమునుండి, ప్రకృతి ప్రత్యయార్థవత్ = ప్రకృత్యర్థములు ప్రత్యయార్థములవలె, సంభూతాః = సంభ వించుచున్నట్టియు, అపోద్ధృతాః = బుద్ధిచే వేరుగా చేయబడినట్టియు, సాధుత్వే = శబ్దముల సాధుత్వ విషయమై, నిమిత్తభూతాః = నిమిత్తములుగా నున్నట్టియు, కనుకనే శాస్త్రే = శాస్త్ర మున అనగా వ్యాకరణ శాస్త్రమున, విభక్తాః = విశేషముగా విషయరూపమున గ్రహింపబడి నట్టియు, శాస్త్రాత్ = వ్యాకరణ శాస్త్రమువలననే, అనుమితాత్మకాః = ఊహింపబడిన స్వరూ పము కల, అనగా అనుమాన ప్రమాణముచే లభించిన స్వరూపముకల, కేచిత్ = కొన్ని, పదార్థాః = పదార్థములు అనగా 1. ద్రవ్యము, 2. గుణము, 3. దిక్కు, 4. సాధనము, 5. క్రియ, 6. కాలము, 7. సంఖ్య, 8. లింగము, 9. పురుషము, 10. ఉపగ్రహము అనెడి పది పదార్థములు, యథాగమమ్ = వ్యాకరణ శాస్త్రమర్యాదను అతిక్రమింపక, సంక్షే పేణ = సంక్షిప్తరూపమున, వక్ష్యన్తే = చెప్పబడబోవుచున్నవి, అనగా పై పది పదార్థములు పది ప్రకరణములలో నిరూపింపబడుచున్నవని భావము.

వాక్యమఖండము, దానికి అవయవములు లేవు. ఇది ప్రథమాంతము, ఇది ద్వితీ యాంతము, ఇది క్రియాపదము అని వేరుచేసి చూపుట శక్యము కాదు. అట్లే వాక్యార్థము కూడ అఖండమే. ఇది కర్త, ఇది కర్మ, ఇది క్రియ అని విభజించుట కవకాశము లేదు.

---

* 1. ద్రవ్య, 2. గుణ, 3. దిక్, 4. సాధన, 5. క్రియ, 6. కాల, 7. సంఖ్య, 8. లింగ, 9. పురుష, 10. ఉపగ్రహ. పచతి, పచతే అనుచోటునందు పరస్మైపదము వలన ఆత్మనే పదమువలన గోచరించెడి అర్థవిశేషమునకు 'ఉపగ్రహ' అని పేరు, ఇది పాణినికి ముందున్న వైయాకరణుల సంజ్ఞ.

కాని అఖండమగు వాక్యమును, అట్టి వాక్యార్థమును, తెలిసికొనుట సాధ్యము కానందున వానినుండి పదములు పదార్థములు వేరుగా చూపబడుచున్నవి. అవి బుద్ధిచే కల్పితము లగుచున్నవి. వీనిద్వారా వాక్యార్థము జ్ఞాతము కాగలదు.

పై రీతిని పదార్థముల విభజనము సహేతుకము. ఏలయన– వాక్యార్థమనునది సంసర్గరూపము. సంసర్గమనగా కలయిక. సంసర్గమనగానే అందు పదార్థములు సంసృష్టము లని అనగా కలసియున్నవని తెల్లము. కనుకనే అవి సంభూతములు. అనగా వేరుచేసి చూపుట కర్హములై యున్నవి.

మరియు వాక్యార్థము అపోద్ధార బుద్ధియే రూపముగా కలది. కనుకనే దానినుండి పై పదార్థములు అపోద్ధృతము లగుచున్నవి.

పై రీతిని పదార్థములను వేరుచేసి చూపుటకు ప్రయోజనమున్నది– వ్యాకరణమున గల సూత్రములయొక్క అర్థమును తెలిసికొనుటకు ఈ కల్పితములగు పదార్థములు ఉపయోగ పడుచున్నవి. సూత్రములలో 'ద్రవ్య, గుణ, కాల, పురుష, దిక్' మున్నగు పదములు వాడబడియున్నవి. ఆ పదముల యర్థము తెలియనిచో సంపూర్ణ సూత్రార్థము తెలియబడదు. పై ప్రయోజనము నపేక్షించి పై పదార్థములు పృథక్కృతములై చూపబడుచున్నవి.

శబ్దముల సాధుత్వమును చూపుటలో పై యర్థములు నిమిత్తములు. వాని మూలముననే 'ఈ శబ్దము సాధువు', ఈ శబ్దము సాధువుకాదు. అని తెలియబడుచున్నది. కనుకనే శాస్త్రమున నవి విభక్తము లగుచున్నవి.

ఇచట రెండు వాదములు కలవు : 1. పదము సత్యము, అదియే యర్థబోధకము. ప్రకృతి ప్రత్యయములు, వాని యర్థములు కల్పితములు. అవి యసత్యములు. 2. వాక్యమే సత్యము అదియే యర్థబోధకము. పద పదార్థములు కల్పితములు. అవి యసత్యములు.

పదము సత్యమనువారి మతమున ప్రకృతి ప్రత్యయార్థములు కల్పితములగునట్లు, వాక్యము సత్యమనువారి మతమున పదార్థములు కల్పితములు. ఈ యభిప్రాయముతో ''ప్రకృతి ప్రత్యయార్థవత్'' అని భర్తృహరి పలికెను. వాక్యమే సత్యమను వాదమున ప్రకృతి ప్రత్యయ కల్పనకు తావులేదు. అందుచే నది దృష్టాంతముగా జూపబడినది. సంశయము– వ్యాకరణ సూత్రాలలో ద్రవ్య, గుణ, దిక్, మున్నగు పది పదార్థములేకాక, ఇంకను మరికొన్ని పదార్థములుకూడ గ్రహింపబడియున్నవి. ''తస్యాఽపత్యమ్'' (4-1-92) (షష్ఠ్యంతము కంటె అపత్యార్థమున 'అణ్' ప్రత్యయము ప్రవర్తించును. ఉపగోరపత్యమ్ = ఔపగవః) 'సాఽస్యదేవతా' (4-2-24) (ప్రథమాంతముకంటె అస్యదేవతా అను నర్థమున 'అణ్' ప్రత్యయము ప్రవర్తించును. ''ఇన్ద్రః దేవతా అస్య = ఐన్ద్రమ్'') మున్నగు రీతిని అపత్యము, దేవత, పశువు మున్నగు చాల నర్థములు కలవు. వానిని గూడ చూపక ద్రవ్యము మున్నగు పది పదార్థములనే అపోద్ధార పద్ధతిలో ఏల భర్తృహరి చూపెను ?

సమాధానము— అపత్యమనగా సంతానము. ఇది ఎల్లరకులకు తెలిసినదే. ఇందు ఎవ్వరికి విప్రతిపత్తి లేదు. పశు - దేవతాద్యర్థములు కూడ అట్టివే. ఇట్టివి అన్నియు లోక ప్రసిద్ధములే, కనుక వాని స్వరూపమును ప్రత్యేకముగా చూపనవసరము లేదు. ద్రవ్యాది పదార్థము లట్టివి కావు. వాని స్వరూపమును వైశేషిక తంత్రము అనగా కణాదమహర్షి రచియించిన తర్కము వేరొక రీతిని నిర్ణయించియున్నది. ఆ నిర్ణయము ననుసరించిన, ద్రవ్యాది పదములతో గూడియున్న వ్యాకరణ సూత్రముల యర్థలక్ష్యముల సిద్ధికై ఉపయోగింపదు, ప్రతికూలించును. కాబట్టి తార్కికులు చూపిన ద్రవ్యాది పదార్థనిర్ణయమును విడనాడి, వ్యాకరణసూత్రముల యర్థము, లక్ష్యసిద్ధికై తోడ్పడునట్లు వ్యాకరణశాస్త్ర మాత్ర ప్రసిద్ధి ననుసరించి ద్రవ్యము మున్నగు పది పదార్థములకు లక్షణము చెప్పవలసి యున్నది.

ఆ పదార్థములకు లక్షణములు పాణినికాత్యాయనపతంజలులు కంఠతః చెప్పి యుండలేదు. మరియేమనగా, వారు చూపిన వ్యవహారములను గుర్తించి వాని మూలమున ద్రవ్యాదులకు లక్షణము చెప్పవలసియున్నది. అనుమాన ప్రమాణముచే వానికి లక్షణములను తెలిసికొని సూత్రార్థనిర్ణయము చేయవలెను. వైశేషికులు చేసిన ద్రవ్యాది పదార్థముల నిర్ణయమును వ్యాకరణశాస్త్రమున నాదరింపరాదు. ఈ యభిప్రాయమును ''శాస్త్రాదనుమితాత్మకాః'' అను కారికాభాగము వ్యక్తపరచుచున్నది.

పాణిన్యాదుల పోకడలను ఆధారముగా గైకొని ద్రవ్యాది పదార్థముల నిర్ణయము ఆ యా ప్రకరణములలో వ్యక్తము కాగలదు.

వాజప్యాయన మతము ననుసరించి ఎల్ల శబ్దములకు జాతియే వాచ్యమగును అను భావముతో జాతిసముద్దేశము, వ్యాడిమతము ననుసరించి ఎల్ల శబ్దములకు ద్రవ్యమే వాచ్యమగు నను భావముతో ద్రవ్యసముద్దేశము, శబ్దార్థములకు గల సంబంధమును తెలుపుటకై సంబంధ సముద్దేశము చూపబడినవి. కాగా అవి మూడు సముద్దేశములు. ద్రవ్యము మున్నగు పది పదార్థములను నిరూపించునవి పది సముద్దేశములు, కాగా పదుమూడు సముద్దేశములు చూపబడినవి. ఇవి వ్యస్తములగు అనగా ప్రత్యేక పదములుగా నుండువాని యర్థములను విచారించి యున్నవి. సమస్త పదార్థములను విచారించుటకై చివరిదియగు వృత్తి సముద్దేశము చూపబడినది. సంకలనచేయగా ఈ పదకాండమున పదునాల్గు సముద్దేశములు భర్తృహరిచే చూపబడినవి. ॥1, 2॥

వ్యాకరణ శాస్త్రమునందలి సూత్రముల యర్థము లక్ష్యముల సిద్ధికై ఉపయోగపడునట్లు నిర్ణయము కలుగుటకై పది విధములగు పదార్థములను శాస్త్రమర్యాద నతిక్రమింపక చెప్పుచున్నానని 1, 2 శ్లోకములచే ప్రతిజ్ఞ చేయబడినది. ఆ పదింటిలోను ద్రవ్యము గుణ క్రియా సంఖ్యాదుల కాధారము కనుక ప్రధానమగుచున్నదనెడి యాశయముతో ముందుగా ద్రవ్య పదార్థమునకు లక్షణము దెలుపుచున్నాడు.

శ్లో॥ వస్తూపలక్షణం యత్ర సర్వనామ ప్రయుజ్యతే ।
ద్రవ్యమిత్యుచ్యతే సోఽర్థో, భేద్యత్వేన వివక్షితః ॥ 3

A. యత్ర = ఏ యర్థమునందు, వస్తూపలక్షణమ్ = వస్తువునకు ఉపలక్షణముగా నున్న అనగా గుర్తుగా ఉపయోగించెడి, సర్వనామ = సర్వనామ శబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపబడు చున్నదో, సః = ఆ, అర్థః = అర్థము, ద్రవ్యమ్ + ఇతి = ద్రవ్యమని ఉచ్యతే = చెప్పబడుచున్నది.

సర్వనామ శబ్దములు రెండు విధములుగా కానవచ్చుచున్నవి: 1. వస్తువు లన్నిటిని తెలుపునవి. సర్వ, విశ్వ, తత్, యత్, ఇదమ్, మున్నగునవి. ఈ శబ్దములచే వస్తుమాత్రమును మనము చూపగలము. 2. కొన్ని వస్తు విశేషమును బోధింపగలవు. ఏక (ఒకడు), అన్యతర మున్నగునవి. ఇద్దరిలో నొకడు అని అన్యతర శబ్దము నియమితమగు అర్థమునే చూపును. ఎల్ల వస్తువులు ఆ శబ్దముచే బోధింపబడవు.

ఈ రెండు విధములగు సర్వనామములలోను వస్తుమాత్రమును బోధించెడి ఇదమ్ (ఇది, వీడు), తత్ (అది, వాడు) మున్నగు శబ్దములచే బోధింపబడెడి అర్థము ద్రవ్యము కాగలదు. ముందుగా ఒక అర్థమును బోధించి మరల దానినే పరామర్శించునపుడు ఆ యర్థమును బోధించెడి పదమునే వాడక దానికి బదులుగా 'ఇదమ్, తత్' అని సర్వనామములను ప్రయోగింతురు. అట్లుకాకున్నను నామవాచకమునకు ముందుగా సర్వనామమును ప్రయోగించి 'అయం ఘటః' (ఇది కడవ), 'సః పటః' (అది వస్త్రము) అను రీతిని వాడుకయు కలదు.

కాగా, సర్వనామ పరామర్శయోగ్యమగు అర్థము ద్రవ్యము అని ద్రవ్యలక్షణము తేలినది. నిరుక్తకారుడు కూడ 'అత ఇతియత్ ప్రతీయతే తద్ ద్రవ్యమ్' అని ద్రవ్యలక్షణమును జెప్పెను. సర్వనామము వలన తెలియబడు నర్థము ద్రవ్యమని దాని భావము. 'అతః' అనునది ఇదం శబ్దముయొక్క రూపము.

వస్తువునందు గల విశేషధర్మము లన్నిటిని జూపి వానిని అనుసరించి వస్తువులకు లక్షణము చెప్పనలవి కాదు. వస్తు సామాన్యమునకు ద్రవ్యత్వము లభించుటకై ''సర్వనామ పరామర్శ యోగ్యం ద్రవ్యమ్'', అని భర్తృహరి చూపియున్నాడు.

B. విశేషాకారమున ద్రవ్యమును గుర్తించుటకై మరియొక ద్రవ్య లక్షణమును జూపుచున్నాడు.

(యద్వా) కాక, భేద్యత్వేన = విశేష్యత్వ రూపమున, వివక్షితః = వివక్షితమగు, అర్థః = అర్థము, ద్రవ్యమ్ = ద్రవ్యమనబడును.

శబ్దమును ప్రయోగింపగా అర్థము భాసించును. ఆ శబ్దముచే భాసించిన అర్థములలో ఏ యర్థము విశేష్యముగా నిశ్చితమగునో ఆ యర్థము ద్రవ్యమనబడును.

ఈ యర్థము విశేష్యమని నిశ్చయించుటలో వక్తయొక్క ఇచ్ఛయే నిమిత్తము. లోకముతో ప్రసక్తి లేదు. ఏ యర్థము విశేష్యమని వక్త తలచునో ఆ యర్థము ద్రవ్యమని పించుకొనును. లోకవ్యవహారమున వ్యక్తి విశేష్యమనియు దానియందున్న జాతి, గుణము, క్రియ మున్నగునవి విశేషణములనియు నిర్ణయము కలదు. జాతి మున్నగువానినే విశేష్యము లుగా వివక్షించిన నవియు ద్రవ్యములే, ఈ లక్షణము చొప్పున కాగలవు. వివక్షనుబట్టి వస్తు మాత్రము ద్రవ్యము కాగలదు. ఈ యాశయముతోడనే "వివక్షితః" అని భర్తృహరి పలికెను.

'పచతి' మున్నగు తిజంతముల వలన, క్రియ విశేష్యముగా భాసించుచున్నది. కనుక అట్టి క్రియ ద్రవ్యము కాగలదు. మొదటి లక్షణముచే గూడ 'కిం పచతి' అను రీతిని సర్వనామ పరామర్శయోగ్యమగుటం జేసి క్రియ ద్రవ్యము కాగలదు.

ఈ రీతిగా తిజంతముచే బోధింపబడిన క్రియ ద్రవ్యమనుటలో సూత్రకారుని అను మతి కానవచ్చుచున్నది. *పాణిని ధాత్వర్థముతో సమానాధికరణమగు అనగా ఏకరూపమగు 'యుష్మద్' శబ్దము ఉపపదముగా నుండగా మధ్యమ పురుషము, అట్టి అస్మద్ శబ్దము ఉపపదముగా నుండగా ఉత్తమ పురుషము ప్రవర్తించునని చెప్పెను. ఉదా : త్వం పచసి (నీవు వండుచున్నావు), అహం పచామి (నేను వండుచున్నాను). ధాతువు యుష్మదస్మచ్ఛబ్ద ములు ఒకే యర్థమును బోధింపవలయును. అపుడు పై రెండు పురుషములు ప్రవర్తింప గలవు. యుష్మదస్మచ్ఛబ్దములు ద్రవ్యబోధకములని ఎల్లరులకు తెల్లమే. అట్టి వానికి ధాత్వ ర్థముతో సామానాధికరణ్యముండవలెను. ధాత్వర్థక్రియ పై లక్షణము చొప్పున ద్రవ్యము కనుక పాణిని చూపిన పై వ్యవస్థ ఉపపన్నమగుచున్నది. క్రియ ద్రవ్యముకానియెడల సామా నాధికరణ్యము లేనందున పై నియమము కుదరదు.

ఇట్లే పాణినికాత్యాయన పతంజలులు ద్రవ్యమునందున్న గుణమును బోధించుటకై 'త్వ, తల్' అను భావ ప్రత్యయములను **విధించియున్నారు. ఘట స్యభావః = ఘటత్వమ్ విశేష్యముగా వివక్షితమగు అర్థము ద్రవ్యమను ఆశయము పాణిన్యాదులకు కలదని దీనివలన వ్యక్తమగుచున్నది. కనుకనే, శుక్ల స్యభావః = శుక్లత్వమ్, అను రీతిని గుణవాచకములుగా లోక ప్రసిద్ధములగు శుక్లాది శబ్దములకంటె పై ప్రత్యయములు ప్రవర్తించుచున్నవి అట్లు కాకున్న ద్రవ్యావాచకములకంటె విధింపబడిన త్వ - తల్ ప్రత్యయములు శుక్లాది శబ్దముల కంటె ప్రవర్తించుట కవకాశము లేనందున సూత్రవార్తికభాష్యములు, అసంగతములే యగును.

---

* "యుష్మద్యుపపదే సమానాధికరణేస్థానిన్యపి మధ్యమః" (1-4-105)"అస్మద్యుత్తమః" (1-4-107) "శేషేప్రథమః" (1-4-108) అని పాణిని సూత్రములు.

** "తస్య భావస్త్వతలౌ" (5-1-119) షష్ఠ్యంతముకంటె భావార్థమున త్వ, తల్, ప్రత్యయ ములు కలుగునని సూత్రార్థము. "యస్య గుణస్యభావాత్ ద్రవ్యే శబ్దనివేశస్తదభిధానేత్వతలౌ" అని కాత్యాయనుని వార్తికము.

పై పోకడలను బట్టి ఈ కారికచే చూపబడిన ద్రవ్య లక్షణము మునిత్రయమునకు సమ్మతమేయని తెల్లము. ఈ కారణముచే అనుమాన ప్రమాణమువలన ద్రవ్యమునకు లక్షణము ఊహింపబడుచున్నది.

'గుణములకు ఆశ్రయము ద్రవ్యము, క్రియలకు ఆశ్రయము ద్రవ్యము' అని తార్కికులు ద్రవ్యలక్షణమును జూపెదరు. ఆ లక్షణమును గ్రహించిన ధాత్వర్థ క్రియ, శుక్ల గుణము ద్రవ్యములు కానందున పై వ్యాకరణ సూత్ర ప్రణాలిక సరిపడదు. కాబట్టి వారు చూపిన ద్రవ్యలక్షణమును గ్రహింపక ఈ శ్లోకముచే చూపబడిన ద్రవ్యలక్షణమును గ్రహింపవలెనని తెలుచున్నది.

ఈ యంశమును స్మరింపవలెను– ''విప్రతిషిద్ధం చానధికరణవాచి'' అను (2-4-13) సూత్రముచే ద్వంద్వసమాసమునకు వికల్పముగా ఏకవద్భావము విధింపబడు చున్నది. ఉదా: శీతంచ ఉష్ణంచ = 1. శీతోష్ణమ్, 2. శీతోష్ణే, (చల్లతనము, వేడితనము). అధికరణమనగా ద్రవ్యము, కాగా ద్రవ్యావాచకములకు పై కార్యము ప్రవర్తింపదు. ఉదా : శీతోష్ణే ఉదకే స్తః (చల్లతనము, వేడిమికల నీళ్ళు ఉన్నవి) ఈ సూత్రమున మాత్రము తార్కికులు చెప్పిన ద్రవ్యలక్షణమునే గ్రహింపవలెను. ''వస్తూప లక్షణమ్'' ఇత్యాదికమగు ప్రకృత శ్లోకముచే చూపబడిన ద్రవ్యమును గ్రహింపరాదు. అట్లు కాకున్న ప్రతి వస్తువు ఈ శ్లోకముచే ద్రవ్యమే యగుటంజేసి 'అనధికరణవాచి' అను నిషేధమునకు ఉదాహరణము కావలసియున్నందున ఏకవద్భావ విధానమునకు ఉదాహరణమే లభింపనందున సూత్రము వ్యర్థమే కావలెను.

*భూయో ద్రవ్యసముద్దేశము ముగిసినది*

# గుణ సముద్దేశము–5

*అవతారిక*— వ్యాకరణప్రక్రియ కనుగుణముగ ద్రవ్యమును నాల్గవ సముద్దేశమున నిరూపించి, ఇచట నిరూపింపదలచిన పది పదార్థములలో మొదటిదియగు వ్యాకరణ శాస్త్రమున గల కొన్ని చిహ్నములచే ఊహింపబడిన 'గుణ' పదార్థమును నిరూపించుచున్నాడు.

శ్లో॥ సంసర్గిభేదకం యద్యత్స వ్యాపారం ప్రతీయతే ।
గుణత్వం పరతన్త్రత్వాత్తస్య శాస్త్ర ఉదాహృతమ్ ॥ 1

యత్ + యత్ = ఏదేది, సంసర్గి = సంబంధము కలిగినదై, అనగా ఆధారముతో వేరు కాకుండ దానితో ఐక్యమును బొందినదై, భేదకమ్ = వేరుచేయుచున్నదై అనగా తనకు ఆధారమగు వస్తువును ఇతర వస్తువుకంటె వేరుచేయుచున్నదై, సవ్యాపారమ్ = ఇతర వ్యావృత్తి అనెడి వ్యాపారముతో గూడినదై, ప్రతీయతే = తెలియబడుచున్నదో, తస్య = దానికి, పరతన్త్రత్వాత్ = పరాధీనమనెడి కారణమువలన, గుణత్వమ్ = గుణత్వము అనగా గుణమనెడి పేరు, శాస్త్రే = వ్యాకరణ శాస్త్రమునందు, ఉదాహృతమ్ = ఉదాహరింపబడినది.

వ్యాకరణశాస్త్రమున కొన్ని సూత్రములలో 'గుణ' అను పదము ప్రయోగింపబడి యున్నది. అచట 'గుణ' శబ్దముచే ఈ శ్లోకమువలన గుర్తింపబడిన గుణమునే గ్రహించి సూత్రార్థము చెప్పవలెను. అట్లుకాకున్న వైశేషికులు చూపెడి *రూపము, రసము మున్నగు గుణములను గ్రహింపవలెను. అట్టితరి లక్ష్యముల సిద్ధికై ఉపయోగించెడి సూత్రార్థము లభింపనేరదు.

లోకమున పరాధీనమగు వస్తువునకు గుణమని వ్యవహారము కలదు. అట్టి లోకసిద్ధమగు అర్థమును స్వీకరించి ఈ లక్షణము నిర్మింపబడినది. ఆశ్రయమును కలిసియుండి, ఇది ఇతరములకంటె వేరు అని యాశ్రయమును గుర్తింపచేయు పదార్థము గుణమనబడును. ఉదా : ఘటమునందు నలుపు, తెలుపు మున్నగు రూపములు కలవు. అవి కడవను విడనాడి యుండవు. పచ్చని కడవకంటె ఇవి భిన్నములు అను జ్ఞానమును కలిగించును. అట్లు చేయుటయే వాని వ్యాపారము. ఇంతవరకు నైయాయికులకు మనకును సమానమే, ఘటమునందు ఘటత్వమనెడి జాతి కలదని యెల్లరులు విశ్వసించినదే. అదియు పై యంశములు కలదియగుటచే 'గుణ' మనిపించుకొనును. అది ఘట వ్యక్తిని విడిచియుండదు. తనకు ఆశ్రయమగు ఘటమును అశ్వాదులకంటె వేరు చేయును. తార్కికుల పద్ధతిలో ఇది గుణము కానేరదు.

---

* రూప, రస, గంధ, స్పర్శ, సంఖ్యా, పరిమాణ, పృథక్త్వ, సంయోగ, విభాగ, పరత్వ, అపరత్వ, గురుత్వ, ద్రవత్వ, స్నేహ, శబ్ద, బుద్ధి, సుఖ, దుఃఖ, ఇచ్ఛ, ద్వేష, ప్రయత్న, ధర్మ, అధర్మ, సంస్కార అను రీతిని వారు 24 గుణముల నంగీకరింతురు.

వారు రూప రసాదులలో దీనిని పేర్కొనలేదు. అదియు గుణమనుటలో మునిత్రయమువారి సమ్మతి కలదు.

''తస్యభావస్త్వతలౌ'' (5-1-119) అను సూత్రముచే షష్ఠ్యంతము కంటె భావార్థమున త్వ, తల్ అను రెండు తద్ధితములు కలుగునని సూత్రార్థము. అచట భావ శబ్దార్థమును కాత్యాయనుడు ''యస్య గుణస్య భావాత్ ద్రవ్యే శబ్దనివేశః'' అని వివరించెను. ద్రవ్యమునందు ఏ గుణముండుటవలన శబ్దము ప్రవర్తించుచున్నదో, దానిని బోధించుటకై త్వ, తల్ కలుగునని వార్తికార్థము. ఉదా : ఘటస్యభావః = ఘటత్వమ్, ఘటము ద్రవ్యము, దానియందు ఘటత్వమనెడి ధర్మముండుటచే దానిని నిమిత్తముగా గైకొని ఘటశబ్దము ప్రవృత్తమగుటం జేసి ఆ ఘటత్వమే త్వప్రత్యయార్థమగును. ఇచట గుణశబ్దముచే జాతిని గ్రహింపక తీరదు. ఇట్లే క్రియయు గుణము కాగలదు. ఉదా : పాచకస్యభావః = పాచకత్వమ్, పాకక్రియ, త్వ ప్రత్యయార్థము.

కాగా మునుల వ్యవహారముచే లభించిన గుణపదార్థము ఈ శ్లోకమున చూపబడినది.

ఇట్లే ''సమర్థః పదవిధిః'' (2-1-1) అను సూత్రమున సమానాధికరణ శబ్దములు అసమర్థములగుటచే వానికి సమాసము సిద్ధింపకున్నది అను ప్రసంగమున వీరః పురుషః మున్నగు చోటులందు ''వీరత్వం గుణః, పురుషత్వం గుణః'' అని మహాభాష్యకారుడు పలికెను. ఇదియు ప్రకృతార్థమునకు సాధకము కాగలదు.

కాగా ''సంసర్గి భేదకమ్'' అనుకారికచే గుర్తింపబడిన గుణమును గ్రహించి పై వ్యాకరణ కార్యములను సమర్థింపవలెను.

ఏ వస్తువును చూచినను ఈ శ్లోకము ప్రకారము గుణము కాగలదు. కనుకనే 'యదృచ్ఛత్' అని వీప్స చూపబడినది.

ఈ యంశము గుర్తింపవలెను : వ్యాకరణ సూత్రములలో కొన్ని చోటులందు మాత్రము ఈ శ్లోకముచే గుర్తింపబడిన గుణమును గ్రహింపరాదు. మరియొక విధముగ గుణ శబ్దార్థమును చూపవలెను.

"వోతో గుణవచనాత్" (4-1-44) వా, ఉతః, గుణవచనాత్, అని పదచ్ఛేదము గుణవచనమయి ఉకారాంతమగు ప్రాతిపదికము కంటె వికల్పముగా 'ఙీష్' ప్రత్యయము స్త్రీలింగమున ప్రవర్తించునని సూత్రార్థము. ఉదా : పటు + ఈ = పట్వీ, పటుః; మృదు + ఈ = మృద్వీ, మృదుః; పటుత్వము, మృదుత్వముకల ఆడుది. ఈ ప్రత్యయము ప్రాతిపదికము కంటె ప్రవర్తించును. ఆ ప్రాతిపదికము గుణము అప్రధానముగా గల ద్రవ్యమును బోధింపవలెను. అట్టితరి 'సంసర్గి భేదకమ్' అను గుణమును ఇచట గ్రహింపరాదు. అట్లు కాకున్న 'ఆఖు' (ఎలుక) మున్నగు జాతిశబ్దముల కంటెను ఈ ప్రత్యయము ప్రవర్తించెడిని. అందుచే ఇచట గుణవచనమనునది విశిష్టమగు సంజ్ఞా శబ్దమని భాష్యకారుడు నిర్ణయించెను.

ద్రవ్యమునకు ధర్మములు—ఇది, అది అను సర్వనామములచే పరామర్శింప బడుట, పరినిష్పన్నత అనగా పరిపూర్ణత, స్వాతంత్ర్యము, లింగసంఖ్యలతో సంబధము మున్నగునవి. ఈధర్మములు కలిగియుండుట వలన ఎల్లయర్థము ద్రవ్యమేకానగును.

అతః = ఈకారణమువలన, సర్వః అర్థః = ఎల్లయర్థము, ద్రవ్యమ్ = ద్రవ్య మనియే, ఇష్యతే = ద్రవ్యవాదిచే అంగీకరింపబడుచున్నది.

ద్రవ్యవాదిమతమున ఆఖ్యాతార్థముకూడ ద్రవ్యమే కాగలదు. ఈయర్థము 4వ సముద్దేశమున స్పష్టముకాగలదు. ॥13॥

అవతారిక—శబ్దముయొక్క వ్యాపారమునుబట్టి చూడగా జాతి ఎల్ల శబ్దములకు వాచ్యముకాగలదని చూపియున్నాడు.

ఇపుడు వైశేషికుల మార్గమును దృష్టిలోనుంచుకొనినను జాతి సార్వత్రికము, అదియే ఎల్లశబ్దములకు వాచ్యము. అన్నివ్యక్తులయందు సమానమగు ధర్మములు కానవచ్చు చున్నవి. కనుకనే జాతికి వైశేషికులు కూడ సామాన్యము అనియే నామకరణము చేసి యున్నారని చెప్పుచున్నాడు.

శ్లో॥ అనుప్రవృత్తిధర్మోవా జాతిస్స్యాత్సర్వజాతిషు।
వ్యావృత్తిధర్మసామాన్యం విశేషే జాతిరిష్యతే॥ 14

A. అనుప్రవృత్తిధర్మః + వా = ఎల్లవ్యక్తులయందు ఏకాకారమగు అనగా ఒకేరూపమున నున్న ధర్మమైన, సర్వజాతిషు = ఎల్లజాతులయందు, జాతిః = జాతికాగలదు అనగా జాతి వలన కలిగెడి కార్యము కలుగగలదు.

జాతియొక్క స్వభావమేమనగా—తనకు ఆశ్రయములగు ఎల్లవ్యక్తులయందు అనువర్తించుటయే. అనగా ఎల్లగోవ్యక్తులయందు గోత్వమను ధర్ముముండుటయే. మరియు తనకు అనురూపమగు జ్ఞానమును కలిగించుటయు జాతియొక్క స్వభావము. దానిని బట్టియే, ద్రవ్యము ఆరూపముతో భాసించుచున్నది. మరియు తనకు అనుగుణమగుశబ్దముచే బోధింప బడుటయు జాతియొక్క స్వభావము. మరియు ప్రతివ్యక్తియందు సర్వాత్మనా అనగా సంపూర్ణముగా సమాప్తినిజెంది యుండుటయు జాతియొక్కస్వభావము. ఇవి యన్నియు జాతిస్వభావములుగా లోకసిద్ధములైయున్నవి.కాని ఇవియన్నియు జాతులుగా పరిగణింపబడవు. గోత్వము, ఘటత్వము, పటత్వము మున్నగునవే జాతులుగా లెక్కింపబడుచున్నవి. అట్లైనను పైఎల్లధర్మములు జాతినిబోలి ఎల్లజాతులను వ్యాపించియున్నవి. కనుక ఇవియు జాతులుగా అనగా అప్రధానములగు జాతులుగా పరిగణింపబడును. జాతితో సామ్యమువీనికికలదు గావున నివియు సామాన్యములుకాగలవు. జాతియందుమరియొక జాతిని అంగీకరించుటలో అనవస్థా దోషము బాధకము కాగలదు. కాని సాధారణ ధర్మరూపమగుజాతి, జాతియందుండుటలో దోషములేదు.

జాతి, సంజ్ఞ, అవ్యయ, కృదంత, తద్ధితాంత, సమస్త, సర్వనామ, సంఖ్యా వీని కంటె ఇతరమగు ప్రాతిపదికము గుణవచనము. ఇది *భాష్యకారుడు చేసిన సంజ్ఞ. గుణమ్ ఉక్తవాన్ (గుణ మప్రధానముగాఁగల ద్రవ్యమును బోధించునది) 'గుణవచనః' అను వ్యుత్పత్తి నాశ్రయింపవలెను.

''సంఖ్యాయా గుణస్య నిమానే మయట్'' (5-2-47) అను పాణిని సూత్రమున గుణశబ్దము సమభాగము అను నర్థము కలది. ఈ శ్లోకముచే చెప్పబడిన గుణము కాదు. 'గుణ వచన' సంజ్ఞయు కాదు. కొనుటకు సాధనమగు వస్తువు కొనబడెడి వస్తువు సమభాగముగా నున్నపుడు సంఖ్యావాచకమగు శబ్దముకంటె 'మయట్' తద్ధితము ప్రవర్తించునని సూత్రార్థము. ఉదా : ద్విమయమ్ ఉదశ్విత్ యవానామ్, (రెండు డొక్కుల యవధాన్యములకు రెండు డొక్కుల మజ్జిగ) ఉదకేన. శ్వయతి (నీటిచే వృద్ధిజెందునది) అను వ్యుత్పత్తిచే ఉదశ్విత్ అనగా మజ్జిగ.

"గుణవచనేభ్యోమతుపో లుక్" (5-2-94) అను వార్తికమున శుక్ల, నీల మున్నగు రూపవిశేష బోధకములు గుణవచన శబ్దముచే గ్రహింపబడుచున్నవి. శుక్లమ్ అస్యాస్తి = (దీనికి శుక్లరూపమున్నది) అను నర్థమున 'మతుప్' ప్రత్యయము ప్రవర్తించి శుక్లవత్ అని యుండగా పై వార్తికముచే 'మతుప్' నకు లోపము కలుగును, శుక్లం వస్త్రమ్.

''తృతీయా తత్కృతార్థేన గుణవచనేన'' (2-1-30) "ప్రకారే గుణవచనస్య" (8-1-12) "పూరణగుణ" (2-2-11) "ఈషద్గుణవచనేన" (2-2-7) "అజాదీగుణ వచనా దేవ" (5-3-58) ఈ సూత్రవార్తికములలో గూడ "సంసర్గి భేదకమ్" అను శ్లోకమున చెప్ప బడిన గుణమును గ్రహింపరాదు. తార్కికులు చూపిన గుణములను లోకప్రసిద్ధమగు గుణము లను గ్రహించి సూత్రార్థ సమన్వయము చేయవలెను. ॥1॥

*అవతారిక* — వస్తువులలో నొకదానికంటె మరియొకదానికి ఉత్కర్షను వివక్షింపగా తర, తమ ప్రత్యయములు వ్యాకరణమున విధింపబడినవి. శుక్లతరం వస్త్రమ్ (ఈ రెంటిలో ఈ వస్త్రము ఎక్కువ తెల్లనిది) ద్రవ్యమునకు స్వతః ఉత్కర్షాపకర్షలు ఉండవు. అది నిజరూపమున ఏకరూపముగానే యుండును. అందుచే ఆ ద్రవ్యమునందుగల తెలుపు మున్నగు గుణముల ఉత్కర్షాపకర్షలను బట్టి ద్రవ్యమునకు ఉత్కర్షాపకర్షలు కలుగును. అనగా గుణమునందున్న వానిని ద్రవ్యమునం దారోపించిన, వాని మూలమున ద్రవ్యమునందు ఉత్కర్షాపకర్షములు భాసించును అని †మహాభాష్యకారుడు నిర్ణయించెను.

---

* ఈ యర్థము ''ఆకడారా దేకా సంజ్ఞా'' (1-4-1) అను సూత్రమునకు సంబంధించిన భాష్యమున కలదు. ఇది మొదలు ద్వితీయాంత భాగమునగల సంజ్ఞలలో ఒకదానికి ఒకే సంజ్ఞ కలుగునని సూత్రార్థము.

† ''అతిశాయనే తమ బిష్ఠనౌ'' (5-3-55) (న్యూనీకరణ రూపమగు అతిశాయనమున తమప్, ఇష్ఠన్ తద్ధితములు కలుగును.) ప్రాతిపదికార్థో వై ద్రవ్యమ్; న చ ద్రవ్యస్య ప్రకర్షాప కర్షౌ స్తః, ఏవం తర్హి గుణః ప్రాతిపదకార్థః, యస్యాస్తి ప్రకర్షః, తత్ప్రకర్షీ భవిష్యతి'' అని మహాభాష్యము.

కాని ద్రవ్యమునకు ఉత్కర్షాపకర్షములు స్వాభావికములు కావనియు, అవి గుణము నకే కలుగుననియు ఎట్లు తెలియనగును? అవి ద్రవ్యమునకు ఏల యుండరాదు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యస్యాఽవ్యపదేశ్యస్య య ఉపాదీయతే గుణః ।
భేదకో వ్యపదేశాయ, తత్ప్రకర్షోఽభిధీయతే ॥ 2

అవ్యపదేశ్యస్య = వ్యవహరించుటకు అర్హముకాని అనగా శబ్దముచే చెప్పుటకు సాధ్యముకాని, ద్రవ్యస్య = ద్రవ్యమునకు, వ్యపదేశాయ = వ్యవహారము కొరకు, భేదకః = భేదమును కలిగించెడి, అనగా ఇతర వస్తువుకంటె వేరుపరచెడి, యః = ఏ, గుణః = గుణము అనగా జాతి, తెలుపు, నలుపు మున్నగు గుణము; వంట, చదువు మున్నగు క్రియ; దేవదత్త మున్నగు సంజ్ఞ అనెడి గుణము, ఉపాదీయతే = స్వీకరింపబడు చున్నదో అనగా శబ్దముచే బోధింపబడు చున్నదో, తత్ప్రకర్షః = ఆ గుణముయొక్క ఉత్కర్షము, అభిధీయతే = చెప్పబడుచున్నది. అనగా తర - తమ - ఇష్ఠన్, ఈయసున్ ప్రత్యయములచే బోధింపబడుచున్నది.

జాతి, గుణము, క్రియ మున్నగు ఉపాధులను వేరుచేసి వాని సంబంధములేక శుద్ధ ద్రవ్యము నిరూపించుట సాధ్యము కాదు. నిరుపాధికమగు ద్రవ్యము శుద్ధ బ్రహ్మరూపమే. అట్టి ద్రవ్యమునందు ఉత్కర్షాపకర్షలు సంభవింపవు అట్టి ద్రవ్యము శబ్దవాచ్యము కానేరదు. లోకవ్యవహారమునకు తగదు. ఆ ద్రవ్యము శబ్దవాచ్యము కావలెనన్నచో జాత్యాదికమగు గుణములతో కలసియున్నదే కావలెను. ద్రవ్యమునందు ఉత్కర్షాపకర్షములు కలుగవు అనుటలో "అవ్యపదేశ్యస్య" అను విశేషణము హేతురూపముగా చూపబడినది.

అందుచే గుణములయందున్న ఉత్కర్షాపకర్షలను పురస్కరించుకొని తరతమ ప్రత్యయములు ప్రవర్తించును. అందును ద్రవ్యమునందు పెక్కు గుణములున్నను ఏ గుణము శబ్దముచే గ్రహింపబడునో, ఆ గుణమునుబట్టి ప్రకర్షము చూపవలెను.

ఇచట గుణపదము 'సంసర్గి భేదకమ్' అనుకారికచే గుర్తింపబడిన గుణమునే బోధించును. ॥2॥

అవతారిక — ద్రవ్యమునకు స్వతః ఉత్కర్షాపకర్షలు సంభవింపవు. అందుచే దానియందున్న తెలుపు మున్నగు గుణముల ఉత్కర్షాపకర్షలను చూచి వాని ద్వారా ద్రవ్యమునకు ఉత్కర్షాపకర్షలు కలుగునని రెండవ శ్లోకమున జూపబడినది. శుక్లము మున్నగు గుణములనే ప్రధానములుగా వివక్షించిన నవియు ద్రవ్యములే యగును. అట్టితరి శుక్లాది శబ్దములకంటె 'తరప్' మున్నగు ఆతిశాయనిక ప్రత్యయములు ప్రవర్తింపనేరవు. లోకమున మాత్రము 'శుక్లతరం రూపమ్ (ఈ తెలుపు ఉత్కృష్టమైనది) అను రీతిని ప్రయోగములు కానవచ్చు చున్నవి. వానిని ఎట్లు సమర్థింపవలెను? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సర్వస్యైవ ప్రధానస్య న వినా భేదహేతునా ।
ప్రకర్షో విద్యతే, నాఽపి శబ్దస్యోపైతి వాచ్యతామ్ ॥ 3

ప్రధానస్య = ప్రధానమగు, సర్వస్య + ఏవ = ఎల్ల వస్తువునకు, భేదహేతునా + వినా = భేదమునకు కారణమగు గుణాదికము లేనిది, ఉత్కర్షః = ఉత్కర్షము, న + విద్యతే = ఉండనేరదు.

అట్లే, శబ్దస్య = శబ్దమునకు అనగా శుక్ల, నీల మున్నగు శబ్దమునకు, వాచ్యతామ్ + అపి = వాచ్యత్వమును గూడ, న + ఉపైతి = పొందనేరదు. ద్రవ్యము నిజరూపమున శబ్దముచే బోధింపబడదు అని భావము.

పటము మున్నగువానియందున్న తెలుపు మున్నగు గుణము ప్రధానముగా వివక్షితమగుచో నదియు ద్రవ్యమే యగును. 'భేద్యత్వేన వివక్షితః' (విశేష్యమున అనగా విశేష్యముగా వివక్షింపబడినది) అనికదా ద్రవ్యలక్షణము చూపబడినది. అట్టితరి శుక్లరూపమున గల భాసురత్వము మున్నగు గుణములను వివక్షించి వాని ఉత్కర్షాపకర్షలను పురస్కరించుకొని, 'శుక్లతరం రూపమ్' మున్నగు ప్రయోగములను సమర్థింపవలెను.

ఒకవేళ భాసురత్వమును గూడ ప్రధానముగా వివక్షించిన నదియు ద్రవ్యమే యగునని భావించిన, అట్టితరి దానియందున్న స్వచ్ఛత మున్నగు గుణములను గ్రహించి వానిని బోధించెడి శబ్దములకంటె తరబాదులను ప్రవర్తింపజేయవలెను.

ఇట్లు ఎంతవరకు మనము ఎల్ల వస్తువులను ప్రధానముగా భావించెదమో, అంత వరకు దానియందు విజాతీయమగు ధర్మములు లభించును. కనుకనే కారికలో 'సర్వస్యైవ' అని సామాన్యముగా జూపబడినది. ఈ యర్థము మొదటి కాండమున (బ్రహ్మకాండము) *64 వ శ్లోకమున వివరింపబడియున్నది. ॥3॥

*అవతారిక*— "శుక్లతరం రూపమ్" (ఈ శుక్లరూపము మిక్కిలి ఉత్కృష్టము) మున్నగు ప్రయోగములు భాసురత్వాది గుణములనుబట్టి సమర్థించుట యుక్తము కాదు. శబ్దముచే బోధింపబడిన గుణముల తారతమ్యమును బట్టియే తరబాదులు ప్రవర్తించును. పై ప్రయోగములలో భాసురత్వాధికము శబ్దముచే బోధింపబడలేదు. అట్లు కాకున్న ఎన్నియో ధర్మములు ద్రవ్యమునందుండుటచే వానిలో నేధర్మముబట్టి తరతమ ప్రత్యయములు ప్రవర్తించునో నియమము లభింపదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ విద్యమానాః ప్రధానేషు న సర్వే భేదహేతవః,
విశేషశబ్దైరుచ్యన్తే వ్యావృత్తార్థాభిధాయిభిః ॥ 4

* "గుణః ప్రకర్షహేతుర్యః స్వాతన్త్ర్యేణోపదిశ్యతే, తస్యాశ్రితగుణాదేవ ప్రకృష్టత్వం ప్రతీయతే" 1-64.

వ్యావృత్త్యర్థాభిధాయిభిః = ఇతరమగు వస్తువునుండి వేరుచేసెడి అర్థములను బోధించెడి, విశేష శబ్దైః = విశేష శబ్దములచే అనగా ఘటః, నీలః మున్నగు శబ్దములచే, ప్రధానేషు = ప్రధానములుగా వివక్షితములగు ఘటము. శుక్లము, భాసురము మున్నగు అర్థములయందు, విద్యమానాః = ఉన్నట్టియు, భేదహేతవః = ఇతర వస్తువును వేరుచేయుటకు కారణములగు, సర్వే = ఎల్ల ధర్మములు, న + ఉచ్యన్తే = చెప్పబడవు. వస్తువులయందున్న ఘటత్వము నలుపు, పెద్దతనము మున్నగు ధర్మములు ఒకే శబ్దముచే బోధింపబడవని భావము.

ఘటమునందు ఘటత్వము ద్రవ్యత్వము మున్నగు జాతి, నలుపు తెలుపు మున్నగు గుణము, చలనము మున్నగు క్రియ, అల్పత్వము మున్నగు పరిమాణము, ఏకత్వము మున్నగు సంఖ్య, కర్తృత్వము మున్నగు కారకము, ఇంకను ఇట్టి విశేషము లెన్నియో కలవు. అవియే ఘటవ్యక్తిని ఇతర వస్తువులనుండి వేరుచేయుచున్నవి. ఆన్ని విశేషములతో గూడియున్నట్లు ఘటమును బోధింపతలచిన అన్ని శబ్దములను ఉపయోగింపవలెను. అట్టి ఘటమును ఒకే శబ్దము బోధింపజాలదు.

ఇట్లే 'శుక్ల' అను శబ్దముచే తెలుపు అను అర్థము బోధింపబడుచున్నది. కాని దానియందు గుణత్వము శుక్లత్వము మున్నగు జాతి, ఏకత్వము మున్నగు సంఖ్య, భాసురత్వము నిర్మలత్వము మున్నగు ఎన్నియో విశేషములు కలవు. కాని వాని నన్నిటిని శుక్ల శబ్దము బోధింపజాలదు. వానిని బోధింపదలచిన పెక్కు శబ్దములను ప్రయోగింపవలెను. కనుకనే అవి విశేష శబ్దములుగా గ్రహింపబడుచున్నవి. అట్లుకాక ఎల్ల విశేషములతో గూడిన ఘటాదులను ఒకే శబ్దము బోధించిన, నది సామాన్య శబ్దమే యగును కాని లోకమున నట్లు కానరాదు.

కాబట్టి ఏ విశేషమును బోధింపదలచెనో, ఆ విశేషమును ఆ శబ్దముచేతనే చూపవలెను. అట్టి శబ్దముచే లభించిన గుణములే ద్రవ్యమునందు ఉత్కర్షమును జూపగలవు.

శుక్లతరం రూపమ్ మున్నగు ప్రయోగములలో గూడ భాసురత్వాది విశేష గుణములు గూడ శుక్ల శబ్దవాచ్యములే యగును. అట్లుకాక పై నియమమును అనుసరించి భాసురత్వాదులు శుక్ల శబ్ద వాచ్యములే కానిచో భేదక ధర్మము లేనందున నచట తరబాదులు ప్రవర్తింపక పోయెడివి.

కాబట్టి ప్రామాణికమగు ప్రయోగము యొక్క బలముచే నిచట మాత్రము విశేష ధర్మములు కూడ శుక్లాది శబ్దవాచ్యములనుటయే లెస్స. ॥4॥

*అవతారిక*— ద్రవ్యము నిజరూపమున శబ్దవాచ్యము కానేరదు. మరియు దానియందు ఉత్కర్షాపకర్షములు స్వతః సంభవింపవు. అందుచే దానియందున్న గుణములను గ్రహించి వానిద్వారా దానికి శబ్దవాచ్యత్వము, ఉత్కర్షాపకర్ష వ్యవహారము నిర్వహింపవలెనని ఇంతవరకు చూపబడినది.

కాని గుణముల సాహాయ్యము ద్రవ్యమునకు శబ్దవాచ్యత్వమును పొందుపరచుటకై

ఉపయోగపడుచున్నది. అంతమాత్రముచే గుణముల సాహాయ్యము అనగా వాని బలము ఉపయోగింపబడి క్షీణించినందున, మరల గుణములు ద్రవ్య ప్రకర్షకు గూడ ఎట్లు సహకరింపగలవు ? అనగా గుణములు ద్రవ్యమునకు రెండు విధములగు ఉపకారములను ఎట్లు చేయగలవు ? ద్రవ్యము శబ్దముచే బోధింపబడుటకై గుణములు సహకరించినందున నవియే మరల ప్రకర్షకు కారణము లెట్లు కాగలవు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ వస్తూపలక్షణే తత్ర విశేషో వ్యాపృతోయది ।
ప్రకర్షో నియమాభావాత్స్యాద విజ్ఞాతహేతుకః ॥ 5

తత్ర = ఆ స్థలములలో అనగా 'శుక్లతరః పటః', 'శుక్లతరం రూపమ్' మున్నగు ప్రయోగములలో, విశేషః = విశేషము అనగా శుక్లరూపము భాసురత్వము మున్నగు విశేషము, వస్తూపలక్షణే = ద్రవ్యమాత్రమును శబ్దముచే బోధించుటయందే, వ్యాపృతః + యది = వ్యాపారము కలది యగుచో, అనగా అంతమాత్రమున గుణము చరితార్థమై ప్రకర్షాధాయకము కూడ కాకున్న, నియమాభావాత్ = నియమము లేనందున, ప్రకర్షః = ఉత్కర్షము, అవిజ్ఞాత హేతుకః = తెలియబడని హేతువు కలదై, స్యాత్ = కావచ్చును, ఏ గుణమునుబట్టి ఈ ప్రకర్షము కలుగుచున్నదో తెలియక పోయెడిని.

శుక్లాది గుణసంబంధము లేనిది పటము మున్నగు ద్రవ్యము శబ్దవాచ్యము కానేరదు. శబ్దముచే బోధింపబడుటకై గుణములు ద్రవ్యములతో సంబద్ధములగుచున్నవి. అంత మాత్రాన అవి ఉపయోగపడుటచే చరితార్థములు కావచ్చును. కాని వాని యుపయోగము అంతమాత్రమే అని భావింపరాదు. అట్లైన ఉత్కర్షాపకర్షములు నిర్హేతుకములే కావలెను. అట్లు లోకానుభవము లేదు. కాబట్టి గుణములు ద్రవ్యము శబ్దవాచ్యమగుటయందు తోడ్పడుచు ఆ ద్రవ్యమునందు ఇతర వస్తువుకంటె ఉత్కర్షాపకర్షములకు కారణములు కూడ కాగలవు. ॥5॥

అవతారిక — 'నికృష్ట తరః' (చాల నీచుడు), ప్రకృష్టతరః (మిక్కిలి ప్రకర్ష కలవాడు) అను ప్రయోగములు కానవచ్చుచున్నవి. కాని నికృష్టునియందు ఉత్కర్ష మెట్లు ? ప్రకర్షకల వానికి ఇంకను ప్రకర్ష ఎట్లు ? అట్టితరి ఆతిశాయనిక ప్రత్యయము లెట్లు ప్రవర్తింప గలవు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సర్వం చ సర్వతోఽవశ్యం నియమేన ప్రకృష్యతే ।
సంసర్గిణా నిమిత్తేన నికృష్టేనాధికేన వా ॥ 6

నికృష్టేన = తక్కువ యగునట్టి, వా = కాక, అధికేన = అధికమగునట్టి, సంసర్గిణా = సంబంధించియున్న, నిమిత్తేన = నిమిత్తముచే, సర్వం + చ = ఎల్ల వస్తువు, సర్వతః = ఎల్ల వస్తువులను బట్టి, నియమేన = నియతముగా, ప్రకృష్యతే = ప్రకర్షకలదిగా గ్రహింపబడుచున్నది.

ప్రతి వస్తువు సజాతీయ వస్తువునుబట్టి న్యూనాధిక భావమును బొందును. న్యూన

త్వమునసే మిక్కిలి న్యూనమగుచో నదియు తరబాదిప్రత్యయములను బొందును. దానికంటె తక్కువగానున్నది. లేదని యర్థము భాసించును. నీచులు ఒక తెగకు చెందినవారుందురు. వారిలో గూడ ఉచ్చ నీచభావము తప్పక యుండును. ఒకే విధమగు నీచత్వము ఎల్లరియందు ఉండదు. ఆ స్థితిలో నూటికి అరువదిపాళ్ళు మంచి గుణములు కలవాడొకడు, ఏబది పాళ్ళు మంచి గుణములు కలవాడు మరియొకడు అను రీతిని భేదము వారిలో నుండును. ఆ సంఘమున నూటికి నూరుపాళ్ళు చెడుగుణములు కలవాడు 'నికృష్టతరః' అను పదముచే వాడబడును. నీచభావమున వానికంటె నీచుడు మరియొకండు లేడను భావము భాసించును. ఈ పద్ధతిలో నీచత్వమున ఆధిక్యముండుటచే నచట నట్టి ఉత్కర్షమును గ్రహించి తరతమ ప్రత్యయములు ప్రవర్తింప గలవు.

అట్లే ఉత్తములు ఒక తరగతికి చెందియుందురు. వారిలో నూటికి పదిపాళ్ళు చెడు గుణములు కలవాడొకడు, అయిదుపాళ్ళు చెడుగుణములు కలవాడు మరియొకడు, అను రీతిని తారతమ్యము నియతముగా నుండును. నూటికి నూరుపాళ్ళు మంచిగుణములు కలవాడు సర్వోత్తము డగును.

ఇట్లే ఏమియులేదను నర్థమును బోధించునపుడు 'న' శబ్దముకంటె తరబాదులు ప్రవర్తించును. 'నతరామ్'. 'న' శబ్దమునకు అభావమర్థము. అభావమనగా లేమి. ఆ లేమిలో గూడ ఏమియులేదనెడి స్థితిని పై శబ్దము సూచించును. లేమిలో పరమావధి ఉత్కర్షముగా భావింపగా తరబాదులు ప్రవర్తించును. ॥6॥

అవతారిక — గోతరా (ఈ రెండు గోవులలో ఈ గోవు ఉత్కృష్టమైనది) 'అశ్వతరః' (ఈ రెంటిలో ఈ యశ్వము ఉత్కృష్టమైనది) అను ప్రయోగములు కానవచ్చు చున్నవి. ఇచట ఉత్కర్షమునకు కారణమగు గుణము ఏదియు శబ్దవాచ్యమై లేదు. గోత్వము, అశ్వత్వము అను జాతులు మాత్రము భాసించుచున్నవి. అవి ఎల్ల వ్యక్తులకు సమానములే కాన, ప్రకర్షహేతువులు కానేరవు. కాగా పై ప్రయోగముల కుపపత్తి యెట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నాపేక్షతే నిమిత్తం చ ప్రకర్షే వ్యాపృతం యది ।
ద్రవ్యస్య స్యాదుపాదానం ప్రకర్షం ప్రత్యనర్థకమ్ ॥ 7

(ద్రవ్యమ్) = ద్రవ్యము, ప్రకర్షే = అతిశయము చూపదలచినపుడు, వ్యాపృతమ్ = వ్యాపారముతో గూడిన అనగా విశేషముగానున్న, నిమిత్తమ్ = నిమిత్తమును, న + అపేక్షతే + చేత్ = అపేక్షింపనిచో, ప్రకర్షం + ప్రతి = ఇతర వస్తువులకంటె తనయందున్న ఉత్కర్షమును గూర్చి అనగా దానిని వ్యక్తపరచుటకై, ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క, ఉపాదానమ్ = స్వీకారము, అనర్థకమ్ = ప్రయోజనము లేనిది, స్యాత్ = కావలెను. నిరూపింపదలచిన అతిశయము వ్యక్తముకానందున 'గోతరా' అను ప్రయోగమే లేకపోయెడిని అని భావము.

జాతినిబట్టి అతిశయము లభింపదు. అది ఎల్ల వ్యక్తులకు సాధారణమేకదా! పై ప్రయోగములు సార్వత్రికములై యున్నవి. ఉత్కర్షను సంపాదించెడి మరియొక గుణము ఆ శబ్దముచే చెప్పబడుట లేదు. అందుచే ఈ రీతిగా సమన్వయము చేయవలెను. ఆవులకు పాలు ఇచ్చుట స్వభావము. పాలు ఇచ్చుట అనే గుణమునుబట్టి ప్రకర్ష వివక్షితమగును. కాగా దోహన క్రియనుబట్టి, తరతమ భావము చెప్పనగును. ఈ రెండు ఆవులలో ఈ ఆవు అధికముగా పాలు ఇచ్చును అను అర్థమును వ్యక్తపరచుటకై 'గోతరా' అను శబ్దము ప్రయుక్తమగును.

వృషభములకు బరువుమోయుట, పొలము దున్నుట మున్నగు పనులు స్వాభావికములు. వానినిబట్టి ప్రకర్షము వివక్షితము కాగలదు. వృషభతరః.

అశ్వమునకు పరుగెత్తుట స్వాభావికము. దానినిబట్టి ప్రకర్షము వివక్షితము కానగును. అశ్వతరః.

పై ప్రయోగములలో గవాది శబ్దములకు గోత్వాది జాతియేకాక దోహనము, వాహనము, పలాయనము మున్నగు క్రియలు గూడ వాచ్యములే యగును. వానినిబట్టి తర - తమ భావము గుర్తింపబడును. అట్లుకాకున్న గవాది శబ్దముల ప్రయోగము వ్యర్థమే యగును. ॥7॥

*అవతారిక*— ప్రకరణార్థమును ముగింపుచున్నాడు.

**శ్లో॥ సవ్యాపారో గుణస్తస్మాత్స్వప్రకర్షనిబన్ధనః ।**
**ద్రవ్యాత్మానం భినత్త్యేవ స్వప్రకర్షే నివేశయన్ ॥ 8**

తస్మాత్ = ఆ కారణమువలన, అనగా ద్రవ్యమునకు స్వతః ఉత్కర్షాపకర్షములు సంభవింపనందున, స్వప్రకర్షనిబన్ధనః = తనయొక్క అనగా గుణము యొక్క ఉత్కర్షము కారణముగా గల, కనుకనే సవ్యాపారః = వ్యాపారముతోగూడిన అనగా విశేషణముగానున్న, గుణః = గుణము (రూపము, భాసురత్వము, నైర్మల్యము, దోహనము, వాహనము పలాయనము మున్నగు) స్వప్రకర్షే = తనయొక్క అనగా ద్రవ్యముయొక్క ఉత్కర్షమునందు, ద్రవ్యాత్మానమ్ = ద్రవ్యస్వరూపమును, నివేశయన్ = ఉంచుచున్నదై, భినత్తి + ఏవ = ఇతర వస్తువునుండి తప్పక వేరుచేయగలదు.

గుణములకు ఉత్కర్షాపకర్షములు సంభవించును. వానిని తనకు ఆశ్రయమగు ద్రవ్యమునకు సంబంధింపజేసి ఇతర వస్తువునుండి ఆ ద్రవ్యమును గుణములు వేరుచేయుచున్నవి.

*అవతారిక*— గుణములయందున్న ఉత్కర్షాపకర్షములు ద్రవ్యమున కెట్లు సంబంధించును? అన్యధర్మము అన్యమునకు కలుగుట అసంభవము కదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అరూపం పరరూపేణ ద్రవ్యమాఖ్యాయతే యథా ।**
**అప్రకర్షం ప్రకర్షేణ గుణస్యాఽఽవిశ్యతే తథా ॥ 9**

యథా = ఏ రీతిగా, అరూపమ్ = రూపములేని అనగా స్వతః తన రూపము తప్ప మరియొక రూపములేని. ద్రవ్యమ్ = స్ఫటికము మున్నగు వస్తువు, పరరూపేణ = ఇతర వస్తువుయొక్క రూపముచే, ఆఖ్యాయతే = చెప్పబడుచున్నదో, మంకెనపూవుయొక్క ఎరుపుతనము స్ఫటికము నందు భాసింపగా, తెల్లగానున్న స్ఫటికము కూడ 'స్ఫటికము ఎఱ్ఱగానున్నద'ని చెప్పబడు చున్నదో యని భావము.

తథా = అట్లే, అప్రకర్షమ్ = స్వతః ఉత్కర్షాపకర్షములులేని, పటము మున్నగు ద్రవ్యము, గుణస్య = శుక్లరూపము మున్నగు గుణముయొక్క, ప్రకర్షేణ = ఉత్కర్షముచే, ఆవిశ్యతే = ఆవేశింపబడుచున్నది, అనగా ఆక్రమింపబడుచున్నది.

అన్యధర్మములు అన్యత్ర సంక్రమించుటలో సామీప్యము కారణము కాగలదు. తెల్లని స్ఫటికము దగ్గర ఎఱ్ఱ పూవు ఉన్నచో దాని ఎరుపుతనము స్ఫటికమునందు సంక్రమించును. అట్లే గుణములకు గుణములుకలవానికి భేదము గృహీతము కానందున గుణముల ధర్మములు ద్రవ్యమునకు సంక్రమింపగలవు.

కాక అరూపమ్ = రూపములేని నిర్గుణ పరబ్రహ్మము అనెడి, ద్రవ్యమ్ = ద్రవ్యము, పరరూపేణ = అనాది సిద్ధమగు మాయయొక్క సంబంధమువలన కలిగెడి రూపము మున్నగువాని సంబంధముచే యథా = ఏ రీతిగ, ఆఖ్యాయతే = వ్యవహరింపబడు చున్నదో అని దృష్టాంతవాక్యమున కర్థము చెప్పవలెను. ॥9॥

*గుణసముద్దేశము ముగిసినది*

## దిక్సముద్దేశము—౫

అవతారిక— ద్రవ్యము మున్నగు పది పదార్థములు మూడవ కాండమున నిరూపింపబడుచున్నవని ప్రతిజ్ఞచేసి ద్రవ్యమును గుణమును నిరూపించి, ఈ సముద్దేశమున దిక్కును నిర్ణయించుచున్నాడు. దిక్కునకు పరాధీనత్వము స్వాభావికము, అట్టి ధర్మము కలవియగుటచే సాధన క్రియాకాలములను గూడ పేర్కొనుచున్నాడు.

శ్లో॥ దిక్ సాధనం క్రియా కాల ఇతి వస్త్వభిధాయినః ।
శక్తిరూపం* పదార్థానా మత్యన్తమనవస్థితాః ॥ 1

1. దిక్, 2. సాధనమ్, (కర్త, కర్మ, కరణము మున్నగు కారకము), 3. క్రియా, 4. కాలః ఇతి = అనెడి ఈ నాల్గు శబ్దములు, పదార్థానామ్ = కడవ. నేల, నీరు మున్నగు సిద్ధ స్వాభావకములగు పదార్థములయొక్క అనగా వానియందు కల, శక్తిరూపమ్ = శక్తి స్వరూపమగు. వస్తు = వస్తువును, అభిధాయినః = చెప్పు స్వభావము కలవి.

కాని, అత్యన్తమ్ = మిక్కిలి, అనవస్థితాః = నియతములై కానరావు, అనగా దిక్కు మున్నగు అర్థములు తార్కికులచే ఎట్లు నిర్వచింపబడినవో, అట్టి యర్థములతో ఈ శబ్దములకు సంబంధము కానరాకున్నది, అట్టి యర్థములను వ్యాకరణశాస్త్రమున సూత్రములలో నుపయోగింపబడిన దిగాదిశబ్దములు బోధింపలేదు. కాబట్టి అసాధారణములగు వీని యర్థములను జూపి తదనుసారముగా సరియగు లక్షణములను వివరించి సిద్ధాంతమును దెలుపవలెనని భావము.

దిక్కు మున్నగు నాలుగు పదార్థములును, భూమి మున్నగు స్వతంత్రపదార్థముల యందున్న శక్తిరూపములు, అనగా కార్యవిశేషమును కలిగించెడి సామర్థ్యవిశేషములు, దిగాదులు స్వతంత్ర వస్తువులు కానేరవు, పరాధీనత్వము శక్తికి అసాధారణమగు రూపము.

సూర్య సంయోగమునుబట్టి భూమి మున్నగు స్వతంత్ర పదార్థములయందు దిక్శక్తి అభివ్యక్తమగును. కనుక ఇది పరాధీనమే.

సాధనశబ్దము కర్త, కర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణ, హేతువులు అను కారకములను బోధించును. పదార్థముల శక్తియే కారకము. "శక్తిః కారకమ్" అని మహాభాష్యకారుని నిర్ణయము.

క్రియ ద్రవ్యములవలన జనియించును. ద్రవ్యాశ్రితమగుటచే నిదియు పరాధీనమే.

కాలము ఇతర వస్తువుల నాశ్రయించియే యున్నందున పరాధీనము.

* పాఠాంతరము — రూపే.

పై భావములు ఆ యా సముద్దేశములలో వ్యక్తమగును.

వైశేషికులు – క్రియ స్వతంత్ర పదార్థమనియు, దిక్కాలములు స్వతంత్ర ద్రవ్య రూపములనియు చెప్పుచు, వానికి ఏవో కొన్ని లక్షణములను జూపియున్నారు.

కాని యట్లు చెప్పుట పొసగదు. పై రీతిని దిగాదులు శక్తిరూపములు గదా! ఈ యభిప్రాయముతో 'అత్యన్తమనవస్థితాః' అని భర్తృహరి పలికెను. వైశేషికులు చేసిన నిర్ణయమును స్వీకరించినచో వ్యాకరణ సూత్రముల యర్థము సరియగు మార్గాన లభింపదు. వ్యాకరణ సూత్రాలలో దిగాదిశబ్దము లుపయోగింపబడియున్నవి.

"దిక్శబ్దేభ్యః ... దిగ్దేశకాలేషు" (5-3-27) ఇత్యాది.

ప్రకృతకారికయందలి 'శక్తిరూపమ్' అనుదానికి బదులుగా 'శక్తిరూపే' అను సప్తమ్యంతపాఠమే తరచుగ కానవచ్చుచున్నది. ఆ పాఠమున నీ రీతిగా సమన్వయము చేయవలెను.

వస్త్వభిధాయినః = సిద్ధస్వభావమగు వస్తువులను బోధించు స్వభావముకల, దిక్, సాధనం, క్రియా, కాలః, ఇతి = దిక్ మున్నగు నాల్గు శబ్దములు అనగా వైశేషికుల మతము ననుసరించి స్వతంత్రపదార్థ బోధకములగు దిగాదిశబ్దములు, పదార్థానామ్ = పదార్థముల యొక్క అనగా వానియందున్న, శక్తిరూపే = శక్తి స్వరూపము విషయమై, అత్యన్తమ్ = మిక్కిలి, అనవస్థితాః = నియతరూపములై కాకున్నవి.

పెరవారు చెప్పిన అర్థములను దిగాదిశబ్దములు బోధింపజాలవు. వారి మతము చొప్పున నా శబ్దములు స్వతంత్ర పదార్థవాచకములు, నిజమున దిగాదులు శక్తిరూపములని భావము.

శక్తిరూపమ్, శక్తిరూపే, అను పాఠములలో సమన్వయభేదమే, తాత్పర్య భేదము లేదు. ॥1॥

అవతారిక — మొదటి శ్లోకమున దిక్కు సాధనము క్రియకాలము అనునవి శక్తి రూపములని చెప్పబడినది. వానిలో సాధనమునకు క్రియకు పాణిని వ్యాకరణమున గల హేతువులను జూచి లక్షణము చెప్పవలెను. అనుమాన ప్రమాణముచే వాని స్వరూపము నిర్ణయింపవలెను. ఆ యంశము సాధనక్రియా (7, 8) సముద్దేశములలో నిరూపింపబడును. దిక్కాలములలో కాలము యొక్క స్వరూపము 9 వ సముద్దేశమున చెప్పబడును. ప్రస్తుతము దిక్కునకు లక్షణము చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యతిరేకస్య యో హేతురవధి ప్రతిపాద్యయోః ।**
**ఋజ్వీత్యేవం యతోఽన్యేన వినా బుద్ధిః ప్రవర్తతే ॥** **2**

B. విశేష = విశేషమునందు అనగా *వైశేషికులంగీకరించిన విశేష మనెడి పదార్థము నందు, వ్యావృత్తి ధర్మసామాన్యమ్ = వ్యావృత్తిని అనగా భేదమును కలిగించెడి ధర్మ మనెడి సామాన్యము, జాతిః = జాతిగా, ఇష్యతే = అంగీకరింప బడుచున్నది.

వస్తువులకు పరస్పరము భేదము పరమాణువులనుబట్టి సిద్ధించును. ఆ పరమాణువులకు భేదమును జూపునవి విశేషములు. అచట జాతిలేదు. అట్లైన సంశయము నివర్తింపదు. మరియు అనవస్థాదోషము వాటిల్లును. ఇతరవస్తువులనుండి వ్యావృత్తిని కలిగించుట అనేధర్మము విశేషములయందున్నది. అది ఎల్ల విశేషములకు సామాన్యము. కాగా విశేషములయందు వ్యావృత్తిని కలిగించెడి సామాన్యము జాతిగా గ్రహింప బడగలదు.

ఇట్లే ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావము అనెడి 4 విధములగు అభావముల యందు జాతి లేదు. జాతి యున్నచో అవి భావపదార్థములే కావలెను, కాని వానియందు అభవనాత్మకమగు ధర్మము సాధారణము కనుక అదియే వానికి జాతికాగలదు.

కాబట్టి ఎల్లశబ్దములు జాతివాచకములు కాగలవు. జాతిసార్వత్రికము కాగలదు.॥14॥

అవతారిక—జాతి సార్వత్రికమనుట పొసగదు. ఏలయన-ఆకాశమొక్కటియే కనుక దానియందు జాతి యుండనేరదు. అది నిత్యముకనుక అచట అవస్థాభేదముకూడ లేనందున జాతి యుండనేరదు. ఇట్లే కాలము ఒకటి, అదియు నిత్యమే. అచటను జాతి యుండ నేరదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు

శ్లో॥ సంయోగి ధర్మభేదేన దేశేచ పరికల్పితే।
తేషు దేశేషుసామాన్య మాకాశస్యాపి విద్యతే॥ 15

సంయోగి ధర్మ భేదేన = ఆకాశముతో సంయోగము కల ఘటము, పటము మున్నగు వాని యొక్క ధర్మముల భేదముచే అనగా పరిమితత్వము అనుధర్మమును బట్టి, దేశే + చ = దేశమునుబట్టికూడ అనగా ఆకాశమునకు దేశభేదము, పరికల్పితే = కల్పింపబడగా, తేషు = ఆ, దేశేషు = ఆ ప్రదేశముల యందు అనగా కల్పితములగు ప్రదేశములను బట్టి, ఆకాశస్య + అపి = ఆకాశమునకు గూడ, సామాన్యమ్ = జాతి, విద్యతే = ఉన్నది.

* కడవకు వస్త్రమునకు భేదము ప్రత్యక్షముగా కానవచ్చుచున్నది. వస్త్రముల అవయవములు, ఆ అవయవముల యొక్క అవయవములు, మరియు వాని అవయవములు ఈ రీతిని పరంపర చూడగా పరమాణువులనుబట్టియే భేదము చెప్పవలెను. పరమాణువులకు పరస్పరము భేదమును కలిగించెడిది విశేషమను పదార్థము. అది నిత్యద్రవ్యములయందుడును. అది అనంతము. కణాదుడు ఈ పదార్థమును ప్రత్యేకముగా నిరూపించెను. అట్టి విశేషమను పదార్థమును బట్టియే ఆయన శాస్త్రమునకు "వైశేషిక" మని అసాధారణ వ్యవహారము లోకమున కలిగినది.

కర్మణోజాతి భేదానా మభివ్యక్తిర్యదాశ్రయా ।
సాస్వైరుపాధిభిర్భిన్నా శక్తిర్దిగితి కథ్యతే ॥ 3

దిక్శక్తి నిజరూపమున ఒక్కటియే, కాని దగ్గరగానున్న వస్తువుల సంపర్కవశమున నది పది విధములుగా కానవచ్చుచున్నది. అది ప్రత్యక్షముగా కానరానందున యుక్తములగు హేతువులచే గుర్తింపబడుచున్నది. ప్రస్తుతము మూడు హేతువులచే దిక్శక్తికలదని నిరూపించుచున్నాడు.

1. అవధి ప్రతిపాద్యయోః = అవధికి అవధిమత్తునకు గల, వ్యతిరేకస్య = భేదమునకు అనగా ఆ రెంటికిగల సంబంధమునకు, యః = ఏది, హేతుః = కారణమో.

'వృక్షః పర్వతాత్ పూర్వః' (చెట్టు కొండకంటె ముందుగానున్నది) చెట్టు ఎచ్చట నున్నది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకై దానికి దగ్గరగానున్న వస్తువులను హద్దుగా జూపి నిర్ణయించుట లోకసహజము. అట్టి చెట్టు ప్రతిపాద్యము, అనగా అదియే నిర్ణయింపదగినది. హద్దుగా చూపబడిన పర్వతము అవధి. ప్రతిపాద్యమగు వృక్షము అవధిమత్తు అనగా అవధికలది. ఆ రెంటికి అవధ్యవధిమత్సంబంధము కలదని యెల్లరికిని తెల్లమే. ఈ సంబంధము కేవలము పర్వతమును వృక్షమును నిమిత్తముగా గైకొని లభించునది కాదు. పర్వతాదులయందుండెడి పర్వతత్వము మున్నగు జాతులనుబట్టియు ఆ సంబంధము చెప్పతగదు. ఇచట జాతి యనునది వివక్షితమే కాదుకదా! మరియొక నిమిత్తము చెప్పసలవి కానందున పరిశేషన్యాయముచే దిక్శక్తిని బట్టియే ఈ రెంటికి ఈ సంబంధము కలుగుచున్నదని చెప్పక తీరదు.

2. అన్యేన+వినా = మరియొకవస్తువు లేకున్నను, యతః = దేనివలన, ఋజు= తిన్నగా ఉన్నది, ఇతి + ఏవమ్ = ఈ రూపముతోనున్న, బుద్ధిః = జ్ఞానము, ప్రవర్తతే = కలుగుచున్నదో,

శ్లోకమున 'ఋజు' అనునది వక్రత్వము మున్నగువానికి గూడ ఉపలక్షణము. అనగా వానిని కూడ గ్రహింపవలెను.

ఈ వెదురుకఱ్ఱ తిన్నగా ఉన్నది. ఇది వక్రముగా ఉన్నది అను రీతిని లోకుల వ్యవహారము కలదు. అందు భూమి మున్నగు పదార్థముల సంబంధములేకయే అట్టి వాడుక కలుగుచున్నది. అట్లు వ్యవహరించుటకు ఏదియో నిమిత్తముండవలెను. ఆ నిమిత్తమే దిక్కు కాగలదు. ఒకే దిక్కువైపు పదార్థము ప్రసారము కలదియగుచో తిన్నగా ఉన్నదనియు, అట్లుకాక నానాదిక్కులవైపు ప్రసరించిన వంకరగా ఉన్నదనియు భావింపవచ్చును.

3. కర్మణః = కర్మయొక్క అనగా ఎత్తుట, దించుట మున్నగు వ్యాపారముల యొక్క, జాతిభేదానామ్ = జాతులకు కల భేదములకు అనగా విభిన్నములగు కర్మ జాతులకు, అభివ్యక్తిః = స్పష్టత, యదాశ్రయా = ఏది ఆశ్రయముగా గలదియో.

కర్మ అనగా పని. దానియందు కర్మత్వజాతి కలదు. ఉత్క్షేపణము (ఎత్తుట), అవక్షేపణము (దించుట), ప్రసారణము (చాచుట), ఆకుంచనము (లాగుకొనుట) మున్నగు రీతిని ఆకర్మ పలు విధములుగా నున్నది. వీనియందును ఉత్క్షేపణత్వము మున్నగు జాతులు కలవు. ఈ వ్యాపారములు మనకు ప్రత్యక్ష సిద్ధములు. వీనియందు గల విభిన్నములగు జాతులకు వ్యంజకము దిక్శక్తి. హస్తమును మీదుగా ఎత్తగా ఉత్క్షేపణమందురు. ఇట్టివి యన్నియు ఆ యా దిక్కులవైపు హస్తాదుల ప్రసారణముచే కలుగుచున్నవి.

కారికయందు 'కర్మణః' అనునది జాత్యేకవచనాంతము.

సా = అట్టి, శక్తిః = శక్తి, స్వైః = తనకు సంబంధించిన, ఉపాధిభిః = ఉపాధులచే, భిన్నా = భిన్నమైనదై, దిక్ + ఇతి = దిక్కు అని, కథ్యతే = చెప్పబడుచున్నది.

ఉప + ఆ + దధాతి అనువ్యుత్పత్తిచే తనకు దగ్గరగానున్న దానికి తన గుణమును సంక్రమింపచేయునది, ఉపాధి యనబడును. ఉదా : ఎఱ్ఱని వస్తువు తనకు దగ్గరగా ఉన్న తెల్లని స్ఫటికమునకు తన ఎరుపుతనమును సంక్రమింపచేయు చున్నది. కాగా ఎఱ్ఱని వస్తువు ఇచట ఉపాధి కాగలదు. అట్లే దిక్శక్తి నిజరూపమున ఒక్కటియే ఐనను సూర్య సంయోగము కల ప్రదేశములనెడి ఉపాధులచే పది విధములగు పరిణామములను జెందు చున్నది.

మధ్యాహ్నకాలమున సూర్యబింబము ఉత్తర ముఖముగా నుండును. అట్టి సూర్య బింబమునకు అభిముఖముగాఉన్నది ఉత్తరము, ఉదయపర్వతమునకు సంబంధించినది తూర్పు, పశ్చిమ పర్వతమునకు సంబంధించినది పడమర, సూర్యబింబమునకు వెనుకభాగమున నున్నది దక్షిణము అను నామములు కలుగుచున్నవి. ఇట్లే ఈశాన్యము మున్నగు నాలుగు విదిక్కులు, ఊర్ధ్వము, అధరము అని రెండు, మొత్తము పది దిక్కులుగా దిక్శక్తి విభక్తమగుచున్నది. ॥2,3॥

అవతారిక— వస్తువులకు గల పరత్వాపరత్వములు దిక్శక్తివలననే కలుగు చున్నవని చెప్పుచున్నాడు.

శ్లో॥ పరాఽపరత్వే మూర్తానాం దేశభేదనిబన్ధనే ।
తతఏవ ప్రకల్ప్యేతే, క్రమరూపేతుకాలతః ॥ 4

A. మూర్తానామ్ = మూర్తములగు వస్తువులకు సంబంధించినట్టియు, దేశభేదనిబన్ధనే = దేశముయొక్క భేదము కారణముగాగల, పరత్వాపరత్వే = పరత్వము అపరత్వమును అనగా ముందువెనుక అనునవి, తతః + ఏవ = దానివలననే అనగా దిక్శక్తివలననే, ప్రకల్ప్యేతే = కలుగుచున్నవి.

పరిమితమగు పరిమాణముకల వస్తువులు మూర్తములనబడును. అట్టి వస్తువులకు కలిగెడి పరత్వము అపరత్వము అనునవి భిన్నమగు దేశమునుబట్టి కలుగును. "ఈ పర్వతము ముందుగా ఉన్నది. దాని తరువాత వృక్షమున్నది" అను రీతిని వస్తువులు ముందు వెనుక

ఉన్నవని లోకులు వ్యవహరింతురు. ముందు వెనుక అని తెలిసికొనుటకు భూమియొక్క ప్రదేశము కారణమగుచున్నది. భూప్రదేశమునకు పరత్వాపరత్వములు దిక్కువలన కలుగు చున్నవి. దిక్కునుబట్టి భూప్రదేశమునకు 'ఇది ముందు, ఇది వెనుక' అని వ్యవహారములు కలుగును. అట్టి దేశముయొక్క పరత్వాపరత్వములను బట్టి వృక్షము మున్నగు మూర్త వస్తువులకు పరత్వాపరత్వములు కలుగుచున్నవి.

B. క్రమరూపే = క్రమరూపములగు, పరత్వాపరత్వే + తు = పరత్వాపరత్వములు మాత్రము, కాలతః = కాలమువలన, ప్రకల్పేతే = కలుగుచున్నవి.

'ఇచట పూర్వము వృక్షముండెడిది, ఇపుడు గృహమున్నది' అను రీతిని పదార్థ ములకు క్రమము కలదు. ఇట్లే "ఈ కలాశాలలో పూర్వము సుబ్బారాయశాస్త్రి ఉండేవారు. ఇపుడు వేంకటశాస్త్రి ఉన్నారు" అనియు వాడుక కలదు. అది కాలము శక్తివలన కలుగు చున్నది. అది దిక్శక్తికృతము కాదు. కాలమునందు వస్తువుల శక్తులను ప్రతిబంధించుట వానిని కార్యోన్ముఖములుగా ప్రసరింపజేయుట అనెడి అసాధారణములగు రెండు శక్తులు కలవు. ఈ యంశము కాలసముద్దేశమున విపులముగా నిరూపింపబడును. అట్టి కాలముయొక్క శక్తులవలన పదార్థములకు క్రమరూపమగు పరత్వాపరత్వములు కలుగును.

కాగా పరత్వము అపరత్వము అనునవి దేశమునుబట్టియు కాలమునుబట్టి కలుగును. దేశమువలన కలిగెడి పరత్వాపరత్వములకు దిక్శక్తి కారణమగుచున్నది. కనుక దిక్శక్తికి కాలశక్తికి సాంకర్యము లేదు. అవి వేరువేరు శక్తులే.

ఇట్టి పరత్వాపరత్వములు మూర్తములకే కలుగును. అమూర్తములగు ఆకాశాదు లకు కలుగవు. ॥4॥

*అవతారిక*— అమూర్తములగు ఆకాశాదులకు గూడ కల్పితములగు పరత్వా పరత్వములు కలుగుచున్నవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆకాశస్యప్రదేశేన భాగైశ్చాన్యైః పృథక్ పృథక్ ।**
**సా సంయోగ విభాగానా ముపాధిత్వాయ కల్పతే ॥ 5**

ఆకాశస్య = ఆకాశమునకు, ప్రదేశేన = ఏకదేశమగుదానితో, అనగా ఆకసముతో కలసి యున్న కడవ మున్నగువానితోను, అన్యైః = ఇతరములగు, భాగైః + చ = భాగములతోను అనగా ఘటాదులయొక్క అవయవములతోను, పృథక్ + పృథక్ = వేరువేరుగా, సంయోగ విభాగానామ్ = సంయోగములకును విభాగములకును, సా = ఆ దిక్శక్తి, ఉపాధిత్వాయ = నియమముకొరకు, కల్పతే = సమర్థమగుచున్నది.

ఆకాశము నిజరూపమున అవయవములులేనిది. కాని దానితో కలసియున్న ఘటాది ద్రవ్యముల సంపర్కవశమున దానికి అవయవములు కల్పితములగుచున్నవి. ఈ యభిప్రా యము జాతి సముద్దేశమున 15వ శ్లోకమున వివరింపబడినది. కాగా అమూర్తమగు ఆకాశము

నకు కల్పితములగు అవయవములు కలవు. అట్లే ఘటాది పదార్థముల అవయవములతో గూడ ఆకాశమునకు సంయోగము కలుగును. వానితో దానికి విభాగము కూడ కలుగును. ఈ రీతిగా కలిగెడి సంయోగ విభాగములు దిక్శక్తినిబట్టి కలుగుచున్నవి. ముందుగా ఉన్న ఆకాశముతో కలసియున్నది పూర్వము, అట్లుకానిది పరము అను రీతిగా లోకుల వ్యవహారము కలుగుచున్నది. కాగా అమూర్తమగు ఆకాశముతో కలిగెడి పూర్వ పరవ్యవహారమే ముందుగా కలుగును. దానినిబట్టి మూర్తములగు ఘటాదులకు పరత్వాపరత్వ వ్యవహారము కలుగును ॥5॥

*అవతారిక*— దేశమునకు పూర్వాపరభావము దిక్శక్తివలన కలుగును. అని 4 వ శ్లోకమున చెప్పబడినది. దిక్కునకు ఆ శక్తి దేనివలన కలిగినది? అని ప్రశ్నింపగా మరియొక వస్తువువలన, దానికి మరియొక వస్తువువలన అని కల్పింపగా అనవస్థాదోషము కలుగును. ఆ దోషమును వారించుటకై దిక్కునకు ఆ శక్తి సహజము అని చెప్పిన, అట్టితరి దేశమునకే ఆ శక్తి సహజమని యేల చెప్పరాదు? వేరుగా దిక్కును స్వీకరింప నక్కరలేదు కదా? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ దిశా వ్యవస్థా దేశానాం దిగ్వ్యవస్థా న విద్యతే।
శక్తయః ఖలు భావానా ముపకార ప్రభావితాః ॥ 6

దేశానామ్ = భూమి మున్నగు దేశములకు, వ్యవస్థా = అవధి అనగా ఈ ప్రదేశము ముందు ఈ ప్రదేశము వెనుక అను నియమము, దిశా = దిక్కుచే, (భవతి) = కలుగుచున్నది.

దిగ్వ్యవస్థా = దిక్కులయొక్క వ్యవస్థ, న + విద్యతే = లేదు, అనగా మరియొక వస్తువువలన కలుగునది కాదు.

భావానామ్ = పదార్థములయొక్క, శక్తయః = శక్తులు, ఉపకార ప్రభావితాః = ఉపకారముచే కలుగుచున్నవై, (భవన్తి) = అగుచున్నవి.

దేశములకు కడవ మున్నగు పదార్థములను ధరియించుట, వానికి నాధారముగా నుండుట అనెడి స్వతంత్రమగు రూపమున్నది. అట్టి దేశములకు పూర్వాపర భావము కలుగవలెనన్న మరియొక నిమిత్త మపేక్షితమగుచున్నది. దిక్కు అట్టిది కాదు. దాని స్వభావము నిత్యపరతంత్రత. అట్లుకాక అచట మరియొక శక్తిని కల్పించిన నది శక్తిమంతము కావలెను. అట్టితరి దాని శక్తి స్వరూపమే భగ్నము కావలెను. సూర్య సంయోగము కూడ నిమిత్తము కానేరదు. అది, లేని పూర్వాపర భావమును కల్పింపనేరదు. అది దిక్శక్తియొక్క స్వభావమునే వ్యక్తపరచును. ॥6॥

*అవతారిక*— దిక్కు శక్తిరూపమే, కనుకనే అది యితర వస్తువుల కుపకరించుచున్నదని నిరూపించుచున్నాడు.

శ్లో॥ ప్రత్యస్తరూపా భావేషు దిక్ పూర్వేత్యభిధీయతే।
పూర్వబుద్ధిర్యతో దిక్ సా సమాఖ్యామాత్రమన్యథా ॥ 7

భావేషు = పదార్థములయందు, ప్రత్యస్తరూపా = ఉపాధిగా ఆరోపింపబడిన రూపముకల, దిక్ = దిక్కు, పూర్వా + ఇతి = పూర్వదిక్కు అని అభిధీయతే = వ్యవహరింపబడు చున్నది.

యతః = దేనివలన, పూర్వబుద్ధి = పూర్వబుద్ధి అనగా 'ఇది పూర్వము' ఇట్లే 'ఇది పరము' అనెడి బుద్ధి, కలుగుచున్నదో, సా = అదియే, దిక్ = ముఖ్యమగు దిక్కు, స్వతంత్రమైనదికాక పరోపాధికమగుటవలన శక్తిరూపముగా నున్న పై చూపబడినదియే ముఖ్యముగా దిక్పదార్థము కానోపును.

అన్యథా = అట్లుకాకున్న అనగా పరోపాధికముకాక స్వాతంత్ర్యము కలదియగుచో, సమాఖ్యామాత్రమ్ = ఏదో పేరు మాత్రమే కావలెను, అర్థమును నపేక్షింపక కేవలము 'దిక్' అను నామమాత్రమే అది కావలెను. డిత్థ, డపిత్థ, అను రీతినివలె నిరర్థక శబ్దమే లోకులచే వాడబడుచుండవలెను, కాని అట్లు కానరాదు.

కాబట్టి దిక్కు స్వతంత్ర ప్రదార్థము కాదు. అది శక్తిరూపమే. ॥7॥

*అవతారిక* — లోకమున 'ఇది పూర్వము, ఇది పరము' అను వ్యవహారము కలుగుచున్నందున, దానిని సమర్థించుటకై వేరుగా దిక్శక్తిని అంగీకరింపవలెనని యింత వరకు చెప్పబడినది. కాని వేరుగా దిక్కును అంగీకరింపనక్కరలేదు. ఏలయన, మనుష్యుని ముఖమునకు ఎదురుగానున్నది పూర్వము, వెనుక భాగముననున్నది పశ్చిమము, కుడిచేతి వైపుననున్నది దక్షిణము, ఎడమచేతి వైపునున్నది ఉత్తరము అను రీతిని వ్యవహారము ఉపపన్నముకాగలదు. సామాన్య ప్రజలు ఇట్లే గుర్తించుచున్నారు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్వాఙ్గాద్ వ్యవస్థా యా లోకే న తస్యాం నియతా దిశః ।**
**ప్రత్యఙ్ముఖస్య యత్ పశ్చాత్తత్పురస్తాద్విపర్యయే ॥ 8**

స్వాఙ్గాత్ = ముఖము మున్నగు తన అవయవములను అవధిగాజేసికొని, లోకే = లోకము నందు, యా = ఏ, వ్యవస్థా = వ్యవస్థయో అనగా తూర్పు పడమర అను నియమమో, తస్యామ్ = దానియందు అట్టి వ్యవస్థయందు, దిశః = దిక్కులు, నియతాః = ఏకరూపము లుగా నున్నవై, న = కానేరవు, ఇది తూర్పు, ఇది పశ్చిమము, అనునియతమగు దిక్కుల వ్యవస్థ సిద్ధింపదని భావము.

ఇందు కారణము చెప్పుచున్నాడు

ప్రత్యఙ్ముఖస్య = పశ్చిమమునందు ముఖముకలవానికి, యత్ = ఏది, పశ్చాత్ = వెనుకభాగమున నున్నదో, అనగా పడమరయగుచున్నదో, తత్ = అది, విపర్యయే = మార్పుచెందగా మనుష్యుడు ముందుకు తిరుగగా, పురస్తాత్ = ఎదురుగానున్నది, (స్యాత్) = కాగలదు.

మనుష్యుడు ఒక వైపు ముఖముపెట్టుకొని యుండగా వెనుకభాగముననున్నది, 'పడమర' అని వ్యవహరింపరాదు. ఆ మనుష్యుడే అడ్డముగా తిరిగిన అతనికి ఆ వస్తువే పూర్వముగా నున్నట్లుండును. ఆ ప్రదేశమే మరియొకనికి దక్షిణము, మరియొకనికి ఉత్తరము కూడ కావలెను. కాని యట్లు కానరాదు.

కాబట్టి పరత్వాపరత్వ వ్యవహారములనుబట్టి వేరుగా దిక్కును నంగీకరించుటయే సమంజసము. ॥8॥

*అవతారిక*— దిక్కును నిమిత్తముగా జేసికొని పరత్వాపరత్వ వ్యవహారము కలుగుచున్నదని ఇంతవరకు చెప్పియున్నాడు. దిక్కును అపేక్షింపకయే పూర్వ - పర - మున్నగు శబ్దములు రూఢినిబట్టి దేశవాచకములు కాగలవని ఇప్పుడు చెప్పుచున్నాడు.

**శ్లో॥ దేశవ్యవస్థానియమో దిక్షు న వ్యవతిష్ఠతే ।**
**రూఢమప్యపరత్వేన పూర్వమిత్యభిధీయతే ॥ 9**

దిక్షు = దిక్కుల విషయమై అనగా దిక్కులను నిమిత్తముగా గైకొని, దేశవ్యవస్థానియమః = దేశములయొక్క అనగా పూర్వదేశము, దక్షిణాపథము, ఉత్తరాపథము మున్నగు దేశములకు కలిగెడి, వ్యవస్థయొక్క నియమము అనగా 'ఇది పరము, ఇది పూర్వము' అను నియత వ్యవహారము న + వ్యవతిష్ఠతే = నిశ్చితము కానేరదు.

అపరత్వేన = అపరదేశమునందున్నట్టుగా అనగా పశ్చిమదేశమునందున్నట్లుగా, రూఢమ్ + అపి = రూఢమైనదియు, పూర్వమ్ + ఇతి = పూర్వదేశమునకు సంబంధించి యున్నదని, అభిధీయతే = చెప్పబడుచున్నది.

'ఈ దేశము పూర్వము', 'ఈ పర్వతము పరము' అను వ్యవహారములలో దిక్కు నిమిత్తము కాదు, అచట పూర్వాదిశబ్దములు ఆయా యర్థములయందు రూఢములే. *కనుకనే పూర్వదేశమునుండి దక్షిణాపథమునకు పయనముచేయు మనుష్యుని 'నీవు ఎచటనుండి వచ్చుచుంటివి?' అని ప్రశ్నించిన 'పూర్వదేశమునుండి వచ్చుచున్నాన'ని సమాధానము చెప్పును. అట్లే ఆ మనుష్యుడే తిరిగి వచ్చుచుండగా ప్రశ్నించిన 'దక్షిణాపథము నుండి వచ్చుచున్నాన'ని సమాధానము చెప్పును. ఇచట దిక్సంబంధములేకయే కేవలము పూర్వ - పర - అను రూఢపదములే దేశములయందు వాడబడుచున్నవి. దిక్కునుబట్టి ఆ మనుష్యుడు పడమరి దేశస్థుడే, అట్టితరి 'పూర్వదేశమునుండి వచ్చుచున్నాను' అను సమాధానము సరిపడదు.

---

* ఈ తొమ్మిదవ శ్లోకము "దిక్శబ్దేభ్యః సప్తమీ పఞ్చమీ ప్రథమాభ్యో దిగ్దేశకాలేష్వస్తాతిః" (5-3-27) అను పాణిని సూత్రమునందలి మహాభాష్యమును వ్యాఖ్యానించుచున్నది. దిక్శబ్దములు, దిక్కును దేశమును కాలమును బోధించునపుడు వానికంటె 'అస్తాతి' అనుతద్ధిత ప్రత్యయమును పై సూత్రము విధించుచున్నది. ఉదా. పురస్తాత్, పరస్తాత్. అచట మహాభాష్యమిట్లున్నది. "ఇహకస్మాన్న భవతి? పూర్వస్మిన్ దేశే వసతి? నైష దేశః । దేశవిశేషణమేతత్"

10 ]
కనుక ఇచట ఒక అవధిని అపేక్షింపకయే పూర్వాది శబ్దములు వాడబడుచున్నవి. అవధి అపేక్షింపనందున నిచట దిక్సంబంధములేదని తెల్లము. అట్టి శబ్దములచే జరిగెడి వ్యవహార మున దిక్కును నిమిత్తముగా గైకొని మరియొక రూపము కలిగిన కలుగవచ్చును. ॥9॥

అవతారిక— పూర్వాది శబ్దములు రూఢములే, అవధి సాపేక్షములు కావని 9 వ శ్లోకమున నిరూపింపబడినది. ఆ యర్థమునే *"దక్షిణోత్తరాభ్యామతసుచ్" (5-3-28) అను పాణిని సూత్రమునందలి భాష్యమును జూపి సమర్థించుచున్నాడు.

శ్లో॥ అతోఽభాషితపుంస్కత్వాత్పుంవద్భావో న సిధ్యతి ।
అస్మిన్నర్థే న శబ్దేన ప్రసవః క్వచిదుచ్యతే ॥ 10

అతః = ఈ కారణమువలన అనగా 'పూర్వ, పర' మున్నగు శబ్దములు రూఢములు కనుక, అభాషిత పుంస్కత్వాత్ = భాషిత పుంస్కము కానందున, పుంవద్భావః = పుంవద్భావము అనగా పుంలింగరూపము, న + సిధ్యతి = సిద్ధింపదు, దక్షిణ ఉత్తర మున్నగు శబ్దములు భాషిత పుంస్కములు కానందున వానికి స్త్రీలింగరూపములలో పుంలింగరూపము రానేరదని భావము.

దక్షిణ, ఉత్తర మున్నగు శబ్దములు భాషిత పుంస్కములు కాకపోవుటలో కార ణము చూపుచున్నాడు.

అస్మిన్ + అర్థే = ఈ యర్థమునందు అనగా పూర్వాది శబ్దములు రూఢినిబట్టి అర్థమును బోధించునపుడు పూర్వాది దిక్కులకు పై లక్షణము చెప్పునపుడు, శబ్దేన = శబ్ద ముచే అనగా పూర్వ దక్షిణ ఉత్తర మున్నగు శబ్దములచే, క్వచిత్ = ఎచటను, ప్రసవః = పుంస్త్వము. అనగా పుంలింగము, న + ఉచ్యతే = చెప్పబడదు.

కనుక దక్షిణాది శబ్దములు భాషిత పుంస్కములు కానందున వానికి పుంవద్భావము కలుగకపోయెడినియని భావము.

"దక్షిణోత్తరాభ్యామతసుచ్" (5-3-28) అను సూత్రముచే దక్షిణ, ఉత్తర అను శబ్దములకంటె 'అతసుచ్' ప్రత్యయము విధింపబడినది, దక్షిణ + అతసుచ్ = దక్షిణతః, ఇట్లే ఉత్తరతః.

1. ప్రశ్న— దక్షిణ, ఉత్తర అనునవి అకారాంతములు. వానికంటె 'తసుచ్' ప్రత్యయమును విధించినను పై రూపములు సిద్ధించును. పెచ్చుగ "యస్యేతిచ" అను

* దక్షిణ, ఉత్తర అను శబ్దములకంటె 'అతసుచ్' అను తద్ధిత ప్రత్యయము ప్రవర్తించు నని సూత్రార్థము. ప్రత్యయమున ఉకార - చ కారములు ఇత్సంజ్ఞకములు. దక్షిణ + అతస్. 'యస్యేతిచ' (6-4-184) అను సూత్రముచే ప్రకృతిలోనున్న చివరి 'అ' కారము లోపింపగా దక్షిణ్ + అతస్ = దక్షిణతః, దక్షిణమునందు, దక్షిణమువలన, దక్షిణము అని యర్థము, ఇట్లే ఉత్తరతః.

(6-4-184) సూత్రముచే 'అ' కారమునకు లోపము చేయనక్కరలేదు. కాగా ప్రత్యయము యొక్క మొదటి 'అ' కారమునకు ప్రయోజనము లేదు.

సమాధానము— దక్షిణా, ఉత్తరా అను స్త్రీ ప్రత్యయాంత శబ్దములకంటెను పై ప్రత్యయము ప్రవర్తించి 'దక్షిణతః, ఉత్తరతః' అను రూపముల సిద్ధికై ప్రత్యయము యొక్క మొదట 'అ'కారమావశ్యకమగుచున్నది. అకారమున్నచో 'యస్యేతిచ' అను సూత్రముచే ప్రకృతియొక్క చివరనున్న 'ఆ'కారము లోపింపగా పై రూపములు సిద్ధించును. అట్లు కాకున్న ఆకారము లోపింపక 'దక్షిణాతః', 'ఉత్తరాతః' అను రూపములుండవలెను. కాని అట్లు లేవు. కాబట్టి ప్రత్యయమున అకారమావశ్యకమే.

2. ప్రశ్న— ప్రత్యయమున 'అ'కారము లేకున్నను దక్షిణా + తస్, ఉత్తరా + తస్' అను స్థితిలో *"తసిలాదిష్వాకృత్వసుచః" (6-3-35) అను సూత్రముచే దక్షిణా, ఉత్తరా అను స్త్రీలింగశబ్దములకు పుంవద్భావము అనగా పుంలింగరూపము ప్రవర్తింపగా పై రూపములు సిద్ధించుచున్నవి. కాబట్టి ప్రత్యయమున 'అ'కారము అక్కరలేదు.

సమాధానము— పై సూత్రముచే **భాషితపుంస్కమగు స్త్రీ ప్రత్యయాంతమునకే పుంలింగరూపము విధింపబడినది. దక్షిణ - ఉత్తర శబ్దములు భాషితపుంస్కములు కానందున పుంవద్భావము ప్రవర్తింపనేరదు. కాబట్టి పై రూపముల సిద్ధికై ప్రత్యయమున 'అ'కారమావశ్యకమే. పూర్వ పరదక్షిణ మున్నగు శబ్దములు దిక్కులను బోధించునపుడు అవి రూఢములే, అచట శబ్దమే ప్రవృత్తినిమిత్తము. ఆ శబ్దములు దేశకాలములను బోధించునపుడు అవధిని అపేక్షించును. 'ఈ దేశము పూర్వము' అని పలుకగా నియతముగా 'ఇది దేనికంటె పూర్వము' అను రీతిని అవధి అపేక్షితమగుచున్నది. దీనినే వ్యవస్థయందురు. కాగా దక్షిణ - ఉత్తర శబ్దములు దిక్కును బోధించుటలో ఆ శబ్దములే ప్రవృత్తి నిమిత్తములు. అవి దేశకాలములను బోధించుటలో అవధి ప్రవృత్తి నిమిత్తము. ఈ రీతిగా ప్రవృత్తి నిమిత్తము తుల్యము కానందున నివి భాషిత పుంస్కములు కానేరవని తెల్లమే. ఈ యర్థ

---

* తసిల్ మొదలుగాగల కృత్వసుచ్ వరకు ఉన్నతద్ధిత ప్రత్యయములు పరమగునపుడు (భాషిత పుంస్కమగు) స్త్రీలింగ శబ్దమునకు పుంవద్భావము కలుగునని సూత్రార్థము. ఉదా. 'పటు'శబ్దమునకు స్త్రీ ప్రత్యయాంతరూపము 'పట్వీ', దీనికి తరప్ ప్రత్యయముచేరగా పట్వీ + తర = పుంవద్భావముచే 'పటుతరా' అని యగును. పుంవద్భావమనగా పుంలింగ రూపము.

** స్త్రీలింగ శబ్దములుగాని, నపుంసక శబ్దములుగాని ప్రవృత్తి నిమిత్తము ఏకరూపముగా నుండగా పుంలింగమును బోధించిన యెడల, వానిని భాషితపుంస్కము లందురు. భాషితః పుమాన్ యస్మిన్, తత్, భాషిత పుంస్కమ్. ఏ ప్రవృత్తి నిమిత్తమున పుంలింగము చెప్పబడునో అది భాషితపుంస్కమనబడును. భాషితపుంస్క మస్యాస్తీతి = భాషిత పుంస్కః, అట్టి భాషిత పుంస్కము కల శబ్దము భాషిత పుంస్కము. ఉదా. మృదు, పటు, యువన్, మృదుత్వము, పటుత్వము, యౌవనము ప్రవృత్తినిమిత్తములు. అవి ఉభయసాధారణములుగాన అట్టి వానిని భాషిత పుంస్కము లందురు. అట్టి వానికి పుంలింగ రూపము కలుగును.

మంతయు భాష్యమున కలదు. దక్షిణ - ఉత్తర శబ్దములు భాషితపుంస్కములు కానేర వని *మహాభాష్యకారుడు స్పష్టముగా వక్కాణించియున్నాడు. దిగ్వాచక శబ్దములు రూఢ ములై దిక్కులను బోధించుననియే ఆయన తాత్పర్యము. అట్లు కాకున్న అవియు అవధి సాపేక్షములన్నచో, నవియు భాషితపుంస్కములే యగుచుండగా ఆ భాష్యము సంగతము కాకపోయెడిని. ॥10॥

అవతారిక— దిక్కులను చెప్పెడి దక్షిణా, ఉత్తరా మున్నగు శబ్దములు వ్యవ స్థను బట్టి ప్రయుక్తములు కావనియు, దేశకాల బోధక దక్షిణాది శబ్దములు వ్యవస్థా మూల కములనియు వానికి భేదమును జూపి పుంవద్భావము రాదని 10 వ శ్లోకమున చూపబడినది. కాని ఉత్తరా, దక్షిణా మున్నగు దిక్శబ్దములు కూడ వ్యవస్థా మూలకములే. ఉత్తరా అను శబ్దముయొక్క అర్థము తెలియగా 'దేనికంటె?' అను అవధి అపేక్షింపబడుచునే యున్నది. అందుచే పై శబ్దములకు ప్రవృత్తి నిమిత్తము సమానమే యగుచు, పుంబోధకము లగుట వలన పుంవద్రూపము సిద్ధింపగలదు.

1 ప్రశ్న— అట్టితరి దిక్శబ్దములు నిమిత్తముగాగల వ్యాకరణ సూత్రములచే విధింపబడిన "అతసుచ్" మున్నగు కార్యములే కాకపోయెడివి. అవి దిక్కులకు నామధేయ ములుగా ప్రయోగింపబడలేదు కదా!

సమాధానము- ఐనను దిక్కులయందు ప్రయోగింపబడియున్నందున అవి ప్రస్తుతము దేశకాల బోధకములైనను ఆ కార్యములు వానికి ప్రవర్తింపగలవు.

2. ప్రశ్న— అట్లైన 'ఈ దిక్కు రమణీయమైనది' అను లోకుల వ్యవహారమును బట్టి 'రమణీయా' మున్నగు శబ్దములకు గూడ దిక్శబ్ద ప్రయుక్తములగు కార్యములు ప్రవ ర్తించెడివి.

పై ప్రశ్నకు మహాభాష్యకారుడు ఈ రీతిగ సమాధానము చెప్పెను. "దిశి దృష్టః శబ్దః = దిక్శబ్దః, దిశం యో న వ్యభిచరతి" అని దిక్కులకు నామధేయములుగా ఉపయోగింప బడిన శబ్దము దిక్శబ్దమనబడును. పూర్వ - పర - దక్షిణ మున్నగు శబ్దములు ప్రస్తుతము దేశ - కాలవాచకములుగా నున్నను అవి దిక్కులకు నామధేయములుగా నున్నందున వానిని గూడ దిక్శబ్దములనవచ్చును. రమణీయా మున్నగు శబ్దములు దిక్కులకు విశేషణములుగా ఉపయోగింపబడినను అవి పూర్వాది శబ్దములను బోలె దిక్కులకు నామధేయములు కావు.

ఈ రీతిగా చూపబడిన మహాభాష్యకారుని సిద్ధాంతమునే సమర్థించుచున్నాడు.

---

* 'నచైతౌ భాషిత పుంస్కౌ సమానాయామాకృతౌ యద్భాషిత పుంస్క మిత్యుచ్య ఆకృత్యన్తరే చ ఇమౌ భాషిత పుంస్కౌ' అని భాష్యము. 'అతసుచ' ప్రత్యయమున 'అ'కార గూర్చి ఇంకను భాష్య విచారణ కలదు. కాని ప్రకృతమున కవసరమగు భాష్యము మాత్ర చూపబడినది.

శ్లో॥ దిక్శక్తేఽభిధానే తు నియతం దిశి దర్శనమ్ ।
పూర్వాదీనాం యథా షష్టేర్జీవితస్యావధారణే ॥ 11

పూర్వాదీనామ్ = పూర్వ - పర - దక్షిణ మున్నగు శబ్దములకు, దిక్శక్తేః = శక్తిరూపమగు దిక్కు యొక్క, అభిధానే + తు = అభిధానమునందే అనగా దిక్కును బోధించునపుడే, దిశి = దిక్కునందు, దర్శనమ్ = ప్రయోగము, జీవితస్య = జీవనము యొక్క, అవధారణే= నిశ్చయము విషయమై, షష్టేః + యథా = షష్టి శబ్దమునకువలె, నియతమ్ = నిశ్చితమైనది అనగా మార్పుచెందనది, (భవతి) = కలుగుచున్నది, రమణీయాది శబ్దముల ప్రయోగమట్టిది కాదని భావము.

పూర్వ - పర మున్నగు శబ్దములు ఇతరములగు నుపాధుల నపేక్షింపకయే రూఢిని బట్టి తూర్పు, పడమర మున్నగు దిక్కులను బోధించును. ఆ శబ్దములే వ్యవస్థను అనగా అవధిని నిమిత్తముగా గైకొని దేశకాలములను బోధించును. కాగా దిక్కులను బోధించెడి పూర్వాది శబ్దములు రూఢములు. ఆ శబ్దములే దేశకాల వాచకములగుచో నైమిత్తికములు. అట్టి రెండు విధములగు పూర్వాది శబ్దములు భిన్నములే. వానికి ఐక్యము లేదు. రూఢి శబ్దములకు, నైమిత్తికములగు శబ్దములకు అభేదము చెప్పుట సాధ్యము కాదు కదా !

పై రీతి రెండు విధములగు పూర్వాది శబ్దములు భిన్నములే ఐనను రూపసామ్యమును బట్టి దేశకాల వాచకములగు పూర్వాది శబ్దములు కూడ దిక్శబ్దములుగానే గ్రహింపబడి వ్యాకరణ శాస్త్రమున చూపబడిన దిక్శబ్ద కార్యములను బొందగలవు. రమణీయాది శబ్దములట్టివి కానందున వానికి ఆ కార్యములు ప్రవర్తింపనేరవు. మరియు శబ్దముల ప్రయోగములు లోకమున కానబడియుండగా వానికి వ్యాకరణము ప్రక్రియా మార్గమును జూపగలదు. దిక్శబ్దములకు పర్యాయ పదములుగా రమణీయాది శబ్దములు లోకమున ప్రయోగింపబడి యుండ నందున వానికి దిక్శబ్ద కార్యములు ప్రవర్తింపవు.

రూపసామ్య మున్నంత మాత్రాన వానికి అభేద మెట్లు ? అను ప్రశ్నకు సమాధానముగా శాస్త్రసమ్మతమగు అర్థము దృష్టాంతముగా జూపబడినది. 'యథాషష్టే ర్జీవితస్యావధారణే'. 'షష్టి' శబ్దమునకు 60 అని యర్థము. కాగా ఆ శబ్దము సంఖ్యావాచకము. అట్లైనను 'ఇతని జీవితము 60 సంవత్సరములు' అను అర్థమును వివక్షించునపుడు ఆ శబ్దము కాలవాచకమై రూపసామ్యమునుబట్టి కాలవాచక శబ్దములకంటె వచ్చెడి వ్యాకరణ విహితమగు ప్రత్యయములను బొందును. షష్టిం + భూతః = షష్టికః, (ఇతడు 60 సంవత్సరములు కలవాడు)

కాగా షష్టి శబ్దము బోలె పూర్వాది శబ్దములు దేశకాల వాచకములు కూడ దిక్శబ్ద కార్యములను పొందగలవు. "దిశం యో న వ్యభిచరతి" అను మహాభాష్యకారుని పలుకు చాల యుక్తముగా నున్నది. ॥11॥

# ప్రస్తావన

తెలుగు అకాదమి ఇంతవరకు ఇంటర్మీడియట్ స్థాయిలో పాఠ్యగ్రంథాలను, డిగ్రీస్థాయిలో పఠనీయగ్రంథాలను, మూడువందలకుపైగా ప్రచురించింది. శాస్త్రగ్రంథ ప్రచురణలో ఇది మొదటిదశ. రెండోదశలో కొన్ని ప్రామాణిక గ్రంథాలకు అనువాదాలను, ఆయా శాస్త్రాంశాలమీద వాటివాటి ప్రాముఖ్యాన్ని పురస్కరించుకొని మోనోగ్రాఫ్‌లను ప్రచురించదలచింది. ఇందువల్ల విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ, పాఠ్యగ్రంథాలే కాక ఆయా పాఠ్యాంశాలమీద విస్తృతాధ్యయనానికి సహాయపడే విషయప్రధాన రచనలుకూడా లభిస్తాయి. అంతేకాదు, ఉన్నత విద్యాబోధనభాషగా తెలుగు సుప్రతిష్ఠితమై తెలుగు అకాదమి పాత్ర మరింత సుసంపన్నం కాగలదు.

ప్రామాణిక గ్రంథానువాదాలలో ఇది ఒకటి. వేదకాలం నుంచీ భారత దేశంలో వ్యాకరణశాస్త్ర సంప్రదాయ మొకటి అనూచానంగా వస్తున్నది. అందులో సిద్ధాంత విభాగానికి చెందిన ప్రశస్తగ్రంథాలలో వాక్యపదీయం అద్వితీయమైనది. ఆ మహా గ్రంథాని కిది అనువాదం. పోల్చి చూడటానికి ఈ అనువాద ప్రచురణ ఎంతో తోడ్పడుతుంది. వాక్యపదీయం పఠనపాఠనాదులనుంచి తొలగిపోతున్న ఈ కాలంలో ఈ అనువాద ప్రచురణ ఎంతో ఆవశ్యకమని భావించినాము.

పై ప్రాముఖ్యాన్ని గుర్తించి అనువాదపరిశీలకర్తలు ఆచార్య గంటి జోగి సోమయాజిగారు సువిస్తృతమైన పరిచయం వ్రాసినారు. వారికీ, అనువాదకులు శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రిగారికి, శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులుగారికి, డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి, శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మగారికి మా కృతజ్ఞతలు.

ఈ వాక్యపదీయంలో మొదటి రెండు కాండలు ప్రథమ భాగంగా 1974 లో అచ్చు అయింది. ఇప్పుడు చివరికాండ ద్వితీయ భాగంగా అందిస్తున్నందుకు సంతోషిస్తునాం. గ్రంథ పరిచయం ప్రథమభాగంలో చూడవచ్చు.

గుణగ్రహణ పారీణులయిన పాఠకులు ఈ గ్రథాన్ని అభిమానించి ఆదరిస్తారని ఆశిస్తున్నాము. సహృదయ విమర్శకులు ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించ గలము.

ఆకాశము నిజరూపమున ఒకటియే, దానికి నానాత్వములేదు. కాని మూర్తములగు ఘటము. పటము, మున్నగు ఎల్లవస్తువులకు ఆకాశము ఆధారమగు చున్నది. ఆకాశమనగా అవకాశమును ఇచ్చునది. ఘటాదులు అట్టివికావు. ఘటము మున్నగు వస్తువుల సంయోగము ఏదేశమున కలుగునో, ఆ ప్రదేశము వస్తుభేదముచే భిన్నము కాగలదు. కనుకనే ప్రతిదేశమున, ఈ ఆకాశము, ఈ ఆకాశము, అను ఏకాకార బుద్ధికలుగుచున్నది. కనుక ఆకాశమునకు కూడ జాతి సంభవించును.

అట్లే కాలమునకు గూడ. పర్వతములు. మనుష్యులు మున్నగు వస్తువుల భేదముచేత భేదముకలుగుగా అచటగూడ జాతి యుపపన్నమగు చున్నది.

సమవాయమునకు గూడ సంబంధిభేదముచే నానాత్వము కలుగగా అచటను జాతి యుండును.

ఆత్మకు దేహ భేదమున నానాత్వము లభింపగా అచట అత్మత్వజాతి యుండును.

కాగా ఈ శ్లోకమున ఆకాశస్య అను పదము కాలసమవాయాత్మలకు ఉపలక్షణముగా ప్రయుక్తమాయెను. ॥15॥

*అవతారిక* —ఆకాశమున ప్రదేశములు కల్పితములున్నవి. వానినిబట్టి దానికి నానాత్వ ముండుటచే అచట జాతి యుండవచ్చునని 15వ శ్లోకమున చెప్పబడినది.

అట్లుగాక ఆకాశమునకు ప్రదేశములు ముఖ్యములే యున్నవని చెప్పుచున్నాడు:

**శ్లో॥ అదేశానాం ఘటాదీనాం దేశాస్సంబన్ధినో యథా।**
**ఆకాశస్యా ప్యదేశస్య దేశాస్సంబన్ధినస్తథా॥** 16

ఇచట దేశశబ్దమునకు అవయవమర్థము అదేశానామ్ = స్వతః అవయవములులేని, ఘటాదీనామ్ = కడవ మున్నగు వానికి, దేశాః = అవయవములుగా నున్నకపాలాదులు, యథా = ఏ రీతిగా, సంబన్ధినః = సంబంధులు అగుచున్నవో-ఘటము అవయవి, అది అవయవములు లేనిదే, దానికి ఆరంభకమగు కపాలములువేరే ఐనను సమవాయ సంబంధమున సంబంధులుగా గ్రహింప బడుచున్నవని భావము.

తథా = అట్లే, అదేశస్య = అవయవములు లేని, ఆకాశస్య + అపి = ఆకాశమునకు గూడ, సంబన్ధినః = సంబంధించియున్న అనగా సంయోగమును సంబంధముగా చేసికొని యున్న ఘటపటాదులు, దేశాః = అవయవములుగా, (భవన్తి) అగుచున్నవి.

కడవ అనునది స్వతంత్రమగు వస్తువు. దానికి అవయవములు లేవు. కపాలములు ఘటమునకు ఆరంభకములు. అనగా కపాలములచే ఘటము తయారు అగును. అవి సమవాయ సంబంధమున ఘటముతో కలసి అవయవములుగా పరిగణింపబడుచున్నవి. అవి స్వతః భిన్న పదార్థములే.

అవతారిక — దిక్కువలన కలిగెడి మరియొక కార్యమును జూపుచున్నాడు.

శ్లో॥ ఛాయాఽఽభాభ్యాం నగాదీనాం భాగభేదః ప్రకల్ప్యతే ।
అతద్ధర్మస్వభావేషు భాగభేదో న కల్ప్యతే ॥ 12

A. నగాదీనామ్ = పర్వతము మున్నగువానికి, ఛాయాఽఽభాభ్యామ్ = నీడచేత, వెలుతురు చేత, భాగభేదః = అవయవముల యొక్క భేదము, ప్రకల్ప్యతే = కల్పితమగుచున్నది.

కొండ మున్నగు వస్తువులు నిజరూపమున ఒకటిగానే కానవచ్చును. కాని ఒకే పర్వతమున ఒక శిఖరమున సూర్యకిరణముల ప్రసారముచే వెలుతురు, అదే సమయమున మరియొక శిఖరమున సూర్యకిరణములు సోకక ఛాయయు అనగా నీడయు కనబడును. దానినిబట్టి చూడగా ఆ పర్వతమున భిన్నములగు అవయవములు అనగా పూర్వము పరము అను రీతిని భాగములున్నవని తెల్లము. అట్లుకాకున్న ఒకే పర్వతమునకు ఒకే సమయమున ఒకవైపు వెలుతురు, ఒకవైపు నీడయు కలుగనేరదు. పై రీతిని పరత్వాపరత్వ భేదము దిక్శక్తిచేతనే కలుగుచున్నదని చెప్పక తీరదు. దిక్శక్తియే లేనిచో పూర్వ - పర భావములే లేనందున పై వ్యవహారము ఉపపన్నము కానేరదు. కాబట్టి అట్టి అవయవ భేదముచే దానికి కారణమగు దిక్శక్తి అనుమితమగుచున్నదనుట లెస్స.

B. పై రీతిని అన్వయ ముఖమున దిక్శక్తిని సాధించి, వ్యతిరేకముఖమున దానినే చూపు చున్నాడు.

అతద్ధర్మ స్వభావేషు = పరత్వాపరత్వములనెడి దిక్శక్తియొక్క ధర్మము లేక పోవుటయే స్వభావముగాగల పదార్థములయందు అనగా అమూర్తములగు వానియందు, భాగ భేదః = అవయవముల భేదము, న + కల్ప్యతే = కల్పితము కానేరదు.

ఆకసము మున్నగు అమూర్తములకు అవయవములు లేనందున అచట దిక్శక్తిచే అవయవములు అనుమితములు కానేరవు.

అమూర్తములయందవయవకల్పన లేకుండుట, మూర్తములగు పర్వతాదులయం దవయవకల్పన ఉండుటయు ఈ రెండును దిక్శక్తికి అనుమాపకములు కాగలవు. అనగా వానిని హేతువులుగా గ్రహించి అనుమాన ప్రమాణముచే దిక్శక్తిని నంగీకరింపవలెను. ॥12॥

అవతారిక — కడవ మున్నగు మూర్త వస్తువులకు అవయవములు కానవచ్చు చున్నవి. అందొక విశేషము కలదు. ఆ వస్తువులకు అవయవములు సాక్షత్తు దిక్శక్తివలన కలుగవు. మరియేమన, దిక్కువలన అమూర్తములగు పరమాణువులకు అవయవము కల్పితములగును. అట్టి వానివలన కడవ మున్నగు వానికి అవయవములు కల్పితమగు చున్నవని చెప్పుచున్నాడు.

శ్లో॥ పరమాణోరభాగస్య దిశాభాగో విధీయతే ।
భాగప్రకల్పనాశక్తిం ప్రథమాం తాం ప్రచక్షతే ॥

అభాగస్య = స్వతః అవయవములులేని, పరమాణోః = పరమాణువునకు, దిశా = దిక్శక్తిచే, భాగః = అవయవరూపమగు భాగము, విధీయతే = చేయబడుచున్నది, అనగా కల్పింపబడు చున్నది.

ప్రథమామ్ = మొదటిదియగు, భాగప్రకల్పనాశక్తిమ్ = అవయవకల్పకమగు శక్తిని, తామ్ = దిక్కునుగా, ప్రచక్షతే = శాస్త్రజ్ఞులు పలుకుచున్నారు.

పరమాణువునకు స్వతః అవయవములు లేవు. కాని దిక్కువలన దానికి 6 భాగములు కల్పితములగుచున్నవి. తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము, ఊర్ధ్వము, అధోభాగము అను ఆరు దిక్కుల వశమున నిరవయవములగు పరమాణువులకు 6 భాగములున్నట్లు కానవచ్చును. అట్లే ప్రతి పరమాణువునకు 6 భాగములు కలుగును. ఈ రీతిగా పరమాణువులు సావయవములు కనుక వానికి పరస్పరము సంయోగము కలుగును. ద్వ్యణుకాదిక్రమమున స్థూల పదార్థము జనియించుచున్నది కాబట్టి పరమాణువునకు భాగకల్పన దిక్శక్తినిబట్టియే కలుగుచున్నది.

పై రీతిని అమూర్తములగు పరమాణువులకు భాగములు ముందుగా కలుగగా వానిని బట్టియే మూర్తములగు కడవ పర్వతము మున్నగువానికి భాగములు కల్పితములగుచున్నవి.

కాగా ప్రాథమికావయవ కల్పన దిక్శక్తిచేతనే కలుగుచున్నది. ॥13॥

అవతారిక — కడవ మున్నగు పదార్థములు విలక్షణములగు అవయవముల సన్నివేశముకలవై జనియించుచున్నవి. అట్లుండుటలో దిక్కువలన కలిగెడి ఉపకారమేమి యున్నది? దిక్సంబంధ మక్కరలేకయే వస్తువులు ఆయా విశిష్టరూపమున నుండగలవు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ అదేశాశ్చాప్యభాగాశ్చ నిష్క్రమా నిరుపాశ్రయాః ।
భావాః, సంసర్గిరూపాత్తు శక్తిభేదః ప్రకల్ప్యతే ॥ 14

భావాః = పదార్థములు, అదేశాః + చ = దేశభేదము లేనివే, అనగా ఆకాశము మున్నగు విభు పదార్థములకు నిజరూపమున అవయవములు లేవని భావము.

అభాగాః + అపి + చ = (పదార్థములు) అవయవములు కలవికూడ కావు. అనగా భూమి మున్నగు పదార్థములకు గూడ వానికి ఆత్మరూపముననే యుండెడి అవయవములు లేవని భావము.

అట్టి రెండు విధములగు పదార్థములు, నిష్క్రమాః = క్రమము లేనివే. క్రమము భేదమునుబట్టి కలుగును. నిజరూపమున ఏ పదార్థమునకు గూడ అవయవములు లేమి కతమున భేదము భాసింపదు. కాబట్టి వానికి క్రమము కూడ ఉండనేరదు.

ఆ పదార్థములు నిరుపాశ్రయాః = ఆశ్రయము లేనివి. అనగా ఉపాధి లేనివి.

సన్నిహితమగు వస్తువునకు రూపాంతరమును కల్పించునది ఉపాధి. దీనికి ఉదాహరణము 3 వ శ్లోకమున చూపబడినది. దానినే ఆశ్రయమందురు.

పదార్థముల స్వభావమిదియే– వానికి అవయవములు లేవు. కనుకనే వానికి క్రమము లేదు. వానికి ఉపాధియు లేదు.

ఇట్లున్నను సంసర్గిరూపభేదాత్ + తు = తనతో సంబంధము కల దేశముయొక్క రూపభేదము వలన మాత్రము, శక్తిభేదః = శక్తిభేదము, అనగా ఆధారము, అవయవి మున్నగు కార్యమునకు కారణమగు శక్తిభేదము, కల్పతే = కలుగుచున్నది.

పదార్థములకు తన దగ్గరగా ఉన్న ఇతర వస్తువుల సంపర్కవశమున నూతనమగు పరిణామవలు కలుగకపోవచ్చును. కాని తనకు సంబంధించియున్న దేశమువలన మాత్రము కొన్ని వ్యవహారములు కలుగవచ్చును. సూర్య సంయోగవశమున దిక్కునకు పది విధములగు నామములు కలుగునని 2, 3 శ్లోకములలో నిరూపింపబడినది. అందు ఏదో ఒక దిక్కుతో సంబంధము కలుగగా అది ఆధారమగుచున్నది. ఉదా. కపాలములు అధరమనెడి దిక్కుతో సంబంధించి ఘటమనెడి కార్యమునకు ఆధారములగును. దారములు వస్త్రమనెడి కార్యమునకు ఆధారములగుచున్నవి. అచటనే సమవాయవశమున అవయవముల భేదము భాసింపక విశిష్టమగు ఘటము, వస్త్రము, మున్నగు కార్యము జనియించును. తరువాత కడవయందు కపాలము లవయవములుగా, వస్త్రమున దారము లవయవములుగా, ఆకాశాదులకు ఘటాదులవలన భాగములు ఏర్పడుచున్నవి.

కాగా అవయవరహితములగు పదార్థములు దేశభేదమున ఆధారము కార్యము మున్నగు రూపములను బొందుచున్నట్లు దిక్కునుబట్టియు పదార్థములకు పూర్వత్వ పరత్వాదుల భేదముచే నానాత్వ వ్యవహారము కలుగును. అది దిక్కువలననే కలుగుచున్నది.

కాబట్టి దిక్సంబంధము లేనిచో ఘటపటాదులు ఆ యా విశిష్టరూపమున నుండజాలవు. ॥14॥

*అవతారిక* — కడవ మున్నగు పదార్థములకు అవయవములున్నట్లు ఎల్లరికిని తెల్లమే. దేశ భేదముచే వానికి భేదము ప్రత్యక్ష సిద్ధమే. వాని పరిమాణము కూడ అనుభవ సిద్ధమే. ఇట్లుండగా వానికి అవయవములు లేవు, వానికి క్రమము లేదు అనుట యెట్లు పొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నిర్భాగాత్మకతా తుల్యాపరమాణోర్ఘటస్య చ ।
భాగః శక్త్యన్తరం తత్ర పరిమాణం చ యత్తయోః ॥ 15

పరమాణోః = పరమాణువునకు, ఘటస్య + చ = ఘటమునకును, నిర్భాగాత్మకతా = భాగములు లేకపోవుట అనగా నిజరూపమున ఎట్టి అవయవములు లేకపోవుట, తుల్యా = సమా

నమే, కడవ కంటికి కానవచ్చును. పరమాణువు కానరాదు. ఐనను నిజరూపమున అవయవ ములు లేకుండుట రెంటికి సమానమే యని భావము.

తత్ర = ఆ రెంటియందు, భాగః = భాగము అనగా అవయవము, శక్త్యన్తరమ్= శక్త్యంతరమే. అనగా ఇతర శక్తుల ప్రభావమువలన కలిగినదే.

దిక్శక్తియొక్క ప్రభావముచే పౌర్వాపర్యము కలుగును. అనగా దారములు కారణ ములుగా నున్నందున పూర్వరూపము. వస్త్రము ఉత్తరరూపము. కపాలములు పూర్వరూపము. కడవ కార్యము కనక ఉత్తరరూపము అను భావభేదము కలుగును. తరువాత కార్యకారణము లకు కల భేదము సమవాయవశమున కానరాక అవయవ కల్పన కలుగును. దారములు అవ యవములుగా నున్నట్లు వాడుక కలుగును. కాగా భాగకల్పన ముఖ్యము కానేరదు. అది గౌణమే. అట్లుకాక కడవ మున్నగు వానికి భాగములు వాస్తములేయగుచో ఏకోఘటః (ఒక కడవ) అను రీతిని ఏకత్వ వ్యవహారము కలుగకపోయెడిని.

చ = మరియు, తయోః = వానికి అనగా ఘటపరమాణువులకు, యత్ = ఏ, పరిమాణమ్ = పరిమాణమో, (తత్) = అదియు, శక్త్యన్తరమ్ = శక్త్యంతరమే, అనగా దిక్శక్తివలన కలిగినదే.

పరమాణువునకు ఘటమునకు పరిమాణమున భేదము కలదు. పరమాణువు అణు రూపము, అంతకంటె తక్కువ పరిమాణము లేదు. కనుకనే అది పరమాణువని వ్యవహరింప బడుచున్నది. ఘట పరిమాణ మట్టిది కాదు. దానియందు మహత్త్వమున్నది. పై రీతిని వానికి భేదము ప్రత్యక్షముగా కానవచ్చుచుండగా ఆ రెంటికి తుల్యత్వ మెట్లు ? అని ప్రశ్నింపరాదు. 'ఇది మహత్తు, ఇది అణువు' అను భేదమునకు దిక్శక్తియే కారణము. ఆ శక్తి విశేషమే పరిమాణముగా గుర్తింపబడుచున్నది. అంతియేకాని అవయవ సంబంధ ముండుటచే 'కడవ మహత్తు' అనియు, అవయవ సంబంధము లేనందున 'పరమాణువు అణువు' అనియు వ్యవహ రింపబడి యుండలేదు. అట్లనుట కవకాశము కూడ చాలదు.

ఉపాధి సంబంధము లేనిచో ఎల్ల వస్తువులు లోకవ్యవహారమునకు శబ్దముచే బోధింపబడుటకు అర్థములు కాక నిర్గుణ పరబ్రహ్మ రూపములే, అట్టివానికి ఉపాధి సంబంధ మున పలు పరిణామములు కలుగును. ఆ యవస్థలో దిక్శక్తియు అవయవ కల్పనకు తోడ్పడుచున్నది. ॥15॥

*అవతారిక*— కడవ మున్నగు వస్తువులకు ఉపాధివశమున భేదము కానవచ్చు చుండగా 'వానికి అట్టి భేదము కలుగదు' అనుట యెట్లు పొసగును ? అను ప్రశ్నకు సమా ధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యతః ప్రకల్పతే భేదో భేదస్తత్రాపి దృశ్యతే ।
అదృష్టోపరతిం భేదమతోఽయుక్తతరం విదుః ॥ 16

A. యతః = దేనినుండి అనగా ఏ వస్తువునుండి, భేదః = భేదము అనగా మరియొక వస్తువునకు భేదము, ప్రకల్ప్యతే = కల్పితమగుచున్నదో, తత్ర + అపి = ఆ వస్తువునందును అనగా హద్దుగా జూపబడిన వస్తువునందును, భేదః = భేదము అనగా మరియొక వస్తువునుండి భేదము, దృశ్యతే = చూడబడుచునే యున్నది

'వస్త్రముకంటె ఘటము వేరు, ఇది ఎల్లరుకు తెల్లమే' ఇచట వస్త్రమును అవధిగా జూపి దానికంటె ఘటము వేరుగానున్నదని మనమెల్లరము భావింతుము. ఆ వస్త్రమునకు కూడ తన అవయవములగు దారములకంటె భేదము స్పష్టము. వానికి కూడ వాని అవయవములకంటె, వానికి కూడ వాని అవయవములకంటె భేదము కాన్పించును. ఈ రీతిగా చూచిన వస్త్రమునకు కారణములగు పృథివీ పరమాణువుల వరకు ఆలోచన జరుగును. అచటను దిక్కువలన కలిగెడి ఆరు భాగములున్నందున, వాని మూలమున పరమాణువునకు భేదము కలుగును వానికి దిక్కువలన, దిక్కునకు సూర్యసంయోగవశమున, దానికి మేరు పర్వతము యొక్క అవయవముల వలన, వానికి దిక్కువలన భేదము కలుగును.

B. పై రీతిని భేదము కలుగుట సమ్మతమే అని చెప్పరాదు. ఏలయన, అట్టితరి ఆ భేదమునకు నిలుకడ లేదు. మితి కలుగదు. అనవస్థాది దోషములు కలుగును. కనుక భేదము లేదనుటయే లెస్స. అది కుదురదు అనిచెప్పుచున్నాడు.

అతః = ఈ కారణము వలన, అనగా ఏ వస్తువును హద్దుగా జూపి మరియొక వస్తువునకు భేదము చూపుచున్నామో, ఆ వస్తువునకు గూడ మరియొక వస్తువువలన భేదము కాన్పించుచున్నందున, అదృష్టోపరతిమ్ = కానరాని నిలుకడ అనగా అంతముకల, భేదమ్ = భేదమును, అయుక్తతరమ్ = మిక్కిలి అయుక్తమైనదానిగా, విదుః = తెలిసికొనుచున్నారు. శాస్త్రము తెలిసినవారు భావింతురని భావము.

పదార్థములకు స్వతః భేదము సిద్ధింపదు. అంతియేకాదు. ఉపాధుల వలనను వానికి భేదము లభింపదు. ఈ యభిప్రాయము కారికలో 'తర' ప్రత్యయముచే వ్యక్తమగుచున్నది.

కాబట్టి పదార్థముల నానాత్వము జ్ఞానరూపముననే కాన్పించును. నిజరూపమున వానికి భేదము లేదనియే ముఖ్య తాత్పర్యము. ఈ యర్థమునే 18వ శ్లోకము వ్యక్తపరచుచున్నది. ॥16॥

*అవతారిక* — దిక్కు వ్యాపకమనియు అమూర్తమనియు చెప్పుచున్నాడు.

**శ్లో॥ సర్వత్ర తస్యకార్యస్యదర్శనా ద్విభురిష్యతే।**
**విభుత్వ మప్యేతదేవాహూ, రన్యః కార్యవతాం విధిః॥ 17**

1. సర్వత్ర = ఎల్ల దేశములయందు, తస్య = ఆ, అనగా దిక్కువలన కలిగెడి, కార్యస్య = కార్యము అనగా పూర్వము పరము మున్నగు కార్యము, దర్శనాత్ = కనబడుటవలన. దిక్కు, విభుః = విభువుగా, ఇష్యతే = అంగీకరింపబడు చున్నది.

ఇది పూర్వము, ఇది పరము అనెడి కార్యములు ఎల్ల దేశములయందు కనబడు చున్నందున దిక్కు వ్యాపకమని తేలుచున్నది. వ్యాపకమనగా అంతట వ్యాపించియున్నదని యర్థము

2. ఏతద్ + ఏవ = దీనినే, అనగా వ్యాపకత్వమునే ఎల్ల దేశములయందు కార్యమును కలిగించుటనే, విభుత్వమ్ + ఇతి = విభుత్వమని, ఆహుః = చెప్పుచున్నారు.

పరిమితమగు పరిమాణము కలవి మూర్తములనబడును. అట్టి ఎల్ల మూర్త ద్రవ్యములతో సంయుక్తమగుట విభుత్వమనబడుసని తార్కికులు తలంతురు.

పై కారణములచే దిక్కు వ్యాపకము కనుకనే విభువు అని యంగీకరింపవలెను.

3. కార్యవతామ్ = శరీరములకు అనగా మూర్తములకు, అన్యః = మరియొకటి యగు విభుత్వము, విధిః = సమ్మతము.

మూర్తములు అవయవములచే విస్తృతమగు దేశమును వ్యాపించుటయే వానికి కల విభుత్వము. ॥17॥

అవతారిక — దిక్కునకు భేదము చెప్పనలవి కాదని 16 వ శ్లోకమున చెప్పబడిన యర్థమునే దృఢపరచుచున్నాడు.

శ్లో॥ చైతన్యవత్ స్థితా లోకే దిక్కాలపరికల్పనా ।
ప్రకృతిం ప్రాణినాం తాం హి కోఽన్యథా స్థాపయిష్యతి ॥ 18

A. లోకే = లోకమునందు, చైతన్యవత్ = ఆత్మవలె, దిక్కాల పరికల్పనా = దిక్కుయొక్క కాలముయొక్క కల్పన, స్థితా = రూఢమైయున్నది

ఆత్మ ఉన్నదని ఎల్ల శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టి ఆత్మకు భేదము చెప్పుట అలవి కాదు. అట్లే దిక్కు కలదనుట ఎల్లరులకు సమ్మతమే. దానికి భేదము చెప్పుట సాధ్యము కాదు. కాలము కూడ ఇట్టిదే.

పదార్థము తెలియబడనిదై వ్యవహారమునకు సరిపడదు. ఆత్మ దిక్కు కాలము అనునవి కంటికి కానరాకున్నను వ్యవహారమున కుపకరించుటచే నవి లేవని చెప్పనలవి కాదు అవిలోక వ్యవహారమున రూఢములై యున్నవి.

B. ప్రాణినామ్ = ప్రాణులకు, ప్రకృతిమ్ = స్వభావరూపమగు, తామ్ = ఆ దిక్కాల కల్పనను, కః = ఎవడు, అన్యథా = మరియొక విధముగా, స్థాపయిష్యతి = ఉంచగలడు అనగా మార్పుచేయ గలడు ? హి = ఇది ప్రసిద్ధమే కదా !

ప్రాణులకు ప్రాణమెట్టిదో దిక్కాలములు కూడ అట్టివే. వానిని విడిచినచో లోక వ్యవహారమే జరుగనేరదు. పండితుడు కూడ ఈ వ్యవస్థను మార్పుచేయలేడు. ॥18॥

అవతారిక— పండితుడు కూడ దిక్కాల వ్యవస్థను మార్పుచేయజాలడు అను 18 వ శ్లోకము యొక్క అర్థమునే సమర్థించుచున్నాడు

శ్లో॥ సంకరో వ్యవహారాణాం ప్రకృతేః స్యాద్విపర్యయే ।
తస్మాత్త్యజన్నిమాన్ ధర్మాన్ పునరేవావలమ్బతే ॥ 19

A. ప్రకృతేః = స్వభావముగా నుండెడి పదార్థముయొక్క అనగా దిక్కాలముల యొక్క విపర్యయే = వైపరీత్యమున అనగా వానిని స్వీకరింపని యెడల, వ్యవహారాణామ్ = లోకులచే చేయబడుచున్న నియతములగు వ్యాపారములకు, సంకరః = సంకరము, స్యాత్ = కాగలదు.

'ప్రాఙ్ముఖః అన్నాని భుఞ్జీత' (తూర్పు ముఖముగానుండి అన్నము తినవలెను). 'అపరాహ్ణే శ్రాద్ధం కుర్యాత్' (అపరాహ్ణ కాలమున శ్రాద్ధము పెట్టవలెను) అనురీతిని దిక్కాలములను అనుసరించి ఎన్నియో లోకవ్యవహారములు అనాదిగా జరుగుచున్నవి. దిక్కాలములను అంగీకరింపని యెడల పై వ్యవహారములు సంకీర్ణములు కావలెను.

B. తస్మాత్ = అందువలన, అనగా దిక్కాలములను విడనాడుట శక్యము కానందున ఇమాన్ = ఈ, భావాన్ = దిక్కు, కాలము మున్నగు పదార్థములను, త్యజన్ = విడచినవాడైనను అనగా శుష్క తర్కవాదముచే 'ఈ పదార్థములు నిరూపింప శక్యముకావు' అని విడిచినవాడైనను, పునః = మరల, అవలమ్బతే + ఏవ = పరిగ్రహించుచునే యున్నాడు. పండితుడు కూడ వ్యవహారదశలో దిక్కాలములను స్వీకరించుచునే యున్నాడని భావము.

పరమార్థదశలో ప్రపంచకము పూర్వాపరభావము లేనిదే ఐనను తత్త్వసాక్షాత్కారము కలుగువరకు వ్యవహారదశలో పెద్దలుచూపిన మార్గములను శ్రుతి స్మృతులు చూపిన ధర్మములను మనుష్యులాచరింపక తప్పదు. తత్త్వసాక్షాత్కారము కలిగినను ప్రారబ్ధవశమున దేహములో నున్నంతవరకు జీవన్ముక్తుడు కూడ దిక్కాలముల ననుసరింపక తప్పదు. శుష్కతర్కము నుపయోగించి 'దిక్కాలములు లేవు' అని పలికినను వ్యవహారదశలో వానిని పరిగ్రహించుచునే యున్నాడు. ॥19॥

అవతారిక— నిర్గుణ పరబ్రహ్మమును అవిద్య, మాయ అను నామాంతరములు గల ప్రకృతి అనాదిగా అంటిపెట్టుకొని యున్నది. దాని శక్తియే కాలము. కాలమునకు గూడ విచిత్రములగు శక్తులు కలవు. ఈ యర్థము ఈ కాండమున కాలసముద్దేశమున (9) విపులముగా చూపబడగలదు. అట్లే దిక్కుకూడ తనకు ఉపాధిగా నున్న పదార్థముల సంబంధముచే భిన్న రూపములను దాల్చి ప్రపంచకమున పరత్వాపరత్వాది వ్యవహారములను కలుగచేయుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ తస్యాస్తు శక్తేః పూర్వాదిర్భేదో భావాన్తరాశ్రయః ।
భిన్నాదిక్తేన భేదేన భేదాయైవోపకల్పతే ॥ 20

తస్యాః = ఆ, శక్తేః = దిక్శక్తికి, పూర్వాదిః = పూర్వము మున్నగు అనగా ఇది పూర్వము ఇది పరము, ఇది దక్షిణము మున్నగు, భేదః + తు = భేదమైతే, భావాన్తరాశ్రయః = ఇతరములగు పదార్థములు నిమిత్తముగా గలదియే.

దిక్శక్తి నిజమున ఏకరూపముగనే ఉండును. దానికి నానాత్వము లేదు. కాని ఇతర పదార్థముల సంపర్కమనే నిమిత్తమునుబట్టి దిక్శక్తికి భేదము కలుగుచున్నది. ఈ యర్థము 3 వ శ్లోకమున చూపబడినదే, మరల ఇచట విశేషరూపమున భేదము చూపబడినది. కనుక పునరుక్తిదోషము వాటిల్లదు.

తేన = ఆ, భేదేన = భేదముచే అనగా ఇతర వస్తువుల సంపర్కముచే కలిగెడి భేదముచే, భేదాయ + ఏవ = భేదముకొరకే, ఉపకల్పతే = సమర్థమగుచున్నది.

వేరువేరు పదార్థములు భాసించునపుడే పూర్వత్వము పరత్వము అనెడి భేదము భాసించును. నిజరూపమున మాత్రము దిక్కు ఏకరూపమే. ॥20॥

అవతారిక — ఈ రీతిగా దిక్శక్తిని నిరూపించి, దిక్కును పురస్కరించుకొని కలిగెడి కార్యములను జూపుచున్నాడు.

శ్లో॥ అవధిత్వేన వాఽపేక్షా, యోగే దిగ్లక్షణో విధిః ।
పూర్వమస్యేతి షష్ఠ్యేవ దృష్టా ధర్మాన్తరాశ్రయే ॥ 21

1. అవధిత్వేన + వా = అవధిరూపముననే అనగా హద్దుగానే, అపేక్షా = అపేక్షించుట, (కార్యాయ + కల్పతే) = కార్యముకొరకు సమర్థమగుచున్నది.

లోకమున రెండు పదార్థములలో ఒకదానిని అవధిగ గ్రహించిన దాని మూలమున దిక్కును నిమిత్తముగా జేసికొని 'దీనికి ఇది ముందు, దీనికి ఇది వెనుక' అను రీతిని వ్యవహార రూపమగు కార్యము జరుగుచున్నది. ఇది లౌకిక కార్యము.

2. దిక్కునుబట్టి కలిగెడి శాస్త్రీయ కార్యమును జూపుచున్నాడు.

యోగే = అవధితో సంపర్కము వివక్షింపబడగా, దిగ్లక్షణః = దిక్శబ్దము నిమిత్తముగా గల, విధిః = పంచమీవిధి (భవతి) = కలుగును.

*"అన్యారాదితరర్తే దిక్శబ్దాఞ్చూత్తరపదాజాహియుక్తే" (2-3-29) అను సూత్రముచే పాణిని దిక్శబ్దయోగమున పంచమీ విభక్తిని విధించెను. ఉదా. "పూర్వో గ్రామాత్ వృక్షః" (వృక్షము గ్రామముకంటె ముందుగానున్నది) ఇది శాస్త్రీయ కార్యము.

---

* అన్య 'ఆరాత్' ఇతర, ఋతే (లేకున్న) దిక్శబ్ద, అఞ్చూత్తరపద (ప్రాక్ మున్నగునవి) ఆచ్ – ఆహి (ఇవితద్ధిత ప్రత్యయములు) వీనితో యోగముండగా పంచమీ విభక్తి కలుగునని సూత్రార్థము. అన్యః ఇతరః కృష్ణాత్, ఆరాత్ వనాత్ (దగ్గరకాక దూరము) ఋతేజలాత్, ప్రాక్ వనాత్, దక్షిణా గ్రామాత్, దక్షిణాహి గ్రామాత్ మున్నగునవి ఉదాహరణములు.

3. దిక్శబ్దయోగమున కొన్ని చోటులందు షష్ఠీవిభక్తి కానంబడియెడి, దానికి ఉపపత్తి చూపుచున్నాడు.

ధర్మాన్తరాశ్రయే = మరియొక ధర్మము అనగా అవయవత్వము అను ధర్మము ఆశ్రయముగాగల, యోగే = సంబంధము కలుగగా, పూర్వమ్ + అస్య = దానికి ముందు, ఇతి = అనురీతిని, షష్ఠీ + ఏవ = షష్ఠీ విభక్తియే, దృష్టా = చూడబడుచున్నది.

అవధికి అవధిమత్తునకు అవధ్యవధిమత్సంబంధమును వివక్షించిన పంచమీ విభక్తి కలుగును అచటనే అవయవావయవి భావసంబంధమును వివక్షించిన షష్ఠీవిభక్తి కలుగును. ఉదా. పూర్వం కాయస్య, (శరీరముయొక్క పూర్వభాగము) ॥21॥

అవతారిక — ఇది పూర్వము, ఇది పరము అను శాబ్దవ్యవహారమున పూర్వాపర భావము పూర్వాది దిక్కులను పురస్కరించుకొనియే జరుగుచున్నది ఇంతియే కాని మనుష్యుని అవయవములను బట్టి కాదు. కనుకనే సంకీర్ణముకాక నిశ్చితమగు వ్యవహారమే కలుగుచున్న దని చెప్పుచున్నాడు.

శ్లో॥ పూర్వాదీనాం విపర్యాసో న దృష్టోఽవధ్యసఙ్కరే ।
ఋజ్వేతదస్యేత్యేతచ్చ లిఙ్గం నవ్యతికీర్యతే ॥ 22

1. అవధ్యసంకరే = అవధులకు సాంకర్యము లేనపుడు అనగా అవధులను అపేక్షింపనందున (అనగా అనిశ్చితము కానందున) పూర్వాదీనామ్ = పూర్వాదులకు అనగా పూర్వము పరము అను వానికి, విపర్యాసః = వ్యత్యాసము అనగా తారుమారు, న + దృష్టః = కానరాదు.

ఇది పూర్వము, ఇది పరము అను వాడుక దిక్కులనుబట్టియే జరుగుచున్నది. మరియొక హద్దును అపేక్షించి జరుగునది కాదు. కనుకనే 'ఇది పూర్వము' అని గ్రహింపగా అది పూర్వమే యగును. ఏ వస్తువునుబట్టి ఏది పూర్వమగుచున్నదో, ఆ వస్తువునుబట్టియే అదియే పరము కానేరదుకదా ! అట్లుకాక అవధులనే ఊత గైకొనిన అవధులు నియతములు కానందున వ్యవహారము కూడ సంకీర్ణమే కావలెను. ఇట్లే శరీరావయవములను బట్టి చూచినను సంకీర్ణమే కావలెను.

2. అస్య = దీనియొక్క అనగా వెదురు మున్నగుదాని యొక్క, ఏతత్ = ఇది, అనగా మూలము, ఋజు = తిన్ననిది, ఇతి = అనెడి, లిఙ్గం + చ = దిక్కుయొక్క చిహ్నము కూడ, న + వ్యతికీర్యతే = సంకీర్ణము కానేరదు.

ఇచటను అవధి యపేక్షితము కానందున వ్యవహారము సంకీర్ణము కానేరదు.

పై వ్యవహారములలో అవధి యపేక్షితమగుచో హద్దు నియతము కానందున 'ఇది పూర్వము, ఇది పరము' అను నియత వ్యవహారము కలుగకపోయెడిని. ॥22॥

*అవతారిక*— దిక్కు, కాలము, పర్వతములు, నదులు, పట్టణములు, అను రీతిని బాహ్య ప్రపంచకము కలదనెడి శాస్త్రజ్ఞుల మతము చొప్పున ఇంతవరకు దిక్కు నిరూపింప బడినది.

ఇపుడు విజ్ఞానవాది మతము నాశ్రయించి దిక్కు జ్ఞానరూపమే, దిక్కు అనునది వేరుగా లేదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అన్తఃకరణధర్మో వా బహిరేవం ప్రకాశతే ।**
**అస్మాంత్వన్తర్బహిర్భావః ప్రక్రియాయాం న విద్యతే ॥ 23**

A. అన్తఃకరణధర్మః + వా = జ్ఞానముయొక్క ధర్మమే, బహిః = బాహ్యరూపమున, ఏవమ్ = ఈ రీతిగా అనగా దిక్కు రూపమున, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

బాహ్య ప్రపంచకము వేరుగా లేదు. విజ్ఞానమే ప్రపంచరూపముగా భాసించు చున్నది. చైతన్యమే అవిద్యావశముచే దిగ్రూపముగ కానవచ్చుచున్నది.

అన్తఃకరణధర్మః — అన్తః = లోపలనున్న, కరణమ్ = వ్యాపారము, యస్య = దేనికో, తత్, అన్తఃకరణమ్, అను వ్యుత్పత్తిచే ఆ శబ్దము చైతన్యమును బోధించును.

B. బాహ్యప్రపంచమే లేనిచో "బహిరేవం ప్రకాశతే" అనుట యెట్లు? బాహ్యము లేనేలేదు కదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

అస్యామ్ = ఈ, ప్రక్రియాయామ్ = కల్పనయందు, అనగా విజ్ఞానమే బాహ్య వస్తురూపముగా భాసించుచున్నదనెడి కల్పనయందు, అన్తర్బహిర్భావః = లోపల యందుం డుట వెలుపలి యందుండుట, న + విద్యతే = లేదు.

విజ్ఞానవాది మతమున లేని పదార్థమే అవిద్యావశమున కానబడును. అది నిజ రూపమున విజ్ఞానరూపమే, కాగా బాహ్యపదార్థము లేనందున ఆంతరపదార్థము మాత్ర మెట్లుండును? రెండు కూడ కల్పితములు. వ్యవహారమును అనుసరించి 'భాసించును' అని మాత్రము అందు గోచరించును.

పూర్వత్వము పరత్వము అనునవి వస్తువులయందు ఆరోపింపబడును. అనాదియగు మిథ్యాభ్యాసవశమున చైతన్యమే దిగ్రూపముగా భాసించుచున్నది. కాగా బాహ్యరూపమయిన దిక్కు వేరుగా లేదు. ॥23॥

*అవతారిక*— దిక్కు బాహ్యపదార్థరూపమున లేదు. విజ్ఞానమే అవిద్యావశమున దిక్కువలె భాసించును. కనుక "దిక్కు ఒకటియా, కాక అనేకమా అనగా నానా" అను వికల్పములకు తావు లేదు. అట్లు వికల్పించుట నిష్ఫలమే, అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకత్వమాసాం శక్తీనాం నానాత్వం వేతి కల్పనే ।**
**అవస్తుపతితే జ్ఞాత్వా సత్యతో న పరామృశేత్ ॥ 24**

అట్టే ఆకాశమునకు అవయవములు లేవు. కాని ఘటపటాదులుఆకాశముతో సంయోగ సంబంధమున కలసి యున్నవి. అందుచే అవి దానికి అవయవములుగా గుర్తింప బడగలవు. కాగా అట్టి అవయవములను బట్టి ఆకాశమునకు నానాత్వము లభించుటచే నచట జాతి యుండగలదు. ఆకాశమునకు ఘటాదులు అవయవములనుట గౌణము. ॥ 16 ॥

*అవతారిక*—ఆకాశమునకు ఘటపటాదులు అవయవములు. కాని అవి అవయవ ములనుట గౌణమని తెలినది. కాని ముఖ్యమగు అవయవములు దేనికైనను ఉన్నయెడల ఇట్టివి గౌణములగును. అందుచే ముఖ్యములగు అవయవములు ఏవో వానిని చూపవలెను. ముఖ్యమును బట్టికదా గౌణమగును. ముఖ్యమేలేనిచో ఇది గౌణము కాదు కదా! అనుప్రశ్నకు సమాధానము చెప్పు చున్నాడు.

శ్లో॥ భిన్నవస్త్వాశ్రయా బుద్ధిః సంయోగిష్వనువర్తతే।
సమవాయిషు భేదస్య గ్రహణం వినివర్తతే॥ 17

శ్లో॥ అతః సంయోగి దేశానాం గౌణత్వం పరికల్ప్యతే।
అవివేకాత్ప్రదేశేభ్యో ముఖ్యత్వం సమవాయినామ్॥ 18

సంయోగిషు = సంయుక్తములగు పదార్థములయందు, అనగాసంయోగ సంబంధమున కలసి యున్న ఘటపటాదుల యందు, భిన్నవస్త్వాశ్రయా = విభిన్నములగు అనగా వేరువేరుగానున్న వస్తువులు ఆశ్రయముగాగల, బుద్ధిః = బుద్ధి, అనువర్తతే = అనువర్తించుచున్నది.

వేరు వేరుగా అనగా స్వతః ఒకదానితో సంబంధములేకయున్న ఘటము, పటము మున్నగు వస్తువులకు సంయోగముకలుగును. ఇది ఘటము, ఇది పటము అని వేరు వేరుగానే బుద్ధి కలుగును. సమవాయిషు = సమవాయ సంబంధము కలవానియందు అనగా కపాలములు అవయవములు, వానియందు ఘటము సమవాయ సంబంధమున నుండును అట్టి వానియందు, భేదస్య = భేదము యొక్క అనగా ఇది కపాలము, ఇది ఘటము అనెడి భేదముయొక్క, గ్రహణమ్ = జ్ఞానము, వినివర్తతే = మరలుచున్నది. అవయవములు వేరు, అవయవి వేరు అని గ్రహించుట సాధ్యముకాదని భావము.

అతః = ఈ కారణమువలన అనగా ఘటపటాదులకు భేదము గ్రహింప బడుటవలన, సంయోగిదేశానామ్ = సంయోగ సంబంధముచేనున్న అవయవములకు అనగా ఆకాశమున సంయోగ సంగ సంబంధముచేనున్న ఘటము పటమున్నగు అవయవములకు, గౌణత్వమ్ = అప్రధానత్వము, పరికల్ప్యతే = కల్పింపబడుచున్నది. ఆకాశమువలె ఘటము పటము మున్నగునవి అవయవములు. అవి అచట సంయోగ సంబంధమున నున్నవి. ఆకాశము కంటే ఘటపటాదులు వేరుగా గ్రహింప బడుచున్నందున, అవయములు గౌణములని తేలుచున్నది.

సమవాయినామ్ = కపాలములయందు సమవాయసంబంధముననున్న ఘట ములకు, ప్రదేశేభ్యః = అవయవములగు కపాలములకంటె, అవివేకాత్ = భేదము గుర్తించుట సాధ్యపడనందున, ముఖ్యత్వమ్ = ముఖ్యత్వము లభించుచున్నది.

ఆసామ్ = ఈ, శక్తీనామ్ = శక్తులకు అనగా దిక్శక్తులకు, ఏకత్వమ్ + వా = ఏకత్వమా ? అనగా అన్ని దిక్కులయందున్న శక్తి ఏకరూపమా, నానాత్వమ్ + వా = భేదమా ? అనగా ఆ శక్తులు వేరువేరుగా ఉన్నవా ? ఇతి = అనెడి, కల్పనే = వికల్పనములను, అవస్తుపతితే= వస్తువుకాని దానియందు లగ్నమైనవని అనగా విచారించుటకు అవకాశము లేనివని, జ్ఞాత్వా = గుర్తించి, సత్యతః = పరమార్థరూపమున, న + పరామృశేత్ = విచారింపరాదు.

విజ్ఞానవాది మతమున చైతన్యము తప్ప వేరు పదార్థము లేదు. కాగా దిక్కు అనెడి బాహ్య పదార్థము లేదు కాని ఆ చైతన్యము అవిద్యావశమున ఈ రూపముగా భాసించుచున్నది. ఇట్టి స్థితిలో దిక్కు ఒకటియా, లేక నాలుగా, లేక ఆరా, లేక పదియా అనెడి వికల్పములకు తావు లేదు.

కాబట్టి దిక్కుయొక్క స్వరూపమును యథార్థ బుద్ధితో విచారింపనవసరము లేదు. ॥24॥

అవతారిక — శాస్త్రములలో పదార్థములు లక్షణములతో నిరూపింపబడినవి. కాని అట్టి నిరూపణము అనవసరము. శాస్త్రవిచారణచే తెలిసిన రూపములతో పదార్థములు లోకమున కానరావు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ వికల్పాతీతతత్త్వేషు సంకేతోపనిబన్ధనాః ।
భావేషు వ్యవహారా యే, లోకస్తత్రానుగమ్యతే ॥ 25

వికల్పాతీత తత్త్వేషు = వికల్పములను అనగా దిక్కు ఉన్నదా ? లేదా ? ఉన్నను అది ఒకటియా, అనేకమా, అది కేవలము శక్తి రూపమా, లేక ద్రవ్యరూపమా అను విభిన్నములగు అభిప్రాయములను అతిక్రమించి యున్న స్వభావముకల, భావేషు = పదార్థముల విషయమై, సంకేతోపనిబన్ధనాః = సంకేతము కారణముగాగల అనగా ప్రజలు కల్పించుకొనిన గుర్తులే మూలముగాగల, యే = ఏ, వ్యవహారాః = వ్యవహారములో అనగా పరస్పరాభిప్రాయమును గుర్తించి జరిగెడి నడవడికలో, తత్ర = అందు, లోకః = లోకము, అనుగమ్యతే = అనుసరింపబడుచున్నది, అనగా లోకము దానికి బద్ధమైనడచుచున్నది.

శాస్త్రకర్తలు ప్రతిశాస్త్రమున పదార్థములకు లక్షణములను దెలిపి పరిశోధించి యున్నారు. ఆ పరిశోధనములు పరస్పరము విరుద్ధములుగా నున్నవి.

దిక్కు, కాలము లేనేలేవు, ఒకవేళ ఉన్నను అవి ఆకాశమున అంతర్భూతములే అని కాపిల సాంఖ్యము చెప్పినది.

దిక్కు వేరుగలేదు. కాలము మాత్రము వేరుగా గలదని పాతంజలయోగము ప్రతిపాదించినది.

దిక్కాలములు స్వతంత్ర ద్రవ్యములని ప్రాచీన తార్కికులు నుడివిరి.

అవి ఈశ్వరునికంటె అతిరిక్తములు కావని నవీనతార్కికులు తలంచిరి.

ఇట్లే బంగారము మట్టి వికారమని మాధ్వమతస్థులు తలంతురు. అది తేజము యొక్క వికారమని వైశేషికులు విశ్వసింతురు.

నిజము చూచిన పదార్థము లిట్లు భిన్న భిన్న రూపములతో నుండనేరవు. వీరి యభిప్రాయములను అతిక్రమించియే పదార్థముండును. శాస్త్రవిచార మెట్లున్నను లోకులు వారి వారి పనులు జరుగుటకై 'ఇది తూర్పు, ఇది పడమర, ఇది బంగారము, దీని విలువ ఇంత, ఇది పర ద్రవ్యము, ఇది పుణ్యము ఇది పాపము' అని ఏవో కొన్ని కట్టుపాట్లు చేసియున్నారు. వానిని అతిక్రమింపక నడచుచున్నారు.

దిక్కులు పదియని లోకులు విశ్వసింతురు. అదియే ఎల్ల వ్యవహారములకు మూలమగుచున్నది. విచారణచేసిన నియతమగు రూపములేక అందముగా కానరావు. అవిచారిత రమణీయమే ఈ లోకవ్యవహారము. ॥25॥

*అవతారిక*—— మరియు శాస్త్రకారులు చేసిన మార్గములను చూచిన, పదార్థముల భేదాభేదములు కూడ సిద్ధింపవు. అనగా పదార్థ మొక్కటియే అనిగాని, ఆ పదార్థములు నానా రూపములు కలవియే అనిగాని నిర్ణయింప సాధ్యముకాదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నైకత్వమస్తి నానాత్వం వినైకత్వేన నేతరత్ ।**
**పరమార్థే తయోరేష భేదోత్యన్తం న విద్యతే ॥ 26**

A. నానాత్వమ్ + వినా = అనేకత్వము లేనిది, ఏకత్వమ్ = ఏకత్వము, న = ఉండనేరదు, అట్లే, ఏకత్వేన + వినా = ఏకత్వము లేనిది, ఇతరత్ = ఇతరమైనది, అనగా నానాత్వము, న = ఉండనేరదు.

ఏకత్వము, నానాత్వము అనునవి పరస్పరాపేక్షములు. 3, 4, పదార్థములున్నచో, వానిలో 'ఇది ఒకటి' అని చెప్పవచ్చును. అట్లుకాకున్న 'ఒకటి' అని పలుకుటే పొసగదు, అట్లే ఒక వస్తువుండగా దాని ప్రక్కన మరికొన్ని వస్తువులు చేరగా రెండు, మూడు, నాలుగు అని వ్యవహరింతురు. కాగా పై వ్యవహారములు పరస్పరాశ్రయములు. ఒకదానిని మరియొకటి ఆశ్రయించియే యున్నవి. అట్టితరి వానికి అన్యోన్యాశ్రయమను దోషము ప్రసక్తమైనందున ఏకత్వముగాని అనేకత్వముగాని స్వతంత్రముగా సిద్ధింపదు.

B. పరమార్థే = యథార్థమగు విచారణ చేయగా, తయోః = ఆ రెంటికి అనగా ఏకత్వ నానాత్వములకు, ఏషః = ఈ, భేదః = భేదము, అత్యన్తమ్ = ఏమియు, న + విద్యతే = లేదు.

పరమార్థమున జ్ఞానము తప్ప మరియొక వస్తువు లేదు. ఏకత్వ నానాత్వములు లేనేలేవు. పరమార్థమున ఏకత్వముగాని నానాత్వముగాని నిలువజాలవు.

కాని ఆ స్థితిని పొందువరకు లోకవ్యవహారము గజనిమీలికచే జరుగుచున్నది. ఏనుగు బలిష్ఠమగు జంతువు. అదియే కన్ను విప్పి సంచరించిన దానిని ఎవరు పట్టజాలరు. అది విశృంఖలముగా తిరిగిన లోకము పటాపంచలమగును. కాని అట్టి ఏనుగునకు మాంద్యము మెండు. అందుచే నది కన్ను తెరువకయే సంచరించును. అట్లే లోకము కూడ సంచరింప వలెను. పదార్థములను సమూలము పరీక్షించిన ఏదియు నిలువజాలదు.

కాబట్టి లోకుల వ్యవహారము చూచిన దిక్కు అనునది ఇతర వస్తువులకు సాహాయ్య మొనరించునట్లు కానవచ్చుచున్నందున నది శక్తిరూపమేయని తెల్లము. ॥26॥

అవతారిక — శక్తిమంతములగు ఘటపటాదులకు ఏకత్వ నానాత్వములు కలుగును. శక్తులకు మాత్రము ఏకత్వ నానాత్వ విచారమర్హముకాదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ న శక్తీనాం తథా భేదో, యథా శక్తిమతాం స్థితిః ।**
**న చ లౌకికమేకత్వం తాసామాత్మసు విద్యతే ॥ 27**

A. యథా = ఏ రీతిగా, శక్తిమతామ్ = శక్తికలవానికి అనగా ఘటము, పటము మున్నగు స్వతంత్ర పదార్థములకు, స్థితిః = భేదరూపమున ఉనికియో, తథా = ఆ రీతిగా, శక్తీనామ్ = శక్తులకు, భేదః = భేదము, న = లేదు.

కడవ మున్నగు పదార్థములు స్వతంత్రములు. అవి వేరుగానే సిద్ధించును. కాబట్టి ఘటపటాదులు పరస్పరము భిన్నములే. కాని వానియందున్న శక్తులకు వానితో భేదము సిద్ధింపదు. అవి ఆశ్రయమును విడిచియుండునవి కావు. అవి అస్వతంత్రములు. కనుక ఆ శక్తులకు ఆశ్రయముతో భేదమున్నట్లు గుర్తింపలేము.

B. తాసామ్ = ఆ శక్తులయొక్క, ఆత్మసు = స్వరూపములయందు, లౌకికమ్ = లోక సిద్ధమగు, ఏకత్వమ్ + చ = ఏకత్వము కూడ, న + విద్యతే = లేదు.

లోకమున కడవ ఒకటిగానే కానవచ్చుచున్నది. అది నిజరూపమున ఒకటియే అది ఎల్లరికి తెలిసినదే. అట్టి ఏకత్వము కూడ దానియందున్న శక్తికి కానరాదు. ఏలయన— ఒకే కడవ కర్తగాను (కడవ ఉన్నది), కర్మగాను (కడవను చూడుము), కరణముగాను (కడవతో నీరు తెమ్ము), సంప్రదానముగాను (కడవకొరకు వెదలుము), అపాదానముగాను (కడవ నుండి నీరు తెమ్ము), అధికరణముగాను (కడవయందు నీరు ఉంచుము) లోక వ్యవహారమున కానవచ్చుచున్నది. కడవ ఒక్కటియేకదా యని దానియందున్న శక్తియు ఒక్కటియే యగుచో పై రీతిని భిన్నకార్యములు సిద్ధింపవు. కాగా లోక సాధారణముగానున్న ఏకత్వము శక్తికి కలుగదు.

కాగా ద్రవ్యమును ఆశ్రయించియున్న శక్తులకు నానాత్వము కలుగును. ఆ శక్తులకు ద్రవ్యముతో అభేదమే లభించును. కనుకనే అవిద్యాశక్తి నిర్గుణ పరబ్రహ్మమునందున్నను అది బ్రహ్మముకంటె భిన్నము కాదు కనుకనే ఆ రెంటికి అభేదము లభించుటచే అద్వైత

వాదము బలిష్ఠమగుచున్నది. అట్లు కాకున్న అవిద్యాశక్తి బ్రహ్మముకంటె భిన్నమగుచో ద్వైతవాదమే నిలిచెడిని. ॥27॥

*అవతారిక*— దిక్కునకు ఏకత్వమే అనిగాని, నానాత్వమే అనిగాని చెప్పుటకు సాధ్యము కాదని 26వ శ్లోకమున చెప్పబడినది. ఆ యర్థమునే సిద్ధాంతముగా జూపుచు, 'దిక్కు ఒక్కటియే' అనెడి తార్కికులవాద మయుక్తమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నైకత్వం వ్యవతిష్ఠేత నానాత్వం చేన్నకల్పయేత్ ।**
**నానాత్వం చావహీయేత యద్యేకత్వం న కల్పయేత్ ॥ 28**

నానాత్వమ్ = అనేకత్వమును, న + కల్పయేత్ + చేత్ = నిరూపింపని యెడల అనగా బుద్ధిచే అనేకత్వమును స్పష్టముగా నిరూపించినచో, ఏకత్వమ్ = ఏకత్వము, న + వ్యవతిష్ఠేత = స్థిరపడునది కాదు. నానాత్వములేనిది ఏకత్వముండదు.

అట్లే, ఏకత్వమ్ = ఏకత్వమును, న + కల్పయేత్ + యది = బుద్ధిచే నిరూపింపని యెడల, నానాత్వమ్ + చ = అనేకత్వము కూడ, అవహీయేత = నశింపవలసి యుండెడిది. అనగా స్వరూపమును పొందకపోయెడిని.

అంతరంగ బహిరంగములవలె ఏకత్వ నానాత్వములు పరస్పరాపేక్షములు. అవి ఒకదానిని విడిచి మరియొకటి యుండనేరవు.

కనుక దీని స్వరూప మెట్టిది? అని విచారింపకయే పండితుడు, పామరుడు కూడ లోక వ్యవహారమును కొనసాగింపవలెను. అనాది సిద్ధమగు లోకవ్యవహారము దిక్కును ఆధారముగా గైకొనియే నడచుచున్నది. ॥28॥

*దిక్ సముద్దేశము ముగిసినది*

# సాధన సముద్దేశము–7

*అవతారిక*—— "దిక్ సాధనం క్రియాకాలః" అనుకారికలో చూపబడిన పదార్థ ములక్రమమును అనుసరించి దిక్కు తరువాత నిర్దిష్టమగు 'సాధన'మును వివరించుచున్నాడు.

శ్లో॥ స్వాశ్రయే సమవేతానాం తద్వదేవాఽఽశ్రయాన్తరే ।
క్రియాణా మభినిష్పత్తౌ సామర్థ్యం సాధనం విదుః ॥ 1

స్వాశ్రయే = తనకు ఆశ్రయమగు దానియందు అనగా క్రియకు ఆధారమగు కర్తృ కర్మల యందు, తద్వత్ = అట్లే, ఆశ్రయాన్తరే + ఏవ = ఇతరమగు ఆధారమునందును, సమవేతా నామ్ = సమవేతములగు అనగా ఎన్నడు విడువక కలసియున్నట్టి, క్రియాణామ్ = పాకము, గమనము, అధ్యయనము మున్నగు వ్యాపారముల యొక్క, అభినిష్పత్తౌ = పుట్టుకయందు, సామర్థ్యమ్ = సామర్థ్యమును అనగా ద్రవ్యములయందున్న శక్తిని, సాధనమ్ = సాధన మునుగా, విదుః = భాష్యకారుడు మున్నగువారు గుర్తించుచున్నారు.

*వివరణము*—— 1. ఈ ప్రకరణమున కర్మ, కరణము, కర్త, సంప్రదానము, అపాదానము, అధికరణము, శేషము, హేతువు అను కారకములు విచారింపబడుచున్నవి, కారకమునకు 'సాధనము' అనునది నామాంతరము, కరోతీతి = కారకమ్ = క్రియా నిష్పాద కము, సాధ్యతే అనేన ఇతి = సాధనమ్. = దీనిచే క్రియ సాధింపబడును. భాష్యకారుడు ఈ రెండు పదములను పర్యాయ శబ్దములుగా జూపియున్నాడు. దేనివలన క్రియ కలుగునో అది కారకము, అదియే సాధనము.

2. చైత్రః కాష్ఠైః స్థాల్యాం తణ్డులం పచతి (చైత్రుడు కట్టెలచే గిన్నెయందు బియ్యమును వంట చేయుచున్నాడు) మున్నగు వాక్యములలో ధాతువులచే పాకము మున్నగు క్రియలు బోధింపబడుచున్నవి. ఆ క్రియలు కర్తృ కర్మలయందే యుండును. అవి కరణము మున్నగు కారకములయందు ఉండవు. కాని కరణాది కారకములు గూడ పాకము మున్నగు క్రియలను కలిగించుచున్నవి. కాగా చైత్రుడు, తండులము మున్నగు పదార్థములు తమయందున్న క్రియలను పుట్టించుటచే కర్తృకారకము, కర్మకారకము అగుచున్నవి. ఈ యర్థమును 'స్వాశ్రయే సమవేతానామ్' అను కారికా భాగము వివరించుచున్నది. దీనినిబట్టి కర్తృకారకము, కర్మకారకము సిద్ధించుచున్నవి. కర్తృ కర్మ కారకములయందున్న పాకాది క్రియలను కట్టెగిన్నె మున్నగు వస్తువులు పుట్టించుచున్నవి. అందుచే నా వస్తువులు కరణము, అధికరణము అనురీతిని కారకములగుచున్నవి. ఈ యర్థమును "ఆశ్రయాన్తరే సమవేతా నామ్" అను భాగము వివరించుచున్నది. కాష్ఠాదులందు పాకాది క్రియలు సమవేతములు కాకున్నను కాష్ఠాదులకంటె ఇతరములగు కర్తృ కర్మలయందున్న ఆ క్రియలను కలిగించు

టచే కాష్ఠాదులు కూడ సాధనములు కాగలవు. కాగా 'ఆశ్రయాన్తరే' అను పదమునకు కరణాదులకంటె భిన్నమగు ఆధారమునందు అనగా కర్తృ కర్మరూపమగు ఆధారమునందు అని యర్థము చెప్పపలెను. 'స్వాశ్రయే' అనుచోట స్వశబ్దార్థము క్రియ. ధాతువుచే బోధింపబడెడి క్రియ కర్తృ కర్మములందే యుండును. ఇతర కారకముల యందుండనేరదు. కనుకనే కర్తృ కర్మములయందే తిజ్ ప్రత్యయములు జనియించును. కరణాది కారకములందు జనియింపవు. ఇది భాష్యకారాదుల నిర్ణయము. అందుచే 'స్వాశ్రయే', 'ఆశ్రయాన్తరే' అను రెండు పదములు భర్తృహరిచే ప్రయోగింపబడినవి.

తాత్పర్యము— 1. సాధ్యము 2. సిద్ధము అను రీతిని పదార్థములు రెండు విధములు. వానిలో సాధ్యము క్రియారూపము. ఉదా. యాగము, పాకము, గమనము, అధ్యయనము మున్నగునవి. అవి ఎప్పటికప్పటికే తయారుచేయబడును. ఘట పటాదుల బోలె స్థిరముగా నుండునవి కావు. అవి నిష్పన్నములు కావలెనన్నచో నిష్పాదకము అపేక్షితమగుచున్నది. ఆ నిష్పాదకమే సిద్ధపదార్థము. అదియే కారకము, అదియే సాధనము. సాధ్యమగు క్రియకు సాధనమగు సిద్ధవస్తువునకు క్రియాకారక భావము సంబంధము. ఈ రీతిగా సాధనమువలన క్రియ జనియించుచున్నది. ఇచట సాధనము వస్తురూపము కాదు. వస్తువు యొక్క శక్తియే సాధనము.

విశేషాంశము— 1. చైత్రః తణ్డులం కాష్ఠైః స్థాల్యాం పచతి (చైత్రుడు బియ్యమును కట్టెలచే గిన్నెయందు వండుచున్నాడు) అనుచోట చైత్రుడు, బియ్యము మున్నగునవి కారకములు. బాగుగ పరిశీలించిన ఆ వస్తువులు కారకములు కానేరవు. ఏలయన క్రియాజనకము కారకము. వస్తువు నిజరూపమున క్రియను జనియింపచేయ నేరదు. దానియందున్న సామర్థ్యము అనగా శక్తి క్రియాజనకమగును. కాగా 'శక్తిఃకారకమ్' అను పక్షము సిద్ధాంతము కాగలదు. శక్తి ఆశ్రయమును విడనాడి యుండనేరదు. అందుచే లోకమున వస్తువులే కారకములని గుర్తింపబడుచున్నవి. ఈ పద్ధతిలో 'శక్తిమత్ కారకమ్' అను పక్షమునకు సంభవమున్నది. *భాష్యకారాదులు, శక్తియే కారకమను పక్షమును ఆదరించిరి.

**భాష్యకర్త మరికొన్ని స్థలములలో ద్రవ్యము కారకమని నుడివెను. శక్తికి శక్తిమత్తునకు అభేదమును వివక్షించుటచే ఆ భాష్యము సమన్వితము కాగలదు.

---

* "పరోక్షేలిట్" (3-2-115), 'అనభిహితే' (2-3-1), మున్నగు సూత్రములలో "గుణః సాధనమ్" అని పతంజలి పలికెను. ఇచట గుణశబ్దము శక్తిపరము. సాధనమనగా కారకము. "సప్తమీ పఞ్చమ్యౌ కారకమధ్యే" అను సూత్రమున కారకశబ్దము శక్తిపరము.

** "ద్రవ్యం క్రియాభి నిర్వృత్తిం ప్రతిసాధనమ్", "సార్వధాతుకేయక్" (3-1-67). "సాధనం వై ద్రవ్యమ్"కిమేత్తిజవ్యయ..., (5-3-55) "సాధనే౽యం భవన్ లిఙ్గ సంఖ్యాభ్యాం యోక్ష్యతే" "ఉపసర్గాచ్ఛన్దసిధాత్వర్థే" (5-1-118)

శక్తిః కారకమ్. అనునదియే సిద్ధాంతము. ఈ యభిప్రాయమును మనంబున నిడుకొనియే భర్తృహరి 'సామర్థ్యం సాధనం విదుః' అని బిగ్గరగా పలికెను.

2. పాకము, గమనము మున్నగు క్రియలు ప్రత్యేకము ఒకొక్కటియే ఐనను ప్రధాన క్రియకు ఉపకరించెడి ఫూత్కారము (ఊదుట) మున్నగు అవాంతర క్రియలు చాల కలవు. అట్టి అప్రధాన క్రియలను పురస్కరించుకొని కారికలో 'క్రియాణామ్' అను బహు వచనము ప్రయుక్తమాయెను. ॥1॥

*అవతారిక*— 'సామర్థ్యం సాధనం విదుః' అను వచనమువలన శక్తికారకము అని తెలియవచ్చుచున్నది. ద్రవ్యము కారకమని యేల చెప్పరాదు ? శక్తియే కారకమని యెట్లు నిశ్చితమగును ? అను ప్రశ్న సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ శక్తిమాత్రా సమూహస్య విశ్వస్యాఽనేకధర్మణః ।**
**సర్వదా సర్వథా భావాత్ క్వచిత్ కిఞ్చిద్వివక్ష్యతే ॥ 2**

శక్తిమాత్రా సమూహస్య = శక్తులయొక్క భాగముల సముదాయ రూపమగునట్టియు, అనేక ధర్మణః = అనేకములగు ధర్మములు కల, విశ్వస్య = ఎల్లవస్తువు అనగా ఘటము, పటము మున్నగు ఎల్ల పదార్థము, సర్వదా = ఎల్లకాలమున, సర్వథా = ఎల్ల విధముల, భావాత్ = ఉండుటవలన, క్వచిత్ = ఒకొక్క సమయమున, కిఞ్చిత్ = ఒకొక్క శక్తియే, వివక్ష్యతే = వివక్షింపబడుచున్నది, ఇచట శబ్దప్రయోక్త కర్త.

అనంతములగు శక్తుల సమూహములే ఘటపటాది వస్తువులు. అట్టి వస్తువుల భాగములే శక్తులు. అవి విచిత్రములగు కార్యములను కలిగించుచున్నవి. ఎట్లనగా— ఘటః అస్తి (కడవ ఉన్నది), ఘటమానయతి (కడవను తెచ్చుచున్నాడు), ఘటేన జలమాహరతి (కడవచే నీటిని తెచ్చుచున్నాడు), ఘటాయ ప్రయతతే (కడవకొరకు ప్రయత్నించు చున్నాడు, ఘటాత్ జలం స్రవతి (కడవనుండి నీరు కారుచున్నది), ఘటే జలం నిదధాతి (కడవయందు నీరు పోయుచున్నాడు). ఒకే ఘటము పై రీతిని భిన్నములగు విచిత్రములగు కార్యములను కలిగించుచున్నది. దీనినిబట్టి చూడగా ఒక వ్యక్తియందు అనేక విచిత్ర శక్తులున్నవని ఎల్లరు నమ్మక తప్పదు. శక్తులే కారకములనియు దీనివలననే తెలియుచున్నది. అట్లుకాక ఘట ద్రవ్యమే కారకమన్నచో, ఒక ద్రవ్యము ఇన్ని విచిత్ర కార్యములను కలిగింపనేరనందున పై వ్యవహారములు కుదురుపాటు నొందనేరవు. శక్తులే కారకమగుచో ఆ శక్తులు వివక్షనుబట్టి కర్త, కర్మము, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అను రీతిని విచిత్ర మగు కార్యములను చేయగలవు.

కాబట్టి శక్తిమత్తు అగు ద్రవ్యము కారకము కాదు. శక్తియే కారకమనుట లెస్స.॥2॥

*అవతారిక*— ద్రవ్యములగు ఘటపటాదులయందు శక్తులు సంభవించును. కనుక అచట వివక్షకు అవకాశమున్నది. కాని శక్తులుండుట కవకాశము లేనిస్థలములు కలవు.

అచట వివక్షమెట్లు సంభవించును? శక్తి మాదధాతి (శక్తిని కలిగించుచున్నది) ఇచట ఔషధము కర్త. చైత్రః శక్త్యాకరోతి (చైత్రుడు శక్తిచే చేయుచున్నాడు) శక్తేః వ్యపైతి (శక్తినుండి మరలుచున్నాడు) పై స్థలములలో శక్తికి కర్తృత్వాదికము అనుభవసిద్ధము, ఘటాదులయందు శక్తియున్నట్లు శక్తికి మరియొక శక్తి సంభవింపదు. అట్లుకాకున్న ఆ శక్తికి కూడ మరియొక శక్తి, దానికి మరియొక శక్తి అను రీతిని అనవస్థా దోషము ప్రసక్తమగును. మరియు వస్తురూపముకాని అభావమునకు గూడ కారకత్వము కానవచ్చుచున్నది. మైత్రః ధనవినాశం కరోతి (మైత్రుడు ధననాశమును చేయుచున్నాడు). ధనాభావేన యుక్తః (ధనము యొక్క లేమితో కూడియున్నవాడు), ఇచట లేమి కారకమని స్పష్టము. దానికి వేరుగ శక్తులుండుట అసంభవము కదా! కాబట్టి శక్తి కారకమను పక్షము ఎట్లు కుదురును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సాధనవ్యవహారశ్చ బుద్ధ్యవస్థానిబన్ధనః।
సన్నసన్వాఽర్థరూపేషు భేదోబుద్ధ్యా ప్రకల్ప్యతే॥ 3

A. బుద్ధ్యవస్థా నిబన్ధనః = బుద్ధిచే కల్పింపబడిన అర్థవిశేషములే కారణముగాగల, సాధన వ్యవహారః + చ = కర్త, కర్మ మున్నగు కారకవ్యవహారము, (సంభవతి) = కలుగగలదు.

బాహ్య ప్రపంచమున నున్న అర్థములనుబట్టి శాబ్దవ్యవహారము జరుగదు లోకమున అర్థమున్నను లేకున్నను శబ్దమువలన వ్యవహారము జరుగగలదు. అందు బుద్ధియే కారణము. బుద్ధిచే ఇది కర్త, ఇది కర్మ, దీనివలన ఈ కార్యము కలుగును అని నిరూపింపగా, అట్టి నిరూపితమగు అర్థమును బోధించుటకై శబ్దములు ఉపయోగపడుచున్నవి.

B. సన్ = లోకమున పదార్థమున్నను, అసన్ + వా = లేనిదియైనను, బుద్ధ్యా = బుద్ధిచే, అర్థరూపేషు = అర్థరూపములయందు, భేదః = భేదము, ప్రకల్ప్యతే = కల్పింపబడుచున్నది.

పై కారికాభాగము యొక్క అర్థమునే ఈ రెండవ భాగము వివరించుచున్నది. బుద్ధియే అర్థ నిర్ణయమును జేయును. అట్టి నిర్ణీతమగు అర్థము శబ్దబోధ్యమగును. బుద్ధి అర్థమును నిర్ణయింపనిచో లోకముననున్న యర్థమును శబ్దము బోధింపజాలదు.

కాగా శక్తి అభావము మున్నగునవి బుద్ధిచే ద్రవ్యరూపములుగా నిరూపింపబడగా వానికి శక్తి సంభవించును. ఆ స్థితిలో శక్త్యాకరోతి, ధననాశంకరోతి అను రీతిని కారకములు కాగలవు. అంతియేకాని అభావము శక్తియు స్వస్వరూపమున కారకములు కానేరవు. అట్లు కాకున్న అనవస్థా దోషము కలుగును.

కాబట్టి బుద్ధిచే నిర్మింపబడిన ద్రవ్యరూపములగు శక్తి మున్నగువానికి శక్త్యంతరము కలుగును.

**విశేషము**— ఈ కారికలో 'సన్' అనునది దృష్టాంతముగా జూపబడినది.

బాహ్యప్రపంచమున సత్తుగా ఉన్న వస్తువు బోలె లేని వస్తువుకూడ బుద్ధిచే నిర్మింపబడినదై శాబ్దవ్యవహారమునకు కారణము కాగలదు. ॥3॥

అవతారిక— పదార్థములు కారకములగుటలో లోకసిద్ధములగుటయే కారణము కాదు. లోకమున అవి లేకున్నను బుద్ధిచే భావింపబడిన పదార్థములే సాధనములు (కారకములు) కాగలవు అను పై చూపబడిన అర్థమునందు మహాభాష్యకారుని సమ్మతిని జూపుచున్నాడు.

శ్లో॥ బుద్ధ్యా సమాహితైకత్వాన్ పఞ్చాలాన్ కురుభిర్యదా ।
ఘనర్విభజతే వక్తా తదాఽపాయః ప్రతీయతే ॥ 4

వక్తా = మాటలాడువాడు, అనగా శబ్దమును ప్రయోగించువాడు, యదా = ఎప్పుడు, బుద్ధ్యా= బుద్ధిచే అనగా బుద్ధిపూర్వకముగా, కురుభిః=కురుదేశమునం దున్నవారితో, సమాహితైకత్వాన్ = కూర్చబడిన ఏకత్వముకల, పఞ్చాలాన్ = పంచాల దేశస్థులను, పునః = మరల, విభజతే = విభజించునో అనగా వేరు చేయునో, తదా = అపుడు, అపాయః = అపాయము అనగా రెండు వస్తువులు కల విభాగము, ప్రతీయతే = తెలియబడగలదు.

వివరణము— 'వృక్షాత్పర్ణం పతతి' (చెట్టునుండి ఆకు రాలుచున్నది) అను చోటున 'ధ్రువమపాయేఽపాదానమ్' (1-4-24). కలసియున్న రెండు వస్తువులకు విభాగము కలుగగా వానిలో స్థిరమగునది అపాదాన సంజ్ఞకమగును అను సూత్రముచే వృక్షమునకు అపాదాన సంజ్ఞ కలుగగా 'అపాదానే పఞ్చమీ' (2-3-28) అను సూత్రముచే వృక్షశబ్దముకంటె పంచమీ విభక్తి ప్రవర్తించుచున్నది. కురుభ్యః పఞ్చాలాః అభిరూపతరాః. (పంచాలదేశపువారు కురుదేశపువారి కంటె మిక్కిలి అందము కలవారు) అనుచోట కురు శబ్దముకంటె అపాదానార్థమున పంచమి సిద్ధింపకున్నది. ఏలయన, వృక్షమునకు పర్ణమునకు సంబంధమున్నట్లు కురుపంచాలులకు సంయోగ సంబంధము లేదు. అందుచే పాణిని 'పఞ్చమీ విభక్తే' (2-3-42) అను సూత్రముచే పంచమీ విభక్తిని విధించెను (భేదము భాసించునపుడు నిర్ధార్యమాణమునకు పంచమి కలుగును).

తాత్పర్యము— వృక్షమునకు పర్ణమునకువలె కురుపంచాలులకు సంయోగము దాని మూలమున ఏకత్వము లేకున్నను శబ్దములను ప్రయోగించువాడు తన బుద్ధిలో వారలకు ఏకత్వమును కల్పించుకొనును దాని మూలమున వారలకు సంయోగము ఏర్పడినట్లు వక్త భావించును. తరువాత వారలలో పంచాలదేశస్థులు అధికమగు సౌందర్యము కలవారని భావించి వారలను కురుదేశస్థులతో వేరుచేయును. కాగా బాహ్యప్రపంచమున వారలకు సంయోగము లేకున్నను బుద్ధి కల్పితమగు సంపర్కము దాని మూలమున విభాగము కలుగుటచే కురుదేశస్థులకు 'ధ్రువమపాయేఽపాదానమ్' అను సూత్రము చేతనే అపాదాన సంజ్ఞ పంచమియు సిద్ధించును. అందుచే 'పంచమీ విభక్తే' అను సూత్రము ఆరంభింప నక్కరలేదు. ఈ యర్థమును భాష్యకారుడు వక్కాణించెను.

కాగా బుద్ధికల్పితములగు అర్థములను స్వీకరించి కారకములు ప్రవర్తింపగలవు అను నర్థము పై రీతిని భాష్య సమ్మతమే. ॥4॥

*అవతారిక*— పై యర్థమున మరియొక భాష్యమును ప్రమాణముగా జూపుచున్నాడు.

**శ్లో॥ శబ్దోపహితరూపాంశ్చ బుద్ధేర్విషయతాంగతాన్ ।**
**ప్రత్యక్షమివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే ॥ 5**

శబ్దోపహితరూపాన్ = శబ్దముచే కూర్చబడిన స్వరూపము కలిగినట్టియు, చ = కనుకనే, బుద్ధేః = బుద్ధికి, విషయతామ్ = విషయత్వమును, గతాన్ = పొందనట్టి, అనగా బుద్ధికి గోచరించిన, కంసాదీన్ = కంసుడు మున్నగువారిని, ప్రత్యక్షమ్ + ఇవ = ప్రత్యక్షమగు పదార్థమునువలె, సాధనత్వేన = సాధనమునుగా, అనగా ప్రత్యయము కలుగునపుడు ఉపయోగించెడి కారకమునుగా, మన్యతే = (భాష్యకర్త) తలంచుచున్నాడు.

*వివరణము*— 'హేతుమతిచ' (3-1-26). ప్రేరణార్థమున ధాతువుకంటె 'ణిచ్' ప్రత్యయము కలుగును అను సూత్రముచే పచ్ మున్నగు ధాతువులకంటె ణిచ్ ప్రత్యయము ప్రవర్తింపగా 'పాచయతి' మున్నగు రూపము లేర్పడును. కంసవధ శబ్దముకంటె ణిచ్ ప్రత్యయము చేరి కంసంఘాతయతి (కంసవధ పురాణము చెప్పుచున్నాడు) అను రూపమేర్పడవలెను. కాని ఇచట కంసుడు, అతనిని చంపెడి కృష్ణుడు పురాణము చెప్పు సమయమున లేనందున ఆ యర్థములు ప్రత్యయోత్పత్తికి సాధనములు కానందున పై ప్రయోగము సూత్రముచే సిద్ధింపకున్నదని భావించి కాత్యాయనుడు "ఆఖ్యానాత్ కృతస్తదాచష్టే" (పురాణ ప్రసిద్ధమగు గాథను బోధించెడి కృదంతము కంటె 'చెప్పుచున్నాడు' అను అర్థమున ణిచ్ ప్రత్యయము కలుగును) అను వచనమును ఆరంభించెను. భాష్యకర్త ఆ వార్తికమును ప్రత్యాఖ్యానించెను. అనగా వార్తికము లేకున్నను సూత్రముచేతనే పై ప్రయోగము కుదురగలదు అని చెప్పెను.

*తాత్పర్యము*— పౌరాణికుడు పురాణము చెప్పునపుడు గతించిన కంసాదుల రూపమును గుణములను వారు చేసిన పనులను శబ్దములచే బోధించును. వినువారికి ఆ శబ్దములవలన కంసాదులు ఒక రూపమున బుద్ధిలో భాసించెదరు. కంసాదులు భీకరముగను క్రూర స్వభావము కలిగినట్లును వినువారు భావింతురు. విశాల ఫాలము, బొద్దు మీసములు, ఆజానుబాహువులు మున్నగునవి అన్నియు సభ్యుల హృదయాలలో ప్రతిఫలించును. అట్లే, పీతాంబరము, శంఖ చక్రాదులు ధరియించిన కృష్ణుడు శ్రోతల బుద్ధిలో భాసించును. పురాణము చెప్పు సమయమున కంసాదులు ప్రత్యక్షముగా కాన్పింపకున్నను పై రీతిని వారు శ్రోతలకు ప్రతిఫలించెదరు. కాగా బుద్ధిస్థుడగు కంసుని బుద్ధిస్థుడగు కృష్ణుడు చంపుచున్నట్లు భావింపగా సూత్రముచేతనే ణిచ్ ప్రత్యయము సిద్ధించును. కాబట్టి వేరు వార్తికము చేయనక్కరలేదు. ఇది యంతయు భాష్యకారుని నిర్ణయము.

కపాలములు అవయవములు, ఘటము అవయవి. దారములు అవయవములు, వస్త్రము అవయవి. దీనికి సమవాయము సంబంధము. ఇచట అవయవములకు అవయవికి భేదము అనగా ఇవికపాలములు, ఇది ఘటము; ఇవి దారములు, ఇది వస్త్రము అని వేరుచేసి చూపుట సాధ్యముకాదు. కాబట్టి ఇచట అవయవములనుట ముఖ్యమే. ॥ 17,18 ॥

*అవతారిక*—వైశేషికులమతము నాశ్రయించి 14, 15, 16, 17, 18 శ్లోకములచే జాతి సార్వత్రికమనియు, అదియే ఎల్ల శబ్దములకు వాచ్యము కాగలదనియు నిరూపించెను.

ఇప్పుడు విజ్ఞానవాది మతమునాశ్రయించి జాతి సార్వత్రికమనియు అదియే ఎల్ల శబ్దములకు వాచ్యమనియు చూపుచున్నాడు.

**శ్లో॥ అనుప్రవృత్తిరూపాం యాంప్రఖ్యాతా మాకృతిం విదుః।**
**కేచిద్వ్యావృత్తిరూపాంతు ద్రవ్యత్వేన ప్రచక్షతే॥** 19

కేచిత్ = కొంతమంది, అనగా జ్ఞానము తప్పమరియొక పదార్థములేదు, బాహ్య ప్రపంచము శూన్యమే అను అభిప్రాయముకల విజ్ఞానవాదులు, యామ్ = ఏజాతిని, అనుప్రవృత్తి రూపామ్ = అనుగతమగు అనగా ఏకా కారమగు, ప్రఖ్యాతామ్ = బుద్ధిని, ఆకృతిమ్ = ఆకృతినిగా, విదుః = తెలిసికొనుచున్నారు. అదియే వ్యాపకము. ఎల్ల శబ్దములకు వాచ్యము.

వ్యావృత్తిరూపామ్ + తు = ఏకాకారముకాక విరూపమగుబుద్ధిని మాత్రము, ద్రవ్యత్వేన = ద్రవ్యరూపమున, అనగా ద్రవ్యమని, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

బుద్ధితప్ప మరియొక పదార్థములేదు. అవిద్యావశమున అదియే బాహ్యప్రపంచ రూపమున భాసించును. దృశ్యమునకు బుద్ధిస్థమునకు అభేదమును అంగీకరించుటచే ఆరెంటికి సామాన్యముండుటవలన ఏకాకారబుద్ధి కలుగును. శబ్దముసుచ్చరింపగా అట్టి ఆకారము కలిగిన బుద్ధి జనియించును. ఆ ఆకారమే శబ్దమునకు వాచ్యమగును. బుద్ధి వాచ్యము కాదు. ఆ ఆకారము బాహ్యముకావచ్చును. కాకపోవచ్చును. శబ్దవాచ్యమగుటలో క్షతిలేదు.

విభిన్నరూపమగు బుద్ధిలో భాసించినది ద్రవ్యముకాగలదు ఇదియే జాతికి వ్యక్తికి కల భేదము.

కాగా విజ్ఞాన వాదమునగూడ ఆకృతి అనగా జాతిసార్వత్రికము, శబ్దవాచ్యము అని సిద్ధించుచున్నది. ॥19॥

*అవతారిక*—వస్తువులకు దేశమునుబట్టి కాలమునుబట్టియు భేదము సిద్ధించును, దేశకాలములను అపేక్షింపని యెడల వస్తువులు అభిన్నములే యగును. ఇట్లు వస్తువులకు అభేదము స్వాభావికమగుచుండగా, దానిని సమర్థించుటకై అతిరిక్తమగు జాతిని కల్పించుటకై ఇంతవేల ప్రయత్నింపవలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ భిన్నా ఇతి పరోపాధిరభిన్నా ఇతి వాపునః।**
**భాతవ్మాసు ప్రపఞ్చోఽయం సంసృష్టేష్వేవ జాయతే॥** 20

కాగా బాహ్యపదార్థము లేకున్నను బుద్ధి పరికల్పితమగు పదార్థమునుబట్టి సాధన వ్యవహారము కలుగుచున్నదనుటలో భాష్యకారుని పై యత్నము ప్రమాణము కాగలదు.

విశేషము—— మన్యతే = తలంచుచున్నాడు. ఇచట భాష్యకర్తయగు పతంజలి కర్త.

ఈ ప్రయత్నమును గ్రహించియే నలధర్మరాజాదులు ఉత్తమ పరిపాలకులనియు, దుర్యోధనాదులు అధార్మికులనియు ఈ నాట ప్రజలు గుర్తించుచున్నారు. అట్లుకాకున్న నల ప్రభృతుల చరిత్రము మనకు అర్థము కాకపోయెడిని బుద్ధికల్పితమగు అర్థమునే శబ్దము బోధించును. అచట బుద్ధికల్పితమగు అర్థములే కారకములు కాగలవు. ॥5॥

అవతారిక—— సాధన వ్యవహారము బుద్ధికల్పితమనుటకు మరియొక ప్రయోజనము కూడ కలుగుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ బుద్ధిప్రవృత్తిరూపం చ సమారోప్యాభిధాతృభిః ।**
**అర్థేషు శక్తిభేదానాం క్రియతే పరికల్పనా ॥ 6**

చ = మరియు, అభిధాతృభిః = శబ్దమును ప్రయోగించెడి వ్యవహర్తలచే, బుద్ధిప్రవృత్తిరూపమ్ = బుద్ధియొక్క, వ్యాపారము యొక్క అనగా 'ఇది యిట్లు' అనెడి నియతమగు ఆకారమును, అర్థేషు = బాహ్యములగు ఘటపటాద్యర్థములయందు, సమారోప్య = ఆరోపించి, శక్తిభేదానామ్ = కారక భేదములయొక్క, అనగా బుద్ధిస్థములగు కారకశక్తుల కంటె బాహ్యములగు కారకములు భిన్నములు అనెడి పరికల్పనా = విచిత్రమగు కల్పన, క్రియతే = చేయబడుచున్నది.

శబ్దముల నుపయోగించెడి మనుష్యులు ముందుగ బుద్ధిచే నిర్మింపబడిన వస్తువులకే సాధ్యసాధనమును గ్రహించెదరు పిమ్మట అట్టి సాధ్యసాధన భావమును బాహ్యవస్తువుల యందు ఆరోపించెదరు. కాగా వస్తువులకు గల సాధ్యసాధన భావము రెండు విధములుగా గుర్తింపబడుచున్నది. 1. బుద్ధికల్పితము, 2. దాని మూలమున కలిగెడి బాహ్య వస్తువులకు కలిగినది. పిమ్మట 'బుద్ధికల్పితము సాధ్యసాధన భావము' అను భావమును మరచి బాహ్య వస్తువులకు గల సాధ్యసాధనమే స్వాభావికమని భావించెదరు. శక్తి భేదమనగా బుద్ధిస్థములగు శక్తులకంటె బాహ్యములగు శక్తులు భిన్నములని భావము. ఉదా : కాష్ఠైఃపచతి, (కట్టెలతో వండుచున్నాడు) కట్టెలకు వంటకు సాధ్యసాధనము బుద్ధికల్పితము. దీనిని లోకమున గల కాష్ఠములకు, వంటకుకూడ సంబంధింపచేయగా వానికి ఆ సంబంధము కలుగునట్లు మనము భావించుచున్నాము. ఈ రీతిగ బుద్ధిస్థ పదార్థ సంబంధమునకు బాహ్యస్థ పదార్థ సంబంధమునకు సంవాదము అనగా ఐక్యము దేనివలన కలుగునో, ఆ వాక్యము ప్రమాణము. దాని యర్థము వ్యవహారమున కుపకరించును. ఆ రెంటికి సంవాదము లేనిచో ఆ వాక్యము ప్రమాణము కానేరదు. ఆ వాక్యమువలన కలిగెడి అర్థము వ్యవహారనుము

కలిగింపనేరదు. నిజముగ అది వాక్యము కూడ కానేరదు. ఉదా : పర్వతేన పచతి (కొండచే వండుచున్నాడు) అను రీతిని బుద్ధిలో ఎన్నియో అర్థములు భాసించును. కాని బాహ్యప్రపంచమున కొండ పాకమునకు సాధనము కాసందున అది విసంవాదియగుటచే అప్రమాణమే యగును.

కాబట్టి బుద్ధికల్పిత పదార్థజాతమంతయు ప్రమాణము కానేరదు. ఏది లోకదృష్టమగు అర్థముతో సంవాదమును బొందునో అది ప్రమాణము. విసంవాదియగుచో అప్రమాణము. పై వ్యవస్థకు బుద్ధియొక్క కల్పనయే తోడ్పడుచున్నది. ॥౬॥

*అవతారిక*— సాధ్యసాధన భావము బుద్ధి పరికల్పితమనుటకు మరియొక ప్రయోజనము కూడ కలదని చూపుచున్నారు.

శ్లో॥ వ్యక్తౌ పదార్థే శబ్దాదేర్జన్యమానస్య కర్మణః।
సాధనత్వం తథాసిద్ధం బుద్ధిరూపప్రకల్పితమ్ ॥ 7

తథా = అట్లే. వ్యక్తౌ + పదార్థే = వ్యక్తియే శబ్దవాచ్యము అను పక్షమున ఘటః, పటః మున్నగు శబ్దములు కడవ మున్నగు వ్యక్తులనే బోధింపగలవు, జాతి బోధకములు కానేరవు అను పక్షమున, జన్యమానస్య = పుట్టుచున్న అనగా నిర్వర్త్యమగు, శబ్దాదేః = శబ్దము మున్నగు అనగా శబ్దం కరోతి, సంయోగం కరోతి మున్నగు ప్రయోగములలో నుండెడి శబ్దము సంయోగము మున్నగు, కర్మణః = కర్మకు, బుద్ధిరూప ప్రకల్పితమ్ = బుద్ధియొక్క ఆకారముచే కల్పింపబడిన, సాధనత్వమ్ = కారకత్వము, సిద్ధమ్ = సిద్ధించుచున్నది.

*వివరణము*— 1. ఘటః, పటః మున్నగు శబ్దములు ఘటత్వము, పటత్వము మున్నగు జాతులను బోధించును అను అభిప్రాయము జాతి సముద్దేశమున నిర్ణయింపబడినది. ఆ పక్షమున ఘటత్వము మున్నగు జాతుల సంబంధము అతీతమగు ఘటవ్యక్తులకు రాబోవు ఘటవ్యక్తులకు సంబంధించియున్నందున భావి ఘటాదులు కూడ మనకు గోచరించును. కాబట్టి ఘటం కరోతి (కడవను చేయుచున్నాడు) మున్నగు చోటులయందు ఘటాదులకు కర్మ సంజ్ఞ సిద్ధించును. జాతి శక్తి పక్షము వాజప్యాయనమునికి సమ్మతము.

వ్యాడిమునియొక్క మతమున ఘటాది శబ్దములు జాతి బోధకములు కానేరవు. ద్రవ్యబోధకములు, అనగా ఘటాదిశబ్దములు వ్యక్తి వాచకములు. ఈ పక్షమున భావి వ్యక్తులకు కర్మ సంజ్ఞ లభింపవలెనన్న బుద్ధిస్థములగు ఘటాదులకే సాధనత్వము అంగీకరింపవలెను.

2. నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యము అను రీతిని కర్మ మూడు విధములని ఈ ప్రకరణముననే భర్తృహరి చెప్పబోవుచున్నాడు. వానిలో నిర్వర్త్యమునకు సాధనత్వము బుద్ధియందున్న పదార్థమునుబట్టియే సిద్ధించును.

*తాత్పర్యము*— శబ్దం కరోతి (ధ్వని చేయుచున్నాడు), సంయోగం కరోతి

(సంయోగమును కలిగించుచున్నాడు) మున్నగు చోటులయందు శబ్దము మున్నగునవి ఈ వాక్యమును ప్రయోగించు సమయమున సిద్ధముగాలేనందున వానికి కారకత్వము సిద్ధింపకున్నది. జాతి పక్షమును ఆశ్రయించిన, అది సిద్ధించును. కాని వ్యక్తి పక్షమున అది కుదురదు. అందుచే బుద్ధిస్థమగ శబ్దాదులను పురస్కరించుకొనియే వానికి సాధనత్వము చెప్పవలెను. అందును నిర్వర్త్యము సాధనము కావలెనన్న బుద్ధిస్థ పదార్థమునకే అది సంభవించును.

కాబట్టి బుద్ధిస్థమగు పదార్థము సాధన వ్యవహారమునకు సమర్థమని చెప్పక తప్పదు.

*విశేషాంశము*— కారికలో 'జన్యమానస్య' అను పదముచే నిర్వర్త్య కర్మ గ్రహింపబడుచున్నది. అది పూర్వము సిద్ధముకానందున బుద్ధికల్పన అవసరమగుచున్నది. ఉదా: 'ఘటం కరోతి' (కడవను తయారుచేయుచున్నాడు).

వికార్యకర్మము సిద్ధవస్తువే యగును. ఉదా: కాష్ఠంభస్మకరోతి (కఱ్ఱను భస్మముగా చేయుచున్నాడు). ఇచట కాష్ఠము వికార్యకర్మ, భస్మము నిర్వర్త్యకర్మ. ప్రాప్యకర్మయు సిద్ధముగనే యుండును. ఉదా: గ్రామం గచ్ఛతి (గ్రామమును గూర్చి వెళ్ళుచున్నాడు), ఆదిత్యం పశ్యతి (సూర్యుని చూచుచున్నాడు) 45, 46, 47, 48, 49, 50, 51 శ్లోకములచే ఈ ప్రకరణముననే వీనికి లక్షణము చెప్పబడుచున్నది. ॥7॥

*అవతారిక*— బుద్ధికల్పితములగు పదార్థములకు సాధనత్వము యుక్తమగుచున్నదని యింతవరకు చూపియున్నాడు. ఇట్టి కల్పన కేవలము సాధనత్వమునకే కాక పదార్థ మాత్రమునకేయని భాష్య ప్రామాణ్యమున జూపుచున్నాడు.

**శ్లో॥ స్వతన్త్రపరతన్త్రత్వే క్రమరూపం చ దర్శితమ్ ।**
**నిరీహేష్వపి భావేషుకల్పనోపనిబన్ధమ్ ॥ 8**

నిరీహేషు + అపి = అచేతనములగు నట్టియు, భావేషు = పదార్థములయందు, స్వతన్త్రపరతన్త్రత్వే = కర్తృత్వము, కరణత్వాదికము, క్రమరూపమ్ + చ = క్రియారూపమును, కల్పనోపనిబన్ధనమ్ = బుద్ధిచే కృతమగు కల్పనయే కారణము కలదిగా, (భాష్యకారప్రభృతిభిః = అద్వైత సిద్ధాంతమును అవలంబించినట్టి భాష్యకారుడు మున్నగువారిచే) దర్శితమ్ = చూపబడినది.

*వివరణము*— "ధాతోః కర్మణః సమానకర్తృకాదిచ్ఛాయాం వా" (3-1-7) అను సూత్రముచే (ధాతువుకంటె ఇచ్ఛార్థమున 'సన్' ప్రత్యయము కలుగును) 'జిగమిషితి' (వెళ్ళుటకు కోరుచున్నాడు: గన్తుమిచ్ఛతి) మున్నగునవి ఉదాహరణములు. ఇచ్ఛ అనగా కోరిక, అది చేతనధర్మము. అట్టితరి 'కూలంపిపతిషతి' (తటము అనగా ఒడ్డు పతనమును కోరుచున్నది: పతితుమిచ్ఛతి) మున్నగు ప్రయోగములు సిద్ధింపకున్నవి. అచేతనమగు ఒడ్డు మున్నగువానికి ఇచ్ఛ సంభవింపదుకదా! పై ప్రయోగమును సిద్ధింపచేయుటకై "ఆశఙ్కా-

యాం సన్వక్తవ్యః" (సిద్ధముగానున్నది అను అర్థమున 'సన్' ప్రత్యయము చెప్పతగినది) అను వచనము ఆరంభింపబడినది. ఆ వచనము అక్కరలేదు, ప్రతిపదార్థము చేతనమే. కాబట్టి కూలమునకు ఇచ్ఛ, కర్తృత్వము మున్నగునవి అన్నియు సంభవింపగలవు అని కాత్యాయనుడు, పతంజలియు (సర్వస్యచేతనా వత్త్వాత్) నిర్ణయించిరి.

తాత్పర్యము— అద్వైత సిద్ధాంతమున ఆత్మకంటె ఇతరమగు వస్తుజాతము మిథ్య. అవిద్యాదశయందును సత్కార్యవాదమునగాని, అసత్కార్యవాదమునగాని కార్యకారణ భావము *కుదురదు. కాబట్టి లేనివస్తువులనే బుద్ధిబలముచే ఉన్నట్లు చూపి వానినే లోకులు వ్యవహరించుచున్నారు. కర్త, కర్మ మున్నగు కారకములలో కర్త స్వతంత్రమైనది. కర్మ, కరణము మున్నగునవి అస్వతంత్రములు, పాకము మున్నగు క్రియలు క్రమముకలవి. ఇవి యన్నియు బుద్ధికల్పితములే. కూలంపిపతిషతి మున్నగు ప్రయోగములు ఎన్నియో కల్పనామూలమున సిద్ధించుచున్నవి.

కాబట్టి క్రియాకారకములేకాక పదార్థములన్నియు బుద్ధికల్పితములే. కాత్యాయన పతంజలులు అద్వైత సిద్ధాంతమును అనుసరించినవారై పై సిద్ధాంతమును నిర్ణయించిరి.

శక్తి **అతిరిక్తమగు పదార్థము అనెడి పూర్వమీమాంసకుల మతము చొప్పున 'శక్తిః కారకమ్' అను పక్షము ఈ కారికయందు నిరూపింపబడినది. ॥8॥

అవతారిక— ఇటుపైని శక్తి §అతిరిక్తపదార్థము కాదు అనెడి వైశేషికుల మతమును ఆశ్రయించి కారకస్వరూపమును జూపుచున్నాడు.

శ్లో॥ శక్తయః శక్తిమన్తశ్చ సర్వేసంసర్గవాదినామ్ ।
భావాస్తేష్వస్వశబ్దేషు సాధనత్వం నిరూప్యతే ॥ 9

సంసర్గవాదినామ్ = వైశేషికుల (మతమున), సర్వే = ఎల్ల, భావాః = పదార్థములు, శక్తయః = శక్తిరూపములు, శక్తిమన్తః + చ = శక్తికలవియు, అనగా ఉభయరూపములుగా, (అఙ్గీక్రియన్తే) = అంగీకరింపబడుచున్నవి.

---

* ఈ యర్థము సంబంధ సముద్దేశమున 61 నుంచి 16 శ్లోకములచే గ్రంథకర్త నిర్ణయించెను. అందుచేతనే అద్వైతవాదము గ్రంథకర్త స్వమతముగా జూపుచున్నాడు.

** పూర్వమీమాంసకులు ఆరు పదార్థములను అంగీకరించిరి. 1. ద్రవ్యము, 2. గుణము, 3. కర్మము, 4. సామాన్యము, 5. శక్తి, 6. అభావము. వీరు ద్రవ్యముకంటె వేరుగా 'శక్తి'ని అంగీకరించుచున్నారు.

§ వైశేషికులు అనగా కణాదమతము వారు ఏడు పదార్థములను ఒప్పిరి. 1. ద్రవ్యము, 2. గుణము, 3. కర్మ, 4. సామాన్యము, 5. విశేషము, 6. సమవాయము, 7. అభావము. వీరి మతమున శక్తి అతిరిక్తపదార్థము కాదు. ద్రవ్యముయొక్క స్వరూపము. సహకరించునవియు కూడ 'శక్తి' అనియే వీరు భావించుచున్నారు.

ఘటము నిష్పన్నముకావలెనన్న, మన్ను నీరు దండము మున్నగు వస్తువులు అపేక్షితములగుచున్నవి. వానిలో నీరు మున్నగునవి సహకారి కారణములు. ఇవి శక్తిరూపములు. మన్ను శక్తిమంతము ఇట్లే సహకారులకు గూడ ఉదకమునకు కారణమగు ద్వ్యణుకాదులు శక్తిరూపములు. వాని రూపము శక్తిమంతము. కాగా కారణము శక్తులుగాను, రూపాదులు శక్తిమత్తులుగాను ఉన్నందున పదార్థములన్నియు శక్తిరూపములు, శక్తిమంతములు కూడ కాగలవు. వీనికంటె వేరుగా శక్తియనునది అతీంద్రియ పదార్థము లేదు.

అస్వశబ్దేషు = స్వశబ్దముచే బోధింపబడని, తేషు = అట్టి శక్తిమంతములయందు, సాధనత్వమ్ = కారకత్వము, నిరూప్యతే = (శాస్త్రమున) చూపబడుచున్నది.

శక్తిమంతము సాధనము, ఆ సాధనత్వము అపాదాన, సంప్రదాన, కర్మ, కర్త, అధికరణ అను పదములచే ఎన్నడు బోధింపబడదు. పంచమి మున్నగు విభక్తి ప్రత్యయముల చేతనే ఆసాధన భావము బోధింపబడును.

కారికలో స్వశబ్దము అపాదానాది శబ్దపరము. ఘటము ధర్మి, దానియందున్న ఘటత్వము ధర్మము. ఈ ధర్మమునకు ధర్మికి సమవాయము సంబంధము. అట్టి సంబంధ వశమున ఆ రెంటికి అభేదము సిద్ధించును అని వైశేషికులు విశ్వసింతురు. సమవాయము సంబంధముగా లేకున్న పదార్థములకు గూడ మరియొక విధమగు సంయోగాది సంబంధమును వారు అంగీకరింతురు. సంబంధములేని పదార్థ ముండనేరదు. కాబట్టి 'సంసర్గవాది' యనగా వైశేషిక మతానుయాయి. ॥9॥

*అవతారిక*— పదార్థమనగా ఏది? దేనికి దేనియందు శక్తి? అను ప్రశ్నకు ఉదాహరణ పూర్వకముగా సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఘటస్య దృశికర్మత్వే మహత్త్వాదీని సాధనమ్।**
**రూపస్యదృశికర్మత్వే రూపత్వాదీని సాధనమ్॥** 10

ఘటస్య = ఘటమునకు, దృశికర్మత్వే = దృశిధాతువునకు అర్థమగు దర్శన క్రియలో కర్మత్వము కలుగవలెనన్న, మహత్త్వాదీని = *మహత్వము. ద్వ్యణుకాదికము రూపము మున్నగునవి, సాధనమ్ = సాధనములగుచున్నవి.

రూపస్య = రూపమునకు, అనగా ఘటగతమగు రూపమునకు, దృశికర్మత్వే = దర్శనమున కర్మత్వము కలుగవలెనన్న, రూపత్వాదీని = **రూపత్వము మున్నగునవి, సాధనమ్ = సాధనములగుచున్నవి.

---

* కణాదుడు ఈ రీతిగ సూత్రించెను. "మహత్యనేక ద్రవ్యవత్త్వా ద్రూపాచ్చోపలబ్ధిః" (4–1–16).

** కాణాదసూత్ర మిట్లున్నది. "అనేక ద్రవ్యసమవాయా ద్రూపవిశేషాచ్చ రూపోపలబ్ధిః" (4–1–8).

ఘటమునందు మహత్త్వమున్నగునవి సమవేతములై యున్నవి. కనుక అవి సాధనములు కాగలవు. అనగా శక్తిమంతములు కాగలవు. ఘటాదికము శక్తి కాగలదు. ఘటం పశ్యతి.

అట్లే ఘటమునందున్న రూపము ప్రత్యక్షము కావలెనన్న ఘటరూపం పశ్యతి, అనుచోట రూపమునందు సమవేతమగు రూపత్వాదికము సాధనము.

కాగా పదార్థములన్నియు శక్తులు, శక్తిమంతులు గూడ కాగలవు. ॥10॥

*అవతారిక* — రసము మున్నగునవి గూడ ఉభయరూపములు కాగలవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్వైః సామాన్యవిశేషైశ్చ శక్తిమన్తో రసాదయః ।**
**నియతగ్రహణా లోకే శక్తయస్తాస్తథాశ్రయైః ॥** 11

రసాదయః = రసము మున్నగునవి అనగా రసము, గంధము, స్పర్శ, శబ్దము మున్నగునవి, స్వైః = స్వరూపములచేతను, సామాన్య విశేషైః + చ = రసత్వము మున్నగు సామాన్యముల చేతను, తీపి పులుపు మున్నగు విశేషములచేతను, శక్తిమన్తః = శక్తిమంతములై, తథా = అట్లే, ఆశ్రయైః = ఆశ్రయములచే, రసాదులకు ఆశ్రయమగు ద్రవ్యములచే, రసత్వాదులకు ఆశ్రయములగు రసములచేతను, నియతగ్రహణాః = నియతమగు జ్ఞానమును కలిగించునవియై, లోకే = లోకమున, (దృశ్యన్తే) = చూడబడుచున్నవి.

రసం రసయతి, గన్ధం జిఘ్రతి, స్పర్శం స్పృశతి, శబ్దం శృణోతి మున్నగు ప్రయోగములలో గూడ రసాదులు శక్తులుగాను శక్తిమంతములుగాను గ్రహింపబడుచున్నవి.

ఘటము మున్నగు ద్రవ్యము ఘటరూపమున నీలం పశ్యతి అనుచోట గుణవిశిష్ట రూపమున, గచ్ఛతి అనుచోట క్రియా విశిష్టరూపమున గోచరించును. కాగా ద్రవ్యము నియత రూపమునకాక అనియతరూపమున గోచరించును. రసాది గుణములు అట్లుకాక నియతరూపమున భాసించును. ॥11॥

*అవతారిక* — మరికొన్ని స్థలములలో సాధన భావమును జూపుచున్నాడు.

**శ్లో॥ ఇన్ద్రియార్థమనః కర్తృసంబన్ధః సాధనం క్వచిత్ ।**
**యద్యదా యదనుగ్రాహి తత్తదా తత్ర సాధనమ్ ॥** 12

A. క్వచిత్ = కొన్ని స్థలములలో, ఇన్ద్రియార్థమనః కర్తృ సంబన్ధః = ఇంద్రియము యొక్క, వస్తువుయొక్క, మనస్సు యొక్క, ఆత్మయొక్కయు సంయోగము, సాధనమ్ = సాధనమగును.

ఘటం పశ్యతి అనుచోట ఘట ప్రత్యక్షము కలుగవలెనన్న ఆత్మ, మనస్సు, ఇంద్రియము ఘటము, వీనికి సంయోగము కారణమగును.

సుఖదుఃఖాదుల ప్రత్యక్షమున ఆత్మ మనస్సంగమే కారణము. అందుచే 'క్వచిత్' అను పదము ప్రయుక్తమాయెను.

B. వస్తువు శక్తి 'ద్రవ్య ప్రత్యక్షమున మహత్త్వాదులు సాధనము' అను రీతిని లెక్కించి చెప్పనక్కర లేదు సామాన్యరూపమున సాధనభావము చెప్పనగునని వ్యాప్తిని చూపుచున్నాడు.

యత్ = ఏది, యదా = ఏ కాలమున, యత్ = దేనిని, అనుగ్రాహి = అనుగ్రహించునో, తత్ = అది, తదా = ఆ కాలమున, తత్ర = దానియందు, సాధనమ్ = సాధనమగును.

ద్రవ్యము, గుణము, క్రియ అను నియమము లేదు. ఏది దేనికి సహకరించునో అది దానికి సాధనమగును. ఈ యర్థము 16, 17 కారికలలో స్పష్టము కాగలదు. ॥12॥

*అవతారిక*— సాధనము, కారకము అనునవి రెండు పర్యాయపదములు. అట్టి కారకము క్రియా మూలకము. అందుచేతనే కారకము క్రియయందే అన్వయించును. క్రియతో అన్వయించెడి కారకము విలక్షణమైనది. అనగా విభక్తి ప్రత్యయములచే బోధింపబడినదే నిజమగు కారకము. కర్మ, అపాదానము మున్నగు శబ్దములచే బోధింపబడునది అట్టిది కాదు అని చూపుచున్నాడు.

శ్లో॥ స్వశబ్దైరభిధానే తు స ధర్మో నాభిధీయతే ।
విభక్త్యాదిభిరేవాసావుపకారః ప్రతీయతే ॥ 13

సః + అ, ధర్మః = శక్తిరూపమగు ధర్మము, స్వశబ్దైః = తన శబ్దములచే అనగా కర్మ కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము, కర్త అను శబ్దములచే, అభిధానే + తు = తెలుపబడినచో, న + అభిధీయతే = బోధింపబడదు.

ఉపకారః = క్రియకు ఉపకారకమగు, అసౌ = ఈ ధర్మము, విభక్త్యాదిభిః + ఏవ = విభక్తి ప్రత్యయములచే, అన్తరా, అన్తరేణ మున్నగు పదములచేతనే, ప్రతీయతే = తెలియబడుచున్నది. ఉపకారశబ్ద ఉపకారకపరము.

విభక్తి ప్రత్యయములు, అన్తరా, అన్తరేణ, వినా, నానా మున్నగు విభక్తి నిమిత్తములగు పదములచేతను క్రియాన్వయయోగ్యమగు అర్థము చెప్పబడును. ॥13॥

*అవతారిక*— క్రియలకు ఉపకారకమగు సాధన భావము ఎట్టిది ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నిమిత్తభావో భావానా ముపకారార్థ మాశ్రితః ।
నతి రావర్జనేత్యేవం సాధనత్వేన కల్ప్యతే ॥ 14

భావానామ్ = సాధ్యస్వభావకమగు క్రియలకు, ఉపకారార్థమ్ = ఉపకారము నిమిత్తమై, ఆశ్రితః = ఆశ్రయింపబడిన, నిమిత్తభావః = నిమిత్తత్వము, నతిః = నమనము అనగా ఉపకారము చేయుటకు ఆభిముఖ్యము, ఆవర్జనా = అంగభావమున తనను సమర్పించుట, ఇతి + ఏవమ్ = ఇట్టి శబ్దములచే బోధింపబడిన, సిద్ధః = సిద్ధ పదార్థము, సాధనమ్ = సాధనముగా, ఇష్యతే = సమ్మతమగుచున్నది.

సిద్ధపదార్థము సాధ్యమగు క్రియలకు సాధనమగును. ద్రవ్యముగాని గుణముగాని క్రియగాని ముందుగా నున్నచో సాధనము కాగలదు. ॥14॥

అవతారిక — పై రీతిని మీమాంసకమతము చొప్పున, శక్తి ద్రవ్యముకంటె భిన్నమనియు, వైశేషికమతము చొప్పున శక్తి ద్రవ్యముకంటె వేరుకాదు, అభిన్నమే అనియు నిరూపించి వైయాకరణులకు ఆ యంశమున ఆగ్రహము లేదు అని చూపుచున్నాడు.

**శ్లో॥ స తేభ్యో వ్యతిరిక్తో వా, తేషామాత్మైవ వా తథా ।**
**వ్యతిరేకముపాశ్రిత్య సాధనత్వేన కల్ప్యతే ॥ 15**

సః = శక్తిరూపమగు ధర్మము, తేభ్యః = ఆ ద్రవ్యములకంటె, వ్యతిరిక్తః + వా = భిన్నమైనను కావచ్చును, తథా = అట్లే, తేషామ్ = ఆ ద్రవ్యములకు, ఆత్మైవ + వా = స్వరూపమైనను కావచ్చును.

శక్తి ద్రవ్యములకంటె భిన్నమన్నను, అభిన్నమన్నను మాకు ఆ వాదముతో ప్రసక్తిలేదు.

కాని, వ్యతిరేకమ్ = భేదమును ఉపాశ్రిత్య = ఆశ్రయించి, సాధనత్వాయ = కారకమగుట కొరకు, కల్ప్యతే = సమర్థమగుచున్నది.

ఏది యెట్లున్నను లోకవ్యవహారము వ్యతిరేకపక్షమునే ఆదరించుచున్నది. ఉదా : ఘటస్య దృశిక్రియాయాం కర్మభావః. (ఘటము దృశి క్రియయందు కర్మయగుచున్నది) ఈ సిద్ధాంతమును బట్టియే 'శక్తిః కారకమ్' అను పక్షము వైయాకరణులు ఆశ్రయించిరి. శక్తికి శక్తిమంతునకు అభేదమును వివక్షించి శాస్త్రమున వ్యవహారము జరుగుచున్నది. 'సప్తమీ పఞ్చమ్యౌ కారకమధ్యే' అను సూత్రము శక్తియే కారకమను పక్షమునకు సాధకమగుచున్నది. ॥15॥

అవతారిక — 12 వ శ్లోకమున ఏది దేనికి తోడ్పడునో, అది దానికి సాధనము కాగలదని చెప్పెను. 'యద్యదా యదనుగ్రాహి తత్తదా తత్ర సాధనమ్' పై యర్థమునందు మహాభాష్యకారుని సమ్మతిని చూపుచున్నాడు.

**శ్లో॥ సందర్శనం ప్రార్థనాయాం వ్యవసాయే త్వనన్తరా ।**
**వ్యవసాయస్తథారమ్భే సాధనత్వాయ కల్పతే ॥ 16**

శ్లో॥ పూర్వస్మిన్ యా క్రియా సైవ పరస్మిన్ సాధనం మతా।
సందర్శనే తు చైతన్యం విశిష్టం సాధనం విదుః ॥ 17

వివరణము—"కర్మణా యమభిప్రైతి ససంప్రదానమ్" (1-4-32) అను సూత్రముచే పాణిని, (కర్త ఏ పదార్థమును కర్మతో సంబంధింపదలచెనో ఆ పదార్థము సంప్రదాన సంజ్ఞిక మగును) సంప్రదాన సంజ్ఞను విధించి, ఆ యర్థమున చతుర్థీ విభక్తిని విధించెను. ఉదా: బ్రాహ్మణాయ గాం దదాతి, ఇచట ఆవు కర్మ. దానితో బ్రాహ్మణుడు సంబంధింప తలచిన వాడు. ఆయనకు సంప్రదాన సంజ్ఞ కలుగును. పై సూత్రము చొప్పున అకర్మకధాతువుల ప్రయోగమున 'పత్యే శేతే ప్రౌఢా' (ప్రౌఢయగు యువతి భర్తకొరకు శయనించుచున్నది) సంప్రదాన సంజ్ఞ సిద్ధింపకున్నది అని భావించి కాత్యాయనుడు 'క్రియాగ్రహణమ్' (కర్త క్రియతో ఏ పదార్థముసు సంబంధింపచేయునో, అదియు సంప్రదానము) అను వార్తికమును ఆరంభించెను. తరువాత భాష్యకర్త పై సూత్రముచేతనే 'పత్యేశేతే' మున్నగుచోటులందు పత్యాదులకు సంప్రదాన సంజ్ఞ సిద్ధించును. కనుక వార్తికము వేరుగ చెప్పనక్కరలేదని సిద్ధాంతము జూపెను. కర్త తనయందున్న క్రియచే దేనిని అభిలషించునో అది కర్మయగును. కర్త అభిలషించునది ద్రవ్యము కావచ్చును, గుణము వచ్చును, క్రియయు కావచ్చును. పని చేయువాడు మనంబున ముందుగ ప్రయోజనమును భావించును. అట్టిది తనకు కావలెనని ప్రార్థించును. తరువాత దానిని నిశ్చయపరచును. తరువాత మానసికమగు యత్నము ఆయనకు కలుగును. తరువాత గమనము, శయనము మున్నగు శారీరకములగు బాహ్య క్రియలు కలుగును. కాగా మనస్సులో తెలిసికొనుట మున్నగు క్రియలు కలిగి వానివలన భౌతిక క్రియ కలుగును. ఇచట ముందుగా జరిగెడి క్రియవలన ఉత్తరక్రియ ఈప్సితమగు టచే నది కర్మ సంజ్ఞిక మగును. ఈ రీతిగా ఆరంభణ క్రియచే శయనక్రియ ఈప్సితమగుట వలన కర్మ సంజ్ఞికమగుచున్నది. ధాత్వర్థ శయనక్రియ కర్మయగుటచే దానిచే సంబంధింప దలచిన భర్తకు 'కర్మణా యమభిప్రైతి' అను పాణిని సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగును. ఈ యంశము *మహాభాష్యమున కలదు.

సందర్శనమ్ = ఫలవిషయకమగు సంకల్పము, ప్రార్థనాయామ్ = ఉపాయము నకు సంబంధించిన అభిలాషయందు, అనన్తరా = అవ్యవహితమగు అనగా ప్రార్థన, వ్యవసాయే + తు = దృఢమగు నిశ్చయమునందును, తథా = అట్లే, వ్యవసాయః = అట్టి నిశ్చయము, ఆరమ్భే = మానసిక ప్రవృత్తియందును, సాధనత్వాయ = సాధనత్వము కొరకు, కల్పతే = సమర్థమగుచున్నది, అనగా కారకమగుచున్నది.

---

* క్రియాపి కృత్రిమం కర్మ. క్రియాపి క్రియయా ఈప్సితాభవతి. కయా క్రియయా? సందర్శన క్రియయా, 'ప్రార్థన క్రియయా, అధ్యవస్యతి క్రియయా' "కర్తరి కర్మవ్యతీహారే"

ఇట్లే "కర్మణా యమభిప్రైతి ససంప్రదానమ్" (1-4-32) అను సూత్రమును వ్యాఖ్యా నించు సందర్భమున భాష్యము కలదు. ఈ భాష్యమును భర్తృహరి ఈ సముద్దేశమున నే సంప్రదాన ప్రకరణమున వివరించుచున్నాడు.

పూర్వస్మిన్ = పూర్వకాలమున, అనగా ముందుగ, యా + క్రియా = ఏ క్రియ కలుగునో, సా + ఏవ = ఆ క్రియయే, పరస్మిన్ = ఉత్తర కాలమున జరిగెడి క్రియయందు, సాధనమ్ = కారకముగా, మతా = తలచబడుచున్నది.

సందర్శనే + తు = ఫలవిషయకమగు సంకల్పమున మాత్రము, విశిష్టమ్ = విశిష్టమగు అనగా మాయాసంవలితమగు. చైతన్యమ్ = జీవభావమును, సాధనమ్ = కారకముగా, విదుః = ప్రాజ్ఞులు తెలిసికొనుచున్నారు. అవిద్యా బద్ధుడగు జీవుడు సంకల్పమున సాధనమగునని భావము.

తాత్పర్యము — లోకులు పదార్థమును తెలిసికొని, దానిని కోరుచున్నారు. తరువాత దానికి అనుగుణముగా ప్రయతిన్నంతురు. ఇది ఎల్లరుకును తెలిసినదే. జానాతి, ఇచ్ఛతి యతతే.

ముందుగా ఏ క్రియ ఉండునో, అది ఉత్తరకాలమున జరిగెడి క్రియకు సాధనము కాగలదు. కా:గా సందర్శన ప్రార్థన వ్యవసాయములచే ఈప్సితమగుటచే ధాత్వర్థశయనాదులు కర్మసంజ్ఞకములగును. ఇది భాష్యకారుని నిర్ణయము.

కాబట్టి క్రియయు కర్మసంజ్ఞకమగునని భాష్యమువలన ఏది దేనికి ఉపకరించునో, అది దానికి సాధనమగుననుట చాల యుక్తముగా నున్నది. ॥16, 17॥

అవతారిక — "కారకే" (1-4-23) ఇది పాణిని సూత్రము. ఇచట సప్తమి ప్రథమార్థకము ఇది సంజ్ఞా సూత్రము. పై సూత్రలలో నిది అనువృత్తమగును. స్వతంత్రము కారకసంజ్ఞ కలదియగును. అది కర్తృసంజ్ఞికమగును అని సూత్రార్థము లభించును.

తరువాత కాత్యాయనుడు ఇట్లు ఆక్షేపించెను. "కారకమితి సంజ్ఞానిర్దేశశ్చేత్ సంజ్ఞినో నిర్దేశః" కారక మనునది సంజ్ఞావాచకమన్నచో సంజ్ఞిని ముందుగా చూపవలెను. అనగా సాధనము కారకసంజ్ఞకమగునని చెప్పవలెనని వార్తికమున కర్థము.

అట్లు వచనము వేరుగా చేయనక్కరలేదు. కారక. అనునది అన్వర్థసంజ్ఞ. అనగా కరోతీతి, కారకమ్ అను రీతిని అవయవార్థమును అనుసరించి యీ సంజ్ఞ చేయబడినది. కాబట్టి కారకం, అని చెప్పుటచేతనే క్రియను జనియింపజేయు సాధనము కారకసంజ్ఞికమగునని సూత్రార్థము లభించును. కాబట్టి వేరు వచనమక్కర లేదు. అని భాష్యకారుడు "అన్వర్థసంజ్ఞా యథావిజ్ఞాయేత, కరోతీతికారకమ్" అని పలికెను.

తరువాత దానిపై ఆక్షేపము కలిగెను. కరోతీతి కారకమ్ అని అన్వర్థమగుచో కారకశబ్దము కర్త అను అర్థముకలది యగును. అపుడు కారక కర్తృశబ్దములు పర్యాయము లగును. అట్టితరి కర్తృత్వములేని కరణ - కర్మ - సంప్రదాన - అపాదానాధికరణములకు 'కారక' సంజ్ఞ లభింపకున్నది కరణాదులు కర్తలు కానేరవుకదా. "అన్వర్థమితిచే దకర్తరి కర్తృశబ్దానుపపత్తిః".

భిన్నాః = వస్తువులు భిన్నములు, అనగా అది ఇది ఒకటికాదు, వేరువస్తువులు, ఇతి = అను వాడుక, పరోపాధిః = ఇతరవస్తువులు ఆధారముగా గలది.

రెండువస్తువులు ఉన్ననాడే దానికంటె ఇది భిన్నమైనది అని లోకవ్యవహారము కలుగును. ఒకేవస్తువున్నచో పై వ్యవహారము జరగదు.

అస్లే, అభిన్నాః = వస్తువులు భేదము లేనివి, ఇతి + వా + పునః = అనువ్యవహారము కూడ, పరోపాధిః = ఇతరవస్తువులు మూలముగా కలదియే.

వస్తువులు కొన్ని వేరుగా ఉన్ననాడే మరికొన్నిటి యందుగాని వానియందుగాని ఇవి అన్నియు ఒక్కటియే అను వ్యవహారము కలుగును. ఒకే వస్తువున్నచో పైవ్యవహారము కుదురదు.

భావాత్మసు = భావరూపములగు వస్తువులు, సంసృష్టేషు + ఏవ = పరస్పరము మిశ్రితములగునపుడే, అయమ్ = ఈ, ప్రపఞ్చః = ప్రపంచకము, జాయతే = కలుగుచున్నది.

ఉపాధులు అనగా నిమిత్తములు లేనిది కేవలమగు వస్తువులు లోకవ్యవహారమునకు ఉపయోగింపవు. దేశము, కాలము, ఘటము, పటము మున్నగు ఉపాధులను బట్టియే వ్యవహారము జరుగును. ఆస్థితి వస్తువులకు ఏకాకారబుద్ధి కలుగవలెనన్నచో సామాన్యమునే ఆశ్రయింపవలెను. ॥20॥

*అవతారిక* — పైయర్థమునే నిషేధరూపమున చూపుచున్నాడు.

**శ్లో॥ నైకత్వం, నాపి నానాత్వం, న సత్త్వం, నాపినాస్తితా।**
**ఆత్మతత్త్వేషు భావానామసంసృష్టేషు విద్యతే॥ 21**

ఆత్మతత్త్వేషు = ఉపాధి లేని కేవలద్రవ్యములు, అసంసృష్టేషు = పరస్పరము కలియనిచో, భావానామ్ = వస్తువులకు, ఏకత్వమ్ = అభేదము, న + విద్యతే = ఉండదు. నానాత్వమ్ + అపి = భేదముకూడ, న + విద్యతే = ఉండదు. సత్త్వమ్ = ఉనికియు, న + విద్యతే = ఉండదు. నాస్తితా + అపి = లేమియు, న + విద్యతే = ఉండదు.

నిరుపాధికములగు వస్తువులకు ఏకత్వనానాత్వములు, ఉనికిలేములు సంభవింపవు. ॥21॥

*అవతారిక* — ఉపాధులనుఆశ్రయించి వానిమూలమున భేదమునుజూపి జాతి సార్వత్రికమని సిద్ధాంతము చూపబడినది. ఆ ఉపాధులు ద్రవ్యముకంటె భిన్నములే అని యింతవరకు చూపబడినది.

ఇపుడు ఆ ఉపాధులు ద్రవ్యముయొక్కశక్తి (వలన కలిగినవే) భూతములే, భిన్నములుకావనెడి అద్వైతదర్శనమును ఆశ్రయించి చెప్పుచున్నాడు.

పై ఆక్షేపమునకు *భాష్యకారుడు సమాధానము చెప్పెను. ఆ భాష్యమును వ్యాఖ్యానించుచున్నాడు.

శ్లో॥ నిష్పత్తిమాత్రే కర్తృత్వం సర్వత్రైవాస్తి కారకే।
వ్యాపారభేదాపేక్షాయాం కరణత్వాదిసంభవః ॥ 18

A నిష్పత్తిమాత్రే = పాకము మున్నగు క్రియలయొక్క పుట్టుక విషయమున మాత్రము అనగా అవాంతర క్రియల ప్రసక్తి లేక పాకమాత్రము జరుగుటలో, సర్వత్ర = ఎల్ల కారకములయందును, కర్తృత్వమ్ = కర్తృత్వము, అస్తి + ఏవ = ఉన్నదే, సంశయింప వలదు.

తాత్పర్యము— పాకము మున్నగు క్రియలు జరుగవలెనన్న, అవి ఒక వస్తువు వలన జరుగునవి కావు. అనేక వస్తువులు అపేక్షితములగును. ఉదా: బియ్యము, కట్టెలు నీరు, గిన్నె, పొయ్యి, సిబ్బి, అగ్ని వీనిని సమకూర్చెడి మనుష్యులు కావలెను. వీనిలో ఏ ఒక వస్తువు లేకున్నను వంట సిద్ధింపదు. ఇది ఎల్లరకు తెల్లమే. పాకము సిద్ధించుట విషయమై పై వస్తువు లన్నియు పనిచేయవలసినదే. గిన్నె పడకుండ ధరియించుట పొయ్యి యొక్క పని. బియ్యము జారకుండ ధరియించుట గిన్నెయొక్క వ్యాపారము. మండుట కట్టెల పని. కాగా పాకము తయారుకావలెనన్న అన్నియు పనిచేయుటచే అన్నియు కర్తలు కాగలవు. ప్రధానము వంటకము. అది జరుగుటలో ఎల్లకారకములు స్వతంత్రములే. అవి అన్నియు కలసియే పాకమును కలిగించుచున్నవి. కాబట్టి పాకము జరుగుటలో కారకములన్నియు కర్తలు కాగలవు.

B. అట్టితరి కర్మ, కరణ, సంప్రదాన, పాదాన, అధికరణ రూపములగు కారకభేదములు ఎట్లు సిద్ధించును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

వ్యాపారభేదాపేక్షాయామ్ = అవాంతరములగు వ్యాపారముల వివక్షయందు, కరణత్వాదిసంభవః = కరణత్వము, కర్మత్వము, సంప్రదానత్వము, అపాదానత్వము, అధికరణత్వము అను కారకభేదములు సంభవించును.

తాత్పర్యము— కః? కిమ్? కేన, కస్మిన్, కథమ్, కస్మై? కస్మాత్, అనెడి విశేషజిజ్ఞాస కలుగగా పచధాతువువలన భాసించెడి జ్వలనము, ధారణము, అధిశ్రయణము, (పొయ్యిపై గిన్నె ఉంచుట) అవాంతర క్రియలనుబట్టి కరణాది విశేషసంజ్ఞలు కలుగుచున్నవి.

కాగా 'పాకము జరుగును' అను సామాన్య వివక్షలో అన్ని వస్తువులు కారకములు = కర్తలు కాగలవు. అచట ఏ వస్తువు ఎట్లు సహకరించినది? అను విశేషజిజ్ఞాస

---

* "సిద్ధః కరణాధికరణయోః కర్తృభావః, కుతః? ప్రతికారకం క్రియాభేదాత్, పచాదీనాం హి ప్రతికారకం క్రియాభిద్యతే, కిమిదం ప్రతికారకమితి? కారకం కారకం ప్రతికారకమ్ సామాన్యభూతాక్రియావర్తతే" ఇది భాష్యము. దీని భావము తాత్పర్యమున స్పష్టము.

కలుగగా అవాంతర వ్యాపారములను బట్టి కర్మ కరణాది విశేషసంజ్ఞలు కలుగును. మండుట అనే వ్యాపారమునుబట్టి కట్టెలు కరణములగును. బియ్యమును ధరియించుటచే గిన్నె అధికరణ మగును. అట్టి గిన్నెను పడకుండ పట్టియుంచుటచే పొయ్యియు అధికరణమగును. ప్రధానమగు విక్లిత్తి అనగా బియ్యము మెత్తపడుటనుబట్టి బియ్యము కర్మయగును. వస్తుసామగ్రిని సమ కూర్చుటను బట్టి చైత్రాదులు ప్రత్యేకముగ కర్తలుగా పరిగణింపబడుచున్నారు.

కాగా పాకక్రియ నిష్పన్నమగుటలో అన్నియు కారకములే = కర్తలే, ఇట్టి కర్తృ త్వము వస్తు సామాన్యమునకు సిద్ధించును. అట్టి కర్తృత్వముండగా వ్యాపారవిశేష జిజ్ఞాస కలుగగా పై రీతిని కరణాది సంజ్ఞలు కలుగును. అందుచే కారకము కరణసంజ్ఞకమగును అను భాష్యకారీయ వ్యవహారము సంగతము కాగలదు. పనిచేయునది కారకము.

'కారకే' అను సూత్రమున వేరుగ సంజ్ఞను అనగా సాధనము కారకసంజ్ఞిక మగునని చెప్పనక్కరలేదు. 'కారక' అను మహాసంజ్ఞవలననే సాధనము కారక సంజ్ఞికమను అర్థము లభించును. ॥18॥

*అవతారిక*— పై యర్థమునకు చక్కని దృష్టాంతమును జూపుచున్నాడు.

**శ్లో॥ పుత్రస్యజన్మని యథాపిత్రోః కర్తృత్వముచ్యతే ।**
**అయమస్యామియం త్వస్మాదితి భేదో వివక్షయా ॥** 19

**పుత్రస్య** = పుత్రునియొక్క, **జన్మని** = కనుటయందు అనగా పుత్రుని కనువిషయమున, **పిత్రోః** = తలిదండ్రులకు, **కర్తృత్వమ్** = కర్తృత్వము, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

ఐనను, వివక్షయా = విశేషవివక్షచే, అనగా ఎవరు ఎట్లు కనిరి ? అను విశేష జిజ్ఞాస కలుగగా, అయమ్ = ఇతడు (తండ్రి), అస్యామ్ = ఈమెయందు (తల్లియందు), ఇతి = అనియు, ఇయం + తు = ఈమెయు, అస్మాత్ = ఇతనివలన, అనియు, భేదః = కారకభేదము, యథా = ఎట్ల కలుగుచున్నదో, (తథా + ప్రకృతేపి) = అట్లే ప్రకృతమున గూడ సమన్వయము చేయవలెను.

తాత్పర్యము—పితరౌ పుత్రం జనయతః (తలిదండ్రులు పుత్రుని కనుచున్నారు) అను వాడుక లోకసిద్ధము. సంతానమును కనుటలో ఉభయులు కర్తలే. ఇచట జనియించుట మాత్రమే ధాత్వర్థము. ఆ క్రియలో ఉభయులు కర్తలే. ఆ ధాత్వర్థమున విశేష వివక్షచేయగా పురుషుడు తన బీజమును స్త్రీయందు విడుచుచున్నాడు అనియు, స్త్రీ పురుషునివలన జారు చున్న బీజమును ధరియించుచున్నది అనియు వాడుక కలుగుచున్నది. ఆ స్థితిలో ఆడుదానికి అధికరణత్వము, మగవానికి అపాదానత్వము లభించుచున్నది. కాగా జని ధాత్వర్థమును సామాన్యరూపమున వివక్షించిన ఆలుమగలకు కర్తృసంజ్ఞయు, విశేషరూపమున వివక్ష చేయగా, వారికి అధికరణాపాదానత్వములు కలుగుచున్నవి.

అట్లే ప్రకృతమున గూడ పచి ధాతువుయొక్క అర్థమును సామాన్యరూపమున గ్రహించినచో ఎల్లకారకములు కర్తలు కాగలవు. విశేషరూపమున, ధాత్వర్థమును జూచిన కరణాది విశేషసంజ్ఞలు కలుగగలవు. కర్తృకరణాదులు విరుద్ధములు కానోపవు ॥19॥

*అవతారిక*— ప్రధాన క్రియలో సామాన్య విశేషభావమును ఆశ్రయించి కారకం కరణమ్ (కర్త కరణమగును), కారకం కర్మ (కర్త కర్మయగును) మున్నగు వ్యవహారములు సంగతములు కాగలవని చెప్పిన భాష్యమును 19వ శ్లోకముచే వ్యాఖ్యానించెను.

ఇప్పుడు క్రియావిశేషమును స్వీకరించినను పై వ్యవహారము లుపపన్నములగును. కాష్ఠము మున్నగునవి అప్రధాన క్రియనుబట్టి స్వతంత్రములై కర్తలు కాగలవు. అవి ప్రధాన క్రియనుబట్టి అస్వతంత్రములైనను, వానికిగల స్వాతంత్ర్యము చెడదు. అది అనువృత్తమగును. కాగా కరణత్వమున్నను కర్తృత్వము కూడ ఉండగలదు అను అర్థమును బోధించెడి *మహాభాష్యమును వ్యాఖ్యానించుచున్నాడు.

**శ్లో॥ గుణక్రియాణాం కర్తారః కర్త్రా న్యక్కృతశక్తయః ।**
**న్యక్తాయామపి సంపూర్ణైః స్వైర్వ్యాపారైః సమన్వితాః ॥ 20**

**శ్లో॥ కరణత్వాదిభిర్జ్ఞాతాః క్రియా భేదానుపాతిభిః ।**
**స్వాతన్త్ర్యముత్తరం లబ్ధ్వా ప్రధానే యాన్తి కర్తృతామ్ ॥ 21**

గుణక్రియాయామ్ = అప్రధానమగు వ్యాపారమునందు, అనగా మండుట మున్నగు అప్రధానమగు పచ్యాద్యర్థవ్యాపారమున, కర్తారః = స్వతంత్రములగు కట్టెలు మున్నగునవి, కర్త్రా = కర్తచే అనగా చైత్రుడు మున్నగు ప్రధాన క్రియాకర్తచే, న్యక్కృతశక్తయః = తిరస్కరింపబడిన స్వాతంత్ర్యముకలవై, న్యక్తాయామ్ + అపి = స్వతంత్రత తిరస్కృతమైనను, సంపూర్ణైః = సంపూర్ణములగు, స్వైః = స్వీయములగు, వ్యాపారైః = మండుట మున్నగు వ్యాపారములచే, సమన్వితాః = కూడియున్నవై, అనగా వానితో విడవకయున్నవై, క్రియాభేదానుపాతిభిః = క్రియావిశేషమును అనుసరించి యుండెడి, కరణత్వాదిభిః = కరణత్వము కర్మత్వము, మున్నగువానిచే, జ్ఞాతాః = తెలియబడినవై, ఉత్తరమ్ = తరువాతను గూడ, అనగా చైత్రాదులచే ప్రేరణ చేయబడిన తరువాత కూడ, స్వాతన్త్ర్యమ్ = స్వతంత్రతను అనగా కర్తృత్వమును, లబ్ధ్వా = పొంది, ప్రధానే = ప్రధాన వ్యాపారమునందు, కర్తృతామ్ = కర్తృత్వమును, యాన్తి = పొందుచున్నవి.

---

* 'స్వతన్త్రపరతన్త్రత్వాత్తయోః పర్యాయేణ వచనమ్, వచనాశ్రయా చ సంజ్ఞా ... ప్రధానేన వ్యవాయే స్థాలీ పరతన్త్రా, వ్యవాయే స్వతన్త్రా. తద్యథా - అమాత్యానాం రాజ్ఞా సహసమవాయే పారతన్త్ర్యం, వ్యవాయే స్వాతన్త్ర్యమ్'. "కారకే" (1–4–23). ఇది మహాభాష్యము. దీని భావము తాత్పర్యమున వ్యక్తము కాగలదు.

తాత్పర్యము— చైత్రః తణ్డులం కాష్ఠైః పచతి. (చైత్రుడు బియ్యమును కట్టెలచే అన్నమును తయారుచేయుచున్నాడు) ఇచట చైత్రుని వ్యాపారము ప్రధానము. మండుట మున్నగునవి అప్రధాన వ్యాపారములు. అప్రధాన వ్యాపారములలో కాష్ఠాదులు స్వతంత్రములే. అట్లుకాకున్న అవి మండుట మున్నగుపనులను చేయజాలవు. ప్రధానవ్యాపారమున కాష్ఠాదులు అస్వతంత్రములే. ఐనను తమకున్న స్వాతంత్ర్యమును గోల్పోవు. చైత్రాదులనుబట్టి అవి అట్లు భాసించుచున్నవి. కాగా తమయందున్న స్వతంత్రతను విడువకయే ప్రధానక్రియకు తోడ్పడుటచే కర్తృత్వము, కరణత్వము కూడ కాష్ఠాదులకు కలుగును. ॥20, 21॥

అవతారిక— పై చూపిన యర్థమునకు దృష్టాంతమును జూపుచున్నాడు.

శ్లో॥ యథా రాజ్ఞా నియుక్తేషు యోద్ధృత్వం యోద్ధృషుస్థితమ్ ।
తేషు వృత్తౌ తు లభతే రాజా జయపరాజయౌ ॥ 22

శ్లో॥ తథా కర్త్రా నియుక్తేషు సర్వేష్వేకార్థకారిషు ।
కర్తృత్వం కరణాదిత్వైరుత్తరం న విరుధ్యతే ॥ 23

యథా = ఏ రీతిగ, రాజ్ఞా = ప్రభువుచే, నియుక్తేషు = ప్రేరితులగు, యోద్ధృషు = యుద్ధము చేయు భటులయందు, యోద్ధృత్వమ్ = యుద్ధముచేయుట, వ్యవస్థితమ్ = నిశ్చిమైయున్నదై, తేషు = ఆ యోద్ధలయందు, వృత్తౌ + తు = జరుగగా అనగా యుద్ధమనెడి క్రియ యుండగా, అనగా వారు యుద్ధముచేయగా, రాజా = ప్రభువు, జయపరాజయౌ = జయాపజయములను, లభతే = పొందుచున్నాడో,

తథా = అట్లే. కర్త్రా = కర్తచే, నియుక్తేషు = నియోగింపబడినట్టియు, అయినను, ఏకార్థకారిషు = పాకము మున్నగు ఒకే ప్రధానక్రియను కలిగించెడి, సర్వేషు = ఎల్లకారకములయందు, (స్థితమ్) = ఉన్నటువంటి, కర్తృత్వమ్ = కర్తృత్వము ఉత్తరమ్ = తరువాతి కాలమున కలిగెడి, కరణాదిత్వైః = కరణత్వము మున్నగువానితో, న + విరుధ్యతే = విరోధించునది కాదు.

తాత్పర్యము— ప్రభువు భటులను యుద్ధము మున్నగు పనులయందు నియోగించును. ఆ స్థితిలో భటులు అస్వతంత్రులే. తరువాత వారు చేసెడి యుద్ధము మున్నగు క్రియలలో స్వతంత్రులే. ఫలితము మాత్రము ప్రధానునకు చెందును భటులు స్వతంత్రులై పనిచేయనిచో ప్రభువునకు కార్యము లభింపదు.

అట్లే దేవదత్తుడు ప్రేరేపింపగా కాష్ఠాదులు పాకక్రియను కలిగించుచున్నవి. అవి ఆ స్థితిలో అప్రధానములే కాని ప్రేరణ తరువాత మండుట మున్నగు అవాంతర వ్యాపారములలో అవి స్వతంత్రములే. అట్లుకాకున్న పాకము నిష్పన్నము కాకపోయెడిని. కాబట్టి కర్తృత్వము, కరణత్వము విరుద్ధములు కావు. ॥22, 23॥

అవతారిక — 'కరోతీతికారకమ్' అను రీతిని కారకసంజ్ఞ అన్వర్థమే అని సిద్ధాంతము చేయబడినది. అట్టితరి హేతువు కూడ క్రియానిర్వాహకమే యగుటంజేసి అదియు కరణసంజ్ఞకమగును. కాగా కరణార్థమున తృతీయావిభక్తి విధింపబడినది. అంత మాత్రముననే హేత్వర్థమున గూడ తృతీయ సిద్ధించుచుండగా మరల 'హేతౌ' అను సూత్రముచే తృతీయా విధానము వ్యర్థము అను ప్రశ్న కలుగగా దానికి సమాధానముగా కరణత్వమునకు హేతుత్వమునకును భేదము జూపుచున్నాడు.

**శ్లో॥ అనాశ్రితే తు వ్యాపారే నిమిత్తం హేతురిష్యతే ।**
**ఆశ్రితావధిభావం తు లక్షణే లక్షణం విదుః ॥** 24

A. వ్యాపారే = వ్యాపారము, అనాశ్రితే + తు = ఆశ్రయింపనిచో, నిమిత్తమ్ = నిమిత్తముగానున్న అర్థము హేతుః = హేతువుగా, విదుః = తెలిసికొనుచున్నారు.

వ్యాపారమును అపేక్షింపక యున్న కారణము హేతువని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఉదా : అధ్యయనేన వసతి. (చదువుచే అనగా చదువు నిమిత్తముగాజేసికొని ఉంటున్నాడు) అధ్యయనము హేతువు. నివాసము హేతుమత్తు. ఇచట వ్యాపారము అపేక్షితము కానందున కరణసంజ్ఞ కలుగదు. సంబంధమున షష్ఠీవిభక్తి ప్రవర్తించుచుండగా దానికి అపవాదముగా హేతు తృతీయ ప్రవర్తించినది.

B. 'అనుర్లక్షణే' (1-4-84) అను సూత్రమున హేతువునుగూడ లక్షణ శబ్దముచే స్వీకరించుచున్నందున లక్షణము హేతువు రెండు ఏకరూపములేకాన శాస్త్రమున వేరువేరుగా గ్రహించుట వ్యర్థము అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

తు = విశేషమేమనగా, అనగా హేతువునకు లక్షణమునకు భేదమేమనగా, లక్షణే = గుర్తింపబడెడి వస్తువును ప్రకాశింపచేయుటలో, (యత్) ఏది, ఆశ్రితావధిభావమ్ = పొందబడిన అవధిభావము అనగా హద్దు కలదియో, తత్ = దానిని, లక్షణమ్ = జ్ఞాపకమునుగా, విదుః = (శాస్త్రజ్ఞులు) గుర్తించుచున్నారు.

హేతువను పదార్థము కూడ ఒక హద్దును అపేక్షించిన లక్షణమనియు, అవధిభావము లేకున్నచో హేతువనియు పెద్దలు చెప్పుచున్నారు. ఉదా : అనువనమశనిర్గతః (వనమువద్ద పిడుగు పడినది) ఇచట వనము హద్దుగా గ్రహింపబడినది. కాబట్టి వనము లక్షణమగుచున్నది ॥24॥

అవతారిక — జనకత్వము సమానముగా నుండుటవలన 1. కారకము 2. హేతువు ఈ రెండు ఏకరూపములు కాకూడదా ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్రవ్యాదివిషయో హేతుః, కారకం నియతక్రియమ్ ।**
కర్తా కర్త్రన్తరాపేక్షః క్రియాయాం హేతురిష్యతే ॥ 25

A. ద్రవ్యాది విషయః = ద్రవ్యము మున్నగునవి అనగా ద్రవ్యము, గుణము, క్రియ విషయముగా గల యర్థము, హేతుః = హేతువు అగును.

ద్రవ్యమును, గుణమును, క్రియను కలిగించునది హేతువనబడును. ఉదా : దణ్డేన ఘటః (కడవ దండముచే జనియించును) దండము హేతువు. దండమునందు వ్యాపారమున్నను క్రియాజనకము కాక కడవయనెడి ద్రవ్యమును పుట్టించుచున్నందున హేతువగును. కరణము కానేరదు. 'ధనేన కులమ్', 'విద్యయా యశః', 'శిల్పాభ్యాసేన నైపుణ్యమ్', 'అగ్నినా పాకః' మున్నగునవి ఉదాహరణములు కాగలవు.

నియత క్రియతమ్ = నియతమగు క్రియకలది, కారకమ్ = కారకమగును.

క్రియామాత్రమును కలిగించునది కరణసంజ్ఞికమగును. 'బాణేన హతః'.

B. వ్యాపారసహితమగు పదార్థమునకు శాస్త్రీయమగు హేతుత్వము కలుగునని చెప్పుచున్నాడు.

కర్తా = కర్త అనగా ప్రయోజక కర్త, కర్త్రన్తరాపేక్షః = మరియొక కర్తయొక్క అపేక్ష కలవాడై అనగా ప్రయోజ్యకర్త ద్వారా క్రియను జనియింపచేయు వాడై, క్రియాయామ్ = పాకము మున్నగు క్రియయందు, (ప్రయోజ్యకర్తారమ్ + ప్రేరయన్) = ప్రయోజ్యకర్తను ప్రేరేపించువాడై, హేతుః = 'హేతు' అను సంజ్ఞకలవాడుగా, ఇష్యతే = సమ్మతమగుచున్నాడు.

పచతి తణ్డులం చైత్రః (చైత్రుడు తండులమును పాకము చేయుచున్నాడు). పాచయతి తణ్డులం చైత్రేణ దేవదత్తః (అట్టి చైత్రునిచే దేవదత్తుడు పాకము చేయించుచున్నాడు) ఇచట దేవదత్తుడు ప్రయోజకకర్త. అతనికే "తత్ప్రయోజకో హేతుశ్చ" అను సూత్రముచే హేతుసంజ్ఞ కలుగును. ఈ హేతువు కారకవిశేషము, లౌకికమగు హేతువు కాదు. ॥25॥

అవతారిక — హేతువునకు కరణమునకు క్రియావిషయత్వము సమానమే. అట్లైనను ఆ రెంటికి వ్యత్యాసమున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియాయై కరణం,తస్య దృష్టః ప్రతినిధిస్తథా ।
హేత్వర్థా తు క్రియా తస్మాన్న స ప్రతినిధీయతే ॥ 26

తథా = అట్లే, కరణమ్ = బాణము, కత్తి మున్నగు కరణము, క్రియాయై = క్రియార్థమే, అనగా క్రియ జనియించుటకు ఉపయోగపడునదియే, తస్య = ఆ కరణము, ప్రతినిధిః = ప్రతినిధి, అనగా ఆ వస్తువు లభింపనపుడు మరియొక వస్తువును ఉపయోగించుట, దృష్టః = కనబడుచున్నది. అనగా శిష్టాచారముగా కానవచ్చుచున్నది.

రథేన గచ్ఛతి (రథముతో వెళ్లుచున్నాడు) ఇచట గమనము ప్రధానము. దానికి సాధనము రథము. కనుకనే అది అప్రధానమగుచున్నది. ఒకవేళ రథము దొరకనిచో మరియొక సాధనమును ఉపయోగించుకొని పయనముచేయుట లోకానుభవ సిద్ధము. దీనినిబట్టి

చూడగా కరణమునకు ప్రతినిధిత్వము అనగా అది దొరకనిచో దానికి బదులుగా మరియొక దానిని వినియోగించుట కానవచ్చుచున్నది. గమనము ప్రధానము. దానికి ప్రతినిధి యుండదు.

క్రియా + తు = క్రియయే, హేత్వర్థా = హేతువుకొరకు ఉపయోగపడుచున్నది అనగా హేతువు ప్రధానము. క్రియ అప్రధానముగా నుండునని భావము.

తస్మాత్ = ఆ కారణమువలన అనగా హేతువు ప్రధానమగుట వలన, సః = ఆ హేతువు, న + ప్రతినిధీయతే = ప్రతినిధిగా చూపబడదు.

అప్రధానమునకే ప్రతినిధి యుండును. ప్రధానమగు దానికి ప్రతినిధి యుండదు. ఉదా: అధ్యయనేన వసతి (చదువును హేతువు జేసికొనివసించుచున్నాడు) ఇచట అధ్యయనము ప్రధానము. దానిని సాధించుటకై గ్రామమున ఉండుట. కాబట్టి అధ్యయనేన వసతి. అనుచోట క్రియ అప్రధానమై అధ్యయనమనే హేతువు ప్రధానమైనది. అందుచే దానికి ప్రతినిధి యుండదు.

క్రియ ప్రధానమై సాధనము అప్రధానమగుచో అచట కరణ తృతీయ అనియు, క్రియ అప్రధానమై సాధనము ప్రధానమగుచో అచట హేతు తృతీయ అనియు వ్యవస్థ చేయదగును. ॥26॥

*అవతారిక* — హేతుత్వ - కరణత్వములకు గల భేదము ఇంతవరకు చూపి, హేత్వర్థ తృతీయకు తాదర్థ్య చతుర్థికి గల భేదమును జూపుచున్నాడు.

**శ్లో॥ ప్రాతిలోమ్యానులోమ్యాభ్యాం హేతురర్థస్య సాధకః।**
**తాదర్థ్యమానులోమ్యేన హేతుత్వానుగతం తు తత్ ॥ 27**

A. ప్రాతిలోమ్యానులోమ్యాభ్యామ్ = ప్రాతికూల్యమున ఆనుకూల్యమున, అర్థస్య = అర్థమునకు, సాధకః = సాధకమగు వస్తువు, హేతుః = హేతువనబడును.

ఒక వస్తువు మరియొక వస్తువునకు ఆనుకూల్యమునుగాని ప్రాతికూల్యమునుగాని కలిగించును. అట్టి యర్థము హేతువగును. ఉదా: ఉదకము సూర్యకిరణ సంపర్కమున తగ్గియున్నదై అంతకంటె గూడ స్వల్పాతి స్వల్పరూపమగు ఉదకమునకు అనుగుణమగును. దీనిని ప్రాతికూల్యమందురు. బీజము ఉదక. ఆతపాది సంబంధమున ఉబ్బి అంకురోత్పత్తికి సహకరించును. దీనిని ఆనుకూల్యమందురు.

పై రీతిని రెండు విధములుగా హేతువు కానవచ్చుచున్నది.

B. తాదర్థ్యము అట్టిది కాదు. ఆనుకూల్యమునే కలిగించుచుండునని చెప్పుచున్నాడు.

ఆనులోమ్యేన = ఆనుకూల్యమున, హేతుత్వానుగతమ్ = హేతువుయొక్క రూపముతో గూడినది, యత్ = ఏదియో, తత్ + తు = అదియే, తాదర్థ్యమ్ = తాదర్థ్యమని చెప్పబడుచున్నది.

హేతువు రెండు విధములుగా నున్నది. వానిలో ఆనుకూల్యమనే రూపము కల హేతువే తాదర్థ్యమనబడును, తస్మై = తయారుకాగల వస్తువునకు, ఇదమ్ = ఉపకరించునది = తదర్థమ్, దాని భావము - తాదర్థ్యము. ఉదా : కుణ్డలాయ హిరణ్యమ్. (కుండలములకు ఉపయోగపడెడి బంగారము). ॥27॥

*అవతారిక*— 24 వ కారికనుండి ఇంతవరకు కారకమునకు, హేతువునకు, లక్షణమునకు, తాదర్థ్యమునకు గల భేదమును జూపి, మరల కారక విచారమును ప్రస్తావించుచున్నాడు.

శ్లో॥ సర్వత్ర సహజా శక్తిర్యావద్ద్రవ్యమవస్థితా ।
క్రియాకాలే త్వభివ్యక్తిరాశ్రయా దుపకారిణీ ॥ 28

సర్వత్ర = అన్ని వస్తువులయందు అనగా అనిత్య పదార్థములయందు, శక్తిః = శక్తి, సహజా = కారణముతోపాటు పుట్టుక కలదియే, వస్తువు జనియించిన పిమ్మట దానియందు శక్తి జనియింపదు. కారణమువలన వస్తువు జనియించుటయే శక్తుల జనియించుటయు ఆ శక్తి, యావద్ద్రవ్యమ్ = ద్రవ్యమున్నంతవరకు, అవస్థితా = ఉండును. ఆశ్రయము లేనిది శక్తి ఉండనేరదు, కాబట్టి ఆశ్రయమున్నంతవరకు శక్తి యుండును, ఆశ్రయము నశించిన శక్తియు నశించును, నిత్య పదార్థములయందు, శక్తి స్వాభావికమే.

ఉపకారిణీ = ఉపకరించెడి అనగా కారణములు సిద్ధముగా నుండగా కార్యమును కలిగించెడి, ఆశ్రయాత్ = ఆధారమునుండి కలిగెడి, అభివ్యక్తిః = ఆవిర్భావము, క్రియాకాలే + తు = క్రియ జరిగెడి కాలముననే.

ద్రవ్యమునందు శక్తియున్నది. కాని ఆ శక్తి కారణముల సామగ్రి సిద్ధముగా నున్నచో ఆ ద్రవ్యమునుండి క్రియ కలుగు సమయముననే అభివ్యక్తమగును. అపుడే అది సాధనమని వ్యవహరింపబడును. అంతకుముందు సాధనమనబడదు. ॥28॥

*అవతారిక*— పై కారికార్థమునే సమర్థించుచున్నాడు:

శ్లో॥ కుడ్యస్యావరణే శక్తి రస్యాదీనాం విదారణే ।
సర్వదా స తు సన్ ధర్మః క్రియాకాలే నిరూప్యతే ॥ 29

కుడ్యస్య = గోడకు, ఆవరణే = ఇతర వస్తువు కానరాకుండుట విషయముగాను, అస్యాదీనామ్ = కత్తి మున్నగువానికి, విదారణే = బద్దలుకొట్టుట విషయముగాను, శక్తిః = శక్తి, సర్వదా = ఎల్లకాలములయందు కూడ, అస్తి = ఉన్నది.

సః + ధర్మః = శక్తిరూపమగు ఆ ధర్మము, క్రియాకాలే + తు = వ్యాపారము చేయు సమయముననే, నిరూప్యతే = నిరూపింపబడుచున్నది. అనగా వ్యక్తీకరింపబడుచున్నది.

ముఖ్యకారణమునుండి కారణమునకు శక్తులు సంక్రమించును. ఆ శక్తులు ఆ ద్రవ్యమున్నంతవరకు తప్పక ఉండును. కాని ఆ ద్రవ్యము పనిచేయునపుడే ఆ శక్తులు వ్యక్తములగును.

గోడ వస్తువు కానరాకుండ చేయగలదు. అది మనము ఒక వస్తువును అన్వేషించునపుడే తెలియబడును. అట్లే కత్తి, కొడవలి మున్నగునవి ద్రవ్యమును రెండు ముక్కలుగా చేయగలవు. కాని విషయమున్నపుడే కదా ఆ పని చేయగలవు. ॥29॥

*అవతారిక*— పై యర్థమునే ప్రమాణముచే నిరూపించుచున్నాడు.

**శ్లో॥ స్వాఙ్గసంయోగినః పాశా దైత్యానాం వారుణా యథా ।**
**వ్యజ్యన్తే విజిగీషూణాం ద్రవ్యాణాం శక్తయ స్తథా ॥ 30**

విజిగీషూణామ్ = పరులను జయించెడి ఇచ్ఛ కలిగిన, దైత్యానామ్ = రాక్షసులకు, వారుణాః = వరుణ దేవతాకములగు, పాశాః = పాశములు, స్వాఙ్గసంయోగినః = తమ అనగా రాక్షసుల హస్తములయందు ఎల్లపుడు శక్తిరూపమున ఉన్నవై, యథా = ఏ రీతిగా, వ్యజ్యన్తే = (పరసేనలను జయించు సమయమున) వ్యక్తములగుచున్నవో, తథా = అట్లే, ద్రవ్యాణామ్ = ద్రవ్యముల యొక్క, శక్తయః = శక్తులు కూడ, (కార్యముచేయు సమయమున), వ్యజ్యన్తే = వ్యక్తములు కాగలవు.

*తాత్పర్యము*— రాక్షసులకు వారుణ పాశములు ఎల్ల సమయములయందు ఇతరులకు కానరాకుండ శక్తిరూపమున ఉన్నవనియు, అవి శత్రువులను జయించువేళ బయటపడుననియు వేదము చెప్పుచున్నది. ద్రవ్యముల శక్తులుకూడ ఆపాశములవలె నున్నవై కార్యసమయమున వ్యక్తములగుచున్నవి. ॥30॥

అవతారిక— శస్త్రము మున్నగువానికి బద్దలుచేయుట విషయమై శక్తి యున్నదని చెప్పబడిన అర్థమును వ్యక్తపరచుచున్నాడు.

**శ్లో॥ తైక్ష్ణ్యగౌరవకాఠిన్య సంస్థానైః స్వైరసి ర్యదా ।**
**ఛేద్యం ప్రతి వ్యాప్రియతే శక్తిమాన్ గృహ్యతే తదా ॥ 31**

అసిః = కత్తి, స్వైః = స్వీయమగు తైక్ష్ణ్య గౌరవకాఠిన్య సంస్థానైః = జారుగా నుండుట, బరువుగానుండుట, గట్టిగానుండుట, ఆయా ఆకారములతో నుండుట అను ధర్మములచే, ఛేద్యమ్ + ప్రతి = నరకబడెడి వస్తువునుగురించి, యదా = ఎప్పుడు, వ్యాప్రియతే = వ్యాపారముకలది యగునో, తదా = అపుడు, శక్తిమాన్ = శక్తికలదిగా, గృహ్యతే = తెలియబడుచున్నది.

కత్తి, గొడ్డలి, రంపము, కొడవలి మున్నగునవి ఆయా ఆకారవిశేషములతో జారుగాను, బరువుగాను, ఉండును. బరువుగాలేనిచో చెట్లను నరకుట జరుగదు. కాని అవి ఎల్లపు

డును శక్తిమంతములుగా లోకులచే గ్రహింపబడవు. కనుకనే వాటిని ఎచ్చటనో దాచి యుంచుదురు. అవసరమగునపుడు వానిని ఉపయోగించెదరు. అపుడే వానిని శక్తికలవాటినిగా లోకులు గుర్తించుచున్నారు. ॥31॥

అవతారిక— సాధనము విషయమున పక్షభేదములను జూపుచున్నాడు.

శ్లో॥ ప్రాఙ్నిమిత్తాన్తరోద్భూతం క్రియాయాః కైశ్చిదిష్యతే ।
సాధనం సహజం కైశ్చిత్ క్రియాన్యైః పూర్వమిష్యతే ॥ 32

1. కైశ్చిత్ = కొందరిచే, క్రియాయాః = క్రియకంటె, ప్రాక్ = ముందుగా, నిమిత్తాన్తరోద్భూతమ్ = నిమిత్తాంతరముచే జనియించినదానిగా, ఇష్యతే = ఇష్టపడుచున్నది.

శక్తి యున్నట్లు మనకు ముందు తెలియదు. వస్తువు జనియించినపిమ్మట శక్తులు ఊహింపబడుచున్నవి. సహకారి కారణముల ప్రోగువలన కార్యము జనియించును. వేరువేరు వస్తువులు కార్యజనకములు కానేరవు. కాగా ద్రవ్యముతోపాటు శక్తులు జనియించునవి కావు. మరి యేమన నిమిత్తాంతరమువలననే.

2. కైశ్చిత్ = కొందరిచే, సాధనమ్ = సాధనము, సహజమ్ = సహజముగా నున్నట్లు, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

శక్తి, శక్తిమత్తు రెండు వేరుకావు. ద్రవ్యమే సాధనము. కాగా అది సహజమేయని కొందరి భావము.

3. అన్యైః = మరి కొందరిచే, క్రియా = క్రియయే, పూర్వమ్ = ముందుగా, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

క్రియతోపాటు శక్తి జనియించునది కాదు. క్రియ సాధ్యము కాన దానికి ముందుగా సాధనముండవలెను. అపుడే రెంటికి సాధ్యసాధన భావము యుక్తమగుచున్నది. కాని అట్లు కాక క్రియయే పూర్వమని వీరి యాశయము. ॥32॥

అవతారిక— సాధనముకంటె ముందుగా క్రియ యుండునని కొందరి యాశయము. అది యెట్లు సంగతమగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రవృత్తిరేవ ప్రథమం క్వచిదప్యనపాశ్రయా ।
శక్తీరేకాధికరణే స్రోతోవదపకర్షతి ॥ 33

క్వచిత్ + అపి = ఒకదానియందు గూడ, అనపాశ్రయా = ఆశ్రయములేని అనగా కారణ వ్యాపారములను అపేక్షింపని, ప్రవృత్తిః + ఏవ = వ్యాపారమే, ప్రథమమ్ = ముందుగా ఏకాధికరణే = ఒకే ఆధారమునందు, శక్తీః = శక్తులను, స్రోతోవత్ = నదీ ప్రవాహము వలె, అపకర్షతి = వహించుచున్నది.

శ్లో॥ సర్వశక్త్యాత్మభూతత్వమేకస్యైవేతి నిర్ణయః।
భావానామాత్మభేదస్య కల్పనా స్యాదనర్థికా॥ 22

సర్వశక్త్యాత్మభూతత్వమ్ = ఎల్లశక్తులకు ఆత్మరూపము అగుట, ఏకస్య + ఏవ = ఒకే పదార్థమునకు అనగా నిర్గుణ పరబ్రహ్మమునకే, ఇతి = అని, నిర్ణయః = శాస్త్రములుచేసిన నిర్ణయము.

లోకమున ఎన్నియో విలక్షణములగు కార్యములు కాన్పించుచున్నవి. వానికి కారణములు శక్తులు కావలెను ఆశక్తులన్నియు ఒక పరబ్రహ్మమునందే ఉన్నవి. కనుక శక్తులు భిన్నభిన్నములు కావచ్చును. వాని ఆశ్రయము మాత్రము ఒక పరబ్రహ్మమే.

భావానామ్ = పదార్థములకు, ఆత్మభేదస్య = స్వరూపభేదమునకు, కల్పనా = కల్పించుట, అనర్థికా = ప్రయోజనములేనిదే, స్యాత్ = కానగును.

అట్లుకాక ఉపాధులనుబట్టి ద్రవ్యములు నానాగా అంగీకరించిన, అట్టి కల్పనకు ప్రయోజనములేదు. కాన ఉపాధులన్నియు ఒకే బ్రహ్మమునందున్నవనుటయే లెస్స. ॥22॥

అవతారిక — ఉపాధులు పరబ్రహ్మముయొక్క శక్తిరూపములే అను అర్థమునే స్పష్టపరచుచున్నాడు.

శ్లో॥ తస్మాత్ ద్రవ్యాదయః సర్వాః శక్తయోభిన్నలక్షణాః।
సంసృష్టాః పురుషార్థస్య సాధికానతు కేవలాః॥ 23

తస్మాత్ = పరబ్రహ్మమునుండి మాయావశమున వెలువడిన, లేక తస్మాత్ అను పంచమికి షష్ఠ్యర్థము చెప్పవలెను. తస్మాత్ = తస్య = బ్రహ్మమునకు సంబంధించియున్న, భిన్న లక్షణాః = విభిన్నములగు లక్షణములు గల అనగా వేరువేరు కార్యములను కలిగించెడి *ద్రవ్యాదయః = ద్రవ్యము మున్నగు, సర్వాః + శక్తయః = ఎల్లశక్తులు, సంసృష్టాః = పరస్పరము కలసియున్నవై, పురుషార్థస్య = పురుషుని లోకయాత్రకు,సాధికాః = సాధకము లగుచున్నవి, కేవలాః + తు = ఆశక్తులు పరస్పరము కలియకుండ ఒక్కొక్క శక్తియే, న = పురుషార్థము సాధింపలేవు.

వైశేషికులు సామాన్యమును ఆత్మపదార్థము కంటె వేరుగా చూపిరి. వైయాకరణులు అట్లుకాక సామాన్యము బ్రహ్మముయొక్క శక్తిరూపమనియే భావించిరి. ఒక సామాన్యమేకాదు, ద్రవ్యము మున్నగు పదార్థములన్నియు బ్రహ్మముయొక్క శక్తులేయని

---

* కణాదమహర్షి-ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము అను ఏడుపదార్థములను చూపియున్నాడు. ఆయన ప్రత్యక్షము, అనుమానము అను రెండు స్వతంత్ర ప్రమాణములను అంగీకరించెను. శబ్దము, ఉపమానము అనునవి అనుమానాంతర్గతములని ఆయన తలంచెను.

ఈయంశము సంబంధసముద్దేశమున 12వ శ్లోకమున గూడ చూపబడును.

తాత్పర్యము— క్రియ నిత్యము. అది ఇతర హేతువులను అపేక్షింపక తనకు ఆధారమగు ద్రవ్యమునందు తనకు అనుకూలములగు శక్తులను ఆవిర్భవింపచేయును. నదీ ప్రవాహము గడ్డి, ఆకు, అలము మున్నగు వస్తువులను లాగుకొనిపోవును. అట్లే క్రియయు శక్తులను ఆకర్షించును.

కాగా వీరి మతము చొప్పున క్రియ ముందుగా నుండును. ॥33॥

అవతారిక— మరికొన్ని మతముల నాశ్రయించి సాధన స్వరూపమును చూపుచున్నాడు.

**శ్లో॥ అపూర్వం కాలశక్తిం వా క్రియాం వా కాలమేవ వా ।**
**తమేవంలక్షణం భావం కేచిదాహుః కథఞ్చన ॥ 34**

1. కేచిత్ = కొంతమంది, ఏవం లక్షణమ్ = పై చూపబడిన స్వరూపముకల, తమ్ = ఆ, భావమ్ = సాధన పదార్థమును, అపూర్వమ్ = అపూర్వమునుగా, ఆహుః = పలుకుచున్నారు. ఇది మీమాంసకుల ఆశయము.

మనుష్యులు చేసెడి శుభాశుభ కర్మలవలన ఒక సంస్కారము కలుగును. అది కర్మల ఫలము లభించువరకు ఉండును. ఫలము రాగా నశించును. దీనిని అపూర్వమందురు. అదియే సాధనమని కొందరు విశ్వసించుచున్నారు.

2. మరికొందరు, కాలశక్తిం + వా = కాలముయొక్క శక్తినే, సాధనముగా పలికెదరు.

3. మరికొందరు, క్రియాం + వా = క్రియనే సాధనమని గ్రహించిరి. అదియే శక్తులను ప్రకాశింపచేయును.

4. మరికొందరు, కాలమ్ + ఏవ + వా = కాలమునే సాధనమునుగా తలంచెదరు. ॥34॥

అవతారిక— ద్రవ్యములయందున్న సామర్థ్యమనెడి శక్తియే సాధనమని చూపి ఆ సాధనము యొక్క సంఖ్యను చూపుచున్నాడు.

**శ్లో॥ నిత్యాః షట్ శక్తయో ఽన్యేషాం భేదాభేదసమన్వితాః ।**
**క్రియాసంసిద్ధయేఽర్థేషు జాతివత్సమవస్థితాః ॥ 35**

అన్యేషామ్ = కొందరి (మతమున), అర్థేషు = ఘటము, పటము మున్నగు పదార్థములయందు భేదాభేదసమన్వితాః = భిన్నముగాను అభిన్నముగాను ఉన్నటువంటి, నిత్యాః = నిత్యములగు, షట్ = ఆరు, శక్తయః = కర్మ, కర్త, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అను ఆరు శక్తులు, క్రియా సంసిద్ధయే = నీటిని తీసికొనివచ్చుట మున్నగు క్రియల సిద్ధికొరకు, జాతివత్ = ఘటత్వము, పటత్వము మున్నగు జాతులువలె, సమవస్థితాః = నియతములై యున్నవి.

కర్తృత్వాది శక్తులు ఘటాదులకంటె వేరు కానేరవు. అట్లని అభిన్నములు కానేరవు జాతి యెట్లు నిత్యమై ఘటవ్యక్తియందు సమవేతమగునో, అట్లే ఈ శక్తులు కూడ నున్నవి. ఇవి ఆరు. ॥35॥

అవతారిక— ద్రవ్యములు ఎన్నియో సంఖ్యాపరిమితి లేకయున్నను, శక్తులు మాత్రము ఆరే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యాకారాదిభేదేన తా శ్చాపరిమితా ఇవ ।
దృశ్యన్తే, తత్త్వమాసాం తు షట్ శక్తీర్నాతివర్తతే ॥ 36

ద్రవ్యాకారాది భేదేన = ద్రవ్యముయొక్క ఆకారము మొదలయినవాని భేదముచే, తాః + చ = ఆ శక్తులు, అపరిమితాః + ఇవ = పరిమితి లేనివివలె, దృశ్యన్తే = చూడబడుచున్నవి.

కొడవలి ఒక విధముగా ఛేదనమునకు ఉపకరించును. కత్తి మరియొక విధముగా సహకరించును. అట్లే ఆ యా వస్తువుల ఆకారమునుబట్టియు వేరువేరు పనులు జరుగును. కాగా వాని శక్తులుకూడ విభిన్నములవలె కాన్పించుచున్నవి. అట్లే దేశకాలములచే గూడ భిన్నములగుచున్నవి.

కాని, ఆసామ్ = ఈ శక్తులయొక్క, తత్త్వమ్ = స్వరూపము, షట్ = ఆరు, శక్తేః = శక్తులను, న + అతివర్తతే = అతిక్రమించి యుండదు.

వేరుగా ఎన్నియో కాన్పించినను, అవి కర్తగానో కర్మగానో కాక మరియొక కారకరూపముగానో కాన్పించును. ఈ యారు కాక మరియొకరూప ముండనేరదు. ॥36॥

అవతారిక— నిజరూపమున శక్తి ఒక్కటియే. అదియే నిమిత్తవశమున ఆరు రూపములుగా కాన్పించుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నిమిత్తభేదాదేకైవ భిన్నా శక్తిః ప్రతీయతే ।
షోఢా, కర్తృత్వమేవాహు స్తత్ప్రవృత్తేర్నిబన్ధనమ్ ॥ 37

ఏకా + ఏవ = నిజరూపమున ఒక్కటియేయగు, శక్తిః = శక్తి, నిమిత్తభేదాత్ = కారణ భేదమువలన, షోఢా = ఆరు విధములుగా, భిన్నా = భిన్నమైనదిగా, ప్రతీయతే = తెలియ బడుచున్నది.

సామర్థ్యమనునది ఒక్కటియే, కాని నిమిత్తముల భేదమున ఆరు రూపములతో కాన్పించుచున్నది.

కర్తృత్వమ్ + ఏవ = కర్తృ శక్తినే, తత్ప్రవృత్తేః = ఆరు విధములగు ప్రవృత్తికి, నిబన్ధనమ్ = కారణముగా, ఆహుః = పలుకుచున్నారు.

కర్తృ శక్తియే కరణముగా, కర్మగా, సంప్రదానముగా, అపాదానముగా, అధికరణముగా పరిణమించుటకు కారణమని పెద్దలు వక్కాణించిరి. ॥37॥

అవతారిక— శక్తి ఒకటియా ? కాక అనేకమా ? అని విచారింపబడినది. ఇపుడు ఆ శక్తి ద్రవ్యరూపమా ? కాక ద్రవ్యముకంటె వేరుగా నున్నదా ? అని విచారించుచున్నాడు.

శ్లో॥ తత్త్వే వా వ్యతిరేకే వా వ్యతిరేకితదుచ్యతే ।
శబ్దప్రమాణకోలోకః, సశాస్త్రేణానుగమ్యతే ॥ 38

తత్త్వే + వా = శక్తికి ద్రవ్యముతో అభేదమున్నను, వ్యతిరేకే + వా = ద్రవ్యముతో భేదమున్నను ప్రయోజనమేమియు లేదు, కాని, తత్ = ఆ సాధనము, వ్యతిరేకి = భిన్నమేయని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

శక్తి ద్రవ్యరూపమే, కాక వేరుగానున్నది అని విచారణకు ఏమియు ప్రయోజనము లేదు. కాని ద్రవ్యముకంటె సాధనము భిన్నమేయనుట యుక్తము. ఏలయనగా—

లోకః = లోకము, శబ్దప్రమాణకః = శబ్దము ప్రమాణముగాగలది, (భవతి) = అగుచున్నది.

శబ్దము ఏమి చెప్పునో దానిని లోకము నమ్ముచున్నది. శక్తి ద్రవ్యముకంటె వేరు అని శబ్దము చెప్పుచున్నది.

సః = అట్టి లోకము, శాస్త్రేణ = శాస్త్రముచే, అనుగమ్యతే = అనుసరింపబడుచున్నది.

లోకమున ఏది ప్రసిద్ధమో దానినే శాస్త్రము బోధించుచున్నది.

కాగా శక్తి ద్రవ్యరూపము కాదు. ద్రవ్యముకంటె భిన్నమే అని వైయాకరణుల సిద్ధాంతము. ॥38॥

అవతారిక— పరమార్థ పర్యాలోచనలేనిదే ఏ పదార్థమును విమర్శించినను, తృప్తి కలదు. అను అభిప్రాయముతో గ్రంథకర్త పరమార్థమును చూపుచున్నాడు.

శ్లో॥ పరమార్థే తు నైకత్వం పృథక్త్వాద్భిన్నలక్షణమ్ ।
పృథక్త్వైకత్వరూపేణ తత్త్వమేవ ప్రకాశతే ॥ 39

పరమార్థే + తు = పరమార్థమును చూచిన, ఏకత్వమ్ = అభేదము, పృథక్త్వాత్ = అనేకత్వము కంటె, భిన్నలక్షణమ్ = వేరుగానున్న రూపము కలది, న = కానేరదు.

తత్త్వమ్ + ఏవ = బ్రహ్మము ఒక్కటియే, పృథక్త్వైకత్వరూపేణ = భిన్నరూపమున అభిన్నరూపమునను, ప్రకాశతే = గోచరించుచున్నది.

తాత్పర్యము— పదార్థము బ్రహ్మము ఒక్కటియే. అదియే అజ్ఞానావస్థలో భిన్నరూపమున, జ్ఞానావస్థలో అభిన్నరూపమున గోచరించుచున్నది.

కాబట్టి ఏకత్వము నానాత్వము పరస్పరము విరుద్ధములు కావు. ॥39॥

అవతారిక— పై కారికార్థమునే వ్యాఖ్యానించుచున్నాడు.

**శ్లో॥ యత్ పృథక్త్వమసందిగ్ధం తదేకత్వాన్న భిద్యతే ।**
**యదేకత్వమసందిగ్ధం తత్ పృథక్త్వాన్నభిద్యతే ॥ 40**

అసందిగ్ధమ్ = (యథార్థము తెలియబడుటచే) సందేహమునకు విషయముకాని, యత్ = ఏ, పృథక్త్వమ్ = నానాత్వమో, తత్ = అది, ఏకత్వాత్ = అభేదముతో, న + భిద్యతే = వేరు కానేరదు.

అట్లే, అసందిగ్ధమ్ = సందేహములేని అనగా భ్రమలేక గుర్తింపబడిన, యత్ = ఏ, ఏకత్వమ్ = ఏకత్వమో, తత్ = అది, పృథక్త్వాత్ = నానాత్వము కంటె, న + భిద్యతే = వేరు కానేరదు.

అజ్ఞానావస్థలో ఏకత్వ నానాత్వములు భిన్నములువలె తెలియబడును. జ్ఞానము కలుగగా భ్రమ ప్రమాదములు తొలగగా ఆ రెంటికి రూపము ఒక్కటియే. ॥40॥

అవతారిక— పరమావధిచే గుర్తింపబడినది చైతన్యమే అదియే అవిద్యాదశ యందు నానారూపములతో భాసించుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్యౌః క్ష్మా వాయురాదిత్యః సాగరాః సరితో దిశః ।**
**అన్తఃకరణతత్త్వస్య భాగా బహిరవస్థితాః ॥ 41**

ద్యౌః = ఆకసము, క్ష్మా = నేల, వాయుః = గాలి, ఆదిత్యః = సూర్యుడు, సాగరాః = సముద్రములు, సరితః = నదులు, దిశః = దిక్కులు, ఇవి యన్నియు, అన్తఃకరణతత్త్వస్య = లోపలనున్న చైతన్యము యొక్క, భాగాః = అంశములే, బహిః = బాహ్యప్రపంచకమున, అవస్థితాః = నిలిచియున్నవి.

చైతన్యము ఒక్కటియే నిజమగు తత్త్వము. ఆ చైతన్యమే దేహములో సూక్ష్మరూపమున నున్నది. దాని ప్రతిబింబములే భూమి, ఆకాశము మున్నగు బాహ్య పదార్థములు. అవి నిజరూపమున భూమ్యాదులు కావు. అవియు చైతన్యరూపములే. ॥41॥

అవతారిక— భూమి మున్నగునవేకాక కాలము కూడ పరమార్థరూపమున చైతన్యము యొక్క భాగమే అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ కాలవిచ్ఛేదరూపేణ తదేవైకమవస్థితమ్ ।**
**సహ్యపూర్వాపరోభాగః పరరూపేణ లక్ష్యతే ॥ 42**

తత్ = ఆ, ఏకమ్ + ఏవ = బ్రహ్మతత్త్వమే, కాలవిచ్ఛేద రూపేణ = కాలమనెడి భేదముతో అవస్థితమ్ = వ్యవస్థితమై యున్నది.

బ్రహ్మమే కాలరూపమున కాన్పించుచున్నది.

అపూర్వాపరః = పౌర్వాపర్యము లేనట్టియు, కనుకనే అభాగః, అవయవములు లేని, సః = బ్రహ్మపదార్థము, పరరూపేణ = మాయావశమున, లక్ష్యతే + హి = నానా రూపమున కాన్పించుచున్నది గదా :

బ్రహ్మ పదార్థము స్వతః నిరవయవము. ఐనను మాయావశమున కాలరూపమున, జీవరూపమున కాన్పించుచున్నది.

కాగా పదార్థముల సామర్థ్యమే సాధనమని వైయాకరణుల మతము. ఆ సందర్భ మున దర్శనాంతరీయుల మతములు కూడ చూపబడినవి.

1. విజ్ఞానవాదముచొప్పున బుద్ధి ప్రకల్పనయే సాధనము.
2. సంసర్గవాదమున సంసర్గివస్తువుల రూపమే సాధనము.
3. మీమాంసకమతమున అదృష్టమే సాధనము.
4. అద్వైతిమతమున బ్రహ్మముయొక్క కాలశక్తి సాధనము.
5. సాంఖ్యమతమున రాజసమగు ప్రవృత్తియే సాధనము.
6. కాలము ద్రవ్యమనెడివారి మతమున నిత్యమగు కాలము సాధనము.

ఇంతవరకు కారకవిచారము, దాని ప్రసంగమున హేతు - లక్షణ - కారకతాద్యర్థ ములకు గల పరస్పర భేదము, శక్తితోకూడి జనియించునదా ? కాక కాలభేదమున జని యించునదా ? అనియు, ఆ శక్తి ఒక్కటియా ? కాక కర్మాదిభేదమున ఆరు విధములా ? అనియు, ఆ శక్తి ద్రవ్యరూపమా ? ద్రవ్యముకంటె వేరుగా నున్నదా ? అనియు, ఆ ప్రసంగమున కొంచెము బ్రహ్మనిరూపణమును చేయబడినది ॥42॥

అవతారిక— ఇపుడు వైయాకరణమతమునే ప్రబోధించుచు శక్తి ద్రవ్యరూపము కాదు, ద్రవ్యముకంటె భిన్నమే అను మతము వైయాకరణ సమ్మతమని నిరూపించు చున్నాడు.

శ్లో॥ దృష్టోహ్యవ్యతిరేకేఽపి వ్యతిరేకోఽన్వయేఽసతి ।
వృక్షాద్యర్థాన్వయ, స్తస్మాద్విభక్త్యర్థోఽన్య ఇష్యతే ॥ 43

అవ్యతిరేకే + అపి = లేమిలేకున్నను అనగా వృక్ష అను ప్రాతిపదికము ఉన్నను, వ్యతి రేకః = భేదము అనగా ప్రత్యయార్థమునకల నానాత్వము, దృష్టః + హి = చూడబడు చున్నది కదా :

వృక్షమ్, వృక్షేణ, వృక్షాయ మున్నగు పదములలో వృక్ష అను ప్రకృతియొక్క అర్థము అంతట నున్నను, ప్రత్యయముల యర్థము మారియున్నది.

అన్వయే = నియతమగు సంబంధము, అసతి = లేకున్నను అనగా ప్రత్యయార్థము ఏకరూపమున లేకున్నను, వృక్షాద్యర్థాన్వయః = వృక్షము మున్నగు ప్రకృత్యర్థము ఏక రూపమున కానవచ్చుచున్నది.

తస్మాత్ = ఆ కారణములవలన, విభక్త్యర్థః = విభక్తి ప్రత్యయము యొక్క అర్థము, అన్యః = భిన్నమైనదే, అనగా ప్రకృత్యర్థమగు వృక్షాది ద్రవ్యములకంటె వేరుగా నున్నదనియే. ఇష్యతే = (వైయాకరణులచే) అంగీకరింపబడు చున్నది. శక్తి సాధనము, అవి ద్రవ్యముకంటె భిన్నమే. ఇది భాష్యకారాది వైయాకరణుల ముఖ్య సిద్ధాంతము. ॥43॥

*అవతారిక* — ఇంతవరకు శక్తికారకము, అదియే సాధనము అను అర్థమును నిరూపించియున్నాడు.

వ్యాఖ్యాతమగు అర్థమును ఉపసంహరించుచు వ్యాఖ్యానింపతగిన అర్థమును సూచించుచున్నాడు

**శ్లో॥ సామాన్యం కారకం తస్య సప్తాద్యా భేదయోనయః ।**
**షట్ కర్మాఖ్యాదిభేదేన శేషభేదస్తు సప్తమీ ॥ 44**

A. ఇంతవరకు కారకమ్ = కారకము. సామాన్యమ్ = సామాన్యముగా (నిరూపితమ్) నిరూపింపబడినది, ద్రవ్యములయందున్న శక్తియే కార్యసాధనము, ద్రవ్యము శక్తిరూపము కానేరదు అని యింతవరకు కారకసామాన్యము చూపబడినది.

B. ఇటుపైని కారకభేదమును జూపుచున్నాడు.

(ఇదానీమ్) = ఇపుడు, తస్య = సామాన్యరూపముగా జూపబడిన కారకమునకు, ఆద్యాః = ప్రధానములగు, సప్త = ఏడు, భేదయోనయః = భేదములకు కారణములు, (కథ్యన్తే) = చెప్పబడుచున్నవి. కారకము ఏడు విధములుగా విభజింపబడుచున్నదని భావము.

C. ఆ భేదములనే చెప్పుచున్నాడు.

కర్మాఖ్యాది భేదేన = కర్మాది వ్యపదేశముల భేదముచే, అనగా కర్మ, కరణము అనెడి పేర్ల భేదమున, షట్ = శక్తులు ఆరు, శేషభేదః + తు = సంబంధమను భేదము, సప్తమీ = ఏడవది

కర్మ, కరణము, కర్త, సంప్రదానము, అపాదానము, అధికరణము అనునవి ఆరు కారకభేదములు, సంబంధము ఏడవ కారక ప్రభేదము. సంబంధము షష్ఠ్యర్థము, అదియు కారకమే అని భర్తృహరి సిద్ధాంతము. కర్మ ఏడు విధములు, సంప్రదానము మూడు విధములు అను రీతిని కారకములు అవాంతర భేదములచే పలు విధములు. కాని ప్రధాన భేదమును బట్టి 'సప్త' అని పలికెను.

ఇచట 'ఆద్య' శబ్దము లక్షణచే ప్రధానార్థకము. ॥44॥

*అవతారిక* — కారకము ఏడు విధములుగా నున్నదని చూపబడినది. వానిలో ముందుగ కర్మ కారకమును వ్యాఖ్యానించుచున్నాడు.

శ్లో॥ నిర్వర్త్యం చ వికార్యం చ ప్రాప్యం చేతి త్రిధా మతమ్ ।
తత్రేప్సితతమం కర్మ, చతుర్ధాన్యత్తు కల్పితమ్ ॥ 45

A. తత్ర = దానియందు అనగా కారకములయందు, ఈప్సితతమమ్ = 'ఈప్సితతమ' అను పదముతో కలసియున్న సూత్రముచే లక్షితమగు అనగా "కర్తురీప్సితతమంకర్మ" (1-4-49) అను సూత్రముచే లక్షితమగు, కర్మ = కర్మ. 1. నిర్వర్త్యం + చ = నిర్వర్త్యమనియు, 2. వికార్యం + చ = వికార్యమనియు, 3. ప్రాప్యం + చ + ఇతి = ప్రాప్యమనియు, త్రిధా = మూడు ప్రకారములచే, మతమ్ = శాస్త్రసమ్మతమై యున్నది.

కర్త తనయందున్న క్రియచే ఏ పదార్థమును సంబంధింపచేయునో, అది కర్మ సంజ్ఞకమగునని "కర్తురీప్సితతమం కర్మ" అను సూత్రమున కర్థము. ఆ పదార్థము కారకము కావలెను. ఈ సూత్రముచే విధింపబడిన కర్మ మూడు విధములుగా జూపబడినది. ఈ మూడింటికి 47 వ శ్లోకము దగ్గరనుండి లక్షణములు చూపబడగలవు.

B. అన్యత్ + తు = సూత్రాంతర నిర్దిష్టమగు కర్మమాత్రము, అనగా "కర్తురీప్సితతమం కర్మ" అను సూత్రము కాక ఇతరములగు "తథాయుక్తం చానీప్సితం" (1-4-50) మున్నగు సూత్రములచే గుర్తింపబడిన కర్మ, చతుర్ధా = నాలుగు ప్రకారములుగా, కల్పితమ్ = శాస్త్రమున చూపబడినది.

'కర్తురీప్సితతమం' అను సూత్రముచే జూపబడిన కర్మ మూడు విధములు, ఇతర సూత్రములచే జూపబడిన కర్మ నాలుగు విధములు. కాగా కర్మ ఏడు విధములుగా విభక్తమగుచున్నది. ॥45॥

*అవతారిక* — "చతుర్ధాన్యత్తు కల్పితమ్" అనెడి కారికా భాగముచే జూపబడిన నాలుగు విధములగు కర్మలను వివరించుచున్నాడు.

శ్లో॥ ఔదాసీన్యేనయత్ప్రాప్యం యచ్చకర్తురనీప్సితమ్ ।
సంజ్ఞాన్తరై రనాఖ్యాతం యత్, యచ్చాప్యన్యపూర్వకమ్ ॥ 46

1. యత్ = ఏది, ఔదాసీన్యేన = ఉదాసీన భావముచే, ప్రాప్యమ్ = పొందబడినదియో, అనగా ఒక పని చేయునపుడు తప్పనిసరిగా మరియొకి వస్తువు తనకు సంప్రాప్తించును. కాని అది తనకు కోరబడినది కాదు. అట్లని ద్వేష్యము కాదు ఉదా: గ్రామం గచ్ఛన్తృణం స్పృశతి (గ్రామమునకు బోవుచున్నవాడై గడ్డిని స్పృశించుచున్నాడు) ఇచట గ్రామము కర్తకు గమ్యము, కాని మార్గమధ్యమున తృణ మున్నందున దానిని తాకుచున్నాడు. అంతియే కాని తృణము గమ్యము కాదు. అట్లని తృణము ద్విష్టముకాదు.

2. చ = అట్లే, యత్ = ఏది, అనీప్సితమ్ = కర్తకు మిక్కిలి సమ్మతము కానిది, అనగా ద్వేషమునకు విషయమగునది.

తృణమువలె కాక కర్తకు సమ్మతము కానిది. ఇదియు కర్మయే. ఉదా : విషం భుఙ్క్తే. (విషమును తినుచున్నాడు) సాంసారికములగు ఇక్కట్లు భరియింపజాలక విషమును త్రాగుచున్నాడు.

1, 2, విధములగు కర్మలు "తథా యుక్తంచా నీప్సితమ్" (1-4-50) అను సూత్రముచే విధింపబడినవి.

3. యత్ = ఏది, సంజ్ఞాన్తరైః = ఇతరములగు సంజ్ఞలచే, అనాఖ్యాతమ్ = వివక్షింపబడనిదో, అపాదానాది సంజ్ఞలు కలుగుచుండగా వానిని వివక్షింపక, కలిగిన కర్మ సంజ్ఞ.

అపాదానము, అధికరణము మున్నగు సంజ్ఞలు ప్రాప్తించుచుండగా వానిని విడనాడి చూపబడినదియు కర్మయగును. ఉదా : గాం దోగ్ధి పయః (ఆవును పాలు పితుకుచున్నాడు) ఇచట దోహన క్రియలో ఆవు అపాదానము కావలెను. ఆవునుండి పాలు తీయుదురుకదా ! అట్లైనను గోవునకు అపాదానత్వమును వివక్షచేయక కర్మత్వమును వివక్షింపగా తద్వాచకము కంటె ద్వితీయా విభక్తి కలిగినది. అట్లే వ్రజ మవరుణద్ధి గామ్ (గోవును పల్లెయందు నిరోధించుచున్నాడు) ఇచట నిరోధమునకు వ్రజము ఆధికరణము, కాగా సప్తమి ప్రవర్తింప వలెను. కాని అధికరణత్వమును వివక్షింపక కర్మత్వమును వివక్షించుటచే ద్వితీయ కలిగినది. ఈ కర్మసంజ్ఞ "అకథితంచ" (1-4-51) అను సూత్రముచే కలిగినది.

4 చ = మరియు, యత్ = ఏది, అన్యపూర్వకమ్ = ఇతరములగు సంజ్ఞలు పూర్వముగా కలదియో, అనగా సంప్రదానము మున్నగు సంజ్ఞలు ప్రాప్తించుచుండగా వానికి అపవాదముగా విధింపబడిన కర్మత్వము.

ఉదా : క్రూరమభిక్రుధ్యతి (క్రూరుని మిక్కిలి కోపగించుచున్నాడు) ఇచట క్రుధధాత్వర్థయోగమున క్రూరునకు "క్రుధద్రుహేర్ష్యాஉసూయార్థానాం యంప్రతికోపః" (1-4-37) అను సూత్రముచే సంప్రదాన సంజ్ఞ కలుగుచున్నది. కాగా చతుర్థీ విభక్తి ప్రవర్తింపవలెను. కాని ఆ సంప్రదాన సంజ్ఞకు అపవాదముగా "క్రుధద్రుహోరుపసృష్టయోః కర్మ" (1-4-38) అను సూత్రముచే (ఉపసర్గతో కూడిన క్రుధ, ద్రుహధాతువుల సంబంధమున ఎవనిని కోపగించునో వానికి కర్మసంజ్ఞ కలుగును) కర్మసంజ్ఞ విధింపబడినది.

మరియు "దివః కర్మచ" (1-4-43) అను సూత్రముచే దివు (కీడ) ధాత్వర్థమున సాధకతమమునకు కర్మసంజ్ఞ, చ శబ్దముచే కరణసంజ్ఞయు కలుగును.

అక్షైఃదీవ్యతి (పాచికలతో ఆడుచున్నాడు) అక్షాన్‌దీవ్యతి. ఇదియు ఈ ప్రభేదమునకు ఉదాహరణము కానోపును. ॥46॥

*అవతారిక* — "కర్తురీప్సితతమం కర్మ" అను సూత్రముచే లక్షితమగు కర్మ మూడు విధములుగా నున్నదని చెప్పబడినది ఆ మూడింటికి లౌకిక ప్రతీతినిబట్టి లక్షణములు $1\frac{1}{2}$ శ్లోకముచే చెప్పుచు ముందుగ నిర్వర్త్యమునకు లక్షణమును జూపుచున్నాడు.

శ్లో॥ సతీ వాఽవిద్యమానా వా ప్రకృతిః పరిణామినీ ।
యస్య నాశ్రీయతే, తస్య నిర్వర్త్యత్వం ప్రచక్షతే ॥ 47

యస్య = ఏ వస్తువునకు అనగా కర్మకు, సతీ + వా = ఉన్నటువంటి, పరిణామినీ = పరిణామమును చెందునట్టి, ప్రకృతిః = ప్రధాన కారణము, న + ఆశ్రీయతే = ఆశ్రయింపబడదో, వా = కాక, అవిద్యమానా = ప్రకృతి లేకయే యుండునో, తస్య = దానికి అనగా ఆ రెండు విధములగు కర్మత్వమునకు, నిర్వర్త్యమ్ = నిర్వర్త్యకర్మత్వమను, ప్రచక్షతే = (కర్మతత్త్వవేత్తలు) చెప్పుచున్నారు.

తాత్పర్యము— ఘటంకరోతి (కడవను తయారుచేయుచున్నాడు) మున్నగు చోటులయందు ఘటాదులు కర్మలగుచున్నవి. ఇచట ఘటమునకు ప్రధానకారణము మన్ను కలదు. కాని మట్టిని వివక్షింపనిచో, ఘటాదులు నిర్వర్త్యకర్మలగుచున్నవి.

సంయోగం కరోతి (సంయోగమును చేయుచున్నాడు) మున్నగు చోటులందు సంయోగాదులకు ప్రధాన కారణము లేదు. అట్టి కర్మలుకూడ నిర్వర్త్యకర్మలే యగును.

మృత్తు కారణము, ఘటము కార్యము, ఈ రెంటికి అభేదవివక్ష చేయనిచో ఘటాదికము నిర్వర్త్యము. సంయోగాదులకు కారణము లేనందున నవియు నిర్వర్త్యములే. ॥47॥

*అవతారిక*— లోకవ్యవహారమును బట్టియే వికార్యకర్మకు లక్షణము చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రకృతేస్తు వివక్షాయాం వికార్యమ్ ।

ప్రకృతేః = కారణమునకు, వివక్షాయాం + తు = వివక్ష చేసినచో, వికార్యమ్ = వికార్యకర్మనుగా, (ప్రచక్షతే) చెప్పుచున్నారు.

మృదం ఘటం కరోతి (మట్టిని ఘటముగా చేయుచున్నాడు) కడవకు కారణమగు మట్టిని గూడ వివక్షించిన, ఘటాదికము వికార్యమగును.

కాగా ప్రకృతిని వివక్షింపనిచో ఘటము మున్నగునవి నిర్వర్త్య కర్మలుగాను, ప్రకృతిని వివక్షించినచో అవియే వికార్యకర్మలుగాను లోకదృష్టి ననుసరించి చూపబడుచున్నవి. సంయోగాదులు ఎల్లపుడు నిర్వర్త్యములే.

*అవతారిక*— $1\frac{1}{2}$ శ్లోకముచే లౌకిక వ్యుత్పత్తినిబట్టి, నిర్వర్త్యవికార్య కర్మలకు లక్షణములను జూపి, ఇపుడు శాస్త్ర వ్యవహారమును ఆశ్రయించి వానికే లక్షణములను చెప్పుచున్నాడు.

శ్లో॥ ................ కైశ్చిదన్యథా ।
నిర్వర్త్యం చ వికార్యం చ కర్మశాస్త్రే ప్రదర్శితమ్ ॥ 48

కైశ్చిత్ = కొందరిచే, అన్యథా = మరియొక విధముగా, అనగా కారణముయొక్క వివక్షతో అవివక్షతోను నిమిత్తము లేకయే, శాస్త్రే = శాస్త్రమార్గమున, నిర్వర్త్యం + చ = నిర్వర్త్యము, వికార్యం + చ = వికార్యము అగు, కర్మ = కర్మ లక్షణము, ప్రదర్శితమ్ = చూపబడినది.

కాక, శాస్త్రే = శాస్త్రమార్గమున, కైశ్చిత్ = కొందరిచే, నిర్వర్త్య = వికార్య కర్మలు, అన్యథా = మరియొక విధముగా, ప్రదర్శితమ్ = ప్రదర్శింపబడినది.

రెంటికి తాత్పర్యము సమానమే. ॥48॥

అవతారిక— శాస్త్రానుసారముగా నిర్వర్త్య వికార్యములకు లక్షణములను జూపుచున్నాడు.

**శ్లో॥ యదసజ్జాయతే సద్వా జన్మనా యత్ప్రకాశతే ।**
**తన్నిర్వర్త్యం, వికార్యం తు ద్వేధా కర్మ వ్యవస్థితమ్ ॥ 49**

***వివరణము***— కారణమువలన కార్యము కలుగుటలో శాస్త్రకారులలో అభిప్రాయభేదము కలదు. 1. ఇంతకుమునుపు అనగా కారణ వ్యాపారమునకు ముందుగా లేనియట్టి కార్యము కారణ వ్యాపారమువలన జనియించుచున్నది. దారములవలన వస్త్రము, మట్టివలన కడవ పుట్టుచున్నవి. కారణావస్థలో వస్త్రము మున్నగునవి లేవు. అవి ఇపుడు జనియించుచున్నవి. దీనిని అసత్కార్య వాదమందురు. అనగా అసత్ = ఇంతకుముందు లేని, కార్యము కలుగుచున్నది. ఈ పక్షమును తార్కికులు విశ్వసింతురు. 2. కార్యము కారణావస్థలో సూక్ష్మ రూపమున ఉన్నది. అంతియేకాని నూతనముగా కార్యము జనియింపలేదు. దీనిని సత్కార్య వాద మందురు. దీనిని సాంఖ్యులు నమ్మినారు. ఈ రెండువాదముల నాశ్రయించి ఇచట నిర్వర్త్యకర్మ చూపబడినది.

***ప్రతిపదార్థము***— A. యత్ = ఏది, అసత్ = లేనిదే, అనగా కారణవ్యాపారమునకు ముందుగా లేనిదే, జాయతే = జనియించుచున్నదో, ఇది అసత్కార్యవాదులగు నైయాయికుల మతము నాశ్రయించి చెప్పబడినది.

సత్ + వా = ఉన్నదేయగు, అనగా కారణవ్యాపారమునకు పూర్వముగూడ సూక్ష్మరూపమున కారణములయందున్నట్టి, యత్ = ఏది, జన్మనా = జన్మచే, ప్రకాశతే = ప్రకాశించుచున్నదో, ఇది సత్కార్యవాదులగు సాంఖ్యులమతము నాశ్రయించి చెప్పబడినది.

తత్ = అది, నిర్వర్త్యమ్ = నిర్వర్త్యకర్మయగును, నిర్వర్తింపతగిన కర్మయని భావము.

తాత్పర్యము— ఘటం కరోతి (కడవను తయారుచేయుచున్నాడు) లేనికడవ మనకు క్రొత్తగా జనియించుచున్నట్లు కానవచ్చుచున్నది. కాపిలమతము చొప్పున కారణరూప

తలంచిరి. ఆ శక్తులు కార్యమునుబట్టి భిన్నములుగానున్నట్లు అనుమితములగుచున్నవి. అవి కలసియే లోకయాత్రను కలిగించును. ద్రవ్యము మున్నగు పదార్థములు వేరువేరుగా ఉన్నచో అవి వ్యవహారమును కలిగింపలేవు.

అందు శక్తులు ఉపాధులు, అవి బ్రహ్మకు ఆత్మభూతములే, దానికంటె భిన్నములు కావు. కావుననే అద్వైతవాదము సరియగుచున్నది.

సత్యభాగము జాతియనియు, అసత్యమగు భాగములు వ్యక్తులనియు విభాగము చేయనగును. ఈయర్థము ఈసముద్దేశముననే 32వ శ్లోకమున గ్రంథకర్తయే చెప్పగలడు॥23॥

అవతారిక — ద్రవ్యము మున్నగు శక్తులు అన్నియు కలసియే కార్యమును సాధించును అని యంగీకరించిన, వానికి ప్రత్యేకము ఆకార్యమును సాధించుట సంభవింపదని తేలినది. అట్టితరి ఆశక్తులకంటె వానియొక్క సంసర్గము వేరుగానున్నదని చెప్పవలయును, కాగా శక్తులు బ్రహ్మముకంటె వేరుగా లేకున్నను, వాని సంసర్గము అనునది వేరుగా నున్నందున ద్వైతభావము ఏర్పడును. ఆద్వైతభావము నశింపవలెను అను ప్రశ్నకు చక్కని దృష్టాంతము చూపి సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యథైవచేన్ద్రియాదీనా మాత్మభూతాసమగ్రతా।
తథాసంబన్ధిసంబన్ధసంసర్గేఽపిప్రతీయతే॥ 24

యథా + ఏవ + చ = ఏరీతిగా, ఇన్ద్రియాదీనామ్ = ఇంద్రియములు మున్నగు వానియొక్క, సమగ్రతా = సంపూర్ణత్వము అనగా వానిప్రోగు, ఆత్మభూతా = ఇంద్రియాదులు రూపముగా కలదియో అనగా ఇంద్రియాదులకంటె వేరుకాక ఇంద్రియాదులుగానే గ్రహింపబడుచున్నదో,

తథా = ఆరీతిగా, సంబన్ధిసంబన్ధసంసర్గే + అపి = సంబంధితో అనగా శక్తులకు ఆధారమగు బ్రహ్మముతో ద్రవ్యాదిరూపమగు శక్తులకు కల సంబంధము వలన కలిగిన సంసర్గమునందు అనగా కలయిక యందు గూడ, ఆత్మభూతతా = బ్రహ్మరూపత్వము, ప్రతీయతే = తెలియబడుచున్నది.

తాత్పర్యము-కంటిచే ఘటాదులరూపము గ్రహింపబడుటలో 1.కన్ను 2.ఘటాదుల రూపము 3.వెలుతురు 4. మనస్సు ఇవియన్నియు కావలెను. వీనిలో ఏదిలేకున్నను రూపము ప్రత్యక్షముకాదు. కనుక వీని సముదాయము అపేక్షిత మగుచున్నది. కాని కన్ను మున్నగువానికంటె ఆసముదాయము వేరుకాదు. ఆసముదాయము, కన్ను మున్నగునవనియు ఏకరూపములే, కనుకనే సామాగ్రినికలిగించునవి, సామాగ్రే శబ్దముచే గ్రహింపబడుచున్నవి.

అట్లే బ్రహ్మమునందు ద్రవ్యము మున్నగు శక్తులున్నవి. ఆ శక్తుల సముదాయము లోకయాత్రను నడిపించుచున్నది. ఆసముదాయము శక్తులకంటె భిన్నముకాదు. శక్తిరూపమే. శక్తి బ్రహ్మరూపమే

మున ఉన్న కడవయే మనకు ఈ రూపమున గోచరించుచున్నదని మనము భావించుచున్నాము. ఇట్లే కుండలం కరోతి మున్నగునవి ఉదాహరణములు కాగలవు.

B. వికార్యం + కర్మ + తు = వికార్యకర్మ, ద్వేధా = రెండు విధములుగా, వ్యవస్థితమ్ = నిశ్చితమైయున్నది. ॥49॥

అవతారిక— వికార్యకర్మ రెండు విధములుగా నిశ్చితమైయున్నదని చెప్పబడినది. దానినే వివరించుచున్నాడు.

శ్లో॥ ప్రకృత్యుచ్ఛేదసంభూతం కిఞ్చిత్కాష్ఠాది భస్మవత్ ।
కిఞ్చిద్ గుణాన్తరోత్పత్త్యా సువర్ణాది వికారవత్ ॥ 50

1. ప్రకృత్యుచ్ఛేద సంభూతమ్ = స్వరూపము యొక్క నాశనమును పొందిన కర్మ, కిఞ్చిత్ = ఒక విధమైనది, అనగా సంపూర్ణమగు స్వరూపమును గోల్పోయినది ఒక విధమగు వికార్యకర్మ. భూ (సత్తాయామ్) అను ధాతువుకంటె సంభూత శబ్దము నిష్పన్నము కాదు. మరి భూ (ప్రాప్తౌ) అను 'చురాది' ధాతువుకంటె ణిచ్ ప్రత్యయము ప్రవర్తించిన పక్షమున కర్త్రర్థము న క్త ప్రత్యయముచేయగా నిష్పన్నమాయెను. దీనికి ఉదాహరణము : కాష్ఠాది = కఱ్ఱ మున్నగునది. కాష్ఠం భస్మకరోతి (కఱ్ఱను భస్మము చేయుచున్నాడు) ఇచట కాష్ఠము సంపూర్ణముగా నశించినది. కాబట్టి ఇది వికార్యకర్మ. వికార్యమ్ = వికారమునకు అర్హమైనది. నికారము భస్మము. దానికి అర్హము కాష్ఠము. 'కాష్ఠాది' అను దానికి విశేషణము- భస్మవత్ = భస్మరూపము కలది, అనగా భస్మరూపమును ధరియించినది అని యర్థము. 'భస్మవత్' అనునది మత్వర్థీయాంతము. భస్మ అస్యాస్తీతి - భస్మవత్, వతి ప్రత్యయాంతము కానోపదు. ఈ విశేషణమువలన కాష్ఠం గృహ్ణాతి (కఱ్ఱను పట్టుకొనుచున్నాడు) మున్నగు ప్రయోగములలో కాష్ఠము వికార్యకర్మ కానేరదు.

2. కిఞ్చిత్ = మరియొక విధమైనది, గుణాన్తరోత్పత్త్యా = (ద్రవ్యము నశింపక) ద్రవ్యమునందు మరియొక ఆకారము యొక్క పుట్టుకచే కలిగినది. ఇచట గుణశబ్దము అవయవసన్నివేశమును బోధించును. ఉదాహరణము జూపుచున్నాడు. సువర్ణాది=బంగారము మున్నగునది. దానికి విశేషణము. వికారవత్ = వికారము కలది. సువర్ణం కుణ్డలంకరోతి (బంగారమును కుండలము చేయుచున్నాడు) ఇచట బంగారము వికార్యకర్మ, బంగారము నశింపకయే కుండలాకారమున మార్పు చెందినది. వికారవత్ ఇది మతుబంతము.

కాగా కాష్ఠం భస్మకరోతి అనుచోట కాష్ఠము స్వరూపమును విడనాడినది. అది ఒక విధమగు వికార్య కర్మ. సువర్ణం కుణ్డలం కరోతి. ఇచట సువర్ణము స్వరూపమును బోగొట్టుకొనకయే కుండల రూపమును ధరియించినది. ఇది రెండవ వికార్య కర్మ. భస్మ కుండలములు నిర్వర్త్య కర్మలే. ॥50॥

*అవతారిక*— పై రీతిని నిర్వర్త్య వికార్యకర్మలకు లక్షణములు దెలిపి ఇపుడు ప్రాప్యకర్మకు లక్షణము చూపుచున్నాడు.

శ్లో॥ క్రియాకృతవిశేషాణాం సిద్ధిర్యత్ర న గమ్యతే ।
దర్శనాదనుమానాద్వా తత్ప్రాప్యమితి కథ్యతే ॥ 51

యత్ర = ఏకర్మయందు, క్రియాకృతవిశేషాణామ్ = కర్తయందున్న వ్యాపారములచే జనియించిన విశేషముల యొక్క, సిద్ధిః = సిద్ధి అనగా రూపపరివర్తనము, దర్శనాత్ = ప్రత్యక్షము వలన, అనుమానాత్ + వా = అనుమాన ప్రమాణమువలనగాని, న + గమ్యతే = జ్ఞాతము కాదో, తత్ = అట్టి కర్మ, ప్రాప్యమ్ + ఇతి = ప్రాప్యమని, కథ్యతే = (పెద్దలచే) చెప్పబడుచున్నది

*తాత్పర్యము*— నిర్వర్త్యమున స్వరూపమును బొందుటయే మనకు ప్రత్యక్షముగా తెలియబడుచున్న విశేషము. ఉదా : కాష్ఠంభినత్తి (కట్టెను చీల్చుచున్నాడు) భేదన క్రియ వలన కట్టెయందు చీలిక అను విశేషము ప్రత్యక్ష సిద్ధము. తణ్డులంపచతి (బియ్యమును ఉడికించుచున్నాడు) పాకక్రియవలన బియ్యము మెత్తగ నగుచున్నది. మెత్తపడుటయే విశేషము అట్లే వికార్యకర్మయందు (కాష్ఠం భస్మకరోతి) రూపము మారిపోవుట ప్రత్యక్ష సిద్ధము.

(పుత్త్రః సుఖంకరోతి) ఒకనికి సుఖము కలిగిన, ఆయన ముఖ వికాసమును బట్టి సుఖము అనుమితమగును. అట్లే దుఃఖము కూడ ముఖమాలిన్యముచే ననుమితము కాగలదు.

పై రీతిని ప్రత్యక్షముగాగాని అనుమానమువలనగాని ఏ కర్మయందు మార్పు జ్ఞాతము కానేరదో, అది ప్రాప్యకర్మ యనబడును. ఉదా : ఆదిత్యం పశ్యతి (సూర్యుని చూచుచున్నాడు). మనము సూర్యుని చూచుటచే సూర్యునియందు ఎవ్విధమగు విశేషము కలుగలేదు. కలుగదు. గ్రామం గచ్ఛతి (గ్రామముగూర్చి వెళ్ళుచున్నాడు) గమన క్రియవలన గ్రామమునకు ఎవ్విధమగు పరిణామము కానరాదు. ఘటం జానాతి (కడవను తెలిసికొనుచున్నాడు) ఇదియు అట్టిదే.

పై రీతిని జ్ఞాన - గమన - దర్శనాది క్రియలవలన ఘట - గ్రామ - సూర్యుల యందు విశేషము జ్ఞాతము కానందున అవి ప్రాప్యకర్మలనబడుచున్నవి.

జ్ఞానాది క్రియలకు విషయములగుటంజేసి ఘటాదులకు కర్మసంజ్ఞ ప్రవర్తింపగలదు. ॥51॥

*అవతారిక*— ప్రాప్యకర్మను అంగీకరింపనక్కరలేదు. ఎల్లకర్మలయందు క్రియావిశేషము కావచ్చుచునే యున్నది అని కొందరు భావించుచున్నారు. వారి యభిప్రాయమును జూపుచున్నాడు.

శ్లో॥ విశేషలాభః సర్వత్ర విద్యతే దర్శనాదిభిః ।
కేషాఞ్చిత్తదభివ్యక్తిస్సిద్ధి ర్దృష్టివిషాదిషు ॥ 52

కేషాఞ్చిత్ = కొందరి (మతమున), సర్వత్ర = ఎల్లచోటులందు అనగా ఎల్ల కర్మలయందు, దర్శనాదిభిః = దర్శనము, గమనము, జ్ఞానము మున్నగువానిచే, విశేషలాభః = క్రియవలన కలిగెడి వికారమును పొందుట, విద్యతే = ఉన్నది, ప్రతికర్మయందు వికారము కలుగుచునే యున్నది, కాని కొన్ని చోటులందు అతిసూక్ష్మతచే గోచరింపకపోవ వచ్చును.

లక్ష్యమును జూపుచున్నాడు. దృష్టి విషాదిషు = నేత్రమునందు విషముకల పాములు మున్నగువానియందు, తదభివ్యక్తిః = దానియొక్క స్పష్టత అనగా దర్శనమువలన క్రియావిశేషము కలుగుట స్పష్టము. కారికలో 'ఆది' పదముచే అయస్కాంతము (సూదంటు రాయి) మున్నగునవి గ్రహింపబడును.

*తాత్పర్యము*— కొన్ని పాములకంటిలో అత్యుత్కటమగు విషముండును. అట్టి పాములు చూచిన గడ్డిలతలు మండును. అది ఎల్లరకును తెల్లమే. అట్లే అయస్కాంతము యొక్క సన్నిధానమున ఇనుము మున్నగునవి చలించును.

కాబట్టి ప్రతిపదార్థమునకు దర్శనాది క్రియలచే విశేషము కలుగుటచే ప్రాప్య కర్మ లేనేలేదు. ఇది కొందరి యభిప్రాయము.

దృష్టి విషాదిషు దృష్టౌ (కంటియందు) విషంయేషాం - తే దృష్టివిషాః = సర్పములు.

మనుష్యులలో గూడ కొందరు చూచిన అన్నము హితము కాకుండుట, నిదురపట్టుక పోవుట, కృశించుట అనే వికారములు కలుగును. దానినే ఈనాడు కూడ దృష్టిదోషముగా భావించుచున్నారు.

*విశేషము*— ఈ కారికను భర్తృహరి తన సిద్ధాంతముగా జూపక పరమతముగా జూపెను. కనుకనే 'కేషాఞ్చిత్' అని భర్తృహరి పలికెను. ఏదో ఒక చోటున విశేష మున్నంత మాత్రాన సర్వత్ర ఉన్నదనుటయు పొసగదు.

మరియు పాముల దృష్టియందు విషమున్నది. అపుడు తృణాదులయందు వికారము విషము యొక్క తేజస్సంయోగము వలన కలుగుచున్నది. కేవలము పాము చూచుట వలన కాదు.

కాబట్టి నిర్వర్త్యవికార్యకర్మలకంటె వేరుగ ప్రాప్యకర్మ ఉన్నదనియే భర్తృహరి సిద్ధాంతము. ॥52॥

*అవతారిక*— ప్రాప్యకర్మయందు క్రియాకృత విశేషమే లేనిచో నది క్రియా సిద్ధికి సహకరింపనందున సాధనమే కాకపోయెడిని. అట్టితరి అది కర్మయే కానేరదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆభాసోపగమో వ్యక్తిః సోఢత్వమితి కర్మణః ।
విశేషాః ప్రాప్యమాణస్య క్రియాసిద్ధౌ వ్యవస్థితాః ॥ 53

1. ఆభాసోపగమః = కంటికి కనబడుటకు యోగ్యమగు దేశమును పొందుట అనగా దూరమున ఉండక దగ్గరగా నుండుట, 2. వ్యక్తిః = స్పష్టత అనగా మంచు మున్నగు ఆవరణ ద్రవ్యములు లేక ద్రవ్యము గోచరించుట, 3. సోఢత్వమ్ = కనబడుటకు అర్హత, పిశాచము దగ్గరగా నున్నను, ఆవరణ లేకున్నను అస్మదాదులకు కానరాదు. అట్లుకాక దర్శనమునకు అర్హత యుండవలెను. ఇతి = అనెడి, విశేషాః = విశేషములు, ప్రాప్యమాణస్య + కర్మణః = ప్రాప్యకర్మకు, క్రియాసిద్ధౌ = దర్శనము మున్నగు క్రియ నిష్పన్నమగుటలో, వ్యవస్థితాః = కారణములుగా నున్నవి.

తాత్పర్యము— ఘటం పశ్యతి (కడవను చూచుచున్నాడు) ఇచట ఘటము ప్రాప్యకర్మ. దర్శనక్రియ వలన కడవకు పరిణామము కలుగదు. 5, 6 గజముల దూరమున ఉన్ననాడే కడవ కంటికి కనబడును. అతిదూరమగుచో కానరాదు. దగ్గరగానున్నను మంచుగాని, గోడగాని అడ్డముగానున్నను కానరాదు. మరియు పిశాచము దగ్గరగానున్నను అడ్డు లేకున్నను మనకు కానరాదు. అందుచే దగ్గరగానుండుట, వ్యవధానములేక ఘటాదులు వ్యక్తమగుట, చూచుటకు అర్హమగు రూపముండుట, మున్నగునవి దర్శన కారణములు కాగలవు. అట్టి అవకాశమును కలిగియుండుటయే ఘటాదులు దర్శన క్రియలో సాధనభావమును బొందుట.

నిర్వర్త్య వికార్యకర్మలయందువలె వస్తువునకు రూపపరిణామాదులు ఇచట అపేక్షితములు కావు.

ఇట్లే గ్రామం గచ్ఛతి, మాతరం స్మరతి మున్నగు లక్ష్యములలో గూడ గ్రామాదులు ప్రాప్యకర్మలు. అవి దర్శనక్రియకువలె గమనాది క్రియలకు గూడ కారణములు కాగలవు. ॥53॥

అవతారిక— ఇంతవరకు కర్మలక్షణమును, దాని విభాగమును చూపబడినది.

20 వ కారికలో (గుణక్రియాయాం కర్తారః) అప్రధాన క్రియలో కర్తగానున్నవి ప్రధాన క్రియలో కర్మలుకాగలవని చెప్పబడినది. కాని కర్త కర్మగానుండుట యెట్లు? అను సంశయమును పోగొట్టుచు కర్మ *కర్తృప్రక్రియకు మార్గమును జూపుచున్నాడు.

శ్లో॥ నిర్వర్త్యాదిషు తత్పూర్వమనుభూయ స్వతన్త్రతామ్ ।
కర్త్రన్తరాణాం వ్యాపారే కర్మ సంపద్యతే తతః ॥ 54

---

* చైత్రః పచతి తణ్డులమ్, ఇచట తండులము కర్మగానున్నది. చైత్రాదుల వ్యాపారము ధాత్వర్థముగా వివక్షచేయక తండులమునందున్న వ్యాపారమే ధాతువాచ్యముగా వివక్ష చేసిన తండులమే కర్త యగును. అపుడు ధాతువు అకర్మకమగును. కాని కర్మల కారముయొక్క రూపము కాన్పించును. పచ్యతే తణ్డులః. తండులము ఉడుకుచున్నది అని యర్థము.

నిర్వర్త్యాదిషు = నిర్వర్త్యము, వికార్యము. ప్రాప్యము అనెడి, తత్ = ఆ కర్మ, ఇచట నిర్వర్త్యాదిషు అను పదమున సప్తమీ విభక్తి ప్రాతిపదికార్థమున కలిగినది. అందుచే కర్మకు అనగా తత్, అను దానికి సమానాధికరణ విశేషణమాయెను, పూర్వమ్ = ముందుగా అనగా నిర్వృత్తి, వికారము యోగ్యదేశమున ఉండుట అను క్రియలయందు, స్వతన్త్రతామ్ = కర్తృత్వమును, అనుభూయ = అనుభవించి, తతః = తరువాత, కర్త్రన్తరాణామ్ = చైత్రుడు మున్నగు కర్తలయొక్క, వ్యాపారే = వ్యాపారమున, కర్మ = కర్మసంజ్ఞ కలది, సంపద్యతే = కాగలదు.

*తాత్పర్యము*— ఘటంకరోతి, ఇచట కడవ నిర్వర్త్య కర్మ. కడవ తయారగుచున్నది. ఇది ప్రథమావస్థ. చైత్రుడు తయారుచేయుచున్నాడు. ఇది రెండవ యవస్థ. మొదటి యవస్థలో కడవ స్వతంత్రము. కనుక అది కర్త యగును. ఇచట చైత్రుని వ్యాపారము ప్రేరణ. అనగా తయారుచేయుట వివక్షింపగా చైత్రుడు కర్త కాగలడు. ఈ రెండవ యవస్థలో కడవ కర్మ కాగలదు. (1) తండులః నిర్వర్తతే, (2) తణ్డులం కరోతి.

ఇట్లే కాష్ఠంభస్మకరోతి. ఇచట కాష్ఠము వికార్యకర్మ. ఇచట కఱ్ఱ వికారమును బొందుచున్నదని ప్రథమావస్థ. కఱ్ఱను వికారమును బొందించుచున్నాడు. ఇది రెండవ యవస్థ. (1) కాష్ఠంవికురుతే, (2) కాష్ఠం భస్మకరోతి.

ఇట్లే ఘటం పశ్యతి. ఇచట ఘటము ప్రాప్యకర్మ, కడవ కంటికి కనబడుటకు యోగ్యమగు దేశమున ఉన్నది. ఇది ప్రథమావస్థ. అట్టిదానిని సాక్షాత్కారముగా జేసికొనుచున్నాడు. ఇది రెండవ యవస్థ.

భృత్యులు స్వతంత్రులే. రాజుగారి దగ్గర వారు అస్వతంత్రులే. అట్లే నిర్వృత్తి, వికారము, ఆభాసోపగమము అనగా కనబడుటకు యోగ్యమగు స్థలమున ఉండుట అనునవి అప్రధాన క్రియలు. వీనిలో ఘటాదులు కర్తలు. తరువాత చైత్రాది వ్యాపారము వివక్షించిన అదియే ప్రధాన వ్యాపారము. అచట ఘటాదులు కర్మలు కాగలవు. ॥54॥

*అవతారిక*— ముందు కర్తగానున్నది తరువాత కర్మయగును. అట్టితరి ఆ కర్మ మరల కర్త యెట్లు కాగలదు. అట్లుకాకున్న 'కర్మ కర్త' అను వ్యవహారము ఉపపన్నము కాజాలదు. కాని ఆ వ్యవహారము శాస్త్రసమ్మతము అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ తద్వ్యాపార వివేకేఽపి స్వవ్యాపారే వ్యవస్థితమ్ ।
కర్మాపదిష్టాన్ లభతే క్వచి చ్ఛాస్త్రాశ్రయాన్విధీన్ ॥ 55

తద్వ్యాపారవివేకే+పి = కర్తయొక్క వ్యాపారమును వేరుచేసినను, స్వవ్యాపారే = తన వ్యాపారమున అనగా అప్రధాన వ్యాపారమున, వ్యవస్థితమ్ = ఉన్నటువంటి, తండులాది కము, కర్మాపదిష్టాన్ = కర్మార్థమున విధింపబడినట్టియు, శాస్త్రాశ్రితాన్ = సూత్రము మూల

ముగా గల అనగా "కర్మవత్కర్మణాతుల్య క్రియః" (3-1-87) అను సూత్రముచే లభించిన, విధీన్ = ఆత్మనే పదము మున్నగు కార్యములను. క్వచిత్ = కొన్ని స్థలములలో అనగా కర్మస్థ క్రియలుకల ధాతువులను ప్రయోగించినపుడు, లభతే = పొందుచున్నది, అనగా కర్తగానున్నను కర్మ నిమిత్తకమగు కార్యములను పొందుచున్నది.

తాత్పర్యము— తణ్డులః విక్లిద్యతే, తండులము మెత్తపడుచున్నది. ఇచట తండులము కర్త. తరువాత చైత్రుని ప్రేషణ అనగా తయారుచేయుటకు అనుకూలమగు వ్యాపారము వివక్షచేయగా చైత్రుడు కర్త కాగలడు. అపుడు తండులము కర్మయగుచున్నది మరల చైత్రుని వ్యాపారమును వివక్షింపనిచో మరల తండులము కర్త కాగలదు. ఇట్లు వివక్షచేయుటకు ప్రయోజనము కలదు. గిన్నె చాల చులకనగా నుండుటచే వంటకము అనాయాసముగా సిద్ధించుచున్నది అను భావము వ్యక్తమగును. చైత్రుని వ్యాపారము లేకున్నను నిమిత్తమాత్రమున ఆయన ఉన్నచో పాకము నిష్పన్నమగుచున్నది. కాగా క్రియాసౌకర్యము వ్యక్తమగును. ఈ స్థితిలో తండులము కర్తగానున్నను కర్మ ప్రత్యయము ప్రవర్తించునపుడు కలిగెడి కార్యములను పొందును. తిఙంతరూపము కర్మలకారమువలె భాసించును. అర్థము మాత్రము కర్తయే. 'పచ్యతే తణ్డులః స్వయమేవ', తండులము తనంతటతానే ఉడుకు చున్నది అని దాని యర్థము. దీనినే కర్మకర్తృ ప్రయోగమందురు. ఇట్టి ప్రయోగములు తెనుగుభాషలో గూడ చాల కలవు. అన్నము ఉడుకుచున్నది, కట్టె బ్రద్దలగుచున్నది, ఇల్లు పడుచున్నది.

ఏ కర్మయందు క్రియవలన విశేషము కాన్పించునో అట్టి కర్మ కర్తగా నున్నప్పుడే ఈ ప్రక్రియ జరుగును. అట్టి కర్మ నిర్వర్త్యము వికార్యము అగును. ప్రాప్యకర్మ కానేరదు. కనుక ఈ ప్రక్రియ ప్రవర్తింపదు.(ఆదిత్యం పశ్యతి, అని ఉదాహరణము) ఈ యభిప్రాయముతో 'క్వచిత్' అను పదము ప్రయుక్తమాయెను. ఇట్లు చైత్రుని వ్యాపారము వివక్షచేయక తండులమునకు కర్తృత్వమును సంపాదించుట నివృత్తప్రేషణ పక్షమని శాస్త్రమున వ్యవహారము.॥55॥

అవతారిక— చైత్రుని వ్యాపారము ప్రేషణము. దానిని వివక్ష చేయనపుడు, దాని మూలమున కలిగెడి కర్మత్వము తండులమునకు కలుగకపోవ వచ్చును. కాని తండులమునకు కర్తృత్వ మెట్లు? ప్రధానమగు చైత్ర వ్యాపారమునుబట్టి కదా తండులమునకు స్వీయ వ్యాపారము కలుగును! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నివృత్తప్రేషణం కర్మ స్వక్రియావయవే స్థితమ్ ।
నివర్తమానే కర్మత్వే స్వే కర్తృత్వేఽవతిష్ఠతే ॥ 56

నివృత్త ప్రేషణమ్ = మరలిన ప్రేషణకల అనగా చైత్రుడు చేసెడి ప్రేషణ లేనియట్టి, కర్మ = కర్మగా భావింపబడుచున్న తండులాదికము, స్వక్రియావయవే = తన క్రియయొక్క అవయవమునందు, అనగా అప్రధాన క్రియయందు, అవస్థితమ్ = ఉన్నదై, కర్మత్వే = కర్మసంజ్ఞ, నివర్తమానే = మరలగా, స్వే = స్వీయమగు అనగా అప్రధాన క్రియవలన కలిగెడి, కర్తృత్వే = కర్తృత్వమున, అవతిష్ఠతే = ఉంటున్నది.

తాత్పర్యము— పాకము మున్నగు క్రియలు సంపూర్ణముగా జరుగునట్లు చేయుటయే చైత్రుని వ్యాపారము. దానినే ప్రేషణమందురు. దానిని పురస్కరించుకొని తండులము కర్మ. కట్టెలు కరణములు అగుచున్నవి. అట్టి ప్రేషణమును ధాతు వాచ్యముగా వివక్షచేయునపుడు తండులము యొక్క వ్యాపారమే ప్రధాన ధాత్వర్థమగును. ఆ స్థితిలో తండులము కర్త కాగలదు. పాకక్రియయందు కలిగెడి సౌకర్యమును అపేక్షించి పై ప్రక్రియ ఆశ్రయింపబడు చున్నది. ॥56॥

అవతారిక— చైత్రుని వ్యాపారము వివక్షితము కాగా దానియందు తండుల వ్యాపారము గుణీభూతమగుచున్నది. ఈ స్థితిలో 'చైత్రః తణ్డులంపచతి' అను రీతిని ప్రయోగముండును. ఇచట రెండు వ్యాపారములు భాసించుచున్నవి. ఈ ప్రయోగమున తండులము కర్మగా నున్నను, మరల చైత్రుని వ్యాపారమును వివక్షింపనియెడల తండులము కర్తగా నుండును. అనగా తండుల వ్యాపారము ఒక్కటియే ధాతువాచ్యమగుచున్నది.

ఇచట ఒక సంశయము. ఒకే ధాతువువలన విలక్షణమగు అర్థద్వయము ఎట్లు భాసించును? ఎచట ఒకే వ్యాపారము ధాతువాచ్యమో, ఎచట వ్యాపారద్వయము ధాతు వాచ్యమో; అని యెట్లు గుర్తింపనగును? కాబట్టి వ్యాపారము ధాతువునకు వాచ్యముకాక తిఙ్ ప్రత్యయమునకు వాచ్యమగును అని స్వీకరించెడి జైమినీయుల మతము చాల యుక్తముగా కాన్పించుచున్నది.

పై సంశయమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తాని ధాత్వన్తరాణ్యేవ పచి సిద్ధ్యతివద్ విదుః ।**
**భేదేఽపి తుల్యరూపత్వాత్ ఏకత్వపరికల్పనా ॥ 57**

A. పచిసిద్ధ్యతివత్ = డుపచష్ (పాకే), షిధు (సంరాద్ధౌ) అనుధాతువులవలె, తాని = వ్యాపారద్వయము వాచ్యముగాగల ధాతురూపములును ఒకే వ్యాపారము వాచ్యముగాగల ధాతురూపములను, ధాత్వన్తరాణి + ఏవ = వేరువేరు ధాతువులను గానే, విదుః = కొందరు శాస్త్రజ్ఞులు గుర్తించుచున్నారు.

విక్లిత్తిమాత్రము వివక్షించి తణ్డులః పచ్యతే అనుచోట ధాత్వర్థము తెలుపునట్టి పచిధాతువు వేరు. అంతియేకాని ఒకే ధాతువునకు రెండు స్థలములలో రెండు అర్థములను చూపుట కాదు. ఎట్లనగా, పచధాతువు, షిధుధాతువు ఇంచుమించుగా ఏకార్థకములవలె భాసించును. 'సిధు' ధాతువు దివాదిగణమున పఠింపబడినది. దానికి విక్లిత్తి మాత్రము అర్థము. అయినను మనకు రెండు వేరువేరు ధాతువులని స్పష్టమే. అట్లే చైత్రః పచతితణ్డులమ్, పచ్యతేతణ్డులః అను ప్రయోగద్వయమున కాన్పించెడివి వేరువేరు ధాతువులే. ఒకే ధాతువునకు వేరువేరు అర్థములు చెప్పుట కాదు.

B. అష్టైన ధాతుపాఠమున ఆ రెండు పచిధాతువులను వేరువేరుగా ఏల పఠింపలేదు ? అను ప్రశ్నకు సమాధానము.

భేదే + అపి = స్వతః ధాతువులకు భేదమున్నను, తుల్యరూపత్వాత్ = సమానమగు వర్ణానుపూర్వి కలిగియుండుటవలన, ఏకత్వ పరికల్పనా = రెంటికి ఏకత్వము కల్పితమగుచున్నది. రెంటికి రూపసామ్యముండుటచే రెంటికి అభేదమును ఆరోపించి. డుపచష్ (పాకే) అను రీతిని ధాతు పాఠమున చూపబడినది. ఒకేసారి ఉపదేశించిన ఫలభేదము లేదు కదా ! అట్లుకాక రూపభేదమున్నచో రెండు మూడు పర్యాయములు ధాతు పాఠమున ఉపదేశింప బడును. ఉదా : క్షి (క్షయే) భ్వాదిగణము. క్షయతి, క్షి (నివాసగత్యోః) తుదాది గణము క్షియతి.

పచిధాతువునకు విక్లిత్తి అను వ్యాపారము అర్థము. షిధు ధాతువునకు విక్లిత్తి మాత్రము అర్థము.

అర్థభేదముచే శబ్దము భిన్నమనెడి కొందరి ఆచార్యుల మతము ఇచట చూపబడినది. ॥57॥

*అవతారిక*— అట్లుకాక ఒకే శబ్దమునకు అనేకార్థములు కలుగునని కొందరి మతము. దానిని చూపుచున్నాడు.

శ్లో॥ ఏకదేశే సమూహే చ వ్యాపారాణాం పచాదయః ।
స్వభావతః ప్రవర్తన్తే తుల్యరూపసమన్వితాః ॥ 58

తుల్యరూప సమన్వితాః = సమానమగు స్వభావముతో గూడిన, పచాదయః = పచి మున్నగు ధాతువులు, వ్యాపారాణామ్ = వ్యాపారములయొక్క, ఏకదేశే = అవయవ క్రియయందును, సమూహే + చ = అవయవములతో గూడిన క్రియా సముదాయమునందును, స్వభావతః = స్వభావమువలన, ప్రవర్తన్తే = ప్రవర్తించుచున్నవి.

అర్థభేదముచే శబ్దము మార్పు చెందదు. శబ్దము స్వభావమున అనేకార్థములను బోధింపగలదు. ఈ సిద్ధాంతము "ఏకమాహు రనేకార్థం శబ్దమన్యే పరీక్షకాః" అను కారికచే ద్వితీయకాండమున చూపబడినది. ॥58॥

*అవతారిక*— ఇంతవరకు కర్మ కర్తృ ప్రక్రియ చూపబడినది. ఆ ప్రసంగమున "ణేరణౌయత్కర్మణౌ చే త్సకర్తాऽనాధ్యానే" (1-3-67) అను సూత్రముచే సాధింపబడిన ప్రయోగములు. "కర్మ వత్కర్మణా తుల్యక్రియః" (3-1-87) అను సూత్రముచే సిద్ధించుచుండగా 'ణేరణౌ' అను సూత్రము వేరుగ ఆరంభింపనక్కర లేదు అను అంశమును ముచ్చటించుచున్నాడు.

శ్లో॥ న్యగ్భవనా న్యగ్భవనం రుహౌ శుద్ధే ప్రతీయతే ।
న్యగ్భవనా న్యగ్భవనం ణ్యన్తేఽపి ప్రతిపద్యతే ॥ 59

శ్లో॥ అవస్థాం పఞ్చమీమాహు ర్ణ్యన్తే తాం కర్మకర్తరి।
నివృత్తప్రేషణాద్ధాతోః ప్రాకృతేఽర్థే ణిజుచ్యతే॥ 60

*వివరణము*— ణేరణౌ (1-3-67) ఇత్యాది సూత్రము ఆత్మనేపదమును విధించుచున్నది. సూత్రార్థము: 1. ణిజంతముకంటె ఆత్మనేపదము ప్రవర్తించును. 2. అణ్యంతావస్థలో ఏ క్రియ భాసించినదో, ఆ క్రియయే ణ్యంతావస్థలో భాసింపవలెను. 3. అణ్యంతావస్థలో ఏది కర్మయో ణ్యంతావస్థలో అది కర్త కావలెను. 5. ఉత్కంఠా పూర్వకస్మృతి అర్థము కాకూడదు.

కాగా ఈ సూత్రమును నాల్గు వాక్యములుగా విభజించి వ్యాఖ్యానింపవలెను. 1. ణేః, 2. అణౌ యత్కర్మణౌ చేత్, 3. సకర్తా, 4. అనాధ్యానే మూడు వాక్యములు విధిబోధకములు, నాల్గవది నిషేధ వాక్యము.

అణ్యంతావస్థ యనగా ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము చేయనిస్థితి. ఆ యవస్థలో ఏ క్రియ కాన్పించునో ఆ క్రియయే, ణిజంతమున కాన్పింపవలెను. ఇదియొక నియమము.

అణ్యంతావస్థలో ఏది కర్మయో, అది ణిజంతమున కర్త కావలెను. ఇది మరియొక నియమము.

ణిజంతముకంటె ఆత్మనేపదము ప్రవర్తించును. ఇది ముఖ్యముగ ప్రయోగమును చూపు స్థితి.

ఈ యవస్థలను దాటిన తరువాత ప్రయోగరూపము అందుబాటులో నుండును. ఈ యవస్థలు ప్రాసాదమును అధిష్ఠించుటకు ఏర్పాటుచేయబడిన సోపానములవంటివి. అనగా మెట్ల వంటివి.

లోకమున ప్రసిద్ధమై ప్రయోగింపబడియున్న శబ్దరూపమునకు ప్రక్రియా మార్గమును వ్యాకరణము చూపును. అందుచే వ్యాకరణ శాస్త్రమునగల ప్రక్రియకు లోకప్రసిద్ధ రూపమును బోధించుటయే ప్రయోజనము.

మహాభాష్యకర్త ఎన్నియో ప్రక్రియా విశేషములను జూపెను. వానిని అన్నిటిని పరిశీలించి భర్తృహరి అస్మదాదులకు సూత్రవార్తిక భాష్యముల ఆశయమును తేటమాటలలో బోధించుచున్నాడు

ఉదాహరణరూపమును జూచుటకై దానికి ముందుగా కల్పింపబడిన అవస్థలను ముందుగా తెలిసికొనవలసి యున్నది.

1. ఆరోహన్తి హస్తినం హస్తిపకాః,

మావిటీళ్ళు ఏనుగును ఎక్కుటకు అనుగుణమగునట్లుగా దానిని వంగునట్లు చేయుచున్నారు. దీనినే న్యగ్భావన అని యందురు— న్యగ్భావనా—

2. ఆరోహతి హస్తీ

ఏనుగు మావటీళ్ళు ఎక్కుటకు అనుగుణమగునట్లు వంగుచున్నది. దీనిని —న్యగ్భవనమ్— అని యందురు. ఇచట మావటీళ్ళ యొక్క ప్రయత్నము వివక్షితము కాదు. అందుచే ఈ ధాతువు అకర్మకమాయెను. దీనినే ప్రేరణ నివర్తించిన రూపమందురు.

3 ఆరోహయన్తి హస్తినం హస్తిపకాః

మరల మావటీళ్లు ప్రేరణాంశమును ధాత్వర్థముగా వివక్షింపగా ఈ ప్రయోగము సిద్ధించును. దీనికి ప్రథమావస్థలోనున్న అర్థమే చెప్పవలెను. మావటీళ్ళు ఏనుగును వంగునట్లు చేయుచున్నారు

4. ఆరుహ్యతే హస్తీ స్వయమేవ

ఏనుగు తనంతట తానే వంగుచున్నది. ఈ యవస్థ కర్మ, కర్తవంటిది.

ప్రథమావస్థలో భాసించిన అర్థమే అనగా క్రియ, మూడవ యవస్థలో భాసించుచున్నది. అణ్యంతావస్థలోనున్న కర్మ ణ్యంతావస్థలో కర్త యగుచున్నది.

పై రీతిని నాలుగు అవస్థలు కలుగగా వీనిని ,సాధనముగా గైకొని అయిదవ అవస్థలో ఈ సూత్రముచే ఆత్మనే పదమును జూపవలెను. ఇంయ మరల ణిజర్థమును వివక్షింపనందున ధాతువు అకర్మకమగును

5. ఆరోహయతే హస్తీ

ఏనుగు వంగుచున్నది. ఈ రూపము ఈ సూత్రమునకు ఉదాహరణము. దానిని చూపుటకై 4 అవస్థలు కల్పితమగుచున్నవి.

ప్రతిపదార్థము—శుద్ధౌ = శుద్ధమగు అనగా ణిజర్థమగు ప్రేరణ లేకుండ స్వార్థమాత్రమును బోధించెడి, రుహౌ=రుహధాతువు ప్రయుక్తముకాగా, అనగా ఆరోహన్తి హస్తినం హస్తిపకాః అని ప్రయోగింపగా, న్యగ్భావనా = అధిష్ఠించుటకు యోగ్యమగునట్లు వంగునట్లు చేయుట, న్యగ్భవనమ్ = (ఆరోహతి హస్తీ) మావిటీళ్ల ప్రసక్తిలేకయే ఏనుగు వంగుట, ప్రతీయతే = భాసించుచున్నది.

ణ్యన్తే + అపి = ణిజంతరూపమున గూడ, న్యగ్భావనా = న్యగ్భావనము, న్యగ్భవనమ్ = న్యగ్భవనమును, ప్రతిపద్యతే = తెలియబడుచున్నది.

ప్రేరణాంశమును వివక్ష చేయకయున్న ఆరోహతి హస్తీ అను ప్రయోగమున ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయముచేయగా ఆరోహయన్తి హస్తిపకాః అను ప్రయోగము లభించును. ఈ వాక్యము ఆరోహన్తి హస్తినం హస్తిపకాః అను వాక్యముతో సమానార్థకము. ఆ వాక్యమున ణిజర్థమగు ప్రేరణ వివక్షితము కానిచో ఆరోహతి హస్తీ అను వాక్యముతో సమానార్థకమగు వాక్యము లభించును.

వివరణ— శక్తులకు సంబంధి బ్రహ్మము. దానితో ద్రవ్యాదులకు సంబంధము. దానివలన సంసర్గము ఏర్పడును. దానియందు శక్తుల ఆత్మరూపము భాసించును. కాగా, సంబంధి = బ్రహ్మము. దానితో ద్రవ్యాదులకు సంబంధము, దానివలనకలిగినది సంసర్గము = సముదాయము. దానియందు ఆత్మరూపత్వము ప్రతీయమానమగుచున్నది.

పాఠాంతరము— సంబన్ధి సంబన్ధసంసర్గః అని ప్రథమాంతపాఠము కానవచ్చుచున్నది.సంబంధి అనగా బ్రహ్మము. సంబంధశబ్దము సంబధ్యన్తేఇతి = (సంబంధింపబడునవి, అనువ్యుత్పత్తినిబట్టి సంబంధించునవి అనగా ద్రవ్యాది శక్తులు, వానియొక్క సంసర్గము అనగా కలయిక ఆత్మభూతమై తెలియబడుచున్నదని యర్థము ఎఱుగనగును. ॥24॥

అవతారిక—ఆయా దర్శనములను అనుసరించి జాతి సార్వత్రికము. అది ఎల్ల శబ్దములకు వాచ్యమగునని నిరూపించెను. 2వ శ్లోకమున ఆజాతి నిత్యమని నిర్ణయించెను.

జాతి నిత్యమనుటలో కొన్నికార్యములుకలుగు చున్నవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నతదు త్పద్యతేకిఞ్చి ద్యస్య జాతిర్నవిద్యతే।**
**ఆత్మాభి వ్యక్తయేజాతిః కారణానాం ప్రయోజికా॥ 25**

A. యస్య = ఏవస్తువునకు, జాతిః = జాతి, న + విద్యతే = లేదో,తత్ = ఆవస్తువు, న + ఉత్పద్యతే = పుట్టనేరదు.

ఏవస్తువైనను పుట్టవలెనన్న, దానికి జాతి తప్పక ఉండవలెను. ఆజాతియేలేనిచో ఆ వస్తువు పుట్టుటకవకాశములేదు.

B. వస్తువులు పుట్టుటలో జాతి ఎట్లుసహకరించునో ఆసంగతి చెప్పుచున్నాడు.

జాతిః = జాతి, ఆత్మాభివ్యక్తయే = తనయొక్క అనగా జాతియొక్క స్పష్టతకొరకు కారణానామ్ = వస్తువుయొక్క పుట్టుకలో కారణములగువానికి, ప్రయోజికా = ప్రయోజికము అనగా ప్రేరణచేయునది (భవతి) = అగుచున్నది.

ఘటమునందు ఘటత్వమను జాతికలదు. ఆజాతియే లేనిచో ఆ ఘటము పుట్టుటకేవీలులేదు. ఆజాతికి రూపములేదు. అది బయటకు స్పష్టముగా గోచరింపవలెనన్న వ్యక్తిద్వారా గోచరింపవలెను. ఘటముకంటికి కనబడగా దానియందున్న ఘటత్వజాతియు కనబడును. అందుకై ఆజాతి ఘటము ఉత్పన్నమగుటకు అవసరమగు కారణములను ప్రేరేపించును. జాతి ఎల్లప్పుడు సన్నిహితమైయుండును. కనుక ఆకారణములకు సహకరించగలదు. వానివలన ఘటముజనింపగా ఘటత్వజాతి వ్యక్తమగును. కాగా జాతి వస్తువు పుట్టుటలో నిమిత్తకారణమగును. ఈ యంశమును వైశేషికులుకూడ అంగీకరింతురు.

జాతి ప్రయోజక కర్తయని గ్రంథకర్తయాశయము. వ్యక్తిలేనిదిజాతివ్యక్తము కాదు. తనఅభివ్యక్తికై జాతి వ్యక్తి జనియించుటకు కారణములకు తోడ్పడుచున్నది. ॥25॥

కర్మకర్త్రాది = కర్మ కర్తయందు అనగా కర్మను కర్తగా వివక్షచేయునపుడు, తామ్ = ఆ, అవస్థామ్ = అవస్థను, పఞ్చమీ = అయిదవ అవస్థగా, ణ్యన్తే = ణిజంతరూపమున, ఆహుః = (భాష్యకారులు) పలుకుచున్నారు.

B. ప్రథమావస్థకు మూడవ యవస్థకు అర్థసామ్యమును జూపుచున్నాడు.

నివృత్తప్రేషణాత్ = విడువబడిన ప్రేషణ కల, ధాతోః = ధాతువుకంటె, ప్రాకృతే = స్వాభావికమగు అనగా శుద్ధ ధాతువుచే బోధింపబడెడి, అర్థే = అర్థమున, ణిచ్ = ణిచ్ ప్రత్యయము, ఉచ్యతే = ప్రయోగింపబడుచున్నది.

ఆరోహన్తి హస్తినం హస్తిపకాః

ఇచట మావటీళ్ల ప్రసక్తిని విడనాడిన ఆరోహతిహస్తీ అను ప్రయోగముండును. ఇచట ధాతువును నివృత్తప్రేషణ అని యందురు. ఇట్టి ధాతువునకు ప్రేరణార్థమున ణిచ్ ప్రత్యయముచేరిన ఆరోహయన్తి హస్తినం హస్తిపకాః అను ప్రయోగము ఏర్పడును.॥59,60॥

అవతారిక— శుద్ధధాతువులకు ణిజంతధాతువులకు అర్థము సమానముగా నుండును అనుటలో దృష్టాంతము చూపుచున్నాడు.

శ్లో॥ బ్రవీతి పచతేరర్థం సిద్ధ్యతిర్న వినా ణిచమ్ ।
సణ్యన్తః పచతేరర్థే ప్రకృతేర్వ్యవతిష్ఠతే ॥ 61

సిద్ధ్యతి = సిధుధాతువు (సిద్ధ్యతి), ణిచం + వినా = ణిచ్ ప్రత్యయము లేనియెడల, పచతేః = పచధాతువుయొక్క, అర్థమ్ = అర్థమును, న + బ్రవీతి = చెప్పనేరదు.

సిధుధాతువునకు విక్లిత్తియే అర్థము. పచధాతువునకు విక్లిత్త్యనుకూల వ్యాపారము అర్థము. ఇచట రెండు సమానార్థకములు కావు.

కాని, ణ్యన్తః = ణిచ్ ప్రత్యయము అంతమునగల, సః = ఆ సిధుధాతువు, ప్రకృతేః = ప్రకృతి భూతమగు, పచతేః = పచిధాతువు యొక్క, అర్థే = అర్థమునందు, వ్యవతిష్ఠతే = నిలిచియున్నది.

తాత్పర్యము— ణిజంతమగు సిధుధాతువు శుద్ధమగు పచిధాతువుయొక్క అర్థమును బోధింపగలదు. సిధుధాతువును కేవలముగా ప్రయోగించిన అది పచిధాతు సమానార్థకము కాదు. సిధుధాతువునకు ణిచ్ ప్రత్యయము చేరగా 'సాధయతి' అను రూపము ఏర్పడును. ఆ ణిజంతము పచిధాతువుతో సమానార్థకము. సాధయతి = అన్నమును తయారు చేయుచున్నాడు. ॥61॥

అవతారి — పై రీతిని ప్రేషణాంశమునకు వివక్షచేయకుండుటచే కర్మ కర్త కాగలదని చూపియున్నాడు.

ఇపుడు ప్రేరణను ఆరోపించుటచే అనగా ప్రేషణాంశము లేకున్నను ఆరోపించుటచే కర్మ కర్త కాగలదని చూపుచున్నాడు.

శ్లో॥ కేషాఞ్చిద్దేవదత్తాదేః వ్యాపారో యః సకర్మకే।
స వినా దేవదత్తాదేః కటాదిషు వివక్ష్యతే॥ 62

కేషాఞ్చిత్ = కొందరి (మతమున), సకర్మకే = సకర్మక ధాత్వర్థమున, దేవదత్తాదేః = దేవదత్తుడు మున్నగువాని యొక్క, యః = ఏ, వ్యాపారః = వ్యాపారమో అనగా ప్రేషణ రూపమగు వ్యాపారమో, సః = ఆ వ్యాపారము, దేవదత్తాదేః + వినా = దేవదత్తుడు మున్నగువారు లేకున్నను, కటాదిషు = చాప మున్నగువానియందు, వివక్ష్యతే = వివక్షింపబడుచున్నది.

తాత్పర్యము— దేవదత్తః కటం కరోతి. (దేవదత్తుడు చాప తయారుచేయుచున్నాడు) ఇచట దేవదత్తుడు ప్రధాన కర్త, కటము కర్మ. దేవదత్తుని వ్యాపారమువలన కటము నిష్పన్నమగుచున్నది ఇచట దేవదత్తుని వ్యాపారమును కటమునందు ఆరోపించుటచే కటము కర్త యగుచున్నది. ఈ రీతిగా కర్మయగు కటము కర్తయగుచున్నది. దీనిని అధ్యారోపిత పక్షమందురు. 55, 56 కారికలో నివృత్తప్రేషణ పక్షము నాశ్రయించి కర్మ కర్త యగునని చూపబడినది. ॥62॥

అవతారిక— పై కారికయొక్క అర్థమును ప్రకృతమున సమన్వయించుచున్నాడు.

శ్లో॥ నివృత్తప్రేషణం కర్మ స్వస్య కర్తుః ప్రయోజకమ్।
ప్రేషణాన్తరసంబన్ధే ణ్యన్తేలేనాభిధీయతే॥ 63

నివృత్తప్రేషణమ్=అవివక్షితమగు ప్రేషణకల అనగా దేవదత్తాది వ్యాపారమును విడనాడిన, కర్మ = కర్మ, కటము మున్నగునది, స్వస్య = స్వీయమగు, కర్తుః = ప్రయోజక కర్తకు అనగా కటాదికమునకు, స్వతంత్రతను వివక్షచేయగా తనకు కలిగెడి ప్రయోజక కర్తృత్వమునకు, ప్రయోజకమ్ = కారణమగుచున్నదై, ప్రేషణాన్తర సంబన్ధే = దేవదత్తాదుల యొక్క ప్రేషణతో సంబంధము కలుగగా అనగా వారియందున్న ప్రేషణాంశమును ఆరోపింపగా, ణ్యన్తే = ణిజంతమున, లేన = లకారముచే, అభిధీయతే = చెప్పబడుచున్నది.

దేవదత్తః కటం కరోతి. ఇచట దేవదత్తుని వ్యాపారము ప్రేషణ. దానిని వివక్షచేయక కటము స్వతంత్రమని వివక్షచేసి, దేవదత్తుని ప్రేషణాంశమును కటమునందు ఆరోపింపగా అది కర్త యగుచున్నది. అట్టి కర్మగానున్న కర్తను ణ్యంతధాతువుకంటె కలిగెడి లకారము బోధించుచున్నది. ఉదా: కారయతే కటః స్వయమేవ, కటము అనగా చాప తనంతట తానే తయారు అగుచున్నది. ఇది కర్మ కర్త యనబడుచున్నది. కాని యిచట 'కర్మ వత్కర్మణాతుల్య క్రియః' అను సూత్రము ప్రవర్తింపదు. 'ణేరణౌ యత్కర్మణౌచేత్సకర్తాఽనాధ్యానే' (1-3-67) అను సూత్రముచే ఆత్మనే పదము ప్రవర్తించినది. ॥63॥

అవతారిక— 59వ కారిక నుంచి 'ణేరణౌ యత్కర్మణౌ చేత్సకర్తాఽనాధ్యానే' అను సూత్రము యొక్క అర్థము విచారింపబడినది.

మరల కర్మ కర్తృ ప్రక్రియగురించి ముచ్చటించుచున్నాడు.

శ్లో॥ సదృశాదిషు యత్కర్మ కర్తృత్వం ప్రతిపద్యతే ।
ఆపత్త్యాపాదనే తత్ర విషయత్వం ప్రతిక్రియే ॥ 64

వివరణము— తాదృశః (అట్టివాడు) సదృశః (సమానమైనవాడు) మున్నగు ప్రయోగములు "త్యదాదిషు దృశోఽనాలోచనేకఞ్చ" (3-2-60) అను సూత్రముచే సిద్ధించుచున్నవి. త్యద్, తద్, మద్, మున్నగు పదములు ఉపపదముగా నుండగా కంటికి కనబడుట అను అర్థము కానపుడు దృశ్ ధాతువునకు, కఞ్ (అ) ప్రత్యయము, క్విన్ (సర్వాలోపి) ప్రత్యయము కలుగునని సూత్రార్థము. 'కఞ్' ప్రత్యయము చేరగా అజంతశబ్దము– తాదృశ, అనియు, క్విన్ చేరగా –తాదృక్– హలంత శబ్దము ఏర్పడును.

ఇచట ఈ రెండు కృత్ప్రత్యయములు ప్రవర్తించుచున్నవి. వానికి కర్త అర్థము కావలెను. కాని అట్లుకాకున్నది. తాదృశః అను పదమునకు అట్టివాడు అని యర్థము. అంతియే కాని, వానిని చూచువాడు అని యర్థము కాదు. అందుచే కృత్ప్రత్యయార్థము సరియగునది కాదనియు, అచట ఇవార్థమున అనగా సదృశార్థమున ఇచట తద్ధిత ప్రత్యయము చెప్పవలె ననియు *వార్తికకారుడు సిద్ధాంతమును ప్రబోధించెను. పాణిని సూత్రము సరిపడదని వార్తిక కారుని యాశయము.

తరువాత భాష్యకారుడు వార్తికమతము బాగులేదు. సూత్రము సరిగనున్నదని భావించెను. అచట కర్మ కర్త బోధింపబడుచున్నది –కర్మ కర్తృత్వాత్సిద్ధమ్– పై భాష్యమును వ్యాఖ్యానించుటకై ఈ కారిక వ్రాయబడినది.

సదృశాదిషు = సదృశః, తాదృశః మున్నగు ప్రయోగములయందు, యత్ = ఏ, కర్మ కర్తృత్వమ్ = కర్మ కర్తృత్వము, ప్రతిపద్యతే = చెప్పబడుచున్నదో, తత్ర = అచట, విషయత్వం + ప్రతి = ఘటము మున్నగువాని విషయత్వము గురించి, ఆపత్త్యాపాదనే = 1. ఆపత్తి, 2. ఆపాదనము అనెడి, క్రియే = రెండు వ్యాపారములు, (వాచ్యే) = దృశి ధాతువునకు వాచ్యములగు చున్నవి.

తాత్పర్యము— ఘటం పశ్యతి మున్నగు చోటులందు దృశిధాతువునకు రెండు వ్యాపారములు వాచ్యములుగా నున్నవి. 1. ఘటము ఇతరులకు గోచరించుటకు అనుకూలమగు పరిమితమగు రూపమును ధరియించుట, 2 అట్టి ఘటమును తన దృష్టికి గోచరింపచేసి కొనుట. మొదటి వ్యాపారము ఘటమునందున్నది, రెండవది చైత్రాది నిష్ఠము. ఘట వ్యాపా

* "వార్తికములు. 1. కృదర్థానుపపత్తిస్తు, 2. ఇవార్థేచ అయంతద్ధితః" త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్చ (3–2–60) సూత్రమున ఇవి కలవు.

రము చైత్ర వ్యాపారమున అప్రధానమై భాసించుచున్నది. చైత్ర వ్యాపారము కూడ ధాత్వర్థమగుచో చైత్రుడు కర్త, ఘటము కర్మయు అగుచున్నవి.

తరువాత చైత్ర వ్యాపారము ధాతువాచ్యము కాదని వివక్షింపగా ఘట వ్యాపారమే ధాతు వాచ్యమగును. అపుడు ఘటము కర్త కాగలదు. సూర్యరశ్మి అధికముగా నుండుటచే ఆవరణ వస్తువులు ఏమియు లేకపోవుటచే ఘటము అప్రయత్నముగా కంటికి కనబడుచున్నదని క్రియా సౌకర్యము లభించును. కాబట్టి కర్మ కర్త తాదృశాది పదములలో కృత్ప్రత్యయమునకు అర్థము కాగలదు. ॥64॥

*అవతారిక*— 64 వ కారికలో చూపిన అర్థమునకు ఉపపత్తి లేదని చూపుచున్నాడు.

శ్లో॥ కుతశ్చిదాహృత్య పదమేవం చ పరికల్పనే ।
కర్మస్థ భావకత్వం స్యాద్దర్శనా ద్యభిధాయినామ్ ॥ 65

కుతశ్చితమ్ = ఎచ్చటనుండియో పదమ్ = విషయ మాపద్యమానమ్, అను పదమును, ఆహృత్య = గ్రహించి, ఏవం = పై ప్రకారము, పరికల్పనే + చ = దృశి ధాతువునకు వ్యాపార ద్వయమును వాచ్యముగా కల్పించినచో, దర్శనాద్యభిధాయినామ్ = దర్శనము, ఆసనము (ఉండుట) మున్నగు క్రియలను బోధించెడి దృశి, ఆస్ మున్నగు ధాతువులకు, కర్మస్థ భావకత్యమ్ = కర్మస్థ భావకత్వము అనగా క్రియవలన కర్మయందు విశేషము కలిగియుండుట, స్యాత్ = కలుగవలెను. కాని అది శాస్త్ర విరుద్ధము, దృశి ప్రభృతులు కర్తృస్థ భావకములని శాస్త్ర సిద్ధాంతమని భావము.

*తాత్పర్యము*— దృశిధాతువునకు రెండు వ్యాపారములు వాచ్యములు కాగలవు. వానిలో ఘటముయొక్క వ్యాపారమే ధాత్వర్థముగా వివక్షించిన అది కర్త కాగలదని యంగీకరించిన, ఆ పద్ధతిలో క్రియవలన కర్మయందు విశేషము కలుగుటచే దృశి, ఆస్ మున్నగు ధాతువులు కూడ కర్మస్థ భావకములు కాగలవు. కాని అవి కర్తృభావకములు, అనగా క్రియచే కర్తయందే విశేషము కలిగియున్నవనెడి సిద్ధాంతము విరోధించును. కాబట్టి పై రీతిని సమన్వయము చేయరాదు. ॥65॥

*అవతారిక*— కర్మస్థ భావకములు, కర్తృస్థ భావకములు అని ధాతువులు రెండు విధములు. అందు కర్మస్థ భావకములకే కర్మవద్భావము. కర్తృస్థ భావకములకు కర్మవద్భావము ప్రవర్తింపదు. దృశి ప్రభృతులు కర్తృస్థ భావకములు కనుక అచట కర్మవద్భావము ప్రవర్తింపదని చెప్పబడినది. కాని ఆ విభాగము ఎట్లు తెలియబడును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ విశేషదర్శనం యత్ర క్రియా తత్ర వ్యవస్థితా ।
క్రియా వ్యవస్థాత్వన్యేషాం శబ్దైరేవ ప్రకల్పితా ॥ 66

A. యత్ర = ఏ కర్మయందు, విశేషదర్శనమ్ = విశేషార్థము కాన్పించునో. తత్ర = అచట క్రియా = క్రియ, వ్యవస్థితా = నిలిచియున్నది.

క్రియవలన ఏ కర్మయందు భేదము కాన్పించునో, అది కర్మస్థ భావకము. ఉదా: 'కాష్ఠంభినత్తి' కట్టెను చీల్చుచున్నాడు. ఛేదన క్రియవలన కాష్ఠమునందు రూపము మారి యున్నది. కాన అది కర్మస్థభావకము. అచట 'కర్మవద్భావము' ప్రవర్తించును. ఛిద్యతే కాష్ఠం స్వయమేవ. ఘటం పశ్యతి. ఇచట దర్శన క్రియవలన ఘటమునందు విశేషము కాన్పించుట లేదు. కాబట్టి ఇది కర్తృస్థభావకము. ఇచట కర్మవద్భావము కలుగదు.

B. అన్యేషామ్ = మరికొందరి (మతమున), తు = మాత్రము, శబ్దైః + ఏవ = శబ్దముల చేతనే, క్రియావ్యవస్థా = క్రియయొక్క వ్యవస్థ, ప్రకల్పితా = చూపబడుచున్నది.

లోకమున శబ్దము ప్రయోగింపగా శ్రోతలు దాని యర్థమును విశదముగా గ్రహింతురు. వారి వ్యవహారము శబ్ద మూలకము. అట్టి లోకవ్యవహారమునే శాస్త్రము బోధించు చున్నది.

కాబట్టి శబ్దమువలననే ఇది కర్మస్థ భావకము. ఇది కర్తృస్థభావకము అని తెలియ బడ గలదు. ॥66॥

అవతారిక— ఇంతవరకు "కర్తురీప్సితతమం కర్మ" (1-4-49) అను ప్రథమ సూత్రముచే గుర్తింపబడిన కర్మకు 1. నిర్వర్త్యము 2. వికార్యము 3. ప్రాప్యము అను మూడు భేదములను జూపి, దాని ప్రసంగమున మతభేదముచే కర్మ కర్తను వ్యాఖ్యానించి కర్మస్థ భావకత్వమును కర్తృస్థ భావకత్వమును జూపెను.

ప్రస్తుతము ఇతర సూత్రములచే గుర్తింపబడిన కర్మలను వ్యాఖ్యానించుచున్నాడు. అందు "అకథితంచ" (1-4-51) అను సూత్రమున కాత్యాయనుడు "కాలభావాధ్వగన్తవ్యాః కర్మ సంజ్ఞా హ్యకర్మణాం దేశశ్చ" అను వార్తికమును రచియించెను. అకర్మకధాతువులతో యోగ మున్నపుడు దేశము, కాలము, భావము, నడవతగిన మార్గము, కర్మ సంజ్ఞ కలవియగు నని వార్తికమునకు అర్థము. ఉదా: కురూన్ స్వపితి (కురుదేశములయందు నిదురించు చున్నాడు), మాసమ్ ఆస్తే (నెల రోజులు ఉంటున్నాడు), గోదోహమాస్తే (ఆవుపాలు పితుకు వరకు ఉంటున్నాడు), ఒక క్రియవలన మరియొక క్రియను గుర్తించుట భావమనబడును. క్రోశమాస్తే (క్రోసు దూరమున ఉన్నది).

కాని పై వార్తికము ఆరంభింపనక్కరలేదు. కర్తురీప్సితతమం కర్మ (1-4-49) అను సూత్రముచేతనే దేశాదులకు కర్మ సంజ్ఞ కలుగగలదు అని భాష్యకారుడు పలికెను. ఆ భాష్యమును వ్యాఖ్యానించుచున్నాడు.

శ్లో॥ కాలభావాధ్వదేశానా మన్తర్భూత క్రియాన్తరైః ।
సర్వైరకర్మకైర్యోగే కర్మత్వముపజాయతే ॥ 67

అన్తర్భూత క్రియాన్తరైః = అంతర్గతముగా చేసికొనబడిన అనగా స్వార్థముగా జేసికొన బడిన వ్యాప్తి మున్నగు ఇతర క్రియలు కలిగిన, సర్వైః = ఎల్ల, అకర్మకైః = అకర్మక ధాతువులతో, యోగే = సంబంధమున, కాలభావాధ్వదేశానామ్ = కాలమునకు, భావమునకు మార్గమునకు, దేశమునకును, కర్మత్వమ్ = కర్మసంజ్ఞ, ఉపజాయతే = కలుగుచున్నది. కర్తు రీప్సితతమ్ అను ప్రథమ సూత్రముచేతనే కాలాదులకు కర్మసంజ్ఞ కలుగుచున్నందున వేరుగ వార్తికమారంభింప నక్కరలేదని భావము.

తాత్పర్యము— మాసమాస్తే మున్నగు చోటులందు ధాతువునకు ఉండుట మాత్రమే అర్థము కాదు. వ్యాపించుట కూడ అర్థము. కాగా ఉండుటచే వ్యాపించుట ధాత్వర్థ మగును. అపుడు వ్యాప్తి ఫలము కనుక అట్టి ఫలమునకు ఆశ్రయమగుటం జేసి మాసమునకు కర్మసంజ్ఞ కలుగుచున్నది. ఇట్లే పై ఉదాహరణములలో గూడ దేశాదులకు కర్మసంజ్ఞ సిద్ధించును.

'మాసమాస్తే దేవదత్తః' ఇచట ధాతువు అకర్మకము. ఐనను మాసము కర్మ కాగలదు. ఇచట భావార్థమున లకారము చేరగా 'మాసమాస్యతే దేవదత్తేన' మున్నగు ప్రయో గములు కలుగుచున్నవి.

'సర్వైః' అనుటచే సకర్మక ధాతువుల యోగమునగూడ కాలాదులకు కర్మసంజ్ఞ కలుగునని తెలియవచ్చుచున్నది. మాసమోదనం పచతి (నెల రోజులు ఓదనమును వండు చున్నాడు) ఓదనము కర్మ. అది యుండగా ధాతువునకు వ్యాప్తికూడ అర్థముగా వివక్షింపగా వ్యాప్తిరూపమగు ఫలమునకు ఆశ్రయమగుటం జేసి మాసముకూడ కర్మ కాగలదు. రెండు కర్మలలోను మాసాది కర్మ బహిరంగము, అనగా ధాత్వర్థముతో ముందుగా సంబంధింపనిది. కనుక అది అప్రధానకర్మ. ఓదనాదికమగు ద్రవ్యరూపమగు కర్మ అంతరంగము. అనగా ధాత్వర్థముతో ముందుగా సంబంధించునది. కనుక అది ప్రధానకర్మ. అందుచే ఓదనాది కర్మను బోధించుచు పచ్యాదులకంటె కర్మ ప్రత్యయము ప్రవర్తించును. మాసాదులను బోధింపదు. కాగా మాసమోదనః పచ్యతే అను ప్రయోగము సిద్ధించుచున్నది. ॥67॥

*అవతారిక*— మాసమోదనం పచతి మున్నగు ప్రయోగములలో మాసము మున్నగునవి అప్రధానకర్మ యనియు, ఓదనాదికము ప్రధానకర్మ అనియు ఎట్లు నిర్ణయింప తగును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆధారత్వమివ ప్రాప్తాస్తే పునర్ద్రవ్యకర్మసు ।
కాలాదయో భిన్నకక్ష్యం యాన్తి కర్మత్వముత్తరమ్ ॥ 68

తే = ఆ, కాలాదయః+పునః=కాలము మున్నగు మాత్రము అనగా కాలము, దేశము, భావము, మార్గము ఇవి మాత్రము, ద్రవ్యకర్మసు = ద్రవ్యరూపమగు కర్మల విషయమై, ఆధారత్వమ్ = ఆధారత్వమును, ప్రాప్తాః + ఇవ = పొందినట్లు ఉన్నవై, భిన్నకక్ష్యమ్ = వేరుగానున్న అవస్థ కలిగినట్టియు, కనుకనే, ఉత్తరమ్ = ఉత్తరకాలమున కలిగెడి, కర్మత్వమ్ = కర్మ సంజ్ఞను, యాన్తి = పొందుచున్నవి, కాక ఆధారత్వమ్ + ఇవ = ఆధార సంజ్ఞవలె.

తాత్పర్యము— ఏ పని జరుగవలెనన్న ఆ పని చేయువారికి కాలము మున్నగునవి ఆధారములగుచున్నవి. రాత్రౌభుఙ్క్తే (రాత్రియందు తినుచున్నాడు). మరియు ఆధారసంజ్ఞ కర్తృ కర్మ వ్యవధానమున క్రియతో సంబంధించునపుడు కలుగును. అట్లే కాలాదులు కూడ ఓదనము మున్నగు ద్రవ్యముల ద్వారా క్రియతో సంబంధించును. పచతి అను క్రియతో పాకము చేయబడెడి తండులాదులు ముందుగా అన్వయించును. తరువాత ఆ పాకము చేయుటకు ఎంతకాలము కావలెను? అను సంశయము కలుగగా 2, 3 గంటల కాలమో, వంటనుబట్టి ఇంకను అధికమగుకాలమో అపేక్షితమై క్రియతో సంబంధించును.

అట్లే అధ్యేతి (చదువుచున్నాడు) అనగా చదుపబడెడి విద్యముందుగా సంబంధించును. చదువబడెడి విద్యను ఇట్టి 5-6 సంవత్సరములలో, కాక 12-15 సంవత్సరములో కాలము అపేక్షితమై సంబంధించును. ముందుగా క్రియతో సంబంధించినది అంతరంగము కనుక ప్రధానకర్మ యనియు, తరువాతి కాలమున సంబంధించిన కాలాది కర్మలు బహిరంగములు కనుక అప్రధానకర్మలనియు వ్యవస్థ చేయనగును.

కాబట్టి మాసమోదనం పచతి అను స్థలమున ఓదనము ప్రధానకర్మయగుటచే ఆ కర్మయందు లకారము ప్రవర్తించును. కాలాదులు అప్రధానకర్మ కనుక అచట లకారము ప్రవర్తింపదు. మాసమోదనః పచ్యతే అనియే ప్రయోగముండును. ॥68॥

అవతారిక— మాసమోదనం పచతి మున్నగు వాక్యములలో రెండు కర్మలు కలవు. ఆ రెండు ఏకరూపమగు కర్మలు కానోపవు. ధాతువునకు ఓదనమగు ద్రవ్యము ప్రాథమికమగు కర్మ. కనుకనే అది ప్రధాన కర్మ. ఓదనము కర్మ సంజ్ఞకమైన పిమ్మట మాసము కర్మయగుచున్నది. కనుకనే అది అప్రధాన కర్మ యగుచున్నది. కాగా అవస్థాన భేదము ఈ రెంటికి కలదు. ఇదియే భిన్నకక్ష్య యనబడును. ఇట్టి అవస్థా భేదమున రెంటికి కర్మత్వము లభించుటవలన కలిగెడి ప్రయోజనము వ్యక్తపరచుచున్నాడు.

శ్లో॥ అతస్తైః కర్మభిర్ధాతుర్యుక్తోఽద్రవ్యైరకర్మకః ।
లస్య కర్మణి భావే చ నిమిత్తత్వాయ కల్పతే ॥ 69

అతః = పై కారణమువలన, అకర్మకః = అకర్మకమగు, ధాతుః = ధాతువు అనగా స్వతః అకర్మకమగు ఆస్తే, శేతే మున్నగు ధాతువు, అద్రవ్యైః = ద్రవ్యములుకాని, కర్మభిః = కర్మలతో అనగా కాలము, దేశము మున్నగు కర్మలతో, యుక్తః = కలసినదై, కర్మణి = కర్మార్థమున, భావే + చ = భావార్థమునను, లస్య = లకారమునకు అనగా లకార, కృత్య, క్త, ఖలర్థ ప్రత్యయములు ప్రవర్తించుటకు, నిమిత్తత్వాయ = కారణత్వము కొరకు, కల్పతే = సమర్థమగుచున్నది.

తాత్పర్యము— మాసమోదనం పచతి మున్నగు వాక్యములలో రెండు కర్మలున్నందున వానిలో ఒకటి ప్రధానకర్మ, రెండవది అప్రధాన కర్మయు అగుచున్నవి. అట్లు

కాక ద్రవ్యకర్మ లేనిచోటునందు కాలాదులే కర్మలుగా నుండునపుడు ధాతువుకంటె కర్మార్థ మున భావార్థమున గూడ లకారము, కృత్యప్రత్యయము, క్తప్రత్యయము, ఖలర్థప్రత్యయము, ప్రవర్తింపగలవు. ద్రవ్యరూపమగు కర్మ లేనందున ధాతువు అకర్మకమై భావార్థమున ప్రత్య యములను బొందగలదు. కాలాది కర్మనుబట్టి సకర్మకము కాన ధాతువు కర్మార్థమున గూడ ప్రత్యయములను పొందగలదు. ఉదా : మాసమాస్తే చైత్రః (చైత్రుడు మాసము ఉంటు న్నాడు) దీనికి కర్మార్థమున ప్రత్యయములు కలుగును. ఆస్యతే మాసః చైత్రేణ, కర్మార్థ మున లకారము. మాసః ఆసితవ్యః, కర్మార్థమున తవ్య ప్రత్యయము. ఆసితః మాసః కర్మార్థమున క్త ప్రత్యయము. మాసః స్వాసః కర్మార్థమున ఖల్ ప్రత్యయము. ఇట్లే అకర్మకమగుటచే మాసమాస్యతే చైత్రేణ. భావార్థమున లకారము, మాసమాసితో దేవదత్తః. కర్త్రర్థమున క్త ప్రత్యయము. కారికలో 'లస్య' అనునది ల, కృత్య, క్త ఖలర్థప్రత్యయ ములకు ఉపలక్షణము అనగా గుర్తు. ॥69॥

అవతారిక — భిన్నకక్ష్యమగు అనగా అవస్థాభేదముచే గల్గెడి కర్మత్వము కాలాదు లకే కాక ఇంకను మరికొన్నిటికి కూడ కలుగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ సర్వం వాఽకథితం కర్మ భిన్నకక్ష్యం ప్రతీయతే।
ధాత్వర్థోద్దేశభేదేన తన్నేప్సితతమం కిల ॥ 70

A. అకథితమ్ = 'అకథితంచ' (1-4-51) అను సూత్రముచే విధింపబడిన, సర్వం + వా = అంతయు, భిన్నకక్ష్యమ్ = కాలభేదముచే కల్గెడి, కర్మ = కర్మగానే, ప్రతీయతే = తెలియబడుచున్నది. గాం దోగ్ధి పయః (ఆవును పాలు పితుకుచున్నాడు) మున్నగు ప్రయోగ ములలో గవాదులకు 'అకథితంచ' అను సూత్రముచే కర్మసంజ్ఞ విధింపబడినది. అదియు భిన్నకక్ష్యమగు కర్మయే యని భావము.

B. ఇందు కారణము చూపుచున్నాడు.

ధాత్వర్థోద్దేశభేదేన = ధాత్వర్థముతో సంబంధించుటలో గల కాలభేదముచే, తత్ = అది, అనగా 'అకథితంచ' అను సూత్రముచే కలిగిన కర్మ, ఈప్సితతమమ్ = మిక్కిలి ఇష్టమగునది, అనగా ముందుగా ధాత్వర్థముతో సంబంధించునది. న + కిల = కానేరదు కదా!

తాత్పర్యము— గాం దోగ్ధి పయః, ఇచటను రెండు కర్మలు కలవు. వానిలో పయస్సు ముందుగా దుహ (పితుకుట) ధాత్వర్థముతో సంబంధించును. కనుక అది ముఖ్య కర్మ. అట్టి కర్మకు నిమిత్తము కనుక గోవు తరువాత ధాత్వర్థముతో సంబంధించుచున్నది. అందుచే గోవు అప్రధాన కర్మ యగును. ఇట్లే బలిం యాచతే వసుధామ్ (బలిని భూమి యాచించుచున్నాడు) మున్నగు ఉదాహరణములలో గూడ అవస్థాభేదమును బట్టి వసుధ ప్రధానమనియు, బలి దానికి నిమిత్తముకాన అప్రధానకర్మ యనియు ఎరుంగునది.

విశేషము— ప్రధానాప్రధానరూపమున రెండు విధములుగా కర్మలు ఉండ నేరవు. అన్నియు ప్రధానకర్మలే కాగలవని 73 వ శ్లోకమున చూపబడుచున్నది. కనుక ఈ భేదము యుక్తము కాదు. ఈ యభిప్రాయము కారికలో 'కిల' అను పదము వ్యక్తపరచు చున్నది. ఇంతియేకాదు 78 వ శ్లోకమున గూడ ఒకే కర్మయని సిద్ధాంతము చేయబడు చున్నది. ॥70॥

అవతారిక— క్రియతో ముందుగా సంబంధించినది ప్రధానమనియు, తరువాత క్రియతో సంబంధించునది అప్రధానమనియు చెప్పబడినది. అదియే 'భిన్నకక్ష్య' శబ్దముచే 68, 70 కారికలలో చూపబడినది.

కాని అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలయన– 'అకథితంచ' (1-4-51) అను సూత్రమున భాష్యకర్త అప్రధానకర్మతోనే ముందుగా ధాత్వర్థమునకు సంబంధము కలుగు నని "పూర్వం గుణకర్మణాభవతి యోగః" అని స్పష్టముగా చెప్పెను. కాగా గోవు ముందుగా సంబంధించుటచే నీవు చెప్పిన ప్రకారము అదియే ప్రధానకర్మ కావలెను అను ప్రశ్న కలుగగా ప్రధానాప్రధానభావమును మరియొక విధముగా జూపుచున్నాడు.

శ్లో॥ ప్రధానకర్మ కథితం యత్ క్రియాయాః ప్రయోజకమ్ ।
తత్సిద్ధయే క్రియాయుక్త మన్యత్త్వకథితం స్మృతమ్ ॥ 71

యత్ = ఏది, క్రియాయాః = దోహనము మున్నగు క్రియకు, ప్రయోజకమ్ = ముఖ్యముగా ప్రేరకమో, అనగా దేనిని ఉద్దేశించి క్రియ జరుగునో ఏది సిద్ధింపగా ఇతర కారకములు నిరుపయుక్తము లగునో, (తత్) అది, ప్రధానకర్మ = ప్రధానకర్మగా, కథితమ్ = చెప్పబడు చున్నది.

తత్సిద్ధయే = అట్టి కర్మ సిద్ధించుటకై, క్రియాయుక్తమ్ = క్రియతో సంబంధించిన, అన్యత్ + తు = ఇతరమైనదియే, అకథితమ్ = అప్రధాన కర్మగా, స్మృతమ్ = చెప్పబడు చున్నది.

తాత్పర్యము— ప్రధానాప్రధానభావమునుబట్టి కక్ష్యాభేదము లభించును. పాలును అపేక్షించియే దోహన క్రియ జరుగును. దానిని సాధించుటకే ఇతర కారకములు సిద్ధముచేయబడు చున్నవి. పాలు సిద్ధింపగా గవాది కారకములు ఉపేక్షితములే యగుచున్నవి. కాబట్టి పయస్సు ప్రధానము. దానికి నిమిత్తముగా క్రియతో గోవు సంబంధించుచున్నది. కనుక గోవు రెండవ యవస్థలో కర్మయగుచున్నది. గోవులేనిది పాలు లభ్యము కానందున గోవు ముందుగా ధాత్వర్థముతో సంబంధించుచున్నది. అంతమాత్రాన గోవు ప్రధానము కాదు. ఇచట అప్రధాన కర్మను బోధించు లకారాదులు ప్రవర్తించును. గౌర్దుహ్యతే పయః. ॥71॥

అవతారిక — 'అకథితంచ' (1-4-51) అను సూత్రమున *నీ, వహ, హృ, గత్యర్థక, ఈ ధాతువులను ద్వికర్మకములుగా జూడవలెనని భాష్యకర్త పలికెను. దానిని వ్యాఖ్యానించుచున్నాడు.

**శ్లో॥ దుహ్యాదివన్నయత్యాదౌ కర్మత్వ మకథాశ్రయమ్ ।**
**ఆఖ్యాతానుపయోగే తు నియమాచ్ఛేష ఇష్యతే ॥** 72

A. దుహ్యాదివత్ = దుహి మున్నగు ధాతువులతో సంబంధమునవలె, నయత్యాదౌ = నయతి మున్నగు ధాతుయోగమున గూడ, అకథాశ్రయమ్ = అవివక్షా మూలమున కలిగెడి, కర్మత్వమ్ = కర్మసంజ్ఞ, (ప్రవర్తతే) = కలుగుచున్నది.

గాం దోగ్ధి పయః అనుచోట పయస్సు ముఖ్యకర్మ, గోవు గౌణకర్మ. అట్లే, అజాం గ్రామం నయతి (మేకను గ్రామముగూర్చి తీసికొనివెళ్ళుచున్నాడు) అను చోటునందు అజము ప్రధాన కర్మ, గ్రామము అప్రధానకర్మ. విశేషమేమనగా ఇచట ప్రధానకర్మమును బోధించుచు లకారము ప్రవర్తించును. అజాగ్రామం నీయతే, జయతి, దణయతి మున్నగు ధాతువుల ప్రయోగమున గూడ గౌణ ముఖ్య కర్మలు సంభవించును.

B. భాష్యకారుడు 'దుహి, యాచ్, నీ, హృ, కృష్, వహి అను రీతిని పరిగణమును జూపియున్నాడు. అనగా దుహాది ధాతుయోగముననే పై రీతిని గౌణ ముఖ్యకర్మ విభాగము సంభవించును. వానికంటె భిన్నమగు ధాతువులతో సంబంధమున మాత్రము పై రీతిని కర్మద్వయము చూపరాదని భావము. అట్టి నియమమునకు ఫలము చూపుచున్నాడు.

ఆఖ్యాతానుపయోగే + తు = నియమ పూర్వకముగా విద్యను స్వీకరింపనపుడు, మాత్రము, నియమాత్ = దుహ్యాదియోగముననే అకథితకర్మ అను నియమమువలన, శేషః = శేషవిభక్తి అనగా షష్ఠీవిభక్తి. ఇష్యతే = సమ్మతమగుచున్నది

దుహ్యాదియోగముననే అకథితకర్మ ప్రవర్తించును అను నియమమువలన 'నటస్య శృణోతి' (నటుని గానమును వినుచున్నాడు) మున్నగు చోటులయందు నియమపూర్వకముగా గల విద్య లేనిసమయమున షష్ఠీ విభక్తియే ప్రవర్తించినది. ॥72॥

అవతారిక — పై రీతిని ప్రధానకర్మ అప్రధానకర్మ చూపబడినవి.

కాని రెండు విధములగు కర్మలు లేవు. అన్నియు ప్రధానకర్మలే అని కొందరు తలంచుచున్నారు. వారి మతమును జూపుచున్నాడు.

**శ్లో॥ అన్తర్భూతణిజర్థానాం దుహ్యాదీనాం ణిజన్తవత్ ।**
**సిద్ధం పూర్వేణ కర్మత్వం, ణిజన్తం నియమస్తథా ॥** 73

---

* మహాభాష్య మిట్లున్నది :
"నీవహ్యోర్హరతేశ్చాపి గత్యర్థానాంతథైవచ ।
ద్వికర్మకేషు గ్రహణం ద్రష్టవ్యమితి నిశ్చయః" ॥

*అవతారిక*—ఘటత్వజాతి ఘటములయందుండును. అంతియేకాని ఘటమునకు కారణములగు మట్టి, పరమాణవులు, కుమ్మరి మున్నగు కారణములయందులేదు, కాగా కారణములయందు జాతి సన్నిహితముకానందున వానిని ఆజాతి యెట్లు ప్రేరిపింపగలదు? అను ప్రశ్నకుసమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ కారణేషు పదంకృత్వా నిత్యానిత్యేషు జాతయః।
క్వచిత్కార్యేష్వభివ్యక్తిముపయాన్తి పునః పునః॥ 26

జాతయః = జాతులు, నిత్యానిత్యేషు = నిత్యములగు నట్టియు అనిత్యములగునట్టియు, కారణేషు = కారణములయందు, పదమ్ = అడుగును ,కృత్వా = చేసి,క్వచిత్ + కార్యేషు = కొన్ని కార్యముల యందు, అభివ్యక్తిమ్ = స్పష్టతను, పునఃపునః = మాటిమాటికి ఉపయాన్తి = పొందుచున్నవి.

*వివరణ*—ఘటము మున్నగుకార్యములకు పరమాణువులు కారణములు. అవి నిత్యములు. సాంఖ్యమతమున ప్రధానము అనగా అవ్యక్తము, మూలప్రకృతి, పురుషుడు కారణములు. అవియు నిత్యములే. కుమ్మరి చక్రము మున్నగునవి అనిత్యములగు కారణములు. ఇట్లేకార్య మాత్రమున చూడనగును.

*తాత్పర్యము*—జాతులు సార్వత్రికములుకనుక కారణములయందుకూడ నుండును మరియు కార్యము జాతి రూపమున కారణముల యందు నిలుచును. అట్టితరి కారణములు కార్యమును కలిగించుటకు సిద్ధముగా నుండగా వానిని జాతి ప్రేరేపించును. ఆ కార్యము నిష్పన్నముకాగా దానిని చూచునపుడెల్ల ఆజాతియచట స్పష్టతను పొందును.

*విశేషాంశము*—పైరీతినిఘటాదులయందు ఘటత్వజాతి అభివ్యక్తము కాగలదు. కాని వాయువునకు రూపము లేదు. అచట జాతిఅభివ్యక్తము కానేరదు. ఈ యభిప్రాయముతో క్వచిత్ అనుపదము ప్రయుక్తమాయెను. అనగా రూపవంతములగు కార్యములయందు జాతి వ్యక్తమగునని ఆశయము.

కార్యము నిష్పన్నము కాకమునుపు కూడ జాతి యున్నందున జాతినిత్యత్వము సిద్ధించుచున్నది అని యీగ్రంథమువలన లభించుచున్నది. ॥26॥

*అవతారిక*—ఎల్లశబ్దములుజాతినే బోధించునని యంగీకరించుట వలన కలిగెడి ఉపయోగములు జూపుచున్నాడు.

శ్లో॥ నిర్వర్త్యమానం యత్కర్మ జాతిస్తత్రాపిసాధనమ్।
స్వాశ్రయస్యాభి నిష్పత్తౌ సా క్రియాణాం ప్రయోజికా॥ 27

నిర్వర్త్యమానమ్* = నిర్వర్త్యము అనెడి, యత్ = ఏ, కర్మ = కర్మభేదమో, తత్ర + అపి =

* 1. నిర్వర్త్యము (తయారుచేయబడునది) 2. వికార్యము (వికారమునకు అర్హమైనది) 3. ప్రాప్యము (క్రియలవలన ఏ విశేషరూపమును బొందనిది) అనురీతిని కర్మమూడు విధములుగా ఉన్నది. ఈయంశము సాధన సముద్దేశమున స్పష్టము కాగలదు-49వ శ్లోకము.

73]

A. అన్తర్భూతణిజర్థానామ్ = ధాత్వర్థము యొక్క మధ్యయందున్న ణిజర్థము అనగా ప్రేరణకల అనగా పితుకటయేకాక పితికించుట అనెడి ప్రేరణకూడ అర్థముగాగల, దుహాదీనామ్ = 'దుహ, యాచ్, నీ, వహ మున్నగు ధాతువుల ప్రయోగమున, ణిజన్తవత్ = ణిజంతములకువలె, (గమయతి గ్రామం చైత్రం మైత్రః = మైత్రుడు చైత్రుని గ్రామము గూర్చి పంపుచున్నాడు), కర్మత్వమ్ = కర్మసంజ్ఞ అనగా ప్రయోజ్యునకు గూడ కర్మసంజ్ఞ, పూర్వేణ = పూర్వసూత్రము చేతనే అనగా 'కర్తురీప్సితతమం కర్మ' అను సూత్రముచేతనే, సిద్ధమ్ = సిద్ధించుచున్నది.

చైత్రః గ్రామం గచ్ఛతి (చైత్రుడు గ్రామముగురించి వెళ్లుచున్నాడు) ఈ ణిచ్ ప్రత్యయము చేరక శుద్ధ ధాతుప్రయోగము అనగా అణ్యంతావస్థ, తరువాత మైత్రుడు చైత్రుని వెళ్ళుమని ప్రేరేపింపగా ణిచ్ ప్రత్యయము చేరగా ణ్యంతావస్థ కలుగుచున్నది. కాగా ణిజంతమువలన రెండు వ్యాపారములు భాసించుచున్నవి. 1. ప్రయోజకునిది, 2. ప్రయోజ్యునిది. ప్రయోజక వ్యాపారమునుబట్టి ప్రయోజ్యునకు కూడ కర్తురీప్సితతమ సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగుచున్నది.

అట్లే, గాందోగ్ధిపయః అను స్థలమునగూడ ణిచ్ ప్రత్యయము లేకున్నను దాని యర్థమగు ప్రేరణనుగూడ శుద్ధ దుహిధాతువునకు వాచ్యార్థముగా వివక్షింపగా దేవదత్తుడు ప్రయోజకుడు కాగలడు. అతని వ్యాపారమును బట్టి గోవుకూడ కర్మ కాగలదు. గోవు పాలు ఇచ్చుచున్నది. దేవదత్తుడు గోవుచే పాలు ఇప్పించుచున్నాడని వాక్యార్థము కలుగును. కాగా పయస్సునకు గోవునకుగూడ 'కర్తురీప్సితతమ' సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగుటచే రెండును ప్రధానకర్మలే కాగలవు. అప్రధానకర్మ లేనేలేదు.

B. 'గతిబుద్ధి ప్రత్యవసానార్థశబ్దకర్మా కర్మకాణామణికర్తా సణౌ' (1-4-52) అను సూత్రము గత్యాద్యర్థకధాతు యోగమున అణ్యంతావస్థలో నున్న కర్తకు ణ్యంతావస్థలో కర్మ సంజ్ఞను విధించుచున్నది. కాని పై పద్ధతిని 'కర్తురీప్సితతమ' సూత్రముచే సిద్ధించుచున్నందున గత్యాది సూత్రము— 'ణిజర్థముతో సంబంధించిన దానికి కర్మసంజ్ఞ ప్రవర్తించుట' గత్యాది ధాతుయోగముననే అని నియమమును బోధించుచున్నది. ఆ నియమమును అనుసరించి పచ్యాదియోగమున ప్రయోజ్యునకు 'పాచయతి చైత్రేణ మైత్రః' మున్నగు చోటులందు కర్మసంజ్ఞ ప్రవర్తింపదు. అట్లే దుహ్యాదియోగమున గూడ పై నియమము చొప్పున గవాదులకు కర్మత్వము ప్రాప్తింపదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

తథా = అట్లే, నియమః = నియమము అనగా ''గతిబుద్ధీ'' త్యాదిసూత్రముచే లభించిన నియమము, ణిజన్తమ్ = ణిజంతము గురించియే, (ప్రవర్తతే) = ప్రవర్తించుచున్నది.

నియమము సజాతీయాపేక్షము కనుక ణిజంతమున కర్మసంజ్ఞ గత్యాది విషయకము అని నియమము లభించును. దుహ్యాదులు ప్రకృతమున ణిజంతములు కానందున పై నియమము ప్రవర్తింపదు. కాబట్టి 'కర్తురీప్సితతమ' సూత్రముచే గవాదులకు కర్మసంజ్ఞ కలుగగలదు. ॥73॥

అవతారిక— ''కర్తురీప్సితతమం కర్మ'' (1-4-49) అను సూత్రముచే కర్తకు ఈప్సితతమమయిన దానికి కర్మసంజ్ఞ విధింపబడుచున్నది. గాం దోగ్ధి పయః అను చోటున ఈప్సితతమము పయస్సు, గోవు ఈప్సితతమము కాదు. ఇది ఎల్లరికి తెల్లమే. కాగా కర్తురీప్సితతమ సూత్రముచే గవాదులకు కూడ కర్మసంజ్ఞ కలుగుననుట ఎట్లు పొసగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ కరణస్య స్వకక్ష్యాయాం న ప్రకర్షాశ్రయో యథా ।
కర్మణోఽపి స్వకక్ష్యాయాం న స్యా దతిశయ స్తథా ॥ 74

యథా = ఏ రీతిగా, కరణస్య = కరణమునకు, స్వకక్ష్యాయామ్ = తనయొక్క అనగా కరణత్వమునకు చెందిన వస్తువు యొక్క కక్ష్యయందు, (కరణములుగా ఏర్పడిన వస్తువుల యందు ఇది ముఖ్యము ఇది అముఖ్యము అను), ప్రకర్షాశ్రయః = ప్రకర్షను ఆశ్రయించుట, న = లేదో,

తథా = అట్లే, కర్మణః + అపి = కర్మకు గూడ, స్వకక్ష్యాయామ్ = తన కక్ష్యయందు, అతిశయః = అధికత అనగా ఈ వస్తువుకంటె ఇది ఈప్సితతమము అను అతిశయము, న + స్యాత్ = కలుగనేరదు.

తాత్పర్యము— ''సాధకతమం కరణమ్'' (1-4-42) అను సూత్రముచే క్రియ సిద్ధించుటలో మిక్కిలి ఉపకరించు కారకమునకు కరణసంజ్ఞ విధింపబడుచున్నది. సూత్రమున 'తమ' ప్రత్యయమువలన ప్రకర్ష లభించుచున్నది. ఆ ప్రకర్ష ఇతర కారకములకంటె గ్రహింపబడుచున్నది. అంతియేకాని ఒక క్రియకు ఎన్నియో సాధనములున్నపుడు వానిలో ప్రకర్ష వివక్షితము కాదు. కనుకనే 'అశ్వేనపథా దీపికయా వ్రజతి' (అశ్వము, మార్గము, దీపమును సాధనముగా జేసికొని వెళ్ళుచున్నాడు) మున్నగు చోటులయందు అశ్వాదులన్నియు కరణములగుచున్నవి. అట్లుకాకున్న అధికముగా ఉపకరించుటచే అశ్వమే కరణసంజ్ఞకము కావలెను.

అట్లే కర్మసంజ్ఞా సూత్రమున గూడ ఇతర కారకములకంటె ప్రకర్ష వివక్షితమగును. ఎన్నియో కర్మలు సంభవించునపుడు వానిలో ప్రకర్ష వివక్షితము కానేరదు.

కాబట్టి పయస్సునకు గవాదులకు గూడ కర్తురీప్సితతమ సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగును. అన్నియు ప్రధానకర్మలే కాగలవు. అప్రధానకర్మ లేనే లేదు. ॥74॥

అవతారిక— 73-74 కారికలచే ఇతరుల మతము చూపబడినది. కాని అది యుక్తము కాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ కర్మణస్త్వాప్తు మిష్టత్వ ఆశ్రితేఽతిశయోయతః ।
ఆశ్రీయత్తే, తతోఽత్యన్తం భేదః పూర్వేణ కర్మణా ॥ 75

తు = కాని, యతః = ఎందువలన, కర్మణః = కర్మకు, ఆప్తుమ్ = సంబంధించుటకు,

ఆ్రశితే = సూత్రమున ఆశ్రయింపబడిన, ఇష్టత్వే = ఇష్టత్వమున, అతిశయః = ఇతర పదార్థము కంటె ఆధిక్యము, ఆశ్రీయతే = (కర్మసంజ్ఞ ప్రవర్తించుట విషయమై) స్వీకరింపబడుచున్నదో,

తతః = ఆ కారణమువలన, పూర్వేణ = కర్తురీప్సితతమ సూత్రముచే కలిగెడి, కర్మణా = కర్మతో, (ద్వితీయస్య) = అకథిత సూత్రముచే విధింపబడిన కర్మకు, అత్యన్తమ్ = మిక్కిలి, భేదః = భేదము (అస్తి) కలదు.

తాత్పర్యము— కరణసంజ్ఞ కలుగుటలో కారకాంతరముల కంటె ప్రకర్ష వివక్షితమగును. తన కక్ష్యలో కాకపోవచ్చును. కర్మసంజ్ఞ అట్టిది కాదు. ఇచట కర్మలలో గూడ తారతమ్యము గ్రహింపబడును. కర్తకు ఈప్సితతమము కర్మ. ఇతర కారకములు ఈప్సితములు కావు. క్రియకు అవి సహకరించును

కాబట్టి కర్తురీప్సితతమ సూత్రముచే పయస్సునకే కర్మసంజ్ఞ కలుగును. కనుక అదియే ప్రధానకర్మ. గవాదులకు అకథిత సూత్రముచే కర్మసంజ్ఞ కలుగును. కనుక అవి అప్రధాన కర్మలు. ॥75॥

అవతారిక— మరియు ణిజంతమునవలె దుహాదియోగమున గూడ రెంటికి, కర్తురీప్సితతమ సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగునని 73 వ శ్లోకమున చెప్పబడినది. అదియు అయుక్తమే అని చెప్పుచున్నాడు

శ్లో॥ ణిజన్తే చ యథా కర్తా సక్రియస్సన్ ప్రయుజ్యతే ।
నయత్యాదౌ తథా కర్తా నిష్క్రియోఽపి ప్రయుజ్యతే ॥ 76

చ = కాని, యథా = ఏ రీతిగా, ణిజన్తే = ప్రేరణార్థకమగు ణిజంతమున, కర్తా = ప్రయోజక కర్త, సక్రియః + సన్ = వ్యాపారము కలవాడుగానే, ప్రయుజ్యతే = ప్రేరేపింపబడుచున్నాడో,

తథా = అట్లే, నయత్యాదౌ = నయతి, దోగ్ధి మున్నగు చోటులందు, కర్తా = కర్త, నిష్క్రియః + అపి = వ్యాపారము లేనిది కూడ, ప్రయుజ్యతే = ప్రేరేపింపబడుచున్నది.

తాత్పర్యము— ''గమయతి చైత్రం గ్రామం మైత్రః'' మున్నగు ణిజంత స్థలమున రెండు ధాతువులు కలవు. 1. గమ్, 2. ణిజంతము. రెంటిచేతను రెండు క్రియలు బోధింపబడుచున్నందున గ్రామమునకు ప్రయోజ్యునకు గూడ 'కర్తురీప్సితతమ' సూత్రముచేతనే కర్మసంజ్ఞ కలుగవచ్చును.

దుహాది ధాతువు ఒక్కటియే. అది ఒక వ్యాపారమునే బోధించును. కాబట్టి రెండు వ్యాపారములు లేనందున రెంటికి 'కర్తురీప్సిత' సూత్రముచేతనే కర్మసంజ్ఞ లభింపదు.

ప్రేరణకూడ దుహిధాతువునకు వాచ్యమగుటచే రెండు వ్యాపారములను బట్టి

రెంటికి కర్మసంజ్ఞ కలుగునని శంకింపరాదు. ణిజంతమున ప్రయోజ్యునియందు వ్యాపారము నియతముగా నున్నందున దానిని అనుసరించి ప్రేరణ సంభవించును. కనుకనే ఆ కర్తకు హేతుసంజ్ఞ కూడ లభించుచున్నది. దుహాదులలో గవాదులయందు అట్టి వ్యాపారము లేదు.॥76॥

అవతారిక— గమయతి అను చోటునందు ణిజంతమునకు, గచ్ఛన్తం ప్రేరయతి (వెళ్ళుచున్న వానిని ప్రేరేపించుచున్నాడు) అను రీతిని వివరణము కానవచ్చుచున్నది. అట్లే గాందోగ్ధి పయః అను స్థలమునగూడ 'గౌః క్షరతి', 'క్షరన్తీం క్షారయతి' (ఆవు పాలు స్రవించుచున్నది. స్రవించుచున్న దానిని ప్రేరేపించుచున్నాడు) అను రీతిని వివరణము కానవచ్చుచున్నది. పై యర్థముయొక్క సామ్యమునుబట్టి దుహ్యాదులకు ణిజర్థమగు ప్రేరణ కూడ అర్థము (వాచ్యము) కాగలదు. కాబట్టి దుహ్యాదులకు కూడ రెండు వ్యాపారములు వాచ్యములుగా ఉన్నందున రెంటికి కర్తురీప్సిత సూత్రము చేతనే కర్మసంజ్ఞ కలుగవచ్చును. అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ భేదవాక్యం తు యత్ ణ్యన్తే 'నీ-దుహి'ప్రభృతౌ చ యత్ ।
శబ్దాన్తరత్వాన్నైవాఽస్తి సంస్పర్శస్తస్య ధాతునా ॥ 77

తు = కాని, ణ్యన్తే = గమయతి మున్నగు ణ్యంతమున, యత్ = ఏ, భేదవాక్యమ్ = భేదమును చూపెడి వాక్యమో అనగా వివరణ వాక్యమో, చ = అట్లే, నీ-దుహిప్రభృతౌ = నీ, దుహి-మున్నగు ధాతువులయందు, యత్ = ఏ భేదవాక్యమో, శబ్దాన్తరత్వాత్ = విభిన్నమగు అర్థముకలది యగుటవలన, తస్య = వివరణ వాక్యార్థమునకు, ధాతునా = ధాతువుతో అనగా గమి మున్నగు ణిజంత ధాతువుతోను, నీ, వహి మున్నగు ధాతువుతోను, సంస్పర్శః = సంబంధము, న + ఏవ + అస్తి = లేనేలేదు.

తాత్పర్యము—'గమయతి చైత్రం మైత్రః' మున్నగువానికి 'గచ్ఛన్తం ప్రేరయతి' అను రీతిని వివరణము కలదని లోకులు భావించుచున్నారు. కాని యది బాగులేదు. ప్రయోజ్య కర్త చైత్రుడు. అతని వ్యాపారముమాత్రము భాసించుటచే అది వివరణమని భావము కలుగుచున్నది. ణిజంతమున ప్రయోజ్యుడు 'చైత్రమ్' అను శబ్దముచే బోధింపబడుచున్నాడు. అట్లే దూరముకానందున దానికి ఇది వివరణవాక్యమని తలంచుచున్నారు.

అట్లే 'అజాం నయతి గ్రామం', 'గాందోగ్ధి పయః' మున్నగు వాక్యములకు గూడ యత్కించిత్ సామ్యమునుబట్టి అజా గచ్ఛతి, తాం గమయతి, (మేక నడచుచున్నది, దానిని ప్రేరేపించుచున్నాడు) అని వివరణముగా వాక్యమును ప్రయోగించుచున్నారు. అదియు భిన్నార్థకమే. నయతి, దోగ్ధి మున్నగునవి మిక్కిలి దూరమగుటచే అవి ణిజర్థమునుకూడ బోధింపజాలవు.

కాబట్టి దుహ్యాదులకు రెండు వ్యాపారములు వాచ్యములు కాజాలవు. ప్రథమ సూత్రముచే రెంటికి కర్మత్వము లభింపదు. పయస్సునకు ప్రథమ సూత్రముచేత, గవాదులకు అకథిత సూత్రముచేతను కర్మసంజ్ఞ చెప్పవలెను. కాగా ''సర్వం చాకథితం కర్మ'' అను 70 కారికార్థమే యుక్తము. ॥77॥

*అవతారిక*— గాం దోగ్ధి పయః మున్నగు వాక్యములలో (ఆవును పాలు పితుకు చున్నాడు) పయస్సునకు ప్రథమ సూత్రముచే, గవాదులకు అకథిత సూత్రముచేతను కర్మ సంజ్ఞ చెప్పవలెనని 70 వ కారికలో చూపబడిన అర్థమును 77 వ కారికతో సమర్థించి యున్నాడు.

ఇపుడు ముఖ్య సిద్ధాంతమును ప్రబోధించుచున్నాడు.

**శ్లో॥ యథైవైకమపాదానం శాస్త్రే భేదేన దర్శితమ్।**
**తథైకమేవ కర్మాపి భేదేన ప్రతిపాదితమ్॥** 78

యథా = ఎట్లు, ఏకమ్ + ఏవ = ఒక్కటియే యగు అనగా ఒకే సూత్రముచే సిద్ధించిన, అపాదానమ్ = అపాదాన కారకము, శాస్త్రే = పాణినీయమున, భేదేన = వేరు వేరు సూత్రము లచే, దర్శితమ్ = ప్రత్యేకముగ చూపబడినదో,

తథా = అట్లే, కర్మ + అపి = కర్మకారకము కూడ, ఏకమ్ + ఏవ = ఒకే సూత్రముచే లభించినదే అయినను, భేదేన = వేరు వేరు సూత్రములచే, శాస్త్రమున, ప్రతి పాదితమ్ = (మంద బుద్ధులకు సుగ్రహమగుటకు) విడదీసి చూపబడినది.

**తాత్పర్యము**— "ధ్రువమపాయేఽపాదానమ్" (1-4-24) అను సూత్రముచే కలిసియున్న వస్తువులకు విభాగము కలుగునపుడు స్థిరమగు పదార్థమునకు అపాదాన సంజ్ఞ చెప్పబడినది. అచట పంచమీ విభక్తి విధింపబడినది. ఉదా : వృక్షాత్పర్ణం పతతి (చెట్టు నుండి ఆకు రాలుచున్నది)

తరువాత 'భీత్రార్థానాం భయహేతుః' (1-4-25) 'పరాజేరసోఢః' (1-4-26) 'జనికర్తుః ప్రకృతిః' (1-4-30) 'ఆఖ్యాతోపయోగే' (1-4-29) 'అన్తర్ధాయేనా దర్శన మిచ్ఛతి' (1-4-28) మున్నగు సూత్రములచే అపాదాన సంజ్ఞ విధింపబడినది. నిజముగ చూచిన "ధ్రువమపాయేఽపాదానమ్" అను ప్రథమ సూత్రముచేతనే 'చోరాద్బిభేతి' మున్నగు చోటులందు కూడ అపాదానసంజ్ఞ కలుగవచ్చును. ఐనను అంత నిగూఢ భావము ఎల్లరులకు తెలియబడుట దుస్సాధమని భావించి ఎల్లరులకు స్పష్టముగా తెలిసికొనుటకు వేరు వేరు సూత్ర ములు రచియింపబడినవి.

అట్లే 'కర్తురీప్సితతమమ్' అను ప్రథమ సూత్రముచేతనే విషంభుక్తే, గాందోగ్ధి పయః, చైత్రం గమయతి, మున్నగు చోటులయందు, విషము, గోవు, మున్నగువానికి కర్మ త్వము లభింపగలదు. ఐనను ఎల్లరకు అందుబాటులో నుండవలెనని యెంచి వేరు వేరు సూత్రములు వ్రాయబడినవి.

'తణ్డులానోదనం' పచతి అను వాక్యమునకు బియ్యమును మెత్తపరచుచు అన్న మును తయారుచేయుచున్నాడు (తణ్డులాన్ విక్లేదయన్ ఓదనం నిర్వర్తయతి) అను అర్థమును భాష్యకారుడు చూపి పచిధాతువునకు విక్లేదనము, నిర్వర్తనము అను రెండు వ్యాపారములు

వాచ్యములగునని పలికెను— 'ద్వ్యర్థః పచిః'. ఆ మార్గాన దుహ్యాదులకు గూడ వ్యాపార ద్వయము వాచ్యము కాగలదు. ఎల్ల లక్ష్యములు పొందపడ గలవు. ఇదియే భాష్యకారాదుల నిర్ణయము. ॥78॥

*అవతారిక*— నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యము అను రీతిని కర్మభేదము ఇంతకుముందు చూపబడియున్నది. అట్టితరి 'కర్మ ఒక్కటియే' అనుట ఎట్లు? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ నిర్వర్త్యోవా వికార్యోవా ప్రాప్యోవా సాధనాశ్రయః ।**
**క్రియాణామేవ సాధ్యత్వాత్ సిద్ధరూపోఽభిధీయతే ॥ 79**

క్రియాణామ్ + ఏవ = క్రియలకే, సాధ్యత్వాత్ = సాధ్యత్వ ముండుటవలన, నిర్వర్త్యః + వా = నిర్వర్త్యరూపముగానున్నదియు, వికార్యః + వా = వికార్య రూపమగునట్టియు, ప్రాప్యః + వా = ప్రాప్యరూపముగా నున్నదైన, సాధనాశ్రయః = సాధనమును ఆశ్రయించి నదై, సిద్ధరూపః=సిద్ధరూపముగా, అభిధీయతే=(నామ పదములచే) బోధింపబడు చున్నది.

**తాత్పర్యము**— పదార్థము రెండు విధములు. 1. సాధ్యము, 2. సిద్ధము. క్రియ సాధ్యమేయగును. నామ శబ్దార్థము సిద్ధరూపముననే భాసించును. వానిలో సిద్ధపదార్థము క్రియకు సాధనమగును. కాగా నిర్వర్త్యముకాని వికార్యముకాని ప్రాప్యముకాని ఏదియైనను సిద్ధపదార్థమే యగును. కనుక కర్మ ఒకటియే యనుట లెస్స. కాని నిర్వృత్తి, వికారము, ప్రాప్తి అనునవి విలక్షణములగు క్రియలు. అవి తన రూపమును తన సాధనములయందు సంక్రమింపజేయును. అక్కారణమున నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యమనెడి కర్మభేదము కలుగుచున్నది. ॥79॥

*అవతారిక*— ఇంతటతో ద్వికర్మకధాతు విషయము ముగిసినది. విషం భక్షయతి (విషమును తినుచున్నాడు), చోరాన్ పశ్యతి (దొంగలను చూచుచున్నాడు) మున్నగు ప్రయోగములలో విషము మున్నగునవి కర్తకు ఈప్సితము లెట్లు కాగలవు? అట్టితరి విషము కర్మ యెట్లు కాగలదు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అహితేషు యథా లౌల్యాత్ కర్తురిచ్ఛోపజాయతే ।**
**విషాదిషు భయాదిభ్యస్తథైవాసౌ ప్రవర్తతే ॥ 80**

యథా = ఏ రీతిగా, అహితేషు = హితముకాని వస్తువులయందు, లౌల్యాత్ = జిహ్వా చాపల్యము వలన, కర్తుః = కర్తకు అనగా ప్రకృతమున రోగికి, ఇచ్ఛా = కోరిక, ఉపజాయతే= కలుగుచున్నదో ;

తథా + ఏవ = అట్లే, అసౌ = ఇతడు అనగా కర్త, విషాదిషు = విషము మున్నగు వానియందు, భయాదిభ్యః=భయము మున్నగువానివలన, ప్రవర్తతే = ప్రవర్తించు చున్నాడు.

తాత్పర్యము— రోగికి వైద్యుడు పథ్యము చెప్పును. వాతము, పిత్తము, కఫము ఇవి ప్రకోపింపకుండుటకై వానికి ఆహార నియమమును బోధించును. వైద్యుడు నిషేధించిన వస్తువులను భక్షించిన, రోగము అధికమగునని రోగికి తెలియును. కాని ఆహారనియమము లేనివాడు జిహ్వను నిరోధించుకొనలేక రోగవృద్ధిని జేయు వస్తువులయందు ఇచ్ఛను పొందును.

అట్లే ప్రభువువలన భయపడినవాడు ప్రభువు ఏమిచేయునో అని తలంచి అతని వలన బాధపడుట కంటె విషమును తినుటయే మేలు అని తలంచును. కాగా విషయమును పరిశోధించి దానివలన క్షేమమున్నదని భావించినవాడు ఈ వస్తువులను కోరడు. భయాదుల వలన గూడ వస్తువులయందు ఇచ్ఛ కలుగును.

అట్లే దొంగ తన వస్తువులను అపహరించునేమో యని భీతిజెంది వాని నడవడిని గుర్తించుటకై చూచును. ॥80॥

అవతారిక— ధాతువునకు రెండు కర్మలు సంభవింపగా, ప్రాధాన్యమునుబట్టి ప్రధాన కర్మను బోధించుచు లకారాదులు ప్రవర్తించునని చెప్పబడినది.

ఇపుడు ఒక వాక్యమున రెండు క్రియలున్నచో అచట ఆ రెండు క్రియలకు ఒకే కర్మ ఉన్నపుడు లకారముచే ఒక క్రియనుబట్టి కలిగెడి కర్మత్వము అభిహితమైనను రెండవ క్రియచే కలిగెడి కర్మత్వము అభిహితము కానందున, అచట ద్వితీయాదులు ప్రవర్తింప వలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రధానేతరయోర్యత్ర ద్రవ్యస్య క్రియయోః పృథక్ ।**
**శక్తిర్గుణాశ్రయా తత్ర ప్రధానమనురుధ్యతే ।** **81**

యత్ర = ఏ ప్రయోగమున, ప్రధానేతరయోః = ప్రధానము అప్రధానము అగు, క్రియయోః = రెండు క్రియలకు సంబంధించిన, ద్రవ్యస్య = ఒకే ద్రవ్యమునకు, పృథక్ = వేరుగా నున్న, శక్తిః = కర్తృత్వము కర్మత్వము మున్నగు కారకశక్తి (అస్తి) కలదో, తత్ర = ఆ ప్రయోగమున, గుణాశ్రయా = అప్రధానమగు క్రియనుబట్టి కలిగెడి శక్తి, ప్రధానమ్ = ప్రధానమగు క్రియవలన కలిగెడి కారకశక్తిని, అనురుధ్యతే = అనుసరించి యుండును. 81, 82 కారికలు "స్వాదుమి ణముల్" (3-4-26) అను సూత్రమునగల భాష్యమును వ్యాఖ్యానించుచున్నవి.

తాత్పర్యము— ఒక వాక్యమున నుండెడి పదములచే బోధింపబడెడి అర్థములకు పరస్పరము సమన్వయము కలుగును. అచట రెండు పదార్థములు విశేష్యములైన, కాక విశేషణములైన, వానికి సమన్వయము కలుగదు. ఒక పదార్థము విశేషణము, మరియొకటి విశేష్యము అగుచో, అట్టివానికి సమన్వయము కలుగును. ప్రకృతమున ఒకటి గుణమును రెండవది ప్రధానమును అగు రెండు క్రియలు ఒకే ప్రయోగమున సంభవింపగా ప్రధాన క్రియచే కలిగెడి కర్తృత్వ కర్మత్వములను బట్టియే విభక్తి ప్రవర్తించును. అప్రధాన క్రియను బట్టి విభక్తి స్వతంత్రముగా ప్రవర్తింపనేరదు. ॥81॥

*అవతారిక*—— 81 వ కారికచే చూపబడిన అర్థమునే వివరించుచున్నాడు.

**శ్లో॥ ప్రధాన విషయా శక్తిః ప్రత్యయేనాభిధీయతే ।**
**యదా గుణే తదా తద్వదనుక్తాపి ప్రతీయతే ॥ 82**

యదా = ఏ ప్రయోగమున, ప్రధానవిషయా = ప్రధానమగు ధాత్వర్థ క్రియ మూలముగాగల, శక్తిః = కర్మ, కర్త మున్నగు శక్తి, ప్రత్యయేన = లకారము మున్నగు ప్రత్యయముచే, అభిధీయతే = చెప్పబడునో, తదా = ఆ ప్రయోగమున, గుణే = అప్రధానమగు క్రియచే కలిగిన, శక్తిః = కర్మ, కర్త మున్నగు శక్తి, అనుక్తా + అపి = సాక్షాత్తు చెప్పబడక పోయినది అయినను, తద్వత్ = చెప్పబడినది వలె, ప్రతీయతే = తెలియబడగలదు. ॥82॥

*అవతారిక*—— పై కారికార్థమునకు ఉదాహరణము జూపుచున్నాడు.

**శ్లో॥ పచావనుక్తం యత్కర్మ క్త్వాన్తే భావాభిదాయిని ।**
**భుజౌ శక్త్యన్తరేఽప్యుక్తే తత్తద్ధర్మః ప్రకాశతే ॥ 83**

భావాభిధాయిని = భావమాత్రమును బోధించెడి, క్త్వాన్తే = క్త్వాప్రత్యయాంతమున, పచౌ = పచిధాతువుయొక్క అర్థమునకు సంబంధించిన, యత్ = ఏ, కర్మ = కర్మ, (అస్తి) కలదో, తత్ = ఆ కర్మ, భుజౌ = భుజిక్రియకు సంబంధించిన, శక్త్యన్తరే + అపి = కర్మ శక్తియు, ఉక్తే = లకారాదులచే చెప్పబడగా, తద్ధర్మః = దానియొక్క అనగా ప్రధాన కర్మయొక్క అభిహితత్వమనెడి ధర్మము కలదై, ప్రకాశతే = ప్రకాశించును.

**తాత్పర్యము**—— చైత్రేణ ఓదనః పక్త్వా భుజ్యతే (చైత్రునిచే ఓదనము వండి భుజింపబడుచున్నది) ఈ ప్రయోగమున భుజిక్రియ ప్రధానము, పచిక్రియ అప్రధానము. ఈ రెంటిలోను ఓదనము ఒక్కటియే కర్మ. భుజిధాతువు కంటె కర్మార్థమున లకారము, పచిధాతువు కంటె భావార్థమున క్త్వాప్రత్యయము ప్రవర్తించినవి. తిఙ్ ప్రత్యయముచే ఓదనకర్మ అభిహితమాయెను. ఆ కర్మ పచిధాతువుకంటె కలిగిన క్త్వాప్రత్యయముచే అభిహితము కాలేదు. అట్లైనను ప్రధాన ప్రత్యయముచే ఓదనకర్మ అభిహితమగుటచే అప్రధాన క్రియా కర్మ ప్రత్యయముచే బోధింపబడకున్నను అభిహితమగునట్లుండుటచే ఓదనశబ్దము కంటె ద్వితీయా విభక్తి ప్రవర్తింపదు.

రెండు క్రియలకు వేరు వేరు కర్మ లుండుచోటున మాత్రము ఈ న్యాయము ప్రవర్తింపదు. ఉదా : ఓదనం భుక్త్వా గ్రామో గమ్యతే (అన్నమును తిని గ్రామము చైత్రునిచే వెళ్ళబడుచున్నది) ఇచట ఓదనము భుజిక్రియకు కర్మ, గమిక్రియకు గ్రామము కర్మ. గమి కర్మతిఙ్ ప్రత్యయముచే అభిహితమగుటచే దానికంటె ద్వితీయ రాకుండ ప్రథమ కలిగినది. భుజికర్మ అభిహితము కానందున దానికంటె ద్వితీయా విభక్తి కలిగినది.

కాగా ప్రధానాప్రధానక్రియలకు ఒకే కర్మ కలిగినచోటనే పై న్యాయము ప్రవర్తించును. ॥83॥

అవతారిక— పై యర్థమునకు మరియొక ఉదాహరణము జూపుచున్నాడు.

**శ్లో॥ ఇషేశ్చ గమిసంస్పర్శాద్ గ్రామే యో లో విధీయతే ।
తత్రేషిణైవ నిర్భోగః క్రియతే గతికర్మణః ॥** 84

గ్రామే = గ్రామము మున్నగు కర్మయందు, యః = ఏ, లః = లకారము, విధీయతే = విధింపబడుచున్నదో, తత్ర = అట్టి, గతికర్మణః = గమ్యర్థ కర్మకు, ఇషేః = ఇషధాత్వర్థమునకు, గమిసంస్పర్శాత్ + చ = గమ్యర్థముతో సంబంధముండుట వలన, ఇషిణా + ఏవ = ఇషధాతువుకంటె ప్రవర్తించిన తిఙ్ ప్రత్యయముచేతనే, నిర్భోగః = చర్వణము అనగా అభిధానము, క్రియతే = చేయబడుచున్నది.

**తాత్పర్యము**— చైత్రేణ గ్రామో గన్తు మిష్యతే (చైత్రునిచే గ్రామము వెళ్ళుటకు ఇచ్ఛగింపబడుచున్నది) ఇచట గ్రామము గమికర్మ, గ్రామము, గమనము రెండుకూడ ఇష ధాత్వర్థమునకు కర్మలు. ఇషధాతువు కంటె కర్మార్థమున లకారము కలుగుటచే ఆ లకారము చేతనే గమికర్మ యగు గ్రామముకూడ అభిహితమగును. కాగా గ్రామశబ్దము కంటె ద్వితీయా విభక్తి కలుగక ప్రథమా విభక్తియే కలిగినది. ॥84॥

అవతారిక— పై యర్థమున మతాంతరమును జూపుచున్నాడు.

**శ్లో॥ పక్త్వాభుజ్యత ఇత్యత్ర కేషాఞ్చిన్న వ్యపేక్షతే ।
ఓదనం పచతిః, సోఽసావనుమానా త్ప్రతీయతే ॥** 85

కేషాఞ్చిత్ = కొందరి, (మతే) మతమున, 'పక్త్వాభుజ్యతే + ఇత్యత్ర' = పక్త్వాభుజ్యతే మున్నగు ప్రయోగమున, పచతిః = పచధాతువు అనగా పచ్యర్థము, ఓదనమ్ = ఓదనః అను ప్రథమాంతమును, న + అపేక్షతే = అపేక్షింపదు. అనగా ప్రథమాంతార్థము పక్త్వా అను 'క్త్వా' ప్రత్యయాంతార్థమున అన్వయింపదు. సః + అసౌ = ఆ ఈ ఓదన పదార్థము, అనుమానాత్ = అనుమాన ప్రమాణమువలన అనగా సామర్థ్యమువలన, ప్రతీయతే = తెలియబడుచున్నది.

'పక్త్వాఓదనః భుజ్యతే' మున్నగు వాక్యములలో ఓదన అను ప్రథమాంతము యొక్క అర్థము భుజ్యతే అను కర్మ తిఙంతార్థముతోనే అన్వయించును. అది పక్త్వా అను క్త్వాంతార్థముతో అన్వయింపదు. పచిధాతువు సకర్మకము కనుక అందు ప్రథమాంతార్థము అన్వయయోగ్యము కాదు. అట్లైనను ఏకవాక్యతా రూపమగు సామర్థ్యమును అనుసరించి మానసముగా ఓదనము సంబంధించును. అనగా అర్థాత్ సంబంధించును.

**విశేషాంశము**— అర్థాత్ లభించిన సంబంధము కంటె శబ్దమువలన కలిగెడి సంబంధము బలవత్తరము కనుక శాబ్దాన్వయము చెప్పుట సమంజసము. అట్లు చెప్పుటయే భాష్య సమ్మతము. కాగా ఈ కారికార్థము సిద్ధాంతము కాదు. ఈ యభిప్రాయముతోనే భర్తృహరి 'కేషాఞ్చిత్' అను పదమును ప్రయోగించెను. ॥85॥

అవతారిక — పై చూపబడిన న్యాయము కర్మ కారకమునకే కాదు. కారకాంతర ములకు కూడ సమన్వితమగును అని చూపుచున్నాడు.

శ్లో॥ తత్రాభినివిశౌ కర్మ యత్తిజన్తేఽభిధీయతే ।
క్త్వాన్తేఽధికరణత్వేఽపి న తత్రేచ్ఛన్తి సప్తమీమ్ ॥ 86

తత్ర = గుణ ప్రధానములగు క్రియలను బోధించెడి ధాతువులున్న ప్రయోగమున, తిజన్తే = తిజంతమగు, అభినివిశౌ = అభి + ని + విశ్ అను ధాతువు ప్రయుక్తము కాగా, యత్ + ఏ, కర్మ = కర్మకారకము, అభిధీయతే = (తిజ్ ప్రత్యయముచే) చెప్పబడుచున్నదో, తత్ర = ఆ కర్మయందు, క్త్వాన్తే = క్త్వాప్రత్యయాంతము ప్రయుక్తముకాగా, అధికరణత్వే + అపి = అధికరణ కారకమునగూడ, సప్తమీమ్ = సప్తమీ విభక్తిని, న + ఇచ్ఛన్తి = (శాస్త్రజ్ఞులు) అంగీకరింపరు

తాత్పర్యము— చైత్రేణ భుక్త్వానగర మభినివిశ్యతే (చైత్రునిచే భుజించి నగరము ప్రవేశింపబడుచున్నది) ఇచట ప్రవేశమునకు నగరము అధికరణము. ఐనను "అభినివిశశ్చ" (1-4-47) అను సూత్రముచే నగరమునకు కర్మసంజ్ఞ చెప్పబడినది. ఆ కర్మను తిజ్ ప్రత్యయము చెప్పుచున్నది. కాగా భుజక్రియకు కూడ ఆధారము నగరము. కాని దానినిబట్టి నగర శబ్దముకంటె అధికరణార్థమున సప్తమి ప్రవర్తింపదు. ప్రధాన క్రియావాచక ధాతువు కంటె ప్రాప్తించిన తిజ్‌చే కర్మత్వము అభిహితమగుటచే, అప్రధానమగు క్రియనుబట్టి కలిగిన అధికరణత్వము అభిహితము కాకున్నను పై న్యాయము చొప్పున అభిహితమే యగుచున్నది. ॥86॥

అవతారిక— గుడం భక్షయతి (బెల్లము తినుచున్నాడు) మున్నగు ప్రయోగ ములు లోక ప్రసిద్ధములు. కాని గుడము సిద్ధమగు పదార్థమే, దానికి భక్షణ క్రియవలన కలిగెడి విశేషము ఏమియు లేదు. కాబట్టి పై ప్రయోగములు ఎట్లు సంగతములగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యన్నిర్వృత్తాశ్రయం కర్మ ప్రాప్తేరప్రచితం పునః ।
భక్ష్యాది విషయాపత్త్యా భిద్యమానం తదీప్సితమ్ ॥ 87

యత్ = ఏ, కర్మ = కర్మ అనగా బెల్లము మున్నగు కర్మ, నిర్వృత్తాశ్రయమ్ = నిర్వర్తితము అనగా సిద్ధము, మరియు నిరాశ్రయము అనగా క్రియను ఆకాంక్షింపనదియు, అట్టే, ప్రాప్తేః = క్రియా సంబంధమువలన, అప్రచితం + పునః = విశేషములేని, తత్ = అట్టి కర్మ, భక్ష్యాది విషయాపత్త్యా = భక్షణము మున్నగు క్రియలకు విషయభావమును పొందుటచే, భిద్యమానమ్ = పరిణామమును జెందినదై, ఈప్సితమ్ = క్రియతో సంబంధించి నది అగుచున్నది.

తాత్పర్యము— 'గుడం భక్షయతి' (బెల్లము తినిపించుచున్నది - అనగా రుచికర

దానియందుగూడ, జాతిః = జాతి, సాధనమ్ = సాధనము అనగా కారకము, కాగలదు. సా = ఆజాతి, స్వాశ్రయస్య = తనకుఅనగా ఆజాతికి ఆశ్రయమగు ద్రవ్యముయొక్క-పుట్టుక విషయమై, క్రియాణామ్ = క్రియలకు, ప్రయోజికా = ప్రేరేపించునది యగుచున్నది.

నిర్వర్త్యకర్మ : ఘటం కరోతి (కడవను తయారుచేయుచున్నాడు) మున్నగు లక్ష్యములలో కడవ మున్నగునవి. సిద్ధమగు వస్తువులు క్రియలలో సాధనమగును. ఇచట కడవ సిద్ధముగా లేదు కనుక అది ఎట్లు సాధనమగును? అని ప్రశ్నింపవచ్చును. ఇచట ద్రవ్యసాధనముకాదు. మరి యేమన జాతిసాధనము అది సిద్ధమే. అట్టిజాతి తాను అభివ్యక్తమగుటకు తనకు ఆశ్రయమగు ద్రవ్యముపుట్టుటకై క్రియలను ప్రేరేపించును. కాగా, జాతియే కారకము, నిష్పన్నమగు ద్రవ్యము కర్మకాగలదు. జాతి, ద్రవ్యము రెండు వేరువేరు పదార్థములుకావు. అవి అభిన్నములే. కనుక ఘటము, కర్మకారకము అనువ్యవహారము కలుగ వచ్చును.

*విశేషాంశము*—వికార్యకర్మః : సువర్ణం కుణ్డలం కరోతి (బంగారమునుకుండలముగా చేయుచున్నాడు) సువర్ణము వికార్యము. (గ్రామం పశ్యతి) గ్రామమును చూచుచున్నాడు. ఇచట గ్రామము ప్రాప్యకర్మ, సువర్ణము,గ్రామము సిద్ధ వస్తువులేకాన ఇచటద్రవ్యములే సాధనములు కాగలవు. అందుచేనిర్వర్త్యకర్మయే జాతివాదమునకు ప్రయోజనము కాగలదు. ఈభావముతో నిర్వర్త్యమానమ్ అను పదము ప్రయుక్తమాయెను ॥27॥

*అవతారిక*—కార్యముజనియించుటలో జాతి కారణములను ప్రేరేపించునని చెప్పబడినది. కాగా జాతివాదమున క్రియలలో సాధనము జాతియే. ద్రవ్యముకాదని తేలినది. విధివాక్యములు, నిషేధవాక్యములు కూడ జాతిని ఉద్దేశించియే చెప్పబడినవని నిరూపించుచున్నాడు.

**శ్లో॥ విధౌవాప్రతిషేధేవా బ్రాహ్మణత్వాదిసాధకమ్।**
**వ్యక్త్యాశ్రితా శ్రితా జాతే స్సంఖ్యాజాతి ర్విశేషికా॥ 28**

A. విధౌ = విధివాక్యమునగాని, ప్రతిషేధే + వా, ప్రతిషేధవాక్యమునగాని, బ్రాహ్మణత్వాది = బ్రాహ్మణత్వము మున్నగు జాతియే, సాధకమ్ = కారణమగుచున్నది.

శాస్త్రము మనుష్యుని అభిమతమగు ఒక క్రియయందు ప్రవర్తింపచేయును. అనిష్టజనకమగు క్రియనుండి నివర్తింపజేయును. వీనినే విధినిషేధములందురు. అవి జాతికే సంబంధించును, వ్యక్తికికాదు.

గామాలభేత (గోవును చంపి యజ్ఞ చేయవలెను) ఇది విధి. గౌర్న పదాస్ప్రష్టవ్యః (గోవును కాలితోతన్నరాదు) ఇది నిషేధము. ఈ రెండు జాతికే సంబంధించును. కాగా ఎల్ల గోవులు (ఏ గోవైనను) యజ్ఞమునకు అర్హములగును. ఎల్లగోవులను కాలిచే తన్నకూడదు అను అర్థములభించును. ద్రవ్యమునకే ఈ విధినిషేధములు సంబంధించినచో ఏదోఒకగోవుతో యజ్ఞము చేయవలెను, ఏదో ఒకగోవును తన్నరాదు, అనియే లభించును. అది సమ్మతముకాదు కనుక జాతిపక్షమును ఆశ్రయించుటయే యుక్తము.

మగుటచే అని భావము) మున్నగు చోటులందు గుడము మున్నగునది సిద్ధపదార్థము, కనుక నిర్వర్త్యకర్మ కానేరదు. మరియు క్రియను ఆకాంక్షించునదియు కాదు. కాబట్టి వికార్య కర్మము కానోపదు. మరియు క్రియా సంబంధమున ప్రచయమును బొందునదియు కాదు. కాన ప్రాప్యము కూడ కాజాలదు. అయినను భక్షణక్రియకు విషయమగుచున్నది. అనగా గుడ భక్షణము ఈప్సితమగుటం జేసి దానిలో అంతర్గతమగు గుడము కూడ ఈప్సితమే యగు చున్నది. కాగా గుడాదులు ప్రాప్యకర్మలు కాగలవు.

*విశేషాంశము*— క్రియకు విషయభావమును బొందుటచే గుడాదులు కర్మలే యగుచో ఎల్ల ధాతువులకు విషయసంబంధ ముండుటవలన ఎల్లధాతువులు సకర్మకములే కావలెను అట్టితరి అకర్మకధాతువులే లేకపోయెడిని అని ప్రశ్నింపవచ్చును.

సమాధానము— బాహ్యకర్మలు లేని ధాతువులు అకర్మకములు కాగలవు. ఆస్తే (ఉంటున్నాడు) ఇచట ఉనికిని చేయుచున్నాడు అను రీతిని అర్థమును గ్రహించిన ఆ ధాతువు నకు బాహ్యకర్మ లేనందున అది అకర్మకమే కాగలదు. ॥87॥

*అవతారిక*— బాహ్యకర్మ ఉన్నను దానిని వివక్షింపనిచో ఆ ధాతువుకూడ అకర్మకము కాగలదని చెప్పుచు ఆ ప్రసంగమున నాల్గు విధములుగా ధాతువులు అకర్మక ములు కాగలవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ధాతోరర్థాన్తరే వృత్తే ర్ధాత్వర్థేనోప సంగ్రహాత్ ।**
**ప్రసిద్ధే రవివక్షాతః కర్మణోఽకర్మికా క్రియా ॥ 88**

క్రియా = ధాతువు, అకర్మికా = అకర్మకము (చతుర్భిః + ప్రకారైః) నాలుగు ప్రకారములచే కలుగును.

1. ధాతోః = ధాతువునకు, అర్థాన్తరే = మరియొక అర్థమున, వృత్తేః = ఉండుటవలన,

ధాతువునకు ఒక అర్థమునందు సకర్మకత్వము కలుగును - భారం వహతి (బరువు మోయుచున్నాడు) ఒక దేశమునుండి మరియొక దేశమునకు వస్తువులను పొందించుట వహ ధాతువునకు అర్థము. వహధాతువునకు పై యర్థము చెప్పక మరియొక యర్థమును జూపిన అపుడు వహధాతువు అకర్మకమగును - నదీ వహతి (నది పారుచున్నది)

2. ధాత్వర్థేన = ధాతువుయొక్క అర్థముచేతనే, ఉపసంగ్రహాత్ = కర్మను చేర్చియుండుట వలన,

దేనిని కర్మగా మనము తలంచుచున్నామో ఆ కర్మ ధాత్వర్థమున కలసియే యుండును. దానికంటె వేరుగా భాసింపదు. చైత్రః జీవతి (చైత్రుడు జీవించియున్నాడు) ప్రాణములను ధరియించుట జీవధాతువునకు అర్థము. ఇచట ప్రాణములు ధాత్వర్థమున అంత ర్గతములై యున్నవి. కాబట్టి జీవధాతువు అకర్మకము.

3. ప్రసిద్ధేః = ప్రసిద్ధినిబట్టియు అకర్మకము కాగలదు.

వర్షతి (మేఘము వర్షించుచున్నది) ఇచట ఉదకమును వర్షించుటలో మేఘము కర్త యని ప్రసిద్ధము. అట్లే ఉదకమును వర్షించుటయు లోక ప్రసిద్ధమే. కాబట్టి మరల (ఉదకమ్) అని కర్మ ప్రయుక్తము కానక్కరలేదు. కనక ఇచట ఈ ధాతువు అకర్మకము.

4. కర్మణః = కర్మయొక్క, అవివక్షాతః = వివక్ష చేయకుండుటవలన,

కర్మయున్నను దానికి క్రియాకారక భావసంబంధమున అన్వయము చూపక సంబంధమాత్రమున అన్వయమును జూపిన నదియు అకర్మకమే. 'నసంశృణుతే' (వినడు) హితునివలన హితమును వినడు అని భావము.

*విశేషాంశము*— ఈ కారికలో అకర్మకత్వము లభించుటలో 4 మార్గాలు చూపబడినవి. కాని వానిలో మూడవ భేదము 'ప్రసిద్ధేః' అనునది యుక్తము కాదు. మేఘో వర్షతి (మేఘము వర్షించుచున్నది) ఇచట జలము అను పదము లేకున్నను అన్వయబోధ కలుగుచున్నది. అందుచే 'జల' అను పదమును ప్రయోగింపలేదు. అంతమాత్రాన ధాతువు అకర్మకము కానేరదు. మరియు భాష్యకర్త ఈ రీతిగ అకర్మకత్వమును ఎచటను చూపియుండలేదు. మిగతా మూడు రీతులను ఆశ్రయించి అకర్మకత్వమును భాష్యకర్త చూపియున్నాడు. ఈ యంశమును విపులముగా వైయాకరణ నాగేశుడు లఘు శబ్దేందుశేఖరమున ఆత్మనేపద ప్రకరణమున నిరూపించియున్నాడు. ॥88॥

*అవతారిక*— పై కారికచే నాల్గు ప్రకారములుగా ధాతువునకు అకర్మకత్వము సంభవించునని చెప్పబడినది. ఆ నాలుగే కాక మరియొక విధమున గూడ అకర్మకత్వము సంభవించునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ భేదా య ఏతే చత్వారః సామాన్యేన ప్రదర్శితాః ।**
**తే నిమిత్తాదిభేదేన భిద్యన్తే బహుధా పునః ॥ 89**

ఏతే = ఈ, యే = ఏ, చత్వారః = నాలుగు, భేదాః = సకర్మక ధాతువులు అకర్మకములగుటకు కారణ భేదములు, సామాన్యేన = సామాన్యరూపమున, ప్రదర్శితాః = చూపబడినవో, తే = అవి, అనగా ఆ నాల్గు భేదములు, పునః = మరల, నిమిత్తాది భేదేన = నిమిత్తమున్నగువాని భేదములచే, నిమిత్తమనగా సహాయము ఉపసర్గము. ఆది పదముచే దేశకాలాదులు గ్రాహ్యములు, బహుధా = పలు విధములుగా, భిద్యన్తే = భిన్నమగుచున్నవి.

తాత్పర్యము— 88 వ కారికచే అకర్మకత్వము నాల్గు ప్రకారములుగా జూపబడినది. అంతియేకాక ఉపసర్గవశమున సకర్మకము అకర్మక ధాతువు కాగలదు. చరధాతువునకు సంచరించుట అర్థము గ్రామం చరతి (గ్రామముగూర్చి వెళ్ళుచున్నాడు) ఉత్ అనెడి ఉపసర్గ వశమున మీదుగ ప్రసరించుట అను అర్థము లభించును. అపుడు చరధాతువు అకర్మకము కాగలదు. ధూమ ఉచ్చరతి (పొగ మీదుగా పోవుచున్నది).

పరస్మైపదిధాతువు సకర్మకమైనను ఆత్మనేపది యగునపుడు అకర్మకము కాగలదు. ఉదా: ఘటం జానాతి (కడవను తెలిసికొనుచున్నాడు) ఇచట సకర్మకము, 'సర్పిషోజానీతే' నేతిని ఉపాయముగా గైకొని ప్రవర్తించుచున్నాడు. ॥89॥

## కరణాధికారము

*అవతారిక*— "స్వౌజసమౌట్ఛస్టాభ్యాం భిస్జేభ్యాం భ్యస్ ఙసిభ్యాం ఙ్యస్ ఙసో సాంఙ్యోస్సుప్" (4-1-2) అనునది స్వాదిప్రత్యయములను విధించిన సూత్రము. అందు సుఔజస్ అమనది ఒక త్రికము. దానికి ప్రథమ అని ప్రాచీనుల సంజ్ఞ. ఆ విధముగనే ద్వితీయా మున్నగునవియు శేషించిన ఆఱు త్రికములకును క్రమముగ సంజ్ఞలు. వానికి కర్త కర్మ కరణము మున్నగు కారకములు అర్థము. అందు ద్వితీయార్థమగు కర్మ కారకము విచారింపబడినది. ఇక తృతీయార్థమును విచారింపవలె.

కర్తయు, కరణమును తృతీయ కర్థములు. కర్త షష్ఠికిగూడ నర్థమగుటచేత నది సాధారణము. కరణమొక్క తృతీయకే అర్థము. అందువలన కర్తకంటె కరణమునకు ఆధిక్యమును భావించి ముందు ఆ కరణము విచారింపబడుచున్నది.

"సాధకతమం కరణమ్" (1-4-42) అను సూత్రము కరణలక్షణ బోధకము. క్రియను సిద్ధింపజేయుటలో ఏయది మిక్కిలిగ నుపకరించునో అది కరణమని యర్థము. కారకములన్నియు క్రియాజనకములే గదా ఈ కరణ కారకమునకు గల సాధకతమత్వము ఎట్టిది? అది ప్రకృష్టోపకారక మెట్లగును? అని శంకించి, ఆ ప్రకర్షను వివరించుచున్నాడు.

**శ్లో॥ "క్రియాయాః పరినిష్పత్తిర్యద్వ్యాపారాదనన్తరమ్।**
**వివక్ష్యతే యదాయత్ర కరణం తత్తదాస్మృతమ్॥** 90

క్రియాయాః = క్రియయొక్క, పరినిష్పత్తి = సంపూర్ణమగు సిద్ధి, యద్వ్యాపారాత్ = ఏ కారక వ్యాపారముకంటె, అనన్తరం = అవ్యవహితోత్తరకాలమున = వెనువెంటనే, యదా, యత్ర = ఎపుడు, ఎచట, వివక్ష్యతే, తదా = జరుగునట్లు వక్తచే తలంపబడునో, అపుడు, తత్ర, తత్ = అచట అది, కరణమ్ = కరణము, స్మృతమ్ = (అగునని) తలంపబడినది.

*తాత్పర్య విశేషాంశములు*— క్రియా నిష్పత్తికి సాధనములన్నియు సన్నిహితములై యుపకరించును. అపుడు వానిలో దేని వ్యాపారమునకు వెంటనే ఆ క్రియ నిష్పన్నమయినట్లు వాక్యప్రయోక్త భావించునో అది సాధకతమము. అదియే దాని అతిశయము.

ఛేదనమను క్రియను జూతము. అచట కర్మ, కర్త, అధికరణము మున్నగునవి అన్నియు తమతమ వ్యాపారములను జేయుచున్నను, ఆ ఛేద్య వస్తువగు దానియందు అవయవ విశ్లేషమును చేయునది కొడవలియో కత్తియో అగును. అది పనిచేసిన తరువాతనేగదా ఛేదన క్రియ నిష్పన్నము. కావున నది, ప్రకృష్టోపకారకము. ఈ విధముగనే చూచుట అను క్రియకు

కస్సు ప్రకృష్టసాధనము. కారికలో, 'వివక్ష్యతే' = వివక్షింపబడునో అని చెప్పబడినది. కర్త తన బుద్ధిలో దేనిని సాధకతమముగ భావించునో అదియే కరణమగునని దాని భావము.

వ్యాకరణశాస్త్రమున వివక్షోపారూఢమగునదియే అంగముగ గ్రహింపబడును దానికి బాహ్యసత్తతో బనిలేదు. అనగా నది మనస్సుననుండిన చాలును బయట నుండనక్కఱ లేదు. ఛేదన క్రియలో, ప్రకృష్టోపకారకము దాత్రమో చురకత్తియో అయినను, 'బలేన లునాతి' = బలముతో కోయుచున్నాడు అనియు నందురు. అనగా నట బలము ప్రకృష్టోపకారకముగా వివక్షింపబడినదనుట. దర్శనమునకు చక్షుస్సు ప్రకృష్టోపకారకము. అయినను, "ఆలోకేన పశ్యతి" = వెలుగుతో జూచుచున్నాడు అందురు. అదియు వివక్షామూలకమే. పాక క్రియకు స్థాలి, అధికరణముకాని, దానికి, కరణత్వమును వివక్షించి 'స్థాల్యాపచ్యతే' = గిన్నెతో వండబడుచున్నది అనియు నందురు. ఇతర కారకములగు స్థాల్యాదులకు వాస్తవ రూపమును, వివక్షితరూపమును వేరువేరుగానున్నను, కరణమున కొక్కటియే రూపము. అది వివక్షాధీనము. సాధనముల వ్యవహారమంతయు బుద్ధ్యవస్థమూలముగాగలది అని "సాధన వ్యవహారశ్చ బుద్ధ్యవస్థానిబంధనః" అని మూడవకారికలో చెప్పియున్నను మరల ఇచ్చట "వివక్ష్యతే" అని చెప్పుట కరణకారకము ఎపుడును వివక్షాధీనమే. దానికి వాస్తవరూపము లేనేలేదు అని సూచించుటకే అని తాత్పర్యము. ॥90॥

*అవతారిక*— అనంతరకారికయు నీ విషయమునే తెలియజేయుచున్నది.

**శ్లో॥ వస్తుత స్తదనిర్దేశ్యం న హి వస్తు వ్యవస్థితమ్ ।**
**స్థాల్యా పచ్యత ఇత్యేషా వివక్షాదృశ్యతే యతః ॥ 91**

వస్తుతః = వస్తురూపమునుబట్టి, తత్ = ఆ, కరణము, అనిర్దేశ్యమ్ = నిర్దేశింపదగినది కాదు, వస్తు = కరణమను వస్తువు, వ్యవస్థితం న హి = నియతము కాదుగదా, యతః = ఎందువలననగా, స్థాల్యాపచ్యతే = గిన్నెతో వండుచున్నది, ఇతిఏషా = అను, ఈ రూపమగు, వివక్షా = వక్తల ఇచ్ఛ, దృశ్యతే = కనబడుచున్నది గదా.

*తాత్పర్య విశేషాంశములు*— వంటకు గిన్నె ఆధారము. కనుక 'గిన్నెలో వండుచున్నాడు' అనవలసియున్నది కాని, దానిని వంటకు కరణముగా వివక్షించి 'గిన్నెతో' అనుటయు గలదు. వంటకు ప్రకృష్టోపకారకములు కట్టెలు. కావున 'కాష్ఠైఃపచతి' అనదగియున్నది. ఆ కట్టెలు తడిగలవై త్వరగా వంటచేయుటకు ఉపయోగింపకున్నను, స్థాలి = గిన్నె, తన పలుచనితనమువలన క్రియాసిద్ధికి మిగుల ఉపయోగించునది అగుటయు కలదు. కాగా వైవక్షికమైన కరణత్వము స్థాలికిని సంభవము. కనుకనే 'స్థాల్యాపచ్యతే' అను ప్రసిద్ధ వ్యవహారము, లోకమున నేర్పడియున్నదని భావము. ॥91॥

*అవతారిక*— క్రియాసిద్ధికి, కరణము ప్రకృష్టోపకారకమగుటవలననే ఆయా క్రియలను చేయువారు, తాముద్దేశించిన ఫలము సత్వరముగ సిద్ధించుటకై, ఆ కరణములకు సంస్కారవిశేషములను, భిన్న భిన్న వినియోగములను జేయుచుందురు.

శ్లో॥ కరణేషు తు సంస్కారమారభంతే పునః పునః ।
వినియోగవిశేషాంశ్చ ప్రధానస్య ప్రసిద్ధయే ॥ 92

ప్రధానస్య = క్రియయొక్క, ప్రసిద్ధయే = సంసిద్ధికై, కరణేషు, తు = కరణములందే, సంస్కారాన్ = సంస్కారములను, వినియోగవిశేషాన్ చ = వేరువేరు వినియోగములను, పునః పునః = మరల మరల, ఆరభన్తే = (ఫలమును గోరువారు) చేయుచుందురు.

*తాత్పర్య విశేషాంశములు*— క్రియాసిద్ధి ప్రధానము. దానికి ప్రకర్షవంతమయిన సాధనము కరణము. అందువలన, ఫలసిద్ధికై, ఆకరణమునకు తరచుగా సంస్కారములను పదును పట్టుట మున్నగువానిని చేయుచుండుట కనుచున్నాము. ఛేదనమునకు కరణము ఖడ్గము. దానికి ఉత్తేజనమును తఱచు చేయుదురుగదా. వినియోగ విశేషములనగా, దానిని అనేక విధములుగా నుపయోగించుట. ఉద్యమనము = పైకెత్తుట, నిపాతనము = పడవేయుట మున్నగునవి యనుట. కట్టెలు వంటకు కరణములు. వానికి సంస్కారము ఉపధానము. అనగా నవి చక్కగ మండునట్లు పేర్చుట. జారుచున్నవానిని ఎగద్రోయుచు సవరించుట వినియోగము. చూచుటకు కన్ను, కరణము. దానికి సంస్కారము కాటుకపెట్టుట. స్ఫుటముగ నగపడుటకు వలయు మందువంటిది. వినియోగము ప్రణిధానము. అనగా, నిలుకడతో చూచుట. ॥92॥

*అవతారిక*— "అశ్వేన పథా దీపికయా యాతి" = దీపమును బుచ్చుకొని, గుఱ్ఱముమీద నెక్కి మార్గమున బోవుచున్నాడు. ఈ వాక్యమున, అశ్వము, పంథ, దీపిక మూడును కరణములు. వానిలో నుపకార ప్రకర్షను, ఎట్లు వివక్షింపవలెను? అనిన నీ క్రింది కారిక దానికి సమాధానము.

శ్లో॥ స్వకక్ష్యాసు ప్రకర్షశ్చ కరణానాం నవిద్యతే ।
ఆశ్రితాతిశయత్వంతు పరతస్తత్ర లక్షణమ్ ॥ 93

కరణానాం = కరణకారకములకు, ప్రకర్షశ్చ = అతిశయము, అనునది, స్వకక్ష్యాసు = తమ కరణత్వావస్థలలో, నవిద్యతే = ఉండబోదు, తత్ర = అందు, ఆశ్రితాతిశయత్వంతు = ఉపకారాతిశయము, పరతః = ఇతర కారకములనుబట్టి, లక్షణమ్ = గ్రహింపదగినదగును.

*తాత్పర్య విశేషాంశములు*.— సాధకతమమనగా, ఇతర సాధనములకంటె త్వరగా క్రియను నిష్పాదించునది అని యర్థముగాని సజాతీయములలోనే, అతిశయ విశేషము కలది అని గాదు. ప్రకృతోదాహరణమున జూడుడు. అశ్వము, దేశాంతరప్రాప్తికి, కర్తకంటె ప్రకర్షగల ఉపకారము. మార్గముగూడ, దొంగలు మున్నగు ఉపద్రవములు లేక యాన క్రియకు మిక్కిలి ఉపకరించునది. దీపము చీకటిని తొలగించి వెలుగునిచ్చును గాన అదియు, ఇతర కారకములకంటె మిక్కిలి ఉపకరించును. కావున, అశ్వము, పంథ, దీపము అను మూడు కరణములును ఏకకాలముననే యానక్రియాసిద్ధికి, ఇతర కారకములకంటె అతిశయిత

వ్యాపారమునందు ప్రవర్తించు కాలములో, ఇతర కారకముల కే వ్యాపారమను లేనేలేదాయె. వానికి సాధనత్వము సిద్ధించుట కర్తృవ్యాపారమునకు తరువాత నవియు తమ వ్యాపారము లందు ప్రవర్తింపగా గలుగును. ఆ దశలోనే వానిలో ప్రకర్షాపకర్షలను గూర్చిన వివక్ష. అయ్యది, కరణమునకు, తనతో తుల్యకక్ష్యలోనిదైన అధికరణాదులతో సంభవింపవచ్చును. కర్తతో గాదు. కర్త స్వామి. ఇతర కారకములు భృత్యప్రాయములు. కర్త స్వతంత్రుడు మాత్రమే. అవి స్వతంత్రములును కర్తకు పరతంత్రములును గూడ నగును. భృత్యులతో స్వామికి స్పర్థయేమి? కరణమును కర్తకు పరతంత్రమే అయినను, సాధనాంతరముల దృష్టిచే సాధకతమముగా నొప్పును. కాబట్టి 'అస్వతంత్రమైనది ప్రకర్షగల సాధన మెట్లగును?' అను ప్రశ్న కవకాశము లేదు. ॥95॥

*అవతారిక*— కర్తకును కరణమునకును ఇట్లు రూపభేదము కలదని నిరూపించి తిరి గదా? అట్లైన, "అసిఃఛినత్తి" = 'కత్తి కోయుచున్నది' అని వ్యవహరింతురే? అది యెట్లు? కరణమగునది కర్త యెట్లగును? అనగా

**శ్లో॥ అస్యాదీనాం తు కర్తృత్వే తైక్ష్ణ్యాది, కరణం విదుః।**
**తైక్ష్ణ్యాదీనాం స్వతంత్రత్వే ద్వేధాత్మా వ్యవతిష్ఠతే॥ 96**

అసి ఆదీనాం = కత్తి మున్నగునవి, కర్తృత్వేతు = కర్తలయినపుడు, తైక్ష్ణ్యాది = వాని తీక్ష్ణత మొదలగుదానిని, కరణం = కరణమునుగా, విదుః = తలంతురు, తైక్ష్ణ్యాదీనాం = కత్తి పదును మున్నగునవి, స్వతంత్రత్వే = కర్తలుగా భావింపబడినపుడు, ఆత్మా = ఆ కరణ స్వరూపము, ద్వేధా = రెండుగా, వ్యవతిష్ఠతే = వ్యవస్థితమై యుండును.

*తాత్పర్య విశేషాంశములు*— చెట్టు నరకువాడు చేతనుడగు మనుష్యుడు. కాని వానితో బనిలేకయే మంచి పదనుగలదియగు కత్తియే ఆ పని చేసినపుడు, 'కత్తి తెగకోయు చున్నది' అందురు. అపుడు కత్తి కరణము కాదు. వేఱొకటి కరణము కావలెను అది యేమి? దాని తీక్ష్ణత్వమో, బరువో, కఠినత్వమో, దాని అవయవ సన్నివేశ విశేషమో, ఆ పనిని చేయుటచేత అవికరణములగును.

ఇక ఆ తీక్ష్ణత మున్నగువానినే కర్తలుగా వివక్షించుననుకొనుడు. అపుడు అవి శబ్దభేదముచే రూపభేదమునంది కర్తలుగను కరణములుగను గూడ వ్యవహరించును. ఎట్లన? "తైక్ష్ణ్యం ఛినత్తి స్వసామర్థ్యేన" = 'కత్తి పదును తన శక్తిచేత వృక్షమును ఛేదించుచున్నది' అనిన ఛేదన క్రియలో కర్తయు కరణమును తీక్ష్ణతయే. అదియే సాధకతమము. తన శక్తి యనగా ఆ తీక్ష్ణతయే. కాని ఏ క్రియకైనను కరణముండి తీరును. ఇచట కరణాంతర మగ పడదు. అందువలన శబ్దభేదముచే రూపభేదము కల్పితము. ॥96॥

*అవతారిక*— కర్తయు కరణమును భిన్న భిన్నములని యుపపాదింపబడినది గదా. అపుడు "ఆకడారాదేకా సంజ్ఞా" (1-4-41) అను సూత్రములో "కరణం పరాణి"

అను వార్తికముచేత, 'కరణసంజ్ఞను, దానికి తరువాతి సంజ్ఞలు, బాధించును' అని, వానికి విప్రతిషేధముపపాదింపబడినదిగదా అది యెట్లు పొసగును? వానికి రూపభేద మున్నపుడు తుల్యబల విరోధమునకు ప్రసక్తి యుండదుగదా? అనిన—

శ్లో॥ ఆత్మభేదేపి సత్యేవమే కోఽర్థ స్తథాస్థితః।
తదాశ్రయత్వాద్భేదేఽపి కర్తృత్వం బాధకం తతః॥ 97

ఏవం = ఇట్టి వివక్షచేత, ఆత్మభేదే = స్వరూపభేదము, సతిఅపి = ఉన్నప్పటికిని, ఏకః = ఒక్కటియే అయిన, సః = ఆ, అర్థః = ద్రవ్యము, తదాశ్రయత్వాత్ = కల్పన నాశ్రయించిన దగుటవలన, తథాస్థితః = అట్లే ఉండినదగును, తతః = అందువలన, భేదేఽపి = వివక్షవలన భేదమున్నను, కర్తృత్వం = కర్తృసంజ్ఞ, బాధకం, భవతి = కరణసంజ్ఞకు బాధకమగును.

తాత్పర్య విశేషాంశములు— కర్తృశక్తికిని కరణశక్తికిని ఆధారమగు, ఆ ఖడ్గమను ద్రవ్యము ఒక్కటియే. భేదము కల్పితము. కాల్పనికమగు భేదము వాస్తవికమగు ఏకత్వమును బోగొట్టదు. కారికలోనున్న 'తదాశ్రయత్వాత్' అను పదమునకు 'కల్పన నాశ్రయించిన దగుటవలన' అనియు జెప్పనగును. లేదా కర్తృకరణ సంజ్ఞలు రెండును, ఆ ఏకార్థమునే ఆశ్రయించినవగుట వలన ననియు వ్యాఖ్యానింపవచ్చును. కారక శక్తులు వేరయినను వాని కాధారమగు ద్రవ్య మొక్కటియే అగుటవలన, విప్రతిషేధ ముపపన్నము కావచ్చును.

శక్తి విశిష్టమగు ద్రవ్యమునకు కర్తృకరణాది సంజ్ఞలు. వానిలో కరణసంజ్ఞ పూర్వము. కర్తృసంజ్ఞ పరము. అష్టాధ్యాయీ సన్నివేశ మట్లున్నది. తుల్యబలములకు విరోధము కలిగినపుడు పరము పూర్వమును బాధించును. "అసిఃఛినత్తి" ఉదాహరణము. అసి, సాధకతమము. దాని కొకానొకపుడు స్వాతంత్ర్యమును వివక్షింపవచ్చును. వక్త రెండు వివక్షలను జేసినపుడు రెండు సంజ్ఞ లేకకాలమున నుండుటకు వీలు కలుగుచుగాన పరము పూర్వమును బాధింపగా, అసి కర్త అగుచున్నది. అది దాని కారోపితము.

'ధనుషావిధ్యతి' = వింటితో గొట్టుచున్నాడు అందురు. వింటినుండి బాణములను వేసి, వానితో గొట్టుదురు. అందువలన విల్లు అపాదానమును, బాణములు కరణములును. కాని వింటికే క్రియాసిద్ధిలో ఉపకార ప్రకర్ష వివక్షింపబడినది. అపాదాన సంజ్ఞను పరమైన కరణ సంజ్ఞ బాధించినది. [వింటితో గొట్టుచున్నాడు అనగా అమ్ములు లేకపోవుటచే వింటినే గ్రహించి దానితోనే గొట్టుచున్నాడనరాదా! ఆ యర్థము లేదా అని యడుగరాదు. ప్రకరణమును బట్టి ఆ యర్థము సరిపడదు.] ॥97॥

*అవతారిక*— కరణకారకము క్రియాసిద్ధికై చేయు నుపకారము, తాను సన్నిహితమై చేయునట్లు, అసన్నిహితమై కూడ చేయుట వ్యవహారమున కననగును.

శ్లో॥ యథాచ, సంనిధానేన కరణత్వం ప్రతీయతే ।
తథైవాసంనిధానేపి క్రియాసిద్ధేః ప్రతీయతే ॥ 98

యథాచ = ఏ విధముగను, సంనిధానేన = తన ఉనికిచే, కరణత్వం = కరణకారకత్వము, ప్రతీయతే = తెలియబడుచున్నదో, తథాఏవ = ఆ విధముగనే, అసంనిధానే అపి = తన సంనిధానము లేనపుడును, క్రియాసిద్ధేః = క్రియ సిద్ధించుటవలన, ప్రతీయతే = ఆ కరణత్వము తెలియవచ్చుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— "దాత్రేణ లునాతి" = కొడవలితో గోయుచున్నాడు అనునపుడు, కొడవలి అను, కరణము, తానుండి కోయుట అను క్రియను సిద్ధింపజేయుచున్నది. ''ధనాభావేన ముక్తః'' = డబ్బు లేమిచే విడుపబడినాడు అనునపుడును ధనము విడిచిపెట్టబడుట అను క్రియ కుపకరించుచున్నదిగాని, అభావరూపమున నుపకరించుచున్నది. అనగా దాని అసంనిధానము కరణము. లేని ధనముచే ముక్తి అనుట. ॥98॥

అవతారిక— ఈ విషయమున సూత్రకార మతసంవాదము జూపబడుచున్నది.

శ్లో॥ స్తోకస్యవాభినిర్వృత్తేరనివృత్తేశ్చ తస్యవా ।
ప్రసిద్ధిం కరణత్వస్య స్తోకాదీనాం ప్రచక్షతే ॥ 99

స్తోకస్య = అల్పమైన దానియొక్క, అభినిర్వృత్తేః వా = సిద్ధివలనగాని, తస్య = ఆ అల్పముయొక్క, అనివృత్తేః వా = శేషమువలనగాని, స్తోకాదీనామ్ = స్తోక, అల్ప, మున్నగువానికి, కరణత్వస్య = కరణకారకత్వమునకు, ప్రసిద్ధిం = సంసిద్ధిని, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్య విశేషాంశములు— ''కరణేచ స్తోకాల్పకృచ్ఛ్ర కతిపయస్యాసత్త్వవచనస్య'' (2-3-33) అని సూత్రము. స్తోక, అల్ప, కృచ్ఛ్ర, కతిపయ - అను నాలుగును ద్రవ్యవాచకములు కానపుడు కరణార్థమున పంచమీవిభక్తి ప్రత్యయములు వానికి వచ్చును. అవి, వికల్పముగాన తదభావమున, కరణార్థమున రాదగిన తృతీయయు ప్రవర్తించును' అని సూత్రార్థము. 'స్తోకాత్ముక్తః' 'స్తోకేనముక్తః' - అని యుదాహరణము. ఇట స్తోకాది శబ్దములు శుక్లాది శబ్దములవలె ధర్మమాత్రమును బోధించునవిగాన అద్రవ్యవచనములు. ఆ స్తోకము క్రమధర్మము, అనగా అల్పత్వము, విద్యమానమైగాని, అసంనిహితమయిగాని విమోచనక్రియలో నుపకరించును. ఒక వ్యక్తి, ఒకనికి తాను కొంత ఈయవలసియున్నది. అందు స్వల్పాంశమే సిద్ధమై వానికడ నున్నది. వాడకించనుడు. అంతకుమించి ఈయలేడు. అపుడాదాత, వానిని ఋణవిముక్తునిజేసిన, "సః స్తోకాన్ముక్తః" అనుచున్నారు. ముక్తికి హేతువు అల్పత్వము. లేదా ఈయవలసిన దానిలో నధికభాగ మిచ్చివేసినాడు. ఇక శేషించినది అల్పము. ఆ అల్పత్వముచే విడచి పెట్టబడినాడనియు నర్థము కావచ్చును. ఆ అల్పము గూడ వానికడ నిపుడు లేదాయె.

ముందుచెప్పిన యర్థమున స్తోకము విద్యమానమై ముక్తికి కరణమయినది. రెండవ

యర్థమున నది అవిద్యమానమై ముక్తికి కరణమైనదనుట - ఇట్లే 'ఏకాన్నవింశతిః' అను పదమును జూడుడు. 'ఏకేన నవింశతిః' = ఒకదానిచే ఇరువది కాలేదు. పందొమ్మిది అని యర్థము. ఇట ఇరువది కాకుండుటకు, ఒకటి, అభావరూపమున కరణము. ॥99॥

అవతారిక— సాధన వ్యవహారమంతయు వక్తల వివక్షనుబట్టి యుండునని తేలినది. కావున మనము క్రియాసిద్ధిలో దేనిని మిక్కిలి ఉపకరించునదిగా దలంతుమో అది కరణము కావచ్చునని చెప్పుచు, వివక్షా ప్రకారమును వివరించుచున్నాడు.

**శ్లో॥ ధర్మాణాం తద్వతా భేదాదభేదాచ్చ విశిష్యతే ।**
**క్రియావధే రవచ్ఛేద విశేషాద్భిద్యతే యథా ॥** 100

అవధేః = అవధియొక్క, అవచ్ఛేద విశేషాత్ = భేద విశేషమువలన, క్రియా = క్రియ, యథా, భిద్యతే = ఎట్లు భేదించుచున్నదో, తథా = ఆ విధముగ, ధర్మాణాం = ఆశ్రయించి ఉన్న వానికి, తద్వతా = ఆ ఆశ్రయముతో, భేదాత్ = భేదమును భావించుటవలనను, అభేదాత్ చ = ఏకత్వమును వివక్షించుటవలనను, క్రియా విశిష్యతే = క్రియ మారుచుండును.

తాత్పర్య విశేషాంశములు— ''దేవదత్తః కాష్ఠైః పచతి'' = దేవదత్తుడు కట్టెలతో వండుచున్నాడు' అను వాక్యముతో, కట్టెలు వంటకు కరణములుగా చెప్పబడినవి. వంట చేయునది, ఆ కట్టెలయందుండు తేజస్సు. అగ్ని అనుట. కాని ఆశ్రితమునకు ఆశ్రయముతో అభేదమును వివక్షించి అట్టి ప్రయోగములు చేయబడుచున్నవి. దేవదత్తుడు, కట్టెలతో, చేయు వంట అని అపుడర్థము.

''ఏధాః పక్ష్యంతి తేజసా'' = కట్టెలు 'అగ్నితో వంటచేయును' అని ఇంకొక వాక్యము. ఇపుడు, కట్టెలు నిప్పుతోచేయు వంట వాక్యార్థము.

''తేజః పచతి ఔష్ణ్యేన'' = 'నిప్పు తన వేడితో వండుచున్నది' అనిన ఇపుడు, వంట అను ఆ క్రియ భేదించినది. ఔష్ణ్యము, అగ్నికంటె వేరుగా క్రియాసిద్ధికి ఉపకరించుట చేత సాధనభేదముచే క్రియాభేదము.

''గ్రామా దా గచ్ఛతి'' = ఊరినుండి వచ్చుచున్నాడు.

''గ్రామస్య సమీపాదాగచ్ఛతి'' ఊరుదగ్గఱనుండి వచ్చుచున్నాడు.

ఉభయత్ర క్రియ ఒకటియే. ఆగమనమే. కాని అవధులగు, గ్రామము తత్సమీపము అను వాని భేదమువలన దానికి భేదము వివక్షితము.

గ్రామమనగా, అడవులు, సీమలు, మున్నగువానితో గూడినదని యర్థమైనపుడు గ్రామ సమీపమునుండి వచ్చినను గ్రామమునుండి వచ్చినట్లే. గ్రామమనగా దాని సరిహద్దు వఱకు మాత్రమే అని యర్థమైన, గ్రామసీమ వేరుగాన అపుడు గ్రామ సమీపమునుండి వచ్చు చున్నాడందురు. అవధులు భేదించుటచే క్రియకు భేదము. అంతియ.

B. జాతియే వాచ్యమను పక్షమున అగ్నిమాదధీత (అగ్ని ఆధానము చేయవలెను) మున్నగు వాక్యములలో ఏకత్వ సంఖ్య వివక్షితమగును. కనుకనే ఒకే అగ్నికి ఆధానము కలుగును అను అభిప్రాయమును సమన్వయ పరుచుచున్నాడు.

వ్యక్త్యాశ్రితాశ్రితా = ఘటము, అగ్నిమున్నగు వ్యక్తిని ఆశ్రయించిన ఏకత్వ సంఖ్యను ఆశ్రయించినట్టి, సంఖ్యాజాతిః = ప్రత్యయార్థమగు సంఖ్యాగతమగుజాతి, జాతేః = ప్రకృత్యర్థమగుఘటత్వము అగ్నిత్వము మున్నగుజాతికి, విశేషికా = విశేషమును కలిగింపగలదు

జాతివాదమున శబ్దమునందలి ప్రకృతి జాతినే బోధించును. విభక్తి ప్రత్యయములు కూడ ఏకత్వ ద్విత్వాది సంఖ్యయందున్న జాతినే బోధించును. ప్రత్యయార్థమగుజాతి ఏకత్వద్విత్వములు మున్నగు సంఖ్యలయందు కలదు. అసంఖ్య వ్యక్తియందు కలదు. ఈః పరంపరచే ప్రత్యయార్థ జాతి వ్యక్తికిసంబంధించినది, ప్రకృత్యర్థ మగు జాతి సమవాయ సంబంధమున ఆ వ్యక్తియందు ఉన్నది. ఏకార్థసమవాయమును బట్టి ప్రత్యయార్థమగు జాతి ప్రకృత్యర్థమగు జాతినిసంబంధించును. ॥28॥

*అవతారిక*—ఎల్లశబ్దములకు జాతియే వాచ్యమగునని నియమము ఎట్లుచెప్పనగును?. **జాతికి** ఆశ్రయము వ్యక్తి. ఆవ్యక్తిని విడిచి జాతి ఉండనేరదు. వ్యక్తులతో మిశ్రితము గనే **జాతి భాసించును** అనుప్రశ్నకు యుక్తమగు దృష్టాంతమును జూపి సమాధానముచెప్పు చున్నాడు.

**శ్లో॥ యథా జలాదిభిర్వ్యక్తం ముఖమేవాభిధీయతే।**
**తథాద్రవ్యైరభివ్యక్తా జాతిరేవాభిధీయతే॥** 29

యథా = ఎట్లు, జలాదిభిః = జలము, అద్దము మున్నగువానిచే, వ్యక్తమ్ = అభివ్యక్తి చేయబడిన అనగా స్పష్టముగాచేయబడిన, ముఖమ్ + ఏవ = ముఖమే, అభిధీయతే = చెప్పబడుచున్నదో,

తథా = అట్లే, ద్రవ్యైః = ద్రవ్యములచే, అభివ్యక్తా = స్పష్టపరచబడిన జాతిః + ఏవ = జాతియే, అభిధీయతే = శబ్దములచే చెప్పబడుచున్నది.

నీటిలోను, అద్దములోను ముఖము ప్రతిఫలించును. ఆ ప్రతిబింబము ఆధార మగు నీటిని, అద్దమును విడనాడకయే యుండును. కాని దానిని ముఖము అనుశబ్దముబోధించునపుడు ఆధారసంబంధములేని ప్రతిబింబమే శబ్దవాచ్యమగుచున్నది.

అట్లేజాతిని వ్యక్తులు స్పష్ట పరచును. వ్యక్తిని విడిచి జాతి యుండదు. కాని గోవు,ఘటము మున్నగు శబ్దములుమాత్రము ఆ జాతినే వ్యక్తులతో సంబంధములేక బోధింపగలవు.

*విశేషాంశము*—కన్నుమున్నగు ఇంద్రియముల వలన కలిగెడి ప్రత్యక్ష జ్ఞానమున, జాతివ్యక్తులు రెండు మిశ్రితములై భాసించును. సంకేతమును బట్టియే శబ్దమువలన జ్ఞానము కలుగుటచే అందు కేవలము జాతియే విషయముకాగలదు. ॥29॥

వివక్షితమైన కరణము, తృతీయా ప్రత్యయముచే చెప్పబడినట్లు, 'ల్యుట్' మున్నగు, ధాతు విహిత ప్రత్యయములచేత గూడ చెప్పబడుచుండును.

''పచనం ఏధః'' = వంటకు కరణమైన కట్టె. ''పచనం తేజః'' = వంటకు కరణమైన అగ్ని. ''పచనీ స్థాలీ'' = వంటచేయు గిన్నె. ''పచనం ఔష్ణ్యమ్'' = వంటకు కరణమైన వేడి. ఇట్టి ప్రయోగములు వివక్షనుబట్టి పలు రకములుగ భాషలోగలవు. ॥100॥

## కర్త్రధికారము

*అవతారిక*— తృతీయావిభక్తికి కర్త, కరణము అర్థములు. అందు కరణము విచారింపబడినది. ఇక కర్త విచారింపబడును. ''స్వతంత్రః కర్తా'' (1-4-54) అనునది కర్తృసంజ్ఞా విధాయకము. స్వః = ఆత్మ, తంత్రం = ప్రధానము, యస్య సః = దేనికో అది అని విగ్రహము. క్రియను సాధించుటలో కర్త ప్రధానభూతుడు. కరణాది కారకములు కర్త వినియోగింపగా పనిచేయునవి. అది కర్తకు పరతంత్రములు. అయినను, తమతమ పనులలో తాము స్వతంత్రములే. కర్త ప్రేరించినను నవి పనిచేసిననేగదా క్రియ సిద్ధించునది! అట్టియెడ కర్తకుగల అతిశయమేమి? అను శంక కలుగును. దానికి సమాధానముగా నీ రెండు కారికలును అవతరించినవి.

**శ్లో॥ ప్రాగన్యతః శక్తిలాభాత్, న్యగ్భావాపాదనాదపి।**
**తదధీన ప్రవృత్తిత్వాత్, ప్రవృత్తానాం నివర్తనాత్ ॥ 101**

**శ్లో॥ అదృష్టత్వాత్ ప్రతినిధేః, ప్రవివేకే చ దర్శనాత్।**
**ఆరాదప్యుపకారిత్వే స్వాతంత్ర్యం కర్తురుచ్యతే ॥ 102**

అన్యతః = ఇతర కారకములకంటె, ప్రాక్ = పూర్వము, శక్తిలాభాత్ = శక్తిని పొందుట వలనను, న్యగ్భావాపాదనాత్, అపి = వానికి పరాధీనత నాపాదించుటవలనను, తదధీన ప్రవృత్తిత్వాత్ = అవి తనకు పరతంత్రములై ప్రవర్తించుటవలనను, ప్రవృత్తానాం, నివర్తనాత్ = ప్రవర్తించినవానిని మరలించుటవలనను, ప్రతినిధేః = కర్తకు, బదులైనది, అదృష్టత్వాత్ = కనబడకుండుట వలనను, ప్రవివేకే = ఇతర కారకములు లేనపుడును, దర్శనాత్ చ = కర్త కనబడుటవలనను, ఆరాత్ = దూరముగ నుండి, ఉపకారిత్వే = ఉపకరించుట, సత్యపి = ఉన్నప్పటికిని, కర్తుః = కర్తకు, స్వాతంత్ర్యం = స్వతంత్రత, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— కర్త స్వతంత్రుడనుటకు ఆఱు కారణములిందు జూపబడినవి. కర్త, ఫలమును గోరి ఆయా కార్యములందు ప్రవర్తించును. ఆ శక్తి కర్తకు, ఇతర కారకము లన్నిటికంటె ముందు లభించును. అది మొదటి కారణము.

కర్త కరణాదికారకములకు న్యగ్భావమును ఆపాదించును. అనగా అవి తనకు వశవర్తులై ప్రవర్తించునట్లు చేసికొనును. అది రెండవ కారణము.

కరణాదులు కర్తకధీనములై తమతమ పనులందు ప్రవర్తించునుగాని స్వతంత్రములు గావు. ఇది మూడవ కారణము.

కర్త ఫలార్థిగాన ఫలము సిద్ధించిన తరువాత నాతడు తన వ్యాపారము నుండి విరమించును. కరణాదు లతిప్రవృత్తములైన, వానిని విరమింపజేయును. ఇది నాలుగవ కారణము. కరణాది కారకములకు ప్రతినిధి సంభవించును. ఖడ్గముగాని గొడ్డలిగాని పని చేయనపుడు, దానికి బదులుగ సాధనాంతరమును కర్త సంపాదించుకొనుట కలదు. ఆ విధముగ కర్తకు ప్రతినిధి యగుపడుట లేదు. ఇది అయిదవ కారణము. ప్రవివేకమనగా కారకాంతరములు లేనేలేకుండుట. ఏ కారకములును లేకున్నను కర్త మాత్ర ముండు క్రియలును గలవు. ఎట్లన– అస్తి, విద్యతే, భవతి అనునవి. ఉన్నాడు, అనగా ఎవరో ఒక కర్త ఆ క్రియ కాశ్రయమైనవాడు తప్పదు. ఇతర కారకములు లేవు. ఇది ఆఱవ కారణము.

'ఇచ్చట నున్నాడు' అనియో, 'ఇప్పుడున్నాడు' అనియో, దేశకాలములు అధికరణముగా ప్రతీయమానము లపుడుగూడ నగునుగదా యనిన, ఆ ప్రతీతి నాంతరీయకముగ నున్నను, శబ్దవ్యాపారము వలన వచ్చినది గాదు. ఈ హేతువులచే కర్తకు ప్రాధాన్యము. క్రియాసిద్ధికి కర్త వ్యాపారము దూరమే. అయినను కారకచక్రము నంతను త్రిప్పువా డాతడే యగుటచే నాతనికే స్వాతంత్ర్యము.

ఈ రెండు కారికలును, ''కారకే'' (1-3-23) అను సూత్రమునందు మహాభాష్యమున సంగ్రహరూపముగ జెప్పబడిన గ్రంథమునకు వ్యాఖ్యాన భూతములు. అట. "కింపునః ప్రధానమ్?" అని ప్రశ్నించి, 'కర్తా' అని సమాధానము చెప్పి, మరల, "కథం పునః జ్ఞాయతే కర్తా ప్రధానమితి? యత్ సర్వేషుకారకేషుసన్నిహితేషు కర్తా ప్రవర్తయితా భవతి" అని వివరింపబడినది. కర్త ప్రధానమని ఎట్లు తెలియునన నితరకారకములను ప్రవర్తింపజేయుట కర్తపని గనుక యనిచెప్పుటవలన కారికోక్తములగు స్వాతంత్ర్య హేతువులందు గర్భితములై యున్నవి. ॥101, 102॥

*అవతారిక*—ఇతర కారకములను ప్రవర్తింపజేయుట మున్నగు ధర్మములు అచేతన పదార్థములకు సంభవింపవు గదా. వానికి కర్తృత్వమెట్లు? అనిన చెప్పుచున్నాడు.

**శ్లో॥ ధర్మైరభ్యుదితైః శబ్దే నియమో న తు వస్తుని।**
**కర్తుర్ధర్మ వివక్షాయాం శబ్దాత్ కర్తా ప్రతీయతే॥** 103

అభ్యుదితైః = చెప్పబడిన, ధర్మైః = ధర్మములతో, నియమః = కూడియుండుట, అను నియమము, శబ్దే = శబ్దమునందుండదగిన, నియమః = నియమము మాత్రమే, వస్తుని తు న = వస్తువు విషయమున గాదు, కర్తుః = కర్తకు, ధర్మవివక్షాయాం = ఆ ధర్మములను

వివక్షించినపుడు, శబ్దాత్, కర్తా = శబ్దమువలననే ఆ ధర్మములుగల కర్త, ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్య విశేషాంశములు— వెనుకటి కారికలలో, కర్తకుండదగినవిగా చెప్పబడిన ధర్మములు వాస్తవిక కర్తకు గాదు. శబ్దముచే అచట బోధింపఁబడిన కర్తకు మాత్రమే. అట్లు కానియెడల, ''అగ్నిర్దహతి'' = నిప్పు కాల్చుచున్నది. 'ఏధాః పచంతి' = కట్టెలు వండుచున్నవి, 'స్థాలీ పచతి' = గిన్నె వండుచున్నది. ఇట్టి వాక్యములందలి వాస్తవిక కర్త లచేతనము లగుటవలన వానికి కర్తృత్వము సిద్ధింపకపోవును. ఈ ధర్మములను ప్రయోక్త ఏ పదార్థములకు వివక్షించిన నవి కర్తలగును. కరణమువలె కర్తృకారకము గూడ వక్తల వివక్షవలన నేర్పడునదియే. వ్యాకరణశాస్త్రమున శబ్దము ప్రతిపాదించిన అర్థమే అర్థము. అది వాస్తవికము కానక్కఱ లేదు. అచేతనమునకు కర్తృత్వము గూడ శబ్దబోధ్యమే గాన 'కర్తృత్వమున కచేతనమునం దారోపము' అని చెప్ప బనిలేదు. ॥103॥

అవతారిక— స్వాతంత్ర్యము వివక్షనుబట్టి యుండునని గ్రహించినపిదప, ''ఆత్మా ఆత్మానం ఆత్మనాహన్తి'' = 'తాను తన్ను తన చేతనే చంపుచున్నాడు' అను, ప్రయోగములవంటివి గూడ సుసమన్వితములగును. చూడుడు.

**శ్లో॥ ఏకస్య బుద్ధ్యవస్థాభిః భేదే చ పరికల్పితే ।**
**కర్మత్వం, కరణత్వం, వా కర్తృత్వం వోపజాయతే ॥ 104**

ఏకస్య = ఒకే పదార్థమునకు, బుద్ధి అవస్థాభిః = బుద్ధిలో కల్పించిన అవస్థలచేత, భేదే = భేదము, పరికల్పితే సతి = కల్పన చేయబడినపుడు, కర్తృత్వం = కర్తయగుట, కర్మత్వం వా = లేదా కర్మయగుట, కరణత్వం వా = కరణమగుటగాని, ఉపజాయతే = సంభవించును.

తాత్పర్య విశేషాంశములు— పై ప్రయోగమునందు ఆత్మ అనునది ఒకటియే మూడు కారకములుగ ప్రయోగింపబడియున్నది. ఒకే వస్తువునకు ఏకకాలమున అనేకరూపత సంభవింపదు. కావున వివక్షచేత రూపభేదమును కల్పించి దానిని ఘటింపజేయవలెను. మరియు ఆత్మ మూర్తిమంతమగు ద్రవ్యము కాదు. దానికి శస్త్రవ్యాపారమువలన కలిగెడు వధ సంభవము కాదు. దానిని గూడ వివక్షచేతనే సంఘటింపజేయనగును.

వ్యాపరించు వస్తు వొకటి. ఆ వ్యాపారమువలన గలిగిన ఫలమును బొందునది, వేఱొకటి. ఆ క్రియ సిద్ధించుటకు మిక్కిలి ఉపకరించినది ఇంకొకటి. ఈ విధముగ కర్తృ, కర్మ, కరణములు లోకమున భిన్న భిన్నముగ నుండును. శాస్త్రమున, శబ్దము దేనిని ప్రతిపాదించిన నదియే శబ్దార్థము. అది వాస్తవికముగాబనిలేదు అని పూర్వ ముపపాదితము గదా. కావున ఆత్మకే, హననవ్యాపారమును, దానివలన గలిగిన ప్రాణవియోగమును, ఆ క్రియ సిద్ధించుటలో ఉపకార ప్రకర్షమును వివక్షాధీనములై సిద్ధించినవి. ఈ విషయమునకు పోద్బలకమగు భాష్యగ్రంథమును జూచునది.

''కర్మవత్ కర్మణాతుల్య క్రియః'' (3-1-87) అని ఒక సూత్రము. ఆ సూత్రము కొన్ని ప్రయోగములలో కర్త కర్మవంటి దగునని కర్త్రవద్భావమును విధించునది. 'పచ్యతే ఓదనః' = అన్నమే వండుచున్నదని యర్థము. ఇట్టి ప్రయోగములు భాషలో గలవు. వానిని కర్మ కర్తృ ప్రయోగములందురు. వంట చేయువానికి మిగుల శ్రమను గలుగ నీయక అన్నము దానియంతట నదియే ఉడికి పోవుచున్నది అని సౌకర్యమును వివక్షించి అట్టి ప్రయోగములు చేయబడును. ఇట కర్మవద్భావము కర్మార్థమున లకారము సిద్ధించుటకు కర్మ వంటిది కర్త యగునను నతిదేశము లేనిచో నది సిద్ధింపదని సూత్రకారుని భావము. కాని ఈ అతిదేశముతో బనిలేదనియు, ''పచ్యతే ఓదనః స్వయమేవ'' అని 'ఆత్మనా' = తనచేతనే, అను నర్థముగల పదముగూడ ప్రయోగింపబడుచున్నదనియు, ఇట ఓదనమనునది స్వాభావిక కర్మయేగాన అతిదేశమువలన వచ్చినది గాదనియు, చెప్పి దానిని ప్రత్యాఖ్యానము చేసియుండెను. ''సిద్ధంతు ప్రాకృతకర్మత్వాత్'' ''ఆత్మ సంయోగే అకర్మకకర్తుః కర్మ దర్శనాత్'' అను, ఆచటిగ్రంథమును జూచునది. పదార్థ మొక్కటియే అయినను బుద్ధిభేద కల్పనముచే దానికి భేదము సంభవమని స్పష్టముగదా ః ॥104॥

అవతారిక— "అంకురోజాయతే" = 'మొలక పుట్టుచున్నది' అందురు గదా. అచట పుట్టుట యనగా నేమి ? పుట్టుచున్నదని చెప్పిన ఆ అంకుర మదివఱకున్నదా ? లేనిదా ? ''యది సత్ జాయతే కస్మాత్ ? అథాసజ్జాయతే కుతః ? = ఉన్నదే పుట్టుచున్నది అనిన, ఇక దానికి ఉత్పత్తియేమి ? లేనిదనిన, లేని దెట్లు పుట్టును ? అని శంకించి, ''ఉప చర్య తు కర్తారం'' ఇత్యాది కారికలచే, సంబంధ సముద్దేశమున అంకురమునకు ఔపచారిక మగు సత్తను ఆశ్రయించి, ఉత్పత్తి సాధింపబడినది. ఉపచారమనగా నారోపము. ఇపుడు, కర్తృత్వము వివక్షాకృతము అను నీ సిద్ధాంతమున నిక ఉపచారముతో బనిలేదని చెప్పబడు చున్నది.

**శ్లో॥ ఉత్పత్తేః ప్రాగసద్భావో బుద్ధ్యవస్థా నిబంధనః ॥**
**అవిశిష్టః సతాన్యేన కర్తా భవతి జన్మనః ॥** 105

ఉత్పత్తేః = పుట్టుటకంటె, ప్రాక్ = ముందు, అసద్భావః = అంకురము లేకుండుట, బుద్ధ్య వస్థా నిబంధనః = బుద్ధియొక్క ఆవస్థ మూలముగాగలది, సః = ఆ అంకురము, సతా = విద్యమానమైన = సత్తైన, అన్యేన = ఇంకొక వస్తువుతో, అవిశిష్టః = తుల్యమైనదై, జన్మనః = ఉత్పత్తికి, కర్తా భవతి = ఆశ్రయమగుచున్నది.

*తాత్పర్య విశేషాంశములు*— వివక్ష అనగా బుద్ధియొక్క ఒక అవస్థ. వస్తువుల ఉనికి గాని లేమి గాని వాక్యప్రయోక్తల బుద్ధ్యవస్థల నాశ్రయించి ఉండును. ఆ వివక్షను బట్టి, ఇతర క్రియల కర్తృత్వమువలె జని క్రియాశ్రయత్వము గూడ అంకురమునకు సంభ వించును. అంకురము పెరుగుచున్నది. అంకురము పుష్పించుచున్నది, అనునపుడు వర్ధన క్రియకును పుష్పించుట అను క్రియకును అంకురము కర్త అయినట్లే జనిక్రియకును కర్త

అగుట కూడ సంభవము. అచట దానికి సంనిధానము = సద్భావము వివక్షాప్రాపితము. బుద్ధిలో సత్తగల అంకురము బాహ్యరూపమును బొందుటయే జన్మ. ఒక రూపములో సత్త్వము. వేరొక రూపమున కర్తృత్వము. కావున నిది వాస్తవ వ్యవస్థ కాకున్నను, శబ్దప్రతిపాద్యము గావున ముఖ్యమేగాని ఆరోపితము గాదు. ॥105॥

*అవతారిక*— 'అంకురో జాయతే' అను, ప్రయోగమున కుపపత్తి వాస్తవరూపమున గూడ సంభవమే అని ఈ కారికలో జూపబడుచున్నది.

**శ్లో॥ కారణం కార్యభావేన యదా వా వ్యవతిష్ఠతే ।**
**కార్యశబ్దం తదా లబ్ధ్వా కార్యత్వేనాథ జాయతే ॥** 106

వా = లేదా, యదా = ఎపుడు, కారణం = కారణమైనది, కార్యభావేన = కార్యముగా, వ్యవతిష్ఠతే = ఏర్పడుచున్నదో, తదా = అపుడు, కార్యశబ్దం = కార్యవాచకమగు శబ్దమును, లబ్ధ్వా = పొంది, అథ, కార్యత్వేన = పిమ్మట, కార్యరూపమున, జాయతే = జన్మనుబొందును.

*తాత్పర్య విశేషాంశములు*— కార్యము, పూర్వమున నున్నదియే అనునది సత్కార్య వాదము. లేనికార్యము అపూర్వముగ బుట్టును అనునది అసత్కార్యవాదము. రెండు పక్షములందును అంకురమున జన్మయనునది కుదురదుగాన బుద్ధ్యవస్థను బట్టి ఉపపత్తి చూపబడినది.

కార్యకారణములు అభిన్నములు. వస్తువు ప్రకృత్యవస్థలో కారణము. వికృత్యవస్థలో కార్యము. క్షీరం దధి సంపద్యతే = పాలు పెరుగగుచున్నది అనినట్లు బీజ మంకురమగుచున్న దందురు. అనగా, పుట్టుట యనగా నొక అవస్థలో నున్నది వేరొక అవస్థను బొందుటయే. పూర్వావస్థ కారణావస్థ. ఆ అవస్థలో కర్తృత్వమును ఉత్తరావస్థలో జన్మయును సంభవములేగాన ఆ ప్రయోగ ముపపన్నము. ॥106॥

*అవతారిక*— 'కారణముల ఉత్తరావస్థయే కార్యరూపము' అను స్వసిద్ధాంత మిందు జూపబడుచున్నది.

**శ్లో॥ యథాహేః కుండలీభావో వ్యగ్రాణాం వా సమగ్రతా ।**
**తథైవ జన్మరూపత్వం సతామేకే ప్రచక్షతే ॥** 107

అహేః = పామునకు, కుండలీభావః యథా = కుటిలత్వమువలెను, వ్యగ్రాణాం = వేరు వేరు నున్న వేళ్ళకు, సమగ్రతా వా యథా = సంఘాత రూపమువలెను, తథా, ఏవ = ఆ ప్రకారముగా, సతాం = ఉన్నవానికి, జన్మరూపత్వం = పుట్టుట అను దానిని, ఏకే = కొం ప్రచక్షతే = వర్ణింతురు.

తాత్పర్య విశేషాంశములు— జన్మ అనగా, ముందటి అవస్థలోనిది తర అవస్థను చేరుటయే కావున, కార్యమనునది అంతకు పూర్వమును నున్నదియే. అది అ

గాదు అను పక్షమునను, అంకురమునకు జని కర్తృత్వము సిద్ధించును. పాము ఒకపుడు దీర్ఘముగనున్నదియే వేఱొక యవస్థలో గుండ్రముగ చుట్టుకొని యుండును. విస్తృతములుగా నున్న చేతి వ్రేళ్ళే ముడిచినపుడు ముష్టి = పిడికిలి, అనబడును. కాగా కార్యకారణ భావ మనునది అవస్థాభేద మాత్రమే అని పర్యవసితము. ॥107॥

*అవతారిక* — 'కార్య కారణములు, భిన్న భిన్నములు' అను, మతమునందును అంకురమునకు జని కర్తృత్వము వాస్తవ రూపముననే ప్రతిపాదింపవచ్చుననుచున్నాడు.

**శ్లో॥ విభక్తయోని యత్కార్యం కారణేభ్యః ప్రవర్తతే ।**
**స్వా జాతిర్వ్యక్తిరూపేణ తస్యాపి వ్యవతిష్ఠతే ॥ 108**

విభక్తయోని = వేరు కారణముగలదై, యత్ = ఏ, కార్యం = కార్యము, కారణేభ్యః = అట్టి కారణములనుండి, ప్రవర్తతే = పుట్టునో, తస్యాపి = అట్టి ఆ కార్యమునకుగూడ, స్వా = తనదైన, జాతిః = జాతియే, వ్యక్తిరూపేణ = వ్యక్తిగా, వ్యవతిష్ఠతే = ఏర్పడుచుండును,

తాత్పర్య విశేషాంశములు— కార్యము, తానుద్భవించుటకు పూర్వము వ్యక్తిరూపమున లేకున్నను, జాతి రూపమున నుండనే యుండును. కాగా విద్యమానమైనది పుట్టినట్లే. జాతియే వ్యక్తిరూపమున పుట్టుచున్నదను వ్యవహారమును కలదుగాన జాతి రూపములో కర్తృత్వమును, వ్యక్తిరూపమున జన్యత్వమును సంభవములే. ఇట్లు, జాతి వ్యక్తులకు పూర్తి వ్యతిరేకము లేదుగాన 'బీజ మంకురోజాయతే' = విత్తు మొలకగా పుట్టుచున్నది' - అను సామానాధికరణ్యమును ఉపపన్నము. ॥108॥

అవతారిక — 'శబ్దము బోధించిన యర్థమే పదార్థము. అది వస్తువుగా నుండనక్కఱ లేదు, అను స్వసిద్ధాంత మీ కారికలో స్థిరపరుపబడుచున్నది.

**శ్లో॥ భావేష్వేవ పదన్యాసః ప్రజ్ఞాయాః వాచ ఏవ వా ।**
**నాస్తీత్యప్యపదే నాస్తి న చాసత్ భిద్యతే సతః ॥ 109**

ప్రజ్ఞాయాః = బుద్ధికిగాని, వాచః ఏవవా = శబ్దమునకుగాని, భావేషు ఏవ = ఆలంబనముల యందే, పదన్యాసః = కాలి ఊనిక, 'నాస్తి' ఇతి అపి = లేదు అను మాటగూడ, అపదే = ఆలంబన రహితమునందు, నాస్తి = వర్తింపదు, అసత్ చ = లేదు అనునదియు, సతః = ఉన్నదానికంటె, నభిద్యతే = భిన్నము కాదు.

తాత్పర్య విశేషాంశములు— జ్ఞానమునకుగాని శబ్దమునకుగాని ఏదేని ఆలంబన ముండి తీరవలెను. కావున ప్రతీయమానమగు ఆకారమే భావము. అదియే వానికి ఆలంబనము. ఆ విధముగనే 'లేదు' అనునపుడును, ఏది లేదు ? ఎపుడు లేదు ? ఎచట లేదు ? అను ప్రశ్నలు కలుగును. కావున అభావమునకును ఆలంబన మావశ్యకము. ఇతరులు కల్పించినది గాని స్వయముగ నుత్ప్రేక్షించినది గాని అగు ఆకారమును అవలంబించియే బుద్ధి శబ్దములు

ప్రవర్తించును. కావున వ్యవహారములో భావపదార్థములును, అభావపదార్థములును, ఆకారావలంబన విషయమున సమానములే. బాహ్య వస్తువుతో బనిలేదు. కావున అంకురము పుట్టుచున్నదను వ్యవహారము సూపపాదము. ॥109॥

*అవతారిక* — 'బుద్ధికిని, శబ్దమునకును విషయమగునది. బయట లేకున్నను, ఉన్నదాని క్రిందనే పరిగణింపబడును. అంతకు మించిన సత్త యనునది లేదు, అని దృఢ పరచుచున్నారు.

**శ్లో॥ బుద్ధిశబ్దౌ ప్రవర్తేతే యథాభూతేషు వస్తుషు।**
**తేషామన్యేన తత్త్వేన వ్యవహారో న విద్యతే॥ 110**

బుద్ధిశబ్దౌ = జ్ఞానమును శబ్దమును, యథా భూతేషు = విద్యమానములైన, వస్తుషు = వస్తువులందు, ప్రవర్తేతే = వర్తించుచుండును, తేషాం = ఆ వస్తువులకు, అన్యేన = వేఱొకి = జ్ఞాన శబ్దగోచరము కాని, తత్త్వేన = స్వరూపముతో, వ్యవహారః = వ్యవహరించుట యనునది, న విద్యతే = ఉండబోదు.

తాత్పర్య విశేషాంశములు— వ్యవహారమనగా శబ్ద ప్రయోగము. అది అర్థ ప్రతీతి పూర్వకము. పదార్థము మనస్సున భాసించిన పిమ్మట దానిని వ్యక్తము చేయుటకు శబ్దములను ప్రయోగింతురు. ఏ పదార్థమునైనను, దాని శబ్ద ప్రతీతులనుబట్టి నిర్ణయింపవలెను. బుద్ధిలో భాసింపనిదియు, శబ్దబోధ్యము కానిదియునగు వేఱొక పదార్థమునుబట్టి, దీనిని లేదనుట యుక్తము గాదు.

పదార్థమును దేనిని గూడ ఉల్లేఖింపని జ్ఞానమే యుండదు. కనుక నవి జ్ఞానగోచరము లైనవనిన వానికి సత్త సిద్ధమే. ఆ విధముగ నంకురమున కుత్పత్తిని నిరూపించి తరువాత జాయతే అను శబ్దముచే చెప్పుదురు. ఒక పదార్థమును, 'ఇది లేదు' అనిన నేమి యర్థము? అయ్యది బాహ్యరూపమున, ఒక చోట, ఒక కాలమున లేకపోవచ్చును. కాని దేశాంతరమున, కాలాంతరముననును నది నానాకారములతో నుపలబ్ధమై, భాసించుచునే యుండును. 'లేదు' అనిన ఇపుడిచట లేదనియే యర్థముగాని సర్వాత్మనా లేదని యర్థము గాదు.

అంకురము పుట్టుట యనగా దాని ఉత్పత్తికి కారణమగుట కదా! కారణము కార్యమునకు ముందుండి తీరవలెను గదా. అట్లు లేని అంకురము కారణమెట్లగును? అని గదా ఆక్షేపము. ఉత్పత్తి అను కార్యమునకు ముందు లేకున్నను, తజ్జాతీయములగు కార్యాంతరములకు ముందుండవచ్చును గాన, ఆ వాసననుబట్టి ప్రయోక్త బుద్ధిలో నది ఉత్పత్తికార్యమున కభిముఖముగా భాసించును అని సమాధానము. ॥110॥

*అవతారిక* — సంబంధ సముద్దేశములో చెప్పబడిన న్యాయమును అనుసరించి అద్వైత సిద్ధాంత ప్రకారము, ఉత్పత్తి వినాశముల కసంభవ ముపపాదింపబడుచున్నది.

శ్లో॥ ఆకాశస్య యథా భేదశ్ఛాయా యాశ్చలనం యథా।
జన్మనాశావభేదేఽపి తథా కైశ్చిత్ ప్రకల్పితౌ॥ 111

ఆకాశస్య = ఆకాశమునకు, భేదః = అనేకత్వము, యథా = ఏ ప్రకారము, కల్పితమో, ఛాయాయాః = నీడకు, చలనం = కదలిక, యథా = ఎట్లు, కల్పింపబడినదో, తథా = ఆ విధముగ, అభేదే సత్యపి = అభేదమే అన్నను, జన్మనాశౌ = పుట్టుకయు, నాశమును, కైశ్చిత్, ప్రకల్పితౌ = కొందరిచే కల్పింపబడినవి.

తాత్పర్య విశేషాంశములు— ఆకాశమంతయు నొక్కటియే. అనేకాకాశములు లేవు. కాని ఆకాశముతో నిత్య సంయుక్తములగు ఘటము, మఠము మున్నగువాని భేదమును ఆకాశమునం దారోపించి. ఇది ఘటాకాశము, ఇది మఠాకాశము అని వ్యవహరించుచున్నారు.

నీడ అనునది వెలుగుయొక్క లేమి. దానికి కదలిక యుండదు. కాని వెలుగును ఆవరించిన ద్రవ్యముయొక్క చలన క్రియనుబట్టి, నీడకు చలనమును వ్యవహరింతురు. ఆ విధముగనే అభిన్నము అద్వయమునగు తత్త్వమునకు, జన్మ, నాశము అనునవి సంభవింప కున్నను, అవిద్యమూలముగ, ప్రాతిభాసికములగు జన్మ నాశములు కొందఱు కల్పించిరి. అది కల్పన మాత్రమే. ఈ విషయము సవిస్తరముగ సంబంధ సముద్దేశమున విచారింపబడినది. కనుక భావము, అభావము, పుట్టుక, నాశము అను వ్యవహారములు విచారసహములు కావు అని భావము. ॥111॥

అవతారిక— వస్తువులకు నాశముగూడ కల్పితమే అను విషయము నుపపాదించు నదీ కారిక.

శ్లో॥ యథైవాకాశ నాస్తిత్వమసన్మూర్తి నిరూపితమ్।
తథైవ మూర్తినాస్తిత్వమసదాకాశ నిశ్రయమ్॥ 112

అసత్ = సత్తుకాని = లేని, ఆకాశనాస్తిత్వం = ఆకాశము యొక్క లేమి, యథా ఏవ = ఏ ప్రకారముగా, మూర్తినిరూపితం = మూర్తిమంతములగు ఘటాదులవల నేర్పడినదో, తథైవ = ఆ ప్రకారముగనే, మూర్తినాస్తిత్వం = ఘటాదుల లేమి, అసత్ = లేనిది, ఆకాశ నిశ్రయమ్ = ఆకాశ కృతమయినది.

తాత్పర్య విశేషాంశములు— ఆకాశమంతట వ్యాపించియుండునది. అది ఎచటను లేకుండ నుండదు. ఘటము మున్నగు మూర్తిమంతములగు ద్రవ్యములున్న స్థలమున నది లేదందురు. అట్లే మూర్త ద్రవ్యములగు ఘటాదులును విద్యమానములే అయినను, వాని నడుమ నాకాశముండుటచేత నచట నవి లేవని అందురు. పదార్థముల స్వభావము సత్త. అది తిరోహితమయినపుడు, దానికి నాశమును, అది ఆవిర్భూతమయినపుడు, దానికి జన్మను కల్పింతురు. సకల పదార్థములును నెపుడును నుండునవియే. అందువలన 'పుట్టుట' అనునది అర్థముగల మాట'కాదు'. ॥112॥

*అవతారిక*— పదార్థములకు జన్మ వాస్తవమే. కల్పితము గాదు అను, మతమును గలదు. ఆ మతమున, 'జాయతే = పుట్టుచున్నది' అను ప్రయోగమును, ప్రకారాంతరమున, సమర్థింపబడును.

**శ్లో॥ యథాతదర్థైర్వ్యాపారైః క్రియాత్మా వ్యపదిశ్యతే ।**
**అభేదగ్రహణాదేవ కార్యకారణయోః క్రమః ॥** 113

క్రియాత్మా = ప్రధాన క్రియ స్వరూపము, తదర్థైః = దానికి కారణములైన, వ్యాపారైః = వ్యాపారములచేత, యథా = ఏ ప్రకారముగా, వ్యపదిశ్యతే = వ్యపహరింపబడుచున్నదో, తథా = ఆ ప్రకారము, కార్యకారణయోః = కార్యకారణముల, క్రమః = క్రమము = ఆనుపూర్వి, అభేదగ్రహణాదేవ = అభేదము నారోపించుటవలననే, గృహ్యతే = వ్యవహరింపబడుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— కార్యకారణములకు అభేదము వాస్తవమని యొక పక్షము. అది ఆరోపితమని వేఱొక పక్షము. అంకురమునకు పుట్టుట అను దానిని రెండప పక్షము నాశ్రయించి ఇపుడు సమర్థించుచున్నారు. పచధాతువునకు విక్లిత్తి ప్రధానమగు నర్థము. దానికి సాధకములగు వ్యాపారము లనేకములు అనేక కారకములచే చేయబడును. అందు కర్తచేయు పనులు, అధిశ్రయణము, = పొయ్యిమీదగిన్నె పెట్టుట, ఉదకాసేచనము = గిన్నెలో నీళ్ళు పోయుట, తండులావపనము = బియ్యము ఎసటిలో పోయుట, ఏధోపకర్షణము = కట్టెల నెగద్రోసి మండించుట మున్నగునవి. వానినన్నింటిని పాకమనియే అందురు. అట్లే కట్టెలు చేయు పాకము, అన్న ముడువఱకును చక్కగ మండుట. పాకమనగా కర్మయందుండు క్రియాఫలము మాత్రమే. వ్యాపారములు తదర్థములు. అప్రధానములు. వానియందు ప్రాధాన్యము నారోపించి అట్టి వ్యవహారములు నడచుచున్నవి. ఆ విధముగనే కారణము కార్యార్థమగుటచేత వాని కభేదమును వ్యవహరింతురు. అంకురము పుట్టుచున్నది అను ప్రయోగమున, కారణమైన బీజము కార్యమగు అంకురముగా నేర్పడుచున్నదని అర్థము. బీజమునకును అంకురమునకును అభేదారోపము వలన నిర్వాహము. ॥113॥

*అవతారిక*— కార్యకారణముల అభేదారోపమును బురస్కరించి, జన్మ కర్తృత్వము సమర్థింపబడినది. ఆ కర్తృత్వము, కారణమునకా? కార్యమునకా? అని సంశయము. ఏలయన— కారణము పూర్వసిద్ధమే గదా. ఇక నది పుట్టుట యన నేమి? ఈ ప్రశ్నలను మనస్సున నుంచికొని, ప్రయోగములను బట్టి కార్యకారణములకు రెండింటికిని పర్యాయముగా కర్తృత్వము గలదని చూపబడుచున్నది.

**శ్లో॥ వికారో జన్మనః కర్తా వికృతిర్వేతి సంశయే ॥**
**భిద్యతే ప్రతిపత్తౄణాం దర్శనం లింగదర్శనైః ॥** 114

జన్మనః = జన్మకు, వికారః = వికృతివాచకము, కర్తా వా = కర్త అగునా? ప్రకృతి ర్వా=

ప్రకృతి = కారణ వాచకమా ? ఇతి = అని, సంశయే = సందేహము కలిగినపుడు, లింగ దర్శనైః = హేతువు లగపడుటచేత, ప్రతిపత్తౄణాం = జ్ఞాతలయొక్క, దర్శనం = మతము, భిద్యతే = వేరు వేరగుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— "క్షీరం దధి సంపద్యతే" = పాలు, పెరుగు అగు చున్నది అని ప్రయోగము కలదు. క్షీరము ప్రకృతి, దధి వికృతి. ప్రకృతి ప్రధానము, వికృతి అంగము. 'సంపద్యతే' అని చెప్పబడిన సంపత్తికి ప్రకృతియే కర్త్రి. ఇది సమానాధి కరణ ప్రయోగములందలి స్థితి.

ఇక 'బీజాదంకురో జాయతే' = విత్తునుండి మొలక మొలచుచున్నది అను ప్రయోగమున, ప్రకృతి వికృతులు వ్యధికరణములుగా నిర్దిష్టములు. అట నిస్సంశయముగ వికృతియే కర్త్రి. ప్రకృతి ఉత్పద్యమానమునకు కారణమగుట వలన అపాదానము. కారికలో ప్రతిపత్తలు అనగా– ప్రకృతి కర్త అనువారును, వికృతికర్త అను మఱికొందరును. జన్మ అనగా ఆత్మ లాభము. అనగా స్వరూప ప్రాప్తి. అదివఱకు లేనిదిగదా పొందవలసినది. అట్టిది వికృతియే గదా. దానికే జన్మ. కావున నదియే కర్త కాదగినదని, వికృతివాదుల భావము. ఇక ప్రకృతికి కర్తృత్వమను వారు, ఇట్లు తలంతురు. లేని వికృతి, ఆత్మలాభమున కున్ముఖము కాజాలదు. జన్మకు కర్తయగుట అనగా, స్వరూప ప్రాప్తికి ఔన్ముఖ్యము. అది దానికి అసంభవము. ప్రకృతికి స్వరూపలాభము సిద్ధము. ఉత్తరావస్థను బొందుటయే దాని కాత్మ లాభోన్ముఖత. అది దానికి సంభవము. కావున నదియే కర్త్రి యగుట యుక్తమని వారి వాదము. ॥114॥

*అవతారిక*— పై రెండు మతములకును ప్రయోగ స్వభావమును బట్టి విషయ విభాగము జూపబడు చున్నది.

**శ్లో॥ క్లృపి సంపద్యమానే యా చతుర్థీ సా వికారతః ।**
**సువర్ణపిండే ప్రకృతౌ వచనం కుండలాశ్రయమ్ ॥** 115

క్లృపి = క్లృపి అర్థముగల ధాతువులు ప్రయోగింపబడినపుడు, సంపద్యమానే = పరిణమించు దానిని బోధించు పదమునందు, యా చతుర్థీ = ఏ చతుర్థీ ప్రత్యయముకలదో, సా, వికారతః = అది వికృతిని బుట్టినది. సువర్ణపిండే = సువర్ణపిండము, ప్రకృతౌ సత్యామ్ = ప్రకృతి అయినపుడు, వచనం = వచనము, కుండలాశ్రయమ్ = వికృతినిబట్టి వచ్చినది.

*తాత్పర్య విశేషాంశములు*— "భక్తిః జ్ఞానాయ కల్పతే" = భక్తి జ్ఞానముగా పరిణమించుచున్నది అని యర్థము. క్లృప్తి, సంపత్తి మున్నగునవి క్లృప్తి అర్థముగా గలవి. "యవాగూః మూత్రాయ సంపద్యతే" = గంజి మూత్రముగా నగును అందురు. జ్ఞానమును మూత్రమును వికృతులు. పై ప్రయోగములలో వికృతి వాచకమునకు పరముగా చతుర్థి అగపడుట వలన, 'క్లృపి సంపద్యమానేచ' అను వార్తికముచే చతుర్థి విధింపబడినది. వ్యాకరణ

# విషయసూచిక

## తృతీయకాండము (పదకాండము)

అవతారిక—ఎల్ల శబ్దములు జాతినే బోధించునని నియమము చేయబడినదికాగా శబ్దములవలనవ్యక్తులు భాసించనందున అవి జాతి విశేషములను జ్ఞానమున విషయమగునట్లు ఎట్లు చేయగలవు? అట్లు కాకున్న ఎల్లశబ్దములనుండి కలిగెడి జ్ఞానములలో జాతి సామాన్యమే భాసింపవలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యథేన్ద్రియగతో భేద ఇన్ద్రియగ్రహణా దృతే।
ఇన్ద్రియార్థేష్వ దృష్టోఽపి జ్ఞాన భేదాయ కల్పతే॥ 30

శ్లో॥ తథాత్మరూప గ్రహణాత్కేషాఞ్చిద్వ్యక్తయో వినా।
సామాన్యజ్ఞానభేదానా ముపయాన్తినిమిత్తతామ్॥ 31

యథా = ఎట్లు, ఇన్ద్రియగ్రహణాత్ + ఋతే = ఇంద్రియముల స్వరూపము తెలియకున్నను, ఇన్ద్రియగతః = ఇంద్రియములందున్న, భేదః = భేదముఅనగా కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, మున్నగు ఇంద్రియభేదము, అదృష్టః + అపి = దృష్టముకాకున్నను, ఇన్ద్రియార్థేషు ఇంద్రియములచే కలిగెడి అర్థములు విషయములుగాగల, జ్ఞానభేదాయ = జ్ఞానములయొక్క భేదము కొరకు అనగా, చక్షురింద్రియమువలన జ్ఞానము, శ్రోత్రేంద్రియమువలన కలిగినజ్ఞానము, అను రీతిని కలిగెడి జ్ఞానభేదము కొరకు, కల్పతే = సమర్థమగుచున్నదో, తథా = అట్లే, వ్యక్తయః = వ్యక్తులు, ఆత్మరూప గ్రహణాత్ + వినా = తనయొక్క స్వరూపమును గ్రహింపకున్నను అనగా అవి శబ్దమున విషయములు కాకున్నను, కేషాంచిత్ = కొన్ని, సామాన్య జ్ఞాన భేదానామ్ = జాతి విషయకమగు జ్ఞానములయొక్క భేదములకు, నిమిత్తతామ్ = కారణత్వమును, ఉపయాన్తి = పొందుచున్నవి.

కన్ను, చెవి, ముక్కు మున్నగు ఇంద్రియములు నిత్య పరోక్షములు. అనగా అవిమనకు ఎన్నడు ప్రత్యక్షములుకావు. కాని ఉన్నవనిమాత్రము అనుమాన ప్రమాణముచే నిశ్చితమగును. మరియు చక్షురింద్రియము వలన కలిగిన జ్ఞానము ఆ ఇంద్రియము యొక్క కార్యముకాదు. అట్లైనను వానివలన కలిగెడి జ్ఞానములు మాత్రము వేరు వేరుగా ఉన్నట్లువానివలన తెలియును.

అట్లే వ్యక్తులు జ్ఞానమున విషయములుకాక పోవచ్చును. జాతులే శబ్దమువలన తెలియ బడవచ్చును. కాని నిజమున ఆరెండింటికి సమవాయము సంబంధము కనుక ఆజాతులు స్వాశ్రయమగు వ్యక్తి విశేషములను తెలుప గలవు. కనుక శబ్దమును ఉచ్చరింపగా జాతియేజ్ఞానమున భాసించినను పైరీతిని వ్యక్తులనుగూడతెలుపుటచే జాతివిశేషము అనగా గోత్వము, ఘటత్వము మున్నగు కొన్ని జాతులే గవాది శబ్దములవలన భాసించును. జాతి సామాన్యము భాసింపదు. కాగాకొన్నివ్యక్తులే కొన్ని జాతులనే శబ్దమున భాసింపజేయగలవు, ॥30,31॥

అవతారిక—ఎల్ల ఉపాధులు పరబ్రహ్మముయొక్క శక్తిరూపములే అని 22వ శ్లోకముచే చెప్పబడినది. అట్టితరి జాతులు, వ్యక్తులు అను భేదమునకు కారణమేది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

స్మృతికి ప్రయోగము గదా మూలము. అందువలన క్లృప్తి, సంపత్తి అను క్రియల కర్తృత్వము వికృతికే అని స్పష్టము.

'భక్తిః జ్ఞానం జాయతే' 'యవాగూః మూత్రం జాయతే' అను నట్టి ప్రయోగము లును గలవు. అందు ప్రకృతి వికృతి వాచకములు సమానాధికరణములు. అట ప్రకృతికి, వికృతి ద్వారముగా క్రియతో నన్వయము. ప్రకృతి వికృతులకు భేదమును వివక్షించినపుడు, ''యవాగ్వాః మూత్రం జాయతే'' = 'గంజినుండి మూత్రము పుట్టును' అని ప్రయోగము. కాగా అభేద వివక్షలోనే చతుర్థి కవకాశము.

మహాభాష్యమున— ''పునరావృత్తః సువర్ణపిండః పునరపరయా ఆకృత్యాయుక్తః ఖదిరాంగార సవర్ణే కుండలే భవతః'' అని ప్రయోగము కలదు. సువర్ణపిండము ప్రకృతి. కుండలములు వికృతులు. వికృతి వచనమైన ద్వివచనమే 'భవతః' అను క్రియాపదమున నగపడుటవలన వికృతి అటకర్త యనుటకు లింగము (అనగా గుర్తు). ఇట్లు ప్రయోగభేద ముచే ఉభయము కర్త కావచ్చునని భావము. ॥115॥

*అవతారిక*— ఇట్లే, విషయభేదమును బట్టి ప్రకృతి వికృతులకు కర్తృత్వ ముండునని ఊహించుటకును ప్రయోగరూప లింగము లగపడుచున్నవి.

**శ్లో॥ వాక్యే సంపద్యతేః కర్తా సంఘః చ్వ్యన్తస్య కథ్యతే ।**
**వృత్తౌ సంఘీభవన్తీతి బ్రాహ్మణానాం స్వతంత్రతా ॥ 116**

చ్వ్యన్తస్య = చ్విప్రత్యయాంతము యొక్క, వాక్యే = విగ్రహవాక్యమున, సంపద్యతేః = సంపద్ ధాతువునకు, సంఘః = సంఘము, కర్తా, కథ్యతే = కర్తగా చెప్పబడుచున్నది, వృత్తౌ = చ్విప్రత్యయాంత వృత్తిలో, 'సంఘీభవంతి' ఇతి = 'సంఘమగుచున్నారు' అని, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులకు, స్వతంత్రతా = కర్తృత్వము, కథ్యతే = చెప్పబడుచున్నది.

*తాత్పర్య విశేషాంశములు*—"కృభ్వస్తియోగే సంపద్య కర్తరి చ్విః" (5-4-50) అని సూత్రము. ఆ సూత్రమున 'అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్' అని వార్తికము. 'కృ, భూ, అస్' అను ధాతువుల ప్రయోగమునందు, ప్రకృతి వికృతిగా మారిన వికార వాచకము నకు, అభూత తద్భావమను నర్థమున = అనగా అదివఱ కారూపమునలేని దారూపమున మారినదను నర్థమున 'చ్వి' అను తద్ధిత ప్రత్యయము వచ్చునని దాని యర్థము. ''అసంఘః సంఘః సంపద్యతే = సంఘీభవన్తి బ్రాహ్మణాః అని యుదాహరణము. విగ్రహవాక్యమున కర్త సంఘము. చ్విప్రత్యయాంత వృత్తిలో ప్రకృతి భూతులయిన బ్రాహ్మణుల బహుత్వ మును సూచించు బహువచనము 'భవన్తి' అని యగపడుచున్నది. కావున నిట్లు ప్రయోగ భేదముచే ప్రకృతి వికృతులకు కర్తృత్వము నిర్బాధమని యెఱుంగునది. ॥116॥

*అవతారిక*— ప్రకృతి వాచకము కర్తృపదమై యుండుననుటకు భాష్యోక్తమైన లింగము.

శ్లో॥ అత్వం సంపద్యతే య_స్త్వం న తస్మిన్ యుష్మదా[శ్రయా ।
[ప్రకృతిః పురుషస్యా_స్తి [ప్రాకృతస్స విధీయతే ॥ 117

అత్వమ్ = ''నీవు కానివాడు, త్వం = నీవుగా, సంపద్యతే = మారుచున్నాడు, (కావున) త్వద్భవతి=నీ వగుచున్నాడు'' ఇతి = అను, యః = ఏ వాక్యముకలదో, తస్మిన్ = అందు, పురుషస్య = పురుష [ప్రత్యయమునకు, యుష్మదా[శ్రయా = నీవు అను నర్థ మా[శ్రయముగా గల, [ప్రకృతిః = [ప్రకృతి, న అ_స్తి = లేదు, [ప్రాకృతః = [ప్రకృతికి సంబంధించిన, సః = ఆ పురుష [ప్రత్యయము, విధీయతే = విధింపబడుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— 'నీవు కానివాడు నీవుగా నగుచున్నాడు' 'అత్వం త్వం సంపద్యతే = త్వద్భవతి' అని భాష్యకారుని ఉదాహరణము. ఇచట 'నీవు' వికృతి. దానినిబట్టి మధ్యమపురుష [ప్రత్యయ ముండవలెను. కాని అది లేదు. 'భవతి' అని 'త్వద్భ స్నుడు' అను [ప్రకృతికి సంబంధించిన [ప్రథమపురుష [ప్రత్యయము అగపడుచున్నది. అందువలన [ప్రకృతి వాచకమునకు క_ర్తృత్వమని నిశ్చితమగుచున్నది. ॥117॥

అవతారిక— ఈ విధముగ [ప్రయోగములుండుటచే, విషయభేదమునుబట్టి [ప్రకృతి వికృతులు రెండును క_ర్తలుగా నుండదగునని ఉద్బోధింపబడినది. కాని దానికి ఉపప_త్తి యేమి ? అనిన చెప్పుచున్నాడు.

శ్లో॥ పూర్వామవస్థామజహత్ సంస్పృశన్ ధర్మము_త్తరమ్ ।
సంమూర్ఛిత ఇవార్థాత్మా జాయమానోఽభిధీయతే ॥ 118

పూర్వాం = మొదటిదైన, అవస్థాం = కారణావస్థను, అజహత్ = విడచిపెట్టనిది అగుచు, ఉ_త్తరం = తరువాతిది అగు, ధర్మం = అవస్థను, సంస్పృశన్ = పొందుచున్నదై, సంమూ ర్ఛితః ఇవ = వి_స్తరించునదివలె నుండు, అర్థాత్మా = పదార్థము = వస్తువు, జాయమానః = పుట్టుచున్నదిగా, అభిధీయతే = వ్యవహరింపబడు చున్నది.

తాత్పర్య విశేషాంశములు— ఒక పదార్థమును 'ఇది పుట్టుచున్నది' అనిన, అది అంతకు పూర్వమున నే విధముగను లేనిది ఉద్భవించినదని యర్థము గాదు. కారణావస్థను వదలిపెట్టకుండగ, ఉదాసీనముగను నుండకుండగ, తరువాతి అవస్థలను పొందుచు తన్ను వి_స్తరింపజేసికొనునట్లు ఆ వస్తువు, 'జాయతే' అని చెప్పదగినదిగా నేర్పడును. కాబట్టి [ప్రకృతియు ఉత్ప_త్తికి ఆ[శ్రయమగును. దాని వికారమును అగును. అందువలననే [ప్రకృతి వికృతులు సమానాధికరణములుగా వ్యవహరింపబడు చుండును. ॥118॥

అవతారిక— అట్లయిన నొకచో నొకటి క_ర్తయు వేఱొకచో నింకొకటి క_ర్తయు నేల కావలెను. సర్వ[త [ప్రకృతి వికృతులు రెండును క_ర్తలేల గాలేదు ? అను [ప్రశ్నకు సమాధానము.

[illegible] 'నీవు అగుచున్నావు' అని ఇట్లు నీవు అను దానినిబట్టి 'అగుచున్నావు' అని [illegible] ప్రత్యయముచేసి ప్రయోగించినచో, అనుకొనిన అర్థము రాదు. అపుడు, [illegible] 'త్వం అత్వం సంపద్యసే' నీవు, నీవు కానివాడవుగా మారుచున్నావని యర్థ [illegible]. ఆ వాక్య ప్రయోక్త యొక్క తాత్పర్యమది గాదు. నీవు కానివాడు, నీవుగా మారు [illegible]. అనియే వివక్షితార్థము. అది సిద్ధించుటకై ప్రథమపురుష ప్రత్యయమే యుక్తము.
॥120॥

అవతారిక — పై కారికలో ప్రతిపాదించిన దానినే వ్యాఖ్యానించునది ఈ కారిక.

శ్లో॥ త్వమన్యో భవసీత్యేషా తత్ర స్యాత్పరికల్పనా ।
రాజ్ఞి భృత్యత్వమాపన్నే యథా తద్వత్ గతిర్భవేత్ ॥ 121

త్వమ్ = నీవు అన్యః = నీవు కానివాడవు, భవసి = అగుచున్నావు, ఇతి, ఏషా = అను, [illegible] పరికల్పనా = అర్థకల్పన, తత్ర, స్యాత్ = అచట, కలుగును, రాజ్ఞి = రాజు, భృత్యత్వం = భృత్యధర్మమును, ఆపన్నే, సతి = పొందినవాడైనపుడు, యథా = ఏ ప్రకా [illegible], తద్వత్ = ఆ ప్రకారముగా, గతిః, భవతే = అర్థప్రతీతి, కలుగును.

తాత్పర్య విశేషాంశములు— "రాజన్ అరాజా సంపద్యసే" అనిన, 'ఓ రాజా [illegible] రాజు కానివాడవుగా మారుచున్నావు' అని యర్థము, అచట తిఙ్ ప్రత్యయమగు 'సే' [illegible] నీవు అనునది ప్రకృతి అనియు, అది భృత్యుడుగా పరిణమించుట యను [illegible] క్రియకు కర్త అనియు తెలియజేయుచున్నది. రాజు కానివాడనగా భృత్యుడు. అది [illegible] కు విరుద్ధము.

ఆ దృష్టాంతముగా 'త్వద్భవసి' అనిన అవస్థాంతరమును బొందినది యుష్మ [illegible] అటువలెనే, 'నీవు కానివాడు నీ వగుచున్నాడు' అను వివక్షితార్థము [illegible] 'త్వద్భవతి' అని ప్రథమపురుష ప్రయోగ ముచితము. ఒకటి చెప్పదలంచిన [illegible] చెప్పకూడదు!

[illegible] "సువర్ణపిండః ఖదిరాంగార సవర్ణే కుండలేభవతః" అను భాష్య [illegible] వికృతికి కర్తృత్వమును వివక్షించిన, 'కుండలములు సువర్ణ పిండముగ [illegible]' అని విపరీతార్థబోధ కలుగునా? అని శంకింపవచ్చును. కాని ఆ శంక [illegible]. ఏలయన, అది చ్విప్రత్యయాంతము గాదు. చ్విప్రత్యయాంత [illegible] నే కర్తకు వికారాంతరాదేశము. ప్రకృతి, వికృతిగా పరిణమించినపుడే [illegible] ప్రకృతి, స్వతః, సిద్ధమే. అది వికృతియొక్క రూపమును బొందినపుడు, [illegible]. ఈ విషయమున యుక్త్యంతరమును గలదు. చ్వి ప్రత్య [illegible] క్రియాయోగమున 'గతి' అను సంజ్ఞను, "ఊర్యాదిచ్విడాచశ్చ" అను [illegible] విధించుచున్నది. గతి సంజ్ఞకములు క్రియావిశేషణములు కావలెను. క్రియా విశేష

ణములకు కర్మత్వ మంగీకరింపబడినందున, వానికి కర్తృత్వము కుదురదు. కావున, ప్రకృతి వాచకమునకే, చ్వి ప్రత్యయాంతార్థ విశేషితమగు క్రియలో కర్తృత్వము న్యాయప్రాప్తము.

నూట అయిదవ కారికనుండి నూట ఇరువదియొకటవ కారిక (శ్లోకము) వఱకును విచారింపబడిన విషయ విశేషమంతయు ఆనుషంగికము. (అందు, చివర కొంత గ్రంథము, అసమన్వితమును, అప్రస్తుతమునగుటచే పరిత్యక్తము.) ఇంతతో నది సమాప్తము. ॥121॥

అవతారిక— కర్తకు స్వాతంత్ర్యము లక్షణమని "స్వతంత్రః కర్తా" (1-4-54) అను సూత్రముచే తెలియబడినది ఆ స్వాతంత్ర్యమన నేమియో "ప్రాగన్యతః శక్తి లాభాత్" ఇత్యాది కారికలచే వ్యాఖ్యానించిరి. కర్త, ప్రయోజకకర్త అనియు, ప్రయోజ్యకర్త అనియు రెండు విధములు.

"పాచయత్యో దనం దేవదత్తేన యజ్ఞదత్తః" = యజ్ఞదత్తుడు దేవదత్తునిచే అన్నము వండించుచున్నాడు. యజ్ఞదత్తుడు, దేవదత్తుని అన్నము వండుటకు ప్రేరించినవాడు. కావున ప్రయోజకకర్త. దేవదత్తుడు ప్రేరితుడు. ప్రయోజ్యకర్త. 'దేవదత్తేన' అను పదము తృతీయాంతము. తృతీయకు కర్త అర్థము. కర్త స్వతంత్రుడుగదా. యజ్ఞదత్తునిచే ప్రేరితుడై ప్రవర్తించిన దేవదత్తుడు స్వతంత్రు డెట్లగును? కరణాదికారకములవలె తానును నిపుడు పరాధీనుడు గదా. కర్తృసంజ్ఞ యెట్లు? తృతీయ ఎట్లు? అని ఇపుడు విచారింపవలసి యున్నది. "స్వతంత్రః కర్తా" (1-4-54) అను సూత్రమున మహాభాష్యమునందు, "స్వతంత్రస్య కర్తృ సంజ్ఞాయాం హేతుమత్యుపసంఖ్యానమ్" "అస్వతంత్రత్వాత్" అను వార్తికము, ప్రయోజ్యకర్త ప్రయోజకాధీనుడు గాన స్వతంత్రుడు గాజాలడు. అందువలన వేఱుగా ప్రయోజ్యునకు కర్తృ సంజ్ఞను చెప్పవలసియుండునని ఆపాదించెను.

ఈ శంకకు పరిహార వార్తికమును అచటనే కలదు. "నవా స్వాతంత్ర్యాత్" అని. 'ప్రయోజ్యునకు గూడ తన పనిలో స్వతంత్రత లేకపోలేదు. కావున వేఱుగా చెప్పనక్కఱ లేదు' అని తాత్పర్యము.

అట్లనిన, 'కరణాదికారకములు గూడ తమ తమ వ్యాపారములందు స్వతంత్రములే కావున వానికిని కర్తృసంజ్ఞ ప్రవర్తింపవలసి యుండునే' అను ప్రశ్నకు సంభవము కలదు. సత్యమే. కాని వానికి వేఱు వేఱుగా నా యా సంజ్ఞలను పాణిని చెప్పియుండెను గదా. ప్రయోజ్యున కట్టి సంజ్ఞ వేరేదియు లేదాయె. కాబట్టి ఆ ప్రశ్న కవకాశము లేదు.

అటులైనను, కర్త సాంనిధ్యమున కరణాదికారకములకు స్వాతంత్ర్యము లేనట్లు, ప్రయోజక సన్నిధిలో ప్రయోజ్యునకును పారతంత్ర్యమేగాని స్వతంత్రత ఎట్లు? అని శంకించి సమాధానమును చెప్పుచున్నాడు.

శ్లో॥ సంభావనాత్ క్రియాసిద్ధౌ కర్తృత్వేన సమాశ్రితః ।
క్రియాయామాత్మ సాధ్యాయాం సాధనానాం ప్రయోజకః ॥ 122

శ్లో॥ ప్రయోగమాత్రే న్యగ్భావం స్వాతంత్ర్యాదేవ నిశ్రితః ।
అవిశిష్టో భవత్యన్యైః స్వతంత్రైః ముక్తసంశయైః ॥ 123

క్రియాసిద్ధౌ = క్రియ సిద్ధించుటలో, సంభావనాత్ = సామర్థ్యమును భావించుటవలన, కర్తృత్వేన = స్వతంత్రుడుగా, సమాశ్రితః = ఆశ్రయింపబడినవాడును, ఆత్మసాధ్యాయాం = తనచే సాధింపదగిన, క్రియాయాం = వ్యాపారములో, సాధనానాం = కరణాదికారకములకు, ప్రయోజకః = ప్రవర్తకుడును, స్వాతంత్ర్యాదేవ = స్వతంత్రుడగుట వలననే, ప్రయోగ మాత్రే = ప్రేరింపబడినంతనే, న్యగ్భావం = ప్రయోజకాధీనత్వమును, నిశ్రితః = పొందినవాడును నగు ప్రయోజ్యుడు, ముక్తసంశయైః = సందేహప్రసక్తి యేదియు లేని, అన్యైః = ఇతరులగు, స్వతంత్రైః = స్వతంత్ర కర్తలతో, అవిశిష్టః, భవతి = తుల్యుడే అగును.

తాత్పర్య విశేషాంశములు— ఒక డొకనిని ఒక పనిలో నియోగించినపుడు, వాని కా పనిని నిర్వహించు శక్తి కలదని తెలిసికొనియే నియోగించును. నియోజ్యుడు, అసమర్థుడును, అలసుడును అని తెలిసినపుడు నియోగింపనే నియోగింపడు గదా. కావున, నియోజ్యుడును స్వతంత్రుడే.

ఒకడు తనకు నియోగింపబడిన పనిని చేయుచునే యుండును. అయినను, మానకుండుటకును, త్వరగా నాత డా పనిని ముగించుటకును గూడ ప్రేరింతురు. అపుడాతడు, తన స్వతంత్రతచే, కరణాదికారకములను నియోగించి, ఆ పనిని నిర్వర్తించును. కనుకను నాతడు స్వతంత్రుడు.

మరియు నాతడు, ప్రయోజకుడు తన్ను ప్రేరించినపుడు, ఆతని ఆజ్ఞలకు లోబడి పనిచేయుట కంగీకరించుటయు స్వతంత్రుడు గనుకనే.

ప్రేరకుని ప్రేరణకు ఫలము క్రియాసిద్ధి. నియోజ్యుడు సాధనాంతరములను వినియోగించి, ఆ కార్యమును సాధించు స్వాతంత్ర్యమును కలిగియుండిననే ప్రేరణ సఫలమగును. కాగా, నియోగమునకును, స్వస్వాతంత్ర్యమునకును విరోధము లేదు. పైగా, తన వ్యాపారమున తనకు స్వాతంత్ర్యముండుట, తాను ప్రయోజకునకు పరతంత్రుడగుటకుపాయమే యగును. కావున, ప్రయోజ్యుడగు కర్తయు, పరప్రేరితుడు కాని కర్తతో సమానుడే యని కారికల భావము.

ఈ సందర్భమున, మహాభాష్యమునందలి వార్తికములు, ప్రకృత విషయమును జక్కగ నుపపాదించినవి, భర్తృహరి ఈ కారికులకు, మూలములు. చూడుడు :

ఇతరథా హ్యకుర్వత్యపి కారయతీతి స్యాత్ ।
నాకుర్వతీతి చేత్ స్వతంత్రః ॥

ప్రయోజ్యుడు కూడ కరణాదికారకములనే వినియోగించి పనిచేయుచున్నాడు గదా. ఆత డే పనిని చేయనపుడు, దేవదత్తునిచే వండించుచున్నాడు అనరు. కావున నాతడు స్వతంత్రుడే అని వార్తికార్థము.

ఇటనొక ప్రశ్న కలుగును– ప్రయోజ్యుని ప్రేరించు ప్రయోజకునకు కర్త అను సంజ్ఞయును, హేతువు అను సంజ్ఞయును విహితములు. కర్త అనగా స్వతంత్రుడు. ''స్వతంత్రః కర్తా''. స్వతంత్రములయిన వానిని ప్రేరించు వ్యక్తి యెల్ల హేతువయిన, కరణాదులను ప్రేరించు ప్రయోజ్యకర్తకును హేతుసంజ్ఞ కలుగవలసి యుండును. అపుడు ''హేతుమతిచ'' - అను సూత్రముచే ణిచ్ ప్రత్యయము రావలసియుండును. అది ఒక దోషము. ఇంకను నిట్టి దోషము లనేకములు కలవు. దీనికి సమాధానము ముఖ్యముగా నే మనిన, హేతు సంజ్ఞను విధించిన సూత్రమున, 'తత్ప్రయోజకః' అనుచో తత్ అను సర్వ నామ పూర్వ నిర్దిష్టమును పరామర్శించును. పూర్వ నిర్దిష్టము 'కర్తా' అను సంజ్ఞ కలది. స్వతంత్ర మాత్రము గాదు. కరణాదులు కూడ ఏ పనిని చేయకుండిన నవి కారకములే కావు. కావున వానికి స్వాతంత్ర్యము కారకసంజ్ఞ కుపయోగించునది మాత్రమే. కర్త స్వాతంత్ర్యము వంటిది కాదు. అంతకంటె నది నికృష్ట స్వాతంత్ర్యము. కావున వానికి 'కర్తా' అను సంజ్ఞ లేదు.

ప్రయోజ్యకర్త, తాను ప్రయోజకునిచే ప్రేరింపబడి పని చేసినను కరణాది కారకములకు తమ తమ పనులలో ప్రవర్తింపజేయుట అను స్వాతంత్ర్యమును కలిగియే యుండును. అది ప్రకృష్టము కర్తృసంజ్ఞకు సంపాదకము, అని భావము. ॥122, 123॥

*అవతారిక*— ప్రయోజ్యుడు ప్రయోజకుని ఆజ్ఞలకు తలయొగ్గి యుండును. అదియు స్వాతంత్ర్యమువలననే అని కారికలో, ''ప్రయోగమాత్రేన్యగ్భావమ్'' ఇత్యాదిగా జెప్పియున్నారు. బాగుగ విచారించిన, ఆ న్యగ్భావము గూడ నాతనికి లేదని దీనివలన దెలియును.

**శ్లో॥ నిమిత్తేభ్యః ప్రవర్తన్తే సర్వ ఏవ స్వభూతయే ।**
**అభిప్రాయానురోధోఽపి, స్వార్థస్యైవ ప్రసిద్ధయే ॥ 124**

సర్వేఏవ = ఎల్లవారును, స్వభూతయే = స్వార్థముకొఱకే, నిమిత్తేభ్యః = హేతువుల వలన, ప్రవర్తన్తే = ప్రవర్తింతురు, అభిప్రాయానురోధః అపి = ప్రేరకుని అభిప్రాయమును, ప్రేర్యు డనుసరించుటయు, స్వార్థస్య = తన ప్రయోజనము యొక్క, ప్రసిద్ధయే ఏవ = సిద్ధించుట కొఱకే అగుచున్నది.

*తాత్పర్య విశేషాంశములు*— ప్రయోజనము నపేక్షించి ప్రవర్తించు ప్రతి వ్యక్తియు, తన ప్రవృత్తి పరాధీనమగుట కిచ్చగింపడు. భృత్యులు మున్నగువారు ప్రభువుల ఆశయమును బట్టి వర్తించుచున్నారనిన నది స్వార్థసిద్ధి కుపాయమగునను తలంపు తోడనే. వీతరాగులు కారుణ్యమువలన చేయు పనులును వారికవి ఇష్టసాధనములగుటవలననే చేయుదురు 'ఈ పని నా కభీష్టమైన దానిని లభింపజేయును' = 'ఇదం మదిష్టసాధనమ్' - అను నభిప్రాయమే ఎల్లరను ప్రవర్తింపజేయునది.

''సర్వ ఇమే స్వభూత్యర్థం యతన్తే । నేహ కశ్చిత్ పరోఽనుగృహీతవ్య ఇతి''

అని మహాభాష్యము. 'ఎల్లరును తమ స్వార్థముకొఱకే ప్రవర్తింతురు, ఇతరుల ననుగ్రహింప వలెనని ఎవరును పనిచేయరు' అని అర్థము.

ఒక ప్రశ్న— అట్లయిన 'ప్రయోజ్యుడు' అను పదమున కర్థమేమి ? ప్రేరణా జన్య ప్రవృత్త్యాశ్రయుడు = ఒకరు ప్రేరింపగా ప్రవర్తించినవాడు' అని గదా. ఆతడును స్వప్రయోజనమునకు తానే ప్రవర్తించెననిన నట ప్రేరణ కుపయోగమేమి ?— ఈ ప్రశ్నకు సమాధానము ''యదభిప్రాయేషు సజ్జతే'' అను వార్తికము. ప్రేరకుని అభిప్రాయమును గ్రహించి ప్రయోజ్యుడు దానిని నిర్వర్తించుటకు సిద్ధమగుటయే ప్రేరణకు ఫలమని తాత్పర్యము.

''హేతుమతిచ'' అను సూత్రమున, ఆ సూత్రముచే సిద్ధింపని ప్రయోగములు సిద్ధింపజేయుట కవతరించిన ఉపసంఖ్యాన వార్తికము లనేకములు పై అభిప్రాయముతోడనే మహాభాష్యకారుడు ప్రత్యాఖ్యానము చేసి యుండెను. అందు కొన్ని వార్తికములను జూతము.

ఒక బాటసారి ఉజ్జయినిలో బయలుదేరి ప్రయాణము సాగించుచున్నాడు. సూర్యోదయ కాలమునకు మాహిష్మతీ నగరము చేరవలెనని ఆతని తలంపు. ఆ సంనివేశమును ఆశ్చర్యముతో జెప్పుచు నింకొకడు ''పథికః మాహిష్మత్యాం సూర్య ముద్గమయతి'' అని ప్రయోగించెను. 'సూర్యుని ఉదయింపజేయుచున్నాడు' అని గదా యర్థము. సూర్యుడు తానే ఉదయించునుగాని ఈ పథికుని ప్రేరణచే కాదు. కాగా ప్రయోజకుని వ్యాపారము లేదు. అందువలన నట్టియెడ ణిచ్ ప్రత్యయము సిద్ధించుటకు, ''చిత్రీకరణే ప్రాపి'' అని యొక వార్తికము, ణిచ్ప్రత్యయోపసంఖ్యానము ఆవశ్యకమని చెప్పెను. ఆశ్చర్యమును గలుగ చేయుట గమ్యమయినపుడు ప్రాప్తి అను నర్థమున ణిచ్ప్రత్యయమును విధింపవలెనని యర్థము. 'సూర్యోద్గమన' అను కృదన్తము ప్రకృతి. ణిచ్ ప్రత్యయము. కృత్ప్రత్యయమగు 'అన' అను దానికి లోపము. కర్మ కారకమయిన సూర్యునకు, 'సూర్యం' అని వేఱుపాటు మున్నగునవి విధేయములు అని తాత్పర్యము.

కాని అచట గూడ పథికుని అభిప్రాయానుసారముగా సూర్యోదయము జరిగినది కాన పథికుడు హేతువే. పథికుడు తాను మాహిష్మతిని చేరునప్పటికి సూర్యోదయము కావలెనని సంకల్పించెను. అట్లే జరిగినది. అది కాక తాదృశమైనను పథికున కందు హేతుత్వము దేవదత్తుని, వంటకు ప్రేరించిన యజ్ఞదత్తుని హేతుత్వముతో తుల్యమే. కావున ''హేతుమతిచ'' (3-1-26) అను సూత్రముచేతనే ణిచ్చు సిద్ధింపవచ్చును అను నభిప్రాయముతో, ''న వా సామాన్య కృతత్వాత్ హేతుతో హ్యవిశిష్టమ్'' అని ప్రత్యాఖ్యానము చేయబడినది.

'కంసవధ' 'బలిబంధము' అనునవి ఉపాఖ్యానములు. వానిని జెప్పు కథకుని 'కంసం ఘాతయతి' 'బలిం బంధయతి' 'ఘాతయతి' అనగా చంపించు చున్నాడు, అనియు, 'బంధయతి' అనగా కట్టింపించుచున్నాడు అనియు ణిజన్తముల కర్థము. పై ప్రయోగములందా యర్థము కుదురదు. కావున నుపాఖ్యాన మావశ్యకమను నభిప్రాయముతో, ''ఆఖ్యానాత్

కృతః తదాచష్టే కృల్లుక్ ప్రకృతి - ప్రత్యాపత్తిః ప్రకృతి వచ్చకారకమ్'' - అను వార్తిక మవతారితము. 'సూర్య ముద్గమయతి' అను స్థలమున 'సూర్యోద్గమనము' అను కృదన్తము కంటె పరముగా ణిచ్చు విధింపబడిన సందర్భమునందలి ప్రక్రియ వంటి ప్రక్రియ ఇచ్చటను చూచుకొనవలెను. ఈ ఉపసంఖ్యానమును నిరాకృతము. హేతువు పూర్వోక్తమే.

కంసుడు చిరకాలము క్రిందటనే హతుడు గదా. బలి బంధనమును చిరప్రవృత్తమే 'సూర్య ముద్గమయతి' అనునట్లు అచట 'ఘాతయతి' 'బంధయతి' అను వర్తమానత ఎట్లు పొసగును అని యడుగవచ్చును - సమాధానము, వినుడు.

శౌభికులు, అనగా, కంసబలివేషములను ధరింపించి వారిని తయారుచేసి వారిచే నాటకమును ప్రదర్శింపించు ఉపాధ్యాయులు, కంసుని, కృష్ణునిచే ప్రత్యక్షముగ చంపించుచున్నారు. బలిని బంధింపించుచున్నారు గదా. పురాణ ప్రవచనమైన, పౌరాణికుడు, తన ప్రవచన పాటవముచే ఆ పనులను ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు చూపగలడు. కొందఱు కంసవధ నాటకమును జూచుటకు బోవుచున్నారు. మరికొందఱు ముందుగా వెళ్ళి, తిరిగి వచ్చివేయు చుందురు. అపు డే మగుచున్నదని వారి నడిగిన, 'గచ్ఛ కంసో హన్యతే' అందురు. ఏమగును? అనిన 'కంసో ఘానిష్యతే' కంసుడు చంపబడునిక' అందురు. నాటకము సమాప్తమయిన తరువాత బోవు వారిని జూచి, 'కంసోహతః కింపశ్యసి' = కంసుడు చంపబడెనాయె ఇక నేమి చూతువు' అని ఇట్లు త్రికాల వ్యవహారమును గలదు గదా! ఇంత ఏల చిత్రకారుల చిత్రకర్మ కూడ కంసవధను ఇపుడు జరుగుచున్నదా, యనునట్లు భావింపజేయును. అది అంతయు కౌశల మూలకము.

'భిక్షా వాసయతి' అని అందురు. ఆయూర నతడెందులకున్నాడు? అని ప్రశ్నించిన 'భిక్ష ఆతనినచట వసింపజేయుచున్నది' అని సమాధానము. భిక్ష సమృద్ధముగా నట లభించుటచే నున్నాడు. కాగా అది నిమిత్తము. ప్రయోజకమనగా, చేతనమే కానక్కర లేదు. నిమిత్త మాత్రమును హేతువే. కనుకనే కారికలో 'నిమిత్తేభ్యః ప్రవర్తన్తే' అని కలదు.॥124॥

## హేత్వధికారము

*అవతారిక* — కర్తయే, ప్రేరకుడైన, హేతువు అనబడునుగాన కర్తృ విచారమునకు తరువాత హేతువిచారము ప్రసక్తము.

శ్లో॥ ప్రేషణాధ్యేషణే కుర్వం స్తత్సమర్థాని చాచరన్ ।
కర్తైవ విహితాం శాస్త్రే హేతుసంజ్ఞాం ప్రపద్యతే ॥ 125

ప్రేషణాధ్యేషణే = ఆజ్ఞాపన ప్రార్థనములను, కుర్వన్ = చేయువాడును, తత్సమర్థాని = ప్రేరితునకు సహాయపడు పనులను, ఆచరన్‌చ = చేయువాడునునగు, కర్తాఏవ = కర్తయే, శాస్త్రే, విహితాం = శాస్త్రమున, విధింపబడిన, హేతుసంజ్ఞాం = 'హేతుః' అను సంజ్ఞను, ప్రపద్యతే = పొందుచున్నాడు

*తాత్పర్య విశేషాంశములు*— ఆజ్ఞా పురస్సరముగ తనకంటె తక్కువవానికి పనిని చెప్పుట ప్రేషణము. తనకంటె పెద్దలయిన అభ్యర్థితులను ప్రార్థించి పనులను చేయించుకొనుట అధ్యేషణము. తత్సమర్థాచరణ మనగా, ప్రయోజ్యుడు చేయవలసిన పని సఫలమగుటకు అనుకూలమగు పరిస్థితులను కల్పించుట. ఇదియే ముఖ్యమగు ప్రయోజక వ్యాపారము. 'భిక్షావాసయతి' అను స్థలమున భిక్షయొక్క వ్యాపరమదియే గదా. ప్రేషణా ధ్యేషణములు, దీని భేదములే. స్వాభిప్రాయ ప్రకాశనము ప్రయోజకుని పని. తదను విధానము ప్రయోజ్యుని పని. కావున తత్సమర్థాచరణమే సర్వత్ర ప్రయోజకుని వ్యాపారము.

కర్తయే హేతుసంజ్ఞను బొందునని చెప్పుటవలన, కర్తృ సంజ్ఞకును హేతుసంజ్ఞకును సమావేశము సూచితము. లేనిచో నిది ఏకసంజ్ఞాధికారమగుటచే కర్తృసంజ్ఞను హేతు సంజ్ఞ బాధింపవలసి వచ్చెడిది. హేతుసంజ్ఞను విధించిన ''తత్ప్రయోజకో హేతుశ్చ'' (1-4-55) అను సూత్రమునందు చకారమున కిదియే ప్రయోజనము. ఇది శాస్త్ర విహితమగు సంజ్ఞ. కావున హేతుపదము గల విధి సూత్రములందు దీనికే గ్రహణము. లోక ప్రసిద్ధమగు హేతువు ద్రవ్యగుణములకు కూడ హేతువగును. ఈ హేతువు క్రియామాత్ర విషయము. ఇది కారకము. ప్రేషణా ధ్యేషణాదులు దీని వ్యాపారములు. ''హేతుమతిచ'' (3-1-26) ''భియో హేతుభయేషుక్'' (7-3-40) ఇత్యాది సూత్రములందు ఈ హేతువునకే గ్రహణము.

కొన్ని స్థలములందు అనగా ''హేతౌ'' (2-3-23), ''లక్షణహేత్వోః క్రియాయాః'' (3-2-126) హేతుహేతుమతోర్లిఙ్'' (3-3-156), ''కృఞో హేతుతాచ్ఛీ ల్యానులోమ్యేషు'' (3-2-20) మున్నగువానిలో లౌకిక హేతువునకే గ్రహణమని ఆయా సూత్రార్థముల పరిశీలనము వలన తెలియనగును.

ఒక ప్రశ్న— ''హేతుమతిచ'' (3-1-26) అను సూత్రము, ప్రయోజక వ్యాపారములగు ప్రేషణాదులు వివక్షితము లగునపుడు ధాతువునకు ణిచ్ప్రత్యయమును విధించు చున్నది. ''ప్రైషాతిసర్గ ప్రాప్తకాలేషు కృత్యాశ్చ'' (3-3-163) అను సూత్రమును, విధ్యర్థమునందు కృత్య ప్రత్యయములతో బాటు 'చ' కారముచే 'లోట్' అను లకారమును గూడ విధించినది. ప్రైష అనగా విధి. అదియు ప్రయోజకుని వ్యాపారమే గదా. కాగా ''పృచ్ఛతు మా భవాన్'' = 'నీవు నన్ను అడుగవలెను' అను వాక్యమున ప్రకృత సూత్ర ముచే ణిచ్ ప్రత్యయమును వికల్పముగ నేల రాలేదు ? ఇట విధి స్పష్టముగ నగపడు చున్నది గదా !

సమాధానము— ''అకర్తృత్వాత్'' అని భాష్యము. అడుగుచున్న వానిని ప్రేరించిన వాడు ప్రయోజకుడు. 'నన్నడుగుము' అని ప్రయోజకుడు చెప్పుటకు పూర్వము, ప్రష్ట, ప్రశ్న క్రియలో ప్రవర్తించి యుండలేదు. కావున కర్తృత్వము లేదు. ఆతడు వ్యాపార వంతుడైన నాతని ప్రేరించునతడు హేతువగును గదా ! కావున ణిజాపత్తికి అవకాశము లేదు.

మరల ప్రశ్న— వర్తమాన కాలమున, ప్రశ్నింపక ఉదాసీనుడుగా నుండ

శ్లో॥ సత్యాసత్యౌ తు యౌ భాగౌ ప్రతిభావం వ్యవస్థితౌ।
సత్యం యత్తత్ర సాజాతిరసత్యా వ్యక్తయఃస్మృతాః॥ 32

ప్రతిభావమ్ = ప్రతిపదార్థమునందు, సత్యాసత్యౌ = సత్యము అసత్యముఅనెడి, యౌ = ఏ, భాగౌ = భాగములు, వ్యవస్థితౌ + తు = ఉన్నవనియే నిశ్చితమైనవో, తత్ర = అరెంటిలోను యత్ = ఏది, సత్యమ్ = సత్యమో, సా = అది, జాతిః = జాతియని, (స్మృతా) = చెప్ప బడుచున్నది. అసత్యాః = అసత్యభాగములు, వ్యక్తయః = వ్యక్తులుగా, స్మృతాః = చెప్పబడు చున్నవి. కాక స్మరింపబడుచున్నవి. అద్వైత తత్త్వము నెరింగినవారిచే సత్యభాగము జాతిరూప మనియు,అసత్యమగు భాగము వ్యక్తిరూపమనియు శ్రుతుల ప్రామాణ్యమును బట్టి నిరూపింప బడుచున్నదని భావము.

కడియము, కంకణము మున్నగు వస్తువులు మనకు కానవచ్చుచున్నవి. వానికి కారణమేది అని ఆలోచించిన బంగారమనితెలియును. అచట కడియము మున్నగునవి సత్యములు కావనియు బంగారమే సత్యమనితేలును. దానిని పరిశీలించిన తేజము సత్యమనియు, దానికి కారణమేమి? అని ఆలోచింపగా పరాప్రకృతి కారణమనితేలును అదియు ఎల్ల వికారములను అనుసరించి జ్ఞానా నందరూపమగు బ్రహ్మము.అదియే యాజాతిరూపము. దానికంటె ఇతరములగు అర్థములు అసత్యములు అవియేవ్యక్తులు.

పైరీతిని జాతి వ్యక్తివిభాగము జ్ఞాతముకాగలదు. ప్రతిభావమ్--ఇచ్చట భావశబ్దము పదార్థపరము. భావేభావే = ప్రతిభావమ్ అని వీప్సార్థమున నవ్యయీభావ సమాసము ఈశ్లోకము యొక్క అభిప్రాయము 2 వ సముద్దేశమున 11, 15 శ్లోకములలోవ్యక్తము కాగలదు. ॥32॥

అవతారిక—అద్వైత సిద్ధాంతమునసుసరించి పరమార్థసత్యమగు నది జాతియే అదియే మహాసత్తయనబడుచున్నది. అది పరబ్రహ్మ స్వరూపము. అదియే గోత్వ, ఘటత్వ, పటత్వరూపమున వివర్తమగుచున్నది. దానినిబట్టి వ్యవహారము జరుగుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ సంబంధిభేదా త్సత్తైవ భిద్యమానా గవాదిషు।
జాతిరిత్యుచ్యతే తస్యాంసర్వే శబ్దావ్యవస్థితాః ।33।

సత్తా + ఏవ = ఆమహాసామాన్యమే, సంబంధిభేదాత్ = ఆశ్రయముల యొక్క భేదమువలన గవాదిషు = గోవు,అశ్వము = మున్నగువానియందు, భిద్యమానా = అరోపితమగు నానాత్వము కలదై, జాతిః + ఇతి = జాతియని = అనగా గోత్వజాతి ఘటత్వజాతిఅని,ఉచ్యతే = చెప్పబడు చున్నది. అనగా గోత్వాదికము అపరసామాన్యమగుచున్నదని.

తస్యామ్ = గవాది వ్యక్తులచే భిన్నమగు సత్తాజాతియందే, సర్వే + శబ్దాః = ఎల్ల శబ్దములు, వ్యవస్థితాః = నియతమగు రూపముతో నిలిచియున్నవి. సంకీర్ణముకాక ఆశబ్దములు నియతమగు జాతినే బోధించుచున్నవని భావము.

వచ్చును. కాని భూతకాలమున ప్రశ్నించియుండెనేమో ? లేదా భావిలో ప్రశ్నించుననవచ్చును. కాన ప్రయోజ్యునకు కర్తృత్వము కలదన వచ్చునే అని—

సమాధానము— భూతభావి క్రియలతో బుద్ధి పరికల్పితమైన సంబంధము ప్రయోజ్యునకు చెప్పవచ్చుననుకొనుడు. వర్తమాన కాలమున క్రియా సంబంధ మెట్లు. ఇపుడాత డూరకినే యుండెను గదా. 'అడుగుము' అనకున్న నడుగబోడు గదా. కాగా వానికి కర్తృత్వము లేదు ప్రశ్నించుము = ప్రశ్నక్రియాకర్తవగుము. క్రొత్తగ కర్తృత్వము విధింపబడు చుండెనాయె. ఇది ణిజ్విషయము కాదు.

క్రియావిశిష్టుడగు కర్తకు ప్రయోజకుడు ప్రేషణాదికమును జేసిన ఆ వ్యాపారము ణిచ్చుకు వాచ్యము. లోట్ప్రత్యయ విషయము వేరు. అచట కర్త, లకారమునకు వాచ్యుడు. ప్రైష, ద్యోత్యము మాత్రమే. వాచ్యము కాదు. దానికి వర్తమాన కాలికత్వ మక్కరలేదు. కావున అపుడడుగని వానిని గూడ 'పృచ్ఛతు మా భవాన్' అని, లేదా 'అనుయుఙ్క్తాం మా భవాన్' అనవచ్చును. అను యోగమనినను ప్రశ్నయే. ముఖ్యమైన భేద మిది. ఏమి ? ణిజర్థ మగు ప్రైష ప్రయోజ్యధర్మము. లోడర్థమగు ప్రైష ప్రయోక్త ధర్మము. ॥125॥

*అవతారిక*— ఆ భేదమునే వివరించునది ఈ కారిక.

**శ్లో॥ ద్రవ్యమాత్రస్య తు ప్రైషే పృచ్ఛ్యాదేర్లోడ్విధీయతే ।**
**సక్రియస్య ప్రయోగస్తు యదా స విషయో ణిచః ॥ 126**

ద్రవ్యమాత్రస్య = క్రియారహితమునకు, ప్రైషేతు = ప్రేరణము వివక్షితమైనపుడు, పృచ్ఛి ఆదేః = పృచ్ఛి మున్నగు ధాతువునకు, లోట్ = లోట్ అను లకారము, విధీయతే = విధింపబడు చున్నది, యదాతు = ఎపుడు అయిన, సక్రియస్య = క్రియావిశిష్ట కర్తకు, ప్రయోగః = ప్రేరణము వివక్షితమగునో, తదా సః = అపుడు, ఆ ప్రయోజ్యుడు, ణిచః = ణిచ్ప్రత్యయమునకు, విషయః = ప్రాప్తి స్థానము, భవతి = అగును.

*తాత్పర్య విశేషాంశములు*— ఒక డొకనిని 'నీవు నన్నడుగుము' అనినపుడు, ఆ అడుగవలసినవాడు, అంతకుముందా క్రియలో ప్రవర్తించి యుండలేదు. క్రియ లేనిచో కారకత్వమే లేదాయె. కర్తృత్వ మెట్లు లభించును ? లోట్ప్రత్యయ ఘటితములగు, 'పృచ్ఛతు' అనుయు 'ఙ్క్తామ్' అను పదములను ప్రయోగించిన నపుడు కర్తృత్వము కలుగును. అట విధి, ద్యోత్యము. కర్తయే వాచ్యుడు. ఇది క్రియయందు ప్రవర్తింపని ద్రవ్య విషయము.

ఇక క్రియయందు ప్రవర్తించిన కర్తకు, ఆ క్రియను మానకుండుట ప్రేరణ చేయుటయు గలదు. ఆ ప్రేరణ వివక్షితమైనపుడు ణిచ్ప్రత్యయము విహితము. అది దానికి వాచకమే.

ఈ ప్రకారముగా, ణిచ్ లోట్ ప్రత్యయములకు విషయ విభాగము లౌకిక శబ్ద ప్రయోగములందు స్పష్టముగ నవధారితమై యున్నది. పృచ్ఛతు, మా, భవాన్, అను

లోడన్త స్థలమున ప్రయోజక కర్తను చెప్పు పదమేదియు లేదు. అచట ఉచ్చరించు వ్యక్తియే సామర్థ్యమువలన కర్తగా ప్రతీయమానుడగును.

ఇట్లు విషయభేదము స్ఫుటముగ నున్నను, శాస్త్రమున ఆ విభాగము చేయబడ లేనందున, 'మాభవాన్ పృచ్ఛతు' అను స్థలమున ణిచ్ప్రత్యయ మేల రాలేదను పూర్వ పక్షము, అదియు ప్రైషయే గదా అని సామాన్య దృష్టిలో చేయబడినది. అంతియ- ॥126॥

*అవతారిక*— ''యజ్ఞ దత్తుడు దేవదత్తునిచేత అన్నమును వండించుచున్నాడు'' అను వాక్యమున యజ్ఞదత్తుడు ప్రేరకుడయిన కర్త. హేతువు. దేవదత్తుడు ప్రయోజ్యుడు. కర్తకు ఈప్సితతమము కర్మ. అనగా, కర్త, తన క్రియచేత దేనిని సంబంధింపదలంచునో అది. యజ్ఞదత్తుడు, తన ప్రేషణ క్రియచే దేవదత్తుని గదా సంబంధింపదలచినది. కాగా దేవ దత్తుడు కర్మ కావలెను. ద్వితీయాంతముగ నుండవలెను. 'దేవదత్తునిచేత' అని అచట కర్తృ తృతీయ అగపడుచున్నది. అది యెట్లుపపన్నమగును? అను శంకకీకారిక సమాధానము.

**శ్లో॥ గుణక్రియాయాం స్వాతంత్ర్యాత్, ప్రేషణే కర్మతాంగతః ।**
**నియమాత్ కర్మసంజ్ఞాయాః స్వధర్మేణాభిధీయతే ॥ 127**

గుణక్రియాయాం = అప్రధాన క్రియలో, స్వాతంత్ర్యాత్ = స్వతంత్రుడగుట వలన, ప్రేషణే = ప్రయోజక వ్యాపారమున, కర్మతాం = కర్మత్వమును, గతః అపి = పొంది యున్నవాడైనను, (ప్రయోజ్యః) = దేవదత్తుడు, కర్మ సంజ్ఞాయాః = కర్మ సంజ్ఞకు, నియమాత్ = నియమముండుట వలన, స్వధర్మేణ = తన ధర్మమగు కర్తృత్వముచేతనే, అభిధీయతే = చెప్పబడుచుండును.

*తాత్పర్య విశేషాంశములు*— ప్రయోజ్యుడు, ప్రయోజకుని, ఆజ్ఞాదులకు లోబడి నను తన స్వతంత్రతను కోల్పోవడు. తన వ్యాపారమున తనకు స్వాతంత్ర్యముండును గాన కర్తృ సంజ్ఞకు భంగము లేదు. ణిజర్థ కర్తకు ఈప్సితతముడు గాన కర్మసంజ్ఞ ప్రాప్తించు చున్నది. అది గతి, బుద్ధి, ప్రత్యవసానము అర్థము గల ధాతువులును, శబ్దము కర్మగా గల ధాతువులును, అకర్మకములగు ధాతువులును, దీని అణ్యన్తావస్థయందు కర్తయగుదానికే అని నియమింపబడినది పచ్ ధాతువందు చేరలేదు. కావున దేవదత్తునకు స్వస్వాతంత్ర్య ప్రయుక్త మగు కర్తృత్వమే నిలిచినది.

ఒక ప్రశ్న— ప్రయోజ్యుడైనపుడు గూడ స్వాతంత్ర్యమాతనికి నివర్తింపదనిన, కర్మ సంజ్ఞకంటె పరమైన కర్తృ సంజ్ఞయే ప్రాప్తించుచుండ, గతి బుద్ధీ త్యాది సూత్రము కర్మ సంజ్ఞా విధాయకమే కావలెనుగదా. నియామక మెట్లగును?

సమాధానము— ప్రయోజ్యకర్త వ్యాపారము ధాతువున కర్థము. ప్రయోజక కర్త వ్యాపారము ణిజర్థము. మొదటిది రెండవదానికి విశేషణము. కాగా అప్రధానము. రెండవది ప్రధానము. అందువలన కర్తృ శక్తికంటె, కర్మశక్తి ప్రబలము. ఓదనము కర్మ

గదా. దానిని జూతము. కాని వ్యాపారము విక్లిత్తి అందది స్వతంత్రమే. అయినను, విక్లేదనము = ఉడికించుట అను దేవదత్త వ్యాపారముచే ఈప్సితముగాన, దానికి కర్మ సంజ్ఞయే ప్రవర్తించినది.

కాగా, ప్రకృతమున కర్తృ సంజ్ఞతో విప్రతిషేధము లేదు. కర్మ సంజ్ఞ సిద్ధము కాబట్టి గత్యాది ధాతు విషయమున నియమము చేయబడినది. దాని ఫలితముగ, 'యజ్ఞదత్తః దేవదత్తం గ్రామం గమయతి' అని గత్యర్థధాతు ప్రయోగమున దేవదత్తునకు కర్మత్వమును, 'యజ్ఞదత్తః దేవదత్తేన, ఓదనం పాచయతి' అను, పచధాతు యోగమున దేవదత్తునకు కర్తృత్వమును ప్రయోగములందు ప్రసిద్ధములు. ॥127॥

*అవతారిక*— కర్తకు ప్రేరకుడు హేతువు. ప్రయోజక మెల్ల హేతువనిన, కర్మ గూడ క్రియకు ప్రయోజకముగాన హేతు సంజ్ఞ కలదియగునా ? అనిన, కాదనుచున్నారు.

శ్లో॥ క్రియాయాః ప్రేరకం కర్మ హేతుః కర్తుః ప్రయోజకః ।
కర్మార్థా చ క్రియోత్పత్తిః సంస్కార ప్రతిపత్తిభిః ॥ 128

కర్మ = క్రియకు ఫలమైన కర్మ, క్రియాయాః = క్రియకు, ప్రేరకమ్ = ప్రయోజకము, హేతుః = హేతువనునది, కర్తుః = కర్తకు=క్రియాశ్రయునకు, ప్రయోజకః = ప్రేరకము. ఉత్పత్తి, సంస్కార, ప్రతిపత్తిభిః=నిర్వృత్తి, వికారము, ప్రాప్తి - అను వీనిచేత, క్రియా= క్రియ, కర్మార్థా చ = కర్మకొఱకైనది గదా :

**తాత్పర్య విశేషాంశములు**— ఫలమున కాశ్రయము కర్మ. కర్తయొక్క వ్యాపారమువలన గలిగిన ఫలము కర్మయందుండును. ఆ కర్మ నిర్వర్త్యము, వికార్యము, ప్రాప్యము - అని మూడు విధములు అని వెనుక జెప్పబడియున్నది. క్రియా ఫలమును, వ్యపదేశివద్భావముచేత శాస్త్రమున ఫలాశ్రయమగునుగాన కర్మ అనబడును. ఆ కర్మ స్వసిద్ధికై క్రియను ప్రేరించును.

ఇక హేతువనునది క్రియార్థమై, సాధనములను వినియోగించి క్రియను సాధింపుమని కర్తను ప్రోత్సహించును. అది సాక్షాత్తుగా క్రియా ప్రయోజకము గాదు. క్రియా పరిపోషమునకై ప్రవర్తించు కర్తకు ప్రయోజకము హేతువు.

ఈ విధముగ ప్రయోజకత్వ విషయమున హేతువునకును, కర్మకును స్వరూప భేదము స్పష్టముగ నగపడుచున్నది.

ఏయది దేనికొఱకై యేర్పడినదో, అయ్యది దానికి ప్రయోజకమందురు. క్రియ కర్మ కొఱకు. కావున కర్మ క్రియకు ప్రయోజకము.

ఇతర కారకములు స్వసిద్ధికై క్రియను ప్రేరింపవు. అవి క్రియార్థములు గాని, వాని కొఱకై క్రియ ప్రవర్తింపదు. ॥128॥

## సంప్రదానాధికారము

అవతారిక— విభక్తుల ననుసరించి కారకముల విచారము చేయబడుచున్నది. అందు ద్వితీయార్థమగు కరణ కారకవిచారమును, తరువాత కర్తృ కారక విచారమును, ఆ ప్రసంగమున ప్రయోజక కర్తృ విచారమును, ముగించి, క్రమ ప్రాప్తమగు చతుర్థీ విభక్త్యర్థ సంప్రదాన విచార మిక చేయబడుచున్నది.

శ్లో॥ అనిరాకరణాత్ కర్తుః త్యాగాంగం కర్మణేప్సితమ్ ।
ప్రేరణానుమతిభ్యాం వా లభతే సంప్రదానతాం ॥ 129

కర్తుః = కర్తచేయు, త్యాగాంగం = దానమున నంగమైనదియు, కర్మణా = కర్మచే, ఈప్సితం = సంబంధించుటకు తలంపబడిన కారకము, అనిరాకరణాత్ = నిషేధింపకుండుట వలన, ప్రేరణానుమతిభ్యాం వా = ప్రేరించుట, అంగీకరించుట వలనగాని. సంప్రదాన తాం = సంప్రదానమను పేరును, లభతే = పొందును

తాత్పర్య విశేషాంశములు— ''ఉపాధ్యాయాయ గాం దదాతి, దేవదత్తః''. గోవు కర్మ. ఇచ్చుట క్రియ. శిష్యుడు కర్త. అతడుచేయు త్యాగములో అంగము ఉపాధ్యాయుడు. అంగమనగా, దాత హస్తము కూడ కావచ్చును కావున నది సంప్రదానము కాకుండుటకు, 'కర్మ సంబంధమును గలుగ చేయుటకు కర్తచే నుద్దేశింపబడినది' అనియు జెప్పబడినది. ఆ సంప్రదానము కారకము కావలెను. కారక మనగా క్రియా జనకము. దాని క్రియ ఇటనేమి? అనిన అది, నిరాకరింపకుండుట, ప్రేరించుట, లేదా అనుమతించుట, ఇందేదియైన నగును.

ఉపాధ్యాయుడు, శిష్యుడు తన కిచ్చిన గోవును వలదనకుండుటయే ఆతని వ్యాపారము. 'దేవతాభ్యో బలిం దదాతి' అనుచోట బలిదానము ననుమతించుట, సంప్రదాన వ్యాపారము. యాచించి దానమును బొందినపుడు ప్రేరణము, సంప్రదాన వ్యాపారము. ఈ విధముగ సంప్రదానము త్యాగమున కుపకారకమగుటవలన నది త్యాగాంగము.

ఇచట నొక ప్రశ్న— ''ముక్తయే హరింభజతి'' = మోక్షార్థము హరి భజనము అందురు. హరిసేవ ముక్త్యర్థముగాన నట ''తాదర్థ్యే చతుర్థీ వాచ్యా'' అను వార్తికముచే, చతుర్థీ ప్రత్యయము విధింపబడినది. ఆ విధముగనే దాన ముపాధ్యాయార్థము గాన ''ఉపాధ్యాయాయ గాం దదాతి శిష్యః'' అను, ప్రయోగమునందు గూడ, చతుర్థిపైవార్తికముచే సిద్ధింప వచ్చును గదా. సంప్రదాన సంజ్ఞ ఎందులకు? అని ప్రశ్న.

సమాధానము— ఇది న్యాయ్యమైన ఆక్షేపము గాదు. ఏలయన- దానక్రియ సంప్రదానార్థము గాదు. సంప్రదాన కారకము దాన క్రియార్థము. కారకములు క్రియార్థములు గదా! ఈయబడు గోవు ఉపాధ్యాయార్థమయినను నది వాక్యార్థము కాదు. వాక్యార్థము క్రియ అది సంప్రదానార్థము గాదు.

"రజకస్య వస్త్రం దదాతి" = చాకలికి బట్టలనిచ్చుట దానమేగాదు. దానమనగా, తన హక్కును వదలుకొని ఇతరుల కా వస్తువును సంక్రమింపజేయుట. అది అచ్చట లేదు. కనుక సంప్రదాన చతుర్థి లేదు. ధాతు వచట గౌణమగు నర్థము కలది

''ఘ్నతః పృష్ఠం దదాతి'' = కొట్టుచున్న వానికి వీపు నిచ్చుచున్నాడందురు. అచటను నంతియే.

ఇక ''అరోచకినే అన్నం దదాతి'' = అన్నమునందు రుచిలేని రోగికన్న మిచ్చుచున్నాడు అందురు. పరునకు తన వస్తువు నిచ్చుట, అది వాని కుపయోగింపవలెనను తలంపుతో గదా. అట్టి ఉపయోగము లేని దానము దానమే కాదు గాని, దేవునకు ఫలపుష్పాదులను సమర్పించువాడు, అవి దేవున కుపయోగింపవలెనను సంకల్పముతో నిచ్చునట్లు, రోగికి అన్నము సహింపవలెనను సంకల్పము, దాత కుండవచ్చును.

''న శూద్రాయ మతిం దద్యాత్'' = శూద్రునికొఱకు మతి నీయరాదు. మతి యన జ్ఞానము. అనగా తత్సాధనమగు శాస్త్రము. ఇచ్చుట అనగా నుపదేశించుట. ఇచట 'దా' ధాత్వర్థమగు దానము, స్వస్వత్వ నివృత్తి పూర్వకముగ పరస్వత్వము నాపాదించుట యను ముఖ్యార్థమా ? లేక గౌణమా ? అని విచారింపవలసి యున్నది. ముఖ్యార్థమున కట సంభవము లేదు. తన హక్కును శాస్త్రమునందు వదలిపెట్టుట, శూద్రునకు సంప్రమింపజేయుట అనునది లేదుగదా. కావున నది గౌణమని కొందరందురు. దాన మచట ముఖ్యమే. గౌణము కాదు. గురువు, తన శాస్త్రజ్ఞాన సంతానమున నేకదేశమును శిష్యున కుపయోగింపవలెనను నుద్దేశముతోనే త్యజించును. కావున నది ముఖ్యమేయని మఱికొందరి భావము.

''వరాయ కన్యాం దదాతి పితా'' ఇట, తండ్రి తన కొమార్తెను దానము చేసినపుడు జన్య జనక భావమను స్వత్వము నివర్తింపకున్నను, స్వస్వామి భావరూపమగు స్వత్వము నివర్తించును గాన 'దా' ధాత్వర్థము, ముఖ్యమే

''ఖండికోపాధ్యాయశ్శిష్యాయ చపేటాం దదాతి'' = ఖండికలనెడి వేదభాగములను అధ్యయనము చేయించు నుపాధ్యాయుడు, తాను, ఉదాత్తము నుచ్చరించినచో, ననుదాత్తము నుచ్చరించిన, శిష్యునికి చెంపదెబ్బ నిచ్చును. ఇచట 'స్వస్వత్వ నివృత్తి పూర్వకముగ పరస్వత్వాపాదనము' అను ముఖ్యార్థమునకు సంభవము గలదాయని విచారించిన, ఆ చపేటము శిష్యున కుపకరించునది గాన, కలదనియే తేలును. చెంపకాయ శిష్యునకు ప్రతికూల రూపము గదా. వానికి దాని యుపకారమేమి ? అనిన, ఆ చపేటమును వా డిపుడు సహించిన నది వానికి శాస్త్రాభ్యాస యోగ్యతను కలుగజేయును. దానివలన భావికాలమున వానికి ఫలావాప్తి కలుగునని భావము.

''మృజిరస్మాయ విశేషేణోపదిష్టః ప్రకృతి పాఠే'' అని వృద్ధి సూత్ర భాష్యమున ప్రయోగము. అందు 'అస్మై' అను చతుర్థి తాదర్థ్యమున చతుర్థి. ధాతు పాఠమునందు, 'మృజ్' అను ధాతువు, సాధు శబ్దములను దెలిసికొనగోరు జిజ్ఞాసువు కొఱకు, సామాన్య

రూపమున, అనగా సకల ప్రత్యయములకును ప్రకృతిగా నది యుండవలెనను తలంపుతో ఉపదేశింపబడినది. అందువలన నాతడు 'మృజ్' అను ధాతు మాత్రమునకు ప్రసంగము గలిగిన, 'మార్జ్' అను వృద్ధి ఘటితరూపము 'మార్జకః' మున్నగు స్థలముల సాధువగునని తాత్పర్యము. ॥129॥

*అవతారిక*— ప్రథమ సంప్రదానమును వెనుకటి కారికచే వ్యాఖ్యానించి ఉత్తర సంప్రదాన వివరణము నిక చేయుచున్నాడు.

**శ్లో॥ హేతుత్వే, కర్మసంజ్ఞాయాం, శేషత్వే వాపి కారకమ్।**
**రుచ్యర్థాదిషు శాస్త్రేణ సంప్రదానాఖ్య ముచ్యతే॥** 130

హేతుత్వే = హేతు సంజ్ఞగాని, కర్మ సంజ్ఞాయాం = కర్మసంజ్ఞ గాని, శేషత్వే వా అపి = కారక వ్యతిరిక్త సంబంధముగాని ప్రాప్తించినపుడు, కారకం = క్రియాజనక మగునది, రుచ్యర్థాదిషు = రుచధాతువు మున్నగువాని ప్రయోగమున, సంప్రదానాఖ్యం = సంప్రదాన మను సంజ్ఞ కలదిగా, శాస్త్రేణ = శాస్త్రముచేత, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్య విశేషాంశములు** — ప్రథమ సంప్రదాన మనగా "కర్మణా య మభిప్రైతి స సంప్రదానమ్" (1-4-32) అను సూత్రముచే విధింపబడినది. అది లౌకిక సంప్రదానము. ఉత్తర సంప్రదానమనగా "రుచ్యర్థానాం ప్రీయ మాణః" (1-4-33) మున్నగు సూత్రములచే విహితమైన సంజ్ఞ.

రుచి అర్థముగాగల ధాతువులు ప్రయోగింపబడినపుడు, ప్రీత్యాశ్రయమగు కారకము సంప్రదాన మగును అని ఆ సూత్రమున కర్థము. రుచి అనగా అభిలాష. దీప్తి కాదు. "దేవదత్తాయ రోచతే మోదకః" = దేవదత్తునకు (కొఱకు) కుడుము రుచించుచున్నది అని యుదాహరణము. రుచించుట = ప్రీతికి విషయమగుట. దేవదత్తునకు కుడుము ఇష్టము. దానియందు లౌల్యమువలన నది తనకు అభిలాష విషయమగు నట్లు చేసికొనును. కాగా నాతనికి హేతుసంజ్ఞ ప్రాప్తించుచున్నది. సంప్రదాన సంజ్ఞ విధింపబడుచున్నది. కావున నీ సంజ్ఞ, సంజ్ఞాంతర ప్రాప్తి పూర్వకసంజ్ఞ. హేతుసంజ్ఞ వచ్చినయెడల ణిచ్ప్రత్యయము ప్రాప్తించెడిది. అది ఈ ప్రయోగమున ఇష్టము గాదు. కావున ప్రకృత ధాతువాచ్య రుచి క్రియలో మోదకము కర్త. దేవదత్తుని అభిలాషలో విషయము గదా మోదకము, కర్మ కావలదా? అనవచ్చును గాని దేవదత్తు డిపుడు కర్తకు ప్రయోజకుడును గాడు, కర్తయు గాడు. కాగా మోదకము వానికి ఈప్సితతమము గాదు. కర్తకు ఈప్సితతమము గదా కర్మ కావలెను.

ఇట్లు ప్రశ్నింపవచ్చును— కర్త కీప్సితమనగా కర్త అను సంజ్ఞ కలవానికి అని కాదు. క్రియలో స్వాతంత్ర్యము = వ్యాపారము కలవానికని యర్థము. దేవదత్తున కా స్వాతంత్ర్యముండును గదా అనిన,

సమాధానము— ఇచట శబ్దము = రుచధాతువు రుచి క్రియను బోధించుచున్నది. దాని కాశ్రయము మోదకముగాని, దేవదత్తుడు కాదు. తమ తమ వ్యాపారములలో సకల కారకములును స్వతంత్రములే. కాని ఆ స్వతంత్రత శబ్దోపాత్తము కానిచో కర్త అను సంజ్ఞ కలుగదు. లేనిచో, కర్మ సంజ్ఞా సూత్రములో 'కర్తుః' అనుట వ్యర్థము. 'సార్థాద్ధీయతే పథికః' అను వాక్యమును జూడుడు. బాటసారుల గుంపునుండి ఒకడు విడివడినాడు. హీయతే అను పదము హాన క్రియను చెప్పుచున్నది విడుచుటలో కర్త సార్థము. పథికునకు కర్మత్వమును, ఆందువలన కర్మార్థమున లకారమును లభించినవి. గుంపును అపాదానముగ వివక్షించుటచే పంచమి. హానక్రియ అచట శబ్దోపాత్తము. ప్రకృతమున దేవదత్తుని క్రియకు శబ్దబోధ్యత లేదు గదా.

'దేవదత్తుని, మోదకము ప్రీతుని జేయుచున్నది' అని ఈ వాక్యమున కర్థమయిన యెడల అపుడు ఆ ధాతువు సకర్మకమగును. దేవదత్తునకు కర్మసంజ్ఞ ప్రాప్తించును. కావున సంప్రదాన సంజ్ఞ కర్మసంజ్ఞా ప్రాప్తి పూర్వకమపుడు కావచ్చును

''దేవదత్తాయ శ్లాఘతే జనః'' జనము, దేవదత్తుని గుణములను బొగడి తమ్ము నాతని కెఱుకపఱచు కొనుచున్నదని ఆ వాక్యమున కర్థము. ''శ్లాఘ హ్నుఙ్ స్థాశపాం జ్ఞీప్స్యమానః'' (1-4-34) అను సూత్రముచే సంప్రదాన సంజ్ఞ. దేవదత్తుడు గుణవంతుడగు టచే తన్ను జనము పొగడునట్లు చేసికొనుచున్నాడని భావము. కాన నాతనికి హేతుసంజ్ఞ ప్రాప్తింపగా సంప్రదాన సంజ్ఞ విధింపబడినదని కొందఱి మతము. అట్లు కాదు. సూత్రమున 'జ్ఞీప్స్యమానః' అను పదము కలదు. 'జ్ఞాపయితు మిష్యమాణః' = తెలియజేయుటకు కోర బడిన వాడని యర్థము. జ్ఞాపన క్రియా సంబంధమును గిలుగజేయుట ఆతనికే గనుక కర్మ సంజ్ఞ ప్రాప్తింపగా 'సంప్రదాన సంజ్ఞావిధి' అని మఱికొందరు నందురు.

ఈ విధముగనే 'హ్నుతే' 'తిష్ఠతే' 'శపతే' అను ధాతువుల ప్రయోగము లందును యథాయోగముగ ఆయా సంజ్ఞలకు ప్రాప్తిని జూడవచ్చును.

శ్లాఘించి తన్ను దేవదత్తున కెఱుకపఱచుట— ఇతరులకు దెలియకుండగా తన్ను మఱుగుగా నెఱుకపఱచుకొనుట, స్వాభిప్రాయము నాతనికి బోధించుట కనుకూలమగు స్థితిని పరిగ్రహించి యుండుట, శపథమును బెట్టి తెలియచేయుటయు, యథాక్రమముగ నర్థములు.

''దేవదత్తాయ శతం ధారయతి యజ్ఞదత్తః'' = దేవదత్తునకు యజ్ఞదత్తుడు నూఱు రూప్యములను బాకీపడి యున్నాడు. ''ధారేరుత్తమర్ణః'' (1-4-35) అను సూత్ర మిట సంప్రదాన సంజ్ఞను విధించునది. 'ధారి' అనగా ణిజన్తమయిన 'ధృఙ్' అవస్థానే అను ధాతువు. అది ప్రయోగింపబడి నపుడు ఉత్తమర్ణునకు సంప్రదాన సంజ్ఞ కలుగునని సూత్రా ర్థము. 'ధారయతి' అనగా ధరింపజేయుచున్నాడని గదా అర్థము. అధమర్ణుడైన యజ్ఞదత్తుడు నిలచియున్న బాకీని నిలిపియున్నాడు. ఆ ధారణమునకు ఉత్తమర్ణుడైన దేవదత్తుడు హేతువు. అత డిచ్చుటవలన గదా అది నిలిచినది. కాని ఆ దానక్రియ శబ్దోపాత్తము కాదు. అది దేవదత్త

సంబంధి. కనుక దేవదత్త శబ్దము సంబంధార్థక షష్ఠ్యంతము కావలసియుండ సంప్రదాన సంజ్ఞచే చతుర్థ్యన్తమయినది శేషత్వ ప్రాప్తి పూర్వక సంప్రదాన సంజ్ఞ కిది ఉదాహరణము.

"పుష్పేభ్యః స్పృహయతి" అను ప్రయోగమున, "స్పృహేరీప్సితః" (1-4-36) అను సూత్రముచే పుష్పములకు సంప్రదానత్వము. పుష్పముల కీప్సితతమత్వమును వివక్షించిన, కర్మసంజ్ఞయే ఆగును. "పుష్పాణి స్పృహయతి". పూవులకొఱ కాశపడుట మొదటి వాక్యమునను, పూవుల నపేక్షించుట రెండవ వాక్యమునను, అర్థములు.

"దేవదత్తాయ క్రుధ్యతి యజ్ఞదత్తః"
,, ద్రుహ్యతి ,,
,, అసూయతి ,,
,, ఈర్ష్యతి ,, అని ప్రయోగములు కలవు.

దేవదత్తుని ఉద్దేశించి యజ్ఞదత్తుడు, క్రోధ, ద్రోహ, అసూయా, ఈర్ష్యలను చిత్తవృత్తులను గలిగియున్నాడని అర్థము. చంపవలెనను చిత్తవృత్తి, అపకారమును చేయవలెనను తలంపు, ఉత్కర్షను సహింపకుండు మనస్తత్త్వము, గుణములను దోషములనుగా భావించుటయు, యథాక్రమముగ, క్రోధ, ద్రోహ, ఈర్ష్యా, అసూయలు. పై ధాతువుల ప్రయోగమున కోపమున కుద్దేశ్యమగు వ్యక్తికి సంప్రదాన సంజ్ఞ, "క్రుధ ద్రుహేర్ష్యా సూయార్థానాం యంప్రతికోపః" (1-4-37) అను సూత్రముచే విధింపబడినది. ఇవి సకర్మక ధాతువులగుటచే కర్మసంజ్ఞ ప్రసక్తము.

"దేవదత్తాయ రాధ్యతి గణకః" "దేవదత్తాయ ఈక్షతే గణకః" అని రెండు ప్రయోగములు. దేవదత్తుని శుభాశుభములను దైవజ్ఞుడు పర్యాలోచించుచున్నాడని అర్థము. దేవదత్తుడు గణకుని అడుగగా నాతడు పర్యాలోచించుచున్నాడని భావము. కాన దేవదత్తుడు ప్రయోజకుడు. హేతుసంజ్ఞ ప్రాప్తింప సంప్రదాన సంజ్ఞ విహితము. సూత్రము "రాధీక్ష్యో ర్యస్య విప్రశ్నః" (1-4-39) అనునది.

"దేవదత్తాయ గాం ప్రతిశ్శృణోతి" లేదా "ఆశ్శృణోతి" దేవదత్తుడు యాచించి ప్రేరింపగా యజ్ఞదత్తు డాతనికి గోవు నిత్తునని వాగ్దానము చేయుచున్నాడని యర్థము. హేతు సంజ్ఞ ప్రాప్తము. దానికి బాధకముగ సంప్రదాన సంజ్ఞ "ప్రత్యాఙ్భ్యాం శ్రువః పూర్వస్య కర్తా" (1-4-40) అని విధింపబడినది. సూత్రమునందున్న, 'పూర్వస్య కర్తా' అను దానికి మొదటి వ్యాపారమగు యాచనకు ఆశ్రయమైనవాడు = అనగా దేవదత్తుడు అని భావము. యాచించి, అంగీకరించునట్లు చేసిన వ్యక్తి అనుట.

"హోత్రే అనుగృణాతి ప్రతిగృణాతి వా అధ్వర్యుః" అని యజ్ఞకర్మలందలి వ్యవహారము. హోత, అధ్వర్యువు, ఋత్విక్కులు. యజ్ఞమునందు, హోత ముందు కొన్ని స్తుతివచనములను పలుకును. అధ్వర్యుడు ఆతని నభినందించుచు, ప్రోత్సాహజనకములయిన

శబ్దముల నుచ్చరించును. శంసన వ్యాపార కర్త కిపుడు, కర్మసంజ్ఞ కపవాదముగ సంప్రదాన సంజ్ఞను ''అనుప్రతిగృణశ్చ'' (1-4-41) అను సూత్రము విధించుచున్నది.

''పరిక్రయణే సంప్రదానమన్యతరస్యామ్'' (1-4-44) అను సూత్రము, సాధకతమమగు కరణమునకు, కొంత కాలము వేతనమిచ్చి ఉంచుకొనుట అను నర్థమునందు సంప్రదాన సంజ్ఞను విధించినది. 'శతేన పరిక్రీతః' లేదా 'శతాయ పరిక్రీతః అనుబ్రూహి' అని యుదాహరణము. నూఱు రూప్యములిచ్చి కొంతకాలమునకు స్వీకృతుడవై అనువచనము చేయుమని ఆ వాక్యమున కర్థము.

సామాన్యముగ ఈ సంప్రదానోదాహరణము లందంతటను, విశేషవివక్ష ఏదియు లేనపుడు క్రియాజనకత్వము అనుకారకత్వము సంభవింపనందున శేషత్వము ప్రాప్తించు చున్నది. కాని క్రియా నిమిత్తమగుటచే అంతమాత్రమును బుచ్చుకొని సంప్రదాన సంజ్ఞ చెప్పబడినది.

అపాదానాది విశేషములు వివక్షింపబడనపుడు ఆ కారకము ''అకథితంచ'' అని అకథితకర్మ అగునుగదా అని యడుగవచ్చును. కాని దుహ్, యాచ్, పచ్ మున్నగు కొన్ని పరిగణితధాతువుల అవివక్షిత కారకమే అకథిత కర్మ అని నిర్ణయింపబడినది. అందువలన కర్మసంజ్ఞా ప్రాప్తి కవకాశము లేదు.

కారికలో 'రుచ్యర్థాదిషు' అని ఆదిపదముండుటవలన శ్లాఘ - హ్నుజేత్యాది సూత్రముల ప్రమేయములు గూడ సోదాహరణముగ విచారింపబడినవని ఎఱుంగునది.

మఱియు, ''శాస్త్రేణ రుచ్యర్థాదిషు సంప్రదానాఖ్య ముచ్యతే'' అని కారికలో చెప్పబడినది. ప్రథమ సంప్రదానము గూడ ''కర్మణా యమభిప్రైతి'' అను శాస్త్రము చేతనే విహితము గదా ? 'రుచ్యర్థాదిషు' 'శాస్త్రేణ' అనుటలో విశేషాభిప్రాయ మేమి ? అని ప్రశ్న.

సమాధానము— సంప్రదానము శాస్త్రీయమనియు, లౌకికమనియు ద్వివిధము ఆ పద మన్వర్థము. 'సంప్రదీయతే అస్మై' ఇతి సంప్రదానమ్ అని వ్యుత్పత్త్యర్థము వలన లభించుటచే, దాన క్రియాకర్మ సంబంధము కలదియే సంప్రదానమని తెలియవచ్చుచున్నది. ఇది లౌకికమయిన అర్థము. 'కర్మణా యమభి' ఇత్యాది సూత్రముచే చెప్పబడినది ఈ లౌకిక సంప్రదానము.

ఇక "రుచ్యర్థానాం ప్రీయమాణః" మున్నగు సూత్రముల యుదాహరణములందు ఆ అర్థమునకు సంభవము లేదు. శాస్త్రారంభ సామర్థ్యమువలన, శబ్దసంస్కార మాత్ర దృష్టితో, 'సంప్రదీయతేఽస్మై' = 'వీనికొఱ కీయబడుచున్నది' అను నర్థము సంభవింపకున్నను అట సంప్రదాన సంజ్ఞ విధింపబడినది. అది శాస్త్రమాత్ర నియతము. ఆ అభిప్రాయముతోనే "శాస్త్రేణ రుచ్యర్థాదిషు" అని కారికలో భర్తృహరి నిర్దేశించి యుండెను. ॥130॥

అవతారిక— 'శ్రాద్ధమును గర్హించుచున్నాడు' అను నర్థమున "శ్రాద్ధాయ నిగర్హతే" అను ప్రయోగము కలదు. 'యుద్ధాయ సంనహ్యతే' = యుద్ధము విషయమున సంనాహపురస్సర నిశ్చయమును చేయుచున్నాడు. యుద్ధమునకు సన్నద్ధుడగు చున్నాడని తాత్పర్యము. "పత్యే శేతే" = భర్తనుపసర్పించి శయనించు చున్నది. ఈ ప్రయోగములందు ఆయా క్రియల కర్మలతో సంబంధింపజేయుటకు తలంపబడినవి శ్రాద్ధముగాని, యుద్ధముగాని పతిగాని కావు. ఆ ధాతువు లకర్మకములు. అందువలన క్రియచే సంబంధించుటకు అభిప్రేత మైనది కూడ సంప్రదానమగునని చెప్పవలసి యుండునని, 'క్రియా గ్రహణం కర్తవ్యమ్' అను వార్తిక మవతరించినది. కాని అది ప్రత్యాఖ్యాతము.

భాష్యకారుని ఆశయమేమనగా, సూత్రమునందలి 'కర్మణా' అను పదమునకు 'క్రియచేత' అనిగూఢ అర్థము. లోకమున నట్టి వ్యవహారమున్నది. నీ వేపని చేయుదువు ? అనుటకు 'త్వం కిం కర్మకరిష్యసి' అందురు. సూత్రమునందలి కర్మ పదమునకు క్రియ అనియు, శాస్త్రీయమగు, 'కర్తురీప్సితతమం కర్మ' అను లక్షణముచే లక్షితమైనదియు అర్థము.

'అట్లు కాదు. కృత్రిమము అకృత్రిమమును సంనిహితములయినపుడు కృత్రిమ మునే గ్రహింపవలెనని శాస్త్రము చెప్పుచున్నది. కావున, అకృత్రిమమయిన క్రియ గ్రహింప బడదు. అందువలన క్రియా గ్రహణమును ప్రత్యాఖ్యానము చేయుట కుదురదు' అనిన క్రియయు, కృత్రిమ కర్మ కావచ్చునని సమాధానము. 'కర్తకు క్రియచే ఈప్సితము గదా కర్మ. క్రియ, ఏ క్రియాంతరముచే ఆప్యమానమగును ?' అని మరల ఆక్షేపము.

సమాధానము— సందర్శనము, ప్రార్థనము. అధ్యవసాయము అనునవి, ప్రేక్షా పూర్వకారియగు = అనగా బుద్ధిపూర్వకముగ నాలోచించి ప్రవర్తించు, ప్రతి పురుషునకును ఆవశ్యకములు.

ముందుగ తన బుద్ధిలో నొక విషయమును జూచును. అది సందర్శనము.

తరువాత దానిని, తనకది సిద్ధింపవలెనని కోరును. అది ప్రార్థనము.

ఆ పిమ్మట దానిని సాధించి తీరవలెనని నిశ్చయించును. అది అధ్యవసాయము.

ఆ తరువాత తదర్థమై యత్నము, ఆ పనిని పూర్తిచేయుట. చివరకు ఫలప్రాప్తి. ఇది లోకము నందలి ప్రక్రియ. కావున సందర్శనాది క్రియలచే సంబంధించుటకు ఈప్సితమగునది ప్రకృత ధాతువాచ్యమగు, గర్హణము, సంనాహము, శయనము మున్నగు క్రియ యగునుగాన నదియు కృత్రిమ కర్మయే. ఈ సందర్శనాదులు ఆ ధాతువున కర్థములు కాదేయనిన, అవియు ధాతు వాచ్య క్రియతో అభిన్నములుగ చెప్పబడును. ఆ క్రియలకు భేదము లేనియెడల క్రియాకారక భావ మెట్లు ? అని ప్రశ్న కలుగును. ఆ ప్రశ్నకు సమాధానముగ, భాష్యకారుని ప్రత్యా ఖ్యానమును సమర్థించుచు చెప్పుచున్నాడు.

డిత్థ, దేవదత్త, మున్నగు సంజ్ఞాశబ్దములు కూడ జాతి వాచకములే కాగలవు, ఈ యభిప్రాయమునే "సర్వే" అనుపదము వ్యక్తపరచుచున్నది. ॥33॥

అవతారిక—ఎల్ల శబ్దములు జాతివాచకములే అను అర్థమునే విశదపరచు చున్నాడు.

శ్లో॥ తాం ప్రాతిపదికార్థం చ ధాత్వర్థం చ ప్రచక్షతే।
సా నిత్యా సా మహానాత్మా తామాహుస్త్వతలాదయః ॥34

1. తామ్ + చ = అట్టి సత్తనే,*ప్రాతిపదికార్థమ్ = ప్రాతిపదికములకు వాచ్యార్థమునుగా, ప్రచక్షతే = పెద్దలు చెప్పుచున్నారు

ఎల్లప్రాతిపదికములకు సత్తవాచ్యమగును. కనుకనే (ప్రాతిపదికార్థః సత్తా) అని పెద్దలు నుడివిరి.

2. తాం + చ = ఆ సత్తనే, ధాత్వర్థమ్ = ధాతువులకు వాచ్యమును గాను, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

కారకములచే క్రియలు జనియించును. అట్టి విలక్షణములగు క్రియలయందు జాతి కలదు. ఆ జాతిని ధాతువులు బోధించును.

3 సా = ఆ సత్త, నిత్యా = నిత్యమే, అనిత్యము గాదు. ఆ సత్తకు ఉత్పత్తి వినాశములు లేవు. కనుక అది నిత్యమే.

4. సా = ఆ సత్త, మహాన్ = వ్యాపకమగు, ఆత్మా = పరమాత్మయే. దానియందే జన్మ మున్నగు ఆరు భావ వికారములు కలుగుచున్నవి.

5. తామ్ = ఆ సత్తనే, త్వతలాదయః = త్వ, తల్ మున్నగు తద్ధిత ప్రత్యయములు, ఆహుః = చెప్పుచున్నవి.

ఎల్ల శబ్దములకు సత్తవాచ్యమగును. అదియే ప్రవృత్తి నిమిత్తము. ఆ ప్రవృత్తి నిమిత్తమగు సత్తను త్వ, ప్రత్యయము, తల్ ప్రత్యయము చెప్పుచున్నవి—ఘటస్యభావః = 1. ఘటత్వమ్ 2. ఘటతా, గోః భావః = 1. గోత్వమ్ 2. గోతా

ఇట్లే ఇమనిచ్-పృథోః భావః-ప్రథిమా, యత్-స్తేనస్యభావః = స్తేయమ్. (దొంగ వాని యొక్క భావము) మున్నగు ప్రత్యయములుకూడ భావరూపమగు సత్తనే బోధించును.

పై ప్రత్యయములు భావార్థమున విధింపబడినవి. భావ మనగా ప్రవృత్తి నిమిత్తము. అది సత్తయే.

---

* 1. అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్ 1-2-45 ధాతువు, ప్రత్యయము, ప్రత్యయాంతము కాని అర్థవంతమగు శబ్దము ప్రాతిపదికము. కృత్తద్ధిత సమాసాశ్చ. 1-2-46 కృదంతములు, తద్ధితాంతములు. సమాసములు కూడ ప్రాతిపదిక సంజ్ఞకములు.

శ్లో॥ భేదస్య చ వివక్షాయాం పూర్వాం పూర్వాం క్రియాం ప్రతి।
పరస్యాంగస్య కర్మత్వాత్ న క్రియాగ్రహణం కృతమ్ ॥ 131

కించ = మఱియు, భేదస్య = భేదముయొక్క, వివక్షాయాం = వివక్షలో, పూర్వాం పూర్వాం = ముందటి, ముందటి, క్రియాం ప్రతి = క్రియను గూర్చి, పరస్య=తరువాతి, అంగస్య= అంగము, కర్మత్వాత్ = కర్మ అగునుగాన, క్రియా గ్రహణమ్ = సూత్రమునందు క్రియా పదము, నకృతమ్ = గ్రహింపబడలేదు.

**తాత్పర్య విశేషాంశములు**— సందర్శనాది క్రియలు ప్రేక్షా పూర్వకారియగు ప్రతి వ్యక్తికిని ఆవశ్యకములుగాన నవి బుద్ధి సన్నిహితములయి యుండును. అవి ప్రధాన క్రియకంటె భిన్నములా? అభిన్నములా? అనిన నది వివక్షనుబట్టి యుండును.

భేదమును వివక్షించినపుడు, ఇవి పూర్వాంగములును, ప్రధాన ధాత్వర్థము ఉత్త రాంగము నగునుగాన నది కర్మ కావచ్చును. కాబట్టి "కర్మణా యమభిప్రైతి" అను సూత్ర మున క్రియాగ్రహణ మక్కర లేదను తాత్పర్యముతో "క్రియాగ్రహణం కర్తవ్యమ్" అను వార్తికము ప్రత్యాఖ్యాతము. సందర్శనాదులు ధాతు వాచ్యములు కాకున్నను సామర్థ్య ప్రాప్తములు. శబ్దబోధ్యములు కానివి గూడ కారకత్వమునకు నిమిత్తములగునా? అనిన– 'సార్థాద్ధీయతే' అను వాక్యమున, సార్థము, అపాదానముగా శబ్దముచే చెప్పబడినను, ఆక్షేపము వలన లభ్యమయిన కర్తృత్వము పథికుని కర్మత్వమునకు నిమిత్తమైనది గదా.

అదియును గాక సందర్శనాదులకును ప్రధాన క్రియకును భేదమే వాస్తవము అవి ప్రధాన క్రియార్థములగుటచే తదభిన్నముగ = అదియు నివియు నొకటే యనునట్లు అను కొనుటయే తప్ప, వాని భేదము సర్వాత్మనా తిరోహితము గాదు. కాబట్టి క్రియకును కర్మత్వ ముపపన్నమే. ॥131॥

*అవతారిక*— క్రియగూడ క్రియచే ఆప్యమానమైన, కర్మ కావచ్చునని చెప్ప బడినది. "ఓదనం పచతి" అను వాక్యమున, పచన క్రియగూడ సందర్శనము మున్నగు క్రియల సంబంధింపబడును గాన కర్మయగునా? అపు డా కర్మచేత అభిప్రేతమయిన ఓదనము గూడ సంప్రదాన మేలకాదు? అనిన చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియాణాం సముదాయే తు యదైకత్వం వివక్షితమ్।
తదా కర్మ క్రియాయోగాత్ స్వాఖ్యయైవోప చర్యతే ॥ 132

యదా తు = ఎపుడైతే, క్రియాణాం = క్రియల యొక్క, సముదాయే = మొత్తమునందు, ఏకత్వం = అభేదము, వివక్షితం = తలంపబడినదో, తదా = అపుడు, కర్మ = ఓదనాది కర్మ కారకము, క్రియాయోగాత్ = క్రియా సంబంధమువలన, స్వాఖ్యయా ఏవ = తన కర్మ సంజ్ఞచేతనే, ఉపచర్యతే = వ్యవహరింపబడును.

తాత్పర్య విశేషాంశములు— సందర్శనము మున్నగు క్రియలు, ఒకటి అంగము వేఱొకటి అంగి అను, భావములేక సమకక్ష్యలో సముచ్చితములై, వానిచే సాధింపదగిన ఫల మొకటియే యగుటవలన, అభిన్నములుగ ధాతువాచ్యము లయినపుడు, వానిలో నొకటి క్రియ, వేఱొకటి కారకము అను సంబంధము గోచరము గాదు. భేదమున్నపుడు గదా ఆ భావము కలుగునది : అపుడు పచిక్రియ కర్మగాదు. కావున తద్వ్యక్తమగు నోదనము, కర్మ గనే వ్యవహరింపబడును గాని సంప్రదానముగ వ్యవహరింపబడదని భావము. ॥132॥

అవతారిక— భేద వివక్షలో సంప్రదాన వ్యవహారము కలుగునందురా ? అనిన—

శ్లో॥ భేదాభేద వివక్షా చ స్వభావేన వ్యవస్థితా ।
తస్మాద్గత్యర్థ కర్మత్వే వ్యభిచారో న దృశ్యతే ॥ 133

భేద, అభేదవివక్షా = భేదమును, అభేదమును వివక్షించుట, స్వభావేన = ప్రయోగ స్వభావ మును బట్టి, వ్యవస్థితా = నియతమైయుండును. తస్మాత్ = అందువలన, గత్యర్థ కర్మత్వే= గత్యర్థక ధాతువుల కర్మ విషయమున, వ్యభిచారః = అతి ప్రసంగము, న దృశ్యతే = ప్రయోగములం దగపడుట లేదు.

తాత్పర్య విశేషాంశములు— లోక ప్రసిద్ధములయిన ప్రయోగముల సాధుత్వా న్వాఖ్యానమునకు శాస్త్ర ముపాయము మాత్రమే. వానిని ప్రయోగానుసారమే సంస్కరింప వలెను. అందువలన ఆ యా ప్రయోగసిద్ధిని బట్టి, సందర్శనాది క్రియలకు ప్రధాన క్రియతో భేదమునుగాని అభేదమునుగాని నియతముగనే వివక్షింపవలెను.

అది నియతము గనుకనే ''గత్యర్థ కర్మణి ద్వితీయా చతుర్థ్యౌ చేష్టాయామనధ్వని'' (2-3-12) అను సూత్రమును రచింప బనిలేదనియు, అతి ప్రసంగములు కలుగవనియు భాష్యమున నిర్ణయింపబడినది. భేద వివక్షలో గత్యర్థక ధాతువుల కర్మకు సంప్రదాన సంజ్ఞా చతుర్థీ ప్రత్యయములును, అభేద వివక్షలో కర్మసంజ్ఞా ద్వితీయలును సిద్ధించునని భావము. ॥133॥

అవతారిక— ప్రకృత విషయమును, ప్రమాణముచే దృఢపరచుచున్నాడు.

శ్లో॥ వికల్పేనైవ సర్వత్ర సంజ్ఞే స్యాతాముభేయది ।
ఆరంభేణ న యోగస్య ప్రత్యాఖ్యానం సమం భవేత్ ॥ 134

సర్వత్ర = అంతటను, ఉభే = రెండు, సంజ్ఞే = సంజ్ఞలును, వికల్పేన = వికల్పముగా, స్యాతాం ఏవయది = ప్రవర్తించినయెడల, యోగస్య = 'గత్యర్థ కర్మణి' అను సూత్రము యొక్క, ప్రత్యాఖ్యానం = నిరాకరణము = అక్కరలేదనుట, ఆరంభేణ = సూత్రారంభ ముతో, సమం = తుల్యమైన ఫలము గలది, నభవేత్ = కాకపోవును.

తాత్పర్య విశేషాంశములు— భేదా భేదముల వివక్షకు నియతి తన మనస్సునందు

స్ఫురించుట చేతనే భాష్యకారుడు "గత్యర్థ కర్మణి" అను సూత్రమును ప్రత్యాఖ్యానము చేసెను. సూత్రారంభ ప్రత్యాఖ్యానములకు ఫలభేదముండిన ప్రత్యాఖ్యానము కుదురదు. గత్యర్థక ధాతువుల విషయమున, ప్రధాన ధాత్వర్థముతో సందర్శనాది క్రియలకు భేదవివక్షా పక్షమునందు వాని కర్మకు సంప్రదాన సంజ్ఞా చతుర్థులును, అభేద పక్షమున కర్మసంజ్ఞా నిబంధన ద్వితీయయు సిద్ధించునుగాన సూత్ర మనావశ్యకమని భావము.

ఆ వివక్షకు నియతి లేనిచో సకల ధాతు విషయమునను, కర్మసంజ్ఞా సంప్రదాన సంజ్ఞలు ప్రాప్తించుచుండ, గత్యర్థకముల కర్మకే ద్వితీయా చతుర్థులు సాధువులగునను నియమమును బోధించుటకు ఆ సూత్ర మావశ్యకమయ్యేడిది. అపుడు ఆరంభమునకును ప్రత్యాఖ్యానమునకును ఫలితములో భేదము ప్రాప్తమగును.

"శ్రాద్ధాయ నిగర్హతే" - ఇట భేద వివక్షయే.

'పచత్యోదనమ్' - ఇట నభేదమే. ఇవి గత్యర్థకములు గావు.

"మనసా పాటలిపుత్రం వ్రజతి" = పాటలిపుత్ర నగరమునకు మనస్సుతో బోవుచున్నాడు. ఇట వ్రజ ధాతువు గత్యర్థకమే. సూత్ర పక్షమున, నీ గమనము చేష్టగాదు గాన చతుర్థి ప్రవర్తింపలేదు. సూత్రము లేనిపక్షమున, అభేదమే క్రియలకు వివక్షితముగాన సంప్రదానత్వము లేదనవలెను. "అధ్వానం గచ్ఛతి". ఇచటను నంతియ. సూత్రమున్న పక్షమున 'అధ్వనిన' అను ప్రతిషేధమువలన చతుర్థి రాలేదు.

'స్త్రియం గచ్ఛతి'=స్త్రీని పొందుచున్నాడు. "అజాంనయతి"=మేకను తీసికొని పోవుచున్నాడు. ఇట చతుర్థి ఏల రాలేదని శంకించి "సిద్ధంత్వ సంప్రాప్తవచనాత్" అని వార్తికకర్త సమాధానము చెప్పెను. సంప్రాప్తమనగా గమన క్రియయొక్క సంబంధము కలది. ఇచట స్త్రీ అట్టిది. స్త్రీని ఉద్దేశించి వెళ్ళుననిన, అపుడు స్త్రీ సంప్రాప్త గాదు. 'స్త్రియై గచ్ఛతి' అనవచ్చును. అట్లే, పాడుత్రోవను వదలి సన్మార్గమునకు పోదలంచిన వానిని 'ఉత్పథేన పథే గచ్ఛతి' అందురు. అట పంథ సంప్రాప్తము గాదు. 'పంథానం గచ్ఛతి' అనిన మార్గమున బోవుచున్నాడని యర్థము. పంథ సంప్రాప్తము. అసంప్రాప్త వచనము వలన, సూత్రమున "అనధ్వని" అను ప్రతిషేధముతో నిక బనిలేదని, 'అధ్వనశ్చాపవాదః' అని వార్తికకర్త సూచించినాడు. "ఆస్థిత ప్రతిషేధో వక్తవ్యః" అని భాష్యము. ఆస్థిత మనగా, గన్త అధిష్ఠించిన మార్గము. దానికే 'అనధ్వని' అను ప్రతిషేధమని భావము. ॥134॥

*అవతారిక*— 'అనధ్వని' అను ప్రతిషేధము, ఆస్థితాధ్వరూప కర్మకు చతుర్థీ ప్రతిషేధమని చెప్పబడినది. ఆ ఆస్థితాధ్వ స్వరూపము వివరింపబడుచున్నది.

**శ్లో॥ త్యాగరూపం ప్రహాతవ్యే, ప్రాప్యే సంసర్గ దర్శనమ్ ।**
**ఆస్థితం కర్మయత్తత్ర, ద్వైరూప్యం భజతే క్రియా ॥ 135**

ప్రహాతవ్యే = విడువవలసిన భాగమున, త్యాగరూపం=హీనమైన రూపముగిలది, ప్రాప్యే=

వెళ్ళవలసిన భాగమున, సంసర్గ దర్శనమ్ = సంబంధరూపమైనదియు, యత్ = ఏ, కర్మ
తత్ = కర్మకలదో, అది, అస్థితమ్ = అస్థితమగు కర్మ అయినది, తత్ర=ఆ అధ్వయందు,
క్రియా = గమన క్రియ, ద్వైరూప్యం = రెండు రూపములను, భజతే = పొందుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— ఆస్థితమనగా గమన క్రియచేత ఆక్రాన్తమయిన మార్గము. నడచుచున్న త్రోవ. ఇందు గమనక్రియ రెండు విధములు. అతిక్రమించిన భాగమున నది హీనరూపము. ఆ క్రియలో కొంత తగ్గినదనుట. ఇంకను నడువవలసిన భాగమున నది సంసర్గరూపము. అనగా ఆ క్రియకు త్యాగమును, ఉపాదానమును రెండవయవములు. అట్టి గమి క్రియచే ఆక్రాన్తమైన అనగా ఆ విధముగ నడవబడుచున్న మార్గము కర్మ సంజ్ఞకు మాత్రమే విషయము. క్రియారూపమగు కర్మచే సంబంధింపబడునది కాదు. కావున సంప్రదాన సంజ్ఞకు విషయము కాదు. అధ్వ కాని కర్మ కది సంభవించును. కావున 'గ్రామాయ గచ్ఛతి' 'గ్రామం గచ్ఛతి' అనియు వ్యవహరింపవచ్చును.

నడచుచున్న మార్గము గాక, ఆక్రమింపబోనున్నది యైన నట ద్వితీయా చతుర్థులు రెండును సాధువులే అని చెప్పబడినది. ఉదాహరణము, ''ఉత్పథేన పథే గచ్ఛతి'' దీని యర్థము వివృతపూర్వము. ॥135॥

## అపాదానాధికారము

*అవతారిక*— విభక్తుల విధాన క్రమము ననుసరించి, వాని యర్థములు విచారింపబడు చున్నవి. అందు చతుర్థ్యర్థ విచారానంతరము, అవసర ప్రాప్తము గాన పంచమ్యర్థము విచారింపబడును.

**శ్లో॥ నిర్దిష్ట విషయం కించిదుపాత్తవిషయం తథా।**
**అపేక్షిత క్రియంచేతి త్రిధాపాదాన ముచ్యతే॥** 136

కించిత్ = ఒకటి, నిర్దిష్టవిషయం = విషయనిర్దేశము గలది, తథా = ఆ విధముగ, కించిత్ = ఇంకొకటి, ఉపాత్తవిషయం = విషయోపాదానము గలది, కించిత్ = వేఱొకటి, అపేక్షిత క్రియంచ = క్రియయొక్క అపేక్ష గలది, ఇతి = అని, ఏవం = ఈ ప్రకారము, అపాదానం = అపాదానమను కారకము, త్రిధా = మూడు విధములుగా, ఉచ్యతే = చెప్పబడు చున్నది.

*తాత్పర్య విశేషాంశములు*— "ధ్రువమపాయే అపాదానమ్" (1-4-2) అను సూత్రము అపాదానమను సంజ్ఞను విధించినది. అపాయమనగా విశ్లేషము = విడివడుట. అది జరిగినపుడు, స్థిరముగ నిలిచి, ఆ విశ్లేషమున కారంభ స్థానమయినది అపాదానము. విశ్లేషమునకు కారణమైన క్రియ వేఱొక దానియందుండును. ఈ అపాదానమునకు 'అవధి' అనియు వ్యవహారము.

"గ్రామాదాగచ్ఛతి దేవదత్తః" = దేవదత్తుడు ఊరినుండి వచ్చుచున్నాడు, అనిన, దేవదత్తునకు ఊరినుండి విశ్లేషము కలిగినది. ఆ విశ్లేషమున కాశ్రయము ఊరు. ఆ విశ్లేషము కలుగు పని చేసినవాడు దేవదత్తుడు. కాగా విశ్లేషమున కాశ్రయమై, దానికి హేతువయిన క్రియకు ఆశ్రయము కాని దెయ్యదియో అది అపాదానమని తేలినది.

ఇట నీ విశ్లేషమునకు సాధనములు రెండు. అందొకటి సంరబ్ధ సాధనము. అదియే విశ్లేషకారణమయిన క్రియను చేయునది కర్త అని అర్థము. రెండవది ఉదాసీన సాధనము. ఆ పని చేయక, ఆ విభాగమున కవధిగ నుండుట మాత్రమే పనిగా గలది. అది గ్రామము.

ఇట్లు సంరబ్ధ, ఉదాసీన సాధన సాధ్యమయిన విశ్లేషము లేదా విభాగము లేదా అపాయము అనునది ఒకచో నిర్దేశింపదగి యుండును. అది నిర్దిష్టవిషయమయిన అపాదానము మొదటిది. 'గ్రామాదాగచ్ఛతి' అనుచోట గ్రామము. 'పర్వతాదవరోహతి' = కొండ నుండి దిగుచున్నాడు, అనుచోట పర్వతమును దాని కుదాహరణములు.

రెండవది ఉపాత్త విషయము. ఉదాహరణము— "వలాహకాత్ విద్యోతతే విద్యుత్" = మేఘము నుండి మెఱపు మెఱయుచున్నది, అనునది. ఇట వలాహకము ఉపాత్తవిషయ మగు అపాదానము. ఇచట క్రియలు రెండు. నిస్సరణము. విద్యోతనము. అందొకటి అంగము వేఱొకటి అంగి. నిస్సరణమంగముగా గల విద్యోతనముగాని, విద్యోతన మంగముగాగల నిస్సరణముగాని ధాతువున కర్థము. క్రియాంతరము అంగముగగాని అంగిగగాని గ్రహింపబడి యున్న స్థలమునందలి అపాదాన కారకము ఉపాత్త విషయము.

మేఘమునుండి మెఱపు మెఱయుచున్నదనిన మేఘము వేఱును, మెఱపు వేఱును అని స్ఫురించును. మేఘమనగా ధూమము, జ్యోతి, సలిలము, మరుత్తు - వీని సంనిపాతము= సమూహము. దానికిని దాని అవయవమునకును భేదమును భావించి, విభాగమును కల్పించుటచే దాని కవధి వలాహకము.

'మేఘమునుండి నిస్సరించి = బయలు వెడలి విద్యుత్తు మెఱయుచున్నది' అని గాని, 'విద్యుత్తు, మేఘముననుండి మెఱసి నిస్సరించుచున్నది' అనిగాని అర్థము. "కుసూలాత్ పచతి" ఇంకొక యుదాహరణము. కుసూలమునుండి వండుచున్నాడనిన నేమి యర్థము? కుసూలమనగా పౌఁతక లేదా గరిసె. ధాన్యము పోసి పెట్టుకొనునది. అందుండి తీసి వంట చేసికొనుచున్నాడనుట. పచధాతువున కిచట ఆదానమంగముగాగల పాక మర్థముగాన నిదియును, ఉపాత్తవిషయమను అపాదానమునకు ఉదాహరణము.

ఇంకను నొక యుదాహరణము "బ్రాహ్మణాచ్ఛంసీ" అనునది. బ్రాహ్మణమను గ్రంథమునుండి గ్రహించి మంత్రములను పఠించుచున్నాడని అర్థము. గ్రహణ క్రియ అంగముగాగల శంసన క్రియ ప్రధానధాత్వర్థము. "పంచమీ ప్రకరణే బ్రాహ్మణాచ్ఛంసిన ఉపసంఖ్యానమ్" అను వార్త్తికముచే పంచమీ ప్రత్యయమునకు 'అలుక్'. "అన్యార్థే చ" అను వార్త్తికాంతరమును గలదు. ద్వితీయార్థమున నట పంచమి యనియు, బ్రాహ్మణములను

జెప్పుచున్నాడని యర్థమనియు ఆ వార్తికకారుని తాత్పర్యము. ఆ మతమున నిది యుదాహరణము కాదు.

అపేక్షిత క్రియమనునది మూడవ అపాదానము. వాక్యమున క్రియాపద ముచ్చరింపబడి యుండదు. అది అనుమితమగును. అట్టి అనుమిత క్రియకు ఆశ్రయమయిన ద్రవ్యమునకు అపాదాన సంజ్ఞ కలిగినచో, అది అపేక్షిత క్రియాపాదానము. ''మాధురాః పాటలిపుత్రకేభ్యః ఆఢ్యతరాః'' అను వాక్యమున 'పాటలిపుత్రకేభ్యః' అనునది యుదాహరణము. మధురానగరము నందలివారు పాటలీపుత్ర వాసులకంటె మిక్కిలి సంపన్నులు. ఆఢ్యతరాః అనుచో తరప్ ప్రత్యయము ప్రకర్షను తెలియజేయును. దానివలన మాధురులకు వేరుపాటు గమ్యమగుచున్నది. పాటలిపుత్రకులనుండి అపకర్షింపబడిన మాధురులు' అని అనుమితమైన అపకర్షణ క్రియాపేక్షమైన అపాదానమనుట. అపకర్షణమనగా విభాగమే.

''వలాహకో విద్యోతతే'' = మేఘము మెఱయుచున్నది అనుచోట విద్యోతనమునకు నిస్సరణము అంగము కాదు. కాని పంచమీ ప్రయోగమున నిస్సరణ మంగముగాగల విద్యోతనము ధాత్వర్థము. ధాతువు లనేకార్థములుగదా. పంచమివలన విభాగము ప్రతీతము. నిస్సరణ మంగముగాగల విద్యోతనము ధాత్వర్థమని చెప్పిననే అది ఉపపన్నమగును. 'వలాహకాత్' 'కుసూలాత్' 'బ్రాహ్మణాత్' పంచమీ శ్రవణమువలన నట్లు చెప్పక తప్పదు. ॥136॥

అవతారిక— అపాయమనగా గతి మాత్రము కాదు. గతిలో విశేషము.

శ్లో॥ సంయోగి భేదాద్భిన్నాత్మా గమిరేవ భ్రమిర్యథా ।
భ్రువావధిరపాయోఽపి సమవేత స్తథాఽధ్రువే ॥ 137

భ్రమిః = తిరుగుట యనునది, యథా = ఏ విధముగా, సంయోగి భేదాత్ = ప్రదేశ భేదము వలన, భిన్నాత్మా = భిన్నరూపమయిన, గమిః ఏవ = గమనమే యగునో, తథా = ఆ విధముగ, అధ్రువే = చలమైన పదార్థమునందు, సమవేతః = సంబద్ధమై, ధ్రువావధిః = స్థిరమయిన అవధిగల, అపాయః అపి = అపాయమును, గతి విశేషమే.

తాత్పర్య విశేషాంశములు— గమనమనగా నొకచోటు వదలి పై చోటుతో సంయోగము భ్రమణమనగా తిరుగుట. అదియు అట్టిదే. అనగా దిగ్విశేషావచ్ఛేదమున గలుగు విభాగ సంయోగరూపమే. కాణాదులు, ఉత్క్షేపణ అపక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనములు— అని క్రియలు అయిదు రకములని చెప్పి, భ్రమణము, రేచనము మున్నగు క్రియలు గమన విశేషములే కావున, వానికి గమనమునందే, అంతర్భావమనిరి ఆ విధముగనే అపాయము అనునదియు నొక గతి విశేషము. దీనిని సంభవింప జేయు క్రియ పర్ణమునందుండును. ఆ క్రియ లేనిది విశ్లేషమున కవధియగు వృక్షము. అది ఉదాసీన కారకమని చెప్పబడినది.

సంయోగ విభాగములు రెండును ద్వినిష్ఠములు ఒకదాని నుండి ఒకటి విడివడుట

విభాగము. ఒకదానితో నొకటి కలియుట సంయోగము. ఆ అపాయము లేదా విశ్లేషము కలిగి నపుడు స్థిరముగ నుండుటయే దాని కారకత్వము. స్థిరమనగా ఱాయివలె కదలకుండ నుండు నది అని అర్థము కాదు. ॥137॥

అవతారిక— ఆ విషయమే యీ కారికలో నుపపాదింపబడుచున్నది.

శ్లో॥ ధ్రువ్యస్వభావో న ధ్రౌవ్యమితి సూత్రే ప్రతీయతే ।
అపాయవిషయం ధ్రౌవ్యం యత్తు తావత్ వివక్షితమ్ ॥ 138

సూత్రే = 'ధ్రువమపాయే' అను సూత్రమునందు, ధ్రౌవ్యం = స్థిరత్వమనగా, ద్రవ్య స్వభావః = స్వభావమైన నిశ్చలత, ఇతి = అని, న ప్రతీయతే = ప్రతీతము గాదు, అపాయ విషయం = విశ్లేషము కలుగవలసినపుడు, ధ్రౌవ్యం = ధ్రువత్వము = అవధిగానుండుట, యత్ తు = ఏది కలదో, తావత్ = అంతయే, వివక్షితమ్ = వివక్షింపబడినది.

తాత్పర్య విశేషాంశములు— లోకములో ధ్రువత్వమనగా 'ఇనుపగుండువలె కదలనిది' అను భావము ప్రసిద్ధము కాని 'ధ్రువమపాయే' అను సూత్రమున ఆ అర్థము కాదు తీసికొనవలసినది. విభాగము కలిగినపుడు, అది ఎచటనుండి కలుగుచున్నదో అది ధ్రువము అని మాత్రమే సూత్రకారుని తాత్పర్యము. కనుకనే, అవధిభూతములయినవి గతి యుక్తములైన వానికి అపాదాన సంజ్ఞ ఎట్లు సిద్ధించునని శంకించి, ఆ అస్థిరత్వముగాదిచట వివక్షింపబడినది అని మహాభాష్యమున శంకా పరిహారములు కలవు.

''గతియుక్తేష్వపాదానసంజ్ఞా నోపపద్యతే అధ్రువత్వాత్
న వా, అధ్రౌవ్యస్య అవివక్షితత్వాత్'' అని వార్త్తికములు.

''ధావతః అశ్వాత్ పతితః'' = పరుగెత్తుచున్న గుఱ్ఱమునుండి పడినవాడు. ''సార్థాత్ గచ్ఛతః హీనః'' = నడచి వెళ్ళుచున్న బాటసారుల గుంపునుండి విడివడినవాడు అను వాక్యములందు అశ్వము పరుగెత్తుచున్నదైనను, సార్థము నడచుచున్నదైనను, ఆ విధమైన అస్థిరత ఇచట వివక్షింపబడదు. ఒక సంరబ్ధ సాధనమును, ఒక ఉదాసీన సాధన మును కలసి సాధించిన కార్యములో ఉదాసీనముగ నుండుట మాత్రమే ధ్రువత్వమని వాని భావము.

ఒక శంక— గ్రామా దా గచ్ఛతి పథా పర్వతమ్ = గ్రామమునుండి, త్రోవ వెంబడి కొండను జేరుచున్నాడు, అను వాక్యమున పంథయు, పర్వతమును, విశ్లేషము గ్రామమునుండి కలిగినపుడు ఉదాసీనములయి యున్నవి గదా వాని కేల అపాదాన సంజ్ఞ కలుగలేదు.

సమాధానము— కర్మ, కరణ సంజ్ఞలు, అపాదాన సంజ్ఞకంటె పరములగుటచేత నవి అపాదాన సంజ్ఞను బాధించును. ''అపాదాన ముత్తరాణి కారకాణి బాధన్తే'' అని వార్త్తి కము. అష్టాధ్యాయీ పాఠమునందు, మొట్టమొదటిది అపాదానము. ఇతర కారకములన్నియు తరువాతివి.

ధనుషావిధ్యతి = వింటితో గొట్టుచున్నాడందురు. వింటినుండి బాణమును దీసి కొట్టునుగదా. కాన విల్లు ఉపాదానము కాదగియున్నది. పరమైన కరణసంజ్ఞ దానిని బాధించినది.

''గాందోగ్ధి'' = ఆవును పితుకుచున్నాడందురు. ఆవునుండి పాలను బితుకును కాన ఆవు అపాదానము కాదగియున్నను, కర్మసంజ్ఞ అష్టాధ్యాయీ సూత్ర పాఠక్రమములో పరమగుట వలన దానిని బాధించినది. ''కంసపాత్ర్యాం భుంక్తే''=కంచమునందు దినుచున్నాడు. కంచమునుండి అన్నమును దీసికొని తినుచున్నాడు అనుట కంచమపాదానము. దాని నధికరణ సంజ్ఞ బాధించినది.

కాగా, ప్రకృతమున విశ్లేషమున కాశ్రయమైనది చలమైనను అచలమైనను ధ్రువమే. విశ్లేషమునకు కారణమైన క్రియ దానియందు లేకుండుటయే దాని ధ్రువత్వమని భావము.॥138॥

అవతారిక— ప్రకృతాంశ వివరణ రూపమే ఈ కారిక.

**శ్లో॥ సరణే దేవదత్తస్య ధ్రౌవ్యం పాతే తు వాజినః ।**
**ఆవిష్టం యదపాయేన తస్యా ధ్రౌవ్యం ప్రచక్షతే ॥ 139**

సరణే = శీఘ్రగతిలో, దేవదత్తస్య = దేవదత్తునకును, పాతేతు = పడుటలో, వాజినః ధ్రౌవ్యమ్ = అశ్వమునకును, ధ్రువత్వము, అపాయేన = విభాగ హేతువైన క్రియచే, యత్, ఆవిష్టం = ఏది ఆవేశింపబడినదో, తస్య, అధ్రౌవ్యం = దానికి, అధ్రువత్వమును, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్య విశేషాంశములు— ''ధావతః అశ్వాత్ పతితః దేవదత్తః'' ఇచట పరుగు సరణము. అది గుఱ్ఱము పని. పరుగెత్తుచున్నదిగాన అధ్రువము. పడిన దేవదత్తుడు పరుగెత్త లేదు. కాన నాతనికి ధ్రువత్వమే. పాతమనగా పతనము. అదియే ఉత్తరదేశ సంయోగము. అది కలుగుటకు పని చేయువాడు దేవదత్తుడు. పడినది అశ్వమునుండి కనుక అశ్వము పరుగెత్తుచున్నను, అది దేవదత్త వ్యాపారమున, ధ్రువమే. గుఱ్ఱము పరుగెత్తుచున్నను దేవదత్తుడు పరుగెత్తలేదుగాన అతనికిని ధ్రువత్వమే యున్నను, అతనికి అపాదాన సంజ్ఞ కలుగదు. ఏలయన - అవధిగా నాతడు నిర్దేశింపబడలేదు గదా. అపాయమనగా గతి మాత్రము కాదు. ''గతిర్వినా త్వవధినా నాపాయ ఇతి కథ్యతే'' అని ముందు చెప్పబడును. ''సరతో దేవదత్తాత్ ధావత్యశ్వః'' = ''పరుగెత్తుచున్న దేవదత్తుని వద్దనుండి అశ్వము పరుగిడుచున్నది'' అని వాక్యవిన్యాస మున్నదనుకొనుడు. అపుడు దేవదత్తున కా సంజ్ఞ కలుగును.॥139॥

అవతారిక— ఇక నెచట రెండు పదార్థములును పరిస్పందములే, అనగా చలనముగలవియే అయినపుడు ధ్రువాధ్రువ విభాగము ఎట్లనిన—

**శ్లో॥ ఉభావప్య ధ్రువౌ మేషౌ యద్యప్యుభయ కర్మజే ।**
**విభాగే ప్రవిభక్తేతు క్రియే తత్ర వివక్షితే ॥ 140**

యద్యపి = విచారింపగా, ఉభయకర్మజే = రెండు క్రియలవలన కలిగిన, విభాగే = విశ్లేషము నందు, ఉభౌ అపి = క్రియాశ్రయములైన రెండు, మేషౌ = మేషములును, అధ్రువౌ = స్థిరములు కావనుకొనుడు, కింతు, తత్ర = కాని, అచట, క్రియే = విభాగ జనక క్రియలు, ప్రవిభక్తే = భిన్న భిన్నములుగనే, వివక్షితే = వివక్షింపబడును.

తాత్పర్య విశేషాంశములు— "స్థాణోః శ్యేనః అపసర్పతి" స్థాణువనగా బండ. లేదా కట్టుదుంగ. దానినుండి డేగ తొలగుచున్నది. ఇచట విభాగము శ్యేన వ్యాపారము వలన కలిగినది. కనుక స్థాణువు ధ్రువము.

"అపసర్పతో మేషాత్ మేషోపసర్పతి". రెండు గొఱ్ఱెలు ఢీకొనును. మరల నొకదాని నుండి మఱియొకటి దూరముగ తొలగి మరల ఢీకొనును. అచట కలుగు విభాగము రెండు గొఱ్ఱెల వ్యాపారము వలనను జరిగినది. కావున రెండును అధ్రువములే. కాని ఆ గొఱ్ఱెలు వేఱు. వాని వ్యాపారములును భిన్న భిన్నములు. దీని క్రియలో నది అవధి. దాని క్రియలో, ఇది అవధి. కనుక ధ్రువాధ్రువ విభాగ ముపపన్నము. ॥140॥

అవతారిక— అందువలన,

శ్లో॥ మేషాంతర క్రియాపేక్ష మవధిత్వం పృథక్ పృథక్ ।
మేషయోః స్వక్రియాపేక్షం కర్తృత్వం చ పృథక్పృథక్ ॥ 141

మేషయోః = రెండు గొఱ్ఱెలకును, మేషాంతర క్రియాపేక్షం = తమలో రెండవదాని క్రియను బట్టి, అవధిత్వం = అవధి అగుటయు, పృథక్ పృథక్ = వేఱు వేఱు, స్వక్రియాపేక్షం = తమతమ క్రియలనుబట్టి, కర్తృత్వంచ = కర్తలగుటయు, పృథక్ పృథక్ = వేఱువేఱుగనే సంభవము.

తాత్పర్య విశేషాంశములు— ఒక గొఱ్ఱెయందలి క్రియనుబట్టి విభాగము కలిగినపుడు రెండవది అవధి యగును. ఆ రెండవదాని క్రియవలన విశ్లేషము కలిగినపుడు మొదటిది అవధి యగును. ఆ విధముగనే తమ తమ వ్యాపారములకు తా మాశ్రయమగుట వలన, కర్తృత్వమును సిద్ధించును. ॥141॥

అవతారిక— మేషములకు పరస్పరము అవధి భావమును వివక్షింపక, వేఱొక దానిని విశ్లేషావధిగా గ్రహించినపుడు ఆ మేషములు కర్తలుగా మాత్రమే ఉండును.

శ్లో॥ అభేదేన క్రియైకా తు ద్విసాధ్యా చే ద్వివక్షితా ।
మేషావపాయే కర్తారౌ యద్యన్యో విద్యతేఽవధిః ॥ 142

ద్విసాధ్యా = రెండింటిచే సాధింపదగిన, ఏకాక్రియా = ఒక క్రియ, అభేదేన తు = ఏకముగనే కాని, వివక్షితా చేత్ = వివక్షింపబడినను, అన్యః = వేఱొకటి, అవధిః = అవధిగా, విద్యతే యది = ఉన్నయెడల, తదా మేషౌ = అపుడు మేషములు రెండును. అపాయే = విభాగములో, కర్తారౌ భవతః = కర్తలు అగును.

తాత్పర్య విశేషాంశములు— "మేషౌ అపసర్పతః" = గొఱ్ఱెలు రెండు తొలగు చున్నవి. ఈ వాక్యమున అపసర్పణమను క్రియ ఒకటియే. ఆ క్రియను జేయునవి రెండు. అపసర్పణమున కవధి వేఱొకటి అనగా పర్వతము. పర్వతము దగ్గరనుండి దూరముగ బోవుచున్నవి లేదా 'పరస్పరతః మేషౌ అపసర్పతః' = ఒకదాని నొకటి విడచి దూరముగ బోవుచున్నవి. అపుడు 'పరస్పరము' అవధి. అపసర్పణమను క్రియ ఇచట తిఙన్తపదముచే ఒకటిగనే చెప్పబడినది. కర్తలు వేఱు, అగుట వలన, క్రియకు భేదప్రతీతి. ॥142॥

అవతారిక— పై విషయమునకు భాష్య గ్రంథ సంవాదము జూపబడుచున్నది.

శ్లో॥ గతిర్వినాత్వవధినా నాపాయ ఇతి కథ్యతే ।
వృక్షస్య పర్ణం పతతీత్యేవం భాష్యే నిదర్శితమ్ ॥ 143

అవధినా వినా = అవధి లేకుండగ, గతిస్తు = గతి మాత్రము, అపాయః ఇతి = అపాయ శబ్దార్థమని, న గమ్యతే = తోచదు, "వృక్షస్య పర్ణం పతతి" = చెట్టుయొక్క ఆకు పడు చున్నది, ఇతి ఏవమ్ = అనియే, భాష్యే = మహా భాష్యమున, నిదర్శితమ్ = ఉదాహరింప బడినది.

తాత్పర్య విశేషాంశములు— "కారకే" (1-4-23) అను సూత్రమున మహా భాష్యములో నిట్లు ప్రశ్నోత్తరములు గలవు.

'కారకే' అను సప్తమి కేమి యర్థము? అని ప్రశ్న.

'ఇది ప్రథమకు బదులు సప్తమి. అందువలన "కారకమ్" అనియే సంజ్ఞాపదము' అని సమాధానము.

దేనికిది సంజ్ఞ? సంజ్ఞి నిర్దేశింపబడలేదే? కాబట్టి, 'సాధకమగునది' లేదా 'నిర్వ ర్తక మగునది' కారకమను సంజ్ఞ కలది అని, సంజ్ఞిని గూడ నిర్దేశింపవలెను. లేనిచో క్రియా జనకము కానిది కూడ కారకమను సంజ్ఞ కలది కావలసి వచ్చును. ఎట్లనగా—

"వృక్షస్య పర్ణం పతతి" = చెట్టు ఆకు రాలుచున్నది అందురు. ఈ వాక్యమున వృక్షము పర్ణమునకు విశేషణము. దానికి క్రియతో సంబంధము లేదు. కాగా క్రియాజనకము గాదు. సూత్రమున సంజ్ఞిని నిర్దేశింపనిచో నిట వృక్షమును అపాదానకారకము కావలసి వచ్చును అను నాశయముతో నిట్లు శంకింపబడినది.

వా॥ "కారక ఇతి సంజ్ఞా నిర్దేశశ్చేత్ సంజ్ఞినో నిర్దేశః"
"ఇతరథాహ్య నిష్టప్రసంగో గ్రామస్య సమీపాదాగచ్ఛతీత్సకారకస్య"
"అపాదానం చ వృక్షస్య పర్ణం పతతీతి"

ఇవి మూడును అచటి వార్తికములు.

విశేషాంశము.— ఈ కారికలో మహాన్ అను పదము కపిలసాంఖ్యమున నంగీకరింప బడిన మహత్ తత్త్వమును సూచించు చున్నది. ఆశాస్త్రమున బుద్ధికి మహత్ అని వ్యవహారము. అదియే ఎల్ల జగములకు కారణము. ఎల్లవికారములకు నిదానము. సత్త అట్టి మహత్తు కనుక ఇది వ్యాపకమనుట సమంజసమే ! ఆ యంశమును హేలారాజు వ్యక్తపరచెను. ॥34॥

**అవతారిక**— ఆ సత్తనే ప్రాతిపదికమునకు, ధాతువునకు వాచ్యమైన దానినిగా పెద్దలు చెప్పుచున్నారని 34 వ శ్లోకమున చెప్పబడినది. దానినే వ్యక్తపరచు చున్నాడు.

**శ్లో॥ ప్రాప్తక్రమా విశేషేషు క్రియా సైవాభిధీయతే।**
**క్రమరూపస్య సంహారేతత్సత్త్వమితి కథ్యతే॥ 35**

A. విశేషేషు = విశేషముల యందు, అనగా వండుట, నడచుట, చదువుట మున్నగు వ్యక్తి రూపమగు క్రియా విశేషములయందు, ప్రాప్తక్రమా = పొందబడిన క్రమము, అనగా పౌర్వాపర్యముకల, సా + ఏవ = ఆ జాతియే, క్రియా + ఇతి = క్రియ అని, అభిధీయతే = చెప్పబడుచున్నది. కారకముల కదలిక (కలయిక) వలన క్రియలు జనియించు చున్నవి. వాని యందు పౌర్వాపర్యము అనగా ముందు వెనుకలు వివక్షితములగుచో, అట్టి వ్యాపారముల మొత్తమును క్రియ అని యందురు. అట్టిపౌర్వాపర్యము జాతియందుకూడ కలుగును. పూర్వా పరభావము వివక్షితమగుచో అ సత్తాజాతియే క్రియ యగును. అదియే సాధ్యమని వ్యవహ రింపబడును. ఇట్టి యర్థము ధాతువులకు వాచ్యమగును. క్రియావచనోధాతుః.

B. క్రమరూపస్య = క్రియలయందున్న క్రమమునకు, సంహారే = సంహారము కలుగగా అనగా అవివక్ష కలుగగా, తత్ = ఆ జాతియే, సత్త్వమ్ + ఇతి = సత్త్వము అనగా ద్రవ్యము, సిద్ధము అని, కథ్యతే = చెప్పబడుచున్నది.

క్రమమును వివక్షింపని యెడల ఆ జాతియే సిద్ధ పదార్థమగును. ఆట్టిసిద్ధపదార్థమే సత్త్వము. అది జాతియే. సత్త్వవాచినామ. నామవాచకము సత్త్వమును బోధించును.

కాగా పదార్థము రెండు విధములు-1. సాధ్యము, 2. సిద్ధము. క్రియలకు పౌర్వా పర్యము వివక్షితమగుచో సాధ్యమనియు, దానిని వివక్షింపనిచో సిద్ధమనియు శాస్త్రములు చెప్పుచున్నవి. జాతియే వివక్షావశమున రెండు రూపములను ధరించు చున్నది. సాధ్యమగు అర్థమును చెప్పునది ధాతువు. సిద్ధమగు అర్థమును చెప్పునది. ప్రాతిపదికము. ॥35॥

అవతారిక— క్రియలన్నియు సత్తయొక్క వివర్తములే యను నర్థమున నిరుక్త కారుని సంవాదమును జూపుచునాడు.

**శ్లో॥ సైవభావ వికారేషు షడవస్థాః ప్రపద్యతే।**
**క్రమేణ శక్తిభిః స్వాభిరేవం ప్రత్యవభాసతే॥ 36**

సా + ఏవ = అ సత్తయే, భావవికారేషు = సద్రూపమగు పదార్థముయొక్క వివర్తములలో, షట్ = ఆరు, అవస్థాః = అవస్థలను, ప్రపద్యతే = పొందుచున్నది. ఆ సత్తయే

ఇవి వార్తికములు గదా 'భాష్యే నిదర్శితమ్' అని కారికలో చెప్పబడినదేమి ? అని శంక కలుగవచ్చును. కాని భాష్యమనగా వార్తిక సహితమే అని తాత్పర్యము కానోపును.

వా॥ "న వా అపాయస్య అవివక్షితత్వాత్" అని పరిహార వార్తికము.

ఇట అపాయము వివక్షితము కాదు. సంబంధము వివక్షితము. అవధి సాపేక్షమగు గతియే అపాయముగా దీసికొనబడును. అవధిత్వమును వృక్షమునకు ప్రయోక్త భావించినచో నపుడు 'వృక్షాత్ పర్ణం పతతి' అనియే ప్రయోగించును. కాని అపుడు ఆ ప్రయోగమువలన, ఆ పర్ణము దేనిదో తెలియకపోవచ్చును. అది కంకపర్ణమా ? లేక కురరపర్ణమా పడినది ? అని శంక కలుగును. కంకము, కురరము అనునవి పక్షులు. కంకము = రాపులుగు. కురరము లకుముకి పిట్ట. వాని ఱెక్క చెట్టునుండి పడుచున్నదని యర్థము కావచ్చును. 'ఆ చెట్టు ఆకు' అని అర్థము కాకపోవును. కావున పర్ణమునకు విశేషణముగా వృక్షము భావింపబడినది. కనుకనే పర్ణము చెట్టును వదిలిపెట్టకుండగ కొమ్మ వంగి. నేలకు రాచుకొనినపుడు గూడ ఆ ప్రయోగము సంభవసు.

ఏతావతా తేలిన విషయము— 'సావధికమగు గతియే' అపాయమనబడును. శుద్ధ గతిమాత్ర మపాయము కాదు. విభాగపూర్వక సయోగము కలిగినపుడు అవధి యుండి తీరును. అదియే సూత్రమునందలి ధ్రువపదమున కర్థము. అది ఉదాసీనమైన కారకము.॥143॥

అవతారిక— "వలాహకాత్ విద్యోతతే విద్యుత్" = మేఘమునుండి మెఱపు మెఱయు చున్నది. "వలాహకే విద్యోతతే విద్యుత్" = మేఘమునందు, మెఱపు మెఱయు చున్నది. "వలాహకః విద్యోతతే" = మేఘము మెఱయుచున్నది.

అని మూడు విధములయిన ప్రయోగములును లోకమున గలవు. ఇందు, మొదటి వాక్యమున వలాహక మపాదానము. రెండవ వాక్యమున అధికరణము. మూడవ వాక్యమున నది కర్త. ఇట్లు మూడు శక్తులకు ఒకచో సమావేశ మెట్లు సంభవము ? తరువాతి సంజ్ఞలచే అపాదాన సంజ్ఞ బాధింపబడవలెను గదా ! "అపాదాన ముత్తరాణి" అనువార్తికము, విప్రతిషేధమును బోధించుచున్నది గదా యనిన—

శ్లో॥ భేదాభేదౌ పృథగ్భావః స్థితిశ్చేతి విరోధినః ।
యుగపన్న వివక్ష్యన్తే సర్వే ధర్మా వలాహకే ॥ 144

భేదాభేదౌ = భిన్నత్వ ఏకత్వములు, పృథగ్భావః = వేఱుపాటు, స్థితిః చ = సంయోగము. ఇతి = అని ఇట్లు, విరోధినః = విరుద్ధములయిన, సర్వే = అన్ని, ధర్మాః = ధర్మములును, వలాహకే = మేఘమునందు, యుగపత్ = ఏకకాలముననే, న విక్ష్యన్తే = వివక్షింపబడవు.

తాత్పర్య విశేషాంశములు— ఏక కాలముననే భిన్న శక్తి యోగము, భావింప బడలేదు. మేఘమన పొగ, వెలుగు, నీరు, గాలి - అనువాని సంఘాతము. దాని ఒక అవ

యవము వెలుగు. అదియే మెఱయునది. దానిని సంఘాతము కంటె వేఱుగా తీసికొనిన, పృథగ్భావము. ఆ వేఱుపాటును వివక్షించినపుడు అదియే అపాయమనబడుసు గాన 'వలాహకాత్ విద్యోతతే విద్యుత్' అని వ్యవహారము. అపుడు వలాహకము ఉపాత్త విషయాపాదానము.

ఆ తేజస్సు అందుండి వేఱుపడినను, నిరాధారముగ నుండజాలదు గాన నది మేఘమునందే యుండునదిగా భావించినపుడు 'వలాహకే విద్యోతతే విద్యుత్' అందురు మేఘము జలపూర్ణము గదా. తేజస్సున కది ఆధార మెట్లగును? అని శంకింపవచ్చును గాని విద్యుత్తు రూపమగు అగ్నికి నీరే ఇంధనముగాన నది సంభవమే. ఈ విధముగ మేఘమునకును విద్యుత్తునకును భేద పక్షమున, మేఘమునకు అధికరణశక్తి, అపాదానశక్తి అని రెండు శక్తు లుద్భవించును. అపుడు తేజస్సు స్వతంత్రముగ ప్రకాశింపదు. దానికి కారణము, ఉదకముతో చేరి యుండుట, ధూమముచేత నావిలమగుటయు నగును.

ఇక 'వలాహకో విద్యోతతే' అను వాక్య సంనివేశమున, మేఘమునకు కర్తృ శక్తియే ఉద్భూతము = ప్రకటనము. మేఘము అతి స్వచ్ఛమగు ద్రవ్యము. అందుండు ఉదకము తేజస్సును ప్రకాశింపకుండ ప్రతిబంధింపదు. ప్రకాశించునది అవయవమే అయినను అవయవి ప్రకాశించునందురు. ఈ ఉపవసము చిగిర్చినదందుము. చిగిరించినవి చెట్లు. వనము వాని సమూహము.

ఇట్లు, వలాహకమునకు, పర్యాయముగనే, కర్తృ, అపాదాన, అధికరణ శక్తులు కలుగును గాని ఏకకాలమున గాదు. కావున భాష్య గ్రంథమున ప్రదర్శితమైన సమావేశము విరుద్ధము గాదు. ॥144॥

*అవతారిక*— ''ధనుషా విధ్యతి'' మున్నగు విప్రతిషేధోదాహరణములందు శక్తి ద్వయమునకును ఏకకాలమునందే సమావేశము వివక్షితమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధనుషా విధ్యతీత్యత్ర వినాఽపాయ వివక్షయా ।**
**కరణత్వం యతో నాస్తి తస్మాత్తదుభయం సహ ॥** 145

'ధనుషావిధ్యతి' = 'వింటితో కొట్టుచున్నాడు' ఇత్యత్ర = అను నీ వాక్యమున, అపాయ వివక్షయా వినా = అవధిత్వ వివక్ష లేనిచో, కరణత్వం = సాధకతమత్వము, యతః నాస్తి = ఎందువలన నుండబోదో, తస్మాత్ = ఆ కారణమువలన, తత్ ఉభయం = ఆ కరణత్వ అవధిత్వములు, సహ = ఆ ద్రవ్యమున కలిసియే యుండును.

తాత్పర్య విశేషాంశములు— ధనుస్సు తననుండి వెలువడు బాణమునకు అవధి. కొట్టుటకు నిమిత్తము. కావున రెండు కారక శక్తులును దానికి ఉండును. ఆ శక్తుల కార్యములు పంచమీ తృతీయలు. అవి రెండును ఒక ప్రాతిపదికమునకు పరముగా సంభవింపవు. శక్తులకు విరోధములేకున్నను వాని కార్యములకు విరోధముండుటవలన కార్యముఖముగా వానికి విరోధముండుటవలన, కరణసంజ్ఞ పరత్వమువలన అపాదాన సంజ్ఞను బాధించినది.

'కంసపాత్ర్యాం ఓదనం భుంక్తే' = కంచు కంచములో నన్నమును దినుచున్నాడు. ఇది భాష్యోదాహరణము. కారికోక్తోదాహరణము ఉపలక్షణమనుట కంచమున దినుట యన, అందున్న అన్నమును దినుటగదా. కంచ మన్నమున కాధారము. అందుండి తీసి అన్నమును దినునుగాన నది అపాదానమును నగును. అపాదానము కాకున్న ఆధారమును గాదు. ఏలయన ఏనుగు పర్ణపుటమునందున్న అన్నమును ఆ ఆకుదొప్ప తోడనే నోటిలో పడవేసికొనినపుడు పర్ణమునందు దినుచున్నదని వ్యవహరింపరు గదా. కావున అధికరణత్వ వివక్షకు అపాదానత్వ వివక్ష నిమిత్తము. కావున నేకకాలమున శక్తిద్వయ వివక్షయును, పరత్వమువలన అధికరణ సంజ్ఞ అపాదాన సంజ్ఞను బాధించుటయు, సుష్ఠు, ఉపపన్నములు.

''గాం దోగ్ధి'' అనుసదియు నుదాహరణాంతరము = ఆవును బిదుకుచున్నాడనిన, ఆవునుండి పాలు తీయుచున్నాడని యర్థము గదా. పాలు గోవునుండి జారవలె. అది జరుగ నిచో పితుకుట కుదరదు. గోవునందున్న కర్మత్వ శక్తి అపాదాన శక్తితో కలిసి యుండు నదియే. కాని శక్తికార్యములయిన విభక్తుల విరోధ మూలముగ శక్తులకు ప్రబలదుర్బల భావ విచారము ప్రసక్తము.

''ధనుర్విధ్యతి''= విల్లు కొట్టుచున్నది అనియు నందురు. అచట విల్లు అపాదానము కాకున్న దానికి వ్యధనమునందు స్వాతంత్ర్యము కలుగదు. ఇచట కర్తృశక్తి అపాదానశక్తికి బాధకమైనది. ॥145॥

*అవతారిక*— రెండు కారకశక్తులు అవినాభావముగ ఒక ద్రవ్యమునందు కలసి యుండినపుడు, రెండు భిన్న సంజ్ఞలు ప్రాప్తించుటయు, కార్యముఖమున వానికి విరోధమును, పరత్వమువలన వ్యవస్థయు నింతవఱ కుపాదింపబడినవి. ఇక నా శక్తులకు భేదము లేదనియు నిందు ప్రతిపాదింపబడుచున్నది.

శ్లో॥ ఏకైవ సా సతీ శక్తిః ద్విరూపా వ్యవతిష్ఠతే।
నిమిత్తం సంజ్ఞయోస్తత్ర పరయా బాధ్యతేఽపరా ॥ 146

ద్విరూపా = రెండు పనులను జేయునదైన, సా, శక్తిః = ఆ శక్తి, ఏకా ఏవసతీ = ఒకటిగనే అగుచు, వ్యవతిష్ఠతే = వ్యవస్థితమై యున్నది, సంజ్ఞయోః = రెండు సంజ్ఞలకు, నిమిత్తం చ= కారణమును, భవతి = అగుచున్నది, తత్ర = అందు, పరయా = పరమున పఠింపబడిన సంజ్ఞచే, అపరా = పూర్వసంజ్ఞ, బాధ్యతే = బాధింపబడును

తాత్పర్య విశేషాంశములు— ద్రవ్యములందుండు శక్తి ఒక్కటియే. అది వేరు వేరు క్రియలను జేయును. ఆ శక్తియే అపాదాన, కరణ సంజ్ఞలకు నిమిత్తమును అగును. కాని సంజ్ఞా కార్యములగు భిన్న భిన్న ప్రత్యయములకు ఒక ప్రాతిపదికము కంటె పరముగ నుండుట అసంభవము గాన, ఆకడార సూత్రము, పూర్వసంజ్ఞ నుత్తరసంజ్ఞ బాధించునని చెప్పినది. "ధనుషా విధ్యతి" అను స్థలమున ధనుస్సునకు గల కరణశక్తి యందే, బాణ

నిస్సరణమున నవధిత్వము గూడ నంతర్భూతము. క్రియలు వేరయినంత మాత్రమున శక్తులును వేరు కానక్కఱలేదు. ఒకే శక్తి ప్రధానక్రియ అగు వ్యధనమును, అంగభూత క్రియయగు నిస్సరణమును చేయుటచే రెండు రూపములు కలదిగా భావింపబడుచున్నది. శక్తుల కాశ్రయమగు ద్రవ్యమే ఆ పనులను జేయుననవచ్చును గదా. శక్తులను కల్పింపనేల అనవచ్చును. కాని అది ద్రవ్యస్వభావము గాదు. ద్రవ్యము రెండు క్రియలను జేయఁజాలదు. శక్తి సామర్థ్యరూపము. అది అనేక కార్యములను సాధింపగలదు. శక్తుల స్వభావము వేరు శక్తిమంతముల స్వభావము వేరు అని దిక్సముద్దేశమున ప్రతిపాదింపబడినది. ॥146॥

*అవతారిక*— నిర్దిష్ట విషయము, ఉపాత్త విషయము, అపేక్షిత క్రియము - అనబడు మూడు అపాదానములును, "అపాదానే పంచమీ" (2-3-28) అను సూత్రమునకు విషయములు.

"పంచమీ విభక్తే" (2-3-42) అనునది వేఱొక పంచమీ విధాయకము. విభాగముతో గూడిన నిర్ధారణము గమ్యమైనపుడు పంచమిని విధించినది ఆ సూత్రము. నిర్ధారణ మనగా సముదాయమునుండి ఏకదేశమునకు పృథక్కరణము. వేఱు పరుపబడినది, సముదాయావయవము గాక భిన్నమే అయినపుడు పంచమీ ప్రత్యయము వచ్చునని యర్థము. ఆ సూత్రమున కుదాహరణములైన వానిలో అపాయము ఊహింపదగినదై యుండునుగాన నా సూత్రము అపేక్షిత క్రియమగు అపాదానము విషయముగాగలది. కావున నట పంచమిగూడ "అపాదానే పంచమీ" అను సూత్రముచేతనే సిద్ధింపవచ్చునని ఈ కారికలో నుపపాదింపబడు చున్నది.

**శ్లో॥ నిర్ధారణే విభక్తో యో భీత్రాదీనాం చ యో విధిః ।**
**ఉపాత్తాపేక్షితాపాయః సో బుధప్రతిపత్తయే ॥ 147**

విభక్తే = భేదముగల, నిర్ధారణే = పృథక్కరణమునందు, యః విధిః = ఏ పంచమీవిధి కలదో, భీత్రాదీనాంచ = భీత్రా మున్నగువాని భయహేతువునకు, యః విధిః = ఏ సంజ్ఞా విధి కలదో, ఉపాత్తాపేక్షితా పాయః = ఉపాత్త విషయము, అపేక్షిత క్రియమును అగు, సః విధిః = ఆ సంజ్ఞా విధానము, అబుధప్రతిపత్తయే = అబుధులకు తెలియుటకై, కృతః = చేయబడినది.

తాత్పర్య విశేషాంశములు— నిర్ధారణమను నర్థమున షష్ఠీ సప్తములు విధింపబడినవి. 'నృణాం ద్విజః శ్రేష్ఠః' లేదా 'నృషు ద్విజః శ్రేష్ఠః' ఉదాహరణము. ఈ షష్ఠీ సప్తముల కపవాదముగా "పంచమీ విభక్తే" (2-3-42) అను సూత్రము పంచమిని విధించినది. "మాథురాః పాటలిపుత్రకేభ్యః ఆఢ్యతరాః" = 'మధురాపుర వాసులు పాటలీపుత్ర పౌరుల కంటె ధనికులు' అని యుదాహరణము. ఇచట పంచమి "అపాదానే పంచమీ" (2-3-28) అను సూత్రముచేతనే సిద్ధింపదా ? అపాదానమనగా విభాగమున కవధి అయినది

గదా ? నిర్ధారణ స్థలములం దెచ్చటనైనను నిర్ధారింపబడు వానికిని, పృథక్కరణమునకు అవధి అయినవానికిని భేదము తప్పదుగదా. అట్టియెడ, సూత్రమునందు 'విభక్తే' అను పదమున కేమి ప్రయోజనము ? అని విచారించిన, నిర్ధార్యమాణమునకు సర్వదా భేదమే ఎచట నుండునో అచట పంచమి వచ్చునని తెలియజేయుటకు గదా ? కాగా అచట గూడ అపాయము = విశ్లేషము అనుమితముగ నగును గాన నది అపేక్షిత క్రియమగు అపాదాన మగును. ఏతావతా అపాదానసంజ్ఞ వలననే పంచమి సిద్ధింపవచ్చును.

ఒక ప్రశ్న కలుగవచ్చును— విభాగము సంయోగ పూర్వకము గదా. చెట్టునందు సంయుక్తమైయున్న పర్ణమునకు తరువాత విభాగ మేర్పడును. ఇచట నట్టి సంయోగ పూర్వక విభాగమునకు సంభవ మేమి ? అని ఆ ప్రశ్న.

సమాధానము— ప్రయోక్త బుద్ధిలో సంశ్లేష విశ్లేషములు సంభవింప వచ్చునని. అది ఎట్లనగా-

మాధురులకును పాటలిపుత్రకులకును ఆఢ్యత్వము తుల్యమని వక్త, తన బుద్ధిలో ముందు గ్రహించును. తరువాత, మాధురులకు అధికమైన ఆఢ్యత కలదని తెలిసికొని పాటలి పుత్రకుల నుండి వారిని వేరుపరచును. ఇట్లు బౌద్ధములగు సంశ్లేష విశ్లేషములు సంభవించును గాన అపాదాన పంచమియే సిద్ధించును. ఇయ్యది అపేక్షిత క్రియమను తృతీయాపాదానము.

బుద్ధి పరికల్పితమైన అపాయము గౌణము గదా ? గౌణ ముఖ్యములలో ముఖ్యము లందే ప్రవర్తించు అపాదానసంజ్ఞ అను నట్టి కార్యము గౌణార్థమున నెట్లు ప్రవర్తించును ? అని శంకింపవచ్చును. కాని కారకాధికారమునందు అట్టి అతిశయ విశేషము వివక్షింపబడదని "సాధక తమం కరణమ్" అను సూత్రమునందలి 'తమప్' గ్రహణము తెలియచేయుచున్నది గాన నా ప్రశ్న కవకాశము లేదు. గౌణాపాదానమునను పంచమి సిద్ధించును.

శ్లో॥ "బుద్ధ్యా సమీహితైకత్వాన్ పంచాలాన్ కురుభిర్యదా ।
పునర్విభజతే వక్తా తదాపాయః ప్రతీయతే" ॥

అని వెనుక చెప్పబడినది స్మరింపదగును.

కౌరవులను, పాంచాలురను ముందుగా వక్త తన బుద్ధిలో నొక్కటిగా భావించి, మరల విభజించినపుడు అపాయము ప్రతీతమగును అని శ్లోకమున కర్థము.

పైన వివరించిన ప్రకారము సామాన్య సూత్రముచేతనే పంచమి సిద్ధించినను మరల "పంచమీ విభక్తే" (2-3-42) అను సూత్రమును రచించుట, వాస్తవాపాయమే గ్రాహ్యముగాని బుద్ధి పరికల్పితాపాయము కాదు అని తలంచు అబుధులకొఱకని యెఱుంగునది.

"భీత్రార్థానాం భయహేతుః" (1-4-25) అను సూత్ర విచారము.

భయము అర్థముగా గలవియు, రక్షించుట అను నర్థము గలవియు నగు ధాతువులు

ప్రయోగింపబడినపుడు భయకారణమైనది అపాదాన సంజ్ఞ కలది అగును' అని అర్థము. 'వృకేభ్యః భయమ్' 'చోరాద్బిభేతి' = తోడేళ్ళవలన భయము. దొంగవలన భయపడుచున్నాడు. ఈ ఉదాహరణములందును పూర్వసూత్రముచేతనే సిద్ధించునుగాన నీ సూత్రమునకును అబుధబోధనమే ఫలము.

వాక్యప్రయోక్త ప్రేక్షా పూర్వకారిగ నుండును. తన బుద్ధితో తాను ముందుగ పరిశీలించి ఆయా కార్యములందు ప్రవర్తించును. కావున ఆతడు, తోడేళ్ళకు అగపడిన తన కనిష్టము కలుగునని తలంచును. అది తోడేళ్ళతో బుద్ధి పరికల్పితమగు సంశ్లేషము. తరువాత విశ్లేషము. భయమందుట యనగా భయపడి అటనుండి తొలగుట. అదియే అపాయము. కావున వృకములకుపాత్తక్రియమగు నపాదానత్వము. 'ధ్రువమపాయే' అను సూత్రముచేతనే సంజ్ఞాసిద్ధి.

''చోరాత్ త్రాయతే'' = 'దొంగ వానినుండి కాపాడుచున్నాడు' అను నపుడును కాపాడుట యనగా అనర్థమును తొలగించుట. చోర సంబంధ మనర్థమని బుద్ధిలో దలంచి, మిత్రుడగువాడు. తన వానికి ఆ సంబంధము కలుగకుండ తప్పించుచున్నాడని అర్థము. కావున నిదియు పూర్వసూత్ర సాధ్యమే. అబుధ ప్రతిపత్తియే ఫలము.

''పరాజేరసోఢః'' (1-4-26) అను సూత్రార్థ విచారము.

''అధ్యయనాత్పరాజయతే'' అధ్యయనమువలన పరాజితుడగుట యనగా, చదువు చదువుకొనుటకు బుద్ధి మాంద్యము మున్నగువానివలన క్లేశపడుట. అనగా ఖేదమునంది, అందుండి మరలుట. అధ్యయనమునకు ప్రారంభించి, అది దుఃఖకరమును దుర్ధరమును, అనగా జ్ఞప్తియందుంచుకొనుటకు సాధ్యపడదనియు, గురువుల పరిచర్య శ్రమకరమనియు దలంచి ఖేదపడి నివర్తించుచున్నాడని తాత్పర్యము గాన, బౌద్ధములగు సంశ్లేష విశ్లేషములిచటను దుల్యములే.

''వారణార్థానామీప్సితః'' (1-4-27) సూత్ర విచారము.

వారించుట అర్థముగా గల ధాతువులు ప్రయోగింపబడినపుడు కర్తకు ఈప్సితమైన కారక మపాదానమని అర్థము.

''యవేభ్యః గాం వారయతి దేవదత్తః'' = యవధాన్యపు చేనులో బడనున్న ఆవును దేవదత్తుడు మరలించుచున్నాడని అర్థము.

ఈ సూత్రమును, సామాన్య సూత్రముచే గతార్థమే. ఎట్లన— 'ఈ గోవు యవల చేనులో బడిన సస్యవినాశమగును. రాజభయమును కలుగవచ్చును' అని విచారించి దానిని నివారించును గాన యవలతో బౌద్ధమగు సంశ్లేషమును తత్పూర్వకమగు విశ్లేషమును వారయితకు కలవని తాత్పర్యము.

''కూపాత్ అంధం వారయతి'' = నూతినుండి గుడ్డి వానిని వారించుచున్నాడు.

''అగ్నేర్మాణవకం వారయతి'' = 'నిప్పునుండి బాలుని వారించుచున్నాడు', అను నుదాహరణములందును, కూప సంప్రాప్తియు, అగ్నిస్పర్శయు అనిష్టహేతువులని బుద్ధిలో దలంచి దయతో మరలించుట తాత్పర్య విషయముగాన బౌద్ధ సంశ్లేష విశ్లేషములు ఇచటను గలవు.

''అంతర్ధౌ యేనాదర్శన మిచ్ఛతి'' (1-4-28) అంతర్ధియనగా అడ్డు. అది యున్నపుడు దాని చాటున దాగి, ఎవరు తన్ను జూడకుండుగాక యని కోరునో ఆ వ్యక్తికి అపాదానసంజ్ఞను విధించునది సూత్రము. ''ఉపాధ్యాయా దంతర్ధత్తే'' అంతర్ధాన మనగా నివృత్తిపూర్వక తిరోభవనము. తొలంగి మఱుగుట.

ఉపాధ్యాయుడు తన్ను జూచిన తిట్టుననియో కొట్టుననియో మనస్సులో దలంచి తప్పుకొనుచున్నాడు గాన బౌద్ధములగు సంశ్లేష విశ్లేషముల కిచటను సంభవము గలదు. కనుక నిదియు పూర్వసూత్ర విషయమే.

''ఆఖ్యాతోపయోగే'' (1-4-29) అని సూత్రము. ఉపయోగమున ఆఖ్యాతకు అపాదానమను సంజ్ఞ కలుగును. ఉపయోగమనగా నియమముతో విద్యను గ్రహించుట. నియమమన భిక్షాచరణము, స్థండిలశయనము మున్నగునవి. ఆఖ్యాత అనగా ఉపదేష్ట. ''ఉపాధ్యాయా దధీతే'' ''ఉపాధ్యాయా దాగమయతి విద్యామ్'' అని ఉదాహరణము.

ఈ సూత్రముతో బనిలేదు, ''ధ్రువమపాయే అపాదానమ్'' అను సామాన్య సూత్రముచేతనే సంజ్ఞ సిద్ధించునని భాష్యకారుని ఆశయము. అది ఎట్లన— ఉపాధ్యాయుని ముఖమునుండి వెలువడు శబ్దములు సంతత ప్రవాహరూపమున శిష్యునిలో ప్రవేశించుట అర్థముగాన ఆ శబ్దముల అపక్రమణమున కుపాధ్యాయు డవధి యగును.

విద్యాగ్రహణము నియమపురస్సరము కానపు డీ సంజ్ఞ ప్రవర్తింపదు. పంచమి రాదు. శేషషష్ఠియే అట ప్రవర్తించును. నటుడు గాథలను వ్యాఖ్యానము చేయును. ఆ గాథలను భిక్షాచరణాది నియమములను పాటింపక వినుచుండు ననుకొనుడు. అపుడు 'నటస్య శృణోతి' అనియే యందురు. ఆ శ్రవణము నట సంబంధి మాత్రమే. నటాపాదానకము గాదు. అపాయ మట వివక్షింపబడదు అని భావము.

''శృంగాత్ శరః జాయతే''. ''జనికర్తుః ప్రకృతిః'' (1-4-30). కొమ్మునుండి బాణము తయారగుచున్నదని అర్థము. కుండను మట్టితో జేసినట్లు, బాణములను కొమ్ముతో జేయుదురు. మట్టి, కుండ కుపాదాన కారణము. కొమ్ము శరమున కుపాదానము. ప్రకృతి అనగా ఉపాదాన కారణము. జనికర్త = పుట్టునది.

ఇదియు భాష్యమున ప్రత్యాఖ్యాతమైన సూత్రమే. లోకమున, ఏయది దేనినుండి పుట్టునో అది దానినుండి వెలువడునను మాటయేగదా ! ఆ నిస్సరణమున కది అవధి అగును. కనుక సామాన్య సూత్రమే అపాదానసంజ్ఞను సిద్ధింపజేయును.

"బ్రహ్మణః ప్రజాః ప్రజాయన్తే", "గోమయాత్ వృశ్చికః జాయతే" = 'బ్రహ్మ నుండి ప్రజ లుద్భవించుచున్నారు.', 'పేడలోనుండి తేలు పుట్టుచున్నది' - మున్నగు ప్రయోగము లందును నిదియే ప్రక్రియ.

తాంత్రికుల ప్రక్రియ దీనికి విరుద్ధము. వైశేషికులు, పరమాణువులందు, కార్యము సమవాయ సంబంధముచే సంబద్ధమై అచటనే పుట్టునందురు. అపుడు కారణమునుండి కార్యమునకు అపక్రమణము = నిస్సరణము లేదు.

సాంఖ్య దర్శనమున జన్మయనగా ఆవిర్భావము. తిరోభావము నాశము. అనగా కారణము కార్యరూపమున పరిణమించును. అంతియ. కారణమునుండి కార్యము వుట్టుట = బయలు వెడలుట అను మాట లేదు. ఆ ప్రక్రియ లీ శాస్త్రమున నాదరింపబడవు.

"భువః ప్రభవః" (1-4-31) అను సూత్రవిషయము. 'భూ' ధాత్వర్థమున కర్తకు ప్రభవమైనది అపాదానము. 'భూ' కర్త అనగా ప్రభవించునది. దానికి ప్రభవమన, నది మొదట ప్రకాశించిన స్థలము.

హిమవంతమున గంగ మొదట బయలుపడినది. అదియే ప్రథమ ప్రకాశము. దానికి స్థానము హిమవంతము. దాని కపాదానసంజ్ఞ. ఈ సూత్రమును ప్రత్యాఖ్యాతమే. గంగ ప్రవాహరూపము గదా! అది అచటనుండి ప్రసర్పించుచున్నదనియే యర్థము. కాగా ముఖ్యార్థమగు విశ్లేషమే అచట కలదని భావము.

"జుగుప్సా విరామ ప్రమాదార్థానా ముపసంఖ్యానమ్" ఇది (1-4-24) సూత్రము నందలి వార్తికము. అపాదాన సంజ్ఞా విధాయకమే. "అధర్మాత్ జుగుప్సతే" = అధర్మము నేవగించుకొనుచున్నాడని అర్థము. ఏవగింపునకు విషయ మధర్మము. కాని అపాదానసంజ్ఞచే అధర్మపదము పంచమ్యన్తము.

"అధర్మాద్విరమతి" = అధర్మము నాచరింపకుండుట విరమణము. 'ధర్మాత్ ప్రమాద్యతి' = ధర్మాచరణ విషయమున ప్రమత్తుడగుచున్నాడు— ఇవి ఉదాహరణములు.

ఈ వార్తికమును, భాష్యకారునిచే ప్రత్యాఖ్యాతమే. అధర్మము పరలోకమున దుఃఖమును కలుగజేయునది యని తెలిసికొని ఏవగింపుతో సందుండి తొలగుచున్నాడని తాత్పర్యము గాన అపాయము అచటను గలదు. కావున సామాన్య సూత్రముచేతనే సంజ్ఞ సిద్ధించును. ఇది ఆస్తికుని విషయము. నాస్తికుడును ముందుగ విచారించి, ధర్మమనునది ఏదియు లేనేలేదు. దాని నాచరింపవలసిన పనియు లేదని నిశ్చయించుకొనును గాన బౌద్ధము లగు సంశ్లేష విశ్లేషములు అచటను సంభవించునని భావము.

ఈ విధముగ అపాదానసంజ్ఞా విధాయక సామాన్య సూత్రమగు "ధ్రువమపాయేఽపాదానమ్" అను నొక్క సూత్రముచేతనే సర్వత్ర అపాదానసంజ్ఞ సిద్ధించును గాన తరువాతి సూత్రము లెల్ల విస్పృతికొఱకు మాత్రమే అని స్పష్టము. లక్షణమును, ప్రపంచనమును, రెండును వ్యాకరణశాస్త్రమునకు కృత్యములుగాన నవియు పాణినిచే రచింపబడినవి. ॥147॥

## అధికరణాధికారము

*అవతారిక*— విభక్తుల క్రమమును బట్టి పంచమ్యర్థ విచారానంతరము షష్ఠ్యర్థ మును విచారింపవలసి యున్నది. కాని కారకముల క్రమము ననుసరించి అపాదాన విచారము నకు తరువాత అధికరణము, విచారింపబడు చున్నది.

శ్లో॥ కర్తృకర్మవ్యవహితామసాక్షాద్ధారయత్ క్రియామ్ ।
ఉపకుర్వత్ క్రియాసిద్ధౌ శాస్త్రేఽధికరణం స్మృతమ్ ॥ 148

కర్తృ కర్మ వ్యవహితాం = కర్తచేతను కర్మచేతను, వ్యవధానము గల, క్రియాం = క్రియను అసాక్షాత్ = పరంపరగా, ధారయత్ = ధరించుచున్నదై క్రియాసిద్ధౌ = క్రియ సిద్ధించు టలో, ఉపకుర్వత్ = ఉపకరించునది, అధికరణం = 'అధికరణము' అని, శాస్త్రే = శాస్త్రము నందు, స్మృతమ్ = చెప్పబడినది.

తాత్పర్య విశేషాంశములు— అధికరణమనగా ఆధారము = ఉనికి పట్టు. లోక ములో అది ద్రవ్య గుణ క్రియలలో దేనికైనను ఆధారమై యుండును. శాస్త్రమునందు మాత్రము క్రియకు ఆధారమైనదియే అధికరణము. క్రియకు సాక్షాత్ ఆధారములు కర్తయు కర్మయు. వాని కాధారము అధికరణము. కాగా కర్తృ కర్మల ద్వారా తన్నిష్ఠమగు క్రియకు ఆధారమగు కారక మధికరణము.

"దేవదత్తః కటే ఆస్తే" = 'దేవదత్తుడు చాపమీద కూర్చొని యున్నాడు' చాప దేవదత్తుని తాను ధరించి అతని ఆసనము = ఉనికి అను క్రియ సిద్ధించుట కుపకరించుచున్నది

"దేవదత్తః స్థాల్యా మోదనం పచతి" = 'దేవదత్తుడు గిన్నెలో అన్నమును వండు చున్నాడు. విక్లిత్తి = ఉడుకుట అనునది అన్నమునందుండు క్రియ. అన్నమున కాధారము స్థాలి. ఆధారమనునది లేనియెడల కర్తృ కర్మలు తమ పనిని చేయజాలవు. అధికరణము, వానిని ధరించి, వానిచేత తమ పనులను చేయించును. కాగా సాక్షాత్తుగా క్రియకు ఆధారము లయిన వానికి కర్త కర్మ అను సంజ్ఞలును, పరంపరగ క్రియాధారమునకు అధికరణ సంజ్ఞయు ప్రవర్తించునని ఫలితము.

కారకములనగా క్రియ నుత్పాదించునవి. అవి సాక్షాత్తుగనే క్రియాజనకములు కానక్కఱలేదు. ఎట్లైనను గావచ్చును.

కారికలో 'వ్యవహితాం' అను పదముచేత అధికరణము సాక్షాత్ క్రియాధారము కాదని సూచించి మరల 'అసాక్షాత్' అనుట ఎందులకు ? అనిన, లోక ప్రయోగ రీతినిబట్టి గూడ ఆ పరంపర తెలియవచ్చు చున్నదని బోధించుటకు. 'నేలమీద పండుకొని యున్నాడు' 'గిన్నెలో అన్నము వండబడుచున్నది' అనిన పండుకొనుట అను క్రియయు, ఆ క్రియతో గూడిన కర్తయును, అట్లే, వంట అను క్రియ, వండబడునట్టి అన్నమను కర్మయును

తెలియవచ్చు చున్నవేగాని క్రియ మాత్రము కాదుగదా. కావున, అధికరణము క్రియా సిద్ధి కుపకరించుట సర్వథా సద్వారకమే. ॥148॥

అవతారిక— ఔపశ్లేషికము, అభివ్యాపకము, వైషయికము అని అధికరణము మూడు విధములు. కారికోక్తమగు లక్షణము మూడింటియందును అనుగతము అయి యున్నది అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఉపశ్లేషస్య చ భేదస్తిలాకాశకటాదిషు ।**
**ఉపకారాస్తు భిద్యన్తే సంయోగి సమవాయినామ్ ॥** 149

తిల ఆకాశ కటాదిషు = తిలలు, ఆకాశము, చాప మున్నగువానియందు, ఉపశ్లేషస్య = సంబంధమునకు, అభేదః చ = అభేదమే, సంయోగి సమవాయినాం = ఆ ధేయముతో సంయోగ సమవాయములు గల ఆధారముల, ఉపకారాః తు = క్రియోపకారములు మాత్రము, భిద్యన్తే = వేఱువేఱుగ నుండును.

తాత్పర్య విశేషాంశములు— ఆధారమునకును ఆధేయమునకును గల సంబంధము ఉపశ్లేషము. అది మూడు విధములయిన అధికరణములందును ఏకరూపమే. ఆధేయముతో సంయోగము గల ఆధారము సంయోగి. సమవాయమను సంబంధముగలది సమవాయి. 'కటే ఆస్తే దేవదత్తః'. ఇచట దేవదత్తునకును కటమునకును సంబంధము సంయోగము. కటము సంయోగి. 'తిలేషు తైలమస్తి' తిలలకును తైలమునకును సంబంధము సమవాయము. తిలలు సమవాయి అయిన ఆధారము.

కటమునందు దేవదత్తుని ఉనికి ఏకదేశముననే. తిలలయందు తైలము, తిలల సర్వావయవములను వ్యాపించి యున్నది. కావున తిలలు అభివ్యాపకాధారము.

'ఖే శకునయః' = ఆకాశమునందు పక్షులు ఎగురునందురు. ఆకాశము అంతయు అఖండము. అందు భాగములు లేవు. కనుక శకునుల కది ఔపశ్లేషికాధికరణమును గాదు. అభివ్యాపకమును గాదు. పక్షుల కాకాశము విషయము మాత్రమే. కనుక నది వైషయికాధారము.

"గురౌ వసతి" = గురువునందున్నాడు. అనగా గురువునకు అధీనుడై ఆయనయందాధారపడియున్నాడనుట. ఇట గురువు శిష్యునకు వైషయి కాధారము.

"యుద్ధే సంనహ్యతి" = యుద్ధము విషయమున సిద్ధపడుచున్నాడనిన, యుద్ధాభిసంధితో కవచధారణము మున్నగునవి చేయుచున్నాడు అని యర్థముగాన సంనాహమునకు యుద్ధము విషయము.

'జలే మత్స్యాః' = నీటిలో చేపలు. జలమున మత్స్యముల కాధారమగు ప్రదేశ ముండునుగాన జలము వైషయికము కాదు. ఔపశ్లేషికమే.

స్వాభిః = స్వకీయములగు, శక్తిభిః = శక్తులచే, క్రమేణ = క్రమముగా, ఏవమ్ = ఈ రీతిగా అనగా జగద్రూపముగ, ప్రత్యవభాసతే = భాసించుచున్నది.

నిరుక్తమును* రచియించిన యాస్కుడు ఆరుభావవికారములు కలుగునని పలికెను. సద్రూపమగు బ్రహ్మయే ఆరు వివర్తములను బొందుచున్నది. సత్తు, సత్త అనునవి భిన్న పదార్థములుకావు ఆసత్తయే తనయందున్న శక్తులనుబట్టి క్రమరూపముగా భాసించు చున్నది.

1. పుట్టుట 2. ఉండుట 3. పరిణమించుట 4. వృద్ధిజెందుట 5. కృశించుట 6. నశించుట. ప్రతి వస్తువు ఈ క్రమమునకు బద్ధమయి యున్నది. అట్టి క్రమము సత్త యొక్క శక్తులవలననే కలుగుచున్నది.

*విశేషాంశము*- ఇచట వికారపదము వివర్తపదముకాగా అద్వైత మతమును వైయాకరణులు ఆశ్రయింతురని వ్యక్తము, అంతియేకాని సాంఖ్య మతము వంటి పరిణామ వాదులు వైయాకరణులు కారు. గ్రంథకర్త వివర్తవాదమునే పలుచోటులందునిరూ పించియున్నాడు॥36॥

అవతారిక—సత్తయే తన శక్తులచే జన్మాదిరూపమున భాసించినపుడు జన్మాది రూపములన్నియు ఒకేసారి ఏల భాసింపవు? క్రమరూపమున భానము ఎట్లు? క్రమ మనెడి క్రియావిశేషము లేదుకదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆత్మభూతః క్రియోప్యస్యా యత్రేదం కాలదర్శనమ్।**
**పౌర్వాపర్యాదిరూపేణ ప్రవిభక్తమివస్థితమ్ ॥ 37**

క్రమః + అపి = పుట్టుక మున్నగువాని యొక్క క్రమముకూడ, అస్యాః = ఈ సత్తయొక్క, ఆత్మభూతః = ఆత్మరూపమైనదే, అనగా సత్తయొక్క శక్తులలోనున్నదే.

క్రియలు క్రమము కలవి. ఆ క్రమము వానికంటె భిన్నము కాదు.

యత్ర = ఏ క్రమమునందు, ఇదమ్ = ఈ, అనగా ప్రత్యక్షముగా కానవచ్చుచున్న, కాలదర్శనమ్ = పెద్దలచే చూడబడుచున్న కాలము, పౌర్వాపర్యాది రూపేణ = ముందు వెనుక అను రీతిని, ప్రవిభక్తమ్ + ఇవ = విభజింపబడినది వలె, స్థితమ్ = ఉన్నదో.

సత్తరూపమగు బ్రహ్మమునందు అనంతశక్తులు కలవు. వానిలో కాలశక్తి ఒకటి. వైశేషికులు చూపిన ప్రకారము కాలము ద్రవ్యము కానేరదు. ఆ కాలశక్తిచే జన్మాది క్రియలకు పౌర్వాపర్యము కలుగుచున్నది. ఈ యంశము మొదటి కాండమున మూడవ శ్లోకమున చూపబడినది. ఈ కాండమున తొమ్మదవ సముద్దేశమున విపులముగా జూపబడగలదు.

అందుచే జన్మాదులు ఒకేసారి భాసింపవు. ॥ 37 ॥

---

* షడ్భావవికారా భవన్తీతి హాస్మాహ భగవాన్ వార్ష్యాయణిః. 1. జాయతే 2. అస్తి 3. విపరిణమతే 4. వర్ధతే 5. అపక్షయతే 6. వినశ్యతి. నిరుక్తము ప్రథమాధ్యాయము; 28, 29.

"గంగాయాం గావః" = గంగ యొడ్డున నావులు మేయుచున్నవి ఇట గంగాతీర మునకును గోవులకును సంబంధము ఉపశ్లేషమే.

"శత్రోరభావే సుఖమ్" = శత్రువు అభావమున సుఖము కలదు. అభావమనగా లేకుండుట. అది అధికరణ మెట్లగును? లేమికి క్రియాజనకత్వమను కారకత్వ మెట్లు సంభము? అని శంక కలుగును. అది బుద్ధి పరికల్పితము. వాస్తవము కాదని సమాధానము. ॥149॥

అవతారిక— 'ఉపకారాస్తు భిద్యన్తే' అనిరి గదా ఆ ఉపకార భేదము లెవ్వి? అనగా—

**శ్లో॥ అవినాశో గురుత్వస్య ప్రతిబంధే స్వతంత్రతా।**
**దిగ్విశేషాదవచ్ఛేద ఇత్యాద్యా భేదహేతవః॥ 150**

అవినాశః = ఆధారము నశింపకుండుట, గురుత్వస్య = బరువుయొక్క, ప్రతిబంధే = ఆపుటలో, స్వతంత్రతా = కర్తృత్వమును, దిగ్విశేషాత్ = ఒక దిక్కునుండి, అవచ్ఛేదః = సంబంధ నిరాసమును, ఇత్యాద్యాః = ఈః మొదలగునవి, భేదహేతవః = ఉపకార భేదములకు హేతువులు.

తాత్పర్య విశేషాంశములు— తిలలు తైలమునకు చేయు నుపకారము, తాము నశింపకుండ నాధారమై నిలుచుట. అవి లేనిచో తైలము వికీర్ణమే నశించును గదా.

"పర్యం కేశేతే" = మంచమునందు పరుండి యున్నాడనిన, మంచము పండుకొనిన వాని బరువును ఆపి ఆతడు క్రింద పడకుండ జేయుచున్నదని యర్థము గాన నదియే పర్యంకము చేయు నుపకారము.

ఆకాశము శకుంతములకు చేయు నుపకారము, వానికి క్రింది దిక్కుతో సంబంధమును తొలగించి నిలుపుట.

"శకటే గచ్ఛతి" = బండిలో పోవుచున్నాడు. బండి, వానికి దేశాంతర ప్రాప్తిని కలుగజేయుట దాని యుపకారము.

"గురౌ వసతి" గురువుచేయు నుపకారము శిష్యునకు సంస్కారము. "ఆదిత్యః ప్రాచ్యాముదేతి", "ప్రతీచ్యామస్తమేతి" = సూర్యుడు తూర్పున నుదయించును, పడమట నస్తమించును. దక్షిణస్యా మగస్త్య ఉదేతి, 'ఉత్తరస్యాం ధ్రువః' అను స్థలములందు, ఆధేయములకు ఆ యా దిక్కులు తమ సంబంధమును గలుగజేయుటయే అవి చేయు నుపకారము. ॥150॥

అవతారిక— మూర్తిమంతములైన వస్తువు లన్నియు ఒక ఆధారము నాశ్రయించి యుండును. ఆ ఆధారము కూడ మూర్తిగల వస్తువైన, దానికిని వేఱొక యాధారము కావలెను గదా. అది ఏది? అనిన—

శ్లో॥ ఆకాశమేవ కేషాంచిత్ దేశభేద ప్రకల్పనాత్ ।
ఆధారశక్తిః ప్రథమా సర్వసంయోగినాం మతా ॥ 151

కేషాంచిత్ = కొందఱి మతమున, ఆకాశమేవ = ఆకాశమే, దేశభేద ప్రకల్పనాత్ = ప్రదేశ భేద కల్పనవలన, సర్వసంయోగినామ్ = సంయోగి వస్తువుల కన్నిటికిని, ప్రథమా = ముఖ్యమగు, ఆధారశక్తిః = ఆధారరూపమగు శక్తిగా, మతా = సమ్మతమైనది.

తాత్పర్య విశేషాంశములు— గ్రహములు, నక్షత్రములు, విమానములు-మున్నగు వానికి ఆకాశమే స్థానముగా ప్రసిద్ధము. రథములు బండ్లు మున్నగువానికి భూమి ఆధారమైనను, ఆ భూభాగమునకు గూడ ఆకాశమే ఆధారము. సంయోగి పదార్థము లనగా సంయోగమను సంబంధముతో సంబద్ధములైనవి. రథాదులకును భూమికిని సంబంధము సంయోగము.

మఱికొన్ని సమవాయి పదార్థములు. అవయవములకును, అవయవికి సంబంధము సమవాయము. ఆ పదార్థములకు వాని అవయవములు ఆధారము. ఆ అవయవములకు పరమాణువు లాధారము. వానికిని చివరకు ఆకాశమే అధికరణము. కావున ముఖ్యమగు నాధార శక్తి ఆకాశాశ్రయము. ఆకాశమంతయు నొక్కటియే అయినను, అందు వేఱువేఱు భాగములను కల్పించుటవలన, 'సకల పదార్థములకును నదియే ఆధారమైనవో, ఆ పదార్థములకు సాంకర్యము కలుగదా ?' అను ప్రశ్న లేదు. కొందఱి మతమున ననుటవలన, అది లేదను వారును గలరని తెలియవచ్చుచున్నది. అది ప్రత్యక్షము కానందున లేనేలేదని వారందురు. శబ్దమను గుణమును బట్టి ఆకాశమను ద్రవ్యము కలదనిన యెడల, శబ్దము దాని గుణమనుట కేమి ప్రమాణమని వారడుగుదురు. ॥151॥

అవతారిక— వైశేషికులు, 'అనుమానము' అను ప్రమాణముచే ఆకాశమును సాధించియున్నారు. శబ్దమను గుణమునుబట్టి, గుణి యగు నాకాశము కలదని, వారి తాత్పర్యము. శబ్ద మాకాశ గుణమని యంగీకరింపకున్నను, ఆకాశమను పదార్థము కలదని నిరూపించుటకు లోక ప్రసిద్ధమైన లింగమును గూడ నిందు జూపుచున్నారు.

శ్లో॥ ఇదమత్రేతి భావానా మభావాన్న ప్రకల్పతే ।
వ్యపదేశస్త మాకాశ నిమిత్తం సంప్రచక్షతే ॥ 152

ఇదం, అత్ర, ఇతి = ఇది, ఇట, అను, వ్యపదేశః = వ్యవహారము, భావానాం = పదార్థములకు. అభావాత్ = ఆధారశక్తి లేనందున, న ప్రకల్పతే = సిద్ధింపదు, తం = కావున, ఆ వ్యవహారమును, ఆకాశ నిమిత్తం = ఆకాశ మూలకమునుగా, సంప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్య విశేషాంశములు— ఆధారమను శక్తియే ఆకాశమనునది కలదని తెలియజేయును. 'ఈ నక్షత్ర మిచట నున్నది' అందురు. అపుడు 'ఇచట' అనునది ఒక వస్తువు కావలెను. అది పృథివిగాని, ఉదకముగాని, తేజస్సుగాని, వాయువుగాని కాదు. ఇక నేమగును? ఆకాశమే కావలె. అది ఏ వస్తువును గాదనిన శబ్ద వ్యవహారమే కుదురదు. ఒకానొక వస్తువును

ముందుగ నిరూపించి, తరువాత దానిని శబ్దముచే వ్యవహరింతురుగదా: 'శబ్దము' అను ప్రమాణము నంగీకరించువారికి, శబ్దము చెప్పినదే అర్థము. 'ఇచట' - అను శబ్దము ఒక వస్తువును చెప్పును. అది లోకసిద్ధమగు ఆధారము కావలె. అది ఆకాశము.

శబ్దము బోధించినది, ఆ వస్తువు అయినను, శబ్దము ప్రమాణమను వారి కది వస్తువే. శత్రువు లేమిలో, సుఖముండుననిన, లేమి = లేకుండుట ఒక వస్తువు కాకున్నను శబ్దబోధ్యము గాన, ఆధారముగ గ్రహింపబడుచున్నది.

పరమార్థమును విచారించిన, లౌకిక పదార్థము లన్నియు లేనివే. బ్రహ్మ పదార్థ మొకటియే ఉండునది. లేనివానికి లక్షణములను కల్పించుట పరమార్థ దృష్టిలో విరుద్ధ ప్రక్రియయే యగును. ॥152॥

*అవతారిక*— సకల పదార్థములకును ఆకాశ మాధారమని చెప్పబడినది. పదార్థములు కొన్ని స్థిరములు. కొన్ని సాధ్యములు. ద్రవ్యములును గుణములును సిద్ధ స్వభావములు. క్రియలకు స్వభావము సాధ్యత. సిద్ధ పదార్థముల కాకాశ మాధారము. సాధ్యములకు కాల మాధారము.

**శ్లో॥ కాలాత్ క్రియాః విభజ్యన్తే ఆకాశాత్ సర్వమూర్తయః।**
**ఏతావాంశ్చైవభేదోఽయ మభేదోపనిబన్ధనః ॥ 153**

కాలాత్ = కాలమువలన, క్రియాః = క్రియలు, విభజ్యన్తే = విభజింపబడును, ఆకాశాత్ = ఆకాశమునుండి, సర్వమూర్తయః = మూర్తి మద్వస్తువు లన్నియు, విభజ్యన్తే = విభజింపబడు చున్నవి, భేదః చ = వానికి భేదమును, ఏతావాన్ ఏవ = ఇంత మాత్రమే, అయమ్ = ఈ భేదము, అభేదోప నిబన్ధనః = పరబ్రహ్మ కారణకము.

తాత్పర్య విశేషాంశములు— "ప్రతిబంధాభ్యనుజ్ఞాభ్యాం తేన విశ్వం విభజ్యతే" అని కాలోద్దేశమున చెప్పబడును. కాలము, పదార్థముల ఉత్పత్తి, స్థితి, వినాశములకు కారణము. అందు క్రియా రూపములగు పదార్థములకు తాను ఆధారమైయుండి వాని విభజించును. పదార్థము లన్నియు ఆకాశమునందు సయుక్తములయినను, భిన్న భిన్న ప్రదేశములందుండుటచేత వానికి సాంకర్యము కలుగదు. ప్రపంచమంతయు, అభిన్నము. ఏకరూపము. అది పరమార్థము. అయినను వ్యవహారములో భేదమే అధికముగ భాసించును. కాని మొదటి అభేదము, తరువాతి భేదమునకు నిమిత్తము. కావున కాలాకాశముల భేదముగూడ పరబ్రహ్మ భేద నిమిత్తకమే. కాలాకాశములు పరబ్రహ్మ యొక్క శక్తులు అని బ్రహ్మకాండమున నిరూపింపబడినది.

"ఉపాన్వధ్యాఙ్వసః" (1-4-48) అను సూత్రమున విచారము. ఉప, అను, అధి, ఆఙ్ - అను ఉపసర్గములు పూర్వమున గల 'వసనివాసే' అను ధాతువున కాధారమైనది కర్మసంజ్ఞ కలదగునని సూత్రార్థము. "వైకుంఠమధివసతి హరిః" = విష్ణువు వైకుంఠము

నధివసించియున్నాడు అనునది ఉదాహరణము. ఆ సూత్రమున "వసేరశ్యర్థస్య ప్రతిషేధః" అని వార్తికము. భోజనము చేయకుండుట అని అర్థమయినపుడు, 'ఉపవస్' అను ధాతువు నాధారమున కీ కర్మసంజ్ఞ ప్రవర్తింపదని వార్తికార్థము. "వనే ఉపవసతి". ఉపవసించుట యనగా భోజన నివృత్తితో గూడిన ఉనికిగాన, సూత్రముచే ప్రాప్తించు కర్మసంజ్ఞకు ప్రతిషేధ మావశ్యకమని వార్తికాశయము.

మహాభాష్యమున నీ వార్తికము ప్రత్యాఖ్యాతము. ఇట ఉపసర్గ విశిష్టమగు వస ధాతువునకు గాదు గ్రామ మధికరణము. కేవల వసధాత్వర్థమునకే అది అధికరణము. వనమున లేదా గ్రామమున వసించుచు, మూడు రాత్రులు ఉపవాసము చేయుచున్నాడని యర్థము. గ్రామేవసన్, త్రిరాత్ర ముపవసతి. ఇపుడు కర్మసంజ్ఞకు ప్రసక్తియే లేదని భాష్యకారుని ఆశయము.

ఉపవాసమనగా నొక కొంత కాలము ఆహారము మానియుండుట. ఆ కాలము అంతరంగమగు ముఖ్య కర్మ. ఉపవాసము చేయు వ్యక్తి తన కేదియు స్థానము లేకుండ నుండుట సంభవింపదు గాన నొక యాధారము నియతముగ నపేక్షితమగును. అది కేవల వసధాత్వర్థమున కాధరమేగాని, 'ఉపవస్' అను ధాత్వర్థమున కాధారము గాదని భావము.॥153॥

అవతారిక— 'తీర్థే ఉపవసతి'='పుణ్య తీర్థమున నుపవాసము చేయుచున్నాడు', అను నీ వాక్యమున, దేశ విశేషమున భోజన నివృత్తి వివక్షితము. కావున దేశవిశేష సంబంధ మా ధాతువునకు గలదు. అట కర్మసంజ్ఞ ఏల రాలేదు ? అనిన చెప్పుచున్నాడు.

**శ్లో॥ యద్య ప్యుపవసిర్దేశ విశేష మనురుధ్యతే ।**
**శబ్దప్రవృత్తి ధర్మాత్తు కాలమేవావలంబతే ॥** 154

ఉపవసిః = ఉపపూర్వక వసధాతువు, యద్యపి = విచారింపగా, దేశవిశేషం = ప్రదేశ విశేషమునే, అనురుధ్యతే = సంబంధించు ననుకొనుడు, శబ్దప్రవృత్తి ధర్మాత్ తు = శబ్ద శక్తి స్వభావమును బట్టి మాత్రము, కాలం ఏవ = కాలమునే, అవలంబతే = ఆశ్రయించి యున్నది.

తాత్పర్య విశేషాంశములు— ఉపవాసముచేయుట పుణ్యతీర్థమునందు గాన ధాత్వర్థమునకు దేశముతో సంబంధము లేకపోలేదు గాని, అది శబ్ద శక్తివలన వచ్చినది గాదు. ఆ భోజన నివృత్తి ఇన్ని దినములని తెలియవలెను గాన కాలవిశేషము గూడ నందు గర్భితమై శబ్దముచే బోధింపబడును దేశ సంబంధము సామర్థ్యముచే ప్రాప్తము. నివసించుటకును దేశమునకును సంబంధము. ఉపవసించుట ప్రధానము. దాని కంగము వాసము. వాసమున కంగము దేశము. అది వాసము ద్వారమున భోజన నివృత్తికి అధికరణము.

కనుకనే మహాభాష్యమున "గ్రామేవసన్ త్రిరాత్ర ముపవసతి" అని ఉపవాస మంగముగా గల నివాసమునకు గ్రామముతో సంబంధము చూపబడినది గాని సాక్షాతుగా

ఉపవాసమున కా సంబంధము చూపబడలేదు. అందువలన గ్రామమునం దుపవాసమనగా, ఉపవాసమునకు గ్రామ మధికరణమని తాత్పర్యము గాదు. ఉపవాస క్రియ కంగమైన నివాసమున కధికరణమనుట. ॥154॥

అవతారిక— గ్రామమున నుపవసించుచున్నాడను చోట ప్రధాన క్రియ భోజన నివృత్తి. దానిలో కర్మ, కాలము. అది వాక్యమున ప్రయుక్తము కాకపోయినను, ప్రతీయమానము కావచ్చునని చెప్పుచున్నాడు.

శ్లో॥ వసతా వ ప్రయుక్తేఽపి దేశోధికరణం తతః ।
అప్రయుక్తం త్రిరాత్రాది కర్మ చోపవసౌ స్మృతమ్ ॥ 155

అప్రయుక్తః అపి = వాక్య ప్రయుక్తము కానిదైనను, దేశః = ప్రదేశ వాచక పదము, వసతౌ = నివాస క్రియలో, అప్రయుక్తం = వాక్యమున ప్రయుక్తముకాని, త్రిరాత్రాది = మూడు రాత్రులు మున్నగునది, ఉపవసౌ = ఉపవాస క్రియలో, అధికరణమ్ = అధికరణమై యున్నది, తతః చ = అందువలననే, కర్మ = కర్మగా, స్మృతమ్ = తలంపబడుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— "గ్రామే ఉపవసతి" లేదా "వనే ఉపవసతి" = ఒక గ్రామముననో వనముననో నివసించుచు మూడు రాత్రులు భోజనము మాని యున్నాడని మహాభాష్యమున నా వాక్యమున కర్థ వివరణము చేయబడినది. వాక్యమున ప్రయోగింపబడినది ఉపవాస క్రియ. నివాస క్రియ ఆక్షేప లభ్యము. దానికి గ్రామ మధికరణము. కారకములు, వాక్యములందు ప్రయోగింపబడని క్రియలను సామర్థ్యము వలన ఆకర్షించును.

'పిండీమ్' అని కారకము మాత్రమే వాక్య ప్రయుక్తము. అది భక్షణ క్రియ నాక్షేపించును. చిన్న పిండమును భక్షింపుమని యర్థము. ఆ విధముగనే క్రియ మాత్రము ప్రయుక్తమై కారకము ప్రయోగింపబడనపుడు, ఆ క్రియ కారకము నాక్షేపించుటయు గలదు. 'ప్రవిశ' - అనునది వాక్యము. అందు కర్మకారకము లేదు. వాక్యత్వసిద్ధికై, 'గృహమ్' అను కర్మవాచక శబ్దము ఆక్షేపింపబడును.

ప్రకృత వాక్యమున ఉపవాస క్రియ, కాలరూపమగు కర్మ నాక్షేపించును. అది ఆవశ్యకము. మూడు రాత్రులు భోజన నివృత్తి. గ్రామమునందు వాసము. కాలమునకు కర్మ సంజ్ఞ ప్రవర్తించినట్లు దేశమునకు గూడ ఆ సంజ్ఞ యేల రాలేదనిన, వాని అంతరంగ బహిరంగ భావము దానికి గారణము. 'భక్తుడు హరిని భజించుచున్నాడు' అను వాక్యమున, హరి గూడ తన వ్యాపారమున స్వతంత్రుడే అయినను అంతరంగమగు కర్మసంజ్ఞయే ప్రవర్తించినది గదా. సందర్శనాది క్రియలచే ఈప్సితతమమునకు కర్మసంజ్ఞ చరితార్థముగా వచ్చును గాన వైయర్థ్యము దాని కాపాదించుటకు వీలులేదు. కావున గ్రామ మధికరణమే.

'ఉపవసతి' అను పదమునకు వేఱు అర్థమును జెప్పిన, "గ్రామముపవసతి" అనియు నుండవచ్చును. ఉపవాసమనగా నొక విశిష్టమగు ఉనికి.

భోజన నివృత్తి అర్థమయినపుడు, క్రియకు సాక్షాదాధారము కాలము. అది ఈ సూత్రముచే కర్మ సంజ్ఞకము. దేశమగు గ్రామము వాసక్రియ ద్వారా ఆధారముగాని సాక్షాత్తుగా కాదు. అందువలన దానికి అధికరణ సంజ్ఞయే.

కొంద అిట్లందురు. ఉపవాసమనగా భోజన నివృత్తి గదా. నివృత్తి అనగా మానుట. మానుట కొక ఆధారమేమి? అనగా స్థానమేమి? అని. అట్లనిన, కాలమునకు మాత్ర మాధారత ఎట్లు? ఆదియునుగాక, నివృత్తి రూప క్రియావాచకములకును ఆధార సంబంధ మగపడుచున్నది. ''ష్ఠాగతినివృత్తౌ'' అను ధాతువును జూతము. ''గ్రామేతిష్ఠతి'' అందురు. ఇచట గతి నివృత్తికి గ్రామ మాధారమైయుండె. అట్లే ''గ్రామే ఆస్తే'' అందురు. ఆసన మనగా సర్వవ్యాపార నివృత్తి. ఏ క్రియయు చేయక ఉనికియు నొక క్రియయే. ప్రకృతమున నది నియతకాలము భోజనము మానుట. నియతకాల మనగా గొన్ని దినములు మాత్రము. కొన్ని దినములకు తరువాత భోజనము చేయుటకు సంకల్పించినాడని భావము. క్రియకు దేశముతోడను, కాలముతోడను గూడ సంబంధము కలదు. కాని అందు కాలసంబంధము నాంతరీయకము (= తప్పనిసరి) అది యున్నపుడే. ఆధారమునకు కర్మసంజ్ఞను విధించిన, ''ఉపాన్వధ్యాఙ్వసః'' (1-4-48) అను సూత్రము ప్రవర్తించునని పర్యవసితార్థము.॥155॥

## శేషాధికారము

*అవతారిక* — కర్త, కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము, తృతీయా, ద్వితీయా, చతుర్థీ, పంచమీ, సప్తమీ విభక్తుల కర్థములు అవి విచారింపబడినవి. షష్ఠ్యర్థము గూడ నొక కారకభేదమే. అది ఏడవది. కర్మాదులకంటె వ్యతిరిక్తమగు స్వస్వామి భావము మున్నగు సంబంధమున ''షష్ఠీశేషే'' (2-3-50) అను సూత్రము షష్ఠీ ప్రత్యయమును విధించినది. అది శేష మెట్లగును? దానికి కారక రూపత ఎట్లు? అను విషయ మీ శేషాధికారమున విచారింపబడును.

**శ్లో॥ సంబంధః కారకేభ్యోఽన్యః క్రియాకారక పూర్వకః।**
**శ్రుతాయామ శ్రుతాయాం వా క్రియాయాం సోఽభిధీయతే॥ 156**

కారకేభ్యః = కారకముల కంటె, అన్యః = ఇతరమైనది, సంబంధః = సంబంధము, సః = 'శేషము' అను నా సంబంధము, క్రియాకారక పూర్వకః = క్రియ నిమిత్తముగా గల కారకత్వము పూర్వము గలది, క్రియాయాం = క్రియాపదము, శ్రుతాయాం = వాక్యమున వినబడినను, అశ్రుతాయాం వా = వినబడకున్నను, సః = ఆ సంబంధము, అభిధీయతే = షష్ఠిచే చెప్పబడును.

తాత్పర్య విశేషాంశములు— షష్ఠీ విభక్తి కర్థమగు శేషము, కర్మాదులకంటె వేరయిన దెట్లగును? ''రాజ్ఞః పురుషః'' = 'రాజుగారి మనిషి' అనగా రాజుగారాతనికి ధన

మిచ్చి తన మనిషిగా జేసికొన్నవాడని యర్థము గదా! అపుడు రాజు కర్త. మనిషి సంప్ర దానము. 'వృక్షస్య శాఖా' అనిన, చెట్టు అధికరణము. 'రాజ్ఞః వస్త్రమ్' అని రాజుగారు కొనుక్కొనిన బట్ట. ఏ వస్తువయినను ఒకరిసొత్తు గాపలెననిన, క్రయా, పహార, యాచన, వినిమయముల వలన నగును. కావున కర్మ కరణాధికారములలో నేదియో యొకటి షష్ఠ్యర్థమై తీరును. కాగా నదికారకేతర మెట్లగును? అని శంకించి, అవియున్నను వానిని వివక్షింప కుండుటయే శేషమగునని భాష్యమున చెప్పబడినది.

'రాజ్ఞః పురుషః' అను వాక్యమున క్రియావాచక పద మేదియు వినబడలేదు. కాని అచట, దానక్రియా నిమిత్తకమగు సంబంధము పూర్వముండి యుండును. అట్లే అవ యవావయ విభావము, లేదా జన్యజనక సంబంధము ఏదియో సిద్ధపూర్వమై యుండును. ముందు ఉండిన ఆ క్రియాకారక సంబంధము తరువాత సంబంధ సామాన్యముగ ననువర్తించును.

రాజపురుషులకు గల కర్తృ సంప్రదాన భావము తరువాత సంబంధ సామానలీ ముగ భాసించుచున్నది. కనుక నిది సప్తమ కారక భేదము.

'రాజు పురుషున కిచ్చుచున్నాడు' అను వాక్యమున కర్థము వేరు. రాజు మనిషి ఈతడను వాక్యమున కర్థము వేరు. క్రియావాచక పదము ప్రయోగింపబడకున్నను నూహింప బడి ఆ సంబంధమునకు నిమిత్తమగును.

''గ్రామస్య సమీపాదాగచ్ఛతి'' = 'ఊరుదగ్గఅనుండి వచ్చుచున్నాడు' ఇట సంబంధము సమీప సమీపి భావము. సమీపమునకు గ్రామ మాశ్రయము. కావున నచటను క్రియాకారక పూర్వకత్వము గలదు.

'చెట్టుయొక్క ఆకు' అనిన ఆకునకు చెట్టు అధికరణము.

'నటస్య శృణోతి' అను వాక్యమున క్రియాపదము వినబడుచున్నది. అచట షష్ఠ్యర్థమగు సంబంధము క్రియాకారక సంబంధమే. క్రియాకారక పూర్వకమగు సంబంధము గాదు. 'నటునకు సంబంధించిన వినికిడి' అని యర్థము. అ సంబంధమును శేషమే. కారకము గాదు. నియమపూర్వక విద్యాభ్యాసము కాదుగదా ఈ శ్రవణము.

ఈ విధముగనే ''మాతుః స్మరతి'' = తల్లికి సంబంధించిన స్మరణ. ''సమాషాణా మశ్నీయాత్'' = మినుముల భక్షణమును చేయరాదు. ''సర్పిషోజానీతే'' = 'నేతిని ఉపాయ ముగ చేసికొని ప్రవర్తించుచున్నాడు'. సర్పిః = నెయ్యి. జానీతే = ప్రవర్తించుచున్నాడు. ప్రవర్తించుటలో నెయ్యి కరణము. ఆ కరణత్వమును కరణత్వ రూపమున వివక్షింపక, శేషము = సంబంధ సామాన్యముగా వివక్షించుటచే షష్ఠి ప్రయోగింపబడినది.

ఈ విధమగు ప్రయోగములు సంస్కృత భాషకసాధారణములై కానవచ్చు చున్నవి అట్టివి అనేకములు గలవు.

ప్రకృత సందర్భమున మహాభాష్యమునందు, రెండు ఆక్షేప వార్తికములు గలవు.

(1) "షష్ఠీశేష ఇతిచే ద్విశేష్యే ప్రతిషేధః" (2) "తత్ర ప్రథమావిధిః"

షష్ఠికి సంబంధ మర్థము గదా. సంబంధ మనునది రెండు పదార్థములం దుండు నది. సంబంధము గలవి సంబంధులు. రాజు ఒక సంబంధి. పురుషు డొక సంబంధి. కాగా సంబంధి వాచక పదములు రెండింటికిని షష్ఠీ ప్రత్యయము కావలసియున్నది. కావున పురుష పదమున షష్ఠి రాదనియు, ప్రథమ వచ్చుననియు అపూర్వముగ విధింపవలసి యుండును అని శంకకు ఆశయము.

సమాధానము— "ఉక్తం పూర్వేణ" = అని భాష్యమున చెప్పబడినది. "ప్రాతి పదికార్థ లింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా" (2-3-46) అను సూత్రమున "పదసామా నాధి కరణ్యే ఉపసంఖ్యాన మధికత్వాత్" అని ఆక్షేపమును, "న వా వాక్యార్థత్వాత్" అని సమాధానమును నచట గలవు.

'రాజ్ఞః పురుషః' అను వాక్యమునందు పురుష శబ్దమున ప్రాతిపదికార్థ మాత్రమున ప్రథమ రాదగి యున్నది. అచట ప్రాతిపదికార్థమే కాక స్వత్వమను సంబంధము గూడ అధికముగ నున్నది గదా! ప్రథమ ఎట్లు వచ్చినది? అని ప్రశ్న. అది వాక్యమున కర్థము గాని పదార్థము గాదు. పురుష పదమును సంస్కరించినపుడు, ప్రాతిపదికార్థ మొక్కటియే స్ఫురించును. దానినిబట్టి ప్రథమ ప్రవర్తించునది' అని సమాధానము. 'రాజ్ఞః' అను దానితో సంబంధము కలిగిన తరువాత పురుషునకు సంబంధిత్వ మవగతమగును. కావున పురుష పదమున ప్రథమ స్వార్థమాత్రమున సిద్ధించును. షష్ఠికి ప్రాప్తియు లేదు. కావున, ప్రతిషేధ మును, విధానమును నక్కరలేదు అని "ఉక్తం పూర్వేణ" అను భాష్య గ్రంథమునకు తాత్పర్యము.

ప్రాతిపదికార్థము కంటె నధికమైన అర్థము వాక్యార్థముగాని పదార్థము కాదంటిరి గదా! అపుడు రాజ శబ్దమునగూడ ప్రథమయే ఏల రాలేదు? అని ప్రశ్నింపవచ్చును. కాని విశేష్యమునందలి ఆధిక్యమే వాక్యార్థము. విశేష్యము ప్రధానము. విశేషణము దాని కుపకారకము. కావున అప్రధానము. అది ప్రధానమున కుపకరించుట కర్హమైన మార్పును బొందును. ప్రధానము తన స్వరూపమును వదలి పెట్టదు. కావున ప్రధానమగు విశేష్యము నందలి అధికాంశమే వాక్యార్థమగును. కావున ప్రధాన వాచకముతో సమానాధికరణముగాని అప్రధాన వాచకము షష్ఠ్యన్తముగనే యుండును. అది సమానాధికరణమైన నచటను ప్రథ మయే వచ్చును. "వీరః పురుషః"=వీరుడగు పురుషుడు. అది పదార్థముల స్వభావము.॥156॥

అవతారిక— ఆ స్వభావమే ఇందు, వివరింపబడుచున్నది.

శ్లో॥ ద్విష్ఠోఽప్యసౌ పరార్థత్వాత్ గుణేషు వ్యతిరిచ్యతే।
తత్రాభిధీయ మానః సన్ ప్రధానేఽప్యుపయుజ్యతే॥ 157

అసౌ = ఈ సంబంధము, ద్విష్ఠః అపి = రెండింటియందున్నదైనను, పరార్థత్వాత్ = ప్రధానార్థము లగుటవలన, గుణేషు = విశేషణములందే, వ్యతిరిచ్యతే=అధికమగుచున్నది, తత్ర= ఆ అప్రధానములందు, అభిధీయమానః సన్ = షష్ఠిచే చెప్పబడుచునే, ప్రధానే అపి = విశేష్యమందును, ఉపయుజ్యతే = ఉపయోగపడుచున్నది.

తాత్పర్య విశేషాంశములు— సంబంధమనునది ఒక్కటియే. కావున దానిని బోధించు షష్ఠీ ప్రత్యయమును నొక్కటియే ఉచితము. రెండు షష్ఠులు ప్రయోగింపబడిన, రెండు సంబంధములు ప్రతీతములు కావలసియుండును. అట్లు లేదుగదా! ఆ షష్ఠి విశేషణములైన శబ్దములందే వచ్చును. వానిలో రూపమున మార్పును గలుగజేసి ఆధిక్యమును ప్రదర్శించును. ఇక విశేష్యము తనలో నెట్టి మార్పును లేకయే ఆ సంబంధము ననుభవించును. కనుకనే దానికి ప్రాధాన్యము. అందువలన విశేష్య వాచకమున ప్రాతిపదికార్థ మాత్రమున ప్రథమయే వచ్చును. రాజపురుషుల విశేష్య భావవిశేషణ భావములు మారినపుడు, ''పురుషస్య రాజా'' = 'పురుషుని రాజు' అని వాక్యముండవచ్చును. ॥157॥

అవతారిక— షష్ఠ్యర్థమగు సంబంధ సామాన్యము క్రియాకారక సంబంధ పూర్వకమని చెప్పిరి. ఆ క్రియాకారక సంబంధము 'ఫలానిది' అని నిరూపించుటకు శక్యమగునా? అనిన, 'కాదు దానికి నియమము లేదు' అనుచున్నారు.

**శ్లో॥ నిమిత్త నియమః శబ్దాత్ సంబంధస్య న గృహ్యతే ।**
**కర్మ ప్రవచనీయైస్తు న విశేషే అవరుధ్యతే ॥ 158**

సంబంధస్య = షష్ఠ్యర్థమగు సంబంధమునకు, నిమిత్త నియమః = నియతమగు నిమిత్తము, శబ్దాత్ = వినబడు శబ్దమువలన, న గృహ్యతే = గ్రహింపబడదు, కర్మ ప్రవచనీయైః తు= కర్మ ప్రవచనీయములను వానిచేనైన, సః = ఆ సంబంధము, విశేషే = 'అది ఇది' అని ఒక విశేషమునందు, అవరుధ్యతే = నిర్ణయింపబడి యుండును.

తాత్పర్య విశేషాంశములు— ''పితుః పుత్రః'' 'తండ్రియొక్క కొడుకు' ఇచట, 'యొక్క' శేష షష్ఠి. శేషము జన్యజనక భావనిమిత్తము.

''పశోః పాదః'' 'పశువు యొక్క కాలు' ఇట సంబంధము అవయవావయవి భావ మూలకమని సంబంధిని బట్టి తెలియవచ్చును.

'రాజ్ఞః పురుషః' అనుచోట ఆ విధముగ స్వస్వామి భావమునకు నిమిత్తమైన, నియతమైన సంబంధమేదియు తెలియరాదు. పురుషుడు రాజసంబంధి అగుటకు, యాచనరా దానమో, ఇంక నేదియో నిమిత్తము కానోపును. నియతి లేకపోవచ్చును. నిమిత్తము తః

అట్టి నిమిత్త నియమము కర్మ ప్రవచనీయముల ప్రయోగమున నగపడును.

ప్ర, పరా.— మున్నగు వానిలో గొన్నింటికి పాణిని, ఉపసర్గ సంజ్ఞ కపవా

ముగ ''కర్మ ప్రవచనీయము'' అను సంజ్ఞను విధించియున్నాడు. ''జపమను ప్రావర్షత్'' ''శాకల్యస్య సంహితామను ప్రావర్షత్'' - మున్నగు వాక్యములలో 'అను' అనునది కర్మ ప్రవచనీయము.

జపము చేయుటవలనను, శాకల్య సంహితను బఠించుటవలనను వర్షము కురిసినది. ఎపుడు వర్షము కురిసినది? అను ప్రశ్న కిది సమాధానము. ''అనుర్లక్షణే'' (1-4-83) అను సూత్రము, గతి సంజ్ఞకు బాధకముగ కర్మ ప్రవచనీయమను సంజ్ఞను 'అను' అనుదానికి విధించినది. తద్యోగమున ద్వితీయ. జపము చేసినట్లు తెలిసికొని ఆ వెంటనే వర్షము కురిసినట్లు తలంపబడుచున్నది. జపమునకును వర్షించుటకును సంబంధము, కారణ కార్య సంబంధము. వినుట లేదా తెలిసికొనుట అను క్రియవలన నది కలిగినదని 'అను' అను కర్మ ప్రయచనీయము తెలియచేయును.

కర్మ ప్రవచనీయముల స్వభావము క్రియోద్దేశమున నిట్లు వివరింపబడినది—

శ్లో॥ క్రియాయాః ద్యోతకో నాయం సంబంధస్య న వాచకః ।
**నాపి క్రియాపదాక్షేపీ, సంబంధస్య తు భేదకః ॥**

''ఇది క్రియకు ద్యోతకము కాదు. సంబంధమును చెప్పదు. క్రియాపదమును నిది ఆక్షేపింపదు. మతేమగుననిన, సంబంధ విశేషమునకు ద్యోతకమగును'' అని దాని యర్థము. 'క్రియాం ప్రోక్తవాన్' = కర్మ ప్రవచనీయః అని వ్యుత్పత్తి. ఇది ప్రకృత క్రియకు ద్యోతకము గాదు. కడచిన క్రియను ప్రకాశింపజేసినది. విభక్తికి ప్రత్యయమే సంబంధమును చెప్పును గాన నిది సంబంధవాచకమును గాదు. ''ప్రాదేశం విలిఖతి'' అని యొక వాక్యము. ప్రాదేశమనగా జానెడు స్థలము. దానిని కొలిచి గీత గీయుచున్నాడని అర్థము. ఇట 'వి' అనునది ఉపసర్గము. కొలుచుట అను క్రియను ఇది ఆక్షేపించును. విలిఖతి = విమాయ లిఖతి' కర్మ ప్రవచనీయములు ఉపసర్గలు చేయు పనులను వేనిని చేయవు. విభక్త్యర్థ మిచట క్రియావిశేష జన్య సంబంధము' అని ప్రకాశింపజేయుట వాని పని.

''అధిబ్రహ్మదత్తే పంచాలాః'' అని యొక వాక్యము. పంచాలదేశము బ్రహ్మదత్త మహారాజుది. ఆ స్వస్వామి భావమును 'అధి' అను కర్మ ప్రవచనీయము ప్రకాశింపజేయును. తద్యోగమున సప్తమి విహితము.

''అభిమన్యురర్జునతః ప్రతి'' = అభిమన్యుడు అర్జునునకు ప్రతినిధి. అనగా అర్జునుడు చేయు పనులను జేయుటచే నాతని అనుకరింపగలవాడని భావము. అనుకార్యానుకరణ భావ మిచట 'ప్రతి' అను దానిచే ప్రకాశింపజేయబడును. కావున నీ తీరుగ క్రియ ప్రకటముగాలేని స్థలములందు దానిని ప్రకాశింపజేయుట, కర్మ ప్రవచనీయముల కృత్యము. ॥158॥

*అవతారిక*— ఇక విచారాంతరము.

''షష్ఠీశేషే'' (2-3-50) అను సూత్రముచే కారక ప్రాతిపదికార్థ వ్యతిరిక్తమగు

అవతారిక—ఉత్పత్తి, నాశము అనునవి స్వతః లేనేలేవు. అట్టి స్థితిలో జన్మ నాశములు సత్తరూపములనుట యెట్లు? అను ప్రశ్నకు ముందుగా నాశము సత్తారూపమే అని చూపుచు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ తిరోభావాభ్యుపగమే భావానాం సైవ నాస్తితా।
లబ్ధక్రమే తిరోభావే నశ్యతీతి ప్రతీయతే॥ 38

భావానామ్ = పదార్థములకు, తిరోభావాభ్యుపగమే = తిరో భావమును (మఱుగు పడుటను) అంగీకరింపగా అనగా ఆ పదార్థములకు కారణమగు వస్తువులయందు శక్తిరూపమున మాత్రము స్థితిని అంగీకరించునప్పుడు, సా + ఏవ + ఆబ్రహ్మ సత్తయే, నాస్తితా = నాశము, (ఇతి) = అని (కథ్యతే) = చెప్పబడుచున్నది. ఎల్ల పదార్థములు సత్తారూపములే, ఆసత్త కారణ వస్తువులయందు శక్తి రూపముననేయుండి, క్రమరహితముకాగా, నాశము అను నామపదముచే చెప్పబడుచున్నది. నాశమనగా అదియే. అంతియేకాని అభావరూపముకాదు.

తిరోభావే = కారణములయందున్న తిరోభవనము (అనగా సూక్ష్మరూపమున నుండుట), లబ్ధక్రమే = పొందబడిన క్రమముకలది కాగా, నశ్యతి + ఇతి = నశ్యతి అని తిఙంతపదముచే, ప్రతీయతే = తెలియబడుచున్నది.

ఆసత్తయే కారణముల యందుండి క్రమము లేక యుండగా, నాశము అను సిద్ధ రూపమున నామపదవాచ్యమగును. అచట క్రమము వివక్షితమగుచో నదియే సాధ్యరూపమున భాసించుటచే, నశ్యతి, అను క్రియా పదముచే బోధింపబడును. క్రమము భాసించుటచే ఆ సత్త సాధ్యమగును, అదియేభేదము. నాశము సత్తారూపమే. ॥38

అవతారిక—నాశము సత్తారూపమే అని 38వ శ్లోకమున జూపి జన్మయు సత్తా రూపమే అని చూపుచున్నాడు.

శ్లో॥ పూర్వస్మాత్ప్రచ్యుతా ధర్మా దప్రాప్తా చోత్తరం పదమ్।
తదన్తరాలే భేదానా మాశ్రయా జ్జన్మ కథ్యతే॥ 39

పూర్వస్మాత్ = మొదటిదియగు, ధర్మాత్ = ధర్మమునుండి, అనగా కారణముల యందు శక్తిరూపమునుండుట యనెడి స్వభావమునుండి, ప్రచ్యుతా = జారినటువంటి అనగా కార్యోన్ముఖముగా నున్నట్టి, ఉత్తరమ్ = చివరిదియగు, పదమ్ = స్థానమును అనగా కార్య రూపమును, అప్రాప్తా + చ = పొందకయున్న, (సత్తా) = సత్తయే, తదన్తరాలే = ప్రథ మావస్థయొక్కయు, ఉత్తరావస్థయొక్కయు, మధ్యభాగమున కలిగెడి, భేదానామ్ = భేదము లకు, ఆశ్రయాత్ = ఆశ్రయమగుటవలన, జన్మ = పుట్టుక, ఇతి = అని, కథ్యతే = చెప్పబడుచున్నది. ఘటముపుట్టుచున్నది, అని లోకులు వ్యవహరింతురు, ఘటముసిద్ధమే యగుచో దానికిపుట్టుక యుండదు, ఆఘటము మట్టిరూపమున నుండగా అది కార్యోన్ముఖము కాగా అదిమొదలుకొని ఘటరూపము సిద్ధించువరకు మధ్యకాలమునకలిగెడి అవస్థలనుబట్టి సత్తయే జన్మ, అను భావమును బొందుచున్నది. కాగా జన్మయనునది క్రొత్తగాపుట్టుటకాదు,

స్వస్వామిభావము మున్నగు సంబంధమున షష్ఠీ విభక్తి ప్రత్యయము విధింపబడినది గదా! మరల కొన్ని సూత్రములందు, "కర్మణి శేషే" "కరణే శేషే" 'అధికరణే శేషే" అని, కర్మ, కరణము, అధికరణము, శేషములుగా వివక్షింపబడినపుడు షష్ఠీ విధానమున కుపపత్తి యేమి? కర్మ కరణాదులు వేరును సంబంధము వేరును గదా! కర్మత్వాదులను సంబంధ మాత్రముగ దలంచినపుడు అవి తిరోహితములే యగును గదా! ఇది ప్రకృత విచార విషయము.

శ్లో॥ సాధనై ర్వ్యపదిష్టే చ శ్రూయమాణక్రియే పునః।
ప్రోక్తా ప్రతిపదం షష్ఠీ సమాసస్య నివృత్తయే॥ 159

సాధనైః = కర్మాదికారకముల చేత, వ్యపదిష్టే = విశేషింపబడిన, శ్రూయమాణ క్రియే = క్రియాపద శ్రవణమున్న చోటులందు, పునః = మరల, షష్ఠీ = షష్ఠీ ప్రత్యయము, సమాసస్య = సమాసము యొక్క, నివృత్తయే = నివారణమునకై, ప్రతిపదం = ప్రత్యేక పదోచ్చారణ ముఖముగా, ప్రోక్తా = విధింపబడినదై, అస్తి = ఉన్నది.

తాత్పర్య విశేషాంశములు— "అధీగర్థ దయేశాం కర్మణి", "జ్ఞోఽవిదర్థస్య కరణే", "కృత్వోఽర్థ ప్రయోగే కాలేఽధికరణే" - ఇవి ద్వితీయాధ్యాయ తృతీయపాదమున (52-51-64) సూత్రములు. వీనిలో "కర్మణి, కరణే, అధికరణే" అనునవి, శేషమును విశేషించును. 'శేషేషష్ఠీ' అనగా సంబంధ రూపార్థమున షష్ఠి వచ్చునని యర్థము. ఏ సంబంధమున? అని ప్రశ్నించిన, ఆ సంబంధము వెనుకటి అవస్థలగు కర్మత్వ కరణత్వాదుల రూపమున నున్న సంబంధమున నని తెలియజేయుట కవి విశేషణములు.

ఇక పునర్విధాన మెందులకను ప్రశ్నకు సమాధానము 'సమాస నిషేధమునకు' అని. అది నియమార్థము. ఆ నియమమునకు ఫలము అన్యనివృత్తి. షష్ఠియే ఉండుననిన దాని అభావముండదని యర్థము గదా. తదభావము సమాసమున గదా యుండునది. కాగా సమాసము రాదని ఫలితము. ॥159॥

అవతారిక— పైన చెప్పిన నియమ ఫలితమును వార్తిక కారుడు. "ప్రతిపద విధానాచ షష్ఠీ న సమస్యతే" అను వార్తికముచే బోధించెను.

శ్లో॥ నిష్ఠాయాం కర్మవిషయా షష్ఠీ న ప్రతిషిధ్యతే॥
శేషలక్షణయా షష్ఠ్యా సమాసస్తత్ర నేష్యతే॥ 160

నిష్ఠాయాం = నిష్ఠా ప్రత్యాయాంతములు పరమైనపుడు, కర్మవిషయా = కర్మార్థకమగు, షష్ఠీ = షష్ఠీ ప్రత్యయము, న ప్రతిషిధ్యతే = నిషేధింపబడదు, తత్ర = అచట, శేషలక్షణయా = 'షష్ఠీ శేషే' అని విహితమైన, షష్ఠ్యా, సమాసః = షష్ఠ్యంతముతో, సమాసము, న ఇష్యతే = సమ్మతము గాదు.

తాత్పర్య విశేషాంశములు— "మాతుః స్మృతమ్" = 'తల్లికి సంబంధించిన స్మృతి' అని యర్థము. కర్మ అగు మాత శేషముగ వివక్షింపబడుట వలన షష్ఠి. 'అధీక్' అను సోపసర్గ ధాతువునకు స్మరణ మర్థము. 'స్మృతమ్' అనునది భావార్థమున నిష్ఠా ప్రత్యయాంతము. క్త, క్తవతు అను ప్రత్యయములకు 'నిష్ఠ' అని సంజ్ఞ. కనుక నిష్ఠా ప్రత్యయాంతముతో నన్వయమున్నపుడు షష్ఠికి "నలోకావ్యయ నిష్ఠాఖలర్థతృనామ్" (2-3-69) సూత్రముచే నిషేధము ప్రాప్తించుచున్నది గాని, ఆ నిషేధము, "కర్తృ కర్మణోః కృతి" (2-3-65) అను సూత్రముచే విధింపబడిన షష్ఠికే. ఆ సూత్రమున 'శేషే' అను పద మను వర్తింపదు. 'షష్ఠ్యేవ న సమాసః' అను నియమమాషష్ఠికి లేదు కాబట్టి 'ధర్మానుస్మరణమ్', 'అర్థానుస్మరణమ్' మున్నగు సమాసములు సాధువులే.

'మాతుః స్మృతమ్' అను స్థలమున అధిగర్థ సూత్రముచే శేషషష్ఠి కాదే. "క్తస్య చ వర్తమానే" (2-3-67) అని గదా అచట షష్ఠి ? అని ప్రశ్న కవకాశము కలదుగాని అది భాష్యమున ప్రత్యాఖ్యాతము. కావున నది శేషత్వ వివక్షచే వచ్చిన షష్ఠియే. 'షష్ఠ్యేవ, న సమాసః' అను నియమమునకు విషయమే. 'స్మృ' ధాతువు సకర్మకమైనను అకర్మకవద్భావముచే భావార్థమున నిష్ఠా ప్రత్యయము సాధువు.

సమాస ప్రతిషేధమున కుదాహరణాంతరములు— "సర్పిషః జ్ఞానమ్", "మధునః జ్ఞానమ్" మున్నగునవి.

ఒక ప్రశ్న— 'మధునః జ్ఞానమ్' అను వాక్యమునకు మధు సంబంధి ప్రవృత్తి అని అర్థము. ఆ సంబంధము కరణత్వ పూర్వకము అని వాక్యమువలన తెలియును. 'మధుజ్ఞానమ్' అను సమాసమయిన సంబంధ సామాన్య జ్ఞానమేకాని, మధువు ప్రవృత్తిలో కరణముగాన నది కరణత్వరూపమని తెలియబడదు. ఇట్లు వృత్తి విగ్రహములకు సమానార్థకత్వము లేనందుననే సమాస ప్రతిషేధము సిద్ధించునుగదా. అనగా సామర్థ్యమువలన సమాసము రాదనవచ్చును గదా. ఈ యత్న మెందులకు ? అని ప్రశ్న.

సమాధానము— వాక్యమువలన నైనను, ఆ సంబంధము కరణత్వ పూర్వకమని శబ్దతః తెలియబడదు. అది అర్థ ప్రకరణాదులను బట్టి తెలియవలసినదే. కావున 'జ్ఞా' ధాతువున కచట ప్రవృత్తి అర్థమని ప్రకరణమువలన గృహీతమైనపుడు ప్రసక్తమగు సమాసమునకు ప్రతిషేధ మావశ్యకమని తాత్పర్యము. ॥160॥

అవతారిక— "షష్ఠీ శేషే" (2-3-51) అను సూత్రమున మహాభాష్యమునందు శంకా సమాధానము లిట్లున్నవి.

సంబంధమనునది ద్వినిష్ఠము గదా. దానిని తెలియజేయుటకు షష్ఠీ విభక్తి ప్రత్యయము ప్రయోగింపవలెను. అపుడు స్వామివాచకమగు రాజ శబ్దమునవలె స్వవాచకమగు పురుష శబ్దమునగూడ షష్ఠి ఏల లేదు ?

సమాధానము— 'ఒక షష్ఠియే ద్వినిష్ఠమగు సంబంధమును తెలియజేయును గాన పురుష శబ్దమున నది రాదు.

అట్లైన నిక 'పురుషస్య రాజా' అను ప్రయోగమే సంభవింపదా? ఏల సంభవింపదు? అపుడు రాజశబ్దము ప్రథమాంతమగును.

ఒకే వస్తువు ప్రధానమును, అప్రధానమును గూడ అగుట అసంభవము గాన "రాజ్ఞః పురుషస్య" అని ప్రయోగించుట సంభవింపదు కదా? అనిన విషయభేద మున్నపుడదియు సంభవమే, 'రాజుగారి పురుషుని ధనము' అని చెప్పదలంచుకొనిన నా ప్రయోగమును సుస్థమే. ఇది అచట గ్రంథము. దాని వ్యాఖ్యానరూపమే ఈ శ్లోకము.

శ్లో॥ అన్యేన వ్యపదిష్టస్య యస్యాన్యస్యోపజాయతే।
వ్యతిరేకః స ధర్మౌ ద్వౌ లభతేవిషయాంతరే॥ 161

అన్యేన = వేరొక విశేషణముచే, వ్యపదిష్టస్య = విశేష్యముగా నిర్దేశింపబడిన, యస్య = దేనికి, అన్యత్ర = ఇంకొక ప్రధానమునందు, వ్యతిరేకః = సంబంధము, ఉపజాయతే = ఏర్పడునో, సః = అది, విషయాంతరే = వేరు విషయమునందు, ద్వౌ, ధర్మౌ = అప్రధానత్వ ప్రధానత్వములను, లభతే = పొందును.

తాత్పర్య విశేషాంశములు— "రాజ్ఞః పురుషస్య కంబలః" - అని వాక్యము. రాజు పురుషునకు విశేషణము. పురుషుడు విశేష్యము. ఆ పురుషునకు కంబలము విశేష్యము. పురుషుడు విశేషణము. ఇట్లు విషయభేదమునుబట్టి ఒకే వ్యక్తి విశేష్యమును విశేషణమును గావచ్చును. ఒక కాలమున పురుషుడు విశేష్యముగ నిర్దేశింపబడి, కాలాంతరమున, అనగా కంబలముతో సంబంధించినపుడు విశేషణమగుట విరుద్ధము కాదు, అని 'వ్యపదిష్టస్య' అను, భూతకాల నిర్దేశముచే సూచింపబడినది. ॥161॥

అవతారిక— పై శ్లోకమునకు విశేష వివరణ రూప మీ క్రింది శ్లోకము.

శ్లో॥ ప్రాధాన్యం స్వగుణేలబ్ధ్వా, ప్రధానే యాతిశేషతామ్।
సహయోగే, స్వయోగేఽతః ప్రధానత్వం నహీయతే॥ 162

స్వగుణే = తన విశేషణమున, ప్రాధాన్యం = విశేష్యత్వమును, లబ్ధ్వా = పొంది, ప్రధానే = ఇంకొక ప్రధానమున, స్వయోగే = తన సంబంధము కలిగినపుడు, శేషతాం = విశేషణత్వమును, యాతి = పొందును, సహయోగే, ఇవ = సహార్థక శబ్దముతో సంబంధమునందువలె, అతః = అందువలన, ప్రధానత్వం = ప్రాధాన్యము, స్వస్య = తనకు, నహీయతే = నివర్తింపదు.

తాత్పర్య విశేషాంశములు— రాజు విశేషణమైనపుడు పురుషునకు ప్రాధాన్యము, ముందే లభించియున్నది. పురుషుడు కంబలమునకు విశేషణమైనపుడు, తాను అప్రధానమైనను

రాజునుబట్టి సప్రాధాన్యము తనకు తొలగదు. గుణప్రధాన భావము, ఏకత్ర, విరుద్ధముగాని విషయములు వేరయినపుడు విరుద్ధము గాదు.

"పుత్రేణ సహ ఆగతః దేవదత్తః" దేవదత్తుడు పుత్రునితోగలసి వచ్చినాడు. వచ్చుట అను క్రియలో తండ్రి ప్రధానుడు. పుత్రుడు అప్రధానము. కనుక నచట "సహ యుక్తేఽప్రధానే" (2-3-19) అను సూత్రముచే తృతీయా విభక్తి ప్రత్యయము వచ్చినది. దేవదత్తునియొక్క పుత్రుడు అనునపుడు, పుత్రుడు "రాజ్ఞః పురుషః" అనుచో పురుషునివలె విశేష్యమే. ప్రధాన భూతుడే. కాని రాకలో, 'తండ్రితోగూడ' అనుటవలన నాతనికి అప్రాధాన్యము. ఆ విధముగనే "రాజ్ఞః పురుషస్య కంబలః" అనుచోట పురుషుడు రాజునకు విశేష్యమును, కంబలమునకు విశేషణమును నగుట విషయభేదముచేత నుపపన్నమే. ॥162॥

## ప్రథమావిభక్తి విచారము

"ప్రాతిపదికార్థ, లింగ, పరిమాణ, వచనమాత్రే ప్రథమా" (2-3-46).

"సంబోధనేచ" (2-3-47) అను రెండు సూత్రములు ప్రథమా విధాయకములు. అందు సంబోధనమన నేమియో 163వ కారికచే విచారింపబడినది. ప్రాతిపదికార్థ సూత్ర విచారమును భర్తృహరి చేయలేదు.

వ్యాఖ్యాతయగు హేలారాజు మహా భాష్యానుసారముగ నా సూత్రమును సమగ్రముగ విచారించెను. ఆ విచార మిందు పొందుపరుపబడుచున్నది.

ప్రాతిపదికము నుచ్చరించిన తోడనే మన మనమున నొక అర్థము నియతముగ నుపస్థితమగును. అదియే ప్రాతిపదికార్థము. ఆయా శబ్దముల ప్రవృత్తి నిమిత్తమును, దాని కాశ్రయమైనదియు ప్రాతిపదికార్థముగా గ్రహింపబడుచుండును.

ప్రథమ ప్రాతిపదికార్థమును మాత్రము బోధించును. కర్మాదులు ద్వితీయాది విభక్తులచే బోధింపబడును. 'ఉచ్చైః', 'నీచైః' మున్నగు నవ్యయములు లింగరహితములు. అచట ప్రథమ ప్రాతిపదికార్థబోధకము. ప్రథమా ప్రత్యయ మచట లోపించినది. వినబడుచున్న విసర్గము ప్రాతిపదికావయవమే. కృష్ణః॥ శ్రీః॥ జ్ఞానమ్॥ ఇవి నియతలింగములు. లింగ మచట ప్రాతిపదికార్థమున చేరినదే. అధికము గాదు. కాగా ప్రాతిపదికార్థముననే ప్రథమ.

తట శబ్దమునకు మూడు లింగములు నుండును. అందు ప్రాతిపదికార్థమే కాక లింగమును అధికముగా నున్నది. కావున నట లింగమాత్రాధిక్యమున ప్రథమ.

ద్రోణః॥ ఖారీ॥ ఆఢకమ్॥ వీనిలో పరిమాణము ప్రాతిపదికార్థముకంటె నధికము. కావున పరిమాణ మాత్రాధిక్యమున ప్రథమకవి యుదాహరణములు.

ఏకః॥ ద్వౌ॥ బహవః॥— ఇట వచనాధిక్యమున ప్రథమ. వచనమనగా సంఖ్య. అది ఏక, ద్వి, బహు— అను ప్రాతిపదికల అర్థమే అగుటచే, ప్రథమా ప్రత్యయములు.

ఉక్తార్థములు. అనగా వాని అర్థము ప్రాతిపదికముచేతనే చెప్పబడినది. ''ఉక్తార్థా నామ ప్రయోగః'' అని న్యాయము. వేని అర్థము శబ్దాంతరములచే, చెప్పబడునో వానికిక ప్రయోగ ముండదు అని ఆ న్యాయమున కర్థము గదా. ఇది ప్రథమావిధాయక సూత్ర ప్రమేయము.

కొంద రీ సూత్రమును మార్చి ''అభిహితే ప్రథమా'' అని పఠింతురు కారకము అభిహితము అయినపుడు ప్రథమ వచ్చునని అర్థము.

'కర్త కరణము మున్నగునవి, తిఙ్, కృత్, తద్ధిత ప్రత్యయములచేతను, సమాసము చేతను చెప్పబడినపుడు' అని భావము.

(1) పచ్యతే ఓదనః = అన్నము వండబడుచున్నది.

(2) మాంసపచనః వహ్నిః = మాంసమును వండు సాధనము అగ్ని.

(3) గోఘ్నః అతిథిః = గోవును చంపుట కుద్దేశ్యభూతుడు (చుట్టము).

(4) ప్రస్కందనః స్తంభః = దీనినుండి జారుదురు గాన నీ స్తంభము ప్రస్కందనము.

(5) ప్రాసాదో రాజభవనమ్ = దీనియందు కూరుచుందురుగాన నిది ప్రాసాదము.

(6) పచతి దేవదత్తః = దేవదత్తుడు వండుచున్నాడు.

ఈ ప్రయోగములందు, యథాక్రమముగ కర్మ, కరణము. సంప్రదానము, అపాదానము, అధికరణము, కర్త - అను నాఱు కారకములును తిఙ్ కృత్ప్రత్యయములచే చెప్పబడినవి గాన నట ప్రథమా ప్రత్యయము వచ్చినది.

ఇట్లే, ''కృతః కటః'' = చాప అల్లబడినది. కృత్ప్రత్యయ మిట కర్మను చెప్పినది ఔపగవః = ఉపగు అను నాయన పుత్రుడు.

ఇట తద్ధిత ప్రత్యయము సంబంధమును చెప్పినది. కావున ప్రథమ. ''చిత్రగుః'' = చిత్ర వర్ణములయిన గోవులు కలవాడు. సమాస మిట సంబంధమును వచించినది.

రాజ్ఞః పురుషః = షష్ఠి, సంబంధమును బోధించినది గాన నిక పురుష పదమున ప్రథమయే వచ్చినది.

మహాభాష్యమున నీ సందర్భమున నీ ప్రశ్నోత్తరములు గలవు.

''అభిహిత లక్షణాయా మనభిహితే ప్రథమావిధిః'' అని వార్తికము. కర్మాది కారకము లభిహితములయినపుడు ప్రథమ వచ్చునని యర్థమయిన, ఏ కారకమును అభిహితము కాని స్థలమున ప్రథమ ప్రాప్తింపకపోవును. అపుడచట అపూర్వముగ ప్రథమను విధింపవలసి యుండును.

'వృక్షః', 'పర్వతః' అనుచో తిఙాదు లేవియు లేవుగాన అభిధానమునకు ప్రసంగమే లేదుగదా యని ప్రశ్న. దీనికి పరిహార మిట్లు కలదు.

''అస్తిర్భవన్తీ పరోఽప్రయుజ్యమానోప్యస్తి'' అని భాష్యము.

భవన్తీ అనునది లట్టను లకారమునకు పూర్వాచార్యుల సంజ్ఞ. అది పరముగాగల అస్తిః = అసభువి అను ధాతువు, ప్రథమ పురుష ప్రత్యయాంతము. వాక్యమునందు ప్రయోగింపబడ కున్నను. అస్తి = అధ్యాహృతమగును. అని అర్థము. క్రియాసంబంధములేని ఏ పదార్థమును వ్యవహారయోగ్యము గాదు గాన నంతటను అస్తి క్రియ సన్నిహితమయియే యుండును. 'వృక్షః' అనిన వెంటనే 'అస్తి' అనునది గూడ ఉన్నట్లే భావింపబడును. భావించుట ఏల 'అస్తి' అను శబ్దమునకే అధ్యాహారము. అందున్న తిఙ్ప్రత్యయముచే కర్త చెప్పబడినది గాన ప్రథమ సిద్ధమే యగును.

ఒక పదమును ప్రయోగించుచున్నారనిన దాని అర్థము నిశ్చితమై యుండవలెను. ఏ పదార్థమును సత్త అనునది లేకుండ నుండదు.

''నసత్తాం పదార్థో వ్యభిచరతి'' = సత్త లేని పదార్థమున కునికి లేదు. కనుక 'వృక్షః' అనిన 'అస్తి' అని కూడ చెప్పినట్లే. ''ప్రవృత్తిహేతుం సర్వేషాం శబ్దానా మౌపచారికీమ్। ఏతాం సత్తాం పదార్థో హి న కశ్చిదతివర్తతే'' అని సంబంధ సముద్దేశమున చెప్పబడిన దిట స్మరింపదగును.

ఈ సందర్భమున వేరొక వాక్యము = వార్తికము, ''అభిహితా నభిహితే ప్రథమా భావః'' అనునది. ''ప్రాసాదే ఆస్తే'' ''శయనే ఆస్తే'', అను వాక్యములలో ప్రాసాదశయన శబ్దములకు ప్రథమ ప్రాప్తించుచున్నది. అది వారణీయము. ప్రాసాదశబ్దము అధికరణ 'ఘఞ'ంతము. 'ప్రసీదన్తి అస్యామ్'. శయన శబ్దము అధికరణ 'ల్యు' డంతము. 'శేరతే అస్యామ్'. అధికరణము 'కృత్ప్ర'త్యయములచే అభిహితము. అయినను 'ఆస్తే' అనుచోట తిఙ్ప్రత్యయముచే అభిహితము కాలేదు. కావున నది అభిహితా నభిహితము. అభిహితము కూడ నగుటచే ప్రథమకు ప్రాప్తి కలదని ఆక్షేపతాత్పర్యము.

ఈ ఆక్షేపమును పరిహరించుటకు, ''తిఙ్సమానాధికరణే ప్రథమా'' అని సూత్ర న్యాసము మార్చబడును. అపుడు 'ప్రాసాదే' 'శయనే' అనునవి తిఙ్ సమానాధికరణములు కావు గాన దోషము ప్రాప్తింపదు. తిఙ్ ప్రత్యయము కర్తను బోధించును. కావున కర్త తిఙ్సమానాధికరణమగును గాని అధికరణము కాదని సమాధాన భావము. ఈ సందర్భముననే వేరొక ఆక్షేప వార్తికము ''శతృశానచోశ్చ నిమిత్త భావాత్ తిఙో భావస్తయోరపవాదత్వాత్'' అనునది.

''దేవదత్తః పచతి'' అను ప్రయోగము ఈ సూత్ర న్యాస పక్షమున లభింపదు. ఏలయన, వాక్యమున కన్వాఖ్యానమని యొక పక్షమును, పదములకు ప్రత్యేకముగ అన్వాఖ్యానమని వేరొక పక్షమును శబ్ద శాస్త్రమున గలవు. అందు మొదటి పక్షమున ఆ వాక్యమిట్లు విభజించి సంస్కరింపబడును. దేవదత్త + పచ్ + ల్ అను స్థితిలో లకార స్థానమున తిఙ్ ప్రత్యయ ముత్పన్నము కాక పూర్వము దేవదత్తునకు తిఙ్ ప్రత్యయ సామానాధికర

ణ్యము లేదు గదా. కాగా, "లటః శతృశాన చావ ప్రథమా సమానాధికరణే" (3-2-124) అను సూత్రముచే తిఙ్ప్రత్యయమున కపవాదములయిన శతృశానచ్ ప్రత్యయములు ప్రాప్తించుచున్నవి. తిఙ్ సామానాధికరణ్యము లేనందున ప్రథమ యుండదు. ద్వితీయాది ప్రత్యయము లన్నియు నుండును. కావున ఆ న్యాసమున నీ దోషముండుటచే, "ప్రాతిపది కార్థ లింగ పరిమాణ వచన మాత్రే ప్రథమా" అను పాణిని న్యాసమే సుస్థము.

అట విచారాంతరమును నిట్లు గలదు. ఆ సూత్రమున 'ప్రాతిపదిక' అను పదము లేకున్న నేమి ? "అర్థలింగ పరిమాణ వచన మాత్రే ప్రథమా" అని సూత్రము చాలదా ? స్వాది ప్రత్యయములు ప్రాతి పదికమునకు పరముగనే వచ్చును. 'స్వౌజసమౌట్' ఇత్యాది శాస్త్రముచే విధింపబడిన ప్రత్యయములకు, ఈ ప్రకరణము, 'అర్థమునందే' 'లింగమునందే' అని ఈ తీరున నియమమును బోధించును. అపు డర్థమనగా ప్రాతిపదికార్థమే గాని వేఱే మగును ? అని శంక. కావున అర్థపదము చాలును 'ప్రాతిపదిక' అను దానితో పని లేదు అని భావము.

సమాధానమేమన—— ఏకత్వాది సంఖ్యలు లేని 'ఉచ్చైః' 'నీచైః' మున్నగు అవ్యయముల అర్థమునను ప్రథమ సిద్ధించుటకు ప్రాతిపదిక పద మావశ్యకమని. అచట ప్రథమ లేకున్న నేమి ? అందురేమో. అది లేకున్న సుబంతత్వము లేదు అది లేనిచో పదత్వము లేదు. పదము కానిది ప్రయోగార్హము కాదు. విశేష వివరణమునకు మహాభాష్య మును చూచునది.

## లింగ పద గ్రహణమునకు ప్రయోజన విచారము

ద్రవ్యవాచక ప్రాతిపదికములకు లింగముగూడ ప్రాతిపదికార్థమే కదా ! ఇక లింగ గ్రహణమునకు ప్రయోజనమేమి ? అని శంక.

స్త్రీ॥ పుమాన్॥ నపుంసకమ్॥ - అను శబ్దములందు గూడ ప్రథమ సిద్ధించుటకు లింగ పద మావశ్యకము. అచట జాతి ద్రవ్యములను ప్రాతిపదికార్థము కంటె నధికముగ లింగ ముండుటవలన ప్రాతిపదికార్థ మాత్రమున విధింపబడిన ప్రథమ సిద్ధింపకపోవును అని సమాధానము.

మరల శంక—— ఆ శబ్దములందు లింగముగూడ నియతోపస్థితి విషయమే కదా ! లింగము లేకుండగ స్త్రీ॥ పుమాన్॥ నపుంసకమ్॥ - అను శబ్దములు లేవు గదా ! కావున ప్రాతిపదికార్థముననే ప్రథమ సిద్ధించునే ?

సమాధానము—— సత్యమే. అనియత లింగములైన 'కుమారీ', 'తటః', 'కుణ్డమ్' మున్నగునవి లింగ గ్రహణ ప్రయోజనములు. అవి సర్వలింగము లగుటచే ఏ ఒక లింగమున కును ప్రాతిపదికము వలన నియతమగు నుపస్థితి కలుగదు గదా !

## పరిమాణ గ్రహణ సార్థక్య విచారము

ప్రస్థః = కుంచము, ఖారీ = పుట్టి, ఆఢకః = తూము ; ఇవి పరిచ్ఛేదకములు = కొలత పాత్రలు. ఆ కొలతగల వస్తువులతో అభేదముగ దీనికి వ్యవహార మగపడుచున్నది. "ప్రస్థః వ్రీహిః" = కుంచము ధాన్యము. ఆ వడ్ల పరిమాణము కుంచమనుట. ప్రస్థ పరకమున నున్న ప్రథమా విభక్తి ప్రత్యయమునకు పరిమాణము అర్థము. దానితో కొలువబడునది వ్రీహి. పరిమాణమునకును వ్రీహికిని మానమేయ భావము (= పరిచ్ఛేద్య పరిచ్ఛేదక భావము) సంబంధము. ప్రస్థమను పరిమాణముతో కొలచిన ధాన్యమని ఆ వాక్యమున కర్థము. ప్రస్థమును, ధాన్యమును అభిన్నములు కావు. కాని లోకమున అభేదమును వాని కారోపించి వ్యవహారము నడచుచున్నది. ఆ విషయమును వ్యక్తము చేయుటకు, పరిమాణ రూపార్థమున ప్రథమ ఈ సూత్రముచే విధింపబడినది.

ఈ ప్రథమా విధానము లేనిచో "ప్రాస్థికో వ్రీహిః" అని తద్ధితాంత పదముతో వ్యవహారమో, లేదా "ప్రస్థము పరిమాణముగా గల వ్రీహి" అని వాక్యము మాత్రమో ఉండ దగును గాని "ప్రస్థో వ్రీహిః" అను వ్యవహారము లభింపదు.

ఈ విషయము రాబోవు వృత్తి సముద్దేశమున 84 85 కారికలచే వివరింపబడినది

> మానమేయాది సంబంధవిశేషేంఽగీకృతే తదా
> ప్రస్థాదీనామసాధుత్వం తద్ధితేన వినా భవేత్ ।
> తద్ధితో యోగభేదేన వాక్యం వా స్యాద్విభాషితమ్
> పరిమాణాధికే తత్ర ప్రథమా శిష్యతే పునః ॥

అర్థము—— ప్రస్థమునకును వ్రీహికిని మానమేయ భావమను సంబంధము నంగీక రించినపుడు తద్ధిత ప్రత్యయములేని "ప్రస్థో వ్రీహిః" ఇత్యాది ప్రయోగిములసాధువులు కావలసి వచ్చును. అందువలన "తదస్య పరిమాణమ్" (5-1-57) అని సూత్రమును వేరు చేసి 'ఠ' గాది ప్రత్యయములను, మహావిభాషచేత వాక్యమునకు సాధుత్వమును బోధింపవలెను. దానివలన, "ప్రాస్థికః వ్రీహిః" అనియు, "ప్రస్థః పరిమాణమస్య వ్రీహేః" అను వాక్య ప్రయోగమును సిద్ధించును. "ప్రస్థో వ్రీహిః" అనునదియు సాధువగును. అందులకై పరిమాణమున ప్రథమా విధానము.

## వచన పదకృత్య విచారము

సూత్రమున వచన శబ్దమునకు సంఖ్య అర్థము. అది పూర్వాచార్య వ్యవహార సిద్ధము. ఏకః, ద్వౌ, బహవః - అను పదములందు, సంఖ్యను ప్రకృతియే చెప్పినను, విభక్తి సిద్ధించుట వచన పదకృత్యము.

మాత్ర పదమున కవధారణ మర్థము. అందువలన కర్మ కరణాద్యర్థములు ప్రాతి

పదికార్థము కంటె నధికముగ నున్నపుడు ఆయా విభక్తులే ప్రవర్తించును గాని ప్రథమ ప్రవర్తింపదు.

మహాభాష్యమున మాత్ర పదము ప్రత్యాఖ్యాతము. అతిరిక్తార్థము లున్నపుడు గూడ ప్రథమ ప్రాప్తించిన, సంబోధనమును నర్థమున "సంబోధనేచ" (2-3-47) అను సూత్రముచే మరల ప్రథమా విధానము వ్యర్థమగును గదా ! కావున మాత్ర పదము లేకున్నను దోషము లేదని భావము.

అది 'మాత్రచ్' అను ప్రత్యయము కాదు. 'మాత్రా' అను 'టా' బంతము. 'మాత్ర' అనగా సంఖ్య. సంఖ్యా రూపార్థమున ప్రథమా విధానమున కా పదము సమాహార ద్వంద్వముచే నిర్దేశింపబడినది' అని కొందరందురు గాని ఆ ప్రయోజనము 'వచన' శబ్దము చేతనే సిద్ధించును. అట్లు కానిచో వచనపదమో మాత్రపదమో ఏదియో యొకటి అందు అనావశ్యక మగును. 'అన్యతరత్ శక్యమకర్తుమ్' అని భాష్యము

'పరిమాణ వచన' - అనునది ఒకటే పదము. వచన పదమువలన సకల పరిమాణ వచనములకును గ్రహణము సిద్ధించును. 'నిలువు' అను నర్థముగల 'పురుష' అను శబ్దము ఊర్ధ్వమాన వాచకము. "పురుషః పరిఖా" = 'నిలువు కందకము' అందురు. అచట పురుష పదమునకు ప్రథమాసిద్ధి ప్రయోజనమని కొందఱనిరి గాని, మాత్రపదమవధారణార్థక మనుటయే యుక్తమని భాష్యమతము.

"వీరః పురుషః" = 'వీరుడగు పురుషుడు'. ఉచట ప్రథమ ప్రాప్తింపదని ఆక్షేపము. ఏలయన- విశేషణ విశేష్య భావ మధికముగా నున్నదిగదా అని భావము. "పద సామానాధి కరణ్యే ఉపసంఖ్యా నమధికత్వాత్" అని ఆక్షేప వార్తికము. "నవా వాక్యార్థత్వాత్" అని సమాధాన వార్తికము. 'విశేషణ విశేష్య పదములకు పరస్పరాన్వయమునకు పూర్వమే ప్రాతిపదికార్థ మాత్రమున ప్రథమ ప్రవర్తించును. పరస్పరాన్వయము కలిగిన తరువాత తెలియవచ్చు విశేషణ విశేష్య భావమను నధికాంశము వాక్యార్థముగాని పదార్థము గాదు' అని సమాధాన తాత్పర్యము.

'శుక్లః పటః' అనుచో శుక్ల శబ్దము గుణివాచకము. ప్రాతిపదికార్థముననే ప్రథమ. "వింశతిః గావః" = ఇరువది గోవులు. 'ఇరువది' సంఖ్యేయ వాచకము. ప్రాతిపదికార్థముననే ప్రథమ.

ఇట్లు యథాన్యాసమువలననే అనగా "ప్రాతిపదికార్థ లింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా" అను పాణిన్యాచార్యుని సూత్రమువలననే సకలేష్టసిద్ధి కలుగుచున్నదిగాన ఆ సూత్రము అవిభాల్యమని హేళారాజు నిర్ధారణము.

అవతారిక— "సంబోధే నేచ" (2-3-47) అను సూత్రము సంబోధన మను నర్థమున ప్రథమా విభక్తిని విధించినది. ఆ సంబోధన మన నేమి? అది పదార్థమా లేక వాక్యార్థమా? అని విచారింపబడుచున్నది.

**శ్లో॥ సిద్ధస్యాభి ముఖీభావమాత్రం సంబోధనం విదుః ।
ప్రాప్తాభిముఖ్యో హి అర్థాత్మా క్రియాసు వినియుజ్యతే ॥ 163**

సంబోధనమ్ = సంబోధనమను పదార్థమును, సిద్ధస్య = సంబోధ్య రూపముతో పూర్వ సిద్ధమైన వ్యక్తియొక్క, అభిముఖీ భావమాత్రం, విదుః = అభిముఖుని జేసికొనుటనుగా, తెలిసికొనుచున్నారు, ప్రాప్తాభిముఖ్యః = పొందబడిన ఆభిముఖ్యము కలవాడై, అర్థాత్మా = అర్థముతో నిండిన స్వరూపము గలవాడగుచు, క్రియాసు వినియుజ్యతే హి = చేయవలసిన పనులందు, ప్రేరింపబడును గదా!

సంబోధనమనగా సమ్యక్ బోధనము. గట్టిగా పిలచి తన వైపు త్రిప్పుకొని, తాను చెప్పు దానిని ఆ వ్యక్తి తెలిసికొని ప్రవర్తించునట్లు చేయుట సంబోధ్యునకు తన రూపము పూర్వసిద్ధమై యుండవలెను. 'రాజన్ । యుధ్యస్వ' అని రాజుగా నంతకు పూర్వము సిద్ధమయిన వానికే యుద్ధము చేయుము అని చెప్పుట. ఇంకను నాతనికి పట్టాభిషేకము లేనందున రాజు కానివాడైన, అపుడు సంబోధన విభక్తి ప్రయోగింపబడదు. అపుడు "రాజా భవ యుధ్యస్వ" అనియే వాక్య సంనివేశముండును.

ఈ సంబోధనము, కర్మ, కరణము మున్నగు వానివంటి కారకము గాదు. అవి సాక్షాత్తుగా క్రియాజనకములు. సంబోధ్యుడగు వ్యక్తి ఆజ్ఞాపింపబడి, అభిముఖుడై కార్యము నందు ప్రవర్తించును గాన అతనికి పరంపరగ క్రియాజనకత్వముగాని సాక్షాత్కారకత్వము లేదు. 'అర్థాత్మ' అనగా ప్రయోక్త యొక్క ఆదేశమునకు అర్థమును బాగుగ గ్రహించిన వాడని యర్థము. అపుడే కదా ప్రవృత్తి ॥163॥

అవతారిక— సంబోధనమునకు పదార్థత్వమును స్థాపించుచున్నాడు.

**శ్లో॥ సంబోధనం న వాక్యార్థ ఇతి వృద్ధేభ్య ఆగమః ।**

సంబోధనం = సంబోధనము, వాక్యార్థః న ఇతి = వాక్యార్థము కాదని, వృద్ధేభ్యః = పెద్దల నుండి, ఆగమః = వచ్చిన సంప్రదాయము.

**తాత్పర్య విశేషాంశములు**— ఆగమ మనగా నిశ్చయ జ్ఞానమును గలుగజేయు ప్రమాణము. సంబోధన పదమునకును క్రియాకాంక్ష కలదనుకొనుడు. అయినను, ఇతర పదముల అపేక్ష లేకయే దాని సంబోధ్య స్వరూపము తెలియవచ్చును. కావున నది పదార్థమే గాని వాక్యార్థము గాదు. కర్మ కరణాదులును పదముల అర్థములేగాని వాక్యార్థములు కావు. క్రియాపేక్ష ఉండవచ్చును. అంతమాత్రమున వాక్యార్థమన బనిలేదు. హేవృక్ష ! = ఓ వృక్షమా! అనిన నట్టి ఒక పదమే వాక్యము, అపుడు సంబోధనము వాక్యార్థమనవచ్చును,

కారణములయందు శక్తిరూపముననుండి క్రమముగా వ్యక్తమగుటయే, మరియొకధర్మమును బొందుటయే జన్మము.

కాబట్టి జన్మము కూడా సత్తారూపమే. ॥39

అవతారిక—సంబంధిభేదముచే సత్తకు భేదముకలుగును, దానివలన గోత్వము మున్నగు జాతిభేదముకలుగునని 33వ శ్లోకమున చెప్పబడినది. భేదకములగు సంబంధులను చూపుచున్నాడు.

శ్లో॥ ఆశ్రయః స్వాత్మమాత్రా వా భావా వా వ్యతిరేకిణః।
స్వశక్తయో వా సత్తాయా భేదదర్శనహేతవః॥ 40

ఆశ్రయః = ఆధారము అనగా గోవు, ఘటము మున్నగు వ్యక్తులు, స్వాత్మమాత్రాః + వా = తనకు ఆత్మీయములగు కల్పింపబడిన గోత్వము మున్నగు భాగములున్న, వ్యతిరేకిణః = వేరుగా ఉన్న, భావాః + వా = పదార్థములున్న అనగా దేశకాలాదులున్న, స్వశక్తయః + వా = తనశక్తులును, సత్తాయాః = బ్రహ్మసత్తకు, భేదహేతవః = భేదమునకు కారణములగుచున్నవి.

1. ఆశ్రయః. క్రియ. ద్రవ్యము రెండుకూడా సత్తారూపములే కాని అవిద్యావశమున భేదము కల్పితమగును. ఆస్థితిలో ఆవు, కడవ మున్నగు ఆశ్రయముల వలన సత్త భిన్నమగుచున్నది. గవాది భేదమున సత్త గోత్వ రూపమున, ఘటత్వరూపమున మారుచున్నది.

2. స్వాత్మమాత్రాః + మహా.సామాన్యము, వ్యాపకము, గోత్వము, మున్నగునవి వ్యాప్యములు. వీనినిబట్టి అది పరిచ్ఛిన్నము కాగలదు. ఆభాగములు ఆశ్రయమును బట్టియే భిన్నములగును.

3. భావాః. దేశమునుబట్టి సత్త భిన్నమగును. ఇది ఇచట ఇట్లున్నది. అచట అది అట్లున్నది అని లోకుల వ్యవహారము కలదు.

అట్లే నల్లకలువ రాత్రి వికసించును, పగటియందు ముకుళించును. దానిని బట్టి చూడగా కాలమునుబట్టి సత్త మారుచున్నట్లు స్పష్టమే.

ఇట్లే శక్తులను బట్టియు సత్త భిన్నమగును. ॥40॥

అవతారిక—జాతి అభివ్యక్తమగుటలో కొన్ని విశేషములను జూపుచున్నాడు.

శ్లో॥ పృథివ్యాదిష్వభివ్యక్తౌ న సంస్థాన మపేక్షతే।
అనుచ్ఛిన్నాఽఽశ్రయాజ్జాతి రనిత్యేఽప్యాశ్రయేస్థితా॥ 41

A. పృథివ్యాదిషు = భూమిమున్నగు వాని యందు అనగా భూమి, ఉదకము, తేజము మున్నగు వానియందు, అభివ్యక్తౌ = జాతి స్పష్టమగుటయందు, సంస్థానమ్ = అవయములకూర్పును, న + అపేక్షతే = అపేక్షింపదు.

ప్రకృతవిషయ నిగమనము క్రింద చేయబడుచున్నది.

**ఉద్దేశేన విభక్త్యర్థాః వాక్యార్థాత్ సమపోద్ధృతాః ॥** 164

ఉద్దేశేన = సంగ్రహరూపముగ, విభక్త్యర్థా = విభక్తుల అర్థములు, వాక్యార్థాత్ = అఖండ వాక్యార్థమునుండి, సమపోద్ధృతాః = విభజింపబడినవి.

*తాత్పర్య విశేషాంశములు*— ఉద్దేశమనగా సంక్షేప వచనము. దాని మూలముగ విభక్తుల అర్థములగు, కర్త, కర్మ మున్నగునవి, పారమార్థికమును, ఏకరూపమును అగు వాక్యార్థమునుండి వేరుచేసి బోధింపబడుచుండును. వాక్యమఖండము. దానినుండి పదములు అపోద్ధృతములు గదా. అట్లే అఖండ వాక్యార్థమునుండి పదార్థముల కపోద్ధారము. పదార్థము నుండి విభక్త్యర్థములకును ఉద్ధారము. వాక్యార్థమే సత్యము. పదార్థములు కల్పితములే అని సిద్ధాంతము.

ఈ కారికార్థ భాగమునకు సమన్వయాంతరమును నిట్లు చేయుదురు. ఎట్లనగా- ఉద్దేశేన = వాక్యార్థావయవముతో గూడిన, వాక్యార్థాత్ = వాక్యార్థైక దేశమగు పదార్థము నుండి. విభక్త్యర్థాః = విభక్తుల అర్థములు సమపోద్ధృతాః = తీయబడినవి అనియు నన్వయింతురు. ॥164॥

*అవతారిక*— ప్రాతిపదికల కర్థములు ద్రవ్యము జాతి మున్నగునవి. విభక్తుల కర్థములు కారకములు. వృక్షః, వృక్షం, వృక్షేణ, వృక్షాయ - ఈ పదములలో ప్రకృతుల కర్థము వృక్ష మొకటియే కారకములు మాత్రము వేరువేరు. దానివలన మనకు తెలియున దేమన, ప్రత్యయార్థము, ప్రకృత్యర్థము కంటె వేరయిన కారక శక్తిరూపమునది కల దనియు అది అపలపనీయము కాదనియు. శ్లో॥ "దృష్టోహ్య వ్యతిరేకేపి వ్యతిరేకోన్వయేఽసతి" ॥ అని ఈ సాధన సముద్దేశముననే 43 వ కారికలో ఈ విషయము సాధింపబడి యున్నది. అది గమనింపదగినది. అందు శాస్త్రీయమగు లింగముగూడ కలదని ఈ కారికలో చెప్పబడుచున్నది.

**శ్లో॥ విభక్త్యర్థేఽవ్యయీభావ వచనాదవ సీయతామ్।**
**అన్యో ద్రవ్యాత్ విభక్త్యర్థః సోఽవ్యయేనాభిధీయతే ॥** 165

విభక్త్యర్థః = విభక్తుల అర్థము. ద్రవ్యాత్ = ద్రవ్యముకంటె, అన్యః = వేరయినది, సః = అది, అవ్యయేన = అవ్యయముచేత. అభిధీయతే = చెప్పబడుచున్నది, ఇతి = అని, విభక్త్యర్థేఽవ్యయీభావ వచనాత్ = విభక్తి అర్థమునందు అవ్యయీభావ విధానమువలన, అవసీయతామ్ = నిశ్చయింపనగును.

*తాత్పర్య విశేషాంశములు*— "అవ్యయం విభక్తి సమీప ...... వచనేషు" (2-1-6) అను సూత్రము విభక్త్యర్థమును బోధించు అవ్యయమునకు సమర్థముతో సమాస

మును విధించుచున్నది అది అవ్యయీభావ సమాసము. సమర్థమనగా ఏకార్థీభావమను సామర్థ్యమున కాశ్రయమైనది. 'వ్యపేక్ష' అను సామర్థ్యముగలది అనినను అనవచ్చును. 'అధిస్త్రి' = 'స్త్రీయందు' అని యర్థము ఇచట సప్తమీ విభక్త్యర్థమును 'అధి' అను నవ్యయము చెప్పును. విభక్త్యర్థము ద్రవ్యయే అయిన, అది ప్రాతిపదికము చేతనే చెప్పబడునుగాన ఇక అవ్యయమునకు ప్రయోగ ప్రసంగమే కలుగదుగాన సమాస విధానమే పొసగదు. కావున ప్రకృత్యర్థము వేరు ప్రత్యయార్థము వేరు అని పూర్వము అన్వయ ముఖమునను, వ్యతిరేక ముఖమునను సాధించిన విషయమున కీ సమాస విధానము ఉపోద్బలకము. అన్వయ వ్యతిరేకములు వెనుక వివరింపబడినవి.

ఇట నొక ఆక్షేపము—ప్రాతిపదికల కర్థము, జాతి, ఒకటియే అని ఒక పక్షము. జాతి ద్రవ్యములు రెండును నని వేరొక పక్షము జాతి ద్రవ్య, లింగములు మూడును ప్రాతిపదికార్థములని మూడవ పక్షము. ఆ మూటితోబాటు సంఖ్యయు ప్రాతిపదికార్థము. కావున చతుష్కము ప్రాతిపదికార్థమనియు, జాతి ద్రవ్యలింగ సంఖ్యా కారకములు అయిదును ప్రాతిపదికార్థములను నైదవ పక్షమును శాస్త్రమునందున్నవి.

అందు, పంచక పక్షమున, వాని మొత్తమును ప్రాతిపదికము బోధించినను విశేషమును తెలియచేయుటకు విభక్తుల ప్రయోగము ద్యోతకముగా నావశ్యకనుగుచున్నట్లే అవ్యయమునకు ప్రయోగ ముండవచ్చును గదా ! ద్యోతకము లనేకము లుండరాదను నియమము లేదే ? ఆ పక్షమున అవ్యయమునకు సమాస విధానము పై విషయమునకు ప్రోద్బలకమగు లింగ మెట్లగును ?

సమాధానము— సత్యమే. 'స్వార్థ ద్రవ్య లింగములు మూడు మాత్రమే ప్రాతిపదిక కర్థములు కారకము విభక్త్యర్థమే' అను పక్షముననే ఇది లింగమగునని తాత్పర్యము. కారకము గూడ ప్రాతిపదకార్థమే అను పక్షముననైనను నియతమగు కారక శక్తిని తెలియజేయునది విభక్తి ప్రత్యయమే అనియు నభిప్రాయము. ॥165॥

*అవతారిక*— 'ద్రవ్యమే కారకము' అనుటకు లింగము లగుపడుచుండ, అదిగాక వేఱొకటి, శక్తి అనునది విభక్త్యర్థమనుట కుపపత్తి ఏమి ? ఆ లింగము లేమన - ''సమాన కర్తృకయోః పూర్వకాలే'' (3-4-21) అను సూత్రమును, ''హరతేః దృతినాథయోః పశౌ'' (3-2-25) అను సూత్రమును జూడుడు.

ఏక కర్తృకము లయిన క్రియలలో పూర్వకాల క్రియావాచి అగు ధాతువునకు 'క్త్వా' అను ప్రత్యయము వచ్చునని మొదటి సూత్రమున కర్థము. కర్త అను కారకము ద్రవ్యమయిన నది రెండు క్రియలకును నొక్కటియే యగుట సంభవము. అట్లుకాక 'శక్తి' కారకమైన, క్రియలనుబట్టి శక్తులు భేదించును గాన ఏక కర్తృకత్వము ఘటింపదు. కావున ద్రవ్యమే కారకమ్మని తెల్పియవచ్చుచున్నది.

ఇక రెండవ సూత్రమున, పశువు కర్త అగునపుడు, నాథ శబ్ద ముపపదముగ నుండ 'హృ' ధాతువునకు 'ఇన్' అను ప్రత్యయము వచ్చునని చెప్పబడినది. 'నాథహరిః' ఉదాహరణము. నాథ మనగా ముగుద్రాడు. దాని నీడ్చుకొని పోవు పశువని యర్థము. పశువు, శక్తి కాదే? అను శంకకు సమాధానము.

**శ్లో॥ ద్రవ్యంతు యద్యథాభూతం తదత్యం తంతథా భవేత్ ।**
**క్రియా భేదేఽపి తస్యాసౌ ద్రవ్యాత్మా నావహీయతే ॥ 166**

ద్రవ్యంతు = ద్రవ్యమనునది, యత్ = ఏది, యథాభూతం = ఎట్లుండెనో, తత్, అత్యంతం = అది సర్వవిధముల, తథా భవేత్ = అట్లే ఉండును, క్రియా భేదే పి = క్రియలకు భేద మున్నను, తస్య = ఆ ద్రవ్యమునకు, అసౌ = ఈ, ద్రవ్యాత్మా = ద్రవ్యరూపము, న అవ హీయతే = తొలగదు.

*తాత్పర్యా విశేషాంశములు*— శక్తియే కారకమని ఏల చెప్పవలెననిన, వృక్షము, వృక్షమును, వృక్షముచేత, వృక్షముకొఱకు - అని ఈ విధముగ నగపడుచున్న సాధన భేదమునకు కారణమును జెప్పవలెను గనుక. ద్రవ్యము సాధనమైన, అది ఏకరూపము ఏ అవస్థలో నైనను మారనిదిగాన అట్టి భేదము కుదరదు. శక్తులు భిన్న భిన్నములు కావచ్చును.

ద్రవ్యమునకైనను, క్రియల భేదమును బట్టి భేదమును చెప్పవచ్చును గదా! అనుటయు అసంగతము. క్రియ లనేకములు కావచ్చును. ద్రవ్యము మాత్రము ఒక్కటియే. అది ధ్రువము. సంబంధి భేదించినంత మాత్రమున, వస్తువునకు మార్పు రాదు. అందువలన శక్తియే కారకమని యంగీకరింపక తప్పదని భావము. ॥166॥

*అవతారిక*— శక్తియే కారకమను సిద్ధాన్తమున కీ కారిక నిగమనము.

**శ్లో॥ తస్మాత్ యత్ కరణం ద్రవ్యం తత్కర్మ న పునర్భవేత్ ।**
**సర్వస్య చాన్యథాభావ స్తస్య ద్రవ్యాత్మనో భవేత్ ॥ 167**

తస్మాత్ = ద్రవ్యమునకు మార్పు లేదు గనుకనే, యత్ ద్రవ్యం = ఏ ద్రవ్యము, కరణమ్ = కరణకారకమో, తత్ పునః = అది మరల, కర్మ న భవేత్ = కర్మ కాకపోవును, సర్వస్య = సమస్తమైన, ద్రవ్యాత్మనః = ద్రవ్య స్వభావమునకును, అన్యథాభావః చ = మార్పును, భవేత్ = కలుగును.

*తాత్పర్యా విశేషాంశములు*— ఒక ద్రవ్యము కరణమని నిశ్చితమైన నికనది కర్మ కాదు. కర్మగా అవధృతమైనది శేషము కాదు. 'అసినా ఛిన్నమ్' = 'కత్తితో ఛేదింప బడినది' అని నపుడు కరణమైన అసి, ''అసిమానయ'' = 'కత్తిని తెమ్ము' అను నపుడు కర్మ అయినది గదా! అనిన నట కరణత్వ శక్తియే మారినది. అసి, అసియే. దానికి మార్పులేదు. ద్రవ్యము మారుననిన, సకల ద్రవ్యములును వస్త్వన్తరములుగా మారిపోవు

నవకాశము ఏర్పడును. అది అనుభవమునకు, దూరము. శక్తి కారకమనినపుడు క్రియలను బట్టి ఒకపుడది భేదించినను, శక్త్యాధారమగు ద్రవ్య మనువర్తించి యుండుటచే దానికి కర్మత్వాది శక్త్యన్తర సంబంధము యుక్తమగును.

ద్రవ్యము సాధనమను పక్షమున నింకొక అనుపపత్తియు గలదు. "ప్రాసాదే ఆస్తే" = 'మేడలో నున్నాడు' "శయనే శేతే" = ప్రక్కపైన పరుండి యున్నాడు. ప్రాసాద శబ్దమున 'ఘఞ్' ప్రత్యయమును, శయన శబ్దమున ల్యుట్ప్రత్యయమును అధికరణార్థకములు అధికరణము వానిచే అభిహితమగుటచే సప్తమి ప్రాప్తింపలేదు. కాని, ఆసన శయన క్రియలు అధికరణ శక్తిని చెప్పలేదు గాన అధికరణ మనభిహితమే అని సమర్థింప బడినది. శక్తి కారకమనిన, క్రియ లనేకములయినపు డదియు భేదించును గాన, సదనమను, క్రియచే, నిరూపితమైన అధికరణ శక్తి అభిహితమైనను, ఆసనమను, క్రియనుబట్టిన ఆశక్తి అభిహితము కాలేదు గాన దోషము లేదని భావము. ద్రవ్యము కారకమనిన, దానికి భేదము లేదుగాన నట్టి సమర్థనమున కవకాశము కలుగదు.

సామర్థ్యములేని ఏ ద్రవ్యమును క్రియను సాధింపజాలదు గాన నదియే కారకము. సామర్థ్యమున కాధారమగుటచే ద్రవ్యమును సాధన మనవచ్చును గదా, అనరాదు. వంటకు దేవదత్తుడు కర్త అనిన, వాని కాధారమైన పీట కూడ కర్త అనము గదా ! కావున శక్తియే కారకము. శక్తిమత్తు కారకముగాదని భావము.

"సమాన కర్తృకయోః" అను సూత్రమున కర్తృ శక్తుల కేకత్వమనియే అర్థము. 'పశువు కర్త అయినపుడు' = "పశౌ కర్తరి" అనగా, 'పశువు ద్రవ్యమయినపుడు, దానియందు గల కర్తృ శక్తి వాచ్యమైనపుడనియే అర్థము. లేదా 'కర్తృ శక్తికి పశువు ఆశ్రయమైనపుడు' అని వివక్షితము. పశువు ద్రవ్యము. కర్త శక్తిరూపము గదా, సామానాధికరణ్య మెట్లుపపన్నమగును ? అను ప్రశ్న కిక నవకాశము లేదు.

"కర్మణి ద్వితీయా" (2-3-2) అను సూత్రమునకు ఏకత్వ సంఖ్యతో గూడిన కర్మయందని అర్థము గదా ! కర్మ పదము శక్తి పరమైనపుడు శక్తికి ఏకత్వ సంఖ్యా విశిష్టత్వ మెట్లు అని శంకింప నక్కఱలేదు. శక్తికిని, సంఖ్యా సంబంధ ముపపన్నమే.

"దేవదత్తః పచతి" అనుచో లకారము కూడ కర్తృ శక్తినే బోధించును. దేవదత్తుడు ద్రవ్యము గదా !, సామానాధికరణ్య మెట్లు పొసగును ? అనిన, శక్తికిని ఏదేని ఆధార ముండవలెను. అది నిరాధారముగ నుండజాలదు గాన శక్తిచే ఆవిష్టమైన ద్రవ్యమే లకారమున కర్థము. అది సామాన్యముగ పాకకర్తను చెప్పును. ఇక ఆ పాకకర్త ఎవరు ? అనిన, పాకానుకూల క్రియకు ఆశ్రయమైన వ్యక్తి విశేషమును బోధించునది దేవదత్త పదము కాబట్టి సామానాధికరణ్య ముపపన్నము. ॥167॥

సాధన సముద్దేశము ముగిసినది

# క్రియా సముద్దేశము—8

*అవతారిక*—— కర్త, కర్మ, కరణము, మొదలగు సాధనములను విశదీకరించిన పిదప, సాధ్యమగు క్రియయొక్క స్వరూపమును శాస్త్రీయముగ ప్రతిపాదింపుచున్నాడు.

**శ్లో॥ యావత్సిద్ధమసిద్ధం వా సాధ్యత్వేనాఽభిధీయతే ।**
**ఆశ్రిత క్రమరూపత్వాత్స క్రియేత్యభిధీయతే ॥** 1

సిద్ధమ్ = పూర్తి అయినదిగాని, (జరిగినది), వా = లేక, అసిద్ధమ్ = పూర్తి కానిదిగాని (జరుగుచున్నది - జరుగనున్నది), యావత్ = ఏది అంతయు, సాధ్యత్వేన = సాధింపదగినదిగా, అభిధీయతే = చెప్పబడునో, తత్ = అది, ఆశ్రిత క్రమరూపత్వాత్ = ఒక విధమైన వరుసను కలిగి యున్నందువలన, క్రియా + ఇతి = క్రియ అని, అభిధీయతే = చెప్పబడును.

*తాత్పర్యము*—— సాధ్యముగా సంకల్పింపబడునది అంతయు క్రియ అగును. క్రియకు తప్పక ఒక క్రమముండును. కాలముయొక్క సంబంధమును బట్టి ఆ క్రియ భూతమైనను వర్తమానమైనను భవిష్యమైనను కావచ్చును

*వివరణము*—— "కృ" (చేయు) అను ధాతువునకు "య" అను ప్రత్యయమును (క్యచ్) చేర్పగా, "క్రియా" అను శబ్ద మేర్పడును. "ఒక వ్యాపారము" —లేక— "పని" అని దీనికి సామాన్యమైన అర్థము. "వ్యాపారః, భావః, భావనా, ఉత్పాదనా" అను శబ్దములను క్రియా శబ్దమునకు సమానార్థకములుగా వాడుదురు. "సాధించుటకు (చేయుటకు - జరుగుటకు) అనువైన దానినిగ" దేనిని సంకల్పింతుమో అది అంతయు క్రియ అగును. అనగా ''కిమ్ - కరోతి ?'' (ఏమి చేయుచున్నాడు ?) అను ప్రశ్నకు సమాధానముగా చెప్పదగినదంతయు (గచ్ఛతి = వెళ్ళుచున్నాడు, లిఖతి = వ్రాయుచున్నాడు, పచతి = వండుచున్నాడు మొదలగునది) క్రియ అనిపించుకొనును. అట్టి దానిని జరిగినట్లును, జరుగుచున్నట్లును, జరుగనున్నట్లును కూడ చెప్పవచ్చును. అది కాలభేద మగును. వాస్తవముగ క్రియకు విస్పష్టమైన లక్షణమును చెప్పుట అతికష్టము అయినను ప్రతియొక క్రియకును ఒక ఫలము —లేక— ప్రయోజనమనునది ఉండును. ఆ ఫలమునుబట్టి దానికి కారణమైనది క్రియ అని ఊహింపవలయును. అనగా ఫలము సామాన్యముగా ప్రత్యక్షమే అగును. దీనినిబట్టి ప్రత్యక్షముకాని క్రియను అనుమానింపదగును (పొగనుబట్టి నిప్పును అనుమానించునట్లు). అట్లే ప్రతియొక క్రియకును ప్రారంభమునుండి ఫలము కలుగు వరకును నిర్దిష్టమైన కొన్ని అవాంతర క్రియలును వానికొక నియతమైన వరుసయు ఉండక తప్పదు. కాలముయొక్క సూక్ష్మ విభాగములైన క్షణములను (సెకనులు, నిమిషములు మొదలగునవి) బుద్ధిలో నుంచికొని, ఆ అవాంతర వ్యాపారములను వాని వరుసను పరికించినచో క్రియయొక్క స్వరూపము బోధపడును. క్రియకు క్షణములే ఆధారములు. వాని వలననే క్రియను తెలిసికొనుట కవకాశము కలుగును. ''క్షణాఽధారా క్రియా = క్రియ క్షణములే ఆధారముగా గలది'' అని నాగేశుడు చెప్పెను.

విశేష విషయములు— (1) "క్రియానామేయమత్యంతాఽ పరిదృష్టా న శక్యా పిండీభూతా నిదర్శయితుమ్" ...... సాఽసావను మానగమ్యా" అని పతంజలి "భూవాదయో ధాతవః" (1-3-1) అను సూత్రమున స్పష్టముగ చెప్పెను. "క్రియను విశదీకరించుట కష్టమనియు, అనుమాన ప్రమాణము మూలముగనే దానిని తెలియవలెననియును" అతని భావము. కాగా సృష్టినిబట్టి స్రష్టను తెలిసికొనునట్లు, సిద్ధించిన ఫలమునుబట్టి దానికి హేతువగు క్రియను తెలిసికొనవలయును. అందువలననే "ఫలానుమేయా క్రియా" (క్రియ ఫలమునుబట్టి ఊహింపదగినది) అని నాగేశాదులు వ్యాఖ్యానించిరి.

(2) "కారకాణాం ప్రవృత్తి విశేషః క్రియా" అని మరియొక నిర్వచనమును గూడ పతంజలి చూపెను. "కారకములైన ద్రవ్యములయొక్క వ్యాపారము క్రియ" అని దీని భావము. సాధనమున్నను దాని వ్యాపారము లేనిచో ఫలము పుట్టదు. కాన ఆ వ్యాపారము క్రియ అగును. ఏది ఎట్లయినను సాధనమైన ద్రవ్యముకన్న సాధ్యమైన క్రియ వేరని చెప్పక తప్పదు. దానిని బుద్ధిబలమువలననే అవగతము చేసికొనవలయును.

(3) చలనాత్మకమైనది క్రియ అని సామాన్యముగా అనుకొందురు. కాని అది సరి కాదు. చలనాత్మకమైనదియు కానిదియును (కేవలము "ఉండుట" మొదలగునది) క్రియయే కావచ్చును. అట్లే కర్తయొక్కయు కర్మయొక్కయు వ్యాపారము మాత్రమే క్రియయనుటయు సముచితము కాదు. వివక్షాధీనముగ ఎల్ల కారకముల వ్యాపారము కూడ క్రియ కావచ్చును. కాగా "సాధనముకన్న వేరై సాధ్యముగా సంభావింపబడునదంతయు క్రియయే" అనియు, "ద్రవ్యము సిద్ధము - క్రియ సాధ్యము" అనునది సారాంశమనియును ఫలించును.

(4) క్రియ లనంతములు. ప్రతియొక క్రియకును సంభవించు అవాంతర క్రియలును అసంఖ్యాకములు. అట్లే అవాంతర ఫలములును ప్రధాన ఫలములును, గూడ భిన్న భిన్నముగా ఉండవచ్చును. ప్రారంభించిన లక్షణమునుండి ఫలము కలుగు క్షణమువరకును అవాంతర క్రియలకు నిర్దిష్టమైన వరుస ఉండును ("తొలుత ఇది - పిదప ఇది - దాని తరువాత ఇది" అను తప్పనిసరియైన పద్ధతి). అది తారుమారయినచో అనుకొన్న ఫలము సిద్ధింపదు. వంట, నడక, భోజనము, (పచ్, గమ్, భుజ్) మొదలగు క్రియలను ఉదాహరణముగా తీసికొని పై యంశములను సమన్వయము చేయదగును.

(5) క్రియను చెప్పునది ధాతువు. ఉదా : పచ్, గమ్ మొదలగునది. ధాతువునకు తిఙ్ ప్రత్యయములు చేరును. అవి కర్త, కర్మ, సంఖ్య, కాలము మొదలగు క్రియకు చెందు విశేషాంశములను సూచించును. ఉదా : "పచతి" వండుచున్నాడు. ఇచట వంట క్రియ. చేయువాడు కర్త. అతడు ఒకడే. కాలము వర్తమానము. కాలముయొక్క సంబంధమువలన సామాన్యముగా క్రియకు మూడు అవస్థలను చూపుచుందురు. (భూతము, వర్తమానము, భవిష్యము) ఇట్టి క్రియను పుట్టించునదియే కారకమగును. అవియు వివక్షాధీనమే. (సంకల్పమును బట్టి ఏ వస్తువైనను ఆ యా కారకముగా చూపవచ్చును). ॥1॥

*అవతారిక*— మీది క్రియా లక్షణమును ఉదాహరణ పూర్వకముగా విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ కార్యకారణ భావేన ధ్వనతీత్యాశ్రిత క్రమః ।**
**ధ్వనిః క్రమనివృత్తౌ తు ధ్వనిరిత్యేవ కథ్యతే ॥ 2**

ధ్వనిః = ధ్వని, ఆశ్రితక్రమః = ఒక వరుసను ఆశ్రయించినదై. కార్యకారణ భావేన = కార్య కారణ సంబంధముచే, ధ్వనతి + ఇతి = ''ధ్వనతి'' (మ్రోగుచున్నది) అని, (కథ్యతే = చెప్పబడును). క్రమనివృత్తౌ + తు = వరుస పోయినపుడయితే, ధ్వనిః + ఇతి + ఏవ = ''ధ్వనిః'' అనియే, కథ్యతే = చెప్పబడును.

*తాత్పర్యము*— ''ధ్వన్'' = మ్రోగుట. ఇదొక క్రియ. ఘంటను కారణముగను, ధ్వనిని కార్యముగను భావించి అందొక వరుసను (మ్రోతయొక్క అవయవము లొకదాని వెనుక వేరొకటి పుట్టుచున్నట్లు) చెప్పదలచినచో ''ధ్వనతి'' అని ప్రయోగింతుము. అట్టి వరుస లేనట్లుగను, మ్రోత సిద్ధముగనే ఉన్నట్లును చెప్పదలచినచో ''ధ్వనిః'' అనియే ప్రయోగింతుము. కాగా ''తి'' మొదలగు ప్రత్యయములుగల ధాతువు సాధ్యమైన క్రియను తెలుపుననియు, కృత్ ప్రత్యయములు (తిఙ్ ప్రత్యయములకన్నా వేరై ధాతువులకు చేరునవి) కలిసిన ధాతువు సిద్ధమైన వస్తువును తెలుపుననియును ఫలించును.

*వివరణము*— ''ఘంటా ధ్వనతి'' = గంట మ్రోగుచున్నది. ఇచట గంట కారణము. మ్రోత కార్యము. ఇట్టి కార్యకారణ భావమును చెప్పదలచి, ఒక క్రమములో మ్రోత జరుగుచున్నదని బోధించుటకై ఈ విధమైన ప్రయోగమును చేయవలెను. అట్లుగాక ''మ్రోత సిద్ధముగనున్నదే'' అను భావమును ప్రకటింపదలచినపుడు, ''ఘంటాయాః ధ్వనిః = గంటయొక్క మ్రోత'' అనియే ప్రయోగింపవలెను

*విశేషము*— ఒక క్రియకు సంబంధించిన అవాంతర క్రియలయొక్క క్రమమును ''పూర్వాఽపరీభావము'' (ఒకదాని వెనుక మరియొకటి జరుగుట) అని కూడ అందురు. ఇట్టి పూర్వాపరీభావమునే క్రియాపదము తెలుపును. పౌర్వాపర్యములేకుండ సిద్ధమైనదానిని ప్రాతిపదికము బోధించును. కావుననే ''ధ్వనిం కరోతి'' (ధ్వనిని చేయుచున్నాడు) అను ప్రయోగమందలి ధ్వని శబ్దము ''ధ్వని'' అను సిద్ధావస్థను బోధించునేగాని ''ధ్వనిచేయు'' అను సాధ్యావస్థను బోధింపదు. అచటి సాధ్యావస్థను ''కృ'' (చేయు) అను వేరొక ధాతువు ప్రతిపాదించుచున్నది గదా ! ॥2॥

*అవతారిక*— మరియొక ఉదాహరణమును చూపుచున్నాడు.

**శ్లో॥ శ్వేతతే శ్వేత ఇత్యేతచ్ఛ్వేతత్వేన ప్రకాశతే ।**
**ఆశ్రితక్రమరూపత్వా దభిధానం ప్రవర్తతే ॥ 3**

''శ్వేతః + శ్వేతతే + ఇతి'' = ''శ్వేతము శ్వేతమగుచున్నది'' అను, ఏతత్ = ఇది, (ఈ ప్రయోగము) ''శ్వేతత్వేన = తెల్లదనముచే, ప్రకాశతే = ప్రకాశించుచున్నది'' (అను భావమునందించును). ఆశ్రిత క్రమరూపత్వాత్ = క్రమమును అవలంబించినదగుట వలన, అభిధానమ్ = ''శ్వేతతే'' అను క్రియాపదముగ, ప్రవర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— ''శ్వేతః శ్వేతతే'' అను వచనమున్నది. ''తెలుపు తెల్లనగుచున్నది'' అని దీని భావము. ఇచట ''శ్విత్'' అను ధాతువునకు ఒకానొక కృత్ప్రత్యయమును చేయగా ''శ్వేతః'' అను శబ్దము సిద్ధించి, ''తెలుపు'' అను గుణమును బోధించుచున్నది. అదే ధాతువునకు ''తిజ్'' ప్రత్యయమును చేర్చినచో ''శ్వేతతే'' అను క్రియాపదము సిద్ధించి, ''తెల్లనగుచున్నది'' అను క్రియను బోధించుచున్నది. కాగా మూలమగు స్వరూప మొకటే అయినను (శ్విత్) సిద్ధావస్థను తెలుపుటకు ఒక రూపమును సాధ్యావస్థను తెలుపుటకు వేరొక రూపమును ఏర్పడుననియు, ఒక క్రమమును కలిగియుండునట్లు చూపుటయే సాధ్యావస్థ అనియును ఫలించును.

వివరణము— ''శ్వేతః'' అనునది సిద్ధము కావుననే ఈ ప్రయోగమున కర్త అయినది. ''శ్వేతతే'' అనునది సాధ్యమైన క్రియను మాత్రమే తెలుపుచున్నది. అన్ని చోటులందును సిద్ధ సాధ్యభావమును ఇట్లే ఊహింపవనయును. ॥3॥

అవతారిక— ''శబ్దముచే (తిఙంతమగు పదముచే) సాధ్యముగ చెప్పబడునదియు పౌర్వాపర్యరూపమైన క్రమము గలదియును అగు అంశము క్రియ'' అని పర్యవసించును. క్రమమనునది కాలమునకు సంబంధించిన క్షణముల ప్రవాహ రూపము. కాగా క్రియయొక్క అవయవములన్నియు ఏకకాలమున ఎన్నడును సంభవింపవు. అయినపుడు ''ఈ క్రియ ఇది'' అని స్పష్టముగ పేర్కొనుట ఎట్లు ? - అను శంకకు సమాధానమును చూపుచున్నాడు.

**శ్లో॥ గుణభూతై రవయవైః సమూహః క్రమజన్మనామ్ ।**
**బుద్ధ్యా ప్రకల్పితాఽభేదః క్రియేతి వ్యపదిశ్యతే ॥ 4**

బుద్ధ్యా = మనస్సుచే, గుణభూతైః = అప్రధానములైన, అవయవైః = అవయవములతో, ప్రకల్పితా భేదః = కల్పింపబడిన ఐక్యముగల, క్రమజన్మనామ్ = క్రమముగల క్షణముల యొక్క, సమూహః = సముదాయము, క్రియా + ఇతి = క్రియ అని, వ్యపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ప్రతియొక క్రియకును ఒక ఫలము తప్పక ఉండును. దానిని బట్టియే క్రియను ఊహింతుము గదా ! ప్రారంభించిన క్షణమునుండి ఫలము కలుగు క్షణము వరకును క్రియకు ఎన్నో క్షణములుండును. ఒక నియతమైన వరుసలో ఒక్కొక క్షణమున ఒక్కొక అవాంతర క్రియ జరుగుచు చివరి క్షణమున అనుకొన్న ఫలము జనించును. అది జనింపగానే ఆ క్రియ ఆగిపోవును. కాగా క్రమముగల క్షణముల సముదాయ మొకటియే

కావున దానినిబట్టి ఆయా ఫలమునకు హేతువైన క్రియ ఒకటే అని వ్యవహరింపబడును. అవయవములను బట్టి ''క్రమము గలది'' అనియు, వాని సముదాయమును బట్టి ''ఒకటే'' అనియు క్రియను చెప్పుచుందురు. ఇది మానసికమైన భావన.

వివరణము— ''వంట'' అను క్రియను ఉదాహరణముగా తీసికొనవచ్చును. ఇచట వస్తువు ''ఉడుకుట'' ఫలము. పొయ్యిపై పెట్టుట మొదటి క్షణమనియు పొయ్యినుండి దింపుట చివరి క్షణమనియును అనుకొన్నచో, మధ్యను లెక్కలేనన్ని క్షణము లుండును. ఆయా క్షణములలో చిన్న చిన్న అవాంతర క్రియలును జరుగుచుండును. వీని మొత్తమునే ''వంట'' అందురు. మొత్తమును బట్టి ఏకత్వమును, అవయవములను బట్టి క్రమమును బుద్ధి యందు స్ఫురించుచుండును. ఈ తీరును బట్టియే క్రియ ఒకటే యనియు, ఒక్కొక క్రియను ఒక్కొక ధాతువు చెప్పుననియును అనుచుందురు. ఉదా : గమ్, పచ్, భుజ్ మొదలగునవి.

విశేషము— వాస్తవమున అవయవముల అమరికను మించి వేరుగ సముదాయ మన్నది ఉండదు. అయినను మొత్తమువలననే ఫలము పుట్టునుగాని ఏ ఒక అవయవము వలనను అది పుట్టదు. అందుచే సముదాయమును అవయవములను గూడ భావింపక తప్పదు. అట్లే క్రియావయవముల క్రమము కూడ అవ్యవధానముగనే ఉండవలెను. లేకున్నచో ఫలము జనింపదు. ''సముదాయము ప్రధానమనుటయు, అవయవములు అప్రధానములనుటయును'' (అప్రధానము లనగా సాయము చేయునవి) ఒక విధమైన కల్పనమే. ॥4॥

అవతారిక— ''సముదాయమే క్రియ'' అన్నచో ఏ ఒక అవయవమందును ''క్రియ'' అను వ్యవహారము కుదురకపోవును. కాగా గడచిన క్షణములను బట్టి ''భూతము'' (జరిగినది) అను వాడుకగాని, రానున్న క్షణముల ననుసరించి ''భవిష్యము'' (జరుగనున్నది) అను వాడుకగాని అనుపపన్నమయ్యెడిని - అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

శ్లో॥ సమూహః స తథాభూతః ప్రతిభేదం సమూహిషు ।
సమాప్యతే తతో భేదే కాలభేదస్య సంభవః ॥ 5

తథాభూతః = ఆ విధముగానున్న (గుణభూతమై క్రమముగల అవయవములుగల), సః = ఆ, సమూహః = సముదాయము, సమూహిషు = అవయవములందు, ప్రతిభేదమ్ = ఒక్కొక దానియందును, సమాప్యతే = ఆరోపింపబడును, తతః = అందువలన, భేదే = భేదము సిద్ధింపగా, కాలభేదస్య = కాలముయొక్క భేదమునకు, సంభవః = అవకాశము, (భవతి = కలుగును).

తాత్పర్యము— క్రియయందలి ప్రతియొక అవయవమందును సముదాయ మారోపింప బడును. కావున భేదము సిద్ధించి, కాలభేదము కుదురును.

వివరణము— పచి క్రియను (వంటను) ఉదాహరణముగా చూపనగును. గిన్నెను పొయ్యిమీద పెట్టుట, నిప్పును సరిచూచుట, కలియబెట్టుట మొదలగునవి అవయవములు

(వాని కాధారములైన క్షణములు కూడ అవయవములే). ''ఉడుకుట'' అను ఫలమును అను సంధానించి. ''వంట'' అను మొత్తము క్రియను ప్రతియొక అవయవమందును ఆరోపింప వలెను (భావించుట). అనగా అవయవ క్రియయే సముదాయ క్రియ యనియు, అదియే ఫలమును కలిగించుననియును అనుకొనదగును. కాగా జరుగుచున్న అవయవమును బట్టి ''పచతి'' (వండుచున్నాడు), అని వర్తమాన కాలమును, జరిగిన దానినిబట్టి 'అపాక్షీత్'' (వండెను) అని భూతకాలమును, జరుగబోవు క్షణము ననుసరించి ''పక్ష్యతి'' (వండగలడు) అని భవిష్యత్కాలమును సిద్ధించును.

*విశేషము*— మొదలుపెట్టిన క్షణమునుండి పూర్తియగు క్షణమువరకును ''వంట'' అను సముదాయము ప్రతియొక అవయవమందును భావనా గోచరమగుచుండును. ఇట్టి రీతియే ఆరోపమునకు నిదానము. ఆరోపింపబడు సముదాయమునందును పౌర్వాపర్యమును (క్రమము భావింపక తప్పదు. అట్లు కాకున్న ఆరోపములేని అవయవముల విషయమున సాధ్యత్వము సంభవించుట కష్టమగును. ॥5॥

*అవతారిక*— సముదాయమును అవయవమం దారోపించి ప్రతియొక అవయవ మును ''క్రియయే'' అన్నచో, జరుగుచున్న అవయవమును బట్టి అది ప్రత్యక్షమే యగును (కనబడునది) అయినపుడు ''క్రియ ప్రత్యక్షము కాదనియు, అది అనుమానముచేతనే తెలియ దగినదనియును'' భాష్యకారు డెందుకనెను ? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రమాత్ సదసతాం తేషామాత్మానో న సమూహినామ్ ।**
**సద్వస్తు విషయైర్యాంతి సంబంధం చక్షురాదిభిః ॥ 6**

క్రమాత్ = క్రమము ననుసరించి, సదసతామ్ = ఉన్నవియు లేనివియు అగుచుండు, తేషామ్ = ఆ, సమూహినామ్ = అవయవముల యొక్క, ఆత్మానః = స్వరూపములు, సద్వస్తు విషయైః = ఉన్న వస్తువులను గ్రహింపగలుగు, చక్షురాదిభిః = కన్ను మొదలగు ఇంద్రియ ములతో, సంబంధమ్ = సంబంధమును, న + యాంతి = పొందవు.

తాత్పర్యము— మొత్తము క్రియకు సంబంధించిన క్షణములు (అవయవములు) ఒక వరుసను కలిగియుండును. అవన్నియు ఏకకాలమున ఉండవు. (ఒక క్షణమున్నపుడు మిగిలిన క్షణము లుండవు). కాగా ఆ క్షణములలో కొన్ని సతులును (ఉండునవి), మరికొన్ని అసతులును (లేనివి) కాక తప్పదు. కన్ను, చెవి మొదలగు ఇంద్రియములు ఉన్న వస్తువులనే గ్రహించునుగాని, లేని వానిని గ్రహింపజాలవు. అందుచే, క్రియ సంపూర్ణముగా ఎన్నడును, ప్రత్యక్షము కాదుగాన, ''అది అప్రత్యక్షము - అనుమాన గమ్యము'' అనుటలో అనౌచిత్యము లేదు.

*వివరణము*— ''క్రియా నామేయమత్యంతాఽపరిదృష్టా న శక్యా పిండీభూతా నిదర్శయితుమ్ ...... సాఽసావనుమాన గమ్యా'' అని ''భూవాదయో ధాతవః'' (1-3-1)

గోత్వము మనుష్యత్వము మున్నగు జాతులు ఆయాసంపూర్ణములగు వ్యక్తుల యందే భాసించును. ఏదో ఒక కొమ్ము డెక్కగోరు మున్నగు చిన్న చిన్న అవయవము లున్నంత మాత్రాన ఆజాతులు వ్యక్తములు కావు.

భూమి ఉదకము మున్నగు వాని యందున్న భూమిత్వము ఉదకత్వము మున్నగు జాతులు అట్లుకాక ఒక చిన్న మట్టిబెడ్డ. గరిటెడునీరు ఉన్నను, కొండలు సముద్రములు మున్నగు పెద్ద వస్తువులున్నను అభివ్యక్తములగును.

B ఘటమునందు ఘటత్వజాతి యభివ్యక్తమగుచున్నది. కాని ఆశ్రయమగు ఘటము నశించగా ఆజాతియు నశింపవలెను. అట్టి తరి జాతి నిత్యముకాకపోవలెను. అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

జాతిః = జాతి, ఆశ్రయాత్ = ఆశ్రయము వలన, అనుచ్ఛిన్నా = నశింపనిదై, అనిత్యే + అపి అనిత్యమగునట్టి, ఆశ్రయే = ఆశ్రమునందు. స్థితా = ఉంటున్నది.

జాతి ఎల్లప్పుడును నశింపనిదే, తాను అభివ్యక్త మగుటకు మాత్రమే ఆశ్రయ మును అపేక్షించును. ఆశ్రయమునుబట్టియే జాతి స్వరూపమును బొందదు. ఆశ్రయము నశింపగా జాతియు నశింపవలెనని నియమము లేదు.

గుణములట్టివి కావు. ఆశ్రయమునశించిన, దానియందున్న గుణములు కూడా నశించును. ఒక ఘటము నశించినను మరికొన్ని ఘటములయందు ఘటత్వజాతి భాసించుచునే యున్నది. ॥41॥

*అవతారిక*—మహాప్రళయమున నిత్యవస్తువులుకూడ నశించును. అప్పుడు ఏ యాశ్రముకూడ నుండదు. అట్టి తరి జాతులు ఎచట నుండును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అనుచ్ఛేద్యాశ్రయామేకే సర్వాంజాతిం ప్రచక్షతే ।**
**న యౌగపద్యం ప్రలయే సర్వస్యేతి వ్యవస్థితాః॥ 42**

ప్రలయే = ప్రళయమున. సర్వస్య = ఎల్ల ప్రపంచకమునకు, యౌగపద్యమ్ = ఒకేసారి సంభవించుట, న = లేదు, ఇతి = అని, వ్యవస్థితాః = నిశ్చయించిన, ఏకే = కొంతమంది అనగా పూర్వమీమాంసకులు, సర్వామ్ = ఎల్ల, జాతిమ్ = జాతిని, అనుచ్ఛేద్యాశ్రయామ్ = నాశము లేని ఆశ్రయము కలదానినిగా. ప్రచక్షతే = చెప్పుచున్నారు.

జైమిని మహర్షి పూర్వమీమాంసాశాస్త్రమును రచించెను. అందు మహాప్రళయ ముండదు, అది జరగబోదు అని సిద్ధాంతము చేయబడినది. కనుక వారి మతము చొప్పున ఎల్ల జగములు ఒకేసారి మహాప్రళయమున నశించుట కవకాశము లేదు. పరమాణువుల యందు జాతులు ఉండును. కాబట్టి ఏవోకొన్ని వ్యక్తులయందు జాతులు ఆశ్రయించి యుండగలవు. ॥42॥

అను సూత్రమున పతంజలి చెప్పెను. ''క్రియను - ఇదమిత్థమ్'' - అని స్పష్టముగాను పూర్తిగాను చూపలేమనియు, ఫలమునుబట్టి దాని నూహింపవలెననియును'' అతని ఆశయము. సముదాయమును అవయవమం దారోపించినను, అచట కూడ క్రమమునే అవలంబింపవలయునుగాన, ''క్రియ ప్రత్యక్షమ''నుట శాస్త్రీయముగా కుదురదు.

*అవతారిక*— పై విషయమునే దృష్టాంతముతో విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ యథా గౌరితి సంఘాతః సర్వోనేంద్రియ గోచరః ।**
**భాగశస్తూప లబ్ధస్య బుద్ధౌరూపం నిరూప్యతే ॥** 7

**ఇంద్రియైరన్యథా ప్రాప్తౌ భేదాంశోపనిపాతిభిః ।**
**అలాతచక్రవద్రూపం క్రియాణాం పరికల్ప్యతే ॥** 8

గౌః + ఇతి = ''గౌః'' అను, సంఘాతః = వర్ణముల సముదాయము, సర్వః = అంతయు, ఇంద్రియ గోచరః = చెవికి విషయమై, న = కాదు, భాగశః = అవయవములుగా, ఉపలబ్ధస్య = పొందబడిన దానియొక్క, రూపమ్ + తు = స్వరూపమైతే, బుద్ధౌ = మనసునందు యథా = ఎట్లు. నిరూప్యతే = గ్రహింపబడునో, (తథా = అట్లు) భేదాంశోపనిపాతిభిః = అవయవములను గ్రహించు, ఇంద్రియైః = ఇంద్రియములచే, అన్యథా = వేరొక విధముగ, ప్రాప్తౌ = ప్రాప్తి కలుగగా. క్రియాణామ్ = క్రియలయొక్క రూపమ్ = స్వరూపము, అలాత చక్రవత్ = కొఱవిచక్రము (మండుచున్న కొఱవిని ఆ మంటతోనే త్రిప్పిన యెడల చూచువారికి కనుపట్టు చక్రము) వలె, పరికల్ప్యతే = కల్పింపబడును.

**తాత్పర్యము**— పదములను పలుకునపుడు వర్ణములన్నింటిని ఒకేసారి పలుకుటయు ఒకేసారి వినుటయును వాస్తవముగ సాధ్యము కాదు. ''ఒకదాని వెనుక మరియొకటి'' అను తీరే అచట కుదురును. అయినను తుది క్షణమున మనసులో సముదాయ రూపమొకటి ఏర్పడును. దాని వలననే సముదాయమును ఒక్క మారుగానే గ్రహించినట్లు అనిపించి ప్రయోజనము సిద్ధించును. అట్లే క్రియయొక్క అవయవములే వరుసగ గ్రహింపబడినను చివరకు బుద్ధియందు మాత్రము సముదాయము స్ఫురించుచుండును. దానిని బట్టియే'' క్రియ ఒకటి'' అను భావము కలుగుచుండును. కొరవిచక్రము నుదాహరణముగా ఇచట తీసికొనవచ్చును. కొరవిని అతివేగముగ త్రిప్పునపుడు ఒక చక్రముగా కనిపించును. కాని అది సత్యము కాదు. ఒకే జ్వాల వేగవశమున చక్రాకారమును దాల్చును.

*వివరణము*— గౌః. ఇచట ''గ్ + ఔ + ః'' అను క్రమమున్నది. అట్లే ప్రతి యొక శబ్దమునను వర్ణముల క్రమ ముండును. ఒక వర్ణమును పలుకు సమయమున ఇతరములుండవు. అయినను సంస్కార వశమున చివరను సముదాయమే మనసులో గోచరించును. అట్లే క్రియాక్షణములలో ఒకటి ప్రత్యక్షమైనపుడు తక్కినవి ప్రత్యక్షము కాకున్నను మానసికమైన సముదాయ భావనవలన సముదాయమే ప్రత్యక్షమన్నట్లు తోచును. ''కాగా అలాత చక్రమువలె'' క్రియ ఒకటి అనుటయు అది ప్రత్యక్షమనుటయును ఒక విధమైన భ్రాంతియే

విశేషము— ఒక వ్యాపారమున కారకములు కూడ వేర్వేరుగ ఉండవచ్చును. అట్టిచోట్ల కారకముల భేదముచే వ్యాపారములును భిన్నా భిన్నములుగ అగపడవచ్చును. అయినను మీద చూపినట్లు ఆరోపితమైన ఏకత్వము ననుసరించి, వ్యాపారముల ఏకత్వమును భావించి, ''ఒక ధాతువు ఒకే క్రియను బోధించును'' అనుచుందురు. ॥8॥

అవతారిక— ఆ యా వర్తమానములగు క్షణములలో ప్రత్యక్షములగు అవయవములను ''ప్రత్యక్షముల''నుట కూడ సముచితము కాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ యథాచ భాగాః పచతేరుదకాఽఽసేచనాదయః ।
ఉదకాసే చ నాదీనాం జ్ఞేయా భాగా స్తథాఽపరే ॥ 9

పచతేః = వంట, అను క్రియకు, ఉదకాసేచనాదయః = నీటితో తడుపుట మొదలయిన, భాగాః = అవయవములు, యథా = ఏ విధముగ, (భవంతి = అగునో), తథా = ఆ విధముగ ఉదకాసేచనాదీనామ్ + చ = నీటితో తడుపుట మొదలగు వానికి గూడ, అపరే = మరికొన్ని, భాగాః = అవయవములు, జ్ఞేయాః = తెలియదగినవి, (భవంతి = అగును).

తాత్పర్యము— బియ్యము కడుగుట, కుదుపుట, పొయ్యిపై పెట్టుట మొదలగు ఎన్నో అవయవములు వంట కుండును. అట్లే సూక్ష్మముగ పరిశీలించినచో, ప్రతియొక అవయవ క్రియకును మరల మరికొన్ని అవయవము లుండును. వానిని గూడ సాధ్యములు గను సక్రమములుగను చూపవచ్చును. ఇట్లు విభాగమును చేసికొనుచు పోయినచో అదెక్కడ ఆగునో చెప్పుట అసంభవమగును. కావున ''క్రియ ప్రత్యక్షము కాదు'' అనుటయే యుక్తము.

వివరణము— ''సముదాయము కాకపోయినను, జరుగు క్షణమున ఆ యా అవయవ క్రియ ప్రత్యక్షమే'' అని యనుటకు కూడ అవకాశములేదని ఈ కారిక చెప్పినది. సముదాయమును ''పచతి'' మొదలగు పదములతో బోధించునట్లుగానే అవయవములను గూడ ''సించతి'' (తడుపుచున్నాడు) ''క్షాలయతి'' (కడుగుచున్నాడు) ''అధిశ్రయతి'' (గిన్నె పొయ్యిపై పెట్టుచున్నాడు) మొదలగు పదములతో బోధింతురు. అనగా ఆ యా ధాతువులను వాడి, ఆ యా అవయవ క్రియలను చెప్పుచుందురు. ఇట్లు ''సముదాయము - అవయవము'' అను విశ్లేషణమును. ''ఒక అవయవము ప్రత్యక్షమగు క్షణమున మిగిలినవి ప్రత్యక్షములు కావు'' అను అనుభవమును అనంతమనిపించును. అందువలన ''క్రియ ప్రత్యక్షము కాకుండ అనుమానగమ్యమే'' అనుటయే సమంజసము. ॥9॥

అవతారిక— ''క్రియ పూర్తియగు (ఫలము కలుగగానే ఆగిపోవు) క్షణము నందలి అవయవమును తీసికొని, దాని కవయవములు లేవనియు అది ప్రత్యక్షమే యనియును అనగూడదా ? - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యశ్చాపకర్ష పర్యంతమను ప్రాప్తః ప్రతీయతే ।
తత్రైకస్మిన్ క్రియాశబ్దః కేవలే న ప్రయుజ్యతే ॥ 10

అపకర్ష పర్యంతమ్ = విభాగముయొక్క చివరను, అనుప్రాప్తః = పొందిన, యః = ఏ క్షణము, ప్రతీయతే = తెలియబడునో, కేవలే = కేవలము, ఏకస్మిన్ = ఒకటియైన, తత్ర + చ = ఆ క్షణమందు, క్రియాశబ్దః = "క్రియా" అను పదము, న + ప్రయుజ్యతే = ఉపయోగింపబడదు.

తాత్పర్యము — అవయవముల విభాగమును చేసికొనుచు పోయినపుడు ప్రతియొక క్రియకును చివరి అవయవమన్నది ఒకటి ఉండవచ్చును. అది పరమాణువువలె భాగరహిత మనియును అనవచ్చును అయినను దానినిబట్టి క్రియ ప్రత్యక్షమనుటకు వీలులేదు. చివరి క్షణము భాగరహితమన్నచో దానిని "క్రియ" అనుటయే పొసగదు. సాధ్యమును సావయవ మును అగు దానినే "క్రియ" అను శబ్దము బోధించును. అట్లు కాని విషయమున ఆ శబ్దమును వాడనే కూడదు.

వివరణము— "క్రియా" అను శబ్దము తెలియజేయు అర్థమును గూర్చి ఈ చర్చ జరుగుచున్నది. సాధ్యమై సక్రమమైన అంశమునే ఈ శబ్దము బోధించుననుట అతి ప్రసిద్ధము. అవయవములును పౌర్వాపర్యమును లేనిది క్రియయే కాదు. అట్టిది ఒక విధముగ సిద్ధావస్థయే యగును. కాగా "క్రియా" అను సామాన్య శబ్దముగాని పచ్, గమ్ మొదలగు విశేష శబ్దములుగాని బోధించు క్రియ "సావయవమనియును అప్రత్యక్షమనియును" పర్యవ సించును. ॥10॥

అవతారిక— చివరి క్షణము విషయమునగూడ క్రమమును కల్పించియే క్రియా శబ్దమును వాడదగుననుచున్నాడు.

**శ్లో॥ పూర్వోత్తరైస్తదా భాగైః సమవస్థాపిత క్రమః ।**
**ఏకః సోఽప్యసదధ్యాసాదాఖ్యాతైరభిధీయతే ॥ 11**

తదా = అప్పుడు, ఏకః + అపి = ఒకటి అయినను, సః = ఆ చివరి అవయవము, అసద ధ్యాసాత్ = లేనివాని నారోపించుట వలన, పూర్వోత్తరైః = ముందు వెనుకలుగా ఉండు, భాగైః = అవయవములచే, సమవస్థాపిత క్రమః = నిశ్చయింపబడిన క్రమముగలదై, ఆఖ్యాతైః = క్రియా పదములచే, అభిధీయతే = చెప్పబడును.

తాత్పర్యము— చివరి క్షణమునందు గూడ సాధ్యత్వమును క్రమమును ఆరో పించియే క్రియాపదమును వాడక తప్పదు. ఆ క్షణము కూడ సమూహమందొక భాగమే గదా! సమూహమును ప్రతియొకి క్షణమునందును ఆరోపింతురని ఇదివరకే ప్రతిపాదింప బడినది. కాగా ఆయా అవయవము లాయా క్షణములందు ప్రత్యక్షమైనను సముదాయరూప మున క్రియ ఎన్నడును ప్రత్యక్షము కాదు. "క్రియా న శక్యాపిండీ భూతా నిదర్శయితుమ్" (క్రియను ఒక ముద్దగా చూపుట అశక్యము) అన్న పతంజలి ఆశయ మిదియే. ॥11॥

అవతారిక— ''సత్త'' (ఉనికి) నిత్యము. అది సాధ్యమనుటకు వీలు పడదు. సాధ్యము కానపుడు అచట క్రమము కూడ ఉండదుగదా: అట్లయినపుడు ''అస్తి'' అను క్రియాపదముచే సత్తను బోధించుట ఎట్లు కుదురను ? - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ కాలానుపాతి యద్రూపం తదస్తీతి ప్రతీయతే ।**
**పరితస్తు పరిచ్ఛిన్నం భావ ఇత్యేవ కథ్యతే ॥** 12

యత్ = ఏ, రూపమ్ = స్వరూపము, కాలానుపాతి = కాలము ననుసరించునో (సంబంధించునో), తత్ = అది, అస్తి + ఇతి = ''అస్తి'' (ఉన్నది) అని, ప్రతీయతే = తెలియబడును, పరితః = అన్ని విధముల, పరిచ్ఛిన్నమ్ + తు = పూర్తి అయిన స్వరూపమైతే, భావః + ఇతి + ఏవ = ''భావము'' అనియే, కథ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ''సాధ్యముగను సక్రమముగను ఒక శబ్దము బోధించు స్థితి క్రియ'' అని క్రియయొక్క లక్షణమును పరిష్కరించిరి. క్రియకును కాలమునకును సంబంధము గలదు. కాలమువలననే క్రియ విభజింపబడును. కాగా ''ఉనికి'' కూడ (సత్త) సాధ్యముగను కాలమునకు సంబంధించునదిగను నిరూపింప శక్యమగుటచే (అదియు) క్రియ కావచ్చును ఆ ఉనికినే సిద్ధముగా చెప్పదలచినచో ''భావము'' అను పదమును వాడవలయును.

వివరణము— కాల విభాగమునకు లోబడి సాధ్యముగ చూపబడునదంతయు క్రియయే అగును. ''అస్'' అను ధాతువునకు ''ఉనికి'' అని యర్థము. దీనికి తిఙ్ ప్రత్యయములను చేర్చి వాడినచో పై క్రియాలక్షణము ఇచటను సరిపోవును. ఉదా: అస్తి = ఉంటున్నది (వర్తమానము). అభూత్ = ఉండెను (భూతము) భవిష్యతి = ఉండగలదు (భవిష్యము). సాధ్యమైన అంశమునకే కాలముతో సంబంధము కుదురును. సిద్ధమైన దానికి కాలసంబంధ మక్కరలేదు. ఉదా: "ఘటః". ఇచట కాలవిశేషమేదియు తెలియదు. కాగా సత్తను సిద్ధముగ చూపదలచినపుడు "భావః" అను పదమే సముచితమగును.

విశేషము— (1) కృ, (చేయు), భూ, (ఉండు), అస్, (ఉండు అను మూడు ధాతువులును క్రియా సామాన్యమును తెలుపును. పచ్, గమ్ మొదలగు ధాతువులన్నియు ఆయా క్రియావిశేషములను తెలుపును. కావున "కిమ్ కరోతి ?" (ఏమి చేయుచున్నాడు) అను ప్రశ్నకు "పచతి", "గచ్ఛతి" మొదలగు సమాధానములు వినబడుచుండును. కావుననే "కృ" ధాతువు నొక్కదానినే అవలంబించి క్రియా వ్యవహారమునంతను నడుపుకొన వీలున్నది. ఉదా: "పాకం కరోతి", "గమనం కరోతి", "దర్శనం కరోతి" మొదలగునవి. భూ, అస్ అనునవి కూడ ఇంచుమించు ఇట్టితీరు గలవియే.

(2) అస్తి, అస్తే, (ఉంటున్నది) మొదలగు చోట్ల చలనము లేకున్నను "సత్త" క్రియయే అగును. కారకముల ప్రవృత్తి విశేషమే క్రియ అనియు, అట్టిది చలనరూపమైనను

కాకపోయినను బాధ లేదనియును వెనుక సూచింపబడెను. (1 వ కారిక). కావున "పర్వతః - అస్తి", "పర్వతః - తిష్ఠతి" (కొండ ఉన్నది) మొదలగు ప్రయోగములలో కూడ "పర్వతము" మొదలగువానియం దొకానొక వ్యాపారము నూహించుకొనవలెను. ఎల్ల కారకముల ప్రవృత్తియు ఒకే విధముగ నుండవలయునను నిర్బంధము లేదుగదా!

(3) క్రియను చెప్పు దాతువునకు తిఙ్ ప్రత్యయమును చేర్చునపుడే క్రియయొక్క ప్రాధాన్యమును సాధ్యావస్థయు విశదమగును. ఉదా: పచతి, పపాచ, పక్ష్యతి మొదలగునవి. కాని అదే ధాతువునకు కృత్ప్రత్యయమును చేర్చినచో క్రియ అప్రధానమై సిద్ధావస్థయే బోధపడును. ఉదా: పాకః (పచ్ + అ = వంట) మొదలగునవి. ఇచట ప్రత్యయము యొక్క అర్థమే ముఖ్యమై ధాతువుయొక్క యర్థము అప్రధానమగును. కాగా సత్తకు సిద్ధావస్థను చెప్పదలచినచో "భావః" అను రూప మేర్పడును (అస్ ⟶ భూ + అ = భావ). ॥12॥

*అవతారిక*— పౌర్వాపర్యరూపమైన క్రియావయవముల క్రమమునకు సంబంధించిన ఆరోపమునకు గల ఒక విశేషమును చూపుచున్నాడు.

**శ్లో॥ వ్యవహారస్య సిద్ధత్వాన్నచేయం గుణకల్పనా ।**
**ఉపచారో హి ముఖ్యస్య సంభవాదపదిశ్యతే ॥ 13**

వ్యవహారస్య = క్రియయొక్క వ్యవహారము, సిద్ధత్వాత్ = లోకసిద్ధము అగుటవలన, ఇయమ్ = ఇది, గుణకల్పనా = ఒకదాని గుణమును వేరొక దానియందు కల్పించుట, న = కాదు, ముఖ్యస్య = ముఖ్యమైన వస్తువు, సంభవాత్ = ఉండుటవలన, ఉపచారః = ఆరోపము అపదిశ్యతే + హి = చెప్పబడును గదా!

*తాత్పర్యము*— క్రియయొక్క అవయవములందు పౌర్వాపర్యరూపమైన క్రమము నారోపించుట యనగా, అనుభవ సిద్ధముగానున్న విషయమును విశ్లేషించి విశదముచేయుటయే. అంతియగాని ముఖ్యమై వేరుగానుండు ఒకదానియొక్క ధర్మమును ముఖ్యము కాకుండ వేరొక వస్తువునం దారోపించుట మాత్రము కాదు.

*వివరణము*— "గౌః - వాహీకః = వాహీకుడను వ్యక్తి గోవు. ఇచట మాంద్యము మొదలగు కొన్ని సమాస గుణములనుబట్టి గోశబ్దము వాహీకుని బోధించునదిగ వాడబడినది. అనగా గోత్వము వాహీకునియం దారోపింపబడినది. కావున ఇచటి గోశబ్దము, ముఖ్యమగు గోవును తెలుపకుండ వాహీకుని తెలుపును. ఈ తీరును గుణవృత్తి యందురు. ఇట్టి చోట్ల ముఖ్యమగు వస్తువు వేరుగా నుండును. కాని క్రియ విషయమున ఈ తీరు సంభవింపదు. అచట ముఖ్యమైనదనియు ముఖ్యముకానిదనియును విభాగము లేదు. ఉన్నది క్రియా మాత్రమే దాని అవయవములందు క్రమమును ఊహింతురు. ఇది లోక సిద్ధము. ఇచటి ఆరోపమన్నది వాస్తవము కాదు. అదియొక విధమైన భావన. కాగా క్రియయొక్క ఏ యొక క్షణమైనను క్రమమును భావించుటవలన క్రియ యగును. కావుననే క్రియ విషయమున ఆరోపమునుబట్టి "అప్రాధాన్యము సంభవించును" అను శంక కవకాశమే లేదు. ॥13॥

అవతారిక — క్రియయొక్క ప్రతి అవయవమందును సమూహ ముంచబడునని ఇదివరకు ప్రతిపాదింపబడినది (5 వ కారిక). ఇపు డా విషయముననే మరియొక రీతిని చూపుచున్నాడు.

**శ్లో॥ ఆహితోత్తర శక్తిత్వాత్ ప్రత్యేకం వా సమూహినః ।**
**అనేకరూపా లక్ష్యంతే క్రమవంత ఇవాఽక్రమాః ॥ 14**

వా = లేక, అక్రమాః = క్రమములేని. సమూహినః = క్రియకు అవయవమైన క్షణములు, ఆహితోత్తర శక్తిత్వాత్ = తమతమ తరువాతి క్షణముల భేదమును క్రమమును ఆరోపించుట వలన, ప్రత్యేకమ్ = విడివిడిగా అనేకరూపాః = అనేక రూపములు గలవిగను, క్రిమ వంతః + ఇవ = క్రమముగలవి వలెను, లక్ష్యంతే = భావింపబడును.

తాత్పర్యము— క్రియకు అవయవములగు క్షణములందు ప్రత్యేకముగ క్రమ మన్నది యుండదు. అయినను ప్రతియొక ముందు క్షణమునందును తరువాతి క్షణముల సముదాయమందు గోచరించు క్రమమును భేదమును ఆరోపింపవలెను. అట్లు చేయుటవలన క్షణములన్నియు భిన్నములుగను, క్రమముగలవిగను స్ఫురించును.

వివరణము— క్రియా క్షణముల భేదమును, క్రమమును, భావించుట కేవలము మానస ప్రక్రియయే. దీనివలన ప్రతియొక క్షణము విషయమునను, సముదాయమును తెలుపు ఆ యా ధాతురూపమును (పచతి, మొదలగునవి) వాడుటయు కాలభేదము కుదురుటయును సిద్ధించును. "సమూహమునకు ప్రతియొక అవయవమందును ఆరోపము" అని వెనుక చెప్ప బడినది. "ఉత్తర క్షణముల ధర్మము పూర్వక్షణములం దారోపింపబడున"ని యిచట చూప బడినది. "పూర్వక్షణముల స్వరూపము నుత్తరక్షణములం దారోపింపకుండుట" ఇచటి విశేషము. ఎట్లు చెప్పినను ప్రయోజనము సమానమే. ॥14॥

అవతారిక— "ఫలమును కలిగించునదియే ముఖ్యమైన క్రియ. మిగిలిన అవ యవము లన్నియును ఉపకారములు మాత్రమే" అను వేరొక రీతిని విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ అనంతరం ఫలం యస్యాః కల్పతే తాం క్రియాం విదుః ।**
**ప్రధాన భూతాం తాదర్థ్యాదన్యాసాం తు తదాఖ్యతా ॥ 15**

యస్యాః = దేనియొక్క, అనంతరమ్ = తరువాత, ఫలమ్ = ఫలము, కల్పతే = పుట్టునో, తామ్ = దానిని, ప్రధాన భూతామ్ = ముఖ్యమైన, క్రియామ్ = క్రియనుగ, విదుః = తెలియు దురు, అన్యాసామ్ + తు = మిగిలిన వానికైతే, తాదర్థ్యాత్ = ఆ ఫలమునకు సాయము చేయుటవలన, తదాఖ్యతా = క్రియ అను పేరు, (భవతి = అగును).

తాత్పర్యము— ఫలము పుట్టుటకు సూటిగా ముందున్న వ్యాపారమే వాస్తవమై నట్టియు ముఖ్యమైనట్టియు క్రియ యగును. అంతకు ముందుండు వ్యాపారములన్నియు ముఖ్య

మైన క్రియకు —లేదా— ఫలమునకు సాయము చేయునవిగాన వానిని గూడ క్రియగనే సంభావింతురు.

*వివరణము*— 'పచి' క్రియ నుదాహరణముగా తీసికొనవచ్చును. "వస్తువు ఉడుకుట —లేక— మెత్తబడుట'' పాకమగును. ఇది పచి క్రియయొక్క ఫలము. పాకమునకు ముందుండు వ్యాపారమును "విచటనము'' అందురు. అనగా వస్తువులందలి సూక్ష్మ భాగములు విడిపోవుట. (దీని పిదపనే మెత్తబడుట సంభవించును) ఇట్టి విచటనమే ముఖ్యమైన క్రియ. దీనికి ముందుండు వ్యాపారము లన్నిటియందును ఇట్టి స్థితికి సాయపడుట ఉండునుగాన వానిని గూడ పచి క్రియగనే వ్యవహరింతురు. చలన రూపమైనను కాకున్నను ప్రతియొక క్రియయందును ఈ తీరును సూక్ష్మదృష్టితో పరిశీలింపవలెను.

*విశేషము*— కాగా మతభేదము వలన మూడు విధములైన క్రియా లక్షణములు సిద్ధించును. (1) క్రియయొక్క ప్రతియొక అవయవమందును సమూహము నారోపించి క్రియను భావించుట. (2) ఉత్తరక్షణముల స్వరూపమును పూర్వక్షణములం దారోపించి క్రియను భావించుట. (3) ఫలమునకు ముందుండు క్రియయే ప్రధాన క్రియయని భావించుట మరియు, ధాతువులన్నియును సామాన్యముగ "కర్తకు సంబంధించినట్లుగనే'' వ్యాపారమును తొలుత బోధించును. వివక్షాధీనముగ మార్పులు అచటనచట జరుగును. ॥15॥

*అవతారిక*— సత్తకు (ఉనికి) సాధ్యత్వమును నిరూపించుచున్నాడు.

**శ్లో॥ సత్సు ప్రత్యయరూపోఽసౌ భావో యావన్న జాయతే ।**
**తావత్పరేషాం రూపేణ సాధ్యః సన్నభిధీయతే ।** 16

అసౌ = ఈ, భావః = పదార్థము (వస్తువు), సత్సు = కారణములైనవి ఉండగా, ప్రత్యయ రూపః = స్పష్టమైన స్వరూపముగలదై, యావత్ = ఎంతవరకు, న + జాయతే = పుట్టదో, తావత్ = అంతవరకును, పరేషామ్ = (ఇతరములయిన) హేతువులయొక్క, రూపేణ = స్వరూపముతో (సూచింపబడినదై), సాధ్యః + సన్ = సాధ్యమైనదిగా, అభిధీయతే = చెప్పబడును.

*తాత్పర్యము*— ఏ వస్తువునకైనను ముఖ్యహేతువైన మూలపదార్థ మొకటి యుండును. అదియే మరికొన్ని హేతువుల మూలమున స్పష్టమైన స్వరూప స్వభావములుగల ఒక వస్తువుగా ఏర్పడును. అనగా కారణమే కార్యరూపమును ధరించును. ఇట్లు కార్యరూపమును ధరించు సమయమున వస్తువు సాధ్యస్వభావమును స్వీకరించును. ఆపుడది "అస్తి'' అను క్రియాపదముచే బోధింపబడును.

*వివరణము*— కారణములు సిద్ధములుగా నుండును. కార్యము తన రూపమును ధరించు అవస్థకు రెండు భాగములుండును. అందు మొదటి భాగము జన్మము. దీనిని ''జాయతే'' అను క్రియాపదము తెలుపును. రెండవ భాగము సత్త. దీనిని ''అస్తి'' అనునది

తెలుపు. సిద్ధములైన కారణములను బట్టి కార్యమును కూడ సిద్ధముగ భావించి - దానినే ... సిద్ధమైన స్వరూపమును సాధ్యముగా భావించుటవలన సత్తకు సాధ్యత్వమును ... సంపాదింపవలెను. ఉదా: "ఘటః - అస్తి". ఇచట మన్ను మూలకారణము. ... చక్రము మొదలగునవి ఇతర కారణములు. ఇవి సిద్ధములు. వీనినిబట్టి ఘటము ... సమయముననే "ఘటః జాయతే" "ఘటః అస్తి" అని వ్యవహరింతురు. ... కారణముల వ్యాపారము నాశ్రయించి సత్తకు సాధ్యత్వమును భావింతురు. ॥16॥

అవతారిక— పైని చూపిన విధముగ భావింపనియెడల,

శ్లో॥ సిద్ధేతు సాధనాకాంక్షా కృతార్థత్వాన్నివర్తతే ।
న క్రియావాచినాం తస్మాత్ ప్రయోగస్తత్ర విద్యతే ॥ 17

సిద్ధే - తు = సిద్ధమైన విషయమున, కృతార్థత్వాత్ = ఫలము కలిగినందువలన, సాధనాకాంక్షా = సాధనముల కోరిక, నివర్తతే = మరలిపోవును, తస్మాత్ = అందువలన, తత్ర = అచట, క్రియావాచినామ్ = క్రియావాచకముల యొక్క, ప్రయోగః = ప్రయోగము, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— సత్తను సిద్ధముగనే భావించినచో సాధనముల ఆవశ్యకత —లేక— అపేక్ష యుండదుగాన, క్రియాపదమును వాడనక్కర లేదు. "భావః" అను కృదంతమునే వాడవలయును. ఉదా: "ఘటస్య భావః" (ఘటముయొక్క ఉనికి).

వివరణము— సిద్ధావస్థయనగా ఫలరూపమే. అది యున్నపుడు సాధనము లక్కరలేదు. ॥17॥

అవతారిక— కాగా ప్రతియొక క్రియయు సాధ్యస్వభావము గలదియు క్రమము గలదియునని మరల చెప్పుచున్నాడు.

శ్లో॥ సచాఽపూర్వాపరీభూత ఏకత్వాదక్రమాత్మకః ।
పూర్వాపరాణాం ధర్మేణ తదర్థేనాను గమ్యతే ॥ 18

ఏకత్వాత్ = ఒకటి యగుటవలన, అపూర్వాపరీభూతః = పౌర్వాపర్యము లేనిదియు, అక్రమాత్మకః = క్రమము లేనిదియునగు, సః + చ = ఆ క్రియ (ప్రధాన క్రియ), తదర్థేన = దాని కుపయోగించు, పూర్వాపరాణామ్ = ముందు వెనుకలుగనున్న అవయవముల యొక్క, ధర్మేణ = స్వభావముచే, అనుగమ్యతే = అనుసరింపబడును.

తాత్పర్యము— ప్రధానమగు క్రియ (ఫలమునకు ముందుండునది) వాస్తవముగ ఒక్కటే. దానికి పౌర్వాపర్యముగాని, క్రమముగాని యుండదు. అయినను దానికి సాయపడు అప్రధానమైన క్రియలందలి పౌర్వాపర్యమును క్రమమును దానియం దారోపింపబడును.

*వివరణము*— ఫలము పుట్టుటకు అవ్యవహితముగ ముందుండు వ్యాపారమే ప్రధాన క్రియయనియు, దాని కుపకరించు మిగిలినవన్నియును అప్రధాన క్రియలనియును పర్యవసించును. ॥18॥

*అవతారిక*— ఫలమును బట్టియు అభేదమును చెప్పదగునని ప్రతిపాదింపు చున్నాడు.

**శ్లో॥ అసన్నివర్తతే తస్మాత్ యత్ సత్తదుపలభ్యతే।**
**తయోః సదసతోశ్చాసా వాత్మైక ఇవ గృహ్యతే॥** 19

అసత్ = లేనిది, నివర్తతే = పోవును, యత్ = ఏది, సత్ = ఉన్నదో, తత్ = అది, ఉపలభ్యతే = గ్రహింపబడును, తస్మాత్ = అందువలన, సదసతోః = ఉన్నట్టియు లేనట్టియు, తయోః + చ = ఆ రెండింటి యొక్కయు, ఏకః = ఒకటియైన, ఆత్మా + ఇవ = ఆత్మవలె, అసౌ = ఇది (ఈ క్రియ), గృహ్యతే = స్వీకరింపబడును.

*తాత్పర్యము*— క్రియకు ఫలమొకటే యుండును. ఆ ఒక్క ఫలముకొరకే క్రియ యొక్క లక్షణములన్నియు (అవయవ క్రియలు) ప్రవర్తించును. అందు జరిగినది కనబడదు (అసత్తు). జరుగుచున్నది కనబడును (సత్తు). రెండును ఒకే స్వరూపము గలవి. అది ఆత్మ వంటిది. అవియే క్రియ అది ఒకటేయని భావింపదగును.

*వివరణము*— ఫల మొకటే కావునను, దానిని గూర్చియే క్రియా క్షణము లన్నియు ప్రవర్తించును కావునను అభేదమును భావించి, "క్రియ ఒకటే" అనుట సమంజసమని సారాంశము. ప్రతియొక క్రియ విషయముననను ఈ తీరునంతను భావింపవలెను. ॥19॥

*అవతారిక*— వ్యక్తి వాదము ననుసరించి యింతవరకును క్రియయొక్క లక్షణమును చూపి, ప్రకృతమును జాతివాదము ప్రకారము క్రియా లక్షణమును చూపుచున్నాడు.

**శ్లో॥ జాతిమన్యే క్రియామాహురనేక వ్యక్తివర్తినీమ్।**
**అసాధ్యా వ్యక్తిరూపేణ సాసాధ్యేవోప లభ్యతే॥** 20

అనేక వ్యక్తివర్తినీమ్ = అనేకములగు వ్యక్తులందుండు, జాతిమ్ = జాతిని, క్రియామ్ = క్రియనుగ, అన్యే = కొందరు, ఆహుః = చెప్పుదురు, సా = ఆ క్రియాజాతి, అసాధ్యా = సాధ్యము కానిదైనను, వ్యక్తిరూపేణ = వ్యక్తియొక్క స్వరూపముచే, సాధ్యా + ఇవ = సాధ్యమైనట్లు, ఉపలభ్యతే = కనబడును.

*తాత్పర్యము*— ఎల్ల క్రియలందును గోచరించు ఒకానొక సామాన్య ధర్మమునే "క్రియ" యని కొందరు చెప్పుదురు. వాస్తవమున అట్టి ధర్మము నిత్యమును అసాధ్యము నగును. అయినను వ్యక్తులనుబట్టి జాతికిని సాధ్యస్వభావమును సక్రమత్వమును ఆపాదింపవలెను.

వివరణము— సకల గోవులందును అనుస్యూతముగ అనుభూతమగు "గోత్వము" అనునది జాతి. ఏ గోవు కా గోవు వ్యక్తి. అట్లే ఎవరు వండినను, దేనిని వండినను ఎల్ల వంట లందును గోచరించు "వంట" అను సామాన్య ధర్మము "పాకజాతి" అగును. జాతి యనునది శాస్త్రీయముగ నిత్యమును అసాధ్యమునగు అంశము. అయినను జాతిని వ్యక్తముచేయు వ్యక్తు లను బట్టి సాధ్యత్వము మొదలగు ధర్మములను జాతియందును భావింపవలెను. ॥20॥

అవతారిక— "ఫలము పుట్టుటకు ముందు లక్షణమందున్న క్రియయే ముఖ్య క్రియ" అని వ్యక్తి వాదమున ప్రతిపాదింపబడెను (15 కారిక). అదే తీరును జాతి వాదమున గూడ చూపుచున్నాడు.

శ్లో॥ అంతే యా వా క్రియాభాగే జాతిః సైవ క్రియా స్మృతా ।
సావ్యక్తేరను నిష్పాదే జాయమానేవ గమ్యతే ॥ 21

వా = లేక, అంతే = చివరిదగు, క్రియాభాగే = క్రియా వ్యక్తియందు, యా = ఏ, జాతిః = జాతి గలదో, సా + ఏవ = అదియే, క్రియా = క్రియయని, స్మృతా = చెప్పబడెను, సా = అట్టి జాతి, వ్యక్తేః = వ్యక్తియొక్క, అనునిష్పాదే = పుట్టుకయందు, జాయమానా + ఇవ = పుట్టుచున్నది వలె, గమ్యతే = తెలియబడును.

తాత్పర్యము— ఏ క్రియా వ్యక్తియొక్క సమనంతరమున (వెన్వెంటనే) ఫలము పుట్టునో, అట్టి క్రియా వ్యక్తియందు గోచరించు జాతియే "క్రియా జాతి" అని చెప్పనగును. ఇచట గూడ వ్యక్తియొక్క నిష్పత్తి ననుసరించి జాతికిని ఆధర్మ మంటగట్ట బడును.

వివరణము— వ్యక్తులవలననే జాతి అభివ్యక్తమగును. అంతియగాని జాతి యన్నది వేరుగ ఎన్నడు నుండదు. కావున వ్యక్తులందుండు ధర్మములను జాతియం దారోపించుట జరుగుచుండును ఈ తీరునందు గూడ ముఖ్య క్రియకు ముందుండు క్రియా వ్యక్తులు తదర్థములగుట వలన (ఉపకారకములు) క్రియ లనిపించుకొనును. ॥21॥

అవతారిక— "జాతియే క్రియ" అని చూపి, జాతికన్నను విశాలమైన "సత్తయే" క్రియ యని ప్రకృతము చూపుచున్నాడు.

శ్లో॥ స్వవ్యాపార విశిష్టానాం సత్తా వా కర్తృకర్మణామ్ ।
క్రియా వ్యాపార భేదేషు సత్తా వా సమవాయినీ ॥ 22

వా = లేక, స్వవ్యాపార విశిష్టానామ్ = తమ తమ వ్యాపారములతో గూడిన, కర్తృ కర్మణామ్ = కర్తల యొక్కయు, కర్మల యొక్కయును, సత్తా = సత్తకాని, వా = లేక, వ్యాపార భేదేషు = ఆ యా వేర్వేరు వ్యాపారములందు, సమవాయినీ = తప్పక ఉండు, సత్తా = సత్తకాని, క్రియా = క్రియ, (భవతి = అగును).

అవతారిక—మహాప్రళయమును ఒప్పుకొన్నవారి మతమును జూచినను జాతుల కాశ్రియములుండగలవని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రకృతౌ ప్రవిలీనేషు భేదేష్వేకత్వదర్శినామ్।
ద్రవ్యసత్త్వం ప్రపద్యన్తే స్వాశ్రయా ఏవజాతయః॥ 43

భేదేషు = ఘటము, పటము మున్నగువస్తుభేదములు, ప్రకృతౌ = ప్రకృతియందు, ప్రవిలీనేషు = లయమునుబొందగా, ఏకత్వినామ్ = ఏకత్వమునుఅంగీకరించువారి మతమున అనగా జగమునకు బ్రహ్మముతో ఏకత్వమును అభేదమును అంగీకరించిన అద్వైతుల మతమున, స్వాశ్రియాః, ఏవ = స్వీయమగు అశ్రియములు కలవిగానే, జాతయః = జాతులు, ద్రివ్యసత్త్వమ్ = ద్రవ్యమునందుండుటను, ప్రపద్యన్తే = పొందుచున్నవి.

వ్యాసమహర్షి ఉత్తరమీమాంసా శాస్త్రమును రచియించెను. అందు మహాప్రళయము జరుగుననియు, అదిశాస్త్రసమ్మతమనియు సిద్ధాంతము చేయబడినది. పదార్థములన్నియు మహాప్రళయమున ఒకేసారి నశించును. నాశమనగా స్థూలరూపమున కానరాకుండుటయే. ఎల్లవస్తువులు ప్రకృతియందు సూక్ష్మరూపమున నిలుచును. సృష్టి ప్రారంభమున అవి మరల స్థూలరూపమున ఆవిర్భవించును.

కాగా అద్వైతవేదాంతము చొప్పునచూచినను ద్రవ్యరూపమగు బ్రహ్మమునే జాతులన్నియు ఆశ్రయించియుండును.

విశేషాంశము—వైశేషికశాస్త్రజ్ఞులు ఇట్లు తలంచుచున్నారు. ప్రళయము శాస్త్ర సమ్మతమే. కాని ఘటత్వము, పటత్వము మున్నగు జాతులు ఆశ్రియములులేకయే యుండగలవు. వానియొక్క అభివ్యక్తిమాత్రముకొరకే వ్యక్తుల అపేక్ష. ॥43॥

అవతారిక—గోత్వజాతి ఎల్ల గోవులయందు ఉండును అని చెప్పబడినది. అట్లు కాక అజాతులు ఎల్లగోవులయందే అను నియమము లేక, ఎల్ల ప్రాణులయందు ఉండునని చెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రాహ్మణత్వాదయో భావాః సర్వప్రాణిష్వవస్థితాః।
అభివ్యక్తాః స్వకార్యాణాం సాధకా ఇత్యపి స్మృతిః॥ 44

బ్రాహ్మణత్వాదయః = బ్రాహ్మణత్వము మున్నగు, భావాః = జాతివిశేషములు, సర్వప్రాణిషు = ఎల్లప్రాణులయందు, అవస్థితాః = నిలిచియేయున్నవి.

బ్రాహ్మణత్వజాతి కేవలము బ్రాహ్మణ వ్యక్తులయందే కాక క్షత్త్రియాది ప్రాణులయందుగూడ కలదు.

అభివ్యక్తాః = ఆయానియతములగు వ్యక్తులచే స్పష్టము చేయబడిన జాతులు, స్వకార్యాణామ్ = జాతివిశేషములకు సంబంధించిన కార్యములకు, సాధకాః = సాధకములు కాగలవు, ఇతి = అనియు, స్మృతిః = వృద్ధ పరంపర చెప్పుచున్నది.

*తాత్పర్యము*— ''సత్ = ఉన్న వస్తువు'', ''సతః - భావః = సత్తా = ఉనికి'', ఆ యా వ్యాపారములు గల కర్తృ కర్మాదుల సత్తగాని, ఆ యా వ్యాపారములందు నియతమైన సత్తగాని క్రియ యగును.

*వివరణము*— ఇది మిక్కిలి తాత్త్వికమైన నిర్వచనము. ఇటుపైని దీని వివరణమే విపులముగ జరుగును. సర్వకారణమును సర్వాకారమును నిత్యమునగు ఒక తత్త్వమును ''సత్'' అని నిర్దేశింతురు. దాని భావమే సత్త. దీనినే ''మహాసత్త'' అనియు, ''మహాసామాన్యము'' అనియు వ్యవహరింతురు. ఇదియే జగత్తుగా గోచరించును. ప్రపంచముగా అనుభూతమగునదంతయు దీనియొక్క వివర్తము —లేక— వికారము. కాగా దేనికి లక్షణమును చెప్పినను అది కృతకమును, పరిమితమును అగును. తాత్త్వికమైన సత్తయే అన్నిటికిని పరమ లక్షణమని ఫలించును. అందుచేతనే క్రియ యనగా సత్తయే అనియు, ఆ సత్త వ్యాపారముతో గూడిన కర్తృ కర్మల సత్త యనిగాని, వ్యాపారముల సత్త యనిగాని చెప్ప వచ్చుననియును పర్యవసించును. ॥22॥

*అవతారిక*— ''ఫలము పుట్టుటకు ముందు క్షణమందున్న వ్యాపారమందలి సత్తయే క్రియ'' అను తీరునుగూడ చూపుచున్నాడు.

**శ్లో॥ అంత్యేవాఽత్మని యా సత్తా సా క్రియా కైశ్చిదిష్యతే ।**
**భావఏవ హి ధాత్వర్థ ఇత్య విచ్ఛిన్న ఆగమః ॥ 23**

వా = లేక, అంత్యే = చివరిదగు, ఆత్మని = వ్యాపార భాగమందు, యా = ఏ, సత్తా = సత్త గలదో, సా = అది, క్రియా = క్రియ అని, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = కోరబడుచున్నది, భావః + ఏవ = భావమే (సత్తయే), ధాత్వర్థః + ఇతి = ధాతువుయొక్క అర్థమని, అవిచ్ఛిన్నః = ఎడతెగని, ఆగమః + హి = సంప్రదాయము గదా !

*తాత్పర్యము*— ఫలమునకు ముందుండు వ్యాపారముయొక్క సత్తయే క్రియ యని కొందరందురు, (అంతకుముందుండు వ్యాపారములందు తాదర్థ్యమువలన క్రియాత్వము సిద్ధించును) ''సత్తయే ధాత్వర్థము'' అనునది పరమ సంప్రదాయము.

*వివరణము*— ఏది ఎట్లయినను సత్తయే క్రియ. సత్తనే భావమనియు నందురు. ''భావమే ధాతువుయొక్క సహజమైన యర్థమ''ని పతంజలి మొదలగు పెద్దలు నిర్ణయించిరి.

*విశేషము*— సత్తయొక్క వికారములే సృష్టియందంతటను గోచరించును. బాహ్యమగు భేదములవలన మహాసత్తకు నామరూప భేదము లేర్పడుచుండును అవియే శబ్దార్థముల వైచిత్ర్యముగా భాసించుచుండును. కావుననే ''తాం ప్రాతిపదికార్థం చ ధాత్వర్థం చ ప్రచక్షతే'' (ఆ సత్తనే ప్రాతిపదికార్థమనియు, దాత్వర్థమనియును చెప్పుదురు) మొదలగు వచనములచే ''శబ్దార్థ ప్రపంచమంతయు సత్తామయమే'' అని తాత్త్వికులు చెప్పుచుందురు. సామాన్యముగా సత్త విషయములో చూపబడు సంబంధములును సంబంధులును సత్తయొక్క ప్రకాశ

ములే. కాగా ఇట్టి వాదమును ''సత్తాఽద్వైతము'' అని యందురు. దీని ననుసరించియే ఈ ఘట్ట మంతయు సాగును. ॥23॥

*అవతారిక*— ''శబ్దమువలన తెలియు అర్థము బౌద్ధము'' అను పక్షమున క్రియ యొక్క స్వరూపమును విశదీకరింపుచున్నాడు.

**శ్లో॥ బుద్ధిం తజ్జాతిమన్యేతు బుద్ధి సత్తామథాఽపరే।**
**ప్రత్యస్తరూపాం భావేషు క్రియేతి ప్రతి జానతే॥ 24**

భావేషు = పదార్థములందు (వస్తువులందు), ప్రత్యస్తరూపామ్ = ఆరోపింపబడిన స్వరూపము గల, బుద్ధిమ్ = బుద్ధినిగాని, తజ్జాతిమ్ + తు = బుద్ధియందలి జాతినిగాని, అన్యే = కొందరు, క్రియా + ఇతి = క్రియయని, ప్రతిజానతే = తెలియుదురు, అథ = మరియు, అపరే = మరికొందరు. బుద్ధి సత్తామ్ = అట్టి బుద్ధియొక్క మహాసత్తను, క్రియా + ఇతి = క్రియయని, ప్రతిజానతే = తెలియుదురు.

*తాత్పర్యము*— బుద్ధియందేర్పడు వస్తువుల ఆకారము (చిత్రము) బుద్ధి యన బడును. (శబ్దమువలన తెలియు అర్థము మానసికమైన ఆ యా ఆకారమేయని శాబ్దికుల నిర్ణయము) కాగా బాహ్యమైన వస్తువులకును బౌద్ధమైన వానికిని అభేదమును కల్పించి, బౌద్ధమైనదియే క్రియ యనియు, అది వ్యక్తిగాని జాతిగాని కావచ్చుననియును కొందరు చెప్పుదురు. బుద్ధికిచెందు మహాసత్తయే క్రియయని మరికొందరు వ్యాఖ్యానింతురు.

*వివరణము*— పచ్, గమ్ మొదలగు ఆ యా ధాతువులవలన వంట, నడక మొదలగు క్రియల చిత్రములు మనసునం దేర్పడును. వానికిని బయట కనబడు వ్యాపారములకును అభేద మనవలెను. అందుచే క్రియ మానసికమే యనియు, వ్యక్తిగాగాని జాతిగాగాని సత్తగాగాని దానిని భావింపవచ్చుననియును కొందరు చెప్పుదురు క్రియా ప్రపంచమంతయు మానసికమేయనుటయు, అందును సత్తయే క్రియ యనుటయును ఇచటి విశేషము. ॥24॥

*అవతారిక*— మహాసత్తయే క్రియయని సమర్థించుటకు ఉపపత్తిని చూపుచున్నాడు.

**శ్లో॥ ఆవిర్భావతిరోభావౌ జన్మనాశౌ తథాఽపరైః।**
**షట్సు భావవికారేషు కల్పితౌ వ్యావహారికౌ॥ 25**

షట్సు = ఆరయిన, భావవికారేషు = సత్తయొక్క వికారములందు, వ్యావహారికౌ = లోకమందలి వాడుకలో ప్రసిద్ధమైన, ఆవిర్భావతిరోభావౌ = ప్రకటమగుటయు కప్పబడుటయును, తథా = అట్లు, అపరైః = కొందరిచే, జన్మనాశౌ = పుట్టుటయును గిట్టుటయును, కల్పితౌ = కల్పింపబడినవి (ఆరోపింపబడినవి).

తాత్పర్యము— సత్త నిత్యము. ఎల్లపుడును ఏకరూపము. అయినను లోకవ్యవహారము నడచుటకై ఆ సత్తకు ఆరు వికారములను కల్పించిరి. అందును మిక్కిలి ముఖ్యమైనవి "ఆవిర్భావము - తిరోభావము" అనునవి రెండే. ఆవిర్భావమును జన్మయనియు తిరోభావమును నాశమనియును కొందరందురు. సత్తయొక్క తొలి వికార మావిర్భావము. చివరి వికారము తిరోభావము. ఇదంతయు లౌకికమైన భావనయే.

వివరణము— జాయతే (పుట్టుట), అస్తి (ఉండుట), విపరిణమతే (మార్పు చెందుట), వర్ధతే (పెరుగుట), అపక్షీయతే (క్షీణించుట), నశ్యతి (నశించుట) అనునవి ఆరు వికారములు. వీనినే భావవికారము లందురు. ఇచట భావమనగా సత్తయని యర్థము. సృష్టియందలి ప్రతియొక వస్తువునకును - మొత్తము సృష్టియంతకును - ఈ ఆరు అవస్థలును తప్పవు. వీని యన్నిటికిని మూలాధారము సనాతనమైన సత్తయే. అది నిర్వికారము కాగా వికారములు కల్పితములు.

సత్కార్యవాదమనియు, అసత్కార్యవాదమనియును, రెండు వాదములున్నవి. కార్యము కారణమందే ఉన్నదనియు, అది బయట పడినపుడు ''ఆవిర్భావము''నియు, మరుగైనపుడు ''తిరోభావము''నియును చెప్పుదురని సత్కార్యవాదము యొక్క సారము. కారణము వలన కార్యము క్రొత్తగా పుట్టుననియు క్రమముగ నశించుననియును, వీనిని ''జన్మ నాశము'' లందురనియును అసత్కార్యవాదము యొక్క సారము.

విశేషము— మన్ను కారణము. కుండ కార్యము. కుండ మట్టియందున్నదే యనుటయు, దాని రూపము బయటపడుటయు మరుగుపడుటయు మాత్రమే జరుగుననుట సత్కార్యవాదము. అంతకు ముందులేని కుండ క్రొత్తగా పుట్టుటయు గిట్టుటయును జరుగునన్నది అసత్కార్యవాదము. ఇట్టి వాదభేదమును బట్టి పై అవస్థలను సాంకేతికముగా ''ఆవిర్భావ తిరోభావములు'' అనిగాని, ''జన్మనాశములు'' అనిగాని చెప్పుదురు. ఏది ఎట్లయినను సత్త మాత్రము నిత్యమును నిర్వికారమునుగాన దాని విషయమున, ఈ వికారములన్నియు ఊహలే యగునుగాని వాస్తవములు కావు. అయినను లోక వ్యవహారము కొరకు వీని నాశ్రయింపక తీరదు. ॥25॥

అవతారిక— అట్లు కల్పితములైన జన్మ నాశములే క్రియ యను వ్యవహారమును పొందునని చెప్పుచున్నాడు.

శ్లో॥ తాభ్యాం సర్వప్రవృత్తీ నామభేదే నోప సంగ్రహః ।
జన్మైవాఽశ్రిత సారూప్యం స్థితిరిత్యభిధీయతే ॥ 26

తాభ్యామ్ = ఆ జన్మ వినాశములు రెండింటితో, అభేదేన = అభేదముచే, సర్వప్రవృత్తీనామ్ = ఎల్ల వ్యాపారములకును, ఉపసంగ్రహః = సంగ్రహము, (భవతి = అగును), ఆశ్రితసారూప్యమ్ = సారూప్యము నాశ్రయించిన, జన్మ + ఏవ = జన్మయే, స్థితిః + ఇతి = స్థితియని, అభిధీయతే = చెప్పబడును.

తాత్పర్యము— జన్మ, వినాశము అను రెండు ప్రవృత్తులందే ఎల్ల వ్యాపారములును ఇమిడి పోవును. అనగా వ్యాపారములన్నియు ''ఈ రెండిటిలో ఒకదాని యొక్క సంతతియే'' అని సూక్ష్మ పరిశీలనము వలన తెలియుచుండును. ''స్థితి'' (కదలక ఉండుట) అను వ్యాపారము కూడ జన్మయే అనదగును.

వివరణము— పుట్టుట, ఉండుట, మారుట, పెరుగుట, క్షీణించుట, నశించుట అను ఆరును భావవికారములు. ఇందు మొదటిదియు చివరిదియునగు ''జన్మ నాశముల''సునవియే ముఖ్యమైన వ్యాపారములు. మిగిలిన నాలుగును వీనికి సంబంధించినవియే. ఆ యా అవస్థలను బట్టి ''ఉండుట'', మొదలుకొని ''పెరుగుట'' వరకును వేర్వేరు పేర్లను పొందును. అట్లే ''క్షీణించుట'' అన్నది నాశమునకు తొలిదశ యగును. ఇట్లు అతిసూక్ష్మముగ పరిశీలించిన యెడల సృష్టియందలి వ్యాపారము లన్నియు జన్మయందో నాశమందో అంతర్భవించును. ఏ వ్యాపారమైనను నిర్వికారమైన సత్తయం దారోపింపబడునదే యగును. ఇట్టి యారోపమును అభేదమును స్వీకరించినందువలన జన్మనాశములే క్రియా వ్యవహారము నంతను పొందును.

''స్థితి'' (స్థా = కదలకుండు) అను ఒక వ్యాపారమున్నది. అదియు వాస్తవముగ జన్మయేయని చెప్పదగును. కావున దానిని ''తిష్ఠతి'' అను క్రియాపదముతో బోధింపవచ్చును (జన్మకును స్థితికిని సాదృశ్యమును భావించినందువలన ఈ తీరు సిద్ధించును) ॥26॥

అవతారిక— ''జన్మ నాశములు కూడ పరమార్థములు కావు సత్తయే పరమార్థము. అదియే ధాత్వర్థము'' అని ప్రకటింపుచున్నాడు.

శ్లో॥ జాయమానాన్న జన్మాన్య ద్వినాశేఽప్యపదార్థతా ।
అతోభావ వికారేషు సత్తైకా వ్యవతిష్ఠతే ॥ 27

జాయమానాత్ = పుట్టు వస్తువుకన్న, అన్యత్ = వేరయిన, జన్మ = పుట్టుక, న = లేదు, వినాశే + అపి = నాశమందును, అపదార్థతా = పదార్థము కాకుండుట, (అస్తి = కలదు), అతః = ఇందువలన, భావవికారేషు = సత్తయొక్క వికారములందు, సత్తా = సత్త, ఏకా = ఒకటియే, వ్యవతిష్ఠతే = ఉండును.

తాత్పర్యము— పుట్టుట మొదలగునవి ధర్మములు. అవి ధర్మియందు (ధర్మముల వస్తువు) ఆధారపడును. అనగా ధర్మి లేనిదే ధర్మములు భాసించుట కవకాశమే లేదు. గా జన్మనాశములను ధర్మములు కూడ ధర్మినిబట్టియే వ్యవహారయోగ్యము లగును. ఎల్ల ర్మములకును ధర్మిగా నుండునది ఒకటే యున్నది. అదియే సత్త. అదియే అన్ని వ్యవహారములకును మూలకారణము. అందువలన జన్మనాశములును కల్పితములే.

వివరణము— పుట్టుదానికన్న వేరుగ ''పుట్టుట'' అను ధర్మ ముండదు. అట్లే నశించుదానికన్న వేరుగ ''నాశమ''ునదియు నుండదు. సర్వమునకును మూలమగు ''సత్త''

యను ధర్మినిబట్టి ఇట్టి వ్యవహారములన్నియును కుదురుచున్నవి. సర్వ వ్యాపకమును సనాతనమునగు ''మహాసత్త''కు వాస్తవమున ఎట్టి వికారములును లేవు. (ఉన్నచో అది నిత్యము కానేరదు). కాగా విశ్లేషించి చూడగా చూడగా చివరకు మహాసత్తయే సకల వ్యాపారములకును ఆధారమని ఫలించును. అందుచే ''సత్తయే ధాతువుయొక్కయు ప్రాతిపదికము యొక్కయు అర్థమనియు, శబ్దార్థ ప్రపంచము సత్తయొక్క విలాసమే యనియును'' చెప్పుదురు. అయినను అట్టి సత్తనే క్రియాపదమును (జాయతే మొదలగునది) వాడి సాధ్యముగను, నామపదమును (ఘటః, పటః మొదలగునవి) వాడి, సాధనముగను చూపుచుందురు. ॥27॥

*అవతారిక*— సత్తకు జన్మాది భేదములు లేకున్నను ''అవి ఉన్నట్లు'' లోకమున వ్యవహారము జరుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పూర్వభాగస్తు యజ్జాతాత్తజ్జన్మ వ్యపదిశ్యతే ।**
**ఆశ్రితక్రమరూపేణ నిమిత్తత్వే వివక్షితే ॥ 28**

జాతాత్ = పుట్టిన దానికి, పూర్వభాగః = ముందు అవస్థ, యత్ + తు = ఏదయితే కలదో, తత్ = అది, ఆశ్రిత క్రమరూపేణ = క్రమము నాశ్రయించుటచే, నిమిత్తత్వే = వ్యాపారము గలదిగ, వివక్షితే = చెప్పదలప బడినపుడు, జన్మ = జన్మగా, వ్యపదిశ్యతే = చెప్పబడును.

*తాత్పర్యము*— పుట్టినదానిని ''జాత'' అను నామ పదముతో వ్యవహరింతురు. ''జాత'' అను వ్యవహారమునకు ఏది హేతువగునో దానిని వ్యాపారముగ భావించి "జాయతే" (పుట్టుచున్నది) అను క్రియాపదముతో నిర్దేశింతురు.

*వివరణము*— "జాతః" అనునది పరినిష్ఠితమైన (పూర్తి అయిన) అవస్థను తెలుపును. ఇందు మొదటిది సాధనావస్థ. రెండవది సాధ్యావస్థ. (రెండును కల్పితములే) ॥28॥

*అవతారిక*— పై అంశమునే విశదీకరింపుచున్నాడు.

**శ్లో॥ ఆఖ్యాత శబ్దైరర్థోఽసావేవం భూతోఽభిధీయతే ।**
**నామశబ్దాః ప్రవర్తంతే సంహరంత ఇవ క్రమమ్ ॥ 29**

అసౌ = ఈ, అర్థః = విషయము, (జాతమునకు ముందు అవస్థ), ఏవం భూతః = ఇట్టిదిగా (క్రమము గలదిగ), ఆఖ్యాతశబ్దైః = తిఙంత పదములచే (జాయతే మొదలగు వానిచే), అభిధీయతే = చెప్పబడును, నామశబ్దాః = నామములు (సుబంతములు), క్రమమ్ = క్రమమును, సంహరంతః + ఇవ = ఉపసంహరించునవి వలె, ప్రవర్తంతే = ప్రవర్తించును.

*తాత్పర్యము*— "జాయతే" మొదలగు తిఙంతములు పుట్టిన వస్తువుయొక్క పూర్వావస్థను సాధ్యమగు రీతిని ప్రకటించును. "జాత" మొదలగు సుబంతములు అదే వస్తువుయొక్క సిద్ధావస్థను బోధించును.

*వివరణము*— క్రియాపదము క్రమమును సాధ్యభావమును సూచించుననియు, నామపదము క్రమము లేకపోవుటను సిద్ధభావమును సూచించుననియును సారాంశము.

*అవతారిక*— పూర్వభాగము జన్మమైనట్లు ఉత్తరభాగము వినాశమగునను కొందరి మతమును చూపుచున్నాడు.

**శ్లో॥ ఫలం ఫలాపదేశో వా వస్తు వా తద్విరోధి యత్ ।**
**తదన్య ఏవ పూర్వేషాం నాశ ఇత్యపదిశ్యతే ॥** 30

ఫలమ్ = ఫలముగాని, వా = లేక, ఫలాపదేశః = ఫలముగా భావింపబడునదిగాని. వా = లేక, తద్విరోధి = నశించుదానికి విరుద్ధమైన, యత్ = ఏ, వస్తు = వస్తువుగలదో, తత్ = అదిగాని, అన్యః + ఏవ = వేరయినదియే. నాశః + ఇతి = వినాశమని, పూర్వేషామ్ = పూర్వుల మతమున, అపదిశ్యతే = చెప్పబడును

*తాత్పర్యము*— "నాశము లేక అభావము వేరొక పదార్థము" అని కొందరి మతము అది ఫలముగాని ఫలముగా భావింపబడు అంశముగాని పూర్తిగా విరుద్ధమైన వస్తువు గాని కావచ్చునని వారి ఆశయము. అట్టి నాశము ''నశ్యతి'' మొదలగు తిజంతములచే సాధ్యముగను, ''నాశః'' మొదలగు సుబంతములచే సిద్ధముగను తెలియజేయబడును.

*వివరణము*— గమనమునకు ఫలము అనుకొన్న ప్రదేశమును చేరుట. దీనినే ''ఉత్తరదేశ సంయోగము'' అందురు. ఈ సంయోగము కలుగగనే గమన మాగిపోవును. అనగా అది నశించినట్లు లెక్క. ఇట్లే ఆ యా పనియొక్క ఫలము కలుగగానే ఆ పని నశించును అందుచే ఫలమునే నాశమని అనుకొనవచ్చును. ఇదియొక భావన. లేక– కుండను బ్రద్దలు కొట్టినచో ముక్కలగును. ఇట్లే ఆ యా వస్తువులు పాడయినపుడు వాని అవయవ ములు మిగులును. వానినే నాశమను పదార్థముగా ఊహింపనగును. ఇదొక భావన. లేక– సుఖము కలుగగనే దుఃఖము పోవును. దుఃఖము కలుగగనే సుఖము పోవును. ఇట్లు ఒకటి యున్నపుడు దానికి విరుద్ధమైనది యుండదు. కాగా విరుద్ధమైన దానినే నాశమని (విరోధియగు దాని నాశము) చెప్పవచ్చును. ఇది వేరొక భావన. ఎట్లయినను నాశమన్నది ప్రత్యేకమైన ఒక పదార్థమని చెప్పవలెను. ఇది వస్తువుయొక్క చివరిదశను బోధించును. ''నశ్యతి'' అనునది నాశముయొక్క క్రియారూపము ''నాశః'' అనునది దానియొక్క ద్రవ్యరూపము. ॥30॥

*అవతారిక*— ''ఒక వస్తువును వేరొక వస్తువుయొక్క వినాశముగా గ్రహించు టెట్లు ?''– అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ నైవాస్తి నైవ నాస్తీతి వస్తునో గ్రహణాద్వినా ।**
**కల్పతే పరరూపేణ వస్త్వన్యదనుగమ్యతే ॥** 31

వస్తుః = ఒక వస్తువుయొక్క, గ్రహణాత్ = గ్రహణము, వినా = లేకుండ, అస్తి + ఇతి =

''అస్తి'' అనునది (ఉన్నది - అని), న + ఏవ + కల్పతే = కుదురదు, న + అస్తి + ఇతి = ''నాస్తి'' అనునదియు (లేదు - అని), న + ఏవ + కల్పతే = కుదురదు, పరరూపేణ= వేరొక వస్తువుయొక్క రూపముచే, అన్యత్ = వేరొక. వస్తు = వస్తువు, అనుగమ్యతే = తెలియబడును.

*తాత్పర్యము*— ఒక వస్తువును బట్టియే వేరొక వస్తువుయొక్క ఉనికినిగాని లేమినిగాని చెప్పుటకు వీలు కలుగును. ఇది వస్తుతత్త్వము. పూర్తిగా శూన్యరూపమైన అభావమును ఎన్నడును ఏ విధముగను గ్రహింపజాలరు కావున ఒక వస్తువు వేరొక వస్తువుయొక్క అభావముగా నిర్దేశింపవచ్చును.

*వివరణము*— భావమనగా సత్త -లేక- ఉనికి దీనికి ప్రతిద్వంద్వి అభావము. దీనిని భావమును బట్టియే అనుసంధానము చేయవలెను అనగా భావముయొక్క స్వరూపమును విడిచినచో అభావముయొక్క స్వరూపము స్పష్టపడదు. ఉదా : ఘటమున్నది. దీని యభావమును ఘటమును బట్టియే భావింపగలుగుదురు. అనగా ఘటాఽభావము ఘటరూపమే. ఇట్లే ప్రతియొక అభావమును ఆయా భావరూపమే యగును. భావమునుగూడ వస్తువుయొక్క రూపమును బట్టియే గ్రహింతురు. రూపమును వేరుచేసి వేరుగా వస్తువుయొక్క భావమును గుర్తించుట అసంభవము. కాగా "అస్తి" యనుటకుగాని, "నాస్తి" యనుటకుగాని ఏదోయొకి వస్తురూపము మానసికముగనైనను ఉండక తప్పదు. కావుననే ఒక వస్తువు మరియొక దాని యొక్క అభావము కావచ్చును.

*విశేషము*— మహాసత్తకైనను కృతకమైన రూపములను (బాహ్య రూపములు) భావింపనిచో అది సర్వశూన్యమే యగును. అట్టిది మనసునకుగాని వాక్కునకుగాని అందదు. అట్లయినపుడు లోకవ్యవహారము నడువదు. అందుచే వస్తువుల రూపముల ననుసరించియే భావాఽభావములను తెలియక తప్పదు. ॥31॥

*అవతారిక*— శూన్యమైన తావున దట్టమైన చీకటియందు చేతితో తడవుచు— ''ఏమియు లేదు'' అను అభావమును అనుభవింతురు. అచట వస్తువుయొక్క ప్రసక్తి లేదు గదా ! అయినను అభావము వస్తురూప మెట్లగును ;— అను శంకను త్రోసి పుచ్చుచున్నాడు.

**శ్లో॥ భావాభావౌ ఘటాదీనామస్పృశన్నపి పాణినా ।**
**కశ్చిద్వేదాఽప్రకాశేఽపి ప్రకాశే తత ఏవ వా ॥ 32**

ప్రకాశే = వెలుగునందును, వా = లేక. అప్రకాశే + అపి = చీకటియందును కూడ, కశ్చిత్ = ఒకానొకడు, పాణినా = చేతితో, అస్పృశన్ + అపి = తాకకున్నను, ఘటాదీనామ్ = ఘటము మొదలగు వానియొక్క, భావాఽభావౌ = భావాఽభావములను, తతః + ఏవ = ఆ వస్తువులను బట్టియే, వేద = తెలిసికొనును.

*తాత్పర్యము*— ఆయా వస్తువులయొక్క స్వరూపములు వేరే ప్రమాణములచే

ముందుగనే నిశ్చితములై యుండును. గాఢాంధకారమున గూడ చేతితో తాకకున్నను ఆ యా నిశ్చితములైన వస్తువులను బట్టియే వానియొక్క భావమునుగాని అభావమునుగాని గ్రహింప వీలగును. వెలుగు విషయమున వేరుగ చెప్పనక్కరలేదు. కావున ఒక వస్తువు వేరొక వస్తువు యొక్క అభావమగుటలో అనుపపత్తి లేదు.

వివరణము — వస్తువులయొక్క స్వరూప స్వభావములన్నియును ప్రమాణాంతరములచే గట్టిపడి మనసున హత్తుకొని యుండును. చికటిలో చేతికి తగులకుండుటచే ఆ యా వస్తువుల అభావమును వాని రూపమును బట్టియే భావింతుము. (ముందుగ తెలియని వస్తువైనచో దాని భావము విశదపడదు. అయినను "ఏదో ఒక అకారమ"ను జ్ఞానము మాత్రము కలుగును అదియు దాని రూపమును బట్టియే గదా ! అందువలన భావము వస్తురూపమైనట్లు అభావము కూడ వస్తురూపమే యగును. ॥32॥

అవతారిక — వేరొక మతము ప్రకారము జన్మమును నాశమును విశదీకరింపుచున్నాడు.

**శ్లో॥ వ్యాపి సౌక్ష్మ్యం క్వచిద్యాతి క్వచిత్సం హన్యతే పునః ।**
**అకుర్వాణోఽథవా కించిత్ స్వశక్త్యైవం ప్రకాశతే ॥ 33**

వ్యాపి = అంతటను వ్యాపించియుండు తత్త్వము, క్వచిత్ = ఒకచోట, సౌక్ష్మ్యమ్ = సూక్ష్మమగుటను, యాతి = పొందును, పునః = మరియు, కృచిత్ = వేరొకచోట, సంహన్యతే = స్వరూపమును పొందును, అథవా = లేక, కించిత్ = ఏమియు, అకుర్వాణః = చేయనిదై, స్వశక్త్యా = తన శక్తిచే, ఏవమ్ = ఇట్లు, ప్రకాశతే = ప్రకాశించును.

తాత్పర్యము — ప్రధానమను తత్త్వమొకటి యున్నది. దానినే "ప్రకృతి" యనియు నందురు. అది సర్వవ్యాపకము. సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు దాని స్వరూపము. ఒకప్పు డా ప్రకృతి సంకోచమును పొందును. ఈ అవస్థను "నశ్యతి" అను క్రియగను, "నాశః" అను ద్రవ్యముగను చెప్పుదురు. మరియొకప్పు డా ప్రకృతియే వికాసమును చెందును ఈ అవస్థను "జాయతే" అని క్రియగను, "జాతః" అని ద్రవ్యముగను వ్యవహరింతురు. ఈ సంకోచ వికాసములు అనెడు రెండు దశలును ప్రకృతియొక్క శక్తి విలాసములే.

వివరణము — ప్రకృతి సర్వశక్తి సంపన్నమనియును సర్వకారణమనియును సాంఖ్యు లందురు. తదనుసారము జన్మనాశములనునవి ప్రకృతియొక్క అవస్థాభేదములే తప్ప వేరు అంశములు కావు. ॥33॥

అవతారిక — పరబ్రహ్మమే అజ్ఞానవశమున క్రియా సామాన్యముగను క్రియా విశేషముగను తోచునని వేరొక మతమును చూపుచున్నాడు.

శ్లో॥ సర్వరూపస్య తత్త్వస్య యత్ క్రమేణేవ దర్శనమ్ ।
భాగైరివ ప్రక్ల్రృప్తిశ్చ తాం క్రియామపరే విదుః ॥ 34

సర్వరూపస్య = ఎల్ల రూపములునుగల, తత్త్వస్య = పరబ్రహ్మముయొక్క, క్రమేణ + ఇవ = క్రమమున్నట్లుగ, దర్శనమ్ = కనబడుటయు, భాగైః + ఇవ = భాగములున్నట్లుగ, ప్రక్ల్రృప్తిః + చ = కల్పనమును, యత్ = ఏది గలదో, తామ్ = దానిని, క్రియామ్ = క్రియనుగ, అపరే = మరికొందరు, విదుః = తెలియుదురు.

తాత్పర్యము— సర్వసృష్టికిని నిదానమగు తత్త్వమొకటే. దానినే ''సత్తు'' అనియు, ''బ్రహ్మము'' అనియు నందురు. అది సర్వశక్తి సంపన్నము. కాలము, దిక్కు మొదలగునవి ఆ సత్తుయొక్క మహాశక్తులు. అందు కాలమను శక్తినిబట్టి క్రమమును భాగములును తోచును ఇట్లు తోచు అంశమును క్రియ యందురు. దిక్కు, దేశము అను శక్తులను బట్టి సిద్ధరూపములు గోచరించును. వానిని ద్రవ్యములని చెప్పుదురు. ఇదంతయు అజ్ఞాన విలసితము. వస్తుతత్త్వమున ఎట్టి భేదములును ఎట్టి వ్యవహారములును లేవు

వివరణము— ఇది బ్రహ్మాద్వైతమతము. పరబ్రహ్మమే అజ్ఞానమువలన ప్రపంచముగ తోచుననియు, అది భ్రాంతియనియును, వాస్తవమున నామరూపములు లేవనియును దీని సారము. దీని ననుసరించి సాధ్యము, క్రమము, క్రియ, - సాధనము, అక్రమము, ద్రవ్యము మొదలగు వ్యవహారములన్నియును కేవలము భ్రాంతిజనితములని పర్యవసించును. పై కారిక పరిణామవాదమును చూపినది. ఒక వస్తువు వేరొక వస్తువుగా మారుట పరిణామమగును. ఉదా : పాలు పెరుగుగా మారుట. ప్రకృతియే ప్రపంచముగ మారుట ''పరిణామ'' మగును. కాగా క్రియ యననది ప్రకృతియొక్క పరిణామమని దీని ముందరి కారిక సూచించినది. ఈ కారిక వివర్తవాదమును విశదీకరించినది. భ్రాంతివలన ఒక వస్తువు వేరొక వస్తువుగా తోచుట ''వివర్తమ''గును. ఉదా : చీకటిలో త్రాడు పాముగా తోచుట. అట్లు బ్రహ్మమే ప్రపంచముగ తోచుట వివర్తమగును. కాగా ''క్రియ'' మొదలగు వ్యవహారములన్నియును బ్రహ్మ వివర్తములే యగును. ఇట్టి అద్వైత తత్త్వమే వైయాకరణులకు అభీష్టము. ॥34॥

అవతారిక— ''సత్తయే సర్వ వ్యవహారములకును నిదాన''మని ఉపసంహరింపుచున్నాడు.

శ్లో॥ సత్తా స్వశక్తియోగేన సర్వరూపా వ్యవస్థితా ।
సాధ్యా చ సాధనం చైవ ఫలం భోక్తా ఫలస్య చ ॥ 35

సత్తా = సత్తయే, స్వశక్తియోగేన = తన శక్తుల సంబంధముచే, సర్వరూపా = సకలమైన రూపములును గలదిగ, వ్యవస్థితా = ఉన్నది. సాధ్యా + చ = సాధ్యమనియును, సాధనమ్ + చ + ఏవ = సాధనమనియును, ఫలమ్ = ఫలమనియును, ఫలస్య = ఫలముయొక్క, భోక్తా + చ = భోక్తయనియును, (కథ్యతే = చెప్పబడును).

గామాలభేత (గోవును చంపి యజ్ఞముచేయవలెను) మున్నగు వాక్యములలో గోశబ్దముఅశ్వత్వజాతిని బోధింపదు. నియతమగు జాతియే గోవుచే నభివ్యక్తమగును. కనుక గోత్వజాతియే భాసించును, అశ్వత్వజాతి భాసింపదు. కనుక జాతులు సార్వత్రికము లైనను నియతకార్యములు జరుగగలవు. ॥44॥

అవతారిక—జాతులు ప్రాణులయందేకాక అప్రాణులయందుగూడ ఉండును. కనుకనే అవి సార్వత్రికములనుట యుక్తమగుచున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ చిత్రాదిష్వప్యభివ్యక్తిర్జాతీనాం కైశ్చిదిష్యతే।
ప్రాణ్యాశ్రితాస్తు తాః ప్రాప్తౌ నిమిత్తం పుణ్యపాపయోః॥ 45

కైశ్చిత్ = కొందరిచే, చిత్రాదిషు + అపి = చిత్రములయందు బొమ్మలయందుగూడ జాతీనామ్ = జాతులకు, అభివ్యక్తిః = స్పష్టత, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

గోత్వజాతి ప్రాణులయందేకాక ఆవుయొక్క ఆకారముతోనున్న చిత్రమును జూచిన, ఒకబొమ్మనుజూచిన, వ్యక్తము కాగలదు. అనగా అచటను ఆ జాతి కలదని కొందరునమ్ముచున్నారు.

తు = విశేషమేమనగా, ప్రాణ్యాశ్రితాః = ప్రాణులను ఆశ్రయించిన, తాః = ఆజాతులు, పుణ్యపాపయోః = పుణ్యపాపములయొక్క, ప్రాప్తౌ = పొందుటయందు, నిమిత్తమ్ = కారణము, (భవన్తి) = అగుచున్నవి.

గోవును చంపినపాపము. గోవునకు ఆహారముపెట్టినపుణ్యము అనిధర్మశాస్త్రము చెప్పుచున్నది. గోత్వజాతి ప్రాణులయందు అప్రాణులయందును ఉన్నను, ప్రాణులయందున్న జాతియే పుణ్యపాపములకు కారణము.

కాబట్టి లోకవ్యవహారము అసంకీర్ణముగానే జరుగును.

*విశేషాంశము*—అప్రాణులయందు ఆకారమాత్రమున్నను అచట గోత్వాదిజాతి ఉండనేరదు. అచటజాతి సమవాయ సంబంధముననుండుట కవకాశము. ఈయర్థము కారికలో 'కైశ్చిత్' అనుపదము వ్యక్తపరుచు చున్నది. ఈ యంశమును హేలారాజు వ్యక్తపరచెను. ॥45॥

అవతారిక—శబ్దములకు, అర్థములకు సంబంధమును ఎరుగని వానికి "గోత్వము అశ్వాదులనుండి వ్యావృత్తమై కేవలము గోవులయందే ఉన్నది" అను జ్ఞానము ఎట్లుకలుగును? గోవ్యక్తుల వలన నభివ్యక్తమగును అని యంగీకరించిన, అజ్ఞునకు కూడ ఆ జ్ఞానము కలుగవలెను. కాని యట్లులేదు

ఇతరులు చెప్పగా ఆ జ్ఞానము కలుగును. అనినచో ఆ చెప్పినవారికి ఆ జ్ఞానమెట్లుకలిగెను? అను ప్రశ్నకలుగును. అతనికిమరియొకడు చెప్పెను, అనిన అచటను

తాత్పర్యము— సృష్టిలో కనబడు వస్తు సముదాయమునకును దానికి సంబంధించిన సకల వ్యవహారములకును మూలము సత్తయే. "సత్" (ఉన్నది) అను జ్ఞానమంతటను ఎడతెగక ఉండును. అది సర్వశక్తి సంపన్నము. ఆ శక్తులవలననే సత్త ఒకటియేయైనను వివిధములుగ భాసించును. సాధ్యము, (క్రియ), సాధనము (ద్రవ్యము), ఫలము, భోక్త (ఫలము ననుభవించువాడు) మొదలగునవన్నియును సత్తయొక్క ఔపాధిక భేదములే (ఆయా దేశకాల పాత్రముల ననుసరించి ఏర్పడునవి. దేశకాలాదులును వాస్తవమున కల్పితములే).

వివరణము— వ్యావహారికముగ క్రియా లక్షణము నెన్ని విధములుగ చూపినను పారమార్థికముగ "సత్తయే క్రియ"యని ఇచటి తత్త్వము. క్రియ విషయముననే గాక మిగిలిన అన్ని విషయములందును గూడ పరమార్థ మిదియేయని, "తాం ప్రాతిపదికార్థం చ ధాత్వర్థం చ ప్రచక్షతే", "సైవ భావవికారేషు షడవస్థాః ప్రపద్యతే" (జాతి సముద్దేశము-35 కా) మొదలగు వచనములతో గ్రంథకర్త పెక్కుసారు లిదివరకే ప్రతిపాదించెను. బ్రహ్మాద్వైతమన్నను సత్తాద్వైతమన్నను, మరియే అద్వైతమన్నను తాత్పర్య మొకటే. "ఒకటియే అనేకముగ తోచును" అన్నది ఆ తాత్పర్యము. ॥35॥

అవతారిక— సాధన సముద్దేశమందు ఇదివరకు చూపిన క్రియా లక్షణమును గుర్తుచేయు చున్నాడు.

శ్లో॥ క్రియామన్యే తు మన్యంతే క్వచిదప్యన పాశ్రితామ్ ।
సాధనైకార్థకారిత్వే ప్రవృత్తిమనపాయినీమ్ ॥ 36

అన్యే + తు = మరికొందరైతే, కృచిత్ + అపి = ఎచటను, అనపాశ్రితామ్ = ఆధారపడనటువంటిన్ని, అనపాయినీమ్ = నాశములేని, సాధనైకార్థకారిత్వే = సాధనములతో కలిసి ఒక ఫలమును సాధించుట కుపయోగించు, ప్రవృత్తిమ్ = ప్రవృత్తిని (వ్యాపారమును), క్రియామ్ = క్రియనుగ, మన్యంతే = తలంతురు.

తాత్పర్యము— నిత్యమైనట్టియు స్వతంత్రమైనట్టియు ఒక శక్తి సాధనముల ద్వారమున ఫలమును సాధించును. అది సాధనముల ప్రవృత్తిరూపమున గోచరించును.

వివరణము— "ప్రవృత్తిరేవ ప్రథమం క్వచిదప్య న పాశ్రితా" అను సాధన సముద్దేశమందలి కారిక (సాధన. 33. కా.) ప్రతిపాదించిన క్రియాలక్షణ మిచట పరామర్శింపబడెను. ॥36॥

అవతారిక— "నిత్యమైన శక్తి సాధ్యమెట్లగును?" అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

శ్లో॥ సామాన్యభూతా సా పూర్వం భాగశః ప్రవిభజ్యతే ।
తతో వ్యాపారరూపేణ సాధ్యేవ వ్యవతిష్ఠతే ॥ 37

పూర్వమ్ = మొదట, సామాన్యభూతా = సామాన్యముగ నుండు, సా = ఆ శక్తి, భాగశః = భాగములుగ, ప్రవిభజ్యతే = విభజింపబడును. తతః = తరువాత, వ్యాపార రూపేణ = వ్యాపారముల స్వరూపముచే, సాధ్యాఇవ = సాధ్యమైనట్లుగ, వ్యవతిష్ఠతే = ఉండును (కనిపించును).

తాత్పర్యము— వాస్తవముగ శక్తి నిత్యమే సాధ్యము కాదు. ఎట్టి విభాగములును దానికి లేవు. అయినను ఆ శక్తి, సాధనములనుండి ప్రసరించునపుడు, సాధనముల భేదమును బట్టి భిన్నముగ (భేదములు గలదిగ) కనిపించును. కావుననే వ్యాపారముగ గోచరించినపుడు సాధ్యముగ కూడ భావింపబడును.

వివరణము— అవిభక్తమగు శక్తి సాధనముల భేదమును బట్టి విభక్తమైనట్లును సాధ్యమైనట్లును అనిపించును. తదనుసారమే వంట, నడక మొదలగు వ్యాపారములన్నియు వేర్వేరుగ తోచును. కాగా సామాన్యావస్థయందు నిత్యమైన శక్తినే విశేషావస్థయందు "వ్యాపారమనియు సాధ్యమని"యును వ్యవహరింతురని ఫలించును. "కారకాణాం ప్రవృత్తి విశేషః క్రియా" (సాధనముల వ్యాపారమే క్రియ) అను పతంజలి వచనముయొక్క తాత్పర్యమిదియే. ॥37॥

అవతారిక— పై విషయముననే రెండు మతములను చూపుచున్నాడు.

**శ్లో॥ ప్రకృతిః సాధనానాం సా ప్రథమం తచ్చ కారకమ్ ।**
**వ్యాపారాణాం తతోఽన్యత్వమపరైరుప వర్ణ్యతే ॥ 38**

సా = నిత్యమైన ఆశక్తి, సాధనానామ్ = కారకములైన ద్రవ్యముల శక్తులకు, ప్రకృతిః = మూలము, తత్ + చ = అదియె, ప్రథమమ్ = మొదటిదగు, కారకమ్ = కారకము, (భవతి = అగును), తతః = ఆ శక్తికన్న, వ్యాపారాణామ్ = వ్యాపారములకు, అన్యత్వమ్ = భేదము, అపరైః = మరి కొందరిచే, ఉపవర్ణ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— సనాతనమైన శక్తియే సకల సాధనములకును ఆ యా శక్తిని ప్రసాదించును. అది లేనిదే సాధనములకు శక్తియే ఉండదు. కావున వాస్తవమైన కారకమా శక్తి యొకటే అయినను సాధనముల భేదము ననుసరించి దానికిని కొందరు భేదము నాపాదింతురు. "మూలమైన శక్తి వేరనియు దానివలన ప్రసరించు వ్యాపారములు వేరనియును" మరికొంద రందురు.

వివరణము— మూల భూతమగు శక్తి సామాన్యము. ద్రవ్యముల శక్తులు విశేషములు. "అవస్థనుబట్టి భేదముకాని వాస్తవమున రెండును ఒకటే" అని ఒక మతము. "రెండును వేర్వేరు" అని రెండవ మతము. ॥38॥

అవతారిక— కాగా "ఒకటే అయినను వేర్వేరుగ తోచు శక్తి క్రియ" అని తేలినది. అట్టి క్రియను ఆఖ్యాతము (తిఙ్ ప్రత్యయాంతము) బోధించునందురు. ఆఖ్యాతము

బోధించు అంశములు కారకము, సంఖ్య, కాలము, పురుషము మొదలగునవియు పెక్కు లున్నవి గదా! అయినపుడు "ఆఖ్యాతము క్రియనే తప్పక బోధించున"నుట ఎట్లు పొసగును అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

శ్లో॥ బహూనాం సంభవేఽర్థానాం కేచిదేవోప కారిణః ।
సంసర్గే కశ్చిదేషాం తు ప్రాధాన్యేన ప్రతీయతే ॥ 39

బహూనామ్ = పెక్కు, అర్థానామ్ = అంశముల యొక్క, సంభవే = ఉనికియందు, సంసర్గే = సంబంధ మేర్పడగా, కేచిత్ + ఏవ = కొన్ని అంశములే, ఉపకారిణః = సాయము చేయునవియై, (భవంతి = అగును), ఏషామ్ = వీనిలో, కశ్చిత్ + తు = ఒక అంశమైతే, ప్రాధాన్యేన = ముఖ్యముగా, ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్యము— పెక్కు అంశము లొకచో కూడినపుడు వానికొక సంబంధమును చెప్పక తప్పదు. సంబంధము లేనిచో వాని సమావేశమునకు ప్రయోజనముండదు. అట్లు సంబంధము కుదిరినపుడు ఆ యంశములలో ఏదో ఒక అంశము మాత్రమే ఉపకారమును పొందునదియై ముఖ్యమగును. మిగిలినవన్నియు ముఖ్యమైన దానికి సాయముచేయుచు అప్రధానము లగును.

వివరణము— సంబంధమన్నది ఒకటి ఏర్పడినపుడు ఆ సంబంధమునకు లోనైన అంశము లన్నిటికిని సమప్రాధాన్య మెన్నడును కుదురదు ఒకటి ప్రధానమై మిగిలినవి అప్రధానమగుట సహజమైన విషయము. అందుచే ఆఖ్యాతము క్రియను ముఖ్యముగ తెలుపుటయు, కారకము మొదలగునవి అచట అప్రధానములగుటయును సంభవించును. ॥39॥

అవతారిక— మీది కారిక చెప్పిన యంశమునే ప్రకృతమున సమన్వయము చేయుచున్నాడు.

శ్లో॥ సాధ్యత్వాత్తత్ర చాఖ్యాతై ర్వ్యాపారాః సిద్ధసాధనాః ।
ప్రాధాన్యేనాఽభిధీయంతే ఫలేనాఽపి ప్రవర్తితాః ॥ 40

తత్ర + చ = వానిలోనయితే, సిద్ధసాధనాః = సిద్ధమైన కారకములు గలవియు, ఫలేన + అపి = ఫలముచే గూడ, ప్రవర్తితాః = ప్రవర్తింపజేయ బడిన, వ్యాపారాః = క్రియలు, సాధ్యత్వాత్ = సాధ్యములగుట వలన, ఆఖ్యాతైః = తిజంతములచే, ప్రాధాన్యేన = ముఖ్యముగా, అభిధీయంతే = చెప్పబడును.

తాత్పర్యము— తిజంతమువలన క్రియ, కారకము, కాలము, సంఖ్య, పురుషము మొదలగు పెక్కు అంశములు తెలిసినను వానిలో క్రియయే ముఖ్యమగును. మిగిలినవన్నియు ముఖ్యమైన క్రియకు సాయముచేయుచు అప్రధానములగును. ఫలము కూడ క్రియకు అంగముగానే భావింపబడును. అట్టి క్రియ ఏదయినను "ఒకటియె" అనుట తత్త్వము.

వివరణము— ''పచతి'' అను దాని నుదాహరణముగా తీసికొనవచ్చును. ఇచట ''వండువాడు'', అను కర్తయు, ''అతడొకడే'' అను సంఖ్యయు, ''వర్తమానము'' అను కాలమును, ''అతడు'' అను పురుషమును, ''వంట'' అను క్రియయు ఒక పదమువలననే తెలియును. అయినను ''వంట'' అను క్రియయె ముఖ్యమని వైయాకరణుల సిద్ధాంతము. సాధింపదగిన పని ''వంట''యె కావున అది ప్రధానమగుటయు, మిగిలినవి ఏదోయొక విధముగ వంట కుపకరించునవి గాన అప్రధానములగుటయును న్యాయమే యగును.

విశేషము— క్రియను నిర్వర్తించు కారకము సిద్ధముగనే యుండునుగాన అది సాధ్యము కానేరదు. సంఖ్యయు, పురుషమును కారకమునకు చెందునుగాని సాక్షాత్తుగ క్రియకు చెందవు. క్రియ జరుగు సమయము వెల్లడి అగుటయే కాలమగును. ఇట్లే యంశములన్నియును క్రియకు అంగములే యగును. క్రియయే లేకున్నచో ఇవన్నియు వ్యర్థములుగా భాసించును. అట్లే తిజంతము ఫలమును గూడ అప్రధానముగనే బోధించును. వాస్తవమున ఏ క్రియ అయినను ఫలముకొరకే ప్రవర్తించినను, ఆ యా క్రియను చెప్పునపుడదియే ముఖ్యమగుట సమంజసము. క్రియవలననే ఫలము పుట్టుటయు, ఫలము నుద్దేశించి ''ఇట్లు చేయుము'' ''అట్లు చేయుము'' అని క్రియనే సూచించుటయును లోకమున అనుభవసిద్ధము. కాగా క్రియ ముఖ్యమగుటయు ఒకటే అగుటయును సిద్ధించును. కావుననే ''ఏకా క్రియా'' (క్రియ ఒకటే) అని శాస్త్రజ్ఞు లందురు. ॥40॥

అవతారిక— క్రియ ఒకటియే అయినచో ''పంచకృత్వః పచతి'' (అయిదు మారులు వండుచున్నాడు) మొదలగు ప్రయోగము లెట్లు కుదురును ? - అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

**శ్లో॥ ఏకత్వావృత్తి భేదాభ్యాం భేదాభేద సమన్వయే ।**
**సంఖ్యాస్తత్రోపలభ్యంతే సంఖ్యేయావయవ క్రియాః ॥ 41**

తత్ర = ఆ క్రియయందు, ఏకత్వా వృత్తి భేదాభ్యామ్ = ''ఏకత్వము'', ''ఆవృత్తి'' యను భేదముల వలన, భేదాభేద సమన్వయే = భేదమును అభేదమును గూడ సంభవింపగా, సంఖ్యేయావయవ క్రియాః = లెక్కింప వీలయిన అవయవ క్రియలుగల, సంఖ్యాః = సంఖ్యలు, ఉపలభ్యంతే = పొందబడును.

తాత్పర్యము— క్రియ ఒకటియే. అయినను దానికి ఆవృత్తిని (మరల మరల జరుగుట) చూపవచ్చును. ఇట్లు ఒకటియగుట వలన అభేదమును ఆవృత్తి కవకాశముండుట వలన భేదమును క్రియయందు భావించినచో, ''పంచకృత్వః పచతి'' మొదలగు ప్రయోగములు ఉపపన్నము లగును. అనగా ''పచతి'' అను ఆఖ్యాతము క్రియయొక్క ఏకత్వమును ''పంచకృత్వః'' అను పదము దాని ఆవృత్తులకు చెందిన సంఖ్యాభేదమును తెలియజేయును.

వివరణము— విడిగా ఏ క్రియను తీసికొన్నను దానికి ''ఫల మొకటే'' అనియు

''కర్తయు ఒకడే'' అనియు భావించి ''క్రియ ఒకటి'' అని యనుచుందురు. ఉదా ; వంట, నడక, వ్రాత మొదలగు క్రియ ''పచతి'' (వండుచున్నాడు), ''పచతః'' (ఇరువురు వండు చున్నారు), ''పచంతి'' (పలువురు వండుచున్నారు), మొదలగు చోట్ల తిజ్ ప్రత్యయముల వలన తెలియు సంఖ్యాభేదము కర్తకు చెందునదేగాని క్రియకు చెందునది కాదు. కాగా ప్రవాహ రూపమైన క్రియ ఒకటిగానే కనబడును. అయినను ఆవృత్తిని బట్టి క్రియయందు భేదము నూహింపవలెను. ఇట్లు భేదమును అభేదమును కూడ అవలంబించినందువలన ''పంచకృత్వః-పచతి - పచతః - పచంతి'' మొదలగు ప్రయోగములు కుదురును. వీనిలోని తిజంతము క్రియకు చెందిన ఏకత్వమును, సంఖ్యావాచకము ఆవృత్తికి చెందిన సంఖ్యయొక్క భేదమును తెలియజేయును.

విశేషము— (1) మాటిమాటికిని ఒక పని జరుగుట ''ఆవృత్తి'' అగును. క్రియ యొక్క ఆవృత్తిని తెలియజేయునపుడు సంఖ్యావాచకమునకు కృత్వస్, స్ మొదలగు ప్రత్యయములు చేరును. ''పంచకృత్వః'' ''షట్ కృత్వః'', ''ద్విః'' (రెండు మారులు), ''త్రిః'' (మూడు మారులు) మొదలగునవి ఉదాహరణములు.

(2) ''పాకః, పాకౌ, పాకాః''. ఇచట ''పాక'' శబ్దము కృత్ప్రత్యయాంతము. వంటయొక్క సిద్ధావస్థను ఇది తెలియజేయును. కావున కారకముతోడి సంబంధముండదు. కావుననే దీనికి సంఖ్యాయోగము కుదురును (ఒక పాకము, రెండు పాకములు మొదలగు రీతి). ''సాధ్యమైన క్రియకు సంఖ్యాయోగము సహజము కాదు. సిద్ధమైన ద్రవ్యమున కది సహజము'' అనునది సారాంశము.

(3) తిజ్ ప్రత్యయము సాధ్యావస్థను, కృత్ప్రత్యయము సిద్ధావస్థను బోధించుట రూఢము (ప్రసిద్ధము). ॥41॥

*అవతారిక*— ''పాకః'' మొదలగుచోట్ల ''పచ్యాది క్రియ సిద్ధముగనే ప్రతిపాదింప బడినచో పెక్కు చిక్కులు కలుగున''ని విశదీకరింపుచున్నాడు.

**శ్లో॥ సిద్ధస్యార్థస్య పాకాదేః కథం సాధనయోగితా ।**
**సాధ్యత్వే వా తిజంతేన కృతాం భేదోన కశ్చన ॥ 42**

సిద్ధస్య = సిద్ధమైన, చేయ నావశ్యకత లేని) పాకాదేః = పాకము మొదలగు. అర్థస్య = ...యమునకు, సాధనయోగితా = కారకములతో సంబంధము, కథమ్ = ఎట్లు (భవతి = ...ను), వా = లేక, సాధ్యత్వే = సాధ్యమైనచో, తిజంతేన = తిజంతముతో, కృతామ్ = ...ంతములకు, కశ్చన = ఏ విధమైన, భేదః = భేదము, న = లేకపోయెడిని.

తాత్పర్యము— సిద్ధమైన విషయమునకు కారకము లక్కరలేదు. సాధ్యమే అయినచో తిజంత రూపమునకును కృదంత రూపమునకును భేదము లేకపోవును కావున ''పాకః'' మొదలగు కృదంతము సిద్ధావస్థను, ''పచతి'' మొదలగు తిజంతము సాధ్యావస్థను తెలుపునని విభాగమును చేసికొనవలెను.

*వివరణము*— తి, తః, అంతి మొదలగునవి తిజ్ ప్రత్యయములు. ఇవి ధాతువులకు చేరి ఆయా క్రియయొక్క సాధ్యావస్థను తెలుపునని ఇదివరకే ప్రతిపాదింపబడినది. 'తృ, తి, ఘఞ్ (అ)' మొదలగునవి కృత్ ప్రత్యయములు. ఇవియు ధాతువులకే సూటిగా చేరును. కర్త, కర్మ, భావము (కేవలము ధాతువుయొక్క అర్థము) మొదలగు అర్థములను ఇవి బోధించును. ఉదా : కర్తృ, కృతి, కారక మొదలగునవి. కాగా కృత్ప్రత్యయములు అంతమందు గల రూపములు సిద్ధమైన అర్థమునే తెలుపును. ఇట్లు తిజంతములకును కృదంతములకును భేదము సిద్ధించును తిజంతములు కూడ క్రియయొక్క సిద్ధావస్థనే తెలుపుచున్నచో ఇట్టి భేదము సిద్ధింపకపోవును. క్రియ సిద్ధమైనపుడు దానిని సాధించుటకై వేరుగ కారకములును వ్యర్థములయ్యెడిని. ''దేవదత్తః పచతి'' అనునట్లు ''దేవదత్తః పాకః'' అను ప్రయోగము యొక్క వాడుకగాని అవసరముగాని లేదుగదా.

*విశేషము*— ''ఘఞ్'' అను ఒక కృత్ప్రత్యయ మున్నది. ఇది సామాన్యముగ భావార్థమున ప్రవర్తించును. పచ్ ధాతువునకీ ప్రత్యయము చేరినచో ''పాక'' అను రూపమగును. ''వంట'' అను క్రియా భావమే దీనివలన బోధపడును ఇట్టి కృదంతముల స్వభావమును స్పష్టపరచుటకు ఈ ఘట్ట మారంభింపబడినది. ' కృదంతములు క్రియయొక్క సిద్ధావస్థను తిజంతములు క్రియయొక్క సాధ్యావస్థను బోధించుననుట'' ఇచటి సారము.

మరియు— ''కర్తృ కర్మణోః కృతి'' (2-3-65) అను సూత్ర మొకటియున్నది. ''కృత్ప్రత్యయాంతమును వాడినపుడు కర్తృవాచకమగు పదమునకును. కర్మవాచకమునకును షష్ఠి యగును'' అని దీని యర్థము. ''కృష్ణస్య కృతిః'' (కృష్ణుడు కర్తగాగల పని), ''జగతః కర్తా'' (జగమునకు కర్త, మొదలగునవి ఉదాహరణములు. ఈ సూత్రము ననుసరించి ''పాకః'' అను కృదంతమును వాడినచో కర్తృపదమునకు షష్ఠి రావలయును. (''దేవదత్తస్య పాకః'' మొదలగు రీతి). కాగా ''పాకః'' మొదలగు కృదంతములు సిద్ధావస్థను తెలుపునన్నచో, కారకముల సంబంధమే కుదురదుగాన, కృదంతయోగమున కర్తృ కర్మలకు షష్ఠిని విధించు ఈ సూత్రము అసంగతము కావలసి వచ్చును. ఇదొక చిక్కు. అట్లుగాక కృదంతము కూడ సాధ్యత్వమునే తెలుపునన్నచో కృత్తులకును తిఙ్గునకును భేదమే లేకపోయెడిని. ఇది వేరొక చిక్కు. (వీనిని పరిహరించు ఉపాయములు దిగువ కారికలలో చూపబడును).
॥42॥

*అవతారిక*— ''కర్తృ కర్మణోః కృతి'' (2-3-65) అను సూత్రమునకు తిజంతము విషయము కానే కాదని ప్రతిపాదింపుచున్నాడు.

**శ్లో॥ తత్ర కారకయోగయా యద్వ్యాఖ్యాతం నిబంధనమ్ ।**
**షష్ఠ్యాః సాలేన సంబంధే వ్యదస్తా కర్తృ కర్మణోః ॥ 43**

తత్ర = అచట, కారకయోగాయాః = కారకములకు ప్రవర్తించు, షష్ఠ్యాః = షష్ఠీ విభక్తికి, ఆఖ్యాతమ్ = తిజ్ ప్రత్యయము (తిజ్ ప్రత్యయాంతము), నిబంధనమ్ = నిమిత్తము,

యది = అగుచున్నచో, సా = ఆ షష్ఠి, లేన = లకారముతో, సంబంధే = సంబంధ మున్నపుడు. కర్తృ కర్మణోః = కర్తృ కర్మలకు, వ్యుదస్తా = నిషేధింపబడినది.

తాత్పర్యము— "కర్తృ కర్మణోః కృతి" అను సూత్రము విధించు షష్ఠికి తిఙంతము నిమిత్తము కాదు. నిమిత్తమని యంగీకరించినను, లకారము యొక్క ఆదేశములను (తిఙ్ ప్రత్యయములను) వాడినపుడు ఆ షష్ఠి రాదని ప్రత్యేకముగ నిషేధమున్నది.

వివరణము— "ఆఖ్యాత" అను పదమును తిఙ్ ప్రత్యయమును బోధించునదిగా వాడుదురు. కొన్నిచోట్ల "తిఙంతము" అను నర్థమున గూడ దీనిని ప్రయోగింతురు. పై సూత్రమున "కృతి" అని స్పష్టముగ నున్నందున తిఙంతము అచట నిమిత్తము కాదనియే తెలియును. నిమిత్తమని అంగీకరించినను "న లోకావ్యయనిష్ఠా ఖలర్థతృనామ్" (2-3-69) అను సూత్రము, తిఙంతముతో యోగ మున్నపుడు కర్తృ కర్మలకు షష్ఠి రాదని నిషేధించినది. కాగా "కృదంతముతో యోగ మున్నపుడు కర్తృ కర్మలకు షష్ఠిని విధించుట" వలన సిద్ధమైన పాకాదులకు సాధనయోగమును సూత్రకారు డంగీకరించినట్లు స్పష్టమగును. కాని అది ప్రసిద్ధమైన యనుభవమునకు విరుద్ధము.

విశేషము— "లకారము యొక్క ఆదేశములను ఉ, ఉక మొదలగు కృత్ప్రత్యయములను వాడినపుడు కర్తృ కర్మలకు షష్ఠి రాదు" అని "న లోకావ్యయ" మొదలగు సూత్రమున కర్థము. తిఙ్ ప్రత్యయములును, శతృ, శానచ్ మొదలగు కొన్ని కృత్ప్రత్యయములును లకారము యొక్క ఆదేశములు. సిద్ధాంతమున ఇచట కూడ కృత్ప్రత్యయములే (శతృ, శానచ్ మొదలగునవి) లాదేశము లగును. అయినను తిఙ్లను గూడ లాదేశములుగా చెప్పనగును గాన అట్టి భావముతో ఈ కారిక బయలుదేరినది. ధాతు రూపముల ప్రక్రియలో మొట్టమొదట చూపబడు లట్, లిట్, లుట్ మొదలగునవి లకారము లనబడును. వానికి తిఙ్ ప్రత్యయము లాదేశములుగ చూపబడును. ॥43॥

అవతారిక— "పాకః" మొదలగుచోట్ల సాధ్యత్వము నంగీకరించి (పచ్యాది క్రియకు) కారకములతోడి సంబంధమును, సిద్ధత్వమును గూడ నంగీకరించి సంఖ్యాయోగమును (ఏకః, ద్వౌ మొదలగు సంఖ్యల సంబంధము) చెప్పగూడదా ? - అను శంకను త్రోసిపుచ్చుచున్నాడు.

శ్లో॥ ఏకాభిధాన ఏకోఽర్థో యుగపచ్చ ద్విధర్మభాక్ ।
న సంభవతి సిద్ధత్వే స సాధ్యః స్యాత్ కథం పునః ॥ 44

ఏకాభిధానః = ఒక శబ్దముచే బోధింపబడు, ఏకః = ఒక, అర్థః = అర్థము, యుగపత్ + చ = ఒకే సమయమున, ద్విధర్మభాక్ = రెండు ధర్మములు గలదై, న + సంభవతి = ఉండదు, సః = ఆ యర్థము, సిద్ధత్వే = సిద్ధమైనపుడు, పునః = మరల, సాధ్యః = సాధ్యమై, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును ?

తాత్పర్యము— ఒక శబ్దము తెలుపు అర్థమునకు ఒకే సమయమున రెండు ధర్మము లుండవు. సిద్ధమైన విషయము సాధ్యము కూడ ఎట్లగును?

వివరణము— ''పాకః'' అను శబ్దము సిద్ధావస్థను మాత్రమే తెలుపును. ''పచతి'' అనునది సాధ్యావస్థను మాత్రమే తెలుపును. కాగా ''పాకః'' మొదలగు కృదంతములలో అనుభూతమగు కారక సంబంధమును సంఖ్యా సంబంధమును (ఒకే సమయమున - దేవదత్తస్య - పాకః, పాకౌ, పాకాః మొదలగు ప్రయోగములు) అనుపపన్నము కాక తప్పదను పక్షమట్లే మిగిలినది. ॥44॥

అవతారిక— ''పాకః'' మొదలగుచోట్ల రెండు శబ్దములను కల్పించి, సిద్ధసాధ్య రూపమైన రెండర్థములను కూడ ఒకేసారి సంపాదింపవచ్చునని చెప్పుటకు ప్రారంభింపు చున్నాడు.

శ్లో॥ ఏతావత్ సాధనం సాధ్యమే తా వదితి కల్పనా।
శాస్త్రఏవ న వాక్యేఽస్తి విభాగః పరమార్థతః ॥ 45

సాధనమ్ = సాధనము, ఏతావత్ = ఇంతటిది —లేక— ఇట్టిది, సాధ్యమ్ = సాధ్యము, ఏతావత్ = ఇట్టిది, ఇతి = అను, కల్పనా = కల్పనము, శాస్త్రే + ఏవ = వ్యాకరణశాస్త్రమందే, అస్తి = కలదు, పరమార్థతః = వాస్తవముగ, వాక్యే = వాక్యమందు, విభాగః = విభాగము, న + అస్తి = లేదు

తాత్పర్యము— ప్రక్రియకొరకు అపోద్ధారమును (విడమరచి చూపుట) అవలంబించి ''ఇది సాధ్యము - ఇది సాధనము'' అను విభాగమును వ్యాకరణము చూపును. అది వాస్తవము కాదు. అఖండమగు వాక్యమే సత్యము.

వివరణము— ''వాక్యము సత్యము. విభాగములన్నియు అసత్యములు'' అనునది శబ్దశాస్త్ర రహస్యము. ఇది ఆయా సందర్భములలో తరచు గుర్తు చేయబడుచుండును. ప్రకృతమున - కల్పితమగు సాధ్యసాధన విభాగము నాశ్రయించినచో ''పాకః'' మొదలగు కృదంతములలో సిద్ధసాధ్య రూపములగు విరుద్ధార్థములు రెండును ఒకేసారిగ (ఒక శబ్దము వలననే) సిద్ధించుట కవకాశమున్నది. ఉదా: ''పాకః = పచ్ + అ''. ఇచట ధాతువు సాధ్యమైన క్రియను, ప్రత్యయము సిద్ధమైన కారకమును (ద్రవ్యమును) బోధించును. ఇట్లు రెండవయవములను కల్పించి రెండర్థములను గూడ సంపాదింపవలెను. సహజమైన ఈ తీరునే శాస్త్రము కృతకముగ విశదీకరించునని ఫలించును. ॥45॥

అవతారిక— శాస్త్రముచేయు సాధ్యసాధన విభాగమును విశదీకరింపు చున్నాడు.

శ్లో॥ ఆఖ్యాత శబ్దే భాగాభ్యాం సాధ్యసాధన వర్తితా।
ప్రకల్పితా యథా శాస్త్రే స ఘఞాదిష్వపి క్రమః ॥ 46

ఆఖ్యాతశబ్దే = తిజంతమైన పదమందు, భాగాభ్యామ్ = అవయవములకు, సాధ్యసాధనవర్తితా = సాధ్యమును సాధనమును బోధించుట, శాస్త్రే = శాస్త్రమందు, యథా = ఎట్లు, కల్పితా = కల్పింపబడినదో, సః = ఆ, క్రమః = తీరు, ఘఞాదిషు + అపి = ఘఞ్ మొదలగు కృత్ప్రత్యయముల విషయమందును, (కల్పితః = కల్పింపబడినది .

తాత్పర్యము— "పచతి" మొదలగునవి తిజంతములు. ఇచట ధాతువు సాధ్యమైన క్రియను బోధించుననియు, ప్రత్యయము కారకము మొదలగు వానిని బోధించుననియును శాస్త్రము చెప్పును. ఇదే తీరును "పాకః" మొదలగు కృదంతరూపముల విషయములో గూడ అవలంబింపవలెను.

వివరణము— ధాతు భాగము అన్నిచోటులందును ఎల్లపుడును క్రియనే తెలుపును (ఉదా : పచతి, పచ్యతే, పాకః, పక్తా మొదలగునవి). ప్రత్యయభాగము కారకము, సంఖ్య, కాలము మొదలగు అంశములను నియతముగ చెప్పును. (ఉదా : తి, (కర్త) తే, (కర్మ) ఘఞ్ = అ, (భావము మొదలగునవి). కాగా ఒకే పదమున రెండు భాగములను కల్పించి రెండర్థములను సంపాదించుట శాస్త్రీయమైన కృత్యమే.

అవతారిక — ఇట్లుండ కృదంతములగు పదముల విభాగములో గల విశేషమును వక్కాణింపు చున్నాడు.

శ్లో॥ సాధ్యత్వేన క్రియా తత్ర ధాతురూప నిబంధనా ।
సత్త్వ భాగస్తు యస్తస్యాః స ఘఞాదినిబంధనః ॥ 47

తత్ర = అచట (కృదంతములయందు), క్రియా = క్రియ, సాధ్యత్వేన = సాధ్యముగా, ధాతురూప నిబంధనా = ధాతు భాగముచే తెలియబడునది, (భవతి = అగును), తస్యాః = ఆ క్రియయొక్క, యః = ఏ, సత్త్వభాగః + తు = సత్త్వభాగము గలదో, సః = అది, ఘఞాదినిబంధనః = ఘఞ్ మొదలగు కృత్ప్రత్యయములచే తెలియబడునది (భవతి=అగును)

తాత్పర్యము— "పాకః" మొదలగు కృదంతములలోని ధాతుభాగము సాధ్యావస్థను తెలుపును కావున కారకములతో సంబంధము కుదురును. ఘఞ్ మొదలగు ప్రత్యయభాగము క్రియకు సత్త్వభావమును ఆపాదించును. అనగా సిద్ధమైన ద్రవ్యరూపమును బోధించును. కావున లింగముతోను, సంఖ్యతోను సంబంధము కుదురును.

వివరణము— సత్త్వమనగా సిద్ధముగానున్న ద్రవ్యము. దానికి లింగ సంఖ్యాయోగము సహజము. ఇట్లు "ఘఞ్" మొదలగు భావార్థకమైన కృత్ప్రత్యయము సత్త్వమును చెప్పునని ఫలించును. కాగా తిఙ్ ప్రత్యయములకును కృత్ప్రత్యయములకును భేదము సిద్ధించినది. "పాకః" మొదలగు ఒకే పదము ఒకే సమయమున సిద్ధసాధ్యరూపమైన రెండర్థములను గూడ చెప్పుటలో బాధకము లేదనియును పర్యవసించినది.

ఈ సందర్భమునందంతను అన్ని విషయములలోను ''పచ్'' ధాతువు ఉదాహరణముగా తీసికొనబడినది. దీని ననుసరించి ''ప్రతియొక ధాతువునకును ఇదే తీరు'' అని గ్రహింపవలెను. ॥47॥

అవతారిక— ఒక శబ్దమందలి భాగములు రెండర్థములను బోధించుటలో దృష్టాంతమును చూపుచున్నాడు.

శ్లో॥ బంధుతా భేదరూపేణ బంధుశబ్దే వ్యవస్థితా ।
సమూహో బంధ్వవస్థా తు ప్రత్యయేనాఽభిధీయతే ॥ 48

బంధుతా = బంధు సమూహము, భేదరూపేణ = భేదముతో, బంధుశబ్దే = ''బంధు'' అను శబ్దమందు, వ్యవస్థితా = ఉన్నది, సమూహః = సముదాయ రూపమైన, బంధ్వవస్థా + తు = బంధువుల స్థితియైతే, ప్రత్యయేన = ప్రత్యయముచే, అభిధీయతే = చెప్పబడును.

తాత్పర్యము— ''బంధుతా'' అని ఒక పదమున్నది. ''బంధు'' అను శబ్దమునకు ''త'' అను తద్ధిత ప్రత్యయము చేరగా అది ఏర్పడినది. ''బంధు సమూహము'' అనియర్థము. ఇచట బంధు శబ్దము భేదముతో బంధు సముదాయమును తెలుపును. ''త'' అను ప్రత్యయము అభేదముతో బంధు సముదాయమును తెలుపును. కాగా ప్రకృతి ప్రత్యయములు రెండును రెండర్థములను చెప్పినట్లగును

వివరణము— ''గ్రామ జన బంధుభ్యస్తల్'' (4-2-48) అను సూత్రముచే బంధు శబ్దమునకు ''సమూహము'' అను అర్థమున ''తల్'' ప్రత్యయము విధింపబడినది. ''బంధూనామ్ - సమూహః = బంధుతా = బంధువుల సమూహము''. ''బంధవః'' అన్నను ''బంధుతా'' అన్నను అర్థ మొకటే. అయినను బహువచనాంతమైన బంధుశబ్దము భేద ప్రధానమైన బంధు సముదాయమును బోధించును (బంధువులు). తద్ధితాంతమైన ''బంధుతా'' శబ్దము అభేద ప్రధానమైన బంధు సముదాయమును తెలుపును (ఒక బంధు సమూహము). ఇదియే భేదము. వాస్తవమున బంధువులకన్న వేరుగ సముదాయమన్నది ఉండదు గదా! కాగా ప్రకృతి ప్రత్యయములు రెండును రెండర్థములను చెప్పుట ప్రసిద్ధమైనందున, ''పాకః'' మొదలగుచోట్ల అట్లు సిద్ధ సాధ్యరూపమైన రెండర్థములును వచ్చుటలో విప్రతిపత్తి లేదని సారము.

విశేషము— ''వాని సమూహము'' అను నర్థమున గ్రామ, జన, బంధు అను శబ్దములకు ''తల్'' (త) ప్రత్యయమగును అని పై సూత్రముయొక్క అర్థము. ఉదా: ''గ్రామాణామ్ - సమూహః = గ్రామతా'' మొదలగునవి. (బహువచనము ''పెక్కు గ్రామములు'' మొదలగు భావమును, ''త'' ప్రత్యయము ''వాని గుంపు'' అను భావమును కలుగజేయును). ॥48॥

ఈ ప్రశ్నకలుగును. చివరకు శబ్దార్థ సంబంధమును స్వయముగా ప్రత్యక్షముగా చూచిన పరమేశ్వరుడు చెప్పెనని యంగీకరింపవలెను.

అట్లుకాకున్న అంధపరంపరగా ఈ శబ్దార్థ సంబంధమున్నదని చెప్పవలెను.

అందుచే పరమేశ్వరుడు ముందుగా చూచిమునులకు బోధించెననుటయుక్తము.

పై సిద్ధాంతమును స్పష్టపరుచుచు పరమేశ్వరుడున్నాడని శబ్దప్రమాణము చేతను అనుమాన ప్రమాణముచేతను చూపుచున్నాడు.

**శ్లో॥ జ్ఞానమస్మద్విశిష్టానాం సర్వం సర్వేన్ద్రియం విదుః।**
**అభ్యాసాన్మణిరూప్యాది విశేషేష్వివ తద్విదామ్॥ 46**

A. అస్మద్ = మనకంటె అనగా ఒకొక్క ఇంద్రియముచే ఒకొక్క అర్థమును గ్రహించెడి అస్మదాదులకంటె, విశిష్టానామ్ = ఉత్కృష్టమగు వారియొక్క, సర్వమ్ = ఎల్లవిధమగు, జ్ఞానమ్ = జ్ఞానము, సర్వేన్ద్రియమ్ = ఎల్లయింద్రియములకు సంబంధించునట్లుగా, విదుః = వేదవేత్తలు చెప్పుచున్నారు. మనము కంటితోరూపమును, చెవితో శబ్దమును, నాలుకతో రుచిని, ముక్కుతో గంధమును గ్రహించుచున్నాము. మన ఎల్లయింద్రియములు ఎల్ల అర్థములను గ్రహింపలేవు. ఋషులు అట్లుకాక అన్ని ఇంద్రియముల చేతను అన్నియర్థములను గ్రహింతురు. ఈ యర్థమును* శ్రుతి స్పష్టముగా చెప్పియున్నది. వారికి ఇంద్రియములతో ప్రసక్తిలేకుండ గనే జ్ఞానము కలుగును. వారే ఋషులు. అట్టిఋషులనుబట్టియే వేరుగా పరమేశ్వరుడు న్నట్లు మనము విశ్వసింపవలెను. కాగా పరమేశ్వరుడు పదార్థములను జూచి ఋషులకు బోధింపగా వారిద్వారా అస్మదాదులకు అవి జ్ఞాతములగుచున్నవి. కనుక అంధపరంపరకాదు. ఈరీతిగా ఆగమ ప్రామాణ్యమునుబట్టి ఈశ్వరుడు సిద్ధించునని కారికా పూర్వార్థము నిర్ణయించు చున్నది.

B. అనుమాన ప్రమాణముచేగూడ ఈశ్వరసిద్ధికలుగునని చెప్పుచున్నాడు.

అభ్యాసాత్ = అభ్యాసమువలన, మణి రూప్యాది విశేషేషు = మణులయొక్కయు, వెండిమున్నగువానియొక్కయు విశేషములయందు, తద్విదామ్ + ఇవ = వానిపరిశీలనము కల వారికివలె యోగులకు జ్ఞానముమెండు.

మణులనుచూచువారికెల్ల వానిస్వరూపము తెలియదు. చాల సారులు పరిశీలనచేయగా చివరకువాని తత్త్వముతెలియును. రత్న పరీక్షయిట్టిదే. ఈ దృష్టాంతమును బట్టి యోగులు అభ్యాసముచేయగా విలక్షణమగు జ్ఞానము వారికికలుగును. ఈశ్వరుడు స్వతః జ్ఞానైశ్వర్య సంపద కలవాడు. ॥46॥

---

* శ్రుతిఇట్లున్నది—
"నేదానీ మిన్ద్రియైరేవ పశ్యన్తి, ఘ్రాణతః శబ్దం శృణోతి, పృష్ఠతో రూపాణి పశ్యతి, అఙ్గుల్యగ్రేణ సర్వేన్ద్రియార్థానుపలభతే"

*అవతారిక*— ఈ విధముగ ''పాకః'' మొదలగుచోట్ల శబ్దభేదము సిద్ధించును గాన (ప్రకృతి + ప్రత్యయము), విషయభేదము సిద్ధించుటలో బాధకము లేదని చెప్పు చున్నాడు.

**శ్లో॥ తత్రయం ప్రతి సాధ్యత్వమ సిద్ధా తం ప్రతిక్రియా ।**
**సిద్ధా తు యస్మిన్ సాధ్యత్వం న తమేవ పునః ప్రతి ॥ 49**

తత్ర = అచట, యమ్ + ప్రతి = దేని నపేక్షించి, సాధ్యత్వమ్ = సాధ్యత్వము (ఆవశ్యక మగునో), తమ్ + ప్రతి = దానిని గురించి, క్రియా = క్రియ, అసిద్ధా = సిద్ధముకానిది, (భవతి = అగును), యస్మిన్ = ఏ విషయమున, క్రియా = క్రియ, సిద్ధా + తు = సిద్ధ మగునో, తమ్ + ఏవ + ప్రతి = దానిని గూర్చియే, పునః = మరల, సాధ్యత్వమ్ = సాధ్య త్వము, న = కాదు.

*తాత్పర్యము*— క్రియ సాధ్యమగునపుడు సాధనములను (కారకములను) అపే క్షించును. ఈ స్థితిలో క్రియ ఎన్నడును సిద్ధము కాదు. ఇట్టి సాధ్యమగు క్రియయే ''పాకః'' మొదలగు చోట్ల ధాతు భాగముచే బోధింపబడును. సిద్ధమైన క్రియ కృత్ప్రత్యయమును అపే క్షించును. ఈ స్థితిలో సాధనముల ఆవశ్యకత దానికుండదు. లింగ సంఖ్యలు మాత్రమే దానికి సంబంధించును.

*వివరణము*— ''పాకః'' మొదలగు కృదంతములలో ధాతు భాగముయొక్క విషయము వేరు. (సాధ్యత్వమును సాధనాపేక్షయు). ప్రత్యయభాగము యొక్క విషయము వేరు. (సిద్ధత్వమును సాధనాపేక్ష తొలగుటయు). ॥49॥

*అవతారిక*— విషయము వేరైనపుడు అర్థమును బోధించుటలోని వైషమ్యము గూడ సమంజసమేయని ఒక దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ రాజ్ఞః పుత్రస్య నప్త్రేతి న రాజ్ఞి వ్యతిరిచ్యతే ।**
**పుత్ర స్యార్థః ప్రధానత్వం న చాస్య వినివర్తతే ॥ 50**

''రాజ్ఞః - పుత్రస్య - నప్తా'' + ఇతి = ''రాజుయొక్క కుమారుని మునిమనుమడు'' అను చోట, పుత్రస్య = పుత్ర శబ్దముయొక్క, అర్థః = అర్థము, రాజ్ఞి = రాజశబ్దము యొక్క అర్థము విషయమున, న + వ్యతిరిచ్యతే = వేరుగా ఉండదు (సంబంధింపకుండ విడిగా ఉండి పోదు), అస్య = దీనికి, (పుత్ర శబ్దార్థమునకు), ప్రధానత్వమ్ + చ = ప్రాముఖ్యము కూడ, న + వినివర్తతే = పోదు.

*తాత్పర్యము*— ''రాజ్ఞః పుత్రస్య నప్తా శోభతే'' అను వాక్యమున్నది. ''రాజు గారి కుమారుని మునిమనుమడు ప్రకాశించుచున్నాడు'' అని యర్థము. ఇచట మునిమనుమడు ముఖ్యుడు. వీనిని బట్టి కుమారుడు అముఖ్యుడగును. అయినను ''రాజుయొక్క కుమారుడు''

అను నర్థము అభీష్టముగాన, రాజసంబంధమును సూచించుటకు (రాజునుబట్టి) కుమారుడు కూడ ఒక విధముగ ముఖ్యుడే యగును. లోక వ్యవహారములో ఇట్లు ఒకే యర్థము ముఖ్యమగుటయు అముఖ్యమగుటయు అనుభవసిద్ధమై యున్నది. అట్లే ''పాకః'' మొదలగు స్థలములలో రెండు భాగములవలన సిద్ధసాధ్య రూపమగు విరుద్ధార్థములు లభించుటలో దోషము లేదు. ॥50॥

*అవతారిక*— పై విషయముననే మరియొక దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ మృగోధావతి పశ్యేతి సాధ్యసాధన రూపతా ।**
**తథా విషయభేదేన సరణస్యోప పద్యతే ॥** 51

''మృగః + ధావతి + పశ్య'' + ఇతి = ''లేడి పరుగెత్తుచున్నది - చూడుము'' అను ప్రయోగమున, సరణస్య = పరుగెత్తుట, సాధ్యసాధన రూపతా = సాధ్యమును సాధనమును గూడ అగుట, తథా = ఆ విధముగ, విషయభేదేన = విషయముయొక్క భేదముచే, ఉపపద్యతే = కుదురును.

తాత్పర్యము— ''లేడి పరుగు పెట్టుచున్నది - చూడుము'' అనునది వాక్యముయొక్క స్వరూపము. ''లేడి పరుగును చూడుము'' అని దీనియొక్క భావము. ఇచట ''పరుగెత్తుట'' అను క్రియకు కర్త లేడి. ''చూచుట'' అను క్రియకు కర్మ పరుగు. కాగా లేడి విషయమున ''పరుగు'' సాధ్యముగను (క్రియ), చూపు విషయమున ''పరుగు'' సాధనముగను (కర్మకారకము) అన్వయించును. ఇట్లు విషయభేదమువలన పరుగునకు సాధ్యత్వమును సాధనత్వమును ఒకే సమయమున సిద్ధించుచున్నది. ఈ విధముగనే ''పాకః'' మొదలగు కృదంతములలో ధాతు భాగముచే సాధ్యత్వమును ప్రత్యయ భాగముచే సిద్ధత్వమును తెలియుట విరుద్ధము కాదని ఎరుగునది.

వివరణము— ''ధావతి'' అనుచోట ''తి'' అను ప్రత్యయము కర్తను బోధించును. కావున ధావనమనునది సాధ్యమై లేడి కర్తయగును. లేడియే దర్శన క్రియకు కర్మయైనచో ''మృగమ్'' అని ద్వితీయా విభక్తి రావలయును. అది అభీష్టము కాదు. అందుచే దర్శన క్రియకు ధావనమే కర్మయగును. అయినపుడది సిద్ధమని చెప్పక తప్పదు (కారకమెపుడును సిద్ధమే). ॥51॥

*అవతారిక*— కాగా పై ఘట్టమును ఉపసంహరింపు చున్నాడు.

**శ్లో॥ ల, కృత్య, క్త, ఖలర్థానాం తథాఽవ్యయ కృతామపి ।**
**రూఢి, నిష్ఠా, ఘఞాదీనాం ధాతుః సాధ్యస్య వాచకః ॥** 52

లకృత్యక్త ఖలర్థానామ్ = లకారములకు, కృత్య ప్రత్యయములకు, క్త ప్రత్యయములకును ఖలర్థ ప్రత్యయములకును సంబంధించినట్టియు, తథా = అట్లు, అవ్యయకృతామ్ + అపి = కృదంతములగు అవ్యయములకు సంబంధించినట్టియు, రూఢినిష్ఠాఘఞాదీనామ్ = క్తిన్ ప్రత్య

యము, క్త, క్తవతు ప్రత్యయములు, ఘఞ్ మొదలగు ప్రత్యయములు - వీనికి సంబంధించినట్టి, ధాతుః = ధాతువు, సాధ్యస్య = సాధ్యమైన వ్యాపారమునకు, వాచకః = బోధకము (భవతి = అగును).

తాత్పర్యము— ధాతువున్నచో సాధ్యమైన క్రియ తెలియుటయు, లేనిచో అది తెలియకుండుటయును అనుభవ సిద్ధము. కావున అన్వయ వ్యతిరేకములవలన అన్ని చోటులందును ధాతువు సాధ్యావస్థనే బోధించునని చెప్పవలయును. కాగా లకారాదు లన్నింటను ధాతు భాగము సాధ్యవాచకమే యగును.

వివరణము— (1) ''ల'' = అనగా లట్, లిట్ మొదలగు లకారములు. వీనికే తిజ్ ప్రత్యయము లాదేశము లగును. ఉదా : పచతి, పచతః, పచంతి మొ॥

(2) కృత్య : తవ్య మొదలగు ప్రత్యయములు. ఉదా : కర్తవ్యమ్, పఠితవ్యమ్ మొ॥

(3) క్త = ''త'' ప్రత్యయము. ఉదా : హసితమ్, జల్పితమ్, (నవ్వు, మాట) ఈ ప్రత్యయము భావార్థకము.

(4) ఖలర్థములు :— ''ఖల్'' (అ) అను ప్రత్యయముయొక్క అర్థమున వచ్చు ప్రత్యయములు. ఉదా : సులభః, దుర్లభః మొ॥

(5) అవ్యయకృత్తులు :— క్త్వా, తుమున్ మొదలగు ప్రత్యయములు. ఇవి అంతమందు గల శబ్దములు అవ్యయములగును. ఉదా : కృత్వా, గంతుమ్ మొ॥

(6) రూఢి :— ''క్తిన్'' అను భావార్థకమగు ప్రత్యయమునకు ఇది సూచకము. ఉదా : కృతిః, గతిః, మతిః మొ॥

(7) క్త ప్రత్యయము - క్తవతు ప్రత్యయము - ఈ రెండును ''నిష్ఠ'' అనిపించుకొనును. ఉదా : పఠితమ్, పఠితవాన్, దృష్టమ్, దృష్టవాన్ మొ॥ (పైని చూపిన ''క్త'' ప్రత్యయము యొక్క స్వభావము కొంచెము భిన్నము).

(8) ఘఞాదులు :— ఘఞ్, ల్యుట్, అ, మొదలగు ప్రత్యయములు. ఉదా ; పాకః (ఘఞ్), పచనమ్ (ల్యుట్), ఇచ్ఛా (అ) మొదలగునవి.

ఈ స్థలము లన్నిటియందును ఆ యా ధాతువు సాధ్యమునే చెప్పును. కొన్నిచోట్ల ఆ యా కృత్ప్రత్యయములు మొత్తముపై సిద్ధావస్థను బోధించును. కొన్నిచోట్ల క్రియయే ముఖ్యమగును. (కృదంతములలోని సిద్ధసాధ్య విచారణ మింతతో ముగిసినది). ॥52॥

అవతారిక— పతంజలి ఒక సందర్భములో ''న తిజంతేన ఉపమానమస్తి'' అని చెప్పెను. ''క్రియను ముఖ్యముగా బోధించు తిజంతముతో (పచతి, కరోతి మొదలగునవి) ఉపమానము కుదురదు'' అని ఆ వచనముయొక్క భావము. ఆ యంశము నిటుపైని అయిదు కారికలతో విశదముచేయుటకు ప్రారంభింపుచున్నాడు.

శ్లో॥ సాధ్యస్యా పరినిష్పత్తేః సోఽయమిత్య నుపగ్రహః ।
తిఙంతై రంతరేణేవముపమానం తతో న తైః ॥ 53

సాధ్యస్య = సాధ్యమైన క్రియ, అపరినిష్పత్తేః = పూర్తి కానందున, తిఙంతైః = తిఙంతము లగు పదములచే, ''సః + అయమ్ + ఇతి'' = ''అదే యిది'' అను, అనుపగ్రహః = అస్వీకారము, (భవతి = అగును) తతః = అందువలన, ఇవమ్ = ఇవ శబ్దము, అంతరేణ = లేకుండ, తైః = ఆ తిఙంతములతో, ఉపమానమ్ = ఉపమానము, న = లేదు (కుదురదు).

తాత్పర్యము— తిఙంత మెల్లప్పుడును క్రియయొక్క సాధ్యావస్థనే (జరుగుస్థితి) బోధించును. సిద్ధమైన దాని నది బోధింపదు. ఉపమానమగుట సిద్ధమునకే చెల్లునుగాని సాధ్యమునకు చెల్లదు. కావున తిఙంతము బోధించు వ్యాపారము ఉపమానము కానేరదు. సాదృశ్యమును చెప్పు ''ఇవ'' (వలె) శబ్దమును ప్రయోగించునపుడు మాత్రము కొన్నిచోట్ల ఉపమాన భావ మొక విధముగ లభించును. ఇవ, శబ్దము లేనిచో అది ఏ విధముగను సంభవింపదు.

వివరణము— చంద్రః, సింహః మొదలగు సిద్ధమైన విషయములను ఉపమానములుగా స్వీకరింతురు. సిద్ధమైన వస్తువులు ఉపమానములగుట సహజము. ఉదా: ''ముఖమ్ చంద్రః''. ''పురుషః సింహః'' మొదలగునవి. ఇట్టిచోట్ల ''అదేయిది'' అను భావన కలిగి చివరకు ''దానివంటిది యిది'' అను సాదృశ్యభావన సిద్ధించును. కాని ఇట్టి స్థితి సాధ్యమైన క్రియకు కుదురదు. పచతి, గచ్ఛతి మొదలగు తిఙంతము లాయా క్రియ ''ఇంకను జరుగుచున్నది'' అనియే తెలుపును. అట్టి క్రియను ఉపమానముగా స్వీకరించుట అసంభవము. ''దేవదత్తః పచతి ఇవ'' (దేవదత్తుడు వండుచున్నాడు వలె) మొదలగు ప్రయోగములు సముచితములు కావు గదా!

అయితే ఒక విశేషము. ''ఇవ'' శబ్దము సాదృశ్యవాచకము. అది లేనపుడు తిఙంతములు (వాని యర్థములు) ఉపమానములు కానే కావు. ఆ శబ్దమును ప్రయోగించినచో కొన్నిచోట్ల ఉపమాన భావమును ఎట్లో సాధింపనగును. ఉదా: ''సః క్రందతి ఇవ గాయతి'' (అతడు ఏడ్చుచున్నట్లు పాడుచున్నాడు) వాస్తవమున ఇచటగూడ తిఙంత ముపమానము కాదు. కర్తను బట్టియె ఉపమానోపమేయ భావమును సమర్థించుకొనవలెను. కాగా ''పాడుచున్న అతడు ఏడ్చుచున్న వానివలె ఉన్నాడు'' అను భావ మేర్పడును.

విశేషము— ''ఇవ'' శబ్దము ఉత్ప్రేక్షను గూడ బోధించును. తిఙంతము చెప్పు క్రియకు ఇవ శబ్దమును వాడి ఉత్ప్రేక్షను సంపాదింపవచ్చును. అందు బాధకము లేదు. ఉదా: ''లింపతి ఇవ'' = మై పూతయా అన్నట్లు, ''వర్షతి ఇవ'' = వర్షమో అన్నట్లు మొదలగునవి. ॥53॥

అవతారిక— ''సాధనముల ద్వారమున క్రియకు ఉపమానోపమేయ భావమును సాధింపగూడదా?'' అను శంకను వారింపుచున్నాడు.

శ్లో॥ సాధనత్వం ప్రసిద్ధం చ తిఙ్క్షు సంబంధినాం యతః ।
తేనాఽధ్యారోప ఏవ స్యాదుపమా తు న విద్యతే ॥ 54

తిఙ్క్షు = తిఙంతముల విషయములో, సంబంధినామ్ = సంబంధము గలవి, సాధనత్వమ్ = సాధనములగుట, యతః = ఎందువలన, ప్రసిద్ధమ్ + చ = ప్రసిద్ధమై యున్నదో, తేన = అందుచే, అధ్యారోపః + ఏవ = ఆరోపమే, స్యాత్ = అగును, ఉపమా + తు = ఉపమ అయితే, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— తిఙంతములు బోధించు క్రియతో సంబంధించునవి సాధనములే యగును. (క్రియ సాధ్యము. సాధ్యముతో సంబంధించునది సాధనమే గదా ?) అవి ఉపమేయ ములును క్రియ ఉపమానమును అగుట సంభవింపదు. (సాధ్య ముపమానము కాదు). కాన ఆవశ్యకమగుచోట ఆరోపమును చెప్పుకొనవలయును గాని ఉపమానోపమేయ భావమును చెప్పరాదు. ఉదా : "పర్వతః చలతి". ఇచట చలన క్రియకు పర్వతము కర్త. వాస్తవ మున పర్వతము కదలదు. అయినను దానియందు కదలికను ఆరోపింపవలెను. అంతియకాని పర్వత ముపమేయమనియు, చలన ముపమానమనియును వ్యాఖ్యానింపకూడదు.

వివరణము— "సాధనమును ఉపమేయముగను క్రియ నుపమానముగను చెప్ప రాదా ?" అనునది శంకయొక్క సారము. "క్రియతో సాక్షాత్తుగా సంబంధించు సాధనము నకు సాధనత్వమే ప్రసిద్ధముగాని ఔపమ్యము ప్రసిద్ధము కాదు" అని సమాధానము యొక్క సారము. సాధ్యసాధన భావము వాస్తవము కానిచోట ("కొండ కదలుచున్నది", "ఆకాశము పడుచున్నది" మొదలగునవి) ఆ యా క్రియను ఆ యా సాధనమం దారోపించుట సముచి తము. ॥54॥

అవతారిక— క్రియతో ఉపమానోపమేయ భావము కుదురకుండుటలో మరియొక హేతువును చూపుచున్నాడు.

శ్లో॥ న్యూనేషు చ సమాప్తార్థ ముపమానం విధీయతే ।
క్రియా చైవాశ్రయే సర్వా తత్ర తత్ర సమాప్యతే ॥ 55

న్యూనేషు = తక్కువైన వానియందు, సమాప్తార్థమ్ + చ = వ్యాపించిన గుణములు గలది, ఉపమానమ్ = ఉపమానముగ, విధీయతే = చెప్పబడును, క్రియా + చ = క్రియ అయితే, సర్వా + ఏవ = అంతయును, తత్ర + తత్ర = ఆ యా, ఆశ్రయే = ఆధారమందు, సమా ప్యతే = సమముగనే వ్యాపించియుండును.

తాత్పర్యము— అధికమైన గుణములు గలది ఉపమానమనియు, తక్కువ గుణ ములు గలది ఉపమేయమనియును ప్రసిద్ధము. ఉదా : "చంద్రః - ముఖమ్" మొదలగునవి. క్రియకును సాధనమునకును ఇట్టి తీరు సంభవింపదు. అచట "క్రియ ఎక్కువ, సాధనము తక్కువ" అనుట కవకాశము లేదు. క్రియ తన కాధారమైన ఆ యా సాధనములందు సమము

గనే యుండునుగాని హెచ్చు తగ్గులతో నుండదు. (క్రియను ఎక్కువగను సాధనమును తక్కువగను నిరూపించుట అశక్యము). ॥55॥

అవతారిక— పై విషయమున ఒక దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ యేనైవ హేతునా హంసః పతతీత్యభిధీయతే ।**
**ఆతౌ తస్య సమాప్తత్వాదుపమార్థో న విద్యతే ॥** 56

యేన = ఏ, హేతునా + ఏవ = హేతువుచే, "హంసః + పతతి + ఇతి" = "హంస ఎగురుచున్నది" అని, అభిధీయతే = చెప్పబడునో, తస్య = ఆ హేతువు, ఆతౌ = ఆతియను పక్షియందు, సమాప్తత్వాత్ = సమముగనే యున్నందువలన, ఉపమార్థః = ఉపమాన భావము, న + విద్యతే = ఉండదు (కుదురదు).

తాత్పర్యము— "హంసః పతతి". ఇచట "ఎగురుట" క్రియ. దాని కాధారమైన సాధనము హంస (కర్త). ఇట్టి సందర్భమున సాధనము మారినను (ఆతిః పతతి, కాకః పతతి, పికః పతతి మొదలగునవి) అన్నిచోటులందును పతనమను క్రియ ఒకే విధమున కర్త నాశ్రయించి యుండును. అందు హెచ్చుతగ్గు లుండవు. కావున క్రియ కుపమానత్వము కుదురదు.

వివరణము— "హంసః ఇవ కాకః పతతి" (హంసవలె కాకి ఎగురుచున్నది) మొదలగు ప్రయోగములలో కర్తలకే (సిద్ధములు) ఉపమానోపమేయ భావముగాని క్రియకు కాదని తెలియునది. ॥56॥

అవతారిక— విజాతీయములగు (పరస్పరము విరుద్ధములు) క్రియలకు గూడ ఉపమానోపమేయ భావము సంభవింపదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రియాణాం జాతి భిన్నానాం సాదృశ్యం నావధార్యతే ।**
**సిద్ధేశ్చ ప్రక్రమే సాధ్యముపమాతుం న శక్యతే ॥** 57

జాతి భిన్నానామ్ = జాతిచే వేరయిన, క్రియాణామ్ = క్రియలకు, సాదృశ్యమ్ = సాదృశ్యము న + అవధార్యతే = నిశ్చయింపబడదు, సిద్ధేః = ఒక క్రియ పూర్తియగుట యొక్క, ప్రక్రమే = ప్రారంభమున, సాధ్యమ్ = సాధ్యమైనది, ఉపమాతుమ్ = ఉపమించుటకు, న + శక్యతే = వీలు పడదు (సమర్థ్యము కాదు).

తాత్పర్యము— పచతి, గచ్ఛతి - తిష్ఠతి, ధావతి మొదలగునవి విజాతీయ క్రియలు. అనగా ఒకదానికొకటి పూర్తిగా వేరై, సాదృశ్యము లేనివి (పరస్పరము పోలిక లేనివి). సాదృశ్యము లేనపుడు ఉపమానోపమేయ భావము కుదరదు గదా ! కావున విజాతీయ క్రియలకును ఔపమ్యమును చెప్పరాదు. మరియు ప్రారంభమునుండి పూర్తియగు వరకును ప్రతియొక క్రియయును సాధ్యమే యగును. అట్టి సాధ్యమైనది ఉపమానముగాని ఉపమేయము

గాని యగుట అసంభవమును అనుచితమును అగును. లోకమున సిద్ధములకే ఉపమానోప మేయ భావము ప్రసిద్ధము.

వివరణము— "తిఙంతముల విషయమున ఔపమ్యము కుదురదు" అను ఘట్ట మింతతో ముగిసినది. ॥57॥

అవతారిక— "పాకః" మొదలగు కృదంతములలో ధాతువు బోధించు క్రియ సాధ్యరూపమును, ఘఞ్ మొదలగు ప్రత్యయము చెప్పు క్రియ సిద్ధరూపమును అగును. అందు బాహ్యాభ్యంతర రూపమైన భేదము కలదు" అని పతంజలి యనెను. అట్టి భేదమును దృష్టాంత పూర్వకముగ ప్రతిపాదింపుచున్నాడు.

శ్లో॥ వనం వృక్షా ఇతి యథా భేదాఽభేదవ్యపాశ్రయాత్ ।
అర్థాత్మా భిద్యతే భావే స బాహ్యాభ్యంతరే క్రమః ॥ 58

భేదాఽభేదవ్యపాశ్రయాత్ = భేదమును, అభేదమును గూడ స్వీకరించుటవలన, వనమ్ + ఇతి = "వనము" అనియు, వృక్షాః + ఇతి = "వృక్షములు" అనియును, అర్థాత్మా = అర్థము యొక్క స్వరూపము, యథా = ఎట్లు, భిద్యతే = వేరగునో (మారునో), సః = ఆ, క్రమః = తీరు, బాహ్యాభ్యంతరే = వెలుపలిదియు లోపలిదియునగు, భావే = భావమందు, (భవతి = అగును).

తాత్పర్యము— "చెట్ల సముదాయ"మున్నది. "వనము" అను పదముతో దానికి సంబంధించిన అభేదమును చెప్పుదురు. ''చెట్లు'' అను పదముతో దానికే చెందు భేదమును తెలుపుదురు. అనగా ఒకే యర్థమును ఒక శబ్దముతో ఒక విధముగను వేరొక శబ్దముతో వేరొక విధముగను బోధించు అవకాశము గలదు. అట్లే ''పాకః'' మొదలగుచోట్ల ప్రకృతి యైన ధాతువుయొక్క (పచ్) అర్థమైన భావము ఆభ్యంతరమనియు (లోపలిది), ప్రత్యయ మైన ''ఘఞ్'' మొదలగు దానియొక్క అర్థమైన భావము బాహ్యమనియును (వెలుపలిది) వ్యవహరింపబడును.

వివరణము— ప్రకృతియైన ధాతువు బోధించు భావము సాధ్యమనియు, ఘఞాది ప్రత్యయము బోధించు భావము సిద్ధమనియును ఇదివరకే ప్రతిపాదింపబడెను. ఇచట మొదటి భావము ఆభ్యంతరమనియు, రెండవది బాహ్యమనియును వేరొక విశేషము చూపబడెను. కాగా ''భావము'' అను భావన ఒకటే అయినను వ్యవహారము ననుసరించి అందలి విశేషములను శాస్త్రము చెప్పునని ఫలించును.

విశేషము— ప్రకృతి బోధించు భావము అభేదరూపమనియు, ఘఞాది ప్రత్యయము బోధించు భావము భేదరూపమనియును ఇచటి తత్త్వము. కావుననే ధాతువు చెప్పు సాధ్యమైన భావమును చూపదలచినపుడు తిఙ్ ప్రత్యయములు ప్రవర్తించును. అచట కాలము, పురుషము అని వాని సంబంధము కుదురును. (ఉదా: పచతి - పచతః - పచంతి). లింగ

సంఖ్యల సంబంధము మాత్రము కుదురదు. ఘఞాది ప్రత్యయము బోధించు సిద్ధమైన భావ మును చూపదలచినపుడు సుప్ ప్రత్యయములు చేరును. (ఉదా : పాకః, రాగః, గతిః, మతిః మొదలగునవి) అచట లింగ సంఖ్యల సంబంధము కుదురును. (ఉదా : పాకః, పాకౌ, పాకాః) కాలపురుష సంబంధము మాత్రము సంభవింపదు. భావార్థకములైన తి, త, అన, అక మొద లగు ప్రత్యయము లన్నింటియందును ఈ రీతిని అన్వయించుకొన వలెను. ॥58॥

అవతారిక— "భావే" (3-2-18) అను సూత్రమున్నది. "ఘఞ్" మొదలగు ప్రత్యయములు "భావము" అను నర్థమున ప్రవర్తించునని దీని అర్థము. ఇచట "లింగ ము"ను (భావః అని పులింగము) "సంఖ్య"యును (భావే అని ఏకవచనము) అవివక్షితము- అనగా - వాని పట్టింపు అనావశ్యకమని భాష్యకారుడనెను. ఆ సందర్భమును వ్యాఖ్యానించు టకు ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥ సామాన్యే భావ ఇత్యత్ర యల్లింగముపలభ్యతే ।**
**భేదానామనుమేయత్వాన్న తత్తేషు వివక్ష్యతే ॥ 59**

భావే + ఇతి = "భావే" అని, అత్ర = ఈ, సామాన్యే = సామాన్యమైన నిర్దేశమందు, యత్ = ఏ, లింగమ్ = లింగము, ఉపలభ్యతే = కనబడుచున్నదో, తత్ = ఆలింగము, భేదానామ్ = విశేషములు, అనుమేయత్వాత్ = ఊహింపదగినవి కనుక, తేషు = ఆ విశేషము లందు, న + వివక్ష్యతే = వివక్షింపబడదు.

తాత్పర్యము— "భూ" ధాతువు క్రియా సామాన్యమును తెలుపును. దానికి భావార్థమున "ఘఞ్" (అ) ప్రత్యయము చేరగా "భావః" అను రూపమగును. ఇది ఏ ధాతువు యొక్క అర్థమునైనను సామాన్య రూపమున చూపించును. కాగా "భావే ఘఞ్" (భావార్థమున ఘఞ్ ప్రత్యయమగును) అనగానే "ఆ యా ప్రత్యేకమైన ధాతువులకు ఆ యా విశేషమైన వాని వాని భావమందే ప్రత్యయము ప్రవర్తించును" అని సమన్వయము చేసికొన వలయును. అంతియకాని అన్ని చోటులందును భావశబ్దము ననుసరించి పుంలింగమును ఏక వచనమును తప్పని సరియని భావింపగూడదు.

వివరణము— పచ్ అను ధాతువుయొక్క భావార్థక రూపము "పాకః" అని ఉండును. రంజ్ అను ధాతువున కిదే యర్థమున "రాగః" అని యగును. ఇట్లు ఆ యా ధాతువుల భావమును (వ్యాపారము) "పాకే", "రాగే" మొదలగు ప్రత్యేకమైన పదములచే నిర్దేశించి ఘఞాది ప్రత్యయములను విధింప నక్కరలేదా ? - అనునది ఇచటి శంక. భూ ధాతువు క్రియా సామాన్యమును తెలుపునుగాన దాని రూపమునే స్వీకరించి (భావే) విశేషముల విషయమునను కార్యములను నిర్వహించుకొనవచ్చునని సమాధానము. అట్లే "తి", (గతిః, మతిః మొదలగునవి) "అ" (ఇచ్ఛా, ఈహా మొదలగునవి) మొదలగు కొన్ని భావార్థకము లైన ప్రత్యయములు స్త్రీలింగమును సంపాదించును. "అన" (కరణమ్, గమనమ్ మొదలగు

నవి) మొదలగు ప్రత్యయములు నపుంసక లింగమును సంపాదించును. ఈ తీరుకు గూడ ఎట్టి ప్రతిబంధకమును లేదు. ''భావః'' అనునది పుంలింగముగాన ప్రత్యయాంతములన్నియు పుంలింగములు కావలయునను నిర్బంధము లేదు. (వచనము విషయమున గూడ ఇదే యుక్తి)

విశేషము— సామాన్యమందు విశేషములన్నియును అంతర్భవించి యుండును. ''గోవును పూజింపవలయును'' అనగా ''ఏదో ఒక గోవునే'' అని తాత్పర్యము కాదు. ''గోసామాన్యమును'' అనియే తాత్పర్యము. అందువలన ''భావే'' అను నిర్దేశము సామాన్యమని భావించుకొనవలయును. ॥59॥

అవతారిక— ''భావః'' అనుచోట స్పష్టముగనున్న పుంలింగమును విడుచుటలో యుక్తిని చూపుచున్నాడు.

**శ్లో॥ నిర్దేశే చరితార్థత్వాల్లింగం భావేఽవివక్షితమ్ ।**
**ఉపమానవిధిత్వాచ్చ భావాదన్యత్ పచాదిషు ॥** 60

నిర్దేశే = పదమును పలుకుటయందు, చరితార్థత్వాత్ = ఉపయోగించుటవలన, భావే = ''భావః'' అనుచోట, లింగమ్ = పుంలింగము, అవివక్షితమ్ = పట్టించుకొనదగినది కాదు, ఉపమానవిధిత్వాత్ + చ = ఉపమానము వంటిదిగాన, పచాదిషు = పచ్, త్యజ్ మొదలగు ధాతువులలో, భావాత్ = భావముకన్న (''అగుట'' –లేక– ''ఉండుట'' - అను అర్థము కన్న), అన్యత్ = వేరయినదియే (ప్రత్యయము యొక్క అర్థమగును).

తాత్పర్యము— ''భూ'' ధాతువునకు ''ఘఞ్'' ప్రత్యయము చేరగా ''భావ'' అను రూప మేర్పడును. ప్రత్యయ మిచట భావార్థకము అనగా భూ ధాతువుయొక్క అర్థము (ఉండుట –లేక– అగుట) ఈ శబ్దముచే సిద్ధరూపముగ చూపబడును. ఘఞ్ ప్రత్యయాంతమగు శబ్ద మెల్లపుడును పుంలింగముగనే యుండును. ఇట్టి ''భావ'' శబ్దము నుచ్చరించి సకల ధాతువులకును ''ఘఞ్'' ప్రత్యయము విధింపబడినది. భావశబ్దము పుంలింగముగాన దానిని పలికినపుడు ఆ లింగము తప్పనిసరి యగును. ఎట్టి లింగమును లేని ప్రాతిపదికమును పలుకరాదు. కాగా ఈ పుంలింగమన్నిట ననువర్తించునని అనుకొనగూడదు. పచ్ మొదలగు విశేష ధాతువుల విషయమున భావార్థమున ఘఞ్ ప్రత్యయమైనచో, పాకః, త్యాగః, రాగః మొదలగు పుంలింగ రూపములే ఏర్పడును. కాని అదే యర్థమున తి ప్రత్యయమైనచో పక్తిః, త్యక్తిః, రక్తిః అని స్త్రీలింగము వచ్చును. భూ ధాతువునకును తి ప్రత్యయమైనచో ''భూతిః'' అని స్త్రీలింగమే యగును.

మరియు "భావే" అను నిర్దేశమును ఉపమానరూపమున గూడ వ్యాఖ్యానింపవచ్చును. (అనగా "భావే ఇవ = భావే" అని అనుకొనవలెను). భూ ధాతువునకు భావార్థమున "భావ" అనురూపమైనట్లు పచ్ మొదలగు విశేష ధాతువులకు "పాక" మొదలగు రూపములగునని చెప్పుకొనినను బాధ లేదు. (''వంట'' మొదలగునవి ప్రత్యయము యొక్క అర్థములగును).

వివరణము— ప్రత్యయమును విధించునపుడు అర్థమును చెప్పక తప్పదుగాన సామాన్యముగ ''భావే'' అని సూత్రకారు డుచ్చరించెను. అదియె ''తి'' మొదలగు ప్రత్యయములను విధించు సూత్రములతో సంబంధించును. కావున ఆ యా ప్రత్యయములు ''భావము'' అను సామాన్యార్థమున ప్రవర్తించును. విశేషధాతువులకు వేర్వేరు రూపము లగుటయు, ప్రత్యయమును బట్టి వాని లింగము మారుచుండుటయును సహజము. అది వేరు విషయము కాన ఆక్షేపణీయము కాదు. ॥60॥

అవతారిక— ఈ సందర్భముననే భాష్యకారుడు వేరొక యుక్తిని చూపెను. ఆ యుక్తిని విశదీకరింపుచున్నాడు.

శ్లో॥ భవతౌ యత్పచాదీనాం తావదత్రోప దిశ్యతే ।
న చ లింగం పచాదీనాం భవతౌ సమవస్థితమ్ ॥ 61

పచాదీనామ్ = పచ్, త్యజ్ మొదలగు విశేష ధాతువులకు చెందు, యత్ = ఏ సామాన్యాంశము, భవతౌ = భావ అనుచోట గలదో, తావత్ = ఆ యంశము మాత్రమే, అత్ర = ఇచట (భావే అను సూత్రమున) ఉపదిశ్యతే = చెప్పబడును, పచాదీనామ్ = పచాదుల యొక్క, లింగమ్ + చ = లింగమైతే, భవతౌ = భూధాతువు యొక్క ''భావ'' అనుచోట, న + సమవస్థితమ్ = లేదు (ఉండదు).

తాత్పర్యము— ఎల్ల విశేష ధాతువులందును అవలంబింపదగు ''భావము'' అను సామాన్యాంశమును మాత్రమే (సిద్ధావస్థలో నుండు ఆ యా ధాతువుల అర్థము) ''భావే'' అనునది బోధించును. కావున విశేషముల లింగముల కిచట ప్రసక్తి లేదు. లింగమును సంఖ్యయు ఆ యా ప్రత్యయములను బట్టి ఆ యా స్థలములలో మారవచ్చును

వివరణము— ''భావము'' అనునది సామాన్యము. ''అది సకల విశేషములందును అనుసరింపదగినది'' అనియే తాత్పర్యము. సామాన్య నిర్దేశమున ఆవశ్యకమైన లింగముండక తప్పదు. విశేషముల లింగములకును దీనికిని ఎట్టి సంబంధమును లేదు. దేని లింగ సంఖ్యలు దానికి నియతములై యుండును.

విశేషము— అనంతములగు వ్యక్తులందుండు ఎల్ల ధర్మములను సామాన్యము చెప్పదు. అన్నిటియందును సమానముగ గోచరించు ఒకానొక ధర్మమును మాత్రమే అది బోధించును. ఉదా : గోత్వము, పటత్వము మొదలగునది. సామాన్యమును చెప్పు శబ్దమున కొక లింగముండుటయును తప్పదు. విశేషముల లింగములు వేరు కావచ్చును. ఒకచో కాకను పోవచ్చును. వానికిని సామాన్యమునకును ఈ యంశమున పొత్తు కుదురదు. ఉదా : ''గోత్వమ్''. ఇది నపుంసకము. ఏకవచనము. ''గౌః, గావౌ, గావః''. ఇచట గోశబ్దము పుంలింగము —లేక— స్త్రీలింగము. అన్ని వచనములు నుండును. ఇట్లే ''భావః'' అనునది సామాన్యముగాన దానికి నియతమైన పుంలింగమును ఏకవచనమును తప్పవు. విశేషములలో

అవతారిక—ఋషులనుబట్టి పరమేశ్వరుడున్నాడనియు అనుమాన ప్రమాణముచే గూడ ఈశ్వర సిద్ధి కలుగుననియు చూపి ఈశ్వరుని వలన పరంపరగా అస్మదాదులకు ఆ జ్ఞానము కలుగగా,మన మూలమున ఇతరులకు ఆ జ్ఞానము కలుగ గలదు.కనుక అంధపరం పరకాదు. అందుచే బ్రాహ్మణత్వము గోత్వము మున్నగు జాతులున్నవనియే నమ్మవలెనని 45,46 శ్లోకములలో నిరూపింపబడినది. అట్టి జాతులను 'త్వాది' భావప్రత్యయములు చెప్పునని 34 వ శ్లోకమున చెప్పబడినది. అచట సంశయము—

జాతిగన్ధత్వమ్ (జాజికాయ యొక్క పరిమళపు తనము), ఉత్పల గన్ధత్వమ్ (నల్ల కలువయొక్క పరిమళపు తనము),మల్లికా గన్ధత్వమ్(మల్లెయొక్క పరిమళపుతనము)మున్నగు స్థలములలో భావప్రత్యయము గంధసామాన్యమును బోధించునా? కాక జాజి మున్నగు వానికి సంబంధించిన గంధవిశేషమును అనగా ఆ వ్యక్తికి సంబంధించిన గంధత్వ విశేషజాతిని బోధించునా? అచట రెంటిని బోధించుటకవకాశమున్నది కదా! ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ జాత్యుత్పలాది గన్ధాదౌ భేదతత్త్వం యదాశ్రితమ్।
తద్భావ ప్రత్యయైర్లోకేఽ నిత్యత్వాన్నాభిధీయతే॥ 47

జాత్యుత్పలాది గన్ధాదౌ = జాజి, నల్లకలువ, పద్మము మున్నగు వానియందున్న గంధము రూపము మున్నగువానియందు, యత్ = ఏ, భేదతత్త్వ = భేదముయొక్క స్వరూపము, ఆశ్రితమ్ = శబ్దముచే చెప్పబడినదో,తత్ = అది, లోకే = లౌకికమగు శబ్దవ్యవహారము వివక్షాధీనమగుచుండగా, భావప్రత్యయేన = త్వ-తల్ అను భావప్రత్యయముచే, అనిత్యత్వాత్ = అనిత్యమగుట వలన, న + అభిధీయతే = చెప్పబడదు.

జాత్యాః గన్ధః—జాతిగన్ధః అని సమాసము ముందుగా చేసి తరువాత భావప్రత్యయము చేయుటకలదు. జాతి గన్ధస్య భావః—జాతిగన్ధత్వమ్ ఇచట సమాసమున సంబంధము భాసించును. అదియే భావ ప్రత్యయముచే చెప్పబడును.

అట్లుకాక, గన్ధస్యభావః—గన్ధత్వమ్ అనురీతిని ముందుగనే భావప్రత్యయముచేసి దానితో జాత్యాః గన్ధత్వమ్—జాతిగన్ధత్వమ్ అను రీతిని సమాసము చేయుటయు కలదు. ఇదియంతయు శబ్దమును ప్రయోగించువాని యిచ్ఛపై ఆధారపడియున్నది. ఇట్టి స్థితిలో గన్ధశబ్దము గంధసామాన్యమును బోధించును. జాతిశబ్ద సంబంధమున జాజియందున్న గంధము అని విశేష గంధముకూడ భాసించును. ఈ గంధవిశేషము జాజియందే యున్నది. మల్లికాదుల యందుండనేరదు. అది వ్యాపకము కానందున అనిత్యమేయగును. భావప్రత్యయముచే బోధింపబడు సామాన్యము నిత్యముకావలెను. కనుక గంధవిశేషజాతిని భావప్రత్యయము చెప్పజాలదు. గంధసామాన్య జాతినే బోధించును. ఆశ్రయభేదముచే గుణములు భిన్నములు కాగలవు.

కాబట్టి ముందుగా భావప్రత్యయముచేసి, దానితో సమాసముచేసిన విశేష జాతిభావ ప్రత్యయార్థము కానేరదు. సామాన్యజాతియే ఆ ప్రత్యయముచే బోధింపబడును. ముందుగా

''పాకః - పాకౌ - పాకాః, పక్తిః - పక్తీ - పక్తయః'' మొదలగు రీతిని లింగ సంఖ్యలు యథావిధిగ ప్రవర్తించును.

''భావే'' అను సామాన్య నిర్దేశమునకు విశేషములందు తాత్పర్యముగాన, అచటి లింగ సంఖ్యలు అవివక్షితములని మీది కారిక చెప్పినది. సామాన్యమునకు నియతమైన లింగ సంఖ్య లుండునుగాన ''భావే'' అనుచోట పుంలింగమును ఏకవచనమును తప్పవని ఈ కారిక స్పష్టపరచినది. ॥61॥

అవతారిక— విశేషములకు సంబంధించిన లింగ సంఖ్యలు సామాన్యమునకు సంబంధింపవని విశదము చేయుచున్నాడు.

శ్లో॥ ఏకశ్చ సోఽర్థః సత్తాఖ్యః కథంచిత్ కైశ్చిదుచ్యతే ।
లింగాని చాస్య భిద్యంతే పచిరూపాది భేదవత్ ॥ 62

ఏకః = ఒకటే అయినట్టి, సత్తాఖ్యః = ''సత్త'' అను పేరుగల, సః = ఆ, అర్థః + చ = భావమను అంశము, కైశ్చిత్ = కొందరిచే, కథంచిత్ = ఆ యా విధముగ, ఉచ్యతే = చెప్పబడును, అస్య = దీనియొక్క, లింగాని + చ = లింగములైనచో, పచిరూపాదిభేదవత్ = పచ్, ధాతువుయొక్క రూపములు వేరయినట్లు, భిద్యంతే = వేరగుచుండును.

తాత్పర్యము— భావమనునది సకల ధాతువుల యొక్కయు అర్థములకు చెందు సిద్ధావస్థను బోధించును. అది సామాన్య ధర్మము. దానిని భావః, సత్తా. సామాన్యమ్ అని వేర్వేరు లింగములు గల శబ్దములతో బోధించుచుందురు. ఈ తీరు పచ్ ధాతువుయొక్క పాకః, పక్తిః, పచనమ్ మొదలగు రూపభేదములను చూపుటవంటిదే. అంత మాత్రమున సామాన్యము యొక్క లింగము విశేషములకుగాని, విశేషములయొక్క లింగము సామాన్యము నకుగాని నియామకము కాజాలదు.

వివరణము— విశేషములను బట్టియే సామాన్యమును భావించి పేర్కొందురు. కాగా సామాన్యమనునది విశేష స్వరూపమే. అయినను సామాన్యము వ్యాపకమును (విశాలమైనది) విశేషము వ్యాప్యమును (సామాన్యములో ఇముడునది) అగుట (శాస్త్ర సంకేతానుసారము) తప్పదు. అందువలన సామాన్యమగు భావము వ్యాపకమును, విశేషములగు పాక, త్యాగరాగాదులు వ్యాప్యములును అగును. అందువలననే ''భావరూపమైన సిద్ధావస్థను బోధించుటకు ఘఞాది ప్రత్యయములగును'' అను అంశమునే ''భావే'' అను సూత్రము బోధించును. అంతియకాని ఆ శబ్దమునకు చెందిన పుంలింగమును ఏకవచనమును. విశేషములకు విధింపదు అనగా ''ప్రత్యయముల యొక్క అర్థమునే సూత్రము సూచించును. ప్రత్యయాంతములగు శబ్దములకు లింగవచనములు వేర్వేరుగ నుండవచ్చును. అట్లుండుట ప్రత్యేక నియమముల వలన సిద్ధించును'' అని సారాంశము.

విశేషము— సామాన్యమునకు విశేషములనన్నింటిని స్వీకరింపగల సామర్థ్య

ముండును. (విడివిడిగా కాని మొత్తముగా కాని), విశేషములకు సామాన్యమును స్వీకరించు సామర్థ్యముండదు. ఉదా : భవనమునకు (భూధాత్వర్థము) పాక త్యాగాదులన్నియు విశేషము లగును. అది వానిని గ్రహించును. కాని పాకాదులు భవనమును గ్రహింపజాలవు. (భవతి:— పాకః భవతిః, రాగః భవతి, త్యాగః భవతి మొదలగు రీతిని ప్రయోగింపనగును. కాని పచతి:— భావః పచతి, రాగః పచతి మొదలగు రీతిని ప్రయోగించుటకు వీలులేదు).

మరియొక విశేషము— సామాన్యమనునది ఎల్ల విశేషములందును సామాన్య రూపముగను, విశేషరూపముగను కూడ భాసింపుచుండును. ఉదా : "నల్లని గోవు". ఇచట గోత్వమను సామాన్యమును, "నల్లని ఒక ఆవు" అను విశేషమును గూడ నుండును. ఈ విధముగనే భావమను సామాన్యము పాకాది విశేషము లన్నింటియందును సామాన్యము గను విశేషముగను కూడ గోచరించును. అట్లు విశేషములు సామాన్యమునంతను స్ఫురింప జేయ జాలవు. ॥62॥

అవతారిక— "ఒకే యంశము సందర్భమును సంబంధమును అనుసరించి అనేక ముగ భాసించుననుట"లో దృష్టాంతమును చూపుచున్నాడు.

శ్లో॥ ఆచార్యో మాతులశ్చేతి యథైకో వ్యపదిశ్యతే ।
సంబంధి భేదాదర్థాత్మా స విధిః పక్తిభావయోః ॥ 63

ఏకః = ఒకటే అయిన, అర్థాత్మా = అర్థస్వరూపము (అర్థము = అంశము), సంబంధిభేదాత్ = సంబంధముగల వారి భేదమువలన, ఆచార్యః = ఆచార్యుడనియు, మాతులః + చ + ఇతి = మేనమామ అనియును, యథా = ఎట్లు, వ్యపదిశ్యతే = చెప్పబడునో, సః = అట్టి, విధిః = తీరు, పక్తి భావయోః = పాకమునకును భావమునకును, (భవతి = అగును).

తాత్పర్యము— ఒక వ్యక్తి ఉన్నాడు. అతడుపాధ్యాయుడు. అతనికి మేనల్లు డొక శిష్యుడు. ఎట్టి చుట్టరికమును లేని మరియొకడు వేరొక శిష్యుడు. మేనల్లుడైనవాడు రెండవవానితో "మేనమామకు నమస్కరింపుము" అనును. అతడుపాధ్యాయునికి నమస్కరించును. అట్లే రెండవవాడు "ఉపాధ్యాయునికి నమస్కరింపుము" అన్నపుడు మేనల్లుడు మేనమామకు నమస్కరించును. ఇది లోకపు తీరు. ఇచట ఒకే వ్యక్తి చుట్టరికమునుబట్టి ఒకనికి మేనమామయు, (గురువును) శిష్యత్వమును బట్టి వేరొకనికి గురువు మాత్రమును అగుచున్నాడు. ఇట్లే పాకము, భావము మొదలగు చోట్ల కూడ ఒకే అంశము సంబంధిభేదము వలన సామాన్యముగను విశేషముగను భాసించుటలో చిక్కేదియు లేదు.

వివరణము— భావమనునది పాకాదులను బట్టి సామాన్యము కావచ్చును. కాని భూధాతువు యొక్క అర్థమును మాత్రమే ఒకచో తీసికొన్న యెడల అపుడది విశేషమును కావచ్చును. అట్లే పాకమనునది భావమును బట్టి విశేషమగును. పాకమందలి విశేషములను చెప్పదలచినపుడు (మధురః పాకః, కటుః పాకః మొదలగునవి) వానినిబట్టి అది సామాన్యమే

యగును. అనగా వివక్షాధీనముగా ప్రతియొక అంశమును సామాన్యమును విశేషమును గూడ అగుట కవకాశమున్నది.

విశేషణము—"ఉపాధ్యాయస్య శిష్యో మాతులస్య భాగినేయమాహ । ఉపాధ్యాయం భవానభివాదయతామితి । స గత్వామాతులమభివాదయతే । తథామాతులస్య భాగినేయ ఉపాధ్యాయస్య శిష్యమాహ । మాతులం భవానభివాదయతామితి । స గత్వా ఉపాధ్యాయ మభివాదయతే ।" అనునవి పతంజలి యొక్క వచనములు. (సూ : 3-2-18) వాని భావము నిచట గ్రంథకర్త గ్రహించెను.

ఇట్లు 59 వ కారిక నుండి ఇంతవరకును అయిదు కారికలతో "భావే" (3-2-18) అను సూత్రము యొక్క భాష్యసారము విశదీకరింపబడినది.

ఈ సముద్దేశమున ప్రతియొక విషయమునను "పచ్" ధాతువు ఉదాహరణముగా చూపబడినది. దానిని బట్టి "సకల ధాతువుల తీరు నిదే"యని యూహింపవలయును.

1. క్రియ సాధ్యరూపము. తిఙ్ ప్రత్యయములు ఆ విషయమును బోధించును. 2. క్రియయొక్క సిద్ధరూపము భావము. దీనిని కృత్తులు బోధించును. 3. క్రియావాచకము ధాతువు. 4. ధాతువులకు సూటిగా చేరు ప్రాథమిక ప్రత్యయములు తిఙ్లును కృత్తులును మాత్రమే అను నంశములు ఈ సముద్దేశము యొక్క పరమసారము.

*క్రియా సముద్దేశము ముగిసినది*

# కాల సముద్దేశము - 9

అవతారిక— క్రియా సముద్దేశమున క్రియా స్వరూపమును నిరూపించి, ఇపుడు కాలము క్రియను పరిచ్ఛేదించును గాన దానిని నిరూపించుటకై మొదట దర్శనాంతర ప్రసిద్ధ మగు కాలస్వరూపమును ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ వ్యాపారవ్యతిరేకేణ కాలమేకే ప్రచక్షతే ।**
**నిత్యమేకం విభుం ద్రవ్యం పరిమాణం క్రియావతామ్ ॥ 1**

ఏకే = వైశేషికాగు లగు కొందరు దార్శనికులు, నిత్యం = నిత్యమైనదియు, ఏకం = ఒక్కటియు, విభు = సర్వ వ్యాప్తమును, క్రియావతాం = క్రియతో సంబంధించిన పదార్థములకు, పరిమాణం = జన్మాది క్రియలద్వారా పరిచ్ఛేదకమును అగు, కాలం = కాలమనెడు, ద్రవ్యం = ద్రవ్యమును, వ్యాపార వ్యతిరేకేణ = వ్యాపారముకంటె వేరుగా, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

తాత్పర్యము— వైశేషికులు మొదలగు కొందరు దార్శనికులు, నిత్యమైనదియు' ఒక్కటియు, సర్వవ్యాప్తమును, క్రియతో సంబంధించిన పదార్థములను 'ఇది దీనికంటె ముందు పుట్టినది, ఇది తరువాత పుట్టినది' ఇత్యాది విధముల జన్మాదులచే పరిచ్ఛేదించునదియు అగు కాలమనెడు ద్రవ్యమును క్రియకంటె వేరుగ అంగీకరింతురు.

విశేషము— కాలము క్రియకంటె భిన్నమైనది. ఇది క్రియతో సంబంధించిన పదార్థములను ఇది మొదట పుట్టినది, ఇది తరువాత పుట్టినది, ఇది ముందుగ నశించినది, ఇది తరువాత నశించినది ఇత్యాది విధమున పరిచ్ఛేదించునది ; అనగా వాటి యునికి మొదలగు వాటిని కొలచునది. ఇది వైశేషికుల సిద్ధాంతము. ॥1॥

అవతారిక— పరిచ్ఛేద్యము లగు (కాలవదగిన) పదార్థముల భేదమును బట్టి, కాలమునకును, ఇతర పరిచ్ఛేదకములకును, (కొలుచువాటికిని) గల భేదమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ దిష్టిప్రస్థ సువర్ణాది మూర్తిభేదాయ కల్పతే ।**
**క్రియాభేదాయ కాలస్తు, సంఖ్యా సర్వస్య భేదికా ॥ 2**

దిష్టిప్రస్థ సువర్ణాది = దిష్టి, ప్రస్థము, సువర్ణము మొదలగునది, మూర్తిభేదాయ = సర్వ వ్యాప్తము కాని ద్రవ్యమునకు సంబంధించిన పరిమాణము యొక్క భేదమును ఏర్పరచుటకు, కల్పతే = సమర్థ మగుచున్నది, కాలః+తు = కాలమైతే ; క్రియా భేదాయ = క్రియ యందలి భేదమును ఏర్పరచుటకు, కల్పతే = సమర్థ మగుచున్నది, సంఖ్యా = సంఖ్య ; సర్వస్య అన్నిటికిని ; భేదికా = భేదమును ఏర్పరచునది,

తాత్పర్యము— దిష్టి, ప్రస్థము, సువర్ణము మొదలగునవి సర్వ వ్యాప్తము కాని ద్రవ్యము యొక్క పరిమాణము నందలి భేదములను చూపును. కాలము క్రియల యందలి భేదమును చూపును. సంఖ్య అన్నింటికిని సంబంధించిన భేదమును తెలుపును.

విశేషము— దిష్టి అనునది ఒక దైర్ఘ్య ప్రమాణము. వస్త్రాదులలోని ఒక కొస తీసికొని ఇది రెండు జానలున్నది, ఇది రెండు మూరలున్నది అని చెప్పుచుందుము. (అట్టిదే యిది) పొడుగు వెడల్పులు కొలుచునది దీనికి ప్రమాణము అని పేరు. ప్రస్థమనగా ధాన్యాదులను కొలచెడు కుంచము వంటి ప్రమాణము. దీనిచే ధాన్యాదుల పొడవు వెడల్పు ఎత్తులను మూడింటిని (వాటి ఘనపరిమాణమును) కొలుచుచుందుము. ధాన్యాదుల నలువైపులకు సంబంధించిన కొలతను చెప్పునవిగాన ఇవి పరిమాణములు. 'పరి' యనగా నలుమూలల యని యర్థము. సువర్ణ మనగా ఘనపదార్థములను తూచెడు ఒక ఉన్మానము. బంగారము వెండి మొదలగు వాటిని త్రాసులో వేసి, దానిని ఎత్తి తూచుదుము గాన తులము, పలము మొదలగు వాటికి ఉన్మాన మని పేరు. ఈ ప్రమాణ - పరిమాణ - ఉన్మానములు మూడును పరిచ్ఛిన్నములగు (సర్వవ్యాప్తములు కాని) మూర్త ద్రవ్యముల పరిమాణమును తెలుపును. ఏతద్భిన్నమగు కాలము మాత్రము అమూర్తమగు క్రియను కొలుచును. ఉదా : సూర్యాది సంచార రూపమగు క్రియను మాసము, ఋతువు, సంవత్సరము మొదలగు కాలములచే కొలచుచుందుము. సంఖ్య మూర్తామూర్తములను, ప్రమాణములను, సంఖ్యను కూడ పరిచ్ఛేదించును. ఉదా : రెండు ఘటములు ; రెండు క్రియలు, మూడు జానలు, నాలుగు కుంచములు ; ఐదు తులములు ; రెండు ఇరవైలు మొ. ॥2॥

అవతారిక— ఇపుడు కాలము క్రియను ఎట్లు పరిచ్ఛేదించునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉత్పత్తౌచ స్థితౌచైవ వినాశే చాపి తద్వతామ్ ।**
**నిమిత్తం కాలమేవాహు ర్విభక్తే నాత్మనా స్థితమ్ ॥** 3

విభక్తేన = విభక్తమగు, ఆత్మనా = స్వరూపముతో, స్థితం = ఉన్న, కాలమేవ=కాలమునే, తద్వతాం = ఉత్పత్తి - స్థితి - వినాశములు గల పదార్థముల, ఉత్పత్తౌ = పుట్టుకయందును, స్థితౌ = ఉనికియందును, వినాశే చాపి = వినాశమునందును, నిమిత్తం = నిమిత్తమునుగా, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— వేరు వేరు స్వరూపములలో నున్న కాలమే పదార్థముల ఉత్పత్తికిని, స్థితికిని, నాశమునకును నిమిత్త మని చెప్పుదురు.

విశేషము — జనించుట, ఉండుట (స్థితి), వినాశము అనెడు క్రియలలో ఇతర క్రియ లన్నియు అంతర్గతములే. పదార్థము లన్నియు ఈ క్రియలలో నేదియో యొక క్రియతో సంబంధించి యుండును. కావున కాలము ఈ క్రియల ద్వారా సర్వపదార్థములకును నిమిత్త మని చెప్పుదురు. ఉదాహరణమునకు : కొన్ని పదార్థములు వసంతమున జనించును, కొన్ని నశించును, కొన్ని శరత్కాలమున జనించును, కొన్ని నశించును. ॥3॥

అవతారిక— పదార్థముల ఉత్పత్త్యాదులకు కాలమే నిమిత్తము గాన ప్రపంచ వ్యవహారమున కంతకును కాలమే కారణమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తమస్య లోకయన్త్రస్య సూత్రధారం ప్రచక్షతే ।**
**ప్రతిబంధాభ్యనుజ్ఞాభ్యాం తేన విశ్వం విభజ్యతే ॥ 4**

తం = ఆ కాలమును, అస్య = ఈ, లోకయన్త్రస్య = లోకమనెడు యంత్రమునకు, సూత్రధారం = సూత్రధారునిగా, ప్రచక్షతే = చెప్పుదురు, తేన = ఆ కాలముచేత, ప్రతిబంధాభ్యనుజ్ఞాభ్యాం = ప్రతిబంధాభ్యనుజ్ఞల ద్వారా, విశ్వం = ప్రపంచము, విభజ్యతే = విభక్తమగుచున్నది.

తాత్పర్యము— లోకమనెడు యంత్రపురుషుని (బొమ్మను) నడిపెడు సూత్రధారుడు ఈ కాలమే. ప్రతిబంధాభ్యనుజ్ఞల ద్వారా ఈ కాలమే ప్రపంచమునందలి విభాగములను ఏర్పరచుచున్నది.

విశేషము— ప్రతిబంధము = ఉత్పత్త్యాదులు జరుగకుండునట్లు చేయుట. అభ్యనుజ్ఞ = ఉత్పత్త్యాదులు జరుగునట్లు చేయుట. జంత్రపు బొమ్మకు తాళ్ళు కట్టి ఒక వ్యక్తి దానిని కదలునట్లును, నడచునట్లును చేయును. వానికి సూత్రధారుడని పేరు. ఈ జగద్యంత్రమునకు కాలము సూత్రధారుని వంటిది. ఈ కాలమే ఆ యా పదార్థముల ఉత్పత్త్యాదులను అడ్డగించుచు జరుపుచు, ఇది ముందు, ఇది వెనుక అనెడు విభాగమును ఏర్పరచుచున్నది.॥4॥

అవతారిక— ఈ విషయమునే స్పష్టీకరించుచున్నాడు.

**శ్లో॥ యది న ప్రతిబధ్నీయాత్ ప్రతిబన్ధం చ నోత్సృజేత్ ।**
**అవస్థా వ్యతికీర్యేరన్ పౌర్వాపర్యవినాకృతాః ॥ 5**

న ప్రతిబధ్నీయాద్యది = (కాలము ఉత్పత్త్యాదులను) అడ్డుకొనకున్నను, ప్రతిబంధం = ఆ అడ్డును, న + చ + ఉత్సృజేత్ (యది) = తొలగింపకున్నను, అవస్థాః = పదార్థముల అవస్థలు, పౌర్వాపర్య వినాకృతాః = పౌర్వాపర్య రహితములుగా చేయబడినవై, వ్యతికీర్యేరన్ = సంకీర్ణములై యుండెడివి.

విశేషము— ఒక బీజమునుండి మొదట అంకురము, తరువాత నాలము, పిమ్మట కాండము జనించుచున్నవి. అనగా అంకురము పుట్టు సమయమున నాలము పుట్టకుండగను, నాలము పుట్టు సమయమున కాండము పుట్టకుండగను కాలము అడ్డుకొనుచున్నది. కావుననే అంకురనాల-కాండాదుల ఉత్పత్తిలో నొక క్రమము (పౌర్వాపర్యము) కనబడుచున్నది. కాల మా విధముగ అడ్డుకొనకున్నచో ఆ యా కారణములనుండి జనించు కార్యముల వివిధావస్థలలో సాంకర్యమేర్పడి యుండెడిది. అనగా అంకుర - నాల - కాండాదులలో ఏది ముందో ఏది వెనుకనో తెలిసికొనుటకు అవకాశముండెడిది కాదు. ॥5॥

సః = ఆ, ద్రవ్యాత్మా = ద్రవ్య స్వభావమే, సంసర్గాత్ = సంఖ్యా రూపాదులతో సంబంధము వలన, ఏవం రూపః = ఇట్టి రూపము కలదిగా, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

తాత్పర్యము— ఏకమనికాని అనేకమనికాని, తెల్లనిది అనిగాని నల్లనిది అనిగాని లేదు. ద్రవ్య స్వభావమే ఆయా సంఖ్యాదులతో సంబంధించుట వలన వేరువేరు విధముల ప్రకాశించుచున్నది.

వివరణము— ద్రవ్యమునకు ఏ ఉపాధులతోడను సంబంధము లేకున్నచో లౌకిక వ్యవహారమే కుదురదు. అందు ద్రవ్యమునకే ఏకత్వాది సంఖ్యలతో సంబంధమును కూర్చి 'ఇది ఒక ద్రవ్యము ; ఇవి రెండు ద్రవ్యములు' అని వ్యవహరింతుము. శుక్ల కృష్ణరూపము లతో ద్రవ్యమునకు సమవాయ సంబంధము (విడదీయరాని సంబంధము) ఉండుటచే ''తెల్లని బట్ట, నల్లని బట్ట'' ఇత్యాది వ్యవహారము చేయుచుందుము. కావున ద్రవ్యములలో కనబడు ఆయా భేదము లన్నియు ఉపాధి భేదకృతములే కాని సహజములు కావు. అట్లే ఉత్పత్త్యాది క్రియలను బట్టి కాలమునందు గూడ 'ఇది ఉత్పత్తి కాలము, ఇది స్థితి కాలము, ఇది వినాశ కాలము' మొదలగు వ్యవహారములు కల్పితము లగుచున్నవి. కావుననే దేవదత్తుని ఉత్పత్తి కాలము యజ్ఞ దత్తునకు స్థితికాలమగుచున్నది. అదియే విష్ణు మిత్రునకు వినాశకాలమగు చున్నది. ॥7॥

అవతారిక— ఉపాధిగత భేదములు కాలమునందు ఆరోపింపబడుచున్నవని చెప్పు చున్నాడు.

**శ్లో॥ సంసర్గిణాం తు యే భేదా విశేషాస్తస్య తే మతాః ।**
**స భిన్నైస్తైర్వ్యవస్థానాం కాలో భేదాయ కల్పతే ॥ 8**

సంసర్గిణాం = కాలముతో సంబంధించిన గ్రహసంచారాది క్రియల యొక్క, యే = ఏ, విశేషాః = విశేషములు కలవో, తే = అవి, తస్య = ఆ కాలము యొక్క, భేదాః = భేదము లుగా, మతాః = చెప్పబడుచున్నవి, సః = ఆ, కాలః = కాలము, తైః = ఆ క్రియా విశేష ములచేత, భిన్నః = భిన్నమైనదై, వ్యవస్థానాం = అహోరాత్రాది వ్యవస్థలయొక్క, భేదాయ = భేదము కొరకు, కల్పతే = సమర్థమగుచున్నది (భేదములకు నిమిత్తమగుచున్నది).

తాత్పర్యము— సూర్యాది గ్రహ సంచార రూపమగు క్రియ కాలమునకు సంబం ధించినదై యుండుటచే ఆ క్రియయందలి విశేషములను కాలమునందు ఆరోపించుచుందురు. ఈ విధముగ ఆయా క్రియలయందలి విశేషములను బట్టి కాలము పగలు, రాత్రి, మాసము మొదలగు విభిన్న వ్యవహారములకు కారణమగుచున్నది.

విశేషము— అహోరాత్ర - పక్ష - మాసాది వ్యవస్థలకు మూల కారణము సూర్యాది గ్రహ సంచారము. కాలమునందు ఆ వ్యవస్థలు పరమార్థతః లేవని తాత్పర్యము. ॥8॥

అవతారిక— ఈ విధముగ కాలము ఉపాధి భేదముచే భిన్నముగ కన్పట్టుచు పదార్థముల జన్మ స్థిత్యాదులకు నిమిత్తమగు చున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ విశిష్ట కాలసంబంధా ద్వృత్తిలాభః ప్రకల్పతే ।**
**శక్తీనాం సంప్రయోగస్మ* హేతుత్వే నావతిష్ఠతే ॥ 9**

విశిష్ట కాల సంబంధాత్ = కాల విశేషము యొక్క సంబంధము వలన, వృత్తి లాభః = (సాధన శక్తుల) ప్రవృత్తి యొక్క లాభము, ప్రకల్పతే = ఏర్పడుచున్నది, సః = ఆ కాలము, శక్తీనాం = శక్తుల యొక్క, ప్రయోగస్య = ప్రయోగమునకు, హేతుత్వేన = హేతువుగా, అవతిష్ఠతే = నిలచుచున్నది. (*'సప్రయోగస్య' అను పాఠము యుక్తమని తోచుచున్నది.)

తాత్పర్యము— వసంతాది కాల విశేష సంబంధముచే సాధన శక్తుల ప్రవృత్తి (పుష్ప ఫలాదుల ఉత్పత్తి మొదలగు ప్రవృత్తి) కనబడుచున్నది. కావున శక్తులు ప్రవర్తించుటకు ఆ కాలమే హేతువుగా ఉన్నది.

వివరణము— వసంతాది కాలములలో ఆ యా సాధన శక్తులు పనిచేయుచున్నవి. దానిని బట్టి ఈ ప్రవృత్తికి కాలమే నిమిత్త కారణమని ఊహింపవలసి యున్నది. ఈ విధముగ కాల ప్రేరితములగు శక్తులు పదార్థములకు జన్మాది క్రియలను సాధించుచున్నవి. ॥9॥

అవతారిక— కారణములందలి శక్తులు కాలము అనుజ్ఞను పొందిన పిమ్మటనే పదార్థముల ఉత్పత్తి స్థిత్యాదులను కలిగింప సమర్థములగుచున్నవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ జన్మాభివ్యక్తి నియమాః ప్రయోగోపనిబన్ధనాః ।**
**నిత్యాధీన స్థితిత్వాచ్చ స్థితిర్నియమ పూర్వికా ॥ 10**

జన్మాభి వ్యక్తి నియమాః = పదార్థముల ఉత్పత్తియు, అభివ్యక్తియు, నియమమును, ప్రయోగోప నిబంధనాః = కాలముయొక్క ప్రేరణముపై ఆధారపడియున్నవి. నిత్యాధీన స్థితిత్వాత్ + చ = పదార్థములు ఎల్లపుడును కాలమునకు అధీనమైన స్థితి కలవగుటచే, స్థితిః = పదార్థముల స్థితి, నియమపూర్వికా = నియమము పూర్వమునందు కలది, అనగా ఒక నియమముతో కూడినది.

తాత్పర్యము— పదార్థముల ఉత్పత్తియు, స్పష్టరూపమున అభివ్యక్తియు, కొంత కాలము మాత్రమే ఉండుట యనెడు నియమమును, కాల ప్రేరణముపై ఆధారపడియున్నవి. పదార్థముల స్థితికూడ ఎల్లపుడును కాలముపైననే ఆధారపడియుండుటచే అది నియమపూర్వకమైనది.

విశేషము— ఉత్పన్నమై అభివ్యక్తమైన పదార్థము ఇంతకాలము మాత్రమే ఉండును అనెడు నియత కాలావస్థితి నియమము. 'ఉత్పత్తౌ చ స్థితౌ చ' ఇత్యాది తృతీయ కారికార్థమే ఇచట వివరింపబడినది. ॥10॥

అవతారిక— కాలకృతములగు మరికొన్ని భావవికారములు గూడ కలవని చెప్పుచున్నాడు

**శ్లో॥ స్థితస్యానుగ్రహస్తైస్తైర్ధర్మైః సంసర్గిభిస్తతః ।**
**ప్రతిబన్ధస్తిరోభావః ప్రహాణమితి చాత్మనః ॥ 11**

స్థితస్య = ఉత్పన్నమై స్థితమగు పదార్థమును, సంసర్గిభిః = దానితో సంబంధించు, తైస్తైః = ఆ యా, ధర్మైః = ధర్మములతో, అనుగ్రహః = అనుగ్రహించుట, తతః = అటుపిమ్మట, ఆత్మనః = ఆ పదార్థము యొక్క, ప్రతిబన్ధః = ప్రతిబంధము (స్వకార్యమును చేయుటకు సామర్థ్యము లేకుండ చేయుట), తిరోభావః = కనబడకుండునట్లు చేయుట, ప్రహాణం = వినాశము (ఇవి యన్నియు కాలకృతములే).

తాత్పర్యము— స్థితిని సంపాదించుకొనిన పదార్థమునకు ఆ యా ధర్మ విశేషములతో సంబంధమును ఏర్పరచుట, తరువాత ఆ పదార్థము తన కార్యము చేయజాలకుండునట్లు చేయుట, దానిని అదృశ్యముచేయుట, నశింపజేయుట ఇవి యన్నియు కాలకృతములే.

విశేషము— ఉత్పన్నమై స్థితిని సంపాదించుకొనిన భూత వృక్షాదులకు కాలమే పుష్ప ఫలాదులతో సంబంధ మేర్పరచుచున్నది. పిమ్మట కాలమే ఆ కార్యములు కలుగకుండ చేయుచున్నది. చివరకు ఆ కాలమే ఆ పదార్థమును అదృశ్యము చేయుచున్నది. ॥11॥

అవతారిక— పదార్థములకు సంబంధించిన ఆ యా క్రియలు ఒక క్రమము ననుసరించి కాలాధీనములై యుండును. అందుచే ఈ క్రియలనే కాలమని వ్యవహరించుచుందురు అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రత్యవస్థం తు కాలస్య వ్యాపారోఽత్ర వ్యవస్థితః ।**
**కాల ఏవ హి విశ్వాత్మా వ్యాపార ఇతి కథ్యతే ॥ 12**

అత్ర = ఈ ప్రపంచమున, ప్రత్యవస్థం = పదార్థములకు సంబంధించిన ప్రతి అవస్థయందును, కాలస్య = కాలము యొక్క, వ్యాపారః = వ్యాపారమే, వ్యవస్థితః = నియతరూపమున ఉన్నది, కాల ఏవ = కాలమే, విశ్వాత్మా హి = ప్రపంచమున కంతకును ఆత్మ కదా, వ్యాపారః ఇతి = వ్యాపారమని, కథ్యతే చెప్పబడుచున్నది.

తాత్పర్యము— ఈ ప్రపంచమునందలి పదార్థములకు సంబంధించిన ప్రతి అవస్థయందును కాలముయొక్క వ్యాపారమే నియతరూపమున ఉన్నది. ఈ విధముగ విశ్వమునకంతకును ఆత్మయైయున్న కాలమే వ్యాపారము అని చెప్పబడుచున్నది.

వివరణము— అనుగ్రహము (ఒక పని జరుగునట్లు చేయుట) నిగ్రహము (దానికి ప్రతిబంధము కలిగించుట) మొదలగు వాటిచే కాలమే పదార్థముల ఉత్పత్తి - వినాశాదికములగు అన్ని అవస్థలతోడను సంబంధించి యున్నది. కావున విశ్వమునందంతటను అనుస్యూత

సమాసము చేసి, తరువాత దానికంటె భావప్రత్యయముచేసిన, ఆ ప్రత్యయము సమాసమువలన భాసించిన సంబంధమును బోధించును, "కృత్తద్ధిత సమాసేభ్యః సంబన్ధాభిధానం భావప్రత్యయేన (కృదంతము కంటె తద్ధితాంతముకంటె సమాసముకంటెను ప్రవర్తించిన భావప్రత్యయము సంబంధమును బోధించును.) అని భర్తృహరియే వక్కాణించెను. ॥47॥

*అవతారిక*—గోత్వజాతిని గోశబ్దము, ఘటత్వజాతిని ఘటశబ్దము బోధించును. కొన్నిజాతులను బోధించెడి శబ్దములు కానరావు. అచట విలక్షణమగు శబ్దము ప్రయోగింపబడునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అస్వశబ్దాభిధానాస్తు నరసింహాది జాతయః ।**
**సరూపావయవేవాన్యా తాసు శ్రుతి రవస్థితా॥** 48

నరసింహాదిజాతయః + తు = నరసింహము మున్నగు జాతులు మాత్రము, అస్వశబ్దాభిధానాః = స్వశబ్దము వాచకముగా కలవి కానేరవు. అనగా వానినిబోధించెడి శబ్దములు లేవనిభావము. తాసు = వానియందు అనగా నరసింహాది జాతులయందు, సరూపావయవా + ఇవ = సమానమగురూపములుకల అవయవములు కలదివలెనున్న, అన్యా = మరియొక, జాతిః = జాతి, అవస్థితా = ఉన్నది.

విష్ణువు నరసింహ రూపమును ధరియించెను. అందు నరత్వము సింహత్వము కూడ కానవచ్చుచున్నది. కాగా రెండు సమానములగు అవయవములు కలిగిన వేరుగా ఉన్న మరియొక జాతి అచటఉన్నది. దానిని చెప్పుటకు ప్రత్యేకించి ఒక శబ్దములేదు. ఏదో విలక్షణమగు'నరసింహ' అనుశబ్దము వాడబడుచున్నది.

ఇట్లే గౌరీఖర (ఒకజాతి అడవి కోతి)మున్నగు శబ్దముకూడ విలక్షణమగు రెంటు సమానమగు అవయవములుకల విశిష్ట జాతివాచకము. ॥48॥

*అవతారిక*—ఇంతవరకు ఎల్లశబ్దములకు జాతియే వాచ్యమగునని నిర్ణయింపబడినది. ఇట్టి యర్థముద్వారా పదము పరీక్షింపబడినది. అర్థము లేనిది, ఇది పదము, అ అ అపోద్ధారము అనగా వాక్యమునుండి పదమును వేరుచేయుట సుశక్యముకాదు. పై యభిప్రాయముతో అర్థము చూపబడినది.

అందుప్రకృతిభాగము ప్రత్యయభాగముకూడ జాతులనే బోధించుననియు నిర్ణయింపబడినది. అనగా 'ఘటమ్' అను ద్వితీయైక వచనాంత శబ్దము వినబడుచున్నది. అచట ఘట, అనునది ప్రకృతి, అది ఘటత్వజాతిని బోధించును. అమ్, అనునది విభక్తి ప్రత్యయము, అదియు కర్మత్వ జాతిని ఏకత్వ సంఖ్యయందున్న ఏకత్వత్వ జాతిని బోధించునని సిద్ధాంతము చేయబడినది.

అచట ప్రకృత్యర్థమగు జాతికి ప్రత్యయార్థమగు జాతికి సమన్వయము అనగా పరస్పర సంబంధమును జూపుచున్నాడు.

ముగ నుండి ఆత్మవలె నున్నది. అందుచే అన్ని వ్యాపారములతో సంబంధించిన కాలమునే వ్యాపారమని యందురు. ॥12॥

అవతారిక— కాలము విశ్వాత్మ యను విషయమునే ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ మూర్తీనాం తేన భిన్నానామాచయా పచయాః పృథక్ ।**
**లక్ష్యన్తే పరిణామేన సర్వాసాంభేదయోగినా ॥** 13

**భేదయోగినా** = ఆ యా పదార్థములకు సంబంధించిన క్రియా విశేషములచే నేర్పడిన భేదముతో కూడిన, **తేన** = ఆ కాలముచే చేయబడిన, **పరిణామాత్** = పరిణామము వలన, **భిన్నానామ్** = పరస్పర భిన్నములగు, **సర్వాసాం** = సమస్తమైన, **మూర్తీనాం** = మూర్త పదార్థముల యొక్క, **ఆచయాపచయాః** = వృద్ధి హ్రాసములు, **పృథక్** = వేరువేరుగా, **లక్ష్యన్తే** = చూడబడుచున్నవి.

తాత్పర్యము— క్రియా భేదముతో సంబంధము కలిగియుండుటచే ఏర్పడిన భేదము గల ఆ కాలముచే కలిగిన పరిణామముచే భిన్నములగు అన్ని పదార్థముల యొక్కయు వృద్ధి హ్రాసములు వేరు వేరుగ చూపబడుచున్నవి.

వివరణము— కాలము అభిన్నమైనను పదార్థములకు సంబంధించిన క్రియలతో సంబంధమువలన భిన్నమువలె కన్పట్టుచున్నది. అట్టి కాలముచే కలిగిన పరిణామముచే ఆయా పదార్థముల వృద్ధి హ్రాసములు వేరు వేరుగ కన్పట్టుచున్నవి.

కాలకృతములగు జన్మ వినాశాదులు నిత్య పదార్థములందు ఉండవుగాన ఇచట అనిత్య పదార్థవాచకమగు 'మూర్తీనామ్' అను పదము ప్రయుక్తమైనది. ॥13॥

అవతారిక— సార్థకమగు పేరును బట్టియే కాలము విశ్వ వైచిత్ర్యమునకు కారణమని చెప్పవచ్చు నని చెప్పుచున్నాడు.

**శ్లో॥ జలయంత్ర భ్రమావేశ సదృశీభిః ప్రవృత్తిభిః ।**
**స కలాః కలయన్ సర్వాః కాలాఖ్యాం లభతే విభుః ॥** 14

**విభుః** = వ్యాపకము, నిత్యము, సర్వస్వతంత్రమును అగు, **సః** = ఆ కాలము, **జలయంత్ర భ్రమావేశ సదృశీభిః** = జలయంత్రము యొక్క భ్రమణముచే కలిగిన క్షోభముతో సమానమైన, **ప్రవృత్తిభిః** = ఆ వృత్తులచే (మరల మరల వచ్చుచుండుటచే), **సర్వాః** = సమస్తమైన **కలాః** = పదార్థములను, **కలయన్** = విసర్జించుచు, (పుట్టించుచు) **కాలాఖ్యామ్** = కాలమనెడు పేరును, **లభతే** = పొందుచున్నది.

తాత్పర్యము— నిత్యమగు ఆ కాలము జలయంత్రము తిరుగునపుడు కలిగిన క్షోభముతో సమానములగు పరావర్తనములచే ఆ యా పదార్థముల కలనము (సృష్టి) చేయుటచే కాలమను అన్వర్థ నామధేయము పొందినది.

వివరణము — జలయంత్రమున కొన్ని ఘటములు అమర్చి ఉండును. ఆ యంత్రమును విశాలమగు నూతిలోనికి త్రిప్పుచుందురు. ఆ యంత్రము తిరుగునపుడు ఘటములన్నియు ఒకదాని తరువాత ఒకటి నీరు నింపుకొని పైకి వచ్చి నీటిని పైకి చిమ్ముచుండును. ఈ విధముగ కాలము కూడ వసంతాది రూపమున మరల మరల వచ్చుచు ఆ యా పదార్థములను సృష్టించుచుండును. ఇట్లు నిత్యమై, సర్వస్వతంత్రమై సమస్త పదార్థ కలనము (సృష్టి) చేయుచుండుటచే ఇది కాలమైనది.

విశ్వాత్మకమును, పరబ్రహ్మ పరదామధేయమును అగు సత్యపదార్థము ఒక్కటియే. అది నానావిధ కార్యములకు కారణమగుటచే దానిని సర్వశక్తి యందురు. అది చక్ర భ్రమణమున తిరుగుచున్న ఘటములవలె ఎల్లపుడును తిరుగుచుండెడు పదార్థములను సృజించును గాన 'కలయతి భూతానీతి కాలః' అను వ్యుత్పత్తిచే కాలమను పేరును వహించియున్నది అది విభువు - అనగా స్వతంత్రము. కావుననే "అధ్యాహృతకలాం యస్య కాల శక్తి ముపాశ్రితాః" (వాక్యపదీయము I. 3) అను కారికలో కాలము స్వాతంత్ర్య శక్తిరూపమైనదని చెప్పబడియున్నది. ఈ విషయము "శక్త్యాత్మ దేవతా పక్షైర్భిన్నం కాలస్య దర్శనమ్" అను కారికలో మున్ముందు (వాక్యపదీయము III. కాల. 62) స్పష్టము కాగలదు. ॥14॥

అవతారిక— కాలము మొదట ప్రతిబంధ రూప ప్రవృత్తిని చూపి తరువాత అనుజ్ఞా రూప ప్రవృత్తిని చూపుచుండును. ఈ విధముగ విశ్వమంతయు కాల పరతంత్రమని సోదాహరణముగ ప్రతిపాదించుచున్నాడు.

**శ్లో॥ ప్రతిబద్ధాశ్చ యాస్తేన చిత్రా విశ్వస్య వృత్తయః ।**
**తాః స ఏవానుజానాతి యథా తన్తుః శకున్తికాః ॥ 15**

తేన = ఆ కాలముచేత, విశ్వస్య = ప్రపంచముయొక్క, చిత్రాః = విచిత్రమైన, యాః = ఏ వృత్తయః = సాధన శక్తులు, ప్రతిబద్ధాః = నిరుద్ధములైనవో (కార్య జననమున అసమర్థములుగ చేయబడినవో), తాః = ఆ శక్తులను, స ఏవ = ఆ కాలమే, తంతుః = దారము, శకున్తికాః యథా = చిన్న పక్షులనువలె, అనుజానాతి = ఆవిర్భవించుటకు వీలుకల వాటినిగ కూడ చేయును.

తాత్పర్యము— కాలము ప్రపంచముయొక్క విచిత్రములగు సాధన శక్తులు, తమ కార్యములను ఆవిర్భవింప చేయజాలనట్లు చేయును. దారము చిన్న పక్షులను ప్రతిబద్ధము లగునట్లు చేసి మరల ఎగురునట్లు చేయు విధమున ఆ కాలమే మరల ఆ విశ్వ సాధన శక్తులను కార్యములు చేయునట్లు అనుమతించును.

విశేషము— కాలము హేమంతాది రూపమున నుండి, సాధన శక్తులు ఆ యా పుష్ప ఫలాదులను ఆవిర్భవింప చేయజాలనట్లు చేయును. ఆ కాలమే వసంతాది రూపమును పొంది ఆ ప్రతిబంధమును తొలగించుటతో సాధన శక్తులు తమ తమ కార్యములను చేయజాలు

చున్నవి. వేటగాండ్రు పెద్ద పక్షులను పట్టుకొనుటకై వాటికి ఎరగా చిన్న పక్షిని ఒక త్రాడికి గట్టి దానిని ఇటు అటు ఎగురునట్లు చేయుదురు. కాని ఆ త్రాడు లాగుచుండుటచే ఆ పక్షి స్వేచ్ఛగా ఎగిరి పోజాలదు. ఇట్లు సూత్రము ఆ చిన్ని పక్షుల గమనమునందు సంకోచ వికాసములు చేయుచుండును. ఈ విధముగనే పదార్థములన్నియు కాల సూత్రమున కట్టువడి ఉత్పత్తి వినాశరూపములగు సంకోచ వికాసముల కెల్లపుడును లోనగుచుండును. ॥15॥

అవతారిక— ఈ సంకోచ వికాసముల క్రమ మెట్లుండునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ విశిష్ట కాలసంబంధా ల్లబ్ధపాకాసు శక్తిషు ।**
**క్రియాభివ్యజ్యతే నిత్యా ప్రయోగాఖ్యేన కర్మణా ॥ 16**

విశిష్ట కాలసంబంధాత్ = విశిష్టమగు కాలముయొక్క సంబంధమువలన, శక్తిషు = మూల కారణ గతములగు శక్తులు, లబ్ధ పాకాసు = పొందబడిన పరిపాకము కలవగుచుండగా, ప్రయోగాఖ్యేన = ప్రేరణా రూపమగు, కర్మణా = కర్మచే, నిత్యా = నిత్యమగు, క్రియా = క్రియ, అభివ్యజ్యతే = అభివ్యక్తమగును.

తాత్పర్యము— విశిష్ట కాలసంబంధముచేత కారణగతములగు కార్యజనన శక్తులు ఫలోన్ముఖములు కాగా, ప్రేరణా రూపమగు కర్మచే నిత్యమగు క్రియ అభివ్యక్తమగును.

వివరణము— ప్రపంచ సృష్టియంతయు ప్రాణుల సుఖదుఃఖభోగముల నిమిత్తము ఏర్పడుచుండును. కావున ప్రలయాంతమున ప్రాణుల అదృష్ట (కర్మ) వశముచే, జగమునకు మూలకారణములుగ వైశేషికాదులచే అంగీకృతములగు పరమాణువులందు గాని, సాంఖ్యాద్యంగీకృతములగు ప్రధానాదులందు గాని, కార్య జనకములగు శక్తులు ఫలోన్ముఖములగును. అపుడా మూలకారణములు పరస్పర సంశ్లేషము పొందుటకై ప్రేరణా రూపమగు ఒక కర్మ విశేషము కలుగును. దానిచే సర్వపదార్థ సంబంధమగు, క్రియ ప్రకటీకృతమగును. ఈ విధముగ సవ్యాపారము లగు కారణములు పరస్పర సంయోగము చెందును. ॥16॥

అవతారిక— ఇట్లు నిత్య క్రియ అభివ్యక్తమైన పిమ్మట ఏమి జరుగునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ జాతి ప్రయుక్తా తస్యాం తు ఫలవ్యక్తిః ప్రతీయతే ।**
**కుతోఽప్యద్భుతయా వృత్త్యా శక్తిభిః సా నియమ్యతే ॥ 17**

తస్యాం = ఆ నిత్యమగు క్రియ అభివ్యక్తమైన దగుచుండగా, ఫలవ్యక్తిః + తు = ఫలవ్యక్తి, అనగా కార్యరూప వ్యక్తి, జాతి ప్రయుక్తా = జాతిచే ప్రేరితమైనదై, ప్రతీయతే = కానవచ్చును, సా = అ ఫలవ్యక్తి, అద్భుతయా = ఆశ్చర్యకరమగు, కుతోఽపి = ఒకానొక, వృత్త్యా = వృత్తిచే (పద్ధతిచే), శక్తిభిః = కారణ శక్తులచేత, నియమ్యతే = నియమింపబడును.

తాత్పర్యము— ఆ నిత్య క్రియ అభివ్యక్తమైన పిమ్మట, జాతి ప్రేరితమై ఫల వ్యక్తి కలుగును. కారణ శక్తులు ఆ కార్యమును ఏదియో ఒకానొక అద్భుతమగు పద్ధతిచే నియమించును.

వివరణము— నియత జాతీయములగు పదార్థములు కలసినపుడే కారణములందు వ్యాపారము (క్రియ) జనించును గాన నిత్య క్రియకు జాతి ప్రయోజకము, అనగా ఆ క్రియ కలుగుటకు ప్రయోజక కారణము. ఈ విధముగ జాతి ప్రయుక్తమై ఆ నిత్య క్రియ కార్యాభి వ్యక్తికి హేతువగుచున్నది. ఉత్పత్తికి పూర్వము కార్యము సత్తు (ఉన్నది) అనిగాని అసత్తు (లేనిది) అనిగాని చెప్పజాలము, అది సత్తు అన్నచో ఉన్న దానిని పుట్టించుటకు కారణ ప్రవృత్తి వ్యర్థము కావలసి వచ్చును. అసత్తు అన్నచో - అనగా కారణ వ్యాపారముచే అంతకు పూర్వము లేని కార్యమే పుట్టుచున్నది అని యన్నచో, మట్టి, చక్రము, దండము మొదలగు కారణముల వలన అంతకు పూర్వము లేని ఘటము పుట్టినట్లు అంతకు పూర్వము లేని పటము ఏల జనింపరాదు - అను ప్రశ్న వచ్చును. కావున కార్యము సత్తు అనికాని అసత్తు అనికాని చెప్పుటకు వీలులేదు. కారణ శక్తులు అట్టి కార్యమునకు స్థితి కల్పించుచున్నవనిన ఇది ఎంతయు ఆశ్చర్యకరమగు విషయము. ఈ స్థితిని ఎట్లు కల్పించుచున్నవో చెప్పజాలము. కావుననే 'కుతోఽప్యద్భుతయా వృత్త్యా' అని చెప్పబడినది. ॥17॥

అవతారిక— అటు పిమ్మట ఏమి జరుగునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ తతస్తు సమవాయాఖ్యా శక్తిర్భేదస్య బాధికా ।**
**ఏకత్వమివ తా వ్యక్తీ రాపాదయతి కారణైః ॥ 18**

తతః = కారణ శక్తులచే కార్యవ్యక్తులు నియమితములైన పిమ్మట, భేదస్య = భేదమును, బాధికా = బాధించు, సమవాయాఖ్యా = సమవాయమనెడు, శక్తిః = శక్తి, తాః = ఆ, వ్యక్తీః = కార్యరూప వ్యక్తులను, కారణైః = కారణములతో, ఏకత్వం = అభేదమును, ఆపాదయతీవ = పొందించుచున్నదా అన్నట్లు ఉన్నది.

తాత్పర్యము— అటుపిమ్మట భేదబాధకమగు సమవాయమనెడు శక్తి కార్యములకు కారణములతో ఒకి విధమగు అభేదమును కల్పించును.

వివరణము— 'ఇహ తంతుషు పటః' - "ఈ తంతువులలో పటము ఉన్నది" ఇత్యాది ప్రతీతిని బట్టి కారణములగు తంతువులకును కార్యమగు పటమునకును ఒక విధమగు సంబంధమున్నట్లు తెలియుచున్నది. అది సమవాయ సంబంధము. ఈ సమవాయము గూడ పరతంత్రమే గాన శక్తిరూపమే. ఈ సమవాయశక్తి భేదమును బాధించు స్వభావము కలది గావున కార్యకారణముల నడుమ భేదము లేనట్లు చూపును.

కారణ వ్యతిరిక్తమగు కార్యము లేదని కొందరు దార్శనికుల యభిప్రాయము. కారణములగు తంత్వాది రూప అవయవములు భిన్నములుగ కనబడుచున్నవి. కార్యములగు

పటాద్యవయవులు అభిన్నములుగ (ఏకవస్తు రూపమున) కనబడుచున్నవి. కావున అవయవము లును అవయవులును అభిన్నములని చెప్పరాదని కొందరి యభిప్రాయము. ఈ అభిప్రాయ మును పురస్కరించుకొని 'ఏకత్వమివ' అని 'ఇవ' శబ్దము ప్రయోగింపబడినది. ॥18॥

అవతారిక— ఈ విధముగ కారణశక్తులచే కార్యము ప్రతిష్ఠితమైన పిమ్మట ఏమి జరుగునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ అథాస్మాన్నియమాదూర్ధ్వం జాతయో యాః ప్రయోజికాః ।**
**తాః సర్వా వ్యక్తిమాయాన్తి స్వచ్ఛే ఛాయా ఇవాంభసి ॥ 19**

అథ = మరియు, అస్మాత్ = ఈ (కారణశక్తి కృతమగు), నియమాత్ = కార్యనియమము నకు, ఊర్ధ్వం = పిమ్మట, ప్రయోజికాః = క్రియా ప్రయోజకములగు, యాః = ఏ, జాతయః = జాతులు కలవో, తాః సర్వాః = అవి అన్నియు, స్వచ్ఛే = స్వచ్ఛమగు, అంభసి = ఉదకమునందు, ఛాయాః ఇవ = వృక్షాది ప్రతిబింబములువలె, వ్యక్తిం = కార్యవ్యక్తిని, ఆయాన్తి = పొందును.

తాత్పర్యము— కారణశక్తులు కార్యమును ఈ విధముగ తమలో నియమించిన పిమ్మట, క్రియా ప్రయోజకములగు జాతులన్నియు, స్వచ్ఛమగు ఉదకమును వృక్షాది ప్రతి బింబములు చేరినట్లు, ఆ వ్యక్తిని పోయి చేరును.

వివరణము— కారణశక్తులు తమవలన జనించిన కార్యమును తమలో నియ మించును. అనగా - జనించి, స్థితిని సంపాదించుకొనిన కార్యము, కారణ మెచట నుండునో అచటనే ఉండును గాని, మరియొక స్థానమున ఉండదు. కార్యమునకు, కారణ స్థితికంటె భిన్నమగు స్థితి లేదు. కారణములు కార్యమును నియమించుట యనగా ఇదియే. కార్య మీ విధముగ స్థితిని పొందిన వెనువెంటనే, ఆ క్షణముననే, తనకు కారణభూతములగు జాతులతో గూడ సంబంధమును పొందును. ఉదాహరణమునకు- ఘట రూపకార్యము పుట్టిన క్షణము ననే సత్త, ద్రవ్యత్వము, పృథివీత్వము మొదలగు జాతులు దానితో సంబంధించును. నిర్మల మగు జలమునందని వృక్షాది ప్రతిబింబము జలాభిన్నముగ భాసించునట్లు ఈ సత్తాది జాతులు గూడ కార్యాభిన్నములుగ భాసించును. ॥19॥

అవతారిక— పిమ్మట గుణములు జనించునని చెప్పుచున్నాడు,

**శ్లో॥ కారణానువిధాయిత్వాదథ కారణ పూర్వకాః ।**
**గుణాస్తత్రోపలభ్యన్తే స్వజాతి వ్యక్తిహేతవః ॥ 20**

అథ = అటుపిమ్మట, స్వజాతి వ్యక్తిహేతవః = తమ జాతులయొక్క (రూపత్వాది జాతుల యొక్క) అభివ్యక్తికి కారణ భూతములైన, గుణాః = రూపాది గుణములు, కారణాను విధా యిత్వాత్ = కారణమును అనుసరించున వగుటచే - అనగా కారణము జనించిన పిదప జనిం

చున వగుటచే, కారణ పూర్వకాః = కారణము పూర్వమునందు కలవగుచునే, తత్ర = ఆ కార్యమునందు, ఉపలభ్యన్తే = పొందబడుచున్నవి.

విశేషము— తంతు సంయోగమువలన పటము ఉత్పన్నమగుచున్నది. ఈ పటమునకు తంతువులు సమవాయి కారణము. తంతువుల సంయోగము అసమవాయి కారణము. ఈ విధముగ సమవాయికారణాసమవాయి కారణములను బట్టి ఉత్పన్నమగు పట రూప కార్యము ఉత్పన్నమైన వెంటనే ఒక క్షణకాలము పాటు ఏ గుణములు గాని, ఏ క్రియ గాని లేకుండ ఉండును. "ఉత్పన్నం ద్రవ్యం క్షణమగుణం నిష్క్రియం చతిష్ఠతి" అని నైయాయిక సమయము. రెండవ క్షణమున ఈ ద్రవ్యమునందు రూపాదిగుణములు జనించును. ద్వితీయ క్షణమున జనించు ఈ రూపాది గుణములకు పటము సమవాయి కారణము. తంతువులకు చెందిన రూపాది గుణములు అసమవాయి కారణము. ఈ విధముగ ఉత్పన్నములగు రూపాది గుణములు తమ రూపత్వాది జాతులను అభివ్యంజింప చేయును.

అదృష్టవశముచేత పరమాణువులయందు క్రియ ఉత్పన్నమగును ; క్రియవలన విభాగము కలుగును. విభాగము వలన పూర్వ దేశముతో సంయోగము నశించును. పూర్వ సంయోగ నాశము వలన ఉత్తరదేశ సంయోగము ఏర్పడును. పిమ్మట ద్వ్యణుకాది క్రమమున పదార్థము లుత్పన్నమగును. భోగసాధనములగు ఇట్టి పదార్థముల సృష్టికంతకును క్రమాఖ్యమగు కాల శక్తియే కారణము అని ఈ శ్లోకముల తాత్పర్యము. ॥20॥

అవతారిక— ఇంతవరకును కాలము పదార్థముల జన్మమునకు ఏ విధముగ కారణమగుచున్నదో ప్రతిపాదించి పదార్థముల స్థితికి కూడ కాలమే కారణమని నిరూపించుచున్నాడు.

**శ్లో॥ ఆశ్రయాణాం చ నిత్యత్వ మాశ్రితానాం చ నిత్యతా ।**
**తా వ్యక్తీరనుగృహ్ణాతి స్థితిస్తేన ప్రకల్పతే ॥ 21**

ఆశ్రయాణాం = ఆశ్రయముల యొక్క, నిత్యత్వం చ = నిత్యత్వము, ఆశ్రితానాం = ఆశ్రయించిన వాటియొక్క, నిత్యతా చ = నిత్యత్వమూ, తాః = ఆ, వ్యక్తీః = వ్యక్తులను, అనుగృహ్ణాతి = అనుగ్రహించుచున్నది, తేన = దానిచేత, స్థితిః = పదార్థముల యొక్క స్థితి, ప్రకల్పతే = ఏర్పడుచున్నది.

తాత్పర్యము— ఆశ్రయముల యొక్క నిత్యత్వము, ఆశ్రయించి యున్న వాటి యొక్క నిత్యత్వము ఆ వ్యక్తులను అనుగ్రహించుచుండుటచే వాటి స్థితి సాధ్యమగుచున్నది.

వివరణము— కార్యవ్యక్తులకు కారణభూతములగు కొన్ని పరమాణ్వాదులు నిత్యములు. ఆ కారణములను ఆశ్రయించుకొని కార్యములుండును. కావున కార్యములకు ఆశ్రయములుగ నున్న ఆ పరమాణ్వాది కారణములు నశింపకుండ నుండుటచే ఈ కార్యములు ఉనికి సాధ్యమైనది. ఈ విధముగ కారణముల నిత్యత్వము (అనగా నిత్యమగు కారణములు) కార్యవ్యక్తులను అనుగ్రహించుచున్నది. ఇట్లే కార్య వ్యక్తులను ఆశ్రయించుకొని యున్న ఘటత్వాది

జాతులు కూడ నిత్యములు. ఆశ్రితములగు ఈ జాతుల నిత్యత్వము గూడ వ్యక్తులను అనుగ్ర హించుచున్నది. అనగా ఆ వ్యక్తు లున్నంతకాలము ఆ యా జాతులతో సంబంధించి యుండు టకు వీలగుచున్నది. ఈ విధముగ ఆశ్రయములగు కారణముల నిత్యత్వము ఆశ్రితములగు జాత్యాదుల నిత్యత్వము అనుగ్రహించుటచే ఘటాది కార్యవ్యక్తుల యునికి (స్థితి) సాధ్యమై నది. అనగా కారణములు లేకపోయినచో కార్యములు నిరాధారములై నశించి యుండెడివి. జాతులు లేకపోయినను కార్యములను వ్యవహరించుట కుదరదు గాన అవి లేనివాటితో సమానమై యుండెడివి. ॥21॥

అవతారిక— ఈ విధముగ ఉత్పత్తివలె పదార్థముల స్థితి కూడ పరాధీనమైనదే యని చెప్పుచున్నాడు.

శ్లో॥ అనిత్యస్య యథోత్పాదే పారతంత్ర్యం తథా స్థితౌ ।
వినాశాయైవ తత్సృష్ట మస్వాధీనస్థితిం విదుః ॥ 22

అనిత్యస్య = అనిత్యమగు కార్యమునకు, ఉత్పాదే = ఉత్పత్తి విషయమున, యథా = ఎట్లు, పారతంత్ర్యం = పరాధీనత్వమో, స్థితౌ = స్థితియందు కూడా, తథా = అట్లే, తత్ = ఆ కార్యము, వినాశాయైవ = నశించుటకొరకు మాత్రమే, సృష్టం = సృష్టింపబడినదై యుండెడి (కావున) అస్వాధీన స్థితిం = స్వాధీనము కాని స్థితికల దానినిగా, విదుః = చెప్పుదురు.

తాత్పర్యము— అనిత్యమగు కార్య వ్యక్తి ఉత్పత్తి విషయమున ఎట్లు పరాధీనమో స్థితి విషయమున గూడ అట్లే పరాధీనము. కానిచో అది నశించుటకొరకు మాత్రమే సృష్టింప బడినదని చెప్పవలసి యుండును. కావున కార్య వ్యక్తి స్థితి విషయమున గూడ పరాధీనమే యని చెప్పుదురు.

వివరణము— కార్యమునకు కారణము అవష్టంభకముగ (ఆధారముగ) లేకున్నచో అది నిరాధారమై పుట్టిన వెంటనే నశించి యుండెడిది. అట్లైనచో ఆ వస్తువు ఏదియో యొక ప్రయోజనము నుద్దేశించి సృష్టింపబడినదని కాక నశించుటకు మాత్రమే సృష్టింపబడినదని చెప్పవలసి యుండును. కావున కార్యము స్థితి సమయమున గూడ పరాధీనమే యని వైశేషి కాదులు చెప్పుదురు. ॥22॥

అవతారిక— ఉత్పన్నమగు భావము (ద్రవ్య వ్యక్తి) అర్థక్రియాకారికావలె నన్నచో (కొన్ని కార్యములను సాధింపవలెనన్నచో) దానికి స్థితిని అంగీకరింపవలెను అని చెప్పుట యుక్తము కాదు. ఆ కార్య వ్యక్తి అర్థ క్రియల నన్నింటిని క్రమముగ చేయునా ఒక్క మారుగ చేయునా? క్రమముగ చేయుచున్నది ఆ ఒక్క కార్యవ్యక్తియే అని చెప్పుటకు ప్రమాణము లేదు. అది అన్ని అర్థ క్రియలను ఒక్కమారుగ చేయుచున్నట్లు కానవచ్చుట లేదు. కావున ఉత్పన్నమగు కార్య వ్యక్తికి స్థితిని అంగీకరింప బనిలేదనియు, అది ఉత్పన్న మైన వెంటనే నశించుననియు ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్థితః సంసర్గిభిర్భావైః స క్రియాస్వను గృహ్యతే ।
నైషాం సత్తా మనుద్గృహ్య వృత్తిర్జన్మవతాం స్మృతా ॥ 23**

స్థితః = స్థితమగు, సః = ఆ భావము (కార్యవ్యక్తి), సంసర్గిభిః = తనతో సంసర్గము కల, భావైః = భావములచేత, క్రియాసు = అర్థ క్రియల విషయమున, అనుగృహ్యతే = అనుగ్రహింపబడు చున్నది, జన్మవతాం = ఉత్పన్నములగు భావములకు, ఏషాం = సంసర్గము గల ఈ సహకారుల యొక్క, సత్తాం = స్థితిని, అనుద్గృహ్య = గ్రహింపకుండగా, వృత్తిః = వ్యాపారము, న స్మృతా = చెప్పబడలేదు (అంగీకరింప బడలేదు).

తాత్పర్యము— స్థితిని పొందిన ఆ భావము (పదార్థము) అర్థ క్రియాకరణము విషయమున తనతో సంబంధించు ఇతర భావములచే అనుగ్రహింపబడుచున్నది. వీటి సత్తను స్వీకరింపకుండగా ఉత్పన్నములగు భావపదార్థములు వ్యవహరింపజాలవు.

వివరణము— ఉత్పన్నమగు కార్య ద్రవ్యము స్థితిని పొంది క్రమముగా అర్థ క్రియాకారి యగును. ఇది క్రమముగ ఏల చేయవలయును ; ఒక్క మారుగనే ఏల చేయజాల కున్నది - అను ఆక్షేపము అయుక్తము. ఉత్పన్నమగు ఏ పదార్థమైనను అర్థ క్రియాకారి కావలె నన్నచో దానికి ఇతర భావముల సాహాయ్యము ఆవశ్యకము. ఆ యా భావములతో సంబంధమును బట్టి ఆ యా యర్థ క్రియలను క్రమముగ సాధించుచుండును. ఇతర భావ పదార్థముల సంసర్గ రూపమగు అనుగ్రహము లేనిచో ఏ కార్య వ్యక్తియు అర్థ క్రియాకారి కాజాలదు. అందుచే ఉత్పన్నమగు ప్రతి కార్య వ్యక్తియు స్థితిని పొందును అని అంగీకరించు టలో దోషము లేదు. అనగా ఆ యా భావముల సహకారము లభించినపుడు క్రమ నిష్పన్నము లగు ఆ యా కార్యములను నిర్వహించుట 'స్థితి'కి లక్షణమని చెప్పినట్లైనది. ఈ స్థితికి కాలము హేతువు. ॥23॥

అవతారిక— ఇపుడు కాలమునకు గల ప్రతిబంధ రూప వృత్తిని చెప్పుచున్నారు

**శ్లో॥ జరాఖ్యా కాలశక్తిర్యా శక్త్యన్తర విరోధినీ ।
సా శక్తిం ప్రతి బధ్నాతి జాయన్తే చ విరోధినః ॥ 24**

శక్త్యన్తర విరోధినీ = ఇతర శక్తులకు విరోధినియగు, జరాఖ్యా = జర (జీర్ణమగుట) అనెడు పేరుగల, యా = ఏ, కాలశక్తిః = కాలశక్తి కలదో, సా = అది, శక్తిం = శక్తిని, ప్రతి బధ్నాతి = ప్రతిబద్ధము చేయును (అడ్డుకొనును), విరోధినః చ = విరుద్ధ లక్షణములు కూడ, జాయన్తే = పుట్టును.

తాత్పర్యము— ఇతర శక్తుల నన్నింటిని ఎదుర్కొనెడు జర అనెడు కాల శక్తి, భావములందలి శక్తిని ప్రతిబంధించును. అపుడు కొన్ని విరుద్ధములగునవి పుట్టును.

విశేషము— కాలమునకు జర (దుర్బలమగునట్లు చేయుట) అనెడు ఒక శక్తి

కలదు. ఇది ప్రాణులను అప్రాణులను కూడ వశము చేసికొని వాటియందు అంతవరకును ఉన్న యౌవనాది శక్త్యంతరములను ఎదుర్కొని వాటికి (ప్రాణ్య ప్రాణిరూప కార్యవ్యక్తులకు) గల స్వకార్య కరణశక్తిని పోగొట్టును. అపుడు వాటియందు కార్యకరణ సామర్థ్యమునకు విరుద్ధములగు ప్రజ్ఞామాంద్యము, శుష్కించిపోవుట మొదలగు అవస్థా విశేషములు ఉత్పన్నమగును. వీటిని బట్టి ఆ కార్యవ్యక్తుల ప్రధ్వంసము ఆసన్నమైనదని తెలియును.॥24॥

అవతారిక— ఈ విధముగ భావమును జర ఆక్రమింపగా—

**శ్లో॥ ప్రయోజకాస్తు యే భావాః స్థితి భాగస్య హేతవః ।**
**తిరోభవన్తి తే సర్వే యత ఆత్మా ప్రహీయతే ॥ 25**

స్థితి భాగస్య = కార్యవ్యక్తికి చెందిన స్థితి రూపాంశమునకు, హేతవః = హేతు భూతములును, ప్రయోజకాః = అర్థ క్రియాకరణ ప్రేరకములును అగు, యే = ఏ, భావాః = సంసర్గి పదార్థములు కలవో, తే సర్వే = అవి అన్నియు, తిరోభవన్తి = అంతర్హితము లగును, యతః = దేనివలన, ఆత్మా = ఆ కార్యవ్యక్తి యొక్క స్వరూపము, ప్రహీయతే = నశించునో.

తాత్పర్యము— కార్య వ్యక్తియొక్క స్థిత్యంశమునకు కారణ భూతములును, ప్రేరకములును అగు భావము లన్నియు అంతర్హితము లగును. దానితో ఆ కార్యవ్యక్తి యొక్క స్వరూపము క్షీణించును.

విశేషము— ఒక కార్యవ్యక్తి సహకారులగు ఇతర భావములతో సంబంధమును పొంది తన అర్థ క్రియలను చేయుచుండును. అదియే దాని స్థితి, అని 23 వ కారికలో చెప్పబడినది. ఈ విధముగ ఒక కార్యవ్యక్తి యొక్క స్థిత్యంశమునకు హేతు భూతములై, అది తన అర్థ క్రియలను చేయునట్లు ప్రేరకములగు సహకారి భావము లన్నియు, ఇంతవరకును ఈ కార్య వ్యక్తితో కలిసియున్నవే యైనను, కృతఘ్నములు వలె ఒకటొక్కటిగ దానిని విడిచిపోవును. అవి దూరముగ పోయినతోడనే ఈ కార్యవ్యక్తి తన స్వరూపమును కోల్పోయి నశించును. ॥25॥

అవతారిక— కార్య వ్యక్తుల వినాశము పైన చెప్పిన విధముగ ఏర్పడుచున్నది. అంతియే కాని దీనిని వినాశకారణము నేమియు చేయుటలేదు అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథైవాద్భుతయా వృత్త్యా నిష్క్రమం నిర్నిబన్ధనమ్ ।**
**అపదం జాయతే సర్వం తథాస్యాత్మా ప్రహీయతే ॥ 26**

నిష్క్రమం = క్రమ రహితమును, నిర్నిబన్ధనమ్ = కారణ సంబంధము లేనిదియు, అపదం = స్థానము లేనిదియు అగు, సర్వం = సకల కార్యవ్యక్తియు, యథైవ = ఏ విధముగా, అద్భుతయా = ఆశ్చర్యకరమగు, వృత్త్యా = రీతిచే, జాయతే = పుట్టుచున్నదో, తథా = అట్లే, అస్య = ఈ కార్యవ్యక్తి యొక్క, ఆత్మా = స్వరూపము, ప్రహీయతే = నశించుచున్నది.

తాత్పర్యము— ప్రతి కార్యవ్యక్తియు, క్రమమేమియు లేనిదై, నిర్ణీతమగు కారణ సంబంధము గాని, స్థానము కాని లేనిదై ఏ విధముగ అత్యాశ్చర్యజనకమగు రీతిలో జనించు చున్నదో అట్లే నాశమును కూడ పొందుచున్నది.

విశేషము— ఒక కారణమునుండి కార్యము పుట్టుచున్నదని అనునపుడు ఉత్పత్తి పూర్వము ఆ కార్యము ఉండెనా (సత్) లేదా (అసత్) అను ప్రశ్న ఉదయించును. పూర్వమే ఉండెనన్నచో దానిని పుట్టించుటకై కరణ వ్యాపారము చేయ బనిలేదు. లేనిదే పుట్టుచున్నచో మృత్తునుండి అంతకుపూర్వము లేని ఘటము పుట్టినట్లు అంతకుపూర్వము లేని పటము కూడ ఏల పుట్టరాదు అను ప్రశ్న ఉదయించును. కావున ఉత్పత్తికి పూర్వము కార్యము సత్తు అని కాని అసత్తు అని కాని చెప్పజాలము. ఈ విధముగ కార్యముయొక్క స్వరూపమును గాని, ఉత్పత్తి క్రమమును గాని, కారణముతో దానికి గల సంబంధమును గాని సరిగా నిర్వచించుట కష్టమైన విషయము. మనకు తెలియని ఆశ్చర్యకరమగు రీతిలో కార్య ప్రపంచమంతయు జనించుచున్నదని చెప్పవలెను. దాని వినాశము కూడ ఇట్లే కాలాధీనమై వర్ణనాతీతమగు - రీతిలో జరుగుచున్నదని యభిప్రాయము. ॥26॥

అవతారిక— కాలము చేయు అనుజ్ఞా ప్రతిబంధములను బట్టి సృష్టి స్థితి వినా శాదులు ఏర్పడుచున్నవనియు, వీటి అన్నిటియందును సర్వాత్మకమగు కాలముయొక్క వ్యాపారమున్నదనియు ''ప్రత్యవస్థం తు కాలస్య వ్యాపారోఽత్ర వ్యవస్థితః'' ఇత్యాది కారిక లచే ప్రతిపాదితమైనది. ఇపుడు కాలానుమానమునకు మరియొక హేతువును గూడ చెప్పు చున్నాడు.

శ్లో॥ క్రియయోరపవర్గిణోర్నానార్థ సమవేతయోః ।
సమ్బన్ధినా వినైకేన పరిచ్ఛేదః కథం భవేత్ ॥ 27

అపవర్గిణోః = ఫలప్రాప్తి పర్యంతము వ్యాపించి యున్నవియు, నానార్థ సమవేతయోః = అనేక పదార్థములతో సంబంధించి యున్నవియు అగు, క్రియయోః = రెండు క్రియలకు, ఏకేన = ఒక, సమ్బన్ధినావినా = సంబంధి లేకుండగ, పరిచ్ఛేదః = పరిచ్ఛేదము, కథం = ఎట్లు, భవేత్ = అగును ?

తాత్పర్యము— అనేక పదార్థములతో సంబంధించినవై ఫలప్రాప్తివరకును వ్యాపించియున్న రెండు క్రియలకు, ఒక సంబంధి లేకున్నచో పరిచ్ఛేదము ఎట్లు అగును ?

వివరణము— ఘటము తయారుచేయుటకు చాలసేపు పట్టినది ; పటము నేయు టకు చాలసేపు పట్టినది అని వ్యవహారము లోకమున నున్నది. ఘటమును తయారుచేయుట అను క్రియ వాస్తవమున ఒక క్రియ కాదు. అనేక క్రియా సమాహారాత్మకమైనది. అనగా మట్టి తెచ్చుట, దానిని శుభ్రముచేయుట, చక్రముపైకి ఎక్కించుట, చక్రమును త్రిప్పుట మొదలగు ఎన్నియో క్రియలు ఘటమును తయారుచేయుట అను క్రియతో సంబంధించి దాని

శ్లో॥ జాత్యవస్థా పరిచ్ఛేదే సంఖ్యా సంఖ్యాత్వమేవవా ।
విప్రకర్షేఽపి సంసర్గాదుపకారాయ కల్పతే ॥ 49

సంఖ్యా = ఏకత్వము మున్నగుసంఖ్య అనగాప్రత్యయార్థముగా నున్న సంఖ్యా గత జాతిచే ఆక్షేపింపబడిన సంఖ్య, సంఖ్యాత్వమ్ + ఏవ + వా = అట్లుకాక ప్రత్యయమునకు వాచ్యార్థ మగు సంఖ్యా గతమగు ఏకత్వత్వము మున్నగు జాతిగాని,జాత్యవస్థాపరిచ్ఛేదే = జాతియొక్క అనగా ప్రకృత్యర్థమగు జాతికి అవస్థితి విషయమై అనగా ఆశ్రయముగా నున్న వ్యక్తుల యందు ఉనికి విషయమై పరిచ్ఛేదము చేయవలసి వచ్చినపుడు అనగా ఆ జాతికి ఆశ్రయము ఒకటియా? కాక అనేకమా? (ఆ శబ్దముచే బోధింపబడిన జాతి ఒక వ్యక్తియందే ఉన్నదా ? లేక రెండు మూడు నాలుగు వ్యక్తుల యందు ఉన్నదా?) అను సంశయము కలుగునపుడు, విప్రకర్షే + అపి = దూరముగా ఉన్నను అనగా ప్రకృత్యర్థ ప్రత్యయార్థములగు జాతులు వేరు వేరు వ్యక్తులయ దున్నను, సంసర్గాత్ = సంబంధము వలన, ఉపకారాయ = పై సంశ యమును పోగొట్టి నిర్ణయ రూపమగు ఉపకారముకొరకు, కల్పతే = సమర్థమగుచున్నది.

ప్రత్యయార్థమగు సంఖ్య సమవాయ సంబంధమున ఘటవ్యక్తియందున్నది.ప్రకృ త్యర్థమగు ఘటత్వ జాతియు పై సంబంధమున అ వ్యక్తియందున్నది.కాగా ప్రత్యయమునకు వాచ్యమగు ఏకత్వత్వ జాతిచే నాక్షిప్తమగు ఏకత్వ సంఖ్య ఏకార్థ సమవాయమనే సంబంధమున ప్రకృత్యర్థజాతికి విశేషణమై నియమించగలదు. అనగా జాతికి ఒక వ్యక్తియే ఆధారము అను నిశ్చితార్థమును కలిగించును.

కాక ప్రత్యయార్థమగు ఏకత్వత్వ సంఖ్యా జాతికి ఆశ్రయము ఏకత్వసంఖ్య, దానికి సమవాయమున ఆశ్రయము ఘటవ్యక్తి. ఘటత్వ జాతికి గూడ ఆ వ్యక్తియే ఆశ్రయము. కాగా స్వాశ్రయ సమవేత సమవాయమనే సంబంధముచే ఆశ్రయ నియమము కలుగును.

ఇట్లే పచతి, పచతః మున్నగు క్రియాపదములలో గూడధాతువు క్రియాత్వజాతిని, ప్రత్యయములు కర్తృత్వ జాతిని సంఖ్యాజాతిని బోధించును అచటకూడ పై ప్రకారము ప్రత్యయార్థమగు జాతి పై సంబంధము వలన ప్రకృత్యర్థమగు క్రియాత్వజాతికి విశేషణము కాగలదు. అచటను ఆశ్రయమగు క్రియ ఒకటియా? లేక రెండా? అను సంశయము లేక నిశ్చి తార్థము కలుగును. ॥49॥

*అవతారిక* — జాతియే ఎల్ల శబ్దములకు వాచ్యమగును. అందును ప్రత్యయార్థ మగు ఏకత్వత్వము మున్నగు జాతులు ద్రవ్యముద్వారా ప్రకృత్యర్థమగు జాతితో సంబం ధించును. కనుక ప్రకృతి ప్రత్యయములు కలసి ప్రయోగింపబడగలవని యింతవరకు చూపబడినది.

ప్రకృతి ప్రత్యయములచే బోధింపబడిన అర్థములు పరస్పరము అన్వితములై వాక్యార్థమున కలసి యుండును. దానివలనమనుష్యులకు కొన్ని కర్మములయందు ప్రవర్తించుట నివర్తించుటయు జరుగును.

యందు అంతర్గతములై యున్నవి. పట నిర్మాణాది క్రియలు కూడ ఇట్లే ఈ విధముగ ఘట పటాది నిర్మాణ రూప క్రియాంతర్గతములగు వివిధ క్రియలతో అనుస్యూతముగ సంబంధించు కాలమనెడు ఒకదానిని అంగీకరింపకున్నచో ఈ పని శీఘ్రముగ జరిగినది, ఈ పని ఆలస్యముగ జరిగినది అనెడు వ్యవహారము కుదరదు. అవాంతర క్రియ లన్నియు వేరు వేరు క్రియలు కావునను అవి యన్నియు ఉత్తరక్షణ విధ్వంసులు కావునను, అవి వేటికవియే భిన్నములగుట వలనను ఈ ఘట నిర్మాణము శీఘ్రముగ జరిగినదని గాని, ఈ ఘట నిర్మాణము ఆలస్యముగ జరిగినదని గాని చెప్పుటకు అవకాశముండదు. ఈ అవాంతర క్రియలతో అనుస్యూతముగ సంబంధించియున్న కాలమును అంగీకరించినచో ఆ కాలమును బట్టి ఈ పని శీఘ్రముగ జరిగినది, ఇది ఆలస్యముగ జరిగినది అని చెప్పుటకు అవకాశముండును గాన నిత్యమును, సర్వ క్రియానుస్యూతమును అగు కాలము ఉన్నదని అంగీకరింపవలెను. ఈ కాలము ఒక్కటే యైనను వివిధ పదార్థములతో సంబంధించిన క్రియల ప్రమాణమును తెలుపుచు ఈ పటము ఆలస్యముగ తయారయినది, ఈ ఘటము ఆలస్యముగ తయారైనది ఇత్యాది వ్యవహారమునకు నిమిత్తమగుచున్నది. ॥27॥

అవతారిక— కాలము ఏకమే అయినపుడు, ఆలస్యము, శీఘ్రత్వము మొదలగు పరస్పర విరుద్ధములగు ప్రతీతులు ఎట్లు కలుగుచున్నవి అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథా తులాయాం హస్తే వా నానాద్రవ్య వ్యవస్థితమ్ ।**
**గురుత్వం పరిమీయేత కాలాదేవం క్రియాగతిః ॥ 28**

నానాద్రవ్య వ్యవస్థితమ్ = అనేక ద్రవ్యములలో నున్న, గురుత్వం = గురుత్వము, యథా = ఏ విధముగా, తులాయాం = త్రాసుయందు గాని, హస్తే వా = హస్తమునందు గాని, పరిమీయేత = తూచబడునో, ఏవం = ఈ విధముగనే, కాలాత్ = కాలమువలన, క్రియాగతిః = క్రియారీతి, కొలవబడుచున్నది.

తాత్పర్యము— అనేక ద్రవ్యములకు సంబంధించిన బరువులను త్రాసు కాని, హస్తము కాని తూచినట్లు కాలము క్రియాగత భేదములను కొలుచుచున్నది.

వివరణము— కొందరు వర్తకులు అభ్యాసాతిశయవశముచే తులాదండము లేకుండ తమ హస్తముచేతనే వస్తువుల బరువును తెలిసికొనగలరు గాన 'హస్తేవా' అని చెప్పబడినది.

అవతారిక — భేదరహితమగు కాలమే నిమేషాది వివిధ క్రియలను వెనుకకు విడిచి విడిచి 'సంవత్సరము' మొదలగు నామధేయములను పొందుచున్నది అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ జహాతి సహవృత్తాశ్చ క్రియాః స సమవస్థితాః ।**
**వ్రీహిర్యథోదకం తేన హాయనాఖ్యాం ప్రపద్యతే ॥ 29**

వ్రీహిః = వరి అంకురము, ఉదకం యథా = ఉదకమునువలె, సః = ఆ కాలము, సహవృత్తాః = సహకారులైన, క్రియాః = క్రియలను, సమవస్థితాః = సంప్రాప్తములై యున్న క్రియలను, జహాతి = విడచును, తేన = ఆ కారణముచే, హాయనాఖ్యాం = హాయనమను పేరును, ప్రపద్యతే = పొందుచున్నది.

తాత్పర్యము— వ్రీహ్యంకురము తనతో కలిసిఉన్న నీటిని విడిచి పైకి పోవునట్లు కాలము కూడ సంప్రాప్తమగు (జరుగుచున్న) క్రియలను, వాటికి సహకారులుగ నుండు క్రియలను వెనుకకు విడిచి తాను ముందు ముందుకు పోవుచుండును. కావుననే దీనికి 'హాయనము' అను పేరు వచ్చినది.

వివరణము— 'ఓహాక్ త్యాగే' అను ధాతువుకంటె వ్రీహి, కాలము అను నర్థమున 'ల్యుట్' ప్రత్యయము విధింపబడినది. దీనిచే 'హాయనః' అను రూపము సిద్ధించును. వరి లేక సంవత్సరము అని అర్థము. వరి అను నర్థమున "జహాతి ఉదకం" (ఉదకమును విడిచి పైకి వచ్చునది) అని విగ్రహము. సంవత్సర పక్షమున "జహాతి భావాన్" (పదార్థములను విడచునది) అని విగ్రహము. ఈ కారికను బట్టి "జహాతి భావగత క్రియాః" అని విగ్రహము చెప్పుకొనవలెను. కలిసిఉన్న జలము ఏ విధముగ వ్రీహులకు ఉపకరించునో అట్లే కాలము కూడ సహకారులగు క్రియలద్వారా భావములకు ఉపకరించుచున్నది. కావున కాలమునందలి భేదమంతయు ఉపాధికృతమే. వాస్తవమున కాలమనునది ఒక్కటియే.

అవతారిక— కాలము ఒక్కటే యైనచో దానికి క్రమరూపత్వ మెట్లు పొసగును - అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రతిబన్ధాభ్యనుజ్ఞాభ్యాం వృత్తిర్యా తస్య శాశ్వతీ ।**
**తయా విభజ్యమానోఽసౌ భజతే క్రమరూపతామ్ ॥ 30**

ప్రతిబన్ధాభ్యనుజ్ఞాభ్యాం = సాధన శక్తులయొక్క ప్రతిబంధముచేతను అనుజ్ఞచేతను (ప్రతిబంధానుజ్ఞల ద్వారా), తస్య = ఆ కాలముయొక్క, యా = ఏ, శాశ్వతే = శాశ్వతమైన, వృత్తిః = భావముల విషయమున ప్రవృత్తి గలదో, తయా = ఆ ప్రవృత్తిచే, విభజ్యమానః = విభజింపబడు చున్నదై, అసౌ = ఈ కాలము, క్రమరూపతాం = క్రమరూపత్వమును (క్రమమును), భజతే = పొందుచున్నది.

తాత్పర్యము— కాలము ఎల్లపుడును ప్రతిబంధానుజ్ఞల ద్వారా సర్వభావముల విషయమునను ప్రవర్తించుచున్నది. ఈ ప్రవృత్తిచే కాలము విభక్తమైనదివలె కనబడుచు క్రమరూపత్వమును పొందుచున్నది.

వివరణము— ఒక క్రియకు సంబంధించిన సాధనశక్తులు పనిచేయకుండ చేయుట ప్రతిబంధము. అవి పనిచేయునట్లు చేయుట అభ్యనుజ్ఞ. ఈ విధములగు ప్రతిబంధాభ్యనుజ్ఞల ద్వారా కాలము సర్వభావములతోడను సంబంధించుచున్నది. ఈ ప్రతిబంధాభ్యనుజ్ఞాక్రమ

మును బట్టి కాలమునందు క్రమమున్నట్లు తోచుచున్నది గాని వాస్తవమున దానియందు క్రమము లేదు. ఎల్లవేళల పరిణామమును చెందు భావములలో ఒకటి పుట్టుచుండును, మరి యొకటి నశించుచుండును. ఈ విధముగ ఆ యా క్రియల ద్వారా కార్యములకు చెందిన క్రమము కాలమునందు ఆరోపింపబడుచున్నది. ॥30॥

అవతారిక— సామ్య వైషమ్యాదులు కూడ కాలమునందు ఆరోపితములైనవే యని చెప్పుచున్నాడు.

శ్లో॥ కర్తృభేదాత్తదర్థేషు ప్రకర్షాపచయౌ గతః ।
సమత్వం విషమత్వం వా న ఏకః ప్రతిపద్యతే ॥ 31

ఏకః = ఒక్కటైన (భేదరహితమైన), సః = ఆ కాలము, కర్తృభేదాత్ = ఆ యా కర్తల యొక్క భేదమువలన, తదర్థేషు = వారు చేయవలసిన ఆచారముల విషయమున, ప్రకర్షాపచయౌ = ఉత్కర్షాపకర్షములను, గతః = పొందినదై, సమత్వం = సమత్వమును కాని, విషమత్వం వా = విషమత్వమును కాని పొందుచున్నది.

తాత్పర్యము— కాలము ఒక్కటియేయైనను, కర్తల భేదము ననుసరించి ఆ యా ఆచారాదుల విషయమున నేర్పడిన ఉత్కర్షాపకర్షములను బట్టి సమత్వమును గాని, విషమత్వమును గాని పొందుచున్నది.

వివరణము— అనుష్ఠాత లగువారు శ్రుతి స్మృత్యాది విహితమగు ఆచారమును చక్కగ అనుష్ఠించునపుడు కాలము కృతయుగాది నామధేయములతో సమకాలము (మంచి కాలము) అని చెప్పబడుచున్నది. ఆ అనుష్ఠాతలు ధర్మ మార్గము నుల్లంఘించి యథేచ్ఛగ ప్రవర్తించునపుడు ఆ కాలమే కలియుగాది నామములతో విషమ కాలమని చెప్పబడుచున్నది. ఈ విధముగ సామ్యవైషమ్యములు ధర్మాచరణమునందలి సామ్యవైషమ్యములను బట్టి వచ్చినవే కాని వాస్తవమున కాలమునందు లేవు. కాలము ఎప్పుడును ఏకవిధముగనే యుండును. ॥31॥

అవతారిక— కాలమునందు ఆరోపితమగు మరియొక విభాగమును గూడ చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియాభేదాద్యథైకస్మిం స్తక్షాద్యాఖ్యా ప్రవర్తతే ।
క్రియాభేదాత్తథైకస్మి నృత్వాద్యాఖ్యోపజాయతే ॥ 32

యథా = ఏ విధముగా, ఏకస్మిన్ = ఒకే వ్యక్తియందు, క్రియాభేదాత్ = క్రియా భేదము వలన, తక్షాద్యాఖ్యా = 'వడ్రంగి' మొదలగు పేరు, ప్రవర్తతే = ప్రవర్తించునో, తథా = అట్లే, ఏకస్మిన్ = ఒకే కాలమునందు, క్రియాభేదాత్ = క్రియాభేదము వలన, ఏకస్మిన్ = ఒకే కాలమునందు, ఋత్వాద్యాఖ్యా = ఋతువులు మొదలగు పేరు, ఉపజాయతే = కలుగును.

తాత్పర్యము— (తాను చేయు) పనుల భేదమును పట్టి ఒకే వ్యక్తికి వడ్రంగి

మొదలగు పేర్లు వచ్చినట్లు ఒకే కాలమునకు క్రియాభేదముచే 'ఋతువు' మొదలగు పేర్లు వచ్చుచున్నవి.

వివరణము— ఒకే వ్యక్తికి కర్రపని చేయునపుడు వడ్రంగి యనియు, ఇనుప పనిముట్లు చేయునపుడు కమ్మరి యనియు పేర్లు పెట్టుచుందుము. అట్లే ఆ యా పుష్పవిశేషములను ఆవిర్భవింపచేయుట మొదలగు క్రియా భేదములను బట్టి ఒకే కాలమునకు వసంతర్త్వాది నామధేయములు కలుగుచుండును. 'ఋత్వాద్యాఖ్యా' అను పదమునందలి ఆది పదముచే, ఆ యా క్రియా భేదములచే నేర్పడు శుక్ల కృష్ణపక్ష వ్యవహారము, అహోరాత్రి వ్యవహారము, ప్రదోష ప్రత్యూష వ్యవహారము మొదలగునవి గ్రాహ్యములు. ॥32॥

అవతారిక— కాలమునందు భేదారోపణమునకు కారణాంతరమును గూడ చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆరమ్భశ్చ క్రియాచైవ నిష్ఠా చేత్యభిధీయతే ।**
**ధర్మాన్తరాణా మధ్యాసభేదాత్ సదసదాత్మనః ॥ 33**

సదసదాత్మనః = సదాత్మకమును అసదాత్మకమును అగు పదార్థముయొక్క, ధర్మాన్తరాణాం = విలక్షణములగు భిన్న ధర్మములయొక్క, అధ్యాస భేదాత్ = ఆరోపణమువలన కలిగిన భేదమును బట్టి, ఆరంభశ్చ = ప్రారంభము, క్రియా = క్రియయు, నిష్ఠాచ ఇతి = నిష్ఠ అనియు, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— సదసదాత్మకమగు పదార్థమునకు గల విలక్షణములగు భిన్న ధర్మముల ఆరోపముచే నేర్పడిన భేదమువలన, ఆరంభమనియు, క్రియయనియు, నిష్ఠ యనియు చెప్పబడుచున్నది.

వివరణము— ఉత్పత్తికి పూర్వము పదార్థము అసదాత్మకము, ఉత్పత్త్యనంతరము సదాత్మకము. ఆ వస్తువును బుద్ధిచే ఏకరూపముగ గ్రహించి విలక్షణములగు ధర్మముల భేదమును బట్టి ఆరంభ కాలమనియు, క్రియా కాలమనియు, నిష్ఠా కాలమనియు వ్యవహరించుట జరుగుచున్నది. పదార్థ స్వరూపమును బుద్ధితో ఊహించుకొని యోగ్యములగు సాధనములను సమకూర్చుకొనుట ఆరంభకాలము. సమకూర్చుకొనిన సాధనములతో పనిచేయుట క్రియా కాలము. చేయవలసిన పని పూర్తియగుట నిష్ఠా కాలము. ఈ విధముగ ధర్మభేద కల్పనచే ఆరంభాది కాల విభాగము ఏర్పడుచున్నది. ॥33॥

అవతారిక— ఇట్టి కాల్పనికమగు విభాగము అన్ని పదార్థముల విషయమునను సమానమేయని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యావాంశ్చ ద్వ్యణుకాదీనాం తావాన్ హిమవతోఽప్యసౌ ।**
**నహ్యాత్మా కస్యచిద్వేత్తుం ప్రచేతుం వాపి శక్యతే ॥ 34**

అసౌ = ఈ ఆరంభాది కాలము, ద్వ్యణుకాదినాం=ద్వ్యణుకము మొదలగు వాటి విషయమున, యావాన్ = ఎంతటిదో, హిమవతోపి = హిమవత్పర్వత విషయమునందు గూడ, తావాన్ = అంతటిదిగానే ఉండును, కస్యచిత్ = ఏ ఆరంభాది కాలము యొక్కయు, ఆత్మా = స్వరూపము, భేత్తుం = తగ్గించుటకు గాని, ప్రచేతుం వా = వృద్ధి పొందించుటకు గాని, న శక్యతే హి = శక్యము కాదు కదా ?

తాత్పర్యము— ద్వ్యణుకాదుల ఆరంభాది కాలములు ఎంత యుండునో హిమవత్పర్వ తారంభాది కాలములు కూడ అంతయే ఉండును. ఆరంభాది కాలముల స్వరూపము అవయవిని బట్టి పెరుగుట కాని తగ్గుట గాని ఉండదు కదా ?

వివరణము— రెండు అణువుల సంయోగముచే ఏర్పడినది ద్వ్యణుకము. ఇది అత్యల్ప ప్రమాణము. హిమవత్పర్వతము అత్యధిక ప్రమాణము. అత్యల్పాత్యధిక ప్రమాణములు గల కార్యములగు ఈ రెండు అవయవులకు సంబంధించిన ఆరంభాది కాలములు తుల్యములే. అనగా అవయవులను బట్టి వాటి ప్రమాణములను బట్టి ఆరంభాది కాలములలో ఎట్టి వైశిష్ట్యమును కలుగదు. వాటిలో ఏదైన వైశిష్టమున్నచో అందులకు కారణము వేరు. ॥34॥

అవతారిక— ఆరంభాది కాలములలో వైశిష్ట్య మేర్పడుటకు కారణమేదియో చెప్పుచున్నాడు.

శ్లో॥ అన్యైస్తు భావైరన్యేషాం ప్రచయః పరికల్ప్యతే ।
శనైరిద మిదం క్షిప్రమితి తేన ప్రతీయతే ॥ 35

తు = కాని, అన్యేషాం = అల్ప పరిమాణ మహాపరిమాణము లగు భిన్నావయవులకు, అన్యైః = అవయవి వ్యతిరిక్తములైన, భావైః = అవయవములచే, ప్రచయః = అభివృద్ధి, పరికల్ప్యతే = కల్పింపబడుచున్నది, తేన = దానిచేత, ఇదం = ఇది, శనైః = మందముగ జరుగుచున్నది, ఇదం = ఇది, క్షిప్రం = శీఘ్రముగ జరుగుచున్నది, ఇతి = అని, ప్రతీయతే = తోచుచున్నది.

తాత్పర్యము— అవయవులకు స్వవ్యతిరిక్తము లగు అవయవములచే వృద్ధి కలుగుచున్నది. దానిని బట్టి ఇది ఆలస్యముగ జరిగినది, ఇది శీఘ్రముగ జరిగినది అను ప్రతీతి కలుగుచున్నది.

వివరణము— అవయవములు అధిక సంఖ్యాకము లైనచో అవయవులకు వృద్ధి కలుగుచున్నది. అవి అల్ప సంఖ్యాకము లైనచో అపచయము (హ్రాసము) కలుగుచున్నది. ఈ విధముగ అధిక సంఖ్యాకములగు అవయవములు గల అవయవి ఆలస్యముగ తయారగుచున్నది. అల్ప సంఖ్యాకములగు అవయవములు గల అవయివి శీఘ్రముగ తయారగుచున్నది. ఇట్లు అవయవముల సంఖ్యాభేదమును బట్టి అవయవులకు సంబంధించిన ఆరంభాది కాలములలో వైలక్షణ్యము కనబడుచున్నది. ॥35॥

అవతారిక— ఈ వస్తువు శీఘ్రముగ ఉత్పన్నమైనది, ఇది ఆలస్యముగ ఉత్పన్నమైనది అను వ్యవహారము వాస్తవమున అవయవితో సంబంధించు విభిన్నావయవముల సంఖ్యాల్పత్వాధిక్యములచే ఏర్పడినదే గాని శీఘ్రత్వ మందత్వములలో గోచరించు క్రమము వాస్తవమున అవయవియగు భావమున (పదార్థమున) లేదు అను విషయమునే విశదీకరించుచున్నాడు.

శ్లో॥ అసతశ్చ క్రమోనాస్తి సహి భేత్తుం న శక్యతే ।
సతోఽపి చాత్మతత్త్వం యత్ తత్తథైవావతిష్ఠతే ॥ 36

అసతః + చ = అసత్తు అగు పదార్థమునకు, క్రమః = క్రమము, నాస్తి = లేదు, హి = ఎందువలన అనగా, సః = అసత్తు, భేత్తుం = పౌర్వాపర్యాది క్రమములచే విశేషించుటకు, న శక్యతే = శక్యము కాదు, సతోఽపి = సత్తు అగు పదార్థము యొక్క, యత్ = ఏ, ఆత్మతత్త్వం = ఆత్మ స్వరూపము కలదో, తత్ + చ = అదియు, తథైవ = ఆ విధముగనే అవతిష్ఠతే = ఉండును.

తాత్పర్యము— అసత్ అగు భావమునకు క్రమము లేదు. ఏలయనగా అది భేదింప వీలు కానిది. సత్ అగు పదార్థము యొక్క స్వరూపము కూడ అట్లే - క్రమరహితముగ - నుండును.

విశేషము— అసత్ అనగా ఉత్పత్తికి పూర్వము లేని భావము (పదార్థము) దానికి ఒక స్వరూపమే లేదుగాన పౌర్వాపర్యమనెడు భేదమును పట్టి ఏర్పడు క్రమము దానికి సంభవింపదు. ఒక పదార్థము పుట్టిన పిమ్మట గూడ దాని స్వరూపమున పౌర్వాపర్య రహితముగనే ఉండును గాన దానియందు కూడ క్రమమును అంగీకరింప వీలులేదు కావున సదసత్పదార్థముల విషయమున గోచరించు క్రమము కేవలము బుద్ధి కల్పితమే కాని వాస్తవము కాదు. అనగా ఒక పదార్థము పుట్టుటకు పూర్వము క్రమము లేదు, పుట్టిన పిమ్మట గూడ క్రమము లేదు. ఉత్పత్తికి పూర్వమును ఆ పదార్థ మొకటి ఉన్నదని బుద్ధిచే భావనచేసి అది ఉత్పన్నమైన తరువాత బుద్ధిలో ఉన్న ఆ పదార్థము ఈ పదార్థము కూడ ఒకదేయని అనుకొని ఆ పదార్థమునందు ఒక విధమగు క్రమము ఆరోపింపబడుచున్నది గాని వాస్తవమున పదార్థమున అసదవస్థా - సదవస్థలు రెండింటి యందును క్రమము లేదని అభిప్రాయము.
॥36॥

అవతారిక— క్రియా భేదమును బట్టి కాలమునకు 'ఋతువు' మొదలగు పేర్లు ఏర్పడుటయే కాదు, భూతము, భవిష్యత్తు మొదలగు పేర్లు కూడ ఏర్పడుచున్నవి అని చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియోపాధిశ్చ సన్ భూతభవిష్య ద్వర్తమానతాః ।
ఏకాదశభిరాకారైర్విభక్తాః ప్రతిపద్యతే ॥ 37

క్రియోపాధిః + చ + సన్ = క్రియలు ఉపాధిగా కలనై, ఏకాదశభిః = పదకొండు, ఆకారైః = ఆకారములచే, విభక్తాః = విభక్తములగు, భూతభవిష్యద్వర్తమానతాః = భూతత్వమును, భవిష్యత్త్వమును, వర్తమానత్వమును, ప్రతిపద్యతే = పొందుచున్నది.

తాత్పర్యము— కాలము క్రియారూపములగు ఉపాధులను బట్టి పదకొండు అవాంతర భేదములు గల భూత - భవిష్యద్వర్తమాన నామధేయములను పొందుచున్నది.

వివరణము—ఒక క్రియ ఉత్పన్నమై నశించిపోయినపుడు అట్టి క్రియ ఉపాధిగా కల కాలము భూతకాలము. సాధనములన్నియు సమకూడి ఇక ఈ క్రియ జరుగవచ్చును అను పరిస్థితు లేర్పడినపుడు అట్టి క్రియ ఉపాధిగా కల కాలము భవిష్యత్కాలము. ప్రారంభమై సమాప్తిచెందని క్రియ ఉపాధిగాగల కాలము వర్తమానకాలము. ఈ భూతాదికాలములకు పదునొకండు అవాంతరభేదము లుండును. ॥37॥

అవతారిక— భూతాది కాలములకు గల పదకొండు భేదములను చెప్పుచున్నాడు.

శ్లో॥ భూతః పంచవిధస్తత్ర భవిష్యంశ్చ చతుర్విధః ।
వర్తమానో ద్విధాఖ్యాత ఇత్యేకాదశ కల్పనాః ॥ 38

తత్ర = వాటిలో, భూతః = భూతకాలము, పంచవిధః = ఐదు విధములైనది, భవిష్యన్ + చ = భవిష్యత్కాలము, చతుర్విధః = నాల్గు విధములైనది, వర్తమానః = వర్తమాన కాలము ద్విధా = రెండు విధములైనదిగా, ఆఖ్యాతః = చెప్పబడినది, ఇతి = ఈ విధముగా, ఏకాదశ = పదకొండు, కల్పనాః = భేదకల్పనలు ఉన్నవి.

తాత్పర్యము— భూతకాలము ఐదు విధములనియు, భవిష్యత్కాలము నాలుగు విధములనియు, వర్తమానకాలము రెండు విధములనియు చెప్పబడినది. ఈ విధముగ పదకొండు భేదములు కల్పింపబడుచున్నవి.

విశేషము— భూతకాలము ఐదు విధములు. సామాన్య భూతము మొదటిది. అద్యతన భూతము రెండవది. అనద్యతన భూతము మూడవది. అద్యతనానద్యతన సముదాయ రూప భూతము నాల్గవది. భవిష్యత్తు ఐనను భూతత్వాధ్యారోపముచే భూతకార్యములను పొందునది ఐదవది. ఇది గౌణభూతము. భవిష్యత్తు నాల్గు విధములు. సామాన్య భవిష్యత్తు మొదటిది. అద్యతన భవిష్యత్తు రెండవది. అనద్యతన భవిష్యత్తు మూడవది. అద్యతనానద్యతన సముదాయ రూప భవిష్యత్తు నాల్గవది. వర్తమానము రెండు విధములు. ముఖ్య వర్తమానము మొదటిది. వర్తమానమునకు సమీపముననున్న భూతము కాని భవిష్యత్తు కాని వర్తమానముగ వ్యవహరింపబడును ; అది రెండవది. ఈ విధముగ శాస్త్రకార్య ప్రవిభాగము నిమిత్తము కాలమునకు భేదములు కల్పితములై యున్నవి. వీటి సంఖ్య ఇంతయే యని నియమించుటకు గూడ వీలులేదు. అనంత క్రియాభేదమును బట్టి కాలభేదములను అసంఖ్యాకముగ కల్పింప

వచ్చును. గడచిన రాత్రి నాల్గవ జాము మొదలు ఈ రాత్రి మొదటి జాము వరకును గల కాలము అద్యతనము తద్భిన్నము అనద్యతనము. ॥38॥

అవతారిక— కడచిపోయిన క్రియను బట్టి కాలమునందు ఇది భూతకాలము అను వ్యవహారము కలుగుచున్నది అని చెప్పబడినది. ఎప్పుడో జరిగి ఇపుడు లేని క్రియ కాలము నందు భూతవ్యపదేశమును (భూతమను పేరును) ఎట్లు కల్పింపగల్గును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ కాలేనిధాయ స్వంరూపం ప్రజ్ఞయా యన్నిగృహ్యతే।
భావా స్తతోనివర్తన్తే తత్ర సంక్రాన్త శక్తయః ॥ 39

భావాః = పదార్థములు, స్వం = తమకు సంబంధించిన, యత్ = ఏ, రూపం = స్వరూపము, ప్రజ్ఞయా = బుద్ధిచే, నిగృహ్యతే = గ్రహింపబడునో. దానిని, కాలే = కాలమునందు, నిధాయ = ఉంచి, తత్ర = దానియందు, సంక్రాన్త శక్తయః = సంక్రమించిన శక్తులు కలవై, తతః = దానినుండి, నివర్తన్తే = మరలుచున్నవి.

తాత్పర్యము— పదార్థములు బుద్ధిచే గ్రహింపదగిన తమ స్వరూపమును కాలము నందు ఉంచి, ఆ కాలమునందు సంక్రమించిన శక్తులు కలవై, ఆ కాలమునుండి దూరమగు చున్నవి.

వివరణము— పదార్థములు క్రియచే నిష్పన్నమగుచున్నవి. క్రియతో సంబంధించు సమయమున అవి వర్తమానావస్థలో నున్నవని యర్థము వర్తమానావస్థలో నున్న ఆభావముల స్వరూపమును అపుడు బుద్ధి గ్రహించుచున్నది. ఈ విధముగ బుద్ధిచే గృహీత మగు తమ స్వరూపమును ఆభావములు స్థిరమును, సర్వాధారమును అగు కాలమునందు సమర్పించి తాము మాత్రము తొలగిపోవుచున్నవి. అట్టి పరిస్థితిలో పూర్వాను భూతములగు ఈ పదార్థములను స్మరించుట మాత్రమే జరుగుచున్నది. ఈ విధముగ స్మరింపబడు చున్న పదార్థములతో సంబంధమును బట్టి కాలమునందు 'ఇది భూతకాలము' అను వ్యవహార మేర్పడుచున్నది. అనగా ఒక క్రియతో సంబంధించునదిగ ఒక సమయమున కనబడిన ఒక పదార్థము ఈ సమయమున ఆ క్రియతో సంబంధించినదిగ కనబడకున్నను, ఆ సమయమున (ఆ కాలమున) ఆ పదార్థము యొక్క సంస్కారము పడియుండుటచే, దాని స్మరణ మిపుడు ఏర్పడుచున్నది. స్మృతి గోచరమగు ఆ పదార్థమును బట్టి ఆ కాలమునందు భూతకాలమనెడు వ్యవహారము సిద్ధించుచున్నది. దానిని బట్టి 'అభూత్ ఘటః' (ఘటము ఉండెను) ఇత్యాది ప్రతీతి కలుగుచున్నది. ఈ విధముగ భూతాది వ్యపదేశమునకు ఘటాది పదార్థములు కారణము. ఘటాది పదార్థములే లేకున్నచో కాలమునందు భూతాది వ్యవహారమే లేకుండెడిది. ॥39॥

అవతారిక— పదార్థములు ఇంకను ఉత్పన్నములు కాని సమయమున వానితో సంబంధము లేదు గాన వానిని బట్టి కాలమునకు 'ఇది భవిష్యత్తు' అను వ్యవహారము ఎట్లు కలుగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ భావినాంచైవ యద్రూపం తస్య చ ప్రతిబింబకమ్ ।
సునిర్మృష్ట ఇవాదర్శే కాలఏవోపపద్యతే ॥ 40

భావినాం = పుట్టబోవు పదార్థములయొక్క, యత్ = ఏ, రూపం = రూపము కలదో అదియు, తస్య = దానియొక్క, ప్రతిబింబకం చ = బుద్ధిలో నిశ్చితమగు ప్రతిబింబ రూపము, సునిర్మృష్టే = బాగుగా పరిశుద్ధముచేయబడిన, ఆదర్శే ఇవ = అద్దమునందువలె, కాలఏవ = కాలమునందే, ఉపపద్యతే = ఏర్పడుచున్నది.

తాత్పర్యము— పుట్టబోవు పదార్థముల ఏ బాహ్యరూపము కలదో అదియు, దాని ప్రతిబింబమూ ఈ రెండునూ బాగుగా శుద్ధముచేయబడిన అద్దమునందువలె కాలమునందే ఏర్పడుచున్నవి.

వివరణము— కారణములన్నియు సమకూడిన పిమ్మట ఇక ఈ పదార్థము తయారుకానున్నది అను ప్రతీతి కలుగును. ఇది భావిపదార్థము. ఇట్టి పదార్థమునకు ఏర్పడనున్న బాహ్యరూపము బుద్ధియందు ప్రతిబింబించును; అనగా బుద్ధిలో గోచరించును. రాబోవు బాహ్యరూపమునకును, బుద్ధిస్థమగు రూపమునకును ఐక్యమును కల్పించి వీటిని స్థిరరూపమగు కాలముతో సంబంధింపచేయుటచే, భావియగు ఈ పదార్థముతో సంబంధమును బట్టి కాలమునకు గూడ భావిత్వ మేర్పడుచున్నది. ఎప్పుడో పుట్టిన పదార్థముయొక్క శక్తిని కాలమునందు సంక్రమింప చేయుటచే ఆ కాలమునకు భూతత్వ వ్యపదేశము కలిగినట్లు రాబోవు పదార్థముయొక్క శక్తిని సంక్రమింపచేయుటచే కాలమునకు భవిష్యత్త్వము లభించుచున్నదని యభిప్రాయము. ॥40॥

అవతారిక— పదార్థములన్నియు ఈ విధముగ కాలమునందు సంక్రమించిన రూపముగలవై ఎల్లప్పుడును పరిణామమును చెందుచున్నవని చెప్పుచున్నాడు.

శ్లో॥ తృణపర్ణలతాదీని యథా స్రోతోఽనుకర్షతి ।
ప్రవర్తయతి కాలోఽపి మాత్రా మాత్రావతాం తథా ॥ 41

యథా = ఏ విధముగా, స్రోతః = ప్రవాహము, తృణపర్ణలతాదీని = గడ్డి, ఆకులు, లతలు మొదలగు వాటిని, అనుకర్షతి = లాగికొని పోవునో, తథా = అట్లే, కాలోఽపి = కాలము కూడా, మాత్రావతాం = పదార్థముల యొక్క, మాత్రాః = ధర్మములను, ప్రవర్తయతి = ప్రవర్తింపచేయు చున్నది.

తాత్పర్యము— ప్రవాహము తృణపర్ణ లతాదులను లాగికొని పోయినట్లు కాలము పదార్థముల ధర్మములను ప్రవర్తింపచేయు చున్నది.

వివరణము— నదీ ప్రవాహము కొన్ని తృణాదులను వాటి చోటునుండి పెకలించి మరియొక చోటునకు తీసికొనిపోవును. కొన్నింటిని మరియొకచోట నాటుకొనునట్లు చేయును.

అట్లే కాలము పదార్థములను తనతో లాగికొని పోవుచుండును; విడుచుచుండును; వాటి ధర్మములలో మార్పులు చేయుచుండును. ॥41॥

అవతారిక— ఈ విషయమునే మరియొక దృష్టాంతమును చూపి స్పష్టీకరించుచున్నాడు.

**శ్లో॥ ఆవిశ్యైవానుసన్ధత్తే యథా గతిమతాం గతీః ।**
**వాయుస్తథైవ కాలాత్మా విధత్తే క్రమరూపతామ్ ॥ 42**

వాయుః = ప్రాణవాయువు, యథా = ఏ విధముగా, ఆవిశ్య = అవయవములలో ప్రవేశించి (ఇచటనున్న 'ఇవ' శబ్దమునకు విశేషార్థమేమియు లేదు), గతిమతాం = ప్రాణుల యొక్క, గతీః = చేష్టలను, అనుసన్ధత్తే = సాధించునో, తథైవ = అట్లే, కాలాత్మా = సర్వాత్మ భూతమగు కాలము, క్రమరూపతాం = క్రమరూపత్వమును, విధత్తే = ఏర్పరచుచున్నది.

తాత్పర్యము— ప్రాణవాయువు ప్రాణుల అవయవ సంధులలో ప్రవేశించి వారి గమనాది చేష్టలను నడిపించినట్లు కాలము కూడ భావములలో ప్రవేశించి వాటిలో క్రమమును ఏర్పరచుచున్నది.

విశేషము— కాలము ఆ యా సాధన శక్తులకు ప్రతిబంధ మేర్పరచి కొన్ని పదార్థములు అదృశ్యములగునట్లు చేయుచున్నది. కొన్ని సాధన శక్తులు ప్రసరించునట్లు చేసి కొన్ని పదార్థములను ఆవిర్భవింప చేయుచున్నది. ఈ విధముగ కాలమే పదార్థములలోనున్న క్రమమునకు కారణమగుచున్నది. ॥42॥

అవతారిక— కాలము ఇంకను ఏ యే పనులకు కారణమగుచున్నదో చెప్పుచున్నాడు.

**శ్లో॥ అయన ప్రవిభాగశ్చ గతిశ్చ జ్యోతిషాం ధ్రువా ।**
**నివృత్తి ప్రభవాశ్చైవ భూతానాం తన్నిబన్ధనాః ॥ 43**

అయన ప్రవిభాగః చ = ఉత్తరాయణము దక్షిణాయనము అనెడు విభాగము, జ్యోతిషాం = నక్షత్రముల యొక్క, ధ్రువా = నిశ్చితరూపమగు, గతిః చ = గమనము, భూతానాం = (పృథివ్యాది) మహాభూతములయొక్క, నివృత్తి ప్రభవాః చ = ప్రలయోత్పత్తులును, తన్నిబన్ధనాః = ఆ కాలమును బట్టి జరుగుచున్నవి.

తాత్పర్యము— ఉత్తరాయణము దక్షిణాయనము అనెడు విభాగము, నిశ్చితరూపమున జరుగుచున్న నక్షత్రాది గమనము, మహాభూతముల ఉత్పత్తి ప్రలయములు ఇవన్నియు కాలమును బట్టి జరుగుచున్నవి. (ఈ విధముగ సర్వోపకారి యగుటచే కాలమునకు విశ్వాత్మయని పేరు). ॥43॥

కాని కొన్ని స్థలములలో ప్రత్యయముచే శాస్త్ర బలమువలన బోధింపబడిన అర్థము వాక్యార్థమున కానరాకున్నది. అచట ప్రత్యయార్థము భాసింపక ప్రకృత్యర్థము మాత్రమే భాసించుచున్నది. అట్లుజరుగుటయే లోకవ్యవహారమున కానవచ్చుచున్నది.

పైయర్థమునకుపపత్తియేది? అను ప్రశ్నకు సమాధానమును 50వ శ్లోకము మొదలు 92వ శ్లోకము వరకు విపులముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ లక్షణా శబ్దసంస్కారే వ్యాపారః కార్యసిద్ధయే।
సంఖ్యా కర్మాది శక్తీనాం శ్రుతిసామ్యేఽపి దృశ్యతే॥ 50

శబ్దసంస్కారే = శబ్దములకు కలిగెడి సంస్కారము విషయమున, అనగా ప్రయోగమున కానవచ్చెడి శబ్దములకు సాధుత్వమును జూపుటకై ప్రకృతుల కంటె ప్రత్యయములను జేర్చుట విషయమై, సంఖ్యాకర్మాది శక్తీనామ్ = ప్రత్యయార్థమగు ఏకత్వమమున్నగు సంఖ్యకు కర్మ, కరణము మున్నగు కారక శక్తులకు, శ్రుతిసామ్యే + అపి = వాచకమగు శబ్దము సమానముగానే యున్నను, కార్యసిద్ధయే = వాక్యార్థమనే కార్యముయొక్క సిద్ధికై, లక్షణా = ఉపలక్షణ రూపమగు అనగా అవివక్షారూపమగు అనగా సఖ్యాదులను విడనాడుట అను వ్యాపారః = వ్యాపారము అనగా ప్రయత్నము దృశ్యతే = చూడబడుచున్నది.

ప్రకృతి భాగము ద్రవ్యమును బోధించును. అందు ఏకత్వము, ద్విత్వము మున్నగు సంఖ్యభాసింపవలెనన్నచో ప్రత్యయమునుబట్టి సిద్ధించును, కాగా ప్రకృతిచే సామాన్య రూపముగా భాసించిన వ్యక్తికి పరిమితిని ప్రత్యయార్థసంఖ్య చేయును.

కాని కొన్నిస్థలములలో ప్రత్యయార్థమగు ఏకత్వసంఖ్య, అట్టి కర్మశక్తియు వివక్షితము కాకుండట సంభవించును. సంఖ్యాద్యర్థమును విడిచి ఇతరములగు అర్థములే, వాక్యార్థఘటకములగును. ఇదియే అవివక్ష, ఉదా- "గ్రహం సమ్మార్ష్టి" అను శ్రుతి వాక్యము కలదు. సోమయాగముచేయునపుడు సోమలతను చితుక కొట్టి దాని రసమును దీసి కొన్ని పాత్రలలో పోయుదురు. ఆ పాత్రలకే గ్రహ మని పరిభాష. వాటిని మట్టిచేతను కఱ్ఱ చేతను గూడ చేయుదురు. అట్టి పాత్రమును శుద్ధముగా జేయవలెనని శ్రుతివాక్యమునకర్థము. అచట గ్రహశబ్దముకంటె అమ్, ఏకవచన ప్రత్యయ మున్నందున దానిచే ఏకత్వసంఖ్య బోధింపబడును. ఆ సంఖ్యప్రకృత్యర్థమగు పాత్రకు విశేషణమై ఒక గ్రహమును పరిశుద్ధముగా అనగా అందుపై చిలికిన సోమరసమును తుడిచి నిర్మలముగా జేయవలెననెడి యర్థము, శబ్దమువలన లభించుచున్నది. కాని శ్రౌతసంప్రదాయమట్లులేదు. ఆ సోమయాగమున 10,15 గ్రహములు విధింపబడి యున్నవి. వానికి అన్నిటికి పారిశుద్ధ్యము కలుగవలెననియే వారి సంప్రదాయము. కాని శబ్దమువలన ఆ యర్థములభించలేదు. కనుక వాక్యార్థమునకును ఆగుణ్యము కలుగుటకై ప్రత్యయార్థమగు ఏకత్వ సంఖ్యను విడనాడి కేవలము ప్రకృత్యర్థమునే గ్రహించి వాక్యార్థమునిర్ణయింపవలెను. దీనినే సంఖ్యను వివక్షింపకపోవుట, అనిశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి.

ఇట్లే 'సక్తూన్ జుహోతి' అని మరియొక శ్రుతివాక్యము కలదు. సక్తూన్, అనునది ద్వితీయా బహువచనాంతము. ద్వితీయావిభక్తికి కర్మ శక్తి యర్థము. సక్తువులను

అవతారిక— నక్షత్రము లనెడు జ్యోతిస్సులు కూడ కాలవిభాగ రూపములే కాని కాలముకంటె భిన్నమగు తత్త్వము కాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ మాత్రాణాం పరిణామా యే కాలవృత్త్యను యాయినః ।
నక్షత్రాఖ్యా పృథక్ తేషు చిహ్నమాత్రం తు తారకాః ॥ 44

మాత్రాణాం = పదార్థములయొక్క, కాలవృత్త్యనుయాయినః = విశిష్టకాల సంబంధముచే ఏర్పడిన, యే = ఏ, పరిణామాః = పరిణామములు కలవో, అవి, పృథక్ = వేరు వేరుగా విభక్తములైనవై, నక్షత్రాఖ్యాః = నక్షత్రములనెడు పేర్లు కలవగుచున్నవి, తారకాః + తు = జ్యోతీరూపములగు నక్షత్రములైతే ; తేషు = ఆ పరిణామముల యందు, చిహ్నమాత్రం కేవలము చిహ్నములుగ మాత్రమే ఉన్నవి.

తాత్పర్యము— విశిష్ట కాల సంబంధముచే పదార్థముల కేర్పడిన పరిణామములు కృత్తికాది నక్షత్ర సంజ్ఞలను పొందుచున్నవి. జ్యోతిరూపమున నున్న తారకలు వాటికి చిహ్నము మాత్రమే.

వివరణము— ''ఈ రోజున పుష్య నక్షత్రము'' ''ఈ రోజున అశ్విని నక్షత్రము'' ఇత్యాది వ్యవహారము లున్నవి. అనగా చంద్రుడు ఆ రోజులలో పుష్య నక్షత్రము తోడను అశ్విని నక్షత్రముతోడను కలిసి యున్నాడని యర్థము. కావుననే 'పుష్యేణ యుక్తం పౌషం అహః' ఇత్యాదులలో 'పుష్య నక్షత్రముతో గూడిన చంద్రుడు గల పగలు' ఇత్యాది విధమున అర్థములు చెప్పబడును. అట్లే 'తిష్యః మాణవకః' ''పునర్వసుః మాణవకః'' ఇత్యాది ప్రయోగములు కలవు. అనగా ''చంద్రుడు తిష్య నక్షత్రముతో కలిసియుండగా పుట్టిన పిల్లవాడు, పునర్వసులో నుండగా పుట్టిన పిల్లవాడు'' అని యర్థము. అనగా తిష్య పునర్వస్వాది శబ్దములు మాణవకరూప భావము యొక్క పరిణామమును - మాణవునకును ఒకానొక కాలవిశేషమున కలిగిన జన్మరూప పరిణామమును - బోధించుచున్నవి. ఈ విధముగ నక్షత్రములు భావపరిణామముగ నుండి కాలమునకు ఉపాధిగ అగుచున్నవి. ఆకాశమున జ్యోతీరూపమున నున్న నక్షత్రములు ఆ పరిణామమునకే జ్ఞాపకములుగ నున్నవి. ఇట్లు నక్షత్రములు కాలోపాధులుగ నుండి కాలవిభాగ హేతువు లగుచున్నవి. (వాస్తవముగ ఆ నక్షత్రములతో చంద్రుడు కలిసియుండడు వానికిని చంద్రునికిని నడుమగల దూరము కోట్ల కొలది మైళ్ళు. కాని అట్లు కలిసియున్నట్లు మనకు కనుపట్టుచుండును ) ॥44॥

అవతారిక— జ్యోతీరూపము లగు చిహ్నములు నియతమగు కాలవిశేషమును సూచించినట్లు మరికొన్ని ఇతర వస్తువులు గూడ సూచించును అని చెప్పుచున్నాడు.

శ్లో॥ రుతైర్మృగ శకున్తానాం స్థావరాణాం చ వృత్తిభిః ।
ఛాయాది పరిణామైశ్చ ఋతుధామా నిరూప్యతే । 45

మృగశకున్తానాం = మృగములు పక్షులు మొదలగు వాటియొక్క, రుతైః = ధ్వనులచేతను,

46 ]

స్థావరాణాం = స్థావరములగు వృక్షాదులయొక్క, వృత్తిభిః = పుష్పించుట మొదలగు ప్రవృత్తుల చేతను, ఛాయాది పరిణామైః + చ = నీడ మొదలగు వాటియొక్క పరిణామములచేతను, ఋతుధామా = ఋతు విశేషమునకు స్థానమగు కాలము, నిరూప్యతే = నిర్ధారణ చేయబడు చున్నది.

తాత్పర్యము— మృగ పక్ష్యాదుల ధ్వనులచేతను, వృక్షాదుల ప్రవృత్తిచేతను, ఛాయాదుల పరిణామములచేతను ఋతువిశేష స్థానమగు కాలము నిర్ధారణ చేయబడుచున్నది.

విశేషము— కాలమను పేరుగల బ్రహ్మయొక్క స్వాతంత్ర్య శక్తి వసంతాది భేదములచే భిన్నమైనదై ప్రకాశించుచున్నది. కావున కాలము "ఋతవః ధామయస్య" (ఋతువులు దేనికి స్థానమో అది) అను నర్థమున "ఋతుధామా" యని చెప్పబడుచున్నది. ఇచట 'వసంతాది ఋతు విశేషము' అని యర్థము. అది పుంస్కోకిలాది రుతములచేతను, స్థావరము లగు మామిడి మొదలగునవి పుష్పించుట మొదలగు ప్రవృత్తులచేతను, సూర్యాది సంచార విశేషముచే కానవచ్చెడు నీడ, ఎండ మొదలగు వాటి భేదముచేతను నిర్ణయింపబడు చున్నది. ॥45॥

అవతారిక— ఇపుడు అద్వైత వాదమునందు గూడ కాలమునకు ఉపయోగమున్న దని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నిర్భాసోపగమో యోఽయం క్రమవానివ దృశ్యతే ।**
**అక్రమస్యాపి విశ్వస్య తత్ కాలస్య విచేష్టితమ్ ॥ 46**

అక్రమస్యాపి = క్రమము లేనిదైనను, విశ్వస్య = ప్రపంచము యొక్క, యః = ఏ, అయం = ఈ, నిర్భాసోపగమః = (పయికి కనుపట్టు తోచుట), ఆభాసము క్రమవానివ = క్రమము కలదివలె, దృశ్యతే = కనబడుచున్నదో, తత్ = అది, కాలస్య = కాలముయొక్క విచేష్టితమ్ = చేష్ట.

తాత్పర్యము— ఈ విశ్వము క్రమరహితమైనది. ఐనను దాని ఆభాసము క్రమము కలది వలె కనబడుచున్నదనిన అది యంతయు కాలప్రభావమే.

వివరణము— ప్రపంచమంతయు బ్రహ్మ వివర్త రూపమైనది. దీనికి క్రమమను నది లేదు. అయినను దీనికొక క్రమమున్నట్లు కనబడుచున్నది. దానికి కారణము బ్రహ్మ శక్తి రూపము, కాలమను పేరుగలదియు అగు అవిద్యయే.

జగత్సృష్టి విషయమున పరిణామవాదము వివర్తవాదము అను రెండు వాదములు కలవు. బంగారము కుండలాది రూపమున మార్పు చెందుచున్నది. అట్లే మూల ప్రకృత్యాదికము జగదాకారమున పరిణతి చెందుచున్నది. ఇది పరిణామ వాదము. త్రాటిని చూచినపుడు భ్రాంతివశమున సర్పమను ప్రతీతి కలుగుచున్నది. ఆ భ్రాంతికి ప్రధాన కారణము రజ్జు స్వరూపా జ్ఞానము ఆ త్రాటిపై కనబడుచున్న సర్పము ఉన్నదని కాని లేదని కాని చెప్ప

వీలులేదు. ఉన్నదన్నచో తరువాత 'ఇది సర్పము కాదు' అను బాధ జ్ఞానము కలుగరాదు. కాని కలుగుచున్నది. లేదన్నచో దాని ప్రతీతియే కలుగకూడదు. కొన్ని క్షణములపాటైనను అది కలుగుచున్నది. కావున ఇది సదసద్రూపములచే అనిర్వాచ్యము. రజ్జువునందు సర్పము కనబడినట్లు బ్రహ్మమునందు జగత్తు కనబడుచున్నది. దీనికి వివర్తవాదమని పేరు. జగత్తునందు లేని క్రమమును ఉన్నట్లు చూపుచున్నది గాన ఇది (క్రమావభాసము) కాలము చేయు మొదటి వ్యాపారము. ॥46॥

అవతారిక— ఈ కాలభేదము ఔపాధికమని (ఇతర సన్నిధానము వలన కలిగినదే కాని వాస్తవము కాదని) చెప్పుచున్నాడు.

శ్లో॥ దూరాన్తికవ్యవస్థాన మధ్వాధి కరణం యథా।
చిరక్షిప్రవ్యవస్థానం కాలాధికరణం తథా॥ 47

అధ్వాధికరణం = మార్గమునకు సంబంధించిన, దూరాన్తిక వ్యవస్థానం = దూరము సమీపము అనెడు వ్యవస్థ, యథా = ఎట్లో, కాలాధికరణం = కాలమునకు సంబంధించిన, చిరక్షిప్రవ్యవస్థానం = ఆలస్యము, శీఘ్రము అనెడు వ్యవస్థ కూడ, తథా = అట్లే.

తాత్పర్యము— మార్గమునకు సంబంధించిన 'దూరము', 'దగ్గర' అను వ్యవస్థ ఎట్లో, కాలమునకు సంబంధించిన 'ఆలస్యము', 'శీఘ్రము' అనెడు వ్యవస్థ కూడ అట్లే.

వివరణము— నడచెడు వాని గమనమునందలి భేదమును బట్టి ఈ మార్గము దూరము, ఈ మార్గము దగ్గర అనెడు వ్యవస్థ ఏర్పడుచున్నది. అంతియే కాని దూరత్వము నికటత్వము అనెడు భేదము వాస్తవమున మార్గమునందు లేదు మందముగా నడచువానికి ఏది దూరమైనదిగ కనబడునో అదియే శీఘ్రముగ నడచువానికి దగ్గరగా కనబడును. అట్లే కాలము స్థిరమైనదే యైనను ఎక్కువగ అవిచ్ఛిన్నత్వముతో జరుగు క్రియ ఉపాధిగానున్నచో 'చిరము' (ఆలస్యము) అనియు, తక్కువ అవిచ్ఛిన్నత్వముతో జరుగు క్రియ ఉపాధిగా నున్నచో ఆలస్య మనియు వ్యవహారము కలుగుచున్నది. ॥47॥

అవతారిక— కాలమునకు క్రియోపాధిని బట్టి భూత భవిష్యద్వర్తమాన భేదము కలుగునని వెనుక చెప్పబడినది. మరియొక విశేషమును కూడ చెప్పుటకొరకు ఆ విషయమునే మరల చెప్పుచున్నాడు.

శ్లో॥ తస్యాభిన్నస్య కాలస్య వ్యవహారే క్రియాకృతాః।
భేదా ఇవ త్రయః సిద్ధా యాన్లోకో నాతివర్తతే॥ 48

అభిన్నస్య = భేదరహితమగు, తస్య = ఆ, కాలస్య = కాలమునకు, వ్యవహారే = లోక వ్యవహారమునందు, క్రియాకృతాః = క్రియలచే నేర్పడిన, త్రయః = మూడు, భేదాః ఇవ = భేదములు వలె, సిద్ధాః = ప్రసిద్ధమైనవి, యాన్ = వేటిని, లోకః = లోకము, నాతివర్తతే = అతిక్రమింప జాలదో.

తాత్పర్యము— భేదరహితమగు ఆ కాలమునకు, లౌకిక వ్యవహారమున క్రియలచే నేర్పడిన మూడు భేదములవలె ప్రసిద్ధమైనవి. ఆ భేదములను లోకము అతిక్రమింప జాలదు.

వివరణము— భూతము, వర్తమానము, భవిష్యత్తు అను భేదములు ఉన్నట్లు క్రియలను బట్టి తెలియుచున్నను ఆ భేదములు వాస్తవములు కావు కాన 'భేదా ఇవ' అని 'ఇవ' శబ్దము ప్రయోగింపబడినది. క్రియ ముగిసినచో భూతము, క్రియ సంభావితమైనచో భవిష్యత్తు. క్రియ క్షణ ప్రవాహ రూపమున జరుగుచున్నచో వర్తమానము. ॥48॥

అవతారిక— భూతము, భవిష్యత్తు, వర్తమానము అను మూడు విభిన్న కార్యములను బట్టి వాటి కారణమగు కాలమునందు గూడ భేదములను ఊహింప వచ్చును గదా? కాలమున యథార్థమగు భేదము లేదని ఎట్లు చెప్ప వీలగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకస్య శక్తయస్తిస్రః కాలస్య సమవస్థితాః ।
యత్సమ్బన్ధేన భావానాం దర్శనాదర్శనే సతామ్ ॥ 49

ఏకస్య = భేదరహితమగు, కాలస్య = కాలమునకు, తిస్రః = మూడు, శక్తయః = శక్తులు, సమవస్థితాః = ఉన్నవి, యత్సంబన్ధేన = ఏ శక్తుల సంబంధముచే, సతాం = సత్తులగు, భావానాం = పదార్థముల, దర్శనాదర్శనే = కనబడుట కనబడకుండుట ఏర్పడుచున్నవో.

తాత్పర్యము— ఒకే కాలమునకు మూడు శక్తులున్నవి. వాటిని బట్టి సత్తులగు కార్యములు కనబడుట కనబడకుండుట జరుగుచున్నవి.

విశేషము— కార్యములు అనేకములైనచో కారణములు గూడ అనేకము లుండవలెను అనెడు అనుమానము యుక్తము కాదు. కారణము ఒక్కటేయైనను దానికి విభిన్న శక్తు లుండుటచే విభిన్న కార్యములు చేయవచ్చును. ప్రకృతమున కాలమునకు మూడు శక్తులు కలవు. వర్తమాన శక్తి సంబంధముచే సత్తులగు భావములు వ్యక్తమగుచున్నవి. అతీత శక్తి సంబంధముచే సత్తులగు భావములు కనబడకుండ పోవుచున్నవి. అనాగత శక్తి సంబంధముచే సత్తులగు పదార్థములు అనభివ్యక్తములై యున్నవి. ఈ విధముగ శక్తి భేదము చేతనే కార్య భేదము ఉపపన్నమై యున్నదిగాన కారణభేదమును కల్పింప బనిలేదు. ॥49॥

అవతారిక— శక్తి విభాగముచే ఏర్పడెడు దర్శనాదర్శనములనే విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ద్వాభ్యాం స కిల శక్తిభ్యాం భావానాం వరణాత్మకః ।
శక్తిస్తు వర్తమానాఖ్యా భావరూపప్రకాశినీ ॥ 50

సః = ఆ కాలము, ద్వాభ్యాం = రెండు, శక్తిభ్యాం = శక్తులచే. భావానాం = పదార్థముల యొక్క, వరణాత్మకః = సంవరణమును (ఆచ్ఛాదనము) చేయు స్వరూపము కలది, వర్త

మానాఖ్యా = వర్తమాన మనెడు పేరుగిల, శక్తిస్తు = శక్తియైతే, భావరూప ప్రకాశినీ = పదార్థముల రూపమును ప్రకాశింపచేయునది.

తాత్పర్యము— కాలము రెండు శక్తులచే భావములను అదృశ్యములుగ చేయును. వర్తమానమనెడు శక్తి మాత్రము పదార్థముల రూపమును ప్రకాశింపచేయును.

వివరణము— కాలము అతీత శక్తిచేతను అనాగత శక్తిచేతను, సత్తులగు పదార్థములు అదృశ్యము లగునట్లు చేయుచుండును. వర్తమాన శక్తిచే పదార్థముల స్వరూపమును ప్రకాశింపచేయును. ॥50॥

అవతారిక— అనాగత శక్తిచే ఆవృతములైన - అనగా భవిష్యత్కాల గోచరములగు పదార్థములు తరువాత అభివ్యక్తములై వర్తమాన శక్తితో సంబంధించుట కానవచ్చుచున్నది. అతీత శక్తిచే ఆవృతములగు - భూతకాల గోచరములగు - పదార్థములు గూడ ఆ విధముగనే మరల ఆవిర్భూతములై వర్తమాన శక్తితో ఏల సంబంధించుట లేదు అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అనాగతా జన్మశక్తేః శక్తి ర ప్రతిబన్ధికా ।**
**అతీతాఖ్యా తు యా శక్తిస్తయా జన్మ విరుధ్యతే ॥ 51**

అనాగతా శక్తిః = అనాగత శక్తి, జన్మశక్తేః = జన్మశక్తికి, అప్రతిబంధికా = ప్రతిబంధము చేయునది కాదు, తు = కాని, అతీతాఖ్యా = అతీతమను పేరుగల, యా = ఏ, శక్తిః = శక్తికలదో, తయా = దానితో, జన్మ = జన్మశక్తి, విరుధ్యతే = విరోధము కలదిగ నున్నది.

తాత్పర్యము— అనాగత శక్తి జన్మ శక్తికి ప్రతిబంధకము కాదు. కాని అతీత శక్తి జన్మ శక్తికి విరుద్ధమైనది. (కావున అనాగత శక్తిచే ఆవృతమగు పదార్థము కాలాంతరమున వర్తమాన శక్తితో సంబంధించి అభివ్యక్తిని పొందినను అతీతశక్తిచే ఆవృతమగునది మరల వర్తమాన శక్తితో సంబంధమును పొందజాలదు). ॥51॥

అవతారిక— శక్తులు శక్తమును (శక్తికల దానిని) ఆశ్రయించుకొని యుండును. ఆ శక్తమువలె శక్తులు కూడ ఎల్లవేళలు సన్నిహితములై యుండునుగాన ఆ శక్తుల సంబంధముచే భావములు ఒకే సమయమున కనుపట్టుచును కనుపట్టకుండను గూడ ఉండవలెను కదా అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ తమః ప్రకాశవత్త్వేతే త్రయోఽధ్వానో వ్యవస్థితాః ।**
**అక్రమాస్తేషు భావానాం క్రమః సముపలభ్యతే ॥ 52**

అక్రమాః = క్రమరహితము లగు, ఏతే = ఈ, త్రయః = మూడు, అధ్వానః = మార్గములు (కాల విభాగములు), తమః ప్రకాశవత్ = చీకటి వెలుగువలె, (తమస్సు, సత్వము

అను గుణములు కూడ ధ్వనించుచున్నవి) వ్యవస్థితాః = ఉన్నవి, తేషు = వాటియందు, భావానాం = పదార్థములయొక్క, క్రమః = క్రమము, సముపలభ్యతే = చూడబడుచున్నది.

తాత్పర్యము— క్రమరహితములగు ఈ మూడు మార్గములును తమః ప్రకాశముల వలె ఉన్నవి. వాటియందు పదార్థముల క్రమము చూడబడుచున్నది.

వివరణము— భూత భవిష్య ద్వర్తమానము లనెడు కాల విభాగములు మూడును మూడు మార్గములవలె నున్నవి గాన 'అధ్వానః' అని చెప్పబడినవి. మార్గములందు నడచెడు వారు గమనాగమనాదికము చేయునట్లు వివిధ పరిణామములకు లోనగుచున్న భావములు వీటి యందు (భూతాది కాలములందు) గమనాగనములు చేయుచుండును. అంతవరకును లేని ఒక వస్తువు పుట్టి, కొంతకాల ముండి మరల మరుగుపడి పోవుచున్నది. ఈ విధముగ పదార్థము లన్నియు మొదట భవిష్యన్మార్గములో నుండి, వర్తమాన మార్గమును పొంది, చివరకు అతీత మార్గమున పడిపోవుచున్నవి. కాలాత్మయందు ఈ మూడు శక్తులును (భూత భవిష్యద్వర్తమాన శక్తులు) క్రమరహితముగనే ఉన్నను తమః ప్రకాశములవలె భావములకు దర్శనాదర్శనములను ఏర్పరచుచు సక్రమములవలె నున్నవి. తమస్సు ఒక పదార్థము అదృశ్యమగునట్లు చేయును. అట్లే భూత భవిష్యచ్ఛక్తులు భావములను అదృశ్యములుగ చేయుచున్నవి. ప్రకాశము పదార్థములు కనబడునట్లు చేయును. అట్లే వర్తమాన శక్తి భావములను కనబడునట్లు చేయుచున్నది. కావున ఈ మార్గత్రయము తమః ప్రకాశములవలె నున్నదని చెప్పబడినది. 'తమః ప్రకాశవత్' అను ఉపమానముచే సాంఖ్యాంద్యంగీకృతములగు గుణత్రయములతో సామ్యము కూడ సూచింపబడుచున్నది. సత్త్వరజస్తమోగుణములు మూడును నిత్యములే కాన అవి సర్వదా ఉండునవే. అయినను ఆ మూడింటిలో ఒకటి ప్రధానముగను మిగిలిన రెండును దానికి అంగములుగను ఉండుటచే ప్రధానముగ నున్న గుణము తన కార్యములు చేయుచుండును అట్లే భూత భవిష్యద్వర్తమాన శక్తులు మూడును కాలమునందు నిత్యములై సర్వదా ఉన్నను అప్పుడప్పుడు తమతమ కార్యములను చేయుచుండును. ఈ విధముగ కాల భేదములు స్వశక్తి మాహాత్మ్యముచే భావభేదములందు క్రమమును కల్పించుచుండును అని ఈ కారిక యభిప్రాయము. ॥52॥

అవతారిక— భూతాది శక్తులకు గల తమః ప్రకాశ రూపత్వమునే విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ద్వౌతు తత్ర తమోరూపావేకస్యాలోకవత్ స్థితిః ।
అతీతమపి కేషాంచిత్ పునర్విపరివర్తతే ॥ 53

తత్ర = ఆ మార్గత్రయమునందు, ద్వౌతు = రెండు మార్గములైతే, తమోరూపౌ = తమః స్వభావములు, ఏకస్య = ఒక మార్గమునకు, ఆలోకవత్ = ప్రకాశమునకు వలె, స్థితిః = స్థితి (కలదు), కేషాంచిత్ = కొందరి మతమున, అతీతమపి = గడచిన పదార్థము కూడా, పునః = మరల, విపరివర్తతే = వచ్చుచుండును.

తాత్పర్యము— ఈ మార్గత్రయములో రెండు మార్గములు తమః స్వభావములు. ఒకటి ప్రకాశ స్వరూపము. కొందరి మతము ప్రకారము అతీతము కూడా మరల వచ్చుచుండును.

విశేషము— సత్త్వరజస్తమోగుణ సాదృశ్యమునే మనస్సులో నుంచుకొని చెప్పుచున్నాడు. 'గురువరణకమేవ తమః' (తమో గుణము బరువైనది, అవరించే స్వభావము కలది) అను సాంఖ్య కారికానుసారముగా ఆవరించుట - పదార్థములు కనబడకుండ చేయుట - తమోగుణ స్వభావము. తమోగుణము వలె అతీతానాగత శక్తులు పదార్థమును కప్పివేయుచున్నవి గాన ఇవి తమః స్వభావములు. సత్త్వగుణము ప్రకాశ స్వభావము కలది. వస్తువులు ప్రకాశించు నట్లు చేయును. సత్త్వగుణము వలె వర్తమాన శక్తిగూడ వస్తువులను ప్రకాశింప చేయును గాన ఇది ప్రకాశ స్వభావము, ''సత్త్వం లఘు ప్రకాశకమ్'' (సత్త్వము తేలికయైనది, ప్రకాశింప చేయునది అని సాంఖ్య కారిక). రజోగుణము ప్రవృత్తి స్వభావము. దాని సంపర్కమువలననే సత్త్వతమోగుణములకు ప్రవర్తన శక్తి లభించుచున్నది. కాలమునందున్న ప్రవృత్తి సామాన్యము సర్వపదార్థ వ్యాపకము అనగా ప్రతిబంధాభ్యనుజ్ఞల ద్వారా కాలము సర్వపదార్థ ప్రేరణము చేయుచున్నది; అది రజః స్వభావము.

అతీత శక్తిచే ఆవృతములగు వస్తువులకు మరల వర్తమాన శక్తితో (జన్మ శక్తితో) సంబంధము కలుగదు; ఏలయన అతీత శక్తి జన్మశక్తికి ప్రతిబంధకము అని 51 వ కారికలో చెప్పబడినది. కాని కొందరి మతము ప్రకారము అతీతాధ్వపతితమైనను జగత్తు కాలాంతరమున అవిర్భవించును. అనగా ఉత్పన్నములగు పదార్థములు ప్రలయమున అదృశ్యములై మరల సృష్టి జరిగినపుడు ఆవిర్భవించుచుండును. ఈ మతము ప్రకారము అన్ని పదార్థములును మూడు మార్గములతో తప్పక సంబంధించును గాన వాటికి త్రివిధత్వము పూర్తిగ ఉపపన్నమగుచున్నది. జగత్తు మరల మరల ఆవృత్తి పొందుచున్నను అదే జగత్తు మరల రాదు. వెనుకనున్న జగత్తువంటి జగత్తు ఆవృత్త మగుచుండును. కావున అతీత శక్త్యావృతములు మరల వర్తమాన శక్తికి విషయమగుట (మరల పుట్టుట) కుదురదు అనునది మొదట చెప్పిన మతము. రెండవ మతము ప్రకారము - ''నాభావో విద్యతే సతః'' (ఒక మారు స్థితిని పొందిన పదార్థమునకు అభావమనునది లేదు) అను గీతా వాక్యానుసారముగ ఒక పదార్థము కొంత కాలముపాటు తిరోభూతమైనను కాలాంతరమున అదియే ఆవిర్భవించును గాన అతీత శక్తి సంబంధము వర్తమానశక్తికి ప్రతిబంధకము కాదు - అనగా భూత కాలములోనికి పోయిన వస్తువు మరల వర్తమానములోనికి రావచ్చును. ॥౫౩॥

అవతారిక— ధర్మములకును ధర్మికిని (పదార్థమునకును) ఒక విధమగు భేదమును అంగీకరించి స్థిరస్వభావమగు ధర్మి వర్తమానమైనను దాని ధర్మములు మాత్రము మార్గత్రయ గోచరములు అని చెప్పబడినది. అనగా ధర్మములు భూత భవిష్యద్వర్తమాన గోచరములైనను ధర్మి మాత్రము సర్వదా వర్తమానమే యని యర్థము. ఇపుడు ధర్మికిని ధర్మమునకును అభేదము నంగీకరించి ధర్మముల ద్వారా ధర్మికి భూతత్వ - భవిష్యత్త్వ -

వర్తమానత్వములు మూడును ఒక్క సమయముననే పొసగును అని భాష్యకారమతానుసారముగ చెప్పుచున్నాడు.

శ్లో॥ యుగపద్వర్తమానత్వం తద్ధర్మా ప్రతిపద్యతే ।
కేషాంచిద్వర్తమానత్వాచ్చైతి తద్వదతీతతామ్ ॥ 54

తద్ధర్మా = అతీతానాగత వర్తమాన రూపములైన ధర్మములు గల ధర్మి, కేషాంచిత్ = కొన్ని ధర్మములు, వర్తమానత్వాత్ = వర్తమానము లగుట వలన, (కనుపట్టు చుండుట వలన), యుగపత్ = ఒకే సమయమున, వర్తమానత్వం = వర్తమానత్వమును, ప్రతిపద్యతే = పొందుచున్నది, తద్వత్ = వర్తమానత్వమును వలె, అతీతతాంచ = అతీతత్వ (భూతత్వ) మును గూడ, ఏతి = పొందుచున్నది.

తాత్పర్యము— ఒక ధర్మి, దానికి సంబంధించిన కొన్ని ధర్మములు వర్తమానము లగుటచే, తాను కూడ వర్తమానత్వమును పొందుచున్నది. అట్లే అతీతత్వమును గూడ పొందుచున్నది.

విశేషము— ఒక ధర్మికి సంబంధించిన కొన్ని ధర్మములు అతీతములగును, కొన్ని అనాగతములుగ ఉండును. కొన్ని వర్తమానములుగ ఉండును. ఉన్న ధర్మములను బట్టి ధర్మి కూడ వర్తమానత్వమును పొందుచున్నది. పూర్వమునందుండిన (అతీతములగు) ధర్మములను బట్టి అతీతత్వమును పొందుచున్నది. అనాగతములగు (రాబోవు) ధర్మములను బట్టి అనాగతత్వమును పొందుచున్నది. ఈ విధముగ స్థాయియగు పదార్థము సర్వదా వర్తమానమే యైనను ధర్మముల్లకు గల త్రివిధత్వమును బట్టి త్రివిధమని (త్రిమార్గమని) చెప్పబడు చున్నది. ॥54॥

అవతారిక— పరస్పర విరుద్ధములగు అతీతత్వ వర్తమానత్వములు ఒక్కచోట ఎట్లు కలియును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ హేతూపకారాదాక్షిప్తో వర్తమానత్వ మాగతః ।
శాన్తహేతూపకారః సన్ పునర్నోపైతి దర్శనమ్ ॥ 55

హేతూపకారాత్ = హేతువులు ఉపకరించుట వలన, ఆక్షిప్తః = ఉత్పన్నమగు పదార్థము, వర్తమానత్వం = వర్తమానత్వమును, ఆగతః = పొందినదై (అగును), శాంతహేతూపకారః సన్ = ఆ కారణములు శమించుటవలన వానినుండి కలుగు సాయము లేకపోవుటచే, పునః = మరల, దర్శనం = దర్శనమును, నోపైతి = పొందుట లేదు.

తాత్పర్యము— కారణములయొక్క ఉపకారముచే జనించిన వస్తువు వర్తమానత్వమును పొందుచున్నది. కారణములు చేయు ఉపకారము తొలగగనే అదృశ్యమగును.

వివరణము— కారణములయందు చేష్టావిశేషము కలుగగనే కార్యము జనించి,

దృశ్యమగుచు అర్థక్రియలను (ఏవైన ప్రయోజనములను) సంపాదించును. అపుడు అది వర్తమానము అని చెప్పబడుచున్నది. కారణ వ్యాపారము శాంతింపగనే ఈ కార్యమునందలి అర్థక్రియా కారిత్వము పోవును అపుడు అదృశ్యమై అతీతమని చెప్పబడుచున్నది. కారణములు ఇంకను ఉపకారమునకై వ్యాపారము చేయని పరిస్థితులలో ఆ భావము అనాగతము అని చెప్పబడును. అపుడు కూడ దానికి అర్థక్రియా కారిత్వ ముండదు. ఈ విధము అర్థక్రియా కారిత్వము ఉండుట, లేకపోవుట అను విషయమును బట్టి ఒక పదార్థమును వర్తమాన పదార్థమనియు అతీత పదార్థమనియు, అనాగత పదార్థమనియు చెప్పుటలో దోషము లేదు. ఆ పదార్థము గుణత్రయమయ మగుటవలనను, ఆ గుణత్రయము నిత్యమై సర్వపదార్థానుగతమై యుండుటవలనను అది (పదార్థము) ఎల్లపుడును సత్తుగనే ఉండును. కావుననే ''తదేతత్ త్రైలోక్యం వ్యక్తేరపైతి, న సత్త్వాత్'' (ఈ మూడు లోకములును అభివ్యక్తములు కాకుండ ఉండవచ్చును కాని వాటికి అసత్త్వము మాత్రము ఎన్నడును లేదు) అని శాస్త్రకారులు చెప్పుదురు ॥55॥

అవతారిక— అతీతమార్గమునందును. అనాగతమార్గమునందును గూడ భావము కనబడకుండుట సమానమే కావున కొందరు కాలమునకు ప్రతిబంధము, అభ్యనుజ్ఞ అనెడు రెండు శక్తులను మాత్రమే అంగీకరించిరి అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్వేఏవ కాలస్య విభోః కేషాం చిచ్ఛక్తివర్త్మనీ ।**
**కరోతి యాభ్యాం భావానా మున్మీలన నిమీలనే ॥** 56

కేషాంచిత్ = కొందరి మతమున, విభోః = సర్వసమర్థమగు, కాలస్య = కాలమునకు, ద్వే = రెండు, శక్తి వర్త్మనీ + ఏవ = శక్తి మార్గములు మాత్రమే ఉన్నవి, యాభ్యాం = వేటిచేత, భావానాం = పదార్థముల యొక్క, ఉన్మీలన నిమీలనీ = ఆవిర్భావతిరోభావములను, కరోతి = చేయుచున్నదో.

తాత్పర్యము— కొందరి మతము ప్రకారము, సర్వసమర్థమగు కాలమునకు రెండే శక్తులున్నవి. వాటిచే అది పదార్థముల ఆవిర్భావతిరోభావములను చేయుచున్నది.

వివరణము— భావములు కనబడకుండునట్లు చేయు శక్తికి ప్రతిబంధ శక్తి యనియు, భావములు ప్రతిభాసించునట్లు చేయు శక్తికి అనుజ్ఞా శక్తి యనియు పేర్లు. ఈ ప్రతిబంధ శక్తిలో అతీతానాగత శక్తులు రెండును ఇమిడి యున్నవి. ॥56॥

అవతారిక— అఖండమును భేదరహితమును అగు కాలము సహాయముతో ఒక వ్యవహారము జరుపుట శక్యము కాదు గాన క్రియ లనెడు ఉపాధులచే కాలమునందు భేదమును కల్పించి తద్ద్వారా వ్యవహారము జరుగునని చెప్పబడినది. కాని ఉపాధి భూతములగు ఆ క్రియల సహాయముచేతనే వ్యవహారమును జరుపుకొనుటకు వీలుండగా మరల అదృశ్యమగు కాలమనునది ఒకటి ఉన్నదని కల్పించుట ఎందులకు. కాలము లేనిచో వ్యవహారము జరుగదు

గాన ఎట్లైనను కాలమనునది ఒకటి ఉన్నదని అంగీకరించియే తీరవలెనని అన్నచో ఆ కాలమును మరియొక విధముగ గూడ కల్పింపవచ్చును గదా యని కొందరి అభిప్రాయము. దాని ప్రకారము చెప్పుచున్నాడు.

శ్లో॥ కలాభిః ప్రవిభక్తాభిః ప్రవిభక్తం స్వభావతః ।
కేచిద్బుద్ధ్యనుసంహారలక్షణం తం ప్రచక్షతే ॥ 57

కేచిత్ = కొందరు, తం = ఆ కాలమును, బుద్ధ్యనుసంహార లక్షణమ్ = బుద్ధిచే ఒక్క సముదాయముగ ఆకళించుకొనుటయే లక్షణముగా కల దానిని గాను, పృథగర్థాభిః = వేరు వేరు ప్రయోజనములు గల, కలాభిః = అంశములచేత, స్వభావతః = దాని స్వభావమును బట్టి, ప్రవిభక్తం = విభజింపబడిన దానిని గాను, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్యము— బుద్ధిచే అనేక క్రియలను ఒక్క సముదాయముగ గ్రహించుటయే కాలముయొక్క లక్షణమనియు, స్వభావముచే అది వేరు వేరు అంశములుగ విభక్తమై యుండు ననియు చెప్పుదురు.

విశేషము— కాలమనెడు బాహ్యమగు తత్త్వమేదియును లేదు. బుద్ధిచే ఒక్క సముదాయరూపమున గ్రహింపబడెడు వేరువేరు క్రియలే 'చిరము' 'శీఘ్రము' మొదలగు వ్యవహారములకును; పగలు, రాత్రి మొదలగు వ్యవహారములకును నిమిత్తముగ నున్నది. ఈ బుద్ధి సంకలనమే కాలతత్త్వము. ఈ బుద్ధి సంకలన రూపములగు చిర - శీఘ్ర - దివసాది భేదములలో కూడ వేరువేరు ప్రయోజనముల ననుసరించి అంశములు కల్పింపబడుచున్నవి, ఈ విధముగ కాలము బౌద్ధమే (బుద్ధిస్థమే) కాని బాహ్యము కాదు అని కొందరు బౌద్ధాదుల అభిప్రాయము ॥57॥

అవతారిక— కాలము బాహ్యమని అంగీకరించినను, అంతరమే యని యంగీకరించినను మాకు విప్రతిపత్తి లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ జ్ఞానానుగత శక్తిం వా బాహ్యం వా సత్యతః స్థితమ్ ।
కాలాత్మాన మనాశ్రిత్య వ్యవహర్తుం న శక్యతే ॥ 58

జ్ఞానాను గతశక్తిం వా = జ్ఞానమునందు సంబంధించిన శక్తి కలదైనను, సత్యతః = వాస్తవముగా, స్థితం = ఉన్న, బాహ్యం వా = బాహ్యమగునదైనను, కాలాత్మానం = కాలాత్మను అనాశ్రిత్య = ఆశ్రయింపకుండగా, వ్యవహర్తుం = వ్యవహారము నడుపుటకు, నశక్యతే = శక్యము కాదు.

తాత్పర్యము— జ్ఞానమునకు మాత్రమే సంబంధించిన శక్తి కలదైనను, వాస్తవమగు బాహ్యరూపముకలదైనను, కాలాత్మను ఆశ్రయింపకుండ లోకవ్యవహారము కుదరదు.

వివరణము— వివిధ క్రియా సముదాయమును బుద్ధిలో ఆకళించుకొనుటయే కాలముగాన అది కేవలము బౌద్ధమే కాని బాహ్యమగు కాలము లేదు అని చెప్పినను, అట్లుకాక

హోమముచేయవలెనని వాక్యార్థము చెప్పవలెను. కాని హోమమున సక్తువులు సాధనములే. కర్మకానేరవు. అందుచే ద్వితీయార్థమగు కర్మశక్తిని విడనాడి వాక్యార్థము చెప్పవలెను. సక్తూన్ = సక్తుభిః = సక్తువులతో హోమము చేయవలెనని శ్రౌత సంప్రదాయసిద్ధమగు వాక్యార్థము నిరాఘాటముగ సిద్ధించును.

కాగా పదములయర్థము వాక్యార్థముతో సరియగుచో నచట ప్రత్యయార్థము వివక్షితముకా నగును. వాక్యార్థముతో సరికానిచో నచట ప్రత్యయార్థము విడవబడును. వాక్యార్థమునకు అనుగుణమగునట్లు సమన్వయము చేయవలెను.

ఇచట లక్షణా, శబ్దమునకు అవివక్ష, యర్థము. ॥50॥

*అవతారిక*—లక్షణారూపమగు అనగా ప్రత్యయార్థమును వివక్షింపకుండుట అనెడి వ్యాపారమును ఎచట స్వీకరింపవలెను? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ న వినా సంఖ్యయా కశ్చిత్ సత్త్వభూతోఽర్థ ఉచ్యతే।**

**అతః సర్వస్య నిర్దేశః సంఖ్యా స్యాదవివక్షితా॥ 51**

సంఖ్యయా + వినా = ఏకత్వము ద్విత్వము మున్నగు సంఖ్యలేనిది, సత్త్వభూతః = ద్రవ్యరూపమగు, కశ్చిత్ + అర్థః = ఏ యర్థముకూడ, న + ఉచ్యతే = శబ్దముచే చెప్పబడదు. పుంస్త్వము మున్నగు లింగము ఏకత్వము మున్నగు సంఖ్యయు అన్వయించుటకు అర్హమగు అర్థము సత్త్వ మనబడును. సత్త్వమనగానే లింగసంఖ్యలతో అవినాభావిగా నున్న యర్థమేయగును.

అతః = ఈకారణమువలన, సర్వస్య = సర్వమునకు అనగా సంఖ్యకు, దానికి ఆశ్రయమగు ద్రవ్యమునకు, నిర్దేశః = శబ్దముచే నిర్దేశము. (భవతి) = జరుగుచున్నది.

సంఖ్యలేనిది కేవలద్రవ్యమును శబ్దము చెప్పుటకు వీలులేదు కనుక సంఖ్యాబోధకముగా ప్రత్యయసహితముగనే ప్రకృతి ప్రయోగింపబడుచున్నది.

వానిలో, సంఖ్యా = ప్రత్యయార్థమగు ఏకత్వము మున్నగు సంఖ్య, అవివక్షితా = వివక్షింపబడనిది, స్యాత్ = కాగలదు.

సు, ఔ, జస్ మున్నగు ప్రత్యయములు సంఖ్యను బోధించును. ఆ ప్రత్యయములులేనిది కేవల ప్రకృతిని ప్రయోగింపరాదు. అందుకు ప్రత్యయమునుగూడ ప్రకృతి ప్రక్కన ప్రయోగింతురు. అంతమాత్రాన ప్రత్యయార్థము మాత్రము వివక్షితముకాదు. దాని యర్థమగు సంఖ్యను విడిచియే మిగిలిన అర్థములను గ్రహించివాక్యార్థము జూపవలెను ॥51॥

కాలమనెడు ఒక బాహ్యమును సత్యమును అగు ద్రవ్యపదార్థము ఉన్నది ; దానికి వర్తమానాది శక్తులు వేరువేరుగ నున్నవి, అని అంగీకరించినను మాకు విప్రతిపత్తి లేదు. అనగా ఇదియే కాలస్వరూపమని చెప్పుటలో మాకు ఆగ్రహము లేదు. దాని స్వరూపమేమైనను, కాలమనునది ఒకటి ఉన్నది అని మాత్రము అంగీకరించి తీరవలెను. దానిని అంగీకరింపకున్నచో ''ఒక వస్తువు ఉండెను, ఉన్నది, ఉండగలదు'' అనెడు వ్యవహారము కుదురదు. ఇట్టి శాబ్దవ్యవహార మునకంగమైన కాలమనునది ఉన్నది అని చెప్పుటయందే మాకు తాత్పర్యము అని భావము. ॥58॥

అవతారిక— కావుననే కాలము విషయమున అనేక మతభేదములు కానవచ్చుచున్నవి. కొందరి మతము ప్రకారము కాలము భావములకంటె వ్యతిరిక్తము కాదు అని చెప్పుచున్నాడు.

శ్లో॥ తిస్రో భావస్య భావస్య కేషాంచిత్ భావశక్తయః ।
తాభిః స్వశక్తిభిః సర్వం సదైవాస్తి చ నాస్తి చ ॥ 59

కేషాంచిత్ = కొందరి మతమున, భావస్య భావస్య = ప్రతిభావ పదార్థమునకును, తిస్రః = మూడు, భావశక్తయః = సత్త్వ రజస్తమోగుణముల శక్తులు, (కలవు), తాభిః = ఆ, స్వశక్తిభిః = తమయొక్క శక్తులచేత, సర్వం = ప్రతి భావమును, సదైవ = ఎల్లప్పుడును, అస్తి చ = ఉన్నది, నాస్తి చ = మరియు లేదు.

తాత్పర్యము— కొందరి మతము ప్రకారము ప్రతి భావమునందును సత్త్వ రజస్తమోగుణముల శక్తు లుండును. ఆ స్వశక్తులచేత ప్రతి పదార్థమును సత్తుగను, అసత్తుగను కూడ అగుచున్నది.

వివరణము— భావము లన్నియు ఎల్లప్పుడును పరిణామము చెందుచుండును. వాటిలో సత్త్వ రజస్తమోగుణముల శక్తులున్నవి గాన అవియే అతీతాదికాల భేదమును కలిగించుచున్నవి. భావములన్నియు గుణత్రయమయములే గావున ఆ గుణముల శక్తిత్రయమును బట్టి - అనగా ఒక శక్తి ఉద్భవించుట మరియొక శక్తి ఉద్భవింపకుండుట అనెడు భేదమును బట్టి - సత్తులుగను అసత్తులుగను వ్యవహారగోచరము లగుచున్నవి. ॥59॥

అవతారిక— పై విషయమునే విశదీకరించుచున్నాడు.

శ్లో॥ సత్త్వాదవ్యతిరేకేణ తాస్తిస్రోఽపి వ్యవస్థితాః ।
క్రమస్తాస్తదభేదాచ్చ సదసత్త్వం న భిద్యతే ॥ 60

తాః = ఆ, తిస్రః + అపి = మూడు శక్తులును, సత్త్వాత = భావముకంటె, అవ్యతిరేకేణ = భేదము లేకుండ, వ్యవస్థితాః = ఉన్నవి, తాః = ఆ శక్తులే, క్రమః = క్రమము, తదభేదాత్ + చ = ఆ శక్తులతో భావములకు గల అభేదమువలన, సదసత్త్వం = సత్త్వాసత్త్వములు, న భిద్యతే = భేదింపవు.

లకు (వర్తమాన శక్త్యాదులకు) గూడ భేదమే గాని అభేదము లేదు. కావున సాంకర్యమునకు అవకాశము లేదు. కాని చూడబడినదియు, చూడబడనిదియు అగు వస్తువు మాత్రము ఒక్కటి. దర్శనాదర్శన రూప ధర్మములు వచ్చుచు పోవుచు ఉన్నను ధర్మి మాత్రము మారుట లేదు కదా ? కావున ఒక భావము దృశ్యమగునపుడు సత్తు అనియు, అదృశ్యమగునపుడు అసత్తు అనియు అనరాదు. సత్తు ఐనది పూర్తిగ నశించుట అనునది అసంభవము. సత్తు అగునదే తిరోభూతమైనపుడు అసత్తు అనుచుందురు. కావున సత్త్వమునకును అసత్త్వమునకును భేదము లేదు. ॥61॥

అవతారిక— కాలతత్త్వ విషయమున మరికొన్ని మతములను గూడ చెప్పి ఉప సంహరించు చున్నాడు.

శ్లో॥ శక్త్యాత్మ దేవతా పక్షై ర్భిన్నం కాలస్య దర్శనమ్ ।
ప్రథమం తదవిద్యాయాం యద్విద్యాయాం న విద్యతే ॥ 62

కాలస్య = కాలము యొక్క, దర్శనం = దర్శనము, శక్త్యాత్మ దేవతా పక్షైః = శక్తి, ఆత్మ, దేవత అనెడు పక్షములచేత, భిన్నమ్ = భిన్నముగ నున్నది, తత్ = కాలమునకు సంబంధించిన ఆదర్శనము, అవిద్యాయాం = అవిద్యావస్థయందు, ప్రథమం = మొదటిది, యత్ = ఏది, విద్యాయాం = విద్యావస్థ యందు, న విద్యతే = లేదో.

తాత్పర్యము— కాలమునకు సంబంధించిన దర్శనము శక్తి పక్షము, ఆత్మ పక్షము, దేవతా పక్షము అనెడు పక్షములచే భిన్నముగ నున్నది. కాలదర్శనము అవిద్యావస్థ లోని మొదటి భేదము. అది విద్యావస్థలో లేదు.

వివరణము— కాలము విషయమున వేరువేరు మతము లున్నవి. కాలమనునది బ్రహ్మయొక్క స్వాతంత్ర్య శక్తియని భర్తృహరి యభిప్రాయము. కాని కొందరు వ్యాఖ్యాతలు కాలమనునది బ్రహ్మశక్తి రూపమని కాక కారణ శక్తియని వ్యాఖ్యానించిరి. బీజమునందు ఒక శక్తి యున్నది. అది అంకుర జననమును అనుమతించుచున్నది, కాండ జననమును అడ్డుకొను చున్నది. ఇట్లే అంకురమునందలి శక్తి కాండ జననమును అనుమతించుచున్నది. దాని తరువాత వచ్చెడు కార్యమును అడ్డుకొనుచున్నది. ఈ విధముగ బీజాంకురాది కారణములందు కానవచ్చు అనుజ్ఞా ప్రతిబంధ శక్తులే కాలము అని వీరి అభిప్రాయము. ఆత్మయే - అనగా జీవుడే - కాలమని మరియొక మతము. కారణ పరంపరచే భావములు పుట్టుచున్నవి. పుట్టిన ఆ భావములు పరస్పర భిన్నములుగను, క్రమవంతములుగను కనబడుచున్నవి. క్రమరూప మగు ఈ కాల శక్తికి భావములే ఉపాధులు. ఇది చిత్స్వరూపుడగు జీవునియందున్నది. కావున జీవుడే కాలము. జీవుడు స్వాభాసమగు కాలము ననుసరించి భావములందును, భావము లను బట్టి కాలమునందును, ఒక క్రమమున్నట్లు తెలిసికొనుచున్నాడు. ఈ విధముగ కాల భేదమును కల్పించుట వలన జీవుడే కాలము అని ఔపచారికముగ చెప్పబడుచున్నాడు. అవిద్యాశక్తి కాలశక్తిని సహాయముగగాని జీవునికొరకే నానావిధ భావములను సృష్టించు

లకు (వర్తమాన శక్త్యాదులకు) గూడ భేదమే గాని అభేదము లేదు. కావున సాంకర్యమునకు అవకాశము లేదు. కాని చూడబడినదియు, చూడబడనిదియు అగు వస్తువు మాత్రము ఒక్కటి. దర్శనాదర్శన రూప ధర్మములు వచ్చుచు పోవుచు ఉన్నను ధర్మి మాత్రము మారుట లేదు కదా? కావున ఒక భావము దృశ్యమగునపుడు సత్తు అనియు, అదృశ్యమగునపుడు అసత్తు అనియు అనరాదు. సత్తు ఐనది పూర్తిగ నశించుట అనునది అసంభవము. సత్తు అగునదే తిరోభూతమైనపుడు అసత్తు అనుచుందురు. కావున సత్త్వమునకును అసత్త్వమునకును భేదము లేదు. ॥61॥

అవతారిక— కాలతత్త్వ విషయమున మరికొన్ని మతములను గూడ చెప్పి ఉపసంహరించు చున్నాడు.

శ్లో॥ శక్త్యాత్మ దేవతా పక్షైర్భిన్నం కాలస్య దర్శనమ్ ।
ప్రథమం తదవిద్యాయాం యద్విద్యాయాం న విద్యతే ॥ 62

కాలస్య = కాలము యొక్క, దర్శనం = దర్శనము, శక్త్యాత్మ దేవతా పక్షైః = శక్తి, ఆత్మ. దేవత అనెడు పక్షములచేత, భిన్నమ్ = భిన్నముగ నున్నది, తత్ = కాలమునకు సంబంధించిన ఆదర్శనము, అవిద్యాయాం = అవిద్యావస్థయందు, ప్రథమం = మొదటిది, యత్ = ఏది, విద్యాయాం = విద్యావస్థ యందు, న విద్యతే = లేదో.

తాత్పర్యము— కాలమునకు సంబంధించిన దర్శనము శక్తి పక్షము, ఆత్మ పక్షము, దేవతా పక్షము అనెడు పక్షములచే భిన్నముగ నున్నది. కాలదర్శనము అవిద్యావస్థ లోని మొదటి భేదము. అది విద్యావస్థలో లేదు.

వివరణము— కాలము విషయమున వేరువేరు మతము లున్నవి. కాలమనునది బ్రహ్మయొక్క స్వాతంత్ర్య శక్తియని భర్తృహరి యభిప్రాయము. కాని కొందరు వ్యాఖ్యాతలు కాలమనునది బ్రహ్మశక్తి రూపమని కాక కారణ శక్తియని వ్యాఖ్యానించిరి. బీజమునందు ఒక శక్తి యున్నది. అది అంకుర జననమును అనుమతించుచున్నది, కాండ జననమును అడ్డుకొను చున్నది. ఇట్లే అంకురమునందలి శక్తి కాండ జననమును అనుమతించుచున్నది. దాని తరువాత వచ్చెడు కార్యమును అడ్డుకొనుచున్నది. ఈ విధముగ బీజాంకురాది కారణములందు కానవచ్చు అనుజ్ఞా ప్రతిబంధ శక్తులే కాలము అని వీరి అభిప్రాయము. ఆత్మయే - అనగా జీవుడే - కాలమని మరియొక మతము. కారణ పరంపరచే భావములు పుట్టుచున్నవి. పుట్టిన ఆ భావములు పరస్పర భిన్నములుగను, క్రమవంతములుగను కనబడుచున్నవి. క్రమరూపమగు ఈ కాల శక్తికి భావములే ఉపాధులు. ఇది చిత్స్వరూపుడగు జీవునియందున్నది. కావున జీవుడే కాలము. జీవుడు స్వాభాసమగు కాలము ననుసరించి భావములందును, భావములను బట్టి కాలమునందును, ఒక క్రమమున్నట్లు తెలిసికొనుచున్నాడు. ఈ విధముగ కాల భేదమును కల్పించుట వలన జీవుడే కాలము అని ఔపచారికముగ చెప్పబడుచున్నాడు. అవిద్యాశక్తి కాలశక్తిని సహాయముగగాని జీవునికొరకే నానావిధ భావములను సృష్టించు

చున్నది. జీవుని అదృష్టము ననుసరించియే ప్రతిబంధాభ్యనుజ్ఞా శక్తులు ప్రవర్తించుచుండును. కావున జీవుడే కాలము అని వీరి అభిప్రాయము. మరికొందరి అభిప్రాయము ప్రకారము విగ్రహముతో కూడిన ఒక మహా ప్రభావశాలియగు దేవతయే కాలము. ఈ దేవత కూడ చిద్రూప బ్రహ్మ శక్తియే గాన ఈ మతము సిద్ధాంత పక్షానుగుణముగ నున్నది.

ఈ విధముగ కాలదర్శనమున ఎన్నియో పక్షములున్నవి. కాని ఇది (కాలదర్శనము) సంసారహేతు భూతమగు అవిద్యలోని మొదటి మెట్టు. సంసారము భేదదృష్టి మయము. భేదమనునది దేశమును బట్టియు కాలమును బట్టియు ఏర్పడును. అందును కాల భేదము జగత్సృష్టిలో మొదటిది. బ్రహ్మతత్త్వమునందు క్రమము లేదు. కాలశక్తితో సహకృతమగు అవిద్యతోడ సంబంధముచే వివిధ భావరూపములలో వివర్తము పొందుచున్నది. కాలానువేధముచే కాలము యొక్క ప్రవేశముచే పదార్థములు క్రమముతో భాసించుట అనునది, అనాది సిద్ధమగు జీవాత్మకు కలుగుచున్నది. ఈ భేద జాలమంతయు అవిద్యామయము. విద్య అవిర్భవింపగనే భేద ప్రపంచమంతయు తొలగిపోవుటచే ఈ కాలము కూడ తొలగిపోవును. కావున కాలము, కాలమును గూర్చిన ఈ విచారము, ఇది యంతయు అవిద్యావస్థలోనే యుండునుగాని విద్యావస్థలో నుండదు. కావున కాలస్వరూపమునకు సంబంధించిన పక్షములలో ఏది యుక్తము ఏది అయుక్తము అనెడు విచారణమున కంతకును ప్రయాసమే ఫలము కాని మంచి ప్రయోజనమేదియు కానరాదు. వ్యవహార కాలమున పదార్థములలో నొక క్రమమున్నట్లు కనబడుచున్నది గాన దానికి హేతుభూతమగు కాలము అనునది ఒక్కటి ఉన్నదని అంగీకరించిన చాలును. ॥62॥

అవతారిక— ఇంతవరకును, జన్మగల వస్తువుల వ్యవహారము నిమిత్తమై కాలమును అంగీకరింపవలెనని చెప్పినట్లైనది కావున కాలకృతమగు భేదమేమైన ఉన్నచో అది అనిత్యములగు జన్య వస్తువులకే ఉండవలెను. అట్టి పరిస్థితులలో నిత్యములగు శబ్దములకు కాలకృతమగు హ్రస్వత్వాది భేదము ఎట్లు కలుగుచున్నది అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ అభేదే యది కాలస్య హ్రస్వదీర్ఘ ప్లుతాదిషు ।
దృశ్యతే భేదనిర్భాసః స చిరక్షిప్ర బుద్ధివత్ ॥ 63

కాలస్య = కాలమునకు, అభేదే = భేదము లేకున్నను, హ్రస్వదీర్ఘ ప్లుతాదిషు = హ్రస్వదీర్ఘ ప్లుతాదులయందు, భేదనిర్భాసః = భేదావభాసము (భేదబుద్ధి), దృశ్యతే యది = చూడబడుచున్నచో, సః = అది, చిరక్షిప్రబుద్ధివత్ = 'చిరము' 'క్షిప్రము' అను బుద్ధివలె కలుగుచున్నది.

తాత్పర్యము— కాలభేద మేమియు లేకున్నను హ్రస్వదీర్ఘ ప్లుతాదులందు భేదమేమైన కనబడుచున్నచో అది 'చిరము' 'శీఘ్రము' ఇత్యాది బుద్ధులందు వలె కలుగుచున్నది అని చెప్పవలెను.

వివరణము— "ఈ కార్యము (వస్తువు) శీఘ్రముగ తయారైనది." "ఈ కార్యము ఆలస్యముగ తయారైనది" ఇత్యాది జ్ఞానములు కలుగుచున్నవి. ఒక అవయవి అల్పసంఖ్యాకములగు అవయవములచే తయారైనచో అది శీఘ్రముగ తయారైనదని అనుచున్నాము. ఒక అవయవి అధిక సంఖ్యాకములగు అవయవములతో తయారయినచో అది ఆలస్యముగ తయారయినదని అనుచున్నాము. ఈ విధముగ విషయమందలి భేదమును బట్టి ఏర్పడిన చిరత్వ క్షిప్రత్వములను కాలమునందు కల్పించుచున్నాము. (ఈ విషయము 35వ కారికలో గూడ స్పష్టీకరింపబడినది). అట్లే శబ్దము నిత్యము గావున దానియందు కాలభేదము లేకున్నను హ్రస్వాదులందు కాలభేదము ఆరోపింపబడుచున్నది. ఇది కాల్పనికమేకాని యథార్థము కాదు. ॥64॥

అవతారిక— హ్రస్వాదులందు కనబడు కాలభేదము కాల్పనికమే కాని వాస్తవము కాదు అని పై కారికలో చెప్పిన సమాధానమును ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ హ్రస్వదీర్ఘ ప్లుతావృత్త్యా నాలికా సలిలాదిషు ।
కథం ప్రచయయోగః స్యాత్ కల్పనా మాత్రహేతుకః ॥ 64

నాలికాసలిలాదిషు = గొట్టములోని నీళ్ళు మొదలైన వాటియందు, హ్రస్వదీర్ఘ ప్లుతావృత్త్యా= హ్రస్వదీర్ఘ ప్లుతముల ఆవృత్తిచేత, కల్పనా మాత్ర హేతుకః = కల్పనా మాత్రమే హేతువుగా గల, ప్రచయయోగః = ఆధిక్యము యొక్క సంబంధము, కథం = ఎట్లు, స్యాత్ = అగును?

తాత్పర్యము— హ్రస్వదీర్ఘ ప్లుతములను ఆవృత్తి చేసినపుడు, నాళికాసలిలాదులందు కల్పనామాత్రముచే ఆధిక్యము ఎట్లు కలుగును?

వివరణము— పూర్వము గడియారములు లేని రోజులలో కాలమును తెలిసికొనుటకై కొంత ప్రమాణముగల నీరు పట్టెడు కుండలను (ఘటికలను) గొట్టములను (నాళికలను) తయారుచేసి వాటికొక నిర్దిష్ట ప్రమాణము గల రంధ్రము చేసెడి వారు ఆ ఘటాదులనిండ నీరు నింపెడి వారు. ఆ రంధ్రముగుండా ఘటాదులలోని నీరు కారిపోవుటకు ఎంతకాలము పట్టునో ఆ కాలమును ఒక ప్రమాణముగ తీసికొనెడి వారు. ఆ కాలమునకు ఘటిక లేక నాళిక యని పేరు ఆ పద్ధతిని మనస్సులో నుంచుకొని ఆశంకించుచున్నాడు. హ్రస్వమును రెండు మూడు సార్లు ఉచ్చరించినపుడు నాళికనుండి కొంచెము ఉదకము స్రవించుచున్నది. దీర్ఘమును రెండు మూడు సార్లు ఉచ్చరించు సరికి అంతకంటె అధిక ప్రమాణముగల ఉదకము స్రవించుచున్నది. ప్లుతమును రెండు మూడు సార్లు ఉచ్చరించినపుడు అంతకంటెను అధికమగు ఉదకము స్రవించుచున్నది. హ్రస్వాదులలోని కాలభేదము కేవలము కాల్పనికమే కాని సత్యము కాదన్నచో కాల్పనికమగు ఈ కాలమనెడు హేతువువలన సత్యమగు అల్ప - అధిక - అధికతర - జల స్రావము [illegible]ల కలుగుచున్నది? అసత్యమగు వస్తువు అర్థక్రియాకారి కాజాలదు కదా! అసత్యమగు సర్పము కరచుటగాని, అది కరచినవాడు మరణించుటగాని కానవచ్చుట లేదు కదా? కావున కాలభేదము సత్యమేయని అంగీకరింపవలెను. సత్యమగు కాలభేదమును

బట్టి భిన్న భిన్న కాలములగుటచే హ్రస్వాది శబ్దములు కూడ నిత్యము కాకాలవు అని పూర్వ పక్షి అభిప్రాయము. ॥64॥

అవతారిక— ఈ ఆక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అభివ్యక్తి నిమిత్తస్య ప్రచయేన ప్రచీయతే।**
**అభిన్నమపి శబ్దస్య తత్త్వ మప్రచయాత్మకమ్ ॥ 65**

అప్రచయాత్మకం = ప్రచయాపచయములు లేని ; శబ్దస్య = శబ్దముయొక్క, తత్త్వం = తత్త్వము, అభిన్నమపి = భేదరహితమైనదైనను, అభివ్యక్తినిమిత్తస్య = తన (శబ్దము యొక్క) అభివ్యక్తికి నిమిత్తమగు ధ్వనియొక్క, ప్రచయేన = ప్రచయముచేత, ప్రచీయతే = వృద్ధి పొందుచున్నది.

తాత్పర్యము— ప్రచయములేని శబ్దతత్త్వము భేదరహితమైనదైనను అభివ్యక్తి నిమిత్తమగు ధ్వనియొక్క ప్రచయముచే ప్రచయమును పొందుచున్నది.

విశేషము— శబ్దము నిత్యము, భేదరహితము. దానికి ప్రచయాపచయములు లేవు. కాని ఈ శబ్దమును అభివ్యక్తము చేయు ధ్వని గ్రామముల ప్రచయాపచయములను బట్టి శబ్దమునందు కూడ వృద్ధిహ్రాసములున్నట్లు ప్రతీతి కలుగుచున్నది. ధ్వనులు శబ్దముతో పూర్తిగ సంమిలితములై తమలోనున్న కాలభేదములను ఆ శబ్దమునందు ప్రకాశింప చేయు చున్నవి. ఈ విధముగ శబ్దతత్త్వ జ్ఞానము అభివ్యంజకములగు ధ్వనులపై ఆధారపడియున్నది గాన అభివ్యంజకములగు ఆ ధ్వనుల ధర్మములు అభివ్యజ్యమగు శబ్దతత్త్వముపై గూడ ప్రసరించుటచే నాళికాదిజలస్రుతిలో భేదము కనబడుచున్నది. ॥65॥

అవతారిక— శబ్దతత్త్వము కేవలము హ్రస్వదీర్ఘాదులందే కాదు, పదవాక్య విషయము లన్నింటి యందును అభిన్నమే యని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏవం మాత్రాతురీయస్య భేదో దాశతయస్య వా**
**పరిమాణ వికల్పేన శబ్దాత్మని న విద్యతే ॥ 66**

ఏవం = ఈ విధముగనే, మాత్రాతురీయస్య = మాత్రయొక్క నాల్గవ భాగము యొక్కకాని, దాశతయస్యవా = దాశతయమను వేదభాగము యొక్కకాని, శబ్దాత్మని = శబ్దతత్త్వము నందు, పరిమాణ వికల్పేన = ప్రమాణ భేదముచేత, భేదః = భేదము, న విద్యతే = లేదు.

తాత్పర్యము— ఇట్లే మాత్రా చతుర్థభాగము యొక్క శబ్దస్వరూపమునందు గాని, దాశతయమను వేదభాగము యొక్క శబ్దస్వరూపమునందు గాని పరిమాణభేదముచే భేదము లేదు.

వివరణము— మాత్రయొక్క చతుర్థ భాగము ఎక్కువగా, ప్రచితమగు ధ్వనిచే వ్యంజింపబడును. 64 ఋక్కులు గల ఒక వేద భాగమునకు 'దాశతయ'మని పేరు. ఇది

ఇంకను అధికమగు ప్రచయము గల ధ్వనిచే వ్యంగ్యము. ఈ రెండింటియందును ఉన్న శబ్ద తత్త్వము సమానమే. కాలభేదమేదైన నున్నచో అది కేవలము వ్యంజకములగు ధ్వనులకు సంబంధించినది. ఉదాహరణకు— ఏనుగును చూడగనే ఒక జ్ఞానము కలుగుచున్నది. మశక మును చూడగా ఒక జ్ఞానము కలుగుచున్నది. ఈ హస్తిమశక జ్ఞానములలో నున్న జ్ఞాన త్వాంశములో భేదమేమియు లేదు. అవి రెండును ఒక్కటే. కాని మొదటి జ్ఞానములో ఏనుగు యొక్క స్వరూపము, రెండవ జ్ఞానములో మశకము యొక్క స్వరూపము భాసించుటచే భిన్నములగు ఆ విషయములను బట్టి ఈ జ్ఞానములు గూడ భిన్నములైనట్లు భాసించుచున్నవి. వాస్తవమున ఆ రెండు జ్ఞానములందును భేదమేదియు లేదు. ఇట్లే స్ఫోటరూపమగు శబ్ద తత్త్వము పదములందుగాని, వాక్యములందుగాని అవి లక్షణముగనే ఉన్నను వ్యంజకములగు ధ్వనుల భేదమునుబట్టి విలక్షణమువలె కనబడుచున్నది. ॥66॥

అవతారిక—— స్ఫోటరూపమగు శబ్దమునందు కాలకృతమగు భేదము లేకున్నను ధ్వనికృత కాలభేదము ననుసరించి హ్రస్వ - దీర్ఘ - ప్లుతభేదములు అంగీకరింపబడినవి. కావున హ్రస్వవర్ణమును ఉచ్చరించునపుడు శాస్త్రమున దీర్ఘ ప్లుతములను గ్రహింపకుండుట కును, దీర్ఘమును ఉచ్చరించినపుడు హ్రస్వ ప్లుతములను గ్రహింపకుండుటకును తపరకర ణము చేయబడునని ''తపరస్తత్కాలస్య'' అను సూత్రము చెప్పుచున్నది. ఏదైన ఒకి అచ్చును తపరముగ (అత్, ఇత్ ఇత్యాదిరూపమున) ఉచ్చరించినపుడు ఉచ్చరించిన అచ్చు నకు ఎంత కాలమున్నదో అంతకాలమే గల అచ్చు మాత్రమే గ్రహింపవలెను గాని తద్భిన్న కాలము కలదానిని గ్రహింపరాదు అని దాని యర్థము. ఇపుడు ప్రశ్న ఏమనగా - ఒక అచ్చు నకు హ్రస్వ - దీర్ఘ - ప్లుత భేదమున్నట్లు హ్రస్వాదులకు గూడ ప్రత్యేకముగ ద్రుత - మధ్య- విలంబిత వృత్తులుండును 'అ' అను ఒక హ్రస్వమునే అతి శీఘ్రముగ ఉచ్చరించినచో ద్రుత వృత్తి. చాల ఆలస్యముగ ఉచ్చరించినచో విలంబిత వృత్తి. మధ్యరీతిలో ఉచ్చరించినచో మధ్య వృత్తి కావున ఈ వృత్తులను బట్టి ఏర్పడిన మూడేసి భేదములను గూడ హ్రస్వదీర్ఘ ప్లుతములకు అంగీకరించి, ఒక భేదమును ఉచ్చరించినపుడు మిగిలిన రెండింటిని గ్రహింప కుండుటకై తపరకరణాదులు చేయవలసి యుండునుగదా యని యాశంకించుకొని చెప్పు చున్నాడు.

శ్లో॥ అనునిష్పాదితత్వేన యేఽన్తరాల ఇవస్థితాః ।
శబ్దాస్తే ప్రతిపత్త్రాణా ముపాయాః ప్రతిపత్తయే ॥ 67

అనునిష్పాదితత్త్వేన = ప్రాకృతధ్వనిని అనుసరించి ఏర్పడు స్వరూపముతో, అన్తరాలే = శ్రోత్రమధ్యమునందు, స్థితాః ఇవ = ఉన్నవి వలె భాసించు, యే = ఏ, శబ్దాః = వైకృత ధ్వనులు కలవో, తే = అవి, ప్రతిపత్త్రాణాం = ద్రుతాది భేదమును గ్రహించెడి వారి యొక్క, ప్రతిపత్తయే = జ్ఞానమునకు, ఉపాయాః = ఉపాయములు.

తాత్పర్యము— ప్రాకృత ధ్వనులను అనుసరించి బయల్వెడలి శ్రోత్రాంతరము నందున్నట్లు తోచు, వైకృత ధ్వనులు ద్రుతాదివృత్తి భేదములను గ్రహింప చేయుచున్నవి.

విశేషము— ప్రాకృతధ్వని యనియు, వైకృతధ్వని యనియు ధ్వని రెండు విధములు. మొట్టమొదట బయల్వెడలు ధ్వని ప్రాకృతధ్వని. ఆ ప్రాకృతధ్వని లేనిచో స్ఫోటము సామాన్యరూపమున గాని విశేషరూపమున గాని భాసింపదు. ఈ ప్రాకృత ధ్వనినే స్ఫోటా భిన్నమని భావింతురు. ఇదియే హ్రస్వదీర్ఘ ప్లుతాది భేదవ్యవహారమునకు హేతువు. కావున వీటిలో ఒకదానిని గ్రహింపవలసి యున్నపుడు మిగిలిన రెండింటిని గ్రహింపకుండు టకు తపరకరణ మావశ్యకము. ప్రాకృత ధ్వని స్ఫోటరూప శబ్దాభివ్యక్తిని చేసిన పిమ్మట గూడ అనువర్తించుచు, శ్రవణ కుహరమున శ్రూయమాణమై యుండునది వైకృత ధ్వని. ఈ వైకృత ధ్వనియే ద్రుత వృత్త్యాది భేదకారణము. దీనిచే స్ఫోటమునందు భేదము ఏర్పడదు. ఈ వైకృత ధ్వనిచే ఆ యా వర్ణముల ఉపలబ్ధిలో వృద్ధి కలిగినను హ్రస్వత్వాదులందు గూడ భేదము కనబడుట లేదు. ఈ హ్రస్వమునే అతడు ద్రుతముగ ఉచ్చరించినాడు, ఇతడు విలంబితముగ ఉచ్చరించినాడు, ఇత్యాది ప్రతీతిని బట్టి వాటి అభేదము తెలియుచున్నది ఈ విధముగ వైకృత ధ్వనులు శబ్దతత్త్వము కంటె బాహ్యములు. బాహ్యములగు వైకృత ధ్వను లచే నేర్పడిన ద్రుతత్వాదులచే శబ్దభేద మేర్పడదు గాన తపరకరణము అనావశ్యకమని భావము. ॥67॥

అవతారిక— ఇపుడు ప్రకృతమగు కాలమునకు సంబంధించిన భేదవ్యవహారము పరోపాధి కల్పితమే అను విషయమును వివరించుచున్నాడు.

**శ్లో॥ విశిష్టమవధిం తం తముపాదాయ ప్రకల్పతే।**
**కాలః కలావతామేకః క్షణమాసర్తు భేదవత్ ॥** 68

ఏకః = ఒక్క, కాలః = కాలమే, విశిష్టం = విశిష్టమగు, తంతం = ఆ యా, అవధిం = అవధిని, ఉపాదాయ = గ్రహించి, క్షణమాసర్తు భేదభాక్ = క్షణములు, మాసములు, ఋతు వులు మొదలగు భేదములను పొందినదై, కలావతాం = సావయవములగు అనిత్య పదార్థముల యొక్క అవచ్ఛేదమునకు, ప్రకల్పతే = సమర్థమగుచున్నది.

తాత్పర్యము— కాలము ఒక్కటియే. అది ఆ యా విశిష్టావధులను గ్రహించి క్షణ - మాస - ఋత్వాది భేదములను పొందుచు సావయవములగు అనిత్య భావముల అవచ్ఛే దమును చేయుచున్నది.

వివరణము— విశిష్టమైన అవధి యనగా రెప్పపాటు వేయుట, చిటిక వేయుట మొదలగునది. ॥68॥

అవతారిక— అట్లైనను ఈ వ్యవస్థ భావములకు సంబంధించినది కాదు, బుద్ధికి సంబంధించినది అని చెప్పుచున్నాడు.

శ్లో॥ బుద్ధ్యవగ్రహభేదాచ్చ వ్యవహారాత్మని స్థితేః ।
తావానేవ క్షణః కాలః యుగమన్వన్తరాణి చ ॥ 69

బుద్ధ్యవగ్రహభేదాత్ + చ = సంకలనా రూపమున బుద్ధిచే గ్రహించుటలో గల భేదమును బట్టి, వ్యవహారాత్మని = వ్యవహారరూపమునందు, స్థితేః = ఉండుటవలన, తావాన్ = సంకలనా రూపమున బుద్ధిచే ఎంత గ్రహింపబడుచున్నదో అంత ప్రమాణము మాత్రమె గల, కాలః ఏవ = కాలమే, క్షణః = క్షణముగాని, యుగమన్వంతరాణివా = యుగమన్వంతరములు గాని అగుచున్నది.

తాత్పర్యము— సంకలనా రూపమున బుద్ధిచే గ్రహించుటలోని భేదమును బట్టి లోకవ్యవహారము జరుగుచుండును గాన, ఎంత ప్రమాణము గల కాలము బుద్ధ్యవగ్రహమునకు విషయమో అంత కాలము మాత్రమే క్షణముగ గాని మన్వంతరముగ గాని అగుచున్నది.

వివరణము— రెప్పపాటు ఎంతలో అగునో అంత కాలమును బుద్ధిచే ఆకలించుకొని దానిని నిమిషమనుచున్నాము. సూర్యోదయము మొదలు సూర్యాస్తమయము వరకును ఎంత ప్రమాణముండునో దానిని బుద్ధిచే ఆకలించుకొని పగలు అనుచున్నాము. ఈ విధముగ క్షణము మొదలు యుగములు, మన్వంతరములవరకును గల కాలము మనము బుద్ధితో ఆకళించుకొనుటను బట్టి ఏర్పడుచున్నది. ఈ విధముగ కాలము విషయమున బౌద్ధికమగు కల్పన చేయబడుచు వ్యవహార సాధనమగుచున్నది. కాలము మాత్రము ఒక్కటే. ॥69॥

అవతారిక— నాళికలోని జలము స్రవించుటనుబట్టి క్షణాహోరాత్రాది వ్యవహారము కలుగుచున్నది గాన అదియే (నాళికాజల సృతియే) కాలమని అంగీకరింప వచ్చునుగదా? మరల తద్భిన్నమగు కాలమును కల్పింపనేల, అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రతిబన్ధాభ్యనుజ్ఞాభ్యాం నాళికా వివరాశ్రితే ।
యదమ్భసి ప్రక్షరణం తత్కాలస్యైవ చేష్టితమ్ ॥ 70

నాళికావివరాశ్రితే = నాళికావివరమును ఆశ్రయించిన, అంభసి = ఉదకమునందు, ప్రతిబంధాభ్యనుజ్ఞాభ్యాం = ప్రతిబంధా భ్యనుజ్ఞలచే, యత్ = ఏ, ప్రక్షరణమ్ = స్రవించుట అనెడు క్రియ కనబడుచున్నదో, తత్ = అది, కాలస్యైవ = కాలము యొక్కయే, చేష్టితమ్ = చేష్ట.

తాత్పర్యము— నాళికా రంధ్రము వద్దనున్న జలమునందు ప్రతిబంధాభ్యనుజ్ఞలచే స్రవించుట అనునది కానవచ్చుచున్న దన్నచో అది కాలముయొక్క చేష్టయే.

వివరణము — ఘటోదరమున నున్న జలము ఛిద్రమునుండి స్రవించుచున్నపుడు ఆ జలములోని కొంత భాగమే స్రవించుట, మిగిలిన భాగము ఆ సమయమున స్రవింపకుండుట అనునది కాలమునకు గల ప్రతిబంధాభ్యనుజ్ఞా శక్తులను బట్టి జరుగుచున్నది. అట్లు కానిచో జలమంతయు ఒక్క మారుగా స్రవించియుండెడిది. క్రమముగ స్రవించుటను బట్టి

ఈ క్రమమునకు హేతువగు కాలవ్యాపార మొకటి యున్నదనియు, ఈ కాలము జలస్రవణ ముచే పరిచ్ఛేదింప (కొలవ) బడునదే కాని, జలస్రవణమే కాలము కాదనియు స్పష్టమగు చున్నది. కావున జలస్రవణము కంటె భిన్నమును, జలస్రవణముచే పరిచ్ఛేద్యమును అగు కాలమును అంగీకరింపవలెనని తాత్పర్యము. ॥70॥

అవతారిక— కాలము ఏకరూపమే అయిన పక్షమున, ఘటచ్ఛిద్రము చిన్నదై నపుడును పెద్దదైనపుడును స్రవించెడు నీటివలన దాని భేదము ఎట్లు నిర్ణయింపబడును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ అల్పేమహతి వాచ్ఛిద్రే తత్సమ్బన్ధే న భిద్యతే ।
కాలస్య వృత్తిరాత్మాపి తమేవాస్యాను వర్తతే ॥ 71

ఛిద్రే = ఛిద్రము, అల్పే = చిన్నదైనను, మహతివా = గొప్పదైనను, తత్సమ్బన్ధే = జలమునకు దానితో సంబంధము ఏర్పడినపుడు, కాలస్య = కాలముయొక్క, వృత్తిః = ప్రవృత్తి, నభిద్యతే = భిన్నము కాదు, అస్య = ఈ కాలము యొక్క, ఆత్మాపి = స్వరూపము కూడా, తమేవ = ఆ ఛిద్ర సంబంధమునే, అనువర్తతే = అనుసరించును.

తాత్పర్యము— జలమునకు చిన్న ఛిద్రముతో సంబంధమున్నను పెద్ద ఛిద్రముతో సంబంధమున్నను ప్రతిబంధాభ్యనుజ్ఞా రూపమగు కాలవ్యాపారమునందు మార్పు ఉండదు. కాలము ఛిద్రసంబంధమునే అనువర్తించును.

వివరణము— కాలము ఘటఛిద్రమును అనువర్తించును గాన, ఛిద్రము అల్పమైనచో ప్రతిబంధాభ్యనుజ్ఞలు బహులముగా నుండునుగాన దీర్ఘకాలమనియు, ఛిద్రము పెద్దదైనచో ప్రతిబంధాభ్యనుజ్ఞలు అల్పముగా నుండును గాన అల్పకాలమనియు వ్యవహారము కలుగును. కాలము భేదరహితమైనను దానికి గల ఛిద్ర సంబంధమును బట్టి భేదము కల్పితమగుచున్నది.

ఘటావయవములచే అడ్డుకొనబడిన జలము స్రవించుట లేదు ; ఛిద్రము విడిచిన జలము మాత్రము స్రవించుచున్నది ; ఈ విధముగ చెప్పుటకు వీలగునపుడు కాలమను దానిని అంగీకరించుట ఎందులకు అని ఆక్షేపింపరాదు. ఏలయన మూలభూతమగు కాలవ్యాపారమును పూర్తిగి త్రోసిపుచ్చుటకు వీలులేదు. కాలముచేయు ప్రతిబంధాభ్యనుజ్ఞలనే ఘటావయవచ్ఛిద్రములు గూడ కొనసాగునట్లు చేయుచున్నవని చెప్పవలెను. ఉదాహరణమునకు, బీజమునందు అంకురజననమును ప్రతిబంధించు శక్తియు, అనుమతించు శక్తియు ఉన్నది. ఈ శక్తులు కాలకృతములు. పౌణకలోనున్న బీజము అంకురమును పుట్టింపదు గాన కుసూలము అంకుర ప్రతిబంధ శక్తికి తోడ్పడుచున్నది. ఆ బీజమునే నేలపై చల్లినపుడు అంకురము వచ్చుచున్నది. కావున క్షేత్రము అంకురజననాభ్యనుజ్ఞా శక్తికి తోడ్పడుచున్నది. ఈ విధముగ ఆ యా కారణములును, కాలమును ఒకదానికొకటి తోడ్పడుచు కార్యములను పుట్టించుచున్నవి

అవతారిక—సంఖ్యఅవివక్షితమను పై చెప్పిన అర్థమున కొందరిభావమును వ్యక్తపరచుచున్నాడు.

**శ్లో॥ ఏకత్వం వా బహుత్వం వా కేషాఞ్చిదవివక్షితమ్।**
**తద్ధి జాత్యభిధానాయ ద్విత్వం తు స్యాద్వివక్షితమ్॥** 52

A కేషాఞ్చిత్ = కొందరి, (మతే) = మతమున, ఏకత్వం + వా = ఏకత్వసంఖ్యయు బహుత్వం + వా = బహుత్వసంఖ్యయు, అవివక్షితమ్ = వివక్షితముకాదు, అనగా అదివాక్యార్థమున మిశ్రితము కాదు. దానినివిడచియే వాక్యార్థము నిర్ణయింపబడునని భావము. అందుకు కారణము చూపుచున్నాడు.

హి = ఏలయన, తత్ = అది అనగా ఏకత్వము. బహుత్వము, జాత్యభిధానాయ = జాతిని బోధించుటకై (ప్రవర్తతే) = ప్రవర్తించుచున్నది.

జాతియందు స్వతః ఏకత్వమున్నది. దానినే బోధించుటకై ఏకవచనప్రత్యయము ప్రవర్తించును. అందుచే 'నాంతరీయకము' కనుక, అనగా 'అది లేనిది యుండదు' కనుక ఏకవచనము శబ్దసాధుత్వము కొరకే ప్రవర్తించును. ఉదా॥ గౌర్నపదాస్ప్రష్టవ్యః (ఆవును పాదముతో తన్నరాదు) ఈ వాక్యము ఎల్లగోవులకు వర్తించును, ఏదోఒక గోవునకే సంబంధించునదికాదు.

బహుత్వము జాతియందు స్వతః లేదు, కాని పాణినిమహర్షి జాతిని బోధింప దలచినపుడు వైకల్పికముగా *బహువచనమును విధించియున్నాడు. అందుచేనచట బహువచనముకూడప్రవర్తించును. ఉదా॥ గౌఃపూజ్యా (గోవు పూజింపతగినది), గావః పూజ్యాః (ఆవులు పూజింపతగినవి). రెంటికి తాత్పర్యమొక్కటియే.

కనుక బహుత్వము వివక్షితముకాదు. ఉదా-'ఖలైఃనసంగచ్ఛేత' (ఖలులతో కలియరాదు). ఒకనితో, ఇద్దరితో పలువురతోగూడ కలియకూడదనియే దానిభావము. బహువచనమున్నదికదా యని ఒకనితో ఇద్దరితో కలియవలెనని భావము కాదు.

B. ద్విత్వం + తు = ప్రత్యయముచే బోధింపబడిన ద్విత్వసంఖ్య మాత్రము, వివక్షితమ్ = వివక్షితమగును, అనగా ప్రత్యయార్థమగు ద్విత్వమును కలిపియే వాక్యార్థము నిర్ణయింపవలెను. ఉదా॥ 'ఘటపటౌ' ఆనయ, (ఘటమును, పటమును తెమ్ము) అనువాక్యమున ద్విత్వముతోగూడిన రెండు వస్తువులును బోధవిషయములగును.

కాగా ఏకత్వబహుత్వములు జాతి ధర్మములుకాన వానిని విడిచియే వాక్యార్థము చూపవలెను. ద్విత్వము జాతి ధర్మము కానందున దానిని విడువకయే వాక్యార్థము చూపవలెను. ॥52॥

---

* జాత్యాఖ్యాయా మేకస్మిన్ బహువచనమన్యతరస్యామ్., (1-2-58.) జాతిని చెప్పదలచిన ఏకత్వమున బహువచనము వికల్పముగా కలుగునని సూత్రార్థము. బ్రాహ్మణాః పూజ్యాః, బ్రాహ్మణః పూజ్యః.

లేదా నిరోధించుచున్నవి అని అంగీకరింపవలెను గాని ఒకదానిని అంగీకరించి మరియొక దానిని నిరాకరించుట యుక్తము కాదు. ॥71॥

అవతారిక— పెక్కులేల? కాలాత్మ భేదరహితమైనను స్వశక్తి వైచిత్ర్యముచే అన్ని భావములందును భేదమును చూపుచున్నది అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆక్రీడ ఇవ కాలస్య దృశ్యతే యః స్వశక్తిభిః।**
**బహురూపస్య భావేషు బహుధా తేనభిద్యతే॥ 72**

స్వశక్తిభిః = తన శక్తులచేత, బహురూపస్య = విభిన్న రూపములుగా ఉన్న, కాలస్య = కాలముయొక్క, యః = ఏ, భావేషు = పదార్థముల విషయమున, ఆక్రీడ ఇవ = ఆటవలె, దృశ్యతే = కనబడుచున్నదో, తేన = దానిచేత, బహుధా = అనేక విధములుగా, భిద్యతే = భిన్నముగ కనబడుచున్నది.

తాత్పర్యము— స్వశక్తులచే బహురూపముల కానవచ్చు కాలము భావములనెడు ఆట వస్తువులతో ఆడుకొనుచున్నట్లున్నది. ఈ విధముగ వర్తమానాది వైచిత్ర్యము గల కాలముతో సంబంధించుటచే భావములు ఆవిర్భావతిరోభావములతో విభిన్న రీతుల కానవచ్చు చున్నవి. భావముల ఆవిర్భావతిరోభావములను బట్టి కాలము భిన్నరూపముల కనబడుచున్నది. ॥72॥

అవతారిక— పై విషయమునే విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ త్వచిసారస్య వా వృద్ధిం తృణసారస్య వా దధత్।**
**తావత్తద్వృద్ధియోగేన కాలతత్త్వం వికల్పతే॥ 73**

త్వచిసారస్య = వెదురు మొక్కయొక్క కాని, తృణసారస్యవా = తాటిచెట్టు యొక్క కాని, వృద్ధిం = వృద్ధిని, దధత్ = చేయుచున్న, తావత్ = అంతే ప్రమాణముగల, కాలతత్త్వం = కాలతత్త్వము, తద్వృద్ధియోగేన = వాటియొక్క వృద్ధితోడి సంబంధముచేత, వికల్పతే = భిన్నమగుచున్నది.

తాత్పర్యము— వెదురు మొక్కకుగాని, తాటిచెట్టుకుగాని వృద్ధిని కలిగించుచు, అంతమాత్రమే ప్రమాణముగల వయస్సును, కాలతత్త్వము వాటియొక్క వృద్ధిని బట్టి వేరు వేరుగ కనబడుచున్నది.

విశేషము— కాలము వెదురు మొక్కకు ఆదినుండి ఫలోద్గమము వరకును వృద్ధిని కల్గించుచున్నది. తాలవృక్షమునకు అంతకంటె అధికమగు వృద్ధిని కల్గించుచున్నది. వెదురుమొక్క వృద్ధిపొందెడు కాలము అల్పము దానికంటె తాటిచెట్టు వృద్ధిచెందెడు కాలము అధికము. ఈ విధముగ కాలము వంశతాలవృక్షాది భావములతో ఆట వస్తువులతో ఆడు

కొన్నట్లు ఆడుకొనుచు, వాటి జన్మస్థితి వినాశాదులతో నేర్పడిన సంబంధమును బట్టి విభాగ మును పొందుచున్నది. ॥73॥

అవతారిక— ఆ యా వస్తువుల అవస్థా భేదమును బట్టి కాలభేదమని అంగీకరించి నచో, వాటి అవస్థా వినాశముచే కాలము గూడ నశించును గాన అది నిత్య మెట్లగును - అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ వ్యతిక్రమేఽపి మాత్రాణాం తస్య నాస్తి వ్యతిక్రమః ।**
**న గన్తృగతి భేదేన మార్గభేదోఽస్తి కశ్చన ॥ 74**

మాత్రాణాం = భావములు, వ్యతిక్రమేఽపి = తొలగిపోయినను, తస్య = ఆ కాలమునకు, వ్యతిక్రమః = తొలగిపోవుట అనునది, నాస్తి = లేదు, గన్తృగతి భేదేన = నడచే వారి యొక్కయు వారి నడకల యొక్కయు భేదముచే, మార్గభేదః = మార్గమునందు భేదము, కశ్చన = ఏదియు, నాస్తి = లేదు.

తాత్పర్యము— భావములును, వాటి యవస్థలును తొలగిపోవుచున్నను (మార్పు చెందుచున్నను), కాలమునకు వ్యతిక్రమము లేదు. నడచేవారియందును వారి నడకలయందును ఉన్న భేదమును బట్టి మార్గమున భేదమేదియు ఉండదు.

వివరణము— భావములకు కాలము ఆధారము. ఆ భావములుగాని, వాటి అవస్థలు గాని ఏమైన మార్పులు చెందినను ఆధారభూతమగు కాలమున భేదమేమియు ఏర్పడదు. ఉదాహరణమునకు— మార్గమునందు నడిచే వారి భేదమును బట్టియు, వారి నడకలలోని భేద మును బట్టియు భేదము చెందక, మార్గము మాత్రము ఒక్క రూపముననే యుండును; దాని యందు మార్పు ఏదియు రాదుకదా ? పుష్పోద్గమాది క్రియలు తొలగుటచే వసంతాది కాలము తొలగినదని వ్యవహరింతుమే గాని వాస్తవమున నిత్యమగు కాలమునకు ఆగమాపాయములేదని తాత్పర్యము. ॥74॥

అవతారిక— ఈ విషయమునే విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ ఉదయాస్తమయావృత్త్యా జ్యోతిషాం లోకసిద్ధయా ।**
**కాలస్యా వ్యతిపాతేఽపి తాద్ధర్మ్యమివ లభ్యతే ॥ 75**

కాలస్య = కాలమునకు, అవ్యతిపాతేఽపి = గడచిపోవుట అనునది లేకపోయినను, లోక సిద్ధయా = లోక ప్రసిద్ధమగు, జ్యోతిషాం = సూర్యాది జ్యోతిస్సుల, ఉదయాస్తమయా వృత్త్యా = ఉదయాస్తమయముల ఆవృత్తిచే, తాద్ధర్మ్యం + ఇవ = ఆ జ్యోతిస్సుల ధర్మము కలిగియుండుట వలె, లభ్యతే = పొందబడుచున్నది (చూడబడుచున్నది).

తాత్పర్యము— కాలమునకు గడచిపోవుట అనునది లేకపోయినను లోకములో ప్రసిద్ధముగ నున్న సూర్యాది జ్యోతిస్సుల ఉదయాస్తమయములచే కాలమునకు గూడ ఆ ధర్మము లున్నట్లు తోచుచున్నది.

వివరణము— సూర్యుడు మొదలగు తేజస్సులు ఉదయించుచు అస్తమించుచు ఉండును. ఆ సూర్యాదుల సంచారముచే కాలమునందు భేదము కల్పింపబడుచున్నది. ఈ కల్పనను బట్టి పగలు గడచినది, రాత్రి గడచినది. శిశిరము వెళ్ళిపోయినది, ఇత్యాది వ్యవహారములు కలుగుచున్నవి గాని వాస్తవమున కాలము గడచిపోవుటగాని, మరల వచ్చుటగాని సత్యములు కావు.

అవతారిక— జ్యోతిర్గమనమును బట్టి కాలమునందు భేదబుద్ధి ఏర్పడుచున్నది గాన ఆ జ్యోతిర్గమనమే కాలమని కొందరి మతమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆదిత్యగ్రహనక్షత్ర పరిస్పన్ద మథాపరే ।**
**భిన్న మావృత్తిభేదేన కాలం కాలవిదో విదుః ॥** 76

అథ = ఇక, అపరే = మరికొందరు, కాలవిదః = కాలవేత్తలు, ఆవృత్తిభేదేన = ఆవృత్తి (మరల మరల వచ్చుట) భేదముచే, భిన్నం = భిన్నమైన, ఆదిత్యగ్రహనక్షత్ర పరిస్పన్దః = ఆదిత్యునియొక్కయు, గ్రహములయొక్కయు, నక్షత్రములయొక్కయు గమనమును, కాలం = కాలమునుగా, విదుః = తెలిసికొనుచున్నారు (చెప్పుచున్నారు).

తాత్పర్యము— మరల మరల తిరిగి వచ్చుచుండుటచే భిన్నముగ కనబడుచున్న ఆదిత్య - గ్రహ - నక్షత్రాదుల గమనమే కాలమని కొందరు కాలజ్ఞులు చెప్పుచున్నారు.

వివరణము— ఉదయము మొదలు అస్తమయమువరకును గల సూర్యసంచారము పగలు ; అస్తమయము మొదలు ఉదయము వరకును ఉన్నది రాత్రి. చంద్రుడు నక్షత్రముల నన్నింటిని దాటుట మాసము. బృహస్పతి ఒక రాశిలో సంచరించుకాలము సంవత్సరము. ఈ విధముగ జ్యోతిర్గమనమే యుగ - మన్వన్తర - కల్ప - మహాకల్పాది భేదభిన్నమగు కాలము. ॥76॥

అవతారిక— ఈ విధముగ సూర్యాదుల గమనక్రియ కాలమని ప్రసిద్ధిపొంది, అప్రసిద్ధమగు ఇతర క్రియల ప్రమాణమును తెల్పుచుండునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రియాన్తర పరిచ్ఛేద ప్రవృత్తా యా క్రియాం ప్రతి ।**
**నిర్జ్ఞాత పరిమాణా సా కాలఇత్యభిధీయతే ॥** 77

నిర్జ్ఞాత పరిమాణా = తెలియబడిన పరిమాణము గల, యా = ఏ క్రియ, క్రియాన్తర పరిచ్ఛేద ప్రవృత్తా = మరియొక క్రియను కొలచుటకై ప్రవర్తించునో, సా = ఆ క్రియ, క్రియాం ప్రతి = పరిచ్ఛేద్యమగు ఆ క్రియను గూర్చి, కాలః ఇతి = కాలము అని. అభిధీయతే = చెప్పబడు చున్నది.

తాత్పర్యము— తెలియబడిన పరిమాణము గల ఏ క్రియ క్రియాంతరమును

కొలచుటకు ఉపయుక్తమగునో, ఆ క్రియ పరిచ్ఛేద్యమగు ఆ క్రియాంతరమును గూర్చి కాలమని చెప్పబడుచున్నది.

వివరణము— సూర్యాది గమనములకు దివసాది నామధేయము లున్నవి. ఈ దివసాదుల ప్రమాణ మెంత యుండునో అందరికిని తెలియును అట్లే ఆవునుండి పాలు పితుకుట అనునది ఒక క్రియ. దీని పరిమాణము కూడ ప్రసిద్ధముగ తెలియును. ప్రసిద్ధ ప్రమాణములగు ఈ సూర్య సంచార క్రియ (పగలు లేక రాత్రి) పాలు పితుకుట అను క్రియ, మొదలగు వాటిని బట్టి అప్రసిద్ధములగు క్రియల పరిమాణమును సూచించుటకు ప్రయత్నింతుము. ఉదాహరణమునకు— 'పగలంతా చదివినాడు', 'రాత్రి అంతా చదివినాడు' ఇత్యాది ప్రయోగములలో పగటి రాత్రుల (సూర్య సంచార క్రియల) పరిమాణమును బట్టి అధ్యయన క్రియా పరిమాణమును నిశ్చయించుచున్నాము. 'గోదోహమాస్తే' (పాలు పితికినంత సేపు ఉన్నాడు) ఇత్యాది ప్రయోగములలో గోదోహనము ఎంత సేపు జరుగునో మనకు తెలియును గాన దానిని బట్టి 'అసి' క్రియను (ఉండుటను) కొలుచుచున్నాము. ఈ విధముగ పై ఉదాహరణములలో అధ్యయన క్రియకు సూర్యసంచార క్రియ కాలము ; అసిక్రియకు గోదోహనము కాలము. ॥77॥

అవతారిక— సూర్యాది సంచారమును, జలస్రుతిని గమనించువానికి కాలభేదము తెలిసినను, గదిలోపల నుండి అంతర్ముఖుడుగ నుండు వానికి కాలభేద మెట్లు తెలియును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ జ్ఞానే రూపస్య సంక్రాన్తి ర్జ్ఞానేనైవాను సంస్మృతిః ।**
**అతః క్రియాన్తరాభావే సా క్రియా కాల ఇష్యతే ॥ 78**

జ్ఞానే = జ్ఞానమునందు. రూపస్య = ప్రాణ ప్రవాహాది రూపమగు (శ్వాసము) యొక్క క్రియయొక్క, సంక్రాన్తిః = సంక్రమణము కలుగును, జ్ఞానేనైవ = జ్ఞానముచేతనే, అను సంస్మృతిః = సంకలనము జరుగును, అతః = ఆ కారణము వలన, క్రియాన్తరాభావే = మరియొక క్రియ ఏదియు లేనిచో, సా = ఆ, క్రియా = క్రియయే, కాలః = కాలము అని, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

తాత్పర్యము— ఊపిరి పీల్చుట విడుచుట మొదలయిన క్రియలు ఆ అంతర్ముఖుని బుద్ధియందు సంక్రమించును. ఆ క్రియలను బుద్ధిచేతనే సంకలనము చేసికొనును. ఈ విధముగ బాహ్యక్రియ ఏదియు లేనిచో, ఆ క్రియయే కాలమని అంగీకరింపబడును.

వివరణము— గదిలో నున్న వ్యక్తి అంతర్ముఖుడైనను తన బుద్ధియందు సంక్రమించిన స్వరూపముగల ప్రాణ ప్రవాహాది క్రియలను గుర్తించును. ఈ విధముగ తన బుద్ధియందు నివిష్టములగు క్రియా క్షణముల నన్నింటిని బుద్ధ్యన్తరముచే సంకలనము చేసికొనును అనగా సముదాయ రూపమున గ్రహించును. ఈ అంతర క్రియల సహాయముతో అతడు

బాహ్య క్రియలను పరిచ్ఛేదింప గలడు. ఈ విధముగ బాహ్య క్రియ లేవియు లేనపుడు బుద్ధి నివిష్టమగు ఇట్టి ఆంతర క్రియయే కాలముగ ఉపకరించును. ఇట్టి బుద్ధులు అధిక సంఖ్యాకము లుగ ఉదయించునపుడు చిరకాలత్వమును, అల్ప సంఖ్యాకములుగ ఉదయించునపుడు శీఘ్ర కాలత్వమును గ్రహించును. కావుననే కొందరు యోగులు ప్రాణచారమును బట్టియు, మరి కొందరు ప్రాణక్షణములను లెక్కించుట చేతను పదార్థములను తెలిసికొందురు. ఒక గడియకు 360 ప్రాణ ప్రసారము లగుననియు, ఒక అహోరాత్ర రూపదివసమున 21600 ప్రాణ ప్రసారము లగుననియు చెప్పుదురు. ॥78॥

అవతారిక— లోకములో "భూతా సత్తా" (సత్త ఉండెడిది) అను ప్రయోగ మున్నది. క్రియాతిరిక్తమగు కాలమనునది లేదన్నచో సత్తా రూపమగు క్రియకు సత్తారూప మగు మరియొక క్రియతో సంబంధమున్నట్లు చెప్పుట అయుక్తముగాన ఈ ప్రయోగము ఎట్లు కుదురును అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ భూతో ఘట ఇతీయంచ సత్తాయా ఏవ భూతతా ।
భూతా సత్తేతి సత్తాయాః సత్తా భూతాభిధీయతే ॥ 79

'భూతః ఘటః' ఇతి = 'ఘటము ఉండెడిది' అనునపుడు గూడ, ఇయం= ఈ, భూతతా = భూతత్వము, సత్తాయాః ఏవ = సత్తకు సంబంధించినదే, 'భూతా సత్తా' ఇతి = సత్త ఉండె డిది అనునపుడు గూడ, సత్తాయాః = సత్తయొక్క, భూతా = పూర్వము ఉన్న, సత్తా = ఉనికి, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— 'భూతః ఘటః' ఇత్యాది ప్రయోగములలో గూడ సత్తయొక్క భూతత్వమే చెప్పబడుచున్నది. "భూతా సత్తా" అనునపుడు గూడ పూర్వముండెడి సత్త యొక్క సత్త చెప్పబడుచున్నది.

వివరణము— 'భూతః ఘటః' ఇత్యాది ప్రయోగములలో భూతత్వము ఘటము నకు సంబంధించినది కాదు ఘటము ద్రవ్యము గాన దానికి కాలముతో ప్రత్యక్ష సంబంధము కుదురదు సాధ్యస్వభావములగు (సాధింపవలసి యున్న) క్రియలకు కాలము ఆధారము గాన వాటికే కాలముతో ప్రత్యక్ష సంబంధ ముండును గాని ద్రవ్యముల కుండదు. 'భూతః' అను పదమునందు 'భూ' ధాతువు 'క్త', ప్రత్యయము ఉన్నవి. భూధాతువు సత్త అను క్రియను బోధించును. 'క్త' ప్రత్యయము ఆ క్రియ పూర్వముండెడిదని బోధించును. ఈ విధముగ 'భూతః' అను దానికి 'సత్త పూర్వమున ఉండెడిది' అని యర్థము. దీనిని బట్టి సత్తయొక్క భూతత్వమే బోధింపబడుచున్నదని తేలినది. ఆ సత్త ఘటమునందు సమవాయా సంబంధ ముతో నున్నది గాన ఘటమునకు సత్త ద్వారా భూతత్వముతో పరంపరా సంబంధమేర్పడు చున్నది. అంతేకాని ఘటమునకు భూతత్వముతో ప్రత్యక్ష సంబంధము లేదు. ఇట్లే 'భూతా సత్తా' అనునపుడు గూడ ధాతువాచ్యమగు సత్త వేరు. అది క్రియారూపమైనది. 'సత్తా' శబ్ద

వాచ్యమగు సత్త వేరు; అది ద్రవ్య తుల్యము. దీనికి కాలముతో ప్రత్యక్ష సంబంధము లేదు. ధాతువాచ్యమగు సత్తా ద్వారముననే దీనికి కాలసంబంధము. ఈ విధముగ 'భూతాసత్తా' ఇత్యాది ప్రయోగములు అదుష్టము లని యభిప్రాయము. ॥79॥

అవతారిక— ఇంతవరకును కాలస్వరూపమును గూర్చి విచారించి, ఇక శాస్త్రమునకు సంబంధించిన కాలభేదమును గూర్చి ప్రసంగించుచున్నాడు.

శ్లో॥ పరతో భిద్యతే సర్వమాత్మాతు న వికల్పతే ।
పర్వతాది స్థితి స్తస్మాత్ పరరూపేణ భిద్యతే ॥ 80

సర్వం = ప్రతి పదార్థమూ, పరతః = ఇతర పదార్థమును బట్టి, భిద్యతే = భేదించును, ఆత్మా తు = దాని స్వరూపమైతే, న వికల్పతే = భిన్నము కాదు, తస్మాత్ = ఆ కారణము వలన, పర్వతాది స్థితిః = పర్వతాదుల యొక్క స్థితి, పరరూపేణ = ఇతర పదార్థములకు సంబంధించిన రూపముచేత, భిద్యతే = భేదమును పొందుచున్నది.

తాత్పర్యము— ప్రతిపదార్థము ఇతర పదార్థములను బట్టి భేదమును పొందుచుండును గాని దాని స్వరూపమునందు భేదము ఉండదు. కావున పర్వతాదుల స్థితి కూడ పరరూపముచే భేదించును.

వివరణము— ఈ కారికయు, దీని తరువాత వచ్చు మరికొన్ని కారికలును, మహాభాష్యములో వర్తమాన కాలాదుల విషయమున వ్రాసిన కొన్ని విషయముల నాధారనుగ చేసికొని వ్రాయబడినవి.

'వర్తమానే లట్' అను పాణిని సూత్రముచే వర్తమాన కాలమును సూచించుచు 'లట్' వచ్చునని చెప్పబడినది. ఈ ప్రసంగమున "నిత్య ప్రవృత్తే చ కాలా విభాగాత్" అను ఒక ఆక్షేప వార్తికములో వార్తిక కారుడు - 'పర్వతాః తిష్ఠన్తి' "నద్యః ప్రవహన్తి" ఇత్యాది స్థలములలో పర్వతములు ఎల్లవేళలను ఉన్నవి గావునను, అట్లే నదులు సర్వదా ప్రవహించుచునే యున్నవి గావునను, ఇచట వర్తమానమును అంగీకరింప వీలులేదు గాన ఈ సూత్రముచే లట్ వచ్చుటకు అవకాశము లేదు; అందుచే 'పర్వతాః తిష్ఠన్తి' ఇత్యాది స్థలములలో 'లట్' వచ్చుటకై ప్రత్యేకముగ ఒక సూత్రమును విధించుకొనవలెను అని చెప్పెను. వర్తమానమనగా ఇపుడున్నది. ఈ వర్తమానత్వము భూత భవిష్యత్త్వములకు విరోధి. నిత్యమైన పదార్థములు ఎల్లప్పుడును ప్రవర్తించుచున్నవే (ఉంటూన్నవే) గావున వాటియందు భూతత్వ భవిష్యత్త్వములు లేకుండుటచే వర్తమానత్వమే ఉండుటకు అవకాశము కలదు. ఇట్టి పరిస్థితులలో 'పర్వతాః తిష్ఠంతి' 'నద్యః ప్రవహన్తి' ఇత్యాది స్థలములందు వర్తమానత్వము లేదను ఆ శంకకు అవకాశము లేదుకదా అని శంకింపరాదు. ఏలయన— కాలముచే ఏ భా
లకు ఉపకారము జరుగునో అట్టి భావముల విషయముననే భూతము, భవిష్యత్తు. వర్తమ
అనెడు కాలమునకు సంబంధించిన విభిన్న వ్యపదేశములు ప్రవర్తించును. ఈ భు

వ్యపదేశములు ప్రవర్తింపవలెనన్నచో ఆ భావములు జన్మవంతములై యుండవలెను. జన్మ వంతములగు భావములు నియతావధిని పట్టి జన్మను స్వీకరించుటచే ఈ భూతాది వ్యపదేశ ములు ఉపపన్నము లగును. సాధనము లన్నియు సమకూడి యున్నపుడు ఉత్పత్త్యభిముఖము లైన వాటిని భవిష్యత్తులు ; ఉత్పన్నములైన తరువాత ఉన్నంతవరకును వర్తమానములు ; కొంతకాల ముండి నశించిపోవునవి భూతములు. ఈ విధముగ వర్తమానము అనెడు వ్యప దేశము భూత భవిష్యదవధులకు మధ్యనున్నట్లు స్పష్టము. కావున భూత భవిష్యత్త్వములు లేనిచోట వర్తమానత్వము కూడ ఉండుటకు అవకాశము లేదుగాన, భూత భవిష్యత్తులతో సంబంధము లేని నిత్య పదార్థముల విషయమున వర్తమానత్వ వ్యపదేశము అయుక్తము. కావున సర్వదా నిలిచియుండునవియు, సర్వదా ప్రవహించునవియు నగు పర్వతముల యెడను నదులతోను వర్తమానత్వము సంబంధింపదు గాన 'పర్వతాః తిష్ఠన్తి' 'నద్యః ప్రవహన్తి' ఇత్యాదులలో లట్టు వచ్చుటకై ప్రత్యేక నియమ మొకటి చెప్పవలసి యుండునని ఈ ఆక్షేప వార్తికము యొక్క అభిప్రాయము.

ఈ ఆక్షేపమునకు మహాభాష్యమునందు క్రింది విధముగ సమాధానము చెప్ప బడినది. ''స్థాస్యన్తి పర్వతాః, తిష్ఠన్తి, అస్థుః'' (పర్వతములు నిలిచి ఉండగలవు, నిలిచి ఉన్నవి, నిలిచి ఉండెను) అనెడు ప్రయోగములు ఉన్నవి ఇట్టి ప్రయోగములను బట్టి పర్వ తాదులకు భూత భవిష్యత్కాల సంబంధము గూడ ఉన్నట్లు తెలియుచున్నది. నిత్య స్థితము లగు పర్వతాదుల స్థితియందు భేదమేదియు లేకున్నను ఇతర క్రియలకు గల భూత భవిష్య త్త్వాది సంబంధమును బట్టి ఈ స్థితియందు గూడ భేదము కల్పింపబడుచున్నది. ఈ విధముగ ''తస్థుః పర్వతాః'' (పర్వతములు నిలిచి ఉండెను) అనగా భూతకాలమునకు సంబంధించి రాజుల క్రియలు ఎపుడు జరుగుచుండెనో అపుడు పర్వతములు నిలిచి యుండెడివి అని యర్థము. ''తిష్ఠన్తి పర్వతాః'' అనగా ప్రస్తుతము పరిపాలించుచున్న రాజులు చేయుచున్న క్రియలు జరుగుచున్నపుడు పర్వతములు నిలిచి యున్నవి అని యర్థము 'స్థాస్యన్తి పర్వతాః' అను దానికి రాబోవు రాజులు ఏ పనులు చేయుచున్నారో ఆ పనులు జరుగనున్న సమయ మున పర్వతములు నిలిచి ఉండగలవు' అని యర్థము. ఈ విధముగ పర్వత స్థితియందు పరులగు రాజాదుల క్రియల భేదమును బట్టి భేదమును కల్పించుటచే భూతభవిష్యత్త భేదము [illegible]గవచ్చును. తద్భిన్నమగు వర్తమానత్వమును సూచించుటకై 'వర్తమానే లట్' అను [illegible]త్రముచే విహితమగు లట్టు వచ్చుటకు బాధకము లేదుగాన ''పర్వతాః తిష్ఠన్తి'' ఇత్యాదు [illegible]లో లట్టు వచ్చుటకై సూత్రాంతరమును రచింప బనిలేదు. ఈ విషయమునే ఈ కారిక చెప్పుచున్నది.

ఏ పదార్థమునకైనను దాని స్వరూపమునందు భేదమేమియు ఉండదు ; ఉపాధి భేదమును బట్టియే భేద మేర్పడుచుండును. కావున పర్వతాది నిత్య పదార్థముల స్థితియందు దాని స్వరూపమును బట్టి భేదమేమియు లేదు. దానియందు ఏదైన భేదము కనబడుచున్నదో అది పదార్థాంతరమునకు సంబంధించిన క్రియాంతరమును బట్టి ఏర్పడుచున్నది. పూర్వ

రాజులు ఏ క్రియలు చేయుచుండిరో ఆ సమయమునందలి పర్వతిస్థితి వేరు. ఈ కాలమున వారు ఏమి చేయుచున్నారో ఆ సమయమునందలి పర్వతస్థితి వేరు, రాబోవు రాజులు ఏ పనులు చేయనున్నారో ఆ సమయమునందలి పర్వత స్థితి వేరు అని అభిన్నమగు స్థితియందు భేదమును కల్పించి త్రికాల విషయకమగు గౌణ ప్రయోగము చేయవచ్చునని అభిప్రాయము. ॥80॥

*అవతారిక*— భూతములు, భవిష్యత్తులును, వర్తమానములును అగు రాజక్రియలతో సాహచర్యముచే పర్వతాది స్థితియందు భూత భవిష్యద్వర్తమానత్వము ఆరోపింపబడుచున్నదనియు, వాస్తవమున నిత్య పదార్థముల స్థిత్యాదులందు భేదము లేదనియు వెనుక చెప్పబడినది. పర్వతాదుల స్థితియందు గూడ వాస్తవమున భేదమున్నదనియు, కాని భూత భవిష్యద్వర్తమాన కాలిక స్థితు లన్నియు సజాతీయములగుటచే వాటియందలి భేదమును గ్రహింప శక్యము కాకున్నదనియు, విజాతీయములగు రాజక్రియాదులచే వీటి భేదము గ్రహింపబడు చున్నదనియు మతాంతరమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రసిద్ధ భేదా వ్యాపార విరూపావయవ క్రియాః ।
సాహచర్యేణ భిద్యన్తే సరూపావయవ క్రియాః ॥ 81

విరూపావయవ క్రియాః = విభిన్న స్వభావములతో గూడిన అవయవ క్రియలు గల, వ్యాపారాః = వ్యాపారములు, ప్రసిద్ధభేదాః = ప్రసిద్ధమైన కాలభేదము కలవి, సరూపావయవ క్రియాః = సజాతీయములగు అవయవములు గల వ్యాపారములు, సాహచర్యేణ = ఇతర క్రియా సాహచర్యముచే, భిద్యన్తే = భేదమును పొందుచున్నవి.

**తాత్పర్యము**— విజాతీయములగు అవయవ క్రియలు గల వ్యాపారములు ప్రసిద్ధ కాలభేదము కలవి. సజాతీయమైన అవయవ క్రియలు గల వ్యాపారములు ఇతర క్రియా సాహచర్యముచే భిన్నములుగ కనబడును.

*వివరణము*— వండుట, బ్రద్దలుకొట్టుట మొదలగు కొన్ని క్రియలు ఉన్నవి. వీటికి బియ్యము కడుగుట, గిన్నె పొయ్యిమీద పెట్టుట, మంట బెట్టుట, గొడ్డలి ఎత్తుట పడవేయుట మొదలగు వేరు అవాంతర క్రియలు అవయవములుగ నున్నవి. ఈ క్రియలలో నున్న అవాంతర క్రియ లన్నియు విజాతీయము లగుటచే ఇట్టి క్రియలలో గల భూత భవిష్యత్త్వాది కాలభేదము స్పష్టముగ తెలియును. స్థితి మొదలగు క్రియలలో గూడ అవాంతర క్రియా రూపము లగు అవయవము లున్నవి. నిన్నటి స్థితి వేరు, ఇప్పటి స్థితి వేరు, రేపటి స్థితి వేరు దీనిలో ఆత్మభరణము (తన్ను తాను నింపుకొని మార్పులేకుండా ఉండుట) మొదలగునవి అవాంతర క్రియలు. ఈ అవాంతర క్రియలును స్థితి క్రియయు సజాతీయములగుటచే వీటి వీటి భేదమును గ్రహించుటకు శక్యము కాదు. వీటి భేదమును రాజాదులగు ఇతర పదార్థములకు సంబంధించిన క్రియలను బట్టి తెలిసికొనవలసి యున్నది. ఈ విధముగ అవాంతర క్రియల భేదము గ్రహింప వీలగుట, కాకపోవుట అను భేదమే తప్ప, పచ్యాది క్రియలందు

వలె స్థిత్యాది క్రియలందు గూడ కాలకృత భేద సంబంధమున్నది. పర్వతాది స్థితికి పరిచ్ఛేదకములు గాన రాజక్రియలు దానికి ఆధారములై, దాని కాలమని వ్యవహరింపబడుచున్నది. భాష్యములో చెప్పిన రాజక్రియ సూర్య సంచారాదులకు గూడ ఉపలక్షణము. సూర్య సంచారాది క్రియల్ల భేదమును బట్టి పర్వతాదిస్థితి భేదము గ్రహింపబడుచున్నది కదా ? ॥81॥

అవతారిక— 'వర్తమానే లట్' అను సూత్ర వ్యాఖ్యా ప్రసంగమునందలి ఆక్షేప వార్తికాన్తర తత్సమాధాన భాష్యార్థములను సంగ్రహించి రెండు కారికలు వ్రాయుచున్నాడు.

**శ్లో॥ వ్యవధానమివోపైతి నివృత్త ఇవ దృశ్యతే ।**
**క్రియాసమూహో భుజ్యాదిరన్తరాల ప్రవృత్తిభిః ॥ 82**

**శ్లో॥ న చ విచ్ఛిన్నరూపోఽపి సోఽవిరామాన్నివర్తతే ।**
**సర్వైవ హి క్రియాన్యేన సఙ్కీర్ణేవోపలభ్యతే ॥ 83**

భుజ్యాదిః = భోజనము చేయుట మొదలగు, క్రియా సమూహః = క్రియా సముదాయము, అన్తరాల ప్రవృత్తిభిః = మధ్యనున్న వ్యాపారముల చేత, వ్యవధానం = వ్యవధానమును, ఉపైతి + ఇవ = పొందుచున్నట్లు ఉండును, నివృత్తః ఇవ = పూర్తియై పోయినదివలె, దృశ్యతే = కనబడును.

సః = ఆ భుజ్యాది క్రియా సమూహము, విచ్ఛిన్నరూపోఽపి = (ఎడగలిగిన) విచ్ఛిన్నమైన రూపము కలదైనను, అవిరామాత్ = (సాగిపోవుట నుండి) అవిరామమునుండి, న నివర్తతే = నివర్తింపదు, సర్వా = సమస్తమైన, క్రియా = క్రియ, అన్యేన = మరియొక క్రియతో, సఙ్కీర్ణా + ఇవ = కలిసిపోయినది వలె, ఉపలభ్యతే హి = కనబడుచున్నది కదా.

*తాత్పర్యము*— భోజనాది క్రియా సమూహము, అవాంతర వ్యాపారములచే వ్యవధానము పొందినది వలె యగును. నివర్తించినట్లు కనబడును.

అది విచ్ఛిన్న రూపమైనను అవిరామము నుండి నివర్తింపదు. అన్ని క్రియలును క్రియాంతరములతో సంకరమును పొందినట్లు (కలిసిపోయినట్లు) కనబడుచుండును కదా ?

*విశేషము*— "ఇహ అధీమహే" (ఇచట అధ్యయనము చేయుచున్నాము), "ఇహవసామః" (ఇచట నివసించుచున్నాము), "ఇహ పుష్యమిత్రం యాజయామః" (ఇచట పుష్యమిత్రునిచే యజ్ఞము చేయించుచున్నాము) ఇత్యాది ప్రయోగములు కలవు. ఇచట ప్రారంభింప బడిన అధ్యయన - నివాస - యాజన క్రియలు అసమాప్తములుగ నున్నవిగాన వర్తమాన కాలమును అంగికరింప వీలులేదు. అనగా అధ్యయనాది క్రియలు చేయ ప్రారంభించినవాడు మధ్య మధ్య భోజన శయనాది క్రియ లెన్నియో చేయుచున్నాడు. ఆ సమయములలో వాడు అధ్యయనాదులు చేయుటలేదు కదా ? కావున ఇచట వర్తమానత్వము లేదు. అందుచే ఇట్టి స్థలములలో 'వర్తమానే లట్' అను సూత్రము ప్రవర్తింపదు గాన ఇచట లట్ వచ్చుటకై

మరియొక సూత్రమును చెప్పవలెను అని వార్తికకారుడు ''ప్రవృత్తస్యావిరామే శిష్యా భవన్త్య వర్తమానత్వాత్'' అను వార్తికముచే ఆక్షేపణము చేసెను. ఈ ఆక్షేపమునకు భాష్యకారులు 'న్యాయ్యాత్వారమ్భా నపవర్గాత్' 'అస్తి చ ముక్తసంశయే విరామః' అని సమాధానము చెప్పెను. అనగా— అధ్యయనాది క్రియలు వేదమును స్వాధీనముచేసికొనుట మొదలగు ఫలముల నుద్దేశించి ప్రారంభింపబడుచున్నవి. ఆ ఫలము లభించువరకును ఆ క్రియ జరుగుచునేయున్నట్లు భావింపవలెను గాన ఇది వర్తమాన కాలమే. అందుచే 'వర్తమానే లట్' అను సూత్రముచేతనే 'లట్టు' రావచ్చును. మధ్య మధ్య భోజనశయనాది క్రియలచే అధ్యయన క్రియకు అంతరాయము కలుగుచున్నది గాన ఇది వర్తమానము కాదను ఆక్షేపము యుక్తము కాదు. 'రామః భుఙ్క్తే' (రాముడు భోజనము చేయుచున్నాడు) మొదలగు, వర్తమానత్వమున విప్రతిపత్తి లేని స్థలములలో గూడ, భోజన క్రియ అవిచ్ఛిన్నముగ జరుగుట లేదు. ఆ భోజనము చేయువాడు మధ్య మధ్య నీళ్ళు త్రాగుట, మాటలాడుట, నవ్వుట మొదలగు పనులు చేయుచున్నాడు ఈ క్రియాంతరములచే వ్యవధానమున్నను 'భుఙ్క్తే' ఇత్యాదులలో వర్తమానత్వమును అంగీకరించినట్లు అధీమహే, వసామః, యాజయామః ఇత్యాది స్థలములలో గూడ అంగీకరింప వచ్చును కదా యని భావము. ఈ విషయమునే పై కారికలు స్పష్టీకరించుచున్నవి.

ముందు వెనుకలనుండు అవయవముల (అవాంతర క్రియల) సముదాయమే భుజ్యాది క్రియలు. ఈ క్రియా సముదాయము నడుమ నవ్వుట, మాటలాడుట మొదలగు కొన్ని విజాతీయ క్రియలు ప్రవేశించుటతో భోజన క్రియాంతర్గత పూర్వాపర క్రియలకు వ్యవధానము ఏర్పడినట్లును, ఆ క్రియ అచట ఖండితమైపోయినట్లును కనబడుచున్నది. ఐనను ఫలప్రాప్తి వరకును భోజన క్రియాంతర్గతావాంతర క్రియలు అనువర్తించుచునే యున్నవి గాన, మధ్యవచ్చిన హసన - జల్పనాది క్రియలను బట్టి ఆ ప్రధాన క్రియ అక్కడ పూర్తియై పోయినదని భావింపరాదు.

అవాంతరములగు హసన జల్పనాది విజాతీయ క్రియలచే ఆ భోజన క్రియ విచ్ఛిన్నమైనను, ఆ క్రియకు విరామము మాత్రము కలుగదు. భోజనాది క్రియనే కాదు అన్ని క్రియలకును - ఉదాహరణమునకు హసన జల్పనాదికములకు గూడ - కండ్లు మూయుట తెరచుట, శ్వాస పీల్చుట విడచుట మొదలగు క్రియాంతరములచే విచ్ఛేదము కలుగుచునే యుండును. తావన్మాత్రముచే ఆ క్రియ విరతమైపోయినదనిగాని, దాని వర్తమానత్వమునకు భంగము వాటిల్లినదని గాని చెప్పుటకు వీలులేదు. ॥83॥

అవతారిక— ఫలపర్యంతమును ప్రవర్తించు అవాంతర క్రియా సమూహమే ప్రధాన క్రియ. ఈ ప్రధాన క్రియకు సంబంధించిన అవాంతర క్రియల నడుమ విజాతీయములును, ఫలాంతర హేతు భూతములును అగు ఇతర క్రియలేమైన వచ్చినను ఆ ప్రధాన క్రియ యొక్క వర్తమానత్వమునకు భంగములేదని పై రెండు కారికలలో ప్రతిపాదింపబడినది. అవాంతర క్రియల మధ్య వచ్చిన ఆ క్రియాంతరము భిన్న జాతీయయని చెప్ప బనిలేదు.

అవతారిక—కొన్ని చోటులందు ద్విత్వము కూడ వివక్షితము కానేరదని చెప్పు చున్నాడు.

**శ్లో॥ ఏతౌ చేద్వ్యాధితౌ స్యాతాం దేయం స్యాదిదమౌషధమ్।**
**ఇత్యేవం లక్షణేఽర్థస్య ద్విత్వం స్యాదవివక్షితమ్॥** 53

ఏతౌ = వీరిద్దరు, వ్యాధితౌ = వ్యాధికలవారు, స్యాతామ్ = చేత్ = ఐనచో, ఇదమ్ = ఈ, ఔషధమ్ = ఔషధము, దేయమ్ = ఇయ్యతగినది, స్యాత్ = కాగలదు ఇతి + ఏవమ్ + లక్షణే = ఈరీతిగానున్న భవిష్యద్విషయమునగల, అర్థస్య = అర్థమునకు సంభవము కలుగగా, ద్విత్వమ్ = ప్రత్యయార్థమగు ద్విత్వము, అవివక్షితమ్ = అవివక్షితమైనది, స్యాత్ = అగును.

వీరిరువురకు భావికాలమున వ్యాధి కలిగిన, వారికి ఈ ఔషధము ఇయ్యవలెనని ఒక వ్యక్తి సలహా ఇచ్చును. ఔషధము వ్యాధికి ప్రతీకారార్థమై వాడబడును ఇరువురకు వ్యాధి కలిగిన, ఇద్దరికి ఆమందు ఇత్తురు. వారిరువురులో ఒకరికి వ్యాధి కలిగినను ఆ ఔషధము ఇచ్చెదరు. ఇద్దరికి ఒకే సారి వ్యాధి రాలేదని మాత్రము ఔషధము ఇచ్చుట మానరు.

కనుక ఏతౌ, అను పదమున ద్వివచన ప్రత్యయముచే బోధింపబడిన ద్విత్వము వివక్షితముకాదు.

*విశేషాంశము*.—కొన్నిచోటుల యందు ద్విత్వము వివక్షితముకాగలదు.ఉదా॥ వృక్షౌచ్ఛేత్తవ్యౌ (ఈ రెండుచెట్లు ఛేదింపదగినవి) ఒకేసారిగాని క్రమముగా గాని రెంటిని ఛేదింపుమని దాని భావము. ఒకే చెట్టునుగాని, మూడు చెట్లను చేదింపుమని గాని భావము కాదు. ఛేదనము రెంటికి కలుగ వలెను. ఇచ్చట ప్రత్యయార్థమగు ద్విత్వము వివక్షితమే. ॥53॥

*అవతారిక*—ప్రత్యయముచే చెప్పబడిన సంఖ్య కొన్ని చోటులందు వివక్షితమగును. కొన్ని చోటులందు వివక్షితము కాక పోవచ్చునని చూపి, ప్రాతిపదికముచే అనగా ఏక, ద్వి, త్రి మున్నగు ప్రాతిపదికములచే చెప్పబడిన సంఖ్య వివక్షితమే యగునని నిరూపించుచున్నాడు.

**శ్లో॥ ఏకాది శబ్ద వాచ్యాయాః కర్మణ్య ఙ్గత్వమిష్యతే।**
**సంఖ్యాయాః. ఖనతి ద్వాభ్యామితి రూపాద్విసాఽఽశ్రితా॥** 54

1. ఏకాదిశబ్దవాచ్యాయాః = ఏక (ఒకటి) మున్నగు ప్రాతిపదికములకు వాచ్యమగునట్టి అనగా ఏక, ద్వి, త్రి, చతుర్, పఞ్చన్ మున్నగు ప్రాతిపదికములచే బోధింప బడిన, సంఖ్యాయాః = ఏకత్వము ద్విత్వము మున్నగుసంఖ్యకు, కర్మణి = వ్యాపారమునందు అనగా ఆ వాక్యములో నున్న పదముచే బోధింపబడిన క్రియ యందు, అఙ్గత్వమ్ = సాధనత్వము అనగా అచట అన్వయము, ఇష్యతే = స్వీకరింపబడుచున్నది.

సంఖ్య ప్రత్యయార్థమగుచోనది వివక్షితమును, అవివక్షితమును గూడ సందర్భమును బట్టి కాగలదు. ప్రాతపదికము చేతనే సంఖ్య బోధింపబడిన, అది తప్పక వివక్షిత మగును అనగా అది వాక్యార్థముతో సంబంధించును.

అందుచే దానిచే వ్యవధానము ఏర్పడినను ప్రధాన క్రియకు వర్తమానత్వమును చెప్పవచ్చును అనెడు పక్షాంతరమును చూపుచున్నాడు.

శ్లో॥ తదన్తరాలదృష్టా వా సర్వైవావయవ క్రియా ।
సాదృశ్యాత్ సతి భేదేతు తదఙ్గత్వేన గృహ్యతే ॥ 84

వా = లేక, తదన్తరాల దృష్టా = భుజ్యాది క్రియా మధ్యమున చూడబడిన, సర్వైవ = హసిత జల్పితాది క్రియలన్నియు, సాదృశ్యాత్ = భోజనావయవములగు అవాంతర క్రియలతో సాదృశ్యముండుట వలన, అవయవ క్రియా = అవయవ క్రియలుగా గ్రహింపబడును, భేదే= భేదము, సతితు = ఉన్నను, ('తు' శబ్దమునకు 'అపి' అని అర్థము), తదఙ్గత్వేన = దానికి అంగముగా, గృహ్యతే = గ్రహింపబడును.

తాత్పర్యము— భోజనాది క్రియల మధ్య వచ్చు అన్ని క్రియలును సాదృశ్యమును బట్టి దాని అవయవములే. భేదము కనబడుచున్నను దానికి అంగములుగ గ్రహింపబడును.

*వివరణము*— భోజనాది ప్రధాన క్రియలకు ఆచమనాది క్రియలు ఉపకారకములు. భోజనాదుల నడుమ వచ్చెడు క్రియలు, ఆచమనాదుల వలె భుజి క్రియకు ఉపకారకము లైనచో అవి భుజిక్రియావయవములుగ గ్రహింపబడును. హసిత - జల్పితాదులు లేకున్నను ఒకప్పుడు భోజన క్రియ జరుగుచున్నది. కావున దధ్యుపసేచనాది క్రియలకును ఈ హసిత - జల్పితాది క్రియలకును భేదమున్నది. ఐనను అవి (హసిత జల్పితాదులు) భుజి క్రియాంగములని చెప్పవచ్చును. సంతోషముగానున్న మిత్రులు మొదలగు వారు కలిసి భోజనము చేయుచున్నప్పుడు హసిత - జల్పితాదులు చేయుట స్వాభావికము కదా ? ఇద్దరు మోయ గలిగిన బరువును మోయుటకు మూడవవాడు కూడ రావచ్చును. మూడవవాడు రాకపోయినను పని జరుగును. కాని వాడు కూడ వచ్చినాడు. వచ్చిన పిమ్మట మొదటి ఇద్దరు ఏ విధముగ భారవహనాంగభూతులో మూడవవాడును అట్లే తదంగ భూతుడగుచున్నాడు. అట్లే జల్పిత హసితాదులు లేకుండ భోజనము చేయవచ్చును. ఐనను ఒక భుజి క్రియలో హసిత జల్పితాదులు గూడ నున్నచో వాటిని దాని కంగములుగ పరిగణించుటలో దోషము లేదు. ఈ విధముగ ప్రారంభించిన క్రియకు ఫలము లభించుటకు పూర్వము క్రియాంతరములతో వ్యవధాన మున్నను దాని వర్తమానత్వమునకు విఘాతము లేదు. ॥84॥

*అవతారిక*— ఇపుడు క్షణభంగవాదము ననుసరించి ఏ క్రియకును వర్తమానత్వమే అయుక్తమని ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ సదసద్వాపి వస్తు స్యాత్ తృతీయం నాస్తి కించన ।
తేన భూతభవిష్యన్తౌ ముక్త్వామధ్యం న విద్యతే ॥ 85

వస్తు = వస్తువు, సత్ = సత్తుగాని, అసద్వా + అపి = అసత్తుగాని, స్యాత్ = కావచ్చును,

తృతీయం = మూడవ విధమైనది, కిఞ్చన = ఏదియును, నాస్తి = లేదు, తేన = ఆ కారణము చేత, భూత భవిష్యన్తౌ = భూత భవిష్యత్తులను, ముక్త్వా = విడిచి, మధ్యం = మధ్యదైనది (వర్తమానమనునది), న విద్యతే = లేదు.

**తాత్పర్యము**— వస్తువు సత్తైనను కావలెను అసత్తైనను కావలెను. మూడవ రక మైనది ఏదియును లేదు. అందుచే భూత భవిష్యత్తులు తప్ప మధ్యయందు వర్తమానమనునది ఏదియు లేదు.

**విశేషాంశము**— సాధింపవలసిన పరిస్థితులలో నున్న దానికి క్రియ యనిపేరు. గడచిపోయిన క్షణము సత్తు. అది సిద్ధ స్వభావము కలది అనగా సిద్ధించిపోయినది. కావున ఆ క్షణమునకు సంబంధించిన క్రియ భూతక్రియ. రాబోవు క్షణము ఇంకను సత్తు కాదు. అది ఇంకను సిద్ధింపవలసి యున్నదిగాన అసత్తు. దానితో సంబంధింపనున్న క్రియ భవిష్య త్క్రియ. ఈ విధముగ క్షణము సత్తైన కావలెను అసత్తైనను కావలెను. వాటికి సంబంధించిన క్రియ సత్తుగాను అసత్తుగాను ఉండును. సత్త్వాసత్త్వములు పరస్పర విరుద్ధములు గాన ఈ రెండును ఒక క్షణమునందు ఉండవు. కావున అట్టి క్షణముతో సంబంధించుటచే ఏర్పడిన వర్తమానత్వము కూడ క్రియయందు ఉండదు. ఏ క్రియయైనను ఒక్క క్షణమును మించి ఉండదు అని క్షణికవాదుల సిద్ధాంతము. ఒక క్షణములో ఒక క్రియ జరిగినదనగా అది క్షణాంతరములో నుండదు. అది జరిగిన వెంటనే భూతకాలముతో సంబంధించును. జరుగక మునుపు భవిష్యత్తుతో సంబంధించును. కావున వర్తమాన కాలమనునది గాని, వర్తమాన కాలముతో సంబంధించిన క్రియ యనునదిగాని లేదు. ఈ విషయమే మహాభాష్యమున శ్లోక ద్వయముచే చెప్పబడినది—

> ''మీమాంసకో మన్యమానో యువా మేధావి సంమతః
> కాకం స్మైహానుపృచ్ఛతి కిం తే పతితలక్షణమ్
> అనాగతే న పతసి అతిక్రాన్తే చ కాక న
> యది సంప్రతి పతసి సర్వో లోకః పతత్యయమ్''

''హిమవానపి గచ్ఛతి''. యువకుడును, మేధావియునగు విమర్శకుడు కాకిని ప్రశ్నించు చున్నాడు. ''నీ పాతమునకు లక్షణమేమి ? ఓ కాకమా ? పాతక్రియ భావియైనచో నీవు ఎగురుట లేదు. అనగా భావియగు పతన క్రియ అసత్తుగాన అసత్తైన పాతక్రియతో నీకు సంబంధము కుదురదు. అందుచే 'త్వంపతసి' అనుట అసంబద్ధము. పతనము జరిగిపోయిన తరువాత గూడ ఆ పాతక్రియ అసత్తుగాన దానితో గూడ నీకు సంబంధము కుదరదు. అందుచే 'త్వంపతసి' అని అనుటకు వీలులేదు. వర్తమాన క్రియ అనునదియే లేదు. లేని వర్తమాన క్రియతో సంబంధమును కూర్చి 'త్వంపతసి' అని ప్రయోగించినచో 'పర్వతః పతతి' అని కూడ ప్రయోగించవచ్చును కదా ? 'హిమవాన్ గచ్ఛతి' అని ప్రయోగించ వచ్చును కదా ? కావున ''పతన క్రియ ఉన్నది'' అనుట అయుక్తమని యర్థము. ఈ విధముగ క్షణికవాదులు వర్తమాన కాలము లేదని చెప్పుదురు. ॥85॥

అవతారిక— క్రియ సాధ్యమానావస్థలో నుండుటయే దాని సత్త్వము, అదియే దాని వర్తమానత్వము. అనగా క్రియ సాధింపబడుచున్న పరిస్థితిలో నున్నపుడు దానిని వర్తమానము అని చెప్పవచ్చును కదా యని ఆశంకించుకొని క్షణికవాది సమాధానము చెప్పు చున్నాడు.

శ్లో॥ నిర్వృత్తిరూపమేకస్య భేదాభావాన్న కల్పతే ।
సదసద్వాపి తేనైకం క్రమరూపం కథం భవేత్ ॥ 86

ఏకస్య = ఒక పదార్థమునకు, భేదాభావాత్ = భేదము లేకపోవుట వలన, నిర్వృత్తిరూపం = నిష్పత్తిరూపము, న కల్పతే = కుదురదు, ఏకం = ఒక వస్తువు, సత్ = సత్తుగానైనను, అసద్వాపి = అసత్తుగానైనను, (ఉండవలెను), తేన = ఆ కారణముచేత, క్రమరూపం = క్రమరూపమైనదై, కథం = ఎట్లు, భవేత్ = అగును ?

తాత్పర్యము— ఒక వస్తువులో భేదము ఉండదుగాన దానికి నిష్పత్తిరూపము కుదరదు. అందుచే సత్తైనను, అసత్తైనను క్రమరూపమగు ఒక పదార్థము ఎట్లుండును ?

విశేషాంశము— పదార్థమునకు ఆది, మధ్యము, అంతము మొదలగు విభాగములు లేవు. కావున దానికి క్రియాలక్షణమగు క్రమరూపత్వము ఉండదు. ('నిర్వృత్తిరూపం' అనగా క్రమాత్మకమగు క్రియచే నిష్పన్నమగుట అని యర్థము). ఏలయనగా ఒక వస్తువు సత్తైన కావలెను లేదా అసత్తు అయినను కావలెను. అది సత్తు అయినచో దానికి మరల నిష్పాద్యమానత్వము (తయారుచేయబడు చుండుట) అనునది ఉండదు. అసత్తైనచో అపుడది క్రమాత్మకమగు క్రియతో సంబంధింప జాలదు గాన అపుడు గూడ దానికి నిష్పాద్యమానత్వము కుదురదు. మూడవరకమగు (సదసదు భయరూపమగు) పదార్థ మనునది లేదు. ఈ విధముగ తయారుచేయబడుచు ఉండుట అనునది వేరుగాన అది వర్తమాన మెట్లగును ? కావున క్రియ సాధ్యమానావస్థలో నుండుట వర్తమానత్వము అను పక్షము కూడ కుదురదు. ॥86॥

అవతారిక— పౌర్వాపర్యమును పొందిన (ముందు వెనుకలుగ నున్న) అనేక క్షణములకు క్రియయని పేరు. అట్టి క్రియకు ఫలోత్పత్తికి పూర్వము వర్తమానమని పేరు అని చెప్పెదము, అని ఆశంకించుకొని క్షణికవాది ఖండించుచున్నాడు.

శ్లో॥ బహూనాం చానవస్థానాదేకమేవోపలభ్యతే ।
యథోపలబ్ధిస్మరణం తత్ర చాప్యుపపద్యతే ॥ 87

అనవస్థానాత్ = ఒక్క కాలమున స్థితి లేకపోవుటవలన, బహూనాం = అనేకావయవములలో ఏకమేవ = ఒక్కటి మాత్రమే, ఉపలభ్యతే = పొందబడు చున్నది (తెలియబడు చున్నది), యథోపలబ్ధి = జ్ఞానమును అనుసరించి కలిగెడు, స్మరణం చ = స్మృతి కూడా, తత్ర = ఆ ఒక్క అవయవమునందే, ఉపపద్యతే = యుక్తమగును.

*తాత్పర్యము*— ఒక్క కాలమునందు స్థితిలేని అనేకమైన అవయవములలో ఒక్కదాని జ్ఞానము మాత్రమే కలుగును. స్మృతి అనుభవమును అనుసరించియే యుండును గాన అది గూడ ఒక్క అవయవమును గూర్చియే కలుగును.

*విశేషాంశము*— క్రమముగ పుట్టెడు అవయవము లన్నియు వేరువేరు కాలములలో నుండును గాని ఒక్క కాలములో ఉండవు. ఒక్కమారు, సన్నిహితమగు ఒక్క క్షణము యొక్క జ్ఞానము మాత్రమే కలుగునుగాని ఇతర క్షణముల జ్ఞానము కలుగదు. ఆ ఒక్క క్షణమున క్రమము లేదు. కావున క్రమికములగు అనేక క్షణములు వర్తమానకాలము అని చెప్పుట తగదు. ఒక్క కాలమున ఒక్క క్షణముయొక్క జ్ఞానము మాత్రమే కలిగినను, క్రమికములగు అనేక లక్షణములను ఒక్క మారుగ స్మరింపవచ్చును గదా ; దానిని పట్టి వర్తమాన వ్యవహారమును సమర్థించవచ్చును అనుటకు కూడ వీలులేదు. అనుభవ మెట్లు కలుగునో స్మరణము కూడ అట్లే కలుగును. అనుభవమునందు క్రమభాన మేదియు లేనపుడు స్మరణమునందు మాత్రము అది ఎట్లు ఉండును ? కావున సమాశ్రిత పౌర్వాపర్యములగు క్షణములే క్రియ యనియు దానికి ఫలోత్పత్తికి పూర్వము వర్తమాన సంజ్ఞ యనియు చెప్పిన మతము గూడ యుక్తము కాదు. ॥87॥

*అవతారిక*— అనేక క్షణములు ఒక క్రియ అనుట గూడ అయుక్తమే యని చెప్పుచున్నాడు.

**శ్లో॥ సదసద్రూపమేకం స్యాత్ సర్వస్యైకత్వ కల్పనే ।**
**నిర్వృత్తిరూపం నిర్వృత్తేః సామాన్యమథవా భవేత్ ॥ 88**

సర్వస్య = అన్నింటికిని, ఏకత్వ ప్రకల్పనే = ఏకత్వమును అంగీకరించినచో, ఏకం = ఒకటి, సదసద్రూపం = సదసదుభయ రూపమై, స్యాత్ = అగును, అథవా = లేక, నిర్వృత్తేః = సాధ్యస్వభావమగు క్రియ యొక్క, నిర్వృత్తిరూపం = నిష్పత్తి రూపమగు, సామాన్యం = సామాన్యము (జాతి), భవేత్ = అగును.

*తాత్పర్యము*— అన్ని క్షణములును కలిసి ఒక క్రియ యగును అని అంగీకరించినచో ఒకటి సదసదుభయరూపమని యంగీకరించి నట్లగును. లేదా క్రియ యొక్క నిష్పత్తిరూపమగు ఒక సామాన్యమును అంగీకరించి నట్లగును.

*విశేషాంశము*— అతీతములును అనాగతములును అగు సదసద్రూపములైన క్షణము లన్నియు కలిసి ఒక క్రియ యగును అని అంగీకరించినచో ఒక్కదానియందు పరస్పర విరుద్ధములగు సత్తులును అసత్తులును కలిసినట్లు అంగీకరించినట్లు అగును. ఇది అయుక్తము. లేదా భిన్నములగు అనేక పదార్థములకు ఏకత్వము కుదురదు గాన ఆ భిన్న పదార్థము లన్నింటితోడను అన్వయించు స్వభావము నొకదానిని అంగీకరించెదము అని చెప్పుట గూడ యుక్తము కాదు. ఆ పక్షమున సాధింపబడుచున్న క్రియకు గల నిష్పత్తి

యోగ్యత్వమనునది అన్ని క్షణములకును సంబంధించిన సామాన్యము అని చెప్పవలసి యుండును. అపుడు క్షణము లన్నింటికిని ప్రత్యేకముగ ఏకక్రియాత్మకత్వము చెప్పినట్లగును అపుడు ఒక క్షణమున కొక క్రియ చొప్పున అనేక క్రియలను అంగీకరించుటచే ఒక్క క్రియ సిద్ధింపదు. కావున క్రియలకు వర్తమానత్వము కుదురదు అని క్షణికవాది యభిప్రాయము.॥౮౮॥

*అవతారిక*— దీనికి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ కార్యోత్పత్తౌ సమర్థం వా స్వేనధర్మేణ తత్ తథా।**
**ఆత్మతత్త్వేన గృహ్యేత సా చాస్మిన్ వర్తమానతా॥ 89**

వా = లేక (రాబోవు కారికలో మరియొక పక్షమును చెప్పనున్నాడు. అందుచే ఇచట 'వా' అని ప్రయోగించినాడు), కార్యోత్పత్తౌ = కార్యోత్పత్తియందు, సమర్థం = సమర్థమైన, తత్ = ఆ క్షణ సముదాయరూపము, స్వేన = తన సంబంధమైన, ధర్మేణ = క్రమాత్మక మగు ధర్మముతో కూడినదై, తథా = ఆ విధముగా, ఆత్మతత్త్వేన = తనయొక్క విద్య మానతా రూపమగు (ఉనికి యనెడు) తత్త్వముతో, గృహ్యేత = గ్రహింపబడును, సాచ = అదియే, అస్మిన్ = క్షణ సముదాయమునందు ఉన్న, వర్తమానతా = వర్తమానత్వము.

*తాత్పర్యము*— కార్యోత్పాదనమునందు సమర్థమగు ఆ క్షణ సమూహము తన ధర్మముతో కూడినదై ఆ విధముగ విద్యమానతారూపమగు ఆత్మతత్త్వముతో గ్రహింప బడును. క్షణ సమూహమునందున్న వర్తమానత్వ మనగా అదియే.

*విశేషాంశము*— నియతమగు క్రమముతో ఒక్క ఫలము నుద్దేశించి ప్రవర్తించు క్షణములకు క్రియయని పేరు. ఫలము ఒక్కటిగాన క్రియకు గూడ ఏకత్వము కల్పింప బడినది. ఈ విధముగ ఫలభేదమును బట్టి క్రియాభేద మేర్పడుచుండును. క్షణ సముదాయము నందలి కొన్ని క్షణములు సత్తువైనను మరికొన్ని అసత్తువైనను వర్తమానత్వమును అంగీక రింప వచ్చును. వర్తమాన మనగా సత్ అని యర్థము కాదు, ప్రారంభమై పూర్తి కాకుండుట అని దాని లక్షణము. ప్రారంభించినది మొదలు ఫలము పుట్టు వరకును ఎన్ని క్షణముల సముదాయము ప్రవర్తించునో ఆ సముదాయమున కంతకును వర్తమానమని పేరు. ఈ క్షణ సముదాయము క్రమరూపమున నుండి ఫలమువరకును వ్యాపించును. అపుడు ఈ క్షణ సముదాయమున్నది అను జ్ఞానము కలుగునుగాన ఈ విద్యమానతా జ్ఞానమునకే వర్తమానత యని పేరు. ఈ క్షణసముదాయము సదసద్రూపమైనను ఫలోత్పత్తివరకును ఒకదానితో నొకటి క్రమబద్ధముగ నున్న క్షణములన్నియు వాటి వాటి సమయములందు సన్నిహితములే కావున వర్తమానత్వమును పొందుచున్నవి. ఈ విషయమే భాష్యమునందు స్పష్టీకరింపబడినది.

"క్రియాప్రవృత్తౌ యో హేతుః తదర్థం యద్విచేష్టితమ్
తదపేక్ష్య ప్రయుఞ్జీత గచ్ఛతీత్య విచారయన్". (మహాభాష్యము)

దేవదత్తుడు గమనరూపక్రియయందు ప్రవర్తించుచున్నాడన్నచో అందులకు హేతువు అనగా

ప్రయోజనము దేశాంతర ప్రాప్తి. దానికొరకై ఆతడు చేయు గమనరూప చేష్ట ప్రత్యక్షముగ కనబడుచున్నది. కావున దాని సత్త్వమును గూర్చిన విప్రతిపత్తి లేదు. అందుచే 'గచ్ఛతి' అని వర్తమానార్థమున నిస్సంశయముగ ప్రయోగింపవచ్చును. అనగా అనేక క్షణసముదాయాత్మకమగు క్రియా ప్రబంధము నంతను మనస్సులో ఏకీకరించి 'గచ్ఛతి' అని ప్రయోగింప వచ్చును అని దీని భావము. ॥89॥

*అవతారిక*— పక్షాంతరమును చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియాప్రబన్ధరూపం యదధ్యాత్మం వినిగృహ్యతే ।
సఙ్క్రాన్త బిమ్బ మేకత్ర తా మాహుర్వర్తమానతామ్ ॥ 90

ఏకత్ర = ఒక్క జ్ఞానమునందు, సఙ్క్రాన్తబిమ్బం = సంక్రమించిన ఆకారము గల, క్రియా ప్రబన్ధ రూపం = క్రియా కలాపముల రూపము, అధ్యాత్మం = బుద్ధియందు, వినిగృహ్యతే ఇతియత్ = గ్రహింపబడుచున్నది అను మాట ఏది కలదో, తాం = దానిని, వర్తమానతాం= వర్తమానత్వమునుగా, ఆహుః = చెప్పుదురు.

**తాత్పర్యము**— ఒక్కచో సంక్రమించిన స్వరూపము గల క్రియా కలాపము నంతను బుద్ధిలో గ్రహించుటయే దానికి గల వర్తమానత్వమని కొందరు చెప్పుదురు.

*విశేషాంశము*— ఒక ఫలము నుద్దేశించి ప్రవర్తించిన క్షణసముదాయమంతయు ఒక్కటే అని వెనుక చెప్పబడినది. ఇపుడు - ఆ క్షణముల నన్నింటిని బుద్ధిచే ఒక్క సముదాయముగ సంకలనము చేయుటచే వాటికి ఏకత్వమని మతాంతరము చెప్పబడుచున్నది. విభిన్నావయవములు గల క్రియా కలాపమునంతను బుద్ధిలో ఒక్క సముదాయముగ ఆకళించుకొని అది యంతయు ఒక్కటేయనియు, అది వర్తమానమనియు వ్యవహరింతురు. క్రమముగ అనుభవగోచరమైన వాటిని గూడ ఒక్కమారుగ మనస్సులో ఆకళించుకొనవచ్చుననుట సర్వానుభవ సిద్ధము. అట్లు కానిచో నూరు, వెయ్యి మొదలగు వాటి మానసిక జ్ఞానమే కలుగుటకు అవకాశముండదు. ఈ విధముగ బుద్ధి గోచరమగు సముదాయమునకు బహీరూపత్వమును కల్పించి దానిని బాహ్యమగు ఒక వర్తమాన క్రియనుగ వ్యవహరించుచుందుము. ఈ విధముగ వర్తమానము సిద్ధించినది. వర్తమానము సిద్ధించిననే భూత భవిష్యత్తులు గూడ సిద్ధించును. ఇట్లు క్రియా కాలత్రయ సంబద్ధమను విషయము నిర్వివాదము. ॥90॥

*అవతారిక*— క్రియాతి పత్తియందు, భూత భవిష్యదర్థము లందు, లృఙ్ విధింపబడినది. ఈ భూత భవిష్యత్త్వముల అనుపపత్తిని ఆశంకించుచున్నాడు.

శ్లో॥ క్రియాతిపత్తిరత్యన్తం క్రియానుత్పత్తి లక్షణా ।
న చ భూతమనుత్పన్నం న భవిష్యత్తథా విధమ్ ॥ 91

క్రియాతిపత్తిః = క్రియాతిపత్తి (క్రియ జరుగకుండుట) యనునది, అత్యన్తం = మిక్కిలి,

క్రియానుత్పత్తి లక్షణా = క్రియ ఉత్పన్నము కాకుండుట అను లక్షణము కలది, అనుత్పన్నం = ఉత్పన్నము కానిది, భూతం = భూతము, న = కాదు, భవిష్యచ్చ = భవిష్యత్తు గూడ, తథా విధం = ఆ విధమైనది, న = కాదు.

తాత్పర్యము— క్రియాతిపత్తి యనగా ఏ మాత్రమును క్రియ ఉత్పన్నము కాకుండుటయని యర్థము. ఉత్పన్నమే కానిది భూతము కాజాలదు. ఆ విధమైనది భవిష్యత్తు కూడ కాదు.

విశేషాంశము— "లిఙ్ నిమిత్తే లృఙ్ క్రియాతిపత్తౌ" అను సూత్రముచేతను, 'భూతే చ' అను సూత్రముచేతను లృఙ్ విధింపబడినది. క్రియాతిపత్తి యున్నపుడు, లిఙ్‌కు నిమిత్తమగు హేతు హేతుమద్భావాదికమునందు, భవిష్యదర్థమున 'లృఙ్' వచ్చునని మొదటి సూత్రమున కర్థము. పై పరిస్థితులందే భూతార్థమున లృఙ్ వచ్చునని రెండవ సూత్రమున కర్థము. ఏదియో ఒక ఏ లోపమువలన పని జరుగకపోవుట క్రియాతి పత్తి. "యది కమలక మాహ్వాస్యత్ న శకటం పర్యా భవిష్యత్" "అభోక్ష్యత భవాన్ ఘృతేన యది మత్సమీప మాగమిష్యత్" ఇత్యాదికములు ఉదాహరణము. 'కమలకుని పిలిచినట్లైతే బండి బోల్తా కొట్టు కుండేది'; 'నీవు నా వద్దకు వచ్చినట్లైతే నేతితో భోజనము చేసెడి వాడవు' అని యర్థము. ఈ ఉదాహరణములు భవిష్యత్కాల విషయకములు. భవిష్యత్తు అగు బోల్తా కొట్టకుండుట (అపర్యాభవము) నకు కమల కాహ్వానము హేతువు, అది హేతుమత్తు. ఈ విధముగ హేతు హేతుమత్తులగు భవిష్యత్కాల విషయకములైన ఆహ్వాన - అపర్యా భవనములు రెండును జరుగలేదని ఈ వాక్యమువలన తెలియుచున్నది. ఇట్టి స్థలములలో లృఙ్ వచ్చును. "దృష్టో మయా భవత్పుత్రోఽన్నార్థీ చంక్రమ్యమాణః, అపరశ్చ ద్విజో బ్రాహ్మణార్థీ, యది సతేన దృష్టోఽభవిష్యత్ తదా అభోక్ష్యత; నతు భుక్తవాన్; అన్యేన పథా సగతః" ఇత్యాది వాక్యములు రెండవ సూత్రమునకు ఉదాహరణములు. "అన్నముకొరకై అలమటలాడుచున్న నీ కుమారుని చూచితిని, (అన్నము పెట్టుటకై) బ్రాహ్మణుని కొరకు అన్వేషించుచున్న మరియొక ద్విజుని చూచితిని. ఆ ద్విజు డాతనిని చూచియున్నచో ఆతడు భుజించి యుండెడి వాడు, భుజించ లేదు. ఆతడు మరొక మార్గమున పోయినాడు" అని దీని కర్థము. ఇచట హేతువు దర్శనము. హేతుమత్తు భోజనము. ఈ హేతు హేతుమత్తులు రెండును జరుగలేదని ప్రత్యక్షముగ చూచినవాడు చెప్పుచున్నాడు గాన ఇది భూతకాల విషయకమగు లృఙ్ ప్రయోగము. పూర్వ సూత్రోదాహరణమున హేతు హేతుమత్తులగు కమలకాహ్వాన శకటా పర్యాభవనముల నెరింగిన ఒక వక్త ఈ రెండును జరగలేదని (వాటి అతిపత్తిని) ప్రమాణాంతరముచే తెలిసికొని పల్కిన వాక్యమది. అందుచే అది (లృఙ్) భవిష్యద్విషయకము. ఇట్టి లృఙ్ యొక్క ఉదాహరణ స్థలములలో భూతత్వ భవిష్యత్త్వములు అనుపపన్నములని ఈ కారిక ఆక్షేపించుచున్నది.

పై సూత్రములచే క్రియాతిపత్తి యందు లృఙ్ విధింపబడినది. క్రియాతిపత్తి యనగా క్రియ అత్యంతము పుట్టకుండుట. అట్టి పరిస్థితిలో భూతత్వముగాని భవిష్యత్త్వము

గాని ఎట్లు పొసగును? ఉత్పన్నమగు ఒక పదార్థము యొక్క సత్త తొలగిపోయినచో దానికి భూతమని పేరు. సమర్థములగు సాధనములు సన్నిహితములైనపుడు కార్యోత్పత్తికి ఎపుడు అవకాశమున్నట్లు తోచునో అపుడు భవిష్యత్తు అని పేరు. పుట్టుటకే అవకాశము లేని దానికి భూతత్వముగాని భవిష్యత్త్వముగాని ఎట్లు లభించును అని ఆక్షేపణమునందలి అభిప్రాయము. ॥91॥

అవతారిక— ల్ఋజ్ స్థలములలోని భూతభవిష్యద్వ్యవహారమును సమర్థించు చున్నాడు.

శ్లో॥ ప్రాగ్విరుద్ధ క్రియోత్పాదా న్నిర్వృత్తే వా విరోధిని ।
వ్యాపారేఽవధిభేదేన విషయస్తత్ర భిద్యతే ॥ 92

విరుద్ధ క్రియోత్పాదాత్ = విరుద్ధమగు క్రియ ఉత్పన్నమగుట కంటె, ప్రాక్ = పూర్వము నందుగాని, వా = లేక, విరోధిని = విరోధియగు, వ్యాపారే = వ్యాపారము, నిర్వృత్తే = జరిగిపోయిన తరువాతగాని, అవధి భేదేన = అవధి భేదముచేత, తత్ర = ఆ ల్ఋజ్ స్థలము నందు, విషయః = విషయము, భిద్యతే = భిన్నముగ కనబడుచున్నది.

తాత్పర్యము— విరుద్ధ క్రియ ఉత్పన్నమగుటకు పూర్వముగాని, విరోధియగు వ్యాపారము జరిగిపోయిన పిమ్మటగాని అవధి భేదమును బట్టి ల్ఋజ్ స్థలములందు విషయము వేరుగా కనబడును.

వివరణము— 'యది కమలక మాహ్వాస్యత్ న శకటం పర్యాభవిష్యత్' అను ఉదాహరణమున– సమర్థసాధన భూతుడగు కమలకుని పిలుచుట బండి తలక్రిందు కాకుండు టకు నిమిత్తము. భవిష్యత్తగు (జరుగవలసియున్న) ఆ కమలకాహ్వానము జరుగలేదని చెప్పుచు వక్త పై వాక్యమును ప్రయోగించెను. కమలకుడు గ్రామాంతరమునకు పోయి యుండుటచే వానిని ఆహ్వానించుట జరుగలేదు. కావున వాని గ్రామాంతరగమనము అహ్వానము నకు విరోధి. బండి తలక్రిందు కాకుండవలెనన్నచో ఎక్కువ బరువు దానిపై వేయకుండ వలెను. కావున గురుతరభారారోపము అపర్యాభవ విరోధి. విరోధి క్రియలగు ఈ గ్రామాన్తర గమన - గురుతరభారారోప క్రియలు జరుగక పూర్వము ముందుగ కమలకాహ్వానము, దాని పిమ్మట అపర్యాభవనము జరుగుటకు అవకాశముండెడిది. అపుడు అపర్యాభవనమునకు భవిష్యత్త్వముండును. ఈ విధముగ ఆహ్వాన - అపర్యాభవనములకు ఆవశ్యకములగు కాల ములు భిన్నములు గాన దానిని బట్టి క్రియాతిపత్తికి (ఇచట అపర్యాభవనమునకు) విభక్తమగు భవిష్యత్తుతో సంబంధ మేర్పడుచున్నది. అనగా– కమలకాహ్వానము లేకపోవుటచే క్రియా రూపమగు శకట పర్యాభవనము జరుగును. వాడు గ్రామాంతరమునకు పోవుటచే వాని నాహ్వా నించుట జరుగబోదు. భవిష్యతు అగు (జరుగవలసి యున్న) కమల కాహ్వానము అసంభావ్య మగుటచే ఏర్పడిన క్రియాతిపత్తికి (అపర్యాభవనాభావమునకు) గూడ భవిష్యత్త్వము లభిం చును. సమర్థ సాధనాహ్వానము భవిష్యత్తు (జరుగగలదు) అన్నచో అపుడు అపర్యాభవన

క్రియ గూడ భవిష్యత్తు అగును (జరుగగలదు). క్రియ భవిష్యత్తు ఐనపుడు దాని అభావము గూడ భవిష్యత్తు అగుటలో అభ్యంతరముండదు. ఇట్లే 'భూతే చ' అను సూత్రమునకు ఉదాహరణమగు ''యదిసతేన దృష్టో భవిష్యత్ తదా అభోక్ష్యత, న తు భుక్తవాన్'' అనుచోట గూడ భోజన ప్రతిద్వంద్వి (విరోధి) యగు అభోజనరూప వ్యాపారము గడచిపోయినది గాన, అవధి భేదమును బట్టి క్రియాతిపత్తి కూడ అతీతవిషయముగ కనబడుటచే భూతమని వ్యవహారము యుక్తమే.

అవతారిక— కాల ప్రసంగముచే సూత్రాంతర నిర్దిష్ట కాలముకంటె భిన్నమగు కాలమున ప్రత్యయములను విధించిన ''ధాతు సమ్బన్ధే ప్రత్యయాః'' అను సూత్రమును విచారించుచున్నాడు.

శ్లో॥ వ్యభిచారే నిమిత్తస్య సాధుత్వం న ప్రకల్పతే ।
భావ్యాసేదితి సూత్రేణ తత్ కాలేఽన్యత్ర శిష్యతే ॥ 93

నిమిత్తస్య = నిమిత్తమగు కాలమునకు, వ్యభిచారే = (విహితమైన వానికంటె ఇతరమైన కాలమందు) వ్యభిచారము కలిగినపుడు, 'భావ్యాసీత్' ఇతి = 'భావి ఆసీత్' ఇత్యాదులకు, సాధుత్వం = సాధుత్వము, న ప్రకల్పతే=కుదురదు, తత్ = ఆ కారణము వలన, సూత్రేణ = 'ధాతు సమ్బన్ధే ప్రత్యయాః' అను సూత్రముచే. అన్యత్ర = మరియొక, కాలే = కాలమునందు, శిష్యతే = ప్రత్యయము విధింపబడుచున్నది.

తాత్పర్యము— నిమిత్తమగు కాలమునకు వ్యభిచారము వచ్చినపుడు ''భావి, (కృత్యమ్) ఆసీత్'' మొదలగు ప్రయోగములు సాధువులు కాజాలవు. కావున ''ధాతు సమ్బన్ధే ప్రత్యయాః'' అను సూత్రముచే మరియొక కాలమునందు గూడ ప్రత్యయము విధింపబడుచున్నది. [ఈ క్రింది ప్రయోగములలో రెండేసి క్రియలు ఒకటి ప్రధాన క్రియ రెండవది సహాయ క్రియయు గలవు. ఒకటి ఒక కాలమును రెండవది వేరొక కాలమును చూపుచున్నది.]

విశేషము— 'అగ్నిష్టోమయాజ్యస్య పుత్రో జనితా' (ఇతనికి అగ్నిష్టోమ యాగము చేసెడు పుత్రుడు కలుగగలడు), 'కృతః కటః శ్వోభవితా' (రేపు చాప చేయబడినదై యుండగలదు), 'భావికృత్యం ఆసీత్' (కావలసియున్న పని జరిగెను), ''వసన్ దదర్శ'' (నివసించుచు చూచెను) ఇత్యాది ప్రయోగములు కలవు. 'అగ్నిష్టోమ యాజీ' అను పదము ''అగ్నిష్టోమేన ఇష్టవాన్'' (అగ్నిష్టోమ మనెడు యాగము చేసినవాడు) అను నర్థమున ''కరణేయజః'' అను సూత్రముచే భూతార్థకమగు ణిని ప్రత్యయము చేర్చుటచే ఏర్పడినది. ఈ భూతార్థక ప్రత్యయాంత పదము 'జనితా' అనెడు భవిష్యదర్థక క్రియా పదముతో అన్వయించుచున్నది. ఇట్లే రెండవ ఉదాహరణమున భూతార్థక 'క' ప్రత్యయాంతమగు 'భూతః' అనునది 'భవితా' అను భవిష్యదర్థకముతో అన్వయించుచున్నది. మూడవ ఉదాహరణమున భవిష్యదర్థకమగు 'భావి' అనునది 'ఆసీత్' అను భూతార్థక పదముతో అన్వయించుచున్నది. వర్తమానార్థకమగు 'వసన్' అనునది 'దదర్శ' అనెడు భూతార్థక

పదముతో అన్వయించుచున్నది. ఈ విధముగ ఆ యా సూత్రములచే భూతాద్యర్థములందు విహితములగు 'ణిని' ప్రత్యయాదులను చేర్చుటచే సిద్ధించిన 'అగ్నిష్టోమయాజీ' ఇత్యాది పదములు తమ కాలముకంటె భిన్నమగు కాలముతో సంబంధించినచో అవి సాధువులు కాజాలవు గాన, వాటికి సాధుత్వమును కల్పించుటకై 'ధాతు సంబంధే ప్రత్యయాః' (3-4-1) అను సూత్రము చెప్పబడినది. "ధాత్వర్థముతో సంబంధము ఏర్పడినపుడు, ఆ యా ప్రత్యయములు ఏ యే అర్థములందు విధింపబడినవో తద్భిన్నార్థములందు గూడ వచ్చును" అని దాని యర్థము. దీనినిబట్టి 'అగ్నిష్టోమయాజీ' ఇత్యాది పదములకు, అవి ఏ ధాతువులతో సంబంధించునో ఆ ధాతువుల కాలమును బట్టి కాలమును మార్చుకొని అర్థము చెప్పవలెను. పై ఉదాహరణమున 'అగ్నిష్టోమయాజీ' అను పదము 'జనితా' అను భవిష్యదర్థక దాతువుతో సంబంధించుచున్నది గాన దానికి 'అగ్నిష్టోమ యాగము చేయగల' (అగ్నిష్టోమేన యక్ష్యమాణః) అను నర్థము చెప్పవలెను. అనగా ఇచట ణిని ప్రత్యయము భూతార్థమునందు కాక భవిష్యదర్థమున వచ్చినదని యర్థము.

"ధాతు సమ్బన్ధే ప్రత్యయస్య యథాకాల విధానాత్ సిద్ధమ్" అను వార్తికము ఉదాహృత సూత్రమును ప్రత్యాఖ్యానము చేసినది. పదములకే శాస్త్రీయ సంస్కారము అను పక్షమున ఆ యా సూత్రములచే ఆ యా కాలాద్యర్థములందు విహితములగు ప్రత్యయములను బట్టియే ఆ యా పదములు (అగ్నిష్టోమ యాజీ ఇత్యాది పదములు) సిద్ధించుచున్నవి గాన ఈ సూత్ర మనావశ్యకమని ఈ వార్తికము అభిప్రాయము. ॥93॥

అవతారిక— ఈ సూత్రమును ప్రత్యాఖ్యానము చేసినచో పై ఉదాహరణములలో అర్థ మెట్లు కుదురునని యాశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్వకాల ఏవ సాధుశ్చేత్ కాలభేదే గతిః కథమ్ ।**
**వాక్యార్థా దతదర్థేషు విశిష్టత్వం న సిధ్యతి ॥ 94**

స్వకాల ఏవ = ఆ ప్రత్యయము ఏ కాలమునందు విధింపబడినదో ఆ కాలమునందు మాత్రమే సాధుః + చేత = సాధువైనచో, కాలభేదే = భిన్నకాలమగు పదముతో సంబంధ మేర్పడినపుడు, గతిః = మార్గము, కా = ఏది ? అతదర్థేషు = పదములు వాక్యార్థమునకు యోగ్యము కాని అర్థములు కలవగు చున్నపుడు, వాక్యార్థాత్ = వాక్యర్థము వలన, విశిష్టత్వం = విశిష్టత్వము, (అనగా వాక్యార్థమును విశేషించుట), న సిధ్యతి = సిద్ధింపదు.

తాత్పర్యము— (ఆశంక) ఒక ప్రత్యయము ఏ కాలమునందు విధింపబడినదో ఆ కాలమునందు మాత్రమే సాధువైనచో, కాలభేదమును బోధించు పదముతో సంబంధ మేర్పడినపుడు సమన్వయము ఎట్లు కుదురును ? (సమాధానము) పదములు వాక్యార్థమునకు యోగ్యముకాని అర్థములు కలిగినపుడు వాటికి వాక్యర్థము వలన విశిష్టత్వము సిద్ధింపదు.

వివరణము— ఈ కారికలోని పూర్వార్థము ప్రశ్న రూపము. ఉత్తరార్థము తత్స

2. ఇందులకుదాహరణము శ్లోకముననే చూపబడుచున్నది.

ఖనతి ద్వాభ్యామితి, ద్వాభ్యామ్ = రెండు మంత్రములచే అనగా రెండు మంత్రములనుచ్చరించుచు, ఖనతి = త్రవ్వుచున్నాడు, ఇతి = అని ఉదాహరణము. ఇది శ్రుతివాక్యము. ఇచట ద్విత్వము వివక్షితమగును.

3. అట్లు వివక్షించుటలో కారణమును జాపుచున్నాడు.

హి = ఏలయన, సా = ఆసంఖ్య, రూపాత్ = ప్రాతిపదికములను, ఆశ్రితా = ఆశ్రయింపబడుచున్నది. అనగా లభించుచున్నది. ప్రాతిపదికముచే బోధింపబడిన సంఖ్య వివక్షితముగాకున్న ఆ శబ్దప్రయోగమే వ్యర్థమగును.

ఇచట రూపశబ్దమునకు ప్రాతిపదిక మర్థము.

యజ్ఞము చేయుటకు వేదిని నిర్మించెదరు. దానికై మట్టిని తెచ్చెదరు. మట్టిని త్రవ్వుట, దానిని స్పృశించుట, తెచ్చుట, ఈ పనులు చేయుటకు కొన్ని మంత్రములు చెప్పెదరు. ఆమంత్రము చెప్పుచు ఆపనులు చేయవలెనని వేదము* బోధించుచున్నది. రెండు మంత్రములు త్రవ్వునపుడు నాలుగు మంత్రములు మట్టిని తీయునపుడు, ఆరు మంత్రములు మట్టిని తెచ్చునపుడు చెప్పుట శ్రౌత సంప్రదాయము. ॥54॥

*అవతారిక*—"వ్యాపారః కార్యసిద్ధయే" అను 50 వ శ్లోకమున **ఉపలక్షణమనే** అనగా అవివక్ష అనే వ్యాపారము కార్యసిద్ధికై స్వీకరింపబడుచున్నదని చెప్పియున్నాడు. దానిని స్పష్టపరచుటకై ఈ గ్రంథము నారంభించుచున్నాడు.

అందుకు ఏకత్వబహుత్వములు వివక్షితములుకావనియు ద్విత్వము మాత్రము వివక్షితమగుననియు 53 వ శ్లోకమున చూపబడినది.

కాని కొన్ని చోటులయందు ప్రత్యయార్థమగు ఏకత్వము వివక్షితముకాగల దని చూపుచున్నాడు.

**శ్లో॥ యజేత పశునేత్యత్ర సంస్కారస్యాపి సంభవే॥**
**యథా జాతిస్తథైకత్వం సాధనత్వేన గమ్యతే** 55

పశునా + యజేత, ఇతి + అత్ర = పశువుచే యాగము చేయవలెనని యర్థముకల పై వాక్యమున, సంస్కారస్య + సంస్కారార్థమై అనగా పశునా అనెడి శబ్దమునకు సాధుత్వమును కలిగించుటకై, సంభవే + అపి = విభక్తి ప్రత్యయమునకు సంభవమున్నను అనగా పశు, అను ప్రాతిపధికము కంటె పరముగా ఉత్పత్తి యున్నను, జాతిః = ప్రకృత్యర్థమగు పశుత్వజాతి, యథా = ఎట్లో, తథా = అట్లే, ఏకత్వమ్ = విభక్తి ప్రత్యయమునకు వాచ్యమగు ఏకత్వ సంఖ్యయు. సాధనత్వేన = సాధన రూపమున అనగా యాగ క్రియకు అంగముగా. గమ్యతే = శబ్దముచే తెలియబడుచున్నది.

---

*ద్వాభ్యాంఖనతి, చతుర్భిరాదత్తే, షడ్భిర్హరతి., 2, 4, 6మంత్రముల నిర్ణయము శ్రౌతభాగము విపులముగా చూపియున్నది,

మాధాన రూపము. 'భావికార్యం ఆసీత్' ఇత్యాదులలోని 'భావి' మొదలగు శబ్దములకు స్వకాలమునందే – అనగా భవితాద్యర్థమునందే, శాస్త్రీయ సంస్కారము నంగీకరించి ఆ యర్థములందు మాత్రమే ఆ శబ్దములు సాధువులని యంగీకరించినచో 'ఆసీత్' ఇత్యాది విభిన్న కాలార్థక పదములతో సంబంధ మేర్పడినపుడు కాలాంతర ప్రతీతి ఎట్లు కలుగును అని సూత్ర ప్రత్యాఖ్యానపర వార్తికముపై ఆక్షేపము. ఈ ఆక్షేపమునకు సమాధానముగ "ఉపపదస్య తు కాలాన్యత్వమ్" అను వార్తికము చెప్పబడినది. పై ఉదాహరణములలో 'ఆసీత్' ఇత్యాది ధాత్వర్థములలో 'భావి' ఇత్యాది పదార్థములు విశేషణములుగ అన్వయించును కావున అవి ఉపపదములు. ఈ ఉపపదములు విశేష్యములగు ధాత్వర్థముల కాలమును గ్రహించును. ఉపపదము ప్రధానపదము యొక్క కాలమును స్వీకరించును అనునది వాక్యార్థ బలముచే సిద్ధించును. పద సంస్కార సమయమున వాక్యార్థము వేరు గాన అది పదార్థమునకు అంగము కాజాలదు. ఈ విషయమునే ఉత్తరార్థము చెప్పుచున్నది. వాక్యార్థమునకు అయోగ్యములగు అర్థములు గల పదములతో వాక్యార్థమునకు వైశిష్ట్యము కుదురదు. అందుచే ఏకవాక్యతా బలముచే విశేషణమునకు విశేష్యకాలముతో సంబంధ మేర్పడును, అనగా విశేష్యకాలమే విశేషణమునకు గూడ సంబంధించును. కావున ప్రత్యేకముగ సూత్రమును చెప్పపనిలేదు.॥94॥

అవతారిక — మీదు మిక్కిలి, సూత్రమును చెప్పినచో వివక్షితార్థ బోధ కూడ కలుగదని చెప్పుచున్నాడు.

శ్లో॥ తదర్థశ్చేదవయవో భావినో భూతతాగతిః ।
న స్యాదత్యన్త భూతత్వమేవైకం తత్ర సంభవేత్ ॥ 95

అవయవః = 'భావికార్యం ఆసీత్' ఇత్యాది వాక్యములలో విశేషణ భూతమగు 'భావి' మొదలగునది, (ఇచట 'భావి' అనునది 'కార్యం' అను దానికి విశేషణము), తదర్థశ్చేత్ = ప్రధానమగు ఆఖ్యాతముచే బోధింపబడు కాలమును బోధించినచో, భావినః = భావిగా నున్న దానికి, భూతతాగతిః = భూతత్వ జ్ఞానము, నస్యాత్ = ఉండదు, తత్ర = అచట, ఏకం = ఒక్క అత్యన్త భూతత్వమేవ = అత్యంత భూతత్వమే, సంభవేత్ = సంభవించును.

తాత్పర్యము— అవయవము కూడ ప్రధానమగు దాని కాలమునే బోధించినచో భావియే భూతమైనది అను జ్ఞానము కిలుగదు. ఒక్క అత్యంత భూతత్వజ్ఞానము మాత్రమే కలుగును.

విశేషము— 'భావి కార్యం ఆసీత్' ఇత్యాది వాక్యములు ఒక అర్థ విశేషమును బోధింపవలె ననెడు అభిప్రాయముతో ప్రయోగింపబడుచున్నవి. 'ఏ కార్యము కొంత కాలము పాటు జరుగవలసినదిగా మాత్రముండెనో అది చివరికి జరిగినది' అని చెప్పుటకై వక్త ఇట్టి వాక్యమును ప్రయోగించును. 'భావి' అనునది సహజముగ భవిషదర్థవాచకమై వాక్యార్థబలముచే భూతార్థమును చెప్పిన పక్షమునసనే ఇంత అర్థము ఆ వాక్యమువలన గ్రాహ్యమగును. సూత్రము ప్రకారము 'భావి' అను పదమునందలి ప్రత్యయము కూడ భూతార్థకమే యైనచో

'భూతం కార్యం ఆసీత్' అన్న విధమున జరిగిన పని తప్పక జరిగినది అని చెప్పినట్లు భూతత్వమునందే అవధారణమును చెప్ప నుద్దేశించినట్లగును. అది వక్తృవివక్షాను గుణము కాదు ॥95॥

అవతారిక— ఒక కాలమును బోధించుటకై నిష్పన్నమగు శబ్దము వాక్యార్థాను సారముగా కాలాంతరమును బోధించిన పక్షమున మొదటి (పూర్వ నిర్దిష్టమగు) కాలమును త్యజింపవలసి యుండును కదా యని ఆశంకించి అట్లు త్యజింప నవసరము లేదని చెప్పు చున్నాడు.

శ్లో॥ విశిష్టకాలతా పూర్వం తథాపి తు విశేషణే ।
ఆశ్రయాత్ సోఽన్తరంగత్వాత్ తత్ర సాధుర్భవిష్యతి ॥ 96

పూర్వం = పదాన్తర సంబంధమునకు పూర్వమే, (భావ్యాది శబ్దములకు), విశిష్టకాలతా = కాలవిశేష సంబంధ మున్నది, విశేషణే = అది మరియొకి పదమునకు విశేషణమైనపుడు, తథాపితు = ఆ విధముగ అన్యకాల విశిష్టత్వము సంభవించినను, సః = ఆ శబ్దము, ఆశ్రయాత్ = ముందుగనే ఆశ్రయించుట వలనను, అంతరంగత్వాత్ = ఆ కాలము అంతరంగ మగుట వలనను, తత్ర=ఆ మొదటి కాలమునందే (కాలార్థమునందే), సాధుః=సాధువై నద్ది, భవిష్యతి = కాగలదు.

తాత్పర్యము— 'భావి' మొదలగు శబ్దములకు పదాంతర సంబంధము కలుగక పూర్వమే కాలవిశేషముతో సంబంధ మేర్పడినది. తరువాత దానికి కాలాంతర సంబంధ మేర్పడినను మొదట ఆశ్రయింపబడిన కాలమే అంతరంగము. అందుచే ఆ కాలమును బట్టియే ఆ శబ్దమునకు సాధుత్వము లభించును.

వివరణము— 'భావి' అను పదమునకు వాక్యమునందు ఇతర పదములతో సంబంధము ఏర్పడుటకు ముందుగనే భవిష్యత్కాలముతో సంబంధ మేర్పడినది గాన ఆ కాలము అంతరంగము. వాక్యమునందు కాలాంతరముతో సంబంధ మేర్పడినను, వెనుకటి కాలమును పూర్తిగ విడువవలసిన పని లేదు. ఆ కాలమును బట్టి దీనికి సాధుత్వము లభించును అనగా 'భావి కార్యం ఆసీత్' 'సోమయాజీ అస్య పుత్రో జనితా' ఇత్యాదులలో 'భావి' 'సోమ యాజీ' ఇత్యాది పదములలోని భవిష్యత్త్వ భూతత్త్వచ్ఛాయ పూర్తిగా తొలగిపోదు. అది ఉండగనే కాలాంతరముతో సంబంధము ఏర్పడును. 'ఏ పని కావలసియుండెనో అది జరిగెను' 'ఈతనికి సోమయాగము చేసినవాడుగా కాబోవు కుమారుడు పుట్టును' అను సర్థము లందు రెండు కాలములఛాయలు ఉండుటచే ఒక వైశిష్ట్యమున్నది. అట్లు కాక సూత్రమును చెప్పి వాటి కాలమే పూర్తిగ మారిపోయి భావి అను దానికి 'అయిపోయినది' అనియు, 'సోమయాజీ' అను దానికి 'సోమయాగము చేయగలవాడు' అను నర్థములు చెప్పినచో ఈ వివక్షితార్థ ప్రతీతి కలుగదు ॥96॥

అవతారిక— కొందరు వార్తికాభిప్రాయమును అంగీకరించుచు, తదనుసారము గూడ సూత్రారంభము ఆవశ్యకమే యని చెప్పినారు. వారి మతమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆమిశ్ర ఏవ ప్రక్రాన్తః స పదార్థ స్తథావిధః ।
కేవలస్య విమిశ్రత్వం నిత్యేఽర్థే నోపపద్యతే ॥ 97

ఆమిశ్రః ఏవ = ఇతర పదార్థ మిశ్రమగు పదార్థమే, ప్రక్రాన్తః = అన్వాఖ్యానమునకై (వ్యాకరణ సంస్కారమునకై) ఉపక్రమింప బడినది, సః = ఆ, పదార్థః = పదార్థము, తథా విధః = ఇతర పదార్థ విమిశ్రమే, అర్థే = అర్థము, నిత్యే = నిత్యమైనపుడు, కేవలస్య = కేవలమగు పదార్థమునకు, విమిశ్రత్వం = మిశ్రత్వము, నోపపద్యతే = ఉపపన్నము కాదు.

తాత్పర్యము— ఇతర పదార్థ విశిష్టమగు పదార్థమే అన్వాఖ్యానమునకై ఉపక్రమింప బడినది గాన అది ఆ విధముగనే భాసించును. శబ్దార్థములకు సంబంధము నిత్యము గాన, కేవల పదార్థమునకు మిశ్రత్వము కుదురదు.

విశేషము— లోకవ్యవహారమునకై శబ్దములను ప్రయోగింతురు. ఆ విధముగ వ్యవహార ప్రయుక్తములగు శబ్దముల స్వరూపమునే వ్యాకరణము విశదీకరించును. వ్యవహారమున వాక్యమును ప్రయోగింతుము గాన వాక్యమే అన్వాఖ్యానాంగ మని అంగీకరింపవలెను. ఈ విధముగ వాక్యార్థమును దృష్టిలో నుంచుకొని చేసిన అన్వాఖ్యానమున ఇతర పదార్థములతో విశిష్టమగు పదార్థములకే స్థానము లభించును. ఇతర పదార్థ సమన్వయ నిరపేక్షముగ ముందుగ పదానుశాసనము చేసి పిమ్మట ఆ పదార్థమునకు ఇతర పదార్థ సంబంధ మేర్పడును, అని అన్నచో ఆ పదమునకు పూర్వమున్న అర్థముతో సంబంధము పోయి విశిష్టార్థముతో క్రొత్తగ సంబంధ మేర్పడినది గాన శబ్దార్థముల సంబంధము నిత్యము అను నియమమునకు విఘాతము కలుగును. కావున ఒక అర్థమున అన్వాఖ్యానము చేయగా వాక్యావస్థలో మరియొక అర్థముతో సంసర్గము కలుగునని చెప్పుట యుక్తము కాదు. ॥97॥

అవతారిక— పై కారికలో సూచించిన కారణముచే ''ధాతుసమ్బన్ధే ప్రత్యయః'' అను పృథక్సూత్రారంభము ఆవశ్యకమే యని చెప్పుచున్నాడు.

శ్లో॥ శుద్ధే చ కాలే వ్యాఖ్యాతమామిశ్రే న ప్రసిధ్యతి ।
సాధుత్వమయథాకాలం తత్సూత్రేణోపదిశ్యతే ॥ 98

శుద్ధే = శుద్ధమైన, కాలే = కాలమునందు, వ్యాఖ్యాతం = చెప్పబడిన ప్రత్యయము, ఆమిశ్రే = సంసృష్టమగు కాలమునందు, న ప్రసిధ్యతి = సిద్ధించదు, తత్ = ఆ కారణమువలన, అయథాకాలం = పూర్వ విహితకాలముకంటె భిన్నమగు కాలమును అనుసరించి, సాధుత్వం = సాధుత్వము, సూత్రేణ = సూత్రముచేత, ఉపదిశ్యతే = ఉపదేశింపబడుచున్నది.

తాత్పర్యము— ఇతర కాలా మిశ్రమగు శుద్ధ కాలార్థమున విహితమగు ప్రత్యయము సంసృష్టకాలార్థమున సిద్ధింపదు. అందుచే పూర్వ విహిత శుద్ధ కాలభిన్న కాలమునందు గూడ ఆ పదమునకు సాధుత్వము లభించుటకై సూత్రము ఉపదిష్టమైనది.

వివరణము— 'భావి' అను పదము 'భవిష్యతి గమ్యాదయః' అను సూత్రముచే ఇతర కాలములతో మిశ్రితము కాని శుద్ధ భవిష్యత్కాలార్థమున విధింపబడినది. ఈ పదము ఈ శుద్ధ భవిష్యదర్థమున ప్రయోగించిననే సాధువగును కాని భూతాది కాలమిశ్ర భవిష్యదర్థమున ప్రయోగించినచో సాధువు కాదు. అనగా— 'భావి కార్యం ఆసీత్' ఇత్యాది స్థలములలో (వార్తికకారాదు లంగీకరించినట్లు) వాక్యాన్వయ బలముచే భవిష్యత్కాలమునకు భూతకాల సంశ్లేషము కలుగుచున్నది గాన ఇది సాధువు కాదు. అందుచే దానికి ఈ యర్థమునందు గూడ (భూత మిశ్ర భావ్యర్థమునందు గూడ) సాధుత్వము లభించుటకై ఈ సూత్ర మావశ్యకమని సూత్రకార సమర్థకుల అభిప్రాయము. ॥98॥

*అవతారిక*— ఇపుడు వార్తికకార మత సమర్థకుడు ఒక ఆక్షేపముచేసి, దానికి సూత్ర సమర్థకులు ఏ సమాధానము చెప్పుదురో ఆ సమాధానమును పురస్కరించుకొని సూత్రము అనావశ్యకమని సూచించుచున్నాడు. 'భావికార్యం ఆసీత్' ఇత్యాది స్థలములలో 'ఆసీత్' అను దానితో సంబంధించుటచే 'భావి' అనునది భూతకాల సంశ్లిష్ట భవిష్యత్కాలమును బోధించునని అంగీకరించి ఆ యర్థమును బోధించుటకై "ధాతుసమ్బన్ధే ప్రత్యయాః" అను సూత్రము రచింపబడినదని మీరు చెప్పుచున్నారు. వినిగమకము లేకపోవుటచే (ఇది ఇట్లే చెప్పవలెను అని నిర్ణయించుటకు తగు ప్రమాణమునకు వినిగమక మని పేరు) 'భావి' యను భవిష్యత్కాలార్థక శబ్ద సంబంధముచే 'ఆసీత్' అనునదియే భవిష్యత్కాల మిశ్ర భూతకాలార్థకమని ఏల యంగీకరింపరాదు అనునది ఆక్షేపము. ఈ ఆక్షేపమునకు క్రింది కారిక సమాధానము చెప్పుచున్నది. ఈ సమాధానమును బట్టియే సూత్రారంభమనావశ్యకమని తేలుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆఖ్యాతపదవాచ్యేఽర్థే నిర్వర్త్యత్వాత్ ప్రధానతా ।**
**విశేషణం తదాక్షేపాత్ తత్కాలే వ్యవతిష్ఠతే ॥ 99**

ఆఖ్యాత పదవాచ్యే = ఆఖ్యాత పదముచే (తిఙంతముచే) చెప్పబడెడు, అర్థే = క్రియారూపమగు అర్థమునందు (అర్థమునకు), నిర్వర్త్యత్వాత్ = అది సాధ్యమైనదగుట వలన, ప్రధానతా = ప్రధానత్వము, విశేషణం = విశేషణము, తదాక్షేపాత్ = ఆఖ్యాత పదార్థముచే ఆక్షిప్తమగుటచే, తత్కాలే = ఆఖ్యాత వాచ్యకాలమునందు (కాలమును), వ్యవతిష్ఠతే = ఉండును (అనుసరించును).

తాత్పర్యము— తిఙంతము క్రియను బోధించును. ఆ క్రియ సాధింపవలసినది. కావున అది ప్రధానము. అదియే వాక్యార్థము గాన, వాక్యార్థమునందు అదియే ప్రధానము. నామపద బోధ్యమగు కారకము సిద్ధ స్వభావమై క్రియకు ఉపకరించును. కావున అది అప్ర

ధానము. అప్రధానములు ప్రధానమైన దానిని అనుసరించును గాని ప్రధానము అప్రధానమైన దానిని అనుసరింపదు. అందుచే 'ఆసీత్' అను ఆఖ్యాతార్థము అప్రధానమగు నామార్థమును అనుసరించి దాని కాలముతో మిశ్రితమగు కాలమును బోధించు ప్రసక్తి లేదు. ఈ విధముగ ఒక వాక్యమున గౌణప్రధానములు రెండును ఉన్నపుడు ప్రధానమును బట్టి గౌణము ప్రవర్తిం చును గాని గౌణమును బట్టి ప్రధానము ప్రవర్తింపదు అను న్యాయముచేతనే భావీత్యాది వాక్యములలో 'భావి' మొదలగు పదములు తమ కాలమును పరిత్యజింపకుండగనే ప్రధానా ఖ్యాత కాలమును గ్రహించును అని చెప్పవచ్చును గాన సూత్రము ఉపదేశింప బనిలేదు. ''కేవలస్య విమిశ్రత్వం నిత్యేఽర్థేనోపపద్యతే'' అను ఆక్షేపము కూడ యుక్తముకాదు. పదార్థములన్నియు ఏదియో విధముగ ఇతర పదార్థములతో సంసృష్టము లగుచునే యుండును. ఇక నేమనగా, పదాన్తర ప్రయోగము లేనపుడు ఆ సంబంధము సామాన్యరూపముననే ఉండును. అపుడు కేవల రూపమున నున్న ఆ పదము సామాన్యార్థమునే బోధించును. వాక్య మున పదాంతర సన్నిధాన మేర్పడినపుడు విశేషార్థమును బోధించును. అందుచే పదము కేవలముగ (పదాంతరా సంసృష్టముగ) నున్నపుడు దాని సాధుత్వమునకై ఒక శాస్త్రమును, పదాంతర సంసృష్టమై యున్నపుడు దాని సాధుత్వమునకై మరియొక శాస్త్రమును ఉపదేశిం చుట అనావశ్యకము. కావున ఒక అర్థమును త్యజించుట, మరియొక అర్థమును గ్రహించుట అనునది ఉండదు. ॥99॥

అవతారిక— పదము, వెనుక చెప్పినట్లు, సామాన్యార్థ బోధకమగునపుడు ఏర్ప డిన వ్యాకరణ సంస్కారము ఆ పదము వ్యామిశ్రార్థ బోధకమగునపుడు గూడ అనువర్తిం చును. ఆ ప్రత్యయము ఆ కాలమునందే ప్రవర్తించును గాని ఇతర కాలముతో సంబంధించి నపుడు రాకూడదని నిషేధము లేదుకదా? అందుచే సూత్ర మనావశ్యకమని చెప్పుచున్నాడు.

శ్లో॥ సత్ప్రత్యయానుకారో వా శబ్దవ్యాపార ఏవ వా।
అధ్యస్యతే విరుద్ధేఽర్థే న చ తేన విరుధ్యతే॥ 100

సత్ప్రత్యయాను కారో వా = జ్ఞానాకారము గాని, శబ్దవ్యాపార ఏవ వా = శబ్దవ్యాపారము గాని, విరుద్ధే = విరుద్ధమగు, అర్థే = అర్థమునందు, అధ్యస్యతే = అధ్యసింపబడుచున్నది, తేన = అధ్యసింపబడుచున్న అర్థముతో, న చ విరుధ్యతే = విరోధమును పొందదు.

తాత్పర్యము— జ్ఞానాకారము గాని, శబ్దవ్యాపారము గాని విరుద్ధమగు అర్థము నందు అధ్యసింపబడును. దానితో విరోధమును కూడ పొందదు.

వివరణము— 'భావికార్యం ఆసీత్' ఇత్యాద్యుదాహరణములలోని 'భావి' మొదలగు దములు తమ తమ స్వభావమును అనుసరించి కొన్ని అర్థములను బోధించును. కాలాంతర మున సాధుత్వమును అనుశాసించినంత మాత్రమున ఆ కాలాంతర రూపార్థ ప్రతీతి కలుగదు. కావున సూత్రారంభ మనావశ్యకము. ఇక వాక్యార్థ సమన్వయ మెట్లు కలుగుననగా— గుణ ప్రధాన భావము ననుసరించి ప్రధాన కాలానుసారముగ సమన్వయము చెప్పుకొనవలెను అని

వెనుక చెప్పబడినది. మరియొక విధముగ గూడ సమాధానము చెప్పుకొనవచ్చును. ప్రత్యయములు కాలములతో పాటు ఆయా సంబంధములను గూడ బోధించును. సమన్వయము మాత్రము అధ్యారోపముచే ఏర్పడును. ఉదాహరణమునకు– ''అగ్నిష్టోమయాజీ అస్య పుత్రో జనితా'' అనుచోట ''అగ్నిష్టోమ యాజీ'' అనునది భూతకాల విశిష్టార్థమునే బోధించును. దీనికి 'జనితా' అను దానితో సంబంధమేర్పడినపుడు భూతకాలావచ్ఛిన్నమగు జ్ఞానాకారము అనుపపన్నము గాన స్వవిరుద్ధమగు ఆ భవిష్యత్కాలమున ఆరోపింపబడును. పుట్టబోవు వానికి సంబంధించిన భవిష్యత్కాలమునందు, జన్మ జరిగిన పిమ్మట అగ్నిష్టోమమును చేయుట, దాని సమాప్తి వీటిని మనసాభావించి ఇపుడే ఇది భూతకాలముగ చెప్పబడినది. ఇతనికి పుట్టబోవువాడు అగ్నిష్టోమయాగము చేయగలడు అనియే తాత్పర్యార్థము. ఈ పక్షమున భూతకాలావచ్ఛిన్న జ్ఞానాకారమునకు భవిష్యత్కాలమున ఆరోపము. లేదా ''అగ్నిష్టోమ యాజీ'' అను శబ్దమునకు గల స్వార్థాభిధాన రూపమగు వ్యాపారము భవిష్యత్కాలమున అధ్యసింపబడును. ''ఎవడు పుట్టి, పెరిగి, 'అగ్నిష్టోమయాజీ' అను పేరు పొందగలడో అట్టి కుమారుడు పుట్టగలడు'' అని యర్థము. ఇది శబ్దవ్యాపారారోప పక్షము. ఈ విధముగ జ్ఞానాకారాధ్యాసమును గాని, శబ్దవ్యాపారాధ్యాసమును గాని అంగీకరించినచో సమన్వయములో విరోధముండదు. ॥100॥

అవతారిక— ఈ విషయమునే ఉదాహరణముతో విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ భూతం భవిష్యదిత్యేతౌ ప్రత్యయౌ వర్తమానతామ్ ।**
**అత్యజన్తౌ ప్రపద్యేతే విరుద్ధాశ్రయ రూపతామ్ ॥ 101**

భూతం = భూతము, భవిష్యత్ = భవిష్యత్తు, ఇతి = అనెడు, ఏతౌ = ఈ, ప్రత్యయౌ = ప్రత్యయములు, వర్తమానతాం = వర్తమానత్వములను, అత్యజన్తౌ = విడువనివై, విరుద్ధాశ్రయ రూపతాం = విరుద్ధమగు ఆశ్రయము యొక్క రూపమును, ప్రపద్యేతే = పొందును.

తాత్పర్యము— భూతము, భవిష్యత్తు అనెడు రెండు జ్ఞానములును వర్తమానత్వమును విడువనివై విరుద్ధమగు ఆశ్రయముయొక్క రూపమును పొందును.

వివరణము— 'ఈ వస్తువు భూతము', 'ఈ వస్తువు భవిష్యత్తు' అను జ్ఞానములు కలుగుచున్నవి. ఇవి వర్తమాన కాలమునకు చెందినవి. అయినను ఈ జ్ఞానములు స్వకాల విరుద్ధములగు భూత భవిష్యత్కాలముల ఆకారమును ఎట్లు ధరించుచున్నవో అట్లే 'అగ్నిష్టోమ యాజీ' ఇత్యాద్యుదాహరణములలో గూడ స్వకాలమును విడువకుండగా కాలాంతరమునందు ఆరోపించుట విరుద్ధము గాదని యభిప్రాయము. ॥101॥

అవతారిక— ఇపుడు, కాల ప్రసంగముచే వర్తమానసారూప్యమును గూర్చి విచారించుచున్నాడు.

**శ్లో॥ అధ్వనో వర్తమానస్య యః శేషో య ఉపక్రమః ।**
**తద్వర్తమానసామీప్యం శాస్త్రే భేదేన దర్శితమ్ ॥ 102**

వర్తమానస్య = వర్తమానమగు, అధ్వనః = మార్గముయొక్క, యః = ఏ, శేషః = శేషము కలదో, యః = ఏ, ఉపక్రమః = ప్రారంభము కలదో, తత్ = అది, వర్తమాన సామీప్యం = వర్తమాన సామీప్యముగా, శాస్త్రే = శాస్త్రమునందు, భేదేన = భేదముతో, దర్శితమ్ = చూపబడినది.

తాత్పర్యము— వర్తమాన మార్గముయొక్క (వర్తమానము యొక్క) చివరి భాగమును (శేషము) ప్రారంభమును వర్తమాన సామీప్యమని శాస్త్రము చెప్పుచున్నది.

వివరణము— ఫలప్రాప్తి యగు వరకును విరమింపని క్రియాసాతత్యమునకు వర్తమాన మని పేరు. అది సమాప్తమైన తరువాత గూడ దాని సంస్కారము అనువర్తించుచుండును; అది వర్తమాన శేషము. ఈ శేషము భూతరూపము. వర్తమానము పూర్తియై పోయినది కదా? అట్లే వర్తమానము ప్రారంభము కాకపూర్వము మానస సంకల్పము కలుగును. అది, ఇంకను వర్తమాన క్రియ ప్రారంభము కాలేదు గాన, వర్తమాన భవిష్యద్రూపము. ఈ రెండును వర్తమానమునకు ముందును వెనుకను దగ్గరగనున్నవి. కావున ఈ రెండింటికిని శాస్త్రకారులు వర్తమాన సామీప్యమని పేరు పెట్టి, "వర్తమాన సామీప్యే వర్తమానవద్వా" అను సూత్రముచే వర్తమాన కార్యములు వికల్పముగ వచ్చునని చెప్పినారు. వర్తమాన సమీపమున నున్న భూత భవిష్యత్తులందు వర్తమానమునందు వలె ప్రత్యయములు వికల్పముగ వచ్చును, అని యర్థము. ఉదా. "కదా ఆగతోఽసి" (ఎప్పుడు వచ్చినావు?) 'అయమాగచ్ఛామి' (ఇదిగో వచ్చుచున్నాను), "కదా గమిష్యసి?" (ఎపుడు వెళ్ళెదవు?) 'ఏష గచ్ఛామి' (ఇదిగో వెళ్ళుచున్నాను). ఇచట మొదటి ఉదాహరణమున గమన క్రియ అపుడే పూర్తియగుటచే వర్తమాన సమీప భూతము. దానియందు వికల్పముగ 'ఆగచ్ఛామి' అను వర్తమానము ప్రయోగింపబడినది. రెండవ ఉదాహరణమున గమనము ప్రారంభము కాకున్నను గమన సంకల్పము ఉన్నది. అందుచే ఇది వర్తమాన సమీప భవిష్యత్తు. దీనియందు గూడ వికల్పముగ 'గచ్ఛామి' అను వర్తమాన ప్రయోగము వచ్చినది. ॥102॥

*అవతారిక*— ఇష్ట వస్తువిషయక మగు ప్రార్థనకు ఆశంసయని పేరు. ఈ ఆశంస అనునది జ్ఞానవిశేష రూపమైనది. అందుచే ఇది ఆ సమయమున నున్నదిగాన వర్తమానమే యగును. ఇట్టి పరిస్థితిలో భాష్యకారుడు "ఆశంసాయాం భూతవచ్చ" (3-3-132) అను సూత్రమున "ఆశంసా నామ భవిష్యత్కాలా" యని ఎట్లు చెప్పెను అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆశంసా వర్తమానాపి విషయేణ భవిష్యతా ।**
**భాష్యే భవిష్యత్కాలేతి కార్యార్థం వ్యపదిశ్యతే ॥ 103**

ఆశంసా = ప్రార్థన, వర్తమానాపి = వర్తమానమైనను, భవిష్యతా = భవిష్యత్తైన, విషయేణ

విషయముచే, భాష్యే = భాష్యమునందు, భవిష్యత్కాలేతి = భవిష్యత్కాలమని, కార్యార్థం కార్యముకొరకై, వ్యపదిశ్యతే = ఆరోపముచే చెప్పబడుచున్నది.

తాత్పర్యము— ప్రార్థన వర్తమానమే యైనను భవిష్యత్తు అగు విషయమును పురస్కరించుకొని భవిష్యత్కాలమునకు చెందినదని, కార్యార్థమై, భాష్యమునందు చెప్ప బడినది.

వివరణము— 'ఆశంసాయాం భూతవచ్చ' (3-3-132) అను సూత్రముచే "భవి ష్యత్కాలమున, ఆశంసార్థమునందు, భూతమునందువలెను వర్తమానమునందు వలెనే ప్రత్యయ ములు వచ్చును" అని విధింపబడినది. "ఉపాధ్యాయశ్చేదాగమత్, ఆగతః, ఆగచ్ఛతి, ఆగ మిష్యతి, ఏతే వ్యాకరణ మధ్య గీష్మహి, ఏతే వ్యాకరణ మధీతవన్తః, అధీమహే, అధ్యేష్యా మహే" (ఉపాధ్యాయుడు వచ్చినచో వ్యాకరణము అభ్యసించెదము) అని ఉదాహరణము. ఇచట ఆశంస (కోరిక) వర్తమాన కాలమున నున్నను ఇది భవిష్యత్కాలమునకు సంబంధించిన దగుటచే భవిష్యత్తని భాష్యకారులు చెప్పెను. "ఉపాధ్యాయశ్చేదాగ మిష్యతి తదావ్యాకరణ మధ్యేష్యామహే" అని భవిష్యత్కాలమునకు సూత్రమే అవకాశముండగా ఈ సూత్రము భవిష్యత్కాలమునందు వర్తమానత్వ భూతత్వములను అతిదేశించుచున్నది (ఆరోపించుచున్నది) దానినిబట్టి 'ఆగమత్' 'ఆగచ్ఛతి' 'అధ్యగీష్మహి' 'అధీమహే' ఇత్యాది భూత వర్తమాన ప్రయోగములకు గూడ వైకల్పికముగ అవకాశము లభించినది. ఈ విధముగ భూత ప్రత్యయ లక్షణమగు కార్యమును భవిష్యద్విషయమున అతిదేశించుటకై భాష్యకారుడు "ఆశంసా నామ భవిష్యత్కాలా" అని చెప్పెనని తాత్పర్యము. ॥103॥

*అవతారిక*— కోరబడెడు విషయము భవిష్యత్తునందున్నది గాన కోరిక (ఆశంస) కూడ భవిష్యత్తు అని భాష్యకారుని యభిప్రాయమని పై కారికలో చెప్పబడినది. ఆ పక్షమున చేయుటకు ఇచ్ఛయించుచున్నాడు (చికీర్షతి) ఇత్యాది స్థలములలో గూడ ఇచ్ఛ భవిష్య ద్విష యమునకు (జరుగబోవు చేయుటకు) సంబంధించినది గాన అదియు భవిష్యత్కాలమగును. అపుడు భవిష్యత్ప్రత్యయములే వచ్చునుగాని వర్తమాన ప్రత్యయములు వచ్చుటకు అవకాశము లేదు గాన వర్తమాన కాల ప్రత్యయములను అతిదేశింపవలసి యుండును కదా యని ఆశం కించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఇచ్ఛా చికీర్షతీత్యత్ర స్వకాలమనురుధ్యతే ।**
**భవిష్యతి ప్రకృత్యర్థే తత్కాలం నానురుధ్యతే ॥ 104**

చికీర్ష తీత్యత్ర = 'చికీర్షతి' అనుచోట, ఇచ్ఛా = ఇచ్ఛ, స్వకాలం = తన కాలమును (వర్త మానమును), అనురుధ్యతే = అనుసరించును, ప్రకృత్యర్థే = ప్రకృత్యర్థము, భవిష్యతి = భవిష్యత్తు ఐనను, తత్కాలం = దానియొక్క కాలమును, నానురుధ్యతే = అనుసరింపదు.

తాత్పర్యము— 'చికీర్షతి' అనుచోట ఇచ్ఛ తన కాలమునే అనుసరించును. ప్రకృ త్యర్థము భవిష్యత్తు ఐనను ఆ కాలమును అనుసరింపదు.

వివరణము— 'చికీర్షతి' అనునది 'కర్తుమ్ ఇచ్ఛతి' (చేయుటకు ఇచ్ఛగించు చున్నాడు) అను నర్థమున కృధాతువునకు 'సన్' ప్రత్యయమును చేర్చుటచే ఏర్పడినది. ప్రకృతియగు 'కృ' ధాతువునకు 'చేయుట' అర్థము. ప్రత్యయమగు 'సన్' కు 'ఇచ్ఛ' అర్థము. ప్రకృత్యర్థము రాబోవునది గాన భవిష్యత్కాలమునకు సంబంధించినది. ప్రత్య యార్థము ఇపుడున్నది గాన వర్తమానము. ప్రకృతి ప్రత్యయార్థములలో ప్రత్యయార్థము ప్రధానము గావున ప్రత్యయార్థమగు ఇచ్ఛ వర్తమానమగుటచే క్రియ వర్తమానమునందే ప్రయుక్తమగును గాని అప్రధానమగు ప్రకృత్యర్థమును బట్టి భవిష్యత్కాలములో నుండుట గాని, తత్పరిహారార్థమై వర్తమానత్వాతి దేశము చేయవలసిన ఆవశ్యకత కాని లేదని తాత్ప ర్యము. ॥104॥

అవతారిక— చికీర్ష తీత్యాదులలో ఇచ్ఛాకాలమగు వర్తమానమే అనువర్తించిన విధమున ఆశంసా స్థలమునందు ఆశంసాకాలమగు వర్తమానము ఎందుచే అనువర్తింపదు అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆశంస్యమాన తన్త్రత్వాదాశంసాయాం విపర్యయః ।
ప్రయోక్తృధర్మః శబ్దార్థే శబ్దై రేవానుషజ్యతే ॥ 105

ఆశంస్యమాన తంత్రత్వాత్ = అభిలషింపబడుచున్న దానిపై ఆధారపడిన దగుటచే. ఆశం సాయాం = ఆశంస విషయమున, విపర్యయః = విపర్యయము - అనగా ప్రార్థనయొక్క కాలమునకు కాక ప్రార్థింపబడుదాని కాలమునకే ప్రాధాన్యమనెడు విపర్యాసము, ప్రయోక్తృ ధర్మః = ప్రయోగించు వానియొక్క ధర్మము, శబ్దై రేవ = శబ్దములచేతనే, శబ్దార్థే = శబ్దార్థమునందు, అనుషజ్యతే = అనుషక్తమగుచున్నది.

తాత్పర్యము— ఆశంసింపబడుచున్న దానిపై ఆధారపడినదగుటచే, ఆశంస విషయమున వెనుక చెప్పినదానికంటె విపర్యాసము కనబడుచున్నది. ప్రయోక్త యొక్క ధర్మమును శబ్దార్థమునందు శబ్దములే అనుషక్తమగునట్లు చేయుచున్నవి.

విశేషము— 'చికీర్షతి' ఇత్యాది స్థలములలో ఇచ్ఛ ప్రత్యయార్థముగ నున్నట్లు 'ఉపాధ్యాయశ్చేదాగమత్' ఇత్యాద్యుదాహరణములందు గమ్యమానమగు ఆశంస ప్రత్య యార్థము కాదు. ఆశంసింపబడుచున్నదే ప్రత్యయార్థముగ నున్నది. ఇచట గమ్యమానమగు ఆశంస వాక్య ప్రయోక్తయొక్క ధర్మమేకాని శబ్దార్థము కాదు. 'ఉపాధ్యాయుడు వచ్చినచో చదువుకొందుము, అని చెప్పుటను బట్టి ఆ వాక్యమును ప్రయోగించువానికి ఆశంస (కోరిక) ఉన్నట్లు తెలియుచున్నది గాని ఆ కోరికను బోధించు పదమేదియు ఇచట లేదుగాన ఇది పదార్థము కాదు. ఉపాధ్యాయాగమన - వ్యాకరణాధ్యయనములే ప్రత్యయవాచ్యము లగుటచే ప్రధానములు గాన వాటి కాలముండుటయే యుక్తము.

అట్లైనచో శబ్దార్థమునే శబ్ద సంస్కారమునకు నిమిత్తముగ గ్రహింపవలెను గాని

ప్రయోక్తృధర్మమగు ఆశంసను శబ్ద సంస్కారమునకు (వ్యాకరణ కార్య ప్రవృత్తికి) నిమిత్తముగ గ్రహింపవచ్చునా యని ఆశంకించి, ఉత్తరార్ధమును చెప్పుచున్నాడు. ఆ శబ్దము ప్రయోగించుటచే ఆధర్మము ప్రయోక్తయందున్నట్లు గమ్యమగుచున్నది గాన శబ్దమే ప్రయోక్తయొక్క ధర్మమును ప్రయోజ్యమగు శబ్దముయొక్క అర్థమునందు ఆరోపించు చున్నది. ఈ విధముగ ప్రయోక్తృధర్మము గూడ పరోక్షరూపమున శబ్ద సంస్కారమునకు నిమిత్తము కావచ్చును. ॥105॥

*అవతారిక*— మహాభాష్యమునందు "అనిష్పన్నే నిష్పన్న శబ్దః శిష్యోఽనిష్పన్నత్వాత్" అను వార్తికమున్నది. కార్యము ఇంకను పూర్తికాకుండునపుడు, అది పూర్తి కాకుండుట వలన (అనిష్పన్నత్వాత్) భవిష్యత్కాల ప్రత్యయము రావలసియున్నను భూత ప్రత్యయము చెప్పవలెను అని దీని యర్థము. "దేవశ్చే ద్వృష్టో నిష్పన్నాః శాలయః" అనునది ఉదాహరణము. దేవుడు వర్షించి యున్నచో వరిధాన్యము నిష్పన్నమైనవి (నిష్పన్నమైనట్లే) అని యర్థము. వార్తికమునందలి 'అనిష్పన్నత్వాత్' అను దానికి హేతువులన్నియు సన్నద్ధములుగ నుండుటచే నిష్పత్త్యభిముఖమైన దగుటవలన అని యర్థము. నిష్పత్తి సంభావ్యమగుటచే భూతకాలమును ఔపచారిక రూపమున ప్రయోగింప నవసరము లేదు. ముఖ్యరూపముననే ప్రయోగింపవచ్చునని యభిప్రాయము. "దేవశ్చేద్ వృష్టః నిష్పన్నాః శాలయః" అనునది వర్షము కురిసిన తరువాత జనులనుకొనెడు మాట. "వర్షము కురిసినది కనుక ఇంక శాలులు (వరి పంటలు) నిష్పన్నములైనట్లే" అని తాత్పర్యము. ఈ వార్తికము అనావశ్యకమని మరియొక వార్తికము చెప్పుచున్నది. "సిద్ధంతు భవిష్యత్ప్రతిషేధాత్". దీనిపై భాష్యము – "సిద్ధమేతత్, కథమ్? భవిష్యత్ప్రతిషేధాత్, యల్లోకో భవిష్యద్వాచినః శబ్దస్య ప్రయోగం న మృష్యతి" కశ్చిదాహ – దేవశ్చేద్వృష్టః సంపత్స్యన్తే శాలయ ఇతి. స ఉచ్యతే మైవం వోచః, 'సమ్పన్నాః శాలయ' ఇత్యేవం బ్రూహి". "దేవుడు వర్షించి యున్నట్లైతే వరి సంపన్నము కాగలదు" అని ఎవ్వడైన భవిష్యత్కాలమును ప్రయోగించినచో ప్రక్కనున్నవారు అందులకు అంగీకరింపక 'సంపత్స్యన్తే' అని భవిష్యత్కాలమును ప్రయోగింపకుము, 'సంపన్నాః శాలయః' అని భూతకాలమును ప్రయోగింపుము అని వాని మాటలు సరిచేయుదురు. ఈ విధముగ భవిష్యత్ప్రతిషేధము చేతనే భూతకాలము సిద్ధించును గాన "అనిష్పన్నే..." ఇత్యాది వార్తిక పాఠము అనావశ్యకమని ఈ వార్తికమున కర్థము ఈ వార్తికార్థము ఎట్లు ఉపపన్నమో విశదీకరించుచున్నాడు.

శ్లో॥ అప్‌శాలి బీజసంయోగే వర్తతే నిష్పదిర్యదా ।
తత్రావయవ వృత్తిత్వాద్భవిష్యత్ ప్రతిషేధనమ్ ॥ 106

నిష్పదిః = నిస్ పూర్వక పద్ ధాతువు, యదా = ఎప్పుడు, అప్శాలి బీజసంయోగే = ఉదకము యొక్కయు శాలి బీజముల యొక్కయు సంయోగము అను నర్థమునందు, వర్తతే = ఉండునో (ఆ అర్థమును బోధించునో) అపుడు అవయవ వృత్తిత్వాత్ = అవయవమునందు

పశునాయజేత, అనునది వేద వాక్యము. పశుశబ్దముచే నిచట మేక చెప్పబడును. మేకచే యజ్ఞము చేయవలెనని దాని యర్థము.

"నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా" (ప్రత్యయము లేకుండ కేవల ప్రకృతి ప్రయోగింపరాదు) అని వైయాకరణులు నియమము చేసి యున్నందున 'పశు', అను ప్రాతిపదికమాత్రమును ప్రయోగింపరాదు. అందుకై 'పశు' అను ప్రాతిపదికము కంటె 'నా' అనుతృతీయా విభక్తి ప్రత్యయము ప్రయోగింపబడుచున్నది. విభక్తి ప్రత్యయమును చేర్చుటకిదియే ప్రయోజనము. కాగా, సముదాయము పదము కనుక ప్రయోగార్హమగు చున్నది.

అందు 'పశు' అను ప్రకృతి పశుత్వ జాతిని, ప్రత్యయము ఏకత్వ సంఖ్యను బోధించుచున్నది. ఈరీతిగా పశుత్వజాతి శబ్ద వాచ్యమగుటచే నది యాగక్రియ కంగ మగుచున్నది. పశుత్వ జాతికి చెందని వ్యక్తితో యాగము చేయరాదని తాత్పర్యము లభించుచున్నది.

అట్లే ప్రత్యయముచే బోధింపబడిన ఏకత్వసంఖ్యయు యాగ సాధనమే యగును. కనుకనే ఒక మేకను ఉపయోగించియే యాగము చేయవలెను. అనేక పశువులతో యాగము చేయరాదని పెద్దలు నుడివిరి. అట్లుకాకున్న అది అశాస్త్రీయమే యగుననియు వారు నిర్ణయించిరి.

కాగా పశునా, అను పదమునకు సాధుత్వమును సంపాదించుటకై ప్రాతి పదికము కంటె తృతీయా విభక్తి ప్రత్యయము పరముగా చేరినను దానిచే బోధింప బడిన ఏకత్వ సంఖ్య వివక్షితమై ప్రకృత్యర్థమగు జాతివలె నదియు యాగమున కంగమగుచున్నది. ఏకత్వ సంఖ్యను విడువక దానితోకలిపియే 'ఏకేన పశునా యాగం భావయేత్' అని వేదవాక్యమున కర్థము చెప్పుట శాస్త్ర సమ్మతము.

కాబట్టి బాధకములేనందున పై వాక్యమున ప్రత్యయార్థమగు ఏకత్వ సంఖ్య వివక్షితమగును. అది ప్రకృత్యమునకు విశేషణమగును. బాధకమున్న చోటున ప్రత్యయార్థసంఖ్య అవిక్షితమగును అని కొందరి సిద్ధాంతము. ॥55॥

*అవతారిక* — సాధుత్వ సంపాదనమే విభక్తి ప్రత్యయమునకు ప్రయోజనము, అంతకు తప్ప దానికి మరియొక ప్రయోజనము కల్పింపరాదని కొందరు శాస్త్రజ్ఞులు తలంచు చున్నారు.

అట్టితరి, పశునాయజేత, అనుచోట పశువునందు ఏకత్వ భావమెట్లు? అనగా ఒకే పశువుచే యాగము చేయవలె ననెడివాక్యార్థ మెట్లు లభించును? అను ప్రశ్నకు వారి మతము ననుసరించియే సమాధానము చెప్పుచున్నాడు.

ఉండుట వలన, తత్ర = అచట, భవిష్యత్ప్రతిషేధనం = భవిష్యత్కాలము యొక్క నిషేధ నము చేయబడుచున్నది.

తాత్పర్యము— నిస్ పూర్వక పద్ ధాతువు, అవయవార్థ మాత్రబోధకమై జల శాలి బీజముల సంయోగము అను నర్థమును బోధించునపుడు భవిష్యత్కాల ప్రయోగము నిషేధింపబడుచున్నది.

వివరణము— నిస్ పూర్వక పద్ ధాతువునకు సాధనములన్నియు సమకూరిన పిదప ఫలము సిద్ధించుట అనునది ముఖ్యార్థము. ఈ ముఖ్యార్థములో జలము, వరి విత్తన ములు కలియుట అనునది ఒక అంగము (అవయవము). ముందు జల - శాలిబీజములకు సంబంధమేర్పడిన పిమ్మట వరి పండుట అను ముఖ్య ఫలము కలుగును కదా. ఆరోపణముచే ఈ అవయవార్థమునే నిస్ పూర్వక పద్ ధాత్వర్థమునుగ గ్రహించినచో వర్షము కురిసిన వెంటనే ఆ అవయవార్థము (జలశాలి బీజసంయోగము) ఏర్పడినది గాన భవిష్యత్కాలమును ప్రయోగింప బనిలేదని దానిని నిషేధించుట యుక్తము. ఈ విధముగ అవయవార్థమునే ఔప చారికముగ నిష్పద్యర్థముగ స్వీకరించి భూతకాల ప్రయోగము చేయవచ్చును గాన భూతకాల ప్రయోగ విధాయక వార్తికము అనావశ్యకమని యభిప్రాయము. ॥106॥

అవతారిక— ఈ విధముగ గౌణార్థమును గ్రహించిన పక్షమున భూతకాలము యుక్తమై యైనను ముఖ్యార్థమును స్వీకరించిన పక్షమున (వరి పండుట అను అర్థమును అంగీకరించిన పక్షమున) భూతత్వ మెట్లు కుదురును అని ఆశంకించి సమాధానము చెప్పు చున్నాడు.

శ్లో॥ ఫలప్రసవరూపే తు నిష్పదౌ భూతకాలతా ।
ధర్మాన్తరేషు తద్రూపమధ్యస్య పరికల్ప్యతే ॥ 107

నిష్పదౌ = నిస్ పూర్వక పద్ ధాతువు, ఫలప్రసవరూపే = ఫలోత్పత్తియను అర్థము కల దని చెప్పినచో, ధర్మాన్తరేషు = ఇతర ధర్మములయందు, తద్రూపమ్ = ఫలనిష్పత్తిత్వ రూపమును, అధ్యస్య = ఆరోపించి, భూతకాలతా = భూతకాలత్వము, పరికల్ప్యతే = కల్పింప బడుచున్నది.

తాత్పర్యము— 'నిష్పది'కి ఫలప్రసవమే ముఖ్యార్థమని యంగీకరించిన పక్షమున ధర్మాన్తరములయందు ఫలప్రసవ రూపత్వమును ఆరోపించి భూతకాలత్వము కల్పింపబడు చున్నది.

వివరణము— ''సాధనములన్నియు సమకూరుటచే ఫలము జనించుట'' అనునది యే 'నిష్పది'కి (నిస్ పూర్వక పద్ ధాతువునకు) అర్థము. ఆ అర్థము ఇంకను నిష్పన్నము కాదు గాన భూతకాలమును ప్రయోగించుటకు అవకాశము లేదు అని చెప్పినచో ఆరోపమును ఈ విధముగ చెప్పవలెను. జలబీజ సంయోగముచే కారణములయందు ఒక ధర్మాతిశయ

మేర్పడును. ఆ ధర్మాతిశయమునే కార్యనిష్పత్తి యని ఆరోపించుటచే భూతకాలమును ప్రయో గింప వచ్చును. పూర్వకారికలో 'నిష్పది'యందు 'జలశాలి బీజసంబంధము' అను నర్థమును ఆరోపించి తద్ద్వారా భూతకాలత్వము సమర్థింపబడినది. ఈ కారికలో జలబీజ సంయోగముచే కొన్ని కారణములయందు ఏర్పడిన ఒక విధమగు అతిశయమునే ఫలప్రసవరూప ముఖ్యార్థ ముగ భావించుటచే, అనగా ముఖ్యార్థత్వారోపణముచే, భూతకాలత్వము సమర్థింపబడినది.

*అవతారిక*— మరియొక విధమగు ఉపచారమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉపయుక్తే నిమిత్తానాం వ్యాపారే ఫలసిద్ధయే ।**
**తత్రరూపం యదధ్యస్తం తత్కాలం తత్ ప్రతీయతే ॥** 108

ఫలసిద్ధయే = ఫలముయొక్క సిద్ధికొరకు, నిమిత్తానాం = నిమిత్తముల యొక్క, వ్యాపారే = వ్యాపారము, ఉపయుక్తే సతి = ఉపయోగింపబడిన దగుచుండగా, తత్ర = ఆ ఫలసిద్ధి యందు, యత్ = ఏ, రూపం = వ్యాపార రూపము, అధ్యస్తం = అధ్యసింపబడినదో, తత్ = ఆ ఫలము, తత్కాలం = ఆ వ్యాపారముయొక్క కాలము కలదిగా, ప్రతీయతే = తోచుచున్నది.

*తాత్పర్యము*— నిమిత్తముల వ్యాపారము ఫలసిద్ధికొరకై వినియుక్తమైన పిమ్మట ఆ ఫలసిద్ధియందు (ఫలమునందు) వ్యాపారరూపమును ఆరోపించుటచే, ఆ ఫలము, ఆ వ్యాపా రమున కే కాలమో ఆ కాలము కలదిగా కనబడుచున్నది.

*వివరణము*— ఒక కార్యము సిద్ధింపవలెనన్నచో అనేక కారణముల సామగ్రి ఉండవలెను. ఆ కారణము లన్నియు ఫలజన్మ నిమిత్తమై వ్యాపారము చేయుచుండును. ఈ కారణముల వ్యాపారమే ఫలమని ఆరోపించుటచే ఈ వ్యాపారమునకును ఫలమునకును అభేద ప్రతీతి కలుగును. అందుచే కారణముల వ్యాపారము అతీతమైపోయినది గాన ఫలము కూడ అతీతమైనట్లు తోచును. పూర్వ కారికలో కారణ ధర్మములందు ఫలారోపము చెప్పబడినది. ఈ కారిక ఫలమునందు కారణ ధర్మారోపమును ప్రతిపాదించుచున్నది. ఈ విధముగ కారణ ధర్మములను ఫలమునందు ఆరోపించుటకు ప్రయోజన మేమనగా కారణములు సమర్థతరము లని చెప్పుటయే. ఈ విధముగ అతీతమగు వర్షముయొక్క కాలము కార్యమునందు (శాలి నిష్పత్తియందు) అధ్యసింపబడుటచే భూతకాల ప్రయోగము ఉపపన్నమగుచున్నది. కార ణాంతరాపేక్ష లేదని చెప్పుట, ఈ విధమగు ప్రయోగములకు ప్రయోజనము. ॥108॥

*అవతారిక*— ఫల నిష్పత్తియనునది హేతువులవలన కలిగెడు ఉపకారముయొక్క సమాప్తిపై ఆధారపడియున్నది గాన ఆయా హేతూపకారములు నిష్పన్నము లగుటతో వివక్షానుసారముగా ఫలనిష్పత్తి వ్యవహారము కలుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నిష్పత్తావవధిః కశ్చిత్ కశ్చిత్ ప్రతివివక్షితః ।**
**హేతుజన్మ వ్యపేక్షితః ఫలజన్మేతి చోచ్యతే ॥** 109

నిష్పత్తౌ = ఫలనిష్పత్తి విషయమున, కశ్చిత్ కశ్చిత్ = ఒక్కొక్క, అవధిః = అవధి, ప్రతి వివక్షితః = వివక్షితమగుచున్నది, హేతుజన్మ వ్యపేక్షాతః = కారణముల యొక్క జన్మను బట్టి, ఫలజన్మేతి చ = ఫలజన్మ అని కూడా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

*తాత్పర్యము*— ఫల నిష్పత్తి విషయమున వివక్షానుసారముగ ఒక్కొక అవధి అంగీకరింపబడును. హేతుజన్మను బట్టి ఫలజన్మయను వ్యవహారము వచ్చును.

*విశేషాంశములు*— ఒకడు శాల్యుత్పత్తి జలశాలి బీజసంబంధము మాత్రముపై ఆధారపడియున్నదని తలచును. మరియొకడు దాని తరువాత కలుగు ఆతపాదికృతమగు ఉపకారముపై ఆధారపడియున్నదని తలచును. ఈ విధముగ ఒక్కొక్కని భావనను బట్టి నిష్పత్తి హేతువు అనవస్థితముగ నున్నది. ఉత్పత్తి విషయమున ఈ కారణమువలన ఎక్కువ ఉపకారము జరుగుచున్నది అని చెప్పుటయే ఒక్కొక్కరు ఒక్కొక్క హేతువుపై నిష్పత్తి యాధారపడియున్నదని చెప్పుటకు కారణము. నిమిత్తాంతరములను లెక్కసేయక తాము అనుకొన్న నిమిత్తము జనింపగనే ఫలనిష్పత్తి యైనదని చెప్పుదురు. ఈ విధముగ హేతూప కార సమాప్తికిని ఫలనిష్పత్తికిని అభేదాధ్యవసాయమును బట్టియే హేతూపకార సమాప్తి కాలమును ఫలనిష్పత్తిపై ఆరోపించుట జరుగుచున్నదని యభిప్రాయము. ॥109॥

*అవతారిక*— కార్యము కారణములన్నియు సమకూడిన పిమ్మటనే సాధ్యమగును కాని ఏదియో ఒక కారణము సంపన్నమైనంత మాత్రమున ఎట్లు నిష్పన్నమగును అను ఆశంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అబహిః సాధనాధీనా సిద్ధిర్యత్ర వివక్షితా ।**
**తత్ సాధనాన్తరాభావాత్ సిద్ధ మిత్యుపదిశ్యతే ॥** 110

యత్ర = ఏ కార్యము విషయమున, అబహిః సాధనాధీనా = బాహ్య సాధనములపై ఆధార పడి యుండని, సిద్ధిః = సిద్ధి, వివక్షితా = వివక్షితమైనదో, తత్ = ఆ కార్యము, సాధనాన్తరా భావాత్ = మరియొక సాధనము అక్కర లేకపోవుటచే, సిద్ధమితి = సిద్ధము అని, ఉప దిశ్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము**— ఏ కార్యముయొక్క సిద్ధి (సమకూడిన వానికంటె వేరయిన) బాహ్య సాధనములపై ఆధారపడియున్నది కాదని చెప్పుట వివక్షితమో, ఆ కార్యము సాధ నాంతరముల యపేక్ష లేకపోవుటచే సిద్ధమని చెప్పబడుచున్నది.

వివరణము— అంతరంగమగు ఒకానొక సాధనము సన్నిహితమైనపుడు బాహ్య సాధనాపేక్ష లేదని దానిని తిరస్కరించి, కార్యము అంతరంగ కారణము సహాయముచేతనే జరిగినదని లోకమున వ్యవహరించుచుందురు. ఈ లోక వ్యవహారము ననుసరించియే శాస్త్రీయ వ్యవస్థ యేర్పడుచున్నది. ఈ విధముగ వివక్షానుసారముగ ఇట్టి విషయములలో కాలత్రయ సంబంధము కలుగుచుండును. ॥110॥

అవతారిక— ఇపు డీ చర్చను ముగించుచున్నాడు.

శ్లో॥ తస్మాదవధి భేదేన సిద్ధా ముఖ్యైవ భూతతా ।
అనాగతత్వ మస్తిత్వం హేతుధర్మ వ్యపేక్షణే ॥ 111

తస్మాత్ = ఆ కారణమువలన, అవధి భేదేన = అవధి భూతమగు కారణముయొక్క భేదమును బట్టి, ముఖ్యైవ = ముఖ్యమేయైన, భూతతా = భూతత్వము, సిద్ధా = సిద్ధించును, హేతుధర్మ వ్యపేక్షణే = భిన్న హేతువుల వ్యాపారమును బట్టి చూచినపుడు, అనాగతత్వం = భవిష్యత్త్వము, అస్తిత్వం = వర్తమానత్వము కూడ ఉండును.

తాత్పర్యము— అందుచే, కారణభేదమును బట్టి ముఖ్యమగు భూతకాలమునే అంగీకరింపవచ్చును. ఇతర హేతువుల వ్యాపారములను గూడ అపేక్షించుటను బట్టి భావిత్వ వర్తమానత్వములు కూడ ఉండవచ్చును.

వివరణము— ఫలనిష్పత్తికి కారణము అవధి. దాని భేదమును బట్టి సమాప్తమైన ఆ కారణమునందు కార్యమును అధ్యసించుటచే దాని భూతత్వము గూడ ముఖ్యమే. కారణమునందు కార్యమునే ఆరోపించుచున్నాము ; అంతియే కాని భూతకాలమును కార్యమునందు ఆరోపించుట లేదు. హేత్వంతరమునకు భావికార్య జనన వ్యాపారమున్నదని చెప్పవలసి వచ్చినచో అపుడు కార్యమునకు ముఖ్యరూపముననే భవిష్యత్త్వము లభించును. మరియొక హేతువునందు ప్రత్యాసన్న కార్యజనన వ్యాపారమున్నదని వివక్ష చేసినచో ఆ సమయమున కార్యమునకు ముఖ్యమగు వర్తమానత్వము లభించును. ఈ విధమున వివక్షానుసారముగ, వ్యవహారము ననుసరించి 'నిష్పన్నాః శాలయః', 'నిష్పద్యన్తే శాలయః' అను త్రివిధ ప్రయోగములును ఉండవచ్చును. ॥111॥

అవతారిక— ''అస్త్యర్థానాం భవన్త్యర్థే సర్వా విభక్తయః కర్తుర్విద్యమానత్వాత్'' అను వార్తికమున వార్తికకారుడు - అస్త్యర్థక ధాతువులకు, అనగా సత్తను బోధించు ధాతువులకు లట్ యొక్క అర్థమున (వర్తమానార్థమున) అన్ని లకారములును వచ్చును, ఏలయన ఆ ఉనికిలో కర్తయగునది నశింపకుండగ ఉంటూ ఉన్నది. ఒకడు కూపమును చూచినాడు. దాని కెపుడును అపాయము వచ్చినట్లు ఆతడు చూడలేదు. అందుచే ''కూపః అభూత్, కూపః అభవత్, కూపః బభూవ, కూపో భవిష్యతి, కూపో భవితా, కూపోఽస్తి'' అని అన్ని లకారములును వర్తమానకాలార్థమునే బోధించును అని చెప్పి, ''సిద్ధం తు యథా స్వకాలం సముచ్చారణాత్'' అను అనంతర వార్తికమున ఈ తిఙ్విభక్తు లన్నియు ప్రయోగానుసారముగ వాటి వాటి కాలమును బోధించుకొని ఒక్క వర్తమానార్థమును మాత్రమే కాదు అని ప్రతిపాదించినాడు. మొదటి వార్తికము ప్రకారము వర్తమానార్థమున లట్‌కు బదులు లఙ్ మొదలగు వాటిని ప్రయోగింపవచ్చును అని యన్నచో 'కూపః అస్తి' అనుటకు బదులు ''కూపః ఆసీత్'' అని ప్రయోగించెడివారు. ఆ విధముగ ప్రయోగించుట లేదు.

కావున ప్రయోగానుసారముగ ఆ యా లకారముల కాలమును గుర్తింపవలెనని నిషేధ వార్తికాభిప్రాయము. పైన చూపిన వార్తికాభిప్రాయమును వివరించుచున్నాడు.

శ్లో॥ సతామిన్ద్రియ సమ్బన్ధాత్ సైవసత్తా విశిష్యతే ।
భేదేన వ్యవహారో హి వస్త్వన్తర నిబన్ధనః ॥ 112

సతాం = వస్తువుల యొక్క, సా = ఆ, సత్తైవ = సత్తయే, ఇన్ద్రియ సంబంధాత్ = ఇంద్రియములతో సంబంధమువలన, విశిష్యతే = విశిష్ట రూపమున చూపబడుచున్నది, భేదేన = భేదముచేత, వ్యవహారః = వ్యవహారము, వస్త్వన్తర నిబన్ధనో హి = వస్త్వన్తరముపై ఆధారపడి యున్నది కదా ? ('ఇంద్రియ సన్నికర్షముపై ఆధారపడి యున్నదికదా' అని ప్రదీపోద్ద్యోతమున నాగేశుడు వ్యాఖ్యానించెను).

తాత్పర్యము— సత్తులగు పదార్థముల సత్తయే ఇంద్రియ సంబంధముచే విశిష్ట రూపమున చూపబడుచున్నది. భేద వ్యపహారమంతయు ఇతర వస్తువులతో నేర్పడిన సంబంధముపై (ఇంద్రియ సన్నికర్షముపై) ఆధారపడినది కదా.

*విశేషము*— తనతో కలిసిన మరియొక పదార్థమునకు సంబంధించిన ధర్మములు తనపై ప్రసరించుటచే ఒక పదార్థమును గూర్చి వ్యవహరించుటకు అవకాశము లభించుచున్నది. కూపమునకు సత్త ఉన్నది. ఆ సత్తను గ్రహించినపుడు మాత్రమే శబ్ద ప్రయోగమునకు అవకాశమున్నది. ఇంద్రియముల ద్వారా దానిని గ్రహింపకున్నచో ఆ కూపము అసత్తుతో సమానము గాన దానిని గూర్చిన శాబ్దవ్యవహారము కుదరదు. కూపమునకు ఇంద్రియములతో సంబంధము కలుగగలదు అను స్థలములందు ఆ సత్త భవిష్యత్సత్త యని వ్యవహరింతుము. ఇంద్రియ కూప సన్నికర్షము జరిగిపోయిన యెడల ఆ సత్త భూతసత్త; అది జరుగుచున్నపుడు వర్తమాన సత్త. ఈ విధముగ ఇంద్రియ సన్నికర్షము నందలి భేదమును బట్టి కాల త్రయ వ్యవహారము కూడ ఉండవచ్చును. అందుచే ఏ లకార ముపయోగించినను అర్థము మాత్రము వర్తమానార్థమే అని చెప్పుట అయుక్తము. ॥112॥

*అవతారిక*— వర్తమాన విషయమున భూత భవిష్య ద్విభక్తులను ప్రయోగింపరాదని నట్లు వర్తమాన విభక్తిని గూడ భూత భవిష్య ద్విషయమున ప్రయోగింపరాదు కదాః కాని నిన్న కూపమును చూచినవాడు, లేదా రేపు చూడనున్నవాడు, ఇపుడు ఇంద్రియ సంయోగము లేకున్నను 'కూపః అస్తి' (నుయ్యి ఉన్నది) అని ప్రయోగించుచున్నాడు. ఈ 'అస్తి'కి భూతార్థమును గాని భావిష్యదర్థమును గాని చెప్పవలసి యున్నది; అది ఎట్లు యుక్తమగును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ అస్తిత్వం వస్తుమాత్రస్య బుద్ధ్యా తు పరిగృహ్యతే ।
యః సమాసాదనాద్భేదః న తత్ర స వివక్షితః ॥ 113

వస్తు మాత్రస్య = ప్రతి వస్తువుయొక్కయు, అస్తిత్వం తు = ఆ స్తిత్వమైతే, బుద్ధ్యా = బుద్ధి చేత, పరిగృహ్యతే = గ్రహింపబడుచున్నది, సమాసాదనాత్ = ఇంద్రియముల ద్వారా గ్రహించుట వలన ఏర్పడిన, యః = ఏ, భేదః = భేదము కలదో, సః = అది, తత్ర = అచట (ఆ సామాన్య సత్తా విషయమున), న వివక్షితః = వివక్షితము కాదు.

*తాత్పర్యము*— బుద్ధిచేత వస్తువుయొక్క సత్తమాత్రమే గ్రహింపబడుచున్నది. ఇచట, ఇంద్రియ సంబంధముచే నేర్పడిన భేదము వివక్షితము కాదు.

*వివరణము*— ఇంద్రియముతో వస్తువునకు సంబంధము కలుగుటచే నేర్పడు భూత భవిష్య ల్లక్షణమగు భేదమును వివక్షింపక, మనస్సుతో కూపమునందలి సత్తా మాత్రమునే గ్రహించినపుడు 'కూపః అస్తి' అని సామాన్యరూపమున ప్రయోగము యుక్తమే.॥113॥

*అవతారిక*— వాస్తవమున సత్తకు ఔపాధిక భేదమును అంగీకరింప బనిలేదు. సత్తకు గల భేదము యథార్థమే అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యోగాద్వా స్త్రీత్వ పుంస్త్వాభ్యాం న కించిదవతిష్ఠతే ।**
**స్వస్మిన్నాత్మని తత్రాన్యద్ భూతం భావి చ కథ్యతే ॥ 114**

వా = లేదా, కించిత్ = ఏ వస్తువును, స్త్రీత్వ పుంస్త్వాభ్యాం = అపచయోపచయములతో, యోగాత్ = సంబంధముండుట వలన, స్వస్మిన్ = తన సంబంధమగు, ఆత్మని = స్వరూపమునందు, న అవతిష్ఠతే = స్థిరముగ ఉండదు, తత్ర = దానియందు, అన్యత్ = భిన్నమైన స్వరూపమే, భూతం = భూతమనియు, భావిచ = భావియనియు, కథ్యతే = చెప్పబడుచున్నది.

*తాత్పర్యము*— ఏ వస్తువైనను సర్వదా ఉపచయాపచయములను (వృద్ధి హ్రాసములను) పొందుచుండును గాన ఒక్క స్వరూపముతో స్థిరముగా నుండదు. అందుచే వర్తమాన స్వరూపముకంటె భిన్నమైనది భూతస్వరూపము, దానికంటె భిన్నమైనది భావి స్వరూపము.

*వివరణము*— పుంస్త్వమనగా ఉపచయము (వృద్ధి); స్త్రీత్వమనగా అపచయము (హ్రాసము), ప్రతి వస్తువును ఉపచయాపచయములను పొందుచుండును. అందుచే ఒక్క క్షణమైనను అది స్వరూపముతో స్థిరముగ నుండజాలదు. కావున ఏ వస్తువునకైనను భూత స్వరూపము వేరు, వర్తమాన స్వరూపము వేరు. భవిష్యత్స్వరూపము వేరు. బుద్ధిచే రూప సామాన్యమును మాత్రము గ్రహించి ఆ వస్తువే ఇది అని అనుకొనుచుందుము. యథార్థముగ భేదమున్నను బుద్ధిచే అభేదమును కల్పించి 'కూపః అస్తి' ఇత్యాది సామాన్య వ్యవహారము చేయుచుందుము. ॥114॥

కాలసముద్దేశము ముగిసినది

# పురుష సముద్దేశము

*అవతారిక*— 'తిఙ్' ప్రత్యయము క్రియను బోధించును. ఆ క్రియచే కాల-పురుష - ఉపగ్రహ - సంఖ్యలు అభివ్యక్తము లగును. వాటిలో కాలస్వరూపమును పరీక్షించి ఇపుడు పురుషమును పరీక్షించుచున్నాడు.

**శ్లో॥ ప్రత్యక్త్వా పరభావశ్చా ప్యుపాధీ కర్తృకర్మణోః ।**
**తయోః శ్రుతి విశేషేణ వాచకౌ మధ్యమోత్తమౌ ॥ 1**

ప్రత్యక్త్వా = ప్రత్యక్త్వము (నేను, తాను అను జీవాత్మ భావము), పరభావశ్చాపి = పరత్వము (మధ్యమ పురుషత్వము), కర్తృ కర్మణోః = కర్తృ కర్మలకు, ఉపాధీ = ఉపాధులు, శ్రుతి విశేషేణ=శబ్ద విశేషముతో ఉపలక్షితములగు, మధ్యమోత్తమౌ=మధ్యమోత్తమములు, తయోః = ఆ ప్రత్యక్త్వ పరత్వములకు, వాచకౌ = వాచకములు.

**తాత్పర్యము**— ప్రత్యక్త్వము పరత్వము అను ఈ రెండును కర్తృ కర్మలకు ఉపాధులు. శబ్దవిశేషోప లక్షితము లగు మధ్యమోత్తమములు ఆ ప్రత్యక్త్వ పరత్వములను బోధించును.

*విశేషాంశములు*— ప్రతి = ప్రతి పురుషునియందును లేదా ప్రతి నియతమగు రీతిలో, అఞ్చతి = చేష్ట చేయుచున్నది కాబట్టి, 'ప్రత్యఙ్' అని చెప్పబడును. అనగా ప్రతి దేహమునందును నియతముగ నున్న అంతర్యామియగు జీవాత్మ. దానియొక్క ధర్మము ప్రత్యక్త్వము. ఈ ప్రత్యక్త్వము ఉత్తమ పురుషముచే వాచ్యమగు అర్థము. 'అహం పచామి' ఇత్యాదులలో 'పచామి' మొదలగు ఆఖ్యాతములచే బోధింపబడు పచనాది క్రియ అహంకార ముతో సమానాశ్రయముగ ('అహం' అను పదముచేత ఏది బోధింపబడుచున్నదో దాని తోడనే క్రియ సంబంధించి యున్నది అని) బోధింపబడు చున్నది. ఇట్లు బోధింపబడుట ఉత్తమ పురుషమునకు విషయము. ఆత్మనేపదము, పరస్మైపదము అని రెండు విధములుగ నున్న స్వ (ఉత్తమపురుష) వాచకముల భేదమును బట్టి ఈ ఉత్తమ పురుషము అహంకారా శ్రయమగు ('నేను చేయుచున్నాను' అను ప్రతీతిని బట్టి) కర్తకును తిఙన్తవాచ్యమగు కర్మ కును ఉపాధిగ నున్నది. 'పచే', 'పచామి' ఇత్యాదులలో ఉత్తమ పురుషము కర్తకు ఉపాధి. ఇది కర్త్రుపాధియైనపుడు కొన్ని స్థలములలో కేవలము పరస్మైపదము చేతను, కొన్ని స్థలము లలో ఆత్మనే పదముచేతను, కొన్ని స్థలములలో రెండింటిచేతను ప్రతీతమగును. 'పచ్యే' (పచింపబడుచున్నాను) ఇత్యాది స్థలములలో ఇది అహంకారాశ్రయమగు కర్మకు ఉపాధి. కర్మణి ప్రయోగమున ఆత్మనేపదము మాత్రమే ఉండునుగాన కర్మోపాధియగు ఉత్తమ పురుషము ఆత్మనేపదము మాత్రముచేతనే గమ్యమగును. ఈ విధముగ కర్తృ కర్మాదులకు విశేషణముగ భాసించు దానికి పురుషమని పేరు. ఈ భాసించునది ప్రత్యక్తరూపమైనచో

ఉత్తమపురుషము, పరత్వమైనచో మధ్యమపురుషము. అనగా కర్తగాగాని, కర్మగాగాని భాసించునది తానైనచో (అహంకార సామానాధికరణ్య మున్నచో) ఉత్తమపురుషము, పరుడైనచో (పరభావ సామానాధికరణ్య మున్నచో) మధ్యమపురుషము. ఉత్తమపురుషము వలె కర్తృ కర్మోపాధిభూతమగు మధ్యమపురుషము గూడ ఆత్మనేపద పరస్మైపదములచే ప్రతీతమగును 'పచసి' 'పచసే' అనునది కర్త్రుపాధి మధ్యమపురుషమునకును, 'పచ్యసే' అనునది కర్మోపాధి మధ్యమపురుషమునకును ఉదాహరణము. ఈ విధముగ పరస్మైపదాత్మనేపదాన్త శబ్దోప లక్షితములగు ఉత్తమపురుష మధ్యమపురుషములు ప్రత్యక్త్వ పరత్వములను బోధించును. మధ్యమ పదవాచ్యమగునది ప్రశ్నించుట మొదలగు వాటికి యోగ్యముగ నుండును. 'నీవు వెళ్ళినావా ?' 'వచ్చినావా ?' ఇత్యాది విధముల ప్రశ్నించుటకు వీలుగా నుండవలెను. అనగా చేతన పదార్థముగ నుండవలెను. ఈ విధముగ కర్తృ కర్మ విశేషణమైన దానికి పురుషమని ప్రాచీనాచార్యుల వ్యవహారము. పాణినీయమున ప్రథమ - మధ్యమ - ఉత్తమ నామధేయములు మాత్రమే ఉన్నవిగాని 'పురుష' నామధేయము లేదు. ॥1॥

అవతారిక— ఉత్తమ పురుషము క్రియకు అహంకారముతో సామానాధికరణ్యమును తెలుపుననియు, మధ్యమపురుషము పరత్వముతో సామానాధికరణ్యమును తెలుపుననియు- అనగా క్రియ తనతో సంబంధించినదని చెప్పినపుడు ఉత్తమ పురుషమనియు, ఇతరునితో సంబంధించినట్లు చెప్పినపుడు మధ్యమపురుష మనియు వెనుక చెప్పబడినది. దీనినిబట్టి అహంకార పరభావములు చేతనముల విషయముననే యుక్తములగును ; అచేతన విషయమున వీటికి ప్రయోగము ఉపపన్నము కాదని చెప్పినట్లైనది. అట్లైనచో ''శృణోత గ్రావాణః'' ((ఓ శిలలారా ! వినండి) మొదలగు అచేతన పదార్థములను సంబోధించు ప్రయోగములు ఎట్లు కుదురును, అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ సదసద్వాపి చైతన్య మేతాభ్యామేవ గమ్యతే ।
చైతన్య భాగే ప్రథమః పురుషో న తు వర్తతే ॥ 2

సత్ = వాస్తవమున ఉన్నదైనను, అసద్వాపి = ఆరోపితమైనదగుటచే వాస్తవమున లేనిదైనను, చైతన్యం = చైతన్యము, ఏతాభ్యామేవ = ఈ రెండింటిచేతనే, గమ్యతే = తెలియును, ప్రథమః పురుషస్తు = ప్రథమ పురుషమైతే, చైతన్యభాగే = చైతన్యాంశమున, న వర్తతే = ప్రవర్తింపదు.

తాత్పర్యము— ఈ రెండింటిచేతను, ఉన్నదైనను, లేనిదైనను చైతన్యమే గమ్యమగును. ప్రథమపురుషము మాత్రము చైతన్యాంశమున ప్రవర్తింపదు.

*విశేషాంశములు*— శబ్దమును ఉచ్చరించుటచే ఏ అర్థము బోధింపబడునో దానిని బట్టియే ఈ శాస్త్రమున, అన్వాఖ్యానము జరుగుచుండును. అందుచే శాబ్దమగు (శబ్దబోధ్యమగు) చైతన్యము అంతటను ఉన్నది. కాని పదాంతరములచే ఒక పదార్థము చైతన్యరహితమని తెలిసినచో అట్టి స్థలములలో చైతన్యము ఆరోపితము. కావున ''శృణోత గ్రావాణః'' ఇత్యా

దులలో చైతన్యము వాస్తవమున లేకపోయినను ఆరోపితముగ నున్నది. ఈ విధముగ ఉత్తమ మధ్యమపురుషములు చేతనపదార్థ మాత్ర బోధకములు. ప్రథమపురుషము మాత్రము అచేతన పదార్థ మాత్ర బోధకము. దీని స్థలమున చైతన్యారోపణము గూడ ఉండదు. ॥2॥

*అవతారిక*— 'బుధ్యతే', 'జానాతి' 'చేతయతే' ఇత్యాది ప్రథమపురుష ప్రయోగ స్థలములలో గూడ చైతన్యోపాధి యగు కర్తయే తెలియుచున్నాడు 'తెలిసికొనుట' మొదలగు క్రియలను చేయు కర్త చేతనమే కదా? అందుచే "చైతన్యభాగే ప్రథమః పురుషో న తు వర్తతే" అని చెప్పుట అయుక్తము కదా, యని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ బుధిజానాతిచితిభిః ప్రథమే పురుషేసతి ।**
**సంజ్ఞానార్థైర్న చైతన్యస్యోపయోగః ప్రకాశ్యతే ॥ 3**

ప్రథమే పురుషే సతి = ప్రథమ పురుషమును ప్రయోగించినపుడు, సంజ్ఞానార్థైః = చైతన్యార్థకము లగు, బుధిజానాతి చితిభిః = బుధ - జ్ఞా - చిత్ ధాతువులచే, చైతన్యస్య = చైతన్యము యొక్క, ఉపయోగః = ఉపయోగము, న ప్రకాశ్యతే = ప్రకాశింపబడుట లేదు.

*తాత్పర్యము*— చైతన్యార్థకములగు (జ్ఞానార్థకములగు) బుధ్, జ్ఞా, చిత్ ధాతువులు ప్రథమపురుషమును ప్రయోగించినపుడు చైతన్యోపయోగమును ప్రకాశింపచేయుట లేదు.

*వివరణము*— 'బుధ్యతే' (తెలిసికొనుచున్నాడు) ఇత్యాదులలో బుధ ధాతువు మొదలగు వాటికే చేతన ధర్మమగు జ్ఞానము అను అర్థమున్నది గాన చైతన్య ప్రకాశము కనబడుచున్నది గాని, ఇది (చైతన్య ప్రకాశము) ప్రథమపురుష ప్రయోగమువలన కాదు. జ్ఞానార్థములు కాని ధాతువులతో ప్రథమ పురుషమును ప్రయోగించినపుడు ఈ చైతన్య ప్రకాశము కానవచ్చుట లేదు కదా? ఉత్తమ మధ్యమపురుషములు మాత్రము అస్మద్యుష్మదర్థములతో సమానాధికరణములు కావున - అనగా 'అస్మద్యుత్తమః' (1-4-107) "యుష్మద్యుపపదే సమానాధికరణే స్థానిన్యపి మధ్యమః" (1-4-105) అను సూత్రములచే అస్మచ్ఛబ్ద యుష్మచ్ఛబ్దములను ప్రయోగించినపుడు గాని, వాటి యర్థము గమ్యమగునపుడుగాని, ఉత్తమ మధ్యమపురుషములను విధించుట వలన, ఈ రెండు పురుషములును చైతన్య వ్యాపారమును తప్పక ప్రకాశింపజేయును. ప్రథమపురుష ప్రయోగస్థలములలో మాత్రము ఎచటనైన చైతన్య వ్యాపారము కినబడినచో, అది ధాత్వర్థమగుటచే వచ్చినదే కాని ప్రథమ పురుషమును బట్టి ఏర్పడినది కాదు. అందుచే "చైతన్యభాగే ప్రథమః పురుషో న తు వర్తతే" అని చెప్పుట యుక్తమే అని భావము. ॥3॥

*అవతారిక*— పరభావము (పరత్వము) బోధ్యమగునపుడు మధ్యమ పురుషము విధింపబడినది. ఈ విషయమున మతాంతరముచే ఒక విశేషమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ సమ్బోధనార్థః సర్వత్ర మధ్యమే కైశ్చిదిష్యతే ।**
**తథా సమ్బోధనే సర్వాం ప్రథమాం యుష్మదో విదుః ॥ 4**

సర్వత్ర = సమస్తమైన, మధ్యమే = మధ్యమపురుష స్థలమునందును, కైశ్చిత్ = కొంతమంది చేత, సమ్బోధనార్థః=సంబోధన రూపార్థము, ఇష్యతే = అంగీకరింపబడును, తథా = అట్లే, యుష్మదః = యుష్మచ్ఛబ్దము యొక్క, సర్వాం = సమస్తమైన, ప్రథమాం = ప్రథమా విభక్తిని, సమ్బోధనే = సంబోధనము నందు, విదుః = అంగీకరించుచున్నారు.

తాత్పర్యము— కొందరు మధ్యమపురుష స్థలము లన్నింటియందును సంబోధ నార్థమునే అంగీకరింతురు. ఇట్లే యుష్మచ్ఛబ్ద ప్రథమారూపము లన్నింటిని సంబోధనము నందే అంగీకరింతురు.

*వివరణము*— 'గచ్ఛ' (వెళ్ళుము) 'భుఙ్క్ష్వ' (తినుము) ఇత్యాది స్థలములందు ఆజ్ఞ వివక్షితము గాన, (అట్టి స్థలములలో ఎదుటివానిని అభిముఖముగ చేసికొని ఆతనిని ఆజ్ఞాపింపవలసి యున్నదిగాన), సంబోధన ముండునని అందరును అంగీకరింతురు. అనగా 'త్వం గచ్ఛ' అను దానికి ''ఓయీ, ఇటు చూడుము ; నీవు వెళ్ళుము'' అన్నట్లు అర్థము చెప్పవలసి యుండును. ఆజ్ఞార్థకముల ప్రయోగమునందే కాక మధ్యమపురుష సామాన్యమున అనగా 'త్వం పచసి' ఇత్యాది స్థలములందు గూడ సంబోధనమున్నదని కొందరు అంగీక రింతురు. వీరి అభిప్రాయము ప్రకారము సంబోధనమనగా ఆభిముఖ్యమును మాత్రమును చేయుట. అందుచే యుష్మచ్ఛబ్ద ప్రథమా విభక్తి మూడు వచనములందును సంబోధనయే యని వీరి అభిప్రాయము.

*అవతారిక*— మధ్యమపురుషము, యుష్మచ్ఛబ్ద ప్రథమా విభక్తియు వెనుకటి కారికలో చెప్పిన విధమున సంబోధనార్థముతైన పక్షమున ''స్వాహేన్ద్రశత్రుః వర్ధస్వ'' 'రాజాభవ యుధ్యస్వ' ఇత్యాది స్థలములలో 'వర్ధస్వ' 'యుధ్యస్వ' అను మధ్యమపురుష రూపములను ప్రయోగించుటచే అధ్యాహార్యమగు 'త్వం' అనునది సంబోధనము కావలెను. అపుడు దానితో 'ఇంద్ర శత్రుః' 'రాజా' అను పదములు సమానాధికరణములుగాన (అనగా 'త్వం' అను దానికి ఆ పదములు విశేషణములు గాన) ఇవి గూడ సంబోధనము లగును. అపుడు 'ఇంద్ర శత్రో' 'రాజన్' అని ప్రయోగింపవలెను గాని 'ఇంద్ర శత్రుః' 'రాజా' అని ప్రయోగింపరాదు కదా, యని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ సమ్బోధనం నలోకేఽస్తి విధాతవ్యేన వస్తునా ।**
**స్వాహేన్ద్రశత్రుర్వర్ధస్వ యథా రాజా భవేతి చ ॥** 5

విధాతవ్యేన = విధింపదగిన, వస్తునా = వస్తువుతో, లోకే = లోకమునందు, సమ్బోధనం= సంబోధనము, నాస్తి=లేదు, యథా=ఎట్లనగా– ''స్వాహేన్ద్రశత్రుః వర్ధస్వ''='సాహేన్ద్ర శత్రుర్వర్ధస్వ' అనునదియు, 'రాజా భవ' ఇతి చ'' = ''రాజా భవ'' అనునదియు ఉదా హరణములు.

**తాత్పర్యము**— ''స్వాహేన్ద్రశత్రుర్వర్ధస్వ'' ''రాజాభవ'' ఇత్యాదులందువలె విధింపదగిన వస్తువుతో లోకమునం దెక్కడను సంబోధనము ఉండదు.

# వాక్యపదీయము

## పదకాండము

### జాతి సముద్దేశము-1

అవతారిక-వాక్యపదీయము ఎనిమిది *పదార్థములను విచారించుచున్నదని ప్రథమ కాండమున 24 - 25 శ్లోకములలో గ్రంథకర్తయే చూపెను.

వానిలో అర్థజ్ఞానము ధర్మము అనెడి ప్రయోజనరూపములగు రెండు పదార్థములు ప్రథమకాండమున నిరూపింపబడినవి.

లోకవ్యవహారమునకుపయోగించెడి వాక్యము — వాక్యార్థము అనెడి రెండు పదార్థములు ద్వితీయ కాండమున స్పష్టపరచబడినవి.

మిగిలిన నాలుగు పదార్థములను అనగా పద పదార్థములు కాక ప్రకృతి ప్రత యార్థములు, శబ్దార్థములకుగల యోగ్యత కార్యకారణభావము అనెడి రెండు సంబంధములు అనెడి నాలుగు పదార్థములను నిరూపించుటకు ఈ మూడవ కాండమారంభింపబడుచున్నది. కనుకనే దీనికి పదకాండమని పేరుకలిగినది. పదము, దానికి అవయవములగు ప్రకృతి ప్రత్యయములు వాని యర్థములు, వానికి గల సంబంధములు ఇచట విచారింపబడుచున్నవి,

అందు ముందుగా అఖండమగు వాక్యమునుండి పదములు కల్పింప బడినవి, అనగా వేరుచేసి చూపబడినవి, అని తలంచి పదములను మతభేదముచే జూపుచున్నాడు.

---

| | |
|---|---|
| * 1. శబ్దము 2 విధములు — | 1. ప్రకృతి ప్రత్యయములు |
| | 2. పదవాక్యములు |
| 2. అర్థము 2 విధములు — | 1. ప్రకృతి ప్రత్యయార్థములు |
| | 2. పదవాక్యార్థములు |
| 3. శబ్దార్థములకుగల సంబంధము 2 విధములు | 1. యోగ్యత |
| | 2. కార్యకారణభావము |
| 4. ప్రయోజనము 2 విధములు | 1. అర్థజ్ఞానము |
| | 2. ధర్మము |
| పదార్థములు | 8 |

శ్లో॥ లిఙ్గాత్తు స్యాద్ద్వితీయాదే స్తదేకత్వం వివక్షితమ్ ।
ఏకార్థవిషయత్వే చ తల్లిఙ్గం జాతిసంఖ్యయోః ॥ 56

A. తదేకత్వమ్ = ఆ పశువునందు ఏకత్వ సంఖ్య, ద్వితీయాదేః = మంత్రములలో పశువునకు విశేషణముగా నున్న, ద్వితీయ, తృతీయ, అను శబ్దప్రయోగ రూపమగు, లిఙ్గాత్ + తు = హేతువు వలననే, వివక్షితమగుచున్నది.

''ఆగ్నేయ మజ మగ్నిష్టోమ ఆలభేత'' (అగ్నిష్టోమయాగమున అగ్నిదేవతాకమగు మేకను చంపవలెను) అని యుపక్రమించి ''ఐన్ద్రాగ్నం ద్వితీయ ముక్థ్యే'' (ఉక్థ్యే అను క్రతువునందు ఇంద్రాగ్ని దేవతాకమగు రెండవ పశువును చంపవలెను), ''ఐన్ద్రం వృష్ణిం తృతీయం షోడశిని'' (షోడశి అను క్రతువునందు ఇంద్రదేవతాకమగు తెల్లని మూడవ పశువును చంపవలెను) అని వాక్యములు చెప్పబడినవి. ఉత్తర వాక్యములలో 'ద్వితీయం, తృతీయమ్' అని చెప్పియుండుటచే పూర్వవాక్యమున పశువు ఒక్కటియేయని చెప్పవలసియున్నది. అట్లుకాక అజమ్, అనుచోట ఏకత్వమును గ్రహించినచో పూర్వ వాక్యమువలననే రెండు మూడు పశువులు అను అర్థము లభించుటచే మరల ఉత్తర వాక్యములలో 'ద్వితీయ, తృతీయ పదములు వ్యర్థములే యగును. కాబట్టి పై వాక్యములలోగల, ద్వితీయ, తృతీయ, అను పదముల ప్రయోగమనెడి హేతువునుబట్టి పూర్వవాక్యమున అర్థాత్తు ఒకే పశువు అను అర్థము లభించును.

కాగా ప్రత్యయార్థమగు ఏకత్వము వివక్షితము కాకపోయినను పై హేతువుచే ఏకత్వము లభించును.

B. తత్ = అదియే అనగా ఉత్తర వాక్యములలో ద్వితీయ-తృతీయ-అను శబ్దముల ప్రయోగమే, జాతి సంఖ్యయోః = జాతికి ఏకత్వసంఖ్యకు. ఏకార్థ విషయత్వేచ = ఒక ఆశ్రయమునందు పరిసమాప్తమగుటయందు గూడ, లిఙ్గమ్ = కారణము-హేతువు కాగలదు.

ఏకత్వము గుణము. అది వ్యక్తియందు పరిపూర్ణముగనే యుండును. జాతి అనేక వ్యక్తులయందు సమవాయ సంబంధముననున్నను ఒకొక్క వ్యక్తియందు పరిపూర్ణముగానే యుండును. కొన్ని అవయవములను పురస్కరించుకొని 'అవయవశః' ఉండనేరదు. అట్లు కాకున్న ఒక వ్యక్తియందు కొంత జాతియే యున్నచో, రెండవది ఆ జాతికి చెందనందున ''ద్వితీయ, తృతీయ'' శబ్దముల ప్రయోగము సంగతము కాకపోయెడివి.

కాబట్టి ఏకత్వ సంఖ్యవలె, జాతియు ఒకొక్క వ్యక్తియందు పర్యాప్తమేయని లభించుచున్నది. ॥56॥

*అవతారిక*—— ప్రత్యయార్థ సంఖ్య వివక్షితము కాగలదు అను 55వ శ్లోకమున చెప్పబడిన అర్థమునే నిరూపించుచున్నాడు.

శ్లో॥ అన్యత్రా విహితస్యైవ స విధిః ప్రథమం పశోః ।
క్రియాయామఙ్గ భావశ్చ, తత్త్వేతస్మాద్వివక్షితమ్॥ 57

*విశేషము*— ''సిద్ధస్యాభిముఖీ భావమాత్రం సమ్బోధనం విదుః'' (వాక్యప. III సా. 163) అని చెప్పిన విధముగ సిద్ధమగు వానిని అభిముఖముగా చేసికొనుటకు సంబోధన మని పేరు. ఈ విధముగ సిద్ధమగు దాని విషయమున మాత్రమే సంబోధనముండును గాని సాధ్యమగు దాని విషయమున సంబోధన ముండదు. ఉదాహరణమునకు— ఒకడు రాజ్యమును పొంది రాజుగానున్నచో ఆతనిని 'ఓ రాజా!' అని సంబోధింపవచ్చును. ఇంకను రాజు కాని వానిని 'ఓ రాజా!' అని సంబోధించుట ఎట్లు కుదురును? పై ఉదాహరణములలో ''ఇంద్ర శత్రుత్వము' (ఇంద్రుని సంహరించే వాడగుట - ఇది యాగము పూర్తియైనచో తరువాత లభించునది), రాజత్వము (ఇది కూడ యుద్ధములో జయము లభించినచో లభించునది), అను నవి సాధ్యములే కాని సిద్ధములు కావు. అట్టి సాధ్యములగు వాటిని పురస్కరించుకొని సంబోధనము కుదురదు. కావున శత్రు రాజపదములకు సంబోధన కార్యములు ('శత్రు' పదము నందలి 'ఉ' కారమునకు గుణము, రాజన్ - అంత్యనకారము లోపింపకుండుట అనునవి) కలుగవు.

*అవతారిక*— 'సమ్బోధనార్థః' ఇత్యాది కారికలో చెప్పిన విధముగ యుష్మచ్ఛబ్ద ప్రథమా విభక్తి సంబోధన విభక్తి గాన ఈ క్రింది శాస్త్ర కార్యము సిద్ధించునని చెప్పుచున్నాడు

**శ్లో॥ యుష్మదః ప్రథమాన్తస్య పరశ్చేన్న పదాదసౌ ।**
**యుష్మదర్థస్య సిద్ధత్వాన్నియతా చాద్యుదాత్తతా ॥** 6.

యుష్మదర్థస్య = యుష్మచ్ఛబ్దార్థము, సిద్ధత్వాత్ = సిద్ధమైనదగుట వలన, అసౌ = ఇది (యుష్మచ్ఛబ్ద ప్రథమాంతము), పదాత్ = పదముకంటె, పరః = పరమైనది, న చేత్ = కాకున్నచో, యుష్మదః = యుష్మచ్ఛబ్దము యొక్క, ప్రథమాన్తస్య = ప్రథమాంతమునకు, ఆద్యుదాత్తతా = ఆద్యుదాత్తత్వము, నియతా = నియతముగ నుండును.

**తాత్పర్యము**— యుష్మచ్ఛబ్దార్థము సిద్ధము గాన, యుష్మచ్ఛబ్ద ప్రథమాంతము, పదముకంటె పరము కాకున్నచో, దానికి ఆద్యుదాత్తత్వము నియతముగ లభించును.

*విశేషాంశము*— ఆమంత్రితము యొక్క (సంబోధన పదముయొక్క) ఆది ఉదాత్తము అగునని 'ఆమన్త్రితస్య చ' (8.1.198) అను సూత్రముచే విధింపబడినది. ''తథా సంబోధనే సర్వాం ప్రథమాం యుష్మదో విదుః'' అని పూర్వకారికలో చెప్పిన విధమున యుష్మచ్ఛబ్ద ప్రథమారూపము లన్నియు సంబోధమే గాన వాటి విషయమున ఈ సూత్రము ప్రవర్తించి ''త్వమగ్నే ప్రయాజానుయాజానాం పురస్తాత్'' ఇత్యాది వాక్యములలోని యుష్మచ్ఛబ్దమునకు నియతముగ ఆద్యుదాత్తత్వము లభించుచున్నది. ఇది పదముకంటె పరమైనపుడు మాత్రము 'ఆమన్త్రితస్య చ' (8-1-19) అను మరియొక సూత్రముచే (పదముకంటె పరమును, పాదాదియందు లేనిదియు అగు ఆమంత్రితమునకంతకును అనుదాత్తము వచ్చును అని దీని యర్థము) అనుదాత్తమగును. ''దేవీరాపః శుద్ధా యూయమ్'' ఇత్యాదులుదాహరణము. ఇచట 'యూయం' అను యుష్మచ్ఛబ్ద ప్రథమా బహువచనాంతపదము ఆమంత్రి

తము. ఇది పదముకంటె పరముగాన అనుదాత్తము వచ్చినది. సిద్ధమగునది సంబోధన విషయమగుటలో విప్రతి పత్తి లేదని సూచించుటకై 'యుష్మదర్థస్య సిద్ధత్వాత్' అని చెప్పబడినది. ఈ విధముగ యుష్మచ్ఛబ్ద ప్రథమారూపము లన్నియు సంబోధనములు గావున 'ఆమంత్రితస్య చ' అను మొదట చెప్పిన సూత్రమును అనుసరించి (ఆ పరము పదముకంటె పరము కానపుడు) నియతముగ ఆద్యుదాత్తము వచ్చుటకు అవకాశమున్నదని తాత్పర్యము.

*అవతారిక*— పైన చెప్పిన విధముగ పురుషప్రత్యయములు నియతార్థమును బోధించునని తెలినది. అట్లైనచో 'శాలాకికోఽస్మి' 'శాలాకికోఽసి' ఇత్యాది ప్రయోగములు కుదురవు. ఏలయన శలాకా శబ్దముకంటె శలాకలతో ఆడుచున్నాడు (శలాకాభిః దీవ్యతి - దీవ్యతి అనునది ప్రథమ పురుషములో నున్నది) అను అర్థమున ''తేన దీవ్యతి, ఖనతి, జయతి, జితమ్'' అను సూత్రముచే (4-4-2) ఠక్ ప్రత్యయము చేయగా 'శాలాకికః' అను రూపము నిష్పన్నమైనది. అనగా ఇచట 'దీవ్యతి' అని ప్రథమపురుషముచే అర్థము నిర్దేశింపబడునపుడు మాత్రమే తద్ధితవచ్చును. పై ఉదాహరణములలో ఉత్తమ - మధ్యమ విషయములలో ఇది వచ్చుటకు అవకాశము లేదు కదా యని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ గుణప్రధానతా భేదః పురుషాది విపర్యయః ।**
**నిర్దిష్టస్యాన్యథా శాస్త్రే నిత్యత్వాన్న విరుధ్యతే ॥ 7**

నిత్యత్వాత్ = శబ్దము నిత్యమగుటవలన, శాస్త్రే = శాస్త్రమునందు, అన్యథా = మరియొక విధముగా, నిర్దిష్టస్య = నిర్దేశింపబడిన శబ్దమునకు, గుణ ప్రధానతా భేదః = గుణ ప్రధానతా భేదము, పురుషాది విపర్యయః = పురుషాదుల మార్పు, న విరుధ్యతే = విరుద్ధములు కావు.

తాత్పర్యము— శబ్దము నిత్యము. అందుచే శాస్త్రమునందు మరియొక విధముగ నిర్దిష్టమగు శబ్దమునకు, గుణ ప్రధానతా భేదముగాని, పురుషాదుల విపర్యయము గాని వచ్చినను అది విరుద్ధము కాదు.

*విశేషము*— శాస్త్రము నిత్యములగు శబ్దముల అన్వాఖ్యానము (ప్రకృతి ప్రత్యయాదుల విభాగముచే శబ్ద నిష్పాదనము అన్వాఖ్యానము) చేయునపుడు ఏదియో ఒక అర్థమును నిమిత్తముగ చూపవలెను గాన దానిని చూపుచు, దానికి ఆవశ్యకములగు ఏవియో పురుషాదులను కూడ చూపుచుండును. కాని చూపిన ఆ పురుషాదులే, అంతటను, ఆ అర్థమున భాసింపవలెనను నియమము లేదు. 'తేనదీవ్యతి...' ఇత్యాది లక్షణమున (శాస్త్రమున) ఆఖ్యాత ప్రధాన నిర్దేశము చేసినను తద్ధితాంతము సత్త్వ ప్రధానమగును. అనగా తద్ధితాంతమగు 'శాలాకికః' అను దానికి 'శలాకతో ఆడుచున్నాడు' అను నర్థము కాక ''శలాకలతో ఆడెడువాడు'' అను నర్థము చెప్పుటచే ఈ శబ్దము సత్త్వ ప్రధానమైనది. కావుననే దీనికి లింగాదులతో సంబంధ మేర్పడినది. ఇట్లే లక్షణమునందు ఒక పురుషమును గ్రహించినను లక్ష్యమున పురుషాంతరాన్వయము కలుగుటలో దోషము లేదు.

*అవతారిక*— ఈ విషయమునే సమర్థించుటకు చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథానిర్దేశమర్థాః స్యుర్యేషాం శాస్త్రం విధాయకమ్ ।**
**కిఞ్చిత్ సామాన్యమాశ్రిత్య స్థితే తు ప్రతిపాదనమ్ ॥ 8**

యేషాం = ఎవరి మతమునందు, శాస్త్రం = శాస్త్రము, విధాయకం = శబ్ద నిష్పాదకమో, వారి మతము ననుసరించి, అర్థాః = అర్థములు, యథా నిర్దేశం = శాస్త్ర నిర్దేశానుసారముగనే, స్యుః = అగును (కావలసి వచ్చును), స్థితే = ఒకానొక శబ్దస్వరూప ముంగగా, కించిత్ = ఒకానొక, సామాన్యం = సామాన్య ధర్మమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రతిపాదనం = శబ్దార్థ ప్రతిపాదనము, (చేయబడును).

తాత్పర్యము— శాస్త్రము శబ్దములను సృష్టించును అని అంగీకరించెడి వారి మతమున అర్థములు శాస్త్రములో నిర్దేశించిన విధముగ మాత్రమే ఉండునని చెప్పవలసి వచ్చును. (అది యుక్తము కాదు) ఉన్న శబ్దమునకు, ఏదియో ఒక సామాన్య ధర్మము నాశ్రయించి, అర్థ ప్రతిపాదనము చేయబడుచుండును.

*వివరణము*— శాస్త్రముచే శబ్దములు నిర్మింపబడును అని కొందరి అభిప్రాయము. అట్లైనచో శాస్త్రము ఏ పదమునకు ఏ అర్థమును నిర్దేశించినదో ఆ అర్థమే బోధింపబడును గాని మరియొక అర్థమును బోధించుటకు వీలుపడదు. అట్లైనచో 'శాలాకికః', 'ఆక్షికః' ఇత్యాది పదములకు 'శలాకలచే ఆడుచున్నాడు' 'అక్షములచే ఆడుచున్నాడు' ఇత్యాది విధముల ప్రథమపురుష సంబద్ధార్థమునే చెప్పవలసి యుండును అట్లైనచో వెనుక ఆశంకించిన విధమున 'శాలాకికోఽసి' 'శాలాకికోఽస్మి' ఇత్యాది ప్రయోగములు అయుక్తము లనవలసి వచ్చును. కావున శాస్త్రము నిత్యమగు శబ్దమునే సాధించుచు, ఏదియో ఒక సామాన్య ధర్మమును గ్రహించి అర్థ నిర్వచనము చేయుచుండునని చెప్పుట యుక్తము. ఇట్లు అంగీకరించిన పక్షమున 'శాలాకికః' ఇత్యాదులలో 'శలాకలచే ఆడుట' మొదలగు సామాన్యమునకే గ్రహణము గాని పురుషవిశేషము గాని, ఆఖ్యాతార్థత్వాదికము గాని వివక్షితము కాదు.

*అవతారిక*— ఈ విషయమున భాష్యకారదర్శితమగు దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ యోఽశ్వే యః పీఠ ఇత్యత్ర భూతయోరశ్వపీఠయోః ।**
**యథోపలక్షణార్థత్వం తథార్థేష్వనుశాసనమ్ ॥ 9**

యః = ఎవడు, అశ్వే = అశ్వముపై నున్నాడో, యః = ఎవడు, పీఠే = పీఠమునందు ఉన్నాడో (అతడు దేవదత్తుడు), ఇత్యత్ర = ఇత్యాది స్థలములందు, భూతయోః = సిద్ధములై ఉన్న, అశ్వపీఠయోః = అశ్వపీఠములు, యథా = ఏ విధముగా, ఉపలక్షణార్థత్వం = ఉపలక్షణములుగ ఉపయోగించుచున్నవో, తథా = అట్లే, అర్థేషు = అర్థములయందు, అనుశాసనమ్ = శాస్త్రాను శాసనము (చేయబడును).

తాత్పర్యము— "అశ్వముపై ఎవ్వడున్నాడో, పీఠముపై ఎవ్వడున్నాడో అతడు దేవదత్తుడు" ఇత్యాది వాక్యములలో సిద్ధములగు అశ్వపీఠాదులు ఉపలక్షణములుగ నున్నట్లు శబ్దానుశాసనమునందు చూపబడు అర్థములు గూడ ఉపలక్షణార్థములే.

*విశేషాంశము*— ఒక్కచోట చాలామంది ఉన్నప్పుడు, వీరిలో దేవదత్తుడు ఎవరు, అని ఎవరైన ప్రశ్నింపగా, "అశ్వముపై నున్నవాడు దేవదత్తుడు" లేదా "పీటపై కూర్చున్న వాడు దేవదత్తుడు" అని సమాధానము చెప్పుదురు. ఇచట అశ్వమేదియో లేదా పీఠమేదియో చెప్పవలసిన పనిలేదు. అవి సిద్ధములై ప్రష్టకు తెలిసియే యున్నవి. దేవదత్తు డెవరో అనునది యే క్రొత్తగ చెప్పవలసిన విషయము గాన అది విధేయము. దేవదత్తునికి గుర్తుగా (ఉపలక్షణముగ) అశ్వపీఠాదులు చెప్పబడుచున్నవి. అట్లే "తేన దీవ్యతి" - ఇత్యాది శాస్త్రముచే విహితములగు ప్రత్యయములకే ప్రాధాన్యము గాని అర్థములకు అంత ప్రాధాన్యము లేదు. అవి కేవలము ఉపలక్షణము మాత్రమే. కావున వాటి యర్థము అవియైన కావచ్చును లేదా వానికి ఇంచుమించుగా దగ్గరలోనున్న ఇతరములు అర్థము కావచ్చును. ప్రత్యయాదులను విధించుటయే వ్యాకరణ శాస్త్రమునకు ప్రధానోద్దేశ్యము గాని అర్థ ప్రతిపాదనము కాదు.

*పురుష సముద్దేశము ముగిసినది*

## సంఖ్యా సముద్దేశము

*అవతారిక*— ఇపుడు సంఖ్యను గూర్చి విచారించుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యావాన్ సత్త్వభూతోర్థః సర్వ ఏవాభిధీయతే ।**
**భేదాభేదవిభాగో హి లోకే సంఖ్యానిబన్ధనః ॥ 1**

సత్త్వభూతః = ద్రవ్యస్వరూపమగు, సర్వః ఏవ = సమస్తమైన, అర్థః = పదార్థము, సంఖ్యావాన్ = సంఖ్య కలదిగా, అభిధీయతే = చెప్పబడుచున్నది, లోకే = లోకమునందు, భేదాభేద విభాగః = భేదము అభేదము అను వాని నుద్దేశించిన విభజనము, సంఖ్యా నిబన్ధనో హి = సంఖ్యనుబట్టి ఏర్పడునది కదా.

తాత్పర్యము— ద్రవ్యరూపమగు ప్రతి పదార్థము - అనగా ప్రతి ద్రవ్యము, సంఖ్య కలదిగా చెప్పబడినది. లోకమున భేదాభేద రూపమగు విభాగము సంఖ్యను బట్టియే ఏర్పడినది కదా ?

విశేషము— 'ఇది' 'అది' అని సర్వనామములచే నిర్దేశించుటకు యోగ్యమగు వస్తువులు పరస్పరము భిన్నములుగ నుండును. ఈ వస్తువులలో నున్న భేదమును రెండు, మొదలగు సంఖ్యలచే, ఒక వస్తువునుండి మరియొక వస్తువును వేరుగ నుద్దేశించి చూప వీలగును. ఈవిధముగ అన్ని ద్రవ్యములును సంఖ్యలతో సంబంధించి యుండును. ఒకటి అను సంఖ్య అభేదమును, రెండు మొదలగు సంఖ్య లన్నియును భేదమును సూచించును.

*అవతారిక*— వైశేషికాదులు సంఖ్య గుణమనియు, ద్రవ్యమును ఆశ్రయించి యుండుననియు అంగీకరించిరి. అసహాయమగు ద్రవ్యము (అనగా ఒక ద్రవ్యము ప్రక్క మరియొక ద్రవ్యము లేనిచో అది) ఏకత్వరూపమనియు, ఆ ద్రవ్యము సహాయమైనచో ద్విత్వాదికమనియు, అందుచే ద్రవ్య వ్యతిరిక్తమగు సంఖ్య అనునది స్వతంత్రముగ లేదనియు కొందరి యభిప్రాయము. ఏది ఎట్లున్నను శబ్దైక ప్రమాణము నాశ్రయించు వారికి పదార్థ విచారణము విషయమున అంత పట్టింపు లేదు. శాస్త్రకారులు లోక వ్యవహారానుసారముగ పదార్థ కల్పన చేసియున్నారు. వారు చేసిన కల్పన ననుసరించి పదార్థముల వ్యవస్థ చేయ వలసి యున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ స ధర్మో వ్యతిరిక్తో వా తేషామాత్మైవ వా తథా ।**
**భేదహేతుత్వ మాశ్రిత్య సంఖ్యేతి వ్యపదిశ్యతే ॥ 2**

సః = ఆ, ధర్మః = సంఖ్యారూపమగు ధర్మము, వ్యతిరిక్తోవా = ద్రవ్యముకంటె భిన్నమైన దైనను, తథా = మరియు, తేషాం = ఆ ద్రవ్యముల యొక్క, ఆత్మైవవా = స్వరూపమే

యైనను, భేద హేతుత్వం = ఆ ద్రవ్యముల పరస్పర భేదమునకు హేతువగుటను, ఆశ్రిత్య= ఆధారముగ చేసికొని, సంఖ్యేతి = సంఖ్యయని, వ్యపదిశ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— ఆ ధర్మము ద్రవ్యములకంటె భిన్నమైనను, ద్రవ్యస్వరూపమే యైనను, ద్రవ్యముల భేదమునకు హేతువగుటను బట్టి సంఖ్య అని చెప్పబడుచున్నది.

వివరణము— ధర్మము ద్రవ్యములకంటె భిన్నమైన గుణమా లేక ద్రవ్యరూపమా అనెడు విచారము నిష్ప్రయోజనము. ఒకటి, రెండు, మూడు మొదలగు భేద వ్యవహారమునకు హేతువగు ఒకానొక ధర్మమున్నట్లు శబ్దమువలన తెలియుచున్నది. భేదహేతువగు ఈ ధర్మమునకు 'సంచష్టే ఇతి సంఖ్యా' (స్పష్టముగ బేదమును చెప్పునది గావున సంఖ్య) అను సార్థకనామము వ్యవహారములో నున్నది.

*అవతారిక*— సంఖ్య ద్రవ్యాశ్రితమైనచో గుణాదులలో గూడ (ఒక రూపము, రెండు రూపములు ఇత్యాది విధమున) సంఖ్యనుబట్టి వ్యవహారము ఎట్లు ఏర్పడుచున్నది అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ సమవేతా పరిచ్ఛేద్యే క్వచిదన్యత్ర సా స్థితా ।**
**ప్రకల్పయతి భావానాం సంఖ్యాభేదం తథాత్మనః ॥ 3**

పరిచ్ఛేద్యే = పరిచ్ఛేద్యమగు దానియందు (ద్రవ్యమునందు), సమవేతా = సమవాయ సంబంధముతో నుండునదియు, క్వచిత్ = కొన్ని స్థలములందు, అన్యత్ర = పరిచ్ఛేద్యము కానిదానియందు, స్థితా = ఉన్నదియు అగు, సా = ఆ, సంఖ్యా = సంఖ్య, భావానాం = భావములకును, తథా = మరియు, ఆత్మనః = తనకును, భేదం = భేదమును, ప్రకల్పయతి = కల్పించును.

తాత్పర్యము— ఒకప్పుడు పరిచ్ఛేద్యమునందు సమవాయ సంబంధముతో నుండునదియు, ఒకప్పుడు పరిచ్ఛేద్యము కాని దానితో సంబంధించునదియు అగు సంఖ్య భావములకును తనకును గూడ భేదమును కల్పించును.

విశేషము— ద్రవ్యము పరిచ్ఛేద్యమగునపుడు, అనగా సంఖ్య ద్రవ్యమునందున్న భేదమును తెలుపునపుడు, అది (సంఖ్య) గుణముగాన ద్రవ్యమునందే సమవాయ సంబంధముతో నుండును. ఈ సంఖ్య గుణములను గూడ పరిచ్ఛేదించును. అపుడు గుణములందు గుణాంతరము లుండవుగాన సంఖ్య ఆ గుణములందు కాక ఆ గుణములకు ఏ ద్రవ్యములు ఆశ్రయములో ఆ ద్రవ్యములందే సమవాయ సంబంధముతో నుండును. రూపాది గుణములును సంఖ్యయు ఒకే ద్రవ్యమునందు సముదాయ సంబంధముతో నున్నవి గాన సంఖ్య గుణములను పరిచ్ఛేదింప గలుగుచున్నది. ఇట్లే సంఖ్య తన్ను (సంఖ్యను) గూడ పరిచ్ఛేదించుచున్నది. ఉదాహరణమునకు— శతం, శతే, శతాని ఇత్యాదులలో శత సంఖ్యను ఏకద్విత్రిత్వాది సంఖ్యలు పరిచ్ఛేదించుచున్నవి. ఇట్టి స్థలములలో గూడ సంఖ్య ద్రవ్యసమవేతమై

యుండి, ద్రవ్య సమవేతములగు సంఖ్యాంతరములను పరిచ్ఛేదించుచున్నది. ఇట్లే 'పంచకర్మ జాతయః' 'ద్వేసామాన్యే' ఇత్యాది స్థలములలో పదార్థ సమవేతమగు సంఖ్య, పదార్థ సమవేతములగు కర్మ జాత్యాదులను పరిచ్ఛేదించుచున్నది. నిరూపాఖ్యమగు (స్వరూప రహితమగు) అభావమునకు గూడ ఔపాధికమగు సంఖ్యా సంబంధముచే 'చత్వారః అభావాః' ఇత్యాది వ్యవహారము చేయబడుచున్నది. ఈ విధముగ కొన్ని స్థలములలో సంఖ్యకు స్వపరిచ్ఛేద్యముతో సంబంధము ముఖ్యము. కొన్ని యెడల గౌణము. ఈ విధముగ భేదగణనా మాత్ర లక్షణమగు సంఖ్య అనునది ఒకటి ఉన్నదనియు దానితో వ్యవహారము చేయవచ్చుననియు చెప్పిన సరిపోవును. దీనిని గూర్చిన శాస్త్రకార మతభేదములతో మనకు పనిలేదని యర్థము. ॥3॥

*అవతారిక*— సంఖ్య ద్రవ్య సమవేతమైనను గుణాదుల భేద వ్యవహారమునకు ఉపయోగింపవచ్చును అను విషయమున దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ పరత్వేచాపరత్వే చ భేదే తుల్యా శ్రుతిర్యథా ।**
**సంఖ్యా శబ్దాభిధేయత్వం భేదహేతో స్తథా గుణే ॥ 4**

పరత్వేచ = పరత్వము విషయమునను, అపరత్వేచ = అపరత్వము విషయమునను, భేదే = భేదమున్నను, యథా = ఏ విధముగ, తుల్యా = సమానమగు, శ్రుతిః = శ్రవణమున్నదో, తథా = అట్లే, భేదహేతోః = ద్రవ్య భేదమునకు కారణభూతమగు సంఖ్యయే, గుణే = గుణము విషయమునందు గూడ, సంఖ్యా శబ్దాభిధేయత్వం = సంఖ్యా శబ్దముచే అభిధేయమగును.

తాత్పర్యము— ద్రవ్య గుణములకు సంబంధించిన పరత్వా పరత్వముల విషయమున భేదమున్నను ఏ విధముగ తుల్యమగు పరత్వాపరత్వముల శ్రుతి యుండునో అట్లే ద్రవ్యభేద హేతువగు సంఖ్యయే గుణము విషయమున గూడ సంఖ్యా శబ్దాభిధేయమై యుండును.

**విశేషము**— రెండు ద్రవ్యములు వేరు వేరు ప్రదేశములందున్నపుడు ఈ ద్రవ్యము దూరముగ (పరముగ) నున్నది. ఇది దగ్గరగ (అపరముగ) ఉన్నది అను పరత్వాపరత్వ రూపములగు గుణములు ద్రవ్య సమవేతములై భాసించుచుండును. అట్లే రూపాది గుణముల విషయమునందు గూడ ఈ పరత్వాపరత్వ బుద్ధి కలుగుచున్నది. ఈ రూపాది విషయక పరాపర బుద్ధికి ద్రవ్యవిషయక పరాపరబుద్ధులే కారణము. అనగా ద్రవ్యమగు ఘటము పరముగ నున్నదిగాన దాని రూపముగూడ పరముగ నున్నట్లు భాసించుచున్నది. అది అపరముగ నున్నచో దాని రూపమును అపరమగుచున్నది. ఈ విధముగ ద్రవ్య సమవేతములగు పరత్వాపరత్వములే గుణముల పరత్వాపరత్వములకు గూడ హేతువైనట్లు ద్రవ్యసమవేతమగు సంఖ్యయే ద్రవ్యసమవేతములగు రూపాది గుణముల సంఖ్యకు గూడ కారణమగుచున్నది. అనగా ద్రవ్యములకు సంబంధించిన సంఖ్యకంటె రూపాదిగత సంఖ్య భిన్నముకాదని యర్థము.

*అవతారిక*— ఒక్క సంఖ్యా పరత్వాపరత్వాదుల విషయముననే కాదు ; ఒక దానిని ఆశ్రయించుకొని యున్న అన్నింటి వ్యవహారములును ఆశ్రయమైన దాని ధర్మము లను బట్టి యుండునని చెప్పుచున్నాడు.

శ్లో॥ అస్వతన్త్రే స్వతన్త్రత్వం పరధర్మో యథా గుణే ।
అభేద్యే భేద్యభావోఽపి ద్రవ్యధర్మ స్తథా గుణే ॥ 5

అస్వతన్త్రే = స్వతంత్రము కాని, గుణే = గుణమునందు, పరధర్మః = గుణమునకు ఆశ్రయ భూతమగు ద్రవ్యముయొక్క ధర్మమైన, స్వతన్త్రత్వం = స్వతంత్రత్వము, యథా = ఎట్లు భాసించుచున్నదో, తథా = అట్లే, అభేద్యే = సంఖ్యచే వ్యవచ్ఛేద్యము కాని, గుణే = గుణము నందు, ద్రవ్యధర్మః = ద్రవ్యముయొక్క ధర్మమగు, భేద్యభావోఽపి = వ్యవచ్ఛేద్యత్వము కూడ భాసించును.

*తాత్పర్యము*— అస్వతంత్రమగు గుణమునందు ద్రవ్యధర్మమగు స్వాతంత్ర్యము భాసించినట్లు, అది (గుణము) సంఖ్యావ్యవచ్ఛేద్యము కాకున్నను ద్రవ్యధర్మమగు వ్యవచ్ఛేద్య త్వము భాసించును.

*వివరణము*— రూపాది గుణములు ఎల్లప్పుడును ద్రవ్యము నాశ్రయించి యుండు టచే నిత్య పరతంత్రములు. అట్లైనను 'పటస్యరూపమ్' (వస్త్రముయొక్క రూపము) అని స్వాతంత్ర్యము రూపమునందు వ్యపదేశింపబడుచున్నది. ఈ స్వాతంత్ర్యము వాస్తవమున రూపమునకు చెందినది కాదు ; పటరూప ద్రవ్యమునకు చెందినది. ఇచట స్వాతంత్ర్యమనగా స్వతంత్రముగ నున్నట్లు భాసించుట. "శుక్లః పటః" (తెల్లని వస్త్రము) అనునపుడు శుక్ల గుణము పటరూప ద్రవ్యమునకు ఉపసర్జనమైనట్లు (అనగా పటము నాశ్రయించికొని యుండి అప్రధానమైనట్లు) భాసించుచున్నది. ద్రవ్యమునుండి శుక్ల గుణమును విడదీసినట్లు "పటస్య శుక్లః" అని ప్రయోగించినపుడు ద్రవ్యమునకు గల స్వాతంత్ర్యము దీనియందు సంక్రమించి నట్లు కనబడుచున్నది. అట్లే గుణము సంఖ్యా వ్యవచ్ఛేద్యము కాకున్నను తదాశ్రయభూతమగు ద్రవ్యము సంఖ్యా వ్యవచ్ఛేద్యమగుటచే దానినిబట్టి ఇదిగూడ వ్యవచ్ఛేద్యత్వమును పొందు చున్నది. ॥5॥

*అవతారిక*— ఈ విషయమునే ఇంకను విశదీకరించుచున్నాడు.

శ్లో॥ స్వబుద్ధ్యా తమపోద్ధృత్య లోకోఽప్యాగమమాశ్రితః ।
స్వధర్మా దన్యధర్మేణ వ్యాచష్టే ప్రతిపత్తయే ॥ 6

లోకోఽపి = సామాన్యజనుడు కూడా, ఆగమం = శాస్త్రమును, ఆశ్రితః = ఆశ్రయించిన వాడై, స్వబుద్ధ్యా = తన బుద్ధిచేత, తం = ఆ గుణమును, అపోద్ధృత్య = ద్రవ్యమునుండి విడదీసి, స్వధర్మాత్ = గుణ ధర్మముకంటె, అన్యధర్మేణ = భిన్నమగు ద్రవ్యముయొక్క ధర్మముచే, ప్రతిపత్తయే = ఇతరునికి జ్ఞానము కలుగుటకై, వ్యాచష్టే = చెప్పుచుండును.

తాత్పర్యము— లౌకిక జనుడుకూడ ఆగమము ప్రకారము తన బుద్ధిచే గుణమును ద్రవ్యమునుండి వేరుచేసి దాని ధర్మముకంటె భిన్నమగు ద్రవ్య ధర్మమును పురస్కరించు కొని ఎదుటివానికి తెలియజెప్పు చుండును

వివరణము— ద్రవ్యముకంటె భిన్నముగ గుణము ఉన్నది. అది ద్రవ్యమునందు సమవాయ సంబంధముతో నుండును. ద్రవ్యధర్మములను బట్టి గుణధర్మములు గూడ ఉండును, అని కేవలము వైశేషికాదులే కాదు; లౌకిక జనులు కూడ ద్రవ్యమునుండి గుణమును స్వబుద్ధిచే వేరుగా భావించి గుణధర్మ విలక్షణమగు ద్రవ్యధర్మమును పురస్కరించుకొని, ఇతరులకు తెలియజెప్పు చుండును. ఉదాహరణమునకు– ఒక వస్త్రమునందు అనేక రూపము లుండవచ్చును. కాని ఆ పటమును ఒక్క వస్తువుగా గ్రహించి, ఆ పటమునందున్న ఏకత్వ సంఖ్యను బట్టి గుణమునందు గూడ ఏకత్వము నారోపించి "ఈ పటమునందు ఒక చిత్ర రూపమున్నది" అని చెప్పును. పటమునంతను ఒక్క వస్తువుగ కాక పటావయవముల నన్నింటిని వేరు వేరుగ భావించినచో వాటి సంఖ్యనుబట్టి దీని నాలుగు అవయవములందును నాలుగు రూపములు ఉన్నవని చెప్పును. ఈ విధముగ ఆశ్రయ ధర్మములను బట్టి ఆశ్రిత ధర్మములను వ్యవహరించుట లోకములో కూడ నున్నది. ॥6॥

అవతారిక— శబ్దము ఎల్లప్పుడును సంబంధించిన ధర్మములతో ఆచ్ఛురితమగు (ధర్మచ్ఛాయాచ్ఛాదితమగు) వస్తువునే బోధించును. ఈ నియమము ద్రవ్యము విషయమునం దైనను, గుణాదుల విషయమునందైనను సమానమే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ పరోపకారతత్త్వానాం స్వాతన్త్ర్యేణాభిధాయకః ।
శబ్దః సర్వపదార్థానాం స్వధర్మాత్ విప్రకృష్యతే ॥ 7

పరోపకారతత్త్వానాం=ఇతర ధర్మములచే ఉపకరింపబడిన స్వరూపముగల, సర్వపదార్థానాం = ద్రవ్యగుణాది సకల పదార్థములను, స్వాతంత్ర్యేణ = ధర్మసంసర్గ శూన్యమగు శుద్ధ రూపముతో, అభిధాయకః = బోధించెడు, శబ్దః = శబ్దము, స్వధర్మాత్ = వాచకత్వ రూప మగు తన ధర్మమునుండి, విప్రకృష్యతే = వేరు చేయబడుచున్నది.

తాత్పర్యము— అన్యధర్మములచే ఉపకృతములగు స్వరూపములు గల సకల పదార్థములను ధర్మ సంసర్గము లేకుండ బోధించు శబ్దము తనకుగల వాచకత్వ ధర్మమును కోల్పోవును.

వివరణము— శబ్దము పదార్థమును బోధించును. ఆ పదార్థము ద్రవ్యము కావచ్చును. గుణము కావచ్చును, మరియొకటి ఏదియైన కావచ్చును. అది ఏదియైనను ఇతర ధర్మముల ఆచ్ఛురణ (పైపూత) మున్న రూపముతోడనే శబ్దముచే బోధింపబడును. ఉదాహ రణమునకు ఘట శబ్దము ఘట మనెడు ద్రవ్యమును బోధించుచున్నది. దీనిని బోధించుచున్న పుడు ఏదియో ఒక రూపము, ఆకారము మొదలగు ధర్మవిశేషములతో కూడిన దానినే

బోధించునుగాని ఏ ధర్మముల సంపర్కములేని ద్రవ్యమును బోధింపజాలదు. అట్టి ద్రవ్యము మన బుద్ధికి విషయము కాజాలదు; వ్యవహారమున గూడ ఉండజాలదు. ద్రవ్య విషయము నందువలె గుణాదుల విషయమునందు గూడ ఏదియో యొక ధర్మ సంబంధమున్ననే శబ్దము బోధింప గల్గును. కావున 'పటః' అన్నపుడు ఆ యా రూపాదులతో గూడిన పటము అను అర్థబోధ కలిగినట్లు ''పటస్య శుక్లః'' ఇత్యాదులలో కూడ ఏకత్వాద్యుపహిత శుక్ల గుణబోధ కలుగును. ఏ శబ్దమైనను ధర్మాంతర సంబంధరహితమగు శుద్ధ పదార్థమును బోధింపవలెనని ప్రయత్నించినచో దాని వాచకత్వము దూరమగును. అనగా ఆ పదము అట్టి యర్థమును చెప్పజాలదు. ఈ విధముగ ద్రవ్యవాచక శబ్దమైనను, గుణవాచక శబ్దమైనను, ఏ శబ్దమైనను ధర్మాంతర సహకృత పదార్థములను మాత్రమే బోధించును.

*అవతారిక*— అర్థము అన్యధర్మోపకారము లేనిచో భాసింపదు (బుద్ధి గోచరము కాదు) అను విషయమున దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ యథైవావిషయం జ్ఞానం న కిఞ్చిదవభాసతే ।**
**తథా భావోఽప్యసంసృష్టో న కశ్చిదుపలభ్యతే ॥ 8**

అవిషయం = విషయములేని, జ్ఞానం = జ్ఞానము, కిఞ్చిత్ = ఏదియు, యథైవ = ఏ విధముగా, న అవభాసతే = వ్యవహారయోగ్యముగ భాసింపదో, తథా = అట్లే, అసంసృష్టః = ధర్మాంతరములతో సంసృష్టము కాని, భావః అపి = పదార్థము కూడ, కశ్చిత్ = ఒక్కటియు, న ఉపలభ్యతే = లభించుట లేదు.

తాత్పర్యము— నిర్విషయమగు జ్ఞానమేదియు ఏ విధముగ భాసించుట లేదో అట్లే అన్యధర్మ సంపర్కములేని పదార్థమేదియును గూడ లభించుటలేదు.

*వివరణము*— ఘట జ్ఞానమునందు ఘటము విషయము. పట జ్ఞానమునందు పటము విషయము. ఈ విధముగ జ్ఞానమునందేదైన ఒక విషయముండి తీరవలెను. విషయము లేని శుద్ధ జ్ఞానము భాసింపదు; వ్యవహారయోగ్యము కాదు. అట్లే ధర్మాంతరముల సంసర్గము లేని పదార్థమేదియు వ్యవహారయోగ్యము కాజాలదు గాన అట్టి పదార్థమును పదము బోధింపదు. ॥8॥

*అవతారిక*— పరస్పర భిన్నములగు ఘటములయందు ఈ ఘటత్వమను సామాన్యము (జాతి) అభేద బుద్ధికి కారణముగనున్నది; విశాలముఖత్వరూపమగు ఈ విశేషము ఈ ఘటములను ఇతర ఘటములనుండి భిన్నముగ కనబడునట్లు చేయుచున్నది; ఇత్యాది విధముల లోకములో వ్యవహారము కలదు. ఇట్టి వ్యవహారములు సామాన్యాదులలో ద్రవ్య సంసర్గము లేకుండ చేయబడుచున్నవి. పరధర్మోపాధి లేని వాటికి వ్యవహారము సాధ్యము కాదు అని యన్నచో ఈ వ్యవహార మెట్లు కుదురును అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

అన్యత్ర = మరియొక స్థలమున అనగా మరియొక వాక్యమునందు. అవిహితస్య + ఏవ = విధింపబడనట్టియే, పశోః = పశువునకు, ప్రథమమ్ = ప్రాథమికమగు, సః + విధిః = ఆ విధి అనగా పశునాయజేత, అను వాక్యముచే విధానము.

క్రియాయామ్ = యాగ క్రియయందు, అఙ్గభావః + చ = పశువునకు అంగత్వము కూడ, ప్రథమస్ + విధిః = ప్రాథమికమగు విధియే.

ఏతస్మాత్ = దీనివలన అనగా పైని చూపబడిన కారణద్వయము వలన, తత్ = అది అనగా ఏకత్వము, వివక్షితం + తు = వివక్షితమే యగును.

స్వర్గమును కోరువాడు యాగముచేయవలెనని వేరు వాక్యము వేదమునకలదు.* ఆ వాక్యము యాగము చేయుమనియే చెప్పుచున్నది. అందు ద్రవ్యమేదియో ఆ వాక్యము చెప్పదు. ''పశునాయజేత'' అను వేదవాక్యము వాక్యాంతరముచే విధింపబడని పశువనెడి ద్రవ్యమును విధించుచున్నది. ఆ విధియు పశువుయాగమున కంగమేయని చెప్పుచున్నది.

కాగా వాక్యాంతరముచే లభింపని పశుద్రవ్యమును ఈ వాక్యమే విధించుటచేతను పశువు యాగమునకు అంగమని చెప్పుటచేతను 'పశునా' అను పదమున తృతీయా విభక్తిచే బోధింపబడెడి ఏకత్వ సంఖ్య •వివక్షితమేయగును, ప్రత్యయముచే బోధింపబడిన అర్థమును విడుచుటలో తగిన ప్రమాణము కానరానందున నదివివక్షితమే యగును. ॥57॥

*అవతారిక* — వాక్యాంతరముచే విధింపబడని పశువును విధించుటయు, ఆ పశువును యాగమునకు అంగముగా విధించుట అనెడి రెండు కారణములనుబట్టి, పశునా, అను పదమున ప్రత్యయార్థముగానున్న ఏకత్వసంఖ్య వివక్షితమగునని 57 వ శ్లోకమున చూపబడినది.

దానినిబట్టి చూడగా వాక్యాంతరముచే విధింపబడిన అర్థమునే మరల విధించిన, అందును ప్రధానముగా విధించిన, అచట ప్రత్యయార్థమగు సంఖ్య వివక్షితము కానేరదని లభించుచున్నది. ఇదియే "వ్యాపారః కార్యసిద్ధయే'' అని 50 వ శ్లోకమున చెప్పబడిన ఉపలక్షణమనే శబ్ద వ్యాపారము అని వ్యక్తపరచుచున్నాడు.

శ్లో॥ గ్రహాస్త్వన్యత్ర విహితా భిన్నసంఖ్యాః పృథక్ పృథక్।
ప్రాజాపత్యా నవేత్యేవమాదిభేదసమన్వితాః ॥ 58

శ్లో॥ అఙ్గత్వేనప్రతీతానాం సమ్మార్గే త్వఙ్గినాంపునః ।
నిర్దేశం ప్రతి యా సంఖ్యా సా కథం స్యాద్వివక్షితా ॥ 59

* "జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత" (జ్యోతిష్టోమనామకేన యాగేన స్వర్గం భావయేత్) అని వచనము. స్వర్గము కోరువాడు జ్యోతిష్టోమయాగము చేయవలెను.

• ఈ కారికచే లభించిన యర్థమునే ''యథు జాతిస్తథైకత్వం సాధనత్వేన గమ్యతే'' అని 55 కారికాగ్రంథము సూచించియున్నది.

శ్లో॥ భేదేన తు సమాఖ్యానం యల్లోకోఽప్యనువర్తతే ।
ఆగమాచ్ఛాస్త్రసదృశో వ్యవహారః స వర్ణ్యతే ॥ 9

లోకోఽపి = లోకము కూడ, భేదేన = భేదముచేత, సమాఖ్యానం = ప్రతిపాదనమును, అను వర్తతే ఇతి యత్ = అనుసరించుచున్నదనునది ఏది కలదో, సః = అది, ఆగమాత్ = వైశేషికాగమానుసారముగ, శాస్త్రసదృశః = శాస్త్రముతో సమానమగు, వ్యవహారః = వ్యవహారముగా, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

తాత్పర్యము— లోకము కూడ సామాన్యాదులను భేదముతో ప్రతిపాదించు చున్నది. ఈ వ్యవహారము వైశేషికాగమానుసారముగ జరిగిన శాస్త్ర సదృశమగు వ్యవహారమని చెప్పబడుచున్నది.

*వివరణము*— సామాన్య విశేషాదిరూపములగు ఉపాధులు ఎల్లప్పుడును పరతంత్రములుగనే ఉండును కాని స్వతంత్రముగ నుండజాలవు. అయినను శాస్త్రము అపోద్ధారము చేసి (వాటిని ద్రవ్యాదులనుండి విడదీసి) స్వతంత్రరూపమున ప్రతిపాదించుచుండును. ఈ శాస్త్ర వ్యవహారమునే అనుసరించి లోకమునందు గూడ ఇట్టి వ్యవహారము కానవచ్చుచున్నది. కావున వీటి స్వాతంత్ర్యము కల్పితమే కాని వాస్తవము కాదు. ॥9॥

*అవతారిక*— ఈ విధముగ శాస్త్రీయ సంస్కారమును బట్టి స్వతంత్రరూపమున ప్రదర్శ్యమానములగు సామాన్యాదులందు ఉపాధుల ఆరోపము జరుగుచుండును అని చెప్పుచున్నాడు.

శ్లో॥ బుద్ధౌ స్థితేషు తేష్వేవమధ్యారోపో న దుర్లభః ।
పరధర్మస్య న హ్యత్ర సదసత్త్వం ప్రయోజకమ్ ॥ 10

ఏవం = ఈ విధముగా, బుద్ధౌ = బుద్ధియందు, స్థితేషు = ఉన్న, తేషు = ఆ సామాన్యాదులందు, పరధర్మస్య = అన్యధర్మమగు ఉపాధియొక్క, ఆరోపః = ఆరోపము, దుర్లభః = దుర్లభమైనది, న = కాదు, అత్ర = ఆరోపమునందు, సదసత్త్వం = సత్త్వము కాని అసత్త్వము కాని, ప్రయోజకం = ప్రయోజకము, నహి = కాదుకదా ?

తాత్పర్యము— ఈ విధముగ బుద్ధియందు స్వతంత్రరూపమున భిన్నముగ నున్న ఆ సామాన్యాదులందు ఇతరోపాధుల ఆరోపముచేయుట కూడ శక్యమే. ఆరోపము విషయమున సత్త్వాసత్త్వములు ప్రయోజకములు కావుకదా ?

*వివరణము*— సామాన్యాదులను బుద్ధిచే ద్రవ్యాదులనుండి విడదీసి, 'ఈ సామాన్యము' 'ఆ సామాన్యము' ఇత్యాది విధమున సర్వనామ నిర్దేశమునకు వీలగునట్లు చేసినపుడు పరధర్మములగు సంఖ్యాదులను గూడ వీటియందు (సామాన్యాదులందు) ఆరోపించుటకు వీలు ఏర్పడుచున్నది. సామాన్య విశేషాదులే ద్రవ్యములకు ఉపాధులై యుండుటచే వాటికి స్వాతం

త్ర్యము లేదు గాన అట్టి వాటియందు లేని ఉపాధులను ఆరోపించుట ఎట్లు అని అశంకింప రాదు. ఆరోపమునకు సత్త్వముగాని అసత్త్వముగాని వాస్తవముగ ఉండవలెననెడు ఆవశ్యకత లేదు. సత్ అయిన దానియందు అసత్త్వమును ఆరోపింపవచ్చును, అసత్తైన దానియందు సత్త్వమును ఆరోపింపవచ్చును. అందుచే సామాన్యాదులందు బుద్ధిచే స్వాతంత్ర్యమును ఆరోపించి అట్టి ఆరోపిత స్వాతంత్ర్యములగు సామాన్యాదులందు ఉపాధ్యారోపము గూడ చేయ వచ్చును. ॥10॥

*అవతారిక*— ఈ విధముగ కల్పిత స్వాతంత్ర్యములగు వాటిపై ఉపాధ్యంతర సమారోపము సంభావ్యము గాన—

**శ్లో॥ సామాన్యేష్వపి సామాన్యం విశేషేషు విశిష్టతా ।**
**సంఖ్యాసు సంఖ్యా లింగేషు లింగమేవం ప్రకల్పతే ॥ 11**

ఏవం = ఈ విధముగ, సామాన్యేష్వపి = సామాన్యములయందు గూడ, సామాన్యం = సామాన్యము, విశేషేషు = విశేషములయందు, విశిష్టతా = విశిష్టత్వము, సంఖ్యాసు = సంఖ్యల యందు, సంఖ్యా = సంఖ్యయు, లిఙ్గేషు = లింగములయందు, లింగం = లింగము, ప్రకల్పతే = ఏర్పడును.

*తాత్పర్యము*— ఈ విధముగ సామాన్యములయందు సామాన్యము, విశేషముల యందు విశిష్టత్వము, సంఖ్యలయందు సంఖ్య, లింగములందు లింగము ఏర్పడును.

*వివరణము*— ఇట్లే బుద్ధిచే గోత్వసామాన్యము (జాతి) అశ్వత్వ సామాన్యము మొదలగు కొన్ని సామాన్యములకు భేదమును కల్పించి ఆ అన్ని సామాన్యములందును అను గతముగ నుండు మరియొక సామాన్యమును (సామాన్యత్వము మొదలగు దానిని) కల్పింప వచ్చును. ద్రవ్యములతో సంబంధించి యున్న విశేషములను బుద్ధిచే వేరుగ పరిగ్రహించి, వాటిని గూడ ద్రవ్యములవలె భావించి ఆ విశేషము లన్నింటియందును అనుగతమగు విశే షత్వమనెడు జాతిని కల్పింపవచ్చును. లేదా ఒక విశేషము మరియొక విశేషముకంటె భిన్న మైనది అను జ్ఞానమునకు నిమిత్తమగు విశేషాంతరమును గూడ విశేషమునందు కల్పింప వచ్చును. సంఖ్యలకు మరల సంఖ్యాసంబంధము నేర్పరచి శతం, శతే, శతాని ఇత్యాది ప్రయోగములు చేయవచ్చును. శబ్దముచే వాచ్యములగు స్త్రీత్వాది లింగములు ద్రవ్యమువలె భాసించుటచే మరల వాటికి లింగాంతరముతో సంబంధము ఏర్పడి 'పుమాన్' 'పౌంస్నమ్' 'పుంస్త్రా' ఇత్యాది ప్రయోగములు చేయవచ్చును. ఈ విధముగ ఔపాధిక భేద కల్పనముచే పూర్వోక్త వ్యవహారమున విరోధము లేదు. ॥11॥

*అవతారిక*— ప్రాసంగిక విచారమును చేసి ప్రకృత విషయమును ముగించు చున్నాడు.

శ్లో॥ అతో ద్రవ్యాశ్రితాం సంఖ్యామాహుః సంసర్గ వాదినః ।
భేదాభేదవ్యతీతేషు భేదాభేద విధాయినీమ్ ॥ 12

అతః = ఆ కారణము వలన, సంసర్గవాదినః = సంసర్గవాదులు (ఒక ద్రవ్యమునందు అనేక ధర్మములు సమవేతములయి యుండును అనుసట్టి కణాద వాదులు), భేదాభేదవ్యతీతేషు = భేదాభేదములను అతిక్రమించియున్న ద్రవ్యగుణాదులందు, భేదాభేదవిధాయినీం = భేదాభేదములను కల్పించెడు, సంఖ్యాం=సంఖ్యను, ద్రవ్యాశ్రితాం=ద్రవ్యమును ఆశ్రయించిన దానినిగా, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— అందుచే సంసర్గవాదులగు వైశేషికులు భేదాభేద రహితములగు ద్రవ్యగుణాదులందు భేదాభేదములను కల్పించు సంఖ్య ద్రవ్యము నాశ్రయించి యుండునని చెప్పుదురు.

వివరణము— సంసర్గవాదులనగా ధర్మములన్నియు ద్రవ్యముతో సంబంధించి యుండునని అంగీకరించు వైశేషికులు. వెనుక చెప్పిన విధముగ ద్రవ్యము నాశ్రయించి యున్న సంఖ్యనుబట్టియే గుణాదులందు కూడ ఏకత్వ ద్విత్వాది వ్యవహారము జరుగుటకు అవకాశమున్నది గాన సంఖ్య గుణాదులను గూడ ఆశ్రయించియుండునని అంగీకరింప బని లేదు. అందుచే భేదము కాని అభేదము కాని లేని ద్రవ్యగుణాదులందు భేదాభేద బుద్ధులను కల్పించు సంఖ్య ముఖ్యముగ ద్రవ్యమునే ఆశ్రయించి యుండునని సంసర్గవాదులు చెప్పుచున్నారు. ఏకత్వ సంఖ్య అభేద జ్ఞానమునకు కారణము, ద్విత్వాది సంఖ్య భేదబుద్ధికి కారణము. ॥12॥

అవతారిక— వాస్తవమున పదార్థములన్నియు భేదాభేద వ్యతీతములైనచో పదార్థముల కంటె భిన్నమగు సంఖ్య వాటియందు భేదాభేద వ్యవహారము నెట్లు కల్పింపగల్గును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆత్మాన్తరాణాం యేనాత్మా తద్రూప ఇవ లక్ష్యతే ।
అతద్రూపేణ సంసర్గాత్ సా నిమిత్త సరూపతా ॥ 13

ఆత్మాన్తరాణాం = ఇతర ద్రవ్యములయొక్క, ఆత్మా = స్వరూపము, అతద్రూపేణ = తద్రూపము కాని, యేన = ఏ గుణాదికముతో, సంసర్గాత్ = సంబంధమువలన, తద్రూప ఇవ = ఆ రూపము కలదివలె, లక్ష్యతే = చూడబడుచున్నదో, సా = అది, నిమిత్త సరూపతా = నిమిత్తమగు గుణముతో సారూప్యము.

తాత్పర్యము— ద్రవ్యాంతరముల స్వరూపము అట్టి రూపములేని ఏ గుణాదికముతో సంసర్గముచే తద్రూపమువలె భాసించునో, అది నిమిత్త సరూపత్వము.

వివరణము— ద్రవ్యాది పదార్థముల ప్రమాణములచే పరస్పర భిన్నములుగ

తెలియబడుచున్నవి. ఈ పదార్థములు ఆ యా గుణములతో సమవాయ సంబంధముచే సంబంధించు చున్నవి. ఆ గుణాదులకును ఆ పదార్థమునకును వాస్తవమున భేదమున్నను ఆ భేదము సమవాయ సంబంధముచే తిరోహితమై పోవుచున్నది. అందుచే పదార్థముల స్వరూపము గుణాదుల స్వరూపముతో కనబడుచున్నది. అనగా పదార్థములకు గుణసారూప్యము కలుగుచున్నది. ఇది కేవలము అట్లు ఆభాసించుటకు నిమిత్తభూతములగు గుణాదులతో కలిగిన సారూప్యమే (నిమిత్త సరూపతా). వాస్తవమున పదార్థములలో నొకదానితో ఒకటికి సరూపత లేదు. అనగా ధర్మాంతరోపధానముచే భేదాభేద వ్యవహారములున్నను వాస్తవమున పదార్థములకు సంకీర్ణత్వము లేదు; అవి పరస్పర వివిక్తములుగ కనబడుచునే యున్నవి అని అభిప్రాయము. ॥13॥

*అవతారిక*—ద్రవ్యగుణాది పదార్థము లన్నియు ఎల్లప్పుడును పరస్పర సంకీర్ణములుగనే కనబడుచున్నవి కదా? వాటికి సంకీర్ణత్వము లేకపోవుట యేమి అని ఆశంకించుకొని కార్యభేదముచే పదార్థభేదము సుస్పష్టమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంసృష్టేష్వపి నిర్భాగే భూతేష్వర్థక్రియా యథా।**
**సత్త్వాదిషు చ మాత్రాసు సర్వాస్వేవం ప్రతీయతే॥ 14**

భూతేషు = పృథివ్యాది భూతములు, సంసృష్టేష్వపి = పరస్పరము కలసియున్నను, సత్త్వాదిషు చ = సత్త్వ రజస్తమోగుణములు సర్వభావ సంసృష్టములైనను, యథా = ఏ విధముగా, అర్థక్రియా = అర్థక్రియ, నిర్భాగే = విభక్తమగు భూతమునందే కానవచ్చునో, ఏవం = ఈ విధముగనే, సర్వాసు = సమస్తమైన, మాత్రాసు = ద్రవ్య గుణాదులందు, ప్రతీయతే = కనబడును.

*తాత్పర్యము*—పృథివ్యాది మహాభూతములు పరస్పర సంసృష్టములైనను, సత్త్వాదిగుణములు గూడ పరస్పర సంబంధములైనను వాటి అర్థక్రియ మాత్రము ఏ విధముగ భిన్న భిన్న రూపముల కానవచ్చునో అట్లే ద్రవ్య గుణాదుల అర్థక్రియలు గూడ భిన్న భిన్నములుగ కానవచ్చుచున్నవి

*వివరణము*—పృథివ్యాది మహాభూతములు ఒకదానితో నొకటి విడదీయుటకు శక్యము కాని విధమున కలిసిపోయి కనుపట్టుచుండును. అయినను వాటి అర్థక్రియలు మాత్రము ప్రత్యేకముగ వేరువేరుగ కనబడుచున్నవి. ధారణ - సంగ్రహ - పాక - వ్యూహ - అవకాశదానములు వరుసగ పృథివ్యప్తేజోవాయ్వాకాశముల కార్యములుగ గోచరించుచున్నవి. అట్లే సత్త్వరజస్తమోగుణములు ఒకదానితో ఒకటి పూర్తిగ కలిసిపోయినను వాటి కార్యములగు ప్రకాశ - ప్రవృత్తి - నియమములు వేరువేరుగ కనబడుచునే యున్నవి. ఈ విధముగనే ద్రవ్య - గుణ - కర్మ - సామాన్య - విశేషములను మాత్రలు కూడ ఒకదానితో ఒకటి కలిసిపోయి యున్నను వాటి కార్యములు మాత్రము వేరువేరుగ కనబడుచున్నవి. ఉదాహరణమునకు— ద్రవ్యము గుణాదులకు ఆశ్రయముగ నుండి అర్థక్రియాకారి యగుచున్నది. గుణములు

ద్రవ్యమునకు తమ స్వరూపమును అర్పించుచు కార్యకారులగుచున్నవి. ఈ విధముగ ద్రవ్య గుణాదులు సర్వదా సంకీర్ణములుగనే కనబడుచున్నను వాటి కార్యములు మాత్రము అసంకీర్ణ ముగ భాసించుచు వాటి భేదమును స్పష్టీకరించుచుండును. ॥14॥

*అవతారిక*— ఇపుడు సంఖ్యాస్వరూపమును పరీక్షించుచున్నాడు. ద్విత్వాది సంఖ్య ఏకత్వముకంటె భిన్నమైనదా అభిన్నమైనదా ? భిన్నమైనచో దాని ఉత్పత్తి ఏకత్వా పేక్షమై యుండజాలదు. అభిన్నమైనచో వాటి భేదమునకు నిమిత్తమే లేకుండ పోవును. అనగా ఆ రెండును ఒక సంఖ్యయే కావలసియుండును ; అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్విత్వాదియోని రేకత్వం భేదా స్తత్పూర్వకాయతః ।**
**వినా తేన న సంఖ్యానా మన్యాసామ స్తి సమ్భవః ॥** 15

యతః = ఏ కారణము వలన, భేదాః = భేదములు, తత్పూర్వకాః = ఏకత్వ పూర్వకములో, ఆ కారణమువలన, ఏకత్వం = ఏకత్వము, ద్విత్వాదియోనిః = ద్విత్వాదులకు కారణము, తేనవినా = ఏకత్వము లేకున్నచో, అన్యాసాం = ఇతరమైన, సంఖ్యానాం = సంఖ్యలకు, సంభవః = సంభవము, నాస్తి = లేదు.

**తాత్పర్యము**— భేదములు ఏకత్వ మూలకములు. అందుచే ఏకత్వము ద్విత్వాదు లకు కారణభూతము. ఏకత్వము లేనిచో ఇతర సంఖ్యలకు సంభవముండదు.

**వివరణము**— భేదము ఉండవలెనన్నచో మొదటి అభేదముండవలెను. అనగా ఒక ఘటమున్నచో దానియందు అభేదముండును. మరియొక ఘటమునందు గూడ అభేద ముండును. ఈ రెండింటిని ఒక్కసారి గ్రహించినచో ఈ ఘటము వేరు, ఆ ఘటము వేరు అను భేదబుద్ధి ఏర్పడును. ఈ విధముగ భేదములన్నియు అభేదపూర్వకములు, అనగా ఏకత్వ పూర్వకములు. కావున ఏకత్వము ద్విత్వాదులకు మూలకారణము. ఏకత్వములేనిచో ఇతర సంఖ్యలకు సంభవమే ఉండదు. ॥15॥

*అవతారిక*— ఏకత్వము ద్విత్వాదులను ఎట్లు జనింపచేయునో చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకత్వే బుద్ధిసహితే నిమిత్తం ద్విత్వజన్మని ।**
**ఏకత్వాభ్యాం సముత్పన్నమేవం వా తత్ప్రతీయతే ॥** 16

బుద్ధిసహితే = స్వవిషయక బుద్ధిసహితములగు (ఏకత్వములను గూర్చిన జ్ఞానముతో సహి తములగు), ఏకత్వే = (రెండు) ఏకత్వములు, ద్విత్వజన్మని = ద్విత్వముయొక్క జన్మ యందు, నిమిత్తం = నిమిత్తము, వా = లేక, ఏకత్వాభ్యాం = రెండు ఏకత్వములచే, సము త్పన్నం = పుట్టిన, తత్ = ద్విత్వము, ఏవం = బుద్ధిపూర్వకముగ, ప్రతీయతే = తోచును.

*తాత్పర్యము*— స్వవిషయకమగు బుద్ధితో గూడిన రెండు ఏకత్వములు ద్విత్వ జన్మకు కారణమని కొందరి యభిప్రాయము. రెండు ఏకత్వములవలన పుట్టిన ద్విత్వము బుద్ధి సహితమై భాసించును అని మరికొందరి యభిప్రాయము.

*వివరణము*— రెండు ద్రవ్యములందు రెండు ఏకత్వములుండును. ఇది ఒక ఏకత్వము, ఇది మరియొక ఏకత్వము అను జ్ఞానము కలిగిన పిమ్మట ఇట్టి జ్ఞానముతో కూడిన రెండు ఏకత్వములు ద్విత్వము జనించుటకు నిమిత్తమని కొందరి మతము. దాని ప్రకారము ద్విత్వమునకు ద్రవ్యద్వయము సమవాయికారణము, ఏకత్వగుణము అసమవాయి కారణము, ఇది ఒక ఏకత్వము, ఇది ఒక ఏకత్వము అనెడు బుద్ధి నిమిత్తకారణము. మరికొందరి మతము ప్రకారము రెండు ఏకత్వములు బుద్ధ్యపేక్ష లేకుండగనే ద్విత్వమును జనింపచేయును. ఈ విధముగ పుట్టిన ద్విత్వము ఏకత్వ బుద్ధిపూర్వకముగ గ్రహింపబడును అని వారు చెప్పుదురు. వీరి మతము ప్రకారను బుద్ధి ద్విత్వమునకు నిమిత్తకారణమని అంగీకరింపబడదు. ఇదియే ఈ రెండు మతములకును గల భేదము.

*అవతారిక*— ద్విత్వస్వరూప విషయమునందు గూడ మతభేదమున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకత్వసముదాయో వా సాపేక్షే వా పృథక్ పృథక్ ।**
**ఏకత్వే ద్విత్వ మిత్యేవం తయోర్ద్వివ్రచనం భవేత్ ॥ 17**

ఏకత్వసముదాయో వా = రెండు ఏకత్వముల యొక్క సముదాయముగాని, వా = లేక, సాపేక్షే = పరస్పరాపేక్షములగు, పృథక్ పృథక్ = వేరు వేరైన, ఏకత్వే = రెండు ఏకత్వములుగాని, ద్విత్వం = ద్విత్వము, ఇత్యేవం = ఈ విధముగ్గ అంగీకరించిన పక్షమున, తయోః = ఆ ఏకత్వములకు, ద్వివచనం = ద్వివచనము, భవేత్ = అగును (కావలసి వచ్చును).

*తాత్పర్యము*— రెండు ఏకత్వముల సముదాయముగాని, వేరువేరుగ నుండు పరస్పర సాపేక్షములగు రెండు ఏకత్వములుగాని ద్విత్వము అని చెప్పినచో ఆ ఏకత్వములు రెండింటికిని ద్వివచనము రావలసివచ్చును.

*వివరణము*— రెండు ఏకత్వములకంటె భిన్నమగు ద్విత్వమనునది లేదను అవ్యతిరేకపక్ష మొకటి ఉన్నది. ఈ పక్షమునందు గూడ రెండు పద్ధతులు కలవు. వృక్షముల సముదాయమే వనము. మృగముల సముదాయమే యూథము. అంతియేకాని వృక్ష మృగ వ్యతిరిక్తముగ వనయూథములనునవి లేవు. అట్లే రెండు ఏకత్వముల సముదాయమే ద్విత్వము. అంతియేకాని రెండు ఏకత్వములవలన క్రొత్తగ ఒక ద్విత్వమనునది పుట్టునని చెప్పుట యుక్తము కాదు. వనాదులలో అవయవ భేదమునుబట్టి భిన్నాకారావభాసము కలుగును; సంఘమును బట్టి ఏకాకారావభాసము కలుగును. దీనిచే 'వనం' అను ఏకవచనాంతమగు శబ్దముచే వృక్ష సముదాయమును బోధించినట్లు 'ద్విత్వం' అనునది ఏకత్వముల సముదాయమును

బోధించును సముదాయమునకు కాక అవయవములకే ప్రాధాన్యమును వివక్షించునపుడు పరస్పరాపేక్షములగు రెండు ఏకత్వములకే ఏకత్వ వ్యవహారమనునది రెండవ పద్ధతి. ఏ పద్ధతి నవలంబించినను ఏకత్వముల కంటె భిన్నమగు ద్విత్వమను మరియొక గుణము లేదు. ఇట్టి అవ్యతిరేక పక్షము యుక్తము కాదు. ఈ పక్షమున ద్విత్వము అని యన్నను రెండు ఏకత్వము లన్నను ఒక్కటే గాన ద్విత్వమనగా రెండు ఏకత్వములని యర్థము. రెండు ఏకత్వము లుండుటచే ద్వివచనము రావలెను కాని ఏకవచనమునకు అవకాశము లేదు. కాని 'ద్విత్వం' అనునపుడు ఏకాకారావభాసపూర్వకమగు ఏకవచనమే కనబడుచున్నది. దీనిని బట్టి 'ద్విత్వము' అనునది రెండు ఏకత్వములకంటె భిన్నమైనదియు, వాటివలన పుట్టునదియు అగు గుణాంతరమని తెలియుచున్నది. కావుననే 'ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే' అను సూత్రమున ద్విత్వమును ఒక్క గుణమునుగా గ్రహించి 'ద్వ్యేకయోః' అని ద్వివచనము ప్రయుక్తమైనది. ద్విత్వమను దానికి రెండు ఏకత్వములు అని అర్థమైనచో దానిలోని రెండు ఏకత్వములు, 'ఏక' అను దానిలోని మరియొక ఏకత్వము కలిసి మూడు అయినవి గాన 'ద్వ్యేకేషామ్' అని బహువచనమును ప్రయోగింపవలసి యున్నది. కావున ద్విత్వము రెండు ఏకత్వముల కంటె భిన్నమైన గుణమని యంగీకరింపవలెను. త్రిత్వము మొదలు దశ సంఖ్యా పర్యంతములగు అన్ని సంఖ్యల విషయమునను ఇట్లే గ్రహించవలెను. ॥17॥

అవతారిక— పై కారికలో చెప్పిన విధమున 'ద్విత్వము' అను సంఖ్యయు; బహుత్వమును ఒక్కొక్క సంఖ్యలే గాన 'ద్విత్వే ద్వివచనమ్' ''బహుత్వే బహువచనమ్'' ఇత్యాది ప్రయోగములు మాత్రమే సాధువులగును గాని 'ద్వయోః ద్వివచనమ్' ''బహుషు బహువచనమ్'' ఇత్యాది ప్రయోగములు అసాధువులగును కదా ? ఇట్టి ద్వివచన బహువచన ప్రయోగములు గూడ లోకమున కనబడుచున్నవి అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు

శ్లో॥ ఏకోఽపి గుణభేదేన సఙ్ఘో భేదం ప్రకల్పయేత్ ।
ఆశ్రయాశ్రయి భేదో హి తదాశ్రయనిబన్ధనః ॥ 18

సంఘః = సముదాయము, ఏకోఽపి = ఒక్కటేయైనను, గుణభేదేన = గుణభూతములైన సముదాయమునందలి యంగముల భేదముచే, భేదం = భేదమును, ప్రకల్పయేత్ = కల్పించును, ఆశ్రయాశ్రయి భేదః = ఆశ్రయమైన దానియొక్కయు ఆశ్రయించి యున్న దానియొక్కయు భేదము, తదాశ్రయ నిబంధనః = సంబంధమునుబట్టి ఏర్పడును కదా ?

**తాత్పర్యము—** సముదాయము ఒక్కటియేయైనను గుణభేదముచే భేదమును కల్పించును. ఆశ్రయాశ్రయిభేదము సంబంధమునుబట్టి ఏర్పడును కదా ?

వివరణము— ఏకత్వాదులకంటె భిన్నములైన ద్విత్వ బహుత్వాది సముదాయములు ఏకత్వాది జన్యములనియు, అవి కాల్పనికములగుటచే ఏకత్వాద్య భిన్నములనియు రెండు మతములు కలవు. ఉత్పత్తి పక్షమున జనకములగు ఏకత్వాదులు జన్యపరవశములు,

బోధించును సముదాయమునకు కాక అవయవములకే ప్రాధాన్యమును వివక్షించునపుడు పరస్పరాపేక్షములగు రెండు ఏకత్వములకే ఏకత్వ వ్యవహారమనునది రెండవ పద్ధతి. ఏ పద్ధతి నవలంబించినను ఏకత్వముల కంటె భిన్నమగు ద్విత్వమను మరియొక గుణము లేదు. ఇట్టి అవ్యతిరేక పక్షము యుక్తము కాదు. ఈ పక్షమున ద్విత్వము అని యన్నను రెండు ఏకత్వము లన్నను ఒక్కటే గాన ద్విత్వమనగా రెండు ఏకత్వములని యర్థము. రెండు ఏకత్వము లుండుటచే ద్వివచనము రావలెను కాని ఏకవచనమునకు అవకాశము లేదు. కాని 'ద్విత్వం' అనునపుడు ఏకాకారావభాసపూర్వకమగు ఏకవచనమే కనబడుచున్నది. దీనిని బట్టి 'ద్విత్వము' అనునది రెండు ఏకత్వములకంటె భిన్నమైనదియు, వాటివలన పుట్టునదియు అగు గుణాంతరమని తెలియుచున్నది. కావుననే 'ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే' అను సూత్రమున ద్విత్వమును ఒక్క గుణమునుగా గ్రహించి 'ద్వ్యేకయోః' అని ద్వివచనము ప్రయుక్తమైనది. ద్విత్వమను దానికి రెండు ఏకత్వములు అని అర్థమైనచో దానిలోని రెండు ఏకత్వములు, 'ఏక' అను దానిలోని మరియొక ఏకత్వము కలిసి మూడు అయినవి గాన 'ద్వ్యేకేషామ్' అని బహువచనమును ప్రయోగింపవలసి యున్నది. కావున ద్విత్వము రెండు ఏకత్వముల కంటె భిన్నమైన గుణమని యంగీకరింపవలెను. త్రిత్వము మొదలు దశ సంఖ్యా పర్యంతములగు అన్ని సంఖ్యల విషయమునను ఇట్లే గ్రహించవలెను. ॥17॥

అవతారిక— పై కారికలో చెప్పిన విధమున 'ద్విత్వము' అను సంఖ్యయు; బహుత్వమును ఒక్కొక్క సంఖ్యలే గాన 'ద్విత్వే ద్వివచనమ్' ''బహుత్వే బహువచనమ్'' ఇత్యాది ప్రయోగములు మాత్రమే సాధువులగును గాని 'ద్వయోః ద్వివచనమ్' ''బహుషు బహువచనమ్'' ఇత్యాది ప్రయోగములు అసాధువులగును కదా ? ఇట్టి ద్వివచన బహువచన ప్రయోగములు గూడ లోకమున కనబడుచున్నవి అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు

**శ్లో॥ ఏకోఽపి గుణభేదేన సఙ్ఘో భేదం ప్రకల్పయేత్ ।**
**ఆశ్రయాశ్రయి భేదో హి తదాశ్రయనిబన్ధనః ॥ 18**

సంఘః = సముదాయము, ఏకోఽపి = ఒక్కటేయైనను, గుణభేదేన = గుణభూతములైన సముదాయమునందలి యంగముల భేదముచే, భేదం = భేదమును, ప్రకల్పయేత్ = కల్పించును, ఆశ్రయాశ్రయి భేదః = ఆశ్రయమైన దానియొక్కయు ఆశ్రయించి యున్న దానియొక్కయు భేదము, తదాశ్రయ నిబంధనః = సంబంధమునుబట్టి ఏర్పడును కదా ?

**తాత్పర్యము**— సముదాయము ఒక్కటియేయైనను గుణభేదముచే భేదమును కల్పించును. ఆశ్రయాశ్రయిభేదము సంబంధమునుబట్టి ఏర్పడును కదా ?

వివరణము— ఏకత్వాదులకంటె భిన్నములైన ద్విత్వ బహుత్వాది సముదాయములు ఏకత్వాది జన్యములనియు, అవి కాల్పనికములగుటచే ఏకత్వాద్య భిన్నములనియు రెండు మతములు కలవు. ఉత్పత్తి పక్షమున జనకములగు ఏకత్వాదులు జన్యపరవశములు,

అనగా జన్యము నిమిత్తమై పనిచేయునవి - గాన గుణములు. కల్పితత్వ పక్షమునందు గూడ అవయవములు సముదాయ పరాధీనములు గాన గుణములు. ద్విత్వ బహుత్వములు స్వస్వరూపముచే ఒక్కొక్కటియేయైనను గుణముల భేదమును బట్టి భిన్నములు వలె కన్పట్టుచున్నవి. ఈ భేదమును పురస్కరించుకొని 'ద్వయోః' 'బహుషు' ఇత్యాది విధమున ద్వివచన బహువచనములు ప్రయుక్తము లగుచున్నవి. ఆధారాధేయముల భేదవ్యవహారము సంబంధమును బట్టి ఏర్పడుచుండును. ఒకప్పుడు ఆశ్రయించి ఉన్నదాని భేదమునుబట్టి ఆశ్రయమగు దాని యందు భేదవ్యవహారము చేయబడుచుండును. ఉదాహరణమునకు - "పరుద్భవానపటురాసీత్, పటుతరశ్చైషమోఽన్య ఏవాసి సంవృత్తః" పరుత్ = నిరుడు నీవు అంతగ పాటవము (నేర్పు) లేనివాడవుగ ఉంటివి ; ఐషమస్ = ఈ యేడు బాగా పాటవము కలిగి క్రొత్తవాడవైనావు) ఇత్యాది వాక్యములందు ఒక వ్యక్తిని ఆశ్రయించుకొని యున్న పాటవముయొక్క భేదమును బట్టి ఆ వ్యక్తి విషయమున గూడ భేదవ్యవహారము కనబడుచున్నది. కొన్ని యెడల ఆశ్రయము యొక్క భేదముచేత ఆశ్రితమునందు భేదవ్యవహారము ఏర్పడును. ప్రకృతమున ద్విత్వాదులు ఏకత్వజన్యములుగాన ఏకత్వమును ఆశ్రయించి యున్నవి. ఆశ్రయభూతములగు ఏకత్వములు భిన్నములగుటచే ఆశ్రితములగు ద్విత్వాదులందు గూడ భేదవ్యవహారము కలిగి తదనుసారముగ ద్వివచనాదులు ప్రయుక్తము లగుచున్నవి. 'ద్వ్యేకయోః' ఇత్యాది స్థలములలో మాత్రము ద్విత్వము స్వగతాభేదమును బట్టి ఏకవచనమునందు ప్రయోగింపబడుచున్నది. ॥18॥

*అవతారిక*— ఇంతవరకు దశసంఖ్యా పర్యవసానమగు సంఖ్యను గూర్చి విచారించి, ఇపుడు వింశత్యాది సంఖ్యాభేదమును గూర్చి విచారించుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యేయ సంఘ సంఖ్యాన సంఘః సంఖ్యేతి కథ్యతే ।**
**వింశత్యాదిషు సాన్యస్య ద్రవ్యసంఘస్య భేదికా ॥ 19**

వింశత్యాదిషు = 'వింశతిః' మొదలగు వాటియందు, సంఖ్యేయ సంఘ సంఖ్యాన సంఘః = లెక్కింపదగిన వాటియొక్క సముదాయము లెక్కించువాటి యొక్క సముదాయము, సంఖ్యా ఇతి = సంఖ్య అని, కథ్యతే = చెప్పబడుచున్నది, సా = ఆవింశత్యాది సంఖ్య, అన్యస్య= మరియొక్క, ద్రవ్యసంఘస్య = గవాది ద్రవ్య సంఘమునకు, భేదికా = పరిచ్ఛేదకము.

*తాత్పర్యము*— 'వింశతిః' ఇత్యాదులందు సంఖ్యేయ సంఘ సంఖ్యాన సంఘము సంఖ్యయని చెప్పబడుచున్నది. అది ఇతర ద్రవ్యసంఘమును పరిచ్ఛేదించును.

*వివరణము*— వింశత్యాది శబ్దములు "పంక్తి వింశతి త్రింశచ్చత్వారింశత్పఞ్చాశత్షష్టి సప్తత్యశీతి నవతిశతమ్" (5-1-60) అను సూత్రముచే నిర్దిష్టములైనవి. వీటి నిష్పత్తిని గూర్చి వార్తికకారుడు సుదీర్ఘమగు విచారము చేసెను. వింశత్యాది శబ్దములు సంఖ్యావాచకములుగను సంఖ్యేయ (లెక్కింపదగిన వస్తువులు) వాచకముగను కూడ ప్రయోగములలో నున్నవి. 'గవాం వింశతిః' (గోవుల యొక్క ఇరువది) ఇత్యాదులలో సంఖ్యా

వాచకము, 'వింశతిర్గావః' (ఇరువది గోవులు) ఇత్యాదులలో సంఖ్యేయవాచకము ఈ వింశతి శబ్దము ''ద్వౌదశతౌ'' ('దశత్' అనగా పదింటి యొక్క సముదాయము) అను నర్థమున 'ద్వి' శబ్దముకంటె 'శతిచ్' ప్రత్యయమును 'ద్వి' శబ్దమునకు 'విన్' భావమును నిపతించు టచే ఏర్పడినదనియు, 'ద్వౌదశతౌ వింశతిః' (రెండు పదుల సముదాయములు వింశతి) యని దీని అర్థమనియు అంగీకరించినచో అపుడు ఈ శబ్దమునకు సంఖ్యేయమగు దానితో సామానాధి కరణ్యము కుదురదు. అనగా 'దశవృక్షాః' (పదిచెట్లు) ఇత్యాదులలో దశన్ శబ్దము వృక్షము లను (సంఖ్యేయములను) బోధించుచున్నది గాన ఈ సంఖ్యా సంఖ్యేయవాచకములు సమా నాధికరణములుగ (ఏకపదార్థ బోధకములుగ) నున్నవి, అందుచే రెండును ప్రథమా బహు వచనమున నున్నవి. పై వ్యుత్పత్తి ప్రకారము 'వింశతి' అనునది రెండు దశద్వర్గములను బోధించుచున్నది గాని సంఖ్యేయములగు గవాదులను ప్రత్యక్షముగ బోధించుటలేదు గాన, వాటితో సామానాధికరణ్యము కుదురదు. సామానాధికరణ్యము లేనిచో ''త్రయాణాం లోకా నాం సమాహారః త్రిలోకీ'' ఇత్యాది విధమున సమానాధికరణము లగు త్రిశబ్ద లోకశబ్దము లకు సమాసము వచ్చినట్లు వింశతి త్రింశదాది శబ్దములకును గవాది శబ్దములకును సమాసము వచ్చి 'వింశతి గవమ్' 'త్రింశత్పూవీ' ఇత్యాది రూపములు సిద్ధింపవు. 'వింశతి' 'త్రింశత్' మొదలగునవి రెండు దశద్వర్గములను, మూడు దశద్వర్గములను బోధించుచున్నవిగాని గోవులు మొదలగు వాటిని బోధించుట లేదు కదా? మరియొక అనుపపత్తి యేమనగా ఈ పదములు రెండు సముదాయములను, మూడు సముదాయములను బోధించుచున్నవి గాన వీటికి ద్వివచన బహువచనములందు ప్రయోగముండవలెను గాని ఏకవచనమున ఉండరాదు. ఈ విషయము లనే— ''వింశత్యాదయో దశదర్థేచేత్ సమాసవచనానుపపత్తిః'' అను వార్తికము చెప్పు చున్నది. 'వింశతి' 'గో' శబ్దములకు సామానాధికరణ్యము లేకపోవుటచే సామానాధికరణ్య మును బట్టి వచ్చెడు ద్విగుసమాసము రాక 'గవాం వింశతిః గోవింశతిః' అను షష్ఠీ సమాసము మాత్రము రావచ్చును.

''సంఖ్యాయాః సంజ్ఞాసంఘ సూత్రాధ్యయనేషు'' అను సూత్రమునుండి సంఘ శబ్దము అనువర్తించుచున్నది గాన 'శతిచ్' ప్రత్యయము సంఘార్థమున చేరి ''ద్వౌదశతౌ పరిమాణమస్య సంఘస్య వింశతిః సంఘః'' అనగా— ఏ సంఘమునకు రెండు దశత్తులు (పదులు) పరిమాణమో ఆ సంఘము వింశతి, అని అర్థము చెప్పిన పక్షమున ఏకవచనము ఉపపన్నమేయైనను సమాసానుపపత్తి దోషము అట్లే ఉన్నది. ఈ పక్షమున మరియొక దోషమేమనగా— 'వింశకో గో సంఘః' అను సాధు ప్రయోగమునకు బదులు 'వింశతిః గో సంఘః' అను అసాధు ప్రయోగము చేయవలసి వచ్చును. వింశతిః అను దానికి ఇరువదియని అర్థమైనపుడు 'వింశతిః పరిమాణం యస్య సంఘస్య' (ఏ సంఘమునకు వింశతి పరిమాణమో అది) అను నర్థమున 'వింశతి త్రింశద్భ్యాం డ్వునన్యతరస్యామ్' అను సూత్రముచే (5-1-21) డ్వున్ ప్రత్యయము వచ్చి వింశకః అను రూపమేర్పడి 'వింశకః గోసంఘః' (వింశతి సంఘాత్మకమగు గోసంఘము) అని అర్థము చెప్పవచ్చు. అట్లుకాక 'వింశతిః' అను దానికే రెండు దశత్తులు ప్రమాణము గల సంఘము అను నర్థము చెప్పినచో అట్టి సంఘము

A. పృథక్ + పృథక్ = వేరువేరుగా అనగా భిన్నభిన్నములగు ప్రకరణములలో, ప్రాజా పత్యా నవగ్రహాః + ఇతి + ఏవమాది భేద సమన్వితాః = ప్రాజాపత్యా నవగ్రాహాః, (ప్రజా పతి దేవతగాగల తొమ్మిది గ్రహములు) ఇట్టివి మొదలగుగాగల భేదముతోగూడినట్టియు, కనుకనే *భిన్నసంఖ్యాః = విభిన్నమగు సంఖ్య కలిగినట్టి, గ్రహాః + తు = గ్రహములు ఐతే, అనగా సోమరసమునుపోయుట కుపయోగించెడి పాత్రలు గ్రహములని శ్రౌత సంప్రదాయము. వానిని మట్టితోగాని కఱ్ఱతోగాని చేయుదురు, అన్యత్ర = మరియొక వాక్యమునందు, విహితాః = విధింపబడియున్నవి, వేదమున వేరువేరు స్థలములలో 9, 10, 1, 1, మున్నగు రీతిని కొన్ని గ్రహములు విధింపబడినవి, వానికి వేరువేరు దేవతలుగూడ చూపబడినవి. అందు ''ప్రాజాపత్యానవ'' అను రీతిని కారికలో నొక వాక్యము చూపబడినది.

B. పై రీతిని లభించిన అర్థమును ప్రకృతమున జూపుచున్నాడు.

అఙ్గత్వేన = అప్రధానముగా, అనగా సమ్మార్జన క్రియలో (శుభ్రపరచుటలో) అప్ర ధానముగా, ప్రతీతానామ్ = తెలియబడుచున్నట్టియు, సోమరసమును ధరియించుటకు ఉప యోగపడుట వలన అప్రధానములుగా జ్ఞానవిషయము లగుచున్నవని భావము, సమ్మార్గి + తు = శుభ్రపరచుటయందు మాత్రము, అఙ్గినామ్ = ప్రధానములేయగు గ్రహములకు పునః = మరల, నిర్దేశమ్ + ప్రతి = గ్రహశబ్దమును ఉచ్చరించుటను గురించి, అనగా ''ప్రాజా పత్యా నవగ్రాహాః'' మున్నగు క్రియా బోధకములలో గ్రహశబ్దమును చర్చించి మరల ''గ్రహం సమ్మార్ష్టి'' (గ్రహమును శుభ్రపరచవలెను) అను వాక్యమున మరల 'గ్రహ' అను శబ్దమును ఉచ్చరించుటను గురించి, యా = ఏ, సంఖ్యా = ఏకత్వమనే సంఖ్యయో, సా = ఆ ఏకత్వ సంఖ్య, కథమ్ = ఎట్లుగా, వివక్షితా = వివక్షింపబడినది, స్యాత్ = కాగలదు ? ఆ సంఖ్య వివక్షితము కానేరదని భావము.

గ్రహములు భిన్న భిన్న ప్రకరణములలో విధింపబడినవి, వానిని జ్ఞాపకము చేయుచు ''గ్రహం సమ్మార్ష్టి'' అను వాక్యము సమ్మార్జనమును అనగా శుభ్రపరచుటను విధించుచున్నది, గ్రహములలో సోమరసము పోయునపుడు వాని ప్రక్కలయందు ఆ రసము చిలుకగా వస్త్రముయొక్క అంచును పవిత్రముగాజుట్టి ఆ గ్రహములను తుడిచి శుభ్రపరచ వలెనని వేదము చెప్పినది. 'గ్రహం సమ్మార్ష్టి' అనునది క్రొత్తగా గ్రహమును విధించునది కాదు, ఆ వాక్యమున సమ్మార్జనము చెప్పబడినను గ్రహములే ప్రధానములగును. కాగా వాక్యాంతమున గ్రహములు విధింపబడినవి. సమ్మార్జనము విషయమై అవి ప్రధానములే యగు

* ''ప్రాజాపత్యా నవగ్రహాః'' ప్రజాపతి దేవతగాగలవి తొమ్మిది గ్రహములు, ''దశైతా నధ్వర్యుః ప్రాతస్సవనే గ్రహాన్ గృహ్ణాతి'' అధ్వర్యుడు ప్రాతస్సవనమున పది గ్రహములను గ్రహించుచున్నాడు. ''ఐన్ద్రవాయవం గ్రహం గృహ్ణాతి'' ఇంద్రవాయు దేవతాకమగు గ్రహ మును గ్రహించుచున్నాడు, ''మిత్రావరుణం గ్రహం గృహ్ణాతి''. మిత్రావరుణ దేవతాకమగు గ్రహమును గ్రహించుచున్నాడు, ఇన్నిటిని శుభ్రపరచవలెనని ''గ్రహం సమ్మార్ష్టి'' అని యున్నది.

(వింశతి సంఘము) ప్రమాణముగా గల మరియొక సంఘమేదియు లేదుగాన పై సూత్రముచే 'డ్వున్' ప్రత్యయము వచ్చుటకు అవకాశముండదు. ఇంక ఈ డ్వున్ ప్రత్యయము సంఘమను నర్థమునందు కాక స్వార్థమునందే వచ్చునని (వింశకః అను ప్రయోగమును సమర్థించుటకై) చెప్పవలసి యుండును. కాని ఈ సూత్రము అర్హీయ ప్రకరణములోనున్నది గాన దానిని స్వార్థ ప్రత్యయ విధాయకమని కల్పించుట కష్ట కల్పన యగును. ఈ భావమునే "పరిమాణిని చేత్ పునః స్వార్థే ప్రత్యయ విధానమ్" అను వార్తికము ప్రతిపాదించినది. మరియు 'వింశతిః' = 'ఇరువది ద్రవ్యములు' అను నర్థము చెప్పినచో గోవులకును వింశతి పదబోధ్యములకును భేదము లేదుగాన షష్ఠి వచ్చుటకు అవకాశము లేదు. రాజు వేరు పురుషుడు వేరు అయినపుడే 'రాజ్ఞః పురుషః' అని షష్ఠి వచ్చును. అట్లే గోవులు వేరు, వింశతి వేరు అను బుద్ధి యున్నపుడే 'గవాం వింశతిః' అని షష్ఠిని ప్రయోగింపవచ్చును. లేకున్నచో 'గావః వింశతిః' అని మాత్రమే ప్రయోగముండును. ఇట్టి ప్రయోగమునందు గూడ గోశబ్ద వింశతి శబ్దములు సమానాధికరణములుగాన 'వింశతి' శబ్దమును గూడ బహువచనముగ ప్రయోగింపవలసి యుండును. ఈ విధముగ వార్తికకారుడు 'వింశతి' ఇత్యాది పదములు వ్యుత్పన్న ప్రాతిపదికములైన పక్షమున అనేక దోషము లుండునని చెప్పి 'సహస్ర' శబ్దాదులవలె వింశత్యాది శబ్దములు గూడ అవ్యుత్పన్న శబ్దములనియు, ఇవి ప్రయోగానుసారముగ సంఖ్యావాచకములుగను సంఖ్యేయవాచకములుగను గూడ ఉండవచ్చుననియు, రూఢ శబ్దములగుటచే 'అప్' శబ్ద 'దార' శబ్దాదులవలె నియతలింగ వచనములై యుండుననియు సిద్ధాంతీకరించెను. కాని భాష్యకారుడు వ్యుత్పత్తిపక్షమునే స్వీకరించి శతిచ్ ప్రత్యయము పరిమాణియగు సంఘము అను నర్థమున విధింపబడినదని అంగీకరించినాడు. "సంఖ్యాయాః సంజ్ఞా—" ఇత్యాది సూత్రమునందలి సంఘశబ్దమునకు ప్రాణి సముదాయమని యర్థము. కాని ఇచట సంఘశబ్దము ప్రాణ్యప్రాణి సాధారణమగు సమూహమును బోధించునుగాన 'గవాం వింశతిః' వలె "వృక్షాణాం వింశతిః" అని గూడ ప్రయోగింపవచ్చునని భాష్యకారుడు చెప్పెను. 'శతిచ్' ప్రత్యయము సంఘార్థకమైనచో వార్తికకారుడు చేసిన— "పరిమాణిని చేత్ పునః స్వార్థే ప్రత్యయ విధానమ్" అను ఆక్షేపణమునకు భాష్యకారుడు "సంహననే వృత్తః సంహననే వర్తిష్యతే" అని సమాధానము చెప్పెను. ఈ కారిక ఆ వాక్యమునకు వ్యాఖ్యారూపము. గోవులు మొదలగునవి సంఖ్యేయములు (లెక్కింపదగినవి). వాటి సంఘము ద్రవ్య సంఘము. రెండు దశత్తులుగ నున్న అట్టి రెండు ద్రవ్య సంఘముల సంఘము అను నర్థమున వింశతి శబ్దము నిపతింపబడినది అది సంఖ్యానములగు రెండు దశద్వర్గముల సముదాయముగాన సంఖ్యాన శబ్దమని చెప్పబడుచున్నది వింశతి శబ్దము సంఖ్యానములగు ఆ రెండు దశద్వర్గముల సముదాయమును బోధించును. వింశతి శబ్దవాచ్యమగు ఆ సంఖ్య (సంఖ్యానసంఘము) గవాది సంఘమునకు విశేషణమగును. అనగా గవాది ద్రవ్యసంఘ పరిమాణమునకు ఉపాధిగ నున్నది. ఈ విధముగ సంఖ్యాన సంఘవాచకమగు వింశతి శబ్దము కంటె పరిమాణియగు గవాది సంఘము అను నర్థమున డ్వున్ ప్రత్యయము రావచ్చును. అనగా రెండు దశత్ సంఘముల ప్రమాణము గల గోసంఘము అను నర్థము చెప్పవచ్చును

గాన డ్వున్ ప్రత్యయమును స్వార్థమున విధింపవలసిన పని ఉండదని తాత్పర్యము. "సంహననే = రెండు దశత్తుల సంఘము అను నర్థమున, వృత్తః = ప్రవర్తించిన వింశతి శబ్దము, సంహననే = గవాది ద్రవ్య సంఘమునందు, వర్తిష్యతే = ప్రత్యయమును పుట్టింప గలదు" అని భాష్య వాక్యార్థము.

వాస్తవమున ద్రవ్యములకు సంబంధించిన ద్రవ్య సంఘమునకును, దశత్తుల దశత్సంఘమునకును పారమార్థికమగు భేదము లేదు. ఇది కేవలము బుద్ధి మాత్ర పరికల్పితము. బుద్ధియందు అవస్థాపితములగు అర్థములను బట్టి ప్రయుక్తములగు శబ్దములు అర్థాకారమగు బుద్ధిని కలిగించుచు వాస్తవమున భేదము లేకున్నను, సంఖ్యా సంఘము వేరు, సంఖ్యేయ సంఘము వేరు అను ప్రతీతిని కలిగించుచుండును. వింశత్యాదులను ఈ విధముగ వ్యుత్పన్న శబ్దములని అంగీకరించినను సమాసానుపపత్త్యాది దోషము లుండవు అను విషయము కైయట హేలారాజాది కృత వ్యాఖ్యలయందు స్పష్టీకరింపబడినది. 'వింశతిః' అనునది దశద్వయ సంఘము (రెండు పదుల సంఘము) అను ధర్మమును మాత్రము బోధించును. గుణవాచకము లగు శుక్లాది శబ్దములను గుణివాచకములతో సమానాధికరణములుగ ప్రయోగించి ('శుక్లః పటః' ఇత్యాది వాక్యములలో) నట్లు ఈ పదములను సంఖ్యేయ సమానాధికరణములుగ ప్రయోగించి అభేదోపచారముచే "వింశతిర్గావః", "వింశతిర్బ్రాహ్మణాః", "వింశతిః కుండాని" ఇత్యాది వాక్యములను ప్రయోగింపవచ్చును. ఈ సామానాధికరణ్యమును బట్టి 'వింశతిగవం' ఇత్యాది సమానాధికరణసమాసము రావచ్చును. వింశతి సంఖ్య ఒక సముదాయముగ గ్రహింపబడిన ద్రవ్యములతో సంబంధించును గాన దానికి సంఖ్యేయము యొక్క లింగవచనములను బట్టి మార్పు రాదు. ముందుగనే తనతో ఏ లింగ సంఖ్యలు సంబంధించినవో అవి అట్లే ఉండును. కావుననే 'వింశతిర్గావః' ఇత్యాది ప్రయోగము లుపపన్నములైనవి. గుణగుణులను భిన్నముగ వివక్షచేసి ప్రయోగించు పక్షమున 'గవాం వింశతిః' ఇత్యాది విధమున ప్రయోగింపవచ్చును. 'వింశతి' అనునది దశత్సంఘ రూపమైన దైనను, దానికి పరంపరయా గోవులతో సంబంధమున్నది గాన షష్ఠి రావచ్చును. ॥19॥

*అవతారిక* — 'ఏకవింశతిః' 'ఏకత్రింశత్' ఇత్యాదులలోని 'ఏక' 'వింశతి' 'ఏక' 'త్రింశత్' అనునవి వేరువేరుగ సంఖ్యావాచకములా లేక 'ఏకవింశతిః' ఇత్యాది సముదాయములే సంఖ్యావాచకములా యని ప్రశ్నించుకొని 'ఏకవింశతి' మొదలగునవియే సంఖ్యావాచకము లని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకవింశతి సంఖ్యాయాః సంఖ్యాన్తర సరూపయోః ।**
**ఏకస్యాం బుద్ధ్యనావృత్త్యా భాగయోరివ కల్పనా ॥ 20**

ఏకస్యాం = అభిన్నమగు (అవయవ రహితమగు), ఏకవింశతి సంఖ్యాయాం = 'ఏకవింశతి' సంఖ్యయందు, బుద్ధ్యనావృత్త్యా = ప్రతి అవయవమునందును బుద్ధియొక్క ఆవృత్తి లేదు కావున, సంఖ్యాన్తర సరూపయోః = 'ఏక' 'వింశతి' అను ఇతర సంఖ్యలతో సమానరూప

ములుగి నున్న, భాగయోరివ = భాగములవలె కన్పట్టు వానియొక్క, కల్పనా = కల్పన చేయబడుచున్నది.

తాత్పర్యము— అభిన్నమగు ఏకవింశతి సంఖ్యయందు, సంఖ్యాంతరములతో సమానరూపములగు భాగముల కల్పనయే కాని వాస్తవమున భాగములు లేవు బుద్ధి అవయవములను వేరువేరుగ గ్రహించుట లేదు కదా ?

వివరణము— 'ఏకాదశ', 'ద్వాదశ' ఇత్యాదులలో ఏకాది శబ్దములకు దశాది శబ్దములతో సమాసమని ''ఏకాదీనాం దశాదిభిర్ద్వంద్వః'' అను వార్తికమున చెప్పి, వార్తిక కారుడు, ''ఏకాదీనాం దశాదిభిర్ద్వన్ద్వ ఇతి చేత్ వింశత్యాదిషు వచన ప్రసంగః'' అను ఆక్షేప వార్తికమున, ''ఇట్లు ద్వంద్వసమాసమును చెప్పరాదు. 'ఏకాదశ' ఇత్యాదులలో ద్వంద్వ సమాసమును అంగీకరించినచో 'ఏక వింశతిః' ఇత్యాదులలో గూడ ద్వంద్వమునే అంగీకరింప వలెను. ఆ పక్షమున ఇందలి 'ఏక' 'వింశతి' శబ్దములు సంఖ్యావాచకములైనచో సమాసము ద్వివచనమునం దుండవలెను. సంఖ్యేయ వాచకమైనచో 'ఏక వింశతయః' అని బహువచనమునం దుండవలెను. 'ఏకవింశతిః' అను ఏకవచన ప్రయోగము అసాధువు కావలసి వచ్చును'' అని ఆశంకించి– ''సిద్ధం త్వధికాన్తా సంఖ్యా సమానాధికరణాధికారే అధిక లోపశ్చ'' అను వార్తికముచే ''ఏకేనాధికా వింశతిః ఏకవింశతిః'' (ఒకటి ఎక్కువగల ఇరువది) అను (ఉత్తరపదలోపి) సమాసము చెప్పుకొనిన ఈ వచనదోష ముండదని సమాధానము చెప్పెను. కాని ఈ సమాసమును చెప్పినచో స్వరదోషము వచ్చునని భాష్యకారుడు ఈ పక్షము నుపేక్షించి 'ఏకశ్చ వింశతిశ్చ' అను ద్వంద్వ సమాసమునే అంగీకరించెను. దీనిని బట్టి 'ఏక వింశతిః' ఇత్యాదులలో అవయవములగు 'ఏక' 'వింశతి' శబ్దములే సంఖ్యా వాచకములుకాని సముదాయము కాదు అను ఆశంక కలుగగా దానిని ఈ కారికచే నిరాకరించు చున్నాడు. ఇచట 'ఏక' 'వింశతి' అను అవయవములు కేవలము వ్యుత్పత్తి మాత్రమునకై కల్పింపబడినవి కాని వాస్తవమున అట్టి అవయవములు లేవు. 'ఏకవింశతి' అనునది నరసింహుని వలె అవయవ భేదరహితమగు ఒక భిన్న సంఖ్యయే. ఈ స్వతంత్ర సంఖ్యయే బుద్ధి గ్రాహ్యముగ నున్నది గాని ఇందలి అవయవములు బుద్ధి గ్రాహ్యములు కావు. నరసింహు మొత్తము ఒక్క వ్యక్తి కాని అందులో నరుడు వేరు సింహము వేరు అను భేదబుద్ధి కః లేదు కదా. అన్వాఖ్యానము నిమిత్తము వీని భాగములను కల్పించి 'ఏకశ్చ వింశతిశ్చ' చెప్పుచున్నారు. ఈ అవయవ కల్పనము కాల్పనికము గాన ఒకరు ఒకటిని ఇరువదిని ఏకవింశతి యనగా మరియొకరు తొమ్మిది + పండ్రెండును కలిసి ఏకవింశతి c మరియొకరు పది పదకొండు కలిసి 'ఏకవింశతి' యనియు చెప్పవచ్చును. ఇట్లు విభాగము కాల్పనికము కావునను, 'ఏకవింశతి' అను సముదాయమే సంఖ్యావాచకము ఏకవచన ప్రయోగమున దోషము లేదు.

అవతారిక— 'ఏకవింశతిః' ఇత్యాది సంఖ్య సంఖ్యాద్వయారబ్ధమై అంగీకరింపవచ్చును కదా ! ఇది అవయవ విభాగ రహితమగు మరియొక సంఖ్య

చెప్పవలెను అని ఆశంకించి కొన్ని శాస్త్రీయ కార్యములు అనుపపన్నములగును గాన దీనిని నిరస్తావయవమగు సంఖ్యాంతరమని అంగీకరింపవలెనని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అసంఖ్యాసముదాయత్వాత్ సంఖ్యాకార్యం విధీయతే ।**
**సమూహత్వే తు తన్నస్యాత్ స్వాఙ్గాదిసముదాయవత్ ॥ 21**

**అసంఖ్యా** సముదాయత్వాత్ = సంఖ్యల సముదాయము కాదు కావుననే, సంఖ్యాకార్యం = సంఖ్యాకార్యము, విధీయతే = విధింపబడుచున్నది, స్వాఙ్గాది సముదాయవత్ = స్వాంగాది వాచకపదముల సముదాయమువలె, సమూహత్వే = ఇదిగూడ సంఖ్యా సమూహమని చెప్పి నచో, తత్ = ఆ సంఖ్యా కార్యము, నస్యాత్ = రాకపోయెడిది.

తాత్పర్యము— 'ఏకవింశతి' ఇత్యాదికము సంఖ్యా సముదాయము కాదు కావుననే సంఖ్యాకార్యము విధింపబడుచున్నది. స్వాంగాది సముదాయము వలె ఇదియు సముదాయమే యైనచో ఆ సంఖ్యాకార్యము ప్రవర్తించెడిది కాదు.

వివరణము— 'ఏకవింశతిః అధికా అస్మిన్ శతే' (ఇరువది ఒకటి అధికముగా గల శతము) 'ఏకత్రింశత్ అధికా అస్మిన్ శత్' అను నర్థమున 'శదన్త వింశతేశ్చ' అను సూత్రముచే 'డ' ప్రత్యయము వచ్చి 'ఏకవింశం' 'ఏకత్రింశమ్' (శతమ్) అను రూపములు సిద్ధించును, 'శత్' అనునది అంతమునందు కలదానికిని, 'వింశతి' శబ్దమునకును 'అది దీని యందు అధికముగ నున్నది' అను నర్థమున 'డ' ప్రత్యయము వచ్చును'' అని ఈ సూత్ర మున కర్థము ఇచట నున్న వార్తికములను బట్టి శదంతమునకే కాక శదంతాంతమునకును, వింశత్యంతమునకును గూడ 'డ' ప్రత్యయము వచ్చును అని అర్థము చెప్పవలెను. అట్లు చెప్పినచో 'గోత్రింశత్ అధికా అస్మిన్ శతే' 'గోవింశతిః అధికా అస్మిన్ శత్' అను నర్థమున 'గోత్రింశత్' 'గోవింశతి' శబ్దములు గూడ శదంతాంత - వింశత్యంతములగుటచే ఈ సూత్రముచే డ ప్రత్యయము రావలసియున్నది. ఆచట రాకుండుటకై 'సంఖ్యాగ్రహణంచ' అను వార్తికము చెప్పబడినది. దీనినిబట్టి ఈ శదంత - వింశత్యంతములు సంఖ్యావాచకము లైన గాని ఈ 'డ' ప్రత్యయము రాదు. 'గోత్రింశత్' 'గోవింశతి' పదములు సంఖ్యావాచక ములు కావు గాన ఈ సూత్రమున కతి ప్రసంగము లేదు. ప్రకృతమున 'ఏకత్రింశత్' 'ఏక వింశతి' మొదలగు పదములు సంఖ్యా సముదాయరూపములని అంగీకరించినచో అవి సంఖ్యా వాచకములు కావు గాన 'శదన్త వింశతేశ్చ' అను సూత్రముచే డ ప్రత్యయము వచ్చుటకు అవకాశము ఉండదు. ఈ విధముగ సంఖ్యాకార్యములగు డ, డట్, తయప్, తమట్, మయట్ మొదలగు ప్రత్యయములు 'ఏకవింశతి' 'ఏకత్రింశత్' ఇత్యాది పదములకు గూడ రావలె నన్నచో ఇవి సంఖ్యా సముదాయాత్మక పదములని అంగీకరింపరాదు. సంఖ్యావాచకములగు అఖండ పదములని అంగీకరింపవలెను.

సంఖ్యా సముదాయములని అంగీకరించినచో సంఖ్యా కార్యములు రావనుటకు ''స్వాఙ్గాది సముదాయవత్'' అనునది ఉదాహరణముగ చూపబడినది. 'స్వాంగాచ్చోప సర్జ

నాద సంయోగోపధాత్' (4-1-54) అను సూత్రముచే ఉపసర్జనమగు స్వాంగ వాచకము కంటె వికల్పముగ 'జీష్' విధింపబడినది. 'చంద్రముఖీ - చంద్రముఖా' ఇత్యాదు లుదాహరణ ములు, 'పాదః' మొదలగునవి స్వాంగములైనను స్వాంగ సముదాయరూపములగు 'పాణి పాద' శబ్దము స్వాంగము కాదు. అందుచే 'కల్యాణ పాణిపాదా' ఇత్యాదులలో ఈ సూత్రము ప్రవర్తింపదు. అట్లే 'ఏకత్రింశత్' మొదలగునవి సంఖ్యా సముదాయములైనచో సంఖ్యా వాచకములు కావు గాన ''శదన్త వింశతేశ్చ'' అను సూత్ర ప్రవృత్తికి అవకాశముండెడిది కాదు. 'స్వాంగాది' అను ఆదిపదముచే మరియొక ఉదాహరణము గూడ సూచింపబడినది. 'కాశీ' శబ్దము జనపదవాచకము ; 'కోసల' శబ్దము గూడ జనపదవాచకము. కాని 'కాశి కోసల' అను జనపద సముదాయవాచక శబ్దము జనపదవాచకము కాదు. అందు 'తత్ర భవః' (అక్కడ నివసించువాడు) అను అర్థమున 'వృద్ధాచ్ఛః' అను సూత్రముచే (4-2-114) ఛ ప్రత్యయము వచ్చి 'కాశి కోసలీయః' అను రూపము నిష్పన్నమగును గాని ''జనపద తదవధ్యోశ్చ'' అను సూత్రముచే 'వుఞ్' రాదు. అట్లే ప్రకృతమున గూడ గ్రహించ వలెను. ॥21॥

అవతారిక — 'ద్విదశాః' 'త్రిదశాః' ఇత్యాది సమాసములందలి అర్థవిశేషాదు లను తెలుపుచున్నాడు.

శ్లో॥ సంఖ్యేయాన్తర తన్త్రాసు యా సంఖ్యాసు ప్రవర్తతే ।
ఆవృత్తివర్గ సంఖ్యేయా తాం సంఖ్యాం తాదృశీం విదుః ॥ 22

ఆవృత్తివర్గ సంఖ్యేయా = దశాది సంఖ్యల ఆవృత్తికాని, దశాది సంఖ్యాపరిచ్ఛేద్యమగు వర్గము గాని సంఖ్యేయముగా గల, యా = ఏద్వ్యాదిసంఖ్య, సంఖ్యేయాన్తర తంత్రాసు = ఇతర సంఖ్యేయములు ప్రధానముగా గల, సంఖ్యాసు = దశాది సంఖ్యలయందు, ప్రవర్తతే = ప్రవర్తించునో, తాం = ఆ, సంఖ్యాం = సంఖ్యను, తాదృశీం = ఆ వృత్తివర్గ సంఖ్యేయ ప్రధానమైనదానినిగా, విదుః = తెలిసికొనుచున్నారు.

తాత్పర్యము— ఆ వృత్తికాని వర్గముగాని సంఖ్యేయముగా గల ఏ ద్వ్యాది సంఖ్య సంఖ్యేయాంతరములు ప్రధానముగా గల సంఖ్యల విషయమున ప్రవర్తించునో ఆ సంఖ్యను అట్టి దానినిగా చెప్పుదురు.

విశేషము— 'ద్వి' శబ్దము ''సంఖ్యయావ్యయాసన్నాదూరాధిక సంఖ్యాః సంఖ్యేయే'' (2-2-25) అను సూత్రముచే దశన్ శబ్దముతో సమసించగా సమాసాంత ప్రత్యయాదులు వచ్చి 'ద్విదశాః' అను బహువ్రీహి సమాసరూపము సిద్ధించినది. ''ద్విః దశ ద్విదశాః'' (రెండుమార్లు ఆవృత్తములగు పది) అని విగ్రహవాక్యము. ఇచట 'దశన్' అను సంఖ్య సంఖ్యేయాంతర తంత్రము. అనగా 'ద్వి' సంఖ్యచే సంఖ్యేయములగు వాటికంటె భిన్నములగు సంఖ్యేయములు (పది వస్తువులు) ప్రధానముగా కలది. దీనితో 'ద్వి' శబ్దము సంబంధమును పొందుచున్నది (ప్రవర్తతే) అనగా సమసించుచున్నది. ఈ ద్విశబ్దమునకు

దశ సంఖ్యావృత్తి గాని, దశ సంఖ్యచే పరిచ్ఛేద్యములగు వస్తువుల వర్గముగాని సంఖ్యేయము. అనగా ఈ ద్విశబ్దము 'రెండు దశ శబ్దా వృత్తులు' అను నర్థమునుగాని, దశ సంఖ్యాకములగు రెండు వర్గములు అని గాని యర్థము. ॥22॥

అవతారిక— 'ద్వి' సంఖ్య దశసంఖ్య యొక్క ఆవృత్తినిగాని, లేదా దశ సంఖ్యేయ వస్తువుల వర్గమునుగాని పరిచ్ఛేదించుచున్నది అని చెప్పబడినది. అట్లు కాక దశ సంఖ్యనుగాని, దశ సంఖ్యచే సంఖ్యేయములగు పది వస్తువులనుగాని ద్విసంఖ్య పరిచ్ఛేదించు చున్నదని ఏల చెప్పరాదు– అని ఆశంకించుకొని అందులకు అనుపపత్తిని చెప్పుచున్నాడు.

**శ్లో॥ న సంఖ్యాయాం న సంఖ్యేయే ద్వౌదశేత్యస్తి సమ్భవః ।**
**భేదాభావాన్న సంఖ్యాయాం విరోధాన్న తదాశ్రయే ॥ 23**

సంఖ్యాయాం = సంఖ్య విషయమునగాని, సంఖ్యేయే = సంఖ్యేయముల విషయమునగాని, ద్వౌదశ ఇతి = రెండు దశలు అని చెప్పుటకు, సమ్భవః = సంభవము, నాస్తి = లేదు, భేదాభావాత్ = భేదము లేకపోవుట వలన, సంఖ్యాయాం = సంఖ్య విషయమున సంభవము, న = లేదు, విరోధాత్ = విరోధము వలన, తదాశ్రయే = సంఖ్యేయమునందు సంభవము, న = లేదు.

తాత్పర్యము— 'ద్వౌదశ' అనునపుడు ద్విశబ్దము 'దశ' సంఖ్యా శబ్దముతోగాని దశ సంఖ్యాకములగు సంఖ్యేయములతో గాని సంబంధింపజాలదు. 'దశ' సంఖ్య ఒక్కటియే గాన, దానిలో భేదము లేదుగాన దానితో ద్విశబ్దాన్వయము కుదరదు. 'రెండు' అను దానికిని 'పది'కిని విరోధము గాన సంఖ్యేయముతో గూడ సంబంధింపదు.

విశేషము— ద్విశబ్దము 'దశ'తో సంబంధింపవలె నన్నచో రెండు పద్ధతు లుండ వలెను. అది 'దశ' అను సంఖ్యతోడనైనను అన్వయించవలెను లేదా దశన్ శబ్దార్థమగు 'పది వస్తువులు' అను దానితో నైనను అన్వయించవలెను. 'దశ' అనునది ఒక్క సంఖ్య కావున దానిని రెండు సంఖ్యలనుట అయుక్తముగాన ద్విశబ్దము దశసంఖ్యతో అన్వయించుట అనెడు మొదటి పక్షము అయుక్తము. పది వస్తువులు ఎన్నటికిని రెండు కాజాలవు గాన ద్విశబ్దము దశశబ్ద సంఖ్యేయములతో అన్వయించును అనెడు రెండవ పక్షముగూడ అయుక్తము. కావున ద్విశబ్దము దశశబ్దావృత్తులతోడనో లేదా దశసంఖ్యాకములగు వస్తువుల వర్గము తోడనో అన్వయించుననెడు పూర్వకారికోక్త పక్షములే యుక్తములు. ॥23॥

అవతారిక— ఈ విషయమునే ముగించుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యాయేతే దశద్వర్గౌ ద్విదశా ఇతి సంఖ్యయా ।**
**తద్రూపే వాపి సంఖ్యేయే ఆవృత్తిః పరిగణ్యతే ॥ 24**

ద్విదశాః ఇతి = ద్విదశాః అనుచోట, సంఖ్యయా = ద్వి సంఖ్యచే, దశద్వర్గౌ = రెండు దశ

ద్వర్గములు (రెండు పదుల సముదాయములు), సంఖ్యాయేతే = చెప్పబడు చున్నవి, వా+అపి = లేక, తద్రూపే = దశరూపమగు, సంఖ్యేయే = సంఖ్యేయము విషయమున, ఆవృత్తిః = రెండు పర్యాయములు ఆవృత్తి, పరిగణ్యతే = ద్వి శబ్దముచే లెక్కించబడు చున్నది.

తాత్పర్యము— 'ద్విదశాః' అనునపుడు 'ద్వి' సంఖ్యచే రెండు దశద్వర్గములు లెక్కింపబడుచున్నవి. లేదా దశరూపమగు సంఖ్యేయమునందు ఆవృత్తి పరిగణింపబడు చున్నది.

విశేషము— దశసంఖ్యా పరిచ్ఛిన్నమగు ఒక వర్గమున్నది. దానితోపాటు మరి యొక వర్గమును చెప్పుటకై ద్విత్వము గ్రహింపబడుచున్నది. అనగా ద్విశబ్దము రెండు దశ ద్వర్గములందున్న ద్విత్వమును బోధించుచున్నది– పది వస్తువుల సముదాయములు రెండు అని చెప్పుచున్నది. కావున "ద్వౌ దశతౌ ద్విదశాః" అని విగ్రహము. అనగా దశన్ శబ్దము నకు ద్విశబ్దముతో సంబంధము మరియొక విధముగ కుదురదు గాన 'దశ' అను దానికి 'దశ వర్గము' అని యర్థము. వర్గమునకును, వర్గములోనున్న వాటికిని అభేదమును వివక్షచేయుటచే 'ద్విదశాః' అనుచోట ద్వివచనమునకు బదులు బహువచనము వచ్చినది. రెండవ పక్షమేమ నగా– 'దశ' శబ్దమునకు 'దశవర్గము' అను నర్థము చెప్పవలసిన యావశ్యకత లేకుండగనే 'ద్వి' శబ్దము 'దశ' శబ్దావృత్తిని బోధించును. 'ద్విః దశ ద్విదశాః' (రెండు పర్యాయములు పది) అని విగ్రహవాక్యము. 'ద్వి' శబ్దమునకు ఆవృత్త్యర్థమున 'సుచ్' ప్రత్యయమును చేర్చుటచే 'ద్విః' అను పదము నిష్పన్నమగును. రెండు పర్యాయములు అని యర్థము. 'ద్విదశాః' ఇత్యాది సమాస స్థలములలో సమాస వృత్తిచే 'ద్విశబ్దమే' 'ద్విః' అను దాని అర్థమును బోధించును గాన 'సుచ్'ను చేర్చవలసిన పనిలేదని "సుజభావోఽభిహితార్థత్వాత్ సమాసే" అను వార్తికమున చెప్పబడినది. ॥24॥

అవతారిక— 'సంఖ్యాయా అవయవే తయప్' (5-2-42) అను సూత్రముచే అవయవభూతమగు సంఖ్యను బోధించు ప్రథమాంత శబ్దముకంటె 'ఈ అవయవి యొక్క అవయవమగు సంఖ్య' అను నర్థమున తయప్ ప్రత్యయము విధింపబడినది. 'పంచ అవ యవాః అస్య ఇతి పంచతయమ్' (దేనికి ఐదు అవయవము లున్నవో ఆ సముదాయము పంచతయము) ఇత్యాదు లుదాహరణము. ఈ సూత్రముచే 'బహవః అవయవాః అస్యాః సంఖ్యాయాః' అను నర్థమున బహుశబ్దము కంటె తయప్ ప్రత్యయము ఏల రాదు అని ఆశంకించుకొని, భాష్యమున, అది రాకుండుటకు కారణము చెప్పబడినది. ఆ విషయమును వివరించుచున్నాడు.

శ్లో॥ సంఖ్యానామకసంఖ్యాస్తి సంజ్ఞైషేతి యథోచ్యతే ।
రూపం న రూపమప్యేవం సంజ్ఞా సాహి సితాదిషు ॥ 25

యథా = ఏ విధముగా, రూపం = రూపమనెడు పేరుగల, రూపం = సిత పీత నీలాదివర్ణ వ్యతిరిక్తముగా విలక్షణ కార్యస్వభావములు గల రూపము, న = లేదో, హి = ఏలయనగా,

సా = ఆరూపం అనునది, సితాదిషు = సితాదులయందు, సంజ్ఞా = సంజ్ఞా మాత్రమే, ఏవం = ఈ విధముగనే, సంఖ్యానామ = సంఖ్య అనెడు, సంఖ్యా = అవయవినియగు సంఖ్య, నాస్తి = ఏకత్వాది సంఖ్యలకంటె భిన్నముగ లేదు, ఏషా = ఇది, సంజ్ఞేతి = ఏకత్వాది సర్వ సంఖ్యానుగతమైన సంజ్ఞయే యని, ఉచ్యతే = చెప్పబడుచున్నది

తాత్పర్యము— సితపీతాది వర్ణములకంటె వ్యతిరిక్తముగ రూపమనెడు పేరుతో మరియొక రూపమేదియును లేదు. ఇది సితాదులందన్నిటియందును ఉన్న రూపసామాన్యమును బట్టి వచ్చిన సంజ్ఞా మాత్రమే. అట్లే ఏకత్వాది సంఖ్యా వ్యతిరిక్తముగ సంఖ్య అనెడు ఒక అవయవి లేదు. ఇది సర్వసంఖ్యానుగతమగు 'సంఖ్య' యనెడు పేరు మాత్రమే.

వివరణము— 'బహవః అవయవాః అస్యాః సంఖ్యాయాః' అను నర్థమున బహు శబ్దము కంటె తయప్ రాదు అని చెప్పుటకు భాష్యకారుడు ఈ క్రింది యుక్తులను చెప్పెను. ఈ అర్థమున తయప్ ప్రత్యయము లావలెనన్నచో 'బహు' శబ్దార్థము అవయవమనియు, ఇది అవయవముగల మరియొక సంఖ్యారూపమగు అవయవి ఉన్నదనియు చెప్పవలసి యుండును. ఇచటనున్న 'సంఖ్యా' అనునదియే అవయవి యని చెప్పుటకు వీలులేదు. ఏలయన ఈ 'సంఖ్యా' అనునది ఏకత్వాది సంఖ్యావిశేషములం దన్నిటియందును అనుగతముగ నున్న ఒక నామధేయము. అనగా ఏకత్వాదికము విశేషము, సంఖ్య సామాన్యము. సామాన్య విశేషములకు అవయవావయవిభావము ఉండదు. ఘటత్వము అవయవి, ఘటము దాని అవయవము అనెడు ప్రతీతి లేదు కదా! కొన్ని యెడల అవయవిత్వము కల్పితమైనను కార్యభేదము, రూపభేదము సమాఖ్యాభేదము, వేరువేరుగ కనబడును. ఉదాహరణమునకు— వృక్షములకును వనమునకును వాస్తవమున భేదము లేదు. ఐనను వీటికి అవయవావయవి భావము కల్పితమైనది. ఈ భేదమును బట్టి కార్యాదులలో భేదము కానవచ్చుచున్నది. వృక్షముచేయు కార్యముకంటె వనముచేయు కార్యము వేరుగ నుండును. వాటి రూపమునందు గూడ భేదమున్నది. వాటి సమాఖ్య (పేరు) లో గూడ భేదమున్నది. ప్రకృతమున సంఖ్య ఏకత్వాదులు చేయు పరిచ్ఛేదము కంటె భిన్నమగు మరియొక పరిచ్ఛేదమును దీనిని చేయుటలేదు. శుక్లాదులకంటె వ్యతిరిక్తమగు రూపమేదియు రూపమునకు లేదు. అట్లే ఇచట గూడ ఏకత్వాది వ్యతిరిక్తమగు రూపమేదియు సంఖ్యకు లేదు. కావున 'సంఖ్య' అను దానిని సంజ్ఞామాత్రమే యని అంగీకరింప వలెను గాని దానికి అవయవిత్వము లేదు. ఇట్లే 'రూప' శబ్దమునకు సితపీతాది సాధారణమగు రూపము అను అర్థము చెప్పిన పక్షమున ఇది (రూపశబ్దము) సామాన్యవాచకమగును గాన అపుడు గూడ అవయవావయవిభావము లేకపోవుటచే 'బహుతయం రూపం' అని ప్రయోగింపలాదు. కాని 'రూప' శబ్దమునకు అనేక రూపసముదాయమగు చిత్రరూపమని చెప్పిన పక్షమున అపుడు ''బహవః అవయవాః యస్యతత్ చిత్రం రూపమ్'' అను నర్థమున 'బహుతయం రూపం' అని తయప్ప్రత్యయమును చేసి ప్రయోగించవచ్చును. ఈ విషయము— ''బహుతయం రూపమిత్యే తచ్చిత్రస్య రూపస్యావయవిత్వవివక్షాయాం భవతి. యదా తు రూపసామాన్యం వివక్ష్యతే శుక్లాది విశేషవిషయం తదా సామాన్య విశేషయోః అవయవావయవిభావాభావాన్న భవతి'' అను కైయటమున స్పష్టము చేయబడినది.

'బహవః అవయవాః అస్యాః సంఖ్యాయాః' అను నర్థమున బహు శబ్దముకంటె (బహు శబ్ద సంఖ్యా శబ్దములకు అవయవావయవిభావ సంబంధము లేకుండుటచే) తయప్ ప్రత్యయము రాకున్నను "బహవః అవయవాః అస్యాం వింశతౌ" అను నర్థమున రావచ్చును కదా యని ఆశంకింపవచ్చును. కాని అచట గూడ అవయవావయవి భావము లేదు. బహుత్వము త్రిత్వ చతుష్ట్వాదులలో కూడ నున్నదిగాన కేవలము వింశతికి మాత్రమే అవయవము కాదు. ఇది అనేక సంఖ్యా సాధారణము. అందుచే బహుత్వమునకును వింశతికిని సామాన్య విశేష భావసంబంధమే కాని అవయవావయవి భావసంబంధము లేకపోవుటచే 'బహుతయీ వింశతిః' ఇత్యాది ప్రయోగములు కూడ సాధ్యములు కావు ॥25॥

*అవతారిక*— 'సంఖ్య' అనునది సామాన్య నామధేయము మాత్రమే అను విషయమును విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యాత్వ జాతియోగాత్తు సంఖ్యా సంఖ్యేతి కథ్యతే।**
**రూపత్వ జాతియోగాచ్చ రూపే రూపమితి స్మృతమ్ ॥ 26**

సంఖ్యాత్వ జాతియోగాత్ + తు = సంఖ్యాత్వము అనెడు సామాన్యముతో సంబంధము వలన సంఖ్యా = సంఖ్య, సంఖ్యేతి = సంఖ్య అని, కథ్యతే = చెప్పబడుచున్నది, రూపే = రూపము నందు, రూపత్వ జాతియోగాత్ = రూపత్వ జాతితో సంబంధమువలన, రూపమితి = రూపము అని, స్మృతమ్ = చెప్పబడినది.

తాత్పర్యము— సంఖ్యాత్వ జాతితో సంబంధముండుటచే, సంఖ్య, సంఖ్యయని చెప్పబడుచున్నది. రూపత్వ జాతితో సంబంధముండుటచే, రూపము, రూపమని చెప్పబడుచున్నది. కావున అవయవావయవి భావసంబంధము లేకుండుటచే 'బహుతయీ సంఖ్యా' "బహుతయం రూపమ్" అను ప్రయోగములు అయుక్తములని తాత్పర్యము. ॥26॥

*అవతారిక*— 'అనభిహితే' (2-3-1) అను అధికార సూత్రమున్నది. ఇది 'కర్మణి ద్వితయా' ఇత్యాదులలోనికి (2-3-2) అనువర్తించుటచే "కర్మాదులు తిఙ్ - కృత్ - తద్ధిత - సమాసాదులచే అభిహితములు కానపుడు ద్వితీయాదులు వచ్చును" ఇత్యాద్యర్థములు లభించును. 'హరిః సేవ్యతే' (హరి సేవించబడుచున్నాడు) ఇత్యాదులలో కర్మార్థక లకారముచే కర్మ అభిహితమైపోయినది గాన కర్మయగు హరి శబ్దమునకు ద్వితీయ రాలేదు. "ప్రాతిపదికార్థ" ఇత్యాది సూత్రముచే ప్రథమయే వచ్చినది అనగా 'అనభిహితే' అను అధికార సూత్రముండుటచే ఇచట ద్వితీయ రాలేదు. కాని ఇచట ఒక ఆశంక గలదు. 'ఉక్తార్థానాం అప్రయోగః'– (ఒక ప్రత్యయము బోధించవలసిన అర్థమును మరియొక ప్రత్యయము ఆదివరకే బోధించి యున్నచో ఇక ఈ ప్రత్యయము రాదు అని అర్థము) అను న్యాయముచే 'బహుపటుః' ఇత్యాదులలో 'బహు' అను తద్ధిత ప్రత్యయము ఒక అర్థమును బోధించియుండగా మరల అదే అర్థమును బోధించు 'కల్పప్' మొదలగు ప్రత్యయములు ఏ

విధముగ చేర్చబడవో అట్లే 'హరిః సేవ్యతే' ఇత్యాదులలో గూడ తిజాదులచే కర్మ అభిహిత మైన పిమ్మట మరల ద్వితీయాదులకెట్లును అవకాశముండదు గాన 'అనభిహితే' అను అధి కారము అనావశ్యకము కదా యని ఆశంకించుకొని దానికి సమాధానము ఇట్లు చెప్పబడినది. 'కర్మణి ద్వితీయా' ఇత్యాది సూత్రములకు ''ద్వ్యేకయోర్ద్వివచనైక వచనే'' 'బహుషు బహు వచనమ్' అను సూత్రములతో ఏకవాక్యత్వమును కల్పించి (సమన్వయించి) ''అనభిహిత మగు కర్మయందలి ఏకత్వ ద్విత్వ బహుత్వములను బోధించుటకు ద్వితీయైకవచన ద్వివచన బహువచనములు వచ్చును'' అని అర్థము చెప్పవలెను. అనభిహితాధికారము లేనిచో 'కృతః కటః' ఇత్యాదులలో క్తప్రత్యయముచే కర్మ చెప్పబడినను ఏకత్వము చెప్పబడలేదు గాన ''ఉక్తార్థానామప్రయోగః'' అనునది ప్రవర్తింపదు గాన ద్వితీయ రావలసి వచ్చును. అనభి హితాధికారముండుటచే 'అభిహితము కాని కర్మయొక్క--' ఇత్యాద్యర్థము వచ్చును గాన, ఇచట క్త ప్రత్యయముచే కర్మ అభిహితమై పోయినది గాన ద్వితీయ రాదు. ఇందులకై 'అనభిహితే' అను అధికార సూత్రము ఆవశ్యకము. దీనినంతను మనస్సులో నుంచుకొని, ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

'ఏకః' 'ద్వౌ' 'బహవః' ఇత్యాది స్థలములలో ప్రాతిపదికములచే ఏకత్వాదులు అభిహితములైనను ''ప్రాతిపదికార్థ లింగ పరిమాణ వచనమాత్రే ప్రథమా'' అను సూత్ర ముచే వచనమాత్రమునందు గూడ ప్రథమ విహితముగాన, ప్రథమ వచ్చినది. కాని పైన చూపిన విధమున అనభిహిత కర్మాదుల ఏకత్వాదులను బోధించుటకు, లేదా ఏకత్వాద్య వచ్ఛిన్న అనభిహిత కర్మత్వాదులను బోధించుటకు ద్వితీయైక వచనాదులు వచ్చునని 'కర్మణి ద్వితీయా' ఇత్యాదుల కర్థము చెప్పబడినది. 'ఏకం' 'ద్వే' 'బహూని' ఇత్యాదులలో ఏక మొదలగు ప్రాతిపదికములచే ఏకత్వాదు లభిహితము లగుచున్నవి గాన ఇచట ద్వితీయైక వచనాదులు ఎట్లు వచ్చును అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నిమిత్తమేకమిత్యత్ర విభక్త్యా నాభిధీయతే।
తద్వతస్తు యదేకత్వం విభక్తిస్తత్ర వర్తతే॥ 27

ఏకం + ఇతి + అత్ర = 'ఏకం' అనుచోట, విభక్త్యా - విభక్తి ప్రత్యయముచే, నిమిత్తం = ఏకశబ్ద ప్రవృత్తి నిమిత్తము (అర్థము) అగు ఏకత్వము, నాభిధీయతే = చెప్పబడుట లేదు, తద్వతః = ప్రవృత్తి నిమిత్తభూతమగు ఏకత్వావచ్ఛిన్నమగు ప్రాతిపదికార్థము యొక్క, యత్ = ఏ, ఏకత్వం = ఏకత్వము కలదో, తత్ర = ఆ ఏకత్వ రూపార్థమున, విభక్తిః = విభక్తి ప్రత్యయము, వర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— 'ఏకం' అనుచోట విభక్తి ప్రత్యయము ప్రాతిపదికార్థమగు ఏకత్వమును బోధించుట లేదు. మరియేమనగా— ఆ ప్రాతిపదికార్థము నందలి ఏకత్వమును బోధించుచున్నది.

వివరణము— ఇచట 'ఏక' శబ్దము ఉదాహరణార్థము చెప్పబడినని గాన ద్వి

చున్నవి. 'పశునాయజేత' అను వాక్యార్థముకంటె ఇది విలక్షణముగా నున్నది. కనుక 'గ్రహమ్' అను పదమున ద్వితీయా విభక్తికి అర్థముగా కాన్పించెడి ఏకత్వ సంఖ్య వివక్షితము కానేరదు. అందుచే పూర్వ వాక్యములలో ఎన్ని గ్రహములు చెప్పబడినవో, వానిని అన్నిటిని శుభ్రపరచవలెననియే వాక్యార్థము లభించును. అట్లుకాక ఏకత్వమును వివక్షించిన ఒక గ్రహమును శుభ్రపరచవలెనని యర్థము చెప్పవలెను. అట్లు చెప్పుట శ్రౌత సంప్రదాయము కాదు. 'పశునాయజేత' అను వాక్యమున 'పశునా' అను పదమున గల తృతీయా విభక్తికి అర్థమగు ఏకత్వమును విడువకయే దానితో కలిపియే వాక్యార్థము చెప్పవలెను. ఒకే పశువును సాధనముగా గైకొని యాగము చేయవలెను. "గ్రహం సమ్మార్ష్టి" అను వాక్యమున 'గ్రహమ్' అను పదమున ద్వితీయా విభక్తికి అర్థముగానున్న ఏకత్వసంఖ్యను విడనాడియే వాక్యార్థము చెప్పవలెను. అన్ని గ్రహములను శుద్ధములుగా బాగుచేయవలెను. ''గ్రహ'' అను ప్రాతిపదికము యొక్క అర్థమే గ్రాహ్యమగును. ఇదియే అవివక్ష. ఇదియే ఉపలక్షణము. దీనినే 'లక్షణా' అని 49 వ శ్లోకమున భర్తృహరి చెప్పెను.

ఒక ప్రకరణమున ఎన్నియో వాక్యములుండును. అందు ప్రకరణార్థమునకు సరిపోవునట్లు వాక్యముల కర్థము నిర్ణీతమగును. అట్లుచేసిన వాక్యార్థమునుండి చేయబడిన పదార్థముల అపోద్ధారము, దానినిబట్టి జరిగెడి పదముల అపోద్ధారము యుక్తముగా నుండును. ॥58-59॥

*అవతారిక* — శబ్ద సంస్కారార్థమై విభక్తి ప్రత్యయములు ప్రాతిపదికముకంటె చేర్చబడుచున్నవి, అదియే వానికి ప్రయోజనము. ప్రత్యయార్థ సంఖ్య ఎల్ల చోటులయందు అవివక్షితమే యగును. సంఖ్యను గ్రహించి వాక్యార్థము చూపుటకు మరియొక యత్నము అనగా యుక్తి యుండవలెను. ప్రబలమగు యుక్తిచేతనే వ్యక్తియందు సంఖ్య భాసించునట్లు సమన్వయము చేయవలెను అని 51 వ (నవినాసంఖ్యయా కశ్చిత్) శ్లోకముచే చూపబడిన అర్థమునే ఏడు (60, 61, 62, 63, 64, 65, 66) శ్లోకములచే వ్యక్తపరచుచున్నాడు.

**శ్లో॥ నాన్యత్ర విధిరస్తీతి సంస్కారో నాపి చాఙ్గితా ।**
**హేతుః సంఖ్యాऽవివక్షాయాం యత్నాత్సా హి వివక్షితా॥ 60**

A. అన్యత్ర = మరియొక వాక్యమునందు, విధిః = విధానము, అస్తి = కలదు, కనుక (సః) = ఆ ఏకవచన ప్రయోగము, సంస్కారః = సంస్కారార్థమే అనగా పదత్వ సంపాదనమే దానికి ప్రయోజనము, ఇతి = అనునది, సంఖ్యాऽవివక్షాయామ్ = ప్రత్యయార్థమగు సంఖ్యను వివక్షింపకపోవుటయందు అనగా దానిని విడచుటయందు, న + హేతుః = కారణము కానేరదు. గ్రహములు మరియొక వాక్యమున చెప్పబడియున్నందున మరల ''గ్రహం సమ్మార్ష్టి'' అను వాక్యమున విధించుటచే సంఖ్య అవివక్షితము అనుట అయుక్తమని భావము, చ = మరియు అఙ్గితా + అపి = ప్రాధాన్యము కూడ, అనగా 'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున మార్జన సంస్కారము విషయమై గ్రహములకు గల ప్రాధాన్యము కూడ,

28 ]
శబ్ద బహు శబ్దము లను గూడ గ్రహింపవలెను. ఏకః, ద్వౌ, బహవః ఇత్యాది ప్రథమా స్థలము లలో గూడ విభక్తి ప్రత్యయములు ఏక మొదలగు ప్రాతిపదికములచే ఏ ఏకత్వాదులు బోధింపబడుచున్నవో వాటిని బోధించుట లేదు. ఆ ప్రాతిపదికార్థము లందలి ఏకత్వ ద్విత్వాదులను బోధించుచున్నవి. అట్లే 'ఏకం, ద్వౌ, బహూన్‌పశ్య' ఇత్యాది ద్వితీయాది స్థలము లలో గూడ ప్రకృత్యర్థమునందలి ఏకత్వాదులనే విభక్తి ప్రత్యయము బోధించుచున్నది గాని ప్రకృత్యర్థములగు ఏకత్వాదులను బోధించుట లేదు. అనగా 'ఏకం ఫలం అస్తి' అనునపుడు 'ఏక' అను ప్రాతిపదికము 'ఏకత్వము కలది' అను అర్థమును బోధింపగా 'సు' అను ప్రత్యయము ఏకత్వముకల దానియందలి ఏకత్వమును బోధించుచున్నది. అట్లే 'ఏక' ఫలం భక్షయతి' ఇత్యాదులలో గూడ ప్రాతిపదికార్థమునందలి ఏకత్వమును బోధించుచున్నది. ఈ విధముగ కర్మాదులందున్న ఏకత్వమును విభక్తి ప్రత్యయమే బోధించుచున్నది కాని ప్రాతిపదికము బోధించుటలేదు గాన ద్వితీయా విభక్తి రావచ్చునని భావము. ॥27॥

**అవతారిక**— పూర్వోక్తో దాహరణములలో నీవు చెప్పినట్లు ప్రకృతి బోధ్యమగు సంఖ్య ఒకటియు ప్రత్యయ బోధ్యమగు సంఖ్య మరియొకటియు ఉన్నట్లు కానవచ్చుట లేదుకదా యని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకస్య ప్రచయో దృష్టః సమూహశ్చ ద్వయో స్తథా ।**
**నిమిత్తవ్యతిరేకేణ సంఖ్యాన్యా భేదికా తతః ॥ 28**

ఏకస్య = ఒకదానికి, ప్రచయః = వృద్ధి (అన్య సహభావముచే పెరుగుదల), దృష్టః = చూడబడినది (కనబడుచున్నది), తథా = అట్లే, ద్వయోః = రెండింటికి, సమూహశ్చ = సమూహము కూడా (చూడబడుచున్నది), తతః = ఆ కారణమువలన, భేదికా = ప్రాతిపదికార్థమును అవచ్ఛేదించునది యగు, అన్యా = మరియొక, సంఖ్యా = విభక్త్యర్థమగు సంఖ్య, నిమిత్తవ్యతిరేకేణ = ఏకశబ్దాది ప్రవృత్తి నిమిత్తము (అర్థము) కంటె భిన్నముగ, కనబడుచున్నది.

**తాత్పర్యము**— ఒక వస్తువునకు వృద్ధియు, రెండింటికి సమూహమును కనబడుచున్నది. కావున ప్రాతిపదికార్థము కంటె భిన్నముగ, తదవచ్ఛేదకమగు విభక్త్యర్థమైన సంఖ్య వేరుగ కనబడుచున్నది.

వివరణము— ఒక వస్తువును మరియొక వస్తువుతో కలిపిన యెడల దానికి వృద్ధి (ప్రచయము) కలుగుచున్నది. ద్విత్వాది సంఖ్యలు ఏర్పడుచున్నవి. రెండు వస్తువులు ఒక సముదాయముగ కనబడుచున్నవి. ఇచట 'ద్వయోః' అనునది 'బహూనామ్' అను దానికి ఉపలక్షణము. అనగా రెండు మూడు వస్తువులున్నను అది ఒక సముదాయముగా కూడ కనబడుటకు వీలున్నది. కావున 'ఏకః' 'ద్వౌ' ఇత్యాదులలోని విభక్తి ప్రత్యయములచే బోధింపబడెడు సంఖ్య ప్రకృతిబోధ్యములగు సంఖ్యలయందలి విశేషమును తెలుపుచుండును. కాన ఇది తద్భిన్నముగ కనబడుచునే యున్నది. అనగా 'ఏకః' అనునపుడు 'ఏక' అను

ప్రాతిపదికము ప్రచితమని కాని అపచితమని కాని భేదములేని ఏకత్వమును మాత్రము బోధించును. దానిపై చేరిన 'సు' విభక్తి ప్రత్యయముచే బోధ్యమగు ఏకత్వ సంఖ్య ప్రాతిపదిక బోధితమగు ఏకత్వ సంఖ్య ప్రచితము కాదు (వృద్ధిపొందక ఒక్కటిగానే ఉన్నది) అని బోధించును. అట్లే 'ద్వౌ' 'త్రయః' ఇత్యాదులలోని 'ద్వి' 'త్రి' మొదలగు ప్రాతిపదికములు కేవలము ద్విత్వ త్రిత్వాదులను మాత్రమే బోధించును ఇవి సమూహాత్మకములా (ఒక సముదాయముగ నున్నవా) లేక వేరువేరుగ నున్నవా యని విశేషము తెలియదు. కాని వాటిపై చేరిన విభక్తి ప్రత్యయములచే బోధింపబడు సంఖ్య ఆ ద్విత్వాదులు సమూహాత్మకములు కాక విభక్త రూపముననే ఉన్నవి అని బోధించును. ఈ విధముగ ప్రాతిపదిక బోధ్య సంఖ్య యందలి వైశిష్ట్యమును బోధించుచు విభక్తి ప్రత్యయవాచ్య సంఖ్య వ్యతిరిక్తముగ నున్నదని యభిప్రాయము. ॥28॥

అవతారిక— **సంఖ్యా**వాచక శబ్దములపై సంఖ్యాబోధకములగు విభక్తి ప్రత్యయములు మరల ఎట్లు వచ్చును అను ఆశంకకు భాష్యోక్తమగు మరియొక సమాధానమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ తదేకమపి చైకత్వం విభక్తి శ్రవణాదృతే ।**
**నోచ్యతే తేన శబ్దేన విభక్త్యా తు సహోచ్యతే ॥ 29**

**తత్** = ఆ, ఏకమపి = ఒక్కటియే యైనను, ఏకత్వం = ఏకత్వము, విభక్తి శ్రవణాత్ + ఋతే = విభక్తి శ్రవణము లేనిచో, తేన = ఆ, శబ్దేన = 'ఏక' శబ్దముచేత, నోచ్యతే = బోధింపబడదు, తు = కాని, విభక్త్యాసహ = విభక్తి ప్రత్యయము**తో** కూడ కలిసి యున్నపుడు, **ఉచ్యతే**= బోధింపబడును.

తాత్పర్యము— ఆ ఏకత్వము ఒక్కటియే యైనను విభక్తి శ్రవణము లేనిచో అది ఆ శబ్దముననే బోధింపబడదు. విభక్తితో కలిసియున్న శబ్దముచేత మాత్రమే బోధింపబడును.

వివరణము— "నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా" (ప్రత్యయరహితమగు ప్రకృతిని ప్రయోగింపరాదు) అను నియమమును అనుసరించి 'ఏక' అను ప్రకృతిని ప్రత్యయము లేకుండ ప్రయోగించుటకు వీలులేదు. అందుచే ఏదైన ఒక విభక్తి ప్రత్యయమును చేర్చవలసి యుండును. ఆ చేర్చెడు ప్రత్యయము ఏకవచన ప్రత్యయము కాక ద్వివచన ప్రత్యయమో బహువచన ప్రత్యయమో అయినచో ప్రకృత్యర్థమునకును ప్రత్యయార్థమునకును పొత్తు కుదురదు. కావున 'ఏక' అను ప్రకృతికి ఏకవచన ప్రత్యయమునే చేర్చవలెను. ఈ ఏకవచన ప్రత్యయము ప్రకృతి బోధ్యమగు ఏకత్వమునే అనువదించును. ఈ విధముగ 'ఏకః' అనునపుడు ప్రకృతి ప్రత్యయములు రెండును ఒకే ఏకత్వమును బోధించును. అనగా 27 వ కారికలో చెప్పినట్లు ప్రాతిపదిక బోధ్యమగు ఏకత్వము ఒకటి, ప్రత్యయ బోధ్యమగు ఏకత్వము మరియొకటి యని అంగీకరింప బనిలేదు. కాని విభక్తి ప్రత్యయము లేకున్నచో కేవల ప్రకృతి ఏకత్వమును బోధింపజాలదు.

ఈ విషయమునే నాగేశుడు ఉద్ద్యోతమున (2-3-1) ఈ విధముగ విశదీకరించెను : ఈ పదమునకు ఇది అర్థము అను రీతిని శక్తి గ్రహము వృద్ధ వ్యవహారమువలననే కలుగును. వృద్ధ వ్యవహారము విభక్త్యంతములగు పదముల విషయముననే ఉన్నది కాని విభక్తిరహిత మాత్రములగు ప్రకృతుల విషయమున లేదు. కావున విభక్తితో కూడిన ప్రకృతి విషయమున ఏర్పడిన శక్తి గ్రహము విభక్తిలేని ప్రకృతిని చూచినపుడు ఉద్బుద్ధము కాదు. ఈ విధముగ పదార్థోపస్థితి తప్పక కావలెనన్నచో విభక్తి ప్రత్యయముండి తీరవలెను. కావున ప్రకృతిచే ఏకత్వము చెప్పబడినను విభక్తి ప్రత్యయమును చేర్చవచ్చును. శక్తి గ్రహము వృద్ధ వ్యవహారము వలననే కలుగును అని చెప్పుటకు ప్రమాణమేమి అని ప్రశ్నింపరాదు. లోక వ్యవహారమున ప్రయుక్తములగు పదముల సాధుత్వమును నిరూపించుటకే కదా ఈ శాస్త్రము బయలుదేరినది.

ఈ విధముగ ఈ కారిక 'ఏకః' ఇత్యాదులలో ప్రకృత్యర్థమునే విభక్తి అనువదించు చున్నది అని చెప్పినది. ఈ యుక్తియే 'ద్విః' శబ్దాదుల విషయమున గూడ ప్రవర్తించును.

*అవతారిక*— ఈ విషయమున భాష్యకారులు మరియొక యుక్తిని గూడ చూపించెను. సంఖ్య అనునది ఎల్లప్పుడు పరప్రధానముగ ఉండును. అది స్వతంత్రముగ ఉండ జాలదు. అందుచే సంఖ్యావాచక శబ్దము 'ఏకం ఫలమ్' ఇత్యాదులందు వలె విశేష్యభూతమగు మరియొక పదమునకు విశేషణముగ ఉండును. దానికి విభక్తి ప్రత్యయము రానిచో కేవల ప్రకృతి ప్రయోగానర్హము గాన ఇది ఆ విశేష్య పదమునకు విశేషణముగ ఉండ జాలదు. అందుచే ఈ 'ఏక' శబ్దము సంఖ్యేయ పదవిశేషణమగుటకు యోగ్యము కావలెనన్నచో విభక్తి ప్రత్యయము చేర్చవలెను. ఈ విషయమునే విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ అన్వయవ్యతిరేకౌహి యది స్యాద్వచనాన్తరమ్ ।**
**స్యాతామసతి తస్మింశ్చ ప్రకృత్యర్థోన కల్ప్యతే ॥ 30**

వచనాన్తరమ్ = మరియొక వచనము, స్యాద్యది = ప్రయుక్తమైనచో, అన్వయ వ్యతిరేకౌ = అన్వయ వ్యతిరేకములు, స్యాతామ్ = ఉండవచ్చును, తస్మిన్ = వచనాంతరము, అసతి చ= లేనిచో. ప్రకృత్యర్థః = ప్రకృత్యర్థము, న కల్ప్యతే = కల్పింపబడదు.

**తాత్పర్యము**— వచనాంతరమును ప్రయోగించినచో అన్వయ వ్యతిరేకములకు అవకాశముండెడిది. వచనాంతరము లేనపుడు ప్రకృత్యర్థము కల్పింపబడదు.

*వివరణము*— 'వృక్ష' అను ప్రాతిపదికమునకు 'సు' చేర్చినచో 'వృక్షః' అనియు, 'ఔ' చేర్చినచో 'వృక్షౌ' అనియు, 'జస్' చేర్చినచో 'వృక్షాః' అనియు వేరు వేరు రూపములు ఏర్పడుచున్నవి. 'వృక్షః' అనునపుడు ఒక అర్థము, 'వృక్షౌ' అనునపుడు మరియొక యర్థము, 'వృక్షాః' అనునపుడు ఇంకొక అర్థము బోధ్యమగుచున్నది. ఈ విధముగ వేరు వేరు వచనములు చేర్చినపుడు వేరు వేరు అర్థములు బోధ్యములగుటచే అన్వయ

వ్యతిరేకములను కల్పించి ఈ ప్రత్యయము చేర్చినపుడు ఈ యర్థము బోధింపబడుచున్నది ; ఇది కాక మరియొక వచన ప్రత్యయమును చేర్చినపుడు ఈ అర్థము బోధింపబడుట లేదు, మరియొక అర్థము బోధింపబడుచున్నది ; కావున ఈ ప్రత్యయమునకు ఇది యర్థము అని నిర్ణయింప వీలగుచున్నది. కాని 'ఏక' శబ్దమునకు ఎల్లప్పుడును ఏకవచన ప్రత్యయమునే చేర్చి ప్రయోగింతురు గాని మరి ఇతర వచన ప్రత్యయములను చేర్చుట లేదు. ఇట్లే 'ద్వి' శబ్దమునకు ద్వివచన ప్రత్యయమునే చేర్తురుగాని ఇతర ప్రత్యయములను చేర్పరు. ఈ విధముగ ఇతర ప్రత్యయములను చేర్పకున్నచో— ఈ ప్రత్యయమును చేర్చగా ఈ యర్థము వచ్చినది, దీనిని తీసి మరియొక ప్రత్యయమును చేర్చగా మరియొక అర్థము వచ్చినది, కావున ఇది ప్రకృత్యర్థము, ఇది ప్రత్యయార్థము అని అన్వయ వ్యతిరేకములచే నిర్ణయింప శక్యము కాదు. కావున 'ఏకః' అను ప్రకృతి ప్రత్యయసముదాయమునకే 'ఒకటి' యని యర్థము, 'ద్వౌ' అను ప్రకృతి ప్రత్యయసముదాయమునకే 'రెండు' అని యర్థము. వీటిలో ప్రత్యయార్థ వ్యతిరిక్తముగ ప్రకృత్యర్థము భాసించుట లేదు అని తాత్పర్యము.

'ఏకః' ఇత్యాదులలో ప్రకృత్యర్థమునే ప్రత్యయము అనువదించుచున్నని అని పూర్వకారికలో చెప్పబడినది. ప్రకృతి ప్రత్యయసముదాయార్థమే సంఖ్యేయమునకు విశేషణముగ ప్రయోగింపబడుచున్నదని ఈ కారిక చెప్పుచున్నది. ॥30॥

అవతారిక— ఈ విషయముననే మహాభాష్యమున మరియొక ఉపపత్తి కూడ చెప్పబడినది. సంఖ్యా శబ్దములు ద్రవ్యమును, గుణమును గూడ బోధించును. ఏ ద్రవ్యమునందలి గుణమును ఈ శబ్దములు బోధించుచున్నవో ఆ ద్రవ్యములకు సంబంధించిన ఏకత్వాదులు అనుక్తములే గాన విభక్తి ప్రత్యయము రావచ్చును, అనునది ఈ ఉపపత్తి. దీనిని విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ఏకత్వమేక ఇత్యత్ర శుద్ధ ద్రవ్యవిశేషణమ్ ।
సగుణస్తు ప్రకృత్యర్థో విభక్త్యర్థేన భిద్యతే ॥ 31

ఏకః ఇత్యత్ర = 'ఏకః' అనుచోట, శుద్ధ ద్రవ్యవిశేషణం = విశేషణమును చేర్చుటకు పూర్వము శుద్ధమైన ద్రవ్యమునకు విశేషణమగు, ఏకత్వం = ఏకత్వము బోధింపబడుచున్నది, సగుణః = గుణముతో కూడిన, ప్రకృత్యర్థః = ప్రకృత్యర్థము, విభక్త్యర్థేన = విభక్త్యర్థమగు ఏకత్వముచే, భిద్యతే = విశేషింపబడుచున్నది.

తాత్పర్యము— 'ఏకః' అనునపుడు ప్రాతిపదికము శుద్ధమగు ద్రవ్యమునకు విశేషణమైన ఏకత్వమును బోధించుచున్నది. ఆ గుణముతో కూడిన ప్రకృత్యర్థమునకు విభక్త్యర్థము విశేషణముగ చేరుచున్నది.

వివరణము— ప్రాతిపదికము గుణోపసర్జనమగు ద్రవ్యమును బోధించును. విభక్తి ద్రవ్యోపసర్జనమగు గుణమును బోధించును. ఉదాహరణమునకు- 'శుక్లం' అను పదమునకు

'శుక్ల వర్ణముతో కూడిన వస్త్రాదికము' అని యర్థము. ఇచట శుక్లగుణము ఉపసర్జనము (అప్రధానము, గను శుక్లగుణము గల ద్రవ్యము ప్రధానముగను బోధింపబడుచున్నవి. ఈ శుక్ల శబ్దముననే 'శుక్ల స్వభావః' అను నర్థమున భావ ప్రత్యయము చేర్చి 'శౌక్ల్యం' అను రూపము నేర్పరచినపుడు భావ ప్రత్యయవాచ్యమగు గుణమున ద్రవ్యము ఉపసర్జనముగ భాసించుచున్నది. అట్లే 'ఏకః' అనునపుడు 'ఏక' అనెడు ప్రాతిపదికము శుద్ధ ద్రవ్య విశేషణ మగు ఏకత్వమును బోధించును. అనగా ఏకత్వమనెడు గుణముగల ద్రవ్యమును బోధించును. విభక్త్యర్థము ప్రకృత్యర్థమును విశేషించుచు ఈ ఏకద్రవ్యము ఏకత్వ విశిష్టమే కాని గుణాన్తర విశిష్టము కాదు అని బోధించును. అనగా విభక్త్యర్థమగు ఏకత్వమున ప్రకృత్యర్థమగు ఏకత్వ విశిష్టద్రవ్యము ఉపసర్జనముగ భాసించును. ఈ విధముగ ఏకశబ్దాదులకు పరముగ విభక్తి ప్రత్యయములు రావచ్చునని భావము. ॥31॥

*అవతారిక*— ఏకాది శబ్దములు ద్రవ్యమును గుణమును గూడ బోధించునని పూర్వకారికలో చెప్పబడినది. కాని 'ఏకః' మొదలగు పదములు సంఖ్యేయములను (లెక్కింప దగిన ద్రవ్యములను) బోధించుచున్నవి. ఇవి ఏకత్వాది గుణమాత్ర బోధకములుగ కూడ నున్నవి అని చెప్పుటకు ప్రమాణమేమి అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ ద్వ్యేకయోరితి నిర్దేశాత్ సంఖ్యామాత్రేఽపి సంభవః ।**
**ఏకాదీనాం ప్రసిద్ధ్యా తు సంఖ్యేయార్థత్వముచ్యతే ॥ 32**

ద్వ్యేకయోః ఇతి = 'ద్వ్యేకయోః' అని, నిర్దేశాత్ = నిర్దేశించుట వలన, ఏకాదీనాం = ఏకాది శబ్దములకు, సంఖ్యామాత్రేఽపి = సంఖ్యామాత్రము నందు గూడ, సంభవః = సంభవ మున్నది, తు = కాని, ప్రసిద్ధ్యా = లౌకిక ప్రసిద్ధిచే, సంఖ్యేయార్థత్వం = సంఖ్యేయము మాత్రమే అర్థము కలిగియుండుట, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

*తాత్పర్యము*— ''ద్వ్యేకయోర్ద్వివచనైక వచనే'' అని సూత్ర నిర్దేశముండుటచే ఏకాది శబ్దములు సంఖ్యామాత్రమును గూడ బోధించునని చెప్పుటకు సంభవమున్నది. కాని లోకప్రసిద్ధిననుసరించి ఈ శబ్దములు సంఖ్యేయములను మాత్రమే బోధించునని చెప్పు చుందురు.

*విశేషము*— ''ద్వ్యేకయోర్ద్వివచనైక వచనే'' అను సూత్రమున 'ద్వ్యేకయోః' అను పదమునకు ద్విత్వ ఏకత్వములు అని అర్థము. అట్లుకాక రెండు, ఒకటియైన ద్రవ్యములు (సంఖ్యేయములు) అను నర్థము చెప్పినచో 'ద్వ్యేకయోః' అని ద్వివచనము కాక 'ద్వ్యేకేషామ్' అని బహువచనమును ప్రయోగింపవలసి యుండును. దీనినిబట్టి ఏకాది సంఖ్యా శబ్దములు సంఖ్యామాత్రమును గూడ బోధించునని తెలియుచున్నది. కాని లౌకిక ప్రసిద్ధి ననుసరించి 'ఏకః' = ఒక పదార్థము, 'ద్వౌ' = రెండు ద్రవ్యములు ఇత్యాదివిధమున సంఖ్యా శబ్దములు సంఖ్యేయవాచకములు అని చెప్పుచుందురు. ॥32॥

*సంఖ్యా సముద్దేశము ముగినినది*

# ఉపగ్రహ సముద్దేశము

*అవతారిక*— ఇపుడు ఆఖ్యాతార్థమగు ఉపగ్రహమును గూర్చి విచారింపబోవుచు ముందుగ ఉపగ్రహమనగా ఏదియో చెప్పుచున్నాడు.

**శ్లో॥ య ఆత్మనేపదాద్భేదః క్వచిదర్థస్య గమ్యతే ।**
**అన్యతశ్చాపి లా దేశాన్మన్యన్తే తముపగ్రహమ్ ॥** 1

లాదేశాత్ = లకారమునకు ఆదేశముగా వచ్చిన, ఆత్మనేపదాత్ = ఆత్మనే పదమువలనగాని, అన్యతః + చ + అపి = మరియొక దానివలన (పరస్మై పదమువలన) గాని, క్వచిత్ = కొన్ని కొన్ని స్థలములందు, అర్థస్య = అర్థముయొక్క, యః = ఏ, భేదః = భేదము, గమ్యతే = తెలియునో, తం = దానిని, ఉపగ్రహమ్ = ఉపగ్రహమునుగా, మన్యన్తే = తలచుచున్నారు (చెప్పుచున్నారు).

**తాత్పర్యము**— 'లట్' మొదలగు లకారములకు ఆదేశముగా వచ్చిన ఆత్మనే పదముగాని, పరస్మై పదముగాని అర్థ విశేషమును బోధించును. దీనిని ఉపగ్రహమందురు.

**వివరణము**— క్రియా ఫలము కర్తకుచెందునని ఆత్మనే పదము చెప్పును. క్రియా ఫలము పరునకు చెందునని పరస్మై పదము చెప్పును. ఈ విధముగ ఆత్యనే పద పరస్మై పద గమ్యమగు అర్థ విశేషమునకు ఉపగ్రహమని ప్రాచీనాచార్యుల వ్యవహారము. అదియే ఇచట గూడ గ్రహింపబడుచున్నది. ॥1॥

*అవతారిక*— ఏ అర్థమునకు చెందిన విశేషమును బోధించును అను విషయమునే వివరించుచున్నాడు.

**శ్లో॥ క్వచిత్సాధనమేవా సౌ క్వచిత్తస్య విశేషణమ్ ।**
**సాధనం తత్ర కర్మాది వ్యక్తవాచో విశేషణమ్ ॥** 2

క్వచిత్ = కొన్ని స్థలములందు, సాధనమేవ = సాధనమే, అసౌ = ఈ ఉపగ్రహము, క్వచిత్ = కొన్ని స్థలములందు, తస్య = దానియొక్క, విశేషణమ్ = విశేషణము (ఉపగ్రహము), తత్ర = అందు, కర్మాది = కర్మాదికము, సాధనమ్ = సాధనము, వ్యక్తవాచః = వ్యక్త వాక్కులు, విశేషణమ్ = విశేషణము.

**తాత్పర్యము**— కొన్ని స్థలములలో సాధనమే ఉపగ్రహము. కొన్ని యెడల దాని విశేషణము ఉపగ్రహము. సాధనమనగా కర్మాదికము. వ్యక్తవాక్కులు దానికి (సాధనమునకు) విశేషణమగుటచే ఉపగ్రహములని చెప్పబడును.

*వివరణము*— ఈ కారికలోని ఉత్తరార్థము పూర్వార్థ వివరణరూపము. 'పచ్యతే' (వండబడుచున్నది) 'గమ్యతే' (పొందబడుచున్నది) ఇత్యాదులలో ఆత్మనే పదము (సాధనమును) కర్మను బోధించుచున్నది గాన అది ఉపగ్రహము. కర్మ మొదలగు వాటికి సాధనము అని పేరు. 'కర్మాది'లోని 'ఆది' శబ్దముచే కర్తయు, భావము కూడ గ్రహింపబడును. 'ఏధతే' ఇత్యాదులలోని ఆత్మనే పదముచేతను, 'యాతి' ఇత్యాదులలోని పరస్మై పదముచేతను కర్త బోధింపబడుచున్నది. కావున ఇచట కర్తృ రూప సాధనము ఉపగ్రహము. 'ఆస్యతే' 'శయ్యతే' ఇత్యాదులలో ఆత్మనే పదము భావరూప (క్రియామాత్ర రూప) సాధనమును బోధించును. అందుచే ఇచట భావము ఉపగ్రహము. 'క్వచిత్తస్య విశేషణమ్' (కొన్ని యెడల ఆ సాధనము యొక్క విశేషణము ఉపగ్రహము) అను దానికి ఉదాహరణముగ 'వ్యక్తవాచో విశేషణమ్' అనునది చూపబడుచున్నది. ''వ్యక్తవాచాం సముచ్చారణే'' అను సూత్రముచే అచ్చులు, హల్లులు అనెడు భేదము వ్యక్తమగు విధమున మాటలాడెడు వారు కలిసి మాటలాడు చుండుట అను అర్థమున వద ధాతువునకు ఆత్మనేపదము విధింపబడినది. 'సంప్రవదన్తే బ్రాహ్మణాః' ఇత్యాదులు ఉదాహరణము. బ్రాహ్మణులందరును కలిసి మాటలాడు చున్నారని యర్థము. ఇచట ఆత్మనేపదముచే బోధ్యమగు వ్యక్త వాక్త్వము (అనగా ఇతరులకు వినబడునట్లు మాటాడుట) కర్తృ భూతసాధనములగు బ్రాహ్మణులకు విశేషణముగ భాసించుచున్నది. ఇది కూడ ఉపగ్రహమే. ॥2॥

*అవతారిక*— కొన్ని యెడల క్రియా విశేషణము ఉపగ్రహముగ నుండునని చెప్పుచున్నాడు.

**శో॥ క్రియా విషయభేదేన జీవికాదిషు భిద్యతే।**
**లాదేశైః స క్రియాభేదో వాక్యేష్వపి నియమ్యతే॥** 3

జీవికాదిషు = తాను జీవించుటకయి వృత్తిగాచేయు పనులయందు (ఇతరుల కొఱకు), విషయభేదేన = విషయ భేదముచే, క్రియా = క్రియ, భిద్యతే = భేదమును పొందుచుండును, సః = ఆ, క్రియాభేదః = క్రియా భేదము, లాదేశైః = లకారాదేశములగు పరస్మై పదాత్మనే పదములచే, (అభివ్యజ్యతే = అభివ్యక్తమగును), వాక్యేష్వపి = వాక్యములందు కూడ, నియమ్యతే = నియమితమై గమ్యమగును.

**తాత్పర్యము**— జీవికాదులందు విషయభేదమును (అనగా ఫలమెవరికొఱకుద్దేశింప బడినదో వారు, విషయము వారు భేదించుటచే) బట్టి క్రియ భేదించుచుండును. ఆ క్రియా భేదము లాదేశములచే అభివ్యక్తమగును. వాక్యములందు గూడ అభివ్యక్తమగును.

**విశేషము**— 'పచ్' ధాతువు 'వండుట' అను క్రియను బోధించును. వంటచేయువానికి సంబంధించినంతవరకు ఈ పాక క్రియ వేరు, భుజించువానికి సంబంధించినంతవరకు ఇది వేరు. ఈ విధముగ విషయభేదమును బట్టి క్రియ భేదమును పొందుచుండును. లకారములకు ఆదేశముగ వచ్చిన పరస్మై పదాత్మనే పదములు ఈ క్రియా భేదములను వ్యక్తీకరించు

చుండును. ఒకడు జీవికకై వంటలు చేయుచుండును : మరియొకడు జీవికకై యజ్ఞాదులు చేయును. ఇట్లు జీవికకై వంట, పూజ మొదలగు పనులు చేయువానికి జీతము అనెడు ఫలము లభించుచుండ వచ్చును. కాని ప్రధాన క్రియా ఫలము అతనికి చెందక ఆతని స్వామికి చెందుచున్నది. వండిన ఆహారమును ఆ స్వామి తినుచున్నాడు ; చేసిన యజ్ఞాదుల వలన కలుగు పుణ్యాదులు స్వామికి చెందును. క్రియలోనున్న ఇట్టి విశేషమును లకారములకు ఆదేశములుగ వచ్చిన పరస్మై పదాత్మనే పదములు బోధించును. 'పచతి' 'యజతి' అని పరస్మైపదమును ప్రయోగించినచో పాకయాగ ఫలములు ఆ పనులు చేయువానికి కాక మరియెవ్వరికో చెందునని యర్థము. 'పచతే' 'యజతే' ఇత్యాది విధమున ఆత్మనే పదమును ప్రయోగించినచో ఆ ఫలములు ఆ పనులు చేసినవానికి చెందునని యర్థము. ఈ విధముగ లాదేశములగు పరస్మై పదాత్మనే పదములచే క్రియా విశేషములు తెలియుచుండును. కొన్ని స్థలములలో వాక్యము చేతనే క్రియా విశేషము స్పష్టమగుచున్నది. ఉదాహరణమునకు 'స్వం యజ్ఞం యజతే' 'స్వం యజ్ఞం యజతి' ఇత్యాది వాక్యములలో 'స్వం' (తన) అను పద ముండుటచే క్రియా ఫలము కర్తకు చెందునని తెలియుచున్నది ఉపపదముచే (సమీపమున నున్న పదముచే) ప్రధాన ఫలము కర్తృగామియా, అన్యగామియా అను విషయము తెలియునపుడు ఏ పదమైన రావచ్చునని ''విభాషోపపదేన ప్రతీయమానే'' (1-3-77) అను సూత్రము చెప్పుచున్నది. కావున పై వాక్యములలో క్రియా ఫలము కర్తృగామియను విషయము 'స్వం' అను పదాంతరముతో గూడిన వాక్యమును బట్టి తెలియుచున్నది. ఈ విధముగ క్రియా భేదము లకారాదేశములగు పరస్మైపదములచేతను వాక్యములచేతను గూడ గమ్యమగునని తాత్పర్యము. ఇట్టి క్రియా విశేషము ఆత్మనే పదాది గమ్యముగాన దీనికి ఉపగ్రహమని పేరు. ॥3॥

*అవతారిక*—— కొన్ని యెడల విషయభేదము లేకున్నను సాక్షాత్తుగ క్రియా విశేషమే ఉపగ్రహమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ధాత్వర్థస్తద్విశేషశ్చాప్యుక్తః క్వచిదుపగ్రహః ।**
**ధాత్వర్థో గన్ధనాదిః స్యాత్ వ్యతిహారో విశేషణమ్ ॥ 4**

క్వచిత్ = కొన్ని స్థలములందు, ధాత్వర్థః = ధాతువు యొక్క అర్థము, తద్విశేషః + చ + అపి = దానియొక్క విశేషణము గూడ, ఉపగ్రహః = ఉపగ్రహముగా, ఉక్తః = చెప్పబడినది, గంధనాదిః = గంధనాదికము (అనగా హింసించుట మొదలయినవి), ధాత్వర్థః = ధాత్వర్థముగా, స్యాత్ = అగును, వ్యతిహారః = వ్యతిహారము, విశేషణం = విశేషణము.

*తాత్పర్యము*—— కొన్ని యెడల ధాత్వర్థము, దాని విశేషణము కూడ ఉపగ్రహమని చెప్పబడినది. గంధనాదికము ధాత్వర్థము ; వ్యతిహారము (ఒకరినుండి యింకొకరు మార్చుకొనుట) విశేషణము.

*వివరణము*—— ఈ కారికలో ఉత్తరార్థము పూర్వార్థ వివరణ రూపము. ''గన్ధనావక్షేపణ - సేవన - సాహసిక్య - ప్రతియత్న - ప్రకథనోపయోగేషు కృఞః'' (1-3-32)

అను సూత్రముచే గంధనాద్యర్థములందు కృఞ్ ధాతువునకు, క్రియా ఫలము కర్త్రభిప్రాయసం (ఆ యా పనులను చేయువాని కొరకే) కాకున్నను, ఆత్మనే పదము విధింపబడినది. గంధన మనగా హింసించుట. ఉదా : 'ఉత్కురుతే' = పరదోషావిష్కరణము చేయుచున్నాడు అని అర్థము. ఇట్లు చేయుట స్వయముగ బాధ కాకపోయినను బాధను కలిగించుటకు కారణమగు చున్నది గావున హింసగ పరిగణింపబడు చున్నది. ఇట్లే అవక్షేపణాద్యర్థములలో 'ఉదా కురుతే' ఇత్యాద్యుదాహరణములను చూచుకొనవలెను. ఈ ఉదాహరణములలోని గంధనము మొదలగు ధాత్వర్థము ఆత్మనే పదముచే గమ్యమగుచున్నది గాన ఈ యర్థము కూడ ఉప గ్రహ సంజ్ఞకమే.

''కర్తరి కర్మ వ్యతిహారే'' అను సూత్రముచే క్రియా వినిమయము ద్యోత్యమగు నపుడు కర్త్రర్థమున ఆత్మనే పదము విధింపబడినది. 'వ్యతిలునీతే' ఇత్యాదులుదాహరణము. ఒకడు చేయవలసి యున్న లవన కర్మను మరియొకడు చేయుచున్నాడు అని అర్థము. ఇచట ఆత్మనే పదము వ్యహారమనెడు క్రియయందలి విశేషమును - అనగా క్రియా విశేషణ భూత మగు వ్యతిహారమును బోధించుచున్నది. ఈ విధముగ ఆత్మనే పద గమ్యమగుటచే క్రియా విశేషణమగు ఈ వ్యతిహారము కూడ ఉపగ్రహమే యని భావము. ॥4॥

*అవతారిక*— క్రియా ఫలము కర్త్రభిప్రాయమైనపుడు, అనగా కర్తకొరకై ఉద్దిష్ట మైనపుడు, ఆత్మనే పదము వచ్చునని చెప్పబడినది. కాని క్రియా ఫలము లవ్నియును ఎట్లైన కర్తకే చెందును గాన ఇట్లు చెప్పవలసిన పనిలేదని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రియాప్రవృత్తౌ వాఖ్యాతా కైశ్చిత్ స్వార్థపరార్థతా ।
అసతీ వా సతీవాఽపి వివక్షిత నిబన్ధనా ॥ 5**

క్రియాప్రవృత్తౌ = క్రియయందు ప్రవర్తించు విషయమున, కైశ్చిత్ = కొందరిచేత, స్వార్థ పరార్థతా = స్వార్థత్వము, పరార్థత్వము, ఆఖ్యాతా = చెప్పబడినది, అసతీ + వా = యథా ర్థము కానిదైనను, సతీవా = యథార్థమైనదైనను, వివక్షిత నిబన్ధనా = వివక్షపై ఆధార పడునది.

**తాత్పర్యము**— కొందరు క్రియాప్రవృత్తి విషయమున స్వార్థత్వమును (తన = కర్తకొఱకు గాని) పరార్థత్వమును (ఇతరుల కొఱకుగాని) చెప్పియున్నారు. ఆ పరార్థత్వము యథార్థమా ఆయథార్థమా అనునది వివక్షపై ఆధారపడి యున్నది.

*వివరణము*— 'సర్వ ఇమే స్వభూత్యర్థం యతన్తే' - (లోకములో ఎల్లరును తమ అభివృద్ధినిమిత్తము మాత్రమే ప్రయత్నము చేయుదురు) అని మహాభాష్యములో చెప్పినట్లు ప్రతి ఒక్కడు స్వలాభాపేక్షతోడనే ప్రవర్తించుచుండును. కావున స్వార్థప్రవృత్తి పార మార్థికము (అనగా నిజమయినది). పరార్థప్రవృత్తి అనునది అసత్యము (అసతీ). అది పార మార్థికము (సతీ) అని ఎవరైన చెప్పినచో అది మాటవరుసకు చెప్పినదే కాని వాస్తవము

వివరణము— "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" (1-3-72) అను సూత్రముచే స్వరితము ఇత్తుగ కల ధాతువుల కంటెను, ఞకారము ఇత్తుగ కల ధాతువుల కంటెను, క్రియా ఫలము కర్తకు చెందెడు పక్షమున, ఆత్మనే పదము విధింపబడినది. ఈ ధాతువుచే విహితమగు ఆత్మనే పదము సంవిధానార్థకములగు ధాతువులకు వచ్చునని కొందరి అభిప్రాయము. 'పచతే'( = పాచయతి = వండించుచున్నాడు), "యజతే"( = యాజయతి= యజ్ఞము చేయించుచున్నాడు) ఇత్యాదు లుదాహరణములు. ధాతువులు అనేకార్థకములుగాన, ధాతువే సంవిధానార్థకమై యుండ దానిని ద్యోతింపచేయుటకు ఆత్మనే పదము వచ్చునని అభిప్రాయము. ప్రకృతి సంవిధానమును బోధింపనపుడు మాత్రము ణిచ్ ప్రత్యయము వచ్చి 'పాచయతి' ఇత్యాది రూపములు ప్రయోగింపబడును.

సమస్తమగు ధాత్వర్థముయొక్క ప్రవృత్తికి అనుకూలమగు వ్యాపారమునకు సంవిధానమని పేరు. దానినే ప్రవర్తనమని కూడ అందురు. 'యజీత' ఇత్యాదులలో ఋత్విక్కులు ప్రవర్తించుటకై యజమానుడు చేయు వ్యాపారమే ధాత్వర్థము. అనగా ధాతువుచే బోధితమగు క్రియకు సంబంధించిన అన్ని అవయవములను పూర్తిచేయుటకై అనుకూలమగు వ్యాపారమునకే సంవిధానమని పేరు. అందుచే 'యజీత' అనునపుడు ఆ యా ఋత్విక్కులు తమ తమ పనులు చేయుట, మరి ఇతర క్రియలును పూర్తియైననే గాని యజధాత్వర్థము పూర్తియైనట్లు కాదు. కావున హోతను శస్త్రములు శంసనము చేయవలెనని అధ్వర్యుడు ప్రేరేపించినను ఈ ప్రేరణారూప వ్యాపారము, యజనక్రియ పూర్తియగువరకును అనువర్తించదు గాన అది సంవిధానము కాదు. యజమాన కృతప్రేరణమే మొదటినుండి తుదివరకును వ్యాపించును గాన అది సంవిధానము సామగ్రిని సమకూర్చుటయే సంవిధానమని మరికొందరి అభిప్రాయము.

పై సూత్రమునందలి "కర్త్రభిప్రాయే క్రియాఫలే" అనునది సంవిధాన లక్షణమగు క్రియా విశేషమును ఉపలక్షించును. శిష్టప్రయోగము ననుసరించి 'క్రీణీష్వ' 'వపతే' 'ధత్తే' 'చినుతే' ఇత్యాదులలో ణ్యర్థము (ప్రేరణార్థము) గమ్యమగుచున్నది. అనగా పై శబ్దములకు వరుసగ - 'కొనుము' 'ముండనము చేయుచున్నాడు' 'ధరించుచున్నాడు' 'చయనము చేయుచున్నాడు' అను నర్థములు కాక - 'కొనిపించుము' 'వపనము చేయించుకొనుచున్నాడు' 'ధరింపచేయు చున్నాడు', 'చయనము చేయించుచున్నాడు' అని అర్థములు శిష్టులచే చెప్పబడు చున్నవి.

శబ్దశక్తి ననుసరించి పరిశీలించినచో స్వరితేత్తులును, ఞిత్తులును అగు ధాతువులకు మాత్రమే సంవిధాన రూపార్థముండునుగాని ఇతర ధాతువులకు ఉండదు. 'కర్త్రభిప్రాయే క్రియాఫలే' అని సూత్రించినను సంవిధాన రూపార్థము గమ్యమగునపుడు ఆత్మనేపది వచ్చును అను అర్థము వచ్చును. అట్టి సంవిధాన రూపార్థము స్వరిత ఞిత్తులకే సంభావ్యము. అందుచే మరల సూత్రమునందు 'స్వరితఞితః' అని చెప్పవలసిన పనిలేదని భాష్యకారుడు చెప్పినాడు.

శ్లో॥ తావతార్థస్య సిద్ధత్వాదేకత్వస్యా వ్యతిక్రమమ్ ।
కేచి దిచ్ఛన్తి న త్వత్ర సంఖ్యాఙ్గత్వేన గృహ్యతే ॥ 65

A. తావతా = అంత పరిమితికల అనగా ఏకత్వ సంఖ్యకల పశువుచే, అర్థస్య = ప్రయోజనము అనగా యాగక్రియ, సిద్ధత్వాత్ = సంపూర్ణముగ జరుగుటవలన, కేచిత్ = కొంతమంది విమర్శకులు, ఏకత్వస్య = ఏకత్వ సంఖ్యకు, అవ్యతిక్రమమ్ = అత్యాగమును అనగా విడువకుండుటను, ఇచ్ఛన్తి = అంగీకరించుచున్నారు.

ప్రత్యయము సంస్కారార్థమే, 'పశునా' అను పదము పశువునందు సంఖ్యాసామాన్యమును బోధించును. కాని ద్విత్వము బహుత్వము మున్నగు అనేకత్వమునకు ఏకత్వమే మూలకారణము. అది లేనిది ద్విత్వాదికముండనేరదు, కనుక ప్రాథమికమగు ఏకత్వమును విడనాడుటలో కారణము లేనందున దానిని గ్రహింపవలెను. ఏకత్వముతో గూడిన పశువు యాగ సాధనమగుచునే యున్నది. అందుచే రెండవ పశువును గ్రహించుట వ్యర్థము. పై యుక్తిచే ఏకత్వము విడువబడక గ్రహింపబడుచున్నది.

B. అత్ర = పశునా యజేత అను వాక్యమున, సంఖ్యా = తృతీయా విభక్త్యర్థమగు ఏకత్వ సంఖ్య, అఙ్గత్వేన = యాగమునకు అంగముగా, న + గృహ్యతే = గ్రహింపబడదు.

64 వ శ్లోకమున లాఘవము యుక్తిగా జూపబడినది. ఇచట ఒక న్యాయము యుక్తిగా జూపబడినది. ॥65॥

*అవతారిక*— 1. లాఘవము 2. ప్రథమాతిక్రమణే కారణాభావము, అను రెండు యుక్తులనుబట్టి 'పశునా యజేత' అను స్థలమున ప్రత్యయార్థమగు ఏకత్వ సంఖ్య వివక్షితమగునని నిరూపింపబడినది.

అట్లైన ద్వితీయమ్, తృతీయమ్, అనెడి పదముల ప్రయోగమునే లింగమువలన ఏకత్వ సంఖ్య వివక్షితమగు చున్నదనెడి 56 వ శ్లోకమున జూపబడిన సిద్ధాంత మసంగతమే కావలెను. ఆ సిద్ధాంతమును దూరము చేసినను ప్రకృతమగు యుక్తిచే సంఖ్యా వివక్ష సిద్ధించుచున్నది కదా ! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్వితీయాదిషు యల్లిఙ్గముక్తం న్యాయానువాది తత్ ।
న సంఖ్యాసాధనత్వేన జాతివత్తేన గమ్యతే ॥ 66

ద్వితీయాధిషు = ద్వితీయ మున్నగు పదములతో గూడిన *మంత్రములయందు, యత్ = ఏ, లిఙ్గమ్ = లింగమో, అనగా ద్వితీయమ్, తృతీయమ్, అని చెప్పుట వలన పశునా యజేత

* "ఉక్థ్యే ద్వితీయమ్" (ఉక్థ్య మనెడి క్రతువున రెండవ పశువును గ్రహింపవలెను) "ఐన్ద్రిం వృష్ణిం తృతీయం షోడశిని" (షోడశి క్రతువున తెల్లని మూడవ పశువును గ్రహింపవలెను)

వివరణము— "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" (1-3-72) అను సూత్రముచే స్వరితము ఇత్తుగ కల ధాతువుల కంటెను, ఞకారము ఇత్తుగ కల ధాతువుల కంటెను, క్రియా ఫలము కర్తకు చెందెడు పక్షమున, ఆత్మనే పదము విధింపబడినది. ఈ ధాతువుచే విహితమగు ఆత్మనే పదము సంవిధానార్థకములగు ధాతువులకు వచ్చునని కొందరి అభిప్రాయము. 'పచతే'( = పాచయతి = వండించుచున్నాడు), "యజతే"( = యాజయతి= యజ్ఞము చేయించుచున్నాడు) ఇత్యాదు లుదాహరణములు. ధాతువులు అనేకార్థకములుగాన, ధాతువే సంవిధానార్థకమై యుండ దానిని ద్యోతింపచేయుటకు ఆత్మనే పదము వచ్చునని అభిప్రాయము. ప్రకృతి సంవిధానమును బోధింపనపుడు మాత్రము ణిచ్ ప్రత్యయము వచ్చి 'పాచయతి' ఇత్యాది రూపములు ప్రయోగింపబడును.

సమస్తమగు ధాత్వర్థముయొక్క ప్రవృత్తికి అనుకూలమగు వ్యాపారమునకు సంవిధానమని పేరు. దానినే ప్రవర్తనమని కూడ అందురు. 'యజేత' ఇత్యాదులలో ఋత్విక్కులు ప్రవర్తించుటకై యజమానుడు చేయు వ్యాపారమే ధాత్వర్థము. అనగా ధాతువుచే బోధితమగు క్రియకు సంబంధించిన అన్ని అవయవములను పూర్తిచేయుటకై అనుకూలమగు వ్యాపారమునకే సంవిధానమని పేరు. అందుచే 'యజేత' అనునపుడు ఆ యా ఋత్విక్కులు తమ తమ పనులు చేయుట, మరి ఇతర క్రియలును పూర్తియైననే గాని యజధాత్వర్థము పూర్తియైనట్లు కాదు. కావున హోతను శస్త్రములు శంసనము చేయవలెనని అధ్వర్యుడు ప్రేరేపించినను ఈ ప్రేరణారూప వ్యాపారము, యజనక్రియ పూర్తియగువరకును అనువర్తించదు గాన అది సంవిధానము కాదు. యజమాన కృతప్రేరణమే మొదటినుండి తుదివరకును వ్యాపించును గాన అది సంవిధానము సామగ్రిని సమకూర్చుటయే సంవిధానమని మరికొందరి అభిప్రాయము.

పై సూత్రమునందలి "కర్త్రభిప్రాయే క్రియాఫలే" అనునది సంవిధాన లక్షణమగు క్రియా విశేషమును ఉపలక్షించును. శిష్టప్రయోగము ననుసరించి 'క్రీణీష్వ' 'వపతే' 'ధత్తే' 'చినుతే' ఇత్యాదులలో ణ్యర్థము (ప్రేరణార్థము) గమ్యమగుచున్నది. అనగా పై శబ్దములకు వరుసగ - 'కొనుము' 'ముండనము చేయుచున్నాడు' 'ధరించుచున్నాడు' 'చయనము చేయుచున్నాడు' అను నర్థములు కాక - 'కొనిపించుము' 'వపనము చేయించుకొనుచున్నాడు' 'ధరింపచేయు చున్నాడు', 'చయనము చేయించుచున్నాడు' అని అర్థములు శిష్టులచే చెప్పబడు చున్నవి.

శబ్దశక్తి ననుసరించి పరిశీలించినచో స్వరితేత్తులును, ఞిత్తులును అగు ధాతువులకు మాత్రమే సంవిధాన రూపార్థముండునుగాని ఇతర ధాతువులకు ఉండదు. 'కర్త్రభిప్రాయే క్రియాఫలే' అని సూత్రించినను సంవిధాన రూపార్థము గమ్యమగునపుడు ఆత్మనేపది వచ్చును అను అర్థము వచ్చును. అట్టి సంవిధాన రూపార్థము స్వరిత ఞిత్తులకే సంభావ్యము. అందుచే మరల సూత్రమునందు 'స్వరితఞితః' అని చెప్పవలసిన పనిలేదని భాష్యకారుడు చెప్పినాడు.

మరి కొందరి మతము ప్రకారము— తన ప్రయోజనము నుద్దేశించి కార్యముచేయ నుద్యమించినపుడు ఆత్మనేపదము వచ్చుననియు, పరుల ప్రయోజనము నుద్దేశించి కార్యము చేయ నుద్దేశించినపుడు పరస్మైపదము వచ్చుననియు చెప్పుదురు. ఈ స్వార్థ పరార్థతలు వివక్షాధీనములు. వివక్షాధీనములగు ఈ స్వార్థపరార్థతలు లౌకిక ప్రయోగములలో స్వరిత ఞిత్తులగు ధాతువుల విషయముననే అంగీకరింపబడునుగాని 'యా' ధాత్వాదుల విషయమున అంగీకరింపబడవు. కావున ఈ మతమును అనుసరించినను స్వరిత ఞిద్గ్రహణము అనావశ్యకము. ప్రకృతమున ఈ కారికలలో చేయబడుచున్న చర్చ యంతయు ఈ మతభేదములపై ఆధారపడి యున్నది.

ణిచ్చు ఏ అర్థమును బోధించునో ఆ అర్థమునే ఆత్మనే పదము గూడ బోధించును గాన ఆత్మనే పదము ణిచ్చుతో వికల్పమును పొందును— అనగా ణిచ్చును చేర్చి ణిజంత ధాతువును ప్రయోగించుటకు బదులు ఆత్మనే పదమును ప్రయోగింపవచ్చును అని కొందరి అభిప్రాయము దీనికి వారు ఇతరుల మతమును దృష్టాంతముగ చూపుచున్నారు (అన్యేషాం తదర్థా ప్రకృతిర్యథా). పైన చూపిన 'క్రీణీష్వ' ఇత్యాద్యుదాహరణములలో ప్రేరణార్థము ధాతువుచేతనే బోధింపబడుటచే ణిజంతధాతువునకు బదులు కేవలధాతువే ఏ విధముగ ప్రయోగింపబడుచున్నదో అట్లే ణిజంతమునకు బదులు ఆత్మనే పదమును ప్రయోగింప వచ్చును అని ఈ దృష్టాంతమును చూపుటలోని ఆశయము.

వీరి మతము ప్రకారము సంవిధానమే ణిజర్థము ; కేవల ప్రైషము (ఆజ్ఞాపించుట) కాదు. దేవదత్తుడు యజ్ఞదత్తునిచేత వంట వండించుచున్నాడు అనునపుడు దేవదత్తుడు ప్రయోజక కర్త ; యజ్ఞదత్తుడు ప్రయోజ్యకర్త. ప్రయోజ్యకర్త స్వార్థాపేక్షతో, అనగా కూలి లభించపలెననెడు అభిలాషతో పనిచేయును. ఆతడు పనిచేయుటకు తగు ఏర్పాట్లు దేవదత్తుడు చేయును. తనకు ధనము లభించుననెడు ఆశ లేనిచో ప్రయోజ్యుడు పనిచేయడు. అట్లే ప్రయోజకుడు, పనిచేయుటకు తగు నేర్పాట్లు చేయకున్నచో ఆతడాజ్ఞాపించినను ప్రయోజ్యుడు పనిచేయడు. కావున 'ప్రైష'మాత్రము ణిచ్ ప్రత్యయార్థమని చెప్ప వీలులేదు. సంవిధానమే ణిజర్థము. ఆత్మనే పదము కూడ ఆ సంవిధానమునే బోధించుచున్నది గాన ఆత్మనే పదము ప్రయోగించు పక్షమున ణిచ్చును చేర్చ బనిలేదని వీరి యభిప్రాయము.

కారికలో 'కేషాంచిత్' అని దీనిని కొందరి మతమని చెప్పుటచే ఇది అంత యుక్తము కాదని సూచింపబడినది. 'హేతుమతి చ' (3-1-26) అను సూత్రము ణిచ్ ప్రత్యయమును విధించుచున్నది. ''ప్రేషణము మొదలగు ప్రయోజక వ్యాపారమను అర్థమున ధాతువుకంటె ణిచ్ ప్రత్యయము వచ్చును'' అని దీని యర్థము. ''కుర్వన్తం ప్రేరయతి కారయతి'' - చేయుచున్నవానిని ప్రేరేపించుచున్నాడు గాన కారయతి అని చెప్పబడు చున్నాడు) ఇత్యాదు లుదాహరణము. ఇచట ప్రేషణము ధాతువునకే అర్థమైయుండ దానిని ఈణిచ్ ప్రత్యయము ద్యోతింప చేయుచున్నదనియు, అట్లుకాక ప్రేషణాదికము ణిచ్ ప్రత్య యార్థమే యనియు, రెండు పక్షము లున్నవి. మొదటి పక్షమున ప్రేషణము కూడ ధాత్వర్థము

నందే అంతర్గతముగ నున్నదిగాన, ప్రకరణాదివశముచే అది ద్యోత్యమైనపుడు ణిచ్ ప్రయోగ మనావశ్యకమనియు, కావుననే 'క్రీణీష్వ' ఇత్యాది ప్రయోగములు ప్రేరణార్థమున శిష్టులచే అంగీకరింపబడిన వనియు చెప్పవచ్చును. అపుడు ప్రకృతియగు ధాతువు ణిచ్చుతో వైకల్పిక ముగ ప్రయుక్తము కావచ్చును. కాని ప్రేషణము ణిచ్ ప్రత్యయార్థమేయని అంగీకరించు పక్షమున ఈ వైకల్పికత్వము కుదురదు. ఇక 'క్రీణీష్వ' ఇత్యాది శిష్టప్రయోగములను అన్తర్భావిత ణిజర్థములనియో, మరి యే విధముననో సమర్థించుకొనవలసి యుండును. అదే విధముగ ఆత్మనే పదమునకు గూడ ణిచ్చుతో వైకల్పికత్వము యుక్తము కాదు. క్రియా ఫలము కర్తృగామి యని బోధించు ఆత్మనే పదము, ప్రధాన ఫలము కర్తకు చెందును అని మాత్రమే బోధింపగల్గును గాని ఇందు ప్రేషణ స్పర్శము ఏ మాత్రమును లేదు. ణ్యన్త ప్రయోగములగు 'యాజయతి' ఇత్యాదులలో ప్రయోజ్య ప్రయోజక వ్యాపారములు విభిన్న ముగ, స్పష్టముగ తెలియుచున్నట్లు 'యజతే' అనునపుడు తెలియుట లేదు. ఫలార్థియై, ఈ కర్త, స్వతంత్రుడై, ఈ యాగమును జరుపుచున్నాడు అని మాత్రమే 'యజతే' అను పద మున కర్థముగ తెలియునుగాని, ఇతరుని ప్రేరేపించుచున్నాడు, అను నర్థము ఈ పదము వలన వచ్చుట లేదు. 'యాజయతి' అనునపుడు యాగ క్రియయందు పరుని ప్రేరేపించు చున్నాడు' అను నర్థము స్పష్టముగ తెలియవచ్చు చున్నది. కావున ఆత్మనే పద విషయమగు సంవిధానమనునది వేరు, ణిజర్థమగు ప్రేషణము వేరు. అందుచే వీటికి వికల్పము కుదురదు అని సూచించుటకై 'కేషాంచిత్' అను పదము ప్రయుక్తమైనది. ॥6॥

అవతారిక — ణిచ్చునకును ఆత్మనే పదమునకును విషయసామ్యమున్నదను భ్రాంతిచే కొందరు (పై కారికలో చూపిన విధముగ) ణిచ్చుతో ఆత్మనే పదమునకు వికల్ప మును అంగీకరించిరి. వారి భ్రాంతికి కారణమును చూపుచున్నాడు.

**శ్లో॥ క్రీణీష్వ వపతే ధత్తే చినోతి చినుతేఽపి చ ।**
**ఆప్తప్రయోగా దృశ్యన్తే యేషు ణ్యర్థోఽభిధీయతే ॥ 7**

యేషు = ఏ ప్రయోగములయందు, ణ్యర్థః = ణిజంతార్థము, అభిధీయతే = చెప్పబడు చున్నదో, అట్టి, 'క్రీణీష్వ' (కొనిపించుము) 'వపతే' (ముండనము చేయించుచున్నాడు) ''ధత్తే'' (ధరింపచేయు చున్నాడు) ''చినోతి'' (చయనము చేయుచున్నాడు), 'చినుతే' (చయనము చేయించుచున్నాడు) అనెడు, ఆప్త ప్రయోగాః = శిష్ట ప్రయోగములు, దృశ్యన్తే = కనుపట్టు చున్నవి.

తాత్పర్యము— ప్రేరణార్థకములగు 'క్రీణీష్వ', 'వపతే', 'ధత్తే', 'చినుతే' మొదలగు ఆప్తప్రయోగములు కానవచ్చుచున్నవి.

వివరణము— నాగమాతయగు కద్రువ వినతతో 'స్వాత్మానం క్రీణీష్వ' అని పల్కగా వినత తన పుత్రులతో ''క్రీణీత మామ్'' అని చెప్పినది. ఇచట క్రయణమునకు దాస్య విమోచనము ఫలము ; అది క్రయణమున కర్తయగు వినతకు చెందునని సూచించు

టకై ఆత్మనే పదము ప్రయుక్తమైనది. కాని ఇచట ప్రకరణమును బట్టి 'క్రీణీష్వ' అను దానికి 'కొనుము' అను నర్థము కాక 'కొనిపించుకొనుము' అను అర్థము చెప్పవలసి యున్నది. అనగా పందెము ద్వారా నీవు నాకు దాసిగా అమ్ముడుపోయితివి ; కావున దాస్యము పోవలె నన్నచో నీ పుత్రులతో ఏమైన చేయించి కొనిపించుకొనుము అని దీని యర్థము. అప్పుడామె పుత్రులవద్దకు పోయి 'క్రీణీతమామ్' అని చెప్పినది. ఈ విధముగ ప్రకరణమును బట్టి ణిజర్థ మగు ప్రైష కనబడుటచేత ణిజాత్మనే పదములు సమాన విషయకములు (ఏకార్థ బోధకములు) అనెడు భ్రాంతి కలిగినది.

ఇట్లే 'వపతే' అను దానికి అన్యునిచే ముండనము చేయించుకొనుచున్నాడు అని యర్థము. వపన క్రియా ఫలము కర్తకు చెందినదను విషయమును తెలుపుటకై ఆత్మనే పదము ప్రయోగింపబడినది. కాని వాక్య సామర్థ్యమును బట్టి - తాను స్వయముగ ముండనము చేసికొనజాలడు గాన అన్యుని ద్వారా చేయించుకొనుచున్నాడు అను నర్థము వచ్చును. ఇచట గూడ ణిచ్ప్రత్యయాత్మనే పదములు సమానవిషయకములు అని భ్రాంతి కలుగుటకు అవకాశ మున్నది.

''తృప్తా పత్నీ రేతోధత్తే'' అను ప్రయోగమున్నది. 'పత్ని తృప్తిచెంది రేతస్సు ఉంచుచున్నది' అను అర్థము అసంగతముగాన సామర్థ్యవశముచే 'ధత్తే' అను దానికి 'ధాపయతి' (ఉంచునట్లు చేయుచున్నది) అను నర్థము చెప్పవలెను. ఇచట గూడ ణిజాత్మనే పదములు సమానవిషయకములను భ్రాంతి కలుగుట కవకాశమున్నది.

''సైషాత్ర యజ్ఞస్య సమృద్ధిర్యోఽగ్నిం చినుతే యశ్చినోతి యశ్చీయతే'' అను వాక్యమున్నది. ఇచట 'చినోతి' అను పరస్మై పదము 'చినుతే' అను ఆత్మనే పదరూపము రెండును ప్రయుక్తములైనవి. 'చినోతి' అను దానికి 'పరప్రేరణముచే అగ్ని చయనము చేయుచున్నాడు' అను నర్థముగాన దానిచే ప్రయోజ్యకర్త బోధింపబడుచున్నాడు. 'చినోతి' అను దానిని బట్టి 'చినుతే' అనునది ప్రయోజకకర్తను - అనగా చయనము చేయుటకు తగు సంవిధానము చేయువానిని, బోధించుచున్నదని చెప్పవలెను. ఇచట గూడ ఆత్మనే పద ణిచ్ప్రత్యయములు సమానవిషయకములని భ్రాంతి కలుగుటకు అవకాశము కలదు. ఈ విధ ముగ పై ఉదాహరణము లన్నింటియందును ప్రేరణార్థము గమ్యమగుచున్నప్పుడు, అది ఆత్మనే పదప్రయోగము వలన కాదు, అర్థసామర్థ్య ప్రకరణాదుల వలన. కావున ణిచ్‌కు బదులుగ ఆత్మనే పదమును ప్రయోగించిన చాలుననుట యుక్తము కాదు. ణిచ్చునకు ప్రేష ణాదిక మర్థము, ఆత్మనే పదమునకు సంవిధానము అర్థము. ఈ రెండును భిన్న విషయ ములు భిన్న విషయములను బోధించువాటికి వికల్పము కుదురదుకదా. ॥7॥

*అవతారిక* — ఆత్మనే పదము సంవిధానమును (ఏర్పాట్లుచేయుటను) బోధించునని చెప్పబడినది. కాని పచాది ధాతువులు ప్రధానమగు విక్లిత్త్యాద్యర్థమునే (బియ్యము ఉడికి మెత్త బడుట మొదలగు అర్థమునే) బోధించుచున్నవి గాని సంవిధానమును బోధించుట లేదుకదా.

అట్టి పరిస్థితిలో సంవిధాన విశిష్ట క్రియాబోధకమగు ధాతువునకు ఆత్మనే పదము వచ్చునని చెప్పుట ఎట్లు యుక్తమగును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ సంవిధానం పచాదీనాం క్వచిదర్థః ప్రతీయతే ।
తన్నిమిత్తా యథాఽన్యాపి క్రియాధిశ్రయణాదికా ॥ 8

తన్నిమిత్తా = విక్లిత్తికి నిమిత్తమగు, అధిశ్రయణాదికా = పొయ్యిపై గిన్నె నెక్కించుట మొదలగు, అన్యాపి = మరియొక, క్రియా = క్రియ, యథా = ఎట్లో, అట్లే, క్వచిత్ = ఒక్కొక్క స్థలమునందు, సంవిధానం = సంవిధానము కూడా, పచాదీనాం = పచాది ధాతువుల, అర్థః = అర్థముగా, ప్రతీయతే = తెలియవచ్చు చున్నది.

తాత్పర్యము— విక్లిత్తికి నిమిత్తమగు అధిశ్రయణాది క్రియలు గూడ పచ్యాదుల కర్థమైనట్లు సంవిధానము కూడ వాటి (పచ్యాదుల) అర్థముగ కనబడుచున్నవి.

వివరణము— ప్రయోజకుని వ్యాపారము గూడ ధాత్వర్థమేయని భాష్యకారులు చెప్పియున్నారు. ప్రయోజకుడు ఉదాసీనుడుగ నున్నను (అన్యునెవనిని ప్రేరేపింపకున్నను) సామగ్రీ పోషణము చేయుచుండుటచే సంవిధాతయనియు కారకుడనియు చెప్పబడుచున్నాడు. 'పచతే' అను ఆత్మనే పదప్రయోగమున అట్టి సంవిధాన రూపవ్యాపారము బోధింపబడు చున్నది. పచధాతువునకు ప్రధానముగ తండుల విక్లిత్తి యను నర్థమైయైనను, దాని కావశ్యకము లగుటచే (పొయ్యిపై నుంచుట నీరుపోసి తడుపుట మొ॥) అధిశ్రయణోదకాసేచనాదికములు గూడ పచ్యర్థములుగ తెలియుచున్నవి. కావుననే 'పచతి దేవదత్తః' అనునపుడు 'అధిశ్రయతి' 'ఉదకమాసేచయతి' ఇత్యాద్యర్థములు గూడ బోధింపబడుటచే, అధిశ్రయణోదక సేచనాదులు ప్రయోజ్యకర్తయగు దేవదత్తుడు చేయుచున్న వ్యాపారములు అని తెలియుచున్నది. అట్లే ''పచతే దేవదత్తః'' అను దానికి ''దేవదత్తుడు పాకమునకు కావలసిన సంభారముల నన్నింటిని సమకూర్చుచున్నాడు అని యర్థము. అతడే ఒక ప్రయోజ్యుని ప్రేరేపించుచున్నాడని చెప్పవలెనన్నచో 'ణిచ్' చేర్చి 'పాచయతి' అని ప్రయోగింపవలెను. సామగ్రిని సమకూర్చుకొనుట (సంవిధానము) ప్రేషణము కాజాలదు. సామగ్రిని సమకూర్చుచు ఎవడు ఇతరుని ప్రేరేపించునో అతడే ప్రయోజకుడు. సంవిధానము చేయుచున్నను పర ప్రేషణము నేయకున్నచో అతడు ప్రయోజకుడు కాజాలడు. ॥8॥

*అవతారిక*— ఆత్మనే పదము కర్త్రభిప్రాయమున విధింపబడినది. దీనినిబట్టి ధాతువునకు సంవిధానమను అర్థమున్నదని చెప్పుట ఎట్లు అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ కర్త్రభిప్రాయతా సూత్రే క్రియాభేదోపలక్షణమ్ ।
తథా భూతా క్రియా యా హి తత్కర్త్రా ఫలభాగ్యతః । 9

సూత్రే = ''స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే అను సూత్రమునందు, కర్త్రభిప్రాయతా = కర్త్రభిప్రాయత్వము, క్రియాభేదోపలక్షణమ్ = క్రియా భేదమునకు (సంవిధాన విశిష్ట

క్రియకు) ఉపలక్షణము, యతః = ఎందువలన అనగా, యా = ఏ, క్రియా = క్రియ, తథా భూతా = అట్టిదో, తత్కర్తా = దానిని చేయువాడే, ఫలభాక్ = ఫలమును పొందువాడు.

తాత్పర్యము— సూత్రమునందలి కర్త్రభిప్రాయత్వము క్రియా భేదమునకు ఉప లక్షణము. ఎందుచేతననగా అట్టి క్రియను చేయువాడే ఫలమును పొంద గల్గును.

వివరణము— క్రియా ఫలము కర్తకు చేరవలెనన్నచో ఆ క్రియకు కావలయు సంవిధానమునంతను ఆతడు చేయవలెను. ఏమియు ఏర్పాట్లుచేయని యాజకునకు స్వర్గాది ఫలము లభింపదు కదా? కావున సూత్రమున చెప్పిన కర్త్రభిప్రాయత్వముచే, క్రియ సంవి ధాన విశిష్టముగ నుండవలెనని ఉపలక్షింపబడుచున్నది. అట్టి సంవిధాన విశిష్ట క్రియను బోధించునపుడు ఆత్మనే పదము వచ్చునని చెప్పినట్లైనదని భావము. ॥9॥

అవతారిక— ఇట్లు సంవిధాన విశిష్టక్రియను ఉపలక్షించుటలో ఉదాహరణమును చూపుచున్నాడు.

**శ్లో॥ యథోపలక్ష్యతే కాలస్తారకాదర్శనాదిభిః।**
**తథా ఫలవిశేషేణ క్రియాభేదో నిదర్శ్యతే॥ 10**

తారకాదర్శనాదిభిః = నక్షత్ర దర్శనాదులచేత, యథా = ఏ విధముగా, కాలః = కాలము, ఉపలక్ష్యతే = ఉపలక్షితమగుచున్నదో, తథా = అట్లే, ఫలవిశేషేణ = ఫలవిశేషముచేత, అనగా ఫలమునందలి కర్తృగామిత్వ విశేషముచేత, క్రియాభేదః = క్రియాభేదము, నిదర్శ్యతే = చూపబడుచున్నది.

తాత్పర్యము— (ఆకాశమునందలి నక్షత్రాదికమును చూచి రాత్రి వేళను పూర్వ కాలమున లెక్కకట్టుచుండు వారు) తారకాదర్శనాదులచే కాలము ఉపలక్షితమగునట్లు ఫల విశేషముచే క్రియాభేదము ఉపలక్షితమగుచున్నది.

వివరణము— 'నక్షత్రం దృష్ట్వా వాచం విసృజేత్' అని ఒక విధమగు మౌన వ్రతమును పాటించువాని విషయమున చెప్పిన శాస్త్రము. అనగా ''నక్షత్రమును చూచిన పిమ్మటనే మాటలాడవలెను'' అని దీని యర్థము. ఇచట నక్షత్ర దర్శనము సంధ్యాకాలము దాటిన పిమ్మట జరుగును గాన ''నక్షత్రం దృష్ట్వా'' అను దానికి లక్షణం 'సంధ్యాకాలము దాటిన తరువాత' అని యర్థము. అందుచేతనే ఆకాశము మేఘాచ్ఛన్నమైనపుడు నక్షత్ర దర్శనము కాకున్నను గడియారములు మొదలగు సాధనముల ద్వారా సంధ్యాత్యయ కాలమును నిర్ణయించుకొని వాగ్విసర్జనము చేయవచ్చును. అట్లే ఇక్కడ కూడ ఫలము కర్తృగామి కావలెనని చెప్పుటచే క్రియ సంవిధాన విశిష్ట క్రియ కావలెనని ఉపలక్షణచే చెప్పుకొనవలెను. 'నక్షత్రం దృష్ట్వా' అను దానికి నక్షత్ర దర్శనము విషయమున అంతగా ఆస్థలేదు; సంధ్యా కాలాత్యయమునే ప్రధానముగ బోధించుటయందు దీని తాత్పర్యము. అట్లే ఆత్మనే పదము గూడ ఫలవిశేషమును (కర్తృగామి ఫలము అను విషయమును) కాక ప్రధానముగ సంవిధాన మాత్రమునే బోధించును. ॥10॥

*అవతారిక*— భాష్యకారుడు స్వరితఞిద్గ్రహణము అనావశ్యకమని ప్రత్యాఖ్యానించెను (చూ. ౯౫ కారిక వ్యాఖ్యానము). దీనిని ప్రత్యాఖ్యానించినచో 'యా' మొదలగు ధాతువులకు గూడ (ఇవి స్వరితేత్తులుగాని ఞిత్తులుగాని కావు) ఆత్మనే పదము రావచ్చునుకదా యని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రియా విశేషవచనే సామర్థ్యముపరుధ్యతే ।**
**కేషాఞ్చిదన్యే తు కృతాః స్వరితేతో ఞిత స్తథా ॥ 11**

క్రియావిశేష వచనే = సంవిధాన లక్షణమగు క్రియావిశేషమును బోధించు విషయమున, కేషాంచిత్ = 'యా' మొదలగు కొన్ని ధాతువులయొక్క, సామర్థ్యం = సామర్థ్యము, ఉపరుధ్యతే = అడ్డుకొనబడుచున్నది, అన్యేతు = అట్టి సామర్థ్యముగల కొన్ని ధాతువులైతే, స్వరితేతః = సరితేత్తులుగను, తథా = మరియు, ఞితః = ఞిత్తులుగను, కృతాః = చేయబడినవి.

*తాత్పర్యము*— యా మొదలగు కొన్ని ధాతువులకు, సంవిధాన విశిష్ట క్రియాబోధకత్వ శక్తి ఉండదు. కొన్నింటికి అట్టి సామర్థ్యముండును. వాటికి ఆ సామర్థ్యమున్నదని సూచించుటకై ధాతు పాఠమున వాటిని స్వరితేత్తులుగను, ఞిత్తులుగను చూపియున్నారు.

*వివరణము*— ఆ యా ధాతువులకు ఆ యా యర్థములను బోధించు శక్తి స్వాభావికముగ నుండును. దానిని ప్రసిద్ధ్యనుసారము తెలుసుకొనవలెనే గాని మన బుద్ధిచే నిర్ణయింపజాలము. శాస్త్రకారులు మాత్రము ఇట్టి శక్తులను సూచించుటకై ఇకారాద్యనుబంధములను చేసియున్నారు. ॥11॥

*అవతారిక*— ఐనను భాష్యకారులు స్వరిత ఞిద్గ్రహణమును ప్రత్యాఖ్యానించుట యుక్తము కాదు. ఈ సూత్రములో స్వరిత ఞిద్గ్రహణమున్నది. కావుననే ధాతుపాఠమున, ఆత్మనే పదరూపకార్యము రావలెనను ఉద్దేశ్యముతో, కొన్ని ధాతువులను స్వరిత ఞిత్తులుగా పఠించుట జరిగినది. సూత్రములో స్వరిత ఞిద్గ్రహణము లేనిచో ఈ ధాతువులకు వాటిని అనుబంధములుగ చేర్చుట జరుగదు. ఇవి లేనిచో ఈ ధాతువులకు సంవిధాన విశిష్ట క్రియాభిధాన శక్తి యున్నది అని తెలిసికొనుట ఎట్లు, అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అనుబన్ధస్తు సిద్ధేఽర్థే స్మృత్యర్థ మనుషజ్యతే ।**
**తుల్యార్థేష్వపి చావశ్యం న సర్వేష్వేకధర్మతా ॥ 12**

సిద్ధే = ప్రసిద్ధమగు, అర్థే = విశిష్టార్థ విషయమున, స్మృత్యర్థం = స్మరణార్థమై, అనుబన్ధః + చ = అనుబంధము, (ఇత్సంజ్ఞక వర్ణము), అనుషజ్యతే = చేర్చబడుచున్నది, సర్వేషు = అన్ని ధాతువులును, తుల్యార్థేష్వపి = సమానమగు వ్యాపార రూపార్థము కలవైనను, అవశ్యం = తప్పక, ఏకధర్మతా = ఏకధర్మత్వము, (ఒకే ధర్మము కలిగియుండుట), న = లేదు.

తాత్పర్యము— ప్రసిద్ధమగు అర్థ విశేషమును స్మరింపచేయుటకై అనుబంధము లను చేర్చు చుందురు. ధాతువులు సమానార్థకములే యైనను అన్నియు ఏకధర్మములు గలవి కావు.

వివరణము— ధాతువులు క్రియా వాచకములు. క్రియావాచకము లగుటచే ధాతువు లన్నియు సమానాభిధేయములే యైనను, శబ్ద శక్తి విచిత్రముగ నుండునుగాన, వాటిలో కొన్ని ధాతువులు విశిష్ట క్రియా బోధకములుగ నుండును. ఉదాహరణమునకు 'యాప్రాపణే' 'నీప్రాపణే' అని 'యా' 'నీ' ధాతువులు రెండింటికిని ఒకే విధమగు ప్రాపణరూపార్థము నిర్దేశింపబడినది. అయినను యా ధాతువునకు (దేశాంతరమును) పొందుట అనియు, నీ ధాతువునకు (దేశాంతరమును) పొందించుట యనియు అర్థభేదము కనబడుచున్నది. అనగా నీ ధాతువునకు సంవిధాన రూపార్థము (ఒకరు దేశాంతరమునకు వెళ్ళు ఏర్పాటుచేయుట అనెడు అర్థము) కనబడుచున్నది. ఇట్లే కొన్ని ఇతర ధాతువులు కూడ స్వభావముచే సంవిధానార్థ మును బోధించును. ఈ వైశిష్ట్యమును స్మరింపచేయుటకే స్వరితాదులు అనుబంధములుగ చేర్చబడుచుండును. ధాతువును చూడగనే దానియందు సంవిధానార్థమున్నదని తెలిసికొన గలిగినవానికి ఈ అనుబంధములతో పనిలేదు. కాని అట్లు తెలియజాలని వానికి స్మృతి కలిగించుటకై ఇవి ఆవశ్యకములు. కావున ధాతు పాఠమున స్వరిత ఇకారాద్యనుబంధములను చేర్చుటయు, సూత్రమున స్వరిత ఇిద్గ్రహణమును, ప్రయోగజ్ఞానము లేని వానికొరకై ఆవశ్యకములు. ప్రయోగజ్ఞానము ఉన్నవానికొరకు అనావశ్యకములని భావము. ॥12॥

అవతారిక— ''తుల్యార్థేష్వపి చావశ్యం న సర్వేష్వేకధర్మతా'' అని చెప్పబడి నది. దీనికి దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ దృశీక్ష్యోః సదృశేఽప్యర్థే నాభేదః ప్రతిపూర్వయోః ।**
**ణ్యర్థోపాదాయిన స్తస్మా న్నతుల్యార్థాః పచాదిభిః ॥ 13**

దృశీక్ష్యోః = 'దృశ్' 'ఈక్ష్' ధాతువులయొక్క, అర్థే = అర్థము, సదృశేఽపి = సమానమే యైనను, ప్రతిపూర్వయోః = ప్రతి అనునది పూర్వమునందుగల వాటికి, అభేదః = అభేదము, న = లేదు, తస్మాత్ = ఆ కారణమువలన, ణ్యర్థోపదాయినః = ణిచ్ ప్రత్యయార్థమును స్వీకరించు ధాతువులన్నియు, పచాదిభిః = పచాది ధాతువులతో, తుల్యార్థాః = సమానమైన అర్థము కలవి, న = కాదు.

తాత్పర్యము— 'దృశ్' 'ఈక్ష్' ధాతువుల ధాతుపాఠోక్తమగు అర్థము సమానమే యైనను, ప్రతిపూర్వకములగు వాటి యర్థములు అభిన్నములు కావు. కావున ణ్యర్థమును స్వీకరించు ధాతువు లన్నియు పచాదులతో తుల్యార్థములు కాజాలవు.

వివరణము— 'పశ్యతి' 'ఈక్షతే' ఇత్యాది ప్రయోగములలో దృశ్ ఈక్ష ధాతు వుల అర్థము సమానమే చూచుచున్నాడని యర్థము. అట్లైనను వీటికి 'ప్రతి' చేర్చినపుడు

వేరు వేరు అర్థము వచ్చుచున్నది. 'ప్రతీక్షతే' అనగా నిరీక్షించుచున్నాడనియు, 'ప్రతిపశ్యతి' అనగా ప్రతికూలముగ చూచుచున్నాడనియు అర్థములు. ఇట్లే ధాతుపాఠమున సమానార్థకము లగు 'రక్ష' 'పాల' ధాతువులకును 'హృ' 'నీ' ధాతువులకును ఉపసర్గ విశేషములు చేర్చి నపుడు అర్థములు మారిపోవుచున్నవి. ప్రతిరక్షతి = తిరిగి రక్షించుచున్నాడు ; ప్రతిపాల యతి = నిరీక్షించుచున్నాడు. 'సంహరతి' = చంపుచున్నాడు. సంనయతి = కూర్చుచున్నాడు ఇత్యాద్యర్థభేదము లున్నవి. అట్లే అన్ని ధాతువులును ణ్యర్థమగు ప్రేషణముతో సంబంధించి నంత మాత్రమున సంవిధానార్థకములగు పచాదులతో తుల్యార్థములు కాజాలవు. ణ్యర్థమగు ప్రేషణము వేరు, ప్రేషణకు గూడ హేతుభూతమగు సంవిధానమనునది వేరు. (చూ. ఆరవ కారిక వ్యాఖ్యానము). ఈ సంవిధాన రూపార్థము పచాదులగు కొన్ని ధాతువులకే ఉన్నది. కావున ణిచ్ ప్రత్యయము చేర్చ వీలగు ధాతువులన్నియు పచాది తుల్యములు కాజాలవని తాత్పర్యము. ॥13॥

*అవతారిక*— స్వరిత ఞిద్వ్యతిరిక్తములగు ధాతువులకు సంవిధాన రూపార్థముతో ఏ మాత్రము సంబంధముండదని చెప్పుటకు వీలులేదు. దానితో సంబంధమున్నను వాటికి దానిని బోధించు శక్తి లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉమ్భ్యర్థే వర్తమానస్య కరోతేర్భిన్న ధర్మణః ।
ణ్యర్థోపాదాయితా తస్మాన్నియతాః శబ్దశక్తయః ॥ 14

ఉమ్భ్యర్థే = 'ఉంభి' ధాతువుయొక్క అర్థమునందు, వర్తమానస్య = ప్రవర్తించుచున్నదియు భిన్నధర్మణః = భిన్న స్వభావము గల, కరోతేః = 'కృఞ్' ధాతువునకు, ణ్యర్థోపాదయితా = ణ్యర్థముతో సమానమైనదగు సంవిధాన రూపార్థమును గ్రహించుట, కనబడుచున్నది, తస్మాత్ = ఆ కారణమువలన, శబ్దశక్తయః = శబ్దశక్తులు, నియతాః = నియతమగు రీతిలో నుండునవి (అని యెరుంగవలెను).

*తాత్పర్యము*— భిన్న స్వభావము గల కృఞ్ ధాతువు ఉంభిధాతువు యొక్క అర్థమునందు ప్రవర్తించుచు ణ్యర్థమును గ్రహించుచున్నది. అందుచే శబ్దశక్తులు నియతరూప మున నుండును.

*విశేషము*— ణిచ్‌కు ప్రేషణము అర్థము. అది సంవిధానముకంటె భిన్నమైనది. కృఞ్ ధాతువు సంవిధాన రూపార్థమును బోధించుచున్నది గాని ప్రేషణ రూపమగు ణ్యర్థ మును బోధించుట లేదు. అందుచే 'ణ్యర్థ' అను దానికి 'ణిజర్థముతో తుల్యమగు అర్థము' అని అర్థము చెప్పబడినది.

'ఉంభపూరణే' అను ధాతువున్నది. దానికి నింపుట అని యర్థము. 'ఉమ్భతి' ఇత్యాది రూపములగును. విట్టినందు 'ఆమ్' చేర్చినపుడు 'కృఞ్' ధాతువు అను ప్రయుక్తమై 'ఉమ్భాఞ్చకార' ఇత్యాది రూపములగును. ఈ ఉమ్భ ధాతువునందు గూడ సంవిధాన రూప మగు అర్థమున్నది. కాని అది స్పష్టముగ అభివ్యక్తము కాకుండుటచే, దానిని అభివ్యక్తము

చేయుటకై కృఞ్ ధాతువు అనుప్రయుక్తమైనది. ఈ కృఞ్ ధాతువు సంవిధాన రూపార్థాభిధాయకము. ఇది ఉంభ్ ధాతువుతో చేరి దాని యర్థమును బోధించుచు, దానితోపాటు సంవిధానార్థమును గూడ స్పష్టీకరించుచున్నది. అందుచే 'ఉమ్భాఞ్చకార' అను దానికి "అది నిండుటకు తగు ఏర్పాట్లు చేసెను" అని యర్థము వచ్చినది. ఈ సంవిధాన రూపార్థము ఉమ్భ ధాతువులో సహజముగ లేదని చెప్పుటకు వీలులేదు. సహజముగ లేకున్నచో అది కృఞ్ ధాతువును చేర్చినను బోధ్యము కాజాలదు. కావున ఉంభ్ ధాతువునకు తనలోనున్న సంవిధాన రూపార్థమును వ్యక్తీకరించు శక్తి లేదనియు, తద్వ్యక్తీకరణమునకై 'కృఞ్' ధాతువు అనుప్రయుక్తమైనదనియు అంగీకరించవలెను. 'కృఞ్' ధాతువునకు ఆ శక్తి ఉన్నది కావుననే ఇది ఞిత్తుగ పఠింపబడినది. ఈ విధముగ శబ్ద శక్తులు వేరు వేరు తీరుల నియతములై యుండును. ॥14॥

*అవతారిక*— 'ఉమ్భాఞ్చకార' అనునపుడు అనుప్రయుక్తమగు కృఞ్ ధాతువు పరస్మైపదముననే ఉన్నదిగాని ఆత్మనేపదమున లేదు. అట్టి పరిస్థితిలో ఇచట కృఞ్ ధాత్వర్థము సంవిధాన విశిష్టమని ఎట్లు చెప్పవీలగును అని ఆశంకించి ఈ విధముగ భాష్యకారాంగీకారమే ప్రమాణమని చెప్పుచున్నాడు.

శ్లో॥ తథాహ్యనుప్రయోగస్య కరోతే రాత్మనేపదే ।
పూర్వవద్గ్రహణం ప్రాప్తే స్వరితం సముపస్థితమ్ ॥ 15

తథా హి = అదియుక్తమే కదా, అనుప్రయోగస్య = అనుప్రయుజ్య మానమగు, కరోతేః = కృఞ్ ధాతువునకు, ఆత్మనే పదే = ఆత్మనే పదము, ప్రాప్తే = ప్రాప్తమగుచుండగా, స్వరితం = స్వరితమగు, పూర్వవద్ గ్రహణం = 'పూర్వవత్' అను పదముయొక్క గ్రహణము, సముపస్థితమ్ = అధికారముగ వచ్చినది.

*తాత్పర్యము*— అది యుక్తమే కదా. అనుప్రయుజ్యమానమగు కృఞ్ ధాతువునకు ఆత్మనేపదము ప్రాప్తమైయుండగా స్వరితత్వముతో కూడిన పూర్వవద్ గ్రహణము అధికారముగ వచ్చినది.

*వివరణము*— ఇచట పరస్మై పదమే ప్రయుక్తమైనను సంవిధాన రూపార్థమున్నట్లు భాష్యకారుని యభిప్రాయమని ఎట్లు తెలియుచున్నదనగా— "ఆమ్ప్రత్యయవత్ కృఞోఽను ప్రయోగస్య" (1-3-72) అను సూత్రముచే అనుప్రయుక్తమగు కృఞ్ ధాతువునకు కూడ, ఆమ్ ప్రత్యయమునకు ఏ ధాతువు ప్రకృతమో ఆ ధాతువునకు వలెనే ఆత్మనే పదము వచ్చునని విధింపబడినది. దీనినిబట్టి 'ఏధాం చక్రే' ఇత్యాదులలో 'ఆమ్' ప్రత్యయము 'ఏధ' ధాతువునకు చేర్చబడినది గాన దాని ప్రకృతి 'ఏధ' ధాతువు. దానితో అనుప్రయుక్తమగు కృఞ్ ధాతువునకు గూడ ఆ 'ఏధ' ధాతువునకు వలెనే ఆత్మనే పదము వచ్చును. అనగా క్రియాఫలము కర్త్రభిప్రాయము కాకున్నను ఈ సూత్రముచే కృఞ్ ధాతువునకు ఆత్మనే పదమే వచ్చి 'ఏధాఞ్చక్రే' ఇత్యాది రూపములగును. కర్త్రభిప్రాయమైనచో "స్వరిత

అనుచోట పశువు ఒక్కటియే అను లింగమో, తత్ = ఆ లింగము, న్యాయానువాది = పై చూపబడిన రెండు న్యాయములకు అనువాదరూపమే. నూతనముగా అర్థనిర్ణాయకము కాదని భావము.

లాఘవము ప్రథమాతిక్రమమున కారణాభావము అను న్యాయములవలన లభించిన అర్థమును వ్యక్తపరచునదే ఆ లింగము. అంతియేకాని అది వేరుగా అర్థమును నిర్ణయించు ప్రమాణము కాదు.

ఏలయన, తేన = ఆ న్యాయద్వయముచేత, జాతివత్ = పశుత్వజాతివలె, సంఖ్యా = ఏకత్వ సంఖ్య, సాధనత్వేన = యాగమునకు అంగముగా, న + గమ్యతే = శబ్దముచే బోధింపబడలేదు.

ప్రత్యయార్థమగు ఏకత్వ సంఖ్య వివక్షితము కాకున్నను పై రెండు న్యాయములచే తమ సంఖ్య తెలియబడుచున్నది. అందుచే నది శాబ్దము కానేరదు.

జాతి యట్టిది కాదు. అది శబ్దముచేతనే యాగాంగముగా తెలియబడుచున్నది.

కాక, తేన = ద్వితీయ, తృతీయ అను లింగముచే, జాతివత్ = జాతివలె, సంఖ్యా = సంఖ్య, సాధనత్వేన = యాగాంగముగా, న + గమ్యతే = తెలియబడదు.

న్యాయముల వలననే ప్రకృతార్థము లభించుచున్నందున, ఆ లింగము కూడ సంఖ్య యాగాంగమని నిర్ణయింపజాలదు.

జాతివత్ అనునది వ్యతిరేక దృష్టాంతము జాతి యాగమున కంగమగునట్లు సంఖ్య యాగమున కంగము కానేరదని యర్థము. ॥66॥

*అవతారిక* — 60 వ శ్లోకము నుంచి ఏడు శ్లోకములచే యుక్తివలననే సంఖ్య వివక్షితమగునని కొందరి మతము చూపబడినది. ఇది మాత్రము (భర్తృహరికి) సమ్మతము కాదు. కనుకనే 65 వ శ్లోకమున 'కేచిదిచ్ఛన్తి' అని పరమతముగానే చూపబడినది.

పై యభిప్రాయముతో 67, 68 శ్లోకములచే తన సిద్ధాంతమును వ్యక్తపరచుచున్నాడు.

**శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యాం సంఖ్యాభ్యుపగమే సతి ।**
**యుక్తం యత్సాధనత్వం స్యాన్నత్వన్యార్థోపలక్షణమ్ ॥ 67**

(విభక్తి ప్రత్యయస్య) విభక్తి ప్రత్యయమునకు, అనగా పశునా అనుచోట 'నా' అను తృతీయైక వచనమునకు. అన్వయ వ్యతిరేకాభ్యామ్ = అన్వయ *వ్యతిరేకములచే, సంఖ్యాభ్యుప

* తత్సత్త్వే తత్సత్త్వమ్ అన్వయః, (అదియుండగా అది యుండుట అన్వయము ? ఘట శబ్దమును వినగా కడవ అను అర్థము తెలియుట అన్వయము, 'తదభావేతదభావః' (అది లేనిచో అది లేకుండుట వ్యతిరేకము) ఘటశబ్దము వినబడకున్న కడవ అను అర్థము తెలియకుండుట వ్యతిరేకము.

ఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే'' అను సూత్రముచే, అనుప్రయుక్తమగు కృఞ్ ధాతువునకు ఆత్మనే పదము రావలసియున్నది. కాని భాష్యకారులు ''పూర్వవత్ సనః'' అను సూత్రము నందలి 'పూర్వవత్' అను పదము స్వరితత్వయుక్తమని అంగీకరించి, (''స్వరితేనాధికారః'' అను సూత్రము ననుసరించి స్వరితత్వయుక్తమగు పదము ఉత్తర సూత్రములలోనికి అధికార ముగ అనువర్తించునుగాన), దానిని 'ఆమ్ప్రత్యయవత్' ఇత్యాది సూత్రములోనికి అనువర్తింప చేసికొని, వాక్యభేదముచే–, అనుప్రయుజ్యమానమగు కృఞ్ ధాతువునకు పూర్వమునందున్న ఏధాది ధాతువులతో సమానముగ ఆత్మనే పదమగును అను నర్థము గూడ వచ్చునని చెప్పెను. అనగా ఈ సూత్రమునందు రెండు వాక్యము లేర్పడినవి– 'కృఞ్ ధాతువునకు ఆమ్ప్ర కృతితో తుల్యముగ ఆత్మనే పదము వచ్చును' అని మొదటిది ''కృఞ్ ధాతువునకు ఆమ్‌కు పూర్వమునందు ప్రయుక్తమగు ధాతువుతో తుల్యముగ ఆత్మనే పదము వచ్చును'' అని రెండవ వాక్యము. ఈ విధముగ రెండు వాక్యములకును అర్థము సమానమే యైనది. కావున రెండవ వాక్యము నియమార్థము. 'కృఞ్ ధాతువునకు పూర్వ ధాతువుతో తుల్యముగ మాత్రమే ఆత్మనే పదము వచ్చునుగాని తద్భిన్నముగ రాదని నియమము. అనగా పూర్వధాతువుకు ఆత్మనే పదము ఉన్నచో దానికిని ఉండును, లేనిచో దానికిని రాదు అని భావము. కావున 'ఉమ్భాఞ్చకార' ఇత్యాదులలో కృఞ్ ధాతువునకు, ఆమ్‌కు పూర్వమునందున్న 'ఉమ్భ' ధాతువునకు ఎట్టి ఆత్మనే పదమున్నదో అదే వచ్చును. 'ఉమ్భ' ధాతువు పరస్మైపది గాన దీనికి అభావరూపమగు ఆత్మనే పదమున్నది, అనగా– ఆత్మనే పదము లేదు. కావున కృఞ్ ధాతువునకు కూడ ఆత్మనే పదము రాదు. ఈ విధముగ మొదటి వాక్యముచే 'ఏధాం చక్రే' ఇత్యాదులలో ఆమ్ప్రకృతులగు ఏధాది ధాతువులలో క్రియా ఫలము కర్తృగామి కాకున్నను అనుప్రయుక్తమగు కృఞ్ ధాతువునకు ఆత్మనే పదము వచ్చుటకు వీలు కలిగినది. రెండవ వాక్యమును బట్టి 'ఉమ్భాంచకార' ఇత్యాదులలో క్రియా ఫలము కర్తృగామి యగుటచే– అనగా క్రియ సంవిధాన విశిష్టముగాన, ఆత్మనే పదము రావలసియుండ తన్నివారణము జరిగి కృఞ్ ధాతువునకు పరస్మై పదము వచ్చినది. 'ఉమ్భాంచకార' ఇత్యాదులలో 'కృఞ్' ధాతువునకు ఆత్మనే పదము రాకుండుటకై 'పూర్వవత్ సనః' అను సూత్రము నుండి 'పూర్వవత్' అను పదమును అనువర్తింపచేసికొని, పైన చూపిన విధముగ, భాష్యకారులు నియమమును చేయుటను బట్టి చూడగా ఇచట ఆత్మనే పదము వచ్చెడు అవకాశమున్నట్లును, తన్నివారణమునకై ఈ యత్నమంతయు చేయబడుచున్నట్లును తెలియుచున్నది. అసలు ఉంభ్యాది ధాతువులచే బోధ్యమగు క్రియ సంవిధాన విశిష్టము కాకున్నచో, ఇచట అను ప్రయుక్తమైన కృఞ్ ధాతువునకు ఆత్మనేపదము వచ్చెడు ప్రసంగమే లేదు. దానిని నివా రింప ఈ నియమమును చేయ పనియులేదు. దీనిని పట్టి ఉంభ్యాది బోధ్యక్రియ సంవిధాన విశిష్టమని తెలియుచున్నది. ॥15॥

*అవతారిక*— ణిచ్ యోగ్యమగు అర్థమును బోధించునదైనను, అన్ని ధాతువుల కును సంవిధానమును బోధించు సామర్థ్య ముండదు అను విషయ దృష్టాంత నిర్దేశ పూర్వక ముగ విశదీకరించుచున్నాడు.

శ్లో॥ ఏకత్వేఽపి క్రియాఖ్యాతే సాధనాశ్రయ సంఖ్యయా ।
భిద్యతే న తు లిఙ్గాఖ్యో భేదస్తత్ర తదాశ్రితః ॥ 16

క్రియా = క్రియ, ఏకత్వేఽపి = ఏకత్వమున్నను (భేదరహితమైన దైనను), ఆఖ్యాతే = తిఙంతపదమునందు, సాధనాశ్రయ సంఖ్యయా = కర్తృ కర్మాది సాధనములకు ఆధారభూతము లగు ద్రవ్యములకు చెందిన సంఖ్యచే, భిద్యతే = భేదమును పొందుచున్నది, తు = కాని, తదాశ్రితః = సాధనాధారాశ్రితమగు, లింగాఖ్యః = లింగమనెడు, భేదః = భేదము, తత్ర = ఆ క్రియయందు, న = లేదు.

తాత్పర్యము— క్రియ అభిన్న స్వరూపమే యైనను, తిఙంతమునందు కర్తృ కర్మాద్యాధారభూతములగు ద్రవ్యముల సంఖ్యనుబట్టి భిన్నముగ కనబడుచున్నది. కాని వాటికి సంబంధించిన లింగము మాత్రము క్రియతో సంబంధించుట లేదు.

వివరణము— క్రియ సాధ్యావస్థలో నుండుటను గాన (సాధింపదగినదై యుండుటను గాన) స్వతః సిద్ధముగ దానియందు భేదమేమియు ఉండదు. కాని 'పచతః' 'పచన్తి' 'పచ్యేతే' 'పచ్యన్తే' ఇత్యాది తిఙంతములలో మాత్రము ఏకపదోపాత్తములగు (పచ్ ధాతువు 'తః' 'తే' మొదలగు ప్రత్యయముల కలయికచే నేర్పడిన ఒకే పదముచే ఉపాత్తములగు) కర్తకును కర్మకును (పచతః = ఇద్దరు కర్తలు వండుచున్నారు ; పచ్యేతే = కర్మభూతములగు రెండు పదార్థములు వండబడుచున్నవి ఇత్యాది విధమున) సంబంధించి సంఖ్యతో ఈ క్రియకు గూడ పరోక్షముగ సంబంధ మేర్పడుచున్నది. అయితే సంఖ్యతో సంబంధము కలిగినట్లు ఆ కర్తృ కర్మాది సాధనములకు గల లింగములతో క్రియకు సంబంధము ఏర్పడుట లేదు. అట్లు ఎందుచే ఏర్పడుట లేదు అని ప్రశ్నించుటకు అవకాశము లేదు. ఈ విధముగ శబ్దములకు గల అర్థబోధన శక్తి స్వభావసిద్ధమేగాని యుక్తిచే నిరూపింప శక్యమైనది కాదు. ॥16॥

అవతారిక— ఈ దృష్టాంతమును ప్రకృతముతో సమన్వయించుచున్నాడు.

శ్లో॥ తస్మాదవస్థితేఽప్యర్థే కస్యచిత్ ప్రతిబద్ధ్యతే ।
శబ్దస్య శక్తిః స త్వేష శాస్త్రేఽన్వాఖ్యాయతే విధిః ॥ 17

తస్మాత్ = ఆ కారణమువలన, అర్థే = సంవిధాన రూపార్థము, అవస్థితేఽపి = ఉన్నను, కస్యచిత్ = ఒకానొక, శబ్దస్య = 'యా' ధాతువు మొదలగు శబ్దముయొక్క, శక్తిః = ఆ అర్థమును బోధించు శక్తి, ప్రతి బధ్యతే = అడ్డుకొనబడు చున్నది, సః = అట్టి, ఏషః = ఈ, విధిః = పద్ధతి, శాస్త్రే = శాస్త్రమునందు, అన్వాఖ్యాయతే = స్పష్టీకరింపబడు చున్నది.

తాత్పర్యము— ఆ కారణము వలన, యా ధాతువు మొదలగు కొన్ని ధాతువులకు సంవిధాన రూపార్థము ఉన్నను దానిని బోధించెడు శక్తి అడ్డుకొనబడుచున్నది. ఈ పద్ధతినే శాస్త్రము విశదీకరించును.

*విశేషము*— పై కారికలో చెప్పిన విధమున కొన్ని శబ్దములకు వాటి స్వభావమును బట్టి కొన్ని యర్థములను మాత్రమే బోధించు శక్తి ఉండును. ఇతరార్థములను బోధించు శక్తి ప్రతిహతమగును. అందుచే పచాది ధాతువులందువలె 'యా' మొదలగు ధాతువులందు గూడ సంవిధాన రూపార్థము ఇమిడియున్నను, ఆ ధాతువులకు ఆ అర్థమును బోధించు శక్తి ప్రతిహతమగుటచే అవి బోధింపజాలకున్నవి. ఇది వాటి స్వభావము. వ్యాకరణము చేయునది ఎల్ల ఏమనగా— ఈ శబ్దము దాని స్వభావమును బట్టి, ఈ అర్థమును బోధింపగలదు, ఈ అర్థమును బోధింపజాలదు అని చెప్పుటయే. ఇందులకై స్వరిత ఞిత్త్వాదులు శాస్త్రమున చూపబడు చుండును. ॥17॥

*అవతారిక*— ''స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే'' అను సూత్రమున క్రియాఫలము కర్తకు చెందునదై ఉండునపుడు ఆత్మనే పదము వచ్చునని చెప్పుటచే 'యజన్తి యాజకాః' ''పచన్తి భక్తకరాః'' ఇత్యాదులందు, యాగఫలము యజమానునకును, పాకఫలమగు ఓదన భోజనము స్వామికిని చెందుచున్నది గాని ఆ క్రియలను చేయువారికి చెందుట లేదుగాన, యజ - పచ ధాతువులకు పరస్మై పదము వచ్చినది. కాని ఇచట గూడ యాగము చేసిన ఋత్విజులకు దక్షిణారూపమగు ఫలము, వంటవానికి కూలియు లభించుచున్నవి కదా? అందుచే క్రియా ఫలము కర్త్రభిప్రాయము గాన ఆత్మనే పదము రావలెను కదా యని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

శ్లో॥ యస్యార్థస్య ప్రసిద్ధ్యర్థ మారభ్యన్తే పచాదయః।
తత్ ప్రధానం ఫలం తేషాం న లాభాది ప్రయోజనమ్॥ 18

యస్య = ఏ, అర్థస్య = ప్రయోజనము యొక్క, ప్రసిద్ధ్యర్థం = సిద్ధికొరకై, పచాదయః = పచాది క్రియలు, ఆరభ్యన్తే = ఆరంభింపబడు చున్నవో, తత్ = అదియే, ప్రధానం = ప్రధానమైన, ఫలమ్ = ఫలము, తేషాం = పాచకాదుల, లాభాది = కూలి మొదలగునది, ప్రయోజనం = ప్రయోజనము, న = కాదు.

*తాత్పర్యము*— ఏ ప్రయోజనము సిద్ధించుటకై పచాదులు ప్రారంభింపబడు చున్నవో అదియే ప్రధానమగు ఫలము. పాచకాదుల లాభాదికము ప్రయోజనము కాదు.

*వివరణము*— కర్త్రభిప్రాయ క్రియా ఫలము సంవిధానమునకు ఉపలక్షకమని చెప్పబడినది. అందుచే సంవిధాన క్రియావాచకమగు ధాతువునకు ఆత్మనే పదము వచ్చునని చెప్పినట్లైనది. అందుచే సంవిధానము చేయువాడు ఏ ఫలము నుద్దేశించి ఆ ఏర్పాట్లను చేయునో అదియే ప్రధాన ఫలము. యాగముచేసి స్వర్గము సంపాదింపవలెనని అభిలషించు యజమానుడు ఇతరములగు సాధన సంపత్తితో పాటు ఋత్విక్కులను గూడ ఏర్పాటుచేసి కొని వానికి దక్షిణ ఈయ వచ్చును. ప్రధానోద్దిష్టమగు స్వర్గరూప ఫలము ఆ సంవిధాన కర్తయగు యజమానునకే చెందునుగాన, దక్షిణాద్యవాంతర ఫలములు ఇతరులకు చెందినను, వాటిని బట్టి పరస్మై పదాత్మనే పదములను నిర్ణయింప వీలులేదు. పచ్యాది విషయమున

గూడ ఇట్లే. ఈ విధముగ ప్రధానముగ ఉద్దిష్టమగు ఫలము కర్తకు చెందినచో ఆత్మనే పదము, అది పరునకు చెందినచో పరస్మై పదము అని నిర్ణయింపవలెను. ॥18॥

*అవతారిక*— సంవిధానార్థమున ఆత్మనేపదము వచ్చును అని సిద్ధాంతము. అట్లైనచో 'స్వామిదాసౌ పచతః' అను ప్రయోగము ఎట్లు సాధువగును? దాసుడు సంవిధాన కర్త కాదు గాన పరస్మైపదము వచ్చినను స్వామి సంవిధాన కర్త గాన ఆత్మనే పదము రావలసియున్నది కదా? 'స్వామి దాసౌ పచతే' అని కూడ ప్రయోగించుటకు వీలు లేదు; అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ యత్రోభౌ స్వామిదాసౌ తు ప్రారభేతే సహక్రియామ్।**
**యుగపద్ధర్మభేదేన ధాతుస్తత్ర న వర్తతే॥** 19

యత్ర = ఎచట, స్వామిదాసౌ = స్వామియు భృత్యుడు, ఉభౌ = ఇరువురును, సహక్రియాం = కలిసి క్రియను, ప్రారభేతే = ప్రారంభింతురో, తత్ర = అచట, ధర్మభేదేన = ధర్మభేద ముండుటచే, ధాతుః = ధాతువు, యుగపత్ = ఒక్కమారుగా, న వర్తతే = ప్రవర్తించదు.

**తాత్పర్యము**— స్వామి భృత్యు లిరువురును కలిసి ఎచట క్రియను ప్రారంభింతురో, అచట ధర్మ (వ్యాపార) భేదముండుటచే ధాతువు ఒక్క మారుగ ప్రవర్తింపదు.

*వివరణము*— సంభారములను ఏర్పాటుచేయుట యనెడు సంవిధానమును ప్రభువు సాధించును. ప్రధాన క్రియారూపమగు వంటను భృత్యుడు సాధించును. ఈ విధము వీరిరువురును చేయు వ్యాపారములు వేరు వేరుగ నున్నవిగాన ఒకే ధాతువు, ఒక్క సమయమున రెండు వ్యాపారములను బోధింపజాలదు. అందుచే సంవిధాతను పట్టి ఆత్మనే పదమును ప్రయోగించవలెనా, దాసుని బట్టి పరస్మై పదము ప్రయోగింపవలెనా అను సంశయము నివర్తించదు. ॥19॥

*అవతారిక*— ధాతువు అనేకార్థము కనుక ఒకే ధాతువు ఏదియో విధముగ వ్యాపారద్వయమును బోధించునని చెప్పినను ఆత్మనేపద పరస్మైపదముల విరోధము దుష్పరిహారమని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యత్రప్రతివిధానార్థః పచిస్తత్రాత్మనే పదమ్।**
**పరస్మైపదమన్యత్ర సంస్కారాద్యభిధాయిని॥** 20

యత్ర = ఎచట, పచిః = పచధాతువు, ప్రతివిధానార్థః = సంవిధానార్థకమో, తత్ర = ఆ వ్యాపారమును బోధింపవలసి యున్నపుడు, ఆత్మనే పదమ్ = ఆత్మనే పదము, సంస్కారాద్యభిధాయిని = అన్న సంస్కారము (అన్నము వండుట) మొదలగు దానిని బోధించు, అన్యత్ర = మరియొక వ్యాపారమునందు, పరస్మై పదము (వచ్చును).

**తాత్పర్యము**— పచధాతువు సంవిధాన రూపమగు అర్థమును బోధించునపుడు

ఆత్మనే పదము విధింపబడినది. తండుల విక్లిత్తి రూపమగు సంస్కారమును బోధించునపుడు పరస్మైపదము విధింపబడినది.

ఈ విధముగ ఒకే ధాతువు అర్థద్వయమును బోధించునని అంగీకరించినను పరస్పర విరుద్ధములగు లకారాదేశములు (పరస్మైపదాత్మనేపదములు) రావలసియుండును. అది సమంజసము కాదు. ॥20॥

*అవతారిక*— దానికి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంవిధాతుశ్చ సాన్నిధ్యాత్ దాసే ధర్మోఽనుషజ్యతే ।**
**ప్లక్షశబ్దస్య సాన్నిధ్యాన్న్యగ్రోధే ప్లక్షతా యథా ॥ 21**

ప్లక్ష శబ్దస్య = ప్లక్ష శబ్దముయొక్క, సాన్నిధ్యాత్ = సాన్నిధ్యము వలన, న్యగ్రోధే = న్యగ్రోధ వృక్షమునందు, ప్లక్షతా = ప్లక్షత్వము, యథా = ఎట్లో, అట్లే, సంవిధాతుః = సంవిధాత యొక్క, సాన్నిధ్యాత్ = సాన్నిధ్యము వలన, దాసే = దాసునియందు, ధర్మః = సంవిధాతృత్వ ధర్మము, అనుషజ్యతే = సంబంధించుచున్నది.

తాత్పర్యము— ప్లక్షశబ్ద సాన్నిధ్యముచే న్యగ్రోధ వృక్షమునందు ప్లక్షత్వము ఏ విధముగ ఆరోపింపబడుచున్నదో అట్లే సంవిధాతయొక్క సాన్నిధ్యముచే దాసునియందు గూడ సంవిధాతృత్వ రూపమగు ధర్మము ఆరోపింపబడుచున్నది.

విశేషము— 'ప్లక్షన్యగ్రోధౌ'' అనునది ద్వంద్వ సమాసము. 'సిద్ధంతు యుగపదధికరణ వచనే ద్వన్ద్వవచనాత్' అను భాష్య వార్తికానుసారముగ ఇచట 'ప్లక్ష' శబ్దము న్యగ్రోధముతో కలిసియున్న ప్లక్ష వృక్షమును, 'న్యగ్రోధ' శబ్దము ప్లక్షముతో కలిసియున్న న్యగ్రోధమును బోధించును. 'యుగపదేకైకేన శబ్దేనాధికరణ మభిధేయం ద్వన్ద్వవాచ్యం సముదాయరూపం యదోచ్యతే తదా ద్వన్ద్వః' అని కైయటము. అనగా ఇచట ప్లక్ష శబ్దమే న్యగ్రోధమును గూడ బోధించుచున్నది. ఇందులకు కారణము న్యగ్రోధమునందు ప్లక్షత్వారోపము. 'ప్రక్షరతీతి ప్లక్షః' అను వ్యుత్పత్తిచే ప్లక్షమనగా సర్వత్ర వ్యాపించునది అనియర్థము. ''న్యక్‌రోహతీతి న్యగ్రోధః'' అను వ్యుత్పత్తిచే క్రిందకు మొలచునది– ఊడలు దింపునది – అని యర్థము. న్యగ్రోధమునందు గూడ ప్లక్షత్వమున్నది ; ప్లక్షమునందు గూడ న్యగ్రోధత్వమున్నది. అందుచే న్యగ్రోధమునందు ప్లక్షత్వారోపము, ప్లక్షమునందు న్యగ్రోధత్వారోపమును ఈ ద్వంద్వమునందున్నది. ''యది తావత్ప్రక్షరతీతి వ్యుత్పత్త్యా ప్లక్షః స్యాత్, న్యగ్రోధేఽప్యేతద్భవతి. తథా యది న్యగ్రోహతీతి న్యగ్రోధః ప్లక్షేఽప్యేతద్భవతి'' (మ. భా.).

అట్లే సంవిధాతృ సాన్నిధ్యముచే దాసునియందు గూడ సంవిధాతృత్వమును ఆరోపించినచో ఆత్మనే పదము వచ్చి ఆ క్రియయందు ఇరువురికిని అన్వయము కలుగుటచే ''స్వామిదాసౌ పచేతే'' అని ప్రయోగింపవచ్చునని యర్థము. ॥21॥

అవతారిక— సన్నిధాన మాత్రముచే ఒక వస్తువునందు అన్యవస్తు రూపత్వము నారోపించుట ఎట్లు సంభావ్యము అని ఆశంకించి దృష్టాంత ప్రదర్శనముచే సమర్థించు చున్నాడు.

**శ్లో॥ పురోడాశాభిధానం చ ధానాదిషు యథాస్థితమ్ ।**
**ఛత్రిణా చాభిసంబన్ధా చ్ఛత్రి శబ్దాభిధేయతా ॥ 22**

ధానాదిషు = ధానాదులయందు (వేయించిన బియ్యము, పేలాలు), యథా = ఏ విధముగా, పురోడాశాభిధానం = పురోడాశమనెడు పేరు, స్థితం = ఉన్నదో, ఛత్రిణా = ఛత్రము కల వానితో, అభిసంబంధాత్ = సంబంధము వలన, ఛత్రి శబ్దాభిధేయతా = ఛత్రి శబ్దముచే బోధింపదగి యుండుట, (ఎట్లో అట్లే ఇచటను గ్రహించునది).

తాత్పర్యము— ధానాది ద్రవ్యములయందు పురోడాశమనెడు పేరు ఎట్లు ఆరో పితమైనదో, ఛత్రముకల వానితో సంబంధమువలన ఛత్రము లేనివారు గూడ ఏ విధముగ 'ఛత్రి' శబ్దముచే చెప్పబడుచున్నారో, అట్లే ఇచట గూడ గ్రహింపవలెను.

విశేషము— పురోడాశము (బియ్యపుపిండి మొదలగువాటితో తయారుచేసిన ఒక హోమ ద్రవ్యము) ఒక్కటియేయైనను ''పురోడాశై ప్రచరన్తి'' అను వాక్యమున బహువచన మును ప్రయోగించుటచే ఆ పురోడాశముతో పాటు చెప్పిన ధానలు, కరంభము, పరివాపము, పయస్య అను వాటియందు కూడ పురోడాశత్వమును ఆరోపించి, వాటితో కలిసి పురోడాశ ములు ఐదు అని పూర్వము మాంసకులచే నిర్ణయింపబడినది. ధానాదులయందు పురోడా శత్వారోపమునకు తత్సాహచర్యమే కారణము. పదిమంది కలిసిపోవుచున్నపుడు వారిలో ఒక రిద్దరి వద్ద మాత్రమే ఛత్రములున్నను వారి సాహచర్యముచే ఇతరులను గూడ ఛత్రవంతు లుగ పరిగణించి 'ఛత్రిణోయాన్తి' (గొడుగులవాళ్ళు వెళ్ళుచున్నారు) అని చెప్పుదురు. అట్లే స్వామిసాన్నిధ్యముచే దాసునియందు గూడ సంవిధాన కర్తృత్వము నారోపించి ఆత్మనే పదమును ప్రయోగింపవచ్చునని యభిప్రాయము. ॥22॥

అవతారిక— ఇచట మతాంతరము ననుసరించి పరస్మై పదమును గూడ ప్రయోగింపవచ్చునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అర్థాత్ ప్రతీతమన్యోన్యం పారార్థ్యమవివక్షితమ్ ।**
**ఇత్యయం శేషవిషయః కైశ్చిదత్రానువర్ణ్యతే ॥ 23**

అత్ర = ఇచట, అర్థాత్ = అర్థ శక్తివలన, ప్రతీతం = ప్రతీయమానమగు, అన్యోన్యం = పరస్పరము, పారార్థ్యం = పరార్థత్వము, అవివక్షితమ్ = వివక్షితము కాదు, ఇతి = ఈ కారణమువలన, అయం = ఇది, శేషవిషయః = శేషపరస్మై పదికి విషయమైనదిగా, కైశ్చిత్ = కొందరిచేత, అనువర్ణ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— ఇచట అర్థమువలన ప్రతీయమానము అగు పరస్పర పారార్థ్యము వివక్షితము కాదు గావున ఇది శేషపరస్మైపది వచ్చుటకు తగిన స్థానమని కొందరు వర్ణించిరి.

వివరణము— స్వామి దాసులలో ఒకడు ముఖ్యఫలమును ఉద్దేశించుచున్నాడు, రెండవవాడు ముఖ్యఫలమును ఉద్దేశించుట లేదు. అందుచే వారికిగల క్రియోపకారిత్వము విలక్షణమైనది. అట్టి వైలక్షణ్యమును వివక్షింపక ''మాతా పితరౌ పుత్రం జనయతః'' ఇత్యాదులందువలె సామాన్యరూపమున వీరిరువురును క్రియయందు కర్తలు అని మాత్రము చెప్పుటచే 'శేషాత్కర్తరి పరస్మై పదమ్' అను సూత్రముచే పరస్మైపదము వచ్చును. ఈ వాక్యమునందు స్వామి పదముండుటచే దానినిబట్టియే ఆతడు సంవిధాన కర్తయని తెలియు చున్నది. దాసపద ముండుటచే ఆతని క్రియాఫలము పరునకు చెందునని తెలియుచున్నది. కావున ఈ అర్థ విశేషములను ఆఖ్యాతము బోధింప పనిలేదు. అందుచే అది క్రియా సామా న్యమునే బోధించునుగాన ఇది ఆత్మనేపదనిమిత్తము కాని ధాతువగుటచే పరస్మైపదము వచ్చి 'స్వామి దాసౌ పచతః' అని ప్రయోగించ వచ్చునని కొందరి యభిప్రాయమని తాత్పర్యము. ॥23॥

అవతారిక— 'కృష్యాదిషుచానుత్పత్తిః' అను వార్తికమును వ్యాఖ్యానించుచు (సూ. 3-1-26) భాష్యకారులు ''కృష్యాదిషుచానుత్పత్తి ర్వక్తవ్యా, ఏకాన్తే తూష్ణీమాసీన ఉచ్యతే పఞ్చభిర్హలైః కృషతీతి'' అని వివరించియున్నారు. అచటనున్న 'పఞ్చభిర్హలైః కృషతి' అను పరస్మై పదప్రయోగమును గూర్చి ఆశంకించుచున్నాడు.

**శ్లో॥ అథ ప్రతివిధాతా యో హలైః కృషతి పఞ్చభిః ।**
**భాష్యే నోదాహృతం కస్మాత్ ప్రాప్తం తత్రాత్మనేపదమ్ ॥ 24**

అథ = మరి, యః = ఏ, ప్రతివిధాతా = ఏర్పాట్లు చేయు స్వామి, పంచభిః = ఐదు, హలైః = నాగళ్ళచే, కృషతి = దున్నుచున్నాడో, తత్ర = అచట, ప్రాప్తం = ప్రాప్తించిన, ఆత్మనేపదం = ఆత్మనేపదము, భాష్యే = భాష్యమునందు, కస్మాత్ = ఏ కారణము వలన, నోదాహృతం = ఉదాహరింప బడలేదు ?

తాత్పర్యము— ఏర్పాట్లుచేయు యజమాని ఐదు హలములచే (నాగళ్ళచే) దున్ను చున్నాడు (కృషతి) అని చెప్పు సందర్భమున ఆత్మనేపదము రావలసియుండగా భాష్య కారులు ఎందుచే అట్లు ప్రయోగింపలేదు ?

వివరణము— 'పంచభిః హలైః కృషతి' అను ప్రయోగమున్నది. ఇచట ఒక వ్యక్తి ఐదు నాగళ్ళచే దున్నుట యనునది అసంభవము. కావున ఒక ప్రభువు ఐదు నాగళ్ళచే దున్నించుచున్నాడని యర్థము. అనగా అట్లు దున్నుటకు ఏర్పాటు చేయుచున్నాడు. ఈ విధముగ ప్రతి విధానకర్తృత్వమును బోధించుచున్నది గాన ఆత్మనేపదము రావలసి

యున్నది కదా? భాష్యకారులు అట్లు 'కృషతే' అని ప్రయోగించకుండగా 'కృషతి' యని ఏల ప్రయోగించెను అని ఆ శంక. ॥24॥

అవతారిక— పూర్వ పక్షియే పరిహారమును ఆశంకించి నిరాకరించుచున్నాడు.

**శో॥ ప్రతీతత్వాత్ తదర్థస్య శేషత్వం యది కల్ప్యతే।**
**న స్యాత్ ప్రాప్తవిభాషాసౌ స్వరితేతాం నివర్తికా॥ 25**

తదర్థస్య = ఆత్మనే పదార్థమగు సంవిధాన కర్తృత్వము, ప్రతీతత్వాత్ = ప్రతీతమగుట వలన, శేషత్వం = శేషత్వము, కల్ప్యతేయది = కల్పింపబడినట్లైతే, అసౌ = ఆ 'విభాషోప పదేన ప్రతీయమానే' (పా. 1-3-77) అనెడు విభాష, స్వరితేతాం = స్వరితేత్తులకు, నివర్తికా = ఒక పక్షమున ఆత్మనే పదమును నివర్తింపచేయు నట్టిదయిన, ప్రాప్తవిభాషా = ప్రాప్తవిభాష (పొందవలసిన వైకల్పికత్వము), నస్యాత్ = కాకపోవును.

తాత్పర్యము— ఆత్మనే పదార్థము ప్రతీతమగుటచే శేషత్వమును కల్పించినచో "విభాషోపపదేన ప్రతీయమానే" అను స్వరితేత్తులకు ఒక పక్షమున ఆత్మనేపదమును నివర్తింపచేయు ప్రాప్తవిభాష కాజాలదు.

విశేషము— భృత్యుడు ఒక్క సమయమున ఐదు నాగళ్ళతో దున్న జాలడు. కావున 'కృషతి' అను దానిలో కర్త సంవిధాతయే యని అర్థాత్ సిద్ధము. అందుచే అర్థాత్సిద్ధ మగు సంవిధాతృత్వమును బోధించుటకై ఆత్మనే పదమును ప్రయోగింప ఆవశ్యకత లేదు గాన శేషార్థమున "శేషాత్కర్తరి పరస్మై పదమ్' అను సూత్రముచే పరస్మైపదము వచ్చి నది అని పూర్వోక్తాశంకకు పరిహారము చెప్పినచో మరియొక దోషము వచ్చును. "విభాషోప పదేన ప్రతీయమానే' అని మరియొక సూత్రమున్నది. "సమీపోచ్చరితమగు పదముచే క్రియాఫలము కర్తృగామియను విషయము తెలుపబడినచో ఆత్మనేపదము వికల్పముగ వచ్చును" అని దీని యర్థము. 'స్వం యజ్ఞం యజతి యజతే వా' ఇత్యాదు లుదాహరణము. ఇచట 'స్వం' అను పదముచే క్రియాఫలము కర్తృగామి యను విషయము తెలియుచున్నది గాన ఆత్మనే పదము వికల్పముగ వచ్చినది. ఈ విభాష 'ప్రాప్తవిభాష' యని భాష్యమునందు చెప్పబడినది అనగా పూర్వోక్తోదాహరణమునందు "స్వరితఞితః"– ఇత్యాది సూత్రముచే నిత్యముగ ఆత్మనేపదము రావలసియుండ ఈ సూత్రముచే వైకల్పికత్వము చెప్పబడినదని యర్థము. అందుచే ఈ ప్రాప్తవిభాష స్వరితేత్తులు మొదలగువాటి విషయమున క్రియాఫలము కర్తృగామి యైనపుడు నిత్యముగ రావలిసియున్న ఆత్మనేపదమును ఒక పక్షమున నివర్తింప చేసి పరస్మైపదము వచ్చునట్లు చేయును. పైన (ఏకదేశి) చెప్పిన విధమున సంవిధాన కర్తృత్వము ప్రమాణాంతరముచే గమ్యమగుచున్నది గాన ఆత్మనే పదము వచ్చుటకే అవ కాశము లేదన్నచో ఈ సూత్రము అప్రాప్త విభాషయని చెప్పవలసి వచ్చును. అనగా 'స్వం యజ్ఞం యజతి' ఇత్యాదులలో 'స్వ' శబ్దముచే క్రియాఫలమున కర్తృగామియని చెప్పబడినది గాన ఆత్మనేపదము వచ్చుటకు పూర్తిగ అవకాశములేని పరిస్థితులలో ఈ సూత్రము

చెప్పబడి, విధి ముఖమున ప్రవర్తించుచున్నది గాన నిది అప్రాప్త విభాషయని చెప్పవలసి యుండును. ఇది భాష్యకార మతమునకు విరుద్ధము. అందుచే ప్రకృతమున 'పంచభిః హలైః కృషతి' అనునపుడు సంవిధాన కర్తృత్వము ప్రమాణాంతర గమ్యమైనను ఆత్మనేపదమే రావలసియున్నదను ఆక్షేపము సుస్థము. ॥25॥

అవతారిక— ఈ విషయమున కొందరు ఈ విధముగ సమాధానము చెప్పుచున్నారు.

**శ్లో॥ శుద్ధే తు సంవిధానార్థే కైశ్చిదత్రేష్యతే కృషిః ।**
**తద్ధర్మా యజిరిత్యేవం న స్యాత్తత్రాత్మనేపదమ్ ॥** 26

కైశ్చిత్తు = కొందరిచేతనైతే, అత్ర = ఇచట, కృషిః = కృష్‌ధాతువు, శుద్ధేః = శుద్ధమగు, సంవిధానార్థే = సంవిధాన రూపమగు అర్థమునందు, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది, ఏవం = ఈ విధముగ చెప్పినచో, యజిః = యజ్ ధాతువుకూడ, తద్ధర్మా = కృష్ ధాతువునకు ఏ సంవిధాన రూపార్థము చెప్పబడినదో ఆ అర్థమే కలది కావున, తత్ర = ఆ యజ్ ధాతువునందు, ఆత్మనేపదం = ఆత్మనేపదము, నస్యాత్ = రాకుండ పోవును.

తాత్పర్యము— కొందరు కృష్ ధాతువునకు ఇచట కేవలము సంవిధానమనెడు అర్థము మాత్రమే అని అంగీకరించినారు. అట్లు చెప్పినచో యజ్ ధాతువునకు గూడ సంవిధాన రూపార్థమునే అంగీకరించుటచే దానికి గూడ ఆత్మనేపదము రాదని చెప్పవలసి యుండును.

వివరణము— వెనుక సూచించిన విధముగ కొందరి మతము ప్రకారము ఆత్మనేపదము ణిచ్చుతో సమానవిషయకము. అనగా ణిచ్చు ఏ అర్థమున వచ్చునో ఆత్మనేపదము కూడ ఆ యర్థముననే వచ్చును. "పంచభిః హలైః కృషతి" ఇత్యాద్యుదాహరణములలో కృష్ ధాతువునకు ణిచ్ ప్రత్యయము ఎందుచే రాలేదు అని ఆశంకించుకొని "కృష్యాదిషుచానుత్పత్తిర్నానా క్రియాణాం కృష్యర్థత్వాత్" అను వార్తికముచే (3-1-26) సమాధానము చెప్పబడినది. 'కృష్ ధాతువునకు నాగలితో దున్నుట అని మాత్రమే అర్థము కాదు. ఈ ధాతువు ప్రతివిధాన మనెడు అర్థమును గూడ బోధించును' అని భాష్యకారులు దీనిని వ్యాఖ్యానించిరి. కావున ఇచట విలేఖనమనెడు (దున్నుట అనెడు) ప్రయోజ్య వ్యాపారము లేదుగాన ణిచ్ ప్రత్యయము రాలేదని ఈ సమాధాన వార్తికము భావము. భాష్యకారులు చెప్పిన విధమున ఇచట కృష్ ధాతువునకు సంవిధానమని అర్థముగాన ఇచట ఆత్మనే పదము కూడ రాదు. సంవిధాన విశిష్టమగు అర్థమును బోధించు ధాతువునకు ఆత్మనే పదము వచ్చునుగాని, శుద్ధమగు సంవిధానమును బోధించు దానికి రాదు కదా? ఈ విధముగ శుద్ధ సంవిధాన బోధకత్వము ఆత్మనేపదము రాకుండుటకు కారణమని వీరి అభిప్రాయము.

ఈ అభిప్రాయము అయుక్తమని ఉత్తరార్థము చెప్పుచున్నది.

కృష్ ధాతువు శుద్ధ సంవిధానార్థకమగుటచే ఆత్మనే పదము రాదు అని సమాధానము చెప్పినచో, అదే విధముగ 'యజి' ధాతువు గూడ శుద్ధ సంవిధానార్థమును బోధించునని చెప్పవచ్చును గాన దానికి గూడ ఆత్మనే పదము రాకుండ పోవును. భాష్యకారుడు కృష్ ధాతువు విషయములో – 'నావశ్యం కృషిర్విలేఖన ఏవవర్తతే ; కింతర్హి ; ప్రతివిధానేఽపి వర్తతే' అని చెప్పినట్లు యజధాతువు విషయమున గూడ ''నావశ్యం యజిర్హవిః ప్రక్షేపణ ఏవవర్తతే ; కిం తర్హి త్యాగేఽపి'' అని చెప్పియున్నాడు. ఋత్విక్కులు హవిస్సును అగ్నిలో హోమము చేయుచుండగా యజమానుడు దూరముగ కూర్చుండి ''ఇంద్రాయేదం నమమ'' (ఇంద్రుని కొఱకిది నాది కాదు) ఇత్యాది విధమున చెప్పుచుండును. ఇదియే త్యాగము. ఈ త్యాగము సంవిధానములో చేరినది. కావున యజధాతువునకు గూడ ఆత్మనే పదము రాకుండవలెను. అందుచే వారు చెప్పిన సమాధానము అయుక్తమని తేలినది. యజ ధాతువునకు కేవల సంవిధానమే కాక, హవిః ప్రక్షేపణ విశిష్ట సంవిధానము అర్థము ; అందుచే ఇచట ఆత్మనేపదము రావచ్చునని సమాధానము చెప్పినచో, కృష్ ధాతువునకు గూడ విలేఖన విశిష్ట సంవిధానము అర్థమని చెప్పవచ్చును గాన ఆత్మనేపదము రావలసియుండును. ॥26॥

*అవతారిక*— ఇపుడు సిద్ధాంతి, ఇచట ఆత్మనేపదము రాకుండుటకు కారణమును తెలుపుచున్నాడు.

**శ్లో॥ అత్ర తూపపదేనాయమర్థభేదః ప్రతీయతే ।**
**ప్రాప్తే విభాషాక్రియతే తస్మాన్నాస్త్యాత్మనేపదమ్ ॥ 27**

అత్రతు = ఇచటనైతే, అయం = ఈ, అర్థభేదః = అర్థభేదము, ఉపపదేన = ఉపపదముచేత, ప్రతీయతే = తెలియుచున్నది, ప్రాప్తే = ఆత్మనే పదము ప్రాప్తమగుచుండగా, విభాషా = వికల్పముగా, క్రియతే = చేయబడుచున్నది, తస్మాత్ = ఆ కారణమువలన, ఆత్మనే పదం = ఆత్మనే పదము, నాస్తి = లేదు.

తాత్పర్యము— ఇచట అర్థభేదము ఉపపదముచే బోధింపబడుచున్నది. అందుచే ఆత్మనే పదము వైకల్పికము గాన ఇచట రాలేదు.

వివరణము— ప్రక్కనున్న ''పంచభిః హలైః'' అను పదములచే ఇచట సంవిధానరూపమగు అర్థవిశేషమున్నదని తెలియుచున్నది. కావున, ''విభాషోపపదేన ప్రతీయమానే'' అను సూత్రము ప్రవర్తించును. అనగా 'స్వరితఞితః'– ఇత్యాది సూత్రముచే నిత్యముగ ఆత్మనే పదము రావలసియుండ ఈ సూత్రమును బట్టి ఆత్మనే పదము వికల్పముగ వచ్చును. కావున 'కృషతి' అనునది ఆత్మనే పదము రాని పక్షమున చేసిన ప్రయోగముగాన సాధువే యని భావము. ॥27॥

*ఉపగ్రహ సముద్దేశము ముగిసినది*

గమే = సంఖ్యను బోధించుట, సతి = కలుగుచుండగా, సాధవత్వమ్ + (ఇతి) + యత్ = యాగమునకు అంగమగుట అనునది యేదో (తత్ + ఏవ) = అదియే, యుక్తమ్ = యుక్తమైనది, స్యాత్ = కాగలదు.

అన్యార్థోపలక్షణమ్ = మరియొక అర్థమునకు ఉపలక్షణమగుట, న + తు = కానేరదు.

పశుశబ్దము పశుత్వజాతిని బోధించునని అన్వయవ్యతిరేకములచే నిర్ణయింపవచ్చును, అట్లే, యా తృతీయా విభక్తికి ఏకత్వ సంఖ్య యర్థమని అన్వయ వ్యతిరేకముల వలన తెలియబడగలదు. ఏకవచనము వినబడుసరికి ఏకత్వ సంఖ్య భాసించును. పశుభ్యామ్, పశుభిః అనుచోట ఏకవచనము వినబడనందున ఏకత్వము భాసింపదు.

కాగా 'పశునా' అను పదము వలన పశుత్వజాతి ఏకత్వ సంఖ్య శబ్దతః లభించుచుండగా, ఆ రెంటిలో జాతి యాగాంగమనియు ఏకత్వసంఖ్య యాగాంగము కాదనియు చెప్పుట సరసము కాదు, రెండు కూడ శబ్దముయొక్క బలముచే లభించుచున్నవి గదా !

అట్లుకాక ప్రత్యయము ప్రకృతికి సాహాయ్యముగా చేర్చబడినది, దానికి వేరు అర్థము లేదు, అవి చెప్పుట యుక్తము కాదు. ॥67॥

*అవతారిక*— పై శ్లోకముయొక్క అర్థమునే బలపరచుచున్నాడు.

**శ్లో॥ సాధనత్వే పదార్థస్య సామర్థ్యం న ప్రహీయతే ।**
**సంఖ్యా వ్యాపారధర్మోఽత స్తేన లిఙ్గేన గమ్యతే ॥ 68**

పదార్థస్య = పదముయొక్క అర్థమునకు, అనగా పశునా అనే పదముచే బోధింపబడిన పశుత్వజాతి ఏకత్వసంఖ్య అనెడి సంపూర్ణమగు అర్థమునకు, సాధనత్వే = యాగాంగత్వము కలుగగా, (పదస్య) = పశునా అను పదముయొక్క, సామర్థ్యమ్ = సామర్థ్యము అనగా శక్తి, న + ప్రహీయతే = విడువబడదు.

ప్రత్యయార్థమగు సంఖ్య యాగమున కంగము కాకున్న దాని శక్తి విడువబడినదే కావలెను, అట్లు విడచుటకు తగిన కారణము కానరాదు.

అంతః = ఈ కారణము వలన అనగా పదముచే బోధింపబడిన అర్థములన్నియు యాగాంగములగుట వలన, సంఖ్యా = ఏకత్వ సంఖ్య, వ్యాపార ధర్మః = క్రియయొక్క ధర్మము (ఇతి) = అని, తేన + లిఙ్గేన = సామర్థ్యమనే ఆ లింగముచే, గమ్యతే = తెలియబడుచున్నది.

కాక తేన + లిఙ్గేన = ద్వితీయమ్, తృతీయమ్. అను పదముల ప్రయోగమనెడి ఆ లింగముచే, తెలియబడుచున్నది.

అట్టి లింగము అనగా చిహ్నము హేతువు ఉన్నచో నచట సంఖ్య వివక్షితమగును.

## లిఙ్గ సముద్దేశము

అవతారిక— ఇంతవరకును తిఙంతార్థ విచారణ జరిగినది. వాటిలో సంఖ్యా సాధనములు తిఙంతములకును సుబంతములకును గూడ సంబంధించునవి. క్రియా - కాల - పురుష - ఉపగ్రహములు మాత్రము కేవలము తిఙన్తములకే సంబంధించునవి. లింగము మాత్రము నామపదములకు అధికముగ నుండునది. దానినిపుడు విచారింప నున్నవాడై దర్శన భేదానుసారముగ దాని లక్షణమును తెలుపుచున్నాడు.

శ్లో॥ స్తనకేశాది సంబన్ధో విశిష్టా వా స్తనాదయః ।
తదుపవ్యఞ్జనా జాతి ర్గుణావస్థా గుణా స్తథా ॥ 1

శబ్దోపజనితోఽర్థాత్మా శబ్దసంస్కార ఇత్యపి ।
లిఙ్గానాం లిఙ్గత త్త్వజ్ఞై ర్వికల్పాః స ప్త దర్శితాః ॥ 2

స్తనకేశాది సంబన్ధః = స్తనకేశాదులతో సంబంధము అనియు, వా = లేక, విశిష్టాః = సంబంధ విశిష్టములగు, స్తనాదయః = స్తనాదులనియు, తదుపవ్యఞ్జనా = స్తనాదులు ఉపవ్యంజకములుగా గల జాతి, జాతిః = జాతియనియు, గుణావస్థాః = సత్త్వాది గుణముల అవస్థలనియు, తథా = మరియు, గుణాః = సత్త్వాది గుణములనియు, శబ్దోపజనితః = శబ్దప్రయోగ మాత్రముపలన కలిగిన, అర్థాత్మా = అర్థస్వరూపమనియు, శబ్ద సంస్కార ఇత్యపి = శబ్ద సంస్కారమనియు, లిఙ్గత త్త్వజ్ఞైః = లింగత త్త్వమును ఎరింగిన వారిచేత, లింగానాం = లింగముల విషయమున, సప్త = ఏడు, వికల్పాః = వికల్పములు, దర్శితాః = చూపబడినవి.

తాత్పర్యము— స్తనకేశాదుల సంబంధమనియు, సంబంధించిన స్తనకేశాదులనియు, స్తనకేశాదులచే వ్యంగ్యమగు జాతియనియు, సత్వాది గుణముల అవస్థలనియు, గుణములనియు, శబ్దమాత్ర బోధ్యమగు అర్థస్వరూపమనియు, శబ్ద సంస్కారమనియు, లింగత త్త్వజ్ఞులు లింగముల విషయమున ఏడు వికల్పములను చూపియున్నారు. ఇచ్చట విశిష్టాః అను పదమునకు సంబంధించిన యని యర్థము వ్రాయబడినది. ఆ విశేషమేమి? 'ప్రసవ యోగ్యములయిన' యను విశేషము వ్యాఖ్యానములో నున్నది. పరిపుష్టములయి, స్తన్య జనన యోగ్యత గలవిగాని, కేవలము చిహ్న మాత్రములుగా పురుషునియందుండు స్తనములు కావు. ప్రచయాది సంబంధ పై శిష్టమనియు భావము. ప్రచయమనగా పెరుగుట యర్థము.

వివరణము— స్త్రీ లింగము, పుంలింగము, నపుంసక లింగము అని మూడు లింగము లున్నవి. లింగము అనగా ఏమి అను విషయమున ఏడు మతభేదము లున్నవని ఈ కారిక చెప్పుచున్నది. ఒక అవయవికి స్తనములు కేశములు మొదలగు వాటితో సంయోగ

సమవాయాత్మక సంబంధము లింగమని మొదటి మతము. ఈ సంబంధములచే సంబంధించిన స్తనకేశాదులే లింగమని రెండవ మతము. ఈ మతద్వయమును– "స్తనకేశవతీ స్త్రీ స్యాల్లోమశః పురుషః స్మృతః ఉభయోర న్తరం యచ్చ తదభావే నపుంసకమ్" అను భాష్యోదాహృత కారిక సూచించుచున్నది. "స్తనకేశాదులు కలది స్త్రీ. అధికముగ లోమములు కలవాడు పురుషుడు. ఈ రెండును లేనపుడు, ఏది ఈ రెండింటికిని సదృశముగ నున్నదో (ఉభయోర న్తరం) అది నపుంసకము" అని ఈ శ్లోకము యొక్క అర్థము. ఇది లౌకిక లింగము. ఇది ప్రాణుల విషయమున కొంతవరకు సరిపడినను అప్రాణులగు 'ఖట్వా' 'మాలా' 'వృక్ష' మొదలగు శబ్దముల విషయమున సమన్వితము కాదు గాన గ్రాహ్యము కాదు. చేతనములలో గూడ నిత్య పుంలింగములును, భార్యాద్యర్థవాచకములును అగు దార శబ్దాదులలో ప్రవర్తించదు

లింగమనునది స్తనాదులగు వ్యంజకములచే వ్యంగ్యమగునదియు, స్త్రీత్వ పుంస్త్వ నపుంసకత్వ రూపమగునదియు నగు ఒక జాతియని మూడవ మతము. స్వత్త్వ రజ స్తమో రూపములగు మూడు గుణముల ఉపచయము (వృద్ధి) అపచయము (హ్రాసము) మాధ్యస్థ్యము అనెడు అవస్థా విశేషములే పుంస్త్వాది లింగములని సాంఖ్యాదుల అభిప్రాయము. ఇది నాల్గవ మతము. ఇది భాష్యకారాభిమతమగు మతము. ఉపచయాద్యవస్థా సహితములగు సత్త్వాది గుణములే లింగమని ఐదవ మతము. ఒకే వస్తువు విషయమున అర్థః (పుం లిం.) వ్యక్తిః (స్త్రీ. లిం.) వస్తు (న. లిం.) అను భిన్న శబ్దములను ప్రయోగింప వచ్చును. దీనిని బట్టి వాస్తవమున లింగమనునది బాహ్య వస్తువులందు లేకున్నను ఉన్నట్లుగ శబ్దములచే బోధింప బడు చున్నదని ఆరవ మతము. తటః, తటీ, తటం ఇత్యాదులలో ఒకే అర్థమును బోధించు ఒకే శబ్దము భిన్న లింగములలో ప్రయోగింపబడు చున్నది. అందుచే లింగమనునది శబ్ద సంస్కారము మాత్రమే అని ఏడవ మతము. ॥2॥

*అవతారిక*— ఇపుడు శబ్ద శక్తి స్వభావమును బట్టి లింగము విషయమున ఇంకను ఏడు వికల్పము లున్నవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉపాదాన వికల్పాశ్చ లింగానాం సప్త వర్ణితాః ।**
**వికల్ప సన్నియోగాభ్యాం యే శబ్దేషు వ్యవస్థితాః ॥** 3

యే = ఏవి, వికల్ప సన్నియోగాభ్యాం = వికల్ప నియమములచే, శబ్దేషు = శబ్దములయందు, వ్యవస్థితాః = ఉన్నవో, అట్టి, లింగానాం = లింగములకు సంబంధించిన, ఉపాధాన వికల్పాః + చ = ఉపాదాన భేదములు, సప్త = ఏడు, వర్ణితాః = వర్ణింపబడినవి. ఉపాదానమనగా విశిష్ట శక్తులగు శబ్దములు అర్థ సంబద్ధములుగ లింగములను పరిగ్రహించుట.

తాత్పర్యము— ఏ భేదములు, వికల్ప సంనియోగములచే శబ్దములయందున్నవో అట్టి, లింగములకు సంబంధించిన, ఏడు ఉపాదాన వికల్పములు వర్ణింపబడినవి.

వివరణము— లింగములు గుణావస్థా రూపము లగుటచే అంతటను సంభావ్యములే

యైనను - అనగా అన్ని లింగములును అన్ని పదములకును సంభవించునని చెప్పుటకు అవకాశమున్నను, ఈ శబ్దము ఈ లింగమును మాత్రమే అభివ్యక్తము చేయగలదు అను నియమమును ఏర్పరచుటచే లింగ సాంకర్యము - అన్ని లింగములును అన్ని శబ్దములకును ఉండుట అనునది - ఉండదు. ఈ విధముగ, ఆ యా శబ్దములకు ఆ యా లింగములను వ్యక్తీకరించు శక్తిని బట్టి ఏడు భేదము లేర్పడును. (1) శంఖః, పద్మః, శంఖం, పద్మం ఇత్యాది పదములు కొన్ని పుంలింగ నపుంసకలింగములలో నుండును. (2) భాగధేయం, భాగధేయీ, భేషజం, భేషజీ - ఇత్యాదులు స్త్రీ నపుంసక లింగములు. (3) ఇషుః, అశని, వత్సః - వత్సా ఇత్యాదులు స్త్రీపుంస సాధారణములు. (4) తటః, తటీ, తటం ఇత్యాదులు లింగత్రయ సాధారణములు. సన్నియోగ మనగా నియమము. దానిని బట్టి మూడు భేదము లేర్పడును. వృక్ష శబ్దాదులు పుంలింగమునందు మాత్రముండును. ఖట్వా శబ్దాదులు స్త్రీలింగమునందే ఉండును. దధ్యాది శబ్దము నపుంసకలింగము నందే ఉండును. ఈ విధముగ శబ్దములకు గల లింగాభివ్యంజకత్వ శక్తిని బట్టి ఏడు భేదము లేర్పడును. ॥3॥

అవతారిక— ఇపుడు జాతి పక్షమును గూర్చి విచారించుచున్నాడు. 'ఖట్వా' ఇత్యాది పదముల విషయమున అవ్యాప్తముగాన "స్తనకేశవతీ స్త్రీ" ఇత్యాది లౌకిక లింగ లక్షణమును పరిత్యజించి స్త్రీత్వాదులు జాతి విశేషములని చెప్పబడినది. అది అయుక్తము కదా. గోవునందు గోత్వజాతి ఒక్కటియే ఉండునుగాని అశ్వత్వాది జాతులు ఉండవు కదా? అట్లే ఒక శబ్దమున గోత్వాది జాతులతో కలిసి స్త్రీత్వ, పుంస్త్వాది జాతులు ఎట్లుండును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ తిస్రో జాతయ ఏవైతాః కేషాంచిత్ సమవస్థితాః ।**
**అవిరుద్ధా విరుద్ధాభిర్గోమహిష్యాది జాతిభిః ॥ 4**

కేషాంచిత్ = కొందరి మతము ప్రకారము, ఏతాః = ఈ, తిస్రః = మూడు, అవిరుద్ధాః = విరుద్ధము కాని, జాతయః = జాతులు, విరుద్ధాభిః = పరస్పర విరుద్ధములగు, గోమహిష్యాది జాతిభిః = గోత్వ మహిషత్వాది జాతులతో, సమవస్థితాః = కలిసి ఉన్నవి.

తాత్పర్యము— కొందరి మతము ప్రకారము విరుద్ధములుకాని ఈ స్త్రీత్వాది జాతులు మూడును పరస్పర విరుద్ధములగు గోత్వ మహిషత్వాది జాతులతో కలిసి యున్నది.

వివరణము— స్త్రీత్వ సంవలితమగు జ్ఞానము గోవు విషయమునందైనను కలుగవచ్చును. మహిష్యాదుల విషయమునందైనను కలుగవచ్చును. కావున స్త్రీత్వాదులు సంబంధించుటకు విరోధమేదియును లేదుగాన అని అవిరుద్ధములు. ఆ యా గోవులయందు ఇది గోవు ఇది గోవు అను రీతిగ అనుస్యూతమగు గోత్వ ప్రతీతి కలుగుచుండుటచే ఆ గోత్వము ఆగో వ్యక్తుల యందున్నట్లు తెలియుచున్నది. కాని ఆ గోవులందు అశ్వత్వ ప్రతీతి కలుగుట లేదు గాన గోవునందు అశ్వత్వ జాతి ఉండ జాలదు. అందుచే గోత్వాశ్వత్వములు పరస్పర విరుద్ధములు. అవి ఒక చోట కలిసి ఉండవు. కాని స్త్రీత్వాదుల విషయ మట్టిది కాదు. గోవునందును,

మహిషి యందును గూడ స్త్రీత్వానురక్తమగు బుద్ధి కలుగుచున్నది గాన గోత్వాది జాతులతో కలిసి స్త్రీత్వ జాతి ఉండవచ్చునని అభిప్రాయము. ॥4॥

అవతారిక — ఈ విషయమునే వివరించుచున్నాడు.

శ్లో॥ హస్తిన్యాం వడవాయాం చ స్త్రీతి బుద్ధేః సమన్వయః ।
అతస్తాం జాతిమిచ్ఛన్తి ద్రవ్యాది సమవాయినీమ్ ॥ 5

హస్తిన్యాం = ఆడ ఏనుగ యందును, వడవాయాం చ = ఆడ గుర్రమునందును, స్త్రీ + ఇతి = స్త్రీ అను, బుద్ధేః = బుద్ధియొక్క, సమన్వయః = సమన్వయము ఉన్నది, అతః = ఆ కారణము వలన, తాం = ఆ, జాతిం = జాతిని, ద్రవ్యాది సమవాయినీం = ద్రవ్యాదులతో సమవేతమైనదానినిగా, ఇచ్ఛన్తి = ఇచ్ఛయించుచున్నారు.

తాత్పర్యము — ఆడు ఏగుగి విషయమునను, ఆడు గుర్రము విషయమునను గూడ స్త్రీ అను బుద్ధి కలుగుచున్నది. అందుచే ఆ జాతి (స్త్రీత్వజాతి) ద్రవ్యాదులతో సమవాయ సంబంధముచే సంబంధించును అని చెప్పుచున్నారు.

వివరణము — భిన్న జాతులకు చెందిన వ్యక్తుల విషయమున గూడ ఇది స్త్రీ, ఇది పురుషుడు ఇత్యాది బుద్ధి కలుగుటకు అవకాశమున్నది. కావున హస్తిత్వవడవాత్వాది జాతులతో స్త్రీత్వ జాతికి విరోధము లేదు. ఈ విధముగ స్త్రీ పుం నపుంసకలింగ రూపమగు జాతి ద్రవ్య గుణ - కర్మ - సామాన్యాదులతో గూడ సంబంధించి యుండును.

వైయాకరణులకు శబ్దమే ప్రథమ ప్రమాణము. శబ్దము ఏ అర్థమును బోధించునో ఆ అర్థమే దాని సరియైన అర్థము. ఒక శబ్దమునుండి ఒక అర్థ ప్రతీతి కలుగునపుడు ఆ శబ్దమునకు ఆ అర్థ మున్నదా లేదా యని సందేహింప పనిలేదు. స్త్రీత్వ పుంస్త్వాది రూపములగు ఉపాధులు భిన్న జాతీయములందు గూడ అనుస్యూతముగ నున్నట్లు శబ్దములవలన స్పష్టముగ తెలియుచున్నది కాబట్టి అవి వాటితో సంబంధించునా సంబంధింపవా యను సందేహమునకు అవకాశము లేదు. కావున ద్రవ్య - గుణ - కర్మ - సామాన్యాదులకు గూడ లింగ జాతితో సంబంధమును అంగీకరింపవలెను. ఒక శబ్దము ఒక లింగ జాతితో సంబంధించినట్లుగ చెప్పబడిన అర్థమునే మరియొక శబ్దము మరియొక లింగజాతితో సంబంధించినట్లు బోధించుచున్నది. ఉదాహరణమునకు— 'ఉనికి' అను అర్థమునకు పుంస్త్వము ఉపాధిగ నున్నట్లు 'భావః' అను శబ్దము చెప్పుచున్నది. స్త్రీత్వము ఉపాధిగా నున్నట్లు 'సత్తా' అను శబ్దము బోధించుచున్నది. 'సామాన్యమ్' అను శబ్దము నపుంసక లింగము ఉపాధిగా నున్నట్లు బోధించుచున్నది. గోత్వాది జాతులకు గూడ భావ - జాతి - సామాన్య శబ్దములచే, మూడు లింగములతో సంబంధమున్నట్లు తెలియుచున్నది. ఈ విధముగ శబ్దము నెల్లపుడును ద్రవ్యమువలె కానవచ్చెడు వస్తువును బోధించుచుండును. అట్లు బోధించుటలో ఆ వస్తు ధర్మమగు లింగము ఉపాధిగ భాసించుచునే ఉండును. కావుననే స్త్రీత్వం, స్త్రీతా, స్త్రీభావః ఇత్యాది స్థలములలో లింగ వాచకములకు లింగాంతర సంబంధము కనబడుచున్నది.

అవతారిక— ఈ విషయమునే ఇంకను విశదీకరించుచున్నాడు.

శ్లో॥ పరతన్త్రస్య యల్లిఙ్గమపోద్ధారే వివక్షితే ।
తత్రాసౌ శబ్ద సంస్కారః శబ్దైరేవ వ్యపాశ్రితః ॥ 6

అపోద్ధారే = అపోద్ధారము, వివక్షితే = వివక్షితమైనదగుచుండగా, పరతన్త్రస్య = పరతంత్రమగు శబ్దము యొక్క, యత్ = ఏ, లింగం = లింగముకలదో, అసౌ = అది, శబ్దైరేవ = శబ్దములచేతనే, వ్యపాశ్రితః = ఆశ్రయింపబడిన, శబ్దసంస్కారః = శబ్దసంస్కారము.

తాత్పర్యము— అపోద్ధారము చేయదలచినపుడు, పరతంత్రమగు శబ్దమునకు సంబంధించిన లింగము శబ్దమాత్రమును ఆశ్రయించిన శబ్ద సంస్కారము మాత్రమే.

వివరణము— నామపదము పదార్థమును బోధించును. అది వృత్తిలో ఉపసర్జనమైనను ప్రక్రియా సమయమున అపోద్ధారము చేసినపుడు, (విగ్రహ వాక్యము చెప్పుటకై విడదీయునపుడు) దానికొక లింగమును చేర్చుచుందురు. లింగములేని శబ్దమును ప్రయోగించుటకు వీలులేదు గాన ఆ శబ్దమునకు ఆ లింగమును చేర్చుట జరుగుచున్నదిగాని లౌకిక ప్రయోగమున ఆ లింగము అవివక్షితము. ''కుక్కుట్యాః అండం కుక్కుటాండం'' అను సమాసమున కుక్కుటీ శబ్దమునకు పుంవద్భావమును విధించుచు చెప్పిన 'కుక్కుట్యాదీనామణ్డాదిషు' అను వార్తికమును నిరాకరించుచు ''నవా అస్త్రీ పూర్వపద వివక్షితత్వాత్'' అను వార్తికము చెప్పబడినది (మ. భా. 6-3-42). ఇచట 'కుక్కుటీ' అను స్త్రీలింగ శబ్దము పూర్వపదముగ నున్నదని చెప్ప బనిలేదు. అందుచేత దానికి పుంవద్భావమును విధించుట అనావశ్యకము, అని దాని భావము. అనగా 'కుక్కుటాణ్డం' ఇత్యాది సమాసములందు ఉపసర్జనముగా (అప్రధానముగా నున్న) కుక్కుట శబ్దము కోడి అనెడు పదార్థమును బోదించుచున్నది. ప్రక్రియా సమయమున ఈ పదములను విడదీసి విగ్రహవాక్యము చెప్పవలసినపుడు (కుక్కుట్యాః' అను స్త్రీలింగ శబ్దమును చెప్పనవసరము లేదు. 'కుక్కుటస్య' అని 'కుక్కుట' శబ్దమునే ఉపయోగించవచ్చును. ఇచటనున్న పుంలింగము ఏదియో యొక లింగమును చేర్చవలెను కదా అని శబ్ద సంస్కారమునకై చేర్చినదే గాని ఇందు పుంస్త్వ వివక్షగాని, స్త్రీత్వ వివక్షగాని లేదు. అందుచే దానికి పుంవద్భావమును చెప్పవలసిన ఆవశ్యకత లేదు. లౌకిక ప్రయోగమునందు మాత్రము మగ కోడికి గ్రుడ్లు ఉండవుగాన 'ఆడ కోడి గ్రుడ్డు' అను అర్థమే వచ్చును. ॥6॥

అవతారిక— స్త్రీత్వాది లింగజాతులు అన్నిటియందును ఉన్నవి అని నాల్గవ కారికలో చెప్పిన వ్యాప్తిని సమర్థించుచున్నాడు.

శ్లో॥ బుద్ధ్యా కల్పితరూపేషు లిఙ్గేష్వపి చ సమ్భవః ।
స్త్రీత్వాదీనాం వ్యవస్థా హి సాలిఙ్గైర్వ్యపదిశ్యతే ॥ 7

బుద్ధ్యా = బుద్ధిచేత, కల్పితరూపేషు = కల్పితమగు రూపముగల, లిఙ్గేష్వపి = లింగముల విషయమున గూడ, సమ్భవః = లింగముల సంభవముండును, సా = ఆ, వ్యవస్థా = నియమము, స్త్రీత్వాదీనాం = స్త్రీత్వాదులయొక్క, లిఙ్గైః = లింగోపాధులగు శబ్దములచే, వ్యపదిశ్యతే = ప్రతిపాదింపబడుచున్నది.

తాత్పర్యము— బుద్ధిచే కల్పితమగు రూపములుగల లింగములందు గూడ లింగములు చేరుటకు సంభవమున్నది. స్త్రీత్వాదుల లింగములకు ఉపాధులగు శబ్దములచే ఆ నియమము ప్రతిపాదింపబడుచున్నది.

వివరణము— స్త్రీత్వాది లింగములు ఆ యా వస్తువులకు ఉపాధులుగ చెప్పబడుచున్నవి. ఆ లింగములకు గూడ బుద్ధిచే రూపములను కల్పించుటచే లింగములు చేర్చుట జరుగును. స్త్రీత్వం, స్త్రీతా, స్త్రీభావః మొదలగు లింగాభిధాయకములగు భావ ప్రత్యయాంత శబ్దములు స్త్రీత్వాదుల లింగనియమమును బోధించును. అనగా 'స్త్రీ' అనునది స్త్రీలింగమును బోధించుచుండగా 'స్త్రీత్వం' అను 'త్వ' ప్రత్యయము ఆ స్త్రీలింగమునకు గల నపుంసకత్వ సంబంధమును, 'స్త్రీతా' అనునపుడు 'తా' అను ప్రత్యయము స్త్రీత్వయోగమును, 'స్త్రీభావః' అనునపుడు 'భావః' అనునది దాని పుంస్త్వయోగమును బోధించుచున్నవి. ఈ త్వతలాది ప్రత్యయములచే కలిగిన నపుంసకత్వ స్త్రీత్వాదులు శాబ్దములే కాని అర్థ సంబద్ధములు కావు.॥7॥

అవతారిక— అచేతన పదార్థముల లింగముల వ్యవస్థకై భాష్యకారుడు "అసత్తు మృగతృష్ణావత్" అని చెప్పియున్నాడు. దీనిని వ్యాఖ్యానించుచున్నాడు.

**శ్లో॥ యథా సలిల నిర్భాసా మృగతృష్ణాసు జాయతే ।**
**జలోపలబ్ధ్యనుగుణాద్ బీజాదుద్బుద్ధేర్జలే సతి ॥ 8**

**తథైవావ్యపదేశ్యేభ్యో హేతుభ్యస్తారకాదిషు ।**
**ముఖ్యేభ్య ఇవ లిఙ్గేభ్యో భేదా లోకే వ్యవస్థితాః ॥ 9**

జలే = జలము, అసతి = లేకున్నను, జలోపలబ్ధ్యనుగుణాత్ = జలజ్ఞానమునకు అనుకూలమగు, బీజాత్ = ఉదకవాసనా లక్షణమగు బీజమువలన, మృగతృష్ణాసు = ఎండమావులయందు, యథా = ఏ విధముగా, సలిలనిర్భాసా = జలబుద్ధి, జాయతే = పుట్టుచున్నదో, తథైవ = అట్లే, అవ్యపదేశ్యేభ్యః = చెప్పశక్యము కాని, హేతుభ్యః = కారణములవలన, తారకాదిషు = తారకాదులయందు, ముఖ్యేభ్యః = ముఖ్యములగు, లిఙ్గేభ్య ఇవ = లింగముల వలన వలె, లోకే = లోకమునందు, భేదాః = భేదములు, వ్యవస్థితాః = ఉన్నవి.

తాత్పర్యము— ఎండమావులలో జలము లేకున్నను జలజ్ఞానమునకు అనుగుణముగ నుండు జలవాసనారూపమగు కారణమువలన జలజ్ఞానము కలుగుచున్నది. అట్లే 'తారకా' మొదలగు పదములందు, చెప్పుటకు అలవికాని హేతువులచే, ముఖ్యములగు లింగముల వలన కలిగినట్లుగనే భేదములు లోకమున ప్రతీతి గోచరములగుచుండును.

వివరణము— ఎండమావులలో జలము లేదు. కాని దప్పికొన్న మృగాదుల మనస్సులో నున్న జలవాసనచే అచట జలమున్నట్లు కనబడుచుండును. అట్లే 'తారకా' స్త్రీ 'పుష్యః' (పుం), 'నక్షత్రం' (నపు) ఇత్యాద్యచేతన పదార్థములలో బాహ్యములగు లింగము లేవియు లేకున్నను, ప్రతి నియతములగు లింగములకు సంబంధించిన భేదములు కానవచ్చు చుండును. అనగా మృగతృష్ణికయందు లేనిజలమును ఆరోపించినట్లు తారకాదులందు గూడ లేని స్త్రీత్వాదికమును ఆరోపించి 'తారకా' ఇత్యాది స్త్రీలింగాదులు ప్రయోగింపబడుచున్నవి. ఇట్టి ఆరోపమునకు కారణమేదియో చెప్పజాలము. అది అనిర్వాచ్యము. మరుమరీచికాదులందు జలమును ఆరోపించుటకు సాదృశ్యాదులు కారణముగ నున్నవని చెప్పుటకైనను వీలున్నది. ఇచట అట్టి కారణము గూడ దురూహ్యమని యభిప్రాయము. కావుననే ఇట్టి స్థలములలో లింగారోపము గంధర్వ నగర కల్పన వంటిది (''గంధర్వ నగరం యథా'' మ. భా.) అని కూడ భాష్యకారుడు చెప్పెను. (ఆకాశమునందు-తలక్రిందైన యొక నగరమున్నదనియు అది గంధర్వ విశిష్టమనియు, అదియే మేఘరూప విశేషముగ కన్పించుచున్నదనియు ఒక భ్రాంత విశ్వాసము). ॥9॥

అవతారిక— దీని తరువాత భాష్యకారుడు - 'ఆదిత్యగతివత్ సన్నా' ''వస్త్రాన్తర్హితవచ్చతత్'' అని కూడ వ్రాసినాడు. దీనిని వివరించుచున్నాడు.

శ్లో॥ వ్యక్తేషు వ్యక్తరూపాణాం స్తనాదీనాం తు దర్శనాత్ ।
అవ్యక్తవ్యఞ్జనా వ్యక్తేర్జాతిర్న పరికల్ప్యతే ॥ 10

వ్యక్తేషు = చేతనగతములగు లింగములయందు, వ్యక్తరూపాణాం = స్పష్టమైన రూపముగల, స్తనాదీనాం = లింగ వ్యంజకములగు స్తనాదులయొక్క, దర్శనాత్ = దర్శనమువలన, అవ్యక్తవ్యఞ్జనా = అస్పష్టములగు వ్యంజకములుగల, జాతిః = లింగజాతి, అవ్యక్తేః = స్పష్టముగ ప్రతీయము కాకుండుటచే, న పరికల్ప్యతే = కల్పింపబడదు.

తాత్పర్యము— చేతనగతములగు లింగముల విషయమున తద్వ్యంజకములగు స్తనకేశాదులు స్పష్టముగ కానవచ్చుచున్నవి. కాని ఖట్వాదులందు వ్యంజకములేవియు స్పష్టముగ కనబడకుండుటచే లింగజాతి ఉన్నదని చెప్పుటకు వీలులేదు.

వివరణము— చేతనములందు స్తనకేశాదులగు లింగ వ్యంజకములు స్పష్టముగ నున్నవిగాన అచట లింగములున్నట్లు చెప్పుటకు వీలు కలుగుచున్నది. కాని అచేతనములగు వృక్షాదులందు అట్టి వ్యంజకము లేవియు కానరాకున్నవి. అందుచే వృక్షాదులందు లింగజాతి లేదనియే చెప్పవలెను. ఏ వస్తువైనను ఏదైన ప్రమాణముచే గ్రహింపబడినచో అది ఉన్నట్లు చెప్పుటకు అవకాశముండును. ఉదాహరణమునకు— సూర్యుని గమనము మన కంటికి కనబడకున్నను, ఒకచోట నున్న సూర్యుడు మరియొక చోట కనబడుటను బట్టి సూర్యగమనమున్నట్లు చెప్పవచ్చును. బట్టతో కప్పిన ఒక వస్తువును దానిని తొలగించినపుడు చూడ

వీలున్నది గాన దాని స్థితిని గూడ అంగీకరింపవచ్చును. కాని వృక్షాదులందు మొదటినుండి చివరివరకును బాడితతో చెక్కినను స్తనకేశాద్యుపవ్యంజనములు కానవచ్చుట లేదు. అందుచే వృక్షాదులలో లింగజాతి వాస్తవమున లేదనియు, లేని లింగజాతియే శబ్ద శక్తిచే ప్రతీతి గోచరమగుచున్నదనియు తాత్పర్యము. ॥10॥

*అవతారిక*— వృక్షాదులలో వాస్తవమున లింగము లేదని పూర్వకారికలో చెప్ప బడినది. అట్లయినను వాటిలో గూడ లింగమున్నదని ఎవ్వరైన చెప్ప ప్రయత్నించినచో అది ప్రత్యక్ష విరుద్ధమని చెప్పుచున్నాడు.

శ్లో॥ అస్తిత్వం చ ప్రతిజ్ఞాయ సదాదర్శనమిచ్ఛతః ।
అత్యన్తాదర్శనే న స్యాదసత్త్వం ప్రతి నిశ్చయః ॥ 11

అస్తిత్వం = అస్తిత్వమును (ఉన్నది అని), ప్రతిజ్ఞాయ = అంగీకరించి, సదా = ఎల్లపుడును, అదర్శనం = కనబడకుండుటను, ఇచ్ఛతః = అంగీకరించువానికి, అత్యన్తాదర్శనే = అత్యంతము కనబడకున్నను, అసత్త్వం ప్రతి = అసత్త్వమును గూర్చి, నిశ్చయః = నిశ్చయము, నస్యాత్ = కలుగకుండ పోవును.

*తాత్పర్యము*— ఉన్నది అని అంగీకరించి, అది మాత్రము ఎన్నటికిని కనబడదు అని చెప్పు వానికి, ఒక వస్తువు ఎప్పుడు కనబడకున్నను దాని అసత్త్వమును గూర్చి నిశ్చయ ముండ జాలదు.

*విశేషము*— ఖట్వా వృక్షాదులందు గూడ లింగము ఉన్నది అని అంగీకరించు వారు, అది ఏల కనబడుట లేదు అని అడుగగా వ్యంజకములు కనబడకుండుటచే అది కన బడుట లేదని చెప్పవలసి యుండును. అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏదైన ఒక వస్తువు లేదు అని చెప్పగలుగుచున్నామన్నచో అందులకు కారణము ఆ వస్తువు ఎన్నడును కనబడ కుండుటయే. ఉదాహరణమునకు శశవిషాణము నెన్నడును చూడలేదు గాన అది అసలు లేదు అని నిశ్చితముగ చెప్పగలము. కాని - లింగము ఉన్నది కాని ఎన్నటికిని మాత్రము కనబడదు అనువాదమును అంగీకరించినచో, ఎన్నటికిని కనబడని ఈ శశవిషాణము గూడ లేదు అని నిశ్చయముగ చెప్ప వీలులేక పోవును. ఉన్నదికాని వ్యంజకములు కనబడకుండుటచే కన బడుట లేదు అని లింగముల విషయమున చెప్పినట్లు, ఉన్నదికాని ఇంద్రియ దౌర్బల్యముచే కనబడుట లేదు అని శశవిషాణము విషయమున గూడ చెప్పవచ్చును కదా ? కావున ప్రత్యక్ష విరోధముచే ఖట్వా వృక్షాదులందు లింగమును అంగీకరింపరాదు. ॥11॥

*అవతారిక*— ప్రకాశమును చూచి దానికి కారణమగు జ్యోతిస్సును ఊహించినట్లు ఖట్వాది శబ్దములలో లింగ కార్యములగు టాబాది ప్రత్యయములు వచ్చుటను చూచి, వాటి కారణమగు లింగమున్నట్లు అనుమానముచే తెలిసికొనవచ్చును అని ఆశంకించుకొని భాష్య కారుడు "అన్యోన్య సంశ్రయంత్వేతత్" అని సమాధానము చెప్పినాడు. దీనిని వ్యాఖ్యానించు చున్నాడు.

శ్లో॥ న చాలమనుమానాయ శబ్దోఽదర్శనపూర్వకః ।
సిద్ధే హి దర్శనే కిం స్యాదనుమాన ప్రయోజనమ్ ॥ 12

అదర్శనపూర్వకః = లింగదర్శన పూర్వకము కాని, శబ్దః = శబ్దము, అనుమానాయ = అనుమానముచేయుటకు, అలం = సరిపడునది, న = కాదు, దర్శనే = దర్శనము, సిద్ధే = సిద్ధమైనచో, అనుమాన ప్రయోజనమ్ = అనుమానమునకు ప్రయోజనము, కిం = ఏది, స్యాత్ = ఉండును ?

*తాత్పర్యము*— లింగదర్శన పూర్వకము కాని శబ్దము అనుమానము చేయుటకు ఉపయోగింప జాలదు. దర్శనము సిద్ధమైనచో అనుమానముతో ప్రయోజనము లేదు.

*వివరణము*— శాస్త్రమున 'స్త్రియామ్' 'పుంసి' 'నపుంసకే' అను పదములచే, సిద్ధములగు అర్థములను అనువదించి ఆ యా కార్యములు విధింపబడుచుండును. 'స్త్రియామ్, అజాద్యతష్టాప్' అను సూత్రములచే స్త్రీలింగమున అదంతశబ్దముల కంటె టాప్ విధింప బడినది. ఈ టాప్ ప్రత్యయమును చేర్చుటకు పూర్వమే 'ఖట్వ' శబ్దమున స్త్రీలింగమున్నదని ప్రమాణాంతరముచే తెలిసియున్నచో, ఈ టాప్‌ను పట్టి స్త్రీత్వానుమానము చేయ పనిలేదు. అట్లుకాక (ప్రమాణాంతరముచే దానియందు స్త్రీలింగమున్నదని తెలియకి) ఈ టాప్‌ను పట్టియే స్త్రీత్వానుమానమును చేయవలెనన్నచో అన్యోన్యాశ్రయ దోషము వచ్చును. స్త్రీత్వ మున్ననే కాని టాప్ రాదు, టాప్ వచ్చిన పిమ్మటగాని స్త్రీత్వమున్నట్లు తెలియదు. కావున లింగ కార్యమగు టాబాదిని బట్టి ఖట్వాదులందు లింగమున్నదని నిర్ణయించుట అయుక్తము. ॥12॥

*అవతారిక*— ఈ విధముగ లౌకిక లింగము అచేతనముల విషయమున అవ్యాప్తము గాన దాని పరిత్యజించి భాష్యకారుడు పారిభాషికమగు లింగమును అంగీకరించినాడు. దానిని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆవిర్భావస్తిరోభావః స్థితిశ్చేత్యనపాయినః ।
ధర్మా మూర్తిషు సర్వాసు లిఙ్గత్వేనానుదర్శితాః ॥ 13

సర్వాసు = సమస్తమైన, మూర్తిషు = పదార్థములయందు, ఆవిర్భావః = ఆవిర్భావము (కనబడుట), తిరోభావః = తిరోభావము (కనబడకుండ పోవుట), స్థితిశ్చ = స్థితియు, ఇతి = అని, అనపాయినః = తప్పనిసరిగ ఉండెడు, ధర్మాః = ధర్మములు, లిఙ్గత్వేన = లింగములుగా, అనుదర్శితాః = చూపబడినవి.

*తాత్పర్యము*— అన్ని పదార్థములయందును తప్పనిసరిగా ఉండెడు ఆవిర్భావము, తిరోభావము, స్థితి అనెడు ధర్మములు లింగములుగ చూపబడినవి.

*విశేషాంశము*— భాష్యకారుడు- ''న శక్యం వైయాకరణై ర్లౌకికం లిఙ్గ మాశ్రయితుమ్. అవశ్యం కశ్చిత్ స్వకృతాన్త ఆస్థేయః'' (వైయాకరణులు లౌకిక లింగమును లింగ

ముగ అంగీకరించుట కుదురదు. అందుచే తమ శాస్త్రమునకు మాత్రమే సంబంధించిన ఏదైన ఒక సిద్ధాంతమును ఆశ్రయించవలెను) అని చెప్పి- "సంస్త్యానప్రసవౌ లిఙ్గ మాస్థేయా స్వకృతాన్తతః. సంస్త్యానే స్త్యాయతేర్ఢ్రట్ స్త్రీ సూతేః సప్ ప్రసవే పుమాన్" అను కారికలో స్వసిద్ధాంతము ప్రకారము లింగ మనగా ఏదియో చెప్పినాడు. సంస్త్యానము స్త్రీలింగము, ప్రసవము పుంలింగము. 'స్త్యై శబ్ద సంఘాతయోః' అను ధాతువుకంటె, సంస్త్యానము అను నర్థమున 'డ్రట్' ప్రత్యయము చేయగా స్త్రీ అను రూపము నిష్పన్నమైనది. 'షూఙ్' ధాతువు కంటె 'డుమసున్' ప్రత్యయము సకారమునకు పకారాదేశము చేయగా 'పుంస్' శబ్దము నిష్పన్నమైనది అని యర్థము. 'పా' ధాతువునకే 'డుమసున్' ప్రత్యయము చేర్చుటచే 'పుంస్' శబ్దము నిష్పన్నమైనట్లు గూడ భాష్యకారాభిప్రాయమును చెప్పవచ్చునని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయము. లోకములో స్త్రీ శబ్దమునకు - "స్త్యాయతి సంహననమాపద్యతేఽస్యాంగర్భః ఇతి స్త్రీ" అను వ్యుత్పత్తి ననుసరించి గర్భము ఎచట సంహననమును (శరీరము అను అర్థము కూడ గలదు) - సంఘటనమును పొందునో అట్టి సంస్త్యానాధారమగు ఆడుది అని యర్థము. శాస్త్రమున స్త్రీ శబ్దమునకు సంహననము అని యర్థము. సంస్త్యానము, సంహ ననము, ప్రతిలయము, తిరోభావము, అపచియము - ఇవన్నియు సమానార్థకములు. సత్త్వాది వికారములగు రూపాది గుణముల అపచయము - తగ్గుదల - అని యర్థము. అట్లే పుంస్ శబ్దము షూ ధాతువు నుండి నిష్పన్నమైనదని అంగీకరించినచో 'సూతే ఇతి పుమాన్' అను వ్యుత్పత్తిచే ఉత్పత్తి చేయువాడు అనియు, పాధాతువునుండి నిష్పన్నమైనదని చెప్పినచో "పాతీతి పుమాన్" అను వ్యుత్పత్తి ననుసరించి సంతానమును పాలించువాడు గాన పుమాన్ అనియు లౌకికార్థము. శాస్త్రమున 'పుమాన్' అను దానికి గుణముల ఆవిర్భావము అని యర్థము. ప్రసవము, ప్రవృత్తి, ఆవిర్భావము అనునవి సమానార్థకములు. ఈ విధముగ స్త్రీలింగ మనగా గుణ సంస్త్యానమనియు, పుంలింగమనగా గుణ ప్రసవమనియు అర్థము. ఇట్టి సంస్త్యాన ప్రసవములు అన్ని పదార్థములయందును ఉన్నవి గాన ఈ లక్షణమునకు అవ్యాప్తి లేదు. ఈ విషయమునే భాష్యకారుడు - "సర్వాశ్చ పునర్మూర్తయ ఏవమాత్మికాః శబ్ద స్పర్శరూప రసగంధవత్యః" అని చెప్పెను. ఈ లక్షణము అచేతన పదార్థములకు గూడ వర్తించును. ఈ దర్శనము ప్రకారము ఆకాశము గూడ సత్త్వరజస్తమోరూప గుణత్రయ వికారమగుటచే దానియందు గూడ గుణముల ఆవిర్భావతిరోభావముల ప్రతీతి కలుగుచుండును. చిద్రూపమగు ఆత్మ నిత్యమేయైనను దేహేంద్రియాదులతో సంబంధించి యుండుటచే దేహేంద్రియాదులకు సంబంధించిన గుణావిర్భావతిరోభావములు ఈ ఆత్మయందు గూడ ప్రతీయమానమగుటచే లింగ సంబంధము దానికి గూడ ఏర్పడుచున్నది. ఈ విధముగ సంస్త్యానము స్త్రీలింగమై, ప్రసవము పుంలింగమైనచో, ఉభయధర్మ సామాన్యరూపమగు స్థితి నపుంసకలింగము. పదార్థములన్నియు అనుక్షణమును పరిణామము చెందుచునే యుండును. అందుచే ప్రతి వస్తువునందును, ఆవిర్భావతిరోభావ స్థితులనెడు మూడు ధర్మములలో ఏదియో ఒకటి తప్పక ఉండి తీరును గాన 'అనపాయినః' అను విశేషణము ప్రయోగింపబడినది.॥13॥

కాగా అట్టి లింగము లేనిచో సంఖ్య వివక్షితము కానేరదని స్పష్టమగుచున్నది. ఉదా॥ గ్రహం సమ్మార్ష్టి.

కాగా ఈ శ్లోకము యొక్క ఉత్తరార్ధమునకు సంఖ్యాఽవ్యాపార ధర్మః, అని అకార ప్రశ్లేషము చూపి రెండవ యర్థము కూడ చెప్పవలెను.

లాఘవము మున్నగు యుక్తులవలన పై యర్థము లభింపదు.

67, 68 శ్లోకములు 'అన్యత్రావిహితస్యైవ' అను 57 వ శ్లోకము యొక్క యర్థమునే నిర్ణయించుచున్నవి. ఇదియే భర్తృహరి యొక్క సిద్ధాంతము. ॥68॥

*అవతారిక* — 'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున సమ్మార్జనము ప్రధానము అయినను ప్రయోజనమును బట్టి గ్రహములు ప్రధానములు. అందుచే ఉత్పత్తి వాక్యమును పురస్కరించుకొని ఏకత్వ సంఖ్య వివక్షితముకాదని 58, 59 శ్లోకములలో చూపబడినది.

ఇప్పుడు శబ్దమువలన గూడ గ్రహములకు ప్రాధాన్యమున్నదని 70 వ శ్లోకముచే చెప్పదలచి, ముందుగా ఒక న్యాయమును జూపుచున్నాడు.

**శ్లో॥ అపూర్వస్య విధేయత్వా త్ప్రాధాన్యమవసీయతే ।**
**విహితస్య పరార్థత్వా చ్ఛేషభావః ప్రతీయతే ॥ 69**

A. అపూర్వస్య = మరియొక దానివలన తెలియబడని యర్థమునకు, విధేయత్వాత్ = క్రొత్తగా బోధింపబడుటవలన, ప్రాధాన్యమ్ = ముఖ్యత్వము, అవసీయతే = నిశ్చయింపబడుచున్నది.

మరియొక వాక్యముచే విధింపబడని యర్థమును నూతనముగా విధించినచో ఆ యర్థము ప్రధానమని తెలియనగును, అట్టి స్థితిలో ప్రత్యయార్థమగు సంఖ్య వివక్షితము కాగలదు. ఇందుల కుదాహరణము 'పశునాయజేత' అనునది కాగలదు.

B. విహితస్య = మరియొక వాక్యముచే విధింపబడిన అర్థమునకు, పరార్థత్వాత్ = ఇతర వస్తువునకు ఉపకరించుటవలన అనగా అనువాదమగుట వలన, శేషభావః = శేషత్వము అనగా అప్రాధాన్యము, ప్రతీయతే = తెలియబడుచున్నది.

మరియొక వాక్యముచే విధింపబడిన అర్థమును మరల విధించిన అది అన్యార్థమని తెలియబడుటచే నది యప్రధానమగును. అట్టి చోటులయందున్న సంఖ్య వివక్షితము కాదు. ఇందుల కుదాహరణము "గ్రహం సమ్మార్ష్టి" అనునది కాగలదు. ॥69॥

*అవతారిక* — 69 వ శ్లోకము యొక్క యర్థమును ప్రకృతమున సమన్వయ పరచుచున్నాడు.

**శ్లో॥ సమ్మార్గస్య విధేయత్వా దన్యత్ర విహితే గ్రహే ।**
**విధివాక్యే శ్రుతా సంఖ్యా లక్షణాయాం న బాధ్యతే ॥ 70**

అవతారిక— భావము లన్నియు గుణత్రయాత్మకములను విషయమును వివరించు చున్నాడు.

శ్లో॥ సర్వమూర్త్యాత్మభూతానాం శబ్దాదీనాం గుణే గుణే ।
త్రయః సత్త్వాదిధర్మాస్తే సర్వత్ర సమవస్థితాః ॥ 14

సర్వమూర్త్యాత్మభూతానాం = సమస్త వస్తువులకును ఆత్మయైన, శబ్దాదీనాం = శబ్దాదులలో, గుణే గుణే = ప్రతి గుణమునందును, త్రయః = మూడు, సత్త్వాది ధర్మాః = సత్త్వము మొదలగు ధర్మములున్నవి, తే = ఆ ధర్మములు, సర్వత్ర = అంతటను, సమవస్థితాః = ఉన్నవి.

**తాత్పర్యము**— సకల వస్తువులకును ఆత్మయగు శబ్దాది గుణము లన్నింటి యందును సత్త్వాది ధర్మము లున్నవి. అవి అన్ని పదార్థములందును ఉన్నవి.

*విశేషాంశము*— ''సర్వాశ్చ పునర్మూర్తయః ఏవమాత్మికాః శబ్ద స్పర్శరూప రసగన్ధవత్యో యత్రాల్పీయాంసో గుణాస్తత్రావరతస్త్రయః, రసగన్ధౌ న సర్వత్ర'' అని భాష్యకారుడు వస్తువులన్నియు శబ్దాది గుణాత్మకములని చెప్పియున్నాడు. ఆకాశము మొదలు పృథివి వరకును గల పదార్థములలో శబ్దాది గుణము లైదును ఒక్కొక్క గుణము చొప్పున పెరుగుచు, సముదాయ రూపమున ఉండును. అనగా ఆకాశమునందు శబ్దమనెడు ఒక్క గుణము, వాయువునందు శబ్ద స్పర్శములు, అగ్నియందు శబ్ద స్పర్శరూపములు, జలము నందు శబ్ద స్పర్శరూప రసములు, పృథివియందు శబ్ద స్పర్శరూప రసగంధములును సంఘీ భావమును చెంది ఉండును. అందుచే వస్తువులన్నియు శబ్దాది గుణాత్మకములు. ద్రవ్యము వాస్తవమున గుణములకంటె భిన్నమేయైనను ఆ గుణములు ఆ ద్రవ్యముతో సమవాయ సంబంధముచే విడదీయరాని విధమున కలిసిపోవుటచే ఆ పదార్థము గుణాత్మకమని చెప్పబడు చున్నది.

పైన ఉదాహరించిన భాష్య వాక్యమునందలి మూర్తయః అను దానికి సంపిండిత స్వరూపములగు చక్షుర్గోచర పదార్థములని అర్థముగాన పృథివ్యప్తేజస్సులే అట్టి పదార్థములు. శబ్ద స్పర్శరూపము లనెడు మూడు గుణములును ఈ మూడు పదార్థములయందు తప్పక నుండును అందుచే 'తత్రావరతస్త్రయః' అని చెప్పబడినది. అవరతః అనగా కనీసము అని అర్థము. తేజస్సునందు రసగంధములు లేవుగాన 'రసగన్ధౌ న సర్వత్ర' అని చెప్పబడినది.

శబ్దాది గుణములు సత్త్వరజస్తమోరూప గుణమయములు. అందుచే శబ్దము మొదలగు అన్ని గుణములందును సత్త్వాది గుణత్రయ ధర్మములు ఉన్నవి. వాటిలో ప్రసవము అనగా ఆవిర్భావము సత్త్వధర్మము. ప్రవృత్తి అనగా క్రియ రజోధర్మము. వరణము అనగా తిరోభావము తమోధర్మము. ఈ ధర్మములే లింగములు. ప్రకాశ వరణ రూపములగు సత్త - తమోధర్మములతో అనుగతమగు, రజోధర్మమైన ప్రవృత్తి విశేషము పుంస్త్వము.

తిరోభావము స్త్రీత్వము. తమోబహుళమగు సామాన్యరూపమైన ప్రవృత్తికి స్థితియని పేరు. అది నపుంసకము. ఈ లింగత్రయము అన్ని వస్తువులతోడను సంబంధింప వచ్చును.

సాంఖ్య మతానుసారము— జగత్తు అంతయు సుఖదుఃఖమోహాత్మకమగుటచే ఆ మూడింటికిని కారణ భూతములగు సత్త్వ - రజ - స్తమోగుణములు కల్పింపబడును. సత్త్వ రజస్తమోరూప త్రిగుణాత్మిక యగు మూల ప్రకృతి సర్వజగత్కారణము. ఈ ప్రకృతి మహచ్ఛబ్దవాచ్య బుద్ధిరూపమున పరిణమించును. మహత్తు అహంకార రూపమున పరిణమించును. అహంకారము గంధ - స్పర్శ - రూప - రస - గంధములనెడు పంచతన్మాత్రలుగను, పంచ జ్ఞానేంద్రియములుగను, పంచ కర్మేంద్రియములుగను మనస్సుగను పరిణతి చెందును. సత్త్వాది త్రిగుణాత్మకములగు శబ్దాది తన్మాత్రలు ఆకాశాది రూపమున పరిణామము చెందును. ఆత్మ కేవల చైతన్యరూపము ; పరిణామరహితము. ఈ విధముగ జగత్తులోని పదార్థములన్నియు త్రిగుణాత్మకము లగుటచే నిత్య పరిణామ శీలములు. సతత పరిణామ శీలములగు పదార్థము లన్నిటితోడను ఉపచయాపచయ స్థితిరూప లింగములు మూడును సంబంధించును. ॥14॥

*అవతారిక*— పూర్వ కారికలో చెప్పిన విధముగ రూపాది సముదాయాత్మకమగు వస్తువునకు ధర్మత్రయ సంబంధము ఉండవచ్చును. రూపము, రసము, శబ్దము మొదలగు గుణములకు తద్భిన్నములగు రూపాదులతో సంబంధము లేదుగాన వాటిలో ఆవిర్భావతిరోభావాదులు చెందునవేవియు ఉండవు. అట్టి పరిస్థితులలో 'రూప' మొదలగు శబ్దములకు గూడ లింగమును చేర్చి 'రూపమ్' 'రసః' 'శబ్దః' ఇత్యాది ప్రయోగములు ఎట్లు చేయబడుచున్నవి అని ఆశంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ రూపస్య చాత్మమాత్రాణాం శుక్లాదీనాం ప్రతిక్షణమ్ ।**
**కాచిత్ ప్రలీయతే కాచిత్కథఞ్చిదభివర్ధతే ॥** 15

రూపస్య = రూపము యొక్క, శుక్లాదీనాం = శుక్లము (తెలుపు) మొదలగు, ఆత్మమాత్రాణాం = అవస్థా విశేషములలో, ప్రతిక్షణం = ప్రతిక్షణమునందును, కాచిత్ = ఒకానొక అవస్థ, ప్రలీయతే = తిరోభావమును చెందును, కాచిత్ = ఒకానొక అవస్థ, కథఞ్చిత్ = ఏదియో విధముగ, అభివర్ధతే = వృద్ధి పొందును.

**తాత్పర్యము**— రూపమునకు సంబంధించిన శుక్లాద్యవస్థలలో ప్రతి క్షణమునందును, ఒక అవస్థ తిరోహితమగుచుండును, మరియొకటి ఎటులనో వృద్ధిచెందుచుండును.

వివరణము— శబ్దాది గుణములకు గూడ సత్త్వాది గుణములతో సంబంధముండునని చెప్పబడినది. కావున ఆ గుణములలో గూడ ఎల్లప్పుడును పరిణామము కలుగుచుండును. ఉదాహరణమునకు రూపమునకు సంబంధించిన శుక్లాద్యవస్థలలో కొన్ని క్రొత్తగ ఆవిర్భవించుచుండును. కొన్ని మరుగుపడుచుండును, కొన్ని ఒక విధమగు వృద్ధి చెందుచుండును. ఇట్టి

పరిణామములు ఎల్లప్పుడును జరుగుచున్నను అతిసూక్ష్మము లగుటచే స్థూల దృష్టికి కనబడవు, ఉదాహరణమునకు ఈ రోజున ఒక వర్ణముతోనున్న ఫలాదులలో మరునాడు మరియొక వర్ణము కలుగుచున్నది. ఈ మార్పు ఒక్క క్షణములో వచ్చునది కాదు. క్షణ క్షణమునను క్రమముగ వచ్చినది. దీనినిబట్టి గుణములందు కూడ ప్రతి క్షణ పరిణామమున్నదని ఊహింప బడుచున్నది. ॥15॥

*అవతారిక*— ఈ విషయమున భాష్యకార సమ్మతిని గూడ చూపుచున్నాడు.

**శ్లో॥ క్వథితోదకవచ్చైషామనవస్థితవృత్తితా ।**
**అజస్రం సర్వభావానాం భాష్య ఏవోపవర్ణితా ॥ 16**

ఏషాం = ఈ, సర్వభావానాం = సర్వ పదార్థములకును, అజస్రం = ఎల్లప్పుడును, క్వథితోదకవత్ = మరుగుచున్న నీటివలె, అనవస్థితవృత్తితా = నిలుకడలేకుండుట, భాష్యే + ఏవ = భాష్యమునందే, ఉపవర్ణితా = వర్ణింపబడినది

తాత్పర్యము— పదార్థము లన్నియు, మరుగుచున్న నీటివలె, క్షణకాలమైనను స్థిరముగ నుండజాలవని భాష్యమునందే వర్ణింపబడినది.

వివరణము— ఈ విధముగ అన్ని పదార్థములందును ఆవిర్భావతిరోభావములు వ్యాపకములుగ నున్నవి గాన స్త్రీ పుంసలింగ సంబంధముండునని తాత్పర్యము. ॥16॥

*అవతారిక*— పదార్థములన్నియు ఎల్లప్పుడును నిలకడ లేకుండ ఉండునని చెప్పినచో వాటికి స్థితి యనునది లేదుగాన, స్థితి నపుంసకలింగమని ఎట్లు చెప్పబడినది అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రవృత్తే రేకరూపత్వం సామ్యం వా స్థితిరుచ్యతే ।**
**ఆవిర్భావతిరోభావ ప్రవృత్త్యా వావతిష్ఠతే ॥ 17**

ప్రవృత్తే = ప్రవృత్తియొక్క, ఏకరూపత్వం = ఏకరూపత్వముగాని, సామ్యం వా = సామ్యము గాని, స్థితిరితి = స్థితియని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, వా = లేక, ఆవిర్భావతిరోభావ ప్రవృత్త్యా = ఆవిర్భావతిరోభావముల నిరంతర ప్రవృత్తిచేత, అవతిష్ఠతే = స్థితి ఏర్పడుచున్నది.

తాత్పర్యము— ప్రవృత్తి యొక్క ఏకరూపత్వముగాని, సామ్యముగాని స్థితియని చెప్పబడుచున్నది. లేదా ఆవిర్భావతిరోభావముల ప్రవృత్తిచే స్థితి ఏర్పడుచున్నది.

వివరణము— స్థితి విషయమున మూడు పద్ధతులు చెప్పబడుచున్నవి. పదార్థములకు ఉపచయము, అపచయము అనెడు రెండు అవస్థ లున్నవి. క్షణ క్షణమునందును ఉపచయమే కలిగినను లేదా అపచయమే కలిగినను, ఆ ఉపచయ ప్రవాహమంతయు గాని

అపచయ ప్రవాహమంతయుగాని ఒక్కటే యని భావించుటచే అది స్థితియని చెప్పబడు చున్నది. ఇది మొదటి స్థితి పద్ధతి. ప్రతి క్షణమునందును వేరు వేరగు ఉపచయాపచయముల ప్రవాహము ఏర్పడినను, అనగా ఒక క్షణమున వృద్ధిరూప పరిణామము, మరుక్షణమున అపాయరూప పరిణామము, ఈ విధముగ భిన్న ప్రవాహము లున్నను ఆ రెండు విధములగు పరిణామములందును ప్రవృత్తి యనునది మాత్రము తుల్యముగ నుండుటచే ఆ సామ్యమునకే స్థితియని పేరు. ఇది రెండవ స్థితి ప్రకారము. ఆవిర్భావతిరోభావములు నిరంతరము జరుగు చున్నపుడు ఒక కల మరుగుపడిన వెనువెంటనే మరియొక కల ఆవిర్భవించుటచే తిరోధానము ప్రతీతి విషయము కాక స్థితియే గోచరించుచుండును. ఇది మూడవ ప్రకారము. ఈ విధముగ గుణములు సర్వదా పరిణామమును చెందుచున్నను అధ్యవసాయముచే స్థితి కల్పింపబడు చున్నది ॥17॥

*అవతారిక*— స్థితి అధ్యవసాయముచే ఏర్పడినది కాదు ; వాస్తవమైనదేయని మతాంతరమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ గుణా ఇత్యేవ బుద్ధేర్వా నిమిత్తత్వం స్థితిర్మతా।
స్థితేశ్చ సర్వలిఙ్గానాం సర్వనామత్వముచ్యతే ॥** 18

వా = లేక, గుణాః ఇత్యేవ = గుణములు అని, బుద్ధేః = బుద్ధికి, నిమిత్తత్వం = నిమిత్తమగుట, స్థితిః = స్థితియని, మతా = చెప్పబడినది, స్థితేః = స్థితి (నపుంసక లింగము), సర్వ లిఙ్గానాం=అన్ని లింగములకును, సర్వనామత్వం=సర్వనామము వంటిదని, ఉచ్యతే చెప్పబడుచున్నది.

**తాత్పర్యము**— 'గుణములు' అనెడు బుద్ధికి నిమిత్తముగా నుండుట స్థితియని చెప్పబడుచున్నది. స్థితి, అనగా నపుంసక లింగము, సర్వ లింగములకును సర్వనామము వంటిదని చెప్పబడుచున్నది.

*విశేషాంశములు*— సత్త్వ రజస్తమోగుణములు ప్రపంచాకారమున పరిణతము లైనను వాటి స్వభావములు మాత్రము వేరు వేరుగ కనబడుచునే యుండును. కావుననే పదార్థ ములలోని ప్రతి అంశమునందును సత్త్వాది గుణములకు చెందిన ప్రకాశము, ప్రవృత్తి, నియ మము అను ధర్మములు అనువర్తించుచునే యుండును. ఈ విధముగ గుణధర్మము లన్నియు అన్ని అవస్థలయందును అనువర్తించుచుండుటచే 'ఇవి గుణములు' అను సామాన్య ప్రతీతి కలుగుచుండును. ఇట్టి ప్రతీతికి నిమిత్తమైనది స్థితి. విశేషము లన్నియు సామాన్యమునందు అంతర్గతము లగును. అందుచే సామాన్యరూపమగు స్థితియందు ఆవిర్భావతిరోభావములు గూడ అంతర్గతము లగును. కావున స్థితిరూపమగు నపుంసకలింగము స్త్రీత్వాది లింగ భేదము నకు సర్వనామము వంటిది. 'తత్' 'ఏతద్' మొదలగు సర్వనామము వస్తు మాత్రమును పరామర్శించును గాన అన్ని వస్తువుల విషయమునను అవ్యాహతముగ ప్రయోగింపబడు చుండును. అట్లే నపుంసకలింగము గూడ, విశేష వివక్ష లేనపుడు, అన్ని లింగములను గూడ

పరామర్శించును. కావుననే గుణమును గూర్చి సందేహము కలిగినపుడు 'కిం జాతమ్' (ఏది పుట్టినది) ఇత్యాది విధమున (ఆ పుట్టినది స్త్రీత్వయుక్తమైనను పుంస్త్వయుక్తమైనను) నపుంసక లింగము ప్రయోగింపబడును. అందుచే నామవాచకములకు సర్వనామమెట్లో, లింగములకు నపుంసక లింగ మట్టిది. ॥18॥

*అవతారిక*— ఈ విధముగ గుణావస్థ లింగమని నిర్ణయము చేయబడినది. అట్టి లింగము అన్నింటి విషయమునను ఉండవచ్చును గాన ఇచట ఈ లింగమే యని వ్యవస్థ చేయుట ఎట్లు అని ఆశంకించుకొని భాష్యకారుడు వివక్ష ననుసరించి వ్యవస్థ చేసికొనవలెను అని సమాధానము చెప్పినాడు. ఆ విషయమును విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ స్థితేషు సర్వలిఙ్గేషు వివక్షా నియమాశ్రయః ।**
**కస్య చిచ్ఛబ్ద సంస్కారే వ్యాపారః క్వచిదిష్యతే ॥ 19**

సర్వలింగేషు = సమస్తములగు లింగములును, స్థితేషు = ఉన్నను, వివక్షా నియమాశ్రయః = వివక్షా రూపమగు నియమమును ఆశ్రయించినదై, క్వచిత్ = ఒకానొక స్థలమునందు, శబ్ద సంస్కారే = శబ్ద సంస్కారము విషయమున, కస్యచిత్ = ఒకానొక లింగము యొక్క, వ్యాపారః - ప్రవృత్తి - ఇష్యతే = అంగీకరింప బడుచున్నది.

*తాత్పర్యము*— అన్ని లింగములు ఉన్నను, శబ్ద సంస్కారమును చేయవలసి యున్నపుడు, ఒక్కచోట, వివక్షను అనుసరించి, ఒక్క లింగమే ప్రవర్తించునని అంగీకరింప బడును.

*విశేషాంశములు*— పదార్థము లన్నియు సత్త్వ రజస్తమో వికారములగుటచే వాటి యన్నింటి యందును ఆవిర్భావతిరోభావాది రూపములగు మూడు లింగములును ప్రవర్తించుటకు అవకాశమున్నది. ఐనను, వివక్షను బట్టి ఒక శబ్దమునకు సంస్కారము చేయవలసి వచ్చినపుడు ఒక లింగము మాత్రమే ప్రవర్తించునని అంగీకరింపవలసి యున్నది. అనగా అర్థమునకు అన్ని లింగములును ఉపాధులుగ నుండుటకు వీలున్నను శక్తి ననుసరించి, ఒక శబ్దము ఏదియో ఒక నియతమగు లింగము ఉపాధిగ గల అర్థమునే బోధించును. దానిని నిర్ణయించుటకు ప్రయోగమే ఆధారము.

*అవతారిక*— ఈ విషయమును దృష్టాంతముతో విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ సన్నిధానే నిమిత్తానాం కిఞ్చిదేవ ప్రవర్తకమ్ ।**
**యథా తక్షాది శబ్దానాం లిఙ్గేషు నియమస్తథా ॥ 20**

నిమిత్తానాం = అనేక నిమిత్తముల, సన్నిధానే = సన్నిధానమున్నను, యథా = ఏ విధముగా, తక్షాది శబ్దానాం = 'తక్ష' మొదలగు శబ్దములకు, కిఞ్చిదేవ = ఏదియో ఒకానొక నిమిత్తమే, ప్రవర్తకం = ప్రవర్తకమో, తథా = అట్లే, లిఙ్గేషు = లింగముల విషయమున, నియమః = నియమము.

తాత్పర్యము— ఎన్నియో నిమిత్తము లున్నను, తక్షాది శబ్దములు ఏదియో ఒక నిమిత్తమును బట్టియే ప్రవర్తించినట్లు లింగములు గూడ ఒక నిమిత్తమును బట్టి నియతము లుగ నుండును.

వివరణము— వడ్రంగి తక్షణము (కఱ్ఱ చెక్కుట) ఛేదనము (కోయుట మొదలగు ఎన్నియో పనులు చేయును. అయినను తక్షణమను ఒక నిమిత్తమును బట్టి అతని విషయమున 'తక్షా' అను శబ్దము ప్రయోగింపబడుచున్నది. కుమ్మరి కుండలు, మూకుళ్ళు మొదలగు అనేక వస్తువులను తయారుచేసినను అతనికి 'కుంభకారః' అనియే పేరు. అట్లే ఒక అర్థమునందు మూడు లింగములును ఉపాధులుగ నున్నను వాటిలో ఏదియో ఒక్క ఉపాధినే ఆధారముగ చేసికొని శబ్దము ఒకానొక నియతలింగమున ప్రయుక్తమగుచుండును. ॥20॥

*అవతారిక* — ఈ శబ్దము ఈ లింగమును ద్యోతింపచేయును అను విషయమును లోకప్రసిద్ధిని పట్టి నిర్ణయింపవలెనని "తస్యోక్తౌ లోకతోనామ" అని భాష్యమున చెప్పబడినది. ఇచట లోకమనగా ఇష్టము వచ్చిన వారిని గ్రహింపరాదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ భావతత్త్వదృశః శిష్టాః శబ్దార్థేషు వ్యవస్థితమ్ ।**
**యద్యద్ధర్మేఽఙ్గతామేతి లిఙ్గం తత్తత్ ప్రచక్షతే ॥ 21**

భావతత్త్వదృశః = వస్తువుల తత్త్వమును చూడగల్గిన, శిష్టాః = శిష్టులు, శబ్దార్థేషు = శబ్దార్థములయందు, వ్యవస్థితం = వ్యవస్థితమైయున్న, యద్యత్ = ఏ యే లింగము, ధర్మే = ధర్మమునందు, అంగతాం = అంగత్వమును, ఏతి = పొందుచున్నదో, తత్తత్ = ఆ యా లింగం = లింగమును, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

తాత్పర్యము— పదార్థ తత్త్వమును చూడకల్గిన శిష్టులు శబ్దముల అర్థములకు సంబంధించిన ఏ యే లింగము ధర్మమునకు అంగముగ నుండునో దానినే ఒక శబ్దముచే ద్యోత్యమగు లింగమునుగా చెప్పుచున్నారు.

వివరణము— పదార్థముల యథార్థ స్వరూపమును కొందరు శిష్టులు మాత్రమే చూడకలుగుచున్నారు. వారు అర్థములకు సంబంధించిన ఏ లింగము ధర్మమునకు సాధనముగ నుండునని భావించుచున్నారో దానినే ఒక శబ్దమునకు లింగమునుగా అంగీకరించుచున్నారు. పదార్థములన్నియు అన్ని లింగములతోడను సంబంధించి యుండవచ్చును. కాని ఈ శబ్దము ఈ అర్థమునందు ఈ లింగమును మాత్రమే ద్యోతింపచేయును. కావున దానిని ఆ లింగమునందు ప్రయోగించిననే ధర్మమునకు, అనగా అభ్యుదయమునకు, సాధనమగును అని శిష్టులు చెప్పుచున్నారు గాన ఆ శబ్దమును ఆ లింగమునందే ప్రయోగింపవలెను. శిష్టలోక ప్రసిద్ధిని బట్టియే లింగ నిర్ణయము జరుగును గాన లింగమును శాస్త్రములో విధింప బనిలేదని కూడ ("లిఙ్గమశిష్యం లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య") భాష్యకారుడు చెప్పియున్నాడు.

*అవతారిక*— ఈ విషయమునే దృష్టాంతముతో సమర్థించుచున్నాడు.

**శ్లో॥ స్వరభేదాద్యథా శబ్దాః సాధవో విషయాన్తరే ।**
**లిఙ్గ భేదాత్తథా సిద్ధాత్ సాధుత్వ మనుగమ్యతే ॥ 22**

శబ్దాః = శబ్దములు, స్వరభేదాత్ = స్వర భేదమువలన, యథా = ఏ విధముగ, విషయాన్తరే = విషయ విశేషమునందు, సాధవః = సాధువులో, తథా = అట్లే, సిద్ధాత్ = శిష్ట ప్రయోగ సిద్ధమగు, లిఙ్గభేదాత్ = లింగ భేదమువలన, సాధుత్వం = సాధుత్వము, అనుగమ్యతే = వ్యవహారమున అనుసరింపబడుచున్నది.

**తాత్పర్యము**— శబ్దములు స్వరభేదమును బట్టి ఏ విధముగ ఆయా యర్థము లందు సాధువులో, అట్లే శిష్ట ప్రయోగసిద్ధమగు లింగభేదమును బట్టి సాధుత్వము అనుసరింప బడుచున్నది.

*విశేషాంశము*— సూక్ష్మరూపము లగు ఉదాత్తాది స్వరములు భేదించిన శబ్దములు వేరు వేరు అర్థములందు మాత్రమే సాధువులని చెప్పబడుచున్నవి. ఉదాహరణమునకు— ''అక్ష'' శబ్దము ఆద్యుదాత్తమైనచో పాచికకంటె భిన్నపగు 'ఇరుసు' మొదలగు అర్థమును బోధించును. అంతోదాత్తమైనచో 'పాచిక' అను నర్థమును బోధించును. అనగా 'ఇరుసు' అను నర్థమున ఆద్యుదాత్తమగు అక్ష శబ్దమే సాధువు. పాచిక అను నర్థమున అంతోదాత్త మగు అక్ష శబ్దమే సాధువు. అట్లే ఒక లింగము గల శబ్దము ఒక అర్థవిశేషమును బోధించు నపుడే సాధువు ; అర్థాంతరమున అసాధువు. ఉదా— 'అర్థ' శబ్దము 'సగము భాగము' అను నర్థమునందు నపుంసకలింగము ; ఒక అంశము అను నర్థమున పుంలింగము. 'సార' శబ్దము 'న్యాయవిరుద్ధము కానిది' అను నర్థమున నపుంసకలింగము. 'నైతత్ సారమ్' ఇత్యాదు లుదాహరణము. 'చందన సారః' ఇత్యాదులలో ఉత్కర్షార్థమున పుంలింగము. ॥22॥

*అవతారిక*— శిష్ట ప్రసిద్ధమగు స్వరసంస్కార నియమమునే శాస్త్రము కూడ బోధించుచున్నట్లు శిష్టవ్యవహార సిద్ధమగు లింగనియమమును గూడ శాస్త్రము బోధించ వచ్చును కదా. ''లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లిఙ్గస్య'' అని లింగశాసనము ఏల నిషేధింప బడినది అని ఆశంకించి చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రయోగో విప్రయోగశ్చ లోకే యత్రోపలభ్యతే ।**
**శాస్త్రమారభ్యతే తత్ర న ప్రయోగావిపర్యయే ॥ 23**

యత్ర = దేని విషయమున, ప్రయోగః = సాధు ప్రయోగము, విప్రయోగశ్చ = విపరీత ప్రయోగము గూడ, లోకే = లోకమునందు, ఉపలభ్యతే = కనబడుచున్నదో, తత్ర = దాని విషయమున శాస్త్రం = శాస్త్రము, ఆరభ్యతే = ఆరంభింపబడుచున్నది, ప్రయోగావిపర్యయే = విపరీత ప్రయోగము లేనపుడు, న = శాస్త్రము ప్రారంభింపబడుట లేదు.

తాత్పర్యము— దేని విషయమున, లోకములో, సాధు ప్రయోగములును, అసాధు ప్రయోగములును గూడ ఉన్నవో దాని విషయమున శాస్త్రము చెప్పబడుచున్నది. విపరీత ప్రయోగములు లేనిదాని విషయమున శాస్త్రారంభము అనావశ్యకము.

వివరణము— 'అక్షీణి మేదర్శనీయాని' 'పాదాః మే సుకుమారతరాః' ఇత్యాది వాక్యములలో బహుత్వము లేకపోయినను, విపరీతముగ బహువచనమును ప్రయోగించుట లోకములో కలదు. అందుచే తన్నివారణార్థమై ''బహుషు బహువచనమ్'' ఇత్యాది శాస్త్రారంభము చేయుట ఆవశ్యకము. లోకములో విపరీత ప్రయోగము లేనివాటి విషయమున శాస్త్రము చెప్పుట ఎందులకు? కావుననే ఉపసర్గలను ధాతువునకు పూర్వము ప్రయోగింపవలెను అని విధించు ''తే ప్రాగ్ధాతోః'' అను సూత్రము (1-4-79), సమాసములో ఉపసర్జన సంజ్ఞికము పూర్వపదముగ ప్రయోగింపబడును అని బోధించు ''ఉపసర్జనం పూర్వమ్'' అను సూత్రమును, అనిష్ట ప్రయోగము లేవియు లేవుగాన అనావశ్యకములని వార్తిక కారునిచే ప్రత్యాఖ్యాతములైనవి. ఇట్లే లింగము విషయమునందును ప్రత్యాఖ్యానము చేయబడినది.॥23॥

అవతారిక— శబ్దములు నియతమగు వస్తుధర్మమును బోధించును. శిష్ట ప్రయోగాను సారముగా, తమ శక్తినిబట్టి శబ్దములు నియతలింగము లగుచుండును అని చెప్పుటచే ప్రధానముగ లింగము వస్తు ధర్మమనియు, తద్ద్వారా తద్బోధక శబ్ద ధర్మమనియు చెప్పినట్లైనది. కావుననే ''ఏకార్థే శబ్దాన్యత్వాత్ దృష్టం లింగాన్యత్వమ్; అవయవాన్యత్వాచ్చ'' అని వార్తికము (4-1-92) చెప్పుచున్నది. అనగా అర్థము ఒక్కటే యైనను, దానికి మూడు లింగములతోడను సంబంధమున్నను, శబ్దభేదమును బట్టి లింగభేదము కానవచ్చుచున్నది. ఉదాహరణమునకు ఏకార్థక బోధకములగు 'పుష్యః' 'నక్షత్రం' 'తారా' అను పదములలో శబ్ద భేదమును బట్టి, లింగ భేదము కనబడుచున్నది. శబ్ద భేదమే కాదు, శబ్దావయవములు వేరైనను, కుటీ - కుటీరః, శమీ - శమీరః, శుణ్డా - శుణ్డారః, ఇత్యాదులలో లింగభేదము కనబడుచున్నది - అని ఈ వార్తికమున కర్థము. ఇది యంతయు సత్త్వాది గుణముల అవస్థయే లింగము అను పక్షమున ఎట్లు ఉపపన్నమగును అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఉపాధి భేదాదర్థేషు గుణధర్మస్య కస్యచిత్ ।**
**నిమిత్తభావః సాధుత్వే వివక్షా చ వ్యవస్థితా ॥ 24**

అర్థేషు = వస్తువులయందు అవచ్ఛేదకముగ నున్న, కస్యచిత్ = ఒకానొక, గుణధర్మస్య = సత్త్వాది గుణ వికారములగు శబ్దాది గుణముల ధర్మమగు లింగమునకు, సాధుత్వే = శబ్ద సాధుత్వవిషయమున, ఉపాధి భేదాత్ = ఉపాధి భేదమునుబట్టి, నిమిత్త భావః = నిమిత్తత్వము ఉండును, వివక్షా = ప్రతి శబ్దముయొక్క లింగమునకు సంబంధించిన వివక్ష కూడ, వ్యవస్థితా = నియతముగ నుండును.

తాత్పర్యము— వస్తువులతో సంబంధించిన గుణధర్మ రూపములగు మూడు లింగములలో ఒక లింగము మాత్రమే ఉపాధిభేదమును బట్టి శబ్ద సాధుత్వమున నిమిత్తముగ

నుండును. ఈ విధముగ వివక్షానుసారముగ శబ్దములయందు లింగ వ్యవస్థ యేర్పడు చున్నది.

వివరణము— లింగము సత్త్వాది గుణత్రయ పరిణామ రూపములగు శబ్దాదుల ధర్మము. సత్త్వాదిగుణములు అతిసూక్ష్మము లగుటచే వ్యవహార యోగ్యములు కావు. వాటి పరిణామ రూపములగు రూపాదుల ఆవిర్భావతిరోభావాద్యవస్థలే లింగములని భాష్యమున చెప్పబడినది. వస్తువులలోనున్న ఈ లింగములలో ఏదియో యొక లింగమును ఆశ్రయించి శబ్దాన్వాఖ్యానము చేయబడుచుండును. వస్తువులతో సంబంధించిన మహత్త్వాద్యుపాధి భేద మును బట్టి, (చూ. కా. 25) మూడు లింగములలో ఒకదానిని మాత్రమే గ్రహించుట జరుగు చున్నది. ఈ విధముగ లింగములు సహజముగ సత్త్వాది గుణధర్మములే యైనను అవియే వస్తుగతములుగను, శబ్దగతములుగను భాసించుటలో విరోధమేదియును లేదని తాత్పర్యము. ॥24॥

*అవతారిక*— ఈ విషయమున నిదర్శనమును చూపుచున్నాడు.

**శ్లో॥ హిమారణ్యే మహత్త్వేన యుక్తే స్త్రీత్వమవస్థితమ్।**
**హ్రస్వోపాధివిశిష్టాయాః కుట్యాః ప్రసవయోగ్యతా ॥ 25**

మహత్త్వేన = మహత్త్వముతో, యుక్తే = కూడిన, హిమారణ్యే = 'హిమ' 'అరణ్య'ముల యందు, స్త్రీత్వం = సంస్త్యానము, అవస్థితమ్ = ఉన్నది. హ్రస్వోపాధి విశిష్టాయాః = హ్రస్వరూపోపాధి విశిష్టమగు, కుట్యాః = 'కుటీ' అను దానికి, ప్రసవయోగితా = ప్రసవముతో (పుంస్త్వముతో) సంబంధము.

తాత్పర్యము— హిమ - అరణ్యములు మహత్త్వమనెడు ఉపాధితో కూడినపుడు సంస్త్యానమును (స్త్రీత్వమును) పొందుచున్నవి. కుటి, హ్రస్వత్వ రూపోపాధితో కూడినపుడు ప్రసవముతో (పుంస్త్వముతో) సంబంధించుచున్నది.

వివరణము— 'హిమ' శబ్దము నపుంసక లింగమున నున్నది. కాని 'మహత్ హిమం' అను నర్థమున, మహత్త్వము ఉపాధిగ నున్నపుడు హిమము సంస్థ్యానరూపమగు స్త్రీత్వమును పొందుచున్నది. ఆ సంస్త్యానమును బోధించుటచే హిమ శబ్దము స్త్రీ లింగము నందు ప్రయుక్తమై 'హిమానీ' అగుచున్నది అట్లే 'అరణ్య' శబ్దము మహత్త్వోపాధి సంసర్గ ముచే సంస్త్యానమును పొందుటచే 'అరణ్యానీ' అను స్త్రీలింగ శబ్దముగ ప్రయోగింపబడు చున్నది. ''మహదరణ్యం అరణ్యానీ'' 'హిమారణ్య యోర్మహత్త్వే' అని వార్తికము. అట్లే కుటీ శబ్దము హ్రస్వత్వోపాధి సంసర్గముచే ప్రసవరూప ధర్మమును పొంది 'కుటీరః' అని, ప్రసవరూప పుంలింగమున ప్రయుక్తమగుచున్నది. 'హ్రస్వాకుటీ కుటీరః' అని యర్థము. ఈ విధముగ కొన్ని వస్తువులు మహత్త్వాద్యుపాధి భేదముచే సంస్త్యానాదులతో సంబంధించు చుండును. తద్ద్యోతకముగ శబ్దము స్త్రీ లింగాదులందు ప్రయుక్తమగును అని భావము. ॥25॥

అవతారిక— ఉపాధి భేదమాత్రముచే అదే శబ్దము లింగాంతరముతో ఎట్లు సంబంధించును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ శబ్దాన్తరాణాం భిన్నేఽర్థ ఉపాయాః ప్రతిపత్తయే ।
ఏకతామివ నిశ్చిత్య లఘ్వర్థ ముపదర్శితాః ॥ 26

ఏకతాం = హిమాది శబ్దములలో నున్న ఒక సామాన్య ధర్మమును, నిశ్చిత్యేవ = నిశ్చయించుట వల్లనే, భిన్నే అర్థే = భిన్నార్థ విషయకములగు, శబ్దాన్తరాణాం = శబ్దాన్తరముల, ప్రతిపత్తయే = జ్ఞానము కొరకు, లఘ్వర్థం = లాఘవము కొరకై, ఉపాయాః = ఉపాయములు, ప్రదర్శితాః = చూపబడినవి.

తాత్పర్యము— హిమాది శబ్దములలోనున్న సామాన్య ధర్మమును గ్రహించి, భిన్నార్థ బోధకములగు ఇతర శబ్దముల జ్ఞానము కొరకై, లాఘవము కొరకు, ఉపాయములు చూపబడుచున్నవి

వివరణము— వాస్తవమున 'హిమ' శబ్దము ఉపాధి భేదము ననుసరించి మరియొక లింగముతో సంబంధించుట యనునది లేదు. అనగా 'హిమ' శబ్దము 'హిమానీ' యని మారుట అనునది లేదు. 'హిమ' శబ్దము వేరు 'హిమానీ' శబ్దము వేరు. కాని 'హిమ' 'హిమానీ' శబ్దములలో నున్న ఏదియో ఒక (మంచు అనెడు అర్థమును బోధించుట మొదలగు) సాధారణ ధర్మమును పురస్కరించుకొని లాఘవము నిమిత్తమై 'హిమ' శబ్దమే మహత్త్వార్థమున 'హిమానీ' యగును ఇత్యాది విధమున అన్వాఖ్యానము చేయబడుచున్నది. ''యావదయం సామాన్యేన శక్నోత్యుపదేష్టుం తత్తావదయముపదిశతి'' అని భాష్యకారులు చెప్పినట్లు ఒక్కొక్క శబ్దములో నున్న ఒక్కొక్క విశేషమును పురస్కరించుకొని శబ్దముల నన్నింటిని వ్యాకరింప ప్రయత్నించినచో గౌరవము గాన, లాఘవము నిమిత్తమై, శబ్ద శాస్త్రమున సామాన్య ధర్మమును పురస్కరించుకొని అన్వాఖ్యానము చేయబడుచుండును. కావున ప్రతి నియతలింగము గల 'హిమమ్' అను శబ్దము వేరు, అట్లే ప్రతి నియత స్త్రీలింగము గల 'హిమానీ' శబ్దము వేరు. అందుచే పూర్వోక్తమగు ఆ శంకకు తావు లేదు అని భావము.

ఈ విధముగ గుణావస్థా రూపమగు లింగత్రయము అన్ని వస్తువులయందును ఉండవచ్చుననియు, కాని ఒక వస్తువును బోధించుటకై ప్రయుక్తమగు ఒక శబ్దమునకు ఆ వస్తువునకు సంబంధించిన ఒక అవస్థను (లింగమును) మాత్రమే వ్యక్తీకరించెడు శక్తి యుండుటచే ఆ శబ్దము ఆ ఒక్క లింగమునందు మాత్రమే ప్రయుక్తమగు చుండుననియు, ఆదే అర్థమును బోధించుటకై ప్రయుక్తమగు మరియొక శబ్దము ఆ అర్థముతో సంబంధించిన మరియొక లింగమును వ్యక్తీకరింప సమర్థమగుటచే ఆ శబ్దము ఆ లింగముతో సంబంధించుననియు చెప్పబడినది. ఈ లింగము శిష్ట వ్యవహారసిద్ధమగుటచే మరల దానిని అనుశాసింప బనిలేదని కూడ చెప్పబడినది. ॥26॥

అన్యత్ర = మరియొక వాక్యమున, అనగా ''ప్రాజాపత్యా నవగ్రహాః'' (ప్రజాపతి దేవతగా గల తొమ్మిది గ్రహములు) మున్నగు వాక్యములయందు, గ్రహే = గ్రహము అనగా సోమరసము పోయుటకు ఉపయోగపడెడి పాత్రలు, విహితే = విధింపబడియుండగా, అనగా అచటనే నూతనముగా బోధింపబడి యుండగా, ఆ కారణము వలన, సమ్మార్గస్య = పరిశుభ్రత, విధేయత్వాత్ = విధింపబడుట వలన 'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున గ్రహమును ఉద్దేశించి సమ్మార్జనము విధింపబడుట వలన, విధివాక్యే = 'ప్రాజాపత్యా నవ గ్రహాః' మున్నగు ఉత్పత్తి వాక్యమున, శ్రుతా = వినబడుచున్న నవ, దశ మున్నగు శబ్దము లచే బోధింపబడుచున్న, సంఖ్యా = నవత్వ, దశత్వ సంఖ్య, న + బాధ్యతే = బాధింపబడదు. ప్రాజాపత్యాః నవగ్రహాః అను రీతిని ఉత్పత్తి వాక్యమున గ్రహములు ప్రధానముగా చెప్ప బడినవి. 'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున సమ్మార్జనము ప్రధానముగా చెప్పబడినది. ఉత్పత్తి వాక్యమున ఏ గ్రహములు చెప్పబడినవో, అవియే బుద్ధిలో నుండుటచే అనువాద వాక్యమున గూడ అవియే స్వీకరింపబడుచున్నవి.

కాబట్టి ఉత్పత్తి వాక్యమున నవ, దశ అను రీతిని సంఖ్యా విశేషము చెప్పబడి నందున దానికి అవిరోధముగా అనువాద వాక్యమున గ్రహసామాన్యమే గ్రహింపబడును. విభక్తి ప్రత్యయము సంస్కారార్థమే చేర్చబడినది.

58, 59 శ్లోకములలో 'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున సమ్మార్జనమునకు శాబ్ద ప్రాధాన్యమున్నను గ్రహములకు అర్థప్రాధాన్యము చూపబడినది. ఈ శ్లోకమున గ్రహ ములకు ఉత్పత్తి వాక్యమున శాబ్ద ప్రాధాన్యము కలదని చూపబడినది. 58, 59 శ్లోకముల కంటె 70 శ్లోకమున కిదియే విశేషము. ॥70॥

*అవతారిక* — 'పశునా యజేత' అను వాక్యమున గూడ యాగము ప్రధానము, పశువు అప్రధానము అని చెప్పవలెను. కాగా అప్రధానమగు పశువునకు విశేషణమగు ఏకత్వ సంఖ్య అవివక్షితమే కావలెను అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ విధివాక్యాన్తరే సంఖ్యా పశోర్నాస్తి విరోధినీ।**
**తస్మాత్సగుణ ఏవాసౌ సహైకత్వేన గమ్యతే॥** 71

విధివాక్యాన్తరే = విధాయకమగు మరియొక వాక్యమున, విరోధినీ = ఏకత్వ సంఖ్యకు విరుద్ధ మగు, సంఖ్యా = సంఖ్య, న + అస్తి = లేదు.

'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున ఏకత్వ సంఖ్య గ్రహమునందు భాసించు చున్నది. దానికి విరుద్ధముగా నవ, దశ అను శబ్దములచే నవత్వ, దశత్వ సంఖ్యలు గ్రహ ములయందు ఉత్పత్తి వాక్యమున కనిపించుచున్నవి.

ఆ రీతిగా, పశునా యజేత అను వాక్యమున విరుద్ధ సంఖ్య కానరాదు. 'పశునా'

అవతారిక— ఇపుడు సంస్త్యాన - ప్రసవాదుల విషయమున మతాంతరమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉత్పత్తి ప్రసవోఽన్యేషాం నాశః సంస్త్యాన మిత్యపి ।
ఆత్మరూపం తు భావానాం స్థితిరిత్యపదిశ్యతే ॥ 27

అన్యేషాం = వైశేషికాదుల మతమున, ఉత్పత్తిః = క్రొత్త అవయవములు పుట్టుట, ప్రసవ = ప్రసవమనియు, నాశః = వాటి నాశము, సంస్త్యానం ఇత్యపి = సంస్త్యానమనియు, భావానాం = పదార్థముల, ఆత్మరూపం = స్వాభావికమగు రూపము, స్థితిరితి = స్థితి యనియు, అపదిశ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— కొందరి మతము ప్రకారము ప్రసవమనగా క్రొత్త అవయవములు పుట్టుట. సంస్త్యానమనగా వాటి నాశనము. స్థితి అనగా పదార్థముల సహజ స్వభావము.

వివరణము— పూర్వము సాంఖ్య దర్శనానుసారముగ సంస్త్యానాదుల స్వరూపము నిరూపింపబడినది. వైశేషిక మతము ప్రకారము వాటి స్వరూపమును చెప్పుచున్నాడు. సాంఖ్యమతము ప్రకారము అవయవములు పూర్వము తిరోభూతములై యుండి ఆవిర్భూతములగుట (కనబడుట) ప్రసవము. అనగా ఆవిర్భావము. వైశేషికుల యభిప్రాయము ప్రకారము పూర్వము లేని అవయవములు క్రొత్తగ పుట్టుట (ఉత్పత్తి) ప్రసవము. ఉన్న అవయవములు కనబడకుండుట (తిరో భావము) సంస్త్యానమని సాంఖ్యమతము. ఉన్న అవయవములు పూర్తిగ నశించుట సంస్త్యానమని వైశేషికమతము. నిత్యములైనను, అనిత్యములైనను పదార్థములకొక సహజ స్వరూపముండును. అదియే స్థితియని వైశేషిక మతము. ఈ ప్రసవ-సంస్త్యాన - స్థితులను ద్యోతింపజేయుటకై పుంస్త్రీనపుంసకములు చేరుచుండునని వీరి యభిప్రాయము. ఈ రెండు మతములందును సత్కార్యవాదా సత్కార్యవాదకృతభేదము తప్ప మిగిలిన అంశములలో భేదము లేదు. ॥27॥

అవతారిక— ఇపుడు లింగమునకు సంబంధించిన మత భేదములలో ఐదవదగు 'శబ్దోపజనితోఽర్థాత్మా' అను మతమును మరియొక విధముగ వివరించుచున్నాడు.

శ్లో॥ దృష్టం నిమిత్తం కేషాఞ్చిజ్జాత్యాదివదవస్థితమ్ ।
దృష్టవచ్ఛబ్ద సంస్కారమాత్రం తు పరికల్పితమ్ ॥ 28

కేషాంచిత్ = కొన్ని చేతన పదార్థములకు సంబంధించిన, దృష్టం=కంటికి కనబడునదియు, జాత్యాదివత్ =జాత్యాదులవలె, అవస్థితం=ఉన్నదియునగు, నిమిత్తం= స్తనకేశాది నిమిత్తము, దృష్టవత్ = చూడబడినదివలె, శబ్ద సంస్కార మాత్రం = శబ్ద సంస్కారమునకు మాత్రము ఉపయోగించునదిగ, (అచేతనములందు గూడ), పరికల్పితమ్ = కల్పింపబడినది.

తాత్పర్యము— కొన్ని చేతన పదార్థములతో ప్రతి నియతమగు స్త్రీత్వాది జాతి

వలె నున్న, ప్రత్యక్ష దృశ్యమానమగు స్తనకేశాది నిమిత్తము, అది కానరాని తారకాదులందు గూడ, దృశ్యమానమువలె, కేవలము శబ్ద సంస్కారము కొరకై కల్పింపబడు చున్నది.

వివరణము— కొన్ని చేతన పదార్థములలో స్త్రీత్వాది జాతివలె (స్త్రీత్వాది జ్ఞాన నిమిత్తమగు) స్తనకేశాద్యవయవ సముదాయము గూడ ప్రతి నియతముగ కనబడుచున్నది. అట్టి స్థలములలో స్తనాదులు స్త్రీత్వాదులను వ్యంజింప చేయుచున్నవి. తారకాద్యచేతన పదార్థములలో స్తనకేశాదులు కానరాకున్నను 'నారీ' ఇత్యాది శబ్దములు ఏ విధముగ సత్త్వ (పదార్థ) బోధకములుగ నున్నవో ఇవి కూడ అట్లే పదార్థ బోధకములుగ నుండుటచే వాటి యందు లింగమును కల్పించి, ఆ లింగమును చేర్చుటద్వారా శబ్ద సంస్కారము చేసి తారకా, పుష్యః, నక్షత్రమ్, ఇత్యాది విభిన్న లింగములు ప్రయోగింపబడుచున్నవి. ఈ విధముగ చేతన పదార్థములలోని లింగము వాస్తవము, అచేతన పదార్థముల లింగము కాల్పనికము అని అభిప్రాయము. ॥28॥

అవతారిక— వాస్తవమున తారకాది శబ్దములందు లింగము లేకపోయినను లింగ మును ఆరోపించుటకు ఒక నిదర్శనమును చూపుచున్నాడు.

శ్లో॥ యథా ప్రసిద్ధేఽప్యేకత్వే నానాత్వాభినివేశినః ।
నానాత్వం జనయన్తీవ శబ్దా లిఙ్గేఽపి స క్రమః ॥ 29

ఏకత్వే = ఏకత్వము, ప్రసిద్ధేఽపి = ప్రసిద్ధమైనను, నానాత్వాభినివేశినః = బహువచన వృత్తులగు, శబ్దా = శబ్దములు, యథా = ఏ విధముగా, నానాత్వం = నానాత్వ బుద్ధిని, జన యన్తీవ = కలిగించుచున్నట్లుండునో, లిఙ్గేఽపి = లింగము విషయమునందు గూడ, సః = అదియే, క్రమః = పద్ధతి.

తాత్పర్యము— ఏకత్వము ప్రసిద్ధముగ నున్నను, బహువచనమునందు ప్రయుక్తము లగు శబ్దములు ఏ విధముగ అనేకత్వ బుద్ధిని కలిగించుచున్నట్లు కనబడునో, లింగము విషయమున గూడ అదియే పద్ధతి.

వివరణము— బోధ్యమగు వస్తువు ఒక్కటియే యైనను 'దారాః', (భార్య) 'అపః', (నీరు) 'గృహాః' (ఇల్లు) 'సికతాః' (ఇసుక) మొదలగు శబ్దములు బహువచనములో ప్రయోగింపబడుచున్నవి. అట్లు బహువచనమునందు ప్రయోగించుటచే ఆ శబ్దముల బోధ్యము లగు అర్థముల బహుత్వమును బోధించుచున్నట్లు కనబడుచున్నను అది అట్లు బోధించుట లేదు. అట్లే స్త్రీత్వాది లింగ విశిష్టములు గల ప్రయుక్తములగు తారకాద్యచేతన వాచక శబ్ద ములు స్తనకేశాద్యవయవ సంబంధమును బోధించుచున్నట్లు కనబడినను అట్లు చేయుట లేదు. ॥29॥

అవతారిక— ఈ విధముగ చూడగా చివరకు, 'శబ్ద సంస్కారో లిఙ్గమ్' అన్న ఏడవ మతమే ప్రమాణము అన్నట్లు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఇదంవేయ మయంవేతి శబ్దసంస్కార మాత్రకమ్ ।
నిమిత్తదర్శనాదర్థే కైశ్చిత్ సర్వత్ర వర్ణ్యతే ॥ 30

ఇదం వా = ఇది (నపుం), ఇయం = ఇది (స్త్రీలిం), అయం = ఇది (పుంలిం), ఇతి = ఈ విధముగ, అర్థే = వస్తుమాత్ర విషయమున, నిమిత్తదర్శనాత్ = ప్రయోగించుట అనెడు నిమిత్తము యొక్క దర్శనము వలన, కైశ్చిత్ = కొందరిచే, సర్వత్ర = అన్ని శబ్దము లందును, శబ్దసంస్కార మాత్రకమ్ = కేవలము శబ్ద సంస్కారముకొరకు మాత్రమే ఉద్దిష్ట మైనదిగా, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

తాత్పర్యము— ఇదఁ, ఇయం, అయం అను రీతిని ప్రతి వస్తువు విషయమునను ప్రయోగించుటకు వీలుండుట అనెడు నిమిత్తము కానవచ్చుటచే, లింగమనునది, అన్ని పదము లందును శబ్ద సంస్కారము కొరకు మాత్రమే ఉద్దిష్టమైనట్లు కొందరు చెప్పుచున్నారు.

వివరణము— బాహ్యనిమిత్తాపేక్ష ఏమియు లేకుండ ప్రతిపదార్థము విషయము నను 'ఇదం వస్తు' 'ఇయం వ్యక్తిః' 'అయం అర్థః' అను రీతిని మూడు లింగములలో నున్న శబ్దములను ప్రయోగించవచ్చును. ఇట్లు ప్రయోగించుటకు అవకాశముండుట అనెడు నిమిత్తము కానవచ్చుటచే, చేతనాచేతన వాచకములగు ఏ శబ్దములందైనను, లింగము కేవలము శబ్ద సంస్కారము కొరకు మాత్రమే ఉపయోగింపబడుచున్నదని కొందరు చెప్పుదురు. 'శబ్దోప జనితోఽర్థాత్మ' అను అరవ మతమున చేతన పదార్థవిషయమున లింగము వాస్తవముగ నున్నను అచేతన పదార్థముల విషయమున లింగము కల్పితము; అది శబ్ద సాధుత్వము కొరకై ఉద్దిష్టమైనది. ఈ మతము ప్రకారము చేతనవాచకము నైనను, అచేతనవాచకము నైనను, అన్ని శబ్దములును గూడ కేవల శబ్ద సంస్కారముకొరకే లింగములను గ్రహించును.

'కైశ్చిత్' అని చెప్పుటచే వస్తువులలోనున్న గుణావస్థా రూపమును ఎవరు గ్రహింపజాలరో అట్టివారే ఈ మతమును అంగీకరింతురనియు, అట్టి గుణావస్థా వివేక వంతులు పూర్వోక్తమగు (గుణావస్థా రూప) లింగమునే అంగీకరింతురనియు, అదియే పరమ సిద్ధాంతమనియు సూచింపబడినది. ॥30॥

అవతారిక— బైట కనబడని లింగము శబ్ద సంస్కారమున కెట్లు నిమిత్తమగును అని ఆశంకించి చెప్పుచున్నాడు.

శ్లో॥ నావశ్యం విషయత్వేన నిమిత్తం వ్యవతిష్ఠతే ।
ఇన్ద్రియాది యథాదృష్టం భేదహేతు స్తదిష్యతే ॥ 31

నిమిత్తం = నిమిత్తము, అవశ్యం = తప్పనిసరిగా, విషయత్వేన = జ్ఞాన విషయముగా, న వ్యవతిష్ఠతే = ఉండదు, ఇంద్రియాది = ఇంద్రియములు మొదలగునవి, యథా = ఎట్లో, అట్లే, తత్ = ఆ నిమిత్తము, అదృష్టం = చూడబడని దగుచునే, భేదహేతుః = భేద బుద్ధికి కారణ మని, ఇష్యతే = అంగీకరింపబడును.

తాత్పర్యము— నిమిత్తము తప్పక జ్ఞాన విషయము కావలెనను నియమము లేదు. ఇంద్రియాదికము వలె, నిమిత్తము కూడ బైటకు కనబడకుండగనే భేదహేతు వగునని అంగీకరింపబడును.

వివరణము— చక్షురాదీంద్రియములు ప్రత్యక్షములు కావు. అయినను వేరు వేరు విషయములు గల జ్ఞానములకు ఆ ఇంద్రియములు నిమిత్తములగుచునే ఉన్నవి. కావున ఒకదాని అవచ్ఛేదమునకు (ఒక దానిని మరియొక వస్తువునుండి వేరుగ జూపుటకు) కారణ భూతమగునది తప్పక జ్ఞాన గోచరము కావలెనని నియమము లేదు. కావున లింగమునకు గూడ బాహ్యరూపమేదియు కానరాకున్నను, దానిని శబ్ద సంస్కారమనెడు కార్యమునకు కారణముగ శాస్త్రమునందు పరిగ్రహించుట యుక్తమే. ॥31॥

లిఙ్గసముద్దేశము ముగిసినది

# వృత్తి సముద్దేశము

## పరిచయము

"వృత్తి" అను శబ్దమునకు "ఉండుట", "జీవనోపాయము", "నడవడి", మొదలగు లోకప్రసిద్ధమైన అర్థములు కొన్ని గలవు. అవి యిచట ప్రకృతములు కావు. అట్లే శబ్దము వలన అర్థమును సంపాదించుట కుపయోగించు అభిధ, లక్షణ, వ్యంజన అను మూడు శబ్ద వృత్తులు సాహిత్యశాస్త్రమున ప్రసిద్ధములై ఉన్నవి. వానికి కూడ ఇచట సంబంధము లేదు.

వ్యాకరణశాస్త్రము చూపు ఒకానొక ప్రక్రియా విశేషమునకు వృత్తియని సంకేతము. ఇచట వృత్తి శబ్దమునకు - "తీరు" - లేక - "రీతి" - లేక - "మార్గము"— అని యర్థము చెప్పవచ్చును. వ్యాకరణ మంగీకరించిన ఒక ప్రక్రియను అవలంబించి, ఒక పదము గాని పదబంధము గాని ఒకానొక విచిత్రమైన అర్థమును బోధించు పద్ధతి వృత్తి యగును. అనగా పదమునకు ఒకానొక ప్రత్యయమును చేర్చికొని— అనేక పదములను ఒక బంధముగ కూర్చికొని, ఒక ప్రత్యేకమైనట్టియు, విపులమైనట్టి అర్థమును తెలుపుటయు, అట్లే పలు శబ్దములను పలుకవలసినచోట ఒకే శబ్దమునుచ్చరించి మిగిలిన వాని యర్థమును తెలుపుటయు, ధాతువునకుగాని పదమునకుగాని చిత్ర విచిత్రములైన ప్రత్యయములను చేర్చి వింత యర్థములను బోధించుటయును సాంకేతికమైన వృత్తి యగునని భావము.

"పరార్థాఽభిధానం వృత్తిః" అని వైయాకరణులు వృత్తి లక్షణమును చూపిరి. శబ్దములు విడివిడిగా ఉన్నపుడు తాము బోధించు అర్థములను విడిచి, సంకేత సిద్ధమైన వృత్తి అను ఒక చట్రములో బిగిసికొని, కొండొక విశిష్టార్థమును బోధించుట అని దీని తాత్పర్యము. పదసముదాయముచే చెప్పదగిన యర్థమును కుదించి తేలికగా చెప్పుటకు వీలు కలిగించుటకై ఈ వృత్తియను మార్గమేర్పడినది. ఉదాహరణము— "పీతాంబరః". (పచ్చని బట్ట గలవాడు) ఇచట "పీతమ్ - అంబరమ్ - యస్య - సః" అను పదసమూహము బోధించు భావమును సమాసమను వృత్తియొక్క బలముతో ఒకే పదము తెలుపగలుగుచున్నది. కాగా వృత్తియొక్క పరమప్రయోజనము లాఘవమేయని విస్పష్టమగును.

అట్టి వృత్తి అయిదు విధములుగా విభజింపబడినది. 1. కృద్వృత్తి, 2. తద్ధిత వృత్తి, 3. సమాసవృత్తి, 4. ఏకశేషవృత్తి, 5. సనాద్యంత ధాతువృత్తి, అని వాని పేర్లు. ఉదాహరణములు—

1. కృద్వృత్తిః— కుంభకారః = కుండలు చేయువాడు. (కుంభం - కరోతి. "కర్మణ్యణ్" = పాణిని సూత్రము (3-2-1) = కర్మవాచకమును ముందుంచికొని ధాతువునకు అణ్ ప్రత్యయమును చేయనగును). ఇచట ధాతువులకు కృత్తులనెడి ప్రత్యయములు చేరుచుండును.

స్వీకరించినపుడు ''సముదాయమునకే విశిష్టార్థమును బోధించు అవకాశము గలదు. అవయవ ములకది లేదు'' అనునది సంప్రదాయము.

**4.** వృత్తికి అవయవములుగా ఉండు శబ్దములకు విశేషణములను చేర్చరాదు. (విశేషణములతో కూడియున్న పదములకు వృత్తి జరుగనే జరుగదు). ఉదా: రాజపురుషః. ఇందలి రాజశబ్దమునకు ''మహతః'' ''శౌర్యవతః'' మొదలగు షష్ఠ్యంతములగు విశేషణములను తగిలింపకూడదు.

5. వృత్తియందు ''ఏకత్వ సంఖ్యయే'' భాసించును. వృత్తియందలి తొలి పదము యొక్క అర్థమున రెండు, మూడు, మొదలగు సంఖ్యావిశేషములు తెలియకుండ, ''ఒకటి'' అను సంఖ్యయే స్ఫురించును. అదియే కావలసిన అన్ని సంఖ్యలను సూచింపుచుండును. దీనికి ''అభేదైకత్వ సంఖ్య'' అని పేరు. తేనె, అను ఒకే పదార్థములో వివిధములగు పుష్పముల మకరందములు తమ భేదమును విడిచి ఎట్లు ఐక్యమును చెందునో, అట్లే అనేకవిధములైన సంఖ్య లిచట ఏకమైపోవును. ఉదా: కుంభకారః. ఇచట కుంభశబ్దము ''కుండను'' అని ఏకత్వమునే తెలియజేయును. అదియే అవసరమైనపుడు అన్ని సంఖ్యలను బోధింపగలదు. (కాగా కుంభౌ, కుంభాన్, మొదలగు సంఖ్యావిశేషములు అవగతములగుచుండును). అందువలననే ''కుంభం కరోతి'' అను రీతిలో ఏకవచనాంతముగానే విడదీయుట జరుగుచుండును.

6. ఏకార్థమును విడమరచి బోధించుటకై వృత్తికి విగ్రహవాక్యము కల్పింపబడును. ఉదా: రాజపురుషః. ఇచట ''రాజ్ఞః పురుషః'' అని విగ్రహ వాక్యము. వేరుగా ప్రయోగించుట కుపయోగ్యములైన ఇట్టి విన్యాసములను లౌకిక విగ్రహములందురు. రాజన్+ ఙస్ + పురుష + సు. మొదలగు రీతిని ప్రకృతిని ప్రత్యయమును గూడ విడదీసి చూపి, ఆ యవస్థలో వృత్తి జరుగునని చెప్పుదురు. అట్టి అవస్థను ''అలౌకిక విగ్రహము'' అందురు. దీనికి స్వతంత్రముగా ప్రయోగముండదు.

7. శాస్త్రీయములగు కార్యములన్నియు అలౌకిక విగ్రహము యొక్క అవస్థయందే ప్రవర్తించును. ఈ యంశమును సూచించుటకు మాత్రమే అలౌకిక విగ్రహ ముపయోగించును (అది వ్యవహారయోగ్యము కాదు).

8. వృత్తి జరుగగానే అవయవముల యొక్క ప్రత్యయములన్నియు లోపించి, వెంటనే సముదాయమంతయు ఒకే ప్రాతిపదికముగా కాని, కొన్నిచోట్ల ధాతువుగా కాని మారిపోవును. దానికి ఆవశ్యకమైన ప్రక్రియను మరల సంపాదించుకొనవచ్చును.

ఇంకను సూక్ష్మములైన విశేషములను ''సమర్థః పదవిధిః'' (2-1-1) అను సూత్రము యొక్క భాష్యమునుండి గ్రహింపనగును.

సామాన్యముగా ఒక వాక్యమువలన పొందదగిన యర్థమును లాఘవముతో సంపాదించుటకు ఈ వృత్తి పద్ధతి ఏర్పడినది. ఇది సంస్కృతభాషకు మిక్కిలి సహజమైనది.

ప్రయోగ సౌకర్యమును సౌందర్యమును దీనికి గలవు. దీనిని శాస్త్రీయముగ నిర్వచించుటకు, పై కల్పన లన్నియు చూపబడినవి. సిద్ధముగనున్న విషయమును కొన్ని నియమములతో విశ్లేషించి చూపుటయే శాస్త్రము చేయుపని. అంతియకాని లేనిదానిని శాస్త్రము క్రొత్తగా తీసి కొని రాదు. ఈ యంశమును "ఉపాయాః శిక్షమాణానామ్" (సత్యమును గుర్తించుటకు శాస్త్రము ఉపాయము మాత్రమే). "సత్యం వస్తు తదాకారైర సత్యైరవధార్యతే" (అసత్యము లగు ఉపాయములచే సత్యము తెలియబడును). మొదలగు వచనములతో భర్తృహరి పలు మారులు వెల్లడించెను.

వృత్తియొక్క సకలసంపదను సాధించుటకు "ఏకార్థీభావము" అను కల్పవృక్షము వైయాకరణులకు లభించినది. దీనివలననే వృత్తికి సంబంధించిన కల్పనలన్నియు సార్థకములు కాగలిగినవి.

ఏకార్థీభావమునకు భిన్నమైన వేరొక సామర్థ్యమున్నది. ప్రాసంగికముగ దానిని గూర్చి రెండు మాటలనుకొనవలయును. వ్యపేక్షా సామర్థ్యమని దాని పేరు. "వి = విశిష్టా + అపేక్షా = వ్యపేక్షా". "చక్కని పొందిక" అని భావము. అనగా పదపదార్థముల కుండ వలసిన అన్యోన్యమైన అమరిక. ఈ సామర్థ్యము వాక్యమందుండును. వాక్యమందలి పదము లను ఆలస్యముచేయక వరుసగ పలుకుటయు, (దీనికి ఆసత్తియని పేరు) పదార్థములు పర స్పరము కలియుటకు తగియుండుటయు, (దీనికి యోగ్యత అని పేరు) అర్థము లొకదాని నొకటి ఆశించుకొనుచు పెనవేసికొని యుండుటయును (దీనిని ఆకాంక్షయందురు) వ్యపేక్ష యొక్క ముఖ్య లక్షణములు. వ్యపేక్షను గలిగిన వాక్యము శీఘ్రముగ అభిమతమైన అర్థమును బోధింపగలుగును. ఉదా : "అద్యరామః గ్రామం గచ్ఛతి" మొదలగునవి. అట్లుగాక వాక్య మందలి కొన్ని పదములను నేడును, మిగిలిన వానిని రేపును పలికినచో అర్థము తెలియదు. (అచట ఆసత్తి యుండదు). "అగ్నినాసించతి" (నిప్పుతో తడుపుచున్నాడు). యోగ్యత లేకుండుటచే ఇట్టి వాక్యములు అర్థమును బోధింపజాలవు. అట్లే– వనమ్, గ్రామః, అశ్వః, తత్ర, పతతి, – ఇది పదసముదాయమైనను మొత్తముపై ఎట్టి యర్థము కూడ తెలియజేయ జాలదు. (ఇట్టిచోట్ల ఆకాంక్ష సంభవింపదు).

కాగా వృత్తియందు ఏకార్థీభావమును వాక్యమందు వ్యపేక్షను శాస్త్రకారు లంగీక రించిరి. సూక్ష్మముగ పరిశీలించినచో వృత్తియందు కూడ వ్యపేక్షయొక్క మూల ధర్మములు కొన్ని ఉండక తప్పదని విశదమగును.

వృత్తియొక్క స్వరూప స్వభావములు ఒకింత తెలియుటకై ఈ పరిచయ వాక్యము లుపయోగించును.

ప్రకృత మీ "వృత్తి సముద్దేశము"న తద్ధితములు, సమాసములు మొదలగు వృత్తులకు సంబంధించిన సామాన్య విషయములు కొన్నియు, విశేష విషయములు కొన్నియు చర్చింపబడును. అందును ఏకార్థీభావము, అభేదైకత్వ సంఖ్య, లింగవచనములు సిద్ధించుట మొదలగు అంశములు అతి విపులముగ నుండును.

ఈ సముద్దేశమందలి విషయజాలమంతయు ప్రక్రియా భాగముపై అధికముగ ఆధారపడియుండుటయు, పరిశీలనములో మునిత్రయవచనముల పరామర్శము మెండుగ జరుగుచుండుటయును అనుభూతమగుచుండును. కాగా పాణినీయము యొక్క పరిచయము కొంతయైనను లేనివారి కిది సుబోధము కాదు.

## (1) సమానాధికరణమైన తద్ధితవృత్తియొక్క విచారము

*అవతారిక*— ''కుత్సితే'' (5-3-74) అను సూత్రముచే ''నిందింపబడినది'' అను నర్థమున ప్రథమాంతమగు ప్రాతిపదికమునకు ''క'' అను ప్రత్యయము విధింపబడినది. అట్లే ''ప్రశంసాయాం రూపప్'' (5-3-66) అను సూత్రముచే ''పొగడబడినది'' అను నర్థమున ''రూప'' ప్రత్యయమును, ''ద్వివచన విభజ్యోపపదే తరబీయసునౌ'' (5-3-57) అను సూత్రముచే ''రెండింటిలో ఒకటి మిన్న'' అను నర్థమున ''తరప్'' ''ఈయసున్'' అను ప్రత్యయములు విధింపబడినవి. ఈ సందర్భములలో ప్రకృతియొక్కయు ప్రత్యయము యొక్కయు అర్థమును సమన్వయింపదగు రీతిని వివరించుచున్నాడు.

శ్లో॥ కుత్సాప్రశంసాతిశయైః సమాప్తార్థం తు యుజ్యతే।
పదం స్వార్థాదయః సర్వే యస్మాత్ కుత్సాదిహేతవః ॥ 1

సమాప్తార్థమ్ = సంపూర్ణమైన అర్థము గల, పదమ్ + తు = పదమైతే, కుత్సా ప్రశంసాతిశయైః = నింద, ప్రశంస, గొప్పదనము (మొదలగు) అను వానితో, యుజ్యతే = సంబంధించును, యస్మాత్ = ఎందువలన, స్వార్థాదయః = స్వార్థము, మొదలగు అర్థములు, (జాతి ద్రవ్యము, లింగము, సంఖ్య, కారకము అనునవి), సర్వే = అన్నియు, కుత్సాదిహేతవః = నింద, ప్రశంసన, గొప్పదనము మొదలగు వానికి నిమిత్తములు, (భవంతి = అగునో, అందువలన - అని అన్వయము).

**తాత్పర్యము**— ప్రతియొక పదము కూడ జాతి, ద్రవ్యము, లింగము, సంఖ్య, కారకము అను అయిదర్థములను సంపూర్ణముగ బోధించుచుండును. అవన్నియును సందర్భమును బట్టి నింద, ప్రశంస, గొప్పదనము మొదలగు విశేష ధర్మములకు నిమిత్తములు కానచ్చును. వానిలో ఏదో యొక దానిని చెందునట్లు నిందను చెప్పదలచినపుడు పదమునకు ''క'' ప్రత్యయమును, ప్రశంసను చెప్పదలచినపుడు ''రూపప్'' ప్రత్యయమును, గొప్పదనమును సూచించునపుడు ''తరప్'' ప్రత్యయమును ప్రవర్తించును. ఉదా : (1) పటుకః = కుత్సితః పటుః = నిందితమగు సామర్థ్యము గలవాడు. (2) పటురూపః = ప్రశస్తః పటుః = మెచ్చదగిన సామర్థ్యము గలవాడు. (3) పటుతరః = ద్వయోః అతిశయేన పటుః = ఇరువురిలోను ఎక్కువ సామర్థ్యము గలవాడు.

*వివరణము*— **జాతి** (సకల వ్యక్తులందును గోచరించు సమానమైన ధర్మము), ద్రవ్యము (ప్రకృతమైన ఒక వ్యక్తి), లింగము (స్త్రీత్వము, పుంస్త్వము మొదలగునది),

సంఖ్య (ఒకటి, రెండు, మొదలగునది), కారకము (కర్త, కర్మ మొదలగునది), అను అయిదు కూడ శబ్దముయొక్క అర్థములనియు, శబ్దము నుచ్చరించిన వెంటనే అవి అతిశీఘ్రముగను వరుసగను ఒకదాని వెనుక మరియొకటి స్ఫురించుచుండుననియును శాస్త్ర సంప్రదాయము. ఉదా : గౌః - అను పదము. ఇచట గోత్వమను జాతియు, గోవు అను వ్యక్తియు, స్త్రీ - అను లింగమును, ఒకటియను సంఖ్యయు, కర్త అను కారకమున్ను ఈ పదమువలన వెంటనే తెలియును. పై అర్థములను ప్రాతిపదికార్థములని యందురు. (వీనియొక్క స్వరూప స్వభావాదులను ఈ కాండము మొదటి సముద్దేశములందు గ్రంథకర్త మిక్కిలి విపులముగ వివరించి యున్నాడు).

కాగా - నిందా ప్రశంసాదులు స్వీకరించిన శబ్దముయొక్క అర్థమును బట్టియే (సామాన్యముగా జాతినిగాని వ్యక్తినిగాని) రూపొందుననియు, అట్లవి ప్రకృత్యర్థమునకు విశేషణములగుననియు, 'క, రూప' మొదలగు ప్రత్యయములు సిద్ధముగనున్న ఆ యా అర్థములను కేవలము సూచించుననియును పర్యవసించును. అనగా ప్రత్యయమునకు వేరుగా అర్థము లేదనియు ప్రకృతియొక్క విశేషార్థము నది సూచించుననియు భావము. ఉదా : మనుష్యకః (నిందితుడైన మానవుడు). ఇచట జాతిగాని వ్యక్తిగాని నిందితము. ఆనింద ప్రకృత్యర్థమునకు చెందినది. అందువలన "కుత్సితః మనుష్యః" అని వివరణమును చూపుదుము. మనుష్య శబ్దమునకు "క" ప్రత్యయము చేరును. అది సిద్ధముగనున్న నిందను వెల్లడిచేయును. ఇట్లే ప్రశంస, మొదలగు అర్థములను రూప, మొదలగు ప్రత్యయములు విశదపరచును. జాతి, ద్రవ్య, లింగాది ధర్మములలో ఏ ధర్మమునుబట్టి నిందా ప్రశంసాదులను చేయ సమకట్టుదుమో, అట్టి ధర్మముగల వస్తువును చెప్పు శబ్దమునకు, ఆ యా అర్థములను వెల్లడి చేయ 'కా'ది ప్రత్యయములగునని సారము.

విశేష విషయములు— కన్ (క), రూపప్ (రూప), తరప్ (తర) మొదలగు ప్రత్యయములు "సమానాధికరణ తద్ధితములు" అనబడును. అనగా ఇవి ప్రవర్తించిన స్థలములలో ప్రకృతి ప్రత్యయములు రెండును ఒకే యర్థమును తెలుపుచుండును. సుబంతమునకు పరముగ తద్ధితములు ప్రవర్తించును. "దేవదత్త + సు + క" మొదలగు రీతిని మొదటి అవస్థను చూపుదురు. తద్ధితాంతము మరల ప్రాతిపదికమగును. (కృత్తద్ధిత సమాసాశ్చ (1-2-46). కృత్ప్రత్యయాంతములు, తద్ధితాంతములు, సమాసములును ప్రాతిపదికములగును). మధ్యనుండు సుప్ ప్రత్యయము లోపించి మొత్తముపై మరల ఆవశ్యకమగు సుప్ ప్రత్యయము వచ్చుచుండును. "దేవదత్తకః", (నిందితుడైన దేవదత్తుడు) మొదలగు రూపములు సిద్ధించును.

కొన్ని చోటులందు లింగమునుబట్టి కుత్స ఏర్పడును. ఉదా : "ప్రాప్యగాండీవ ధన్వానం విద్ధి కౌరవకాన్ స్త్రియః" (అర్జునుని ఎదుట కౌరవులు ఆడువారు). ఇచట "కుత్సితాః కౌరవాః = కౌరవకాః" అని కౌరవులందలి పుంస్త్వము నిందితము. దానినే క ప్రత్యయము సూచించును. అట్లే "పుత్రకః శతమ్" (ఒక కొడుకే నూరుమంది పెట్టు) మొదలగుచోట్ల

అను పదముచే పశువునందు ఏకత్వము భాసించుచున్నది. దానికి విరుద్ధముగా మరియొక సంఖ్య పశువునందు శబ్దముచే బోధింపబడి యుండలేదు.

తస్మాత్ = అందువలన, అసౌ = ఈ పశువు, సగుణః + ఏవ = పుంస్త్వము, పశుత్వము అనెడి గుణములతో గూడినదే, ఏకత్వేన + సహ = ఏకత్వ సంఖ్యతో గూడ, గమ్యతే = యాగాంగముగా తెలియబడుచున్నది.

'పశునా' అను పదము పశుత్వము, పుంస్త్వముకల వ్యక్తిని బోధించును. అందుచే మగ పశువును ఉపయోగించియే యాగము చేయవలెను. స్త్రీ పశువు యాగమున నుపయోగింప రాదు. అట్లే ప్రత్యయార్థమగు ఏకత్వ సంఖ్యయు పశువునకు విశేషణమగుటచే అదియు యాగాంగము కాగలదు. ॥71॥

**అవతారిక**— 50 వ శ్లోకమునుండి ఇంతవరకు 21 శ్లోకములలో సంఖ్య వివక్షితమా ? కాదా ? అని విచారింపబడినది.

ఇచట నుండి 80 వ శ్లోకము చివరి వరకు 9 శ్లోకములలో వ్యక్తియందున్న తెలుపు, ఎరుపు మున్నగు గుణము; పశుత్వము, అజత్వము మున్నగు జాతి; వివక్షితమగునా ? వివక్షితము కాదా ? అని విచారించుచున్నాడు.

**శ్లో॥ నిర్జ్ఞాత ద్రవ్యసంబన్ధే యః కర్మణ్యుపదిశ్యతే ।**
**గుణస్తేనార్థితా తస్య ద్రవ్యేణేవ ప్రతీయతే ॥** 72

నిర్జ్ఞాత ద్రవ్యసంబన్ధే = స్పష్టముగాతెలియబడిన ద్రవ్యముయొక్కసంబంధముకల, కర్మణి = యాగము మున్నగు క్రియయందు, యః = ఏ, గుణః = గుణము అనగా తెలుపు నలుపు ఎరుపు మున్నగు గుణము, తేన = ఆ గుణముతో, ద్రవ్యేణ + ఇవ = ద్రవ్యముతోవలె, తస్య = ఆ క్రియకు, అర్థితా = ఆకాంక్ష, ప్రతీయతే = తెలియబడుచున్నది, శబ్దముచే బోధింపబడుచున్నది.

"వాయవ్యం శ్వేతం పశుమాలభేత" అని వేదవాక్యము కలదు. వాయువు దేవతగా గలిగినట్టియు తెల్లని పశువును అనగా మేకను స్పృశింపవలెను, కాక చంపవలెనని దాని యర్థము. అట్లే ''గామభ్యాజ శుక్లామ్" అని మరియొక వాక్యము కలదు. (తెల్లని ఆవును బంధింపవలెను) ఆలంభకము, బంధనము అనునవి క్రియలు. వానిలో మేక, ఆవు ద్రవ్యములుగా స్పష్టముగా జెప్పబడినవి. ఆ ద్రవ్యములతోపాటు ఆ క్రియలకు (తెలుపు అను గుణముతో గూడ సంబంధము చెప్పబడినది. అందుచే క్రియకు ద్రవ్యముతో సంబంధము నియతమగునట్లు గుణముతోగూడ సంబంధము నియతమే. ఆలభేత, అని ఆలంభనక్రియ వినుసరికి కమ్ ? అని (దేనిని) ఆకాంక్ష కలిగినట్లు, కింగుణకమ్ ? (ఏ గుణము కల దానిని) అనియు ఆకాంక్ష కలుగును. ద్రవ్యమునకువలె గుణమునకు కూడ యాగాది క్రియలలో ప్రాముఖ్యము

2 ]
"కుత్సితః - ఏకః - పుత్రః" (నూరుమంది వలన కలుగు దుఃఖమును ఒకడే కలిగించు చున్నాడని భావము) అని సంఖ్యకూడ కుత్సకు నిమిత్తమగును. ఇట్లే ప్రశంస, ప్రకర్షము మొదలగునవి శబ్దార్థమునకు చెందుటను ఊహించునది. ॥1॥

*అవతారిక*— పైని చూపినట్లు చెప్పినచో "కుత్సితకః" మొదలగు ప్రయోగ ములు కుదురునా ? అని శంకించి సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ దేవదత్తాది కుత్సాయాం వర్తతే కుత్సితశ్రుతిః ।**
**కుత్సితస్థా తు యా కుత్సా తదర్థః కో విధీయతే ॥ 2**

దేవదత్తాది కుత్సాయామ్ = దేవదత్తుడు మొదలగు వారిని నిందించునపుడు, కుత్సిత శ్రుతిః= ఏదో యొక నిమిత్తమును బట్టి నింద వినబడుట, వర్తతే = ఉండును, (తథా = అట్లు), కుత్సితస్థా = కుత్సితుని యందుండు, కుత్సా = నింద, యా + తు = ఏదైతే కలదో, తదర్థః = దాని కొరకు, కః = క ప్రత్యయము, విధీయతే = విధింపబడును.

*తాత్పర్యము*— "కుత్సితః దేవదత్తః" (నిందింపబడిన దేవదత్తుడు), "కుత్సితః అశ్వః" (నిందితమైన అశ్వము) మొదలగు చోట్ల ఒకానొక నిమిత్తమువలన ఆ యా వస్తువు లకు చెందు నిందను తెలుపుటకు, కుత్సిత శబ్దమును ముందుగ ఉపయోగించి ఆ యర్థమును సూచించుటకై "క" ప్రత్యయమును చేర్చి, సూ. కుత్సితే (5-3-74). "దేవదత్తకః" "అశ్వకః" మొదలగు పదములను వాడుదుము. ఈ విధముగనే "కుత్సితః - కుత్సితః" అను విగ్రహమును చూపి, ఏదో యొక ప్రత్యేక ధర్మమునుబట్టి కుత్సితునకు గూడ నిందను అంటగట్టునపుడు, దానిని సూచించుటకై కుత్సిత శబ్దమునకును క ప్రత్యయమును చేర్చి "కుత్సితకః" అను రూపమును వాడుకొనవచ్చును.

*వివరణము*— "నిందింపబడినది" అను నర్థమును సూటిగా చెప్పు "కుత్సిత" శబ్దమునకు, మరల అదే అర్థమున "కుత్సితే" అను సూత్రముచే క ప్రత్యయము రాదగునా? అనునది యిచటి శంక. కుత్సితగతమగు కుత్సను ఏదో విధముగ మరల తెలుపుటకు క ప్రత్యయము రావచ్చునని సమాధానము.

విశేష విషయములు— శబ్దమొక అర్థమును బోధించుటకు నిదానమైన ధర్మమును ప్రవృత్తి నిమిత్తమందురు. జాతి, గుణము, క్రియ, అని ప్రవృత్తి నిమిత్తములు మూడు. ఉదా : గౌః = ప్రవృత్తినిమిత్తము "గోత్వము" అను జాతి. శుక్లః = తెలుపు అను గుణము ప్రవృత్తినిమిత్తము. పాచకః = వంట, అను క్రియ ప్రవృత్తినిమిత్తము. అట్లుగాక అన్ని శబ్దముల విషయమునను జాతి యొకటే ప్రవృత్తినిమిత్తము కావచ్చునను వాదము కూడ ఉన్నది. (ఇవన్నియు ఇదివరకు చర్చింపబడిన అంశములే). అట్టి ప్రవృత్తినిమిత్తమునకు సంబంధించు నిందను తెలుపుటకు క ప్రత్యయము చేరును. ఇతర శబ్దము లన్నిటికిని అది సహజము కావచ్చును. అట్లే కుత్సితత్వమను ప్రవృత్తినిమిత్తమునకును ఏదో యొక విశేష

ముచే మరల నిందను సూచింపదలచినపుడు కుత్సిత శబ్దమునకును మరల క ప్రత్యయము చేరవచ్చునని సారాంశము.

ఆ విధముగనే ''అనుకంపాయామ్'' (5-3-76) అను సూత్రముచే అనుకంపార్థమున ప్రాతిపదికమునకు క ప్రత్యయము విధింపబడినది. ''అనుకంప'' అనగా జాలి –లేక– దయ. ఉదా : అనుకంపితః - పుత్రః = పుత్రకః (జాలిగొలుపు కుమారుడు), మొదలగునవి. ఇచట కూడ మీద చూపిన యుక్తులచే అనుకంపిత, అనుశబ్దమునకును (జాలిగొలిపినవాడు) క ప్రత్యయము చేర్చి, ''అనుకంపితకః'' అను రూపమును సాధింపనగును. (అనుకంపితః - అనుకంపితః - అని విగ్రహము = మిక్కిలి జాలిగొలుపు వ్యక్తి - అని యర్థము) లేదా– ''అనుకంపితః కుత్సితః'' అను విగ్రహమును చూపి కుత్సితకః, అనుచోట క ప్రత్యయము అనుకంపార్థకమనియు, (జాలిగొలుపు నిందితుడు) ''కుత్సితః - అనుకంపితః'' అను విగ్రహమును చూపి, ''అనుకంపితకః'' అనుచోట క ప్రత్యయము కుత్సార్థకమనియును (నిందితుడైన అనుకంపితుడు) సమర్థించుకొనవచ్చును. ఎట్లయినను ఒక విశేషార్థమును ఆశ్రయింపక తప్పదు ॥2॥

*అవతారిక*— ఇట్లే ''అతిశాయనమును'' (అతిశయము = ప్రకర్షము = గొప్పదనము) సూటిగ తెలుపు ''ప్రకృష్ట'' మొదలగు శబ్దములకు కూడ, అదే యర్థమున ''తర'' మొదలగు ప్రత్యయములు చేరవచ్చునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రకృష్ట ఇతి శుక్లాది ప్రకర్షస్యాఽభిధాయకః ।**
**ప్రకృష్టస్య ప్రకర్షే తు తరబాదిర్విధీయతే ॥ 3**

ప్రకృష్టః + ఇతి = ప్రకృష్టః అను పదము, (గొప్పది = మిన్నయైనది), శుక్లాది ప్రకర్షస్య = శుక్ల, మొదలగు వాని ప్రకర్షమును, అభిధాయకః = చెప్పునదియగును, ప్రకృష్టస్య = ప్రకృష్టము యొక్క, (ఆ శబ్దము యొక్క అర్థమునకు సంబంధించిన), ప్రకర్షే + తు = ప్రకర్షమందు (ఆధిక్యము), తరబాదిః = తరప్, మొదలగు ప్రత్యయము, విధీయతే = విధింపబడును.

*తాత్పర్యము*— ''మిక్కిలి తెల్లనిది'' అను నర్థమును ''ప్రకృష్టః శుక్లః'' అను రీతిని ప్రకృష్ట, అను విశేషణము నుపయోగించి తెలుపవచ్చును. లేదా– శుక్ల శబ్దమునకు ప్రకర్షార్థమున ''తర'' అను ప్రత్యయమును చేర్చి ''శుక్లతర'' అను ప్రత్యయాంతముచే గూడ ఆ యర్థమును బోధింపవచ్చును. అదే విధముగ ప్రకృష్ట శబ్దమునకు కూడ ప్రకర్షార్థమున తర ప్రత్యయమును చేర్చి, ''ప్రకృష్టతరః'' అను ప్రయోగమును చేయనగును. అనగా సహజముగనున్న ప్రకర్షమునకు మరికొంత ప్రకర్షమును తరప్రత్యయము సంపాదించును.

*వివరణము*— ''ద్వివచన విభజ్యోపపదే తరబీయసునౌ'' (5-3-57) అనునది సూత్రము. ''ఏదైన ఒక విషయములో– ఇరువురిలో ఒకరు మిన్న'' అను నర్థమునగాని,

''ఒకరిని ప్రత్యేకముగా ఎత్తి చూపి, ఒక విషయమున వారికంటె వీరు గొప్ప'' అను నర్థమున గాని— ఏ యంశమునుబట్టి గొప్పదనమును చెప్పదలతుమో ఆ యంశమును చెప్పు సుబంతమునకు తరప్, (తర) ఈయసున్ (ఈయన్) అను ప్రత్యయములు వచ్చునని ఈ సూత్రము యొక్క అర్థము. ఈ ప్రత్యయములు అతిశయమును సూచించును. ఇచట కూడ అతిశయము —లేక— ప్రకర్షము ప్రకృత్యర్థమందే ఇమిడియుండును. ప్రత్యయమద్దానిని సూచించును. ఉదా : ''అనయోః అయమ్ అతిశయేన పటుః = పటుతరః, పటీయాన్'' ''ప్రాచ్యేభ్యః ఉదీచ్యాః బలీయాంసః''. (ప్రాచ్యులకన్న ఉదీచ్యులు మిక్కిలి బలముగలవారు) ఎట్టి విశేషమును చెప్పకపోయినను కేవలము ప్రకర్షార్థమందు కూడ ఈ ప్రత్యయములు. రావచ్చునని యిచట ఒక సిద్ధాంతమున్నది. తదనుసారము ''ప్రకృష్టః శుక్లః'' అను నర్థమున '''శుక్లతరః'' అను ప్రయోగము సాధువే. ఇట్లుండ ప్రకర్షమును సాక్షాత్తుగ చెప్పు ''ప్రకృష్ట'' శబ్దమునకు తరప్రత్యయమును చేర్పవచ్చునా ? అను శంకకు సమాధానమును ఈ కారిక చెప్పినది. ఉన్న ప్రకర్షమునకే మరికొంత ప్రకర్షమును చెప్పదలచినపుడు తర ప్రత్యయము చేరవచ్చునని ఫలించినది.

విశేష విషయములు— ప్రశంస, ప్రకర్ష, నింద, అజ్ఞాతము, అల్పము, హ్రస్వము మొదలగు అర్థములందు ఆయా సూత్రములచే రూప, తర, క, మొదలగు ప్రత్యయములు తద్ధిత ప్రకరణమున విధింపబడినవి. ఇవన్నియు స్వార్థికములు —లేక— సమానాధికరణములు. అనగా ప్రకృతియందు ఇమిడియున్న అర్థమునే యివి తెలుపును. ఇట్లుండ ఆయా అర్థములను సూటిగ చెప్పు కుత్సిత, అజ్ఞాత, మొదలగు శబ్దములకు కూడ అదే యర్థమును ఇనుమడింపజేయ సమకట్టినపుడు ఆయా ప్రత్యయములు రావచ్చునని విశదీకరించుటయే ప్రకృత చర్చయొక్క ప్రయోజనము. కుత్సితక, అను ప్రయోగము యొక్క ప్రసంగము దీనికి దారి తీసినది. కాగా ప్రశస్తరూపః, అల్పకః, హ్రస్వకః, మొదలగు ప్రయోగములన్నియు సముచితములే యని తేలినది. ॥3॥

అవతారిక— కుత్సితక, అనుచోట కుత్సితమునకు గల వేరొక కుత్స ఎట్టిది ? అను అంశమును వివరించుచున్నాడు.

శ్లో॥ కుత్సితత్వేన కుత్స్యో వా న సమ్యగ్వాఽపి కుత్సితః ।
స్వశబ్దాభిహితే కేన విశిష్టోఽర్థః ప్రతీయతే ॥ 4

కుత్సితత్వేన = నిందితమగుటచే, కుత్స్యః + వా = నిందకు అర్హమైనది, వా = అట్లుకాక, కుత్సితః = నిందితమగుట, న + సమ్యక్ = సముచితము కాదు— ఈ మొదలగు, విశిష్టః = వేరుగ వక్కాణింపబడిన, అర్థః = అర్థము, స్వశబ్దాఽభిహితే = స్వశబ్దముచే చెప్పబడిన స్థలమందు (కుత్సార్థమును సూటిగ చెప్పు కుత్సిత శబ్దము విషయమున), కేన = క ప్రత్యయముచే, ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్యము— ''కుత్సితకః'' మొదలగుచోట్ల, తెలియబడు నింద ''తగినదియే''

అనికాని, "వాస్తవముగ నింద తగదు. అది ఎవరో కిట్టని వ్యక్తి మోపినది" అని కాని ఒకానొక విశేషమును "క" ప్రత్యయము సూచించును. అనగా కేవలము కుత్సిత శబ్దముచే నిందా సామాన్యమును, క ప్రత్యయముచే అందలి విశేషమును తెలియజేయవచ్చును గాన క ప్రత్యయము సార్థకమగును. ఉన్న నిందకే వేరొకరీతిని నిందను కల్పించి క ప్రత్యయమును ఉపయోగించుకొనవచ్చునని సారాంశము.

**అవతారిక**— మీద చూపినట్లు రెండవ రకమగు నిందను చెప్పనక్కర లేదు. కుత్సిత, అను శబ్దమువలన సహజముగ తెలియు నిందనే క ప్రత్యయము బోధించునని మార్గాంతరమును చూపుచున్నాడు.

**శ్లో॥ న చ సాంప్రతికీ కుత్సా భేదాఽభావాత్ ప్రతీయతే ।
పూజ్యతే కుత్సితత్వేన ప్రశస్తత్వేన కుత్స్యతే ॥** 5

భేదాఽభావాత్ = ఎట్టి భేదమును లేనందువలన, సాంప్రతికీ = ప్రస్తుతమైన, కుత్సా = నింద, న + ప్రతీయతే + చ = తెలియబడదు, కుత్సితత్వేన = నిందితమగుటచే, **పూజ్యతే** = **పూజింపబడును** (ఒక వస్తువు), ప్రశస్తత్వేన = ప్రశంసింపబడిన దగుటచే, **కుత్స్యతే** = నిందింపబడును. (వేరొక వస్తువు).

**తాత్పర్యము**— కుత్సితము = నిందితము. అట్లు దూషింపబడిన ద్రవ్యమే ఒకప్పుడు కొందరికి పూజనీయము కావచ్చును. అట్లే పూజ్యమగు వస్తువే మరికొందరికి కుత్సితము కావచ్చును. వస్తువులకు చెందు నిందా ప్రశంసాదులు ఆపేక్షికములు— నియతములు కావు. కావుననే "కుత్సితకః" మొదలగుచోట్ల ప్రశంసార్థమున క ప్రత్యయమనియు (ప్రశస్తః - కుత్సితః), "ప్రశస్తకః" మొదలగు స్థలములందు నిందార్థమున క ప్రత్యయమనియును (కుత్సితః - ప్రశస్తః) చెప్పుట కవకాశమున్నది. కాగా అట్టి సంశయమునకు తావు లేకుండ కుత్సితకః, అనుచోట "ప్రస్తుతము నిందయే" అని నొక్కి చెప్పుటకు క ప్రత్యయము చేరునని చెప్పవచ్చును.

**వివరణము**— నిందితము, ప్రశస్తము మొదలగు పెక్కు అర్థములను బోధించుటకు క ప్రత్యయము విధింపబడినది. ఆ యా అర్థమును సూటిగ చెప్పు శబ్దములకు మరల అదే యర్థమున క ప్రత్యయము రాదగునా? తగదా?— అను శంకకు సమాధానముగ ఈ సందర్భమంతయు బయలుదేరినది. ఇచటి సమాధానము మొత్తముపై మూడు విధములుగా ఉన్నది: (1) కుత్సితమునకే వేరొక రీతిని కుత్సను తెలుపుటకు క ప్రత్యయము. (2) ప్రస్తుతమైన కుత్సనే నొక్కిచెప్పుటకు క ప్రత్యయము. (3) అర్థమును మార్చివేసి వేరొక అర్థమును చెప్పుటకు క ప్రత్యయము. ఇంతటితో సమానాధికరణ తద్ధితవిచారము ముగిసినది.

6]

## (2) సమానాధికరణ సుబ్ వృత్తి (సమాస) విచారము

అవతారిక — కుత్స, ప్రశంస మొదలగు ధర్మములవలెనే విశేషణ విశేష్యభావ మను ధర్మము కూడ, సంపూర్ణమగు పదమునకే సంబంధించునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ విశేషణవిశేష్యత్వం పదయోరుపజాయతే ।**
**న ప్రాతిపదికార్థశ్చ తత్రైవం వ్యతిరిచ్యతే ॥ 6**

విశేషణవిశేష్యత్వమ్ = విశేషణ విశేష్యభావము, పదయోః = సంపూర్ణమైన పదములకు, ఉపజాయతే = కలుగును, ఏవమ్ + చ = ఇట్లయినపుడు, తత్ర = అచట, ప్రాతిపదికార్థః = ప్రాతిపదికము యొక్క అర్థము, న + వ్యతిరిచ్యతే = మారదు.

తాత్పర్యము— అన్ని విధముల పరిపూర్ణములైన పదములకే విశేషణ విశేష్య భావమను సంబంధము కలుగుచుండును. అట్టిచోట్ల ప్రాతిపదికార్థములో ఏ విధమైన మార్పును ఉండదు.

వివరణము— "వీరః + పురుషః" మొదలగు చోటులందు, జాతి, ద్రవ్య, లింగ, సంఖ్యా, కారకములనెడి ప్రాతిపదికార్థము ఆ యా పదములవలన మొదట పూర్తిగా బోధ పడును. ఇచట ఎట్టి మార్పును ఉండదు. పిదప ఆ రెండు పదములకును ఒకదానితో వేరొక దానికి అన్వయమును చేసినపుడు, "ఒకటి విశేషణము - మరొకటి విశేష్యము" అను సంబంధము వాక్యార్థము రూపముగా సిద్ధించును. "వీరుడైన పురుషుడు" మొదలగు రీతిని బోధ కలుగును. కాగా విశేషణ విశేష్యభావమనునది వాక్యార్థరూపమేగాని పదార్థరూపము కాదు.

విశేష విషయములు— "విశేషణం విశేష్యేణ బహులమ్" (2-1-56) అను సూత్రముచే సమాసము విధింపబడినది. విశేషణమైన సుబంతము విశేష్యమైన సుబంతముతో సమసించునని అర్థము. "వీరపురుషః" మొదలగునవి ఉదాహరణములు. (వీరః + చ + సః + పురుషః + చ). ఇట్టివానికి సమానాధికరణ సమాసములని పేరు. (సమానమ్ = ఒకటే యగు, అధికరణమ్ = ఆశ్రయః = అర్థము, యస్య + సః = సమానాధికరణః = ఒకే యర్థ మును బోధించు పదము). వీనియందు ప్రకాశించు విశేషణ విశేష్యభావమను సంబంధమును విశదీకరించుటకు ఈ ప్రసంగము బయలుదేరినది.

సమానాధికరణములగు పదములను వాడినపుడు వాని యర్థము తొలుత విడివిడి గానే స్ఫురించుననియు, పిదప వాక్యముగాకాని సమాసముగాకాని ఆ పదములను బంధింప దలచినపుడు ఒకదాని యర్థము విశేష్యముగాను (ప్రధానము) వేరొక దాని యర్థము విశేష ణముగాను (అప్రధానము) భాసించుననియును నిర్ణయింపవలెను. ఇట్టి సంబంధము వాక్య దశలో కలుగునుగాన అది వాక్యార్థమగును కాని పదార్థము (పదములయొక్క అర్థము) కానేరదు.

విశేష్యము ఎల్లప్పుడును ద్రవ్యమై యుండును. ద్రవ్యమునకే క్రియతో అన్వయము సహజము. గుణమున కది అసంభవము. ఉదా: ''రక్తం సరసిజమానయ'' (ఎర్రని పద్మమును తెమ్ము). ఇచట ''తెచ్చుట'' అను క్రియతో పద్మమునకే సంబంధము కుదురును. ''ఎరుపు'' అను గుణమును విడిగా తెచ్చుట కుదురదు. ద్రవ్యము ద్వారా గుణమునకు క్రియాన్వయము లభించును. కాగా క్రియతో అన్వయించు ద్రవ్యమే ముఖ్యమగుటయు, దానికి తోడ్పడు గుణము అముఖ్యమగుటయును స్వభావసిద్ధమని అనవచ్చును. ॥7॥

అవతారిక— పై యంశమును వేరొక రీతిని వివరించుచున్నాడు.

**శ్లో॥ విభక్తిభేదో నియమాద్గుణ గుణ్యభిధాయినోః ।**
**సామానాధికరణ్యస్య ప్రసిద్ధిర్ద్రవ్య శబ్దయోః ॥ 8**

గుణగుణ్యభిధాయినోః = గుణమును ద్రవ్యము (గుణి)ను చెప్పు శబ్దములకు, నియమాత్ = తప్పక, విభక్తిభేదః = వేర్వేరు విభక్తియుండుట, (భవతి = అగును), ద్రవ్యశబ్దయోః = ద్రవ్యములను బోధించు రెండు శబ్దములకు, సామానాధికరణ్యస్య = సమానాధికరణ భావము యొక్క (ఒకే విభక్తిలో ఉండుట = ఒకే యర్థమును తెలుపుట) ప్రసిద్ధిః = ప్రసిద్ధి, (స్యాత్ = అగును).

తాత్పర్యము— ద్రవ్యమును వేరుగను, దానియందలి గుణమును వేరుగను, చెప్పునపుడు ద్రవ్యమును బోధించు శబ్దమునకు షష్ఠీ విభక్తియు గుణమును బోధించు శబ్దమునకు ప్రథమయు తప్పక వచ్చును. అది సహజమును శాస్త్రీయమును అగును. ఉదా: ''పటస్య శుక్లః'' (బట్టయొక్క తెలుపు). అట్లుగాక రెండు శబ్దములును ద్రవ్యవాచకములే అయినచో రెండిటికిని ప్రథమయే సహజము. ఆ రెండును సమానాధికరణములగును. సామర్థ్యమును సందర్భమును బట్టి అందొకటి ప్రధానమును వేరొకటి అప్రధానమును అగుచుండును. ఉదా: ''వీరః పురుషః'' (వీరుడైన పురుషుడు).

వివరణము— ద్రవ్యమాధారము. గుణమాధేయము. కాగా ఒకప్పుడు గుణమును ముఖ్యముగను ద్రవ్యముమ అముఖ్యముగను సూచింపదలచినపుడు అట్టి సంబంధము విశదమగుటకు ద్రవ్యవాచకమునకు షష్ఠియు (షష్ఠి సంబంధమును సూచించును), గుణవాచకమునకు ప్రథమయు (ముఖ్యమగు స్వార్థమును ప్రథమ సూచించును) సహజములు. ఇట్టి ప్రయోగములను వ్యధికరణములందురు. అనగా వేర్వేరు విభక్తులను కలిగిన పదములు ఏదో ఒక సంబంధమును బట్టి అన్వయమును పొంది గుణప్రధాన భావమును స్పష్టపరచుట. ఉదా: ''పటస్య శుక్లః'' ''రాజ్ఞః పురుషః'' మొదలగునవి. ఇచట విడిగా పదములను వాడవచ్చును. లేక షష్ఠీ తత్పురుష సమాసమునైనను చేయవచ్చును (పటశుక్లః, రాజపురుషః, మొదలగునవి) వ్యధికరణము లగుటయే వైయధికరణ్యము. ఇట్టి సందర్భములలో గుణప్రధాన భావము విభక్తులను బట్టియే విశదమగును. అట్లుగాక రెండు పదములును ద్రవ్యమునే బోధించునపుడు, తమ తమ సహజార్థమును తెలుపుచు ప్రథమా విభక్తియే రెండిటికిని అగును ఉదా: ''వీరః

వలన, తౌ = ఆ కృష్ణ - తిల - శబ్దములు, విశేషే = ఆయా విశేషమందు, వ్యవస్థితౌ = నియతములు, (భవతః = అగును), తమ్ = ఆ, విశేషమ్ = విశేషమును, రూపాఽభేదాత్ = స్వరూపములో భేదము లేనందువలన, అభివ్యంక్తుమ్ = విశదపరచుటకు, న + శక్నుతః = సమర్థములు కావు.

తాత్పర్యము— "కృష్ణాః - తిలాః" మొదలగుచోట్ల రెండు శబ్దములును ఎట్టి విశేషమునులేని ద్రవ్యమునే బోధించుచున్నచో వానికి పరస్పరము సంబంధము కుదురదు. (దేనికదే ముఖ్యమైన రెండు వస్తువులను కలిపి చెప్పుట ఎందులకు ? ఇట్టివి ద్వంద్వ సమాసములు కావు గదా !) కాన ఆ రెండు శబ్దములును విశేషమునే సూచించునని చెప్పవలెను (కృష్ణ శబ్దము తిలజాతి విశేషమును తిలశబ్దము కృష్ణ గుణవిశేషమును అపేక్షింపక తప్పదు). అయితే - ఆ రెండు శబ్దముల స్వరూపము ఎప్పుడును ఒకటేగాన (సామాన్యమును చెప్పినను విశేషమును చెప్పినను) ఆ యా విశేషము వెనువెంటనే విశదము కాదు.

వివరణము— కృష్ణ - తిల - శబ్దములకు ఒక సంబంధమున్నదని తెలియక పూర్వము, అభీష్టమైన విశేషార్థము వానివలన తెలియుట కష్టము. అందుచే వానికొక సంబంధమును చెప్పవలెను. అదియే "విశేషణ విశేష్యభావము" అని ఫలితము.

శ్లో॥ తావేవం సన్నిపతితౌ భేదేన ప్రతిపాదనే ।
అవచ్ఛేదమివాఽఽధాయ సంశయం వ్యపకర్షతః ॥ 11

ఏవమ్ = ఇట్లు, ప్రతిపాదనే = అర్థమును బోధించుటయందు, భేదేన = భేదముతో, సన్నిపతితౌ = ఒక దగ్గర కూడిన, తౌ = ఆ రెండు శబ్దములును, అవచ్ఛేదమ్ = నిశ్చయమును, ఆధాయ + ఇవ = వహించినట్లు, సంశయమ్ = సందేహమును, వ్యపకర్షతః = పోగొట్టును.

తాత్పర్యము— "కృష్ణాః తిలాః" అని విడిగాకాని "కృష్ణతిలాః" అని సమాసముగా కాని ప్రయోగించినపుడు, ఆ రెండు శబ్దములకు గల సంబంధమొకటి తప్పక స్ఫురించి కృష్ణ శబ్దము గుణమును (నలుపు) చెప్పి విశేషణమగుననియు, తిలశబ్దము ద్రవ్యమును బోధించి విశేష్యమగుననియు నిర్ణయము కలుగును. అట్టి నిర్ణయము వానికిగల పరస్పరాపేక్ష అనెడి ధర్మమువలన ఏర్పడును. (ఇట్టి చోట్ల తిలశబ్దముతో కలియు కృష్ణశబ్దము గుణవిశేషవాచకమనియు, కృష్ణశబ్దముతో కలియు తిలశబ్దము ద్రవ్యవిశేషవాచకమనియును తెలియుచుండును).

వివరణము— ఎట్టి సంబంధమును లేని విడి విడి పదములు సరియైన అర్థమును బోధింపజాలవు. కావున సమాసముగనో వాక్యముగనో పదములను వాడినపుడు వానికొక సంబంధముండి తీరవలెను అట్టి సంబంధము అర్థమందు కలుగు సంశయములను పోగొట్టును. ప్రకృతమున గుణవాచకమును (కృష్ణ) ద్రవ్యవాచకమును (తిల) కలిపి పలికినపుడు ద్రవ్యము ప్రధానమనియు, గుణము ద్రవ్యమందుండును గాన అప్రధానమనియును విశదమైపోవును.

శ్లో ద్విధాకైశ్చిత్పదం భిన్నం చతుర్ధా పఞ్చధాపివా।
అపోద్ధృత్యైవవాక్యేభ్యః ప్రకృతిప్రత్యయాదివత్ ॥ 1

కైశ్చిత్ = కొందరిచే, వాక్యేభ్యః వాక్యములనుండి, పదమ్ = పదము, (పదేభ్యః) = పదములనుండి, ప్రకృతిప్రత్యయాదివత్ = ప్రకృతి ప్రత్యయము, ఆగమము, ఆదేశము మున్నగునవివలె, అపోద్ధృత్య + ఏవ = బుద్ధిపూర్వకముగ వెగలించి వేరుచేసియే, ద్విధా + వా = రెండువిధములుగానే, అనగా నామము (సుబంతము) ఆఖ్యాతము (క్రియా ప్రధానము) భిన్నమ్ = విభజింపబడినది.

కైశ్చిత్ = మరికొందరిచే, చతుర్ధా + వా = నాలుగు విధములుగానేఅనగా నామము ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము, అను రీతిని నాలుగువిధములుగానే. భిన్నమ్ విభజింప బడినది.

కైశ్చిత్ = మరికొందరిచే, పఞ్చధా + అపి + వా = ఐదువిధములగానే అనగా నామము, ఆఖ్యాతము, ఉపసర్గము, నిపాతము, కర్మప్రవచనీయము అను రీతిని ఐదు విధములుగానే, భిన్నమ్ = విభజింపబడినది.

వాక్యమే అర్థబోధకము. అదినిరవయవము, దానిచే బోధింపబడెడి అర్థము కూడ నిరవయవమే. అనగా ఇది కర్త, ఇది కర్మ, ఇది విశేషణము, ఇది క్రియ అను విభాగములేదు. ఇది వైయాకరణుల ముఖ్యసిద్ధాంతము.

అట్టి వాక్యమును వాక్యార్థమును తెలిసికొనుట దుస్సాధము, మరియు వాక్యములకు అంతము లేనందున వానికి సాధుత్వ సంపాదనము దుశ్శకము అని భావించి పాణిని, కాత్యాయన, పతంజలి మహర్షులు వాక్యములనుండి పదములను విభజించిరి. ఆపదములను గుర్తించుటలో అభిప్రాయభేదముకలదు.

1. పదము రెండు విధములు—నామము,ఆఖ్యాతము. నిపాతలు నామార్థము నందు గలవిశేషమును ద్యోతనచేయుటచే నవియు నామపదములుగానే గుర్తింపబడును.స్వః (స్వర్గము) మున్నగునవి నామపదములే. హిరుక్ (వేరుగా, శీఘ్రముగా) మున్నగు శబ్దములు క్రియా ప్రధానకములు కనుక అవి ఆఖ్యాతపదములుగానే పరిగణింపబడుచున్నవి. ప్ర, పర, మున్నగు ఉపసర్గములును, కర్మప్రవచనీయములుగూడ క్రియా విశేషమును ప్రకాశింపచేయుటచే నవియు ఆఖ్యాతపదములే. కాగా వాక్యమునుండి పదవిభాగము చేయగా రెండు విధముల పదములు కాన్పించునని కొందరిఆశయము.

2. నామము, ఆఖ్యాతము స్వతంత్రపదములు. నిపాతములు, ఉపసర్గములు వానియర్థవిశేషమును ద్యోతనచేయును. అంతమాత్రాన అవి వానిలో అంతర్భూతములు కావు. కనుక అవి అనగా నిపాతము, ఉపసర్గము స్వతంత్రపదములే, అందుచే పదములు

కాన్పించుచున్నది. విశేషమేమనగా— ముందుగా ద్రవ్యము, తరువాత గుణము ఆకాంక్షిత మగును. క్రియతో సాక్షాత్సంబంధము ద్రవ్యమునకే కదా! యాగాది క్రియలు పూర్తి చెందవలెనన్న శాస్త్రవిహితమగు ద్రవ్యము గుణము రెండు అపేక్షితములే.

గవాది పదములు శక్తిచే ద్రవ్యబోధకము లనెడి సిద్ధాంతము నాశ్రయించి యీ శ్లోకము చెప్పబడినది. పై శబ్దములు జాతి బోధకములనెడి సిద్ధాంతము నాశ్రయించి 77 వ శ్లోకము చెప్పబడుచున్నది.

గుణ ద్రవ్యముల రెంటికి క్రియతో సంబంధము శ్రౌతమే. అనగా శబ్దసామర్థ్యము వలన కలుగునదియే యని యీ శ్లోకముయొక్క తాత్పర్యము. ॥72॥

*అవతారిక*— వాక్యార్థ నిర్ణయమునకై గుణ ద్రవ్యములకు కల పరస్పర సంబంధమును చూపుచున్నాడు.

**శ్లో॥ కశ్చిదేవగుణో ద్రవ్యే యథాసామర్థ్యలక్షణః ।**
**ఆధారోఽపిగుణస్యైవం ప్రాప్తస్సామర్థ్యలక్షణః ॥ 73**

ద్రవ్యే = ద్రవ్యమునందు, కశ్చిత్ + ఏవ + గుణః = ఏదో ఒక గుణము, సామర్థ్య లక్షణః = సామర్థ్యము చిహ్నముగాకలదై, అనగా గుణములేని ద్రవ్య ముండనేరదు అనెడి అనుపపత్తి మూలముగా కలదై, యథా = ఏ రీతిగా, (అస్తి) = ఉన్నదో, గుణములేని ద్రవ్యముండుట యసంభవము కనుక ద్రవ్యమనుసరికి దానియందు ఏదో గుణము తప్పక యుండగలదని యెట్లు తెలియబడుచున్నదో యని భావము.

ఏవమ్ = అట్లే, గుణస్య = గుణమునకు ఆధారః + అపి = ఆశ్రయము కూడ, సామర్థ్య లక్షణః = సామర్థ్యము చిహ్నముగా గలదియే. అనగా ఆధారములేనిది గుణము ఉండనేరదనెడి అనుపపత్తిని మూలముగా జేసికొనినదై, ప్రాప్తః = ప్రతీతి విషయమగుచున్నది. అనగా తెలియబడుచున్నది. ఎరుపు, తెలుపు మున్నగు గుణములు ఒక ద్రవ్యమును ఆధారముగా జేసికొనియే యుండును, అది వాని స్వభావము. కాగా గుణము అనుసరికి దానికి ఏదో ఒక ఆధారమగు ద్రవ్యము తప్పక యుండునని తెలియబడుచున్నదని భావము.

ఉపపన్నము కాని యర్థమునకు ఉపపత్తిని కలిగించెడి అర్థమును కల్పించుట సామర్థ్యమనబడును. దీనినే అర్థాపత్తి ప్రమాణమందురు. అర్థస్య = ఉపపాదకమగు అర్థమునకు, ఆపత్తిః = కల్పన = అర్థాపత్తి. ఇది స్వతంత్రమగు ప్రమాణమని శాబ్దికులు తలంతురు.

గుణములేని ద్రవ్య ముండనేరదు కనుక ద్రవ్యమునకు ఏదో గుణమున్నదనియు, ఆధారములేనిది గుణములుండనేరవు కనక వానికి ఆధారముగా ద్రవ్యమున్నదనియు చెప్పనక్కర లేకుండగనే తెలియబడగలదు.

ఆ గుణము తెలుపు, నలుపు అనిగాని, ఆ ద్రవ్యము ఆవు, మేక అనిగాని విశేష

అవతారిక— పై యంశమునే సమర్థించుచున్నాడు.

శ్లో॥ నిమిత్తైరభిసంబంధా ద్యా నిమిత్త సరూపతా ।
తయైకస్యాఽపి నానాత్వం రూపాఽభేదాత్ ప్రకల్ప్యతే ॥ 13

నిమిత్తైః = గుణము, జాతి మొదలగు ప్రవృత్తి నిమిత్తములతో, అభిసంబంధాత్ = సంబంధము వలన, నిమిత్తసరూపతా = నిమిత్తముల సారూప్యము, యా = ఏది కలదో, తయా = దానిచే, ఏకస్య + అపి = ఒకటే అయిన దానికిని (ద్రవ్యమునకు), నానాత్వమ్ = అనేకత్వము, (భేదము), రూపాఽభేదాత్ = స్వరూపము యొక్క భేదము లేనందువలన, ప్రకల్ప్యతే = కల్పింపబడును.

తాత్పర్యము— ద్రవ్యమొకటే. అయినను దానియందలి గుణము, జాతి, మొదలగు ధర్మములకు గల భేదమును పురస్కరించుకొని, ద్రవ్యభేదమును కల్పించుకొనవచ్చును. ఉదా : తిలాః = నువ్వులు. ఈ పదార్థమెప్పుడును ఒకటే. కాని కృష్ణ, శుక్ల (తెల్లని) మొదలగు గుణముల భేదమువలన దీనికిని భేదము కల్పింపబడును. కాగా ''కృష్ణతిలాః'' అనుచోట కృష్ణ శబ్దము ''నల్ల నువ్వులు'' అను ఒక ద్రవ్యమును, తిల శబ్దము ''నువ్వులు'' అను వేరొక ద్రవ్యమును బోధించుటచే రెండు ద్రవ్యములున్నవని భావింపవలెను. ॥13॥

అవతారిక— మీద చూపిన విధమున భేదకల్పనచే సిద్ధించిన రెండు ద్రవ్యములును ఆధేయములే. (ఒక వస్తువును ఆశ్రయించునవి). వీని కాధారమగు మూడవ ద్రవ్యమును కూడ కల్పించుకొనవలెనని చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యావస్థా తృతీయా తు యస్యాం సంసృజ్యతే ద్వయమ్ ।
తయోరవస్థయోర్భేదాదాశ్రయత్వే నియుజ్యతే ॥ 14

ద్వయమ్ = జాతి, గుణములచే వేరుచేయబడిన ద్రవ్యద్వయము, యస్యామ్ = ఏ అవస్థయందు, సంసృజ్యతే = కలియునో, (సా = అట్టి), తృతీయా = మూడవదైన, ద్రవ్యావస్థా + తు = ద్రవ్యముయొక్క అవస్థ అయితే, తయోః = ఆ, అవస్థయోః = అవస్థలకు, భేదాత్ = భేదమువలన, ఆశ్రయత్వే = ఆధారముగా, నియుజ్యతే = కల్పింపబడును.

తాత్పర్యము— పూర్వోక్తమగు కల్పనచే సిద్ధించిన రెండు ద్రవ్యములకును ఆధారమగునట్లుగా మూడవ ద్రవ్యము నొకదానిని కూడ కల్పింపవలెను. దానిపై రెండు ద్రవ్యములును కలిసి విశ్రమించును. ఈ రీతిని సామానాధికరణ్యము సాధ్యమగును. (రెండు వేర్వేరు వస్తువులు ఒక దానియందు కూడుట). అనగా సమానాధికరణ స్థలములలో పదార్థముల సంబంధమును భావించు సమయమున మూడవ ద్రవ్యమును కూడ అంగీకరించినగాని సాంకేతికమైన సామానాధికరణ్యము సంభవింపదని ఫలించును.

వివరణము— ''కృష్ణాః - తిలాః''. ఇచట కృష్ణ శబ్ద మొక తిలద్రవ్యమును

తిలశబ్దము వేరొక తిలద్రవ్యమును బోధించును. ఈ రెండింటికిని ఆధారముగ మూడవ తిల ద్రవ్యము కలదని ఊహింపవలెను. దీనియందు పై రెండును కలిసియుండును. ఇదియే సామానాధికరణ్యము. ఇట్టి కల్పన చేయనిచో సామానాధికరణ్యము సార్థకము కాకపోవును, ॥14॥

అవతారిక— ఒకే ద్రవ్యమునకు బుద్ధి పరికల్పితమైన భేదమును చూపవచ్చునని అనుచున్నాడు.

శ్లో॥ బుద్ధ్యైకం భిద్యతే భిన్నమేకత్వంచోపగచ్ఛతి ।
బుద్ధ్యాఽవస్థా విభజ్యంతే సాహ్యర్థస్య విధాయికా ॥ 15

ఏకమ్ = ఒకటే అగు వస్తువు, బుద్ధ్యా = బుద్ధిచే, భిద్యతే = వేరుచేయబడును, భిన్నమ్ = విడివిడిగా ఉండునది, ఏకత్వమ్ = ఒకటేయగుటను, ఉపగచ్ఛతి + చ = పొందునుకూడ, అవస్థాః = అవస్థలు, బుద్ధ్యా = బుద్ధిచే, విభజ్యంతే = విడదీయబడును, సా = ఆ బుద్ధి, అర్థస్య = అర్థమును, విధాయికా + హి = సమర్పించునది గదా ।

తాత్పర్యము— ఎట్టి యర్థమునయినను ప్రకాశింపజేయు శక్తి బుద్ధికి గలదు. దాని వలననే ఒక వస్తువే ఎన్నో వస్తువులుగాను, ఎన్నో వస్తువులు ఒకే వస్తువుగాను భాసించు చుండును.

వివరణము— కాగా "కృష్ణతిలాః" మొదలగుచోట్ల సమాసము కానపుడు ఆ రెండు శబ్దములును వేర్వేరు ద్రవ్యములను బోధించుననియు, సమాసమైనపుడు ఒకే ద్రవ్యమును తెలియజేయుననియును ఈ మొదలగు విశేషాంశములు బుద్ధివైభవము యొక్క ఫలితములే అని తెలియవలెను. ॥15॥

అవతారిక— బుద్ధి పరికల్పితములైన భేదాఽభేదములు వార్తికకారునికి (కాత్యాయనుడు) అభిమతమే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ వ్యపదేశివదేకస్మిన్ బుద్ధ్యా నానార్థకల్పనా ।
తయా కల్పితభేదః సన్నర్థాత్మా వ్యపదిశ్యతే ॥ 16

ఏకస్మిన్ = ఒకే వస్తువునందు, వ్యపదేశివత్ = వేర్వేరు వ్యవహారములు కలిగినట్లుండుట, (భవతి = అగును), బుద్ధ్యా = మనసుచే, నానార్థ కల్పనా = పెక్కు అర్థములను కల్పించుట, (స్యాత్ = అగును), తయా = ఆ బుద్ధిచే, కల్పితభేదః + సన్ = ఏర్పడిన భేదములు గలదై అర్థాత్మా = అర్థస్వరూపము, వ్యపదిశ్యతే = వ్యవహరింపబడును.

తాత్పర్యము— ఒకే వస్తువు బుద్ధిశక్తిచే వేర్వేరుగ భాసింపవచ్చును. శబ్దముల వలన కలుగు అర్థజ్ఞానమంతయు బుద్ధియొక్క వికారమే లేని భేదములను కూడ కల్పించి ఒక వస్తువునే అనేకముగ బుద్ధి చూపించగలదు.

వివరణము— ముఖ్యమగు ఒక ధర్మమును బట్టి ఒక వస్తువును ఒక శబ్దముతో బోధింతుము. అది సహజమే. కాని ఒకప్పుడు అట్టి ధర్మమును కల్పించియైనను ఆ శబ్దముతో ఆ యర్థమును బోధించుట లోకసిద్ధమైన విషయము. ఉదా: ముగ్గురు కుమారులున్నపుడు వరుసగా ''అయమ్ జ్యేష్ఠః'' (ఇతడు పెద్దవాడు), ''అయం మధ్యమః'' (ఇతడు నడిమివాడు), ''అయం కనిష్ఠః'' (ఇతడు చివరివాడు) అను వ్యవహారము ఆ ముగ్గురికిని సూటిగ సరిపోవును. అట్లుగాక ఒకే కుమారుడున్న సందర్భములో కూడ పై వ్యవహారములు వినబడుచుండును. (''వీడే జ్యేష్ఠుడును, మధ్యముడును, కనిష్ఠుడును కూడ''— అని యనుచుందురు) ఇచట జ్యేష్ఠత్వము, మధ్యమత్వము, కనిష్ఠత్వము అను ధర్మములు ఒకే వ్యక్తియందు సంభవింపవు. అయినను బుద్ధిచే కల్పించి ఆయా శబ్దములను వాడుచుందురు. ఈ విధముగ ఒకే వస్తువునకు వేర్వేరు ధర్మములను ఆరోపించి (అంటగట్టి) చెప్పుటయే ''వ్యపదేశివద్భావము'' అగును.

విశేష విషయములు— వి = విశిష్టః = ముఖ్యమైన, అపదేశః = వ్యవహారము, అస్య + అస్తి = దీనికి గలదు = వ్యపదేశీ = ముఖ్యమైన ధర్మమునుబట్టి ఒకానొక శబ్దముచే సూటిగా బోధింపబడునది. ఉదా: ''జ్యేష్ఠః''. పెద్దతనము ధర్మముచే పెద్దయగు వానిని ఇది సహజముగా చెప్పును. ''వ్యపదేశినా + తుల్యమ్ = వ్యపదేశివత్ = ముఖ్యమైన వ్యవహారము కలిగిన దానితో సమానము. (కల్పనవలన అట్లగుట కుదురును). ''ఆద్యంతవదేకస్మిన్'' (1-1-21) అను సూత్రమును వ్యాఖ్యానించు సందర్భమున'' తత్ర వ్యపదేశివద్వచనమ్। ఏకాచో ద్వే ప్రథమార్థమ్'' అని కాత్యాయనుడు తొలుత చెప్పెను. ''ఏకాచోద్వే ప్రథమస్య'' (6-1-1) అను సూత్రము ధాతువునందలి తొలి ఏకాచ్చునకు (ఏకః + అచ్ + యస్య - సః = ఒక అచ్చుగల భాగము) ద్విత్వమును విధించును. ఒకే ఒక అచ్చుగా ఉన్న ''ఇ'' మొదలగు ధాతువులకు గూడ ద్విత్వము సిద్ధించుటకై వ్యపదేశివద్భావమును నొక్కి చెప్పక తప్పదని ఈ వచనముయొక్క ఆశయము. పిదప ''అవచనాత్ లోకవిజ్ఞానాత్ సిద్ధమ్'' అను వచనముతో మీది ప్రతిపాదనమును అతడే ఖండించెను. వ్యపదేశివద్భావము లోకసిద్ధమే అనియు వేరుగ చెప్పనక్కరలేదనియును దీని భావము. దీనివలన బుద్ధి కల్పితమైన భేదము (అభేదము కూడ) కాత్యాయనునికి అభిమతమేయని విశదమగును. ॥16॥

*అవతారిక*— భేదము లేకున్నను భేదమును కల్పించుటలో, ''శిలాపుత్రకస్య శరీరమ్'' (సన్నికల్లు యొక్క శరీరము) అను ఒక ఉదాహరణమును చూపుచుందురు. దానిని గురించి మాటాడుచున్నాడు.

**శ్లో॥ క్రియాభేదేన దృష్టానామశ్మాదీనాం పునః పునః ।**
**కించిద్దర్శన మన్యేన దర్శనేనాపదిశ్యతే ॥** 17

క్రియాభేదేన = వ్యాపారముల భేదముచే, పునః పునః = పెక్కుసారులు, దృష్టానామ్ = చూడబడిన, అశ్మాదీనామ్ = రాయి, మొదలగువానియొక్క, కించిత్ = ఒకానొక, దర్శనమ్ = జ్ఞానము, అన్యేన = వేరొక, దర్శనేన = జ్ఞానముచే, అపదిశ్యతే = వ్యవహరింపబడును.

తాత్పర్యము— "శిలాపుత్రకస్య శరీరమ్" అని ప్రయోగము. శిలాపుత్రక మనగా సన్నికల్లు. (నూరుకొనుట కుపయోగించు రాతి పలక) అది ఎల్లపుడును ఒకే విధముగ నుండును. వేరుగ దాని శరిరమన్నది లేదు. దాని స్వరూపమున భేదముండదు. (అవయవాదుల భేదము = అనగా శరీరమును అదియును ఒకటే). అయినను భేదమును కల్పించి "దానికి సంబంధించిన శరీరము" అని వాడుక జరుగుచుండును. ఇచట క్రియలను బట్టి భేదమును కల్పించుకొనవలెను. అనగా - నూరుకొనుట, గుండచేయుట, మొదలగు పెక్కు పనులకు ఆ రాతి పలక ఉపయోగించును గదా ! అందొక్కొక్క పనికి సంబంధించిన పలక వేరు వేరని భావించి, భేదమును కల్పించుకొని ప్రకృతమైన పనికి సంబంధించిన "రాతి పలక యొక్క శరీరమిది"— అన్న విధముగా చెప్పుకొనవలెను. ॥17॥

అవతారిక— ఈ విధముగనే "ఇ" (ఇణ్) మొదలగు ధాతువుల విషయమున గూడ, ఏకాచ్త్వమును (ఏకః + అచ్ + యస్య - సః = ఏకాచ్ = ఒక అచ్చును కలిగిన భాగము. ఏకాచః - భావః = ఏకాచ్త్వమ్) కల్పించుకొనవచ్చునని అనుచున్నాడు.

శ్లో॥ ప్రయోగభేదాద్ధాతూనాం ప్రకల్ప్య బహురూపతామ్ ।
భేదాఽభేదావుపాదాయ క్వచిదేకాచ్త్వముచ్యతే ॥ 18

ప్రయోగభేదాత్ = ప్రయోగముల భేదమువలన, ధాతూనామ్ = ధాతువులకు, (ఒకే అచ్చుగా ఉన్న "ఇ" మొదలగువానికి), బహురూపతామ్ = పెక్కు రూపములను, ప్రకల్ప్య = కల్పించి, భేదాఽభేదా = భేదమును అభేదమును, ఉపాదాయ = స్వీకరించి, క్వచిత్ = కొన్నిచోట్ల, ఏకాచ్త్వమ్ = ఏకాచ్త్వము, ఉచ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— "ఇ" (గతౌ = వెళ్ళుట) అను ధాతువునకు వేర్వేరు ప్రత్యయములను కూర్చినపుడు, ఏతి, అయనమ్, ఇతః, ఏతా, మొదలగు పెక్కు రూపములగును. అవన్నియు ఇణ్ ధాతువులే అనుకొని భేదమును, ప్రకృతకార్యము విషయమున అభేదమును ఆశ్రయించినచో ధాతువునకు ఏకాచ్త్వము సిద్ధించును. (అవన్నియు ఒక అచ్చుగల భాగములే)

వివరణము— "ఏకాచ్" అను పదము బహువ్రీహి (ఏకః, అచ్, యస్య - సః) అన్నవుడు "ఇ" ధాతువు ఏకాచ్చు కానేరదు. (గద్, వద్, మొదలగు ధాతువులవలె ఒక ...చ్చుగల భాగ మిచట లేదు. ఒకే అచ్చు మాత్ర మున్నది) కావున ప్రయోగ భేదమును ... ధాతు భేదమును కల్పించి ఏకాచ్త్వమును సాధింపవలెను. (అవన్నియు "వేర్వేరు ధాతు...లు" అనగానే ఒక అచ్చుగల భాగములగును) అట్లే "ఇ" అనుచోట (ఇయాయ - అను రూపమును సాధించుటకు ద్విత్వము చేయునపుడు) అభేదమును కల్పించి (అదియు ఇదియును ఒకటే అని చెప్పి) ఏకాచ్త్వమును సంపాదించుకొనవలెను. ॥18॥

అవతారిక— పై విషయముననే వేరొక తీరున సమన్వయమును చూపుచున్నాడు.

శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యామర్థవాన్ పరికల్పితః।
ఏకోఽధాత్వర్థవిగమాత్ వర్ణత్వేనోపచర్యతే॥ 19

అన్వయవ్యతిరేకాభ్యామ్ = ఉండుట లేకపోవుట, అనువానిచే, అర్థవాన్ = అర్థమును కలిగినదిగా, పరికల్పితః = కల్పింపబడిన, ఏకః = ఒకటి (అచ్చు), ధాత్వర్థవిగమాత్ = ధాతువుయొక్క అర్థము లేనందువలన, వర్ణత్వేన = వర్ణముగా, ఉపచర్యతే = చెప్పబడును.

తాత్పర్యము— "ఇ" ధాతువునకు ఆ యా ప్రత్యయములు చేరునపుడు తన యర్థము (వెళ్ళుట) అను గతముగ నుండును. ప్రత్యయములవియే అయినను ధాతువును మార్చినచో ఆ యర్థ ముండదు. ఈ అన్వయ వ్యతిరేకములచే ఏతి, అయనమ్, మొదలగు చోట్ల ఉండు ధాతువు (ఇణ్) "అర్థవత్తు" (అర్థముగలది) అనియు, "ఇయాయ" (ఇ - ధాతువునకు లిట్టు రూపము - ద్విత్వాదికార్యములు - ఇచట "ఇ" అను ఒక వర్ణమునే గ్రహింతుము) అనుచోట ఉండు "ఇ" అనునది అనర్థకమనియును కల్పించి "అర్థముగల ధాతువునకు అవయవమైన ఒకే అచ్చు "ఇ" అనునది" అని ఏకాచ్త్వమును సాధింపవచ్చును.

వివరణము— ఇణ్ ధాతువునకు "తి" ప్రత్యయము (లట్టు - ప్రథమ పురుషము - ఏకవచనము) చేరినపుడు "ఏతి" (వెళ్ళుచున్నాడు) అను రూపమగును. "అన" ప్రత్యయము చేరినచో "అయనమ్" (వెళ్లుట) అను రూపమగును. ఇట్లే ఆ యా ప్రత్యయములు చేరినపుడు రూపములు మారినను "వెళ్ళు" అను ధాత్వర్థము మాత్రము మారదు. ఇది అన్వయము (ధాతువున్నపుడు దాని అర్థముండుట). ప్రత్యయములు మారకపోయినను ధాతువు మారినచో "వెళ్ళు" అను అర్థము లేకుండుట వ్యతిరేకము —లేక— వ్యభిచారము. (ఉదా : కరోతి = చేయుచున్నాడు, కరణమ్ = చేయుట, మొదలగునవి). ఈ రీతిని ఏతి, అయనమ్, మొదలగుచోట్ల సార్థకముగా ఉన్న ధాతువునకు అవయవమై నిరర్థకమైన ఒక అచ్చే (ఇ) "ఇయాయ" అనుచోట ఉన్నదని చెప్పి, దానికి ఏకాచ్త్వమును సమర్థింపనగును. (ఏకాచ్త్వమ్ = ఒకే అచ్చుగ ఉండుట) అట్లు అచట ద్విత్వమను కార్యమును సాధించుకొనవచ్చును. ॥19॥

అవతారిక— ఇట్లు బౌద్ధమైన కల్పనలచే భేదమును స్వీకరించి వ్యపదేశివద్భావమును సాధించినట్లే, సామానాధికరణ్యమును గూడ సంపాదింపవచ్చునని ప్రకృతాంశమును ముగించుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యాత్మానస్త్రయస్తస్మాత్ బుద్ధౌ నానా వ్యవస్థితాః।
ఆశ్రయాశ్రయిధర్మేణేత్యయం పూర్వేభ్య ఆగమః॥ 20

తస్మాత్ = అందువలన, త్రయః = మూడైన, ద్రవ్యాత్మానః = ద్రవ్య స్వరూపములు, ఆశ్రయాశ్రయి ధర్మేణ = ఆధారాధేయభావముతో, నానా = వేర్వేరుగ, బుద్ధౌ = బుద్ధియందు, వ్యవస్థితాః = ఉన్నవి, ఇతి = అని, అయమ్ = ఈ, ఆగమః = సంప్రదాయము పూర్వేభ్యః = పెద్దలనుండి, (ఆగతః = వచ్చినది).

తాత్పర్యము— ''కృష్ణతిలాః'', ''వీరపురుషః'' మొదలగు సమాస స్థలములందు గాని, ''కృష్ణాః తిలాః'', ''వీరః పురుషః'' మొదలగు వ్యాసస్థలములందుగాని (అట్టి వాక్యము లందుగాని) మూడు విధములైన ద్రవ్యములుండునని మనసులో అనుకొనవలెను. గుణముతో కూడినది ఒక ద్రవ్యము (కృష్ణ, మొదలగు శబ్దములచే బోధింపబడునది). జాతితో కూడినది రెండవ ద్రవ్యము (తిలాది శబ్దములచే తెలియునది). రెండిటి సంబంధమును వహించునది మూడవ ద్రవ్యము (రెండు శబ్దములను అన్వయించునపుడు తెలియునది). ఇందు మొదటి రెండును ఆధేయములు (వేరొకదానియందు విశ్రమించునవి). మూడవది ఆధారము. ఇట్లు సామానాధికరణ్యము చక్కగ కుదురును. విడిగా ఉండు రెండు వస్తువులు వేరొక మూడవ వస్తువునందు విశ్రమించుటయే సామానాధికరణ్యము గదా ! ఈ తీరు చిరుకాలమునుండియు పెద్దలు అవలంబించినదే.

వివరణము— సామానాధికరణ్యము అవశ్యకమైన అన్నిచోటులందును ఈ పద్ధతినే అవలంబింపవలెను. రెండు పదములును జాతివాచకములే అయినచోట్ల కూడ, ఇదియే మార్గము (ఒకదానిని గుణవాచకముగా మార్చుకొనవలెను). అందువలననే శాస్త్రీయమగు సమానాధికరణ కార్యములన్నియు ప్రవర్తించును.

ఈ రీతిని అర్థములకు సామానాధికరణ్యము సాధింపబడెను. కాగా ''రెండు పదములును ఒకే వస్తువును బోధించినచో– వేర్వేరుగా వస్తువులు లేనందున– సామానాధికరణ్యము సాంకేతికముగ ఎట్లు కుదురును ?'' అను శంక తొలగిపోవును, అర్థములకే సామానాధికరణ్యము. అదియు పూర్తిగా బుద్ధి పరికల్పితము'' అన్నది ఇచటి సారము.

విశేష విషయములు— ఇట్టి కల్పనవలననే విశేషణ విశేష్యభావము కూడ కుదురును. అచట కూడ పూతవేయు ద్రవ్యమొకటియు (విశేషణము), పూతవేయించుకొను ద్రవ్యమొకటియును (విశేష్యము) విడిగా ఉన్నట్లు కల్పించుకొనవలెను. లేకున్న భేదప్రధానమగు విశేషణ విశేష్యభావము సిద్ధింపదు. ॥20॥

అవతారిక— ఇట్లర్థములకు సామానాధికరణ్యమును కుదిర్చి, శబ్దములకును అద్దానిని కుదుర్చుటకు ప్రయత్నించుచున్నాడు.

**శ్లో॥ సామానాధికరణ్యం చ శబ్దయోః కైశ్చిదిష్యతే ।**
**విశేషణవిశేష్యత్వం సంజ్ఞాసంజ్ఞిత్వమేవవా ॥ 21**

సామానాధికరణ్యమ్ = సామానాధికరణ్యమును, విశేషణవిశేష్యత్వమ్ = విశేషణ విశేష్యభావమును, వా = లేక, సంజ్ఞా సంజ్ఞిత్వమ్ + చ = సంజ్ఞా సంజ్ఞిభావమును, శబ్దయోః + ఏవ = శబ్దములకే, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = కోరబడుచున్నది.

తాత్పర్యము— ''వీరః పురుషః'' మొదలగుచోట్ల సామానాధికరణ్యముగాని, విశేషణవిశేష్యభావముగాని శబ్దములకే అని కొందరి మతము. అట్లే శాస్త్రీయములగు సంజ్ఞా స్థలములలో సంజ్ఞా సంజ్ఞిభావము కూడ శబ్దములకే అని వారందురు

వివరణము— ఒకే విభక్తిగల రెండు శబ్దములు తమ ప్రవృత్తినిమిత్తములు (జాతి, గుణము మొదలైనవి) వేరైనను, మొత్తముపై ఒకే యర్థమును (ఆ యా విశేషముతో కూడిన ఒకే ద్రవ్యమును) బోధించును. ఇట్లు రెండు శబ్దములకును ఒకే అర్థమగుటయే సామానాధికరణ్యమని భావింపవలయును. (రెండు శబ్దము లొక అర్థమందు విశ్రమించుట). విశేషణ విశేష్యభావము కూడ ఇట్టిదే. అచట రెండు శబ్దములును సామాన్య విశేషభావముతో ఒకే యర్థమును తెలియజేయును. అట్లే ''వృద్ధిరాదైచ్'' (1-1-1) మొదలగు సంజ్ఞా సూత్రములలో, ''వృద్ధిః'' మొదలగు సంజ్ఞాపదములును ''ఆదైచ్'' మొదలగు సంజ్ఞిపదములును ఒకే యర్థమును బోధించును. కావున సంజ్ఞా సంజ్ఞిభావము కూడ శబ్దములకే అని యన వచ్చును.

విశేష విషయములు— ''వృద్ధిరాదైచ్'' (1-1-1). వృద్ధిః, ఆదైచ్, - ఈ రెండును ఏక విభక్తికములు. ''దీర్ఘములగు ఆకారమును, ఐకారమును, ఔకారమును వృద్ధి అనిపించుకొనును'' అని యర్థము. ఇచట వృద్ధి శబ్దము సంజ్ఞ. ఆదైచ్చులు (సంజ్ఞచే తెలియ బడునవి). కాగా ''వృద్ధి శబ్దముచే బోధింపబడునవి ఆదైచ్చులు'' అను రీతిని విశేషణ విశేష్యభావమే ఇట్టిచోట్ల కూడ ఫలించును. ॥21॥

*అవతారిక*— అర్థములకు సామానాధికరణ్యమును వేరొక తీరున చూపుచున్నాడు.

**శ్లో॥ కేషాంచిజ్జాతిగుణయో రేకార్థ సమవేతయోః ।**
**వృత్తిః కృష్ణతిలేష్విష్టా శబ్దే ద్రవ్యాఽభిధాయిని ॥ 22**

శబ్దే = శబ్దము, ద్రవ్యాభిధాయిని = ద్రవ్యమును చెప్పగా, జాతిగుణయోః = జాతి, గుణములు రెండును, ఏకార్థసమవేతయోః = ఒకే ఆధారమందు (ద్రవ్యమందు) విశ్రమించగా, కృష్ణతిలేషు = కృష్ణతిలలందు (కృష్ణ, తిలశబ్దములకు), వృత్తిః = ఏకార్థీభావము, (రెండు శబ్దములును కలిసి ఒకే యర్థమును తెలుపుట), కేషాంచిత్ = కొందరికి, ఇష్టా = అభిమతము.

తాత్పర్యము— ''కృష్ణతిలాః'' మొదలగుచోట్ల ఏకార్థీభావమభిమతము. విశేషణ విశేష్యభావమున్నపుడే అది కుదురును. తిలశబ్దము తిలత్వమను జాతిగల తిలలను ద్రవ్యమును బోధించును. కృష్ణశబ్దము కూడ కృష్ణత్వమను గుణము కల తిలలనే బోధించుననవలయును. ఇట్లు రెండు శబ్దములును తిలలను ఒకే యర్థమును తెలుపును. (అయినను ద్రవ్యము ముఖ్యము గను, గుణము అముఖ్యముగను తోపక తప్పదు). కాగా ''తిలలు'' అను ద్రవ్యమందు (ఆధారము) కృష్ణత్వమను గుణమును తిలత్వమను జాతియును (ఆధేయములు) విశ్రమించునని చెప్పి సామానాధికరణ్యమును సంపాదింపవచ్చును. ॥22

అవతారిక— కేవలము గుణములనే బోధించు శబ్దములకు సమానాధికరణ సమాసము రాదనుచున్నాడు.

శ్లో॥ సంస్తురూపరసాదీనా మాశ్రయో నాఽభిధీయతే ।
ద్రవ్యాభిధానేన వినా తతస్తే ద్వంద్వభావినః ॥ 23

రూపరసాదీనామ్ = రూప, రస, గంధ, మొదలగు గుణవాచకముల విషయములో, ద్రవ్యాభిధానేన + వినా = ద్రవ్యమును చెప్పకుండునపుడు, ఆశ్రయః = ఆధారము, (ద్రవ్యము), సన్ + తు = ఉన్నను, న + అభిధీయతే = సూటిగ బోధింపబడదు, తతః = అందువలన, తే = ఆ శబ్దములు, ద్వంద్వభావినః = ద్వంద్వ సమాసమును పొందుటకు యోగ్యములు.

తాత్పర్యము— రూపమ్, (ఆకారము), రసః (రుచి), గంధః (వాసన), మొదలగు పదములు సహజముగ గుణములనే చెప్పును. ద్రవ్యములేకుండ గుణముండదు. కావున ద్రవ్యము తప్పక స్ఫురింపవచ్చును. అయినను ఈ శబ్దములవలన సూటిగ (అభిధావ్యాపారముచే) ద్రవ్యము బోధింపబడదు. అందుచే వీనికి విశేషణ విశేష్యభావము కుదురదు. కాగా వీనికి ద్వంద్వ సమాసమునే చేయదగునుగాని సమానాధికరణ సమాసమును చేయరాదు.

వివరణము— ఒకటి గుణమును వేరొకటి ద్రవ్యమును అయినపుడే విశేషణ విశేష్యభావముగాని, సామానాధికరణ్యముగాని సంభవించును. కేవలము గుణములకును కేవలము ద్రవ్యములకును అది దుర్లభము. కావున అట్టిచోట్ల శబ్దార్థములకు సమప్రాధాన్యమును సూచించు ద్వంద్వసమాసమే సముచితము. ॥23॥

అవతారిక— ''కృష్ణాః తిలాః'' మొదలగుచోట్ల రెండు శబ్దములును ద్రవ్యమునే బోధించినను, ద్రవ్యమే ప్రధానమనియు గుణము అప్రధానమనియును విశదీకరించుచున్నాడు

శ్లో॥ ద్రవ్యాభిధాయీ కృష్ణాదిరాకాంక్షావాన్ ప్రవర్తతే ।
నిమిత్తానువిధాయిత్వాత్తత్తిలాదౌ న విద్యతే ॥ 24

ద్రవ్యాభిధాయీ = ద్రవ్యమును చెప్పు, కృష్ణాదిః = కృష్ణ మొదలగు గుణము, ఆకాంక్షావాన్ = అపేక్షగలదై, ప్రవర్తతే = ప్రవర్తించును, నిమిత్తానువిధాయిత్వాత్ = జాతియను ప్రవృత్తి నిమిత్తమును ఎప్పుడును అనుసరించునది అగుటవలన, తిలాదౌ = తిలాది ద్రవ్యమందు, తత్ = అది (అట్టి అపేక్షను కలిగియుండుట) న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— ''కృష్ణతిలాః'' మొదలగుచోట్ల కృష్ణాదిగుణము (నలుపు మొదలగునది) ఎప్పుడును ద్రవ్యము నపేక్షించుచునే యుండును. ద్రవ్యమును విడిచి వేరుగ గుణముండుట కుదురదు కావున గుణము స్వతంత్రము కాదు. తిలాది ద్రవ్యమునకు మాత్రమట్టి అపేక్ష ఏదియు నుండదు. అందు జాతి అనునది యున్నను అది ఎల్లపుడునుండు ఆత్మ వంటిది. అందుచే ద్రవ్యము స్వతంత్రము.

వివరణము— ఏదైన ఒక క్రియతోడి అన్వయము ద్రవ్యమునకే సంభవించును. (ఉదా: ''నీలోత్పలమానయ = నల్ల కలువను తెమ్ము''. ఇచట ''తెచ్చుట'' అను పనికిని

''కలువ'' అను ద్రవ్యమునకును సంబంధము) ద్రవ్యము మూలముగనే గుణమునకు క్రియాన్వయ మగునుగాని సాక్షాత్తుగ కాదు. అట్లు గుణమునకు ద్రవ్యాపేక్ష నియతము. కొన్ని సందర్భములలో మాత్రము (రూపమ్, రసః, మొదలగునవి) ద్రవ్యమునుండి వేరు చేసినట్లు భావించి, గుణమునకు ప్రాధాన్యము కల్పింపబడును. అట్లే గుణమునకును ద్రవ్యమునకును అభేదమును కల్పించుటచే, గుణవాచకము ద్రవ్యమును బోధించుటయు ఒకానొకచోట ఉండవచ్చును. అంతమాత్రమున గుణము స్వతంత్రము కాజాలదు. క్రియతో సూటిగ అన్వయించు శక్తి ద్రవ్యమునకే గలదు. అట్లది స్వతంత్రము. అద్దానికి గుణాపేక్ష నియతము కాదు. (గుణమున్నచో ఉండవచ్చును. లేకున్నను అన్వయమునకు బాధ ఉండదు). ద్రవ్యమందుండు జాతి అనునది సనాతనము. అది ఒకప్పుడుండి మరొకప్పుడు పోవునది కాదు. కావున ''ద్రవ్యమునకు కూడ జాత్యపేక్ష యున్నదిగదా !'' అని శంకింప నక్కరలేదు. అది గుణమునకు గల అపేక్షవంటిది కాదు. ॥24॥

అవతారిక— పై యంశమునే వివరించుచున్నాడు.

**శ్లో॥ ఏవం జాతిమతి ద్రవ్యే ప్రత్యాసన్నే క్రియాం ప్రతి ।**
**గుణధర్మం గుణావిష్టం ద్రవ్యం భేదాయ కల్పతే ॥ 25**

ఏవమ్ = ఇట్లు, జాతిమతి = జాతిగల, ద్రవ్యే = ద్రవ్యము, క్రియామ్ + ప్రతి = క్రియను గూర్చి, ప్రత్యాసన్నే = దగ్గరగా ఉండగా, గుణధర్మమ్ = అప్రధానమైన ధర్మమును గలిగినట్టియు, గుణావిష్టమ్ = గుణముతో కూడినట్టియు, ద్రవ్యమ్ = ద్రవ్యము, భేదాయ = భేదమునకు, కల్పతే = దారి తీయును.

**తాత్పర్యము**— ''కృష్ణతిలాన్ ఆనయ'' = నల్లని నువ్వులను తెమ్ము'' ఇచట ''తెచ్చుట'' అనునది క్రియ. దానితో సూటిగ అన్వయించునది (తేబడునది) ''నువ్వులు'' అను ద్రవ్యము (కర్మ) (దీనియందు తిలత్వమను జాతి గలదు). దానియందుండునది కృష్ణత్వమను గుణము. (ఇదియు నువ్వులందుండునదియే గదా !) ఇట్లు జాతిగల ద్రవ్యమొకటియు గుణముగల ద్రవ్యమొకటియును ఉన్నట్లు భాసించును. వానిలో క్రియకు దగ్గర చుట్టము జాతి గల ద్రవ్యము అందుచే అది ప్రధానమై విశేష్యమగును. గుణము కల ద్రవ్యము ముఖ్య ద్రవ్యము ద్వారమున క్రియకు దూరపు చుట్టమగును. కావున అది అప్రధానమై విశేషణమగును.

వివరణము— ''నీలోత్పలం పశ్యతి'' (నల్లకలువను చూచుచున్నాడు), ''మధురం ఫలమాస్వాదయతి'' (తియ్యనిపండు తినుచున్నాడు), ''సురభి కుసుమం జిఘ్రతి'' (పువ్వును వాసన చూచుచున్నాడు) మొదలగుచోట్ల రూపము, రసము, గంధము మొదలగు గుణములకు సాక్షాత్తుగ క్రియతో అన్వయమున్నట్లు గోచరించునుగాని, వాస్తవమున అచట కూడ ద్రవ్యము ద్వారముననే క్రియాన్వయమని తెలియవలెను. (ద్రవ్యము లేకుండ గుణమునకు ఉనికి కుదురదు). కాగా గుణమునకు ఏ తీరున క్రియాన్వయమును కూర్పదలచినను అయ్యది ద్రవ్యము మూలముగనే ఉపపన్నమగును— అని ఫలించును. ॥25॥

అవతారిక— ఈ తీరున ''కృష్ణతిలాః'' మొదలగుచోట్ల రెండు శబ్దములును ద్రవ్యములనే బోధించును''. (గుణముకల ద్రవ్యమొకటి– జాతితో కూడిన ద్రవ్యమొకటి) అన్న పక్షమున గుణప్రధాన భావమును వివరించి,– అట్లు కాకున్నను వేరొక మార్గమున కూడ గుణప్రధాన భావమును సంపాదింపవచ్చునని చూపుచున్నాడు.

శ్లో॥ గుణమాత్రాభిధాయిత్వం కేచిదిచ్ఛంతి వృత్తిషు ।
అజాశ్వాదిషు సంబంధా ద్రూఢీనామివ రూఢిభిః ॥ 26

రూఢీనామ్ = ప్రసిద్ధములైన అర్థములకు, రూఢిభిః = ప్రసిద్ధములైన అర్థములతో, సంబంధాత్ = అనువగు సంబంధము ననుసరించి, అజాశ్వాదిషు + ఇవ = ''అజాశ్వః'' మొదలగు చోటులందువలె, వృత్తిషు = సమాసాది వృత్తులలో, గుణమాత్రాభిధాయిత్వమ్ = కేవలము గుణముననే చెప్పుటను, కేచిత్ = కొందరు, ఇచ్ఛంతి = కోరుచున్నారు.

తాత్పర్యము— గుణమును తెలుపు శబ్దమును ద్రవ్యమును తెలుపు శబ్దమును సమాసము మొదలగు వృత్తిలో కలిసియున్నపుడు, గుణవాచకము కేవలము గుణమునే చెప్పుననియు ద్రవ్యమును బోధింపదనియును కొందరందురు. అనగా ''కృష్ణతిలాః'' మొదలగు చోటులందు తిలశబ్దమే ద్రవ్యమును తెలుపుననియు, కృష్ణశబ్ద మా ద్రవ్యమందలి ''నలుపు'' అను గుణమునే బోధించుననియు, ఇదియే విశేషణ విశేష్యభావమనియును వారి యాశయము. ఇట్టి తీరు వృత్తియొక్క సామర్థ్యమును బట్టి లభించును.

ఇందుకొక ఉదాహరణమును చూపుదురు.– ''అజాశ్వః దేవదత్తః''. ఇచట అజ శబ్దము మేకను అశ్వశబ్దము గుర్రమును సహజముగ బోధించును. దీనినే రూఢియందురు. (ఒక శబ్దమునకు నియతముగ ఒక అర్థమందేర్పడిన ప్రసిద్ధి). ఈ యర్థముల కిచట సంబంధము కుదురదు. కావున ''అజాః = పుట్టుక లేనట్టి (అయోనిజములు = దివ్యములు), అశ్వాః గుర్రములు, యస్య + సః = కలవాడు = అజాశ్వః'' అని బహువ్రీహి సమాసమునుచేసి, ఆ పదమును దేవదత్తపదమునకు విశేషణముగ అన్వయింపవలెను. (అపుడు అజ శబ్దము అజత్వమను గుణమును చెప్పును) అట్లు సంబంధము ఒప్పును. ఇట్లే ప్రకృతమున కూడ రెండు శబ్దములును ద్రవ్యములనే చెప్పినచో, సంబంధము దుర్లభమగును గాన గుణవాచకము గుణమును మాత్రమే చెప్పి అప్రధానముగ నుండునని వ్యాఖ్యానింపవలెను.

వివరణము— ''కృష్ణాః తిలాః'' అని వాక్యముగా ప్రయోగించునపుడు, కృష్ణ శబ్దము ఆ గుణముతో కూడిన ద్రవ్యమును బోధించినను బోధింపవచ్చును. వృత్తియందు మాత్రము అది కేవలము గుణమునే తెలుపుననుటయు ఇతర గుణములనుండి ద్రవ్యమును వేరు చేయుచు విశేషణమగుననుటయును యుక్తమని ఈ పక్షముయొక్క సారము (రెండు శబ్దములును ద్రవ్యములనే తెలిపినచో వానికి సముచితమగు సంబంధము కుదురదని ఈ పక్షమువారి అభిసంధి). ॥26॥

రూపమున జ్ఞాతము కాకపోవచ్చును. కనుకనే శ్లోకమున-కశ్చిత్, ఏవ, అని చెప్పబడినది. ఆ ద్రవ్యము ఏ జాతికి చెందినది, అనియు గూడ తెలియనక్కరలేదు. కాబట్టి జాతిని అపేక్షింపకయే గుణద్రవ్యములు పరస్పరాపేక్ష కలిగియుండును. వానికి ఆధారాధేయ భావము నియతము.

అవి ఒకదానిని ఒకటి విడువకయే యుండుటచే వానికి సమవాయము సంబంధముగా తార్కికులచే నంగీకరింపబడుచున్నది. ॥73॥

*అవతారిక*— గుణద్రవ్యములకు పరస్పరాకాంక్షామూలమున సామాన్య రూపముగా అధారాధేయభావము లభించునని 73 వ శ్లోకమున జూపి, ఆ రెంటికి వాక్యార్థమునగల సంబంధమును ప్రదర్శించుచున్నాడు.

**శ్లో॥ తయోస్తు పృథగర్థిత్వే సంబన్ధోయః ప్రతీయతే ।**
**న తస్మిన్నుపఘాతోఽస్తి కల్ప్యమన్యత్ర చాశ్రుతమ్ ॥ 74**

పృథక్ = పరస్పరము, అర్థిత్వే = పై చెప్పిన ప్రకారము గుణద్రవ్యములకు ఆకాంక్షకలుగగ, తయోః + తు = వానికే అనగా శబ్దముచే బోధింపబడిన ఏకవాక్యోపాత్తములగు ఆ గుణ ద్రవ్యములకే, యః = ఏ, సంబన్ధః = సమన్వయము, ప్రతీయతే = తెలియబడుచున్నదో, తస్మిన్ = ఆ సమన్వయమునందు, ఉపఘాతః = బాధ, న + అస్తి = లేదు.

'శ్వేతం ఛాగమాలభేత' అను ఒకే వాక్యమున తెలుపు అను గుణము, మేక అను ద్రవ్యము రెండు బోధింపబడుచున్నవి. వానికి పరస్పరము ఆకాంక్షయున్నది. కాబట్టి వానికి పరస్పరము అన్వయము చూపవలెను. తెల్లని మేకతో యాగము చేయవలెనని వాక్యార్థము లభించును. మేక ద్రవ్యము కనుక దానియందు తెలుపనే గుణముండవచ్చును. తెలుపు అనునది గుణము కనుక దానికి మేక ఆధారము కాగలదు. ఇట్లు సమన్వయము చేయుటలో బాధ యేమియు లేదు.

కాబట్టి గుణమును ద్రవ్యమును రెంటిని గ్రహించి సమన్వయము చేయవలెను. ఒక దానిని గూడ విడువనక్కరలేదు.

అన్యత్ర + చ = విడుచుటకు కారణమున్నప్పుడే, అశ్రుతమ్ = శబ్దమువలన లభింపనిది, కల్ప్యమ్ = కల్పింపతగినది యగును.

శబ్దముచే బోధింపబడిన యర్థములలో ఏదో ఒక దానిని విడువవలసిన పరిస్థితి కలిగినపుడు, ఆ వాక్యమున శబ్దముచే లభింపని యర్థమును కల్పించి సమన్వయము చేయవలెను. ప్రకృతము దేనిని గూడ విడువవలసిన పరిస్థితిలేనందున శబ్దముచే లభించిన అర్థములను పురస్కరించుకొని సమన్వయము జరుగుచున్నందున అర్థాంతర కల్పన చేయనక్కరలేదు.

అవతారిక— వేరొక తీరులో కూడ గుణవాచకము విశేషణమగునని విశదము చేయుచున్నాడు.

శ్లో॥ తిలే పూర్వముపాత్తే వా తత్రైవ మతుబిష్యతే ।
న చ ధర్మః సమాసేషు గుణస్తస్మాద్విశేషణమ్ ॥ 27

వా = లేక, తిలే = తిలత్వమను జాతిగల ద్రవ్యము, పూర్వమ్ = ముందుగా, (సామాన్య రూపముతో), ఉపాత్తే = తీసికొనబడగా (బోధింపబడగా), తత్ర + ఏవ = ఆ విషయ మందే, మతుప్ = "మతుప్" అను ప్రత్యయము, (కృష్ణ శబ్దమునకు పరముగ), ఇష్యతే= కోరబడును (చేయబడును), సః = ఆ, ధర్మః + చ = సంబంధము (ద్రవ్యమునకును గుణ మునకును గల సంబంధము = ఆధారాధేయ భావము) సమాసేషు = సమాసములందు (అంతర్భవతి = ఇమిడియుండును), తస్మాత్ = అందువలన, గుణః = గుణము, విశేషణమ్ = విశేషణము, (భవతి = అగును).

తాత్పర్యము— "కృష్ణతిలాః" అనుచోట, తిల శబ్దము మొదట తిలసామాన్య మునే బోధించును. పిదప కృష్ణశబ్దముతో సమాసము జరుగగానే, ఆ కృష్ణశబ్దము "నలుపు గలవి" అను విశేషార్థమును తిలలకు సంబంధించునట్లుగా తెలియజేయును. ఇందులకై "కృష్ణః = నలుపు, ఏషామ్ = వీనికి, అస్తి = కలదు" అను నర్థమున "మతుప్" అను ప్రత్యయము చేరి వెంటనే లోపించును. కృష్ణశబ్దమే మరల మిగులును. అయినను సమాసము యొక్క శక్తిని బట్టి అదియే ఆ యర్థమునంతను చెప్పగలదు. "నలుపుగలవి నువ్వులు" అని తెలియును. అనగా నలుపు, అను గుణమునకును తిలలను ద్రవ్యమునకును ఉండు సంబంధమును విశదపరచును. అట్టిది అప్రధానమై విశేషణమగును (ద్రవ్యము ముఖ్యము. దానియందుండు గుణము అముఖ్యము).

వివరణము— "తదస్యాఽస్త్యస్మిన్నితి మతుప్" (5-2-94) అని సూత్రము. "తత్ = అది (ఒక వస్తువు —లేక— గుణము మొదలగునది), అస్య = దీనికి,— (లేక) అస్మిన్ = దీనియందు, అస్తి = ఉన్నది— అను నర్థమున ప్రథమాంతమైన ప్రాతిపదికము నకు "మతుప్" అను ప్రత్యయము చేరును" అని దీని యర్థము. ఉదా : ధనమ్ - అస్య - అస్తి = ధనవాన్. గుణాః - అస్మిన్ - సంతి = గుణవాన్. మొదలగునవి. ఈ మతుప్ ప్రత్యయము శుక్ల, కృష్ణ, మొదలగు గుణవాచకములకు చేరునపుడు లోపించును. "గుణవచనేభ్యో లుక్" (5-2-95) సూత్రమందలి వార్తికము = గుణవాచకములకు వచ్చిన మతుప్పు లోపించునని యర్థము) అను వార్తిక మాలోపమును విధించినది. కావుననే శుక్లాది శబ్దములు ఆయా గుణములను, ఆయా గుణములు కల ద్రవ్యములను కూడ ఒకే స్వరూపముతో తెలియజేయగలవు.

ప్రకృతమున "కృష్ణతిలాః" అనుచోట కృష్ణశబ్దము మతుబంతమన్నపుడు నలు పనెడి గుణము కలవి తిలలను ద్రవ్యమేగాని వేరొకటి కాదుగదా !

ఇట్లు సామానాధికరణ్యము యొక్కయు విశేషణ విశేష్యభావము యొక్కయును తీరుతెన్నులు ఒకటి రెండుదాహరణములతో విశదీకరింపబడినవి. ॥27॥

## (3) ద్వంద్వైకశేషవృత్తి విచారము

*అవతారిక*— ద్వంద్వసమాసము యొక్కయు ఏకశేషవృత్తి యొక్కయు పరిశీలనమును ప్రారంభింపుచున్నాడు.

**శ్లో॥ అనుస్యూతేవ భేదాభ్యామేకా ప్రఖ్యోపజాయతే ।**
**యదా సహవివక్షాం తామాహుర్ద్వంద్వైకశేషయోః ॥ 28**

ద్వంద్వైకశేషయోః = ద్వంద్వసమాసమందును, ఏకశేషవృత్తియందును. భేదాభ్యామ్ = భేదములతో, అనుస్యూతా + ఇవ = కలిసి కుట్టబడినట్లు (కలసిపోయి ఉన్నట్లు), ఏకా = ఒక, ప్రఖ్యా = జ్ఞానము, యదా = ఎప్పుడు, ఉపజాయతే = కలుగునో, తామ్ = ఆ జ్ఞానమును, సహవివక్షామ్ = సహవివక్షనుగా, (కలిపి చెప్పగోరిక), ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— ''రామలక్ష్మణౌ'' (రామశ్చ + లక్ష్మణశ్చ) ఇది ద్వంద్వము. ''పితరౌ'' (పితాచ + మాతాచ). ఇది ఏకశేషము. ఇట్టిచోట్ల సమసించు పదార్థములకు మొత్తముగా (కలిసి కట్టుగా) ఒక క్రియతోగాని ఒక గుణముతోగాని సంబంధము కలుగును. ఉదా: ''రామలక్ష్మణౌపశ్య'' (రామలక్ష్మణులను చూడుము). ఇచట ''చూచుట'' అను వ్యాపారములో రామలక్ష్మణు లిరువురును కలిసియే సమముగా అన్వయించుదురు. (ఇరువురను సమప్రధాన భావముతో ఒకేసారి చూచుట జరుగును). ఇట్లే ''రామలక్ష్మణౌ శూరౌ'' మొదలగు చోట్ల శౌర్యము మొదలగు గుణములు కూడ, రామలక్ష్మణులకు సమముగానే సంబంధించును. ఏకశేషముయొక్క విషయము కూడ ఇట్టిదే. ఈ రీతిని అన్వయమును సంపాదించుటకే ద్వంద్వమునుకాని ఏకశేషమునుగాని చేయుదురు. కాగా అనేకములగు పదార్థముల సముదాయము తమ భేదమును పరస్పరసాహచర్యమును విడువకుండగనే క్రియాగుణములతో సంబంధించుట జరుగును. ఇట్లు భావించు బుద్ధినే ''సహవివక్ష'' అని అందురు. ఇది ద్వంద్వైకశేషములలో తప్పక ఉండును.

వివరణము— ''సహ = కలిపి, వక్తుమ్ = చెప్పుటకు, ఇచ్ఛా = కోరిక = సహవివక్షా = కలిపి చెప్పగోరిక'' సముదాయముగా (మొత్తముగా) తమ భేదమును విడువకుండ (విడిగా కూడ భాసింపుచు) క్రియాగుణములతోడి సంబంధమును పదార్థములకు చెప్పు అభిలాష ''సహవివక్ష'' అగును. ఇచట సముదాయమనునది ఒకటిగా తోచుచున్నను, అవయవముల కలయికయేగాని వేరేదియు కాదు. అవయవముల భేదము కూడ స్పష్టముగ తెలియుచునే యుండును. కావుననే ''రామలక్ష్మణౌ'' ''రామలక్ష్మణ భరత శత్రుఘ్నాః'' అని ద్వివచన బహువచనములు సిద్ధమగును. ఈ విధముగ భేదముతో కూడిన సముదాయము భాసించుట సమాసవృత్తియొక్క మహిమయే.

విశేష విషయములు— సహవివక్ష ఉన్నపుడే ద్వంద్వ సమాసమగును. ద్వంద్వమునకు అపవాదము ఏకశేషము. కొన్నిచోట్ల ద్వంద్వమున కనువగు స్థితియందే దానిని త్రోసివైచి ఏకశేషము ప్రవర్తించును. కాగా దీనియందును సహవివక్ష తప్పదు. ''దేనికది ముఖ్యముగా నుండియు, ఒకటికి మించిన పదార్థములు ఒండొరులు కలిసి కట్టుగా ఒక పనితో సంబంధించుట'' అన్నది సహవివక్ష యొక్క సారము.

''చార్థే ద్వంద్వః'' (2-2-29) అనునది ద్వంద్వమును విధించు సూత్రము. ''చ - అను అవ్యయముయొక్క అర్థమును ఇముడ్చుకొన్న అనేకములగు ప్రథమాంతములైన సుబంతములు సమసించును. ఆ సమాసము ద్వంద్వమనబడును'' అని యర్థము. ఉదా: ''ఘటః - చ + పటః - చ = ఘటపటౌ'' మొదలగునవి. ఇతరేతరయోగము (తమలో తాము స్వతంత్రముగ కలిసిన పదార్థములు క్రియా గుణములతో సంబంధించుట), సమాహారము, (సమూహము) అను అర్థములందే ద్వంద్వము ప్రవర్తించును.

''ఏకస్య శేషః = ఏకశేషః = ఒక పదము మిగులుట = ఏకశేషమగును. ''పితామాత్రా'' (1-2-70) మొదలగునవి ఏకశేషమును విధించు సూత్రములు. ''మాతృ శబ్దముతో పితృ శబ్దమును కలిపి చెప్పినపుడు (సహవివక్ష ఉన్నపుడు) పితృ శబ్ద మొకటే మిగులును'' అని దీని యర్థము. మిగిలిన పదమే లోపించిన పదము యొక్క అర్థమును కూడ చెప్పును. ఉదా: ''మాతా - చ + పితా - చ = పితరౌ.'' (తల్లిదండ్రులు) మొదలగునవి ఏకశేషమనునది వేరుగ ఒక వృత్తి. (సమాస వృత్తిలో చేరునది కాదు). ॥28॥

*అవతారిక*— ''సహవివక్షయందు భేదము తప్పనిసరి అయినచో ఇతరేతర యోగమునకును గల విశేషమేమి?'' అను శంకకు సమాధానమును చూపుచున్నాడు.

**శ్లో॥ ఇతరేతరయోగస్తు భిన్నసంఘాభిధాయినామ్ ।**
**ప్రత్యేకం చ సమూహోఽసౌ సమూహిషు సమాప్యతే ॥ 29**

భిన్న సంఘాభిధాయినామ్ = వేర్వేరు సముదాయమును బోధించువాని యొక్క, (ద్వంద్వమందలి పదములయొక్క) సమూహః + తు = సముదాయమే (పదార్థముల సంఘము). ఇతరేతరయోగః = ఇతరేతరయోగము, అసౌ = ఈ సమూహము, సమూహిషు = అవయవములందు, ప్రత్యేకమ్ + చ = విడిగా ఒక్కొక్క అవయవమందు కూడ. సమాప్యతే = ఉంచబడును. (ఉన్నదని చెప్పబడును)

**తాత్పర్యము**— సహవివక్ష అన్నది బుద్ధియొక్క ధర్మము. (అనేకములతో కూడిన ఏకత్వ జ్ఞానము) వాస్తవముగ అది ఒక్కటే. అయినను దానికి ముఖ్యమైన లక్షణములు మూడున్నవి: (1) భేదము. (2) అవయవములకు ప్రాధాన్యము. (3) సమూహమునకు ప్రాముఖ్యము. అందు భేదముతో కూడిన అవయవములును, వాని సమూహమును కూడ ప్రధానమైనచో ఇతరేతరయోగ ద్వంద్వమును, భేదము భాసించినను కేవలము సమూహము మాత్రమే ముఖ్యమైనయెడల సమాహార ద్వంద్వమును అగునని చెప్పవలెను.

వివరణము— ''ఘటపటౌ'' (ఘటశ్చ + పటశ్చ). ఇది ఇతరేతరయోగ ద్వంద్వము (పరస్పరము పదార్థములు కలియుట). అనగా ఘటము, పటము, అను రెండు వస్తువులకును కలిసి కట్టుగా (విడిగాను - మొత్తముగాను) ఏదో ఒక క్రియతో (ఆనయనము = తెచ్చుట - మొదలగునది) అన్వయమును చెప్పదలతుము. ఇదియే సహవివక్ష. ఇదియొక విచిత్రమైన జ్ఞానము. ఇందు ఘటము - పటము కూడ వేరుగా తెలియుచు, రెండిటి సమూహము కూడ తెలియుచుండును. అనగా అవయవముల భేదమును వాని సముదాయమును ఒకేసారి స్ఫురించుచుండును. దీనిని ''ఉద్భూతావయవ భేదము అయిన సముదాయము'' (అవయవ భేదము తెలియుచుండు సమూహము) అందురు. ఈ సముదాయమును సమాసమందలి ఘట పట శబ్దములు రెండును వేర్వేరుగా బోధించును. (ఘట శబ్దమునకు ఘట పటముల సముదాయ మర్థము. అట్లే పట శబ్దమునకును ఘట పటముల సముదాయమర్థము). స్పష్ట ప్రతిపత్తి కొరకు రెండు శబ్దములను కూడ ప్రయోగింపవలెను. ఈ రీతిని అవయవముల భేదమును సముదాయమును కూడ ముఖ్యముగ క్రియతో అన్వయించినచో ఇతరేతర యోగమగును. అట్లుకాక అవయవభేదము స్ఫురించుచున్నను– దానిని గుర్తింపకుండ. సమూహమునే ముఖ్య ముగ క్రియతో అన్వయించిన యెడల సమాహారమగునని పర్యవసించును. ఉదా : ''పాణి పాదం చలతి'' = కాలు,సేతుల సమూహము కదలుచున్నది.

విశేష విషయములు— సహవివక్షకు విషయమైన పదార్థములు ఇతరేతరయోగ మున రెండైనచో ద్వివచనమును, అంతకుమించినచో బహువచనమును సమాసపదమునకు చేర్పవలెను. ఉదా : ''ఘటపటౌ'', ''కట, ఘట, పటాః'' మొదలగునవి. సమాహారమున సామాన్యముగా ఏకవచనమే అగుచుండును. ఉదా : ''పాణిపాదమ్'' మొదలగునవి.

సూక్ష్మముగ పరిశీలించినచో వస్తు సముదాయమును దేనిని చూచినను అవయవ భేదమును సముదాయైక్యమును భాసించుచునే యుండును. అట్లే విడివిడిగా ఏ అవయవమును చూచినను సముదాయమంతయు అగపడుచున్నట్లును, సముదాయమునంతను చూచునపుడు విడిగా అవయవములన్నియు అగపడుచున్నట్లును స్ఫూర్తి కలుగును. కాగా సహజమైన ఈ తీరులో అవయవముల భేదమును చెప్పదలచుకొన్నచో ఇతరేతరయోగమనియు, చెప్పదలచు కొననిచో సమాహారమనియును సూత్రప్రాయముగ చెప్పవచ్చును.

ఇట్టి విశేషములన్నియు సమాస వృత్తియొక్క సామర్థ్యముచే (ఏకార్థీభావము) సిద్ధించును. అభిమతమగు అర్థము స్పష్టమగుట కొరకే ''ఘటః - చ + పటః - చ'' అని వాక్యావస్థయందు ''చ'' అను అవ్యయమును వాడుదురు. సమాసావస్థయందు చకారమును వాడనక్కరలేదు ఇదియే విశేషము. ప్రతియొక ద్వంద్వపదమును ఏకశేషమును ఇట్లే వ్యాఖ్యానించుకొనవలెను. ॥29॥

**అవతారిక**— ''ద్వంద్వమందు ప్రతియొక పదము కూడ అవయవ భేదముగల సముదాయమును బోధించును'' అను అంశమున దృష్టాంతమును చూపుచున్నాడు.

శ్లో॥ వ్యాపార సముదాయస్య యథాఽధిశ్రయణాదిషు ।
ప్రత్యేకం జాతివద్వృత్తిః తథా ద్వంద్వపదేష్వపి ॥ 30

అధిశ్రయణాదిషు = పొయ్యిమీద గిన్నె పెట్టుట, మొదలగు వానియందు, వ్యాపార సముదాయస్య = క్రియా సమూహమునకు జాతివత్ = జాతివలె, ప్రత్యేకమ్ = ప్రత్యేకముగా, వృత్తిః = ప్రవృత్తి, యథా = ఎట్లో, తథా = అట్లు, ద్వంద్వపదేషు + అపి = ద్వంద్వ సమాసము యొక్క పదములలో కూడ. (ప్రతియొక పదమును సమూహమును బోధించును).

తాత్పర్యము— "పచతి = వండుచున్నాడు". ఇచట వంట అనునది వ్యాపారము. అది సమూహ రూపము. పొయ్యిపై గిన్నె పెట్టుట మొదలుకొని, గిన్నెను దింపి పొయ్యిని ఆర్పుటవరకును జరుగు ఒక వరుసగల పనుల సముదాయము అయినను ఆ పనులలో ఏ యొక పని జరుగుచున్నను "పచతి" అని వాడుదురు. అనగా ప్రతియొక అవాంతర క్రియయు క్రియా సముదాయమును తెలియజేయును. ఈ విధముగనే ద్వంద్వమందు ప్రతియొక పదము కూడ అవయవభేదముగల సముదాయమును బోధించును. జాతి విషయమునను ఇదే తీరు గోచరించును. వ్యక్తుల సముదాయమందు అనుగతముగ నుండును (ఒకే విధముగ నుండు) ధర్మము జాతి అది ప్రతియొక వ్యక్తియందు కూడ అనుభూతమగుచుండును. ఉదా : "గోత్వము" అనున దొక జాతి (సకల గో సముదాయమందలి ఒక ధర్మము) ఇది గో సముదాయమందును "గోవు" అను ప్రతియొక వ్యక్తియందును స్ఫురించుచుండును

వివరణము— జాతియను సముదాయ ధర్మము ప్రతి వ్యక్తియందును ఉండునట్లు ద్వంద్వమందలి సమూహము అవయవ భేదముతో ప్రతియొక పదార్థమందును ఉండును. అనగా ద్వంద్వమం దున్నపుడు ఒక పదార్థము వేరొక పదార్థమును అపేక్షించుచునే యుండును. ఉదా : "రామలక్ష్మణౌ గచ్ఛతః" = రామలక్ష్మణులు వెళ్ళుచున్నారు. ఇచట "కలిసియే నడక" కావున రాముడు లక్ష్మణుని లక్ష్మణుడు రాముని అపేక్షించును. లేకున్న కలయిక కుదురదు. కాగా ప్రతియొక పదార్థము కూడ ఆ యా క్రియతో అన్వయించు పదార్థ సమూహమునే బోధించునని ఫలితము. ద్వంద్వమందలి పదములు ఒక్కొక్కటియు అవయవ భేదముతోడి సమూహమును తెలియజేయుట అనగా ఇదియే. ॥30॥

అవతారిక— "వంట పూర్తియగుటకై సహకరించు చిన్న చిన్న పనుల విషయములో కూడ "పచ్" అను ధాతువు నుపయోగించుట, (పచతి) పైన చూపిన విధమున సమర్థనీయము కావచ్చును. కాని "ఘట – పటౌ", "రామలక్ష్మణౌ" మొదలగు చోట్లగల ఆ యా పదములను విడిగా వాడునపుడు వానికి వేర్వేరుగ అర్థములున్నవి. అవియే సమాసమున అర్థసముదాయమును (తమతో కలిసియున్న పదముల అర్థమును కూడ) ఎట్లు బోధింపగలవు ?"– అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

శ్లో॥ శౌండార్ధర్చ పురోడాశచ్ఛత్రిణోఽత్ర నిదర్శనమ్ ।
తే విష్ణుమిత్రా ఇతి చ భిన్నేషు సహచారిషు ॥ 31

ప్రయోగమును చేయుదురు. సాహచర్యమును బట్టి ఛత్రములేని వారికిని "ఛత్రిత్వము" (గొడుగు కలిగియుండుట) అను ధర్మము నారోపించి అందరను ఛత్రి శబ్దముతో బోధించుట జరుగును.

(౬) "విష్ణుమిత్రాః" అనునదియు ఇట్టిదే. "విష్ణుమిత్ర" అను పేరుగల వారధికముగ నుండుటచే వారితో కలిసియున్న మిగిలిన వారికి కూడ అదియే పేరగుచుండును.

పై నిదర్శనములను బట్టి– వాక్యావస్థయందు వేర్వేరుగా అర్థములను కలిగియున్నను, ద్వంద్వైక శేషములలోని పదములు సహచరితములైన పదముల అర్థములను కూడ బోధించుట ఉపపన్నమగును.

విశేష విషయము— "సప్తమీ శౌండైః" (2-1-40) "సప్తమ్యంతమైన పదము శౌండాది గణమందున్న పదములతో సమసించును" అని యర్థము. ఉదా : అక్షేషు + శౌండః = అక్షశౌండః, మొదలగునవి. ఇది సప్తమీ తత్పురుషము. "అర్ధర్చాః పుంసిచ" (2-4-31). "అర్ధర్చ" మొదలగు గణమందలి శబ్దములకు, పుంలింగము, నపుంసక లింగము కూడ అగును" అని యర్థము ఉదా : అర్ధర్చమ్, అర్ధర్చః, వనమ్, వనః మొదలగునవి. కొన్ని శబ్దముల లింగమును ఈ సూత్రము నిర్ణయించును. ॥31॥

*అవతారిక*— పై అంశమునే స్పష్టము చేయుచున్నాడు.

**శ్లో॥ అర్థాంతరాభిధాయిత్వం తథార్థాంతరవర్తినామ్ ।**
**యాభ్యాం చైకమనేకార్థం తాభ్యామేవాపరం పదమ్ ॥** 32

అర్థాంతరవర్తినామ్ = వేరొక యర్థమందుండు పదములకు, అర్థాంతరాభిధాయిత్వమ్ = మరొక అర్థమును చెప్పగలుగుట, తథా = ఆ విధముగ (శౌండాది పదములవలె) (ఉపపద్యతే = కుదురును), చ = మరియు, యాభ్యామ్ = ఏ రెండర్థములను బట్టి, ఏకమ్ = ఒక పదము, అనేకార్థమ్ = ఒకటిని మించిన అర్థములుగలదగునో, తాభ్యామ్ + ఏవ = ఆ రెండర్థములను బట్టియే, అపరమ్ = మరియొక, పదమ్ = పదము, అనేకార్థమ్ = అనేకార్థకము, (భవతి = అగును).

**తాత్పర్యము**— (మీది కారికకు ఇది శేషము). సహజముగ ఒక అర్థమును చెప్పు పదము (విడిగా ఉన్నపుడు). ద్వంద్వమందును ఏకశేషమందును వేరొక యర్థమును కూడ బోధించుట (వృత్తి మహిమచే), శౌండ, పురోడాశాదిపదములకు వలెనే సంభవించును.

మరియు "ఘటపటౌ" మొదలగుచోట్ల ఘట పదమునకు ఏ రెండర్థములను (ఘటపటములు) చెప్పుదుమో, పట పదమునకును అవియే అర్థములని తెలిసికొనవలెను. కాగా రెండు పదములును రెండర్థములను మాత్రమే బోధించినట్లగును గాన, "ఘటపటౌ" అని ద్వివచనము కుదురును. బహువచన మున్నచోట్ల కూడ ఈ తీరునే అవలంబించి, బహువచనమును సార్థకము చేయనగును. (ఉదా : రామ లక్ష్మణ భరత శత్రుఘ్నాః. ఇచట ఒక్కొక్క

ప్రయోగమును చేయుదురు. సాహచర్యమును బట్టి ఛత్రములేని వారికిని "ఛత్రిత్వము" (గొడుగు కలిగియుండుట) అను ధర్మము నారోపించి అందరను ఛత్రి శబ్దముతో బోధించుట జరుగును.

(౬) "విష్ణుమిత్రాః" అనునదియు ఇట్టిదే. "విష్ణుమిత్ర" అను పేరుగల వారధికముగ నుండుటచే వారితో కలిసియున్న మిగిలిన వారికి కూడ అదియే పేరగుచుండును.

పై నిదర్శనములను బట్టి– వాక్యావస్థయందు వేర్వేరుగా అర్థములను కలిగియున్నను, ద్వంద్వైక శేషములలోని పదములు సహచరితములైన పదముల అర్థములను కూడ బోధించుట ఉపపన్నమగును.

విశేష విషయము— "సప్తమీ శౌండైః" (2-1-40) "సప్తమ్యంతమైన పదము శౌండాది గణమందున్న పదములతో సమసించును" అని యర్థము. ఉదా : అక్షేషు + శౌండః = అక్షశౌండః, మొదలగునవి. ఇది సప్తమీ తత్పురుషము. "అర్ధర్చాః పుంసిచ" (2-4-31). "అర్ధర్చ" మొదలగు గణమందలి శబ్దములకు, పుంలింగము, నపుంసక లింగము కూడ అగును" అని యర్థము ఉదా : అర్ధర్చమ్, అర్ధర్చః, వనమ్, వనః మొదలగునవి. కొన్ని శబ్దముల లింగమును ఈ సూత్రము నిర్ణయించును. ॥31॥

*అవతారిక*— పై అంశమునే స్పష్టము చేయుచున్నాడు.

**శ్లో॥ అర్థాంతరాభిధాయిత్వం తథార్థాంతరవర్తినామ్ ।**
**యాభ్యాం చైకమనేకార్థం తాభ్యామేవాపరం పదమ్ ॥** 32

**అర్థాంతరవర్తినామ్** = వేరొక యర్థమందుండు పదములకు, **అర్థాంతరాభిధాయిత్వమ్** = మరొక అర్థమును చెప్పగలుగుట, **తథా** = ఆ విధముగ (శౌండాది పదములవలె) (**ఉపపద్యతే** = కుదురును), **చ** = మరియు, **యాభ్యామ్** = ఏ రెండర్థములను బట్టి, **ఏకమ్** = ఒక పదము, **అనేకార్థమ్** = ఒకటిని మించిన అర్థములుగలదగునో, **తాభ్యామ్ + ఏవ** = ఆ రెండర్థములను బట్టియే, **అపరమ్** = మరియొక, **పదమ్** = పదము, **అనేకార్థమ్** = అనేకార్థకము, (**భవతి** = అగును).

**తాత్పర్యము**— (మీది కారికకు ఇది శేషము). సహజముగ ఒక అర్థమును చెప్పు పదము (విడిగా ఉన్నపుడు). ద్వంద్వమందును ఏకశేషమందును వేరొక యర్థమును కూడ బోధించుట (వృత్తి మహిమచే), శౌండ, పురోడాశాదిపదములకు వలెనే సంభవించును.

మరియు "ఘటపటౌ" మొదలగుచోట్ల ఘట పదమునకు ఏ రెండర్థములను (ఘటపటములు) చెప్పుదుమో, పట పదమునకును అవియే అర్థములని తెలిసికొనవలెను. కాగా రెండు పదములును రెండర్థములను మాత్రమే బోధించినట్లగును గాన, "ఘటపటౌ" అని ద్వివచనము కుదురును. బహువచన మున్నచోట్ల కూడ ఈ తీరునే అవలంబించి, బహువచనమును సార్థకము చేయనగును. (ఉదా : రామ లక్ష్మణ భరత శత్రుఘ్నాః. ఇచట ఒక్కొక్క

పదము అవయవ భేదముగల సముదాయమును చెప్పుచుండును. అనగా ప్రతియొక పదమును అందరిని బోధించును).

వివరణము— "యుగపదధికరణత్వమందు ద్వంద్వ మగునని" కాత్యాయను డొక సూచనను చేసెను. ఆ యుగపదధికరణత్వము యొక్క స్వభావమునే యింతదనుక గ్రంథకారుడు వివరించి చూపెను. కాగా యుగపదధికరణత్వమును స్థూలముగా ఇట్లు వింగడింప వచ్చును. "యుగపత్ = ఒకేసారిగ - ఒక శబ్దముతో, అధికరణత్వమ్ = చెప్పదలచిన అర్థమును కలిసి కట్టుగా చెప్పుట" అని ఈ పదముయొక్క తాత్పర్యము. ఏదో ఒక ధర్మమును నిమిత్తముగా చేసికొని పదార్థములందు పరస్పరము ఆరోపమును సంపాదించి, తమ యర్థమును భేదభావనను విడువకుండ మొత్తముపై పదార్థ సముదాయమును బోధించునట్లు కూర్పు దలపెట్టినప్పుడే పదములకు ద్వంద్వము ప్రవర్తించును. ఉదా: "ఘటపటౌ". ఈ ఒక్క పదమువలననే "ఘటపటముల సముదాయము" అని స్ఫురించును. ఇచట ఘటమందు పట ధర్మమును పటమందు ఘట ధర్మమును ఆరోపింతురు. కావున రెండు శబ్దములును ఘట పట రూపమగు అర్థమును తెలియజేయును. మొత్తముపై సముదాయము స్ఫురించినను ఘట పటముల భేదభావన తప్పక ఉండును ఇట్టి తీరునకే "సహవివక్ష" అని పేరు. "యుగపదధికరణత్వము" "సహవివక్ష" అను పదములు ఇంచుమించు సమానార్థకములు. రెండు పదార్థములను కలుపదలచినపుడే వీని యునికి.

విడిగా వాక్యములో వాడినపుడు పై విశేషము లేవియు నుండవు. కావున అచట అభిమతమగు అర్థము లభించుటకు, "చ" అను అవ్యయము నుపయోగింతురు. ఉదా: "ఘటః - చ, పటః - చ". అట్లే ఒకే పదమును వాడినను ఈ విశేషములు కలుగవు. కావలసిన విశేషాంశములన్నియు లభించుటకు సమాసమను వృత్తియే మూలము. వృత్తియందలి శబ్దములకు విచిత్రమైన శక్తు లుండును. అవియే అభీష్టమును సాధించి పెట్టును. ఇంతకన్నను వివరములను తెలియగోరువారు మహాభాష్యాది గ్రంథములను పరిశీలింపవలెను. ॥32॥

అవతారిక— పై యంశమునే విశదీకరించుచున్నాడు

**శ్లో॥ సముదాయాంతరత్వాచ్చ తాదృశోఽర్థో న లౌకికః।**
**అన్వయవ్యతిరేకాభ్యాం శాస్త్రార్థోఽపి న దృశ్యతే ॥ 33**

తాదృశః = అటువంటి, అర్థః = అర్థము, (సముదాయ రూపమైన యర్థము) సముదాయాంతరత్వాత్ + చ = చిత్రమైన వేరొక సముదాయమగుట వలన, లౌకికః = లోకప్రసిద్ధమైనది, న = కాదు, అన్వయ వ్యతిరేకాభ్యామ్ = ఉండుట - లేకుండుట అను ధర్మములను బట్టి లభించు, శాస్త్రార్థః + అపి = శాస్త్రీయమగు అర్థము కూడ, న + దృశ్యతే = (ఇచట) కనబడదు.

తాత్పర్యము— "ఘటపటౌ" మొదలగు స్థలములలో యుగపదధికరణతలేక—సహవివక్ష— అను పద్ధతివలన లభించు సముదాయరూపమైన యర్థము, (పదములు తమ

యర్థములను విడువకుండుట,— ఆరోపముచే ఒండొరులు కలిసిన యర్థములను కూడ చెప్పుట— అవయవభేదమును కలిగియుండుట— మొత్తముపై ఈ యంశములన్నియు కల పదార్థ సముదాయము తెలియుట) మిక్కిలి విలక్షణమైనది. అది లోకమందలి వాడుకలో ప్రసిద్ధమైనది కాదు. అట్లే అది అన్వయ వ్యతిరేకముల ననుసరించి (ఒక పద మున్నపు డొక యర్థము వచ్చుట - అది లేనపు డా యర్థము రాకుండుట) శాస్త్రములలో సంపాదించు అర్థమువంటిది కూడ కాదు.

*వివరణము*— శబ్దములను వాని యర్థములను నిర్ణయించుటకు లోకవ్యవహారమే ప్రబలమైన సాధనము. దానినిబట్టి చూచినపుడు ఘటపటాది శబ్దములకు ప్రసిద్ధమైన ఒక యర్థమే యుండును. ఏదో యొక వ్యాపారముయొక్క —లేక— ధర్మముయొక్క సామ్యము ననుసరించి, బలవంతముగా ఒక శబ్దము వేరొక శబ్దముయొక్క అర్థమును చెప్పుట సామాన్యముగా పొసగదు. (ఉదా : "ఘట్యతే - ఇతి = ఘటః" = కూర్చబడునది కాన ఘటము. "పట్యతే - ఇతి = పటః = విస్తరింపజేయబడునది కాన పటము. ఇచట ఆ యా ధర్మములు ఘట పటములకు రెండిటికిని కొంతవరకు సమానమే. అయినను అంతమాత్రమున ఘట శబ్దమునకు పటమనియు, పట శబ్దమునకు ఘటమనియును అర్థము చెప్పకూడదు). అట్లయినచో గో శబ్ద మొకటే (గచ్ఛతి - ఇతి = నడచునది = గౌః) నడచి వెళ్ళు ప్రాణుల నన్నింటిని బోధింపవలసి వచ్చెడిని. కాగా లోకవ్యవహారమున శబ్దార్థముల కొక నియతమైన వ్యవస్థ యున్నది. కావుననే "ఘటశ్చ పటశ్చ" అని విడిగా వాడినపుడు తెలియు సముదాయము ఎట్టి విశేషాంశములును లేని సామాన్య సముదాయము మాత్రమే.

అన్వయ వ్యతిరేకములచే "దీనికిది అర్థము" అని నిర్ణయించు శాస్త్రమార్గ మొకటి యున్నది. తదనుసారము పదమందలి ప్రకృతిని ప్రత్యయమును విడదీసి, "ప్రత్యయ మున్నపుడు తెలియు అర్థము— అది లేనపుడు తెలియదు"గాన అ ప్రత్యయమున కదియే అర్థమని నిశ్చయింతురు. ఉదా : "దశరథస్య - అపత్యమ్ = దాశరథిః = దశరథుని కుమారుడు". ఇచట "ఇ" అను ప్రత్యయమునకు "సంతతి" అని యర్థము. ఈ విధమైన తీరు కూడ ద్వంద్వ విషయమున కుదురదు. అందలి పదములకు అన్వయ వ్యతిరేకముల వలన తమ తమ అర్థమే స్థిరపడును. ఒకటి వేరొకదాని యర్థమును చెప్పుట అసంభవము. కాగా ద్వంద్వైక శేషములలో "యుగపదధికరణత" అను క్రొత్త మార్గమువలన లభించు సముదాయరూపమైన అర్థము విలక్షణమైనదియే అని యనక తప్పదు. దీని ముఖ్య లక్షణములను ఇట్లు ప్రస్తరింపనగును.

(1) ఇది ద్వంద్వము, ఏకశేషము అను వృత్తులవలన లభించును.

(2) పదములు తమ తమ అర్థములను విడువక ప్రక్కనున్న పదముల యర్థమును కూడ తెలుపును.

(3) పదార్థముల భేదము స్ఫురించుచుండును.

(4) ఇట్టి విశిష్టమైన సముదాయము మొత్తముగా తెలియుచుండును.

అందువలన వాక్యావస్థవలన తెలియు సముదాయమువంటి సముదాయము కాదిది. మరియు పదము ప్రక్కను మరియొక పదమును (ప్రథమాంతములుగ) కూర్చునపుడే పదార్థములు సహచరితము లగునపుడే) మీది విశేషములన్నియు సిద్ధించును. ఏకశేషమందు మాత్రము ఒక పదమే మిగులును గాన అదియే లోపించిన పదముల యర్థమును కూడ చెప్ప గలదు. అదియు ''యుగపదధికరణత'' యొక్క ప్రభావమే.

పై తీరున ద్వంద్వైకశేషముల వలన లభించు పదార్థములన్నియు స్వతంత్రముగ ఏదేని ఒక క్రియతోగాని గుణముతోగాని అన్వయించుచుండును అనగా అవి సమప్రాధాన్యమును కలిగియుండును. ఇదియు నొక విశేషమే. ఇతర సమాసములలో ముఖ్యమైన పదార్థ మొకటియే క్రియా గుణములతో అన్వయించును. మిగిలిన పదార్థము లద్దానికి విశేషణములుగ మారిపోవును.

*అవతారిక*— ఈ విధమైన ''యుగపదధికరణవచనత'' మిక్కిలి కష్టదాయక మని అనుచున్నాడు.

**శ్లో॥ దుఃఖా దురుపపాదా చ తస్మాద్భాష్యేఽప్యుదాహృతా ।**
**యుగపద్వాచితా సా తు వ్యవహారార్థమాశ్రితా ॥ 34**

తస్మాత్ = అందువలన, యుగపద్వాచితా = ఒక శబ్ద మొకేసారిగ కావలసిన విశేషార్థము లన్నిటిని చెప్పుట, దుఃఖా = మనసును కష్టపెట్టునదనియు, దురుపపాదా + చ = ప్రమాణ బద్ధముగ నిరూపింప శక్యముకానిదనియును, భాష్యే + అపి = మహాభాష్యమందు కూడ, ఉదాహృతా = చెప్పబడినది, సా + తు = అది అయితే, వ్యవహారార్థమ్ = లోకమందలి ప్రయోగములను వ్యాఖ్యానించుటకు, ఆశ్రితా = అవలంబింపబడినది.

*తాత్పర్యము*— ''యుగపద్వాచిత'' (యుగపదధికరణవచనత) అను పేరుగల సహవివక్షను సమగ్రముగను నిర్దుష్టముగను భావించుట మిక్కిలి కష్టమని పతంజలి తన మహాభాష్యమున స్పష్టముగ చెప్పినాడు. అయినను సమన్వయమున కుపకరించునని ప్రకృత మద్దానిని వివరించితిమి.

*వివరణము*— ''చార్థే ద్వంద్వః'' (2-2-29) అను సూత్రము యొక్క భాష్యములో ''సేయం యుగపదధికరణవచనతా నామ దుఃఖాచ దురుపపాదాచ'' అని పతంజలి చెప్పియున్నాడు కాత్యాయనుడు చూపిన ''యుగపదధికరణత'' యందలి సాధక బాధకము లను కూలంకషముగ చర్చించిన పిదప అన్నమాట యిది. ''యుగపదధికరణవాచకత్వము'' అనునది వినుట కింపుగనే యున్నదిగాని దాని స్వరూప స్వభావములను వివరించుటయు దానిని ప్రామాణికములుగ ఒప్పించుటయు మిక్కిలి శ్రమయని దీని భావము.

*విశేషాంశము*— ఇచట 'కల్ప్యమన్యన్న చాశ్రుతమ్' అను పాఠాంతరము కలదు.

అశ్రుతమ్ = శబ్దముచే లభింపని, అన్యత్ = మరియొక పదార్థమును, న + చ + కల్ప్యమ్ = కల్పింప నక్కరలేదు.

శబ్దముచే లభించిన అర్థములలో ఏదో ఒక దానిని విడచుటలో కారణము కానరా నందున శబ్దబోధ్యములగు గుణద్రవ్యములకు రెంటికి పరస్పరము అన్వయము సంభవించు చున్నందున అప్రకృత కల్పన చేయనక్కరలేదు

ఈ పాఠమును ఆశ్రయించియే హేలారాజు వ్యాఖ్యానించెను ॥74॥

*అవతారిక*— కారకములకు క్రియతో నన్వయము చెప్పవలెను. ఆలభేత, అను పదము ఆలంభన క్రియను బోధించును. శ్వేతగుణము, ఛాగద్రవ్యము రెండు ఆ క్రియలో కారకములగును. కాగా ఆ రెంటికి పరస్పరము అన్వయము చేయక వానికి వేరువేరుగా క్రియాన్వయము చూపవలెను. "శ్వేతమాలభేత, ఛాగమాలభేత". కాగా రెండు వాక్యములు స్పష్టముగా నున్నందున వాక్యభేదమనే దోషము ప్రసక్తమగుచున్నది అను ప్రశ్నకు సమా ధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ క్రియయా యోఽభిసంబన్ధః స శ్రుతిప్రాపిత స్తయోః ।**
**ఆశ్రయాశ్రయిణోర్వాక్యాన్నియ మ స్త్వవతిష్ఠతే ॥ 75**

తయోః = ఆ గుణ ద్రవ్యములకు, క్రియయా = అలంభనము మున్నగు క్రియతో, యః = ఏ, అభిసంబన్ధః = అన్వయమో, సః = ఆ సంబంధము, శ్రుతిప్రాపితః = కారకవిభక్తిరూపమగు 'శ్రుతి' అను ప్రమాణముచే పొందింపబడు చున్నది, అనగా బోధింపబడుచున్నది.

ఒకే వాక్యమున గ్రహింపబడిన గుణ ద్రవ్యములకు క్రియతో అన్వయము 'శ్రుతి' అను ప్రమాణము వలన కలుగుచున్నది.

ఇచట ''క్రియాయాం యోఽభిసంబన్ధః స
శ్రుత్యా ప్రాపిత స్తయోః''

అను పాఠాంతరము కలదు. అర్థములో భేదము కానరాదు.

ఆశ్రయాశ్రయిణోః = ఆశ్రయమునకు ఆశ్రయించిన దానికి అనగా ఆశ్రయమగు ద్రవ్యమునకు ఆశ్రయించియున్న గుణమునకును, నియమః + తు = నియమము మాత్రము అనగా మేక తెల్లనిదే. ఆ తెల్లనిది మేకయే, మేక నల్లగాగాని, పచ్చగాగాని, ఎఱ్ఱగాగాని యుండరాదు, తెల్లనిది గొఱ్ఱెగాని, గుఱ్ఱముగాని కాకూడదు అను నియమము, వాక్యాత్ = వాక్యరూపమగు ప్రమాణమువలన, అవతిష్ఠతే = కలుగుచున్నది.

కష్టమైనను "యుగపద్వాచకత్వము"ను అంగీకరించినచో ద్వంద్వమందలి వైచిత్ర్యముల నన్నింటిని సాధింపవచ్చునని భావించి, భర్తృహరి యింతదనుక దీనినిగురించి ముచ్చటించెను.

విశేష విషయములు—"చార్థే ద్వంద్వః" అను సూత్రమున "చార్థే" అను పదమును తీసివైచి "యుగపదధికరణవచనే" అని యుంచుట మంచిదని కాత్యాయనుని సూచన. కాని దానిని త్రోసిపుచ్చి "చార్థే" అను పదమే ఉండుట సముచితమని పతంజలి యాశయము. "చార్థమందు - అనగా - ఇతరేతర యోగము. సమాహారము అను నర్థములందు ద్వంద్వమగును" అను సూత్రకారుని మతమే సుఖమనియు, కావలసిన విశేషములన్నియు వృత్తి సామర్థ్యమును బట్టి లభించుననియు, కాత్యాయనుని "యుగపద్వాచిత్వము" (సహవివక్ష) చాల కష్టమనియును పతంజలి తీర్పు చెప్పెను.

"కష్టము, సుఖము, అన్న భేదమున్నను అది కూడ ఒక మార్గమే" అనుట, పతంజలి హృదయమని భర్తృహరి భావించెను. ॥ 34॥

*అవతారిక*— "యుగపదధికరణవచనత" (సహవివక్ష)ను స్వీకరించుటలో గల హేతువును చెప్పుచున్నాడు.

శ్లో॥ **సముదాయముపక్రమ్య పదం తస్యాం ప్రయుజ్యతే ।**
**విభాగేన సమాఖ్యేన తతస్తద్ ద్వ్యర్థముచ్యతే ॥** 35

సముదాయమ్ = సముదాయమును, ఉపక్రమ్య = ఉద్దేశించి, పదమ్ = పదము (సమస్తమైన పదము), తస్యామ్ = ఆ యుగపదధికరణతయందు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును, తతః = అందువలన, విభాగేన = విడదీసి, సమాఖ్యానే = వివరించుటలో, తత్ = ఆ పదము (విడి పదము), ద్వ్యర్థమ్ = రెండర్థములు గలదిగ, ఉచ్యతే = చెప్పబడును.

*తాత్పర్యము*— "ఘటపటౌ", "కట ఘట పటాః", మొదలగు సమాసములు ఆయా వస్తువుల సముదాయమును బోధించుటకై వాడబడును. అట్లు వాడుట లోకమున ప్రసిద్ధము. సిద్ధమైయున్న పదములను విడదీసి వానికొక సంస్కారమును చూపి అర్థమును సమన్వయించుట శాస్త్ర మర్యాద. లేని యంశమును క్రొత్తగా శాస్త్రము తెచ్చిపెట్టదు. (ఉన్నదున్నట్లు చెప్పి దానికొక యోగ్యతను కల్పించుటయే శాస్త్రము చేయుపని). కాగా సమాసమందలి పదములు సముదాయమును బోధించునుగాన వాని అవయవములుగ నున్న పదములు కూడ సమూహమునే తెలియజేయుట సమంజసము. ఇట్లు ద్వంద్వమందలి పదములు, ఒక్కొక్కటియు తనతోపాటు మిగిలిన వాని యర్థములను చెప్పునుగాన, అనేకార్థములగును. "యుగపదధికరణవచనత" యందలి రహస్య మిదియే.

*వివరణము*— "ఘటశ్చ పటశ్చ" అనునది వాక్యదశ. ఇచట పదములు తమ యర్థము నొకదానినే చెప్పును. చకారము కిలయికను సూచించును. రెండు పదార్థములును

స్వతంత్రముగను ముఖ్యముగను "విద్యతే" (ఉన్నది) మొదలగు క్రియతో అన్వయించును. దీనికి భిన్నమైనది "ఘటపటౌ" అను సమాసదశ. ఇచట చకారమును వాడకూడదు. సమాస పదమునకు ద్వివచనము గావలయును (బహుత్వ మున్నచోట బహువచనము వచ్చును). సముదాయము తెలియవలయును. అదియును వాక్యమువలన తెలియు సముదాయము వంటిది కారాదు. అట్లయిన సముదాయ మొకటేగాన ఎల్లప్పుడును సమాసమునకు ఏకవచనమే కావలసి వచ్చును అందుచే అవయవ భేదము స్ఫురించవలెను. అట్టి సముదాయములు రెండని కూడ భావింపవలెను. (ఘట పదముచే ఘట పట సముదాయము. అట్లే పట పదముచే కూడ పట ఘట సముదాయము). సహచరితముగ పద ముండవలెను లేకున్న కావలసిన స్ఫూర్తి కలుగదు. పదార్థములకు సమప్రాధాన్య ముండక తప్పదు. అప్పుడే వానికి క్రియాన్వయము సరిపోవును. ఇన్ని విధములైన విశేషములు సమాస దశవలన సహజముగ లభించును. వీనికి ఒక సంకేతమును కూర్చుటయే శాస్త్రము చేయు పని ఆ సంకేతమే "యుగపదధికరణవచనత" - లేక - "సహవివక్ష" అనబడును. ఇది ద్వంద్వమందును ఏకశేషమందును ఉండును.

విశేష విషయములు— వాక్యమునకు గల అర్థమును తెలియజేయు శక్తికున్న, సమాసాదివృత్తికి గల అట్టి శక్తి సమధికమును విచిత్రమును అయి యుండును. దానివలననే విశేషాంశములన్నియు సిద్ధించును.

ద్వంద్వమునకు యోగ్యమైన స్థలమందే, దానిని బాధించి ఒకప్పుడు ఏకశేషమగుచుండును. కావున పైన చూపిన విషయములన్నియు ఏకశేషమునకు సమానములే. ఏకశేషమనునది వేరుగా ఒక వృత్తియే. ద్వంద్వమన్నది సమాసవృత్తి యొక్క ఒకానొక భేదము. ॥35॥

## (4) వృత్తికిని వాక్యమునకును గల భేదమును ప్రతిపాదించుట

*అవతారిక*— వాక్యమునకును సమాసము మొదలగు వృత్తికిని గల భేదమును సామాన్యముగ చూపుచున్నాడు

**శ్లో॥ వాక్యేఽపి నియతా ధర్మాః కేచిద్వృత్తౌ ద్వయో స్తథా।**
**తే త్వభేదేన సామర్థ్యమాత్ర ఏవోపవర్ణితాః ॥ 36**

కేచిత్ = కొన్ని, ధర్మాః = ధర్మములు, వాక్యే + అపి = వాక్యమందును, నియతాః = తప్పక ఉండునవియై, (సంతి = కలవు), కేచిత్ = కొన్ని ధర్మములు, వృత్తౌ = వృత్తియందు, నియతాః = నియతములు, కేచిత్ = మరికొన్ని ధర్మములు, తథా = అట్లు, ద్వయోః = వృత్తి వాక్యములు రెండిటియందును, (సంతి = కలవు), తే + తు = ఆ ధర్మములన్నియును, అభేదేన = భేదము లేకుండ, సామర్థ్యమాత్రే + ఏవ = సామర్థ్యమందే, ఉపవర్ణితాః = చెప్పబడినవి.

తాత్పర్యము— శబ్దము లర్థములను బోధించు తీరులు పెక్కులు గలవు. అందు

కొన్ని కేవలము వాక్యమునకే చెందును. మరికొన్ని సమాసము మొదలగు వృత్తికే చెందును. ఇంకను కొన్ని వృత్తి వాక్యములు రెండిటికిని సమానములు ''సమర్థః పదవిధిః'' (2-1-1) అను సూత్రము సామర్థ్యమును సామాన్యముగా నిర్దేశించినది. పై తీరులన్నియును ఆ సామర్థ్యము యొక్క విశేషములే

వివరణము— సముచితమగు సంబంధమును కలిగిన అర్థములను బోధించు విడి విడి పదముల సముదాయము వాక్యమగును. (ఈ గ్రంథము యొక్క రెండవ కాండము ప్రారంభమున వాక్య లక్షణము విపులముగ చర్చింపబడినది). వాక్యావస్థయందు –లేక– విడిగా ఉన్నపుడు వేరే అర్థమును బోధించు పదములు, ఒకానొక తీరులో ఒకే పదముగ మారిపోయి పెనవేసికొన్న ఒకే అర్థమును చెప్పుట వృత్తి అగును. (చూడుము : ''పరిచయము'' అను శీర్షిక). అర్థములను అందించుటలో వృత్తి వాక్యములు రెండిటికిని తమ తమ నియతమైన పద్ధతులు కొన్నియు, సామాన్యమైన పద్ధతులు మరికొన్నియు గలవు. పాణిని వాని నన్నింటిని విడమరచి చెప్పలేదు. ''సమర్థః పదవిధిః (2-1-1) అను సూత్రమున ''సమర్థ'' (సామర్థ్యమును అంతగా గొనునది) అను పదముచే సామాన్యముగ సూచించి విడిచి పెట్టెను.

విశేష విషయములు— ''సమర్థః పదవిధిః'' (2-1-1) ''పదములకు సంబంధించిన కార్యము, ఆ పదములు సమర్థములైనపుడే ప్రవర్తించును'' అని యర్థము. ''పదవిధి'' అన్నను ''వృత్తి'' అన్నను సారాంశము ఒకటే. కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము సన్, క్యచ్, మొదలగు ప్రత్యయము లంతమందుగల ధాతువు - అను ఈ అయిదును వృత్తులు.

అర్థమును బోధించుటలో శబ్దమునకు గల శక్తి విశేషమును సామర్థ్యమందురు. ఇది వ్యపేక్ష, ఏకార్థీ భావము అని రెండు విధములు. వాక్యమందుండునది వ్యపేక్ష. ''వి = విశిష్టా = సుందరమైన + అపేక్షా = ఆకాంక్ష = వ్యపేక్షా''. ''సముచితముగ ఒండొరులను కోరుకొనుచు పదార్థములు మేళవింపును పొందుట'' వ్యపేక్షయని భావము. ఇది వాక్యమునకు నియతమైనది. ''అంతకు పూర్వము వేరుగనుండు అర్థములు ఒక మూసలో పోతపోయబడి నట్లు, మొత్తముపై ఒకే యర్థముగ సిద్ధమగుట'' ఏకార్థీ భావము. ఇది వృత్తికి నియతమైనది. ఇవియే గాక వృత్తికిని వాక్యమునకును నియతముగనో, సమానముగనో చెందు ధర్మములు పెక్కులు గలవు. వాని నన్నింటిని సూచించుటకే పాణిని ''సమర్థ'' పదమును వృత్తి ప్రసంగమున ఉపయోగించెను. కాత్యాయనుడును పతంజలియు ఆ విశేషముల నన్నిటిని పూర్తిగా చూపినారు. భర్తృహరియు ఇటుపైని వానిని యథావకాశముగ చూపదలపెట్టి ముందుగా ఈ మాట లనెను. ॥36॥

అవతారిక— వృత్తికిని వాక్యమునకును గల భేదములను కొన్నిటిని నొక్కి వక్కాణించుచున్నాడు

శ్లో॥ వృత్తౌ విశేషవృత్తిత్వాద్భేదే సామాన్యవాచితా ।
ఉపమాన సమాసాదౌ శ్యామాదీనాముదాహృతా ॥ 37

ఉపమానసమాసాదౌ = ఉపమానసమాసము మొదలగు సమాసములందు, శ్యామాదీనామ్ = ''శ్యామా'' మొదలగు శబ్దములకు, వృత్తౌ = వృత్తియందు, విశేషవృత్తిత్వాత్ = విశేషమందుండుటవలన, భేదే = వాక్యమందు, సామాన్యవాచితా = సామాన్యమును బోధించుట, ఉదాహృతా = చెప్పబడినది.

తాత్పర్యము— ''శస్త్రీశ్యామా'' (చిన్న కత్తివలె నల్లనైన ఒక స్త్రీ) అనునది ఉపమానసమాసము. ఇచట ''స్త్రీ'' అనునది విశేష్యమగుటచే సమాసమందలి శ్యామా శబ్దము స్త్రీ యను విశేషార్థమును చెప్పునని తేలును. దీనినిబట్టి ''శస్త్రీ - ఇవ - శ్యామా'' అను వాక్యావస్థయందుండు శ్యామా శబ్దము ''శ్యామత్వము'' (నలుపు) అను సామాన్య గుణమును చెప్పునని ఒప్పుకొనక తప్పదు. లేకున్న ''ఉపమానాని సామాన్యవచనైః'' (2-1-54) అను సూత్రముచే సమాసమే రాకపోయెడిని.

వివరణము— ''ఉపమానాని = ఉపమానమును చెప్పు సుబంతములు (ప్రథమాంతములు). సామాన్యవచనైః = సామాన్య ధర్మమును (ఉపమేయోపమానములకు సమానముగా ఉండు క్రియ —లేక— గుణము) చెప్పు సుబంతములతో (ప్రథమాంతములే) సమసించునని సూత్రార్థము. ''ఘనశ్యామః'' (ఘన ఇవ శ్యామః), ''శస్త్రీ శ్యామా'' మొదలగునవి ఉదాహరణములు. వీనిలో సమాస వృత్తియందుండు శ్యామాది శబ్దములు ఉపమేయములుగా ఉండు ఆ యా పదార్థ విశేషములను బోధించును. (ఘన శ్యామః = రామః, - శస్త్రీ శ్యామా = స్త్రీ - మొదలగు రీతిని) వాక్యావస్థలో కూడ ఆ పదములు విశేషమునే చెప్పినచో, సామాన్య వాచకములు కాకపోవును గాన సమాసమే కుదరక పోవును. అందువలన వాక్యావస్థయందున్న శ్యామాది పదములు సామాన్య వాచకములే అనుట సమంజసమని పతంజలి సూచించెను. కాగా వాక్యమందు సామాన్యమును బోధించు శబ్దములే వృత్తియందు విశేషమును బోధించుట, వృత్తికిని వాక్యమునకును గల భేదములలో ఒకటియని ఫలించును.

విశేష విషయములు— ఉపమానము = అధిక గుణములు కల వస్తువు. ఉదా: చంద్రుడు మొదలగునది. ఉపమేయము = ఉపమానము కన్న తక్కువ గుణములు కల వస్తువు. ఉదా: ముఖము, మొదలగునది. సామాన్యము —లేక— సమాన ధర్మము = ఉపమానోపమేయములకు సమానముగా ఉండు ధర్మము. ఉదా: గుండ్రముగా నుండుటయు, సంతోషమును కలిగించుటయు మొదలగునది. ఈ పదములు అలంకారశాస్త్రమున అతి ప్రసిద్ధములు. ॥37॥

అవతారిక— పై విషయముననే వేరొక ఉదాహరణమును చూపుచున్నాడు.

శ్లో॥ వృత్తిరన్యపదార్థే యా తస్యా వాక్యేష్వసంభవః ।
చార్థేద్వంద్వపదానాంచ భేదే వృత్తిర్న విద్యతే ॥ 38

షులు). ''ప్ర'' (అధికము, మొదలగునవి యర్థములు) మొదలగునవి ద్రవ్యమును చెప్ప జాలవు. సమాసవృత్తి యందవి ద్రవ్యమును చెప్పగలవు. (''నిష్క్రాంతః'' - మొదలగు చోట ద్రవ్యమునకే ప్రాముఖ్యము). అట్లే గౌర (తెలుపు), కృష్ణ (నలుపు), అను శబ్దములు విడిగా వాడినపుడు విశేషణములై విశేష్యమగు ఆ యా వస్తువును చెప్పును. సమాసముగా ప్రయోగించినపుడు రంగుతో నిమిత్తము లేకుండ ఒక జాతిని బోధించును. ''గౌరఖర'', ''కృష్ణసర్ప'' మొదలగునవి నిత్యసమాసములు. ''గౌరశ్చాసౌ ఖరశ్చ'', ''కృష్ణశ్చాసౌ సర్పశ్చ'' అను విగ్రహ వాక్యములను సౌకర్యమునకై చూపినను అవి వాస్తవములు కావు భాషలో మొదటినుండియు అవి సమాసములుగానే వాడబడుచు ఒక ఖర జాతిని ఒక సర్ప జాతిని తెలియజేయుచున్నవి. తెలుపు రంగున్నను లేకపోయినను ఒక జాతికిచెందిన గాడిదను ''గౌరఖర'' మందురు అట్లే నలుపున్నను లేకున్నను ఒక జాతికిచెందిన పామును ''కృష్ణ సర్ప'' మందురు. కాగా ఏకార్థీభావ మనెడి వృత్తి ధర్మమువలన ఆ యా విశేషార్థములు లభించును. వాక్యమందది యుండదుగాన ఆ యర్థములు రావు.

విశేష విషయములు—— ఇచట మరియొక చిత్రము కూడ ఉన్నది. మీద చూపి నట్లు ''గౌరఖర'', ''కృష్ణసర్ప'' మొదలగు శబ్దములు వృత్తియందు సూటిగ జాతిని బోధిం చును గాన, వానికి మత్వర్థ ప్రత్యయమును (''అది దీనికి గలదు'' అను నర్థమున మతుప్- అను తద్ధిత ప్రత్యయమును గాని, ఆ యర్థమే గల వేరొక తద్ధితమును గాని) సరాసరిగ తగిలింప వీలు కలుగును. ఉదా : ''గౌరఖరవత్'' - అరణ్యమ్'' (గౌరఖరాః - అస్మిన్ - సంతి = గౌరఖరజాతి కల అడవి), ''కృష్ణసర్పవాన్ - వల్మీకః'' (కృష్ణసర్పాః - అస్మిన్ - సంతి = కృష్ణసర్ప జాతిగల పుట్ట) మొదలగు ప్రయోగములు కుదురును. అట్లుగాక ఆ శబ్ద ములు మామూలుగ ఆ యా రంగుగల వస్తువునే బోధించు కర్మధారయ సమాసములన్నచో, వానికి మత్వర్థ ప్రత్యయమును చేర్ప వీలుండదు. మత్వర్థము (''అది దీనికి గలదు'' అనునది) బహుబ్రీహి సమాసమును చేసినందువలననే సిద్ధించునుగాన, (గౌరాః ఖరాః - యస్మిన్ - తత్ = గౌరఖరమ్ = అరణ్యమ్, కృష్ణాః సర్పాః - యస్మిన్ - సః = కృష్ణసర్పః = వల్మీకః - అను రీతిని) లాఘవము ననుసరించి ఇచట బహుబ్రీహినే చేయక తప్పదు. అందు వలననే అభిమతమైన యర్థమును బహుబ్రీహి అందించగల సందర్భములలో కర్మధారయ మును స్వీకరించి దానికి మత్వర్థ ప్రత్యయమును సామాన్యముగా చేర్చరు.

''భిద్యంతే - అస్మిన్ - అర్థాః = భేదః = ఇందర్థములు విడిగా ఉండును. ఈ వ్యుత్పత్తినిబట్టి భేద శబ్దమున కిచట ''వాక్యము'' అని యర్థము. ॥39॥

*అవతారిక*—— వృత్తికిని వాక్యమునకును గల సహజమైన భేదము విషయములో వ్యాకరణ ప్రవర్తకుల సంవాదమును చూపుచున్నాడు.

శ్లో॥ క్రీడాయాం జీవికాయాం చ వాక్యేనాఽవచనాత్తథా ।
న నిత్యగ్రహణం యుక్తం కౌటిల్యేయఢ్ విధౌ యథా ॥ 40

కౌటిల్యే = ''వంకర'' అను నర్థమున, యజ్విధౌ = యజ్ ప్రత్యయమును విధించు సూత్ర మందు, యథా = ఎట్లో, తథా = అట్లు, వాక్యేన = వాక్యముచే, అవచనాత్ = వృత్తియొక్క అర్థము రానందువలన, క్రీడాయామ్ = క్రీడయందును, జీవికాయామ్ + చ = జీవికయందును, నిత్యగ్రహణమ్ = ''నిత్యమ్'', అను పదము, న + యుక్తమ్ = సముచితము కాదు.

**తాత్పర్యము**— వృత్తివలన లభించు అర్థము వాక్యమువలన లభింపదుగాన ''నిత్యం కౌటిల్యే గతౌ'' (3-1-23) అను యజ్ ప్రత్యయమును విధించు సూత్రములో ''నిత్యమ్'' అను పద మక్కరలేదనియు, అంత మాత్రమున దోషము లేదనియును కాత్యాయనుడును పతంజలియు ప్రతిపాదించిరి. అదే హేతువుచే ''నిత్యం క్రీడా జీవికయోః'' (2-2-17) అను షష్ఠీ సమాసమును విధించు సూత్రమందలి నిత్యపదము కూడ ఆవశ్యకము కాదు

**వివరణము**— యజ్ (య) అనునది ''హల్వర్ణము మొదట గలిగి, ఒక అచ్చుగల ధాతువులకు'' చేరు ప్రత్యయము. ''క్రియా సమభిహారము'' (ఒక పని మాటి మాటికిని జరుగుట —లేక— తీవ్రముగ జరుగుట) అన్నది దీని యర్థము. ఉదా : బోభూయతే. భూధాతువునకు యజ్ ప్రత్యయము చేరిన రూపము. ఈ ప్రత్యయము చేరినను వృత్తి యగును. (సనాద్యంత ధాతు వృత్తి).

ఈ సందర్భములో ''నిత్యం కౌటిల్యే గతౌ'' (3-1-23) అను సూత్రమున్నది. ''గత్యర్థకములైన (వెళ్ళు, అను అర్థము కలవి) ధాతువులకు ''వంకర'' అను నర్థమున (వంకరగ నడచుట) యజ్ ప్రత్యయము నిత్యముగనగును'' అను భావముతో పాణిని ''నిత్యమ్'' అను పదము నుపయోగించెను ఉదా : ''వావ్రజ్యతే'' (వ్రజ, ధాతువునకు యఙ్. వంకరగ నడచుచున్నాడని యర్థము) ఈ యర్థమున'' కుటిలం వ్రజతి'' అని విడిగా వాక్యమును వాడకూడదని పాణిని యాశయము. కాని కాత్యాయన పతంజలులు నిత్య పదమును త్రోసి పుచ్చినారు. ''కుటిలం వ్రజతి'' అను వాక్యమువలన ''కుటిలుని గురించి పోవుచున్నాడు'' —లేక— ''కుటిలమగు దారిని పట్టుచున్నాడు'' అను నర్థమే ప్రసిద్ధముగ వచ్చును. ''వంకరగ నడచుచున్నాడు'' అను నర్థము రాదు. కాగా ''వావ్రజ్యతే'' అను వృత్తి పదము సమర్పించు అర్థమును వాక్యము సమర్పింపజాలదు. ఇట్లు ఆ యర్థమున వాక్య ప్రయోగమునకు సంభవమే లేదు. అందుచే ''కౌటిల్యే గతౌ'' అనియే సూత్రము నుంచి, ''కౌటిల్యార్థమందు మాత్రమే గత్యర్థకములకు యజ్ ప్రత్యయమగున''ని వారు వ్యాఖ్యానించిరి. వృత్తి యొక్క అర్థమును వాక్యము చెప్పజాలక పోవుటయే ఇచట ముఖ్యమైన హేతువు.

ఇదే హేతువును పురస్కరించికొని "నిత్యం క్రీడా జీవికయోః" (2-2-17) అను సూత్రమున నిత్య పదమును త్రోసివేయవచ్చునని భర్తృహరి యొక్క ప్రతిపాదనము. "సమాసము మొత్తముపై ఒక ఆట —లేక— ఒక బ్రతుకుతెరువు అను నర్థము వచ్చునపుడు, షష్ఠ్యంతమగు పదము "అక" అను ప్రత్యయ మంతమందు గల పదముతో నిత్యముగ సమ

సించును" అని సూత్రార్థము. "ఉద్దాలక పుష్ప భంజికా" (ఉద్దాలక పుష్పములతో ఆడు ఒక ఆట). "దంతలేఖకః" (దంతములను బాగుచేసి పొట్టగడుపుకొనుట) అనునవి ఉదాహరణములు ఇచట "ఉద్దాలక పుష్పాణాం - భంజనమ్" (ఉద్దాలక పుష్పములను పాడుచేయుట), "దంతానాం - లేఖనేన - యః - జీవతి" (దంతములను బాగుచేయుటచే బ్రతుకువాడు) అను వాక్యములను వాడినచో "ఆట" "బ్రతుకుతెరువు" అను నర్థములు రానేరావు. సమాసములుగ వాడినపుడే అవి వచ్చును. అది శబ్దశక్తి యొక్క వైచిత్ర్యము. కాగా వాక్యమందు అతి ప్రసక్తి ఉండదు కావున నిత్యపద మక్కరలేదనుట ఇచటి తత్త్వము.

విశేష విషయములు— ఈ విధముగ వృత్తికిని వాక్యమునకును భేదములు పెక్కులున్నవి ఈ ప్రకరణము వృత్తికిని నియతమైన ధర్మములనే విశదపరచును. పదార్థముల సంఖ్య స్పష్టముగ తెలియుట, (రాజ్ఞః - పురుషః, రాజ్ఞోః పురుషః, రాజ్ఞామ్ - పురుషః - మొదలగు రీతిని) అప్రధానముగ నుండు పదార్థమునకు విశేషణమును చేర్చుట, (సుందరస్య-రాజ్ఞః - పురుషః - మొదలగు తీరు, చకారమును తప్పక వాడుట (ఘటశ్చ పటశ్చ - మొదలగు విధము), మొదలగు విశేషములు వాక్యమునకు నియతములు. విశేషణ విశేష్యభావము మొదలగు కొన్ని ధర్మములు వృత్తి వాక్యములకు సమానములు. "సమర్థః పదవిధిః" (2-1-1) అను సూత్రముయొక్క భాష్యమున ఇవన్నియు సమగ్రముగ చూపబడినవి. ॥40॥

*అవతారిక*— ఇట్లు వృత్తికిని వాక్యమునకును భేదము సిద్ధింపగా—

**శ్లో॥ నిర్ధారణాదివిషయే వ్యపేక్షైవ యతఃస్థితా ।
సమాస ప్రతిషేధానాం తతోనాస్తి ప్రయోజనమ్ ॥** 41

నిర్ధారణాది విషయే = నిర్ధారణము మొదలగు విషయమున, వ్యపేక్షా + ఏవ = వ్యపేక్షా సామర్థ్యమే, యతః = ఎందువలన, స్థితా = ఉన్నదో, తతః = అందువలన సమాస ప్రతిషేధానామ్ = సమాసమును వారించుటకు, ప్రయోజనమ్ = ఫలితము, న + అస్తి = లేదు.

తాత్పర్యము— ఏదో యొక ధర్మమునుబట్టి ఒక వ్యక్తిని సముదాయమునుండి వేరుచేయుట నిర్ధారణము. దీనిని తెలియజేయునపుడు సముదాయమును బోధించు పదమునకు షష్ఠీ విభక్తి వచ్చును. ఉదా: "గవాం కృష్ణా బహుక్షీరా" (ఆవులలో నల్ల ఆవు మిక్కిలి పాలు గలది). ఇట్టి చోట్ల వాక్యమువలననే అభిమతార్థము లభించును. "గోకృష్ణా" అని సమాసమును చేసినచో ఆ యర్థము రాదు. అది శబ్దశక్తి యొక్క స్వభావము. కాగా వ్యపేక్షా సామర్థ్యమేగాని ఏకార్థీ భావ మిట్టిచోట్ల పొసగనే పొసగదు. అందువలన సమాసమునకు ప్రసక్తియే లేదుగాన, వేరుగ "ననిర్ధారణే" (2-2-10) అను సూత్రముచే సమాసమును వారింప నక్కరలేదు.

*వివరణము*— "యతశ్చ నిర్ధారణమ్" (2-3-41) అనునది షష్ఠిని విధించు సూత్రము "ఏ సముదాయము నుండి జాతి, గుణము, మొదలగు ఏదో యొక ధర్మమునుబట్టి

అవయవమును వేరుచేసి చూపుదుమో - ఆ సముదాయమును చెప్పు శబ్దమునకు షష్ఠియు సప్తమియు అగునని" అర్థము. "*గవామ్ - గోషువా కృష్ణా బహుక్షీరా*" మొదలగునవి ఉదాహరణములు. "న నిర్ధారణే" (2-2-10) అనునది షష్ఠీ సమాసమును నిషేధించు సూత్రము. "నిర్ధారణమను అర్థమందు ఉండు షష్ఠ్యంతము సమసింపదు" అని యర్థము. సమాసము చేసినయెడల ("గోకృష్ణా" మొదలగు రీతిని) నిర్ధారణమను అర్థము రానేరాదు. షష్ఠీ సమాసమును నిషేధించు సూత్రములు ఇట్టివే మరికొన్ని కూడ కలవు. ఆ యా స్థలములలో కూడ వాక్యమే సహజమగును గాన ఆ సూత్రములును నిష్ఫలములేయని ఊహింపవలెను. ॥41॥

*అవతారిక*— శబ్దములకు గల శక్తి వైచిత్ర్యము స్వభావ సిద్ధము. అది ఒకరు పెట్టునదియు మరొకరు తీసివేయునదియు కాదు. ఈ యంశమును సూచించుటయే శాస్త్రము చేయు పని అని యనుచున్నాడు.

**శ్లో విధిభిః ప్రతిషేధైశ్చ భేదాభేద నిదర్శనమ్ ।**
**కృతం ద్వంద్వైకవద్భావే సంఘవృత్త్యుపదేశవత్ ॥** 42

ద్వంద్వైకవద్భావే = ద్వంద్వ సమాసమందలి ఏకవద్భావమందు, సంఘవృత్త్యుపదేశవత్ = సమాహారమును చెప్పుటను సూచించునట్లు, భేదాఽభేదనిదర్శనమ్ = భేదము యొక్కయు అభేదము యొక్కయు సూచనము, విధిభిః = సమాస విధులచేతను, ప్రతిషేధైః + చ = సమాస నిషేధములచేతను, కృతమ్ = చేయబడినది.

**తాత్పర్యము**— కొన్నిచోట్ల సమాహార ద్వంద్వమునకు ఏకవద్భావమును (సముదాయమును మాత్రమే తెలుపుట) శాస్త్రము విధించినది. అది కేవలము సహజమైన యంశమును విశదీకరించుటయే గాని క్రొత్తగా తీసికొని వచ్చియుంచుట కాదు. అట్లే సమాస విధులన్నియు సహజమైన ఏకార్థీ భావమును సమాస నిషేధములన్నియు సహజమైన వ్యపేక్షను చూపించును.

*వివరణము*— ముందు లక్ష్యము. పిదప లక్షణము. లక్ష్యము ననుసరించియే లక్షణము బయలుదేరును. సిద్ధముగనున్న భాషకు సహజమైన ధర్మములను ఎత్తి చూపి, వాని నొక సంప్రదాయముగా తీర్చి దిద్దుటయే వ్యాకరణ శాస్త్రముయొక్క ముఖ్య కర్తవ్యము. ఏకార్థీ భావము కొన్నిచోట్ల సహజము. అట్టిచోట్ల శాస్త్రము సమాసమును విధించును. కొన్నిచోట్ల వ్యపేక్షయే స్వభావము. అచట శాస్త్రము సమాసమును వారించును. అంతియేగాని తనంత తానుగ శాస్త్రము చేయునది ఏదియు లేదు. కాగా ఆ యా స్థలములందలి భేదమును (భేద సంబంధము = వాక్యదశ = వ్యపేక్ష) అభేదమును (అభేద సంబంధము = వృత్తిదశ = ఏకార్థీ భావము) సహజ సిద్ధములు.

విశేష విషయములు— "భిద్యంతే - అస్మిన్ - అర్థాః = భేదః" పదార్థములు విడిగా ఉండి సంబంధమును కలుపుకొని, విశేషణ విశేష్యరూపమైన ఒక అర్థమును చెప్పుట

భేదమగును. ఇది వాక్యమందుండును దీనికే వ్యపేక్ష అని పేరు. భేదమునకు విరుద్ధమైనది అభేదము. అనగా పదార్థము లన్నియు ఒకటిగా మారి ఒకే యర్థమును చెప్పుట. ఇది వృత్తి యొక్క స్వభావము. దీనికే ఏకార్థీ భావమని పేరు.

"పాణి పాదమ్" మొదలగు ద్వంద్వములలో సమాహారమే సహజము. (సమాహార మొకటే గాన ఎల్లపుడు ఏకవచనమే యగును. ఇదియే ఏకవద్భావము) "దధిపయసీ" మొదలగు చోట్ల ఇతరేతరయోగమే సహజము. ఈ విషయమునే ఆ యా సూత్రములనువదించును. ॥42॥

*అవతారిక*— "సామర్థ్యము గలది సమర్థము. సమర్థః పదవిధిః (2-1-1) అను సూత్రమున సమర్థ శబ్దమువలన వ్యపేక్షయు ఏకార్థీ భావమును కూడ సామాన్యముగా సూచితములైనవి. ప్రయోగముల ననుసరించి వాని విభాగమును లక్షణములను నియమములను వ్యాఖ్యాతలు వివరించి చూపినారు" అని చెప్పుచున్నాడు.

శ్లో॥ సామర్థ్యమవిశేషోక్తమపి లోకవ్యవస్థయా ।
వృత్త్యవృత్త్యోః ప్రయోజ్ఞైర్విభక్తం ప్రతిపత్తృభిః ॥ 43

అవిశేషోక్తమ్ + అపి = విశేషము లేకుండ చెప్పబడినను, సామర్థ్యమ్ = సామర్థ్యము, లోకవ్యవస్థయా = వ్యవహారము యొక్క ఏర్పాటు ననుసరించి, ప్రయోగజ్ఞైః = లక్ష్యములను తెలిసిన, ప్రతిపత్తృభిః = వ్యాఖ్యాతలచే, వృత్త్యవృత్త్యోః = వృత్తికిని వాక్యమునకును, విభక్తమ్ = వేరు చేయబడినది (పంచబడినది).

*తాత్పర్యము*— "సమర్థః పదవిధిః" అను సూత్రమున సమర్థ పదమునే సామర్థ్యమును సామాన్యముగా పాణిని నిర్దేశించెను. పిదప లోకవ్యవహారము ననుసరించి కాత్యాయనుడును పతంజలియు "వాక్యమందు వ్యపేక్ష అనియు వృత్తియందేకార్థీభావమనియును" ఉదాహరణ పూర్వకముగా సిద్ధాంతము చేసి చూపిరి.

*వివరణము*— "సమ్" అను ఉపసర్గమునకును "అర్థ" శబ్దమునకును సమాసము జరుగగా "సమర్థ" అను శబ్దము సిద్ధమగును. ఉపసర్గము యొక్క బలమువలన అభిమతమైన భావము లభించును. కాగా "సమ్ = సంబద్ధః = పరస్పరము కలిసిన, అర్థః = అర్థము" అని చెప్పినచో వ్యపేక్షయగును. "సమ్ = సంగతః = ఒకటిగా మారిన, అర్థః = అర్థము" అని యన్నచో ఏకార్థీ భావమగును. ఇట్లు సమర్థ పదమువలన రెండు విధములైన సామర్థ్యములను కూడగట్టవచ్చునని పతంజలి స్పష్టముగ చెప్పెను. ప్రయోగముల ననుసరించి ఒకానొక వ్యవస్థను (కట్టుబాటు) ఏర్పాటు చేయుటకై వాక్యమందు వ్యపేక్ష అనియు వృత్తియందేకార్థీభావమనియును అంగీకరింపక తప్పదని యుక్తి పూర్వకముగను ఉదాహరణ పూర్వకముగను అతడే విశదీకరించెను.

విశేష విషయములు— రెండు విధములైన సామర్థ్యముల యొక్క స్వరూప

సమభివ్యాహారరూపమగు వాక్యమనెడి* ప్రమాణమువలన గుణ ద్రవ్యములకు పరస్పర సంబంధము, ఇతర వ్యావృత్తియు కలుగును ॥75॥

*అవతారిక*— జాతి, గుణము రెండు శబ్దబోధ్యములే కనుక ఆ రెండు కూడ శ్రుతి, వాక్యము అను రెండు ప్రమాణములచే క్రియాంగములు, పరస్పరము అన్వితములు కాగలవని యింతవరకు నిరూపింపబడినది.

దానిపై ఒక ప్రశ్న కలుగుచున్నది— తెల్లని మేకను ఉపయోగించి యాగము చేయవలెనని శ్రుతి చెప్పుచున్నది అచట మేక అను ద్రవ్యము తెలుపు అను గుణము రెండు ముఖ్యములే యగుచున్నవి.

కాని తెల్లని మేక లభింపనిచో యాగమున ఏది ద్రవ్యము కాగలదు ? నల్లని మేకను ఉపయోగింపవలెనా ? కాక తెల్లని గొఱ్ఱెను ఉపయోగింపవలెనా ? ఏదో ద్రవ్యమును గ్రహించి యాగము చేయక తప్పదుకదా ! దీనికి జాతిశక్తి వాదమున 77 వ శ్లోకమున సమాధానము చెప్పుచు, ద్రవ్య వాదమున ఈ దోషము దుర్వారమేయని నిర్ణయించుచున్నాడు.

శ్లో॥ తత్ర ద్రవ్యగుణాభావే ప్రత్యేకం స్యాద్వికల్పనమ్ ।
శ్రుతి ప్రాప్తోపి సంబన్ధోబలవాన్ వాక్యలక్షణాత్ ॥ 76

A ద్రవ్య గుణాభావే = ద్రవ్యము, గుణము రెండు లేనపుడు అనగా తెల్లని మేక లభింపనపుడు, తత్ర = ఆ రెంటియందు, ప్రత్యేకమ్ = వేరువేరుగా, వికల్పనమ్ = వికల్పము, అనగా ద్రవ్యమునుగాని గుణమునుగాని గ్రహింపవచ్చుననెడి వికల్పము, స్యాత్ = కలుగుచున్నది.

తెల్లని మేకతో యాగము చేయుమని శ్రుతి చెప్పుచున్నది. అట్టి మేక దొరకనిచో తెల్లని గొఱ్ఱెనుగాని, నల్లని మేకనుగాని గ్రహించి యాగము చేయవచ్చునని భావము లభించుచున్నది.

B. 'శ్వేతం ఛాగమాలభేత' అను ఒకే వాక్యమున ద్రవ్య గుణములు గ్రహింపబడియున్నందున ఆ రెంటికి సంబంధము కలుగుచుండగా వానికి వికల్ప ప్రసక్తి యెట్లు అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. శ్రుతిప్రాప్తః = శ్రుతియనే ప్రమాణమువలన లభించిన, సంబన్ధః = సంబంధము, వాక్యలక్షణాత్ = వాక్యరూపమగు అనగా వాక్యమనే ప్రమాణము వలన కలిగెడి సంబంధము కంటె, బలవాన్ + హి = బలవంతమైనది కదా !

ద్రవ్య గుణములకు క్రియతో సంబంధము శ్రుతివలన లభించును. శ్వేతమ్ ఛాగమ్ అను ద్వితీయా శ్రుతి, తిఙ్ విభక్తి శ్రుతి, ఇందు కారణము.

---

* పూర్వమీమాంసా శాస్త్రమున వాక్యార్థనిర్ణయమునకు 1. శ్రుతి, 2. లింగము 3. వాక్యము, 4. ప్రకరణము, 5. స్థానము, 6. సమాఖ్య అను రీతిని ఆరు ప్రమాణములను ఆశ్రయించిరి.

స్వభావములును, వాని వాని నియతమైన ధర్మములును, సమానమైన ధర్మములును, "సమర్థః పదవిధిః" అను సూత్రము యొక్క భాష్యములో సుదీర్ఘముగ చర్చింపబడినవి. అవియే యథావకాశముగను యథాసందర్భముగను ఈ ప్రకరణమున చూపబడుచున్నవి. ॥43॥

*అవతారిక*— "వాక్యమందు వ్యపేక్ష - వృత్తియందేకార్థీభావము" అను విభాగ మందలి యుక్తిని చూపుచున్నాడు.

**శ్లో॥ అర్థస్య వినివృత్తత్వాల్లుగాది న విరుధ్యతే ।
ఏకార్థీభావ ఏవాతః సమాసాఖ్యా విధీయతే ॥ 44**

అర్థస్య = అర్థము, వినివృత్తత్వాత్ = పోవునుగాన, లుగాది = లుక్కు మొదలగు కార్యము, న + విరుధ్యతే = అడ్డుపడదు, అతః = ఇందువలన, ఏకార్థీభావే + ఏవ = ఏకార్థీ భావ మందే, సమాసాఖ్యా = సమాసమను వ్యవహారము. విధీయతే = విధింపబడును.

**తాత్పర్యము**— "సుపోధాతు ప్రాతిపదికయోః" (2-4-71) అను సూత్రము వృత్తికి అవయవములుగా ఉండు పదముల సుప్ ప్రత్యయములకు లోపము (జారిపోవుట)ను చెప్పును. ఏకార్థీభావమందు ఆయా ప్రత్యయముల విశేషార్థము సహజముగనే పోవునుగాన అట్లు చెప్పుట సముచితమే. అందువలననే ఏకార్థీభావమందే సమాసమనుటయును సమంజసము.

*వివరణము*— విశేషణ విశేష్యభావముగల ఒకే ఒక అర్థము వృత్తిపలన బోధ పడును. కావున అవయవములుగా ఉండు పదార్థములకు చెందిన భేదభావనయు, సంఖ్యయు తనంత తానే తొలగిపోవును. అయినపుడు వానిని సూచించుటకై వేరుగ సుప్ ప్రత్యయము లుండనక్కరలేదు. సహజమగు ఈ అంశమునే సూత్రము విశదపరచెను. ఇట్టి స్థితి సమాస మునకే నప్పునుగాని వాక్యమునకు నప్పదు.

విశేష విషయములు— "సుపోధాతు ప్రాతిపదికయోః" (2-4-71). "ధాతువున కును ప్రాతిపదికమునకును అవయవములైన సుప్ ప్రత్యయములు లోపించును" అని యర్థము. ప్రాతిపదికము విషయమున ఉదాహరణము : రాజపురుషః. (రాజ్ఞః పురుషః) ఇచట "రాజన్ + ఙస్ + పురుష + సు" అని అలౌకికమగు విగ్రహము. (ఇది ప్రయో గార్హము కాదు. శాస్త్రీయ కార్యములకొరకు దీనిని చూపుదురు) ఈ అవస్థయందు సమాసము జరుగును. సమాసము మరల ప్రాతిపదికమగును. ("కృత్తద్ధిత సమాసాశ్చ" (1-4-46) = కృదంతములును, తద్ధితాంతములును, సమాసములును ప్రాతిపదికములగును.) సుప్ ప్రత్య యములకు ప్రకృత సూత్రముచే లోపము. "రాజపురుష" అని యగును. "రాజసంబంధియగు వ్యక్తి" అని మొత్తముపై యర్థము. ఇట్లు రాజ శబ్దముయొక్క అర్థము వేరుగ భాసించుటయు, అచటి సంఖ్యా విశేషమును (ఒక రాజు, ఇరువురు రాజులు, మొదలగునది) సామర్థ్యము యొక్క మహిమచే సమసిపోవును. "రాజునకు చెందు" అని ఏకత్వ సంఖ్యయే సామాన్య ముగ తెలియును. దీనిని "అభేదైకత్వ సంఖ్య" అని యందురు. ఇది వృత్తులందు భాసించును.

(దీని వివరములు ముందు చూపబడును). కృత్తు, తద్ధితము, ఏకశేషము అను వృత్తులందు కూడ ఇదియే తీరు ధాతు విషయమున ఉదాహరణము : "పుత్రీయతి" ఇచట "పుత్రమ్ - ఆత్మనః - ఇచ్ఛతి" అనునది లౌకిక విగ్రహము. "పుత్ర + అమ్" అని అలౌకికము. ఇపుడు "య" అను ప్రత్యయమగును. "పుత్ర + అమ్ + య". ఈ దశ మొత్తము ధాతువగును. ప్రకృత సూత్రముచే "అమ్" అనునది లోపించును. (పుత్రయ) ప్రక్రియా విశేషమున "పుత్రీయతి" (పుత్రుని కోరుచున్నాడు) అని సిద్ధించును. ఇది "సనాద్యంత ధాతు వృత్తి" అనబడును.

కాగా మీది సూత్రముచే సుప్ ప్రత్యయములకు లోపమును విధించినందువలన "సమాసమందేకార్థీభావమే" పాణిని యభిమతమని పర్యవసించును. ॥44॥

*అవతారిక*— ''సమాసమునకును వాక్యమునకును గల సామర్థ్యభేదమును పాణిని స్పష్టముగనే చెప్పెననవచ్చును'' అని కొందరందురు. వారి యాశయమును చూపుచున్నాడు.

**శ్లో॥ వ్యవస్థితవిభాషా చ సామాన్యే కైశ్చిదిష్యతే ।**
**తథా వాక్యం వ్యపేక్షాయాం సమాసోఽన్యత్ర శిష్యతే ॥ 45**

సామాన్యే = ఎట్టి విశేషమును లేని సామర్థ్యము విషయమున, వ్యవస్థిత విభాషా + చ = నియతమైన వికల్పము, కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = కోరబడుచున్నది, తథా = అట్లు, వ్యపేక్షాయామ్ = వ్యపేక్షయందు, వాక్యమ్ = వాక్యమును, అన్యత్ర = వేరొక దానియందు (ఏకార్థీభావమందు) సమాసః = సమాసమును, శిష్యతే = నియమింపబడుచున్నది.

*తాత్పర్యము*— ''విభాషా'' (2-1-11) అని పాణిని చెప్పిన– సమాసములకు సంబంధించిన వికల్పమునకు, ఒక నియమమును కల్పించి ''వ్యపేక్షయందు వాక్యమే'' అనియు ''ఏకార్థీభావమందు సమాసమే (వృత్తియే) సాధువు'' అనియును కొందరు చెప్పుదురు.

*వివరణము*— ''విభాషా'' అనగా వికల్పము. ఏవో ఒకటి రెండు తప్ప, మిగిలిన సమాసము లన్నియు వికల్పములే (సమాసమగుటయు కాకుండుటయును సాధువే) అని ఈ సూత్రము చెప్పును సమాసము లన్నింటికిని వర్తించును గాన దీనిని ''మహావిభాష'' అనియందురు. ''సమర్థః పదవిధిః'' (2-1-1) అను సూత్రము ప్రతియొక పదవిధికిని సంబంధించును. కాగా ఇచటి సమర్థపదము వ్యపేక్షను ఏకార్థీభావమును కూడ సామాన్యముగ సూచించినను, ఈ మహావిభాషకును సూత్రమునకును సంబంధమును ఏర్పరచి వ్యపేక్షా సామర్థ్యమున్నచో వాక్యమే అనియు, ఏకార్థీభావమున్నచో సమాసమే అనియును నియమమును చేయవచ్చును. అపుడు సామర్థ్యము యొక్క పంపకమును పాణినియే చేసేనను టకవకాశ ముండును. అనగా వెనుక చూపిన (44 వ కారిక) లుగ్విధానము సమాసమందేకార్థీభావమును జ్ఞాపనము చేయునని చెప్పనక్కరలేదని ఈ వాదమందలి సారము.

*విశేష విషయములు*— వికల్పమునకు ఒక విధమైన కట్టుబాటును చేయుటను

''వ్యవస్థ'' అందురు. అట్టి వ్యవస్థగల విభాష ''వ్యవస్థిత విభాష'' అగును. సమర్థ సూత్రమున రెండు విధములైన సామర్థ్యములను కలగాపులగముగ పాణిని సూచించెనన్న పక్షమున, పదవిధులన్నింటియందును ఆ రెండు సామర్థ్యములకును అవకాశమున్నదనవచ్చును. కాని వెన్వెంటనే ఉన్న ''విభాషా'' అన్న అతని మాటకు వ్యవస్థను ఏర్పరిచినచో (సామాన్యమైన ఆ సామర్థ్యము వికల్పమని తొలుత నిది సూచించునుగదా!) వాక్యమందు వ్యపేక్షయే యనియు వృత్తియందేకార్థీభావమేయనియు ఫలించును. కావున ఎట్టి చిక్కును కలుగదు.

వాక్యమునకు వ్యపేక్షయు వృత్తికి (సమాసమునకు) ఏకార్థీభావమును మిక్కిలి సహజములుగాన, వేరుగ ఎట్టి ఏర్పాటును చేయనక్కరయే లేదని భావించి కాత్యాయనుడు ''విభాషా'' అను సూత్రమును త్రోసి పుచ్చెను. ॥45॥

*అవతారిక*— వ్యపేక్షయందును ఏకార్థీభావమందును శబ్దములును అర్థములును ఇంచుమించు సమానములే. అయినను ఏకార్థీభావమున ఒక విశేషమున్నదని చూపుచున్నాడు.

**శ్లో॥ తుల్యశ్రుతిత్వాత్తత్త్వేఽపి రాజాదీనాముపాశ్రితే।**
**వృత్తౌ విశేషణాకాంక్షాగమకత్వాన్నివర్తతే॥** 46

**తుల్య శ్రుతిత్వాత్** = సమానముగ వినిపించుటవలన, రాజాదీనామ్ = రాజ, మొదలగు **శబ్దములకు, తత్త్వే** = అభేదము, **ఉపాశ్రితే + అపి** = ఆశ్రయింపబడినను, వృత్తౌ = వృత్తియందు, **అగమకత్వాత్** = గమకము లేనందువలన, విశేషణాకాంక్షా = విశేషణము యొక్క **అపేక్ష, నివర్తతే** = నివర్తించును.

తాత్పర్యము— ''రాజ్ఞః పురుషః'', ఇది వాక్యము. ''రాజ పురుషః''. ఇది సమాసవృత్తి. రెండవ స్థలమందును శబ్దములు సమానములే. అయినను వాక్యమందలి ''రాజ్ఞః'' అను దానికి ''వీరస్య'' (శూరుడైన) మొదలగు విశేషణములను చేర్ప వీలున్నది. ''ఎట్టి రాజు?'' అను శంకను పోగొట్టుటకు అట్టి విశేషణములు పనికి వచ్చును. కాని ''రాజ పురుషః'' అను సమాసమున కవయవమైన రాజ శబ్దమునకు అట్టి విశేషణములను కూర్ప వీలుండదు. అచట ''పురుష'' మొదలగు చివరి పదముయొక్క అర్థమే ముఖ్యము. తొలి పదముయొక్క అర్థము దానికి విశేషణమై దానియందే లీనమైనందున అప్రధానమై తన స్వాతంత్ర్యమును కోల్పోవును. అందుచే అట్టి దానికి విశేషణముతోడి సంబంధము కుదురదు.

వివరణము— వాక్యమందలి సామర్థ్యము వ్యపేక్ష. భేదము ప్రధానముగా గల పదార్థముల సంబంధము దీనియొక్క ముఖ్య ధర్మము. అనగా పదార్థములు ఒండొరులు విశేషణ విశేష్యభావముతో కలిసినను, వాని స్వతంత్రతకు లోటుండదు. అది భాసించుచునే యుండును. అట్టి స్థితియందు ఇచ్ఛానుసారము విశేషణములను కూర్పవచ్చును. వృత్తియందలి సామర్థ్యమేకార్థీభావము. అభేదము ప్రధానముగా గల పదార్థముల సంబంధము దీని ధర్మము. ఇందు ఒక పదార్థమే ముఖ్యముగ నుండి దానితో సంబంధించిన మిగిలిన పదార్థములన్నియు

తమ వ్యక్తిత్వమును కోల్పోవును. ఇట్టి వానిని ఉపసర్జనములందురు. వీనికి విశేషణములను కూర్చుటకు వీలు కలుగదు.

విశేష విషయము:— ఒక అంశమును "తప్పనిసరిగ" సూచించు తీరును "గమకము" అందురు. (గమయతి - ఇతి = గమకమ్ = తెలియజేయునది) వాక్యమందలి పదార్థములకు "ఎట్టిది?" "దేనియొక్క?" మొదలగు శంకలను తీర్చుటకై ఆయా విశేషణముల అపేక్ష సహజము వృత్తియందలి పదార్థముల కట్టి అపేక్ష పొసగదు. ప్రయోగముల వలన కలుగు అర్థానుభవమే అందు ప్రబల ప్రమాణము. "సవిశేషణానాం వృత్తిర్న - వృత్తస్య చ విశేషణయోగో న" (విశేషణములతో కూడిన పదములకు వృత్తి జరుగదు - వృత్తియందలి పదములకు విశేషణములు కూడవు) అని ఈ యంశమునే శాస్త్రకారులు విశదము చేసిరి. కాగా "వీరస్య రాజ్ఞః పురుషః" అను స్థితిలో రాజ శబ్దమునకును పురుష శబ్దమునకును సమాసము జరుగదు. అట్లే "రాజ పురుషః" అను దశలో రాజ శబ్దమునకు విడిగా ఎట్టి విశేషణమును కలుపకూడదు వృత్తికిని వాక్యమునకును గల ఈ విశేషము శబ్ద శక్తి యొక్క ఫలితమే. ॥46॥

*అవతారిక*— గమక మున్నచోట మాత్రము వృత్తియందు కూడ విశేషణమును కూర్పవచ్చు ననుచున్నాడు.

**శ్లో॥ సంబంధిశబ్దః సాపేక్షో నిత్యం సర్వః ప్రయుజ్యతే ।**
**స్వార్థవత్సా వ్యపేక్షాస్య వృత్తావపి న హీయతే ॥ 47**

సర్వః = ప్రతియొక, సంబంధి శబ్దః = సంబంధి శబ్దమును, సాపేక్షః = అపేక్షతో కూడినదై, నిత్యమ్ = ఎల్లపుడును, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును, అస్య = దీనియొక్క, సా = ఆ, వ్యపేక్షా = వ్యపేక్ష, స్వార్థవత్ = తన అర్థమువలె, వృత్తౌ + అపి = వృత్తియందు కూడ, న + హీయతే = విడువబడదు.

తాత్పర్యము— గురు, శిష్య, పితృ, మాతృ, మొదలగు శబ్దములు సంబంధి శబ్దములు. వాక్యమందును వృత్తియందును కూడ ఇవి వేరొక శబ్దమును అపేక్షించుచునే యుండును. అందుచే వీనిని నిత్య సాపేక్షములని యందురు. అందుచేతనే వృత్తియందును ఈ శబ్దములకు విశేషణముగ వేరొక శబ్దమును కూర్చుటకు వీలుండును.

వివరణము — "గురుః" అనగానే "కస్య" (ఎవనియొక్క) అను ప్రశ్న ఎల్లపుడును కలుగును. దానిని పోగొట్టుటకు "దేవదత్తస్య" మొదలగు ఏదోయొక పదమును వాడక తప్పదు. ఇట్లు గురు శబ్దము సంబంధి శబ్దమగును. (అనగా ఒక పదార్థముయొక్క సంబంధమును తప్పక కలిగియుండునది) పితృ, మాతృ, మొదలగు శబ్దములు కూడ ఇట్టివే. వేరొక పదార్థముతోడి సంబంధము ఇచట సహజముగను అంతర్లీనముగను ఉండును. కావున "గురోః కులమ్ = గురుకులమ్" అని సమాసమును చేసినను, అపుడు గురు శబ్దముయొక్క అర్థము

అప్రధానమైపోయినను దానికిగల సహజమైన ఆకాంక్షను తొలగించుటకు "దేవదత్తస్య" మొదలగు ఒక పదమును వాడవచ్చును. దాని యర్థము గురు శబ్దార్థముతో సంబంధించును. ఇట్లు చేయుటలో "ఆకాంక్షను పోగొట్టుట తప్పనిసరి" అగుటయే గమకము.

విశేష విషయములు— స్వస్య + అర్థః = స్వార్థః = శబ్దమునకు సహజమైన అర్థము. దీనినే ప్రాతిపదికార్థమందురు. శబ్దమునకు ఇది ఎంత సహజమో, సంబంధి శబ్దము నకు వేరొక శబ్దమును గురించిన **ఆకాంక్షయు అంత సహజము.** కావున వాక్యమందువలెనే (దేవదత్తస్య గురోః కులమ్) వృత్తియందును ఆకాంక్షను పోగొట్టు శబ్దమును ప్రయోగింపక తీరదు. ఇదియు నొక శబ్దశక్తి వైచిత్ర్యమే. ॥47॥

అవతారిక— పై విషయముననే వేరొక సమన్వయమును చూపుచున్నాడు.

**శ్లో॥ సముదాయేన సంబంధో యేషాం గురుకులాదినా ।**
**సంస్పృశ్యావయవాంస్తే చ యుజ్యంతే తద్వతా సహ ॥ 48**

యేషామ్ = ఏ శబ్దములకు, (వాని యర్థములకు), గురుకులాదినా = గురుకులము మొదలగు, సముదాయేన = సముదాయముతో, సంబంధః = సంబంధము, (అస్తి = కలదో) తే + చ = అవి అయితే, అవయవాన్ = అవయవములను, సంస్పృశ్య = ముట్టుకొని, తద్వతా + సహ = అవయవితో కూడ, (సముదాయముతో) యుజ్యంతే = కూడును.

తాత్పర్యము — "గురుకులమ్ = గురువుగారి యిల్లు" ఈ మొత్తము అర్థమునకే "దేవదత్తస్య" మొదలగు శబ్దముయొక్క అర్థమును కలుపవచ్చును. అట్లు చేయునపుడు ఆ యర్థము అవయవమగు గురు శబ్దార్థముతో తొలుత కలిసి, చివరకు సముదాయార్థముతో కలియునని చెప్పవచ్చును. కాగా "దేవదత్తస్య గురుకులమ్" మొదలగుచోట్ల "దేవదత్తుని గురువు - అతని యిల్లు" అన్నట్లు భావ మేర్పడును. సంబంధి శబ్దములతో వృత్తి జరుగునపు డెల్ల ఇట్లే ఊహింపవలెను.

వివరణము— ఈ పక్షమున - వృత్తియందిమిడిపోయిన ముఖ్యము కానట్టి గుర్వాది శబ్దముల అర్థములతో దేవదత్తాది శబ్దముల అర్థముల కన్వయమని చెప్పనక్కర లేదు. ముఖ్య మైన కులాది శబ్దముల అర్థములతోనే వాని కన్వయమనియు, అది అవయవార్థములను కలియుచు, సముదాయార్థముతో జరుగుననియును చెప్పవచ్చును. కాగా "వృత్తియం దుపసర్జన మైన దానికి విశేషణమును కలుపుట" అను ఆక్షేపమున కవకాశముండదు. "దేవదత్తస్య గురుకులమ్" ఇచట ప్రధానమైనది ఇల్లు. దానితోనే దేవదత్తుని కన్వయము. అయినను సంశ యమును వారించుటకై అతడు అవయవమైన గురు శబ్దార్థమును స్పృశించును. ఆ విధముగ "దేవదత్తస్య గురుః కులమ్" అను వాక్యమువలన లభించు విస్పష్టమైన అర్థమే వృత్తి వలనను లభించును. ॥48॥

అవతారిక— "వృత్తికిని వాక్యమునకును పూర్తిగ భేదమే" అని చెప్పుచున్నాడు.

శ్లో॥ అబుధాన్ ప్రత్యుపాయాశ్చ విచిత్రాః ప్రతిపత్తయే।
శబ్దాంతరత్వాదత్యంత భేదో వాక్యసమాసయోః॥ 49

ప్రతిపత్తయే = సత్యము తెలియుటకు, అబుధాన్ + ప్రతి = పండితులు కాని వారిని గురించి, విచిత్రాః = చిత్రములైన, ఉపాయాః = ఉపాయములు, (కల్ప్యంతే = కల్పింపబడును), శబ్దాంతరత్వాత్ = వేర్వేరు శబ్దములగుటవలన, వాక్యసమాసయోః = వాక్యమునకును సమాసమునకును, అత్యంతభేదః = పూర్తిగా భేదము, (భవతి = అగును).

తాత్పర్యము— వాక్యావస్థను చూపి (రాజ్ఞః పురుషః, మొదలగునది) అదియే ప్రక్రియావశమున సమాసముగ మారునట్లు (రాజ పురుషః) చెప్పుచుందురు. అదంతయు వాస్తవము కాదు. సమాసము యొక్క తత్త్వము తెలియుటకై మందమతుల నుద్దేశించి అట్టి ఉపాయములు చూపబడుచుండును. వాస్తవమున సమాసము వేరు - వాక్యము వేరు. రెండింటికిని ఎట్టి సంబంధమును లేదు.

వివరణము— ఆవు బొమ్మను గీచి "ఇది ఆవు" అని పిల్లలకు బోధింతుము. దానివలన ఆవును గురించిన కొంత జ్ఞానము వారికి కలుగును. కాని ఆవు బొమ్మ వేరు. ఆవు వేరు. రెండును ఒకటి కావు. (కొన్ని పోలికలు మాత్రముండును) వాక్యమునకును సమాసమునకును గల చుట్టరిక మిట్టిదే. విగ్రహ వాక్యమును చూపుటయు, సుప్ ప్రత్యయములు లోపించుననుటయు, వ్యపేక్ష తొలగి ఏకార్థీభావ మేర్పడుననుటయును - ఈ మొదలగు తీరులన్నియు కృతకములు. యథార్థములు కావు. (1) పదములు విడిగా ఉండుట, (2) వ్యపేక్షా సామర్థ్యము, (3) భేదముతో కూడిన పదార్థముల సంబంధము. ఇట్టి ధర్మములు వాక్యమునకు నియతములు. (1) ఒకే పదముగ నుండుట, (2) ఏకార్థీభావము, (3) అభేదము ప్రధానమైన సంబంధము - ఇట్టివి సమాసమునకు నియతములు. మరియు వాక్యస్వరూపము వేరు. సమాస స్వరూపము వేరు. రెండిటి అర్థములును వేర్వేరు అర్థములు వేరయినపుడు శబ్దములును వేరే అనవలయును. కాగా వాక్యమునకును సమాసమునకును పూర్తిగా భేదమే.

విశేష విషయములు— చటి సమాస పదముచే వృత్తుల నన్నింటిని గ్రహింపనగును. "వాక్యమును ఆధారముగా చేసికొని వృత్తిని బోధించుట" కేవలము కల్పితమైన ఉపాయమేగాని సత్యకథనము కానేరదని గ్రంథకర్త యొక్క తాత్పర్యము "భాషయు భాష యొక్క ధర్మములును సహజములనియు, ఆ సత్యమును గుర్తించుటకై ఏర్పడిన అసత్య మార్గమే శాస్త్రమనియును" అతడు తరచుగ వక్కాణించుచునే యుండును.

ఒక విషయము నిచట గ్రహించునది. - "రాజ్ఞః పురుషః", మొదలగు వాక్యములును "రాజపురుషః" మొదలగు వృత్తులును వాడుకకు తగినవే. ఇష్టమైనపుడు వాక్యమునకు బదులుగ వృత్తిని వాడుకొనవచ్చును. "రాజ్ఞః పురుషః" మొదలగు దానిని లౌకికమైన

విగ్రహ వాక్యమందురు. లోకమున ప్రయోగింపదగినదనియు, సత్యమైనదనియును, వృత్తి యొక్క అర్థమును విడమరచి చెప్పునదనియును భావము. ఇట్టిచోట్ల ''రాజన్ + జస్ + పురుష + సు'' అను ఒక దశను చూపి, ఈ దశలో వృత్తి జరుగుననియు, ప్రత్యయములు లోపించుననియును శాస్త్రము చెప్పును. ఇట్టి శాస్త్రమార్గమే కల్పితమని యిచటి తత్త్వము. ॥49॥

*అవతారిక*— ''గోరథః'' అనునది ఒక సమాసము. (ఎడ్లను పూన్చిన బండి) ఇచట ''గోభిః యుక్తః రథః'' అను వాక్యమును వాడుదురు. అట్లయినపుడు ''యుక్త'' అను పదమునకు సమాసమున లోపమని చెప్పవలయునా? అని శంకించి ''అక్కరలేదు'' అనుచున్నాడు.

**శ్లో॥ అసమాసే సమాసే చ గోరథాదిష్వదర్శనాత్ ।**
**యుక్తాదీనాం న శాస్త్రేణ నివృత్త్యనుగమః కృతః ॥ 50**

గోరథాదిషు = ''గోరథ'' మొదలగు స్థలములలో, అసమాసే = వాక్యమందును, సమాసే + చ = సమాసమందును, యుక్తాదీనామ్ = ''యుక్త'' మొదలగు పదములు, అదర్శనాత్ = కనబడక పోవుటవలన, శాస్త్రేణ = శాస్త్రముచే, నివృత్త్యనుగమః = పోవుట, (లోపము) న + కృతః = చేయబడలేదు.

*తాత్పర్యము*— ''గోరథః'' మొదలగుచోట్ల ''గవాం రథః'' మొదలగునవియే వాక్యములు. (గోవుల రథము). సామర్థ్యమునుబట్టి (అర్థముల పొందిక కుదురుటకు) "యుక్తః" (పూన్చబడిన) అను పదము తప్పక స్ఫురించుచుండును. సమాసమున కూడ ఇదియే తీరు. కావున ఆ పదమును వేరుగా వాడరు. కావుననే ఆ పదమునకు వ్యాకరణము లోపమును చెప్పదు.

*వివరణము*— లౌకికమైన విగ్రహ వాక్యము యొక్క అర్థమునే సమాసము బోధించునని సంప్రదాయము. ''రాజ్ఞః పురుషః'' మొదలగు వాక్యములలో సిద్ధముగ నున్న ప్రత్యయముల అర్థము, ''రాజపురుషః'' మొదలగు సమాసములందు సహజముగ ప్రత్యయములు లేకుండగనే తెలియును గాన, ఆ ప్రత్యయములు లోపించునని శాస్త్రము చెప్పును. అది యుక్తమే. కాని ''గోరథః'' మొదలగు వాని స్థితి యిట్టిది కాదు. అచట ''గవాం రథః'' అనియే వాక్యము. ఎడ్లకును రథమునకును వేరొక సంబంధము పొసగదు కాన, ''గోభిః యుక్తః'' (ఎడ్లతో కూర్చబడిన) అను నర్థము అవశ్యము గమ్యమగును. అందుచే "యుక్తః" అను పదమును వేరుగ వాడనక్కరలేదు. వాడని పదమునకు లోపమును కూడ చెప్పనక్కర లేదుగదా! ''దధ్యోదనః'' (దధ్నా - ఉపసిక్తః - ఓదనః = పెరుగుతో తడిసిన అన్నము), ''గుడధానాః'' (గుడేన - సంమిశ్రాః - ధానాః = బెల్లము కలిపిన అటుకులు), ''దధిఘటః'' (దధ్నా పూర్ణః ఘటః = పెరుగుతోనిండిన కుండ), మొదలగుచోట్ల కూడ ఇట్లే ఉపసిక్త, సంమిశ్ర, పూర్ణ, మొదలగు పదములకు లోపమును చెప్పనక్కరలేదు. వానిని వాక్యములలో ప్రయోగింపకుండగనే వాని భావములను తెలియ వీలగును. కాగా వాక్యములో కనిపించుదానికే వృత్తియందు లోపముకాని అచట కనుపింపని దానికి లోపమెందుకు? అని సారము. ॥50॥

అవతారిక— "గోరథః" మొదలగు చోట్ల "గోయుక్తః రథః" మొదలగు తీరులో వాక్యమును వాడినను ఆ రీతి వేరనియు, దానినిబట్టి యుక్త శబ్దమునకు సమాసమున లోపమని చెప్పనక్కర లేదనియును చెప్పుచున్నాడు

శ్లో॥ శబ్దాంతరత్వాద్యుక్తాది క్వచిద్వాక్యే ప్రయుజ్యతే ।
ప్రపర్ణ ప్రపలాశాదౌ గతశబ్దశ్చ వృత్తిషు ॥ 51

క్వచిత్ = ఒకానొక, వాక్యే = వాక్యమందు, శబ్దాంతరత్వాత్ = వేరొక శబ్దమగుటవలన, యుక్తాది = "యుక్త" మొదలయిన పదము, ప్రయుజ్యతే = వాడబడును, వృత్తిషు = వృత్తి జరిగినపుడు, ప్రపర్ణప్రపలాశాదౌ = ప్రపర్ణ - ప్రపలాశ - మొదలగుచోట్ల, గతశబ్దః + చ = "గత" అను శబ్దము కూడ, ప్రయుజ్యతే = వాడబడును.

తాత్పర్యము— "గోయుక్తః రథః", "దధిపూర్ణః ఘటః" మొదలగు వాక్యములను కూడ "గోరథః", "దధిఘటః" మొదలగు సమాసములకు మారుగ ఒకప్పుడు వాడవచ్చును. అయినను ఆ శబ్దములు వేరు. "గోరథః", మొదలగు వానిని విశ్లేషించి చూపునట్టి సరియైన విగ్రహములు కావు అట్లే ప్రపర్ణః, ప్రపలాశః, మొదలగు వృత్తులలో "ప్రగతః పర్ణః", "ప్రపతితః పలాశః" మొదలగు రీతిని చూపబడు గత, పతిత, మొదలగు శబ్దములును వేరు శబ్దములే.

వివరణము— కల్పనయే అయినను సమాసమున కనబడు శబ్దములతోనే విగ్రహమును చూపవలెను. విగ్రహమనగా లోకవ్యవహారమున వాడుటకు వీలులేనట్టియు ప్రకృతి ప్రత్యయములను విడదీసి చూపునట్టి ఒక స్థితి. దీనిని అలౌకిక విగ్రహమందురు. ఈ స్థితి యందే సమాస శాస్త్రము ప్రవర్తించును కాగా "గోరథః" అనుచోట గో శబ్దమును రథ శబ్దమును మాత్రమే అలౌకిక విగ్రహమున వినబడుచున్నవి. (గో + ఆమ్ + రథ + సు). యుక్త శబ్దమచట లేదు. కావున దానికి లోపమును చెప్పనక్కర లేదు. "గోయుక్తః" అనునది వేరొక సమాసమగును. (గోభిః + యుక్తః = తృతీయా తత్పురుషము) దీనిని విశేషణముగను, రథశబ్దమును విశేష్యముగను చేసి, "గోయుక్తః రథః" అను వాక్యమును వాడుటలో తప్పు లేదు కాని అది "గోరథ" అను సమాసమునకు సమానార్థకమైన వేరొక శబ్దమనియే లెక్కకు వచ్చును. అందుచే దానికిని దీనికిని ముడివైచి అచటి యుక్త శబ్ద మిచట లోపించె ననుట సముచితము కాదు. "ప్రపర్ణః" మొదలగు సమాసముల విషయమున కనబడు "గత" మొదలగు శబ్దముల ఉనికియు ఇట్టిదే. "దధ్యోదనః", "దధిఘటః" మొదలగు సమాసములలో కూడ "దధ్యుపసిక్తః ఓదనః", "దధిపూర్ణః ఘటః" మొదలగు వాక్యములు, సమానార్థకములైన వేర్వేరు శబ్దములే కాని సరియైన విగ్రహములు కావని తెలియవలెను. ॥51॥

అవతారిక— వాక్యమును వృత్తియును ఒకే యర్థమును బోధించుననియు, వానికి భేదము లేదనియును కొందరు చెప్పుదురని చూపుచున్నాడు.

**శ్లో॥ విశేషణ విశేష్యత్వం కైశ్చిదేక స్తథాశ్రయః ।
ఉపాయే తత్త్వదర్శిత్వాదిష్యతే వృత్తి వాక్యయోః ॥ 52**

వృత్తి వాక్యయోః = వృత్తియందును వాక్యమందును, విశేషణ విశేష్యత్వమ్ = విశేషణ విశేష్యభావమును, తథా = అట్లు, ఏకః = ఒకటే అయిన, ఆశ్రయః = ఆధారమును, ఉపాయే = ఉపాయమందు, తత్త్వదర్శిత్వాత్ = ఉపేయము యొక్క స్వరూపమును భావించుట వలన కైశ్చిత్ = కొందరిచే, ఇష్యతే = కోరబడుచున్నది.

తాత్పర్యము— "నీలమ్ ఉత్పలమ్", "రాజ్ఞః పురుషః" మొదలగునవి వాక్యములు. "నీలోత్పలమ్", "రాజపురుషః" మొదలగునవి సమాసములు. సమాసముయొక్క తీరును వివరించుటకు "నీల + సు + ఉత్పల + సు" మొదలగు ప్రక్రియా వాక్యమును చూపుదురు. అయినచు శబ్దార్థములకు చెందు విశేషణ విశేష్యభావమును సామానాధికరణ్యమును (నీలోత్పలమ్, మొదలగుచోట్ల రెండు పదములును బోధించు వస్తువు ఒకటే), వాక్యమందును సమాసమందును సమానమే. కావుననే వృత్తికిని వాక్యమునకును భేదము లేదని కొందరి మతము.

వివరణము— ఈ మతముయొక్క సారమిట్లుండును: వృత్తియనునది పూర్తిగా అవయవపదములు లేనిదని చెప్పలేము. అందవయవములుండును. అవి వాక్యదశలో విడిగా నుండి వృత్తిదశలో ఏకమగును. అయితే అన్వయవ్యతిరేకములతో ఆ యా అర్థములను నిశ్చయించుటకై (ఆ పదమున్నపుడే ఆ యర్థము లభించుట - లేకున్న లభింపకపోవుట) అలౌకికమైన విగ్రహవాక్య మావశ్యకమగును. "నీలమ్ ఉత్పలమ్" మొదలగు సమానాధికరణ స్థలములందును "రాజ్ఞః పురుషః" మొదలగు వ్యధికరణ స్థలములందును వాక్యమువలన కలుగు అర్థబోధయే వృత్తివలనను కలుగుచుండును. (ఒకింత భేదమున్నను ముఖ్యార్థము మాత్ర మొకటే). కావున వాక్యమే వృత్తిగ మారుననియు, వాక్యమందలి వ్యపేక్షయే వృత్తియందును ఉండుననియును చెప్పుట సముచితము. వాక్యమునకును వృత్తికిని నియతమైన ఆ యా ధర్మములను కొన్నిటిని సహజములని సమర్థింపవచ్చును. మరికొన్నిటిని స్పష్టముగానే చెప్పుకొనవచ్చును. కాగా ఏకార్థీభావమును అంగీకరింప నక్కరలేదు.

విశేష విషయములు— ''పరస్పరవ్యపేక్షాం సామర్థ్యమేకే'' (సమర్థః పదవిధిః (2-1-1) అను సూత్రముయొక్క భాష్యము = వృత్తియందును వ్యపేక్షయే సామర్థ్యమని కొందరందురు) అను పూర్వపక్ష మతముయొక్క సారమిది. ఉపాయము = సాధనము ఉపేయము = సాధ్యము. ప్రకృతమున వాక్య ముపాయమనియు వృత్తి ఉపేయమనియును వర్ణింపబడినది. ఈ రెండిటికిని అభేదమను భావన అజ్ఞాన మూలకము. ॥52॥

అవతారిక— పై అపసిద్ధాంతమును ఖండించుచున్నాడు.

**శ్లో॥ పదం యథైవ వృక్షాది విశిష్టేఽర్థే వ్యవస్థితమ్ ।
నీలోత్పలాదిష్వపి తథా భాగాభ్యాం వర్తతే వినా ॥ 53**

వృక్షాది = "వృక్షః" మొదలగు, పదమ్ = పదము, విశిష్టే = ఒకటే అయిన, అర్థే = అర్థమందు, యథా = ఎట్లు, వ్యవస్థితమ్ = సిద్ధముగ ఉన్నదో, తథా = అట్లు, నీలోత్పలాది + అపి = "నీలోత్పలమ్" మొదలగునది కూడ, భాగాభ్యామ్ + వినా = భాగములు లేకుండ వర్తతే = ఉండును.

తాత్పర్యము— "వృక్షః" మొదలగు పదములలో అవయవములైన వర్ణములు లేనట్లుగానే, "నీలోత్పలమ్" మొదలగు వృత్తులలో కూడ అవయవములైన పదములు లేవు.

వివరణము— పదములు అఖండములనియు అఖండమైన యర్థమును బోధించుననియు, ప్రకృతి - ప్రత్యయము మొదలగు కల్పనలు అసత్యమనియును రెండవ కాండమున ప్రతిపాదింపబడినది. అదే తీరులో వృత్తులు కూడ అఖండములనియు, వాని కవయవములు లేవనియు విశేషణ విశేష్యభావముతో ఏకాకారమైన యర్థమును బోధించుననియును గ్రహింప వలెను. ఏకార్థీభావము, అభేదైకత్వ సంఖ్య (కావలసిన సంఖ్యను సమర్పించుచు ఎట్టి విశేషమును లేని సామాన్యరూపమగు ఒక సంఖ్య) భాసించుట, ఒకటి ముఖ్యమై మిగిలిన పదార్థములు విశేషణములగుట, మొదలగు ధర్మములన్నియు వృత్తికి సహజములు. మందమతుల కొరకు వాక్యదశను చూపి సమన్వయము చేయుదురు కాని వాక్యమునకును వృత్తికిని ఎట్టి సంబంధమును లేదు. కొద్ది పోలికను బట్టి "అదియు ఇదియు ఒకటే" అనుట కేవలము భ్రాంతి మూలకము

విశేష విషయములు— "ఏకార్థీభావః సామర్థ్యమ్ - పరిభాషా చ" (వృత్తియందలి సామర్థ్యమేకార్థీభావము - ఈః సూత్రము పరిభాష) అను సిద్ధాంతము (సమర్థః పదవిధిః - 2-1-1) ఇచట సంగ్రహింపబడినది. ॥53॥

అవతారిక— వృత్తికిని వాక్యమునకును సాదృశ్యము కూడ అన్నిచోటులందును ఉండదనుచున్నాడు.

శ్లో॥ శ్రోత్రియక్షేత్రియాదీనాం న చ వాసిష్ఠగార్గ్యవత్ ।
భేదేన ప్రత్యయో లోకే తుల్యరూపాసమన్వయాత్ ॥ 54

వాసిష్ఠగార్గ్యవత్ = వాసిష్ఠః, గార్గ్యః, అను వానివలె, శ్రోత్రియక్షేత్రియాదీనామ్ = శ్రోత్రియః, క్షేత్రియః, మొదలగు వానికి, తుల్యరూపాసమన్వయాత్ = సమానమైన రూపము కుదురనందున, భేదేన = విభాగముతో, ప్రత్యయః = అర్థము తెలియుట, లోకే = వ్యవహారమున, న + చ = లేదు (కనబడదు).

తాత్పర్యము— "వసిష్ఠస్య - అయమ్ = వాసిష్ఠః" = వసిష్ఠునికి సంబంధించిన వాడు. "గర్గస్య - అపత్యమ్ = గార్గ్యః = గర్గుని సంతతి. ఇది తద్ధితవృత్తి. ఇచట వృత్తికిని వాక్యమునకును పోలిక ఉన్నది. (వసిష్ఠ, గర్గ, అను శబ్దములకు తద్ధిత ప్రత్యయము మాత్రము చేరినది) కావున ప్రకృతి ప్రత్యయ విభాగము కుదురును. కాని "శ్రోత్రియః",

ద్రవ్య గుణములు ఒక వాక్యమున పదబోధ్యములగుటచే వానికి సంబంధము వాక్య మూలకము. అంతకు తప్ప వానికి సంబంధము నిర్ణయించునది మరియొకటి లేదు.

వాక్య ప్రమాణముకంటె శ్రుతి ప్రమాణము ప్రబలము. ఇది *మీమాంసకుల నిర్ణయము. కాబట్టి శ్రుతినిబట్టి చూడగా పై వికల్పము ప్రసక్తమగుచున్నది. అట్టితరి ప్రతినిధి నియమము కలుగదు. ఈ యంశమును గుర్తింపవలెను.

ద్రవ్యము శబ్దముచే బోధింపబడుననెడి వ్యాడి మహర్షియొక్క మతమును దూషించుటకై ఈ శ్లోకము వ్రాయబడినది. ద్రవ్యవాదమున ద్రవ్యగుణములు సమకక్షములు కనుక పై రీతిని వికల్పము ప్రసక్తమగుచున్నది. వికల్పము శాస్త్ర సమ్మతము కాదు. తెల్లని మేక దొరకనిచో ఎరుపో నలుపో రంగుకల మేకనే ఉపయోగింపవలెను, అంతియేకాని గొఱ్ఱెను గాని మరియొక తెల్లని వస్తువునుగాని ఉపయోగింపరాదని శాస్త్రనిర్ణయము. ఆ నిర్ణయమునకు ద్రవ్యవాదమున భంగము వాటిల్లును.

కాబట్టి ఆ వాదము యుక్తము కాదు. ॥76॥

*అవతారిక*—— పై శ్లోకమున ద్రవ్యవాదమున దోషము దుర్వారము కనుక అది అయుక్తమని నిరూపించి జాతి శక్తివాదమున సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యదాతు జాతిః శక్తిర్వా క్రియాం ప్రత్యుపదిశ్యతే।**
**సామర్థ్యాత్సంనిధీయేతే తత్రద్రవ్యగుణౌతదా ॥** 77

యదా + తు = ఎప్పుడైతే, జాతిః = శబ్దముచే బోధింపబడిన జాతి, వా = కాక, శక్తిః = శక్తి, క్రియామ్ + ప్రతి = యాగాది క్రియను గురించి, ఉపదిశ్యతే = చెప్పబడుచున్నదో, తదా = అప్పుడు, ఆ పక్షమున, తత్ర = ఆ క్రియయందు, సామర్థ్యాత్ = సామర్థ్యము వలన అనగా అర్థాపత్తి ప్రమాణము వలన, ద్రవ్యగుణౌ = ద్రవ్యము గుణము, ఈ రెండు, సంనిధీయేతే = ఏకరూపముగనే సన్నిహితములుగా చేయబడుచున్నవి.

ఎల్ల శబ్దములకు జాతియే వాచ్యమగునని వాజిప్యాయనుని ఆశయము. అందు శక్తికి జాతి ఉపలక్షణము కాగలదని యీ సముద్దేశమున 3 వ శ్లోకమున చూపబడినది.

జాతిగాని శక్తిగాని యాగాది క్రియలకు సాధనము కాగలదు. ఆ రెండు కూడ ఆశ్రయములేనిది ఉండనేరవు కనుక అవి వానికి ఆధారమగు ద్రవ్యమును ఆక్షేపించును. ఆ

---

* "శ్రుతి లిఙ్గవాక్య ప్రకరణ స్థానసమాఖ్యానాం పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అని జైమిని సూత్రము.

''క్షేత్రియః'' అను పదములలో అట్టి పోలిక ఇసుమంతయు లేదు. శ్రోత్రియ శబ్దమునకు ''వేదమును చదువువాడు'' (ఛందః అధీతే) అని యర్థము. క్షేత్రియ శబ్దమునకు ''ఈ జన్మలో కుదురని రోగము'' (పరక్షేత్రే చికిత్స్యః = మరొక జన్మలో చికిత్స చేయదగినది) అని యర్థము. ఇదియు తద్ధిత వృత్తియే ఇచట వృత్తికి అనుగుణముగా పదములను విడదీసి (వాక్యరూపమున) సమానమైన యర్థమును చెప్పుటయే కుదురదు. కాగా వాక్యము వేరు. వృత్తి వేరు.

వివరణము— ''శ్రోత్రియశ్ఛందోఽధీతే'' (5-2-84) అను సూత్రము శ్రోత్రియ శబ్దమును సాధించును. ''క్షేత్రియచ్ పరక్షేత్రే చికిత్స్యః'' (5-2-92) అనునది క్షేత్రియ శబ్దమును సాధించును. ఆ యా యర్థములందు ప్రసిద్ధమైన ఆ యా శబ్దములను'' ఉన్నవి ఉన్నట్లుగ'' తీసికొని పాణిని సాధుత్వమును చెప్పెను. వీనిని నిపాతములందురు. ఇట్టి స్థలములలో ప్రకృతి, ప్రత్యయము, అను విభాగమే యుండదు. ఇవి ఏకార్థీభావము గల వృత్తులు. కాగా వృత్తి విషయమున వాక్యమును చూపుట కృతకము వృత్తికిని వాక్యమునకును కలదని భావింపబడు సాదృశ్యము కూడ సార్వత్రికము కాదు. ॥54॥

అవతారిక — వృత్తికిని వాక్యమునకును అర్థము కూడ కొన్నిచోట్ల సమానముగ నుండదని చెప్పుచున్నాడు.

శ్లో॥ సప్తపర్ణాదివద్భేదో న వృత్తౌ విద్యతే క్వచిత్ ।
రూఢ్యరూఢివిభాగోఽపి క్రియతే ప్రతిపత్తయే ॥ 55

క్వచిత్ = ఒకానొక సందర్భమున, సప్తపర్ణాదివత్ = సప్తపర్ణః, మొదలగు చోటులందువలె, వృత్తౌ = వృత్తియందు. భేదః = అర్థభేదము, న + విద్యతే = ఉండదు, రూఢ్యరూఢి విభాగః + అపి = ''రూఢి - రూఢికాదు'' అను విభాగము కూడ, ప్రతిపత్తయే = తెలియుట కొరకు, క్రియతే = చేయబడును.

తాత్పర్యము— వృత్తికిని వాక్యమునకును సామాన్యముగా అర్థమందు భేదము లేకపోవచ్చును. కాని అట్టి యర్థభేదముగల స్థలములు కూడ కొన్ని యున్నవి. ''సప్తపర్ణః'' అనునది ఇందు కుదాహరణము. ఇచట వృత్తియొక్క యర్థము వేరు. (ఒక విధమైన అరటి చెట్టు). వాక్యముయొక్క అర్థము వేరు (ఏడాకులు గలది). అట్లే ''ఈ పదము రూఢము - ఇది రూఢము కాదు'' అను విభాగము కూడ ఉన్న యర్థమును విశదపరచుటకై ఏర్పడినదే.

వివరణము— ''పర్వణి పర్వణి - సప్త - పర్ణాని - అస్య - సంతి'' (సప్తపర్ణః) అని వాక్యమును చూపుదురు. ''ప్రతియొక కణుపునందును ఏడాకులు గల చెట్టు'' అను నర్థము దీనివలన వచ్చును. ''సప్తపర్ణ'' అను వృత్తివలన (బహుప్రీహి సమాసము) ''ఒక జాతి అరటి చెట్టు'' అను నర్థము లభించును. ఈ రెండిటికిని ఎట్టి పోలికయు లేదు. ఆకులున్నను ఎండిపోయినను సప్తపర్ణ శబ్దమాయర్థమును (అరటి) తప్పక బోధించును. వాక్యము బోధింప జాలదు. కావుననే ''సప్తపర్ణ'' మొదలగు శబ్దములను రూఢము లందురు. అట్లని ''రాజ

పురుష'' మొదలగు వృత్తులన్నియును రూఢములు కానక్కరలేదు. అవయవములుగా ఉన్న శబ్దముల అర్థము కూడ అట్టిచోట్ల స్ఫురించుచుండును. ఈ విధముగ ''రూఢము - యౌగికము'' అను వేర్పాటు కూడ సహజమైన స్థితిని గుర్తించుట కుపయోగించు ఉపాయము మాత్రమే. కాగా వృత్తి వేరు. వాక్యము వేరు.

విశేష విషయములు— అర్థమును తెలియజేయు తీరునుబట్టి శబ్దములను ఇట్లు విభజింతురు :

(1) యౌగికము— అవయవముల అర్థమును పూర్తిగా చెప్పునది. ఉదా : పాచకః (పచ్ + అక = వంటచేయువాడు) మొదలగునది.

(2) రూఢము— అవయవములున్నను వాని యర్థముతో సంబంధము లేకుండ మొత్తముపై ఒక యర్థమును చెప్పునది. ఉదా : సప్తపర్ణః. ఇచట ఒకప్పుడు అవయవార్థము కుదిరినను (అరటికి ఏడాకులే ఒకప్పుడుండినను) ఈ శబ్దమును యౌగికమనరు. కుశలః, ప్రవీణః, (నేర్పరి) మొదలగు శబ్దములు ఇట్టివే.

(3) యోగరూఢము— అవయవార్థమును స్వీకరించినను ఒకే యర్థమును ఎల్లప్పుడును చెప్పునది. ఉదా : పంకజమ్. (పంకే - జాయతే = బురదయందు పుట్టునది = పద్మము మాత్రమే - మరొక వస్తువు కాదు).

ఇట్టి తీరులన్నియు భాషకు సహజములనియు ఆ యా సంకేతములు వీనిని వివరించుటకు బయలుదేరినవేగాని వాస్తవములు కావనియును గ్రంథకారుని హృదయము అట్లే ''వృత్తి - వాక్యము'' అను రెండు ప్రసిద్ధమైన మార్గములు అనాది సిద్ధములై ఉన్నవనియు, అందు వృత్తి అఖండమగు నర్థమును వాక్యము సఖండమగు నర్థమును బోధించుననియు, కొంత సామ్యమున్నంత మాత్రమున ''అవి ఒకటే'' యని భావింపరాదనియును ఈ సందర్భమున అతడు తరచుగ చెప్పుచుండును ॥55॥

అవతారిక— ఏకార్థీభావము సంగీకరించి వృత్తిని వేరుచేసినపుడు కూడ త్రిపద బహువ్రీహి సమాసమున (మూడు పదములకు జరుగు బహువ్రీహి) మొదటి రెండు పదముల కును వేరొక సమాసమును చేయరాదని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు.

శ్లో॥ యా సామాన్యాశ్రయా సంజ్ఞా విశేషవిషయాచయా ।
బహులగ్రహణాన్నాస్తి ప్రవృత్తిరుభయోస్తయోః ॥ 56

శ్లో॥ సుసూక్ష్మజటకేశాదౌ సమాసోఽవయవే యది ।
స్యాత్ స్యాత్తత్రాంతరంగత్వాద్బాధకోఽవయవస్వరః ॥ 57

సుసూక్ష్మజటకేశాదౌ = ''సుసూక్ష్మజటకేశః'' మొదలగుచోట్ల, అవయవే = అవయవము లగు, పదములకు, సమాసః = సమాసము (కర్మధారయము), స్యాత్ + యది = అయిన

ట్లయితే, అంతరంగత్వాత్ = లోపలిదగుటవలన, బాధకః = బాధించునట్టి, అవయవస్వరః = అవయవములకగు స్వరము, తత్ర = అచట, స్యాత్ = వచ్చెడిని.

(అందువలన) సామాన్యాశ్రయా = సామాన్యములకగు, సంజ్ఞా = సమాసము, యా = ఏది కలదో, విశేషవిషయా = విశేషములకగు, సంజ్ఞా = సమాసము, యా + చ = ఏదియు కలదో, తయోః = ఆ, ఉభయోః = రెండిటికిని, బహుల గ్రహణాత్ = ''బహులమ్'' అనుటవలన, ప్రవృత్తిః = ప్రవృత్తి, న + అస్తి = ఉండదు.

తాత్పర్యము— ''సుసూక్ష్మజటకేశః'' అనునది మూడు పదములకును సుసూక్ష్మ + జట + కేశ) ఒకేసారిగ జరిగిన బహువ్రీహి సమాసము ఇచట మొదటి రెండు పదముల కును ''సుప్సుపా'' (2-1-4) అను సూత్రముచే సామాన్య సమాసముగాని, ''విశేషణం విశేష్యేణ బహులమ్'' (2-1-57) అను సూత్రముచే కర్మధారయ సమాసముగాని ప్రవర్తింపదు. ఈ సూత్రమందలి ''బహులమ్'' అను పదమే అందు హేతువు. వానికి సమాస మును చేసినచో మొత్తముపై వచ్చు బహువ్రీహి స్వరమును బాధించి అవయవమైన సమాస మునకు వేరొక స్వరము రావలసి వచ్చును.

వివరణము— "సుసూక్ష్మాః - జటాః - కేశాః - యస్య - సః" (సూక్ష్మములై జడలుగట్టిన జుత్తు గలవాడు) అను విగ్రహమున మూడు పదములకును కలిపి, "అనేక మన్యపదార్థే" (2-2-24) అను సూత్రముచే బహువ్రీహి సమాసము ఒక్కుమ్మడిగ అగును. అందువలన "బహువ్రీహౌ ప్రకృత్యా పూర్వపదమ్" (6-2-1) అను సూత్రముచే తొలి పదమునకు సహజముగనున్న స్వరమే మిగులును. అది యభిమతము. అట్లుగాక "ఏకార్థీ భావము కుదురును గదా !" అని భావించి మొదటి రెండు పదములకును సామాన్య సమాస మునుగాని విశేష సమాసమునుగాని ముందుగ చేసినచో, బహువ్రీహి స్వరమును త్రోసివైచి "సమాసస్య" (6-1-223) అను సూత్రముచే ఆ అవయవ సమాసముయొక్క చివరి అచ్చు ఉదాత్తము కావలసి వచ్చును. తరువాత బహువ్రీహి ప్రవర్తించినను ప్రయోజనముండదు. అందుచే అవయవములకు సమాసము జరుగరాదు. ఇట్టి నిషేధమును సూత్రమందలి "బహులమ్" అను పదమువలన సాధింపనగును. ఇష్టము కానిచోట్ల సమాసమును బహుల శబ్దము వారించునని సంప్రదాయము.

విశేష విషయములు— "మధ్యనుండు పదార్థములకు ఏకార్థీభావమును చెప్పి అవాంతర సమాసమును చేయరాదా ?" అను శంకకిది సమాధానము. "సుప్సుపా" = సుబంతము సమర్థమైన వేరొక సుబంతముతో సమసించును అని యర్థము. ఉదా : "పూర్వమ్ + భూతః = భూతపూర్వః" మొదలగునవి. ఈ సమాసమునకు ప్రత్యేకముగ ఎట్టి పేరును లేదు. కాన ఇది సామాన్య సమాసము. "విశేషణం విశేష్యేణ బహులమ్" (దీని యర్థ మిది వరకే చూపబడినది). దీనిచే జరుగు సమాసమునకు కర్మధారయమని పేరు. ఇది విశేష సమాసము. "నిత్యముగ వచ్చుట", "వికల్పముగ వచ్చుట", "రాకుండుట", మొదలగు అభిమతార్థములను ఆవశ్యకత ననుసరించి బహుల పదమువలన సాధింతురు. "అనేక మన్య

పదార్థే" = "సమర్థములై ఒకటిని మించిన ప్రథమాంతములగు సుబంతములు సమసించును. అట్లు సమసించు పదముల యర్థము సమాసమందు లేని వేరొక పదముయొక్క అర్థమును బోధింపవలయును" అని యర్థము. ఈ సమాసమునకే "బహుప్రీహి" అని పేరు. ఉదా : "పీతమ్ + అంబరమ్ - యస్య - సః = పీతాంబరః" (పచ్చని బట్టగలవాడు = విష్ణువు) మొదలగునవి.

ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము మొదలగునవి స్వరములు. ఇవి అచ్చుల ధర్మములు. సామాన్య వ్యవహారమున వీనిని పలుకుట పూర్తిగా నశించినది. కాని వేదభాషలో వీనిని పలుకుట తప్పనిసరి. వీనికి సంబంధించిన నియమములు కొల్లలుగా ఉన్నవి. సమాసమునకు చెందు రెండు నియమములిచట ప్రస్తుతములు. "సమాసస్య" = సమాసముయొక్క చివరి అచ్చు ఉదాత్తము అని యర్థము. ఇది సామాన్యస్వరము. "బహుప్రీహౌ ప్రకృత్యా పూర్వపదమ్'' అనునది బహుప్రీహికి మాత్రమే చెందునుగాన విశేషస్వరమగును ఈ రెండిటిలో సామాన్యస్వర మంతరంగము. అనగా సుఖముగను వేగముగను ప్రవర్తించునది. విశేషస్వరము బహిరంగము. కష్టముగను విలంబముగను ప్రవర్తించునది. కాగా బహిరంగమును బాధించి అంతరంగము ప్రవర్తించుట న్యాయ్యము. (బహిరంగము = ఎక్కువ నిమిత్తములు గల కార్యము. అంతరంగము = తక్కువ నిమిత్తములుగల కార్యము) సమాసమయినచో - చాలును - సమాసస్వరము రావచ్చును. సమాసమును బహుప్రీహియు కూడ అయినపుడే బహుప్రీహి స్వరమగును. ఇట్లు సమాసస్వర మంతరంగమై బహుప్రీహి స్వరమును బాధించెడిని. (బహిరంగి కార్యముకన్న అంతరంగ కార్యము ప్రబలమని వైయాకరణుల సంప్రదాయము).

కాగా ప్రకృతమున మూడు పదములకును ఒకేసారిగ బహుప్రీహిని మాత్రమే చేయవలయునుగాని అవాంతర సమాసమును చేయకూడదని ఫలించినది. ॥57॥

*అవతారిక*— ''మీద చూపిన మూడు పదముల బహుప్రీహియందు ప్రాప్తించు అవాంతర సమాసమును ''విభాషా'' (2-1-11) అను మహాకవి కల్పముచేతనే వారింపవచ్చును. అందులకై బహుల పదమును ఆశ్రయించుట వ్యర్థము అను అభిప్రాయమును ఖండించుచున్నాడు.

**శ్లో॥ సముదాయస్య వృత్తౌ చ నైకదేశో విభాష్యతే ।**
**భేద ఏవ విభాషాయాం నియతో విషయోయతః ॥ 58**

సముదాయస్య = సమూహమునకు, వృత్తౌ + చ = వృత్తియందు, ఏకదేశః = అవయవము, న + విభాష్యతే = వికల్పింపబడదు, యతః = ఎందువలన, విభాషాయామ్ = వికల్పమందు, భేదః + ఏవ = వ్యపేక్షయే, నియతః = నియమింపబడిన, విషయః = విషయమై, (భవతి = అగుచున్నదో).

తాత్పర్యము— "విభాషా" (2-1-11) అను వికల్పమునకు వ్యపేక్షా సామర్థ్యము విషయమని వెనుక చూపబడినది (45 వ కారిక). కావున ఏకార్థీభావమున అది ప్రవర్తింపదు. పదసమూహమునకు ఏకార్థీభావమున్నచో, సమాసము రాక తప్పదు. అట్లు అవయవములగు పదములకు గూడ ఏకార్థీభావమువలన ప్రాప్తించు సమాసమును బహుల గ్రహణముచేతనే వారింపవలయును.

వివరణము— ఏకార్థీభావమున వృత్తి తప్పదనియు, వ్యపేక్షయందు వాక్యము తప్పదనియును ఒక విధమైన కట్టుబాటును మాత్రమే "విభాషా" అను సూత్రము బోధించునని కొందరి మతము. ॥58॥

అవతారిక— పై విషయమునే మరొక విధమున విశదీకరించుచున్నాడు.

శ్లో॥ యతశ్చావిషయః సోఽస్యా స్తస్మాన్నా స్త్యకృతార్థతా ।
అభేదప్రక్రమేఽత్యంతం భేదానామపసారణాత్ ॥ 59

అభేదప్రక్రమే = అభేదమును స్వీకరించునపుడు, భేదానామ్ = భేదములు, అత్యంతమ్ = పూర్తిగా, అపసారణాత్ = పోవునుగాన, యతః + చ = ఎందువలన, సః = ఆ అభేదము, అస్యాః = ఈ విభాషకు, అవిషయః = విషయముకాదో, - తస్మాత్ = అందువలన, అకృతార్థతా = కృతార్థము కాకపోవుట, న + అస్తి = లేదు.

తాత్పర్యము— ఏకార్థీభావమున పదార్థముల భేదము పూర్తిగా నశించును. అపుడు వృత్తి తప్పదు. వ్యపేక్షయందు పదార్థముల భేదము పూర్తిగా ఉండును. అపుడు వాక్యము తప్పదు. ఈ వాక్యమే "విభాషా" అను దానికి విషయముకాని వృత్తి కానేరదు. కాగా వృత్తి విషయమున "విభాషా" అనునది "చరితార్థమగునా ? (ప్రయోజనము గలది) కాదా ?" అను ప్రసక్తియే లేదు.

వివరణము— ఈ విధముగ "విభాషా" అనునది వాక్యమునకు మాత్రమే కట్టు బడి పోయినందున (వాక్యమందే చరితార్థమయినందున) వృత్తియందు పనిచేయజాలదు. అందుచే "సుసూక్ష్మజటకేశ" మొదలగుచోట్ల మొదటి రెండు పదములకును ప్రాప్తించు సమాసమును బహుల గ్రహణముచేతనే వారింపక తీరదు. ॥59॥

అవతారిక— మూడు పదములకు జరుగు తత్పురుష సమాసములో కొన్నిచోట్ల అవయవములకు అవాంతర సమాసమును చేయవచ్చుననియును - అట్లయినను స్వరభేదముండదనియును ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ మహాకష్టశ్రితేత్యేవం న స్యాద్భేదః పదత్రయే ।
వృత్తావవయవస్యా త్త్వం యస్మాన్న ప్రతిషిధ్యతే ॥ 60

మహాకష్టశ్రిత + ఇతి = "మహాకష్టశ్రితః" అనుచోట, ఏవమ్ = ఈ తీరులో, పదత్రయే =

మూడు పదములందు, అవయవస్య = అవయవమునకు, వృత్తౌ = సమాసమందు, ఆత్త్వమ్ ఆకారము, (ఆ - అను వర్ణము) యస్మాత్ = ఎందువలన, న + ప్రతిషిధ్యతే = వారింపబడలేదో, (తస్మాత్ = అందువలన) భేదః = స్వరభేదము, న + స్యాత్ = ఉండదు.

**తాత్పర్యము**— "మహాకష్టశ్రిత" అనుచోట మహత్ + కష్టమ్ + శ్రిత, అను **మూడు** పదములకును తత్పురుషము. ఇచట వాస్తవముగ పదసమూహమునకే ఒకేసారి ఏకార్థీభావము. అయినను అవయవములగు మహత్, కష్ట, అను పదములకు కూడ వేరుగ ఏకార్థీభావము నంగీకరించి అవాంతరమగు కర్మధారయమును చేయవలయును. లేకున్న మహత్ శబ్దమునకు (త్ - అను చివరి వర్ణమునకు) ఆత్త్వము (ఆకారము) రాకపోవును. "మహాకష్ట" అను అభిమతమగు రూపము సిద్ధింపకపోవును. అట్లు అవాంతర సమాసమును చేసినను మొత్తముపై స్వరభేదము మాత్రము కలుగదు. ఇదొక విశేషము.

**వివరణము**— "మహత్ + కష్ట" అను వానికి "సన్మహత్పరమోత్తమోత్కృష్టాః పూజ్యమానైః" (2-1-61) అను సూత్రముచే కర్మధారయమగును. "ఆన్మహతః సమానాధికరణ జాతీయయోః" (6-3-46) అను సూత్రముచే మహత్ శబ్దమునకు ఆకారమగును. పిదప "మహాకష్టమ్ + శ్రిత", అను పదములకు "ద్వితీయాశ్రితాతీత పతితగతాత్యస్తప్రాప్తాపన్నైః" (2-1-14) అను సూత్రముచే తత్పురుషమగును. ఇచట అవయవ సమాసమునకు "సమాసస్య" (6-1-223) అను సూత్రముచే రాదగు అంతోదాత్తమును, "థాథఘఞ్క్తాజబిత్రకాణామ్" (6-2-144) అను సూత్రము బాధించును. అయినను దీనిని బాధించి "అహీనేద్వితీయా" (6-2-47) అను సూత్రము ప్రవర్తించుటచే మొత్తముపై అభిమతమగు స్వరమే (అంతోదాత్తము) సిద్ధించును.

విశేష విషయములు— (1) సన్మహత్పరమోత్తమోత్కృష్టాః పూజ్యమానైః" (2-1-61) సత్, మహత్, పరమ, ఉత్తమ, ఉత్కృష్ట అను శబ్దములు, (విశేషణములు) **పూజింపబడు** వస్తువును చెప్పు శబ్దములతో (విశేష్యములు) సమసించును అని యర్థము. **ఉదా**: సద్వైద్యః, మహావైయాకరణః, మొదలగునవి.

(2) "ఆన్మహతః సమానాధికరణ జాతీయయోః" (6-3-46) "మహత్ శబ్దము యొక్క చివరి వర్ణమునకు ఆకార మాదేశమగును. సమానాధికరణమైన (విశేష్యము) ఉత్తరపదముగాని, "జాతీయ" అను శబ్దముగాని పరముగ నుండవలెను అని యర్థము. "మహాపురుషః" మొదలగునవి ఉదాహరణములు. ప్రకృతమున (మహాకష్టశ్రిత, అనుచోట) మూడు శబ్దములకును ఒకేసారిగ వృత్తి అన్నచో కష్టశబ్ద ముత్తరపదము కానందున మహచ్ఛబ్దమునకు ఆత్త్వము రాకపోయెడిని. (సమాసముయొక్క చివరి పదము మాత్రమే ఉత్తర పదమనుట వ్యాకరణ మర్యాద). అందుచే "మహత్ + కష్ట" అను దశలో అవాంతర సమాసమును చేయక **తప్పదు**.

(3) "ద్వితీయాశ్రితాతీత పతితగతాత్యస్త ప్రాప్తాపన్నైః" (2-1-14). "సమ

ర్థములగు శ్రిత, అతీత, పతిత, గత, అత్యస్త, ఆపన్న, అను వానిలో దేనితోనయినను ద్వితీయాంతము సమసించును'' అని యర్థము. ''కష్టశ్రిత, గ్రామగత'', మొదలగునవి యుదాహరణములు.

(4) సమాసస్య'' (6-1-223) దీని యర్థము 56, 57 కారికల వ్యాఖ్యలో చూపబడినది. ఇది సమాస మాత్రమునకు వర్తించు సామాన్య స్వరము.

(5) ''థాఽథఘఞ్క్తాజబిత్రకాణామ్'' (6-2-144) గతికిగాని, (ప్ర. పరా. మొదలగునది), కారకమునకుగాని (కర్మ, కరణము, మొదలగునవి), ఉపపదమునకుగాని (ముందుండు పదము) పరమై, - థ, అథ, ఘఞ్, క్త, అచ్, అప్, ఇత్ర, క - అను ప్రత్యయములలో ఏదేని చివరగల పదమున్నపుడు, దాని చివరి అచ్చు ఉదాత్తమగును (అంతోదాత్తము)'' అని యర్థము. ప్రభృథః, ఆవసథః, మొదలగునవి ఉదాహరణములు. ఈ సూత్రము విశేషముగాన ''సమాసస్య'' అను దానిని బాధించును. ''మహాకష్టశ్రిత'' అను చోట ''శ్రిత'' అనునది క్తప్రత్యయాంతము. ''మహాకష్టమ్'' అనునది కర్మకారకము. కాగా ఈ సూత్రమున కిచట ప్రాప్తి యున్నది.

(6) ''అహీనేద్వితీయా'' (6-2-47) ''ద్వితీయాంతము క్తప్రత్యయాంతముతో సమసించునపుడు, సమాసమువలన ''కూడిన - లేక - పొందిన'' అను భావము (అహీనము= విడువబడినది = కూడి యున్నది) వచ్చినచో ద్వితీయాంతము తనకు సహజమైన స్వరమునే పొందును అని యర్థము. ''కష్టశ్రిత'' మొదలగునవి ఉదాహరణములు. ఇచట కష్ట శబ్దమంతోదాత్తము. సమాసమున అదియే మిగులును. ఈ సూత్రము వేరొక విశేషముగాన ''థాఽథఘఞ్'' మొదలగు సూత్రమును బాధించును. కాగా ''మహాకష్టశ్రిత'' అనుచోట చివరకు ఈ సూత్రమే ప్రవర్తించి, ''మహాకష్ట'' అనునది అంతోదాత్తమగును. అదియే ''మహాకష్టశ్రిత'' అను మొత్తమునకును అనుసరించును. ఇట్లు ఇచట సముదాయమునకును అవయవములకును వేర్వేరుగ సమాసమును చేసినను స్వరభేదమను దోషము కలుగదని ఫలించినది. ॥60॥

*అవతారిక* — మూడు పదములకగు తత్పురుష సమాసములలో కొన్నిచోట్ల స్వరభేదము తప్పదనుచున్నాడు.

**శ్లో॥ మహారణ్యమతీతే తు త్రిపదాద్భిద్యతే స్వరః ।**
**యస్మాత్తత్రాంతరంగత్వాద్బాధకోఽవయవస్వరః ॥** 61

మహారణ్యమ్ + అతితే + తు = మహారణ్యమ్ + అతీత, అనుచోట అయితే, త్రిపదాత్ = మూడు పదముల సమాసముకన్న (మహత్, అరణ్యమ్, అతీత, అను పదములకు) స్వరః= స్వరము, భిద్యతే = వేరగును, యస్మాత్ = ఎందువలన అనగా, తత్ర=అచట, అంతరంగత్వాత్ = లోపలిదగుటవలన, అవయవస్వరః = అవయవమైన సమాసముయొక్క స్వరము, బాధకః = బాధించునదియై, (భవతి = అగును).

తాత్పర్యము— ''మహారణ్యాతీతః'' అనుచోట కూడ మూడు పదములకును ఒకేసారి సమాసమన్నచో స్వరభేదము కలుగును. ఇచట ''మహాకష్టశ్రిత'' అను చోటునందు వలె మహచ్ఛబ్దమునకు ఆత్త్వము సిద్ధించుటకై (చూడు - 60 వ కారిక) మహత్ + అరణ్య, అను శబ్దములకు ముందుగా సమాసమును చేయవలయును. అపుడు ''సమాసస్య'' (6-1-223) అను సూత్రముచే ఈ అవయవ సమాసమునకు అంతోదాత్తము తప్పదు. అదియే మొత్తము సమాసమునకును సంక్రమింపవలసి వచ్చును. ''థాథఘఞ్'' మొదలగు సూత్రము బహిరంగమగుటచేతను (అతీత - అను శబ్దమును కూడ కలిపినగాని అద్దానికి ప్రవృత్తి యుండదు. ''సమాసస్య'' అనునది అంతరంగమగుటచేతను (రెండు శబ్దములకును సమాసము కాగానే వచ్చునది) అవయవస్వరము బాధకము కాక తప్పదు.

వివరణము— ''అతీత'' శబ్దమునకు ''దాటినవాడు'' అని యర్థము. కావున సమాసమువలన ''విడువని'' (అహీనము) అను భావము రాదు. అందుచే ''అహీనే ద్వితీయా'' (6-2-47 చూ - 60 వ కారిక) అను సూత్రము ''మహారణ్యాతీత'' అనుచోట ప్రవర్తింపదు. అందుచేతనే ''మహాకష్టశ్రితః'', అను దానికిని ''మహారణ్యాతీతః'' అను దానికిని పొత్తు కుదురదు. (స్వరములు వేరు) ॥61॥

అవతారిక— మీది యంశమునే వివరించుచున్నాడు.

**శ్లో॥ సతిశిష్టబలీయస్త్వాత్ థాథాదిస్వరఏవ తు ।**
**ద్విపదే తేన యుగపత్ త్రితయం న సమస్యతే ॥ 62**

ద్విపదే = రెండు పదముల సమాసము, సతి = అయినపుడు, శిష్టబలీయస్త్వాత్ = వేరుగ విధింపబడిన శాస్త్రము ప్రబలమగుటవలన, థాథాదిస్వరః + ఏవ + తు = ''థాథఘఞ్'' (6-2-144) మొదలగు సూత్రముచే విధింపబడిన స్వరమే, (భవతి = అగును), తేన = అందుచే, త్రితయమ్ = మూడు పదములును, యుగపత్ = ఒకేసారిగ, న + సమస్యతే = సమసింపవు.

తాత్పర్యము— ''మహారణ్యాతీత'' అనుచోట ''మహత్ + అరణ్య'', అను వానికి ముందుగ సమాసముచేసి, పిదప ''మహారణ్యమ్ + అతీత'' అను రెండింటికిని సమాసమును చేసినచో, తొలి సమాసమునకు ప్రాప్తించు అంతోదాత్త స్వరమును బాధించి, ''థాథఘఞ్'' మొదలగు సూత్రముచే విధింపబడిన స్వరమే ప్రవర్తించును. అది విశేషకార్యముగాన ప్రబలమగును అందుచే ఇచట మూడు పదములకును ఒకేసారి సమాసము రాదనుటయే సమంజసము.

వివరణము— ''సమాసస్య'' (6-1-223) అను సూత్రముచే వచ్చు అంతోదాత్తము సామాన్యకార్యము. ''థాథఘఞ్'' మొదలగు సూత్రముచే వచ్చు అంతోదాత్తము విశేషకార్యము. సామాన్యమును విశేషము బాధించును. కాగా మూడు పదముల సమాసమైనచో

మధ్యోదాత్తమును రెండు పదముల సమాసమైనచో అంతోదాత్తమును అగునన్నది యిచటి సారము. ఇట్టి భేదమును వారించుటకై ఇట్టి స్థలములందు రెండు పదములకే తత్పురుషమనుట న్యాయ్యము.

విశేష విషయములు— మూడు పదములు గలచోట మూడింటికిని ఒకేసారి సమాసమని చెప్పి, కొన్ని కార్యములు సిద్ధించుటకై తొలి రెండు పదములకును మరల అవాంతరముగ సమాసమనుట ఒక పద్ధతి. దీనిని త్రిపద సమాసమందురు అట్లుగాక తొలి రెండు పదములకును మొదట సమాసముచేసి, పిదప చివరి పదముతో సమాసమనుట రెండవ పద్ధతి. దీనిని ద్విపదసమాసమందురు. (మొదటి సమాసమంతయు ఒకే పదమగును. "సుప్సుపా" (2-1-4) (సుబంతము సమర్థమగు వేరొక సుబంతముతో సమసించును - అని యర్థము) అను సూత్రమున ఏకవచనమును ("ఒక సుబంతము" అను నర్థమును) పాటించనిచో, మూడు పదములకును ఒకేసారి సమాసము కుదురును. దానిని పాటించినచో ఎప్పుడైనను రెండు పదములకే సమాసమనుట తప్పదు.

సామాన్య వ్యవహారమున త్రిపద సమాసమన్నను, ద్విపదమన్నను భేదము కానరాదు. కాని కొన్నిచోట్ల స్వరమునందు భేదమేర్పడును. మరికొన్నిచోట్ల కొన్ని కార్యములందును భేదము కలుగును. ఈ యంశమును విశదపరచుటకే ఈ ఘట్టము బయలుదేరినది.॥62॥

*అవతారిక*— "మహాకష్టశ్రితః" అనుచోట, కష్టశబ్దము యొక్క అర్థము శ్రిత శబ్దముయొక్క అర్థముతోనే సంబంధించును. (కష్టమును పొందిన) అయినపుడు కష్టశబ్దమునకును మహత్ శబ్దమునకును సంబంధమెట్లు? సంబంధము లేనిచో సమాసమును, దాని మూలమున ఆత్త్వమును ఎట్లు వచ్చును? - అను శంకకు సమాధానమును చూపుచున్నాడు.

**శ్లో॥ యేషా మపూజ్యమానత్వం పరార్థానుగమార్థకే ।**
**విశేషణవిశేష్యత్వమపి తేషాం న కల్పతే ॥ 63**

పరార్థానుగమార్థకే = వేరొక శబ్దముయొక్క అర్థముతో సంబంధము కలిగినచోట, అపూజ్యమానత్వమ్ = పూజింపబడకుండుట (పూజకు యోగ్యత లేకుండుట) యేషామ్ = ఎవరికో (ఎవరి కభిమతమో), తేషామ్ = వారికి, విశేషణవిశేష్యత్వమ్ + అపి = విశేషణవిశేష్యభావము కూడ, న + కల్పతే = కుదురదు.

**తాత్పర్యము**— కష్ట శబ్దముయొక్క అర్థము శ్రిత శబ్దముయొక్క అర్థముతో సంబంధమును కలిగినంత మాత్రముచే, కష్ట శబ్దమునకును దానికి విశేషణమగు వేరొక శబ్దమునకును సంబంధమే ఉండకూడదని అనరాదు. అట్లయినచో మూడు పదములుగలట్టియు ప్రసిద్ధమైనట్టి కొన్ని సమాసములలో తొలి రెండు పదములకును విశేషణవిశేష్యభావము కూడ కుదురకపోవును.

వివరణము— మహత్ శబ్దము పూజా వాచకము (ఇచట ఆధిక్యమును సూచిం

చును = అధికమైన కష్టము) కష్ట, అనునది పూజ్యమానము. దీనియందలి విశేషమును బోధించుటకు మహచ్ఛబ్దము దీనితో సంబంధించుననుటలో తప్పు లేదు. ద్రవ్యముతోపాటు దానియందలి గుణములకు కూడ క్రియతో సంబంధముండునట్లు ప్రధానమైన దానికిని దాని విశేషములకును సంబంధముండును. కావున మహచ్ఛబ్దమునకును కష్ట శబ్దమునకును సామర్థ్య ముండుటచే తొలుత సమాసము సిద్ధించును. పిదప "మహాకష్టమ్ + శ్రితః" అని ద్విపద తత్పురుషమును చేయవలెను. ఇదియే సరియైన తీరు.

ఇట్లు కాదన్నచో ''పంచగవధనః'' (పంచ + గావః + ధనమ్ - యస్య - సః = అయిదు గోవులు ధనముగ గలవాడు) మొదలగుచోట్ల మొదటి రెండు పదములకును విశేషణ విశేష్యభావము కూడ కుదురకపోవును. అట్లయిన అచట రావలసిన కార్యములు (గోశబ్దము ''గవ'' అని మారుట) రాకపోయెడిని.

విశేష విషయములు— ''పంచగవధనః'' మొదలగుచోట్ల అభీష్టము సిద్ధించుటకు తొలి రెండు పదములకును విశేషణ విశేష్యభావమును, తొలుత అవాంతర సమాసమును శాస్త్రకారు లంగీకరించిరి. ఆ తీరునే ''మహాకష్టశ్రిత'' మొదలగుచోట్ల కూడ అవలంబింపవలె నని గ్రంథకర్త యొక్క హృదయము.

''సుప్ సుపా'' (2-1-4) అను సూత్రమున ''సుప్'' (సుబంతము) ''సుపా'' (సుబంతముతో) అను ఏకవచనమునకు పట్టింపులేదనియును, ఎన్నియైనను సుబంతములు సమర్థములైనచో పరస్పరము సమసింపవచ్చుననియును ఒక వాదమున్నది. తదనుసారముగ ''త్రిపద తత్పురుషము'' మొదలగు రీతిని (మూడు పదములకును ఒకేసారి సమాసము) కొంద రంగీకరించిరి. కాని అది సిద్ధాంతము కాదు. ఈ సూత్రమున ఏకవచనమునకు పట్టింపు గలదనియును, ఎట్లు సాధించినను ఒకసారి రెండు సుబంతములకు మాత్రమే సమాసమును చెప్పవలెననియును సిద్ధాంతము. కావున తత్పురుషములో మూడు - లేక— నాలుగు పదము లున్నపుడు, రెండు రెండు చొప్పున అవాంతర సమాసములను చేసికొనుచు, తుదకు రెండు పదములకే సమాసమును జరుపవలెను. అందువలన మహాకష్టశ్రిత, మహారణ్యాతీత, మొద లగు చోట్ల కూడ అవాంతర సమాసమును చేసి, చివరకు ద్విపద సమాసమును చెప్పుటయే శరణ్యము. ॥63॥

*అవతారిక*— మరికొన్ని విశేషములను చూపుటకై వృత్తికిని వాక్యమునకును గల భేదమును మరల పరామర్శింపుచున్నాడు.

**శ్లో॥ విశేషః శ్రూయమాణోఽపి ప్రధానేషు గుణేషు వా ।**
**శబ్దాంతరత్వాద్వాక్యే తు వృత్తౌ నిత్యం న విద్యతే ॥** 64

వాక్యే = వాక్యమందు, ప్రధానేషు = ముఖ్యమైన వానియందుగాని, వా = లేక, గుణేషు = ముఖ్యము కాని వానియందుగాని, విశేషః = విశేషము, శ్రూయమాణః + అపి = వినబడు

ద్రవ్యము గుణమును ఆక్షేపించును అందుచే ద్రవ్యము గుణము కూడ అర్థాత్తు లభించును, ద్రవ్యము శబ్దముచే బోధింపబడదు.

ఈ పక్షమున 76 వ శ్లోకము యొక్క అవతారికలో చూపబడిన పూర్వపక్షమునకు సమాధానము లభించును.

ద్రవ్యవాదమున ఆ పూర్వపక్షమునకు సమాధానము చెప్పనలవికానందున అది దోషముగానే యుండును

పై మతభేదమును ఈ కారికలోనున్న 'తు' శబ్దము సూచించుచున్నది. ॥77॥

*అవతారిక*— పై శ్లోకముచే లభించిన అర్థమునకు ప్రయోజనము జూపుచున్నాడు.

**శ్లో॥ జాతీనాంచ గుణానాంచ తుల్యేఽఙ్గత్వే క్రియాంప్రతి।**
**గుణాః ప్రతినిధీయన్తే ఛాగాదీనాం నజాతయః ॥** 78

జాతీనామ్ + చ = పశుత్వము ఛాగత్వము మున్నగు జాతులకును, గుణానామ్ + చ = తెలుపు నలుపు మున్నగు గుణములకును, క్రియామ్ + ప్రతి = ఆలంభనము యాగము మున్నగు క్రియనుగురించి, అఙ్గత్వే = సాధనముగా నుండుట, తుల్యే = సమానమే ఐనను, ఛాగాదీనామ్ = మేక మున్నగువానికి సంబంధించియున్న, గుణాః = తెలుపు మున్నగుణములు, ప్రతినిధీయన్తే = ప్రతినిధిగా చూడబడగలవు. అనగా తెలుపే అని నియమములేకుండ అట్టి మేక దొరకని పక్షమున నల్లని మేక కూడ యాగాంగముగా గ్రహింపబడునని భావము.

జాతయః = ఛాగత్వము మున్నగు జాతులు, న + ప్రతినిధీయన్తే = ప్రతినిధిగా చూడబడవు, అనగా గ్రహింపబడవు.

తెల్లని మేక దొరకని పక్షమున మేక అను జాతికి ప్రాధాన్యమొసంగి తెల్లదనము లేకున్నను నల్లదనము కలిగిన మేకయే యాగాంగమగును.

కాగా జాతి, గుణము రెండుకూడ ద్రవ్యముద్వారా క్రియతో సంబంధించుటచే నవి రెండు ఏకరూపముగా నుండును. అచట జాతి ప్రధానముగాను, గుణములు అప్రధానములుగాను ఉండుటచే, వానిలో జాతియుక్తమగు నల్లని మేక గ్రహింపబడును, తెల్లని గొఱ్ఱె మున్నగునవి గ్రహింపబడవు. ॥77॥

*అవతారిక*— 'శ్వేతం ఛాగమాలభేత' (తెల్లని మేకను చంపవలెను, దానితో యాగము చేయవలెను) అను వాక్యమున జాతిని తప్పక గ్రహింపవలెను. తెలుపు అను గుణము సంభవించిన గ్రహింపబడును, సంభవింపకపోయిన దానిని విడచి మరియొక గుణమును గ్రహింపవలెను. కాగా జాతికి ప్రతినిధి లేదు. మరియొక జాతిని గ్రహింపరాదు. గుణమునకు ప్రతినిధి యుండును, మరియొక గుణము కల మేకను గ్రహింపవచ్చును అని 77 వ

చున్నను, వృత్తౌ + తు = వృత్తియందైతే, శబ్దాంతరత్వాత్ = వేరొక శబ్దమగుటవలన, నిత్యమ్ = ఎపుడును, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— ముఖ్యమైన పదార్థమునకుగాని ముఖ్యము కాని దానికిగాని వాక్యమందు విశేషమును చెప్పవచ్చును. అట్లు వృత్తియందెపుడును విశేషమును చెప్పకూడదు. వాక్యముకన్న వృత్తి పూర్తిగా వేరగుటయే ఇందుకు కారణము.

వివరణము— ''రాజ్ఞః పురుషః''. ఇది వాక్యము ఇచట అర్థమును భావించి నపుడు పురుషుడు ముఖ్యుడగును. రాజు ముఖ్యుడు కాడు. అయినను మనము సంకల్పించినచో ''ఋద్ధస్య'' (ఐశ్వర్యముగల), ''బలవంతః'' మొదలగు విశేషణములను రాజునకు చెప్పవచ్చును. ఇచట ''రాజు'' అను పదార్థము విడిగా ఉన్నది. అట్లే ''చిత్రాః - గావః - అస్య - దేవదత్తస్య'' అను వాక్యములో ముఖ్యమైన ''దేవదత్తుడు'' మొదలగు విశేషమును స్పష్టముగ చెప్పవచ్చును.

కాని ఈ తీరు వృత్తిలో కుదురదు. ''రాజ పురుషః'' అను సమాసములో ఇమిడి పోయిన రాజునకు (రాజ శబ్దముయొక్క అర్థమునకు) ''బలవతః'' మొదలగు విశేషములను కలుపకూడదు. ఇచట రాజ శబ్దార్థము పురుష శబ్దముయొక్క అర్థముతో విడదీయుటకు వీలు లేకుండ కలిసిపోయినది. కాన అర్థానికి స్వాతంత్ర్యము లేదు. అట్లే ''చిత్రగుః'' మొదలగు బహువ్రీహి సమాసములో సామాన్యమైన అన్య పదార్థము (ఆ సమాసమునకు విశేష్యముగ ఉండునది) ముఖ్యమైనను, దాని విశేషమును మాత్రము ''ఇది'' అని నొక్కిచెప్పుటకు వీలు లేదు. సందర్భమునుబట్టి ఆ విశేషము మారుచుండును. (రామః, హరిః, దేవదత్తః మొదలగు వారిలో ఎవరయినను ''చిత్రగుః'' కావచ్చును)

కాగా వాక్యధర్మములు వేరు. వృత్తిధర్మములు వేరు. వానికిని వీనికిని ఎట్టి పొత్తును లేదు. ॥64॥

అవతారిక— వృత్తియందు అప్రధానమైయున్న పదార్థమునకు విశేషముతో సంబంధము లేనిచో, ''కృతపూర్వీ'' (ఇదివరకే చేసినవాడు) అను తద్ధితవృత్తియందు ''చేయుట'' మొదలగు క్రియలలో ''కటమ్'' (చాపను) మొదలగునవి కర్మలుగా ఎట్లన్వయించును? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ విశేషకర్మసంబంధే నిర్భుక్తేఽపి కృతాదిభిః ।
విశేషనిరపేక్షోఽన్యః కృతశబ్దః ప్రవర్తతే ॥ 65

కృతాదిభిః = కృత, మొదలగు శబ్దములచే, విశేష కర్మసంబంధే = విశేషమైన కర్మల యొక్క సంబంధము, నిర్భుక్తే + అపి = అనుభవింపబడినను, విశేష నిరపేక్షః = విశేషముల అపేక్షలేని, అన్యః = వేరొక, కృతశబ్దః = కృత, అను శబ్దము, ప్రవర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— కృత, మొదలగు శబ్దములు వాక్యమందున్నపుడు ఆ యా కర్మ విశేషములను చెప్పగలుగును. అవియే వృత్తియందున్నచో కర్మతోడి సంబంధమును పోగొట్టుకొనును. కావున వృత్తిని వాడినపుడు కర్మను వేరుగ చూపుట తప్పదు.

వివరణము— ''కృతపూర్వీ'' (ముందుగ చేసినవాడు. ''కటమ్ = చాపను'' మొదలగునది ఇచట కర్మ) అను తద్ధితవృత్తి ప్రకృతమైన ఉదాహరణము. ఇచట ''కృతః = చేయబడినది - పూర్వమ్ = ముందుగ, అనేన = వీనిచే'' అనునది వాక్యము (వీనిచే ముందుగ చాప చేయబడినది - అని యర్థము). ఇచట "కృ" ధాతువునకు "క్త" (త) అను ప్రత్యయము చేరగా కృత, (చేయబడిన) అను రూపమేర్పడును. క్త ప్రత్యయము కర్మ విశేషమునంతను (కట, పట, ఘట మొదలగు చెప్పదలచిన కర్మను) చెప్పివేయును. కావున కర్మవాచకమునకు ద్వితీయావిభక్తి రాకుండ ప్రథమయే వచ్చును. ఇటువంటి అర్థమును చెప్పు వాక్యము ఈ తీరులోనే యుండును. కాని ఇదే అర్థమును చెప్పునపుడు వృత్తి వేరుగనుండును. "కృతపూర్వీ" అనునది వృత్తియొక్క రూపము. ఇచట ''కృత'' అను శబ్దము ఏ విధమైన కర్మను బోధింపక, ''చేయుట'' అను కృధాతువు యొక్క సామాన్యమైన అర్థమును మాత్రమే చెప్పును. అందుచే కర్మ విశేషమును (చాప, బట్ట మొదలగునది) ద్వితీయాంతముగ వాడక తప్పదు. కాగా "కృతపూర్వీ" (ముందుగ చేసిననాడు - అనియే అర్థము) అనగానే "కటమ్" అనియా, ''పటమ్'' అనియో ఏదోయొక కర్మను చెప్పి తీరవలెను. ఇట్టి స్థలములందు వాక్యమందలి ''కృత'' శబ్దము ''చేయబడిన'' అను నర్థమును (కర్మార్థము) వృత్తియందలి ''కృత'' శబ్దము ''చేసినవాడు'' అను నర్థమును (కర్త్రర్థము) బోధించుచున్నది అని సారాంశము. ఇదియు శబ్ద శక్తియొక్క విలాసములలో ఒకటి.

విశేష విషయములు— ''కృతపూర్వ'' శబ్దమునకు ''సపూర్వాచ్చ'' (5-2-87) అను సూత్రముచే ఇన్, అను తద్ధిత ప్రత్యయము ప్రవర్తించును. (కృతపూర్వ + ఇన్ = కృతపూర్వీ) ''అనేన కృతమ్, అనేన భుక్తమ్'' మొదలగు అర్థమును చెప్పదలచినపుడు, ఆ యా క్త ప్రత్యయాంతము (కృత, భుక్త మొదలగునది) ముందుగనున్న ''పూర్వ'' అను శబ్దమునకును ''ఇన్'' ప్రత్యయమగునని పై సూత్రముయొక్క అర్థము. ''భుక్తపూర్వీ'' (ఓదనమ్), ''గతపూర్వీ'' (గ్రామమ్), మొదలగునవన్నియు ఇట్టివే.

వేరొక విధమున కర్మ చెప్పబడనపుడే కర్మవాచకమునకు ద్వితీయా విభక్తి యగును. (అనభిహితే - 2 - 3 - 1, కర్మణి ద్వితీయా - 2 - 3 - 2 - కర్మ చెప్పబడనపుడే ద్వితీయ అగునని యర్థము) ప్రకృతమున వాక్యావస్థయందలి కృత శబ్దము కర్మను చెప్పివేయును. వృత్తియందలి కృత శబ్దము కర్మను చెప్పజాలదు. ॥65॥

అవతారిక— పై విషయమునే వివరింపుచున్నాడు.

**శ్లో॥ అకర్మకత్వే సత్యేవం క్తాంతం భావాభిధాయి తత్ ।**
**తతః క్రియావతా కర్త్రా యోగో భవతి కర్మణామ్ ॥ 66**

67 ]
ఏవమ్ = ఇట్లు, అకర్మకత్వే + సతి = కర్మ లేకపోవుట సంభవింపగా, తత్ = ఆ, క్తాంతమ్ = క్త ప్రత్యయాంతము, భావాభిధాయి = క్రియను మాత్రమే చెప్పును, తతః = అందువలన, క్రియావతా = క్రియను గలిగిన, కర్త్రా = కర్తతో, కర్మణామ్ = కర్మలకు, యోగః = సంబంధము, భవతి = అగును.

తాత్పర్యము— "కృతపూర్వీ" మొదలగు తద్ధిత వృత్తులందున్న కృత, మొద లగు క్త ప్రత్యయాంతము కేవలము క్రియను మాత్రమే చెప్పును. (కర్మను చెప్పదు) ఆ క్రియ గలవాడు కర్త. కావున కర్తతో కర్మకు సంబంధము కుదురును. అనగా కర్మను స్పష్టముగా చెప్పవచ్చును.

*వివరణము*— వాక్యమందు కర్మను బోధించు క్త ప్రత్యయాంతము (కృత, భుక్త మొదలగునది), తద్ధిత వృత్తియందు ఆ యా క్రియను మాత్రమే తెలియజేయుచు, తుద కా క్రియగల కర్తను బోధించును. అట్లది అకర్మకమగును. అందుచే అచటి కర్మను వేరుగ ద్వితీయాంతమగు పదముతో (కటమ్, అన్నమ్ మొదలగునది) విశదీకరింపవలయును.

విశేష విషయములు— ఇట్టిచోట్ల "ఇన్" అను తద్ధితము కర్తను చెప్పును. అతడు చేయు క్రియను క్త ప్రత్యయాంతము సూచించును. "ఏదో ఒక కర్మ ఉండును" అను భావన కలిగినను అది ఏదో స్పష్టముగ తెలియదు. ఆ కర్మను స్పష్టపరచుటకై కర్మ పదమును వాడుదుము. అనగా "కృతపూర్వీ" మొదలగుచోట్ల "ముందు చేసినవాడు" అను రీతిని కర్తయే ముఖ్యముగ బోధపడును. క్రియ అప్రధానమగును. ఆ క్రియకు చెందు కర్మను తొలుత భావనలో ఉంచికొని చివరను విడిగా పేర్కొందుము. ఇట్లు "కటమ్" మొదలగు శబ్దములను వాడుట కుదురును.

కర్మ ప్రసిద్ధమైనపుడు కొన్ని క్రియలలో కర్మ పదమును ఉపయోగించము. ఉదా : "మేఘః వర్షతి" (మేఘము వర్షించుచున్నది) ఇచట "జలమ్" అని వేరుగ చెప్ప నక్కర లేదు. ఇట్టి క్రియలను గూడ "అకర్మకములు" (ప్రసిద్ధిని బట్టి కర్మను పేర్కొన నక్కరలేనివి) అందురు. ఈ తీరు అకర్మకత్వమును "కృతపూర్వీ" మొదలగు స్థలములందలి క్రియలకు ఊహింపవలయును. ఇదంతయు వృత్తి మాహాత్మ్యము.

*అవతారిక*— "కృతపూర్వీ" మొదలగుచోట్ల (వృత్తియందు) క్రియ కర్తతో కలిసిపోయి ఉండునుగాని వేరుగను స్వతంత్రముగను ఉండదు. అయినను అట్టి క్రియకు కర్మతో సంబంధము కుదురు రీతిని దృష్టాంతపూర్వకముగా చూపుచున్నాడు.

**శ్లో॥ అవిగ్రహా గతాదిస్థా యథా గ్రామాదికర్మభిః ।**
**సంబధ్యతే క్రియా తద్వత్ కృతపూర్వ్యాదిషు స్థితా ॥** 67

గతాదిస్థా = "గత" మొదలగుచోట్ల ఉన్న, అవిగ్రహా = ఆకారములేని, క్రియా = వ్యాపారము, గ్రామాదికర్మభిః = గ్రామము మొదలగు కర్మలతో, యథా = ఎట్లు, సంబధ్యతే =

సంబంధించునో, తద్వత్ = అట్లే, కృతపూర్వ్యాదిషు = కృతపూర్వీ, మొదలగుచోట్ల, స్థితా = ఉన్న - క్రియ, సంబధ్యతే = సంబంధించును.

తాత్పర్యము— "గ్రామం గతః" (గ్రామమును వెళ్ళినవాడు) మొదలగు స్థలము లలో గూడ గమనము మొదలగు వ్యాపారము కర్తను ఆశ్రయించుకొనియే ఉండును. వేరుగ నుండదు. అయినను దానికి కర్మతో సంబంధము కుదురును. అట్లే "కృతపూర్వ" మొదలగు చోట్ల వేరుగ భాసించినట్టియు అప్రధానమై ఉండునట్టియు క్రియకును (చేయుట మొదలగు నది) కర్మ సంబంధము సంభవించును.

వివరణము— "గ్రామం గతః", "గ్రామం గచ్ఛతి" (గ్రామమును గూర్చి వెళ్ళుచున్నాడు) మొదలగునవి దృష్టాంతములు. ఇచట త, తి అను ప్రత్యయములు కర్తను చెప్పును. కాగా ఆ యా ధాతువు బోధించు క్రియ ఎల్లపుడును, ఇట్టిచోట్ల కర్తను ఆశ్రయించు కొనియే ఉండునుగాని వేరుగను స్వతంత్రముగను ఒక ఆకారముతో కనబడదు. అనగా ఆ యా క్రియ అప్రధానముగనే యుండును. అయినను అట్టి క్రియలో గ్రామము మొదలగునవి కర్మలుగా అన్వయించును. ఇదే రీతిని "కృతపూర్వీ" మొదలగు స్థలములలో అవలంబింప వలెను.

విశేష విషయములు— ఎట్టి ప్రత్యయమును లేని కేవల ధాతువునకు (గమ్, కృ, మొదలగునది) ప్రయోగముండదు. ఉన్నను ప్రయోజనము శూన్యము. కావున ప్రత్యయమును కలిపిన "గచ్ఛతి" మొదలగు రూపములనే వాడవలెను. అయినపుడు ప్రత్యయము యొక్క అర్థము (కర్త, కర్మ మొదలగునది) ఎల్లపుడును ముఖ్యముగ నుండి, ధాత్వర్థమైన వ్యాపా రము దానికి విశేషణమై అప్రధానమగుచుండును. కాగా కారకమును (కర్త, కర్మ మొదలగు నది) విడిచి వేరుగా క్రియ సంభవింపదు. క్రియకు ప్రాధాన్యమును చెప్పినను కారకము ద్వారముననే చెప్పి తీరవలెను. ॥67॥

అవతారిక— "ముండయతి" (కేశఖండనము చేయుచున్నాడు), "సూత్రయతి" (సూత్రములను రచించుచున్నాడు), మొదలగుచోట్ల ముండ - సూత్ర, మొదలగునవి క్రియా వాచకములు కాకపోయినను వానికి కర్మలతో సంబంధము కుదురునని చెప్పుచున్నాడు.

శ్లో॥ ముండిసూత్ర్యాదయోఽసద్భిర్భాగై రనుగతా ఇవ ।
విభక్తాః కల్పితాత్మానో ధాతవః కుట్టిచర్చివత్ ॥ 68

ముండి సూత్ర్యాదయః = ముండి, సూత్రి, మొదలగునవి, కుట్టిచర్చివత్ = కుట్టి, చర్చి, అను వానివలె, అసద్భిః = లేనట్టి, భాగైః = భాగములతో, అనుగతాః + ఇవ = కూడినవా - అన్నట్లు, విభక్తాః = వేరుచేయబడినట్టియు, కల్పితాత్మానః = కల్పింపబడిన స్వరూపముగల, ధాతవః = ధాతువులై; (భవంతి = అగును).

తాత్పర్యము— కుట్ట, చర్చ, అను ధాతువులు చురాదిగణమున పఠింపబడినవి.

ఇవి అఖండములు. అసగా ఎట్టి అవయవములును లేనివి. వీని వలెనే ముండ, సూత్ర మొద లగునవియు అఖండములే. వీని విషయమున భాగములను చూపుట కేవలము కల్పనము.

*వివరణము*— ప్రక్రియనుబట్టి ముండ, సూత్ర మొదలగు ప్రాతిపదికములకు, ''కరోతి'' (చేయుచున్నాడు) అను నర్థమున ణిచ్ (ఇ) ప్రత్యయమును చేయగా, అవి ముండి, సూత్రి మొదలగు ధాతువులుగ మారును. పిదప తిజ్ ప్రక్రియవలన ముండయతి, సూత్ర యతి మొదలగు రూపములగును. ఈ తీరు కూడ వృత్తియే. దీనిని ''సనాద్యంత ధాతువృత్తి'' అందురు. ఇచట కూడ ''ముండం కరోతి'' మొదలగు వాక్యమును ప్రకృతి ప్రత్యయాది విభాగమును కేవలము ఉపాయమే. వాస్తవము కాదు. ''ముండయ'', ''సూత్రయ'' మొదలగు అఖండమైన ధాతు రూపములే సత్యములు. అవి క్రియా వాచకములు. కేశఖండనము, సూత్ర రచనము, మొదలగునవి వీని యర్థములు. కావుననే ''మాణవకుడు'' (వటువు) ''సూత్రము'' మొదలగు కర్మలతో వీనికి సహజముగనే సంబంధము కుదురును. కాగా ''మాణవకం ముండ యతి'' ''వ్యాకరణం సూత్రయతి'' మొదలగు ప్రయోగములు సహజ సిద్ధములు.

విశేష విషయములు— పాణిని తన ధాతు పాఠమున పఠించిన అఖండములగు ధాతువుల వంటివే (ముండి, మొదలగునవి) అని చెప్పుటకు, కుట్ట, చర్చ, అను దృష్టాంతము చూపబడినది. ముండి, కుట్టి, మొదలగునవి ణిచ్చును కలిపి వాడిన రూపములు. లేదా— ఇ, అను ప్రత్యయమును ధాతువునకు చేర్చి ఆ యా ధాతువును పేర్కొనుట కూడ ఒక సంప్ర దాయము. (ఉదా : గమిః = గమ్, ధాతువు). సన్, క్యచ్, మొదలగు ప్రత్యయములు పండ్రెండున్నవి. వీనిలో కొన్ని ధాతువులకు సూటిగానే చేరును. మరికొన్ని ప్రాతిపదికము లకు చేరును. తుదకన్నియు ధాతువులుగ మారును. ''కోరిక'', ''సాదృశ్యము'' మొదలగు చిత్ర విచిత్రమైన యర్థములను ఈ ప్రత్యయములు బోధించును. వీనిలో ఏ ఒక ప్రత్యయ మంతమందుగల రూపమును వాడినను, దానిని సనాద్యంత ధాతువృత్తి అని యందురు. వృత్తియొక్క ధర్మములన్నియు ఇచటను సమానముగనే పాటింపబడును. ॥౬౮॥

*అవతారిక*— ఇట్లే మరికొన్నిచోట్ల కూడ ప్రకృతి, ప్రత్యయము, మొదలగు విభాగమును చూపుట ఉపాయము మాత్రమే అని యనుచున్నాడు.

శ్లో॥ పుత్రీయతౌ న పుత్రోఽస్తి విశేషేచ్ఛా తు తాదృశీ।
వినైవపుత్రానుగమాత్ యా పుత్రే వ్యవతిష్ఠతే ॥ 69

పుత్రీయతౌ = ''పుత్రీయతి'' అనుచోట, పుత్రః = పుత్రశబ్దము, న + అస్తి = లేదు, పుత్రే = పుత్ర విషయకమైన, యా = ఏ, విశేషేచ్ఛా + తు = ప్రత్యేకమైన కోరిక అయితే (కలదో) తాదృశీ = అట్టి కోరిక, పుత్రానుగమాత్ = పుత్ర, అను భాగము ఉండుట, వినా + ఏవ = లేకుండగనే, వ్యవతిష్ఠతే = ఉండును.

తాత్పర్యము— ''పుత్రీయతి'' (తనకు పుత్రుని కోరుచున్నాడు) అనుచోట

''పుత్రమ్ - ఆత్మనః - ఇచ్ఛతి'' అను వాక్యమును చూపుదురు. అందుచే అవయవముగ పుత్ర శబ్ద మున్నట్లు తోచును. కాని వాస్తవముగ అచట ఎట్టి భాగమును లేదు. అది యఖండము. దానివలననే అభిమతమైన యర్థము (పుత్రుని కోరువాడు - అనునది) సూటిగ వచ్చును.

*వివరణము* — పుత్రీయతి, అనునదియు సనాద్యంత ధాతువృత్తియే ఇచట పుత్ర శబ్దమునకు ''క్యచ్'' (య) ప్రత్యయమనియు, అది పుత్ర విషయకమైన కోరికను తెలుపుననియును చెప్పి, ప్రక్రియను చూపుదురు. అదంతయు కల్పనమే. వృత్తియగుటచే ఏకార్థీభావము, అఖండత్వము మొదలగు ధర్మము లిచట సహజములు. (''పుత్రీయ'' అనునదియే ఇచటి మూల రూపము) ॥౬౯॥

*అవతారిక* — ''పుత్రీయతి'' అనుచోట ''మాణవకమ్'' మొదలగు వేరుగనున్న విశేషమైన కర్మతో సంబంధముండదని రెండు కారికలతో చెప్పుచున్నాడు

**శ్లో॥ ప్రాణై ర్వినా యథా ధారిర్జీవతౌ ప్రాణకర్మకః ।**
**నచాత్ర ధారిర్న ప్రాణాః జీవతిస్తు క్రియాంతరమ్ ॥ 70**

**శ్లో॥ తథా వినేషి పుత్రాభ్యాం పుత్రీయాయాం క్రియాంతరమ్ ।**
**అన్వాఖ్యానాయ భేదాస్తు సదృశాః ప్రతిపాదకాః ॥ 71**

జీవతౌ = జీవ, అను ధాతువు విషయమున, ప్రాణైః + వినా = ''ప్రాణాన్'' (ప్రాణములను) అను కర్మపద మక్కరలేకుండ, ప్రాణకర్మకః = ప్రాణములు కర్మగాగల, ధారిః = ధారి (ధారయతి) అను ధాతువు, (వర్తతే = ఉన్నది), అత్ర = ఇచట, ధారిః = ధారి, అనుధాతువు, న = లేదు, ప్రాణాః + చ = ప్రాణములును (కర్మలు) న = లేవు, జీవతిః + తు = జీవ ధాతువైతే, యథా = ఎట్లు, క్రియాంతరమ్ = వేరొక క్రియయో.

తథా = అట్లు, ఇషిపుత్రాభ్యామ్ + వినా = ''ఇష్'' ధాతువును పుత్ర శబ్దమును లేకుండ, పుత్రీయాయామ్ = ''పుత్రీయ'' అనుచోట, క్రియాంతరమ్ = వేరొక క్రియ, (అస్తి = ఉన్నది) ప్రతిపాదకాః = అర్థమును (ప్రక్రియను) చూపునటువంటిన్ని, సదృశాః = సమానములైనటువంటి, భేదాః + తు = విభాగములైతే, అన్వాఖ్యానాయ = విడమరచి చెప్పుటకు, (ఉపయుజ్యంతే = ఉపయోగించును).

తాత్పర్యము— ''జీవ'' అను ధాతువునకు ''ప్రాణములను ధరించుట'' అని యర్థము. (జీవతి = ప్రాణాన్ ధారయతి) ఇచట ప్రాణాన్, అను కర్మపదముగాని, ధారి, అను ధాతువుగాని వాస్తవము కాదు. ''జీవ'' అను అఖండమగు ధాతువే ఆ యర్థమునంతను చెప్పగలదు.

అట్లే పుత్రీయ, అనునది అఖండమగు ఒక ధాతువు. ''తనకు పుత్రుని కోరుట'' అను వ్యాపారమునంతను ఇది బోధించును. పుత్ర శబ్దమునుగాని, (ఆత్మనః - పుత్రమ్ -

అను రీతిని కర్మగ), ఇష్, ధాతువునుగాని (ఇచ్ఛతి) ఇచట వాడనక్కరలేదు. ఇట్టి స్థలములలో చూపబడు విభాగములుగాని, ప్రక్రియలుగాని కేవలము సత్యమును గుర్తించుటకై బయలుదేరిన సాధనములు మాత్రమే.

వివరణము— జీవన క్రియ అనగా "ప్రాణములను ధరించుటయే". ఇచట క్రియలో కర్మ ఇమిడియున్నదిగాన ప్రసిద్ధినిబట్టి ఈ ధాతువకర్మకము ఈ విధముగనే "పుత్రీయ" అను వ్యాపారమున (తనకు పుత్రుని కోరుట) పుత్రరూపమైన కర్మ ఇమిడియుండును. అందుచే వేరుగ కర్మను వాడనక్కరలేదని ప్రకృతమున సమన్వయము.

అవతారిక— "ముండయతి" (కేశములను ఖండించుచున్నాడు) అనుచోట "మాణవకమ్" మొదలగు విశేషకర్మను (ఎత్తిచూపు కర్మ) వాడుట కుదురును. కాని "పుత్రీయతి" అనుచోట అట్లు కుదురదని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆక్షేపాచ్చ ప్రయోగేణ విషయాంతరవర్తినా ।
సదపీచ్ఛాక్యచః కర్మ వాక్యఏవ ప్రయుజ్యతే ॥ 72

విషయాంతరవర్తినా = వేరొక విషయమున ప్రవర్తించును, ప్రయోగేణ = ప్రయోగముచే, ఆక్షేపాత్ + చ = బాధవలన, ఇచ్ఛాక్యచః = ఇచ్ఛార్థమున వచ్చు క్యచ్ ప్రత్యయము యొక్క, కర్మ = కర్మ, సత్ + అపి = ఉన్నను, వాక్యే + ఏవ = వాక్యమందే, ప్రయుజ్యతే = వాడబడును. (వృత్తియందు వాడబడదు).

తాత్పర్యము— ఇచ్ఛార్థకమైన క్యచ్ ప్రత్యయమును ఆచారార్థకమైన క్యచ్ ప్రత్యయము బాధించును. కావున "మాణవకం పుత్రీయతి" అని విశేష కర్మతో ప్రయోగింపగనే, "మాణవకుని పుత్రునివలె చూచుకొనుచున్నాడు" అను నర్థమే వచ్చునుగాని "మాణవకుని పుత్రునిగా కోరుచున్నాడు" అను అభిమతమగు అర్థము రాదు. అందుచే ఇచ్ఛార్థమున "పుత్రీయతి" అనునపుడు "మాణవకమ్" మొదలగు విశేషకర్మను వాడకూడదు. వాడదలచినచో వృత్తిని విడనాడి "మాణవకమ్ - పుత్రమ్ - ఇచ్ఛతి" అను వాక్యమునే ప్రయోగింపవలెను.

వివరణము— "సుప ఆత్మనః క్యచ్" (3-1-8) అను సూత్రము. "తన కోరికకు కర్మగా ఉండు వస్తువును (తాను కోరిన వస్తువును) చెప్పు సుబంతమునకు ఇచ్ఛార్థమున క్యచ్చు (య) అగును" అని యర్థము. ఉదా : ఆత్మనః పుత్రమ్ ఇచ్ఛతి = పుత్రీయతి. ఇది ఇచ్ఛార్థకమైన క్యచ్చు. "ఉపమానాదాచారే" (3-1-10) అని వేరొక సూత్రము. "ఉపమానమైన కర్మగ ఉండు సుబంతమునకు ఆచారార్థమున క్యచ్చు అగును" అని యర్థము. ఉదా : "పుత్రమ్ - ఇవ - ఆచరతి = పుత్రీయతి. (పుత్రునివలె చూచుకొనుచున్నాడు. "శిష్యమ్" = శిష్యుని - మొదలగునది ఉపమేయమగును). ఇది విశేషముగాన సామాన్యమైన మీది ప్రత్యయమును బాధించును. కాగా "సః పుత్రీయతి" అనగా "అతడు పుత్రుని కోరు

చున్నాడు'' అను నర్థము వచ్చును. ఇచట పుత్రుడను కర్మ (సామాన్యమైనను విశేషమైనను) వృత్తిలో ఇమిడియే యున్నది. అట్లుకాక ''మాణవకం పుత్రీయతి'' అని విశేషకర్మను స్పష్టముగా వాడగానే ఇచ్ఛార్థము పోయి ''మాణవకుని పుత్రునివలె భావించుచున్నాడు'' అను ఆచారార్థమే రాక తప్పదు. ఇది వృత్తి స్వభావము. అందుచే ఇచ్ఛార్థమున వృత్తిలో కర్మను వేరుగ వాడకూడదు. అట్టి యర్థమును తెలుపదలచినచో ''మాణవకం పుత్రమిచ్ఛతి'' అను వాక్యమునే ప్రయోగింపవలెను.

''ముండయతి'' మొదలగుచోట్ల ఈ చిక్కు లేదు. అచటి ప్రత్యయము క్యచ్చు కాదు (ణిచ్చు). కావున అచట కర్మపదమును వాడుకొనక తప్పదు.

ఎట్టి విశేషమును లేని కర్మ సామాన్యకర్మ అగును. ''ఇట్టిది'' అని స్పష్టముగ చెప్పబడిన కర్మ విశేషకర్మ అనిపించుకొనును. ॥72॥

*అవతారిక*— మీద చూపిన తీరునే మరికొన్నిచోట్ల కూడ భావింపనగునని ప్రసంగవశమున చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రసిద్ధేన వృతః శబ్దో భావగర్హాభిధాయినా ।**
**అభ్యాసే తుల్యరూపత్వాన్న యఙంతః ప్రయుజ్యతే ॥ 73**

భావగర్హాభిధాయినా = క్రియయొక్క నిందను బోధించు, ప్రసిద్ధేన = ప్రసిద్ధిచే, వృతః = కూడిన, యఙంతః = యఙ్ ప్రత్యయ మంతమందుగల, శబ్దః = శబ్దము, తుల్యరూపత్వాత్ = సమానమైన రూపము గలదగుటవలన, అభ్యాసే = క్రియా సమభిహారమున, న + ప్రయుజ్యతే = ప్రయోగింపబడదు.

*తాత్పర్యము*— ''లోలుప్యతే'', ''సాసద్యతే'' మొదలగు రూపములు యఙంతములు. ఇవియు సనాద్యంత ధాతు వృత్తియందే చేరును. వీనివలన వ్యాపారమునకు (ధాతువు యొక్క అర్థము) చెందిన నింద మాత్రమే బోధపడును. ప్రసిద్ధి ననుసరించి అట్లు జరుగును. కావున క్రియా సమభిహారమున వీనిని వాడకూడదు. అచట ''పునః పునః లుంపతి'' (మాటి మాటికి నరకుచున్నాడు) అను వాక్యమునే వాడవలెను.

*వివరణము*— ''ధాతో రేకాచో హలాదేః క్రియా సమభిహారే యఙ్'' (3-1-22) అనునది యఙ్ ప్రత్యయమును విధించు సూత్రము. ''హలాదియై ఒకే అచ్చుగల ధాతువునకు క్రియా సమభిహారమున యఙ్ ప్రత్యయమగును'' అని యర్థము. క్రియా సమభిహారమనగా ఒక క్రియ మాటిమాటికిని జరుగుట -లేక- తీవ్రముగా జరుగుట. ఈ సూత్రము సామాన్యము. ఉదా: బోభూయతే. (పునః పునః భవతి- ''భూ'' ధాతువునకు యఙ్ ప్రత్యయము. ధాతువునకు ద్విత్వము మొదలగు ప్రక్రియ) సనాది ప్రత్యయములలో యఙ్డు కూడ చేరి యున్నది. కాన ఇదియు వృత్తియే.

''లుప, సద, చర, జప, జభ, దహ, దశ, గృభ్యో భావగర్హాయామ్'' (3-1-24)

అనునది విశేష సూత్రము. లుప్, మొదలగు ఎనిమిది ధాతువులకును భావగర్హాయందే యఙ్ ప్రత్యయమగును అని దీని యర్థము. భావమనగా వ్యాపారము. దానిని ఏవగించుకొనుట భావ గర్హా యగును. ఉదా : లోలుప్యతే, మొదలగునవి. కాగా ఈ ధాతువులకు యఙ్ చేరునపుడు ఆ యా వ్యాపారమును ఏవగించుకొనుటయే స్ఫురించును. అట్లు స్ఫురించుటకు ఆ యా రూపము లా యర్థమున రూఢములై పోవుట కారణము. కావున అచట సామాన్యమగు క్రియా సమభిహారమును చెప్పకూడదు. అట్టి యర్థము కావలసినచో ''పునః పునః లుంపతి'' అను రీతిని వాక్యమునే ప్రయోగింపవలెను.

విశేష విషయములు— వృత్తియొక్క స్వభావమునుబట్టి కొన్ని యఙంతము లా యా విశేషార్థమున ప్రసిద్ధములై యున్నవి. ''రూప మొకతీరుననే యున్నదిగదా'' అని భావించి అట్టి చోటులందు సామాన్యమైన క్రియా సమభిహారమును చెప్పకూడదని సారాంశము.

ఇట్లే చంక్రమ్యతే, జంగమ్యతే, మొదలగుచోట్ల ''వంకరగ నడచుచున్నాడు'' అను విశేషార్థమునే చెప్పవలెను. ''నిత్యం కౌటిల్యేగతౌ'' (2-1-23) అను సూత్రముచే అచట కౌటిల్యమను నర్థమున యఙ్విహితమైనది. (40 వ కారికలో ఈ యంశము వివరింప బడినది) అందుచే అచటకూడ క్రియా సమభిహారము కావలసినపుడు, ''కుటిలం గచ్ఛతి'' మొదలగు రీతిని వాక్యమునే వాడుకొనవలెను. ॥73॥

అవతారిక— ఇట్లు అఖండమైన సముదాయములే సత్యములు. అవయవముల కల్పన మసత్యము. అది ఉపాయము మాత్రమే. సముదాయమువలన లభించు అర్థము అవ యవముల యర్థమును ఎల్లపుడును బాధించునను తత్త్వమును ప్రకటించుచున్నాడు.

శ్లో॥ శబ్దా యథా విభజ్యంతే భాగైరివ వికల్పితైః।
అన్వాఖ్యేయాస్తథా శాస్త్రమతిదూరే వ్యవస్థితమ్ ॥ 74

వికల్పితైః = కల్పింపబడిన, భాగైః + ఇవ = భాగములతో అన్నట్లు, శబ్దాః = శబ్దములు, యథా = ఎట్లు, విభజ్యంతే = విభజింపబడునో, తథా = అట్లు, అన్వాఖ్యేయాః = వ్యాఖ్యా నింపదగినవి, శాస్త్రమ్ = శాస్త్రము, అతిదూరే = మిక్కిలి దూరమున, వ్యవస్థితమ్ = ఉన్నది.

తాత్పర్యము— సత్యమైన అఖండత్వమును బోధించుటకు అసత్యమైన భాగ కల్పనము స్వీకరింపబడును. భాగములను చూపు శాస్త్రము ఉపాయము మాత్రమే.

వివరణము— శబ్ద మఖండమైనను దాని సాధుత్వమును తత్త్వమును అనేక విధములైన ప్రక్రియలతో శాస్త్రము చూపుచుండును. అంతమాత్రమున ఆ ప్రక్రియలు వాస్తవ ములు కావు. అవి చిత్రములవంటివి. ఆ చిత్రములు బోధించు సత్య వస్తువులవంటివి శబ్దములు.

విశేష విషయములు— ప్రక్రియలు అసత్యములు కనుకనే ఒక్కొక శబ్దమునకు ఒక్కొక రీతి ప్రక్రియను ఒక్కొకరు చూపుచుందురు. అట్లు వేర్వేరు వ్యాకరణములును సిద్ధ

మైనవి. కాగా వ్యాకరణశాస్త్రము సత్యము కాదు. దాని మూలమున తెలియదగు అఖండమైన శబ్దము పరమార్థము. ॥74॥

అవతారిక— "అవయవములు అసత్యములనుట" అన్నిటను వర్తించునని గుర్తు చేయుచున్నాడు.

శ్లో॥ అర్థస్యానుగమం కంచిద్ దృష్ట్వైవ పరికల్పితమ్ ।
పదం వాక్యే పదే ధాతుర్ధాతౌ భాగశ్చ ముండివత్ ॥ 75

అర్థస్య = అర్థముయొక్క, కంచిత్ = ఒకానొక, అనుగమమ్ = సంబంధమును, దృష్ట్వా+ ఏవ = చూచియే, ముండివత్ = "ముండయతి" అనుచోటవలె, వాక్యే = వాక్యమందు, పదమ్ = పదమును, పదే = పదమున, ధాతుః = ధాతువును, ధాతౌ = ధాతువునందు, భాగః + చ = భాగమును, పరికల్పితమ్ = కల్పింపబడెను.

తాత్పర్యము— వాక్యార్థమఖండము. దానిని బోధించు వాక్యము కూడ అఖండమే అయినను అఖండమైన వానిని అట్లే మందబుద్ధులకు వ్యాఖ్యానించుట కష్టమని భావించి పదము ధాతువు, ప్రకృతి, ప్రత్యయము, వర్ణము, మొదలగు భాగములు కల్పింపబడినవి. అట్లే వాని యర్థములును కల్పింపబడినవి.

వివరణము— శబ్ద సముదాయమును విభజించుకొనుచు పోయినచో దానికి అంత మన్నది ఉండదు. పదము, ప్రకృతి, ప్రత్యయము, వర్ణము, దాని అవయవము, దాని భాగము ఈ రీతిని ఎంతవరకు పోవుటయో చెప్పలేము. ఎక్కడో ఒకచోట "ఇది అభిన్నము" (భాగములు లేనిది) అనుట తప్పదు. అట్లయినపుడు తొలుతనే "వాక్య మఖండమనుట" మంచిది. వాక్యము బోధించు అర్థమును అట్టిదియే. శబ్దార్థముల తీరు తెన్నులను సూక్ష్మముగ పరిశీలించిన వైయాకరణు లీ తత్త్వమును నిశ్చయించిరి. అయితే వ్యవహారమును అర్థము తెలియుటలో గల సామాన్య విశేషభావమును అనుసరించి సౌకర్యమునకై "అపోద్ధారమును" (విడదీయుట - ఎత్తి చూపుట) ఆశ్రయించి వారు విభాగములను చూపుదురు. అంతమాత్రమున అవి సత్యములని భావింపరాదు. "ముండయతి" అనునది విభాగము విషయమున ఉదాహరణముగ చూపబడినది. ఇట్టి విశేషములన్నియు మొదటి కాండమున విపులముగ చర్చింపబడినవి. ॥75॥

అవతారిక— కాగా వేర్వేరుగ నుండు ప్రక్రియలను సత్యములని యనుకొనరాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అవిప్రయోగః సాధుత్వే వ్యుత్పత్తిరనవస్థితా ।
ఉపాయాన్ ప్రతిపత్తౄణాం నాభిమన్యేత సత్యతః ॥ 76

సాధుత్వే = సాధుత్వమందు, అవిప్రయోగః = వివిధమైన ప్రతిపాదనము లేదు, వ్యుత్పత్తిః = వ్యుత్పత్తి, అనవస్థితా = అనిశ్చితము, ప్రతిపత్తౄణామ్ = తెలిసికొను వారికి సంబంధించిన, ఉపాయాన్ = ఉపాయములను, సత్యతః = సత్యముగా, న + అభిమన్యేత = తలపకూడదు.

శ్లోకమున చెప్పబడినది. ఆ యర్థమును యుక్తి జూపి సమర్థించుచున్నాడు. అనగా జాతినే విడువరాదా, గుణమునే గ్రహింపరాదా ? అను ప్రశ్నకు యుక్తి జూపి సమర్థించుచున్నాడు.

శ్లో॥ వ్యక్తౌ శక్తేః సమాసన్నా జాతయోన తథా గుణాః ।
సాక్షాద్ద్రవ్యం క్రియాయోగి, గుణస్తస్మాద్వికల్ప్యతే ॥ 79

వ్యక్తౌ శక్తేః = శక్తమగు ద్రవ్యమునకు, జాతయః = జాతులు, సమాసన్నాః = దగ్గరగా నున్నవి, గుణాః = గుణములు, తథా = అట్టివి, అనగా ద్రవ్యమునకు దగ్గరగా నున్నవి, న = కానేరవు, ఏలయన, ద్రవ్యమ్ = ద్రవ్యము, సాక్షాత్ = సాక్షాత్తుగా, క్రియాయోగి = యాగాది క్రియలతో సంబంధించునది, తస్మాత్ = ఆ కారణము వలన, అనగా ద్రవ్యము సాక్షాత్తు క్రియతో సంబంధించును, గుణము దాని ద్వారా క్రియతో సంబంధించునను కారణము వలన, గుణః = గుణము, అనగా తెలుపు, నలుపు మున్నగుగుణము, వికల్ప్యతే = వికల్పమును జెందును. అనగా గుణమే ప్రతినిధిగా గ్రహింపబడును.

ద్రవ్యమునందు జాతి, గుణములు కూడ సమవాయ సంబంధమున నుండును, కాని జాతి వ్యక్తిని ఎన్నడు విడనాడకయే యుండును, గుణము లట్టివి కావు, ద్రవ్యముండగనే దానియందున్న గుణములు నశించును, నూతనమగు గుణములు కలుగును.

కాబట్టి అవినాభావిగానున్న జాతికి ప్రతినిధి యుండదు. వచ్చుచు పోవుచు ఉండెడి గుణములకు ప్రతినిధి యుండును.

ద్రవ్యము సాక్షాత్తు క్రియతో సంబంధించును. దానిద్వారా జాతిగుణములు క్రియతో సంబంధించును. అందుచే వానిలో ద్రవ్యమునకు ఏది సన్నిహితము, ఏది దూరము అని విచారింపబడుచున్నది. అందు జాతి సన్నిహితము కనుక జాత్యంతరమునకు ప్రతినిధిత్వము లేకుండ ఆ జాతికి చెందిన వ్యక్తినే యాగాంగముగా గ్రహింపవలెను. గుణములు దూరము కనుక వానిని విడనాడి గుణాంతరయుక్తమగు మేకనే గ్రహింపవలెను. నల్లని మేక కూడ ఛాగత్వజాతికి చెందినదే.

ద్రవ్యమును అపేక్షింపక గుణమే సాక్షాత్తు క్రియతో సంబంధించిన, అపుడు పై విచారము. అనగా గుణములు ప్రతినిధిగా గ్రహింపబడునా ? లేక జాతులు ప్రతినిధిగా గ్రహింపబడునా అను వికల్పమునకు తావు లేదు, కాని గుణము సాక్షాత్తు క్రియతో సంబంధింపదు.

కాగా జాతి పక్షమున పై సిద్ధాంతము ఉపపన్నమగుచున్నది, ద్రవ్యమే శబ్దవాచ్యమను పక్షమున పై సిద్ధాంతము నిలువదు అని ఈ శ్లోకముయొక్క ముఖ్య తాత్పర్యము.

జాతి శక్తివాదము చాల ఉత్తమమైనదని బోధించుటకు ఈ విచారణము చేయబడినది.

॥79॥

తాత్పర్యము— విభాగములు లేని శబ్దమే సాధువు. దానిని ప్రతిపాదించు ప్రక్రియలు ఎన్ని యున్నను అవి ఈ సత్యమును చూపి మరలిపోవును. అవి నియతములు కావు. ఉపాయములను సత్యములని యనుకొనరాదు.

వివరణము— ఇట్టి యంశములు వెనుకటి రెండు కాండములందును పెక్కుసారులు విశదీకరింపబడినవి. ప్రసంగము వచ్చినపుడెల్ల వానిని మరల మరల పరామర్శించుట గ్రంథకారుని స్వభావము. ॥76॥

అవతారిక— "ఉపాయములు అసత్యములైనపుడు వ్యుత్పత్తిగల శబ్దములును వ్యుత్పత్తిలేని శబ్దములును అన్నియు నొకటే. భేదము వాస్తవము కాదు" అని చెప్పుచున్నాడు.

శ్లో॥ యథైవ డిత్థే దయతిః పాచకే పచతి స్తథా ।
దయతిశ్చ పచిశ్చైవ ద్వావప్యేతావలౌకికౌ ॥ 77

డిత్థే = డిత్థ, అను శబ్దమున, దయతిః = "దయ" అను ధాతువు, యథా = ఎట్లో, పాచకే= పాచక, అను శబ్దమున, పచతిః = పచ్, ధాతువు, తథా + ఏవ = అట్లే, (ఉన్నది) దయతిః + చ = "దయ" ధాతువును, పచిః + చ + ఏవ = పచ్ ధాతువును, ఏతౌ = ఈ, ద్వౌ + అపి = రెండును, అలౌకికౌ + ఏవ = అప్రసిద్ధములే.

తాత్పర్యము— డిత్థ, అను శబ్దమందును, పాచక, అను శబ్దమందును భావింపబడు దయ, పచ్, అను ధాతువులు రెండును కల్పితములే.

వివరణము— శబ్దములలో కొన్నిటికి వ్యుత్పత్తి (ప్రకృతి + ప్రత్యయము అను విభాగము) కలదనియు, మరికొన్నింటికది లేదనియును చెప్పుట సంప్రదాయమై యున్నది. కాని అదియు వాస్తవము కాదు. అన్నిచోట్లను సముదాయములే సాధువులు. అవి యఖండములు. అవియే లోకమున అర్థమును బోధించును.

విశేష విషయములు— ప్రవృత్తి నిమిత్తమును బట్టి (శబ్ద మా యా అర్థమును బోధించుటకు హేతువైన అంశము) శబ్దములను నాలుగు విధములు విభజించుట ఆచారము. ఉదా: (1) గౌః, మొదలగునవి జాతి ప్రవృత్తి నిమిత్తకములు. (గచ్ఛతీతి = గౌః - గోత్వమును జాతి ఇచట ప్రవృత్త నిమిత్తము). (2) శుక్లః, మొదలగునవి గుణప్రవృత్తి నిమిత్తకములు. (తెలుపు, అను గుణము ప్రవృత్తి నిమిత్తము). (3) పాచకః, మొదలగునవి క్రియా ప్రవృత్తి నిమిత్తకములు. (పచతీతి = పాచకః - వంట, అను క్రియ ప్రవృత్తి నిమిత్తము). (4) డిత్థః, మొదలగునవి సంజ్ఞాప్రవృత్తి నిమిత్తకములు (డిత్థ, మొదలగు కల్పితమైన పేరే (ప్రవృత్తి నిమిత్తము). ఇట్లుకాక అన్ని శబ్దములకును జాతి యొకటే ప్రవృత్తి నిమిత్తమగునని ఒక మతమున్నది.

అట్లే కొన్ని శబ్దములకు వ్యుత్పత్తి యుండుననియు కొన్నింటికి ఉండదనియును

చెప్పుట కూడ ఒక సంప్రదాయమే. మరియు యౌగికములు, (అవయవముల అర్థము కలవి = పాచకః, మొదలగునవి), రూఢములు, (అవయవార్థము లేకుండ ప్రసిద్ధమైన అర్థమును బోధించునవి. కుశలః, మొదలగునవి), యోగరూఢములు (అవయవార్థమును కలిగి ఏదో యొక అర్థమున ప్రసిద్ధములు = పంకజమ్, మొదలగునవి) అను విభాగము కూడ శాస్త్ర మర్యాదలో నున్నది.

పై రీతులన్నియును అసత్యములైన ఉపాయములు మాత్రమే. అన్ని శబ్దములును అఖండములుగనే తమ తమ యర్థములను బోధించును. సాధుత్వమును చెప్పుటకు కంకణము కట్టుకొన్న వ్యాకరణశాస్త్రము మాత్రము వీలున్నచోట వ్యుత్పత్తిని చూపును. లేనిచోట సముదాయమే సాధువనును. పట్టుదల చూపినచో అన్నిచోట్లను వ్యుత్పత్తిని చూపనగును. లేనిచో లేదు

ప్రకృతమున డిత్థ, అనునది (ఒక వ్యక్తికి కల్పితమైన పేరు) అవ్యుత్పన్నమనుటయు, పాచక, అనునది వ్యుత్పన్నమనుటయును అభ్యాసము. వాస్తవమున రెండింటి తీరును ఒకటే అని చెప్పుట గ్రంథకర్తకు అభిమతము. ॥77॥

*అవతారిక* — మందబుద్ధుల కుపయోగించుటకై వివిధములగు భేదములను శిష్టులు కల్పించిరని చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రకృతిప్రత్యయౌ వూహ్యౌ పదాత్తాభ్యాం పదం తథా ।
అనుబంధస్వరాదిభ్యః శిష్టైః శాస్త్రం న తాన్ప్రతి ॥ 78

శిష్టైః = శిష్టులచే, పదాత్ = పదమువలన, ప్రకృతి ప్రత్యయౌ = ప్రకృతి ప్రత్యయములు, ఊహ్యౌ = ఊహింపదగినవి, తథా = అట్లు, తాభ్యామ్ = ఆ ప్రకృతి ప్రత్యయములచేతను, అనుబంధస్వరాదిభ్యః = అనుబంధములు, స్వరములు మొదలగువానిచేతను, పదమ్=పదము, (ఊహ్యమ్ = ఊహింపదగినది), తాన్ + ప్రతి = అశిష్టులను గురించి, శాస్త్రమ్ = వ్యాకరణ శాస్త్రము, న = లేదు.

*తాత్పర్యము* — శబ్ద ప్రపంచమంతను కరతలామలకముగ చూచువారు శిష్టులు. (పాణిని, వరరుచి, పతంజలి మొదలగు మునులును వారివంటి శక్తి సంపన్నులును). వారు సాధు శబ్దములనే శిష్యుల కుపదేశింతురు. అఖండమగు వాక్యమునుండి పదమును వేరుచేసి, దానియందు ప్రకృతి, ప్రత్యయము మొదలగు భాగముల నూహించి వివరింతురు. అట్లే ప్రకృతులందును, ప్రత్యయములందును ఇత్సంజ్ఞక వర్ణములు మొదలగు వానిని కూడ ఊహించి చూపుదురు. ఈ ప్రక్రియ అంతయు శిష్యులకే ఉపయోగించును. శిష్టులకు వ్యాకరణము వలన ప్రయోజనము లేదు.

*వివరణము*— సాధు శబ్దములను ప్రయోగించుటవలన ధర్మము లభించుననియు అసాధువుల నుచ్చరించినచో అధర్మము కలుగుననియును వైయాకరణుల సిద్ధాంతము. కావున

శిష్టు లెపుడును సాధు శబ్దములనే చూపుదురు. వారి ప్రయోగమే వ్యాకరణమునకు శరణ్యము. శబ్దములను సూటిగను ఉన్నదున్నట్లుగను చూపుట ఒక పద్ధతి. వీనిని నిపాతనము లందురు. ఉదా : పృషోదరః, పారస్కరః, మొదలగునవి. ప్రకృతులను ప్రత్యయములను వేరుగా చూపి కొన్ని కార్యములను కూడ ప్రవర్తింపజేసి, శబ్దములను సిద్ధముచేయుట రెండవ పద్ధతి. ఉదా : పాచకః, భవతి, మొదలగునవి. ఇట్టి తీరులన్నియును మందబుద్ధుల కొరకే బయలు దేరినవి. శబ్ద తత్త్వవేత్తలకు వీనివలన ఉపయోగము లేదు. వారు ఎల్లపుడును అఖండములగు శబ్దార్థములనే అనుసంధానము చేయుచుందురు.

విశేష విషయములు— ఆయా ప్రకృతులకును (భ్వాక్, డీఙ్, మొదలగు ధాతువులు) ప్రత్యయములకును (త్యాచ్, తృన్, మొదలగునవి) చివరనుండు క్, ఙ్, చ్, మొదలగు వర్ణములను అనుబంధములు -లేక- ఇత్సంజ్ఞక వర్ణములని యందురు. ఇవి సిద్ధ రూపములలో వినబడవు. కాని వీనివలన ఉదాత్తాది స్వరములును మరికొన్ని విశేషకార్యములును కృత్రిమముగ లభించును. వీని నన్నింటిని కూడ శిష్టులూహింతురు. ॥75॥

అవతారిక— కేవలము శాస్త్రమునుబట్టి ప్రాకులాడుట కూడ తగదనుచున్నాడు.

**శ్లో॥ శాస్త్రదృష్టిస్తు శాస్త్రస్య ప్రాప్తిమాత్రేఽప్యనిశ్చితే।**
**యుజ్యతే ప్రత్యవాయేన శాస్త్రం చక్షురపశ్యతామ్ ॥** 79

శాస్త్రస్య = శాస్త్రముయొక్క, ప్రాప్తిమాత్రే + అపి = ప్రవర్తించుట అయినను, అనిశ్చితే= నిశ్చయింపబడనపుడు, శాస్త్రదృష్టిః + తు = కేవలము శాస్త్రమే ఆధారముగా గలవాడు, ప్రత్యవాయేన = పాపముతో, యుజ్యతే = కూడును, అపశ్యతామ్ = శిష్టప్రయోగమును చూడని వారికి, శాస్త్రమ్ = శాస్త్రము, చక్షుః = నేత్రమువంటిది.

తాత్పర్యము— వ్యాకరణ శాస్త్రముయొక్క విధులను నియమములను చక్కగ తెలియకుండ శబ్దములను స్వేచ్ఛగ ప్రయోగించినచో పాపము సంభవించును. శిష్టుల ప్రయోగములను శాస్త్రమును కూడ సమన్వయించికొని శబ్దములను వాడవలెను. శిష్ట ప్రయోగముల నెరుగని వారికి శబ్ద శాస్త్రము నేత్రము వంటిది.

వివరణము— ''బహుళము'', ''వికల్పము'', ''నిత్యము'', ''నియమము'' మొదలగు తీరులెన్నియో వ్యాకరణ కార్యములు ప్రవర్తించుటలో పాటింపబడు చుండును. వానిని బాగుగా పరిశీలింపక తొందరపడి ఒక నిర్ణయము చేసికొని, శిష్టుల ప్రయోగమునైనను అనుసరింపక స్వేచ్ఛగ శబ్దములను వాడరాదు. అట్లని కేవలము శిష్టప్రయోగమునే ఆశ్రయించుకొని శాస్త్రమును వదలుటయు మంచిది కాదు. శాస్త్రమును ప్రయోగమును కూడ సముచితముగ సమన్వయించుకొనవలెనని యిచట గ్రంథకర్త హెచ్చరించినాడు.

విశేష విషయములు— అందువలననే ''లక్ష్య లక్షణే వ్యాకరణమ్'' అని వరరుచియు పతంజలియును సిద్ధాంతము చేసిరి. ''శిష్ట ప్రయోగము వ్యాకరణశాస్త్రము – ఈ

రెండిటి కలయికయే వ్యాకరణమగును'' అని దీని భావము. కాగా ''శిష్టుల ప్రయోగమును, వారు రచించిన శాస్త్రమును శిష్యులకు స్వీకార్యములు'' అని ఇచటి సారము ॥79॥

అవతారిక— మందబుద్ధులకు వ్యాకరణము నేత్రమువంటిదైనను, కొన్ని సందర్భములలో అది ''నిష్ఫలమని'' త్రోసివేయబడు చుండునని చెప్పుచున్నాడు.

శ్లో॥ అర్థాంతరాభిధానాచ్చ పౌర్వాపర్యం న భిద్యతే ।
రాజదంతాహితాగ్న్యాదిరాజాశ్వాదిషు సర్వథా ॥ 80

రాజదంతా ... ... శ్వాదిషు = రాజదంతః, అహితాగ్నిః, రాజాశ్వః, మొదలగుచోట్ల, అర్థాంతరాభిధానాత్ + చ = వేరొక యర్థమును చెప్పుటవలన, పౌర్వాపర్యమ్ = ముందు వెనుకలగుట, సర్వథా = అన్ని విధముల, న + భిద్యతే = మారదు.

తాత్పర్యము— ''రాజదంతః'' మొదలగు సమాసములలో శబ్దములను తారుమారు చేసినచో అభిమతమగు అర్థము రాదు. అందుచే వ్యవహారమున అవి ఒక నియతమైన వరుసలోనే పలుకబడుచుండును. కావున అట్టి వరుసను చెప్పుటకై శాస్త్ర మావశ్యకము కాదని చెప్పుదురు.

వివరణము— (1) ''దంతానామ్ - రాజా = రాజదంతః'' ఇది షష్ఠీ తత్పురుషము. ''శ్రేష్ఠమైనదంతము'' అని యర్థము. ఇచట ''దంతరాజః'' అని ప్రయోగించుట లోక సిద్ధము కాదు. అట్లుచ్చరించినచో ''దంతముల రాజు'' అను వేరొక యర్థము స్ఫురించెడిని.

(2) ''ఆహితః - అగ్నిః - యేన - సః = ఆహితాగ్నిః. ఇది బహువ్రీహి'' అగ్నిని సంపాదించినవాడు = దీక్షితుడు'' అని భావము. ఇచట రెండు పదములను తారుమారుగ (అగ్న్యాహితః) పలికినను అర్థమున మార్పురాదు. అట్టి ప్రయోగము కూడ లోక ప్రసిద్ధము

(3) ''రాజాశ్వః'' = ''రాజ్ఞః - అశ్వః'' = రాజుగారి గుర్రము. ఈ షష్ఠీ తత్పురుషములో శబ్దముల క్రమ మిట్లే యుండును. ''అశ్వరాజః'' ఇదియు షష్ఠీ తత్పురుషమే అయినను ఇపుడు ''శ్రేష్ఠమైన అశ్వము'' అను నర్థము వచ్చును. (శబ్ద క్రమము మారినది) కాగా ఆ యా సమాసములలోని పదముల వరుస లోకమువలననే (శిష్టవ్యవహారము) నిశ్చితమై పోవును. అందుకొరకై (పదముల క్రమమును చెప్పుటకై) సూత్రములను రచింప నక్కర లేదు. రచించినను అవి నిష్ఫలములు.

విశేష విషయములు— ''ఉపసర్జనం పూర్వమ్'' (2-2-30) అను సూత్రము, ''సమాసమున ఉపసర్జనమైన పదమును ముందుగ పలుకవలెను'' అను నర్థమును చెప్పును. సమాసమును విధించు సూత్రములలో (షష్ఠీ - 2 - 2 - 8, సప్తమీ శౌండైః - 2 - 1 - 40, మొదలగునవి) ప్రథమాంతముగ ఉన్న పదమువలన గ్రహింపబడు శబ్దములకు (షష్ఠ్యంతము సప్తమ్యంతము, మొదలగునవి) ఉపసర్జనమని కృత్రిమమైన పేరు. అట్టి ఉపసర్జనమునకు పూర్వ నిపాతమును (ముందు వాడుట) పై సూత్రము చెప్పినది.

''నవా - అనిష్టాఽదర్శనాత్'' (2-2-30 - సూత్రమున వార్తికము) అను వచనముచే ''ఉపసర్జనం పూర్వమ్'' అను సూత్రము భాష్యమున ప్రత్యాఖ్యాతమైనది (త్రోసివేయబడినది). సమాసములందలి శబ్దముల పౌర్వాపర్యము లోకమువలననే సిద్ధించును కావునను, సూత్రము లేకున్నను దోషములు సంభవింపవు కావునను ఈ సూత్ర మక్కరలేదని ఈ వచనము యొక్క భావము. ఇట్టి సందర్భమంతయు ఈ కారికయం దిమిడియున్నది. ॥80॥

*అవతారిక*— శిష్టుల వ్యవహారము వలననే అన్నియు సిద్ధించినను, శబ్దముల సాధుత్వమును విశదపరచుటకై కొన్ని కార్యములను శాస్త్రము విధింపక తప్పదని చూపుచున్నాడు.

శ్లో॥ వినైవ ప్రత్యయైర్వృత్తౌ యే భిన్నార్థాఽభిధాయినః ।
గర్గాదయో లుకా తేషాం సాధుత్వమనుగమ్యతే ॥ 81

ప్రత్యయైః = ప్రత్యయములు, వినా + ఏవ = లేకుండగనే, వృత్తౌ = వృత్తియందు (తద్ధితము, మొదలగునది), భిన్నార్థాభిధాయినః = వేరొక యర్థమును చెప్పు, యే = ఏ, గర్గాదయః = ''గర్గాః'' మొదలగు పదములు గలవో, తేషామ్ = వానికి, లుకా = ప్రత్యయము యొక్క లోపముచే, సాధుత్వమ్ = సాధు శబ్దమగుట, అనుగమ్యతే = సంపాదింపబడును.

తాత్పర్యము— తద్ధిత వృత్తిలో కొన్నిచోట్ల ప్రత్యయము లేకున్నను అభీష్టమైన యర్థము లభించును. ఉదా: ''గర్గాః'' (గర్గస్య - గోత్రాపత్యాని - పుమాంసః) ''గర్గుని సంతతియైన పురుషులు'' అని యర్థము. ఇచట అపత్యమును (సంతతి) చెప్పు ప్రత్యయమునకు లోపమును శాస్త్రము విధించినది. అది కేవలము శబ్దముయొక్క సాధుత్వము కొరకే.

*వివరణము*— ''గర్గుని గోత్రమైన సంతతి'' అను నర్థమున గర్గ శబ్దమునకు, ''గర్గాదిభ్యోయఞ్'' (4-1-105) (గర్గాది గణమందలి శబ్దములకు - ''అతని గోత్రాపత్యము'' - అను నర్థమున యఞ్ ప్రత్యయమగును) అను సూత్రముచే యఞ్ ప్రత్యయమగును. ''గార్గ్య'' అను రూపము సిద్ధించును. ఈ ప్రత్యయమునకు బహువచనమున లోపము విధింపబడినది. అందుచే ఏకవచనమందును ద్వివచనమందును గార్గ్యః, గార్గ్యౌ, అను రూపములున్నను, బహువచనమందు మాత్రము ''గర్గాః'' అను రూపమే యగును. అర్థమందు మార్పు ఉండదు. (కేవలము గర్గ శబ్దమునకు ప్రథమా బహువచనము కూడ ''గర్గాః'' అనియే యుండును. కాని దాని యర్థము వేరు. ''పెక్కు గర్గులు'' అని యర్థము.)

''న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యానాఽపి (కేవలః) ప్రత్యయః'' అను ఒక నియమమున్నది. ''ప్రత్యయము లేని ప్రకృతినిగాని ప్రకృతి లేని ప్రత్యయమునుగాని ప్రయోగింపరాదు'' అని దీని భావము. ఈ నియమము ననుసరించి, ''గర్గాః'' అనుచోట అపత్యరూపమైన తద్ధిత ప్రత్యయము యొక్క యర్థము తెలియుచున్నను, ప్రత్యయము చేరినట్లును అది లోపించినట్లును శాస్త్రము చెప్పును. అనగా సంస్కరించి ''ఈ శబ్ద మిట్లు సాధువు'' అని ప్రకటించును.

(3) ''బభ్రోః - గోత్రాపత్యాని - పుమాంసః=బభ్రవః'' అని యగును. (బభ్రుని గోత్రమైన మగ సంతానము). బాభ్రవ్యః, బాభ్రవ్యౌ, అనునవి వీనియొక్క ఏకవచన ద్వివచనములు. మిగిలిన విషయము సమానమే. (గర్గ శబ్దమునకు బదులు బభ్రుశబ్దమున్నది).॥82॥

*అవతారిక*— ''గర్గాః'' మొదలగు తద్ధితవృత్తిలో ''అపత్యము'' అను నర్థము నియతముగ తెలియుటకు ప్రత్యయమును విధించి దానికి లోపమును చెప్పవలయునని మీది కారిక వివరించినది. అదే తీరులో ''ప్రష్ఠీ'' (ప్రష్ఠస్య - స్త్రీ = ప్రష్ఠుని భార్య) మొదలగుచోట్ల కూడ ''ప్రష్ఠస్య - ఇయమ్'' (ప్రష్ఠునికి సంబంధించిన స్త్రీ) అను సామాన్యార్థమున తద్ధిత ప్రత్యయమును చేసి, దానివలన నియతముగ ''భార్య'' అను నర్థమును రాబట్టి, ఆ ప్రత్యయమునకు లోపమును చెప్పవలసి యుండును. లేకున్న ''భార్య'' అను నర్థము తప్పక వచ్చుట ఎట్లు కుదురును ?— అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

**శ్లో॥ సోఽయమిత్యభిసంబంధే లింగోపవ్యంజనాదృతే ।**
**ప్రష్ఠాదిషు న జాయైవ నియమేన ప్రతీయతే ॥ 83**

''సః + అయమ్ + ఇతి'' = ''అతడే యితడు'' అని - (లేక - ''అతడే ఈమె - అని) అభిసంబంధే = సంబంధమును కల్పించినపుడు, లింగోపవ్యంజనాత్ + ఋతే = లింగమును చెప్పు ప్రత్యయము లేకుండ, ప్రష్ఠాదిషు = ప్రష్ఠ, మొదలగుచోట్ల, జాయా + ఏవ = భార్యయే, నియమేన = నియమముగ, న + ప్రతీయతే = తెలియబడదు.

తాత్పర్యము— ప్రష్ఠీ, మొదలగుచోట్ల ''ఙీష్'' (ఈ) అను స్త్రీలింగమును బోధించు ప్రత్యయమున్నది. అదియే ''భార్య'' అను నర్థమును నియతముగ తెలియజేయును. కావున అందుకొరకై వేరుగ తద్ధిత ప్రత్యయమును చేసి దానికి లోపమును చేయనక్కర లేదు.

*వివరణ*— ప్రష్ఠునికిని అతని భార్యకును అభేదమును కల్పించి స్త్రీ ప్రత్యయమును చేయుదుము. అట్లు ''భార్య'' అను అభిమతమైన యర్థము వేరొక విధమున తప్పక లభించునపుడు, అదే యర్థమునకై తద్ధితమును చేయుటయు దానికి లోపమనుటయును వ్యర్థము గదా !

విశేష విషయములు— ప్రష్ఠః, అను శబ్దమునకు, ''సమర్థముగ ప్రయాణము చేయువాడు'' -లేక- ''ముందు వెళ్ళువాడు'' (నాయకుడు) అని యర్థము. ఇచట ''ప్రష్ఠస్య - స్త్రీ'' (ప్రష్ఠుని భార్య) అను నర్థమున ''పుంయోగాదాఖ్యాయామ్'' (4-1-48) అను సూత్రముచే ప్రష్ఠ శబ్దమునకు ఙీష్, (ఈ) అను స్త్రీ ప్రత్యయము చేరును. ''ఒకానొక విశిష్టమైన ధర్మమును బట్టి ప్రసిద్ధముగా పురుషుని బోధించు శబ్దమునకు, ''అతని భార్య'' అను నర్థమున ఙీష్ ప్రత్యయమగు''నని పై సూత్రముయొక్క భావము. ఈ ప్రత్యయము ''భార్య'' అను నర్థమును తప్పక బోధించును. (సూత్రమందలి ''పుంయోగ'' అను శబ్దము ''భార్య'' అను సంబంధమునే సూచించునని నిర్ణయము, కావున చెల్లెలు, తల్లి, మొదలగు

(3) ''బభ్రోః - గోత్రాపత్యాని - పుమాంసః = బభ్రవః'' అని యగును. (బభ్రుని గోత్రమైన మగ సంతానము). బాభ్రవ్యః, బాభ్రవ్యౌ, అనునవి వీనియొక్క ఏకవచన ద్వివచనములు మిగిలిన విషయము సమానమే. (గర్గ శబ్దమునకు బదులు బభ్రుశబ్దమున్నది).॥82॥

అవతారిక — ''గర్గాః'' మొదలగు తద్ధితవృత్తిలో ''అపత్యము'' అను నర్థము నియతముగ తెలియుటకు ప్రత్యయమును విధించి దానికి లోపమును చెప్పవలయునని మీది కారిక వివరించినది. అదే తీరులో ''ప్రష్ఠీ'' (ప్రష్ఠస్య - స్త్రీ = ప్రష్ఠుని భార్య) మొదలగుచోట్ల కూడ ''ప్రష్ఠస్య - ఇయమ్'' (ప్రష్ఠునికి సంబంధించిన స్త్రీ) అను సామాన్యార్థమున తద్ధిత ప్రత్యయమును చేసి, దానివలన నియతముగ ''భార్య'' అను నర్థమును రాబట్టి, ఆ ప్రత్యయమునకు లోపమును చెప్పవలసి యుండును. లేకున్న ''భార్య'' అను నర్థము తప్పక వచ్చుట ఎట్లు కుదురును ?— అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

**శ్లో॥ సోఽయమిత్యభిసంబంధే లింగోపవ్యంజనాదృతే ।**
**ప్రష్ఠాదిషు న జాయైవ నియమేన ప్రతీయతే ॥ 83**

''సః + అయమ్ + ఇతి'' = ''అతడే యితడు'' అని - (లేక - ''అతడే ఈమె - అని) అభిసంబంధే = సంబంధమును కల్పించినపుడు, లింగోపవ్యంజనాత్ + ఋతే = లింగమును చెప్పు ప్రత్యయము లేకుండ, ప్రష్ఠాదిషు = ప్రష్ఠ, మొదలగుచోట్ల, జాయా + ఏవ = భార్యయే, నియమేన = నియమముగ, న + ప్రతీయతే = తెలియబడదు.

తాత్పర్యము— ప్రష్ఠీ, మొదలగుచోట్ల ''జీష్'' (ఈ) అను స్త్రీలింగమును బోధించు ప్రత్యయమున్నది. అదియే ''భార్య'' అను నర్థమును నియతముగ తెలియజేయును. కావున అందుకొరకై వేరుగ తద్ధిత ప్రత్యయమును చేసి దానికి లోపమును చేయనక్కరలేదు.

వివరణ — ప్రష్ఠునికిని అతని భార్యకును అభేదమును కల్పించి స్త్రీ ప్రత్యయమును చేయుదుము. అట్లు ''భార్య'' అను అభిమతమైన యర్థము వేరొక విధమున తప్పక లభించునపుడు, అదే యర్థమునకై తద్ధితమును చేయుటయు దానికి లోపమనుటయును వ్యర్థము గదా !

విశేష విషయములు— ప్రష్ఠః, అను శబ్దమునకు, ''సమర్థముగ ప్రయాణము చేయువాడు'' - లేక - ''ముందు వెళ్ళువాడు'' (నాయకుడు) అని యర్థము. ఇచట ''ప్రష్ఠస్య - స్త్రీ'' (ప్రష్ఠుని భార్య) అను నర్థమున ''పుంయోగాదాఖ్యాయామ్'' (4-1-48) అను సూత్రముచే ప్రష్ఠ శబ్దమునకు జీష్, (ఈ) అను స్త్రీ ప్రత్యయము చేరును. ''ఒకానొక విశిష్టమైన ధర్మమును బట్టి ప్రసిద్ధముగా పురుషుని బోధించు శబ్దమునకు, ''అతని భార్య'' అను నర్థమున జీష్ ప్రత్యయమగు''నని పై సూత్రముయొక్క భావము. ఈ ప్రత్యయము ''భార్య'' అను నర్థమును తప్పక బోధించును. (సూత్రమందలి ''పుంయోగ'' అను శబ్దము ''భార్య'' అను సంబంధమునే సూచించునని నిర్ణయము, కావున చెల్లెలు, తల్లి, మొదలగు

నర్థములను ఈ ప్రత్యయము బోధింపదు). అందుచే ఇదే ప్రయోజనము సిద్ధించుటకై ''తస్యేదమ్'' (4-3-120) (''వానికి సంబంధించినది ఇది'' అను సామాన్యమైన సంబంధమును తెలుపుచు, షష్ఠ్యంతమైన శబ్దమునకు అణ్, మొదలగు తద్ధితములగునని భావము) అను సూత్రము నాశ్రయించి, తద్ధితమును చేయుటయు అది ''భార్య'' అను నర్థమును నియమించి లోపించుననుటయును నిష్ఫలము.

కాగా ''గర్గాః'' మొదలగుచోట్ల తద్ధిత ప్రత్యయము అర్థమును నియమించుననియు ''ప్రష్ఠీ'' మొదలగుచోట్ల స్త్రీ ప్రత్యయము అర్థమును నియమించుననియును ఫలించినది.॥83॥

*అవతారిక*— ''ప్రస్థః - వ్రీహిః'' (అడ్డెడు ధాన్యము) మొదలగు ప్రయోగములున్నవి. ఇచట పరిమాణమును (కొలత - కొలత కుపయోగించు పాత్ర) చెప్పు ప్రస్థ మొదలగు మూల భూతములైన శబ్దములే ఎట్టి ప్రత్యయమును లేకుండ పరిమితమును కూడ (కొలవబడిన వస్తువును) చెప్పుట లోకసిద్ధమై యున్నది. ఇట్టి స్థలములందు కూడ ''కొలవబడిన వస్తువు'' అను నర్థము నియతముగ వచ్చుట కుపాయములున్నవనియును వేరుగ తద్ధిత ప్రత్యయమును చేసి దానికి లోపమును చెప్పనక్కరలేదనియును, ప్రాసంగికముగ రెండు కారికలతో విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ మానమేయాదిసంబంధ విశేషేఽఙ్గీకృతే తథా ।**
**ప్రస్థాదీనామసాధుత్వం తద్ధితేన వినాభవేత్ ॥ 84**

**శ్లో॥ తద్ధితోయోగభేదేన వాక్యం వా స్యాద్విభాషితమ్ ।**
**పరిమాణాధికే తత్ర ప్రథమా శిష్యతే పునః ॥ 85**

తథా = అట్లు, మానమేయాది సంబంధవిశేషే = ''కొలుచునది - కొలవబడునది'' మొదలగు విశేషసంబంధము, అంగీకృతే = అంగీకరింపబడగా, తద్ధితేన = తద్ధిత ప్రత్యయము, వినా= లేకుండ, ప్రస్థాదీనామ్ = ప్రస్థ, మొదలగు శబ్దములకు, అసాధుత్వమ్ = సాధుశబ్దములు కాకపోవుట, భవేత్ = అయ్యెడిని.

యోగభేదేన = సూత్రముయొక్క విభాగముచే, తద్ధితః = తద్ధిత ప్రత్యయము, స్యాత్ = అగును, వా = లేక, విభాషితమ్ = వికల్పముగ, వాక్యమ్ = వాక్యము, స్యాత్ = అగును, తత్ర = అచట, (ప్రస్థ, మొదలగు శబ్దముల విషయమున) పరిమాణాధికే = పరిమాణమను అర్థ మధికమైనపుడు, ప్రథమా = ప్రథమ విభక్తి, పునః = మరల, శిష్యతే = విధింపబడుచున్నది.

తాత్పర్యము— ప్రస్థ, అను శబ్ద మొకవిధమైన కొలత పాత్రను (అడ్డ) చెప్పును. ''ప్రస్థము పరిమాణము గల ధాన్యము'' అను నర్థము తప్పక రావలయునన్నచో, పరిమాణమను నర్థమున తద్ధిత ప్రత్యయమును చేసి ''ప్రాస్థిక'' అను శబ్దమును వాడవలెను. ఆ ప్రత్యయము లేకున్న ఆ యర్థము లభింపదు. లేక— తద్ధితము వికల్పముగాన అది రాని పక్ష

మున ''ప్రస్థః పరిమాణం అస్య ధాన్యస్య'' అని వాక్యమును ప్రయోగింపవచ్చును. లేదా— ఇంకొక తీరున్నది. పరిమాణమును ప్రత్యేకముగ తెలుపుటకై ప్రథమా విభక్తి విధింపబడి యున్నది. ఆ విభక్తి వలన ఇష్టమగు పరిమాణార్థమును బోధింపవచ్చును. ఉదా : ''ప్రస్థమ్ ధాన్యమ్''. కాగా ''ప్రాస్థిక'' అను తద్ధితాంతమునుగాని, ''ప్రస్థం పరిమాణమస్య'' అను వాక్యమునుగాని, ''ప్రస్థమ్'' అను ప్రథమాంతమునుగాని, ప్రయోగించి మానమేయ సంబంధమును తెలియజేయవలయును. ఈ మూడింటిలోను ఏదో యొక తీరు నవలంబింపని యెడల అభిమతము సిద్ధింపదు.

వివరణము— కొలత పాత్రకును కొలువబడిన వస్తువునకును అభేదమును కల్పించినను, ''ప్రస్థమ్'' అను శబ్దముచే ''ప్రస్థ పరిమితం ధాన్యమ్'' (కొలవబడిన ధాన్యము) అను నర్థము నియతముగ వచ్చుట కష్టము. అభేదమును భావించినపుడు ప్రస్థమునకు దగ్గరగా ఉన్న వస్తువు కూడ ప్రస్థమే కావచ్చును గదా! అందుచే పరిమాణరూపమైన అర్థమును తప్పక సంపాదించుటకు పై మూడు మార్గములలోను ఏదో ఒక దానిని స్వీకరింపవలెను. ఏదియు కాదన్నచో ఆ యర్థమున ఆ శబ్దము అసాధువగును.

విశేష విషయములు— ''తదస్య పరిమాణమ్'' (5-1-57) అను సూత్రమును దాని తరువాతి సూత్రము నుండి (5-1-58) వేరుగ చేయుదురు. యోగభేదమనగా ఇదియే ''అది దీనికి పరిమాణము'' (దాని కొలతగల వస్తువు) అను నర్థమున ప్రథమాంతమగు పరిమాణమును చెప్పు శబ్దమునకు ''ఠఞ్'' ప్రత్యయమగును అని యర్థము. ప్రస్థ శబ్దమునకు ఈ ప్రత్యయము చేరినపుడు తద్ధిత ప్రక్రియ జరుగగా ''ప్రాస్థిక'' అను రూప మేర్పడును. ప్రత్యయము రానపుడు ''ప్రస్థం పరిమాణమస్య'' అని వాక్య ముండును.

''ప్రాతిపదికార్థ లింగ పరిమాణ వచన మాత్రే ప్రథమా'' (2-3-46) అను సూత్రము ''పరిమాణము'' అను నర్థమును ప్రత్యేకముగ బోధించుటకై ప్రథమను విధించినది. అందుచే ప్రస్థ, మొదలగు పరిమాణ వాచకములకు ఈ ప్రథమను ఉపయోగించి ''ప్రస్థము పరిమాణము గలది'' మొదలగు నర్థములను కూడ సంపాదింపవచ్చును. ఆఢక, (కుంచము) ద్రోణ, (కుంచము) మొదలగు పరిమాణవాచకముల విషయమునను ఈ తీరు నంతను ఊహించునది. ॥85॥

*అవతారిక*— పరిమాణమును చెప్పు శబ్దమే కొండొకచో పరిమేయము (కొలువబడునది) ను కూడ బోధింపగలుగునని వివరించుచున్నాడు.

**శ్లో॥ వ్యతిరిక్తస్య సాధుత్వే తదేవ చ నిదర్శనమ్ ।**
**యుజ్యతేఽఙ్గీకృతాధిక్యం తత్సర్వాభిర్విభక్తిభిః ॥ 86**

వ్యతిరిక్తస్య = వేరుగా అధికమైన యర్థము, సాధుత్వే = సాధువగుటలో, తత్ + ఏవ + చ = ఆ ప్రథమ విభక్తిని విధించుటయే, నిదర్శనమ్ = ప్రమాణము, అంగీకృతాధిక్యమ్ =

అంగీకరింపబడిన అధికమైన యర్థముగల, తత్ = ఆ పదము, సర్వాభిః = అన్ని, విభక్తిభిః = విభక్తులతో, యుజ్యతే = కూడును (కూర్పబడును).

తాత్పర్యము— సహజముగ పరిమాణమును బోధించు ప్రస్థ, మొదలగు శబ్దములు పరిమేయమును కూడ బోధించుటలో - పరిమాణార్థమున ప్రత్యేకముగ ప్రథమ విభక్తిని విధించుటయే జ్ఞాపకమగును. అట్టి ప్రత్యేకమైన యర్థమును బోధించు పదములకే కర్మ, కరణము, మొదలగు సంబంధములను తెలియజేయు ద్వితీయ, తృతీయ, మొదలగు విభక్తు లన్నియును చేరుచుండును.

వివరణము— శబ్దమును పలుకగానే ఎల్లపుడును ఏ యర్థము తప్పక స్ఫురించునో ఆ యర్థమును ప్రాతిపదికార్థమందురు. కాగా ప్రస్థ, మొదలగు శబ్దములకు ఆ యా పరిమాణములే సహజమైన యర్థములు. అట్లుండ ''ప్రాతిపదికార్థ లింగపరిమాణ వచనమాత్రే ప్రథమా'' (2-3-46) అను సూత్రము, పరిమాణమను నర్థమున మరల ప్రత్యేకముగ ప్రస్థాది శబ్దములకు ప్రథమను విధించినది. అందుచే ఈ విభక్తి వ్యర్థము కాకుండ, తద్ధిత ప్రత్యయమువలెనే ''అంత పరిమాణముగల ధాన్యము'' మొదలగు అర్థమును బోధించుచుండును. పిదప ఆవశ్యకతను బట్టి అట్టి విశేషార్థమును చెప్పు శబ్దములకు ద్వితీయ, తృతీయ, మొదలగు అన్ని విభక్తులను చేర్చుకొనవచ్చును. ఉదా : ''ప్రస్థమ్ - (తండులమ్) పచతి'' = అడ్డెడు (బియ్యమును) వండుచున్నాడు. ''ప్రస్థేన - క్రీణాతి'' = అడ్డెడు - బియ్యముతో - కొనుచున్నాడు - మొదలగునవి.

ఇట్లు పరిమాణమును చెప్పు శబ్దములే పరిమేయమును కూడ చెప్పగలుగుట కుపాయము లున్నవని తేలినది.

విశేష విషయములు— ''కేవలము ప్రాతిపదికము యొక్క అర్థమును, అధికముగ ఉన్న లింగమును, పరిమాణమును, వచనమును మాత్రము బోధించుటకు ప్రథమ యగును'' అని ''ప్రాతిపదికార్థ'' మొదలగు సూత్రమున కర్థము. ''ద్రోణః - వ్రీహిః'' (కుంచెడు ధాన్యము) అనునది ప్రకృతమున ఉదాహరణము. ఇచటి ప్రథమకు ''కుంచెడు'' అని యర్థము.

కాగా ఆ యా ప్రయోగములలో ఏదో యొక సంబంధమును బట్టి ఆ యా అర్థములకు అభేదమును కల్పించినను, నియతమైనట్టియు, ఇష్టమైనట్టియు అర్థమును సంపాదించుటకు - ప్రత్యయమును చూపుటయు - లేక - దానికి లోపమనుటయు - లేక - మరియొక తీరును చూపుటయును - మొదలగు ప్రయత్నములను చేయవలసి యుండుననుట ప్రకృత సందర్భము యొక్క సారము. ॥86॥

అవతారిక— శుక్ల, నీల, మొదలగు శబ్దము లా యా గుణములను (తెలుపు, నలుపు, మొదలగు రంగులు), ఆ గుణములు కల వస్తువులను కూడ సహజముగనే బోధించును. అయినను ''ఆ గుణము కలది'' అను నర్థమున ఆ శబ్దములకు ''మతుప్'' అను తద్ధిత

*అవతారిక* — జాతి, గుణములలో దేనిని ముఖ్యముగా గ్రహింపవలెను అను విచారమున రెండును సమానములే కాన, వానిలో ఏదో ఒకదానిని ప్రతినిధిగా గ్రహింపవచ్చును. తెల్లని గొఱ్ఱెనుగాని, నల్లని మేకనుగాని గ్రహించి యాగము చేయవలెను. తెల్లని మేక దొరకిన, దానితో యాగము చేయవలెనని 76 వ శ్లోకమున చెప్పబడినది మతాంతరము, అనగా ఎల్ల శబ్దములకు ద్రవ్యమే వాచ్యమనెడి వ్యాడియొక్క మతమని చూపుచు ఈ విచారమును ముగించుచున్నాడు.

**శ్లో॥ సామ్యే నాన్యతరాభావే వికల్పః కైశ్చిదిష్యతే ।**
**అతద్గుణోఽతశ్ఛాగః స్యాన్మేషో వా తద్గుణో భవేత్ ॥ 80**

సామ్యేన = జాతి గుణములకు సామ్యముండుటచే, అన్యతరాభావే = జాతిగాని, గుణముగాని లేని పక్షమున, వికల్పః = అదిగాని, ఇదిగాని అను వికల్పము, కైశ్చిత్ = కొందరిచే, అనగా ఎల్ల శబ్దములకు ద్రవ్యమే వాచ్యమగుననెడి వ్యాడి మతమును అనుసరించెడి వారిచే, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

ఆ వికల్పమునే జూపుచున్నాడు.

అతః = ఈ కారణమువలన, అనగా రెండును సమములగుట వలన, అతద్గుణః = తెలుపు అనే గుణములేని, ఛాగః = మేక, స్యాత్ = యాగమునకు, అంగము కాగలదు, వా = కాక, తద్గుణః = తెలుపు అను గుణముకల, మేషః = గొఱ్ఱె, భవేత్ = యాగాంగమగును.

కైశ్చిత్, అని పలుకుటచే ఇది మతాంతరమని స్పష్టము.

జాతి ద్రవ్యముపై ఆధారపడియున్నది, గుణము అట్టిదే, అవి స్వతంత్రములు కావు. ఈ సామ్యమునుబట్టి రెండు సమకక్షములు, కనుక తెల్లని మేక దొరకనపుడు, జాతికి ప్రాధాన్యమిచ్చి నల్లని మేకనుగాని, గుణమునకు ప్రాధాన్యమిచ్చి తెల్లని గొఱ్ఱెనుగాని గ్రహించి యాగము చేయవచ్చును.

వ్యాడిమతమున తెలుపు, నలుపు మున్నగు గుణములు కూడ విశేష్యత్వరూపమున వివక్షించిన ద్రవ్యమేయగుటచే పై రీతిని వికల్పము ప్రసక్తమగుచున్నది.

కాని యిది శిష్టసమ్మతము కాదు, జాతికి ప్రాధాన్యమును జూపి [illegible] ప్రతినిధిగా గైకొనుటయే పతంజలి మున్నగువారికి సమ్మతము. ॥80॥

*అవతారిక* — 72 వ శ్లోకమునుండి ఇంతవరకు 9 శ్లోకములచే గుణము వివక్షితమగునా? కాదా? అని విచారణము జూపియున్నాడు, ఇది ప్రాసంగికము.

మరల సంఖ్యను వివక్షించుట గురించియే ప్రసంగించుచున్నాడు.

**శ్లో॥ జాతే రాశ్రితసంఖ్యాయాః ప్రవృత్తి రుపలభ్యతే ।**
**సంఖ్యా విశేషముత్సృజ్య క్వచిత్త్వేవ ప్రవర్తతే ॥ 81**

ప్రత్యయమును చేసి దానికి లోపమును చెప్పుదురు. ఆ తీరు కేవలము సాధుత్వమును సంపాదించుటకే అని చెప్పుచున్నాడు.

శ్లో॥ శుక్లాదిషు మతుబ్లోపో వ్యతిరేకస్య దర్శనాత్ ।
అసాధుత్వనివృత్త్యర్థం సాధవస్తే బిదాదివత్ ॥ 87

వ్యతిరేకస్య = భేదము (వేరొక తీరు), దర్శనాత్ = కనబడుటవలన, అసాధుత్వనివృత్త్యర్థమ్ = సాధువులు కాకపోవుటను వారించుటకు, శుక్లాదిషు = "శుక్ల" మొదలగు శబ్దములందు మతుబ్లోపః = మతుప్ ప్రత్యయమునకు లోపము (విధీయతే = విధింపబడును), తే = ఆ శబ్దములు, బిదాదివత్ = బిదాః, గర్గాః, మొదలగు శబ్దములవలె, సాధవః = సాధువులు, (భవంతి = అగును).

తాత్పర్యము— శుక్లః = తెలుపు. "శుక్లః పటః" = తెలుపుగల బట్ట. ఇచట శుక్ల శబ్దమే "తెలుపు గలది" అను నర్థమును గూడ చెప్పును. అయినను "పటస్య శుక్లః" (బట్టయొక్క తెలుపు) మొదలగు ప్రయోగములు కూడ ఉన్నవి. ఇట్టిచోట్ల శుక్లాది శబ్దములు "అది గలది" అను నర్థమును బోధింపవు. కావున "శుక్లః పటః" మొదలగుచోట్ల నిస్సంశయముగ "అది గలది" అను నర్థము వచ్చుటకు "మతుప్" ప్రత్యయమును చెప్పుటయు, వెంటనే దానికి లోపమనుటయును సమంజసము. ఇట్లు ఈ శబ్దములకు "గర్గాః" (గర్గుని గోత్రమైన సంతతి), "బిదాః" (బిదుని గోత్రమైన సంతతి) మొదలగు శబ్దములవలెనే సాధుత్వమును సంపాదించినట్లగును. (చూ. 81 వ కారిక).

వివరణము— (1) "అది గలది" అను నర్థము రావలయునన్నచో, "మతుప్" అను తద్ధిత ముండవలయును. వెంటనే అది పోయినను - అట్టి సంస్కారమును చేసినందువలన "ఈ శబ్దము సాధువు" అనుటకు వీలు కలుగును. లేకున్న "కేవలమైన ప్రకృతిని వాడ కూడదు" అను నిషేధమున్నందున ఆ యర్థమున ఆ శబ్దము సాధువు కాకపోయెడిని.

(2) "బిదాః", మొదలగు శబ్దములు (తద్ధితము లోపించినను) తమ యర్థముతో కూడిన అపత్యార్థమును చెప్పునట్లే, శుక్లాది శబ్దము తమ యర్థముతో కూడిన "కలది" అను విశేషార్థమును గూడ ప్రత్యయము యొక్క సాహాయ్యముచే బోధింపగలుగుననియు, ఇట్టిచోట్ల "గుణమునకును గుణము గల దానికిని అభేదము నంగీకరించియే అభిమతమైన యర్థమును సంపాదింపవలెనన్న" పట్టుదల అక్కరలేదనియును సారాంశము.

(3) "తదస్యాఽస్త్యస్మిన్నితి మతుప్" (5-2-94) అను సూత్రము మతుప్పును సామాన్యముగ విధించును. "అది దీనికి గలదు - అది దీనియందు గలదు - అను నర్థములలో ప్రథమాంతమునకు మతుప్ ప్రత్యయమగును" అని దీని భావము. ఉదా : ధనవాన్, గుణవాన్, మొదలగునవి.

(4) "గుణవచనేభ్యోమతుపోలుగిష్టః" (5-2-95 సూత్రమందలి వార్తికము)

అను వార్తికము గుణవాచకములకగు మతుప్పునకు లోపమును చెప్పును శుక్ల, నీల, మొదలగు శబ్దములు గుణవాచకములు. ॥87॥

## (5) వృత్తియందు విశేషణ విశేష్యభావము యొక్క ఉపపాదనము

*అవతారిక*— సమానాధికరణమగు వృత్తిని పరిశీలించు సందర్భములో ప్రాసంగికముగ మీది విషయములన్నియు వచ్చినవి. కాని వృత్తియందు అభేదము నంగీకరించినపుడు, విశేషణ విశేష్యభావమెట్లు కుదురునన్నది మొదట ప్రకృతమైన విషయము. దానినే కొందరి మతము ప్రకారము చూపుచున్నాడు.

**శ్లో॥ విశేషణాద్విశేష్యేఽర్థే తద్భావాభ్యుచ్చయే సతి।**
**పునశ్చ ప్రతిసంహారే వృత్తిమేకే ప్రచక్షతే॥ 88**

విశేష్యే = విశేష్యమైన, అర్థే = పదార్థమందు, విశేషణాత్ = విశేషణము వలన, తద్భావాభ్యుచ్చయే + సతి = ఆ విశేషణము యొక్క స్వరూప మధికము కాగా, పునః + చ = మరల ప్రతిసంహారే = కూడగట్టుట జరుగగా, వృత్తిమ్ = వృత్తిని, ఏకే = కొందరు, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్యము— వృత్తియందు జరుగు విశేషణ విశేష్యభావమును కొందరిట్లు వివరింతురు. విశేషణమైన వస్తువును విశేష్యమైన వస్తువును విడివిడిగానే బుద్ధియందు భాసించును. విశేషణము విశేష్యమందలి ఆధిక్యమును (ఒక విశేషము) మొదట చూపును. చివరకు అ యాధిక్యము గల విశేష్యమను జ్ఞానము కలుగును.

*వివరణము*— ''నీలోత్పలమ్'' అనునది ఉదాహరణము. ఇది సమాసవృత్తి. ఇచట నీలమను రంగును కలువయనెడి వస్తువును తొలుత విడిగానే తెలియును. నీల అను పదము ''కలువకు గల ఆ రంగు - విశేషము'' అని బోధపరచును. (మామూలు కలువకన్న ప్రకృతమైన కలువయందలి వింత) చివరకు ''నీలమురంగుతో కూడిన కలువ'' అను రీతిని విశేషణ విశేష్యభావము బుద్ధియందేర్పడును.

విశేష విషయములు— ఈ మతముయొక్క సారమిది : వృత్తియందు కేవలము అఖండార్థము (భేదము లేనిది) బోధపడుచున్నచో భేద ప్రధానమైన విశేషణ విశేష్యభావమును విశదీకరించుట మిక్కిలి కష్టమగును. మరియు శబ్దము వినిపించు వరుసలోనే అర్థము కూడ తెలియుననుట సముచితము. కాగా విశేషణము ముందుగను విశేష్యము వెనుకగను వినిపించునుగాన, వాని యర్థములను గూడ అట్లే చెప్పవలయును. అదియునుగాక ఇట్టిచోట్ల ''నాగృహీత విశేషణా విశేష్యేబుద్ధిః'' అను న్యాయమొకటి ప్రవర్తించును. ''ముందుగ విశేషణమును స్వీకరింపని బుద్ధి విశేష్యమును గ్రహింపజాలదు'' అని దీని భావము. అందుచే విశేషణ విశేష్యములను విడిగానే గ్రహింపక తప్పదు. అయితే వానినట్లే వదలివేయక ఒండొరులకు ఉపకారభావమును కల్పించి (ఒకటి వేరుచేయునది - వేరొకటి వేరుచేయబడునది) తుదకు ''ఆ ధర్మముగల వస్తువు'' అని ఐక్యమును భావింతుము. ॥88॥

అవతారిక — మీది మతమును రెండు కారికలతో దూషించుచున్నాడు.

శ్లో॥ నిమిత్తే ప్రత్యయః పూర్వో నానుప్రాప్తో నిమిత్తినా ।
నిమిత్తవతి బుద్ధేశ్చ న నిమిత్తసరూపతా ॥ 89

శ్లో॥ సంస్కారసహితాజ్జ్ఞానాన్నోపశ్లేషః స్మృతేరపి ।
వ్యాపారే తన్నిమిత్తానాం న గ్రాహ్యం స్యాత్తథావిధమ్ ॥ 90

నిమిత్తినా = విశేష్యముచే, పూర్వః = మొదటి, ప్రత్యయః = సంబంధము, (జ్ఞానము), నిమిత్తే = విశేషణమందు, న + అనుప్రాప్తః = పొందబడదు, నిమిత్తవతి = విశేష్యమందలి, బుద్ధేః + చ = జ్ఞానమునకును, నిమిత్తసరూపతా = విశేషణముతోడి సారూప్యము, న = (భవతి) = ఉండదు

సంస్కారసహితాత్ = సంస్కారముతో కూడిన, జ్ఞానాత్ = జ్ఞానమువలన, స్మృతేః + అపి = స్మరణమునకును, ఉపశ్లేషః = పరస్పరము కలియుట, న = (భవతి) = కలుగదు, (సంభవింపదు), తన్నిమిత్తానామ్ = ఆ స్మృతికి కారణమైన వానియొక్క వ్యాపారే = పనియందు, తథావిధమ్ = అటువంటిది, గ్రాహ్యమ్ = గ్రహించుటకు వీలయినది, న + స్యాత్ = కాకపోయెడిని.

తాత్పర్యము— విశేషణమును విశేష్యమును విడిగా గ్రహించిన పక్షములో, దాని సంబంధమును దీనికిగాని దీని సంబంధమును దానికిగాని కూర్చుట కుదురకపోవును. సంస్కారము వలన కలుగు స్మరణము కూడ అనుభవము ననుసరించియే ఏర్పడునుగాన, అదియు విశేషణ విశేష్యముల సంబంధమును సంపాదింపజాలదు. తెలిసికొను వ్యక్తియొక్క భావనా బలమువలన అట్టి సంబంధము కుదురునన్నయెడల, తొలుత విశేషణమును విశేష్యమును గ్రహించుట కూడ అనావశ్యకమయ్యెడిని.

వివరణము— విశేషణమును ముందుగ తెలిసికొనుటయు పిదప విశేష్యమును తెలియుటయు అన్నది ప్రకృతము. ఇచట తార్కికముగా పరిశీలించినచో ఒకదానిని గ్రహించిన క్షణములో వేరొకటి బుద్ధియందుండదు (ఒకే సమయమున రెండును బుద్ధియందు భాసింపవు). అయినపుడు వానికి పరస్పరము విశేషణ విశేష్యభావమనెడి సంబంధము కుదురుట ఎట్లు పొసగును?

''విడిగా గ్రహించినను విశేషణ విశేష్యములకు గల క్రమము (ముందు – వెనుక అను వరుస) ఒకటి సంస్కారరూపమున బుద్ధియందుండును. ఆ సంస్కారమువలన అట్టిదే యగు స్మరణము కలుగును. దానివలన ఒండొరుల సంబంధము కుదురును గదా!''— అని యనవచ్చును. కాని ఇదియు సరికాదు. తొలుతకలిగిన ప్రత్యక్షమైన అనుభవము ననుసరించియే స్మరణము కూడ ఏర్పడునుగాన పైనచూపిన ఆక్షేపణ మల్లే మిగిలిపోవును. (అనగా ప్రత్య

క్షమునకు ప్రతిబింబమువంటిదే స్మరణము. కాన విశేషణ విశేష్యములు విడిగానే ఉండి పోవునుగాని వానికొక పొత్తు కుదురదు).

ఇక ''గ్రహీతయొక్క (తెలిసికొను వ్యక్తి) భావనకు విచిత్రమైన శక్తులుండును. వాని మహిమవలన అభిమతమైన సంబంధమును కుదుర్చుకొనవచ్చును'' - అని వాదింప వచ్చును. కాని అదియు హాస్యాస్పదమేయగును. ఈ పక్షమున భావనాశక్తి వలననే అన్ని పనులను నెరవేరునుగాన, మొదట ప్రత్యక్షముగ విశేషణమును విశేష్యమును విడిగా గ్రహించుట కూడ అనావశ్యకమగును. ॥90॥

*అవతారిక*— ''విశేషణ విశేష్యభావము భావనవలన కలుగుననుట'' కుదురదని స్పష్టము చేయుచున్నాడు.

**శ్లో॥ అంతఃకరణవృత్తౌ చ వ్యర్థా బాహ్యార్థకల్పనా ।**
**తస్మాదనుపకారో వా గ్రాహ్యం వా న తథాస్థితమ్ ॥ 91**

అంతకరణవృత్తౌ + చ = మనస్సుయొక్క వ్యాపారమందు, బాహ్యార్థకల్పనా = బయటి విషయములను అంగీకరించుట, వ్యర్థా = నిష్ఫలము, తస్మాత్ = అందువలన అనుపకారః + వా = ప్రయోజన ముండదు, వా = లేక, గ్రాహ్యమ్ = గ్రహింపబడిన వస్తువు, తథా = అట్లు (అనుకొన్నట్లు) న + స్థితమ్ = ఉండదు.

తాత్పర్యము— మనోవ్యాపారము నంగీకరించిన పక్షమున బయటి వస్తువుల నంగీకరింప బనియే లేదు. కావున విశేషణ విశేష్యభావము మనస్సువలన కుదురదు. కుదురు నన్నచో బాహ్యములైన విశేషణము, విశేష్యము అను పదార్థములనే త్రోసివేయవచ్చును.

*వివరణము*— విశేషణము, విశేష్యము అనబడు పదార్థములు రెండును బాహ్యము లనియు (ప్రత్యక్షములు) వానికి గల నియతమైన సంబంధము మాత్రము మానసికమనియును మీద చూపిన భేదవాదుల యొక్క తాత్పర్యము. అది సరికాదు. సంబంధముకొరకై బుద్ధి పరకును వెళ్ళినపుడు దానివలననే సకలమును భావింపవచ్చును గాన, బయటి పదార్థములను వేరుగ అంగీకరించుట వ్యర్థమగును. కాగా భావనను స్వీకరించుటవలన ప్రయోజనము లేదు.

అందుచే ''విశేషణము యొక్కయు విశేష్యము యొక్కయు జ్ఞానము వేర్వేరుగ కలుగినున్న పక్షమున వానికిగల నియతమైన సంబంధము సిద్ధింపదు'' అని ఫలించును.॥91॥

*అవతారిక*— ఇట్లు విశేషణ విశేష్యభావము విషయమున పరుల మతమును దూషించి, తన మతమును రెండు కారికలతో వివరింపుచున్నాడు.

**శ్లో॥ అనుస్యూతేవ సంసృష్టేరర్థే బుద్ధిః ప్రవర్తతే ।**
**వ్యాఖ్యాతారో విభజ్యాఽథ తాం భేదేన ప్రచక్షతే ॥ 92**

శ్లో॥ తదాత్మన్యవిభక్తే చ బుద్ధ్యంతరముపాశ్రితాః ।
విభాగమివ మన్యంతే విశేషణ విశేష్యయోః ॥ 93

సంసృష్టేః = విడదీయుటకు వీలులేకుండ కలిసియున్నందువలన, అనుస్యూతా + ఇవ = కట్టబడినదా అన్నట్లు, బుద్ధిః = జ్ఞానము, అర్థే = పదార్థమందు, ప్రవర్తతే = ప్రసరించును, అథ = తరువాత, వ్యాఖ్యాతారః = వివరించి చెప్పువారు, తామ్ = ఆ బుద్ధిని, విభజ్య = వేరు చేసి, భేదేన = భేదముతో, ప్రచక్షతే = చెప్పుదురు.

తదాత్మని = ఆ బుద్ధియొక్క స్వరూపము, అవిభక్తే + చ = వేరుచేయబడకుండగా, బుద్ధ్యంతరమ్ = వేరొకబుద్ధిని, ఉపాశ్రితాః = అవలంబించినవారై, విశేషణ విశేష్యయోః = విశేషణ విశేష్యములకు, విభాగమ్ = భేదమును, మన్యంతే + ఇవ = భావించునట్లు కనబడుదురు.

తాత్పర్యము— విశేషణ విశేష్యముల విషయమున ఎట్టి భేదమును లేని జ్ఞానమే సహజముగ వక్తియందు కలుగును. అయినను శిష్యులకు స్పష్టముగ తెలియుటకై పెద్దలు (గురువులు) భేదమును కల్పించి చూపుదురు. ఆ భేదము వాస్తవము కాకపోయినను ఉన్నట్లుగ బుద్ధియందు భాసించుచుండును. ఇట్లు భాసించుట కూడ తత్త్వము తెలియుట కుపాయము మాత్రమే.

వివరణము— జాతి, గుణము, క్రియ, మొదలగు ధర్మములు సహజముగను విడదీయుటకు వీలులేకుండగను ప్రతియొక పదార్థమందును ఉండును. వీనికిని ఆయా వస్తువునకును ఉన్న సంబంధమును "సమవాయ సంబంధమ"ని శాస్త్రీయముగ అందురు (వేరుచేయ శక్యముకాని సంబంధము). కావున పదార్థము విషయమున కలుగు జ్ఞాన మెల్లపుడును, అభిన్నముగను ఏకాకారముగనే కలుగును. అయితే ఆ తీరు తెలియనివారికి తెలిసినవారు విడమరచి చెప్పుట ఆవశ్యకమగును. అట్లు చెప్పునపుడు బుద్ధియందు భేదము భాసించును. అది కేవలము కృత్రిమము

విశేష విషయములు— (1) సజాతీయములగు సకల వస్తువులందును గోచరించు ఏకాకారమైన ధర్మము "జాతి" యగును. (ఉదా : గోత్వము, మానవత్వము, మొదలగునవి) తెలుపు, నలుపు మొదలగునవి గుణములు. నడక, వంట, మొదలగునవి క్రియలు —లేక— వ్యాపారములు. ఈ ధర్మములే సామాన్యముగ విశేషణములగుచుండును. (వేరుచేయు ధర్మము విశేషణము. వేరుచేయబడు వస్తువు విశేష్యము).

(2) నీలోత్పలమును చూచునపుడు నలుపు వేరుగను కలువ వేరుగను ఉండదు. కావున "నలుపురంగు కల కలువ" (నల్లకలువ) అను అభేదజ్ఞానమే కలుగును. "ఇది విశేషణము - ఇది విశేష్యము" అని వ్యాఖ్యానించుట కేవలము బుద్ధికిచెందు ఒకానొక అవస్థ.

(3) సమవాయమనునది నిత్యమైన సంబంధము. కావున అది ఉన్నచోట విశేషణ విశేష్యభావమనగా అదియే యని భావము. సమవాయము కాని సంబంధములన్నియు (సంయో

గము, స్వస్వామిభావము, మొదలగు విడదీయుటకు వీలయిన సంబంధములు) అనిత్యములు అచట కూడ తొలుత అభేదజ్ఞానమే కలుగుననియు, పిదప భేదము కల్పింపబడుననియును ఊహింపవలెను.

(4) ''నీలమ్ - ఉత్పలమ్'' అను రీతిని వేరుచేసినచో అది వాక్యదశ యగును. దీనియందు భేదము స్పష్టముగ తెలియుచుండును ''నీలోత్పలమ్'' అన్నది వృత్తిదశ. దీని యందు భేదము వాస్తవము కాదు. ఇట్లు వాక్యమునకును వృత్తికిని ధర్మభేదమున్నది.

(5) వాక్యమువలనగాని, వృత్తివలనగాని కలుగు జ్ఞానమంతయు అఖండమే యనియు, వాక్యమునకును వృత్తికిని చూపు భేదములుకూడ ఉపాయములే అనియును పరమ సిద్ధాంతము.

(6) కాగా - వృత్తియందు భేదజ్ఞానము సరియైనది కాదనియును అభేదజ్ఞానమే సముచితమనియును పర్యవసించినది. ॥93॥

అవతారిక— వృత్తినిగురించి మహాభాష్యమున చూపబడిన వేరొక మతమును వ్యాఖ్యానించుచున్నాడు

శ్లో॥ అబుధాన్ ప్రతివృత్తిం చ వర్తయంతః ప్రకల్పితామ్ ।
ఆహుః పరార్థవచనే త్యాగాభ్యుచ్చయ ధర్మతామ్ ॥ 94

అబుధాన్+ప్రతి = పండితులు కానివారిని గురించి, ప్రకల్పితామ్ = కల్పింపబడిన, వృత్తిమ్ = వృత్తిని, వర్తయంతః + చ = ఏర్పాటుచేయువారు, పరార్థవచనే = వేరొక శబ్దముయొక్క అర్థమును చెప్పుటలో, త్యాగాభ్యుచ్చయధర్మతామ్ = విడుచుట —లేక— అధికమగుట - అను ధర్మములు కలిగియుండుటను, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— వాక్యమే వృత్తిగా మారునని కొందరందురు. వారి మతమున వాక్యమందలి పదముల యర్థము వృత్తియందలి పదములచే మార్చబడి వేరొక రూపమును ధరించి బోధపడును. అట్లు వాక్యము వృత్తిగా మారునపుడు వాక్యమందలి యర్థమును పూర్తిగా విడిచిపెట్టి, వృత్తియందలి శబ్దములు స్వతంత్రముగనే విశేషార్థమును బోధించుచున వచ్చును. ఈ తీరును ''త్యాగము'' అందురు (వాక్యమందలి యర్థమును విడుచుట). లేదా— వాక్యమందలి శబ్దముల యర్థములను విడువకుండగనే ఉన్నదున్నట్లుగా స్వీకరించి, వృత్తి యందలి శబ్దములు ఒక విశేషార్థమును చెప్పునని వ్యాఖ్యానింపవచ్చును. ఈ తీరును ''అభ్యు చ్చయము'' అందురు (ఉన్న యర్థమునకే పెంపును సమకూర్చుట).

వివరణము— శబ్దములకు వృత్తి అన్నది ప్రత్యేకమైనట్టియు నిత్యమైనట్టి ఒక అవస్థ కాదనియు, వాక్యముగ (విడిగా) ఉన్నప్పటి శబ్దములనే కొంచెము మార్చుకొని అభి మతమైన విశేషార్థమును సంపాదింపవచ్చుననియును కొందరి మతము. ఈ మతమున వాక్య మునకు బదులుగ ఉపయోగించునదియే వృత్తియగును. అయితే వాక్యస్థానమున వృత్తిని

వాడుటలో రెండు పద్ధతులను అవలంబింపవచ్చును. వాక్యదశయందలి పదముల యర్థములు వృత్తిదశలో పూర్తిగా జారిపోవుననుట యొకటి. దీనిని ''జహత్స్వార్థము'' (స్వార్థమును విడుచునది) అందురు. ఉన్న యర్థములు వృత్తియందు యథాతథముగ (ఉన్నవి ఉన్నట్లుగ) అనువర్తించుననుట రెండవది. దీనిని ''అజహత్స్వార్థము'' (స్వార్థమును విడువనిది) అందురు.

''వాస్తవమున ఇదంతయు కల్పనమే. వాక్యమువేరు - వృత్తివేరు. రెండిటికిని ఎట్టి సంబంధమును లేదు. దేనికది సర్వస్వతంత్రము'' అన్నది సిద్ధాంతము.

విశేష విషయములు — (1) ''పరార్థాభిధానం వృత్తిః'' అనునది పై మతమును ప్రతిపాదించు భాష్యవచనము ''వేరొక శబ్దముయొక్క అర్థమును చెప్పుతీరు వృత్తియగును'' అని దీని భావము. అనగా వాక్యదశలో ఒక విధమైన యర్థమును చెప్పు పదము (ముఖ్యముగా అప్రధానమైన పదము) వృత్తిదశలో వేరొక విధమైన యర్థమును బోధించుననుట. (వాక్య దశలో విడివిడి యర్థములను తెలుపు పదములు వృత్తదశలో ఒకదానితో వేరొకటి కలిసి పోయి మొత్తముపై అఖండమైన ప్రత్యేకార్థమును తెలుపుట). ఉదా : ''రాజ్ఞః పురుషః''. ఇది వాక్యదశ. ఇచట రాజ శబ్దమునకు ''రాజు'' అర్థము. ''రాజపురుషః''. ఇది వృత్తి. ఇచట రాజ శబ్దమునకు ''పురుషుడు'' (రాజ సంబంధము గలవాడు) అనియే యర్థము. పురుష శబ్దమునకును అదియే యర్థము.

ఈ మతమున వాక్యమాధారముగ వృత్త సిద్ధించునుగాన వాక్యము కారణమును వృత్త - కార్యమును అగును. కాగా కారణములైన దారములకన్న కార్యమైన బట్టయందు కొన్ని విశేషములున్నట్లే (పొడవు, వెడల్పు, ధరించుటకు వీలగుట మొదలగునవి) వాక్యముకన్న వృత్తియందు అవశ్యకమైన విశేషార్థములు లభించును. అట్లు లభించుట కార్యమునకుగల ప్రత్యేకమైన శక్తి - లేక - ధర్మము అనుకొనవలయును. దానికే వృత్తియని సంకేతము.

(2) జహత్స్వార్థ— ''జహతి - పదాని - స్వార్థమ్ - యస్యామ్ సా'' = ఇచట పదములు తమ యర్థమును విడుచును - అని యర్థము. (వేరొక క్రొత్తయర్థమునే స్వీకరించును). వాక్యముయొక్క స్థానమున వృత్తి అన్నపుడు వాక్యము పూర్తిగా తొలగవలయును. ఒక దృష్టాంతమువలన ఈ యంశమును గ్రహింపనగును. ఒక గిన్నెలో నిండుగ పాలున్నవి. ఆ గిన్నెలోనే పెరుగును పోయవలెనన్నచో పాలను తీసివేయవలెను. అట్లే వాక్యము తొలగి ననే కాని యచట వృత్తియుండుట కుదురదు. అయితే ఇచట తొలగుట అనగా ఆ యవస్థ యందలి అర్థమును ''తీసికొనకుండుట'' మాత్రమేయని గ్రహింపవలెను. దీనికే ''త్యాగము'' అని పేరు.

(3) అజహత్స్వార్థ — మీది తీరున కిది వ్యతిరిక్తము (భిన్నము). ''న - జహతి - పదాని - స్వార్థమ్ - యస్యామ్ - సా'' = ఇందు పదములు తమ అర్థములను విడువవు అని యర్థము. (ఉన్నవాని సంచికొని ఆవశ్యకమైన క్రొత్త బంధములను కూర్చుకొనుట). బిచ్చ గాడు అధికము లభించినను కూడబెట్టునేగాని, తొలి బిచ్చమును విడువడు. అట్లే వృత్తి వశ మున విశేషార్థములు వచ్చినను వాని నన్వయించుకొనుచు తొలి దశయందలి యర్థములే అనుస

రించును. (ఒక విశేషము - అర్థమును విడుచుటయు విడువకుండుటయును అప్రధానమైన (ఉపసర్జనము) పదము విషయముననే చక్కగ కుదురును.) దీనిని ''అభ్యుచ్చయము'' అందురు.

(4) పై రెండు పద్ధతులలోను దేని నవలంబించినను ఫలిత మొకటే. విశేషణ విశేష్యభావము గల ఒకానొక ప్రత్యేకమైన యర్థము వృత్తియందు లభించుటయే ఆ ఫలితము. మొదటి పద్ధతిలో (జహత్స్వార్థ) అట్టి యర్థము వచ్చుటకై వృత్తికి ప్రత్యేకమైన శక్తిని అంగీకరింపవలసి యుండును. రెండవదానిలో (అజహత్స్వార్థ) మొదటి దశయందు (వాక్యము) పదములకున్న శక్తియు పనికివచ్చునని చెప్పవచ్చును. ఇదియే రెండిటికిని గల భేదము.

(5) శబ్దము నిత్యమని వైయాకరణుల సిద్ధాంతము. అయినపుడు వాక్యమే వృత్తిగా మారుననుట పొసగదు. వాక్యమును వృత్తియు దేనికది స్వతంత్రములు. వాని ధర్మములును సామర్థ్యములును వేరే. ఈ యంశములన్నియు వెనుక చర్చింపబడినవి. కావుననే ప్రకృతమైన కారికయందును, ''అబుధాన్ ప్రతి ...... ప్రకల్పితామ్'' అని గ్రంథకర్త వక్కాణించెను. ॥94॥

అవతారిక— వృత్తి జహత్స్వార్థమైనపుడును కానపుడును సంభవించు విశేషములను విశదము చేయుచున్నాడు.

శ్లో॥ అన్వయాద్గమ్యతే సోఽర్థః విరోధీ వా నివర్తతే ।
ద్వ్యర్థమర్థాంతరే వాఽపి తత్రాహురుపసర్జనమ్ ॥ 95

సః = ఆ, అర్థః = అర్థము, అన్వయాత్ = అన్వయమువలన, గమ్యతే = తెలియబడును, వా = లేక, విరోధీ = విరోధముగలది, (అర్థము) నివర్తతే = పోవును, తత్ర = అచట, అర్థాంతరే + వా + అపి = వేరొక యర్థమందుకూడ, ఉపసర్జనమ్ = అప్రధానమైన పదమును, ద్వ్యర్థమ్ = రెండర్థములుగల దానినిగ, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్యము— వృత్తి జహత్స్వార్థమైనపుడు కూడ ప్రధానమైన పదముయొక్క అర్థమునకు తన విశేషార్థమును అంటించి, ఉపసర్జనమైన పదముయొక్క యర్థము మరలి పోవును. అంతియేకాని పూర్తిగా పోదు. అట్టి సంబంధమువలన విశేషార్థముతో కలిసిన ప్రధానార్థమే తెలియబడును. లేక— ప్రకృతమునకు విరుద్ధమైన తన ప్రాధాన్యమును ఉపసర్జన పదముయొక్క అర్థము పోగొట్టుకొనుననియైనను చెప్పవచ్చును. వృత్తి అజహత్స్వార్థమైనపుడు ఉపసర్జనము తన యర్థమును— దానితోపాటు ప్రధానార్థమును కూడ బోధించుగాన అది ''ద్వ్యర్థము'' అని అందురు.

వివరణము— (1) ''రాజపురుషః''— అనునది యుదాహరణము. ఇచట రాజ శబ్ద ముపసర్జనము. (అప్రధానము). పురుష శబ్దము ప్రధానము. ఉపసర్జనమైనది తన యర్థమును పూర్తిగా విడుచునన్నచో రాజ పదమును వాడుటయే అసంగతమగును. (ఎట్టి యుపయోగమును లేనపు డా పదమును చేర్చుటెందులకు ?) లేక— ''పురుషుడు'' అను ముఖ్యమైన

యర్థమునే రాజపదము కూడ బోధించునన్నయెడల— అపుడుసు అది వ్యర్థమేయగును. ముఖ్యార్థమును బోధించు పురుషపదము వేరుగనున్నది గదా! అదియునుగాక ఎట్టి ఉపయోగ మును లేని రాజపదమును చేర్చినను సామర్థ్యము కుదురనందున సమాసమను పేరే అచట సంభవింపకపోయెడిని. అందువలన ఇట్టిచోట్ల ఉపసర్జనము ప్రధానమునకు కొంత ఉపకారము చేయక తప్పదనవలయును. కాగా తన యర్థమును విశేషణరూపమున ప్రధానమందు పులిమి, తన స్వరూపమును పోగొట్టుకొనుటయే ఉపకారమగును. అట్లు ఉపసర్జనము యొక్క వాసనయే ప్రధానమందు మిగులునుగాని దాని స్వరూపముండదు. జహత్స్వార్థత్వమనగా ఇదియే. ఇదొక పక్షము.

(2) జహత్స్వార్థతయందును ప్రకృతమునకు విరుద్ధమైన యంశమునే ఉపసర్జన మైన పదము విడిచిపెట్టును. తన యర్థమునంతను పూర్తిగా విడువదు. ఇచట ప్రకృతమునకు విరుద్ధమైన యంశమనగా తన అర్థముయొక్క ప్రాధాన్యము. దానినే అది విడుచును. అనగా తాను ప్రధానమునకు విశేషణమై అప్రధానమై పోవును. కావుననే అట్టి రాజపదమునకు ''బుద్ధస్య'' మొదలగు వేరు విశేషణములతో సంబంధము కుదురదు. విశేషణముతోడి సంబంధము ప్రధానమునకే చెల్లునుగదా! కావున ''అర్థమును విడుచుట'' అనగా ప్రాధాన్య మును పోగొట్టుకొనుట మాత్రమే. ఇది మరియొక పక్షము.

(3) ఇక— అజహత్స్వార్థతయందు తన యర్థము నుంచుకొనుచు విశేషణరూప మైన వేరొక యర్థమును కూడ ఉపసర్జనము కూడగట్టుకొనునుగాన, ఆ విధముగా అది ''రెండర్థములు గలది'' అగునని కొందరు వ్యాఖ్యానింతురు. అయినను దానికి ప్రాధాన్యము మాత్ర ముండదనుటయే పర్యవసానము.

విశేష విషయములు—— (1) పైని చూపిన జహత్స్వార్థత్వమందలి రెండు తీరుల విషయములోను లోకసిద్ధమైన రెండు దృష్టాంతములను పతంజలి చూపెను. ఒకటి:— మల్లి పువ్వుల బుట్ట. బుట్టలోనుండి మల్లిపువ్వులను తీసివేసినను వాని వాసన మాత్రము బుట్టనంటి పెటుకొని యుండును. అట్లే వృత్తియందలి ఉపసర్జన పదముయొక్క యర్థము సంస్కార రూపమున ఉండును. ఇది మొదటి తీరు. రెండు:— రాజుగారి సేవకు కుదిరిన వ్రడంగి. ఇచట వ్రడంగి తన వృత్తియగు వ్రడంగము గాక, వేరొక పనిలో చేరినవాడు. కావున ఉద్యో గములో అతని వృత్తియొక్క ప్రాధాన్యము పోవును. అయినను అతనికి సహజమైన ధర్మము లన్నియు అతనిని విడువకయే ఉండును. ఇది రెండవ తీరు.

కాగా జహత్స్వార్థత అనగా ''పూర్తిగా తన యర్థమును విడుచుట కాదనియు, అవశ్యకము కాని యంశమును విడిచి అవశ్యకమైనదాని నుంచుకొనుట అగుననియు'' ఫలించును.

(2) అజహత్స్వార్థమున కూడ ఒక దృష్టాంతమున్నది. ఒక గిన్నెనిండ ఇసుక యున్నది. అందులో నీరు పోయుదుము. అది యిసుకలో ఇంకిపోయి కలిసిపోవును. అయినను రెండు పదార్థములును అచట నున్నవి. అట్లే వృత్తియందు పదార్థములు కలిసియుండును.

అయితే వానిలో ఒకటి ముఖ్యముగను వేరొకటి విశేషణముగను అన్వయించుట వృత్తియొక్క శక్తి వైచిత్ర్యమని భావింపవలయును.

(3) ఇట్టి చర్చకు మూలమైన "పరార్థాభిధానం వృత్తిః" అను భాష్యవచనమును ఇట్లు వ్యాఖ్యానింతురు. "పరస్య + అర్థః = పరార్థః" వేరొక శబ్దముయొక్క యర్థము. "అభిధీయతే - అత్ర = అభిధానమ్" = దీనియందు చెప్పబడును. "పరార్థస్య + అభిధానమ్ = పరార్థాభిధానమ్". వేరొక శబ్దముయొక్క అర్థమును వేరొక శబ్దముతో బోధించుట దేనియందు కుదురునో అది వృత్తియగునని భావము. ఉదా : రాజపురుషః. ఇచట వాక్యావస్థలో (రాజ్ఞః పురుషః) రాజ శబ్దమునకు రాజనియు, పురుష శబ్దమునకు పురుషుడనియును విడిగానున్న యర్థములు. సమాసమందలి రెండు శబ్దములకును "రాజ సేవకుడు" అని ఒకటిగా ఏర్పడినదియే యర్థమగును. ఇట్లు పురుష శబ్దముయొక్క అర్థమును రాజ శబ్దమును, రాజ శబ్దముయొక్క అర్థమును పురుష శబ్దమును కలిసిమెలిసి బోధించు ప్రక్రియయే వృత్తి యనిపించుకొనును. వృత్తులన్నిటియందును ఇదియే తీరు నూహించుకొనవలెను.

ఇచట వేరొక రీతిని కూడ అవలంబింపవచ్చును. "పరః = వేరైన, అర్థః = అర్థము = పరార్థః". "అభిధీయతే - అనేన = అభిధానమ్" = చెప్పు సాధనము. "పరార్థస్య + అభిధానమ్=పరార్థాభిధానమ్" = వాక్యావస్థలో విడిగా ఉండు పదముల అర్థములను గాక, విశేషణ విశేష్యభావముతో ఏకమైపోయిన వేరొక యర్థమును బోధించుట కుపయోగించు సమాసము మొదలగు సాధనము వృత్తియగునని భావము. ఎటు చెప్పినను సారాంశము సమానమే.

అవతారిక— మీద చూపినట్లు వృత్తియందు కూడ పదములు తమ అర్థమును - ఇంతో అంతో - నిలబెట్టుకొన్నచో, "జహత్స్వార్థత్వము" (అర్థములను విడుచుట) ఎట్లు కుదురును ?— అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపాయమాత్రం నానాత్వం సమూహస్త్వేక ఏవ సః ।
వికల్పాభ్యుచ్చయాభ్యాం వా భేదసంసర్గకల్పనా ॥ 96

నానాత్వమ్ = అనేకత్వము (భేదము), ఉపాయమాత్రమ్ = కేవలము ఉపాయము, సః = ఆ సమూహః + తు = సముదాయమైతే, ఏకః + ఏవ = ఒక్కటే, వా = లేక, వికల్పాభ్యుచ్చయాభ్యామ్ = వికల్పము, అభ్యుచ్చయము అను వానివలన, భేదసంసర్గకల్పనా = భేదము - సంబంధము అను వాని కల్పనము (భవతి = అగును).

తాత్పర్యము— వాక్యమందువలె వృత్తియందు పదముల విభాగమును చూపుట కేవలము ఉపాయము. వాస్తవముగ వృత్తి యఖండము. సముదాయరూపము. అచట అవయవములు లేవు. అట్లే "పదార్థములకు చెందిన భేదము —లేక— సంబంధముగాని, భేద సంబంధములు రెండును గాని వృత్తియొక్క అర్థమగునని" చెప్పుటయు వాక్యము ననుసరించియే జరుగుచున్నది. వాస్తవమున వృత్తివలన లభించునది అఖండమైన యర్థమే.

ఆశ్రిత సంఖ్యాయాః = ఆశ్రయింపబడిన సంఖ్యకల, జాతేః = జాతికి, ప్రవృత్తిః = క్రియా సంబంధము, ఉపలభ్యతే = శబ్దముచే తెలియబడుచున్నది.

'పశునాయజేత' మున్నగు వాక్యములలో పశుత్వజాతి, పశువునందున్న సంఖ్యయు యాగమున కంగములుగా శబ్దముచే బోధింపబడుచున్నవి.

సంఖ్యా విశేషమ్ = సంఖ్యలో విశేషమును, ఉత్సృజ్య = విడనాడి, క్వచిత్ = కొన్ని వాక్యములలో, సా + ఏవ = జాతి మాత్రమే, ప్రవర్తతే = యాగాంగమై యున్నది.

'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున గ్రహత్వజాతి ఏకత్వ సంఖ్యయు భాసించుచున్నను వానిలో సంఖ్య విడువబడి జాతిమాత్రమే సమ్మార్జనమున సంబంధించును. ॥81॥

అవతారిక— పై శ్లోకముయొక్క అర్థమునే స్పష్టపరచుచున్నాడు.

**శ్లో॥ పరాఙ్గభూతం సామాన్యమ్ యుజ్యతే ద్రవ్యసంఖ్యయా ।**
**స్వార్థం ప్రవర్తమానం తు న సంఖ్యామవలమ్బతే॥ 82**

పరాఙ్గభూతమ్ = మరియొక యర్థమున అప్రధానముగా నుండెడి, సామాన్యమ్ = జాతి, ద్రవ్య సంఖ్యయా = ద్రవ్యమునందున్న సంఖ్యతో, యుజ్యతే = కలసియున్నదియగును.

'పశునాయజేత' అను వాక్యమున యాగము ప్రధానము. దానియందు పశుత్వజాతి అప్రధానముగా నున్నందున పశుద్రవ్యమునందున్న ఏకత్వ సంఖ్యను గ్రహించును. ఒక పశువుచే యాగము చేయవలెనను వాక్యార్థము లభించును.

స్వార్థమ్ = తనయొక్క ఉపయోగమునకు, ప్రవర్తమానమ్ + తు = ప్రవర్తించిన సామాన్యము మాత్రము, సంఖ్యామ్ = ద్రవ్యమునందున్న సంఖ్యను, న + అవలమ్బతే = గ్రహింపదు.

"గ్రహం సమ్మార్ష్టి" అను వాక్యమున సమ్మార్జనము గ్రహముల పారిశుద్ధ్యమునకే కాన అచట సామాన్యము ప్రధానమగుటచే ఇచట ఏకత్వసంఖ్య ద్రవ్యమునందు వివక్షితము కానేరదు. ఉత్పత్తి వాక్యమున గల గ్రహములన్నిటికి సమ్మార్జనము సిద్ధించును.

ఇంతకు మునుపు ఈ విచారణ జరిగినది. అచట శబ్దమువలన కలిగిన జ్ఞానమును బట్టి గుణప్రధాన భావమును జూపి విచారణ చూపబడినది. ఇచట లోకమున నిజరూపమున గల గుణప్రధానమును జూపి విచారణ చేయబడుచున్నది. ॥82॥

అవతారిక— పై రెండు శ్లోకములయొక్క పూర్వార్థములచే జూపబడిన అర్థములకు ఉదాహరణము జూపుచున్నాడు.

**శ్లో॥ యజేత పశునేత్యత్ర యజ్యర్థాయాం పశుశ్రుతౌ ।**
**కృతార్థైకేన పశునా ప్రధానం భవతి క్రియా ॥ 83**

వివరణము— వాక్యమే వృత్తిగా మారుననువారు వాక్యముయొక్క ధర్మములను వృత్తికిని అంటగట్టుదురు. వీరి మతమున విడివిడిగ పదములుండుట వృత్తియందు కూడ కుదురును. అయితే వాక్యమందుగల ఆయా పదముల అర్థములయొక్క ప్రాముఖ్యము మాత్రము విడువబడును. అందుచే వృత్తి జహత్స్వార్థమగును. అట్లే భేదముకాని సంబంధము కాని –లేదా– రెండును కలిసిగాని వాక్యార్థముగ ఫలించునను తీరు కూడ వృత్తియందు కుదురుననియు వీరందురు. ఇదంతయు కల్పనమే. వృత్తిగాని అది సమర్పించు అర్థముగాని ''అఖండమ''నుట పరమార్థము.

విశేష విషయములు— ''రాజ్ఞః పురుషః'' - ఇది వాక్యము. ఇచట రాజ శబ్దము పురుషుని వేరు చేయును. అనగా మామూలు పురుషుడు కాడనియు రాజుకు చెందినవాడని యును సూచించును. ఇది భేదము. అట్లుగాక రాజ శబ్దము రాజునకును పురుషునకును గల సంబంధమును మాత్రము తెలియజేయుననుట సంబంధమగును. (రాజు స్వామి. పురుషుడు స్వమ్ము –లేక– సేవకుడు. ఇరువురికిని గల సంబంధము సేవ్యసేవక భావము) ఇట్టి భేదము కాని సంసర్గముకాని వాక్యార్థముగ పర్యవసించునని యొక పక్షము. రెండును కలిసియే వాక్యార్థముగ భాసించుననుట రెండవ పక్షము.

వృత్తిని కల్పించువారు పై రెండు తీరులను వృత్తియందు కూడ చూపుదురు.॥96॥

అవతారిక— వృత్తియందు విభాగములను చూపుట ఉపాయము మాత్రమే. అందుచేతనే ఎవరి యభిరుచిని బట్టి వారు ఉపాయములను కూడ వేర్వేరుగ చూపుచుందురను చున్నాడు.

**శ్లో॥ వృత్తిం వర్తయతా మేవమబుధ ప్రతిపత్తయే ।**
**భిన్నాః సంబోధనోపాయాః పురుషేష్వనవస్థితాః ॥** 97

ఏవమ్ = ఇట్లు, వృత్తిమ్ = వృత్తిని, వర్తయతామ్ = ప్రతిపాదించువారికి, అబుధప్రతి పత్తయే = అజ్ఞానులకు తెలియుటకై, పురుషేషు=వ్యక్తుల విషయములో, సంబోధనోపాయాః = తెలియజేయు ఉపాయములు, భిన్నాః = వేరుగను, అనవస్థితాః = అనియతములుగను, (భవంతి = ఉండును).

తాత్పర్యము— ''వృత్తియఖండమ''ను సత్యమును బోధించుటకై, అసత్యము లగు ఉపాయములను పెక్కింటిని ఆశ్రయింపవచ్చును. అవన్నియు మందబుద్ధుల కుపయో గించునవి. కావుననే ప్రతిపాదించు వారి యిష్టమునుబట్టి అవి వివిధములుగ నుండును. వాని కొక వ్యవస్థయు నుండదు.

వివరణము— వాక్యము ప్రకృతి, వృత్తి వికృతి (మూలము వాక్యము దాని వికారము వృత్తి), అనుటయు, వృత్తి జహత్స్వార్థము –లేక– అజహత్స్వార్థమనుటయును ఉపాయములే. వాస్తవముగ వాక్యమునకును వృత్తికిని ఎట్టి సంబంధమును లేదు. ॥97॥

అవతారిక— ఇట్లు వృత్తికిని వాక్యమునకును పూర్తిగా భేదమును చూపి, వృత్తి యందు సంఖ్యా విశేషము కూడ భాసింపదని ప్రకృతము విశదీకరించుచున్నాడు.

శ్లో॥ వాచికా ద్యోతికా వాఽపి సంఖ్యానాం యా విభక్తయః ।
తద్రూపేఽవయవే వృత్తౌ సంఖ్యాభేదో నివర్తతే ॥ 98

విభక్తయః = విభక్తులు, యాః = ఏవి కలవో, (తాః = అవి), సంఖ్యానామ్ = సంఖ్యలను, వాచికాః = చెప్పునవియు, వా = లేక, ద్యోతికాః + అపి = స్పష్టము చేయునవియు కూడ (భవంతి = అగును), వృత్తౌ = వృత్తియందు, తద్రూపే = వాక్యముయొక్క అవయవముతో సమానముగా కనబడు, అవయవే = అవయవమందు, సంఖ్యాభేదః=సంఖ్యయొక్క భేదము నివర్తతే = పోవును.

తాత్పర్యము— శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములు ఒకటి, రెండు మొదలగు సంఖ్యా విశేషమును తెలియజేయును. వాక్యమందలి పదముల యర్థములు వేనికవి ప్రధానముగ నుండును కావున అచట విభక్తులు తప్పక ఉండును. కాని వృత్తియందలి పూర్వపదము వాక్యమందలి పదముతో సమానముగ కనిపించినను, ఉపసర్జనమై తన యర్థమును ప్రధానమైన యర్థముతో కలిపివేసికొనును. అందుచే తన యర్థము వేరుగ లేనందున దానికి సంబంధించు సంఖ్య కూడ అచట నిలువదు.

వివరణము— "రాజ్ఞః పురుషః" (ఏకవచనము = ఒక రాజుయొక్క అని యర్థము), "రాజ్ఞోః పురుషః" (ద్వివచనము), "రాజ్ఞామ్ పురుషః" (బహువచనము) అను రీతిని వాక్యమందు సంఖ్యా విశేషమును స్పష్టముగ చెప్పవచ్చును. "రాజు" అను నర్థము వేరుగ నుండుటచే దానికి చెందు సంఖ్యను చెప్పుటకై ఆయా విభక్తులను వాడక తప్పదు. వృత్తి విషయమట్లు కాదు. "రాజపురుషః" అనుచోట రాజ శబ్దమునకు స్వాతంత్ర్యము లేదు. దాని యర్థము పురుషుడను ముఖ్యమైన యర్థముతో వేరుచేయ వీలులేకుండ కలిసిపోయినది. అందుచే దానియొక్క సంఖ్య వేరుగ లేదు కాన దానిని చెప్పు విభక్తి ప్రత్యయము రానేరాదు.

విశేష విషయములు— (1) జాతి, వ్యక్తి, లింగము, సంఖ్య, కారకము, అను అయిదును ప్రాతిపదికము యొక్క (శబ్దము) అర్థములేయని ఒక మతము. ఇందు సంఖ్య కూడ శబ్దమువలననే తెలియునుగాన విభక్తులు కేవలము ద్యోతకములు (అనగా ఉన్నదానిని ప్రకటించునవి) అనబడును. జాతి, వ్యక్తి, లింగము, అను మూడే ప్రాతిపదికార్థములని వేరొక మతము. ఈ మతమున సంఖ్యను విభక్తులే చెప్పును గాన అవి వాచకములగును.

(2) వృత్తియందు ఉపసర్జనమైన యర్థమునకు కావలసిన సంఖ్యను భావించుకొనుటయేగాని స్పష్టముగ ఎట్టి సంఖ్యయు నుండదు. కాగా "రాజపురుషః" మొదలగుచోట్ల సందర్భమునుబట్టియే "ఒక రాజుయొక్క" "ఇరువురు రాజులయొక్క" —లేక— "పెక్కు రాజులయొక్క" మొదలగు రీతిని సంఖ్యను భావించుకొనవలయును. అయితే వృత్తియందు

విగ్రహ వాక్యమును చూపుటయు, అచటి ప్రత్యయములకు లోపమును చెప్పుటయును శాస్త్రీయ మైన కార్యములు కొన్ని సిద్ధించుటకు మాత్రమే అని గ్రహింపవలెను. ॥98॥

*అవతారిక*— పై విషయముననే వేరొక మతమును చూపుచున్నాడు

**శ్లో॥ అభేదైకత్వసంఖ్యా వా తత్రాన్యైవోపజాయతే ।**
**సంసర్గరూపం సంఖ్యానామవిభక్తం తదుచ్యతే ॥** 99

తత్ర = అచట (వృత్తియందు), అన్యా = వేరొక, అభేదైకత్వసంఖ్యా + వా = "అభేదైకత్వము" అను సంఖ్య అయినను, ఉపజాయతే = పుట్టును, తత్ = అది, సంఖ్యానామ్ = సంఖ్యలయొక్క, అవిభక్తమ్ = విభాగములు లేనిదిగను, సంసర్గరూపమ్ = సంబంధము స్వరూపముగా గలదిగను, ఉచ్యతే = చెప్పబడును.

**తాత్పర్యము**— వృత్తియందు ఉపసర్జనమైన అర్థము విషయమున "అభేదైకత్వము" అను ఒక విచిత్రమైన సంఖ్య ఉండునని చెప్పవచ్చును. అది కావలసిన అన్ని సంఖ్యలను తనలో ఇమిడ్చికొనును. తాను మాత్ర మెల్లపుడును ఒకటిగనే భాసించును.

**వివరణము**— ఉపసర్జనమైనది కూడ ఏదో యొక వస్తువు కాక తప్పదు. అయినపుడు అచట సంఖ్యయే లేదనుట సముచితము కాదు. అందువలన "అభేదైకత్వ సంఖ్య" నంగీకరింపవలయును. భేదములున్నను అవన్నియు సమసిపోయి ఒకటిగా అనుభవమునకు వచ్చు సంఖ్యయే అభేదైకత్వమగును. అది పైకి ఒకటిగా కనిపించినను ఆవశ్యకమైన సంఖ్య (ఏదియైనను) స్ఫురించుచునే యుండును. ఈ తీరు కూడ వృత్తికిగల వైచిత్ర్యములలో ఒకటి యనవచ్చును. ఉదా : "రాజపురుషః". ఇచట "రాజ్ఞః పురుషః" అని రాజ శబ్దముయొక్క అర్థమున ఏకత్వమునే చూపుదుము. అందులోనే ఏకత్వము, బహుత్వము కూడ ఇమిడి యుండును.

విశేష విషయములు— "న + భేదాః - యస్మిన్ - తత్ = అభేదమ్" = భేదములు లేనిది. "అభేదమ్ + చ + తత్ + ఏకత్వమ్ + చ" = అభేదైకత్వమ్ = భేదములుండియు కనబడకుండ ఒకటిగా మారిన స్థితి ఇందు సంఖ్యలన్నియును కూడి యుండును గాన ఇది "సంసర్గరూపము" అగును. విభాగములు తెలియవుగాన "అవిభక్తము" కూడ అగును. ॥99॥

*అవతారిక*— అభేదైకత్వసంఖ్యను విశదీకరించుటకు ఒక దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ యథౌషధిరసాః సర్వే మధున్యాహితశక్తయః ।**
**అవిభాగేన వర్తంతే తాం సంఖ్యాం తాదృశీం విదుః ॥** 100

ఓషధిరసాః = ఓషధులయొక్క రసములు, సర్వే = అన్నియు, ఆహితశక్తయః = ఉంచ

బడిన శక్తులు గలవై, అవిభాగేన = విభాగము లేకుండ, మధుని = తేనెయందు, యథా = ఎట్లు, వర్తంతే = ఉండునో, తాదృశీమ్ = అట్టిదానినిగ, తామ్ = ఆ, సంఖ్యామ్ = సంఖ్యను, విదుః = తెలియుదురు.

తాత్పర్యము— తేనె ఉన్నది. అది ఎన్నో పుష్పముల మకరందములు కలిసి ఒకటిగా మారిన ద్రవము. అది ఒకటియే అయినను ఆ యా మకరందములుగాని వాని రుచి గాని అచట బొత్తిగా లేదని చెప్పజాలము. అభేదైకత్వమను సంఖ్యయు ఇట్టిదే. ఇందు ఏకత్వమే పైకి అనుభూతమగును. కాని అన్ని సంఖ్యలును అవిభక్తముగ ఇమిడియుండును.

వివరణము— అభేదైకత్వమనునది వాస్తవముగ ప్రత్యేకమైన సంఖ్య కానేరదు. అయినను కావలసిన సంఖ్యను దీనినుండియే విడదీసి తీసికొందురుగాన దీనినిగూడ "సంఖ్య" అను పదముతో వాడుదురు. కాగా ఇది సంఖ్యా సామాన్యమును సంఖ్యా విశేషమును కూడ అగును. ॥100॥

అవతారిక— పై విషయముననే వేరొక తీరును చెప్పుచున్నాడు.

శ్లో॥ భేదానాం వా పరిత్యాగాత్ సంఖ్యాత్మా స తథావిధః ।
వ్యాపారాజ్జాతిభాగస్య భేదాపోహేన వర్తతే ॥ 101

వా = లేక, భేదానామ్ = భేదముల యొక్క, పరిత్యాగాత్ = విడుచుటవలన, సః = ఆ, సంఖ్యా సామాన్యము, తథావిధః = అటువంటిది (అభేదైకత్వమని చెప్పదగినది), (భవతి = అగును), జాతి భాగస్య = జాతియను అంశముయొక్క, వ్యాపారాత్ = పనివలన, భేదాపోహేన = భేదములను పోగొట్టుచు, వర్తతే = ఉండును

తాత్పర్యము— సంఖ్యా విశేషములను విడిచిపెట్టిన జాతి రూపమైన సంఖ్యయే "అభేదైకత్వ సంఖ్య" అని యైనను చెప్పవచ్చును. కావుననే అది ఏకత్వము, ద్విత్వము మొదలగు అన్ని భేదములను అడ్డివేయును.

వివరణము— "ఒకటి" అనునది మిగిలిన సంఖ్యల నన్నింటిని అడ్డు పెట్టును. అట్లే ఏ సంఖ్యను తీసికొన్నను అది మిగిలిన సంఖ్యల నన్నింటిని పోగొట్టును. ఈ తీరున విశేషములను అడ్డు పెట్టుటను "భేదాపోహ" మందురు. ఇట్టి భేదాపోహముచే ఎల్ల సంఖ్యా విశేషములను పోగొట్టు సంఖ్యను "అభేదైకత్వ సంఖ్య" అనవచ్చును. అనగా "గోత్వము" మొదలగు వాని వలెనే ఇదియు నొక సంఖ్యా జాతియని సారాంశము.

విశేష విషయములు— "అభేదైకత్వము" అను సంఖ్యయందు "సకల భేదములును కలిసిపోయి ఉండుటయు, విభాగములు తెలియకుండుటయును" అను తీరును మీది కారిక చూపినది. "భేదాపోహము" అను విధమున సకల భేదములకును వర్తించు సామాన్య ధర్మమును ఈ కారిక వివరించినది. సకల వ్యక్తులందును ఒకే విధముగ కనబడు ధర్మమునే

సామాన్యమనియు జాతియనియును అందురు. ఆవశ్యకమైన సంఖ్య స్ఫురించుట ఈ పక్షమందు కూడ సమానమే. ॥101॥

అవతారిక— గోత్వము మొదలగు జాతి ఒక్కటే. అందు విశేషము లెన్నడును స్ఫురింపవు. అట్లే అభేదైకత్వము కూడ జాతి యన్నపుడు అచట విశేష సంఖ్యలు స్ఫురింపకూడదు. కాని ఆవశ్యకమైన విశేషసంఖ్య స్ఫురించునని చెప్పుచున్నారుగదా : ఇదెట్లు కుదురును ?— అను శంకకు రెండు కారికలతో సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అగృహీతవిశేషేణ యథారూపేణ రూపవాన్ ।**
**ప్రఖ్యాయతే న శుక్లాదిభేదరూపస్తు గృహ్యతే ॥** 102

**శ్లో॥ భేదరూపసమావేశే తథా సత్యవివక్షితే ।**
**భాగః ప్రకాశితః కశ్చిచ్ఛాస్త్రేఽఙ్గత్వేన గృహ్యతే ॥** 103

అగృహీతవిశేషేణ = విశేషములు తెలియని, రూపేణ = రూపముచే, రూపవాన్ = రూపముగల వస్తువు, ప్రఖ్యాయతే = తెలియబడును, శుక్లాదిభేదరూపః + తు = తెలుపు మొదలగు భేదములు గలదిగ, యథా = ఎట్లు, న + గృహ్యతే = తెలియబడదో, తథా = అట్లు, భేద రూప సమావేశే = భేదముల కలయిక. అవివక్షితే + సతి = చెప్పుటకు సంకల్పింపబడనిది కాగా (వివరించుటకు ఇష్టపడనిది), ప్రకాశితః = స్ఫురించిన, కశ్చిత్ = ఒక, భాగః = విశేషము –లేక– భేదము, శాస్త్రే = వ్యాకరణమున, అంగత్వేన = నిమిత్తముగా, గృహ్యతే = తీసికొనబడును.

తాత్పర్యము— దూరమునుండి ఒక వస్తువును చూచునపుడు "అదొక ఆకారము" అన్నట్లు రూపసామాన్యమే తెలియును. కాని తెలుపు, నలుపు మొదలగు విశేషములున్నను ఆ క్షణమున తెలియవు. అట్లే అభేదైకత్వమందును తొలుత సంఖ్యా సామాన్యమే ఉద్దేశింపబడును. సందర్భమును బట్టి ఉపసర్జనమైన అర్థమందు ఆవశ్యకమైన సంఖ్యా విశేషము ఆవిర్భవించును. వృత్తిని వివరించునపుడు మాత్రము కొన్నిచోట్ల ఆ విశేషసంఖ్యను శాస్త్రము స్వీకరించును.

వివరణము— "తావకీనః" అనునది తద్ధితరూపము. "తవఅయమ్" (నీకు సంబంధించినవాడు) అను నర్థమున యుష్మచ్ఛబ్దమునకు ఖఞ్ ప్రత్యయము చేరును. ఇచట "తవకమమకావేకవచనే" (4-3-3) అను సూత్రముచే "యుష్మద్" అను దానికి "తవక" అను ఆదేశము, ఏకత్వమును చెప్పునపుడే ప్రవర్తించును ఇది వృత్తి కావున అభేదైకత్వమను సామాన్య సంఖ్యయే ఉండునన్నచో, సూత్రమున "ఏకవచనే" అను నిర్దేశ మెట్లు కుదురు నన్నది శంకకు బీజము. ఇట్టి సందర్భములలో వృత్తియందు కూడ కావలసిన సంఖ్య స్ఫురించుననియు, శబ్దముయొక్క సాధుత్వమును విశదపరచుటకు వ్యాకరణ మా సంఖ్యను స్వీకరించుననియును సమాధానము. ఇట్లే వృత్తులలో సంఖ్యా విశేషమును నిర్దేశించిన ఇతర స్థలములందును వ్యాఖ్యానించుకొనవలెను.

విశేష విషయములు— "ఖఞ్, అణ్, అను ప్రత్యయములు పరమైనపుడు, ఏకత్వమును చెప్పు యుష్మద్, అస్మద్, అను శబ్దములకు యథాక్రమముగ తవక, మమక అను ఆదేశములగు"నని పై సూత్రముయొక్క అర్థము. తావకీనః (ఖఞ్ = ఈన), తావకః (అణ్), మామకీనః, మామకః అనునవి యుదాహరణములు. ॥103॥

*అవతారిక*— "అభేదైకత్వమన్నది అన్ని సంఖ్యలను చెప్పగల సంఖ్యా సామాన్యమని ఎంతగా చెప్పినను, వృత్తియందుపసర్జనమువలన ఏదోయొక సంఖ్యావిశేషమే తెలియుచుండును. అట్లయిన కావలసిన సంఖ్యావిశేషమే అభేదైకత్వమని అనరాదా?"— అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యాసామాన్యరూపేణ తదా సోంశః ప్రతీయతే ।**
**అర్థస్యానేకశక్తిత్వే శబ్దైర్నియతశక్తిభిః ॥** 104

అర్థస్య = అర్థము, అనేక శక్తిత్వే = వివిధమైన శక్తులుగలదైనను, నియతశక్తిభిః=నియత మైన సామర్థ్యముగల, శబ్దైః = శబ్దములచే, తదా = అప్పుడు, సః + అంశః = ఆ విశేష మైన సంఖ్య. సంఖ్యా సామాన్యరూపేణ = సంఖ్యా సామాన్యముగ, ప్రతీయతే = తెలియ బడును

తాత్పర్యము— అర్థములు వివిధములుగ నుండవచ్చును వాక్యమందలి శబ్దములు వానిని పూర్తిగా చెప్పవచ్చును. కాని వృత్తియందలి శబ్దముల కట్టి శక్తి యుండదు. ఆ శక్తి నియతము. అదియే వృత్తియొక్క వైచిత్ర్యము. అందుచే వృత్తియందలి ఉపసర్జనమైన శబ్దము సంఖ్యా విశేషమును కూడ సంఖ్యా సామాన్యముగనే తెలియజేయును. "విశేషము స్ఫురించుచున్నను అది సామాన్యరూపముగనే స్ఫురించుట అభేదైకత్వము యొక్క విలాసమే" అని ఫలితము. ॥104॥

అవతారిక— అభేదైకత్వమందు సంఖ్యకు పూర్తిగా అభేదమన్నచో, సంఖ్యా విశేషము తెలియగూడదు. అటుగాక భేదమన్నచో అభేదమనుట ఎట్లు పొసగును?— అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

**శ్లో॥ అవ్యయానాం చ యో ధర్మఃయశ్చ భేదవతాం క్రమః ।**
**అభిన్నవ్యపదేశార్హమంతరాలం తదేతయోః ॥** 105

అవ్యయానామ్ + చ = అవ్యయములకు, ధర్మః = స్వభావము, యః = ఏదిగలదో, భేదవ తామ్ + చ = విభక్తులుగల శబ్దములకును, క్రమః = తీరు, యః = ఏదిగలదో, ఏతయోః = ఈ రెండింటికిని, అంతరాలమ్ = మధ్యనున్నటువంటి, తత్ = అది (అభేదైకత్వము), అభిన్నవ్యపదేశార్హమ్ = అభిన్నమను వ్యవహారమునకు తగినది, (భవతి = అగును).

తాత్పర్యము— అవ్యయములవలన ఎట్టి సంఖ్యయు తెలియదు. అది వాని స్వభా

వము. విభక్తులుగల శబ్దములవలన సంఖ్యావిశేషములు తెలియును. అది వాని ధర్మము. ఈ రెండు ధర్మములను మించిన విచిత్రమైన ధర్మమొకటి యున్నది. అదియే అభేదైకత్వము. అది వృత్తియందలి ఉపసర్జనములైన శబ్దములవలన అవగతమగుచుండును.

వివరణము— యదా (ఎప్పుడు). తదా (అప్పుడు), మొదలగునవి అవ్యయములు ఇవి ఎట్టి సంఖ్యను బోధింపవు. రామః, కృష్ణః, మొదలైనవి శబ్దములు. ఇవి సంఖ్యావిశేషమును బోధించును. సంఖ్యకు సంబంధించిన భేదమును అభేదమును కూడ కలిసియుండుట అభేదైకత్వమందలి ఒక వైశిష్ట్యము. ఇదియే వాక్యముకన్న వృత్తివేరని స్పష్టముగ తెలియజేయును. ॥105॥

అవతారిక— ఈ యంశమున వార్తికకారుని సమ్మతిని చూపుచున్నాడు.

శ్లో॥ అలుకశ్చైకవద్భావస్తస్మిన్ సతి న శిష్యతే।
స చ గోషుచరాదీనాం ధర్మోఽస్తి వచనాంతరే॥ 106

తస్మిన్ = ఆ అభేదైకత్వము, సతి = ఉండగా, అలుకః + చ = అలుక్కునకును. ఏకవద్భావః = ఏకవద్భావము, న + శిష్యతే = విధింపబడదు, వచనాంతరే = ఏకవచనముకాని వేరొక వచనమందు, గోషుచరాదీనామ్ = "గోషుచర" మొదలగుచోట్ల, సః = ఆ, ధర్మః + చ = అభేదైకత్వమను ధర్మము, అస్తి = ఉన్నది.

తాత్పర్యము— "స్తోకాన్ముక్తః" (స్తోకాత్ = కొంచెమువలన, ముక్తః = విడువబడినవాడు). ఇది పంచమీ తత్పురుషము. ఇచట పంచమీవిభక్తి ప్రత్యయమునకు "అలుక్కు" (లోపము లేకుండుట) విధింపబడినది. ఈ సందర్భమున అభేదైకత్వ సంఖ్యను మనసులో ఉంచుకొనియే "ఏకవద్భావము" అక్కరలేదని వార్తికకారుడు చెప్పెను అట్లే "గోషుచరః" (ఆవు శరీరము మీద ప్రాకు ఒక విధమైన పురుగు) "అప్సుజః" (నీటిలో పుట్టునది) మొదలగు సమాసములలో కూడ సప్తమికి అలుక్కు వచ్చును. అచట బహువచనమున్నను బహుత్వము తెలియదు. ఏకత్వమే తెలియును. అది అభేదైకత్వమను ధర్మమే.

వివరణము— సమాసము జరుగగానే దాని యవయవములైన సుప్ ప్రత్యయములు లోపించుట సహజము. అయినను కొన్నిచోట్ల అట్లు లోపము జరుగదు. దానినే "అలుక్కు" అందురు. (లుక్ = లోపము, న + లుక్ = అలుక్). "స్తోకాభ్యామ్ ముక్తః" "స్తోకైః ముక్తః" అను రీతిని ద్విత్వమునుగాని బహుత్వమునుగాని వేరుగ చెప్పనక్కరలేదనియు, "స్తోకాన్ముక్తః" అనగానే అభేదైకత్వ సంఖ్య ఏర్పడునుగాన దానివలననే అభిమతము సిద్ధించుననియును వార్తికకారుడు భావించెను. అందువలననే ఇట్టిచోట్ల ద్వివచన బహువచనములతో విగ్రహమును చూపినపుడును "ఏకవచనమే మిగులు"నని ప్రత్యేకముగ చెప్పనక్కరలేదని నొక్కి చెప్పెను. (ఏకవద్భావమును ఖండించుట అనగా ఇదియే). అట్లే "గోషుచరః" మొదలగుచోట్ల బహువచనమున్నను ఏకత్వమే సహజముగ భాసించును. అదియు అభేదైకత్వమే. అచటి బహువచనము జాతిని సూచించును.

విశేష విషయములు— (1) ''సుపోధాతు ప్రాతిపదికయోః'' (2-4-71) అను నది సుప్పులకు లుక్కును విధించు సూత్రము. ''ధాతువునకును ప్రాతిపదికమునకును అవయవములుగా ఉండు సుప్ ప్రత్యయములు లోపించును'' అని యర్థము సమాసము కాగానే అది మరల ప్రాతిపదికమగును.

(2) ''పంచమ్యాః స్తోకాదిభ్యః'' (6-3-2) అనునది పంచమికి అలుక్కును విధించు సూత్రము. ''ఉత్తరపదము పరమైనపుడు ''స్తోక'' మొదలగు శబ్దముల పంచమికి అలుక్కు అగును'' అని యర్థము. అలుక్కుతో పాటుగ ఏకవచ్యావమును కూడ చెప్పవలసి యుండునని ముందుగ శంకించి, ''అక్కరలేదని'' యీ సందర్భమందే వార్తికకారుడు ఖండించెను.

(3) ''జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్'' (1-2-58) అనునది జాతిని సూచించు బహువచనమును విధించు సూత్రము. ఒక వ్యక్తినిగాక అచటి జాతిని తెలుపదలచినపుడు, బహువచనమును వికల్పముగ వాడుకొనవచ్చునని దీని భావము. ఉదా : ''గావః పూజ్యాః'' (గోవు సేవింపదగినది). ఇచటి బహువచనము గోత్వమను జాతిని మొత్తముగా తెలియజేయును. వ్యక్తుల బహుత్వమున కిచట ప్రసక్తి లేదు. (గౌః పూజ్యా'' అను ఏకవచనము కూడ సాధువే). కాగా ''గోషుచరః'' మొదలగు సప్తమికి అలుక్కు ప్రవర్తించిన స్థలములలోని బహువచనము జాతివాచకనుగుటవలన అచట ఏకత్వమే స్ఫురించుచుండునని ఫలితము.

(4) ఉపసర్జనమైన పదము ఏకవచనాంతముగ నున్నను, అభిమతమైన ద్విత్వ బహుత్వములు స్ఫురింపవచ్చుననుటకు ''స్తోకాన్ముక్తః'' అనునదియు, బహువచనాంతముగ ఉన్నచోట గూడ ఏకత్వమే స్ఫురించుననుటకు ''గోషుచరః'' అనునదియు స్వీకరింపబడినవి. ఇట్టి తీరులన్నియును అభేదైకత్వము యొక్క విలాసములే యనుట పరమోద్దేశ్యము. ॥106॥

అవతారిక— ద్వివచనము మాత్రము వృత్తియందు ఎన్నడును సిద్ధింపదను ఒకి పక్షమును చూపుచున్నాడు.

శ్లో॥ జాతౌ ద్వివచనాభావాత్తద్వృత్తిషు న విద్యతే ।
ప్రత్యాఖ్యానే తు యోగస్య ద్రవ్యే గోషుచరాదయః ॥ 107

జాతౌ = జాతియందు, ద్వివచనాభావాత్ = ద్వివచనము లేనందువలన, వృత్తిషు = వృత్తులందు, తత్ = ఆ ద్వివచనము, న + విద్యతే = ఉండదు, యోగస్య = సూత్రముయొక్క, ప్రత్యాఖ్యానే + తు = ఖండనమందైతే, గోషుచరాదయః = గోషుచర మొదలగునవి, ద్రవ్యే = వ్యక్తులందే, (భవంతి = అగును).

తాత్పర్యము— జాతివాచకముగ ద్వివచనము విధింపబడలేదు. బహువచనము విధింపబడినది. కాగా వృత్తులందు ఏకవచనమునకును బహువచనమునకును మాత్రమే సంభవమున్నదిగాని ద్వివచనమునకు లేదు. ఇది అభేదైకత్వము యొక్క ఫలమని భావింపవచ్చును.

జాతియందు బహువచనమును విధించు సూత్ర మావశ్యకము కాదని కొట్టివేయ బడినది. ఆ పక్షమున ''గోషుచరః'' మొదలగుచోట్ల బహువచనము సహజమైనదేయనియు, అది వ్యక్తుల బహుత్వము (ఆవులు) నే చెప్పుననియును అనవలయును.

వివరణము— జాతిని చెప్పదలచినపుడు అది ఒకటియేగాన ఏకవచనమును, జాతిగల వ్యక్తులను (పెక్కులు) చెప్పదలచినపుడు బహువచనమును సహజముగనే సిద్ధించును గాన ''జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచనమన్యతరస్యామ్'' (1-2-58) అను సూత్రము ప్రత్యాఖ్యాతమైనది. అపుడు ''గోషుచరః'' అనుచోట బహువచనము ''పెక్కు గోవులు'' అను నర్థమునే చెప్పవచ్చును. ఏకత్వభావనయు అచట కలుగవచ్చును. అట్లే ''అప్సుజః'' (నీటియందు పుట్టునది) అనుచోట బహువచనము నీటి అణువుల బహుత్వమును సూచించును.

అభేదైకత్వమందును ఏకత్వ బహుత్వముల స్ఫూర్తికే అవకాశమున్నదిగాని, ద్విత్వస్ఫూర్తి కవకాశము లేదన్నది యిచటి విశేషము. అనుభవమును ఊతగాగొని ఈ పక్షము బయలుదేరినట్లనిపించును. ॥107॥

అవతారిక— మీది పక్షము సముచితముకాదని రెండు కారికలతో చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆశ్రయాద్భేదవత్తాయాః సర్వభేద సమన్వయః ।
ద్రవ్యాభిధానపక్షేఽపి జాత్యాఖ్యాయాం న విద్యతే ॥ 108

శ్లో॥ సర్వద్రవ్యగతిశ్చైవమేకశేషశ్చ నోచ్యతే ।
ప్రత్యాఖ్యాతేఽన్యథా సూత్రే భిన్నద్రవ్యగతిర్భవేత్ ॥ 109

భేదవత్తాయాః = భేదములు కలుగుటను, ఆశ్రయాత్ = స్వీకరించుటవలన, సర్వభేద సమన్వయః = సకల భేదములయొక్కయు సంబంధము, స్యాత్ = కలిగెడిని), జాత్యాఖ్యాయామ్ = జాతిని బోధించు బహువవచనమున, ద్రవ్యాభిధాన పక్షః + అపి = వ్యక్తులను బోధించుట అను పక్షము, న + విద్యతే = లేదు.

ఏవమ్ = ఇట్లు, (జాతి బహువచనమున్నపుడు), సర్వద్రవ్యగతిః + చ = అన్ని వ్యక్తులయొక్క జ్ఞానమును, (భవతి = కలుగును), ఏకశేషః + చ = ఏకశేషము కూడ, న + ఉచ్యతే = చెప్పబడదు, అన్యథా = అట్లుగాక, సూత్రే = ''జాత్యాఖ్యాయామ్'' మొదలగు సూత్రము, ప్రత్యాఖ్యాతే = తిరస్కరింపబడినచో, భిన్నద్రవ్యగతిః = వేర్వేరు వ్యక్తుల జ్ఞానము, భవేత్ = కలిగెడిని.

తాత్పర్యము— ''గోషుచరః'' మొదలగుచోట్ల బహువచనము జాతి బహువచనమనియే చెప్పవలయును. జాతి ఒకటే. అయినను అభేదైకత్వము యొక్క బలమువలన ఆవశ్యకమైన అన్ని వ్యక్తులును బోధపడును. అట్లుగాక ''వ్యక్తుల భేదమును బహుత్వమును చెప్పు బహువచనమే అది'' అన్నచో అదే తీరులో ఏకత్వమును ద్విత్వమును కూడ బోధించుట

కవకాశమేర్పడును గాన, వృత్తియందు సంఖ్యా విశేషములనన్నింటిని పూర్తిగా అంగీకరించి నట్లే యగును. అపుడు ''అభేదైకత్వము'' అను భావనయే వ్యర్థమైపోవును. మరియు జాతి బహువచనము నంగీకరించినపుడే ఏకశేషమును తిరస్కరించుటయు కుదురును. లేనిచో ఏక శేషమును స్వీకరించుటయు, వ్యక్తుల భేదము స్పష్టముగా ఉండుటయును తప్పనిసరి కావలసి వచ్చును. కాగా ''జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్'' (1-2-58) అను జాతి బహువచనమును విధించు సూత్రమును ప్రత్యాఖ్యానము చేయకుండ, గోషుచర, మొద లగు చోట్ల బహువచనము జాతివాచకమనుటయే సమంజసము.

వివరణము— గోషుచర, మొదలగు వృత్తులలోని బహువచనము జాతి బహువచన మనుటయే గ్రంథకర్త కభిమతము. అపుడే అభేదైకత్వము సరసముగ నప్పును. అపుడే ''ఒక గోవు - రెండు గోవులు'' మొదలగు సంఖ్యావిశేషము స్ఫురింపకుండ, ''గోసామాన్య మున గోచరించు పురుగు'' అను ప్రసిద్ధమైన యర్థము తెలియును. అందువలననే వ్యక్తి భేదము నాశ్రయించినచో బహువచనము సహజమేయని భావించి ''జాత్యాఖ్యాయామ్'' మొద లగు సూత్రమును ప్రత్యాఖ్యానము చేయరాదు.

మరొక విశేషము— ఈ సూత్రమును స్వీకరించినచో ఏకశేషము (ఒకే శబ్దము మిగులుట) అక్కరలేదు. అనగా ఈ బహువచనమువలననే కావలసినన్ని వ్యక్తుల జ్ఞానము కూడ కలుగునుగాన వేరుగ ఏకశేషమను ప్రక్రియ ఆవశ్యకము కాదు.

విశేష విషయములు— (1) గోశబ్దమున్నది. ప్రతియొక గోవును చెప్పుటకు ఒకొక్కక్క గోశబ్దమును పలుకుట న్యాయ్యముగాన, ఎన్ని గోవులున్నవో అన్ని గోశబ్దము లను పలుకవలసి వచ్చును. అది చాల కష్టము. (నూరు గోవులను చెప్పుటకై నూరు గోశబ్దము లను పలుకుట వ్యవహారమున అసాధ్యము). ఈ చిక్కును తొలగించుటకు ''సరూపాణామేక శేష ఏకవిభక్తౌ'' (1-2-64) అను సూత్రముచే ఏకశేషమను ప్రక్రియ చూపబడినది. ''ఒక విభక్తి ప్రత్యయము పరమగునపుడు సమానాకారములైన శబ్దములు ఎన్ని యున్నను వానిలో ఒకటే మిగులును'' అని ఈ సూత్రముయొక్క భావము. దీనివలన గోవులు రెండయినను పెక్కులయినను, ''గావౌ, గావః'' అని ఒక గోశబ్దమే మిగులును. అదియు విభక్తియు కలిసి కావలసిన సంఖ్యను అందించును.

(2) ''జాత్యాఖ్యాయామ్'' మొదలగు సూత్రమును స్వీకరించి, జాతి బహువచ నము వలననే అభీష్టము సిద్ధించునుగాన ఏకశేష మక్కరలేదని త్రోసిపుచ్చుట జరిగినది.

(3) జాతి బహువచనమును కాదన్నచో, ఏకశేషమును స్వీకరించుటయు వ్యక్తుల భేదము తెలియుటయు తప్పనిసరియగును అపుడు ''వృత్తియందు అభేదైకత్వము'' అను అందరును అంగీకరించు సిద్ధాంతము పాడగును. కావున జాతి బహువచనమునే ఒప్పుకొని ఏకశేషమును త్రోసిపుచ్చుటయే మంచిది.

(4) గోషుచరః, అనుచోట జాతి బహువచనము కాదని, వ్యక్తులను చెప్పు బహు

యజేత పశునా + ఇతి + అత్ర = పశునా యజేత, అను వాక్యమున, పశుశ్రుతౌ = శబ్దముచే బోధింపబడిన పశువు, యజ్యర్థాయామ్ = యాగార్థమైయుండగా, ప్రధానమ్ = ప్రధానమగు, క్రియా = యాగక్రియ, ఏకేన = ఒక, పశునా = పశువుచే, కృతార్థా = చేయబడిన ప్రయోజనము కలది, భవతి = అగుచున్నది.

పశునాయజేత, అను వాక్యముయొక్క అర్థమున యాగక్రియ ప్రధానము. అది సిద్ధించుటకై పశువు సాధనముగా నుండుటచే అప్రధానము. కాగా ప్రధానమగు క్రియ ఒక పశువును చంపి దాని యవయవములను శాస్త్రమున చెప్పబడిన ప్రకారము హోమము చేసిన సంపూర్ణముగ జరుగును. అందుచే మరియొక పశువును గ్రహింప నక్కరలేదు. అట్లు ప్రధానముగా నున్న యాగము అప్రధానమగు పశువునుబట్టి ఆవృత్తమగుచో అనగా మరియొక పశువును ఉపయోగించి చేయబడినచో అది యాగాంతరమే యగును. ప్రధానమును అప్రధానము అనువర్తించుట ధర్మము ఇచట అట్లుకాక అప్రధానమగు పశువును ప్రధానమగు యాగము అనువర్తించునట్లగుచున్నది. ॥83॥

అవతారిక— ఒక పశువుతోకాక అనేక పశువులతో యాగముచేసిన న్యాయమును అతిక్రమించుటయను దోషము కలుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యావతాం సంభవో యస్య స కుర్యాత్తావతాం యది ।**
**ఆలమ్భనం, గుణైస్తేన ప్రధానం స్యాత్ప్రయోజితమ్ ॥ 84**

యస్య = ఎవనికి అనగా యాగము చేయువానికి, యావతామ్ = ఎన్ని పశువులకు, సంభవః = సంభవమో, అనగా అతనికి ఎన్ని పశువులు లభించునో, సః = అతడు, తావతామ్ = అన్నిటికి, ఆలమ్భనమ్ = ఆలంభనమును అనగా హింసను, కుర్యాత్ + యది = చేసిన యెడల, తేన = ఆ చేయుటచే, గుణైః = అప్రధానములగు పశువులచే, ప్రధానమ్ = ప్రధానమగు ఆలంభనము, ప్రయోజితమ్ = ప్రేరేపింపబడినది అనగా అనుగ్రహింపబడినది, స్యాత్ = కాగలదు.

అప్రధానమగు పశువులనుబట్టి ప్రధానమునకు రూపము లభించుటచే దానికి ప్రాధాన్యమే సిద్ధింపనేరదు.

యాగమున ఆలంభనము చేయువానికి ఎన్ని పశువులు లభించునో, అన్నిటిని ఉపయోగించిన పై దోషము లగ్నమగుచున్నది.

కాగా అప్రధానము ప్రధానమును అనుసరించును, అను న్యాయమే లుప్తము కావలసి వచ్చును. కనుక అట్లు చేయరాదు. ఒకే పశువును ఉపయోగించి ఆలంభనము (యాగము) చేయవలెను. ॥84॥

వచన మన్నచో, బహుత్వమన్నది మూడునుండి ప్రారంభమగుచుగాన ''పెక్కు గోవులందు సంచరించునది'' అను నర్థము మాత్రమే లభించును. అది ఇష్టము కాదు. ఒక గోవునందు రెండు గోవులందు సంచరించినను ''గోషచరః'' అని వ్యవహరించుటయే అభీష్టము. ''గోసామాన్యమున సంచరించు ఒకానొక పురుగు'' అని ఆ పదమునకు రూఢమైన యర్థము. అచట వ్యక్తుల ప్రసక్తి లేనేలేదు. ఈ యంశమును సాధింపవలెనన్నచో, అది జాతి బహు వచనమనియు, అభేదైకత్వమచట పనిచేయుననియును అనక తప్పదు. అభేదైకత్వము యొక్క సామాన్యపరిశీలన మింతతో ముగిసినది.

## (6) వృత్తియందలి అభేదైకత్వ సంఖ్యయొక్క పరిశీలనము

*అవతారిక*— అభేదైకత్వ సంఖ్య అన్ని సంఖ్యావిశేషములను తనలో ఇమిడ్చి కొనును. అందుచే అది వృత్తియందు సంఖ్యాభేదమును (విశేషమును) బోధింపగలదు - అను విషయమును స్థిరపరచుటకు చర్చను ప్రారంభింపుచున్నాడు.

**శ్లో॥ వృత్తౌ యోయుక్తవద్భావో వరణాదిషు శిష్యతే ।
అభేదైకత్వసంఖ్యాయాం గోదౌ తత్ర న సిధ్యతి ॥ 110**

వరణాదిషు = ''వరణాః'' మొదలగుచోట్ల, వృత్తౌ = వృత్తియందు, యః = ఏ, యుక్తవ ద్భావః = ప్రకృతివద్భావము, శిష్యతే = చెప్పబడునో, తత్ర = అచట, అభేదైకత్వ సంఖ్యా యామ్ = అభేదైకత్వ సంఖ్యయందు, గోదౌ=''గోదౌ'' అను ప్రయోగము, న + సిధ్యతి= సిద్ధింపదు.

**తాత్పర్యము**— ''వరణాః'' మొదలగు కొన్ని తద్ధిత వృత్తులందు ప్రత్యయము లోపించును. అయినను ప్రకృతియొక్క లింగమును సంఖ్యయును అచట అనువర్తించునని (అట్లే యుండుట) చెప్పబడినది. ఈ తీరును ''యుక్తవద్భావము'' అందురు. వృత్తియందు అభేదైకత్వమువలన ఏకత్వమే భాసించునన్నచో, యుక్తవద్భావము ననుసరించి ''గోదౌ'' (గ్రామః) అనుచోట అభిమతమైన ద్విత్వము (రెండు సంఖ్య) సిద్ధింపకపోయెడిని.

*వివరణము*— (1) అభేదైకత్వ సంఖ్యయనగా ''అభిన్నమైన ఏకత్వము'' (భేదములులేని ఒకటియను సంఖ్య) అను ఆశయముతో బయలుదేరిన శంక ఇది. కావలసిన సంఖ్యావిశేషములు కూడ అచట బోధపడునని ఇదివరకే చెప్పబడెను. ఆ సిద్ధాంతమును ఇటుపైని దృఢపరచుటకే ఈ చర్చ ప్రారంభమైనది.

(2) ''దానికిది నివాసము'' ''దానికిది అదూరభవము'' (దగ్గరగా ఉన్నది) అను నర్థములలో షష్ఠ్యంతమగు ప్రాతిపదికమునకు ''అణ్'' ప్రత్యయమగును. (తస్య నివాసః (4-2-69), అదూరభవశ్చ (4-2-70) ఉదా: ''వరణామ్ - అదూరభవః = గ్రామః, వరణా + ఆమ్ + అ'' అని అలౌకిక విగ్రహము. అణ్ ప్రత్యయమునకు లోపము. యుక్త వద్భావము వరణ నదికి దగ్గరగానున్న గ్రామమని యర్థము. సామాన్యమైన యుదాహరణ ముగా ఇది చూపబడినది.

(3) ''జనపదే లుప్'' (4-2-81) అను సూత్రము తద్ధితమునకు లోపమును విధించునది. ''అదూరభవముగాని నివాసముగాని అయినది, ఒక దేశమో -లేక- ఒక గ్రామమో అయినచో తద్ధితము లోపించును'' అని దీని యర్థము.

(4) ''లుపి యుక్తవద్వ్యక్తివచనే'' (1-2-51) అను సూత్రము యుక్తవద్భావమును విధించునది. ''ప్రత్యయము లోపించినపుడు ప్రకృతియొక్క లింగ సంఖ్యలే వృత్తియందును అనుసరించునని'' దీని భావము. ఇచట రెండు పక్షములున్నవి : వృత్తి జరిగిన తరువాత సిద్ధముగనున్న ప్రకృతియొక్క లింగ సంఖ్యలు అనువర్తించునని ఒక పక్షము. వృత్తి జరుగకముందుండు ప్రకృతియొక్క లింగ సంఖ్యలు అనుసరించునని రెండవ పక్షము. ఇందు మొదటి పక్షము ననుసరించినచో ''గోదౌ'' (గ్రామః) అనుచోట ద్విత్వము సిద్ధింపదు. ''గోదయోః నివాసః'' (ఇరువురు గోదులకు నివాసమైన గ్రామము) అను నర్థమున తద్ధిత ప్రత్యయము వచ్చి లోపించును. వృత్తియగుటచే అభేదైకత్వ సంఖ్య ఏర్పడును. పిదప యుక్తవద్భావమును చెప్పినను ఆ ఏకత్వమే లభించునుగాని ద్విత్వము (గోదౌ) లభింపదని శంక ఉదయించినది. దీని సమాధానము దిగువ కారికలలో స్పష్టము కాగలదు.

*విశేష విషయములు*— ''లుపియుక్త వద్వ్యక్తివచనే''. ప్రవర్తించు ప్రత్యయమునకు ప్రకృతియైన శబ్దము యుక్తమనబడును. వ్యక్తియనగా లింగము. వచనమనగా సంఖ్య. ప్రత్యయము లోపించినపుడు ప్రకృతియొక్క లింగ సంఖ్యలే మొత్తమునకు సంక్రమించునని సూత్రముయొక్క అర్థము. ఉదా : గోదౌ = గ్రామః. ఇచట విశేష్యము గ్రామమైనను తదనుసారము లింగము, సంఖ్యయు నుండవు. (గోదః, అని యుండదు). నివాసమను నర్థమున వచ్చిన తద్ధితమునకు ప్రకృతియైన ''గోద'' శబ్దము ననుసరించియే అవి యుండవలెను. కాగా పుంలింగమును ద్విత్వమును ఉండుట (గోదౌ) ఇచట అభీష్టము. ''వృత్తియందు అభేదైకత్వమన్నచో ఇది సిద్ధించునా ?'' అని శంకా స్వరూపము. ॥110॥

*అవతారిక*— వృత్తికి ముందుండు ప్రకృతియొక్క లింగ సంఖ్యలు అనుసరించునను రెండవ పక్షమందలి విశేషమును చూపుచున్నాడు.

**శ్లో॥ ప్రాగ్వృత్తేర్యుక్తవద్భావే షష్ఠీ భేదాశ్రయా భవేత్ ।**
**వృత్తౌ సంఖ్యావిశేషాణాం త్యాగాద్భేదో నివర్తతే ॥ 111**

వృత్తేః = వృత్తికన్న, ప్రాక్ = ముందు, యుక్తవద్భావే = యుక్తవద్భావము జరిగినచో, భేదాశ్రయా = భేదమును తెలుపు, షష్ఠీ = షష్ఠీవిభక్తి, భవేత్ = వచ్చెడిని (అయినను), వృత్తౌ = వృత్తియందు, సంఖ్యావిశేషాణామ్ = సంఖ్యలకు సంబంధించిన భేదములను, త్యాగాత్ = విడుచుటవలన, భేదః = భేదము, నివర్తతే = పోవును.

**తాత్పర్యము**— ''యుక్తవద్భావము'' (ప్రకృతియొక్క లింగ సంఖ్యలు వృత్తియందును అనుసరించుట) వృత్తికి ముందుండు వాక్యావస్థయందే ప్రవర్తించునన్నచో,

''గోదా'' (గ్రామః) అనుచోట ''గోదయోః'' అని షష్ఠికూడ రావలసివచ్చును. ''గోదయోః నివాసః'' అన్నది యచటి వాక్యావస్థగదా ః. అయినపుడు ''గోదులకు చెందిన'' అను రీతిని భేదభావనము కూడ కలిగెడిని. అయినను వృత్తి జరిగిన పిదపనే యుక్తవద్భావమను సిద్ధాంతము ననుసరించినచో, అభేదైకత్వము యొక్క బలమువలన సంఖ్యావిశేషము లన్నియు నివర్తించునుగాన భేదముగాని దానిని బోధించు షష్ఠీ విభక్తిగాని రాదని చెప్పవలయును.

*వివరణము*— ''వృత్తి జరిగిన తరువాతనే యుక్తవద్భావమును చెప్పుట మంచిది. అంతకు ముందుండు వాక్యదశనుబట్టి చెప్పకూడదు.'' అను సిద్ధాంతమిచట సూచింపబడినది.

విశేష *విషయములు*— (1) వృత్తికి ముందే యుక్తవద్భావమన్నను, ఆ యతిదేశముయొక్క స్వభావమువలన వచన సామాన్యమే (ఏకవచనము, ద్వివచనము మొదలగునది) అనువర్తించునుగాని దానికి సంబంధించిన విభక్తి విశేషమునువర్తింపదనియు, అందువలన షష్ఠి రాదనియును వేరొక రీతిని సమాధానము భాష్యములో ఉన్నది.

(2) ''యుక్తము'' అనగా ''ప్రత్యయముతో కూడినది'' అను అర్థము చెప్పక తప్పదు. ''యుక్తస్య + ఇవ = యుక్తవత్'' = ప్రత్యయముతో కూడిన ప్రకృతికివలె అని వివరణము లభించును. అందుచే తద్ధిత వృత్తి జరిగిన పిదపనే లింగమును సంఖ్యను అతిదేశించుట న్యాయము. ॥111॥

*అవతారిక*— కాగా ''వృత్తికి పిదపనే లింగమును సంఖ్యను అతిదేశించుట సముచితము''ని అన్నపుడు, ''అభేదైకత్వము వలన ''గోదా'' అనుచోట ఏకత్వమే యుండవలయునుగాని ద్విత్వము పనికిరాదు'' అను శంక ప్రకృతము మిగిలినది. దీనికి సమాధానము చెప్పుటకై అభేదైకత్వము యొక్క స్వరూపమును మరల చూపుచున్నాడు.

**శ్లో॥ విద్యమానాసు సంఖ్యాసు కేచిత్సంఖ్యాంతరం విదుః ।**
**అభేదాఖ్యముపగ్రాహి వృత్తౌ తచ్చోపజాయతే ॥** 112

సంఖ్యాసు = సంఖ్యలు, విద్యమానాసు = ఉండగా, ఉపగ్రాహి = స్వీకరించునటువంటిన్ని, అభేదాఖ్యమ్ = అభేదమను పేరుగల, సంఖ్యాంతరమ్=వేరొక సంఖ్యను, కేచిత్ =కొందరు, విదుః = తెలియుదురు (చెప్పుదురు), తత్ + చ = అదియే, వృత్తౌ = వృత్తియందు, ఉపజాయతే = పుట్టును.

*తాత్పర్యము*— అన్ని విధములయిన సంఖ్యలను తీసికొని తనలో ఇమిడ్చికొని మొత్తముపై ఒకటిగా భాసించు సంఖ్యయే అభేదైకత్వమనియు వృత్తియందది స్ఫురించుననియును కొందరు చెప్పుదురు.

*వివరణము*— సంఖ్యాభేదములన్నియు పోవుటయే అభేదైకత్వమని కొందరు భావింతురు. వారి మతమున సంఖ్యలను స్వీకరించుట జరుగదు. ఈ యంశమువెనుక (98 వ కారిక) చూపబడినది. ॥112॥

అవతారిక— అన్ని సంఖ్యలను స్వీకరించిన అభేదైకత్వము వృత్తియందు స్ఫురించినపుడు, ''గోదౌ'' అనుచోట ద్విత్వము సిద్ధించునని చూపుచున్నాడు.

**శ్లో॥ వ్యాపారం యాతిభేదాఖ్యై స్తత్ స్వైరవయవైః క్వచిత్ ।**
**ఆత్మాభేదానపేక్షోఽస్య క్వచిదేతి నిమిత్తతామ్ ॥** 113

క్వచిత్ = ఒకచోట, భేదాఖ్యైః = వేర్వేరుగా ఉండు, స్వైః = తన, అవయవైః = అవయవములైన సంఖ్యలతో, తత్ = ఆ అభేదైకత్వము, వ్యాపారమ్ = ఉపయోగమును, యాతి = పొందును, క్వచిత్ = ఒకానొకచోట, అస్య = ఈ అభేదైకత్వము యొక్క, ఆత్మా = స్వరూపము, భేదానపేక్షః = భేదములను ఆశించనిదై, నిమిత్తతామ్ = ఉపయోగమును ఏతి = పొందును.

తాత్పర్యము— ప్రయోగముల ననుసరించి ఆవశ్యకమైన కొన్నిచోట్ల అభేదైకత్వమందలి సంఖ్యావిశేషములు భాసించును. అనగా అట్టిచోట్ల వృత్తియున్నను మనకు కావలసిన సంఖ్యను తీసికొనవచ్చును. ఆవశ్యకము కానిచోట్ల అభేదైకత్వము మాత్రమే స్ఫురించును.

వివరణము— కాగా ''గోదౌ'' అనుచోట ఈ తీరునుబట్టి అభీష్టమైన ద్విత్వమును సంపాదింపవచ్చునని సారాంశము. ॥113॥

అవతారిక— ఈ యంశమున ఉదాహరణమును చూపుచున్నాడు.

**శ్లో॥ దాస్యాఃపతిరితి వ్యక్తో గోదావితి చ దృశ్యతే ।**
**వ్యాపారభేదః సంఖ్యాయా స్తస్మాదేవం వ్యవస్థితః ॥** 114

''దాస్యాః పతిః + ఇతి'' = ''దాస్యాః పతిః'' అనుచోట, వ్యక్తః=ఏకత్వము నిశ్చయింపబడెను, ''గోదౌ + ఇతి + చ'' = ''గోదౌ'' అనుచోటను, దృశ్యతే = ద్విత్వము సహజముగ కనబడుచున్నది, తస్మాత్ = అందువలన, సంఖ్యాయాః = అభేదైకత్వ సంఖ్యయొక్క, వ్యాపారభేదః = పనిచేయుటయందలి భేదము, ఏవమ్ = ఇట్లు, వ్యవస్థితః = నిశ్చితమైయున్నది.

తాత్పర్యము— ''దాస్యాః పతిః'' అను సమాసవృత్తియందు ఏకత్వమును, ''గోదౌ'' అను తద్ధితవృత్తియందు ద్విత్వమును తెలియుట సహజమైన విషయము. అచట అభేదైకత్వసంఖ్య యున్నను ప్రసిద్ధినిబట్టి ఆ యా సంఖ్యావిశేషమును కూడ కొండొకచో అది సమర్పించుచుండును. అభేదైకత్వము విషయమున అట్టి ఏర్పాటును పెద్ద లంగీకరించిరి.

వివరణము— ''దాస్యాః పతిః'' (పనికత్తెమగడు) అనునది షష్ఠీ సమాసము. ''షష్ఠ్యా ఆక్రోశే'' (6-3-21) (నింద గమ్యమానమైనపుడు షష్ఠికి అలుక్కు అగును) అను సూత్రముచే షష్ఠి లోపింపకుండ మిగిలినది. మగనిని దూషించుటయే ఇచట ముఖ్యమైన భావము. దాసీగతమైన సంఖ్యాభేదము (ఒకతె, ఇరువురు, ముప్వురు మొదలగునది) అవివక్షి

తము. అందుచే ఇచట ఏకత్వము సహజము. అట్లే ''గోదా'' (గోదయోః నివాసః గ్రామః) అనుచోట ద్విత్వము వ్యవహారబలముచే సిద్ధించినది. దానినే అభేదైకత్వము ప్రతిపాదించును. కాగా కావలసిన సంఖ్యను సమర్పించుటయే అభేదైకత్వము యొక్క ముఖ్య ధర్మమని ఫలించును.

*విశేష విషయములు*— అభేదైకత్వమను సాంకేతికమైన సంఖ్యకేగాక, సామాన్యమైన సంఖ్యలకును ఇట్టి విచిత్రములు గోచరించును. ఉదా : ''వింశతిః - గావః'' (ఇరువది ఆవులు). ఇచట ఇరువదిలో రెండు పదులున్నవి. అయినను ద్విత్వము రాకుండ ఏకత్వమే ఎల్లపుడును భాసించును. ''ద్వౌ, త్రయః'' (రెండు, మూడు) మొదలగుచోట్ల లెక్కింపబడు వస్తువుల భేదము నాశ్రయించుటవలన ఎల్లపుడును ఆ యా భేదములే తెలియుచుండును. మరియు ఒక సంఖ్యయందు వేరొక సంఖ్య ఇమిడియుండుట కూడ లోకవ్యవహారమున ప్రసిద్ధమే. ఉదా : ''కతి - భవతః - పుత్రాః ?'' (మీ కెందరు పుత్రులు ?) ఈ ప్రశ్నయందు ఒకటి, రెండు, మూడు మొదలగు సంఖ్యలన్నియు ఇమిడియున్నవి. అందువలననే ఈ ప్రశ్నకు ''ఏకః, ద్వౌ, త్రయః'' మొదలగు సమాధానములు వినబడుచుండును. ఇట్టి రీతులన్నియు సంఖ్యావిషయమున సహజములు. కావున అభేదైకత్వ సంఖ్యయందును ఒకచో ఏకత్వము భాసించుటయు, వేరొకచో సంఖ్యావిశేషము స్ఫురించుటయును విరుద్ధము కాదు.॥114

*అవతారిక*— అభేదైకత్వమును స్వీకరించినపుడు ''ద్విపుత్రః'' (ఇరువురి కుమారుడు) మొదలగుచోట్ల ద్విత్వము తెలియు రీతిని చూపుచున్నాడు.

**శ్లో॥ ద్వ్యాదీనాం చ ద్విపుత్రాదౌ బాహ్యో భేదో నివర్తతే ।**
**విభక్తివాచ్యః స్వార్థత్వాన్నిమిత్తం త్వవతిష్ఠతే ॥** 115

ద్విపుత్రాదౌ = ''ద్విపుత్రః'' మొదలగుచోట, ద్వ్యాదీనామ్ = ద్వి, మొదలగు శబ్దముల యొక్క, విభక్తివాచ్యః = విభక్తివలన చెప్పబడు, బాహ్యః = వెలుపలిదైన, భేదః = భేదము, నివర్తతే = పోవును, నిమిత్తమ్ + తు = ప్రవృత్తి నిమిత్తమైతే, స్వార్థత్వాత్ = శబ్దముయొక్క అర్థమగుటవలన, అవతిష్ఠతే = మిగులును.

తాత్పర్యము— ''ద్విపుత్రః''. ఇచట ''ద్వయోః పుత్రః'' అని విగ్రహము. సమాసము జరుగగనే షష్ఠీ విభక్తివలన తెలియు సంఖ్యాభేదము (ద్వివచనమువలన బోధపడు ద్విత్వము) తొలగిపోవును. ''ద్వి'', అను ప్రాతిపదికము యొక్క సహజమైన అర్థమగు ద్విత్వము మాత్రము మిగులును. అందువలన అభీష్టార్థము సిద్ధించును. (''ఇరువురికి చెందిన'' అనుభావము).

*వివరణము*— అభేదైకత్వమువలన ప్రాతిపదికము యొక్క అర్థము నశింపదు గదా : అట్లయిన ''ద్వి'' అను శబ్దమును వాడుటయే వ్యర్థమయ్యెడిని. కాగా ద్విశబ్దమువలన ద్విత్వము లభించుటలో అనుపపత్తి ఏదియు లేదు. ఇట్లే ''త్రిపుత్రః'' మొదలగు ప్రయోగములలో కూడ ఊహింపవలెను. ॥115॥

అవతారిక— "ద్విపుత్రః" అనుచోట ద్విత్వము భాసించినచో, అభేదైకత్వ మచట ఉన్నట్లు అనుకొనవచ్చునా ? - అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

**శ్లో॥ ద్విత్వోపసర్జనే సంఘే ద్విశబ్దస్తత్ర వర్తతే।**
**సోఽయమిత్యభిసంబంధాదుభశబ్దే న తత్తథా ॥** 116

తత్ర = అచట, ద్విశబ్దః = ద్వి, అను శబ్దము, ద్విత్వోపసర్జనే = ద్విత్వము అప్రధానముగా గల, సంఘే = సముదాయమందు, వర్తతే = ఉండును, సః = అదే, అయమ్ = ఇది, ఇతి = అను, అభిసంబంధాత్ = భావనవలన, ఉభశబ్దే = ఉభ, అను శబ్దము విషయమున, తత్ = అది, (ద్విత్వము అప్రధానముగా ఉండుట) తథా = అట్లు, న = కాదు.

తాత్పర్యము— వాక్యమందలి ద్విశబ్దము "వస్తువులు రెండు" అని సంఖ్యాభేద మును స్పష్టముగా చెప్పను. వృత్తియందలి ద్విశబ్దము మాత్రము, "రెండిటి సముదాయము" అని సముదాయరూపమైన ఏకత్వమునే బోధించును. ఇట్టిచోట్ల అభేదైకత్వమనగా ఇదియే. కాన అభేదైకత్వమున్నదనియే చెప్పవచ్చును.

ద్విశబ్దమునకు సమానార్థకమైన "ఉభ" అను శబ్దమొకటి యున్నది. అర్థమొక టియే అయినను ఉభశబ్దము విషయమున ఈ తీరు వర్తింపదు. అనగా "వృత్తియందు ద్విత్వము అప్రధానముగాగల సముదాయమును బోధించుట" సంభవింపదు. అందుచే "ఉభ పుత్రః" అను ప్రయోగమును చేయరాదు.

వివరణము— ద్వి, ఉభ అనునవి పర్యాయములే అయినను ఉభశబ్దము విషయ మున వృత్తి ప్రవర్తింపకుండుటయు, వృత్తి ధర్మములు లేకుండుటయును శబ్దశక్తి యొక్క- స్వభావమని తెలియవలెను. అనగా అట్టి ప్రయోగములు లేకుండుటయే నిదానమని ఫలితము.

విశేష విషయములు— వృత్తియందు ఉభశబ్దమునకు మారుగ "ఉభయ" అను శబ్దమునే ఎల్లపుడును వాడుట సంప్రదాయము. ఈ యంశమును గ్రంథకర్తయే దిగువ స్పష్టము చేయును. ॥116॥

అవతారిక— ఉభశబ్దమును గురించి పైని చెప్పిన అంశమును విశదము చేయు చున్నాడు.

**శ్లో॥ ఉభయస్తస్య తుల్యార్థో వృత్తౌ నిత్యం ప్రయుజ్యతే।**
**సూత్రేఽపినిత్యగ్రహణం తదర్థమభిధీయతే ॥** 117

తస్య = దానికి, (ఆ ఉభ శబ్దమునకు) తుల్యార్థః = సమానార్థకమైన, ఉభయః = ఉభయ శబ్దము, వృత్తౌ = వృత్తియందు, నిత్యమ్ = ఎల్లపుడు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును, సూత్రే + అపి = సూత్రమందు కూడ, తదర్థమ్ = అందుకొరకే, నిత్యగ్రహణమ్ = "నిత్యమ్", అను పదము, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— ఉభశబ్దమునకు మారుగ ఉభయశబ్దమే ఎల్లపుడును వృత్తియందు వాడబడును. ''ఉభాదుదాత్తో నిత్యమ్'' (5-2-44) అను సూత్రమందలి ''నిత్యమ్'' అను పదము కూడ ఈ విషయమునే సూచించును.

వివరణము— ఉభయ పుత్రః, (ఇరువురి కుమారుడు), ఉభయథా, (రెండు విధముల), ఉభయతః (రెండు వైపుల), మొదలగునవి వృత్తి జరిగిన పదములు. ఇట్టి ప్రయోగము లన్నిటియందును ఉభశబ్దమును వాడకూడదు. ఉభయశబ్దమునే వాడవలెను. ఉభశబ్దమునకు భేదమును (రెండు అవయవములు —లేదా— ఇరువురు) బోధించుటయే స్వభావము. (ఉదా : ఉభౌ.). రెండు అవయవముల సముదాయమును (సముదాయ మొకటియే) బోధించుట ఉభయశబ్దము యొక్క స్వభావము. కాగా ద్విత్వ ముపసర్జనముగాగల సంఘమును బోధించు శక్తి ఉభశబ్దమునకు లేనందున వృత్తియందు దానిని ఉపయోగింపకూడదని సారాంశము. తన సూత్రమున ''నిత్యమ్'' అను పదముచే సూత్రకారుడు కూడ ఈ భావమునే ప్రకటించెను.

*విశేష విషయములు*— ''ఉభాదుదాత్తో నిత్యమ్'' (5-2-44) ''ఆద్యుదాత్తమైన ''అయ'' అను ప్రత్యయము ఉభశబ్దమునకు నిత్యముగనగును.'' అని యర్థము. ఇచట ఉభశబ్దమునకు అయప్రత్యయమును చేర్చి, ''ఉభయ'' అను రూపమును సాధించుట సూత్రకారుని తాత్పర్యము కాదు. ''ఉభయ'' అనునది మాత్రమే వృత్తియందు రెండిటి సముదాయమును బోధింప సమర్థమైనది'' అనియే అతని యాశయమని వ్యాఖ్యాతలు నిర్ణయించిరి. కాగా ఉభయశబ్దము యొక్క స్వభావమునే సూత్రమందలి నిత్యగ్రహణము వెల్లడించును. మరియు ఉభ, ఉభయశబ్దములు వాస్తవముగ సమానార్థకములు కానేకావు. (మొదటిది భేదమును రెండవది సముదాయమును తెలుపును). అభేదమును భావించుటవలననే అవి సమానార్థకములనుట పొసగును. ॥117॥

*అవతారిక*— ఉభశబ్దమునకు ద్వివచనమును టాప్ (ఆ), అను స్త్రీ ప్రత్యయమును మాత్రము రావచ్చుననుచున్నాడు.

**శ్లో॥ ఆపికేచాపరార్థత్వాన్నాభేద ఉపజాయతే ।**
**ఉభే ఇతి తతఃస్వార్థే భేదవృత్తిః ప్రయుజ్యతే ॥ 118**

ఆపి = టాప్, అను స్త్రీ ప్రత్యయము విషయమునను, కే + చ = ''క'', అను ప్రత్యయము విషయమునను, అపరార్థత్వాత్ = అప్రధానమగుట సంభవింపనందున, అభేదః = అభేదము, న + ఉపజాయతే = కలుగదు, తతః = అందువలన, భేదవృత్తిః = భేదమును బోధించు, ఉభే + ఇతి = ఉభే, అను రూపము, స్వార్థే = తన యర్థమున, ప్రయుజ్యతే = ప్రయోగింపబడును.

తాత్పర్యము— ''రెండు'' అనునది ఉభశబ్దమునకు సహజమైన యర్థము (అనగా అది భేదమును తెలుపును), స్త్రీత్వమును తెలుపదలచినపుడు టాప్ అను స్త్రీ ప్రత్యయముగాని,

నిందాదులను బోధింపదలచినపుడు క, అను తద్ధిత ప్రత్యయముగాని స్వార్థమందు ప్రవర్తించును. అనగా ప్రాతిపదికము యొక్క అర్థమున సిద్ధముగానున్న స్త్రీత్వమును టాప్ ప్రత్యయమును, నింద మొదలగు నర్థములను క ప్రత్యయమును వెల్లడిచేయును. అంతియగాని అచట ప్రత్యయము యొక్క అర్థము వేరుగాఉండి ప్రధానమగుటయు, దానికి ఉభశబ్దము యొక్క అర్థము విశేషణమై స్వార్థమును కోల్పోయి, "రెండిటి సముదాయము" అను అభేదమును బోధించుటయు జరుగదు. కావున టాప్ వచ్చినపుడు "ఉభే" (ద్వివచనము) అనియు, క ప్రత్యయము వచ్చినపుడు "ఉభకే" అనియు ప్రయోగములుండును. "ఇరువురు స్త్రీలు" అను రీతిని భేదముగల స్వార్థమే (ఉభశబ్దము యొక్క అర్థము) వీనివలన తెలియుచుండును.

వివరణము— ప్రాతిపదికమందు సిద్ధముగానున్న స్త్రీత్వమును వెల్లడి చేయుటయే స్త్రీ ప్రత్యయముల పని యనియు, అట్లే నింద మొదలగు అర్థములను ప్రకాశింపజేయుటయే స్వార్థికములగు తద్ధితముల పని యనియును సంప్రదాయము. కావున టాప్పు వచ్చినను క ప్రత్యయము వచ్చినను ఉభశబ్దము యొక్క సహజమైన యర్థము మారదు. అది భేదమునే చెప్పగలదుగాని అభేదమును చెప్పజాలదు.

అట్లుగాక స్వార్థికముకాని వేరొక ప్రత్యయమును చేసినను ఉత్తరపదము పరమైనపుడును (ఉభయతః, ఉభయపుత్రః, మొదలగు స్థలములు) ఆ యా అర్థములు ప్రధానములగును. ఏకార్థీభావము వలన వానికి విశేషణమై అప్రధానముగ నుండి అభేదమును (రెండిటి సముదాయము, అను భావమును) బోధించు శక్తి ఉభయ శబ్దమునకు మాత్రమే యున్నది. ఉభశబ్దమునకు లేదు. అందువలన అట్టిచోట్ల ఉభయశబ్దమును వాడక తప్పదు.

*విశేష విషయములు*— "స్త్రీ ప్రత్యయములు ద్యోతకములు" (ఉన్న యర్థమును వెల్లడి చేయునవి) అను పక్షమున ఈ తీరు సమన్వయించును. ॥118॥

*అవతారిక*— "స్త్రీ ప్రత్యయము స్త్రీత్వమునకు వాచకమే" (స్త్రీత్వమును క్రొత్తగా ప్రత్యేకముగ బోధించును) అను మరొక పక్షమున్నది. ఇందు ఉభశబ్దము యొక్క అర్థము ప్రత్యయముయొక్క అర్థమునకు విశేషణము కావచ్చును గదా ! అట్లయినపుడు ప్రయోగమెట్లుండును ? - అను శంకకు సమాధానమును చూపుచున్నాడు.

**శ్లో॥ స్త్రీత్వాభిధానపక్షేఽపి గుణభావవిపర్యయః ।**
**స్వభావాదపదార్థత్వాత్తత్ర భేదో న హీయతే ॥ 119**

స్త్రీత్వాభిధానపక్షే + అపి = స్త్రీత్వమును చెప్పు పక్షమందును, గుణభావ విపర్యయః = అప్రధానమగుట సంభవింపదు, స్వభావాత్ = స్వభావము ననుసరించి, అపరార్థత్వాత్ = ప్రాధాన్యమే ఉండుటవలన, తత్ర = అచట, భేదః = భేదము, న + హీయతే = పోదు.

తాత్పర్యము— స్త్రీ ప్రత్యయము స్త్రీత్వమును చెప్పునను పక్షమందు కూడ ఉభశబ్దముయొక్క యర్థము, ప్రత్యయముయొక్క అర్థమునకు విశేషణముగ మారదు. ప్రధాన

ముగనే యుండును. అది దాని స్వభావము. అనగా ''స్త్రీలు ఇరువురు'' అను ముఖ్యమైన యర్థమునే ఉభశబ్దము బోధించును. అందువలననే సహజమైన భేదము నివర్తింపదు.

వివరణము— ''దాశరథిః'' (దశరథస్య - అపత్యమ్ - పుమాన్ = దశరథుని మగ సంతానము) మొదలగుచోట్ల ప్రత్యయముయొక్క అర్థము ముఖ్యమై ప్రకృతియొక్క అర్థము అప్రధానమగును. స్త్రీ ప్రత్యయముల విషయమున మాత్ర మట్టితీరు లేదు. ప్రత్యయము వాచకమైనను ద్యోతకమైనను స్త్రీత్వముతో కూడిన ప్రకృత్యర్థమే ముఖ్యముగ ప్రకాశించును. అది స్వభావము. అర్థమనునది ఎల్లపుడును లోకవ్యవహారమును బట్టియే సాగుచుండును. వ్యాకరణము కేవలము శబ్దముయొక్క ప్రక్రియనే చూపునుగాని, అర్థమునుగురించి ఎట్టి నిర్ణయమును చేయజాలదు. ఈ భావమునే ''అర్థానాదేశనాత్'' (శాస్త్ర మర్థమును నిర్దేశింపదు) అను వచనముతో పెద్దలు బోధించుచుందురు. ॥119॥

అవతారిక— కాగా ఉభశబ్ద మెల్లపుడును భేదమునే బోధించుగుగాన.

శ్లో॥ తస్మాద్ద్వివచనాట్టాపశ్చోభయోఽన్యత్ర దృశ్యతే ।
ప్రత్యయం తయపం హిత్వానాస్త్యుత్తరపదే పునః ॥ 120

తస్మాత్ = అందువలన, ద్వివచనాత్ = ద్వివచనము కన్న, టాపః + చ = టాప్ ప్రత్యయము కన్నను, అన్యత్ర = వేరైనచోట, ఉభయః = ఉభయశబ్దము, దృశ్యతే = చూడబడును, తయపమ్ = ''తయప్'', అను, ప్రత్యయమ్ = ప్రత్యయమును, హిత్వా = విడిచి, ఉత్తరపదే + పునః = ఉత్తరపదము పరమగునపుడు కూడ, న + అస్తి = (ఉభశబ్దము) లేదు.

తాత్పర్యము— టాప్ ప్రత్యయము, ద్వివచనము, తయప్పు (తయ, అను తద్ధితము) అను వాని విషయములోనే ఉభశబ్దమునకు ప్రసక్తి యుండును. మిగిలిన అన్నిచోటులందు సమానార్థకమైన ఉభయశబ్దమే వాడబడును. ఏకార్థీభావమునకును తన్నిమిత్తకమైన అభేదైకత్వమునకును అనువైన స్వభావము ఉభయశబ్దమునకే గలదు.

వివరణము— తయప్, అనునది మూలమైన ప్రత్యయము. ''ఉభాదుదాత్తో నిత్యమ్'' (5-2-44) అను సూత్రముచే ''తయ'' అను దానికి ''అయ'' అను ఆదేశము విధింపబడెను. (ఉభయ అను రూపము సిద్ధించును). సూత్రమున ''ఉభాత్'' అని స్పష్టముగ పేర్కొనుటవలన ఈ సందర్భము ''ఉభ'' శబ్దమునకేయని అనవలసివచ్చెను. ॥120॥

అవతారిక— అభేదైకత్వమును చర్చించు సందర్భములో ప్రసక్తానుప్రసక్తముగ వచ్చిన కొన్ని విషయములు ఈ విధముగ ప్రతిపాదింపబడినవి. ఇట్లే అభేదైకత్వసంఖ్య నంగీకరించినచో దోషములు కలుగునని దిగువ మూడు కారికలతో కొన్ని శంకలను ప్రకృతము చూపుచున్నాడు. (అందు మొదటి శంక)—

శ్లో॥ ప్రాప్తిః ప్రగృహ్యసంజ్ఞాయా న స్యాత్ ప్రత్యయలక్షణాత్ ।
కుమార్యగారే న హ్యస్తి సమాసో వచనాంతరే ॥ 121

ప్రత్యయలక్షణాత్ = ప్రత్యయ లక్షణమువలన, ప్రగృహ్య సంజ్ఞాయాః = ప్రగృహ్య సంజ్ఞ యొక్క, ప్రాప్తిః = లాభము, న + స్యాత్ = కలుగకపోయెడిని, కుమార్యగారే = "కుమార్యగారమ్", అనుచోట, వచనాంతరే = వేరొక వచనమున, సమాసః = సమాసము, న + అస్తి + హి = లేదుగదా ।

తాత్పర్యము— "కుమార్యగారమ్" అనునది కుమారీ శబ్దముతో జరిగిన షష్ఠీ తత్పురుషము. అభేదైకత్వము నంగీకరించినపుడు, ఇచట ద్వివచనాంతముతో (కుమార్యోః + అగారమ్) సమాసమనుటయే కుదురదు. (ఏకత్వ సంఖ్య తప్పదు కావున). అట్లయినపుడు "ప్రత్యయ లక్షణమువలన ఇచట ప్రగృహ్య సంజ్ఞ వచ్చెడిని" అను వార్తికకారుని ప్రతిపాదనమే వ్యర్థము కావలయును గదా ।

వివరణము— మహాభాష్యమందలి సందర్భమిది : "ఈ దూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" (1-1-11) అని సూత్రము. "దీర్ఘములైన ఈ కారమును, ఊకారమును, ఏకారమును అంతమందుగల ద్వివచనము ప్రగృహ్యమగును" అని యర్థము. ఇదియే సిద్ధాంతము. ప్రగృహ్యమైనచో సంధికార్యము రాదు. ఉదా : "హరీ + ఇమే = హరీఇమే" మొదలగునవి.

ఇచట వ్యాఖ్యావికల్పములను చూపు ఘట్టమున "ఈదాద్యంతం ద్వివచనాంతమితిచేల్లుకి ప్రతిషేధః" అని వార్తికకారుడొక యాక్షేపమును చేసెను "ఈదాద్యంతమై ద్వివచనాంతమైనది ప్రగృహ్యమగును" అని చెప్పినచో, "కుమార్యోః అగారమ్" అని ద్వివచనాంతముతో సమాసమును చేసినపుడు - కుమార్యగారమ్, అనుచోట "కుమారీ" అనునది ప్రగృహ్యము కావలసివచ్చును. (కుమారీ అగారమ్, అని అనవలసి వచ్చును). దానిని ఆపవలసి యుండును" అని వీనియొక్క భావము. కుమారీ, అనునది ఈకారాంతమగును కావున, సమాసమునకు అవయవమై లోపించిన "ఓస్" అను ద్వివచనమును ప్రత్యయ లక్షణమువలన మరల ఉన్నట్లు భావింపవచ్చును కావునను పై ఆక్షేపము సరిపోవునని సమన్వయము (ఈకారాంతమును ద్వివచనాంతమును అగుట కుదురును). కాని అభేదైకత్వమును ఆశ్రయించినచో "ద్వివచనాంతముతో సమాసము" అనుటయే కుదురనందున వార్తికకారుని యాక్షేపమే నిష్ప్రయోజనమగును.

విశేష విషయములు— "ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్" (1-1-62) అని సూత్రము "ప్రత్యయము లోపించినను దానివలన రాదగు కార్యము ప్రవర్తించును" అని యర్థము. దీనినే ప్రత్యయ లక్షణమందురు ॥121॥

అవతారిక— మరియు (రెండవ శంక)–

శ్లో॥ ఏకద్వయోర్యక్షాదీనాం విభాషాలుజ్ న కల్పతే ।
యౌష్మాకస్తావకశ్చేతి భేదాభావాన్న సిధ్యతి ॥ 122

మును నియమించునవి కనుక అవి ఆఖ్యాతపదములు గానే గ్రహింపబడుచున్నవి అని కొందరి యాశయము.

3. నామము, ఆఖ్యాతము, నిపాతము ఉపసర్గము. ఇవి స్వతంత్రపదములు, కర్మ ప్రవచనీయములు సాక్షాత్తుగా క్రియను ప్రకాశింప చేయజాలవు. కాబట్టి అవి ఆఖ్యాత పదములుగా గ్రహింపబడక స్వతంత్రపదములుగానే స్వీకరింపబడుటయుక్తము. కాబట్టి పదము ఐదువిధములనుటయే యుక్తమనికొందరి యభిప్రాయము.

వాక్యమునుండి పదములువిభక్తములైనవి, అనుటలో "ప్రకృతి ప్రత్యయాదివత్" అనునది దృష్టాంతముగా జూపబడినది. వాక్యము అఖండము,పదములు కల్పితములని వాక్య వాదులు పలుకుదురు. పదము అఖండము, దానిలో ప్రకృతిప్రత్యయములు కల్పితములని పదవాదులు నుడివిరి. ఈ రెండువాదములు ద్వితీయ కాండమున చూపబడినవి. అంతతః పదాని కల్పితాని (పదములుకల్పితములు), వాక్యమేవ సత్యమ్ (వాక్యమేసత్యము)అని సిద్ధాంతముచేయబడినది. పదవాది మతమునప్రకృతి ప్రత్యయములు కల్పితములగునట్లు మామతమున అనగా వాక్యమే వాచకము అను వారిమతమున పదములు కల్పితములు. వాక్యవాది పదమువరకే తన కల్పనను చూపును. ప్రకృతి ప్రత్యయకల్పనా ప్రసక్తి వాక్యవాదికిలేదు. కనుకనే అది దృష్టాంతముగా జూపబడినది.

*విశేషాంశములు-*

1. ఈకల్పన అర్థమును పురస్కరించుకొని చేయబడినది. ఆసందర్భమున సుబంత తిఙంత పదభేదము సహకరించదు. కనుకనే సుబంతము తిఙంతము అను రీతిని భేదముచూపక నామము ఆఖ్యాతము మున్నగు రీతిని పదవిభాగము చూపబడినది.
2. పైరీతిని పదములు కల్పితములు కాగ వానిద్వారా అఖండవాక్యము యొక్కస్వరూపము తెలియబడగలదు. కాగా వాక్యవాక్యార్థములను తెలిసికొనుటకు పదపదార్థములు ఉపాయములు కాగలవు.

*అవతారిక* ——అవయవములు లేక ఏకాకారముగానుండెడి వాక్యమును తెలిసి కొనుట సాధ్యము కానందున, దానిని తెలిసికొనుటకు ఉపాయములుగా పదములు విభజింప బడినవి. వాని ద్వారా వాక్యము తెలియబడగలదనే భావము మొదటి శ్లోకమున చూపబడినది. దానిని అపోద్ధారపద్ధతి యందురు. అట్లు పదముల యొక్కయపోద్ధారము అర్థమునుబట్టి చేయవలసి యున్నది. అట్లుకాకున్న ఒకనియమము లేకుండ నిరర్థకవిభాగము కూడ చేయ బడగలదు. కాబట్టి వాక్యమునుండి పదముల అపోద్ధారము అర్థములయొక్క అపోద్ధారముపై ఆధారపడి యున్నవి.

పైయభిప్రాయముతో అఖండమగు వాక్యార్థమునుండి పదార్థములు అపోద్ధృతము లగుచున్నవని నిరూపించుట కుపక్రమింప బడుచున్నది.

అందు పదార్థము 1. సిద్ధము 2. సాధ్యము అని రెండు విధములుగానున్నది. నామముయొక్కయర్థము సిద్ధపదార్థమనియు, ఆఖ్యాతముయొక్క యర్థము సాధ్యపదార్థ

*అవతారిక*— 81, 82 శ్లోకముల ఉత్తరార్థముల యర్థములకు ఉదాహరణము చూపుచున్నాడు.

**శ్లో॥ సంమృజ్యమానతన్త్రే తు గ్రహేయత్ర క్రియాశ్రుతిః ।**
**సంఖ్యావిశేషగ్రహణం నైవ తత్రాద్రియామహే ॥ 85**

యత్ర = ఎచట, సంమృజ్య మానతన్త్రే = శుభ్రపరచబడు నట్టియు కనుకనే ప్రధానమగునట్టి' గ్రహే = గ్రహము (పాత్రము) విషయమున, క్రియాశ్రుతిః = క్రియయొక్క వినబడుట, (అస్తి) = కలదో, తత్ర + తు = అచట మాత్రము, సంఖ్యా విశేష గ్రహణమ్ = విశేష సంఖ్యయొక్క వివక్షను, న + ఏవ + ఆద్రియామహే = ఆదరింపనే ఆదరింపము. ఇచట తంత్ర శబ్దము ప్రధానార్థకము.

'గ్రహం సమ్మార్ష్టి' అను వాక్యమున శబ్ద వ్యాపారము వలన సమ్మార్జన క్రియ ప్రధానముగా భాసించును. కాని ఆ సమ్మార్జనము పాత్రలకు సంబంధించి యున్నందున యాగము చేయుటలో గ్రహములే ప్రధానములనక తప్పదు. ఈ రీతిగా చూచిన శాబ్ద ప్రాధాన్యము క్రియకున్నను అర్థ ప్రాధాన్యము గ్రహములకుండుటచే, నవియే వివక్షితము లగును. 'అమ్' అను విభక్తి ప్రత్యయముచే ఏకత్వసంఖ్య బోధింపబడుచున్నను అది వివక్షితము కానేరదు. ఉత్పత్తి వాక్యమున శ్రుతములగు ఎన్ని గ్రహములున్నవో, వాని కన్నిటికిని సమ్మార్జన క్రియ జరుగును. ॥౮౫॥

*అవతారిక*— అప్రధానముగానున్న పదార్థముననున్న సంఖ్య వివక్షితము కాగలదు. ఇందుకుదాహరణము— 'పశునాయజేత' ప్రధానముగానున్న అర్థమునకల సంఖ్య వివక్షితము కానేరదు. ఇందుకుదాహరణము— "గ్రహం సమ్మార్ష్టి" అని చూపిన నిర్ణయమున పాణిని మహర్షియొక్క అనుమతిని జూపుచున్నాడు.

**శ్లో॥ శిష్యమాణపరే వాక్యే యదేకగ్రహణం కృతమ్ ।**
**శేషే విశిష్టసంఖ్యేఽపి వ్యక్తం తల్లిఙ్గదర్శనమ్ ॥ 86**

శిష్యమాణపరే = శేషింపబడునదియే ప్రధానముగాగల, అనగా అట్టి యర్థమును బోధించెడి, వాక్యే = వాక్యమున అనగా "సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (1-2.64) అను సూత్రమున విశిష్టసంఖ్యే = విశిష్టమగు సంఖ్య కలిగిన, అనగా విశేష సంఖ్యతో గూడిన, శేషే + అపి = శేషః అను శబ్దమున్నను, మరల, యత్ + ఏ, ఏకగ్రహణమ్ = 'ఏక' అను శబ్దము నుచ్చరించుట, కృతమ్ = చేయబడినదో, అనగా పాణినిచే 'ఏక' అను శబ్దముచ్చరింపబడినదో, తత్ = ఆ 'ఏక' గ్రహణము, వ్యక్తమ్ = స్పష్టమగు, లిఙ్గదర్శనమ్ = హేతువుయొక్క కాన్పించుట, (భవతి) = అగుచున్నది. పై యర్థమున 'ఏక' అను శబ్దము హేతువగుచున్నదని భావము,

యఞాదీనామ్ = యఞ్ , మొదలగు ప్రత్యయములకు, ఏకద్వయోః = ఏకత్వమందును ద్విత్వమందును, లుక్ = లుక్కు, విభాషా = వికల్పముగ, న + కల్పతే = కుదురదు, భేదాభావాత్ = భేదము లేనందువలన, యౌష్మాకః = యౌష్మాక, అను రూపమును, తావకః + చ + ఇతి = తావక, అను రూపమును, న + సిధ్యతి = సిద్ధింపదు.

తాత్పర్యము— యఞ్ ప్రత్యయము మొదలగు కొన్ని తద్ధితములను ప్రవర్తింపజేసినపుడు, ఏకత్వముగాని ద్విత్వముగాని తెలియు సందర్భములలో ఆయా ప్రత్యయమునకు వికల్పముగ లోపమగునని వార్తికకారుడు చెప్పెను. అట్లే యుష్మద్ శబ్దమునకు అణ్ ప్రత్యయము పరమైనపుడు, ఏకవచనమందు "తావక" అను రూపమును, ద్విత్వ బహుత్వములందు "యౌష్మాక" అను రూపమును అగునని సూత్రకారుడు చెప్పెను. వృత్తియందు అభేదైకత్వమన్న పక్షమున సంఖ్యాభేదమే యుండదు కావున ఇరువురి మాటలును అసంగతములయ్యెడిని.

వివరణము— "యఞఞోశ్చ" (2-4-64) అని సూత్రము. "బహుత్వమును చెప్పదలచినపుడు, గోత్రార్థకములైన యఞ్, అఞ్ ప్రత్యయములు నిత్యముగ లోపించునని" దీని భావము. ఉదా: గార్గ్యః. (యఞన్తము) దీనికి బహువచనము "గర్గాః" అని యుండును. (యఞ్ ప్రత్యయము లోపించెను). ఈ సందర్భమందు "గార్గ్య" శబ్దమును ముందుంచి, షష్ఠీతత్పురుష సమాసము చేయగా, ఏకవచనాంతముగ కాని ద్వివచనాంతముగ కాని విగ్రహమును చూపదలచినపుడు, యఞ్ ప్రత్యయమునకు వికల్పముగ లోపమగును" అని కాత్యాయనుడొక వచనమును చూపెను. ఉదా: "గార్గ్యస్యకులమ్ = గార్గ్యకులమ్" అనిగాని, "గర్గకులమ్" అనిగాని రూపముండవచ్చును. (యఞ్ ప్రత్యయమునకు వికల్పముగ లోపము). "గార్గ్యయోః కులమ్" అని చూపినను రూపములు సమానమే. కాగా అభేదైకత్వమున ఏకత్వము, ద్విత్వము మొదలగు విశేషములే సంభవింపవుగాన, పై కాత్యాయన వచనము అనుపపన్నమగును.

అట్లే "తవకమమకావేకవచనే" (4-3-3) అని సూత్రము. "అణ్ ప్రత్యయముగాని ఖఞ్ ప్రత్యయముగాని పరమగునపుడు, ఏకత్వమును చెప్పు యుష్మద్, అస్మద్, అను శబ్దములకు వరుసగ తవక, మమక, అను నాదేశములగునని" దీని భావము. తావకః, మామకః (అణ్ ప్రత్యయము) అనునవి ఉదాహరణములు. ఇదే సందర్భములో ద్విత్వ బహుత్వములను చెప్పునపుడు మాత్రము యుష్మాక, అస్మాక, అను నాదేశములగునని (యుష్మద్, అను దానికి యుష్మాక. అస్మద్, అను దానికి అస్మాక). దీనిమీది సూత్రము (తస్మిన్నణిచ యుష్మాకాస్మాకౌ (4-3-2) బోధించునది. యౌష్మాకః (యువయోః - అయమ్, లేక— యుష్మాకమ్ - అయమ్, (అని విగ్రహము) ఆస్మాకః, అనునవి ఉదాహరణములు. అభేదైకత్వ పక్షమున సంఖ్యాభేదము లేనందున పాణిని యొక్క ఈ నిర్దేశము కూడ విరోధించెడిని.

ఇట్లు పాణిని కాత్యాయనుల వచనములకును అభేదైకత్వమను ప్రతిపాదనమునకును పొత్తు కుదురలేదని ఫలించినది. ॥122॥

అవతారిక— మరియు (మూడవ శంక)-

శ్లో॥ దృష్టో గార్గ్యతరే భేదస్తథా గర్గతరా ఇతి।
యుష్మత్పితా త్వత్పితేతి తథాదేశౌ వ్యవస్థితౌ॥ 123

గార్గ్యతరే = గార్గ్యతరః, అను ప్రయోగమందును, తథా = అట్లు, గర్గతరాః + ఇతి = గర్గతరాః, అను చోటను, భేదః = భేదము, దృష్టః = కనబడెను, తథా = అట్లే, యుష్మత్పితా = యుష్మత్పితా, అనుచోటను, త్వత్పితా + ఇతి = త్వత్పితా, అనుచోటను, ఆదేశౌ = ఆదేశములు, వ్యవస్థితౌ = నియతములై యున్నవి.

తాత్పర్యము— "గార్గ్యతర" అను రూపమందు యఞ్ ప్రత్యయము లోపింపలేదు. కావున ఏకత్వముగాని ద్విత్వముగాని తెలియుచుండును. "గర్గతర" అనగానే ఆ ప్రత్యయము లోపించినందున బహుత్వము తప్పక తెలియును. అట్లే "త్వత్పితా", అనునపుడు ఏకత్వమే బోధపడును. "యుష్మత్పితా" అనగానే ద్విత్వముగాని బహుత్వముగాని తప్పక స్ఫురించును. కాగా ఇట్టి సంఖ్యావిశేషములు స్ఫురించుట అభేదైకత్వమం దెట్లు కుదురును?

వివరణము— "యఞఞోశ్చ" (2-4-64) అను సూత్రముచే బహుత్వమందే యఞ్ ప్రత్యయము లోపించును. అట్లే "త్వత్పితా" (తవ + పితా) అను సమాసమున ఏకత్వమందే యుష్మద్ శబ్దమునకు "త్వ" అను నాదేశము విధింపబడినది. (ప్రత్యయోత్తరపదయోశ్చ (7-2-98) "ప్రత్యయముగాని ఉత్తరపదముగాని పరమైనపుడు ఏకత్వమును తెలుపు యుష్మద్ శబ్దమునకు "త్వ", అను నాదేశమును, అస్మచ్ఛబ్దమునకు "మ" అను నాదేశమును అగును"). ॥123॥

అవతారిక— అభేదైకత్వ సంఖ్య విషయమున బయలుదేరిన పై శంకలన్నిటికిని సమాధానమును చూపుచున్నాడు.

శ్లో॥ ఉపాధిభూతా యా సంఖ్యా ప్రకృతౌ సమవస్థితా।
ఆదేశైః సంజ్ఞయా వాఽపి విభక్త్యా వ్యజ్యతే వినా॥ 124

ప్రకృతౌ = ప్రాతిపదిక విషయములో, యా = ఏ, సంఖ్యా = సంఖ్య, ఉపాధిభూతా = విశేషణముగా, సమవస్థితా = సహజముగనున్నదో, (సా = ఆ సంఖ్య) విభక్త్యా + వినా = విభక్తిలేకుండగనే, ఆదేశైః = ఆదేశములచేతను, వా = లేక, సంజ్ఞయా + అపి = సంజ్ఞచేతను కూడ, వ్యజ్యతే = సూచింపబడును.

తాత్పర్యము— సంభవించు సంఖ్య లన్నింటియొక్కయు సామాన్యమైన సంబంధమే "అభేదైకత్వ సంఖ్య" అని ఇదివరకే చెప్పబడెను. సంఖ్యావిశేషమును సూచించు నిమిత్తమేదయిన ఉన్నచో, ఆ యా విశేషసంఖ్య వృత్తియందును స్ఫురించుచునే యుండును. లేనిచోట సర్వసామాన్యమైన ఏకత్వము భాసించును. కాగా కొన్నిచోట్ల - అనగా "తావక",

మొదలగుచొట్ల ''తవక'' మొదలగు ఆదేశములును, మరికొన్నిచోట్ల - అనగా ''కుమార్య గారమ్'' మొదలగుచొట్ల ప్రగృహ్యమనెడి సంజ్ఞయు ఆ యా సంఖ్యా విశేషమును తెలియ జేయును. ఎట్టి నిమిత్తమును లేని ''రాజపురుషః'' మొదలగు స్థలములలో సామాన్యమైన ఏకత్వమే ప్రకాశింపుచుండును.

వివరణము— సంఖ్యావిశేషము కూడ ప్రాతిపదికముయొక్క అర్థముతో పెన వేసికొనియే యుండును. అందువలన వృత్తియందు ప్రాతిపదికము ఉపసర్జనముగా ఉన్నను కొన్నిచోట్ల ఆ యా సంఖ్యాభేదము స్పష్టముగ తెలియుటయే లోకసిద్ధమైన విషయము. అట్లు తెలియుటకు తవక, యుష్మాక, మొదలగు నాదేశములు సాయపడును. ఎట్టి నిమిత్తమును లేనిచోట ఏకత్వమే తెలియును. ఇదియే అభేదైకత్వము యొక్క స్వభావము. అనగా వృత్తి యందు కూడ, ప్రయోగముల ననుసరించి - నిమిత్తమున్నచోట కావలసిన సంఖ్యా విశేష మును, లేనిచోట సామాన్య రూపముతో ఏకత్వమును భాసింపుచుండునని ఫలించును. అట్లు సిద్ధముగనున్న స్వభావమును వెల్లడించుటయే శాస్త్రము చేయుపని.

విశేష విషయములు— కాగా ''యఞఞోశ్చ'' (2-4-64) అను సూత్రము లుక్కును చెప్పుటయు, ఆ సూత్రమందలి వార్తికకారుని వచనములును, ''తవకమమకావేక వచనే'' (4-3-3) మొదలగు సూత్రము లా యా ఆదేశములను చెప్పుటయును అభేదైకత్వము యొక్క స్వరూపస్వభావములను విశదపరచునట్టివేగాని ''విరోధించునవి కానేరవనునది'' ఇచటి సారము. ॥124॥

అవతారిక— ఇదే తీరులో ఈ దిగువ ప్రయోగములును ఉపపన్నములగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ శౌర్పికే మాసజాతే చ పరిమాణం స్వభావతః ।**
**ఉపాధిభూతామాశ్రిత్య సంఖ్యాం భేదేనవర్తతే ॥ 125**

శౌర్పికే = శౌర్పిక, అనుచోటను, మాసజాతే + చ = మాసజాత, అనుచోటను, ఉపాధి భూతామ్ = ప్రాతిపదికము యొక్క అర్థమునకు విశేషణమైన, సంఖ్యామ్ = సంఖ్యను, ఆశ్రిత్య = అవలంబించి, పరిమాణమ్ = పరిమాణము, స్వభావతః = సహజముగ, భేదేన = భేదముతో, వర్తతే = ఉండును.

తాత్పర్యము— ''శౌర్పికమ్''. ఇది తద్ధితవృత్తి. ''శూర్పేణ క్రీతమ్'' అని వివరణము. అనగా ''ఒక చేటెడు వస్తువుతో (బియ్యముకాని మరేదైనగాని) కొనబడినది'' అని భావము. అట్లే ''మాసజాతః'' అన్నది సమాసవృత్తి. ''ఒక నెల వయసుగల బిడ్డ'' అని యర్థము. ఈ రెండు స్థలములందును ''ఒకటి'' అను ఏకత్వము తప్పక భాసించును. సామాన్యమైన అభేదైకత్వము భాసింపదు. అది ప్రయోగముయొక్క స్వభావము.

వివరణము— చేట, నెల, అనునవి పరిమాణములు. ''ఒక చేటెడు - ఒక నెల

వయస్సు'' అని ఏకత్వమును బోధించుటయే ఈ ప్రయోగములందలి తాత్పర్యము. అట్లుగాక సామాన్యముగ సంఖ్యను భావించినచో ''ఎన్ని చేటలైనను - ఎన్ని నెలలైనను కావచ్చును'' గాన ప్రయోగము యొక్క ఔచిత్యము పొడగును. (చెప్పదలచిన పరిమాణము విశదము కాదు). అందుచే ప్రాతిపదికమును పలుకగానే (శూర్ప, మాస) స్ఫురించు మొదటిదైన ఏకత్వ మొకటియే ఇట్టి స్థలములలో బోధపడుననుట సమంజసము.

**విశేష విషయములు**— వృత్తులందు ద్విత్వమును, బహుత్వమును నియతముగ ప్రకాశించు ప్రయోగములు కొన్ని పై కారికలలో చూపబడినవి. ఏకత్వము తప్పక స్ఫురించు ప్రయోగిములు ఇచట చూపబడినవి. కాగా ''అభేదైకత్వము''ను అంగీకరించినను ఆయా చోటులందు నిమిత్తవశమున, కావలసిన సంఖ్యా విశేషము తెలియుచునే యుండును. వ్యాకరణ సంప్రదాయము లన్నింటికిని ప్రయోగముల ప్రాభవమే మూలము. ॥125॥

*అవతారిక*— మీది శ్లోకము యొక్క అర్థమునే వివరింపుచున్నాడు.

**శ్లో॥ వయస్విని పరిచ్ఛేదః క్రీతేచాపి న గమ్యతే ।**
**ఇష్టో భేదాదృతే తత్ర పరిమాణమనర్థకమ్ ॥** 126

తత్ర = అచట, భేదాత్ = సంఖ్యావిశేషమును (ఏకత్వమును), ఋతే = విడిచినచో, వయస్విని = వయస్సుగల వ్యక్తియందును, క్రీతే + చ + అపి = కొనబడిన వస్తువునందును, ఇష్టః = అభిమతమైన. పరిచ్ఛేదః = నియతమైన కొలత, న + గమ్యతే = తెలియబడదు, (కాగా) పరిమాణమ్ = పరిమాణమును చెప్పు శబ్దము, అనర్థకమ్ = అర్థములేనిదగును.

**తాత్పర్యము**— మీది ప్రయోగములలో (శౌర్పిక, మాసజాత) ''ఒకటి'' అను విశేషసంఖ్యను స్వీకరించనియెడల, వ్యక్తియొక్క వయసునుగాని కొనబడిన వస్తువుయొక్క వెలనుగాని నొక్కి చెప్పుటకు వీలుండదు. అట్లయినపుడు శూర్ప, మాస, అను పరిమాణమును బోధించు శబ్దములను వాడుటయే వ్యర్థమగును (సంఖ్యానియమము తెలియనపుడు వాడినందు వలన వచ్చు లాభమేమి ?). అందువలన ఆ స్థలములలోని పరిమాణశబ్దములు ఏకత్వమును మాత్రమే బోధించునని చెప్పక తప్పదు. ॥126॥

*అవతారిక*— అందువలననే—

**శ్లో॥ భిన్నస్యాభేదవచనాత్ ప్రస్థాదిభ్యః శసోవిధిః ।**
**తద్ధర్మత్వాదభేదాత్తు ఘటాదిభ్యో న దృశ్యతే ॥** 127

భిన్నస్య = వేరుగాఉన్న వానియొక్క, అభేదవచనాత్ = అభేదమును చెప్పుటవలనను, తద్ధర్మత్వాత్ = అది వాని స్వభావమగుట వలనను, ప్రస్థాదిభ్యః = ప్రస్థ, మొదలగు పరిమాణ వాచకములకు, శసః = శస్ ప్రత్యయమును, విధిః = విధించుట, (జరిగినది), అభేదాత్ + తు = భేదము లేనందువలననే, ఘటాదిభ్యః = ఘట, మొదలగు జాతివాచకములకు, న + దృశ్యతే = కనబడదు (శస్ ప్రత్యయము కనబడదు).

తాత్పర్యము—— "ప్రస్థశః" (ప్రస్థమ్ - ప్రస్థమ్) ఇది తద్ధితవృత్తి. ప్రస్థమనగా ఒక పరిమాణము. (కొలపాత్ర = మానిక –లేక– అడ్డ అనవచ్చును). ప్రస్థ, శబ్దమునకు శస్, అను ప్రత్యయము చేరినది. ఇది "వీప్స" అను అర్థమున ప్రవర్తించినది. వీప్స, అనగా "ఉన్న వ్యక్తులలో ప్రతియొక వ్యక్తికిని అనుకొన్న పనిని సంబంధింపజేయుట." కాగా "ప్రస్థశః – తండులాన్ - దదాతి" అని ప్రయోగించినపుడు, "ఒక్కొక అడ్డెడు బియ్యమును ఒక్కొకి వ్యక్తికిని ఇచ్చుచున్నాడు" అని యర్థము వచ్చును.

పరిమాణశబ్దములు ఎల్లపుడును ఏకత్వమునే బోధించును. అది వాని స్వభావము. అనగా ప్రస్థములు వేర్వేరుగా ఎన్ని యున్నను "ప్రస్థ" అని పలుకగానే "ఒక ప్రస్థమే" అనియే తెలియును (రెండు, మూడు, మొదలగు భావనయే కలుగదు). కావున "ప్రస్థశః" మొదలగు ప్రయోగములలో "ఒక్కొక అడ్డెడు" అని ఏకత్వమే భాసించును. అభేదైకత్వ మిచట పనికిరాదు.

కాని "ఘట" మొదలగు శబ్దములకు ఈ విధముగ శస్ ప్రత్యయము రాదు. ఘట, పట, మొదలగునవి జాతివాచకములు. అవి నియతముగ ఏకత్వమును చెప్పజాలవు. (ఎన్నింటినైనను చెప్పగలవు). "ఘటశః" అని యన్నచో అభేదైకత్వము పనిచేసి, "ఎన్ని ఘటములయినను" అన్నట్లు - సర్వభేదములను తనలో ఇమిడ్చికొను సామాన్యమైన సంఖ్యయే స్ఫురించును.

వివరణము—— "సంఖ్యైకవచనాచ్చ వీప్సాయామ్" (5-3-43) అనునది శస్ ప్రత్యయమును విధించు సూత్రము. "సంఖ్యావాచకమునకును, ఏకత్వమును బోధించు పరిమాణవాచకమునకును వీప్సయందు శస్ ప్రత్యయమగును" అని యర్థము. ఉదా : ద్విశః. (సంఖ్య = ద్వౌ – ద్వౌ – దదాతి). ప్రస్థశః. (పరిమాణము = ప్రస్థమ్ - ప్రస్థమ్ - దదాతి).

ఇచటి సారమిది—— అభేదైకత్వ సంఖ్య అన్నది సకల సంఖ్యలయొక్కయు సంబంధరూపమనియు, వృత్తులలో అది సామాన్యముగ భాసించుననియును వివరింపబడినది. అయినను శబ్ద శక్తులును, ప్రయోగస్వభావములును అతివిచిత్రములు. తదనుసారము వృత్తి యందు కూడ కొన్నిచోట్ల ఆ యా సంఖ్యావిశేషములు స్ఫురించును. మరికొన్నిచోట్ల సంఖ్యా సామాన్యమే అనుభూతమగును. "ఇది ఇట్లే" అని నొక్కిచెప్పుట సాధ్యము కాదు. అందు వలన సూత్రమునుగాని వార్తికమునుగాని భాష్యమునుగాని - వేరొక వ్యాకరణ సంప్రదాయ మునుగాని ప్రయోగములను బట్టియే సమన్వయించుకొనవలయును. ప్రయోగమునకు శాస్త్రము లొంగవలసినదేగాని శాస్త్రమునకు ప్రయోగము లొంగుట సంభవింపదు. ఇదియే భాష యొక్కయు వ్యాకరణము యొక్కయు రహస్యము.

అభేదైకత్వము విషయమున బయలుదేరిన శంకలకు ఈ విధముగ సమాధానములు చూపబడినవి. ॥127॥

*అవతారిక*—— "సంఖ్యాభేదము లన్నియును తొలగుటయే అభేదైకత్వము" అను

పక్షము కూడ ఉన్నది. ''తద్రూపేఽవయవే వృత్తౌ సంఖ్యాభేదో నివర్తతే'' (98 వ కారిక) అను వచనము ఈ పక్షమును తెలుపును. దీని నవలంబించినను విరోధములను పోగొట్టవచ్చు నని చూపుటకు ప్రారంభింపుచున్నాడు.

శ్లో॥ శ్రూయతేవచనం యత్రభావస్తత్ర విశిష్యతే।
నివర్తతేయద్వచనం తస్యభావో న విద్యతే॥ 128

యత్ర = ఎచట, వచనమ్ = ఏకవచనము, ద్వివచనము, మొదలగునది, శ్రూయతే = వినబడునో, తత్ర = అచట, భావః = సంఖ్య అనెడి ధర్మము, విశిష్యతే = వేరుచేయబడును, యత్ = ఏ, వచనమ్ = వచనము, నివర్తతే = పోవునో, తస్య = దానియొక్క, భావః = సంఖ్య, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— వాక్యమందు ఏకవచనము, ద్వివచనము మొదలగు వచనములు వినబడును. కాన అవి బోధించు ఒకటి, రెండు, మొదలగు సంఖ్యలు కూడ స్పష్టముగ నుండును. వృత్తియందు వచనములు తొలగిపోవును. కావుననే ఆ యా సంఖ్యలును నివర్తించును. (ఇట్లు సంఖ్యావిశేషములు పోవుటయే అభేదైకత్వమనబడును). ॥128॥

అవతారిక— వృత్తియందు విభక్తి ప్రత్యయములు (సు - ఔ - జస్, మొదలగునవి) లేకుండుట సహజము. అయినను ప్రత్యయ లక్షణము సిద్ధించుటకై విభక్తులున్నట్లు చూపించుటయు, వానికి లుక్కును చెప్పుటయును జరుగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ కార్యం సత్తాశ్రయం శాస్త్రాదప్రవృత్తి రదర్శనమ్।
వాక్యే దృష్టంయదత్యంతమభావస్తస్య వృత్తిషు॥ 129

అప్రవృత్తిః = విభక్తులు పుట్టకుండుటయే, అదర్శనమ్ = ఉండవలసినది కనబడకుండుట —లేక— లోపము, (భవతి = అగును), సత్తాశ్రయమ్ = విభక్తి ప్రత్యయముయొక్క ఉనికిని ఆశ్రయించు, కార్యమ్ = కార్యము, శాస్త్రాత్ = శాస్త్రమువలన, (భవతి = అగును), వాక్యే = వాక్యమందు, యత్ = ఏది, దృష్టమ్ = చూపబడినదో, తస్య = దానికి, వృత్తిషు = వృత్తులందు, అత్యంతమ్ = పూర్తిగా, అభావః = లేకుండుట, (భవతి = జరుగును).

తాత్పర్యము— తమ తమ యర్థముల ఆవశ్యకత లేనందున ఆ యా విభక్తి ప్రత్యయములు వృత్తియందు పుట్టనే పుట్టవు. అయితే శాస్త్రీయములగు కొన్ని కార్యములు ప్రవర్తించుటకై, (తవక, మమక, మొదలగు ఆదేశములు ఏకవచనము పరమగునపుడు విధింపబడినవి) ప్రత్యయములు పుట్టినట్లును అవి లోపించినట్లును చూపబడును. పిదప ప్రత్యయ లక్షణము నాశ్రయించి (ప్రత్యయము లోపించినను తన్నిమిత్తమైన కార్యము వచ్చుట) ఆయా కార్యములను చేయుదురు.

వాస్తవమున వాక్యము వేరు - వృత్తి వేరు. కావున వాక్యధర్మము లేవియును

వృత్తియందుండవు. అందుచే వృత్తియందు సంఖ్యాభేదమును బోధించు విభక్తులు ఉండవను టయే సముచితము.

*వివరణము*— "సుపోధాతు ప్రాతిపదికయోః" (2-4-71) అను సూత్రము వృత్తియందలి సుప్ ప్రత్యయములకు లుక్కును చెప్పును. (దీని యర్థ మిదివరకు విశదీక రింపబడినది - 106, 121, శ్లోకములు). "ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్" (1-1-62) అను సూత్రము "ప్రత్యయము లోపించినను అది యుండగా వచ్చు కార్యము రావచ్చును" అని చెప్పును. (ఇదియు వెనుక వ్యాఖ్యాతము. 121 వ శ్లోకము).

వృత్తియందు విభక్తులు పుట్టి లోపించుట కేవలము శాస్త్రీయమైన కల్పనమనియు, అసలు విభక్తులు పుట్టకుండుటయే సహజమైన స్థితియనియును ఇచటి సారాంశము. ॥129॥

*అవతారిక*— వృత్తియందు సుప్ ప్రత్యయములు పుట్టవన్నచో, ఏకవచనము, ద్వివచనము, మొదలగునవి అచట లేవనియే ఫలించును. అయినపుడు ప్రత్యయలక్షణము నవలంబించినను ఆయా కార్యము లెట్లు ప్రవర్తించును? - అను శంకకు బదులు చెప్పు చున్నాడు.

**శ్లో॥ సంజ్ఞావిషయభేదార్థం ప్రసక్తాదర్శనం స్మృతమ్ ।**
**శ్రూయమాణం తు వచనం విశిష్టముపలభ్యతే ॥ 130**

సంజ్ఞావిషయభేదార్థమ్ = "లోపము" అను సంజ్ఞయొక్క విషయమును వేరుచేయుటకై, ప్రసక్తాదర్శనమ్ = ఉండవలసిన దానియొక్క అదర్శనము, స్మృతమ్ = చెప్పబడినది, శ్రూయమాణమ్ = వినబడు, వచనమ్ = తు = వచనమైతే, విశిష్టమ్ = పూర్తిగా, ఉపలభ్యతే = స్వీకరింపబడును.

*తాత్పర్యము*— లోపసంజ్ఞయొక్క విషయమును స్పష్టపరచుటకు "ఒకచో తప్పక ఉండవలసినది (ప్రత్యయము మొదలగునది) కనబడకుండుటయే లోపమని" లక్షణము బయలుదేరినది. అందుచే లోపమనిగాని "లుక్కు" అనిగాని అనగానే ఒకానొక ప్రత్యయ మచట ఉండక తప్పదని ఊహింపదగును. కాగా వాక్యమందు విభక్తి ప్రత్యయములు (వచన ములు) వినబడును. వాక్యముతో సమానమైన ప్రక్రియావాక్యమొకటి వృత్తియందును కల్పింప బడును. వాక్యమందువలెనే ఇచటగూడ వచనములనుసరించును. వృత్తియందు సాక్షాత్తుగ వచనములుండవు. అయినను ముందున్న ప్రక్రియావాక్యమునుబట్టి "ఉన్నట్లు" అనుమానింప వచ్చును. ఈ తీరు ననుసరించియే ప్రత్యయలక్షణమున్ను ఆయా కార్యములు ప్రవర్తించుట యును కుదురును.

వివరణము— "అదర్శనం లోపః" (8-1-60) అన్నది లోపసంజ్ఞను వివరిం చిన సూత్రము. "అదర్శనము" అనగా కనబడకుండుట. తాను ఉండదగినచోట కనబడు టయు, లేనిచోట కనబడకుండుటయు ప్రతియొక దానికిని సహజమే. అందుచే అదర్శనమని

సామాన్యముగా అన్నచో అన్నింటికిని ''లోప'' సంజ్ఞ రావలసి వచ్చును (ఎప్పుడో ఒకప్పుడు ప్రతియొకటియు కనబడదు). ఈ దోషమును వారించుటకు ''ప్రసక్తమైన దానియొక్క'' - అనగా - తప్పక ఉండవలసిన దానియొక్క - అదర్శనమే లోపమని వ్యాఖ్యానించిరి.

ప్రత్యయమునకు జరిగిన లోపమును లుక్, శ్లు, లుప్, అను పదములలో ఏదో ఒక పదముతో బోధింతురు. (ప్రత్యయస్య లుక్ శ్లు లుపః (1-1-61) వృత్తియందలి సుప్ ప్రత్యయములకు లుక్కు ప్రవర్తించును.

కాగా ప్రకృతము - వృత్తియందు వచనములకు (సుప్పులకు) లుక్కు అన్నందు వలన ఆ ప్రత్యయము లచట ఉన్నట్లు అనుమానింపవలెను. వాస్తవముగ అవి యచట లేనందున, అవి యుండుటకు తగిన ఒక ప్రక్రియా వాక్యమును కల్పింపవలెను. అది వృత్తికి పూర్వావస్థ. అట్టి కల్పనకు మూలము సహజమైన వాక్యము. ప్రతియొక వృత్తియందును ఇదియే తీరు.

వాక్యమందును ప్రక్రియావాక్యమందును వచనములు పూర్తిగా వినబడును. కావున ఆవశ్యకతను బట్టి ఆ వచనముల నాశ్రయించిన కార్యములు ఆయా చోటులందు ప్రవర్తించును. వృత్తియందుకూడ ప్రక్రియావాక్యమును బట్టి, ఆయా వచనములున్నట్లు ఊహించి కార్యములను ప్రవర్తింపజేయనగును. అందువలన ''ప్రత్యయ లక్షణము'' అను పద్ధతికి వృత్తియందెట్టి ఆక్షేపమును లేదు.

విశేష విషయములు— సంఖ్యాభేదములన్నియు ఇమిడియున్నట్టిదియు, సకల సంఖ్యలయొక్క సంబంధరూపమైనట్టిదియును అభేదైకత్వ సంఖ్యయని మొదటి మతము. అందు వృత్తియందు ప్రవర్తించు ఆదేశాదులచే, (తావక, అనుచోట ''తవక'' అను ఆదేశము కావలసిన సంఖ్య తెలియుచుండునని వెనుక చూపబడినది.

ఉన్న సంఖ్యలన్నియు తొలగుటయే అభేదైకత్వమని రెండవ మతము. ఈ మతమున ఆదేశాదులచే ప్రత్యయ లక్షణమును దానివలన ప్రక్రియా వాక్యమును ఊహించి, అందున్న సంఖ్యను వృత్తియందును చెప్పవచ్చునని ఇచట విశదీకరింపబడినది. ॥130॥

అవతారిక— మీది కారిక చూపిన సమాధానములో దోషమున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ అభావో వా లుకో యత్ర రూపవాన్ వా విధీయతే ।**
**వ్యభిచారాన్నిమిత్తస్య తత్రాసాధుః ప్రసజ్యతే ॥** 131

యత్ర = ఎచట, లుకః = లుక్కుయొక్క, అభావః + వా = లేకుండుటగాని, రూపవాన్ + వా = నియతమైన స్వరూపముగల ఆదేశముగాని, విధీయతే = విధింపబడునో, తత్ర = అచట, నిమిత్తస్య = నిమిత్తముయొక్క, వ్యభిచారాత్ = లేకుండుటవలన, అసాధుః = అసాధువైన ప్రయోగము, ప్రసజ్యతే = కావలసి వచ్చును (ప్రాప్తించెడిని).

తాత్పర్యము— సంఖ్యాభేదములు తొలగుటయే (భేదాపోహము = భేదములు పోవుట) అభేదైకత్వమను పక్షమున, సుప్పులకు లుక్కురాని వృత్తియందును (స్తోకాన్ముక్తః) ఏకత్వమున విధింపబడిన ఆదేశములుగల వృత్తియందును (తావక, మొదలగునవి) దోషము కలుగును.

వివరణము— వాక్యదశలో ఉన్న సంఖ్యలు వృత్తిలో తొలగుటయే అభేదైకత్వమనియు, ఆవశ్యకమైనచోట ప్రక్రియా వాక్యమందలి సంఖ్యను వృత్తియందు గ్రహింపవీలగుననియును మీది కారిక విశదీకరించినది.

కాని ఇట్లు చెప్పినందువలన కొన్నిచోట్ల చిక్కులు వచ్చును. ఉదా: ''స్తోకాన్ముక్తః''. ఇచట పంచమికి ''అలుక్కు'' (లోపము రాకుండుట) విధింపబడెను. ''స్తోకాభ్యామ్ ముక్తః, స్తోకేభ్యో ముక్తః'' అను విగ్రహమున ద్వివచన బహువచనాంతములతో సమాసమే జరుగదనియు, ఆవశ్యకమైన యెడల ''స్తోకాన్ముక్తః'' అను దానివలననే ద్విత్వబహుత్వములు బోధపడుననియును వెనుక సూచింపబడినది (106 వ కారిక). అందువలన ద్వివచనములోను బహువచనముతోను ఉండు ప్రక్రియా వాక్యములు ''స్తోకాన్ముక్తః'' అను సమాసమునకు పూర్వావస్థలు కాజాలవు. అచటనున్న వచనములను సమాసమున తీసికొనివచ్చుట కుదురదు. కాగా ద్విత్వమందును బహుత్వమందును ''స్తోకాన్ముక్తః'' అను సమాసము అసాధువు కావలసి వచ్చును.

అట్లే ''తావకః'' అను తద్ధితవృత్తియందును దోషము కలిగెడిని. ఇచట ఏకవచనమున (సుప్ ప్రత్యయము కాదు. ఒక వస్తువును = ఒక వ్యక్తిని చెప్పునది) ''తవక'' అను నాదేశము విధింపబడెను. ఇది బోధించు ఏకత్వము వృత్తియందు తొలగిపోయినచో ''తావక'' అను దానివలన అభిమతమగు నర్థము (''నీకు చెందిన'' - అనునది) లభింపకపోవును. ॥131॥

*అవతారిక*— అభేదైకత్వము విషయమున బయలుదేరిన రెండు మతముల యొక్కయు పరమార్థమును చూపుచున్నాడు.

శ్లో॥ భేదః సంఖ్యావిశేషో వా వ్యాఖ్యాతో వృత్తివాక్యయోః ।
సర్వత్రైవ విశేషస్తు నావశ్యం తాదృశో భవేత్ ॥ 132

భేదః = సంఖ్యాభేదముగాని, సంఖ్యావిశేషః + వా = సంఖ్యావిశేషముగాని, వృత్తివాక్యయోః = వాక్యమందును వృత్తియందును, వ్యాఖ్యాతః = చెప్పబడెను, సర్వత్ర = అంతటను, విశేషః + తు = విశేషమైతే, ఆవశ్యమ్ = తప్పక, తాదృశః + ఏవ = అట్టిదే, న + భవేత్ = కానక్కరలేదు.

తాత్పర్యము— వాక్యమందు సంఖ్యాభేదము తెలియుననియు, వృత్తియందు అది తెలియక అభేదైకత్వము తెలియుననియును విశదీకరింపబడినది. కాని వృత్తియందుకూడ

కొన్నిచోట్ల సంఖ్యాభేదము సహజముగ స్ఫురించుచుండును. అంతమాత్రమున "వృత్తి వాక్యము వంటిదే" అని భావింపకూడదు.

వివరణము— "వాక్యము వేరు - వృత్తి వేరు" అని వృత్తివాక్యముల విభిన్న ధర్మములను విశదముచేయు సందర్భమున, "అభేదైకత్వ సంఖ్య" వృత్తియొక్క ధర్మమని భాష్యకారుడు చెప్పెను. దాని తీరు తెన్నులను సామాన్యముగా నిర్దేశించెను. అయినను "తావకః" (నీవాడు) "మాసజాతః" (ఒక నెలబిడ్డ) మొదలగు వృత్తులలో కూడ సంఖ్యా విశేషము స్పష్టమగుచునే యుండును. అంతమాత్రమున "వృత్తియందును వాక్యమందును సంఖ్యావిశేషము స్ఫురించుట సమానమే" అని అనరాదు. "రాజపురుషః" మొదలగు పెక్కు వృత్తులలో సంఖ్యాభేదమెన్నడును స్ఫురింపదు గదా!

విశేష విషయములు— అభేదైకత్వసంఖ్యకు నిర్దుష్టముగా లక్షణమును చెప్పుట మిక్కిలి కష్టము. భాషయొక్క స్వభావము ననుసరించి ప్రయోగములలో వైచిత్ర్యము లుండును. శబ్దశక్తులు విచిత్రములును అనంతములును గదా! అందుచే అభేదైకత్వమునకు లొంగని ప్రయోగములు కొన్ని యుండవచ్చును. అంతమాత్రమున ఆ ధర్మమునే త్రోసి పుచ్చ నక్కరలేదు.

ఏ లక్షణమైనను సామాన్యధర్మమునుబట్టియే బయలుదేరును. దానికి లోబడని విశేషములు కొన్ని ఎప్పుడును ఉండును. విశేషించి భాషయొక్క ధర్మములకు లక్షణమును చెప్పుట మరియు కష్టము. దేశము, కాలము, వ్యక్తి - వీనియొక్క పరిణామములచే భాష యందు ఎన్నో విచిత్రములు కనబడుచునే యుండును. కాగా ఎచటనైనను ప్రయోగములో కొద్ది వ్యభిచారము (లక్షణము కుదురకుండుట) సంభవించినను - దానినిబట్టి సామాన్య లక్షణ మును తిరస్కరింపకూడదు. ॥132॥

అవతారిక— సంఖ్యావిశేషమువలెనే లింగవిశేషము కూడ వృత్తులలో కొన్నిచోట్ల భాసింపదని చెప్పుచున్నాడు.

శ్లో॥ జాతేశ్చ భేదహేతుత్వాన్న లింగేన విశేష్యతే ।
ప్రధానం మృగదుగ్ధాదౌ గార్గీపుత్రే న స క్రమః ॥ 133

మృగదుగ్ధాదౌ = "మృగదుగ్ధమ్" మొదలగుచోట్ల, జాతేః = జాతి, భేదహేతుత్వాత్ + చ = భేదమునకు కారణమగుటవలన, ప్రధానమ్ = ముఖ్యమైనది, లింగేన = లింగముతో, న + విశేష్యతే = వేరుచేయబడదు, గార్గీపుత్రే = "గార్గీపుత్ర" అనుచోట, సః = ఆ, క్రమః = తీరు, న = లేదు.

తాత్పర్యము— "మృగదుగ్ధమ్" (లేడి పాలు). ఇచట "దుగ్ధ" శబ్దము ఉత్తర పదము. దాని యర్థమే ప్రధానము. దానిని విశేషించి చెప్పుటకై "మృగ" శబ్ద ముపయోగించును. అది జాతినిగాని (మృగత్వమను సామాన్యధర్మమును), వేరొక జాతిని వారించుటను

86 ]

"సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (1-2.64) అని పాణిని ఏకశేష సూత్రమును రచియించెను, విభక్తి ప్రత్యయము చేర్చునపుడు మార్పులేక ఒకే విధముగానున్న ప్రాతిపది కములలో ఒకటి మిగులును అని సూత్రార్థము. రెండు కడవలను తెమ్ము, అను అర్థమును బోధింపదలచిన, రెండు ఘట శబ్దములను ప్రయోగింపవలె. 'ఘటఘటౌ' అని, మూడు కడవలు అను చెప్పదలచిన అవి మూడు కనుక మూడు ఘటశబ్దములను 'ఘటఘట ఘటాన్' అని ప్రయోగింపవలెను. కాని భాషలో అట్టి ప్రయోగములు లేవు. ఘటౌ, ఘటాన్, అనియే ప్రయోగములు కానవచ్చును. ఆ ప్రయోగముల యుపపత్తికై పై సూత్ర మారంభింపబడినది. రెండు మూడు ఘటశబ్దములు ఏకరూపముగానే యున్నవి, అనగా ఒకే విధమగు వర్ణముల ప్రోగు కలవి, (ఘట-ఘట) రెంటికి ఇట్లే మూడింటికి వర్ణములలో మార్పులేదు, కనుక అచట ఏకశేష కలుగును, అనగా ఒకటి మిగులును, మిగిలినవి లోపించును. 10 ఘటములను లేక 100 ఘటములను బోధింపదలచినను ఒకే ఘటశబ్దము ప్రయోగింపబడి ఆ ఎల్ల అర్థములను బోధింపగలదు. ఇదియే ఆ సూత్రమునకు ప్రయోజనము.

ఈ సూత్రమున 'ఏకశేషః' అను పదము 'ఒకటి శేషించునది' అను అర్థమును బోధించుచున్నది. 'శేషః' అనుచోట ఏకవచనము ఏకత్వసంఖ్యను చెప్పుటచే దానిని వివక్షిం పగా, ఒకటి శేషించినది. అని యర్థము సిద్ధించుచుండగా మరల 'ఏక' అను శబ్దమును ప్రయోగింప నక్కరలేదు, ఈ రీతిగ 'ఏక' శబ్దము సూత్రమున లేకున్నను ఒకటి అను అర్థము లభించుచుండగా మరల 'ఏక' అను శబ్దమును ఉపయోగించుటచే పాణిని యొక్క అభిప్రాయమును ఈ రీతిగా ఊహింపవలసి యున్నది. "ఇచట ఏకత్వసంఖ్య వివక్షితము కాదు"– అట్లు కాకున్న ఆ శబ్దమును ప్రయోగించి యుండడుకదా ! .

'శిష్యతే అసౌ' అను రీతిని శేషశబ్దము కర్మ ప్రత్యయాంతము, మిగులునది, శేషము. ఏకశేషమనునది సంస్కారము కనుక అప్రధానము. శేషించినది సంస్కరింపబడు నది యగుటచే ప్రధానము. శేషించినది గ్రహమువంటిది, సంస్కారమగు ఏకశేషము సమ్మా ర్జనము వంటిది, కాగా ప్రధానమగుటచే 'గ్రహం సమ్మార్ష్టి' అనుచోట గ్రహమునందు ఏకత్వ సంఖ్య వివక్షితము కాలేదు, అట్లే శేషించినది ప్రధానము కనుక దానియందు ఏకత్వసంఖ్య వివక్షితము కానేరదు, అందుచే 'శేషః' అన్నంత మాత్రాన ఒకటి శేషించునది, అను అర్థము లభింపదు, ఆ యర్థమును సంపాదించుటకై పాణిని మరల సూత్రమున 'ఏక' శబ్దమును ప్రయోగించెను. 'ఏక' శబ్దమును ప్రయోగించుటను హేతువుగా జూపి పాణినికి ప్రధానమగు అర్థమునగల సంఖ్య వివక్షితము కాదు అను భావమున్నట్లు అనుమాన ప్రమాణముచే నిశ్చ యింప వచ్చును.

పై ప్రకారము ప్రధానమగు అర్థమున సంఖ్య వివక్షితము కాదు, అను భావము పాణినికి సమ్మతమని స్పష్టమగుటచే అప్రధానమగు అర్థమునగల సంఖ్య వివక్షితమగునని వేరుగ చెప్పనక్కర లేకుండగనే తెలియవచ్చుచున్నది.* ॥86॥

---

* పర్వతో వహ్నిమాన్, ధూమాత్, యథా మహానసః. ఈ యనుమాన ప్రమాణము ఎల్లరులకు తెలిసినదే. అట్లే "పాణినిః ప్రధానే సంఖ్యాన వివక్ష్యతే, ఇత్యాశయవాన్, సరూప సూత్రే ఏకశబ్ద గ్రహణాత్ యథా-గ్రహం సమ్మార్ష్టి అని అనుమానము చూపవచ్చును.

(మృగత్వముకన్న వేరయిన జాతి ఏదియు కాదనుభావమును) గాని, బోధించును. కావున పురుషుడు, స్త్రీ, మొదలగు లింగముయొక్క ప్రసక్తి యుండదు. ''మృగస్య దుగ్ధమ్'' అనియే విగ్రహమును చూపవలెను.

''గార్గీపుత్రః'' మొదలగు కొన్నిచోట్ల మాత్రము అప్రధానమైన శబ్దమునకు (గార్గీ) లింగ విశేషముతో సంబంధము తప్పక ఉండును.

వివరణము— దుగ్ధమును విశేషించుటయే (వేరుచేసి చూపుట మాత్రమే) ప్రయోజనమైనపుడు పూర్వపదము కేవలము జాతివాచకముగా ఉండుటయే సముచితము. లేదా— జాత్యంతరమును వారించునదియైనను అది కావచ్చును. అయినపుడు ''ఆడ, మగ'' మొదలగు లింగమును నొక్కి చెప్పనక్కరలేదు. లోకవ్యవహారమట్లే యున్నది. లింగమును నొక్కి చెప్పదలచినచో ''మృగ్యాః దుగ్ధమ్'' అని వ్యస్తప్రయోగమునేగాని సమాసమును వాడరాదు. ''కుక్కుటాండమ్'' (కోడిగ్రుడ్డు) ''ఛాగమాంసమ్'' (మేకమాంసము) మొదలగు ప్రయోగములలో కూడ ఇదియే తీరు.

అయితే లింగమును నొక్కి చెప్పినందువలన కొన్నిచోట్ల ఉత్తరపదము యొక్క అర్థమునకు ప్రశంసయో - నిందయో —లేక— వేరొక విశేషమో తెలియుచుండును. అట్టిచోట్ల పూర్వపదార్థమునకు లింగముకూడ విశేషణమగును. ఉదా : గార్గీపుత్రః, మొదలగునవి.

కాగా ''మృగదుగ్ధమ్'' మొదలగుచోట్ల పూర్వపదము సామాన్యముగా జాతినే బోధించుననియు, లింగ విశేషమును బోధింపదనియును సారాంశము.

## (7) ''విశేషణానాం చాజాతేః'' (1—2—52) అను సూత్రముయొక్క సమర్థనము

*అవతారిక*— వృత్తియందలి పూర్వపదము జాతిని బోధించునపుడు, సంఖ్యాభేదమువలెనే లింగభేదము కూడ సామాన్యముగా సమసిపోవును. కావుననే ''విశేషణానాం చాజాతే'' (1-2-52) అను సూత్రమును ఆరంభింపవలసి వచ్చినదని చెప్పుచున్నాడు.

శ్లో॥ అభేదే లింగసంఖ్యాభ్యాం యోగాచ్ఛుక్లం పటా ఇతి ।
ప్రసక్తే శాస్త్రమారబ్ధం సిద్ధయే లింగసంఖ్యయోః ॥ 134

అభేదే = భేదము లేనపుడు, లింగసంఖ్యాభ్యామ్ = లింగముతోను, సంఖ్యతోను, యోగాత్ = సంబంధమువలన, శుక్లమ్ - పటాః + ఇతి = ''శుక్లమ్ - పటాః'' అను ప్రయోగము, ప్రసక్తే = ప్రాప్తమగుచుండగా, లింగసంఖ్యయోః = లింగసంఖ్యల యొక్క, సిద్ధయే = సిద్ధికై, శాస్త్రమ్ = సూత్రము, ఆరబ్ధమ్ = ప్రారంభింపబడెను.

తాత్పర్యము— లింగముయొక్కయు సంఖ్యయొక్కయును భేదము తెలియనపుడు సామాన్యమైన లింగసంఖ్యల సంబంధము ననుసరించి, ''శుక్లమ్ పటాః'' అను రీతిని ప్రయో

గము కానున్నది. దానిని వారించి ''శుక్లాః పటాః'' అను అభిమతమైన ప్రయోగము సిద్ధించుటకై ''విశేషణానాం చాజాతేః'' అను సూత్ర మారంభింపబడెను.

వివరణము— (1) ''తద్ధిత ప్రత్యయమునకు లుప్పు (లోపము) జరిగినపుడు, ఆ ప్రత్యయముచే బోధింపబడు అర్థమునకు విశేషణముగా నుండు అర్థమును చెప్పు శబ్దము విషయమున, ప్రకృతికివలెనే (ప్రత్యయముయొక్క ప్రకృతికి) లింగమును సంఖ్యయును అగును. అట్టి విశేషణము జాతివాచకమైనచో ఈ తీరు వర్తింపదు'' అని పై సూత్రము యొక్క అర్థము. ఉదా : "పంచాలాః రమణీయాః". ఇచట "పంచాలానాం నివాసః" అను నర్థమున అణ్ ప్రత్యయము వచ్చుటయు అది లోపించుటయు జరిగెను. పిదప "లుపి యుక్తవద్వ్యక్తి వచనే" (1-2-51 ఇది 110 వ కారికలో వివరింపబడినది) అను సూత్రము వలన యుక్తవద్భావము కలిగి "పంచాలాః" అని పుంలింగమును బహువచనమును సిద్ధించినవి. (లేనియెడల ప్రత్యయముయొక్క అర్థము "నివాసః" నివాసము. అది ఒకటియేకాన ఏకవచనము ఉండవలయును.) పంచాలాః, అను దానికి "రమణీయ" శబ్దము విశేషణము. కాగా ప్రకృత సూత్రముచే ఇచట కూడ ప్రత్యయ ప్రకృతియొక్క లింగసంఖ్యలే అను వర్తించినవి. (రమణీయాః) "పంచాలాః జనపదః" అన్నది ప్రత్యుదాహరణము. ఇచట జనపదశబ్దము జాతివాచకమైనందున (జనపదః = ప్రదేశము. జనపదత్వము జాతియగును) ప్రకృతియొక్క లింగసంఖ్యలు సంబంధింపవు. ఇది "విశేషణానాం చాజాతే" అను సూత్రముయొక్క వాస్తవస్వరూపము.

(2) అయితే ''పంచాలాః రమణీయాః'' మొదలగుచోటు లన్నింటియందును విశేషణ విశేష్యములకు సామానాధికరణ్యము (ఒకే అర్థమును బోధించుట) ఉండునుగాన, ''లుపియుక్తవత్'' మొదలగు సూత్రముచేతనే యుక్తవద్భావము సిద్ధించునని భావించి ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రమును భాష్యకారుడు త్రోసిపుచ్చెను.

(3) అయినను గుణవచనముల విషయమున (శుక్ల, కృష్ణ, మొదలగునవి) అభిమతమైన లింగ సంఖ్యలను సాధించుట కీ సూత్ర ముపయోగించునని భాష్యకారుడే తుదకు సమర్థించెను. అనగా ''గుణవచనానామాశ్రయతో లింగవచనాని'' అను సంప్రదాయ సిద్ధమైన వచనమునకు మారుగా ''విశేషణానామ్'' ఇత్యాది సూత్ర ముపయోగించునని అతని యాశయము.

(4) గుణవచనము లనగా సామాన్యముగా రంగులను చెప్పు శబ్దములు. రంగులకు ఆధారమైన ద్రవ్యములు ఆశ్రయములనబడును. అట్టి ద్రవ్యములను చెప్పు శబ్దములయొక్క లింగ సంఖ్యలే గుణవాచకములకును అగునని పై వచనముయొక్క తాత్పర్యము. ఉదా : ''శుక్లః పటః, శుక్లౌ పటౌ, శుక్లాః పటాః'' మొదలగునవి. ఈ ప్రయోజనమును ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రము సాధించునని భాష్యకారుడు భావించెను.

(5) గుణవచనముల విషయమున కూడ ఒక చిత్రమున్నది. అవి ఆశ్రయమైన

ద్రవ్యమును సూటిగా తెలుపజాలవు. దానిని తెలుపుటకు ''మతుప్'' అను తద్ధితమును (''అది గలది'' అను నర్థమున) గుణవచనములకు చేర్పవలెను. పిదప ''గుణవచనేభ్యో మతుపోలుగిష్టః'' (గుణవచనములకు పరమైన మతుప్పు లోపించును) అను వచనముచే ప్రత్యయము లోపించును. ప్రకృత సూత్రమువలన ఆశ్రయము యొక్క లింగవచనములు సిద్ధించును.

(6) ఇట్టి పూర్వరంగము తెలిసిననేగాని ఈ కారికయొక్క ఆశయము విశదము కాదు. ఇపుడు దీనినిట్లు వివరించుకొనవచ్చును.

వ్యాకరణము పదములనే సంస్కరించునను పక్షమున తొలుత శుక్ల శబ్దము కేవలము తన యర్థమునే బోధించునదియై, సామాన్యమైన నపుంసకలింగమును సామాన్యమైన ఏకత్వ సంఖ్యను పొందును. ''శుక్లమ్'' అని ఏర్పడును. పిదప వాక్యావస్థను చూపదలచి ''పటః'' అని విశేష్యమైన పదమును ప్రయోగించినను, తొలుత జరిగిన పదముయొక్క సంస్కారము తొలగిపోవుట సముచితము కానందున (అది అంతరంగము - అనగా ముందుగా జరిగినది) ''శుక్లం పటః'' అని ప్రయోగము ప్రాప్తించుచున్నది. దానిని వారించి విశేష్యాను సారముగా లింగ సంఖ్యలుండునని బోధించుటకు ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రము బయలుదేరెను.

విశేష విషయములు— వాక్యావస్థను తీసికొనక పదములను మాత్రమే వేర్వేరుగా గ్రహించి. ఏ పదమున కా పదమునకే వ్యాకరణ కార్యములను చేసి విడుచుటను పద సంస్కార పక్షమందురు. ఈ పక్షమందు వేరొక పదముతో సంపర్కముండదుగాన, ప్రతి యొక పదమును తన యర్థమును మాత్రమే సామాన్యరీతిని బోధించును. లింగ విశేషము తెలియనపుడు నపుంసకమును, సంఖ్యాభేదము తెలియనపుడు ఏకత్వమును వచ్చుననుట సంప్రదాయము. అట్టి నపుంసకమును లింగ సర్వనామమనియు అట్టి ఏకత్వ సంఖ్యను సంఖ్యా సర్వనామమనియు వాడుట గలదు. ఈ సంస్కారము అంతరంగము. దీని తరువాత పదమునకు వేరొక పదముతో సంబంధమును చూపి విశేషార్థమును బోధించు వాక్యదశను ఏర్పరచినను, అంతరంగమైన పదసంస్కారము నశింపదనుట ఒక విధమైన శాస్త్రీయ భావన.

''గుణే శుక్లాదయః పుంసి గుణిలింగాస్తు తద్వతి'' (శుక్ల, మొదలగునవి గుణమును చెప్పినచో పుంలింగములు గుణముగల దానిని చెప్పినచో విశేష్య నిఘ్నములు - అనగా విశేష్యము యొక్క లింగమును పొందును) అను వచనముతో అమరసింహుడు ఇంచుమించు ఈ కారికయొక్క భావమును విశదీకరించెను. ॥134॥

*అవతారిక*— సామాన్యముగా ఎట్టి విశేషణమునైనను బోధించు ''విశేషణమ్'' అను పదముచే గుణవాచకమును మాత్రమే (శుక్ల, కృష్ణ, మొదలగునది) గ్రహించుట ఎట్లు? అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

శ్లో॥ పరార్థం శేషభావం యో వృత్తిషు ప్రతిపద్యతే ।
గుణో విశేషణత్వేన స సూత్రే వ్యపదిశ్యతే ॥ 135

యః = ఏ, గుణః = గుణము, పరార్థమ్ = ఇతరముకొరకు, శేషభావమ్ = ఆధారపడి యుండుటను, వృత్తిషు = వృత్తులలో, ప్రతిపద్యతే = పొందునో, సః = ఆ గుణము, విశేషణత్వేన = విశేషణముగా, సూత్రే = సూత్రమందు, వ్యపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— తద్ధితవృత్తియందు తన పారతంత్ర్యమును, ద్రవ్యముయొక్క స్వాతంత్ర్యమును ఏ గుణము బోధించునో అదియే విశేషణమని గ్రహింపవలెను. ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రమందలి విశేషణ శబ్దమునకు తాత్పర్యమిదియే.

వివరణము— ద్రవ్యమును బోధించునపుడు శుక్ల, మొదలగు గుణవాచకములకు ''మతుప్'' ప్రత్యయము (శుక్లః - అస్య - అస్తి = తెలుపు దీనికి గలదు = శుక్లమత్) చేరుటయు అది లోపించుటయు సహజము. అట్లు జరిగినపుడే అవి విశేష్యమైన ద్రవ్యమును బోధింపగలవు. అందువలన ఇచట విశేషణమనగా ''ద్రవ్యముపై ఆధారపడు గుణము'' అను భావమును తీసికొనవలెను.

విశేష విషయములు— వ్యావర్తకము, భేదకము (వేరుచేయునది) మొదలైన అర్థములను ఇచటి విశేషణ పదమునకు చెప్పకూడదు. కేవలము ''పరతంత్రము'' అను నర్థమునే చెప్పవలెను. కాగా ''గుణమ్ + ఉక్తవాన్'' = గుణమును చెప్పనది=గుణవచనము అని చెప్పి, శుక్ల, మొదలగు శబ్దమునే ఇచట విశేషణముగా గ్రహింపవలెను. ॥135॥

*అవతారిక*— ''వ్యాకరణముచేయు సంస్కారము వాక్యమునకే'' అను పక్షమున వాక్యమందలి పదముల పరస్పర సంబంధమువలననే ''శుక్లః - గుణః - అస్య - పటస్య' (ఈ బట్ట రంగు తెలుపు) అను రీతిని గుణవచనములకు నియతమైన లింగమును సంఖ్యయును తెలియుచుండును. అయినపుడు ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రమెందులకు ? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ శబ్దాంతరత్వాద్వాక్యేషు విశేషాద్యపి శ్రుతాః ।
వృత్తేరభిన్నరూపత్వాత్తేషు వృత్తిర్నవిద్యతే ॥ 136

యద్యపి = ఆలోచింపగా, వాక్యేషు = వాక్యములందు, శబ్దాంతరత్వాత్ = వేరు శబ్దములగుట వలన, విశేషాః = ఆ యా లింగ సంఖ్యాభేదములు, శ్రుతాః = వినబడును, (తథాపి = అట్లయినను) వృత్తేః = వృత్తి, అభిన్నరూపత్వాత్ = ఏకరూపమగుటవలన, తేషు = ఆ విశేషములందు, వృత్తిః = వృత్తి, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— ''వాక్యమందలి శబ్దములు వేరు. వృత్తియందలి శబ్దములు వేరు'' అని ఇదివరకు పెక్కుసారులు చెప్పబడినది. కాగా - ''శుక్లః - గుణః - అస్య - పటస్య''

అను వాక్యమందు లింగ సంఖ్యల విశేషములు స్పష్టముగ తెలిసినను, శుక్ల, అను గుణవచనమునకు "మతుప్" అను తద్ధితమును చేసి తద్ధితవృత్తిని సంపాదింపదలచినపుడు మాత్రము ఆ విశేషములు తెలియవు. ఇట్టి చోటులందు వృత్తివిషయమున సామాన్యము (లింగ సామాన్యము - సంఖ్యాసామాన్యము) భాసించుటయే సహజము. అందుచే వృత్తియందు విశేషములు తెలియుటకై "విశేషణానామ్" మొదలగు సూత్ర మావశ్యకము.

*వివరణము*— ఉన్నదున్నట్లుగ వాక్యమునే తీసికొని అందలి పదములకు ఆవశ్యకమైన సంస్కారములను చూపుటను వాక్యసంస్కార పక్షమందురు. ఇందు పదములును పదార్థములును పరస్పరము కలిసియుండునుగాన ఆ యా లింగములును, సంఖ్యలును స్పష్టముగ తెలియుట కవకాశమున్నది. అయినను వృత్తి పదముల విషయము వేరు. వాక్యమునకును వృత్తికిని ఎట్టి పోలికలును లేవు. అది (వృత్తి) ఎల్లపుడును ఒకే తీరులో నుండును. వాక్యమందొక భాగముగా ఉన్నను దాని స్వభావము మారదు. అందుచే గుణవచనములకు చెందిన తద్ధితవృత్తియందు వెనుక చూపిన రీతిని సామాన్యమే స్ఫురించునుగాని విశేషములు స్ఫురింపవు. ఆ విశేషములను సాధించుటయే "విశేషణానామ్" అను సూత్రము చేయుపని.
॥136॥

అవతారిక— వృత్తియందు సామాన్యమే ప్రకాశించినను, అది ఏదోయొక విశేషము నాశ్రయించియే ప్రకాశించుట తప్పదు. ఎట్టి విశేషమునులేని సామాన్యమన్నది ఉండదు అందుచే గుణవచనముల విషయమున సామాన్యముతోపాటు నియతమైన విశేషము కూడ తెలియుచుండుననుటయే సముచితము. దానివలన లింగసంఖ్యలు తెలియును. లేదా– "శుక్లం పటాః" మొదలగు ప్రయోగములలో, సమన్వయము కుదురదుగాన, అన్వయింపబోవు విశేష్యము యొక్క లింగసంఖ్యలను వృత్తిపదము ముందుగనే ఆశించి నిరీక్షించుచుండుననుటయు, పిదప (విశేష్యము తెలియగానే) ఆ లింగసంఖ్యలనే తాను స్వీకరించుననుటయును సమంజసము. వాస్తవమున విశేష్యముతోడి సంబంధము బహిరంగము. (అనగా తరువాత జరుగునది). అయినను సమన్వయము కుదురుటకై ఇట్లు చెప్పక తప్పదు. లేకున్నచో ముందుగలేని విశేషములను "విశేషణానామ్" మొదలగు సూత్రము మాత్రమెట్లు సాధింపగలదు? - కాగా ఎట్లు చెప్పినను సూత్రము నిష్ఫలమని తోచును. అను వాదమునకు రెండు కారికలతో సమాధానము చూపుచున్నాడు.

శ్లో॥ రూపాచ్చ శబ్దసంస్కారః సామాన్యవిషయో యతః ।
తస్మాత్తదాశ్రయం లింగం వచనం చ ప్రసజ్యతే ॥ 137

శ్లో॥ సలింగంచ ససంఖ్యంచ తతో ద్రవ్యాభిధాయినా ।
సంబధ్యతే పదం తత్ర తయోర్భిన్నా శ్రుతిర్భవేత్ ॥ 138

యతః = ఎందువలన, రూపాత్ = స్వరూపమును బట్టి, శబ్దసంస్కారః = శబ్దమునకు జరుగు వ్యాకరణకార్యము, సామాన్యవిషయః = సామాన్యమే విషయముగా గలది, (భవతి=

అగునో), తస్మాత్ = అందువలన, తదాశ్రయమ్ = సామాన్యము నాశ్రయించిన, లింగమ్ = లింగమును, వచనమ్ + చ = సంఖ్యయు, ప్రసజ్యతే = ప్రాప్తించును.

తతః = తరువాత, సలింగమ్ + చ = అట్టి లింగముతో కూడినట్టియు, ససంఖ్యమ్ + చ = సంఖ్యతో కూడినట్టి, పదమ్ = వృత్తిపదము, ద్రవ్యాభిధాయినా = ద్రవ్యమును చెప్పు పదముతో, సంబధ్యతే = కలియును, తత్ర = అచట, తయోః = ఆ రెండు పదములందును, భిన్నా = వేరయిన, శ్రుతిః = లింగసంఖ్యలు వినబడుట, భవేత్ = అయ్యేడిని.

తాత్పర్యము— వృత్తిపద మెల్లప్పుడును ఒకే స్వరూపముతో ఉండును. దానిని బట్టియే సంస్కారము జరుగుట సముచితము. శుక్ల మొదలగు గుణవచనములకు "మతుప్" అను తద్ధిత సంస్కారమును చేయునపుడు, "శుక్లః - అస్య - అస్తి" అను రీతిని సామాన్యమే (తెలుపుగలది = ఏ వస్తువైనను - అను భావము) ఉపస్థితమగును. తదనుసారము సామాన్య నపుంసకమును సామాన్యమగు ఏకత్వమును మాత్రమే వచ్చును. తరువాత "పటాః" మొదలగు ద్రవ్యవిశేషమును చెప్పు పదముతో సంబంధము కలుగును. అయినను మొదటి సంస్కారమట్లే యున్నందున, "శుక్లం పటాః" అని వేర్వేరు లింగసంఖ్యలు వినబడుట కవకాశము గలదు. దానిని వారించుటకే "విశేషణానామ్" ఇత్యాది సూత్ర మావశ్యకము.

వివరణము— "శుక్లః - అస్య - అస్తి" అనునది వాస్తవముగ వాక్యము. వృత్తిని వివరించుటకు ఉపాయముగ మాత్రమే దానిని తీసికొందురు. గుణవచనముల విషయమున "శుక్ల" (శుక్లమత్ ⟶ శుక్లవత్ ⟶ మతుప్పునకు లోపము = శుక్ల) మొదలగునవియే సత్యమైన వృత్తిరూపములు. వీనిని సంస్కరించునపుడు తొలిదశలో "తెలుపు గలది" అనియే తెలియునుగాని ఆ వస్తువేదో తెలియదు. అనగా సామాన్యమే తోచునుగాని విశేషము తోచదు. పిదప "పట" మొదలగు ఆ యా విశేషమును చెప్పు పదములను కలుపుట సహజమైన క్రమము. అందువలన సామాన్యదశలో ప్రవర్తించిన కార్యమును విశేషదశలో మార్చుటకు సూత్ర మావశ్యకమగునని సారాంశము. ॥138॥

అవతారిక— ద్రవ్యవాచకము యొక్క లింగసంఖ్యలు బహిరంగములైనను సూత్రముయొక్క సామర్థ్యమువలన గుణవాచకమునకు రాగలవని సమర్థించుచున్నాడు.

శ్లో॥ భావినో బహిరంగస్య వచనాదాశ్రయస్య యే ।
లింగసంఖ్యే గుణానాం తే సూత్రేణ ప్రతిపాదితే ॥ 139

బహిరంగస్య = వెలుపల ఉన్నటువంటిన్ని, భావినః = రాబోవునటువంటిన్ని, ఆశ్రయస్య = ఆధారమైన ద్రవ్యముయొక్క, యే = ఏ, లింగసంఖ్యే = లింగమును సంఖ్యయుగలవో, తే = అవి, గుణానామ్ = గుణవాచకములకు, సూత్రేణ = సూత్రముతో, వచనాత్ = చెప్పుటవలన, ప్రతిపాదితే = సంపాదింపబడినవి.

తాత్పర్యము— ఒక పదమును సంస్కరించు క్షణమున రెండవ పదముయొక్క సంస్కారము అసంభవము (రెండును ఒకే క్షణమున జరుగవు). గుణవాచకములను సంస్కరించునపుడు గుణివాచకముల ప్రసక్తి యుండదు. ఈ విధముగ గుణవాచకముల సంస్కారము అంతరంగమును (ముందు జరుగునది) గుణివాచకముల సంస్కారము బహిరంగమును (తరువాత జరుగునది) అగును. అయినను గుణవాచకములను సంస్కరించు సమయములోనే, "ఆధారమైన ద్రవ్య విశేషమొకటి యుండక తప్పదు" అను భావము కలుగునుగాన ద్రవ్య విశేషము కూడ సిద్ధముగ ఉన్నట్లే అనిపించును. దీనికి చెందిన లింగసంఖ్యలే ముఖ్యములగును. అవియే శుక్ల, మొదలగు గుణవాచకములకు సంబంధించును. "విశేషణానామ్" అను సూత్రమును ప్రత్యేకముగ ఆరంభించినందువలన ఈ తీరు సిద్ధించును. అనగా బహిరంగము యొక్క లింగసంఖ్యలు అంతరంగముయొక్క లింగసంఖ్యలను త్రోసివేయును.

వివరణము— వ్యాకరణ కార్యములను చేయుటకై మొదట తీసికొనబడు పదము వర్తమానమును అంతరంగమును అగును. తరువాత స్వీకరింపబడునది భావియు బహిరంగమును అగును. గుణవాచకముల సంస్కారము అంతరంగముగను, వానితో సంబంధించు ద్రవ్యావాచకముల సంస్కారము బహిరంగముగను ఇచట భావింపబడెను. ఇది కేవలము బుద్ధిగమ్యమైన క్రమము. ॥139॥

అవతారిక— మీది కారికలో చెప్పినట్లు గుణవచనములకు చేరు తద్ధితప్రత్యయము వలన ద్రవ్యవిశేషము కూడ తెలియుట అభిమతమైనచో, "విశేషణానామ్" ఇత్యాది సూత్రమును వేరుగ ఆరంభించుట ఎందుకు ? – అను శంకకు సమాధానము చూపుచున్నాడు.

శ్లో॥ విశేషవృత్తే రపి చ రూపాభేదాదలక్షితః ।
యస్మాద్విశేషస్తేనాత్ర భేదకార్యం న కల్పతే ॥ 140

యస్మాత్ = ఎందువలన, రూపాభేదాత్ = రూపభేదము లేనందువలన, విశేషవృత్తేః + అపి + చ = విశేషమును సూచించునట్టి వృత్తిపదము వలన కూడ, విశేషః = ద్రవ్య విశేషము, అలక్షితః = స్పష్టముగ తెలియబడదో, తేన = అట్టి విశేషముచే, భేదకార్యమ్ = లింగసంఖ్యల భేదము, న + కల్పతే = సిద్ధింపదు.

తాత్పర్యము— "ఏదో యొక ద్రవ్యవిశేషము" అను స్ఫూర్తియే కలుగునుగాని, ఆ వస్తువేదో స్పష్టముగను నిశ్చితముగను తెలియదు. అట్టి అనిశ్చితమైన విశేషముయొక్క లింగసంఖ్యలు సామాన్యమైన గుణవాచకమునకు సంక్రమించుట సంభవింపదు. కావున లింగసంఖ్యలు సిద్ధించుటకై వేరుగ సూత్రము నారంభింపవలెను. ॥140॥

అవతారిక— సామాన్యమన్నది (అన్ని విశేషములందును ఒకే తీరులో ఉండునని భావింపబడు ధర్మము) ఎట్టి విశేషమును ఆశ్రయింపకుండ ఉండుట అసంభవము. ఏదో ఒక విశేషమును స్వీకరించియే సామాన్యమును నిరూపింప శక్యమగును. కాగా ఆ విశేషమునకు

చెందు కార్యములు సామాన్యమునకును ప్రవర్తించుటలో ప్రతిబంధక మేమి ? – అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ విశేష ఏవ సామాన్యం విశేషాద్భిద్యతే యతః ।
అభేదో హి విశేషాణామాశ్రితో వినివర్తకః ॥ 141

యతః = ఎందువలన, విశేషాత్ = విశేషమునుండి, భిద్యతే = వేరుచేయబడునో, (తతః = అందువలన), సామాన్యమ్ = సామాన్యము, విశేషః + ఏవ = విశేషమే, (భవతి = అగుసు), విశేషాణామ్ = విశేషములను, వినివర్తకః = తొలగించు, అభేదః = అభేదము (విశేషముల భేదము లేకుండుట) ఆశ్రితః + హి = అవలంబింపబడెను గదా !

తాత్పర్యము— ఒండొరులను వేరుచేసికొను ఆయా వ్యక్తులు విశేషములన బడును. వేరొక వ్యక్తిని వేరుచేసి నిశ్చితముగ చూపుటయే విశేషముయొక్క ముఖ్యలక్షణము ఈ తీరున సామాన్యము కూడ విశేషమే కావచ్చును. విశేషము లన్నింటియొక్కయు అభేదము (విశేషముల భావనము నశించుట) సామాన్యమగును. ఇదియు విశేషములన్నింటిని దగ్గరకు రానీయక వేరుచేయునుగాన ముఖ్యలక్షణము ననుసరించి విశేషమే యగునుగదా ! అందుచే సామాన్యము నాశ్రయించినపుడు విశేషములన్నియు నివర్తించును. కాగా విశేషముయొక్క కార్యములు సామాన్యమునకు రావు.

వివరణము— ''నిర్విశేషం న సామాన్యమ్'' (విశేషములేని సామాన్యముండదు) అను పెద్దల వచనమొకటి యున్నది. దాని ననుసరించి శంక బయలుదేరినది. కాని ''సామాన్యమపి యథా విశేషః తద్వత్'' (సామాన్యము కూడ ఒక విధమైన విశేషమే) అను వచనము గూడ కలదు. తదనుసారమిచట సమాధానము చూపబడినది. ॥141॥

అవతారిక— ''సామాన్యము కూడ విశేషమైనచో సామాన్యముయొక్క స్వరూప స్వభావములను తెలిసికొనుట మిక్కిలి కష్టమగును'' అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యద్యదాశ్రీయతే తత్తదన్యస్య వినివర్తకమ్ ।
భేదాభేదవిభాగస్తు సామాన్యే న నిరూప్యతే ॥ 142

యత్ + యత్ = ఏది ఏది, ఆశ్రీయతే = స్వీకరింపబడునో, తత్ + తత్ = అది అది, అన్యస్య = వేరొకదానికి, వివివర్తకమ్ = తొలగించునది (భవతి = అగును), భేదాభేద విభాగః + తు = భేదము, అభేదము అను విభాగమైతే, సామాన్యే = సామాన్యము విషయమున, న + నిరూప్యతే = స్పష్టముగా చెప్పబడదు.

తాత్పర్యము— ఒక శబ్దమును ప్రయోగించుట వేరొక శబ్దమును వారించుటకే (అనగా – ఆ సందర్భమున ఆ శబ్దమే యుండవలయునుగాని వేరొకటి ఉండరాదనుట).

అట్లు సామాన్యము కూడ విశేషమువలెనే ఒకప్పుడు వ్యావర్తకము కావచ్చును. అంతమాత్ర మున సామాన్యమును భేదమనిగాని అభేదమనిగాని నిర్దిష్టముగా చెప్పజాలము.

వివరణము— విశేషములందు నియతముగ కనబడుచుండునుగాన సామాన్యమును భేదమని చెప్పుట కష్టము. ఒకచో వ్యావర్తకము కూడ అగుచుండునుగాన అభేదమని చెప్పు టయు కష్టమే.

కాగా శుక్ల, మొదలగు శబ్దములకు సామాన్యమైన ముఖ్యార్థమందు సంస్కారము జరిగి, పిదప విశేషములతో సంబంధము కలిసినపుడు లింగ సంఖ్యాభేదము ప్రాప్తించు చుండగా ("శుక్లం - పటాః" - అని) దానిని వారించుటకై "విశేషణానామ్" ఇత్యాది సూత్ర మావశ్యకమని ఫలించును. ॥142॥

అవతారిక— ప్రసిద్ధమైన వస్తువులకు స్పష్టమైన రూపమొకటి ఉండును. దానిని బట్టి "సామాన్యమ"ను అనుగతమైన ధర్మము నొకదానిని చెప్పుటకు వీలు పడును. కాని శబ్దములవలన తెలియు అర్థములకు సామాన్యమన్నది ఎట్లు కుదురును ? - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అపోద్ధారశ్చ సామాన్యమితి తస్యోపకారిణః ।**
**నిమిత్తావస్థమేవాతస్తత్ స్వధర్మేణ గృహ్యతే ॥ 143**

అపోద్ధారః + చ = అపోద్ధారమే, (వేరుచేయుట –లేక– విడిగా చూపుట) సామాన్యమ్ + ఇతి + అతః = సామాన్యమగుట వలన, ఉపకారిణః = సాయముచేయు, తస్య = ఆ సామా న్యము యొక్క, నిమిత్తావస్థమ్ = నిమిత్తమందు ఉనికిగల, తత్ + ఏవ = ఆ స్వరూపమే, స్వధర్మేణ = తన స్వభావముచే, గృహ్యతే = నిశ్చయింపబడును.

తాత్పర్యము— సంపూర్ణమైన యర్థమును బోధించునది వాక్యమే. అయినను స్పష్టతకొరకై పదములను వాని యర్థములను వేరుగ ఎత్తి చూపుదురు. ఈ తీరు "అపోద్ధా రము" అనబడును. పదముల విషయమున సామాన్యమనగా ఇదియే. ఇది వాక్యమునకు సాయముచేయుచుండును. కాగా వేరుచేయబడు పదముయొక్క అర్థము సామాన్యరూపముగనే తెలియబడును. అనగా "వాక్యార్థము పూర్తియగుటకుగాను, ఈ పదార్థమునకు వేరొక పదా ర్థము యొక్క ఆకాంక్ష గలదు" అను సామాన్యభావమే అవగతమగునుగాని, పదార్థము యొక్క విశేషములైన లింగ సంఖ్యలతోడి సంబంధము ఏర్పడదు.

వివరణము— పదార్థముల పరస్పర సంబంధమే వాక్యార్థము. ఆ సంబంధము నుండి పదార్థమును విడదీయుట అపోద్ధారము. ఇది జరిగినపుడు పదార్థము సామాన్యరూపము గనే భాసించును. ("ఇది ఆకాంక్షగల ఒక పదార్థము" అను తీరులోనే తెలియును). కాని పదార్థముయొక్క లింగము, సంఖ్య మొదలగు విశేషములు తెలియవు. పదార్థములకుగల సామాన్యమనగా ఇదియే. (పదార్థము = పదముయొక్క అర్థము). ॥143॥

అవతారిక— నియతస్వరూపముగల ఆయా వాక్యములందే పదములుండును గదా ! అయినపుడు వాని యర్థములును నియతములై విశేషములే యగునుగాని సామాన్యము లెట్లు కాగలవు ? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ అనిర్ధారితధర్మత్వాద్భేదా ఏవ వికల్పితాః ।
నిమిత్తైర్వ్యపదిశ్యంతే సామాన్యాఖ్యా విశేషితాః ॥ 144

అనిర్ధారితధర్మత్వాత్ = నిశ్చయముకాని ధర్మములు గలవగుటవలన, భేదాః + ఏవ = భేదములే, నిమిత్తైః = ఆయా నిమిత్తములచే, వికల్పితాః = కల్పింపబడి, సామాన్యాఖ్యా విశేషితాః = సామాన్యమను పేరుగలవై, వ్యపదిశ్యంతే = వ్యవహరింపబడును.

తాత్పర్యము— పదములవలన తెలియు అర్థములు తొలుత విడివిడిగను, సామాన్యరూపముగను భాసించును. వేరొక పదముతో సంబంధము కలిగినపుడు వచ్చు విశేషార్థము లేవియు ప్రారంభమున తెలియవు. అందువలన విడిగా ఉండు ఆయా అర్థములనే సామాన్యమను పేరుతో వ్యవహరింతురు.

వివరణము— ప్రవృత్తి నిమిత్తముమబట్టి (శబ్దమును వాడుటలో ముఖ్య హేతువైన ధర్మము - జాతి, గుణము, క్రియ). శబ్దమొక యర్థమును బోధింపవచ్చును. ఉదా : గో. (గోత్వమను జాతి), శుక్ల (తెలుపు అను గుణము), పాచక (వంట అను క్రియ). అది భేదరూపమే. అయినను వాక్యమందు వేరొక పదముతో సంబంధమేర్పడినపుడు వచ్చు విశేషార్థములను విడిగా ఏ శబ్దమైనను బోధింపజాలదు. కావున సామాన్యముగ భాసింపుచున్నందున భేదములనే ''సామాన్యము''లని చెప్పుదురు. ఇదియొక విధమైన కల్పనము.

విశేష విషయములు— గో శబ్దము తన యర్థమును చెప్పి వేరొక యర్థమును వారించును. కాన అది భేదమే. అయినను గోశబ్దము తొలుత ''గోసామాన్యము'' అను భావమునే కలుగజేయునుగాని, గోవిశేషములను (అనగా తెల్ల ఆవుగాని, రాముని ఆవుగాని, యజ్ఞధేనువుగాని, రక్షింపవలసిన ఆవుగాని - ప్రకరణము తెలియక) తెలియజేయ జాలదు. ఈ తీరునుబట్టి శబ్దార్థములన్నియు ప్రారంభమున సామాన్యములనియే చెప్పబడునని యిచటి సారాంశము.

కాగా విశేషణములకు లింగము, సంఖ్య అను విశేషములు సిద్ధించుటకై ''విశేషణానామ్'' ఇత్యాది సూత్ర మావశ్యకమని ఇంతవరకు (134 నుండి 144 వ కారిక) సమర్థింపబడినది. ఈ సందర్భమంతయు సూత్రమును సమర్థించుటకై బయలుదేరిన కల్పనమే. వాస్తవమున పదములును పదార్థములును అసత్యములు. వాక్య వాక్యార్థములే పరమ సత్యమన్నది సిద్ధాంతము. ॥144॥

అవతారిక— ''విశేష్యము ననుసరించి విశేషణములకును లింగసంఖ్యలు సహజముగనే సిద్ధించును. అందుకు వేరుగ ''విశేషణానాం చాజాతేః'' (1-2-52) అను

*అవతారిక*— సంఖ్యకు వివక్ష యుండుటకును లేకుండుటకును **'పశునాయజేత'** 'గ్రహం సమ్మార్ష్టి' అను వేదమున కల వాక్యములు ఉదాహరణములుగా **జూపబడినవి, వేద** మునవే కాక పాణిని వ్యాకరణ సూత్రములలో గూడ పై విచారణమునకు **ఉదాహరణములు** కలవు, అని చూపుచున్నాడు.

**శ్లో॥ సమాసప్రత్యయవిధౌ యథా నిపతితా శ్రుతిః ।**
**గుణానాం పరతన్త్రాణాం న్యాయేనై వోపపద్యతే ॥** 87

సమాస ప్రత్యయ విధౌ = సమాస విధియందు అనగా 'సుప్ సుపా' అను సమాసమును విధించెడి వాక్యమునందు, ప్రత్యయమును విధించు 'జ్యాప్ప్రాతిపదికాత్' (4-1.1) అను విధి యందును, యథా = ఏ ప్రకారముగా, శ్రుతిః = శబ్దము, అనగా సుప్, సుపా, ప్రాతిపదికాత్ అను శబ్దము, నిపతితా = ఏకత్వసంఖ్య కలదై చెవికి గోచరమగుచున్నదో, (తథా) = ఆ ప్రకారముగా, గుణానాం + పరతన్త్రాణామ్ + (ఇతి) = అప్రధానములు పరాధీనములు, ప్రధాన మును అనుసరించియే యుండును అనెడి, న్యాయేన + ఏవ = న్యాయముచేతనే, ఉపపద్యతే = యుక్తమగుచున్నది, అనగా ఆ సంఖ్యతో గూడినదియే భాసించును.

'సహ సుపా' (2-1.4) అని పాణిని సూత్రించెను. ఇందు 'సుబామన్త్రితే పరాఙ్గ వత్స్వరే' (2-1.2) అను సూత్రమునుండి 'సుప్' అను పదము అనువృత్తమగును కాగా సుబం తము సుబంతముతో కలసి. సమాస సంజ్ఞకనుగునని సూత్రార్థము లభించును. ఇచట సమా సము విధేయము కనుక ప్రధానము, సమసించెడివి అవయవములుగా నున్న సుబంతములు అప్రధానములు, కాగా అప్రధానముగా నున్న అర్థమునందు కల సంఖ్య వివక్షితమగుననెడి న్యాయము చొప్పున ఏకత్వసంఖ్య వివక్షితమగును. యాగమువంటిది సమాస విధానము. పశువు వంటిది సమసించెడి సుబంతద్వయము.

ఏకత్వసంఖ్య వివక్షితమగుటచే రెండు సుబంతములకే సమాసము ప్రవర్తించును. బహుపదములకు సమాసము ప్రవర్తింపదు.

ద్వంద్వమున బహువ్రీహియందును 'అనేకమ్' అని ప్రత్యేకముగా చెప్పియున్నం దున ద్వంద్వ బహువ్రీహులు బహుపదములకు గూడ కలుగును.

ఇట్లే 'జ్యాప్ప్రాతిపదికాత్' (4-1.1) అను సూత్రమును పాణిని చూపెను. గౌరీ మున్నగు జ్యంతములకంటె, రమా మున్నగు ఆబంతములకంటె ప్రాతిపదికము కంటెను సుప్ ప్రత్యయము మున్నగునవి ప్రవర్తించునని దాని యర్థము. ఇచట ప్రత్యయ విధానము ప్రధానము అందు ప్రాతిపదికము గుణీభూతమగుచున్నది. ఈ రీతిగ ప్రాతిపదికము అప్ర ధానమగుటచే అచట ప్రత్యయార్థమగు ఏకత్వసంఖ్య వివక్షితమగును కనుక ప్రాతిపదిక ముల సముదాయముకంటె సుప్పు ప్రవర్తింపదు. ఒక ప్రాతిపదికముకంటెనే అది ప్రవర్తించును. ॥87॥

సూత్ర మక్కరలేదు.'' అని భాష్యకారు డీ సూత్రమును ప్రత్యాఖ్యానము చేసెను. ఆ విషయ మును ప్రకృతము విశదము చేయుచున్నాడు.

శ్లో॥ యదా తు వ్యపదిశ్యేతే లింగసంఖ్యే స్వభావతః ।
ప్రయోగేష్వేవ సాధుత్వం వాక్యే ప్రక్రమ్యతే తదా ॥ 145

ప్రయోగేషు + ఏవ = పదములు ప్రయోగింపబడుచున్నపుడే, వాక్యే = వాక్యమందు, సాధుత్వమ్ = సాధుత్వము, యదా + తు = ఎప్పుడైతే, ప్రక్రమ్యతే = ప్రారంభింప బడునో, తదా = అపుడు, లింగసంఖ్యే = లింగమును సంఖ్యయు, స్వభావతః = స్వభావ మును బట్టి, వ్యపదిశ్యేతే = వచ్చునని చెప్పబడును.

తాత్పర్యము— వాక్యదశయందే - పదముల సాధుత్వమునకై వ్యాకరణ సంస్కా రము చేయవలయునని యొక పక్షము. అందు విశేష్యముతో సామానాధికరణ్యము (ఒకే యర్థమును చెప్పుట) సిద్ధించుటకు, అద్దాని లింగసంఖ్యలు విశేషణమునకును సహజముగనే సంక్రమించును.

వివరణము— వాక్య సంస్కారపక్షమున వాక్యములోని పదము లన్నింటికిని ఒకేసారిగ ఆవశ్యకమైన కార్యములు ప్రవర్తించును. ''ఇది అంతరంగము'', ''ఇది బహి రంగ కార్యము'' అను ప్రసక్తి యుండదు. కాగా - సామానాధికరణ్యము ననుసరించి, విశే ష్యము యొక్క లింగసంఖ్యలే విశేషణమునకును సంక్రమింపక తప్పదు. ''శుక్లాః పటాః'' అను రీతినే ప్రయోగములుండును. వేరుగ ''విశేషణానామ్'' మొదలగు సూత్ర మక్కరలేదు.

విశేష విషయములు— పద సంస్కారపక్షము వెనుక చూపబడినది. అందు గుణమునకును గుణముగల ద్రవ్యమునకును భేదము నాశ్రయించి, ఆ ద్రవ్యమును బోధించు టకై గుణవాచకమునకు ''మతుప్'' అను తద్ధిత ప్రత్యయమును దానికి లోపమును విధింప బడినది. అపుడు విశేష్యముయొక్క లింగసంఖ్యలు విశేషణమునకు సంక్రమించుటకు సూత్ర మావశ్యకమయ్యెను.

ప్రకృతము వాక్య సంస్కారపక్షము స్వీకరింపబడినది. ఇందు గుణమునకును గుణికిని (ద్రవ్యము) అభేదమును (''గుణమును, అది గల ద్రవ్యమును ఒకటే'' అను భావన) చెప్పుదురు. అందువలన శుక్ల మొదలగు గుణవాచకములు తొలుతనే ద్రవ్యమును బోధించును గాన ద్రవ్యముయొక్క లింగసంఖ్యలే వీనికిని వచ్చును. అందువలననే ఈ పక్షమందు ద్రవ్య మును చెప్పుటకై వేరుగ తద్ధితమక్కరలేదు. లింగసంఖ్యలు సిద్ధించుటకు వేరుగ సూత్రమును అక్కర లేదు. కాగా పద సంస్కారపక్షమున గుణవాచకములకు తద్ధితవృత్తి జరుగుననియు, (భేదమున్నందున), వాక్య సంస్కార పక్షమున తద్ధితవృత్తి జరుగదనియును (అభేదముకాన) ఫలించును. ఉదా : ''శుక్లః పటః'' తెలుపు రంగుగల బట్ట; తెల్లని బట్ట; తెల్ల బట్ట. (ఇది పదసంస్కారము). ''శుక్లః పటః'' = తెలుపు బట్ట. (ఇది వాక్య సంస్కారము). తెలుగున తెల్లని, తెల్ల మొదలగునవి గుణవాచకములు. తెలుపుగలవి అని యర్థము. తెలుపు గుణవాచ కము. ఇందు తెలుపునకును తెల్లనిది అను దానికిని అభేదము. ॥145॥

అవతారిక— గుణమునకును గుణముగల ద్రవ్యమునకును భేదము నాశ్రయించి నపుడు గుణవాచకమునకు మతుప్ ప్రత్యయమును దానికి లోపమును ఆవశ్యకమని ఇదివరకు విశదమైనది. అయినను జాతి విషయమున ఈ తీరును ఊహింపనక్కరలేదు. ''జాతి వేరు - గుణము వేరు'' అగుటయే అందుకు కారణమని ప్రతిపాదింపుచున్నాడు.

**శ్లో॥ తత్ర ప్రయోగోఽనియతో గుణానామాశ్రయైః సహ ।**
**సామాన్యం యత్తదత్యంతం తత్రైవ సముపస్థితమ్ ॥ 146**

తత్ర = అచట, గుణానామ్ = గుణములకు, ఆశ్రయైః + సహ = ఆధారములైన ద్రవ్యములతో కలిసి, ప్రయోగః = ప్రయోగము, అనియతః = నిశ్చితము కాదు, సామాన్యమ్ = సామాన్యము, యత్ = ఏది గలదో, తత్ = అది, అత్యంతమ్ = ఎల్లపుడును, తత్ర + ఏవ = అచటనే (ద్రవ్యమందే), సమవస్థితమ్ = నిశ్చితముగా ఉండునది, (భవతి = అగును).

తాత్పర్యము— తెలుపు, నలుపు, మొదలగు గుణములు ద్రవ్యమందెల్లపుడును నియతముగ నుండునవి కావు. అవి ఒకప్పుడుండును. మరొక్కప్పుడు పోవును. అందుచే వానికిని ద్రవ్యములకును భేదమునుగాని అభేదమునుగాని ఇష్టానుసారముగ చెప్పవచ్చును. ఉదా : ''పటస్య శుక్లః'' (బట్టయొక్క తెలుపు). ఇది భేదము. ''శుక్లః పటః'' (తెల్లబట్ట). ఇది అభేదము. కాని సామాన్యము —లేక— జాతి అన్నది విడదీయుటకు వీలులేకుండ, ఎల్లపుడును ద్రవ్యముతో కలిసియే యుండును. (అనగా గోత్వములేని గోవు ఉండదు అని యర్థము) ఉదా : గౌః. (గోత్వమను జాతిగల ఒక వ్యక్తి). అందువలన జాతి విషయమున అభేదమేగాని భేద మెప్పుడును పొసగదు.

వివరణము— కాగా గుణవాచకముల విషయమున భేదమును చెప్పదలచినపుడు, మతుప్ ప్రత్యయము యొక్క లోపమును లింగసంఖ్యలు సిద్ధించుటకు ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రమును ఆవశ్యకమగునని ఫలించును. ॥146॥

అవతారిక— మీది కారికయొక్క అర్థమునే విశదపరచుచున్నాడు.

**శ్లో॥ న గోత్వం శాబలేయస్య గౌరితి వ్యపదిశ్యతే ।**
**శుక్లత్వం బాహులేయస్య శుక్ల ఇత్యపదిశ్యతే ॥ 147**

శాబలేయస్య = శాబలేయము యొక్క, గోత్వమ్ = గోత్వమను సామాన్యము, గౌః ఇతి = గోవు అని, న + వ్యపదిశ్యతే = చెప్పబడదు, బాహులేయస్య = బాహులేయము యొక్క, శుక్లత్వమ్ = శుక్లత్వమను గుణము, శుక్లః ఇతి = ''బాహులేయము యొక్క తెలుపు'' అని, అపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ''శాబలేయః గౌః'' అని అభేదమును చూపియే గోత్వమను సామాన్యమును నిర్దేశింతురు. ''బాహులేయస్య శుక్లః'' అని భేదమును చూపియు శుక్లత్వమను గుణమును నిర్దేశింపవచ్చును. (''శుక్లః బాహులేయః'' అన్నది అభేదపక్షమున ప్రయోగము).

వివరణము— "త్వ" అనునది భావమును తెలుపు ప్రత్యయము. (ఉదా : గోః-భావః = గోత్వమ్, ఘటస్య - భావః = ఘటత్వమ్, మొదలగునవి). అది యున్నపుడే ఒక వ్యక్తికిచెందిన జాతిని స్పష్టముగ చెప్పుటకు వీలుపడును. ఉదా : గోత్వము = గోవునందలి జాతి. ఆ ప్రత్యయము లేనపుడు జాతికిని వ్యక్తికిని అభేదము నాశ్రయించియే జాతిని చూపవలెను. ఉదా : గౌః = గోత్వమను జాతిగల వ్యక్తి (ఒక ఎద్దు). ఈ పదముయొక్క విశేషణములు కూడ దీని ననుసరించియే యుండును. ఉదా : శాబలేయః గౌః. (శబలయొక్క సంతతి. కాగా జాతి విషయమున అభేదము తప్పదు.

గుణము విషయమట్టిది కాదు. అచట భేదమును గూడ చూపుటకు వీలున్నది. ఉదా : బాహులేయస్య శుక్లః. అందువలననే భేదపక్షమున గుణవాచకములకు మతుప్ ప్రత్యయమును లోపమును విధింపబడినవి.

"శబలాయాః అపత్యమ్ పుమాన్" అను విగ్రహమున "శాబలేయః" అను రూపమగును. (చిత్రవర్ణముగల ఆవుయొక్క దూడ) ఇట్లే "బాహులేయః" అనునది ఏర్పడును. (నల్ల ఆవుయొక్క దూడ) "గోత్వము" అను జాతిని వేరుచేసి, "గోవు" (గౌః) అని చెప్పరు. కాని గుణమును వేరుచేసి, "శుక్లము" (శుక్లః) అని చెప్పుదురు. (బాహులేయస్య శుక్లః బాహులేయము యొక్క తెలుపు). జాతికిని గుణమునకును ఇట్టి భేదము కూడ వ్యవహారములో ఉన్నది. ॥147॥

అవతారిక— అట్లు చెప్పనిచో వచ్చు దోషమును చూపుచున్నాడు.

**శ్లో॥ వ్యతిరేకే చ సత్యేవం మతుపః శ్రవణం భవేత్ ।**
**లుగన్వాఖ్యాయతే తస్మాద్రసాదిభ్యశ్చనాస్తి సః ॥ 148**

ఏవమ్ = ఇట్లు, వ్యతిరేకే + చ = భేదము కూడ, సతి = ఉండగా, మతుపః = మతుప్పునకు, శ్రవణమ్ = వినికిడి, భవేత్ = కావలసివచ్చును, తస్మాత్ = అందువలన, లుక్ = లుక్కు, అన్వాఖ్యాయతే = చెప్పబడును, రసాదిభ్యః + చ = రస, మొదలగు శబ్దముల విషయమున, సః = అలుక్కు, న + అస్తి = లేదు.

తాత్పర్యము— గుణమునకును ద్రవ్యమునకును భేదమును వివక్షించినపుడు, "పటస్యశుక్లః" అను వ్యవహారమున్నది. అభేదమును చెప్పదలచినపుడు కూడ "శుక్లః" (పటః) అను ప్రయోగమే సిద్ధించుటకుగాను మతుప్పును దానికి లోపమును చెప్పబడినది. (లేకున్నచో "మతుప్పు" వినిపింపవలసి యుండును - శుక్లవాన్). కావుననే అచట ఆ ప్రత్యయము లేకున్నను దాని యర్థము స్ఫురించుచుండును.

అయితే రస, రూప, మొదలగు కొన్ని శబ్దములకు ఇదే అర్థములో మతుప్ ప్రత్యయము ప్రవర్తించును. కాని దానికి లుక్కు మాత్రము రాదు. ॥148॥

అవతారిక— రస, మొదలగు శబ్దములు మతుప్ ప్రత్యయము లేనపుడు ఆశ్రయ మగు వస్తువును బోధింపజాలవని విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ యతోఽయమితి సంబంధాద్రూపాభేదేన వర్తతే।**
**శుక్లాదివత్తతో లోపస్తద్రసాదౌ న విద్యతే॥ 149**

సః + అయమ్ + ఇతి = "అదే ఇది" అను, సంబంధాత్ = సంబంధమువలన, రూపాభే దేన = రూపముయొక్క అభేదముచే, యత్ = ఏది, వర్తతే = ఉన్నదో, తత్ = అది, శుక్లాదివత్ = శుక్ల, మొదలగు శబ్దములందువలె, రసాదౌ = రస, మొదలగు శబ్దములందు, న + విద్యతే = లేదు, తతః = అందువలన, లోపః = లోపము, న = లేదు.

తాత్పర్యము— "అదే యిది" అను అభేదభావనమువలన శుక్లాది శబ్దములు ద్రవ్యమును కూడ బోధించు అవకాశము ఒకప్పుడు కలదు. ఉదా : శుక్లః పటః (తెల్లబట్ట). ఈ సందర్భమందే భేదమును పాటించినపుడు అన్వయము కుదురుటకై శుక్లాది శబ్దములకు "మతుప్పు" అనియు దానికి లుక్కు అనియు చెప్పుదురు.

కాని రస, (రుచి), గంధ (వాసన), మొదలగు శబ్దములు కొన్ని యున్నవి. శుక్లాదు లకు వర్తించు తీరు వీనికి వర్తింపదు. ఇవి సహజముగ తమ తమ యర్థములను మాత్రమే బోధించునుగాని, వాని కాధారములైన ద్రవ్యములను బోధింపజాలవు. ద్రవ్యములను తెలుప వలెనన్నచో, రసాది శబ్దములకు మతుప్పును తప్పక చేయవలెను. ఉదా : రసవాన్ = రుచిగల వస్తువు గంధవాన్ = వాసనగల వస్తువు. అందువలననే రసాది శబ్దములకు ప్రవ ర్తించు మతుప్పునకు లోపము జరుగదు.

వివరణము— శుక్ల, మొదలగు శబ్దములు మతుప్ ప్రత్యయము లేకున్నను, "అది గల వస్తువు" అను నర్థమును బోధింపగలవు. రస, గంధ, మొదలగు కొన్నింటికి మాత్ర మట్టి సామర్థ్యము లేదు. అది శబ్దశక్తి యొక్క వైచిత్ర్యము. అందువలన "అది గలది" అను భావము కావలసినపుడు రసాది శబ్దములకు మతుప్పును చేయక తప్పదు. దానికి లోపమును చేయరాదు.

విశేష విషయములు— "రసాదిభ్యశ్చ" (5-2-95) అను సూత్రము రసాదు లకు మతుప్పును విధించినది. ఈ ప్రత్యయము "అది గలది" అను నర్థమున ప్రవర్తించు - ఈ ప్రకరణమందలి ఇతర ప్రత్యయములను రాకుండ అడ్డివేయును. (ఇన్, ఠక్ = ఇక, మొదలగునవి ఇతర ప్రత్యయములు. అవి రావు). ఈ యంశము నిచట తెలియవలెను. "రూపిణీ" మొదలగు ప్రయోగములలో రూపశబ్దమునకు సౌందర్య మర్థము. "కంటికి కన బడు ఆకారము" అని కాదు. కాన అచట "ఇన్" ప్రత్యయము రావచ్చును. అట్లే "రసికః" అనుచోట రస శబ్దమునకు "శృంగారము" అని యర్థముకాని "రుచి" అని కాదు. కాన "ఇక" (ఠక్) ప్రత్యయము రావచ్చును. కాగా గుణవాచకములైన రసాది శబ్దములకే మతుప్పు వచ్చుననుటయు సమంజసమే. ॥149॥

అవతారిక— ఇట్లు వాక్యసంస్కార పక్షమందు "అదే యిది" అను అభేదమును భావించుటవలన, గుణవాచకములు ఆయా గుణముగల ద్రవ్యమును కూడ బోధించునుగాన ద్రవ్యముయొక్క లింగసంఖ్యలు వానికిని సహజముగ సిద్ధించును. అందుకొరకై "విశేషణానామ్" ఇత్యాది సూత్ర మక్కరలేదు - అని యింతవరకు ప్రతిపాదింపబడెను. అయినను వాక్యసంస్కార పక్షమందు కూడ పై సూత్రముయొక్క ఉపయోగముండునని విశదీకరించుటకు ప్రయత్నించుచున్నాడు.

శ్లో॥ ఆవేశో లింగసంఖ్యాభ్యాం క్వచిన్మంచాదివత్ స్థితః ।
సోఽయమిత్యభిసంబంధే న ప్రష్ఠాదౌ న విద్యతే ॥ 150

సః + అయమ్ + ఇతి = "అదే యిది" అని, అభిసంబంధే = సంబంధమును చూపునపుడు, లింగసంఖ్యాభ్యామ్ = లింగసంఖ్యలతో, ఆవేశః = ఆవేశము (సంక్రమించుట) మంచాదివత్ = మంచ, మొదలగు శబ్దములందువలె, క్వచిత్ = ఒకానొకచోట, స్థితః = ఉన్నది, సః = ఆ ఆవేశము, ప్రష్ఠాదౌ = ప్రష్ఠ, మొదలగు శబ్దముల విషయములో, న + విద్యతే = లేదు.

తాత్పర్యము— "అదే యిది" అను అభేద సంబంధమును చెప్పిన స్థలములలో కొన్నిచోట్ల, ఆరోపింపబడు వస్తువుయొక్క లింగమును సంఖ్యయు మారకుండుటయు, మరి కొన్నిచోట్ల అవి మారుటయును ప్రయోగములలో కనబడుచున్నది. మంచ, మొదలగు శబ్దముల విషయములో లింగసంఖ్యలు మారవు. ప్రష్ఠ, మొదలగు శబ్దముల విషయములో అవి మారును.

వివరణము— మంచ, శబ్దమునకు "మంచము" అని యర్థము. అది పుంలింగము సామాన్యముగ బహువచనాంతము. అభేదమును భావించి మంచమందుండు వస్తువులనుగాని వ్యక్తులనుగాని, "మంచ" శబ్దముతోనే బోధింపవచ్చును. అయినను మంచ శబ్దము తన లింగ సంఖ్యలను విడువదు. ఉదా: "మంచాన్ = యువతీః - వాసాంసి - వా - పశ్య" (మంచములైన— అనగా - మంచమందుండు యువతులనుగాని బట్టలనుగాని చూడుము). ఇచట యువతి శబ్దము స్త్రీలింగము. వాసస్, శబ్దము నపుంసకము. అయినను మంచ శబ్దముయొక్క లింగ సంఖ్యలలో మార్పు ఉండదు. "ప్రష్ఠ" శబ్దము విషయములో ఈ తీరు లేదు. అచట ఆరోపమును పొందు వస్తువును బట్టియే లింగసంఖ్య లుండును. ప్రష్ఠః = ముందుండువాడు (పుంలింగము. ఏకవచనము). ఈ ప్రష్ఠత్వమను ధర్మమును స్త్రీయందారోపించునపుడు "ప్రష్ఠీ" అను రూపమగును. (ప్రష్ఠస్య - స్త్రీ = ప్రష్ఠయగు ప్రష్ఠుని భార్య) స్త్రీలింగమును అవశ్యకమగు వచనమును ప్రవర్తించును.

విశేష విషయములు— లింగముయొక్కయు సంఖ్యయొక్కయు ఆవేశ మాయా ప్రయోగములలో అతివిచిత్రముగ నుండును. ఉదా: (1) హరీతక్యః = ఫలాని. ("హరీతకి" యను ఓషధియొక్క ఫలములు) ఇచట "హరీతక్యః" అను శబ్దము ఆరోపముచే (అభేదము) పండ్లను బోధించును. అయినను హరీతకీ, అను స్త్రీలింగము మాత్ర మనువర్తిం

చెను. (2) ఖలతికమ్ = వనాని. (ఖలతికస్య - అదూరభవాని = ఖలతిక, అను పర్వతము నకు దగ్గరగానుండు అడవులు) ఇచట "ఖలతికమ్" అన్నది అభేదభావనచే వనములను చెప్పును. ఏకవచనము మాత్ర మనువర్తించుటయు, నపుంసక లింగమట్లే యుండుటయును ఇచట జరిగెను. (3) "వింశతిః = బ్రాహ్మణాః" (ఇరువది = బ్రాహ్మణులు). ఇచట వింశతి, శబ్ద మారోపముచే బ్రాహ్మణులను తెలుపును. అయినను దానికి సహజమైన లింగ సంఖ్యలు రెండును (స్త్రీలింగమును ఏకవచనమును) మారకుండ అట్లే మిగిలినవి. ॥150॥

*అవతారిక*— పైని చూపిన యంశమును శాస్త్రముకూడ గుర్తించుచున్నదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ లింగం లింగపరిత్యాగే సూత్రే ప్రత్యయశాసనమ్ ।**
**సోఽయమిత్యభిసంబంధాత్ పుంశబ్దే స్త్ర్యభిధాయిని ॥ 151**

సః + అయమ్ + ఇతి = "అదే యిది" అను, అభిసంబంధాత్ = సంబంధమువలన, పుం శబ్దే = పురుషవాచకమైన శబ్దము, స్త్ర్యభిధాయిని = స్త్రీని చెప్పునపుడు, సూత్రే = సూత్ర మందు, ప్రత్యయశాసనమ్ = ప్రత్యయమును విధించుట, లింగపరిత్యాగే = లింగమును విడుచుటలో, లింగమ్ = జ్ఞాపకము, (భవతి = అగును).

*తాత్పర్యము*— "పుంయోగాదాఖ్యాయామ్" (4-1-48) అను సూత్రము పుం వాచక శబ్దములకు (పురుషుని చెప్పునవి) "ఙీష్" (ఈ) అను స్త్రీ ప్రత్యయమును విధించి నది. పురుషుని తెలుపు "ప్రష్ఠ" మొదలగు శబ్దములు అభేద సంబంధముచే (ఆ యా పురుష ధర్మములను అతని భార్యయం దారోపించుటచే) స్త్రీని బోధించునపుడే ఆ ప్రత్యయము ప్రవర్తించును. అనగా ప్రష్ఠాది శబ్దములు అభేద సంబంధముచే స్త్రీని బోధించునపుడు, తమ లింగమును విడిచిపెట్టును. ఇట్లు ఆరోపము ననుసరించి ఒక శబ్దము వేరొక యర్థమును తెలియజేయునపుడు లింగసంఖ్యలలో మార్పు జరుగుననుటను పై సూత్రము సమర్థించు చున్నది.

*వివరణము*— 83 వ కారికలో ఈ కారికయొక్క భావమంతయు విశదీకరింప బడినది. అచట సందర్భానుసారముగ ఈ చర్చ జరిగినది. ॥151॥

*అవతారిక*— ఇట్లు లింగసంఖ్యలు సంక్రమించుట అనియతముగ నుండుటవలన, "శుక్లాది శబ్దములకు ద్రవ్యమునకు సంబంధించిన లింగసంఖ్యలు సిద్ధింపవేమో" అను శంక అక్కరలేకుండ నిస్సంశయముగ అవి సిద్ధించుటకై "విశేషణానామ్" మొదలగు సూత్ర ముపయోగించునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆశ్రయే లింగసంఖ్యాభ్యామాశ్రితం వ్యపదిశ్యతే ।**
**విశేషణానాం చాజాతేరితి శాస్త్రవ్యవస్థయా ॥ 152**

''విశేషణానాంచాజాతేః'' + ఇతి = ''విశేషణానాంచాజాతేః'' అను, శాస్త్రవ్యవస్థయా = సూత్రముయొక్క నియమముచే, ఆశ్రయే = ఆధారమగు ద్రవ్యమందలి, లింగసంఖ్యాభ్యామ్ = లింగసంఖ్యలతో, ఆశ్రితమ్ = ఆధేయమగు గుణము, వ్యపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ద్రవ్యమునకు చెందిన లింగసంఖ్యలు గుణమునకును సంక్రమించునని ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రము బోధించును.

వివరణము— శబ్దశక్తి ననుసరించి లింగసంఖ్యల ఆవేశము సహజముగనే సిద్ధించినను, ఆ యంశమునే సూత్రమనువదించుచున్నదని భావింపవలయును. ''పుంయోగాదాఖ్యాయామ్'' (4-1-48) అను సూత్రము కూడ ఇట్లు అనువాదకమేయని చెప్పవచ్చును. ॥152॥

అవతారిక— పై యంశమునే స్పష్టము చేయుచున్నాడు.

శ్లో॥ నిమిత్తానువిధాయిత్వాద్యే ధర్మాభేదహేతుషు ।
త ఆశ్రయేఽపి విద్యంత ఇతి బుద్ధిర్నివర్త్యతే ॥ 153

భేదహేతుషు = భేమమునకు కారణములైన గుణములందు, యే = ఏ, ధర్మాః = ధర్మములు గలవో, తే = అవి, నిమిత్తాను విధాయిత్వాత్ = నిమిత్తమును అనుసరించుటవలన, ఆశ్రయే + అపి = ఆధారమైన ద్రవ్యమందును, విద్యంతే + ఇతి = ''ఉండును'' అను, బుద్ధిః = భావము, నివర్త్యతే = తొలగింపబడును.

తాత్పర్యము— గుణములయొక్క లింగసంఖ్యలే ద్రవ్యమునకును సంక్రమించునను అభిప్రాయమును ''విశేషణానామ్'' ఇత్యాది సూత్రము తొలగించును. కాన అది వ్యర్థము కాదు.

వివరణము— ద్రవ్యమునకు భేదమును కలిగించునవి గుణములు. నిమిత్తములన్నను అవియే. నిమిత్తముగలది ''నిమిత్తి''. అనగా ద్రవ్యము. అభేద సంబంధము నాశ్రయించి గుణవాచకము ద్రవ్యమును బోధింపవచ్చును. అట్టి సందర్భములో నిమిత్తముయొక్క ధర్మములు (లింగసంఖ్యలు) నిమిత్తికిని సంక్రమించునను భావన కలుగవచ్చును. ఆ భావన కలుగకుండ వారించుటకు ప్రకృత సూత్ర మావశ్యకమగును.

విశేష విషయములు— నిమిత్తముయొక్క ధర్మములు నిమిత్తియందును వర్తించునని ఒక సంప్రదాయము. అట్లు సంక్రమించిన ప్రయోగములును కొన్ని యున్నవి. ఉదా: "పంచాలాః" (జనపదః = దేశము) పంచాలులను పేరుగల రాజులకు నివాసమైన దేశము. (పంచాలానామ్ - నివాసః). అభేదముచే నివసించు రాజుల పేరుతోనే దేశము వ్యవహరింపబడినది. అట్టి వ్యవహారమునకు నిమిత్తమైన రాజుల బహుత్వము నిమిత్తియగు నివాసమునకు సంక్రమించినది. (వాస్తవముగ నివాసమైన దేశ మొకటియే గదా!) ॥153॥

అవతారిక— "పంచాలాః" మొదలగుచోట్ల నిమిత్తముయొక్క లింగసంఖ్యలు

సంక్రమించుటనే "లుపియుక్తవద్వ్యక్తివచనే" (1-2-51) అను సూత్రము సమర్థించునని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆఖ్యాయతే చ శాస్త్రేణ లోకరూఢా స్వభావతః ।
నిమిత్తతుల్యా గోదాదౌ ప్రవృత్తిర్లింగ సంఖ్యయోః ॥ 154

స్వభావతః = స్వభావము ననుసరించి, లోకరూఢా = వ్యవహారమందు ప్రసిద్ధమైన, గోదాదౌ = "గోదౌ" మొదలగుచోట్ల, నిమిత్తతుల్యా = నిమిత్తముతో సమానమైన, లింగసంఖ్యయోః = లింగసంఖ్యల యొక్క, ప్రవృత్తిః = ప్రవృత్తి, శాస్త్రేణ=శాస్త్రముచే ("లుపియుక్తవత్" ఇత్యాది సూత్రముచే) ఆఖ్యాయతే + చ = చెప్పబడుచున్నది.

తాత్పర్యము— "గోదౌ" (గ్రామః), "పంచాలాః" (జనపదః), మొదలగుచోట్ల నిమిత్తము ననుసరించి నిమిత్తియందు లింగసంఖ్యలు అనువర్తించుట సహజమైనదియు లోక ప్రసిద్ధమైనదియునగు విషయము. అట్టిదానినే "లుపియుక్తవత్" మొదలగు సూత్ర మనువదించును.

వివరణము— లింగసంఖ్యలు ఆయా ప్రయోగములలో సహజములైనవి. అట్లు సిద్ధముగ ఉన్నవానిని విశదము చేయుటయే శాస్త్రము చేయుపని. అంతియకాని శాస్త్రము లింగసంఖ్యలను శాసింపజాలదు. "ప్రసిద్ధమైన ప్రయోగములను శాస్త్ర మనుసరించును. శాస్త్రమును ప్రయోగము లనుసరింపవు" అను తత్త్వమును సందర్భము వచ్చునపుడెల్ల గ్రంథ కర్త సూచింపుచునే యుండును.

"లుపియుక్తవత్" ఇత్యాది సూత్రము 110 వ కారికలో పూర్తిగా వ్యాఖ్యానింపబడినది. ॥154॥

అవతారిక— "శబ్దశక్తినే శాస్త్రమనుసరించును. కావుననే ఈ విధమైన విభాగము కూడ సిద్ధించినదని" చూపుచున్నాడు.

శ్లో॥ హరీతక్యాదిషు వ్యక్తిః సంఖ్యా ఖలతికాదిషు ।
మనుష్యలుబ్విశేషాణామభిధేయాశ్రయం ద్వయమ్ ॥ 155

హరీతక్యాదిషు = హరీతక్యః, (ఫలాని) మొదలగుచోట్ల, వ్యక్తిః = లింగమును, ఖలతికాదిషు = ఖలతికమ్, (వనాని) మొదలగు స్థలములందు, సంఖ్యా = సంఖ్యయు, మనుష్యలుబ్విశేషాణామ్ = ''మనుష్యుడు'' అను నర్థమున వర్తించు లుబంతమైన శబ్దముయొక్క విశేషణములకు, అభిధేయాశ్రయమ్=వాచ్యమగు అర్థమునకు సంబంధించిన, ద్వయమ్=లింగసంఖ్యలు రెండును, (సిధ్యంతి = సిద్ధించును).

తాత్పర్యము— హరీతక్యః, అనుచోట స్త్రీలింగము మాత్రమే నిమిత్తముతో సమానము. బహువచనము నిమిత్తికి చెందినదే. ఖలతికమ్, అనుచోట ఏకవచనము మాత్రము

నిమిత్తముతో సమానము. నపుంసకలింగము నిమిత్తికి సంబంధించినదే. ''చంచా'' అనగా గడ్డిబొమ్మవంటి మనుష్యుడు. ఈ శబ్దమునకు ''అభిరూప'' (సుందరము), ''దర్శనీయ'' (చూడదగిన) మొదలగు విశేషణములను వాడినపుడు, ''మనుష్య'' అను విశేష్యము ననుసరించియే ఆ విశేషణములకు లింగసంఖ్యలు రెండును సంబంధించును. సహజములైన ఈ అంశములనే శాస్త్రీయములైన వచనములు ప్రకటించుచున్నవి.

వివరణము— ఒక వస్తువుయొక్క ధర్మమును, దానికి సంబంధించిన వేరొక వస్తువునం దారోపించి, రెండిటిని ఒకే శబ్దముతో బోధించు సందర్భమున నిమిత్త నిమిత్తి భావమును స్వీకరింతురు. ఉదా: హరీతకీ. ఇదొక ఓషధి. దీని పండ్లనుగూడ ఈ శబ్దముతోనే చెప్పవచ్చును. ఓషధికిని దాని పండ్లకును అభేదమును కల్పించినచో, అట్లు చేయుటకు వీలు కలుగును. ''హరీతక్యాః - ఫలాని = హరీతక్యః''. ఇచట హరీతకి నిమిత్తము. పండ్లు నిమిత్తి. ''పండ్లు'' అను నర్థమున ఒక తద్ధిత ప్రత్యయము వచ్చుననియు, అది లోపించుననియు అపుడు నిమిత్తము ననుసరించి లింగమును, నిమిత్తిని బట్టి వచనమును వచ్చుననియును, శాస్త్రము చెప్పును. కాగా హరీతక్యః. అని స్త్రీలింగమును బహువచనమును సిద్ధించును ఇట్లే ''ఖలతికమ్'' = వనాని'' అను ప్రయోగము. ''ఖలతిక''మనునది ఒక పర్వతము. దానికి దగ్గరగానుండు అడవులను కూడ ఈ శబ్దముతో బోధింతురు. (ఖలతికస్య - అదూరభవాని వనాని) ఇచట ఖలతికము నిమిత్తము, దానియొక్క ఏకవచనము అనువర్తించినది. నపుంసకలింగము నిమిత్తియైన వనమునకు చెందినదే.

ఇక - ''చంచా'' శబ్దమునకు ''గడ్డిబొమ్మ'' అని సహజమైన యర్థము. ''ఇవే ప్రతికృతౌ'' (5-3-96) అను సూత్రముచే సాదృశ్యార్థమున ఈ శబ్దమునకు ''కన్'' ప్రత్యయము విధింపబడినది. పిదప ''లుమ్మనుష్యే'' (5-3-98) అను సూత్ర మా ప్రత్యయమునకు లోపమును చెప్పినది. (''చంచా - ఇవ - మనుష్యః'' అని మనుష్యుడు ఉపమేయమైనపుడు, కన్ ప్రత్యయము లోపించునని యర్థము) కాగా ''చంచా'' అనునదియే ''గడ్డిబొమ్మవంటి మానవుడు'' అను నర్థమును చెప్పగలుగును. ఈ దశయందు అభిరూప, దర్శనీయ, మొదలగు విశేషణములను చంచా, శబ్దమునకు ఉపయోగించినచో, ''విశేషణానామ్'' మొదలగు సూత్రముచే ''చంచా'' శబ్దముయొక్క లింగసంఖ్యలు విశేషణములకును ప్రాప్తించుచున్నవి. కాని ''మనుష్యలుపి ప్రతిషేధః'' (మనుష్యార్థమందు లుప్పు వచ్చినపుడు ''విశేషణానామ్'' అను సూత్రము ప్రవర్తింపదు) అను నిషేధమున్నందున చంచా శబ్దముచే బోధింపబడు మనుష్యుని అనుసరించియే (మనుష్య, శబ్దమును బట్టియే) లింగవచనము లుండును. ''అభిరూపః చంచా'' మొదలగు రీతినే ప్రయోగింపవలెను.

ఇట్లు భాషకు సహజమైన అంశములనే ''హరీతక్యాదిషు వ్యక్తిః'', ''ఖలతికాదిషు వచనమ్'', ''మనుష్యలుపి ప్రతిషేధః'' అను కాత్యాయనుని వచనములు స్పష్టపరచినవి. అంతియేకాని ఆ వచనములనుబట్టి ఈ ప్రయోగములు బయలుదేరినవని అనుకొనరాదు.॥155॥

*అవతారిక*— ''విశేషణానాంచాజాతేః'' అను సూత్రమున ''అజాతేః'' అను నిషేధమున్నందున, జాతివాచకమగు శబ్దమును వాడినపుడు మాత్రము దాని విశేషణమునకు లుబంతము యొక్క లింగవచనములు సంక్రమింపవు - అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ జాతిప్రయోగే జాత్యాచేత్ సంబంధముపగచ్ఛతి ।**
**విశేషణం తతో ధర్మాజ్జాతే స్తత్ ప్రతిపద్యతే ॥ 156**

జాతిప్రయోగే = జాతివాచకమగు శబ్దమును వాడినపుడు, విశేషణమ్ = విశేషణము, జాత్యా = జాతితో, సంబంధమ్ = సంబంధమును, ఉపగచ్ఛతి + చేత్ = పొందినట్లయితే, తతః = అపుడు, జాతేః = జాతియొక్క, ధర్మాత్ = ధర్మమునుబట్టి, తత్ = దానిని (లింగమును వచనమును) ప్రతిపద్యతే = పొందును,

**తాత్పర్యము**— విశేషణమును జాతివాచకముతో కలిపినపుడు, జాతివాచకము యొక్క లింగసంఖ్యలే దానికిని వచ్చును ఉదా : "పంచాలాః = జనపదః". ఇచట జన పదః, అను దానికి "రమణీయః", "సుందరనగరః" మొదలగు విశేషణములు సహజములు. జనపదశబ్దము జాతివాచకము. అది విశేష్యము. దాని ననుసరించియే విశేషణములకు లింగ సంఖ్యలు ప్రవర్తించును. ॥156॥

*అవతారిక*— విశేషణమును లుబంతముతోనే సంబంధింప జేసినపుడు కలుగు విశేషమును చూపుచున్నాడు.

**శ్లో॥ లుబంతే సన్నిపతితం జాతేరన్యద్విశేషణమ్ ।**
**లుబంతస్య ప్రధానత్వా త్తద్ధర్మైర్వ్యపదిశ్యతే ॥ 157**

జాతేః = జాతికి, అన్యత్ = వేరయిన, (సంబంధింపని), లుబంతే = లుబంతమందు, సన్ని పతితమ్ = పడిన, (సంబంధించిన), విశేషణమ్ = విశేషణము, లుబంతస్య = లుబంతము, ప్రధానత్వాత్ = ముఖ్యమగుటవలన, తద్ధర్మైః = దానియొక్క ధర్మములచే (లింగ సంఖ్య లచే) వ్యపదిశ్యతే = వ్యవహరింపబడును.

**తాత్పర్యము**— విశేషణము ఇచ్ఛానుసారముగ సంబంధింపవచ్చును. కాగా జాతి వాచకమును విడిచి, లుబంతముతోనే విశేషణమును కలిపినచో, లుబంతముయొక్క లింగ వచనములే విశేషణమునకును సంక్రమించును. ఉదా : "పంచాలాః - ప్రియాతిథయః, వినీత వేషాః - జనపదః." (పంచాలములు ప్రియాతిథులును, వినీత వేషములును అయిన జన పదము).

వివరణము— ఆయా అర్థములందు తద్ధితము వచ్చి, లోపించిన శబ్దములు "లుబంతము" (ఉదా : పంచాలాః, మొదలగునవి) లనబడును. లుబంతముయొక్క అర్థము ముఖ్యము. కావున తదనుసారమే విశేషణముల యొక్క లింగసంఖ్య లుండును,

అవతారిక — అప్రధానమగు అర్థమునందున్న సంఖ్య వివక్షితమగునని యింత వరకు చూపబడినది, అట్టి సంఖ్య వివక్షితమేయగునని నియమము లేదు. కొన్ని స్థలములలో సందర్భమునుబట్టి అవివక్షితము కూడ కాగలదని చూపుచున్నాడు.

**శ్లో॥ గుణేఽపినాఙ్గీ క్రియతే ప్రధానాన్తర సిద్ధయే ।**
**సంఖ్యా కర్తాతథా కర్మణ్యవిశిష్టః ప్రతీయతే ॥** 88

ప్రధానాన్తర సిద్ధయే = మరియొక ప్రధానమగు అర్థమునకు గూడ కార్యసిద్ధికొరకు, గుణే + అపి = అప్రధానమగు అర్థమునందున్నను, సంఖ్యా = ఏకత్వము మున్నగు సంఖ్య, న + అఙ్గీక్రియతే = స్వీకరింపబడదు, అనగా వివక్షితము కాదు.

తథా = ఇట్లుండగా, కర్మణి = కర్మ సంజ్ఞా విషయమున అనగా "కర్తు రీప్సిత తమం కర్మ" (1-4.49) అను సూత్రము విషయమై, కర్తా = ఆ సూత్రమున చెప్పబడిన కర్త, అవిశిష్టః = సంఖ్యతో కూడి యుండకయే, అనగా సంఖ్యా సంబంధము లేకయే, ప్రతీయతే = తెలియబడును.

పాణిని "కర్తు రీప్సితతమం కర్మ" (1-4.49) అను సూత్రముచే కర్మసంజ్ఞను విధించెను. కర్తయందున్న క్రియతో సంబంధించియున్న కారకము కర్మ సంజ్ఞ కలదియగు నని సూత్రమున కర్థము.

'కర్తుః' అను పదము ఏకవచనాంతము. మరియు అది పుంలింగము. కర్మ సంజ్ఞ విధింపబడుటచే అది ప్రధానము. దానికి ఉపకరించుటచే కర్త అప్రధానము, కాగా అప్రధాన మగు అర్థమునగల సంఖ్య వివక్షితమగునని నియమము ప్రకారము ఇచట కర్తయందున్న సంఖ్య వివక్షితమగుచో ఒక కర్తయందున్న క్రియతో సంబంధించిన కారకమునకే కర్మ సంజ్ఞ కలుగవలెను. అట్టి యర్థము స్వీకరించిన ఇద్దరు ముగ్గురియందున్న క్రియలతో సంబంధించిన కారకమునకు కర్మ సంజ్ఞ రాకపోయెడిని. అట్టి కారకమునకు కూడ ఆ సంజ్ఞ కలుగుట సమ్మతము. కనుక కర్తయందున్న సంఖ్యను వివక్ష చేయరాదు. అట్లే అచట పుంస్త్వము కూడ వివక్షితము కాదు. కాగా ఇద్దరు ముగ్గురు, కాక ఆడువాండ్రు వీరియందున్న క్రియతో సంబంధించియున్న కారకమునకు కూడ కర్మ సంజ్ఞ సిద్ధించును.

అట్లుకాక కర్తయొక్క సంఖ్యను వివక్షించిన ఒక కర్తకు సంబంధించినదియే కర్మ సంజ్ఞకమని సంకోచము కలుగును. అట్టి అప్రధానమును బట్టి ప్రధానము నియమిత మగును. కాగా ప్రధానమే అప్రధానమును అనసరించినట్లగును.

కాబట్టి సంఖ్య అవివక్షితమై రెండు మూడు కర్తృపదార్థములకు సంబంధించిన ప్రధానములకు గూడ కర్మ సంజ్ఞ కలుగును. ॥88॥

విశేష విషయములు— ప్రవర్తించి లోపించిన తద్ధితమునకు ప్రకృతిగా మిగిలిన శబ్దము "లుబంతమ"ని ఫలించును. 134 వ కారిక నుండి ఇంతపరకును (157) "విశేషణానాంచాజాతేః" (1-2-52) అను సూత్రముయొక్క విచారణము విపులముగ జరిగినది. ॥157॥

## (8) లింగవచనముల అతిదేశప్రసంగమున - "అతిశాయనే తమబిష్ఠనౌ" (5-3-55) అను సూత్రముయొక్క పరిశీలనము

*అవతారిక*— మీది విచారణమువలన "విశేషణానామ్" మొదలగు సూత్రము, "గుణవాచకములకు ద్రవ్యమునుబట్టి లింగవచనములు సంక్రమించును" అను విషయమును విశదముచేయుట కుపయోగించునని ఫలించినది. అట్లు లింగవచనములు సంక్రమించుట ఏయే స్థలములం దుపయోగపడునో - (లేక— జరుగునో) - అన్న అంశమును భాష్యకారుడు విపులముగ చర్చించెను. ఆ యా స్థలములను అచటి చర్చలయొక్క సంగ్రహమును ప్రకృతము చూపుచున్నాడు.

**శ్లో॥ నఞ్సమాస బహువ్రీహిద్వంద్వస్త్ర్యతిశయేషు యే ।**
**భేదా భాష్యానుసారేణ వాచ్యాస్తే లింగసంఖ్యయోః ॥ 158**

నఞ్సమాస బహువ్రీహి ద్వంద్వస్త్ర్యతిశయేషు = నఞ్సమాసము, బహువ్రీహి సమాసము, ద్వంద్వసమాసము, "స్త్రియామ్" అను సూత్రము, "అతిశాయనే తమబిష్ఠనౌ" అను సూత్రము - ఈ స్థలములలో, లింగసంఖ్యయోః = లింగవచనముల యొక్క, యే = ఏ, భేదాః = భేదములు గలవో, తే = అవి, భాష్యానుసారేణ = భాష్యము ననుసరించి, వాచ్యాః = చెప్పదగియున్నవి.

*తాత్పర్యము*— "గుణవచనా నామాశ్రయతో లింగవచనాని" (గుణవాచకములకు ద్రవ్యవాచకములను బట్టి లింగసంఖ్య లుండును) అను వచనమును నఞ్ సమాసము మొదలగు అయిదు స్థలములలో భాష్యకారుడు ప్రవర్తింపజేసి పరిశీలించెను. ఆ పరిశీలనము యొక్క రీతులను ప్రకృతము భావింపదగును. ॥158॥

*అవతారిక*— పై కారికలోని వరుసను తారుమారు చేసి, (వెనుకనుండి ఆరంభించి మొదటికి వచ్చుట) గ్రంథకర్త విషయములను విశదీకరించెను. కాగా "అతిశాయనే తమబిష్ఠనౌ" (5-3-55) అను సూత్రమును ముందుగ తీసికొని చర్చను ప్రారంభింపుచున్నాడు.

**శ్లో॥ యది షష్ఠీద్వితీయాంతాన్నిష్కృష్టాత్తమ బాదయః ।**
**న్యక్కారిణీ స్యురుత్కృష్టే ప్రకృతేః స్యాద్విలింగతా ॥ 159**

నిష్కృష్టాత్ = తక్కువ అయిన వస్తువును చెప్పు, షష్ఠీద్వితీయాంతాత్ = షష్ఠ్యంతముగాని ద్వితీయాంతముగాని అయిన శబ్దమునకు, న్యక్కారిణీ = తిరస్కరించు, ఉత్కృష్టే = "గొప్పదైన వస్తువు" అను నర్థమున, తమబాదయః = తమప్, ష్ఠొదలగు ప్రత్యయములు, యది+

స్యుః = ప్రవర్తించినట్లయితే, ప్రకృతేః = ప్రకృతియైన శబ్దమునకు, విలింగతా = లింగము వేరగుట, స్యాత్ = సంభవించెడిని.

తాత్పర్యము— కొన్ని వస్తువులలో ఒకటి ''మిగిలిన వానికన్న మిన్న'' అని చెప్పవలసి వచ్చును. అపుడు తక్కువయైన వస్తువును చెప్పు శబ్దమునకు ''అన్నిటికన్న మిన్నయైనది'' అను నర్థమున ''తమప్'' (తమ) అను ప్రత్యయము విధింపబడినది. కొన్ని చోట్ల ''తరప్'' (తర) అను ప్రత్యయము కూడ ఈ యర్థముననే ప్రవర్తించును. అట్టి సందర్భములలో ప్రకృతియొక్క లింగమును ప్రత్యయార్థముయొక్క లింగమును వేర్వేరగు ప్రమాదమున్నది.

వివరణము— "అతిశాయనే తమబిష్ఠనౌ" అని సూత్రము. ఇచట "అతిశాయన" అను శబ్దమునకు రెండర్థములను చెప్పవచ్చును. ''మిన్నయగు వస్తువు'' అని ఒక యర్థము. ''మిన్నయగుటకు హేతువుగా భావింపబడు వస్తుధర్మము'' అని రెండవయర్థము. ఆ ధర్మము గుణముకాని క్రియకాని కావచ్చును. ఇట్టి అతిశాయనమను అర్థమున, తమప్, తరప్, మొదలగు ప్రత్యయములగును. ప్రకృతియైన శబ్దమును (అనగా తక్కువ అయిన వస్తువును బోధించు శబ్దము) ద్వితీయాంతముగగాని, షష్ఠ్యంతముగగాని తీసికొనవచ్చును. అది స్త్రీలింగ శబ్దమైనచో ఆ, ఈ (టాప్, జీష్ మొ॥) మొదలగు స్త్రీ ప్రత్యయములతో కూడినదియు, లేనిచో కేవలము ప్రాతిపదికమును అగును.

ఈ సందర్భమున అతిశాయనమన్నది ప్రత్యయముయొక్క అర్థమునకు విశేషణమని యొక పక్షమున్నది. ఇందు ''వస్తువు మిన్నయగుటకు ముఖ్యకారణము దానియందలి ధర్మమే'' (గుణము —లేక— క్రియ) అను భావనవలన, ''ఆ యా ధర్మముచే గొప్పదైన ద్రవ్యము'' అను అర్థమును ''తరప్'' ప్రత్యయము బోధించును. అపుడు ప్రకృతియొక్క అర్థమును ప్రత్యయముయొక్క అర్థమును వేర్వేరగును. ఒక ధర్మముచే తక్కువయగు వస్తువును ప్రకృతి బోధించును. అదే ధర్మముచే మిన్నయగు వస్తువును ప్రత్యయము చెప్పును. కాగా ప్రకృతియైన శబ్దమునకు ఒక లింగమును ప్రత్యయార్థమైన దానికి వేరొక లింగమును ఉండు ప్రయోగములలో లింగైక్యము (ఒకే లింగముండుట) కుదురకపోవును.

దిగువ కారికయందలి ఉదాహరణములవలన ఈ యంశములు విశదము కాగలవు.

విశేష విషయములు— (1) ''అతిశేతే - ఇతి = అతిశాయనః'' = మిన్నయై మిగిలిన వస్తువులను తిరస్కరించు వస్తువు. (ఇదొక యర్థము). ''అతిశాయనః = అతిశయః'' = మిన్న అగుట. (ఇది వేరొక యర్థము). ద్రవ్యమునకుగాని జాతికిగాని గొప్పదనమన్నది తనంతతానుగ సంభవింపదు. అందుండు ధర్మమునుబట్టియే అది కుదురును. ఆ ధర్మము సామాన్యముగ గుణమేయగును. కొండొకచో క్రియ అయినను కావచ్చును.

(2) ''పెక్కింటిలో ఒకటి మిన్న'' అను నర్థమున ''తమప్పు'' వచ్చుటయు, ''రెండిటిలో ఒకటి మిన్న'' అను నర్థమున ''తరప్పు'' వచ్చుటయును సాధారణమైన

అంశము. అయినను కొన్నిచోట్ల ''తరప్పు'' కూడ "తమప్పు" యొక్క విషయములో ప్రవ ర్తించుట గలదు. ఈ తీరున "తరప్పు" ప్రవర్తించిన ఉదాహరణములే దిగువ కారికలో చూపబడును.

(3) ప్రత్యయముయొక్క అర్థము అతిశాయనమన్నచో, తిరస్కరించు వస్తువును —లేదా— దానియందుండు ధర్మవిశేషమును ప్రత్యయము చెప్పును. అపుడు ''తిరస్కరింప బడునది'' ప్రకృతియొక్క అర్థమగును. ఉదా : ''ఆఢ్యతమః - రామః''. (ఆఢ్యానామతి శాయనః = ధనవంతులలో మిన్న). ఆఢ్యశబ్దము ధనవంతులందరను బోధించును. ''తమ'' అనునది ఆఢ్యత్వమను ధర్మముచే మిన్నయగు రాముని తెలుపును. ఈ విధముగ ప్రకృత్యర్థ మును ప్రత్యయార్థమును వేరగును. ఇదొక పక్షము.

(4) ఇట్లుగాక ప్రకృతియే ''అతిశాయన'' మను నర్థమును స్వతంత్రముగ బోధించుననియు, ప్రత్యయమదే యర్థమును కేవలము సూచించుననియును వేరొక పక్ష మున్నది. ఇందు ప్రత్యయము స్వార్థికమగును. అనగా వేరుగ తన యర్థము లేకుండ ప్రకృతి యొక్క అర్థమునే బోధించును. ఇపుడు అర్థములో భేదముండదు. తుదకు ఈ పక్షమే సిద్ధాంతముగ తీసికొనబడును.

(5) మీది పూర్వపక్షము ననుసరించియే దిగువ కారికలో ఉదాహరణము లీయ బడినవి. ॥159॥

అవతారిక— మీద చూపిన భిన్న లింగత్వమును ఉదాహరణములతో వివరింపు చున్నాడు.

శ్లో॥ కాల్యాం కాలాద్ద్వితీయాంతాత్కాలే కాల్యాస్తరబ్ భవేత్ ।
న్యక్కర్తరి తథా గార్గ్యే గర్గేభ్యః ప్రత్యయో భవేత్ ॥ 160

శ్లో॥ న్యక్కర్తృషు చ గర్గేషు గార్గ్యాత్ స్యాత్తచ్చనేష్యతే ॥ $160\frac{1}{2}$

కాల్యామ్ = అతిశయించునది ''కాలి'', అగునపుడు, (కాలీ శబ్దము) ద్వితీయాంతాత్ = ద్వితీ యాంతమైన, కాలాత్ = కాల, శబ్దమునకును, కాలే = తిరస్కరించువాడు కాలుడయినపుడు, (''కాల'' శబ్దము), కాల్యాః = కాలీ శబ్దమునకును, తరప్ = తరప్ ప్రత్యయము, భవేత్ = అయ్యెడిని, తథా = అట్లు, గార్గ్యే = గార్గ్యుడు, న్యక్కర్తరి = తిరస్కరించువాడగు నపుడు, గర్గేభ్యః = బహువచనాంతరమైన గర్గ శబ్దమునకును, గర్గేషు = గర్గులు, న్యక్కర్తృషు = అతిశయించువారగు నపుడు, గార్గ్యాత్ + చ = గార్గ్య శబ్దమునకును, ప్రత్యయః = తరప్ ప్రత్యయము, స్యాత్ = ప్రవర్తించెడిని, తత్ + చ = అది, న + ఇష్యతే = అభి మతము కాదు.

తాత్పర్యము— ''కాలమ్ - అతిశేతే - కాలీ'' (నల్లని వానిని మించు నల్లని ఆడుది) అను నర్థమున కాలశబ్దమునకు తరప్ ప్రత్యయము వచ్చి, ''కాలతరా'' అని కావలసి

వచ్చును. (''కాలితరా'' అనునది ఇష్టమైన రూపము. ''కాలీమ్ - అతిశేతే - కాలః'' (నల్లని దానిని అతిశయించు నల్లవాడు) అను నర్థమున కాలీ శబ్దమునకు తరప్పు వచ్చి, ''కాలితరః'' అని కావలసి వచ్చును. (''కాలతరః'' అన్నది అభిమతము). ఇట్లు లింగము వేరగుట సంభవించెడిని.

అట్లే కొన్నిచోట్ల ప్రకృత్యర్థముయొక్క సంఖ్యయు, ప్రత్యయార్థముయొక్క సంఖ్యయును వేరు కావలసి వచ్చును. ఉదా : ''గర్గాన్ - అతిశేతే - గార్గ్యః''. (గర్గులను మించు గార్గ్యుడు) అను భావమున గర్గ శబ్దమునకే ప్రత్యయము వచ్చి, ''గర్గతరః'' అను రూపమయ్యెడిని. (''గార్గ్యతరః'' అనునది ఇష్టము). ''గార్గ్యమ్ - అతిశేరతే - గర్గాః'' (గార్గ్యుని అతిశయించిన గర్గులు) అను భావమున గార్గ్య శబ్దమునకు తరప్పు వచ్చి, ''గార్గ్యతరాః'' అను రూపమయ్యెడిని. (''గర్గతరాః'' అనునది అభీష్టము). ఈ విధముగ లింగ భేదమును సంఖ్యాభేదమును కూడ ప్రాప్తించుచున్నది. అది అభిమతము కాదు.

*వివరణము*— కాలః, అనునది పుంలింగము. కాలీ, అనునది స్త్రీలింగము. అతిశయించు వస్తువుయొక్క లింగమును, తిరస్కరింపబడు వస్తువుయొక్క లింగమును వేరుగ నున్నపుడు ప్రకృతియొక్క లింగము మారకుండ ఉండిపోవలసి వచ్చును. ప్రత్యయార్థము యొక్క లింగమే (అతిశయించు ద్రవ్యముయొక్క లింగము) మొత్తముపై వచ్చుట అభీష్టము

అట్లే గార్గ్య - అనునది ఏకవచనము. గర్గాః, అన్నది గార్గ్య శబ్దముయొక్క బహువచనము. (యఞ్ ప్రత్యయము లోపించును). పై విధముగనే యిచట కూడ వచనములు (సంఖ్య) తారుమారయిపోవును. అతిశయించు వస్తువుయొక్క సంఖ్యయే మొత్తముపై వచ్చుట అభీష్టము. కాగా అతిశాయనమన్నది ప్రత్యయార్థమునకు విశేషణమను పక్షమున ''లింగ భేదమును సంఖ్యాభేదమును'' అను దోషములు ప్రాప్తించుచున్నవని ఫలించినది. ॥160॥

*అవతారిక*— ''అతిశాయనము'' (అతిశయించునది = మించునది) ప్రకృత్యర్థమునకే విశేషణమని చెప్పుట యుక్తము" - అనునది సిద్ధాంతము. ఇందును కొంత దోషమున్నదని చూపుచున్నాడు.

**శ్లో॥ కుమార్యాః స్వార్థికే జీప్ స్యాత్ ప్రకృత్యర్థోహి నాధికః ॥ 161**

స్వార్థికే = ప్రకృత్యర్థమును బోధించునపుడు, కుమార్యాః = కుమారీ శబ్దము విషయమున, జీప్ = జీప్, అను స్త్రీ ప్రత్యయము (ఈ), స్యాత్ = అయ్యెడిని, ప్రకృత్యర్థః = ప్రకృతియైన శబ్దముయొక్క అర్థము, అధికః = అధికమైనది, న + హి = కాదుగదా :

*తాత్పర్యము*— తరప్ ప్రత్యయము ప్రకృత్యర్థమందే ప్రవర్తించినచో "కుమారితరా" అనుచోట జీప్పు రావలసివచ్చును. (కుమారితరీ - అను రూపము ప్రాప్తించెడిని). ఈ పక్షమున ప్రకృతియొక్కయు ప్రత్యయముయొక్కయు అర్థ మొకటేయగును గదా :

*వివరణము*— "అతిశాయనమ"న్నది ప్రకృత్యర్థమునకే విశేషణమన్నచో, తరప్

ప్రత్యయమునకు వేరుగ నర్థమేదియు నుండదు. "ఇది మిన్నయగు వస్తువు" అను భావమును ప్రకృతియే బోధించును. ఆ భావమునే ప్రత్యయము కూడ అనువదించును. ఇట్లు ప్రకృత్యర్థమునే బోధించుటవలన ప్రత్యయము స్వార్థికమగును. అర్థములో భేదముండదు. "కాలీ - అతిశేతే = కాలితరా" (అతిశయించు కాలి = నల్లని స్త్రీ), "కాలః - అతిశేతే = కాలతరః" (మిన్న యగు కాలుడు = నల్లని వాడు) మొదలగు రీతిని అభీష్టరూపములు సిద్ధించును. పైన చూపిన లింగ సంఖ్యల భేదమను దోషము ప్రసక్తము కాదు.

కాని "కుమారితరా" మొదలగుచోట్ల వేరొక రీతిని దోషము కలిగెడిని. కుమార, కిశోర, అనునవి తొలి వయసుగల వ్యక్తిని చెప్పు శబ్దములు. స్త్రీత్వమున "వయసి ప్రథమే" (4-1-20) అను సూత్రముచే వీనికి "ఙీప్" (ఈ) ప్రత్యయమగును. (కుమారీ, కిశోరీ, అను రూపములగును). పిదప "కుమారీ - అతిశేతే" (మించు కుమారి) అను నర్థమున తరప్పు వచ్చినపుడు కూడ ఈ స్త్రీ ప్రత్యయమే ప్రవర్తించి, "కుమారితరీ" అను రూపము కావలసి వచ్చును. అది ఇష్టము కాదు.

విశేష విషయములు— (1) "వయసి ప్రథమే" - "తొలి వయసుగల స్త్రీని చెప్పు అకారాంతమగు శబ్దమునకు ఙీప్పు వచ్చును" అని యర్థము. ఉదా : కుమారీ, కిశోరీ మొదలగునవి. స్త్రీ ప్రత్యయములు కూడ కేవలము ద్యోతకములే. అనగా ప్రకృత్యర్థముగా సిద్ధమైన స్త్రీత్వమునే అవి వెల్లడించును. స్త్రీత్వమును క్రొత్తగా బోధింపవు.

(2) తరప్పు, స్వార్థికమన్నచో అర్థభేదము లేనందున, "కుమారితర" అను శబ్దమునకును ఙీప్ ప్రత్యయమే రావలసి వచ్చును. అది సాధువు కాదు. అతిశాయనమను క్రొత్త భావమును వెల్లడిచేయుచు "టాప్" (ఆ) అను స్త్రీ ప్రత్యయము వచ్చుటయే అభిమతము. ("కుమారితరా" అనునది సాధువు).

(3) తరప్పు స్వార్థికమగునపుడు ప్రథమాంతమగు ప్రాతిపదికమునకే చేరుచుండును. ఉదా : "కాలీ - అతిశేతే = కాలితరా" మొదలగునవి.

(4) "కుమారితరా" మొదలగు చోట్ల మొదటిదగు ఙీప్పు (ఈ) ప్రథమ వయస్సునకును, రెండవదగు టాప్పు (ఆ) అతిశాయనమునకును ద్యోతకమగునని సారాంశము.

(5) స్వతంత్రముగ ఒకానొక యర్థమును చెప్పునది వాచకమనియు, ఉన్న అర్థమును సూచించునది ద్యోతకమనియు వ్యవహరింపబడును. ప్రయోగముల ననుసరించియే వాచకత్వమునుగాని, ద్యోతకత్వమునుగాని నిర్ణయించుకొనవలెను. శాస్త్రీయమగు ప్రక్రియ ఈ విషయమున పనికిరాదు.

*అవతారిక*— ఇట్లు తరప్ ప్రత్యయము స్వార్థికమన్నను దోషముండుటచే, దానిని వారించుటకై భాష్యకారుడు చూపిన ఒక మార్గమును విశదీకరించుచున్నాడు.

**శ్లో॥ షష్ఠ్యంతాదధికే తస్మాద్గుణే స్వాశ్రయవర్తిని ।**
**ఉత్కృష్టసమవేతాయాం క్రియాయాం వా విధీయతే ॥** 162

తస్మాత్ = అందువలన, స్వాశ్రయవర్తిని = తనకు ఆధారమైన ద్రవ్యమందుండు, అధికే = అధికమైన. గుణే = గుణమందుగాని, ఉత్కృష్టసమవేతాయామ్ = అధికమైన ద్రవ్యమందుండు, క్రియాయామ్ + వా = క్రియయందుగాని, షష్ఠ్యంతాత్ = షష్ఠ్యంతమైన ప్రాతిపదికమునకు, విధీయతే = తరప్పు విధింపబడును.

తాత్పర్యము— మిన్న యగుటకు మూలముగా తీసికొనబడునట్టియు, ద్రవ్యమందు నియతముగ నుండునట్టి గుణమునుగాని క్రియనుగాని బోధించునదిగ తరప్పు ప్రవర్తించునని చెప్పవలెను. అది షష్ఠ్యంతమగు ప్రాతిపదికమునకు చేరును. ఇట్లు చెప్పినచో దోషములేవియు రావు.

వివరణము— అతిశయమును కలుగజేయునది అతిశాయనమని చెప్పినపుడు, ద్రవ్యమందుండు గుణమును తీసికొనవచ్చును. గుణమువలననే ద్రవ్యమునకుత్కర్షము ఏర్పడును గదా! అట్లుగాక ''అతిశయమే - అనగా - మించియుండుటయే - అతిశాయన'' మన్నచో అది క్రియారూపముగాన క్రియనే ప్రకర్షహేతువుగా స్వీకరింపవచ్చును. ఈ రెండు రీతులందును ఆ యా ద్రవ్యమందలి గుణమునుగాని క్రియనుగాని వేరుగా భావించి, అదియే అతిశయమునకు హేతువని చెప్పుదుము. తరప్పు ఆ యర్థమున ప్రవర్తించి చివరకు ఆ యా గుణక్రియలకు ఆశ్రయమైన ద్రవ్యమునే బోధించును. ఉదా: ''శుక్లస్య - అతిశాయనః - గుణః = శుక్లతరః'' = తెలుపుచే మిన్నయగు తెల్లని వస్తువు (గుణము), ''శుక్లస్య - అతిశాయనమ్ = శుక్లతరః'' = తెల్లని వస్తువుయొక్క గొప్పదనము. (మించియుండుట = ఇది క్రియ). ఈ పక్షమందు ప్రకృతియొక్కయు ప్రత్యయముయొక్కయు అర్థములు వేరుగా నుండవుగాన లింగభేదముగాని, సంఖ్యాభేదముగాని ప్రసక్తము కాదు. ఆశ్రయమగు ద్రవ్యమొకటే యగుటచే ఆయనందున తదనుసారమే లింగసంఖ్యలు ప్రవర్తించును. అట్లే ''కుమారితరా'' మొదలగుచోట్ల ప్రత్యయార్థము ముఖ్యమై (గుణముకాని క్రియకాని) ప్రకృత్యర్థము (కుమారియందలి గొప్పదనము) విశేషణమగునుగాన జీప్పు కూడ మొత్తముపై ప్రవర్తింపదు. (తరప్ ప్రత్యయాంతమునకు జీప్పు రాకుండ టాప్ ప్రత్యయమే చేరును).

కాగా గుణక్రియలను వేరుగా చూపుటవలన దోషములు కలుగవని ఫలించినది.॥162

అవతారిక — ద్రవ్యమందలి గుణమునుగాని క్రియనుగాని విడదీసినపుడు తరప్పు యొక్క అర్థము ఆ రెండింటిలో ఒకటియై ప్రధానమగును. ఆశ్రయమైన ద్రవ్యము అప్రధానమగును. అయినపుడు సామానాధికరణ్యము (ఒకేచోట నుండుట=ఒకే యర్థమును తెలుపుట) ఎట్లు కుదురును? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపాత్తం చ ప్రకృత్యర్థో ద్రవ్యమేవాశ్రయస్తయోః।
సోఽయమిత్యభిసంబంధాదభేదేన ప్రతీయతే ॥ 163

ప్రకృత్యర్థః = ప్రాతిపదికము యొక్క అర్థముగా, ఉపాత్తమ్ = తీసికొనబడిన, ద్రవ్యమ్ +

ఏవ = ద్రవ్యమే, తయోః = ఆ గుణక్రియలకు, ఆశ్రయః = ఆధారమై, సః + అయమ్ + ఇతి = "అదేయిది" అను, అభిసంబంధాత్ = సంబంధము వలన, అభేదేన = అభేదముతో (భేదము లేకుండ), ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్యము— గుణక్రియలను వేరుగా భావించినను అవి తరప్ ప్రత్యయము యొక్క అర్థములని చెప్పినను, వాని కాధారమైనది ప్రకృత్యర్థమైన ద్రవ్యమే. అందువలన ఆధారమైన ద్రవ్యమునకును ఆధేయములైన గుణక్రియలకును అభేదమును కల్పించుకొని సామానాధికరణ్యమును సంపాదింపవచ్చును.

వివరణము— అతిశయమును వెల్లడించునది తరప్పు. తరబంతమైన శబ్దము కేవలము గుణమునో క్రియనో బోధించుట అసంగతమగును. "శుక్లతర" మొదలగునవి ద్రవ్యమును బోధించుటయే ప్రసిద్ధము. అందుచే అభేదమును భావించి సామానాధికరణ్యమును పొందవలెను.

లింగభేదము, సంఖ్యాభేదము మొదలగు దోషములను వారించుటకు మాత్రమే గుణ క్రియలను వేరుచేయుట అను ఊహ ఏర్పడినది.

కాగా "శుక్లతర" మొదలగుచోట్ల అతిశయముగల ఆ యా ద్రవ్యమే బోధపడును కాన దాని ననుసరించియే లింగవచనములు ప్రవర్తించుచుండును. "గుణవచనముల కాశ్రయము ననుసరించి లింగవచనములగును" అను వచన మీ విధముగ ఇచట సమన్వితమగును.

విశేష విషయములు— శుక్లతర, మొదలగుచోట్ల "ప్రకృతియొక్క అర్థము ద్రవ్యము. ప్రత్యయముయొక్క అర్థము గుణక్రియలలో ఏదోయొకటి" అనునది భేదభావనము. "తుదకు ప్రకృతి ప్రత్యయముల అర్థములు రెండును ఒకటే. ద్రవ్యమును విడిచి గుణ క్రియలు వేరుగా నుండవుగదా!" అనునది అభేద భావనము. ॥163॥

*అవతారిక*— శుక్లతర, మొదలగుచోట్ల "శుక్ల" మొదలగు శబ్దములు ఆ యా గుణముగల ద్రవ్యసామాన్యమును (ఏదయిన ఒక వస్తువు - అను నర్థమును) బోధించును. తరప్ ప్రత్యయముకూడ "అతిశయముతో కూడిన - అనగా - మిన్నయగు - ఆ యా గుణముగల ద్రవ్యసామాన్యమునే" తెలుపును. అంతియగాని ద్రవ్యవిశేషమును (నిర్దిష్టమగు ఒక వస్తువును) చెప్పజాలవు. అయినపుడు ఆశ్రితమగు గుణము ఏ విధముగను వేరుగా తెలియనందున "ద్రవ్యమును బట్టి గుణవాచకములకు లింగవచనములగును" అను వచనమును సమన్వయము చేయుట ఎట్లు? - అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ రూపాభేదాచ్చ తద్ద్రవ్యమాకాంక్షావత్ ప్రతీయతే ।**
**విశేషైర్భిన్నరూపై స్తదాశ్రయైరివ యుజ్యతే ॥ 164**

రూపాభేదాత్ + చ = రూపభేదము లేనందువలన, తత్ = ఆ, ద్రవ్యమ్ = ద్రవ్యము, ఆకాంక్షావత్ = ఆకాంక్షగలదిగ, ప్రతీయతే = తెలియబడును, భిన్నరూపైః = వేర్వేరు

స్వరూపములుగల, విశేషైః = ద్రవ్యవిశేషములతో, తత్ = ఆ ద్రవ్యసామాన్యము, ఆశ్రయైః + ఇవ = ఆధారములతోవలె, యుజ్యతే = కూడును.

తాత్పర్యము— శుక్లతర, మొదలగుచోట్ల తొలుత ద్రవ్యసామాన్యము బోధపడుట సహజమే. అయినను అది ''పటము'', ''ఘటము'', మొదలగు ఏదో ఒక విశేషమును అపేక్షించుచునే యుండును. (విశేషములేని సామాన్యముండదుగాన). అట్టి విశేషమును ఆశ్రయముగను, సామాన్యమును ఆశ్రితముగను భావించుకొనవలెను. ఈ విధముగ లింగవచనముల వ్యవస్థ కుదురును.

వివరణము— ''శుక్లతరః'' అనగానే ''మిక్కిలి తెల్లనిది'' అనియే తెలియును. అయినను అంతమాత్రమున భావము పూర్తికానందున, ''పటః'', ''ఘటః'', మొదలగు ఏదో ఒక విశేషమగు వస్తువును చెప్పక తప్పదు. ఆ వస్తువునే ఆశ్రయమని భావించి తదనుసారము లింగవచనములను చెప్పుకొనవలెను. ఉదా : శుక్లతరః = పటః ; శుక్లతరా = నారీ ; శుక్లతరమ్ = వస్త్రమ్, మొదలగునవి. ఇట్లు లింగసంఖ్యల సమన్వయములో చిక్కేదియు కలుగదు. ॥164॥

అవతారిక— కాగా—

శ్లో॥ భిన్నరూపేషుయల్లింగం విశేషేషు వ్యవస్థితమ్ ।
సంఖ్యా చ తాభ్యాం ద్రవ్యాత్మా సోఽభిన్నో వ్యపదిశ్యతే ॥ 165

భిన్నరూపేషు = వేర్వేరు స్వరూపములుగల, విశేషేషు = విశేషవస్తువులందు, యత్ = ఏ, లింగమ్ = లింగమును, సంఖ్యా + చ = వచనమును (గలవో), తాభ్యామ్ = ఆ రెండిటితోను, సః = ఆ, ద్రవ్యాత్మా = ద్రవ్యసామాన్యము, అభిన్నః = వేరుకానిదియై, వ్యపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ద్రవ్యసామాన్యము ఆశ్రితము (ఆధేయము) గను, ద్రవ్యవిశేషమాశ్రయముగను భాసించును. విశేషముయొక్క లింగసంఖ్యలు సామాన్యమునకు సంక్రమించును. తుదకు సామాన్యవిశేష్యములు రెండును ఒకటియే అగునుగదా ! ఇట్లు ''ఆశ్రయమును బట్టి ఆశ్రితమునకు లింగవచనములగును'' అను వచనమిచట సరిపోవును. ॥165॥

అవతారిక— అతిశయించునది గుణమైనపుడు అది ఆశ్రయమైన ద్రవ్యమందుండును గాన, ఆశ్రయముననుసరించి గుణవాచకమునకు సంఖ్య (వచనము) సంక్రమించుట సిద్ధించును. కాని అతిశయించునది క్రియ అగునపుడు, ''మించు వస్తువు - మించబడు వస్తువు'' అను రెండు వస్తువులును ఆ క్రియ కాశ్రయములని భావించినచో ఎల్లపుడును ద్వివచనము రావలసివచ్చునని భాష్యకారుడు శంకించి సమాధానమును చెప్పెను. ఆ తీరును వివరింపుచున్నాడు.

శ్లో॥ ఆశ్రయః సమవాయీ చ నిమిత్తం లింగసంఖ్యయోః ।
కర్తృస్థభావకశ్చేతిరతో భాష్య ఉదాహృతః ॥ 166

ఆశ్రయః = ఆధారమైనట్టిది, సమవాయీ + చ = విడదీయుటకు వీలులేని సంబంధము గలిగి నట్టి ద్రవ్యము, లింగసంఖ్యయోః = లింగమునకును, వచనమునకును, నిమిత్తమ్=నిమిత్తము (భవతి = అగును). అతః = ఇందువలన, శేతిః = ''శీ'', అను ధాతువు, కర్తృస్థభావకః= కర్తయందుండు వ్యాపారము గలదిగ, భాష్యే = భాష్యమందు, ఉదాహృతః = చెప్పబడెను.

తాత్పర్యము— వ్యాపారము ఏ ద్రవ్యమందు నియతముగ నుండునో - ఆ ద్రవ్యమే ఆ వ్యాపారమున కాశ్రయమగును. దాని ననుసరించియే లింగవచనములను చెప్పవలెను. ప్రకృతమున ''అతిశయించుట'' (అతి + శీ ⟶ అతిశేతే = అతిశాయనః = అతిశయించు నది), అను వ్యాపారము కర్తరియగు ద్రవ్యమందే యుండును. కావున దాని ననుసరించియే వచనము వచ్చునుగాని ఎల్లపుడును ద్వివచనము రాదని భాష్యకారుడు చెప్పెను.

వివరణము— ''అతి'' అనునది ఉపసర్గము. ''శీ'' అనునది ధాతువు. ఉపసర్గము యొక్క బలముచే ఈ ధాతువు సకర్మకమగునన్నచో, అతిశయించు కర్త ఒకటియు అతిశ యింపబడు కర్మ ఒకటియు రెండు ద్రవ్యములుండును. ఆ రెండును క్రియ కాధారములన్న పుడు ద్వివచనము తప్పదు. కాని ''అతిశీ'' అను ధాతువు అకర్మకమని భాష్యకారుడు చెప్పెను. కావున కర్తయగు ద్రవ్యమొక్కటియే క్రియ కాధారమగును. తదనుసారముగనే ఏకవచనము సిద్ధించును. ॥166॥

అవతారిక— కర్మనుకూడ ఆశ్రయముగ భావించినచో ద్వివచనమును రావచ్చు ననుచున్నాడు.

శ్లో॥ నిమిత్తమాశ్రయత్వేన గృహ్యేత యది సాధనమ్ ।
కర్మోపదిష్టయోః ప్రాప్తిస్తత్ర స్యాల్లింగసంఖ్యయోః ॥ 167

సాధనమ్ = కారకము, నిమిత్తమ్ = నిమిత్తమాత్రముగాను, ఆశ్రయత్వేన = ఆధారముగాను, గృహ్యేత + యది = స్వీకరింపబడినట్లయితే, తత్ర = అచట, కర్మోపదిష్టయోః = కర్మకు సంబంధించినట్లు చెప్పబడు, లింగసంఖ్యయోః = లింగవచనముల యొక్క, ప్రాప్తిః = రాక, స్యాత్ = అగును.

తాత్పర్యము— ''కర్తయగునది కర్మను అపేక్షించునను'' భావనవలన, కర్మను గూడ క్రియకు ఆశ్రయముగ తీసికొన్నచో కర్మకుచెందిన లింగవచనములును రావచ్చును.

వివరణము— ''అతిశయించుట'' అను క్రియ వాస్తవముగ కర్తయందే నియత ముగ నుండును. అయినను ఏదో విధముగ కర్మ కూడ స్ఫురించునని భావించి, అదియు క్రియ కాశ్రయమని చెప్పినపుడు, ద్వివచనము (కర్తృ కర్మలకు రెండిటికిని చెందునట్లు) రావచ్చునని భాష్యకారుడు వ్యాఖ్యానించెను. ఉదా : ''శుక్లస్య - అతిశాయనః = శుక్లతరౌ'' మొదలగునవి.

విశేష విషయములు— క్రియ అన్నది ఎల్లపుడును కర్తయందే యుండును. కాగా

అది కర్తృసమవేతము. కర్మ సమవేతము కాదు. అయినను భావనాబలముచే కర్మనుకూడ క్రియకాశ్రయముగ చెప్పవచ్చునను ప్రౌఢవాదము ననుసరించి ఈ చర్చ జరిగినది.

ఈ కారికతో ''అతిశాయనే తమబిష్ఠనౌ'' అను సూత్రమందలి భాష్యముయొక్క పరిశీలనము ముగిసినది. ॥167॥

## (9) లింగవచనముల అతిదేశ ప్రసంగమున "స్త్రియామ్" (4-1-3) అను సూత్రమందలి భాష్యపరిశీలనము

*అవతారిక*— 158 వ కారికలోని సరుసలో వెను నుండి రెండవదగు ''స్త్రియామ్'' (4-1-3) అను సూత్రముయొక్క భాష్యమును పరిశీలించుటకు ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥** శాస్త్రే నిమిత్తభావేన సముదాయాదపోద్ధృతః ।
స్త్ర్యర్థస్తస్యేచ్ఛయాయోగః ప్రకృత్యా ప్రత్యయేన వా ॥ 168

స్త్ర్యర్థః = స్త్రీత్వమను ధర్మము, సముదాయాత్ = పదము మొత్తమునుండి, నిమిత్తభావేన = నిమిత్తముగా, శాస్త్రే = వ్యాకరణశాస్త్రమున, అపోద్ధృతః = వేరుచేయబడినది, తస్య = ఆ ధర్మమునకు, ప్రకృత్యా = ప్రకృతితోగాని, ప్రత్యయేన + వా = ప్రత్యయముతోగాని, ఇచ్ఛయా = ఇచ్ఛననుసరించి, యోగః = సంబంధము, (భవతి = అగును).

*తాత్పర్యము*— పదార్థములందుండు స్త్రీత్వమను ధర్మము సహజసిద్ధము. అది ''అజా, గౌరీ,'' మొదలగు పదములను పూర్తిగా ఉచ్చరించునపుడే తెలియుచుండును. అయినను స్పష్టతకొరకై వ్యాకరణము ప్రకృతి ప్రత్యయములను విడదీసి స్త్రీత్వమును సమన్వయము చేయును. అపుడా స్త్రీత్వము ప్రకృతియొక్క అర్థమనికాని, ప్రత్యయముయొక్క అర్థమనికాని చెప్పుకొనవచ్చును.

*వివరణము*— ''స్త్రియామ్'' అనునది అధికారసూత్రము. కావున అది ప్రత్యయములను విధించు సూత్రములతో చేరి, స్త్రీత్వమందు టాప్ (ఆ), ఙీప్ (ఈ), మొదలగు ప్రత్యయములు ప్రాతిపదికమునకు చేరునని బోధించును. ఇచట స్త్రీత్వమను ధర్మము లోకములో ప్రసిద్ధమైన ''స్తనకేశాదులను కలిగియుండుట'' కాదు. సత్త్వము, రజస్సు, తమస్సు - అను ప్రకృతిగుణములయొక్క అపచయము— అనగా - తక్కువగానుండు స్థితి - స్త్రీత్వమని వ్యాకరణమున ఒక వ్యవస్థ ఏర్పడి ఉన్నది. దీనినే ''సంస్త్యానము'' (తిరోభావము = గుణత్రయము తగ్గియుండుట) అని సాంకేతికముగ వాడుదురు. ఈ సందర్భమున ఇటుపైని ''సంస్త్యానము'' అను పదము తరచుగ వినవచ్చుచుండును.

పదములఖండములని సిద్ధాంతము. అయినను వైశద్యమునకై ప్రకృతి ప్రత్యయములను శాస్త్రము కల్పించును. కాగా స్త్రీత్వమును తెలుపు పదములలోగూడ ప్రకృతి ప్రత్యయములను చూపుట కాల్పనికమే. అజా, గౌరీ, మొదలగుచోట్ల స్త్రీత్వమును సూచించు ప్రత్య

అవతారిక—— పై యర్థమునే దృఢపరచుచున్నాడు.

శ్లో॥ యస్యాన్యస్య ప్రసక్తస్య నియమార్థా పునఃశ్రుతిః ।
నివృత్తౌ చరితార్థత్వాత్సంఖ్యా తత్రావివక్షితా ॥ 89

యస్య = దేనికి, పునః + శ్రుతిః = మరల చెప్పుట, అనగా సూత్రమున చెప్పకపోయినను సిద్ధించుచుండగా మరల చెప్పుట, అన్యస్య = ఇతరమగు దానికి, ప్రసక్తస్య = ప్రసక్తమగు కార్యమునకు, నివృత్తౌ = వారించుట విషయమై చరితార్థత్వాత్ = చూపబడిన ప్రయోజనము కలది యగుట వలన, నియమార్థా = నియమము ప్రయోజనముగా కలదియో, తత్ర = అచట, సంఖ్యా = ఏకత్వము మున్నగు సంఖ్య, అవివక్షితా = అవివక్షితమగును.

"కర్తు రీప్సితతమం కర్మ" (1-4.49) అను సూత్రమున కర్తుః, అను పదము కలదు. దానివలన కర్తకు ఈప్సితము కర్మ సంజ్ఞ కలదని యర్థము లభించును. కాని బాగుగ ఆలోచించిన 'కర్తుః' అను పదము సూత్రమునలేకున్నను ఆ యర్థము లభించును. ఎట్లన, 'ఈప్సితతమమ్' అనగా మిక్కిలి కోరబడినది యని యర్థము. కోరు వానిని వేరుగ చెప్పకున్నను అర్థాత్తు లభించును, ఆ కోరువాడు కర్తయే. ఈ రీతిగా కర్తుః అను పదము వ్యర్థమే యగుచున్నది. పై పద్ధతిలో కర్మకు కరణమునకు గూడ ఈప్సితతమమగునది కర్మ సంజ్ఞకము కావలెను. అది సమ్మతము కాదు, అందుచే 'కర్తుః' అను పదమువలన "కర్తకే ఈప్సితతమము కర్మయగును" అని నియమము సిద్ధించును. అట్టితరి కర్మాదులకు ఈప్సిత మగు దానికి కర్మ సంజ్ఞ వారింపబడును.

కాగా 'కర్తుః' అను పదము కారకాంతరమునే వారించుచున్నది. కర్త ఒకడా, కాక అనేకమా అను అర్థముతో ప్రసక్తిలేదు. కాబట్టి సంఖ్య *అవివక్షితమే యగును. ॥89॥

అవతారిక—— 'ప్రాతిపదికాత్' అను స్థలమున ఏకత్వసంఖ్య వివక్షితమగును. అందుచే ఒకే ప్రాతిపదికము కంటె సుప్ ప్రత్యయము ప్రవర్తించును. అంతియేకాని 2.3 ప్రాతిపదికములకంటె విభక్తి ప్రత్యయము ప్రవర్తింపదని 87 వ శ్లోకమున చెప్పబడినది.

కాని మహాభాష్యకారుడు 'సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ' (1-2.64) అను సూత్రమును వ్యాఖ్యానించుచు ప్రాతిపదిక సముదాయము కంటెను విభక్తి ప్రత్యయము కలుగునని చెప్పెను.

కాగా పై భాష్యము విరోధించుచున్నది అను పూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సరూపసముదాయాత్తు విభక్తిర్యా విధీయతే ।
ఏకస్తత్రార్థవాన్ సిద్ధః సముదాయస్య వాచకః ॥ 90

---

* 89 వ శ్లోకార్థమునకు "శేషాత్కర్తరి పరస్మైపదమ్" (1-3.78) మున్నగు చాల సూత్రములు ఉదాహరణములు కాగలవు. విశేషము నాకాంక్షించువారు మూలగ్రంథము చూతురుగాక. గ్రంథవిస్తర భీతిచే నిచట చూపలేదు.

యము (ఆ, ఈ,) వినబడుచుండును. సరిత్, వాక్, మొదలగుచోట్ల అట్టి ప్రత్యయమే విన బడదు (అయినను అవి స్త్రీలింగములే). అందుచే స్త్రీత్వమనునది ప్రకృత్యర్థమనుటకును (సరిత్, వాక్, మొదలగు స్థలములు) ప్రత్యయార్థమనుటకును గూడ (అజా, గౌరీ, మొదలగు స్థలములు) అవకాశమున్నది. ॥168॥

*అవతారిక*— మీది భావమునే వివరింపుచున్నాడు.

**శ్లో॥ స్త్రీశబ్దో గుణశబ్దత్వాత్తుల్యధర్మా సితాదిభిః ।**
**గుణమాత్రే ప్రయుజ్యేత సంస్త్యానవతి వాశ్రయే ॥ 169**

గుణశబ్దత్వాత్ = గుణమును చెప్పు శబ్దమగుటవలన, స్త్రీశబ్దః = "స్త్రీ" అను శబ్దము, సితాదిభిః = సిత, శుక్ల, మొదలగువానితో, తుల్యధర్మా = సమానమైన స్వభావముగలది, గుణమాత్రే = కేవలము గుణమందు, ప్రయుజ్యేత = ప్రయోగింపబడును, వా = లేక, సంస్త్యానవతి = సంస్త్యానమను గుణముగల, ఆశ్రయే = ద్రవ్యమందు, ప్రయుజ్యేత = ప్రయోగింపబడును.

*తాత్పర్యము*— "స్త్రియామ్" అను సూత్రమున స్త్రీశబ్దము సంస్త్యానమను గుణమును తెలుపును. కావున అది శుక్ల, మొదలగు గుణవాచకములతో సమానమగును. కావుననే కేవలము గుణము (సంస్త్యానము) ను కాని, ఆ గుణమున కాధారమైన ద్రవ్యమునుగాని స్త్రీ శబ్దము బోధింపగలదు.

*వివరణము*— "స్త్రీ = సంస్త్యానమ్", సమ్ = బాగుగా, స్త్యానమ్ = అణగి యుండుట. అనగా "సత్త్వము, రజస్సు, తమస్సు, అను మూలగుణములుగాని, వాని పరిణామములైన శబ్దము, రూపము, మొదలగు గుణములుగాని తగ్గియుండుట" – స్త్రీత్వమగును. ఈ ధర్మమునే "సంస్త్యానమ"ను శబ్దముతో గ్రంథకర్త వ్యవహరించుచుండును.

కాగా సంస్త్యానము –లేక– స్త్రీత్వము ఒక విధమైన గుణమైనందున శుక్లాది శబ్దములవలె స్త్రీశబ్దము కూడ గుణమును గుణిని బోధించుట కవకాశము కలదు.

విశేష విషయములు— "సంస్త్యానమును స్త్రీత్వమును ఒకటే" అనుకొని "స్త్రియామ్" అను సూత్రమునకు వ్యాఖ్యానము చేయవలెను. "ప్రాతిపదికాత్" అను పద మిచట సంబంధించును. కాగా – "స్త్రియామ్ = స్త్రీత్వేగుణే, ప్రాతిపదికాత్ – ప్రత్యయః" = "ఏదో ఒక వస్తువును చెప్పు శబ్దమునకు, స్త్రీత్వమను గుణమును బోధించుచు "టాప్" మొదలగు ప్రత్యయములగును" అని యర్థము వచ్చును. ఇపుడు స్త్రీత్వము ప్రత్యయముయొక్క అర్థమగును. ("స్త్రియామ్", అను స్త్రీశబ్దము గుణమునే చెప్పును). దీనిని "ప్రత్యయార్థ పక్ష"మందురు (అనగా స్త్రీత్వము ప్రత్యయముయొక్క అర్థమని భావము).

అట్లుగాక – స్త్రీశబ్దము స్త్రీత్వముగల ద్రవ్యమునే బోధించునన్నచో సూత్రము యొక్క అర్థము రెండు విధములుగ సంభవించును. అందు మొదటిది "సమానాధికరణ

పక్షము'', ఇచట ఒక చిత్రమున్నది. దానిని ముందుగ గ్రహింపవలెను. ''శుక్లత్వము'' మొదలగు గుణములను నిమిత్తముగ తీసికొని, శుక్ల, మొదలగు శబ్దము లాయా ద్రవ్యముల నన్నింటిని కూడ చెప్పగలవు ఉదా : శుక్లః = పటః = తెల్లనిబట్ట. శుక్లః = ఘటః = తెల్లని కుండ (తెల్లని వస్తువేదయినను సరే). కాని స్త్రీత్వమను గుణమట్టిది కాదు. స్త్రీత్వమును నిమిత్తముగా గ్రహించి ఒక ద్రవ్యమును బోధించుట అన్నది ఒక్క ''స్త్రీ'' అను శబ్దమునకే తప్ప మిగిలిన ఏ శబ్దమునకును సంభవింపదు. (స్త్రీశబ్దము స్త్రీనిమాత్రమే చెప్పగలుగును. మిగిలిన వస్తువులను చెప్పజాలదు) ఒక్క ''స్త్రీ'' శబ్దముకొరకే సూత్రమారంభించుట నిష్ఫలమగును అందుచే స్త్రీశబ్దము ద్రవ్యమును దేనినైనను బోధించుననియు, అపుడు స్త్రీత్వమను ధర్మము ఉపలక్షణము మాత్రమే అగుననియును చెప్పవలెను. అనగా ''శబ్దము బోధించు ద్రవ్యమందలి స్త్రీత్వము సూచితమైనచో చాలునని'' తెలియును. అపుడు ''స్త్రియామ్= స్త్రీసమానాధికరణాత్ = ప్రాతిపదికాత్ - ప్రత్యయః = స్త్రీ అను శబ్దముతో సమానాధికరణమైన శబ్దమునకు ప్రత్యయమగును'' అని సూత్రార్థము వచ్చును. ప్రాతిపదికార్థముగ స్త్రీత్వము లేకున్నను ''స్త్రీ'' అను భావము సూచితమైనచో ప్రత్యయము రావచ్చునని ఫలించును. అట్లయినపుడు సహజముగ స్త్రీత్వమును చెప్పు శబ్దములతోపాటు - వాని యర్థముతో మాత్రమేకీభవించి - స్త్రీత్వమును చెప్పని శబ్దములకు కూడ ప్రత్యయములు రావలసివచ్చును. ఇట్టి సమానాధికరణ పక్షమందు సంభవించు దోషమునే దిగువ కారికలు విశదపరచును.

రెండవది ప్రకృత్యర్థ పక్షము. ''స్త్రీత్వమను గుణమును కలిగిన ద్రవ్యమును సూటిగ చెప్పు శబ్దమునకు ప్రత్యయములగును'' అని ఇందు సూత్రార్థము లభించును. ఇందు స్త్రీత్వము వాచ్యము కావలెను. సూచితమైనచో ప్రత్యయము రాదు. ఈ పక్షము నిర్దుష్టమని భాష్యకారుడు చెప్పెను. ఈ యంశమును గూడ రాబోవు కారికలు స్పష్టపరచును. ॥169॥

అవతారిక— కాగా ''స్త్రియామ్'' (4-1-3) అను సూత్రమునకు సంభవించు వ్యాఖ్యానమును చూపుచున్నాడు.

శ్లో॥ స్త్ర్యర్థః సంస్త్యానవద్ద్రవ్యం ప్రకృత్యర్థశ్చ యద్యసౌ ।
ద్రవ్యోపలక్షణార్థత్వం సంస్త్యానస్య తథాసతి ॥ 170

సంస్త్యానవత్ = సంస్త్యానము (గుణముల అపచయము) అను నిమిత్తముగల, ద్రవ్యమ్ = వస్తువు, స్త్ర్యర్థః = స్త్రీశబ్దముయొక్క అర్థమై, అసౌ = ఇది, ప్రకృత్యర్థః + చ = ప్రకృతియొక్క అర్థముగ కూడ, యది = అయితే, తథా + సతి = అట్లయినచో, సంస్త్యానస్య = సంస్త్యానమను ధర్మము, ద్రవ్యోపలక్షణార్థత్వమ్ = ద్రవ్యమున కుపలక్షణమగుట (కేవలము సూచించు ఒక ధర్మము), (భవేత్ = అయ్యెడిని)

తాత్పర్యము— స్త్రీ, అను శబ్దమొకటి తప్ప మిగిలిన ఏ శబ్దమైనను, స్త్రీత్వమును నిమిత్తముగా తీసికొని ద్రవ్యమును బోధింపదు. కావున స్త్రీత్వమనునది ద్రవ్యమున కుపలక్షణము మాత్రమే అగును. అనగా వేరుగ ఒక ద్రవ్యమును చెప్పవలెననియును, అచటి స్త్రీత్వము సూచితమైన చాలుననియు పర్యవసించును.

వివరణము— ఇదియే సమానాధికరణ పక్షము. ఇందు ''స్త్రీ'' అను భావమును సూచింపుచు, ఒకానొక ద్రవ్యమును చెప్పు శబ్దమునకు ప్రత్యయమగును'' అని సూత్రార్థము లభించును. కాగా స్త్రీత్వము ప్రాతిపదికమునకు వాచ్యము కానక్కరలేదు. ప్రాతిపదికార్థమున స్త్రీత్వమున్నట్లు సూచించిన చాలును.

విశేష విషయములు— ''స్త్రియాః భావః = స్త్రీత్వమ్'' అనగా సంస్త్యానమే. ఇది స్త్రీశబ్దము విషయముననే నిమిత్తమగును. కావుననే ''స్త్రీత్వము గలది స్త్రీమాత్రమే'' అగును. వేరొకటి కాదు. ॥170॥

అవతారిక— ఇట్లు సమన్వయము చేసినపుడు కలుగు దోషమును చూపుచున్నాడు.

శ్లో॥ సంస్త్యానేన క్వచిద్ద్రవ్యం దృష్టం యదుపలక్షితే ।
అనంగీకృతసంస్త్యానా త్తద్వృత్తేః ప్రత్యయో భవేత్ ॥ 171

క్వచిత్ = ఒకానొక, ఉపలక్షితే = సూచింపబడిన దానియందు, యత్ = ఏ, ద్రవ్యమ్ = వస్తువు, సంస్త్యానేన = సంస్త్యానమను ధర్మముతో, దృష్టమ్ = చూడబడునో, అనంగీకృత సంస్త్యానాత్ = సంస్త్యానమును స్వీకరింపని, తద్వృత్తేః = అట్టి ద్రవ్యమును బోధించు వేరొక శబ్దమునకు, ప్రత్యయః = ప్రత్యయము, భవేత్ = అయ్యెడిని.

తాత్పర్యము— స్త్రీత్వముచే (సంస్త్యానము) ఉపలక్షితమైన ద్రవ్యమును బోధించు శబ్దమొకటి యున్నపుడు, స్త్రీత్వమను ధర్మములేకున్నను - అట్టి శబ్దమునకు సమానాధికరణ మైన మరియొక శబ్దమునకు కూడ టాబాదిప్రత్యయములు రావలసి వచ్చును. ॥171॥

అవతారిక— మీది కారిక చెప్పిన విషయములో ఉదాహరణమును చూపుచున్నాడు.

శ్లో॥ భూతాదయః షడాఖ్యాశ్చ సంస్త్యానేనోపలక్షితే ।
బ్రాహ్మణ్యాదౌ యదా వృత్తాస్తేభ్యః స్యుః ప్రత్యయా స్తదా ॥ 172

భూతాదయః = భూతమ్, మొదలగు శబ్దములును, షడాఖ్యాః + చ = ''షట్'' అను సంజ్ఞ గల పంచన్, షట్, మొదలగు శబ్దములును, సంస్త్యానేన = సంస్త్యానముచే, ఉపలక్షితే = సూచింపబడిన, బ్రాహ్మణ్యాదౌ = బ్రాహ్మణీ, మొదలగు శబ్దములందు, యదా = ఎపుడు, వృత్తాః = ప్రవర్తించునో, తదా = అపుడు, తేభ్యః = వానికి, ప్రత్యయాః = స్త్రీప్రత్యయ ములు, స్యుః = అయ్యెడిని.

తాత్పర్యము— ''భూతమ్ - ఇయమ్ - బ్రాహ్మణీ'' (ఈ బ్రాహ్మణస్త్రీ భూతము = రాక్షసి) ఇచట బ్రాహ్మణస్త్రీ సంస్త్యానముచే ఉపలక్షిత అగును. ఆమెను బోధించునదియు సంస్త్యానము లేనిదియు (స్త్రీత్వమును స్వీకరించనిది = నిత్యము నపుంసకము) భూతశబ్ద మగును. కాగా భూతశబ్దమునకు టాప్, అను ప్రత్యయము రావలసివచ్చును. అట్లే ''పంచ - బ్రాహ్మణ్యః'' (అయిదుగురు బ్రాహ్మణస్త్రీలు). ఇచటను ''పంచన్'' శబ్దము బ్రాహ్మణ

స్త్రీలను బోధించుటవలన దానికి జీప్, ప్రత్యయము రావలసివచ్చును (ఇవి అభిమతములు కావు. ఈ దోషములను వారించుటకు వేరుగ ప్రయత్నము చేయవలసియుండును).

*వివరణము*— షకారాంతముగాని (షష్), నకారాంతముగాని (పంచన్, మొదలగునవి) అగు సంఖ్యావాచకమునకు ''షట్'' అని వైయాకరణుల సంకేతము. కాగా - ''స్త్రీలింగమగు శబ్దముతో సమానాధికరణమైన శబ్దమునకు ప్రత్యయములగును'' అను సమానాధికరణ పక్షమందు ఇట్టి దోషములు కలుగునని సారాంశము. ॥172॥

*అవతారిక*— పై కారికనే వివరింపుచున్నాడు.

**శ్లో॥ తద్వంతో హి ప్రధానత్వాత్ ప్రత్యయానాం ప్రయోజకాః ।**
**సామానాధికరణ్యేఽపి తస్మాట్టాబాదిసంభవః ॥** 173

తద్వంతః = సంస్త్యానము గల ద్రవ్యములు, ప్రధానత్వాత్ = ముఖ్యమగుటవలన, ప్రత్యయానామ్ = ప్రత్యయములకు, ప్రయోజకాః + హి = సంపాదకములగును గదా !, తస్మాత్ = అందువలన, సామానాధికరణ్యే + అపి = సామానాధికరణ్యమందును, టాబాది సంభవః = టాప్, మొదలగు ప్రత్యయములు వచ్చుట, (భవతి = కుదురును).

**తాత్పర్యము**— సమానాధికరణ పక్షమున సంస్త్యానముగల పదార్థములు ముఖ్యములగును (సహజముగ స్త్రీలింగములైన శబ్దములే ప్రధానములు). అవి తమతో సమానాధికరణములగు వానికి కూడ (ముఖ్యార్థముతో అన్వయించునవి) ప్రత్యయములను సంపాదించును.

*వివరణము*— ''స్త్రీలింగ శబ్దముతో సమానాధికరణమగు శబ్దమునకు ప్రత్యయములగును'' అని ''స్త్రియామ్'' అను సూత్రమున కర్థము చెప్పినపుడు, సమానాధికరణమై స్త్రీలింగముకాని శబ్దమునకును టాబాదులు ప్రవర్తించుట సమంజసమే గదా ! ॥173॥

అవతారిక— ఇట్లు సమానాధికరణ పక్షమందు దోషముండుటచే దానిని విడిచి, నిర్దుష్టమగు ప్రకృత్యర్థపక్షము భాష్యమున ప్రతిపాదింపబడినది. ఆ పక్షమును చూపుచున్నాడు.

**శ్లో॥ గుణమాత్రాభిధాయిత్వం స్త్రీశబ్దే వర్ణ్యతే యదా ।**
**ప్రకృత్యర్థశ్చ సంస్త్యానం స్వార్థికాః ప్రత్యయాస్తదా ॥** 174

స్త్రీశబ్దే = స్త్రీ, అను శబ్దము, (స్త్రియామ్, అను సూత్రమున) గుణమాత్రాభిధాయిత్వమ్ = కేవలము గుణమును బోధించుటయు, సంస్త్యానమ్ = సంస్త్యానమను గుణము, ప్రకృత్యర్థః + చ = ప్రకృతియొక్క అర్థమనియును, యదా = ఎప్పుడు, వర్ణ్యతే = చెప్పబడునో, తదా = అప్పుడు, ప్రత్యయాః = ప్రత్యయములు, స్వార్థికాః = ప్రకృత్యర్థమందే ప్రవర్తించునవియై, (భవంతి = అగును).

తాత్పర్యము— "స్త్రీ" అనగా సంస్త్యానమను గుణము మాత్రమే (ఉపలక్షిత మగు ద్రవ్యము కాదు). "స్త్రీత్వమను గుణమును బోధించు ప్రాతిపదికమునకు టాబాది ప్రత్యయములగును" అని, "స్త్రియామ్" అను సూత్రమున కర్థము. కాగా స్త్రీత్వమును బోధించుదానికే ప్రత్యయములగునుగాన, ప్రత్యయములకు వేరుగా అర్థము ఉండదు. ప్రకృత్యర్థమునే వెల్లడించుచు అవి స్వార్థికములగును.

*వివరణము*— ఇదియే ప్రకృత్యర్థ పక్షము. ఇందు స్త్రీత్వమను ధర్మమును ప్రకృతియే బోధించును. ప్రత్యయములు కేవలము ద్యోతకములుగ నుండును. ఇదియే సిద్ధాంతముగ స్వీకరింపబడినది.

విశేష విషయములు— "స్త్రియామ్" అను సూత్రమున "స్త్రీశబ్దము ద్రవ్యమును బోధించున"న్నది మొదటి పక్షము. "స్త్రీశబ్దము గుణమును మాత్రమే బోధించునన్న"ది రెండవ పక్షము. ॥174॥

అవతారిక— "ఏ ప్రాతిపదికమైనను కేవలము స్త్రీత్వమను గుణమును బోధించుట సంభవించునా?" - అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంస్త్యానే కేవలే వృత్తిః ప్రకృతీనాం న విద్యతే।**
**తదావిష్టే తతో ద్రవ్యే గృహ్యంతే సమవస్థితాః ॥ 175**

కేవలే = కేవలము, సంస్త్యానే = సంస్త్యానమందు, ప్రకృతీనామ్ = ప్రకృతులుగా నుండు శబ్దములకు, వృత్తిః = ప్రవృత్తి, న + విద్యతే = ఉండదు, తతః = అందువలన, తదావిష్టే = ఆ సంస్త్యానముతో కూడిన, ద్రవ్యే = ద్రవ్యమందు, సమవస్థితాః = ఉన్నవై, గృహ్యంతే = తీసికొనబడును.

తాత్పర్యము— కేవలము స్త్రీత్వమును ఏ శబ్దమైనను బోధింపదు. కావున స్త్రీత్వముతో కూడిన ద్రవ్యమును తెలుపు శబ్దమునకే స్త్రీ ప్రత్యయములగును.

వివరణము— వ్యవహారములో సిద్ధముగానున్న శబ్దములను (అజా. గౌరీ, మొదలగు శబ్దములు. ఇచట ఆ, ఈ, మొదలగునవి స్త్రీ ప్రత్యయములని భావన) సంస్కరించుటయే శాస్త్రము చేయుపని. అట్టి శబ్దములన్నియును ఏదో ఒక వస్తువును బోధించునుగాని కేవలము స్త్రీత్వమను ధర్మమును మాత్రము చెప్పి ఊరకుండవు. కాగా "స్త్రీత్వమను ధర్మముతో కూడిన ద్రవ్యమును చెప్పు శబ్దమునకు ప్రత్యయమగును" అని "స్త్రియామ్" అను సూత్రమున కర్థము చెప్పక తప్పదు. ఈ విధముగ స్త్రీత్వము (సంస్త్యానము) ప్రకృతియొక్క అర్థము –లేక– ప్రకృత్యర్థమునకు విశేషణమగుట కుదురును. ॥175॥

అవతారిక— స్త్రీత్వమును ప్రకృత్యర్థముగా చెప్పినపుడు, వెనుకటి (172 వ కారిక) దోషములు సంభవింపవని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఉపకారి చ సంస్త్యానం యేషు శబ్దేష్వపేక్షితమ్ ।
తేభ్యష్టాబాదయ స్తచ్చ భూతాదిష్వవివక్షితమ్ ॥ 176

యేషు = ఏ, శబ్దేషు = శబ్దములందు, సంస్త్యానమ్ = స్త్రీత్వము, ఉపకారి + చ = ఉపయోగించునట్లు, అపేక్షితమ్ = కోరబడునో, తేభ్యః = ఆ శబ్దములకు, టాబాదయః = టాప్, మొదలగు ప్రత్యయములు (భవంతి = అగును), భూతాదిషు + చ = "భూతమ్" మొదలగు చోట్ల అయితే, తత్ = ఆ స్త్రీత్వము, అవివక్షితమ్ = వివక్షింపబడలేదు.

తాత్పర్యము— స్త్రీత్వమును స్పష్టముగ బోధించు శబ్దములకే స్త్రీ ప్రత్యయము లగును. "భూతమ్ - ఇయమ్ - బ్రాహ్మణీ" అనుచోట "భూత" శబ్దము విషయమున స్త్రీత్వము వివక్షితము కాదు.

వివరణము — ఈ పక్షమందు ప్రకృత్యర్థమందు స్త్రీత్వము తప్పక ఉండవలెను. "భూతమ్" అనుచోట భూతశబ్దము కేవలము "కఠిన హృదయత్వమును" బోధించునుగాని, స్త్రీత్వమును చెప్పదు. ఇచట కూడ స్త్రీత్వమును చెప్పదలచినచో "భూతా" అని కావచ్చును. కాని అర్థము మారిపోవును. (ఉండినది - సత్యమైనది). అట్లే పంచన్, షట్, మొదలగు సంఖ్యాశబ్దములును భేదరూపమైన సంఖ్యనే చెప్పునుగాని, స్త్రీత్వమును చెప్పవు. అందుచే వానికి స్త్రీ ప్రత్యయములు రావు. కాన వానిని వారించుటకై వేరుగ ప్రయత్న మక్కరలేదు. ॥176॥

అవతారిక— "స్త్రీత్వము ప్రత్యయముయొక్క అర్థము" అను పక్షమును అందలి దోషమును చూపుచున్నాడు.

శ్లో॥ సంస్త్యానం ప్రత్యయస్యార్థః శుద్ధమాశ్రీయతే యదా ।
తదా ద్వివచనానేకప్రత్యయత్వం న సిధ్యతి ॥ 177

శుద్ధమ్ = కేవలమైన, సంస్త్యానమ్ = స్త్రీత్వము, ప్రత్యయస్య = ప్రత్యయముయొక్క, అర్థః = అర్థముగా, యదా = ఎప్పుడు, ఆశ్రీయతే = స్వీకరింపబడునో, తదా = అప్పుడు ద్వివచనానేక ప్రత్యయత్వమ్ = ద్వివచన బహువచనములును ఒకటికి మించిన ప్రత్యయములు వచ్చుటయును, న + సిధ్యతి = సిద్ధింపదు.

తాత్పర్యము— స్త్రీత్వమును గుణము మాత్రమే టాబాది ప్రత్యయముల అర్థమన్నచో ఆ స్త్రీత్వమొకటియేగాన (స్త్రీలింగ శబ్దములకు) ఏకవచనము ఒక్కటియే ఉండవలెనుగాని మిగిలిన రెండు వచనములు ఉండకూడదు. అట్లే స్త్రీత్వమును బోధించుటకొక ప్రత్యయమే చాలునుగాన కొన్నిచోట్ల కనబడు అనేక స్త్రీప్రత్యయములు అసాధువులు కావలసి వచ్చును.

వివరణము— ఇది ప్రత్యయార్థ పక్షము. ఇందు స్త్రీత్వము ద్రవ్యమునకు విశేషణము కాదు సాక్షాత్తుగ ప్రత్యయమునకే అర్థమగును. (ద్రవ్యము ప్రకృత్యర్థము) స్త్రీత్వమను

ధర్మ మొకటే. అందుచే దానిని చెప్పుటకు ఏకవచనము [illegible]
మొదలగు ప్రయోగములు అనావశ్యకములయ్యెదని అట్లే "[illegible]" [illegible]
స్త్రీ ప్రత్యయములు (జీప్, టాప్) సిద్ధములు. అవి అసాధువు[illegible]. స్త్రీత్వము [illegible]
టకు ఒక ప్రత్యయము సరిపోవునుగదా!) ఇట్టి పక్షము [illegible]

అవతారిక— "స్త్రీత్వము జాతి" అని యన్నను పై దోషము [illegible] చెప్పు చున్నాడు.

శ్లో॥ జాతిశ్చేత్ స్త్రీత్వమేవాసౌ భేదోఽన్యత్రావివక్షితః ।
తస్మాద్భిన్నైరపి ద్రవ్యైస్తదేకం సద్విశిష్యతే ॥ 178

స్త్రీ త్వమ్ = స్త్రీత్వము, జాతిః + ఏవ + చేత్ = జాతియే అయినచో, అసౌ = ఈ, భేదః = భేదము, అన్యత్ర = వ్యక్తియందు, అవివక్షితః = చెప్పవలయునది కాదు, తస్మాత్ = అందువలన, భిన్నైః వేరువేరగు, ద్రవ్యైః + అపి = వ్యక్తులతోకూడ, తత్ = ఆ స్త్రీత్వము, ఏకమ్ + సత్ = ఒకటిగా ఉన్నదై, విశిష్యతే = సంబంధించును

తాత్పర్యము— స్త్రీత్వము జాతియన్నను అది ప్రత్యయార్థమగుటచే ప్రధానమగును. కావున ప్రకృత్యర్థముగా ఉండు వ్యక్తులు ఎన్ని యున్నను వానియందు మొత్తముగా ఉండు స్త్రీత్వమను ఒక ధర్మమును చెప్పుటకు ఏకవచనమే సముచితమగును.

వివరణము— "స్త్రియామ్" = స్త్రీత్వే = ప్రత్యయః అన్నపుడు జాతియే ప్రత్యయార్థము. ప్రకృతియొక్కయు ప్రత్యయముయొక్కయు అర్థములు కలిసిపోయినను ప్రత్యయార్థము ప్రధానమగునని సంప్రదాయము. కావున మొత్తముపై స్త్రీత్వమే ముఖ్యమగును అది ఒకటియే.

జాతితో కూడిన వ్యక్తి ముఖ్యమైన సందర్భములలో గౌః, గావౌ, గావః, మొదలగు రీతిని వ్యక్తిభేదమును సూచించు వచనములుండుట సహజమే. కాని వ్యక్తుల భేదమును పాటింపక వానియందలి స్త్రీత్వమును మాత్రమే ముఖ్యముగ భావించినపుడు ఏకవచనము తప్పదు. ॥178॥

అవతారిక— "సత్త్వాదిగుణముల అపచయము స్త్రీత్వము. అనగా, గుణముల పరిణామములైన రూపము, రసము, మొదలగు వానియొక్క ఒక విధమైన అవస్థ. (తిరోభావము = కప్పబడి యుండుట) అది స్థిరమనుటకు వీలులేదు. ప్రతియొక క్షణమునను మారుచునే యుండును. అట్టి మార్పులందలి భేదమును పురస్కరించుకొని వచనభేదమును సాధింపగూడదా?" - అను శంకను త్రోసివేయుచున్నాడు.

శ్లో॥ మాత్రాణాం వా తిరోభావే పరిమాణం న విద్యతే ।
కుమార్యఇతి తేన స్యాత్ కుమార్యాం భేదసంభవాత్ ॥ 179

మాత్రాణామ్ = రూపాది గుణములయొక్క, తిరోభావే = అపచయమందు (ప్రలయము = అంతర్ధానము), పరిమాణమ్ = కొలత, న + విద్యతే + హి = లేదుగదా!, తేన=అందుచే, కుమార్యామ్ = ఒక కుమారియందు, భేదసంభవాత్ = భేదములు కుదురును గనుక, కుమార్యః + ఇతి = "కుమార్యః" అను బహువచనమే, స్యాత్ = ఎల్లపుడును అయ్యెడిని.

తాత్పర్యము— గుణావస్థలకు భేదములను పాటించినయెడల అవి అనంతము లగునుగాన ఎల్లపుడును స్త్రీలింగ శబ్దములు బహువచనాంతములుగనే యుండవలసి వచ్చును.

వివరణము— అవస్థ అనునది చంచలము. అది మార్పు చెందుచునే యుండును. దానికి, ఒకటి, రెండు అను కొలత కుదరదు. అందువలన దాని భేదములను స్వీకరించినచో బహువచనము మాత్రమే వచ్చును అట్లుగాక అవస్థ ఒకటే యన్నచో "స్త్రీత్వము జాతి" అన్నట్లే అగును. అపుడు మీది కారికలో చూపిన రీతిని ఏకవచనము మాత్రమే రావలయును. (అవస్థ ఒకటియన్నను స్త్రీత్వమొకటియన్నను ఫలితము సమానమే).

విశేష విషయములు— మీది కారిక చూపిన దోషమునే ఈ కారిక బలపరచినది. కాగా స్త్రీత్వము ప్రత్యయార్థమన్నచో ఏకవచనము మాత్రమే వచ్చుట ఒక దోషము. మరియు "ఇయం కుమారీ" మొదలగు రీతిని సామానాధికరణ్యము కుదురదు. కుమారీ శబ్దమందలి ప్రత్యయము స్త్రీత్వమను ధర్మమును బోధించునుగాన "అస్యాః కుమారీ" అని ప్రయోగింప వలసి వచ్చును. (అస్యగోత్వమ్, అన్నట్లుగా). అట్లే స్త్రీత్వము గుణముగాన క్రియతో సంబంధము కుదురకపోవును. (ద్రవ్యమునకే క్రియా సంబంధము కుదురును) "అలంక్రియతాం కుమారీ" (కుమారి అలంకరింపబడు గాక) మొదలగు ప్రయోగములు సాధువులు కాకపోయెడిని.

ఇట్లు ప్రత్యయార్థమను పక్షమున దోషబహుత్వము సంభవించును. ॥179॥

అవతారిక — మీద చూపిన దోషములను వారించుటకు "గుణస్యద్రాశ్రయతో లింగవచన భావాత్" అను సమాధానమును వార్తికకారుడు చూపెను. (అనగా స్త్రీత్వము గుణము కావున ఆధారమైన ద్రవ్యమునుబట్టి లింగముకాని వచనముకాని గుణవాచకమునకు సిద్ధించుటవలన - ఎట్టి దోషములును కలుగవని భావము). దానిని రెండు కారికలతో విశదము చేయుచున్నాడు

శ్లో॥ జాతిసంఖ్యా సమాహారై ర్యథైవ సహచారిణి ।
ద్రవ్యే క్రియాః ప్రవర్తంత ఏకాత్మత్వేఽప్యపేక్షితే ॥ 180

శ్లో॥ మూర్తిభ్యో మూర్తిధర్మాణాం తథాభేదస్య దర్శనాత్ ।
సామానాధికరణ్యం చ క్రియాయోగశ్చ కల్పతే ॥ 181

ఏకాత్మత్వే = అభేదము, అపేక్షితే = అంగీకరింపబడగా, జాతిసంఖ్యా సమాహారైః = జాతి - సంఖ్య - సమాహారము - అను వానిచే, సహచారిణి = కలిసియుండు, ద్రవ్యే + అపి = ద్రవ్యమందు కూడ, క్రియాః=వ్యాపారములు, యథా=ఎట్లు, ప్రవర్తంతే + ఏవ=ప్రవర్తించునో.

తథా = అట్లు, మూర్తిధర్మాణామ్ = ద్రవ్యముల ధర్మములకు, మూర్తిభ్యః = ద్రవ్యములతో, అభేదస్య = అభేదమును, దర్శనాత్ = చూచుటవలన (అంగీకరించుట), సామానాధికరణ్యమ్ + చ = సామానాధికరణ్యమును, కల్పతే = సంభవించును.

తాత్పర్యము— ద్రవ్యములును వానియందలి ధర్మములును అవినాభూతములు. రెండింటిని విడదీయుట కుదురదు. కావున ధర్మములను నిర్దేశించి చూపు కార్యములన్నియు అభేద భావనచే ద్రవ్యములకే చెందును. కాగా స్త్రీత్వము ధర్మమైనందున దానికాశ్రయమగు ద్రవ్యమునుబట్టి వచనములు సిద్ధించును. (కుమార్యౌ, కుమార్యః మొ॥) అట్లే స్త్రీప్రత్యయము ద్రవ్యమును తెలుపుటచే "ఇయం కుమారీ" మొదలగు రీతిని సామానాధికరణ్యమును, "కుమారీ అలం క్రియతామ్" మొదలగు రీతిని క్రియతోడి సంబంధమును సంభవించును.

వివరణము— జాతి, సంఖ్య, సమాహారము (సముదాయము) అనునవి కూడ ఒక విధమగు ధర్మములే. వీనికిని ఆయా క్రియలకును సూటిగ సంబంధము అసంభవము. అందువలన వీనిని చూపి క్రియలను చెప్పినపుడు, ఈ ధర్మములుగల వస్తువులకే ఆయా క్రియలు సమన్వయించును. ఇట్టిచోట్ల ధర్మములకును ధర్మముగల వస్తువులకును అభేదము నంగీకరింపక తప్పదు.

ఉదా : (1) జాతి— "గౌః దుహ్యతామ్" (ఆవునుండి పాలను పిదుకుము)· గోత్వమను జాతినుండి పాలను పిదుకుట అసంభవము. ఆ జాతిగల గోవ్యక్తినుండి పిదుకుదురు·

(2) సంఖ్య— "మనుష్యశతం భోజ్యతామ్" (నూరుగురు మనుష్యులకు భోజనము పెట్టుము) "నూరు" అను సంఖ్య భోజనము చేయదు. అది గల వ్యక్తులు భోజనము చేయుదురు.

(3) సమాహారము— "పంచగవమ్ ఆనీయతామ్ (అయిదు గోవుల సముదాయమును తెమ్ము) సముదాయమును వేరుగ తీసికొనివచ్చుట కుదురదు. అది గల వ్యక్తులనే తీసికొనివచ్చుట కుదురును.

ఈ రీతినే స్త్రీత్వము ప్రత్యయార్థమన్నను అది వేరుగ భాసింపనేరదు. ఆ గుణము గల ద్రవ్యముతో కూడియే భాసించును. దానినిబట్టి వచనము మొదలగునవన్నియు ప్రవర్తించును. కేవలము ప్రక్రియావైచిత్ర్యమునకై ప్రత్యయార్థపక్షము ప్రత్యేకముగ చూపబడినది.

అవతారిక— ఈ సందర్భమున కొందరు ఇట్లందురు. "కుమారీ" మొదలగు స్త్రీ ప్రత్యయాంతములు గుణవాచకములే. అయినను వానికి "శుక్ల" మొదలగు శబ్దములకు వలె మతుప్పును ("అది గల ద్రవ్యము" అను నర్థమును చెప్పునది) చేసి, దానికి లుక్కును (లోపమును) చెప్పినచో అవి ద్రవ్యములను బోధించుటలో చిక్కేమియు కలుగదు" అని - "ఇట్టి మతము మంచిదికాదని" చెప్పుచున్నాడు.

**శ్లో॥ సామానాధికరణ్యే తు మతుబ్లోపాదపేక్షితే ।**
**లుక్ తద్ధితలుకీతి స్యాల్లుక్ తత్రాప్యుపలక్షణమ్ ॥** 182

మతుబ్లోపాత్ = మతుప్పుయొక్క లోపమువలన, సామానాధికరణ్యే = సామానాధికరణ్యము, అపేక్షితే + తు = కోరబడినచో, "లుక్ తద్ధితలుకి" + ఇతి = లుక్ తద్ధితలుకి అను సూత్రముచే, లుక్ = స్త్రీ ప్రత్యయమునకు లోపము, స్యాత్ = కలిగెడిని, తత్ర + అపి = అచట కూడ (శుక్ల మొదలగు గుణవాచకముల విషయమున కూడ). లుక్ = మతుప్పుయొక్క లోపము, ఉపలక్షణమ్ = సూచన మాత్రమే.

తాత్పర్యము — "కుమారీ" మొదలగు స్త్రీ ప్రత్యయాంతములగు శబ్దములకు ద్రవ్యవాచకత్వమును సంపాదించుటకై (అట్లయిన - "ఇయం కుమారీ" - మొదలగు రీతిని సామానాధికరణ్యము కుదురును) మతుప్పును దాని లోపమును ఆశ్రయించినచో, "లుక్ తద్ధితలుకి" (1-2-49) అను సూత్రముచే స్త్రీ ప్రత్యయము కూడ లోపించెడిని. అది ఇష్టము కాదు. శుక్లాది శబ్దములలో కూడ మతుప్పునకు లుక్కు నామమాత్రమే. వాస్తవము కాదు.

వివరణము— "తద్ధిత ప్రత్యయమునకు లోపము జరిగినపుడు అప్రధానమైన స్త్రీ ప్రత్యయము లోపించునని" పై సూత్రముయొక్క అర్థము. "కుమారీ + మత్" అని మతుప్పును చూపినపుడు మతుప్పుయొక్క అర్థము ముఖ్యమగును. స్త్రీ ప్రత్యయము అప్రధానమగును. కావున అది కూడ లోపింపవలసి వచ్చును అందుచే శుక్లాది శబ్దముల సామ్యము ఇచట పనికిరాదు. అందువలన మతుప్పు లేకుండగనే సహజముగనే స్త్రీ ప్రత్యయాంతములగు శబ్దములు స్త్రీత్వముతో కూడిన ద్రవ్యములను బోధించునని చెప్పుట (మీది రెండు కారికలును వివరించిన తీరు ననుసరించి) సమంజసము.

శుక్లాది శబ్దముల విషయమున కూడ, శుక్ల, మొదలగు ప్రకృతులే ఆ యా గుణము గల వస్తువును బోధించుననియు, మతుప్పును దాని లుక్కును చూపుట సూచనామాత్రమే యనియును వెనుక (145, 146, మొ॥ కారికలు) ప్రతిపాదింపబడినది.

విశేష విషయములు— ఇట్లు స్త్రీత్వము ప్రత్యయార్థమన్నను, గుణమునకు ద్రవ్యమునకును అభేదము నాశ్రయించుటవలన ద్వివచన బహువచనములును, సామానాధికరణ్యమును సిద్ధించునని ఫలించినది. "కాలితరా" మొదలగుచోట్ల ద్రవ్యగతమైన స్త్రీత్వమును రెండు స్త్రీ ప్రత్యయములతో చెప్పుటకూడ ప్రయోగస్వభావమని గుర్తింపవలెను. అదొక దోషము కాదు. ॥182॥

అవతారిక — "స్త్రీత్వము ప్రత్యయార్థము" అను పక్షమందు సామానాధికరణ్యము మొదలగు అభీష్ట విషయములను వేరొక తీరులో కూడ సాధింపవచ్చునని చెప్పుచున్నాడు

శ్లో॥ కేషాంచిత్ వ్యక్తిభేదేషు ద్రవ్యేష్వేవ విధీయతే ।
సంస్త్యానవత్సు టాబాదిరభేదేన సమన్వయాత్ ॥ 183

అభేదేన = భేదములేకుండ, సమన్వయాత్ = అన్వయించుటవలన, వ్యక్తిభేదేషు = భేదము

సరూప సముదాయాత్ + తు = సమానమగు అక్షరసామ్యముకల ప్రాతిపదికముల సమూహము కంటె, యా = ఏ, విభక్తిః + తు = విభక్తి ఐతే, విధీయతే = విధింపబడుచున్నదో, అనగా 3, 4 ప్రాతిపదికముల సముదాయము కంటె విభక్తి ప్రత్యయము భాష్యకారునిచే విధింపబడుచున్నదో, తత్ర = ఆ విభక్తి విషయమున, సముదాయస్య = 3, 4 ప్రాతిపదికములచే బోధింపబడెడి అర్థముల సమూహమునకు, వాచకః = బోధకమగునట్టియు, అర్థవాన్ = అర్థవంతమగు, ఏకః = ఒకటి అనగా 3, 4 ప్రాతిపదికముల సమూహ రూపమగు ఒక శబ్దము, సిద్ధః = సిద్ధించునది (భవతి) అగుచున్నది.

'ఘట' అనునది ఒక ప్రాతిపదికము. ఇట్టి 3, 4 ప్రాతిపదికములు కలిసియుండగా (ఘట-ఘట, ఘట) వీని సముదాయమునకు ప్రాతిపదిక సంజ్ఞ కలుగును. వేరువేరు 1, 2, 3, 4 ప్రాతిపదికములు అర్ధవంతములే. వానిని ఏకముగాకలిపిన ఆ సముదాయము అర్ధవంతమే. కాబట్టి సముదాయముకంటె విభక్తి ప్రత్యయము ప్రవర్తింపగలదు. ఈ యంశమును "సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (1-2.64) అను సూత్రమును వ్యాఖ్యానించు సందర్భమున *మహాభాష్యకారుడు స్పష్టపరచెను, కనుక పై భాష్యము విరోధింపదు. ॥90॥

*అవతారిక*— ప్రత్యయవిధియందు సమాసవిధియందును అప్రధానమగు అర్థమున గల సంఖ్య వివక్షితమగునని 87 వ శ్లోకమున నిరూపింపబడినది. అట్లు చేయుట చాల యుక్తము· అట్లైన ప్రధానార్థమునకు భంగములేకుండగ ఎన్నియో కార్యములు సిద్ధింపగలవని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ప్రత్యయస్య ప్రధానస్య సమాసస్యాపి వా విధౌ ।**
**సిద్ధః సంఖ్యా వివక్షా యాం సర్వథానుగ్రహో గుణే॥ 91**

ప్రత్యయస్య = ప్రత్యయముయొక్క అనగా సుప్పు మున్నగు ప్రత్యయముయొక్క, సమాసస్య + వా = సమాసముయొక్కయు, విధౌ = విధియందు అనగా వానిని విధించెడి "ఙ్యాప్ప్రాతిపదికాత్" (4-1.1). "సుప్ సుపా" (2-1.4) అను సూత్రములయందు, గుణే = అప్రధానమగు దానియందు, అనగా ప్రాతిపదికాత్, సుప్, సుపా అని వానియందు, సంఖ్యా వివక్షాయామ్ + అపి = ఏకత్వరూపమగు సంఖ్యను వివక్షించినను, సర్వథా = ఎల్లవిధముల, ప్రధానస్య = ప్రధానమగు దానియొక్క అనగా అట్టి ప్రత్యయముయొక్క సమాసముయొక్కయు, అనుగ్రహః = అనుగ్రహము అనగా ఆనుకూల్యము, సిద్ధః = సిద్ధించును.

'ప్రాతిపదికాత్' అనుచోట ఏకత్వము వివక్షితమగును, కాబట్టి ఒకే ప్రాతిపదికము

---

* "అథవాపునరస్తు ఏకవిభక్తా వేకశేషః" (కాక సముదాయముకంటె ఒక విభక్తి ప్రవర్తించగా ఏకశేషము కలుగును) అని అచట వార్తికభాష్యములు కలవు. అచట 6 పక్షములు చూపబడినవి! వానిలో నిది ఒకటి.

లను విడిచినట్టియు, సంస్త్యానవత్సు = స్త్రీత్వమను గుణము కలిగినట్టి, ద్రవ్యేషు + ఏవ = ద్రవ్యములందే, టాబాదిః = టాప్ మొదలగు ప్రత్యయము, కేషాంచిత్ = కొందరి మతమున, విధీయతే = విధింపబడును.

తాత్పర్యము— స్త్రీత్వముతో కూడిన ద్రవ్యమునే స్త్రీ ప్రత్యయము బోధించును. ఆ ద్రవ్యము సామాన్యమగును. ప్రకృతి బోధించు ద్రవ్యము విశేషమగును. సామాన్యవిశేషములకు అభేదమును చెప్పవలయును. అట్లు ప్రకృతి ప్రత్యయములు రెండును కలిసి ఒకే ద్రవ్యమును తెలుపుట కుదురును.. కాగా సామానాధికరణ్యము మొదలగునవి సులభమగునని కొందరందురు.

వివరణము — ఈ మతమున "స్త్రియామ్" (4-1-3) అను సూత్రమునకు "స్త్రీత్వముతో కూడిన ద్రవ్యమును చెప్పుచు ప్రత్యయమగును" అని యర్థము.

"స్త్రీత్వముతో కూడిన ద్రవ్యసామాన్యము" అని ప్రత్యయము చెప్పును. "ఆ ద్రవ్యమిది" అని ద్రవ్యవిశేషమును ప్రకృతి బోధించును. చివరకు ప్రకృతి ప్రత్యయములు రెండును కలిసి "స్త్రీత్వము గలది ఈ ద్రవ్యము" అను భావమును కలుగజేయును. కాగా మొత్తముపై ద్రవ్యమే బోధపడును గాన వెనుక శంకించిన దోషములు ప్రసక్తములు కావు.

అవతారిక— పై కారికయొక్క భావమునే వివరించుచున్నాడు.

**శ్లో॥ సామాన్యభూతో ద్రవ్యాత్మా పరిచ్ఛిన్నపరిగ్రహః ।**
**క్రియాభిర్యుజ్యతే భేదైర్భాగశశ్చావతిష్ఠతే ॥ 184**

సామాన్యభూతః = సామాన్యమువలె అయినను, ద్రవ్యాత్మా = ద్రవ్యముయొక్క స్వరూపము, పరిచ్ఛిన్న పరిగ్రహః = పరిమితమైన రూపముగలదై, క్రియాభిః = వ్యాపారములతో, యుజ్యతే = కూడును, భేదైః = భేదములతో, భాగశః + చ = విడివిడిగా, అవతిష్ఠతే = ఉండును.

తాత్పర్యము— ప్రకృతియొక్క అర్థము ద్రవ్యవిశేషమనియు, ప్రత్యయము యొక్క అర్థము ద్రవ్యసామాన్యమనియు చెప్పుట కల్పనము మాత్రమే. అది ప్రక్రియావస్థ. వాస్తవమున ప్రయోగములో ఎల్లపుడును స్త్రీత్వముగల ఆయా ద్రవ్యవిశేషములే బోధపడు చుండును. కావున క్రియాయోగమును, సామానాధికరణ్యమును కుదురును

వివరణము— స్త్రీ ప్రత్యయాంతములగు శబ్దములలో (కుమారీ, అజా, మొ॥) ద్రవ్యవిశేషమును దాని భేదములును (ఏక, ద్వి, బహువచనములు) తెలియుటయే సహజము. అయినను ప్రత్యయమువలన "స్త్రీత్వ"మను ధర్మము అన్నిచోట్లను అనువర్తించుచుండును గాన అది సామాన్యమని భావింపబడును. అంతియగాని విశేషసామాన్యములు రెండును దేనికది స్వతంత్రముగా ఉండవు. "సామాన్యము కూడ విశేషరూపముతోనే ఉండునని" పర్యవసానము.
॥184॥

అవతారిక— ఇట్లు స్త్రీత్వము ప్రత్యయార్థమను పక్షమున గూడ ఆశ్రయమైన ద్రవ్యము ననుసరించి వచనములు కుదురునని ప్రతిపాదించి - ''ఇచట కూడ ఒక ఆక్షేప మున్నదని'' చూపుచున్నాడు.

**శ్లో॥ శుక్లాదిష్వాశ్రయద్రవ్యం ప్రాధాన్యేనాభిధీయతే ।**
**స్త్రీత్వం తు ప్రత్యయార్థత్వాదభిధావిషయో యతః ॥ 185**

శుక్లాదిషు = శుక్ల మొదలగు శబ్దములలో, ఆశ్రయద్రవ్యమ్ = ఆధారమైన వస్తువు, ప్రాధాన్యేన = ముఖ్యముగా, అభిధీయతే = చెప్పబడును, స్త్రీత్వమ్ + తు = స్త్రీత్వమైతే, ప్రత్యయార్థ త్వాత్ = ప్రత్యయముయొక్క అర్థమగుటవలన, యతః = ఎందువలన, అభిధావిషయః = అభిధకు గోచరమగునో (ముఖ్యమగునో - అతః = ఇందువలన దోషము కలుగును).

తాత్పర్యము— శుక్ల, మొదలగు గుణవాచకములు ద్రవ్యమునే ముఖ్యముగ చెప్పును. కావున వాని విషయములో ఆశ్రయానుసారముగ లింగవచనములు కుదురును. కాని స్త్రీత్వమన్నది ప్రత్యయార్థమన్నపుడు అదియే ముఖ్యము కావలయును గదా ! అయినపుడు అప్రధానమైన ద్రవ్యమునుబట్టి వచనములు సిద్ధించుటెట్లు ?

వివరణము— శుక్ల, మొదలగుచోట్ల "ఆ గుణముగల ద్రవ్యము" అని సహజ ముగ తెలియును. కాని స్త్రీత్వము ప్రత్యయార్థమన్నపుడు "కుమారీ" మొదలగుచోట్ల "ఒక ద్రవ్యమందలి స్త్రీత్వము" అను జ్ఞానము కలుగును. అట్లయిన అప్రధానముగా ఉండు ద్రవ్య మునుబట్టి వచనమును చెప్పుట అనుచితమగును.

"ప్రత్యయార్థః ప్రధానమ్" (ప్రకృతి ప్రత్యయములు కలిసి అర్థమును బోధించి నను, ప్రత్యయార్థము ముఖ్యము) అను సంప్రదాయమున్నది. ॥185॥

అవతారిక— మీది దోషమును వారించుచున్నాడు.

**శ్లో॥ సోఽయమిత్యభిసంబంధాదాశ్రయం ప్రతిపద్యతే ।**
**స్త్రీత్వం స్వభావసిద్ధో వా గుణభావవిపర్యయః ॥ 186**

"సః + అయమ్ + ఇతి" = "అదే యిది" అను, అభిసంబంధాత్ = సంబంధమువలన, స్త్రీత్వమ్ = స్త్రీత్వమను గుణము, ఆశ్రయమ్ = ద్రవ్యమును, ప్రతిపద్యతే = పొందును, వా = లేక, గుణభావ విపర్యయః = గుణత్వము మారిపోవుట, స్వభావసిద్ధః = శబ్దముల శక్తి ననుసరించి సహజమైనది, (భవతి = అగును).

తాత్పర్యము— "అదే యిది" అను అభేద భావనవలన స్త్రీ ప్రత్యయము ద్రవ్య మునే చెప్పును. లేక— స్త్రీ ప్రత్యయాంతములగు శబ్దములు సహజముగ ద్రవ్యమునే ముఖ్య ముగ బోధించుననియు, స్త్రీత్వమును అప్రధానముగ మార్చివేయుననియును వ్యాఖ్యానింప వచ్చును. ఎట్లయినను ద్రవ్యము ప్రధానమగునుగాన మీది ఆక్షేపము కలుగదు.

వివరణము— "స్త్రీత్వమును ద్రవ్యమును ఒకటే"యను అభేదకల్పనయొక్క ఉపాయము. గుణప్రధానభావము తారుమారగుట రెండవ ఉపాయము.

ప్రక్రియలో ప్రత్యయార్థము ముఖ్యమని చూపినను ప్రయోగములో అది అప్రధానమగును. అట్లగుట శబ్దశక్తి స్వభావము. దానిని ఏ శాస్త్రము అయినను కాదనజాలదు.

ప్రత్యయార్థము అప్రధానమగుట పెక్కుచోట్ల అనుభూతమగుచునే యుండును.

*అవతారిక*— స్త్రీత్వము "ప్రత్యయార్థమైన ద్రవ్యసామాన్యమ"ని చెప్పినను అది గుణమనుట కవకాశమున్నది. గుణమైనపుడు ఆశ్రయమును బట్టియే లింగవచనములను సంపాదింపవచ్చునని విశదముచేయుచున్నాడు.

**శ్లో॥ సాకాంక్షత్వాద్గుణత్వేన సామాన్యం వోపదిశ్యతే ।**
**వ్యక్తీనామాత్మధర్మోఽసావేక ప్రఖ్యానిబంధనః ॥** 187

వా = లేక, సామాన్యమ్ = సామాన్యము, సాకాంక్షత్వాత్ = ద్రవ్యవిశేషముయొక్క అపేక్ష గలదగుట వలన, గణత్వేన = గుణముగా, ఉపదిశ్యతే = చెప్పబడును, ఏకప్రఖ్యానిబంధనః = ఒకే ఆకారముగల జ్ఞానమువలన సిద్ధించు, అసౌ = ఈ సామాన్యము, వ్యక్తీనామ్ = ద్రవ్యవిశేషముల యొక్క, ఆత్మధర్మః = స్వభావము, (భవతి = అగును).

**తాత్పర్యము**— స్వతంత్రముగ ఉండలేక, ఏదో ఒక ద్రవ్యమును ఆధారముగ తప్పక అపేక్షించునది గుణమనబడును. కాగా స్త్రీత్వము ప్రత్యయార్థమన్నను, ద్రవ్యసామాన్యమన్నను, అది ఒక విశేషద్రవ్యమును కోరక తప్పదు. అట్లది గుణమేయగును. అయినపుడు ద్రవ్యవిశేషము యొక్క లింగవచనములు దానికిని సంక్రమించును.

*వివరణము*— ప్రత్యయార్థమైన స్త్రీత్వమనునది అన్ని వ్యక్తులయందును ఏకాకారముగ అనువర్తించి భాసించుచుండును. (కుమారీ - స్త్రీ, గౌరీ - స్త్రీ మొ॥) అందువలన అది వ్యక్తులందుండు ధర్మమనియు, గుణమనియును చెప్పవచ్చును. ॥187॥

*అవతారిక*— పై రీతిని ఏదోవిధముగ ప్రత్యయార్థమైన ద్రవ్యసామాన్యమునకు గుణత్వమును కల్పింపవచ్చును. అయినను స్త్రీత్వముగల ద్రవ్యమొకటే (అఖండమే) యగును గాన ఆశ్రయాశ్రయి భావము ("ఒకటి ఆధారము - వేరొకటి ఆధేయము" అను విభాగము) ఎట్లు కుదురును ?" అను శంకకు రెండు కారికలతో బదులు చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏవంభూతా చ సావస్థా భాగభేదపరిగ్రహే ।**
**కృతే బుద్ధ్యైవ భేదానామాశ్రయత్వేవ కల్పితే ॥** 188

**శ్లో॥ నిష్కృష్టేష్వపి భేదేషు వ్యక్తిభేదాశ్రయే తతః ।**
**లింగప్రత్యవమర్శేన లింగసంఖ్యే ప్రపద్యతే ॥** 189

ఏవంభూతా = ఇట్లు సామాన్యవిశేషములతో కలిసి విచిత్రముగనున్న, సా = ఆ, అవస్థా = అవస్థ, బుద్ధ్యా + ఏవ = బుద్ధిచేతనే, భాగభేద పరిగ్రహే = ప్రకృతియొక్కయు, ప్రత్యయము యొక్కయు, వాని అర్థముల యొక్కయు విభాగమును స్వీకరించుట, కృతే = చేయబడగా, భేదానామ్ = ప్రకృత్యర్థమైన ద్రవ్యవిశేషములకు, ఆశ్రయత్వే = ఆధారమగుట, అవకల్పితే = కల్పింపబడగా.

తతః = పిదప, నిష్కృష్టేషు + అపి = వేరుచేయబడినను, భేదేషు = విశేషములందు, లింగప్రత్యవమర్శేన = లింగమును నిరూపించు భావనచే, వ్యక్తిరూపాశ్రయే = ద్రవ్యభేదము నాశ్రయించిన, లింగసంఖ్యే = లింగమును సంఖ్యను, ప్రపద్యేతే = పొందును.

తాత్పర్యము— "కుమారీ" మొదలగుచోట్ల ప్రకృతి ప్రత్యయములు కలిసి సామాన్యవిశేషములను బోధించు అవస్థ అతివిచిత్రమైనది. అందు ఈ విధముగ కల్పనము చేయవలెను. ప్రకృత్యర్థము ద్రవ్యవిశేషము. ప్రత్యయార్థము ద్రవ్యసామాన్యము. ద్రవ్యవిశేషమునకు భేదము లుండును. (లింగభేదము, సంఖ్యాభేదము) ఆభేదములు గల ద్రవ్యము ముఖ్యమై ఆధారమగును. స్త్రీత్వము అధేయమగును. ఆధారముయొక్క లింగ సంఖ్యలు ఆధేయమునకు సంక్రమించును.

వివరణము— "సా - అవస్థా - లింగసంఖ్యే - ప్రపద్యేతే" అని మొత్తముపై సమన్వయము, "ద్రవ్యవిశేషములను, వాని భేదములను ముఖ్యముగను, ఆధారముగను స్వీకరించి, తదనుసారముగ ఆధేయమైన స్త్రీత్వమునకు లింగసంఖ్యలను అన్వయింపవలెనని" ఈ కల్పనయందలి సారము.

స్త్రీత్వమిచట నియతముగా నుండును. కాన లింగాతిదేశమనావశ్యకము. కావలసినది వచనాతిదేశము మాత్రమే. ద్వివచన బహువచనములను సాధించుటకే ఈ సందర్భమంతయు బయలుదేరినది. శుక్లాది శబ్దముల విషయమున లింగవచనములు రెండును అతిదేశింపబడినవి. ఆ సాహచర్యమువలన లింగము కూడ ఇచట ప్రస్తావింపబడినది.

కొన్నిచోట్ల స్త్రీత్వమును సూచించు ప్రత్యయములు రెండు ఉండుట కూడ (కాలితరా = జీప్పు - టాప్పు) శబ్దస్వభావమని వెనుక చూపబడినది)

లింగవచనముల అతిదేశమును ప్రస్తావించిన "స్త్రియామ్" (4-1-3) అను సూత్రముయొక్క భాష్యపరిశీలన మింతతో ముగిసినది. ॥188॥

## (10) లింగవచనముల ఆతిదేశమును ప్రస్తావించు "చార్థేద్వంద్వః"(2-2-29) అను సూత్రముయొక్క భాష్యపరిశీలనము

అవతారిక— "చ" అను అవ్యయముయొక్క అర్థమందు (ఇతరేతరయోగము —లేక— సమాహారము) ద్వంద్వసమాసము విధింపబడెను. అందువలన ఆ అవ్యయమునకు వలె సమాసమునకును లింగముకాని సంఖ్యకాని యుండదగదని శంక బయలుదేరగా, అవ్య

యమునకు లింగసంఖ్యలు లేకపోవుటయు, సమాసమునకవి యుండుటయును శబ్దస్వభావమని భాష్యకారుడు సమాధానము చూపెను. ఆ సందర్భమును వివరించుటకు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ అంతరేణ చశబ్దస్య ప్రయోగం ద్వంద్వభావినామ్ ।
అవిశిష్టార్థవృత్తిత్వం రూపాభేదాత్ ప్రతీయతే ॥ 190

చశబ్దస్య = చ - అను అవ్యయముయొక్క, ప్రయోగమ్ = ఉచ్చరించుట, అంతరేణ = లేకుండ, ద్వంద్వభావినామ్ = ద్వంద్వసమాసమును పొందబోవు పదములకు (వాక్యదశలో ఉండు పదములకు) రూపాభేదాత్ = స్వరూపములో భేదము లేనందువలన, అవిశిష్టార్థవృత్తిత్వమ్ = విశేషములేని తమతమ అర్థములను బోధించుట, ప్రతీయతే = తెలియబడును.

**తాత్పర్యము**— చ, అను అవ్యయమును కలుపకుండ కేవలము ఘటః, పటః, అను రీతిని పదములను ప్రయోగించినచో, అది వాక్యమగును. అచటి శబ్దములు తమ యర్థమునే తెలుపునుగాని "చ" అనుదాని విశేషార్థము తోడి సంబంధమును తెలుపజాలవు.

*వివరణము*— "చ, అను అవ్యయముయొక్క అర్థమందుండు సమర్థములై అనేకములైన పదములకు ద్వంద్వమగును" అని "చార్థేద్వంద్వః" (2-2-29) అను సూత్రమున కర్థము. చ - అను దానికి సముచ్చయము, అన్వాచయము, ఇతరేతరయోగము, సమాహారము అని నాలుగర్థములున్నవి.

(1) "విడివిడిగా అదియును ఇదియును" అనుట సముచ్చయము (ఈశ్వరః - గురుః - చ).

(2) "రెండిటిలో ఒకటి ముఖ్యము. రెండవది అప్రధానము" అనుట అన్వాచయము. ("భిక్షామ్ - అట" - "గామ్ - చ - ఆనయ" = భిక్షకై తిరుగుము - గోవును తీసికొని రమ్ము - ఇచట భిక్షాటనము ముఖ్యము).

(3) "అదియును ఇదియును రెండును కలిసి" అనుట ఇతరేతరయోగము. (ఘటశ్చ పటశ్చ = ఘటపటౌ).

(4) "కొన్నింటి మొత్తము సముదాయము" అనుట సమాహారము. (పాణిపాదమ్ = కాలుచేతుల సముదాయము).

ఈ యర్థములలో మొదటి రెండిటియందును పదములకు సామర్థ్యము కుదురదుగాన సమాసము రాదు. అందువలన వాక్యమునే ప్రయోగింపవలెను.

వాక్యదశలో కూడ చకారమును తప్పక వాడవలెను. (ఘటః, పటః చ) లేకున్న "ఘటపటముల సముచ్చయము" అను విశేషార్థము రాదు. చకారమున్నపుడే దాని అర్థము విశేష్యముగను ముఖ్యముగను భాసించుట సంభవించును.

విశేష విషయములు— వాక్యదశను వివరించుటకే ఈ కారిక బయలుదేరినది.

ఈ సముద్దేశమందలి 28, 29, 30, కారికలలో ద్వంద్వమును గురించి విపులమైన విచారణము జరిగినది. ॥190॥

అవతారిక— మీది భావమునే విశదము చేయుచున్నాడు.

శ్లో॥ వికల్పవతి వా వృత్తిర్నివర్త్యేఽథ సముచ్చితే ।
తేషామజ్ఞాతశక్తీనాం ద్యోతకేన నియమ్యతే ॥ 191

అథ = అపుడు, అజ్ఞాతశక్తీనామ్ = తెలియని శబ్దశక్తులుగల, తేషామ్ = ఆ పదములయొక్క (వాక్యదశయందలి పదములు), నివర్త్యే = పోగొట్టదగిన, వికల్పవతి = వికల్పము గల అర్థమందు, వృత్తిః + వా = ప్రవృత్తి, ద్యోతకేన = ద్యోతకమగు దానిచే (చకారముచే), సముచ్చితే = సముచ్చితమైన అర్థమందు, నియమ్యతే = నియమింపబడును.

తాత్పర్యము— ద్వంద్వమును పొందదగిన వాక్యదశయందలి పదముల అర్థములను నియమించుటకు ద్యోతకమగు శబ్దమొకటి యుండవలెను. అట్టి ద్యోతకము చకారము, అది పదార్థముల సముచ్చయమును స్పష్టపరచును. (ఘటః, పటః చ=ఘటమును పటమును) అది లేనిచో "వికల్పము" అను అర్థమైనను అట్టిచోట్ల రావలసివచ్చును. (ఘటః పటః వా = ఘటముకాని పటముగాని) కాగా వికల్పమును రానీయక సముచ్చయమును తీసుకొని వచ్చుటకై చకార మావశ్యకమగును.

వివరణము— వేరొక పదముయొక్క అర్థమునే విశదముచేయుచు, అందుకొరకు విడిగా ప్రయోగింపబడు శబ్దమునుగాని ప్రత్యయమునుగాని ద్యోతకమందురు. చ, వా, మొదలగు అవ్యయములు ద్యోతకములు. వాక్యమందలి చకారము ఆ యా పదార్థముల సముచ్చయమును (కూడిక) సూచించును. అది లేనపుడు "వా" (వికల్పము) మొదలగు వేరొక ద్యోతకమైనను ఉండక తప్పదు. ఏదియు లేనిచో "ఘటః పటః" అను పదముల సంబంధమే తెలియక పోయెడిని.

విశేష విషయములు— కాగా ద్వంద్వభావులగు (ద్వంద్వమున కర్హములు) పదముల వాక్యదశలో, చకారమును వాడక తప్పదని ఫలించినది. ॥191॥

అవతారిక— ద్వంద్వసమాసమందు మాత్రము చకారమును వాడనక్కరలేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ వృత్తౌ విశిష్టరూపత్వాచ్చశబ్దో వినివర్తతే ।
అర్థభేదేఽపి సారూప్యాత్ తచ్చార్థేనాపదిశ్యతే ॥ 192

విశిష్టరూపత్వాత్ = సముచ్చయముతో కూడిన పదార్థములను బోధించు స్వరూపము గలదగుటవలన, వృత్తౌ = వృత్తియందు, చశబ్దః = చకారము, వినివర్తతే = పోవును, అర్థభేదే + అపి = వృత్తియొక్కయు వాక్యముయొక్కయు అర్థములకు భేదమున్నను, సారూప్యాత్ =

సాదృశ్యమును బట్టి, తత్ = ఆ విశిష్టరూపత్వము, చార్థేన = చకారముయొక్క అర్థముతో, అపదిశ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— "ఘట పటౌ" ఇది ద్వంద్వము. ఇచట ఇతరేతరయోగము (రెండును కలిసి ఒక క్రియతో సంబంధించుట) సహజముగనే తెలియును. అది వృత్తియొక్క ధర్మము. కావున చకారమును వాడనక్కరలేదు. అయితే - వాక్యమునకును వృత్తికిని గల సామ్యము ననుసరించి, "చార్థే ద్వంద్వః" (చకారము యొక్క అర్థమున ద్వంద్వమగును) అనుట జరిగినది. అంతమాత్రమున "ద్వంద్వము యొక్క అర్థము చార్థము" అనుకొనరాదు. చకారము లేకున్నను దాని భావమును ద్వంద్వసమాసము సహజముగ బోధించును.

వివరణము— ద్వంద్వ వృత్తియందు పదార్థముల కలయిక సహజము గాన వాని భేదము తెలియదు. అందుచే భేదమును సూచించు చకారమచట అక్కరలేదు. వాక్యదశ యందు పదార్థముల భేదమును సూచించుటకు, చకారముండవలయును. అయినను "ఒక క్రియతో అన్వయించుట" అను ధర్మము మాత్రము రెండు దశలందును సమానము. ఈ సామ్యమును బట్టియే "చార్థమున ద్వంద్వము"ను వ్యవహారము ఉపపన్నమగును. ॥192॥

అవతారిక— చకారము యొక్క అర్థమందు ద్వంద్వమైనచో కలుగు దోషమును చూపుచున్నాడు.

శ్లో॥ చస్య చాసత్త్వభూతోర్థః సఏవాశ్రీయతే యది ।
తద్ధర్మత్వం తతో ద్వంద్వే చాదిష్వర్థకృతం హి తత్ ॥ 193

చస్య = చకారముయొక్క, అర్థః + చ = అర్థమైతే, అసత్త్వభూతః = సత్త్వముకానిది (ద్రవ్యముకానిది), సః + ఏవ = అదియే, ఆశ్రీయతే = స్వీకరింపబడునది, యది = అయితే, తతః = అపుడు, ద్వంద్వే = ద్వంద్వమందు, తద్ధర్మత్వమ్ = ద్రవ్యముకాని దాని స్వభావము, (స్యాత్ = కలిగెడిని), తత్ = ఆ ధర్మము, చాదిషు = ''చ'' - మొదలగు అవ్యయములలో, అర్థకృతమ్ + హి = అర్థమునుబట్టి ఏర్పడినది గదా!

తాత్పర్యము— ''సముచ్చయము'' మొదలగు చార్థము ద్రవ్యము కాదు. అనగా లింగమును సంఖ్యయును కలిగినది కాదు. అట్టి యర్థమునే ద్వంద్వమునకు చెప్పినచో అదియు చకారమువలెనే అవ్యయము కావలసి వచ్చును. అర్థమును బట్టియే చ, వా, (వికల్పము) న, (నిషేధము) మొదలగునవి అవ్యయములగుచున్నవి.

వివరణము— లింగసంఖ్యల కనువగు ద్రవ్యము సత్త్వమనియు, అట్లుకానిది అసత్త్వమనియును చెప్పబడును. సముచ్చయము మొదలగు-అర్థములు ద్రవ్యములు కానేరవు. అందుచే ఆ అర్థములను చెప్పు ''చ'' మొదలగునవి అవ్యయములైనవి. కాగా ద్వంద్వము యొక్క అర్థమును చార్థమును ఒకటేయన్నచో ద్వంద్వము కూడ లింగసంఖ్యలు లేని అవ్యయము కావలసి వచ్చును. ॥193॥

అవతారిక— శబ్దముల యొక్క అర్థములను శాస్త్రము చెప్పజాలదనియు, శక్తి వైచిత్ర్యము వలన అర్థము కూడ విచిత్రముగ భాసించుచుండుననియును వివరించుచున్నాడు.

శ్లో॥ చార్థః శబ్దే క్వచిద్భేదాత్ కథంచిత్ సమవస్థితః ।
దోత్యకాశ్చాదయ స్తస్య వక్తా ద్వంద్వస్తు తద్వతామ్ ॥ 194

క్వచిత్ = ఒకానొక, శబ్దే = శబ్దమందు, చార్థః = చకారము యొక్క అర్థము, భేదాత్ = భేదము ననుసరించి, కథంచిత్ = ఏదో ఒక విధముగ, సమవస్థితః = ఉన్నది, తస్య = ఆ అర్థమునకు, చాదయః = చ, మొదలగునవి, ద్యోతకాః = సూచకములు, ద్వంద్వః + తు = ద్వంద్వమైతే, తద్వతామ్ = ఆ యర్థముగల వస్తువులకు, వక్తా = వాచకము, (భవతి = అగును).

తాత్పర్యము— సముచ్చయము అను నర్థమునే "సముచ్చయః" అను శబ్దము సూటిగ చెప్పును. అపుడా శబ్దము ద్రవ్యవాచకము వలెనే లింగసంఖ్యలను పొందును. అదే యర్థమును చకారము సూచించి వదలివేయును. అందుచే అది ద్యోతకమై అవ్యయమగును. కాగా ద్వంద్వము చార్థమునకు వాచకము కావున అవ్యయము కాదనియు, లింగసంఖ్యలను పొందుననియును ఫలించును.

వివరణము— అర్థమును అందించుటలో శబ్దమునకు గల శక్తులు అతి చిత్రములు. "సముచ్చయము" మొదలగు అర్థములను సముచ్చయః, వికల్పః, నిషేధః, మొదలగు శబ్దములు సూటిగ చెప్పి, వాచకములై ద్రవ్యవాచకముల వంటివేయగును. కాని అవే యర్థములను "చ" మొదలగునవి సూటిగ చెప్పక సూచించును. అందుచే నవి ద్యోతకములై అవ్యయములగును. ప్రకృతమున ద్వంద్వము వాచకమేగాని ద్యోతకము కాదని సారము.

విశేష విషయములు— అర్థమును సూటిగ చెప్పునది వాచకము. ఉదా: సముచ్చయః = కలయిక, వికల్పః = వికల్పము (రెండిటిలో నేదో యొకటి అని తెలుపుట), ప్రక్కనుండు ఒక శబ్దముయొక్క అర్థముపై పూర్తిగ ఆధారపడి దానిని సూచించునది ద్యోతకము. ఉదా: ఘటః పటః చ (సముచ్చయము) "సః - వా - అయం - వా" (వాడు కాని వీడు కాని. వికల్పము) ఒక శబ్దమును దగ్గర ఉంచుకొనక పోయినచో చ, మొదలగునవి ఎందుకును పనికిరావు, ఇట్లవి ద్యోతకములు మాత్రమే. ॥194॥

అవతారిక— మీది భావమునే విశదము చేయుచున్నాడు.

శ్లో॥ వికల్పాద్యభిధేయస్య చార్థస్యాన్యపదార్థతా ।
ద్యోతకత్వాన్న కల్పేత తస్మాత్ సదుపలక్ష్యతే ॥ 195

వికల్పాద్యభిధేయస్య = "వికల్ప", మొదలగు శబ్దములచే చెప్పబడు, అర్థస్య = వికల్పము, సముచ్చయము మొదలగు అర్థము, అన్యపదార్థతా + చ = వేరొక పదముయొక్క వాచ్యార్థ

మగుట, ద్యోతకత్వాత్ = ద్యోతకమగుట వలన, న + కల్ప్యేత = కుదురదు, తస్మాత్ = అందువలన, సత్ = లింగసంఖ్యలతో కూడిన ద్రవ్యము, ఉపలక్ష్యతే = సూచింపబడును.

తాత్పర్యము— వికల్పః, సముచ్చయః, మొదలగు శబ్దములు వాచకములు. లింగసంఖ్యలు గల ద్రవ్యరూపమైన అర్థము నవి చెప్పును. వా, చ, మొదలగునవి ద్యోతకములు. కావున అవి అవ్యయములు. లింగసంఖ్యలు కుదురని అర్థమును బోధపరచుచు తుదకు అవి ద్రవ్యమును సూచించును. అర్థములో పెద్దగ భేదము లేకున్నను, కొన్ని శబ్దములు వాచకములగుటయు, మరికొన్ని ద్యోతకములగుటయును భాషయొక్క స్వభావము. కాగా ద్వంద్వము ఇతరేతర యోగము గల ద్రవ్యములకు వాచకము కాన లింగసంఖ్యల సంబంధము కుదురును.

"చార్థే ద్వంద్వః" (2-2-29) అను సూత్రమందలి "చార్థే" అనునది ద్రవ్యమున కుపలక్షణమగును. అనగా చార్థము ద్వంద్వమునకు విషయమైన ద్రవ్యమేయని తేలును.॥195

*అవతారిక*— మీది భావమునే విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ తత్ర స్వాభావికం లింగం శబ్దధర్మే వ్యపేక్షితే ।**
**శబ్దః కశ్చిత్తమేవార్థం కథంచిత్ ప్రతిపద్యతే ॥ 196**

శబ్దధర్మే = శబ్దముయొక్క ధర్మము, వ్యపేక్షితే = సిద్ధముగా నుండగా, లింగమ్=లింగము తత్ర = అచట. స్వాభావికమ్ = సహజమైనది, కశ్చిత్ = ఒకానొక, శబ్దః = శబ్దము, తమ్ = ఆ, అర్థమ్ + ఏవ = అర్థమునే, కథంచిత్ = ఏదో విధముగ, ప్రతిపద్యతే=పొందును.

తాత్పర్యము— లింగము శబ్దముయొక్క స్వభావము. లింగము వేరైనను వేర్వేరు శబ్దములు ఒకే యర్థమును బోధింపగలవు.

*వివరణము*— శబ్దమునకు సహజమైన లింగభేదమునుబట్టి అర్థమందలి వైచిత్ర్యము కూడ తెలియుచుండును. ఉదా : కార్శ్యమ్ - (కృశస్య భావః) (నపుం.), కృశతా (కృశస్య భావః) (స్త్రీ), "కృశించుట" అను అర్థమొకటే రెండు లింగములు కలదిగ తెలియును. అట్లే - జలమ్ (నపుం॥ - నీరు), ఆపః (స్త్రీ॥ లిం॥ - నీరు) - నిత్య బహువచనము), కళత్రమ్ (నపుం॥), దారాః (భార్య - పుం॥ లిం॥ - నిత్య బహువచనము) మొదలగుచోట్ల లింగవచన భేదము గూడ ఉన్నది.

కాగా వాక్యమందలి "చ"కారము వలన సూచింపబడు అర్థమునకు లింగసంఖ్యలతో యోగము ఉండదు. ద్వంద్వసమాసము చెప్పు అదే యర్థమునకు లింగసంఖ్యలతో యోగముండును. అది శబ్ద స్వభావము.

విశేష విషయములు— సత్త్వ రజస్తమోగుణముల ఉత్కర్ష పుంలింగము. వాని అపకర్ష స్త్రీలింగము. ఆ గుణములయొక్క స్థితి మాత్రము నపుంసకము. ఇట్టి లింగము

అర్థమునకు చెందినదేయని శాస్త్రమర్యాద. అర్థమందలి లింగమునే శబ్దము సహజముగ బోధించును. ॥196॥

అవతారిక — శబ్ద ధర్మమునుబట్టియే అర్థముల నిర్ణయము జరుగునని ప్రాసంగికముగ చెప్పుచున్నాడు.

**శ్లో॥ శబ్దాదర్థాః ప్రతాయంతే స భేదానాం విధాయకః ।**
**అనుమానం వివక్షాయాః శబ్దాదన్యన్న విద్యతే ॥ 197**

అర్థాః = అర్థములు, శబ్దాత్ = శబ్దమువలన, ప్రతాయంతే = విస్తరించును, సః = ఆ శబ్దము, భేదానామ్ = అర్థభేదములను, విధాయకః = కలుగజేయునది, వివక్షాయాః = వక్తయొక్క తాత్పర్యమునకు, శబ్దాత్ = శబ్దముకన్న, అన్యత్ = వేరైన, అనుమానమ్ = (ఊహించుటకు) ప్రబలమైన హేతువు, న + విద్యతే = లేదు

తాత్పర్యము — శబ్దమునుబట్టియే వక్తయొక్క అభిప్రాయము తెలియును. అదియే అర్థమును నిశ్చయించుటలో ప్రబలమైన సాధనము. శబ్దమువలననే అర్థభేదములును విస్తరించును.

వివరణము — ఎట్టి యర్థమునకైనను శబ్దమే సంకేతము. కావున దానిని బట్టియే అర్థములను వింగడించుకొందురు.

ఉదా : భార్యా = స్త్రీత్వముగల స్త్రీ
దారాః = పుంస్త్వముగల స్త్రీ
జలమ్ = ఉదక సముదాయము - నపుంసకము
ఆపః = పెక్కు నీటి అవయవములుగల నీరు - (స్త్రీత్వము, బహుత్వము)

ఇట్లు లోకవ్యవహారమున శబ్దమే అర్థనిర్ణాయకము. ॥197॥

అవతారిక — ఇట్లు ద్వంద్వమున లింగసంఖ్యల సంబంధము సమర్థింపబడినది.

"ఆశ్రయమగు ద్రవ్యమునుబట్టియు ద్వంద్వమున లింగవచనములు రావచ్చునని" వేరొక పక్షము భాష్యమందున్నది. దానిని పరిశీలించుటకు ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥ సముచ్చితః స్యాద్ద్వంద్వార్థో గుణభూతసముచ్చయః ।**
**సముచ్చయోఽపి వా భవేత్ గుణభూతసముచ్చితః ॥ 198**

గుణభూతసముచ్చయః = అప్రధానమైన సముచ్చయముగల, సముచ్చితః = కలయిక గల ద్రవ్యము, ద్వంద్వార్థః = ద్వంద్వముయొక్క అర్థము, స్యాత్ = అగును, వా = లేక, గుణభూతసముచ్చితః = అప్రధానమైన సముచ్చిత ద్రవ్యముగల, సముచ్చయః + అపి = సముచ్చయమైనను, (ద్వంద్వార్థః = ద్వంద్వముయొక్క అర్థము) భవేత్ = అగును.

కంటె ఒకే విభక్తి ప్రత్యయము ప్రవర్తించును. అంతియేకాని ఘట-పట మున్నగు ప్రాతిపదికముల సముదాయముకంటె ఒకే విభక్తి ప్రత్యయము ప్రవర్తింపదు.

కాని ఒకే రూపములుకల 3, 4 (ఘట-ఘట-ఘట-ఘట) ప్రాతిపదికముల సముదాయ మున్నచో ఆ సముదాయమునకు వేరుగా ఒక ప్రాతిపదిక సంజ్ఞ కలుగుటచే ఆ సముదాయము కంటె ఒకే విభక్తి ప్రత్యయము ప్రవర్తింపగలదు. ఇదియే సర్వథా అనుగ్రహము. అనగా వేరువేరు ప్రాతిపదికముల కంటెను, సరూపములగు ప్రాతిపదికముల సముదాయము కంటెను విభక్తి ప్రవర్తించును.

ఇట్లే 'సుప్ సుపా' అను సమాసవిధిలో ఏకత్వము వివక్షితమగును కాబట్టి రెండు సుబంతములకే సమాససంజ్ఞ కలుగును.

కాని ద్వంద్వసమాసము, బహువ్రీహి సమాసము కూడ ఆ సూత్రములలో 'అనేకమ్' అని ప్రత్యేకముగా చెప్పియుండుటచే బహుపదములకు గూడ ద్వంద్వబహువ్రీహి సమాసములు ప్రవర్తింపగలవు. ఇదియే సర్వథా అనుగ్రహము.

ప్రత్యయ విధానము, సమాస విధానము ప్రధానములు. ప్రాతిపదికాత్, సుబన్తమ్, సుబన్తేన అనునవి అప్రధానములు.

ఇంతటితో సంఖ్యా వివక్ష పూర్తి అయినది. ॥91॥

అవతారిక— ఎల్ల శబ్దములకు జాతియే వాచ్యమగునని యీ సముద్దేశమున ప్రతిజ్ఞ చేయబడినది.

అందు ప్రాతిపదికము ధాతువు కూడ జాతినే బోధించుననియు, విభక్తి ప్రత్యయము కూడ సంఖ్యాత్వజాతినే బోధించుననియు 49 వ శ్లోకము చివరివరకు నిరూపింపబడినది. ఇది అపోద్ధారపద్ధతికి ఉపయోగపడును.

ఆ సంఖ్యా ప్రసంగవశమున ప్రత్యయార్థమగు సంఖ్య వివక్షితము అవివక్షితము అను విషయము 50 వ శ్లోకమునుండి యింతవరకు ప్రదర్శింపబడినది.

పై యంశమును ముగించి, మరల జాతినిగురించి చెప్పదలచిన విశేషాంశములను జూపుచున్నాడు.

**శ్లో॥ అభేదరూపం సాదృశ్యమాత్మభూతాశ్చ శక్తయః ।**
**జాతి పర్యాయవాచిత్వ మేషామప్యుపవర్ణ్యతే ॥ 92**

అభేదరూపమ్ = వేరుకానట్టి, సాదృశ్యమ్ = సామ్యము, అనగా వ్యక్తులకు ఏకరూపమగు సామ్యము, ఆత్మభూతాః = వ్యక్తిరూపములేయగు, శక్తయః + చ = శక్తులు కూడ అనగా కార్యమును కలిగించెడి సామర్థ్యములు కూడ (జాతిః + ఇతి + వ్యపదిశ్యన్తే) = జాతి అని వ్యవహరింపబడుచున్నవి, అనగా పిలువబడుచున్నవి.

తాత్పర్యము— "ఘట పటౌ" ఇది ద్వంద్వము. "కలయిక గల ఘట పటము లను రెండు వస్తువులు" అనిగాని, "ఘట పటములను రెండు వస్తువుల కలయిక" అనిగాని దీని కర్థమును చెప్పవచ్చును. మొదటి యర్థమున సముచ్చయము (కూడిక) అప్రధానమై, వస్తువులు ప్రధానమగును రెండవ యర్థమున వస్తువులు అప్రధానములై సముచ్చయము ప్రధానమగును. ॥198॥

అవతారిక— అట్లయినపుడు.

శ్లో॥ సముచ్చితస్య ప్రాధాన్యే లింగసంఖ్యే స్వభావతః ।
సముచ్చయస్య ప్రాధాన్యే శాస్త్రం స్యాత్ ప్రతిపాదకమ్ ॥ 199

సముచ్చితస్య = సముచ్చితమైన ద్రవ్యముయొక్క, ప్రాధాన్యే = ప్రాధాన్యమందు, లింగ సంఖ్యే = లింగవచనములు, స్వభావతః=స్వభావమునుబట్టి (సిద్ధించును), సముచ్చయస్య = సముచ్చయము యొక్క, ప్రాధాన్యే = ప్రాధాన్యమందు, శాస్త్రమ్ = వ్యాకరణము, ప్రతిపాద కమ్ = లింగవచనములను చెప్పునది, స్యాత్ = అగును.

తాత్పర్యము— ద్వంద్వమందు ద్రవ్యములు ముఖ్యమన్నచో వాని స్వభావమును బట్టి లింగవచనములు సహజములేయగును. వేరుగ ప్రయత్నమక్కరలేదు. అట్లుగాక ద్రవ్య ముల సముచ్చయము ప్రధానమన్నచో "విశేషణానాంచాజాతేః" (1-2-52) అను సూత్రము వలన ఆశ్రయమగు ద్రవ్యములనుబట్టి లింగవచనములు సంక్రమించును.

వివరణము— సముచ్చయమను ధర్మముకూడ విశేషణముగ అంగీకరింపబడును. "విశేషణానామ్" మొదలగు సూత్రము 134 వ కారికలో వ్యాఖ్యానింపబడినది. ఈ ప్రసంగ మంతయు ఆ సూత్రము ననుసరించి విస్తరించినదే. ॥199॥

అవతారిక— సముచ్చితము (ద్రవ్యములు) ముఖ్యమైనను, సూత్ర ముపయోగించు నని కొందరందురు. వారి మతమును చూపుచున్నాడు.

శ్లో॥ సముచ్చయవతోఽర్థస్య ప్రాధాన్యేప్యపరే విదుః ।
నిమిత్తానువిధాయిత్వాదసిద్ధిం లింగసంఖ్యయోః ॥ 200

సముచ్చయవతః = సముచ్చయముగల, అర్థస్య=అర్థముయొక్క, (ద్రవ్యములు), ప్రాధాన్యే + అపి = ప్రాధాన్యమందు కూడ, నిమిత్తాను విధాయిత్వాత్ = నిమిత్తమునే అనుసరించుట వలన, లింగసంఖ్యయోః = లింగవచనములయొక్క, అసిద్ధిమ్ = సిద్ధింపక పోవుటను, అపరే = కొందరు, విదుః = తెలియుదురు (భావింతురు).

తాత్పర్యము— "ఘట పటౌ" మొదలగుచోట్ల ద్రవ్యస్వరూపమును నిశ్చయించు టలో సముచ్చయము నిమిత్తమగును. అట్టి సముచ్చయముచే ద్రవ్యములు కప్పబడును. కావున సముచ్చయమను ధర్మమే భాసించుచున్నందున "ద్రవ్యము ముఖ్యము" అన్న పక్ష

మందును, ''విశేషణానామ్'' మొదలగు సూత్రముచేతనే లింగవచనములను సాధింపవలెనని కొందరందురు.

వివరణము— ''కలయిక గల ఘట పటములు'' అని అర్థమును చెప్పినను, ''కలయిక'' అను ధర్మమందు ఆ రెండును కప్పబడినట్లై కలయికయే భావన యందుండును గాన తదనుసారము లింగవచనములుండక పోవచ్చునని వీరి తాత్పర్యము. నిమిత్తమైన ధర్మము నిమిత్తిని కప్పివేయునని వీరి సమన్వయము. ॥200॥

అవతారిక — మీది మతము సముచితముగాదని చెప్పుచున్నాడు.

శ్లో॥ సముచ్చయో నిమిత్తం చేత్ స్యాన్నిమిత్తానువర్తనమ్ ।
అన్వయవ్యతిరేకాభ్యాం చార్థో ద్వంద్వనిబంధనః ॥ 201

సముచ్చయః = సముచ్చయము, నిమిత్తమ్ + చేత్ = నిమిత్తమైతే, నిమిత్తానువర్తనమ్ = నిమిత్తము ననుసరించుట, స్యాత్ = అయ్యెడిని, అన్వయవ్యతిరేకాభ్యామ్ = అన్వయవ్యతిరేకముల వలన, ద్వంద్వనిబంధనః = ద్వంద్వమునుబట్టి తెలియదగినది, చార్థః = చకారము యొక్క అర్థము, (భవతి = అగును).

తాత్పర్యము— ద్వంద్వము యొక్క అర్థమునకు సముచ్చయము నిమిత్తము కాదు. మీదు మిక్కిలి ద్వంద్వమునుబట్టియే చకారముయొక్క అర్థమును భావింపవలయును. కాగా సముచ్చయము ద్వంద్వమున నిమిత్తము కానందున మీని కారిక చూపిన మతము మంచిది కాదు.

వివరణము— ద్వంద్వమున్నపుడు వచ్చునదియు, లేనపుడు రానిదియునగు అర్థమే ద్వంద్వముయొక్క అర్థమగును. అన్వయవ్యతిరేక భావమనగా ఇదియే. అట్టి యర్థము ''సమప్రాధాన్యముగల ద్రవ్యముల కలయిక లింగవచనములను కలిగి ఒక క్రియలో అన్వయించుట'' అగును. ఉదా: ''ఘట పటౌ ఆనయ'' (ఘట పటములను రెండిటిని కలిసి తీసుకొని రమ్ము). అట్టి యర్థమును వాక్యదశయందు చకారము సూచించును. అందువలన ద్వంద్వమునకు వాచ్యమైన యర్థమే చకారమునకు ద్యోత్యమగునని విశదముచేయుటకై ''చార్థే ద్వంద్వః'' అను సూత్రము బయలుదేరినది. అంతియకాని చార్థమైన సముచ్చయము ద్వంద్వమున నిమిత్తమని చెప్పుట దాని తాత్పర్యము కాదు. కాగా సముచ్చయము నిమిత్తమనుట కేవలము భ్రాంతి. ॥201॥

అవతారిక— ''ఇచటి తత్త్వమిది'' అని చూపుచున్నాడు

శ్లో॥ సముచ్చితనిమిత్తత్వే చార్థస్యాపగమేఽపి వా ।
స్వభావసిద్ధే ద్వంద్వస్య లింగసంఖ్యే వ్యవస్థితే ॥ 202

సముచ్చితనిమిత్తత్వే = కలిసిన ద్రవ్యములు నిమిత్తమైనపుడును, వా = లేక, చార్థస్య =

చకారముయొక్క అర్థము, అపగమే + అపి = పోయినపుడు గూడ, ద్వంద్వస్య = ద్వంద్వ మునకు, లింగసంఖ్యే = లింగవచనములు, స్వభావసిద్ధే = సహజములుగా, వ్యవస్థితే = నిశ్చయింపబడినవి.

తాత్పర్యము— కలిసిన ద్రవ్యములు ముఖ్యమైనపుడును, ద్రవ్యముల కలయిక (సముచ్చయము) నిమిత్తము కానపుడునుగూడ, ద్వంద్వమున లింగవచనములు సహజములే యగును. (ద్రవ్యముల ధర్మములుగాన అవి సహజములు). ॥202॥

అవతారిక— "సముచ్చయమనగా పరస్పరాపేక్షగల ద్రవ్యముల కలయిక గదా! అయినపుడు ద్వంద్వమున "చార్థము" లేకపోవుట ఎట్లు కుదురును?" - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ పదాంతరస్థస్యార్థస్య ద్యోతకత్వాన్న యుజ్యతే ।**
**నిపాతో లింగసంఖ్యాభ్యాం ద్వంద్వస్త్వర్థస్య వాచకః ॥ 203**

పదాంతరస్థస్య = వేరొక పదమందుండు (వాక్యమందలి పదము), అర్థస్య = అర్థమును, ద్యోతకత్వాత్ = ద్యోతనము చేయునదగుటవలన, నిపాతః = నిపాతము (చకారము), లింగ సంఖ్యాభ్యామ్ = లింగవచనములతో, న + యుజ్యతే = కూడియుండదు, ద్వంద్వః + తు = ద్వంద్వసమాసమైతే, అర్థస్య = అర్థమునకు ("కలయిక" అను అర్థము), వాచకః = వాచకము.

తాత్పర్యము— చకారము నిపాతము. అది వాక్యదశలో ఉండు పదార్థముల సముచ్చయమును ద్యోతన చేయును. కావున దానికి లింగవచనములుండవు. ద్వంద్వము సముచ్చయమునకు వాచకము. కావున దానికి లింగవచనములు సహజములు.

వివరణము— "చార్థము పోవుట" అనగా సమాసదశలో చకార మక్కర లేకుండ, దాని యర్థము తెలియుటయే. అనగా "ఘట పటౌ" మొదలగు ద్వంద్వములవలననే సముచ్చయ రూపమగు అర్థము స్పష్టమైపోవును. అచట చకారమును వాడనక్కరలేదు. "ఘటః - చ - పటః - చ" మొదలగునది వాక్యావస్థ. కేవలము పోలికనుబట్టి ద్వంద్వమునకు అది విగ్రహముగా చూపబడును. వాస్తవమున వాక్యమునకును సమాసమునకును ఎట్టి సంబంధమును కుదురదు. (190-195, కారికలలో ఈ యంశములు ఇదివరకే నిరూపింప బడినవి). ॥203॥

అవతారిక— "సముచ్చయమును నిమిత్తము ననుసరించుట" అను మతమును (200 కారిక) మరల దూషించుచున్నాడు.

**శ్లో॥ నిమిత్తానువిధానే చ ద్రవ్యధర్మానపేక్షణాత్ ।**
**గుణప్రధానభావేన క్రియాయోగో న కల్పతే ॥ 204**

నిమిత్తానువిధానే + చ = సముచ్చయమును నిమిత్తముచే ద్రవ్యములు కప్పబడినపుడు, ద్రవ్య

ధర్మా నపేక్షణాత్ = ద్రవ్యముల యొక్క ధర్మముల అపేక్ష లేనందువలనను, గుణప్రధాన భావేన = సముచ్చయమను గుణము ముఖ్యమగుట చేతను, క్రియాయోగః = క్రియతోడి సంబంధము, న + కల్పతే = కుదురకపోవును.

తాత్పర్యము — ద్వంద్వమున సముచ్చయము నిమిత్తమై ద్రవ్యములను కప్పివేసి నచో, ద్రవ్యములు అప్రధానములుగను, సముచ్చయమను గుణమే ప్రధానముగను మారును. అయినపుడు ద్వంద్వమునకు క్రియాసంబంధము కుదురకపోవును. క్రియతోడి సంబంధము ద్రవ్యమునకేగాని గుణమునకు సంభవించదు గదా ! (ద్రవ్యము ఆధారము. అందలి గుణము అధేయము).

వివరణము — నిమిత్తాను విధానమనగా నిమిత్తమునే ముఖ్యముగ భావించి, నిమిత్తముగల ద్రవ్యములను ఉపేక్షించుట. అపుడు ద్రవ్యముయొక్క కర్తృత్వము, కర్మత్వము మొదలగు శక్తులు అణగిపోవును. కారకము కానందున క్రియాయోగము కుదురదు. ॥204॥

అవతారిక — క్రియాయోగము లేనపుడు కలుగు దోషమును వివరించుచున్నాడు.

శ్లో॥ యస్య నాస్తి క్రియాయోగః స్వతంత్రోఽసౌ న విద్యతే ।
అర్థో ద్వంద్వస్య తత్ర స్యాదుపాదానమనర్థకమ్ ॥ 205

యస్య = ఏ అర్థమునకు, క్రియాయోగః = క్రియతో సంబంధము, న + అస్తి = ఉండదో, అసౌ = ఈ, అర్థః = అర్థము, స్వతంత్రః = స్వతంత్రముగా, న + విద్యతే = నిలబడదు, తత్ర = అచట, ద్వంద్వస్య = ద్వంద్వముయొక్క, ఉపాదానమ్ = స్వీకారము, అనర్థకమ్ = ప్రయోజనము లేనిదై, స్యాత్ = అయ్యెడిని.

తాత్పర్యము — క్రియతో సంబంధము లేని పదార్థము స్వతంత్రముగ నుండజాలదు. (దానివలన అర్థప్రతీతి సంపూర్ణము కాదు). అందుచే ద్వంద్వమునకు క్రియాయోగము లేకపోయినపుడు దానిని స్వీకరించుటయు వ్యాఖ్యానించుటయును నిష్ఫలమగును. ॥205॥

అవతారిక — ''నిమిత్తాను విధానము'' అను రీతి కూడ అన్ని చోటులందును ఉండదని చెప్పుచున్నాడు.

శ్లో॥ సముచ్చయవతోఽర్థస్య వాచకో నానువర్తతే ।
నిమిత్తమపి చాస్యార్థః స్వధర్మైర్యుజ్యతే తతః ॥ 206

సముచ్చయవతః = సముచ్చయముగల, అర్థస్య = అర్థమును, వాచకః + అపి = చెప్పు శబ్దము కూడ (''సముచ్చిత'' అను శబ్దము), నిమిత్తమ్ = నిమిత్తమును, న + అనువర్తతే = అనుసరించదు. తతః + చ = అందువలన, అస్య = ఈ శబ్దముయొక్క, అర్థః = అర్థము, స్వధర్మైః = తన ధర్మములతో (లింగవచనములతో), యుజ్యతే = కలియును.

తాత్పర్యము— ''సముచ్చితః'' (కలయికగలది - లేక- కలిసియున్నది) అను శబ్దమున్నది. ఇది ''కలిసియున్న వస్తువు'' అను నర్థమును చెప్పును. ఇచట ''కలిసి యుండుట'' సిద్ధముగనే యుండును. ఉన్నదానిని ఈ శబ్దము బోధపరచును. అంతియకాని సముచ్చయము నిమిత్తము కాదు. అందువలన సముచ్చిత శబ్దము లింగసంఖ్యలను పొందును. ''ఘట పటౌ'' మొదలగు ద్వంద్వము కూడ ఇట్టిదే. పదార్థముల కలయిక ఇచట ముందుగనే సిద్ధముగ నుండును. దానికి ద్వంద్వము వాచకమగును. అంతేకాని సముచ్చయము ద్వంద్వము నకు నిమిత్తము కాదు. కాగా ద్వంద్వమునకు లింగవచనములు సహజములు.

*వివరణము*— శుక్లః, మొదలగు గుణవాచకములు ''శుక్లత్వము'' మొదలగు గుణ మును నిమిత్తముగా గ్రహించి, ఆ గుణముగల ద్రవ్యమును చెప్పగలవు. (శుక్లః = తెలుపు, శుక్లః = తెల్లని వస్తువు) నిమిత్తమగుట యనగా ఇట్టిది. ఈ తీరు ''సముచ్చయ'' అను శబ్దము విషయమున కుదురదు. సముచ్చయమన్నది శుక్లత్వమువంటి ధర్మము కాదు. కావున అది ద్రవ్యమును బోధించుటలో నిమిత్తము కానేకాదు. సముచ్చయము సిద్ధముగానున్నచో మాత్రము ''సముచ్చయము గల ద్రవ్యము'' అను నర్థమును ''సముచ్చిత-సముచ్చయవత్'' అను వేరే శబ్దములు తెలియజేయును.

ద్వంద్వసమాసము యొక్క తీరు కూడ ఇట్టిదే. సిద్ధముగనున్న సముచ్చయమును అది బోధించును. కాని దానిని నిమిత్తముగా స్వీకరింపదు. కాగా సముచ్చితమైన ద్రవ్యములు ముఖ్యమన్నచో ద్వంద్వమునకు లింగవచనములు సహజములగును. ద్రవ్యముల సముచ్చ యమే ముఖ్యమన్నచో ''విశేషణానామ్'' (1-2-52) మొదలగు సూత్రముచే ఆశ్రయగత మగు లింగవచనములు వచ్చునని చెప్పవలయును. (199 వ కారిక చెప్పిన భావమే తుదకు ఇచట సిద్ధాంతమైనది). ॥206॥

*అవతారిక*— ద్వంద్వమందలి పదార్థములు అనేకములు. అవి సమప్రాధాన్యము గలవి. అయినపుడు ఏది ఆశ్రయమగును? దేనినిబట్టి లింగవచనములను సంపాదింపవలెను? అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ బాహ్యో నాస్త్యాశ్రయో ద్వంద్వే విశేషౌ తత్ర హి శ్రుతౌ।**
**సముచ్చయస్తదాధారస్తద్ధర్మైర్వ్యపదిశ్యతే॥ 207**

ద్వంద్వే = ద్వంద్వమందు, బాహ్యః = వెలుపలిదైన, ఆశ్రయః = ఆధారము, న + అస్తి = ఉండదు, తత్ర = అచట, విశేషౌ = ద్రవ్యవిశేషములు, శ్రుతౌ + హి = వినబడునుగదా!, తదాధారః = ఆ విశేషములే ఆశ్రయముగా గల, సముచ్చయః = సముచ్చయము, తద్ధర్మైః = వాని ధర్మములతో (లింగసంఖ్యలతో), వ్యపదిశ్యతే = వ్యవహరింపబడును.

తాత్పర్యము— ద్వంద్వమున ఆధారమైన ద్రవ్యము వేరుగా ఉండదు. కలిసి యుండు ద్రవ్యములచట స్పష్టముగనే ఉండును. అవియే సముచ్చయమున కాధారములు. వానిని బట్టియే లింగసంఖ్యలు వచ్చును.

*వివరణము*— గుణవాచకముల విషయములో ఆశ్రయము వేరుగా గుండును. ఉదా : శుక్లః పటః. పటము ఆశ్రయము. శుక్లా నారీ. శుక్లౌ ఘటౌ. కావున ఆశ్రయ మునుబట్టి లింగసంఖ్యలనుట అచట సులభము. కాని ద్వంద్వమందు ఆశ్రయము వేరుగా ఉండదు కలియు ద్రవ్యములు ద్వంద్వమందే ఇమిడియుండును. (ఘట పటౌ). అందువలన సముచ్చయమున కాధారముగా వానినే తీసికొనవలయును. వాని లింగసంఖ్యలే సముచ్చయము నకు సంక్రమించుచునవలెను.

విశేష విషయములు— భిన్న లింగములకు ద్వంద్వమైనపుడు పరపదముయొక్క లింగమే మొత్తముపై వచ్చునను నియమము గలదు. (ఉదా : కుక్కుటమయూర్యౌ - ఇమే (- స్త్రీ॥) మయూరీకుక్కుటౌ - ఇమౌ - పుం॥). సంఖ్యయు అవయవములగు పదార్థములను బట్టి అనుసరించును. (రెండయినచో ద్వివచనము, పెక్కులయినపుడు బహువచనము).॥207

*అవతారిక*— ద్వంద్వమందలి పదము ప్రతియొకటియు సమసించు పదార్థముల సముదాయమునే బోధించుచున్న పక్షములో లింగవచనముల సిద్ధిని చూపుచున్నాడు.

శ్లో॥ యో వావయవభేదాభ్యాం భేదవద్భ్యామివాన్వితః ।
ఏకః సమూహో ధర్మాత్ స భాగయోః ప్రతిపద్యతే ॥ 208

వా = లేక, భేదవద్భ్యామ్ + ఇవ = భేదముగలవి అన్నట్లుండు, అవయవభేదాభ్యాం = అవ యవముల భేదములతో, అన్వితః = కూడిన, ఏకః = ఒకటియైన, సమూహః = సముదా యము, యః = ఏది గలదో, సః = అది, భాగయోః = ఆశ్రయములైన భాగములయొక్క ధర్మాత్ = ధర్మమువలన, ప్రతిపద్యతే = పొందును (లింగవచనములను).

తాత్పర్యము— అవయవభేదములు గల సముదాయమే ద్వంద్వమందలి పదముల కర్థమని చెప్పుదుము. ఆ సముదాయమందలి భాగము లాధారములగును. వానినిబట్టి సముదా యమునకును లింగవచనములు సిద్ధించును.

*వివరణము*— 28 వ కారికలో చూపబడిన ద్వంద్వపరిశీలనమును ఇచట సమన్వ యించుకొనవలెను. "అవయవ భేదములు గల సముదాయము ద్వంద్వమున కర్థమని" ఆ సందర్భమున విపులమైన చర్చ జరిగినది. ॥208॥

*అవతారిక*— "అవయవములను మించిన సముదాయమన్నది ద్వంద్వమున వేరుగ ఉండదు. అట్లయినపుడు ఆధారాధేయ భావ మెట్లు కుదురును ?" అను శంకకు సమా ధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏకశ్చ ద్వ్యాత్మకోఽర్థోఽసౌ భేదాభేదసమన్వితః ।
యో భేదాశ్రితః తత్స్థే లింగసంఖ్యే ప్రపద్యతే ॥ 209

అసౌ = ఈ, అర్థః = అర్థము, ఏకః + చ = ఒకటియైనను, భేదాభేదసమన్వితః =

భేదముతోను అభేదముతోను కూడినదై, ద్వ్యాత్మకః = రెండు స్వరూపములు గలది, (భవతి = అగును), యౌ = ఏ, భేదౌ = భేదములను, ఆశ్రితః = ఆశ్రయించునో, తత్స్థే = ఆ భేదములందుండు, లింగసంఖ్యే = లింగవచనములను, ప్రపద్యతే = పొందును.

తాత్పర్యము— ద్వంద్వమున కర్థమైన సముదాయము రెండు రకములు. అవయవ భేదములు గల దొకటి. అది లేనిది రెండవది. అందు మొదటిది అవయవములనే ఆశ్రయము లుగ స్వీకరించును. తాను ఆశ్రితమగును. కాగా అవయవముల లింగవచనములు సముదాయ మునకు సిద్ధించును.

వివరణము— వనమ్ = చెట్ల సముదాయము. యూథమ్ = జంతువుల సముదాయము. ఇట్టి చోటులందు సమువాయ మొకటియే ముఖ్యము. అవయవ భేదముండదు. ఇట్టి సముదాయమే ద్వంద్వమున కర్థమన్నచో ఇతరేతర యోగ ద్వంద్వమున (ఘట పటౌ, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నాః) లింగవచనముల వ్యవస్థ కుదురక పోవును. అందువలననే భావ నామాత్రగమ్యమైన ఈ కల్పనమంతయు చేయబడినది.

ద్వంద్వమున లింగవచనముల అతిదేశ పరిశీలన మింతటితో ముగిసినది. ॥209॥

## (11) బహువ్రీహియందు లింగవచనముల అతిదేశ పరిశీలనము

*అవతారిక*— బహువ్రీహి సమాసమున లింగవచనముల అతిదేశముయొక్క ఉప యోగమును పరిశీలించుటకు ప్రారంభించుచున్నాడు.

**శ్లో॥ యథా స్వశబ్దాభిహితే చైత్రార్థే న ప్రయుజ్యతే ।**
**చైత్రశబ్దో బహువ్రీహావప్రయోగ స్తథా భవేత్ ॥** 210

స్వశబ్దాభిహితే = తన శబ్దముచే (అదే శబ్దముచే) చెప్పబడిన, చైత్రార్థే = చైత్రరూపమైన అర్థమందు, చైత్రశబ్దః = చైత్ర, అను శబ్దము, యథా = ఎట్లు, న + ప్రయుజ్యతే = ప్రయోగింపబడదో, తథా = అట్లు, బహువ్రీహౌ = బహువ్రీహి సమాసమున, అప్రయోగః = ప్రయోగము లేకపోవుట, భవేత్ = అయ్యెడిని.

తాత్పర్యము— చైత్రుడు, అను అర్థమును చెప్పుటకు ''చైత్రః'' అను శబ్దమును ఒకసారి వాడిన చాలును. మరల మరల వాడనక్కరలేదు. అట్లే బహువ్రీహి సమాసమును వాడినపుడు అన్యపదార్థము తెలిసిపోవును, గాన దానిని చెప్పుటకై వేరొక శబ్దమును వాడ నక్కర యుండక పోయెడిని.

వివరణము— బహువ్రీహియందు అన్యపదార్థము ముఖ్యము. అనగా సమసించు పదముల అర్థము విశేషణమై వేరుగా ఉండు విశేష్యముతో అన్వయించును. ఉదా: ''పీతాంబరః = విష్ణుః'' (పీతమ్ - అంబరమ్ - యస్య - సః = పచ్చని బట్ట గలవాడు = విష్ణువు). ఇట్టిచోట్ల సమాసమువలననే విశేష్యము తెలియునుగాన (ఆయా విశేషణము గల వ్యక్తియను భావము తెలిసిపోవును) దానిని చెప్పు శబ్దమును వేరుగ పలుకనక్కరయుండదని సారాంశము

విశేష విషయములు— (1) సమసించు పదములను (సమాసములో ఇమిడియున్న పదములు) వృత్తిపదము లందురు. వాని యర్థములు వృత్తి పదార్థములగును. వీనికన్న వేరైనది అన్య పదార్థము. అనగా విడిగానుండు విశేష్యముయొక్క అర్థము.

(2) ''ఉక్తార్థానామ్ అప్రయోగః'' అని సంప్రదాయము. వేరొక విధమున అర్థము తెలియునపుడు అదే యర్థముకొరకు వేరొక శబ్దమును వాడనక్కరలేదని భావము. ఉదా : చైత్రః = చైత్రుడు. ఈ యర్థమునకై మరల చైత్రశబ్ద మక్కరలేదు. ''ఘటపటౌ'' = ఘట పటముల సముచ్చయము. ఇచట సముచ్చయమును చెప్పుటకు చకారమును వాడ నక్కర లేదు.

(3) అట్లే బహువ్రీహి వలన అన్యపదార్థము తెలిసిపోవునుగాన దానిని చెప్పు శబ్దమును ప్రయోగింపనక్కర లేదు.

(4) ఈ కారిక కేవలము శంకను చూపినది. ॥210॥

అవతారిక — మీది శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథా గౌరితి శుక్లాదేరభిధానం న విద్యతే।**
**ఏవం యస్యాభిసంబంధో గోభిస్తావత్ ప్రతీయతే॥** 211

గౌః + ఇతి=గౌః, అను సామాన్యపదముచే, శుక్లాదేః=''శుక్లా - గౌః'' మొదలగు విశేషము యొక్క, అభిధానమ్ = చెప్పుట, న = విద్యతే = ఉండదో, ఏవమ్ = ఇట్లు, గోభిః = గోవులతో, యస్య = ఎవనికి, అభిసంబంధః = సంబంధమో, తావత్ = అంతమాత్రమే, ప్రతీయతే = తెలియబడును (బహువ్రీహిచే).

తాత్పర్యము— సామాన్యమును చెప్పు శబ్దము విశేషమును చెప్పజాలదు. ఉదా : గౌః = ఆవు (సామాన్యము). ఇది శుక్ల, కృష్ణ, మొదలగు విశేషములను చెప్పదు. అవి కావలసినచో ''శుక్లా'', ''కృష్ణా'' మొదలగు పదములను తప్పక వాడవలెను. అట్లే ''చిత్రగుః'' (చిత్రాః - గావః - యస్య - సః = రంగు రంగుల ఆవులుగల వ్యక్తి) అను బహువ్రీహి ''గోవులకు ప్రభువైన వ్యక్తి'' అను సామాన్యార్థమునే చెప్పి ఊరకుండును. చైత్రుడు, మైత్రుడు మొదలగు వ్యక్తి విశేషములను బోధించుటకు ఆ యా పదములు వేరుగా ఉండక తీరదు. కాన విశేష్యమును బోధించు పదమును బహువ్రీహికి అనుబంధముగా చేర్చవలెను.

వివరణము— ''సామాన్యాభిధానే హి విశేషానభిధానమ్'' (సామాన్యమును మాత్రము చెప్పినపుడు విశేషము తెలియదు గదా!) అను అభియుక్తుల వచనము ఇచట ప్రమాణము. ॥211॥

అవతారిక— శబ్దముయొక్క శక్తివలన కొన్ని బహువ్రీహులందు విశేషముకూడ ఇమిడి యుండును. అట్టిచోట్ల విశేషమును వేరుగ చూపనక్కరలేదని వివరించుచున్నాడు.

శ్లో॥ సంబంధీ నియతో రూఢశ్చిత్రాణాం న చ విద్యతే ।
గవాం యథా వజ్రపాణిస్త్ర్యక్షో వాపి వ్యవస్థితః ॥ 212

వజ్రపాణిః = వజ్రపాణిః, అను బహువ్రీహియు, వా = లేక, త్ర్యక్షః + అపి = త్ర్యక్షః, అను బహువ్రీహియును, యథా = ఎట్లు, వ్యవస్థితః = నిశ్చయింపబడినదో (తథా = అట్లు), నియతః = నిశ్చితమైన, రూఢః = ప్రసిద్ధమైన, సంబంధీ = సంబంధముగల వ్యక్తి విశేషము, చిత్రాణామ్ = చిత్రములైన, గవామ్ = గోవులకు, న + చ + విద్యతే = ఉండదు.

తాత్పర్యము — ''వజ్రపాణిః'' (వజ్రం - పాణౌ - యస్య - సః) ఇది ఇంద్రుని యందు రూఢము. కాన ఇచట ''ఇంద్రః'' అని అనుప్రయోగమును (వెనుకగా విశేష శబ్దమును పలుకుట) చేయనక్కరలేదు. అట్లే - ''త్ర్యక్షః'' (త్రీణి - అక్షీణి - యస్య - సః = ముక్కంటి) అనునది శివునియందు ప్రసిద్ధము. ఇచట కూడ అనుప్రయోగమక్కరలేదు. కాని ''చిత్రగుః'' (చిత్రాః - గావః - యస్య - సః) అనునది మాత్రము ''చిత్రమైన ఆవులకు స్వామి'' అను సామాన్యము నే తెలియజేయును. ఆ స్వామి ప్రసిద్ధుడు కాడు. కావున ఇట్టిచోట్ల విశేషశబ్దమును (చైత్రః, మొ॥) పలుకక తప్పదు.

వివరణము — కొన్ని బహువ్రీహులు విశేషమును కూడ ప్రతిపాదించుటయు, మరికొన్ని సామాన్యమును మాత్రమే ప్రతిపాదించుటయును శబ్దశక్తి యొక్క మహిమయే. (అనగా భాషా స్వభావము). ప్రకరణము మొదలగు వానివలన విశేషము తెలియునపుడు ''చిత్రగుః'' మొదలగుచోట్ల కూడ, అనుప్రయోగమావశ్యకము కాదు. ॥212॥

అవతారిక — వాక్యము విశేషమును గూడ చెప్పగలదు. సమాసము సామాన్యమునే బోధించునని చూపుచున్నాడు

శ్లో॥ శబ్దాంతరత్వాద్వాక్యేషు విశేషా యద్యపి శ్రుతాః ।
వృత్తిశబ్దోన్య ఏవాయం సామాన్యస్యాభిధాయకః ॥ 213

యద్యపి = పరిశీలింపగా, శబ్దాంతరత్వాత్ = వేరు శబ్దములగుట వలన, వాక్యేషు = వాక్యములందు, విశేషాః = విశేషములు, శ్రుతాః = వినబడును, సామాన్యస్య=సామాన్యమును, అభిధాయకః = బోధించు, అయమ్ = ఈ, వృత్తిశబ్దః = వృత్తిపదము (బహువ్రీహి సమాసము) అన్యః + ఏవ = వేరైనదియే.

తాత్పర్యము— ''వాక్యము వేరు, వృత్తి వేరు'' అని ఇదివరకు పెక్కు విధముల (ఈ సముద్దేశము యొక్క తొలి చర్చలలో) ప్రతిపాదింపబడెను. బహువ్రీహి విషయమందును అదియే స్థితి. ''చిత్రాః - గావః, అస్య - దేవదత్తస్య'' అను వాక్యము విశేషమును కూడ స్వీకరింపగలదు. ''చిత్రగుః'' అను సమాసము మాత్రము అట్లు చేయలేదు. సామాన్యమునే బోధించి యూరకొనును.

వివరణము— కొంచెము పోలికనుబట్టి వృత్తిని వాక్యరూపమున విశ్లేషించి చూపుదురు. అంతమాత్రమున "ఆ రెండును ఒకటేయనిగాని, ఒకదానికొకటి మార్పు" అనిగాని అనుకొనగూడదు. వాక్యధర్మములను పూర్తిగా వృత్తి చెప్పజాలదు. వాక్యమందలి సంఖ్యావిశేషములను వృత్తి బోధింపజాలదు గదా! ॥213॥

అవతారిక— అట్లయినచో కేవలము సామాన్యమునే బోధించు బహువ్రీహి వలన ప్రయోజనమేమి? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ అగోరచిత్రగోశ్చైవ రూపభేదాన్నివర్తకః ।
న చిత్రగువిశేషాణాం రూపాభేదాత్తు వాచకః ॥ 214

రూపభేదాత్ = స్వరూపముయొక్క భేదమువలన, అగోః = గోవుల సంబంధము లేనివానిని, అచిత్రగోః + చ = చిత్రమైన గోవుల సంబంధము లేనివానిని కూడ, నివర్తకః + ఏవ = త్రోసివేయునదియే (భవతి = అగును), తు = కాని, రూపాభేదాత్ = స్వరూప భేదము లేనందువలన, చిత్రగువిశేషాణామ్ = చిత్రమైన గోవులుగల వ్యక్తి విశేషములను, వాచకః = చెప్పునది, న = కాదు.

తాత్పర్యము— అగుః = గోవులు లేనివాడు (న - సంతి - గావః - యస్య - సః) అచిత్రగుః = చిత్రమైన గోవులు లేనివాడు, (న + చిత్రగుః) భిన్నమైన ఈ శబ్దములు వేర్వేరు అర్థములను బోధించును. ఈ రెండు విధములైన అర్థములను అడ్డుటకు "చిత్రగుః" అను బహువ్రీహి ఉపయోగించును. అది "చిత్రగోస్వామి" అను సామాన్యమునే బోధించును గాని విశేషములను బోధింప సమర్థము కాదు. చైత్రః, మైత్రః, మొదలగు విశేషముల సంఖ్యాకములు. అయినను అన్నింటికిని "చిత్రగుః" అను విశేషణ మొకటియే సరిపోవును గదా!

వివరణము— అగుః, అచిత్రగుః, అను వానికి భిన్నమైన చిత్రగు, శబ్దము ఆ రెండింటిని త్రోసివేయును. అందు రూపభేదము కారణము. అట్లే విశేషము లెన్నియైనను అన్నింటిని విశేషముగా కాక సామాన్యముగా చెప్పగలది చిత్రగు శబ్దమగును. అందు శబ్దరూప మొకటే యగుట నిదానము. ఇట్లు బహువ్రీహి ఒక విధముగ విశేషమును, వేరొక విధముగ సామాన్యమును కూడ బోధించునని పర్యవసించును. ॥214॥

అవతారిక— చిత్రగుః, మొదలగు బహువ్రీహి స్థలములలో, చైత్రః, మైత్రః మొదలగు విశేష శబ్దముల అనుప్రయోగము తప్పదని పై విచారణవలన తేలినది. అట్లే తత్, ఇదమ్, మొదలగు సర్వనామములకు కూడ అనుప్రయోగమావశ్యకమే. అవియు ఒక విధముగ విశేషములేయగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ యథా చిత్రగురిత్యేతత్ ప్రయుక్తే న ప్రయుజ్యతే ।
ఏవం యది స్యాత్ సామాన్యం తస్య న స్యాత్ ప్రతిశ్రుతిః ॥ 215

ఏషామ్ = సాదృశ్యము, శక్తి అను మున్నగువానికి, జాతిపర్యాయ వాచిత్వమ్ + అపి = జాతిని బోధించెడి శబ్దములకు పర్యాయ శబ్దత్వము కూడ, ఉపపద్యతే = అంగీకరింపబడుచున్నది.

కొందరు ప్రశ్నించెదరు— 'గోవ్యక్తు లన్నిటియందు గౌః, అను ఏకరూపమగు జ్ఞానము కలుగుటచే దాని బలమువలన గోత్వమనే జాతిని అంగీకరించుట అయుక్తము. ఏలయన ఏకరూపమగు సాదృశ్యము ఎల్లగోవులకు కలదు. అట్లే ఎల్లగోవులయందు కార్యమును కలిగించెడి శక్తులు కలవు. కాగా సాదృశ్యమునుబట్టిగాని, సామర్థ్యమునుబట్టిగాని ఏకరూపమగు జ్ఞానము కలుగవచ్చును. ఇట్లుండగ వేరుగ జాతిని స్వీకరింపనక్కరలేదు.

ఈః ప్రశ్న సత్యమే. సాదృశ్యము, శక్తి అనునవియు జాతిరూపములే. జాతి, ఆకృతి అను పర్యాయపదములున్నట్లు సాదృశ్యము, శక్తి అనునవియు పర్యాయపదములు కాగలవు.

సాదృశ్యము శక్తి మున్నగునవి జాతికంటె వేరుగా ఉన్నవా ? కాక ఏకరూపము లేనా ? అని శాస్త్రజ్ఞులు విచారింతురు. వారికి పట్టుదలయే మిగులును. ౹92॥

*అవతారిక* — జాతి సాదృశ్యరూపము కాదు. అది దానికంటె వేరుగానే యున్నదని వైశేషిక దర్శనము నాశ్రయించి సమర్థించుచున్నాడు

**శ్లో॥ దణ్డోపాదిత్సయా దణ్డం యద్యపి ప్రతిపద్యతే ।**
**నతస్మాదేవ సామర్థ్యాత్స దణ్డీతి ప్రతీయతే ॥** 93

**శ్లో॥ నేచ్ఛానిమిత్తా దిచ్ఛావానితి జ్ఞానం ప్రవర్తతే ।**
**తస్మాత్సత్యపి సామర్థ్యే బుద్ధిరర్థాన్తరాశ్రయా ॥** 94

యద్యపి = ఆలోచింపగా, దణ్డోపాదిత్సయా = దండమును (కఱ్ఱను) గ్రహింపవలెననెడి కోరికచే, దణ్డమ్ = దండమును, ప్రతిపద్యతే = పొందుచున్నాడు.

(తథాపి) కాని, తస్మాత్ + ఏవ + సామర్థ్యాత్ = ఆ దండమునందు కార్యమును కలిగించుట యనే సామర్థ్యము వలననే, సః = ఆతడు అనగా దండమును ధరించినవాడు, దణ్డీ + ఇతి = దండము కలవాడని, న + ప్రతీయతే = తెలియబడడు.

ఇచ్ఛానిమిత్తాత్ = కోరికకు కారణమగుదానివలన, ఇచ్ఛావాన్ + ఇతి = కోరిక కలవాడనెడి, జ్ఞానమ్ = జ్ఞానము, న + ప్రవర్తతే = కలుగనేరదు.

తస్మాత్ = ఆ కారణమువలన అనగ ప్రకృత వ్యవహారము జరుగనేరదను కారణము వలన, సామర్థ్యే = సామర్థ్యము, సతి + అపి = ప్రతి వ్యక్తియందు ఉన్నను, బుద్ధిః = ఎల్ల గోవులయందు, 'గౌః' అను ఏకాకారమగు జ్ఞానము, అర్థాన్తరాశ్రయా = మరియొక యర్థము ఆధారముగా అనగా నిమిత్తముగా గలదియే యగును. ఆ యర్థము జాతియేయని భావము.

ప్రయుక్తే = ఒక శబ్దము ప్రయోగింపబడగా, చిత్రగుః + ఇతి = చిత్రగుః, అను, ఏతత్ = ఈ పదము, యథా = ఎట్లు, న + ప్రయుజ్యతే = ప్రయోగింపబడదో, ఏవమ్ = ఇట్లు, సామాన్యమ్ = సామాన్యమును చెప్పు, "సర్వ" మొదలగు పదము, స్యాత్ + యది = అయినట్లయితే, తస్య = దానికి, ప్రతిశ్రుతిః = (వినబడుట) అను ప్రయోగము, న + స్యాత్ = లేకుండును.

తాత్పర్యము— "చిత్రమైన గోవులకు స్వామి" అను నర్థమును చెప్పు ఒక శబ్దమున్నపుడు మరల అదే యర్థమునకై "చిత్రగుః" అను పదమును వాడనక్కఱ లేదు. అట్లే సర్వ, తత్, ఇదమ్, మొదలగు శబ్దముల అపేక్ష లేనియెడల వానిని ప్రయోగింపవలసిన ఆవశ్యకత యుండదు. కాని వాని అపేక్ష కొన్నిచోట్ల ఉండునుగాన ఆ శబ్దములను గూడ అనుప్రయోగము చేయవచ్చును.

వివరణము— ఒక ప్రదేశమును ఉద్దేశించి, "చిత్రగు" అందుము. అపుడా ప్రదేశమంతయు "చిత్రగువు" అగునా? లేక కొంతయేనా? లేక ఈ ప్రదేశమా? ఆ ప్రదేశమా? మొదలగు శంకలు కలుగును. వానిని పోగొట్టుటకు సర్వమ్ (అంతయు), ఇదమ్ (ఇది), తత్ (అది) మొదలగు పదములను వాడక తప్పదు. కాగా అవి విశేషములను చెప్పు చైత్రః, మైత్రః, మొదలగు పదముల వంటివేయగును. అందుచే సర్వనామములకు కూడ బహువ్రీహిలో అనుప్రయోగము సంభవించును. ఉదా: చిత్రగుః - సః, చిత్రగుః - అయమ్ మొదలగునవి. ॥215॥

అవతారిక— వేరొక యర్థమును అడ్డునుగాన సర్వనామము కూడ విశేషపదమే యగునని వివరించుచున్నాడు.

శ్లో॥ సర్వాదయో విశేషాస్తు ప్రదేశానాం నివర్తకాః ।
యథా ప్రదేశాః సామాన్యప్రదేశాంతరబాధకాః ॥ 216

ప్రదేశాః = విశేషములు, యథా = ఎట్లు, సామాన్యప్రదేశాంతర బాధకాః = సామాన్యమునకును, ఇతర విశేషములకును బాధకములో, (తథా = అట్లు), ప్రదేశానామ్ = విశేషములను, నివర్తకాః = అడ్డివేయు, సర్వాదయః + తు = సర్వ, మొదలగు పదములైతే, విశేషాః = విశేషములు (భవంతి = అగును).

తాత్పర్యము— చైత్రః, అనునది విశేషము. ఇది మనుష్య సామాన్యమును, మైత్ర, మొదలగు ఇతర విశేషములనన్నింటిని తొలగించును. అట్లే, సర్వ, ఇదమ్ మొదలగు సర్వనామములు తాముకాని ఇతరములనన్నింటిని అడ్డివేయునుగాన అవియు విశేషములే యగును.

వివరణము— తన్ను తప్ప ఇతరములను తొలగించునది విశేషము. ఉదా: చైత్రః, అనగానే చైత్రుడు తప్ప మిగిలినవారందరును తొలగుదురు. దీనినే "అన్యవ్యా

వృత్తి'' అందురు. ఈ రీతి సర్వనామములకును వర్తించును. సర్వమ్, తత్, ఇదమ్, మొదలగు పదములను ఉచ్చరింపగానే అడి కానిదంతయు నివర్తించును.

ఇట్లు బహువ్రీహియందును ప్రయోగము సమర్థింపబడినది. ॥216॥

అవతారిక— బహువ్రీహియందు అన్యపదార్థము (విశేష్యమైన వేరొక వస్తువు) ముఖ్యమనియు, అపుడనుప్రయోగము కుదురుననియును ఇంతదనుక ప్రతిపాదింపబడినది. ''సంబంధమే బహువ్రీహియందు ముఖ్యమని'' వేరొక పక్షమును భాష్యకారుడు చూపెను. ఆ పక్షమును ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ విభక్త్యర్థాభిధానాద్వా షష్ఠీ నానుప్రయుజ్యతే ।
ద్రవ్యస్యానభిధానాత్తు తచ్ఛబ్దోఽనుప్రయుజ్యతే ॥ 217

వా = లేక, విభక్త్యర్థాభిధానాత్ = షష్ఠియొక్క అర్థమైన సంబంధమును చెప్పుటవలన, షష్ఠీ = షష్ఠీ విభక్తి, న + అనుప్రయుజ్యతే = వెనుకను ప్రయోగింపబడదు, ద్రవ్యస్య = ద్రవ్యమును, అనభిధానాత్ + తు = చెప్పనందువలన, తచ్ఛబ్దః = ఆ ద్రవ్యమును చెప్పు శబ్దము, అనుప్రయుజ్యతే = వెనుక ప్రయోగింపబడును.

తాత్పర్యము— బహువ్రీహియందు పదార్థము ముఖ్యముకాదు. సంబంధమే ముఖ్యము దానిని సమాసము బోధించునుగాన షష్ఠియొక్క అనుప్రయోగముండదు. పదార్థము ఏ విధముగను తెలియదు. అందుచే దానిని చెప్పు శబ్దమునకు అనుప్రయోగమావశ్యకమగును.

వివరణము— ''చిత్రగుః = చిత్రాః - గావః - యస్య'' ఇచట షష్ఠీవిభక్తియొక్క అర్థము సంబంధము - అనగా స్వస్వామి భావ సంబంధము. (స్వమ్ = సొత్తు, స్వామి = సొత్తు గలవాడు. ఇదొక సంబంధము) దీనినే ''చిత్రగు'' అను సమాసము చెప్పును. అందుచే వేరుగ షష్ఠిని వాడనక్కరలేదు. (ఉక్తార్థానామప్రయోగః = తెలిసిన యర్థమును చెప్పుటకు వేరుగ శబ్దమును వాడనక్కరలేదు). కాని ఆ సంబంధముగల ద్రవ్యము (స్వామి) బోధపడక పోవుటచే దానిని బోధించుటకు చైత్రః, మైత్రః, మొదలగు పదములను ప్రయోగింపక తప్పదు.

విశేష విషయములు— సంబంధముగల ద్రవ్యము ముఖ్యమనియు, దానిని సమాసము చెప్పుననియును వెనుకటి పక్షము. దీనిని పదార్థాభిధాన పక్షమందురు. అందు ద్రవ్యమును సమాసమే బోధించునుగాన, దానిని బోధించు పదమును వేరుగ వాడనక్కరలేదేమో - అను శంకయు, దానికి సమాధానమును చూపబడినది.

ద్రవ్యమునకు గల సంబంధమే ముఖ్యమని ప్రకృత పక్షము. దీనిని విభక్త్యర్థాభిధాన పక్షమందురు. ఇందు సంబంధమును చెప్పు షష్ఠికి అనుప్రయోగమక్కరలేక పోయినను (సంబంధము సమాసమే చెప్పునుగాన) ద్రవ్యమును చెప్పుటకు ఆ శబ్దముయొక్క అనుప్రయోగము న్యాయ్యమే యగునని ఫలించును. ॥217॥

అవతారిక— బహువ్రీహి సంబంధమునే బోధించునన్నపుడు సామానాధికరణ్యము కుదురదని శంకించుచున్నాడు.

శ్లో॥ సామానాధికరణ్యం చేన్మతుబ్లోపాత్ ప్రకల్ప్యతే।
మతుపోఽపి తదర్థత్వాదనవస్థా ప్రసజ్యతే॥ 218

మతుబ్లోపాత్ = మతుప్పుయొక్క లోపమువలన, సామానాధికరణ్యమ్=సామానాధికరణ్యము, ప్రకల్ప్యతే + చేత్=కల్పింపబడినట్లయితే, మతుపః + అపి=మతుప్పునకును, తదర్థత్వాత్ = అదే అర్థమగుటవలన, అనవస్థా = నియమము లేకపోవుట, ప్రసజ్యతే = సంభవించెడిని.

తాత్పర్యము— బహువ్రీహికి మతుప్ ప్రత్యయమును చేసి, దానికి లోపమును చెప్పి ''చిత్రగుః = చైత్రః'' అను రీతిని సామానాధికరణ్యమును (రెండును ఒకే ద్రవ్యమును చెప్పుట) సంపాదింపవచ్చునన్నచో చిక్కులు ఏర్పడును. మతుప్పునకర్థము సంబంధమున్న యెడల ఎన్నిసారులు మతుప్పును చేసినను సంబంధముగల ద్రవ్యము బోధపడదు. ఇదొక అనుపపత్తి. అట్లుకాక సంబంధియగు ద్రవ్యమునే మతుప్పు బోధించునన్నచో బహువ్రీహి యును ద్రవ్యమునే బోధింపవలసి వచ్చునుగాన ''సంబంధము ముఖ్యము'' అను విభక్త్యర్థాభి ధాన పక్షమే కుదురదు. ఇది వేరొక అనుపపత్తి.

వివరణము— చిత్రగు, అను సమాసము సంబంధమునే చెప్పునన్నయెడల, అది ద్రవ్యము కానందున లింగమును, వచనమును (చిత్రగుః - చిత్రగు, మొదలగు లింగభేదము, చిత్రగూ - చిత్రగవః, మొదలగు వచనభేదము) సిద్ధింపవు. అవి సిద్ధించుటకు బహువ్రీహికి గుణవచనముల సామ్యమును భాష్యకారుడు చెప్పెను. శుక్ల, మొదలగు గుణవాచకములకు వలె ఆశ్రయమగు ద్రవ్యమునుబట్టి లింగవచనములు బహువ్రీహియందును రావచ్చునని అతని ఆశయము. అయినను ''శుక్లః పటః'' మొదలగురీతిని గుణవాచకములకు సామానాధికరణ్యము కుదురునట్లు ''చిత్రగుః చైత్రః'' అని సామానాధికరణ్యము కుదురదను శంకను ఈ కారిక ప్రస్తావించినది.

విశేష విషయములు— (1) ''గుణవచనానామాశ్రయతో లింగవచనాని'' (గుణ వాచకములకు ఆశ్రయమునుబట్టి లింగవచనములగును) అను అతిదేశమునకు బహువ్రీహియం దుపయోగము ఈ పక్షమున చూపబడినది.

(2) బహువ్రీహియందు సంబంధము ప్రధానమన్నపుడు అది ద్విష్ఠము (రెండు వస్తువులకు చెందునది. సంబంధమనగానే రెండు వస్తువులుండక తీరదు) అగును. అందుచే దాని కాశ్రయము స్వమ్ము (సొత్తు), స్వామియు కూడ కావచ్చును. అయినను స్వామి ముఖ్యముకాన దానినే సహజమైన ఆశ్రయముగా స్వీకరింపవలెను. దానినిబట్టియే లింగవచనము లగును. కాగా ''చిత్రగుః'' మొదలగుచోట్ల చైత్రః, మొదలగు అన్యపదార్థమును బట్టియే లింగవచనములను చెప్పవలయును.

(3) అయితే - గుణవాచకమునకును, సంబంధమునకును కొంత భేదమున్నది. గుణమునకును ద్రవ్యమునకును అవినాభావము గలదు. అందుచే శుక్లాది శబ్దములకు మతుప్పను చేసి, లోపమును చెప్పి, "శుక్లః పటః" అను రీతిని సామానాధికరణ్యమును సంపాదించుట అతి సులభము. కాని సంబంధమట్టిది కాదు. అది అనియతము. వేరొక వస్తువుతో సంబంధము లేకుండ ద్రవ్యముండవచ్చును. అందును స్వస్వామి భావము మొదలగు సంబంధము వివక్షాధీనము. అందువలన సంబంధవాచకముగా బహువ్రీహిని అంగీకరించునపుడు, మతుప్పను దాని లోపమును చెప్పినను సామానాధికరణ్యమును సంపాదించుట అతిదుర్లభమగును. ॥218॥

అవతారిక — పై విషయమునందే మరొక దోషమును చూపుచున్నారు.

శ్లో॥ సంబంధస్య చ సంబంధీ సంబంధోఽన్యః ప్రసజ్యతే ।
విభక్త్యర్థప్రధానే చ క్రియాయోగో న కల్పతే ॥ 219

సంబంధస్య = సంబంధమునకు, సంబంధీ = సంబంధియగు, అన్యః = మరియొక, సంబంధః + చ = సంబంధము కూడ, ప్రసజ్యతే = ఏర్పడవలసి వచ్చును, విభక్త్యర్థప్రధానే = విభక్త్యర్థము (సంబంధము) ముఖ్యమైనపుడు, క్రియాయోగః + చ = క్రియతోడి సంబంధము కూడ, న + కల్పతే = సంభవింపదు.

తాత్పర్యము — బహువ్రీహికి మతుప్పను చేసి, రెండిటికిని సంబంధమే అర్థమన్నచో, ప్రకృత్యర్థము విశేషణమును, ప్రత్యయార్థము విశేష్యమును అగునుగాన, "సంబంధముతో కూడిన సంబంధము" అను (చిత్రగుః = చిత్రగోవుల సంబంధముగల సంబంధము) ప్రతీతి కలిగెడిని. మరియును సంబంధము ముఖ్యమన్నచో అది ద్రవ్యము కానందున క్రియతో అన్వయము కుదురకపోవును. (ఉదా : చిత్రగుః - ఆనీయతామ్ = చిత్రగువును తీసికొనిరమ్ము - సంబంధమును తీసికొనివచ్చుట అసంభవము). ॥219॥

అవతారిక — విభక్త్యర్థము ముఖ్యమైనను "తతః పశ్య" (అచటనుండి చూడుము), "తత్రపశ్య" (అచట చూడుము) మొదలగుచోట్ల క్రియాన్వయము కనబడుచున్నది గదా ! - అను శంక సరికాదని చెప్పుచున్నారు.

శ్లో॥ విభక్త్యర్థప్రధానత్వాత్ తత స్తత్రేతి న క్రియా ।
దృశ్యాదిః కర్మకర్త్రాదినిమిత్తత్వాయ కల్పతే ॥ 220

తతః + తత్ర + ఇతి = తతః, తత్ర, అనుచోట, దృశ్యాదిః = దృశ్ మొదలగు, క్రియా = క్రియ, విభక్త్యర్థప్రధానత్వాత్ = విభక్తియొక్క అర్థము ముఖ్యమగుటవలన, కర్త్రాదినిమిత్తత్వాయ = కర్త, కర్మ మొదలగువానికి హేతువగుటకు, న + కల్పతే = సమర్థము కాదు.

తాత్పర్యము — తతః అనుచోట పంచమ్యర్థము (అవధి) ప్రధానము. తత్ర అనుచోట సప్తమ్యర్థము (ఆధారము) ముఖ్యము. ఈ రెండును ద్రవ్యములు కావు. అందు

వలన దృశ్, (చూచుట) మొదలగు క్రియలకు అవి కర్తలుగాని, కర్మలుగాని కానేరవు. అవధియైన ద్రవ్యమునకును, ఆధేయమగు ద్రవ్యమునకును మాత్రమే అచట క్రియతో అన్వయము.

వివరణము— తత్ శబ్దమునకు "తస్" ప్రత్యయము చేరుటవలన "తతః" అని యగును. పంచమీ విభక్తియొక్క అర్థమున (అవధి) ఆ ప్రత్యయము వచ్చినది. అట్లే తత్ శబ్దమునకు సప్తమ్యర్థమున (ఆధారము) త్ర, అను ప్రత్యయము చేరగా "తత్ర" అని యగును. ఇచట ఆయా విభక్త్యర్థములు క్రియతో సంబంధింపవు. అనగా అవి కర్తగా కాని కర్మగా కాని క్రియతో సంబంధించుట కుదురదు. (అవధి చూచుట, ఆధారము చూచుట అని తాత్పర్యము కాదు). అందుచే ద్రవ్యమునకే అచట క్రియాన్వయము. ("అవధిగానుండు వస్తువునుండి చూడుము, ఆధేయమగు వస్తువును చూడుము" అనియే అన్వయము).

కాగా బహువ్రీహియందు విభక్త్యర్థము (సంబంధము) ముఖ్యమన్నచో, దానికి క్రియాయోగము సంభవింపక పోవును. ॥220॥

అవతారిక— ఇట్లు విభక్త్యర్థము (సంబంధము) ముఖ్యమను పక్షమున దోషము కలుగునని చూపి, మరియొక ఆక్షేపమును కూడ చూపుచున్నాడు.

శ్లో॥ అంతర్భవేచ్చ సంబంధః ప్రాధాన్యాభిహితః కథమ్ ।
స ప్రాతిపదికార్థశ్చ తథాభూతః కథం భవేత్ ॥ 221

ప్రాధాన్యాభిహితః = ముఖ్యముగా చెప్పబడిన, సంబంధః + చ = సంబంధమైతే, కథమ్ = ఎట్లు, అంతర్భవేత్ = అంతర్భవించును? (సమాసములో ఇముడును), తథాభూతః = అట్లయిన (అంతర్భవించని), సః = అది, ప్రాతిపదికార్థః + చ = ప్రాతిపదికార్థముగా అయినను, కథమ్ = ఎట్లు, భవేత్ = అగును?

తాత్పర్యము— సంబంధము ముఖ్యముగా భాసించినపుడు, సమాసముయొక్క అర్థములో అది అప్రధానముగ ఇమిడియుండుట కుదురదు. అట్టి సంబంధము ప్రాతిపదికార్థమనుటకును వీలులేదు.

వివరణము— చిత్రగుః - ఇది "చిత్రగోవుల సంబంధము"ను ముఖ్యముగా చెప్పును. కాగా సంబంధముగల వ్యక్తిని చెప్పు పదమునకు షష్ఠీ విభక్తి వచ్చి "చిత్రగుః చైత్రస్య" మొదలగు రీతిని ప్రయోగములు సాధువులయ్యెడిని. ("చైత్రస్య గృహమ్" అను ప్రయోగమువలె "చైత్రస్య చిత్రగుః" అనునదియు సహజమగును).

"రాజపురుషః" మొదలగు షష్ఠీ సమాసములలో పురుషుడు ముఖ్యుడుగను, రాజుయొక్కయు పురుషునియొక్కయు సంబంధము అప్రధానముగను తెలియుచుండును. (రాజ సంబంధము గల పురుషుడు). కావున వాని తీరు వేరు. బహువ్రీహి వలన సంబంధమే ముఖ్యముగా చెప్పబడునుగాన అది సమాసమున ఇముడుట కుదురదు. అందువలననే అది ప్రాతిపదికము యొక్క అర్థమగుననుటకును వీలు లేదు.

విశేష విషయములు— సంబంధము అప్రధానముగను, సంబంధి ప్రధానముగను ఉన్నచో సంబంధము సమాసార్థమున అంతర్భవించినదనుటకు వీలున్నది. బహువ్రీహి సంబంధమును మాత్రమే వేరుచేసి ముఖ్యముగ చూపునన్నపుడు దానికి అంతర్భావము కుదురదు.

ఈ ఘట్టమున భాష్యకారుడు మాత్రము "బహువ్రీహియందు సంబంధము ముఖ్యమన్నను, సంబంధియే ముఖ్యముగ తోచునుగాన సంబంధము అంతర్భవించుననియు, అది ప్రాతిపదికార్థమగుననియు, అందువలన ప్రథమయే వచ్చునుగాని (చిత్రగుః - చైత్రః) షష్ఠి రాదనియును (చిత్రగుః చైత్రస్య)" ఒక విధమైన దోషపరిహారమును చూపెను. ఈ యంశమును భర్తృహరి స్పృశింపలేదు. ॥221॥

అవతారిక— సంబంధము ముఖ్యమైనను క్రియాన్వయము కుదురునని ప్రతిపాదింపుచున్నాడు.

**శ్లో॥ అసంభవాత్తు సంబంధే సంబంధసహచారిణి ।**
**జాతి సంఖ్యాసమాహారకార్యాణామివ సంభవః ॥** 222

సంబంధే = సంబంధమందు, అసంభవాత్ + తు = కుదురనందువలన అయితే, సంబంధ సహచారిణి = సంబంధముతో కలిసియుండు ద్రవ్యమందు, జాతి సంఖ్యాసమాహారకార్యాణామ్ + ఇవ = జాతి, సంఖ్య, సమాహారము అను వాని కార్యములకువలె, సంభవః = కుదురుట (జరుగును).

తాత్పర్యము— జాతి, సంఖ్య, సమాహారము అను వానికిని క్రియాన్వయము సహజముగ కుదురదు. అట్టిచోట్ల వానితో కూడిన ద్రవ్యమునకే క్రియాన్వయమని చెప్పుదురు. అట్లే సంబంధము విషయములో కూడ అవినాభూతమైన ద్రవ్యమునుబట్టి క్రియాన్వయమును సంపాదించుట కవకాశముండును

వివరణము— జాతి, సంఖ్య, సమాహారము అననవి వస్తువులు కావు. అందుచే వానికి సాక్షాత్తుగ క్రియాన్వయము కుదురదు. ఉదా: (1) జాతి:– "గామ్ - పూజయేత్" (ఆవును పూజింపవలెను). ఇచట గోసామాన్యమే ఉద్దిష్టము. అయినను దానికి క్రియతో సంబంధము కుదురదుగాన గోవ్యక్తినే తీసికొనవలయును.

(2) సంఖ్య:– "బ్రాహ్మణశతం ఆనయ" (బ్రాహ్మణుల వందను తీసికొని రమ్ము), ఇచట "వంద" అను సంఖ్యకు క్రియతో సంబంధము అసంభవము. కావున నూర్గురు బ్రాహ్మణులను తీసికొనిరావలెను.

(3) సమాహారము:– "పంచవటీమ్ పశ్య" (అయిదు వటముల సమూహమును జూడుము). ఇచట కూడ వస్తువులకే క్రియాన్వయము. (ఈ యంశములు 180 వ కారికలో కూడ ప్రస్తావింపబడినవి).

వస్తువుల సంబంధము కూడ ప్రత్యేకమైన వస్తువు కాదు. అయినను ఆ సంబంధము గల వస్తువులకు క్రియా సంబంధమును చెప్పుకొనవచ్చును. ॥222॥

అవతారిక— జాతి, సంఖ్య, మొదలగువానిని చెప్పినపుడు అవినాభూతమైన ద్రవ్యమే తప్పక స్ఫురించునుగాన క్రియాన్వయము ఉపపన్నమగును. కాని బహువ్రీహియందు సంబంధమే ముఖ్యమైనందువలన క్రియాయోగముగాని, సామానాధికరణ్యముగాని ఎట్లు కుదురును ? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ సోఽయమిత్యభిసంబంధాద్విశిష్టాశ్రయవాచినామ్ ।
శుక్లాదివల్లింగసంఖ్యే శాస్త్రారంభాద్భవిష్యతః ॥ 223

సః + అయమ్ + ఇతి = "అదే ఇది" అను, అభిసంబంధాత్ = అనుసంధానమువలన, (అభేద భావన), విశిష్టాశ్రయవాదినామ్ = సంబంధముగల ద్రవ్యమును చెప్పు శబ్దముల యొక్క, లింగసంఖ్యే = లింగవచనములు, శుక్లాదివత్ = శుక్ల, మొదలగు వానికివలె, శాస్త్రారంభాత్ = సూత్రమును ఆరంభించుటవలన, భవిష్యతః = కాగలవు.

తాత్పర్యము — గుణమునకును గుణముగల ద్రవ్యమునకును అభేదమును భావించి "శుక్లః పటః" మొదలగుచోట్ల ద్రవ్యములను బట్టియే లింగవచనములను, సామానాధికరణ్యమును సంపాదింతుము. అట్లే బహువ్రీహియందును సంబంధమునకును సంబంధికిని అభేదమును పాటించి సంబంధియగు ద్రవ్యమును బట్టియే లింగవచనములను, సామానాధికరణ్యమును సాధింపవచ్చును. ఉదా : చిత్రగుః చైత్రః, చిత్రగు వనమ్, మొదలగునవి.

వివరణము— సాంకేతికముగ సంబంధము ముఖ్యమని వాదించినను, చిత్రగు మొదలగు బహువ్రీహివలన సంబంధియగు ద్రవ్యము బోధపడుటయే సహజము. అది శబ్దశక్తి స్వభావము. కాబట్టి అభేదోపచారము తప్పదు. అట్లయినపుడు ద్రవ్యమునుబట్టి సామానాధికరణ్యము సులభమగును. ఇట్టి చోటులందు అభేదము ననుసరించి లింగసంఖ్యలను అతిదేశించుటయే "విశేషణానామ్" (2-1-52) మొదలగు సూత్రముయొక్క ముఖ్య ప్రయోజనము.

కాగా శుక్లాది శబ్దములు అభేదోపచారమువలన గుణివాచకములైనట్లు, బహువ్రీహియును సంబంధివాచకము కాగలదనియు అందువలన సంబంధియగు అన్యపదార్థముయొక్క లింగసంఖ్యలే సమాసమునకగుననియును ఫలించును. ॥223॥

అవతారిక — "బహువ్రీహి సంబంధమును చెప్పినచో లింగవచనములు గల పదార్థము సంపూర్ణముగా ఎట్లు తెలియును ?" అని భాష్యకారుడు ఆక్షేపించెను. పై విధముగా అభేదభావన వలన పదార్థము తెలియునన్నపుడు అట్టి యాక్షేపము సముచితమగునా ? అని శంకించి యీ సందర్భమందలి భాష్యకారుని భావమును విశదము చేయుచున్నాడు.

శ్లో॥ భేదేన తు వివక్షాయాం సామాన్యే వా వివక్షితే।
సలింగస్య ససంఖ్యస్య పదార్థస్యాగతిర్భవేత్ ॥ 224

భేదేన = భేదముతో, వివక్షాయామ్ + తు = చెప్పదలచినపుడును, వా = లేక, సామాన్యే = సామాన్యము, వివక్షితే = చెప్పదలపబడినపుడును, సలింగస్య = లింగముతో కూడినట్టియు, ససంఖ్యస్య = వచనముతో కూడినట్టియు, పదార్థస్య = పదార్థముయొక్క, అగతిః = తెలియకపోవుట, భవేత్ = అయ్యెడిని.

తాత్పర్యము— సంబంధికి వేరుగా సంబంధము ముఖ్యమని చెప్పినను, సామాన్య రూపముగ సంబంధము ముఖ్యమని చెప్పినను లింగవచనములుగల పదార్థము తెలియక పోవును.

వివరణము— సంబంధము గలది పదార్థమగును. దానిని కూడగట్టుకొనకుండ కేవలము సంబంధమునే స్వీకరించినచో ద్రవ్యముతో సామానాధికరణ్యము లేనందున దాని లింగసంఖ్యలును సంక్రమింపవు అట్లుగాక సంబంధము సామాన్యరూపమున (చిత్రగు = చిత్రగో సంబంధము అన్నింటికిని సామాన్యముగా చెందునట్లు) తెలియునన్నచో, విశేష ద్రవ్యము (సంబంధముగల నిర్దిష్టమైన ఒక పదార్థము) తెలియనందున దాని లింగసంఖ్యలును రావు. ఇట్లు పదార్థమేదియో పరిపూర్ణముగా అవగతము కాదు.

విశేష విషయములు— సంబంధమును సామాన్యముగా చెప్పదలచినచో, చైత్రః, మైత్రః మొదలగు ద్రవ్యవిశేషములు స్ఫురింపవు. (చిత్రగు, అనగానే చిత్రగోవుల సంబంధము గల వస్తువు ఏదైనను - అనియే స్ఫురించును). కాన సామాన్యమును సూచించు నపుంసక లింగమే రావలసివచ్చును. కాగా అభేదభావన వలన కూడ పదార్థము విస్పష్టమగుట సంభవింపదు. ॥224॥

అవతారిక— బహువ్రీహి సంపూర్ణమైన అన్యపదార్థమును బోధించుటను సమర్థింపు చున్నాడు.

శ్లో॥ సాధుత్వం న విభక్త్యర్థమాత్రే వృత్తస్య దృశ్యతే।
కృత్స్నార్థవృత్తేః సాధుత్వమిత్యర్థగ్రహణం కృతమ్ ॥ 225

వృత్తస్య = వృత్తిగానున్న శబ్దమునకు, విభక్త్యర్థమాత్రే = కేవలము విభక్తియొక్క అర్థమందు (సంబంధము), సాధుత్వమ్ = సాధుభావము, న + దృశ్యతే=కనబడదు, కృత్స్నార్థవృత్తేః = పూర్తిగా పదార్థమును తెలుపు శబ్దమునకే, సాధుత్వమ్ + ఇతి = సాధుత్వమని తెలియజేయుటకు, అర్థగ్రహణమ్="అర్థ" అను శబ్దమును పలుకుట, కృతమ్=చేయబడినది.

తాత్పర్యము— బహువ్రీహి సమాసము కేవలము సంబంధమును చెప్పుట అభిమతము కాదు. విశేష్యముగ నుండు అన్యపదార్థమును స్పష్టముగ చెప్పుటయే ఇష్టము. అందు కొరకే సమాసమును విధించు "అనేక మన్యపదార్థే" (2-2-24) అను సూత్రమున "అర్థ" శబ్ద ముచ్చరింపబడినది.

వివరణము— వ్యవహారములో సిద్ధముగనున్న శబ్దమునే వ్యాకరణము వ్యాఖ్యా నించును. సిద్ధముగనున్న బహువ్రీహి సంబంధమును మాత్రము చెప్పుట అనుభవమునకు విరుద్ధము. అన్యపదార్థమును చెప్పుటయే బహువ్రీహి యొక్క స్వభావము. ఈ విషయమును స్పష్టపరచుటకే విధి సూత్రమున "అన్యపదార్థే" అని అర్థశబ్దము స్వీకరింపబడినది. కాగా అన్యపదార్థమును చెప్పు చైత్రః, మైత్రః మొదలగు పదములయొక్క అనుప్రయోగమును, వాని లింగవచనములే సమాసమునకు వచ్చుటయును అప్రయత్నముగనే సిద్ధించును.

విశేష విషయములు— "అనేక మన్యపదార్థే" (2-2-24) అను నది బహువ్రీహిని విధించు సూత్రము. "వేరొక పదముయొక్క అర్థమును చెప్పు ఒకటికిమించిన పదములు సమసించుననియు, అది బహువ్రీహి యగుననియును" దీని యర్థము ఇచట పదమున కర్థము తప్పదుగాన "అన్యపదే" అని యన్నను, "అన్యపదార్థే" అను భావము లభించును. కాని అట్లనక "అన్యపదార్థే" అని అర్థశబ్దము నుచ్చరించినందువలన, పదార్థమే ముఖ్యమనియు అదియే విశేష్యమనియు, దానిని బట్టియే లింగవచనములు సమాసమునకు రావలెననియును విశదమగును. ఈ రీతిని "పదార్థాభిధాన పక్షమే" సూత్రకారుని యభీష్టమని పతంజలి వివరించెను. ॥225॥

అవతారిక— పదార్థాభిధాన పక్షమున లింగవచనముల అతిదేశము వ్యర్థము. విభక్త్యర్థాభిధాన పక్షమందే అది ఉపయోగించునని చెప్పుచున్నాడు.

శ్లో॥ సోఽయమిత్యభిసంబంధాద్ద్రవ్యవృత్తిరయం యదా ।
సలింగస్య ససంఖ్యస్య తదా సాధుత్వముచ్యతే ॥ 226

సః + అయమ్ + ఇతి = "అదే యిది" - అను, అభిసంబంధాత్ = అనుసంధానము వలన, అయమ్ = ఈ బహువ్రీహి, యదా = ఎప్పుడు, ద్రవ్యవృత్తిః = ద్రవ్యమును బోధించునది, అగునో, తదా = అప్పుడు, సలింగస్య = లింగముతోకూడిన దానికిని, ససంఖ్యస్య = వచన ముతోకూడిన దానికిని, సాధుత్వమ్ = సాధుత్వము, ఉచ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— బహువ్రీహియందు సంబంధమే ముఖ్యమై, సంబంధమునకును సంబంధియగు ద్రవ్యమునకును అభేదోపచారమన్నపుడే అట్టి ద్రవ్యమును బట్టి లింగవచనము లను అతిదేశించుట సఫలమగును. మీది కారికలో చూపినట్లు పదార్థమే ముఖ్యమన్నపుడు లింగవచనాతిదేశ మక్కరలేదు. అపుడవి సహజములగును. ॥226॥

అవతారిక— "బహువ్రీహి అన్యపదార్థమునే చెప్పునను" పక్షములో కొన్ని దోషములు సంభవించునని మూడు కారికలతో ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ అంతర్భూతవిభక్త్యర్థే షష్ఠీ న శ్రూయతే యథా ।
తథాఽశ్రుతిః ప్రసజ్యేత లింగసంఖ్యాభిధాయినామ్ ॥ 227

ఎల్ల గోవ్యక్తులయందు 'గౌః గౌః' అను ఏకాకారమగు జ్ఞానము కలుగుచున్నది. ఆ జ్ఞానమునకు గోత్వమను జాతియే కారణమగును, యోగ్యమగు కారణముబట్టియే కార్యము కలుగును. అట్టి జ్ఞానము గోవులకున్న సామ్యమునుబట్టి కలుగనేరదు. అట్లైన, 'సదృశః' (ఈ వ్యక్తికి, ఆ వ్యక్తికి సమానమైనది) అనియే జ్ఞానము కలుగవలెను. 'గౌః' అను ఏకాకారమగు జ్ఞానము కలుగనేరదు. అట్లే వానియందున్న సామర్థ్యమునుబట్టియు ఆ జ్ఞానము కలుగనేరదు. అట్లుకాకున్న 'సమర్థః' అను రీతినే జ్ఞానము కలుగవలెను. కారణమునుబట్టి కదా కార్యము కలుగును.

ఇందుకు దృష్టాంతము చూపబడినది. లోకమున దండము ధరియించువానిని 'దణ్డీ' అని వ్యవహరింతురు. అచట దండ సంబంధము కారణము. దండమునకు మనుష్యునకు సంబంధము సంయోగము దండ సంబంధము ఎవరికి కలుగుననగా దండమును గ్రహింపవలెననెడి కోరిక ఉన్నవారికి కలుగును. కాగా దండ సంబంధమునకు కోరిక కారణమగును. అట్టితరి అట్టి ఇచ్ఛనుబట్టి 'దణ్డీ' అను వ్యవహారము కలుగదు, సంబంధమువలననే పై వ్యవహారము కలుగును.

అట్లే దండమును గ్రహించెడి ఇచ్ఛకు కారణమేది ? అని ఆలోచించిన, ఆ దండమును ఎచట వినియోగించినపుడు అది సమర్థమై కార్యజనకమగునో, అచటకల సామర్థ్యము కారణమనవలెను. అట్టితరి ఆ సామర్థ్యమువలన, 'దణ్డీ' అను వ్యవహారము కలుగదు.

కాగా ఇచ్ఛకు ఏది నిమిత్తమో, దానినిబట్టి 'ఇచ్ఛ కలవాడు' అను వ్యవహారము కలుగదు.

ప్రకృతమున ఎల్లగోవులయందు గోత్వజ్ఞానము కలుగుటలో వానికిగల సాదృశ్యము సామర్థ్యము నిమిత్తము కావచ్చును. వానినిబట్టి మాత్రము 'గౌః' అను ఏకాకారమగు జ్ఞానము కలుగనేరదు. ఆ జ్ఞానము సామాన్యమునుబట్టియే కలుగును.

కాబట్టి సాదృశ్యముకంటె సామర్థ్యముకంటెను వేరుగా సామాన్యమును అనగా జాతిని అంగీకరింపవలెను. ॥93-94॥

*అవతారిక*— అతిరిక్తమగు జాతిని అంగీకరింపనియెడల లోకమున శాబ్దవ్యవహారమునకు అనగా శబ్దమువలన కలిగెడి పరస్పరాభిప్రాయమును గుర్తించుటకు భంగమే కలుగునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్వభావోఽవ్యపదేశ్యో వా సామర్థ్యం వావతిష్ఠతే ।**
**సర్వస్యాన్తే యతస్తస్మాద్వ్యవహారో న కల్పతే ॥ 95**

యతః = ఎందువలన, సర్వస్య = ఎల్ల పదార్థమునకు అనగా కారణముగా కల్పింపబడిన పదార్థ మాత్రమునకు, అన్తే = చివరయందు అనగా మూలకారణమునందు, స్వభావః + వా = స్వభావముగాని, సామర్థ్యమ్ + వా = సామర్థ్యముగాని, అవ్యపదేశ్యః = ఇది యిట్లు, అది ఆ రీతిగా ; అని విశేషించి చెప్పుటకు అలవికానిదై, అవతిష్ఠతే = ఉండునో,

తాత్పర్యము— లింగవచనములను చెప్పు ప్రత్యయములు రానిచో, బహుప్రీహి లింగసంఖ్యలు లేని అవ్యయము వంటిదే కావలసి వచ్చును.

వివరణము— ''న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యానాపి కేవలః ప్రత్యయః'' (కేవలము ప్రకృతినిగాని ప్రత్యయమునుగాని వాడకూడదు) అను నియమమున్నది. అయినను అవ్యయములకు లింగవచనములు సహజముగనే లేనందున వాని విషయములో (చ, వా, తు, మొదలగునవి) ఈ నియమము వర్తింపదు. ప్రకృతమున బహుప్రీహి కూడ ఇట్టిదే అయి పోవును. (చిత్రగు, అనియే ప్రయోగము సంభవించెడిని). ॥228॥

అవతారిక— చైత్రః, మొదలగు విశేష్యములతో సామానాధికరణ్యము కూడ వికృతముగ సంభవించెడిని అని చూపుచున్నాడు.

శ్లో॥ ప్రయుక్తేన చ సంబధాచ్చైత్రాదిశ్రవణం భవేత్ ।
వినా విభక్త్యా సంబంధో విభక్త్యా విద్యతే వినా ॥ 229

ప్రయుక్తేన = ప్రయోగింపబడిన పదముతో, సంబంధాత్ + చ = సంబంధమువలన, విభక్త్యా + వినా = విభక్తి లేకుండ, చైత్రాదిశ్రవణమ్ = చైత్ర, మొదలగు పదములు విన బడుట, భవేత్ = అగును, విభక్త్యా + వినా = విభక్తిలేకుండ, సంబంధః = సంబంధము, విద్యతే = ఉండును.

తాత్పర్యము— చిత్రగు, మొదలగు బహుప్రీహి అవ్యయముతో సమానమైనచో, దానికి విశేషమగు చైత్ర, మొదలగు పదము కూడ దానివలెనే విభక్తి లేకుండ వినబడవలసి వచ్చును. రెండును సమానార్థకములే అగునుగాన రెండింటికిని విభక్తి లేకుండుటయే సముచిత మగును. అట్లయినపుడు అట్టి శబ్దములవలన సామాన్య విశేషభావము విశదము కాకపోవును. (అర్థము విశదము కాదు).

వివరణము— ''చిత్రగు - చైత్ర'' అను విభక్తి ప్రత్యయము లేని ప్రయోగ ములో లింగవచనము ఉండవుగాన, అభిమతమగు విశేషణ విశేష్యభావము సిద్ధింపక పోయెడిని. ॥229॥

అవతారిక— ఇట్లు పదార్థాభిధాన పక్షమందు కలుగు చిక్కులను వివరించి వీనికి భాష్యకారుడు చూపిన పరిహారమును వ్యాఖ్యానించుచున్నాడు.

శ్లో॥ అభిధానేఽపి సంఖ్యాయాః సంఖ్యాత్వం న నివర్తతే ।
షష్ఠ్యర్థస్యాభిధానే తు స్యాత్ ప్రాతిపదికార్థతా ॥ 230

అభిధానే + అపి = అభిధానమందును (బహుప్రీహి సంఖ్యను చెప్పినను), సంఖ్యాయాః = సంఖ్యయొక్క, సంఖ్యాత్వమ్ = సంఖ్యయగుట, న + నివర్తతే = తొలగిపోదు, షష్ఠ్యర్థస్య = షష్ఠ్యర్థము యొక్క (సంబంధముయొక్క) అభిధానే + తు = చెప్పుటయందైతే, ప్రాతి పదికార్థతా = ప్రాతిపదికము యొక్క అర్థమగుట, స్యాత్ = అగును.

తాత్పర్యము— బహువ్రీహి వలన సంఖ్య చెప్పబడినను దాని సహజ లక్షణము తొలగదు. అనగా ఆయా సంఖ్యను చెప్పుటకు సుప్ ప్రత్యయములు తప్పక వచ్చును. షష్ఠి యొక్క అర్థము మాత్రము (సంబంధము) అభిహితమైనందున ప్రాతిపదికార్థముగ మారును. అందువలన ప్రాతిపదికార్థమును చెప్పు ప్రథమావిభక్తి అగును.

వివరణము— ఏకశబ్దము ఏకత్వమును (ఒకటి) చెప్పును. ద్విశబ్దము ద్విత్వమును బోధించును. బహుశబ్దము బహుత్వమును ప్రతిపాదించును. అయినను అదే అర్థమును చెప్పు ప్రత్యయము లా యా శబ్దములకు వచ్చును. ఉదా : ఏకః, ద్వౌ, బహవః, అట్లే చిత్రగు మొదలగు బహువ్రీహికి కూడ సుప్ ప్రత్యయములు రావచ్చును. బహువ్రీహి వలన సామాన్యముగా సంఖ్య తెలిసినను సంఖ్యావిశేషములు తెలియవు గదా ! అందుచే కర్మత్వము, కరణత్వము మొదలగు విశేషములు కలిసిన సంఖ్యను చెప్పుటకు ద్వితీయ, తృతీయ మొదలగు విభక్తి ప్రత్యయము లగుచుండును. ఉదా : ''చిత్రగుమ్ - ఆనయ. చిత్రగునా కృతమ్'' మొదలగునవి. ఎట్టి విశేషమును లేనపుడు కేవలము ప్రకృతిని ప్రయోగింపకూడదు గాన, ప్రథమా విభక్తి (చిత్రగుః) యే వచ్చును. అవ్యయముతోడి సామ్యము బహువ్రీహికి నప్పదు. అవ్యయములకు వచ్చిన సుప్ ప్రత్యయములకు లోపమును శాస్త్రము విధించినది. బహువ్రీహి కట్లు విధింపలేదు. కాగా బహువ్రీహికి సుప్పులు వచ్చుటయు సామానాధికరణ్యము కుదురుటయును నిర్బాధము.

ఇక బహువ్రీహి షష్ఠ్యర్థమును చెప్పునన్న పక్షమున అది (సంబంధము) ప్రాతిపదికము యొక్క అర్థమే యగునుగాన, (సంబంధము అప్రధానమై సంబంధియే ప్రధానముగ తెలియును. చిత్రగుః = చిత్రగోవుల సంబంధము గలవాడు) షష్ఠి రాకుండ ప్రథమయే వచ్చును. (సంబంధము ముఖ్యమగునపుడే షష్ఠి వచ్చుట శాస్త్రీయము).

విశేష విషయములు— వచనమును (సుప్ ప్రత్యయములు) గురించిన ఆక్షేపమునకు పరిహారమును మాత్రమే ఈ కారిక చూపినది. లింగమును గురించిన పరిహారమును ఇది స్పృశింప లేదు. అయినను భాష్యకారుడు చూపిన పరిహారమును ఇచట భావింపవలయును. ''బహువ్రీహి లింగమును బోధించినను, టాప్ మొదలగు స్త్రీ ప్రత్యయములు స్వార్థికములై ద్యోతకములుగ ప్రవర్తింపవచ్చును'' అనునది ఆ పరిహారము.

కాగా ఈ ఘట్టమందలి సారమిది :

(1) బహువ్రీహియందు పదార్థాభిధాన పక్షము ముందుగ చూపబడెను. అందు చైత్రాది శబ్దముల అను ప్రయోగమును గూర్చి పరిశీలనము జరిగినది. ఇది ఇంచుమించు పూర్వపక్షమే.

(2) పిదప విభక్త్యర్థాభిధాన పక్షము వివరింపబడెను. అందు క్రియాయోగమును, లింగవచనముల అతిదేశమును చర్చింపబడినవి.

(3) సంపూర్ణమైన అన్యపదార్థమునే బహువ్రీహి బోధించునని చివరగా ప్రతిపాదింపబడినది. ఇది సిద్ధాంతము. ॥230॥

అవతారిక — బహువ్రీహి విషయమున మరికొందరి మతమును చూపుచున్నాడు.

శ్లో॥ అనుప్రయోగసిద్ధ్యర్థం న విభక్త్యర్థకల్పనా ।
వస్త్వంతరముపక్షిప్తమితి కేచిత్ ప్రచక్షతే ॥ 231

విభక్త్యర్థకల్పనా = షష్ఠ్యర్థమునే (సంబంధము) బహువ్రీహి బోధించునను కల్పము, అనుప్రయోగసిద్ధ్యర్థమ్ = చైత్రాది శబ్దముల అనుప్రయోగము సిద్ధించుటకు, న = కాదు, వస్త్వంతరమ్ = వేరొక విషయము, ఉపక్షిప్తమ్ + ఇతి = ఉంచబడినదని, కేచిత్ = కొందరు, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్యము— "బహువ్రీహి అన్యపదార్థమును చెప్పునను" పక్షమున బయలు దేరిన శంకకు సమాధానముగా "విభక్త్యర్థమును చెప్పును" అను పక్ష ముదయింపలేదు. విభక్త్యర్థాభిధాన పక్షము స్వతంత్రమైన వేరొక ప్రతిపాదనమే - అని కొందరందురు.

వివరణము— పదార్థాభిధాన పక్షమున అనుప్రయోగము (చిత్రగుః - చైత్రః) కుదురనందున, దానిని కుదుర్చుటకై విభక్త్యర్థాభిధాన పక్షము బయలుదేరినదని ఇంతవరకును గ్రంథకర్త వ్యాఖ్యానించెను. అట్లుకాక విభక్త్యర్థ పక్షము వేరుగా ఒక స్వతంత్ర పక్షమే అని కొందరి భావము.

విశేష విషయములు— పదార్థాభిధానము పూర్వపక్షమనియు, విభక్త్యర్థాభిధానమును, అందును సంపూర్ణ పదార్థము తెలియుటయును సిద్ధాంతమనియును భర్తృహరి యొక్క తాత్పర్యము. విభక్త్యర్థాభిధానము స్వతంత్ర పక్షమనుట అతని కభిమతము కాదు. అందు వలననే "కొందరందురు" అని వక్కాణించెను. ॥231॥

అవతారిక— పై రీతిని విభక్త్యర్థ పక్షము స్వతంత్రమన్నపుడు గూడ రెండు పక్షములు రావచ్చునని ప్రతిపాదించుచున్నాడు.

శ్లో॥ సంబంధిభిర్విశిష్టానాం సంబంధానాం నిమిత్తతా ।
సంబంధైర్వా విశిష్టానాం తద్వతాం స్యాన్నిమిత్తతా ॥ 232

సంబంధిభిః = సంబంధముగల వానితో, విశిష్టానామ్ = కూడిన, సంబంధానామ్ = సంబంధములకు, నిమిత్తతా = నిమిత్తభావము, స్యాత్ = అగును, వా = లేక, సంబంధైః = సంబంధములతో, విశిష్టానామ్ = కూడిన, తద్వతామ్ = సంబంధముగల వస్తువులకు, నిమిత్తతా = నిమిత్తభావము, స్యాత్ = అగును.

తాత్పర్యము— శబ్దమొక అర్థమును చెప్పుటలో హేతువైన ముఖ్యధర్మము, నిమిత్తము లేక ప్రవృత్తి నిమిత్తమని యందురు. చిత్రగు, మొదలగు బహువ్రీహికి "చిత్రగోవుల సంబంధము", కాని "చిత్రగోవుల సంబంధము గల వ్యక్తి" కాని నిమిత్తము కావచ్చును.

జంతువునకును సమవాయము. ఇచట ప్రకృతియైన శబ్దము (దండ) సంబంధము గల వస్తువును చెప్పును. ప్రత్యయము "అట్టి వస్తువుగల వ్యక్తిని" చెప్పును. కాగా మొదటి సంబంధి ప్రవృత్తి నిమిత్తముగాను, రెండవ సంబంధి ప్రత్యయాంతమునకు వాచ్యముగాను ఏర్పడును.

(3) ఇదే తీరులో బహువ్రీహియందు తొలి సంబంధియగు వర్తి పదార్థము ప్రవృత్తి నిమిత్తమనియు. మలి సంబంధియగు అన్యపదార్థము సమాస వాచ్యమనియును చెప్పవచ్చును. ॥233॥

అవతారిక — పై విషయమునసే రెండవ పక్షమును చూపుచున్నాడు.

శ్లో॥ భిన్నం సంబంధిభేదేన సంబంధమపరే విదుః ।
నిమిత్తం సవిభక్త్యర్థః సమాసేనాభిధీయతే ॥ 234

సంబంధిభేదేన = సంబంధుల భేదముచే, భిన్నమ్ = వేరైన, సంబంధమ్ = సంబంధమును, నిమిత్తమ్ = ప్రవృత్తి నిమిత్తముగా, అపరే = మరికొందరు, విదుః = తెలియుదురు, సవిభక్త్యర్థః = విభక్త్యర్థముతో కలిసిన ఆ సంబంధము, సమాసేన = బహువ్రీహిచే, అభిధీయతే = చెప్పబడును.

తాత్పర్యము — దండీ, విషాణి, మొదలగు మత్వర్థప్రత్యయ మంతమందుగల స్థలములలో సంబంధులు రెండుండును. (దండమును, అదిగల వ్యక్తియును సంబంధులే) కాన సంబంధములు కూడ రెండగును. (దండమునకు గల సంబంధము, వ్యక్తికి గల సంబంధము) ఈ సంబంధమే యిచట ప్రవృత్తినిమిత్తమని మరికొందరందురు. బహువ్రీహి యందును ఇట్లే సంబంధమే ప్రవృత్తినిమిత్తమగును. కాగా సంబంధమే మొత్తము సమాసమున కర్థమనియును, "అదే యిది" అను అభేదభావనవలన సంబంధియగు వస్తువు తెలియుననియును పర్యవసించును.

*వివరణము* — మీది కారిక సంబంధులను ప్రవృత్తినిమిత్తముగా చెప్పినది. ఈ కారిక సంబంధములను ప్రవృత్తినిమిత్తముగా అంగీకరించినది. వివక్షాధీనముగా ఎట్లయినను చెప్పుట కవకాశమున్నందున రెండు పక్షములు బయలుదేరినవి. మత్వర్థప్రత్యయాంతముల స్వభావమును, బహువ్రీహియొక్క స్వభావమును ఒకటేయనియు, అచటకూడ బహువ్రీహి యందువలె రెండు తీరులు సంభవించుననియును చెప్పుటయే ఈ రెండు కారికల యొక్కయు ప్రయోజనము. ॥234॥

*అవతారిక* — కాగా బహువ్రీహియందు అన్యపదార్థము సంబంధియనియు, అదియే ముఖ్యమనియును అన్నచో అది పదార్థాభిధాన పక్షముగా లెక్కకు వచ్చును. అట్లుగాక అన్యపదార్థము సంబంధమేయనియు, అదియే ముఖ్యమనియును అన్నచో విభక్త్యర్థాభిధాన పక్షమగును అని ఉపసంహరించుచున్నాడు.

శ్లో॥ ప్రధానమన్యార్థతయా భిన్నం స్వైరుపసర్జనైః।
నిమిత్తమభిధేయం వా సర్వపశ్చాదపేక్ష్యతే॥ 235

స్వైః = తన, ఉపసర్జనైః = అప్రధానములైన వానితో, భిన్నమ్ = కూడిన సంబంధము, ప్రధానమ్ = ముఖ్యమైనదై, అన్యార్థతయా = వేరొక పదార్థము కొరకగుటచే, నిమిత్తమ్ = ప్రవృత్తినిమిత్తము (భవతి = అగును), వా = లేక, అభిధేయమ్ = వాచ్యముగా, సర్వపశ్చాత్ = అన్నిటికిని వెనుక (ఓట్టచివర), అపేక్ష్యతే = కోరబడును.

తాత్పర్యము— బహువ్రీహియందు సంబంధి అన్యపదార్థము వర్తి పదార్థముల సంబంధము ప్రవృత్తినిమిత్తము ఇట్లయినచో పదార్థాభిధాన పక్షమగును. అట్లుకాక సంబంధమే అన్యపదార్థము, అదియే సమాసమునకు వాచ్యార్థము అన్నచో విభక్త్యర్థాభిధాన పక్షమగును. షష్ఠీ విభక్తియొక్క అర్థమందే చిట్టచివర బహువ్రీహి సమాసమును వాడుదుముగాన ఈ పక్షమే సముచితము.

వివరణము— ఇచట సారమిది. బహువ్రీహిలో అన్యపదార్థము ప్రధానము. సంబంధమును ప్రవృత్తినిమిత్తముగాను సంబంధిని సమాసార్థముగాను చెప్పినచో పదార్థాభిధానమగును. సంబంధిని ప్రవృత్తినిమిత్తముగాను సంబంధమును సమాసార్థముగాను చెప్పినచో విభక్త్యర్థాభిధానమగును. ఇందు అభేద భావనవలన సంబంధి పూర్తిగ తెలియును. ''చిత్రాః గావః అస్య'' అని షష్ఠిని చూపి ఈ యర్థమందే ''చిత్రగుః'' అను సమాసమును వాడుదురుగాన, షష్ఠ్యర్థమైన సంబంధమే ముఖ్యమనుట మంచిది. అయితే ''అన్యపదార్థమని'' నొక్కిచెప్పుటవలన చివరకు సంబంధముగల పూర్తి పదార్థమే తెలియును. భాష్యకారుడు విభక్త్యర్థాభిధానమందే మొగ్గును చూపెను. ॥235॥

అవతారిక— బహువ్రీహిని వివరించు వాక్యమునకును బహువ్రీహి సమాసమునకును భేదమును చూపుచున్నాడు.

శ్లో॥ స్వామిని వ్యతిరేకశ్చ వాక్యే యద్యపి దృశ్యతే।
ప్రాధాన్య ఏవ తస్యేష్టో బహువ్రీహిర్వివక్షితే॥ 236

యద్యపి = పరిశీలింపగా, స్వామిని = ప్రభువు విషయమున, వ్యతిరేకః = వేరగుట, వాక్యే = వాక్యమందు, దృశ్యతే = కనబడును (తథాపి = అట్లయినను), తస్య = అతనియొక్క, ప్రాధాన్యే = ప్రాముఖ్యము, వివక్షితే + ఏవ = చెప్పదలపబడినపుడే, బహువ్రీహిః = బహువ్రీహి సమాసము, ఇష్టః = అభిమతము.

తాత్పర్యము— ''చిత్రాః గావః అస్య = చిత్రమైన గోవులు వీనికి'' అను వాక్యదశయందు, స్వామియగువాడు అప్రధానముగను, స్వమ్ములయిన గోవులు ప్రధానముగను గోచరించును. కాని చిత్రగుః, అను సమాసము మాత్రము స్వామినే ముఖ్యముగ చెప్పును. అట్లు స్వామియొక్క ప్రాధాన్యము లేనిచో సమాసమే ప్రవర్తింపదు.

వివరణము— వాక్యము వేరు, వృత్తి వేరు. స్వామిని అప్రధానముగ చూపుట వాక్యస్వభావము. అతనినే ప్రధానముగ చూపుట వృత్తి స్వభావము. కావున వాక్యదశయందు గోవులే ముఖ్యముగాన "సంబంధము - ముఖ్యమా? సంబంధి ముఖ్యమా?" అను పై చర్చ యంతయు వ్యర్థమని అనుకొనరాదు. ॥236॥

అవతారిక— కాగా "ఇతనివి విచిత్రమైన గోవులు" అను వాక్యము బహువ్రీహికి సరియైనది కాదని చెప్పుచున్నాడు.

**శ్లో॥ గవాం విశేషణత్వేన యదా తద్వాన్ ప్రవర్తతే।**
**అస్యైతా ఇతి తత్రాఽర్థే బహువ్రీహిర్న విద్యతే॥ 237**

"అస్య = ఇతనికి, ఏతాః = ఈ గోవులు" ఇతి = అని, గవామ్ = గోవులకు, విశేషణత్వేన = విశేషణముగా, తద్వాన్ = గోవులుగల వ్యక్తి, యదా = ఎప్పుడు, ప్రవర్తతే = ప్రవర్తించునో, తత్ర = ఆ, అర్థే = అర్థమందు. బహువ్రీహిః = బహువ్రీహి సమాసము, న + విద్యతే = ఉండదు.

తాత్పర్యము— స్వామిని విశేషణముగాను, గోవులను ముఖ్యముగాను చెప్పు "ఇతనివి చిత్రమైన గోవులు" (అస్య చిత్రాః గావః) అను వాక్యము బహువ్రీహికి అనుగుణము కానే కాదు. ॥237॥

అవతారిక— "చిత్రమైన గోవుల అధిపతి" అను వాక్యము బహువ్రీహికి సరియైనదని చూపుచున్నాడు.

**శ్లో॥ యదా ప్రత్యవమర్శస్తు తాసాం స్వామీ గవామితి।**
**గోభిస్తదాభిసంబంధో నిమిత్తత్వాయ కల్పతే॥ 238**

"తాసామ్ = ఆ, గవామ్ = గోవులకు, స్వామీ = ప్రభువు", ఇతి = అని, ప్రత్యవమర్శః = ప్రతిపాదనము, యదా = ఎప్పుడు, (జరుగునో), తదా = అప్పుడు, గోభిః = గోవులతో, అభిసంబంధః = సంబంధము, నిమిత్తత్వాయ = నిమిత్తముగా, కల్పతే = సంభవించును.

తాత్పర్యము— "చిత్రగోవులకు అధిపతి ఇతడు" అని చెప్పదలచినపుడే గోవుల సంబంధము బహువ్రీహికి నిమిత్తమగుట కుదురును. కావున "చిత్రాః గావః యస్య సః" అనునదియే బహువ్రీహికి అనుగుణమైన వాక్యము.

వివరణము— బహువ్రీహికి నిమిత్తము సంబంధమనియు, అట్టి సంబంధముగల సంబంధి సమాసమున కర్థమనియును ఫలించును. ॥238॥

అవతారిక— సంబంధము నిమిత్తమై సంబంధియగు వస్తువు సమాసముయొక్క అర్థమైనపుడు లింగవచనముల అతిదేశము సార్థకమగునని మరల విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ అపేక్షమాణః సంబంధం రూఢిత్వస్య నివృత్తయే ।**
**నిమిత్తానువిధాయిత్వాత్తద్ధర్మార్థః ప్రసజ్యతే ॥** 239

రూఢిత్వస్య = రూఢమగుట, నివృత్తయే = పోవుటకు, సంబంధమ్ = సంబంధమును, అపేక్షమాణః = కోరుచున్న, అర్థః = బహువ్రీహియొక్క అర్థము, నిమిత్తానువిధాయిత్వాత్ = నిమిత్తమును అనుసరించుటవలన, తద్ధర్మా = ఆ సంబంధముయొక్క ధర్మములు గలదై, ప్రసజ్యతే = కావలసి వచ్చును.

తాత్పర్యము— ''చిత్రగు'' అను బహువ్రీహి రూఢము కాదు. రూఢమైనచో అవయవముల అర్థముండదు. బహువ్రీహియందవయవముల అర్థముండును. (చిత్రములైన గోవులు అను అర్థము). కాగా సంబంధము నిమిత్తమై సంబంధి సమాసవాచ్యమైనపుడు ఆ సంబంధమే చివరకు అనువర్తించునుగాన దాని ధర్మములే సమాసార్థమునకును రావలసి వచ్చును. అనగా సంబంధము ద్రవ్యము కానందున లింగవచనములుండవు. అట్లే సమాసమునకును లింగవచనములు లేకపోయెడిని. అందువలన ఈ పక్షమున లింగవచనముల అతిదేశము సార్థకమగునని అభిసంధి.

వివరణము— కుశలః (నేర్పరి), ప్రవీణః (నేర్పరి) మొదలగునవి రూఢములు. అనగా అవయవార్థము లేకుండ ప్రసిద్ధమైన ఒక అర్థమును చెప్పునవి. ప్రకృతమున సంబంధమునకు అనుసంధానము లేదన్నచో బహువ్రీహి రూఢమైపోవును. అది అభిమతము కాదు. కావున బహువ్రీహియందు నిమిత్తమైన సంబంధమునకు అనుసంధానము తప్పదు. సంబంధమును చివరివరకును భావించుటయే అనుసంధానమగును. ॥239॥

అవతారిక— పై విషయమునే దృష్టాంతముతో బలపరచుచున్నాడు.

**శ్లో॥ నానాచిత్ర ఇతి యథా నిమిత్తమనురుధ్యతే ।**
**నానాభూతేఽపి వృత్తః సన్ బహువ్రీహిస్తథా భవేత్ ॥** 240

నానాభూతే = వివిధమైన వస్తువులందు, వృత్తః + సన్ + అపి = ప్రవర్తించినను (బోధించినను), నానా - చిత్రాః = వివిధమైన చిత్రవస్తువులు, ఇతి = అని, నిమిత్తమ్ = నిమిత్తము, యథా = ఎట్లు, అనురుధ్యతే = అనుసరింపబడునో, తథా = అట్లు, బహువ్రీహిః = బహువ్రీహి, భవేత్ = అయ్యెడిని.

తాత్పర్యము— నానా - అనునది అవ్యయము. ''అనేకము లేక వివిధము'' అని యర్థము. వైవిధ్యము అను ధర్మమిచట ప్రవృత్తినిమిత్తము. దీనికి లింగవచనములుండవు. ఈ అవ్యయముతో కలిసిన ''నానాచిత్రాః'' అను ప్రయోగమున్నది. ఇచట ''నానా'' అనునది వైవిధ్యముగల ద్రవ్యములనే బోధించును. అయినను నిమిత్తమైన వైవిధ్యమును అనుసంధానము చేయుటవలన లింగవచనములు లేకుండగనే యుండును. ఇట్లు నిమిత్తానుసంధానము వలన బహువ్రీహికిని లింగవచనము లుండకపోవును. వానిని రాబట్టుటకు అతిదేశము ఆవశ్యకము.

వివరణము— నిమిత్తమును కూడగట్టుకొనియే నిమిత్తిని భావించినపుడు శుద్ధమైన నిమిత్తి స్ఫురింపదు. కాగా ''సంబంధముగల సంబంధి'' అను భావన బహువ్రీహియందుండు నన్నపుడు, సంబంధముయొక్క ధర్మములే సంబంధికిని వచ్చుట సముచితమయ్యెడిని. వానిని వారించి సంబంధియొక్క లింగవచనములను తీసికొనివచ్చుటకు ప్రయత్నమావశ్యకమగును గదా!

విశేష విషయములు— బహువ్రీహియందు నిమిత్తాను విధానము చేసిన పక్షమున లింగవచనముల అతిదేశము సఫలమని ఈ రెండు కారికలును బోధించినవి. ॥240॥

అవతారిక— వర్తి పదార్థములైన సంబంధులే బహువ్రీహికి నిమిత్తములనియు, అన్యపదార్థమైన ద్రవ్యము సమాసవాచ్యమనియును చెప్పిన పక్షమున లింగవచనములు సహజముగనే సిద్ధించునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ సంబంధిని నిమిత్తే తు ద్రవ్యధర్మో న హీయతే।**
**లింగాభావో హి లింగస్య విరోధిత్వేన వర్తతే॥ 241**

సంబంధిని = సంబంధి, నిమిత్తే + తు = ప్రవృత్తినిమిత్తమైతే, ద్రవ్యధర్మః = ద్రవ్యముయొక్క ధర్మము (లింగవచనములు), న + హీయతే = పోదు, లింగాభావః = లింగము లేకుండుట, లింగస్య = లింగమునకు, విరోధిత్వేన = విరోధిగా, వర్తతే + హి = ఉండును గదా!

తాత్పర్యము— సంబంధులైన చిత్రగోవులే ప్రవృత్తినిమిత్తమైనపుడు అన్యపదార్థము యొక్క లింగవచనములు సహజముగనే మిగులును. అవి స్పష్టముగ నున్నపుడు వానిని కాదనుట కుదురదు.

వివరణము— చిత్రగుః - గోవులు సంబంధులు, ఇవియే ప్రవృత్తినిమిత్తము. చైత్రః, మొదలగునది అన్యపదార్థము. ఇవి సమాసముయొక్క అర్థము. సంబంధులు వేరుగా ఉండి, అన్యపదార్థమును కప్పివేయకుండ దాని స్వాతంత్ర్యమును మిగుల్చును. కావున అన్యపదార్థముయొక్క లింగవచనములు అట్లే యుండును. నిమిత్తానువిధానమన్నను నిమిత్తముయొక్క (గోవులు) లింగసంఖ్యలు పనిచేయవు. ఇట్లు వాని అతిదేశ మక్కరలేదు.

విశేష విషయములు— సంబంధము నిమిత్తమైనపుడు అది అన్యపదార్థమును కప్పివేయగలదనియు, సంబంధి నిమిత్తమైనచో, అది వేరై అన్యపదార్థమును కప్పజాలదనియును ఫలితము. ॥241॥

అవతారిక— మీది విషయమునే విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యావాన్ లింగవాంశ్చార్థోఽభిన్నధర్మా నిమిత్తతః।**
**ఆసన్న ఏవ ద్రవ్యత్వాత్ తద్ధర్మైర్న విరుధ్యతే॥ 242**

సంఖ్యావాన్ = సంఖ్యను గలిగినట్టియు, లింగవాన్ + చ = లింగమును గలిగినట్టియును, అర్థః = సంబంధియగు అన్యపదార్థము, నిమిత్తతః = నిమిత్తముతో, అభిన్నధర్మా = సమాన ధర్మములు గలదై, ఆసన్నః + ఏవ = దగ్గరగానే యున్నదై, ద్రవ్యత్వాత్ = ద్రవ్యమగుట వలన, తద్ధర్మైః = దాని ధర్మములతో, న + విరుధ్యతే = విరోధింపదు.

తాత్పర్యము— వర్తి పదార్థమైన సంబంధి నిమిత్తమును, అన్యపదార్థమైన సంబంధి నిమిత్తియు అయినపుడు రెండును ద్రవ్యములేగాన సమానములేయగును. కాగా దగ్గరగా ఉన్న అన్యపదార్థము తన లింగవచనములను స్వతంత్రముగ మిగుల్చుకొనును.

వివరణము— సంబంధము నిమిత్తమైనచో దాని మూలమున సంబంధి తెలియ వలయునుగాన అన్యపదార్థము దూరమగును. సంబంధియే నిమిత్తమైనచో అన్యపదార్థము వేగముగా తెలియును. ॥242॥

అవతారిక— విపులమైన పై చర్చవలన బహువ్రీహియందు విభక్త్యర్థాభిధానము (సంబంధము) సముచితమని తేలును. కాని ఈ పక్షమందు "అదే యిది" అను అభేదమును ఆశ్రయించి సంబంధిని గ్రహింపవలయును. అయినపుడు పదార్థాభిధానము (సంబంధి) కన్న విశేషమేమి ? – అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ విభక్త్యర్థేన చావిష్టం శుద్ధం చేతి ద్విధా స్థితమ్ ।
ద్రవ్యం శుద్ధస్య యో ధర్మః స న స్యాదన్యధర్మణః ॥ 243

విభక్త్యర్థేన = షష్ఠియొక్క అర్థముతో, ఆవిష్టమ్ + చ = కలిసినదియు, శుద్ధమ్ + చ = కలియకుండ స్వతంత్రముగా ఉండునదియు, ఇతి = అని, ద్రవ్యమ్ = ద్రవ్యము, ద్విధా = రెండు విధములుగ, స్థితమ్ = ఉన్నది, శుద్ధస్య = శుద్ధమైన ద్రవ్యమునకు, యః = ఏ, ధర్మః = ధర్మము గలదో, సః = అది, అన్యధర్మణః = వేరు ధర్మముగల ద్రవ్యమునకు (విభక్త్యర్థముతో కలిసినది), న + స్యాత్ = కాదు (రాదు).

తాత్పర్యము— షష్ఠియొక్క అర్థము సంబంధము దీనితో అభేదమును పాటించి సంబంధియగు ద్రవ్యమును బోధించినచో విభక్త్యర్థాభిధానమగును. ఇందు సంబంధము కలిసి నందున ద్రవ్యధర్మములగు లింగసంఖ్యలు లభింపవు. అందుచే వానిని వేరుగా అతిదేశింప వలెను. శుద్ధమైన ద్రవ్యమునే బోధించినచో పదార్థాభిధానమగును. ఇందు ద్రవ్యమునకు లింగ వచనములు సహజములేగాన వానిని అతిదేశింప నక్కరలేదు.

వివరణము— సంబంధమును పులిమి సంబంధిని తెలియుట విభక్త్యర్థాభిధానము. సూటిగ సంబంధిని తెలియుట పదార్థాభిధానము. ఇదియే రెండింటికిని భేదము. ॥243॥

అవతారిక— పై విషయమునే సంగ్రహముగా చూపుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యమాత్రస్య నిర్దేశే భేదోఽయమవివక్షితః ।
గ్రంథే పూర్వత్ర భేదస్తు ద్వితీయేఽనుప్రదర్శితః ॥ 244

తస్మాత్ = అందువలన, వ్యవహారః = శబ్దము వలన లోకులకు కలిగెడి వ్యవహారము అనగా పనులు చేసికొనుట, న + కల్పతే = కుదరదు, అనగా జరుగనేరదు.

మనుష్యుడు జీవించుటకు కారణము ఏది? అని ప్రశ్నింపగా, అన్నము కారణమని చెప్పవచ్చును. దానికి కారణమెద్ది? అని ప్రశ్నకు ఓషధులు అని చెప్పవచ్చును. వానికి కారణమేది? మరల ఆ కారణమునకు కారణమేది? అను రీతిని ప్రశ్న పరంపర కలుగగా చివరకు మూలకారణము పరమాణువులు, ప్రధానము బ్రహ్మము అని చెప్పవలెను. దానివలన ఇది యెట్లు కలుగును అని ప్రశ్నింపగా అది దాని స్వభావమని చెప్పవలెను. నిజమున అది మనకు ప్రత్యక్షము కానందున దాని స్వభావము కూడ ప్రత్యక్షముకానందున, ఇది యిట్లు, అని స్పష్టముగా తెలియనేరదు. అట్లుకాక ఆ మూలకారణమునందు అనేక శక్తులున్నవని యంగీకరించిన, కారణము ప్రత్యక్షము కానందున దాని శక్తులు ప్రత్యక్షము కానందున అవియు స్పష్టముగా తెలియబడవు.

అట్టి తరి 'గామానయ' (ఆవును తెమ్ము) ఓదనం పచ (అన్నము వండుము) మున్నగు వాక్యములవలన నియతమగు అర్థము తెలియనందున లోక ప్రవృత్తియే జరుగక పోయెడిని. 'గామానయ' అని ప్రయోగింపగా స్వభావమును తెమ్ము, సామర్థ్యమును తెమ్ము అను రీతిని జ్ఞానము కలుగవలెను.

కాబట్టి సామర్థ్యము, సాదృశ్యము, స్వభావము వీని అన్నిటికంటె వేరుగ జాతులను స్వీకరించవలెను. జాతులనుబట్టి శబ్దముల యర్థములు నియతముగా గ్రహింపబడగలవు. దానినిబట్టి లోకులు శబ్దములవలన సరియగు ప్రవృత్తి నివృత్తులను చేయగలరు. ॥95॥

*అవతారిక* — కపిల సాంఖ్యమతమును అద్వైతమతమును ఆశ్రయించి వేరుగా జాతిని అంగీకరింపవలెనని చెప్పుచున్నాడు.

**శ్లో॥ యదా భేదాన్ పరిత్యజ్య బుద్ధ్యైక ఇవ గృహ్యతే।**
**వ్యక్త్యాత్మైవ తదా తత్ర బుద్ధిరేకా ప్రవర్తతే ॥ 96**

యద్దా = ఎపుడు, భేదాన్ = ఎల్ల భేదములను, పరిత్యజ్య = విడనాడి, వ్యక్త్యాత్మా + ఏవ = వ్యక్తియొక్క స్వరూపమే, బుద్ధ్యా = బుద్ధిచే ఏకః + ఇవ = ఒకే వస్తువువలె, గృహ్యతే = గ్రహింపబడునో, తదా = అపుడు, తత్ర = ఆ వ్యక్తియొక్క రూపమునందు, అనగా దానిని ఊతగా గైకొని, ఏకా = ఏకాకారమగు, బుద్ధిః = బుద్ధి అనగా సామాన్య జ్ఞానము, ప్రవర్తతే = కలుగుచున్నది.

ప్రపంచకమునకు ప్రధానము అనగా మూల ప్రకృతి ఒక్కటియే కారణము. కాగా కార్యము ప్రపంచకము. కార్యమునకు కారణమునకు అభేదము. అనగా కారణముకంటె కార్యము భిన్నము కాదు. విశేషరూపమున వానికి భేదము కూడ కలదు. ఒకే వస్తువునకు అనేక రూపములతో స్థితి కలుగుటచే వానికి అభేదము కలుగును. అదియే సామాన్యము, భేద

పూర్వత్ర = మొదటి, గ్రంథే = గ్రంథమందు, (భాష్య సందర్భము), ద్రవ్యమాత్రస్య = కేవలము ద్రవ్యముయొక్క, నిర్దేశే = ప్రతిపాదనమందు, అయమ్ = ఈ, భేదః = విశేషము, (విభక్త్యర్థము కలియుట), అవివక్షితః = చెప్పదలప బడలేదు, ద్వితీయే + తు = రెండవ గ్రంథమందయితే, భేదః = విశేషము, అనుప్రదర్శితః = చూపబడినది.

తాత్పర్యము— బహువ్రీహిని సుదీర్ఘముగ చర్చించిన భాష్యములో తొలుత పదార్థాభిధానపక్షమును, తరువాత విభక్త్యర్థాభిధానపక్షమును చూపబడినవి.

వివరణము— శుద్ధమైన పదార్థమే (అన్యపదార్థము) బహువ్రీహియొక్క అర్థమన్నది మొదట చర్చింపబడినది. అందు విభక్త్యర్థము యొక్క ఆవేశము లేదు. సంబంధమను విభక్త్యర్థము యొక్క ఆవేశము తరువాత చూపబడినది. ఇందుకూడ చివరకు సంబంధావిష్టమైన ద్రవ్యమే ముఖ్యముగా తెలియును. కావుననే లింగవచనముల అతిదేశము (ఆశ్రయమును బట్టి లింగవచనములు వచ్చుట) కుదురును.

కాగా శుద్ధమైన ద్రవ్యము (చిత్రగుః = చిత్రగోవుల అధిపతి) బహువ్రీహికి వాచ్యమని మొదటి పక్షము. షష్ఠ్యర్థము (సంబంధము = చిత్రగుః = చిత్రగోవుల సంబంధము ⟶ అభేదముచే చివరకు సంబంధముగల అధిపతి) బహువ్రీహికి వాచ్యమని రెండవ పక్షము. ఇందును విభక్త్యర్థము యొక్క ఆవేశముగల ద్రవ్యమే ముఖ్యమగును. ॥244॥

అవతారిక — విభక్త్యర్థమును చెప్పు పక్షమునగూడ ద్రవ్యమునకే ప్రాధాన్యమని సమర్థించుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యస్యగ్రహణం చాత్ర లింగసంఖ్యావిశేషణమ్ ।
ద్రవ్యాశ్రితత్వం హి తయో స్తతోఽన్యస్య న సిధ్యతః ॥ 245

అత్ర = ఈ పక్షమున, లింగసంఖ్యా విశేషణమ్ = లింగసంఖ్యలకు విశేషణముగా, ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క, గ్రహణమ్ = స్వీకారము (భవతి = అగును), తయోః = ఆ లింగ సంఖ్యలు, ద్రవ్యాశ్రితత్వమ్ + హి = ద్రవ్యము నాశ్రయించుట ప్రసిద్ధము గదా!, తతః = ద్రవ్యముకన్న, అన్యస్య = వేరొకదానికి, న + సిధ్యతః = సిద్ధింపవు.

తాత్పర్యము — ద్రవ్యమునకే లింగసంఖ్యలు సహజములు. సంబంధము ద్రవ్యము కాదు. కావున అభేదమును భావించి సంబంధమనగా సంబంధియగు ద్రవ్యమే అని చెప్పక తప్పదు. అయినపుడు విభక్త్యర్థపక్షమున కూడ లింగసంఖ్యలు గల ద్రవ్యమే ముఖ్యముగ బహువ్రీహి యొక్క అర్థమగును.

వివరణము— పదార్థాభిధానమున ద్రవ్యప్రతీతి శాబ్దము. (అనగా శబ్దమే సూటిగ ద్రవ్యమును బోధించును). విభక్త్యర్థాభిధానమున ద్రవ్యప్రతీతి ఆర్థము. (అనగా శబ్దమువలన సంబంధము తెలిసి - పిదప అభేదమువలన ద్రవ్యము తెలియును). కాగా వేరొక పక్షమును చూపు అభినివేశముతో విభక్త్యర్థాభిధానమని చెప్పినను ఫలిత మొకటే యగును.

విశేష విషయములు— శుక్ల మొదలగు కొన్ని శబ్దములు గుణమును; గుణిని కూడ తెలుపును. ఉదా : శుక్లః = తెలుపు, శుక్లః = తెల్లని వస్తువు. కాని ''పటు'' అను శబ్దము మాత్రము గుణవాచకమైనను ఎల్లప్పుడును గుణిని మాత్రమే బోధించును. గుణమును బోధింపదు. ఉదా : పటుః = బలమైన వస్తువు. అట్లే ''చిత్రగుః'' మొదలగు బహువ్రీహి ఎల్లప్పుడును ద్రవ్యమునే ముఖ్యముగ చెప్పును. సంబంధము ప్రధానమన్నను చివర కా యర్థము తప్పదు. అది శబ్ద శక్తియొక్క సొగసు. ॥245॥

అవతారిక— పై భావమునే విశదము చేయుచున్నాడు.

శ్లో॥ సంబంధిభిన్నసంబంధపరిచ్ఛిన్నే ప్రవర్తతే ।
సమాసో ద్రవ్యసామాన్యే విశిష్టార్థానుపాతిని ॥ 246

సంబంధి భిన్నసంబంధ పరిచ్ఛిన్నే = సంబంధులతో కూడిన సంబంధము గలిగినట్టియు, విశిష్టార్థానుపాతిని = వెనుకనుండు ద్రవ్యవిశేషముగల, ద్రవ్యసామాన్యే = ద్రవ్యసామాన్యమున, సమాసః = బహువ్రీహి సమాసము, ప్రవర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— విభక్త్యర్థ పక్షమందుకూడ వర్తి పదార్థముల సంబంధము గల పదార్థమునే బహువ్రీహి బోధించును. ఆ పదార్థము సామాన్యరూపముగనే తెలియును. విశేషమును ''చైత్రః'' మొదలగు విశేష్యపదములు తెలియజేయును. వానిని బట్టియే సమాసము యొక్క లింగవచనములను నిశ్చయింపవలెను.

వివరణము— అభేద భావనచే లభించు అన్యపదార్థము కూడ, సామాన్యరూపము గనే తెలియును. కాన విశేషము తెలియుటకై ఇచట కూడ అనుప్రయోగమావశ్యకమగును. కాగా అనుప్రయోగము రెండు పక్షములందును సమానమే అని ఫలించును. ॥246॥

అవతారిక— అనుపాతి (వెనుక నుండునది) యగు విశేష ద్రవ్యమునుసరించి సామానాధికరణ్యము కుదురునని చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్రవ్యధర్మానతిక్రాంతో భేదధర్మేష్వవస్థితః ।
భవిష్యదాశ్రయాపేక్షే లింగసంఖ్యే ప్రపద్యతే ॥ 247

ద్రవ్యధర్మానతిక్రాంతః = ద్రవ్యధర్మములను అతిక్రమించనట్టియు, భేదధర్మేషు = విశేష ద్రవ్యముల ధర్మములందు, అవస్థితః = ఆధారపడినట్టి, (సమాసః = బహువ్రీహి), భవిష్యదాశ్రయాపేక్షే = రాబోవు ద్రవ్యము నాశ్రయించిన, లింగసంఖ్యే = లింగవచనములను, ప్రపద్యతే = పొందును.

తాత్పర్యము— బహువ్రీహివలన ద్రవ్యసామాన్యమే తెలియును. విశేషము అనుప్రయుక్తమైన ''చైత్ర'' మొదలగు పదములవలన లభించును. దాని లింగవచనములే సమాసమునకు సంక్రమించును. అట్లు సామానాధికరణ్యము సంగతమగును. ఉదా : చిత్రగుః = చైత్రః, చిత్రగు = వనమ్ మొదలగునవి.

వివరణము— ''విశేషణానాంచాజాతేః'' (1-2-52) (ఇదివరకే పలుమార్లు వ్యాఖ్యాతము) అను సూత్రముయొక్క సామర్థ్యమువలన అనుప్రయుక్తమైన ద్రవ్యవిశేషము యొక్క లింగసంఖ్యలే బహువ్రీహికి సంక్రమించునని ఫలితము.

విశేష విషయములు— ఈ కారికతో బహువ్రీహియొక్క చర్చ ముగిసినది. ఇచటి సారాంశము లివి.

(1) బహువ్రీహి అన్యపదార్థమును చెప్పును (ఇది మొదటి పక్షము).

(2) అది సంబంధమును చెప్పును. చివరకు అభేదముచే సంబంధినే బోధించును. (రెండవ పక్షము).

(3) రెండవ పక్షమందు భాష్యకారునికి ప్రీతి అధికము.

(4) రెండు పక్షములందును విశేష్యము (ద్రవ్యవిశేషము) అను ప్రయుక్తమగును. దానినిబట్టియే లింగవచనములుండును.

(5) చిత్రగు, అను ఒక్క ఉదాహరణము నాశ్రయించి చర్చ అంతయు జరిగినది. అయినను బహువ్రీహికంతకును ఇది వర్తించును.

## (12) నఞ్సమాసమందు లింగవచనముల అతిదేశ పరిశీలనము

*అవతారిక*— నఞ్ సమాసమున లింగవచనముల అతిదేశమును దాని ఉపయోగమును పరిశీలించుటకు ప్రారంభించుచు తొలుత ఆ సమాసము విషయమున భాష్యకారుడు చూపిన మూడు పక్షములను సమర్థించుచున్నాడు.

**శ్లో॥ శాస్త్రప్రవృత్తిభేదేఽపి లౌకికార్థో న భిద్యతే ।**
**నఞ్సమాసే యతస్తత్ర త్రయః పక్షా విచారితాః ॥ 248**

శాస్త్రప్రవృత్తిభేదే + అపి = శాస్త్రము ప్రవర్తించుటలో భేదమున్నను, లౌకికార్థః = లోకములో ప్రసిద్ధమైన యర్థము, నఞ్సమాసే = నఞ్సమాసమందు, న + భిద్యతే = మారదు, యతః = కాగా, తత్ర = అచట, త్రయః = మూడు, పక్షాః = పక్షములు, విచారితాః = పరిశీలింపబడినవి.

**తాత్పర్యము**— ''అబ్రాహ్మణః'' మొదలగునది నఞ్సమాసము. ''బ్రాహ్మణుడు కాని వ్యక్తి'' అని దీని యర్థము, ప్రసిద్ధమైయున్నది. ఇదెప్పుడును మారదు. అయినను శబ్దసంస్కారమును చూపు శాస్త్రము, ప్రక్రియలో కొన్ని భేదములను చూపుచుండును. ఈ తీరుననుసరించియే ఇచట భాష్యములో మూడు పక్షములు చూపబడినవి.

**వివరణము**— శబ్దముయొక్క అర్థమును వ్యాకరణము చెప్పదు. అర్థమెప్పుడును లోకాధీనమే. అట్టి యర్థమునకు హాని లేకుండ శబ్దరూపమునకు చెందిన ప్రక్రియలో గౌరవలాఘవములను చర్చించుటకై కొన్ని వాదభేదములను శాస్త్రము చూపుచుండును.

విశేష విషయములు— ''నఞ్'' (2-2-6) అను సూత్రము నఞ్‌సమాసమును విధించును. ''న'' అను అవ్యయము సమర్థమైన సుబంతముతో సమసించును— అది తత్పురుషమనిపించుకొనును'' అది దీని యర్థము. ఉదా : న + బ్రాహ్మణః = అబ్రాహ్మణః, మొదలగునవి ఉదాహరణములు

ఈ సూత్రముయొక్క భాష్యములో మూడు పక్షములున్నవి.

(1) నఞ్‌సమాసమందు తొలిపదము యొక్క అర్థము ముఖ్యమా ? (పూర్వపదార్థ ప్రాధాన్యము).

(2) లేక చివరి పదము (మలిపదము) యొక్క అర్థము ముఖ్యమా ? (ఉత్తర పదార్థ ప్రాధాన్యము)

(3) లేక బహువ్రీహియందువలె అన్యపదార్థము ప్రధానమా ? (అన్యపదార్థ ప్రాధాన్యము).

వీనిలో ఏ పక్షమును స్వీకరించినను లోకసిద్ధమైన అర్థము మాత్రము మారదు - మారకూడదు. ఉదా : ''అబ్రాహ్మణః = బ్రాహ్మణుడు కాని వ్యక్తి'' అను అర్థమును మూడింటియందును సంపాదింపవలెను.

1. పూర్వపదార్థ ప్రాధాన్యము:— ఇందు ''న'' అను దానికి నివృత్తి —లేక— అభావమర్థము. కాని నిషేధము ప్రాప్తిపూర్వకము (ప్రాప్తించునపుడే నిషేధము సార్థకము) మరియు అభావమునకు క్రియతో సంబంధము అసంభవము. కాగా ''న'' అను దానికి సాదృశ్యమను అర్థము ఫలించి ''బ్రాహ్మణునివలె కనిపించుచు ''క్షత్రియాది జాతికి చెందినవాడు'' అను భావము వచ్చును.

2. ఉత్తరపదార్థ ప్రాధాన్యము:— ఇందు ''న'' అనునది భ్రాంతిని సూచించును. ''బ్రాహ్మణుడు కాకున్నను బ్రాహ్మణుడను భ్రాంతికి విషయమైనవాడు'' అను భావము కలుగును.

3. అన్యపదార్థ ప్రాధాన్యము:— ఇందు ''అబ్రాహ్మణః'' అనగా ''బ్రాహ్మణ వ్యక్తి కాని క్షత్రియాది వ్యక్తి'' అను భావము సిద్ధించును.

ఎట్లయినను సమాసము సమర్పించు భావమొకటియే. అయినను శాస్త్రప్రక్రియ యొక్క ఔచిత్యమును సమర్థముగ చూపుటకై మూడు పక్షములును ప్రతిపాదింపబడినవి.

వీనిలో చివరకు ఉత్తరపదార్థ ప్రాధాన్యమే ప్రామాణికముగ తీసికొనబడినది.

అవతారిక— నఞ్ సమాసమున ''అపోద్ధారమును'' అవయవములను ఎత్తి చూపుట) ఆశ్రయించి పై మూడు పక్షములును బయలుదేరినవి. వాస్తవముగ అచట అవయవములు లేవు - అని చెప్పుచున్నాడు.

శ్లో॥ శబ్దాంతరేఽపి చైకత్వమాశ్రిత్యైవ విచారణా ।
అబ్రాహ్మణాదిషు నఞః ప్రయోగో న హి విద్యతే ॥ 249

శబ్దాంతరే + అపి = వేరొక శబ్దమైనను, ఏకత్వమ్ + ఏవ = ఐక్యమునే, ఆశ్రిత్య + చ = ఆశ్రయించి, విచారణా = పరిశీలనము, (భవతి=అగును), అబ్రాహ్మణాదిషు=అబ్రాహ్మణః, మొదలగుచోట్ల. నఞః = నఞ్కు, ప్రయోగః = ప్రయోగము, న + విద్యతే + హి = లేదుగదా ।

తాత్పర్యము — "న బ్రాహ్మణః" అను వాక్యము వేరు. "అబ్రాహ్మణః" అను సమాసము వేరు అయినను ఆ రెండింటికిని అభేదమును కల్పించుటవలన సమాసమందును నఞ్ను చూపి అర్థవికల్పములు పరిశీలింపబడును. వాస్తవమున సమాసమఖండము. దాని యర్థమును అఖండమే

వివరణము — వాక్యమునకును వృత్తికిని గల స్వల్పసామ్యమునుబట్టి, వృత్తియందును అవయవములును, విశేషణ విశేష్యభావము మొదలగునవియు ఉన్నట్లు ప్రక్రియను చూపుదురు. కాని వృత్తికిని వాక్యమునకును ఎట్టి సంబంధమును లేదు. కాగా నఞ్ సమాసమున చూపబడిన మూడు పక్షములు కూడ వాక్యదశ ననుసరించినవేయని భావింపవలయును.॥249

అవతారిక — ఇట్లు వాక్యముతో అభేదమును భావించి నఞ్ సమాసమున మూడు పక్షములను చూపుట సరియే కావచ్చును కాని వాక్యమందలి నఞ్కు వాస్తవమైన అర్థమేమి?- అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

శ్లో॥ ప్రాక్సమాసాత్ పదార్థానాం నివృత్తిర్ద్యోత్యతే నఞా ।
స్వభావతో నివృత్తానాం రూపాభేదాదలక్షితా ॥ 250

స్వభావతః = సహజముగ, నివృత్తానామ్ = పోయిన (లేని), పదార్థానామ్=వస్తువులయొక్క, నివృత్తిః = పోవుట, రూపాభేదాత్ = స్వరూపములో భేదము లేనందువలన, అలక్షితా = చూడబడనిదై, సమాసాత్ = సమాసముకన్న, ప్రాక్ = ముందు, నఞా = నఞ్చే, ద్యోత్యతే = సూచింపబడును.

తాత్పర్యము — సహజముగనే పదార్థములులేని స్థితియందు, వాని అభావమును వాక్యమందలి నఞ్ సూచించును కాని అది అభావమును సూటిగ చెప్పదు.

వివరణము — "న బ్రాహ్మణః" మొదలగు వాక్యమువలన ఆ యా పదార్థముయొక్క (బ్రాహ్మణుడు మొదలయినది) నివృత్తిని —లేక— అభావమును తెలియుదుము. అభావము (లేకుండుట) తనంతతాను ఉండజాలదు. ఏదైనా ఒక వస్తువునకు సంబంధించియే అది యుండుట సహజము. ("దాని యభావము, దీని యభావము" - అని యనుటయేగాని పూర్తిగా ఒక పదార్థముగా అభావమును భావింపలేము). అయితే ఒక చిత్రము. సిద్ధముగా

అట్లుకాక నఞ్ఞున కుత్తరపదముతోనే సంబంధమన్నపుడు సామర్థ్యము కుదురును గాన వృత్తి ప్రవర్తించును. కాగా అర్థముయొక్క ప్రాధాన్యమునకు చెందిన మూడు పక్షములును ఈ సందర్భమందే సముచితములగును. అయితే "అబ్రాహ్మణః" మొదలగు సమాసములో "అస్తి" (ఉన్నాడు) అను క్రియ మాత్రము ఉత్తరపదముయొక్క అర్థమందు ఇమిడియుండునని గ్రహింపవలెను. ఎట్టి పదార్థమునకైనను సత్త (ఉనికి) నియతము కావున దానిని చెప్పు క్రియాపదమును వాడినను, వాడకున్నను ఆ భావము తెలియుచునే యుండును. కాగా నఞ్ఞునకు "అస్తి" అను క్రియతో సంబంధము సూచితమైనను సామర్థ్యమునకు లోపముండదు.

విశేష విషయములు— "అస్తి" (ఉన్నది) అను క్రియాపదము బోధించు సత్తాసామాన్యమును 'న' అనునది ఎల్లప్పుడును నిషేధించును. అనగా 'న' అను దానికి సత్త అను క్రియతోడి సంబంధము సహజముగాన ఈ యర్థమందు ఉత్తరపదముతో సామర్థ్యము కూడ సంభవించునని ఫలించును. ॥251॥

*అవతారిక*— ఇట్లు ఉత్తరపదముయొక్క అర్థమందుండు విశేషక్రియలను కూడ నఞ్ఞు నిషేధించునన్నపుడు కలుగు దోషమును చూపుచున్నాడు.

**శ్లో॥ పాచకాదిపదస్థా చేన్నఞా సంబధ్యతే క్రియా ।**
**తత్ర సత్తానుపాదానాత్ త్రిపక్షీ నోపపద్యతే ॥ 252**

పాచకాదిపదస్థా = పాచక, మొదలగు పదముల అర్థమందుండు, క్రియా = వ్యాపారము, నఞా = నఞ్ఞుతో, సంబధ్యతే + చేత్ = కూర్చబడినచో, తత్ర = అచట, సత్తానుపాదానాత్ = సత్తను స్వీకరింపనందువలన, త్రిపక్షీ = మూడు పక్షములు, న + ఉపపద్యతే = కుదురవు.

తాత్పర్యము— "న + పాచకః = అపాచకః", "న + పాఠకః = అపాఠకః" ఇట్టిచోట్ల పాచక, పాఠక, మొదలగు ఉత్తరపదముల అర్థమందు వంట, చదువు, మొదలైన విశేష క్రియలున్నవి. వానిని "న" అనునది నిషేధించునన్నచో, సత్తా సామాన్యమును స్వీకరింపనందున వెనుక చూపిన మూడు పక్షములును (నఞ్ సమాసములో ఏ యర్థము ముఖ్యమని పరిశీలించునవి) కుదురక పోవును.

వివరణము— సత్త అను సామాన్యక్రియగాని, వంట చదువు మొదలగు విశేష క్రియగాని, సమాసమున ఉత్తరపదము వలననే తెలయుననియు, నఞ్ఞు ద్యోతకమై దానిని నిషేధించుననియు చెప్పినచో, నఞ్ఞు నిరర్థకమగునుగాన, అర్థప్రాధాన్యమును విచారించు వికల్పముల కవకాశముండదు. అందువలన వాక్యమందు ద్యోతకమగునని అన్నను, వృత్తియందు మాత్రము నఞ్ఞు వాచకమగునని చెప్పవలెను. అపుడు "అసత్తా సామాన్యము" (నాస్తి = లేదు = ఉనికి లేదు) దాని యర్థమగును. పాచకాది పదములున్నపుడు క్రియా

విశేషము యొక్క అసత్తయు (లేకుండుట) నఞర్థము కావచ్చును. కాగా సమాసమున రెండు పదములకును స్వతంత్రమైన అర్థముండును గాన ప్రాధాన్యవిచారణ కుదురును.

విశేష విషయములు— సమాసమున సత్తా సామాన్యమునే నఞు స్వతంత్రముగ నిషేధించునని చెప్పవలెను. ॥252॥

అవతారిక— ఈ విధముగా సత్తతో నఞునకు సంబంధమన్నచో చిక్కు వచ్చునని చూపుచున్నాడు.

**శ్లో॥ సత్తయైవాభిసంబంధో యది సర్వత్ర కల్ప్యతే ।**
**అసన్నితి సమాసేఽస్మిన్ సత్తాన్యా పరికల్ప్యతామ్ ॥ 253**

సర్వత్ర = అన్నిచోటులందును, సత్తయా + ఏవ = సత్తాతోనే, అభిసంబంధః = సంబంధము, కల్ప్యతే + యది = కల్పింపబడినచో, ''అసన్ + ఇతి'' = ''అసన్'' అను, అస్మిన్ = ఈ, సమాసే = సమాసమందు, అన్యా = వేరొక, సత్తా = సత్త, పరికల్ప్యతామ్ = కల్పింపబడవలెను.

తాత్పర్యము— పదార్థము లన్నింటికిని సత్త (ఉనికి) తోడి సంబంధము నియతము. అట్టి సత్తనే నఞ్ సమాసమందలి ''న'' అనునది నిషేధించునన్నచో ''న + సన్ = అసన్ (లేనిది)'' అనుచోట ఉత్తరపదార్థమునకు చెందిన వేరొక సత్తను కల్పింపవలసి యుండును.

వివరణము— ''అసన్'' అను పదమువలన ఒక సత్తయొక్క అభావమే తెలియును. సత్తా సామాన్యమును నిషేధించుట నఞున కర్థమన్నచో, నఞునకు సంబంధించిన వేరొక సత్త నిచట అంగీకరింపవలసి యుండును. (అసన్ = సత్తయొక్క సత్త లేకుండుట అను భావము వచ్చెడిని). ॥253॥

అవతారిక— ఈ సందర్భముననే మరియొక దోషమును చూపుచున్నాడు.

**శ్లో॥ క్త్వాంతే చ తుమునంతే చ నఞ్సమాసే న దృశ్యతే ।**
**విశేషణవిశేష్యత్వం నఞా సత్తాభిధాయినా ॥ 254**

క్త్వాంతే + చ = త్వా, అను ప్రత్యయ మంతమందుగల శబ్దమందును. తుమునంతే + చ = తుమ్, అను ప్రత్యయ మంతమందుగల శబ్దము విషయమునను, నఞ్ సమాసే = నఞ్ సమాసమున, సత్తాభిధాయినా = సత్తను చెప్పు, నఞా = నఞుతో, విశేషణవిశేష్యత్వమ్ = విశేషణ విశేష్యభావము, న + దృశ్యతే = కనబడదు.

తాత్పర్యము— ''న + కృత్వా = అకృత్వా (చేయక)''. ఇది క్త్వా ప్రత్యయాంతముతో నఞ్ సమాసము. ''న + కర్తుమ్ = అకర్తుమ్'' (చేయకుండుటకు) ఇది తుమున్

ప్రత్యయాంతముతో నఞ్ సమాసము. ఇట్టిచోట్ల ఆ యా విశేషక్రియలనే నఞ్ఞు నిషేధించును గాని సత్తను నిషేధింపదు. కాగా నఞ్ఞు సత్తనే సామాన్యముగా నిషేధించుననుట పొసగదు.

వివరణము— ఇచటి సారమిది :

(1) వాక్యమందలి ''న'' అనునది అభావమునకు ద్యోతకమనుట కుదురును.

(2) వృత్తియందలి ''న'' అనునది ద్యోతకము మాత్రమే అన్నచో, ఉత్తర పదార్థమే ముఖ్యమగునుగాన అర్థప్రాధాన్యమును గూర్చి వికల్పములు కుదురవు.

(3) అట్లుకాక వృత్తియందలి ''న'' అనునది సత్తను నిషేధించు వాచకమే అగునన్నచో, అసన్, అకృత్వా, మొదలగు ప్రయోగములలోని అర్థానుభవము విరోధించును.

(4) ఇట్లు నఞ్ఞు ద్యోతకమన్నను, సత్తకు వాచకమన్నను ''త్రిపక్షి'' (మూడు పక్షములు = నఞ్ సమాసముయొక్క అర్థమునుగురించి మూడు పక్షములు) ఉపపన్నము కాదు.

(5) వృత్తియందలి నఞ్ఞునకు కేవలము నిషేధమే అర్థమని చెప్పినచో, ఏదో యొక విధముగ త్రిపక్షిని సమర్థింపవచ్చును. ఇందు నఞ్ఞునకు స్వతంత్రమైన అర్థముండును (నిషేధము). ''సత్త'' యను సామాన్యక్రియతోగాని. ''చేయు'' మొదలగు విశేషక్రియలతో గాని దానికి సంబంధమును చూపవచ్చును. ॥254॥

అవతారిక— పైన చూపిన దోషములు కలుగకుండుటకు ఉపాయమును చెప్పుచున్నాడు.

శ్లో॥ క్రియాయాః సాధనాధారసామాన్యే నఞ్ వ్యవస్థితః ।
తతో విశిష్టైరాధారైర్యుజ్యతే బ్రాహ్మణాదిభిః ॥ 255

క్రియాయాః = క్రియయొక్క, సాధనాధార సామాన్యే = సాధనమునకు ఆశ్రయమైన సామాన్యమందు, నఞ్ = నఞ్ఞు, వ్యవస్థితః = నిశ్చయింపబడినది, తతః = అందువలన, బ్రాహ్మణాదిభిః = బ్రాహ్మణుడు మొదలయిన, విశిష్టైః = విశేషములైన, ఆధారైః = ఆధారములతో, యుజ్యతే = సంబంధించును.

తాత్పర్యము— ''లేని వస్తువు'' అన్నది నఞ్ఞుయొక్క అర్థము. ఇది సామాన్యార్థము. ఉత్తరపదము ఆ వస్తువును స్పష్టపరచును. ఇది విశేషమగును. కావున సామాన్యవిశేషభావ మేర్పడి, ''అబ్రాహ్మణః'' మొదలగుచోట్ల కావలసిన యర్థము సిద్ధించును.

వివరణము— ''న'' అనునది అభావమును బోధించును. భావముయొక్క నిషేధమే అభావము. భావమనగా ''ఉనికి'' ఇచట ఈ ఉనికిని లేక సత్తను క్రియగా తీసికొనవలెను. సత్తకు సాధనమైన ఆధారమనగా ''ఉండు వస్తువు'' అగును. దీనిని ''న'' అనునది సామాన్యరూపమున నిషేధించును. కాగా ''న'' అనునది ''లేని వస్తువు'' (ఏదయినను సరే) అను

నర్థమును చెప్పును. పిదప సమాసము జరిగినపుడు ఉత్తరపదార్థము విశేషమగును. నఞర్థము నకును ఉత్తరపదార్థమునకును సామాన్యవిశేష భావము కుదురును.

విశేష విషయములు— ఈ పరిష్కారము వలన చిక్కులేవియు రావు. ఇందు ''న'' అనునది వాచకమే యగును. కావున వివక్షాధీనముగా అర్థప్రాధాన్యమును గురించిన మూడు పక్షములును సరిపోవును. ఉదా : ''అబ్రాహ్మణః = బ్రాహ్మణుడు - లేనివాడు.'' ఈ యర్థమున పూర్వపదార్థము యొక్క ప్రాధాన్యము. ''లేని బ్రాహ్మణుడు అని చెప్పినచో ఉత్తరపదార్థ ప్రాధాన్యము. ''బ్రాహ్మణత్వము లేని వ్యక్తి'' అని అన్నచో అన్యపదార్థ ప్రాధాన్యము. ఇట్లే ''అపాచకః'' మొదలగుచోట్ల సామాన్యవిశేషభావముచే ఆ యా క్రియా విశేషమునకే నిషేధము చెందును. ''అకృత్వా'' మొదలగుచోట్ల కూడ ఇట్లే సామాన్యవిశేష భావమును ఊహింపవలెను. ॥255॥

అవతారిక— వాక్యమందు ద్యోతకమైన నఞునకు, వృత్తియందు వాచకత్వ మెట్లు కుదురునను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ వృత్తౌ యథా గతాద్యర్థముపాదాయ నిరాదయః ।
యుజ్యంతే సాధనాధారైర్నఞ్సమాసేఽపి స క్రమః ॥ 256

నిరాదయః = నిర్ మొదలగునవి, వృత్తౌ = వృత్తియందు, గతాద్యర్థమ్ = ''గత'' మొదలగు అర్థమును, ఉపాదాయ = స్వీకరించి, సాధనాధారైః = కారకములైన ద్రవ్యములతో, యథా = ఎట్లు, యుజ్యంతే = కూడునో, నఞ్సమాసే + అపి = నఞ్సమాసమందును, సః = అదియే, క్రమః = తీరు.

తాత్పర్యము— నిర్ (నిష్క్రమించుట), అతి (అతిక్రమించుట), మొదలగునవి వాక్యదశయందు అవ్యయములు. కాని ''నిష్కౌశాంబిః'' (నిష్క్రాంతః కౌశాంబ్యాః=కౌశాంబి యను నగరమునుండి వెడలినవాడు) అతిఖట్వః (ఖట్వామ్ - అతిక్రాంతః = మంచమును దాటినవాడు) మొదలగు సమాసములలో అవి ఆ యా ద్రవ్యములనే బోధించును. అట్లే నఞ్ సమాసమందలి ''న'' అనునది ''లేని వస్తువు'' అను నర్థమును సామాన్యముగ చెప్ప గలుగును.

వివరణము— శబ్దశక్తి ననుసరించి, నిష్కౌశాంబిః, మొదలగు సమాసముల లోని ''నిర్'' మొదలగు అవ్యయములు (సహజముగ ద్యోతకములైనను) ''నిష్క్రమించిన వస్తువు''ను చెప్పునట్లు, ''అబ్రాహ్మణః'' మొదలగు సమాసమందలి ''న'' అనునది ''లేని వస్తువు''ను సామాన్యరూపములో చెప్పును. అట్లు కాకున్న సామర్థ్యము కుదురనందున సమాసమే రాకపోవును. (వాక్యదశలో ''న'' అను దానికి ''అభావము'' అనియే యర్థము). ॥256

*అవతారిక*— నఞు అసత్సామాన్యమును (లేని వస్తువు - అను అర్థమును) చెప్పినపుడు ఉత్తరపదము యొక్క అర్థమే విశేషమగుటవలన ముఖ్యమని తెలిసిపోవును. అయి

అందు ఎల్లశబ్దములు సిద్ధరూపమగు ద్రవ్యమునే బోధించును అని వ్యాడి* అను ఆచార్యుని మతము. అట్లుగాక ఎల్ల శబ్దములు జాతినేబోధించునని వాజప్యాయన అను ఆచార్యుని మతము అట్లుగాక ఉభయమును అనగా ద్రవ్యమును. జాతిని శబ్దము బోధించునని పాణిన్యాచార్యుని సిద్ధాంతము.

అందు ముందుగా వాజప్యాయనమునియొక్క మతమును ఆశ్రయించి ఎల్లశబ్దములకు జాతియే వాచ్యమగునని నిరూపించుటకు ఈసముద్దేశము నారంభించు చున్నాడు. కనుకనే ఈప్రకరణమునకు, జాతిసముద్దేశః అని భర్తృహరి నామకరణము చేసెను. ఈమూడవ కాండమున 14 ప్రకరణములు కలవు. వానికి సముద్దేశములు అని గ్రంథకర్తయొక్క వాడుక. సమ్ + ఉద్ + దిశ ధాతువునకు కరణార్థమున 'ఘఞ్' ప్రత్యయము చేరగా, సముద్దేశ శబ్దము నిష్పన్నమగును. సమ్యక్ ఉద్దిశ్యతే = ప్రతిపాద్యతే అనేన (లెస్సగా దీనిచే తెలియబడునది) అనువ్యుత్పత్తిని ఆశ్రయించగా లెస్సగా తెలిసికొనుటకు సాధనము అనగా ఉపకరించునది-సముద్దేశము అను అర్థము లభించును. జాతిని లెస్సగా తెలిసికొనుట కుపకరించెడి ప్రకరణము-జాతిసముద్దేశము. ఇట్లే పై 13 సముద్దేశములకు అర్థము చెప్పనగును.

శ్లో॥ పదార్థానామపోద్ధారే జాతిర్వా ద్రవ్యమేవవా।
పదార్థౌసర్వశబ్దానాం, నిత్యావేవోపవర్ణితౌ॥ 2

A. పదార్థానామ్ = పదార్థములకు అనగా పదముచే బోధింపబడెడి అర్థములకు, అపోద్ధారే వాక్యార్థమునుండి వేరుపరుచుట జరగగా. అనగా అఖండమగు వాక్యార్థమునుండి పదార్థములకు విభజన జరుగగా, సర్వశబ్దానామ్ = ఎల్లశబ్దములకు, జాతిః + వా = జాతియే కాని, ద్రవ్యమ్ + ఏవ = ద్రవ్యమేకాని, వా = అట్లుగాక ఉభయముకాని, పదార్థౌ = పదముల యర్థములుగా, (స్యాతామ్) = కాగలవు.

1. ఎల్లశబ్దములకు జాతియేవాచ్యమగునని వాజప్యాయనుని యాశయము. ఘట, పట మున్నగు శబ్దములు ఘటత్వ, పటత్వ జాతులను, శుక్ల మున్నగు శబ్దములు శుక్లత్వమున్నగు గుణగతజాతులను, పచతి మున్నగు శబ్దములు పాకము మున్నగు క్రియలయందున్న జాతులను 'డిత్థ' మున్నగు శబ్దములు డిత్థత్వము మున్నగు జాతులను బోధింపగలవు. జాతి తనకు ఆశ్రయమగు ద్రవ్యమును ఆక్షేపించును. ద్రవ్యముమాత్రము వాచ్యముగాదు.

2. ఎల్లశబ్దములు ద్రవ్యమునే బోధించునని వ్యాడిమహర్షి యాశయము. ద్రవ్యమనగా నిర్గుణాద్వయబ్రహ్మమే, కాక ఘటము పటము మున్నగు వ్యక్తి. ఈరెండు విధములగు ద్రవ్యములు ఈమూడవకాండముననే 2,4 సముద్దేశములలో ద్రవ్యసముద్దేశము, అను పేర్లతోనే నిరూపింపబడుచున్నవి.

---

* ద్రవ్యాభిధానం వ్యాడిః, ఆకృతిం వాజప్యాయనః, అని మహాభాష్యకారుడు. స్వరూపాణామేకశేష ఏకవిభక్తౌ, 1,2,64 అనుసూత్రమును వ్యాఖ్యానించు సందర్భమునఇరువుర మతములను విపులముగ చర్చించి యున్నాడు.

మును వివక్షించిన అదియే విశేషము. ఎల్ల వస్తువులకు అభేదమును అంగీకరించిన అదియే మహా సామాన్యము. అవాంతరభేదమును అంగీకరించిన అదియే గోత్వము, ఘటత్వము అను రీతిని అపరసామాన్యము.

ఎల్ల వస్తువులు మూల ప్రకృతియొక్క పరిణామమే. అద్వైతమతమున అవి బ్రహ్మముయొక్క వివర్తములు.

కాగా భేదాఽభేద విచారముచేయక ఎల్లభేదములను విడనాడి కేవల వ్యక్తులనే ఏక బుద్ధికి విషయమగునట్లు చూచిన అందు విషయమగునది సామాన్యమే కావలెను.

కాబట్టి సాంఖ్యమతమును జూచిన, అద్వైతమతమును జూచిన సామాన్యము అనగా జాతి తప్పక అంగీకరింపవలెను. ॥96॥

అవతారిక— పాణిని మహర్షి "సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (1-2.64) అసూత్రముచే ఘటౌ, ఘటాః, మున్నగు స్థలములయందు ఏకశేషమును విధించెను. ఎన్ని ఘట వ్యక్తులను బోధింపదలచెనో, అన్ని ఘట శబ్దములను ప్రయోగింపవలెను. కాని లోకమున అట్లులేక ఒకే ఘటశబ్దమును ప్రయోగించుట కానవచ్చుచున్నది. దానికి ఉపపత్తిని చూపుటకై ఏకశేషము ఆరంభింపబడినది. కాగా వ్యక్తి పక్షమున సూత్రము అవసరమగుచున్నది.

ఘటాది శబ్దములకు ఘటత్వము మున్నగు జాతియే వాచ్యమగును. ఈ పక్షమున ఒకే ఘటశబ్దము జాతిని పురస్కరించుకొని ఎన్నియో ఘటములను బోధింపగలదు. కనుక ఏకశేష సూత్రము చెప్పనక్కరలేదు.

మహాభాష్యకారుడు జాతి పక్షమును ఆశ్రయించి పై పద్ధతిని ఏకశేష సూత్రమక్కరలేదని సిద్ధాంతమును చూపెను.

ఆ సిద్ధాంత పక్షమున బుద్ధికి ఘటముల సమూహము ఎట్లు విషయమగునో, ఆ యంశమును జూపుచున్నాడు.

శ్లో॥ భేదరూపైరనుస్యూతం యదైకమివమన్యతే ।
సమూహావగ్రహా బుద్ధిర్బహుభ్యో జాయతే తదా ॥ 97

బుద్ధిః = బుద్ధి, యదా = ఎప్పుడు, భేదరూపైః = భేదముకల రూపములతో అనగా భిన్న రూపములతో, అనుస్యూతమ్ = అనుసరింపబడియే యున్న సమూహమును, ఏకమ్ + ఇవ = ఒకే పదార్థమునుగా, మన్యతే = తలచునో, తదా = అపుడు, సమూహావగ్రహా = సమూహము ఆధారముగా గలదై, బహుభ్యః = బహు సంఖ్యాకములగు వ్యక్తులవలన, జాయతే = జనించుచున్నది.

శబ్దము నుచ్చరింపగా అర్థము బుద్ధికి విషయమగుచు, ఆ యర్థము భిన్నముగా నున్న వ్యక్తి, ఏకరూపముగానున్న జాతియు కాగలదు ఆ ఏకత్వము అనగా జాతియందున్న

నపుడు అర్థప్రాధాన్యము విషయమున వెనుకటి వికల్పము లెట్లు కుదురును? - అను శంకకు బదులు చెప్పుచున్నాడు.

శ్లో॥ తత్రాసతి నఞో వృత్తేర్బ్రాహ్మణక్షత్రియాదిభిః ।
విశేషణవిశేష్యత్వం కల్ప్యతే కుబ్జఖంజవత్ ॥ 257

తత్ర = అచట, అసతి = అసత్తునందు (లేని వస్తువు), నఞః = నఞ్ను, వృత్తేః = ప్రవర్తించుట వలన, బ్రాహ్మణక్షత్రియాదిభిః = బ్రాహ్మణ, క్షత్రియ మొదలగు పదములతో, కుబ్జఖంజవత్ = "కుబ్జఖంజ", అను సమాసమందువలె, విశేషణవిశేష్యత్వమ్ = విశేషణ విశేష్య భావము, కల్ప్యతే = కల్పింపబడును.

తాత్పర్యము— "అబ్రాహ్మణః" "అక్షత్రియః" మొదలగు నఞ్ సమాసములలో నఞ్ లేని వస్తువును సామాన్యమును చెప్పును. అయినను దానికిని బ్రాహ్మణాదులకును "కుబ్జ ఖంజః" అను సమాసమందువలె "ఒకటి విశేషణమనియు, వేరొకటి విశేష్యమనియును" విశేషణ విశేష్యభావమును చెప్పుకొనవలెను.

వివరణము— కుబ్జః = గూనివాడు, ఖంజః = కుంటివాడు. కుబ్జశ్చ - అసౌ - ఖంజశ్చ = కుబ్జఖంజః (గూనియు కుంటియునగు వ్యక్తి. ఇచట రెండును విశేషణములే. విశేష్యమైన వ్యక్తి వేరుగా ఉండును. అయినను ఈ రెండు పదములకును స్వేచ్ఛగా విశేషణ విశేష్యభావమును కల్పించి కర్మధారయ సమాసమును సమర్థింతురు. (కుబ్జ అన్నది విశేష్యమనియు, ఖంజ అనునది విశేషణమనియును మార్చినచో "ఖంజకుబ్జః" అనియు వాడవచ్చును) అట్లే నఞ్ సమాసములో విశేషణ విశేష్యభావమును స్వేచ్ఛగా కల్పింపవచ్చును. అపుడు అర్థముయొక్క ప్రాధాన్యము తారుమారగుచుండును. కాగా దానిని గురించిన వికల్పములు సమంజసములే అగును. ॥257॥

అవతారిక— అట్లు విశేషణ విశేష్యభావమును స్వేచ్ఛగా చెప్పినపుడు సిద్ధించు ఫలితమును చూపుచున్నాడు.

శ్లో॥ కామచారే చ సత్యేవమసతః స్యాత్ ప్రధానతా ।
గుణత్వమితరేషాం చ తేషాం వా స్యాత్ ప్రధానతా ॥ 258

ఏవమ్ = ఇట్లు, కామచారే = స్వేచ్ఛ, సతి + చ = ఉండగా, అసతః = అసత్తునకు (లేని వస్తువు - అను సామాన్యమునకు), ప్రధానతా = ప్రాధాన్యము, స్యాత్ = అగును, ఇతరేషామ్ = మిగిలిన వానికి (బ్రాహ్మణ, మొదలగు విశేషములకు), గుణత్వమ్ + చ = గుణభావమును (అప్రాధాన్యము), స్యాత్ = అగును, వా = లేక, తేషామ్ = ఆ విశేషములకే, ప్రధానతా = (ప్రాధాన్యము, స్యాత్ = కలుగును (సామాన్యము అప్రధానమగును).

తాత్పర్యము— నఞ్ సమాసములో విశేషణ విశేష్యభావమును స్వేచ్ఛగ చెప్ప

వచ్చునన్నపుడు, ఒకసారి "అసత్సామాన్యము" (నఞర్థము) ముఖ్యమై, బ్రాహ్మణాది విశేషములు అప్రధానములగును. వేరొకసారి విశేషములే ప్రధానమై అసత్సామాన్యము అప్రధానమగును.

వివరణము— "అబ్రాహ్మణః" = బ్రాహ్మణుడు - లేనివాడు. (బ్రాహ్మణ పదార్థము విశేషణము, నఞర్థము విశేష్యము) ఇదొక రీతి. ఇందు పూర్వపదార్థము ముఖ్యమగును. అబ్రాహ్మణః = లేనివాడు బ్రాహ్మణుడు ఇదొక రీతి. ఇందు ఉత్తరపదార్థము ప్రధానము ఈ రెండు రీతులను అంగీకరించినపుడు "బ్రాహ్మణత్వము లేని వ్యక్తి" అను వేరొక రీతిని కూడ అంగీకరింపవచ్చును. ఇందు అన్యపదార్థము ముఖ్యమగును. ఇట్లు అర్థప్రాధాన్యమును గురించి వికల్పములు బయలుదేరును.

విశేష విషయములు— కాగా వాక్యమందలి నఞు నిషేధమును మాత్రమే సూచించును. అది ద్యోతకము. కావుననే అవ్యయము. (లింగవచనము లుండవు). వృత్తియందలి నఞు వాచకము. అసత్సామాన్యమును అది చెప్పును. దానికిని ఉత్తరపదమునకును విశేషణ విశేష్యభావము. అందు స్వేచ్ఛ గలదు. కావుననే "దీని యర్థము ముఖ్యమని" విచారణ చేయుట కవకాశము కలిగినది. ॥258॥

అవతారిక— ఇట్లు నఞ్ సమాసము విషయమున భాష్యము చూపిన మూడు పక్షములును సమర్థింపబడినవి. అందు ఉత్తరపదార్థము ముఖ్యమను పక్షమును ముందుగా భాష్యకారుడు సమీక్షించెను. ఆ తీరును వివరించుటకు ప్రారంభింపుచున్నాడు.

**శ్లో॥ ప్రాధాన్యేనాశ్రితాః పూర్వం శ్రుతేః సామాన్యవృత్తయః ।**
**విశేష ఏవ ప్రక్రాంతా బ్రాహ్మణక్షత్రియాదయః ॥ 259**

బ్రాహ్మణక్షత్రియాదయః = బ్రాహ్మణ, క్షత్రియ, మొదలగునవి, శ్రుతేః = వినుటవలన, సామాన్యవృత్తయః = సామాన్యమైన అర్థమందుండునవియై, విశేష + ఏవ = విశేషమైన అర్థమందే, పూర్వమ్ = ముందుగా, ప్రక్రాంతాః = ప్రారంభింపబడినవై, ప్రాధాన్యేన = ముఖ్యములుగా, ఆశ్రితాః = ఆశ్రయింపబడును.

తాత్పర్యము— అబ్రాహ్మణః - మొదలగు నఞ్ సమాసములలో బ్రాహ్మణ - మొదలగు ఉత్తరపదములు, నివృత్తితో (అభావము) కూడిన తమ, తమ అర్థములనే ముఖ్యములుగా బోధించును. 'న' అనునది వానికి విశేషణమగుచు సిద్ధముగానున్న నివృత్తిని వెల్లడి చేయును. స్వరూపము ఒకటిగానే వినిపించినను (వేరు స్థలములలో) నఞ్ సమాసమందలి చివరి పదములు అభావవిశిష్టమైన స్వార్థమును చెప్పును అనవలెను.

వివరణము— బ్రాహ్మణ శబ్ద మన్నిచోటులందును ఒకే విధముగ వినిపించును. అయినను నఞ్ సమాసమున అది "లేని బ్రాహ్మణత్వము గలవాడు" అను భావమును సమర్పించును. పిదప "న" అనునది ఆ భావమును విశదము చేయును. ఉన్న ధర్మమును నఞు పోగొట్టజాలదు. అందుచే ఇట్లు చెప్పక తప్పదు. ॥259॥

అవతారిక— కాగా విశేషణ విశేష్యభావ మేర్పడి ఉత్తరపదార్థము ముఖ్యమగునని దృష్టాంతముతో చూపుచున్నాడు.

శ్లో॥ యథా గౌరాదిభిస్తేషామవచ్ఛేదో విధీయతే।
అసతాప్యనభివ్యక్తం తాదాత్మ్యం వ్యజ్యతే తథా ॥ 260

తేషామ్ = వానికి (బ్రాహ్మణ మొదలగు పదముల అర్థములకు), గౌరాదిభిః = గౌర, మొదలగు పదముల అర్థములతో, అవచ్ఛేదః = వేరుచేయుట (సంబంధము), యథా = ఎట్లు, విధీయతే = విధింపబడునో, తథా = అట్లు, అసతా + అపి = లేని వస్తువుతో కూడ, అనభివ్యక్తమ్ = విస్పష్టము కాని, తాదాత్మ్యమ్ = అభేదము, వ్యజ్యతే = సూచింపబడును.

తాత్పర్యము— ''గౌరః'' (తెల్లని) మొదలగు పదములు ''బ్రాహ్మణ'' మొదలగు పదములకు విశేషణములై ''తెల్లని బ్రాహ్మణుడు'' మొదలగు రీతిని మొత్తముపై ఒకే వస్తువును బోధించును. అట్లే ''న'' అను దాని యర్థము (నివృత్తి = అభావము) కూడ విశేషణమై ''లేని బ్రాహ్మణత్వము గల వ్యక్తి'' అను భావమును కలిగించును. అయినను బ్రాహ్మణాది శబ్దములు తొలుతనే నఞర్థముతో కలిసియుండుటయు, నఞు చేరగానే అది విస్పష్టమగుటయును ఇచటి విశేషము. (అబ్రాహ్మణః = న + బ్రాహ్మణః - ఇచట బ్రాహ్మణ శబ్దము ''అబ్రాహ్మణః'' అను నర్థమును చెప్పును. దానిని ''న'' అనునది వెల్లడించును).

అవతారిక— ఉన్న వస్తువునకు విశేషమును చెప్పుటకై విశేషణమును చూపుట సహజము. కాని నఞు వస్తువుయొక్క అభావమును చెప్పును. దానికి విశేష్యమైన వస్తువు కూడ అభావము గలదియే (లేనిది) అగును కాగా ఉత్తరపదార్థమే లేనపుడు దానికై ఉత్తర పదమును ప్రయోగించుటయు, నఞునకును దానికిని విశేషణ విశేష్యభావమును చెప్పుటయును ఎట్లు సంభవించును ? - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యథా సత్తాభిధానాయ సన్నర్థః పరికల్ప్యతే।
తథాసత్తాభిధానాయ నిరుపాఖ్యో వికల్ప్యతే ॥ 261

సత్తాభిధానాయ = ఉనికిని చెప్పుటకు, అర్థః = అర్థము (పదార్థము), సన్ = ఉన్నదని, యథా = ఎట్లు, పరికల్ప్యతే = కల్పింపబడునో, తథా = అట్లు, అసత్తాభిధానాయ = అభావమును చెప్పుటకు, నిరుపాఖ్యః = ఆకారము లేనిది = విశేషరూపము లేని వస్తువు, వికల్ప్యతే = కల్పింపబడును.

తాత్పర్యము— ''బ్రాహ్మణ'' మొదలగు శబ్దముల అర్థములన్నియును కేవలముగ ప్రయోగించినపుడు భావమునకును అభావమునకును సామాన్యముగానే ఉపయోగించును. భావమును చెప్పదలచినపుడు ''సన్ బ్రాహ్మణః'' (ఉన్న బ్రాహ్మణుడు) అని విశేషణమును చూపుదుము. అట్లే అభావమును చెప్పదలచినపుడును ''అసన్ బ్రాహ్మణః'' (లేని బ్రాహ్మ

వ్యక్తి'' అని తెలియజేయును. కాగా ''అబ్రాహ్మణః'' అను సమాసము ''బ్రాహ్మణ సదృశుడై బ్రాహ్మణుడు కాని వ్యక్తి'' అను అర్థమును తెలియజేయును

వివరణము— బ్రాహ్మణుని పోలికలుగల క్షత్రియుడొకడుండును. అతనిని చూచి 'బ్రాహ్మణః' అనుటకు మనసు తొలుత తొందరపడును. పిదప నిర్ణయముకలిగి, వెంటనే ''న''కారమును చేర్చి ''అబ్రాహ్మణః - అయమ్ - క్షత్రియః'' అని అందురు. ఈ విధముగ భ్రాంతిచే తొలుత ఉంచదలచిన జాతిని వెంటనే నఞ్ తీసివేయును.

విశేష విషయములు— ''ఒక వస్తువుకన్న కొంచెము వేరుగా ఉండినను ఆ వస్తువుతో సమానముగా ఉండు వస్తువునే'' ఇచట నఞు బోధించును. కావున ''అబ్రాహ్మణః'' అనునది ''బ్రాహ్మణుడు కాని మానవునే'' తెలుపునుగాని, రాయి, రప్ప మొదలగువానిని తెలుపదు. ॥262॥

అవతారిక— ''అభావః'' అను నఞ్ సమాసమును సమర్థించుచున్నాడు.

**శ్లో॥ అభావ ఇతి భావస్య ప్రతిషేధే వివక్షితే ।**
**సోపాఖ్యత్వమనాశ్రిత్య ప్రతిషేధో న కల్పతే ॥ 263**

అభావః + ఇతి = ''అభావము'' అని, భావస్య = భావమునకు, ప్రతిషేధే = నిషేధము, వివక్షితే = చెప్పదలపబడినపుడు, సోపాఖ్యత్వమ్ = ఆకారము గలిగియుండుటను, అనాశ్రిత్య = స్వీకరింపనిచో, ప్రతిషేధః = నిషేధము, న + కల్పతే = కుదురదు.

తాత్పర్యము— ''న + భావః = అభావః (లేకుండుట)''. ఇచట భావమునకు (ఉనికి) ఆకారము లేదు. వాస్తవముగ అది నిరాకారము. అయినను నిషేధము సిద్ధించుటకై భావమునకును మనస్సులో ఒక ఆకృతిని కల్పింపవలెను. ఇచటి భావశబ్దము అభావమును బోధించుననియు దానినే 'న' అన్నది అభివ్యక్తము చేయుననియును అనుకొనవలెను.

వివరణము— నఞ్ సమాసమువలన ''తద్భిన్నమును తత్సదృశమును అగు వస్తువు'' తెలియునన్నచో, అభావః అనుచోట సమన్వయమును చెప్పుట కష్టము. భావము కానిదియు, భావముతో సదృశమైనదియునగునది అచట సంభవింపదు గదా! అనగా అచట ''భావమునకు నిషేధమే'' తెలియునుగాని సాదృశ్యము తెలియనే తెలియదు. ఇట్టి చిక్కును తొలగించుటకు ఈ కారిక బయలుదేరినది. ॥263॥

అవతారిక— ఈ సందర్భములో (ఉత్తరపదార్థము ముఖ్యమను పక్షములో) భాష్యకారుడు వేరొక తీరును చూపెను దానిని వివరించుచున్నాడు.

**శ్లో॥ అనేకధర్మవచనైః శబ్దైః సంఘాభిధాయిభిః ।**
**ఏకదేశేషు వర్తంతే తుల్యరూపాః స్వభావతః ॥ 264**

అనేక ధర్మవచనైః = వివిధములైన ధర్మములను చెప్పునట్టియు, సంఘాభిధాయిభిః = సముదాయమును బోధించునట్టి, శబ్దైః = శబ్దములతో, తుల్యరూపాః = సమానమైన రూపముగల శబ్దములు, స్వభావతః = స్వభావమునుబట్టి, ఏకదేశేషు = అవయవములందు, వర్తంతే = ప్రవర్తించును.

**తాత్పర్యము**—— సముదాయమును బోధించు శబ్దములే అవయవములను కూడ బోధించుట ప్రసిద్ధమైయున్నది. ఉదా : తైలంభుక్తమ్=నూనె అనుభవింపబడినది, ఘృతమ్ భుక్తమ్ = నెయ్యి త్రాగబడినది. ఇచట తైల, ఘృతశబ్దములు అవయవములనే బోధించును. (తైల ఘృత సముదాయమునంతను అనుభవించుట అసంభవము గదా !) ఆవశ్యకమైనపుడు అవేశబ్దములు సముదాయమును తెలుపును. అట్లే నఞ్ సమాసములోని బ్రాహ్మణాది శబ్దములు బ్రాహ్మణుని లక్షణములను పూర్తిగ బోధింపకుండ, కొన్నింటినే బోధించుననియు, ఆ విషయమును నఞ్ స్పష్టము చేయుననియును వ్యాఖ్యానింపవచ్చును. అట్లయిన ఉత్తరపదార్థము ముఖ్యమగుట సులభమగును.

**వివరణము**—— (1) సముదాయమును చెప్పు శబ్దములును, అవయవములను మాత్రము చెప్పు శబ్దములును భిన్నములే అనవలెను. (అర్థము వేరయినచో శబ్దము కూడ వేరగుట సంప్రదాయము). అయినను వాని స్వరూపమొకటేగాన ''అవి వేరుకావ''ను భ్రాంతి సహజముగ నుండును. (పండితులు కాని వారీ విభాగమునే గ్రహింపజాలరు).

(2) తపస్సు, పాండిత్యము, వినయము మొదలగునవి బ్రాహ్మణుని ధర్మములు. అవి మొత్తము పదియని భావించినపుడు, అవన్నియు గల వ్యక్తిని "బ్రాహ్మణ" శబ్దము బోధించును. అపుడది సముదాయవాచకము. అట్లే ఏవో కొన్నియే ధర్మములుగల వ్యక్తిని బోధించుటకును బ్రాహ్మణ శబ్దమును వాడవచ్చును. అపుడది అవయవ వాచకమగును.

(3) కాగా - నఞ్ సమాసములోని బ్రాహ్మణ శబ్దము ఏకదేశ వాచకమనుకొనవలెను. అనగా కొద్ది బ్రాహ్మణ ధర్మములు గల క్షత్రియునిగురించి ''బ్రాహ్మణః'' అని వాడదలతుము. కాని మరికొన్ని ధర్మములచట ఉండవు. అందుచే ''న'' అను దానిని కలిపి ''అబ్రాహ్మణః'' అని యందుము. ''బ్రాహ్మణ ధర్మములు కొద్దిగా ఉన్న క్షత్రియుడు'' అను భావము సిద్ధించును.

(4) ఈ పక్షమున బ్రాహ్మణ శబ్దము ధర్మసముదాయ వాచకము కాదనియు, అవయవ వాచకమనియును నఞ్ స్పష్టపరచును. ఉత్తరపదము యొక్క అర్థము ముఖ్యమగును. వెనుక చూపిన రీతిని బ్రాహ్మణత్వమునకు "ఉపచార సత్త" (లేకున్నను ఉన్నట్లు భావించుట) ను అంగీకరింప నక్కరలేదు. కొంతవరకును బ్రాహ్మణ ధర్మములుండునుగాన, బ్రాహ్మణత్వమున్నదనియే అనుకొనవచ్చును. ॥264॥

**అవతారిక**—— అబ్రాహ్మణః, అనుచోట ధర్మసముదాయమును చెప్పు బ్రాహ్మణ శబ్దము భ్రాంతివలన అవయవవాచకముగా ప్రయోగింపబడుననియు, కొన్ని బ్రాహ్మణ ధర్మ

ములు లేనట్లు "న" అనునది సూచించుచుననియు చెప్పినచో, బ్రాహ్మణ శబ్దమువలన కొన్ని ధర్మముల ఉనికియు, నఞ్వలన కొన్నింటి లేమియు తెలియునుగాన పూర్వోత్తర పదార్థము లకు సమన్వయ మెట్లు కుదురును ? - అను శంకను, దానికి సమాధానమును రెండు కారిక లతో చూపుచున్నాడు.

**శ్లో॥ యథైకదేశకరణాత్ కృత ఇత్యభిధీయతే ।**
**అకృతశ్చేతి సంఘాత స్తథైవాబ్రాహ్మణే క్రమః ॥ 265**

ఏకదేశకరణాత్ = కొంత భాగమును పూర్తి చేసినందువలన, కృతః + ఇతి = చేయబడిన దనియు, అకృతః + ఇతి + చ = చేయబడనిదనియును, సంఘాతః = సముదాయము, యథా = ఎట్లు, అభిధీయతే = చెప్పబడునో, తథా + ఏవ = అట్లే, అబ్రాహ్మణే = అబ్రాహ్మణ, అను సమాసమందు, క్రమః = తీరు, (భవతి = అగును).

తాత్పర్యము— మొత్తము పనిలో కొంతభాగమును పూర్తిచేసినపుడు ఆ పనిని "కృతమ్" అని అనవచ్చును. మిగిలిన భాగము పూర్తికానందున దానినే "అకృతమ్" అనియు పేర్కొనవచ్చును. ఇచట కృత, అకృత అను శబ్దములను రెండింటిని కూడ సము దాయము నుద్దేశించియే వాడుదురు. అనగా అవయవము యొక్క ధర్మమును (పూర్తియగుట —లేక— కాకుండుట) సముదాయమందారోపింతురు. ఉదా : "కృతః - అకృతశ్చ - పాకః" = వంట అయినది - కాలేదు. (కొంత అయినది - కొంత కాలేదు. ఇచట వంట అన్నది సంఘాతము) ఇట్లే "అబ్రాహ్మణః" అనుచోట కూడ నఞును బట్టి "కొంత బ్రాహ్మణ త్వము కలదు - కొంత లేదు" అను భావము ఫలించునని అనుకొనవలెను.

**శ్లో॥ బ్రాహ్మణోఽబ్రాహ్మణ స్తస్మాదుపన్యాసాత్ ప్రసజ్యతే ।**
**అకృతే వా కృతాసంగాదవిశిష్టం కృతాకృతాత్ ॥ 266**

తస్మాత్ = అందువలన, ఉపన్యాసాత్ = నిర్దేశించుట వలన, బ్రాహ్మణః = బ్రాహ్మణు డనియు, అబ్రాహ్మణః = అబ్రాహ్మణుడనియును, ప్రసజ్యతే = సంభవించెడిని, వా = లేక, అకృతే = అకృతమందు, కృతాసంగాత్ = కృతశబ్దమును ప్రయోగించుటవలన, కృతా కృతాత్ = "కృతాకృతమ్", అను సమాసముకన్న, అవిశిష్టమ్ = వేరుకాదు.

తాత్పర్యము— అట్లయినచో "అబ్రాహ్మణః" అను సమాసముతో ఒకే వ్యక్తిని "బ్రాహ్మణశ్చ - అబ్రాహ్మణశ్చ" (బ్రాహ్మణుడును బ్రాహ్మణుడు కానివాడును) అని వ్యవహరించినట్లగును. కాని ఇది విరుద్ధము కానేరదు. ఒక సముదాయమును గూర్చి "కృతా కృతః" అని చెప్పినట్లే ఒక వ్యక్తినిగూర్చి "బ్రాహ్మణాబ్రాహ్మణః" అని అనవచ్చును. ఈ యర్థమునే "అబ్రాహ్మణః" అను సమాసము సమర్పించును. ఇట్టిచోట్ల ఏకదేశమందే సముదాయము ఆరోపింపబడును.

వివరణము— కాగా నఞ్ సమాసమున నఞర్థమునకు ఉత్తరపదార్థముతో సమ న్వయము కుదురును. ఎట్టి దోషములును కలుగవు. ॥266॥

అవతారిక— ''అబ్రాహ్మణః'' అనుచోట బ్రాహ్మణ శబ్దము ముఖ్యార్థమును చెప్పదని సూచించుటకే నఞు కలిసియుండునని చెప్పుచున్నాడు.

శ్లో॥ అముఖ్యసంభవే తత్ర ముఖ్యస్య వినివృత్తయే।
శాస్త్రాన్వాఖ్యానసమయే నఞ్ ప్రయుక్తో విశేషకః ॥ 267

తత్ర = అచట, అముఖ్యసంభవే = ముఖ్యముకాని యర్థము పొసగునపుడు, ముఖ్యస్య = ముఖ్యార్థముయొక్క, వినివృత్తయే = పోవుటకై, శాస్త్రాన్వాఖ్యానసమయే = శాస్త్రముతో సంస్కారము జరుగు సమయమునందు, విశేషకః = విశేషణముగా, నఞ్ = 'న' కారము, ప్రయుక్తః = ప్రయోగింపబడును.

తాత్పర్యము— ''అబ్రాహ్మణః'' అను సమాసమును దాని యర్థమును అఖండములే. అయినను సంస్కారమునుచేయు వ్యాకరణము దానిని విశ్లేషించి చూపును. అపుడు నఞును వేరుచేయుట జరుగును. అది బ్రాహ్మణ శబ్దమిచట ముఖ్యార్థమును (పూర్తిగ బ్రాహ్మణుడు) బోధింపదని స్పష్టపరచును. అట్లు అది బ్రాహ్మణ శబ్దమునకు విశేషణముగా మారును. ॥267॥

అవతారిక— ''నఞ్ సమాసమున ఉత్తరపదార్థము ప్రధానము'' అను పక్షమందు, ''అబ్రాహ్మణమానయ'' (అబ్రాహ్మణుని తీసికొని రమ్ము) అను వచనమువలన, బ్రాహ్మణమాత్రుని తీసికొనివచ్చుట సంభవించెడిని - అని భాష్యకారుడొక ఆక్షేపమును చూపినాడు. అద్దాని భావమును విశదముచేయుటకు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ పదార్థానుపఘాతేన దృశ్యతే చ విశేషణమ్।
అథ జాతిమతోఽర్థస్య కశ్చిద్ధర్మో నివర్తితః ॥ 268

పదార్థానుపఘాతేన = పదార్థమును పాడుచేయకుండ, విశేషణమ్ = విశేషణము, దృశ్యతే = కనబడును, అథ = లేక, జాతిమతః = జాతిగల, అర్థస్య = వస్తువుయొక్క, కశ్చిత్ = ఒకానొక, ధర్మః = ధర్మము, నివర్తితః = పోగొట్టబడినది (యది = అయినచో).

తాత్పర్యము— వస్తువును పాడుచేయకుండ దానియందొక విశేషమును కూర్చుట విశేషణముయొక్క స్వభావము. నఞు అభావమును బోధించునుగాన అది విశేషణమైనచో ఉత్తరపదార్థమునకు అభావమునే తెచ్చిపెట్టును. అది ఇష్టము కాదు. అందుచే సమాసమున అది వ్యర్థమనవలెను. అట్లయినచో ''బ్రాహ్మణ'' శబ్ద మొకటే ఉన్నట్లగునుగాన, ''అబ్రాహ్మణమానయ'' అను వాక్యమువలన బ్రాహ్మణుడైన వానికి మాత్రమే (ఎవరో ఒక బ్రాహ్మణుని) ఆనయనము ప్రాప్తించెడిని. అట్లుకాక నఞు కొద్ది బ్రాహ్మణ ధర్మములను పోగొట్టునన్నచో అపుడును చిక్కే. (ఆ చిక్కును దిగువ కారిక చూపును).

వివరణము— రాజ పురుషః. నీలోత్పలమ్, మొదలగు అన్నిచోటులందును విశేష్య

మగు వస్తువునకు లోపము లేకుండ ఒక విశేషమును దాని కంటగట్టుట విశేషణముయొక్క ధర్మము ప్రకృతము నఞు విశేషణమన్నచో దానితో కలిసిన ఉత్తరపదార్థమును పూర్తిగ పోగొట్టినట్లగును. కానా నఞు నిరర్థకమని చెప్పవలసి వచ్చును.

అట్లుకాక కొన్ని బ్రాహ్మణ ధర్మముల నివృత్తిని (మరికొన్నింటి ఉనికిని) నఞు చెప్పునన్నచో వేరొక దోషము కలిగెడిని. ॥268॥

అవతారిక — ఆ దోషమును చూపుచున్నాడు.

శ్లో॥ అవశ్యం బ్రాహ్మణే కశ్చిత్ క్వచిద్ధర్మో న విద్యతే।
విశేషావచనాత్తత్ర నఞః శ్రుతిరనర్థికా॥ 269

క్వచిత్ + బ్రాహ్మణే = ఏ బ్రాహ్మణునియందైనను, కశ్చిత్ = ఒకానొక, ధర్మః = ధర్మము అవశ్యమ్ = తప్పక, న + విద్యతే = ఉండదు, తత్ర = అచట (ఆ పక్షమున), విశేషావచనాత్ = విశేషమును చెప్పనందువలన, నఞః = నఞుయొక్క, శ్రుతిః = వినబడుట, అనర్థికా = వ్యర్థము.

తాత్పర్యము — సంపూర్ణముగా బ్రాహ్మణ ధర్మములుగల బ్రాహ్మణుడు సృష్టిలో ఉండడు. ప్రతియొక బ్రాహ్మణునియందును, ఏదో ఒక ధర్మము లోపింపక తప్పదు. అయినపుడు బ్రాహ్మణ శబ్ద మెల్లపుడును కొన్ని గుణములను కలిగినట్టియు, కొన్నింటిని కలిగియుండనట్టియు బ్రాహ్మణునే బోధించును. కాగా బ్రాహ్మణ శబ్దమునకు ముందుగా నఞును కలిపి సాధించు విశేషార్థమేదియు ఉండనందున అది వ్యర్థమే యగును.

వివరణము — పై రీతిని నఞు చేయు పనిని బ్రాహ్మణశబ్దమే చేయునుగాన నఞు నిరర్థకము. అందుచే "అబ్రాహ్మణ మానయ" అను వచనమువలన "బ్రాహ్మణ మాత్రునకే ఆనయనము ప్రాప్తించుట" అను ఆక్షేపము అట్లే మిగిలిపోవును. ॥269॥

అవతారిక — ఈ పక్షమున మరియొక దోషమును చూపుచున్నాడు.

శ్లో॥ అవిశిష్టస్య పర్యాయో నఞ్విశిష్టః ప్రసజ్యతే।
అన్వాఖ్యానాద్ధి సాధుత్వమేవంభూతే ప్రతీయతే॥ 270

నఞ్విశిష్టః = నఞుతో కలిసిన శబ్దము, అవిశిష్టస్య = నఞుతో కలియని శబ్దమునకు, పర్యాయః = మారుపదముగ, ప్రసజ్యతే = సంభవించెడిని, ఏవంభూతే = ఇట్లు సిద్ధించిన శబ్దమందు (అబ్రాహ్మణః, మొదలగునది), అన్వాఖ్యానాత్ = శాస్త్రము చెప్పుటవలన, సాధుత్వమ్ = సాధుభావము, ప్రతీయతే + హి = తెలియును గదా!

**తాత్పర్యము** — నఞునకును బ్రాహ్మణ శబ్దమునకును అర్థమొకటే అయినపుడు, "బ్రాహ్మణః, అబ్రాహ్మణః" అను రెండును పర్యాయపదములు (ఒకే యర్థమును చెప్ప

రెండు పదములు) కావలసివచ్చును. ''నఞ్'' (2-2-6) అను సూత్రము ప్రత్యేకముగ ''అబ్రాహ్మణః'' మొదలగువానికి సాధుత్వమును చెప్పినది గదా !

వివరణము— ''కొన్ని బ్రాహ్మణధర్మములుండుటయు, కొన్ని లేకపోవుటయు'' అను నర్థము, నఞుతో కూడిన ''అబ్రాహ్మణః'' అను సమాసమువలనను, ''బ్రాహ్మణః'' అను కేవల పదమువలనను సిద్ధించుట సమానమైనపుడు రెండును ''పర్యాయపదముల''నుటలో తప్పు లేదుగదా ! ॥270॥

*అవతారిక*— మీది దోషములకు పరిహారమును చూపుచున్నాడు.

**శ్లో॥ పదార్థానుపఘాతేన యద్యప్యత్ర విశేషణమ్ ।**
**ఉపచారసతోఽర్థస్య సావస్థాద్యోత్యతే నఞా ॥ 271**

అత్ర = ఇచట, యద్యపి = పరిశీలింపగా, ఉపచారసతః = కల్పితముగానుండు, అర్థస్య = అర్థమునకు, పదార్థానుపఘాతేన = పదముయొక్క అర్థమును పాడుచేయకుండ, విశేషణమ్ = విశేషణము, (భవతి = అగును), సా = ఆ, అవస్థా = స్థితి నఞా = నఞుచే, ద్యోత్యతే = వెల్లడి చేయబడును.

తాత్పర్యము— ''అబ్రాహ్మణః'' అనుచోట బ్రాహ్మణ శబ్దమునకు ''ముఖ్యమైన బ్రాహ్మణుడు కాడు'' అనియే అర్థము. దానిని పాడుచేయకుండగనే విశేషణ ముండవచ్చును. ఉన్న అర్థమునే నఞు ప్రకాశింపజేయును.

*వివరణము*— బ్రాహ్మణత్వము సంపూర్ణముగా లేకున్నను, ఉన్నట్లు భావించి బ్రాహ్మణ శబ్ద మిచట వాడబడెననియు, ఆ భావమునే నఞు విశేషణముగా నుండి స్పష్టపరచు ననియును అనుకొనవలెను ॥271॥

*అవతారిక*— మీది భావమును సమర్థించుచున్నాడు.

**శ్లో॥ విశేష్యేషు యథాభూతః పదార్థః సమవస్థితః ।**
**తథాభూతే తథాభావో గమ్యతే భేదహేతుభిః ॥ 272**

పదార్థః = పదార్థము, యథాభూతః = ఎట్టి స్వరూపము గలిగి, విశేష్యేషు = విశేష్యము లందు, సమవస్థితః = ఉన్నదో, తథాభూతే = ఆ విధముగ ఉన్న దానియందు, తథాభావః = అట్లుండుట, భేదహేతుభిః = భేదమునకు కారణములైన, విశేషణములచే, గమ్యతే = తెలియబడును.

*తాత్పర్యము*— విశేష్యమగు వస్తువు ఉన్నదున్నట్లుగనే యుండును. అందలి ఒకానొక విశేషధర్మమును మాత్రము విశేషణము ప్రకటించును. ఉదా : ''నీలోత్పలమ్'' (నల్ల కలువ). ఇచట కలువయందుండు ''నలుపు'' అను విశేషమును నీల శబ్దము ప్రకటించును. అనగా విశేషణము క్రొత్తగా ఒక అంశమును తీసికొనివచ్చి విశేష్యమందుంచ

ఏకత్వము భిన్నములగు వ్యక్తులతో సంవలితమేయగును. కాగా ఏకత్వము అప్రధానమై వ్యక్తులే ప్రధానములుగా నుండుటచే వాని సమూహము బుద్ధికి విషయమగును. కనుకనే "రామలక్ష్మణౌ" మున్నగు ఇతరేతరయోగ ద్వంద్వమున, ఘటౌ, ఘటాః మున్నగు ఏకశేషమున వచనభేదము కానవచ్చుచున్నది. సమాహార ద్వంద్వమున ఏకవచనమే యుండును

కాబట్టి పై రీతిని ఏకశేష స్థలమున సమూహము విశేషముగా బుద్ధికి విషయమగుచున్నది. ।97।

అవతారిక — 'ఘటః, ఘటౌ, ఘటాః' మున్నగు శబ్దములవలన కలిగెడి జ్ఞానమున జాతి భాసించిన ఏకత్వము నియతమగును. వ్యక్తులు భాసించిన వాని సమూహము భాసించును. ఈ రెండింటికంటె వేరు వస్తువు భాసింపనందున వ్యక్తులకు పరస్పరము భాసించుచున్న సాదృశ్యమును ఎట్లు ఉపపాదింపగలము ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ సకృత్ప్రవృత్తా వేకత్వ మా వృత్తౌ సదృశాత్మతామ్ ।
భిన్నాత్మికానాం వ్యక్తీనాం భేదాపోహాత్ప్రపద్యతే ॥ 98

(బుద్ధిః) = బుద్ధి, భిన్నాత్మికానామ్ = భిన్నమగు స్వరూపముకల, వ్యక్తీనామ్ = వ్యక్తులకు, సకృత్ = ఒకసారి, ప్రవృత్తౌ = ప్రవృత్తి కలుగగా, భేదాపోహాత్ = భేదము నశించుటవలన, ఏకత్వమ్ = ఏకత్వమును, ప్రపద్యతే = పొందుచున్నది.

భేదము వ్యక్తులనుబట్టి కలుగును. ఆ వ్యక్తులను దూరము చేసి ఒకేసారి బుద్ధి ప్రవర్తించిన, దానియందు ఏకత్వము విషయమగును. ఆ ఏకత్వము జాతికి సంబంధించును. కాక సముదాయమునకు సంబంధించును. ఈ రీతిగా జాతి, సముదాయము ఉపపన్నములగుచున్నవి.

ఆవృత్తౌ = ఆవృత్తి కలుగగా, సదృశాత్మతామ్ = వ్యక్తులకు గల సాదృశ్యమును, ప్రపద్యతే = పొందుచున్నది.

ఆ బుద్ధియే పలుమారులు వ్యక్తులకు సంబంధించిన, ఆ వృత్తియనునది ఒకే ధర్మము కలవానికే కలుగుటచే వానికి సాదృశ్యము బుద్ధికి విషయమగును.

ఆ బుద్ధికి జాతి విషయము కాదు. జాతి నియతముగా అభేదమును ఆశ్రయించియున్నది. సముదాయము కూడ ఆ బుద్ధికి విషయము కాదు. అది వ్యక్తుల అనావృత్తిని ఆధారముగా జేసికొని యుండునుగదా !

గోవువంటిది గవయము అను జంతువు కలదు. ఆ రెంటికి ముందుగా భేద జ్ఞానము కలుగును. పిమ్మట ఆ రెంటికి అవయవముల సామ్యముండుటచే అభేదము భాసించును. దానిని బట్టి వానికి సాదృశ్యము బుద్ధిలో భాసించును. కాబట్టి, జాతి సముదాయము ఏకత్వమునుబట్టి, ఆవృత్తినిబట్టి సాదృశ్యము కూడ ఉపపన్నమగును. ॥98॥

దనియు, విశేష్యమందు సిద్ధముగా ఉన్న అంశమునే ప్రత్యేకమైన పదముతో ప్రకటించు ననియును పర్యాపసించును. అట్లే ప్రకృతమున బ్రాహ్మణశబ్దము విశేష్యము. ''ఆరోపింప బడిన బ్రాహ్మణత్వము గలవాడు'' అని దీని యర్థము. దీనినే విశేషణమైన నఞ్ఞు విశద పరచును. ॥272॥

అవతారిక— మీది చర్చవలన నఞ్ఞు విశేషణము కావచ్చుననియు, ఉత్తరపదార్థము యొక్క నివృత్తిని (ఆ యర్థము లేకపోవుటను) అది సూచించుననియును తేలినది. కాని ''అబ్రాహ్మణః'' మొదలగు సమాసములలో ''బ్రాహ్మణ'' మొదలగు ఉత్తరపదము యొక్క అర్థము నివర్తించుట ఎట్లు కుదురునని ఆక్షేపించుచున్నాడు.

శ్లో॥ నివృత్తేఽవయవస్తస్మిన్ పదార్థే వర్తతే కథమ్ ।
నానిమిత్తా హి శబ్దస్య ప్రవృత్తిరుపపద్యతే ॥ 273

నివృత్తే = పోయిన, తస్మిన్ = ఆ, పదార్థే = పదార్థమందు, అవయవః = ఏకదేశము, (ఒక భాగము), కథమ్ = ఎట్లు, వర్తతే = ఉండును ? అనిమిత్తా = ప్రవృత్తి నిమిత్తములేని ప్రవృత్తిః = ప్రవృత్తి, (అర్థమందు వర్తించుట) శబ్దస్య = శబ్దమునకు, న + ఉపపద్యతే+ హి = కుదురదు గదా !

తాత్పర్యము— ''అబ్రాహ్మణః'' అనుచోట బ్రాహ్మణ శబ్దము ఏకదేశవాచకమని (ఏదో కొంత బ్రాహ్మణత్వముగల వానిని చెప్పునది) ఇదివరకు నిశ్చయింపబడినది. ఇపుడు ఉత్తరపదము యొక్క అర్థము పూర్తిగా నివర్తించునన్నచో, ''బ్రాహ్మణత్వము''ను ప్రవృత్తినిమిత్తమే పోవుసుగాన ''బ్రాహ్మణ'' అను శబ్దమునే వాడకూడని పరిస్థితి ఏర్పడును. కాగా అవయవ వాచకముగా బ్రాహ్మణ శబ్దము కుదురనపుడు, విశేషణముగా ఉన్న నఞ్ఞు మాత్ర మేమి చేయగలదు ? ॥274॥

అవతారిక— అబ్రాహ్మణః, అనుచోట బ్రాహ్మణశబ్దము సహజముగనే ''బ్రాహ్మణత్వము లేకుండుట''ను చెప్పుసన్నచో, నఞ్ఞును వాడుటయే వ్యర్థమని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆరాచ్ఛబ్దవదేకస్య విరుద్ధేఽర్థే స్వభావతః ।
శబ్దస్య వృత్తిర్యద్యస్తి నఞః శ్రుతిరనర్థికా ॥ 274

ఏకస్య = ఒకటేయగు, శబ్దస్య = శబ్దమునకు, ఆరాచ్ఛబ్దవత్ = ''ఆరాత్'' అను శబ్దమునకు వలె, స్వభావతః = స్వభావము ననుసరించి, విరుద్ధే = విరుద్ధమైన, అర్థే = అర్థమందు, వృత్తిః = ప్రవృత్తి, అస్తి + యది = ఉన్నచో, నఞః = నఞ్ఞుయొక్క, శ్రుతిః = వినుకవి, అనర్థికా = నిష్ఫలము.

తాత్పర్యము— ''ఆరాత్'' అను ఒక అవ్యయమున్నది. ''దూరము - దగ్గర'' అను విరుద్ధములైన రెండర్థములను కూడ అదియే బోధించును. అది దాని స్వభావము. అట్లే

నఞ్ సమాసమందలి ఉత్తరపదము తన అర్థమును తన యర్థములేకుండుటను గూడ సహజముగనే చెప్పును. అందు ''అర్థాభావము''నే గ్రహింపవలెనన్నచో నఞ్ను ప్రయోగించుటయే వ్యర్థమగును.

వివరణము— అర్థముయొక్క అభావమును ఉత్తరపదమే చెప్పినచో ప్రకరణాదుల వలన అభిమతమైన తాత్పర్యము సిద్ధించునుగాన (అర్థాభావము తెలియుట) ద్యోతకముగానైనను నఞ్ను ఉచ్చరించుటవలన ప్రయోజనమేమి? (''బ్రాహ్మణ'' శబ్దమే సందర్భమును బట్టి బ్రాహ్మణుని బ్రాహ్మణుడుకాని క్షత్రియాదులను బోధింపగలుగును.) ॥274॥

అవతారిక— అట్లుగాక పదార్థముయొక్క నివృత్తికి నఞ్ ద్యోతకముకాదనియు, వాచకమే అనియు అన్నచో—

శ్లో॥ అథస్వభావో వచనాదన్వాఖ్యేయత్వ మర్హతి।
తద్వాచ్యమప్రసిద్ధత్వాన్నఞార్థో వినివర్త్యతే॥ 275

అథ = లేక, స్వభావః = స్వభావము, వచనాత్ = వచనమువలన, అన్వాఖ్యేయత్వమ్ = చెప్పదగియుండుటను, అర్హతి = పొందినట్లయినచో, తత్ = అపుడు, అప్రసిద్ధత్వాత్ = ప్రసిద్ధము కాకపోవుట వలన, ''నఞా + నఞ్చే, అర్థః = అర్థము, వినివర్త్యతే = పోగొట్టబడును'' అని, వాచ్యమ్ = చెప్పవలసియుండును.

తాత్పర్యము— నఞ్ అభావమునకు వాచకమన్నను ఉత్తరపదము యొక్క అర్థమును అది పోగొట్టుట ప్రసిద్ధము కానందున, ''నఞ్ను పలికి ఉత్తరపదార్థమును పోగొట్టవలయును'' అని వేరుగా చెప్పవలసి వచ్చును.

వివరణము— ఇట్లు ద్యోతకమన్నను వాచకమన్నను చిక్కు ఏర్పడుచున్నదని ఫలించును. ॥275॥

అవతారిక— ''నఞ్ ద్యోతకమే అనియు ఉత్తరపదార్థము సహజముగనే పోవుననియును'' భాష్యకారుడు సిద్ధాంతమును చూపెను. దానిని వివరింపుచున్నాడు.

శ్లో॥ యద్యప్యుభయవృత్తిత్వం ప్రధానం తు ప్రతీయతే।
ప్రస్థానం గమ్యతే శుద్ధే తదర్థేఽపి న తిష్ఠతౌ॥ 276

యద్యపి = వాస్తవముగ, ఉభయవృత్తిత్వమ్ = రెండర్థములందుండుట, (భవతి = అగును), తు = కాని, ప్రధానమ్ = ప్రసిద్ధమైన అర్థము, ప్రతీయతే = తెలియబడును, తదర్థే + అపి = ఆ యర్థము గలదైనను, శుద్ధే = కేవలముగానుండు, తిష్ఠతౌ = ''స్థా'' అను ధాతువునందు, ప్రస్థానమ్ = ప్రయాణము, న + గమ్యతే = తెలియబడదు.

తాత్పర్యము— పరస్పరము విరుద్ధములైన రెండర్థములను శబ్దములు సహజము

గనే చెప్పవచ్చును. కాని ప్రసిద్ధమైనట్టి యర్థము మాత్రమే శబ్దమువలన తెలియును. రెండవ యర్థము తెలియుటకై ద్యోతకమైన ఒక శబ్ద ముండవలెను. ''స్థా'' (నిలుచుండుట) అను ధాతువు ''నిలుచుండుట'' అను నర్థమును ముఖ్యముగా చెప్పును. అట్లే ''బయలుదేరుట'' అను నర్థమును గూడ అదియే చెప్పును. కాని ''ప్ర'' అను ఉపసర్గము ద్యోతకముగ ఉన్నపుడే (ప్రతిష్ఠతే = బయలుదేరుచున్నాడు) అది ప్రయాణమును నర్థమును బోధింపగలదు.

వివరణము— ''ప్రతిష్ఠతే''. ఇచట కేవలము ''ప్ర'' అను దానికి ప్రయాణమను అర్థము లేదు. కావున ''స్థా'' అను ధాతువునకే ఆ యర్థమున్నదనవలెను. అట్లే కేవలము ''స్థా'' ధాతువు కూడ ప్రయాణమును బోధింపజాలదు. కాగా ''స్థా'' ధాతువునకే ఉన్న రెండవయర్థమును (బయలుదేరుట) వెల్లడిచేయుట కుపసర్గము పనికివచ్చును.

ఈ విధముగనే ''అబ్రాహ్మణః'' అనుచోట బ్రాహ్మణశబ్దము ''బ్రాహ్మణత్వము లేకుండుట''ను సహజముగనే చెప్పును. కాని ఆ విషయము స్పష్టపడుటకు ''నఞ్''ను (న) చేర్చవలెను. ఇట్లు ''న''కారము ద్యోతకమే అగును.

విశేష విషయములు— చీకటిలో కనబడకున్న వస్తువులను దీపము వెల్లడిచేయును అట్లే సహజముగ శబ్దమే బోధించు పదార్థముయొక్క అభావమును నఞ్ విశదపరచును. దీపమువలె అది అచట ఉండవలెను. ద్యోతకత్వమనగా ఇట్టిదియే. కాగా నఞ్ సమాసమందలి నకారము ద్యోతకమని స్థిరపడినది. ॥276॥

అవతారిక— అప్రసిద్ధమైన అర్థమందు (అభావము) బ్రాహ్మణశబ్దమును ప్రయోగించుటయు, ద్యోతకముగా నఞ్ను కలుపుటయు ఎందుకని ఆక్షేపించుచున్నాడు

**శ్లో॥ కిమర్థమతథాభూతే సతి ముఖ్యార్థసంభవే।**
**భేదే బ్రాహ్మణశబ్దస్య వృత్తిరభ్యుపగమ్యతే॥ 277**

ముఖ్యార్థసంభవే + సతి = ముఖ్యమైన అర్థమునకు అవకాశమున్నపుడు, అతథాభూతే = అట్టిదికాని, భేదే = వేరయిన అర్థమందు, బ్రాహ్మణశబ్దస్య = బ్రాహ్మణశబ్దమునకు, వృత్తిః = ప్రవృత్తి, కిమర్థమ్ = ఎందుకొరకు, అభ్యుపగమ్యతే = అంగీకరింపబడును ?

తాత్పర్యము— అబ్రాహ్మణః, అనుచోట బ్రాహ్మణశబ్దము ''బ్రాహ్మణుడుకాని క్షత్రియాది వ్యక్తిని'' చెప్పునందురు. ఆ యర్థమును ''న''కారము వెల్లడి చేయునందురు. అట్టియెడల ''క్షత్రియః'' మొదలగు శబ్దములనే సూటిగ వాడకూడదా ? శబ్దముయొక్క ముఖ్యార్థమును పోగొట్టు ఈ కల్పనమంతయు ఎందుకు ? ॥277॥

అవతారిక— పై ఆక్షేపమునకు భాష్యకారుడు చూపిన సమాధానమును వ్యాఖ్యానించుచున్నాడు.

**శ్లో॥ అయం పదార్థ ఏతస్మిన్ క్షత్రియాదౌ న విద్యతే।**
**ఇతి తద్వచనః శబ్దః ప్రత్యయాయ ప్రయుజ్యతే॥ 278**

అయమ్ = ఈ, పదార్థః = పదముయొక్క అర్థము, ఏతస్మిన్ = ఈ, క్షత్రియాదౌ = క్షత్రియుడు మొదలగు వ్యక్తియందు, న + విద్యతే = లేదు, ఇతి = అని, ప్రత్యయాయ = తెలియుటకై, తద్వచనః = ఆ యర్థమునుచెప్పు, శబ్దః = శబ్దము, ప్రయుజ్యతే = వాడబడును.

తాత్పర్యము— అవివేకమువలనగాని పొరపాటుగా నిర్దేశించుటవలనగాని క్షత్రియాది వ్యక్తిని బ్రాహ్మణుడనుకొన్నపుడు, ఆ భ్రాంతిని పోగొట్టి "ఇచట బ్రాహ్మణత్వము లేదు" అని స్పష్టపరచుటకై బ్రాహ్మణశబ్దమునే వాడుటయు, అభావము వెల్లడియగుటకు నఞ్ఞను చేర్చుటయును జరుగును.

వివరణము— కేవలము నకారమునే వాడుటవలన ప్రయోజనము లేదు. అది ఏ పదార్థమును పోగొట్టునో తెలియదు. కావున "పోవు పదార్థమిది" అని తెలియుటకు బ్రాహ్మణాదిశబ్దమును చేర్చవలెను. అట్లుగాక సూటిగా "క్షత్రియః" అన్నచో బ్రాహ్మణత్వము పోయినట్లు తెలియనే తెలియదు కాగా బ్రాహ్మణత్వమున్నదని భ్రాంతిపడినచోట్ల, "అది లేదని" స్పష్టపరచుటకై ఇట్టి ఏర్పాటు తప్పదని ఫలించును. ॥278॥

అవతారిక— బోద్ధయగువాడు (శబ్దమును విని అర్థమును తెలియువాడు) ఎల్లపుడును బుద్ధి పరికల్పితమైన అర్థమునే తెలిసికొనునని చెప్పుచున్నాడు.

శ్లో॥ బుద్ధేర్విషయతాం ప్రాప్తే శబ్దాదర్థే ప్రతీయతే ।
ప్రవృత్తిర్వానివృత్తిర్వా శ్రుత్యాహ్యర్థోఽనుషజ్యతే ॥ 279

బుద్ధేః = బుద్ధికి, విషయతామ్ = విషయమగుటను, ప్రాప్తే = పొందిన, అర్థే = అర్థమందు, ప్రవృత్తి + వా = భావము (ఉనికి) కాని, నివృత్తిః + వా = అభావము (లేకుండుట) గాని, శబ్దాత్ = శబ్దమువలన, ప్రతీయతే = తెలియబడును, అర్థః = అర్థము, శ్రుత్యా = శబ్దమును వినుటచే, అనుషజ్యతే + హి = కూర్చబడును గదా ;

తాత్పర్యము— భావమునకును అభావమునకును సాధారణమైన అర్థమునే శబ్దము బుద్ధికి సమర్పించును. పిదప ఆ యర్థమునకు సముచితమైన విశేషమును వేరొక శబ్దము చెప్పును.

వివరణము— "వృక్షః". ఈ శబ్దము "చెట్టు" అను నర్థమును భావాభావములు రెండిటికిని యోగ్యమగునట్లుగా బోధించును. ఇట్టి జ్ఞానము మానసికము. పిదప "సన్" (ఉన్నది) అను విశేషణము ఉనికిని, "అసన్" (లేదు) అనునది అభావమును తెలియజేయును అనగా విశేషములు తెలియుటకు ప్రత్యేక శబ్దములుండవలెను.

ప్రకృతమున బ్రాహ్మణశబ్దము బ్రాహ్మణత్వముయొక్క అభావమును కూడ చెప్పగలిగినను, ఆ యర్థము స్పష్టపడుటకు "న" అను విశేషణ మావశ్యకమగును. ॥279॥

అవతారిక— నఞ్ సమాసమున ఉత్తరపదార్థము ప్రధానమను పక్షములో,

''తద్భిన్నము తత్సదృశమునగు వస్తువు'' (ఉత్తరపదార్థమునకు భిన్నమై ఉత్తరపదార్థము తోనే సమానమగు వస్తువు) బోధపడును. కావున ''అబ్రాహ్మణః'' అనునది బ్రాహ్మణ సదృశుడగు క్షత్రియాది వ్యక్తినే బోధించునుగాని, రాయి, కర్ర, మొదలగు వానిని బోధింప దని భాష్యకారుడు చెప్పెను. ఆ యంశమును విశదముచేయుచున్నాడు.

శ్లో॥ అసమ్యగుపదేశాద్వా నిమిత్తాత్ సంశయస్య వా ।
శబ్దప్రవృత్తిర్నత్వస్తి లోష్టాదిషు విపర్యయాత్ ॥ 280

అసమ్యగుపదేశాత్ + వా = పొరపాటుగా చెప్పుటవలనగాని, సంశయస్య = సంశయము యొక్క, నిమిత్తాత్ =వా= హేతువువలనగాని, శబ్దప్రవృత్తిః = శబ్దముయొక్క ప్రవృత్తి, (భవతి = అగును). విపర్యయాత్ = అట్టి నిమిత్తములేనందువలన, లోష్టాదిషు + తు = మట్టి ముక్క మొదలగు వానియందైతే, శబ్దప్రవృత్తిః =శబ్దము ప్రవర్తించుట, న + అస్తి = లేదు.

తాత్పర్యము— ఒకరు పొరపాటుగా చెప్పినందువలనగాని, సాదృశ్యముచే కలుగు సంశయమువలనగాని ఒక వస్తువును బోధించు శబ్దమును వేరొక - వస్తువును బోధించునదిగా వాడుదురు. ఉదా : బ్రాహ్మణ సదృశుడైన క్షత్రియాది వ్యక్తిని బోధించుటకై బ్రాహ్మణ శబ్దమును వాడుట. నఞ్ సమాసమున ఉత్తరపదము చెప్పు అర్థ మెల్లపుడును ఇట్టిదేయగును. కావున అబ్రాహ్మణః, అను దానివలన ''బ్రాహ్మణుడు కానట్టియు, మిగిలిన అన్ని విషయ ములలోను బ్రాహ్మణుని పోలియున్నట్టి క్షత్రియాదివ్యక్తి'' అను నర్థమే వచ్చును. లోష్టము మొదలగువానికి బ్రాహ్మణ సాదృశ్యమెన్నడును కలుగదు. కాగా అవి ఈ సమాసముచే బోధ పడవు.

వివరణము— ''అది కానిదియు దానితో సమానమైనదియునగు వస్తువు'' అను నర్థమును నఞ్ సమాసమున నియతముగ చెప్పవలయును. కావుననే ''అబ్రాహ్మణమ్ - ఆనయ'' మొదలగు వాక్యములవలన, క్షత్రియాదులకే ''ఆనయనము'' మొదలగు క్రియలతో సంబంధము (వారినే తీసికొనివచ్చుట) కుదురుచున్నది. అట్టి వాక్యమును విని మట్టిముక్కను తెచ్చుట (అదియు బ్రాహ్మణ భిన్నమే గదా!) ఎన్నడును ప్రాజ్ఞవ్యవహారమున జరుగదు. కాగా సాదృశ్యము కుదురనిచోట కూడ సాదృశ్యమును కల్పించుకొని నఞ్ సమాసమున కర్థమును చెప్పుచుండవలయును. ॥280॥

అవతారిక— ఉత్తరపదార్థము ముఖ్యమన్నచో మరికొన్ని ప్రయోజనములు కూడ అప్రయత్నముగ సిద్ధించునని భాష్యకారుడనెను. ఆ సందర్భమును చూపుచున్నాడు.

శ్లో॥ అనేకస్మాదస ఇతి ప్రాధాన్యే సతి సిధ్యతి ।
సాపేక్షత్వం ప్రధానానామేవం యుక్తం త్వతల్విధౌ ॥ 281

ప్రాధాన్యే = ఉత్తరపదముయొక్క అర్థము ముఖ్యమగుట, సతి = ఉన్నపుడు, అనేకస్మాత్

+ అసః + ఇతి = ''అనేకస్మాత్'' అనియు, ''అసః'' అనియు రూపము, సిధ్యతి = సిద్ధించును. ఏవమ్ = ఇట్లే, త్వతల్విధౌ = త్వ. తల్, అను ప్రత్యయములను విధించునపుడు, ప్రధానానామ్ = ముఖ్యమైన వానికి, సాపేక్షత్వమ్ = వేరొకదానిని కోరుట, యుక్తమ్ = సముచితము, (భవతి = అగును).

**తాత్పర్యము**— ''న + ఏకః = అనేకః (ఒకటి కానిది) ⟶ ''అనేకస్మాత్'' (పంచమ్యేకవచనము). ''న + సః = అసః = (వాడు కాని వ్యక్తి). నఞ్ సమాసమున ఉత్తరపదార్థము ముఖ్యమైనపుడే ఈ రూపములు సిద్ధించును. అట్లే ''అబ్రాహ్మణత్వమ్'' (అబ్రాహ్మణస్య భావః = బ్రాహ్మణుడు కాకుండుట = ''త్వ'' ప్రత్యయము), ''అబ్రాహ్మణతా'' (అర్థమున మార్పులేదు = తల్ ప్రత్యయము) మొదలగుచోట్ల ముఖ్యమైన యర్థము సాపేక్షమగుటయు ఈ పక్షమందే కుదురును.

**వివరణము**— ''ఏక'' శబ్దమును తచ్ఛబ్దమును సర్వనామములు నఞ్ సమాసమున ఈ శబ్దముల అర్థము ముఖ్యమైనపుడే వానికి సర్వనామకార్యములు (పంచమ్యేకవచనమున ''స్మాత్'' అని యగుట, తచ్ఛబ్దములోని తకారము సకారముగ మారుట మొదలగునవి) లభించును. అట్లుకాక వాని యర్థము అప్రధానమైనచో అట్టి సర్వనామములకు ఆయా కార్యములు రావని నిషేధమున్నందున, ''అనేకస్మాత్'' అనియు, ''అసః'' అనియును ప్రయోగించుట అసాధువు కావలసి వచ్చును.

అట్లే ''అబ్రాహ్మణత్వమ్'' మొదలగుచోట్ల ''ప్రధానము సాపేక్షము'' అని ఒక సందర్భములో భాష్యకారుడనెను. అదియును ఉత్తరపదార్థము ముఖ్యమైనపుడే కుదురును. (అబ్రాహ్మణతా, అనునదియు ఇట్టిదే).

**విశేష విషయములు**— అబ్రాహ్మణత్వమ్, ఇచట ''న + బ్రాహ్మణ + త్వ'' అను రీతిని ఒక్కమారుగానే రూపమును తయారుచేయుటయా ? లేక— ''న + బ్రాహ్మణః = అబ్రాహ్మణః'' అని తొలుత సమాసమునుచేసి, పిదప ''త్వ'' అను తద్ధితమును చేయుటయా ! - అను చర్చ జరిగినది. అపుడు బ్రాహ్మణ శబ్దముయొక్క అర్థము ముఖ్యమనియును, అది నఞ్ యొక్క అర్థమును (అభావము) అపేక్షించునుగాన, అసమర్థమైనందున ''త్వ'' అను తద్ధితవృత్తి ముందుగా జరుగదనియును, సమాసమును చేసియే తద్ధితమును చేయవలయుననియును భాష్యకారుడు ఉపపత్తిని చూపెను. అది ఉత్తరపదార్థము ముఖ్యమైనపుడే సంభవించును గదా ! ॥281॥

**అవతారిక**— ''అనేకః'' అనుచోట కలిగిన లాభమును వివరింపుచున్నాడు.

**శ్లో॥** ఏకస్య చ ప్రధానత్వాత్తద్విశేషణ సన్నిధౌ ।
ప్రధానధర్మావ్యావృత్తిరతో న వచనాంతరమ్ ॥ 282

ఏకస్య = ''ఏక'' అను శబ్దము, ప్రధానత్వాత్ + చ = ముఖ్యమగుటవలన, తద్విశేషణ

సన్నిధౌ = దాని విశేషణము దగ్గరగా ఉన్నపుడు, ప్రధానధర్మావ్యావృత్తిః = ముఖ్యమైన ధర్మము పోకుండుట, (భవతి = జరుగును) అతః = ఇందువలన, వచనాంతరమ్ = వేరొక వచనము, న = కాదు (రాదు).

తాత్పర్యము— "న + ఏకః = అనేకః" అనుచోట ఏకశబ్దముయొక్క అర్థమే ముఖ్యము. దానికి నఞర్థము విశేషణమగును. అయినను ముఖ్యమైన ఏకశబ్దము ననుసరించి సమాసమునకు ఏకవచనమే వచ్చును.

వివరణము— "అనేకః" అను సమాసమువలన రెండు, మూడు, మొదలగు సంఖ్య లెన్ని స్ఫురించినను, "లేని ఒకటి" అని ఏకశబ్దార్థమే ప్రధానముగ లభించునుగాన, తదనుసారము ఏకవచనమే న్యాయ్యమగునుగాని ద్వివచన బహువచనములు న్యాయ్యముకావని సారాంశము. ॥282॥

అవతారిక — అనేకః. అనుచోట ద్వివచన బహువచనములు రాకుండుటను సమర్థింపు చున్నాడు.

శ్లో॥ ప్రధానమత్ర భేద్యత్వాదేకార్థో వికృతో నఞా ।
హిత్వా స్వధర్మాన్ వర్తంతే ద్వ్యాదయోఽప్యేకతాం గతాః ॥ 283

అత్ర = ఇచట, నఞా = నఞ్ఞుచే, వికృతః = మార్చబడిన, ఏకార్థః = ఏకశబ్దముయొక్క అర్థము, భేద్యత్వాత్ = విశేష్యమగుటవలన, ప్రధానమ్ = ముఖ్యమై, (భవతి = అగును) ద్వ్యాదయః + అపి = "రెండు", మొదలగునవి కూడ, స్వధర్మాన్ = తమ ధర్మములను, హిత్వా = వీడిచి, ఏకతామ్ = ఏకత్వమును, గతాః = పొందినవై, వర్తంతే = ఉండును.

తాత్పర్యము— నఞ్ఞుతో కూడిన ఏకశబ్దము (అనేకః) విశేష్యము. అందువలన దాని యర్థమే ముఖ్యమగును. రెండు, మూడు, మొదలగు సంఖ్యలు ఒకటిగానే మారిపోయి భాసించును. కాగా రెండుగాని మూడు, మొదలయినవిగాని, "అనేకః" అను ఏకవచనముతోనే తెలియబడును. ఉదా: "అనేకః - జనః" = ఇద్దరు —లేక— పెక్కురు జనులు.

వివరణము— "అనేకః" అను సమాసము "ఆరోపితమైన ఏకత్వము గలది" అను నర్థమును సమర్పించును. కాగా ఏకశబ్దమునుబట్టి ఏకవచనమే సముచితమగును. ॥283॥

అవతారిక— విరుద్ధమైన ద్విత్వమునకును బహుత్వమునకును ఏకత్వము వచ్చు టెట్లు? - అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ బ్రాహ్మణత్వం యథాపన్నా నఞ్యుక్తాః క్షత్రియాదయః ।
ద్విత్వాదిషు తథైకత్వం నఞ్యోగాదుపచర్యతే ॥ 284

నఞ్యుక్తాః = నఞ్ఞుతో కూడిన, క్షత్రియాదయః = క్షత్రియుడు మొదలగువారు, బ్రాహ్మణత్వమ్ = బ్రాహ్మణ భావమును, యథా = ఎట్లు, ఆపన్నాః = పొందుదురో, తథా = అట్లు,

నఞ్ యోగాత్ = నఞ్ఞుతోడి సంబంధమువలన, ద్విత్వాదిషు = ద్విత్వము మొదలగు వాని యందు, ఏకత్వమ్ = ఏకత్వము, ఉపచర్యతే = ఆరోపింపబడును.

తాత్పర్యము— "అబ్రాహ్మణః", అనుచోట నఞ్ఞుతో కూడిన బ్రాహ్మణశబ్దము, క్షత్రియుడు మొదలగు వ్యక్తిని బోధించునట్లే. "అనేకః" అనుచోట నఞ్ఞుతో కలసిన ఏక శబ్దము విరుద్ధమైనను ద్విత్వమునుగాని బహుత్వమునుగాని బోధించును

వివరణము— నఞ్ఞ ' తద్భిన్నమును తత్సదృశమును" చెప్పునని యిదివరకు ప్రతిపాదింపబడినది. తదనుసారము "అనేకః" అను శబ్దము ఒకటికి వేరైన "రెండు —లేక— మూడు" అను సంఖ్యలనే బోధించును. ద్విత్వ బహుత్వములందు ఏకత్వమారోపింపబడి "ఆరోపితమైన ఏకత్వము" అను భావము కలుగునని సారాంశము. ॥284॥

అవతారిక— పై యంశమునే సమర్థింపుచున్నాడు.

శ్లో॥ ఏకత్వయోగమాసజ్య స ధర్మః ప్రతిషిధ్యతే ।
ద్వ్యాదిభ్యస్తేషు తచ్ఛబ్దో వర్తతే బ్రాహ్మణాదివత్ ॥ 285

ఏకత్వయోగమ్ = ఏకత్వముతోడి సంబంధమును, ఆసజ్య = కలిగించి, సః = ఆ, ధర్మః = ధర్మము (ఏకత్వము) ద్వ్యాదిభ్యః = ద్విత్వము మొదలగువాని నుండి, ప్రతిషిధ్యతే = నివారింపబడును, తేషు = వానియందు (ద్విత్వము మొదలగు వానియందు), తచ్ఛబ్దః = ఆ శబ్దము, బ్రాహ్మణాదివత్ = బ్రాహ్మణ మొదలగు శబ్దములవలె, వర్తతే = ప్రవర్తించును.

తాత్పర్యము— ద్విత్వము మొదలగు వానియందు భ్రాంతిచే తొలుత ఏకత్వమును భావించి, పిదప నఞ్ఞుతో ఆ ఏకత్వమును వారింతురు. కావున "అనేకః" అనుచోట నిషేధము నకు విషయముగా ఏకత్వముండి, ఏకశబ్దమే తుదకు ద్విత్వమునుగాని - బహుత్వమునుగాని తెలుపును. "అబ్రాహ్మణః" అనుచోట బ్రాహ్మణ శబ్దమిట్లే క్షత్రియాది వ్యక్తినే బోధించును గదా ! ॥285॥

అవతారిక— "న" అను నిషేధమునకు విషయముగా వృత్తియందును వాక్య మందును ఏకశబ్దము ప్రధానముగానే ఉండునని చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆవిష్టసంఖ్యో వాక్యేఽసౌ యథా ద్వ్యాదౌ ప్రయుజ్యతే ।
వృత్తౌ తస్య ప్రధానత్వాత్ సా సంఖ్యా న నివర్తతే ॥ 286

అసౌ = ఈ ఏకశబ్దము, ఆవిష్టసంఖ్యః = ఆవేశించిన సంఖ్యగలదై, వాక్యే = వాక్యమందు, ద్వ్యాదౌ = రెండు మొదలగు అర్థమందు, యథా = ఎట్లు, ప్రయుజ్యతే = ప్రయోగింపబడునో (తథా = అట్లు) వృత్తౌ = వృత్తియందు, తస్య = దానియొక్క, ప్రధానత్వాత్ = ప్రాము ఖ్యము వలన, సా = ఆ. సంఖ్యా = ఏకత్వసంఖ్య, న + నివర్తతే = తొలగిపోదు.

తాత్పర్యము— "న ఏకః గచ్ఛతి" (ఒకడు వెళ్ళలేదు = ఇద్దరు ముగ్గురు వెళ్ళు చున్నారు) మొదలగు వాక్యమందు కూడ ఏకశబ్దము తన ధర్మమును విడువకనే రెండు, మూడు, మొదలగు సంఖ్యలను బోధించును. అట్లే "అనేకః" అను వృత్తియందును అది ముఖ్యమై తన యర్థమును విడువకుండ ద్విత్వాది రూపమైన సంఖ్యనే చెప్పును. ॥286॥

అవతారిక— వృత్తియందు ఏకశబ్దముయొక్క అర్థమును విడిచినచో, అభిమతమైన అర్థము సిద్ధింపదనుచున్నాడు.

శ్లో॥ ప్రతిషేధ్యో యథాభూత స్తథాభూతోఽనుషజ్యతే ।
వచనాంతరయోగే హి న సోఽర్థః ప్రతిషిధ్యతే ॥ 287

ప్రతిషేధ్యః = నిషేధింపదగినది, యథాభూతః = ఏ విధముగ నుండునో, తథాభూతః = ఆ విధముగనే నుండునదియై, అనుషజ్యతే = అనుసరింపఁబడును, వచనాంతరయోగే = వేరొక వచనముతోడి సంబంధమందు, సః = ఆ, అర్థః = అర్థము, న + ప్రతిషిధ్యతే + హి = నిషేధింపబడదు గదా !

తాత్పర్యము— "అనేకః" అను సమాసమున, "ఏక" అను ఉత్తరపదము, "ఆరోపితమైన ఏకత్వమును" చెప్పును దానిని "న" అనునది నిషేధించును. అనగా "లేని ఏకత్వము" అను భావమును కలిగించును. ఇట్లు ఏకత్వమే మరల అను సంధానము చేయబడి ముఖ్యమగును. కావున ఏకవచనమే సమాసమున కగును. ద్వివచనముగాని, (అనేకౌ), బహువచనముగాని (అనేకే) ఇచట ప్రవర్తించినచో "నిషేధింపబడినది ఏకత్వము" అను అభీష్టమైన అర్థము సిద్ధింపదు. ॥287॥

అవతారిక— "అనేకః" అను దానివలన ద్విత్వమునకుగాని, బహుత్వమునకుగాని ప్రతీతి కలుగుననుటను సమర్థింపుచున్నాడు.

శ్లో॥ అశుక్ల ఇతి కృష్ణాదిర్యథార్థః సంప్రతీయతే ।
సంఖ్యాంతరం తథానేక ఇత్యత్రాప్యభిధీయతే ॥ 288

అశుక్లః + ఇతి = "అశుక్లః" అను దానివలన, కృష్ణాదిః = "నలుపు" మొదలగు (రంగు), అర్థః = అర్థము, యథా = ఎట్లు, సంప్రతీయతే = తెలియబడునో, తథా = అట్లు, అనేకః + ఇతి = "అనేకః" అను, అత్ర + అపి = ఇచటగూడ, సంఖ్యాంతరమ్ = వేరొక సంఖ్య, అభిధీయతే = చెప్పబడును.

తాత్పర్యము— "అశుక్లః" అను నఞ్ సమాసమున్నది. దీనివలన "తెలుపుకాని నలుపు మొదలగు రంగు" అను నర్థము వచ్చును. అట్లే "అనేకః" అను నఞ్ సమాసము వలన, "ఒకటికాని రెండు మొదలగు సంఖ్య" అను అర్థము లభించును.

వివరణము— "న" అను దానిని ఉత్తరపదముతో అన్వయించి, "అది కాని

దియు, (ఉత్తరపదముయొక్క అర్థము కానిది), దానితో సజాతీయమగునదియును'' అను అర్థమును చెప్పినచో ''పర్యుదాస''మని శాస్త్రీయముగా అందురు. కాగా ''అనేకః'' అనుచోట పర్యుదాసమని చెప్పవలెను. అందువలన ''ఒకటికాక - రెండు మొదలగు సంఖ్య'' అను అర్థము లభించును.

విశేష విషయములు— ఈ సందర్భమున పర్యుదాసము కాక ''ప్రసజ్య ప్రతిషేధము'' అను వేరొక పక్షమున్నది. ''ప్రసజ్య = విధించి, ప్రతిషేధః = నిషేధించుట'' అని దీని యర్థము. ఒక క్రియనుగాని, గుణమునుగాని విధించి వారించుట అని భావము. కాగా ఈ పక్షమందు నఞ్ క్రియతో అన్వయించి ఆగిపోవును. అనగా నిషేధము మాత్రమే చివరకు మిగులును. ఉదా : ''అనేకం భోజయ'' = ఒకనికి భోజనము పెట్టవద్దు.'' ఇచట ''భోజనము పెట్టుట అను క్రియతో నిషేధము సంబంధించును. అయినను ఈ పక్షమందును ఇరువురికిగాని, పెక్కుమందికిగాని భోజనము పెట్టుము'' అని ద్విత్వ బహుత్వములే చివరకు ఫలించుననుట సారాంశము. ॥288॥

అవతారిక— ''అనేకః'' అనుచోట ప్రసజ్యప్రతిషేధమందు కూడ ద్విత్వముగాని, బహుత్వముగాని తెలియునను విషయమును రెండు కారికలతో సమర్థింపుచున్నాడు.

శ్లో॥ క్రియాప్రసంగాత్ సర్వేషు కర్మస్వంగీకృతేషు చ ।
ఏకస్మిన్ ప్రతిషిద్ధేఽపి ప్రాప్తమన్యత్ ప్రతీయతే ॥ 289

శ్లో॥ క్రియాశ్రుతిశ్చ ప్రక్రాంతే ప్రసజ్యప్రతిషేధనే ।
పర్యుదాసే తు నియతం సంఖ్యేయాంతరముచ్యతే ॥ 290

క్రియాప్రసంగాత్ = క్రియయొక్క సామర్థ్యమువలన, సర్వేషు = సకలమైన, కర్మసు+చ = కర్మలును, అంగీకృతేషు = స్వీకరింపబడగా, ఏకస్మిన్ = ఒక కర్మ, ప్రతిషిద్ధే + అపి = నిషేధింపబడినను, ప్రాప్తమ్ = ప్రాప్తించిన, అన్యత్ = వేరొక కర్మ, ప్రతీయతే = తెలియబడును.

ప్రసజ్య ప్రతిషేధనే = విధించి నిషేధించుట, ప్రక్రాంతే = ప్రారంభింపబడినపుడు క్రియాశ్రుతిః = క్రియ వినబడుట (భవతి = అగును), పర్యుదాసే + తు = పర్యుదాసమందైతే, సంఖ్యేయాంతరమ్ = లెక్కింపదగిన వేరు వస్తువు, నియతమ్ = తప్పక, ఉచ్యతే = చెప్పబడును.

తాత్పర్యము— ''అనేకం భోజయ'' మొదలగు స్థలములలో, ప్రసజ్య ప్రతిషేధమను పక్షమందు, ''భోజయ'' మొదలగు క్రియయొక్క సామర్థ్యము ననుసరించి దానికనువైన కర్మ లన్నియును తొలుత ప్రాప్తించును పిదప ''ఏకమ్'' (ఒకనిని) అను కర్మను నిషేధించుటవలన మిగిలిన ''ఇరువురిని'' ''పలువురను'' అను కర్మలు తెలియబడును.

అవతారిక — జాతియనునది సాదృశ్యము శక్తి అను వానికంటె అభిన్నమే భిన్నము కాదు అను అవ్యతిరిక్తమగు జాతిని 92 వ శ్లోకమున, 93 వ శ్లోకమునుంచి వాని కంటె వ్యతిరిక్తమగు జాతిని నిరూపించియున్నాడు.

ప్రస్తుతము బౌద్ధ సిద్ధాంతమును అనుసరించి జాతి నిజరూపమున లేదు. అది కల్పితమే అని 99, 100, 101 మూడు శ్లోకములచే ప్రదర్శించుచున్నాడు.

శ్లో॥ అనుప్రవృత్తేతి యథాభిన్నా బుద్ధిః ప్రతీయతే।
అర్థోవ్యావృత్త రూపోఽపితథా తత్త్వేన గృహ్యతే॥ 99

బుద్ధిః = బుద్ధి అనగా జ్ఞానము, అనుప్రవృత్తా + ఇతి = ఎల్ల వ్యక్తులయందు అనుగతముగా నున్నదనెడి కారణమువలన, అభిన్నా = ఏకరూపమై, ప్రతీయతే = తెలియబడుచున్నదో, తథా = అట్లే, అర్థః = అర్థము అనగా ఆవు మున్నగు వ్యక్తి, వ్యావృత్తరూపః + అపి = విలక్షణమగు రూపము కలదియైనను, తత్త్వేన = అభేదరూపమున, గృహ్యతే = తెలియ బడుచున్నది.

ఎల్ల గోవ్యక్తులయందు 'గౌః, గౌః' అను ఏకాకారమగు జ్ఞానము కలుగుచున్నం దున, దానిని పురస్కరించుకొని వేరుగా జాతిని అంగీకరింపవలెనని కొందరు పలుకుదురు.

కాని యది యుక్తము కాదు. వ్యక్తులు వేరువేరుగా నున్నందున వానిని పురస్క రించుకొని కలిగెడి జ్ఞానములు కూడ భిన్నములే. ఎల్ల వ్యక్తులయందు అనుసరించియున్నం దున ఆ జ్ఞానము ఒక్కటియే యని లోకులు తలంచుచున్నారు.

అట్లే గోవ్యక్తులు తమ్ముబట్టియు, ఇతర వ్యక్తులనుబట్టియు భిన్నములే. అట్లైనను అవి యన్నియు ఏకరూపముగనే గుర్తింపబడుచున్నవి.

కాగా జాతి యనునది వేరు పదార్థము లేదు. భ్రమ మూలమున కల్పింపబడు చున్నది. ॥99॥

అవతారిక — ఎల్ల గవాది వ్యక్తులకు సంబంధించి 'గౌః, గౌః' అను ఏ కాకారమగు జ్ఞానము కలుగుచున్నది. అందు అనాది సిద్ధమగు భ్రమయే కారణమా? కాక బాహ్య ప్రపం చకమున ఆ జ్ఞానమునకు ఏదైన నిమిత్తమున్నదా? అను ప్రశ్నకు సమాధానము చెప్పు చున్నాడు

శ్లో॥ సరూపాణాం చ సర్వేషాం న భేదోపనివేశినః।
విద్యన్తే వాచకాః శబ్దాః నాఽపి భేదోఽవధార్యతే 100

1. సరూపాణామ్ = సమానమగు రూపముకల, సర్వేషామ్ + చ = ఎల్ల వస్తువులకు గూడ, భేదః = భేదము, న + అవధార్యత్యే = నిర్ధారణచేసి గుర్తించుటకు వీలుపడదు.

ప్రసజ్య ప్రతిషేధమందు నఞు క్రియతో అన్వయించునుగాన ఆ నిషేధమునకు విషయమగు కారకము (కర్మ) మాత్రమే నివారింపబడును. మిగిలిన వానికి నిషేధము లేనందున వాని కాయా క్రియతోడి సంబంధము ఏర్పడును. పర్యుదాసమంసైతే సంశయము నకు తావే యుండదు. ''అనేకమ్'' అను దానివలన - ''ఒకరు కాకుండ ఇద్దరుకాని పెక్కు-మందిగాని'' అను భావము సహజముగనే లభించును.

వివరణము— ''అనేకం భోజయ'' అను వచనమునకు ''ఏకమ్+న+భోజయ'' అని సమన్వయముచేసినచో ప్రసజ్య ప్రతిషేధమగును. కాగా నిషేధము ఒకనికేగాన ద్విత్వ బహుత్వములు నిషేధమునకు విషయములు కావు. ''ఏకభిన్నమ్ - ఏకసదృశమ్ - భోజయ'' (ఒకరుకాని వ్యక్తులు) అని సమన్వయము చేసినచో పర్యుదాసమగును. ఇపుడు ద్విత్వబహుత్వ ములు సులభముగనే సిద్ధించును.

*విశేష విషయములు*— ''ప్రసజ్య ప్రతిషేధః స్యాత్ క్రియయా సహ యత్ర నఞ్ । పర్యుదాసః స విజ్ఞేయో యత్రోత్తరపదేన నఞ్ ॥ - అని ప్రసజ్య ప్రతిషేధమునకును పర్యుదాసమునకును సంప్రదాయ సిద్ధమైన ఒక లక్షణమున్నది. ''నఞు క్రియతో అన్వయించు నపుడు ప్రసజ్య ప్రతిషేధమును, ఉత్తరపదముతో అన్వయించునపుడు - పర్యుదాసమును అగునని'' దీని భావము. కాగా :

1. అనేకమ్ = ఏకమ్ + న = (ఇరువురు లేక పెక్కు-రు) అన్నచో ప్రసజ్య ప్రతిషేధమును,
2. అనేకమ్ = ''ఏకభిన్నమ్ - ఏకసదృశమ్'' అన్నచో (ఇరువురు లేక పెక్కు-రు) పర్యుదాసమును అగును. మొదటి పక్షమున కారకమునకు నిషేధము సూటిగా తెలియును. రెండవ పక్షమున అది చివరకును ఫలించును.

*అవతారిక*— ''అనేకమ్ - ఆసయ, భోజయ, శాయయ'' అను ఉదాహరణ మును భాష్యకారు డీ సందర్భమున చూపెను. దాని భావము కూడ ''ప్రకృతమున కను కూలమే'' అని చెప్పుచున్నాడు.

**శ్లో॥ ధాత్వర్థః కర్మవిషయో వ్యపదిష్టః స్వసాధనైః ।**
**అర్థాత్ సర్వాణి కర్మాణి ప్రాగాక్షిప్యావతిష్ఠతే ॥** 291

స్వసాధనైః = తన కారకములతో, వ్యపదిష్టః = వ్యవహరింపబడినట్టియు, కర్మవిషయః = కర్మకారకమునకు చెందునట్టి, ధాత్వర్థః = ధాతువుయొక్క- అర్థము, అర్థాత్ = భావము ననుసరించి, సర్వాణి = ఎల్ల, కర్మాణి = కర్మలను, ప్రాక్ = ముందుగా, ఆక్షిప్య = ఆకర్షించి, అవతిష్ఠతే = ఉండును.

తాత్పర్యము— ఆసయ, (కూర్చుండబెట్టుము), భోజయ (తినజేయుము), శాయయ (నిద్రింపజేయుము) అను ప్రయోగములో ఆయా ధాతువుల అర్థములు పరస్పరము

భిన్నములు. అచట కర్త వేరుగను, కర్మ వేరుగను ఉండును. "అనేకమ్" అను పదమును కర్మగా చేర్చగానే, అన్ని వ్యాపారములకును ఒకే వ్యక్తి కర్మగా ఉండుట అసంభవముగాన "పెక్కురు వ్యక్తులు" అను భావము సహజముగ లభించును.

*వివరణము*— ఆసనము, భోజనము, శయనము అను విరుద్ధమైన క్రియలకు కర్మగా "అనేకమ్" అను పదముయొక్క అర్థము అన్వయించును. అయినను ఏకమునకు నిషేధముండుటచే పెక్కు వ్యక్తులే కర్మలని ముందుగానే తెలిసిపోవునని సారాంశము.॥291॥

*అవతారిక*— క్రియావిశేషమునుగాని గుణవిశేషమునుగాని నిర్దేశింపని, "అనేకః" (తిష్ఠతి) (అనేకము = ఉన్నది) అను ప్రయోగమున కూడ ద్విత్వబహుత్వములే తెలియబడునని రెండు కారికలతో చెప్పుచున్నాడు.

**శ్లో॥ నిర్జ్ఞాతసాధనాధారే యత్రాఖ్యాతే ప్రయుజ్యతే ।**
**అనేకఇతి పశ్చాచ్చ తిష్ఠతీత్యనుషజ్యతే ॥ 292**

**శ్లో॥ సాధ్యత్వాత్తత్ర సిద్ధేన క్రియా ద్రవ్యేణ లక్ష్యతే ।**
**ప్రాగేవాంగీకృతం ద్రవ్యమతః పూర్వేణ భిద్యతే ॥ 293**

నిర్జ్ఞాతసాధనాధారే = బాగుగా తెలిసిన కారకముగల, ఆఖ్యాతే = క్రియయందు, అనేకః + ఇతి = అనేకము అని, యత్ర = ఎచట, ప్రయుజ్యతే = ప్రయోగింపబడునో, పశ్చాత్ = తరువాత, తిష్ఠతి + ఇతి + చ = "తిష్ఠతి" అను పదము, అనుషజ్యతే = కలుపబడునో.

తత్ర = అచట, సిద్ధేన = సిద్ధముగానున్న, ద్రవ్యేణ = కారకమైన ద్రవ్యముచే, సాధ్యత్వాత్ = సాధింపదగినదగుట వలన, క్రియా = క్రియ, లక్ష్యతే = ఆక్షేపింపబడును, ద్రవ్యమ్ = ద్రవ్యము, ప్రాక్ + ఏవ = ముందుగానే, అంగీకృతమ్ = స్వీకరింపబడినది, అతః = ఇందువలన, పూర్వేణ = ముందుగా చూపిన తీరుకన్న, భిద్యతే = వేరగును.

*తాత్పర్యము*— "అనేకః" (రెండు లేక పెక్కు) అను శబ్దమును మాత్రమే ప్రయోగింతుము. ఎట్టి క్రియనుగాని, గుణమునుగాని దానికి విధింపము. అయినను అనేకమయినది కారకమైన ఒకానొక వస్తువుకాక తప్పదు. దానినిబట్టి అనువగు "తిష్ఠతి" అను సామాన్యక్రియ ఆక్షేపింపబడును. అనగా సాధనమైన ద్రవ్యమే ముందుగా ఉన్నందున, అది సాధ్యమైన క్రియను లాగికొనివచ్చును. అట్లు తుదకు ద్విత్వబహుత్వములే తెలియును. క్రియ వలన కారకము నాక్షేపించుట పైన చూపబడినది. (290) దానికి విపరీతము ఈ పక్షము.

*వివరణము*— విశేషక్రియ లేనిచోట తిష్ఠతి, భవతి, అస్తి, మొదలగు సామాన్య క్రియలు వాడబడును. విశేషములను విధింపక, కేవలము "అనేకః" అన్నచో, ప్రసజ్య ప్రతిషేధమున "ఒకటి కాదు" అని నిషేధము మాత్రమే ఫలించి ద్విత్వబహుత్వముల ప్రతీతి కలుగదేమో అను శంక కలుగును. దానిని వారించుటకై ఇట్టి సందర్భములందు పర్యుదాస

మునే స్వీకరింపవలెననియు, అట్లు ద్విత్వాది ప్రతీతి సుకరమగుననియును భాష్యకారు డభిప్రాయపడెను. ఆ భావమును ఈ కారికలు విశదము చేసినవి.

కాగా క్రియ వినిపించినచోట దానినిబట్టి కారకమైన ద్రవ్యమున కాక్షేపము కలుగును. క్రియ వినిపింపక ద్రవ్యము మాత్రమే ఉన్నపుడు దానినిబట్టి క్రియకు ఆక్షేపము కలుగును. ఎట్లయినను నఞ్ఞు నిషేధించు వస్తువును విడిచి మిగిలినవన్నియును క్రియాన్వయమును పొందునని ఫలించును. ॥293॥

*అవతారిక*— క్రియను పూర్తిగా వివక్షింపని వాక్యమందు కూడ (న న ఏకమ్ ప్రియమ్, మొదలగునది) వేరొక సంఖ్యయే తెలియునని చూపుచున్నాడు.

**శ్లో॥ సంఖ్యైవ ప్రతిషేధేన సంఖ్యాంతరమపేక్షతే ।**
**వాక్యేఽపి తేన నైకత్వమాత్రమేవ నివర్త్యతే ॥ 294**

వాక్యే + అపి = వాక్యమందు కూడ, ప్రతిషేధేన = నిషేధముచే, సంఖ్యా = సంఖ్య, సంఖ్యాంతరమ్ + ఏవ = వేరొక సంఖ్యనే, అపేక్షతే = కోరును, తేన = అందుచే, ఏకత్వమాత్రమ్ + ఏవ = ఏకత్వము మాత్రమే, న + నివర్త్యతే = తొలగింపబడదు.

**తాత్పర్యము**— "న న ఏకం ప్రియమ్" (ఒక ప్రియము కాదు = ఎన్నో ప్రియములు), "న న ఏకం సుఖమ్" (ఒక సుఖము కాదు = ఎన్నో సుఖములు) అను వాక్యములో కూడ నఞ్ఞు ఏకత్వమును మాత్రమే నిషేధించి ఊరకొనదు. ఆ నిషేధముచే "ఒకటిని మించిన ఎన్నో సుఖములు" అను రీతిని బహుత్వమే తెలియబడును.

వివరణము— "న న ఏకం ప్రియమ్" అను వాక్యము శత్రువునుద్దేశించి సంభావించునది. "శత్రువునకు ఎన్నో ప్రియములు - మనకు లేవు" అని దాని భావము. బాధను సూచించుటకై "న" అను దానికి ద్విరుక్తి వచ్చినది. ఇచట క్రియ వివక్షితము కాదు. ఇది వృత్తియు కాదు. అయినను ఏకత్వముయొక్క నిషేధమువలన బహుత్వము తెలియుచున్నది. కాగా "అనేకమ్" అను వృత్తివలన ద్విత్వబహుత్వములు లభించుటలో చిక్కేదియు ఉండదు.

*విశేష విషయములు*— "ఆబాధేచ" (8-1-10) అనునది ద్విరుక్తిని విధించు సూత్రము. "బాధను సూచించునపుడు పదమునకు ద్విరుక్తియగును" అని దీని భావము.

అవతారిక— ఏకత్వమును నిషేధించుటవలన తత్సదృశమైన వేరొక సంఖ్యయే తెలియుననుటను ఒక దృష్టాంతముతో సమర్థించుచున్నాడు.

**శ్లో॥ స్నేహాంతరాదవచ్ఛేదస్తథాసత్తేః ప్రతీయతే ।**
**తైలేన భోజనే ప్రాప్తే నత్వన్యదుపసేచనమ్ ॥ 295**

భోజనే = భోజనము, తైలేన = నువ్వులనూనెతో, ప్రాప్తే = సంభవించునపుడు, ఆసత్తేః =

దగ్గర సంబంధమునుబట్టి, స్నేహాంతరాత్ = వేరొక చమురువలన, అవచ్ఛేదః = విశేషము, ప్రతీయతే = తెలియబడును, అన్యత్ = మరియొక, ఉపసేచనమ్ + తు = తడుపు పదార్థమైతే, న = కాదు (తెలియబడదు).

తాత్పర్యము— "అతైలేన భోజనమ్" (నూనె కాని వస్తువుతో భోజనము) అను వాక్యము నూనెను నిషేధించినను "నూనెవంటి నెయ్యి, మొదలగు చమురుతోనే భోజనము" అను అర్థమును సమర్పించును. అంతియకాని పెరుగు, పాలు, మొదలగు ద్రవ్యములు అచట స్ఫురింపవు. అట్లగుటలో నూనె, నెయ్యి మొదలగువాని సజాతీయత్వమే కారణము. అట్లే "అనేకమ్" అని ఏకత్వమును నిషేధించినందువలన ఏకత్వమునకు సదృశములైన ద్విత్వ బహుత్వ సంఖ్యలే అవగతములగునుగాని వేరొక వస్తువేదియు అవగతము కాదు.

వివరణము— నఞ్ "తద్భిన్నమును తత్సదృశమును బోధించును" అనుట వలన, నిషేధించిన వస్తువుతో సమానమైన వస్తువే లభించునుగాని వేరొకటి లభింపదు.

ఈ విధముగ "నఞ్ సమాసము ఉత్తరపదార్థ ప్రధానము" అన్నపుడు "అనేకమ్" అను, ప్రయోగముయొక్క ఉపపత్తి ప్రతిపాదింపబడినది. (281-295 కారికలు).

అవతారిక— "నఞ్ సమాసము అన్యపదార్థ ప్రధానము" (బహుప్రీహివలె తాను విశేషణముగ నుండి విశేష్యమైన వేరొక వస్తువును చెప్పునది) అను పక్షమును పరిశీలించుట కిపుడు ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ ఏకార్థే వర్తమానాభ్యామసతా బ్రాహ్మణేన చ ।
యదా జాత్యంతరం బాహ్యం క్షత్రియాద్యపదిశ్యతే ॥ 296

ఏకార్థే = ఒకే యర్థమున, వర్తమానాభ్యామ్ = ఉంటున్న, అసతా = అభావమును సామాన్యముగ చెప్పు నఞ్ చేతను, బ్రాహ్మణేన + చ = బ్రాహ్మణ పదముచేతను, బాహ్యమ్ = వెలుపలనున్న, క్షత్రియాది = క్షత్రియత్వము మొదలగు, జాత్యంతరమ్ = వేరొకజాతి, యదా = ఎపుడు, అపదిశ్యతే = చెప్పబడునో (తదా = అపుడు, నఞ్ సమాసః = నఞ్ సమాసము, అన్యపదార్థ ప్రధానః = అన్యపదార్థము ముఖ్యముగా గలదియై, భవతి = అగును).

తాత్పర్యము— "అబ్రాహ్మణః" అనుచోట "న + బ్రాహ్మణః + అస్యామ్" (బ్రాహ్మణ వ్యక్తిలేని జాతి) అను విగ్రహమును చూపి, వర్తి పదార్థములను కాక, అన్యపదార్థమునే విశేష్యముగ చెప్పినచో, నఞ్ సమాస మన్యపదార్థ ప్రధానమగును.

వివరణము— నఞ్ సామాన్యముగ అభావమును చెప్పినను, ప్రస్తుతము ప్రక్కనుండు బ్రాహ్మణ శబ్దమునుబట్టి "బ్రాహ్మణాభావము" అను విశేషార్థమును తెలియజేయును. కాగా ఆ రెండు పదములును సమానాధికరణములయి, విశేష్యమైన వేరొక అర్థమందు ఆధారపడును. ఆ యర్థము వెలుపలిదగుటవలన అన్యపదార్థమగును. ఇట్లు "అబ్రాహ్మణః" అనునది విశేషణముగ ఏర్పడినందున క్షత్రియః, వైశ్యః, మొదలగునవి దానికి

విశేష్యములుగ ఉండును. అన్యపదార్థ ప్రాధాన్యమనగా ఇదియే, (సమసించు పదముల యర్థముగాక, వేరొక పదముయొక్క అర్థము ముఖ్యమగుట), ॥296॥

అవతారిక— అన్యపదార్థము ప్రధానముగాగల మరియొక తత్పురుషమును నిదర్శనముగా చూపుచున్నాడు.

**శ్లో॥ శ్యామేవ శస్త్రీ కన్యేతి యథాన్యద్వ్యపదిశ్యతే ।**
**అసన్ బ్రాహ్మణ ఇత్యాభ్యాం తథాన్యే క్షత్రియాదయః ॥ 297**

శస్త్రీ + ఇవ + శ్యామా = ''శస్త్రీశ్యామా'' (కత్తివలె నల్లనిది), కన్యా + ఇతి = కన్యయని, యథా = ఎట్లు, అన్యత్ = వేరొక వస్తువు, వ్యపదిశ్యతే = చెప్పబడునో, తథా = అట్లు, అసన్ + బ్రాహ్మణః + ఇతి = ''అసన్ బ్రాహ్మణః'' - అను, (అబ్రాహ్మణః), ఆభ్యామ్ = ఈ రెండు పదములచే, అన్యే = ఇతరులైన, క్షత్రియాదయః = క్షత్రియుడు మొదలగు వారు, (వ్యపదిశ్యంతే = చెప్పబడుదురు).

తాత్పర్యము— ''శస్త్రీశ్యామా'' ఇదియు తత్పురుష సమాసమే. ''శస్త్రీ ఇవ శ్యామా'' అని విగ్రహము. ''కన్యా'' అనునది దీనికి విశేష్యము (శస్త్రీ శ్యామా కన్యా చిన్న కత్తివలె నల్లని కన్య). కాగా ఇచట అన్యపదార్థమే ముఖ్యముగ నుండును. ఇట్లే ''అబ్రాహ్మణః'' అను నఞ్ సమాసమువలన కూడ అన్యపదార్థములగు క్షత్రియాదులు తెలియుటలో బాధ ఉండదు.

వివరణము— ''అనేక మన్యపదార్థే'' (2-2-24) ఇది బహువ్రీహిని విధించు సూత్రము. ఇందు ''అన్యపదార్థే'' అని స్పష్టముగ ఉన్నది. కావున బహువ్రీహి అన్యపదార్థ ప్రధానమగుట సమంజసమే. కాని ''నఞ్'' (2-2-6) అను నఞ్ సమాసమును విధించు సూత్రమున ''అన్యపదార్థే'' అను నిర్దేశము లేదు. అయినపుడు ''నఞ్'' సమాసము అన్య పదార్థ ప్రధానమగుట సముచితమా ?'' అను శంక కలుగును. ఈ శంకను వారించుటయే ఈ కారికయొక్క పని. ''శస్త్రీశ్యామా'' మొదలగు ఉపమాన సమాసములు ''ఉపమానాని సామాన్యవచనైః'' (2-1-55) అను సూత్రముచే సాధింపబడును. అవియు తత్పురుషములే. వానిని సాధించు పై సూత్రమున కూడ, ''అన్యపదార్థే'' అను పదము లేదు. అయినను వాని వలన అన్యపదార్థమే ముఖ్యముగ తెలియుచుండును. అందువలన ''శస్త్రీశ్యామా'' అను వాని వలెనే ''అబ్రాహ్మణః'' మొదలగునవి కూడ అన్యపదార్థమును బోధించుననుటలో దోషము లేదు.

విశేష విషయములు— 1. ''అనేకమన్యపదార్థే''– అన్యపదార్థమును బోధించు ఒకటికిమించిన సమర్థములైన సుబంతములు సమసించును - అది బహువ్రీహియగును - అని యర్థము.

2. ''ఉపమానాని సామాన్యవచనైః''– ఉపమానమును చెప్పు శబ్దములు సామాన్య ధర్మమును చెప్పు శబ్దములతో సమసించును - అది తత్పురుషమగును - అని యర్థము.

''నఞ్'' అను సూత్రముయొక్క అర్థమిదివరకే చూపబడినది. ॥297॥

అవతారిక— పై విషయముననే వేరొక దృష్టాంతమును చూపుచున్నాడు.

**శ్లో॥ అసాస్నో గౌరితి యథా గవయో వ్యపదిశ్యతే ।**
**జాత్యంతరం న గోరేవ సాస్నాభావః ప్రతీయతే ॥ 298**

అసాస్నః = గంగడోలు లేని, గౌః = ఎద్దు, ఇతి = అని, జాత్యంతరమ్ = వేరొక జాతియైన, గవయః = గవయము, యథా = ఎట్లు, వ్యపదిశ్యతే = చెప్పబడునో, గోః = ఎద్దుయొక్క, సాస్నాఽభావః + ఏవ = గంగడోలు లేకుండుట మాత్రమే, యథా = ఎట్లు, న + ప్రతీయతే = తెలియబడదో - (అట్లే ''అబ్రాహ్మణః'' అను దానివలన క్షత్రియాది జాతియే తెలియును)

తాత్పర్యము— గవయమన్నది ఎద్దును పోలియుండు ఒకానొక అడవి జంతువు. దానికి గంగడోలుండదు. మిగిలిన అవయవముల తీరు అంతయును ఎద్దువలెనే యుండును. అగవయమును బోధించుటకు ''అసాస్నః గౌః'' అను వాక్యమును ప్రయోగింతురు. ఇచట ''అసాస్నః'' అనునది గంగడోలు యొక్క అభావమును మాత్రమే బోధించి యూరకొనదు. గోవును పోలిన గవయమను జాత్యంతరమును బోధించును. అట్లే ''అబ్రాహ్మణః'' అనునది బ్రాహ్మణత్వము లేకుండ, మిగిలిన లక్షణములన్నియుగల క్షత్రియాది జాతిని బోధింప గలుగును.

వివరణము— సాస్న అనగా గంగడోలు. నఞు ఒక ధర్మమును నిషేధించి నపుడు, మిగిలిన ధర్మములన్నియు సమానమే అను భావము కలిగి, సదృశమైన వేరొక వస్తువు బోధపడునని ఇచటి సారాంశము. ॥298॥

అవతారిక— పై విషయముననే మరియొక నిదర్శనమును చూపుచున్నాడు.

**శ్లో॥ తుల్యరూపం యథాఖ్యాతం కంటకైర్భేదహేతుభిః ।**
**ఖదిరం జాతిభేదేన ఖర్జూరాత్ ప్రతిపద్యతే ॥ 299**

తుల్యరూపమ్ = సమానమైన రూపము గలదిగ, ఆఖ్యాతమ్ = చెప్పబడిన, ఖదిరమ్ = ఖదిర వృక్షము (చండ్రచెట్టు), భేదహేతుభిః = భేదమునకు కారణములైన, కంటకైః = ముండ్లచే, ఖర్జూరాత్ = ఖర్జూరపు చెట్టుకన్న, జాతిభేదేన = జాతిభేదముతో, యథా = ఎట్లు, ప్రతి పద్యతే = తెలియబడునో, (అట్లు అబ్రాహ్మణః అను దానివలన క్షత్రియాది జాతి తెలియ బడును.)

తాత్పర్యము— ''ఖదిర ఖర్జూరౌ గౌరకాండౌ సూక్ష్మపర్ణౌ'' (ఖదిరపు చెట్టును, ఖర్జూరపు చెట్టును తెల్లని కాండములును, చిన్న ఆకులను గలవి) అను వాక్యమువలన మొదట

ఖదిర ఖర్జూరముల సాదృశ్యము తెలియును. పిదప ''కంటకవాన్ ఖదిరః'' (ముండ్లుగలది ఖదిరము) అను వచనముచే, ఖదిరమునకు ముండ్లు ఉన్నందున అది ఖర్జూరపు చెట్టుకన్న వేరైన చెట్టు అని భేదము స్పష్టపడును. (ముండ్లు ఖదిరమును వేరు చేయును). అట్లే ''అబ్రాహ్మణః'' అను సమాసమువలన ''బ్రాహ్మణజాతి కాదనియు, మిగిలిన లక్షణములన్నియును ఆ వ్యక్తికి సమానమే అనియును'' విశదపడును. అనగా ''వేరొక జాతి'' అని తెలియును.

*అవతారిక*— మీద చూపిన దృష్టాంతములకు ప్రకృతమున సమన్వయము చూపుచున్నాడు.

శ్లో॥ అవిద్యమానబ్రాహ్మణ్యో యాదృశో బ్రాహ్మణో భవేత్ ।
అంగీకృతోపమానేన తథాన్యార్థో విధీయతే ॥ 300

బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, అవిద్యమాన బ్రాహ్మణ్యః = బ్రాహ్మణత్వము లేనివాడై, యాదృశః = ఎట్టివాడు, భవేత్ = అగునో, తథా = అట్లు, అంగీకృతోపమానేన = స్వీకరింపబడిన ఉపమానముగల దానిచే (నఞ్ సమాసముచే) అన్యార్థః = అన్యపదార్థము, విధీయతే = విధింపబడును.

తాత్పర్యము— ఏదోయొక కారణమువలన బ్రాహ్మణత్వమును కోల్పోయిన బ్రాహ్మణుని గూర్చి ''బ్రాహ్మణః'' అని ప్రయోగించినపుడు, ఆ పదము ''వాస్తవముగా బ్రాహ్మణ్యము లేకపోయినను బ్రాహ్మణ సాదృశ్యము గలదు'' అను భావమునందించును. అట్లే ''అబ్రాహ్మణః'' అను నఞ్ సమాసము ''బ్రాహ్మణ సదృశమైన క్షత్రియాది జాతి'' అను అర్థమును సమర్పించును.

వివరణము— పై మూడు కారికలును మూడు దృష్టాంతములను ఇట్లు చూపినవి. 1. శస్త్రీశ్యామా, 2. అసాస్నోగౌః, 3. ఖదిర ఖర్జూరౌ గౌరకాండౌ – కంటకవాన్ ఖదిరః ఈ మూడు చోట్లను కూడ చివరకు సాదృశ్యమే తెలియును. మొదటి రెండు చోట్లను (1. కత్తివలె నల్లని కన్య, 2. గంగడోలు లేని ఎద్దువంటిది గవయము) సదృశమైన అన్య పదార్థమే ముఖ్యముగ ఉండును. అట్లే ''అబ్రాహ్మణః'' అనుచోట కూడ ఉపమానోపమేయ భావము అవగతమై ''బ్రాహ్మణ సదృశమైనను బ్రాహ్మణ భిన్నమైన జాతి'' అను అర్థము సిద్ధించును. కాగా అన్యపదార్థము ముఖ్యమన్నపుడు నఞ్ సమాసమున సాదృశ్యము అంతర్గతమై ఉండునని ఫలించును.

*విశేష విషయములు*— పదార్థములకు సంపూర్ణమైన భేదముగాని, అభేదముగాని యున్నచో సాదృశ్యమన్నది సంభవింపదు. అందుచే సాదృశ్యమనగానే భేదాభేదములు రెండును ఉండునని తెలియవలెను. కొన్ని లక్షణములనుబట్టి భేదమును మరికొన్ని లక్షణములను బట్టి అభేదమును సాదృశ్యమున్నచోట భావింపక తప్పదు. ॥300॥

సమాసమగుననియు, పిదప ఆ సమాసము క్షత్రియాది వ్యక్తినే అన్యపదార్థముగ బోధించు ననియును మరికొంందరు చెప్పుదురు.

వివరణము— వ్యక్తిని చెప్పు శబ్దమునకు తొలుత నఞ్ సమాసమనియు, పిదప సమాసము జాతిని అన్యపదార్థముగ తెలుపుననియును ఇంతదనుక చెప్పబడినది. దానికి విపరీతమైనది ఈ పక్షము. రెండింటి తాత్పర్యమును ఒకటే. అయినను అన్యపదార్థము జాతి యని మొదటి పక్షము చెప్పును. అది వ్యక్తియని రెండవ పక్షమనును. మిగిలినదంతయు సమానమే. ॥302॥

*అవతారిక*— నఞ్ సమాసమందలి ఉత్తరపదము తొలుత జాతివాచకమై పిదప వ్యక్తిని అన్యపదార్థముగ బోధించునను పక్షమున, నఞ్ సమాసమునకును, బహువ్రీహికిని భేదము కూడ సులభముగ సిద్ధించునని చెప్పుచున్నాడు.

**శ్లో॥ నచైవం విషయః కశ్చిత్ బహువ్రీహిః ప్రకల్పతే ।**
**అగురశ్వఇతి వ్యాప్తిర్నఞ్సమాసేన యస్య న ॥ 303**

కశ్చిత్ = ఏ ఒక, బహువ్రీహిః + చ = బహువ్రీహియైనను, ఏవం విషయః = ఇట్టి విషయము గలదై, (జాతితో కలిసిన అన్యపదార్థమగు వ్యక్తిని చెప్పునదియై), న + ప్రకల్పతే= ఉండజాలదు, యస్య = ఏ బహువ్రీహికి, నఞ్ సమాసేన = నఞ్ సమాసముచే, వ్యాప్తిః = వ్యాపించుట, న = లేదో, (సః = అట్టి), అగుః + అశ్వః + ఇతి = అగుః (అశ్వః) అను బహువ్రీహి (కల్పతే = సమర్థమగును).

తాత్పర్యము— "ఆధిక్యము" మొదలగు మతుప్ ప్రత్యయముయొక్క అర్థమును బహువ్రీహి సమాసము బోధించుట అతిప్రసిద్ధము. ఉదా : చిత్రగుః = చిత్రమైన పెక్కు గోవులు కలవాడు. నఞ్ సమాసమువలె జాతి విశిష్టమైన వ్యక్తిని అన్యపదార్థముగ బహువ్రీహి సమర్పింపజాలదు. అట్లయినచో నఞ్ సమాసమునకును బహువ్రీహికిని భేదమే లేకుండ పోయెడిని. అది అనుభవమునకు విరుద్ధము. అందువలన వ్యక్తి అన్యపదార్థముగ ఫలించి నపుడు, నఞ్ సమాసమనియు, అట్లు కానపుడు (కేవలము జాతికాని, మతుబర్థముగాని) బహువ్రీహియనియును భేదమును కల్పించుకొనుట సమంజసము. అనగా నఞ్ సమాస మాక్రమించని స్థలము బహువ్రీహి కాగలదు. ఉదా : 1. అగుః - (అశ్వః) న + గౌః - అని విగ్రహము. గోత్వమను జాతితో కూడిన గోవ్యక్తి కానిది అశ్వము = "అశ్వము గోవు కాదు" అని భావము. ఇది నఞ్ సమాసము.

2. అగుః = న + గావః + యస్యసః = పెక్కు గోవులు లేనివాడు ఇది బహువ్రీహి. (అశ్వః, అను దానికి ఇచట సంబంధమక్కరలేదు).

వివరణము— నఞ్ సమాసము అన్యపదార్థ ప్రధానమన్నపుడే బహువ్రీహితో సాంకర్యమున కవకాశము కలుగును. దానిని వారించుటకు ఏదో ఒక యుక్తిని చూపవలసి

యుండును. జాతి విశిష్టమగు వ్యక్తిని నఞ్ సమాసము బోధించునని సమన్వయము చేయుటయే అట్టి యుక్తి యగును. ॥303॥

అవతారిక— నఞ్ సమాసము అన్యపదార్థ ప్రధానమన్నచో దోషము సంభవించునని భాష్యమున నున్నది. ఆ దోషమును వివరించుచున్నాడు.

శ్లో॥ ద్వంద్వైకదేశినోరుక్తా పరవల్లింగతా యతః ।
అవర్షాసు తతోఽసిద్ధిరిష్టయోర్లింగసంఖ్యయోః ॥ 304

పరవల్లింగతా = ప్రక్కనుండు పదముయొక్క లింగము సమాసమునకు వచ్చుట, ద్వంద్వైకదేశినోః = ద్వంద్వమునకును, ఏకదేశి సమాసమైన తత్పురుషమునకును మాత్రమే, యతః = ఎందువలన, ఉక్తా = చెప్పబడెనో, తతః = అందువలన, అవర్షాసు = ''అవర్షాః'' అను నఞ్ సమాసమున, ఇష్టయోః = అభిమతములైన, లింగసంఖ్యయోః = లింగముయొక్కయు, వచనముయొక్కయు, అసిద్ధిః = సిద్ధింపకపోవుట (స్యాత్ = కలిగెడిని).

తాత్పర్యము— నఞ్ సమాసమన్యపదార్థ ప్రధానమన్నచో ''అవర్షాః హేమంతః'' అనుచోట, అన్యపదార్థమును చెప్పు హేమంత శబ్దము ననుసరించి నఞ్ సమాసమునకు లింగవచనములు రావలసియుండును. (అవర్షః - హేమంతః) కాని అది అభిమతము కాదు. ''అవర్షాః'' అని స్త్రీలింగముగను, నిత్య బహువచనముగను ఉండుటయే అభిమతము.

అయితే ''పరవల్లింగం ద్వంద్వ తత్పురుషయోః'' (2-4-26) అను సూత్రము ద్వంద్వమునకును తత్పురుషమునకును పరపదముయొక్క లింగమును అతిదేశించినది. దీని ననుసరించి నఞ్ సమాసము కూడ తత్పురుషమే కాన ''అవర్షా'' అనుచోట దోషము కలుగదని (పరపదమైన వర్షా శబ్దమును బట్టియే లింగవచనములు సిద్ధించును) వాదింపవచ్చును. కాని ఆ పరపదముయొక్క లింగము వచ్చుట - తత్పురుషములో ''ఒక్క ఏకదేశి సమాసమునకు మాత్రమే'' (ఉదా : అర్థపిప్పలీ) అని నియమము చేయబడినది. నఞ్ సమాసము ఏకదేశి సమాసము కాదు గదా! కావున పై వాదము నిలువదు. కాగా దోషము కలుగక తప్పదు.

వివరణము— ''పరవల్లింగం ద్వంద్వ తత్పురుషయోః'' - ''దంద్వసమాసమునకును, తత్పురుష సమాసమునకును, చివరనుండు పదముయొక్క లింగము సంక్రమించును'' అని యర్థము.

ఉదా : 1. మయూరీ+చ+కుక్కుటః+చ = మయూరీ కుక్కుటౌ (ద్వంద్వము) కుక్కుట శబ్దము ననుసరించి సమాసమునకు పుంలింగము.

2. అర్ధమ్ + పిప్పల్యాః = అర్థపిప్పలీ (ఏకదేశి సమాసము - తత్పురుషము). పిప్పలీ శబ్దము ననుసరించి సమాసమునకు స్త్రీలింగము.

ఎల్ల పదార్థములకు పరస్పరము భేదము* స్వాభావికము, ఒక వస్తువును పోలిన మరియొక వస్తువు ఉండదు. గోవునంటిది గవయమము అను లోకుల వాడుక యున్నది. కాని అది సత్యము కాదు. ఆ రెంటికికల భేదము గుర్తింపబడక పోవుటచే భ్రమ మూలమున వార లకు ఆ వాడుక కలిగినది. దీనిని 'ప్రఖ్యావ్యవహార' మందురు. అనగా రెంటికికల విశేషము తెలియబడనందున రెంటికి సామ్యమున్నది అని భావించుట ప్రఖ్యయని వ్యవహారము. కాగా సాదృశ్యమనునది భ్రమమూలకమే.

2. భేదోపనివేశినః = వస్తువునందు కల అసాధారణమగు స్వరూపమున ఉన్న భేదమునకు దగ్గరగా నున్నట్టియు, వాచకాః = ఆ భేదమును బోధించెడి, శబ్దాః + అపి = శబ్దములు కూడ, న + విద్యన్తే = లేవు.

ప్రతి వస్తువునందు అసాధారణమగు ధర్మము కలదు. కాని ఆ ధర్మమునకు సంబంధించిన బోధకమగు శబ్దములు లేవు. ఒక గోవునకు ఏదో ఒక విలక్షణమగు ధర్మ ముండును. ఆ ధర్మము మరియొక గోవున కుండనేరదు. రెండవ దానియందు దానికే సంబంధించిన ధర్మముండును. ఇట్లే మరియొక గోవునకు అసాధారణమగు ధర్మముండును. కోట్లకొలది గోవులున్నను ప్రతి వ్యక్తికి ఇతర వ్యక్తికి లేని ఏదో అసాధారణ ధర్మముండును. కాగా ఒక్కొక్క గోవ్యక్తిని బోధించెడి గోశబ్దములు కూడ వేరువేరుగానే యున్నవి. ఆ అసాధారణముగా నున్న ధర్మమును బోధించెడి శబ్దములు లేనేలేవు. ఆ ధర్మము శబ్దగోచ రము కానేరదు

పై రీతిని ఆ ధర్మములకు వాచకములగు శబ్దములు లేనందున ఎల్లగోవులకు వాచకము ఒక్క శబ్దమే అని భ్రమయు కలుగుచున్నది కాగా ఎల్లగోవులను ఒకే శబ్దముచే వ్యవహరించుట 'ఉపాఖ్య' వ్యవహారమందురు.

కాబట్టి వ్యక్తులకు కల భేదము గుర్తింపబడనందున భ్రమమూలకమగు ఏకరూప మగు జ్ఞానము కలుగుచున్నది. దీనిని 'ప్రఖ్య' వ్యవహారమందురు.

వ్యక్తియందున్న విశేషములను బోధించెడి శబ్దములు లేనందున, అభిన్నమగు అనగా ఏకరూపమగు శబ్ద ప్రవృత్తి కలుగుచున్నది. దీనిని 'ఉపాఖ్య' వ్యవహారమందురు.

కాగా సామాన్యమనెడి బాహ్య వస్తువు లేనేలేదు. ॥100॥

*అవతారిక* — పై శ్లోకమున కల 'సర్వేషామ్' (ఎల్ల పదార్థములకు) అను పదముయొక్క అర్థమును వివరించుచున్నాడు.

---

* 'సర్వం స్వలక్షణమ్' అని బుద్ధుని యుపదేశము, ఎల్లవస్తువులు తనకు తానే లక్షణము చిహ్నము, సరియగుట. తనకు సరియగు మరియొకటి లేనే లేదు

1. సర్వం స్వలక్షణమ్, 2. సర్వం దుఃఖమ్, 3. సర్వం క్షణికమ్, 4. సర్వం శూన్యమ్' ఈ నాలుగు బుద్ధుని ఉపదేశములు.

కాగా నఞ్ సమాసము అన్యపదార్థ ప్రధానమన్నచో "అవర్షాః - హేమంతః" అనుచోట దోషము తప్పదని తేలినది. కావుననే ఆ పక్షము మంచిది కాదనియును ఫలించును. ॥304॥

అవతారిక— "నఞ్ సమాసమున పూర్వపదముయొక్క అర్థము (న = అభావము) ప్రధానము", అను పక్షమును పరిశీలించుటకు ఇపుడు ప్రారంభింపుచున్నాడు

**శ్లో॥ విశేషణం బ్రాహ్మణాది క్రియాసంబంధినోఽసతః ।**
**యదా విషయభిన్నం తత్తదాసత్త్వం ప్రతీయతే ॥** 305

క్రియాసంబంధినః = క్రియతో సంబంధముగల, అసతః = "లేనిది" అను నర్థమునకు (అభావము), బ్రాహ్మణాది = బ్రాహ్మణ మొదలగు శబ్దము, విశేషణమ్ = విశేషణమై, తత్ = అది, విషయభిన్నమ్ = విషయముచే వేరైనది, యదా = ఎపుడు (భవతి = అగునో), తదా = అపుడు, అసత్త్వమ్ = అభావము (లేకుండుట), ప్రతీయతే = తెలియబడును.

తాత్పర్యము— "అబ్రాహ్మణః" మొదలగుచోట్ల, నఞర్థమైన అభావము ముఖ్యము. అందు బ్రాహ్మణ మొదలగు శబ్దముల అర్థము విశేషణమై అప్రధానముగ నుండును. కావున "బ్రాహ్మణాభావము" మొదలగు అర్థము లభించును. ఇట్టి అభావమే పిదప సముచితమైన క్రియతో అన్వయించును. (అబ్రాహ్మణః అస్తి = బ్రాహ్మణాభావము గలదు). ఈ తీరు ననుసరించినపుడు నఞ్ సమాసము పూర్వపదార్థ ప్రధానమగును. ॥305॥

అవతారిక— అసత్తునకును క్రియా సంబంధము కుదురునని నిరూపించుచున్నాడు.

**శ్లో॥ బ్రాహ్మణత్వేనచాఽసత్త్వాదుచ్యతేఽసత్తదన్యథా ।**
**అసదిత్యపి సత్త్వేన సతః సత్తా నివర్త్యతే ॥** 306

బ్రాహ్మణత్వేన = బ్రాహ్మణ్యముచే, అసత్త్వాత్ + చ = లేకపోవుటవలన, తత్ = ఆ, అసత్ = లేనిది, అన్యథా = వేరొక రీతిలో, ఉచ్యతే = చెప్పబడును, అసత్ + ఇతి + అపి = "అసత్" అనుచోట కూడ, సత్త్వేన = సత్త్వముచే (ఉనికి), సతః = ఉన్నదానియొక్క సత్తా = ఉనికి, నివర్త్యతే = తొలగింపబడును.

తాత్పర్యము— "అబ్రాహ్మణః (బ్రాహ్మణ్యము లేనివాడు - అనగా ఇతరుల ధర్మమున్నది గదా?)" అనునది "బ్రాహ్మణ్యము లేకున్నను క్షత్రియాదుల ధర్మమున్నది" అను భావమునే తుదకు కలుగజేయును. అనగా "సిద్ధముగనున్న ధర్మము బ్రాహ్మణ్యరూపముతో లేదు" అని మార్చి చెప్పినట్లగును. కావున (చివరకు ఉనికియే తెలియును) క్రియాన్వయము కుదురును. అట్లే "అసన్" అను నఞ్ సమాసమును కూడ కుదుర్చుకొనవచ్చును. ఏ విధముగను సత్త్వమును (ఉనికిని) భావింపని అభావమన్నది సంభవింపదు. (అభావము, అనునది ఒకదాని యునికిని తప్పక అపేక్షించును) అట్లు భావనాసిద్ధమైన సత్త్వమునే నఞా

తొలగించును. కాగా ''అసన్'' అను దానివలన ''సత్త్వాభావము'' అను నర్థము, పూర్వ పదార్థము ముఖ్యమను పక్షములో లభించును. ॥306॥

*అవతారిక*— పూర్వపదార్థము ముఖ్యమన్నపుడు, ''సమాసము అవ్యయము కావలసి వచ్చునని'' భాష్యకారు డొక శంకను లేవదీసెను. దానిని విశదము చేయుచున్నాడు.

**శ్లో॥ సామాన్యద్రవ్యవృత్తిత్వాన్నిమిత్తానువిధాయినః ।**
**అయోగో లింగసంఖ్యాభ్యాం స్యాద్వా సామాన్యధర్మతా ॥ 307**

నిమిత్తానువిధాయినః = ప్రవృత్తి నిమిత్తముగలది, సామాన్య ద్రవ్యవృత్తిత్వాత్ = ద్రవ్య సామాన్యమును చెప్పుటవలన, లింగసంఖ్యాభ్యామ్ = లింగవచనములతో, అయోగః = సంబంధము లేకుండుట, స్యాత్ = కలిగెడిని, వా = లేక, సామాన్యధర్మతా = సామాన్య ధర్మమగుట (స్యాత్ = కలిగెడిని).

తాత్పర్యము— నఞ్ సమాసము పూర్వపదార్థ ప్రధానమన్న పక్షములో నఞర్థ మైన అభావము సామాన్యరూపమున ముఖ్యమగును గదా ! ఉత్తరపదార్థ మచట విశేషణమై విశేష్యమును చెప్పుచు తన సహజ ధర్మములైన లింగవచనములను పోగొట్టుకొనును. నఞర్థ మునకు లింగవచనములు లేకుండుట సముచితమే (అభావము ద్రవ్యము కాదు). కాగా ముఖ్య మైన నఞర్థము ననుసరించి సమాసమంతయు అవ్యయము కావలసి వచ్చును. ఇదొక చిక్కు. లేక— సమాసము అభావ సామాన్యమును బోధించుటవలన నపుంసక లింగమును ఏకవచన మును మాత్రమే (అబ్రాహ్మణమ్) రావలసి వచ్చును. ఇది వేరొక చిక్కు.

వివరణము— న = అభావము. ఇది అవ్యయము. ''అబ్రాహ్మణః'' = బ్రాహ్మణా భావము. ఇదియు అవ్యయము కావలెను. ॥307॥

*అవతారిక*— పై కారిక చూపిన దోషమునకు భాష్యకారుడే పరిహారమును చూపెను. దానిని వివరించుచున్నాడు.

**శ్లో॥ ప్రాగసత్త్వాభిధాయిత్వం సమాసే ద్రవ్యవాచితా ।**
**నిమిత్తానువిధానం చ న సర్వత్ర స్వభావతః ॥ 308**

ప్రాక్ = ముందు, (సమాసమునకు ముందు), అసత్త్వాభిధాయిత్వమ్ = ద్రవ్యము కాని ధర్మమును చెప్పుటయు, సమాసే = సమాసమందు, ద్రవ్యవాచితా = ద్రవ్యమును బోధించు టయు, (భవతి = అగును), నిమిత్తానువిధానమ్ + చ = నిమిత్తము ననుసరించుటయు, స్వభావతః = స్వభావమునుబట్టి, సర్వత్ర = అన్నిచోటులందును, న = ఉండదు.

తాత్పర్యము— సమాసమునకు ముందు నఞ్ ద్రవ్యమును బోధింపదు. ''అభావ సామాన్యము''ను బోధించును. కావున అపుడది యవ్యయమగును. సమాసమందలి నఞ్

ద్రవ్యమును చెప్పును. అది దాని స్వభావము. కావున సమాసమునకు లింగవచనములు సిద్ధించును. ప్రవృత్తి నిమిత్తము ననునరించుట అన్నిచోటులందును ఉండదు.

వివరణము— శబ్దము లాయా నియతమైన యర్థములను బోధించుట అనాది సిద్ధము. దాని నెవరును మార్పజాలరు. వాక్యమందలి నఞ్ కేవలము నిషేధమును చెప్పును. సమాసమందలి నఞ్ నిషేధింపబడు ద్రవ్యమును బోధించును. అది సహజమగు స్వభావము. వృత్తియొక్కయు, వాక్యముయొక్కయు ధర్మములు వేరని పెక్కుసారులు ప్రతిపాదింపబడినది. ॥308॥

అవతారిక— పై విషయమునే సమర్థింపుచున్నాడు.

శ్లో॥ నిమిత్తానువిధానే చ క్రియాయోగో న కల్పతే ।
తథాచావ్యపదేశ్యత్వాదుపాదానమనర్థకమ్ ॥ 309

నిమిత్తానువిధానే + చ = ప్రవృత్తి నిమిత్తము ననుసరించిన యెడల, క్రియాయోగః = క్రియతోడి సంబంధము, న + కల్పతే = సంభవింపదు, తథా + చ = అట్లయిన, అవ్యపదేశ్యత్వాత్ = చెప్ప నావశ్యకత లేనందున, ఉపాదానమ్ = శబ్దమును స్వీకరించుట, అనర్థకమ్ = నిష్ఫలము.

తాత్పర్యము— ప్రవృత్తి నిమిత్తమైన అభావ సామాన్యమే సమాసమువలన తెలియునన్నచో, క్రియాసంబంధము కుదురదు. "అబ్రాహ్మణ మానయ", "అబ్రాహ్మణం పశ్య" మొదలగుచోట్ల "బ్రాహ్మణాభావము" సామాన్యముగ తెలియునపుడు, అట్టి దానికి "తీసికొనివచ్చుట" "చూచుట" మొదలగు క్రియలతో సమన్వయమెట్లు సరిపోవును? అట్లయినపుడు సాధింపదగిన యర్థము బొత్తిగా లేనందున నఞ్ సమాసమే వ్యర్థమైపోవును. కాని వ్యవహారమున నఞ్ సమాసమునకు క్రియాయోగము ప్రసిద్ధముగనున్నది. అందువలన అది ద్రవ్యవాచకమే యనియు, లింగవచనములు దానికుండుననియును ప్రయోగములనుబట్టి నిర్ణయింపక తప్పదు. ॥309॥

అవతారిక— నఞ్ సమాసమునకు లింగవచనములు వేరొక తీరులో కూడ సిద్ధించునని భాష్యకారుడనెను. ఆ తీరును విశదము చేయుచున్నాడు.

శ్లో॥ అసత్సామాన్యవృత్తిర్వా విశేషైః క్షత్త్రియాదిభిః ।
ప్రయుక్తైరాశ్రయైర్భిన్నో యాతి తల్లింగసంఖ్యతామ్ ॥ 310

వా = లేక, అసత్సామాన్యవృత్తిః = అభావమును సామాన్యముగ చెప్పునదియై, ప్రయుక్తైః ప్రయోగింపబడిన, ఆశ్రయైః = ఆధారములైనటువంటివన్ని, క్షత్త్రియాదిభిః = క్షత్రియుడు మొదలగు, విశేషములతో, భిన్నః = వేరైనదియై, తల్లింగ సంఖ్యతామ్ = ఆ విశేషముల యొక్క లింగవచనములు కలిగియుండుటను, యాతి = పొందును.

తాత్పర్యము— నఞ్ సమాసము ఉత్తరపదముయొక్క అర్థముతో కూడిన అభావమును సామాన్యముగ చెప్పినను, అట్టి అభావమునకు సంబంధించిన విశేషములు తెలియుటకై క్షత్రియాదులను అనుసంధానము చేయక తప్పదు. (అబ్రాహ్మణః = క్షత్రియః, వైశ్యః శూద్రః మొ॥) అట్టివాని ననుసరించి సమాసమునకు లింగవచనములు సంక్రమించును.

వివరణము— ''గుణవచనానామాశ్రయతో లింగవచనాని'' (ఆధారమైనట్టి ద్రవ్యమునుబట్టి గుణవాచకములకు లింగవచనములు వచ్చును) అను వచనమువలన నఞ్ సమాసమునకు లింగవచనములు సిద్ధించునని అభిసంధి. ఈ వచనము ననుసరించియే పెక్కు స్థలములలో లింగవచనములు సాధింపబడినవి.

విశేష విషయములు— ''బ్రాహ్మణుడు కాడు'' అని సామాన్యముగ చెప్పగానే ''తత్సదృశమైన క్షత్రియాది వ్యక్తి'' అను విశేషము స్ఫురించును. అదియే ప్రకృతమున ఆశ్రయమగును. దానిని బోధించు శబ్దమునుబట్టి సమాసమునకు లింగవచనము లుండును.

నఞ్ సమాసమునకు ద్రవ్యవాచకత్వము స్వాభావికమని మీది కారిక చెప్పినది. అట్లుగాక లింగవచనములే స్వాభావికములని ఈ కారిక వివరించినది. కాగా యుక్తి వేరుగ కన్పించినను, ఫలితమొక్కటే. ॥310॥

అవతారిక— ఏదోయొక విశేషములేని సామాన్యమన్నది అసంభవము. కావున సామాన్యమున విశేషమంతర్భవించియే యుండును. కాగా నఞ్ సమాసమున విశేషమును ప్రయోగించుట ఎట్లు పొసగును ? – అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రాగాశ్రయో హి భేదాయ ప్రధానేఽభ్యంతరీకృతః ।
పునః ప్రత్యవమర్శేన విభక్త ఇవ దృశ్యతే ॥ 311

ప్రాక్ = ముందుగా, ప్రధానే = ముఖ్యమైన సామాన్యమందు, అభ్యంతరీకృతః = ఇముడ్చబడిన, ఆశ్రయః = ఆధారమైన విశేషము, భేదాయ = భేదముకొరకు, పునః = మరల, ప్రత్యవమర్శేన = అనుసంధానముచే, విభక్తః + ఇవ = విడదీయబడినది వలె, దృశ్యతే + హి = కనబడును గదా !

తాత్పర్యము— సామాన్యమున విశేషమంతర్భవించుట సహజమే. కాని ఆ విశేషమును విశదము చేయకున్నచో చెప్పదలచిన భావము పూర్తిగాదు. అందువలన ఇమిడియున్న విశేషమును విడదీసి చూపవలెను. అట్లు చేసినపుడు ఆ విశేషమే ఆశ్రయమగును. దానినిబట్టి లింగవచనములు సిద్ధించును.

ఉదా : ''అబ్రాహ్మణః'' – అన్నంతమాత్రమున లాభము లేదు. క్షత్రియః, అనియో, వైశ్యః, అనియో చెప్పి స్పష్టపరుపవలెను. కాగా మీది కారిక చూపిన యుక్తిలో అనుపపత్తి ఏదియు లేదు. ॥311॥

అవతారిక— పై యంశమునే సమర్థింపుచున్నాడు.

శ్లో॥ సమాసే శ్రూయతే స్వార్థో యేన తద్వాం స్తదాశ్రయః ।
ద్రవ్యం తు లింగసంఖ్యావదసతాభ్యంతరీకృతమ్ ॥ 312

యేన = ఏ, అసతా = అభావ సామాన్యముచే, తద్వాన్ = అది గలదియు, తదాశ్రయః = దాని కాధారమైనదియు, లింగసంఖ్యావత్ = లింగవచనములు గల, ద్రవ్యమ్ + తు = ద్రవ్య మైతే, అభ్యంతరీకృతమ్ = ఇముడ్చబడినదో (సః = అ), స్వార్థః = స్వార్థము (సమాసము యొక్క అర్థము), సమాసే = సమాసమున, శ్రూయతే = వినబడును.

తాత్పర్యము— లింగవచనములు గల ద్రవ్యవిశేషము సమాసార్థమందే ఇమిడి యుండును. సమాసము బోధించు అభావ సామాన్యమున కదియే ఆశ్రయమగును. కాగా నఞ్ సమాసమున ఆశ్రయమునుబట్టి లింగవచనములు సిద్ధించును.

వివరణము— ఆశ్రయమునుబట్టి లింగవచనములగుట స్వాభావికము. ఆ ధర్మ మును వ్యాఖ్యానించుటలో ఇట్టి యుక్తులన్నియును ఉపయోగించును. ॥312॥

అవతారిక— నఞ్ సమాసమున క్షత్రియాదులు స్వపదార్థముగా తెలియు రీతిని విశదము చేయుచున్నాడు.

శ్లో॥ ఏకార్థవిషయౌ శబ్దౌ తస్మిన్నన్యార్థవర్తినౌ ।
అసతైవ తు భేదానాం సర్వేషాముపసంగ్రహః ॥ 313

అన్యార్థవర్తినౌ = వేర్వేరు అర్థములందుండు, శబ్దౌ = శబ్దములు రెండును (నఞు + ఉత్తర పదము), తస్మిన్ = ఆ సమాసమందు, ఏకార్థవిషయౌ = ఒకే యర్థమును చెప్పునవియగును సర్వేషామ్ = సకలములైన, భేదానామ్ + తు = భేదములకైతే, అసతా + ఏవ = అభావము చేతనే, ఉపసంగ్రహః = కూడగట్టుట, (భవతి = అగును).

తాత్పర్యము— సమాసావస్థకు ముందు (వాక్యమందు) నఞు నివృత్తికి ద్యోత కము. ఉత్తరపదమగు బ్రాహ్మణ శబ్దము నివృత్తితో కూడిన బ్రాహ్మణరూపమైన యర్థమును చెప్పును. ఇట్లు శబ్దములు భిన్నార్థములు. సమాసమున మాత్రము ఉత్తర పదార్థముతో కలిసిన అభావమను ఒకే యర్థము బోధపడును. అనగా నఞు అభావమునకు వాచకమేయగును. ఆ అభావమందే ''క్షత్రియః'' మొదలగు విశేషములన్నియు ఇమిడి పోవును.

వివరణము— వాక్యమందు బ్రాహ్మణాది శబ్దము అభావమునకు వాచకము. నఞు ద్యోతకము. సమాసమందు నఞు అభావమునకు వాచకము. బ్రాహ్మణ శబ్దము ద్యోతకము. అభావమందు క్షత్రియాది భేదములన్నియు ఇమిడియుండును. ఇట్లు నఞర్థము ముఖ్యమగుట వలనను, అందే విశేషములన్నియు నుండుటవలనను, క్షత్రియాదులు సమాసార్థమగుటయు, పూర్వపదార్థము ముఖ్యమగుటయును సిద్ధించును. ॥313॥

అవతారిక— అన్యపదార్థము ముఖ్యమగునప్పటి తీరును వివరింపుచున్నాడు.

శ్లో॥ తే క్షత్త్రియాదిభిర్వాచ్యా వాచ్యా వా సర్వనామభిః ।
యాంతీవాన్యపదార్థత్వం నఞో రూపావికల్పనాత్ ॥ 314

క్షత్రియాదిభిః = క్షత్రియ మొదలగు శబ్దములచే, వాచ్యాః = చెప్పదగిన, వా = లేక, సర్వ నామభిః = సర్వనామ శబ్దములచే, వాచ్యాః = చెప్పదగిన, తే = అవి (ఆ యా విశేషములు) నఞః = నఞ్ణుయొక్క, రూపావికల్పనాత్ = స్వరూపమును ఎరుగనందువలన, అన్యపదా ర్థత్వమ్ = అన్యపదార్థమగుటను, యాంతి + ఇవ = పొందునట్లగును.

తాత్పర్యము— వాస్తవమున అబ్రాహ్మణః, అనునదియే శబ్ద శక్తి ననుసరించి క్షత్రియాది విశేషములను బోధింపగలుగును. మరల క్షత్రియః మొదలగు విశేషపదములను వాడనక్కర లేదు. అయినను నఞ్ణున కిట్టి సామర్థ్యమున్నదని గుర్తింపనందున, విశేషములు స్పష్టపడుటకై, ఒకప్పుడు ''క్షత్రియః'' మొదలగు శబ్దములనుగాని ''సః'', ''అయమ్'' మొదలగు సర్వనామములనుగాని ప్రక్కను పలుకుట జరుగుచుండును. (అబ్రాహ్మణః = క్షత్రియః –లేక– అబ్రాహ్మణః – సః, మొదలగు రీతి). దాని ననుసరించి అవి అన్యపదార్థము లనియు, వానిని బోధించు సమాసమన్యపదార్థ ప్రధానమనియును అనుకొందురు. ఇదియొక విధమైన భ్రాంతి.

వివరణము— నఞ్ణు కేవలము నిషేధమును, బ్రాహ్మణ శబ్దము ''బ్రాహ్మణుడు'' అను నర్థమును చెప్పునని భావించినందున, ''బ్రాహ్మణుడు కాని క్షత్రియుడు మొదలగు వ్యక్తి'' అన్యపదార్థమగునను భ్రాంతి కలుగును. కాని విశేషములను కూడగట్టుకొన్న నఞర్థమే ముఖ్యమన్నపుడు, విశేషములకై వేరుగా ప్రయత్న మక్కరలేదు. అవి స్వార్థములేయగును కాని అన్యపదార్థములు కావు. కాగా విశేషములను చెప్పు శబ్దములను వాడనక్కరలేదు.॥314॥

అవతారిక— నఞ్ సమాసము పూర్వపదార్థ ప్రధానమన్న పక్షమందలి దోష మును చూపుచున్నాడు.

శ్లో॥ విశేషస్యాప్రయోగే తు లింగసంఖ్యే న సిధ్యతః ।
అవర్షాదిషు దోషశ్చ హేమంతోఽన్యాశ్రయో యతః ॥ 315

విశేషస్య = విశేషమునకు, అప్రయోగే + తు = ప్రయోగము లేనపుడు, లింగసంఖ్యే = లింగవచనములు, న + సిధ్యతః = సిద్ధింపవు, అవర్షాదిషు = ''అవర్షాః – హేమంతః'', మొదలగుచోట్ల, దోషః + చ = దోషము కూడ (భవేత్ = కలిగెడిని), యతః = ఎందువలన అనగా, అన్యాశ్రయః = వేరుగానున్న ఆశ్రయము, హేమంతః = హేమంతము (భవతి = అగును).

తాత్పర్యము—పూర్వపదార్థము ముఖ్యమన్నపుడు, విశేషమునుచెప్పు ''క్షత్త్రియః''

మొదలగు శబ్దమును వాడనక్కర లేదందురు. అట్లయినచో సమాసము సామాన్యవాచకమే అయినట్లగునుగాన, సామాన్యమైన నపుంసకలింగమును, ఏకవచనమును మాత్రమే రావలసి వచ్చును. (విశేషపదమును వాడినపుడు దానినిబట్టి సమాసమునకు లింగవచనములు సిద్ధించును గాన ఈ బాధక ముండదు).

అట్లే "అవర్షాః హేమంతః" అనుచోట హేమంతము ఆశ్రయముగా పేర్కొనబడుటచే, దాని ననుసరించి "అవర్షః" అను ప్రయోగమే సాధువు కావలసి వచ్చును. (వర్షా శబ్దమునకు హ్రస్వమును, పుంలింగమును రావలసి వచ్చును).

వివరణము— కాగా నఞ్ సమాసమున పూర్వపదార్థము ప్రధానమన్నచో దోషములు సంభవించుచున్నందున "ఉత్తర పదార్థము ముఖ్యము" అన్న పక్షమే మంచిదని ఫలించును. ఇదియే సిద్ధాంతము కూడ. అయినను "గుణవచనములకు ఆశ్రయమునుబట్టి లింగవచనములగును", అను వచనముయొక్క ఉపయోగము, పూర్వపదార్థము ముఖ్యమను పక్షమందు సంభవించునని విశదముచేయుటకై ఆ పక్షము కూడ చూపబడినది.

విశేష విషయములు— ఇట్లు, 159 వ కారిక మొదలుకొని ఈ కారికవరకును, మహాభాష్యము ననుసరించి ద్వంద్వసమాసము మొదలగు ఆయా ప్రదేశములలోని లింగ వచనముల అతిదేశమును దాని ప్రయోజనమును అతివిపులముగ చర్చింపబడినది. (159 వ కారికలోని విషయముల వరుసమాత్రము మారి చివరినుండి మొదటికి వచ్చినది). ॥315॥

*అవతారిక*— శబ్దముల కర్థము జాతియా ? వ్యక్తియా ? అని శాస్త్రములందు విచారణచేయబడినది. వ్యాకరణశాస్త్రమునను, "సరూపాణా మేకశేష ఏకవిభక్తౌ" (1-2-64) అను పాణిని సూత్ర మహాభాష్యమున నీ విషయము విమర్శింపబడినది. ఆ సూత్ర మేకశేష విధాయకము. రాముడును లక్ష్మణుడును అని చెప్పదలచినపుడు 'రామలక్ష్మణౌ' అందుము. అటులనే ఇద్దరు రాములు అని చెప్పదలంచినపుడు "రామరామౌ" అని యనవలసియున్నది. కాని 'రామౌ' అని ఒక రామశబ్దమునే ప్రయోగింతుము. ఒక వ్యక్తిని బోధించుట కొక శబ్దము. అనేక వ్యక్తులను బోధించుట కనేక శబ్దములను ప్రయోగింపవలెనుగదా యను శంకకు సమాధానముగా నవతరించిన దా సూత్రము.

సమానరూపములగు ననేకశబ్దముల నుపయోగింపవలసి యున్నపుడందొక్కటియే మిగిలి, లోపించిన శబ్దముల అర్థమునుగూడ, ఆ మిగిలిన శబ్దమే బోధించును అని ఆ సూత్రము తెలియచేయుచున్నది. కనుక, 'రామౌ' అని, "రామాః" అనియు నొక రామ శబ్దమే ఇద్దరు ముగ్గురను బోధింపదలచినపుడును ప్రయోగింపబడుచున్నది.

ఈ ఏకశేషవిధాయక సూత్రమును, పతంజలిమహర్షి, తన మహాభాష్యమునందు, ఇది అనావశ్యకమని త్రోసిపుచ్చినాడు. వాజప్యాయనుడని వేరొకముని. అతని మతమున శబ్దములకు జాతియే అర్థము. గోశబ్దమునకు గోత్వము అని అర్థము. ఘటము అనగా ఘటత్వము అని యర్థము. జాతి అనునది ఒక పదార్థము. అది ప్రత్యక్షాది ప్రమాణములచేత

సాధింపబడినది. కావున 'గావౌ' అనిన, అట నుచ్చరింపబడిన, ఒక గోశబ్దమే, ఆ జాతిని బోధింపజాలును. అట్లే, 'ఘటాః' = ఘటములు అనినపుడును ఒక ఘటశబ్దమే ఆ జాతి నంతను బోధించుచున్నది. కనుక ఏకశేషవిధాన మక్కఱలేదని భాష్యకారుని తాత్పర్యము.

ఇపుడొక శంక. జాతికి లింగమును సంఖ్యయును లేవుగదా ! పుం, స్త్రీ, నపుంసక లింగ సంబంధమును ఏకవచనాదివచన సంబంధమును శబ్దముల కెట్లు కలుగును ? అని, దీనికి సమాధానము, "లింగవచన సిద్ధిర్గుణస్యానిత్యత్వాత్" అను వార్తికముచే చెప్పబడినది. గుణములనగా, పుంస్త్వ స్త్రీత్వాదులును, ఏకత్వ ద్విత్వాది సంఖ్యలును, వానితో జాతికి 'ఏకార్థసమవాయము' అను సంబంధము కలదు. అనగా వ్యక్తులందు జాతియును, గుణము లును 'సమవాయము' అను సంబంధముతో నుండును. జాతినే వైయాకరణులు ఆకృతి అనియు వ్యవహరింతురు. అది సకల పదార్థగతము. కాని అది నియతములయిన లింగ సంఖ్యలుగల శబ్దములచేతనే బోధింపబడుచుండును. ఒకానొక జాతి, స్త్రీలింగ శబ్దముచేతను, వేరొకటి పుంలింగ శబ్దముచేతను, అట్లే, ఏకత్వాది సంఖ్యలుగల శబ్దములచేతను తెలియచేయ బడుచుండును. అయ్యది వివక్షాధీనము. అనగా వక్త ఇష్టముచొప్పున జరుగునదియని గుణ వివక్షానిత్యత్వాత్' అను వార్తికము సూచించుచున్నది.

జాతికి లింగవచన సిద్ధి గుణవచన శబ్దములయిన, శుక్లాది శబ్దములకువలె సంభ వింపవచ్చునని పక్షాంతరమును "గుణవచనవద్వా" అను వార్తికము చెప్పుచున్నది. శుక్ల శబ్దము, తెలుపు అను, గుణమును చెప్పును. గుణములకు లింగములేదు వచనములేదు. కాని ఆ గుణముగల ద్రవ్యము వస్త్రము. దానికి అవి యున్నవి. కనుక శుక్ల శబ్దము నపుంసకము. ఆ శుక్ల గుణముగలది శాటి అయిన నది స్త్రీలింగముగాన 'శుక్లాశాటీ' అందురు. పటమయిన, 'శుక్లః పటః' అందురు. ఆ విధముగనే జాతి శబ్దములును ఆ జాతి కాశ్రయములగు వాని లింగవచనములను బొందునని ఈ కారిక చెప్పుచున్నది.

శ్లో॥ ఆకృతిస్సర్వశబ్దానాం యదా వాచ్యా ప్రతీయతే ।
ఏకత్వా దేకశబ్దత్వం న్యాయ్యం తస్యాంచవర్ణ్యతే ॥ 316

సర్వశబ్దానామ్ = అన్ని శబ్దములకును, ఆకృతిః = జాతి, యదా = ఎపుడు, వాచ్యా = శక్యార్థముగా, ప్రతీయతే = తెలియబడుచుండునో, తదా, తస్యామ్ = అపుడు, ఆ జాతి యందలి, ఏకత్వాత్ = ఏకత్వమువలన – అది ఒక్కటే అగుటవలన, ఏకశబ్దత్వమ్ = ఒకే శబ్దముచే నది బోధింపబడుట, న్యాయ్యమ్ = న్యాయయుతమైనదిగా = సోపపత్తికముగా, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— జాతి అనునది ఒకటియే శబ్దమున కర్థము. కావున దానిని బోధించుటకు ఒక శబ్దమే చాలును. కాగా ఏకశేషవిధానముతో బనిలేదు. అర్థభేద ముండినగదా శబ్దమునకు భేదముండదగును ? అర్థము జాతియే. అది ఒక పదార్థమే ఆయె, ఘనుముందు శబ్దమును వినినతోడనే స్ఫురించునది సామాన్యమే. సామాన్యమనినను జాతియే.

''జాతిర్జ్ఞాతంచ సామాన్యమ్''. అవి మూడును పర్యాయములు. ప్రతినియతమగు విశేషము శబ్దమువలన స్ఫురింపదు. సామాన్యమే స్ఫురించును. అదియే శబ్దార్థము. ॥316॥

*అవతారిక*— సకల శబ్దాభిధేయ అగు ఈ జాతి 'అవిష్టలింగ' అనిరి. అనగా దీనిచే లింగ మావేశింపబడియుండునని యర్థము. పుంస్త్వ స్త్రీత్వాది లింగములు మూడును అన్ని పదార్థములందును నుండును అయినను, కొన్ని శబ్దములు, కొన్ని లింగములను మాత్రమే వ్యక్తము చేయును. కాబట్టి ఆ యా శబ్దముల ననుసరించి, జాతి 'నియతలింగ' అగును. ఆ విషయ మీ కారికలో చెప్పబడుచున్నది.

**శ్లో॥ అవిష్టలింగతా తస్యాం స్యాద్గ్రామ్య పశుసంఘవత్ ।
ద్రవ్యభేదేపిచైకత్వాత్తత్రైకవచనం భవేత్ ॥ 317**

**తస్యాం** = ఆ జాతియందు, గ్రామ్య పశుసంఘవత్ = గ్రామీణ పశువుల సంఘములను బోధించువానికి వలె, ఆవిష్టలింగతా = నియతమగు లింగమును గలిగియుండుట, స్యాత్ = సంభవించును, ద్రవ్యభేదే సత్యపి = ద్రవ్యముల కనేకత్వమున్నను, తత్ర = ఆ జాతి యందు, ఏకత్వాత్ = ఏకత్వము = అభేదము ఉండుటవలన, ఏకవచనం, భవేత్ = ఏకవచన ప్రత్యయము, సిద్ధించును.

*తాత్పర్య వివరణములు*— ఏకశేష ప్రకరణమునందు, ''గ్రామ్య పశుసంఘేష్వ తరుణేషు స్త్రీ'' (1-2-73) అను నొక సూత్రము ఏకశేషవిధాయకము గలదు. ''పుమాన్ స్త్రియా'' (1-2-67) అను సూత్రము. స్త్రీపురుష వ్యక్తులను కలిపి చెప్పదలంచినపుడు, ఆసహోక్తిలో, పురుషుని బోధించు శబ్దమే శేషించి స్త్రీనిగూడ బోధించును అని చెప్పుచున్నది ఆ సూత్రమున కిది అపవాదము. 'ఆరణ్యకములు కాని పశువుల స్త్రీపురుష సంఘములను జెప్పదలంచినపుడు, ఆసహోక్తిలో పుంవాచకము శేషింపదు. 'స్త్రీవాచకమే శేషించును' అని దీని యర్థము. ''గావః ఇమాః'' అని యుదాహరణము. 'గావశ్చ గావశ్చ' - అని విగ్రహము. శేషించినది స్త్రీలింగ గోశబ్దము. పుంలింగము గాదు. ఆ విషయమును స్పష్టపరచుటకు 'ఇమాః' అని స్త్రీలింగ విశేషణము చూపబడినది. 'గావః' అను నీ ఏకశేష వృత్తి అగు పదమునకు 'ఎద్దులును, ఆవులును' - అని యర్థము.

ఈ సూత్రమును గూడ భాష్యకర్త ప్రత్యాఖ్యానము చేసివేసెను. జాతివాచక శబ్దములకు లింగనియమము స్వభావసిద్ధము. అది ఆ యా శబ్దముల అభిధాశక్తి నాశ్రయించి యుండును. కనుకనే బ్రాహ్మణశబ్దము, పుం స్త్రీలింగ మాత్రయుక్తము. వృక్ష శబ్దము కేవల పుంలింగమే. శబ్దముల కర్థము జాతి. అర్థమనగా శక్తిచే సిద్ధమయిన అర్థమనుట. వ్యక్తులు అనుమాన ప్రమాణ గమ్యములు. అవి భిన్నభిన్నములయినను, జాతినిబట్టిన సంఖ్య ఏకత్వమే గనుక ఏకవచనము. కాని, ''సంపన్నః వ్రీహిః'' (ధాన్యము సమృద్ధముగ పండినవి) అని చెప్పదలంచినపుడు, ''సంపన్నాః వ్రీహయః'' - అని బహువచనాంత శబ్దప్రయోగము గూడ లోకసిద్ధమగుట వలన, అది సిద్ధించుటకై, ''జాత్యాఖ్యాయామేకస్మిన్ బహువచన

మన్యతరస్యామ్'' (1-2-59) అను సూత్ర మారంభింపబడినది. జాతిని చెప్పదలంచి నపుడు, ఒకే పదార్థమది అయినను, పర్యాయముగ బహుపదార్థములవలె నగునని ఆ సూత్ర మునకు భావము. ॥317॥

*అవతారిక* — జాతికి లింగభేదముండుననిన, అవిష్టలింగత చెప్పబడినదిగదా ; అది యెట్లు కుదురును ? అవిష్టలింగత అనగా నియతముగ నొకే లింగము కలిగియుండుట గదా ! – అనిన–

**శ్లో॥ ఆశ్రయాణాం హి లింగైస్సానియతై రేవయుజ్యతే ।**
**తథా చ యుక్తవద్భావే ప్రతిషేధోనిరర్థకః ॥ 318**

నియతైః ఏవ = నియమము కలవియేఅగు, ఆశ్రయాణాం = జాతికాశ్రయములయిన వ్యక్తుల యొక్క, లింగైః = పుంస్త్వాది లింగములతో, సా, యుజ్యతే = ఆ జాతి, సంబద్ధమై యుండును, తథా చ = కాబట్టియే, యుక్తవద్భావే = లింగవచనములకు చెప్పబడిన యుక్త వదతిదేశమున, ప్రతిషేధః = 'అజాతేః' - అను నిషేధము, నిరర్థకః = ప్రయోజనము లేనిది.

**తాత్పర్య వివరణములు**— పుంస్త్వాది లింగములు, ఏకత్వాది సంఖ్యలు, అను గుణములతో పాటు, వ్యక్తులయందు జాతియును సమవాయమను సంబంధముచే సంబద్ధమై యుండును. ''లుపియుక్తవత్ వ్యక్తివచనే'' (1-2-51) అని యొక సూత్రము. ఉదాహర ణము 'పంచాలాః' - అనునది. పంచాలదేశీయుల నివాసమయిన జనపదమని యర్థము. ఈ అర్థమునందు ఒక తద్ధిత ప్రత్యయమును విధించి, దానికి, 'జనపదే లుప్' (4-2-81) అను సూత్రముచేత నా ప్రత్యయమునకు లుప్పు = లోపము చెప్పబడినది. కాగా ప్రత్యయ ముండదు. ప్రకృతి మాత్రమే యుండును. ప్రకృతికి పంచాలదేశ మర్థము. ప్రత్యయమునకు 'వారి నివాసము' - అని యర్థము. దేశవాచకమగు పంచాల శబ్దము బహువచనాంతము. ప్రత్యయమునకు లుప్పు = ప్రత్యయలోపము ఆ పదముచే విధింపబడినపుడు, లుబంతమునకు లింగవచనములు, ప్రకృతి లింగవచనములే యుండునను పై అతిదేశమువలన, 'పంచాలాః' అని బహువచనాంతమే సాధుశబ్ద రూపము.

ఇక, 'పంచాలాః జనపదః' = పంచాలదేశము వారి నివాసము - జనపదము, అని ప్రయోగించినపుడు, 'పంచాలాః' - అను దానికి జనపదము విశేషణము. విశేషణ పద మేల బహువచనాంతము ప్రయోగింపబడలేదు ? అనిన, జాతివాచకములు కాని విశేషణము లకే వ్యక్తివచనములు వచ్చునని, ''విశేషణానాం చాజాతేః'' (1-2-52) అను సూత్రము చెప్పుచున్నది. జనపద శబ్దము జాతివాచి కావున బహువచనము లేదు. రమణీయ శబ్దము విశేషణమగుననుకొనుడు. అపుడది జాతిశబ్దము కాదుగాన 'పంచాలాః రమణీయాః' - అనియే ప్రయోగము.

ప్రకృతమున - జాతిశబ్దములు తమ తమ శక్తివిశేషముచేత, ఆ యా నియత

శ్లో॥ జ్ఞానశబ్దార్థ విషయా విశేషా యే వ్యవస్థితాః।
తేషాం దురవధారత్వాత్, జ్ఞానాద్యేకత్వ దర్శనమ్ ॥ 101

జ్ఞాన శబ్దార్థవిషయాః = జ్ఞానము, శబ్దము, అర్థము ఇవి విషయముగాగల అనగా వానియందున్న, యే = ఏ, విశేషాః = అసాధారణమగు ధర్మములు అనగా స్వరూపములు, వ్యవస్థితాః = నిశ్చితములై అనగా ప్రమాణసిద్ధములై యున్నవో, తేషామ్ = ఆ విశేషములు, దురవధారత్వాత్ = తెలిసికొనుటకు శక్యములు కానందున, జ్ఞానాద్యేకత్వదర్శనమ్ = జ్ఞానము మున్నగు వానికి ఏకత్వబుద్ధి కలుగుట జరుగుచున్నది.

ఘటము, పటము మున్నగు అర్థములు అనగా వస్తువులున్నవి. వానిని బోధించెడి 'ఘటము, పటము' మున్నగు శబ్దములు కలవు. ఆ శబ్దముల వలన ఘటము మున్నగు అర్థములు విషయముగా గల జ్ఞానములు కలుగుచున్నవి.

జ్ఞానములు పరస్పరము భిన్నములు, ఒకదానిని పోలియున్నది మరియొకటి యుండదు. 'ఘట' అను శబ్దము బహువిధమే. వానికి పోలిక లేదు. కోట్లకొలది ఘటవ్యక్తులుండవచ్చును. అవియు పరస్పరము భిన్నములే, వానికి ఏమియు పోలిక యుండనేరదు.

కాని జ్ఞానములకు, అట్లే శబ్దములకు, అట్లే అర్థములకు వానిలోనే వానికి కల భేదము సామాన్య ప్రజలచే గుర్తింపనలవి కానందున, ఎల్ల జ్ఞానములు ఏకరూపములే యని, ఎల్ల ఘట శబ్దములు ఏకరూపములే యని, ఎల్ల ఘటవ్యక్తులు ఏకరూపములే యనియు వివేకము లేని ప్రజలు భావించుచున్నారు.

వివేకము కలవారికి మాత్రము జ్ఞాన శబ్దార్థములకు కల భేదము స్పష్టముగ గోచరించును. ॥101॥

*అవతారిక* — 99, 100, 101 మూడు శ్లోకములచే బౌద్ధమతము నాశ్రయించు స్వతః జాతి లేదనియు జ్ఞాన శబ్దార్థములకు ఏకత్వము లభింపదనియు, ఏకత్వము భ్రమ మూలకమనియు నిరూపించియున్నాడు.

ప్రస్తుతము ఆ మతమును ఖండించుచున్నాడు.

శ్లో॥ జ్ఞానేష్వపియథాఽర్థేషు తథా సర్వేషు జాతయః।
సంసర్గదర్శనే సన్తి, తాశ్చార్థస్య ప్రసాధికాః ॥ 102

సంసర్గ దర్శనే = సంసర్గ* సిద్ధాంతమున అనగా బ్రహ్మమునందు అనంతములగు భిన్న శక్తులు కలవు. అవి ప్రత్యేకము కార్యమును కలిగింపలేవు. అవి పరస్పరము కలసియే కార్య సాధకము లగును అను సిద్ధాంతమున, యథా = ఏ రీతిగా, అర్థేషు = కడవ మున్నగు

* ఈ సిద్ధాంతము ఈ సముద్దేశముననే 21వ శ్లోకముచే నిరూపింపబడినది. ఇది జాతి వాదమునకు మూలము.

లింగములనే గ్రహించునుగాని, ప్రకృతి లింగవచనములను పొందనే పొందవు కావున ''అజాతేః'' అను ప్రతిషేధ మనావశ్యకమని తాత్పర్యము.

వృక్షః, పాదపః, తరుః శింశపా, పనసమ్ - ఈ శబ్దములు వృక్షజాతి వాచకములు. అందు వృక్ష, పాదప, తరు, అనునవి వృక్షత్వ జాత్యాశ్రయముల పుంలింగమునే కలిగియుండును. శింశపా - స్త్రీలింగము. పనసమ్ - నపుంసకము. కొన్ని శబ్దములు ద్విలింగములు. కొన్ని త్రిలింగములు. అది వాని వాని శబ్దశక్తి భేదమునుబట్టి యుండును. అవిష్టలింగత అన నిదియే. ॥318॥

*అవతారిక*— గుణవచన శబ్దములగు శుక్లాదులందువలె, జాతి, స్వాశ్రయగత లింగమును గ్రహించునంటిరి గదా ! అపుడు జాతికి, తనదిగా నెట్టి లింగసంబంధమునులేదని యర్థము. అది ద్రవ్యధర్మముగదా ! అని ప్రశ్న. సత్యమే. లింగసంబంధము శబ్దసంస్కార మాత్రమే. కనుకనే నియత పుంలింగమైన పాదపశబ్దమునకు, 'పాదపః శింశపా' అనియు, 'పాదపః పనసమ్' అనియు నిట్లు భిన్నలింగ శబ్దములతో సామానాధికరణ్య మగపడుచున్నది.

సకల పదార్థములకును, సత్వరజస్తమోగుణముల, ఉపచయము, అపచయము, స్థితి - అను మూడు ప్రవృత్తులును, నియతముగ నుండును. అవియే క్రమముగ శాస్త్రీయములగు పుం, స్త్రీ, నపుంసక లింగములు. శాస్త్రీయ లింగమునుబట్టియే జాతికి అవిష్టలింగత. ఈ విషయము నీ కారిక వ్యాఖ్యానించును.

శ్లో॥ సర్వత్రావిష్టలింగత్వం లోకలింగపరిగ్రహే ।
విరోధిత్వాత్ ప్రసజ్యేత నాశ్రితం తచ్చలౌకికమ్ ॥ 319

లోకలింగ పరిగ్రహే = లోకవ్యవహారమున రూఢమైన లింగమును గ్రహించిన, అవిష్టలింగత్వం = నియతలింగత్వము, సర్వత్ర, ప్రసజ్యేత = సకలార్థములందును, ప్రాప్తించును, తత్ = అందువలన, విరోధిత్వాత్ = విరుద్ధమగుటవలన = విరోధమువలన, లౌకికం = లోకప్రసిద్ధమగు లింగము, న ఆశ్రితమ్ = ఆశ్రయింపబడలేదు.

తాత్పర్య వివరణములు— స్తనకేశములు కలిగియుండుట, లోకమునందు, స్త్రీత్వము లోమవత్త్వము పుంలింగము. ఈ లింగము నాశ్రయించినచో స్తనకేశ సంబంధము గల స్త్రీ, స్త్రీలింగ శబ్దములచేతనే బోధింపబడవలసి యుండును. పుంలింగమైన దారశబ్దము చేతనుగాని, నపుంసకలింగమగు కళత్రశబ్దముచేతగాని భార్య అను నర్థము చెప్పబడకపోవలసి వచ్చును. అశ్వమును వాహనశబ్దము చెప్పకపోవును. అది నపుంసకముగదా !

అందువలన వైయాకరణులు, లింగవిషయమున నొక స్వీయ సిద్ధాంతమును ఏర్పరచుకొనవలసి యుండును—

''తస్మాత్ న వైయాకరణైః శక్యం లౌకికం లింగమాస్థాతుమ్ ।
అవశ్యం కశ్చిత్ స్వకృతాంత ఆస్థేయః ॥'' అని భాష్యము

లింగము అర్థమందుండును. శబ్దమునందుగాదు. ఏ పదార్థమునైనను, మనము, 'అయం పదార్థః' 'ఇయం వ్యక్తిః' 'ఇదం వస్తు' - అని, పుంలింగ పదార్థపదముచేతను, స్త్రీలింగ వ్యక్తిపదముచేతను, నపుంసక లింగవస్తు పదముచేతను వ్యవహరించుచున్నాము. (ఘట పదార్థమందుము. ఘటవ్యక్తి, ఘటమను వస్తువు అని అనుచుందుము). కనుక సకల పదార్థములకును లింగత్రయ సంబంధము సిద్ధించుటకు వైయాకరణులు తామొక పారిభాషిక లింగమును తప్పక ఆశ్రయింపవలెనని భావము. ॥319॥

అవతారిక— లౌకిక లింగమున కంతట సంభవమును లేదు.

శ్లో॥ సామాన్య మాకృతిర్భావో జాతిరిత్యత్ర లౌకికమ్।
లింగం న సంభవత్యేవ తేనాన్యత్ పరిగృహ్యతే॥ 320

సామాన్యమ్ = సామాన్యము = జాతి, ఆకృతిః = ఆకృతి = అవయవముల సన్నివేశము = జాతి, భావః = సామాన్యము = జాతి, జాతిః = సామాన్యము = జాతియే, ఇతి అత్ర = అను నీ నాలుగు పదముల అర్థమందును, లౌకికం లింగం = లోకప్రసిద్ధమయిన స్తనకేశ వత్త్వము, లోమవత్త్వమును, నసంభవత్యేవ = సంభవింపనే సంభవింపదు, తేన అన్యత్ = అందుచేత, వేఱొక శాస్త్రీయలింగము, పరిగృహ్యతే = గ్రహింపఁబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ఈ నాలుగు పదములకును జాతియే అర్థము. అందు భావశబ్దము పుంలింగము. జాతి ఆకృతి శబ్దములు స్త్రీలింగములు. సామాన్య శబ్దము నపుంసకము. ఇట్లు భిన్న భిన్న లింగములు గల శబ్దములు, ఒకే పదార్థమును, 'జాతి' అను దానిని చెప్పుచున్నవి. స్తనకేశవత్త్వముగాని, లోమవత్త్వముగాని ఆ పదార్థమునకు సంభవింపదు. అపుడా శబ్దములకు ఏ లింగమును లేకపోవలసి వచ్చును. అందువలన శాస్త్రీయ లింగాశ్రయణ మావశ్యకమని తాత్పర్యము.

కేశమనగా భగము, లోమ అనగా పురుషగుహ్యము. అని వ్యాఖ్యాతలు. "స్తన కేశవతీ స్త్రీస్యాల్లోమశః పురుషః స్మృతః". ॥320॥

అవతారిక— 'లోకనిరూఢముగాని, కేవల స్వసిద్ధాంత సిద్ధమైన, ఆలింగ మేది? అని మహాభాష్యమున ప్రశ్నించి, "సంస్త్యాన ప్రసవౌలింగమ్" అని సమాధానము చెప్ప బడినది - ఆ గ్రంథ వ్యాఖ్యానరూప మీ కారిక.

శ్లో॥ ప్రవృత్తిరితి సామాన్యం లక్షణం తస్యకథ్యతే।
ఆవిర్భావ స్తిరోభావః స్థితిశ్చేత్యథభిద్యతే॥ 321

ప్రవృత్తిః ఇతి = పరిణామము, అని, తస్య = ఆ శాస్త్రీయలింగమునకు, సామాన్యం లక్షణం = సామాన్య లక్షణము, కథ్యతే = చెప్పబడుచున్నది, అథ, తత్ = తరువాత, అది, ఆవిర్భావః = ఉపచయము = వృద్ధి, తిరోభావః = అపచయము = తగ్గుదల, స్థితిః చ = సమత్వమున్ను, ఇతి = అని, భిద్యతే = భేదమును పొందుచున్నది.

తాత్పర్య వివరణములు— మహాభాష్యమున "సంస్త్యానప్రసవౌ లింగమ్" అని వార్తికము. అది లింగలక్షణ బోధకము. స్త్రీ అను శబ్దము, స్త్యై ష్ట్యై = శబ్ద సంఘాతయోః అను ధాతువునుండి ఏర్పడినది.

స్త్యాయతి అస్యాంగర్భః ఇతి స్త్రీ - అని విగ్రహము. ఈ వ్యక్తియందు, గర్భము అనగా శుక్రము, శోణితముతో సంహతమగుచున్నది = కలియుచున్నది కావున ఈ వ్యక్తి స్త్రీ అనబడును.

'సూతే ఇతి ప్రసవః' అనగా పురుషుడు. సూతే అనగా శుక్రంత్యజతి = శుక్రమును విడుచువాడు కాగా ప్రసవః అనబడును.

ఇది లోకప్రసిద్ధమగు నర్థము. ఇక శాస్త్రమునందు, సంస్త్యాన ప్రసవ శబ్దములు రెండును భావార్థకములు. స్త్రీ = స్త్యానము = అపచయము = హ్రాసము = తగ్గుదల. ప్రసవః = పుమాన్ = పుంస్త్వము = ప్రవృత్తి = వృద్ధి.

దేనియొక్క ఉపచయాపచయములు ? = వృద్ధిహ్రాసములు ? అనగా - శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము. అను, గుణముల వృద్ధిహ్రాసములు.

శబ్ద స్పర్శాదులు, సత్వరజస్తమోగుణముల పరిణామరూపములు. సకల పదార్థములును, పైన చెప్పిన సంస్త్యాన ప్రసవములు కలవియే. అవి సతతము మారుచునే యుండును. ఏదియు నిలుకడగ నుండదు. పెరుగదగినంత పెరుగును. లేదా తరుగును. అందు, రజోగుణమునకు, ప్రవృత్తి అనునది ధర్మము. అయ్యది ప్రధానమైయున్నపుడు ప్రాదుర్భావమును, తమస్సు ప్రధానమైనపుడు తిరోభావమును అనబడును. ఆ మూడు గుణములును సమపాళ్లలో నుండుట 'స్థితి' అందురు. అది నపుంసకము = స్త్రీపుంస నిషేధరూపము. స్త్రీ కాదు. పురుషుడును గాదు. "నస్త్రీ, నపుమాన్" = నపుంసకమ్. కనుకనే నపుంసక లింగమునకు వేరుగ లక్షణమును జెప్పలేదు.

ఉపచయాపచయావస్థలందును, స్థితి అనునది ఉండునుగాన, నపుంసకమును 'లింగ సర్వనామ' అనిరి. నామములలో, సర్వనామ అనునట్లు లింగములలో సర్వనామ. ఇవి సకల పదార్థ సాధారణములయినచో, లింగవ్యవస్థ ఎట్లు ? అని శంకించి, 'వివక్షాతః' అని సమాధానము చెప్పిరి. వక్తలంఘనుబట్టి అని భావము. ఉపచయ వివక్షలో - పుంలింగము. అపచయమును వివక్షించిన, స్త్రీలింగము. దేనిని వివక్షింపకున్న, నపుంసకము. అని వ్యవస్థ. ॥321॥

అవతారిక— ఈ లింగము సకల పదార్థములను వ్యాపించియుండునని మహాభాష్యమున చెప్పిన విషయమును వివరించునది "ప్రవృత్తిమంతః" - అను నీ కారిక.

**శ్లో॥ ప్రవృత్తిమంతః సర్వేర్థాః తిసృభిశ్చ ప్రవృత్తిభిః ।**
**సతతం న వియుజ్యన్తే వాచస్త్వైవాత్ర సంభవః ॥ 322**

తిస్రృభిః=అవిర్భావము, తిరోభావము, స్థితి అను మూడు, ప్రవృత్తిభిః=ప్రవృత్తులతోడను, సర్వే=అన్ని, అర్థాః=పదార్థములును, సతతం=ఎల్లపుడును, నవియుజ్యన్తే=వియుక్తములు కావు, ప్రవృత్తిమంతశ్చ=నిత్యము ప్రవృత్తికలవియే యగుచుండును, అత్ర ఏవ=ఇట్టి పదార్థములందే, వాచః=శబ్దమునకు, సంభవః=అవకాశము=విషయభావము. (బోధ్యమయిన విషయము).

తాత్పర్య వివరణములు—

''ప్రవృత్తిః ఖల్వపినిత్యా। న హి కశ్చిత్ స్వస్మిన్నాత్మని
ముహూర్తమప్యవతిష్ఠతే। వర్ధతే యావ దనేన వర్ధితవ్యమ్'' ॥

అపాయేన వా యుజ్యతే అని మహాభాష్యము. ప్రవృత్తి అనగా పరిణామము=మారుచుండుట, అది నిత్యము. ఏ పదార్థమును, మారకుండగ క్షణకాలము కూడ నుండదు. పెరిగినంత పెరుగును. తరిగినంత తరుగుచుండును. కావున వానికి ప్రతిక్షణమును అవస్థాంతరమును బొందుట స్వభావము. పరిణామములేనిచో అవస్థల మార్పుండదు గదా. ''సర్వాశ్చ పునర్మూర్తయ ఏవమాత్మికాః సంస్త్యాన ప్రసవగుణాః అని భాష్యము. సకలమూర్తులును=వస్తువులును, ఉపచయాపచయములు కలిగియే ఉండును. ఇటువంటి సతత పరిణామి పదార్థములే శబ్దములకు విషయము. పరిణామరహితమై శుద్ధముగ నుండు వస్తుతత్త్వమేదియు వాగ్విషయము కాదు.

అది ఆకారము కలదియై యున్ననే శబ్దము దానిని బోధించును. కనుక ఈ లింగ సంబంధము సర్వశబ్దములకును, శబ్దశక్త్యనురోధముగ సంగతమే యగును. ॥322॥

అవతారిక— పకృతితత్త్వము సత్వరజస్తమోగుణమయము. అందు రజోగుణము దానికి సతత ప్రవృత్తిని కలిగించును. ఆ ప్రకృతియొక్క వికారములే - మార్పులే - మారురూపములే, మనకు భోగయోగ్యముగనున్న వస్తుజాతము. ఆ వస్తువులును సతత పరిణాములే. కాని భోక్తయగు పురుషుడు, భోగ్యవస్తువులకంటె విలక్షణుడు. ఈతడు చేతనుడు. అవి అచేతనములు. ఈతడు నిర్గుణుడు. కావుననే పరిణామము లేనివాడు.

అయినను, నియతలింగములయిన, ఆత్మ, చితి, చైతన్యము. అను పుం, స్త్రీ నపుంసక లింగశబ్దములచేత చెప్పబడుచున్నాడే అది యెట్లు? శుద్ధము పరిణామ రహితమును అగు వస్తువు వాగ్విషయము కాదంటిరిగదా! అను శంకకు సమాధానపరముగా ఈ కారిక రచింపబడినది.

శ్లో॥ యశ్చాప్రవృత్తి ధర్మాఖ్యః చితిరూపేణ గృహ్యతే।
అనుయాతీవసోఽన్యేషాం ప్రవృత్తీర్విష్వగాశ్రయః॥ 323

అప్రవృత్తిధర్మా=పరిణామము అను ధర్మములేని, యః అర్థః=ఏ వస్తువు=అనగా పురుషుడు, చితిరూపేణ=కేవల చైతన్యరూపముగా, గృహ్యతే=యోగులచే గ్రహింపబడు

చున్నాడో, విష్వగాశ్రయః సః = సకల పదార్థములయందునున్న, ఆ పురుషుడు, అన్యేషాం ప్రవృత్తీః = ఇతరములగు భోగ్యవస్తువుల పరిణామములను, అనుయాతీవ = అనుభవించు నట్లగపడును.

తాత్పర్య వివరణములు— అంతఃకరణమను నర్థమునందు చైతన్యముయొక్క ఛాయ సంక్రమించును. అందువలన దానికి భోగ్యత ఏర్పడును. కావున, వ్యవహార దశలో చైతన్యమనునది స్వతః పరిణామరహితము అయినను, భోగ్యము అను, భావముచేత శబలితమై రంజితమయియే గ్రహింపబడును. అది జ్ఞానమునకు విషయము కానిచో = అందనిచో, దానిని శబ్దము బోధించుట అనునదియే సంభవింపదు. కావున ఆచైతన్యము, భోగ్యవస్తువుల పరిణామ విశేషములనుబట్టి లింగసహితము నగును. ఆ యా వస్తువుల ఆకారముతో అంతఃకరణ వృత్తులు, చైతన్యమునందు ప్రతిబింబించునని భావము. (ఇట కారికలో 'విష్వగాశ్రయః' అనియే పాఠము. బహువచనాంత పాఠ మపపాఠము). ॥323॥

అవతారిక— ఈ విషయము నింకను వివరించునదియే ఈ కారిక.

శ్లో॥ తేనాస్య చితిరూపంచ చితికాలశ్చభిద్యతే ।
తస్య స్వరూపభేదస్తు న కశ్చిదపి విద్యతే ॥ 324

తేన = ఆ భోగ్య వస్తుజాతముచేత, అస్య = ఈ భోక్తయొక్క, చితిరూపంచ = చైతన్య స్వరూపమును, చితికాలః చ = చైతన్య కాలమును, భిద్యతే = వేరుగా గ్రహింపబడును, తస్య = ఆ భోక్తయొక్క, స్వరూపభేదః తు = స్వరూపమున భేదము మాత్రము, కశ్చిదపి, న విద్యతే = ఏదియును లేదు.

తాత్పర్య వివరణములు— 'జ్ఞానము' అనునది ఒక్కటియే. కాని ఆ జ్ఞానము నకు విషయములయిన ఘట పటములనుబట్టి, ఘట జ్ఞానమనియు, పట జ్ఞానమనియు, భేద మును వ్యవహరింతుము.

ఆ విధముగను, చైతన్యమనునది ఒక్కటియే. అది అవిచ్ఛిన్నముగ నుండునది. దానికి దేశకాలభేదముగాని స్వరూపభేదముగాని లేదు. భోగ్యములు భిన్న భిన్నములగుటవలన వాని భేదములనుబట్టి దానికి భేదవ్యవహారము. కాగా పురుషుడు వేరు, చితిక్రియ వేరును గావు. భేదము కల్పనయే. ॥324॥

అవతారిక— పరమార్థమగు చైతన్యరూపము వ్యవహారమునకు గోచరము కాదు. అను విషయము నీ కారిక బోధించుచున్నది.

శ్లో॥ అచేతనేషు సంక్రాంతం చైతన్యమివదృశ్యతే ।
ప్రతిబింబకధర్మేణ యత్తచ్ఛబ్ద నిబంధనమ్ ॥ 325

యత్, చైతన్యం = ఏ చైతన్యము, ప్రతిబింబకధర్మేణ = ప్రతిబింబ న్యాయముచేత, అచేత

నేషు = జడపదార్థములందు, సంక్రాంతమివ = సంక్రమించినట్లు, దృశ్యతే = కనబడునో, తత్ = అది, వాచః = శబ్దవ్యవహారమునకు, నిబంధనమ్ = విషయమగునది.

తాత్పర్య వివరణములు— మనము మన ముఖము నద్దమునందు చూచుకొనుచున్నాము. అది అద్దమున లేదు. దర్పణముయొక్క స్వచ్ఛతవలన అందది లగ్నమైనట్లు కనబడుచున్నది.

ఆ విధముగినే, అచేతనములయిన అంతఃకరణాదులందు చైతన్యము సంక్రమించినట్లు భాసించును. మరియు, భోగ్యములయిన వస్తువుల పరిణామముల ననుసరించి తానును లింగసంబంధమును బొందును. నిర్వికారము, స్వయంప్రకాశము, పరిణామ శూన్యమునగు చితిశక్తి వ్యవహారగోచరము కాదు. ॥325॥

అవతారిక— ఈ విధముగ లింగసంబంధ మవర్జనీయముగాన నది లేని అవస్థయే ఉండదని ఈ కారిక చెప్పుచున్నది.

శ్లో॥ అవస్థా తాదృశీనాస్తి యాలింగేన నయుజ్యతే ।
క్వచిత్తు శబ్దసంస్కారో లింగస్యానాశ్రయేసతి ॥ 326

యా = ఏ అవస్థ, లింగేన = పుంస్త్వాది లింగముతో, నయుజ్యతే = కూడియుండదో, తాదృశీ = అటువంటి, అవస్థా, నాస్తి = అవస్థ = స్థితి, లేనేలేదు, కింతు = కాని, క్వచిత్, లింగస్య = కొన్ని స్థలములందు, లింగమునకు, అనాశ్రయేసతి = అవివక్ష కలిగినపుడు, తత్ = ఆ లింగము, శబ్దసంస్కారః భవతి=శబ్దమునకు సంస్కారము మాత్రమే అగును.

తాత్పర్య వివరణములు— భోక్తం భోగ్యము అని రెండే పదార్థముల అవస్థలు. ఆ రెండవస్థలయందును లింగసంబంధము ప్రతిపదార్థమునకును నుండును. ఉపచయము, అపచయము, స్థితి అను నివి సకల పదార్థ సాధారణములుగాన జాతికిని లింగయోగముండునని, అది బాధితముగాదని తాత్పర్యము. కొన్ని స్థలములందు అది వివక్షింపబడును. అపుడు దానిని బోధించు ప్రత్యయము సంస్కారమాత్రార్థము. ప్రత్యయములేని కేవల ప్రకృతి ప్రయోగార్హము కాదుగదా. ॥326॥

అవతారిక— ''లింగవిరహితావస్థయే సంభవింపదని చెప్పి దానిని విశదీకరించునది ఈ కారిక.

శ్లో॥ కృత్తద్ధితాభిధేయానాం భావానాం న విరుధ్యతే ।
శాస్త్రే లింగం గుణావస్థా తథాచాకృతిరిష్యతే ॥ 327

శాస్త్రే = శాస్త్రమునందు పరిభాషింపబడియున్న, గుణావస్థా = సత్వాదిగుణముల అవస్థ అను, లింగం = లింగమనునది, కృత్, తద్ధిత అభిధేయానాం = కృదంతతద్ధితాంతములం దా

ప్రత్యయములచేత చెప్పదగిన, భావానాం = భావములకు, న విరుధ్యతే = విరుద్ధము కాదు, తథా చ, ఆకృతిః = కాబట్టి లింగజాతి యొకటి, ఇష్యతే = అంగీకరింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— రూపము, రసము మున్నగు గుణములు, సత్త్వరజస్తమస్సుల పరిణామ రూపములు. వాని, ఆవిర్భావము, తిరోభావము, స్థితి, అను నవస్థలు లింగములు.

పాకః - పక్తిః - పచనమ్ - ఈ మూడు పదములును, 'వంట' అను, భావమును చెప్పును. భావమనగా భావన = ఉత్పాదన = క్రియ. ఆ క్రియ అనునది ఒక్కటియే అయినను, అవస్థలభేదమునుబట్టి వేరయి, వేరు వేరు లింగములుగల శబ్దములచే చెప్పబడుచున్నవి. పై మూడు శబ్దములును, ఘఞ్, క్తిన్, ల్యుట్ అను ప్రత్యయములు భావార్థకములు అంతమందు గలవి. అవి క్రమముగా, పుంస్త్రీ నపుంసకలింగములు.

గరిమా, (పుం) గురుతా (స్త్రీ) గురుత్వమ్ (న) ఇవి తద్ధితాంతములు. ప్రత్యయములు బావార్థకములు. వీనిచే చెప్పబడు భావములును అట్టివే. గుణావస్థ అను లింగము, కృత్తద్ధితాభిధేయములగు భావములకు విరుద్ధము కాదు. అందువలన, ప్రవృత్తిత్వమను లింగజాతి యొకటి కలదనుట. ॥327॥

అవతారిక— ఇక, ఈ గుణావస్థ అను లింగమునకు, ఆకృతి పక్షమునందును, వ్యక్తి పక్షమునను, భేదము లేదు అని నిరూపించుచున్నారు.

శ్లో॥ లింగంప్రతి నభేదోస్తి ద్రవ్యపక్షేఽపికశ్చన ।
తస్మాత్ సప్తవికల్పా యే సైవాత్రావిష్టలింగతా ॥ 328

లింగంప్రతి = లింగము విషయమున, ద్రవ్యపక్షేపి = ద్రవ్యము పదార్థము అను పక్షమునందును, కశ్చన భేదః = ఏదియు, భేదము, న అస్తి = లేదు, తస్మాత్ = అందువలన, యే సప్తవికల్పాః = ఏ, ఏడు వికల్పములు చెప్పబడినవో, సైవ అత్ర = అవి కలిగియుండుటయే, ఇచట, ఆవిష్టలింగతా = నియతలింగత అగును.

తాత్పర్య వివరణములు— శబ్దములు తమ తమ శక్తిని పురస్కరించుకొని, జాతినిగాని వ్యక్తినిగాని, నియతమగు లింగముకల దానిని ప్రతిపాదించును. కాఁగా పక్షద్వయమునను, లింగవిషయమున నెట్టి భేదమును లేదు. 'జాతి ఆవిష్టలింగ' - అని చెప్పబడియున్నది. అనగా ఒక లింగమే కలది అని యర్థము కాదు. లింగసముద్దేశమునందు, "ఉపాదాన వికల్పాశ్చ లింగానాం సప్తదర్శితాః" అని చెప్పబడిన, సప్తవికల్పముల ప్రకారము, నియతలింగోపాదానమే ఆవిష్టలింగత, లింగమనునది శబ్ద బోధ్యమగు వస్తువుయొక్క ధర్మము. వస్తుమాత్ర ధర్మమ్ కాదు అనగా శబ్ద ప్రతిపాద్యముకాని, దాని ధర్మము కాదు. ॥328॥

అవతారిక— ద్రవ్య పక్షమునకు జాతి పక్షముతో సామ్యము లింగవిషయమున నిట్లు సమర్థించి, వచన విషయమునను దానిని సమర్థించుచున్నారు.

**శ్లో॥ వచనేనియమః శాస్త్రాత్ ద్రవ్యస్య అభ్యుపగమ్యతే।**
**యత స్తదాకృతౌ శాస్త్రమన్యథైవ సమర్థ్యతే ॥ 329**

ద్రవ్యస్య = వ్యక్తికి, వచనే = ఏక, ద్వి, బహువచనముల విషయమున, నియమః = నియతత్వము, యతః = ఏ, శాస్త్రాత్ = శాస్త్రమువలన, అభ్యుపగమ్యతే = అంగీకరింపబడుచున్నదో, తత్, శాస్త్రం = ఆ శాస్త్రము, ఆకృతౌ = జాతి పదార్థము - అను పక్షమునందును అన్యథైవ = వేఱొక రీతిగనే, సమర్థ్యతే = సమర్థింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ద్రవ్యమునందు, ఏకత్వ ద్విత్వబహుత్వ సంఖ్యలుండును. కాని, ప్రయోగములం దచ్చటచ్చట వ్యత్యాసమును అగపడుచున్నది. ఎట్లనగా— 'పంచాలాః' = పంచాలదేశీయుల నివాసమగు జనపదము. 'గోదౌ' = అది యొక గ్రామము. అని ప్రయోగములున్నవి. జనపద మొక్కటియే అయినను, దానిని బోధించు శబ్దము బహువచనాంతముగ నున్నది. గ్రామ మొక్కటియే. 'గోదౌ' అనునది ద్వివచనాంతము. ఈ రీతి వ్యత్యాసము ఇతర శబ్దముల విషయమునను, ప్రాప్తించునేమో యని, దానిని వారించుటకు, ''బహుషు - బహువచనం'' (1-4-21) అను మున్నగు, వచన నియామక శాస్త్రము లావశ్యకములైనవి ఆకృతి పదార్థము. అను పక్షమునందు, శ్రీ శాస్త్రముల కిట్లు అర్థము చెప్పవలసియుండును. ఎట్లనగా— ''ఒక వ్యక్తియందు గల జాతి వివక్షితమైనపు డేకవచనము. ద్వి, బహువ్యక్తుల జాతివివక్షలో, ద్వివచన బహువచనములు - అని యీ రీతిగ నర్థ వర్ణనముచేసి జాతికి గూడ వచనోపకారమును సమర్థింపవలెనని భావము. ॥329॥

అవతారిక— ఆ సమర్థన ప్రకారమే ఈ కారికచే వివరింపబడుచున్నది.

**శ్లో॥ వర్తతే యోబహుష్వర్థో భేదే తస్యవివక్షితే।**
**స్వాశ్రయైః వ్యపదిష్టస్య శాస్త్రేవచన ముచ్యతే ॥ 330**

యః అర్థః = ఏ, అర్థము = జాతి, బహుషు, వర్తతే = అనేక వ్యక్తులందుండునో, తస్య, భేదే, వివక్షితే = దానికి, అనేకత్వమును చెప్పదలంచినపుడు, శాస్త్రే = ''బహుషు బహువచనమ్'' - మున్నగు శాస్త్రమునందు, స్వాశ్రయైః = జాతికి ఆశ్రయములగు వ్యక్తులచేత, వ్యపదిష్టస్య = వ్యవహరింపబడిన దానికి, వచనం ఉచ్యతే = ఏకవచనాదికము, విధింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— జాతి అను పదార్థ మొకటి, అనేకములగు వ్యక్తులందు సమవాయమను సంబంధముచే సంబద్ధమై యుండును. కాగా దానికి, ఆశ్రయభేదము వలన భేదమును కల్పించి, ఏకత్వ, ద్విత్వ, బహుత్వ సంఖ్యలచే పరిచ్ఛేదింపబడిన వ్యక్తులయందుండు జాతిని బోధించుచు, ఆయా వచనములను, ''ద్వ్యేకయోః ద్వివచనైకవచనే''

(1-4-22) ''బహుషు బహువచనమ్'' (1-4-21) మున్నగు శాస్త్రములు విధించును అని భావము.

ద్రవ్యవాది, ద్రవ్యగత సంఖ్యా వివక్షలో వచనములు విధింపబడునని చెప్పును. జాతివాది, ఏకత్వ ద్విత్వబహుత్వ సంఖ్యలుగల వ్యక్తులయందలి జాతిని వివక్షించిన ఆ యా వచనములగును. అంతే భేదము అని భావము. ॥330॥

*అవతారిక*— ఈ ప్రకారముగా ఆశ్రయభేదముచే జాతికిని భేదమును ఆపాదించిన జాతి వ్యక్తి పక్షములకు భేదమే లేకపోవునే ?

**శ్లో॥ యదాత్వాశ్రయ భేదేన భేదఏవ ప్రతీయతే ।**
**ఆకృతేర్ద్రవ్యపక్షేణ తదా భేదో న విద్యతే ॥** 331

యదాతు, ఆకృతేః = ఎపుడైతే జాతికి, ఆశ్రయభేదేన = ఆశ్రయములగు వ్యక్తుల భేదమును బట్టి, భేదఏవ ప్రతీయతే = అనేకత్వమే, ప్రతీతమగునో, తదా ద్రవ్యపక్షేణ = అపుడు, వ్యక్తిపక్షముతో, భేదః న విద్యతే = భేదముండదు.

తాత్పర్య వివరణములు— ఆశ్రయభేదముచే జాతి కూడ భిన్నమైన, వచన భేదము స్వాభావికమే యగును. శాస్త్రవిధేయము కాదు. అనేక శబ్దప్రయోగ వారణమునకై ఏకశేష విధానమును, అపుడు తప్పదు. 'ఆకృతి ఒకటియే' - అను వాదమును నిలువదు. అని భావము. ॥331॥

*అవతారిక*— అందువలన పూర్వోక్తమైన, ఏకశేష సూత్ర ప్రత్యాఖ్యానమే యుక్తమని ఉపపాదింపబడుచున్నది.

**శ్లో॥ అభేదేత్వేకశబ్దత్వాత్ శాస్త్రాచ్చవచనే సతి ।**
**ఏకశేషో న వక్తవ్యః వచనానాంచ సంభవః ॥** 332

అభేదేతు = జాతికి భేదము లేనపుడైతే, శాస్త్రాత్ = శాస్త్రమువలన = 'బహుషు బహువచనమ్' మున్నగు, వచనేసతి చ = ఏకవచనాదికము సిద్ధించినపుడును, ఏకశబ్దత్వాత్ = ఒకే శబ్ద మనేకములకు బోధకమగునుగాన, ఏకశేషః న వక్తవ్యః = ఏకశేష సూత్రము రచింపబడ నక్కర్లేదు, వచనానాం = ఏకవచన, ద్వివచన బహువచనములకు, సంభవశ్చభవతి = అవ కాశమును కలుగును.

తాత్పర్య వివరణములు— తాత్పర్యము స్పష్టముగాన వివరణ మపేక్షితము గాదు. ॥332॥

*అవతారిక*— ఇట నొక శంక కలిగిన కలుగవచ్చును. ఎట్లనగా—

**శ్లో॥ ననుచానభిధేయత్వే ద్రవ్యస్య తదుపాశ్రయః ।**
**ఆకృతేరుపకారోయం ద్రవ్యాభావాన్న కల్పతే ॥** 333

నను = ఓయీ, ద్రవ్యస్య = ద్రవ్యము = వ్యక్తి, అనభిధేయత్వే = శబ్దశక్తిచే బోధింపబడ నపుడు, తదపాశ్రయః = ఆ వ్యక్తికి సంబంధించిన, ఆకృతేః అయం ఉపకారః = జాతికి, ఈ ఉపకారము = లింగాది సంబంధము, ద్రవ్యాభావాత్ = వ్యక్తివాచ్యము కానందువలన, న కల్పతే = సిద్ధింపదే ? అని.

తాత్పర్య వివరణములు— శబ్దమునకు, జాతి, అభిధ వలన సిద్ధించిన అర్థము అనిన, అపుడు, ద్రవ్యము = వ్యక్తి. అభిధేయము కాదు. తన్నిమిత్త సంస్కారమగు లింగ సంఖ్యా సిద్ధి, జాతికిమట్టు కెట్లు కలుగును ? ద్రవ్యము వస్తువుగా నున్నంతమాత్రము చాలదు అది అభిధేయము కావలెనుగదా అని ప్రశ్న. ॥333॥

అవతారిక— పై శంక కీ క్రింది కారికలో పరిహారము గలదు.

శ్లో॥ వ్యపదేశోఽభిధేయేన న శాస్త్రే కశ్చిదాశ్రితః ।
ద్రవ్యం నామపదార్థో యో న చ స ప్రతిషిధ్యతే ॥ 334

శాస్త్రే = ''బహుషు'' ఇత్యాది వచన విధాయక శాస్త్రమందు, అభిధేయేన = అభిధకు విషయ మగు ఆశ్రయముచేతనే, వ్యపదేశః = శబ్దసంస్కారము కలుగవలెనను నియమము, కశ్చిత్ న ఆశ్రితః = ఏదియు, ఆశ్రయింపబడి యుండలేదు, కించ, ద్రవ్యంనామ = మరియు, ద్రవ్యమనునది, యః పదార్థః = ఏ పదార్థము గలదో, సః న, ప్రతిషిధ్యతే = అది, 'లేదు' అని చెప్పబడలేదు.

తాత్పర్య వివరణములు— ఏక, ద్వి, బహువచన విధాయక శాస్త్రములందు, 'ఆశ్రయముల ఆయా సంఖ్యలందు ఆ యా వచనములు వచ్చును' - అని మాత్రమే చెప్పబడి యున్నదిగాని, ఆ ఆశ్రయములు, అభిధేయములు అనగా శబ్దశక్తిచే బోధింపబడినవి కావలె నని చెప్పలేదు. అందువలన భిన్న భిన్న వ్యక్తులందుండు జాతికి వచనముల భేదము లభించ వచ్చును. జాతి పదార్థమను వానికి, ద్రవ్య మిక లేనేలేదని తాత్పర్యము గాదు. అట్లే ద్రవ్యము పదార్థమను వారికిని, ఆకృతి యనునది లేకనే పోదు. - ''నహ్యాకృతి పదార్థకస్య ద్రవ్యం న పదార్థః । ద్రవ్యపదార్థ కస్యవా ఆకృతిర్న పదార్థ'' - అని సరూప సూత్ర భాష్యము. ॥334॥

అవతారిక— తరువాతి మహాభాష్య గ్రంథము ''కస్యచిత్తు కించిత్ప్రధాన భూతమ్ । కించిద్గుణ భూతమ్'' - అనున దీ కారికలో వికృతము.

శ్లో॥ గుణభావోఽభిధేయత్వం ప్రతిద్రవ్యస్య నాశ్రితః ।
ఉపకారీగుణః శేషః పదార్థ ఇతికల్పనా ॥ 335

ద్రవ్యస్య = వ్యక్తికి, గుణభావః = అప్రధానత, అభిధేయత్వం ప్రతి = శబ్దవాచ్యతను బట్టి, న ఆశ్రితః = ఆశ్రయింపబడలేదు, ఉపకారీ = ప్రధానమున కుపకరించు, పదార్థః=పదార్థము

శేషః = ప్రధానముకొఱకైనది గాన, గుణః = గుణము = అప్రధానము, ఇతి = అని, కల్పనా = కన్పన చేయబడుచున్నది.

తాత్పర్య వివరణములు— 'ద్రవ్యము గుణము' అనిన, అదియు శబ్దవాచ్యమై అప్రధానమని యర్థము కాదు. శబ్ద శక్యము కాకున్నను, జాతికి ఉపకరించుచున్నదిగాన గుణము = శేషము అందురు. శేషమనగా నిట ప్రధానోపకారకము. ఆ ఉపకారమేమనిన, వాహము = బండి లాగుట. దోహము = పాలిచ్చుట - మున్నగునవి, గోత్వమను జాతికి సంభవింపవుగాన, గోవ్యక్తి తాను ద్వారముగా నుండి, వానిని జాతికి సంబంధింపజేయుట. ఆ విధముగనే ద్రవ్యగత లింగసంఖ్యలు జాతికి లభించుట ఉపకారము. ॥335॥

*అవతారిక*— జాతి వ్యక్తివాదు లిద్దరిలో ఒకరికొకటి ప్రధానమయినపుడు వేఱొకటి గుణభూతమగునని మాత్రమే చెప్పబడినది. కాని, ''ద్రవ్య మప్రధానమగుట, అదియు నభిధేయమైనపుడేయని కాదు'' అని ఇట్లు స్పష్టముగ నెచ్చటను మహాభాష్యమున వ్యాఖ్యానింపబడలేదే ? అనిన—

**శ్లో॥ ద్రవ్యే న గుణభావోఽస్తివినాద్రవ్యాభిధాయితామ్ ।**
**ఆకృతౌ వా ప్రధానత్వమతఏవం సమర్థ్యతే ॥ 336**

అద్రవ్యాభిధాయితాంవినా = ద్రవ్యాభిధానా భావము లేనపుడు, ద్రవ్యే, గుణభావః = ద్రవ్యమునం దప్రధానత్వముగాని, ఆకృతౌ, ప్రధానత్వం వా = జాతియందు ప్రధానత్వముగాని, న అస్తి = ఉండబోదు, అతః, ఏవం సమర్థ్యతే = అందువలన నీ విధముగా వ్యాఖ్యానింప బడు చున్నది.

తాత్పర్య వివరణములు— అద్రవ్యాభిధాయిత అనగా ద్రవ్యము శబ్దవాచ్యము కాకుండుట. అది లేనపుడు = అనగా అది శబ్దముచే చెప్పబడినదైనపుడు. అట్టి యెడ దాని కభిధానమే కలదుగాన అప్రాధాన్యముండదు. జాతికి ప్రాధాన్యమును రాదు. అపుడు ద్రవ్యమునకు జాతి అవచ్ఛేదకముగ నుండును. ద్రవ్యమే ముఖ్యము. జాతి అప్రధానమైనను దానికి, ప్రధానమగు ద్రవ్యముయొక్క సంఖ్య అనువర్తించును అనిన, వచనభేదమును ప్రాప్తమగును. అపుడు జాతి యనునది ఒక్కటియేగాన ఏకశేష విధానముతో బనిలేదని దానిని ప్రత్యాఖ్యానము చేయుట కుదురదు. ద్రవ్యము శబ్దవాచ్యము కానపుడు, అది శబ్దవాచ్యమగు జాతికి విశేషణమై తన లింగసంఖ్యలను దానికి లభింపజేయును. ఆ విధముగ నది ఉపకారి. అందువలన - 'గుణము'. అభిధేయమైనందున గుణము కాలేదు. ॥336॥

Note— అద్రవ్యాభిధాయితామ్ అనునదియే సమంజసమైన పాఠము, అక్లిష్టమును.

*అవతారిక*— జాతి వ్యక్తులు రెండును అభిధేయములయినను వానికి ప్రాధాన్యాప్రాధాన్యముల నిట్లు సమర్థింపనగుననుచున్నారు.

శ్లో॥ కైశ్చిద్గుణ ప్రధానత్వం నామాఖ్యాతవదిష్యతే ।
నవృత్తివత్పరార్థస్య గుణభావస్తు వర్ణ్యతే ॥ 337

గుణప్రధానత్వం = జాతి వ్యక్తులకు, అప్రధానతా ప్రధానతలు, నామాఖ్యాతవత్ = కారక పదమునందును, క్రియాపదము నందునువలె, కైశ్చిత్ ఇష్యతే = కొందరిచేత గ్రహింపబడు చున్నవి, పరార్థస్య = ఉపసర్జన పదార్థమునకు, వృత్తివత్ = సమాస వృత్తియందువలె, గుణభావస్తు = అప్రధానత్వము మాత్రము, న వర్ణ్యతే = చెప్పబడలేదు.

తాత్పర్య వివరణములు— 'పాచకః' - అనునది నామపదము. అందు 'పచ్' ధాతువు. అక అనునది ప్రత్యయము. ధాతువునకు - వండుట - అను క్రియ అర్థము. అక ప్రత్యయమునకు, ఆ క్రియను చేయువా డర్థము. వండుట అను క్రియ ఇట సిద్ధము. సాధింప వలసినది గాదు. కర్త ఆ క్రియను అంతకు బూర్వమే చేసియున్నవాడు. లేదా చేయుచున్నాడు గావచ్చును. చేయనున్నను నుండవచ్చును. ఆతడు పాచకుడు అని వ్యవహరింపబడును. అచట కర్తకు ప్రాధాన్యము. క్రియకు గుణభావము = అప్రధానత.

ఇక 'పచతి' అను పదమును జూతము. అది తిఙన్తము. ఇందు ధాత్వర్థమగు క్రియ, ప్రధానము. కర్త అప్రధానము. ఇట క్రియ సాధ్యము. కర్త అప్రధానుడే అయినను, ధాత్వర్థమగు వ్యాపారమునకు ఆశ్రయ భూతుడుగా గోచరించుచునే యుండును. మొత్తము వాక్యార్థమునందే వాని కప్రాధాన్యము. అందువలన 'దేవదత్తః పచతి' = దేవదత్తుడు వంట చేయుచున్నాడు అనినపుడు, దేవదత్తుడు అను విశేషణముయొక్క సంబంధము కర్తకు కలదు. అప్రధానుడుగదా యని ప్రతీతియే లేదనిన, విశేషణ సంబంధమును పొసగదు.

కర్తయందు ద్విత్వ బహుత్వాది సంఖ్య లుండును. వానితో క్రియకు ఆ కర్త ఉపకరించును. కావుననే, క్రియ ఒక్కటియే అయినను పచతః, పచన్తి - మున్నగు ద్వివచన బహువచనాంతములును గలవు.

ఈ విధముగనే, జాతి ద్రవ్యములు రెండును, ఏ పక్షమునందైనను, వివక్షాను సారము ప్రధానా ప్రధానార్థములగును. జాతి కుపకరించుటకై ద్రవ్యముపాత్తమైన, ఆకృతి విశేష్యమై ప్రధానమగును. ఇక వ్యక్తికి అవచ్ఛేదకముగ = విశేషణముగ, ఆకృతి గ్రహింప బడిన నపుడది అప్రధానము. వ్యక్తి ప్రధానము.

సమాసాది వృత్తులందలి గుణప్రధాన భావమిట్టిది గాదు. 'రాజపురుషః' అను సమాసములో, పురుషుడు. ప్రధానుడు, రాజు అప్రధానుడు. రాజపదార్థమునకు పురుష పదార్థముతో సంభేదమేగాని పృథగ్గ్రహణము లేదు. కనుక రాజశబ్దార్థమున కచట విశేషణము సంబంధము, దేవదత్త విశేషణ సంబంధము ప్రత్యయార్థమగు కర్తకు 'దేవదత్తః పచతి' అను స్థలమున నున్నట్లు, సంభవింపదు.

'రాజమాతంగః' = రాజుగారి ఏనుగు. ఆ రాజు, అత్యధికైశ్వర్య సంపన్ను

డందము. అపుడా విశేషణమును తెలియచేయుటకు 'ఋద్ధస్య' అను విశేషణమును జేర్చి 'ఋద్ధస్య రాజమాతంగః' అని ప్రయోగింపజనదు. ఋద్ధస్య = 'ఐశ్వర్యవంతుడైన'.

'పాచకః' అను నామపదమందును, పచతి అను క్రియాపదమునందును, క్రియా కారకములు రెండును సాధ్యసాధనములుగా ప్రతీతి విషయములగుచునే యుండును. అందు సాధనమగు కారకము సాధ్యమగు క్రియ కుపకారకము. అందుచేత అప్రధానము. దేనికొరకు ప్రవృత్తియంతయు ఇచట జరుగుచున్నదో అట్టి సాధ్యమగు క్రియ ప్రధానము. ఇది ఆఖ్యాత పదమునందలి చర్య.

ఇక నామపదమునందో? అచట కారకశక్తి ప్రవృత్తి నిమిత్తము. ఆ శక్తికి ఆశ్రయమైన కర్త 'పాచకః' మున్నగు పదములలో ప్రధానుడు. క్రియ అప్రధానాభిధేయము. కాబట్టి సమాస స్థలమునందువలె కాక నామాఖ్యాత పదములందువలె గుణప్రధానత్వము సుస్థము. ॥337॥

*అవతారిక*— 'ఆకృతి ఒకటియే' దాని చెప్పు శబ్దమును ఒకటియే యగును. కావున ఏకశేషతో పనిలేదు. అంటిరే? అది యెట్లు. ఆ పక్షమునను ద్రవ్యము వాచ్యమను చున్నారు. అపుడు వచనభేదమువలె శబ్దభేదము తప్పదుగదా అనిన—

**శ్లో॥ గుణభూతస్య నానాత్వా దాకృతేరేక శబ్దతా ।**
**సిద్ధోవచనభేదశ్చ ద్రవ్యభేద సమన్వయాత్ ॥** 338

గుణభూతస్య = అప్రధానమైన ద్రవ్యము, నానాత్వాత్ = అనేక మగుటవలన, ఆకృతేః = జాతికి, ఏకశబ్దతా సిధ్యతి = ఒకే శబ్దముచే బోధ్యమగుట సిద్ధించును, ద్రవ్యభేద సమన్వయాత్ = వ్యక్తుల అనేకత్వ సంబంధమువలన, వచనభేదశ్చ = ఏకవచనాది భేదమును, సిద్ధః భవతి = సిద్ధమే యగును.

తాత్పర్య వివరణములు— ఆకృతి, శబ్దముల కర్థమను వారికి ద్రవ్య మప్రధానము. దాని అనేకత్వమువలన శబ్దముల కనేకత్వము రాదు. ప్రధానముగ శబ్దార్థము జాతియే కావున దానినిబట్టి ఏకత్వమే కలుగును. ఇక ద్రవ్యమును అభిధేయమే గదా. దానిని బురస్కరించుకొని, అవిరుద్ధమగు వచనభేదమును సంభవమే. ॥338॥

*అవతారిక*— ఈ విషయము నీ కారికయు వివరించుచున్నది.

**శ్లో॥ సాధనం గుణభావేన క్రియాయా భేదకం యథా ।**
**ఆఖ్యాతేష్వేకశబ్దాయా జాతేర్ద్రవ్యం తథోచ్యతే ॥** 339

ఆఖ్యాతేషు = తిజన్త క్రియాపదములందు, సాధనం = నామపదము = కారకపదము, గుణభావేన = తన అప్రధానత్వముచేత, క్రియాయాః = ప్రధానమైన క్రియకు, యథాభేదకం = ఏ ప్రకారముగా విశేషకమగుచున్నదో, తథా ద్రవ్యం = ఆ విధముగనే, అప్రధానమైన

ద్రవ్యమును, ఏకశబ్దాయాః = ఏకశబ్ద వాచ్యమగు ఆకృతికి, జాతేః భేదకం ఉచ్యతే = జాతికి విశేషకముగా చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— **పచతి, పచతః, పచంతి,** మున్నగునవి ఆఖ్యాతములు. దీనిలో ధాత్వర్థమగు క్రియ ప్రధానము. అప్రధానమగు కర్తనుబట్టి వచనభేదము కలిగినది. ఆ విధముగనే, శబ్దవాచ్యమగు జాతి ప్రధానమైనను, ఆ శబ్దముచేతనే అభిహితమై సన్నిహితమై యున్న ద్రవ్యము, ప్రధానా విరుద్ధమగు తన ధర్మము నుపకారకముగా ఉపస్థాపింపవచ్చును. అట్లు చేయనిచో ఆ గుణమునకు గుణత్వమే నిలువదు. గుణమనగా ప్రధానమున కుపకరించునదియే. నామపదములును ఆఖ్యాతపదములును ఒక వాక్యమునందున్నపుడు నామపదములు క్రియాపదములకు చేయు నుపకారము అదియే. కావున నది నిదర్శనముగా జూపబడినది.

'రాజపురుషః' మున్నగునవి **సమాసవృత్తులు.** అందు అప్రధానమైనది తన సంఖ్యాభేదమునుబట్టి ప్రధానమునకు వచనభేదమును గల్పింపదు. కనుక, 'నవృత్తివత్' అనుట.

కారకముల సంఖ్యాభేదముచేత, తిఙన్తపదములకు వచనభేదము సిద్ధించును. కావుననే తిఙన్తముల కేకశేషవృత్తి లేదని, "న వైతిఙన్తాన్యేకశేషారంభం ప్రయోజయన్తి" అని మహాభాష్యమున చెప్పిరి. ॥౩౩౯॥

*అవతారిక*— శబ్దములు జాతితో గూడిన వ్యక్తులనే బోధించును. అయినను నందు ప్రధానమైనది జాతి గనుక, ఆ విశిష్టవాదమును, జాతివాదమే యగును. అపుడు జాతికి లింగ సంఖ్యలు లేవుగదా ! లింగవచన సంబంధ మెట్లుపపన్నమగును ? అని శంకించి, ఆశ్రయ ధర్మములు ఆశ్రితములకు లభింపవచ్చును. అని – "లింగవచన సిద్ధిర్గుణ వివక్షా నిత్యత్వాత్" అను వార్తికముచే మహాభాష్యమున సమాధానము చెప్పబడినది.

తరువాత "గుణవచనపద్వా అను వార్తికమును వ్యాఖ్యానించుచు, శుక్లాది శబ్దములకు వలె లింగవచన సిద్ధి ఉపపన్నమగుననియు, కావున జాతియే శబ్దమున కర్థమను పక్షమును చక్కగ నుపపాదింపవచ్చుననియు నీ కారికలు బోధించును.

**శ్లో॥ ఏకత్వే తుల్యరూపత్వా చ్ఛబ్దానాం ప్రతిపాదనే ।**
**నిమిత్తాత్ తద్వతోఽర్థస్య విశిష్టగ్రహణే సతి ॥** 340'

**శ్లో॥ సోఽయమిత్యభిసంబంధాదాశ్రయై రాకృతేఃసహ ।**
**ప్రవృత్తౌ భిన్నశబ్దాయాం లింగసంఖ్యే ప్రసిధ్యతః ॥** 341

ఏకత్వే = జాతి వ్యక్తుల కభేదమను పక్షమునందు, శబ్దానాం = శబ్దములు, ప్రతిపాదనే = అర్థబోధనమునందు, తుల్యరూపత్వాత్ = సమానరూపములగుట వలన, నిమిత్తాత్ = కారణమును బట్టి, తద్వతః అర్థస్య = జాతిమత్తగు అర్థమునకును = వ్యక్తికిని, విశిష్ట గ్రహణేసతి = అభేద ప్రతీతి కలుగగా.

ఆకృతేః = జాతికి, ఆశ్రయైః సహ = వ్యక్తులతో గూడ, సోయం = అదియే ఇది, ఇతి అభిసంబంధాత్ = అను అభేదగ్రహణము వలన, భిన్న శబ్దాయాం = జాతి వ్యక్తు లకు వేరు వేరు బోధకములు గల, ప్రవృత్తౌ = శబ్దముల అర్థప్రవృత్తి పక్షమునందు, లింగ సంఖ్యే = లింగములును, వచనములును, ప్రసిద్ధ్యతః = సిద్ధించుచున్నవి.

తాత్పర్య వివరణములు— పూర్వ ముపపాదింపబడిన పక్షమునందు, ఒకే శబ్దము జాతి వ్యక్తులను రెండింటిని, గుణప్రధాన భావముచే బోధించునని చెప్పబడినది. ఇపుడు జాతి వ్యక్తుల కభేదారోపమువలన రెండును చెప్పబడునని ప్రతిపాదించుచున్నారు. జాతి శబ్దములు స్వార్థమును ప్రతిపాదించినపుడు, ఆ జాతి అను నిమిత్తమునే, దాని కాశ్రయమగు ద్రవ్యము నం దాశ్రయించి = అనగా ఆరోపించి బోధించుటవలన వాని కభేదము సిద్ధించును. కాగా నిమిత్తమగు జాతితో పాటుగా నిమిత్తియగు వ్యక్తియు నభిహితమగుటవలన శుక్ల కృష్ణాది గుణవచన శబ్దములకువలె లింగసంఖ్యలు వచ్చును.

అర్థములందు శబ్దములు ప్రవర్తించును. ఆ ప్రవృత్తి ఏకశబ్ద అనియు, భిన్నశబ్ద అనియు, రెండు విధములు. జాతిని, ఆ జాతిగల వ్యక్తిని ఒకే శబ్దము బోధించిన, అపుడు ఆ శబ్దప్రవృత్తి, ఏకశబ్ద. శబ్ద మొక్క జాతినే ప్రతిపాదించినది, భిన్నశబ్ద ప్రవృత్తి. అందును జాతి ద్రవ్యములకు, అభేద ప్రతీతియే లోకసిద్ధము. అది యెట్లనగా – గోశబ్దమునకు గోత్వము అను జాతి అర్థమయినపుడును 'అయంగౌః' = ఇది గోవు అనియే అందురుగాని, దీని గోత్వము అని యర్థమిచ్చుటకు 'అస్యగౌః' అని అనరు కావున అభేదోపచారమువలన ఆశ్రయముయొక్క లింగవచనములు గూడ సిద్ధించును. ఒక పక్షమునందు, గుణప్రధాన భావముచే ఉభయ బోధనము. వేరొక పక్షమున అభేదోపచారముచే తద్బోధనము. అంతియ. ॥340, 341॥

*అవతారిక*— ఇట్లు జాతివాచక శబ్దములు అభేదారోపముచే వ్యక్తిని బోధించుట ముఖ్యమేగాని గౌణము గాదు. జాతి సంబంధము లేని వ్యక్తులు విశేష వ్యవహారమునకు గోచరములే కావు అని చెప్పుచున్నారు.

**శ్లో॥ ప్రాక్చజాత్యభిసంబంధాత్ సర్వనామాభిధేయతా ।**
**వస్తూపలక్షణం సత్వే ప్రయుజ్యన్తే త్యదాదయః ॥ 342**

**జాత్యభిసంబంధాత్** = వ్యక్తులకు జాతి సంబంధము కలుగుటకంటె, ప్రాక్, సర్వనామాభి ధేయతా = ముందు, సర్వనామపదములచే చెప్పదగుటయే ఉండును, సత్వే = ద్రవ్యమునందు, వస్తూపలక్షణం = వస్తు సామాన్య మాత్ర బోధకముగా, త్యదాదయః = సర్వనామ శబ్దములు (త్యద్ మొదలయినవి), ప్రయుజ్యన్తే = ప్రయోగింపబడుచుండును.

తాత్పర్య వివరణములు— వ్యక్తులయందు జాతి ఆరోపింపబడునని చెప్పబడినది. అంతకుపూర్వము ద్రవ్యములకు రూపనిశ్చయమే కలుగదు. ఆ అవస్థలో, ఏ శబ్దమయినను, దాని అర్థమును, ''ఇదియొక వస్తువు'' అని సామాన్యరూపముగనే బోధించునుగాని, 'ఇది

గోవు' 'ఇది అశ్వము' అని విశేషాకారముగ బోధింపదు. అపుడా పదార్థములు, సః=అది, అయం=ఇది అని సర్వనామ శబ్దములచేత మాత్రమే చెప్పదగినవిగా నుండును.

సర్వనామములు వస్తూప లక్షణములు మాత్రమే. ఉపలక్షించుట అనగా సామాన్యాకారముగ బోధించుట మాత్రమే. కాబట్టి, విశేషాకార జ్ఞానమునకై జాతి సంబంధము వ్యక్తికి ఆవశ్యకమని భావనము. ॥342॥

*అవతారిక*— ఇచట మతాంతరమును గలదు. ఎట్లనగా—

**శ్లో॥ పాకౌ, పాకా ఇతియథాభేదకః కైశ్చిదాశ్రయః ।**
**ఇష్యతే చానుపాదానో ధర్మోఽసౌగుణవాచినామ్ ॥ 343**

పాకౌ, పాకాః, ఇతి = రెండు వంటలు, చాల వంటలు అని, యథా, అనుపాదానః = ఏ విధముగా, శబ్దముచే బోధింపబగని, ధర్మః, ఆశ్రయః = ధర్మమయిన, క్రియాశ్రయము, భేదకః, కైశ్చిత్ = భేదమును బోధించునదిగా, కొందరిచే, ఇష్యతే, తథా = అంగీకరింపబడు చున్నదో, ఆ విధముగా, గుణవాచినామ్ = గుణవచన శబ్దములగు, శుక్ల మున్నగువానికి, అసౌ, అనుపాదానః = ఈః, శబ్దోపాదానములేని, ఆశ్రయః భేదకః ఇష్యతే = గుణముల ఆధారము, వచన భేదసాధకమని సమ్మతము.

తాత్పర్య వివరణములు— పాకశబ్దము క్రియాధర్మమును చెప్పు శబ్దము అది క్రియాశ్రయమును చెప్పదు. అయినను లోకమునందు, రెండు వంటలు, మూడు వంటలు - అని ఇట్లు వ్యవహారము కలదు. పాక క్రియ ఒకటియే. కాని వరి బియ్యముపంట ఒకటి యవధాన్యముల బియ్యపు పాక మొకటి. గోధుమ బియ్యపు వంట బెల్లముపంట - ఈః విధముగ వండబడు వాని భేదమునుబట్టి ఆ వ్యవహారములు వచ్చినవి.

ఆ విధముగనే గుణవాచకములగు శుక్లాది శబ్దములందును ఆశ్రయములకును, ఆశ్రితములకును గల, "అదియే ఇది" అను సంబంధమువలన ఆశ్రయము. ఆశ్రితమగు గుణమునకు భేదమును బోధించును. కావున గుణవాచకములందువలె జాతివాచకములందును, శబ్ద బోధ్యముగాని ద్రవ్యము వచనముల భేదమును = అనేక వచనములను కల్పించునని కొందరందురు. కాని ఇది యుక్తముగా దోచదు.

పాకౌ, పాకాః అనుచోట ద్వివచన బహువచనములు క్రియకును దాని ఆశ్రయమునకును అభేదారోపమువలన వచ్చినవి కావు. క్రియాభేద కృతములే. అచట భేదము స్వగతమే ఆశ్రయముననున్న దాని కారోపమువలన రాలేవు. ఆశ్రయములకు భేదమున్నచోట, ఆశ్రితమునకు ఏకవచనాంతత్వమే యగపడుచున్నది చూడుడు. "గుడతిల తండుల ఓదనానాంపాకః" = బెల్లము, నువ్వులు, బియ్యము, అన్నము - వీని వంట, అని అర్థము. గుడాదు లాశ్రయములు. పాకము ఆశ్రితము. పాకక్రియ లనేకములయినను నట బహువచనము లేదు.

శుక్లాది శబ్దముల విషయమున, గుణములకును, అవి కలవానికిని, అభేదోపచారము

ఉపచారమనగా ఆరోపము. కనుక నవియే, జాతి శబ్దములకు దృష్టాంతములు, ''సంఖ్యావచన వద్వా'' అను వార్తికమును వ్యాఖ్యానించిన సందర్భములో, మహాభాష్యమున జూపబడినవి. క్రియావాచకములు దృష్టాంతములు కావనుట. ॥343॥

అవతారిక— పై విషయము నీ కారిక స్పష్టపరచుచున్నది.

శ్లో॥ ఆశ్రయస్యానుపాదానే కేవలం లభతే యది।
ఆధార ధర్మాన్ సామాన్యం పురస్తాత్తద్విచారితమ్॥ 344

సామాన్యం = జాతి, ఆశ్రయస్య = ఆధారమగు వ్యక్తియొక్క, అనుపాదానే = గ్రహణము లేనపుడు, కేవలం = శుద్ధమగు సామాన్యముగనే, ఆధార ధర్మాన్ = తన ఆశ్రయముల ధర్మములను, లభతేయది=పొందును అనిన, తత్పురస్తాత్ విచారితమ్=అపయము ముందటి గ్రంథమున, విమర్శింపబడినది.

తాత్పర్య వివరణములు— 'జాతివాచకములయిన శబ్దములు, ఆధారరహితమైన శుద్ధ జాతిని మాత్రమే బోధించును. అయినను ఆధారముల యొక్క లింగములను వచనములను బొందును'- అను విషయము ద్రవ్యవాదికి సమాధానముగ ఆకృతివాది చెప్పిన,- ''లింగవచన సిద్ధిర్గుణస్య నిత్యత్వాత్'' అను వార్తిక వ్యాఖ్యాన ప్రసంగమున, మహాభాష్యమున వివరింపబడినది. ప్రకృత గ్రంథమునందును, ''నచుచానభిధేయత్వే'' - అను 333వ కారికచే ప్రశ్నించి, ''వ్యపదేశోభిదేయేన'' - అను 334వ కారికలో సమాధానము చెప్పబడినది.

''జాతి వ్యక్తులు రెండును ప్రధానాప్రధాన భావముచే శబ్ద వాచ్యములే'' - అను పక్షాంతరమును, - ''కైశ్చిద్గుణ ప్రధానత్వం - అను 337వ కారికచే ఉపపాదింపబడినది

ప్రకృత కారికయందు, జాతి మాత్రమే శబ్ద శక్యమనియు, అభేదారోపమువలన శబ్దము వ్యక్తులను బోధించునుగాన, ఆశ్రయ ధర్మములయిన లింగ సంఖ్యలు దానికి సిద్ధించును అనియు స్పష్టపరుపబడినది. ॥344॥

అవతారిక— జాతికిని జాతిమంతమగు వ్యక్తికిని అభేద మెట్లు పొసగును? అని శంకించి, ''సామాన్యే వృత్తస్య విశేషే వృత్తిరుపజాయతే'' = జాతి శబ్దము ముందు సామాన్యమును బోధించును. తరువాత విశేషమునందు వర్తించును'' అని మహాభాష్యమున సమాధానము చెప్పబడినది. ఆ విషయము నుపపాదించున దీ కారిక.

శ్లో॥ జాతౌ పూర్వం ప్రవృత్తానాం శబ్దానాం జాతివాచినామ్।
అశబ్దవాచ్యాత్ సంబంధాత్ వ్యక్తిరప్యుపజాయతే॥ 345

జాతౌ = జాతియందు, పూర్వం = ముందుగా, ప్రవృత్తానాం = ప్రవర్తించిన, జాతివాచినాం = జాతివాచకములగు, శబ్దానాం = శబ్దములకు, అశబ్దవాచ్యాత్ = శబ్ద ప్రతిపాద్యముగాని,

సంబంధాత్ = సంబంధమువలన, వ్యక్తిః అపి = ఆశ్రయ ప్రతీతి కూడ, ఉపజాయతే = కలుగును.

*తాత్పర్య వివరణములు* — జాతి నిమిత్తము. వ్యక్తి నిమిత్తి. శబ్దము నిమిత్తిని నిమిత్త పురస్సరముగనే బోధించును. కాగా ముందు జాతిని బోధించుననుట. ఆశ్రయము లేకుండ జాతికి ఉనికి సంభవింపదు. కావున, శబ్దము బోధింపకున్నను, జాతి కాశ్రయమై యుండుట అను సంబంధమునే ముందు పెట్టుకొని వ్యక్తియు ప్రతీతి విషయమగును.

''అధికరణగతిః సామాన్యాత్'' - అని సరూప సూత్రమున భాష్యవార్తికము. వాజప్యాయనుడను మహర్షి జాతివాది. వ్యాడి మహర్షి వ్యక్తివాది.

''గౌరనుబంధ్యో అజోగ్నీషోమీయః'' అనునది పూర్వ మీమాంసలో విచారింపబడిన ఒక విధి వాక్యము. విధికి చోదన అని పర్యాయపదము. ''అగ్ని, సోముడు అను నీ ఇద్దఱు దేవతలజంట, దేవతగాగల ఛాగ పశువుని కనుబంధము చేయవలెను'' అని ఆ విధి కర్థము. అనుబంధమనగా ఆరంభణా లంభనములు. అందు ఆరంభణము మేకను కొనుట. ఆలంభనమనగా దానిని మంత్రపూర్వకముగా తాకుట అని వ్యాఖ్యాతలు.

ఈ చోదనా వాక్యమునందలి అజపదమునకు, అజత్వము అను జాతి అర్థమయినను, ఆరంభణాది క్రియలకు జాతియందు సంభవముండదు. కనుక వ్యక్తియే శబ్దమున కర్థము కావలెనని వ్యక్తివాదులు. వారికి సమాధానముగ పై భాష్యవార్తిక మవతరించినది.

జాతియే పదార్థమయినను, దానితో పాటుగా నుండునది అగుటవలన, జాతికి విధింపబడిన కార్యములు దాని కాధారమగు వ్యక్తియందు ప్రవర్తించునని జాతివాదుల తాత్పర్యమని ఆ వార్తికము తెలియచేయుచున్నది.

హోమము చేయుటకు, అగ్ని కావలెనుగదా దానికై ''అగ్నిరానీయతామ్'' అని ఆదేశింతురు. అగ్నిని తేవలెను అని యర్థము. ఏదేని పాత్రము లేకుండగ అగ్నిని తెచ్చుట వీలు పడదు. 'ఒక పళ్లెముతో అగ్నిని తేవలెనని' చెప్పలేదు అవిహితమయినను పాత్రమందుపయోగింపబడుచున్నది గదా! ఆ విధముగనే, అభిధేయము కాకున్నను వ్యక్తి, బోధలో విషయమగును అని జాతివాదుల తాత్పర్యము. ॥846॥

*అవతారిక* — శబ్దములు, వాని అర్థములను అభిద అను వ్యాపారముచే బోధించును. ఆ వ్యాపారము, తాను బోధింపవలసిన అర్థమును ఒక్కసారిగనే బోధించును. కొంత భాగమును బోధించి, కొంత తడవాగి మరల వ్యాపారించుట = అను విరమ్య వ్యాపారము దానికి లేదు. కాని గ్రహీతలు మాత్రము, సంసృష్టములగు అర్థములను, తాము విభజించుకొని ఒక క్రమముగనే గ్రహింతురు. ఆ అభిప్రాయముతో, మహాభాష్యమున, ''సామాన్యే వృత్తస్య విశేషే వృత్తిరుపజాయతే'' - క్రమము చెప్పబడినది. ఈ కారిక ఆ విషయమును వివరించునది.

తాత్పర్య వివరణములు— 'మంచ లరచుచున్నవి' - అను వాక్యమునందు, మంచ శబ్దము, ఆధేయ భూతులగు మంచస్థులను బోధించునది అయియున్నను, దానిని ఆధారవాచకమే అందురు. ఆ విధముగనే జాతి శబ్దములు, జాత్యాశ్రయములగు ద్రవ్యములను బోధించినను, జాతి వాచకములే'' అని ద్రవ్యమును బోధించునవి అనుట, ఉపచరిత వ్యవహారము. అనగా ఆరోపితమనుట. అది ముఖ్యవహారము కాదు. జాత్యభిధానమే ముఖ్యము.

అట్లైన, జాతి ఒక్కటియే గదా! జాతివాచకములకు ద్వివచన బహువచనము లెట్లుపపన్నములగును? ఏకత్వసంఖ్య గల జాతిని బోధించు శబ్దములు, ఏకవచనాంతములుగ మాత్రమే యుండదగును గదా! అని మరల ప్రశ్న కలుగును. సమాధానమేమనిన,— సంఖ్యా సంస్పర్శములేని జాతి మాత్రమునకే, ద్రవ్యములం దధ్యాసము. ఏకత్వ సంఖ్యా విశిష్టమునకు గాదు. కావున, ఆశ్రయగత లింగసంఖ్యల సంబంధము, జాతికి సిద్ధించునని తాత్పర్యము. ॥348॥

అవతారిక— జాతిబోధక శబ్దములకు గూడ లింగవచనము లుపపన్నములగునని నిరూపింపబడినది. వానికి శుక్లాది గుణశబ్దములు దృష్టాంతముగా నీయబడినవి. 'శుక్లః' అను శబ్దము తెలుపుగలదియను నర్థమును చెప్పినపుడందు 'మతుప్' - అను ప్రత్యయము వచ్చి లోపించినది అనిగాని లేదా గుణమునకును గుణికిని అభేదమేయనిగాని చెప్పవలసి యుండును.

జాతి శబ్దములును అభేదోపచారముచేతనే జాతిమంతములను బోధించును. ఇట్లు, బోధనోపాయ విషయమున భేదమున్నను, తద్వత్తు బోధించు జాతి గుణశబ్దములు రెండింటికిని దుల్యమే. అందువలన గుణశబ్దములు జాతి శబ్దములకు దృష్టాంతముగ జూపబడినవి. ఈ విషయ మీ కారికలో నిరూపింపబడుచున్నది.

**శ్లో॥ అస్యేదమితి వా యత్ర సోఽయమిత్యపి వా శ్రుతిః ।**
**వర్తతే పరధర్మేణ తదన్యదభిధీయతే ॥ 349**

'అస్య ఇదం' ఇతివా = 'దీనికి సంబంధించినది ఇది' అని గాని, 'సోఽయం' ఇతివా = 'అది ఇది' అనిగాని, శ్రుతిఃయత్ర వర్తతే = శబ్దప్రయోగ మెచ్చట నుండునో అచట, తత్ = ఆ శబ్ద వ్యవహారము గల, అన్యత్ = నిమిత్తి = నిమిత్తముగలది, పరధర్మేణ అభిధీయతే = నిమిత్తారోపముచే, అట్లు చెప్పబడును.

తాత్పర్య వివరణములు— శబ్దములే యుపాయముచే అర్థాంతరమును బోధించినను, నిమిత్తరూపము నారోపించి, నిమిత్తిని బోధించుట తుల్యము. కాగా శుక్లాది శబ్దములు ద్రవ్యమును చెప్పినను గుణ శబ్దములే యనబడును. గవాది శబ్దములును ద్రవ్యమును బోధించినను జాతి శబ్దములని వ్యవహరింపబడ వచ్చును. ॥349॥

అవతారిక— అది యెట్లనగా జూడుడు.

**శ్లో॥ యత్రప్రధానం న తస్యాస్తి స్వరూపమనిరూపణాత్ ।**
**గుణస్య చాత్మనా ద్రవ్యం తద్భావేనోపలక్ష్యతే ॥ 350**

కలుగును. కనుక జ్ఞానము పరాధీనము. స్వతః దానియందు నానాత్వము వైలక్షణ్యము కలుగదు. ఘటాది వ్యక్తినిబట్టి జ్ఞానముయొక్క ఆకారము నిష్పన్నమగును. అట్లే ఘట వ్యక్తి యందున్న ఘటత్వ జాతినిగూడ జ్ఞానము పొందగలదు.

కాబట్టి స్వతః జ్ఞానమునందు సామాన్యము లేకున్నను ఘటాదికమునందున్న జాతి జ్ఞానమునందుండును. కాగా బాహ్య పదార్థమే అందుకు కారణము కాగలదు. ॥103॥

*అవతారిక*— జ్ఞానము జ్ఞేయము కానందున అది యెన్నడు ఇతర వస్తువుయొక్క రూపముచే నిరూపింపబడదని చెప్పబడినది. కాని యది యెట్లు ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ యథా జ్యోతిః ప్రకాశేన నాన్యేనాభిప్రకాశ్యతే।**
**జ్ఞానాకార స్తథాన్యేన న జ్ఞానేనోపగృహ్యతే॥** 104

యథా = ఏ రీతిగా, జ్యోతిః = తేజము, అన్యేన = మరియొక, ప్రకాశేన = తేజముచే, న + అభిప్రకాశ్యతే = ప్రకాశింప చేయబడదో,

తథా = ఆ రీతిగా, జ్ఞానాకారః = జ్ఞానము యొక్క ఆకారము, అన్యేన = మరి యొక, జ్ఞానేన = జ్ఞానముచే, న + ఉపగృహ్యతే = గ్రహింపబడదు.

ఘటము మున్నగు జడ పదార్థములను దీపము అనగా వెలుతురు ప్రకాశింప చేయును. ఆ వెలుతురు మరియొక వెలుతురును అపేక్షింపదు. అట్లుకాక తేజము మరియొక తేజముచేతనే ప్రకాశింపజేయబడిన అదియు జడమే కావలెను. కనుక తేజము స్వప్రకాశము ఇతరమును అపేక్షింపదు. అట్లే జ్ఞానముకూడ స్వప్రకాశమే. మరియొక జ్ఞానముచే గ్రహింప బడునది కాదు.

ఘటము మున్నగు వ్యక్తులకు ఘటత్వము మున్నగు జాతియొక్క అపేక్ష కలదు. జ్ఞానమునకు అట్టి యపేక్ష లేదు. కాబట్టి అర్థములయందున్న ఏకత్వము జాతినిబట్టి కలుగును. ఆ జాతియు వ్యక్తి ద్వారా జ్ఞానమునకు కలుగును.

జ్ఞానములు ఆకారము కలవి. స్వప్రకాశములు. స్వతః అవి జాతి లేనివి.

*విశేషాంశము*— జ్ఞానమునకు జ్ఞేయమగు ఘటాదులయందున్న సామాన్యములే ఉపకారకములగును. కాని జ్ఞానమునకు ఆకారము లేదు జ్ఞానము స్వప్రకాశము కాదు అని వైశేషికులు తలంతురు.

కాని వైయాకరణులు అట్లు భావింపరు. పై రీతిని జ్ఞానము స్వప్రకాశము, సాకారము, సామాన్యరహితమనియే తలంతురు.

వైశేషికమతము యుక్తము కాదు. ఈ యంశము 'జ్ఞానాకారః' అను పదముచే వ్యక్తమగుచున్నది. హేలారాజు దీనిని స్పష్టపరచెను. ॥104॥

యత్ ప్రధానం = ఏది, ముఖ్యమైనదో, తస్య స్వరూపం = దాని, స్వరూపము, అనిరూపణాత్ న అస్తి = నిరూపకము = విశేషణము లేనందున, లేదు, ద్రవ్యం చ = ద్రవ్యమును, గుణస్య ఆత్మనా = విశేషణముయొక్క, స్వరూపముచే, తద్భావేన, ఉపలక్ష్యతే = గుణాత్మకముగ, చూడబడుచుండును.

*తాత్పర్య వివరణములు*— క్రియా సంబంధమునకు అర్హమైన ద్రవ్యమేది అయినను, ఉపాధి విరహితమగు రూపముతో వ్యవహారమున నుండదు. ఉపాధి అనగా విశేషణము. నిరూపణమనగా ఉపాధియొక్క రూపముతో పూత పెట్టబడియుండుట. ఉపాధి రూపాచ్ఛురణమన నదియే. శుక్ల గుణముగల ద్రవ్యముగాని, జాతి విశిష్ట వ్యక్తిగాని, ఆ, శుక్లగుణము, జాతి, అను నుపాధుల రూపముతో గూడి తాము విశేషణ రూపములే యనునట్లగపడును. నిమిత్తి, నిమిత్తముతో సారూప్యము నందినదా యనునట్లు భాసించును. ॥350॥

*అవతారిక*— అట్లైనను జాతికి ప్రాధాన్యము నశించుననుకొనరాదు.

శ్లో॥ గుణస్య భేదకాలేతు ప్రాధాన్యముపజాయతే ।
సంసర్గ శ్రుతిరర్థేషు సాక్షాదేవ న వర్తతే ॥ 351

గుణస్య = గుణమును, భేదకాలేతు = వేఱొక దానినుండి విడబరచి ప్రధానముగ చెప్పిన, ప్రాధాన్యం, ఉపజాయతే = అపుడు ప్రాధాన్యము దానికి కలుగును, సంసర్గ శ్రుతిః = సంసర్గము ప్రవృత్తి నిమిత్తముగా గల శబ్దము, అర్థేషు = అర్థములందు, సాక్షాదేవ న వర్తతే = ఉపాధిని విడిచి వేరుగా వర్తింపదు.

*తాత్పర్య వివరణములు*— ద్రవ్యము ప్రధానముగ వివక్షింపబడినపుడు, జాతి ఉపాధి. గుణము ప్రధానవాచ్యమైన, గుణజాతి ఉపాధి. జాతియే ప్రధానముగ నభిమతమయిన శబ్దస్వరూప ముపాధి. శబ్దములేవస్తువును బోధించినను, ఏదియో ధర్మాంతరము యొక్క సంసర్గము నుపాధిగా గల దానినే బోధించునుగాని శుద్ధ వస్తువును బోధించవు. కనుక ఉపాధిని విడిచి సాక్షాదర్థమునందు, ఏ శబ్దమును వర్తింపదు. ॥351॥

*అవతారిక*— ద్రవ్యపదార్థ వాదమునను, జాతియను నుపాధితో గూడియే అది వాచ్యమగును గదా. అపుడు జాతి పదార్థతయే ప్రాప్తించినది. ఇక జాతి పదార్థవాదమునను, జాతి ద్రవ్యముల కభేదమున్నను జాతియే పదార్థమని సిద్ధించును. ఇక వేరుగ ద్రవ్యపదార్థ వాదమనునది ఎట్లు సంభవము ?

శ్లో॥ జాతౌ వృత్తోయదా ద్రవ్యే సశబ్దోవర్తతే పునః ।
జాతేరేవపదార్థత్వం న తదాభ్యుపగమ్యతే ॥ 352

శబ్దః = ఒక శబ్దము, జాతౌవృత్తః = జాతియందు వర్తించినదై, పునః సః = మరల, అది, ద్రవ్యే, యదా, వర్తతే = ద్రవ్యమునందు, వర్తించిన, తదా = అపుడు, ఇక, జాతేరేవ

పదార్థత్వ = జాతికే పదార్థతయనుట = జాతియే పదమున కర్థమనుట, న అభ్యుపగమ్యతే = గ్రహింపబడదు = అంగీకరింపబడదు.

*తాత్పర్యా వివరణములు*— శబ్దములు 'అభిధ' అను వ్యాపారముచే ముందు జాతిని బోధించి, అంతతో నాగక మరల ద్రవ్యమును గూడ బోధించునపుడు, కేవలము **జాతియే** బోధితమనుట అంగీకరణీయము గాదు. ద్రవ్యమును బోధింపబడినది గదా ! కనుక ఆ వాదమును సిద్ధించును. ॥352॥

*అవతారిక*— శబ్దము లొక యర్థము నొక **వ్యాపారము**చే బోధించి, **అంతతో** నాగక మరల నర్థాంతరబోధకు **వ్యాపారించుననుట శాస్త్రీ**యము గాదు. కాగా నొక **శబ్దము**నకే **జాతివాచకత్వ**మును ద్రవ్యవచనత్వము నెట్లు **సంభవించును**? అపుడవి భిన్న భిన్న శబ్దములే కావలెను గదా అనిన–

**శ్లో॥ ప్రవృత్తానాం పునర్వృత్తిరేకత్వేనోపవర్ణ్యతే ।**
**ప్రతిపత్తే రుపాయేషు న తత్త్వమనుగమ్యతే ॥** 353

ప్రవృత్తానాం = ఒక యర్థమునందు ప్రవర్తించిన శబ్దములకు, పునః, వృత్తిః = మరల అర్థాంతరమున బ్రవర్తించుట, ఏకత్వేన = అభిన్నముగనే = ఏకప్రవృత్తిగనే, **ఉపవర్ణ్యతే**= చెప్పబడుచున్నది, ప్రతిపత్తేః = బోధనమునకు, **ఉపాయేషు** = సాధనముగా గ్రహింపబడు వాని విషయమున, తత్త్వం, న అనుగమ్యతే = యాధార్థ్యము, పాటింపబడదు.

**తాత్పర్యా వివరణములు**— సత్యమే. ఆ శబ్దములు భిన్న భిన్నములే కావలెను. కాని వాని సాదృశ్యమునుబట్టి అభేదమును వానికి అధ్యవసించి (ఆరోపించి) ఏకత్వమే వ్యవహరింపబడు చున్నది. అది ప్రతిపాదనమునం దుపాయము మాత్రమే. శబ్దములు జాత్యాదులతో సంసృష్టములగు వానిని మొత్తముగనే బోధించును. వానికి ఒక యర్థమును బోధించి, విరమించిన, మరల వ్యాపారించుట శాస్త్రానుమతము గాదు. క్రమబోధ లేనేలేదు. ప్రతిపత్తి సౌకర్యమునకై క్రమము కల్పితము. అంతియే. ఉపేయమును దెలిసికొనుటకై యవలంబింపబడు నుపాయములు వ్యవస్థితములుగా నుండవు. అవి సత్యములును గావు. ॥353॥

*అవతారిక*— జాతియు వ్యక్తియును భయములును శబ్దములచే నభిహితములయినను, వాని ప్రాధాన్యమును అప్రాధాన్యమునుబట్టి మత భేదముచే, **'జాతి పదార్థత'** 'ద్రవ్య **పదార్థత'** అను వాదములు సిద్ధించును, అని యిందు చెప్పబడుచున్నది.

**శ్లో॥ అపృథక్ శబ్దవాచ్యస్య జాతిరాశ్రీయతేయదా ।**
**ద్రవ్యస్య సతిసంస్పర్శే తదాజాతి పదార్థతా ॥** 354

అపృథక్ శబ్ద వాచ్యస్య = వేరు శబ్దముచే గాక యొకే శబ్దముచే చెప్పబడిన ద్రవ్యమునకు, **జాతిః**, యదా, ఆశ్రీయతే = జాతి, ఎపుడు, ప్రధానముగ ఆశ్రయింపబడునో, తదా =

అపుడు, ద్రవ్యస్య = ఆ ద్రవ్యమునకు, సంస్పర్శే 'సత్యపి' = శబ్దముచే బోధనము ఉన్న ప్పటికి, జాతి పదార్థతా = 'జాతి పదార్థము' అను పక్షమే సిద్ధము.

తాత్పర్య వివరణములు— జాతియు, వ్యక్తియు నొక శబ్దముచేతనే బోధింపబడి నను కార్యప్రవృత్తి విషయమున, జాతికే ప్రాధాన్యమును వివక్షించిన, ద్రవ్య సంబంధ మా జాతికి లేకపోదు. అయినను జాతి యచట పదార్థమనుటయే యుక్తము. ద్రవ్య సంస్పర్శ మెందుకనగా, ఆధార భేదముచే ఆధేయమగు జాతికి భేదమును సూచించుటకు మాత్రమే. కనుకనే ఈ ప్రయోగములలో నొకచో బహువచనోపపత్తి. లేనిచో జాతినిబట్టి ఏకవచనమే ప్రాప్తము. ''బ్రాహ్మణాః శుశ్రూషితవ్యాః । = బ్రాహ్మణజాతి సేవింపదగినది. ఇచ్చటను ఏకవచనము మాత్రమే ప్రాప్తము. ''యోఽయం పానీయం పిబతి స గౌః పదా న స్ప్రష్టవ్యః'' = నీరు త్రాగుచున్న గోజాతీయ మేదియు కాలితో తాకబడరాదు. ''గౌరనుబంధ్యః'' = గోజాతీయము ఆలంభనీయము అని ఇట్లు శబ్దముచే ద్రవ్య సంస్పర్శమున్నను జాతిపదార్థ పక్షమే పర్యవసించును. అపుడును ఏకవచన బహువచనాంత శబ్దప్రయోగము లుపపన్న ములు. ॥354॥

అవతారిక— ఇక ద్రవ్యపదార్థ పక్ష మెపుడు సిద్ధించుననిన—

**శ్లో॥ ద్రవ్యస్య సతి సంస్పర్శే ద్రవ్యమాశ్రీయతే యదా ।**
**వాచ్యం తేనైవ శబ్దేన తదా ద్రవ్యపదార్థతా ॥ 355**

శబ్దేనతేనైవ = ఆ జాతి బోధకశబ్దముచేతనే, ద్రవ్యస్య = ద్రవ్యమునకు, సంస్పర్శే సతి = అభిధేయముగ సంబంధము కలిగినపుడు, యదా = ఎపుడు, ద్రవ్యం వాచ్యం = ద్రవ్యము, ఆశ్రీయతే = కార్యార్థమై ప్రధానముగ నాశ్రయింపబడునో, తదా, ద్రవ్యపదార్థతా=అపుడు, ద్రవ్యపదార్థ పక్షము సిద్ధించును.

తాత్పర్య వివరణము— జాతి బోధక శబ్దమే ద్రవ్యమును గూడ బోధించినను, అభిధేయమగు ఆ ద్రవ్యము కార్యవిశేషమునందు ప్రధానముగ గ్రహింపబడి, జాతి దానికి విశేషణముగ మాత్రమే ఉపయుక్తమయినపుడు ''ద్రవ్యము పదార్థము'' అను పక్షము ఏర్పడును. ఎట్లనగా - ''బ్రాహ్మణ మిమం భోజయ'' అను వాక్యమును జూడుడు. 'ఈ బ్రాహ్మణున కన్నము పెట్టుడు' అనిన నట బ్రాహ్మణ శబ్దము, ఈ బ్రాహ్మణున కనుటవలన జాతిని బోధింపదు. వ్యక్తినే బోధించును. కనుక నిట ద్రవ్యపదార్థ పక్ష మాశ్రితము. ప్రాధాన్యాప్రాధాన్యములనుబట్టి పక్షములకు వ్యవస్థయని భావము.

సరూప సూత్ర భాష్యమున నీ సందర్భమునందున్న గ్రంథము గమనీయము— ''కస్యచిత్తు కిం చిత్ప్రధానమ్'' కించిద్గుణ భూతమ్. న హి ఆకృతి పదార్థకస్య ద్రవ్యం న పదార్థః । ద్రవ్య పదార్థ కస్య వా ఆకృతిర్న పదార్థః । ఉభయోరుభయం పదార్థః । ఆకృతి పదార్థకస్య ఆకృతిః ప్రధానభూతా । ద్రవ్యం గుణభూతమ్ । ద్రవ్యపదార్థకస్య ద్రవ్యం ప్రధానభూతమ్ । ఆకృతిర్గుణ భూతా ॥'' - ఇవి యచటి పంక్తులు.

"పదములకు ఆకృతి 'అర్థము' - అను వానికి ద్రవ్యమిక లేనేలేదని యర్థము కాదు. ద్రవ్యపదార్థి వాదికిని, ఆకృతి పదార్థము కానేకాదని తాత్పర్యము గాదు. ఉభయుల కును నుభయమును పదార్థమే. అయిన నొకని కొక్కటి ప్రధానమయిన, రెండవది అప్ర ధానము. ఆకృతివాది కాకృతి ప్రధానమయిన ద్రవ్యమప్రధానము. ద్రవ్యవాదికి ద్రవ్యము ప్రధానమయిన, ఆకృతి గుణమగును. అంతియ— ॥355॥

అవతారిక— వేదమున పూర్వకాండము కర్మలను బోధించును. విధి వాక్యము లకు చోదనావాక్యములని వ్యవహారము. 'చోదన, విధి' - ఇవి పర్యాయపదములు. ఆ చోద నలు జాతిపరములు కొన్ని, వ్యక్తిపదములు కొన్ని. "గౌరనుబంధ్యోఽజో గ్నీషోమీయః" అని యొక చోదన. అది జాతి పరము. గోజాతికి ఆలంభనమును చేయుట అసంభవి. గోపదము జాతివాచకమయినను, తాత్పర్యదృష్టిలో ద్రవ్యమే అచటను శబ్దార్థమని వ్యాడి మున్నగు మహర్షుల మతము.

శ్లో॥ అపృథక్ శబ్దవాచ్యాపి భేదమాత్రే ప్రవర్తతే ।
యదా సంబంధవజ్జాతిః సాపి ద్రవ్యపదార్థతా ॥ 356

జాతిః = ఆకృతి, అపృథక్ శబ్దవాచ్యా అపి = ఒకే శబ్దముచే జెప్పబడినను, యదా=ఎపుడు, సంబంధవత్ = సమాసార్థమగు సంబంధమువలె, భేదమాత్రే = తన ఆశ్రయమును వేరు జేయుటలో మాత్రమే, ప్రవర్తతే = వర్తించునో, తదాపి, సా = అపుడును, ఆస్థితి, ద్రవ్య పదార్థతా = ద్రవ్యము పదార్థముగా గలిగియుండుట అగును.

తాత్పర్య వివరణములు— జాతియు, వ్యక్తియు, ఏకశబ్దోపాత్తములే అయినను, ఆలంభనము మున్నగు కార్యములు అనుభవించు యోగ్యత జాతికి సంభవింపదు. అపుడు జాతిని ఆదరింపక వ్యక్తినే స్వీకరించువారు వ్యాడిమహర్షి మున్నగువారు. "చోదనాసు చ తస్యారంభాత్" అని యీ సందర్భమున వ్యక్తికి పదార్థతను సాధించు వార్తికము. చోద నాసు = ప్రవర్తక వాక్యములలో, తస్య = ద్రవ్యమునకు, ఆరంభాత్ = ఆరంభము చేయ బడుటవలన - అని యర్థము ఆరంభణమనగా క్రియము లేదా బంధనము. ఈ క్రియయు, ప్రోక్షణ విశసనాది క్రియలును ద్రవ్యమునందే చేయబడుచున్నవి. కావున ద్రవ్యమే శబ్ద వాచ్యమని వారి తాత్పర్యము. ఇక జాతి కుపయోగమేమనిన, వ్యక్తి, జాత్యవచ్ఛిన్నమేగాని గుణాద్యవచ్ఛిన్నము గాదని తెలుపుటయే.

రాజపురుషః అనునది షష్ఠీ సమాసము. తత్పురుష, అది ఉత్తరపదార్థ ప్రధానము రాజపురుషుల సంబంధమగు 'స్వస్వామి భావసంబంధమును షష్ఠ్యర్థమే. కావున నదియు సమాసవాచ్యమే అయినను ప్రధానము గాదు. ఆ సంబంధము, ఆ పురుషుడు రాజు సంబం ధియే గాని ఇతర సంబంధి గాదు అని తెలియచేయుటకే ఉపయుక్తము. ఆ విధముగనే యీ వాదమున గోత్వాది జాతులును అవచ్ఛేదక మాత్రములే. వ్యక్తులకే ప్రాధాన్యము అని భావము. ॥356॥

అవతారిక— 'శుద్ధ జాతివాదము', 'శుద్ధ వ్యక్తివాదము' అనియు రెండు పక్షములు గలవు. కేవల జాతియే శబ్దవాచ్యము అనునది మొదటివారి వాదము. శుద్ధ ద్రవ్యము శబ్దవాచ్యమని ద్రవ్యపదార్థ పక్షము. ఆ పక్ష ద్వయ మీ కారికలో ప్రసంగింపబడును.

శ్లో॥ అత్యంతభిన్నయోరేవ జాతిద్రవ్యాభిధాయినోః ।
అవాచ్యస్యోపకారిత్వ ఆశ్రితేతూభయార్థతా ॥ 357

అత్యంతభిన్నయోః ఏవ = మిక్కిలి వేరు వేరే అయియున్న, జాతి ద్రవ్యాభిధాయినోః = జాతివాచక, వ్యక్తివాచక శబ్దములలో, అవాచ్యస్య = శబ్దవాచ్యముగాని రెండవదానికి, ఉపకారిత్వే = వాచ్యమయిన దాని కుపకారము, ఆశ్రితే తు = ఆశ్రయింపబడిన యెడల, ఉభయార్థతా = జాతి పదార్థతయు, ద్రవ్య పదార్థతయు, సిధ్యతి = సిద్ధించినది.

తాత్పర్య వివరణములు— కేవలము జాతిని మాత్రము చెప్పు శబ్దము వేరు. ఆ విధముగనే వ్యక్తిమాత్ర వాచక శబ్దమును వేరే. ఆ భిన్న భిన్న శబ్దములందు, జాతివాచకము, జాతిని చెప్పినపుడు, వ్యక్తి, చెప్పబడకపోయినను, తన లింగవచనాదులను జాతికి కల్పించి యుపకరించును.

అటులనే, వ్యక్తి వాచ్యమయినపుడు, జాతి, తాను వాచ్యముకాకున్నను, వ్యక్తులకు విశేషణముగ నుపకరించును. కావున శుద్ధ జాతి, శుద్ధ వ్యక్తి పక్షములు పాణినికి సమ్మతములుగా మహాభాష్యమున చివర నుపపాదింపబడినవి. విషయ భేదముచే లక్ష్యానుసారముగ జాతి వ్యక్తి పక్షము లాశ్రయింపబడినవి. "జాత్యాఖ్యాయా మేకస్మిన్ బహువచన మన్యతరస్యామ్" (1-2-58) అను సూత్రము, వ్రీహి జాతి సంపన్నమను నర్థమున సంపన్నా; వ్రీహయః అను ప్రయోగము ననుసరించి, రచింపబడినది. దీనివలన జాతిపక్ష మాతనికి సమ్మతమని తెలియును.

అది యొక్కటియే సమ్మతమయిన, సరూపములగు పదములకు సహవివక్షలో ఏ వచనము జాతియొక్క ఏకత్వమువలననే సిద్ధించునుగాన, "సరూపాణామేకశేష ఏకవిభక్తౌ" (1-2-64) అను సూత్రమును రచింప బనిలేదు. కాగా పక్షద్వయమును నాతనికి సమ్మతమే యనుట నిర్వివాదము. ॥357॥

అవతారిక— ఇటుల ప్రసంగరీత్యా మతభేదమును ప్రదర్శించి, ప్రకృతి విషయము నీ కారికతో ముగించుచున్నారు.

శ్లో॥ ఆశ్రితే త్వాశ్రయ కృతంభేద మభ్యుపగచ్ఛతా ।
పునశ్చాప్యేకశబ్దత్వం జాతిశబ్దేఽనువర్ణితమ్ ॥ 358

ఆశ్రయకృతం = జాతికి ఆశ్రయమగు వ్యక్తినిబట్టిన, భేదః = సంఖ్యాభేదమును, ఆశ్రితే = వ్యక్తి విశేషము నాశ్రయించిన జాతియందు. అభ్యుపగచ్ఛతా = అంగీకరించుచున్న భాష్యకారునిచేత, ఏకశబ్దత్వం = అనేకార్థ బోధయందుగూడ శబ్దమొక్కటియే యుండుట, జాతిశబ్దే

= జాతిపదార్థ వాదమునందు, పునః అపిచ = మరలగూడ, అనువర్ణితమ్ భవతి = ఉపపాదితమగుచున్నది.

తాత్పర్య వివరణములు— జాతి, వ్యక్తుల నాశ్రయించియుండును. జాతియొక్కటి వ్యక్తు లనేకములు. శబ్దము జాతిని బోధించినపుడు, ఆ సన్నిహితమగు ఆశ్రయమునుబట్టి, శబ్ద సంస్కారమున కావశ్యకమగు లింగవచనముల భేదము జాతి శబ్దమునకును గలుగునని భాష్యకారు డంగీకరించియున్నాడు.

''లింగవచన సిద్ధిర్గుణ వివక్షానిత్యత్వాత్'' - అని సరూప సూత్రమున వార్తికము గుణములనగా, స్త్రీపుం నపుంసక లింగములును ఏకత్వ ద్విత్వబహుత్వములును. వాని వివక్ష నియతము గాదు కాబట్టి జాతికి లింగవచనములు సిద్ధించునని చెప్పి, ద్రవ్యపదార్థ వాదికి వచనములు, స్వాభావికములుగాక బహుషు బహువచనమ్ - అను మున్నగు వచనములచేతనే ప్రతిపాద్యములయిన, జాతివాదినైన నాకును నష్టే యగును, 'పచతి' పచతః 'పచంతి' అని, క్రియా ప్రధానములయినను తిఙన్తములకు వచనభేదము కారకములవలన గలిగినట్లు, ఆకృతి ప్రధానమైనను ద్రవ్యసంఖ్యనుబట్టి వచనభేద ముపపాద్యము అని చెప్పెను. కనుక ఏకశేష విధాన మనావశ్యకమని ముగింపు. ప్రధానముగ జాతి శబ్దముచే చెప్పబడును. అది యొక్కటియే. కనుక దానిని చెప్పు శబ్దమును నేకమే ప్రాప్తమని భావము.

ఏకవచనాదులు శాస్త్రప్రతిపాద్యములేగాని స్వాభావికములు గావు. 'గోదౌ' అని ద్వివచనాంత శబ్దము ఒక గ్రామమునకు వాచకము. 'పంచాలాః' అని బహువచనాంత మొక దేశమునకు వాచకముగనున్నది. వచనములు స్వాభావికములయిన నట్లుండదుగదా. ద్రవ్య పదార్థవాదికయినను వచన నియమ మావశ్యకమయినట్లు, ఆకృతివాదికిని అది అపరిహరణీయము. వృత్తి విచార ప్రసంగ సంగతమయిన లింగవచన సిద్ధి విచారమింతతో ముగిసినది, ॥358॥

అవతారిక— ఉపమాన సమాసవిచార మిక జేయబడును. ఉపమాన సమాసమనగా, ''ఉపమానాని సామాన్యవచనైః'' అను, (2-1-54) సూత్రముచే విధింపబడిన సమాసము. ఉపమానవాచకములగు సుబంతములు సాధారణ ధర్మ విశిష్టములను జెప్పు సుబంతములతో సమసించునని యా సూత్రమున కర్థము. అందుపమానమన నేమియో తెలుపుటకు, ముందుగ, మానమననేమి ? అని తెలిసికొనుటకై, భాష్యమున్న, ''మానం హి నామ అనిర్జ్ఞాత జ్ఞానార్థ ముపాదీయతే, అనిర్జ్ఞాతం జ్ఞాస్యామీతి'' అని చెప్పబడినది. దాని నీ కారిక విశదీకరించును.

శ్లో॥ అనిర్జ్ఞాతస్య నిర్జ్ఞానం యేన తన్మానముచ్యతే ।
ప్రస్థాది కేన మేయాత్మా సాకల్యేనావధార్యతే ॥ 359

యేన = దేనిచేత, అనిర్జ్ఞాతస్య = 'ఇది ఇంత' అని స్పష్టముగ తెలియబడని వస్తువునకు, నిర్జ్ఞానం భవతి = విశేష పరిజ్ఞానము కలుగునో, తత్, మానం, ఉచ్యతే = అది, మానము,

అని చెప్పబడుచున్నది, ప్రస్థాదికేన = 'మానిక' మున్నగు కొలపాత్రచేత, మేయాత్మా = కొలవవలసిన పదార్థ ప్రమాణము, సాకల్యేన, అవధార్యతే = సంపూర్ణముగ 'ఇంత' అని నిశ్చయింపబడును.

తాత్పర్య వివరణము— మానమనగా నిది యింత అని పరిచ్ఛేదించునది. అడ్డ, తవ్వ, కుంచము, మరకము మున్నగు కొలపాత్ర. ఈ మాన శబ్దమునకు ఉత్, పరి, ప్ర. అను నుపసర్గలను జేర్చి, ఉన్మానము, పరిమాణము - ప్రమాణము - అనియు వ్యవహరింతురు. వానికి అర్థభేదమును గలదు. ఉన్మానమనగా తూకము. తులము, పలము, వీసె - మున్నగునది. పరిమాణములు, కుంచము మున్నగునవి. మూర, జాన, గజము - మున్నగునవి ప్రమాణములు. ఈ విధముగ సాకల్యముగ పరిచ్ఛేదించునది మానమగును. ॥౩౫౯॥

అవతారిక— పైన జెప్పినవన్నియు పరిచ్ఛేద్య వస్తువును, నిక్కచ్చిగ ఇది యింత, అని పరిచ్ఛేదించునవి. ఇక ఉపమానమననేమియో చెప్పుచున్నాను.

**శ్లో॥ అనిర్ జ్ఞాతం ప్రసిద్ధేన యేనతద్ధర్మ గమ్యతే।**
**సాకల్యేనా పరిజ్ఞానా దుపమానం త దుచ్యతే॥ 360**

అనిర్ జ్ఞాతం = 'ఇది ఇట్లు' అని తెలియబడనిది, ప్రసిద్ధేన, యేన = ఆ విధముగ తెలియబడిన, దేనిచేత, తద్ధర్మ = ఆ, ప్రసిద్ధమైన దాని ధర్మము కలదిగా, గమ్యతే, తత్ = తెలియబడుచున్నదో, అది, సాకల్యేన = సమగ్రముగ, అపరిజ్ఞానాత్ = తెలియచేయనందున, తత్, ఉపమానం = 'ఉపమానము' = దగ్గరగ తెలియచేయును, ఇతి ఉచ్యతే = అని, చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— గవయము - అని అడవులలో నుండు ఒక మృగము. అది ఆరణ్యులకే తెలియునది. అది ఎట్లుండును? అని అడిగిన, గోవువలె నుండునని, యందురు. నగరములందును, గ్రామములందును నుండు వారికి గోవు ప్రసిద్ధము. దాని సాదృశ్యమును బట్టి, దాని ధర్మములు కలదిగా గవయము నిరూపింపబడుచున్నది. కావున గోవు గవయమునకు ఉపమానము. అనగా ఇంచుమించుగ పరిచ్ఛేదకము మాత్రమే. కుంచము మానికవలె సమగ్ర పరిచ్ఛేదకము గాదు. 'ఉప' అనునది 'హీనము' అను నర్థమునకును ద్యోతకము. ఉపమానమనునది, ఉపమేయ వస్తువును, స్వసదృశముగ మాత్రమే బోధించును గాని విశేషరూపముగ బోధింపదు. కనుక అది మానము గాదు.

కనుకనే, ఉపమానమను తార్కికుల ప్రమాణము విషయమున, వివాదమును గలదు. అట ఆప్తవాక్యమే ప్రమాణము సాదృశ్యకథనముపాయమాత్రమే యని వారి తాత్పర్యము. 'ఉపమీయతే అనేన ఇతి ఉపమానమ్' అనుకరణ వ్యుత్పత్తిచే సాదృశ్యజ్ఞానముపమానము. ఆ జ్ఞానముచేత, సాక్షాత్తుగా ఉపమేయము పరిచ్ఛేదింపబడును. గోవు ఉపమానమనుట పరంపరనుబట్టి, సాదృశ్యజ్ఞానమే గవయ పరిచ్ఛేదకము ఆ శబ్దమునకును దాని యర్థమునకును గల సంబంధమును తెలిసికొనుటయే, ఫలము అందురు. ॥360॥

అవతారిక — ఇక నీ కారికలో సామాన్యవచనము లననేమియో చెప్పుదురు.

శ్లో॥ ద్వయోస్సమానో యో ధర్మ ఉపమానోపమేయయోః ।
సమాస ఉపమానానాం శబ్దైస్తదభిధాయిభిః ॥ 361

ఉపమానోపమేయయోః = ఉపమానము, ఉపమేయము అను, ద్వయోః = రెండింటికిని, సమానః, యః, ధర్మః = సమానమయిన, ఏ, ధర్మముకలదో, తదభిధాయిభిః శబ్దైః = దానిని చెప్పు శబ్దములతో, ఉపమానానాం సమాసః = ఉపమాన వాచకములకు సమాసము వచ్చును.

తాత్పర్య వివరణములు— సాదృశ్యము అను ధర్మమునుబట్టి రెండు వస్తువుల కుపమానోపమేయ భావమును చెప్పుదురు. ఆ ధర్మమే సామాన్యము. రెండింటికిని సమానమయి యుండుట. ఆ సామాన్యమును ముందుగ బోధించి, తరువాత తద్విశిష్టమును బోధించునవి సామాన్య వచనములు. వానితో ఉపమానవాచకములకు సమాసము వచ్చునని సూత్రార్థము. ఉదాహరణములు— ఘనశ్యామః - శస్త్రీశ్యామా - అనునవి. మేఘమువలె నల్లనివాడు దేవదత్తుడు. చురకత్తివలె నల్లనైనది, దేవదత్త - అని యర్థము. ఈ సమాసమున కుపమాన పూర్వపద కర్మధారయమని వ్యవహారము. ॥361॥

అవతారిక— ఆర్యా ! శ్యామత్వమను, గుణము, మేఘగతమయినది వేరు. దేవదత్తునియందుండునది వేరునుగదా ! అది సామాన్య ధర్మమెట్లగును ? అనిన—

శ్లో॥ ఆధారభేదాత్ భేదో యః శ్యామత్వే సో వివక్షితః ।
గుణోఽసావాశ్రితైకత్వో భిన్నాధారః ప్రతీయతే ॥ 362

శ్యామత్వే = నలుపు అను, గుణమునందు, ఆధారభేదాత్ = ఆశ్రయ భేదమువలన, యః భేదః సః = ఉన్నయే భేదముగలదో అది, అవివక్షితః = వివక్షింపబడదు, అనగా లెక్కలోనికి రాదు, అసౌ గుణః = ఈ, శ్యామత్వగుణము, భిన్నాధారః = వేరు వేరు ఆశ్రయములు కలదైనను, ఆశ్రితైకత్వః = ఆశ్రయింపబడిన, ఏకత్వము కలదై = ఏకముగా గృహీతమయి, ప్రతీయతే = ప్రతీయమానమగును.

తాత్పర్య వివరణములు— సామాన్యవాచక శబ్దములతో సమాసము విధింపబడినది గదా ఆశ్రయభేదమువలన గుణమునకు భేదమును గ్రహించిన ఉపమానోపమేయములకు సాధారణమైన ధర్మమే సంభవింపదు. అందువలన, సామాన్యవచన శబ్దము సార్థకమగుటకు, ఆశ్రయభేదమున్నను ధర్మమునకు ఏకత్వమే గ్రహింపవలెను. ఆధారములకు భేదమున్నను, గుణమునకు, ఉభయాన్వయము గల రూపముండును. అందువలన అభేదము లేకున్నను అభిన్నమను జ్ఞానము సంభవము. ॥362॥

అవతారిక— అభేదమే వివక్షితమును గాదు. ఇక నేమనిన—

శ్లో॥ గుణయోర్నియతో భేదః గుణజాతే స్తథైకతా।
ఏకత్వేఽత్యంతభేదే వా నోపమానస్య సంభవః॥ 363

గుణయోః = ఉపమానోపమేయముల గుణములకు, భేదః, నియతః = అనేకత్వము, నియతము కాని, తథా = ఆ విధముగనే, గుణజాతేః = ఆ గుణములందలి జాతికి, ఏకతా, నియతా = అభేదమును నిశ్చితము, ఏకత్వే=వానికి ఐక్యమే అనినగాని, అత్యంతభేదే వా=అంతయు భేదమే యనిన గాని, ఉపమానస్య = ఉపమించుట యను వ్యాపారమునకు, సంభవః న భవతి = సంభవము ఉండబోదు.

తాత్పర్య వివరణములు— 'రెండు వస్తువులు తుల్యములు' అనిన, అవి వేరు వేరు వస్తువులయి తీరును. ఉపమానోపమేయ భావమున కపుడే సంభవము. గోవువంటిది గవయము' అందుపుగాని, 'గోవు వంటిది గోవు' అనము. అట్లని, ఆ రెండు వస్తువులకును, సమానధర్మమేదియును లేకుండగ పూర్తిగ భేదమే యున్నను, పనికిరాదు. ఉభయత్ర అన్వయించు రూప మావశ్యకము. "మట్టిగడ్డ హిమవత్పర్వతము వంటిది" అని ఎవరును అనరు. భేదాభేదములు రెండును నుండవలెను. శ్యామగుణములు వేరయినను వానియందుండు శ్యామత్వ జాతి ఏకమేగాన నది సామాన్యమగును, అని భావము. ॥363॥

అవతారిక— ఉపమానోపమేయముల కత్యంతము భేదమున్నపుడు హిమవంతమునకును లోష్టమునకువలె ఔపమ్యమున చెప్పుట యుక్తము గాదు. అది సత్యమే. వానికి సర్వథా అభేదమున్నపుడును నది సంభవింపదందురే? అది ఏల? గుణసామ్యమును బుచ్చుకొని సంభవింపవచ్చును గదా? అనిన—

శ్లో॥ జాతిమాత్ర వ్యపేక్షయాముపమార్థో న కశ్చన।
శ్యామత్వమేకం గుణయోరుభయోరపివర్తతే॥ 364

జాతిమాత్ర వివక్షాయాం = ఆశ్రయముల భేదమును గణింపక జాతిని మాత్రమే తీసికొనిన, ఉపమార్థః=ఉపమించుట అనునది, కశ్చన, న=ఏదియు, కుదురదు, ఉభయోరపి గుణయోః = రెండు శ్యామ గుణములందును, శ్యామత్వం = శ్యామత్వమను జాతి, ఏకం వర్తతే = ఒకటి, గుణజాతి యుండును.

తాత్పర్య వివరణములు— ఉపమానము, సాదృశ్యమును బురస్కరించుకొని ఉపమేయమును పరిచ్ఛేదించును గదా. అపుడా మాటయే యుండదు. 'శస్త్రీ శ్యామా' అనుచో శస్త్రియందలి నలుపునకును, దేవదత్త నలుపునకును, శ్యామత్వము సామాన్యము' అని అంత మాత్రమే యర్థమగును. అంతియకాని, 'శస్త్రివలె దేవదత్త నల్లగా నున్నది' అనెడు భావమే కలుగదు. ॥364॥

*అవతారిక*— ఈ కారికయు నీ విషయమునే విపులముగ జెప్పుచున్నది.

**శ్లో॥ యేనైవ హేతునా శ్యామా శస్త్రీ తత్ర ప్రవర్తతే ।**
**స హేతుర్దేవదత్తాయాః ప్రత్యయేన విశిష్యతే ॥** 365

యేన, హేతునా, ఏవ = ఏ, కారణముచేతనే, శస్త్రీ, శ్యామా, తత్ర, ప్రవర్తతే = చురకత్తి, నలుపుకలది యగుటవలన నుపమేయమునందు వర్తించునో, సః హేతుః = ఆ హేతువు, దేవదత్తాయాః = దేవదత్తయొక్క, ప్రత్యయేన, విశిష్యతే = ప్రతీతిచేత, విశేషింపబడుచున్నది.

**తాత్పర్య వివరణములు**— నలుపు - అను, గుణము చురకత్తియందు, సమవేతమయి, అనగా సమవాయమను సంబంధమును గలిగి - ఉన్నది. అందువలన నది నల్లనిది అని గ్రహించుచున్నాము. దేవదత్త అనునామె కూడ ఆ గుణముచేతనే నల్లనిదని భావించుచున్నాము. ఆ గుణము తుల్యముగ రెండింటిని నంటియుండుట కారణము. అనగా నేమి తెలుచున్నది ? కత్తి నలుపు దేవదత్తయు నలుపు అనియే తెలుచున్నది. ఆ గుణమునుబట్టి వానికి సాదృశ్యము కలదని గోచరము కాదు. ॥365॥

*అవతారిక*— అందువలన నేమి గ్రహింపవలెననగా—

**శ్లో॥ ఆశ్రయాత్ యో గుణే భేదో జాతేర్యా చ విశిష్టతా ।**
**తాభ్యాముభాభ్యాం ద్రవ్యాత్మా సవ్యాపారః ప్రతీయతే ॥** 366

గుణే = నలుపు మున్నగు గుణమునందు, ఆశ్రయాత్ = దాని కాధారమగు వస్తువువలన, యః, భేదః = ఏ, భేదము కలదో, జాతేఃయాఅవిశిష్టతా చ = దానియందలి శ్యామత్వ జాతికి, అభేదమేది కలదో, తాభ్యాం ఉభాభ్యాం = ఆ భేదాభేదములు రెండింటిచేతను, ద్రవ్యాత్మా = ద్రవ్యముయొక్క స్వభావము, సవ్యాపారః = ఉపమించుట అను వ్యాపారము కలదిగా, ప్రతీయతే = తెలియబడుచున్నది.

**తాత్పర్య** వివరణములు— శస్త్రియందును, దేవదత్తయందును నుండు నలుపులు, భిన్నములే కాని వానియందు శ్యామత్వమను గుణజాతి ఒక్కటియే. ఈ ఆధారభేద నిమిత్తకమయిన, భేదమును, అన్వయిరూప హేతుకమైన ఏకత్వమును కారణములుగా, ఉపమించుట అను ద్రవ్యస్వభావము, పనిచేసి, ఉపమేయమును పరిచ్ఛేదించును అని భావము. ॥366॥

*అవతారిక*— ఓయీ ! భేదమును అభేదమును పరస్పర విరుద్ధములు గదా. అవి రెండును గలసి, ఉపమితి వ్యాపారమునందు ప్రవర్తించుట యెట్లు కుదురును ? అనిన—

**శ్లో॥ సోఽయమేకత్వనానాత్వే వ్యవహారః సమాశ్రితః ।**
**భేదాభేదవిమర్శేన వ్యతికీర్ణేన వర్తతే ॥** 367

ఏకత్వనానాత్వే = అభేదమును, భేదమును, ఆశ్రితః = ఆశ్రయించియున్న, సోఽయం = ఆ,

అవతారిక — అయం ఘటః, (ఇది కడవ) అను శబ్దమువలన, ఇది కడవ. అను జ్ఞానము కలుగుచున్నది. ఆ జ్ఞానములో ఘటము విషయమగుచున్నది.

అట్లే 'ఘట జ్ఞానమేతత్' అను శబ్దమువలన ఇది 'ఘట జ్ఞానము' అను జ్ఞానము కలుగుచున్నది. ఆ రెండవ జ్ఞానములో జ్ఞానము విషయము కాగలదు. రెంటికి భేదము ఏమియు లేదు కదా ! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ ఘటజ్ఞానమితి జ్ఞానం ఘటజ్ఞాన విలక్షణమ్ ।
ఘట ఇత్యపి యత్ జ్ఞానం విషయోపనిపాతి తత్ ॥ 105

ఘట జ్ఞానమ్ + ఇతి = ఘట జ్ఞానము ఇది అనెడి, జ్ఞానమ్ = జ్ఞానము, ఘటజ్ఞాన విలక్షణమ్ = ఘటము అనెడి జ్ఞానముకంటె విజాతీయమైనదే.

'ఘటః' అను పదమువలన కలిగెడి 'ఘటము' అను జ్ఞానము వేరు. 'ఘటజ్ఞానమ్' అను పదమువలన కలిగెడి 'ఇది ఘట జ్ఞానము' అనునది విలక్షణమైనదే. రెండు ఏకరూపములు కావు.

ఇందుకు కారణము చెప్పుచున్నాడు.

ఘటః + ఇతి + అపి = ఇది ఘటము అనెడి, యత్ + ఏ, జ్ఞానమ్ = జ్ఞానమో, తత్ = ఆ జ్ఞానము, విషయోపనిపాతి = ఘటము మున్నగు విషయమును అనుసరించి యున్నది.

'ఇది ఘటము' అను జ్ఞానము విషయమువలన కలుగుచున్నది. అనగా విషయముచే జనియించుచున్నది. 'ఇది ఘట జ్ఞానము' అను జ్ఞానము విషయమువలన జనింపలేదు. 'నేను ఇట్టి జ్ఞానము కలవాడను' అను రీతిని ఆ రెండవ జ్ఞానమున్నది

*కాబట్టి ఒక జ్ఞానము మరియొక జ్ఞానము ఎన్నడు గ్రహింపబడదు. ॥105॥

అవతారిక — ఘటాదికము జ్ఞానములో విషయమగుచున్నది. గ్రాహకము జ్ఞానము. గ్రాహ్యము ఘటాదికము. జ్ఞానము గ్రాహ్యాకారముకంటె భిన్నము కాదు. ఇది ఘట జ్ఞానము అను జ్ఞానమున ఘటము కూడ సంబంధించి యున్నది కదా ! అందుచే 'ఇది ఘట జ్ఞానము' అను జ్ఞానము కూడ విషయమువలన జనియించినదే అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ యతో విషయరూపేణ జ్ఞానరూపం న గృహ్యతే ।
అర్థరూపవివిక్తం చ స్వరూపం నావధార్యతే ॥ 106

---

* ఈ శ్లోకమునకు హేలారాజు మరియొక రీతిగా వ్యాఖ్య రచించెను. విశేషము నపేక్షించువారు మూలము చూతురుగాక, గ్రంథ విస్తర భీతిచే నిచట చూపలేదు.

ఈ సుప్రసిద్ధమయి యున్న, వ్యవహారః = సాదృశ్య వ్యవహారము, వ్యతికీర్ణేన = సంకీర్ణ మయిన, భేదాభేద విమర్శేన = భేదమును, అభేదమును అనునది మూలముగ, ప్రవర్తతే = బుద్ధి గోచరమయి యుండును

తాత్పర్య వివరణములు— రెండు వస్తువులకు పూర్తిగ అభేదమే ఉండిన, 'సోఽయం'=అదియే యిది - అనుకొందుము. వానికి భేదమే పూర్తిగసుండిన, 'అది కాదిది. ఇది వేరు' - అని వ్యవహరింతురు. భేదాభేదములు రెండును గలసినపుడే, 'తత్సదృశమిది' అను బుద్ధి కలుగును. అందు విరోధమేమున్నది? ఈ తృతీయకాండమునందే జాతి సముద్దేశ మున,

"సకృత్ప్రవృత్తా వేకత్వం, ఆవృత్తౌ సదృశాత్మతామ్।
భిన్నాత్మికానాం వ్యక్తీనాం భేదాపోహాత్ప్రపద్యతే॥"

అను 98 వ కారికలో, సామాన్యబుద్ధి, సమూహబుద్ధి, సదృశబుద్ధి, అను బుద్ధిత్రయవిషయము వివరింపబడినది. ॥367॥

అవతారిక— అన్వయముఖముగా నుపపాదించిన విషయమునే దార్ఢ్యమునకై వ్యతి రేక ముఖమున గూడ నుపపాదించుచున్నారు.

శ్లో॥ శ్యామేత్యే వాభిధీయేత జాతిమాత్రే వివక్షితే।
శస్త్ర్యాదీనాముపాదానే తత్ర నాస్తి ప్రయోజనమ్॥ 368

జాతిమాత్రే = జాతి యొకటియే, వివక్షితే సతి = చెప్పదలంపబడిన, శ్యామా ఇత్యేవ = "శ్యామా దేవదత్తా" = దేవదత్త నల్లగనున్నది అనియే, అభిధీయేత = చెప్పబడి యుండ దగును, శస్త్రీ ఆదీనాం = ఉపమానములగు చురకత్తి మున్నగువానిని, ఉపాదానే = గ్రహిం చుటలో, తత్ర = అచట, ప్రయోజనం = ప్రయోజనము, నాస్తి = ఉండదు.

తాత్పర్య వివరణములు— దేవదత్త అను నీమె శ్యామత్వజాత్యనుగతమగు శ్యామ గుణము కలది' అని మాత్రమే వివక్షితమైన, "ఇయం దేవదత్తా శ్యామా" = ఈ దేవదత్త నల్లగా నున్నది' - అని మాత్రమే అనదగి యున్నది. నల్లనిది అని తెలియచేయుటకు, శ్యామ గుణసంబంధమును తెలియజేయు శ్యామ పదము కలదు గదా. ఇక శస్త్రీ అను పదప్రయోగ మెందులకు? ఆ నలుపు నందలి అతిశయమును చెప్పదలంపనపుడు శస్త్రీ మున్నగు ఉప మాన పదములను వాక్యమున చేర్చి 'శస్త్రీ శ్యామా' అనుట నిష్ప్రయోజనము. ॥368॥

అవతారిక— ఓయీ! ఉపమానోపమేయ భావము, భేద ఘటితమును, అభేద ఘటితమును ననిన, అతి ప్రసంగము కలుగును. ఆశ్రయములగు ద్రవ్యములన్నిటయందును నుండు శ్యామ గుణమొక్కటియే కానిమ్ము. కాని ఆశ్రయముల వేరుపాటును బట్టి అదియు వేరు వేరు కావచ్చునుగదా! ఇక శ్యామత్వమను గుణజాతి ఒక్కటియేగాన నభేదమును సంభ వము. అపుడు దేవదత్తకు, శస్త్రియే యేల ఉపమానమనవలెను? వేరొకటియు నా గుణము

గలది కావచ్చును - అని శంకింపవచ్చును. కాని ఉపమావిషయములగు గుణములకు స్వలక్షణ విశేషముండును. స్వలక్షణమనగా స్వనియతము, విలక్షణము కానిది.

శ్లో॥ అశబ్దవాచ్యో యో భేదః శ్యామమాత్రే న వర్తతే।
శ్యామేషు కేషు చిద్వృత్తిర్యస్య సోఽత్రవ్యపేక్ష్యతే॥ 369

అశబ్దవాచ్యః యః భేదః = అచటనున్న శబ్దముచే చెప్పబడని ఏ భేదము, శ్యామమాత్రే న వర్తతే = సకల శ్యామములందును నుండదో, యస్యకేషుచిత్ = కాని దేనికి ఏ కొన్ని, శ్యామేషు వృత్తిః = శ్యామములందే ఉనికి యుండునో సః = అది, అత్ర = ఈ ఉపమితి క్రియయందు, వ్యపేక్ష్యతే = వ్యాపారముగలదిగా నపేక్షింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— శ్యామ గుణమున కాశ్రయము లనేకములుండును. వానికి సూక్ష్మభేదములును నుండవచ్చును. కాని వానికి వాచకమగు పదనుచట ప్రయోగింపబడి యుండదు. కాని వాచ్యమగు గుణవిశేషముండును. సకల శ్యామ గుణములందును నది అనుస్యూతమై యుండక, కొన్నిచోట్ల మాత్రమే యుండును. అది ఈ ఉపమానోపమేయముల సంబంధమును దెలియచేయుట అను వ్యాపారము కలది.

'శస్త్రీ శ్యామా' అను నీ వృత్తిపదమువలననే ఉపమానోపమేయముల శ్యామ గుణము అనన్యము, ఇతరత్ర సంభవింపనిది అని ప్రతీతమగుచున్నది. కాగా, శ్యామగుణము ఆధారముల భేదమువలన భిన్నముగా దోచినను, ఒకానొక స్వాలక్షణ్యముచే, ప్రతినియతత్వముచేత, భేదరూపమునను అభేదరూపమునను ఔపమ్యమును ఉపమానోపమేయములకు స్థాపించునని భావము. ॥369॥

అవతారిక— ఉపమితి వ్యాపారమున, గుణజాతికయినను నంతకును సంబంధముండదు అని నిరూపించుచున్నారు.

శ్లో॥ శ్యామేషు కేషుచిత్ కించిత్ కించిత్ సర్వత్ర వర్తతే।
సామాన్యం కశ్చిదేకస్మిన్ శ్యామే భేదో వ్యవస్థితః॥ 370

కేషుచిత్ = కొన్ని జాతులందు, అనగా, శ్యామేషు = శ్యామత్వ గుణజాతులందు, కించిత్ కించిత్ = కొంత కొంత, సామాన్యం = తక్కువచోట్లనుండు సామాన్యము = జాతి, సర్వత్ర = సర్వ గుణములందును, వర్తతే = ఉండును, ఏకస్మిన్ = ఒకానొక, శ్యామే = శ్యామ గుణమునందు, కశ్చిత్ = ఒకానొక, భేదః = విశేషము, వ్యవస్థితః = స్థిరమై నిలుచును.

తాత్పర్య వివరణములు— సామాన్యమనగా జాతి. అది రెండు విధములు. 1. పరసామాన్యము, 2. అపరసామాన్యము. పరసామాన్యమునకు మహాసామాన్యమనియు వ్యవహారము. ఇపుడు - ద్రవ్యములు తొమ్మిది, గుణములు ఇరువదినాలుగు, కర్మలు అయిదు. అని వైశేషికుల పదార్థవిభాగము గదా! ద్రవ్యములందుండు జాతి ద్రవ్యత్వము గుణములం

దుండునది గుణత్వజాతి, కర్మలందుండునది కర్మత్వజాతి. మూడింటి మొత్తమునందుండునది 'సత్త' అను సామాన్యము. ఈ సత్త, మహాసామాన్యము లేదా పరసామాన్యము. తక్కినవి అపరసామాన్యములు.

ఆ విధముగనే కొన్ని శ్యామ గుణములందుండు శ్యామత్వము అపరసామాన్యమగును. అదియే ఉపమితి క్రియలో పనిచేయునది. అన్ని శ్యామములందును నుండు శ్యామత్వమను మహాసామాన్య ముపమకు నిమిత్తముగాదు. ఒకానొక ప్రతినియత శ్యామ గుణమునందు ఒక విశేషముండవచ్చును. అదియే ఉపమకు నిమిత్తము. ఉపమానగతమగు నుత్కర్షను తెలియచేయునది అదియే. ఉత్కృష్టగుణము గలదిగదా ఉపమానమగునది.

చంద్రునితో కన్యావదనముఁ బోల్చుదురు. చంద్రుని యుత్కర్షను తెలియచేయునది కాంతి విశేషము. అది ఉపమకు నిమిత్తము. ఎచ్చటనైనను, ఉపమానమున కతిశయమును గలుగజేయు విశేషమే ఉపమానాంగము. సామాన్యము కాదు - అని తాత్పర్యము. ఈ విషయ ముక్తపూర్వము. ॥370॥

*అవతారిక* — గుణసామాన్యము తప్ప వేరొక జాతి కలదనుటకు ప్రమాణ మేమనిన—

**శ్లో॥ తథా హి సతిసౌరభ్యే భేదోజాత్యుత్పలాదిషు ।**
**గంధానాం సతిభేదే తు సాదృశ్యముపలభ్యతే ॥** 371

**తథా హి** = అది యెట్లనిన జూడదు, జాత్యుత్పలాదిషు = జాజి, కలువ మున్నగువానియందు, సౌరభ్యే సతి = సువాసన యున్నపుడు, గంధానాం = ఆ పరిమళములకు, భేదః = విశేషము అవధార్యతే = నిశ్చయింపబడును, భేదే = వానికి భేదము, సతితు = ఉండినపుడు మట్టుకు, సాదృశ్యం = సారూప్యము, ఉపలభ్యతే = పొందబడుచున్నది.

*తాత్పర్య వివరణములు* — జాజిపూవులు, కలువపూవులు మున్నగు పూవులకు, గంధములు కలవుగదా. ఆ గంధములందు గంధత్వము అను మహాసామాన్యముండును. అదిగాక, 'చక్కని సువాసన' అను సౌరభ్య గుణవిశేషమును ఉండును. ఆ గంధముల భేదము, దానినిబట్టి నిర్ధారింపవచ్చును. కలువలుగాని, నిశారాణీగాని పరిమళించినపుడు, చీకటిలోనైనను, ఆ సౌరభ్యమునుబట్టి, ఇది ఫలాని పూవు గంధమని చెప్పగలుగుచున్నాము. కాగా సౌరభ్యమనునది అపరసామాన్యమనుట.

ఇట్లు వాని వాని సౌరభ్యమునుబట్టి ఆ యా గంధములకు విశేషమున్నను, గొన్నిటికి సాదృశ్యమును గలదు.

'నఖము' అని యొక గంధద్రవ్యము. శైలేయము = అనగా, రాతిపువ్వు. ఇట్టి వాని గంధములకును అవాంతర భేదములు లేకపోలేదు. అయినను ఏదియో ఒక స్వభావమును బట్టి వానికి సాదృశ్యము వ్యవహరింపబడుచుండును. పద్మగంధి ముఖం, కింజల్కగంధి,

మాలతీగంధి - ఇత్యాది వ్యవహారములందు, అపరసామాన్య కృతభేదమున్నను సదృశవ్యవహారము ప్రసిద్ధము. గంధ గుణమున కవాంతరజాతి భేదమున్నట్లు, రూపమునకును సరి సంభవమే. కావున శ్యామాది రూపములందును అపరసామాన్యముండుట న్యాయ్యము అని తాత్పర్యము. ॥371॥

**అవతారిక**— సరి. ఈ గుణములకు ప్రతినియతత్వము = ప్రత్యేకత దేనివలన కలుగును? అనిన—

**శ్లో॥ గుణానామాశ్రయాద్భేదః స్వతోవాప్యనుగమ్యతే ।**
**అనిర్దేశ్యాత్ విశేషాద్వా సంకరాద్వా గుణాంతరైః ॥ 372**

గుణానామ్ = శ్యామాది గుణములకు, భేదః = భేదము, ఆశ్రయాత్ వా = వాని వాని ఆధారమును బట్టిగాని, స్వతః అపి వా = స్వరూపమును బట్టియేగాని, అనిర్దేశ్యాత్ విశేషాత్ వా = 'ఫలానా' అని చెప్పుటకు వీలులేని విశేషమువలనగాని, గుణాంతరైః = మరికొన్ని బయట గుణములతో, సంకరాత్ వా = సంకరము = కలిసిపోవుటవలనగాని, అనుగమ్యతే = అనుగతముగ గ్రహింపబడుచుండును.

**తాత్పర్య వివరణములు**— కొన్ని కొన్ని గుణములకు, వాని కాశ్రయములగు ద్రవ్యమువలన విశేషమేర్పడును. కలువలు నలుపు వేరు. తమాల పుష్పముల నలుపు వేరు. కాని స్వభావ సామ్యమువలన వాని కుపమానోపమేయ భావము ప్రవర్తించును. ''—రోలంబ, గరల, వ్యాల, తమాల, శ్యామలంనభః—'' అనగా, ఆకాశము - తుమ్మెద, విషము, త్రాచు పాము, చీకటి చెట్టు - దీనివలె నల్లగనున్నది అని యర్థము. అచట, తుమ్మెద మున్నగువాని నలుపు ఆశ్రయభేదముచే వేరు వేరు గదా!

కొన్ని గుణములకు ఆశ్రయ మొక జాతిదియే యయినను, స్వరూపముననే భేదముండును ధూసరత్వము = గోధుమరంగు, అట్టిది.

కొన్నిటికి భేదము కాల పరిణామమువలన కలుగునది. కల్లు, సారాయి మున్నగు వాని రసగంధ వైచిత్రి దాని కుదాహరణము.

ద్రవ్యాంతరముల గుణములు కలియుటవలన కొన్ని గుణములకు భేదమేర్పడును. మామిడిపండ్ల కావులో ఆసవమునుంచిన, ఆ పండ్లవాసన ఆసవమునకు వచ్చును. మాలతీ పువ్వులు, మందారపూవులు వేసిన, నూనెకును గంధ గుణభేదము కలుగును.

ఈ విధముగ గుణములు వేరు వేరయినను, ఒకానొక ప్రత్యాసత్తిచే హానియందపరసామాన్యమనునది యుండవచ్చును. ఆ సాదృశ్యమును బురస్కరించుకొని సామాన్య వచనముతో నుపమానవచనమునకు సమాసము సిద్ధించునని భావము. ॥372॥

**అవతారిక**— గుణముల సామ్యము మాత్రమే ఉపమించుటకు హేతువు కాదు.

ఉపమానము, ఉపమేయమగు దానికంటె గుణోత్కర్ష కలదిగ నుండదగును. అపుడే ఉప మానోపమెయ భావము ఘటించును

శ్లో॥ ఉపమానం ప్రసిద్ధత్వాత్ సర్వత్ర వ్యతిరిచ్యతే ।
ఉపమేయత్వ మాధిక్యే సామ్యే వా ననివర్తతే ॥ 373

ఉపమానం = ఉపమానము, ప్రసిద్ధత్వాత్ = ప్రసిద్ధివలన, సర్వత్ర = అంతటను, వ్యతిరిచ్యతే = అధికమై యుండును, ఉపమేయత్వం = ఉపమేయ భావమైతే, ఆధిక్యే వా = ఉత్కర్ష యున్నపుడును, సామ్యేసతి వా = సమత్వమే యున్నపుడుగాని, న నివర్తతే = తొలగదు.

*తాత్పర్య వివరణములు*— ఉపమానమనునది, ఉపమేయమగు దానికంటె నెపుడును అధిక గుణముకలది అయియే యుండవలెను. వ్యతిరేకమనగా నిచట ఆధిక్యము

ఉపమేయము మట్టుకు, అధిక గుణమైనను, తుల్య గుణమైనను గావచ్చును. ఉప మానమునకు ఆ, ఆధిక్యము స్వతః సిద్ధమయి ఉండవచ్చును, లేదా ప్రసిద్ధినిబట్టి కల్పింపబడ వచ్చును. ప్రసిద్ధతయే ఆ గుణోత్కర్ష. కనుకనే, స్త్రీ ముఖము, న్యూనగుణమైనను, శృంగార రస పరిపోషణమునకై చంద్రబింబమున కుపమానముగా కవులు నిర్దేశించుచుందురు.

ప్రేయసీ ముఖము కాముకుని దృష్టిలో ఉత్కృష్టగుణము కలది.

"ఈర్ష్యావశేన కలుషత్వ ముపాగతస్య దూరాన్ముఖస్య తవసుందరి ! సామ్యమేత్య, చేతః ప్రహర్షభరపూరిత. పూర్ణదేహః స్వాంగేష్వపి ప్రసభమద్యనమాతిచంద్రః" - అను వాక్యమును జూడుడు.

ఓ సుందరీ ! నీ ముఖము, ఈర్ష్యచేత కలుషితమై యున్నపుడది కళంకము గల తన కుపమానమై యుండుటను గమనించి, చంద్రుడు, మనస్సునందలి ప్రహర్షముచే దేహమంతయు నుప్పొంగి ఇపుడు తన అవయవములందు తాను ఇముడక బాధనొందుచున్నాడు అని యర్థము. ఇట వస్తుతః కామినీ ముఖమునకు ఉత్కృష్టగుణత లేదు. కాముక దృష్టిలో నది ప్రసిద్ధము.

కారికలో - సర్వత్ర అనుచున్నారు. అనగా వస్తుతః గుణోత్కర్ష కలదియే ఉపమానము కానక్కరలేదు. న్యూనగుణము కూడ ప్రసిద్ధిననుసరించి యుపమానము కావచ్చునని భావము. ఏ విధముగనైనను నధిక గుణముగా రూపింపబడవలెను. ఉపమేయమునం దా నియమ మక్కరలేదు. ॥373॥

*అవతారిక*— ఇక నిపు డుపమానమునకు వేరు విధముగ లక్షణమును చెప్ప దలంచి, మాన లక్షణమును జెప్పిన భాష్యగ్రంథమును ప్రకారాంతరముగ వ్యాఖ్యానించుచున్నారు.

శ్లో॥ అన్యైస్తుమానం జాత్యాది భేద్యస్యార్థస్య వర్ణ్యతే।
అనిర్జ్ఞాతస్వరూపో హి జ్ఞేయోర్థస్తేన మీయతే॥ 374

మానం, నామ = మానమనగా, భేద్యస్య = విశేషింపవలసియున్న, అర్థస్య = ద్రవ్యమునకు, జాత్యాది = జాతి మున్నగునది యగును, ఇతి తు = అనియేమో, అన్యైర్వర్ణ్యతే = ఇతరులచే రక్షింపబడుచున్నది, అనిర్జ్ఞాతస్వరూపః = తెలియబడని స్వరూపముగల, జ్ఞేయః, అర్థః = తెలియవలసిన పదార్థము, తేన = మీయతే హి = దానిచేత, కొలవబడుచున్నది గదా.

తాత్పర్య వివరణములు— మేయము = ఇదమిత్థమని నిరూపింపదగినది. మానము = ఆ విధముగ నిరూపించునది. ఈ మానమేయములనే, పరిచ్ఛేదకము, పరిచ్ఛేద్యము అందురు. లేదా అవచ్ఛేదకము, అవచ్ఛేద్యము అందురు. భేదకము భేద్యము అనునవియు నివ్వియే. విశేషణము విశేష్యము - అనుట.

ద్రవ్యము భేద్యము. దానికి, జాతిగుణ క్రియలు భేదకములు. ఏదియేని ఒక ఉపాధితో గూడినగాని బుద్ధి నారోపింపదు. 'ఇది ఇట్లు' అని తెలియబడని దానిని తెలియబరచినవి గాన జాతి, గుణ, క్రియలు మానపదార్థములగునని వారి భావము. ॥374॥

అవతారిక— ఇక నుపమానమన నేమియనగా జెప్పుచున్నారు.

శ్లో॥ మితస్తు స్వేన మానేన ప్రసిద్ధో యో గుణాశ్రయః।
ఆశ్రయాంతరమానాయ స్వధర్మేణ ప్రవర్తతే॥ 375

శ్లో॥ రూపాంతరేణ సంస్పర్శో రూపాంతరవతాం సతామ్।
భిన్నేన యస్య భేద్యానాముపమానం తదుచ్యతే॥ 376

ఈ రెండు కారికలకును నన్వయము ఒక్కటిగనే జేసి వ్యాఖ్యానింపబడుచున్నది.

స్వేన = ఆత్మీయమైన, మానేన = జాతి మున్నగు మానముచేత, మితః = పరిచ్ఛేదింపబడినదై, యః గుణాశ్రయః = గుణముల కాధారమయిన యే ద్రవ్యము, ప్రసిద్ధః, సః = ప్రసిద్ధముగ తెలియబడుచున్నదో, అది, ఆశ్రయాంతరమానాయ = ఇతరములగు నాశ్రయములను పరిచ్ఛేదించుటకు, యదా స్వధర్మేణ ప్రవర్తతే = తనయందున్న గుణమును బట్టి ప్రవర్తించునో, తదా, యస్య = అపుడు, ఏ పరిచ్ఛేదకము యొక్క, భిన్నేన, రూపాంతరేణ = వేరయిన ఆ రూపవిశేషముచే, రూపాంతరవతాం సతాం = తాము రూపాంతరము గలవి యగుచున్న, భేద్యానాం = పరిచ్ఛేద్యములకు = విశేష్యములకు, సంస్పర్శః భవతి = పరిచ్ఛేదము కలుగునో, తత్, ఉపమానం ఉచ్యతే = అది ఉపమానమని చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు — ఇక ఉపమానమనగా దగ్గరగా మానము. సమగ్ర పరిచ్ఛేదకము కాదనుట. ద్రవ్యమునందు జాతిగుణ క్రియలుండును. వానిచేత పరిచ్ఛిన్నము కావుననే ద్రవ్యము ప్రసిద్ధమయినది.

అనగా, ఉత్కృష్టమయిన గుణముగలది, వేరొక అప్రసిద్ధగుణము కల దానిని తెలియచేయుటకు ప్రవర్తించును. వాని రూపములు భిన్న భిన్నములు. కాని ఉభయానుగత మగు (అన్వయి) ధర్మమొకటి యుండును. అదియే సాదృశ్యము. అత్యంతము భిన్నము లయిన వానికి సంబంధముపపన్నము కాదుగాన, అన్వయి ధర్మమగు ఈ సాదృశ్యము ముందుకువచ్చి వానిని పరిచ్ఛేదించును. సాదృశ్యమాత్రమును బుచ్చుకొని పరిచ్ఛేదకమేగాన ఉపమానమేగాని సమగ్రమానము గానేరదు.

'శస్త్రీ శ్యామా' అను నుపమాన సమాసములో, శస్త్రీ దేవదత్తలకు సామాన్య ధర్మమగు శ్యామత్వము, వాని ఉపమానోపమానోపమేయ భావమునకు నిత్తము అని తాత్ప ర్యము ॥375, 376॥

అవతారిక— ఇక "ఈ నలుపు ఈ నలుపుతో సమానము" - అనునపుడు ఉప మానోపమేయభావ మెట్లనిన జెప్పుచున్నారు.

శ్లో॥ ధర్మః సమానః శ్యామాదిరుపమానోపమేయయోః ।
ఆశ్రీయమాణ ప్రాధాన్యోధర్మేణాన్యేనభిద్యతే ॥ 377

ఉపమానోపమేయయోః = ఉపమానమునకును ఉపమేయమునకును, సమానః, శ్యామాదిః, ధర్మః = సమానధర్మమగు నలుపు మున్నగునది, ఆశ్రీయమాణ ప్రాధాన్యః = ఆశ్రయింప బడిన ప్రాధాన్యము కలది, (యదా, భవతి, తదా, సః)=అయినపుడు అది, అన్యేన ధర్మేణ = వేరొక సాధారణ ధర్మముచే, భిద్యతే = విశేషింపబడును.

తాత్పర్య వివరణములు— ఉపమానోపమేయ భావమునకు వ్యవస్థాపకమగు శ్యామగుణము, తా నుపకారకత్వమును విడచి, ప్రధానముగ నుపమేయమే అయిన, అపుడది ద్రవ్యమువంటిదే యగునుగాన దానికి వేరొక స్వగతధర్మముచే పరిచ్ఛేద్యత కలుగును = ఇంకొక ధర్మము దానిని పరిచ్ఛేదింపవలసి యుండును. అపుడా ఇతరధర్మ ముపమానోప మేయ భావమునకు మూలము. ॥377॥

అవతారిక— ఆ ధర్మమేది యగును ? అనిన—

శ్లో॥ శస్త్రీకుమార్యోః సదృశః శ్యామ ఇత్యేవమాశ్రితే ।
వ్యపదేశ్యమనేనేతి నిమిత్తం గుణయోః స్థితమ్ ॥ 377

శస్త్రీకుమార్యోః = 'చురకత్తికిని, కుమారికిని', శ్యామః సదృశః = నలుపు సమానము, ఇతి, ఏవం = అని ఇట్లు, ఆశ్రితే సతి = వ్యవహరింపబడినపుడు, గుణయోః స్థితం = అపుడా గుణములందున్న, నిమిత్తం = సాధారణ కారణము, అనేన, ఇతి, వ్యపదేశ్యమ్ = 'ఫలానా' దానిచేత అని నిరూపింపదగి యుండును.

తాత్పర్య వివరణములు— ఆ శ్యామగుణముల సామాన్యధర్మము దీప్తి=ప్రకాశ

మగును. దీప్తినిబట్టి ఈ నఖపు ఈ నలుపుతో సమానము అని చెప్పదగును. వేరొక ధర్మము ధర్మాంతరముల ఔపమ్యమునకు మూలమనుట. కాని యిట్లుపపాదించిన, అనవస్థ యేర్పడునని బ్రహ్మకాండమున 63 వ కారికచే నిరూపింపబడినది. ॥378॥

అవతారిక— ఉపమానోపమేయభావము భేదాధీనము, ఉపమానమును ఉపమేయమును భిన్న భిన్నములుగ వివక్షింపబడినపుడే అది శబ్ద ప్రతిపాద్యమగును - అది యెట్లనిన జూడుడు.

శ్లో॥ యదా నిమిత్తైస్తద్వన్తో గచ్ఛన్తీత తదాత్మతామ్।
భేదాశ్రయం తదాఖ్యానముపమానోపమేయయోః ॥ 379

నిమిత్తైః = ఔపమ్య నిమిత్తములయిన గుణములతో, తద్వంతః = ఆ నిమిత్తములుగల, ఉపమానోపమేయములు, తదాత్మతాం = అభేదమును = ఏకాత్మతను, గచ్ఛంతి, ఇవ = పొందుచున్నవా ? అనునట్లు, యదాభవన్తి = అయినపుడు, తదా = అట్టి సందర్భమున, ఉపమానోపమేయయోః = ఉపమానమునకును ఉపమేయమునకును, ఆఖ్యానం = వేరు వేరుగా వ్యవహారము, భేదాశ్రయం భవతి = వాని భేదమును పురస్కరించుకొనినదగును.

తాత్పర్య వివరణములు— నిమిత్తములనగా నొకదానితో వేరొకదానిని బోల్చుటకు కారణములయిన నలుపు మున్నగు గుణములు. వానినిబట్టి చూచిన నుపమానోపమేయములు ఒకే వస్తువా యనునట్లు భాసించును. కాని వాని స్వరూపమునుబట్టి అవి వేరువేరే. వానికి గల సంబంధమును చెప్పు విభక్తి ప్రత్యయమేదియు నచట లేదు. అందుకొరకు, ఇవ = వలె మున్నగు ద్యోతకములు ప్రయోగింపబడుచుండును. కావున ఇవాది శబ్దములచే ప్రతిపాదింపబడుట వలన ఉపమానోపమేయభావము 'శాబ్దము' అగును.

శస్త్రీ ఇవ శ్యామా॥ గౌరివ గవయః॥ శైలాః ఇవ వలాహకాః॥ మున్నగునవి ఉదాహరణములు. ఇటువంటి అభేద నిర్దేశము గల స్థలములందు, సామాన్యధర్మమునకు తద్విశిష్టముతో గల సంబంధమును దెలుపు షష్ఠ్యాదివిభక్తి లేనందున, వానికి సమన్వయము పొసగుటకు 'ఇవ' మున్నగునవి ప్రయోగింపబడును.

కాబట్టి అచట ఉపమపరిపూర్ణము అని ఆలంకారికులందురు. ఉపమానము, ఉపమేయము, సాధారణ ధర్మవాచకము. ఉపమానోపమేయ భావద్యోతకములగు ఇవాది పదముల ప్రయోగమును నున్నందున, పూర్ణత యని తాత్పర్యము. ॥379॥

అవతారిక— ఉపమానోపమేయముల కుండు పోలికలనుబట్టి వానికి అభేదమునే ఆరోపించిన, అపుడుపమానోపమేయభావము గర్భీకృతమై యుండును గాని వాచ్యము గాదు. ఎట్లన—

శ్లో॥ తత్త్వాసంగవివక్షాయాం యేషు భేదో నివర్తతే।
లుప్తోపమాని తాన్యాహుః తద్ధర్మేణ సమాశ్రయాత్ ॥ 380

యేషు = ఏ ఉపమానములందు, తత్సామాన్యగపివక్షయాం = అభేదారోపమును వివక్షించినపుడు భేదః నివర్తతే = భేదము తొలగిపోవునో, తాని = ఆ ఉపమానములు, తద్ధర్మేణ = ఆ సమాన ధర్మముచేత=గర్భీకృత ధర్మముచేత, సమాశ్రయాత్ =పరిగ్రహింపబడి యుండుట వలన, లుప్తోపమాని, ఆహుః = 'లుప్తోపమలీ యుపమానములు' అనిరి.

తాత్పర్య వివరణములు — ఉపమానోపమేయముల కభేద మారోపింపబడినపుడిక భేదము లేదు గాన, నుపమానోపమేయభావము గూడ తిరోహితమగును. ఎట్లనగా జూడుడు. ''గౌర్వాహీకః'' అందురు. వాహీకుడు ఎద్దు. ''సింహో మాణవకః'' ఈ పిల్లవాడు సింహము అందురు. సింహముకాని వానిని సింహమనుట, ఎద్దుకాని వానిని ఎద్దు అనుట, ఉపపన్నము గాదు. దాని యుపపత్తికై, కార్యమునుబట్టి కారణ మూహింపబడునుగాన, వారియందు గోవు చేయు పనులును, సింహము చేయు పనులును నుండుట చూచి, సమానధర్మము నంతర్భవింప జేసి 'సింహతుల్యుడు' 'గోతుల్యుడు' - అను నర్థమున, ఉపవాచకమగు ఇవ శబ్దము లేకుండ గనే 'ఎద్దు వాహీకుడు' 'సింహము మాణవకుడు' అనియే యనుచున్నారు. ॥380॥

అవతారిక— ఒక వస్తువును, 'ఇది ఇట్టిది' = ఇదం ఇత్థమ్ అని సమగ్రముగా పరిచ్ఛేదించునది మానమనబడును - అని చెప్పి, ''తత్సమీపే యత్ = న అత్యన్తాయ మిమీతే తత్ ఉపమానమ్'' అని మహాభాష్యమున జెప్పబడినది ''అన్యైస్తుమానం జాత్యాది'' అను కారికార్థమును జూడుడు. ఆ భాష్య తాత్పర్యమిందు విశదీకరింపబడుచున్నది.

శ్లో॥ శస్త్రీం ప్రసిద్ధం శ్యామత్వం మానం సా తేన మీయతే ।
అన్యా శ్యామా తు తద్రూపా తేనాత్యంతం న మీయతే । 381

శస్త్ర్యాం=చురకత్తియందు, ప్రసిద్ధం శ్యామత్వం=పరిచ్ఛేదకముగా, ప్రసిద్ధమయిన, నలుపు, మానం, భవతి = మానమగును, సా, తేన, మీయతే = ఆ కత్తి, ఆ నలుపు గుణముచే, సమగ్రముగ పరిచ్ఛేదింపబడుచున్నది, అన్యా, శ్యామా =ఇతరమైన, ఆ నలుపురూపుగలయామె తద్రూపా, తు = ఆ కత్తిరూపమువంటి రూపముగలది మాత్రమే, తేన, అత్యంతం = ఆ నలుపుచే, సమగ్రముగ నది, న మీయతే = పరిచ్ఛేదింపబడుట లేదు.

తాత్పర్య వివరణములు— కత్తియు నలుపే - దేవదత్త యను నామెయు నలుపే దేవదత్త నలుపు ప్రసిద్ధముగాదు. ప్రసిద్ధమగు శస్త్రీగత శ్యామత్వముచేత, 'ఈ దేవదత్తయు నల్లనిది' - అని పరిచ్ఛేదింపబడుచున్నది. ఈ విధముగా శ్యామత్వము శస్త్రికిని దేవదత్తకును సామాన్యధర్మమే అయినను, హీనమగు మానమేకాని సమగ్రమానము గాదు. కావున నది ఉపమానము'' - అని భావము. ॥381॥

అవతారిక— ఈ కారికయు, పూర్వ కారికకు వివరణరూపమే—

శ్లో॥ శస్త్రీం స్వేనగుణేనాతోమిమానా మాశ్రయాంతరమ్ ।
అసమాప్తగుణం సిద్ధేరుపమానం ప్రచక్షతే ॥ 382

అతః = ఈ, సిద్ధేః = పరిపూర్ణ గుణసిద్ధివలన, స్వేన, గుణేన = ఆత్మీయమగు గుణముచేత, ఆశ్రయాంతరం = ఆ గుణమున కాశ్రయమగు వేరొక వ్యక్తిని, మిమానాం శస్త్రీం = కొలచుచున్న = పరిచ్ఛేదించుచున్న కత్తిని, అసమాప్తగుణం = గుణ సమగ్రతలేని, ఉపమానం = అసంపూర్ణ మానముగా, ప్రచక్షతే = చెప్పుచుందురు.

తాత్పర్యము— తాత్పర్యము స్పష్టముగాన వివరణ మపేక్షితముగాదు. ॥382॥

అవతారిక— రెండు విధములుగ ఉపమానోపమేయములను వ్యాఖ్యానించి, సామాన్యవచనత్వము విచారింపబడుచున్నది. సాధారణ ధర్మవాచక శబ్దము, ఆ ధర్మము సాధారణమైనను, తాను దానిని ఉపమానగతముగగాని ఉపమేయగతముగగాని చెప్పగలదు. యుగపత్ = ఒకే పర్యాయమున ఉభయగతముగ చెప్పజాలదు గదా అపుడు దానికి సామాన్యవచనత్వ మెట్లు? అని శంక కలుగగా, సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉపమేయేస్థితో ధర్మః శ్రుతోऽన్యత్రానుమీయతే ।
శ్రుతోऽథవోపమానస్థ ఉపమేయేऽనుమీయతే ॥ 383

ఉపమేయే, శ్రుతః సన్ = ఉపమేయమువద్ద వినబడుచున్నదై, స్థితః ధర్మః = ఉన్న సాధారణ ధర్మము, అన్యత్ర, అనుమీయతే = ఉపమానమువద్దను ఊహింపబడును, అథవా = లేదా, ఉపమానస్థ, శ్రుతః = ఉపమానమునందున్నదిగా వినబడినది, ఉపమేయే, అనుమీయతే = ఉపమేయమునం దూహింపబడును.

తాత్పర్య వివరణములు— ఒకసారియే ఉపమానోపమేయోభయగతముగ సాధారణ ధర్మాభిధానము సంభవింపదు. "శస్త్రీ శ్యామా దేవదత్తా" అని చెప్పినపుడు శ్యామత్వము ను ధర్మము ఉపమానగతముగా చెప్పబడిన, శస్త్రీ శబ్ద సమీపమునగదా శ్యామా శబ్దము శ్రుతము. దానికి ఉపమేయయగు దేవదత్తయం దన్వయమనుమేయము.

ఉపమేయమున నది వినబడిన, ఉపమానమునందును దానికి సంబంధము అనుమానముచే కల్పనీయము. ॥383॥

అవతారిక— ఉపమేయ సమీపమున సాధారణ ధర్మవాచక శ్రవణమునకు నిదర్శనము.

శ్లో॥ అధీయతే బ్రాహ్మణవత్ క్షత్త్రియా ఇతిదృశ్యతే ।
ఉపమేయస్య భిన్నత్వాత్ వచనం క్షత్రియాశ్రయమ్ ॥ 384

"అధీయతే బ్రాహ్మణవత్ క్షత్రియాః" = రాజులు బ్రాహ్మణులవలె నధ్యయనము చేయుచున్నారు, ఇతి, దృశ్యతే = అనివాక్య విన్యాసమగపడుచున్నది, ఉపమేయస్య, భిన్నత్వాత్ = ఉపమేయులగు రాజు లనేకులగుటవలన, వచనం, క్షత్రియాశ్రయమ్ = బహువచనము క్షత్రియులను బట్టినది.

యతః = ఏల యనగా, జ్ఞానరూపమ్ = 'ఇది ఘట జ్ఞానము' అను జ్ఞానము, విషయరూపేణ = ఘటము మున్నగు విషయముల యొక్క స్వరూపముచే అనగా వానితో మిశ్రితమై, న + గృహ్యతే = గ్రహింపబడదు.

పై చూపబడిన జ్ఞానము విషయ జనితము కాదు.

అర్థరూప వివిక్తమ్ + చ = విషయము యొక్క రూపముతో వివిక్తమగు అనగా దాని రూపములేని, స్వరూపమ్ = జ్ఞానము యొక్క స్వరూపము, న + అవధార్యతే = నిశ్చయింపబడదు.

విషయము లేనిది జ్ఞానముండనేరదు, కనుక ఘట జ్ఞానము, అని అనుచున్నారు. వస్తుతః ఆ జ్ఞానము విషయమువలన పుట్టునది కాదు. ॥106॥

జాతి సముద్దేశము ముగిసినది

తాత్పర్య వివరణములు— ఈ వాక్యమునందు, 'క్షత్రియాః' అని బహువచనము వినబడుచున్నది. 'బ్రాహ్మణవత్' అను ఉపమానపదమునందది స్పష్టముగ లేదు. కాని ఉపమేయులగు క్షత్రియులనేకులుగ బహువచనముచే చెప్పబడినారు. అధీయతే = చదువుచున్నారు అను క్రియాపదమును బహువచనాంతము. అధ్యయనము సాధారణ ధర్మము. దానికి ఉపమాన భూతులగు బ్రాహ్మణులతోడను సంబంధము ప్రతీతమగుచున్నది. ఉపమానగతముగ వినబడిన ధర్మమునకు ఉపమేయమున సమన్వయము ఉపమానముయొక్క ఉపమేయోపకారిత్వము వలననే తెలియుచున్నది. కావున దానికి వేరుగా నిదర్శనమును జూపబనిలేదు. ॥384॥

అవతారిక— ఆ సాధారణ ధర్మముభయగతముగా వచింపబడకున్నను, దాని సామాన్యవచనత్వమునకు అనుపపత్తి లేదు.

శ్లో॥ సాధారణం బ్రువన్ ధర్మం క్వచిదేవ వ్యవస్థితమ్ ।
సామాన్యవచనః శబ్ద ఇతి సూత్రే అపదిశ్యతే ॥ 385

క్వచిత్ ఏవ = ఉపమానోపమేయములలో నొకదానియందే, వ్యవస్థితం = సంబద్ధమైయున్న, సాధారణం ధర్మం = సామాన్య ధర్మమును, బ్రువన్ అపి = బ్రువన్ = చెప్పుచున్నదైనను, శబ్దః, సామాన్యవచనః = ఆ శబ్దము, సామాన్య ధర్మవిశిష్ట వాచకము, ఇతి, సూత్రే, అపదిశ్యతే = అని, 'ఉపమానాని' అను సూత్రమున జెప్పబడినది.

తాత్పర్య వివరణములు— ఆ ధర్మము, ఉపమానగతముగను, ఉపమేయగతముగను గూడ శబ్దతః చెప్పబడనక్కరలేదు. ఎట్లు నిర్దేశింపబడినను అది సామాన్య ధర్మమే. తద్వాచకమును సామాన్యవచనమగును. శ్యామత్వము వాస్తవరూపముచే సాధారణమే. ఒకచోట నున్నదిగ చెప్పబడినను రెండవస్థలమున నది అనుమానముచే సాధారణమగుట కెట్టి ప్రతిబంధకమును లేదు. ॥385॥

అవతారిక— సామాన్యవచనమయిన శ్యామశబ్దము గుణగత శ్యామత్వజాతిని చెప్పినపుడును సామాన్యవచనమే. ద్రవ్యగతమగు గుణమును జెప్పినపుడును సామాన్యవచనమే యగుననుచున్నారు.

శ్లో॥ నాభేదేన న భేదేన గుణో ద్విష్ఠోఽభిధీయతే ।
భిన్నయోర్ధర్మయోరేకః శ్రూయతేఽన్యః ప్రతీయతే ॥ 386

ద్విష్ఠః, గుణః = ఉపమానోపమేయములు రెంటియందుండు గుణము, అభేదేన = ఒక్కటిగాను, న అభిధీయతే = శబ్దముచే చెప్పబడదు, భేదేన చ = వేరు వేరయినదిగాను, న అభిధీయతే = చెప్పబడదు, భిన్నయోః, ధర్మయోః = వేరు వేరయిన రెండు ధర్మములలో, ఏకః, శ్రూయతే = ఒకటి, శబ్దముచే చెప్పబడును. అన్యః ప్రతీయతే = ఇంకొకటి అనుమానింపబడును.

'నలుపు' అను, గుణము, ఉపమానోపమేయములు రెండింటియందును నున్నది. కాని అది ఒకటియే అని శబ్దము చెప్పదు, అది వానిలో నేదియా యొకదానికే సంబంధించిన శబ్దము అయి యుండునుగదా. పోనిమ్ము అభిన్నముగ చెప్పబడకున్నను సహజమగు ఇతర వ్యావృత్తిరూపముచే చెప్పబడునుగదా అనిః నట్లును గాదు. అపుడు సామాన్యవచనమది యనుటయే పొసగదు. కాగా అది ఒకచో శ్రుతమయినను, ఇంకొకచోటను నన్వయించి ఉభయగతమనబడును. అపుడే గదా అది సామాన్యవచనమగునది ? అని భావము. ॥386॥

అవతారిక— ''మానం హి నామ అనిర్జ్ఞాత జ్ఞాపనార్థముపాదీయతే । తత్సమీపే యత్ నాత్యంతాయమిమీతే తదుపమానమ్'' - అని మహాభాష్యము 'ప్రస్థో వ్రీహిః' అందురు. మానెడువడ్లు, అని యర్థము. అచట మానిక, మానము. పరిచ్ఛేద్యమగు వ్రీహియందు పరిచ్ఛేదకమగు మానికయొక్క రూపము నారోపించిచేయు వ్యవహారమది. ''ప్రస్థోఽస్య పరిమాణం'' 'ఈ ధాన్యము పరిమాణము మానిక' - అనియు వ్యవహారముండును. అది భేదవ్యవహారము. వడ్లు వేరు, మానిక వేరు అని ఆ వ్యవహారము సూచించును.

ఇక ఉపమానమనునది, ఉపమేయమును, భేదాభేదములు రెంటిని మనమున నిడికొనియే పరిచ్ఛేదించును. కనుకనే దానిని 'న అత్యంతాయ మిమీతే' అనిరి. అనగా, సకలాంశములచేతను పరిచ్ఛేదింపదు అనుట. ముఖము చంద్రునితో తుల్యమను వ్యవహారముననును భేదాభేదములు రెండును గోచరములు గదా ! ఈ భాష్యగ్రంథము నీ కారిక వ్యాఖ్యానించుచున్నది.

శ్లో॥ నాత్యంతాయ మిమీతేయత్ సామాన్యే సమవస్థితమ్ ।
సాదృశ్యాదుపమేయార్థః సమీపే పరికల్ప్యతే ॥ 387

సామాన్యే = సాధారణ ధర్మమునందు, సమవస్థితం సత్ = ఉంటున్నదగుచు, యత్, అత్యంతాయ = ఏది, సకలాంశములచేతను, న మిమీతే = పరిచ్ఛేదింపదో = విశేషింపదో, తత్ ఉపమానమ్ = అది, ఉపమానము అనబడును, ఉపమేయార్థః = ఉపమేయ పదార్థ పరిచ్ఛేదకమయిన, సాదృశ్యం = సామ్యము, సమీపే, పరికల్ప్యతే = సమీపమునందే. కల్పింపబడును.

తాత్పర్య వివరణములు— సమీపే, మానం = ఉపమానమ్. సమీపమున ననగా ఉపమేయమునకు సమీపముననుండునది. దేవదత్తకు శస్త్రి పరిచ్ఛేదకముగదా ! అది దేనిని బట్టి ? శ్యామ గుణసాదృశ్యమునుబట్టి. దేవదత్తరూపము సంస్థానము. స్త్రీత్వమనుట. ఆ రూపముచేత గూడ శస్త్రి ఆమెను విశేషించుటలేదు. అందువలన సమీపమానమే గాని సమగ్ర మానము కాదు. అనగా పోలిక సుమారుగా నుండునుగాని ఎల్ల విధములను గాదని భావము. ॥387॥

అవతారిక— ఆ మహాభాష్య గ్రంథమునకు వ్యాఖ్యానాంతర మిందు జూపబడుచున్నది.

శ్లో॥ మానం ప్రతి సమీపం వా సా దృశ్యేన ప్రతీయతే ।
పరిచ్ఛేదాద్ధి సాదృశ్యమిహ మానోపమానయోః ॥ 388

వా = అథవా = లేదా, మానం ప్రతి = కొలుచుట = పరిచ్ఛేదించుటను గూర్చి, సమీపం = దగ్గర అయినది, సాదృశ్యేన, ప్రతీయతే = సాదృశ్యముచేత, ప్రతీయమానమగును, ఇహ = ప్రకృతమున, మాన ఉపమానయోః = మానమగు దానికిని, ఉపమానమగు దానికిని, పరిచ్ఛేదాత్ = కొలచుట = స్వరూపమును నిర్ధారించుట అను ధర్మముపలన, సాదృశ్యం అస్తిహి = సామ్యము కలదుగదా !

తాత్పర్య వివరణములు— 'తత్సమీపే' అనుచోట తచ్ఛబ్దము ప్రధానమగు ఉపమేయమును బరామర్శించుననియు, ఉపమేయమునకు దగ్గర దగ్గరగా పరిచ్ఛేదకమేగాని సమగ్రముగ గాదుగాన ఉపమానమగుననియు నింతకు బూర్వ ముపపాదింపబడినది ఇక నీ కారికలో— తత్పదము, ప్రధానమగు మానమునే పరామర్శించుననుచున్నారు. మేయమునకు మానము పరిచ్ఛేదకమయినందున అప్రధానమయినను, స్వరూప లక్షణములో నది ప్రధానమే యగును. కావున తచ్ఛబ్దమును దానినే పరామర్శించును. మాన సామీప్య ముపమానమున కెట్టిదనిన, సమాన ధర్మసంబంధమే అది. మానమును, అనగా ప్రస్థము మున్నగునదియు వస్తువును పరిచ్ఛేదించును. ఉపమానమును. ఉపమేయమును పరిచ్ఛేదించునుగాన వానికి సామ్యము కలదు. అందు, మానమత్యంత పరిచ్ఛేదకము. ఉపమానము సమీప పరిచ్ఛేదకము. అదియే భేదము. పరిచ్ఛేదమనునది రెండింటికిని సమానమే. ॥388॥

అవతారిక— "ఉపమానాని సామాన్యవచనైః" (2-1-54) అను సూత్రముతో మహాభాష్యమున - "ఉపమానానీత్యుచ్యతే కాని పునరుపమానాని ? కిం యదే వోపమానం తదే వోపమేయమ్ ? ఆహోస్విదన్య దుపమానమన్యదుపమేయమ్ ? అను గ్రంథము కలదు. అదియే, ఉపమానలక్షణ ప్రస్తావమునకు కారణము. ఉపమానములనుచున్నారే అవి యేవి ? ఉపమానము ఉపమేయమా ? అవి రెండును వేరు వేరా ? అను గ్రంథమునకు వ్యాఖ్యారూపమీ కారిక—

శ్లో॥ ఏకజాతి వ్యపేక్షాయాం తదేవేత్యవసీయతే ।
భేదస్యైవ వ్యపేక్షాయామన్య దేవేతిగమ్యతే ॥ 389

ఏకజాతి వ్యపేక్షాయాం = ఒకే గుణజాతిని వివక్షించినపుడు, తదేవ ఇతి, అవసీయతే = అదియే అని, నిర్ధారితమగును, భేదస్య ఏవ = భేదమునకే, వ్యపేక్షాయాం = వివక్ష చేసినపుడు, అన్యదేవ = అది వేరే, ఇతి, గమ్యతే = అని గ్రహింపబడును.

తాత్పర్య వివరణములు— అర్థ పతీతి ననుసరించియే శబ్దవ్యవహారము వర్తించును. ఉపమానోపమేయములందు సాధారణమైయుండు గుణజాతిని గ్రహించి, వ్యక్తి భేదమును గమనింపనిచో, ఉపమానమే ఉపమేయమని వ్యవహరింపవలసి వచ్చును. అటులగాక

వ్యక్తికృతమయిన, వాని స్వీయ స్వరూపభేదము ననుసంధించిన, అవి భిన్న భిన్నములే అని తోచును కావున ఉపమానము వేరు ఉపమేయము వేరు అనియే తెలును. ఉపమకు ప్రయోజక మయినది, వాని, అత్యంతభేదమా? అత్యంతాభేదమా? అని శంకాభిప్రాయము. ॥౩౮౯॥

అవతారిక— ఆర్యా! ఉపమానోపమేయములు భిన్నములా? అను శంకకై అవకాశము లేదే. ఉపమింపబడునది ఉపమేయము. ఉపమించుటకు సాధనమైనది ఉపమానము. మొదటిది కర్మసాధనము = కర్మ ప్రత్యయాంతము రెండవది కరణసాధనము. కరణకారకము తృతీయాంతము. ఇటుల వానికి భేదము ప్రకటముగ నగపడుచునే యున్నదిగదా! ఇక సంశయమునకు తావేది? అను శంకను అంగీకరించుచు నీ కారిక, శంకకు తావులేదని వివరించుచున్నది.

శ్లో॥ కర్మత్వం కరణత్వం చ భేదేనైవాశ్రితం యతః।
అత్యన్తైకత్వవిషయా న్న స్యాత్తేనాత్ర సంశయః ॥ 390

కర్మత్వం = ఉపమించుటలో కర్మ అగుట, కరణత్వం చ = కరణమగుటయు, భేదేన ఏవ వేరు వేరుగనే, యతః ఆశ్రితమ్ = ఏ కారణముచే ఆశ్రితమో, తేన అత్ర = ఆ కారణముచే, నిచట, అత్యంతైకత్వ విషయాత్ = వాని ఐక్యము విషయమువల్ల, సంశయః నస్యాత్ = సందేహము కలుగదు.

తాత్పర్య వివరణములు— ఉపమేయ శబ్దమునందు 'యత్' ప్రత్యయము, ఉపమింపబడునది = ఉపమించుటయను క్రియయందు కర్మను జెప్పును. ఉపమానమనగా, ఉపమీయతే అనేన = ఉపమానం అను విగ్రహముచే కరణార్థమున ల్యుట్ప్రత్యయాంతమయి, ఉపమాకరణమగును. కావున వాని వాస్తవభేదము స్పష్టమే ఆయె. కాగా ఏకత్వ సంశయమే కలుగదు.

కాని భిన్నములయిన వానికి గూడ సామాన్యధర్మమను నుపాధిని పుచ్చుకొని ఏకత్వమును వ్యవహరించుటయు గలదు. ఆ ఔపాధికమగు ఏకత్వము సంశయమునకు గారణమైన, కావచ్చును అని తాత్పర్యము. ॥౩౯౦॥

అవతారిక— వాస్తవముగ వేరు వేరయిన వానికి గూడ, ఉపాధుల మూలముగ అభేదము కల్పింపబడిన వ్యవహారములు గలవాయనిన—

శ్లో॥ భేదేన తుల్యరూపత్వాత్ శాలీంస్తానితి దృశ్యతే।
జాత్యభేధాత్ స ఏ వాయమితిభిన్నోఽభిధీయతే॥ 391

భేదే అపి = పదార్థములకు భేదమున్నప్పటికిని, తుల్య రూపత్వాత్ = రూపసామ్యముండుట వలన, 'తాన్ శాలీన్' ఇతి = ఆ వరి ధాన్యమునే, తినుచున్నాము అనుట, దృశ్యతే = లోకమున నగపడుచున్నది, భిన్నః = వేరయినది గూడ వ్యక్తి, జాత్యభేదాత్ = దానియందుండు

జాతి ఒకటియే యగుటవలన, 'స ఏవ అయం' = 'అదియే ఇది', ఇతి అభిధీయతే = అని చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— "తానేవ శాలీన్ భుంజ్మహే యే మధురాయాం దృష్టాః = మధురలో మనము చూచిన వరి ధాన్యమునే తినుచున్నాము' - అని యందురు. కాని, ఇవి అవి కావు. తత్సరూపములు. ఆ జాతివే. రూపసామ్యముండుటవలన నభేదము నారోపించుచున్నాము.

ఈ విధముగనే, సాదృశ్యముండుటవలననేగాక, జాతి ఒకటియే అగుటవలనను వ్యక్తుల కభేదమును వ్యవహరించుచున్నారు. మాఠరుడు, కౌండిన్యుడు, గార్గ్యుడు, గౌతముడు అను నలుగురు వ్యక్తులు. వారియందుగల బ్రాహ్మణత్వ మొకటియే జాతి. అందువలన వారిని బ్రాహ్మణులు అనుచున్నాము. ఎచ్చట? "చత్వారో బ్రాహ్మణా ఉదకుంభానాహరేయుః" (నలుగురు బ్రాహ్మణులు నీటికుండను తీసికొనివత్తురు గాక) అను శ్రౌతవాక్యమునందు. అనగా వారికి జాతినిబట్టి ఐక్యము వ్యక్తులనుబట్టి భేదము. ఆ విధముగనే ఉపమానోపమేయ వ్యక్తులు వేరయినను, ధర్మసామ్యమువలననో లేక ఏకజాతి సంబంధమువలననో, అభేదము గోచరించుననుట. ॥391॥

అవతారిక— "భేదస్యైవ వివక్షయా మన్యదేవేతి కథ్యతే" అని వెనుక చెప్పబడిన, ఉపమానోపమేయముల భేద పక్షమునందును, సంశయము యుక్తమే యనుచున్నారు.

శ్లో॥ కథం హ్యవయవోఽన్యస్య స్యాదన్య ఇతి చోచ్యతే ।
అత్యంతభేదే నానాత్వం యత్ర తత్త్వం న విద్యతే ॥ 392

అన్యస్య = వేరొక దానికి, అన్యః = వేరొకటి, అవయవః కథంస్యాత్ ? = అవయవ మెట్లగును ? ఇతిచ, ఉచ్యతే = అనియు, భాష్యమున ప్రశ్నింపబడుచున్నది, యత్రతత్త్వం = ఏ భేదమున్నపుడు, అభేదము, నవిద్యతే, తత్ర = ఇకనుండదో, ఆ, అత్యంతభేదే = సంపూర్ణమగు వేరుపాటున్నపుడు, నానాత్వం భవతి = అనేకత్వమే ఉండును.

తాత్పర్య వివరణములు— "హలన్తాచ్చ" (1-2-10) అని యొక పాణిని సూత్రము. ఇక్కునకు అవయవమయిన హల్లుకంటె బరమగు 'ఝల్' ప్రత్యాహార వర్ణము ఆదినిగల సన్ప్రత్యయము 'కిత్తు' అగును అని దాని కర్థము. ఆ సూత్రమున మహాభాష్యమునందు ఈ గ్రంథము గలదు. "అయుక్తోఽయం నిర్దేశః, కథం హి ఇకోనామహల్ అంతః స్యాత్ అన్యస్యాన్యః ?" అని. వర్ణము లొకదానికొకటి అవయవములు కావుగదా. అట్టియెడ, హల్లు ఇక్కునకు అంతావయవమగుట ఎట్లు? అని శంకాభిప్రాయము. అనగా, అత్యంత భిన్నములకు, అభేద మే విధముగను గుదురదనిగదా శంకించువాని యభిప్రాయము. ప్రకృత విషయమున, ఉపమానోపమేయములకు, జాతినిబట్టిగాని, రూపసాదృశ్యమునుబట్టిగాని అభేదము నుపపాదించినను, వాని కత్యంత భేదమే వాస్తవికము. కావున సంశయ ముపపన్నమే. ॥392॥

*అవతారిక*— అవయవములకును, అవయవికిని, అభేదము వివక్షవలన సంభ వించిన సంభవింపవచ్చును. వర్ణముల కవయవావయవిభావము లేదుగదా. కావున వాని కభేద వివక్షకు సంభవమే లేదనుచున్నారు.

శ్లో॥ అభేదస్య వివక్షాయామేకత్వం సంఘసంఘినోః ।
సంఘినోర్నత్వభేదోఽస్తి తథాన్యత్వముదాహృతమ్ ॥ 393

సంఘసంఘినోః = అవయవికిని, అవయవములకును, అభేదస్య వివక్షాయాం = ఏకత్వమును వివక్షించినపుడు, ఏకత్వం భవతి = ఐక్యము వ్యవహరింపబడును, సంఘినోః తు = అవ యవములకు మట్టుకు, అభేదః న అస్తి = అభేదము లేదు, తథా చ = కాబట్టి, అన్యత్వం ఉదాహృతమ్ = భేదము ఉదాహరింపబడినది.

తాత్పర్య వివరణములు— అవయవములకును అవయవికిని సంబంధము సమ వాయము. దానినిబట్టి వాని కభేదమును చెప్పదలంచుటయు గలదు. వనమనగా వృక్షముల సంఘము. కాని, 'వనము వృక్షములు' 'బ్రాహ్మణులు' సంఘము అని వాని నొకటిగ వ్యవహ రించుటయు లేకపోలేదు. ఇక వనవృక్షములకును, బ్రాహ్మణ సంఘములకును భేదమును పాటించి, వృక్షముల వనము = చెట్లతోట, అవియు బ్రాహ్మణుల గుంపు అను వ్యవహార మును గలదు. కావున వానికి భేదమును అభేదమును సంభవించును. ఇక అవయవములకు ఒకదానితో నింకొకదానికి భేదమేగాని అభేదము లేదు. శింశపపలాశములు రెండు చెట్లు. వనావయవములు. శింశపలాశములు = ఇరుగుడు చెట్టును, మోదుగ చెట్టును పరస్పరము అభిన్నములుగ వ్యవహరింపబడవు. ఇక నుపమానోపమేయములకు కర్మకరణ ప్రత్యయము లను బట్టి భేదమును, అభేదము నాశ్రయించి ఏకత్వ సంశయమును ఉపపన్నములు. ॥393॥

అవతారిక— తరువాత, మహాభాష్యమున, "కిం చ భోః" అని ఆరంభించి, 'యదియదేవోపమానం తదేవోపమేయం కఇహోపమార్థో గౌరివ గౌః ?' అథాప్యన్యదుపమాన మన్యదుపమేయం కఇహోపమార్థో గౌరివాశ్వఇతి" అని శంకింపబడినది. '— ఏమండీ ! ఉపమానమును నుపమేయమును నొకేవస్తువయిన నచట ఉపమించుటయను వ్యాపారమున కర్థమేమి ? 'గోవువంటిది గోవు' అనుట నిష్ప్రయోజనము గదా ! ఇక అవి అత్యంతము భిన్నములయియున్నను, 'గోవువంటిది అశ్వము' అందురనుకొనుడు. అపుడును ఆ ఉపమా నోపమేయభావమున కర్థము లేదు అని ఆ శంకకర్థము. ఆ గ్రంథమునకు వ్యాఖ్యాన మీ కారికలు.

శ్లో॥ తత్రాభిన్నవ్యపేక్షాయాముపమార్థో న విద్యతే ।
యో హి గౌరితి విజ్ఞానేహేతుః సోఽస్తిగవాంతరే ॥ 394

శ్లో॥ వ్యావృత్తానాం విశేషాణాం వ్యాపారేతు వివక్షితే ।
న కశ్చిదుపకారోఽస్తిబుద్ధేః బుద్ధ్యంతరం ప్రతి ॥ 395

తత్ర = అందు, అభిన్నవ్యపేక్షాయాం = ఉభయగతమయిన, ఏకధర్మమును తీసికొని నపుడు, ఉపమార్థః న విద్యతే = 'ఉపమించుట' అను పని కర్థముండదు, యః హేతుః = ఏ కారణము, 'గౌః' ఇతి విజ్ఞానే = 'గోవు' - అను జ్ఞానములో నుండునో, స గవాంతరే అస్తి = అదియే హేతువు రెండవదానిని 'గోవు' అనుకొనుటలోను నుండును.

వ్యావృత్తానాం = అత్యంతమును వేరు వేరయిన, విశేషాణాం = వాని, భేదములకు, వ్యాపారే = వ్యాపారమయిన ఉపమించుట అను క్రియలో, వివక్షితే సతి తు = వివక్షింప బడినచో, బుద్ధేః = ఒక వస్తువుయొక్క జ్ఞానమునకు, బుద్ధ్యంతరం ప్రతి = వస్త్వంతర జ్ఞానమును గూర్చి, కశ్చిత్ = ఏదియు, ఉపకారః = ఉపయోగము, న అస్తి = ఉండబోదు.

తాత్పర్య వివరణములు— ఒకదానికి గల ప్రసిద్ధమయిన ధర్మమును బుచ్చుకొని అప్రసిద్ధమయిన దానిని దెలియజేయుట, ఉపమించుట అను క్రియకు ప్రయోజనము. ఉపమానమునందును నుపమేయమునందును గూడ గల ఏకధర్మమునే దానికి హేతువుగా స్వీకరించినచో, ఆ ఉపమితి క్రియకు ఫలము శూన్యము. గోవువంటిది గోవు అనుటకేమి ప్రయోజనముండును? తెలియనిదానిని తెలియజేయుట అందేదియు లేదుగదా?

ఆ విధముగనే సర్వాత్మనా భిన్నములయిన గవాశ్వముల కుపమానోపమేయ భావవర్ణనమును నిష్ప్రయోజనము. గోవుకును, అశ్వమునకును, ఉభయాన్వితమగు ధర్మము ఏదియు లేదుగదా? అని భావము. ॥394, 395॥

అవతారిక— ''ఏవం తర్హి యత్ర కించిత్ సామాన్యం కశ్చిచ్చవిశేషః తత్రోపమానోపమేయభావః'' = ''ఇటులైన, ఏ పదార్థములయందు సామాన్యధర్మ మేదియో యొకటి ఉండి, కొంత వానికి భేదముగూడ నున్నపు డుపమానోపమేయభావము సంభవించు నని శంకను తొలగించు భాష్య వాక్యమును వ్యాఖ్యానించునదీ కారిక.

శ్లో॥ కించిద్యత్రాస్తి సామాన్యం యది భేదాశ్చకేచన॥ 396

యత్ర = ఏ పదార్థద్వయమునందు, కించిత్ సామాన్యం = కొంత సమాన ధర్మము, అస్తి యది = ఉండియున్నచో నున్న, భేదాశ్చకేచన = భేదములుగూడ కొన్ని, సన్తి యది చ = ఉండియున్నను, తత్ర = అట్టి స్థలమున, ఉపమానోపమేయభావః = ఉపమాన ఉపమేయ సంబంధ ముండును.

తాత్పర్య వివరణములు— 'తత్ర' 'ఉపమానోపమెయభావః' - అను పదముల కధ్యాహారముచే సమన్వయము. భావము స్పష్టము. ॥396॥

అవతారిక— అందువలన, రెండును గోవులే అయినను, వానికి సామాన్యమును కొంత భేదమును బుచ్చుకొని ఉపమానోపమేయ భావము సంభవింపవచ్చును.

శ్లో॥ గోత్వం గోష్వస్తిసామాన్యం భేదాశ్చశబలాదయః॥ 396

గోత్వం = (గోవులు ఆ రెండింటియందును గూడ), గోషుయత్ = గోవులన్నిటియందు నుండునే సామాన్యముగలదో, తత్ సామాన్యం అస్తి = ఆ సామాన్యమగు గోత్వము గలదు శబలాదయః = శబల, బహుల, మున్నగునవయిన, భేదాశ్చసన్తి = గోభేదములును గలవు.

తాత్పర్య వివరణములు— శబల గోవుదూడ శాబలేయము. బహుల గోవుదూడ బాహులేయము. వాని కుపమానోపమేయ భావమును వివక్షించినపుడు 'శాబలేయము వంటిది బాహులేయము' అనుట కలదు. గోత్వము సామాన్యజాతి. శాబలేయత్వ బాహులేయత్వములు అవాంతర జాతులు. అవి భిన్నములు. అయినను, ఏకార్థ కారిత్వము = రెండును నొకే పనికి, ఉపయోగించుట అను దానినిబట్టి ఉపమానోపమేయభావ ముపపన్నమని భావము. ॥396॥

అవతారిక— లేదా, 'సకల పదార్థములందును, సామాన్యమును, విశేషమునుగూడ నుండును. కావున నుపమానత్వోపమేయత్వము ససంభవమనిన, అతిప్రసంగము కలుగును. మేరు పర్వతమువంటిది, ఆవగింజ - గోవువంటిది గోవు అనియు ననవలసివచ్చును - అనునాక్షేపము కారికార్థభాగమున కర్థము. దానికి ప్రతి సమాధాన మీ కారికలో నిబంధింపబడినది.

శ్లో॥ సామాన్యం శ్యామతాద్యేవ తద్ధిసాధారణం ద్వయోః ।
తదేవ సిద్ధ్యసిద్ధిభ్యాం భేద ఇత్యపదిశ్యతే ॥ 397

సామాన్యం = సామాన్యమనగా, శ్యామతాది ఏవ = శ్యామత్వము మున్నగు గుణమే, తత్, ద్వయోః, సాధారణం హి = అది, రెంటికిని, సాధారణము గదా, తత్, ఏవ = అదియే, సిద్ధి, అసిద్ధిభ్యామ్ = ప్రసిద్ధి, అప్రసిద్ధి అను వానినిబట్టి, భేదః ఇతి, అపదిశ్యతే = 'విశేషము' అని చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— సామాన్యమనగా, మహాసామాన్యము అను గుణజాతి కాదు. శ్యామత్వమను, గుణమే. అది ఉపమానమునకును, ఉపమేయమునకును సాధారణము గదా. అది వ్యావర్యకమును నగుటవలన విశేషమనియు జెప్పబడును. ఈ ప్రకరణముననే, మహాభాష్యమున పై గ్రంథ మీ యంశమును నిరూపించును.

"న చావశ్యం స ఏవసామాన్యవచనః యోబహూనాం సామాన్యమాహ ।
ద్వయోరపి యః సామాన్యమాహసోఽపిసామాన్యవచనః ॥"

ఇతి, అనగా, అనేకములం దనుగతమగునది సామాన్యమందురు. అనేకములనగా రెండును గావచ్చును. అధికములును గావచ్చును. కాగా రెండు వస్తువులందుగల సామాన్యమును జెప్పునది గూడ సామాన్యవచనమే. నలుపు అనే గుణము, ఉపమానము, ఉపమేయము అను రెండు వస్తువులందును నుండునది. ఇట నదియే వివక్షితము. అది - సాదృశ్యము. జాతి కాదు. ఇక భేదము, ప్రసిద్ధిని అప్రసిద్ధినిబట్టి యుండును. ఆ సాదృశ్యము ఉపమానమందు ప్రసిద్ధమైనట్లు ఉపమేయమున ప్రసిద్ధము గాదు.

కావున సజాతీయములకును సంస్థానము = అనగా అవయవముల సన్నివేశము

మున్నగువాని సాదృశ్యమునుబట్టి, ఉపమానోపమేయభావ ముండవచ్చును. కనుకనే శాబలేయ బాహులేయముల కయ్యది వెనుక జూపబడినది. శబలీ, ధవలా, కృష్ణా, కపిలా - మున్నగునవి, గోవులలో వాని వర్ణమును బురస్కరించిన భేదములు. బహులా, అనునదియు గోభేదమే వాని మహాసామాన్యము గోత్వమే అయినను, అవాంతర జాతి భేదమునుబట్టి ఉపమానోపమేయభావము ప్రసిద్ధము. ॥397॥

అవతారిక — శ్యామతాదులకు, ప్రసిద్ధ్య ప్రసిద్ధులనుబట్టి మాత్రమే కాదు. కాని, పూర్ణత్వము, అపూర్ణత - వీనినిబట్టి గూడ భేదము సంభవమగు మతాంతరమును జెప్పబడుచున్నది.

శ్లో॥ శ్యామత్వమేవసామాన్య మన్యేషాముభయోఃస్థితమ్ ।
సంపూర్ణత్వాత్ తదన్యత్వాత్ విశేషఇతికథ్యతే ॥ 398

అన్యేషాం = ఇతరుల మతమునందు, ఉభయోః = ఉపమానోపమేయములందు, స్థితం సామాన్యం = ఉన్న, సాధారణ ధర్మమగు, శ్యామత్వమేవం = శ్యామత్వమే, సంపూర్ణత్వాత్ = ఒకచో సంపూర్ణమగుటవలనను, తదన్యత్వాత్ చ = వేరొకచో, అసంపూర్ణమగుటను, విశేష ఇతి కథ్యతే = విశేషము అని చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— నలుపు అను, గుణము శస్త్రియందును, దేవదత్తయందును గలదు. కాని శస్త్రి నలుపు వేరు, దేవదత్తది వేరు. సూక్ష్మతవలన ఆ భేదము తోచదు. కావున నది సామాన్యమనిరి. అది ఉపమానమునందు నిండుగనుండును. ఉపమేయమునందు మాత్రము కొన్ని యంశములలో కొఱవడియుండును. ఈ భేదమువలన నది విశేషము అనియు నందురు. ఈ విధముగ, భిన్నముగను, అభిన్నముగను గూడ నిర్ధారితమైన సామాన్యమే సాదృశ్యము. ॥398॥

అవతారిక— లేదా ఈ విధముగను జెప్పవచ్చును. ఉపమించుట అను పనిలో భిన్న జాతికిని అభిన్న జాతికిని గూడ వ్యాపారముండును అని.

శ్లో॥ ఆకృతౌ వాపి సామాన్యే క్వచిదేవ వ్యవస్థితాః ।
శ్యామాదయోఽవసీయంతే విశేషాస్తఇహాశ్రితాః ॥ 399

వా = అథవా = లేదా, ఆకృతౌ, సామాన్యే అపి = జాతి, సామాన్యమే అయినను, క్వచిదేవ వ్యవస్థితాః = ఏదియో యొక ఆశ్రయమునందే, యేశ్యామాదయః = నియతములయిన, ఏ శ్యామత్వాదులు, అవసీయన్తే = జాతికి భేదకములుగా నిశ్చయింపబడుచున్నవో, తే, ఇహ = అవి, ఇచ్చట, ఆశ్రితాః = ఉపమితి క్రియలో నాశ్రయింపబడినవి.

తాత్పర్య వివరణములు— జాతితోబాటుగా, కొన్ని సూక్ష్మములయిన విశేషములు కొన్ని కొన్ని వ్యక్తులందుండును. అవి జాతిభేదమునకు హేతువులు. ఆ విశేషములతో గూడిన

జాతి, వ్యక్తులందు, సమవాయమను సంబంధముచే సంబంధించియుండి, ఉపమానోపమేయ భావమునకు గారణమగును.

శస్త్రీయందును, దేవదత్తయందును, శ్యామ గుణములున్నవి. వానియందు గుణత్వ జాతి ఉండును. దాని కాశ్రయములయినవానిలో కొన్నిటియందు దీప్తి = కాంతివిశేషము మున్నగు ధర్మములుండుటచే, ఆ శ్యామత అనురజ్యమానమై ఆశ్రయములకు భేదమును కల్పించి, అవి సదృశములు అను జ్ఞానమును మనకు గలిగించును.

రెండు గోవులందు గూడ నేదియో విశేషముండవచ్చును గదా : 'గౌరివ గౌః' = గోవువంటిది గోవు - అనవచ్చునా యనిన, ఆ విశేషము, వాని జాతికి భేదకముగా స్ఫురింపదు. కాగా నట్టి ప్రయోగముల కుపపత్తి యగపడదు. శస్త్రీశ్యామా దేవదత్తా, శాబలేయ ఇవ బాహులేయః' - అను ప్రయోగములందు, ఆ గుణముల ఆశ్రయములకు భేదముండుటవలన విశేషావధారణమున కవకాశము గలదు. ॥399॥

అవతారిక— ఈ విధముగ భాష్యగ్రంథమును వ్యాఖ్యానించి పిండితార్థమును జెప్పుచున్నారు.

శ్లో॥ జాతేరభేదే భేదే వా సాదృశ్యం తత్ప్రచక్షతే ।
కశ్చిత్కదాచిదర్థాత్మా తథాభూతోఽపదిశ్యతే ॥ 400

జాతేః, అభేదే = జాతికి, ఐక్యము చెప్పబడినపుడుగాని, భేదే వా = 'భేదము' అని చెప్పినపుడు గాని, (యత్ సామాన్యం ఉక్తం) = సామాన్య ధర్మమొకటి కలదని ఏది చెప్పబడినదో, తత్, సాదృశ్యం ప్రచక్షతే = దానిని సాదృశ్యమందురు, కశ్చిత్ = ఒకానొక, అర్థాత్మా = ఉపమేయము, కదాచిత్ = ఒకానొకప్పుడు, తథాభూతః = అట్టిదిగా = సదృశముగా అపదిశ్యతే = (ఆసాదృశ్యమును బట్టి) చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ఈ రెండు వస్తువులును సదృశములు అను జ్ఞానమెచట గలుగునో, అచటనే ఉపమానోపమేయభావ ముండును. ప్రమేయత్వము, జ్ఞేయత్వము - మున్నగునవి సకల వస్తువులందును నుండు ధర్మములయినను నవి సాదృశ్యములు కావు. కావున, ఆ ధర్మములను బుచ్చుకొని ఇవి ఉపమానోపమేయములనుట చెల్లదు. ఈ కారికలో ''జాతేరభేదే'' అను నంశము, 'ఆకృతౌవాపి సామాన్యే' - అను కారికలో చెప్పబడిన యర్థమున కనువాదము. ''భేదేవా'' - అను నంశము ''సామాన్యం శ్యామతాద్యేవ'' ఇత్యాది కారికోక్తార్థానువాదము అని గ్రహింపదగును. ॥400॥

అవతారిక— 'ఇవి సదృశములు' అను ప్రత్యయమునకు విరుద్ధమయిన ప్రత్యయమును, సదృశప్రత్యయ విషయ నిర్ధారణమునకై ఉదాహరించుచున్నారు.

శ్లో॥ యత్రార్థే ప్రత్యయాభేదో నకదాచిద్వికల్పతే ।
అవిద్యమాన భేదత్వాత్ స ఏకఇతిగమ్యతే ॥ 401

# ద్రవ్యసముద్దేశము-2

*అవతారిక*— ఎల్లశబ్దములకు జాతికాని, ద్రవ్యముకాని వాచ్యమగునని జాతిసము ద్దేశమున రెండవశ్లోకముచే (జాతిర్వా, ద్రవ్యమేవవా) చెప్పి, ఆసముద్దేశమున వాజప్యాయన మహర్షి యొక్క మతమును నాశ్రయించి జాతియే ఎల్లశబ్దములకు వాచ్యమగుననెడి పక్షమును నిరూపించెను.

ఈ సముద్దేశమున వ్యాడిమహర్షిమతము చొప్పున ద్రవ్యమే ఎల్లశబ్దములకు వాచ్య మగుననెడి పక్షమును నిరూపించుచున్నాడు.

శ్లో॥ ఆత్మావస్తు స్వభావశ్చ శరీరం తత్త్వమిత్యపి ।
ద్రవ్యమిత్యస్య పర్యాయా, స్తచ్చనిత్య మితిస్మృతమ్ ॥ 1

A. నిరూపింపదలచిన ద్రవ్యమును బోధించెడి పర్యాయశబ్దములను ముందుగా చూపుచున్నాడు.

ద్రవ్యమ్ + ఇతి + అస్య = ద్రవ్యమనెడి పదార్థమునకు, ఆత్మా = ఆత్మ శబ్దము, వస్తు = వస్తువు అనుశబ్దము. స్వభావః + చ = స్వభావము అనెడి శబ్దము, శరీరమ్ = శరీరము అను శబ్దము, తత్త్వమ్+ఇతి=తత్త్వము అనుశబ్దము, అపి=ఇవియే, పర్యాయాః పర్యాయము లుగా, (సన్తి) = ఉన్నవి, వైయాకరణులు ఏయర్థమును ద్రవ్యముగా భావించిరో, ఆయర్థ మును బోధించెడివి ఆత్మమున్నగు 5 శబ్దములే కలవు. ఇవి తప్ప మరియేశబ్దము ఆద్రవ్య మును బోధింపజాలదని భావము.

ఘటః, పటః మున్నగుశబ్దములు జాతిమున్నగు ఉపాధుల ద్వారా బ్రహ్మరూప మగు ద్రవ్యమును బోధించును. ఆత్మమున్నగు అయిదు శబ్దములు ఉపాధులనపేక్షింపకయే ద్రవ్యబోధకములగును.

ఒకే వ్యక్తిని బోధించెడి పలుశబ్దములు పర్యాయ శబ్దములనబడును. ఉదా-ఇన్ద్రః, మరుత్వాన్, మఘవా, పాకశాసనః, శక్రః. ఆ శబ్దముల వ్యుత్పత్తిమాత్రము వేరుగానుండును అట్లే ఆత్మాదిశబ్దములు ద్రవ్యబోధకములై పర్యాయములుగా గుర్తింపబడుచున్నవి.

ఒకే మతమును నాశ్రయించి పైశబ్దములు పర్యాయములుగా ఇచట చూపబడలేదు. దార్శనికులవిభిన్నములగు దృక్పథముల నాశ్రయించి పై శబ్దములు చూపబడినవి.

1. ఆత్మా-ఆప్నోతీతి ఆత్మా (అంతట వ్యాపించి యుండునది, ఆప్ల్ =వ్యాప్తౌ అనిధాతువు) అనువ్యుత్పత్తిచే ఆత్మశబ్దము సత్యజ్ఞానానందరూపమగు నిర్గుణ బ్రహ్మమును బోధించునని అద్వైత శాస్త్రజ్ఞులు విశ్వసింతురు. 'అయమాత్మాబ్రహ్మ' మున్నగు శ్రుతు లిందుకు ప్రమాణము.

యత్ర అర్థే = ఏ వస్తువునందు, ప్రత్యయాభేదః = ప్రతీతికి అభేదము, కదాచిదపి = ఎపుడును, న వికల్పతే = మారదో, సః = అది - ఆ పదార్థము, అవిద్యమాన భేదత్వాత్ = భేదమనునది లేనిదగుటవలన, ఏకః, ఇతి, గమ్యతే = 'ఇది అభిన్నము' అని తెలియబడును.

తాత్పర్య వివరణములు— ఒక వస్తువు మనకొక రీతిలో గోచరించును. ఆ గోచరించుటనే ప్రత్యయమందురు. ప్రతీతి ప్రత్యయపదము లేకార్థములు. ఏ ఆకారములో ఆ ప్రతీతి కలుగుచున్నదో ఆ ఆకారముయొక్క అభేదము = ఏకత్వము, ఇక మారకూడదు. మరల భేద ప్రత్యయముతో వికల్పితము గారాదు. అపుడా వస్తువు, దాని అవస్థలలో భేదమున్నను, ఆ భేదము వ్యవహారములో భాసింపదు గాన, లేనిదానివంటిదే అగుటచేత, ఇది ఏకమే. అభిన్నమే = ఒక్కటియే - అను ప్రతీతిలో విషయమగును. ఇది సదృశ ప్రత్యయమునకు ప్రత్యనీకము. ॥401॥

*అవతారిక*— ప్రత్యయము, ప్రతీతి, సంవిత్, జ్ఞానము, ప్రతిభానము - వీనికన్నిటికిని అర్థమొకటియే. అభిన్న ప్రత్యయమన నేమియో గత కారిక వివరించినది. 'ప్రత్యభిజ్ఞ' అను ప్రత్యయము నీ కారిక ఉదాహరించుచున్నది.

**శ్లో॥ యోఽర్థ ఆశ్రితనానాత్వః స ఏవేత్యపదిశ్యతే ।**
**వ్యాపారం జాతిభాగస్య తత్రాపి ప్రతిజానతే ॥ 402**

ఆశ్రితనానాత్వః = ఆశ్రయింపబడిన భేదముగల, యః అర్థః = ఏ పదార్థము = వస్తువు, సః ఏవ - ఇతి = 'అదియే' అని, అపదిశ్యతే = వ్యవహరింపబడునో, తత్రాపి = ఆ వ్యవహారమునందు గూడ, జాతిభాగస్య = జాత్యంశమునకు, వ్యాపారం = వ్యాపారమును = పని గలిగియుండుటను, ప్రతిజానతే = చెప్పుచున్నారు.

**తాత్పర్య వివరణములు**— ఒక వస్తువునకు భేదము ప్రసిద్ధముగ నుండును. అనగా ఆ వస్తువులు భిన్నములేగాని ఏకము గాదు. కాని అది 'సోయమ్' = అదియే యిది అని అందురు. అట్లనుకొనుటలో పనిచేయునది, జాతి విశిష్ట వ్యక్తియొక్క 'జాతి' అను భాగమగును. అనగా జాతి వ్యక్తితో ఏకాత్మతను బొందునుగాన అందు జాతి యొక భాగము వ్యక్తి వేరొక అంశము ననుట. వ్యక్తితో నేకాత్మత నొంది జాతి ప్రత్యభిజ్ఞ అను ప్రత్యయమునకు ప్రయోజకము. సదృశ ప్రత్యయమున నది పని చేయదు.

కొన్నిచోట్ల వస్తువులకు సాదృశ్యముండుటవలన తత్త్వము అభేద మారోపింపబడును. అపుడును అదియే యిది అనుకొనుట భ్రాంతి. ఛేదింపబడిన తరువాత మరల పుట్టిన కేశములను అవియే యివి అనుకొనుట వంటిదే. అది జాతియొక్క ఏకత్వమువలన అపాదింపబడినది అని తాత్పర్యము. ॥402॥

*అవతారిక*— వస్తువునందు భేదసంబంధముగాని అభేదముగాని, జ్ఞానమునకు అనగా సంవిత్తునకు సంబంధించినదే. ఎట్లనగా—

శ్లో॥ జాతిభాగాశ్రయా ప్రఖ్యా తత్రాభిన్నా ప్రవర్తతే।
వ్యక్తిభాగాశ్రయా బుద్ధిస్తత్ర భేదేన జాయతే॥ 403

తత్ర = అందు, జాతిభాగాశ్రయా = జాత్యంశము నిమిత్తముగా గలది యయిన, ప్రఖ్యా = బుద్ధి = సంవిత్తు, అభిన్నా ప్రవర్తతే = 'అదియే' అని ప్రవర్తించును = కలుగును, వ్యక్తి భాగాశ్రయా = వ్యక్త్యంశ మూలకమయిన = వ్యక్తి అను అంశమువలన, బుద్ధిస్తు = బుద్ధి అయితే, భేదేన జాయతే = 'అది వేరు ఇది వేరు' అని కలుగును.

తాత్పర్య వివరణములు— ఒకే జాతికి చెందిన పదార్థము = వస్తువు 'గౌరేవాయమ్' ఇది గోవే అని పరామర్శింపబడును. ఎందువలన? గోత్వము అను జాతి భాగము కలదు గనుక. ఇది అభేద రూపమయిన సంవిత్తు. ఇక భేదముచే ఉపలక్షితమయిన సంవిత్తు ఆ గోవు. ఈ గోవు అని కలుగుచుండినది వ్యక్తులు ఆశ్రయముగా గలది. కాగా సంవిత్తుకే అనగా బుద్ధికే భేదసంబంధమును, అభేదముతో సంబంధమును కలుగుచుండుననుట ॥403॥

అవతారిక— ఈ కారికలలో సదృశ ప్రత్యయమునకు లక్షణము చెప్పబడు చున్నది.

శ్లో॥ అన్యత్రవర్తమానం సత్ భేదాభేద సమన్వితమ్।
నిమిత్తం పునరన్యత్ర నానాత్వేనేవ గృహ్యతే॥ 404

శ్లో॥ ఆధారేషు పదన్యాసం కృత్వోపైతి తదాశ్రయమ్।
ససాదృశ్యస్య విషయ ఇత్యన్యైరపదిశ్యతే॥ 405

నిమిత్తం = సదృశ ప్రత్యయమునకు కారణమైన శ్యామత్వజాతి, అన్యత్ర వర్తమానమ్ సత్ = వేరొక ఆశ్రయమునందు, ముందు వర్తించి, పునః అన్యత్ర = మరల, ఆశ్రయాంతము నందు, నానాత్వేన ఇవ = భేదముచే ననినట్లు = భిన్నమైనదా యనునట్లు, గృహ్యతే = పరిచ్ఛేదింపబడుచుండును.

'తత్' = ఆ సదృశ ప్రత్యయ నిమిత్తము, భేదాభేద సమన్వితం = సామాన్య విశేషరూపములు గలదై, ఆధారేషు = తన ఆశ్రయములందు = గుణములందనుట, పదన్యాసంకృత్వా = కాలూని, అనగా సదృశములివి యని ఎరిగించి, తదాశ్రయం = ఆ గుణమునకాధారమైన ద్రవ్యమును, ఉపైతి = అపుడు పొందును, సః, సాదృశ్యస్య = ఆ గుణాశ్రయము, సాదృశ్యమునకు, విషయః ఇతి = విషయము, అని, అన్యైః అపదిశ్యతే = ఇతరులచే వ్యవహరింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— 'శస్త్రీశ్యామా' అనునది ప్రకృతోదాహరణము. అట, దేవదత్త అను నామె యొక చురకత్తితో సదృశురాలు అను ప్రత్యయము కలుగుచున్నది. దానికి కారణము శ్యామత్వము అను, గుణగతజాతి. అయ్యది శస్త్రి గుణమైన నలుపునందు

ఉంటూ, దేవదత్తాగత గుణమునందును నుంటున్నది. కాబట్టి ఆశ్రయముల భేదముచేత భిన్నమైనదా యిది అనునట్లు తోచును. ఈ విధముగ భేదాభేదములు రెండిటితో గూడి, ఆ నిమిత్తము, తన ఆశ్రయములయిన గుణములందు దృఢముగ కాలూని, ఆ నలుపులు రెండును సదృశములు అను ప్రతీతిని కలిగించి, అపుడు వాని కాశ్రయములయిన ద్రవ్యములను బొందును. ఆ గుణజాతియగు శ్యామత్వమునకును, గుణాశ్రయ ద్రవ్యములకును సంబంధము, సమవేత సమవాయము. అనగా, దేవదత్తయందు నలుపు అను గుణము సమవేతము = సమవాయమను సంబంధముచే సంబద్ధము. ఆ నలుపునందు నలుపుతనము = శ్యామత్త్వమను గుణగత జాతియొక్క సమవాయమున్నది. ఇచట ఆ నలుపు, అను, గుణమునకు ఆశ్రయమైన ద్రవ్యము అనగా శత్త్రియు దేవదత్తయు సదృశ ప్రతీతి విషయములు. సాదృశ్యము, జాతి కాదు. జాతి అభిన్నము. ఏకము. ఇది భేదాభేదములు రెండును గలదియై ఉపమానోపమేయ భావమునకు నిమిత్తమగుచున్నది.

ఈ కారికలో ''అన్యైరపదిశ్యతే'' - అని యున్నది. వెనుక, ఆశ్రయమునందు భేదాభేద ప్రతీతి. ఉపమానోపమేయభావ హేతువని చెప్పబడినది. ఇచ్చట నిమిత్తము భేదాభేద సమన్వితమైనపుడు, ద్రవ్యమునందు సామాన్య విశేషావభాసము కలుగుననియు, అట్టి నిమిత్తము, ఉపమితి ప్రతీతి హేతువనియు చెప్పబడినది. ॥404, 405॥

అవతారిక— తరువాతి భాష్యగ్రంథము - ''కామం తర్హి ఏతేనైవహేతునా యస్య గవయోనిర్జ్ఞాతః, గౌరనిర్జ్ఞాతః, తత్కర్తవ్యం స్యాత్, 'గవయ ఇవ గౌః' ఇతి బాఢం కర్తవ్యమ్'' అని.

ఏమయా ! నిర్జ్ఞాతమయినది ఉపమానమును, నిర్జ్ఞాతము కానిది=అప్రసిద్ధము ఉపమేయమును, అనిన గవయము ప్రసిద్ధమయి, గోవు ప్రసిద్ధముగాని వానికి, 'గవయము వంటిది గోవు' అనియు, ఉపమానోపమేయ విన్యాసము చేయవలసియుండునే ? అని శంకించి 'ఓ ! అవశ్యము చేయవచ్చును. అజ్ఞాతజ్ఞాపనమేకదా కర్తవ్యము' - అని చెప్పి, ఉపమానోపమేయముల అవ్యవస్థ అంగీకరింపబడినది. ఆ విషయము సనిదర్శనముగ వ్యుత్పాదింపబడుచున్న దీ కారికలో—

శ్లో॥ పరాపేక్షే యథాభావే కారణాఖ్యా ప్రవర్తతే ।
తథాన్యాధిగమాపేక్షముపమానం ప్రచక్షతే ॥ 406

కారణాఖ్యా = 'ఇది దీనికి కారణము' - అని కారణమనుమాట, యథా = ఏ ప్రకారముగా, పరాపేక్షే = ఇతరాపేక్ష గల, భావే = పదార్థమునందు, ప్రవర్తతే = ప్రవర్తించుచు, లోకమున నున్నదో, తథా = ఆ ప్రకారముగ, ఉపమానం = ఉపమానమును, అన్యాధిగమాపేక్షం = ఇంకొక భావముయొక్క అపేక్షకల దానినిగా, ప్రచక్షతే = చెప్పుదురు.

తాత్పర్య వివరణములు— ఒకానొకదానిని కారణమనుట కార్యమునుబట్టి

యుండును. కార్యతా నిరూపితము కారణత అందురు అయినను కార్యకారణములకు సంకరము లేదు. కార్యము, ఆ కారణమునకు కార్యమే. దానికింకకారణము గాదు. ఆ విధముగనే. ఉప మేయతా నిరూపిత ముపమానత్వము. ఉపమానముగా ప్రసిద్ధ ముపమానమే. అది ఉప మేయము గాదు. ప్రసిద్ధికిని అప్రసిద్ధికిని సంకరము లేదు. ప్రసిద్ధము ప్రసిద్ధమే. అప్రసిద్ధ మప్రసిద్ధమే. కనుక నుపమానోపమేయభావ విపర్యాస ప్రసంగము లేదు. ఉపమానముపమే యాపేక్షమయినను నది ప్రసిద్ధిని పురస్కరించుకొని ఉపమానమే. ॥406॥

*అవతారిక* — వేరొక నిదర్శనము గూడ ఇందు, జూపబడుచున్నది.

**శ్లో॥ గురుశిష్య, పితాపుత్ర, క్రియాకాలాదయో యథా।**
**వ్యవహారా స్తథౌపమ్య మప్యపేక్షానిబంధనమ్॥** 407

గురుశిష్య = గురువు, శిష్యుడు, పితాపుత్ర = తండ్రి, కొడుకు, క్రియాకాల = క్రియ, కాలము ఆదయః = మొదలగు, వ్యవహారాః యథా = వ్యవహారము నెట్లో, తథా, ఔపమ్యమపి = ఆ విధముగనే, ఔపమ్యము గూడ, అపేక్షా నిబంధనమ్ = అన్యాపేక్ష నిమిత్తముగా గలది.

**తాత్పర్య వివరణములు**— లోకవ్యవహారమునందు ఒకనిని 'గురువు' అనిన నాతడెవరికి గురువు? తన శిష్యులకుగదా. అనగా గురువను వ్యవహారము శిష్యుని దృష్టిచేత గదా. అది శిష్యాపేక్షా నిమిత్తకము. అందును స్వశిష్యాపేక్షమే. ఇంకొక గురువునుబట్టి కాదు. ఆ విధముగనే శిష్యుడు, తన శిష్యునకు శిష్యుడు గాదు పిత, పుత్రునకు. ఇంకొకని పితకు గాదు. పుత్రుడు - తన తండ్రికి, తన పుత్రునకు గాదు. క్రియ, దేనికి? తన కారకమునకు. అనగా తన్ను నిర్వర్తించు సాధనమునకు. క్రియాంతరమునకు గాదు. క్రియ అనునది సాధ్య. అనగా సాధింపవలసినది. సాధించునది కారకము = సాధనము. ఒకానొకటి సాధనమగుట, తనచేత సాధింపబడు దాని దృష్టిలో గదా. ఇది వాని స్వభావము - క్రియా సముద్దేశములో "తత్ర యం ప్రతి సాధ్యత్వమసిద్ధా తం ప్రతిక్రియా। సిద్ధా తు యస్మిన్ సాధ్యత్వం న తమేవ పునఃప్రతి" - అని క్రియాస్వరూపము శోధింపబడినది.

ఇక కాలమనగా - ప్రసిద్ధమగు నొక పరిమాణము గల క్రియ. అది వేరొక క్రియకు పరిచ్ఛేదకము. ఇట్లు పైన జెప్పినవన్నియు ఆపేక్షికములగు వ్యవహారములు. మొద లగునవి అనుటవలన, విశేష్యవిశేషణ భావవ్యవహారమును ఆపేక్షికమే.

ప్రకృతమేమి? అన, ఔపమ్యమును అట్టిదే. కాని వాని ప్రసిద్ధిని అపేక్షించి = పట్టి ఉండుననుట. గవయము వనేచరున కుపమానము. నాగరకుని దృష్టిలో ఉపమేయము. కావున సంకరములేదని భావము. ॥407॥

*అవతారిక* — "ఉపమానాని సామాన్యవచనైః" (2-1-54) అను ప్రకృత సూత్రార్థ విచార ప్రస్తావమున, తరువాతి గ్రంథము.

''కింపునరిహోదాహరణమ్'' = ఈ సూత్రమున కుదాహరణమేమి ? ''శస్త్రీ శ్యామా'' = శస్త్రీ శ్యామా అనునది. ''ఈ శ్యామా శబ్దము దేనిని బోధించును ? = ''క్వపునరయం శ్యామా శబ్దోవర్తతే ? ''శస్త్ర్యామిత్యాహ'' = శస్త్రిని బోధించును. ''కేనేదానీం దేవదత్తా అభిధీయతే ?'' = దేవదత్తను బోధించునది యేది ? 'సమాసేన' = సమాసము మొత్తముచే నది బోధింపబడును అని యున్నది. ఆ గ్రంథార్థానువాద రూప మీ కారిక.

శ్లో॥ శ్యామత్వముపమానే చేద్వృత్తౌ వృత్తం ప్రయుజ్యతే।
ఉపమేయం సమాసేన బాహ్యం తత్రాభిధీయతే ॥ 408

వృత్తౌ = 'శస్త్రీశ్యామా' - అను సమాస వృత్తియందు, శ్యామత్వం = శ్యామా శబ్దార్థమయిన నలుపు గుణము, ఉపమానే = ఉపమానమయిన, చురకత్తియందు, వృత్తం ప్రయుజ్యతే చేత్ = బోధకిమైనదిగా, ప్రయోగింపబడినచో, తత్ర బాహ్యం = అపుడా సమాసమున, బహిర్భూత, ఉపమేయం = ఉపమేయ అయిన దేవదత్త అను నామె, సమాసేన అభిధీయతే = మొత్తము సమాసముచే చెప్పబడును.

తాత్పర్య వివరణములు— తాత్పర్యము స్పష్టము. కారికలో చేత్ అనుటవలన పక్షాంతరమును గలదని సూచింపబడుచున్నది. వర్తి పదములు = అనగా సమాసమందున్న, 'శస్త్రీ, శ్యామా' అను రెండు పదములును, ఉపమానమునే బోధించిన, ఇక ఉపమేయయగు దేవదత్త, మొత్తము సమాసమున కర్థము కావలెనని తేలినది. అపుడీ సమాసము, అన్యపదార్థ ప్రధాన సమాసము అనవలసి యుండును. దేపదత్త అన్యపదార్థము గదా ! కాని, తత్పురుష అన్యపదార్థ ప్రధానమగునా ? అది ఉత్తరపదార్థ ప్రధానము కావలెనుగదా ? అని ప్రశ్నింపవచ్చును. సమాధానమేమన— 'నఞ్' (2-2-6) అను సూత్రములో, నఞ్సమాసము, పూర్వపదార్థ ప్రధానమా ? ఉత్తరపదార్థ ప్రధానమా ? అన్యపదార్థ ప్రధానమా ? అని పక్షత్రయము విచారింపబడినది. కావున, ఆ నియమము లేదనుట. ఈ సమాసమున నీ పదము యొక్క అర్థము ప్రధానమనుమాట, లోకప్రసిద్ధినిబట్టి చెప్పినదేగాని, నైయత్య సూచకము గాదు. కాగా శ్యామా శబ్దము శస్త్రీ శబ్దమునకు సమానాధికరణముగా ప్రయోగింపబడినను ఉపమేయ ప్రతీతి కలుగుచున్నందున నిది అన్యపదార్థ ప్రధాన సమాసము అని స్పష్టమయినది.

ఇక నిట రెండు శంకలు కలుగును - 'శస్త్రీ శ్యామా' అను తత్పురుష సమాసము వలన అన్యపదార్థ ప్రతీతి కలుగుచున్నట్లు, 'పీతాంబరః' - మున్నగు బహువ్రీహి సమాసములందును గలుగవచ్చును గదా ? ఆ సూత్రమున, అనగా = ''అనేక మన్యపదార్థే'' అను సూత్రమునందు, 'అన్యపదార్థే' అను పదమెందులకు ? అని యొక శంక.

బహువ్రీహి సమాసం సంజ్ఞచే తత్పురుషకు అనగా నీ సమానాధికరణ సమాసమునకు బాధ ప్రాప్తింపదా ? అని రెండవది.

మెదటి శంకకు సమాధానము— ప్రయోగానురోధముగ సర్వప్రత్యాఖ్యానము

యుక్తము గాదు. అన్యపదార్థము బహిరంగమును స్వపదార్థ మంతరంగమునుగదా. కనుక, స్వపదార్థ ప్రాధాన్యమున బహువ్రీహిని వాదించుటకు ''అన్యపదార్థే'' అనునది ఆవశ్యకము.

ఇక రెండవ శంకకు సమాధానము— బహువ్రీహి సమాసము, ''శేషోబహువ్రీహిః'' (2-2-23) అని శేషాధికారమున విధింపబడినది. సమానాధికరణ సమాసమయిన ఉపమాన సమాసము శేషము గాదు. కావున దానిచే దీనికి బాధ ప్రాప్తింపదు. బహువ్రీహి అయిన, గుణవచనమగు శ్యామా శబ్దము విశేషణమగుటవలన పూర్వనిపాతము ప్రాప్తమై అది 'శ్యామా శస్త్రీ' - అని కావలసివచ్చును. స్వరములో భేదము మాత్రము లేదు లెండు. ఉపమాన పూర్వ పద సమాసమయినను, బహువ్రీహి అయినను, పూర్వపద ప్రకృతి స్వరమే ప్రవర్తించును గదా.

బహువ్రీహి సమాసమైనచో ఔపమ్య ప్రతీతి కలుగదుగాన నది గాదని యనుట పొసగదు. షష్ఠ్యర్థమగు సంబంధ సామాన్యమునందు బహువ్రీహి యగును. సామాన్యమేమో విశేష నిష్ఠమే ఆయె. ఆ విశేషము, ఉపమానోపమేయ భావమే యగును. వేరొకటి కుదురదు గదా ! కనుక, శేషవచనమువలన నిది బహువ్రీహికి విషయము కాదు.

ఆ సూత్రమున శేషపదము చివరకు ప్రత్యాఖ్యాతమయినదనినను, వచన సామర్థ్యము వలన నిది తత్పురుషమే యగును.

''ప్రాక్కడారాదేకాసంజ్ఞా'' ''ప్రాక్కడారాత్పరంకార్యమ్''

అని రెండు విధములుగ ''ఆ కడారాదేకాసంజ్ఞా'' (1-4-1) అను సూత్రమున భాష్యము నందు పఠింపబడినది. ఏ పాఠమునందైనను విశేషవిధియగు ''ఉపమానాని సామాన్యవచనైః'' అను నిది బహువ్రీహికి బాధకమే యగునని నిర్ణయింపబడినది.

కారికలో 'వృత్తౌ' అని యున్నది. శ్యామా శబ్దము వృత్తిలో ఒక పర్యాయమే ఉచ్చరింపబడినందున, దేవదత్త సమాసవాచ్యమే కావలెను. వాక్యమునందైన, 'యథాశస్త్రీ శ్యామా తథా దేవదత్తా' అని యర్థమగుటచే, శ్యామా శబ్దమునకు ఉపమానోపమేయములు రెండింటితోడను సంబంధము సిద్ధింపవచ్చును అని భావము. ॥408॥

**అవతారిక**— ''యద్యేవం శస్త్రీశ్యామో దేవదత్తః'' ''ఇతి న సిద్ధ్యతి'' అని భాష్యము. శ్యామా శబ్ద ముపమానమును బోధించునపుడు గుణవాచకములకు ఆశ్రయమును బట్టి లింగవచనములు వర్తించునుగాన, స్త్రీ లింగమగు శ్యామా శబ్దముతోడనే సమాసమగును. ఉపమేయమగు వ్యక్తి పురుషుడు అయినను, శస్త్రీశ్యామా దేవదత్తః అనియే యగునుగాని 'శస్త్రీశ్యామః' అని పుంలింగరూపము సిద్ధింపకపోవునని అక్షేపాశయము ఆ గ్రంథమునకు వివరణరూప మీ కారిక.

**శ్లో॥ టాబన్త ఏవ చైత్రాదౌ శ్యామశబ్ద స్తథా భవేత్ ।**
**సూత్రే చ ప్రథమాభావాన్న శ్యామాద్యుపసర్జనమ్ ॥** 409

తదా = ఉపమేయము సమాసవాచ్యమయిన పక్షమున, చైత్రాదౌ = చైత్రుడు మున్నగు పురుషులందును, టాబన్త ఏవ = 'టాప్' ప్రత్యయాంతమగునదియే, శ్యామాశబ్దః భవేత్ = 'శస్త్రీశ్యామా' (చైత్రః) అని యగును, సూత్రే = 'ఉపమానాని' అను సూత్రమునందు, ప్రథమాభావాత్ చ = 'సామాన్యవచనాని' అని ప్రథమానిర్దేశము లేనందున, శ్యామాది = శ్యామాది శబ్దార్థము, ఉపసర్జనం = ఉపసర్జనము, న భవతి = కాదు (కాగా ''గోస్త్రియోః'' అని హ్రస్వము రాదు).

తాత్పర్య వివరణములు— శ్యామా శబ్దము ఉపమేయమును బోధింపదనిరి. అపుడు శస్త్రివలె చైత్రుడు నల్లనివాడు అని చెప్పదలచినను, 'శస్త్రీశ్యామా చైత్రః' - అనియే కావలసి యుండును. సమాస విధాయక శాస్త్రమునందు, ప్రథమా విభక్త్యంతపదముచే నిర్దేశింపబడినది ఉపసర్జనమను సంజ్ఞకలది యగును. అనియును, ఉపసర్జనమైన స్త్రీప్రత్యయాంతమునకు హ్రస్వము వచ్చును' - అనియు శాస్త్రములు కలవు. కాని సామాన్యవచన మిట సూత్రమునందు తృతీయా నిర్దిష్టముగాని ప్రథమా నిర్దిష్టము గాదాయె. అందువలన హ్రస్వప్రాప్తి లేదని తాత్పర్యము. ॥409॥

అవతారిక— తదనన్తర భాష్యగ్రంథమున - ''ఉపసర్జన హ్రస్వత్వమత్ర భవిష్యతి'' - అని ఆక్షేప సమాధానము చెప్పబడినది. సూత్రమునందు సామాన్యవచన శబ్దము ప్రథమా నిర్దిష్టము కాకున్నను, ''ఏకవిభక్తిచా పూర్వనిపాతే'' (1-2-44) అను సూత్రముచే ఉపసర్జన సంజ్ఞ శ్యామా శబ్దమునకు సిద్ధింపవచ్చును. ఎట్లన, విగ్రహవాక్యము నందు నియతముగ నొకే విభక్తి కలదియు నుపసర్జన సంజ్ఞ కలదియగునని ఆ సూత్రమున కర్థము. శ్యామా శబ్దము, విగ్రహవాక్యములో నెపుడును ప్రథమాంత మేగదా. లేదా ఉప సర్జన సంజ్ఞ అన్వర్థసంజ్ఞ. అనగా లోకవిదితమయిన సంజ్ఞ, లోకములో అప్రధానమైనదాని నుపసర్జనమందురు. ఉపమేయము ప్రధానము. అది సమాసార్థము. వర్తిపదార్థముప సర్జనము = అప్రధానము. ఉపసర్జన పద మన్వర్థమను నాశయముచేతనే, పైన భాష్యము నందు ''యదితర్హి ఉపసర్జనాన్యపి ఏవం జాతీయకానిభవన్తి'', 'తిత్తిరికల్మాషీ' 'కుంభ కపాలలోహినీ' - అను శబ్దములందు ఈ అను స్త్రీ ప్రత్యయము రాకుండును. అది అనుప సర్జన ప్రాతిపదికమైననే ప్రవర్తించును. ''అనుపసర్జన లక్షణః ఈకారః నప్రాప్నోతి'' అని ఆక్షేపింపబడినది. ఆ గ్రంథ వ్యాఖ్యానరూపమగునదియే ఈ కారిక.

శ్లో॥ అథచైకవిభక్తిత్వాత్ గుణత్వాద్వోపసర్జనమ్ ।
నైవతిత్తిరి కల్మాష్యామిష్టః స్త్రీప్రత్యయోభవేత్ ॥ 410

అథ చ = ఇక, ఏక విభక్తిత్వాత్ = విగ్రహమున, నియతవిభక్తి అగుటవలనగాని, గుణ త్వాత్ వా = అప్రధానత్వము వలనగాని, ఉపసర్జనం భవతి = సమాస ఘటక పద ముప సర్జనమగుననిన, (తథాపి) = అప్పటికిని, తిత్తిరి కల్మాష్యామ్ = 'తిత్తిరి కల్మాషీ' - అను రూపమునందు, ఇష్టః స్త్రీ ప్రత్యయః = సమ్మతమైన స్త్రీ ప్రత్యయము, న భవేత్ = సిద్ధింపక పోవును.

తాత్పర్య వివరణములు— 'శస్త్రీ శ్యామా' - అను నీ సమాసమున, బాహ్య పదార్థమయిన దేవదత్త అను నామె ప్రధానము. 'శస్త్రీ ఇవ శ్యామా' అను విగ్రహవాక్యములో 'శ్యామా' అను పదము నియతముగ ప్రథమాంతమే. అది మారబోదు. మొత్తము సమాసపదమున కనేక విభక్త్యన్తముగ మార్పు కలుగవచ్చును. గాన నది నియత విభక్తికము కాదు. ఇట్లు హ్రస్వ మచట సిద్ధించినను, 'తిత్తిరి కల్మాషీ' అను స్థలమున, ఏదియో స్త్రీ ప్రత్యయము = అనగా టాప్పు లభించినను, కావలసిన ఈ అనునది లభింపదు.

తిత్తిరి కల్మాషీ అనగా తీతువు పిట్టవలె నానావర్ణములు గల స్త్రీ వ్యక్తి. 'కుంభకపాలలోహినీ' అనగా కుండ పెంకువలె నెఱ్ఱగనుండు స్త్రీ వ్యక్తి. అందు తిత్తిరి శబ్దము పుంలింగము. కుంభకపాల శబ్దము నపుంసకము. సమాస ప్రవృత్తికి పూర్వము కల్మాష లోహిత శబ్దములు స్త్రీ ప్రత్యయాంతములు కావు. సమాసము వచ్చిన తరువాత ఉపసర్జనములు. ఇట ప్రవర్తింపవలసిన స్త్రీ ప్రత్యయములను విధించు శాస్త్రములలో 'అనుపసర్జనాత్' అనునది అధికారప్రాప్తమయి యున్నది. ఉక్తరీతిగ నవి ఉపసర్జనము లగుటచేత, 'తిత్తిరి కల్మాషీ' అనుచోట, 'అన్యతోఙీష్' (4-1-40) అని ఙీప్ప్రత్యయముగాని, కుంభకపాలలోహినీ అనుచోట ''వర్ణాదనుదాత్తాత్తోపధాత్తోనః'' - అని (4-1-31) ఙీప్పుగాని ఇష్టమయినవి ప్రాప్తింపవు అని భావము.

''ఏకవిభక్తి చా పూర్వనిపాతే'' (1-2-44) అను సూత్రముచేతను ప్రథమా నిర్దిష్టం సమాస ఉపసర్జనం'' (1-2-43) అను సూత్రముచేతను విధింపబడిన ఉపసర్జన సంజ్ఞ కృత్రిమము. లోకప్రసిద్ధమయిన అప్రధానమను నర్థము అకృత్రిమము. శాస్త్రమునందు లక్ష్యానురోధముగ కృత్రిమమును అకృత్రిమమును గూడ గ్రహింపవచ్చును, ''ఉభయగతిరిహ భవతి'' - అని చెప్పబడియున్నది.

లౌకికార్థమును ఆశ్రయించిన, శాస్త్ర మా సంజ్ఞను విధించుట వ్యర్థముగాదా ? అని తోచవచ్చును. ప్రధానమైన దానికి గూడ పూర్వనిపాతము - పురుష వ్యాఘ్రః అర్థపిప్పలీ' - ఇత్యాదులం దావశ్యకమగుటచేత నది సిద్ధించుటకై ప్రథమా నిర్దిష్ట మిత్యాది శాస్త్రీయ సంజ్ఞా విధానమును ఆవశ్యకమే.

''రాజ్ఞః గోః క్షీరమ్'' - అను వాక్యమును చూడుడు = 'రాజుగారియొక్క ఆవుయొక్క పాలు' రాజ్ఞః అనునదియు, గోః అనునదియు గూడ నుపసర్జనములే, అయినను లౌకికమయిన ఉపసర్జనత్వము నాశ్రయించి రాజ పదమునకే పూర్వనిపాతము. ఈ విధముగ ఉపసర్జనత్వము, శాస్త్రీయమును లౌకికమును గూడ గ్రహించి తత్తత్కార్యనిర్వాహము శాస్త్ర సిద్ధము. కావున నీ రీతిగా శస్త్రీ శ్యామో దేవదత్తః అనుచోట హ్రస్వము సిద్ధించినను, దోషాన్తరము లుండుటవలన లౌకికోపసర్జనత్వము గ్రాహ్యము కాదను నభిప్రాయముతో, ''యదిపునరేవం జాతీయకాన్యప్యుపసర్జనాని భవన్తి'' అని అరుచి సూచింపబడినది. కాగా ''టాబన్తమేవ చైత్రాదౌ శ్యామాశబ్ద స్తదాభవేత్'' - అను నాపత్తి నిలిచినది. ॥410॥

*అవతారిక*— ఉపసర్జత్వము నొప్పుకొని, స్త్రీ ప్రత్యయ విషయమున దోషము కలుగుననిరి. దానికి సమాధానమును శంకించి, దోషాంతరము ప్రసక్తమగునుగాన నది కుదుర దని నిరాకరించుచున్నారు.

**శ్లో॥ సతి శిష్టబలీయస్త్వాత్ బాహ్యే జీషి చ సత్యపి ।**
**ఉపమానస్వరో న స్యాత్ తస్మాత్ స్త్ర్యన్తః సమస్యతే ॥ 411**

చ = అపిచ = మఱియు, బాహ్యేజీషి = బయటదైన, జీప్రత్యయము, సత్యపి = సిద్ధించి నప్పటికిని, సతి శిష్టబలీయస్త్వాత్ = ఒక కార్యముండగా విధింపబడిన రెండవ కార్యము బలవత్తరమగుటవలన, ఉపమానస్వరః = ఉపమాన పూర్వపద ప్రకృతి స్వరము, న స్యాత్ =సిద్ధింపక పోవును, తస్మాత్ =అందువలన, స్త్ర్యన్తః సమస్యతే=స్త్రీ ప్రత్యయాంత కల్మాషీ శబ్దమే సమసించును.

తాత్పర్య వివరణములు— 'వర్ణాదనుదాత్తాత్', 'అన్యతోజీష్' అను సూత్రములం దనువర్తించిన, 'అనుపసర్జనాత్' అనునది తదంతమునకు విశేషణముగాని సూత్రగృహీతము నకు గాదు. అపుడు కల్మాషలోహిత శబ్దము లుపసర్జనములయినను, తదంతము లుపసర్జన ములు కావు గాన, సమాసానంతరము జీషాదులు సిద్ధించుట సంభవమే. తిత్తిరికల్మాషీ అను సమాసమున, జీప్రత్యయ స్వరమైన అంతోదాత్తము 'సతిశిష్టము' గాన ప్రబలమై ఉపమాన పూర్వపద స్వరమును బాధించును.

ఒక స్వరము ముందు ప్రవర్తించి, అది యుండగా తరువాత విధింపబడిన వేరొక స్వరము సతిశిష్ట స్వరమనబడును. అది బలీయము. కావున నట ఉపమాన స్వర మిష్టమైనది అయినను సిద్ధింపకుండును. ఈ విధముగ స్వరదోషము కలదుగాన, సమాసముచేయుటకు ముందే స్త్రీ ప్రత్యయమును ప్రవర్తింపజేసి, తదంతమగు 'కల్మాషీ' అను సామాన్యవచన ముతో ఉపమానమునకు సమాసమును జేసిన, అపుడు ఉపమానస్వరమే సతిశిష్టమగును. అదియే బలవత్తరముగాన ప్రవర్తించును.

సామాన్యవచనములగు 'శ్యామా' మున్నగునవి, ఉపమేయములందు వర్తింపక ఉపమానమును బోధించునవైన పుం నపుంసకములయిన తిత్తిరి, కుంభకపాల శబ్దములతో సమానాధికరణములగును. స్త్రీ ప్రత్యయమును సిద్ధించును అని భావము. ॥411॥

*అవతారిక*— మరియును—

**శ్లో॥ గుణేన చోపమానస్థే సాపేక్షత్వం న ప్రకల్పతే ।**
**ప్రధానస్య తదా న స్యాత్ వ్యాఘ్రాదౌ లింగదర్శనమ్ ॥ 412**

గుణే, వ్యాఘ్రాదౌ ఉపమానస్థే = శౌర్యము మున్నగు గుణము ఉపమానములయిన వ్యాఘ్రాదు లందున్నయెడల, ప్రధానస్య = ప్రధానుడగు పురుషునకు, సాపేక్షత్వం = సామాన్య ధర్మ

వాచకాపేక్ష, న ప్రకల్పతే = సిద్ధింపదు, తదా = అపుడు, లింగదర్శనం = సామాన్యా ప్రయోగే అనునది జ్ఞాపకమగుట, న స్యాత్ = సంభవింపకపోవును.

తాత్పర్య వివరణములు— "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ప్రయోగే" (2-1-56) అను సూత్రముచేత, ఉపమేయములకు, 'వ్యాఘ్ర' మున్నగు కొన్ని ఉపమాన వాచకములతో సమానాధికరణ తత్పురుషము విధింపబడినది. "పురుషవ్యాఘ్రః" - మున్నగు నవి ఉదాహరణములు. పురుషుడు శూరత్వములో పులివంటివాడు అని యర్థము. సామాన్య ధర్మము శూరత్వము.

కాని, 'పురుషోవ్యాఘ్ర ఇవశూరః' అని విగ్రహమును చెప్పి, సామాన్య ధర్మ వాచకమగు శూర శబ్దమును ప్రయోగించిన, "పురుషవ్యాఘ్రః శూరః" అని సమాసపదము సమ్మతము గాదు. అందులకై సామాన్యాప్రయోగే అను పదము సూత్రమున గ్రహింపబడినది. ఇపుడొక విమర్శ కర్తవ్యము.

సామాన్య ధర్మవాచకమును బ్రయోగించినపుడు, పురుషపదము తదపేక్షమగును గదా ? సాపేక్షమయినది అసమర్థమువంటిదని చెప్పిరిగదా : అసమర్థమునకు సమాసము రానేరాదయ్యె. ఇక సామాన్యాప్రయోగే అను పదమెందులకు ? అని—

ఈ విధముగా పర్యాలోచించిన, అదివ్యర్థమే. ఇట్లు వ్యర్థమయినది, ఒక అపూర్వా ర్థమును జ్ఞాపనముచేసి సార్థకము కావలెను. లింగమనగా జ్ఞాపకము. ఆ అపూర్వార్థము అను జ్ఞాప్యాంశమిచట నేమి ? అనిన - 'ప్రధానమైనది సాపేక్షమైనను, సమాసము రావచ్చును' అనునది.

కాగా సామాన్యాప్రయోగే అనున నదిపుడు సఫలము. ఈ సామాన్యగుణము, ఉప మానగతమా ? ఉపమేయగతమా ? ఉపమానగతమైన ప్రధానమునకు సాపేక్షత్వము లేదు. 'సామాన్యాప్రయోగే' అనునదపుడు వ్యర్థము, కాదు. కాగా లింగము కానేరదు. అది ఉపమేయ గతమయిన, ప్రధాన ముపమేయముగాన అపుడు జ్ఞాపకత్వము సుస్థమగునని భావము. ॥412॥

అవతారిక— అందువలన 'శస్త్రీశ్యామో దేవదత్తః' అను స్థలమున, అప్రధానత్వ రూపమగు ఉపసర్జనత్వమును ఆశ్రయించి, హ్రస్వమును సమర్థించుట ఉపపన్నము గాదు. కనుక ఆ పక్షము హేయము అని ఉపసంహార మీ కారికలో నిబంధింపబడినది.

శ్లో॥ తస్మాత్ సతి గుణత్వేఽపి ప్రాధాన్యం విగ్రహాంతరే ।
నైవం జాతీయకం శాస్త్రే సంభవత్యుపసర్జనమ్ ॥ 413

తస్మాత్ = అందువలన, గుణత్వే సత్యపి = (శ్యామ గుణమునకు) అప్రాధాన్యమున్నను, విగ్రహాంతరే = వేరొక విధమయిన విగ్రహవాక్యమునందు, ప్రాధాన్యం అస్తి = ప్రధానత్వ ముండవచ్చును, ఏవం జాతీయకం = ఈ ప్రకారమైన, ఉపసర్జనం = అప్రాధాన్యము, శాస్త్రే న సంభవతి = శాస్త్రమునందు సంభవింపదు.

3. జాతి, ద్రవ్యము రెండు కూడా శబ్దమునకు వాచ్యములుకాగలవని పాణిని దర్శనము అంగీకరించుచున్నది. ఆరెంటిలో విశేషణవిశేష్యభావము అనియతముగానుండును.
B. అట్టి ద్రవ్యజాతియు నిత్యౌ + ఏవ = నిత్యములనియే, ఉపవర్ణితౌ = వర్ణింపబడినవి. అనగా కాత్యాయన పతంజలులచే నిర్ణయింపబడినవి.

జాతి నిత్యమని ఎల్లశాస్త్రములు అంగీకరించియున్నవి. బ్రహ్మయే ద్రవ్యమనెడి పక్షమున అది నిత్యమని ఉపనిషత్తులు ప్రబోధించుచునేయున్నవి. వ్యక్తి ద్రవ్యమనెడిపక్షమున వ్యక్తులకు ప్రవాహనిత్యతనుబట్టి నిత్యత్వములభించును. ఈయంశము పస్పశాహ్నికమున కాత్యాయనపతంజలులు విపులముగా చూపియున్నారు.

*విశేషాంశములు*—సర్వశబ్దానామ్ = ఎల్లశబ్దములకు అని చెప్పుటలో ఒక విశేషము కలదు. ఘట, పట, శుక్ల, పచతి, డిత్థ మున్నగు ప్రకృతిగానున్న శబ్దములు జాతిబోధకములే. వానికంటె ప్రవర్తించెడి విభక్తిప్రత్యయరూపములగు శబ్దములు కూడ కరణత్వ, ఏకత్వ, త్వ, కర్మత్వ, మున్నగు జాతులనేబోధించును. ఉపసర్గములు కూడ క్రియాత్వజాతినే ప్రకాశింపజేయును. ॥2॥

*అవతారిక*—అపోద్ధార పద్ధతిలో జాతిగాని ద్రవ్యముగాని పదార్థముకాగలదని మత భేదము నాశ్రయించి చూపబడినది. పదమును పరీక్షించుటకై ఈ కాండ మారంభింపబడినది. పదమును పరీక్షించుట అర్థముద్వారా జరుగును కాబట్టి అర్థ పరీక్ష అవసరమాయెను. అదియు వాక్యార్థమును తెలిసికొనుటకుపయోగపడుచున్నది.

పైచూపబడిన రెండు మతములలోను జాతి శక్తివాదమును ప్రస్తుతము విచారించుచున్నాడు ఈవాదమున శబ్దములు జాతినేబోధించును. అచట క్రియ సాధనముతో నన్వయింపవలెను. సాధనము జాతికానేరదు. జాతికిఆశ్రయమగు వ్యక్తి సాధనముకాగలదు. కాని అచట ఒక దోషము ప్రసక్తమగుచున్నది. శబ్దముచే లభించినజాతిఆశ్రయముద్వారా వాక్యార్థ ఘటకమగును. అది శబ్దముచే లభించినదే కనుక వాక్యార్థము పరిపూర్ణమగుటవలన ప్రతినిధికి భంగముకలుగుచున్నది. శబ్దముచే బోధింపబడినది సంభవింపనపుడు దానికి బదులుగా దానితోసమానమగు అర్థమును గ్రహించుట ప్రతినిధి యనబడును. ఉదా॥ దర్భైః ప్రస్తరితవ్యమ్, (అగ్నికి నాలుగు ప్రక్కల దర్భలుంచవలెను) అని శ్రుతిచెప్పినది. దర్భములు సంభవింపకపోయిన, వానికిబదులుగా శరములు అనగా రెల్లు ఉపయోగింతురు. అసంభవము కలిగినపుడే ప్రతినిధిని అపేక్షింపవలెను. జాతి వాచ్యమగుచో దానికి ఆశ్రయము ఆక్షిప్తమగుటచే అచట వాక్యార్థము సంభవింపగలదు. అసంభవము లేదు. అట్టి తరి ప్రతినిధికే భంగమువాటిల్లుచున్నది అను పూర్వపక్షమునకు సమాధానముచెప్పుచున్నాడు.

**శ్లో॥ కేషాఞ్చిత్సాహచర్యేణ జాతిః శక్త్యుపలక్షణమ్।**
**ఖదిరాదిష్వశక్తేషు శక్తః ప్రతినిధీయతే॥ 3**

కేషాఞ్చిత్ = కొందరియొక్క మతమున అనగా శబ్దములకు జాతియే వాచ్యమనెడి వారి మతమున, జాతిః = శబ్దములచే బోధింపబడిన జాతి, సాహచర్యేణ = సాహచర్యముచే,

2. వస్తు– వసతీతివస్తు (తనయొక్క అసాధారణమగు రూపముతోనుండునది) అనువ్యుత్పత్తిని బట్టి ద్రవ్యము స్వలక్షణమని బుద్ధమతానుయాయులు నమ్ముచున్నారు. "సర్వం స్వలక్షణమ్" (ఏ వస్తువైనను తనతో తానే సమానముగానుండును. తనతోసమాన మగు ఇతర వస్తువులేదు) అని వారు భావింతురు. అట్టివస్తువే వ్యవహారమునకు సాధనము.

3. స్వభావః- స్వస్యభావః (తనయొక్క భావము) స్వశబ్దమునకు తాను అని యర్థము. తాను అనగా సత్తయే. పూర్వాపరభావములేకయున్నది సత్త. అదియే తన ప్రక్క నున్న ఉపాధుల భేదముచే భిన్నరూపమును దాల్చి ద్రవ్యమనబడుచున్నదని సత్తాఽద్వైత వాదుల యాశయము.

4. శరీరమ్– శీర్యతే ఇతి శరీరమ్ (నశించునది) అను అభిప్రాయముతో మనకు కానవచ్చెడి నశించు స్వభావము కల దేహము శరీరము. అందు చేతనుడగు పురుషుడుకలడు. అతడు శరీరి అని వ్యవహరింపబడుచున్నాడు. పురుషుడు తప్ప మిగతా భాగమంతయు జడమే. అదియే శరీరము. కాగా జడమగు శరీరమునకు చేతను డగు శరీరికి భేదము తెలియ బడనందున శరీరమే ద్రవ్యము, అదియే ప్రధానమని సామాన్య ప్రజలు తలంచుచున్నారు. అదియే ద్రవ్యము, ఆత్మ అని వారి తలంపు.

5. తత్త్వమ్– తేషాంభావః తత్త్వమ్ (వాని యొక్క అనగా భూమి, నీరు, తేజము, వాయువు అనెడి నాల్గుభూతముల సమష్టి) అనువ్యుత్పత్తిని స్వీకరించి శరీరము ఇంద్రియములు విషయములు వీనియొక్క ప్రోగు ద్రవ్యమని చార్వాకులు నమ్మియున్నారు. వీరిమతమున ఆకాశమనే ఐదవభూతములేదు.

పయిరీతిని దార్శనికుల దృక్పథములు విభిన్నములైనను వస్తుతః అన్నిశబ్దములు నిర్గుణాద్వితీయ బ్రహ్మమునే బోధించునని గ్రంథకర్తయొక్క ఆశయము.

B. తత్ = అది అనగా ద్రవ్యము, నిత్యం + చ = నిత్యమే, ఇతి = అని, స్మృతమ్ = స్మరింపబడినది, అనగా చెప్పబడినది. ఆ ద్రవ్యమునిత్యమే, అనిత్యముకాదని పెద్దలు చెప్పు చున్నారని భావము.

"సిద్ధేశబ్దార్థ సంబన్ధే" (శబ్దములు, వానిచే బోధింపబడెడి యర్థములు, ఆశబ్దార్థము లకు గల సంబంధములు నిత్యములే) అని కాత్యాయనుడు సిద్ధాంతము చేసెను. ఇచట సిద్ధ శబ్దమునకు నిత్యమనియర్థము. ఎల్ల శబ్దములు ద్రవ్యమునే బోధించును. ఆద్రవ్యము నిర్గుణ బ్రహ్మరూపము. కాబట్టి ద్రవ్యము నిత్యమనుట లెస్సయే ఈ యర్థమును మహాభాష్యకారుడు వ్యక్తపరచెను. శబ్దమునకు నిత్యత్వము మొదటి కాండమున చూపబడినది. ॥1॥

ఈ యంశము నిట గుర్తింపవలెను : ద్రవ్యము రెండువిధములుగా నున్నది (1) పారమార్థికము, (2) వ్యావహారికము. మొదటిది నిర్గుణ బ్రహ్మరూపము, అట్టి బ్రహ్మభావమే మోక్షము. రెండవది వ్యాకరణ శాస్త్రమున విధింపబడిన కొన్ని కార్యములు ప్రవర్తించుటకు ఉపయోగపడుచున్నది.

**తాత్పర్య వివరణములు**—— శ్యామ గుణము ఉపమానగతము అయిన అది ఉప మేయమునకు విశేషణమగును. కావున అప్రధానము. కాని, ''శస్త్రీ ఇవ దేవదత్తా శ్యామా'' అని ఇట్లు, ఆ శ్యామ గుణము నుపమేయమునందున్న దానినిగా చెప్పినపుడది ప్రధానమే అగును.

ఉపమానవృత్తి శ్యామ గుణమను పక్షమునందైనను, ప్రక్రియా వాక్యములో అప్రధానముగ దోచినను, సమాస ముపమేయమును బోధించుటచేత వస్తుతః అది ప్రధానమే శాస్త్రము లోకసిద్ధమైన అర్థమునే అనువదించును. కాబట్టి వాస్తవ రూపములో ప్రధానమే అయిన ఉపసర్జనత్వము శాస్త్రమునందును ఉపపన్నము గాదు. కనుకనే మహాభాష్యమునందు ''ఈ జాతి ఉపసర్జనములు గూడ సంభవించిన'' - అని చెప్పి ఈ పక్షమందు అరుచి ప్రదర్శింపబడినది. ॥413॥

*అవతారిక*—— ఈ విధముగ గుణవచనము ఉపమానమును బోధించుటలో అనుపపత్తి నిర్ధారణమునుచేసి - ''ఏవం తర్హి శస్త్ర్యామేవ శస్త్రీ శబ్దో వర్తతే। దేవదత్తాయాం శ్యామా శబ్దః'' అని స్థిరీకృతము = శస్త్రీ శబ్దమునకు చురకత్తి అర్థము. శ్యామా శబ్దమునకు, దేవదత్త అర్థము. కనుక, వెనుక చెప్పిన దోషము లేవియు నుండబోవు అని భావము. శ్యామా శబ్దమున కిట్లు ఉపమేయ వృత్తిత్వము స్థిరపరచియు, తదుపరి వేరొక అనుపపత్తి ఉద్భావింపబడినది. ఎట్లనగా—

> ''ఏవమపి గుణోఽనిర్దిష్టో భవతి।
> బహవశ్చ శస్త్ర్యాం గుణాః।
> సూక్ష్మా మృదుతరీ'' ఇతి

''అయినను గుణము నిర్దేశింపబడ లేదుగదా. శస్త్రీగతమగు గుణమును శ్యామా శబ్దము తెలియచేయదాయె. అపుడు, అనియతమగు గుణాంతరమును దేనినో పుచ్చుకొని సాదృశ్యమును జెప్పవలసి యుండును. కత్తియందు చాల గుణములుండును. తీక్ష్ణత ఉండును. సూక్ష్మత పృధుత్వము - ఇట్లెన్నియేని గుణము లుండవచ్చును గదా. శ్యామా శబ్ద ముపమేయమగు దేవదత్తను చెప్పునుగాన స్త్రీలింగము సిద్ధించినది. తత్పురుష సమాసమున నుండదగిన, ఉత్తర పదార్థ ప్రాధాన్యమును నిర్వహింపబడినదగును. కాని పై దోషము, అనగా ఉపమానగతమగు గుణము నియతమైన ఉపమానోపమేయ భావహేతువు నిర్దిష్టము కాలేదనునది పరిహరింపబడ లేదు అని భాష్యాశయము.

తదుపరి, ''అనిర్దిశ్యమానస్యాపి గుణస్య భవతిలోకే సంప్రత్యయః'' అను పరిహార భాష్య మీ కారికచే వివరింపబడుచున్నది.

**శ్లో॥ ఉపమేయాత్మని శ్యామో వర్తమానోఽభిధీయతే।**
**ఉపమానేష్వనిర్దిష్టః సామర్థ్యాత్ సంప్రతీయతే॥ 414**

ఉపమేయాత్మని = ఉపమేయ పదార్థమునందు, వర్తమానః శ్యామః = ఉంటున్న నలుపు అను

ధర్మము, అభిధీయతే = శబ్దముచే స్పష్టముగ వచింపబడును, ఉపమానేషు = ఉపమాన పదములందు, అనిర్దిష్టః = నిర్దేశింపబడనిది = శాబ్దము కానిది, సామర్థ్యాత్ సంప్రతీయతే = సామర్థ్య గమ్యమగును.

తాత్పర్య వివరణములు— శ్యామాది శబ్దములు, దేవదత్తాదులందున్న సాధారణ ధర్మమును, శబ్ద శక్తిచే బోధించును. ఆ అభిధావ్యాపారమునకు ఒక్క పర్యాయమే ప్రవృత్తి. అంతతో నది ఉపక్షీణమగును. కాని, ఉపమానమునందు ఈ శ్యామత్వముగాక వేరొక ధర్మమును అచట శబ్ద సన్నివేశమేదియు దెలియజేయలేదు. అందువలన సన్నిహితము, ఆకాంక్షితము, శ్రుతమును అగునది శ్యామగుణమే కావున తత్సంబంధమే న్యాయ్యమగునని భావము. ॥414॥

అవతారిక— "నిర్దేశింపబడని గుణమైనను లోకమునందు ప్రతీయమానమగు చుండును" - అని చెప్పి దృష్టాంతముగా నీయబడినది,

"తద్యథా చంద్రముఖీ దేవదత్తేతి ।
బహవశ్చ చంద్రేగుణాః ।
యాచాసౌ ప్రియదర్శనతా సాగమ్యతే"

అను గ్రంథము. దాని నీ కారిక వ్యాఖ్యానించుచున్నది

శ్లో॥ ద్రవ్యమాత్రేఽపి నిర్దిష్టే చంద్రవక్త్రేఽనుగమ్యతే ।
విశిష్టఏవ చంద్రస్థో గుణో నోపప్లవాదయః ॥ 415

చంద్రవక్త్రే = 'చంద్రముఖీ' అను పదమునందు, ద్రవ్యమాత్రే = ఉపమానమగు ద్రవ్యము మాత్రమే, నిర్దిష్టే అపి = నిర్దేశింపబడి యున్నను, చంద్రస్థ = చంద్రునియందుండు, విశిష్టః గుణః ఏవ = ప్రసిద్ధమయిన, ధర్మమే, అనుగమ్యతే = సాధారణ ధర్మముగా గ్రహింపబడును, ఉపప్లవాదయః = కళంకము మున్నగునవి, న అనుగమ్యంతే = గ్రహింపబడవు.

తాత్పర్య వివరణములు— 'చంద్రునివంటి ముఖముగలది ఈమె' అందురు. చంద్రుడు ముఖమున కుపమానము. సాధారణ ధర్మవాచకము లేదు. అయినను ప్రసిద్ధినిబట్టి ఉపమానోపమేయభావ హేతువుగా, ఆహ్లాదకత్వము మున్నగు సాధారణ ధర్మమునే గ్రహింతురు. ఇతర ధర్మములు పెక్కులున్నను అవి గ్రహింపబడవు. ఉపప్లవమనగా కళంకము= చంద్రునిలోని మచ్చ అని కొందరందురు. మున్నగునవి యనగా వృద్ధిక్షయములు.

మరికొందరు, ఉపప్లవమనగా వృద్ధిక్షయములు. సతతగతి శీలమును. ఆదిపదమునకు శశలాంఛనము మున్నగునవి అర్థములు అనిరి.

ఎప్పుడు సాధారణధర్మము అసలు నిర్దిష్టమేకాకున్నను ప్రసిద్ధివలన నుభయత్ర అన్వయించినదో, అపుడు ఒకచో శ్రుతమైనది రెండవచోట = ఉపమేయమునందు ప్రతీతమగుననుటకు అభ్యంతరమేమి ? అని భావము. ॥415॥

అవతారిక — సాధారణ ధర్మవాచకము, ఉపమేయ సమీపమున నుచ్చరింపబడి నను సామర్థ్యమువలన నుపమానమునందును వర్తించునను పక్షము విచారించి నిర్ణయింపబడి నది. కాని ఇది అంతయు కల్పితమగు ప్రక్రియావాక్యమునందే. పరమార్థ దృష్టిలో 'శస్త్రీ శ్యామా' అను పదము అఖండము. విశిష్టమే విశిష్టోపమేయార్థమును జెప్పును.

శ్లో॥ భేదవాసనయైతచ్చ సమాసేప్యుపవర్ణ్యతే ।
విశిష్టగుణభిన్నే ఒర్థే పదమన్యత్ ప్రయుజ్యతే ॥ 416

ఏతచ్చ = సామాన్యవచనమున కీ ఉభయవృత్తిత్వము, భేదవాసనయా = ప్రక్రియావాక్యము నందలి భేదవాసనవలన, సమాసే అపి = సమాసపదమునందు గూడ, ఉపవర్ణ్యతే = వర్ణింప బడుచున్నది, అన్యత్ పదం = విగ్రహగతముకంటె వేరగు అఖండపదము, విశిష్టగుణభిన్నే = ఉపమానమను ఆశ్రయభేదముచే భిన్నమైన గుణముగల, అర్థే, ప్రయుజ్యతే = ఉపమే యమునందు, ప్రయోగింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— సామాన్యవచనము, ఉపమానమునకు సంబంధించిన దయినపుడు "శస్త్రీ ఇవ శ్యామా దేవదత్తా" అని విగ్రహవాక్యము. అది ఉపమేయవృత్తి అయిన, 'శస్త్రీ ఇవ దేవదత్తా శ్యామా' అని వాక్యముండును. ఈ విధముగ భిన్న భిన్న ప్రక్రియా వాక్యములందు, 'శ్యామా' అనునది, ఉభయ సంబంధిగా అనుభవ విషయమగుట వలన, ఆ వాసననుబట్టి, వృత్తిపదము గూడ వాక్య సమానార్థకముగా నుండదగునని తలంచి, దాని కుభయసంబంధమును జెప్పుదురు.

కాని సమాసపదము నిరంశము. ప్రక్రియా వాక్యము, సమాసపదముల అన్వాఖ్యా నమునకై కల్పించిన కల్పన. ఆ కల్పన అతిప్రసంగము నాపాదింపరాదు. సామాన్య వచన మున కుపమేయ సంబంధమున్ననే, 'శస్త్రీ శ్యామః' అను పుంలింగ సమాసమున కుపపత్తి. 'తిత్తిరి కల్మాషీ' అనుచో స్త్రీప్రత్యయ సిద్ధియు నపుడే.

కాని ఈ పక్షమునందును చోద్యము = శంక లేకపోలేదు.

"ఏవమపి సమానాధికరణేనేతి వర్తతే ।
వ్యధికరణానాం సమాసో న ప్రాప్నోతి ।
కిం హి వచనాన్న భవతి"

అని అచట భాష్యము. శస్త్రీపద ముపమానమును, శ్యామాపద ముపమేయమును బోధించి నపుడు, వానికి సామానాధికరణ్య మెట్లు? ఏకార్థ బోధకత్వముగదా సామానాధికరణ్యము? ఈ సూత్రము సమానాధికరణాధికారములోనిది గదా?

దానికి పరిహారముగా, - "ఏమి? వచన సామర్థ్యమువలన సమాసము సిద్ధింపదా? అనిరి. ప్రకరణము సమానాధికరణ ప్రకరణమైనను, వచనము అనగా "ఉపమానాని" అను సూత్రము ప్రబలముగాన దానిని బాధించునని తాత్పర్యము. వచనము శ్రుతి. శ్రుతి, లింగ,

వాక్యప్రకరణ, స్థాన సమాఖ్యలను ప్రమాణములలో పూర్వ పూర్వ ప్రమాణముకంటె నుత్త రోత్తరము దుర్బలము. ॥416॥

అవతారిక— "కిం హి వచనాన్న భవతి" అను భాష్యమునకు, వచనము అకృతార్థము కాన ప్రకరణమును బాధించునని భావమనిరి. కాని సామాన్యవచన ముపమానపర మైనపుడు, సూత్రము ప్రవర్తించునే, ప్రకరణ బాధయు నుండదుగదా అనిన, అఖండ పదము విశిష్టార్థబోధకము. అన్వాఖ్యానముకొరకై వాక్యకల్పన చేసినను, శాస్త్ర ప్రక్రియకు భంజకముగ, అపోద్ధారమును చేయరాదు. మరియును, సామాన్యవచన ముపమానమునకు సంబంధించినను, శస్త్రీ శ్యామా పదములు రెండును, ఉపమేయ విశేషణములగుటచే అప్రధానములు, సాపేక్షములును అగును. అపుడు సామర్థ్యము లేకుండుటవలన సమాసము రాకపోవును.

ఉపమేయ వృత్తి అయినచో, శస్త్రీ శ్యామా పదార్థములకు ఉపమానోపమేయ సంబంధముండునుగాన అసామర్థ్యముండదు. అపుడు వ్యధికరణములయినను, ఆ పదములకు వచనము = అనగా సమాసవిధాయకను వృత్తిని విధించును.

ఈ విధముగ గమకత్వమువలన సమాసము సిద్ధించినను, 'మృగీవచపలా = మృగచపలా' - అను స్థలమున సమానాధికరణ ముత్తరపదమయినపుడు రాదగిన పుంవద్భావము సిద్ధింపకపోవును అని దోష మాశంకింపబడినది.

> "యద్యపితావద్వచనాత్ సమాసః స్యాత్ ।
> ఇహతుఖలు మృగీవచపలామృగచపలా ।
> సమానాధికరణ లక్షణః పుంవద్భావః న ప్రాప్నోతి"

అని. ఇది తద్వివరణమైన కారిక.

శ్లో॥ యదిభిన్నాధికరణో వచనాదనుగమ్యతే ।
మృగీవచపలేత్యత్ర పుంవద్భావో న సిద్ధ్యతి ॥ 417

భిన్నాధికరణః = వ్యధికరణమైన సమాసముగూడ, వచనాత్ = సమాసవిధాయక వచన బలమువలన, అనుగమ్యతే యది = అంగీకరింపబడుననిన, 'మృగీవచపలా' = 'మృగీఇవ చపలా' అను విగ్రహముగల, ఇత్యత్ర = 'మృగచపలా' అను సమాసమునందు, పుంవద్భావః = సమానాధికరణము పరమైనపుడు రాదగిన, న సిద్ధ్యతి = పుంవద్భావము సిద్ధింపదు

తాత్పర్య వివరణములు— తాత్పర్యము స్పష్టముగాన వివరణ మపేక్షితము గాదు. ॥417॥

అవతారిక— పూర్వోత్తరపదములు సమానాధికరణములయినపుడు, పూర్వపద మగు స్త్రీవాచకమునకు పుంవద్భావము వచ్చును. ఉదాహరణము - మహతీచ సానవమీచ = మహానవమీ. మృగచపలా అనుచోట నది సిద్ధింపదు. ఏలయన, మృగీశబ్ద ముపమానమును,

చపలాశబ్ద ముపమేయమును బోధించిన, ఆ పదములు సమానాధికరణము లెట్లగును? అని శంక - ఈ శంకకు పరిహారమిట మహాభాష్యమున జెప్పలేదుగాని, ప్రదేశాంతరమున గలదు. అయ్యది ఒక పక్షమున చెల్లునది. ఎట్లనగా-

**శ్లో॥ అస్త్రీపూర్వపదత్వాత్తు పుంవద్భావో భవిష్యతి।**
**యథైవ మృగదుగ్ధాదౌ న చేత్ స్త్ర్యర్థో వివక్ష్యతే॥ 418**

అస్త్రీపూర్వపదత్వాత్ తు = స్త్రీలింగముకానిది పూర్వపదమగుటవలన, మృగదుగ్ధాదౌ యథా ఏవ = 'మృగదుగ్ధం' మున్నగు సమాసములం దెటులనో, తథా స్త్ర్యర్థః = అటుల, స్త్రీరూప మగు అర్థము, న వివక్ష్యతే చేత్ = ప్రత్యేకముగ వివక్షింపబడనిచో, పుంవద్భావః = పుంవ ద్భావము = పుంవాచక మాదేశమగుట, భవిష్యతి = సిద్ధింపగలదు.

తాత్పర్య వివరణములు— ''మృగక్షీరమును దెమ్ము'' అందురు. అపుడు ఇంకొక జాతిక్షీరము తేవలదు అని తాత్పర్యము. అది జాత్యంతర నివృత్తిపరమైన చోదన. మృగ క్షీరమనిన మృగిక్షీరమే. క్షీరములుండునది మృగికేగదా. మృగ్యాః క్షీరం = మృగక్షీరం - అని విగ్రహముచెప్పి, పూర్వపదమునకు పుంవద్భావమును, ''కుక్కుట్యాదీనామండాదిషు'' అని వార్తికకారుడు విధించియున్నాడు. కాని పూర్వపదమచట స్త్రీవాచకము కానేకాదు కనుక పుంవద్భావముతో బనిలేదని - ''నవా అస్త్రీపూర్వపద వివక్షితత్వాత్'' - అని, విధాయక వార్తికము ఖండింపబడినది.

'మృగచపలా' అను స్థలమున, మృగజాతి చాపలమే వివక్షితము. మృగ ఇవ చపలా అనియే విగ్రహము. స్త్రీత్వము వివక్షితము కాదు అని భావము.

అట్లు కాదు స్త్రీచాపలమును స్త్రీచాపలముతోనే పోల్చవలెను అని విశేషాభిప్రాయ మైన, పుంవద్భావ మావశ్యకమే యగును. కావున నిది పాక్షిక సమాధానము. ॥418॥

అవతారిక— అనంతరము, ''ఏవం తర్హి తస్యామేవోభయం వర్తతే'' = అటు లైన, ఆ దేవదత్తయందే శస్త్రీపదమును, శ్యామా పదమును గూడ వర్తించును' - అని నిర్దోష పక్షముపపాదితము.

**శ్లో॥ శస్త్రీవ శస్త్రీశ్యామేతి దేవదత్తేవ కథ్యతే।**
**తస్యామేవోభయం తస్మాదుచ్యతే శాస్త్రవిగ్రహే॥ 419**

శస్త్రీ ఇవశస్త్రీ ఇతి=చురకత్తివంటిదిగాన శస్త్రిఅనియు, శ్యామా ఇతి=నల్లగానున్నదిగానశ్యామ అనియు, దేవదత్తా ఏవ = 'దేవదత్త' అను నామెయే, కథ్యతే=చెప్పబడుచున్నది, తస్మాత్, శాస్త్రవిగ్రహే=అందువలన, శాస్త్రీయవాక్యమునందు, తస్యామేవ=ఆమెయందే, ఉభయం ఇతి ఉచ్యతే = ఉపమాన, గుణవచన పదములు రెండును వర్తించునని చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— సామాన్య ధర్మవాచకమైన శ్యామాది శబ్దము ఉప

మానమును బోధించినపుడు, ఉపమేయ బోధకము సమాసపదము మొత్తము. ఇయ్యది సమాసపదమునకు సంబంధించినంతవరకు. ఇక విగ్రహవాక్యమునందు వర్తిపదములే = అనగా సమాస ఘటకపదములే ఉపమేయమును చెప్పునవి కావలెను. దేవదత్తకును శస్త్రికిని సాదృశ్యమునుబట్టి అభేదము ఆరోపింపబడునుగాన నది దేవదత్తను బోధించును. శ్యామా పదమును ఉపమేయమునే బోధించునుగదా. కావున, సామానాధికరణ్యము కుదురును. పుంవద్భావమును సిద్ధించును. ప్రకరణమునకును బాధలేదు. శస్త్రీ శబ్దము 'దేవదత్త'ను బోధించుట ఉపమాన సంబంధమును తన కడుపులోనుంచుకొనియే.

శబ్దము, పరార్థమున ప్రయోగింపబడుచున్నదనిన, ఇవార్థమున కంతర్భావము తప్పదు. 'సింహోమాణవకః' 'పిల్లవాడు సింహమండీ' - అనిన సింహమువంటివాడని యర్థము. ఇదంతయు ప్రక్రియావాక్య విషయము. వాక్యావస్థలో సామానాధికరణ్యమును సమర్థించుటకు చెప్పబడినది.

ఇక లోకప్రత్యయమగు సమాసపదమునం దంశములు లేవుగాన నీ యుపన్యాస మనావశ్యకము. పదములందు వర్ణములను విభజించుట అసత్యమైనట్లు వాక్యమునందు అనగా నిచ్చట సమాసపదమునందు, అవయవవిభాగము లేనేలేదు. శస్త్రీ శబ్దముగాని దాని యర్థము గాని ఉండినగదా ఆరోపితార్థమని చెప్పుట కవకాశము ? అని భావము. ॥419॥

అవతారిక — ఈ పక్షమే భాష్యమున సిద్ధాంతపక్షముగా స్థాపింపబడినది.

"ఏతచ్చాత్రయుక్తం యత్తస్యామేవోభయంవ్రర్తేత ।
ఇతరథాబహ్వపేక్ష్యం స్యాత్"

అని అచట భాష్యము. ఆ విషయ మీ కారికలో వ్యాఖ్యానింపబడుచున్నది.

శ్లో॥ పుంవద్భావస్య సిద్ధ్యర్థం పక్షే స్త్రీప్రత్యయస్య చ ।
బహ్వపేక్ష్య మత స్తస్యాముభయ ప్రతిపాదనమ్ ॥ 420

పుంవద్భావస్య=పుంవదతిదేశమునకును, పక్షే స్త్రీప్రత్యయస్య చ=వికల్పముగ స్త్రీప్రత్యయ మగు జీషునకును, సిద్ధ్యర్థమ్ = సిద్ధికొరకై, బహు, అపేక్ష్యమ్ = అధిక మనేకము, కావలసి యుండును, అతః, తస్యాం = అందువలన, ఆ ఉపమేయమునందు, ఉభయ ప్రతిపాదనమ్= ఉపమానవచన ఉపమేయవచనముల కుపపాదనము కర్తవ్యము.

తాత్పర్య వివరణములు— శ్యామా శబ్దమున కుపమేయ మర్థమను పక్షమునందు, శస్త్రీ శబ్దముతో సామానాధికరణ్యము సిద్ధింపదు. కాగా సమాసము రాదు. వచన బలమువలన నది సిద్ధించినను, మృగచపలా అను స్థలమున పుంవద్భావసిద్ధికొరకు, అస్త్రీ పూర్వపద వివక్షా నియమము, వెనుక చెప్పినది కావలసి వచ్చును. మృగక్షీరా మున్నగు ప్రయోగములందువలె, మృగచపలా అనుచో గూడ సామాన్య వివక్షయేగాని, మృగస్త్రీవివక్ష లేదనియు జెప్పవలసి యుండును. ఇదంతయు అపేక్ష్యము కావలసివచ్చును దానివలన నర్థమును గ్రహించుట సులభము గాదు.

శ్యామా శబ్దము గూడ ఉపమానమగు శస్త్రినే చెప్పుననిన, 'శస్త్రీ శ్యామో దేవ దత్తః' అనుచోట, ''గోస్త్రియోరుపసర్జనస్య'' - అని హ్రస్వము సిద్ధించునుగాని, 'తిత్తిరి కల్మాషీ' - అనుచో జీప్రత్యయము లభింపదు. అందుకై - 'కల్మాష శబ్దముగాదిట వర్ణ వాచకము. తిత్తిరి కల్మాష' అను సముదాయము తద్వాచకము, అని చెప్పవలసి యుండును.

లేదా - 'అప్రధానత్వమను లౌకికోపసర్జనము గ్రహింపబడదు గాన కల్మాష శబ్దము ప్రధానమే. తదంత విధిచేత జీషు సిద్ధించును - అని చెప్పవలెను. అపుడు స్వరవిషయ మున దోషము.

ఈ విధముగ నీ రెండు పక్షములందును బహ్వర్థాపేక్ష కలదు. కావున శస్త్రీ శబ్ద మును శ్యామా శబ్దమును గూడ ఉపమేయ అగు దేవదత్తనే చెప్పుననుట యుక్తము. కాగా, పైన ప్రతిపాదించిన విషయములనన్నిటిని పరిశీలింపగా, 'శస్త్రీశ్యామా' - అను నుపమాన సమాసమువలన కలుగు శాబ్ద జ్ఞాన మిట్లుండును.

ఎట్లు ? - 'ఉపమేయమును పరిచ్ఛిదించు, శ్యామయగు శస్త్రియు, పరిచ్ఛేదింపబడు శ్యామయగు దేవదత్తయు, అభిన్నములు' - శాబ్దజ్ఞానమనినను శాబ్దబోధయనినను నొక్కటియే.

శస్త్రీ సాదృశ్యమువలన దేవదత్తకు తదభేదమని భావము. ॥420॥

*అవతారిక*— తదుపరి భాష్యగ్రంథము - ''యదితావదేవం విగ్రహః కరిష్యతే'', 'శస్త్రీవ శ్యామా దేవదత్తేతి', శస్త్ర్యాం శ్యామేత్యేతదపేక్ష్యం స్యాత్ । అథాప్యేవం విగ్రహః కరిష్యతే, ''యథా శస్త్రీ శ్యామా తద్వదియం దేవదత్తేతి, ఏవమపి దేవదత్తాయాం శ్యామా ఇత్యేతదపేక్ష్యం స్యాత్'' - అని యున్నది.

''శస్త్రీ ఇవ శ్యామా దేవదత్తా'' అని విగ్రహవాక్యమును వర్ణించిన, దేవదత్త నల్లనిదని యర్థమైనను, శస్త్రి నలుపని సిద్ధింపలేదు. కనుక శ్యామా అను పదమును అచ్చట కూడ అపేక్షింపవలసి యుండును. 'యథా శస్త్రీ శ్యామా తథా దేవదత్తా' - అని విగ్రహించిన, దేవదత్త నల్లనిదని తెలుపుటకు శ్యామాపదము నచ్చట అపేక్షింపవలసియుండును - అని ఈ విధముగ బహ్వపేక్ష వర్ణింపబడినది. సమాసమునకు పూర్వ ముపమేయమును బోధించు కల్మాష శబ్దమునకు, ఇష్టస్త్రీప్రత్యయము సిద్ధింపవచ్చును. ఉపమేయలింగమును సిద్ధించును. కావున బహ్వపేక్ష యీ విధముగ వ్యాఖ్యానింపబడిన దీ కారికలో.

**శ్లో॥ శ్యామాశస్త్రీ యథా శ్యామాశస్త్రీ కల్పేతిచోచ్యతే ।**
**తత్రోపమానేతరయోః శ్యామేత్యేతదపేక్ష్యతే ॥ 421**

శ్యామా శస్త్రీ యథా = చురకత్తివలె నల్లనైనది = శస్త్రీవ శ్యామా, శ్యామా శస్త్రీకల్పా = నల్లని చురకత్తివంటిది = శ్యామా శస్త్రీవ, ఇతి చ ఉచ్యతే = అనియు విగ్రహము చెప్పబడు చున్నది. తత్ర = అందు = ఆ విగ్రహ వాక్యములలో, ఉపమానేతరయోః = ఉపమానము నందును, ఉపమేయమునందును, శ్యామా ఇతి ఏతత్ అపేక్ష్యతే = 'నల్లని' అను నీ సామాన్య ధర్మసంబంధము కోరబడును.

తాత్పర్య వివరణములు— 'చురకత్తివలె నల్లనిది దేవదత్త' అని విగ్రహము చెప్పినపుడు, శ్యామా శబ్దము దేవదత్తనే చెప్పును. శస్త్రీ శబ్దము కత్తిని మాత్రమే చెప్పును. వాని ఔపమ్యనిమిత్తము నలుపేగాని వేరొకరంగు కాదు అని తెలుపుటకు శ్యామాపద సంబంధాపేక్ష తప్పదు. ఆ పద మొకచోట శ్రుతమైన రెండవచోట ననుమానింపబడవలెను. అట్లు కానిచో ఉపమానోపమేయభావమే కుదురదు. శస్త్రీశబ్దము శస్త్రిని బోధించినట్లు శ్యామా శబ్దమును శస్త్రినే చెప్పిన, దేవదత్తకు శ్యామ గుణసంబంధ మపేక్షితమగును. ఇదియే బహ్వాపేక్ష యని కొందరి మతము. ॥421॥

*అవతారిక*— ఏమండీ! 'బహ్వాపేక్ష్యం స్యాత్' అని తరచుగా ననుచున్నారే. బహ్వాపేక్ష యేమున్నది? లోకప్రసిద్ధమగు నర్థమున కనుగుణముగ విగ్రహవాక్యమును కల్పించవలెను. కావున, ఉపమానమునందును నుపమేయమునందును గూడ శ్యామాపద సంబంధ మావశ్యకము. వాక్యమున నట్లే ప్రయోగింపబడుచున్నది. లేదా ప్రయోగింపవలెను. ఇక సమాసవృత్తిలో, రెండవ శ్యామా శబ్ద మంతర్భూతమయి యుండునుగాన దానికి ప్రయోగమక్కరలేదు. కాబట్టి బహ్వాపేక్ష ఏమిగలదు? అనిన చెప్పుచున్నారు.

**శ్లో॥ అథశ్యామేవ శస్త్రీయం శ్యామేత్యేవం ప్రయుజ్యతే।**
**శస్త్రీయధేయం శ్యామేతి తావదేవ ప్రతీయతే॥** 422

అథ = ఇక, శ్యామాశస్త్రీ ఇవ ఇయం శ్యామా = నల్లని చురకత్తివలె ఈ దేవదత్త నల్లనిది, ఇతి ఏవం ప్రయుజ్యతే యది = అని ఇట్ల ప్రయోగించినను, 'శస్త్రీ ఇవ ఇయం శ్యామా' = కత్తివలె నీమె నల్లనిది, ఇతి ప్రయోగే యావత్ =అను ప్రయోగమునం దెంతయర్థమో, తావత్ ఏవ = అంత యర్థమే. ప్రతీయతే = ప్రతీయమానమగుచున్నది.

తాత్పర్య వివరణములు— 'నల్లని కత్తివలె ఈ దేవదత్త నల్లనిది' - అని ఇట్లు, ఉపమేయముతోడను ఉపమానముతోడను గూడ 'నల్లని' అను పదములు ప్రయోగించినపుడును, 'కత్తివలె నీమె నల్లనిది' - అని ఒక పర్యాయమె శ్యామ శబ్దమును ప్రయోగించినపుడు ఎంత యర్థము తోచునో అంతయే యర్థమగును. ॥422॥

*అవతారిక*— ఎందువల్లననగా-

**శ్లో॥ ఉపలక్షణమాత్రార్థా గుణస్యాస్య యది శ్రుతిః।**
**పృథక్ ద్వయోః శ్రుతోఽప్యేష నేష్టస్యార్థస్య వాచకః॥** 423

అస్య, గుణస్య శ్రుతిః = ఈ గుణవాచక శబ్ద శ్రవణము, ఉపలక్షణమాత్రార్థా యది భవతి= ఉపలక్షించుటకొరకు మాత్రమే అయిన, తదా = అపుడు, ఏషః పృథక్ = ఈ గుణశబ్దము, వేరుగా, ద్వయోః శ్రుతః అపి = ఉపమానోపమేయములందు వినబడినను, ఇష్టస్య అర్థస్య= కావలసిన, అర్థమునకు, వాచకః న భవతి = బోధకము, కాదు.

తాత్పర్య వివరణములు— గుణవాచక శబ్దమును ప్రయోగించుట ఎందులకు? అది వస్తువును విశేషించుటకా? లేక ఉపలక్షించుటకు మాత్రమెనా? ఉపలక్షణ మాత్రార్థ మైన, దాని నుభయత్ర ప్రయోగించినను, అభీష్టమయిన ఔపమ్య ప్రతిపాదనము జరుగదు. ఏలయన— శ్యామగుణోపలక్షితమైన చరకత్తి, గుణాంతరముచే ఉపలక్షింపబడిన దేవదత్తను గూడ పరిచ్ఛేదింపవచ్చును అని యర్థమగును. అపుడు రెండుసార్లు ప్రయోగించినను ఔప మ్యము సాదృశ్యమువలననని యవగతము కాదు. ॥423॥

అవతారిక— సామాన్య ధర్మవాచకమును ప్రయోగించుట, ఉపమేయముయొక్క రూపవిశేషమును, 'ఇదమిద్ధమ'ని బోధించుటకేగాని ఉపలక్షించుటకు మాత్రము గాదు అనిన, అపుడు—

శ్లో॥ ఉపమేయం తు యద్వాచ్యం తస్యచేత్ ప్రతిపాదనే।
సవ్యాపారాగుణాస్తత్ర సర్వస్యోక్తిః సకృత్ శ్రుతౌ॥ 424

ఉపమేయం = పోల్పవలసినది = పరిచ్ఛేద్యము అగు, యత్ వాచ్యం = ఏ అభిధేయము కలదో, తస్య ప్రతిపాదనేతు=దాని, స్వరూపజ్ఞాపనమునందైతే, గుణాః సవ్యాపారాః చేత్= శ్యామ మున్నగు గుణవాచకములు పనిచేసినచో, తత్ర, సకృత్, శ్రుతౌ = అచట, గుణమున కొక పర్యాయమే శ్రవణమున్నను, సర్వస్య, ఉక్తిః భవతి = అంతకును, ఉపమానమునకును గుణ ప్రతిపాదనము సిద్ధించును.

తాత్పర్య వివరణములు— ఉపమానోపమేయములకు సాదృశ్యమునుబట్టి సంబంధ మును నియమించుటకు గదా గుణవాచకమును గ్రహించుట. అది వానిలో దేని సమీపమున నుచ్చరింపబడినను, సామర్థ్యమువలన, సర్వత్ర ఆ గుణసంబంధమును బోధించవలెను. కనుక బహ్వాపేక్ష. కాబట్టి, ఉపమానపదమును, గుణవచనమును, ఉపమేయమునే బోధించు నను పక్షము భాష్యమున సిద్ధాంతితము. ॥424॥

అవతారిక— ప్రకృత సందర్భమున మహాభాష్యమునందు, ఆక్షేప సమాధాన కార్తికములు రెండు గలవు. అందు—

''ఉపమానసమాసే గుణవచనస్య విశేషభాక్త్వాత్, - సామాన్యవచనా ప్రసిద్ధిః'' అనునది ఆక్షేప వార్తికము.

''ఉపమానాని సామాన్యవచనైః'' అను సూత్రముచే విధింపబడిన సమాస ముప మాన సమాసము. శస్త్రీశ్యామా మున్నగునది. ఇందు గుణవచనము శ్యామా శబ్దము. అది శస్త్రీ శబ్దముతో సంబంధించియున్నదిగాన విశేషవచనమగునుగాని సామాన్యవచన మెట్లగును? అని ఆక్షేపము. శస్త్రీగతమగు శ్యామత్వమును బోధించునది, ఆశ్రయాంతరగత గుణమును బోధింపజాలదు. కాగా సామాన్యవచనము కాదని భావము. ఈ విషయమును ప్రతిపాదించునది ఈ కారిక.

శ్లో॥ ప్రకారాధారభేదేన విశేషే సమవస్థితః ।
శబ్దాంతరాభిసంబంధే సామాన్యవచనః కథమ్ ॥ 425

ప్రకారాధార భేదేన = ప్రకారమును, ఆధారమును వేరగుటచేత, విశేషే, సమవస్థితః = విశేషమునందు, సంబద్ధమై యుండునది, శబ్దాంతరాభి సంబంధే = వేరొక శబ్దముతో సంబంధము కలిగినపుడు, సామాన్యవచనః = సామాన్యమును చెప్పునది, కథం భవతి = ఎట్లగును ?

తాత్పర్య వివరణములు— (శుక్లాది) గుణవచనములకు సామాన్యవచనత్వము, వెనుక, 385వ కారికలో, "సాధారణంధ్రువం ధర్మమ్" ఇత్యాదిగా ప్రతిపాదింపబడినది. కాని ఇచట నది ఏకగతముగా జెప్పబడుటచే నది సాధారణ మెట్లగునను నాక్షేపము సమంజసమే. గుణమున కాశ్రయమును నిష్కర్షించి చెప్పిన, ఆ ఆధారముచేత నవచ్ఛిన్నములై సామాన్యవచనములగును. అపుడున్న ఈ గుణము ప్రధానముగా అభిహితమయిన నిక నది ఉపమితి క్రియలో పనిచేయదు. ఆ విషయము వెనుక, 377 వ "ధర్మః సమానః శ్యామాదిః" అను కారికలో చెప్పబడినది.

గుణము సాధారణమగుటచేత ఉపమానోపమేయములకు తత్త్వమే = ఏకత్వమే ఆరోపింపబడినపుడు సామాన్యవచనమునకు ప్రయోగమే ఉండదు. అభేదోపచారమువలననో, మతుప్ప్రత్యయ లోపమువలననో ద్రవ్యసమానాధికరణముగ గుణవచనము ప్రయోగింపబడినఅపుడు సమానాధికరణ సమాసమునకు విషయము.

సామాన్యమనగా సాధారణ ధర్మము. దానిని ముందు చెప్పి, తరువాత నా ధర్మము కల దానిని చెప్పునది సామాన్యవచనమగును. అందు నియతమగు ఆధార సంబంధముండిన ఆధారభేద విశిష్టము గుణము. లేదా తనయందున్న ధర్మాంతర భేదమువలనను నగును. ఈ విషయము "గుణానామాశ్రయాద్భేదః" అను 372 వ కారికలో ప్రతిపాదితము. ఆ గుణవచనము ఉపమాన సంబద్ధమో ఉపమేయ సంబద్ధమో అయినపుడు విశేషవచనమె యగును గదా.

ఒకదానితో సంబంధించియున్నను, సామర్థ్యమువలన సంబంధము రెండవదానితోడను గలుగునని చెప్పియున్నారనుకొనుడు. కాని గుణవచనమనుటచే, ఆ వచన శబ్దము వలన, ఆ సంబంధ మభిధావ్యాపార గమ్యమే కావలెను. సామర్థ్య గమ్యమైన జాలదు అని భావము. కాగా సమాసము ప్రాప్తింపదని తేలినది.

ఒక శంక కలుగవచ్చును - "సమాసప్రవృత్తికి తరువాత విశేషబోధకమైనను, ముందు పదసంస్కారము నది ప్రతిబంధింపదుగదా" అని అట్లనదగదు. ఏలయనగా—

నిరంశమగు సమాసపదమును మనము అన్వాఖ్యానమునకై విభజించుచున్నాము. అపుడు వాని యర్థమునుబట్టిగదా పూర్వోత్తరపదములను గల్పింపవలెను ? అపుడు, విశిష్టార్థ వచనమైన శ్యామా శబ్దమునే మనము విభజింపవలెను. ఇపుడది సామాన్యవచనమే గాదు. విశేషవచనమే కాబట్టి ఆక్షేపము యుక్తమే అని తాత్పర్యము. ॥425॥

ఈ రెండింటిలో పారమార్థికద్రవ్యము, ఈ సముద్దేశమున 18 శ్లోకములచే నిరూపింపబడుచున్నది. వ్యావహారిక ద్రవ్యము ఈ కాండముననే 4 వ సముద్దేశమున నిరూపింప బడుచున్నది. ఈ రెంటికి ద్రవ్యసముద్దేశ (భూయో ద్రవ్యసముద్దేశ) మనియే భర్తృహరి నామకరణము చేసియున్నాడు.

అవతారిక— దార్శనికుల విభిన్నములగు దృక్పథముల ఊతగాగైకొని ద్రవ్యపదార్థమును పలు విధములుగా నిర్దేశించి, ఇపుడు కేవలము తన సిద్ధాంతము నాశ్రయించి ద్రవ్యపదార్థమును నిరూపించుచున్నాడు.

**శ్లో॥ సత్యంవస్తు తదాకారై రసత్యై రవధార్యతే।**
**అసత్యోపాధిభిః శబ్దైః సత్యమేవాభిధీయతే ॥ 2**

A. సత్యమ్ = సత్యమగు, వస్తు = వస్తువు, తదాకారైః = సత్యమగు పదార్థము యొక్క ఆకారమువంటి ఆకారముకల, అసత్యైః = అసత్యములగు వస్తువులచే, అవధార్యతే = నిశ్చయింపబడు చున్నది.

నిర్గుణబ్రహ్మమే సత్యము, అది జ్ఞానరూపము, ఆనందరూపము. దానిని నిజ రూపమున తెలిసికొనుట సాధ్యముకాదు. అట్టి సత్యమగు వస్తువు మాయావశమున సగుణముగా భాసించును. ఈ రెండవ రూపము అసత్యమే. కాని సాధకుడు ముందుగా అసత్యమగు సగుణమునే ఉపాసింపవలెను. అట్లు ఉపాసింపగా అవిద్య క్షీణింపగా సాధకుడు నిర్గుణ బ్రహ్మ భావమును బొందును. కాగా అసత్యములగు కల్పితరూపములు ముందుగా భాసించును. వానిని ఊతగా గైకొని విచారణచేయగా సత్యవస్తువు గోచరించును. అట్టి సత్యవస్తువే ఇచట ద్రవ్యముగా గ్రంథకర్తచే గుర్తింపబడినది. ఈ యాశయము *మహాభాష్యకారుడు స్పష్టపరచి యున్నాడు.

B. పై యాశయమునే వ్యక్తపరచుచున్నాడు.

అసత్యోపాధిభిః = అసత్యములగు ఉపాధులతోగూడిన అర్థమును బోధించెడి, శబ్దైః = శబ్దములచే, సత్యమ్ + ఏవ = సత్యమగుపదార్థమే, అభిధీయతే = చెప్పబడుచున్నది. జాతి, గుణము, క్రియ మున్నగు ఉపాధులను విడనాడి శబ్దములచే శుద్ధమగు అర్థము బోధింపబడునని భావము.

ఎల్ల శబ్దములకు పరమార్థ సత్యమగు శుద్ధ ద్రవ్యమును బోధించుటయందే ముఖ్య తాత్పర్యము. దానికి ఉపాయములుగా జాతి మున్నగునవి స్వీకరింపబడుచున్నవి. చివరకు వానిని పారద్రోలి శుద్ధ ద్రవ్యమునే బోధించును.

---

* 'సిద్ధే శబ్దార్థ సంబన్ధే' అను వార్తికమును వ్యాఖ్యానించుచు 'ద్రవ్యం హి నిత్యమ్, ఆకృతి రనిత్యా' అని భాష్యకారుడు పలికెను. 'అసత్యోపాధ్యవచ్ఛిన్నం బ్రహ్మతత్త్వ మిహ ద్రవ్య శబ్దవాచ్యమ్' అని కైయటుడు వ్యాఖ్యానించెను. దీని భావము పై భాగమున నున్నదే.

అవతారిక— "నవాశ్యామత్వస్యోభయత్రభావాత్, తద్వాచకత్వాచ్చ శబ్దస్య, సామాన్యవచనత్వ ప్రసిద్ధిః" అని పరిహారవార్తికము. తద్వివరణరూప మీ కారికాద్వితయము.

శ్లో॥ సాదృశ్యమాత్రం సామాన్యం ద్విష్ఠం కైశ్చిత్ ప్రతీయతే।
గుణో భేదేప్యభేదేన ద్వివృత్తిర్వా వివక్షితః॥ 426

శ్లో॥ వ్యాపారో జాతిభాగస్య ద్రవ్యయోర్వాభిధిత్సితః।
రూపాత్సామాన్యవాచిత్వం ప్రాగ్వా వృత్తేరుదాహృతమ్॥ 427

ద్విష్ఠమ్ = ఉపమానోపమేయ ద్వితయమునందున్న, సాదృశ్యమాత్రం = సాదృశ్యమే, సామాన్యం = సామాన్యముగా, కైశ్చిత్ ప్రతీయతే = కొందరిచే గ్రహింపబడుచున్నది, గుణః వా = లేదా, శ్యామత్వము మున్నగు గుణమే, భేదే సత్యపి = ప్రకార భేదమున్నను, అభేదేన = అభిన్నముగ = ఒక్కటిగా, ద్వివృత్తిః వివక్షితం = వాని రెండింటనున్నదిగా చెప్పదలంపబడినది.

ద్రవ్యయోః = ఉపమానోపమేయములందు, జాతిభాగస్య = 'గుణత్వ జాతి'- అను అంశమునకు, వ్యాపారః = సాదృశ్యమును తెలియచేయుట అను పని, అభిధిత్సితః = బోధించుటకు దలంపబడినది, రూపాత్ = రూప సాదృశ్యమువలన, సామాన్యవాచిత్వం = సామాన్య వచనమగుట కలుగును, అథవా, వృత్తేః = లేదా, సమాసవృత్తికి, ప్రాక్ తత్ = పూర్వమున్న, ఆ సామాన్యవచనత్వము, ఉదాహృతమ్ = ఉదాహరింపబడినది.

తాత్పర్య వివరణములు— సూత్రమునందున్న సామాన్య శబ్దమున కర్థము సాదృశ్యమే అని వివక్షితము. ఆ సాదృశ్యము భేద ఘటితము. అనగా వేరు పదార్థములకు అధిక ధర్మములు సమానములయినపుడుండునది. అది ఉభయ నిష్ఠము = ఉపమానోపమేయ ములు రెండింటియందు నుండుట దానికి స్వభావము. అందువలన, ఒక్క ఉపమానగతము గనేగాని, ఉపమేయమాత్ర గతముగాగాని అది చెప్పబడినను, అభిదయకు వ్యాపారమే దాని కుభయనిష్ఠతను జెప్పును

సామాన్యవచనమనగా, బహుపదార్థములందు గల ధర్మమును చెప్పునది మాత్రమే కాదు. రెండు వస్తువులందు గల సాదృశ్యమును దెలియచేయునదియు సామాన్య వచనమే. "న చావశ్యం స ఏవసామాన్యవచనో యోబహూనాం సామాన్యమాహ। ద్వయోరపి యః సామాన్యమాహ సోఽపి సామాన్యవచనః" - అని మహాభాష్యము.

అవతారికలో నిచ్చిన వార్తికము తాత్పర్యమును వ్యాఖ్యానించునది రెండవకారిక.

ఉపమానోపమేయముల గుణజాతి యనగా, వాని గుణములగు శ్యామాదులందుండు శ్యామత్వము మున్నగు వ్యాపక జాతి. అది వ్యాపారించుట అనగా, ఆ గుణముల అభేద ప్రతీతికి కారణమై, ఔపమ్య సంబంధమును దెలియచేయుట. ఆకృత్యమును తెలియజేయునదియే సామాన్యవచనముగా నిట వివక్షితము. పరిశీలింపగా, గుణజాతి సకలాశ్రయ గతమైనదై,

ఆశ్రయభేదముచే భిన్నమగుటవలన, ఉపమితి క్రియ కుపయోగింపబడదు' అని వెనుక చెప్పబడినది.

కాని అది తన ఆధారముల సూక్ష్మవిశేషముల ప్రతిఫలనముచేత, అవాంతర వ్యాప్యజాతి రూపమై ఉపమితి క్రియ కుపకరించును. "రూపాత్, సామాన్యవాచిత్వమ్" అని కారికలో నున్నది. అనగా ఉపమానోపమేయము లందలి గుణములకు రూపములో సాదృశ్య ముండుటవలన వాని నొక్కటిగా దీసికొని ఔపమ్య ప్రత్యాయనమును చేయుటచేత శ్యామాది శబ్దము సామాన్యవచనమగుట. గుణమును జెప్పు శబ్దము, అభేదారోపమువలన ద్రవ్యబోధక మును అగును. అందువలననే కారికలో "ద్రవ్యయోః" అనుట.

"ఇక ప్రాక్ వృత్తేః" – అను కారికా భాగ వివరణము – అన్ని శబ్దములును, వేరొక శబ్దముతో సంబంధించినపుడు విశేషవచనములే. అందువలన 'సామాన్యవచనైః' అను పదమునకు, అభిసంబంధమునకు బూర్వము సామాన్యవచన మర్థమని భాష్యము. అభిసంబంధ మనగా సమాసము. అభిముఖములై, అనగా పరస్పర మిశ్రితములయి పదార్థము లిందు సంబద్ధములై యుండునుగాన నిది అభిసంబంధము. ఇక నందు పదార్థ విభాగముండదుగదా. సమాసమునకు ముందు విగ్రహవాక్యమునగల సామాన్య బోధకతనుబట్టి సామాన్యవచన మనుట. వృత్తి, సంసృష్టార్థము. వాక్యము, అసంసృష్టార్థము. ఇట్లు విభిన్నములయినను రూప సామాన్యమువలన వాక్యధర్మములచేత, వృత్తిపదము అన్వాఖ్యానము చేయబడుచున్నది.

శ్యామాది పదములు సమాసమునం దుపమేయ సంబద్ధములు. కాని వాక్యమునం దట్టి అవరోధము లేదు. కనుక సామాన్యవచనములు. లేదా, భూతపూర్వగతిచే సామాన్య వచనములు. సామాన్యమును ఇపుడు కాకున్న, పూర్వము చెప్పియున్నదియు సామాన్యవచన మనుట. శస్త్రీ శబ్దమును అంతియే. అది వృత్తిలో, ఉపమేయబోధకము. భూత పూర్వగతిచేత నుపమానివాచి. ఈ విధముగ సామాన్యవచనత్వము ఉపపన్నము. ॥426, 427॥

*అవతారిక*— "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్య ప్రయోగే" (2-1-56) – అను సూత్రము, ఉపమేయవాచకమునకు ఉపమానవాచకములగు 'వ్యాఘ్ర', 'సింహ', 'సోమ' – మున్నగువానితో సమాసము ప్రవర్తించుననియు, సాధారణ ధర్మవాచక శబ్దమున కా వాక్యమునందు ప్రయోగమున్నయెడల ప్రవర్తింపదనియు విధించుచున్నది. ఉదాహరణ ములు, పురుషవ్యాఘ్రః, 'పురుష సింహః' 'నృసోమః' – మున్నగునవి. "పురుషః వ్యాఘ్ర ఇవశూరః" అను వాక్యమునందు పురుషవ్యాఘ్ర శబ్దములకు సమాసము కలుగదు. సామాన్య ధర్మమగు శౌర్యమును జెప్పు శూరపదమందు ప్రయుక్తముగదా.

ఈ సూత్రము సమానాధికరణాధికారమునందు విధింపబడినది. సమసించు పూర్వో త్తర పదములు ఏకాధికరణములు కావలెను. అందొకటి ఉపమానవాచకమును వేరొకటి ఉప మేయ బోధకమును అయినపుడు వ్యధికరణములగును గాన సమాసమునకు, పురుషో వ్యాఘ్ర ఇవ శూరః అనుచో ప్రాప్తియే లేదే అని ప్రశ్న. అట్లైన పురుషవ్యాఘ్రః అను నుదాహరణ

మున నెట్లు సమాసము ప్రవర్తించినది? అనియు ప్రతి ప్రశ్న కలుగును. ఈ విషయమును యథాభాష్యముగ విచారించిన కారికలు అయిదు. అందు మొదటిది—

శ్లో॥ వ్యాఘ్రశబ్దోయథాశౌర్యాత్ పురుషార్థేఽవతిష్ఠతే ।
తదాధికరణాభేదాత్ సమాసస్యాస్తి సంభవః ॥ 428

వ్యాఘ్రశబ్దః=వ్యాఘ్ర అను శబ్దము, శౌర్యాత్ = శూరత్వమను సాధారణ ధర్మమును తనలో నుంచుకొని, పురుషార్థే = అభేదారోపమువలన ఉపమేయమునందు, యదా = ఎపుడు, అవతిష్ఠతే = ఉండునో, తదా = అపుడు, అధికరణాభేదాత్ = అభిధేయభేదము లేనందున, సమాసస్య = సమానాధికరణాధికార విహిత సమాసమునకు, సంభవః అస్తి = సంభవ ముండును.

*తాత్పర్య వివరణములు*— వ్యాఘ్రమునకును పురుషునకు సమానమగు ధర్మము శూరత్వము. దానిని బుచ్చుకొని ఆ ఉపమానోపమేయముల కభేదము. కావున సామానాధికరణ్యమునకు లోపము లేదు. సమాసము ప్రవర్తించును. ॥428॥

*అవతారిక*— సమాన ధర్మవాచకమును వాక్యమున ప్రయోగించిన యెడల—

శ్లో॥ శూరశబ్దప్రయోగే తు వ్యాఘ్రశబ్దో మృగే స్థితః ।
భిన్నేఽధికరణే వృత్తేస్తత్ర నైవాస్తి సంభవః ॥ 429

శూరశబ్ద ప్రయోగేతు = 'శూరః' అను శబ్ద మా వాక్యమున ప్రయోగించిన, వ్యాఘ్ర శబ్దః = అపుడు 'వ్యాఘ్రః' - అను శబ్దము, మృగే = 'మృగజాతీయము' అను స్వార్థమునందే, స్థితః భవతి = వర్తించునదగును, పురుషుని బోధింపదు, భిన్నే అధికరణే = ఉపమేయము కంటె భిన్నమయిన దానియందు, వృత్తేః = వర్తించుటవలన, తత్ర = అచ్చట, సంభవః = సమాసము కలుగుట కవకాశము, న, ఏవ, అస్తి = ఉండనే ఉండదు.

*తాత్పర్య వివరణములు*— ఉపమేయమునందలి సామాన్యధర్మమగు శౌర్యమును స్వశబ్దమే అనగా 'శూరః' అను శబ్దమే చెప్పుచున్నది. ఇక వ్యాఘ్ర శబ్దము 'పులి' అను మృగజాతీయార్థమునే బోధించును ఉపమేయమును బోధింపదు. ఆ వాక్యమునందలి 'ఇవ' అనునది పురుషునకును వ్యాఘ్రమునకు గల ఉపమానోపమేయత్వమను భేద సంబంధమునే ద్యోతన చేయునుగాని యభేదమును చెప్పదు. కాగా సామానాధికరణ్యమే వానికి లేదాయె. సమానాధికరణ ప్రకరణమునందు విహితమయిన సమాసమునకు ప్రాప్తియే లేదు. ఇట్లుండగా నిక 'సామాన్యాప్రయోగే' - అను ప్రతిషేధ మెందులకు? అని భావము. ॥429॥

*అవతారిక*— ఈ కారిక ప్రతిషేధావశ్యకతను సమర్థించుచున్నది.

శ్లో॥ సామానాధికరణ్యేఽపి గుణభేదస్య సంభవాత్ ।
ప్రయోగశ్శూరశబ్దస్య సమాసేఽప్యనుషజ్యతే ॥ 430

సామానాధికరణ్యే సత్యపి = సామాన్యధర్మము నంతర్భవింపచేసికొని వ్యాఘ్ర శబ్దము పురుషుని చెప్పినపుడును, గుణభేదస్య = గుణమునకు భేదము, సంభవాత్ = సంభవింపవచ్చును గాన, శూరశబ్దస్య = 'శూరః' అను శబ్దమునకు, ప్రయోగః = ప్రయోగము, సమాసే అపి = సమాసమునందు గూడ, అనుషజ్యతే = ప్రసక్తమగుచున్నది.

తాత్పర్య వివరణములు— ఆ సమాన ధర్మము శూరత్వమే అని నియతముగ నిరూపించుటకు శూర శబ్ద ప్రయోగ మావశ్యకమే యగును. ఉపమానోపమేయములకు సామానాధికరణ్యము నుపపాదించుటకు అభేదాధ్యారోపము కావలెను. దానికి హేతువు సమానధర్మమగు నొక నియతగుణముండవలసి యున్నది. అంతర్భూతమగు గుణము శూరత్వమేయని చెప్పుటకు వీలులేదు. అది హింస్రత్వము కావచ్చును, లేదా బలవత్త్వము కానగును. ఇట్లు వ్యాఘ్రమునందు గుణభేదము సంభవముగాన నియమమునకై శూర శబ్దమును బ్రయోగింతురు. అపుడును ప్రాప్తమగుచున్న సమాసమును వాదించుటకు ప్రతిషేధ మావశ్యకమనుట. ॥430॥

అవతారిక— ఓయీ! 'సింహః' 'వ్యాఘ్రః' మున్నగు శబ్దములు పూజను దెలియజేయునవి 'శ్వా', 'కాకః' - మున్నగునవి గర్హను దెలుపునవియని యందురు గదా! 'పురుషవ్యాఘ్రః' అనినను, 'పురుషసింహః' - అనినను నట పూజాద్యోతకమగు గుణము శౌర్యమే అగును. వేరొకటి కానేకాదు. అట్టి యెడల అనియతగుణమునకు ప్రసంగమే లేదే - అనిన—

శ్లో॥ పూజోపాధిశ్చ యో దృష్టః కుత్సనోపాధయశ్చ యే ॥
తేషాం భిన్ననిమిత్తత్వాన్నియమార్థా పునః శ్రుతిః ॥ 431

యః = ఏ, పురుష, వ్యాఘ్ర మొదలగు, పూజోపాధిః = పూజకు ద్యోతకమయిన శబ్దము, దృష్టః = వాక్యమున జూడబడునో అదియు, యేచ = ఏవియు, కుత్సనోపాధయః చ = నిందకు స్ఫోరకములయిన శబ్దములు, దృష్టాః = చూపబడుచున్నవియో, తేషాం = అవి, భిన్ననిమిత్తత్వాత్ = వేరు వేరు కారణముగలవియగునుగాన, పునః శ్రుతిః = శూర మున్నగు శబ్దముల ప్రయోగము, నియమార్థా భవతి = నియమమునకై ఆవశ్యకమగును.

తాత్పర్య వివరణములు— పూజను ప్రతిపాదించునవిగా ఏ గుణములు ఉపమానమున నంతర్భూతములయి యుండునందురో ఆ గుణములు, ప్రకరణభేదముచే భిన్న భిన్నములయి యుండునుగాన నియతముగ గ్రహింపబడవు. అందువలన గుణవాచకమునకు ప్రయోగము తప్పదు. ఎట్లనిన జూడుడు. 'అభిమనాయతే' 'సుమనాయతే' 'దుర్మనాయతే' - అని క్యజ్ ప్రత్యయాంత ధాతురూపములు కలవుగదా. అట, 'మనాయ'-అనునది క్యజంతధాతువు 'సు, దుర్, అభి' - అనునవి ఉపసర్గ సమానాకారములయిన పూర్వపదములు. వాని యర్థముల నంతర్భవింపజేసికొనియే ప్రత్యయము ప్రవర్తించినది. అయినను విశేషాభివ్యక్తికొరకు వాని ప్రయోగ మనివార్యము.

'పురుషకాకః' - అను సమాసము నిందా ప్రతిపాదనపరము. నిందకు కారణములు, వానికిగల అశుచిభక్షణము, స్థిరముగ నొకచోట నుండకుండుట మున్నగునవి యనేకము లుండును. కావున నియతగుణ ప్రతిపాదనమునకు సామాన్య ధర్మవాచకమునకు ప్రయోగము తప్పనిది. కనుక నిషేధ మావశ్యకము. కాని అపు డుపమేయము సాపేక్షమగును గాన సమాసము ప్రాప్తింపదే. నిషేధ మెందులకు? అనిన నది యపుడు జ్ఞాపకార్థము. ॥431॥

*అవతారిక*— వైయధికరణ్యమువలన = సమానాధికరణత్వము లేనందున సామాన్య ధర్మవాచక ప్రయోగమునందు సమాసప్రాప్తి లేదనినను, సాపేక్షత్వమువలన నది ప్రాప్తింపదనినను, 'సామాన్యాప్రయోగే' అనునది వ్యర్థమయి జ్ఞాపకమగుననుచున్నారు.

**శ్లో॥ అసంభవేఽపి వా వృత్తేః స్యాదేతల్లింగ దర్శనమ్ ।**
**అచ్వేరితి యథాలింగమభావేఽపి భృశాదిషు ॥** 432

వృత్తేః = సమాసవృత్తికి, అసంభవేఽపివా = సంభవములేకున్నను, ఏతత్ = ఈ "సామాన్య ప్రయోగే" అనునది, లింగదర్శనమ్ = జ్ఞాపక ప్రదర్శనము, స్యాత్ = అగును, యథా = ఎట్లు, అభావేఽపి = చ్విప్రత్యయాంతమున క్యఙ్ప్రత్యయప్రాప్తి లేకున్నను, భృశాదిషు = భృశ - మున్నగువాని విషయమున, అచ్వేరితి = సూత్రమునందలి 'అచ్వేః' - అను పదము, లింగమ్ భవతి = అభూత తద్భావమునకు జ్ఞాపకమగునో అట్లు.

**తాత్పర్య వివరణములు**— అన్యాపేక్షగలది అసమర్థము, అంతియ కాదు వ్యధికరణమయినదియు నసమర్థమే. అట్టి అసామర్థ్యమున్నపుడు సమాసము ప్రవర్తింపదు. అయినను సామానాధికరణ్యము నూహించి, సమాస వారణమునకై చేయబడిన సామాన్యాప్రయోగే అనునది వ్యర్థము. కనుక నది జ్ఞాపకము.

ఏ విషయమునకు జ్ఞాపకమనిన– 'ప్రధానము సాపేక్షమయినను, అసమర్థము కాదు' - అను విషయమున కది జ్ఞాపకము. ప్రధానమయినది స్వతంత్రమయినది గనుక దానికి అనేక విశేషణముల యపేక్ష ఉండవచ్చును. అప్రధానమట్లు కాదు. అదియొక దానితో సంబద్ధమయినపుడిక వేరొకదానితో సంబంధింపదు. అట్లు సంబంధించినది అప్రధానమే కాదు ప్రధానమయినది తన కుపకారకములగు నెన్నింటితోనయినను నొక్కసారిగ సంబంధింప వచ్చును. అయ్యది దాని ప్రాధాన్యమునకు పోషకమే యగును. కావున న్యాయసిద్ధమగు నర్థమునకే ఇది జ్ఞాపకమని యర్థము. ఈ విధమగు జ్ఞాపకమునకు నిదర్శనము గలదు. "భృశాదిభ్యో భువ్యచ్వేర్లోపశ్చహలః" (3-1-12) అను సూత్రమొకటి గలదు. అది భృశ మున్నగు శబ్దములకంటె పరముగా, 'భవతి' అను నర్థమున క్యఙ్ప్రత్యయమును విధించుచున్నది. 'భృశాయతే' అని యుదాహరణము. భృశాదులు చ్విప్రత్యయాంతములయినపు డది రాకుండుటకు 'అచ్వేః' - అను నిషేధ మందు గలదు. చ్విప్రత్యయాంతమయిన, 'భవతి' అను నర్థ ముక్తమే యగును గాన నిక ప్రత్యయప్రాప్తియే లేదుగదా. కాని సంభావనను బట్టి ఆ నిషేధము చేయబడినది. అది చ్విప్రత్యయార్థమయిన, అభూతతద్భావముననే క్యఙ్ వచ్చునని జ్ఞాపకము చేయును. అనగా 'అభృశః' భృశః భవతి.

## "తేనతుల్యం క్రియాచేద్వతిః" అను సూత్రమున విచారము

*అవతారిక*—ఉపమాన ప్రసంగవశమున ప్రసక్తమగు విచారాంతరము చేయబడును.

శ్లో॥ వత్యన్తావయవే వాక్యే యదౌపమ్యం ప్రతీయతే ।
తత్ప్రత్యయవిధౌ సూత్రే నిర్దేశోఽయం విచార్యతే ॥ 433

వత్యన్తావయవే = వతి ప్రత్యయాంత శబ్ద మవయవముగాగల, వాక్యే = ''బ్రాహ్మణవధధీతే'' మున్నగు వాక్యమునందు, యత్ = ఏ, ఔపమ్యం = ఉపమానోపమేయభావ సంబంధము, ప్రతీయతే = అవగతమగుచున్నదో, తత్ప్రత్యయవిధౌ = ఆ ఔప్యమునకు ప్రతిపాదకమగు ప్రత్యయమును విధించిన, సూత్రే = ''తేన తుల్యం'' ఇత్యాది (5-1-145) సూత్రమునగల, అయం = ''తేనతుల్యం క్రియాచేత్'' - అనునీ, నిర్దేశః = వాక్యవిన్యాసము, విచార్యతే = పరీక్షింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— 'బ్రాహ్మణునివలె నధ్యయనము చేయుచున్నాడు' 'క్షత్రియునివలె యుద్ధమును చేయుచున్నాడు'. 'వైశ్యునివలె సంపాదన చేయుచున్నాడు' = ''బ్రాహ్మణవత్ అధీతే'' ''క్షత్రియవత్ యుధ్యతే'' ''వైశ్యవత్ అర్జయతి'' - ఈ వాక్యము లందు వత్యంతపదములు అవయవములు. ఇందు, ఉపమానోపమేయ భావము గోచరమగు చున్నవి. బ్రాహ్మణునివలె క్షత్రియు డధ్యయనము చేయుచున్నాడనిన. అధ్యయనమట సమాన ధర్మము. అది ఉపమేయవాచకమునకు సన్నిహితముగ, వినబడుచున్నది. కాని యది అర్థతః ఉపమానగతమును నగును. ఔపమ్యమునకు ప్రతిపాదకమగునది తత్ అను 'వతి' ప్రత్యయము. దానిని విధించిన సూత్రము ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' (5-1-115) అను సూత్రము. సూత్రమునందలి 'క్రియా' అనునది, ప్రకృత్యర్థమునకు విశేషణముగా నిర్దేశింపబడినదా ? ప్రత్యయార్థమా ? అని విచారము. అందేది న్యాయ్యము ? ఎట్లయిన లక్ష్యవ్యవస్థలో భేదము లేకుండును ? అను విషయమును నిర్ణయింపవలెనుగాన నీ విచారము ప్రసక్తము. అచట భాష్య మిట్లున్నది. ''ఇదమయుక్తం వర్తతే। కిమత్రాయుక్తమ్ ? యత్ తృతీయాసమర్థం క్రియా చేత్సా భవతీత్యుచ్యతే। కథం చ తృతీయాసమర్థం నామ క్రియా స్యాత్'' - అని. ''క్రియా'' అనునది తృతీయా సమర్థమునకు విశేషణమని యంగీకరించి చేసిన యాక్షేపమిది. భాష్యకారుని యాశయమేమి ? అని విచారము. ॥433॥

*అవతారిక*— ఆక్షేప తాత్పర్య మీ కారికలో వివరింపబడుచున్నది.

శ్లో॥ క్రియేత్యుపాధిః ప్రాథమ్యాత్ ప్రకృత్యర్థస్య యద్యపి ।
న ప్రాతిపదికం తత్ర క్రియావాచ్యుపపద్యతే ॥ 434

క్రియాఇత్యుపాధిః = సూత్రమునందలి ''క్రియా'' అను విశేషణము, యద్యపి = ఆలో చింపగా, ప్రాథమ్యాత్ = మొదట నుండుటవలన, ప్రకృత్యర్థస్య = వతి ప్రత్యయ ప్రకృతి యగు 'బ్రాహ్మణ' మున్నగుదానికి, భవతి = సంబంధించదగియున్నది, పరంతు = కాని,

తత్ర = అచ్చట, ప్రాతిపదికం = ప్రాతిపదికము, క్రియావాచి = క్రియను జెప్పునదియగుట, న ఉపపద్యతే = ఉపపన్నముగాదు.

**తాత్పర్య వివరణములు**— 'తృతీయాసమర్థము క్రియ అయినచో' అనుచున్నారు. కాని ఇది అయుక్తము. అది క్రియ ఎట్లగును? అనిగదా యాక్షేపము. 'సమర్థః పద విధిః (2-1-1) అను సూత్ర ప్రకారము పదసంబంధి విధులన్నియు సమర్థాశ్రితములై యుండ వలె. వతిప్రత్యయ విధియు నట్టిది. సామర్థ్యమనగా ప్రకృత్యర్థమునకు ప్రత్యయార్థ వ్యపేక్ష. ప్రకృత్యర్థ ముపమానము. ప్రత్యయార్థ ముపమేయము. 'తేన' అనుటచే ప్రకృతివాచకము కంటె బరముగానున్న తృతీయ సమర్థ విభక్తి. తృతీయా సమర్థమనగా 'బ్రాహ్మణేన' మున్నగునది. 'తేన' అనునది సూత్రమున ముందుగా నుండుటవలనను. క్రమమును దప్పింప పనిలేదు గావునను, దానికే క్రియా అనునది విశేషణమగునని, స్థాన ప్రమాణమువలన నిర్ణేయ మగుచున్నది. అపుడు, తృతీయా సమర్థము క్రియ యయినచో నని చెప్పబడకున్నను నది న్యాయప్రాప్తమగుటచే చెప్పినట్లే. అందువలన, 'ఉచ్యతే' అని భాష్యములో చెప్పబడినది.

తృతీయావిభక్తి, ద్రవ్యావాచియగు ప్రాతిపదికముకంటె విధింపబడును. అది క్రియావాచి గాదు. సాధింపబడునది క్రియ. అయ్యది తిజంతపద గోచరమగునది. కావున అసంభవమువలన తృతీయా సమర్థమునకు 'క్రియా' అనునది సంబంధింపదని తాత్పర్యము. తృతీయాంతమగు సమర్థ విభక్త్యంతము తృతీయా సమర్థము.

ప్రకృతమైన యర్థమును బోధించుటకు తగిన తృతీయావిభక్తి అంతమందు గలిగిన పదము తృతీయాసమర్థము విగ్రహవాక్యమున 'బ్రాహ్మణేనతుల్యమ్' అని యున్నది. ఇందు 'బ్రాహ్మణేన' అనునది తృతీయా సమర్థము. ॥434॥

**అవతారిక**— పోనిందు. విశేషణముగా జెప్పబడుట వ్యర్థము కాకుండుటకు తద్బలమువలన, తృతీయాసమర్థము క్రియావాచియగునందుమా యనిన—

**శ్లో॥ సత్త్వవృత్తస్య శేషే వా తృతీయా సాధనేఽపివా ।
తిజామసత్త్వవాచిత్వాదుభయం తన్నవిద్యతే ॥** 435

సత్త్వవృత్తస్య = ద్రవ్యమునందు వర్తించిన ప్రాతిపదికమునకు, శేషేవా = శేషసంబంధము నందుగాని, సాధనేఽపివా = క్రియాకారక సంబంధమునందుగాని, తృతీయాభవతి = తృతీయా విభక్తి ప్రత్యయము వచ్చును, తిజామ్ = తిజంతములు, అసత్త్వవాచిత్వాత్ = ద్రవ్యమును బోధించునవి కావుగాన, ఉభయం తత్ = శేషసంబద్ధ నిమిత్త విభక్తిగాని సాధన విభక్తిగాని, న విద్యతే = ఉండదు.

**తాత్పర్య వివరణములు**— సత్త్వమనగా ద్రవ్యము. 'సీదన్తి అస్మిన్ జాతిగుణ క్రియాః' అని వ్యుత్పత్తి. జాతికిని, గుణములకును, క్రియలకును ఆశ్రయమయినది అని యర్థము. అసత్త్వము, విభక్త్యర్థమునకు జేయు నుపకారమునుబట్టి దానికి వాచకమగు విభక్తి

నాశ్రయించును. ఉపకారమనగా నది క్రియాకారక సంబంధమును. తన్మూలకమగు శేష సంబంధమును గూడ నగును. ఎట్లనగా = అధ్యయనేన వసతి = చదువు కారణముగా నుంటు న్నాడు. 'దధ్నా జడః'= పెరుగుత్రాగుట మూలముగ మందుడు. 'తపసా కృశః'=తపస్సు చేత కృశించియున్నాడు. ''ధనేన కులమ్''=ధన నిమిత్తముగా నేర్పడిన కులము. ఈ స్థలములందు హేతు హేతుమద్భావము శేష సంబంధము. ''దాత్రేణ లునాతి'' =కొడవలితో గోయుచున్నాడు. 'పరశునా ఛినత్తి' = గొడ్డలితో నఱకుచున్నాడు - మున్నగుచోట్ల క్రియా కారక సంబంధమే తృతీయార్థము. ఈ రెండు సంబంధములును క్రియావాచకములగు తిఙంత ములకు సంభవింపవు. క్రియకు సాధ్యమగుట స్వభావము. ద్రవ్యమునకు సిద్ధత స్వభావము. కాగా క్రియావాచులు తృతీయా సమర్థములు కావు.

అయిన నొక ప్రశ్న గలదు. అసత్త్వవాచకమునకు కరణార్థమున తృతీయ ''కరణేచస్తోక కాల్పకృచ్ఛ్రకతిపయస్యాసత్త్వవచనస్య'' (2-3-33) అను సూత్రముచే, 'స్తోకేనముక్తః' మున్నగుచోట విధింపబడినదిగదా. కాగా ద్రవ్యభిన్నమయినదియు కరణము కావచ్చునే యనిన నట నది అల్పత్వరూప ధర్మమాత్రవచనము. ధర్మము ద్రవ్యమువంటిదే. క్రియ సాధ్యముగాని సిద్ధముగాదు. ॥435॥

*అవతారిక*— 'పాకః', 'యాగః' - మున్నగు భావఘఞంతములగు క్రియావాచక ములు తృతీయా సమర్థములు కానగుననిన—

**శ్లో॥ పాకాదయస్తృతీయాన్తాః సత్త్వధర్మ సమన్వయాత్ ।**
**న క్రియేత్యపదిశ్యన్తే కృత్వోఽర్థ ప్రత్యయే యథా ॥ 436**

తృతీయాన్తాః = తృతీయావిభక్త్యంతములగు, పాకాదయః='పాక' మున్నగునవి, సత్త్వధర్మ సమన్వయాత్ = ద్రవ్య ధర్మమగు సిద్ధత్వము కలవగుటవలన, క్రియా ఇతి = క్రియా వచనములని, కృత్వోఽర్థ ప్రత్యయే యథా = 'కృత్వసుచ్' మున్నగు ప్రత్యయముల విష యమునందువలె, న అపదిశ్యన్తే = వ్యవహరింపబడవు.

తాత్పర్య వివరణములు— సిద్ధావస్థలోనున్న ధాత్వర్థమును జెప్పునవి 'ఘఞ్' మున్నగునవి. క్రియ=సాధ్యావస్థలో నుండు ధాత్వర్థము. కనుక ఘఞంతాదులు క్రియాభిధాయు లని వ్యవహరింపబడవు. కనుకనే వానికి లింగసంఖ్య లున్నవి. కృదంతములచే అభిహితమయిన భావము ద్రవ్యమువలె భాసించునందురు = ''కృదభిహితో భావో ద్రవ్యవత్ ప్రకాశతే'' సిద్ధతగూడ క్రియాధర్మమే అందువలన 'ద్రవ్యమువలె' ననుట. అది సాధ్యముగాదు గనుక క్రియ కాకున్నను, భూతపూర్వ క్రియా సంబంధమువలన 'తద్ధర్మమ'ను వ్యవహారము మాత్రమే. అందువలననే ఘఞాద్యంతములగు పాకః మున్నగు శబ్దములతో నన్వయించు కృత్వసుజాద్యంత శబ్దములకు ప్రయోగములుండవు. 'పంచకృత్వః పచతి' అనునట్లు 'పంచ కృత్వః పాకః' అను ప్రయోగ ముపపన్నము గాదు. ''సంఖ్యాయాః క్రియాభ్యావృత్తి గణనే కృత్వసుచ్'' (5-4-17) అని సూత్రము. క్రియకు అభ్యావృత్తియనగా మరల మరల

ప్రవృత్తి. అది సాధ్యమగు క్రియకే సంభవించును. ఘఞాది ప్రత్యయాంతములతో నన్వయించు కృత్వసుజాది ప్రత్యయాంత శబ్దముల ప్రయోగములు లేనందున. 'పాకః'-మున్నగునవి క్రియావచనములు కావని నిశ్చితమయినట్లే. అంతటను వానికి క్రియావాచితా వ్యవహారము లేకుండుట న్యాయప్రాప్తము. ॥436॥

అవతారిక— 'తుమున్' అను ప్రత్యయము స్వార్థమునందు విధింపబడినది. స్వార్థమనగా ధాత్వర్థము = క్రియ. తుమున్నంతము కృదంతముగాన ప్రాతిపదికము. క్రియావాచి. కనుకనే ''పంచకృత్వః గన్తుమ్'' అని తద్యోగమున 'కృత్వసుచ్' ప్రత్యయ మగపడు చున్నది. ఆ విధముగనే 'ద్విః భుక్త్వా' = రెండు పర్యాయములు భుజించి - మున్నగు ప్రయోగములందును కృత్వోర్థ ప్రత్యయ మగుపడుటవలన క్త్వా ప్రత్యయాదులును సాధ్య క్రియా వచనములు గలవుగదా యనిన—

శ్లో॥ యేచావ్యయ కృతః కేచిత్ క్రియాధర్మ సమన్వితాః ।
తేషామసత్త్వవాచిత్వం తిజన్తైర్న విశిష్యతే ॥ 437

యే చ = ఏయవి, కేచిత్ = కొన్ని, అవ్యయకృతః = అవ్యయసంజ్ఞా ప్రయోజక కృదంతములు, క్రియాధర్మ సమన్వితాః = క్రియాధర్మమగు సాధ్యత్వముతో గూడినవి, సన్తి = కలవో, తేషాం = వానికి, అసత్త్వవాచిత్వం = ద్రవ్యార్థవాచులు కాకుండుట, తిజన్తైః = తిజంత శబ్దములతో, న విశిష్యతే = భేదింపదు, (అనగా తత్తుల్యమే యనుట).

తాత్పర్య వివరణములు— తుమున్నంతములు, క్త్వాంతములును అవ్యయములు. కావున వాని నవ్యయకృత్తులందురు. అవి సాధ్యస్వభావ క్రియాధర్మములు కిలవి. ఆఖ్యాత తుల్యములే. తిజంత పదములకు తృతీయా ప్రత్యయములు లేనట్లు వానికిని నవి యుండవు. కావున నవి తృతీయా సమర్థములు కావు. ప్రాతిపదికార్థమున ప్రథమా విభక్తి ప్రత్యయములు వానికిని రావచ్చును. ॥437॥

అవతారిక— పోనిండు. కృత్యప్రత్యయ వాచ్యమగు క్రియ క్రియాంతరమునకు సాధనమగును. కావున 'శయితవ్య' మున్నగునవి, తృతీయాంతములు సంభవించవచ్చునుగదా యనిన—

శ్లో॥ కృత్వసుజ్విషయా యాపి శయితవ్యాదిషు క్రియా ।
ఉపమానోపమేయత్వం తత్రాత్యన్తమసంభవి ॥ 438

యా అపి = ఏ యదియు, కృత్వ సుజ్విషయా = కృత్వ సుజంతము లన్వయించు, శయితవ్యాదిషు = 'శయితవ్య' మున్నగువాని యందలి, క్రియా = క్రియ గలదో, తత్ర = అందు, ఉపమానోపమేయత్వం = ఉపమానోపమేయ భావము, అత్యంతం = ఎంతమాత్రమును, అసంభవి = సంభవింపనిది.

తాత్పర్య వివరణములు— ''పంచకృత్వః శయితవ్యమ్'' = అయిదుసార్లు శయనింపదగి యుండుట - అని యనుట గలదు. అందువలన శయితవ్యాదులందు క్రియ సాధ్యస్వభావమే. కాని ఆ విషయమున నుపమానోపమేయ భావమునకు సంభవము లేదు. ''శయితవ్యేన తుల్యః దేవదత్తః'' = నిద్రింపదగుటతో దేవదత్తుడు సమానుడు - అని యిట్లు వ్యవహారములు లేవుగదా. కాబట్టి శయితవ్యవంటి క్రియావాచి తృతీయాంతములు వతిప్రత్యయమునకు ప్రకృతులనుట సమ్మతము గాదు.

ఇచట ధాతువే సాధ్యావస్థలోని క్రియను దెలియజేయునది గదా. తదతిరిక్తమగు ప్రత్యయవాచ్య క్రియ యింక నేది గలదు? ''తయోరేవ కృత్యక్తఖలర్థాః'' (3-4-70) అను సూత్రముచే భావకర్మార్థములందే కృత్య ప్రత్యయములు విహితములు గదా. కావున నిట భావమనగా ధాతువాచ్యమగు భావనయే. అదియే క్రియ యనియు వ్యవహరింపబడును గదా యని శంక కలుగును - దానికిట్లు సమాధానము.

కృదంత స్థలములందు, ధాతువు, వర్తమానమయిన భావ్యత్వముగల క్రియను బోధింపదు. అనగా ప్రస్తుతము జరుగుచున్న దానిగా జెప్పదు. వేరొక యవస్థలో జరిగిన దానినే చెప్పును. ఆ క్రియ, తత్సాధనమైన కారకమునకు అవచ్ఛేదకము. కారకము ప్రత్యయార్థము. తత్సంబంధమువలన క్రియకు భావ్యత వ్యజ్యమానము - 'పచతి దేవదత్తః' = 'దేవదత్తుడు వంట చేయుచున్నాడు; అందుము ఇట లకారార్థము కర్త వాని సంబంధమువలన ధాత్వర్థమగు వర్తమాన పచిక్రియ భావ్యము. అట్లే 'పాచకః' అను కృదంత స్థలములందును గమనీయము. 'ఆస్యతే దేవదత్తేన' = దేవదత్తుడు ఉండుట. ఇట లకారార్థము భావన. తత్సంబంధము వలన ధాత్వర్థమునకును భావ్యత. కాగా, ప్రకృతి వాచ్యమగు భావము వేరు. లకారవాచ్యము వేరు. కృత్య ప్రత్యయాంతములందును, క్త్వాప్రత్యయాంతములందును, ప్రత్యయార్థమగు భావము వేరు. అది బాహ్యము. ॥438॥

అవతారిక— ఉపమానోపమేయ భావము, 'శయితవ్య' మున్నగు కృత్య ప్రత్యయాంత వాచ్య క్రియతో నత్యంతమసంభావితమంటిరే? ఎందువలన—

**శ్లో॥ న కేవలౌ ద్రవ్యగుణౌ తద్వాన్వాప్యుపమీయతే।**
**శయితవ్యాదిభిస్తేషు నోపమార్థోఽస్తికశ్చన॥ 439**

శయితవ్యాదిభిః = 'శయితవ్య' మున్నగు పదములకు వాచ్యములగు క్రియలతో, కేవలౌద్రవ్యగుణౌ = కేవల ద్రవ్యముగాని కేవల గుణముగాని, తద్వాన్ వా అపి = లేదా ద్రవ్యవత్తుగాని గుణవత్తుగాని, న ఉపమీయతే = పోల్పబడదు, తేషు = వానిలో, ఉపమార్థః=సాదృశ్యనిమిత్తమైన అన్వయి ధర్మము, కశ్చ న = ఏదియు, న అస్తి = లేదు.

**తాత్పర్య వివరణములు**— 'శయితవ్యమ్' - అనగా శయన క్రియ. తత్తుల్యుడు దేవదత్తుడు అని వివక్షించి, ''శయతవ్యేన తుల్యో దేవదత్తః'' అని ఎవరును ప్రయోగింపరు.

ఉపాధులు లేనిచో శబ్దము శుద్ధ ద్రవ్యమును బోధింపజాలదు. ఈ యభిప్రాయము సంబంధసముద్దేశమున 52, 53, 54 శ్లోకములలో స్పష్టము కాగలదు. ఉపాధులు శబ్దవాచ్యములు కావు, బోధవిషయములు కూడ కావు. ॥2॥

*అవతారిక*— జాతి, గుణము మున్నగు ఉపాధుల యందు శబ్దమునకు తాత్పర్యములేనియెడల అవి ఉపాధులేకానోపవు. శబ్దమునకు వాచ్యములుకానివి ఉపాధులు కానేరవుకదా! అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ అధ్రువేణ నిమిత్తేన దేవదత్తగృహం యథా ।**
**గృహీతం గృహశబ్దేన శుద్ధమేవాభిధీయతే ॥ 3**

యథా = ఏరీతిగా, దేవదత్తగృహమ్ = దేవదత్తునియిల్లు, అధ్రువేణ = అస్థిరమగు, నిమిత్తేన = నిమిత్తముచే, అనగా కాకము మున్నగు పదార్థముచే, గృహీతమ్ = తెలియబడినది అయినను, గృహశబ్దేన = గృహ అను శబ్దముచే, శుద్ధమ్ + ఏవ = శుద్ధమైనదే, అనగా కాకముయొక్క సంబంధము లేక కేవల గృహమే, అభిధీయతే = చెప్పబడుచున్నదో, (తథా) = అట్లే శబ్దముచే సత్యమగు పదార్థమే చెప్పబడునని 1 వ శ్లోకార్థముతో నన్వయము చూపవలె.

ఒక మనుష్యుడు గ్రామాంతరము వెడలి అచట 'దేవదత్తుని గృహమేది?', అని అడుగగా 'అదిగో కాకి యున్నది దేవదత్తుని యిల్లు' అని గుర్తు చెప్పుదురు. అచట కాకము ఉపాధి, అనగా దేవదత్తుని గృహమును తెలుసుకొనుటలో సహకరించినది. ఇతరుల గృహముల నుండి దేవదత్తుని ఇంటిని వేరుగా చూపు నిర్ణయమున కారణమైనది. ఇంతియేకాని గృహశబ్దమునకు కాకము వాచ్యార్థము కాదు. కాకము యొక్క ప్రసక్తి లేకుండగనే గృహ శబ్దము శుద్ధమగు - అనగా కాక సంబంధములేని - ఇంటినే బోధించును.

ప్రకృతమున గూడ జాతి, గుణము, క్రియ, సంఖ్య మున్నగు ఉపాధులు ఘట శబ్దమునకు వాచ్యార్థములు కానేరవు. ఘటత్వజాతి నలుపు మున్నగు గుణములు, చలనము మున్నగు క్రియ, ఏకత్వము మున్నగు సంఖ్య, ఇవియన్నియు కాకమువలె ఇతరవస్తువుల కంటె ఘటమును వేరుచేసి ఆ వ్యక్తినే బోధ విషయముగా చేయగలవు.

ఇట్టి దృష్టాంతములు చాల కలవు 'దేవదత్తుడు ఎవడు'? అను ప్రశ్నకు, 'తెల్లని పంచ కట్టుకొన్నవాడు దేవదత్తుడు' అని గుర్తు చెప్పను. ఇచట వస్త్రము ఉపాధి. ॥3॥

*అవతారిక*— 'కాకవద్దేవదత్త గృహమ్' (కాకముకలది దేవదత్తుని యిల్లు) అనునది ప్రకృతమునకు దృష్టాంతము కానేరదు. ఏలయన— కాకము గృహముకంటె మిక్కిలి విజాతీయమగు వస్తువు. గృహముపై కాకము నిలిచియున్నను ఆ రెంటికి భేదము స్పష్టముగా భాసించును. వానిని వేరుచేయుట సుకరము. కాబట్టి కాకము గృహశబ్దమునకు వాచ్యార్థము కానేరదు. 'ఘటత్వజాతి' గుణము మున్నగునవి కాకమువంటివి కావు. వానిని ద్రవ్యముకంటె

ద్రవ్యమునకును క్రియకును నుపమానోపమేయ భావము అసంభవి. అటులనే 'శయితవ్యేన తుల్యం స్థౌల్యమ్' అని గుణమును క్రియతో పోల్పము. ద్రవ్యమున కాశ్రయమగునదియు క్రియతో బోల్పబడదు. 'శయితవ్య తుల్యము దేవదత్తుని స్వత్వము' - అను వ్యవహారమున లేదు. 'శయితవ్య తుల్యుడు స్థూలుడు' - అని గుణికిని క్రియకును నౌపమ్యము ఎచ్చటను లేదు. సాదృశ్య హేతువగు ధర్మము లేకుండుటయే కారణము. ప్రసిద్ధమయిన గుణమో క్రియయో ఉపమానోపమేయ భావమునకు నిమిత్తము, చంద్రునకును ముఖమునకునువలె నేదేని యుండవలెను గదా. పై వ్యవహారములలో నట్టి ప్రసిద్ధి లేదు. ॥439॥

*అవతారిక* — క్రియకును ద్రవ్యగుణములకును సమానధర్మము లేకపోలేదు. కాని అది వాక్యమునందు ప్రయోగింపబడదు. అందువలన నుపమానోపమేయభావ ప్రతీతి కలుగ లేదు, అని యందురేని అది యుక్తము గాదు. ఔపమ్యమున కుపపత్తియే లేదుగదా.

**శ్లో॥ ఉపమానోపమేయత్వే ద్రవ్యేచానుక్త ధర్మిణి ।**
**నిమిత్తత్వేన గమ్యన్తే రూఢయోగాః క్రియాగుణాః ॥ 440**

అనుక్త ధర్మిణి = అభిహితము కాని సదృశ ధర్మముగల, ద్రవ్యే చ = ద్రవ్యమునందును, ఉపమానోపమేయత్వే = ఉపమానోపమేయ భావమునందు, రూఢయోగాః = నిరూఢమయిన సంబంధము గల, క్రియాగుణాః = క్రియలును గుణ్యములును, నిమిత్తత్వేన = ఉపమానోపమేయ భావమునకు నిమిత్తముగా, గమ్యన్తే = ప్రతీయమానము లగును.

తాత్పర్య వివరణములు— సాదృశ్య ప్రయోజకమగు ధర్మము, వాక్యమున చెప్పబడకపోయినను, ప్రసిద్ధివలన, పదార్థమునం దేకదేశములా ఇవి యనునట్లు అవినా భూతములయి క్రియానిమిత్తకములును గుణనిమిత్తకములునునగు సంబంధము లుపమానోప మేయములకు ప్రతీతములగును. ముఖము చంద్రుని బోలియున్నదనిన, కాంతిమంతమని చెప్పనక్కఱలేదు. ఆ ఉపమానోపమేయభావము ప్రసిద్ధము. "శయితవ్యముతో తుల్యము" అనిన నట్లేదియు ప్రతీయమానమగుట లేదు. ఎందువలన? ఆ ఔపమ్యమనుపపన్నము గనుక. అనుట. ॥440॥

*అవతారిక* — పోనిండు. క్రియతో క్రియావత్తు పోల్పబడనగునే యనిన—

**శ్లో॥ హోతవ్య సదృశో హోతేత్యత్రా ప్యర్థో న విద్యతే ।**
**విరోధాత్ క్రియయా తస్మాత్ క్రియావాన్నోపమీయతే ॥ 441**

హోతవ్య సదృశః హోతా = హోమ క్రియాతుల్యుడు హోత, ఇత్యత్రాపి = అనుచో గూడ, అర్థః = ఉపమా ప్రయోజనము, న విద్యతే = లేదు, కుతః? = ఎందువలన ననగా, విరోధాత్ = విరోధముండుట వలన, తస్మాత్ = ఆ హేతువులన, క్రియయా = క్రియతో, క్రియావాన్ = ఆ క్రియ కాశ్రయ భూతమగునది, న ఉపమీయతే = పోల్పబడదు.

తాత్పర్య వివరణములు— "శయితవ్యేన తుల్యః శాయకః = పండుకొనుటతో దుల్యుడు పండుకొనువాడు.

"హోతవ్యేన తుల్యః హోతా" = హోమసమానుడు హోత - అని యిట్లు కృత్య ప్రత్యయాంత క్రియావాచకముతో క్రియాశ్రయుని బోల్చుట యుక్తము గాదు. క్రియకు స్వభావము సాధనీయత = చేయదగిన పనియై యుండుట. క్రియావంతము సిద్ధ స్వభావము. ఇట్లు పరస్పర విరుద్ధములగుటవలన వానికి సమాన ధర్మయోగము సంభవింపదు. అత్యంత భిన్నములగు క్రియా ద్రవ్యములకు ఔపమ్యము నుపపాదించుట ప్రయోజన విరహితము.॥441

అవతారిక— అట్లయిన రెండు క్రియల కుపమానోపమేయభావ ముండునాయనిన—

**శ్లో॥ క్రియా సమానజాతీయా తద్భావాన్నోపమీయతే ।**
**జాతిభేదేఽపి పాకేనభిన్నాః పాకాదయః క్రియాః ॥ 442**

సమాన జాతీయా క్రియా = సమానమగు జాతికి చెందిన క్రియ, తద్భావాత్ = తత్త్వము వలన = ఐక్యమువలన ననుట, న ఉపమీయతే = ఒకదానితో నొకటి ఉపమింపబడదు, జాతిభేదే సత్యపి = జాతిభేద మున్నపుడును, భిన్నాః = భిన్న భిన్నములగు, పాకాదయః = పాకక్రియ మున్నగు, క్రియాః = క్రియలు, పాకేన = పాక క్రియతో నొక పాకక్రియగా, న ఉపమీయన్తే = ఉపమింపబడవు.

**తాత్పర్య** వివరణములు— ఒకేజాతికిచెందిన క్రియ లయినచో నందొకటి వేరొక దాని కుపమానము గాదు. అపుడు వానికి ఐక్యమే ఆయె. ఔపమ్యమునకు భేదమును నభేద మును నావశ్యకములు. "శయితవ్యేన తుల్యం శయితవ్యమ్" = పండుకొనదగుటతో తుల్యము పండుకొనదగుట - అధ్యేతవ్యేన తుల్య మధ్యేతవ్యమ్" = అధ్యయన క్రియతో సమానమైనది అధ్యయన క్రియ - అని యిట్లౌపమ్యము నుపపాదించుట కేమి యర్థము ? అత్యంతాభేద మున్నపుడు, 'గోవువంటిది గోవు' అని యనరుగదా ! భాష్యకారుడు - 'యది యదేవోపమానం తదేవోపమేయం క ఇహ ఉపమార్థో గౌరివ గారితి' - అని చెప్పినది ఈ అభిప్రాయముతోడనే. భిన్నములైన పదార్థములయినను నేకజాతీయములగుట వలన, జాతిభేద నిమిత్తకమయిన ఉపమానోపమేయభావము వానికి ఘటింపదని భావము.

ఆ విధముగనే అత్యంతభేదముగల పదార్థములకును నయ్యది నిష్ప్రయోజనము. "వక్తవ్యేన తుల్యం పఠితవ్యమ్" = చెప్పబడుట, చదువబడుట తుల్యములు - అని వ్యవహ రింపరు. సమానధర్మమున కట సంభవముండదు. "అథాన్యదుపమాన మన్యదుపమేయం క ఇవోపమార్థో గౌరివాశ్వ ఇతి" - అని భాష్యము. ఉపమానోపమేయము లత్యంతభిన్నములయిన గోవువంటి దశ్వమనుటలో నర్థమేమి ? "ఉపమానోపమేయత్వం తత్రాత్యంత మసంభవి" - అని 438 వ కారికలో చెప్పబడినది.

ఇక క్రియతో ద్రవ్యగుణాదులకు, వానియందుగల సత్త్వము. జ్ఞేయత్వము,

గోచరమగునో, తత్ర = ఆ విషయమునందు, అనపేక్షస్య = సాపేక్షముగాని, సామర్థ్యాత్ = దానికి, వృత్తిః = ఏకార్థీభావమను సామర్థ్యమువలన గలుగు తద్ధిత వృత్తి, ప్రసజ్యతే = ప్రసక్తమేయగును.

**తాత్పర్య వివరణములు**— "అధ్యేతవ్యేన సదృశమధ్యేతవ్యమ్" అనియే చెప్పినను, ఆ అధ్యయనమున కాశ్రయభూతులగు బ్రాహ్మణ క్షత్రియాదులకు సామర్థ్యమువలన ప్రతీతి కలుగును. లేదా ప్రకరణమువలన నది సిద్ధింపవచ్చును. అపుడు సాపేక్షత వేరుగాన తద్ధితవృత్తియగు వతిప్రత్యయాంత ప్రయోగము సంభవించును.

మరియు - 'బ్రాహ్మణానాం' అనియు, 'క్షత్త్రియాణాం' - అనియు వ్యస్తపదములుగా గాక 'బ్రాహ్మణాధ్యేతవ్యే న తుల్యం క్షత్త్రియాధ్యేతవ్యమ్' - "రాజశయితవ్య సదృశమ్, దేవదత్త శయితవ్యమ్" అని సమాసముచేసి ప్రయోగించిన, ఏకార్థీభావమువలన నిక సాపేక్షత యుండదు. ఆ విధముగనే - "స్థాతవ్యేన తుల్యం గమనం, మందత్వాత్" = మందముగ నుండుటవలన నీ నడక నిలుకడతో తుల్యముగ నున్నది. "నృత్తే న తుల్యం గమనం బహువికారత్వాత్" = చాల వికారములు గలదై యుండుటవలన నడక నాట్యమువలె నున్నది - అను వ్యవహారములలో, భిన్న జాతీయములగు స్థాన గమన క్రియలకును, నృత్త గమన క్రియలకును నుపమానోపమేయభావ మగపడుచున్నది.

కృత్ప్రత్యయములచే అభిహితమయిన భావము ద్రవ్యమువలె భాసించునని చెప్పబడినది. అంతియకాదు. అది క్రియవలెగూడ భాసించును. "తుమున్ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్" (3-3-10) అని సూత్రము. ఒక క్రియ కింకొక క్రియ ప్రయోజనమయి, తద్వాచక క్రియాపదము సమీపమున నుచ్చరింపబడినపుడు తుమున్, ణ్వుల్ అను ప్రత్యయములు భవిష్యదర్థమున, ధాతువునకు బరముగానగునని యర్థము. కృష్ణం ద్రష్టుం యాతి. 'కృష్ణం దర్శకో యాతి' - అని యుదాహరణములు. 'భోక్తుం పాకః' = భుజించుటకు పాకము అనియు, 'భోక్తుం పచతి' - అని తిఙంత ముపపదముగ నున్నప్పుడువలె, తుమున్ ప్రత్యయ ప్రయోగము కలదు. అట్లే 'బోద్ధుం పాఠః', 'కారకస్య గతిః' అనియు ప్రయోగములు దృష్టములు. ఇట 'పాకః పాఠః గతిః' - అను కృద్వృత్తులచే అభిహితమయిన భావము క్రియవలె భాసించిననే, వానికి ఉపపత్తి.

ఇట క్రియకు వాచకములు, ధాతు భాగమును, ప్రత్యయభాగమును గూడ నగుచున్నవి గదా. కాగా ధాతువాచ్య క్రియ నాశ్రయించియే తుమునాదులు ప్రవర్తించుననరాదా యనిన నట్లన గాదు. క్రియార్థమయిన క్రియ అనగా భోజనార్థమయిన పాక క్రియ గదా. ఆ పాకము, సిద్ధమయినదే భోజనార్థమగును కావున ప్రత్యయవాచ్య క్రియయే తుమునాదులన్వయించుటకు యోగ్యము.

అటులైన, "భోక్తుం పాకః" అనునట్లు, "పంచకృత్వః పాకః" - అయిదు పర్యాయములుగా పాకము - అని యిట్లు ఏల ప్రయోగింపరాదు ? అనిన - క్రియయొక్క

అభ్యావృత్తి గణనమున 'కృత్వ సుచ్' ప్రత్యయము విధింపబడినదిగదా. అభ్యావృత్తి యనగా మరల మరల ప్రవృత్తి. అయ్యది కర్తవ్యమాపమగు క్రియయేగాని సిద్ధమయిన దానికి సంభవింపదు. అందు తిజన్తశబ్దము ప్రయోగింపబడిన, క్రియ కర్తవ్యరూపమని దెలియునుగాన నా ప్రత్యయము సంభవించినను నవిలేనిచో రాదు. ''పంచకృత్వః పాకోభవతి'' అనుడు. అది న్యాయ్యమగు ప్రయోగపగును. భవతి అను తిజంతమచట సాధ్యస్వభావమగు క్రియను బోధించునుగాన దానికి అభ్యావృత్తి ససంభవము.

సరి. 'ఓదనస్య పాకః' అనుచో సమన్వయమెట్లు? ప్రత్యయార్థమగు సిద్ధతకు సాధనమగు ఓదనముతో సంబంధ ముపపన్నము గాదుగదా? సాధ్యస్వభావమగు క్రియ అయిననే దానికి కారక సంబంధము కలుగును. అనిన - సత్యమే యనుకొనుడు. కాని ప్రత్యయార్థమునకు అచట అప్రధానమయిన ధాత్వర్థము ద్వారా కారకసంబంధ ముపపాద్యము. అభ్యావృత్తితో సంబంధమును గూడ నా విధముగ నేల యుపపాదింప రాదందురేమో? వినుడు. ప్రధానమయి దానికి ఇతరార్థములతో సంబంధము, స్వస్వభావమునకు విరుద్ధమయిన ధర్మము ద్వారమున గలుగదు. ఘఞర్థమగు క్రియయొక్క సిద్ధతకు అభ్యావృత్తి విరుద్ధమయినది. సిద్ధమయిన, మరల మరల ప్రవృత్తి యెట్లు కలుగును? సాధనములతో = కారకములతో సంబంధము అప్రధాన ద్వారమున, విరోధము లేనందున గలుగవచ్చును అని తాత్పర్యము. ॥444॥

అవతారిక— ఈ విధముగ ఘఞ్ మున్నగు కృదంతముల సంబంధ మున్నపుడును క్రియాశ్రయములగు తుమున్ప్రత్యయాది కార్యములు అగపడుచుండుటవలన తద్వాచ్య క్రియ తృతీయాంత పదవాచ్యము ఉపమానముగా సంభవించును. ''తైల పాకవత్ ఘృత పాకః = నూనె వంట వంటిది నేతివంట - అను నీ మున్నగు ప్రయోగములును వతిప్రత్యయాంతములు గలవు. తైల పాక ఘృతపాక పదములు సమస్త పదములుగాన సాపేక్షత్వము లేదు. సామర్థ్యము నిర్బాధము. కృదభిహితమగు భావమునకు ద్రవ్యవాచకమునకువలె లింగ సంఖ్యా సంబంధమును నుపపన్నమే యనుచున్నారు.

శ్లో॥ తైలపాకేన తుల్యే చ ఘృతపాకే వివక్షితే।
క్రియావదపి కార్యాణాం దర్శనాత్ప్రత్యయో భవేత్॥ 445

తైలపాకేన = నూనెవంటతో, తుల్యే = సమానమైనదిగా, ఘృతపాకే = నేతివంట, వివక్షితే చ = వివక్షితమైనపుడును, క్రియావత్ = ద్రవ్యమువలెనే గాక క్రియవలె గూడ ఘఞంతమున, కార్యాణాం = తుమున్ మున్నగు కార్యములు, దర్శనాదపి = అగపడుటవలనను, ప్రత్యయః వతి ప్రత్యయము, భవేత్ = వచ్చును.

తాత్పర్య వివరణములు— తాత్పర్యము సుగమము. ॥445॥

అవతారిక— ఘఞాద్యంతభావ ప్రత్యయాంతము లుపపదములై యున్నపుడు

తుమున్, ణ్వుల్, మున్నగు కార్యములు క్రియాయోగమునందువలె ప్రవర్తించునను విషయము నకు వార్తికమతమును సంవాదకము.

శ్లో॥ అతిఙ్గ్రహణమేవం తు సమాసస్య నివర్తకమ్ ।
గమనం కారకస్యేతి ణ్వుల్యన్యస్మిన్న సంభవేత్ ॥ 446

ఏవమ్ = ఈ ప్రకారము, 'కారకస్య గమనమ్' = 'కారకస్య' 'గమనమ్', ఇతి = అను పద ములకు, సమాసస్య = ఉపపద సమాసమునకు, నివర్తకం = ప్రతిషేధకము, అతిఙ్ గ్రహణం భవతి = "ఉపపదమతిఙ్" (2-2-19) అను సూత్రమునందలి అతిఙ్ అనునది యగు, తత్ = అది, అన్యస్మిన్, ణ్వులి = వేరొక ణ్వుల్ప్రత్యయమైన, న సంభవేత్ = సంభవింపదు.

తాత్పర్య వివరణము— 'ఉపపదమతిఙ్' (2-2-19) అను సూత్రము ఉపపద మునకు సమాసమును విధించునది. ఉపపదమనగా ప్రత్యయవిధాయక సూత్రములందు సప్త మ్యంత పదముచే చెప్పబడినది. "కుంభకారః" అను సమాస ముదాహరణము. 'కర్మణ్యణ్' అను సూత్రము అణ్ప్రత్యయ విధాయకము. అందు సప్తమ్యంతపదము 'కర్మణి' అనునది ఆ కర్మను బోధించుపదము కుంభపదము. దానికి 'కార' అను కృదంతముతో సమాసము. 'అతిఙ్' అనునది సమాస నిషేధకము. తిఙన్త ముపపద సమాస ఘటకము కారాదని తాత్ప ర్యము. 'కారకః వ్రజతి' - అను వాక్యమున కారకః అను పదము ణ్వుల్ప్రత్యయాంతము. "తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్" (3-3-10) అను సూత్రము తద్విధాయ కము. కరణ మొక క్రియ. గమన మొక క్రియ. చేయబోవువాడై వెళ్ళుచున్నాడని యర్థము. గమనమునకు ప్రయోజనము కరణము. క్రియార్థక క్రియ అనగా కరణార్థక గతి క్రియ. తద్వాచకమగు 'వ్రజతి' అనునది ఉపపదమై యుండుటచే కారకః అనుచో భవిష్యదర్థమున ణ్వుల్ప్రత్యయము. ఇట తిఙంతమునకు సమాస ప్రసక్తియే లేదు. సమాస విధాయకమునందు 'సుప్ సుపా' - అని అధికారప్రాప్తము. అందువలన 'అతిఙ్' - అనునది వ్యర్థమని శంకించి వార్తికకారుడు - "ఉపపదమతిఙితి తదర్థ ప్రతిషేధః" - అని సమాధానము వార్తికమును బోధించెను. తదర్థ ప్రతిషేధమన తిఙర్థ సుబన్తముతో సమాస నిషేధమునకనుట. 'అతిఙ్' అనునది అర్థప్రధాన నిర్దేశము. క్రియార్థమునకు సమాసము రాదనుట. 'ఉపపదమ క్రియా'- అని వివక్షితార్థ ప్రతిపాదకమగు సూత్రన్యాస ముచితమను తాత్పర్యముతో 'క్రియాప్రతి షేధోవా' - అని వార్తికాంతర పాఠమును గలదు.

క్రియా ప్రధానమగు సుబన్త ముపపదమగునపుడు దానికి ప్రాప్తించు సమాసము నకు ప్రతిషేధమనుట 'కారకస్య గతిః' 'కారకస్య గమనమ్' 'కారకస్య వ్రజ్యా' - ఇత్యాది స్థలములందు క్రియా ప్రధాన సుబన్తములగు నుపపదములు, 'గతిః గమనమ్ వ్రజ్యా' మున్నగునవి. 'గతిః' మున్నగునవి యుపపదములయినపుడు, ణ్వుల్ప్రత్యయ తుమున్ ప్రత్య యాదులు ప్రవర్తింపనియెడల సమాస ప్రతిషేధమునకు ప్రయోజనమేమగును ?

పోనిందు. ణ్వుల్ తృచౌ అను సూత్రముచే ణ్వుల్ప్రత్యయము విధింపబడినపుడా ణ్వులంతముతో క్రియావచనమునకు సమాస ప్రతిషేధమున కది సార్థకమందురా ? కాదు. అపుడుపపదము లేదుగదా. కనుక ''కారకస్య గతిః'' - ఇత్యాదులందు 'గతిః' మున్నగునవి యుపపదములు సుబంతములు నగుటచేత ప్రాప్తించు నుపపద సమాస ప్రతిషేధమునకే అతిజ్ఞ్వదము. ఆ ప్రతిషేధము ఘఞ్ మున్నగు ప్రత్యయములంతమున గల ఉపపదము లందును, క్రియా కార్యములగు 'తుమున్', 'ణ్వుల్' - మున్నగునవి వచ్చునని జ్ఞాపన చేయు నని గ్రహింపదగియున్నది.

అతిజ్ఞ్వదము, సిద్ధస్వభావమగు నర్థమునకు క్రియాత్వమును జ్ఞాపన చేయునని యనరాదు. వస్తు స్వభావ విపర్యాసమును ఏవియు జ్ఞాపన చేయజాలవు. ॥446॥

*అవతారిక* — ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' - అను సూత్రమున 'క్రియాచేత్' అనునది వతి ప్రత్యయ ప్రకృతికి విశేషణము కావచ్చునని నిర్ణయింపబడినది. 'సమర్థ తృతీయాంతమగు' బ్రాహ్మణేన మున్నగునది క్రియ యెట్లగును ? అని శంకించి, క్రియావాచకము లగు తృతీయాంతములు 'శయితవ్యేన' 'పాకేన' మున్నగునవి సంభవించును 'శయితవ్యవత్' 'పాకవత్' మున్నగు 'వత్యంతములు' ససంభవములని ఇంతవర కుపపాదింపబడినది. ఇట్లుప పత్తి యున్నను 'కథం చ తృతీయాసమర్థం నామక్రియాస్యాత్' - అను నాక్షేపమునకు, ''సర్వఏతే గుణశబ్దాః సముదాయేషువర్తన్తే। సముదాయేషు వృత్తాః శబ్దాః అవయవేష్వపి వర్తన్తే'' = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య 'శూద్ర' - అను నీ శబ్దములన్నియు సముదాయ బోధకములు. సముదాయమనగా గుణముల సమూహము. 'చాంద్రాయణాది తపస్సును, వేద వేదాంగాది పరిజ్ఞానమును, బ్రాహ్మణుడుగా జన్మించుటయును బ్రాహ్మణుడను వ్యవహారము నకు గారణములు. తపస్సును, పాండిత్యమును లేనివాడు జాతి బ్రాహ్మణుడే యగును. పరి పూర్ణ బ్రాహ్మణుడు గాడు. అటులనే గౌరవర్ణము కలిగి యుండుట, ఆచార శౌచము, కపిల వర్ణ కేశత్వము మున్నగునవియు బ్రాహ్మణత్వ వ్యంజకములుగా పురాకల్పమున నుండెడివి. ఈ విధముగా గుణ సముదాయమును జెప్పు శబ్దము లోకప్పుడు అవయవమాత్రమును బోధించుటయు కలదు. తూర్పు పంచాలము, ఉత్తర పంచాలము అందురు. అట సముదాయ బోధకమయిన పంచాల శబ్దము పూర్వోత్తర శబ్దముల ప్రయోగమువలన నవయవ మాత్ర బోధకమగుచున్నది. తైలమున గొంత భాగమే భుక్తమైనను 'తైలం భుక్తం' 'ఘృతం భుక్తం' మున్నగు వ్యవహారములును గలవు. కావున బ్రాహ్మణ వదధీతే' అను స్థలమునను బ్రాహ్మణ శబ్ద ముపమేయగత క్రియ = అధ్యయనము మాత్రమును జెప్పును. కావున నుప పత్తి లేదు' - అని యిట్లు మార్గాంతరము నాశ్రయించి సమాధానము మహాభాష్యమున జెప్ప వలసి వచ్చినది ? - అని యాశంకించి చెప్పుచున్నారు.

శ్లో॥ సర్వస్య పరిహారార్థం సముదాయత్వ మాశ్రితమ్ ।
శుద్ధాయాః సంభవాన్నస్యాత్ క్రియాయా బ్రాహ్మణాదిషు ॥ 447

సముదాయత్వం=గుణసముదాయమగుట, సర్వస్య పరిహారార్థం=సర్వసాధారణ పరిహారము కొరకు, ఆశ్రితమ్ = ఆశ్రయింపబడినది, అన్యథా = అట్లు కానిచో, శుద్ధాయాః = కేవలమగు క్రియాయాః = క్రియకు, సంభవాత్ = సంభవము కలదుగాన, బ్రాహ్మణాదిషు='బ్రాహ్మణ వత్' ఇత్యాదులందు, న స్యాత్ = వతిప్రత్యయము రాకపోవును.

**తాత్పర్య వివరణములు**— 'హోతవ్యేన తుల్యం' - ఇత్యాది వ్యవహారములందు క్రియావాచియగు తృతీయా సమర్థము సంభవించుననుకొనుడు. అయినను 'సర్వఏతే శబ్దా గుణసముదాయే వర్తన్తే' - అని సముదాయ రూపత్వము నాశ్రయించుట, సర్వసాధారణమగు పరిహారమొక్కటియే చెప్పదగునని. కానిచో, శయితవ్యాది పదబోధ్యమగు సముదాయ రూపముగాని శుద్ధక్రియ, ప్రత్యయ ప్రవృత్తిగా సంభవించుచున్నది గాన బ్రాహ్మణాది శబ్ద విషయమున వతిప్రత్యయము రాకుండెడిది. బ్రాహ్మణ శబ్దము లక్షణా వృత్తిచేత క్రియావాచి యగు ననవలెను. 'హోతవ్య' 'పాక' మున్నగునవి ముఖ్యవృత్తిచేతనే క్రియావాచులు గదా. ముఖ్యము సంభవించినపుడు గౌణము నేల పరిగ్రహింపవలెను? అను ప్రశ్న కలుగును. ఇపుడుమట్టుకు సర్వపరిహారమెట్లు? సముదాయ ఏకదేశములను గల్పించి క్రియావచనములు బ్రాహ్మణాది శబ్దములగునని నయ్యది గౌణ పరిగ్రహమేయగును గదా యనిన, వ్యాప్తి న్యాయమువలన గౌణ ముఖ్యోభయ గ్రహణమని తాత్పర్యము. గౌణ ముఖ్య న్యాయమున కిది తావుగాదు. సాదృశ్య సంబంధముచే గుణారోపమువలన గౌణములయిన వానికి గ్రహణము లేదనియే ఆ న్యాయము బోధించును.

లేదా క్రియకు తృతీయాసమర్థత సంభవింపనే సంభవింపదను నాశయముతో సముదాయ రూపత నాశ్రయించి సమాధానము భాష్యమున చెప్పబడినదనియు ననవచ్చును. కాని యిది కారికా సమ్మతమగు వ్యాఖ్యగా దోపదుగాని యుత్తర కారికలో నా విషయము స్ఫురించును. ॥447॥

**అవతారిక**— అది యెట్లన-

**శ్లో॥ ఉపమానవివక్షాయాం స్వధర్మశ్చ నివర్తతే ।**
**క్రియాయా, న శ్రుతాద్యస్మాదుపమానం సమాప్యతే ॥ 448**

క్రియాయాః = హోతవ్య, పాక మున్నగు పదముల క్రియకు, ఉపమాన వివక్షాయామ్ = ఉపమానత్వమును వివక్షించినపుడు, స్వధర్మశ్చ = వాని స్వధర్మమగు అద్రవ్య స్వభావము గూడ, నివర్తతే = మరలిపోవును, యస్మాత్ = ఎందువలననగా, శ్రుతాత్ = వినబడిన = శబ్దోపాత్తమయిన యుపమాన మాత్రమున, ఉపమానం = ఉపమానత్వము, న సమాప్యతే = పరిపూర్ణము గాదు.

**తాత్పర్య వివరణములు**— కృత్తులచే అభిహితములయిన క్రియలు ద్రవ్యముల వంటివే. క్రియకు స్వభావము సాధ్యమగుట = ద్రవ్యము కాకుండుట. ఒకానొకటి యుపమాన

సకల పదార్థములకు సర్వధర్మ సామ్య ముండిన, భేదమే లేదు గాన నుపమానోప మేయభావ ప్రయోజకమగు సాదృశ్యమునకు సంభవమే కలుగదు కావున సమానధర్మ మావశ్యకము. 'దానికంటె భిన్నమై దాని ధర్మములు కొన్ని సమానమయినవి గల్గి యుండుట చూచియే, దాని పోలిక దీనికి అందురు. ॥449॥

*అవతారిక* — సిద్ధరూపమగు ద్రవ్యము సాధారణ ధర్మమును ఉపమానత్వ సిద్ధి కొరకపేక్షించిన నపేక్షించుగాక. సాధ్యస్వభావ యగు క్రియ గూడ నుపమానమయినపుడు సాధారణ ధర్మవ్యాపార మెందులకు ? అనిన—

**శ్లో॥ ద్రవ్యే వాఽపి క్రియాయాం వా నిమిత్తా త్తత్ ప్రకల్పతే।**
**క్రియాణాం విద్యమానత్వాత్ వృత్తి ర్న స్యాత్ గవాదిషు ॥ 450**

తత్ = ఆ సామ్యము, ద్రవ్యేవా = ద్రవ్య ముపమాన యిపుడుగాని, క్రియాయాం వాపి = క్రియ ఉపమానమయినపుడుగాని, నిమిత్తాత్ = సామ్య నిమిత్తమయిన సాధారణ ధర్మము వలననే, ప్రకల్పతే = సిద్ధించుచున్నది, క్రియాణాం = శుద్ధములగు క్రియలు, విద్యమాన త్వాత్ = ఉండుటవలన, గవాదిషు = 'గో' శబ్దము 'బ్రాహ్మణ' శబ్దము మున్నగువాని విషయ మున, వృత్తిః = తద్ధితవృత్తియగు వతిప్రత్యయము, న స్యాత్ = రాకపోవును.

**తాత్పర్య వివరణములు**— ఉపమానమన నుపమేయమునకు పరిచ్ఛేదకము గదా. ద్రవ్య ముపమానమయిన నది యుపమేయమును పరిచ్ఛేదించుటకు సాధారణ ధర్మము నపే క్షించక తీరదు. క్రియ ఉపమానమయినను నంతియ. అపుడది ద్రవ్యతుల్యమే యగును. క్రియాత్వమిక దానికి గలుగదు.

సాధనములు పనిచేయు అవస్థను దెలియజేయునదియు ప్రధానముగ గ్రహింపబడి నదియు క్రియ యగును. ఆ క్రియ వేరొక ధర్మమున కాశ్రయమై దానికిక సాధనముల వ్యాపారముతో బని లేనపుడు ద్రవ్యమే అగును. అపుడది క్రియ గాదు. నిమిత్తముల యపేక్ష లేకయే ఉపమానమయినపుడు, శుద్ధములయిన క్రియల కుపమానత్వము, పాకాది పదవాచ్యము లకు సంభవించును గాన, గౌణ క్రియాబోధకములగు 'బ్రాహ్మణ' 'గో' మున్నగువానికి వతి ప్రత్యయ మెందులకు వచ్చును ? బ్రాహ్మణ శబ్దము లక్షణచే బ్రాహ్మణాధ్యయన క్రియా వాచకము గదా ? కాగా, 'గోవత్' 'బ్రాహ్మణవత్' మున్నగు ప్రయోగములు లేకుండును. ॥450॥

*అవతారిక*— ఇక శుద్ధములగు క్రియ లుపమానములుగా సంభవింపనపుడు గౌణాశ్రయణము సంభవమగును.

**శ్లో॥ అభావాత్ కేవలాయాస్తు తద్వానర్థః ప్రతీయతే।**
**ప్రధానాసంభవే యుక్తా లక్షణార్థా క్రియా శ్రుతిః ॥ 451**

వేరు చేయలేము. వానికి ద్రవ్యముతో భేదము తెలియబడదు. కాబట్టి జాత్యాదులు ఘటాది శబ్దములకు వాచ్యములే యగును. కనుక దృష్టాంతము సరిగా లేదు.

ఈ యభిప్రాయముచే సరియగు మరియొక దృష్టాంతమును జూపుచున్నాడు.

**శ్లో॥ సువర్ణాది యథాభిన్నం స్వైరాకారై రపాయిభిః ।**
**రుచకాద్యభిధానానాం శుద్ధమేవైతి వాచ్యతామ్ ॥** 4

స్వైః = తనకు అనగా బంగారమునకు సంబంధించినట్టియు, అపాయిభిః = విభాగము కలిగిన అనగా నియతముగా ఉండనట్టి, ఆకారైః = ఆకారములతో, భిన్నమ్ = వేరుగా ఉన్న, సువర్ణమ్ = బంగారము మున్నగు, శుద్ధమ్ + ఏవ = శుద్ధమగు వస్తువే, రుచకాద్యభిధానానామ్ = 'రుచక' మున్నగు శబ్దములకు (అనగా రుచక, కటక, కంకణ, కుండలాది శబ్దములకు) వాచ్యతామ్ = వాచ్యత్వమును, యథా = ఏ రీతిగా, ఏతి = పొందుచున్నదో, (తథా) = అట్లే శబ్దములచే శుద్ధమగు ద్రవ్యమే చెప్పబడునని రెండవ శ్లోకముతో నన్వయము చేయవలెను. రుచక మనగా ఒకానొక కంఠాభరణ విశేషము.

బంగారముతో కంకణము, కడియము, కుండలము, రుచకము మున్నగు నగలు చేయుదురు. వాని ఆకారములతో బంగారము వేరుగా నున్నదే. కాని కంకణాది శబ్దము మాత్రము ఆకార విశేషముతో సంబంధములేక కేవలమగు బంగారమునే బోధించును. ఆకారములు మార్పు చెందుటచే అనిత్యములే. అవి వేరుగాచేసి చూపుటకు సాధ్యపడవు. అవి కాకమువంటివి కావు. ఐనను వానితో సంబంధములేక కంకణాది శబ్దములు శుద్ధమగు బంగారమునే బోధించును.

ప్రకృతమున గూడ ప్రకృతి సంబంధమున ద్రవ్యము నానారూపములతో భాసించుచున్నను శుద్ధ బ్రహ్మతత్త్వమే శబ్దములచే బోధింపబడును.

*విశేషాంశము*— ఇచట శబ్దములు కేవలము ఉపాధులనే బోధించుననెడి ఆశయము నిరాకరింపబడుచున్నది. ఉపాధులు అప్రధానములుగా, ద్రవ్యము ప్రధానముగానుండి అవి శబ్దవాచ్యమనుటలో విప్రతిపత్తి లేదు. ॥4॥

*అవతారిక*— బ్రహ్మము వ్యాపకము, అదియే ద్రవ్యరూపము. అట్టి ద్రవ్యము శబ్దార్థమని యంగీకరించిన ఎల్ల శబ్దములు ఎల్ల యర్థములను బోధింపవలెను. కాని యట్లు అనుభవము లేదు. ఘట శబ్దము కడవనే బోధించును. వస్త్రమును బోధింపదు. ఎల్ల శబ్దములకు బ్రహ్మరూపమగు ద్రవ్యమే వాచ్యమగుచో. అది సర్వసాధారణము కాన పై దోషము ప్రసక్తమగుచున్నది అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఆకారైశ్చ వ్యవచ్ఛేదాత్ సార్వార్థ్య మవరుధ్యతే ।**
**యథైవ చక్షురాదీనాం సామర్థ్యం నాడికాదిభిః ॥** 5

మట్టుకు, తద్వాన్ = ఆ క్రియాశ్రయమగు, అర్థః = పదార్థము, ప్రతీయతే = ఉపమానముగా ప్రతీతమగును, ప్రధానాసంభవే = ముఖ్యము సంభవింపనపుడు, లక్షణార్థా = లాక్షణికమగు నర్థమున గల, క్రియా శ్రుతిః = క్రియావాచక శబ్ద శ్రుతి, యుక్తా, భవతి = యుక్తమగును.

తాత్పర్య వివరణములు— 'తేనతుల్యమ్' అను సూత్రమునందు మొదట తేన అను పదము పఠింపబడినది. అది ప్రకృత్యర్థ బోధకము. 'క్రియా' అను పదము, క్రమమును దప్పించుటలో ప్రయోజనము లేదుగాన దానికే విశేషణమగును. క్రియాతౌల్యమునందు 'వతి' ప్రత్యయమగునని యపుడర్థము. పైని జెప్పిన రీతిగ శుద్ధమగు క్రియ కుపమానత్వము సంభవింపదుగాన ముఖ్యార్థమును వదలి గౌణార్థమును గ్రహింపవలసి యుండును. క్రియ తన ఆశ్రయమును వీడి యుండదు గావున, బ్రాహ్మణవత్ అనుచోట బ్రాహ్మణ పదమునకు బ్రాహ్మణాధ్యయన క్రియ యర్థమని లక్షణాసిద్ధము. కాగా తృతీయా సమర్థము క్రియావిష్ట ద్రవ్యము సంభవించును. అట్లే శయితవ్యాదులును లాక్షణికములు అని భావము. శుద్ధమనగా ముఖ్యము. గౌణము కానిది. ॥451॥

అవతారిక— అధ్యేతవ్యాది పదవాచ్యములగు క్రియలును నుపమానములయిన వానికి బ్రాహ్మణాది శబ్దములతో సర్వథా సామ్యమే సిద్ధించును.

శ్లో॥ క్రియాంతరేషు సాపేక్షాః క్రియాశబ్దాః క్రియాన్తరే।
ఉపకారాయ గృహ్యన్తే యథైవ బ్రాహ్మణాదయః॥ 452

క్రియాన్తరే = వేరొక క్రియయందు, ఉపకారాయ = ఉపకరించుటకు = పరిచ్ఛేదించుటకనుట క్రియాశబ్దాః = 'బ్రాహ్మణాధ్యేతవ్య' మున్నగు క్రియాశబ్దములు, బ్రాహ్మణాదయః = 'బ్రాహ్మణవత్' ఇత్యాదులందు బ్రాహ్మణ మున్నగునవి, యథైవ = ఏ ప్రకారముగనున్నవో, తథా = ఆ ప్రకారము, క్రియాన్తరేషు = ఔపమ్యహేతువులగు సౌష్ఠవము మున్నగువాని యందు, సాపేక్షాః = ఆకాంక్షను గలవిగ, గృహ్యన్తే = గ్రహింపబడుచున్నవి.

తాత్పర్య వివరణములు— క్షత్త్రియాధ్యయనమున కుపమానము జెప్పి యుపకరించుటకు ఉపమానవాచకములగు 'బ్రాహ్మణాధ్యేతవ్య మున్నగునవి అధ్యయన క్రియకంటె వేరగు సౌష్ఠవాది క్రియా సాపేక్షములయి ప్రయోగింపబడుచున్నవి. 'బ్రాహ్మణవత్ అధీతే క్షత్రియః' - అని చెప్పినపుడు, బ్రాహ్మణ క్షత్రియుల సాదృశ్యమునకు హేతువయిన అధ్యయన క్రియనుబట్టి బ్రాహ్మణ శబ్దము క్షత్రియ పరిచ్ఛేదకమయినట్లు, 'బ్రాహ్మణాధ్యేతవ్యవత్ క్షత్త్రియాధ్యయనమ్' - అని చెప్పినపుడు అధ్యయనముల సాదృశ్యమునకు హేతువు వాని సౌష్ఠవము. కాగా ద్రవ్యవాచకము లుపమానములయినట్లే క్రియావాచకములును నుపమానములయి వతి ప్రత్యయమును బొందును' - అని భావము. ॥452॥

అవతారిక— కాని యొక ప్రశ్న కలదు. క్రియగూడ నుపమానమయినపుడు ధర్మాంతరము కావలసి వచ్చినయెడల, అనవస్థ గాదా? ఆ ధర్మముల కుపమానోపమేయ

భావము బోధ్యమయినపుడు వేరొక ధర్మము, వాని కింకొక ధర్మము అపేక్షితము కావలదా యని యాశంకించి, దానికి నిదర్శనమును జూపి, ఆ అనవస్థ తప్పదు యనుచున్నారు.

శ్లో॥ యథాప్రకర్షస్సర్వత్ర నిమిత్తాంతరహేతుకః ।
ద్రవ్యవత్ గుణశబ్దేఽపి స నిమిత్తమపేక్షతే ॥ 453

యథా = ఏ ప్రకారము, ప్రకర్షః = అతిశయము, నిమిత్తాంతరహేతుకః = వేరొక కారణము వలన గలిగినదిగా, సర్వత్ర భవతి = అంతట నుండునో, తథా = ఆ ప్రకారము, సః = ఆ ప్రకర్షము, ద్రవ్యవత్ = ద్రవ్యవాచకమునందు వలెనే, గుణశబ్దేఽపి = గుణవాచకమునందును, నిమిత్తమ్ = వేరొక నిమిత్తమును, అపేక్షతే = అపేక్షించును.

తాత్పర్య వివరణములు— "న వై ద్రవ్యస్య స్వతః ప్రకర్షాపకర్షౌ స్తః" - అందురు పెద్దలు. ద్రవ్యమునకు అతిశయముగాని అపకర్షముగాని స్వాభావికముగా నుండదు. అవి దానికి ఆ ద్రవ్య సంసర్గము గల ధర్మాంతరము మూలమున గలుగును. 'శుక్లతరః పటః' = 'ఈ వస్త్రము ఎక్కువ తెల్లగానున్నది' అనిన, ఇంకొక దానికంటె ఈ వస్త్రమున కతిశయము, ఆ వస్త్రమున సమవేతమగు శుక్ల గుణమువలన వచ్చినది. ఆ విధముగనే 'శుక్లతరమస్య రూపమ్' = దీని తెలుపు దాని తెలుపుకంటె సతిశయితము = అనినపుడు శుక్ల గుణమున కచ్చట అతిశయము వివక్షితము. ద్రవ్యమునకు గాదు. కాని యా శుక్లగుణమపుడు 'ద్రవ్యాయమాణము' అనగా ద్రవ్యమువంటిదే యగుచున్నది. అది గుణవాచక శబ్దముచే జెప్పబడుచు, భాస్వరత్వము మున్నగు స్వగతమగు వేరొక ధర్మమును ప్రకర్షహేతువు నపేక్షించుచున్నది. ॥453॥

అవతారిక— వేరొక నిదర్శనమును గూడ దీనికి జూపుచున్నారు.

శ్లో॥ యో య ఉచ్చార్యతే శబ్దః స స్వరూపనిబన్ధనః ।
యథా తథోపమానేషు వ్యపేక్షా న నివర్తతే ॥ 454

యః యః = ఏయే, శబ్దః = శబ్దము, ఉచ్చార్యతే = ఉచ్చారణ విషయమగునో, సః సః = ఆ యా శబ్దమెల్ల, స్వరూపనిబన్ధనః = తన రూపమే నిమిత్తముగ గలదియై, యథా భవతి = వర్తించుచున్నది యెట్లో, తథా = ఆ ప్రకారముగనే, ఉపమానేషు = ఉపమానముల విషయమునను, వ్యపేక్షా = నిమిత్తమగు సాధారణ ధర్మముయొక్క అపేక్ష, న నివర్తతే = తొలగదు.

తాత్పర్య వివరణములు— అగ్నిమనోదాత్తమ ధీష్వ" - అని వేదమున నున్నది. అగ్నిని అంతోదాత్తముగ నుచ్చరించుట యసంభవము. అగ్ని యన నిప్పు. దాని కుచ్చారణ క్రియ కుదురదు. "అగ్నేర్ఢక్" - అని పాణిని సూత్రము. అచ్చట గూడ నిప్పుగడ్డకు పరముగా 'ఢక్' అను ప్రత్యయమును విధించుట వీలుగాదు. కావున ఇచ్చట 'అగ్ని' అను మాటయే అర్థముగాని వస్తువుగాదు అని చెప్పబడినది. శబ్దము, తాలువు మొదలయిన అవయవ

ముల యందు సమకూర్పబడి యొక క్రమములో నుచ్చరింపబడి యర్థమునకు వాచకమగు చున్నది. అయ్యది నిరుపాధికమయిన, వాచకము గానేరదు. కావున నది స్వరూపమునే విశేషణముగ నాశ్రయించును. ఆ విధముగ స్వరూప రూపితమగు నభిధేయమును బోధించును. అపుడు ప్రయోగస్థమగు వాచ్యమే దాని స్వరూపము. ఈ విషయము బ్రహ్మకాండమున నిరూపితము. ఆ ప్రయోగస్థమగు వాచ్యమైన శబ్దము గూడ నుచ్చారణ సాధనావయవములచే నుచ్చరింపబడినపుడు, దానికిని, ఉపసంహృత క్రమమయి ప్రయోగస్థమగు నింకొక వాచ్యము నిమిత్తముగ కల్పింపబడును. కావున నెల్ల శబ్దముల విషయమునను, నిమిత్తము, నిమిత్తవత్తు, అభిధేయము = వాచ్యము - అను నీ మూడును నుండక తీరదు.

'అగ్ని' - మున్నగు శబ్దములకు ప్రవృత్తి నిమిత్తమయిన స్వరూపము, ఉచ్చారణ విషయమయినపుడు, వేరొక ప్రవృత్తి నిమిత్త మాపశ్యకమగును. నిమిత్త విరహితమయినది వాచకము కాదనుట సార్వత్రికమను విషయము కారికయందు, 'యోయః' - అను వీప్సచే సూచితము.

ఈ విధముగ, ప్రకర్షము బోధనీయమయినపుడు, ధర్మాంతరమును సంభవించి నంత దనుక నిమిత్తముగ గల్పించినట్లును, స్వరూప మభిధేయమై తాను మరల నభిధాయకమయినపుడు స్వరూపాంతరము నిమిత్తమయినట్లును, ఔపమ్య విషయమున గూడ నిమిత్త కల్పన మవర్జనీయముగాన, ఉపమానము - ఉపమేయము - వాని సాధారణ ధర్మము - అను నీ మూడును అపరిహార్యములు.

''బ్రాహ్మణవత్ క్షత్రియోధీతే'' అనుచో అధ్యయనము సాధారణ ధర్మము ఆ అధ్యయన ముపమానమయిన, ''బ్రాహ్మణాధ్యయన తుల్యం క్షత్రియాధ్యయనమ్'' అను వచో విన్యాసమున, సౌష్ఠవము సాధారణ ధర్మము. ఆ సౌష్ఠవ ముపమానముగ వివక్షితమయిన నపుడు తద్గతమగు పరినిష్పత్తి = పరిపూర్తి సాధారణ ధర్మమగును. చివరకు శబ్ద వ్యాపార మెచ్చట నిలుచునో అచ్చట కల్పన పర్యవసితమగును. కావున నీ యనవస్థ మూలక్షయకారిణి కాదుగాన దోషము గాదని తాత్పర్యము. ॥454॥

*అవతారిక* — శుద్ధమగు క్రియ 'తేన' - అనుచో జెప్పబడిన తృతీయా విభక్త్యర్థాన్వయ యోగ్యమగునది = తృతీయా సమర్థము సంభవింపదను, భాష్యగ్రంథమును సమర్థించి, అచటనే యున్న - ''ఇదమయుక్తం వర్తతే, కిమత్రాయుక్తమ్'' - అను గ్రంథము నుపపాదించుచున్నారు.

శ్లో॥ క్రియావృత్తేస్తృతీయోస్తస్యైవం చా సంభవే సతి ।
ప్రసిద్ధన్యాయకరణో భాష్యే యుజిరుదాహృతః ॥ 455

ఏవంచ = మరియు నీ ప్రకారము, క్రియావృత్తేః = క్రియను బోధించు, తృతీయాస్తస్య = తృతీయా విభక్త్యంతమునకు, అసంభవే సతి = సంభవము లేకపోగా, అందువలననే, భాష్యే

= మహాభాష్యమున, ప్రసిద్ధి న్యాయకరణః = ప్రసిద్ధమగు 'న్యాయేన' అనునది కరణముగా గల, యుజః = యుజిర్ యోగే అను ధాతువు, ఉదాహృతః = ప్రయోగింపబడినది.

తాత్పర్య వివరణములు— "ఇదమయుక్తం వర్తతే" - అని భాష్యము. ఈ వాక్యార్థము యుక్తము కానిదిగా నున్నది అని యర్థము యుక్తమనగా కూడియున్నది. దేనితో గూడినది ? అని ప్రశ్న కలిగినపుడు, యోగమునకు కరణమయినది చెప్పబడవలెను. అది చెప్పబడలేదు. ఎందువలన ? అనగా నది ప్రసిద్ధముగాబట్టి. న్యాయముతో గూడినది అనుట. న్యాయయుతము కానిది అయుక్తము. క్రియా స్వరూప సామర్థ్యమునుబట్టి యవగత మగు కారకము స్వశబ్దముచే గ్రహింపబడ నక్కరలేదు. ఎట్లన - 'ఈత దర్శుడయినవాడు' అందురు. దేనికి ? అనిన సత్కారమునకు అని వేరుగ జెప్పనక్కరలేదు. 'వర్షించుచున్నది' అందురు, ఏది ? దేనిని ? అను ప్రశ్నలకు సమాధానము 'మేఘము', 'జలమును' అని సామర్థ్య గమ్యము దానిని పృథక్కుగా వచింప నక్కరలేదు. కనుక 'న్యాయముతో' అను కరణ వాచకము ప్రసిద్ధమగుటచే నిర్దేశింపబడలేదు. ॥455॥

అవతారిక— కొందరు, ఇచట 'న్యాయముతో', అను, కరణము ధాత్వర్థమున నంతర్భూతము గాన వచింపబడలేదు అందురు. కాని యది సమంజసమైన సమాధానము గాదు ఏలయన—

శ్లో॥ అంతర్భూతే తు కరణే ప్రయోగో న పునర్భవేత్ ।
న్యాయేనాయుక్త మిత్యత్ర జీవతౌ ప్రాణకర్మవత్ ॥ 456

కరణే = 'న్యాయేన' అను, కరణము, అంతర్భూతేతు = యుజధాత్వర్థమున నంతర్భూతమని నచో, అత్ర = ప్రకృత విషయమున, జీవితౌ = జీవధాతువునందు అంతర్భూతమైన, ప్రాణ కర్మవత్ = 'ప్రాణాన్' - అను కర్మకువలె, "న్యాయేన అయుక్తమ్" ఇతి = 'న్యాయముతో గూడినది కాదు' అని, పునః = మరల 'న్యాయముతో' అని కరణవాచకమునకు, ప్రయోగః = ప్రయోగము, నభవేత్ = ఉండకపోయెడిది.

తాత్పర్య వివరణములు— 'జీవతి' - అను పదమునకు ప్రాణములను ధరించి యున్నాడు అని యర్థము. 'ప్రాణములను' అను కర్మ 'జీవప్రాణధారణే' అని ధాత్వర్థము ననే జేరియున్నది. కావున 'ప్రాణాన్ జీవతి' - అని ప్రయోగింపరు. 'అస్తి' = అనిన తనను భరించియున్నాడు అని యర్థము అస = భువి. భవనమనగా ఆత్మధారణము. ఆత్మయను కర్మ ధాత్వర్థముననే అంతర్భూతము. కనుకనే 'ఆత్మానమస్తే' అని ప్రయోగింపరు. ఆ విధముగ నిట కరణరూపకారకము ధాత్వర్థ సంగృహీతమనివ నిక దానికి వేరుగ ప్రయోగమే లేకపోవును. కాని ప్రయోగ మగపడుచున్నది. 'న్యాయేన అయుక్తమ్' అనియు, ఉపపత్త్యా అయుక్తమ్' అనియును వ్యవహరింతురు. కనుక కరణ వాచకము ప్రయోగింపబడకుండుటకు ప్రసిద్ధియే కారణము గాని ధాత్వర్థాంతర్భావము గాదు. ॥456॥

*అవతారిక*— "అయుక్తం" - అను శబ్దము నన్వాఖ్యానము చేయుటకు, అందు ప్రకృతి కర్థము యుజిక్రియ యనియు దానికి, కరణము 'న్యాయము' అనియు నిట్లు చెప్పుట అన్వాఖ్యాన సమయ పరిపాలనమునకు మాత్రమే. పరమార్థమును విచారించిన నీ పదమందవయవ విభాగమే లేదు. కావున యుజిక్రియయు లేదు. తత్కరణమును లేదు. చూడుడు—

**శ్లో॥ శాస్త్రాభ్యాసాయ భేదోఽయమయుక్తమితి వర్ణ్యతే।
అశోభనమసంబద్ధమితి రూఢిర్వ్యవస్థితా॥** 457

'అయుక్తమ్' ఇతి='అయుక్తమ్' - అను పదమునందు, శాస్త్రాభ్యాసాయ=వ్యుత్పత్తి సమయ పాలనమునకు, అయం = ఈ, భేదః = క్రియ, కరణము - అను భేదము, వర్ణ్యతే = వర్ణింపబడుచున్నది (కాని), అశోభనమ్ = 'శోభనమైనది గాదు', అసంబద్ధమ్ = 'సంబద్ధముగా లేనిది', ఇతి = అని ఇట్లు, రూఢి = రూఢ్యర్థమే, వ్యవస్థితా = వ్యవస్థితమై యున్నది.

*తాత్పర్య వివరణములు*— శబ్దముల నన్వాఖ్యానము చేసినపుడు, అర్థానుగుణముగ నందు క్రియాకారకములను గల్పించుట వ్యుత్పత్తి పరిపాటి. అందులకై యుజిక్రియ ఆ శబ్దమునందుటచే దానికి కరణమేమి? అను విచారము. ప్రసిద్ధముగాన 'న్యాయము' కరణము గావచ్చును, కాగా న్యాయముతో సంబద్ధముగాలేనిది అని యర్థము అని భాష్యకర్త తాత్పర్యముగా వర్ణించిరి. కాని లౌకికులందు అవయవభేదమును గమనింపక అయుక్తమనగా 'అశోభనము' - 'అసంబద్ధము' - 'అన్యాయ్యము' - 'అశ్లిష్టము' - అను రూఢ్యర్థమునే గ్రహింతురు. అందువలననే భాష్యకారుడు, 'ఇదం న్యాయేనా యుక్తమ్' - అని వచింపలేదు. అందు యుజిక్రియ యేదియు లేదనియే యాతని తాత్పర్యముగానోపును.

*అవతారిక*— వతిప్రత్యయ విధాయక సూత్రమున 'క్రియా' అనునది - ప్రకృత్యర్థమునకు విశేషణమయిన, క్రియావాచులగు తృతీయాంతములు ఆ ప్రత్యయమునకు ప్రకృతులు కావలెను. అట్టివి లేనేలేవు కనుక నా పక్షము గ్రాహ్యము గాదని నిరూపించి, ఆ పక్షమునకు అసలు సంభవమే లేదని ఈ కారికలో జెప్పుచున్నారు.

**శ్లో॥ వివిభక్తిః ప్రకృత్యర్థం ప్రత్యుపాధిః కథం భవేత్।
విభక్తిపరిణామే చ ప్రకల్ప్యం విషయాన్తరమ్।** 458

వివిభక్తిః = విరుద్ధ విభక్త్యంతమగు క్రియా అనునది, ప్రకృత్యర్థం ప్రతి = 'తేన' అను తృతీయాసమర్థ ప్రకృత్యర్థమునకు, ఉపాధిః = సమానాధికరణ విశేషణము, కథం భవేత్ = ఎట్లగును? విభక్తి పరిణామే చ = క్రియా అనునది తృతీయాంతముగా మార్చబడుననిన, విషయాంతరం = ప్రథమాంతమునకు చరితార్థతగల వేరొక స్థలము, ప్రకల్ప్యమ్ = కల్పింపవలసి యుండును.

*తాత్పర్య వివరణములు*— 'తేన' అనునది తృతీయాంతము. క్రియా అనునది ప్రథమాంతము. అది తేన అను దానికి విశేషణము = అనగా ఉపాధి ఎట్లగును? ఉపాధి

యనగా, సమానాధికరణ విశేషణము. ''అర్థవిశేష ఉపాధిః తదన్తవాచ్యస్సమాన శబ్దోయః'' అని ''ప్రత్యయః'' (3-1-1) అను సూత్ర భాష్యమునందుకై యట గ్రంథమున నుపాధి లక్షణము చెప్పబడియున్నది. 'దృతిహరిః పశుః' అను స్థలమున, ''హరతేర్దృతి నాథయోః పశౌ'' - అసూత్రముచే 'ఇన్' అను ప్రత్యయము విధింపబడినది. అట 'పశౌ' అనునది 'ఉపాధి'. ''దాణ్డాక్రీడా'' = దీనిలో దణ్డము ప్రహరణము గాన నీ క్రీడ దాణ్డ యనబడును. ''సాస్య దేవతా'' (4-2-24) 'ఆమె దీనికి దేవత' అను నర్థమున అణాదులు వచ్చును అని యర్థము 'ప్రాజాపత్యః' ఉదాహరణము. ప్రజాపతి దేవతగా గల క్రతువు' అని యర్థము. పై సూత్రములలో పశు, క్రీడా, దేవతాది శబ్దము లుపాధులు - ఇక విశేషణములనునవి అవచ్ఛేదకములు మాత్రమే. అవి వ్యధికరణములయినను గావచ్చును. ''గార్గికయా శ్లాఘతే'' - అను ప్రయోగమును జూతము - గార్గిక అనగా గర్గగోత్రా పత్యమగుట. తన్మూలమున పొగడుకొనుచున్నాడు అని యర్థము. ''గోత్రచరణాత్ శ్లాఘాత్యాకార తదవేతేషు'' (5-1-134) అను సూత్రముచే భావకర్మార్థములందు 'వుఞ్' అను ప్రత్యయము విహితము. అందు శ్లాఘా పదము విశేషణము. సూత్రార్థమునకు సిద్ధాంత కౌముది చూడనగును.

పోనిమ్ము. సమన్వయము కుదురదుగాన, 'క్రియయా' అని విభక్తి విపరిణామమును గల్పింతుము అనిన, నీ సూత్రమునందలి ప్రథమాంతమున కెచ్చట చారితార్థ్యము ? అది లేనపుడు విపరిణామమెట్లు ? లేనిచో ప్రథమాంతపదము వ్యర్థమే కావలెనుగదా ? పరిణామ మనగా నూహవంటిది. ప్రకృతియాగమునందొక విభక్త్యంతముగా శ్రుతమైన దానికి వికృతి యాగములందు విభక్త్యంతర విపరిణామమే గదా ఊహ. ॥458॥

అవతారిక — పై విషయ మీ కింది రెండు కారికలందును నుపపాదింపబడినది.

శ్లో॥ విభక్త్యన్తరయోగో హి యస్యతద్విషయాన్తరే ।
విభక్త్యన్తర సంబన్ధః సామర్థ్యాదనుమీయతే ॥ 459

శ్లో॥ సారూప్యాత్తు తదేవేదమితి తత్రోపచర్యతే ।
శబ్దాన్తరే విభక్త్యా తు యుక్తం శాస్త్రే తదశ్రుతమ్ ॥ 460

తథా హి = అది యెట్లనగా, యస్య = ఏ శబ్దమునకు, విభక్త్యన్తర యోగః = ఒకానొక విభక్తి సంబంధము, విషయాన్తరే = వేరొక విషయమునందు, (చరితార్థః) = కృతార్థమగునో తస్య = దానికి, సామర్థ్యాత్ = సమన్వయానుపపత్తి వలన, విభక్త్యన్తర సంబంధః = వేరొక విభక్తి యోగము, అనుమీయతే = కల్పింపబడెను, సారూప్యాత్ తు = సారూప్య ముండుటవలన నైతే, తదేవ ఇదమితి = అదియే యిది అని, తత్ర = ఆ మార్పబడిన శబ్దము విషయమున, ఉపచర్యతే = అభేద వ్యవహారము చేయబడుచున్నది, శాస్త్రే = సూత్రమునందు అశ్రుతమ్ తు = వినబడని పదమైనదిమట్టుకు, శబ్దాన్తరే = వేరొక శబ్దమునందు, విభక్త్యా = వేరొక విభక్తితో, యుక్తమ్ = కూడుకొనినది, భవతి = అగుచున్నది.

తాత్పర్య వివరణములు— సూత్రమునందు ఒక విభక్తితో నుచ్చరింపబడిన శబ్దము, ఆ విభక్త్యర్థ సంబంధము గల యొక వాక్యార్థమునం దుపకారకము కావలెను. లేనిచో ఆ విభక్తితో నా పదము నుచ్చరించుట నిరర్థకమే యగును. ''భూవాదయో ధాతవః'' (1-3-1) అను సూత్రమున, ధాతవః అను పదము ప్రథమా విభక్త్యంతముగ నుచ్చరింపబడి యున్నది. క్రియావాచకములగు భ్వాది గణపఠితములు ధాతుసంజ్ఞ కలవి యగును - అను వాక్యార్థమున నది ఉపయోగముగలదియై కృతార్థమైనది. దానికే ''అనుదాత్తజిత ఆత్మనే పదమ్'' (2-3-12) అను సూత్రమునందు స్వరితత్వమువలన ననువర్తించి ఆ 'ధాతవః' అను పదము పంచమ్యంతముగ మార్పునందును. ప్రథమాంత ధాతు పదమున కట సమన్వయము కుదురదుగదా. ఆ సూత్ర మాత్మనే పద ప్రత్యయ విధాయకము. అందు ప్రకృతి ధాతువు. ధాతువుకంటె బరముగానను నర్థముకల ప్రత్యయమందు గావలెను. సామర్థ్యమువలన విభక్త్యంతర సంబంధానుమానమన నిదియే.

ఇక శబ్దార్థ సంబంధములు నిత్యములని వైయాకరణుల సిద్ధాంతము. కనుక సూత్ర గృహీతమయిన శబ్దమునకుగాని దాని యర్థమునకుగాని మార్పు యుక్తము గాదు. కనుక శబ్దాంతరమే యోగ్యమయిన విభక్తితో గూడినది సూత్రమున నుచ్చారితము కాకున్నను నుత్ప్రేక్షింపబడవలసి యుండును. ఆ శబ్దము వేరు. ఇది వేరు. సారూప్యమువలన, అనగా విభక్తి వేరయినను ప్రకృత్యంశము తుల్యముగ నుండుటచేత నదియే యిది యనుకొనుట. క్షీరము దధిగ మారినదను వ్యవహారమునందును క్షీర ధర్మములు గొన్ని దధియం దగపడుటయే నిమిత్తము. ప్రత్యభిజ్ఞానమునకును నదియే కారణము. కావున 'క్రియాచేత్' అను ప్రథమాంతమునకు ప్రకృత్యర్థ విశేషణత్వము అను పక్షము సంభవరహితము. ॥459, 460॥

అవతారిక— కాగా సూత్రమునందు 'తేన' అను పదమువలన తృతీయాంతము, వతిప్రత్యయమునకు ప్రకృతియని తెలియుచున్నదిగాన దానినిబట్టి క్రియా అనునది 'క్రియయా' అనియే నిర్దేశింపబడి యుండవలెను. క్రియా అను పదమునందలి ప్రథమను బుచ్చుకొని 'తేన' అను ప్రధానమునకు విపరిణామము కలుగదు. అను విషయ మీ కారికయందు జెప్పబడినది.

శ్లో॥ ప్రకృతిశ్చేత్ తృతీయాన్తా తేనేత్యస్మాత్ ప్రతీయతే ।
క్రియేతి ప్రథమాన్తా సా కథం భవితుమర్హతి ॥ 461

తేన ఇత్యస్మాత్ = సూత్రమునందలి తేన అను పదమువలన, ప్రకృతిః = వతి ప్రత్యయమునకు ప్రకృతి, తృతీయాన్తా = తృతీయా విభక్తి ప్రత్యయాంతముగా, ప్రతీయతే చేత్ = ప్రతీయమానమగుచున్నదనిన, సా = ఆ ప్రకృతి, క్రియా ఇతి = 'క్రియా' అని, ప్రథమాంతా = ప్రథమా విభక్త్యంతము, భవితుమ్ = అగుటకు, కథం అర్హతి = ఎట్లు అర్హమగును?

తాత్పర్య వివరణములు— విభక్తి విపరిణామము సంభవింపనపుడు వివిభక్తికములకు సంబంధము పొసగదు. ఈ విషయ ముపపాదిత పూర్వము. వివిభక్తికములనగా, విరుద్ధములైన విభక్తులుగల పదములు. ॥461॥

అవతారిక— ఒకప్పుడు విభక్తి విపరిణామమును జేసినను 'తేన' అను దానితో 'క్రియయా' - అను పదమున కన్వయము సంభవింపదు.

**శ్లో॥ క్రియయేతి తృతీయా చ ప్రయోగే కస్య కల్ప్యతామ్।
తేనేత్యస్య హి సంబంధః సూత్రస్థేన న విద్యతే॥ 462**

కస్య = ఏ పదముయొక్క, ప్రయోగే చ = విశేష్య ప్రయోగమున, క్రియయా ఇతి = 'క్రియయా' అని, తృతీయా = తృతీయాంత విశేషణము, కల్ప్యతామ్ = కల్పింపబడవలెను? సూత్రస్థేన = సూత్రమునందున్న 'క్రియా' అను దానితో. తేన ఇత్యస్య = 'తేన' అను దానికి, సంబంధః = సంబంధము, న హి విద్యతే? = లేదుగదా?

తాత్పర్య వివరణములు— 'తేన' అనునది పుంలింగము. 'క్రియయా' అనునది స్త్రీలింగమాయె. ఇక తుల్యమ్ అను దాని కుపాధియనిన నపుడు ప్రకృతి విశేషణము గాదు. ॥462॥

అవతారిక— సూత్రమున క్రియా అను పదమునకు సంబంధము నీ విధముగా నాక్షేపించి సమర్థించుచున్నారు.

**శ్లో॥ సోపస్కారేషు సూత్రేషు వాక్యే శేషః సమర్థ్యతే।
తేన యత్తత్ తృతీయాన్తం క్రియా చేత్ నేతి గమ్యతే॥ 463**

సోపస్కారేషు = అధ్యాహారములతో గూడిన, సూత్రేషు=సూత్రములందు, వాక్యే=వాక్యమునందు, శేషః = మిగిలియున్నది = ఆవశ్యకమగునది, సమర్థ్యతేః = సమర్థింపబడును = కల్పింపబడును, తేన = అందువలన, యత్ తత్ తృతీయాంతమ్ = "తృతీయాంతమది యేది గలదో, సా క్రియా చేత్ = అది క్రియ యగుచో, ఇతి గమ్యతే = అని గమ్యమగును.

తాత్పర్య వివరణములు— సూత్రములందు వాక్యములు సామాన్యముగి అధ్యాహార సాపేక్షములయి యుండును. లక్ష్యముల కనుగుణముగ లక్షణములు రచింపబడును. కావున ఆ యా లక్ష్యముల భేదము ననుసరించి క్రియా పదముల నధ్యాహరించుకొనవలసి యుండును.

ప్రకృత సూత్రమున 'చేత్' అను శబ్దము గలదు. దానివలన పదముల సంబంధమున భేద మవగతమగుచున్నది. కాగా, తృతీయా సమర్థమగునది క్రియ యగుచో, దానితో సమానమయినది అను నర్థమున వతి ప్రత్యయమగునని సూత్రార్థ ముపపన్నము. సూత్రమునందే విభక్తి విపరిణామము చేయవలెనను నిర్బంధములేదు. వ్యాఖ్యానరూపమగు తత్సమన్వయ వాక్యమునందును విభక్తి విపరిణామమును జేయవచ్చును. 'తేన' అను తృతీయా నిర్దేశము వలన ప్రకృతి తృతీయాంతము గావలెనని తెలియుచున్నది.

ఆ ప్రకృతికి ఉపాధితో సంబంధమును గలదని 'చేత్' అనునది తెలియచేయును,

కావున ఉపాధివాచకము ప్రథమాంతము గాన ఉపాధేయమగు 'తేన' అనునదియు సమన్వయ వాక్యమునందు ప్రథమాంతముగా పరిణతమగును. "ఇకోగుణవృద్ధీ" (1-1-3) అను సూత్ర మును జూడుడు. 'ఎక్కడ', 'గుణము వచ్చును' అని గుణమును, 'వృద్ధి వచ్చును' అని వృద్ధియు విధింపబడునో అచ్చట 'ఇకః' అను షష్ఠ్యంతపద ముపస్థితమగును అని సమన్వయ వాక్యమున నధ్యాహారముచే వాక్యార్థము సమర్థితము. ప్రకృత సూత్రమున నట్లే కర్తవ్యము. ॥463॥

అవతారిక— ఉపాధి అన నేనియో చెప్పబడినది. ప్రకృత సూత్రమున 'క్రియా' అనునది ఉపాధియనియు దానికి ఉపాధిమత్తగు 'తేన' అను దానితో, వాక్యాధ్యాహారముచే సమన్వయమనియు నిరూపింపబడినది. ఆ ఉపాధి వాక్యమునందు ప్రయుక్తమయినను గావచ్చును. లేదా ప్రతీయమానమును గావచ్చునని ప్రతిపాదింపబడుచున్నది.

శ్లో॥ ఉపాధేః కస్యచిద్వాక్యే ప్రయోగ ఉపలభ్యతే ।
ప్రతీయమాన ధర్మాన్యో న కదాచిత్ప్రయుజ్యతే ॥ 464

కస్యచిత్ ఉపాధేః=ఒకానొక విశేషణమునకు, వాక్యే=విగ్రహ వాక్యమునందు, ప్రయోగః =ప్రయోగము, ఉపలభ్యతే=కనబడుచుండును అన్యః=వేరొక ఉపాధి, ప్రతీయమాన ధర్మా=ప్రతీయమానమగు ధర్మము గలదియై, కదాచిత్=ఎప్పుడును, న ప్రయుజ్యతే= ప్రయోగింపబడదు.

తాత్పర్య వివరణములు— ఉపాధి రెండు విధములు. ప్రయుజ్యమానమును ప్రతీయమానమును. "తదస్యామ్ ప్రహరణమితి క్రీడాయాంణః" (4-2-57) అని యొక సూత్రము. ఈ క్రీడలో దండము ప్రహరణముగాని నిది 'దాణ్డా' యనబడును. ఇందు ముష్టి ప్రహరణముగాన నీ క్రీడ 'మౌష్ట' యగును. 'దాండా' 'మౌష్టా' అను స్త్రీలింగ రూపములు పైని జెప్పబడిన యర్థమునందు లోకమున ప్రయోగములలో గలవు. వాని సాధుత్వ బోధన మున కీ సూత్రము రచింపబడినది. ఇందు 'తత్' అనునది ప్రయోగములందున్న దండ, ముష్టి, హస్త మున్నగువాని కనుకరణము. ప్రయోగవాక్యమున 'దండః' అను దానికి 'ప్రహరణం' అనునది సమానాధికరణ విశేషణముగా నుపాత్తము. ఇది ప్రయుజ్యమానమగు నుపాధి. ప్రయోగమునందు వినబడని యుపాధికి సూత్రములందును కరణమును ఉండబోదు. ప్రకృత సూత్రమున క్రియ యను నుపాధి యట్టిది. 'బ్రాహ్మణేన తుల్యమధీతే క్షత్రియః' అనుచో నధ్యయనమను క్రియ సాక్షాత్తు, బ్రాహ్మణగతముగా జెప్పబడలేదు. అది సామర్థ్యమువలన గమ్యము మాత్రమే. ఆ క్రియకు సూత్రమున ప్రథమాంతముగా నిర్దేశము చేయబడినను సమన్వయ ముపపన్నముగాన దోషము లేదు. ॥464॥

అవతారిక— అందు ప్రతీయమానమగు నుపాధి కుదాహరణము.

శ్లో॥ నీల ముత్పలమిత్యత్ర న విశేష్యే న భేదకే ।
కశ్చిత్తద్ధర్మవచనో వాక్యే శబ్దః ప్రయుజ్యతే ॥ 465

నీల ముత్పల మిత్యత్రవాక్యే = 'నీలం చ తదుత్పలంచ' అను వాక్యమునందు, విశేష్యే = విశేష్యమునందుగాని, భేదకే = విశేషణమునందుగాని, తద్ధర్మ వచనః = విశేషణ విశేష్య భావమును జెప్పు పదము, కశ్చిత్ శబ్దః = ఏ శబ్దమును, న ప్రయుజ్యతే = ప్రయోగింప బడుట లేదు.

తాత్పర్య వివరణములు— నీలోత్పలముల విశేషణ విశేష్యభావము సామానాధి కరణ్యమువలననే గమ్యము. కావున దానిని జెప్పునట్టి శబ్దమేదియును, "నీలమనునది విశేష ణము, ఉత్పలమనునది విశేష్యము" - అని ఈ రీతిగా ప్రయోగింపబడదు. సూత్రమునందే విశేషణము, విశేష్యము అను పదములు, "విశేషణం విశేష్యేణ బహులమ్" అని ప్రయుక్త ములు. ప్రతీయమానమగు నుపాధి గల వాక్యమున కిది నిదర్శనము. ॥465॥

అవతారిక— అందువలన—

శ్లో॥ అత్యంతానుగమాత్తత్ర న సూత్రే న చ విగ్రహే ।
విభక్తిపరిణామేన కించిదస్తి ప్రయోజనమ్ ॥ 466

అత్యన్తానుగమాత్ = విశేషణ విశేష్యభావము అత్యంతము ననుగతమై, తత్ర = అచ్చట నుండుటవలన, విభక్తి పరిణామేన = విభక్తిని మార్చుటతో, సూత్రే = సూత్రమునందు, కించిత్ ప్రయోజనం=ఏమియు ప్రయోజనము, నాస్తి = లేదు. విగ్రహే చ నాస్తి=విగ్రహ వాక్యమునను ప్రయోజనము లేదు.

తాత్పర్య వివరణములు— "నీలంచ తత్ ఉత్పలంచ" అను వాక్యమునందు 'ఉత్పలం విశేష్యమ్' అనిగాని, సూత్రమునందు 'విశేష్యేణ' అను తృతీయాంతమును 'విశేష్యం' అని ప్రథమాంతముగ గాని మార్ప బనిలేదు. సామానాధికరణ్యము వలన ఆ సంబంధము తెలియుచున్నది గదా । వాక్యమున 'విశేష్యం' అను పదము ప్రయోగింపబడిన యెడల దాని కనుకరణమైన, సూత్రస్థమగు 'విశేష్యేణ' అనునది గూడ ప్రథమాంతముగ మార్పబడి యుండెడిది. కనుక నిటువంటి స్థలములందు విభక్తి విపరిణామమునకు ప్రసక్తియే లేదు అని భావము. ॥466॥

అవతారిక— దీని నుదాహరణముగా దీసికొని ప్రకృత సూత్రమునను విభక్తి విపరిణామ మక్కరలేదనుచున్నారు.

శ్లో॥ తృతీయాన్తం క్రియేత్యేతత్ విగ్రహే న ప్రయుజ్యతే ।
యథా దండః ప్రహరణం క్రీడాయామితి దృశ్యతే ॥ 467

'దాండా' - అను తద్ధితాంతమునకు విగ్రహ వాక్యమున "దండః ప్రహరణం అస్యాం క్రీడాయాం" - అని యథా = ఏ ప్రకారము, దృశ్యతే = కనబడుచున్నదో, తథా = ఆ విధ ముగా, తృతీయాంతం = తృతీయాంతమగు, 'క్రియా' ఇత్యేతాత్ = 'క్రియయా' - అనునది,

ఆకారైః = ఆకారములచే, వ్యవచ్ఛేదాత్ = నియమింపబడి యున్నందున, సార్వార్థ్యమ్ + చ = సర్వార్థ బోధకత్వము మాత్రము అనగా ఎల్ల యర్థములను బోధించుట, అవరుధ్యతే = నివారింపబడుచున్నది.

ఎల్ల శబ్దములు ద్రవ్యబోధకములే. కాని అవిద్యావశమున ఆ ద్రవ్యము రూప విశేషముతో కలసియున్నదే బోధ విషయమగును. ఘటాకారమును ఊతగా గైకొనియున్న బ్రహ్మము ఘట శబ్దముచే బోధింపబడును. అట్లే పటాకారమును ఊతగా గైకొనియున్న బ్రహ్మమును పటశబ్దము బోధించును. ఈ కారణమువలన ఆయా ఆకారములచే ద్రవ్యము నియమితమగునట్లుండుట వలన ఎల్ల శబ్దములు ఎల్ల యర్థములను బోధింపవు.

పై యర్థమున దృష్టాంతమును జూపుచున్నాడు. చక్షురాదీనామ్ = కన్ను మున్నగువానియొక్క, సామర్థ్యమ్ = శక్తి అనగా విషయమును గ్రహించుట అనే శక్తి, నాడికాదిభిః = గొట్టము మున్నగువానిచే, యథా + ఏవ = ఏ రీతిగా, అవరుధ్యతే = నిరోధింప బడుచున్నదో, నాడిక అనగా గొట్టము. నేత్రము తనతో సంబంధించియున్న ఘటము మున్నగు విషయములన్నిటిని గ్రహింపగలదు. కాని మనము వెదురు గొట్టముతో, ఇనుప గొట్టముతో, మరియొక గొట్టముతో చూచిన ఆ కన్ను పరిమితమగు వస్తువునే గ్రహించును. దగ్గరగానున్న ఎల్ల వస్తువులను గ్రహింపలేదు. గొట్టము ఇంద్రియము యొక్క శక్తిని నియమితమగునట్లు చేయుచున్నది.

ఇట్లే ఏకాగ్రత, రూపముయొక్క సౌందర్యము కూడ ఇంద్రియశక్తిని సార్వత్రికముకాకుండచేయును.

ఇట్లే అన్నిటిని గ్రహించెడి శక్తి కలిగిన మనస్సు అవధానదశలో ఇతర పదార్థములను గ్రహింపజాలదు. ॥5॥

*అవతారిక* — కడవమున్నగు ఎల్లశబ్దములు ద్రవ్యబోధకములనియు, ఆ ద్రవ్యము సార్వత్రికమనియు ఇంతవరకు చెప్పబడినది. కాని అవయవముల కూర్పు అను అర్థము కల సంస్థానము, సన్నివేశము మున్నగు శబ్దములు ధర్మమును బోధించును. అవి పైచూపబడిన ద్రవ్యమును బోధింపవు. కాబట్టి ద్రవ్యపదార్థము సార్వత్రిక మనుటయెట్లు పొసగును ? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ తేష్వాకారేషు యశ్శబ్ద స్తథా భూతేషు వర్తతే ।**
**తత్త్వాత్మకత్వా త్తేనాపి నిత్యమేవాభిధీయతే ॥** 6

తథాభూతేషు = అట్టి, అనగా ఉపాధి మాత్రమే స్వభావముగా గల, తేషు = ఆ, ఆకారేషు = ఆకారములయందు అనగా అవయవములకూర్పుల యందు, యః = ఏ, శబ్దః = సంస్థానము, సన్నివేశము మున్నగుశబ్దము, వర్తతే = ఉన్నదో. అనగా వానిని బోధించుచున్నదో, తేన + అపి = ఆ శబ్దముచేగూడ, తత్త్వాత్మకత్వాత్ = ద్రవ్యమే స్వరూపముగా గలదియగుటవలన,

విగ్రహే = 'బ్రాహ్మణవత్' అను దాని విగ్రహమునందు, న ప్రయుజ్యతే = ప్రయోగింపబడలేదు.

**తాత్పర్య వివరణములు—** ఆ, క్రీడలో దండము ప్రహరించుట = కొట్టుటయను క్రియకు సాధకతమము. అది అందు కరణమని, దండః అస్యాం అని మాత్రమే విగ్రహ వాక్యమయినచో, తెలియబోదు. కనుక 'ప్రహరణమ్' అనునదియు ప్రయోగింపబడుచున్నది. అది ఉపాధి. దానికి, 'ప్రహరణ క్రియకు సాధకమయినది' అని చెప్పు స్వశబ్దమగు 'ప్రహరణం' అను పదము నుపయోగించి తెలియజేయుట ఆవశ్యకమయినది

''బ్రాహ్మణేన తుల్యం క్షత్రియః అధీతే'' అను విగ్రహ వాక్యమునందు, 'అధ్యయన క్రియచేత' అని తెలుపుటకు 'క్రియయా' అను పదము నుపయోగించుట లేదు. ఉపమేయమగు 'క్షత్రియః' అను పదమునకు సమీపమున నుచ్చరింపబడిన అధీతే అను దానికి సామర్థ్యమువలన నుపమానమునందును సమన్వయము సిద్ధించును. అట్లు గాకున్న నుపమానోపమేయ భావమే ప్రతీతము గాదుగదా ! కాగా వాక్యమున 'క్రియయా' అను దానికి ప్రయోగము లేనపుడిక సూత్రమున విభక్తి పరిణామ మెందులకు ? అని తాత్పర్యము.॥467॥

*అవతారిక—* అంతర్భూతమగు ధర్మముగల ఉపాధికి నీలోత్పలమనునది యుదాహరణమనిరి. కాని అట ''నీలం విశేషణం ఉత్పలం విశేష్యమ్'' అనియు విగ్రహ వాక్య ప్రయోగము గలదేయనిన, నిర్వివాదోదాహరణమును జెప్పుచున్నారు.

**శ్లో॥ ఘవిధౌ ఘశ్చ సంజ్ఞాయామితి సూత్ర ఉదాహృతమ్ ।**
**ఉపాదానం ప్రయోగేషు తస్యాత్యంతం న విద్యతే ॥** 468

ఘవిధౌ = ''పుంసి సంజ్ఞాయాః'' అను ఘప్రత్యయవిధిలో, ఘశ్చ సంజ్ఞాయామ్ = సంజ్ఞయందు ఘ ప్రత్యయమగును, ఇతి = అని, సూత్రే = ఆ సూత్రమునందు (3-3-118), ఉదాహృతమ్ = చెప్పబడియున్నది, తస్య = ఆ 'సంజ్ఞాయామ్' అను ఉపాధికి, ప్రయోగేషు = విగ్రహ వాక్యములందు, ఉపాదానం = ప్రయోగము = ఉచ్చారణమనుట, అత్యంతమ్ = ఎంతమాత్రమును, న విద్యతే = లేదు.

**తాత్పర్య వివరణములు—** ''పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ'' అని సూత్రము (3-3-118). ఇది 'ఘ' అను ప్రత్యయమును సంజ్ఞ అయినపుడు విధించుచున్నది. తదంతములు పుంలింగములయి యుండును. 'దంతచ్ఛదః' 'ఆకరః' మున్నగు సంజ్ఞావాచకము లుదాహరణములు. 'దన్తాః ఛాద్యన్తే అనేన' - 'ఆకుర్వన్తి అస్మిన్నిత్యాకరః' అని విగ్రహ వాక్యములు. అట ఉపాధియగు సంజ్ఞాపదమునకు విగ్రహములందు ప్రయోగము లేదు. ఎందువలన ? ప్రకృతి ప్రత్యయ సముదాయము సంజ్ఞ యగుటచే సంజ్ఞారూపమగు నుపాధి అందంతర్గతమయియే యున్నది. ఆ విధముగనే ప్రకృత సూత్రమునందును క్రియ అను నుపాధి అంతర్భూతమగుటచే 'క్రియయా తుల్యం' అని చెప్పలేదు. ॥468॥

*అవతారిక* — ఇక, సూత్రమునందు 'తేన'- అని నిర్దేశింపబడిన తృతీయా సమర్థము ప్రధానము గాన, దాని ననుసరించి 'క్రియా' అనునది గూడ తృతీయాంతము గావలె నందురేమో?

**శ్లో॥ యైరప్రయుక్తైః సంస్కారః ప్రధానేషు ప్రతీయతే।**
**తే భేదేపి విభక్తీనాం నిర్దిశ్యన్త ఉపాధయః॥ 469**

అప్రయుక్తైః = విగ్రహ వాక్యమునందు ప్రయోగింపబడని, యైః = ఏ ఉపాధులచేతను, ప్రధానేషు = ప్రధానములగు వాని విషయమున, సంస్కారః = అతిశయమును గలుగచేయుట, ప్రతీయతే = కనబడుచుండునో, తే ఉపాధయః = ఆ విశేషణములు, విభక్తీనామ్ = వాని విభక్తులకు, భేదే సత్యపి = భేదమున్నను. నిర్దిశ్యన్తే = వ్యవచ్ఛేదకములగుచునే యుండును.

*తాత్పర్య వివరణములు* — క్రియ యను నుపాధి విగ్రహవాక్యమున ప్రయోగము లేకున్నను ప్రధానమును సంస్కరించుచునే యున్నది. సంస్కారమనగా దానిని విశేషించుట· అయ్యది ప్రథమాంతముగా నున్నను, తృతీయాంతముతో దానికి సంబంధము కలుగును. క్రియా గ్రహణమున కదియే ప్రయోజనము గదా 'క్రియయా' అని మార్చినపుడైన సామానాధి కరణ్యము సిద్ధింపదాయె. ఏలయన నవి భిన్నలింగములు గదా. కావున నా యుపాధి యెట్లు నిర్దేశింపబడినను, అప్రధానములు ప్రధానమును సంస్కరించుటకే యేర్పడినవి గాన తత్కృత వ్యవచ్ఛేదము సిద్ధించును. ॥469॥

*అవతారిక* — ఇంతవరకు, ప్రకృత్యర్థ విశేషణ పక్షమున, క్రియావచనమునకు తృతీయాంతత్వము సంభవింపదని నిరూపింపబడినది. ఇక, "సర్వ ఏతే శబ్దాః గుణ సముదాయేషు వర్తన్తే" - అను భాష్యగ్రంథము వివరింపబడును.

**శ్లో॥ సముదాయేషు వర్తన్తే భావానాం సహచారిణామ్।**
**శబ్దాస్తత్త్వ వివక్షాయాం సముచ్చయ వికల్పయోః॥ 470**

శబ్దాః = 'బ్రాహ్మణ' మున్నగు శబ్దములు, సహచారిణామ్ = తమతో గలసియుండు, భావానామ్ = ధర్మముల యొక్క, సముదాయేషు = సమూహములందు, వర్తన్తే = వర్తించును, తత్ తు = అవర్తించుటయును, సముచ్చయ వికల్పయోః = సముచ్చయ వికల్పముల యొక్క అవివక్షాయాం భవతి = వివక్ష చేయనపుడే సంభవించును.

తాత్పర్య వివరణములు— తెల్లగానుండుట, పరిశుద్ధమగు నాచారము, తలవెండ్రుకలు పసుపురంగుగ నుండుట - మున్నగునవి బ్రాహ్మణ జాతీయుల నియతధర్మములు. వాని సముదాయము నా శబ్దములు బోధించును. ఆ ధర్మములకు ఒకప్పుడు నియత సహచారము లేకున్నను బ్రాహ్మణత్వ జాతి సహచారము తప్పదు. అదియును, 'ఇదియా? అదియా' - అను వికల్పముగాని, ఇదియును నదియును నను సముచ్చయముగాని లేనపుడే, సంభవించును ॥470॥

అవతారిక— గుణ సముదాయమును బోధించు శబ్దములలో, ఆ గుణములకు వికల్పము గలిగిన నది సముదాయార్థమునకు విరుద్ధముగాన, నా వికల్పము లేకుండ నిమ్ము. సముచ్చయమనగా నొక్కసారిగనే యనేకార్థములను బోధించుటగదా. అది సముదాయమునకు విరుద్ధముగాదే యనిన—

శ్లో॥ సముచ్చయస్తు క్రియతే యేషు ప్రత్యర్థవృత్తిషు ।
భేదాధిష్ఠానయా యోగస్తేషాం భవతి సంఖ్యయా ॥ 471

ప్రత్యర్థ వృత్తిషు = ప్రత్యేకముగ సముదాయావయవ బోధకములగు, యేషు తు = ఏ శబ్దములందు, సముచ్చయః = అవయవ సముచ్చయ బోధనము, క్రియతే = చేయబడునో, తేషాం = ఆ శబ్దములకు, భేదాధిష్ఠానయా = అవయవభేదము ఆశ్రయముగా గల, సంఖ్యయా = సంఖ్యావాచక వచనముతో, యోగః భవతి = సంబంధము కలుగును.

తాత్పర్య వివరణములు— సముదాయ బోధక శబ్దములు అవయవములను గూడ బోధించినపుడు సముదాయము సముచ్చయరూపముగ వాచ్యమగును. అవయవములన్నియు సమానమగు కక్ష్య గలవి. కాని అనేకత్వము, ప్రకటము. అవి యన్నియు ప్రధానములే. కనుక వాని బహుత్వమును పురస్కరించుకొని బహువచనము ప్రవర్తించును. ఎట్లనగా - 'వనము' 'వృక్షములు' అను పదములను జూడుడు. వనమనగా వృక్షముల సముదాయము. కాని అవయవములను ప్రధానముగ బోధింపదలంచిన, 'వృక్షాః' అని బహువచనమే ప్రయోగింపబడుచున్నది. సముదాయమును బోధింపదలంచిన 'వనము' అని సముదాయ గతైకత్వ బోధకమగు నేకవచనమే ప్రయుక్తము. ఆ విధముగనే ప్రకృతమునను, బ్రాహ్మణ శబ్దము సముదాయార్థకమయినపుడు, ప్రత్యర్థ వృత్తి కానేరదుగాన, అనగా పృథగవయవములను బోధింపదు గాన సముచ్చయ మట సంభవింపదు. కావున సముచ్చయము సముదాయ విరోధియే యగును. ॥471॥

అవతారిక— ఓయీ ! మాత్రా కలాపము = అనగా అవయవముల సమూహము, సమాన కక్ష్యముగ నభిహితము కానపుడు, జాతి విశిష్ట ద్రవ్యము శబ్దములచే బోధింపబడు నను పక్షమునకును దీనికిని భేదమేమి ? అనిన—

శ్లో॥ సర్వైర్విశిష్టాస్తైరర్థైర్జన్యన్తే సహచారిభిః ।
బుద్ధయ ప్రతిపత్తమాణాం శబ్దార్థాంస్తానతో విదుః ॥ 472

సహచారిభిః తైః = కూడనుండు ఆ, సర్వైః అర్థైః = సకలార్థముల తోడను, విశిష్టాః = కూడిన, బుద్ధయః = బుద్ధులు = జ్ఞానములు, ప్రతిపత్తిమాణాం = శ్రోతలకు, జన్యన్తే = కలిగింపబడును, అతః = అందువలన, తాన్ = వానిని, శబ్దార్థాన్ = శబ్దముల కర్థములనుగా విదుః = తెలిసికొనుచుందురు.

తాత్పర్య వివరణములు— జాతియో, గుణమో క్రియయో ద్రవ్యముతో గలసియే యుండును. వానిచే రూపితములయి జాత్యాది విశిష్టమగు నర్థము గ్రహింపచేయు బుద్ధులు శ్రోతల కా శబ్దముల ప్రయోగములందు గలిగింపబడుచుండును. బుద్ధ్యనుసారముగ నిరూపిత మయిన యర్థమునే శబ్దములు బోధించును. కనుక గుణసముదాయమే ప్రతీతి గోచరమగు శబ్దార్థము. ద్రవ్యము అర్థక్రియాకారి. అనగా పనికి ఉపయోగపడునది. కనుక జాతిగుణ క్రియాది ధర్మములతో సంస్పృష్టమయియే శక్తికి విషయమగును = బోధ్యమగుననుట. అదియు నొక్కటియే గనుక ఏకవచనమే. ఇక ద్రవ్యాభిధాన పక్షముననో, ద్రవ్య మొక్కటియే జాత్యావిష్టమయి వాచ్యమగును. గుణమును క్రియయును సామర్థ్యమువలన నవగతము లగును. క్రియా గుణములు లేని ద్రవ్య ముండదుగదా ? కావున ఆ పక్షమున క్రియా గుణములకు అభిధానము లేదు. ఈ పక్షమున నన్నియు వాచ్యములే = అభిధాన విషయములే.॥472॥

అవతారిక—పైన నుపపాదింపబడిన విషయమునే యీ కారిక వివరించుచున్నది.

శ్లో॥ సంసృష్టాః ప్రత్యయేష్వర్థాః సర్వ ఏవోపకారిణః ।
తేషాం ప్రత్యయరూపేణ సర్వేషాం శబ్దవాచ్యతా ॥ 473

సర్వే ఏవ అర్థాః = సమస్త పదార్థములును, ప్రత్యయేషు = బుద్ధులయందు, సంసృష్టాః = సంసర్గము గలవియై, ఉపకారిణః = చోద్యములు, భవన్తి = అగుచున్నవి, తేషాం = వానికి, సర్వేషాం = అన్నింటికిని, ప్రత్యయ రూపేణ = బుద్ధిరూపముననే, శబ్దవాచ్యతా = శబ్ద వాచ్యత గూడ, భవతి = కలుగుచున్నది.

తాత్పర్య వివరణములు— వక్త శబ్దముల నుచ్చరించిన వెంటనే శ్రోతల బుద్ధుల యందు పదార్థాకారముపారూఢమగును. ఆ ఆకారమును ముందు బోధించి, తరువాత దానితో బాహ్య వస్తువున కభేదమును గ్రహించిన వెనుక శబ్దములు దానిని బోధించును. మాత్రా కలాపరూపమగు సకలార్థములును, బుద్ధియందు ఏర్పడిన ఆకారము ననుసరించియే వాచ్యము లగుచుండును. బుద్ధి గోచరములగు జాతిగుణ క్రియా ద్రవ్యములను నర్థములు, సంసర్గమును ప్రత్యయములందే = బుద్ధులయందే పొందునుగాన తద్వాచక శబ్దములను సముదాయాభిధాయి శబ్దము లందురు. బాహ్య పదార్థములు అంశరహితములు. బుద్ధి పరికల్పిత పదార్థములందే భాగ విభాగము నిశ్చితమగును. అందును బాహ్య పదార్థములవలె ప్రధానా ప్రధాన భావమును బట్టియే బుద్ధియందును వానికి భాసము కలుగును గాన జాతిగుణ క్రియలతో సంసృష్టమగు ద్రవ్యమే ప్రధానముగ వాచ్యమగును. అందువలననే ఆ శబ్దము లేకార్థములని యందురు.॥473

అవతారిక— శబ్దములు, గుణసముదాయ వాచకములని యనవలసిన పని యేమి గలదు ? అవి ద్రవ్యమాత్ర వాచకములే యనరాదాయనిన—

శ్లో॥ కేవలానాం తు భావానాం న రూపమవధార్యతే ।
అనిర్ధూపిత రూపేషు తేషు శబ్దో న వర్తతే ॥ 474

కేవలానాం = ఉపాధి సంసర్గము = విశేషణ సంబంధములేని, భావానాం తు = ద్రవ్యములకు మాత్రము, రూపం = స్వరూపము, న అవధార్యతే = నిరూపింపబడదు, అనిరూపిత రూపేషు = రూప నిరూపణము లేని, తేషు = ఆ ద్రవ్యముల యందు, శబ్దః = శబ్దము, న వర్తతే = బోధకముగా నుండదు.

తాత్పర్య వివరణములు— ఏదియేని యొక ధర్మముతో గూడి నిరూపిత స్వరూపము లయిన పదార్థములే శబ్దబోధ్యములగును. ఉపాధిరహితమగు ద్రవ్యమాత్రము నిరూపణ గోచరము గాదు. 'ఇది ఈ ప్రకారమయినది' అని తెలిసికొనుటయే గదా నిరూపణము. కావున నిరవచ్ఛిన్నమగు ద్రవ్యము భాసింపనే భాసింపదు. జాతియో, గుణమో, క్రియయో అవచ్ఛేదకములుగా నుండియే తీరవలెను. కావున విశేషణ విశిష్టమే, గుణసముదాయ వాచకత్వ సిద్ధాంతమున, శబ్దవాచ్యము. సముదాయ వృత్తులు పంచాలాది శబ్దములు 'పూర్వ పంచాలము' అనినపుడు ఆ పూర్వ = తూర్పు అను విశేషణము వలన, అవయవబోధకమగుచున్నది.॥474

అవతారిక— అట్లయిన సముదాయమును బోధించు శబ్దము, సముదాయ రూపమగు నర్థమును వదిలిపెట్టి, అవయవమును బోధించునట్లగునుగదా? అపుడు శబ్దార్థ సంబంధమునకు అనిత్యత్వము వాటిల్లదా? అనిన—

శ్లో॥ పూర్వశబ్ద ప్రయోగాచ్చ సమూహాన్ననివర్తతే ।
వర్తతే అవయవేనాపి, నోపాత్తం త్యజతి క్వచిత్ ॥ 475

పూర్వశబ్ద ప్రయోగాత్ = 'పూర్వే' - అను శబ్దముండుటవలన, సమూహాత్ = సముదాయము నుండి, న నివర్తతే = పంచాల శబ్దము మరలదు, అవయవే అపిచ = అవయవ రూపమగు నర్థమున గూడ, న వర్తతే = అపూర్వముగ వర్తింపదు, ఉపాత్తం = గృహీతమయిన నిరూఢార్థమును, క్వచిత్ = ఎచ్చటను, న త్యజతి = విడిచిపెట్టదు.

తాత్పర్య వివరణములు— 'పూర్వే పంచాలాః' = తూర్పు పంచాలము, అనుచోట పంచాల శబ్దము మొత్తము పంచాల దేశమునంతను జెప్పునది. అందు 'తూర్పు' అను నవయవ వాచకమున్నను, నది సముదాయార్థము నుండి తొలగదు. ఎందువలన ననగా, శబ్దార్థ సంబంధము నిత్యము గదా. అపూర్వముగ నిచట నది అవయవ వాచకమును గాదు. నిరూఢమగు నర్థమును వదలిపెట్టుట, అపూర్వార్థమును పరిగ్రహించుటయు నెచ్చటను శబ్దముల విషయమున సమ్మతము గాదు. ॥475॥

అవతారిక— అట్లయిన సమన్వయము కుదురదే? అవయవ వాచకమగు పూర్వ శబ్దమునకు సముదాయ వాచకమగు పంచాల శబ్దముతో సమన్వయము పొసగుటకు సముదాయ బోధకము గూడ నవయవమును బోధించుననరాదా యనిన—

శ్లో॥ సముదాయాభిధాయీ చ యది భేదం విశేషయేత్ ।
తత్రాతుల్య విభక్తిత్వం పూర్వకాయాదివద్భవేత్ ॥ 476

సముదాయాభిధాయీ చ = సముదాయవాచక శబ్దము గూడ, భేదం = అవయవమును, విశేష యేద్యది = వ్యచ్ఛేదించిన యెడల = వేరు పరచినచో, తత్ర = అచట = పూర్వే పంచాలాః అనుచోట, పూర్వకాయాదివత్ = 'పూర్వకాయః' అనుచోట వలె, అతుల్య విభక్తిత్వమ్ = విషమ విభక్తిని గలిగియుండుట, భవేత్ = ప్రాప్తించును.

తాత్పర్య వివరణములు— పంచాల దేశమంతయు నొక్కటియే. దానినే పంచాలము శబ్దము చెప్పును. అది అఖండము. సఖండమైనచో అఖండమును జెప్పుటకు పూర్వశబ్ది ప్రయోగ మావశ్యకమయ్యెడిది. కాని అట్లు వ్యవచ్ఛేద్యము లేకయున్నను ప్రయోగింపబడిన పూర్వశబ్దము పంచాల దేశమున నవయవ భేదమును గల్పించినచో నపుడు పంచాల దేశము యొక్క తూర్పుభాగ మిదియని యర్థమగును. 'పూర్వః కాయస్య' = శరీరము యొక్క పూర్వ భాగము - అనునట్లు, 'పూర్వః పంచాలానామ్' అని ప్రథమాంత షష్ఠ్యంత పదములుగ ప్రయోగించవలసి వచ్చును. సామానాధికరణ్యము కుదురదు. సామానాధికరణ్యమునకు భంగము లేకుండగ నవయవార్థబోధనము యుక్తము గాదు. సంబంధము నిత్యమాయె - అని తాత్పర్యము. ॥476॥

అవతారిక—ఇక, ఈ పంచాల శబ్దము అవయవబోధకమును నగునను విషయము సమర్థింపబడుచున్నది.

శ్లో॥ సమూహే చ ప్రదేశే చ పంచాలా ఇతి దృశ్యతే ।
తథా విశేషణం సర్వఇత్యేతదుపపద్యతే ॥ 477

పంచాలాః ఇతి = 'పంచాలాః' అను పదము, సమూహేచ, ప్రదేశేచ = సముదాయము నందును, అవయవమునందును, దృశ్యతే = ప్రయోగములం దగపడుచున్నది, తథా = కను కనే, 'సర్వే' ఇత్యేతత్ = 'సర్వే' అను నీ, విశేషణం = విశేషణము, ఉపపద్యతే = ఉప పన్న మగుచున్నది.

తాత్పర్య వివరణములు— పంచాల శబ్దము ముఖ్యవృత్తియగు శక్తిచేతనే సముదాయమును అవయవమును అనగా ఆ దేశమున గొంతభాగమును గూడ బోధించును. 'పంచాల దేశీయులకు నివాసమయిన జనపదమ'ను వ్యుత్పత్త్యర్థమును బట్టియు అర్థ ద్వయమునకును ఉపపత్తి కలదు. జనపదమంతయు నివాసమయినట్లు తదేకదేశమును నివాసస్థాన మగును గదా ! ఇయ్యది వనశబ్దమువంటి అవయవివాచి, వనమున బ్రవేశింపుమనిన వృక్షసమూహమున బ్రవేశించుట ఏకదేశమున ప్రవేశించుటయే. నివాసాధికరణత్వమను నిమిత్తమును బట్టియీ శబ్దము ప్రవర్తించుచున్నది. ఆ నిమిత్తము సముదాయావయవములకు తుల్యము. 'పంచాల దేశమునందు ప్రవేశించినాడు' 'ఆ దేశమును జూడుడు' - ఈ మున్నగు వ్యవహారములందు ఏకదేశ ద్వారముననే గదా ఆ యా పనులు జరుగునది.

వ్యుత్పత్తివాదమును విడిచి స్వాభావిక వాదమును బట్టినను = అనగా పంచాల శబ్దము రూఢి శక్తిచేత నర్థబోధకమేగాని అవయవశక్తిచే గాదన్నను, అనేకార్థక శబ్దములవలె

నిదియు సముదాయైక దేశములను బోధించుననుట యొప్పును. కనుకనే, 'పంచాల దేశము లబ్ధము' - 'పంచాలము కొట్టబడినది' - ఇత్యాది వ్యవహారములలో, దేశమంతయు లబ్ధమా ? ఏకదేశము మాత్రమా ? యను సందేహమును వారించుటకు "సర్వే పంచాలా లబ్ధాః" - అని సర్వశబ్దము విశేషణముగా నుపయోగింపబడుచున్నది. దానివలనను నీ శబ్ద ముభయవాచక మని సిద్ధము. కావున నిట్లు సముదాయ శబ్దములు ప్రసిద్ధములయినవి ముఖ్యవృత్తిచేతనే ఉభయ బోధకములుగ నగపడుచున్నవి ॥477॥

అవతారిక— ఇందు భాష్యకారుని సంవాదమును గలదనుచున్నారు.

**శ్లో॥ తథార్ధపిప్పలీత్యత్ర జాత్యంతరనివృత్తయే ।**
**అర్ధం చ పిప్పలీచేతిఖండే శబ్దః ప్రయుజ్యతే ॥** 478

తథా=ఆ ప్రకారముగనే (అందువలననే), అర్ధపిప్పలీ ఇత్యత్ర='అర్ధపిప్పలీ' అను సమాసమున, జాత్యంతర నివృత్తయే = ఈ సగము వేరొక జాతిదిగాదని చెప్పుటకు, అర్ధం చ పిప్పలీ చ ఇతి = "అర్ధం చ తత్ పిప్పలీ చ" - అని, ఖండే = అర్ధ ఖండ భాగమునందు, శబ్దః = పిప్పలీ శబ్దము విశేష్యముగా, ప్రయుజ్యతే = ప్రయోగింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ఏకదేశి సమాసమని తత్పురుష సమాసభేదము ఒకటి కలదు. 'అర్ధపిప్పలీ' 'పూర్వకాయః' మున్నగునవి యుదాహరణములు. 'అర్ధం పిప్పల్యాః' 'పూర్వం కాయస్య' అని విగ్రహవాక్యము. ఈ సగము ముక్క, పిప్పలి కట్టెది. వేరు దానిది గాదు అని జాత్యంతర నివృత్తికై పిప్పలీ శబ్ద ప్రయోగము. ఇందు 'అర్ధం' అనునది ప్రధానము, అది నపుంసకము. సమాసలింగము స్త్రీలింగము గానున్నది. అందుకొరకు "పరవల్లింగ ద్వంద్వ తత్పురుషయోః" అని పరపదలింగము సమాసమున కతిదేశింపబడినది.

ఈ ఏకదేశి సమాసమును భాష్యకారుడు ప్రత్యాఖ్యానము చేసినాడు. 'అర్ధం చ తత్ పిప్పలీ చ' అను విగ్రహము గల సమానాధికరణ సమాసమే కావచ్చునని తాత్పర్యము. తత్పురుష ఉత్తరపదార్థ ప్రధానముగాన పిప్పలీ శబ్ద స్త్రీలింగము సమాసమునకు సిద్ధించును. పరపద లింగాతిదేశ మక్కరలేదని యభిప్రాయము. ఒకదాని యందలి భాగము ఏకదేశము. ఆ యర్ధముగ పదముతో గూడినది ఏకదేశి సమాసము. ఏకదేశి సమాసమునందు, అర్ధము పిప్పలిచే విశేషింపబడుచున్నది. సమానాధికరణ సమాసమునందు జాత్యంతరము గాదని తెలియజేయుటకే, 'అర్ధం' అను దానికి పిప్పలి విశేష్యమగుచున్నది. కాగా రెండు సమాసముల కును ఫలాంశమున నభేదమే కలదు గాన నేకదేశి సమాసము ప్రత్యాఖ్యాతము. జాతి ప్రవృత్తి నిమిత్తకమయిన పిప్పలీ శబ్దము వ్యక్తియందు, దాని ప్రచయాపచయములతో నిమిత్తము లేకయే వర్తించును. అట్లు కానిచో 'అర్ధం చ పిప్పలీ చ' అను సామానాధికరణ్యము కుదురదుగదా యని భావము. ॥478॥

*అవతారిక* — ఈ ఖండము వేఱొకటి గాదు పిప్పలియే యని తెలియచేయుటకు అవయవమునందు గూడ సముదాయవాచి శబ్దము ప్రయోగింపబడినట్లే పంచాల శబ్దమును ప్రయోగింపబడునని చెప్పుచున్నారు.

**శ్లో॥ పంచాలానాం ప్రదేశోఽపిభిన్నో జనపదాంతరాత్ ।**
**తత్రాన్యస్య నివృత్త్యర్థే శబ్దే భేదో న గమ్యతే ॥** 479

పంచాలానాం = పంచాలమను జనపదము యొక్క, ప్రదేశోఽపి = ఏకదేశమగు గ్రామము గూడ, జనపదాంతరాత్ = 'మగధ' మున్నగు నితర జనపదముకంటె, భిన్నః = వేరయినదే, తత్ర = అందు, అన్యస్య = వేఱొక దేశమును, నివృత్త్యర్థే శబ్దే = నివర్తింపజేయుటకు ప్రయుక్తమైన శబ్దమునందు కాదనుటకు, భేదః న గమ్యతే = భేదము తెలియబడదు.

తాత్పర్య వివరణములు— జనపదమనగా కొన్ని గ్రామముల గుంపు. దాని ఏక దేశములు, ఆ జనపదమునందలి గ్రామములు. పంచాల జనపదమంతయు మగధ జనపదము కంటె వేరయినది యయినట్లే, దాని యేకదేశమగు గ్రామమును, భిన్నమే. ఆ భేదమును సూచించుటకే 'పూర్వే పంచాలాః' అను వాక్యమున పంచాల శబ్దము ప్రయోగింపబడుచున్నది అట్టియెడ, సముదాయావయవ భేదము అదరింపబడదు. పంచాల శబ్దము, ముఖ్యవృత్తిచేత నే తదంతర్గత గ్రామమును బోధించును. కాగా అవయవముతో సముదాయవాచకమునకు సామా నాధికరణ్య ముపపన్నమగును. రెండును తుల్య విభక్తులే కావచ్చును. జాత్యంతర నివృత్తి వివక్షితమయినపుడు సముదాయావయవ వాచకములు తుల్యములే యగును. ॥479॥

*అవతారిక* — "సముదాయేషు హి వృత్తాః శబ్దాః అవయవేష్వపి వర్తన్తే" - అని మహాభాష్యమున చెప్పబడిన దాని కేమి యర్థము? సముదాయమునకును అవయవముల కును అభిధేయత్వము తుల్యమేగదా యనిన—

**శ్లో॥ ప్రసిద్ధాస్తు విశేషేణ సముదాయే వ్యవస్థితాః ।**
**ప్రదేశే దర్శనం తేషామర్థ ప్రకరణాదిభిః ॥** 480

విశేషేణ తు = అధికముగనైన, సముదాయే = సమూహమునందే, ప్రసిద్ధా=ప్రసిద్ధములుగా, వ్యవస్థితాః = (పంచాలాదులు) వ్యవస్థ చేయబడియున్నవి, తేషాం = వానికి, అర్థ ప్రకర ణాదిభిః = సామర్థ్యము ప్రకరణము మున్నగువానిచే, ప్రదేశే దర్శనం భవతి = అవయవము నందు ప్రవృత్తి కలుగును. (అందలి ఒక భాగమును గూడ దెలియజేయు చుండును).

తాత్పర్య వివరణములు— 'పంచాల' మున్నగు శబ్దములు మొత్తము జనపదము నందే ప్రసిద్ధ తరములు. అచటనే ముఖ్యవృత్తములు. ప్రకరణమునుబట్టియో, లేక సామర్థ్యము వలననో, అవయవములను గూడ బోధించును. అందువలన భాష్యమున నవి సముదాయమున వృత్తములని చెప్పబడినవి. 'అవయవేష్వపి వర్తంతే' - అనుట ప్రకరణాది మూలకము.

అవతారిక— 'బ్రాహ్మణ' మున్నగు శబ్దములను సముదాయమున ముఖ్య వృత్తములయి ప్రకరణాదివశమున నవయవ మాత్రబోధకములగును.

శ్లో॥ యదుపవ్యంజనం జాతేః సహచారి చ కర్మసు।
తత్రవారూఢ సంబంధం యత్ప్రాయేణోపలక్షితమ్॥ 481

శ్లో॥ సముదాయః ప్రదేశోవేత్యేతం తస్మిన్న నాశ్రితే।
అర్థాత్మన్యవిశేషణవర్తంతే బ్రాహ్మణాదయః॥ 482

యత్ = ఏయది, జాతేః = జాతికి, ఉపవ్యంజనం = అభివ్యంజకమగునదియు, కర్మసు = కర్మలయందు, సహకారిచ = విడువక యుండునదియునో, యత్ = ఏయది, జాతౌ = జాతియందు, రూఢ సంబంధం = నిరూఢమగు సంబంధము కలదిగా, ప్రాయేణ = తరచు, ఉపలక్షితం వా = ఊహింపబడుచున్నదో, సముదాయః = సమూహముగాని, ప్రదేశో వా = ఏకదేశముగాని, ఇత్యేవం = అను నీ విధముగా, అనాశ్రితే = వివక్షింపబడని, తస్మిన్ = ఆ, అర్థాత్మని = పదార్థమునందు, బ్రాహ్మణాదయః = 'బ్రాహ్మణ' మున్నగు శబ్దములు, అవిశేషేణ = భేదము లేకుండగ, వర్తన్తే = ప్రవర్తించుచుండును.

తాత్పర్య వివరణములు— బ్రాహ్మణత్వాది జాతిని అభివ్యంజింపజేయునదియు, ఉపనయనము, మున్నగు సంస్కారములు గలదియునగునే వ్యక్తి విశేషము గలదో దాని నాశ్రయించియు, యజనము యాజనము = అనగా యజ్ఞములను జేయుట చేయించుట మున్నగు క్రియలందు నియతముగ నుండు శౌచము, శ్రద్ధ = ఆస్తిక్య బుద్ధి, విద్వత్త్వము మొదలగు వానిని బట్టియు, ఆ జాతికి అవ్యభిచరితముగ నుండు మృదువగు మనస్సు, సత్యవాదిత్వము, వైరానుబంధము లేకుండుట మొదలగుచు తరచుగ ననుమితములగు వానిని బట్టియు బ్రాహ్మణాది శబ్దములు ప్రవర్తించును. కావున వానిని సముదాయాభిధాయు లందురు.

కాని జాత్యంతర నివృత్తికొరకు, సముదాయావయవ విభాగమును గమనింపక, తదేక దేశమందును నవి వర్తించుచున్నవి అర్థ ప్రకరణాదుల వలన నట్లు ప్రవర్తించుటచే నపుడు వానికి అముఖ్యత్వము వ్యవహరింపబడుచున్నది. ॥481, 482॥

*అవతారిక*— అపుడు, సముదాయమున కర్థము వేరును అవయవార్థము వేరును నగునుగదా! సముదాయ వృత్తములే అవయవములందును వర్తించుచున్నవనుట యెట్లు. అనిన—

శ్లో॥ యశ్చతుల్య శ్రుతిర్దృష్టః సముదాయే వ్యవస్థితః।
తేనోపచరితైకత్వం ప్రదేశేవ్యుపలభ్యతే॥ 483

తుల్య శ్రుతిః = సమాన వినికిడి గలదిగా (సరూపముగా), దృష్టః = దృష్టమయినదై = కనబడినదై, యశ్చ శబ్దః = ఏ శబ్దము, సముదాయే = సముదాయమునందు = తద్బోధకముగా, వ్యవస్థితః = స్థిరపరుపబడి యున్నదో, తేన = అట్టి ఆ శబ్దముతో, ఉపచరితైకత్వం = ఆరో

పింపబడిన అభేదము, ప్రదేశే అపి = అవయవవాచక శబ్దమందు గూడ, ఉపలభ్యతే = కన బడు చున్నది.

తాత్పర్యా వివరణములు— సముదాయ వాచకమయినను, అవయవ వాచకమయి నను, ఆ శబ్దమునకు రూపము తుల్యముగ నుండుటవలన సముదాయబోధకముగ నిశ్చితమయి నదే అవయవ బోధకమును నందురుగాని, అవి భిన్న భిన్న శబ్దములే. ఆ శబ్దమే సముదాయ రూపార్థము నుండి తొలగి అవయవ రూపార్థమును బోధించుచున్నదని తాత్పర్యము గాదు. శబ్దార్థ సంబంధము నిత్యము గదా. ॥483॥

అవతారిక— "తేనతుల్యం క్రియాచేద్వతిః" (5-1-115) సూత్రమునందు మహాభాష్యమున - "ఈ సూత్ర వాక్యార్థ మయుక్తముగ నున్నది తృతీయా సమర్థమయినది క్రియ యయినచో వతి ప్రత్యయము వచ్చుననుచున్నారు. తృతీయా సమర్థము క్రియ ఎట్లగును?" అని యాక్షేపించి, "బ్రాహ్మణః క్షత్రియః వైశ్యః శూద్రః" - అను నీ శబ్దము లన్నియు గుణసముదాయమును జెప్పు శబ్దములు. తపస్సు, వేద వేదాంగాధ్యయనము జన్మ - ఇవి బ్రాహ్మణుడనిపించుకొనుటకు నిమిత్తములు. గౌరత్వము, శౌచము పింగళ వర్ణము, కపిలరంగు తల వెంట్రుకలు - అను నివియు బ్రాహ్మణ శబ్దార్థమున నంతర్భూత ములు. సముదాయమును బోధించు శబ్దములు అవయవములను గూడ బోధించును. ఎట్లనగా 'పూర్వ పంచాలము' 'ఉత్తర పంచాలము' అందురు. తైలము భుజింపబడినది ఘృతము త్రాగబడినది అందురు. అట్లే 'శుక్ల, నీలః, కృష్ణః' - అను శబ్దములును నట్టివే. అట్లే ఈ బ్రాహ్మణ శబ్దము గూడ సముదాయబోధకమై అవయవములను గూడ బోధించును" - అని సమాధానము చెప్పబడినది.

అందు 'పూర్వే పంచాలాః' అను నిదర్శన మింతవరకును వ్యాఖ్యానింపబడినది. ఇక 'తైలం భుక్తం' 'ఘృతం భుక్తమ్' - అను నుదాహరణ గ్రంథము వాఖ్యానింపబడును.

శ్లో॥ సంస్కారాదుపఘాతాద్వావృత్తోఽక్త పరిమాణకే।
తైలాదౌ జాతిశబ్దోఽత్ర సామర్థ్యాదవసీయతే॥ 484

సంస్కారాత్ = ఔషధ సంస్కారము వలన గాని, ఉపఘాతాత్ వా = కుక్కలు, కాకులు ఎంగిలి పరచినందున గాని, అక్త పరిమాణకే = పరిచ్ఛిన్నమగు = ఇంతయును, కొలతగల, తైలాదౌ వృత్తః = నూనె, నెయ్యి మున్నగువానియందు వర్తించినదిగా, జాతి శబ్దః = జాతి ప్రవృత్తి నిమిత్తకమగు నీ శబ్దము, అత్ర = 'తైలం భుక్తమ్' అను నుదాహరణమున, సామర్థ్యాత్ = ప్రకరణ బలమువలన, అవసీయతే = నిర్ణయింపబడుచున్నది.

తాత్పర్యా వివరణములు— తైల ఘృత శబ్దములు అవయవావయవి సాధారణ జాతి శబ్దములు. అవి సముదాయవృత్తములై అవయవబోధకములు గావు గదా. అవి యుదా హరణము లెట్లగును? 'స్ఫోటసిద్ధి' యను గ్రంథమునందు "నేక్షితా జాతి శబ్దానాం సముదా యానుపాతితా। జాతి మాచక్షతే తే హి వ్యక్తిర్జాతి సమాశ్రయా" అని చెప్పబడినది. జాతి

నిత్యమ్ + ఏవ = నిత్యమగు ద్రవ్యమే, అభిధీయతే=చెప్పబడుచున్నది. సంస్థాన, సన్నివేశాది శబ్దములు గూడ ద్రవ్యమునే బోధించునని భావము.

ఉపాధులు కల్పితములుకాన అనిత్యములే. వాని నిజరూపము ద్రవ్యమే. ద్రవ్యము మాత్రము ఉపాధి రూపముకాదు. ఉపాధులు మూలభూతమగు ద్రవ్యమునందు లయమును పొందగా (ఉపాధులు) వేరుగా లేనేలేవు. ఉపాధులు నిష్కర్షచేయగా బ్రహ్మ సత్తను బట్టియే సద్రూపమున భాసించుచున్నవి.

కాబట్టి యెల్ల శబ్దములు ద్రవ్యబోధకములనుటయే లెస్స. ॥6॥

అవతారిక— ఆకారములనిత్యములనియు, ద్రవ్యము నిత్యమనియు, శాస్త్రజ్ఞుల నిర్ణయము. ధర్మములు కూడ మరియొక యవస్థయందు ధర్మిరూపములేయని యంగీకరించిన ధర్మములు కూడ నిత్యములేయగుటచే పైనిర్ణయమునకు భంగము వాటిల్లును అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ నతత్త్వాతత్త్వయోర్భేద ఇతి వృద్ధేభ్య ఆగమః ।
అతత్త్వమితిమన్యన్తే తత్త్వమేవాఽవిచారితమ్ ॥ 7

తత్త్వా తత్త్వయోః = తత్త్వమునకును, అతత్త్వముకును అనగా సత్యపదార్థమునకు అసత్య పదార్థమునకును, భేదః = భేదము, న = లేదు, ఇతి = అని, వృద్ధేభ్యః = పెద్దలవలన, ఆగమః = పరంపరగా వచ్చెడివినికిడి.

అవిచారితమ్ = వారివారి జ్ఞానమునుబట్టి ప్రకాశించుచున్న, తత్త్వమ్ + ఏవ = సత్యపదార్థమునే, అతత్త్వమ్ + ఇతి = అసత్య పదార్థమని, మన్యన్తే = తత్త్వవేత్తలు తలంచుచున్నారు.

సత్యము, అసత్యము అనెడి రెండు పదార్థములు వేరుగా లేవు. పారమార్థిక తత్త్వ మొక్కటియే, అదియే పరబ్రహ్మము. అనాది సిద్ధమగు అవిద్యనుబట్టి ఆ సత్య పదార్థమే అసత్యమగు నానారూపములుగా భాసించుచున్నది. అంతియేకాని సత్యపదార్థము కంటె వేరుగా అసత్య పదార్థము నిలుచునదికాదు. అవిద్య యున్నంతవరకు భేదము భాసించును. అవిద్య తొలగగా సత్యపదార్థమొక్కటియే యుండును.

సత్యపదార్థమే అవిద్యాదశలో అసత్యరూపమున కన్పించును. ఇది అద్వైతశాస్త్ర జ్ఞుల విశ్వాసము. కాబట్టి ఉపాధులు వేరుగా సత్యరూపములై యుండునవికావు. ఈ యభి ప్రాయముతోడనే మొదటి కాండమున, "సత్యా విశుద్ధిస్తత్రోక్తా" (శ్లోకము-9) అని పరమ సిద్ధాంతము నిరూపింపబడినది. ప్రతివస్తువు అవిద్యామూలమున రూపాంతరమున భాసించు బ్రహ్మమే. ॥7॥

ప్రవృత్తి నిమిత్తక శబ్దములు జాతినే బోధించును. జాత్యాశ్రయమగుటచే వ్యక్తియందు గార్యములు ప్రవర్తించును. అయ్యవి సముదాయవాచకములగుట ఎచ్చటను జూడబడదు - అని యర్థము.

పై ఆక్షేపమునకు ప్రతి సమాధాన మీ కారికయం దభిహితము 'తైలం భుక్తమ్' అను నుదాహరణమున తైల మనగా, ఒకానొక రోగమును శాంతింపజేయుటకు, ఔషధముచే సంస్కరింపబడినది. ఘృతమనునదియు నట్టిదియే వివక్షితము. అయ్యది, పదహారు పలములు లేదా ముప్పదిరెండు పలములు - అని ఇట్లు పరిచ్ఛేదింపబడినది గ్రాహ్యము. అదియే అక్త పరిమాణమనుట. అక్త అనగా 'పరిచ్ఛిన్నమగు' - అని యర్థము. లేదా శ్వకాకాదులచే నుచ్ఛిష్టము గావింపబడి పరిత్యాజ్యమగునదియైనను గొంత పరిమాణము కలది అయి యుండును.

అందు ప్రతిదినమును గొంత భాగమును మాత్రమే భుక్తమయినను తైలము భుక్త మనుచున్నారు. కుక్క నూనెను గొంత మాత్రమునే త్రాగివేసినను నట్లందురు. అవయవమునం దిట్లు సముదాయారోపముచే వ్యవహారమున కిది యుదాహరణము. ॥484॥

*అవతారిక*— ఇది భాష్యకారుని ఆశయమని యెట్లు తెలియుననిన—

**శ్లో॥ న జాతిగుణశబ్దేషు మూర్తిభేదోఽవివక్షితః ।**
**తే జాతిగుణ సంబంధ భేదమాత్ర నిబంధనాః ॥ 485**

జాతిగుణ శబ్దేషు = జాతిగుణములు ప్రవృత్తి నిమిత్తములుగాగల శబ్దములందు, మూర్తిభేదః = ద్రవ్యపరిమాణ భేదము, న వివక్షితః = వివక్షింపబడదు, తే = ఆ జాతిగుణ నిమిత్తక శబ్దములు, జాతిగుణ సంబంధ భేదమాత్ర నిబంధనాః = జాతి సంబంధమును, గుణ సంబంధమును అను విశేష మొక్కటియే నిమిత్తముగా గలవి.

తాత్పర్య వివరణములు— ఈ వ్యక్తి ఆ జాతిగాని గుణముగాని కలదియా? కాదా? యని మాత్రమే ఆ శబ్దములు గమనించునుగాని, వ్యక్తియొక్క మూర్తిభేదమును = పరిమాణ భేదమును జూడకయే ఆ వ్యక్తి నా శబ్దములు బోధించును. పరిమాణ శబ్దములగు కుంచము, మానిక మున్నగునవి యట్లు గాదు. అవి అందు గొంతభాగము తగ్గినయెడల ప్రవర్తింపవు. కాగా సంస్కారము ఉపఘాతము గల ద్రవ్యమును యథాక్రమముగ బోధించు తైల ఘృత శబ్దము లిట భాష్యకారునకు వివక్షితము అని గ్రహింపవలసి యున్నది. ॥485॥

*అవతారిక*— ఇక శుక్లః, నీలః, కృష్ణః - అను నుదాహరణములు వివరింపబడును.

**శ్లో॥ కృష్ణాది వ్యపదేశశ్చ సర్వావయవ వృత్తిభిః ।**
**గుణైస్తైస్త్వేకదేశస్థాః పటాదీనాం విశేషకాః ॥ 486**

సర్వావయవవృత్తిభిః = సకలావయవములందు నుండు, గుణైః = నలుపు, ఎరుపు, మున్నగు

గుణములచే, కృష్ణాదివ్యపదేశః = నల్లనిది, మొదలగు వ్యవహారము, భవతి = కలుగును, తే = అవి, ఏకదేశస్థాః అపి = కొన్ని అవయవములందున్నను, పటాదీనాం = పటము మున్నగు విశేష్యములకు, విశేషకాః భవన్తి = విశేషణములగును.

**తాత్పర్యము వివరణములు**— గుణ ప్రవృత్తి నిమిత్తక శబ్దములు అవయవావ యవి విభాగము లేకయే వర్తించునని యుపపాదింపబడినది. కాని లోకమున సమస్తావయవము లను వ్యాపించి గుణ మున్ననే అట్టి వ్యవహారమగపడును. నల్లనిబట్ట, తెల్లనిబట్ట - అని, బట్ట యంతయు నలుపుగాని తెలుపుగాని అయిననే అందురు. కాబట్టి ముఖ్యవృత్తిచేత నవి సము దాయ శబ్దములే. ఇక నొక వస్త్రమున గొన్ని దారములు మాత్రమే నల్లనివయి మిగిలినంతయు తెల్లనిదయినపుడు గూడ, సముదాయారోపము వలన కృష్ణాది వ్యవహారములగపడుచున్నవి. వస్త్రమున నొక భాగము = కొద్ది భాగము మాత్రమే మలిన హస్తములతో తాకబడి నల్లబడి నపుడు కోపముతో, అట్లా మలినపరచిన వానిని, తెల్లని బట్టను నలుపు చేసివేసితి వేమయా ః అని యనుట కలదు. ॥486॥

అవతారిక— ఇట ప్రకారాంతరమును గలదు.

**శ్లో॥ పటావయవవృత్తాస్తు యదా తత్ర పటాదయః ।**
**తదా తైలాదివత్తేషాం జాతి శబ్దత్వ ముచ్యతే ॥ 487**

తత్ర = 'శుక్లః పటః' - అనుచోట, యదాతు = ఎపుడైతే, పటాదయః = 'పట' - మున్నగు నవి, పటావయవవృత్తాః=పటావయమును బోధించునవి, భవన్తి = అగునో, తదా=అపుడు, తేషాం = వానికి, తైలాదివత్ = 'తైల' - మున్నగు శబ్దములకువలె, జాతి శబ్దత్వమ్ = జాతి శబ్దములగుటయే, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ''పటః కృష్ణః'' = వస్త్రము నల్లనిది, అని వ్యవహా రము కలదు. అచట ఏకదేశమే నల్లనిది. అయినను నట్టి వ్యవహారమును రెండు విధములుగ నుపపాదింపవచ్చును. సమస్తావయవ కృష్ణత్వమున కచట అవయవమునం దధ్యారోపమువలన నా వ్యవహారమని ఇదివర కుపపాదింపబడినది.

ఇక పట శబ్దమునకు పటైకదేశ మర్థమనినపుడు, సమీపమునను్న కృష్ణ శబ్దము ముఖ్యార్థకమేయగును. సముదాయివాచకమగు పటశబ్ద మిపు డవయవవాచక మగుచున్నది గాన ప్రకృతమున నుదాహరణమగును. తైల ఘృత శబ్దములవలె పట శబ్దము గూడ జాతి ప్రవృత్తి నిమిత్తకమే. అవి సంస్కారమువలననో ఉపఘాతమువలననో అతిశయ విశేషము గల పరిచ్ఛిన్న పరిమాణ ద్రవ్యమును బోధించినట్లు, సమస్తావయవ సమాహారరూపమగు మొత్తము పటమును బోధించుచు 'ఇదియును పటమే ద్రవ్యాంతరము గాదు' అని చెప్పుటకు అవయవమును గూడ బోధించును. ఈ విధముగనే 'ఘృతం భుక్తమ్' - అను వాక్యమున ఘృత శబ్దము ముఖ్యార్థకము. భుక్త శబ్దము మట్టుకు, సముదాయమునందు అవయవరూపము

శ్లో॥ బ్రాహ్మణాధ్యయనే తత్రవర్తతే బ్రాహ్మణ శ్రుతిః ।
సాదృశ్యం తత్రదృష్టం హి క్షత్రియాధ్యయనాదిభిః ॥ 489

తత్ర='బ్రాహ్మణ వదధీతే క్షత్రియః' - అను వాక్యమునందు, బ్రాహ్మణ శ్రుతిః=బ్రాహ్మణ పదము, బ్రాహ్మణాధ్యయనే=బ్రాహ్మణుని అధ్యయన క్రియయందు, వర్తతే=ఉండును= దానిని బోధించుననుట, క్షత్రియాధ్యయనాదిభిః = క్షత్రియుని యధ్యయనము మున్నగు వానితో, సాదృశ్యమ్ = ఔపమ్యము, తత్ర = ఆ బ్రాహ్మణుని అధ్యయన క్రియయందు, దృష్టం హి = కనబడుచున్నది గదా.

తాత్పర్య వివరణములు— కొందరిట్లు చెప్పుదురు- "బ్రాహ్మణవదధీతే క్షత్రియః" అను వాక్యమునం దుపమేయవాచకమగు క్షత్రియ శబ్దమునకు సమీపమున, 'అధీతే' అని అధ్యయనవాచక శబ్దము వినబడుచున్నది. అందువలన బ్రాహ్మణ క్షత్రియుల సామ్యము అధ్యయన మూలకమని తెలియుచున్నది. బ్రాహ్మణ శబ్దము, తపస్సు, పాండిత్యము, వేదాధ్యయనము మున్నగు గుణముల సముదాయమును బోధించునది. అందధ్యయన మను నవయవమును మాత్రమే లక్షణచే నిట తెలియచేయుచున్నది. కనుక, అధ్యయన క్రియావాచియగు తృతీయాసమర్థ విభక్త్యంతమునకు బరముగ వతి ప్రత్యయమగునని యర్థము" - ఇది కొందరి మతము. ॥489॥

అవతారిక— ఈ మత ముపపత్తి గలది గాదు-

శ్లో॥ బ్రాహ్మణాధ్యయనే వృత్తిర్యదిస్యాద్ బ్రాహ్మణ శ్రుతేః ।
వక్తవ్యం కేన ధర్మేణ తుల్యత్వం క్రియయోరితి ॥ 490

బ్రాహ్మణ శ్రుతేః=బ్రాహ్మణ పదమునకు, బ్రాహ్మణాధ్యయనే=బ్రాహ్మణుని అధ్యయనము అను నర్థమున, వృత్తిః = వర్తించుట = బోధనమనుట, యదిస్యాత్ = కలిగినయెడల, క్రియయోః=ఆ రెండు అధ్యయన క్రియలకును, కేన ధర్మేణ=ఏ ధర్మముచేత, తుల్యత్వం ఇతి = సామ్యమని, వక్తవ్యమ్ = చెప్పవలసి యుండును.

తాత్పర్య వివరణములు— బ్రాహ్మణ శబ్దమునకు అధ్యయనమే అర్థమయిన ఆ అధ్యయన క్రియల కుపమానోపమేయభావమని యవగతమగును గాని అధ్యేతలగు బ్రాహ్మణ క్షత్రియులకని సిద్ధింపదు. కాని ఔపమ్యమునకు నిమిత్తమయిన ధర్మము సౌష్ఠవము = సుష్ఠుత్వమని చెప్పవలసియుండును. ఆ సుష్ఠుత్వమునకు స్థానమయిన అధ్యయన మిపుడు సర్వనామ పరామర్శయోగ్యమయిన ద్రవ్యమువంటిదే అయి యిక దానికి క్రియాత్వముండదు. కాగా క్రియావాచి తృతీయా సమర్థమనుట పొసగదు. కావున నిది యుపపన్నము గాదు.॥490

అవతారిక— కావున నిట్లు చెప్పుట యుక్తము-

శ్లో॥ అధ్యేతరి యదా వృత్తిరుచ్యతే బ్రాహ్మణశ్రుతేః ।
నిమిత్తత్వం తదోపైతి క్రియైవాధ్యేతరి స్థితా ॥ 491

బ్రాహ్మణ శ్రుతేః=బ్రాహ్మణ శబ్దమునకు, అధ్యేతరి=అధ్యయన క్రియావిశిష్టుడగు బ్రాహ్మణునియందు, వృత్తిః = శక్తి, యదా ఉచ్యతే = చెప్పబడిన యెడల, తదా = అపుడు, అధ్యేతరి = అధ్యేతయగు నాతనియందు, స్థితా = ఉన్న, క్రియైవ = ఆ అధ్యయన క్రియయే, నిమిత్తత్వం = ఔపమ్యమునకు నిమిత్త భావమును, ఉపైతి = పొందును.

తాత్పర్య వివరణములు— శుద్ధ క్రియావాచియగు తృతీయము వతిప్రత్యయమునకు ప్రకృతిగా సంభవింపదు. కనుక క్రియావిశిష్ట ద్రవ్యవాచకము గ్రహింపబడును. బ్రాహ్మణ శబ్దము గుణసముదాయవాచకమని చెప్పబడినది. ఆ గుణములలో నొకటియగు అధ్యయన క్రియావ్యాపారమును ప్రధానముగా గలిగిన తృతీయాంత బ్రాహ్మణ శబ్దమునకు బరముగా వతిప్రత్యయము విధింపబడును. శబ్ద ప్రతిపాదితమగు అధ్యయనమే బ్రాహ్మణ క్షత్రియుల ఉపమానోపమేయభావమునకు నిమిత్త మపుడగును. సౌష్ఠవాది ధర్మాంతరములతో బనిలేదు. ॥491॥

అవతారిక— కొందరిట్లందురని చెప్పబడిన ఆ కొందరి మతమునందు వేరొక దోషమును గలదు. ఎట్లనిన—

శ్లో॥ సింహశబ్దేన సంబంధే శౌర్యమాత్రాభిధాయినా।
చైత్రాత్ షష్ఠీ ప్రసజ్యేత యోగే శౌర్యాదిభిర్యథా॥ 492

శౌర్యమాత్రాభిధాయినా = శూరత్వమను, గుణమును చెప్పు, సింహశబ్దేన = సింహ శబ్దముతో సంబంధే సతి = సంబంధము కలిగినపుడు, శౌర్యాదిభిః = శౌర్యపదము మున్నగు వానితో, యోగే యదా = సంబంధమున్నపుడు వలె, చైత్రాత్ = చైత్ర శబ్దముకంటె బరముగా, షష్ఠీ = షష్ఠీ విభక్తి, ప్రసజ్యేత = రావలసియుండును.

తాత్పర్య వివరణములు— 'బ్రాహ్మణవత్' అను స్థలమున బ్రాహ్మణ పదమునకు వాని యధ్యయనము మాత్రమే యర్థమయిన యెడల, ఆ విధముగనే, "చైత్రస్య సింహః" అను వాక్యమున సింహ శబ్దమునకు శూరత్వము మాత్ర మర్థముచెప్పి 'చైత్రుని శౌర్యము' అనుచోట చైత్రుని అనుషష్ఠికివలె నిచటను షష్ఠికి సాధుత్వమును గ్రహింపవలసి వచ్చును.

ఇక మా మతముననో - 'సింహ శబ్దము శౌర్యముగలది'యను నర్థమునందు వర్తించును గాన చైత్రః సింహః' అని సామానాధికరణ్య ముపపన్నమగును. ॥492॥

అవతారిక— ఏకీయుల మతమున అనగా "ఇతి ఏకే" అని చెప్పబడిన కొందరు అను వారి మతమున దోషాంతరమును గలదు.

శ్లో॥ బ్రాహ్మణాయేవ దాతవ్యం వైశ్యాయేత్యేవమాదిషు।
సంప్రదానాదియోగశ్చ క్రియామాత్రే న కల్పతే॥ 493

బ్రాహ్మణాయ ఇవ వైశ్యాయ దాతవ్యమ్ = బ్రాహ్మణు నుద్దేశించినట్లు వైశ్యు నుద్దేశించి దానము చేయవలెను, ఇత్యాదిషు = ఈ మున్నగు వాక్యములలో, క్రియా మాత్రే = కేవల క్రియయందు, సంప్రదానాది యోగశ్చ = ఉద్దేశ్యత్వము మున్నగు దాని సంబంధమును, న కల్పతే = ఘటింపదు.

తాత్పర్య వివరణములు— వతి ప్రత్యయ విషయమున బ్రాహ్మణ శబ్దమునకు అధ్యయన క్రియ మాత్రమే అర్థమయిన, 'బ్రాహ్మణవత్ వైశ్యాయదాతవ్యమ్' అను వాక్యమున సంప్రదాన సంబంధము క్రియా మాత్రమునకు సంబంధింపక పోవును. బ్రాహ్మణుని యధ్యయనమున కిచ్చుట ససంభవము గాదుగదా. అటులనే 'బ్రాహ్మణవత్ వైశ్యాదధ్యేతవ్యమ్' అను స్థలమున, అధ్యయనమున కపాదానత్వమును, 'బ్రాహ్మణవత్ వైశ్యే వర్తితవ్యమ్' - అనుచో అధ్యయునమునకు అధికరణత్వమును సంభవరహితములు. మా మతమునైన, అధ్యయన క్రియావిశిష్టు డర్థముగాన నా ప్రయోగములన్నియు నుపపన్నములగును. ॥493॥

అవతారిక— మరియును ఆ 'కొందరు' అను వారి మతము భాష్యవిరుద్ధము.

శ్లో॥ క్రియామాత్రాభిధాయిత్వాదవ్యయేషు వతేర్నచ ।
పాఠః కదాచిత్కర్తవ్య స్తుల్యౌ పక్షావుభౌ యతః ॥ 494

వతేః = వతి ప్రత్యయము, క్రియామాత్రాభిధాయిత్వాత్ = క్రియను మాత్రమే జెప్పునది యగుటవలన, అవ్య యేషు = అవ్యయములలో, పాఠః = దానికి పాఠము, కదాచిత్ = ఎపుడును, న కర్తవ్యః = చేయనక్కరలేనిది, యతః = ఎందువలననగా, ఉభౌ పక్షౌ = రెండు పక్షములును, తుల్యౌ భవతః = సమానములే గాబట్టి.

తాత్పర్య వివరణములు— తేనతుల్యమను సూత్రమున 'క్రియ' అనునది ప్రకృత్యర్థ విశేషణమని యొక పక్షము. ప్రత్యయార్థమునకు విశేషణమని వేరొక పక్షము. అందు ప్రత్యయార్థ విశేషణమను పక్షమున నిట్లు లాఘవము కలదని భాష్యకారుడు చెప్పెను. "అపి చావ్యయేషువతేః పాఠోనకర్తవ్యో భవతి। క్రియాయామయం భవన్‌లింగ సంఖ్యాభ్యాం న యోక్ష్యతే" అని. అవ్యయములలో వతి ప్రత్యయమును బఠింపనక్కరలేదు. ఇది క్రియను బోధించినపుడు లింగ సంఖ్యాయోగము కలది గాదుగదా' అని యర్థము.

ప్రకృత్యర్థమునకు క్రియ విశేషణమను పక్షముననైనను ఉపమాన శబ్దములు క్రియను మాత్రమే బోధించునవయిన క్రియకు తుల్యమైనది క్రియయే యగునుగాన నదియే వతి ప్రత్యయార్థమగును. అది సత్యరూపము కాదుగాన వతి ప్రత్యయాంతమునకు, లింగ సంఖ్య లుండనే యుండవు. అపుడు, స్వరాదులలో సత్త్వవచనముల నడుమ అవ్యయ సంజ్ఞకై వతి ప్రత్యయమును బఠించుట ఈ ప్రకృత్యర్థ విశేషణ పక్షముననను నక్కరలేదు. అట్టియెడ, ప్రత్యయార్థ విశేషణ పక్షమున కొక యుత్కర్షను గల్పించుచు, ఆ పక్షముననే అవ్యయములలో వతి ప్రత్యయమున పాఠ మనావశ్యకమగునను లాఘవమును భాష్యకర్త విశేషించి చెప్పవలెను ?

బ్రాహ్మణాది శబ్దములు క్రియను మాత్రమే చెప్పిన, క్రియయే ప్రత్యయార్థ ముభయపక్షములందును నగును. రెండు పక్షములును దుల్యములే.

ఇక మా పక్షమున క్రియావిశిష్టుడు బ్రాహ్మణ శబ్దార్థము గాన నుపమేయము గూడ క్రియావిశిష్టమే యగుట న్యాయ్యము. క్రియావిశిష్ట ద్రవ్యము సత్త్వము. లింగ సంఖ్యా యోగ్యము. కావున తద్వారణమునకై అవ్యయములందు పాఠము కర్తవ్యమగును. ప్రత్యయార్థమునకు క్రియ విశేషణమయిన నవ్యయములందు పఠికి పాఠ మక్కరలేదని భాష్య తాత్పర్యము. ॥494॥

అవతారిక— కాబట్టి ఆ కొందరి మతము నిర్దోషముగాదని నిరూపించి స్వమతము నీ కారికలో వివరించుచున్నారు.

శ్లో॥ జహాతి జాతిం ద్రవ్యం వా తస్మాన్నావయవేస్థితః ।
క్రియాయాస్తు శ్రుతిర్యస్మాత్తద్వత్యర్థేఽవతిష్ఠతే ॥ 495

తస్మాత్ = అందువలన, అవయవే = ఏకదేశమునందు, స్థితః = ఉన్న శబ్దము, జాతిం = జాతినిగాని, ద్రవ్యం వా = ద్రవ్యమును అనగా వ్యక్తినిగాని, నజహాతి = విడిచిపెట్టదు, యస్మాత్ తు = ఏ కారణమువలన, క్రియాయాః = క్రియా' అను పదమునకు, శ్రుతిః = సూత్రమునందు శ్రవణము కలదో, తస్మాత్ = అందువలన, తద్వతి = ఆ క్రియగల, అర్థే = పదార్థమునందు = క్రియావిశిష్టము నందును, వర్తతే = నిలుకడగ నుండును.

తాత్పర్య వివరణములు— బ్రాహ్మణ శబ్దము క్రియను మాత్రమే బోధించుననిన దోషములుండుటచేత నది ఏకదేశ వాచకమయినను, ప్రవృత్తి నిమిత్తమయిన జాతిని విడువదు. ఏకదేశవాచకముగాక సముదాయవాచకమే యగునపుడును జాతియే ప్రవృత్తి నిమిత్తము. ఆ విధముగనే అవయవబోధక మగునపుడును ద్రవ్యము వాచ్యము కాకపోదు.

'తేనతుల్యం' - అను సూత్రమునందు క్రియ ప్రకృత్యర్థమున కుపాధిగా నిర్దేశింపబడుటచే, బ్రాహ్మణ శబ్దము అధ్యయన క్రియావిశిష్ట ద్రవ్యమును బోధించునది గ్రాహ్యము. ద్రవ్య సహచారులగు నితర ధర్మములు విడిచిపెట్టబడినను ద్రవ్యము విడువబడదు ॥495॥

అవతారిక— ముఖ్య క్రియాభిధాయి తృతీయాంతమేదియు సంభవింపదు గనుకి క్రియా భిన్నవాచులు తృతీయా సమర్థములు కావలెను. అందు ద్రవ్యవాచులును గుణవాచకములును ప్రకృతులు కాకుండుటకు సూత్రమున 'క్రియా' అను పదము గ్రహింపబడినది. అయ్యది దాని ముఖ్యార్థమునకు సంభవము లేనందున క్రియావత్తును లక్షణచే బోధించునని యుపపాదించు చున్నారు.

శ్లో॥ అక్రియాణాం నివృత్త్యర్థాయ తత్రాత్రక్రియా శ్రుతిః ।
క్రియోపలక్షితే తస్మాత్ క్రియాశబ్దః ప్రతీయతే ॥ 496

యతః చ = మరియు నే కార్యమువలన, అత్ర=ఇచ్చట అనగా తేనతుల్యమను సూత్రమున, క్రియాశ్రుతిః = 'క్రియా' అను పదము, అక్రియాణాం = క్రియగాని వానియొక్క, నివృత్త్యర్థా = తొలగింపుకొర కేర్పడిదో, తస్మాత్ = ఆ కార్యమువలన, క్రియాశబ్దః = ఆ 'క్రియ' అను శబ్దము, క్రియోపలక్షితే = లక్షణచే క్రియావిశిష్టమును బోధించునదిగా, ప్రతీయతే = ఊహింపబడుచున్నది.

తాత్పర్యము— అవతారికా గ్రంథమునందే స్పష్టీకృతము. ॥496॥

అవతారిక— క్రియావాచకములగునవి తృతీయా సమర్థములు సంభవింపనందు రేమి ? 'హోతవ్య' మున్నగునవి యట్టివి కలవుగదా యనిన—

శ్లో॥ హోతవ్యాదిషు యస్మాచ్చ క్రియాన్యా బ్రాహ్మణాదివత్ ।
అపేక్షణీయా శుద్ధేర్థే తస్మాత్ వృత్తిః న కస్యచిత్ ॥ 497

కిం చ = మరియు, యస్మాత్ = ఏ కారణమువలన, హోతవ్యాదిషు = హోతవ్యవత్ - మున్నగు స్థలములందు, బ్రాహ్మణాదివత్ = బ్రాహ్మణవత్ = మొదలగు చోట్లవలె, అన్యా క్రియా = వేరొక క్రియ, అపేక్షణీయా అస్తి = సాధారణ ధర్మముగ నపేక్షింపదగినదై యున్నదో, తస్మాత్ = ఆ హేతువువలన, శుద్ధే అర్థే = కేవల క్రియారూపమగు నర్థమునందు, కస్యచిత్ = ఏ పదమునకును, వృత్తిః = ప్రవృత్తి, న అస్తి = లేదు.

తాత్పర్య వివరణములు— "బ్రాహ్మణవత్ అధీతే క్షత్రియః"-అను వాక్యమున నుపమానోపమేయ భావమునకు నిమిత్తముగ అధ్యయనము సాధారణ ధర్మమయినట్లు "బ్రాహ్మణహోతవ్యేన తుల్యం క్షత్రియహోతవ్యమ్" అను స్థలమునందు వేరొక క్రియా సాధారణ ధర్మముగ అపేక్షణీయమగుచున్నది. లేనిచో సమన్వయము కుదురదు. అపుడు సత్త్వవాచకములగు బ్రాహ్మణాది శబ్దముల వంటివే హోతవ్యాది శబ్దములును నగును. కాగా అందలి క్రియా శుద్ధమగు కేవల క్రియ కానేరదు. ఈ విధముగ, ముఖ్యార్థము సంభవింపదు గాన, సూత్రమునందలి 'క్రియా' అనునది లక్షణావృత్తిచే క్రియావత్తును బోధించుట న్యాయ్యమే. ॥497॥

అవతారిక— ఉపమేయగత క్రియయే ఉపమానమునందును సాధారణ ధర్మముగ నాశ్రయింపబడు నంటిరి. అపుడు బ్రాహ్మణ శబ్ద మవయవబోధకమని కల్పింపవలసిన పనియేమి ? సముదాయబోధకమే అయినను సముదాయస్థమగు క్రియను ఆకాంక్షింపవచ్చును గదా యనిన—

శ్లో॥ సర్వం వాప్యేకదేశో వా యస్మిన్నాశ్రీయతే క్వచిత్ ।
విశేషవృత్తిం తం సర్వమాహుర్భేదే వ్యవస్థితమ్ ॥ 498

క్వచిత్ యస్మిన్ = ఎచ్చటనైనను ఏ పదమునందైనను, సర్వం వా అపి = సముదాయ

మంతయు గూడిగాని, ఏకదేశః వా = లేదా అవయవ మాత్రముగాని, ఆశ్రీయతే = ఆశ్ర యింప బడునో, తం సర్వం = ఆ పదము నంతను, భేదే = విశేషమునందు, వ్యవస్థితం = బోధకమైయున్న దానిని, విశేష వృత్తిం = విశిష్టార్థ వాచకమునుగా, ఆహుః = చెప్పుదురు.

తాత్పర్య వివరణములు— అవయవమాత్రబోధక శబ్దమును సముదాయవాచక శబ్దమును గూడ విశిష్టార్థమును బోధించు శబ్దమే అందురు. ఏ శబ్దమైనను విశేషపరమే యగుట కారణము. విశేషమనగా ఇతర నివర్తకము గదా. అవయవమును బోధించినపుడు సముదాయమును నివర్తించును గాన నది విశేషపరము. సముదాయమున బ్రయోగించిన, అవయము వ్యావర్తింపడును గాన నపుడు నవి విశేషపరమే. అవయవమొకటి వేరొకటి యవయవమును నివర్తింపజేసినపుడు విశేషమని వ్యవహరింపబడును. అట్లే సముదాయి మవయవ వ్యావర్తకమయినపుడును విశేషపరమగును. సముదాయమాత్రమును బోధించినను అవయవమాత్రమును బోధించినను, సమస్త భేదములచే రూపితమగు నర్థమునే నిరూపించును శబ్దములకు గుణసముదాయ పర్వత మిట్లు సమర్థితము.

పర్యవసాన మేమనగా గుణసముదాయమును బోధించినపుడు ఆ సముదాయమే ప్రధానము. అవయవముల భేదము తెలియని మొత్తమే అపుడు అభిధేయము. వికల్పముగా గాని సముచ్చయము గాని అవయవముల ప్రతీతియే యుండబోదు. వృక్షమున్నదనుకొనుడు. అది, మొదలు, కాండము కొమ్మలు మొదలగు అవయవముల సముదాయము కాని ఆ శబ్దము వాని మొత్తమునే బోధించును గాన నేకవచనాంతముగనే ప్రయోగింపబడుచున్నది. కాగా సముదాయము చెప్పబడినపుడు తదంతర్గతముగ నవయవము వాచ్యమయినను దాని నిష్కృష్ట రూపముతో వాచ్యము కాలేదు గాన, దానివలన నుపకారము లభింపదు. సముదా యము నుండి ఆపోద్ధారము చేయబడిన అవయవము బ్రాహ్మణ శబ్దమున కర్థమనవలెను. అనగా వ్యాపార విశిష్టమగు ద్రవ్యము = వ్యక్తి, అనుట. వ్యాపారమే క్రియ. కనుక క్రియా ముఖమున నుపమానోపమేయములకు సాదృశ్యమపు డుపపన్నమగును. ॥498॥

అవతారిక— శబ్దము లవయవములను బోధించినను సముదాయమును బోధించి నను విశేషవచనములే యగునెడల నిక సామాన్యవచనత్వ మనగా నేమగును? అనిన—

శ్లో॥ సముచ్చయో వికల్పో వా ప్రకారాః సర్వ ఏవవా ।
విశేషా ఇతి వర్ణ్యంతే సామాన్యం వా వికల్పితమ్ ॥ 499

సముచ్చయః వా = అవయవముల సముచ్చయముగాని, వికల్పః వా = వాని వికల్పము = ఇదియే అదియోగాని, సర్వే ప్రకారాః ఏవవా = లేదా ఆ ఈ ప్రకారములన్నియుగాని, అవి కల్పితం = ప్రధానముగ వాచ్యమయిన, సామాన్యం వా = సామాన్యమయిననుగాని, విశేషాః ఇతి = విశేషములేయని, వర్ణ్యన్తే = చెప్పబడుచున్నవి.

తాత్పర్య వివరణములు— వేరు వేరు రూపములుగల అనేకములగు నర్థములు

సమకక్ష్యముగ నభిహితములయినపుడది సముచ్చయము. అవి పర్యాయముగ జెప్పబడిన, వికల్పమగును. ప్రకారములనగా ద్రవ్యము ప్రధానముగా నుండి, దానికి విశేషణములుగా నున్న ధర్మములు.

కాగా, సమప్రాధాన్యం, పర్యాయము, గుణప్రధాన భావము— ఈ మూడు ప్రకారములు సంభవములు. అవి మూడును విశేషములే యనబడును. విశేషమనగా నితర వ్యావర్తకము గదా. వీనిలో నొకటి అభిధావిషయమయినపుడు రెండవది నివర్తితమచుగుండును. ఇక వికల్పరహితమగు సామాన్య మభిహితమయినపు డా సామాన్యమును విశేషమేయగును. ఎందువలన ననగా, విశేషము లనేకములు సామాన్య రూపముచే నుపరక్తములయి చెప్పబడినపుడు, వాని వాని ప్రతినియత విశేషమున వ్యావర్తించునుగదా. ''సామాన్య మపియధా విశేష స్తద్వత్'' - అని మహాభాష్యమున కిదియే భావము. విశేషములన్నియు నేక సామాన్యానువిద్ధములయియే క్రియతో నన్వయించును.

అవతారిక— ఉపమితి క్రియలో అనగా నుపమానోపమేయ భావవర్ణనములో, గుణమునకును, క్రియకును నుపయోగము గలదుగదా. అపుడు బ్రాహ్మణాది శబ్దములు సముదాయ వచనములయిన వాని యుపకార మెట్లు కలుగును - అనిన.

శ్లో॥ న హి బ్రాహ్మణ ఇత్యత్ర భేదః కశ్చిదపాశ్రితః ।
అపాకృతో వా తేనాయం సముదాయే వ్యవస్థితః ॥ 500

బ్రాహ్మణః ఇత్యత్ర = 'బ్రాహ్మణః' అనునపుడు, కశ్చిత్ భేదః = ఏ విశేషమును, న అపాశ్రితః హి = ఆశ్రయింపబడలేదు గదా, అపాకృతః వా భవతి = ఇంకొక విశేషము నివారింపబడను లేదు, తేన, అయం = అందువలన నీ బ్రాహ్మణ శబ్దము, సముదాయే వ్యవస్థితః = సముదాయవాచకముగనే నిశ్చితము.

తాత్పర్య వివరణములు— ఒక నియతభేదము ప్రతిపాదింపబడినచో నింకొకటి నివారితమగును. అపుడు సముదాయ వచనత్వము లేకపోవును. ఇచట నట్లు ఒక విశేషమును పరిగ్రహించి వేరొక దానిని త్యజించుట లేదాయె. కనుక సముదాయ వచనత్వమునకు భంగ మేమి ? బ్రాహ్మణ శబ్దము ప్రకరణముతో బనిలేకయే సమూహమునే చెప్పుచున్నది. కావున క్రియయును, గుణములును శబ్దార్థములయి ఉపమితి క్రియ కుపకారములు అగును. ॥500॥

అవతారిక— అచట సముదాయవాచకమున కవయవబోధకత్వము యత్నసాధ్యము

శ్లో॥ క్రియాత్వాశ్రీయతేయస్మిన్ న భేదోధ్యవసీయతే ।
తథాన్యథా సర్వథా చేత్యప్రయోగే న విద్యతే ॥ 501

యస్మిన్ = ఏ ఉపమితి వ్యాపారమునందు, క్రియాతు = క్రియ అయితే, ఆశ్రీయతే = ఆశ్ర

*అవతారిక* — పయిరీతిని పరబ్రహ్మమే ఆయారీతిని భాసించును, కాబట్టి ఆయా ఉపాధులను ముందుగా నిడికొని బ్రహ్మమే ఎల్ల శబ్దములకు విషయమగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ వికల్పరూపం భజతే తత్త్వమేవాఽవికల్పితమ్ ।
నచాత్రకాల భేదోఽస్తి, కాలభేదశ్చ గమ్యతే ॥ 8

అవికల్పితమ్ = వికల్పములకు తావులేని (అనగా ఆత్మ ఒకటియా, నానాత్వమా, నిత్యమా, అనిత్యమా మున్నగు వికల్పములకు తావులేని) తత్త్వమ్ + ఏవ = పరతత్త్వమే, వికల్పరూపమ్ = విభిన్నములగు రూపములను, భజతే = పొందుచున్నది.

బ్రహ్మము నిజరూపమున ఒక్కటియే, అది నిత్యము, సత్యము. కాని అనాదిసిద్ధమగు మాయనుబట్టి విచిత్రములగు రూపములను దాల్చినట్లు గాన్పించుచున్నది. అదియే అవిద్యాదశయందు జీవభావమును, దిక్శక్తిమూలమున దేశభేదమును పొంది అనేక రూపమున వివర్తమగుచున్నది.

అత్ర = ఈ శుద్ధద్రవ్యమునందు, కాల భేదః + చ = కాలభేదము కూడ, న + అస్తి = లేదు. అనివార్యమగు భూత భవిష్యద్వర్తమానరూపమగు కాలముకూడ ఈ పరతత్త్వమునలేదని భావము.

కాలభేదః + చ = కాలము యొక్క భేదము కూడ, దృశ్యతే = చూడబడుచున్నది.

నిజరూపమున బ్రహ్మము కాలమునకు బద్ధముకాదు. కాని అవిద్యా శక్తి రూపమగు కాలము యొక్క ప్రభావముచే వ్యవహారదశలో కాల భేదము పరతత్త్వమున భాసించును. దానిని బట్టియే పుట్టుక మున్నగు ఆరు వివర్తములు బ్రహ్మము నందు కాన్పించుచున్నవి. దానివలననే జగము క్రమబద్ధమై జరుగు చున్నది.

కాబట్టి బ్రహ్మమే అవిద్యావశమున ఉపాధుల ద్వారా ఎల్ల శబ్దములకు విషయమగుచున్నది. ॥8॥

*అవతారిక* — ఉపాధులు స్వతః లేనేలేవు. కాని యవి ద్రవ్యమునందు భాసించునని చెప్పుట పొసగదు. లేని పదార్థములకు భాసమసంభవముకదా ! అనుప్రశ్నకు సమాధానముగా విజ్ఞాన వాదిమతమునాశ్రయించి దృష్టాంతమును జూపుచున్నాడు.

శ్లో॥ యథా విషయధర్మాణాం జ్ఞానేఽత్యన్త మసంభవః ।
తదాత్మేవ చ తత్సిద్ధమత్యన్త మతదాత్మకమ్ ॥ 9

యథా = ఏరీతిగా, విషయధర్మాణామ్ = కడవమున్నగు వస్తువులకు సంబంధించిన (అనగా జడపదార్థములకు సంబంధించిన) తెలుపు, నలుపు మున్నగు ధర్మములకు, జ్ఞానే = శుద్ధమగు జ్ఞానమునందు, అత్యన్తమ్ = మిక్కిలి, అసంభవః = సంభవములేదు. జడములకు అజడమునకు ఏ యంశముచేతను సామ్యము లేదని భావము.

శ్లో॥ వ్యాపారేణేవ సాదృశ్యే వ్యాపారస్య వివక్షితే।
క్రియావద్వచనాచ్ఛబ్దాత్ ప్రత్యయ ప్రతిపాద్యతే॥ 503

వ్యాపారస్య = క్రియకు, వ్యాపారేణ ఏవ = క్రియతోడనే, సాదృశ్యే = సామ్యము, వివక్షితే సతి = చెప్పదలంచినపుడు, క్రియావద్వచనాత్ = క్రియావిశిష్ట ద్రవ్యవాచకమగు, శబ్దాత్ = శబ్దమునకు బరముగ, ప్రత్యయః ప్రతిపాద్యతే = ప్రత్యయము విధింపబడుచున్నది.

తాత్పర్య వివరణములు— "బ్రాహ్మణాధ్యయనే న తుల్యం క్షత్రియాధ్యయనమ్" = 'బ్రాహ్మణుని అధ్యయన క్రియతో క్షత్రియుని యధ్యయన క్రియ తుల్యము' అని చెప్పదలంచినపుడు సుష్ఠుత్వమను సాధారణ ధర్మమున కాశ్రయమయిన 'అధ్యయనము అను క్రియ ద్రవ్యమువంటిదే ప్రాతిపదికార్థము. కనుక ఇపుడును, సూత్రమునందలి 'క్రియా' అను పద ముపలక్షణము గాన తద్విశిష్ట ద్రవ్యవాచకమునకు బరముగనే వతి ప్రత్యయ మగును. ॥503॥

అవతారిక— ద్రవ్యవాచకమునకు బరముగ వతి ప్రత్యయము ప్రవర్తించినను అది క్రియ ప్రధానముగా గలదియే యగును. అసత్త్వభూతమగు భావమే క్రియ. అసత్వభూతత్వమనగా లింగసంఖ్యల యన్వయమునకు యోగ్యత లేకుండుట. కనుక వతి ప్రత్యయాంత మట్టిదియే యగును గదా యిక దానికి అవ్యయత్వము కొరకు స్వరాదులందు పాఠ మెందులకు? అని ప్రశ్న కలుగుననిన చెప్పుచున్నారు.

శ్లో॥ క్రియావతోఽపిసాదృశ్యే వక్తుమిష్టే క్రియావతా।
అధ్యేతా బ్రాహ్మణ ఇవప్రత్యయో న నివర్తతే॥ 504

క్రియావతః = క్రియావిశిష్టమునకు, క్రియావతా = క్రియావిశిష్టముతో, సాదృశ్యే = సామ్యము, వక్తుమిష్టే అపి = వివక్షితమయినపుడును, అధ్యేతా బ్రాహ్మణఇవ = 'బ్రాహ్మణునివలె జరుపువాడు' అను నర్థమందు, ప్రత్యయే = 'బ్రాహ్మణవత్ అధ్యేతా క్షత్రియః' అని, న నివర్తతే = వతి ప్రత్యయము తప్పదు

తాత్పర్య వివరణములు— "బ్రాహ్మణవదధీతే క్షత్రియః" అను ప్రయోగ మిష్టము. "బ్రాహ్మణవదధ్యేతా క్షత్రియః" అనునది అనిష్టప్రయోగము. బ్రాహ్మణ క్షత్రియుల సాదృశ్యమధ్యయన క్రియాద్వారకము గనుక నిపుడా ప్రయోగమునందును వతి ప్రత్యయము ప్రాప్తమగుచున్నది. వతి ప్రత్యయాంతము ద్రవ్యము ప్రధానముగా గలది కావున సత్త్వవచనము. లింగసంఖ్యలు కలది కావలసియుండును. అందువలన స్వరాదులందు పాఠమును గల్పించి అవ్యయత్వము విధింపబడుచున్నది. ॥504॥

అవతారిక— క్రియావంతముల కుపమానోపమేయభావము క్రియాద్వారక మే అయినపుడు వతి ప్రత్యయమేల రారాదు? అనిష్ట మెట్లగుననిన—

శ్లో॥ అధీతేతుల్య ఇత్యేవం పుంలింగేన విశేషణమ్ ।
క్రియావతి, క్రియాయాం తు తుల్యశబ్దే నపుంసకమ్ ॥ 505

క్రియావతి = క్రియావిశిష్టమునందు, 'అధీతేతుల్యః' = బ్రాహ్మణతుల్యుడై, ఇత్యేవం = అని ఇట్లు, పుంలింగేన = పుంలింగ తుల్య శబ్దముచే, విశేషణం భవతి = విశేషించుట కలదు, క్రియాయాం తు = క్రియయందైన, తుల్యశబ్దే = తుల్య శబ్దమునందు, నపుంసకం = నపుంసకమను, లింగం = లింగము, భవతి = (అగపడుచు) ఉన్నది.

తాత్పర్య వివరణములు— క్రియావంతములగు సాదృశ్యమును ప్రతిపాదింప దలంచి విధింపబడిన వతి ప్రత్యయము సత్త్వ (ద్రవ్యరూపముగాన నచట తుల్య శబ్దము,- ''బ్రాహ్మణే న తుల్యః అధీతే క్షత్రియః'' అని యిట్లు పుంలింగముగ విగ్రహవాక్యమున ప్రయోగింపబడుచున్నది. అపుడు సామ్యము క్రియా నిమిత్తమేయని అనగా అధ్యయన మూలకమేయని నియతముగ ప్రతీతము గాదు. ధర్మాంతరముచే బ్రాహ్మణ క్షత్రియులకు సామ్యము అనియు చెప్పనగును. కావున వతి ప్రత్యయము రాదు సూత్రముచే, క్రియచే సాదృశ్యము ప్రతిపాద్యమయినపుడే అది విధింపబడినది. కావున తుల్య శబ్దము వాక్యమున క్రియను బోధించునుగాన, నది అసత్వభూతమగుటవలన, దానికి బరముగ లింగ సర్వనామ మగు నపుంసకలింగ ప్రత్యయమే వచ్చును. అపుడు ''బ్రాహ్మణే న తుల్యమధీతే క్షత్రియః'' అనుటవలన వారికి సామ్యము అధ్యయన క్రియాకృతమేయని నియతముగ దెలియవచ్చును. ఆ విగ్రహమున వతి ప్రత్యయమును వచ్చును. ఈ పక్షమునందు, క్రియావిశేషణము సత్త్వ భూతమయినను విశేష్యమగు క్రియయొక్క ధర్మమగు అసత్త్వ స్వభావతయును వర్తించును గాన లింగవిశేషమేదియు లేనేలేదు. కాన వతి ప్రత్యయమునకు అవ్యయములందు పాఠ మనావశ్యకమని భావము. ॥505॥

అవతారిక— 'తేనతుల్య'మిత్యాది సూత్రమునందు 'క్రియా' అను పదము ప్రకృత్యర్థమునకు విశేషణమని నిర్ణయించి, ఆ పక్షమున నిట్లు దోష ముద్భావింపబడినది. ''యది తర్హి తృతీయా సమర్థం విశేష్యతే ప్రత్యయార్థో అవిశేషితో భవతి. తత్రకోదోషః ? తృతీయా సమర్థాత్ క్రియావాచినో గుణతుల్యత్వేపి ప్రత్యయః ప్రాప్నోతి - పుత్రేణ సహతుల్యః స్థూలః పుత్రేణ సహతుల్యః పింగళః ।'' - అని = క్రియ తృతీయా సమర్థమున కర్థమయినపుడు, తుల్యమయినది' అను ప్రత్యయార్థమునకు క్రియనుబట్టి కాక, గుణమునుబట్టి సామ్యమున్నపుడును వతి ప్రత్యయము, 'పుత్రవత్ పితాః స్థూలః' అనియు, పుత్రవత్ పితాపింగళః అనియును నుండవలసి వచ్చునని భాష్యమున నాక్షేపింపబడినది. అది యెట్లుపపన్నమగును ? పుత్రశబ్దము క్రియావాచి కాదుగదా యని శంక.

శ్లో॥ ప్రకృత్యర్థే విశిష్టేఽపి ప్రత్యయార్థా విశేషణాత్ ।
పుత్రేణతుల్యః కపిల ఇతివృత్తిః ప్రసజ్యతే ॥ 506

ప్రకృత్యర్థే = వతి ప్రత్యయ ప్రకృతి యర్థము, విశిష్టే సత్యపి = 'క్రియా' అను పదముచే విశేషింపబడినను, ప్రత్యయార్థా విశేషణాత్ = ప్రత్యయముయొక్క అర్థము విశేషింపబడ నందున, 'పుత్రేణతుల్యః కపిలః' ఇతి = అను నీ విగ్రహము వివక్షితమయినపుడు, వృత్తిః, ప్రసజ్యతే = "పుత్రవత్ కపిలః" = అని తద్ధిత ప్రత్యయము రావలసి వచ్చుచున్నది.

తాత్పర్య వివరణములు— సూత్రమున నొక్కటియే క్రియాశబ్దము కలదు. అది ప్రకృత్యర్థమునకు విశేషణమనిన, అంతతో నది చరితార్థముగాన నిక ప్రత్యయార్థమగు తుల్యత్వము నది విశేషింపజాలదు. కపిలత్వము గుణము. క్రియ కాదు. ఆ గుణమునుబట్టి పితకుతౌల్యము వివక్షితమయినపుడును తద్ధితవృత్తియగు వతి ప్రత్యయము రావలసివచ్చునని ఆక్షేప భాష్య తాత్పర్యము. ॥506॥

అవతారిక— 'పుత్రశబ్దము క్రియావాచి కాదుగదా. ఆ యాక్షేప మెట్లుపపన్న మగును' అను శంకకు సమాధానముగా క్రియావాచిత్వ మిట్లు సమర్థితము.

**శ్లో॥ యాః పుత్రే రూఢసంబంధాః క్రియాఃలోకే వివక్షితాః ।**
**తాభిః క్రియావతః పుత్రాత్ గుణతుల్యే వతిర్భవేత్ ॥ 507**

పుత్రే = పుత్ర శబ్దయొక్క అర్థమునందు, యాః = ఏ, రూఢసంబంధాః = నిరూఢమగు సంబంధముగల, క్రియాః = క్రియలు, లోకే = లోకమునందు, వివక్షితాః = వివక్షింపబడు చుండునో, తాభిః = వానిచే, క్రియావతః = క్రియా విశిష్టార్థ వాచకమగు, పుత్రాత్ = పుత్ర శబ్దముకంటె బరముగ, గుణతుల్యే = గుణముచే సామ్యమున్నపుడును, వతిః భవేత్ = వతి ప్రత్యయము రావలసి యుండును.

తాత్పర్య వివరణములు— తండ్రి యాజ్ఞను పాలించుట, వేద వేదాంగాధ్యయనము చేసియుండుట సంతానమును గలిగియుండుట, సదాచారమును పాలించుచుండుట - ఈ క్రియలు గలవాడు పుత్రుడందురు. అవి లేనివాడు పుత్రుడే కాడని లోకమున వ్యవహరించుట కలదు. నియోగకరణము, మున్నగు పైన చెప్పిన క్రియలు పుత్ర శబ్దార్థమున నంతర్భూత ములు. కనుక నిదియు సముదాయవచనము. అందున్న క్రియలనుబట్టి క్రియావచనమగును. కావున వతిప్రత్యయాపత్తి కలదు, అని భావము. ॥507॥

అవతారిక— "పున్నామ్నో నరకాద్యస్మాత్త్రాయతే పుత్త్ర ఇత్యతః" - అని మను స్మృతి. 'పుత్' అను నరకమున తండ్రిని బడకుండ రక్షించువాడు గాన పుత్త్రుడగును అని యర్థము. పుత్ర శబ్దమునకు ప్రవృత్తి నిమిత్తమగు ముఖ్య క్రియ 'పవనము' అనగా రక్షణ మనుట. దానిని గ్రహింపక సహచారులుగా నుండు 'నిదేశ స్థానము' - అనగా తండ్రి యాజ్ఞ యందుండుట మున్నగు క్రియల నెందుకు పరిగ్రహింపవలెను? అనిన సమాధానమును జెప్పు చున్నారు

శ్లో॥ అంతర్భూతం నిమిత్తం చ రూఢిశబ్దేషు యద్యపి ।
క్రియాస్తు సహచారిణ్యో రూఢాః సన్తి పదార్థవత్ ॥ 508

రూఢి శబ్దేషు = రూఢి శక్తిచే బోధకములగు వానియందు, నిమిత్తం చ = ప్రవృత్తి నిమిత్తమగు క్రియ గూడ, యద్యపి అంతర్భూతమ్ = చేరియే యుండుననుకొనుడు, తథాపి = అయినను, సహచారిణ్యః క్రియాస్తు = ఆ ప్రవృత్తి నిమిత్తముతో బాటుగ నుండు క్రియలును, పదార్థవత్ = పదవాచ్యమగు ద్రవ్యమువలె, రూఢాః సన్తి = ప్రసిద్ధములయినవి కలవు.

తాత్పర్య వివరణములు — రూఢి శబ్దములను. అందుండు అవయవముల యర్థమునకు పొందుబాటు లేకున్నను, వ్యుత్పాదనమునకు మాత్ర మా అవయవార్థమును గ్రహించి వ్యుత్పాదింతురు. అంతియేగాని అవయవార్థమునకు అందు అనుగతి ఎంతమాత్రము నుండదు పుత్ర శబ్దమునందుగూడ, పవనక్రియ అంతరంగమయినను, దానికి, అర్థక్రియాకారిత్వము లేదు. కావున ప్రసిద్ధములగు నితరక్రియలే శబ్దార్థముగా నట గ్రహింపబడును, నిదేశ స్థానము మున్నగు క్రియ లట్టివి. క్రియాపదము ప్రకృత్యర్థమునకు విశేషణమయినపుడు క్రియావత్తును లక్షణచే బోధించునుగాన బ్రాహ్మణాది శబ్దములకు వతిప్రత్యయము సమర్థనీయమగును. కాని ప్రత్యయార్థమును క్రియయే కావలెనని సిద్ధింపలేదు కాన గుణతౌల్యమున్నపుడును తదాపత్తి అనివార్యమని భావము. ॥508॥

అవతారిక — అట్లైన ప్రత్యయార్థమునకే విశేషణమగుగాక యనుచున్నారు.

శ్లో॥ క్రమంతు యదిబాధిత్వా ప్రత్యయార్థ విశేషణమ్ ।
ప్రధానానుగ్రహాత్ సామ్యాత్ విభక్త్యోశ్చావతిష్ఠతే ॥ 509

కింతు = కాని (క్రియా అనునది), ప్రధానానుగ్రహాత్ = ప్రధానమగు ప్రత్యయార్థమునకు విశేషణమగును గావునను, విభక్త్యోః సామ్యాత్ చ = ప్రథమావిభక్తి సామ్యముండుటవలనను, క్రమం బాధిత్వా = స్థానమను క్రమమును, ఆదరింపక, ప్రత్యయార్థ విశేషణం = ప్రత్యయార్థమునకు విశేషణముగా, అవతిష్ఠతే యది = "తుల్యం యత్ సాక్రియా" అని నిలచిన యెడల.

తాత్పర్య వివరణములు — 'తేనతుల్య మిత్యాది సూత్రములో 'తేన' - అనునది మొదటి పదము. అన్వయ బోధక ప్రమాణములలో స్థానమనునది యొకటి. స్థానమనగా క్రమము. ఆ ప్రమాణమువలన 'క్రియా' అను పదము 'తేన' అను ప్రకృత్యర్థ బోధక తృతీయా సమర్థమునకు విశేషణముగాదగియున్నది. కాని ఆ ప్రమాణమును బాధించి, అనగా అది గాదని, 'తుల్యమ్' అను పదమునకు విశేషణము కావలెను. ప్రకృత్యర్థ ప్రత్యయార్థములలో ప్రకృత్యర్థముకంటె ప్రత్యయార్థము ప్రధానము గదా. మరియు, 'తుల్యం', 'క్రియా' - అను పదములు రెండును సమాన విభక్త్యంతములు. కావున విభక్తి సామ్యము ప్రకటముగ శబ్దబోధ్యము. క్రమము శబ్దబోధ్యము గాదు. సామానాధికరణ్యము సంబంధము.

ఇట్లుండ, అధ్యాహారముచేసి 'యత్ తృతీయా సమర్థం సా క్రియా చేత్' - అని ఇట్లన్వయమును కల్పించుట యుక్తముగాదని తాత్పర్యము. ॥509॥

*అవతారిక*— కాని అధ్యాహార కల్పనావశ్యకత ప్రత్యయార్థమునకు క్రియ విశేషణమను పక్షమునను తప్పదనుచున్నారు.

శ్లో॥ ప్రకృతేరవిశిష్టత్వాత్ క్రియాతుల్యే ప్రసజ్యతే ।
పుత్రాదౌ గుణశబ్దేభ్యః పూర్వోక్తస్య విపర్యయే ॥ 510

ప్రకృతేః = వతిప్రత్యయ ప్రకృతి, అవిశిష్టత్వాత్ = 'క్రియా' అను దానిచే విశేషింపబడనందున, గుణశబ్దేభ్యః = గుణవాచకములగు స్థూలమున్నగు శబ్దములకంటె, క్రియాతుల్యే = క్రియచే సమానుడగు, పుత్రాదౌ వాచ్యే = పుత్రుడు మున్నగు వ్యక్తి అర్థమయినపుడు, పూర్వోక్తస్య విపర్యయే = "పుత్రేణతుల్యః స్థూలః" అను నుదాహరణమునకు విరుద్ధముగ, ప్రసజ్యతే = "స్థూలేన తుల్యః పుత్రః" - అని ప్రయోగము ప్రసక్తమగుచున్నది.

*తాత్పర్య వివరణములు*— 'క్రియా' - అనునది యొక్కటియే ప్రకృత్యర్థమునకును ప్రత్యయార్థమునకును గూడ విశేషణమగుట సంభవముగాదు గాన ప్రత్యయార్థ విశేషణ పక్షమున, ప్రకృతి విశేషింపబడదు. అపుడు ప్రకృతి క్రియావాచకము కావలెనను నిర్బంధము లేదు. 'స్థూలమయిన తండ్రితో పుత్రుడు, అజ్ఞావర్తిత్వము మున్నగు క్రియచే తుల్యుడు' అను నర్థమును వివక్షించినపుడు, ప్రకృత్యర్థ విశేషణ పక్షమునందలి యుదాహరణమునకు విరుద్ధముగ "స్థూలవత్ పుత్రః" - అను ప్రయోగము ప్రసక్తము. ఈ విషయము మహాభాష్యమున నిట్లుపపాదింపబడినది— "ఏవమపి తృతీయా సమర్థమవిశేషితం భవతి । తత్రకో దోషః । తృతీయా సమర్థాద క్రియావాచినః క్రియాతుల్యేపి ప్రత్యయః ప్రాప్నోతి"— అని. ॥510॥

*అవతారిక*— క్రియావాచికాని తృతీయా సమర్థముకంటె పరముగా క్రియాతౌల్యమున్నపుడు ప్రత్యయము రావలసియుండునని మాత్రమే మహాభాష్యమున జెప్పబడినది ఉదాహరణము చూపబడలేదు. ఉదాహరణ మూహ్యమని ప్రతీపమునందు గలదు. కావున "స్థూలేన తుల్యోయాతి" అనునది = అనగా నచట 'స్థూలవద్యాతి' అనునది యుదాహరణమని చెప్పవలెను. అపుడు 'యాతి' అను నాఖ్యాతమువలన, క్రియావిశిష్టమగు నుపమేయము ప్రతీతమగుట కవకాశముండును అని కొందరందురు. కాని అదియు సరిపడదు. ఎందువలననగా—

శ్లో॥ స్థూలేనతుల్యోయాతీతి బహిరంగా క్రియాశ్రుతిః ।
అనిమిత్తం వతేస్తుల్యం యాతీత్యత్రేష్యతేవతిః ॥ 511

'స్థూలేనతుల్యః యాతి' ఇతి = 'స్థూలునితో తుల్యుడై నడచుచున్నాడు', బహిరంగా, క్రియాశ్రుతిః = అనిన, క్రియాపద శ్రవణము బహిరంగము, వతేః = కావున వతిప్రత్యయమునకది,

అనిమిత్తమ్ = నిమిత్తము కానేరదు, 'తుల్యం యాతి' = 'స్థూలునితో తుల్యముగా పోవు చున్నారు' ఇతి అత్ర = అనుచో నపుడా ప్రయోగమున, వతిః = వతిప్రత్యయము, ఇష్యతే = సమ్మతమగును.

తాత్పర్య వివరణములు— 'స్థూలేనతుల్యః యాతి' అని యొక వాక్యము - 'స్థూలేన తుల్యం యాతి' అని వేరొక వాక్యము. అందు మొదటి వాక్యమున తుల్య శబ్దము పుంలింగముగా నుపయోగింపబడియున్నది. కావున, ధర్మాంతరమునుబట్టి స్థూలునితో తుల్యుడైన దేవదత్తుడు వెళ్ళుచున్నాడు అనియే అపుడర్థమగును. నియతముగ క్రియా తౌల్యము స్ఫురింపదు. 'స్థూలేన' 'తుల్యః' - అను రెండు పదములకును పరస్పరాన్వయమును చేయు సమయమున వతిప్రత్యయమునకు నిమిత్తమగు క్రియ ఏదియు సన్నిహితముగ లేదు. స్థూల శబ్దము గుణవాచకము. తుల్య శబ్దము పుంలింగమగుటచే క్రియా విషయము కాదాయె. ఇక వానికి సంబంధము నిష్పన్నమయిన వెనుక, 'యాతి' అను పదమువలన క్రియ ప్రతీతమయినను నది బహిరంగమగుటవలన నుపమానోపమేయ సంబంధమునకు నిమిత్తము కాదు. కాగా, "స్థూలేన తుల్యః యాతి" అనునది గూడ "స్థూలేన తుల్యః పుత్రః" అను దాని వంటిదే.

"స్థూలేన తుల్యం యాతి" అనిన, 'యాతి' అను క్రియావాచకమునకు, నపుంసకమగు క్రియా విశేషణముతో సామానాధికరణ్యము. అపుడు క్రియ, అద్రవ్య స్వభావముగాన దాని విశేషణము నపుంసకమయి యుండుట ఉపపన్నము. నియమముగ క్రియనుబట్టియే ఉపమానోపమేయములకు సామ్యమనియు దెలియవచ్చును. వతిప్రత్యయమును నచట సమ్మతమే యగును. ఈ ప్రయోగమును పరికింపుడు—

"స్థూలవద్యాతి మన్దాయమానపదవిన్యాసశ్చవితోదర కలశః" - లావుగల మనుష్యుడు మెల్లగ నడుగులువేయుచు, పొట్ట కదలించుకొనుచు పోవునట్లు దేవదత్తుడును పోవుచున్నాడు అని యర్థము స్పష్టము. 'బ్రాహ్మణవదధీతే క్షత్రియః' - అను స్థలమునందువలెనే శబ్దవాచ్యమగు క్రియ ఉపమానోపమేయ భావనిమిత్తమగును. ॥511॥

అవతారిక— ఏతావతా, ప్రకృత్యర్థ ప్రత్యయార్థ పక్షములు రెండింటియందును దోషము తుల్యమేయని యంగీకరించి, మహాభాష్యమున నీ విధముగ సమాధాన మభిహితము.

"నైషదోషః। యత్తత్తుల్యం క్రియా చేత్సా భవతీత్యుచ్యతే। తులయా చ సమ్మితం తుల్యమ్। యది చ తృతీయాసమర్థమపి క్రియా ప్రత్యయార్థోఽపి క్రియాతతస్తుల్యం భవతి" - అని.

'తుల్యమనగా - తులయా సమ్మితమ్' = త్రాసుతో సమముగా జేయబడినది యర్థము. తృతీయా సమర్థమును, ప్రత్యయార్థమును గూడ క్రియయే అయినపుడే గదా తులాసమ్మితత్వము అని భావము. తద్వివరణ మీ కారిక—

శ్లో॥ ద్వయం విశేష్యతే తేన యదేకత్ర విశేషణమ్ ।
తుల్య శబ్దోహితం ధర్మముభయస్థ మపేక్షతే ॥ 512

యత్ = ఏది, ఏకత్ర = ఒకదానియందు, విశేషణం = విశేషణమో, తేన = దానిచేత, ద్వయం = రెండవది గూడ, విశేష్యతే = విశేషింపబడును, తుల్యశబ్దః = 'తుల్యం' అను శబ్దము, తం = ఆ, ధర్మం = ధర్మమును = క్రియను, ఉభయస్థం = రెండింటియందు నున్నదానినే, అపేక్షతే హి = అపేక్షించును గదా.

తాత్పర్యా వివరణములు— 'తేనతుల్య మిత్యాది సూత్రమునందు, 'క్రియా' అను పదము ఒకచోట నుచ్చారితమై విశేషణముగ నున్నది దానిచేత ప్రకృతి ప్రత్యయార్థములు రెండును విశేషింపబడును. ఒక పద ముభయవిశేషణ మెట్లగునందురా ? తుల్య శబ్దమే ఆ క్రియయను ధర్మమునుభయగతమునుగా బోధించుచున్నది. కావున నది యొకచో నుచ్చారిత మయినను సామర్థ్యమువలననుభయవిశేషణమయి యుండును - అట్లయిననే తుల్య శబ్దార్థమున కుపపత్తి ॥512॥

అవతారిక— ఆ విషయమే ప్రతిపాదించునది యీ కారిక—

శ్లో॥ ఏకస్సమానో ధర్మశ్చేదుపమానోపమేయయోః ।
తులయా సంమితం తుల్యమితి తత్రోపపద్యతే ॥ 513

ఉపమానోపమేయయోః = ఉపమానమునకు నుపమేయమునకును, ఏకః సమానః ధర్మః చేత్ = సమాన ధర్మ మొక్కటియే యగునో, తత్ర = అట్టియెడ, తులయాసమ్మితం తుల్యం ఇతి = 'త్రాసుతో సమపరుపబడినది' - అను మాట, ఉపపద్యతే = ఉపపన్నమగును.

తాత్పర్యా వివరణములు— తుల్య శబ్దమునకు సదృశమయినది అను నర్థము రూఢ్యర్థము. అందు త్రాసును లేదు. సమపరచుటయు లేదు. కాని పదవ్యుత్పాదనమున కట్లు శాస్త్రమున రచింపబడినది. తరాజుతో రెండు వస్తువులను దూచి సమపరచినట్లు సమాన ధర్మ సంబంధమును బట్టి ఉపమానమునకును నుపమేయమునకును సమత్వము ప్రతిపాదింపబడును. కావున సమాన ధర్మవాచక మెచ్చటనున్నను రెండింటితోడను దాని కన్వయము తప్పదు. అదియే తులాసమ్మితత్వము. కనుక క్రియ ప్రకృత్యర్థ విశేషణమయినచో, ప్రత్యయార్థమును, నదియే కాక తీరదని భావము. ॥513॥

అవతారిక— 'క్రియాచేత్' అనునది ప్రత్యయార్థమునకు విశేషణమయినను, తుల్య శబ్దసామర్థ్యమువలన ప్రకృత్యర్థమును క్రియయే యగునుగాన నే పక్షమునను దోషము లేదు. ఆ క్రియారూపమగు సమానధర్మమును వాక్యమున సన్నిహితమయినదే కావలెను - అని ప్రతిపాదింపబడుచున్నది.

శ్లో॥ సూత్రేఽశ్రుతశ్చ ద్విష్ఠోఽసావభేదేన ప్రతీయతే ।
న చ సామాన్యశబ్దత్వాదశ్రుతా గమ్యతే క్రియా ॥ 514

అసౌ = ఈ క్రియయను ధర్మము, సూత్రే = తేనతుల్యమను సూత్రమునందు, శ్రుతః చ = "క్రియాచేత్" అని నిర్దేశింపబడినది, అభేదేన = సామ్యతా బలమువలన అభిన్నముగ, ద్విష్ఠః ప్రతీయతే = ఉభయగతమై, ప్రతీతి విషయమగును, సామాన్య శబ్దత్వాత్ = పుత్ర శబ్దము సామాన్య శబ్దమగుట వలన, అశ్రుతా క్రియా చ = నిర్దేశింపబడని క్రియ యేదియు, న గమ్యతే = గ్రహింపబడదు.

తాత్పర్య వివరణములు— ఈ క్రియయను ధర్మము సూత్రమున నుపమేయోప మానములలో నొకదానికి సంబంధించినదిగా మాత్రమే నిర్దిష్టమయినను నుభయగతమే కావలెను. కాబట్టి "పుత్రేణతుల్యః స్థూలః" - అనిగాని, "స్థూలేనతుల్యః పుత్రః" - అనిగాని ప్రయోగించినపుడు వతిప్రత్యయము ప్రవర్తింపదు. పుత్ర శబ్దము సామాన్యవాచకము· క్రియావిశిష్టుని, తదవిశిష్టుని గూడ నది బోధించును. కావున నచట సాదృశ్యము క్రియా కృతమే యగునని నియతముగ జెప్పుటకు వీలు కనబడదు. సముదాయబోధక శబ్దములు క్రియావత్తగు నవయవమును బోధింపవలెననిన నది యత్నసాధ్యమని చెప్పబడియున్నది అని తాత్పర్యము. ॥514॥

అవతారిక— ఏమయ్యా ! ప్రిత్రాజ్ఞావర్తిత్వము మున్నగు క్రియలు నిరూఢముగ సంబద్ధములయి పుత్రశబ్దార్థమున నంతర్గతములయి యుండునని ప్రతిపాదింపబడినది గదా ? పుత్రశబ్దమువలన నవి యేల ప్రతీయమానములు గావు ? అనిన జెప్పుచున్నారు.

శ్లో॥ అశ్రుతాశ్చప్రతీయంతే నిదేశస్థాయితాదయః ।
యే ధర్మా నియతా స్తేషాం పుత్రాదిషు నవిద్యతే ॥ 515

అశ్రుతాశ్చ = వినబడనివైనను = నిర్దేశింపబడనివయినను, నియతాః = నియతిగలిగినవైన (తప్పనివైన), నిదేశస్థాయితాదయః = తండ్రిమాటయందు నిలచుట మున్నగు, యేధర్మాః = ఏ ధర్మములు, ప్రతీయన్తే = సామాన్యముగ తెలియబడునో, తేషాం = ఆ సామాన్య ధర్మ ములకు సంబంధించిన, పుత్రాదిషు = పుత్రుడు మున్నగు నర్థములు వాచ్యములయినపుడు, న విద్యతే = వతిప్రత్యయమను తద్ధితవృత్తి ఉండదు.

తాత్పర్య వివరణములు — పుత్ర శబ్దముయొక్క అర్థముతో నిరూఢమగు సంబంధముగల, ప్రసిద్ధములగు క్రియలు కొన్ని సామాన్యముగ, వానికి వాచకమగు శబ్ద మచట ప్రయోగింపబడకున్నను, ప్రతీతి గోచరములగుచుండును. అయినను నా ధర్మములు అనేకములు అందు నియతమగు వాచకమేదియు క్రియకు లేదు. అందువలన నదియే ఉపమా హేతువని యెట్లు చెప్పగలము. కావున నట్టి సామాన్యధర్మములు గలవిగా పుత్ర శబ్దముచే పుత్రాద్యర్థములు వాచ్యములయినను వతిప్రత్యయము రాదు.

''పుత్రవదయం మాణవకః'' = ఈ బాలుడు గురువునకు కుమారునివంటివాడు అనుట గలదు. అట వతిప్రత్యయము ప్రవర్తించినది. దాని బలమువలన యోగ్యమగు క్రియ నధ్యాహారము చేయవలెను. కుమారునివంటివాడుగా జూచుకొనదగినవాడు అని దర్శన క్రియ కధ్యాహారము. ''స్థానివదాదేశః'' అని పాణిని. అచటను 'వర్తతే' అను క్రియాపదమున కధ్యాహారము ఆదేశము స్థానివలె వర్తించుననుట, యానక్రియా తౌల్యమున్నపుడు, 'స్థూల వద్యాతి' అను, తద్ధితవృత్తియు నుపపన్నము. ॥515॥

*అవతారిక*— పై యర్థమును నిగమనరూపమున బోధించుచున్నారు.

శ్లో॥ అనాశ్రితక్రియస్తస్మాన్న తుల్యోఽస్తి క్రియావతా ।
క్రియాయాః శ్రవణే సాఽపి క్రియావత్తా ప్రతీయతే ॥ 516

తస్మాత్ = అందువలన, అనాశ్రిత క్రియః = క్రియాశ్రయము లేనిది, క్రియావతా = వేరొక క్రియావిశిష్టముతో, తుల్యః = తుల్యమైనది, న అస్తి = లేదు. క్రియాయాః = క్రియావాచకము నకు, శ్రవణే = ప్రయోమున్నపుడు, సా = ఆ, క్రియావత్తాపి = క్రియావైశిష్ట్యము గూడ, ప్రతీయతే = ప్రతీతికి గోచరమగును

*తాత్పర్య వివరణములు*— క్రియాపదము ప్రయోగింపబడనపుడు, ఉపమానోప మేయములకు సాధారణమగు క్రియారూప ధర్మము తెలియబడదుగాన నట్టి స్థలములందు వతి ప్రత్యయము ప్రవర్తింపదు. అసాధారణమగు క్రియయొక్క నిర్దేశము లేని పదార్థమునకు వేరొక క్రియా విశిష్టముతో సాదృశ్యము సంభవింపదు. ఈ విషయము కారిక పూర్వార్థముచే బోధితము. క్రియా శ్రుతియున్న ''బ్రాహ్మణ వదధీతే క్షత్రియః'' - మున్నగు స్థలములందు, ఉపమేయగతముగ క్రియ నిర్దేశింపబడినను ఆ క్రియా సంబంధ ముపమానమందును గమ్య మగును. కావుననే పక్షమునందును దోషము లేదు. ॥516॥

*అవతారిక*— అయినను ప్రత్యయార్థమునకు 'క్రియా' అనునది విశేషణమను పక్షమునే భాష్యమున సిద్ధాంతీకరించిరి. ఆ భాష్యమును వినుడు— ''కిం పునరత్రజ్యాయః ? ప్రత్యయార్థ విశేషణమేవజ్యాయః । కుత ఏతత్ । ఏవం హి కృత్వా ఆచార్యేణ సూత్రం పఠితమ్ వతినా సామానాధికరణ్యం కృతమ్ । అపిచావ్యయేషువతేః పాఠః నకర్తవ్యోభవతి । క్రియాయామయం భవన్‌లింగసంఖ్యాభ్యాం న యోక్ష్యతే'' - ఈ రెండు పక్షములలోనేది శ్రేష్ఠము ? ప్రత్యయార్థమునకు విశేషణమను పక్షమే. ఏల ? పాణిన్యాచార్యుని సూత్రపాఠ మా విధముగనే యున్నది. 'తేన' 'క్రియా' అను పదములు విభిన్న విభక్తికములు 'తుల్యం' 'క్రియా' అనునవి సమాన విభక్తికములు మరియు 'క్రియా' అను పదమునకు, వతిప్రత్య యముతోనే సామానాధికరణ్యమును వ్యాఖ్యానింపవచ్చును. వతిప్రత్యయము వచ్చును. అది క్రియావాచి, అని యర్థము.

అదియునుగాక ప్రత్యయార్థ విశేషణ పక్షమున లాఘవమును గలదు. అపుడు

అతదాత్మకం + చ = జ్ఞానరూపముకాకున్నను, తత్ = ఆజడవస్తువు, తదాత్మ + ఇవ = జ్ఞాన రూపమైనది వలె, సిద్ధమ్ = కాన్పించుచున్నదో,

ఈ శ్లోకార్థమునకు పదియవ శ్లోకముయొక్క ఉత్తరార్ధముతో నన్వయము చూప వలెను.

విజ్ఞానవాదిమతమున జ్ఞానము తప్ప బాహ్యవస్తువులేనేలేదు. కడవ మున్నగు వస్తువులు, వానియందు కాన్పించు గుణములు అసత్యములే. ఐనను జడములు జ్ఞానరూపములవలె కాన్పించును. అట్లుభాసించుటకు అనాదియగు అవిద్యమే కారణము. అట్లే, లేని యుపాధులు అవిద్యా వశమున బ్రహ్మమున భాసింపగలవు. ॥9॥

*అవతారిక* — ప్రకృతార్థమునకు విజ్ఞానవాదిమతము ననుసరించి 9 వ శ్లోకమున దృష్టాంతము చూపబడినది.

ఇపుడు కపిలసాంఖ్యముననుసరించి పూర్వార్ధముచే దృష్టాంతము చూపుచున్నాడు.

శ్లో॥ తథా వికారరూపాణాం తత్త్వేఽత్యన్త మసంభవః ।
తదాత్మేవ చ తత్తత్త్వమత్యన్త మతదాత్మకమ్ ॥ 10

(యథా + వా) = ఏరీతిగా, వికారరూపాణామ్ = బుద్ధి మున్నగు వికారములయొక్క పలు విధములగు రూపములకు, తత్త్వే = ప్రధానతత్త్వమున అనగా మూల ప్రకృతియందు, అత్యన్తమ్ = మిక్కిలి, అసంభవః = సంభవము లేదో, తథా = ఆ రీతిగా, అత్యన్తమ్ = మిక్కిలి, అతదాత్మకమ్ = ఉపాధుల రూపము కానట్టి, తత్త్వమ్ = బ్రహ్మతత్త్వము, తదాత్మ + ఇవ + చ = ఉపాధుల యొక్క రూపముకలదివలె, (భాసతే) = భాసించును.

కపిలతంత్రమున 25 పదార్థములంగీకరింపబడినవి వానికి తత్త్వములని వారి వ్యవహారము. ఆ తత్త్వములలో మూలప్రకృతి యొకటి, దానివలననే పై వికారములు కలుగును. దానికి మాత్రము కారణము లేదు. అందుచే నది మూల ప్రకృతి యనబడును. దానినే ప్రధానము, అవ్యక్తము మున్నగు పదములచే వ్యవహరింతురు. దాని వికారములే బుద్ధిమున్నగునవి. బుద్ధికి 'మహత్తత్త్వ' మని వారి సంకేతము. వికారముకలుగుటకు కావలసిన శక్తులు ప్రధానమున కలవు. సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థయే 'మూల ప్రకృతి' యనబడును. ఆ గుణముల వైషమ్యముచే రాపిడికలిగి ఎన్నియో వికారములు కలుగును. నిజమున ఆవికారములు మూల ప్రకృతికి లేవు. కాని అవిద్యావశమున నానావికారములుగా ఆ ప్రకృతియే కాన్పించును.

అట్లే పరబ్రహ్మము అవిద్యావశమున ఉపాధి రూపములతో కాన్పించును. ఎల్లదర్శనములలోను అవిద్యా సంబంధము కాన్పించుచునే యున్నది. ॥10॥

క్రియ, సాధ్యమాన స్వభావమగు అసత్వభూతము సంభవించును. అది వాచ్యమగునపుడు విధీయమానమగు వతిప్రత్యయము గణపాఠమున లేకున్నను అవ్యయసంజ్ఞను బొందును లింగసంఖ్యా సంబంధముండదు గదా ? అని భాష్య తాత్పర్యము— ఏతద్వ్యాఖ్యాన రూపమే యీ కారిక— రెండు పక్షములందును దోషము పరిహరింపబడినది గాన రెండును ప్రశస్యములే కాని ప్రత్యయార్థ విశేషణ పక్షమున వతిప్రత్యయ మసత్త్వభూతక్రియను దెలియజేయును గాన ఆ లింగమును అసంఖ్యమును అగును. అవ్యయత్వము స్వతస్సిద్ధము కావున స్వరాది పాఠముతో బనిలేదు. అది యిందు లాఘవము.

**శ్లో॥ ద్వయోః ప్రతివిధానాచ్చ జ్యాయ స్త్వమభిధీయతే ।**
**నిత్యాసత్వాభిధాయిత్వాత్ ప్రత్యయార్థ విశేషణే ॥** 517

ద్వయోః = రెండు పక్షములందును, ప్రతివిధానాత్ = దోషము వారింపబడుటవలనను, ప్రత్యయార్థ విశేషణే = ప్రత్యయార్థమునకు విశేషణమను పక్షమున, నిత్యాసత్త్వాభిధాయిత్వాత్ చ = వతిప్రత్యయము నియమముగ అసత్వ భూతక్రియను జెప్పుటవలనను, జ్యాయస్త్వం = ప్రశస్యతరత్వము, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యమవతారికా గ్రంథముచే గతార్థము. ॥517॥

*అవతారిక*— ఏమయా, ఈ పక్షమునందైనను, వతిప్రత్యయమునకు క్రియా విశిష్టము గదా అర్థము. క్రియ అసత్త్వభూతమయినను తద్విశిష్టము ద్రవ్యరూపమేగాన లింగ సంఖ్యా సంబంధమును వత్యంతమునకు వారించుటకై స్వరాది గణపాఠ మావశ్యకమే యగునే ? అనిన—

**శ్లో॥ అసత్త్వభూతోవ్యాపారః కేవలః ప్రత్యయే యతః ।**
**విద్యతే లక్షణార్థత్వం నాస్తి తేన క్రియాశ్రుతేః ॥** 518

ప్రత్యయే = ప్రత్యయ విషయమున, యతః = ఏ కారణమువలన, అసత్వభూతః = ద్రవ్య స్వభావము కాని, వ్యాపారః = క్రియా రూపమగునది, కేవలః = ద్రవ్యరహితము, విద్యతే = ఉంటున్నదో, తేన = ఆ కారణముచేత, క్రియాశ్రుతేః = 'క్రియా' - అను పదమునకు, లక్షణార్థత్వం = లాక్షణికార్థము = విశిష్టము, నాస్తి = లేదు.

*తాత్పర్య వివరణములు*— ప్రత్యయార్థ విశేషణ పక్షమున, కేవల క్రియ. అనగా ద్రవ్యరహితమగు అసత్త్వ భూతవ్యాపారము సంభవము. కాన క్రియా శబ్దమునకు లాక్షణికార్థమగు క్రియావత్తును గ్రహింపనక్కరలేదు. ముఖ్యార్థమునకు సంభవము లేనపుడు గదా లక్షణకు ప్రసంగము. కాగా వతిప్రత్యయమపుడు, క్రియామాత్రమును బోధించునుగాన అవ్యయత్వము సిద్ధమే. స్వరాది పాఠముతో బనిలేదు. ॥518॥

*అవతారిక*— ప్రకృత్యర్థ విశేషణ పక్షమున శుద్ధక్రియ ఉపమానముగ సంభ

వింప నపుడు క్రియా విశిష్టము గ్రహింపబడుననిరి. ఆ విధముగనే ఈ పక్షమునను ప్రత్యయ వాచ్య క్రియకు క్రియతోనే తౌల్యముగాన శుద్ధక్రియ సంభవింపనపుడు తద్విశిష్టమున కంటెనే వతిప్రత్యయము ప్రాప్తము గదా. ఇక పక్షములకు భేదమేమి? అనిన-

**శ్లో॥ క్రియావతస్తు గ్రహణాత్ ప్రకృత్యర్థ విశేషణే।**
**క్రియామాత్రేణ తుల్యత్వే సిద్ధాసత్త్వాభిధాయితా॥** 519

**శ్లో॥ యదాక్రియానిమిత్తం తు సాదృశ్యం స్యాత్ క్రియావతోః।**
**క్రియావతోఽభిధేయత్వాత్ తదాద్రవ్యాభిధాయితా॥** 520

ప్రకృత్యర్థ విశేషణే = 'క్రియా' అనునది ప్రకృత్యర్థమునకు విశేషణమను పక్షమున, క్రియావతః = క్రియావిశిష్టము (ప్రకృత్యర్థముగ), గ్రహణాత్ = గ్రహింపబడుటవలన, క్రియామాత్రేణ = క్రియచేతనే, తుల్యత్వే తు = సామ్యము వివక్షితమయిన, అసత్వాభిధాయితా = అసత్త్వ భూతక్రియాభిధానము, సిద్ధా భవతి = సిద్ధించినదగును, యదా తు = ఎపుడైతే, క్రియావతోః = క్రియావిశిష్టములకు, సాదృశ్యం = సామ్యము, క్రియానిమిత్తం స్యాత్ = క్రియామూలకమగునో, తదా = అపుడు, క్రియావతః = క్రియావిశిష్టము, అభిధేయత్వాత్ = చెప్పదగినదగును గనుక అపుడు, ద్రవ్యాభిధాయితా భవేత్ = ద్రవ్యవాచిత్వము సిద్ధించును.

*తాత్పర్య వివరణములు*— క్రియ ఉపమేయమయిన నది ద్రవ్యభిన్నమయిన, సాధ్యతా స్వభావమగు నర్థమే గనుక, వతిప్రత్యయాంతమునకు అవ్యయత్వము సిద్ధించును.

క్రియ ప్రత్యయార్థము గాదు. క్రియావిశిష్టము ప్రత్యయమున కర్థమను పక్షమున, ఆ క్రియావంతములగు నుపమానోపమేయములకు సాదృశ్యము క్రియానిమిత్తకమే యగును. ఆ క్రియ వేరొక క్రియకు, సౌష్ఠవము మున్నగు సమాన ధర్మమును బుచ్చుకొని యుపమాన మయిన నదియే ప్రత్యయార్థ విశేషణత యనబడును. క్రియావిశిష్ట ముపమేయమయినపుడు, వ్యాపారానువిద్ధమగు క్రియావత్తుకే ప్రాధాన్యము. ఆ వ్యాపారము సత్త్వభూతము గాదు గాన అవ్యయత్వము దానికి సిద్ధమే యగును తిఙన్తపదవాచ్యము గదా ఉపమేయమగును, ఆఖ్యాతమసత్త్వభూతార్థ ప్రధానమే ఆయె. ॥519, 520॥

*అవతారిక*— క్రియావిశిష్టమగు ద్రవ్య ముపమేయమయినపుడు, వ్యాపారానువిద్ధమగు ద్రవ్యమునకాని లేక వ్యాపారోపలక్షితమగు ద్రవ్యమునగాని దాని కా ప్రాధాన్యమని విచారింపవలసి యుండును. మొదటి పక్షమున వత్యన్త మసత్వభూతమగును గాన అవ్యయత్వము సిద్ధించునని చెప్పబడినది. క్రియచేత నుపలక్షితమగు ద్రవ్యమునకు ప్రాధాన్యమయిన, ప్రకృతి వాచ్యమును క్రియావిశిష్ట ద్రవ్యమే. ప్రత్యయార్థమును నదియే యగును. అపుడు సత్వభూతార్థవాచియగును గాన నవ్యయత్వము సిద్ధింపదు. కావున స్వరాదిపాఠము వత్యంతమున కావశ్యకమగునని చెప్పుచున్నారు.

శ్లో॥ అవ్యయేషువతేః పాఠః కార్యస్తత్ర స్వరాదివత్ ।
బ్రాహ్మణేన సమోఽధ్యేతేత్యత్ర చ ప్రత్యయో భవేత్ ॥ 521

తత్ర = వత్యంతము ద్రవ్యమయినపుడు, వతేః = వతిప్రత్యయమునకు, అవ్యయేషు = అవ్యయములలో. స్వరాదివత్ = స్వర్ మున్నగువానికి వలె, పాఠః = గణపాఠము, కార్యః = చేయవలసినదై యుండును, బ్రాహ్మణేన సమః అధ్యేతా = ఈ వాక్యమునందు, ఇత్యత్ర చ = ఈ విగ్రహ వాక్యమున గూడ, ప్రత్యయః = వతిప్రత్యయము, భవేత్ = రావలసి యుండును.

తాత్పర్య వివరములు— స్వర్, అంతర్, - మున్నగునవియు నిపాతలును అవ్యయములు. అందు స్వరాదులు ద్రవ్యవచనములు. "స్వః రోహావః = స్వర్గము నెక్కుచున్నాము. "స్వర్యాతః" = స్వర్గమును బొందినాడు, మొదలగు ప్రయోగములు కలవు. అందు స్వర అను దానికి కర్మత్వ మగపడుచున్నది. అది సత్వభూతమయిననే ఘటించును. 'చ' 'వా' మున్నగునవి అసత్త్వ భూతములు. స్వరాదులను చాదులలోనే చేర్చి 'నిపాతముల వ్యయములు' అని సూత్రమును పాణిని రచింపకుండుట కిదియే కారణము. స్వరాదులలో వత్యంతమును బఠించి, పాఠసామర్థ్యమువలన నవ్యయత్వమును సంపాదింపవలెను. వ్యాపారానువిద్ధకర్తృ ప్రాధాన్య పక్షమున, అవ్యయపద మన్వర్థమగుటచేతనే అవ్యయత్వము సిద్ధించును. 'అవ్యయమ్' అను పదమునకు 'నవ్యేతి' అని విగ్రహము. లింగసంఖ్యలులేని దవ్యయమని ఫలితార్థము. సూత్రకారునకును, గణమున పఠింపబడని వాని కవ్యయత్వ సిద్ధి కొఱకు అన్వర్థత్వమే ఆశ్రయణీయము. వార్తికకారుడును 'అలింగాసంఖ్య మవ్యయమ్' అనియే అవ్యయ లక్షణమును జెప్పెను మునిత్రయ మతమునను ప్రత్యయార్థ విశేషణ పక్షమున, పాఠము = అనగా గణపాఠ మక్కఱలేకయే వత్యంతమున కవ్యయ సంజ్ఞ సిద్ధించును. ఇదియే ఈ పక్షమునకు గల ఉత్కర్షము.

తేనతుల్యం క్రియాచేద్వతిః (5-1-115) అను నీ సూత్రమునకు తరువాత, "తత్రతస్యేవ" (5-1-116), "తదర్హమ్" (5-1-117) అను రెండు సూత్రములును వతిప్రత్యయ విధాయకములే. ఆ వతిప్రత్యయాంతములకును గణపాఠముతో బనిలేకయే అవ్యయత్వము సిద్ధించును.

'బ్రాహ్మణేన తుల్యః అధ్యేతా' - అను నభిప్రాయముతో, 'బ్రాహ్మణవత్ అధ్యేతా' - అను ప్రయోగమనిష్టము. దానికి ప్రసంగము కారికోత్తరార్థమున ఆపాదింపబడినది. ఈ విషయము 523 కారికలో విస్తృతముగ నిరూపింపబడినది. ॥521॥

అవతారిక— "ఏవంచైవ హి కృత్వా ఆచార్యేణ సూత్రం పఠితమ్ । వతినా సామానాధికరణ్యం కృతమ్" - అని మహాభాష్యమున జెప్పబడిన ఆ వతిసామానాధికరణ్యమీ కారికలో వివరింపబడుచున్నది.

శ్లో॥ సామానాధికరణ్యం చ వత్యర్థేనాపదిశ్యతే।
తుల్యమిత్యన్యథా కల్ప్యో వాక్యశేషో శ్రుతో భవేత్ ॥ 522

సామానాధికరణ్యం చ = భాష్యోక్తమయిన వతిసామానాధికరణ్యమును, 'తుల్యమ్' ఇతి = 'తుల్యమ'ని సూత్రమున గల తుల్య శబ్దముతో, వత్యర్థేన = అనగా వతితోగాక వత్యర్థమగు తుల్యశబ్దముతో, అపదిశ్యతే = వివక్షింపబడుచున్నది, అన్యథా = అట్లు కానిచో, అశ్రుతః = అధ్యాహారము చేయబడినదై, వాక్యశేషః = యత్తత్ తృతీయాసమర్థం సా క్రియాచేత్' అని శేషపూరణము, కల్ప్యఃభవేత్ = కల్పింపవలసి యుండును.

తాత్పర్య వివరణములు— భాష్యమునందు 'వతిసామానాధికరణ్యం కృతమ్' అనగా వతిప్రత్యయముతో క్రియాశబ్దమునకు సమానాధికరణ నిర్దేశమని యర్థము గాదు. వతిప్రత్యయ మా సూత్రముచే విధింపబడుచున్నది. అంతకు పూర్వము సిద్ధముగాదు. సిద్ధ పూర్వమునకే ఇతర వ్యావృత్తికొరకు విశేషణ సంబంధము కలుగజేయబడును. 'క్రియ అయిన వతిప్రత్యయము వచ్చును' అను మాట కర్థము లేదు. దానికి క్రియారూపతగాని తద్భిన్నరూపముగాని లేదు గదా. అందువలన విశేషణ మర్థవిరహితము.

కావున వత్యర్థవాచకమగు తుల్యశబ్దముతో క్రియా అను దానికి సామానాధికరణ్య మని భాష్య తాత్పర్యము తుల్యశబ్దార్థము క్రియయును అక్రియయును సంభవముగాన విశేష ముపపన్నమగును. ఇపుడు సామానాధికరణ్యము శబ్ద ప్రతిపాదితమే. అశ్రుత కల్పనతో బని లేదు. 'క్రియా' అనునది ప్రకృత్యర్థమునకు విశేషణమను పక్షమున, 'తేన' 'క్రియా' అను పదములు విరుద్ధ విభక్తికము లగుటచేత, ''యత్ తత్ తృతీయాసమర్థం క్రియాచేత్ సా భవతి'' అని వాక్యశేషమునధ్యాహరించి సమన్వయమును గల్పింపవలసి యుండును. అది గౌరవదోష పరాహతము ॥522॥

అవతారిక— ఈ పక్షమున అధ్యేత ఉపమేయుడయినపుడు ప్రాప్తమగు అనిష్ట ప్రత్యయమును వారితమగును– ఎట్లనగా

శ్లో॥ క్రియావతోశ్చ సాదృశ్యే ప్రత్యయార్థవిశేషణే।
అధ్యేత్రా సదృశోఽధ్యేతేత్యత్ర నాస్తి వతే ర్విధిః ॥ 523

ప్రత్యయార్థ విశేషణే = ప్రత్యయార్థమునకు క్రియా అనునది విశేషణమను పక్షమున, క్రియావతోః = క్రియా విశిష్టములకు సామ్యము వివక్షింపబడినను, సాదృశ్యే చ = సామ్యవివక్ష యందైనను, అధ్యేత్రా సదృశః అధ్యేతా = అను నీ ప్రయోగమునందు, ఇత్యత్ర = అధ్య యనము చేయువానితో నట్టివాడు సమానుడు అను నర్థమున, వతేః విధిః నాస్తి = వతి ప్రత్యయమునకు విధానము లేదు.

తాత్పర్య వివరణములు— ఈ పక్షమున, 'తుల్యమయినది క్రియ అయినచో' అని క్రియయే విశేషింపబడుట వలన, క్రియచే ఆవిష్టుడగు కర్తయందే ప్రత్యయము

ప్రవర్తించును అనగా క్రియకే ప్రాధాన్యము వివక్షితము. ద్రవ్యమునకు గాదు. కనుకనే క్రియా ప్రధానమగు ఆఖ్యాతముతో నిర్దేశము, 'బ్రాహ్మణేన తుల్యం అధీతే' అని = బ్రాహ్మణునితో సమానముగా చదువుచున్నాడు అనియే అగపడు చున్నది. వెనుక అపక్ష మున క్రియావత్తగు ప్రత్యయార్థముతో, అటువంటి ప్రత్యయార్థముననే సామ్యము. ఉపమా హేతువగు క్రియ అప్రధానమగుట వలన ద్రవ్యము ప్రధానమయినపుడు అనిష్టమయిన ప్రత్యయము రావలసి వచ్చును.

'పుత్రేణతుల్యః స్థూలః' అను స్థలమున, 'తత్రతస్యేవ' అను పై సూత్రముచేత కూడ వతిప్రత్యయము రాదు. ''మధురావత్ స్రుఘ్నేప్రాసాదః'' 'చైత్రవత్ మైత్రస్యగావః' అను స్థలములందు సప్తమ్యన్త షష్ఠ్యంతములకంటె పరముగనే ఆ సూత్రము వతిప్రత్యయ మును విధించును.

'పుత్రవత్ స్థూలః వర్తతే' అని వర్తన క్రియాకృతమగు నుపమానోపమేయ భావమునందు, వతిప్రత్యయము సాధువే యగును. కావున వత్యంతమున కవ్యయములలో పాఠప్రసంగమును లేదు. అనిష్ట స్థలమున వతిప్రత్యయాపత్తియును లేదు. అందువలన ప్రత్యయార్థ విశేషణ పక్షమే ప్రశస్యతరమని సిద్ధాంతము. ॥523॥

*అవతారిక* — ఈ వృత్తి సముద్దేశమునందు 433 వ కారిక నుండి 523 వ కారిక వరకును 91 కారికలలో, అతివిపులముగ, సూ॥ ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' (5-1-115) అను సూత్రవిషయము ఉపమానోపమేయ భావ విచార ప్రసంగ సంగతమయినది విచారింప బడినది. ఇక తదనంతర సూత్రమగు ''తత్రతస్యేవ'' (5-1-116) అను సూత్రముచే విహితమయిన ఇవార్థవిషయ వతిప్రత్యయ విషయము, 550 వరకును గల 27 కారికలలో విమర్శింపబడును.

— ''తత్రతస్యేవ'' అని సూత్రము. 'అచ్చటవలె' 'దానికివలె' అను నర్థములందు వతిప్రత్యయము, సప్తమీరూప సమర్థ విభక్త్యంతము కంటెను, 'షష్ఠీరూప సమర్థ విభక్త్యం తము కంటెను బరము గావచ్చును' అని సూత్రార్థము. ''మధురావత్ పాటలీపుత్రే ప్రాసాదాః'' = మధురాపట్టణము నందువలె నుండునవి పాటలిపుత్ర నగరమునందలి మేడలు. 'చైత్రస్యేవ మైత్రస్యగావః = చైత్రవత్ మైత్రస్యగావః = చైత్రునివివలె మైత్రుని గోవులు - అని యుదాహరణము.

ప్రకృత సూత్రమున మహాభాష్యమున నిట్లాక్షేపింపబడినది. ''తేనతుల్యం క్రియా చేద్వతిః'' అను పూర్వసూత్రము వలననే. పై లక్ష్యములందును వతిప్రత్యయము సిద్ధించు గదా ? ఈ సూత్ర మెందుకు రచింపవలె'' అని. కాని పూర్వసూత్రములచేత నెట్లు సిద్ధిం చును ? అది తృతీయా సమర్థమునకు ప్రత్యయ విధాయకము. ఇది, షష్ఠీ సమర్థమునకును సప్తమీ సమర్థమునకును వతివిధాయకము గదా అని ప్రశ్న కలుగుచున్నది. కావున నీ కారి కలో పూర్వపక్షాభిప్రాయమును వ్యాఖ్యానించుచున్నారు.

శ్లో॥ తుల్యార్థైరితి యా తస్యాస్తృతీయాయా నభిద్యతే ।
అర్థో భేదేఽపి సర్వాభిరితరాభిర్విభక్తిభిః ॥ 524

తుల్యార్థైః ఇతి = 'తుల్యార్థైః' అను సూత్రముచే, యా తృతీయా = ఏ తృతీయ కలదో, తస్యాః తృతీయాయాః = దానియొక్క, అర్థః = అర్థము, భేదే = వ్యాపార భేదము, సత్యపి = ఉన్నప్పటికిని, ఇతరాభిః = ఇతరములయిన, సర్వాభిః = అన్ని, విభక్తిభిః = విభక్తుల చేతను, అభిహితాత్ = చెప్పబడిన, అర్థాత్ = అర్థముకంటె, న భిద్యతే = వేరుకాదు.

తాత్పర్య వివరణములు— "తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్య తరస్యామ్" (2-3-72) అను సూత్రము, 'సమానమయిన' అను నర్థముగల 'సదృశః' సమఃతుల్యః - మున్నగువానితో సంబంధమున్నపు డుపమానవాచక శబ్దమునకు తృతీయా షష్ఠీవిభక్తి ప్రత్యయములు వచ్చునని చెప్పుచున్నది.

"కృష్ణేనతుల్యః" అనియు కృష్ణస్య తుల్యః అనియు ప్రయోగము లుదాహరణ ములు. ఆతృతీయార్థమునకును, ఇవశబ్దయోగమున నగపడు సకల విభక్తుల యర్థమునకు భేదము లేదు. శబ్దభేదము మాత్రమే యుండును. వతిప్రత్యయము వచ్చినపుడా విభక్తి లోపించును. సదృశార్థప్రతీతి సమానమే. విగ్రహ వాక్యముననే భేదము. అందువలన పూర్వ సూత్రముచేతనే వతిప్రత్యయము ఇవార్థ విషయమునను సిద్ధింపవచ్చునని పూర్వపక్ష తాత్ప ర్యము. ॥524॥

అవతారిక— ఇవ శబ్దప్రయోగమున సకల విభక్తులకును, తుల్య శబ్దయోగమున తృతీయా విభక్తికిని అర్థమున భేదములేదని ప్రయోగముఖమున నీ కారికలలో జూడబడు చున్నది.

శ్లో॥ భోజ్యతేబ్రాహ్మణ ఇవతుల్యం భుక్తం ద్విజాతినా ।
పశ్యతిబ్రాహ్మణ మివతుల్యం విప్రేణపశ్యతి ॥ 525

శ్లో॥ బ్రాహ్మణేనేవ విజ్ఞాతం తుల్యం జ్ఞాతం ద్విజాతినా ।
దీయతాం బ్రాహ్మణాయేవ తుల్యం విప్రేణదీయతామ్ ॥ 526

శ్లో॥ బ్రాహ్మణాదివ వైశ్యాత్త్వమధీష్వాధ్యయనం బహు ।
ఇత్యేవమాదిభిర్భేద స్తృతీయాయా నకశ్చన ॥ 527

తాత్పర్య వివరణములు— తుల్యార్థయోగమున విహితమగు తృతీయాశేష విభక్తి. అనగా ఉపపద విభక్తి. ఇవార్థయోగమున దృశ్యమానములగు విభక్తులు. కారక విభక్తులు. శేషసంబంధమునకు గూడ అనగా కారక క్రియా సంబంధముకంటె వ్యతిరిక్తమగు పదాంతరయోగమున వచ్చు సంబంధము గూడ క్రియాకారక భావ మూలకమే. కర్మ కరణాదులు స్వస్వరూపముతో వివక్షింపబడక, సంబంధ సామాన్యరూపమున వివక్షింపబడుటయే

శేషముగ వివక్షించుట యనబడును. కావున వస్త్వర్థమునకు భేదము లేదుగాన పూర్వ సూత్రముచే సిద్ధింపవచ్చునని తాత్పర్యము. ప్రథమాది విభక్తి క్రమమున నుదాహరణములు చూడుడు.

బ్రాహ్మణః ఇవభోజ్యతే క్షత్రియః ।
బ్రాహ్మణేన తుల్యం భోజ్యతే క్షత్రియః ॥

బ్రాహ్మణమివపశ్యతి క్షత్రియమ్ ।
విప్రేణతుల్యం పశ్యతి క్షత్రియమ్ ॥

బ్రాహ్మణేనేవ విజ్ఞాతం క్షత్రియేణ ।
ద్విజాతినాతుల్యం విజ్ఞాతం క్షత్రియేణ ॥

బ్రాహ్మణాయేవ దీయతామ్ క్షత్రియాయ ।
విప్రేణతుల్యం దీయతామ్ క్షత్రియాయ ॥

బ్రాహ్మణాదివ త్వం బహు అధ్యయనమధీష్వ క్షత్రియాత్ ।
విప్రేణతుల్యం వైశ్యాత్త్వ మధీష్వాధ్యయనం బహు ॥

బ్రాహ్మణస్యేవ వైశ్యస్య ధనమేతదుపస్థితమ్ ।
విప్రేణతుల్యం వైశ్యస్య ధనమేతదుపస్థితమ్ ॥

బ్రాహ్మణే ఇవగుణాః బహవః స్థితాః క్షత్రియే ।
విప్రేణతుల్యం తిష్ఠన్తి క్షత్రియే బహవోగుణాః ॥
॥525, 526, 527॥

*అవతారిక*— ఇచట నొక ప్రశ్న కలుగును—

**శ్లో॥ తుల్యం మథురయాధీయే మాత్రా తుల్యం స్మరామితామ్ ।**
**మథురాయాశ్చ మాతుశ్చ కథం సాదృశ్య కల్పనా ॥** 528

మథురయాతుల్య మధీయే = 'మథురతో సమానముగ జదువుచున్నాను', మాత్రా తుల్యం తాం స్మరామి = 'తల్లితో తుల్యముగ నామెను తలంతును', మథురాయాః చ=(అను విగ్రహ వాక్యములందు) మథురకును, మాతుః చ = తల్లికిని (అధ్యయన స్మరణములతో), కథం సాదృశ్య కల్పనా = సామ్యమును గల్పించుట యెట్లు ఘటించును ?

**తాత్పర్య** *వివరణములు*— 'మథురాయామివ పాటలీపుత్రే అధీయే అహమ్' = మథురలోవలె పాటలి పుత్రములో నేను జదువుకొనుచున్నాను. అను నర్థమునందు 'మథురావ దధీయే' అనియు, ''మాతురివ దేవదత్తాయాః స్మరామి'' = తల్లినివలె దేవదత్తను స్మరింతును - అను నర్థమునందు, మాతృవత్ దేవదత్తాం స్మరామి, - అనియు వతిప్రత్యయము అభీష్టము. అయ్యది పూర్వసూత్రముచే ప్రవర్తించిన నపుడు ''మథురయాతుల్య మధీతే''

అనియు, 'మాత్రాతుల్యం స్మరామి' అనియు, విగ్రహవాక్యము లుండదగినవి అధ్యయనము నకు మధురతోడను, స్మరణమునకు మాతతోడను సాదృశ్యమును చెప్పినట్లగును. అది యుప పన్నము గాదు స్మరణ విషయము మాత. అధ్యయనమునకు అధికరణము మధుర. అధ్యయన స్మరణ క్రియలతో తుల్యమగు క్రియ యేదియును మధురామాతలందును లేనందున, మాతృ శబ్దమునకు మాతృ స్మరణమునందును, మధురా శబ్దమునకు మధురాధికరణకు అధ్యయనము నందును లక్షణ నాశ్రయింపవలెను. ఆ రెండధ్యయనములకును, స్మరణములకును ఆశ్రయ భేదముచే భేదమును గల్పించి, వానికి సాదృశ్యమును కల్పింపవలసి యుండును. కాని, కర్త యధ్యయనమునకును, మధురాధికరణకు అధ్యయనమునకును, కర్త స్మరణమునకును కర్మ యగు మాత స్మరణమునకును సాదృశ్యము అసంభవము ॥528॥

అవతారిక— కాగా, వెనుక సూత్రముచే నిచట వతిప్రత్యయ మెట్లు ? అనిన—

శ్లో॥ మధురావిషయః పాఠః స్మరణం మాతృకర్మకమ్ ।
మధురామాతృ శబ్దాభ్యామభేదేనాభిధీయతే ॥ 529

మధురావిషయః పాఠః = మధురానగరమునందలి అధ్యయనమును, మాతృకర్మకం స్మరణమ్ చ = మాతకర్మగాగల స్మరణమును, మధురా మాతృశబ్దాభ్యామ్ = యథాక్రమముగ, మధురాశబ్దము, మాతృశబ్దములచేత, అభేదేన = అభేదముగ = ఒక్కటిగ, అభిధీయతే = చెప్పబడుచున్నది.

తాత్పర్య వివరణములు— మధురయా తుల్యమధీయే అనగా 'మధుర'తో తుల్యముగ నేను చదువుచున్నాను అని యర్థము. అధ్యయన క్రియ ఉపమేయమునకు = అనగా తనకు సంబంధించినదిగా శ్రుతమగుచున్నది. కావున నది ఆ క్రియ నుపమానమున గూడ నున్నట్లు తెలియజేయును. ఔపమ్యము సమాన ధర్మ సంబంధ మూలకము గదా. కనుక 'మధురతో' అనగా మధురయందలి అధ్యయనముతోనని యర్థము. మధుర, అధ్య యనమునకు ఆధారము. అధ్యయనము ఆధేయము. ఆధారాధేయముల కభేదమును మనమున నిడికొని అట్టి ప్రయోగము చేయబడినది. ఆ విధముగనే స్మరణమునకు విషయము మాత. విషయిస్మరణము. విషయమునకును విషయికిని అభేదమను నభిప్రాయముతో నా ప్రయోగము అనగా మాత్రాతుల్యం స్మరామి అను ప్రయోగము. మధుర యందలి అధ్యయనముతో పాటలి పుత్రమునందలి యధ్యయనమును, దేవదత్తా స్మరణము, మాతృ విషయక స్మరణ ముతో తుల్యమనియు నర్థము. కారికలో 'స్మరణం మాతృకర్మకం' అని, అది మాతృ సంబంధియయినను, తత్కర్మకమనుట, ఆ సంబంధము వాస్తవముగ కర్మత్వరూపమే అగుట వలననని యెఱుంగునది. "అధీగర్థదయేశాం కర్మణి" (2-3-52) అను సూత్రముచేత, కర్మశేషముగా వివక్షితమయినపుడు షష్ఠి ప్రతిపద విహితము. ఆ ప్రతిపద విధానమునకు ఫలము, 'మాతుః స్మరణమ్' అనుచో షష్ఠీ తత్పురుష సమాసము లేకుండుట. ॥529॥

అవతారిక — వెనుక, సముదాయ శబ్దము లవయవబోధకములును నగునని యుపపాదింపబడినది. అట్లే ప్రకృతమున మధురాశబ్దము సముదాయ వచనమయినను, నిచ్చట తదవయవమగు, అనగా నేకదేశమగు గృహములందు వర్తించునని నిదర్శన పూర్వకముగ నుపపాదింపబడుచున్నది.

శ్లో॥ ఉష్ట్రావయవతుల్యేషు ముఖేషూష్ట్రశ్రుతిర్యథా ।
వర్తతే గృహతుల్యే చ ప్రాసాదే మధురాశ్రుతిః ॥ 530

ఉష్ట్రశ్రుతిః = "ఉష్ట్రముఖః" అను స్థలమున ఉష్ట్రపదము, ఉష్ట్రావయవ తుల్యేషు = ఒంటె అవయవములతో తుల్యములయిన, ముఖేషు = ముఖములందు, యథావర్తతే = ఏ ప్రకారముగా వర్తించుచున్నదో, తథా = ఆ ప్రకారముగా, మధురశ్రుతిః చ = మధురాపదమును (మధురావత్ అనుచోట), గృహతుల్యే = మధురయందలి గృహములతో తుల్యమయిన, ప్రాసాదే వర్తతే = పాటలీపుత్రమునందలి ప్రాసాదములందు వర్తించును.

తాత్పర్య వివరణములు — 'ఉష్ట్రముఖః' అని యొక సమాసము. దీనిని ఉపమాన పూర్వపద బహువ్రీహియందురు. ఉష్ట్రః ముఖం యస్యసః = ఒంటె ముఖము దేనికో అది అనివ్యుత్పత్తి. ఉష్ట్రముఖ మివముఖం యస్యసః అని విగ్రహమును జెప్పి, ఉపమానభూతమగు పూర్వపదమునం దుత్తరపదమునకు లోపమును వార్తికకారుడు చెప్పియుండెను. కాని భాష్యకారుడు ఆ వార్తికమును ప్రత్యాఖ్యానము చేసెను. కనుక ఉష్ట్రము ముఖముగా గలది యనియే విగ్రహము. ఒంటె, ముఖమగుట యసంభవము. కావున ఉష్ట్ర శబ్దమునకు, దాని అవయమగు ముఖమునందు లక్షణ. అపుడైనను, ఉష్ట్రము యొక్క ముఖము వేరొకదానికి ముఖమగుటయు నుపపన్నము గాదు గాన, ఇవార్థము నంతర్భవింపజేసి సంబంధమును గల్పింపవలెను.

ఆ విధముగనే మధురాపట్టణైకదేశములగు గృహములను మధురా శబ్దము బోధించుటచే, పాటలీపుత్రమునందలి గృహములు మధురా గృహతుల్యములని యర్థమగును. కాగా, ఇవార్థక వతిప్రత్యయమునకును, తుల్యార్థక వతిప్రత్యయము చేతనే సంగ్రహమని భావము. ॥530॥

అవతారిక — లేదా, ద్రవ్యవాచక శబ్దమునకు క్రియయందు లక్షణ ఉపచారము, అనవలదు. ద్రవ్యములకే సామ్యమందుము. ఆ సామ్యము క్రియాద్వారక మగును' - అని నిదర్శన పురస్సరముగ నుపపాదించుచున్నారు.

శ్లో॥ యథాధ్యయనయో స్సామ్యమధ్యేత్రోరపదిశ్యతే ।
తథా క్రియా గతైర్ధర్మై రుచ్యన్తే సాధనాశ్రయాః ॥ 531

అధ్యయనయోః = రెండు అధ్యయన క్రియలకు గల, సామ్యం = సాదృశ్యము, అధ్యేత్రోః = అధ్యయనము చేయువారల యందు, యథా = ఏ ప్రకారము, అపదిశ్యతే = ఆరోపింప

బడుచున్నదో, క్రియాగతైః ధర్మైః = అధ్యయన స్మరణ క్రియలందుగల ధర్మములచే, సాధనాశ్రయాః తథా = తదాశ్రయములగు కారకము లా విధముగా, ఉచ్యన్తే = చెప్పబడు చున్నవి.

*తాత్పర్య వివరణములు*— బ్రాహ్మణునివలె క్షత్రియుడు చదువుచున్నాడనిన సామ్యము వారి చదువులకనుట కాని ఆ క్రియా కర్తలకు తుల్యత్వము అధ్యయన ద్వారమున వ్యవస్థాపితమగుచున్నది. ఆ విధముగనే 'మధురావదధీతే' 'మాతృవత్ స్మరతి' అను వాక్యములందు, అధ్యయన స్మరణములను క్రియల ధర్మములగు సాదృశ్యములను బుచ్చుకొని కారకములగు మధురాదులు చెప్పబడుచున్నవి. ఆ క్రియల ద్వారమున, వాని కర్మకును అధి కరణమునకును, అనగా మాతకును, మధురకును, దేవదత్తా పాటలిపుత్రములకును నుపమా నోపమేయ భావము. క్రియా ద్వారక సంబంధము కర్తకు మాత్రమేగాని కారకాన్తరములకు లేదనుట యుక్తము గాదు గదా. సకల కారకములతోడను క్రియకు అవినాభావము కలదు. కావున 'మధురావత్' - మాతృవత్ అను స్థలములందును పూర్వసూత్రము చేతనే వతిప్రత్య యము స్థిరమని భావము. ॥531॥

*అవతారిక*—కాని ఒక విశేషము కలదనవచ్చును. క్రియ అను ఉపాధితో గూడిన సాదృశ్యమున, పూర్వసూత్రముచే వతిప్రత్యయము విధింపబడుచున్నది. అనగా క్రియ, వతి ప్రత్యయార్థమునందే అంతర్భూతమయి యున్నదగుటవలన క్రియావాచకమునకు ప్రయోగ మక్కరలేదు. ఈ సూత్రముచేత వతిప్రత్యయము సామాన్యముగ సాదృశ్య మాత్రముననే విహితము. కాబట్టి ఆ భేదము కలదుగదాయని ఆశంకించి చెప్పుచున్నారు.

శ్లో॥ ఇవార్థే యచ్చ వచనం పూర్వసూత్రే చ యో విధిః ।
క్రియాశబ్దశ్రుతౌ భేదో న కశ్చిద్విద్యతే తయోః ॥ 532

ఇవార్థే చ = ఇవార్థమగు సాదృశ్యమునందు ప్రత్యయమును విధించిన, యద్వచనం అస్తి = ఏ ''తత్రతస్యేవ'' అను సూత్రము కలదో, పూర్వసూత్రే = వెనుకటి సూత్రమునందలి, యః విధిశ్చ అస్తి = ఏ వతిప్రత్యయవిధి గలదో, తయోః = ఆ రెండింటికిని, క్రియాశబ్ద శ్రుతౌ = క్రియాపద ప్రయోగ విషయమున, కశ్చిత్ భేదః = ఏ భేదమును, న విద్యతే = లేదు.

తాత్పర్య *వివరణములు*— క్రియాపదము ప్రయుక్తమయినపుడు తేనతుల్యం క్రియాచేద్వతిః'' అను పూర్వసూత్రముచేత, ''తత్రతస్యేవ'' అను నీ సూత్రముయొక్క విషయము గూడ వ్యాప్తమగును. కనుక నీ సూత్రమును రచింపనక్కరలేదు. పూర్వ సూత్రో దాహరణ విషయమున క్రియాపద ప్రయోగము లేకుండగ నుండదుగదా. ॥532॥

*అవతారిక*— ఎందువలననగా—

శ్లో॥ యద్యప్యుపాధిరన్యత్రనియతో న ప్రయుజ్యతే ।
రూపాభేదాత్త్వనిర్జ్ఞాతా క్రియాత్రశ్రూయతేపునః ॥ 533

*అవతారిక*— అస్మదాదులకు కాన్పించు ఎల్ల ఆకారములు అసత్యములనియు, పరబ్రహ్మయే సత్యమనియు ఎట్లు తెలియనగును? అను ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు.

**శ్లో॥ సత్యమాకృతిసంహారే యదన్తే వ్యవతిష్ఠతే ।**
**తన్నిత్యం శబ్దవాచ్యం తచ్ఛబ్దతత్త్వం నభిద్యతే ॥** 11

ఆకృతిసంహారే = ఆకారములకు నాశముకలుగగా, అన్తే = చివరకు, యత్ = ఏది, అవతిష్ఠతే = మిగిలియుండునో, తత్ = అదియే, సత్యమ్ = పరమార్థసత్యము, నిత్యమ్ = పరమార్థనిత్యము, తత్ = అదియే, శబ్దవాచ్యమ్ = జాత్యాదిరూపమున ఎల్లశబ్దములకు వాచ్యమగును.

శబ్ద తత్త్వమే = శబ్దముల నిజరూపము అనగా పరావాగ్రూపమగుశబ్దము, న + భిద్యతే = వేరుకానేరదు, అనగా నిర్గుణ పరబ్రహ్మము కంటె వేరుకానేరదు.

ఔపనిషదులు ఏ తత్త్వమును సత్యజ్ఞానానందరూపమున భావింతురో, ఆ తత్త్వమే వైయాకరణుల ముఖ్యతత్త్వమని భావము.

ఎల్ల వస్తువులను పరికించిన వానికి ఏదో మూలము కాన్పించును. దానికికూడ మరియొక మూల కారణము కాన్పించును. అట్లు పరిశీలింపగా చివరకు ఏది నియతమై భాసించునో అదియే సత్యము. అంతవరకు కాన్పించునవి వికారములే. అవి అసత్యములే. ఉదా- మనిష్యుని శరీరమునకు మూలము అన్నము, దానికి ఓషధులు, వానికి భూమి, దానికి ఉదకము, దానికి తేజము, దానికి వాయువు, దానికి ఆకాశము మూలము. ఆకాశమునకు కారణము ఏది అన్నచో పరమాత్మకారణమని చెప్పవలెను. దానికికారణమేమియు లేదు. అదియే చివరకు మిగిలినందున అదియే సత్యము.

ఇట్లే ప్రతి పదార్థమునను చూడనగును. పైరీతిని చూచిన ఉపాధు లసత్యములే. పరబ్రహ్మమే సత్యమని తెల్లమగును.

అట్టి పరబ్రహ్మమే జాతి మున్నగు ఉపాధులను ఊతగైకొని గుణరూపమును దాల్చి ఎల్ల శబ్దములచే బోధింప బడుచున్నది.

జ్ఞానమనుసద పశ్యంతీ వాగ్రూపము. దానికిమూలము పరావాక్కు. అది నిర్గుణాద్వయ బ్రహ్మరూపము. దానికంటె వేరుకాదు. ॥11॥

*అవతారిక*— ఉపాధి రూపముకాని పరతత్త్వము ఉపాధి రూపమున కాన్పించుచున్నదని 10 వ శ్లోకమున చెప్పబడినది. ఆ పరతత్త్వము ఉపాధి రూపము ఏలకాదో, ఆ యంశమును వివరించుచున్నాడు.

యద్యపి = ఆలోచించిన, అన్యత్ర = ఇతర స్థలములందు, నియతః = తప్పనిదై, ఉపాధిః = విశేషణము, న ప్రయుజ్యతే = ప్రయోగింపబడలేదు, అత్రపునః = ఇచ్చటమట్టుకు, రూపాభేదాత్ = రూపమున భేద మగపడనందున, అనిర్జ్ఞాతా = తెలియబడని, క్రియాతు = క్రియాపదము మట్టుకు, శ్రూయతే = వినబడుచుండును.

తాత్పర్య వివరణములు— "హరతేః దృతినాథయోః పశౌ" (3-2-25) అను సూత్రము, దృతినాథ శబ్దములు సమీపోచ్చారితములయి యున్నపుడు, 'హృ' ధాతువునకు, పశువు కర్త్రర్థమయిన, 'ఇన్' అను ప్రత్యయమును విధించుచున్నది. 'దృతిహరిః' 'నాథహరిః' - అని యుదాహరణములు. 'దృతిం హరతి' 'నాథం హరతి' - అని విగ్రహవాక్యములు. అట పశువు అను నొక విశిష్ట ద్రవ్య ముపాధి. అది ప్రత్యయముచేతనే తెలియజేయబడుచున్నది. కావున, 'పశుః' అని విగ్రహమున నుచ్చరింపదు. పశువను కర్త బోధ్యమయిననే ఆ ప్రత్యయమగుటచే నిక నా యంశమున సందేహము కలుగదు. వతిప్రత్యయ విషయమున నట్లుగాదు. 'క్రియాచేత్' అను దానిచే సామాన్యముగ క్రియ ఉపాధిగా వచింపబడినది గాని క్రియావిశేషము వచింపబడలేదు. క్రియావిశేష మవగతము కావలెననిన విగ్రహవాక్యము నందు, 'అధీతే' అనియు 'స్మరతి' అనియు తద్విశేష బోధకము నుచ్చరించి తీరవలెను. 'బ్రాహ్మణవత్' ఇత్యాది వృత్తిపదమువలన క్రియా సామాన్య ప్రతీతి గలిగెనను అధ్యయనాది రూప తద్విశేష క్రియా ప్రతీతి కలుగదని భావము. దృతి అనగా తోలు సంచి. జలపూరితమైన యీ సంచిని మోయునది పశువైన 'దృతహరిః' అనబడును. మనుష్యుడైనచో 'దృతహరః' అనబడును. నాథ శబ్దమునకు 'ముకుద్రాడు' అర్థము. అది కలపశువు 'నాథహరిః' అనబడును. ముకుద్రాడు గల వ్యక్తి పశువుకాక మనుష్యుడైనచో (అనగా బానిస) 'నాథహరః' అనబడును. ॥533॥

అవతారిక— ఈ యంశము నిదర్శన పూర్వకముగా సాధింపబడుచున్నది.

శ్లో॥ యథావ్యుత్పరయః పుచ్ఛే క్యజన్తే సుదురాదయః ।
సత్యతి ప్రత్యయార్థత్వే భేదాభావాదుదాహృతాః ॥ 534

యథా = ఏ ప్రకారముగా, పుచ్ఛే = 'పుచ్ఛయతి' అను ణిజన్త ధాతువునందు, వ్యుత్పరయః = వి, ఉత్, పరి - అనునవియు, క్యజన్తే = క్యచ్ప్రత్యయాంతమునందు, సుదురాదయశ్చ = సు, దుర్, మున్నగునవియు, ప్రత్యయార్థత్వే సత్యపి = వాని యర్థము ప్రత్యయబోధ్యమయినను, భేదాభావాత్ = రూపమునందు భేదము లేనందువలన, ఉదాహృతాః = ఉచ్చరింపబడి యున్నవో, తథా అత్ర = ఆ ప్రకారమే వత్యంతవిషయమున గూడ క్రియాపద ముదాహార్యమ్ = క్రియా బోధకమగు అధీయతే మున్నగునది ఉచ్చరింపవలసి యున్నది.

తాత్పర్య వివరణములు— "పుచ్ఛభాండ చీవరాణ్ణిఙ్" (3-1-20) అని సూత్రము. ఈ మూడు ప్రాతిపదికముల కంటెను బరముగా 'ణిఙ్' అను ప్రత్యయమగునని యర్థము. ఆ ణిఙ్ ప్రత్యయము సనాది గణ పఠితము. కావున తదంతము ధాతువగును.

'ఉత్పుచ్ఛయతే' - విపుచ్ఛయతే. పరిపుచ్ఛయతే అని యుదాహరణములు. పుచ్ఛముదస్యతి, పుచ్ఛం వ్యస్యతి, పుచ్ఛం పర్యస్యతి గౌః - అని విగ్రహ వాక్యములు. గోవు తన తోకను పైకి విసరుచున్నది. లేదా వివిధముగ జిమ్ముచున్నది. లేదా అంతటను = చుట్టును విసరు చున్నది యని అర్థము. ''పుచ్ఛాదుదసనే వ్యసనే పర్యసనేచ'' - అని వార్తికము. ఇట ణిఙ్ప్రత్యయమే, ఉదసన వ్యసన పర్యసనములను సామాన్యముగ జెప్పును. అయినను విశే షాభి వ్యక్తికై, వి, ఉత్, పరి, - అను నుపసర్గలు ప్రయోగింపబడుచున్నవి

ఆ విధముగనే ''భృశాదిభ్యో భువ్యచ్వేర్లోపశ్చ హలః'' (3-1-12) అను సూత్రము, భృశాది గణమున పఠింపబడిన శబ్దములకంటె బరముగా 'అభృశః భృశః భవతి' = నక్షత్రము కానిది నక్షత్ర మగుచున్నది - అను నర్థమున, 'భృశాయతే' మున్నగు రూప ముల సాధుత్వము కొరకు 'క్యఙ్' అను ప్రత్యయమును విధించినది.

ఈ గణమునందు కొన్ని ప్రకృతులు ఉపసర్గ సహితములు పఠింపబడి యున్నవి. అవి అభిమనస్, సుమనస్, దుర్మనస్, మున్నగునవి. అచ్చట ఉపసర్గార్థము ప్రకృత్యర్థము నకు విశేషణమని యొక పక్షమును, ప్రత్యయార్థ విశేషణమని వేరొక పక్షమును ఉపపాదింప బడినవి. అందు ప్రత్యయార్థ విశేషణ పక్షమే సిద్ధాంతితము. ఆ పక్షమున ప్రత్యయముచేతనే ఉపసర్గార్థము సంగృహీతమయినను, ఉపసర్గరహిత రూపమునందు భేదము లేనందున అది విశేషార్థము నభివ్యక్తము చేయజాలదని, 'అభిమనాయతే' సుమనాయతే, దుర్మనాయతే - అను ఉపసర్గ విశిష్టరూపము లంగీకృతములు.

ఆ విధముగనే క్రియా మాత్రమున వతి విధింపబడుటచే దానివలన క్రియావిశేష ప్రతీతి కలుగదు. అందువలన క్రియాపద ప్రయోగము న్యాయ్యము. కావున క్రియాశబ్ద ప్రయోగ విషయమున భేదము లేదు. కాగా పూర్వసూత్రముచేతనే సిద్ధమని తేలినది. ॥534॥

*అవతారిక* — పూర్వపక్ష భాష్యాశయ మీ కారికలో నిట్లు నిగమనము చేయబడినది

**శ్లో॥ ఏవం చ సతిపూర్వేణసిద్ధోఽత్రాపివతేర్విధిః ।**
**నియమే వా భిధానే వా భిద్యతే న క్రియాశ్రుతిః ॥** 535

ఏవం చ సతి = ఇట్లు పర్యవసింపగా, అత్రాపి = ''తత్రతస్యేవ'' అను సూత్రమునందు గూడ, వతేః విధిః = వతిప్రత్యయ విధానము, పూర్వేణ = వెనుక సూత్రమగు ''తేనతుల్య'' మను దాని చేతనే, సిద్ధః = సిద్ధించినది, నియమే వా = నియమవిధి అయినపుడును, అభిదానే వా = అపూర్వవిధి అయినను, క్రియాశ్రుతి = క్రియావాచక పదప్రయోగము, న భిద్యతే = మారదు.

*తాత్పర్య వివరణములు* — వతిప్రత్యయాంత ఘటితవాక్యమునందు క్రియావాచక పదప్రయోగమేపక్షముననుు తప్పనిదే. పూర్వసూత్రముచే వతిప్రత్యయము విధింపబడినపుడు ఏదియో యొక క్రియ ఆ ప్రత్యయముచేత చెప్పబడినను, క్రియావిశేషాభి వ్యక్తికై క్రియా పదప్రయోగము ఆవశ్యకము. అది విశేషాంతరమును నివర్తించునుగాన నియమమగును.

''తత్రతస్యేవ'' (5-1-116) అను నీ సూత్రము, ఇవార్థమగు సాదృశ్యము నందు, క్రియా సంబంధము లేకున్నను వతిప్రత్యయమును విధించుచున్నది. క్రియా ప్రత్యాయనమునకు క్రియా పదప్రయోగ మపూర్వముగ కర్తవ్యము. కాగా క్రియా పదప్రయోగ మెట్లైనను అపరిహార్యము గనుక మరల నీ సూత్రముచే తద్విధాన మనర్థకమని భావము. ॥535॥

*అవతారిక*— తరువాత ''అక్రియార్థోఽయ మారంభః'' - ఆరంభమనగా సూత్ర రచనము. ఈ ''తత్రతస్యేవ'' అను సూత్రము క్రియా నిమిత్తమగు తౌల్యము లేనపుడు, ద్రవ్య నిమిత్తకముగాని గుణ నిమిత్తకముగాని అగు సాదృశ్య మున్నపుడు వతిప్రత్యయ సిద్ధి కొరకే చేయబడినదని వ్యాఖ్యానించుచున్నారు.

**శ్లో॥ ఇవే ద్రవ్యాదివిషయః ప్రత్యయః పునరుచ్యతే ।**
**క్రియాణామేవ సాదృశ్యే పూర్వసూత్రే విధీయతే ॥ 536**

ఇవే = ఇవార్థమునందు, ద్రవ్యాది విషయః = ద్రవ్య గుణ విషయమైన, ప్రత్యయః = వతి ప్రత్యయము, పునః ఉచ్యతే = మరల విధింపబడుచున్నది, క్రియాణాం = క్రియలకు, సాదృశ్యే ఏవ = సామ్యమున్నపుడే, పూర్వసూత్రే = వెనుకటి సూత్రమునందు, విధీయతే = వతి ప్రత్యయము విధింపబడుచున్నది.

*తాత్పర్య వివరణములు*— పూర్వసూత్రము క్రియానిమిత్త సామ్యమున 'వతి' విధాయకము. ఆ సూత్రమున 'క్రియాచేత్' అను విశేషణము గలదు. అందువలననే ''గవా తుల్యః గవయః' = గవయమను మృగము ఎద్దును బోలినది, అను నర్థమునందు, 'గోవత్ గవయః' - అను ప్రయోగము సాధువు గాదు.

ప్రకృత సూత్రము ద్రవ్య కృతసాదృశ్యమునందును గుణ కృతసాదృశ్యమునను వతి విధాయకము. కనుక భేదము లేకపోలేదు. ॥536॥

*అవతారిక*— ఉదాహరణములను పరికింపుడు.

**శ్లో॥ మధురాయామివగృహాః బ్రాహ్మణస్యేవ పాండురాః ।**
**ఇత్యత్ర ద్రవ్యగుణయోః పూర్వేణ న వతిర్భవేత్ ॥ 537**

''మధురాయామివ గృహాః'' = 'మధురలోవలె పాటలిపుత్రమున నిండ్లున్నవి', బ్రాహ్మణస్య ఇవ పాండురాః = 'బ్రాహ్మణునకువలె క్షత్రియునకును దంతములు స్వచ్ఛములు' ఇత్యత్ర = అను నీ ప్రయోగములందు, ద్రవ్య గుణయోః = ద్రవ్యములను గృహములకును, దంతముల తెలుపులకును, పూర్వేణ = (సామ్యము వివక్షితమైనపుడు) వెనుక సూత్రముచే, వతిః న భవేత్ = వతి ప్రత్యయము రాదు, సాదృశ్య మిట క్రియా మూలకము గాదు గదా.

*తాత్పర్య వివరణములు*— తాత్పర్యము స్పష్టముగాన వివరణ మపేక్షితము గాదు. ॥537॥

అవతారిక— ఇట నొక యాక్షేపము.

శ్లో॥ ఆరంభస్యా క్రియార్థత్వే నార్థో యోగేన విద్యతే ।
ఋతే క్రియాయా గ్రహణాత్ పూర్వయోగేన సిధ్యతి ॥ 538

ఆరంభస్య = "తత్రతస్యేవ" అను సూత్రమును చేయుట, అక్రియార్థత్వే = క్రియాభిన్నములకు తౌల్యమున్నప్పటికైన, యోగేన = ఈ సూత్రముతో, అర్థః న విద్యతే = ప్రయోజనము లేదు, క్రియాయాః = "క్రియాచేత్" - అను విశేషణమునకు, గ్రహణాత్ ఋతే = గ్రహణము, సూత్రమున, లేకుండ జేసినచో, పూర్వయోగేన = (అపుడు) వెనకటి సూత్రము చేతనే, సిధ్యతి = వతి ప్రత్యయము సిద్ధించును.

తాత్పర్య వివరణములు— వెనుక చెప్పినట్లు ఈ సూత్రము ద్రవ్యగుణములకు సాదృశ్యమున్నపుడు వతిప్రత్యయము ప్రవర్తించుట కుద్దేశింపబడిన పూర్వ సూత్రమున 'క్రియా' అను పదమును దొలగించిన యెడల ఆ ప్రయోజనము సిద్ధించును. 'తేనతుల్యం వతిః' అను నదియే ద్రవ్యగుణ క్రియావిషయ సాదృశ్యము లందెల్ల వతిప్రత్యయమును విధింపవచ్చును. ఈ సూత్ర మపుడు వ్యర్థమేయగును. ॥538॥

అవతారిక— ఏమండీ ! పాటలిపుత్రములోని గృహములు మధురతో దుల్యములు కావే ? మధురలోని గృహములతో నవి సమానములు. యజ్ఞదత్తుని దంతములు దేవదత్తుని దంతములతో తుల్యములుగాని దేవదత్తునితో గాదు. కావున తేనతుల్యమను పూర్వ సూత్రముచే నెట్లు సిద్ధించును ? కాగా షష్ఠీ సప్తమీ సమర్థ ప్రాతిపదికము కంటె బరముగ వతివిధానమున కీ సూత్ర మావశ్యకమే గదా యని శంకించిన నందులకు సమాధానము.

శ్లో॥ మధురావయవే వృత్తిర్వ్యాఖ్యాతా మధురాశ్రుతేః ।
బ్రాహ్మణావయవాన్ దంతాన్ వక్ష్యతి బ్రాహ్మణశ్రుతిః ॥ 539

మధురాశ్రుతేః = మధురా శబ్దమునకు, మధురావయవే = మధురావయవములగు గృహములందు, వృత్తిః వ్యాఖ్యాతాః = ప్రవృత్తి (తద్బోధకత్వము) చెప్పబడియున్నది, బ్రాహ్మణ శ్రుతిః = బ్రాహ్మణస్యేవ అనుచో బ్రాహ్మణ పదము, బ్రాహ్మణావయవాన్ = బ్రాహ్మణుని అవయవములయిన, దన్తాన్ వక్ష్యతి = దంతములను బోధించును.

తాత్పర్య వివరణములు— 'ఉష్ట్రముఖః' అను స్థలమున ఉష్ట్ర పదమునకు ఉష్ట్రావయవమగు ముఖమర్థమని చెప్పినట్లు 'మధురయా' అను పదమునకు మధురావయవ గృహములతో నని యర్థమనియు, "బ్రాహ్మణస్యేవ దన్తాః క్షత్రియస్య' అను స్థలమున, బ్రాహ్మణ పదమునకు తదవయవములయిన ఆనియు నర్థమని పూర్వమే నిర్ణీతమయి యున్నది. గృహములును దంతములు నుపమేయములగుటచే వానినే ఆ పదములు బోధించును. ॥539॥

అవతారిక— ఈ కారికలో ఇవార్థవిషయ వతివిధానము సమర్థింపబడుచున్నది.

శ్లో॥ నకాచిదివయోగే తు బాహ్యాత్ సంబంధినోవినా।
షష్ఠీ విధీయతే తత్ర పూర్వేణ ప్రత్యయో భవేత్ ॥ 540

ఇవయోగేతు = 'ఇవ' అను శబ్దముతో సంబంధమున్నపుడు, బాహ్యాత్ = బయటిదగు, సంబంధినః వినా = సంబంధినిబట్టి వచ్చునది తప్ప, కాచిత్ షష్ఠీ = షష్ఠీ విభక్తి ఏదియు, న విధీయతే = విధింపబడలేదు (ప్రథమయే వచ్చును), తత్ర = అట్టి ప్రథమాంత ముపమాన మయినపుడును, పూర్వేణ = 'తేనతుల్యమను సూత్రముచే' ప్రత్యయః భవేత్ = 'గౌరివ గదయః'' అను స్థలమునను రావలసి వచ్చును.

తాత్పర్య వివరణములు— పూర్వ సూత్రమున క్రియా అను పదమును దీసి వేసిన అపుడు 'గౌరివ గవయః' అను స్థలమున క్రియానిమిత్త సాదృశ్యము వివక్షితము కాకున్నను వతిప్రత్యయము రావలసి వచ్చును. తుల్య శబ్దయోగమునందు తృతీయా షష్ఠీ విభక్తులు విధింపబడినట్లు, ఇవ శబ్దముతో సంబంధమున్నపుడే షష్ఠీ విభక్తియు విహితము గాదు. బయటి సంబంధి యేదియేని ప్రయుక్తమయినపుడు తత్సంబంధమున శేషషష్ఠి వచ్చును. ఇవ శబ్దార్థమునకు సామానాధికరణ్య సంబంధముచేత సమన్వయమేగాని వైయధికరణ్యాన్వయ ముండదు. కావున వ్యతిరేక విభక్తియగు షష్ఠికి ప్రసక్తి లేదు. కావున తద్యోగమున ప్రథమా విభక్తికి మాత్రమే ప్రాప్తి. కాగా ''గౌరివ గవయః'' అను నపుడును వతిప్రత్యయము రావలసి వచ్చును. తద్వారణమునకు ఈ సూత్రమును రచింపవలెనని భావము. ॥540॥

అవతారిక— సూత్రమున 'తేన' - అని కలదు గదా. దానివలన, వతిప్రత్యయము నకు ప్రకృతి తృతీయా సమర్థము కావలెను. ప్రథమా సమర్థముకంటె పరముగా రాదగిన ప్రసక్తి యేమి ? అనిన చెప్పుచున్నాడు.

శ్లో॥ ఆధిక్యం తుల్య శబ్దేన సంబంధ ఉపజాయతే।
షష్ఠీ తృతీయే తత్ర స్తస్తుల్య శబ్దోహి వాచకః ॥ 541

తుల్య శబ్దేన సంబంధే = తుల్య అను శబ్దముతో సంబంధమున్నపుడు, ఆధిక్యం = వ్యతిరేకము, ఉపజాయతే = ఉద్భవించును, తత్ర = అచ్చట = తుల్య శబ్దయోగము గల ప్రయోగములందు, షష్ఠీ తృతీయే స్తః = షష్ఠీ విభక్తియు తృతీయయు, తుల్యార్థ సూత్రముచే వచ్చును, తుల్య శబ్దః = తుల్య శబ్దము, వాచకః హి = వాచకము గదా, ద్యోతకముగాదనుట

తాత్పర్య వివరణములు— తుల్య శబ్దము స్వతంత్రముగ నర్థమును బోధింప గలది. సత్త్వభూతమగు నర్థమును బోధించును. తద్యోగమున తౌల్య ప్రతియోగియగు నుప మానమునకు వ్యతిరేకము సంభవము. కావున వ్యధికరణ విభక్తులగు షష్ఠియు, తృతీయయు ''తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాన్యతరస్యామ్'' (2-3-72) అను సూత్రముచే ప్రవర్తించును.

ఇవ శబ్దమట్టిది గాదు. అది సాదృశ్యమునకు ద్యోతకము మాత్రమే. తదర్థ ముప మానమున సమానాధికరణ విశేషణము. అందువలన తన్యోగమున ప్రథమయేగాని వ్యతిరేకి విభక్తికి ప్రసంగము లేదు. ॥541॥

*అవతారిక*— తుల్య శబ్దముతో సమానమగుచున యర్థముగల ఇవ శబ్దము ప్రయో గింపబడినపుడు—

**శ్లో॥** ఇవశబ్ద ప్రయోగేతు బాహ్యాత్ సంబంధినోవినా।
నాధిక్య ముపమానేఽస్తి ద్యోతకః సంప్రయుజ్యతే। 542

ఇవ శబ్ద ప్రయోగేతు = ఇవ శబ్దము వాక్యమున ప్రయోగించినపుడైతే, బాహ్యాత్ = బహిర్ భూతమగు, సంబంధినః వినా = సంబంధిని బట్టి తప్ప, ఉపమానే = ఉపమానమునందు, ఆధిక్యం = అధిక్యము = వ్యతిరేకమనుట, న అస్తి = ఉండదు, ద్యోతకః = ఇవ అనునది ద్యోతకముగా, సంప్రయుజ్యతే = ప్రయోగింపబడును.

**తాత్పర్య వివరణములు**— ఇవ శబ్దము, సాదృశ్యమునకు ద్యోతకము. ద్యోతక మనగా తనతో సహోచ్చారితమగు పదమునందలి అర్థబోధకత్వ శక్తి నుద్బోధించునది. సమ భివ్యాహృత పద గత విశేషార్థమును ప్రకాశింపచేయుటయే దాని కృత్యము. తాను ప్రకాశింప జేయు నర్థము తనది కాదు. పరపదమునకు సంబంధించినదియే కనుక ద్యోతకమగు ఇవ శబ్దము ఉపమానమునందు వ్యతిరేకమును బోధింపలేదు

కనుక ఇవ శబ్దము సాదృశ్యమును ఉపదర్శించినపుడు వ్యతిరేక విభక్తికి ప్రసం గము లేదు. అపుడు వెనుక సూత్రమున 'క్రియా' అను పదము తీసివేసిన, దానిచేత వతి ప్రత్యయము రావలసి వచ్చును దానిని వారించుటకు అందు 'క్రియాచేత్' అనునది ఆవశ్య కము. కనుక 'తత్రతస్యేవ' అను దాని యారంభము క్రియా భిన్న నిమిత్తక సాదృశ్య మున్నపుడు వచ్చుట కనుట యుక్తమే. ఈ సూత్రముచే, "గౌరివ గవయః" అను స్థలమున ప్రథమాంతముకంటె పరముగ వతిప్రత్యయాపత్తియు లేదు. షష్ఠీ సప్తముల కంటెనే అని నియమము గలదు గదా యని భావము. ॥542॥

*అవతారిక*— "పితృ వదధీతే పుత్రః" = తండ్రివలె కుమారుడు చదువు చున్నాడు. అనునది "తేనతుల్యం క్రియాచేద్వతిః" - అను సూత్రముచే విధింపబడిన వతి ప్రత్యయమున కుదాహరణము. పిత ఉపమానము. పుత్రు డుపమేయము. అధ్యయన క్రియ సాధారణ ధర్మము. పితాపుత్రుల సాదృశ్యమును ప్రదర్శించునది, విగ్రహ వాక్యమునందలి తుల్య శబ్దము. "పిత్రాతుల్యం = పితృవత్" - అని విగ్రహము.

అప తుల్యార్థయోగమున తృతీయ. ఇవ శబ్దమును విగ్రహ వాక్యమున ప్రయో గించి సాదృశ్య ప్రదర్శనము చేయుట కుదురదు. 'మధురావత్ పాటలిపుత్రే ప్రాసాదాః' 'దేవదత్త వద్యజ్ఞ దత్తస్యదన్తాః' అను స్థలములందు దంత ప్రాసాదాది బాహ్యపదార్థ సంబంధ

ముచే వచ్చినవి షష్ఠీ సప్తములు. అచట ఇవార్థమునందు "తత్ర తస్యేవ" అను సూత్ర ముచే వతిప్రత్యయము. సాదృశ్య ప్రదర్శనము విగ్రహ వాక్యమున 'మధురాయాం ఇవ' అనియు, 'దేవదత్తస్య ఇవ' – అనియు 'ఇవ' శబ్దముచే చేయబడునది. అచట ప్రకృత్యర్థము నకు ఇవార్థముతో బాహ్య సంబంధమును బట్టి సమన్వయము.

తుల్య శబ్దముచే సాదృశ్యముపదర్శింపబడినపుడు ఇవార్థముతో అన్వయము లేదు గాన ఇవ శబ్దమునకు బ్రయోగము లేదు గదా, గౌరివ గవయః' అనుచోట వతిప్రత్యయా పాదన మెట్లు? అని ఆశంకించి, ఇవ నిమిత్తకమగు వ్యతిరేకమునకును, తుల్య నిమిత్తక వ్యతిరేకమునకును భేదము గలదని ప్రదర్శించి, పూర్వ సూత్రమున క్రియాపదము లేనపుడు, దానిచేత తుల్య నిమిత్తక వ్యతిరేకమునందు విధింపబడిన వతి ప్రత్యయము, తుల్య శబ్దముచే సాదృశ్యముపదర్శింపబడినపుడును అతిప్రసక్తమగునని చెప్పుచున్నారు.

**శ్లో॥ ఇవే యోవ్యతిరేకోఽత్ర స ప్రాసాదాది హేతుకః।**
**తుల్యే తద్విషయాపేక్ష మాధిక్య ముపజాయతే॥** 543

అత్ర = ఈ "తత్రతస్యేవ" అను సూత్రోదాహరణ విషయమున, ఇవే = ఇవ శబ్ద ప్రయోగమునందు, యః వ్యతిరేకః = షష్ఠీ సప్తములకు నిమిత్తమయిన ఏ భేదము గలదో (విభక్త భేదము), సః ప్రాసాదాదిహేతుకః = అది 'ప్రాసాదాః "దన్తాః" అను పదములవలన గలిగినది, తుల్యే = వెనుక సూత్రముచే తుల్యార్థమున విహితమయిన వతి విషయమున, తద్విషయాపేక్షం = తుల్యా శబ్దార్థ నిమిత్తకమగు, ఆధిక్యం ఉపజాయతే = వ్యతిరేకము ఏర్పడును.

తాత్పర్యావివరణములు— 'మధురాయామివ' 'దేవదత్తస్యేవ' - అని ఇవ శబ్దము ప్రయోగింపబడినపుడు, షష్ఠీ సప్తమీ విభక్తులవలన, భేద ముపమేయమునకు అగపడుచున్నది. దానికి నిమిత్తము ఇవార్థము గాదు. దంత ప్రాసాదాది పదసంబంధము. కావున వతిప్రత్యయార్థమగు సాదృశ్యముచే గలిగెడు వ్యతిరేక మిచ్చట సంభవింపదు. కాగ బాహ్య సంబంధులగు ప్రాసాద దంతములే షష్ఠీ సప్తములకు నిమిత్తములు. తదంతములకంటె వతిప్రత్యయము అని స్పష్టము. పూర్వ సూత్రముచే తుల్యార్థమున వతి వచ్చినపుడు, బాహ్య పదార్థ సంబంధముతో నిమిత్తము లేదు. తుల్యార్థ నిమిత్తకమే వ్యతిరేకము. దానినిబట్టి తృతీయాంతము వతి ప్రకృతి. ఇట్లు తుల్యార్థక వతి ప్రత్యయమునకును ఇవార్థ వతి ప్రత్యయమునకును విషయ భేదము కలదు. ॥543॥

*అవతారిక*— కాగా తుల్య శబ్దార్థ నిమిత్తకమగు భేదమున నతిప్రసంగము నుదాహరించుచున్నారు.

**శ్లో॥ గవయేన సమోఽనడ్వానితి వృత్తిస్తదా భవేత్।**
**నత్వస్తి గౌరివేత్యత్ర వ్యతిరేక ఇవాశ్రయః॥** 544

"గవయేన సమః అనడ్వాన్" = 'గవయమృగముతో ఎద్దు తుల్యము', ఇతి తదా = అను

నపుడు, క్రియా గ్రహణము లేనియెడల, వృత్తిః భవేత్ = వతి ప్రత్యయము రావలసివచ్చును, "గౌరివ" ఇత్యత్ర తు = 'గౌరివ గవయః' = గోవువంటిది గవయమను నపుడు, ఇవా శ్రయః = ఇవార్థ మాశ్రయముగా గల, వ్యతిరేకః = వ్యతిరేకము, న అస్తి = లేదు

**తాత్పర్య వివరణములు**— గవయమును, గోవును ద్రవ్యములే. సాదృశ్యము వానికే వివక్షితము. విగ్రహము 'గవయేన తుల్యః' అనియే. పూర్వ సూత్రమున క్రియా అను పదము లేనిచో, ఆ సూత్రముచేత నిచ్చట గూడ వతి ప్రత్యయము రావలసి వచ్చును. సాదృశ్యము తుల్యార్థ నిమిత్తకమే గదా. అందువలన పూర్వ సూత్రమునందు క్రియా గ్రహణము తప్పదు. ద్రవ్యములకును గుణములకును సాదృశ్య మున్నపుడు వతి ప్రత్యయము సిద్ధించుటకు రెండవ సూత్ర మావశ్యకము కాని దానిచేత నిట వతి ప్రాప్తింపదు. అది బాహ్య సంబంధులను బట్టి ప్రవర్తించునది. ఇచట బాహ్య సంబంధి ప్రసక్తి 'మధురాయామివ' అను చోటవలె లేదు గదా.

ఇక 'గౌరివ గవయః' అను స్థలమునను రెండవ సూత్రముచే వతిప్రత్యయము ప్రాప్తింపదు. ఇవార్థ నిమిత్తకమయిన వ్యతిరేక విభక్తి లేదు. ప్రథమయే గలదు గదా. రెండవ సూత్రము ప్రథమా సమర్థమునకు వతి ప్రత్యయమును విధింపదాయె. 'గోరివ గవయస్య సంస్థానమ్' = అని అందుమనుకొనుడు. అపుడు 'సంస్థానమ్' అను బాహ్య సంబంధ్యపేక్షమగు షష్ఠి, వ్యతిరేక విభక్తి కలదుగాన వతి ప్రత్యయము వచ్చును. 'గోవద్గవయస్య సంస్థానమ్' అని వత్యన్త ఘటిత వ్యవహార ముపపన్నమగును. ॥544॥

**అవతారిక**— సూత్ర ద్వయారంభ మిట్లు సమర్థితము. ఇక నా సూత్రద్వయమునకు విషయ విభాగము ప్రదర్శింపబడుచున్నది.

**శ్లో॥ ఉపమేయేన సంబంధాత్ ప్రాక్ ప్రాసాదాది హేతుకే।**
**వ్యతిరేకే వతేర్భావో న తుల్యార్థత్వహేతుకే ॥ 545**

**ఉపమేయేన** = ఉపమేయముతో, సంబంధాత్ ప్రాక్ = సంబంధమునకు ముందు, ప్రాసాదాది హేతుకే = ప్రాసాదాదుల వలన గలిగిన, వ్యతిరేకే = వ్యతిరేకమునందు, వతేః = వతి ప్రత్యయము యొక్క, భావః = ప్రవృత్తి కలుగును, తుల్యార్థత్వ హేతుకే = తుల్యార్థ నిమిత్తక వ్యతిరేకమున, న భవతి = కలుగదు.

**తాత్పర్య వివరణములు**— "మధురాయాం ఇవ ప్రాసాదాః పాటలిపుత్రే" లేదా, మధురాయాః ఇవ ప్రాకారాః పాటలిపుత్రస్య" అను వాక్య ప్రయోగములలో, ఉపమేయ సంబంధమునకు ముందే ప్రాసాదాది పదములతో సంబంధ ముపమానమునకు కలుగజేయబడిన, వ్యతిరేక విభక్తులు షష్ఠీ సప్తము లుత్పన్నములగును. తరువాత ఇవార్థయోగమును, ఉపమేయ సంబంధమును కలుగును. అపుడు రెండవ సూత్రముచే వతి ప్రత్యయము. పూర్వ సూత్ర విషయమున తుల్య శబ్దార్థాన్వయ ప్రయుక్తము తృతీయ. ఇట్లు విషయ విభాగ

మున్నను, ధర్మాంతరముచే సాదృశ్యము వివక్షితమయినపుడు, ''బ్రాహ్మణేన తుల్యః క్షత్రియః'' అనుచో వతి ప్రత్యయమును వారించుటకు క్రియాగ్రహణ మవశ్య కర్తవ్యము. కాగా రెండవ 'వతి' విధాయకము, అక్రియార్థమను విషయము సమర్థితము. ॥545॥

*అవతారిక*— తేనతుల్యమను సూత్రమున, 'తేన' అని తృతీయ సమర్థ విభక్తి నిర్దేశింపబడినది. అనంతర సూత్రమగు ''తత్ర తస్యేవ'' అను దానిలో, 'తత్ర' 'తస్య' అని సప్తమీ విభక్తులు సమర్థ విభక్తులుగా చెప్పబడినవి. ప్రకృత విభక్తియగు తృతీయను విడిచి, వేరు విభక్తులు షష్ఠీ సప్తము లెందుకు వతి ప్రకృతులుగా గ్రహింపబడినవి? అను శంకకు పరిహారముగ ''న కాచి దివశబ్దేన యోగే తృతీయా విధీయతే'' అని మహాభాష్యము. దాని వ్యాఖ్యాన రూప మీ కారిక—

**శ్లో॥ ఇవశబ్దేన సంబంధే న తృతీయా విధీయతే।**
**ప్రకృతాం తామతస్త్యక్త్వా విభక్త్యంతర మాశ్రితమ్॥ 546**

ఇవ శబ్దేన, సంబంధే = ఇవ శబ్దముతో యోగమునందు, తృతీయా న విధీయతే = తృతీయా విభక్తి విధింపబడలేదు. అతః ప్రకృతాం = అందువలన పూర్వ సూత్రమున ప్రస్తుతమైనను, తాం త్యక్త్వా = ఆ తృతీయను విడచి, విభక్త్యన్తరం, ఆశ్రితమ్ = షష్ఠీ సప్తమీ రూపము లగు నితర విభక్తులు గ్రహింపబడినవి.

*తాత్పర్య వివరణములు*— ''తుల్యార్థైః'' అను సూత్రముచేత, ఇవ శబ్ద సంబంధ మున్నపుడు తృతీయ ప్రవర్తింపదు. ఇవ శబ్దము ద్యోతకమేగాని తుల్యార్థకము గాదు 'తత్ర తస్యేవ' అను సూత్రమున, 'తత్ర, తస్య' అను పదములను దొలగించి, 'తేన' అను పదము నను వర్తించి, తృతీయార్థముచే సకల విభక్త్యర్థములును వ్యాప్తములుగాన, షష్ఠీ, సప్తమ్యర్థక విభక్త్యంతమగు నుపమాన వాచకముకంటె వతి ప్రత్యయము సిద్ధించునుగాన, సప్తమీ నిర్దేశము వ్యర్థమయి, 'శేష విషయమున' అనగా క్రియా సంబంధము లేనపుడు సప్తమి వచ్చునని జ్ఞాపనము చేసినను తృతీయా జ్ఞాపన మిష్టము గాదు. ఇవ శబ్దను ప్రయోగింపబడినపుడు, కారక విభక్తియేగాని శేషవిభక్తి యుండదు. తుల్యార్థయోగమునందు వచ్చిన తృతీయ సర్వ విభక్త్యర్థ వ్యాపకమయినట్లు, కారక విభక్తియగు తృతీయచే, సకల విభక్త్యర్థములును వ్యాప్తములు గావు. ఈ విషయము సదృష్టాంతముగ నిరూపిత పూర్వము.

కావున సంభవము లేనందున ప్రకృత తృతీయను వదిలిపెట్టి షష్ఠీ సప్తములు నిర్దేశింపబడినవి. 'మధురాయామివ' - బ్రాహ్మణస్యేవ - అని ఇవ శబ్దముచే వతి ప్రత్యయార్థము చూపబడినది. ఆ సప్తమీ షష్ఠీ విభక్తుల యర్థముతో తుల్య శబ్దమునకు సమన్వయము కుదురదు గదా. కాగా, అంతరంగ సంబంధమున, 'తేనతుల్య'మను వతి విధియు, బహిరంగ సంబంధమునందు, 'తత్ర తస్యేవ' అను వతి ప్రత్యయవిధియు ప్రవర్తించునని వివేకము.

తరువాతి మహాభాష్య గ్రంథము - ''నను చ సప్తమ్యపి న విధీయతే। ఏవం తర్హి

సిద్ధే సతి యత్ ఇవ శబ్దయోగే సప్తమీం శాస్తి తత్ జ్ఞాపయత్యాచార్యః భవతి ఇవ శబ్దేనయోగే సప్తమీ ఇతి। కి మేతస్య జ్ఞాపనే ప్రయోజనమ్? దేవేష్వివ నామ. బ్రాహ్మణేష్వివనామ' ''ఇత్యేష ప్రయోగ ఉపపన్నో భవతి'' అర్థము— ఇవ శబ్దయోగమున తృతీయ యేదియు విధింపబడలేదని అందువేమి? సప్తమియు విధింపబడలేదు గదా. జ్ఞాపకమువలన శేష విషయమున సప్తమి సిద్ధించుననిన తృతీయయు సిద్ధింపనగునే?— అనిన తృతీయానువృత్తి చేతనే సిద్ధించుచుండగా ఇవ శబ్ద యోగమునందు సప్తమీ సమర్థముకంటె బరముగ వతి ప్రత్యయ శాసనమువలన పాణిన్యాచార్యుడు ఇవ శబ్ద యోగమున సప్తమి వచ్చునని జ్ఞాపన చేయుచున్నాడు. ఈ జ్ఞాపనమునకు ప్రయోజనమేమనిన,— దేవేష్వివనామ = దేవతలకువలె పేరు. 'బ్రాహ్మణులకువలె పేరు' అని షష్ఠ్యర్థమున సప్తమీ ప్రయోగములు సిద్ధించుట— శేష విషయమున తృతీయ లేనట్లే సప్తమియు లేదుగాన నీ జ్ఞాపనమువలననే సప్తమి వచ్చిన తృతీయయు వచ్చును. కాగా తృతీయానువృత్తిచేతనే తృతీయాంతముకంటె బరముగా వతి సిద్ధించుచుండ, తత్ర అను సప్తమీ నిర్దేశము, ఇవ శబ్ద యోగమున శేషవిషయమునందు సప్తమియే వచ్చును. తృతీయ సమ్మతము గాదు అని భాష్య తాత్పర్యము. ॥546॥

అవతారిక— ప్రకృతవిషయ మింకను విపులముగ నీ కారికలో వివరింపబడును.

శ్లో॥ సప్తమ్యపి న తత్రాస్తి జ్ఞాపకార్థా తు సాకృతా।
ఇష్టా సా శేషవిషయే నియతాసు విభక్తిషు ॥ 547

తత్ర సప్తమీ అపి నాస్తి = వతి ప్రత్యయవిధిలో సప్తమి కూడ లేదు, సాజ్ఞాపకార్థాతు = అది జ్ఞాపకమగుట కొరకు మట్టుకు, కృతా = ఉచ్చరింపబడినది, నియతాసు = నియతమగు తమ తమ విషయముగల, విభక్తిషు = విభక్తుల విషయమున, శేషవిషయే = కారకములు వివక్షింప బడనపుడు, సా ఇష్టా = ఆ సప్తమి, సమ్మతము.

తాత్పర్య వివరణములు— బాహ్య పదార్థాన్వయ మూలకమగు వ్యతిరేకమును షష్ఠియే బోధించునుగాన, నీ విషయమున తృతీయ యుండనట్లే సప్తమియు సంభవింపదు. కాన సూత్రమున తత్ర అను సప్తమ్యంత పద గ్రహణమును అనావశ్యకము. ఒక ప్రశ్న ఉద్బుద్ధము కావచ్చును. ఎట్లనగా— షష్ఠ్యంతముకంటె బరముగా వతి ప్రత్యయము విధింపబడి నపుడు సప్తమ్యర్థమునకు సంగ్రహ మెట్లు కలుగును? అపుడు ''మథురావత్ పాటలి పుత్రే ప్రాకారాః'' అను స్థలమునందు 'మథురాయాః ఇవ' - అని విగ్రహము. ఉపమాన విభక్తి షష్ఠి, ఉపమేయ విభక్తి సప్తమి. షష్ఠ్యర్థము శేషము = కారక వ్యతిరిక్త సంబంధము. సప్తమ్యర్థము ఆధారము. అది అధికరణ కారకము. అనగా ఏకకాలముననే అచట, శేషవివక్షయు, కారకవివక్షయు చేయబడుచున్నదనుట గదా. అవి పరస్పర విరుద్ధములు గదా. అది యెట్లు పొసగును? ఇది ప్రశ్న. సమాధాన మేమనగా— షష్ఠీ సమర్థమునకంటె బరముగ వతి ప్రత్యయము వచ్చినను, వృత్తి పదమునందు విభక్తి యేదియు వినబడలేదు. ఉపమానోప మేయ భావము మాత్రమే తెలియవచ్చు చున్నది. సామాన్యమునందు విశేష మంతర్భూతమయి

శ్లో॥ నతదస్తి, నతన్నాస్తి, నతదేకం, నతత్ పృథక్ ।
నసంసృష్టం, విభక్తంవా, వికృతం న చ, నాన్యథా ॥ 12

పరతత్త్వము ఎల్ల వ్యవహారములను అతిక్రమించి యున్న దనుటకు మూలము వ్యావహారిక దశలచట కానరాకుండుటయేయని నిరూపించుచున్నాడు.

తత్ = ఆపరతత్త్వము, అస్తి = ఉన్నదనుటకు, న = వీలుకాదు. సత్త అనునది ఒక ఉపాధి, అది ఘటము మున్నగు దానికి సంబంధించును. కాన వానికి 'ఘటః అస్తి' అను వ్యవహారము కలుగును. పరబ్రహ్మమునకు సత్త అను ఉపాధిలేనందున నచట 'అస్తి' అనుట సాధ్య పడదు. వ్యవహారము ఆరోపముచే కలుగ నేరదు.

తత్ = ఆతత్త్వము, న + అస్తి = లేదనుటయు, న = పొసగదు. పరతత్త్వము భావరూపమని శాస్త్రములు నిరూపించుచున్నందున, నచట అభావమును ఉపాధిగా జూపరాదు.

తత్ = ఆ తత్త్వము, ఏకమ్ = ఒక్కటియే, అని చెప్పుటయు, న = తగదు. నిరుపాధికమగు పరబ్రహ్మము అభిన్నము కనుక ఏకత్వ సంఖ్య అచట ఉపాధి కానేరదు

తత్ = ఆతత్త్వము, పృథక్ = భిన్నమనుటయు, న = యుక్తము కాదు పరబ్రహ్మము కంటె భిన్నమగు వస్తువు అసత్యమే కాన దానియందు భేదము వాటిల్లదు.

కనుకనే తత్ = అది, సం సృష్టమ్ = ఇతర వస్తువులతో కలసి యున్నదనుట, న = సరిపడదు. విభక్తమ్ = వేరుగా నున్నదనుటయు, న = తగదు. దానికంటె వేరు వస్తువు ఉన్నదనుటయు న = తగదు. దానికంటె వేరు వస్తువు ఉన్నదనుటలో ప్రమాణము లేనందున ఆ పరబ్రహ్మము 'దీనితో కలిసియున్నది. దీనితో విభక్తమైనది' అనిచెప్పజాలము. సంసర్గము, విభాగము కూడ అచట ఉపాధులు కానేరవని భావము.

తత్ = ఆపరతత్త్వ రూపమగు ద్రవ్యము, వికృతమ్ = వికారమును బొందినదని యనుటయు, న=యుక్తముకాదు, అన్యథా=వికారమును పొందదు అనుటయు, న=సరికాదు.

బ్రహ్మము రూపాంతరమున పరిణమించునది కాదు. పరిణామ వాదమును శాస్త్రజ్ఞులు దూషించియున్నారు. కాబట్టి, పరతత్త్వము వికారమును బొందునదికాదు. వివర్తవాదమే శాస్త్ర సమ్మతము పరతత్త్వము అద్భుతమగు మాయా వృత్తిచే అనేకములగు రూపాంతరములుగా వివర్తమగుటవలన అది వికృతమనుటయు పొసగదు.

కాబట్టి అస్తి, నాస్తి, ఏకమ్, అనేకమ్, సంసృష్టమ్, విభక్తమ్, వికృతమ్, అవికృతమ్ అను విభిన్నములగు వ్యవహారములకు గోచరింపనందున పరతత్త్వము ఉపాధి రూపము కాదని విస్పష్టము. ॥12॥

*అవతారిక* — ఉపాధిరూపమునలేని బ్రహ్మరూపమగు ద్రవ్యమే అవిద్యాదశయందు ఉపాధిరూపముననే కాన్పించుచున్నదని చెప్పుచున్నాడు.

యుండును గాన ఉపమేయమగు పాటలిపుత్రము అధికరణ సప్తమ్యంతము కావచ్చును. దానిని బట్టి ఉపమానమును అధికరణ విషయమని అపసితమగును. ఉపమేయము ననుసరించి యుప మానమున విశేషావధారమునకు హేతువు. ప్రకృతి కర్థమగు ఉపమానము ప్రత్యయార్థమగు నుపమేయమునందు విశేషణమగుటయు, నుపమేయము ప్రధానమగుటయును నగును. కనుకనే పెద్దలు "ఉపమానమునందలి సంశయ ముపమేయము వలన దొలగును" - "ఉపమానే యః సంశయః స ఉపమేయాత్ వ్యావర్తతే" - అందురు.

ఇంకొక ప్రశ్న. "తత్ర తస్యేవ" అను సూత్రమున, వతి ప్రత్యయ ప్రకృతులు సప్తమ్యంతములుగను షష్ఠ్యంతములుగను నిర్దిష్టములు. అచట షష్ఠ్యర్థముచే సప్తమ్యర్థము వ్యాప్తముగాన నది వ్యర్థమయి జ్ఞాపకమనుచున్నారు గదా. తుల్య యుక్తిచే "తదస్యాస్త్య స్మిన్నితి మతుప్" (5-2-94) అను సూత్రమున, 'అస్య', 'అస్మిన్' - అని షష్ఠీ సప్తములు రెండును 'మతుప్' ప్రత్యయ ప్రకృతులుగా నిర్దేశింప బనిలేదే. షష్ఠి సమర్థముకంటె బరముగా విధించినను సప్తమ్యర్థ మవగతమగును గదా? అని ప్రశ్న.

సమాధానము— ఈ రెండును తుల్యములు కావు. మతుప్ ప్రత్యయమునకు షష్ఠీ సప్తముల యర్థము ప్రధానముగ వాచ్యము. "వృక్షవాన్ పర్వతః" = 'అందు వృక్షములు గల పర్వతము' - అని పర్వతమున కాధారత్వము స్పష్టముగ ప్రతీతము. కావున నది సప్తమిచే వేరుగ నిర్దేశింపవలసినదే వతి ప్రత్యయ విషయమున నట్లుగాదు. అచట ప్రకృత్యర్థ ముపసర్జనము. అనగా అప్రధానము. వత్యంతమువలన ఔపమ్యమాత్రము ప్రతీతము. షష్ఠి ఆ ఔపమ్యమునకు మధురా సంబంధమును తెలియచేయును. అదియే సప్తమ్యర్థమును గూడ నంతర్భవింప జేసికొనును గాన వ్యర్థమయి జ్ఞాపకమగును. ఆ జ్ఞాప్యాంశ మేమనగా— "స్వస్వవిషయములందు నియతములగు విభక్తులు పరస్పర విషయములందు ప్రవేశించుట ఉపపన్నముగాదు గాన, షష్ఠీ విషయమున శేషార్థమునందు సప్తమి వచ్చును' అనునది జ్ఞాప్యము. బాహ్య సంబంధి సంబంధమును పురస్కరించుకొని షష్ఠి ప్రవర్తించినట్లే సప్తమియు వర్తించునని భావము. ॥547॥

*అవతారిక*— సప్తమీతర విభక్తులు కూడ తమ విషయములందే ప్రవర్తింపవలసినవి ఇవయోగమునందు గూడ సంకీర్ణములుగ ప్రవర్తించునని జ్ఞాప్యము కాదు అనుచున్నారు.

**శ్లో॥ యది తు వ్యతిరేకేణ విషయేఽస్మిన్ విభక్తయః।
ప్రవర్తేరం స్తృతీయైవ వ్యభిచారం ప్రదర్శయేత్ ॥** 548

అస్మిన్ విషయే = ఈ ఇవార్థము విషయమున, విభక్తయః = అన్ని విభక్తులును, వ్యతిరేకేణ = స్వస్వవిషయముల నతిక్రమించుటచే, యదితు ప్రవర్తేరన్ = ప్రవర్తించిన యెడల, తదా తృతీయైవ = అపుడు, ప్రస్తుత విభక్తియగు తృతీయయే, వ్యభిచారం = ఆ యా విభక్తులు తమ విషయమున నతిక్రమించుటను, ప్రదర్శయేత్ = జ్ఞాపన చేయును.

తాత్పర్య వివరణములు— ఇవార్థ విషయమున సకల విభక్తులును సంకీర్ణములై ప్రవర్తించునని జ్ఞాపనము చేయుట ఇష్టమయిన, ప్రకృత తృతీయయే ఆ అతిక్రమమును జ్ఞాపన చేయవచ్చునుగాన విభక్త్యంతరము నాశ్రయించుట వ్యర్థము. తృతీయేతర విభక్తిని గ్రహించుటచే, శేషవిషయమున నొక్క సప్తమియే ప్రవర్తించును. ఇతర విభక్తులు ప్రవర్తింపవు అని విశేషజ్ఞాపన మిష్టమని తెలియుచున్నది. కావున 'దేవై రివనామ' - మున్నగు ప్రయోగములు సాధువులు కావు అని తాత్పర్యము. ॥548॥

అవతారిక— "ఏవం తర్హి సిద్ధే" ఇత్యాదిగా పూర్వోక్తమయిన భాష్య గ్రంథము యొక్క భావమును వివరించునది "వ్యభిచారే తథా" అను నీ కారిక.

శ్లో॥ వ్యభిచారే తథా సిద్ధే సప్తమీ గ్రహణాత్ వినా ।
సప్తమ్యే వోచ్యతే సర్వా న సన్త్యన్యా విభక్తయః ॥ 549

తథా = ఆ ప్రకారముగా. అనగా తృతీయానువృత్తిచే, వ్యభిచారే = సంకరము, సిద్ధే సతి= నిశ్చితము కాగా, సప్తమీ గ్రహణాత్ = తత్ర అను సప్తమ్యంత పరము లేకున్నను, యత్ సప్తమ్యేవ ఉచ్యతే = సప్తమియే చెప్పబడుట యనునది, అన్యాః = ఇతరములయిన, సర్వా విభక్తయః = సకల విభక్తులును, న సన్తి = ఇవార్థ విషయమున నుండబోవని తెలియ చేయును.

తాత్పర్య వివరణములు— 'తేన' అను తృతీయాంతపదమునను వర్తించి, ఈ జ్ఞాపకమువలననే తృతీయ ననుమానించి, ఆ తృతీయాంతముకంటె బరముగా వతి ప్రత్యయము సిద్ధించినను చేయబడిన 'తత్ర' అను సప్తమీ నిర్దేశము, శేషవిషయమున ఇవార్థ యోగమునందు సప్తమియే వచ్చుననియు నితర విభక్తులు రావనియు నను నియత విషయమునకు జ్ఞాపకమగునని భావము. ॥549॥

అవతారిక— అట్లయిన నొక 'తత్ర' అను సప్తమి మాత్రమే గ్రహింపబడ రాదా ? అది జ్ఞాపకమును గావచ్చును. షష్ఠ్యంతముకంటె బరముగా వతి ప్రత్యయము విధింపబడినపుడు, 'మధురావత్' - అను వత్యంతము నర్థమే సప్తమ్యంతము వతికి ప్రకృతియయి నపుడును స్ఫురించును. విషయత్వము గదా సప్తమ్యర్థము. అది షష్ఠ్యర్థమును గూడ సంగ్రహింప గలదు గదాయని యాశంకించి చెప్పుచున్నారు.

శ్లో॥ అత్యంతమత్ర విషయే సప్తమ్యా జ్ఞాపకార్థయా ।
బాధితా వినివర్తేత షష్ఠీ సా గృహ్యతే పునః ॥ 550

అత్ర విషయే = ఈ ఇవార్థ విషయమున, జ్ఞాపకార్థయా = జ్ఞాపకము కొరకయిన, సప్తమ్యా = సప్తమిచేత, అత్యంతం = మిక్కిలి = పూర్తిగ ననుట, బాధితా = బాధింపబడినదై, షష్ఠీ = షష్ఠీ విభక్త్యంతము, వినివర్తేత = వతి ప్రత్యయమునకు ప్రకృతిగా తొలగును, సా పునః = (అందువలన) ఆ షష్ఠి మరల, గృహ్యతే = గ్రహింపబడుచున్నది.

మరికొందరిట్లును తదాశయ వర్ణనమును జేయుచున్నారు. "షష్ఠి సంబంధ సామాన్య వివక్షలో విధింపబడినది. సప్తమ్యర్థమగు ఆధారాధేయ భావము గూడ నొక సంబంధమే. అదియు సంబంధ సామాన్యాంతర్గతమే. కావున అనుప్రయోగము సప్తమ్యంత మయినను వతి ప్రత్యయము షష్ఠ్యంతముకంటె బరముగనే ప్రవర్తించును. 'శేషవివక్షలో, ఇవ శబ్దయోగమున్నపుడు సప్తమి యుండును' – అనియే జ్ఞాప్యాంశముగాని, 'ఆధారాదేయ భావ వివక్షలో సప్తమ్యర్థమున వతి ప్రత్యయము రానేరాదు' అని తన్నివారణమే జ్ఞాపకము చేయబడదు గదా – అని భావము. ॥550॥

**అవతారిక**— తుల్యార్థమున వతి యొకటి. ఇవార్థమున వతి యొకటి. ఆ రెండును విచారింపబడినవి. ఇక అర్హార్థవతి విచారము క్రమప్రాప్తము. "తదర్హమ్" (5 1-117) అను సూత్రము తద్విధాయకము – అచట, ఆక్షేపభాష్యమిట్లు గలదు. "కిమర్థమిదముచ్యతే। న। తేన తుల్యం క్రియాచే ద్వతిరిత్యేవ సిద్ధమ్" – అని. ఈ సూత్రముతో బనియేమి? తేన తుల్యమ్ అను సూత్రముచేతనే వతి సిద్ధింపవచ్చును గదా? అని ఆక్షేప తాత్పర్యము. ప్రకృత కారిక ఆక్షేప వ్యాఖ్యాన రూపము.

**శ్లో॥ పూర్వాభ్యామేవ యోగాభ్యాం విగ్రహాంతరకల్పనాత్।**
**అర్హార్థేఽపి వతిః సిద్ధః సత్వేకేన నిదర్శ్యతే ॥** 551

పూర్వాభ్యామ్ = వెనుకటి, యోగాభ్యామ్ ఏవ = రెండు సూత్రములచేతనే, విగ్రహాంతర కల్పనాత్ = మరియొక రీతి విగ్రహ వాక్యకల్పనము వలన, అర్హార్థేపి = "తదర్హతి" అను నర్థమునందును, వతిః సిద్ధః = వతి ప్రత్యయము, సిద్ధించినది, సః ఏకేన తు = ఆ వతి ప్రత్యయము, ఒక సూత్రముచేత మట్టుకు, నిదర్శ్యతే = ఉపలక్షింపబడుచున్నది.

**తాత్పర్య వివరణములు**— "తదర్హతి" అను సూత్రమునందు పూర్వ సూత్రమునుండి 'క్రియా' అను పదమనువర్తించును. ద్వితీయా సమర్థ విభక్త్యంతముకంటె పరముగా, క్రియారూపమగు అర్హణకర్తను బోధించుచు వతి ప్రత్యయమగును అని సూత్రార్థము. "రాజవత్ వృత్తమ్" అని యుదాహరణము. 'రాజాన మర్హతి' అని విగ్రహము. వృత్తమనగా వర్తనము. అది క్రియ.

'రాజవత్' అను వత్యంతమునకు, "రాజ్ఞా తుల్యం వర్తతే" – అని విగ్రహ వాక్యమును చెప్పినను నీ యర్థమే ప్రతీతమగును. కనుక తృతీయాంతముకంటె 'తేనతుల్య'మను సూత్రముచేతనే వతి ప్రత్యయము సిద్ధింపవచ్చును.

'రాజవత్ ధైర్యమ్' 'రాజవత్ వేషః', 'బ్రాహ్మణవత్ ఉపశమః' = రాజువంటి ధైర్యము. రాజువంటి వేషము బ్రాహ్మణునివలె శాంతి – అను స్థలములందు అర్హతి కర్త్రి క్రియ కానందున తేనతుల్యమను సూత్రముచే సిద్ధింపకున్నను, 'తత్ర తస్యేవ' – అని సిద్ధింప వచ్చును. 'రాజ్ఞః ఇవధైర్యమ్' అని విగ్రహభేదము మాత్రమేగాని వస్తుభేదము లేదు. కనుక పూర్వ సూత్రములచేతనే సిద్ధింపవచ్చును.

అట్లయిన, మహాభాష్యమున, 'తేనతుల్య మిత్యేవ సిద్ధమ్' అని ఒక సూత్రము చేతనే సిద్ధి చెప్పబడినదే యనిన, నది ఉపలక్షణమని గ్రహింపదగును. అయ్యది ఉదాహరణ ప్రదర్శన మాత్రము. పూర్వ సూత్రములచే సిద్ధించుననియే హృదయము. ॥551॥

*అవతారిక*— తేనతుల్యమను సూత్రముచేత నెట్లు సిద్ధియనగా—

**శ్లో॥ తేన తుల్యమితి ప్రాప్తేః క్రియోపాధిః ప్రసిధ్యతి ।**
**రాజవద్వర్తతే రాజేత్యత్ర భేదే వివక్షితే ॥** 552

క్రియోపాధిః వతిః = క్రియ (ఉపాధి =) విశేషణముగాగల వతి, రాజవత్ రాజా ఇత్యత్ర = 'రాజువంటివాడు రాజు' అనునపుడు, భేదే వివక్షితే సతి = ఒకే వ్యక్తికిని భేదమును వివక్షింపగా, 'తేనతుల్యమ్' ఇతి = ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' అను సూత్రముచే, ప్రాప్తేః ప్రసిధ్యతి = ప్రాప్తించుటవలన, సిద్ధించును.

**తాత్పర్య వివరణములు**— 'తేనతుల్యం క్రియాచేద్వతిః' - అను వతి ప్రత్యయమునకు క్రియ ఉపాధి. అనగా నది ప్రత్యయార్థమగు నుపమేయమునకు అవచ్ఛేదకము. కాగా అర్థ ద్వారమున ప్రత్యయమునకు విశేషణము.

'తదర్హం' - అను ప్రకృత సూత్రోదాహరణము, 'రాజవత్ వృత్తమ్' - అను మున్నగునది. 'రాజానమర్హతి' - అని విగ్రహము రాజునకు యోగ్యమైన వర్తనము అని యర్థము. ఆ అర్థము 'రాజుతో తుల్యమైనది' = ''రాజ్ఞాతుల్యం వృత్తమస్య'' అని విగ్రహించినను లభించును. ఇట్లు విగ్రహభేదముచేత ఆ సూత్రము నుదాహరణములు ఈ సూత్రముచేతను ప్రకృత సూత్రోదాహరణములా సూత్రముచేతను గతార్థములు కావచ్చును.

సరి. ''రాజవద్వర్తతే బ్రాహ్మణః'' అనిన, నుపమానము రాజును, నుపమేయము బ్రాహ్మణుడును, గాన దానిచే సిద్ధింపవచ్చు ననుకొనుడు, 'రాజవద్వర్తతే రాజా' = రాజు రాజువలె వర్తించుచున్నాడు' అనునపుడెట్లు ? తనకు తనతో నుపమానము అసంభవముగదా యనిన భేదమును వివక్షించినపుడు, అట్టి స్థలమునను వతి ప్రత్యయము సిద్ధింపవచ్చును. అని భావము. ॥552॥

*అవతారిక*— అది యెట్లన—

**శ్లో॥ రాజత్వేన ప్రసిద్ధా యే పృథుప్రభృతయో నృపాః ।**
**యుధిష్ఠిరాన్తా స్తేఽన్యేషా ముపమానం మహీక్షితామ్ ॥** 553

రాజత్వేన ప్రసిద్ధాః = రాజులుగా ప్రసిద్ధులయిన, పృథు ప్రభృతయః = పృథు చక్రవర్తి మున్నగు, యుధిష్ఠిరాంతాః నృపాః = యుధిష్ఠిరుని వరకునుగల రాజులు, యే సన్తితే = ఎవ్వారుండిరో వారు, అన్యేషామ్ = ఇతరులగు, మహీక్షితామ్ = రాజులకు, ఉపమానమ్ = ఉపమాన భూతులగుదురు.

తాత్పర్య వివరణములు— పృథువు, భరతుడు, యయాతి, దిలీపుడు మొదలగు ధర్మ తనయుని వరకునుగల, విశుద్ధ చరిత్రులును, నిండైన రాజవృత్తముతో నొప్పువారును నగు మొదటి కల్పముల రాజులు, ఈ కాలపు ఒక రాజునకు, రాజోచిత వృత్తము పరిపూర్ణముగ లేనివానికి ఉపమానముగా జెప్పబడినపుడు, 'రాజవదయం వర్తతే' = ప్రసిద్ధుడగు మహారాజును బోలి ఈతని వృత్తమున్నది, అందురు. ఈతని సమాచార మొకప్పుడు రాజుకు విరుద్ధమైనదిగా గూడ నుండవచ్చును. కాని యట్టి సంభావన లేదని ప్రశంసించుటకు, 'రాజవద్వృత్తమస్య' అందురు. ఇట్టి వ్యవహారము లుండుటవలన నీ విధముగ భేదమును వివక్షించి ఉపమానోపమేయ భావమును గల్పింపసగునని భావము. ॥553॥

అవతారిక— ఓయీ ! ఉపమేయుడగు రాజు గూడ ప్రజాపాలనమును జేయువాడైన నిక ఉపమానోపమేయ భావ ప్రయోజకమగు భేదమేమి గలదు ? అది లేనిచో సాదృశ్యమే లేదాయె ? అపుడే రాజునకు ప్రసిద్ధుడగు మహారాజుపమాన మెట్లగును ? అనిన.

శ్లో॥ సిద్ధ్యసిద్ధికృతో భేద ఉపమానోపమేయయోః ।
సర్వత్రైవయతో సిద్ధం ప్రసిద్ధేనోపమీయతే ॥ 534

ఉపమానోపమేయయోః=ఉపమానమునకును, ఉపమేయమునకును, భేదః=భేదము, సర్వత్రఏవ = అంతటను, సిద్ధిః అసిద్ధికృతః = ప్రసిద్ధి, అప్రసిద్ధి - వీనినిబట్టి యుండునది, యతః = ఎందువలననగా, అసిద్ధం = అప్రసిద్ధమయిన వస్తువు, ప్రసిద్ధేన ఉపమీయతే = ప్రసిద్ధమైన దానితో బోల్పబడును.

తాత్పర్య వివరణములు— పరిపూర్ణ గుణ సంపత్తిగల వ్యక్తి ప్రసిద్ధ వ్యక్తి యగును. తద్విరుద్ధ వ్యక్తికి ప్రసిద్ధి కలుగదు. అప్రసిద్ధమునకు ప్రసిద్ధ ముపమానముగా నిర్దేశింపబడును. సర్వాత్మనా భేదమే యున్నపుడుగాని అభేదమే యున్నపుడుగాని ఉపమానోపమేయ భావ ప్రసంగమే యుండబోదని నిరూపింపబడి యున్నది. బ్రాహ్మణునివలె క్షత్రియు డధ్యయనము చేయుచున్నాడనిన నచట కరణ సౌష్ఠవాదులుండుట వలన బ్రాహ్మణాధ్యయనము ప్రసిద్ధము, అప్రసిద్ధమగు క్షత్రియాధ్యయనమున కుపమానము. చతురుదధి పర్యంత పృథివీపాలకుడగు భరతుడు ప్రసిద్ధుడు, పరిపూర్ణ రాజత్వము కలవాడు. అట్టి రాజు, పృథివ్యేక దేశమాత్ర పాలకుడును, కోశదండాది సాధనముల గొరత గలవాడును నగు నీనాటి రాజున కుపమానము అతనిని ''రాజవద్వృత్తమస్య'' = ఈతని వర్తనము ప్రసిద్ధ రాజతుల్యమని ప్రశంసింతురు. ఆ విధముగనే ''బ్రాహ్మణవదయం వర్తతే బ్రాహ్మణః'' = ఈ బ్రాహ్మణుడు బ్రాహ్మణునివంటివాడు'' అని, ప్రసిద్ధులగు వసిష్ఠాదులతో బోల్పబడుచుండును. కనుక, 'తేనతుల్యం క్రియాచేత్తను సూత్రముచే సిద్ధినిర్బాధము. ॥554॥

అవతారిక— ''తత్ర తస్యేవ'' అను సూత్రముచే నెచ్చట వతి ప్రత్యయము సిద్ధించుననిన జెప్పుచున్నాడు.

శ్లో॥ రాజవద్రూపమస్యేతి రాజన్యేవ వివక్షితే।
అక్రియార్థేన యోగేన ద్వితీయేన భవిష్యతి॥ 555

'రాజవత్ రూపమస్య' = 'ఈతని రూపము రాజువంటిది', ఇతి, రాజనిఏవ = అని రాజే ఉపమానముగ, వివక్షితేసతి = వివక్షింపబడినపుడు, అక్రియార్థేన = క్రియాతౌల్యము లేనపుడు ప్రవర్తించుట కేర్పడిన, ద్వితీయేన = రెండవ, యోగేన = సూత్రమగు "తత్ర తస్యేవ" - అను దానిచే, భవిష్యతి = వతి ప్రత్యయము సిద్ధించును.

తాత్పర్య వివరణములు— "రాజవత్ అస్యరూపం, ధైర్యం, ఉపశమః"— అని యందురు = ఈ రాజు రూపమును, ధైర్యమును, ప్రశాంతియు, భరతాది రాజులను బోలినది' అని యర్థము. అచ్చట గుణములచే తౌల్యము. క్రియచే గాదు. అచ్చట రెండవ సూత్రము ప్రవర్తించును.

'తదర్హ'మను నీ సూత్రమున్నపుడును, అర్హతి కర్తృ క్రియ అయిననే, ఆ సూత్రముచే వతి ప్రత్యయము వచ్చునుగాని గుణతౌల్యమున్నపుడు రాదుగాన నచట పూర్వ సూత్రము చేతనే వతి ప్రత్యయమును సాధింపవలెను' అని భావము. ॥555॥

అవతారిక— తరువాత సూత్రారంభ సమర్థన గ్రంథ మిట్లు గలదు. "నసిధ్యతి. తృతీయా సమర్థాత్, తత్ర యదా అన్యేన కర్తవ్యాం క్రియామన్యః కరోతి తదా ప్రత్యయ ఉత్పాద్యతే ఇహ పునర్ద్వితీయా సమర్థాదాత్మార్హాయాం క్రియాయాం అర్హతి కర్తరి నిశ్చిత బలాధానే ప్రత్యయ ఉత్పాద్యతే" = "తేనతుల్యమను పూర్వ సూత్రముచే నిట వతి ప్రత్యయము సిద్ధింపదు. తృతీయా సమర్థముకంటె నట, వేరొకడు చేయదగిన పని నింకొకడు చేసినపుడు. ప్రత్యయము విధింపబడినది. ఇట నట్లుగాదు. ద్వితీయా సమర్థ మిచ్చట ప్రకృతి. ద్వితీయాంత వాచ్యమగు నర్థమున కర్హమగు క్రియారూపమయిన, అర్హధాత్వర్థ కర్తకు నిశ్చిత విషయమునకు బలము కూర్చుటకు స్థైర్యోత్పాదనము వివక్షితమయినపుడు వతి ప్రత్యయము విహితమగుచున్నది. యీ సూత్రమువలన" – అని భాష్యార్థము. ఆ విషయ మీ కారికలో వ్యాఖ్యానింపబడుచున్నది.

శ్లో॥ ఉపమానా వివక్షాయాం నియమార్థోయముచ్యతే।
ధర్మోర్హతి క్రియాకర్తా తదర్థం వచనం పునః॥ 556

ఉపమానా వివక్షాయాం = ఉపమానోపమేయ భావమును వివక్షింపనపుడు, అయం అర్హతి క్రియా కర్తా = ఈ అర్హణ కర్తయగు, ధర్మః = ధర్మము, నియమార్థః ఉచ్యతే = నియమము కొరకు చెప్పబడుచున్నది, తదర్థం = అందుకొరకే, పునః వచనమ్ = మరల చెప్పుట.

తాత్పర్య వివరణములు— రాజ శబ్దము రాజ సామాన్య వాచకమయినపుడు, భేదము వివక్షింపబడదు భేదము లేనిచో నుపమానోపమేయ భావ ముండదు. అవధారణము మాత్రము "రాజవదస్య వృత్తం" అనుచో వివక్షితము. ఈ వృత్త మీతనిది, రాజునకే తగి

యున్నది. ఇతరుల కర్హము గాదు అని యర్థము. నియమ మనగా అవధారణము. ఈతని యాచారము క్షత్రియాచారమే యని నిశ్చితమయినను, ఇతరాచార మెంత మాత్రమును గాదు' అని స్థిరపరచుటకే, 'రాజపదిదం వృత్తం వర్తతే' యనుట. ఈ ఆచారము రాజునకే తగినది యని యర్థము. అవధారిత పూర్వమయిన విషయమును మరల జెప్పుటకు ప్రయోజనము స్థైర్యాపాదనము అని భావము. ॥556॥

అవతారిక— పృథు భరత యయాతి దిలీపాది ప్రసిద్ధ రాజులలో నొకని నుద్దేశించి ''రాజవద్వర్తతేయమ్'' = 'ఈతడు రాజువలె నున్నాడు' - అని యందురనుకొనుడు. అపుడును ఉపమానోపమేయ భావము వివక్షితము గాదు. చూడుడు—

శ్లో॥ కృతహస్తవదిత్యేతత్ ప్రసిద్ధేష్వేవ దృశ్యతే ।
రాజత్వేన ప్రసిద్ధే చ రాజ్ఞి రాజవదిత్యపి ॥ 557

కృతహస్తవత్ = కృతహస్తునివలె = నేర్పరివలె, ఇత్యేతత్ =అను నీ మాట, ప్రసిద్ధేష్వేవ= ప్రసిద్ధ పురుషుల విషయముననే, దృశ్యతే = ఆగపడుచున్నది రాజవత్ = రాజువలె, ఇత్యేతదపి చ = అను నీ మాటయు, రాజత్వేన = రాజుగా, ప్రసిద్ధే రాజ్ఞి దృశ్యతే = ప్రసిద్ధుడగు రాజునందే కనబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ''విచ్ఛేద కృతహస్తవత్'' = కృతహస్తుని మాదిరిగ ఛేదించినాడు అని యందురు. కృతః = అభ్యాసమువలన నివేశితమయిన, హస్తః = చేయి, యస్యసః = కలవాడు', అని యర్థము. చేయి నలిగినవాడు. skilled hand, అర్జునాదుల లోని వాడు'. ఆతని నుద్దేశించియే ఇట్లందురు వేరొక కృతహస్తునితో నీతనికి పోలిక గాదచట చెప్పదలంచినది. ఈతడే కృతహస్తుడు. తనవంటి వానికి తగిన ఛేదనమును చేసినాడనియే వివక్షితము. కృతహస్త మర్హతి కృతహస్తవత్ = ఈతని కృత్యము కృతహస్తునికి యోగ్యమైనది అన్యునకు యోగ్యము గాదని భావము. ఔపమ్యమేమియు నుద్దిష్టము గాదు. జ్ఞాతాంశమునే మరల చెప్పుటకు ప్రయోజనము అవధారణము. అనగా నీతడు కృతహస్తుడే. ఈతడే కృతహస్తుడు' అని బోధించుట.

పాండురాజు ప్రసిద్ధుడగు రాజే కదా. ''పాండోర్విదుర! సర్వాణి ప్రేతకార్యాణి కారయ రాజవద్రాజసింహస్య'' అనుచో, విదురా, పాండురాజు రాజసింహుడు. ఆతనికి ప్రేత కార్యములను రాజునకువలె జరిపింపుము' అని విదురునకు చేసిన యుపదేశములో, 'రాజునకే అర్హములయిన ప్రేత కృత్యములను చేయుము' అను నభిప్రాయము వ్యక్తము. అచట నింకొకని యుపమానము పాండురాజునకు చెప్పుట వివక్షితము గాదు. ॥557॥

అవతారిక— కాబట్టి యీ సూత్రమునకు విషయమిది యని నిరూపించుచున్నారు.

శ్లో॥ అరాజ్ఞి యేషాం ధర్మాణాం దృష్టోఽత్యంత మసంభవః ।
తేరాజని నియమ్యన్తే త్యజ్యన్తే వ్యభిచారిణః ॥ 558

యేషాం ధర్మాణాం = ఏ ధర్మములకు (రాజునందు గలవానికి), అరాజ్ఞి = రాజు కానివాని యందు, అత్యంతమసంభవః = సర్వథా సంభవము లేకపోవుట, దృష్టః=కనబడుచున్నదో, తే, రాజని, నియమ్యన్తే = ఆ ధర్మములు రాజునందు నిర్ధారింపబడు చున్నవి, వ్యభిచారిణః = తద్విరుద్ధ ధర్మములు, త్యజ్యన్తే= విడువబడుచున్నవి.

తాత్పర్య వివరణములు— కొన్ని ధర్మములు నియతముగ క్షత్రియునందే యుండునవి. వానికట స్థైర్యమును తెలియజేయుటకు, మరల మరల నవి వచింపబడుటయు గలదు. అదియే బలాధానము. దానికి ఫలము నియమము. అనగా నియమ ఫలమయిన అన్య నివృత్తిని బోధించుట. ఈ ధర్మములు రాజుకే యోగ్యములు. ఇవియే 'రాజార్హములు' అని రెండు విధముల నియమనమును ఫలితమగును. కారికలో, తద్విరుద్ధములు త్యజింపబడుననుట కిదియే యాశయము.

ఆత్మార్హాయాం క్రియాయాం అర్హతి కర్తరి నిశ్చిత బలాదానే'' అని భాష్యమున గలదు ఆత్మయనగా ద్వితీయా సమర్థమునకు ప్రకృతి. 'రాజవత్' అనుచోట రాజ పదార్థము క్రియ అనగా అర్హణ కర్త యొక్క వ్యాపారమగు వర్తనము అది రాజార్హము. రాజేతరుల కర్హము గాదు. ఇట్టి అర్థవివక్షలో నీ సూత్రముచే వతి ప్రత్యయమగును.

''రాజవద్రూపమ్, రాజవద్ధైర్యమ్'' అనుచో, ''తత్ర తస్యేవ'' అను సూత్రము చేతనే వతి ప్రత్యయము. అట రూపపదార్థమును ధైర్యపదార్థమును క్రియలు కావు. పర్యవసిత మేమనగా భేదము వివక్షితమగు నెడల పూర్వసూత్రము చేతను, అభేద వివక్షయం దుపమా నోపమేయ భావము సంభవింపదు గాన ప్రకృత సూత్రముచేతను వతి ప్రత్యయ విధానము' అని— ॥558॥

*అవతారిక* — ''తదర్హమను సూత్రములోనికి 'క్రియా' అను పదమును వర్తించుట వలన, రాజానమర్హత్యేతత్ వాసః = ఈ వస్త్రము రాజునకు యోగ్యమయినది. 'బ్రాహ్మణ మర్హత్యేష కమండలుః' అనుచోట్ల క్రియ కర్త గాదు గాన 'వతి' రాదనుచున్నారు.

**శ్లో॥ అర్హతేశ్చ క్రియాకర్త్రీ యా తస్యాం వతిరిష్యతే।**
**రాజానమర్హతి చ్ఛత్రమితి నత్వేవ మాదిషు ॥** 559

అర్హతేః = అర్హ ధాతువుయొక్క, కర్త్రీ = వ్యాపారాశ్రయమగు, యాక్రియా = క్రియ యేది గలదో, తస్యాం = ఆ క్రియయందు, వతిః ఇష్యతే = వతి ప్రత్యయము ప్రవర్తించుట ఇష్టము ''రాజానమర్హతి ఛత్రమ్'' = గొడుగు రాజున కర్హమైనది యను నర్థమున, ఇతి ఏవం ఆదిషు తు = అట్టి ప్రయోగములందు ''రాజవత్ ఛత్రమ్'', న ఇష్యతే = అని ప్రయోగిం చుట సమ్మతము గాదు.

తాత్పర్య వివరణములు— 'తదర్హమ్' అని సూత్రము. 'అర్హమ్' అను పదము. 'అర్హతీత్యర్హమ్' - అను విగ్రహముచే 'పచాద్యజన్తము. అర్హణకర్తయని అర్థము. అది

వృత్తము వర్తనము. సూత్రమునందు ఆ కర్త క్రియయే కావలెనని లేదు. కాని క్రియా అను పదము పూర్వసూత్రము నుండి యనువర్తించునని భావము. కాగా ఛత్రము క్రియకాదు గాన రాజవత్ ఛత్రమను ప్రయోగము సాధువు కానేరదు' అని తాత్పర్యము. ॥559॥

*అవతారిక*— రాజవత్ ఛత్రమ్ = రాజాన మర్హతి, బ్రాహ్మణవత్ కమండలుః = బ్రాహ్మణమర్హతి, ఇత్యాదులందు వతి ప్రత్యయ మేలయసాధువు కావలెను. వానిని గూడ సాధించునట్లు ఆ సూత్రము నర్థము చేయవచ్చునుగదా యనిన జెప్పుచున్నారు.

శ్లో॥ ప్రయుక్తానాం హి శబ్దానాం శాస్త్రేణానుగమః సతామ్ ।
ఛత్రాద్యర్థే తు వచనే ప్రత్యాఖ్యానం న సంభవేత్ ॥ 560

ప్రయుక్తానాం = శిష్ట వ్యవహారమునందు ప్రయుక్తములై, సతాం శబ్దానాం = విద్యమానము లగు శబ్దములకు, శాస్త్రేణ = శాస్త్రముచేత, అనుగమః క్రియతే హి = అన్వాఖ్యానము చేయ బడును గదా, వచనే = 'తదర్హమ్' అను సూత్రము, ఛత్రాద్యర్థే సతి తు = ఛత్రము మున్నగునది అర్హాణ కర్త యయినపుడును వచ్చుటకైన, ప్రత్యాఖ్యానం = ఆ సూత్రమును ప్రత్యాఖ్యానము చేయుట, న సంభవేత్ = సంభవింపదు.

*తాత్పర్య వివరణములు*— శబ్దములును, అర్థములును వాని సంబంధమును నిత్యములు అవి కార్యములు గావు. ఆ స్థితిలోనే శాస్త్ర మవతరించినది. ఆ శాస్త్రము శబ్దము లను ఉత్పాదింపదు. ప్రయోగములందు ప్రయుక్తములగు వానికి ప్రకృతి ప్రత్యయ విభాగ పురస్సరముగ నన్వాఖ్యాన మాత్రమునే దాని కృత్యము. అన్వాఖ్యాన మనగా సాధువులివి యని ప్రతిపాదించుట. ఈ విషయము నిర్ణీతచరము. 'రాజవచ్ఛత్రమ్', 'బ్రాహ్మణవత్ కమండలుః' మున్నగునవి, ఉపమానోపమేయ భావ తాత్పర్యముతోగాని అర్హామను నర్థమున గాని లోకమున నెచ్చటను ప్రయోగింపబడి యుండలేదు. కావున అసాధువులు. అసాధు శబ్దా న్వాఖ్యాన మనుపపన్నము.

మరియు, తేనతుల్యమను సూత్రముచే సిద్ధి నాశ్రయించి 'తదర్హ'మను నీ సూత్రము ప్రత్యాఖ్యానము చేయబడియున్నది. రాజవచ్ఛత్ర మిత్యాదులందు వతి ప్రత్యయ సాధనమున కావశ్యకమగు నెడల ప్రత్యాఖ్యానము సంభవింపదు. క్రియోపాధికమగు తుల్య త్వమునందే 'తేనతుల్య'మను సూత్రముచే వతి ప్రత్యయము విహితము. ఛత్రాదులు కర్త లయినపుడు ఆ సూత్రము ప్రవర్తింపదు గాన నట వతి ప్రత్యయ సాధనమునకు తదర్హమను సూత్ర మావశ్యకము కావలసి వచ్చును. దాని ప్రత్యాఖ్యానము నంగీకరించి, 'రాజవద్వృత్తమ్' అను ప్రయోగ మన్యసాధిత మగుటచే, ఛత్రము కర్త అయినపుడు వతి ప్రత్యయాభావమును భాష్యకారుడు సమ్మతించెనని స్పష్టము. సూత్రారంభ ప్రత్యాఖ్యానములు తుల్య ఫలములు కావలెను. కానిచో ప్రత్యాఖ్యానమే ఘటింపదు. దానివలన సూత్రారంభ పక్షమునందును క్రియయే అర్హాణ కర్త్రి యని అవశ్యవక్తవ్యము. ॥560॥

తాత్పర్య వివరణములు— ఇవార్థ విషయమున సప్తమికి సంభవము లేదు. అయినను, 'తత్ర' అని సూత్రమున సప్తమి నిర్దేశింపబడినది. కావున నా నిర్దేశము. ఇవార్థ విషయమున తన యునికి నిత్యమని జ్ఞాపన చేయును. కాగా నిక షష్ఠి లేకనే పోవును. అందువలన నదియు నుండునని తెలియచేయుటకు 'తస్య' అని షష్ఠీ విభక్త్యంతమును గ్రహింపబడినది.

ఇచట నొక శంక— షష్ఠ్యంతమగు 'తస్య' అను పదమును సూత్రమున గ్రహింపక, 'తత్ర' అను పదమును మాత్రమే నిర్దేశింపబడిన ఆ సప్తమి బాహ్యమగు ఆధేయ సంబంధ నిమిత్తకమగు అధికరణ సప్తమియే యగును. అధికరణ విహిత సప్తమ్యంతమున కంటె వతి విధానమునకు సప్రయోజనమయినపుడు విశేషవిషయ జ్ఞాపనార్థ మెట్లగును? 'తస్య' అను షష్ఠ్యంతము సూత్రమున నుచ్చరింపబడిన నది శేషార్థకమగుటచే దాని సాహచర్యమువలన 'తత్ర' అనునది గూడ, శేషవిషయక సప్తమియని తెలియును. కాగా షష్ఠీ నిర్దేశమే లేనియెడల సప్తమికి జ్ఞాపకత్వమెట్లు? అది షష్ఠిని బాధించుటయు నెట్లు?

పై శంక కిది సమాధానము— సత్యమే యనుకొనుడు. కాని, షష్ఠీ, సప్తములలో నేదియో యొకటి మాత్రము నిర్దిష్టమయినను, నయ్యది రెండవదాని యర్థము నంతర్భవింప జేసికొనునుగాన నుభయోపాదానము వ్యర్థమయి జ్ఞాపనార్థమగును. అందు సప్తమి విషయములో షష్ఠి భాష్యకారునకు సమ్మతము కాదు. కావున సప్తమియే జ్ఞాపకార్థమని భాష్యమున చెప్పబడినని. ఇక వతి ప్రత్యయము షష్ఠ్యంత ప్రకృతికి గూడ వచ్చుట ఇష్టము కాబట్టి, స్వవిషయమున షష్ఠిని వర్తింపదు. ఈ అనివృత్తియే అబాధ - అనగా దానికి బాధ లేకుండ యనబడును.

వేరొక శంక— ప్రకృత జ్ఞాపకమువలననే, ఈ సప్తమి శేషవిషయమనిన, ''మధురాయామివ పాటలిపుత్రే ప్రాకారాః'' = 'మధురలోవలె పాటలిపుత్రమునందు ప్రాకారములు' - అనుచో, అధికరణ సప్తమ్యంతము కంటె బరముగా వతి ప్రత్యయము సిద్ధింపదు. ఇది ఇవార్థమున శేషసప్తమిగాన అనుప్రయోగమునందు, 'పాటలిపుత్రే' అని సప్తమి, ఆధారాధేయ భావము వివక్షింపబడినపుడు తప్ప సిద్ధింపకపోవును. ఇవ శబ్ద మున్నపుడుగదా శేష విషయ సప్తమి జ్ఞాపితము. అనుప్రయోగమగు పాటలిపుత్ర శబ్దమువద్ద ఇవ అను శబ్దము లేదుగదా.

అందువలన ''మధురాయామివ పాటలిపుత్రస్య ప్రాకారాః'' అని పాటలిపుత్ర శబ్దమునకు షష్ఠియే రావలసియున్నది

ఈ శంకకు సమానాధానము = ''ఆక్షేపము సమంజసమే. అందుకొరకు 'తత్ర' అను సూత్రమున కావృత్తిచేయబడును. లేదా అది తంత్ర నిర్దేశమని యయినను జెప్పవచ్చును సకృదుచ్చరితమయినను ననేకార్థ బోధకమగుట తంత్రమనబడదు. అందొక దానిచే అధికరణ సప్తమ్యంతమునకు వతి ప్రత్యయమును విధించి, రెండవదానిచే శేషవిషయమున సప్తమి జ్ఞాపితమగునని భాష్యకారుని యాశయమును'' కైయటోపాధ్యాయులు వివరించిరి.

మరికొందరిట్లును తదాశయ వర్ణనమును జేయుచున్నారు. ''షష్ఠి సంబంధ సామాన్య వివక్షలో విధింపబడినది. సప్తమ్యర్థమగు ఆధారాధేయ భావము గూడ నొక సంబంధమే. అదియు సంబంధ సామాన్యాంతర్గతమే. కావున అనుప్రయోగము సప్తమ్యంత మయినను వతి ప్రత్యయము షష్ఠ్యంతముకంటె బరముగనే ప్రవర్తించును. 'శేషవివక్షలో, ఇవ శబ్దయోగమున్నపుడు సప్తమి యుండును' – అనియే జ్ఞాప్యాంశముగాని, 'ఆధారాదేయ భావ వివక్షలో సప్తమ్యర్థమున వతి ప్రత్యయము రానేరాదు' అని తన్నివారణమే జ్ఞాపకము చేయబడదు గదా – అని భావము. ॥550॥

*అవతారిక*— తుల్యార్థమున వతి యొకటి. ఇవార్థమున వతి యొకటి. ఆ రెండును విచారింపబడినవి. ఇక అర్హార్థవతి విచారము క్రమప్రాప్తము. ''తదర్హమ్'' (5 1-117) అను సూత్రము తద్విధాయకము – అచట, ఆక్షేపభాష్యమిట్లు గలదు. ''కిమర్థమిదముచ్యతే। న। తేన తుల్యం క్రియాచే ద్వతిరిత్యేవ సిద్ధమ్'' – అని. ఈ సూత్రముతో బనియేమి? తేన తుల్యమ్ అను సూత్రముచేతనే వతి సిద్ధింపవచ్చును గదా? అని ఆక్షేప తాత్పర్యము. ప్రకృత కారిక ఆక్షేప వ్యాఖ్యాన రూపము.

**శ్లో॥ పూర్వాభ్యామేవ యోగాభ్యాం విగ్రహాంతరకల్పనాత్।**
**అర్హార్థేఽపి వతిః సిద్ధః సత్వేకేన నిదర్శ్యతే ॥** 551

పూర్వాభ్యామ్ = వెనుకటి, యోగాభ్యామ్ ఏవ = రెండు సూత్రములచేతనే, విగ్రహాంతర కల్పనాత్ = మరియొక రీతి విగ్రహ వాక్యకల్పనము వలన, అర్హార్థేపి = ''తదర్హతి'' అను నర్థమునందును, వతిః సిద్ధః = వతి ప్రత్యయము, సిద్ధించినది, సః ఏకేన తు = ఆ వతి ప్రత్యయము, ఒక సూత్రముచేత మట్టుకు, నిదర్శ్యతే = ఉపలక్షింపబడుచున్నది.

*తాత్పర్య వివరణములు*— ''తదర్హతి'' అను సూత్రమునందు పూర్వ సూత్రమునుండి 'క్రియా' అను పదమనువర్తించును. ద్వితీయా సమర్థ విభక్త్యంతముకంటె పరముగా, క్రియారూపమగు అర్హణకర్తను బోధించుచు వతి ప్రత్యయమగును అని సూత్రార్థము. ''రాజవత్ వృత్తమ్'' అని యుదాహరణము. 'రాజాన మర్హతి' అని విగ్రహము. వృత్తమనగా వర్తనము. అది క్రియ.

'రాజవత్' అను వత్యంతమునకు, ''రాజ్ఞా తుల్యం వర్తతే'' – అని విగ్రహ వాక్యమును చెప్పినను నీ యర్థమే ప్రతీతమగును. కనుక తృతీయాంతముకంటె 'తేనతుల్య'మను సూత్రముచేతనే వతి ప్రత్యయము సిద్ధింపవచ్చును.

'రాజవత్ ధైర్యమ్' 'రాజవత్ వేషః', 'బ్రాహ్మణవత్ ఉపశమః' = రాజువంటి ధైర్యము. రాజువంటి వేషము బ్రాహ్మణునివలె శాంతి – అను స్థలములందు అర్హతి కర్త్రి క్రియ కానందున తేనతుల్యమను సూత్రముచే సిద్ధింపకున్నను, 'తత్ర తస్యేవ' – అని సిద్ధింప వచ్చును. 'రాజ్ఞః ఇవధైర్యమ్' అని విగ్రహభేదము మాత్రమేగాని వస్తుభేదము లేదు. కనుక పూర్వ సూత్రములచేతనే సిద్ధింపవచ్చును.

అట్లయిన, మహాభాష్యమున, 'తేనతుల్య మిత్యేవ సిద్ధమ్' అని ఒక సూత్రము చేతనే సిద్ధి చెప్పబడినదే యనిన, నది ఉపలక్షణమని గ్రహింపదగును. అయ్యది ఉదాహరణ ప్రదర్శన మాత్రము. పూర్వ సూత్రములచే సిద్ధించుననియే హృదయము. ॥551॥

*అవతారిక*— తేనతుల్యమను సూత్రముచేత నెట్లు సిద్ధియనగా–

**శ్లో॥ తేన తుల్యమితి ప్రాప్తేః క్రియోపాధిః ప్రసిధ్యతి।**
**రాజవద్వర్తతే రాజేత్యత్ర భేదే వివక్షితే ॥** 552

క్రియోపాధిః వతిః = క్రియ (ఉపాధి =) విశేషణముగాగల వతి, రాజవత్ రాజా ఇత్యత్ర = 'రాజువంటివాడు రాజు' అనునపుడు, భేదే వివక్షితే సతి = ఒకే వ్యక్తికిని భేదమును వివక్షింపగా, 'తేనతుల్యమ్' ఇతి = ''తేనతుల్యం క్రియాచేద్వతిః'' అను సూత్రముచే, ప్రాప్తేః ప్రసిధ్యతి = ప్రాప్తించుటవలన, సిద్ధించును.

**తాత్పర్య వివరణములు**— 'తేనతుల్యం క్రియాచేద్వతిః' - అను వతి ప్రత్యయమునకు క్రియ ఉపాధి. అనగా నది ప్రత్యయార్థమగు నుపమేయమునకు అవచ్ఛేదకము. కాగా అర్థ ద్వారమున ప్రత్యయమునకు విశేషణము.

'తదర్హం' - అను ప్రకృత సూత్రోదాహరణము, 'రాజవత్ వృత్తమ్' - అను మున్నగునది. 'రాజానమర్హతి' - అని విగ్రహము రాజునకు యోగ్యమైన వర్తనము అని యర్థము. ఆ అర్థము 'రాజుతో తుల్యమైనది' = ''రాజ్ఞాతుల్యం వృత్తమస్య'' అని విగ్రహించినను లభించును. ఇట్లు విగ్రహభేదముచేత ఆ సూత్రము నుదాహరణములు ఈ సూత్రముచేతను ప్రకృత సూత్రోదాహరణములా సూత్రముచేతను గతార్థములు కావచ్చును.

సరి. ''రాజవద్వర్తతే బ్రాహ్మణః'' అనిన, నుపమానము రాజును, నుపమేయము బ్రాహ్మణుడును, గాన దానిచే సిద్ధింపవచ్చు ననుకొనుడు, 'రాజవద్వర్తతే రాజా' = రాజు రాజువలె వర్తించుచున్నాడు' అనునపుడెట్లు? తనకు తనతో నుపమానము అసంభవముగదా యనిన భేదమును వివక్షించినపుడు, అట్టి స్థలమునను వతి ప్రత్యయము సిద్ధింపవచ్చును. అని భావము. ॥552॥

*అవతారిక*— అది యెట్లన–

**శ్లో॥ రాజత్వేన ప్రసిద్ధా యే పృథుప్రభృతయో నృపాః।**
**యుధిష్ఠిరాన్తా స్తేఽన్యేషా ముపమానం మహీక్షితామ్ ॥** 553

రాజత్వేన ప్రసిద్ధాః = రాజులుగా ప్రసిద్ధులయిన, పృథు ప్రభృతయః = పృథు చక్రవర్తి మున్నగు, యుధిష్ఠిరాంతాః నృపాః = యుధిష్ఠిరుని వరకునుగల రాజులు, యే సన్తితే = ఎవ్వారుండిరో వారు, అన్యేషామ్ = ఇతరులగు, మహీక్షితామ్ = రాజులకు, ఉపమానమ్ = ఉపమాన భూతులగుదురు.

తాత్పర్య వివరణములు— పృథువు, భరతుడు, యయాతి, దిలీపుడు మొదలగు ధర్మ తనయుని వరకునుగల, విశుద్ధ చరిత్రులును, నిండైన రాజవృత్తముతో నొప్పువారును నగు మొదటి కల్పముల రాజులు, ఈ కాలపు ఒక రాజునకు, రాజోచిత వృత్తము పరిపూర్ణముగ లేనివానికి ఉపమానముగా జెప్పబడినపుడు, 'రాజవదయం వర్తతే' = ప్రసిద్ధుడగు మహారాజును బోలి ఈతని వృత్తమున్నది, అందురు. ఈతని సమాచార మొకప్పుడు రాజుకు విరుద్ధమైనదిగా గూడ నుండవచ్చును. కాని యట్టి సంభావన లేదని ప్రశంసించుటకు, 'రాజవద్వృత్తమస్య' అందురు. ఇట్టి వ్యవహారము లుండుటవలన నీ విధముగ భేదమును వివక్షించి ఉపమానోపమేయ భావమును గల్పింపనగునని భావము. ॥553॥

అవతారిక— ఓయీ ! ఉపమేయుడగు రాజు గూడ ప్రజాపాలనమును జేయువాడైన నిక ఉపమానోపమేయ భావ ప్రయోజకమగు భేదమేమి గలదు ? అది లేనిచో సాదృశ్యమే లేదాయె ? అపుడే రాజునకు ప్రసిద్ధుడగు మహారాజుపమాన మెట్లగును ? అనిన.

శ్లో॥ సిద్ధ్యసిద్ధికృతో భేద ఉపమానోపమేయయోః ।
సర్వత్రైవయతో సిద్ధం ప్రసిద్ధేనోపమీయతే ॥ 534

ఉపమానోపమేయయోః=ఉపమానమునకును, ఉపమేయమునకును, భేదః=భేదము, సర్వత్ర ఏవ = అంతటను, సిద్ధిః అసిద్ధికృతః = ప్రసిద్ధి, అప్రసిద్ధి - వీనినిబట్టి యుండునది, యతః = ఎందువలననగా, అసిద్ధం = అప్రసిద్ధమయిన వస్తువు, ప్రసిద్ధేన ఉపమీయతే = ప్రసిద్ధమైన దానితో బోల్పబడును.

తాత్పర్య వివరణములు— పరిపూర్ణ గుణ సంపత్తిగల వ్యక్తి ప్రసిద్ధ వ్యక్తి యగును. తద్విరుద్ధ వ్యక్తికి ప్రసిద్ధి కలుగదు. అప్రసిద్ధమునకు ప్రసిద్ధ ముపమానముగా నిర్దేశింపబడును. సర్వాత్మనా భేదమే యున్నపుడుగాని అభేదమే యున్నపుడుగాని ఉపమానోపమేయ భావ ప్రసంగమే యుండబోదని నిరూపింపబడి యున్నది. బ్రాహ్మణునివలె క్షత్రియు డధ్యయనము చేయుచున్నాడనిన నచట కరణ సౌష్ఠవాదులుండుట వలన బ్రాహ్మణాధ్యయనము ప్రసిద్ధము, అప్రసిద్ధమగు క్షత్రియాధ్యయనమున కుపమానము. చతురుదధి పర్యంత పృథివీపాలకుడగు భరతుడు ప్రసిద్ధుడు, పరిపూర్ణ రాజత్వము కలవాడు. అట్టి రాజు, పృథివ్యేక దేశమాత్ర పాలకుడును, కోశదండాది సాధనముల గౌరత గలవాడును నగు నీనాటి రాజున కుపమానము అతనిని ''రాజవద్వృత్తమస్య'' = ఈతని వర్తనము ప్రసిద్ధ రాజతుల్యమని ప్రశంసింతురు. ఆ విధముగనే ''బ్రాహ్మణవదయం వర్తతే బ్రాహ్మణః'' = ఈ బ్రాహ్మణుడు బ్రాహ్మణునివంటివాడు'' అని, ప్రసిద్ధులగు వసిష్ఠాదులతో బోల్పబడుచుండును. కనుక, 'తేనతుల్యం క్రియాచేత్తను సూత్రముచే సిద్ధినిర్బాధము. ॥554॥

అవతారిక— ''తత్ర తస్యేవ'' అను సూత్రముచే నెచ్చట వతి ప్రత్యయము సిద్ధించుననిన జెప్పుచున్నాడు.

శ్లో॥ రాజవద్రూపమస్యేతి రాజన్యేవ వివక్షితే ।
అక్రియార్థేన యోగేన ద్వితీయేన భవిష్యతి ॥ 555

'రాజవత్ రూపమస్య' = 'ఈతని రూపము రాజువంటిది', ఇతి, రాజనిఏవ = అని రాజే ఉపమానముగ, వివక్షితేసతి = వివక్షింపబడినపుడు. అక్రియార్థేన = క్రియాతౌల్యము లేనపుడు ప్రవర్తించుట కేర్పడిన, ద్వితీయేన = రెండవ, యోగేన = సూత్రమగు "తత్ర తస్యేవ" - అను దానిచే, భవిష్యతి = వతి ప్రత్యయము సిద్ధించును.

తాత్పర్య వివరణములు— "రాజవత్ అస్యరూపం, ధైర్యం, ఉపశమః"— అని యందురు = ఈ రాజు రూపమును, ధైర్యమును, ప్రశాంతియు, భరతాది రాజులను బోలినది' అని యర్థము. అచ్చట గుణములచే తౌల్యము. క్రియచే గాదు. అచ్చట రెండవ సూత్రము ప్రవర్తించును.

'తదర్హ'మను నీ సూత్రమున్నపుడును, అర్హతి కర్తృ క్రియ అయిననే, ఆ సూత్రముచే వతి ప్రత్యయము వచ్చునుగాని గుణ తౌల్యమున్నపుడు రాదుగాన నచట పూర్వ సూత్రము చేతనే వతి ప్రత్యయమును సాధింపవలెను' అని భావము. ॥555॥

అవతారిక— తరువాత సూత్రారంభ సమర్థన గ్రంథ మిట్లు గలదు. "నసిధ్యతి. తృతీయా సమర్థాత్, తత్ర యదా అన్యేన కర్తవ్యాం క్రియామన్యః కరోతి తదా ప్రత్యయ ఉత్పాద్యతే ఇహ పునర్ద్వితీయా సమర్థాదాత్మార్హాయాం క్రియాయాం అర్హతి కర్తరి నిశ్చిత బలాధానే ప్రత్యయ ఉత్పాద్యతే" = "తేనతుల్యమను పూర్వ సూత్రముచే నిట వతి ప్రత్యయము సిద్ధింపదు. తృతీయా సమర్థముకంటె నట, వేరొకడు చేయదగిన పని నింకొకడు చేసినపుడు. ప్రత్యయము విధింపబడినది. ఇట నట్లుగాదు. ద్వితీయా సమర్థ మిచ్చట ప్రకృతి. ద్వితీయాంత వాచ్యమగు నర్థమున కర్హమగు క్రియారూపమయిన, అర్హధాత్వర్థ కర్తకు నిశ్చిత విషయమునకు బలము కూర్చుటకు స్థైర్యోత్పాదనము వివక్షితమయినపుడు వతి ప్రత్యయము విహితమగుచున్నది. యీ సూత్రమువలన" - అని భాష్యార్థము. ఆ విషయ మీ కారికలో వ్యాఖ్యానింపబడుచున్నది.

శ్లో॥ ఉపమానా వివక్షాయాం నియమార్థోయముచ్యతే ।
ధర్మోర్హతి క్రియాకర్తా తదర్థం వచనం పునః ॥ 556

ఉపమానా వివక్షాయాం = ఉపమానోపమేయ భావమును వివక్షింపనపుడు, అయం అర్హతి క్రియా కర్తా = ఈ అర్హణ కర్తయగు, ధర్మః = ధర్మము, నియమార్థః ఉచ్యతే = నియమము కొరకు చెప్పబడుచున్నది, తదర్థం = అందుకొరకే, పునః వచనమ్ = మరల చెప్పుట.

తాత్పర్య వివరణములు— రాజ శబ్దము రాజ సామాన్య వాచకమయినపుడు, భేదము వివక్షింపబడదు భేదము లేనిచో నుపమానోపమేయ భావ ముండదు. అవధారణము మాత్రము "రాజవదస్య వృత్తం" అనుచో వివక్షితము. ఈ వృత్త మీతనిది, రాజునకే తగి

యున్నది. ఇతరుల కర్హము గాదు అని యర్థము. నియమ మనగా అవధారణము. ఈతని యాచారము క్షత్రియాచారమే యని నిశ్చితమయినను, ఇతరాచార మెంత మాత్రమును గాదు' అని స్థిరపరచుటకే, 'రాజవదిదం వృత్తం వర్తతే' యనుట. ఈ ఆచారము రాజునకే తగినది యని యర్థము. అవధారిత పూర్వమయిన విషయమును మరల జెప్పుటకు ప్రయోజనము స్థైర్యాపాదనము అని భావము. ॥556॥

అవతారిక— పృథు భరత యయాతి దిలీపాది ప్రసిద్ధ రాజులలో నొకని నుద్దేశించి ''రాజవద్వర్తతేయమ్'' = 'ఈతడు రాజువలె నున్నాడు' - అని యందురనుకొనుడు. అపుడును ఉపమానోపమేయ భావము వివక్షితము గాదు. చూడుడు—

శ్లో॥ కృతహస్తవదిత్యేతత్ ప్రసిద్ధేష్వేవ దృశ్యతే ।
రాజత్వేన ప్రసిద్ధే చ రాజ్ఞి రాజవదిత్యపి ॥ 557

కృతహస్తవత్ = కృతహస్తునివలె = నేర్పరివలె, ఇత్యేతత్ =అను నీ మాట, ప్రసిద్ధేష్వేవ= ప్రసిద్ధ పురుషుల విషయముననే, దృశ్యతే = ఆగపడుచున్నది రాజవత్ = రాజువలె, ఇత్యేతదపి చ = అను నీ మాటయు, రాజత్వేన = రాజుగా, ప్రసిద్ధే రాజ్ఞి దృశ్యతే = ప్రసిద్ధుడగు రాజునందే కనబడుచున్నది.

తాత్పర్య వివరణములు— ''చిచ్ఛేద కృతహస్తవత్'' = కృతహస్తుని మాదిరిగ ఛేదించినాడు అని యందురు. కృతః = అభ్యాసమువలన నివేశితమయిన, హస్తః = చేయి, యస్యసః = కలవాడు', అని యర్థము. చేయి నలిగినవాడు. skilled hand, అర్జునాదుల లోని వాడు'. ఆతని నుద్దేశించియే ఇట్లందురు వేరొక కృతహస్తునితో నీతనికి పోలిక గాదచట చెప్పదలంచినది. ఈతడే కృతహస్తుడు. తనవంటి వానికి తగిన ఛేదనమును చేసినాడనియే వివక్షితము. కృతహస్త మర్హతి కృతహస్తవత్ = ఈతని కృత్యము కృతహస్తునికి యోగ్యమైనది అన్యునకు యోగ్యము గాదని భావము. ఔపమ్యమేమియు నుద్దిష్టము గాదు. జ్ఞాతాంశమునే మరల చెప్పుటకు ప్రయోజనము అవధారణము. అనగా నీతడు కృతహస్తుడే. ఈతడే కృతహస్తుడు' అని బోధించుట.

పాండురాజు ప్రసిద్ధుడగు రాజే కదా. ''పాండోర్విదుర! సర్వాణి ప్రేతకార్యాణి కారయ రాజవద్రాజసింహస్య'' అనుచో, విదురా, పాండురాజు రాజసింహుడు. ఆతనికి ప్రేత కార్యములను రాజునకువలె జరిపింపుము' అని విదురునకు చేసిన యుపదేశములో, 'రాజునకే అర్హములయిన ప్రేత కృత్యములను చేయుము' అను నభిప్రాయము వ్యక్తము. అచట నింకొకని యుపమానము పాండురాజునకు చెప్పుట వివక్షితము గాదు. ॥557॥

అవతారిక— కాబట్టి యీ సూత్రమునకు విషయమిది యని నిరూపించుచున్నారు.

శ్లో॥ అరాజ్ఞి యేషాం ధర్మాణాం దృష్టోత్యంత మసంభవః ।
తేరాజని నియమ్యన్తే త్యజ్యన్తే వ్యభిచారిణః ॥ 558

యేషాం ధర్మాణాం = ఏ ధర్మములకు (రాజునందు గలవానికి), అరాజ్ఞి = రాజు కానివాని యందు, అత్యంతమసంభవః = సర్వథా సంభవము లేకపోవుట, దృష్టః=కనబడుచున్నదో, తే, రాజని, నియమ్యన్తే = ఆ ధర్మములు రాజునందు నిర్ధారింపబడు చున్నవి, వ్యభిచారిణః = తద్విరుద్ధ ధర్మములు, త్యజ్యన్తే= విడువబడుచున్నవి.

తాత్పర్య వివరణములు— కొన్ని ధర్మములు నియతముగ క్షత్రియునందే యుండునవి. వానికట స్థైర్యమును తెలియజేయుటకు, మరల మరల నవి వచింపబడుటయు గలదు. అదియే బలాధానము. దానికి ఫలము నియమము. అనగా నియమ ఫలమయిన అన్య నివృత్తిని బోధించుట. ఈ ధర్మములు రాజుకే యోగ్యములు. ఇవియే 'రాజార్హములు' అని రెండు విధముల నియమనమును ఫలితమగును. కారికలో, తద్విరుద్ధములు త్యజింపబడుననుట కిదియే యాశయము.

ఆత్మార్హాయాం క్రియాయాం అర్హతి కర్తరి నిశ్చిత బలాదానే'' అని భాష్యమున గలదు. ఆత్మయనగా ద్వితీయా సమర్థమునకు ప్రకృతి. 'రాజవత్' అనుచోట రాజ పదార్థము క్రియ అనగా అర్హణ కర్త యొక్క వ్యాపారమగు వర్తనము అది రాజార్హము. రాజేతరుల కర్హము గాదు. ఇట్టి అర్థవివక్షలో నీ సూత్రముచే వతి ప్రత్యయమగును.

''రాజవద్రూపమ్, రాజవద్ధైర్యమ్'' అనుచో, ''తత్ర తస్యేవ'' అను సూత్రము చేతనే వతి ప్రత్యయము. అట రూపపదార్థమును ధైర్యపదార్థమును క్రియలు కావు. పర్యవసిత మేమనగా భేదము వివక్షితమగు నెడల పూర్వసూత్రము చేతను, అభేద వివక్షయం దుపమానోపమేయ భావము సంభవింపదు గాన ప్రకృత సూత్రముచేతను వతి ప్రత్యయ విధానము' అని— ॥558॥

*అవతారిక* — ''తదర్హమను సూత్రములోనికి 'క్రియా' అను పదమును వర్తించుట వలన, రాజానమర్హత్యేతత్ వాసః = ఈ వస్త్రము రాజునకు యోగ్యమయినది. 'బ్రాహ్మణమర్హత్యేష కమండలుః' అనుచోట్ల క్రియ కర్త గాదు గాన 'వతి' రాదనుచున్నారు.

**శ్లో॥ అర్హతేశ్చ క్రియాకర్త్రీ యా తస్యాం వతిరిష్యతే ।**
**రాజానమర్హతి చ్ఛత్రమితి నత్వేవ మాదిషు ॥** 559

అర్హతేః = అర్హ ధాతువుయొక్క, కర్త్రీ = వ్యాపారాశ్రయమగు, యాక్రియా = క్రియ యేది గలదో, తస్యాం = ఆ క్రియయందు, వతిః ఇష్యతే = వతి ప్రత్యయము ప్రవర్తించుట ఇష్టము ''రాజానమర్హతి ఛత్రమ్'' = గొడుగు రాజున కర్హమైనది యను నర్థమున, ఇతి ఏవం ఆదిషు తు = అట్టి ప్రయోగములందు ''రాజవత్ ఛత్రమ్'', న ఇష్యతే = అని ప్రయోగించుట సమ్మతము గాదు.

తాత్పర్య వివరణములు— 'తదర్హమ్' అని సూత్రము. 'అర్హమ్' అను పదము. 'అర్హతీత్యర్హమ్' - అను విగ్రహముచే 'పచాద్యజన్తము. అర్హణకర్తయని అర్థము. అది

వృత్తము వర్తనము. సూత్రమునందు ఆ కర్త క్రియయే కావలెనని లేదు. కాని క్రియా అను పదము పూర్వసూత్రము నుండి యనువర్తించునని భావము. కాగా ఛత్రము క్రియకాదు గాన రాజవత్ ఛత్రమను ప్రయోగము సాధువు కానేరదు' అని తాత్పర్యము. ॥559॥

*అవతారిక*— రాజవత్ ఛత్రమ్ = రాజాన మర్హతి, బ్రాహ్మణవత్ కమండలుః = బ్రాహ్మణమర్హతి, ఇత్యాదులందు వతి ప్రత్యయ మేలయసాధువు కావలెను. వానిని గూడ సాధించునట్లు ఆ సూత్రము నర్థము చేయవచ్చునుగదా యనిన జెప్పుచున్నారు.

శ్లో॥ ప్రయుక్తానాం హి శబ్దానాం శాస్త్రేణానుగమః సతామ్ ।
ఛత్రాద్యర్థే తు వచనే ప్రత్యాఖ్యానం న సంభవేత్ ॥ 560

ప్రయుక్తానాం = శిష్ట వ్యవహారమునందు ప్రయుక్తములై, సతాం శబ్దానాం = విద్యమానములగు శబ్దములకు, శాస్త్రేణ = శాస్త్రముచేత, అనుగమః క్రియతే హి = అన్వాఖ్యానము చేయబడును గదా, వచనే = 'తదర్హమ్' అను సూత్రము, ఛత్రాద్యర్థే సతి తు = ఛత్రము మున్నగునది అర్హాణ కర్త యయినపుడును వచ్చుటకైన, ప్రత్యాఖ్యానం = ఆ సూత్రమును ప్రత్యాఖ్యానము చేయుట, న సంభవేత్ = సంభవింపదు.

*తాత్పర్య వివరణములు*— శబ్దములును, అర్థములును వాని సంబంధమును నిత్యములు అవి కార్యములు గావు. ఆ స్థితిలోనే శాస్త్ర మవతరించినది. ఆ శాస్త్రము శబ్దములను ఉత్పాదింపదు. ప్రయోగములందు ప్రయుక్తములగు వానికి ప్రకృతి ప్రత్యయ విభాగ పురస్సరముగ నన్వాఖ్యాన మాత్రమునే దాని కృత్యము. అన్వాఖ్యాన మనగా సాధువులివి యని ప్రతిపాదించుట. ఈ విషయము నిర్ణీతచరము. 'రాజవచ్ఛత్రమ్', 'బ్రాహ్మణవత్ కమండలుః' మున్నగునవి, ఉపమానోపమేయ భావ తాత్పర్యముతోగాని అర్హామను నర్థమున గాని లోకమున నెచ్చటను బ్రయోగింపబడి యుండలేదు. కావున అసాధువులు. అసాధు శబ్దాన్వాఖ్యాన మనుపపన్నము.

మరియు, తేనతుల్యమను సూత్రముచే సిద్ధి నాశ్రయించి 'తదర్హా'మను నీ సూత్రము ప్రత్యాఖ్యానము చేయబడియున్నది. రాజవచ్ఛత్ర మిత్యాదులందు వతి ప్రత్యయ సాధనమున కావశ్యకమగు నెడల ప్రత్యాఖ్యానము సంభవింపదు. క్రియోపాధికమగు తుల్యత్వమునందే 'తేనతుల్య'మను సూత్రముచే వతి ప్రత్యయము విహితము. ఛత్రాదులు కర్తలయినపుడు ఆ సూత్రము ప్రవర్తింపదు గాన నట వతి ప్రత్యయ సాధనమునకు తదర్హామను సూత్ర మావశ్యకము కావలసి వచ్చును. దాని ప్రత్యాఖ్యానము నంగీకరించి, 'రాజవద్వృత్తమ్' అను ప్రయోగ మన్యసాధిత మగుటచే, ఛత్రము కర్త అయినపుడు వతి ప్రత్యయాభావమును భాష్యకారుడు సమ్మతించెనని స్పష్టము. సూత్రారంభ ప్రత్యాఖ్యానములు తుల్య ఫలములు కావలెను. కానిచో ప్రత్యాఖ్యానమే ఘటింపదు. దానివలన సూత్రారంభ పక్షమునందును క్రియయే అర్హాణ కర్త్రి యని అవశ్యవక్తవ్యము. ॥560॥